# సుందరకాండ

విద్యాప్రవీణ, భాషాప్రవీణ
మైలవరపు సుబ్రహ్మణ్యం

భోయినపల్లి
కామేశ్వరరావు, బి.ఎ

mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
www.mohanpublications.com








3 were here 0 this week

View Pages Feed
See posts from other Pages

Invite friends to like this Page

907 post reach this week

Boost Your Page for ₹137
Reach even more people in Rajahmondry

Boost Page



ABOUT

Opp.Ajantha Hotel fortgate
Rajahmondry, Andhra Pradesh, India

090324 62565

Open
Today 9:00AM - 9:00PM

Add Price Range

http://www.mohanpublic...

Boost Website

Mohan publications added 7 new photos.
Published by Rama Chandra Rao Akula [?] · November 28, 2015

మోహన్ పబ్లికేషన్స్
(శ్రీ ఆకుల రామచంద్రరావు )
ప్రతి హిందువుల ఇంట్లో
"మోహన్ వారి శ్రీ లలితా విష్ణు సహస్రనామ స్తోత్రాలు "
అను గ్రంథం లేని ఇల్లు ఉండకూడదు... See More










2,155 people reached

Boost Post

907
Post Reach

0
Website Clicks

1 of 6
Response Rate

Recent
2015
2014
2013
2012



# Mohan Publications

**ఫేస్‌బుక్‌లో మోహన్ పబ్లికేషన్స్ పేజ్ - లైక్ చేయండి మేము పోస్టు చేసే అనేక ఆధ్యాత్మిక పి.డి.ఎఫ్. లు ఉచితంగా పొందండి మీకు నచ్చిన పోస్టులను షేర్ చేయండి**

శ్రీమద్వాల్మీకి రామాయణము

# సుందరకాండము

## ప్రథమ సంపుటము

(1–15 సర్గలు)

పదచ్ఛేద – అన్వయక్రమ – ప్రతిపదార్థ – వ్యాఖ్యానవిశేష – తాత్పర్యములతో కూడిన

## సుబోధినీ వివరణ సహితము

విద్యాప్రవీణ, భాషాప్రవీణ
**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయినపల్లి**
**కామేశ్వరరావు**, బి.ఏ

# మున్నుడి

**"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా ॥"**

మన ఆర్షవాఙ్మయమున ఆదికావ్యము శ్రీమద్రామాయణము. దానిని మన భారతీయులు పూజామందిరములందుంచి పరమ పవిత్ర గ్రంథముగా సంభావించెదరు. నిత్యము పారాయణము చేయుదురు.

**"సుందరో రాఘవః, సుందరీ జానకీ, సుందరో మారుతిః."** వీరి పవిత్ర గాథతో సుందరమైనది "సుందర కాండము". ప్రత్యేకించి ఎందరో భక్తి శ్రద్ధలతో పారాయణము చేయుట కలదు. ఆ విధముగా పారాయణము చేయు వారిలో కొందరు జిజ్ఞాసువులకు దానిలో శ్లోకములకు అర్థ తాత్పర్యములు, విశేషాంశములు విపులముగా తెలిసికొని పారాయణము చేసిన మరింత ప్రయోజనకారిగా నుండగలదని ఆలోచన కలిగినది. వారి జిజ్ఞాసాఫలితమే యీ సుబోధినీ వ్యాఖ్య.

మా పితృపాదులు, సంస్కృతాంధ్ర విద్యాప్రవీణులు కీ.శే.మైలవరపు సుబ్రహ్మణ్యముగారు శ్రీమద్వాల్మీకి రామాయణముపై ఇతఃపూర్వము వెలువడిన పలు వ్యాఖ్యానములు – తిలకము, మందరము, గోవిందరాజీయము మున్నగు వానిని పరిశీలించి అందలి విశేషాంశములను క్రోడీకరించి ప్రతీశ్లోకమునకు పదచ్ఛేదము, అన్వయక్రమము, ప్రతిపదార్థము, తాత్పర్యము మున్నగు వానిని చేర్చి యీ వ్యాఖ్యానమును సమగ్రముగా రూపొందించిరి. దీనిని పరిశీలించిన పలువురు ప్రముఖ సంస్కృతాంధ్ర పండితులు, మేధావులు ఆమోదించి ప్రశంసించిరి.

సుబోధినీ అను యీ వ్యాఖ్యానము తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయముతో 8 సంపుటములుగా ముద్రింపబడినది. ఈ ముద్రణా కార్యక్రమము 1982వ సంవత్సరములో ప్రారంభమై 1994వ సంవత్సరమున ముగింపబడినది. ప్రస్తుతము యీ వ్యాఖ్యాన ప్రతులు లభించుటలేదు. పలువురు మిత్రులు, బంధువులు వీని ప్రతులను కోరుటయు, అలభ్యములని చెప్పి వారిని నిరాశపరచుటయు జరుగు చుండెడిది. సరిగా సంవత్సర క్రితము మా ఆప్త మిత్రులు అనపర్తి ఉన్నత పాఠశాలలో మా సహాధ్యాయి మా నాన్నగారి ప్రియశిష్యులు శ్రీ తులసి సుబ్బారావు సతీసమేతముగా నన్ను చూడవచ్చినారు. ప్రసంగవశమున యీ సుబోధినీ వ్యాఖ్యా సంపుటములలో నొక దానిని వారికి పరిచయము చేయుట జరిగినది. మా సోదరి శ్రీమతి సుబ్బారావు కూడా మిగిలిన సంపుటములను గూర్చి ప్రశ్నించినది.

ఎప్పటి వలెనే ప్రతులు లేవని చెప్పక తప్పలేదు. దానితో మా మిత్రుడు ఎనిమిది సంపుటముల ప్రతులు ఒక్కొక్కటి చొప్పున సేకరించి యిచ్చిన పునర్ముద్రణము చేయవచ్చని సూచించినారు. అప్పటికి దానిని సూచనా మాత్రముగానే భావించి ఆనందించినాను. కానీ, వారు హైదరాబాదు తిరిగి చేరిన తరువాత కూడా మరల మరల నన్ను హెచ్చరించి, నా అశక్తతను గమనించి పునర్ముద్రణ బాధ్యతను పూర్తిగా తామే స్వీకరించినారు.

పలువురు మిత్రులు దీని సాధ్యాసాధ్యములను గూర్చి ఆర్థిక భారమును గూర్చి సందేహములను వెలిబుచ్చినారు. కానీ, మా మిత్రులు శ్రీ సుబ్బారావు వజ్ర సంకల్పముతో యీ ముద్రణా బాధ్యతను నిర్వహించినారు. శ్రీ సుబ్బారావు ఇంజనీరింగు పట్టభద్రులు, నిర్వహించిన పదవులు కూడా తత్సంబంధమైనవి కానీ సంస్కృతాంధ్రభాషలపై ఆర్షవాఙ్మయముపై వీరికిగల మక్కువ అపారము. పదవీ విరమణ చేసిన పిమ్మట ఆంధ్ర భాషలో అత్యున్నత శ్రేణిలో ఎమ్.ఏ.డిగ్రీ కూడా సాధించినారు.

వీరికి మరొక ఆప్త మిత్రులు శ్రీమాన్ తూపురాణి నమ్మాళ్వారు పూర్తి సహాయ సహకారముల నందించినారు.

అసాధ్యమనుకొనిన యీ గురుతర పునర్ముద్రణాభారమును అవలీలగా సుసాధ్యము చేసిన యీ ఉభయ మిత్రులను స్వర్గముననున్న వారి గురువులు మా పితృపాదులు మనఃపూర్వకముగా నాశీర్వదించగలరు.

**"కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః ।**
**సుకృతే దుష్కృతే చైవ చత్వారః సమభాగినః ॥"**

యీ నలుగురు సమాంశభాజులలో నన్ను ఏమని భావించుకొన వలెనో నాకు తెలియకున్నది. అయినను అనుమోదకునిగా భావించుకొని తృప్తిపడెదను.

ఈ పునర్ముద్రణకు మరల ఆర్థిక సహాయ మందించుట కంగీకరించినందులకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము అధికారులకు నా కృతజ్ఞతాంజలి. ప్రథమ ముద్రణ సందర్భమున, తిరుమల తిరుపతి దేవస్థానం కార్యనిర్వహణాధికారిగా తమ ఆమోదముద్ర వేసిన మాన్యులు శ్రీ పి.వి.ఆర్.కె.ప్రసాద్, ఐ.ఏ.యస్ (రిటైర్డ్), యీ ద్వితీయ ముద్రణ విషయంలో కూడా తమ సహాయ, సహకారా లందించి, ప్రస్తుత కార్య నిర్వహణాధికారిగారితో మాట్లాడి, మరల ఆర్థికసహాయం అందుటకు సహకరించినారు. వారికి ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. ఈ

పునర్ముద్రణ యందు అక్షర దోషములను సరిచూచి పరిష్కరించిన ప్రముఖ సంస్కృత పండితులు శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యుల వారికి నా సవినయ ప్రణామములు.

ఈ సత్కార్యమునకు తమ హర్షామోదములను తెలిపిన సుబోధినీ సహ వ్యాఖ్యాతలు ప్రథమ ముద్రణ బాధ్యత వహించిన కీ.శే.బోయనపల్లి కామేశ్వరరావు గారి కుమారులు శ్రీ బోయనపల్లి ప్రసాద్ గారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాంజలి. ఈ ముద్రణాభారము నందు ఎందరో మహానుభావులు పాలుపంచుకొనినారు. వారందరికీ వందనములు.

స్వస్తి

బుధజన విధేయుడు

**మైలవరపు యజ్ఞనాథం**

# కృతజ్ఞతా నివేదనము

'సుబోధినీ' ఆంధ్రవివరణసహితమైన ఈ సుందరకాండ ద్వితీయ ముద్రణకు అనుమతించిన గ్రంథకర్త కుమారుడు, మా గురుపుత్రుడూ అయిన శ్రీమైలవరపు యజ్ఞనాథంగారికీ –

ఎనిమిది సంపుటాల్లో ప్రథమ ముద్రణగా పూర్వం వెలువడిన ఈ గ్రంథాన్నే మూడు సంపుటాల్లో సమగ్రంగా ప్రచురిస్తున్న మాకు ఆర్థిక సహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానాల కార్యనిర్వహణాధికారులు మాన్యులు శ్రీ ఎమ్.జి.గోపాల్ ఐ.ఏ.యస్ గారికీ, సహకరించిన తక్కిన అధికారులకూ –

నాటి తిరుమల తిరుపతి దేవస్థానాల కార్యనిర్వహణాధికారిగా ఈ గ్రంథం ప్రథమముద్రణకూ, ఈ నాటి ఈ ద్వితీయముద్రణకూ అన్నివిధాలా తమ సహాయ సహకారా లందించిన సహృదయులు, విద్వద్బంధువులు, ధార్మిక కార్యనిర్వహణ ధురీణులూ అయిన శ్రీ పి.వి.ఆర్.కె.ప్రసాద్ ఐ.ఏ.యస్ గారికీ –

ఈ గ్రంథాన్ని సుందరాక్షరాలతో సకాలంలో డి.టి.పి చేసి ఇచ్చిన నిత్యోత్సాహి శ్రీ కల్లూరి సుబ్రహ్మణ్యం గారికీ –

గ్రంథంలో ముద్రణదోషాలు పరిహరించే బాధ్యతను స్వీకరించి, సమర్థంగా నిర్వహించి, అన్నివిధాల సహకారాన్నీ అందించిన సంస్కృతపండితులు శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు గారికీ –

గ్రంథ ముద్రణ, బైండింగ్ పనులను అతిస్వల్పకాలంలో అత్యంత సుందరంగా పూర్తి చేసి, అనుకున్న సమయానికి గ్రంథాలు అందజేసిన ముద్రణ నిపుణులు, సంహితా గ్రాఫిక్స్ యజమానులు శ్రీ నరేంద్రగారికి –

మా హార్దిక కృతజ్ఞతలు.

అన్నింటినీ మించి, సకల విఘ్నాలు నివారిస్తూ, ఈ గ్రంథం సర్వాంగ సుందరంగా వెలువడజేసిన 'కలౌ వేంకటనాయకః' అని ప్రసిద్ధుడైన భక్తజనపారిజాతం శ్రీ వేంకటేశ్వర స్వామివారికి సాష్టాంగ దండ ప్రణామాలు తెలియజేసుకుంటూ,

బుధజన విధేయులు

**తూప్పురాణి నమ్మాళ్వారు**

**తులసి సుబ్బారావు**

విజయ మకరసంక్రాంతి
15.01.2014

# విషయసూచిక

# విషయ సూచిక - II

★★★

# విజయతే శ్రీవేంకటేశః ప్రభుః

శ్లో॥ లభ్యతే దర్శనా ద్యస్య
నిర్వృతి ర్నేత్రయోః, హృది ।
బ్రహ్మానందానుభూతి శ్చ
తం భజే వేంకటప్రభుమ్ ॥

శ్లో॥ వినుతిః కలిదోషశోషణాయ
ప్రణతి ర్వాంఛితసిద్ధయే చ యస్య ।
స్మరణం చిరసౌఖ్యలబ్ధయే స్యాత్
కలయే తం హృది వేంకటాద్రినాథమ్ ॥

శ్లో॥ యో దేవ స్స్వజనావనాయ కృతసంకల్పోఽవతీర్ణః క్షితౌ
లక్ష్మీశోభితవిగ్రహః ప్రవిలసద్వైకుంఠరమ్యాలయః ।
అశ్రాంతోత్సవరాజితో ఘనదయాసింధు స్స బంధు స్సతాం
భక్తాభీష్టవరప్రదో విజయతే శ్రీవేంకటేశః ప్రభుః ॥

సుబోధినీసమర్పకులు

**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయనపల్లి కామేశ్వరరావు** బి.ఏ.,

# పరిచయము

*శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి గారు*

రాజమహేంద్రవరము

శ్రీమద్రామాయణము భారతీయసాహిత్యమున శిఖరాయమానమైన మహాగ్రంథము. వాల్మీకిప్రణీతమైన యాదికావ్యము. వేదమంత్రములవలనఁ దెలిసికొనఁదగిన పరమాత్ముఁడు దశరథాత్మజుడుగా నవతరించెను. ఏడు కాండములుగా నున్న రామాయణములో ఇరువదినాలుగువేల శ్లోకములు గలవు. గాయత్రీమంత్రాక్షరములు ఇరువదినాల్గు. వాల్మీకిరామాయణములోని ప్రతి వేయవ శ్లోకము ఆ మంత్రాక్షరముతో నారంభమగును. దానివలన రామాయణము పారాయణము చేయుటవలనఁ గర్తకు సకలకార్యసిద్ధు లగుచున్నవి. మనోహరమైన కవిత్వానందముతోపాటు మహిమసిద్ధిప్రదమైన రామాయణమునకు సుందరకాండము శిరస్థానీయము. సప్తకాండమండితమైన శ్రీమద్రామాయణములో సుందరకాండమును ప్రత్యేకముగాఁ బారాయణము చేయుచుందురు. తత్పారాయణము అభీష్టసిద్ధి నొసగుచుండుటయు సర్వభక్తానుభవము.

ఒక శ్లోకము, ఒక పాదము, ఒక పదము కూడ పుణ్యప్రదమని చెప్పఁబడినది. శ్రద్ధాభక్తులతో, అర్థజ్ఞానము కలిగి పారాయణమొనర్చుటవలన గలిగెడి ప్రయోజన మనంతమైనది. సంస్కృతభాషాపరిచయము కలవారు ఆంధ్రులలో ఎందఱుందురు? అర్థజిజ్ఞాసువులయిన ధార్మికులకు, ఆస్తికులకు, పారాయణాసక్తులకు సుబోధముగా నుండునట్లు "సుందరకాండము" ప్రచురిత మగుట తెలుగువారికి అపేక్షితము. ఇతఃపూర్వము వావిళ్ళవారు సార్థతాత్పర్యముగా ప్రచురించియున్నను, ఆ గ్రంథము లిపుడు లభ్యము గాకుండుటచేఁ బలువురు ఆంధ్రవివరణసహితమగు సుందరకాండమునకు బహుకాలముగాఁ బ్రతీక్షించుచున్నారు.

ఇపు డీ "సుబోధినీ" సహితమగు సుందరకాండము తెలుఁగువారి కోరికకు ఫలముగా వెలువడుచుండుట ఆనందదాయకము. ఈ పుణ్యకృతికి సంకల్పించినవారు శ్రీ బోయనపల్లి కామేశ్వరరావుగారు. వీరు రామనామప్రచారకాగ్రేసరులగు "శ్రీరామశరణు"గారి శిష్యులలో అగ్రగణ్యులు. త్యాగభోగములకుఁ దగిన సంపత్తితోపాటు ధార్మికప్రవృత్తి కలిగిన యుదారులు; నిరంతర శ్రీరామధ్యాన పూజాతత్పరులు. ఆంగ్లమున పట్టభద్రులయ్యును, భారతీయసంప్రదాయములయెడ అవిచలితమైన శ్రద్ధాసక్తులు కలిగినవారు. వీరు తెనుఁగు పద్యరచన చేయగల సహృదయులు. "అమృతోదయ" మన్న ఆంధ్రకావ్యమును కృతిపొందియున్నారు.

శ్రీ కామేశ్వరరావుగారి పరిచయభాగ్యము నాకు పెక్కు వత్సరములుగా నున్నది. వీరు బహువారములు సుందరకాండ పారాయణము చేసి తత్తాత్పర్యార్థభావనా పులకితాంతరంగులై వాల్మీకిమహర్షి వదనారవిందగళితమైన వాఙ్మధువును, ఆ మహామునివాక్యములందలి రమణీయార్థవిశేషములను వివరముగా తెలిసికొనఁ దలఁచిరి. అట్టి జిజ్ఞాసతో ప్రతిపదార్థవివరణసహిత గ్రంథమున కన్వేషించిరి. లభ్యము కాలేదు. తనకుఁ దానే విద్వన్ముఖముగా సుందరకాండములోని ప్రతిశ్లోకమునకు అర్థతాత్పర్యములు తెలిసికొనుటకై నిర్ణయించుకొనిరి.

అట్టి సమయములో వీరికి శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారితో దైవికముగా పరిచయము కలిగినది. శ్రీ సుబ్రహ్మణ్యముగారు సంస్కృతాంధ్రములందు కృతపరిశ్రములు; పండితులు; సహృదయులు. నరసింహకర్ణామృతము, రమ్యోక్తి రత్నావళి మున్నగు పద్యకృతులు రచించిన కవులు. వీరుకూడ శ్రీరామశరణు గురువులతో రామమంత్రోపదేశమును పొందిన సుకృతాత్ములు. సగంధులైన శ్రీ సుబ్రహ్మణ్యముగారి సహకారముతో "సుబోధినీ" నామకమైన ఆంధ్రవ్యాఖ్య యీవిధముగా సంతరించి ముద్రణమునకు దెచ్చిరి. పదచ్ఛేదము – అన్వయక్రమము – ప్రతిపదార్థము – తాత్పర్యము – తత్తద్వ్యాఖ్యాతలు చెప్పిన విశేషార్థములు మున్నగునవి ప్రతిశ్లోకమునకు వ్రాయుపద్ధతి ప్రతిపాఠకునకు బహూపకారమై యున్నది.

సుందరకాండ శ్లోకములకుఁ దాత్పర్యమును తెలుపు గ్రంథములు మన తెనుఁగులో పెక్కు ముద్రితములై వచ్చినవి. ప్రతిపదార్థవిశిష్ట తాత్పర్యములతో ప్రచురితమగుచున్న యీ గ్రంథసంపుటములు భక్తజిజ్ఞాసువులకు అధికాదరపాత్రములై యుండుననుట నిస్సంశయము.

ఈ సుందరకాండము ఎనిమిది సంపుటములుగా ముద్రింపబడనున్నది. ఇది తొలిసంపుటము. ఇందు నాల్గు సర్గము లున్నవి. సాగరలంఘనము, నిశాగమన ప్రతీక్ష, లంకాధిదేవతావిజయము, లంకాపురీప్రవేశము. క్రమశః సర్వసంపుటములు ప్రచురితములై బహుజనులకు ఉపయోగపడుటయే వ్యాఖ్యాతల కృతార్థత.

శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ గ్రంథముద్రణమున కిచ్చిన అభయముద్ర యీవిధముగా కార్యరూపమును దాల్చుచున్నందులకు భక్తులు ఆనందించుచున్నారు.

ఇట్లు

**మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి**

శ్రీరామ శ్శరణం మమ

# ఆమోదము

ఉభయ వేదాంత ప్రవర్తకులు

**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి గారు**

విశాఖపట్టణము

వేదవేద్యుడగు పరమపురుషుడు దశరథాత్మజుడై దిగిరాగా వేదమే శ్రీరామాయణముగా వాల్మీకిముఖమునుండి వెలువడినది. శ్రీరామాయణమును వేదసమ్మితమని నారదమహర్షి ప్రశంసించుచు "**ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్**" అని ఉపదేశించెను. ఇది వేదమువలె శబ్దప్రధానము, పురాణమువలె అర్థప్రధానము, కావ్యమువలె రసప్రధానమునై ప్రకాశించుచున్నది. వేదమంత్రములవలె శబ్దమాత్రపారాయణమే అరిష్టనివారకము, శుభప్రదాయకమును. కాని అర్థజ్ఞానము లేక చేసిన పారాయణమున అనుభవము కొంత తక్కువ యగును. అర్థజ్ఞానమున్నచో అనుభవముచే మనసు మాఱి దైవీసంపదభివృద్ధి కలుగును. ధర్మాభ్యుదయము సిద్ధించును. ఆంతరమగు ధ్వన్యర్థము నెఱిగిననాడు ఆత్మస్వరూపసిద్ధి కలిగి పరమ పురుషార్థము లభించును. ఇట్లు శబ్దశక్తిచే, అర్థశక్తిచే, ధ్వనిశక్తిచే అజ్ఞ ప్రాజ్ఞ విశేషజ్ఞులకు ఉపకరించుచున్నట్లు వాల్మీకిమహర్షి శ్రీరామాయణమును అనుగ్రహించెను.

మంత్రముగా పారాయణము చేసి సకలార్థములను పొందినవా రెందరో కలరు. కాని శబ్దస్వరూపము తెలిసి అర్థజ్ఞానముతో సాగిన పారాయణమువలన విశేషఫలము సిద్ధించును. అర్థజ్ఞానము లేని పారాయణము సరియైన ఫలము నీయజాలదు. అందుకై పదచ్ఛేదము, పదార్థజ్ఞానము ఆవశ్యకము. తెనుగులో సుందరకాండమునకు పదచ్ఛేద ప్రతిపదార్థములతో విశేషార్థములు జోడించి ఆంధ్ర పాఠకలోకమునకు అందించు మహాభాగ్యము శ్రీరామచంద్రకటాక్షముచే ఈనాడు శ్రీకామేశ్వరరావుగారికి లభించినది. వారికి శ్రీసుబ్రహ్మణ్యముగారు రామానుగ్రహముచే లభించినారు. వారిద్దఱు రామదాసులు, సాత్త్వికులు, నిరహంకారులు నగుటచే ఈ మహాకార్యము నెఱవేఱినది కాని సాధారణమైన పనికాదు.

సుందరకాండమును పారాయణము చేయువారు ఎందఱో పదస్వరూపము, ప్రతిపదార్థము కావలెనని కోరుచుండుట నేనెఱుగుదును. శ్రీరామాయణములో సుందరకాండము హనుమత్సీతారామచంద్రుల సౌందర్యమును ఆచార్య జీవ భగవత్ సౌందర్యమును ప్రతిపాదించును. భగవానునికి దూరమై బంధములో నున్న సీతమ్మను

శ్రీరామునితో చేర్చిన హనుమ ఇందు ప్రధానుడు. హనుమను భవభూతి మహాకవి జీవలోక ప్రత్యుద్ధరణ గురూపకారి యనును. ఆ హనుమదనుగ్రహమే జీవకోటికి రక్షకము. సీతమ్మకూడ "త్వమస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ!' అని హనుమయందే కార్యభారము ఉంచును. అందుచే లౌకిక అలౌకిక కార్యనిర్వహణ దక్షుడగు హనుమ అనుగ్రహమే మానవుల సుఖశాంతులకు సాధనము. దానికి సుందరకాండమే మూలము. దీని నెఱిగి పారాయణము చేసిననాడే ఫలము సిద్ధించును. ఎఱుగుటకై ఈ సుబోధినీసహిత సుందరకాండపఠనమే ఆవశ్యకము.

దీనిని లోకమున కందించిన ఈ మిత్రద్వయము లోకమునకు చేసిన మహోపకారము అనితరసాధారణము. గుర్వనుగ్రహము, రామానుగ్రహము తోడై వారిని నడిపించి శ్రీనివాసుని అనుగ్రహమునకు పాత్ర మొనరించినది. విష్ణుసహస్ర నామము, సుందరకాండము, భగవద్గీత పారాయణము చేయుటయే మానవజాతి తమ మానవత్వమును నిలుపుకొనుటకు ప్రధానసాధనము. ప్రతివ్యక్తియు సుందరకాండము పారాయణము చేయవలసినదే. దానివలననే ఐహికాముష్మిక సుఖశాంతులు లభించును. దానికి అర్థవివరణము చేసి ఆంధ్రులను తరింపజేసిన ఈ రచయితలను శ్రీసీతారామచంద్రప్రభువు సర్వథా సర్వదా సర్వాభ్యుదయములతో సంధించుగాక, అని ప్రార్థించుచు నా కీ యవకాశము నొసంగిన ఈ మిత్రులకు నా ఆమోదానుభూతిని తెలియజేయుచున్నాను.

విశాఖపట్టణము
15.02.1982

ఇట్లు
భాగవత విధేయుడు
**శ్రీభాష్యం అప్పలాచార్యులు**

శ్రీ లక్ష్మీహయవదనో౽వతాత్

# మంగళాశాసనము

- ఉ.వే.ప్ర. శ్రీమాన్ తె.కం. గోపాలాచార్యస్వామిగారు
అధ్యక్షులు :
శ్రీమన్నారాయణ వేదవేదాంగ విద్యాలయము,
నడిగడ్డపాలెము : 522318

**ఆపదా మపహర్తారం దాతారం సర్వసమ్పదామ్ ।**
**లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥**

**వాల్మీకిగీత రఘుపుఙ్గవ కీర్తిలేశైః**
**తృప్తిం కరోమి కథ మప్యధునా బుధానామ్ ।**
**గఙ్గాజలై ర్భువి భగీరథయత్నలబ్ధైః**
**కిం తర్పణం న విదధాతి జనః పితౄణామ్ ॥**

"భగీరథచక్రవర్తి కడుంగడు విఘ్నముల కోర్చి మిక్కిలి ప్రయాసతో ఆకాశ గంగాదేవిని భూమికి తెచ్చెను. ఆ జలములతో ఆస్తికుడు తర్పణ మొసంగి పితరులను తృప్తిపఱచుచున్నాడు గదా! అటులనే నేనును వాల్మీకి మహర్షి ప్రసాదించిన శ్రీ రామాయణ కథాంశములతో పాఠకులకు తృప్తిని కలిగింతును" అని భోజమహారాజు రామాయణచంపువును రచించెను. మఱియును -

**నారాయణకథాప్రశ్నః పునాతి భువనత్రయమ్ ।**
**వక్తారం పృచ్ఛకం శ్రోతౄన్ తత్పాదసలిలం యథా ॥**

శ్రీమన్నారాయణుని కథను వినిపించుడని ప్రార్థించి ఒక పుణ్యపురుషుని వలన దానిని వినినచో, ఆ ప్రశ్న - ఆ కథను ప్రసాదించిన పురుషశ్రేష్ఠుని, చెప్పించిన ఉదారుని, వినిన పుణ్యశీలురను ఈ ముగ్గురను తరింపజేయును.

అటులనే ఈ సుందరకాండమును ఆంధ్ర టీకాతాత్పర్య విశేషార్థములతో, సుప్రసిద్ధ వ్యాఖ్యాతలు తెలిపిన పెక్కు అంశములను లోకోపకారముగా, చక్కని సులభ శైలిలో మన కందజేయుటకు ఉద్యమించిన శ్రీ బోయనపల్లి కామేశ్వరరావుగారిని, వారికి సహకరించిన శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారిని, దానిని ఆదరించి చదివించి శ్రద్ధాభక్తులతో వినిన శ్రోతృజనమును పవిత్రమొనరించును. అనగా వారి పాపములను

బాపి పరమపదస్థానమును ప్రసాదించును.

ఈ కాండను "సుందరకాండ" అననేల? బాలకాండ మున్నగు ఇతర కాండలలో ఆ యా పేరులకు తగిన కథాభాగమే అందుండుటచే వాని కా పేరుంచ బడినది. కాని యీ కాండ కీ పేరెట్లుంచబడినది? అని సంశయము జనించకమానదు. దీనికి ప్రాజ్ఞు లనేకవిధములగు సమర్థనలను చూపియుండిరి. కాని విస్తరభీతిచే నే నొక ముఖ్యాంశమును మాత్రము మనవి చేయుచున్నాను.

సీతామాత అశోకవనమునందు శింశుపావృక్షముక్రింద రాక్షసస్త్రీలచే చుట్టుకొనబడి కూర్చుండియుండి మిక్కిలి భీతభీతయై యుండెను. "భీతస్య సర్వం భయకారి నూనమ్" అనినట్లు దేనిని చూచినను రావణుడే ఆ రూపముతో తనయొద్దకు వచ్చుచున్నట్లు భయపడుచుండెను. అట్టి సమయములో శ్రీ ఆంజనేయులు దయచేయగా ఆయనను సంశయించి నీవు నిజముగ శ్రీరామదూతవే యైనచో శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహమును నాకు నమ్మకము కలుగునట్లు తెలియజెప్పుమని యడిగెను.

అందుల కాంజనేయులు శ్రీరామచంద్రుని ప్రతి అవయవమును ఉన్నదాని నున్నట్లు కొలిచి వచ్చెనో యన్నట్లు వర్ణించి చెప్పెను. ఈ కాండలో నున్నట్లు శ్రీరామచంద్రుని విగ్రహసౌందర్యవర్ణన మెచ్చటను లేకుండుటచే శ్రీరామసౌందర్యమే దీనికి ముఖ్యతాత్పర్య మనునటుల నీకాండ కీపే రుంచబడెను.

మరియు మోక్షప్రాప్తికి ఇతర కర్మయోగాద్యుపాయము లన్నిటికన్నను అందరకును సుకరతమమైన ఉపాయము – ఆచార్యాభిమానమే యని శాస్త్రోద్ఘోషము. అట్టి యాచార్యవైభవ మీ కాండలో శ్రీఆంజనేయులయం దారోపించి సమగ్రముగ వర్ణించుటచే నీకాండ సుందరమైనది.

మరియు నీకాండలోని శ్లోకములలో అనేకబీజాక్షరసంపుటి చేర్చబడుటచే నిది సకలఫలప్రదమని యాదరింపబడుటచేతను ఇది సుందరార్థప్రతిపాదకమగుటచే సుందరకాండ యనబడుచున్నది.

"**తతో రావణనీతాయాః**" ఇత్యాది ప్రథమశ్లోకమునందే శ్రీఆంజనేయుల ఆచార్యత్వము ధ్వనింపచేయబడిన విషయము ఈ యనువాదగ్రంథములోనే వ్యక్తపఱుపబడియున్నది.

"**ఆచార్యో వేదసమ్పన్నః విష్ణుభక్తః**" ఇత్యాద్యాచార్య లక్షణము లన్నియును శ్రీఆంజనేయులకు కలవని శ్రీరామచంద్రు డీతనికి ప్రసాదించిన యోగ్యతాపత్రమే ప్రమాణము.

పంపాతీరమున శ్రీరామలక్ష్మణులు విశ్రమించియుండగా సన్యాసివేషముతో విచ్చేసి శ్రీఆంజనేయులు సంస్కృతభాషలో ప్రసంగించిన స్వల్పభాషణలోనే శ్రీరామచంద్రు డాశ్చర్యపడి

**"నాఽ నృగ్వేదవినీతస్య నాఽ యజుర్వేదధారిణః ।**
**నాఽ సామవేదవిదుషః శక్యమేవం ప్రభాషితుమ్ ॥"**

అని యాతని త్రయీపరిజ్ఞానమున్నూ

**"నూనం వ్యాకరణం కృత్స్న మనేన బహుధా శ్రుతమ్ ।**
**బహు వ్యాహరతాఽనేన న కిఞ్చి దపశబ్దితమ్ ॥"**

ఇత్యాదిశ్లోకములచే నీతని వేదాంగవిజ్ఞానమున్ను ప్రశంసింపబడుటచే నుపలక్షణముగా నీయనయందలి యాచార్యలక్షణము లన్నియును సమన్వయపడునట్లు ప్రశంసింపబడెను.

ఈ సుందరకాండ కథాసందర్భము నంతను మానవజీవితముతో సమన్వయ పఱచుచు శ్రీవేదాంతదేశికమహాశయు లొక్క శ్లోకములో సెలవిచ్చిరి.

**శ్లో॥ "దర్పోదగ్ర దశేన్ద్రియానన మనోనక్తంచరాధిష్ఠితే ।**
**దేహేఽ స్మిన్ భవసిన్ధునా పరివృతే దీనాం దశా మాస్థితః ।**
**అద్యత్వే హనుమత్సమేన గురుణా సందర్శితార్థః పుమాన్**
**లఙ్కారుద్ధవిదేహరాజతనయాన్యాయేన లాలప్యతే ॥"**

శ్రీసీతాదేవి దుర్దశకు మనము విచారించవలసిన పనిలేదు. మనదశ అంతకు మించిన దుస్థ్సితిలో నున్నదని తెలిసికొనుడు.

మన శరీరమే లంక. ఇది సంసారసాగరమధ్య నున్నది గదా! ఇందొక రావణు డున్నాడు గమనింపుడు. మనస్సే రావణుడు. వాని లక్షణము లన్నియును మన మనస్సున కున్నవి. చఞ్చలము, ప్రమాథి, బలవంతము, దృఢము. ఇదియును దుర్జయమే. – (గీత 4 అధ్యా.)

కామమే కుంభకర్ణుడు. "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి." కుంభకర్ణునకు ఆహార మెంత తిన్నను తృప్తిలేనట్లు కామము నట్టిదే.

ఇంద్రజిత్తు క్రోధము. కోపము చేయించని పాపము లేదు. "**క్రుద్ధో హన్యా ద్గురూ నపి**". వీని పేరే వీని దుర్లక్షణమును ధ్వనింపజేయును.

రావణునకు పది తలలు తోడు. ఆ తల్లి యెంతమంది రాక్షసస్త్రీలతో నావరింపబడినదో మన ఆత్మయును అన్ని ఇంద్రియవృత్తులతో నావరింప బడియున్నది. ఆ తల్లి యెట్లు తన మనోవాక్కాయములను శ్రీరామచంద్రుని కర్పించి, యాతని కృపకు పాత్రమై, ఆయన పంపిన హనుమంతుని సందేశముతో ప్రాణమును ధరించియుండి, ఆయనద్వారా తనముక్తికి విరోధులైన దైత్యులబారినుండి బయటపడి, పుష్పకవిమానములో నయోధ్యకు చేర్చబడినదో మనమును అటులనే మన మనోవాక్కాయములను భగవదర్పణము గావించి, దృఢమైన విశ్వాసముతో నున్నచో భగవంతుడు మనయందు కృపతో మనకును ఆంజనేయులవంటి ఆచార్యులను అందజేసి మనకు మోక్షవిరోధులైన రాక్షసులకన్నను ఘోరతమములగు పాపములను బాపి మనలను అర్చిరాదిమార్గమున విమానముతో అయోధ్యకు (పరమపదమునకు) చేర్చును. అని యీ కాండలోని కథాసందర్భము మనకు బోధించుచున్నది.

ఇట్టి పవిత్రమును, పరమపదప్రదము నగు సుందరకాండకు ప్రతిశ్లోకమునకు పదచ్ఛేదము, అర్థక్రమము, ప్రతిపదార్థము, పూర్వాచార్యుల వ్యాఖ్యానరహస్యములను, తాత్పర్యమును ఇంత సులభశైలిలో అనువదించి సుబోధిని యను పేరుతో లోకమున కొసగిన శ్రీ బోయినపల్లి కామేశ్వరరావుగారికిని, శ్రీమైలవరపు సుబ్రహ్మణ్యముగారికిని,

దీనిని ముద్రించుటకై శ్రీ శ్రీనివాసుని పరమపవిత్రద్రవ్యమును ప్రసాదించిన శ్రీ శ్రీనివాసుని దక్షిణహస్తమైన శ్రీ శ్రీ ప్రసాదుగారికిని శ్రీ రామచంద్రుడు సమస్త సన్మంగళములను ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాను.

ఆంధ్రప్రజానీక మీ గ్రంథమును సద్వినియోగపరచుకొని ఇహపరసుఖముల నందగలరని యాశించుచున్నాను.

ఇట్లు

భాగవతదాసుడు

**గోపాలాచార్య**

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః

# ఆశీస్సు


విద్వత్కవిశేఖర; కవితాభూషణ;

**బ్రహ్మశ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు**

కాకినాడ.


తపస్వియు, స్వాధ్యాయనిరతుఁడు నగు నారదమహర్షి గురువు, శిష్యుఁడు వాల్మీకియఁట. గురుముఖతః సీతారాముల వృత్తము నంతయు విని, కావ్యరూపమున వాల్మీకి రచించినాఁడఁట. "**కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్, పౌలస్త్యవధ మిత్యేవం చకార చరితవ్రతః.**" ఆ రాముని చరితమునకు "రామాయణము" అనియు, "సీతయొక్క గొప్పచరిత్రము" అనియు, "రావణవధ" అనియు మూఁడు నామములతో లోకవిఖ్యాతి నందునట్లు మహాతపస్వియైన వాల్మీకి రచన వెలసినది. అది సప్తకాండములతో, ఇరువదినాల్గువేల శ్లోకములతో రూపొందినది. అందు అయిదవ కాండము సుందరమఁట. కథాంశస్ఫోరకములుగా వెనుకటి నాల్గుకాండములకును, తరువాతి రెండుకాండములకును గల్గిన నామములవంటిదిగాక, దీనియం దేదో ప్రత్యేకత యున్నట్లు లేదా? రామాయణమున కది హృదయస్థానీయము కావున నట్టి పేరొందినది. రామాయణనాయకుఁడు రాముఁడు. సుందరకాండ మొక ప్రత్యేకకావ్యముగా నెంచినచో దానికి ఆంజనేయుఁడు నాయకుఁడు.

ఈ సౌందర్య మెందున్నది? అని పరిశీలించి, అశోకవనమున నున్న సీత దిక్కుగానక విలపించి, మరణమే శరణముగాఁ దన దీర్ఘమగు వేణిని కంఠమునకు నురిపోసికొను సమయమున రామకథ హనుమంతునివలన విని బ్రదికి వికసితముఖి యైనది. కావున నామె సుందరియైనది. సీత కనఁబడక, లక్ష్మణునితో – నేను సీతలేనిదే జీవింపనని అరణ్య కిష్కింధా కాండములలో పెక్కుపర్యాయములు జీవితాశ వదలుకొని, తపించుచు, కృశించిపోయిన తనకు సీతాదేవి కుశలవార్త వినఁబడి యానందమూర్తిగా పరిణమించిన రాముఁడు సుందరుఁ డైనాఁడు. కావున అట్టి సీతారాములనుబట్టి యది సుందరకాండమైనది అనినారు.

సముద్రలంఘనమునకై మహేంద్రపర్వతమున పర్వతాకారముతో నిలిచి, తన యిష్టదేవతలను బ్రార్థించుచు మొట్టమొదటఁ గనఁబడుచున్న యాంజనేయమూర్తి యీ కాండమున కంతకును నాయఁకుడు. బ్రహ్మాండపురాణమున వేదవ్యాసులవారు –

"శ్రుత్వా తు పంచమం కాండం హనుమద్విజయాంకితమ్ ।
ఆంజనేయప్రసాదేన బ్రహ్మలోకం స గచ్ఛతి ॥"

హనుమద్విజయాంకితమైన ఐదవకాండమును విన్న నరుఁడు అంజనేయుని దయచే బ్రహ్మలోకమును పొందునని యెలుఁగెత్తి చాటినారు. కావున నాంజనేయుని విజయపరంపరయం దేమేని సౌందర్య మున్నదేమో యని పరిశీలించి వీరరౌద్రభయానక బీభత్సరసములతో నిండిన యా ఘట్టములందుఁ గాదు. ఆద్యంత మా కాండమున నాంజనేయుఁడు సుందరమూర్తి; కావున నది సుందరునియొక్క కాండము అనినారు.

ఎట్లన – రామముద్రికతోపాటు 'పుంసాం మోహనరూపుఁ'డైన రాముని తేజస్సును, రాముఁడు జీవించియున్నాఁడని విని వికసితముఖియై లంకనుండి వచ్చునపుడు సీత యిచ్చిన శిరోమణితోపాటు జగజ్జనని యగు నా సీతామహాదేవి దివ్యతేజస్సును గూడ తనకు సంక్రమించిన యాంజనేయుఁడు సుందరాతి సుందరమూర్తిగా వాల్మీకిమహర్షి దృష్టిలో ప్రత్యక్ష మగుటచే నా కాండము సుందరము అనినాఁడని తుదితీర్పుగాఁ జెప్పినారు ప్రాజ్ఞులు.

దీని ననుసరించి సుందరకాండ మాంజనేయుఁడు నాయకుఁడుగా ప్రత్యేక మొక యవాంతరకావ్యమైనది.

ఋశ్యమూకమునకు వచ్చుచున్న రామలక్ష్మణులను ప్రప్రథమముగా కలిసికొని, నమస్కరించి వారి వృత్తాంత మడుగుచునే, సుగ్రీవవృత్తాంతము వినిపించి, వినీతుఁడై నిలిచిన హనుమంతునిగూర్చి రాముఁడు లక్ష్మణునితో "మధురవాక్కగు నీ సుగ్రీవసచివుఁడు – ఋగ్యజుస్సామవేదజ్ఞుఁడు. కావుననే యిట్లు పలుకుచున్నాఁడు. వ్యాకరణశాస్త్ర మంతయు బహుధా నేర్చినవాఁడు కాకున్న నపశబ్దస్పర్శము లేకుండ నిట్లు పలుకఁగలఁడా? ఈతని వాఙ్నైపుణ్యమునకు కత్తియెత్తి మీఁదఁబడనున్న శత్రువు కూడ వశుఁడు కాక మానఁడు. ఇట్టి దూత యే రాజునకుఁ గల్గఁడో, యట్టి రాజునకు నే కార్యమైన సిద్ధించునా?" అని యింకను బహువిధముల మెచ్చుకొనినాఁడు. కావుననే సీతాన్వేషణమునకు సుగ్రీవాజ్ఞచే దక్షిణదిశకు పంపుచున్న వానరులలో యువరాజగు నంగదుఁడు, వృద్ధుఁడగు జాంబవంతుఁడు మున్నగువారి కెవరికి నీయక, రాముఁడు తన యంగులీయకము హనుమంతుని చేతిలోఁ బెట్టినాఁడు.

సుగ్రీవుఁ డనినట్లుగా – నాంజనేయునకుఁ దెలియనిది లేదు. ఆతని గమనమున కడ్డు లేదు. గమనవేగము, పరాక్రమము, లాఘవము, తండ్రి యగు వాయుదేవునితో సమముగాఁ గలవాఁడు. భూమియందుఁ గాని, ఆకాశమునందుఁ

గాని, నీటియందు గాని, యాతని గమనమున కడ్డు లేదు – "అని సర్వత్ర కనఁబడుచునే యున్నది. లంకలోఁ బ్రవేశించిన తరువాత – సుగ్రీవుఁడు చెప్పినట్లు – బలము, బుద్ధి, పరాక్రమము, దేశకాలానువృత్తి, నీతి యాతని సొమ్మై యున్నవి". అవి యన్నియు నాతని చర్యలలో ప్రత్యక్షమగుచునే యున్నవి.

ఆతని జితేంద్రియత్వమున కొక యద్భుతసంఘటనము – లంకలో సీతను వెదకి తెలిసికోవలసియున్నది. పగటివేళ వీలుగాదు. రాత్రి మాత్రము జనులందఱును మేల్కొనియుండ నెట్లు కుదురును? అర్ధరాత్రమున రావణాంతఃపురమున స్త్రీలు నిద్రించుచుండ నంతఃపురమున స్త్రీల నడుమ నెచటనైన సీత యున్నదేమో యని వెదుకుసమయమున నెంత నిర్వికారచిత్తముతో సంచరించినాఁడు! సీతాదేవితో మాటాడునపు డెంత సంయమనము! ఎంత ధర్మచింత! ఎంత దూరదృష్టి! వివరించిన నొక గ్రంథము కాఁగలదు.

రాముని క్షేమవార్త చెప్పినాఁడు. ఆనవాలుగా నుంగర మిచ్చినాఁడు. సీతయిచ్చిన శిరోమణి పుచ్చుకొన్నాఁడు. వెడలిపోవచ్చును గదా! అట్లు గాదు. ఇట్లు నిర్ణయించుకొన్నాడు. ఇంకను కొంచెము కార్యశేష మున్నది. ఈ రాక్షసులపట్ల సామదాన భేదములు పనికిరావు. పరాక్రమించి తీఱవలెను. కార్యసాధకలక్షణ మేమన :– తనకు నిర్దేశించిన యొక్క కార్యమే కాదు. బహుకార్యములు దానితోపాటు చేయవలెను. రావణుని సామర్థ్యముకూడఁ దెలిసికొనక వెళ్ళుట సమంజసము కాదు. వీరితో యుద్ధముచేయక బలాబలములు తెలియవు. దానికై యీ యశోకవనము ధ్వంసముచేసి రాక్షసులతో యుద్ధమొనర్చి రావణునకు బుద్ధిచెప్పి వెడలెదను. అని అశోకవన వినాశము చేసెను. పెక్కుమంది రాక్షసులను యుద్ధములో ఘోరముగా సంహరించెను. ఆ యుద్ధమునందు – "ఈ విజయము రామునిది, లక్ష్మణునిది. రామునిచే రక్షితుఁడగు నా ప్రభువు సుగ్రీవునిది. నాదిమాత్రము కాదు. నేను రామునకు దాసుఁడను. నా పేరు హనుమంతుఁడు. ఎందఱు శత్రువు లెదురైనను వారినందఱను సంహరించి వైచెదను. వేయిమంది రావణులు వచ్చినను నన్నెదిరింపఁజాలరు. లంకాపట్టణము కలచివైచెదను. నాతల్లి సీతకు మ్రొక్కి నా కోర్కె తీర్చుకొని వెడలెదను." అను నర్థము గల నాల్గుశ్లోకములను పెక్కుసార్లు పఠించును. ఇది కార్యశూరుడైన యీతని నిష్కామ కర్మశీలతకును "కర్మకౌశలము" నకును నిదర్శనము.

అక్షాదిరాక్షసనిర్మూలనమునఁ గానవచ్చు వీరత్వము, బ్రహ్మాస్త్రబద్ధుడై రావణసభలో ప్రవేశించుటలోని యౌచిత్యము, ప్రభువు సందేశమును వినిపించి రావణునికి హితోపదేశము చేయుటలో చూపిన ధీరత్వము మున్నగు మహానాయక

లక్షణములకెల్ల లక్ష్యమైన హనుమంతుడు నాయఁకుడుగా శ్రీరామనాయకమైన మహాకావ్యమగు ఆదికావ్యమునందు సుందరకాండము అవాంతరమైన స్వతంత్ర లఘుకావ్య మనఁదగును.

పరమశివాంశవిశిష్టుఁడైన యాంజనేయుని జయోదాహరణ మగు నీ సుందరకాండమును ఇష్టసిద్ధికై పారాయణ మొనర్పుట భారతీయుల యనూచానమైన యాచారము.

మన యాంధ్రదేశమున నీ సుందరకాండమును సీతారామప్రీతికరముగా, ఆంజనేయోపాసనముగా పరిపరివిధములుగా బహువిధములగు నియమములతో పారాయణము చేసి తమ యభీష్టసిద్ధి నొందినవారును, దుర్ఘటకార్యములను సాధించుకొన్నవారు నెందఱో యున్నారు.

అట్టి హనుమత్సీతారామభక్తులు సుందరకాండమునందలి యర్థ విశేషములను వివరముగ సుకరముగఁ దెలిసికొనుటకు వీలుగా హనుమత్సీతారామ భక్తులైన శ్రీ బోయనపల్లి కామేశ్వరరావుగారును, శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారును మంచి పరిశ్రమ చేసి యిందలి శ్లోకములకు – పదచ్ఛేద, ప్రతిపదార్థ, తాత్పర్యములు వ్రాయుటయే గాక సంస్కృతాంధ్ర పూర్వవ్యాఖ్యానములందు గానవచ్చిన విషయములను గూడఁ జేర్చి, నే డీ "సుబోధిని"ని రచించి "స్వయం తీర్ణః పరాంస్తారయేత్" అను సూక్తికి లక్ష్యమైనారు. బహువ్యాఖ్యలను బరిశీలించి తెల్పిన యిందలి బహు విషయములు పాఠకులకు బహూపయుక్తములై యున్నవి. ఏతద్గ్రంథ నాయకుఁడైన, యాంజనేయపరబ్రహ్మము వారికి వరప్రదాతయై లోకకళ్యాణ మొనర్చుగాక అని నా ఆశీస్సు.

**వెంపరాల సూర్యనారాయణశాస్త్రి**

# స్వస్తి సౌహార్దాయ

ఉభయ వేదాంత ప్రవర్తకులు

**శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాధాచార్యులవారు**

సంస్కృతాంధ్రోపన్యాసకులు,

S.V.S.A కళాశాల, వరంగల్లు.

**శ్లో॥ కరుణైకాస్పదస్వాంత - శాలినే వనమాలినే ।**
**అవంధ్యాహార్యకోపాయ - రాఘవాయాస్తు మంగళమ్ ॥**

వేదమే సాక్షాద్రామాయణాత్మనా అవతరించినదని పెద్దల ఆశయము. అందలి సుందరకాండము వేదశిరస్సారమే అనుట వాస్తవము. ఉపనిషత్తులన్నియును ముముక్షువగు శిష్యునకు ఆచార్యుడు తత్త్వోపదేశములను చేయుచున్నట్లు ప్రవృత్తమైనవి. సుందరకాండములోని పరమార్థము గూడ నిదేనని "దర్పోదగ్రదశాననేంద్రియ ..... అద్యత్వే హనుమత్సమేన గురుణా సంబోధితార్థ స్సుధీః ......" ఇత్యాది శ్లోకమున శ్రీ వేదాన్తదేశికులవారు ప్రసాదించిరి.

తత్త్వోపదేశపరమైన ఈ సుందరకాండమునకు అర్థమును టీకా తాత్పర్యములను ముఖ్యవిశేషార్థములను వ్రాసి ప్రకటించుచున్న శ్రీ కామేశ్వరరావుగారు, శ్రీ సుబ్రహ్మణ్యముగారు అభినందనీయులు. ఇది సంస్కృత మెరుగని జిజ్ఞాసువులకు మహోపకారకమైన గ్రంథమనుటలో సందేహములేదు. నిర్దుష్టమైన వివరణముతో కూడినట్టి ఈ గ్రంథము సర్వజనాదరణీయమగునని ఆశింతును.

★★★

శ్రీరామ శ్శరణం మమ

# ఆమోదము

శిరోమణి : **సముద్రాల లక్ష్మణయ్య,** ఎం.ఏ.,
కార్యదర్శి – ఇన్‌చార్జి
హిందూ ధర్మ రక్షణసంస్థ, తిరుపతి.

ఆదికవి వాల్మీకి రచించిన రామాయణం భారతీయ సాహిత్యానికే కాక విశ్వవాఙ్మయానికీ మకుటాయమానమైంది. రామాయణమే లేని పక్షములో రాముడెవడో అతడెలాంటివాడో లోకానికి తెలిసేది కాదు.

కోట్లకొలది ప్రజలు ఈనాడు రాముణ్ణి ఆరాధ్యదైవంగా భావిస్తున్నారు. సకలకల్యాణగుణపరిపూర్ణుడూ, అవతారపురుషుడూ అయిన శ్రీరామచంద్రుడు మానవాళి కంతటికీ ఆచరణీయమైన మహోత్తమాదర్శాలను తన జీవితంద్వారా ప్రబోధించాడు. శబ్దబ్రహ్మాన్ని స్వాధీనం చేసుకున్న ప్రాచేతసుడు ఆ మర్యాదా పురోషోత్తముని గుణకర్మనామాలను కీర్తించి తాను ధన్యుడు కావడమే కాక, భక్త కోటిని కూడా ధన్యజన్ములను చేశాడు. అందుకే వేదవేద్యుడైన పరమపురుషుడు దశరథాత్మజుడుగా అవతరించగా వేదమే ప్రాచేతసునిద్వారా రామాయణరూపంలో సాక్షాత్కరించిందని చెప్పబడింది.

వాల్మీకి కృతి ఆదికావ్యమైనా నాటికీ, నేటికీ అది అద్వితీయంగా భాసిస్తున్నది. అంతకంటె ఉదాత్తమైన కావ్యం భావికాలంలోనైనా అవతరించటం అసంభవం. చదివేకొద్దీ చవులూరించే ఈ మహాకావ్యాన్ని ఆధునికకాలంలో పాశ్చాత్యదేశీయులు కూడా అనల్పమైన ఆదరణతో సంభావిస్తున్నారు.

రామాయణ మంతటిలోనూ సుందరకాండ అత్యద్భుతమైన భాగంగా గుర్తింపబడింది. భగవద్గీతను పారాయణం చేసినట్లే సుందరకాండను కూడా అనేకులు భక్తిశ్రద్ధలతో పారాయణంచేసి అభీష్టప్రయోజనాన్ని పొందగలుగుతున్నారు. అలాంటి సుందరకాండకు పదచ్ఛేదము, అన్వయము, ప్రతిపదార్థము, తాత్పర్యము, ప్రాచీన వ్యాఖ్యాతలు చెప్పిన విశేషములు చేర్చి కూర్చిన ఈ గ్రంథరాజం భక్తపాఠకలోకానికి పరమాదరణీయం అనడంలో ఎలాంటి సందేహమూ లేదు. అన్ని విషయాలనూ సంగ్రహంగానూ, సమగ్రంగానూ, గ్రహించగోరేవారికి ఈ గ్రంథం ఎంతో సహకరిస్తుంది.

విపులవివరణతోకూడి ఉండడంవల్ల ఈ ఒక్కకాండమునే ఎనిమిది సంపుటాలుగా ప్రకాశకులు ప్రచురిస్తున్నారు. అందు మొదటి సంపుటం ముందే వెలువడింది. ఈ రెండవ సంపుటం తరువాత తక్కిన సంపుటాలు త్వరలో రానున్నాయని తెలుపడం సంతోషదాయకం.

శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారు, శ్రీ బోయినపల్లి కామేశ్వరరావుగారు భగవదనుగ్రహానికి పాత్రులయ్యారు కాబట్టే ఇంత దివ్యమైన కృషిని దీక్షాదక్షులై కొనసాగిస్తున్నారు. వారిని మనసారా అభినందిస్తున్నాను.

ఈ మహాప్రయత్నం ఒక్క సుందరకాండకే పరిమితం కాకుండా రామాయణానికి కంతటికీ విస్తరిస్తే ఆంధ్ర పాఠకలోకానికి మహోపకారం జరుగగలదు. అలాంటి శక్తియుక్తులను శ్రీరామచంద్రమూర్తి సుబోధినీ వివరణ కర్తలకూ, తత్ప్రకాశకులకూ అనుగ్రహించు గాక.

★★★

# అనుశీలన

డాక్టర్. **కొర్లపాటి శ్రీరామమూర్తి,**
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
తెలుగుశాఖ
ఆంధ్ర విశ్వ కళాపరిషత్, వాల్తేరు.

ఆదికవి వాల్మీకి కోకిల కలకూజితమైన రామాయణ మహాకావ్యము కలికాలమునందును కలకాలము సహృదయ హృదయంగమము. వాల్మీకి మహర్షి వదనారవింద గళితమైన కవితారస మకరందము భావుకమధుప మధురము. అందు సుందరకాండము కవితా సుందరము మాత్రమేగాక పారాయణ బంధురము. అట్టి సుందరకాండమును సుబోధినీ వివరణ సమేతముగ ఎనిమిది సంపుటములందు ప్రకటించుచున్న శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యము, బోయనపల్లి కామేశ్వరరావు గారల అపూర్వ ప్రయత్నము అత్యంత ప్రశంసాపాత్రము.

ప్రతి శ్లోకమునకు పదచ్ఛేదము, అన్వయక్రమము, ప్రతిపదార్థము, తాత్పర్యము, విశేషార్థములు సంతరించిన సుబోధినీ వివరణము నిజముగ సుబోధినీ వివరణమే. ఒక సంస్కృత మూలమునకు బద్ధులు కాక, వివిధ ముద్రణములను పరిశీలించి, అధిక శ్లోకములకు సహితము అర్థ వివరణము కావించుట అభినంద నీయము. ఏ ఒక సంస్కృత వ్యాఖ్యానమునకును బద్ధులుకాక, గోవిందరాజీయము, మహేశ్వర తీర్థీయము, రామానుజీయము, రామాయణ శిరోమణి, తిలకము మొదలైన వివిధ వ్యాఖ్యానములను పరిశోధించి అర్థ విశేషములను సంఘటించుట ఆదర్శ ప్రాయము. ఇట్లు మొత్తము రామాయణము ప్రకటితమైనచో, అది తెలుగువారి సుకృతమే అగును. ఏ మహాసంస్థలో చేపట్టవలసిన ఏతాదృశ మహాకార్యమునకు ఏకదేశముగనైనను ఇద్దరు వ్యక్తులు దీక్షాకంకణధారులగుట ఆంధ్రుల మహాభాగ్యమే. ఒక విధముగ సంస్థల చేతిలో పడుటకంటె వ్యక్తుల నెత్తిన పడుట వాల్మీకి అదృష్టము.

జిజ్ఞాస నిరవధికము. అది దేశకాల మత రాజకీయాదులకు అతీతము. అందును, భారతీయులకు ప్రామాణిక గ్రంథములు మాత్రమే గాక పారాయణ గ్రంథములునైన భారత భాగవత రామాయణముల జిజ్ఞాస సావధిక మగుట సంకుచిత దృష్టికి మాత్రమే నిదర్శనము. పరంపరాగతమైన సంకుచిత దృష్టిని సరకు గొనక, సువిశాలదృష్టితో – వివిధ వ్యాఖ్యాన విశేషములను ప్రోదిచేసి, ఏపాటి తెలుగుభాషా పరిచయము కలవారికైనను కరతలామలక మగునట్లు సుబోధినీ వివరణమును

సూక్తిసుందరము కావించిన సుబ్రహ్మణ్య కామేశ్వరుల సారస్వత కృషి సఫలము. రామాయణ జిజ్ఞాసువులకు సుబోధినీ వివరణ సమేత సుందరకాండము రమణీయ రత్న దర్పణము.

ఇట్లు సుందరకాండమును ఎనిమిది సంపుటములుగ ప్రకటించి, అంతతో సంతృప్తి చెందక, మొత్తము రామాయణమును సుబోధినీ వివరణ సమేతముగ వీరు ప్రకటింపవలయునని ఆకాంక్ష. అందుకు తెలుగువారి వెలుగు వేల్పు శ్రీ తిరుపతి వేంకటేశ్వరస్వామి వీరిని సంకల్ప సిద్ధులను చేయుగాతమని సంప్రార్థనము.

**"వాల్మీకిగిరిసంభూతా రామాంభోనిధి సంగతా ।**
**శ్రీమద్రామాయణీ గంగా పునాతు భువనత్రయమ్ ॥"**

★★★

శ్రీరామ

# సుందరకాండము

# నివేదనము

రామకథాసుధను వాల్మీకిమహర్షిప్రోక్తములైన మధురవచనములలో ఆస్వాదించుట ఒక దివ్యమైన అనుభవము.

అందును ఆ యాదికవి రమణీయతరమైన భాషలో కమనీయతమములైన భావములతో అద్వితీయమహిమాఢ్యముగా రూపొందించిన సుందరకాండమును అధ్యయనము చేయుట ఇంకను దివ్యతరమైన అనుభూతి.

సుందరకాండము - జానకీరాఘవుల దివ్యచరితమునకు తన దౌత్య రూపమున హనుమ గావించిన భవ్యమైన వ్యాఖ్యానము.

సీతారాముల నెడి సువర్ణమూర్తులకు హనుమత్సేవ యనెడి సౌరభ మబ్బిన విశిష్టకథాఘట్టమే సుందరకాండము.

ఆ సువర్ణసురభిళచరితమునకు మహర్షిపావనవాఙ్మాధుర్యవిశేషము తోడుపడి రూపొందిన దివ్యకావ్యమే సుందరకాండము.

'పాఠ్యే, గేయే చ మధురమ్'' అగుచు అలౌకికానందప్రదాయకమైన ఆదికావ్యముయొక్క సారమనియును, సర్వార్థసిద్ధిప్రదముగా, సకలజనసులభ సేవ్యముగా లోకమునకు, మహర్షి ప్రసాదించిన మనోహరమైన మంత్రరాజ మనియును సర్వజనులచే భక్త్యానందములతో ఉపాసింపబడు ఉత్కృష్ట కావ్యమే సుందరకాండము.

వాడవాడలను, ఇంటింటను వేయేల; మన భారతీయు లెల్లరి హృదయము లందును స్థిరప్రతిష్ఠితులై యుండి మన జీవనపథములందు ఎదురగుచున్న కష్టసుఖములతో ధర్మాధర్మనిర్ణయము చేసి కర్తవ్యాకర్తవ్యములను బోధించుచు, స్త్రీపురుషులచేతను, పండితపామరులచేతను తెల్లవాతినది మొదలు ఆత్మీయతతో పలువిధములుగా సేవింపబడుచున్న మన ఆరాధ్యదైవములైన సీతమ్మ, రామయ్య, హనుమన్నల ప్రభావవిశేషవర్ణనమే సుందరకాండము.

తుదకు రెండు మాటలలో - దైవీగుణసంపద - ఆదిలో ఆపదలచే బాధితమయ్యును, చివరకు స్థిరమైన అభ్యుదయ మొందును; ఆసురబలసంపన్మత్తులు ఐహికభోగవిలాసముల పరాకాష్ఠ నందినను, తుదకు తమ అధర్మానలముచేత తాము

దగ్ధులు కాకమానరు – అని లోకమునకు బోధించు రమణీయతత్త్వశాస్త్రమే సుందరకాండము.

"ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్," అని అగ్గలమైన భక్తితాత్పర్యములతో మే మీ సుందరకాండమును పారాయణము చేయుచుండగా ఇందలి అర్థవిశేషములను వివరముగ తెలిసికొనవలెనను ఆసక్తి తీవ్రమగుచుండెడిది. లభ్యములైన తాత్పర్యయుక్తగ్రంథములు పెద్దలు రచించినవి అనేకములు సంపాదించి చదివినను తనివి తీఱదయ్యెను. మహర్షిముఖనిస్సృతములైన వచనములకు ప్రతి పదమునకును అర్థము తెలిసికొనవలె నను కుతూహలము నెఱవేఱలేదు. ఆ కోరికతో చేసిన ప్రయత్నములో సంస్కృతవ్యాఖ్యానగ్రంథములు రెండు దొరికినవి. వాటి సాయముతో ప్రతిపదార్థము సొంతముగానే వ్రాసికొనవలెనని నిశ్చయించుకొంటిమి. గురుదేవుల స్మరణముతో ఆరంభించి ఆ యా వ్యాఖ్యాతలు తెలిపిన, మేము గ్రహించిన విశేషములను ఆ యా శ్లోకములకడనే చేర్చుకొనుచు టీక వ్రాసికొనుట ఆరంభించితిమి.

మేము చేయుచున్న ఈ కృషి మాబోటివారికి మఱి పెక్కుమందికి కూడ ఉపయోగపడవలె నన్న కోరికతో తటస్థపడిన జిజ్ఞాసుమిత్రులకు చూపుచుండగా వారందరును ఈ టీకావివరణములు సుందరముగా సుబోధముగా నున్న వనుచుండిరి.

కొద్దికాలములో మేము వేఱుపనులపై వెళ్ళినప్పుడు హైదరాబాదులోను, విజయనగరములోను గ్రంథాలయములలో ప్రతిపదార్థయుక్త సుందరకాండము చూడగల్గితిమి. అది సుమారు ఎనుబది సంవత్సరముల క్రిందట అచ్చుపడిన పాతప్రతి. ప్రాచీనమహాపండితులు బ్రహ్మశ్రీ చదలవాడ సుందరరామశాస్త్రిగారు 'పరమార్థచంద్రిక' అను పేరుతో రచించిన వ్యాఖ్యాగ్రంథము. క్రొత్తగా శ్రమపడ నక్కఱలేకుండ ఎట్లో దానికి మాఱుప్రతి వ్రాసికొన్న సరిపోవును గదా యని ఆ గ్రంథమును శ్రద్ధగా పరికించితిమి. మేము ప్రారంభించి వ్రాయుచున్న విధానము దానికంటె కొద్ది భిన్నముగా నుండి, వివరముగాను, సరళముగాను ఉన్నదని మాకు నమ్మకము కలిగినది. శ్రమను ఓర్చి పూర్తిచేయగలిగినచో మా పరిశ్రమ పునరుక్తకల్పము కాబోదు. మాబోటి కుతూహలము గల నేటి పాఠకులకు మా రచనము మిక్కిలి ఉపయుక్తముగా నుండును. కాబట్టి మా కృషిని కొనసాగించవలసినదే అని నిశ్చయించుకొని "సుబోధిని" అను పేరుతో మా రచనమును నడుపుచుంటిమి.

మాఱుమూలలందలి దూరదూరగ్రామములలో నివసించుచున్న మేము వీలుపడినప్పు డెల్ల కలిసికొని శ్రద్ధగ సాగించుచున్నను మా కృషి నిరంతరాయముగా నడచి ఈ బృహద్రచనము కడముట్టునా అను జంకు ఒక వంక మమ్ము బాధించు

చుండెడిది. ఆ రోజులలోనే మాకు రామమంత్ర ముపదేశించిన గురుదేవులు మహామండలేశ్వర, భాగవత చరితవ్యాస, శ్రీరామ శరణ మహోదయులు మా ఆశలను, మా శంకలను మావలన విని, వెంటనే 'ఈ గ్రంథమును మీరు తప్పక పూర్తిచేయగలరు. జంకు లేక ముందునకు సాగిపోవలసినదే' అని ఆశీర్వాదపూర్వకముగా మ మ్మాదేశించిరి. మా యత్నసాఫల్యము వారి ఆశీఃఫలితమే అను భక్తితో మే మీ గ్రంథమును వారికే అంకిత మిడుటకు అప్పుడే నిశ్చయించుకొంటిమి.

పిమ్మట కొద్ది కాలములో మే మనుకొనకుండ దైవనిర్ణయముగా శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము ప్రజాసంబంధ కార్యశాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణ గారిని కలిసికొనగల్గితిమి. వారు మా ఉద్యమమును గూర్చి విని తమ సంతోషమును తెలుపుచు తమ దేవస్థానమునుండి వీలైనంత సహాయము చేయగలమనియును ఈ గ్రంథము తప్పక వెలుగులోనికి రాగలదనియును మాకు ధైర్యమును గూర్చి నిండు హృదయముతో మమ్ము ప్రోత్సహించిరి.

గ్రంథము సగము పూర్తియైన వెంటనే వెంటగొని మేము తిరుపతి దేవస్థానము కార్యనిర్వహణాధికారి శ్రీ పి.వి.ఆర్.కే.ప్రసాదు, ఐ.ఏ.ఎస్. మహాశయులను దర్శించి వారికి గ్రంథమును చూపి సుమారు రెండువేల పుటలకు మించి యుండు ఈ బృహద్గ్రంథమునకు తమ ఆమోదసహాయములను అర్థించుచున్నామని విన్నవించితిమి. వారు మా కృషిని గ్రహించి తమ ఆమోదమును తెలుపుచు తమ నియమములకు లోబడి వీలైనంత హెచ్చు ద్రవ్యసహాయము చేయగలమనియును, మొదటి సంపుటము ఆమోదముకొఱకు త్వరలో పంపవలసినదనియు చెప్పి మా అభ్యర్థనమును సఫలము చేసి మమ్మానందింపజేసిరి. అప్పుడే ఈ సుందరకాండ బృహద్గ్రంథమును సాధ్యమైనంత సుందరముగా ప్రకటించుటకు వీలుగా ఎనిమిది సంపుటములుగా విభజించి ముద్రించుట యుక్తముగ నుండునని నిశ్చయించుకొంటిమి.

మా మిత్రులు, సాహిత్య విద్యాప్రవీణులు, ఆంధ్రప్రదేశోపాధ్యాయ పండిత పరిషత్తు పూర్వాధ్యక్షులును అగు శ్రీ పున్నమరాజు లోవరెడ్డిపంతులు గారు మా సంకల్పమును మొదటినుండియు ప్రోత్సహించుచున్నట్టే మా వ్రాతప్రతులను శ్రమ తీసికొని ఆమూలాగ్రముగ పరిశీలించి అమూల్యమైన తమ సూచనల నొసగుచు మా సుబోధిని త్వరలో ముద్రింపబడుటకు ఎంతయో తోడ్పడియున్నారు.

ముద్రణమునకు సిద్ధముచేసిన వ్రాతప్రతిని చివరిసారిగా మాకు సన్నిహితులును, మాపై మిక్కిలి మక్కువ గలవారును, తమ బహుగ్రంథములలో నొకటిగా రామాయణగ్రంథముపై పరిశోధన చేసి 'తెలుగులో రామాయణములు'

అను గ్రంథము రచించినవారును అగు జగ మెఱిగిన మహాకవిపండితులు శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారికి చూపి వారి ఆశీర్వాదమును, ఆమోదమును కోరితిమి. వా రీ గ్రంథమును ఆప్యాయముగా తిలకించి మమ్ము పవిత్రమైన ఒక ఘనకార్యమును సాధించుచున్నవారినిగా ఆశీర్వదించుటయే గాక తమ నగరములో జరుగుచున్న ముద్రణకార్యమును పర్యవేక్షించుటకై మేము చేసిన ప్రార్థనను దయతో మన్నించి ఆ భారమును గూడ వహించిరి.

ఇట్లు ముద్రితమై లోకావలోకనము నొందనున్న మా రచనమును మధురహృదయులైన శ్రీ మధునాపంతులవారు గుణగణనము చేసి ఆంధ్రజనులకు 'పరిచయము' చేయుటయును, సుందరకాండముపై తమకు ఎంతటి భక్తిగౌరవములు గలవో అంతటి ప్రేమానురాగములను మాపై జూపి శ్రీమాన్ శ్రీభాష్యంవారు సహజ మధురమైన తమ ప్రవచనరీతిలో నిండు మనస్సుతో తమ 'ఆమోదము'ను ప్రసాదించుటయును, భగవత్తత్త్వప్రబోధమే తమ జీవితసర్వస్వముగ నుండిన వాఙ్మయతపస్సంపన్నులగు శ్రీమాన్ గోపాలాచార్యస్వామివారు అవ్యాజకరుణతో మాకు 'మంగళాశాసనము' ననుగ్రహించుటయును, జ్ఞానవృద్ధులైన తాము ప్రస్తుతము వయస్సుచే గూడ మిక్కిలి వృద్ధులై యుండిన విద్వత్కవిశేఖరులు శ్రీ వెంపరాలవారు సుందరకాండముపై మేము చేయుచున్న కృషిని పరికించి తమకు ఆనందప్రదమైన పరిశ్రమ సలుపుచున్నారని మమ్ము ఆశీర్వదించి అల్పవ్యవధిలో లేని యోపిక తెచ్చుకొని తమ ఆశీస్సు వ్రాసి పంపుటయును – మా శ్రీరామసేవాలబ్ధభాగ్యముగా భావించుచు జగద్విఖ్యాతయశోవిశాలురైన యీ పండితదిగ్గంతులు మాపై జూపిన అనురాగ విశేషమునకు వారికి కృతజ్ఞతతో అంజలి ఘటించుచున్నాము.

ఏరీతిలో నైన శ్రీరాముని సేవించు మహాత్ములను గాంచినంతనే ఆనందముతో పులకితుల మగుట, ఏరూపములో నైన శ్రీరఘునాయకుని సేవలో భాగము సంపాదించుకొనవలెనను కుతూహలము కలిగియుండుట – అను లక్షణములు మా యిరువురిలో సమానముగా నుండుట కనుగొని మాచే ఈ విధమగు తన సేవ చేయించుకొన నెంచి రామప్రభువే మాకు పరస్పరము పరిచయము కల్పించినా డని మా నమ్మకము. ఈ సుందరసేవాసందర్భములో మేము సందర్శించిన మధుర హృదయులైన ఎందఱో మహాత్ములు అనురాగపూర్ణవచనములతో మమ్ము అభినందించినపుడు తన సేవలోనే రామప్రభువు మాకు "కావ్యామృతరసానందము, సజ్జనసంగతి" అను సంసారసారఫలద్వయముకూడ లభింపజేయుచున్నాడని ఆనందింతుము.

"దైవం మానుషరూపేణ" అనునట్టు ఇట్టి ఎందఱో మహనీయుల రూపమున శ్రీరామచంద్రుడే మాకు తోడ్పడుచున్నాడు. శ్రీరామాంశసంపన్నులైన ఈ మహాత్ము లందఱికిని, మాకు శక్త్యుత్సాహముల నొసగుచున్నందులకు హృదయపూర్వకముగా కృతజ్ఞతతో వందనము లర్పించుకొనుచున్నాము.

మా ఉద్దేశము ననుసరించి ఈ గ్రంథము సమగ్రము గాదు. సమగ్ర విషయబోధమున కిది సోపానమాత్రముగ తప్పక ఉపయుక్తము కాగలదని సవినయముగ మనవి చేయుచున్నాము.

ప్రస్తుత సంపుటములో మా యజ్ఞానమువలన పెక్కువిధములగు లోపము లుండును. గుణగ్రహణనిరతులైన సహృదయవిబుధులు మా భక్త్యుత్సాహములు మాత్రమే లెక్కగొని లోపములను మన్నింపగలరని ప్రార్థించుచున్నాము.

ఇట్లు

బుధజనవిధేయులు, సుబోధినీ సమర్పకులు,

**మైలవరపు సుబ్రహ్మణ్యము, బోయనపల్లి కామేశ్వరరావు.**

## అంకితము

**శ్రీరామశరణ గురుభ్యో నమః**

గురుదేవ! శ్రీ రామశరణ మహాదేవ !
సతత రామ విలగ్న సర్వభావ !
తా మొసంగిన దివ్యరామమంత్రమ్మును
భవదాజ్ఞయునె మాకు బలమొసంగ
అఘనిబర్హణమును అమృతతుల్యమ్మనౌ
సుందరకాండ సుశ్లోకతతికి
ప్రతిపదార్థమును తాత్పర్యమున్ వెలయించి
జిజ్ఞాసు సోదరుల్ సేకొనంగ

ఈ సుబోధినిం గూర్చి, యీ కృతిని తమకు
అంకిత మ్మిడుచున్నార మమితభక్తిఁ
దాము, తమలోని రామచంద్రప్రభుఁడు,
రామభక్తులు, విబుధులు రంజిలంగ ॥

సుబోధినీ సమర్పకులు

**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయనపల్లి కామేశ్వరరావు**

## శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి

శ్రీరామనామ జపపూత నిజాంతరంగం
శ్రీరామనామ పరికీర్తన పుణ్యవాచమ్ ।
శ్రీరామనామ వసనాంచిత రమ్యదేహం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 1

కుందుర్తివంశ కలశోదధి పూర్ణచంద్రం
శ్రీవేంకటాఢ్య నరసార్య ఇతి ప్రగీతమ్ ।
వాత్సల్యపూర్ణ హృదయాదృత శిష్యకోటిం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 2

నామప్రయాగ ఇతి సుప్రథితే స్వకీయే
బుద్ధాంపురే నిజనివేశిత మందిరస్థమ్ ।
సీతాపతిం హనుమతా సహ సేవమానం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 3

తం మంగళం కవిగురు ద్విజరాజ సౌమ్య
భాస్వచ్ఛివార్య చతురానన దివ్యమూర్తిమ్ ।
సీతాసతీ రఘువరానిలజేష్టభక్తం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 4

శ్రీరామతత్త్వ ముపదిశ్య సభాంతరేషు
గ్రంథాన్ విరచ్య, వినివేశ్య తథాఽఽలయాంశ్చ ।
యో రామదేవ మనిశం భజతే ముదా తం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 5

వాల్మీకి కౌశిక వశిష్ఠముఖై ర్మునీంద్రైః
యద్రామతత్త్వ మసకృత్సువివేచితం ప్రాక్ ।
తద్యేన సాధు విశదీక్రియతేఽధునా, తం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 6

సాక్షాత్కృతో రఘుపతి ర్నిజగాఢభక్త్యా
తీవ్రేణ మంత్రజపరూప తపోబలేన ।
యే నాప్తజీవితఫలేన జితాత్మనా, తం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 7

రామేఽఖిలం జగదిదం పరిలోకయంతం
విశ్వేఽఖిలే చ రఘునాథ మవేక్షమాణమ్ ।
అంతర్బహిశ్చ రఘునాయకపూర్ణదృష్టిం
శ్రీరామదేవశరణం గురు మానతోఽస్మి ॥ 8

★★★

శ్రీ రామ జయరామ జయజయరామ శ్రీరామశరణ్ గురుభ్యో నమః

# గురుదేవుల జీవితచరిత్ర

**శ్లో॥ సీతాలక్ష్మణసంయుక్తః పాణౌ కోదండశోభితః ।**
**మత్ప్రియో రామభగవాన్ హృది తిష్ఠతు సర్వదా ॥**

**శ్లో॥ నమ శ్రీరామశరణచరణౌ భవతారణౌ ।**
**సదా శిష్యాళిసంపూజ్యౌ వసేతాం హృదయే మమ ॥**

**శ్లో॥ శ్రీరామ ముద్రాంచిత చారుహస్తం**
**శ్రీరామవస్త్రేణ విశోభితాంగం ।**
**శ్రీరామనామామృత పానలోలం**
**శ్రీరామరూపం శిరసా నమామి ॥**

అంధ్రదేశమున భక్తి ప్రచారమునకై అవతరించిన భగవదంశసంభూతులలో, బ్ర॥ శ్రీ॥ వే॥ శ్రీ కుందుర్తి వెంకటనరసయ్యగారొకరు.

పరమపవిత్రమైన వారి చరిత్రము భవపాశలవిత్రము, భగవన్నామ ప్రచారమునకు కరపత్రమై, తాపత్రయముల ఆతపము బాపు ఛత్రమై, విశుద్ధప్రేమకు పాత్రమై, దివ్యమై, భవ్యమై అలరారును.

గుంటూరు మండలమున, నరసరావుపేట, వినుకొండలకు మధ్యగా కుందుర్తి యను చిన్న పల్లెటూరు గలదు. అదియే గురుదేవుల జన్మస్థానము. వారి పూర్వులు, పాతగుంటూరు జమీందారులవద్ద సముద్దారులుగ పనిచేసిరి. ఈ వంశము నందు, ఏడవతరమువాడైన శ్రీలక్ష్మీనరసయ్యగారు "హాస్యకళాప్రపూర్ణ" యను బిరుదునొంది, వెంకటగిరి, చల్లపల్లి, పిఠాపురము మున్నగు ఆస్థానములందును, శ్రీశ్రీశ్రీ పరమహంసపరివ్రాజకులగు, పుష్పగిరి పీఠాధిపతులచేతను సన్మానితులైరి.

వారి తపఃపుణ్యఫలమే అస్మదాచార్యులగు వెంకట నరసయ్యగారు.

వారు విశ్వావసు నామసంవత్సర చైత్రబహుళ త్రయోదశిని రేవతీ నక్షత్రయుక్త మకరలగ్నమునందు, రాత్రి పది గంటలకు అనగా ది.02.05.1905 తేదీన జననమందిరి.

| చ | ర బు గు శు | | |
|---|---|---|---|
| శ కే | రాశి | | |
| ల | | | రా |
| | | కు | |

| | బు | | కు శు |
|---|---|---|---|
| | అంశ | | |
| కే చం | | | రా |
| శ | | ర గు | |

వారి బాల్యమున, ఒక రోజున వారి తల్లిగారు బావిదగ్గరకు నీరు తెచ్చుటకు వెళ్ళగా బాలుడగుటచే వారేడువసాగిరి. అత్తరి నొక భిక్షువు “రామ నను దయచూడరా” అని పాట పాడగానే, వా రేడువకుండిరి. అంతలోన తల్లిగారు రాగా, ఆ భిక్షువు తనకు భిక్షదొరకునను ఆశతో పాట పాడుట మానగా మరల నా పాప దేడువసాగెను. మరల నాతడు ఆ కీర్తనను బాడగనే ఏడుపు మానెను. అది చూచి ఆ సాధువు ఓ అమ్మా! నీ బాలుడు రామభక్తిరత్నము కాగలడని దీవించెను.

అట్లు దినదినప్రవర్ధమాను డగుట నైదేండ్లు రాగా, ఆయన కక్షరాభ్యాసము చేసిరి. పూవు పుట్టగనే పరిమళమును వెదజల్లు ననురీతిగా నరసయ్యగారున్న చోటి కొక స్వాములవారు ఏతెంచిరి. ఆయన తన ఉపన్యాససమయమున తనముందు కూర్చొనిన బాలురను చూచి, దేవు డెక్కడున్నాడని అడుగగా, చాలామంది దేవాలయములో వున్నాడని నుడివిరి. ఒక్క నరసయ్యగారు మాత్రము దేవుడు దేవాలయములోనే గాదు, జగమంతట నున్నాడని, తనచేతిని త్రిప్పుచు చూపించిరి. అది చూచి, ఈ బాలుడు ప్రహ్లాదుని పగిది లోకమున కాహ్లాదము కలుగచేయగలడని వారు కొనియాడిరి.

అట్లు కొన్నిదినములు గడువగా, క్రమక్రమముగా విద్యాభ్యాసముతోబాటు, భజనలయందును, సంకీర్తనలయందును నరసయ్యగారికి మక్కువ వృద్ధిచెందసాగెను.

ఒకచోట శ్రీకృష్ణజయంతి సందర్భమున బాలకృష్ణుని లీలావిలాస మాధుర్యమును, తల్లియగు యశోదయొక్క వాత్సల్యభక్తివైభవమును విని, నరసయ్యగారు పరవశులైరి. నరసయ్యగా రొకనాడు తమ భావమున బాలకృష్ణుని నిలుపుకొని తాను యశోదనని భావించుకొని, పొలమున చిన్న కృష్ణుని వెదుకసాగిరి. అప్పుడు వారి కాలు గట్టునకు తగిలి, బాహ్యస్మృతి లేకుండ పడిపోయిరి. సగము రాత్రివరకును వా రాస్థితిలోనే యుండి మెలకువ రాగా, వారింటికి వచ్చిరి.

అట్లు వచ్చి వారి మనస్సును, నందనందనుని అరుణారుణ సదృశమగు చరణకమలములపై నిలిపి, వారొక గీతమును వ్రాసిరి.

**శ్రీరాగము, ఆటతాళము.**

రా, రా, రా, గోపాలకృష్ణ ! రా, రా,
లాలకు రార నాన్న, నీలశరీర, నీ
వేలా చిక్కవు నాకు. చాలా అలసితి తండ్రి ॥ రా॥

తరువాత నరసయ్యగారు పొన్నూరులో వెంకటపార్వతీశ్వరులను కవుల కృతులను చదివి, కవనము నల్ల నారంభించిరి. అందు గోపాలకృష్ణశతకము ముఖ్యమైనది. ఉదా॥

శ్లో॥ శ్రీరమా రమణీమణి చిత్తచోర
భక్తజన మానసోద్యాన పారిజాత
రాధికాకుచ నరసిజ రాజహంస
వందనం బిదె, వేణుగోపాలకృష్ణ !

**ముక్తపదగ్రస్తము : –**

సరసతరవేష రత్నభూషావిశేష,
శేషభూషణ హృత్సరసిజనివాస
వాసవాది సురవినుత పాదపద్మ
పద్మదళనేత్ర వేణుగోపాలకృష్ణ !

ఇదియేగాక నరసయ్యగారు నరసదాసుకీర్తనలని మూడుభాగములుగా వ్రాసిరి.

1920 సంవత్సరమున గాంధీగారు విజయవాడ వచ్చినప్పుడు నరసయ్య గారు వారి నిరాడంబర జీవితమునకు వారు తమ రామోపాసనను దేశదాస్యవిముక్తికి వినియోగించుట కచ్చెరువొంది ఆ యుద్యమమున చేరి, వీరు గూడా అప్పటి దేశభక్తులతో జైలుకు వెళ్ళిరి.

నరసయ్యగారు జైలునుండి విడుదలయైన తరువాత రాజకీయజీవితము నేవగించి, తీవ్రమగు ఆధ్యాత్మికసాధన మొదలిడిరి.

అత్తరిని నరసయ్యగారి కుపనయన మాయెను. వారు గాయత్రీ మంత్రోపాసన

తీవ్రముగ చేయ మొదలిడిరి. ప్రతినిత్యము సహస్రగాయత్రి చేసిన తరువాతగాని భోజనము చేయనని నియమము చేసికొనిరి.

వారట్లు తీవ్రముగ జపము చేయుచుండగా ఒకనాడు వారి స్వప్నమునందు ముక్తావిద్రుమ, హేమ, నీల, ధవళవర్ణరంజితమై పంచవదనములతోడను, వజ్రము, పాశము, అంకుశము, శంఖము, చక్రము, పద్మము మొదలగు ఆయుధములతో, నిస్తులతేజంబును వెదజల్లు హస్తములతో, హార కేయూర, భూషణ, భూషితయై అభయహస్తముతో వారికి శ్రీగాయత్రీమాత గోచరించి ఇట్లనెను –

"ఓ వత్సా! నీ హృదయపరిపక్వత నీ మనోనిశ్చలత అభినందనీయము. నీ నియమము లోకుల కాదర్శమగుగాక!" అని నుడివి, అంతర్ధానమాయెను. నరసయ్యగారు మేల్కొని, యా గాయత్రీదేవి తేజఃపుంజమున కంజలి ఘటించి, ఓ తల్లీ! నీ యనుగ్రహము నాకు మంగళప్రదమని కొనియాడిరి.

కొంతకాలమునకు నరసయ్యగారు వివాహితులై ఉపాధ్యాయవృత్తి నవలంబించిరి. అత్తరిని వారికి ఆంధ్రవాల్మీకి శ్రీవాసుదాసస్వామివారితో పరిచయ మేర్పడెను. శ్రీరామసాక్షాత్కారము నొందిన భగవదంశసంభూతులగు వాసుదాసస్వామివారు వాడవాడల భక్తిప్రచారము చేయుచుండిరి. ఒక్కపరి వారు జమ్ములపాలెము శ్రీరామాలయమున శ్రీరామతత్త్వముపై నుపన్యాసము నిచ్చుచుండిరి. "రామనామసముత్పన్నః ప్రణవో మోక్షదాయకః" "సప్తకోటి మహామంత్రాః, చిత్తవిభ్రమ కారకాః, ఏక ఏవ పరో మంత్రః 'రామ' ఇత్యక్షరద్వయమ్" – ఇత్యాది అనేకవచనములచే శ్రీరామమహిమను విశదపరచిరి. ఇంకను మానవుని చిత్తమును శ్రీరాముని పాదపద్మములయందు నిలకడగ చేర్చియుంచు నుపాయమును నొక్కి వక్కాణించిరి. తరువాత వారు ఈ సభను నేను బోధించిన విధముగా నెవ్వ రనుష్ఠించెదరని శ్రీవాసుదాసస్వామివా రడుగగా, నరసయ్యగారు లేచి అంగీకారమును తెలిపిరి.

శ్రీవాసుదాసస్వామివారు అప్పుడు నరసయ్యగారిని జూచి ఇట్లనిరి – 'ఓ కుమారా! నీ వినయవిధేయతలు, నిష్ఠాగరిష్ఠత, నీ తత్త్వజిజ్ఞాస, అకుంఠితభక్తిభావము నన్ను మిక్కిలిగా ఆకర్షించినవి. నాకు నీ భవిష్యత్తు ఉజ్జ్వలముగా కానవచ్చుచున్నది. నేను నిన్ను చూడగనే నా యంతరంగమున శ్రీరామభక్తిరసానందము ఉప్పొంగుచున్నది. కావున నీకు నేను శ్రీరామమంత్రము నీయదలచితిని. అద్దాన నీకు జగమంతయు రామమయముగా కాన్పించును.' అని యనగా నరసయ్యగా రమితానందముతో,

తన హృదయక్షేత్రమున శ్రీరామమంత్రబీజమును నాటించుకొనిరి. గురువర్యులతో ఈ మహామంత్ర దీక్షకొరకై అనవరతమును కృషిసలిపెద నని నుడివిరి.

ఆ విధముగా మంత్రదీక్షను పొంది నరసయ్యగారు సుమారు నాలుగు గంటల కాలములో 21,600 జపము చేయుచు, రోజునకు 10,000 రామనామమును వ్రాయుచుండిరి. ధ్యానమున శ్రీరామచంద్రుని నిలుపుకొనుచుండిరి.

ఇట్లుండ నొకనాడు బాలకృష్ణుడు నరసయ్యగారి స్వప్నమున గోచరించి కిలకిల నవ్వుచు నిట్లనెను.

"ఓ వత్సా! నీ జపము సఫలమైనది." అని పలికి నిమేషమాత్రమున ఆ బాలముకుందమూర్తి వాసుదాసుగా రిచ్చిన మంత్రాధిష్ఠానదేవత యగు కోదండ రాము డాయెను. శ్రీరామచంద్రుడు హనుమత్ సీతాలక్ష్మణ సమేతుడై సాక్షాత్కరించెను. అప్పుడు నరసయ్యగారి శరీరము పరవశమాయెను. అప్పుడు వారు 'గురుపూజా' విధాన మను పుస్తకమును వ్రాసిరి. నేటికిని చాలామంది దాని సహాయమున వారివారి గురువులను పూజించుకొందురు.

నరసయ్యగారు ఉపాధ్యాయవృత్తియం దుండగా ఒంగోలునందు ఒకనాడు వేసవిని హరిజను డొకడు వడదెబ్బ తిని పడిపోయెను. నరసయ్యగారు మలభూయిష్ఠమైన అతని పైవస్త్రమును దీసి వారి పైయుత్తరీయము నాతనిపై గప్పి అతనిని వారి భుజములపై మోచుకొనివచ్చి సత్రమున శీతలోపచారములు చేసి, సేదదీరిన తరువాత నింటికి పంపిరి. ఇట్టి ఉదారస్వభావముతో వారు జగమంతయును రామమయముగా చూచుచు, "శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః" అను వాక్యమును వారు ప్రత్యక్షప్రమాణము చేసిరి.

నరసయ్యగారు యోగాభ్యాసము చేయసాగిరి. వారు సాత్త్వికాహారమును భుజించుచు రాత్రిపూట 10 గం॥ల వరకు భజన చేయుచు, తెల్లవారుజామున 4 గంటలకు లేచి యోగసాధన చేయుచుండిరి. ఇట్లు యోగసిద్ధి నొందియున్న నరసయ్య గారికి యోగమహిమలు కొన్ని గోచరించెను. శ్రీవాసుదాసస్వామివారు తమ ప్రియ శిష్యుని జూచు వేడుకతో నరసయ్యగారి దగ్గరకు వచ్చి, సిద్ధులవలలో బడి సర్వసిద్ధులకు స్వామియైన శ్రీరామచంద్రుని మరువవద్దని ఉద్బోధించిరి. మహిమలు చూపుట అనర్థకమని వానిని ప్రదర్శింపవల దనిరి.

శ్రీరామచంద్రునితో, నరసయ్యగారు సఖ్యభక్తి చేయుచుండిరి. వారు శ్రీరామచంద్రమూర్తితో, ఆటపాట లాడుచుండిరి. ఒకనాటి రాత్రి నరసయ్యగారు

పరుండియుండగా శ్రీరామచంద్రమూర్తి సఖుడై వారిప్రక్కనే నిదురించెను. నరసయ్య గారు నిద్రావివశులై కాలు రామచంద్రునిపై వేసిరి. వెంటనే శ్రీరామచంద్రమూర్తి లేచి, 'నరసయ్యా! నేను నీయందలి నెయ్యమున నీ శయ్యయం దుండగా నాపైన కాలువేయుట నీకు న్యాయమా?' అనిరి. నరసయ్యగారు ఎదుట కాన్పించిన శ్రీరామచంద్రుని జూచి ఆశ్చర్యమగ్నమానసులై ఆ ప్రభువుయొక్క తెల్లని ముఖముల్ తలగుడ్డను శయ్యనుండి తీసి, ఆ పురుషోత్తమున కందించిరి. అత్తరిని నరసయ్య గారితో శ్రీరామచంద్రు డిట్లనెను. 'ఓ నరసయ్యా! నన్నే నమ్మి భజించు సుజనుల చరణరజము నా కెంతయును సంతసమును గూర్చు భస్మము. దాని ధారణకొఱకే నేను నాభక్తులవెంట తిరుగుదును.'

శ్రీవాసుదాసస్వామివారి కోదండరామ సేవక వార్షికోత్సవములు జరుగుచుండెను. అందు నరసయ్యగారు కూడా పాల్గొనిరి. శ్రీరామనామ క్షేత్రమునుండి శ్రీరాగం ఆంజనేయులుగారు మున్నగువారు అచ్చటకు విచ్చేసిరి. అత్తరిని నరసయ్య గారు భక్తినిగూర్చి ఉపన్యసించిరి. సంకీర్తన గూడా చేసిరి. అది విని శ్రీరామనామక్షేత్ర పురోభివృద్ధికి దోహదము చేయుడని ఆ సభ్యులు కోరిరి. నరసయ్యగా రందుల కంగీకరించిరి. ఆ క్షేత్రమునందలి సాధనశాఖకు వీరే అధ్యక్షులు. 'మోక్షసాధని' పత్రికకు వీరే ఎడిటరుగా నుండిరి.

తరువాత నరసయ్యగారు బుద్ధాములో కాపురము పెట్టి, వాసుదాసస్వామివారు వ్రాసిన మందరమునకు సాపు వ్రాసిరి.

ఇట్లుండ నొకనాడు నరసయ్యగారి భార్య యగు శేషమ్మగారు వారి అమ్మగారింటికి వెళ్ళిరి. నరసయ్యగారు యథానియమముగా సహస్రగాయత్రిజపము 21,600 జపమును పూర్తిచేసుకొని స్వహస్తపాకమును భుజించి, కాలక్షేపము చేయుచుండిరి. ఒకనాడు ఇంట నేమియును లేకుండుటచే, ఒక్కపూట మాత్రము అసంపూర్తిగా భోజనము చేసిరి, రాత్రికేమియును లేదు. వారు శ్రీరామచంద్రుని కళ్యాణగుణములను స్మరించి, కరుణాకాకుత్థ్సుని మనంబున నిల్పి, నిద్రపోయిరి. అత్తరిని నరసయ్యగారి స్వప్నమున శ్రీరామచంద్రుడు సాక్షాత్కరించెను. ఆ ప్రభువు శరీర మలసి యుండెను. ఒడలినుండి చెమట ధారాప్రవాహముగా ప్రవహించుచుండెను. ఒడలిపై తడసిన ఉత్తరీయ ముండెను. ప్రభువు ధరించిన ధావళి సగమువరకును ఊడియుండెను. ఆయన ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసములు ఉరవడిగా వచ్చు చుండెను. రామచంద్రప్రభువు తన భక్తరక్షణార్థము పరుగుపరుగున వచ్చినట్లుండెను. నేత్రములనుండి అశ్రువులు వెలువడుచుండెను. వచ్చి

నరసయ్యగారితో ఇట్లనెను –

'ఓ వత్సా! ఆకలితో నీవెంత బాధపడుచుంటివో గదా! నేను నీవంటి ప్రేమాత్మిక భక్తుల ఇంట బందీనగుటచే సత్వరమిటకు రాలేకపోతిని. నన్నే ఏడుగడగా నెంచుకొను వారిని నేను విడువజాలను. ఆకలితో అలమటించు నీ కాహారమును తెచ్చితిని. నరసయ్యా! లేచి నేను నీకొఱకై తెచ్చిన ఆహారమును భుజింపుము' అని ఆర్తత్రాణ పరాయణుండగు శ్రీరామచంద్రుడు తన దక్షిణహస్తమును నరసయ్యగారి కరమున నుంచెను. నరసయ్యగా రా హస్తస్పర్శచే మేల్కాంచి చూడ ఆ పుంసాంమోహనమూర్తి అట లేడు. కాని ఇంటియొక్క ద్వారములు తెరువబడియుండెను. నరసయ్యగారు లేచిచూడగా అచ్చట నొక పళ్ళెమున నాలుగు గోధుమ రొట్టెలు గలవు. వానిపై వెన్నముద్ద గలదు. భగవానుని వాత్సల్యమున కుప్పొంగి ఆ వేడివేడి గోధుమ రొట్టెలను శ్రీరామచంద్రుని స్మరించుచు నరసయ్యగారు భుజించిరి.

1941 సంవత్సరమున త్రివేణీసంగమమున విరాట్ సంకీర్తనమును లోకశాంతికై శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు ప్రారంభించిరి. అందు పాల్గొనుటకై శ్రీ సీతారామ సంకీర్తన సంఘమునకును ఆహ్వానము వచ్చెను. నరసయ్యగారికి సంకీర్తనమునందును, హిందీభాషయందును ప్రావీణ్యముండుటచే వారు ఆ సంఘము తరపున ప్రయాగకు ప్రయాణమయిరి. వారు సాధననుగూర్చి తెలుసుకొనవచ్చునని, మహాత్ములను దర్శించవచ్చునని సంతోషపడిరి. ఆ తీర్థరాజమున వారి కొక మహాత్ముడు దర్శనమిచ్చెను. ఆ తేజశ్శాలిని నరసయ్యగారు నీ వెవరవని అడుగగా ఆ సాధువు శ్రీరామచంద్రమూర్తి పటమువంక జూచి చిరునవ్వు నవ్విరి. ఆ మహానుభావుడు అదృశ్యుడాయెను. కార్యక్రమము పూర్తియగుటచే నరసయ్యగారు ఇంటికి వచ్చిరి. ఇంటికి వచ్చినతరి అందరును వారిని ఆచార్యపీఠ మలంకరించుడని వేడిరి. వారందుల కంగీకరింపలేదు. అట్లుండ ఒకనాడు వాసుదాసస్వామివారు కలలో కాన్పించి ఇట్లనిరి.

ఓ వత్సా! నీ సాధన లన్నియును చక్కగా నెరవేరినవి. నీవు సాధించిన మధురరసమును, లోకక్షేమమునకై ఉపయోగించుము. నేను నీకు మంత్రము నీయకున్న నీ మనస్సు ఎంత ఖిన్నత నొందునో నిన్ను గురువుగా కోరువారికి నీవు మంత్ర మీయ కుండిన అంత బాధయుండును. కావున నీవు ఇటనుండి సర్వజనులకును, శ్రీరామ నామ ప్రభావమును బోధించి ఆచార్యపీఠము నలంకరించుము. ఇది నా ఆజ్ఞ గావున నీవు దీనిని శిరసావహింపుమని ఆజ్ఞాపించి అంతర్ధానమయిరి.

గురుదేవుల ఆదేశానుసారము నరసయ్యగారు మంత్రపునశ్చరణ చేయబూనిరి.

**రామరహస్యోపనిషత్తు :-** 'రామమంత్రాణాం కృతపునశ్చరణః రామచంద్రో భవతి' రామమంత్రమును పునశ్చరణ (అక్షర లక్షలు) చేసినవాడు రామచంద్రు డగుచున్నాడు.

మంత్రసిద్ధి అక్షరలక్షలు జపముచేసినగాని సిద్ధింపదు గావున తీర్థరాజమగు ప్రయాగకు పయనమయిరి. మాఘమాసమున త్రివేణీస్నానము ముక్తికి ద్వారమని ప్రతీతి. ముక్కోటి దేవతలు అప్పు డచట స్నానమాడుదురని నానుడి. శీతలమున కోర్చుకొని అచట చేయు తపము సద్యఃఫలదాయకము. నరసదాసుగారు అచట నొక పందిరివేసుకొని మంత్రపునశ్చరణ మొదలిడిరి.

అట్లు తపమాచరించగా నరసయ్యగారికి ముందుసారి వచ్చినప్పుడు అంతర్ధానమైన సాధువు మరల దర్శనమిచ్చెను. వారు చప్పిడి తిని, పగలంతయు జపము చేసిరి. రోజునకు 80, 90 కూడా జపముచేయగా ఆయన సాక్షాత్కరించెను.

**ఆయన ఇట్లనెను :-** 'వత్సా! నీ జపము సిద్ధించినది. నీవు ధన్యుడవు' అని పలికెను. ఆయన నరసయ్యగారి శరీరము నిమిరెను. వా రాయనను తన కుటీరమునకు తీసుకొని వచ్చి ఆయన చరణములను గడిగి తీర్థమును శిరస్సుపై ధరించి మధురపదార్థములను నోటికి అందించిరి. ఆ మహామహుడు తన చేతితో దేనిని తీసుకొనక, నరసయ్యగారు అందించిన దానినే తినుచుండిరి. వారు నరసయ్యగారికున్న అన్ని సందేహములను తీర్చిరి. ఆయన సగుణ నిర్గుణ సమన్వయమునందు సంశయములను సులభముగ దీర్చెను. వారి హస్తమును నరసయ్యగారి మస్తకమున నుంచగా వారికి నిర్వికల్ప సమాధి కల్గెను. ఆ ఋషి, నరసయ్యగారికి "శ్రీరామత్రయోదశాక్షరీ" మంత్రమును ఉపదేశించెను. నీ వింక ఆచార్యపీఠమున నుండుట కర్హుడవని పలికెను.

ఆ తరువాత వా రయోధ్యకు వచ్చిరి. అందు సరయూతటమున "స్వర్గ ద్వారమున" ఆసీనులై మంత్రపునశ్చరణ మొదలిడిరి. శ్రీరామచంద్రుని మనంబున నిల్పి మంత్రపునశ్చరణ చేయగా శ్రీరామచంద్రమూర్తి సరయూజలంబులనుండి వచ్చి నరసయ్యగారి మస్తకమున తన హస్తము నుంచెను. వా రా ప్రభువు పాదపద్మములకు సాష్టాంగనమస్కారము చేసిరి. అంతలోనే వారి ఎదుట అయోధ్యపీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ సియారఘునాథ శరణ్‌గా రనువారు "సీతారాం సీతారాం" అనుచు నిలచిరి. వారిట్లనిరి.

'ఓ భక్తాగ్రగణ్య! నీవు చేయు జపము ఫలించినది.' అని నరసయ్యగారిని తన ఆశ్రమమునకు తీసుకొనిపోయి వారికి "శ్రీరామపంచాయతన" మంత్రము నిచ్చిరి. నరసయ్యగారి ప్రాకృతదేహమును శ్రీరామ సాక్షాత్కార జ్ఞానాగ్నిచే దహింపజేసి వారికి

దీక్ష నిచ్చి నాటినుండియును "శ్రీరామచరణ్" అను దీక్షానామము నిచ్చిరి.

అచ్చటినుండి శ్రీరామశరణ్ గారు కాశీకి వచ్చిరి. వరుణ, ఆసీ నదుల నడుమ ఉత్తరవాహినియై ప్రవహించు గంగాతీరమున గురుదేవులు శృంగేరీపీఠము నందలి మేడలో ఒక గది తీసుకొని శివపంచాక్షరీమంత్రమును జపముచేయ మొదలిడిరి. కాశీక్షేత్రమున మంత్రపునశ్చరణ పూర్తికాగా పరమశివుడు ప్రత్యక్షమై ఇట్లనెను.

"ఓ భక్తరత్నమా! నేను నిరంతరమును చేయు రామనామమే నీయందు నిలచియున్నది. నీవు శ్రీరామచంద్రుని ప్రేమకు పాత్రుడవగుటచే నీవు నాకత్యంత సన్నిహితుడవు. నీవు రామనామమును ప్రచారము చేయునప్పుడు నా శివశక్తి నీయందు నిలచును. నీవు నా యనుగ్రహముచే రామనామ ప్రచారక రత్నము కాగలవు." అని ఆశీర్వదించి అంతర్ధానమాయెను.

"శ్రీరామచరణ్" గారు తరువాత బృందావనమునకు చేరిరి. అందు నిర్వికల్ప సమాధి నొందిన శ్రీ ఉడియా బాబావారి ఆశ్రమమున ఒక గుహయందు మంత్ర పునశ్చరణ మొదలిడిరి. ఇచ్చట గూడ పునశ్చరణ పూర్తి యగుసరికి రాధాకృష్ణుల యొక్క దర్శనభాగ్యము లభించెను.

అచ్చటి నుండి గోవర్ధనము చేరిరి. అందు కుసుమసరోవరమువద్ద పునశ్చరణ పూర్తిచేయగా అచ్చటను రాధాకృష్ణుల దర్శనభాగ్యము కలిగెను.

తరువాత కలియుగ పరమపదద్వారమగు హరిద్వారమున శ్రీరామశరణ్ గారికి శ్రీహరిహరానందకరపాత్రజీ వారి దర్శనము లభించెను.

అచ్చటినుండి బుద్ధాముచేరి వారి తపఃఫలముచే వారి ఇంటి ఎదుట ప్రసన్నాంజనేయస్వామిని ప్రతిష్ఠించిరి. ఆ ప్రదేశము నామప్రయాగ యని వాసిగాంచెను. అందే వారు శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగా రిచ్చిన పాలరాతి రాధాకృష్ణ విగ్రహములను ప్రతిష్ఠించిరి. శ్రీరామశరణ్ గారు భక్తిప్రచారమునందు నిమగ్నులై తులసీదాస విరచిత "రామచరితమానసము" నందలి భక్తిజ్ఞానకర్మయందలి మర్మములను ప్రవచనము చేయసాగిరి.

వారు మృదుమధురముగ కథాసంకీర్తనము చేయగలరు. అందును శబరి సంకీర్తన బహురమ్యముగా, ఆర్తితో చేసి, ప్రజానీకము యొక్క మన్ననలను బడసిరి. వేణుపత్రాకారముగా తిలకము దిద్దుకొని బంగారు ఛాయగల శరీరముతో రామనామ

వస్త్రమును నడుమునకు కట్టుకొని, కాళ్ళకు గజ్జెలు కట్టుకొని, చేత చిటికలు ధరించి కరములు చాచి “రామా, రామా” యనుచు సంకీర్తనచేయు శ్రీరామశరణ్‌గారి దర్శనము సకలజనమనోరంజనము.

1946 నుండియును వారు రామనామ తండులభోజనమునే చేయు నియమము నేర్పరచుకొనిరి. శ్రీరామ యని ఒక్కొక్క బియ్యపుగింజ నేరి వండిన భోజనమే వారు భుజింతురు.

**శ్రీరామచరణ్‌గారి రచనలు :-**

“ఆజన్మబ్రహ్మచారులును”, అపరశుకమహర్షులును అగు ప్రభుదత్త బ్రహ్మచారిగారు వ్రాసిన భాగవతచరిత్రను సరళాంధ్రమున అనువదించిరి. అది 60 భాగములుగానున్న 16 వేల పేజీల గ్రంథము. అది తర్జుమా చేసినందులకు వారికి “భాగవతచరితవ్యాస” యను బిరు దీయబడెను.

ఆంధ్రమున ఎచ్చటికి పోయినను శ్రీరామచరణ్‌గారు భక్తిప్రబోధము చేసినారని విని శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిగారు వీరికి “మహామండలేశ్వర” యని బిరుదునిచ్చిరి.

శ్రీరామచరణ్ గారికి, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారితోను పరిచయ మేర్పడెను. వారు గావించిన సప్తాహములో పాల్గొనుటకు శ్రీరామశరణ్‌గారు వెళ్ళిరి. అచ్చట శ్రీరామచరణ్‌గారు చేసిన ఉపన్యాసమును విని బాబావారు సంతసించి పట్టుబట్టలతోను, రెండువందల రూపాయలతోను సత్కరించిరి. శ్రీరామ్‌చరణ్ గారు “నామమహిమ” యను గ్రంథమును రచించి బాబాగారికి కృతినిచ్చిరి. అత్తరిని బాబావారు వీరిని నీ కోరిక చెప్పుమనగా శ్రీరామచరణ్‌గారు “స్వామీ! నాకు మీ స్మరణయే చాలును. ఐనను నన్ను నమ్ముకొనియున్న శిష్యులకు మోక్షము ననుగ్రహింపుడని కోరిరి. బాబావా రందులకు సంతోషించి, శ్రీరామచరణ్‌గారూ! మీది దయార్ద్రహృదయము. మీకు శిష్యవాత్సల్యము మెండని కొనియాడి అటులనే ఔగాక యని పలికిరి.

వీరు “రామమంత్రానుష్ఠాన”మను గ్రంథమును వ్రాసిరి. రామతత్త్వ మందు చక్కగా పొందుపరుపబడినది. శ్రీ శ్రీ శ్రీ కంచికామకోటి పీఠాధిపతులుగూడా దానిని కొనియాడిరి. ఇంకను రామోపాసనాసర్వస్వము, హనుమన్నిష్ఠ, రామరహస్యోపనిషత్తు మున్నగునవి వారి కృతులు.

కంటిచూపు తగ్గినను, నేటికిని శ్రీరామనామ ప్రచారముచేయు గురుదేవుల పాదపద్మములకు సాష్టాంగ దండప్రణామములు.

**శ్రీరామకర్ణామృతము :-**

**శ్లో॥ శ్రీరామభద్రాశ్రిత సద్గురూణాం**
**పాదారవిందం భజతాం నరాణాం ।**
**ఆరోగ్యమైశ్వర్య మనంతకీర్తిః**
**అంతే చ విష్ణోః పదమస్తి సత్యమ్ ॥**

శ్లో॥ శ్రీరామచంద్రుని ఆశ్రయించిన యోగ్యగురువుయొక్క పాదపద్మములను సేవించువారికి, ఆరోగ్యము, ఐశ్వర్యమును, అపరిమితకీర్తియును, అంత్యకాలము నందు శాశ్వతమైన పరమపదమును లభించును.

★★★

# సుందరం కావ్య మాసేవ్యతామ్

– సుబోధినీ సమర్పకులు

సుందరో రాఘవ స్సుందరీ జానకీ
సుందరో మారుతి స్సుందరా స్తస్య తే ।
విక్రమా యత్ర సంప్రస్తుతా స్సుందరం
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 1

విశ్వభాషాసు గీర్వాణ వాణీ వరా
తత్ర రామాయణం వేదవ త్పావనమ్ ।
తత్ర యత్ సారవ న్నిర్మితం మౌనినా
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 2

భీతికృ ద్రౌద్ర బీభత్స వీరాద్భుతాః
యత్ర శృంగారకారుణ్యహాస్యా రసాః ।
కుర్వతే చిత్త మానందమగ్నం చిరం
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 3

ధర్మసంబద్ధయో ర్భవ్యచారిత్రయో
శ్శోకసమ్మగ్నయో ర్జానకీరామయోః ।
దుఃఖనాశక్రమో యత్ర సంవర్ణితః
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 4

క్రూరరక్షోగణైః పీడ్యమానా చిరం
శీలసంరక్షణే తత్పరాఽనారతమ్ ।
క్ష్మాసుతా యత్ర దృష్టా క్షమారూపిణీ
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 5

దుష్టశీలస్య భాగ్యాని భోగాశ్చ యే
విక్రమా స్తే హి నాశాయ తస్యేతి – తత్ ।
సత్య ముద్ఘోషితం యత్ర వాల్మీకినా
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 6

లంఘయిత్వా మహోబ్ధిం మహీజాం చిరం
తీవ్ర మన్విష్య చానిశ్వసన్ మారుతిః ।
ఆహ్వాయ న్నైకశో యత్ర దైత్యాన్ యుధి
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 7

యత్ర లోకోత్తరాం స్వప్రభో ర్వీరతాం
జిష్ణుతాం రమ్యతాం కామ్యతాం నైకశః ।
కీర్తయన్ పావని ర్నైవ తృప్తిం గతః
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 8

భక్తసంరక్షణా యావతీర్ణం క్షితౌ
రామ మామ్నాయగమ్యం పరం వేధసమ్ ।
వేదతుల్యై ర్వచోభి ర్య దాఖ్యాతి నః
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 9

దుస్తర స్సాగరో గోష్పదో జాయతే
రామభక్తస్య ఘోరాసురాః కీటకాః ।
ఇష్టసిద్ధి ర్ధ్రువా చేతి యద్వక్తి నః
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 10

ప్రాప్యతే ఽ లౌకికానందసిద్ధి ర్యతః
సద్గతిద్యోతకో ధర్మబోధో యతః ।
లౌకికా చ్ఛోకజాలా చ్చ ముక్తి ర్యతః
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 11

బ్రహ్మనిష్ఠేన వాల్మీకిసన్మౌనినా
వశ్యవాచా సుధాస్యందిభి ర్యత్పదైః ।
నిర్మితాం సచ్చిదానందసంధాయకం
తచ్ఛివం సుందరం కావ్య మాసేవ్యతామ్ ॥ 12

★★★

# హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః

శతాదిత్యతేజోవిరాజన్ముఖాబ్జః
లసద్రత్నభూషా విశేషోజ్జ్వలాంగః ।
సువర్ణాద్రిగంభీరసౌందర్యమూర్తిః
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 1

తనౌ రామలీలాస్మృతే రోమహర్షః
హృది క్ష్మాసుతాసంయుతో రామచంద్రః ।
ముఖే రామనామామృతం యస్య సోఽయం
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 2

నతత్రాణదక్షో యదీయః కటాక్షః
అఘౌఘాపనోదక్షమౌ యస్య పాదౌ ।
శరణ్య స్సతాం భీకర శ్శాసతాం యః
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 3

ఉమేశో రమేశో దినేశ శ్శచీశః
తథాఽహీశ వాణీశ ముఖ్యా స్సురేశాః ।
దదు స్స్వస్వతేజాంసి యస్మై ముదా సః
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 4

య థై వాత్మశక్త్యా వితేనే ప్రభుం యం
అవాప్తాత్మకామం నిరస్తస్వదుఃఖమ్ ।
తథా స్వాంశ్చ భక్తాన్ విధాతుం చణ స్సః
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 5

సదా రామపాదౌ ముదా యస్య సేవ్యౌ
మహీజాప్రియస్య ప్రియం యం విదంతి ।
య మాహు ర్యమం రక్షసాం శిక్షణే సః
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 6

నహి స్యా దశక్యం క్వచి ద్యస్య కించిత్
మహిమ్నో నచ స్యా త్తులా యస్య లోకే ।
అలభ్యం న భక్తస్య య స్యాస్తి సోఽయం
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 7

భవాంభోధిమగ్నే దురాశాదిరుగ్ణే
మదక్రోధగర్వాదిదుర్భావభగ్నే ।
చిరా ద్రామభద్రాంఘ్రిసేవావిలగ్నే
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 8

మహైశ్వర్య మారోగ్య ముత్సాహ మాయుః
బలం సాహసం శౌర్యధైర్యే యశ శ్చ ।
ప్రసన్న స్తనోతి స్వభక్తేషు య స్సః
హనూమాన్ మయి స్యాత్ సదా సుప్రసన్నః ॥ 9

– సుబోధినీ సమర్పకులు



# గాయత్రీ రామాయణము

తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్ ॥ 1

స హత్వా రాక్షసాన్ సర్వాన్ యజ్ఞఘ్నాన్ రఘునందనః ।
ఋషిభిః పూజిత స్సమ్యగ్యథేంద్రో విజయీ పురా ॥ 2

విశ్వామిత్రస్య ధర్మాత్మా శ్రుత్వా జనకభాషితమ్ ।
వత్స రామ ధనుః పశ్య ఇతి రాఘవ మబ్రవీత్ ॥ 3

తుష్టావాస్య తదా వంశం ప్రవిశ్య స విశాం పతేః ।
శయనీయం నరేంద్రస్య తదాసాద్య వ్యతిష్ఠత ॥ 4

వనవాసం హి సంఖ్యాయ వాసాంస్యాభరణాని చ ।
భర్తార మనుగచ్ఛంత్యై సీతాయై శ్వశురో దదౌ ॥ 5

రాజా సత్యం చ ధర్మం చ రాజా కులవతాం కులమ్ ।
రాజా మాతా పితా చైవ రాజా హితకరో నృణామ్ ॥ 6

నిరీక్ష్య స ముహూర్తం తు దదర్శ భరతో గురుమ్ ।
ఉటజే రామ మాసీనం జటావల్కలధారిణమ్ ॥ 7

యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిమ్ ।
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః ॥ 8

భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమ చ ప్రభో ।
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి ॥ 9

గచ్ఛ శీఘ్ర మితో రామ సుగ్రీవం తం మహాబలమ్ ।
వయస్యం తం కురు క్షిప్ర మితో గత్వాద్య రాఘవ ॥ 10

దేశకాలౌ ప్రతీక్షస్వ క్షమమాణః ప్రియాప్రియే ।
సుఖదుఃఖసహః కాలే సుగ్రీవవశగో భవ ॥ 11

వంద్యా స్తే తు తపస్సిద్ధా స్తపసా వీతకల్మషాః ।
ప్రష్టవ్యా స్తేఽపి సీతాయాః ప్రవృత్తిం వినయాన్వితైః ॥ 12

స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్ ।
విక్రమేణ మహాతేజా హనుమా న్మారుతాత్మజః ॥ 13

ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః ।
మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్ ॥ 14

మంగళాభిముఖీ తస్య సా తదాఽఽసీ న్మహాకపేః ।
ఉపతస్థే విశాలాక్షీ ప్రయతా హవ్యవాహనమ్ ॥ 15

హితం మహార్థం మృదు హేతుసంహితమ్
వ్యతీతకాలాయతిసంప్రతిక్షమమ్ ॥
నిశమ్య తద్వాక్య ముపస్థితజ్వరః
ప్రసంగవా నుత్తరమేత దబ్రవీత్ ॥ 16

ధర్మాత్మా రక్షసాం శ్రేష్ఠ స్సంప్రాప్తోఽయం విభీషణః ।
లంకైశ్వర్యం ధ్రువం శ్రీమా నయం ప్రాప్నోత్యకంటకమ్ ॥ 17

యో వజ్రపాతాశనిసన్నిపాతా న్న చుక్షుభే నాపి చచాల రాజా ।
స రామబాణాభిహతో భృశార్త శ్చచాల చాపం చ ముమోచ వీరః ॥ 18

యస్య విక్రమమాసాద్య రాక్షసా నిధనం గతాః ।
తం మన్యే రాఘవం వీరం నారాయణ మనామయమ్॥ 19

న తే దదృశిరే రామం దహంత మరివాహినీమ్ ।
మోహితాః పరమాస్త్రేణ గాంధర్వేణ మహాత్మనా ॥ 20

ప్రణమ్య దేవతాభ్యశ్చ బ్రాహ్మణేభ్యశ్చ మైథిలీ ।
బద్ధాంజలిపుటా చేద మువా చాగ్నిసమీపతః ॥ 21

చలనాత్పర్వతేంద్రస్య గణా దేవాశ్చ కంపితాః ।
చచాల పార్వతీ చాపి తదాశ్లిష్టా మహేశ్వరమ్ ॥ 22

దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనమ్ ।
సర్వ మేవావిభక్తం నో భవిష్యతి హరీశ్వర ॥ 23

యా మేవ రాత్రిం శత్రుఘ్నః పర్ణశాలాం సమావిశత్ ।
తామేవ రాత్రిం సీతాఽపి ప్రసూతా దారకద్వయమ్ ॥ 24

ఇదం రామాయణం కృత్స్నం గాయత్రీబీజసంయుతమ్,
త్రిసంధ్యం యః పఠే న్నిత్యం సర్వపాపైః ప్రముచ్యతే ॥

ఇతి శ్రీగాయత్రీరామాయణమ్.

హరిః ఓం తత్ సత్.

★★★

# శ్రీఆంజనేయాష్టకమ్

ఓం నమో వాయుపుత్రాయ - భీమరూపాయ ధీమతే ।
నమస్తే రామదూతాయ - కామరూపాయ శ్రీమతే ॥ 1

మోహశోకవినాశాయ - సీతాశోకవినాశినే ।
భగ్నాశోకవనాయాస్తు - దగ్ధలంకాయ వాగ్మినే ॥ 2

గతినిర్జితవాతాయ - లక్ష్మణప్రాణదాయ చ ।
వనౌకసాం వరిష్ఠాయ - వశినే వనవాసినే ॥ 3

తత్త్వజ్ఞాన సుధాసింధు - నిమగ్నాయ మహీయసే ।
ఆంజనేయాయ శూరాయ - సుగ్రీవసచివాయ తే ॥ 4

జన్మమృత్యుభయఘ్నాయ - సర్వక్లేశహరాయ చ ।
నేదిష్ఠాయ ప్రేతభూత - పిశాచభయహారిణే ॥ 5

యాతనానాశనాయాస్తు - నమో మర్కటరూపిణే ।
యక్షరాక్షసశార్దూల - సర్పవృశ్చికభీహృతే ॥ 6

మహాబలాయ వీరాయ - చిరంజీవిన్ నమోఽస్తు తే ।
హారిణే వజ్రదేహాయ - ఉల్లంఘితమహాబ్ధయే ॥ 7

బలినా మగ్రగణ్యాయ - నమో నః పాహి మారుతే ।
లాభదోఽసి త్వమేవాఽఽశు - హనుమన్ రాక్షసాంతక ।
యశో జయం చ మే దేహి - శత్రూన్ నాశయ నాశయ ॥ 8

☆☆☆

స్వాశ్రితానా మభయదం - య ఏవం స్తౌతి మారుతిమ్ ।
హానిః కుతో భవే త్తస్య - సర్వత్ర విజయీ భవేత్ ॥

★★★

## శ్రీమత్సుందరకాండ పారాయణ విధానమున

### అంగన్యాస కరన్యాసములు

ఆచమ్య, దేశకాలాదికం సంకీర్త్య,

... గోత్రస్య .... నామధేయస్య సకుటుంబస్య మమ క్షేమ స్థైర్య విజయాఽఽ భయాఽఽఽ యురారోగ్యైశ్వర్యాభివృద్ధ్యర్థం సర్వానిష్టనివారణార్థం సర్వాభీష్టసిద్ధ్యర్థం శ్రీసుందరకాండ మహామంత్ర పారాయణం కరిష్యే ॥

అస్య శ్రీసుందరకాండ మహామంత్రస్య, వాల్మీకిః ఋషిః, అనుష్టుప్ ఛందః, ఆంజనేయో దేవతా, రామదూతాయ కపయే ఇతి బీజమ్, నమో వాతాత్మజాయ ఇతి శక్తిః, సర్వానిష్టనివారణార్థే సర్వాభీష్టసిద్ధ్యర్థే సుందరకాండపారాయణేజపే వినియోగః.

ఉదధిక్రామిణే తుభ్యం నమో రాక్షసమర్దినే - అంగుష్ఠాభ్యాం నమః,
ఛాయాగ్రహవినాశాయ సురసామారకాయ చ - తర్జనీభ్యాం నమః,
మైనాకదర్శినే తుభ్యం మైనాకగిరిమానినే - మధ్యమాభ్యాం నమః,
ఆకాశగామినే దేవమానినే సర్వదాయినే - అనామికాభ్యాం నమః,
వాయుపుత్రాయ ధీరాయ లంకాదర్పాపహారిణే - కనిష్ఠికాభ్యాం నమః,
అక్షహంత్రే నమస్తుభ్యం పుచ్ఛవహ్నిప్రదీపినే - కరతలకరపృష్ఠాభ్యాం నమః,

ఉదధిక్రామిణే తుభ్యం నమో రాక్షసమర్ధినే - హృదయాయ నమః,
ఛాయాగ్రహవినాశాయ సురసామారకాయ చ - శిరసే స్వాహా,
మైనాకదర్శినే తుభ్యం మైనాకగిరిమానినే - శిఖాయై వషట్,
ఆకాశగామినే దేవమానినే సర్వదాయినే - కవచాయ హుమ్,
వాయుపుత్రాయ ధీరాయ లంకాదర్పాపహారిణే - నేత్రత్రయాయ వౌషట్,
అక్షహంత్రే నమస్తుభ్యం పుచ్ఛవహ్నిప్రదీపినే - అస్త్రాయ ఫట్,
అష్టమంత్రిసుతానాం చ గర్వభంగకృతే నమః - ఇతి దిగ్బంధః;

ధ్యానమ్ ॥ సర్వానిష్టనివారకం శుభకరం పింగాక్ష మక్షాపహమ్
సీతాన్వేషణతత్పరం కపివరం కోటీందుసూర్యప్రభమ్ ।
లంకాద్వీపభయంకరం సకలదం సుగ్రీవసమ్మానినమ్
దేవేంద్రాదిసమస్తదేవవినుతం కాకుత్థ్సదూతం భజే ॥
బుద్ధిర్బలం యశో ధైర్యం నిర్భయత్వ మరోగతా ।
అజాడ్యం వాక్పటుత్వం చ హనూమాత్స్మరణాద్భవేత్ ॥

# శ్రీమత్సుందరకాండ

## పారాయణఫలమ్

బ్రహ్మాండపురాణే :–

తతో రావణనీతాయా స్సీతాయా శ్శత్రుకర్శనః
ఇతి శ్లోకం సమాకర్ణ్య కార్యసిద్ధిం లభేన్నరః ॥ 1

సుందరాదిమసర్గస్థ హనూమద్విక్రమాదికమ్ ।
శ్రుత్వాఽపస్మారకుష్ఠాది భూతభేతాళనాశనమ్ ॥ 2

స నిర్జిత్య పురీం శ్రేష్ఠా మితి శ్లోకాదిమాక్షరమ్ ।
శ్రుత్వా బంధా ద్విముక్తస్సన్ బ్రహ్మభూయాయ కల్పతే ॥ 3

సీతాసందర్శనం శ్రుత్వా వీతశోకో భవిష్యతి ।
శ్రుత్వా తు త్రిజటాస్వప్నం దుఃస్వప్నో నశ్యతి ధ్రువమ్ ॥ 4

శ్రీరామముద్రికాదానం యే శృణ్వంత్యాదరేణ తు ।
నిర్జిత్య శత్రూన్ సంగ్రామే స్థిరం రాజ్యం వ్రజంతి తే ॥ 5

ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధా ఇత్యత్ర చాదిమమ్ ।
శ్రుత్వా చతుర్దశం వర్ణ మసంగో వాయువచ్చరేత్ ॥ 6

హనూమద్గ్రహణం శ్రుత్వా బంధాన్ముచ్యేత మానవః ।
లంకాదాహా ద్యనుశ్రుత్వా తాపత్రయహతి ర్భవేత్ ॥ 7

మంగళాభిముఖీత్యస్మిన్ శ్లోకే యత్ప్రథమాక్షరమ్ ।
తద్గాయత్ర్యాః పంచదశం శ్రుత్వా మద్రూపభాగ్భవేత్ ॥ 8

శ్రుత్వా తు పంచమం కాండం హనూమద్విజయాంకితమ్ ।
ఆంజనేయప్రసాదేన బ్రహ్మలోకం స గచ్ఛతి ॥ 9

కాండస్య సుందరాఖ్యస్య శ్రవణాత్ పఠనాదపి ।
మాం ప్రాప్నుయా జ్జగద్ధేతుం నాత్ర సందేహ ఇష్యతే ॥ 10

# శ్రీమత్సుందరకాండ

## పారాయణఫలము

బ్రహ్మాండపురాణమునందు :-

1. సుందరకాండమునందలి మొదటి శ్లోకమును వినినమాత్రమున నిర్విఘ్నముగ సర్వకార్యములు నెఱవేరును.

2. మొదటి సర్గమునందలి హనుమంతుని పరాక్రమాదులను వినిన నరునికి అపస్మారము, కుష్ఠము మున్నగు రోగములును, భూతభయములును నశించును.

3. "స నిర్జిత్య" అను శ్లోకము మొదటి అక్షరమును ఏకాగ్రతతో వినిన నరుడు కారాగృహవిముక్తుడై బ్రహ్మపదము నొందుట కర్హుడగును.

4. హనుమ సీతమ్మను జూచిన ఘట్టమును వినిన ఎల్ల దుఃఖములు తొలగును. త్రిజటాస్వప్నవృత్తాంతమును వినిన దుస్స్వప్నములు నశించును.

5. అంగులీయకప్రదాన కథను సాదరముగ వినినవారు యుద్ధమున శత్రువులను జయించి స్థిరమైన రాజ్యమును పొందుదురు.

6. గాయత్రీ చతుర్దశాక్షరమైన "ధన్యా దేవా...." అను శ్లోకము మొదటి అక్షరమును వినిన పాపసంగరహితుడై వాయువువలె పరిశుద్ధుడై వర్తించును.

7. హనుమకు కల్గిన బ్రహ్మాస్త్రబంధమును, విముక్తిని వినిన నరుడు బంధ విముక్తుడగును. లంకాదహనమును వినిన తాపత్రయవిముక్తి కలుగును.

8. గాయత్రీ పంచదశాక్షరమైన మంగళాభిముఖీ .... అను శ్లోకము మొదటి అక్షరమును వినిన నావలె(మహేశ్వరునివలె) శ్రీరామప్రియభక్తుడై వెలయును.

9. ఆంజనేయుని విజయగాథయగు సుందరకాండమును శ్రద్ధతో వినినవాడు హనుమ అనుగ్రహము నొంది బ్రహ్మలోకము నందగలడు.

10. సుందరకాండమును చదివినను, వినినను జగత్తునకు మూలమైనట్టి నన్ను (పరమేశ్వరుని) చేరును. ఇందు సందేహము లేదు.

ఉమాసంహితాయామ్ :-

శ్రుత్వేమం సుందరం కాండం పురా వాల్మీకినా కృతమ్ ।
యత్ర ప్రవృత్తిం సీతాయా రామస్య చ నివేదనమ్ ॥ 1

సంతానార్థీ ధనార్థీ వా సామ్రాజ్యార్థీ చ మానవః ।
రాజబంధవిమోక్షార్థీ మోక్షార్థీ వాపి యో భవేత్ ॥ 2

తత్తత్ఫల మవాప్నోతి సీతారామప్రసాదతః ।
ఆవృత్యా చైకవింశత్యా పుత్రసంతాన మాప్నుయాత్ ॥ 3

పంచవింశతిసర్గాంశ్చ ప్రత్యహం పఠతే తు యః ।
మహద్ధన మవాప్నోతి గృహం ధాన్యాదికం చ సః ॥ 4

ప్రత్యహం సప్తసర్గాంశ్చ పఠిత్వా వత్సరం నరః ।
మహత్సామ్రాజ్యమాప్నోతి పృథ్వీంద్రైశ్చ ప్రపూజ్యతే ॥ 5

చతుస్త్రింశతిసర్గాంశ్చ పఠిత్వా యుగ్మకే దినే ।
తావత్యా చైవ చావృత్త్యా రాజబంధా ద్విముచ్యతే ॥ 6

యథాశక్తి పఠిత్వాఽఽఽశు యావజ్జీవం నరోత్తమః ।
ఐహికం తు సుఖం ప్రాప్య మోక్ష మీయాత్ పరత్ర చ ॥ 7

అనావృష్ట్యాం ప్రవృత్తాయా మవగ్రహనివృత్తయే ।
పఠే చ్చ సుందరం కాండం సువృష్టిశ్చ తతో భవేత్ ॥ 8

కిం బహూక్తేన విధినా సర్వాభీష్టప్రదాయకమ్ ।
నాతోఽన్య ద్విద్యతే లోకే ఇహాముత్రఫలప్రదమ్ ॥ 9

విప్రశ్రేష్ఠాదిదం శ్రుత్వా శక్త్యా బ్రాహ్మణభోజనమ్ ।
పూజయేచ్చైవ చాచార్యం గోభూవస్త్రాదిభూషణైః ॥ 10



(59)

**ఉమాసంహితలో :–**

1\. 2. పూర్వము వాల్మీకిచే రచింపబడిన ఈ సుందరకాండమునందలి రామునకు నివేదింపబడిన సీతావృత్తాంతమును విన్నవారు వారి వారి కోర్కెల ననుసరించి సీతారాముల అనుగ్రహమువలన సంతానము, ధనము, రాజ్యాధిపత్యము, కారాగారబంధవిమోచనము, మోక్షము మొదలగువానిని పొందెదరు.

3\. 4. 5. ఇరువదియొక్కమాఱు సుందరకాండము నంతను పారాయణము చేసిన వారికి పుత్రసంతానము కలుగును. ఇరువదియైదు సర్గల చొప్పున పారాయణము చేసిన గొప్ప ఐశ్వర్యమును, గృహములు, ధనధాన్యాది కములును లభించును. ప్రతిదినము ఏడుసర్గల చొప్పున ఒక సంవత్సరము పారాయణము చేసిన మండలాధిపత్యము పొంది, రాజులచేతగూడ పూజింపబడును.

6\. దినమునకు ముప్పదినాలుగు సర్గలుచొప్పున అరువదినాల్గు దినములలో ముప్పదినాల్గు మాఱులు పారాయణము చేసినచో కారాగృహమునుండి విముక్తుడగును.

7\. బ్రతికియున్నంతకాలము ప్రతిదినము శక్తికొలది పారాయణము చేసినవాడు ఈ లోకమున సుఖము లనుభవించి అంతమున మోక్షము నొందును.

8\. అనావృష్టి యేర్పడినప్పుడు ఆ దోషనివారణముకొఱకు సుందరకాండము పఠింపవలెను. దానివలన సువృష్టి కలుగును.

9\. వేయేల? ఈ సుందరకాండ పారాయణముకంటె ఇహపరములందు సర్వాభీష్టములనొసగు సాధనము వేఱేదియు లేదు.

10\. ఉత్తమవిప్రునివలన ఈ సుందరకాండము విని యథాశక్తిగా బ్రాహ్మణ సమారాధము చేసి గో భూ వస్త్ర భూషణాదులచే గురువును సత్కరింపవలెను.



# శ్రీమత్సుందరకాండ పారాయణోపక్రమము

## స్మార్త సంప్రదాయము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ 1

వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే ।
యం నత్వా కృతకృత్యాః స్యుస్తం నమామి గజాననమ్ ॥ 2

దోర్భిర్యుక్తా చతుర్భిః స్ఫటికమణిమయీ మక్షమాలాం దధానా
హస్తే నైకేన పద్మం సిత మపి చ శుకం పుస్తకం చాపరేణ ।
భాసా కుందేందు శంఖస్ఫటిక మణినిభా భాసమానాఽసమానా ।
సా మే వాగ్దేవతేయం నివసతు వదనే సర్వదా సుప్రసన్నా ॥ 3

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥ 4

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥ 5

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్ ।
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్ ॥ 6

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్ ॥ 7

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్ ।
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥ 8

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
య శ్శోకవహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్ ॥ 9
ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్ ।
పారిజాతతరుమూలవాసినం భావయామి పవమాననందనమ్ ॥ 10

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారిపరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥ 11

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి ॥ 12

యః కర్ణాంజలిసంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరాత్
వాల్మీకే ర్వదనారవిందగళితం రామాయణాఖ్యం మధు ।
జన్మవ్యాధి జరావిపత్తి మరణై రత్యంతసోపద్రవం
సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్ ॥ 13

తదుపగత సమాస సంధియోగం సమమధురోపనతార్థవాక్యబద్ధమ్ ।
రఘువరచరితం మునిప్రణీతం దశశిరస శ్చ వధం నిశామయధ్వమ్ ॥14
వాల్మీకిగిరిసంభూతా రామసాగరగామినీ ।
పునాతు భువనం పుణ్యా రామాయణమహానదీ ॥ 15

శ్లోకసారసమాకీర్ణం సర్గకల్లోలసంకులమ్ ।
కాండగ్రాహమహామీనం వందే రామాయణార్ణవమ్ ॥ 16

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా ॥ 17

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పకమాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామం భజే శ్యామలమ్ ॥ 18

వామే భూమిసుతా పుర శ్చ హనుమాన్ పశ్చాత్సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరత శ్చ పార్శ్వదళయో ర్వాయ్వాదికోణేషు చ ।
సుగ్రీవ శ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జాంబవాన్
మధ్యే నీలసరోజకోమలరుచిం రామం భజే శ్యామలమ్ ॥ 19

నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకాత్మజాయై ।
నమోస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥20

★★★

# శ్రీవైష్ణవ సంప్రదాయము

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥ 1

లక్ష్మీనాథసమారంభాం నాథయామునమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరామ్ ॥ 2

యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతోఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥ 3

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్ ।
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమత్తదంఘ్రియుగళం ప్రణమామి మూర్ధ్నా ॥ 4

భూతం సరశ్చ మహదాహ్వయభట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్ ।
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్రమిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥ 5

☆ ☆ ☆

పితామహస్యాపి పితామహాయ ప్రాచేతసాదేశఫలప్రదాయ ।
శ్రీభాష్యకారోత్తమదేశికాయ శ్రీశైలపూర్ణాయ నమో నమః స్తాత్ ॥ 6

యో నిత్య మచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహిత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురో ర్భగవతో ఽస్య దయైకసింధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥ 7

రామానుజపదచ్ఛాయా గోవిందాహ్వానపాయినీ ।
తదాయత్తస్వరూపా సా జీయా న్మద్విశ్రమస్థలీ ॥ 8

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమఉక్తి మధీమహి ।
యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళసూత్రతామ్ ॥ 9

శ్రీపరాశరభట్టార్యః శ్రీరంగేశపురోహితః
శ్రీవత్సాంకసుత శ్శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥ 10

నమో వేదాంతవేద్యాయ జగన్మంగళహేతవే ।
యస్య వాగమృతాసారపూరితం భువనత్రయమ్ ॥ 11

వేదాంతవేద్యామృతవారిరాశేః వేదార్థసారామృతపూర మగ్ర్యమ్ ।
ఆదాయ వర్షంతమహం ప్రపద్యే కారుణ్యపూర్ణం కలివైరిదాసమ్ ॥ 12

శ్రీకృష్ణపాదపాదాబ్జే నమామి శిరసా సదా ।
యత్ప్రసాదప్రభావేన సర్వసిద్ధి రభూన్మమ ॥ 13

శ్రీమత్కృష్ణసమాహ్వాయ నమో యామునసూనవే ।
యత్కటాక్షైకలక్ష్యాణాం సులభ శ్శ్రీధర స్సదా ॥ 14

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే ।
సంసారభోగి సందష్ట జీవజీవాతవే నమః ॥ 15

నమ శ్శ్రీశైలనాథాయ కుంతీనగరజన్మనే ।
ప్రసాదలబ్ధపరమప్రాప్య కైంకర్యశాలినే ॥ 16

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥ 17

రమ్యజామాతృయోగీంద్ర పాదరేఖామయం సదా ।
తదాయత్తాత్మసత్తాదిం రామానుజమునిం భజే ॥ 18

☆ ☆ ☆

**తతః స్వాచార్యశ్లోకానుసంధానమ్**

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥ 19

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥ 20

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్ ।
అతృప్తస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్ ॥ 21

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్ ॥ 22

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్ ।
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥ 23

మనోజవం మారుతతుల్యవేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం శ్రీరామదూతం శిరసా నమామి ॥ 24

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తే నైవ దదాహ లంకాం నమామి తం ప్రాంజలి రాంజనేయమ్ ॥25

ఆంజనేయ మతిపాటలాననం కాంచనాద్రి కమనీయ విగ్రహమ్ ।
పారిజాత తరుమూలవాసినం భావయామి పవమాననందనమ్ ॥ 26

యత్ర యత్ర రఘునాథకీర్తనం తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥ 27

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా ॥ 28

తదుపగత సమాస సంధియోగం సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్ ।
రఘువరచరితం మునిప్రణీతం దశశిరస శ్చ వధం నిశామయధ్వమ్ ॥ 29

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘువరాన్వయ రత్నదీపమ్ ।
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి ॥ 30

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం, రామం భజే శ్యామలమ్ ॥ 31

★★★

# మాధ్వసంప్రదాయము

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥ 1

లక్ష్మీనారాయణం వందే తద్భక్తప్రవరో హి యః ।
శ్రీమదానందతీర్థాఖ్యో గురు స్తం చ నమామ్యహమ్ ॥ 2

వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా ।
ఆదా వంతే చ మధ్యే చ విష్ణు స్సర్వత్ర గీయతే ॥ 3

సర్వవిఘ్నప్రశమనం సర్వసిద్ధికరం పరమ్ ।
సర్వజీవప్రణేతారం వందే విజయదం హరిమ్ ॥ 4

సర్వాభీష్టప్రదం రామం సర్వారిష్టనివారకమ్ ।
జానకీజాని మనిశం వందే మద్గురువందితమ్ ॥ 5

అభ్రమం భంగరహిత మజడం విమలం సదా ।
ఆనందతీర్థ మతులం భజే తాపత్రయాపహమ్ ॥ 6

భవతి యదనుభావా దేడమూకోఽపి వాగ్మీ
జడమతి రపి జంతు, ర్జాయతే ప్రాజ్ఞమౌళిః ।
సకలవచనచేతోదేవతా భారతీ సా
మమ వచసి విధత్తాం సన్నిధిం మానసే చ ॥ 7

మిథ్యాసిద్ధాంత దుర్ధ్వాంత విధ్వంసనవిచక్షణః ।
జయతీర్థాఖ్యతరణి ర్భాసతాం నో హృదంబరే ॥ 8

చిత్రైః పదైశ్చ గంభీరై ర్వాక్యై ర్మానై రఖండితైః ।
గురుభావం వ్యంజయంతీ భాతి శ్రీజయతీర్థవాక్ ॥ 9

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్ ।
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥ 10

వాల్మీకే ర్మునిసింహస్య కవితావనచారిణః ।
శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్ ॥ 11

యః పిబన్ సతతం రామచరితామృతసాగరమ్ ।
అతృప్త స్తం మునిం వందే ప్రాచేతస మకల్మషమ్ ॥ 12

గోష్పదీకృతవారాశిం మశకీకృతరాక్షసమ్ ।
రామాయణమహామాలారత్నం వందేఽనిలాత్మజమ్ ॥ 13

అంజనానందనం వీరం జానకీశోకనాశనమ్ ।
కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరమ్ ॥ 14

మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠమ్ ।
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి ॥ 15

ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్ ॥ 16

ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయవిగ్రహమ్ ।
పారిజాత తరుమూలవాసినం
భావయామి పవమాననందనమ్ ॥ 17

యత్ర యత్ర రఘునాథకీర్తనం
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్ ।
బాష్పవారి పరిపూర్ణలోచనం
మారుతిం నమత రాక్షసాంతకమ్ ॥ 18

వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా ॥ 19

ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయో భూయో నమామ్యహమ్ ॥ 20

తదుపగత సమాస సంధియోగం
సమమధురోపనతార్థ వాక్యబద్ధమ్ ।

రఘువరచరితం మునిప్రణీతం
దశశిరస శ్చ వధం నిశామయధ్వమ్ ॥ 21

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామండపే
మధ్యే పుష్పక మాసనే మణిమయే వీరాసనే సుస్థితమ్ ।
అగ్రే వాచయతి ప్రభంజనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం, రామం భజే శ్యామలమ్ ॥ 22

వందే వంద్యం విధిభవమహేంద్రాది బృందారకేంద్రైః
వ్యక్తం వ్యాప్తం స్వగుణగణతో దేశతః కాలత శ్చ ।
ధూతావద్యం సుఖజితిమయై ర్మంగళై ర్యుక్త మంగైః
సానాథ్యం నో విదధ దధికం బ్రహ్మ నారాయణాఖ్యమ్ ॥ 23

భూషారత్నం భువనవలయ స్యాఖిలాశ్చర్యరత్నం
లీలారత్నం జలధిదుహితు ర్దేవతామౌళిరత్నమ్ ।
చింతారత్నం జగతి భజతాం సత్సరోజద్యురత్నం
కౌసల్యాయా లసతు మమ హృన్మండలే పుత్రరత్నమ్ ॥ 24

మహావ్యాకరణాంభోధి మంథమానసమందిరమ్ ।
కవయంతం రామకీర్త్యా హనుమంత ముపాస్మహే ॥ 25

ముఖ్యప్రాణాయ భీమాయ నమో యస్య భుజాంతరమ్ ।
నానావీరసువర్ణానాం నికషాశ్మాయితం భజే ॥ 26

స్వాంతస్థానంతశయ్యాయ పూర్ణజ్ఞానమహార్ణసే ।
ఉత్తుంగవాక్తరంగాయ మధ్వదుగ్ధాబ్ధయే నమః ॥ 27

వాల్మీకే ర్గౌః పునీయా న్నో మహీధరపదాశ్రయా ।
యద్దుగ్ధ ముపజీవంతి కవయ స్తర్ణకా ఇవ ॥ 28

సూక్తిరత్నాకరే రమ్యే మూలరామాయణార్ణవే ।
విహరంతో మహీయాంసః ప్రీయంతాం గురవో మమ ॥ 29

హయగ్రీవ హయగ్రీవ హయగ్రీవేతి యో వదేత్ ।
తస్య నిస్సరతే వాణీ జహ్నుకన్యాప్రవాహవత్ ॥ 30

★★★

## శ్రీమత్సుందరకాండ

# పారాయణసమాపనక్రమము

## స్మార్తసంప్రదాయము

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినో భవంతు ॥ 1

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః ॥ 2

అపుత్రాః పుత్రిణస్సంతు పుత్రిణ స్సంతు పౌత్రిణః ।
అధనా స్సధనా స్సంతు జీవంతు శరదాం శతమ్ ॥ 3

చరితం రఘునాథస్య శతకోటిప్రవిస్తరమ్ ।
ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతకనాశనమ్ ॥ 4

శృణ్వన్ రామాయణం భక్త్యా యః పాదం పదమేవ వా ।
స యాతి బ్రహ్మణః స్థానం బ్రహ్మణా పూజ్యతే సదా ॥ 5

రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే ।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః ॥ 6

యన్మంగళం సహస్రాక్షే సర్వదేవనమస్కృతే ।
వృత్రనాశే సమభవ త్తత్తే భవతు మంగళమ్ ॥ 7

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥ 8

య న్మంగళం సుపర్ణస్య వినతాఽకల్పయ త్పురా ।
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగళమ్ ॥ 9

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్ ।
అదితి ర్మంగళం ప్రాదా త్తత్తే భవతు మంగళమ్ ॥ 10

త్రీన్ విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమితతేజసః ।
య దాసీ న్మంగళం రామ తత్తే భవతు మంగళమ్ ॥ 11

ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశ శ్చ తే ।
మంగళాని మహాబాహో దిశంతు తవ సర్వదా ॥ 12

కాయేన వాచా మనసేంద్రియై ర్వా
బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి ॥ 13



# శ్రీవైష్ణవ సంప్రదాయము

ఏవ మేత త్పురావృత్త మాఖ్యానం భద్ర మస్తు వః ।
ప్రవ్యాహరత విస్రబ్ధం బలం విష్ణోః ప్రవర్ధతామ్ ॥ 1

లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః ।
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః ॥ 2

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశో ఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః ॥ 3

కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః ।
శ్రీరంగనాథో జయతు శ్రీరంగశ్రీశ్చ వర్ధతామ్ ॥ 4

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు ॥ 5

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥ 6

వేదవేదాంతవేద్యాయ మేఘశ్యామలమూర్తయే ।
పుంసాం మోహనరూపాయ పుణ్యశ్లోకాయ మంగళమ్ ॥ 7

విశ్వామిత్రాంతరంగాయ మిథిలానగరీపతేః ।
భాగ్యానాం పరిపాకాయ భవ్యరూపాయ మంగళమ్ ॥ 8

పితృభక్తాయ సతతం భ్రాతృభి స్సహ సీతయా ।
నందితాఖిలలోకాయ రామభద్రాయ మంగళమ్ ॥ 9

త్యక్తసాకేతవాసాయ చిత్రకూటవిహారిణే ।
సేవ్యాయ సర్వయమినాం ధీరోదారాయ మంగళమ్ ॥ 10

సౌమిత్రిణా చ జానక్యా చాపబాణాసిధారిణే ।
సంసేవ్యాయ సదా భక్త్యా స్వామినే మమ మంగళమ్ ॥ 11

దండకారణ్యవాసాయ ఖండితామరశత్రవే ।
గృధ్రరాజాయ భక్తాయ ముక్తిదాయాస్తు మంగళమ్ ॥ 12

సాదరం శబరీదత్త ఫలమూలాభిలాషిణే ।
సౌలభ్యపరిపూర్ణాయ సత్త్వోద్రిక్తాయ మంగళమ్ ॥ 13

హనుమత్సమవేతాయ హరీశాభీష్టదాయినే ।
వాలిప్రమథనాయాస్తు మహావీరాయ మంగళమ్ ॥ 14

శ్రీమతే రఘువీరాయ సేతూల్లంఘితసింధవే ।
జితరాక్షసరాజాయ రణధీరాయ మంగళమ్ ॥ 15

ఆసాద్య నగరీం దివ్యా మభిషిక్తాయ సీతయా ।
రాజాధిరాజరాజాయ రామభద్రాయ మంగళమ్ ॥ 16

మంగళాశాసనపరై ర్మదాచార్యపురోగమైః ।
సర్వైశ్చ పూర్వై రాచార్యై స్సత్కృతాయాస్తు మంగళమ్ ॥ 17

హరి ఓం సత్ తత్

★★★

## మాధ్వసంప్రదాయము

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభ మస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు ॥ 1

కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశో ఽయం క్షోభరహితో బ్రాహ్మణా స్సంతు నిర్భయాః ॥ 2

లాభ స్తేషాం జయ స్తేషాం కుత స్తేషాం పరాభవః ।
యేషా మిందీవరశ్యామో హృదయే సుప్రతిష్ఠితః ॥ 3

మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥ 4

కాయేన వాచా మనసేంద్రియై ర్వా బుద్ధ్యాత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।
కరోమి యద్య త్సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి ॥ 5

★★★

# శ్రీమదాంజనేయ పరబ్రహ్మణే నమః



అంభోధేర్లంఘనేనాసురపతినగరే భూమిజాన్వేషణేన
లంకాయాం చారణేన ప్రతిభట బలవద్దైత్య విద్రావణేన ।
ప్రఖ్యాతాతిప్రభావ స్స హి మమ భవతా దాంజనేయః ప్రసన్నః
శ్రీసీతారామపాదాంబుజ మధు లహరీపానమత్తద్విరేఫః ॥

శ్రీరామాయ నమః
శ్రీరామశరణ గురుభ్యో నమః

# శ్రీమద్వాల్మీకి రామాయణము

# సుందర కాండము

## ప్రథమసర్గ

**శ్లో॥ తతో రావణనీతాయా స్సీతాయాః శత్రుకర్శనః ।**
**ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – రావణనీతాయాః – సీతాయాః – శత్రుకర్శనః – ఇయేష – పదమ్ – అన్వేష్టుం – చారణాచరితే – పథి ॥

**అన్వయక్రమము :–** తతః శత్రుకర్శనః (హనుమాన్) రావణనీతాయాః సీతాయాః పదమ్ అన్వేష్టుం చారణాచరితే పథి (గంతుమ్) ఇయేష.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, శత్రుకర్శనః = శత్రుమర్దనుడైన హనుమంతుడు, రావణనీతాయాః = రావణునిచే అపహరింపబడినట్టి, సీతాయాః = సీతాదేవియొక్క, పదం = ఉనికిని, అన్వేష్టుం = వెదకుటకై, చారణాచరితే = చారణులను దేవజాతివారిచే సంచరింపబడునట్టి, పథి = మార్గమైన ఆకాశమునందు, (గంతుమ్ = పయనించుటకు), ఇయేష = కోరెను.

**తాత్పర్యము :–** జాంబవంతుడు, తన సామర్థ్యవిశేషమును ఎఱుకపరచి తనను ప్రోత్సహించిన అనంతరము మహేంద్రపర్వతమును చేరి, శత్రుభయంకరుడైన హనుమంతుడు, సీతాదేవిని అపహరించిన రావణాసురు డామె నెందు దాచియుంచెనో వెదకి తెలుసుకొనుటకై చారణులు మున్నగు దేవగణములు సంచరించు ఆకాశమార్గమునందు పయనించి లంకను చేరగోరెను.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** కిష్కింధాకాండమునందు శ్రీరాముని పరత్వమును తెలుపునట్టి అసాధారణ కళ్యాణ గుణములు వర్ణింపబడినవి. ఈ కాండమునందు, ఆతని సర్వ సంహారకశక్తి వర్ణింపబడుచున్నది. వెనుకటికాండమున సర్వవిధముల మిత్రసంరక్షణమే కర్తవ్యమని తెలుపబడినది. ఈ కాండమునందు దూతయొక్కయు, పతివ్రతయొక్కయు, వర్తనము ఇట్లుండవలెనని ప్రతిపాదింపబడుచున్నది.

పూర్వకాండమున జగద్రక్షణకార్య తత్పరుడైన శ్రీమహావిష్ణువునకు (శ్రీరామునకు) ఆచార్యరూపమైన పురుషకారము (హనుమంతుడు) లభించినట్లు చెప్పబడెను. ఇచ్చట ఆచార్యునియొక్క కార్యము చెప్పబడుచున్నది. ఈ ప్రథమ సర్గమునందు గురువు ఉపదేశింపదగిన శిష్యుని వెదుకుట గూర్చి చెప్పబడుచున్నది.

తతః = ముద్రిక నొసంగుట యను భగవదనుజ్ఞ లభించినపిమ్మట; శత్రుకర్శనః = "గుశబ్దస్త్వంధకారస్స్యాత్, రుశబ్ద స్తన్నిరోధకః, అంధకారనిరోధిత్వాత్ గురు రిత్యభిధీయతే" అను ప్రమాణము ననుసరించి అజ్ఞానరూప శత్రునివర్తనశీలుడైన గురువు, చారణాచరితే పథి = చారయంతి ఆచారయంతి ధర్మాన్ ఇతి చారణాః; పూర్వాచార్యులు; (వారిచే) ఆచరితే = అనుసరింపబడిన; పథి = మార్గమునందు; "మహాజనో యేన గత స్స పంథాః" అను సూక్తి ననుసరించి ధర్మముల నాచరింపచేయునట్టి పూర్వాచార్యులు నడచునట్టి మార్గమున; రావణసీతాయాః = "రావయతి అసత్ప్రలాపాన్ కారయతీతి రావణః, అవివేకః ఇత్యర్థః" అనగా అసత్ప్రలాపములు గావించునట్టి అవివేకముచే స్వాధీనము చేసుకొనబడినట్టి; సీతాయాః = అనాదిభగవత్పరతంత్రుడైన జీవునియొక్క; ఇచ్చట 'సీత' యను పదమువలన అయోనిజత్వము, స్త్రీలింగముచేత పారతంత్ర్యమును చెప్పబడినది. ('స్త్రీప్రాయ మితరత్సర్వం' అనగా, భగవంతునికన్న వేరైనదంతయును స్త్రీప్రాయమే అని సాంప్రదాయము.) పదం = స్థానమును, సంసారమండలమును. లేక

"శ్లో॥ విష్ణోః కటాక్షశ్చాద్వేషః ఆభిముఖ్యం చ సాత్త్వికైః,
సంభాషణం షడేతాని త్వాచార్యప్రాప్తిహేతవః."

అని చెప్పబడిన రీతిగా, ఆచార్యప్రాప్తికి హేతువైన సాత్త్వికసంభాషణాది చిహ్నములు; లేక 'పదం' అను పదమునకు, ప్రయత్న మనియు అర్థమున్నది. కాబట్టి ఏ జీవునికి భగవత్ప్రాప్తికొరకు ప్రయత్నము గలదో వానిని; అన్వేష్టుం = వెదకి తెలుసుకొనుటకు; ఇయేష = కోరెను.

"చారణాచరితే పథి, పదమ్ అన్వేష్టుమ్, ఇయేష" = హనుమంతు డాకాశమునందు గూడ సీతమ్మ ఉనికిని వెదుకగోరెను. దీనినిబట్టి హనుమంతునకు ఆకాశమునందు గూడ స్వేచ్ఛగా తిరుగగల సామర్థ్యమును, బుద్ధిచాతుర్యమును, గలవని చెప్పబడుచున్నది. దీనిచేత శిష్యుడుండు ప్రదేశము వెదకుటయందు ఆసక్తిగల గురువుయొక్క స్వరూపము చెప్పబడుచున్నది.

ఈ శ్లోకమునకు పూర్వము పదునొకండువేల శ్లోకములు ముగిసినవి. ఈ శ్లోకము పండ్రెండవ వేయి యొక్క మొదటి శ్లోకము. ఇందు గాయత్రీమంత్రముయొక్క

పం(డెండవ అక్షరము ప్రయుక్తమైనది. అది పండితులకు విదితము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభి(ప్రాయములు

**మహేశ్వరతీర్థీయము** :– వెనుకటి కాండమున, "జగామ లంకాం మనసా మనస్వీ" అని మానసికమైన గమనమును కవి చెప్పి ప్రస్తుతము శారీరకగమనమునకు ఉద్యుక్తు డగుచున్నట్లు తెలుపుచున్నాడు. ఈ శ్లోకముయొక్క నాల్గవ అక్షరము 'వ' అనునది గాయత్రీమం(త్రముయొక్క పం(డెండవ అక్షరము.

**రామాయణశిరోమణి** :– జాంబవంతుడు హనుమను సాగరతరణమునకై (ప్రోత్సహించిన తరువాత వృత్తాంతమును కవి ఇచట చెప్పుచున్నాడు. తతః = తన పరా(క్రమమును జ్ఞాపకము చేసిన పిమ్మట.

**రామానుజీయము** :– వెనుకటి కిష్కింధాకాండముయొక్క చివరి సర్గమున చెప్పిన లంకాగమనకథనము కేవలము మానసికమైనది. ఇచ్చట చెప్పబడునది శారీరక గమనవృత్తాంతము.

**వాసుదాసస్వామి** :– ఈ కాండమునందు ఆత్మావలోకనతత్పరుడైన యోగిచర్యయు, ఆత్మ చేయు భగవదనుసంధానవిధము, ఆత్మదర్శనము గల యోగి దేహాభిమాన త్యాగమును ధ్వనితము.

ఈ కాండము 'త'కారముతో (ప్రారంభమై, 'త'కారముతోడనే ముగిసినది. ఇది 'తత్' అనుదానిని బోధించుచున్నది.

శ్లో॥ త ది త్యనభిసంధాయ ఫలం యజ్ఞతపః(క్రియాః ।
దాన(క్రియాశ్చ వివిధాః (క్రియంతే మోక్షకాంక్షిభిః ॥
– (భగవద్గీత – 17 అ. 25 శ్లో.)

తా॥ మోక్షమును గోరువారు వేరుఫలమును గోరక 'తత్' అని ఉచ్చరించి అనేకవిధములైన యజ్ఞములు, దానములు, తపః(క్రియలును చేయుచున్నారు.

సుందరకాండ పఠనమువలన భుక్తిముక్తులు కలుగును. మానవుడు దీనిని భక్తియుతముగా పఠించవలెను. అర్థము తెలియక మనస్సు రంజిల్లదు. మనసు రంజిల్లక భక్తి కుదురదు. కావున దీనిని అర్థయుతముగానే చదువవలెను.

**శ్లో॥ దుష్కరం నిష్ప్రతిద్వంద్వం చికీర్షన్ కర్మ వానరః ।**
**సముద(గశిరో(గ్రీవో గవాంపతి రి వాబభౌ ॥ 2**

**పదచ్ఛేదము** :– దుష్కరం – నిష్ప్రతిద్వంద్వం – చికీర్షన్ – కర్మ – వానరః – సముదగ్రశిరోగ్రీవః – గవాం – పతిః – ఇవ – ఆబభౌ ॥

**అన్వయక్రమము** :– వానరః దుష్కరం నిష్ప్రతిద్వంద్వం కర్మ చికీర్షన్ సముదగ్ర శిరోగ్రీవః గవాంపతిః ఇవ ఆబభౌ.

**ప్రతిపదార్థము** :– వానరః = హనుమంతుడు, దుష్కరం = కఠినమైన, కర్మ = కార్యమును, నిష్ప్రతిద్వంద్వం = ఎదురులేనిరీతిగా, చికీర్షన్ = చేయగోరుచు, సముదగ్ర శిరోగ్రీవః = మీదికి చాచిన తలయును మెడయును గల, గవాం పతిః ఇవ = ఆబోతువలె; ఆబభౌ = మిక్కిలి ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– నిష్ప్రతిద్వంద్వం – సహాయాంతర రహితముగా, లేక ప్రతిబంధక రహితముగా.

**భూషణము** :– నిష్ప్రతిద్వంద్వం – ఎదురు లేనట్టినదిగాను, అనితరసాధ్యముగాను.

**తాత్పర్యము** :– మిక్కిలి కష్టమైన పనిని, ఇతరు లెవ్వరికిని సాధ్యముగాని రీతిగా చేయబూని, సముద్రమును దాటుటకు ఉద్యుక్తుడైన హనుమంతుడు, తన పరాక్రమాతిశయముతో శిరస్సును మెడను మీదికి ఎత్తి, ఉన్నతమైన శిరస్సు మెడయును గల వృషభరాజమువలె, ప్రకాశించెను.

**శ్లో॥ అథ వైడూర్యవర్ణేషు శాద్వలేషు మహాబలః ।**
**ధీర స్సలిలకల్పేషు విచచార యథాసుఖమ్ ॥ 3**

**పదచ్ఛేదము** :– అథ – వైడూర్యవర్ణేషు – శాద్వలేషు – మహాబలః – ధీరః – సలిల కల్పేషు – విచచార – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము** :– అథ, మహాబలః, ధీరః, (సః) వైడూర్యవర్ణేషు సలిలకల్పేషు శాద్వలేషు యథాసుఖం విచచార.

**ప్రతిపదార్థము** :– అథ = అంతట, మహాబలః = మహాబలాఢ్యుడును, ధీరః = మహాధీరుడును అగు, సః = ఆ హనుమంతుడు, వైడూర్యవర్ణేషు = వైడూర్య వర్ణము కలిగినట్టియును, సలిలకల్పేషు = నీటివలె నున్నట్టియును, శాద్వలేషు = పచ్చికబయళ్ళయందు, యథాసుఖం = సుఖముగా; విచచార = సంచరించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**భూషణము** :– సలిలకల్పేషు = వైడూర్యవర్ణము కలిగి యుండుటచే అచ్చటి పచ్చికబయళ్ళు నీళ్ళవలె గోచరించెను. జలభ్రాంతిని కల్పించుట వైడూర్య రత్నమునకు సహజమైన లక్షణము.

**రామానుజీయము** :– వైడూర్యవర్ణము – ఆకుపచ్చ వర్ణముతో కూడిన శుక్లవర్ణము. ఆ శాద్వలములు సలిలములవలె కనిపించుటకు హేతువు అందలి శైత్యము, మార్దవము మొదలగు లక్షణములచేతనే.

**తాత్పర్యము** :– కడు బలవంతుడును, ధైర్యవంతుడును అగు హనుమంతుడు మరకతచ్ఛాయ కలిగి నీటివలె మెరయుచున్న అచ్చటి పచ్చికబయళ్ళయందు కొద్దికాలము స్వేచ్ఛగా ఇటునటు తిరిగెను.

**శ్లో॥ ద్విజా న్విత్రాసయన్ ధీమా నురసా పాదపాన్ హరన్ ।**
**మృగాంశ్చ సుబహూన్ నిఘ్నన్ ప్రవృద్ధ ఇవ కేసరీ ॥ 4**

**పదచ్ఛేదము** :– ద్విజాన్ – విత్రాసయన్ – ధీమాన్ – ఉరసా – పాదపాన్ – హరన్ – మృగాన్ – చ – సుబహూన్ – నిఘ్నన్ – ప్రవృద్ధః – ఇవ – కేసరీ ॥

**అన్వయక్రమము** :– ధీమాన్ (సః), ద్విజాన్ విత్రాసయన్ ఉరసా పాదపాన్ హరన్, సుబహూన్ మృగాన్ నిఘ్నన్ చ ప్రవృద్ధః కేసరీ ఇవ విచచార.

**ప్రతిపదార్థము** :– ధీమాన్ = ధీశాలియైన హనుమ; ద్విజాన్ విత్రాసయన్ = పక్షులను భయపెట్టుచు, ఉరసా = రొమ్ముతో, పాదపాన్ హరన్ = వృక్షములను కూల్చుచు, సుబహూన్ మృగాన్ = పెక్కు మృగములను, నిఘ్నన్ చ = సంహరించుచును, ప్రవృద్ధః కేసరీ ఇవ = విజృంభించిన సింహమువలె, విచచార = సంచరించెను.

**తాత్పర్యము** :– ధీశాలియైన హనుమంతుడు, అచట పక్షులను భయపెట్టుచు, తన రొమ్ముతో వృక్షములను కూల్చుచు, పెక్కు మృగములను సంహరించుచు, చెలరేగిన సింహమువలె సంచరించెను.

**శ్లో॥ నీలలోహితమాంజిష్ఠపత్రవర్ణై స్సితాసితైః ।**
**స్వభావవిహితై శ్చిత్రై ర్ధాతుభి స్సమలంకృతమ్ ॥ 5**

**శ్లో॥ కామరూపిభి రావిష్ట మభీక్ష్ణం సపరిచ్ఛదైః ।**
**యక్షకిన్నరగన్ధర్వై ర్దేవకల్పైశ్చ పన్నగైః ॥ 6**

శ్లో॥ స తస్య గిరివర్యస్య తలే నాగవరాయుతే ।
తిష్ఠన్ కపివర స్తత్ర హ్రదే నాగ ఇ వాబభౌ ॥ 7

**పదచ్ఛేదము** :- నీలలోహితమాంజిష్ఠపత్రవర్ణైః - సితాసితైః - స్వభావవిహితైః - చిత్రైః - ధాతుభిః - సమలంకృతమ్ ॥

కామరూపిభిః - ఆవిష్టం - అభీక్ష్ణం - సపరిచ్ఛదైః - యక్షకిన్నరగంధర్వైః - దేవకల్పైః - చ - పన్నగైః - సః - తస్య - గిరివర్యస్య - తలే - నాగవరాయుతే - తిష్ఠన్ - కపివరః - తత్ర - హ్రదే - నాగః - ఇవ - ఆబభౌ ॥

**అన్వయక్రమము** :- నీలలోహితమాంజిష్ఠపత్రవర్ణైః సితాసితైః స్వభావవిహితైః చిత్రైః ధాతుభిః సమలంకృతం, సపరిచ్ఛదైః కామరూపిభిః యక్షకిన్నరగంధర్వైః దేవకల్పైః పన్నగైశ్చ అభీక్ష్ణం యత్ ఆవిష్టం, నాగవరాయుతే తస్య గిరివర్యస్య తలే తిష్ఠన్ (సః) కపివరః హ్రదే నాగః ఇవ ఆబభౌ.

**ప్రతిపదార్థము** :- నీల లోహిత మాంజిష్ఠ పత్రవర్ణైః = నలుపు ఎరుపు పసుపుపచ్చ ఆకుపచ్చ రంగులు కలిగినట్టియు, సితాసితైః = తెలుపు నలుపు రంగులు కలిగినట్టియు, స్వభావవిహితైః = స్వతస్సిద్ధములైన రంగులతో ఒప్పుచున్నవియును అగు, చిత్రైః ధాతుభిః = వివిధవర్ణములు గల మణిశిలాది ధాతువులచే, సమలంకృతమ్ = అలంకరింపబడినట్టియును, సపరిచ్ఛదైః = అలంకరించుకొన్నట్టివారును, కామరూపిభిః = కామరూపులైనట్టివారును అగు, యక్షకిన్నరగంధర్వైః = యక్షులచేతను కిన్నరుల చేతను గంధర్వులచేతను, దేవకల్పైః పన్నగైః చ = దేవతలతో సమానులైన నాగులచేతను, అభీక్ష్ణం = మిక్కిలిగా (యత్ = ఏ ప్రదేశము) ఆవిష్టం = నిండియున్నదో, నాగవరాయుతే = నాగశ్రేష్ఠములతో నిండిన, తస్య గిరివరస్య తలే = ఆ గిరిరాజము యొక్క చరియపై, తిష్ఠన్ = నిలచినవాడై, (సః) కపివరః = ఆ హనుమంతుడు, హ్రదే నాగః ఇవ = మడుగునందు మదగజమువలె, ఆబభౌ = మిక్కిలి ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ఇచ్చట పర్వతమునందు తటాకసామ్యము శ్యామవర్ణముచేత మాత్రమే; 'పత్రవర్ణైః' కి బదులుగా 'పద్మవర్ణైః' అని పాఠాంతరము. 'స్వభావవిహితైః' కి బదులుగా 'స్వభావసిద్ధైః' అని పాఠాంతరము.

**తాత్పర్యము** :- నలుపు ఎరుపు పసుపుపచ్చ ఆకుపచ్చ వన్నెలు కల్గినట్టియును, చిత్రములైనట్టియు, స్వభావసిద్ధములైనట్టియు, మణిశిలాదిధాతువులచే

అలంకరింపబడినట్టియు, కామరూపులును అలంకృతులు నగు యక్షకిన్నరగంధర్వుల చేతను, దేవతలతో సమానులగు నాగులచేతను నిండినట్టి ఆ మహేంద్రగిరియొక్క చరియపై నిలచి హనుమంతుడు పెద్ద మడుగునందున్న ఏనుగువలె ప్రకాశించెను.

**శ్లో॥ స సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే ।**
**భూతేభ్య శ్చాంజలిం కృత్వా చకార గమనే మతిమ్ ॥ 8**

**పదచ్ఛేదము :–** సః – సూర్యాయ – మహేంద్రాయ – పవనాయ – స్వయంభువే – భూతేభ్యః–చ–అంజలిం – కృత్వా–చకార–గమనే–మతిమ్ ॥

**అన్వయక్రమము :–** సః సూర్యాయ మహేంద్రాయ పవనాయ స్వయంభువే భూతేభ్యః చ అంజలిం కృత్వా గమనే మతిం చకార.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమంతుడు; సూర్యాయ = సూర్యునకును, మహేంద్రాయ = దేవేంద్రునకును, పవనాయ = వాయుదేవునకును, స్వయంభువే = బ్రహ్మకును, భూతేభ్యశ్చ = భూతములకును, (అనగా పంచమహాభూతములకును) అంజలిం కృత్వా = ప్రణమిల్లి, గమనే మతిం చకార = పయనమున కుద్యుక్తు డాయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** స్వయంభువే పవనాయ = తన జ్ఞానముచే యోగిబృందమును పావనము చేయునట్టి, ప్రత్యక్తత్త్వభూతుడైన భగవంతుడైన రామునకును, ఈ స్తుతిచేత సకలవిఘ్న నివారణకొఱకై ఇష్టదేవతాప్రార్థనపూర్వకముగనే యాత్ర సలుపవలయునను సదాచారము ఇచ్చట బోధింపబడినది.

'పవన' శబ్దమునకు ఈ శ్లోకమున శ్రీరాముడనియును, మీది శ్లోకమున వాయుదేవుడనియును విశేషణభేదముచే అర్థము గ్రహించవలెను.

**తాత్పర్యము :–** అంతట హనుమంతుడు తన గురువగు సూర్యునకును, మహేంద్రునకును, వాయుదేవునకును, బ్రహ్మకును, పంచమహాభూతములకును అంజలి ఘటించి పయనమున కుద్యుక్తు డాయెను.

**శ్లో॥ అంజలిం ప్రాఙ్ముఖః కుర్వన్ పవనా యాత్మయోనయే ।**
**తతోఽభివవృధే గంతుం దక్షిణో దక్షిణాం దిశమ్ ॥ 9**

**పదచ్ఛేదము :–** అంజలిం – ప్రాఙ్ముఖః – కుర్వన్ – పవనాయ – ఆత్మయోనయే –

తతః–అభివవృధే – గంతుం–దక్షిణః – దక్షిణాం–దిశమ్ ॥

**అన్వయక్రమము** :– ప్రాఙ్ముఖః ఆత్మయోనయే పవనాయ అంజలిం కుర్వన్ తతః దక్షిణః (సః) దక్షిణాం దిశం గంతుమ్ అభివవృధే.

**ప్రతిపదార్థము** :– ప్రాఙ్ముఖః = తూర్పున కభిముఖుడై, ఆత్మయోనయే పవనాయ = తన జనకుడగు వాయుదేవునకు; అంజలిం కుర్వన్ = దోసిలి ఒగ్గినవాడై (ప్రణమిల్లుచు), తతః = పిమ్మట, దక్షిణః (సః) = సమర్థుడైన ఆ ఆంజనేయుడు, దక్షిణాం దిశం గంతుం = దక్షిణ దిక్కు మొగముగా పోవుటకు, అభివవృధే = శరీరమును పెంచుకొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– హనుమంతుడు దక్షిణ దిక్కుగనే నిలచి తన అంజలిని మాత్రము తూర్పు దిక్కునకు త్రిప్పి నమస్కరించెను.

**తాత్పర్యము** :– సమర్థుడైన హనుమ ప్రాఙ్ముఖముగా తిరిగి, తన తండ్రియైన వాయుదేవునకు ప్రణమిల్లుచు, పిమ్మట దక్షిణ దిశగా పయనింపగోరి, తన శరీరమును చక్కగా పెంచుకొనెను.

**శ్లో॥ ప్లవంగప్రవరై ర్దృష్టః ప్లవనే కృతనిశ్చయః ।**
**వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు ॥ 10**

**పదచ్ఛేదము** :– ప్లవంగప్రవరైః – దృష్టః – ప్లవనే – కృతనిశ్చయః – వవృధే – రామవృద్ధ్యర్థం – సముద్రః – ఇవ – పర్వసు ॥

**అన్వయక్రమము** :– ప్లవంగప్రవరై దృష్టః ప్లవనే కృతనిశ్చయః (సః) పర్వసు సముద్రః ఇవ రామవృద్ధ్యర్థం వవృధే.

**ప్రతిపదార్థము** :– ప్లవంగప్రవరై = వానరవీరులచే, దృష్టః = దర్శింపబడుచున్నవాడై, ప్లవనే = సముద్రలంఘనమునందు, కృతనిశ్చయః (సః) = స్థిరనిశ్చయము కల్గిన ఆ హనుమంతుడు, పర్వసు సముద్రః ఇవ = పూర్ణిమాదిపర్వములందు సముద్రమువలె, రామవృద్ధ్యర్థం = శ్రీరాముని కార్యసాధనముకొఱకు, వవృధే = శరీరమును పెంచుకొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'రామవృద్ధ్యర్థం' = రామాభ్యుదయముకొఱకు;

**భూషణము** :– 'రామవృద్ధ్యర్థం' = రాముని ప్రయోజనమునుగూర్చి;

**తాత్పర్యము** :– వానరవీరులు తనను చూచుచుండగా, సాగరమును లంఘింప నిశ్చయించినవాడై హనుమంతుడు రాముని వృద్ధిని కోరుచు పర్వకాలమునందు పొంగునట్టి సముద్రమువలె తన శరీరమును పెంచుకొనెను.

**శ్లో॥ నిష్ప్రమాణశరీరస్సన్ లిలంఘయిషు రర్ణవమ్ ।**
**బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– నిష్ప్రమాణశరీరః – సన్ – లిలంఘయిషుః – అర్ణవమ్ – బాహుభ్యాం – పీడయామాస – చరణాభ్యాం–చ–పర్వతమ్ ॥

**అన్వయక్రమము** :– అర్ణవం లిలంఘయిషుః (సః) నిష్ప్రమాణశరీరః (సన్) బాహుభ్యాం చరణాభ్యాం చ పర్వతం పీడయామాస.

**ప్రతిపదార్థము** :– అర్ణవం = సముద్రమును; లిలంఘయిషుః సః = లంఘింప కోరినట్టి ఆ హనుమ, నిష్ప్రమాణశరీరః (సన్) = అపరిమితమైన దేహము గలవాడై, బాహుభ్యాం చరణాభ్యాం చ = రెండు పాదములతోడను రెండు చేతులతోడను, పర్వతం పీడయామాస = పర్వతమును అదిమెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– 'బాహుభ్యాం' – వానరుడు కాబట్టి తన పాదములను చేతులనుగూడ లంఘనమున కుపయోగించెను.

**తాత్పర్యము** :– తన శరీరమును అపరిమితముగా పెంచి, సముద్రమును లంఘింప కోరినవాడై హనుమంతుడు తన చేతులతోను, పాదములతోను ఆ పర్వతమును బలముగా అదిమెను.

**శ్లో॥ స చచాలా ఽ చలశ్చాపి ముహూర్తం కపిపీడితః ।**
**తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్పమశాతయత్ ॥ 12**

**పదచ్ఛేదము** :– సః–చచాల – అచలః – చ – అపి – ముహూర్తం – కపిపీడితః – తరూణాం – పుష్పితాగ్రాణాం – సర్వం–పుష్పమ్–అశాతయత్ ॥

**అన్వయక్రమము** :– అచలశ్చాపి సః కపిపీడితః (సన్) ముహూర్తం చచాల; పుష్పితాగ్రాణాం తరూణాం సర్వం పుష్పమ్ అశాతయత్.

**ప్రతిపదార్థము** :– అచలశ్చ అపి = సహజముగా చలనరహితమైన దైనప్పటికిని, సః

= ఆ పర్వతము, కపిపీడితః (సన్) = హనుమంతునిచే పీడింపబడినదై, ముహూర్తం = రెండు క్షణముల కాలము, చచాల = కంపించెను. పుష్పితాగ్రాణాం తరూణాం = పూచియున్న వృక్షములయొక్క, సర్వం పుష్పం = పుష్పసమూహము నంతను, అశాతయత్ = రాల్చివేసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'అశాతయత్' – కొండయే పాదఘట్టనవల్ల పుష్పములను రాల్చెను.

**తాత్పర్యము :–** సహజముగా అచలమయ్యును ఆ పర్వతము హనుమంతునిచే పీడింపబడి అప్పుడు ముహూర్తకాలము చలించెను. పుష్పించియున్న వృక్షజాలములపై నున్న పుష్పము లన్నియును వెంటనే రాలిపోయెను.

**శ్లో॥ తేన పాదపముక్తేన పుష్పౌఘేణ సుగంధినా ।**
**సర్వత స్సంవృతశ్శైలో బభౌ పుష్పమయో యథా ॥ 13**

**పదచ్ఛేదము :–** తేన – పాదపముక్తేన – పుష్పౌఘేణ–సుగంధినా– సర్వతః – సంవృతః – శైలః – బభౌ – పుష్పమయః – యథా ॥

**అన్వయక్రమము :–** పాదపముక్తేన సుగంధినా తేన పుష్పౌఘేణ సర్వతః సంవృతః (సః) శైలః పుష్పమయో యథా బభౌ.

**ప్రతిపదార్థము :–** పాదపముక్తేన = చెట్లనుండి రాలిన, సుగంధినా = పరిమళవంతమైన, తేన పుష్పౌఘేణ = ఆ పువ్వుల సమూహముచే, సర్వతః సంవృతః = అంతటను కప్పబడియున్నట్టి, సః శైలః = ఆ మహేంద్రపర్వతము, పుష్పమయః యథా = పువ్వుల కొండవలె, బభౌ = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** చెట్లనుండి రాలిన సువాసనలు గల ఆ పూలరాశిచే నిండుగా కప్పబడినదై యా మహేంద్రగిరి ఒకానొక పుష్పపర్వతమువలె ప్రకాశించెను.

**శ్లో॥ తేన చోత్తమవీర్యేణ పీడ్యమానస్స పర్వతః ।**
**సలిలం సంప్రసుస్రావ మదం మత్త ఇవ ద్విపః ॥ 14**

**పదచ్ఛేదము :–** తేన – చ – ఉత్తమవీర్యేణ – పీడ్యమానః – సః – పర్వతః – సలిలం – సంప్రసుస్రావ – మదం – మత్తః – ఇవ – ద్విపః ॥

**అన్వయక్రమము :–** ఉత్తమవీర్యేణ తేన పీడ్యమానః సః పర్వతః మత్తద్విపః మదమ్ ఇవ సలిలం సంప్రసుస్రావ.

**ప్రతిపదార్థము :–** ఉత్తమవీర్యేణ తేన = మహావీరుడై నట్టి యా హనుమచే, పీడ్యమానః సః పర్వతః = పీడింపబడినట్టి ఆ పర్వతము, మత్తః ద్విపః = మదించినట్టి ఏనుగు, మదమ్ ఇవ = మదజలమునువలె, సలిలం సంప్రసుస్రావ = నీటిని వెడలగ్రక్కెను.

**తాత్పర్యము :–** బలాఢ్యుడైన హనుమంతునిచే పీడింపబడిన యా పర్వతము మదించిన ఏనుగు మదజలమును స్రవింపజేసినట్లు జలధారలను స్రవింపజేసెను.

**శ్లో॥ పీడ్యమానస్తు బలినా మహేంద్రస్తేన పర్వతః ।**
**రీతీ ర్నిర్వర్తయామాస కాంచనాంజనరాజతీః ॥ 15**

**పదచ్ఛేదము :–** పీడ్యమానః – తు – బలినా – మహేంద్రః – తేన – పర్వతః – రీతీః – నిర్వర్తయామాస – కాంచనాంజనరాజతీః ॥

**అన్వయక్రమము :–** బలినా తేన పీడ్యమానః మహేంద్రః పర్వతః కాంచనాంజన రాజతీః రీతీః నిర్వర్తయామాస.

**ప్రతిపదార్థము :–** బలినా తేన = మహాబలాఢ్యుడైన ఆ హనుమచే; పీడ్యమానః = పీడింపబడుచున్నదై; (సః) మహేంద్రః పర్వతః = ఆ మహేంద్రపర్వతము; కాంచనాంజనరాజతీః = బంగారము కాటుక వెండి అను వానియొక్క; రీతీః = మెరపులను; నిర్వర్తయామాస = ప్రకాశింపజేసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఆ యా రంగులు గల జలధారలను ప్రసరింపజేసెను. ఆ వర్ణములు వాటి వాటి క్రిందనున్న రాళ్ళచే కలిగెను.

**భూషణము :–** కాంచనాంజనరజతవర్ణములైన శిలలు బద్దలై వచ్చిన నీరు అట్లు వేరు వేరు రంగులతో చూపట్టెను. (రీతీః కి బదులుగా ధారాః యని పాఠాంతరము).

**తాత్పర్యము :–** బలశాలియైన హనుమ పీడింపగా ఆ పర్వతమున బంగారు రాళ్ళు, వెండి కాటుక రాళ్ళు పగిలి ఆ యా ధాతువులయొక్క వివిధవర్ణములు గల జలధారలను చిమ్ముచుండెను.

**శ్లో॥ ముమోచ చ శిలాశ్శైలో విశాలా స్సమనశ్శిలాః ।**
**మధ్యమే నార్చిషా జుష్టో ధూమరాజీ రివాఽనలః ॥ 16**

**పదచ్ఛేదము :–** ముమోచ – చ – శిలాః – శైలః – విశాలాః – సమనశ్శిలాః – మధ్యమేన – అర్చిషా – జుష్టః – ధూమరాజీః – ఇవ – అనలః ॥

**అన్వయక్రమము** :– శైలః సమనశ్శిలాః విశాలాః శిలాః మధ్యమేన అర్చిషా జుష్టః అనలః ధూమరాజీః ఇవ ముమోచ.

**ప్రతిపదార్థము** :– (సః) శైలః = (ఆ) మహేంద్రపర్వతము, సమనశ్శిలాః = మణి శిలలతో కూడినట్టి, విశాలాః శిలాః = పెద్ద పెద్ద శిలలను, మధ్యమేన అర్చిషా జుష్టః = నడుమ జ్వాలలు కలిగినట్టి, అనలః = అగ్ని, ధూమరాజీః ఇవ = ధూమ సముదాయములను వలె, ముమోచ = వెడలగ్రక్కుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**భూషణము** :– మధ్యమున గల జ్వాలయే, పొగను వెదజిమ్మును. పార్శ్వమున జ్వాల యున్నప్పుడు, ధూమము వెలువడదు.

**మహేశ్వరతీర్థులు** :– "మధ్యమేన అర్చిషా జుష్టః" అనగా మధ్యమజ్వాలతో నిండినది. మొత్తము అగ్నిజ్వాలలు ఏడు. అగ్నిదేవుడు సప్తజిహ్వుడు. కాళీ, కరాళీ, విస్ఫులింగినీ, ధూమ్రవర్ణా, విశ్వరుచిః, లోహితా, మనోజవా అను సప్తనామములు గలవి. ఇందు మధ్యమజ్వాలకు ధూమ్రవర్ణ యని పేరు.

**తాత్పర్యము** :– కాళి, కరాళి, విస్ఫులింగిని, ధూమ్రవర్ణ, విశ్వరుచి, లోహిత, మనోజవ యను సప్తనామములు గల సప్తజిహ్వలలో, నడిమిదైన ధూమ్రజ్వాలతో కూడిన అగ్నినుండి, పొగల వరుసలు బయలువెడలు నట్లు, హనుమంతుడు కదలించుటచే ఆ మహేంద్రపర్వతమునుండి, మణిశిల మున్నగు పచ్చని గైరికధాతువులు, నల్లని శిలలు బయలువెడలెను.

**శ్లో॥ గిరిణా పీడ్యమానేన పీడ్యమానాని సర్వతః ।**
**గుహావిష్టాని భూతాని వినేదుర్వికృతైః స్వరైః ॥ 17**

**పదచ్ఛేదము** :– గిరిణా – పీడ్యమానేన – పీడ్యమానాని – సర్వతః – గుహావిష్టాని – భూతాని – వినేదుః – వికృతైః – స్వరైః ॥

**అన్వయక్రమము** :– పీడ్యమానేన, (తేన) గిరిణా, సర్వతః, పీడ్యమానాని, గుహావిష్టాని, భూతాని, వికృతైః, స్వరైః, వినేదుః.

**ప్రతిపదార్థము** :– పీడ్యమానేన (తేన) గిరిణా = పీడింపబడుచున్న ఆ పర్వతముచే, సర్వతః = అన్ని మూలలయందును, పీడ్యమానాని = పీడింపబడుచున్నట్టి; గుహావిష్టాని = గుహలలోపల నున్నట్టి, భూతాని = భూతములు, వికృతైః స్వరైః = వికృతములైన ధ్వనులతో, వినేదుః = ఆక్రోశించినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'బలినా'కు బదులుగా, "హరిణా" యని పాఠాంతరము. అనగా కపివరునిచేత, "భూతాని" అను పదమునకు బదులుగా, "సత్త్వాని" అని పాఠాంతరము. అనగా ప్రాణులు అని అర్థము.

**గోవిందరాజీయము** :– 'వికృతైః' = దైన్యవ్యంజకములైనట్టి, స్వరములచే.

**తాత్పర్యము** :– ఆ పర్వతమట్లు పీడింపబడగా, అందలి గుహలలోని వివిధములైన ప్రాణులు, పంచభూతములును, బాధనొందినవై, వికృతములైన స్వరములతో, మిక్కిలిగా, ఘోషపెట్టెను.

**శ్లో॥ స మహాసత్త్వసన్నాదః శైలపీడానిమిత్తజః ।**
**పృథివీం పూరయామాస దిశశ్చోపవనాని చ ॥ 18**

**పదచ్ఛేదము** :– సః – మహాసత్త్వసన్నాదః – శైలపీడానిమిత్తజః – పృథివీం – పూరయామాస – దిశః – చ – ఉపవనాని – చ ॥

**అన్వయక్రమము** :– శైలపీడానిమిత్తజః సః మహాసత్త్వసన్నాదః, పృథివీం, దిశశ్చ, ఉపవనాని చ, పూరయామాస.

**ప్రతిపదార్థము** :– శైలపీడానిమిత్తజః = పర్వతముయొక్క పీడనమువలన జనించినట్టి, సః మహాసత్త్వసన్నాదః = ఆ మహాసత్వముల ఆక్రోశము, పృథివీం = భూమండలమును, దిశశ్చ = (సమస్త) దిక్కులను, ఉపవనాని చ = (అన్ని) ఉద్యానవనములను, పూరయామాస = నింపివైచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'మహాసత్త్వసన్నాదః' – 'మహాన్ సత్త్వసన్నాదః' అని పాఠాంతరము.

**గోవిందరాజీయము** :– మహాసత్త్వాః = మహాభూతాః

**మహేశ్వరతీర్థులు** :– మహాసత్త్వాః = మహాజంతువులు.

**తాత్పర్యము** :– ఆ పర్వతపీడనమువలన గలిగినట్టి భూతములయొక్క ఘోషము, భూమి అంతయును నిండి సకలదిక్కులయందును, ఉద్యానవనములయందును, వ్యాపించెను.

**శ్లో॥ శిరోభిః పృథుభి స్సర్పా వ్యక్తస్వస్తికలక్షణైః ।**
**వమంతః పావకం ఘోరం దదంశుర్దశనై శ్శిలాః ॥ 19**

**పదచ్ఛేదము :–** శిరోభిః – పృథుభిః – సర్పాః – వ్యక్తస్వస్తికలక్షణైః – వమంతః – పావకం – ఘోరం – దదంశుః – దశనైః – శిలాః ॥

**అన్వయక్రమము :–** సర్పాః వ్యక్తస్వస్తికలక్షణైః పృథుభిః శిరోభిః ఘోరం పావకం వమంతః, దశనైః శిలాః దదంశుః.

**ప్రతిపదార్థము :–** సర్పాః = (ఆ పర్వతమునందలి) సర్పములు, వ్యక్తస్వస్తికలక్షణైః = కనబడుచున్న స్వస్తికచిహ్నములుగల, పృథుభిః శిరోభిః = విశాలమైన పడగలచే, ఘోరం పావకం వమంతః = భీకరమైన అగ్నిని గ్రక్కుచున్నవై, దశనైః= (తమ) కోరలచే, శిలాః = (ఆ కొండలమీది) రాతిబండలను, దదంశుః = కాటు వేసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** స్వస్తికః = పడగపైనున్న నల్లని రేఖ, దదంశుః = తమ పీడచే కలిగిన కోపమువలన కరచినవని భావము.

**గోవిందరాజీయము :–** స్వస్తిక మనగా, పాము పడగపై కనబడెడి అర్ధచంద్రాకారముతో నుండు గుర్తు.

**తాత్పర్యము :–** స్వస్తికచిహ్నములతో గూడిన తమ పెద్ద పడగలతో నిప్పులను గ్రక్కుచు, సర్పములు తమ కోరలచే శిలలను గాఢముగా కరిచెను.

**శ్లో॥ తాస్తదా సవిషై ర్దష్టాః కుపితైస్తైర్మహాశిలాః ।**
**జజ్వలుః పావకోద్దీప్తాః బిభిదుశ్చ సహస్రధా ॥ 20**

**పదచ్ఛేదము :–** తాః – తదా – సవిషైః – దష్టాః – కుపితైః – తైః – మహాశిలాః – జజ్వలుః, పావకోద్దీప్తాః – బిభిదుః – చ – సహస్రధా ॥

**అన్వయక్రమము :–** సవిషైః కుపితైః తైః దష్టాః, తాః మహాశిలాః, పావకోద్దీప్తాః, జజ్వలుః; సహస్రధా బిభిదుశ్చ.

**ప్రతిపదార్థము :–** సవిషైః = విషముతో గూడినట్టియును, కుపితైః = క్రోధము నొందియున్నవియు నగు, తైః = ఆ సర్పములచే, దష్టాః = కాటు వేయబడినట్టి; తాః మహాశిలాః = ఆ పర్వతమునందలి మహాశిలలు, పావకోద్దీప్తాః = అగ్నిచే రగుల్కొల్పబడినవై, జజ్వలుః = ప్రజ్వలించినవి. సహస్రధా = వేయిముక్కలుగా,

బిభిదుశ్చ = బ్రద్దలై పోయినవి కూడను.

**తాత్పర్యము :–** ఆ విషసర్పములచే కరువబడిన ఆ శిలలు రగులుకొని మండెను. మఱియును అవి, వేయి తునకలుగా ఛిన్నము లైనవి గూడను.

**శ్లో॥ యాని చౌషధజాలాని తస్మిన్ జాతాని పర్వతే ।**
**విషఘ్నాన్యపి నాగానాం న శేకు శ్శమితుం విషమ్ ॥ 21**

**పదచ్ఛేదము :–** యాని – చ – ఔషధజాలాని – తస్మిన్ – జాతాని – పర్వతే – విషఘ్నాని – అపి – నాగానాం – న – శేకుః – శమితుం – విషమ్ ॥

**అన్వయక్రమము :–** తస్మిన్ పర్వతే జాతాని ఔషధజాలాని యాని (సంతి) (తాని) విషఘ్నాని అపి, నాగానాం విషం శమితుం న శేకుః.

**ప్రతిపదార్థము :–** తస్మిన్ పర్వతే = ఆ మహేంద్రపర్వతమునందు, జాతాని = మొలచినట్టి, యాని ఔషధజాలాని (సంతి) = ఏ యోషధుల సమూహములున్నవో (తాని = అవి) విషఘ్నాని అపి = విషసంహారకములైనప్పటికిని, నాగానాం విషం = ఆ సర్పముల విషమును, శమితుం = హరించుటకు, న శేకుః = సమర్థములు గాకపోయెను.

**తాత్పర్యము :–** ఆ కొండయందు పుట్టిన యోషధుల సమూహములలో ఎన్నియో విషసంహారకములైనవి ఉన్నప్పటికిని, అవి ఆ సర్పముల విషమును పోగొట్టలేక పోయినవి.

**శ్లో॥ భిద్యతేఽయం గిరి ర్భూతై రితి మత్వా తపస్వినః ।**
**త్రస్తా విద్యాధరా స్తస్మాదుత్పేతుః స్త్రీగణై స్సహ ॥ 22**

**పదచ్ఛేదము :–** భిద్యతే – అయం – గిరిః – భూతైః – ఇతి – మత్వా – తపస్వినః – త్రస్తాః – విద్యాధరాః – తస్మాత్ – ఉత్పేతుః – స్త్రీగణైః – సహ ॥

**అన్వయక్రమము :–** భూతైః అయం గిరిః భిద్యతే ఇతి మత్వా తపస్వినః విద్యాధరాః తస్మాత్ స్త్రీగణైః సహ ఉత్పేతుః.

**ప్రతిపదార్థము :–** భూతైః = (అచ్చటి) భూతములచే, అయం గిరిః = ఈ పర్వతము, భిద్యతే = బ్రద్దలుకొట్టబడుచున్నది, ఇతి మత్వా = అని తలంచి, తపస్వినః విద్యాధరాః = అమాయకులైన విద్యాధరులు, త్రస్తాః = భీతిని పొందినవారై; స్త్రీగణైస్సహ = తమ భార్యలతోగలసి, తస్మాత్ = ఆ పర్వతమునుండి, ఉత్పేతుః = (ఆకసమునకెగిరిపోయిరి.)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– భూతైః = బ్రహ్మరక్షః ప్రభృతి మహాభూతములచే,

**రామాయణశిరోమణి** :– భూతైః = (భువి ఉతైః వ్యాప్తైః) అనగా భూమియందుండెడి దేవవిశేషములచే.

**మహేశ్వరతీర్థులు** :– భూతైః = పృథివ్యాది పంచమహాభూతములతో, (కలసి, బద్ధలగుచున్నది.)

**తాత్పర్యము** :– భూతములచే ఈ గిరి పగులగొట్టబడుచున్నదని తలచి, విద్యాధరులు తమ భార్యలతో గూడ, ఆ పర్వతమునుండి ఆకసమున కెగసిరి.

**శ్లో॥ పానభూమిగతం హిత్వా హైమ మాసవభాజనమ్ ।**
**పాత్రాణి చ మహార్హాణి కరకాంశ్చ హిరణ్మయాన్ ॥ 23**

**శ్లో॥ లేహ్యానుచావచాన్భక్ష్యాన్ మాంసాని వివిధాని చ ।**
**ఆర్షభాణి చ చర్మాణి ఖడ్గాంశ్చ కనకత్సరూన్ ॥ 24**

**శ్లో॥ కృతకంఠగుణాః క్షీబా రక్తమాల్యానులేపనాః ।**
**రక్తాక్షాః పుష్కరాక్షాశ్చ గగనం ప్రతిపేదిరే ॥ 25**

**పదచ్ఛేదము** :– పానభూమిగతం – హిత్వా – హైమమ్ – ఆసవభాజనమ్ – పాత్రాణి – చ – మహార్హాణి – కరకాన్ – చ – హిరణ్మయాన్ ॥ లేహ్యాన్ – ఉచ్చావచాన్ – భక్ష్యాన్ – మాంసాని – వివిధాని – చ – ఆర్షభాణి – చ – చర్మాణి – ఖడ్గాన్ – చ – కనకత్సరూన్ ॥ కృతకంఠగుణాః – క్షీబాః – రక్తమాల్యానులేపనాః – రక్తాక్షాః – పుష్కరాక్షాః – చ – గగనం – ప్రతిపేదిరే ॥

**అన్వయక్రమము** :– పానభూమిగతం హైమమ్ ఆసవభాజనం, మహార్హాణి పాత్రాణి చ, హిరణ్మయాన్ కరకాంశ్చ, ఉచ్చావచాన్ లేహ్యాన్, భక్ష్యాన్, వివిధాని మాంసాని చ, ఆర్షభాణి చర్మాణి చ, కనకత్సరూన్ ఖడ్గాన్ చ హిత్వా, కృతకంఠగుణాః, క్షీబాః, రక్తమాల్యానులేపనాః, రక్తాక్షాః, పుష్కరాక్షాః చ (సంతః) గగనం, ప్రతిపేదిరే.

**ప్రతిపదార్థము** :– పానభూమిగతం = పానభూమియందున్నట్టి, హైమమ్ ఆసవభాజనం = బంగారు మద్యపాత్రను, మహార్హాణి పాత్రాణి చ = మిక్కిలి విలువైన పాత్రలను, హిరణ్మయాన్ కరకాంశ్చ = బంగారు కలశములను, ఉచ్చావచాన్ = వివిధములైన, లేహ్యాన్ = లేహ్యములను, భక్ష్యాన్ = పిండివంటలను, వివిధాని మాంసాని చ =

పలువిధములగు మాంసాహారములను, ఆర్షభాణి చర్మాణి చ = వృషభచర్మముతో నిర్మింపబడిన డాలులను, కనకత్సరూన్ ఖడ్గాం శ్చ = బంగారు పిడులుగల ఖడ్గములను, హిత్వా = విడిచిపెట్టి, కృతకంఠగుణాః = కంఠహారములను ధరించిన వారును, క్షీబాః = మత్తిల్లి యున్నవారును, రక్తమాల్యానులేపనాః = ఎఱ్ఱని గంధమును మాలికలను ధరించినవారును, రక్తాక్షాః = ఎఱ్ఱని కన్నులు గలవారును, పుష్కరాక్షాః చ = తామర పుష్పములవలె, విశాలమైన నేత్రములు కలిగియున్నవారు నగు విద్యాధరులు, గగనం ప్రతిపేదిరే = ఆకసమును చేరుకొనిరి.

**విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు**

**రామాయణశిరోమణి** :– కృతకంఠగుణాః = వెల్లడించిన కంఠస్వరము గలవారును.

**తాత్పర్యము** :– ఆ విద్యాధరులు, పానశాలయందలి స్వర్ణ పాత్రలను, మిక్కిలి విలువైన ఇతర పాత్రలను, వివిధములైన లేహ్యములను, భక్ష్యములను, మాంసములనేగాక, తమ డాలులను, బంగారు పిడులుగల ఖడ్గములను ఎక్కడివి అక్కడ విడిచిపెట్టి, మంచి కంఠహారములను, ఎఱ్ఱని గంధమాల్యాదులను ధరించి యున్నట్టి వారందరును మద్యపానముచే ఎఱ్ఱబడిన విశాల నేత్రములతో మీదికి ఎగసి ఆకాశమును చేరుకొనిరి.

**శ్లో॥ హారనూపుర కేయూర పారిహార్యధరా స్త్రియః ।**
**విస్మితా స్సస్మితాస్తస్థు రాకాశే రమణై స్సహ ॥ 26**

**పదచ్ఛేదము** :– హారనూపురకేయూరపారిహార్యధరాః – స్త్రియః – విస్మితాః – సస్మితాః – తస్థుః – ఆకాశే – రమణైః – సహ ॥

**అన్వయక్రమము** :– హారనూపుర కేయూర పారిహార్యధరాః స్త్రియః రమణై స్సహ ఆకాశే విస్మితాః సస్మితాః తస్థుః.

**ప్రతిపదార్థము** :– హార = హారములను, నూపుర = అందెలను, కేయూర = (అంగదములను) భుజకీర్తులను, పారిహార్య = కంకణములను, ధరాః = ధరించి యున్నట్టి, స్త్రియః = విద్యాధరస్త్రీలు, రమణైస్సహ = తమ ప్రియులతోగూడి, ఆకాశే = గగనమునందు, విస్మితాః = విస్మయము నొందుచున్నవారును, సస్మితాః = చిరునవ్వుతో గూడినవారు నగుచు, తస్థుః = నిలచియుండిరి.

**తాత్పర్యము** :– కంఠహారములను, అందెలను, భుజకీర్తులను, మురుగులను ధరించిన విద్యాధరవనితలు, విస్మయము నొంది, చిరునగవుగల మోముతో, తమ భర్తలతో గలసి, ఆకాశమున నిలిచిరి.

శ్లో॥ దర్శయంతో మహావిద్యాం విద్యాధరమహర్షయః ।
సహితా స్తస్థురాకాశే వీక్షాంచక్రుశ్చ పర్వతమ్ ॥ 27

**పదచ్ఛేదము :–** దర్శయంతః – మహావిద్యాం – విద్యాధరమహర్షయః – సహితాః – తస్థుః – ఆకాశే – వీక్షాంచక్రుః – చ – పర్వతమ్ ॥

**అన్వయక్రమము :–** విద్యాధరమహర్షయః మహావిద్యాం దర్శయంతః ఆకాశే, సహితాః తస్థుః పర్వతం వీక్షాంచక్రుశ్చ.

**ప్రతిపదార్థము :–** విద్యాధర మహర్షయః = మహాఋషుల వంటి యా విద్యాధరులు, మహావిద్యాం = అణిమాది యోగవిద్యను, దర్శయంతః = ప్రదర్శించు చున్నవారై, సహితాః = తామెల్లరును గలసి, ఆకాశే తస్థుః = ఆకాశమునందు నిలచిపోయిరి, పర్వతం = ఆ మహేంద్రపర్వతమును, వీక్షాంచక్రుశ్చ = వింతగా చూచుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** మహావిద్యాం = నిరవలంబన స్థితి రూపమైన స్వశక్తిని.

**గోవిందరాజీయము :–** మహావిద్యాం = అణిమాది అష్ట మహాసిద్ధి రూపమైన విద్యను.

**తాత్పర్యము :–** ఆ విద్యాధరులు, తమ యోగవిద్యను, ఉపయోగించి ఆకసమునం దొక చోటకు చేరి, యా పర్వతమును తిలకించు చుండిరి.

శ్లో॥ శుశ్రువుశ్చ తదా శబ్దమృషీణాం భావితాత్మనామ్ ।
చారణానాం చ సిద్ధానాం స్థితానాం విమలేఽమ్బరే ॥ 28

**పదచ్ఛేదము :–** శుశ్రువుః – చ – తదా–శబ్దం–ఋషీణాం– భావితాత్మనామ్– చారణానాం – చ – సిద్ధానాం – స్థితానాం – విమలే – అంబరే ॥

**అన్వయక్రమము :–** విమలే అంబరే స్థితానాం భావితాత్మనామ్ ఋషీణాం చారణానాం సిద్ధానాం చ శబ్దమ్ శుశ్రువుః.

**ప్రతిపదార్థము :–** విమలే అంబరే = నిర్మలమైన ఆకాశమునందు, స్థితానాం = ఉన్నట్టి, భావితాత్మనామ్ ఋషీణాం = ఆత్మ జ్ఞాన సంపన్నులగు మహర్షుల యొక్కయు, చారణానాం = చారణుల యొక్కయు, సిద్ధానాం = సిద్ధుల యొక్కయు, శబ్దం = పలుకులను, తదా = అప్పుడు, శుశ్రువుః చ = వినిరి(కూడను)

**తాత్పర్యము :–** నిర్మలమైన ఆకాశమునం దుండి, ఆత్మనిష్ఠాపరులైన మునులయొక్కయు, సిద్ధుల యొక్కయు, చారణుల యొక్కయు, వచనములను ఈ రీతిగ వినియుండిరి.

**శ్లో॥ ఏష పర్వతసంకాశో హనుమాన్ మారుతాత్మజః ।**
**తితీర్షతి మహావేగః సముద్రం మకరాలయమ్ ॥ 29**

**పదచ్ఛేదము :–** ఏషః – పర్వతసంకాశః – హనుమాన్ – మారుతాత్మజః – తితీర్షతి – మహావేగః – సముద్రం – మకరాలయమ్ ॥

**అన్వయక్రమము :–** మహావేగః మారుతాత్మజః పర్వతసంకాశః ఏషః హనుమాన్ మకరాలయం సముద్రం తితీర్షతి.

**ప్రతిపదార్థము :–** మహావేగః = అమితమైన వేగము గల వాడును, మారుతాత్మజః = వాయుదేవుని పుత్రుడును, పర్వతసంకాశః = పర్వతమును బోలియున్న వాడును అగు, ఏషః హనుమాన్ = ఈ హనుమంతుడు, మకరాలయం సముద్రం = జల జంతువులచే భీకరమైన సాగరమును, తితీర్షతి = లంఘింప గోరుచున్నాడు.

**తాత్పర్యము :–** పర్వతమువంటి మేనుగల, ఈ వాయునందనుడు, మహావేగముతో, మకరములచే భీకరమైయున్న, యా సాగరమును దాట గోరుచున్నాడు.

**శ్లో॥ రామార్థం వానరార్థం చ చికీర్షన్ కర్మ దుష్కరమ్ ।**
**సముద్రస్య పరం పారం దుష్ప్రాపం ప్రాప్తుమిచ్ఛతి ॥ 30**

**పదచ్ఛేదము :–** రామార్థం – వానరార్థం – చ – చికీర్షన్ – కర్మ – దుష్కరమ్ – సముద్రస్య – పరం – పారం – దుష్ప్రాపం – ప్రాప్తుమ్ – ఇచ్ఛతి ॥

**అన్వయక్రమము :–** రామార్థం వానరార్థం చ దుష్కరమ్ కర్మ చికీర్షన్, సముద్రస్య దుష్ప్రాపం పరం పారం ప్రాప్తుమ్ ఇచ్ఛతి.

**ప్రతిపదార్థము :–** రామార్థం = శ్రీరాముని కొఱకును, వానరార్థం చ = వానరుల కొరకును, దుష్కరం కర్మ = కఠినమైన కార్యమును, చికీర్షన్ = చేయగోరినవాడై, దుష్ప్రాపం = చేరుటకు కష్టమైన, సముద్రస్య పరం పారం = సముద్రముయొక్క ఆవలియొడ్డును, ప్రాప్తుమ్ ఇచ్ఛతి = చేర గోరుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** వానరార్థం = రామకార్యమునందు వానరులు అత్యాసక్తులై యుండుటచే, సముద్రలంఘనము వానరులకు సంతోషము కలిగించునదే యని భావము.

**తాత్పర్యము :–** పరుల కసాధ్యమైన, ఈ దుష్కర కార్యమును చేయబూని శ్రీరాముని

కొఱకును, వానరుల కొఱకును, ఈతడు సముద్రము యొక్క ఆవలి యొడ్డునకు చేరగోరుచున్నాడు.

**శ్లో॥ ఇతి విద్యాధరాశ్శ్రుత్వా వచస్తేషాం మహాత్మనామ్ ।**
**తమప్రమేయం దదృశుః పర్వతే వానరర్షభమ్ ॥ 31**

**పదచ్ఛేదము :–** ఇతి – విద్యాధరాః – శ్రుత్వా – వచః – తేషాం – మహాత్మనామ్ – తమ్ – అప్రమేయం – దదృశుః – పర్వతే – వానరర్షభమ్ ॥

**అన్వయక్రమము :–** ఇతి తేషాం మహాత్మనాం వచః శ్రుత్వా, విద్యాధరాః పర్వతే తమ్ అప్రమేయం వానరర్షభమ్ దదృశుః.

**ప్రతిపదార్థము :–** ఇతి = ఈ విధముగా (పలికిన), తేషాం మహాత్మనాం = ఆ మహాత్ములయొక్క, వచః = వచనము(ల)ను, శ్రుత్వా = విని, విద్యాధరాః = ఆ విద్యాధరులు, పర్వతే = ఆ పర్వతమునందు, అప్రమేయం = అపరిమిత శరీరము కలిగినట్టి, తం వానరర్షభమ్ = ఆ వానరశ్రేష్ఠుని, దదృశుః = చూచిరి.

**తాత్పర్యము :–** ఆ మహాత్ములు పలికిన వచనములను విని, విద్యాధరులు, ఆ పర్వతముపై మహాకాయుడైన హనుమంతుని గాంచిరి.

**శ్లో॥ దుధువే చ స రోమాణి చకంపే చాచలోపమః ।**
**ననాద సుమహానాదం సుమహానివ తోయదః ॥ 32**

**పదచ్ఛేదము :–** దుధువే – చ – సః – రోమాణి – చకంపే – చ – అచలోపమః – ననాద – సుమహానాదం – సుమహాన్ – ఇవ – తోయదః ॥

**అన్వయక్రమము :–** సః రోమాణి దుధువే, అచలోపమః (సః) చకంపే చ. సుమహాన్ తోయదః ఇవ సుమహానాదం ననాద.

**ప్రతిపదార్థము :–** సః = హనుమంతుడు, రోమాణి = శరీరము పై గల రోమములను, దుధువే = విదిల్చెను, అచలోపమః = పర్వతమువలె నున్న యాతడు, చకంపే చ = కంపించెను. సుమహాన్ తోయదః ఇవ = గొప్పదైన మేఘమువలె, సుమహానాదం = గొప్పధ్వని కల్గునట్లుగా, ననాద (చ) = గర్జించెను కూడ.

**తాత్పర్యము :–** పర్వత సదృశుడైన యా హనుమంతుడు, అప్పుడు తన రోమములను విదిల్చెను. అటు నిటు నూగెను. గొప్పదైన మేఘమువలె, పెద్దధ్వని కలుగునట్లుగా గర్జించెను.

**శ్లో॥ ఆనుపూర్వ్యేణ వృత్తం చ లాంగూలం రోమభిశ్చితమ్ ।**
**ఉత్పతిష్యన్ విచిక్షేప పక్షిరాజ ఇవోరగమ్ ॥ 33**

**పదచ్ఛేదము** :– ఆనుపూర్వ్యేణ – వృత్తం – చ – లాంగూలం – రోమభిః – చితమ్ ఉత్పతిష్యన్ – విచిక్షేప – పక్షిరాజః – ఇవ – ఉరగమ్ ॥

**అన్వయక్రమము** :– ఉత్పతిష్యన్ సః, ఆనుపూర్వ్యేణ వృత్తం, రోమభిః చితమ్, లాంగూలం, పక్షిరాజః ఉరగమ్ ఇవ, విచిక్షేప.

**ప్రతిపదార్థము** :– ఉత్పతిష్యన్ (సః) = ఆకసమున కెగుర గోరు హనుమ , ఆను పూర్వ్యేణ = క్రమముగా, వృత్తం = వర్తులమై యున్నట్టియును, రోమభిః చితమ్ = దట్టమైన, రోమములతో కూడినదియునగు, లాంగూలం = తన తోకను, పక్షిరాజః ఉరగమ్ ఇవ = గరుత్మంతుడు సర్పమును వలె, విచిక్షేప = విదల్చెను.

**తాత్పర్యము** :– ఆ హనుమంతుడు, ఆకసమున కెగురబోవుచు రోమభరితమై, ఆవుతోక రూపముగా నున్నట్టి తన వాలమును, గరుత్మంతుడు పెద్ద సర్పమును విదల్చినట్లు విదల్చెను.

**శ్లో॥ తస్య లాంగూల మావిద్ధ మాత్తవేగస్య పృష్ఠతః ।**
**దదృశే గరుడేనేవ హ్రియమాణో మహోరగః ॥ 34**

**పదచ్ఛేదము** :– తస్య – లాంగూలమ్ – ఆవిద్ధమ్ – ఆత్తవేగస్య – పృష్ఠతః – దదృశే – గరుడేన – ఇవ – హ్రియమాణః – మహోరగః ॥

**అన్వయక్రమము** :– ఆత్తవేగస్య – తస్య – పృష్ఠతః – ఆవిద్ధం – లాంగూలం – గరుడేన హ్రియమాణః – మహోరగః – ఇవ దదృశే.

**ప్రతిపదార్థము** :– ఆత్తవేగస్య = మహావేగము కలిగియున్న, తస్య = ఆ హనుమంతుని యొక్క, పృష్ఠతః = పృష్ఠభాగమున, ఆవిద్ధం లాంగూలం = వంకరగా వ్రేలాడుచున్న అతని వాలము, గరుడేన = గరుత్మంతునిచే, హ్రియమాణః = తన్నుకొని పోబడుచున్న, మహోరగః ఇవ = పెద్ద సర్పమువలె, దదృశే = కనుపట్టెను.

**తాత్పర్యము** :– మహావేగముతో, పోవుచున్నట్టి, యాతని పృష్ఠభాగమున, వంకరగానున్న, ఆ వాలము గరుడునిచే కొనిపోబడుచున్న మహాసర్పమువలె నుండెను.

**శ్లో॥ బాహూ సంస్తంభయామాస మహాపరిఘసన్నిభౌ ।**
**ససాద చ కపిః కట్యాం చరణౌ సంచుకోచ చ ॥ 35**

**పదచ్ఛేదము :–** బాహూ – సంస్తంభయామాస – మహాపరిఘసన్నిభౌ – ససాద – చ – కపిః – కట్యాం – చరణౌ – సంచుకోచ – చ ॥

**అన్వయక్రమము :–** కపిః మహాపరిఘసన్నిభౌ బాహూ సంస్తంభయామాస, కట్యాం ససాద చ, చరణౌ సంచుకోచ చ.

**ప్రతిపదార్థము :–** కపిః = హనుమంతుడు, మహాపరిఘసన్నిభౌ = పెద్ద ఇనుప గుదియలవలె నున్న, బాహూ = తన రెండు బాహువులను, సంస్తంభయామాస = స్తంభింప జేసెను, కట్యాం ససాద చ = నడుమును, సన్నగిల్లునట్లు చేసెను. చరణౌ సంచుకోచ చ = పాదములను ముడుచుకొనెనుకూడ.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** హనుమంతుడు తన ఱొమ్మును తలను ముందుకు చాచి, పాదములను, పృష్ఠమును సంకుచింపజేసి, లంఘన సన్నాహము చేసికొనెను.

**రామాయణశిరోమణి :–** కట్యాం ససాద చ – అతి సంకుచిత శరీరుడయ్యెను.

**తాత్పర్యము :–** పిమ్మట హనుమంతుడు తన ఇనుపగడియలవంటి బాహువులను స్తంభింపజేసి, ఊపిరిని బిగియబట్టి, తన పాదములను ముడుచు కొనెను.

**శ్లో॥ సంహృత్య చ భుజౌ శ్రీమాన్ తథైవ చ శిరోధరామ్ ।**
**తేజస్సత్త్వం తథా వీర్యమావివేశ స వీర్యవాన్ ॥ 36**

**పదచ్ఛేదము :–** సంహృత్య – చ – భుజౌ – శ్రీమాన్ – తథా – ఏవ –చ–శిరోధరామ్–తేజః–సత్త్వం–తథా–వీర్యమ్–ఆవివేశ – సః – వీర్యవాన్ ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్ వీర్యవాన్ సః, భుజౌ చ శిరోధరాం చ సంహృత్య, తేజః సత్వం తథా వీర్యం ఆవివేశ.

**ప్రతిపదార్థము :–** శ్రీమాన్ = మహాశోభావంతుడును, వీర్యవాన్ = పరాక్రమ వంతుడునగు, సః = ఆ హనుమంతుడు, భుజౌ = తన రెండు భుజములను, శిరోధరామ్ = కంఠమును, సంహృత్య = బిగియబట్టి, తేజః = గొప్ప ఉత్సాహమును, సత్త్వం = గొప్పబలమును, తథా వీర్యం = అట్లే గొప్ప పరాక్రమమును, ఆవివేశ = సమకూర్చు కొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తేజః = ఇతరులను అణచగలిగిన సామర్థ్యము, సత్త్వం = శారీరక

బలమును; వీర్యం = ఆంతర బలమును.

**రామానుజీయము :–** తేజః = శత్రువుల నెదుర్కొను సామర్థ్యము, సత్త్వం = బలమును; వీర్యం = ఆకాశాదులందు ప్రయాణము చేయు సామర్థ్యము.

**తాత్పర్యము :–** శ్రీమంతుడును వీర్యవంతుడును అగు నా హనుమంతుడు, తన భుజములను కంఠమును సంకుచింపజేసి, తనలో తేజమును సత్త్వమును వీర్యమును, అపారముగా సమకూర్చుకొనెను.

**శ్లో॥ మార్గమాలోకయన్ దూరాదూర్ధ్వం ప్రణిహితేక్షణః ।**
**రురోధ హృదయే ప్రాణానాకాశ మవలోకయన్ ॥ 37**

**పదచ్ఛేదము :–** మార్గమ్ – ఆలోకయన్ – దూరాత్ – ఊర్ధ్వం – ప్రణిహితేక్షణః – రురోధ – హృదయే – ప్రాణాన్ – ఆకాశమ్ – అవలోకయన్ ॥

**అన్వయక్రమము :–** ఊర్ధ్వం ప్రణిహితేక్షణః(సః), దూరాత్ మార్గమ్ ఆలోకయన్, ఆకాశం అవలోకయన్, హృదయే ప్రాణాన్ రురోధ.

**ప్రతిపదార్థము :–** ఊర్ధ్వం ప్రణిహితేక్షణః = మీదికి తన చూపును నిగిడించి, దూరాత్ మార్గం ఆలోకయన్ = దూరమునుండియే ముందు మార్గమును విలోకించుచు, ఆకాశమ్ అవలోకయన్ = ఆకాశమువంక జూచుచు, హృదయే ప్రాణాన్ రురోధ = తన హృదయమునందు ప్రాణవాయువును నిరోధించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** హృదయము = ప్రాణప్రతిష్ఠాస్థానము.

**రామాయణశిరోమణి :–** ఆలోకయన్ = అనగా చూచుటకని ఇచ్చట చెప్పవలెను.

**భూషణము :–** ప్రాణాన్ = ఉచ్ఛ్వాస రూపములయిన వాయువులను – ప్రాణనిరోధము వ్యోమోత్పతన సాధనమైనది.

**గోవిందరాజీయము :–** "హృదయే ప్రాణాన్ రురోధ" = ఉచ్ఛ్వాస వాయువును, హృదయమునందు నిరోధించి ఆకాశగమన సామర్థ్యమును సంపాదించెనని భావము.

**తాత్పర్యము :–** హనుమంతుడు దూరముగా ఎదురుగా నున్న దారిని చూచుచు ఊర్ధ్వముగా దృష్టిని ప్రసరింపజేసి, ఆకాశమును చూచుచు, తన హృదయమునందు ప్రాణవాయువును బిగబట్టెను.

**శ్లో॥ పద్భ్యాం దృఢమవస్థానం కృత్వా స కపికుంజరః ।**
**నికుంచ్య కర్ణౌ హనుమానుత్పతిష్యన్మహాబలః ।**
**వానరా న్వానరశ్రేష్ఠ ఇదం వచన మబ్రవీత్ ॥ 38**

**పదచ్ఛేదము** :– పద్భ్యాం – దృఢమ్ – అవస్థానం – కృత్వా – సః – కపికుంజరః – నికుంచ్య – కర్ణౌ – హనుమాన్ – ఉత్పతిష్యన్ – మహాబలః – వానరాన్ – వానరశ్రేష్ఠః – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– సః కపికుంజరః వానర శ్రేష్ఠః హనుమాన్, పద్భ్యాం దృఢమ్ అవస్థానం కృత్వా, మహాబలః, కర్ణౌ నికుంచ్య ఉత్పతిష్యన్, వానరాన్, ఇదం వచనం అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– మహాబలః=మహాబలాఢ్యుడును, వానరశ్రేష్ఠః= వానరోత్తముడునగు, సః కపికుంజరః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, పద్భ్యాం = తన రెండుపాదములతోను, దృఢమ్ అవస్థానం కృత్వా = బలముగా ఆనుకొని, కర్ణౌ నికుంచ్య = చెవులను సంకోచింపజేసి, ఉత్పతిష్యన్ = ఆకసమున కెగురబోవుచున్నవాడై, వానరాన్ = తనవారైన వానరులను గూర్చి, ఇదం వచనమ్ అబ్రవీత్ = ఈ మాటలను బలికెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు తన చరణములను పర్వతముపై దృఢముగా నిలిపి, తన రెండు చెవులను సంకోచింపజేసి మహాబలముతో ఎగురబోవుచు, అంగద జాంబవత్ ప్రముఖులతో నిట్లని పలికెను.

**శ్లో॥ యథా రాఘవనిర్ముక్తశ్శర శ్శ్వసనవిక్రమః ।**
**గచ్ఛే త్తద్వద్గమిష్యామి లంకాం రావణపాలితామ్ ॥ 39**

**పదచ్ఛేదము** :– యథా – రాఘవనిర్ముక్తః – శరః – శ్వసనవిక్రమః – గచ్ఛేత్ – తద్వత్ – గమిష్యామి – లంకాం – రావణపాలితామ్ ॥

**అన్వయక్రమము** :– యథా రాఘవనిర్ముక్తః శరః శ్వసనవిక్రమః గచ్ఛేత్, తద్వత్ రావణపాలితాం లంకాం గమిష్యామి ॥

**ప్రతిపదార్థము** :– రాఘవనిర్ముక్తః=శ్రీరామునిచే విడువబడినట్టి, శరః = బాణము, శ్వసనవిక్రమః = వాయువేగముగలదై, యథా గచ్ఛేత్ = ఏరీతిగా చొచ్చుకొని పోవునో, రావణపాలితాం లంకాం = రావణుడు పాలించు లంకను, తద్వత్ = అట్టివిధముగనే, గమిష్యామి = పోవగలను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– తద్వద్గమిష్యామి = రామబాణమువలెనే, కృతకృత్యుడనై రాగలనని సూచితము.

**రామానుజీయము** :– రాఘవశరదృష్టాంతముచే తన ప్రయత్నమునందు అవిలంబత్వము, అప్రతిహతత్వము, అమోఘత్వము మున్నగు గుణములు ఉన్నవని సూచించెను.

**తాత్పర్యము** :– వాయుతుల్యపరాక్రమము కలిగి, రఘురామనిర్ముక్తమైన బాణమెట్లు దూసికొనిపోగలదో అట్లే నేనును రావణపాలితమైన లంకకు బోయెదను.

**శ్లో॥ న హి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజామ్ ।**
**అనేనైవ హి వేగేన గమిష్యామి సురాలయమ్ ॥ 40**

**పదచ్ఛేదము** :– న – హి – ద్రక్ష్యామి – యది – తాం – లంకాయాం – జనకాత్మజామ్ – అనేన – ఏవ – హి – వేగేన – గమిష్యామి – సురాలయమ్ ॥

**అన్వయక్రమము** :– లంకాయాం తాం జనకాత్మజాం యది హి న ద్రక్ష్యామి, అనేన హి వేగేన ఏవ సురాలయం గమిష్యామి.

**ప్రతిపదార్థము** :– లంకాయాం = లంకానగరమునందు, తాం జనకాత్మజాం = ఆ సీతమ్మను, యది హి న ద్రక్ష్యామి = చూడలేక పోయినట్లయిన, అనేన హి వేగేన ఏవ = ఈ వేగము తోడనే, సురాలయం గమిష్యామి = స్వర్గలోకమునకు బోయెదను.

**తాత్పర్యము** :– ఆ లంకయందు నేను ఒక వేళ సీతమ్మను కనుగొనలేకపోయినచో, ఇదే వేగముతో నాకలోకమునకు బోయెదను.

**శ్లో॥ యది వా త్రిదివే సీతాం న ద్రక్ష్యామ్యకృతశ్రమః ।**
**బద్ధ్వా రాక్షసరాజాన మానయిష్యామి రావణమ్ ॥ 41**

**పదచ్ఛేదము** :– యది – వా – త్రిదివే – సీతాం – న – ద్రక్ష్యామి – అకృతశ్రమః – బద్ధ్వా – రాక్షసరాజానమ్ – ఆనయిష్యామి – రావణమ్ ॥

**అన్వయక్రమము** :– త్రిదివే వా సీతాం న ద్రక్ష్యామి యది అకృతశ్రమః రాక్షసరాజానం రావణం బద్ధ్వా ఆనయిష్యామి.

**ప్రతిపదార్థము** :– త్రిదివే = స్వర్గలోకమునందు, వా = ఒక వేళ, సీతాం న ద్రక్ష్యామి యది = సీతమ్మను నేను చూడలేక పోయిన యెడల, అకృతశ్రమః = శ్రమను నేను

లెక్కచేయక, రాక్షసరాజానం రావణం = రాక్షసరాజైన రావణుని, బద్ధ్వా = బంధించి, ఆనయిష్యామి = తీసికొని వచ్చెదను.

**తాత్పర్యము :–** ఒకవేళ ఆ స్వర్గమునందు గూడ మా సీతమ్మను చూడలేక పోయినచో, నేను అలసట నొందక దానవరాజైన రావణునే బంధించి తెచ్చెదను.

**శ్లో॥ సర్వథా కృతకార్యోఽహమేష్యామి సహ సీతయా ।**
**ఆనయిష్యామి వా లంకాం సముత్పాట్య సరావణామ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** సర్వథా – కృతకార్యః – అహమ్ – ఏష్యామి – సహ–సీతయా – ఆనయిష్యామి – వా – లంకాం – సముత్పాట్య – సరావణామ్ ॥

**అన్వయక్రమము :–** సర్వథా అహం కృతకార్యః సీతయా సహ ఏష్యామి. వా సరావణాం లంకాం సముత్పాట్య ఆనయిష్యామి.

**ప్రతిపదార్థము :–** సర్వథా = సర్వవిధముల, అహం = నేను, కృతకార్యః = కార్యమును సాధించినవాడనై, సీతయా సహ = సీతమ్మతో కలసి, ఏష్యామి = తిరిగి వచ్చెదను, వా = లేక, సరావణాం = రావణునితో కూడిన, లంకాం = లంకానగరమునే, సముత్పాట్య = పెల్లగించి, ఆనయిష్యామి = తీసికొని రాగలను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సముత్పాట్య = ఓషధి పర్వతమును పెల్లగించినట్లుగా నని భావము.

**తాత్పర్యము :–** ఏరీతిగా నైనను నేను తలపెట్టిన కార్యమును సాధించి సీతమ్మను తీసుకొనియే మరలివచ్చెదను. లేదా రావణసహితముగా, లంకనే పెకలించుకొని వచ్చెదను.

**శ్లో॥ ఏవ ముక్త్వా తు హనుమాన్ వానరాన్వానరోత్తమః ।**
**ఉత్పపాతాథ వేగేన వేగవా నవిచారయన్ ।**
**సుపర్ణ మివ చాత్మానం మేనే స కపికుంజరః ॥ 43**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్త్వా – తు – హనుమాన్ – వానరాన్ – వానరోత్తమః – ఉత్పపాత – అథ – వేగేన – వేగవాన్ – అవిచారయన్ – సుపర్ణమ్ – ఇవ – చ – ఆత్మానం – మేనే – సః – కపికుంజరః ॥

**అన్వయక్రమము :–** వానరోత్తమః హనుమాన్, వానరాన్ ఏవమ్ ఉక్త్వా, అథ వేగవాన్ అవిచారయన్, వేగేన ఉత్పపాత. కపికుంజరః సః, ఆత్మానం సుపర్ణ మివ చ మేనే.

**ప్రతిపదార్థము** :– వానరోత్తమః హనుమాన్ = వానరశ్రేష్ఠుడైన హనుమ, వానరాన్ ఏవమ్ ఉక్త్వా = వానరులను గూర్చి ఇట్లు పలికి, అథ = పిమ్మట, వేగవాన్ = మహావేగ సంపన్నుడై, అవిచారయన్ = ఏమియు నాలోచింపక, వేగేన ఉత్పపాత = రివ్వున పైకి ఎగసెను, కపికుంజరః సః = వానరశ్రేష్ఠుడైన యాతడు, ఆత్మానం = తనను, సుపర్ణమ్ ఇవ మేనే = గరుత్మంతునిగనే భావించుకొనెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు వానరులతో నిట్లు పలికి ఇక ఏమియు నాలోచింపక మహావేగముతో ఆకసమున కెగసెను. అప్పుడు అతడు తనను గరుత్మంతునిగనే భావించుకొనెను.

**శ్లో॥ సముత్పతతి తస్మింస్తు వేగాత్తే నగరోహిణః ।**
**సంహృత్య విటపాన్ సర్వాన్ సముత్పేతుస్సమంతతః ॥ 44**

**పదచ్ఛేదము** :– సముత్పతతి – తస్మిన్ – తు – వేగాత్ – తే – నగరోహిణః – సంహృత్య – విటపాన్ – సర్వాన్ – సముత్పేతుః – సమంతతః ॥

**అన్వయక్రమము** :– తస్మిన్ వేగాత్ సముత్పతతి, తే నగరోహిణః, సర్వాన్ విటపాన్ సంహృత్య, సమంతతః సముత్పేతుః.

**ప్రతిపదార్థము** :– తస్మిన్ = ఆ హనుమంతుడు, వేగాత్ = వేగముగా, సముత్పతతి = ఎగురుచుండగా, తే నగరోహిణః = పర్వతములందు మొలచినట్టి యా వృక్షములు, సర్వాన్ విటపాన్ = కొమ్మల నన్నింటిని, సంహృత్య = వంచుకొని, సమంతతః = అన్ని వైపులనుండియును, సముత్పేతుః = వెంబడించి ఎగిరినవి.

**తాత్పర్యము** :– మారుతి మిక్కిలి వేగముతో ఆకసమున కెగురుచుండగా, ఆ కొండమీదగల చెట్లు అన్నియును, తమ కొమ్మల నన్నింటిని వంచుకొని ఆతని వెంబడి పైకి ఎగిరినవి.

**శ్లో॥ స మత్తకోయష్టిభకాన్ పాదపాన్ పుష్పశాలినః ।**
**ఉద్వహన్నూరువేగేన జగామ విమలేఽంబరే ॥ 45**

**పదచ్ఛేదము** :– సః – మత్తకోయష్టిభకాన్ – పాదపాన్ – పుష్పశాలినః – ఉద్వహన్ – ఊరువేగేన – జగామ – విమలే – అంబరే ॥

**అన్వయక్రమము** :– సః పుష్పశాలినః మత్తకోయష్టిభకాన్ పాదపాన్ ఉద్వహన్, ఊరువేగేన విమలే అంబరే జగామ.

**ప్రతిపదార్థము** :– సః = ఆ హనుమంతుడు, పుష్పశాలినః = పుష్పములతో నిండినట్టి,

మత్తకోయష్టిభకాన్ = చీకుకొక్కెరలతో గూడినట్టి, పాదపాన్ = వృక్షములను, ఉద్వహన్ = తనతో వహించుచు, విమలే అంబరే = విమలమైన ఆకాశమునందు, ఊరువేగేన = తన యూరువులయొక్క బలముతో, జగామ = వెడలెను.

**తాత్పర్యము** :– వివిధములైన పక్షులతోడను, పుష్పములతోడను ప్రకాశించునట్టి అచ్చటి వృక్షములను హనుమ తన తొడల వేగముచే పైకి ఎగరజేయుచు ఆ నిర్మలాకాశమునందు పయనించెను.

**శ్లో॥ ఊరువేగోద్ధతా వృక్షా ముహూర్తం కపి మన్వయుః ।**
**ప్రస్థితం దీర్ఘమధ్వానం స్వబంధుమివ బాంధవాః ॥ 46**

**పదచ్ఛేదము** :– ఊరువేగోద్ధతాః – వృక్షాః – ముహూర్తం – కపిమ్ – అన్వయుః – ప్రస్థితం – దీర్ఘమ్ – అధ్వానం – స్వబంధుమ్ – ఇవ – బాంధవాః ॥

**అన్వయక్రమము** :– దీర్ఘమ్ అధ్వానం ప్రస్థితం స్వబంధుం బాంధవాః ఇవ, ఊరువేగోద్ధతాః వృక్షాః ముహూర్తం కపిమ్ అన్వయుః.

**ప్రతిపదార్థము** :– దీర్ఘమ్, అధ్వానం ప్రస్థితం = దీర్ఘ ప్రయాణమునకై బయలుదేరినట్టి, స్వబంధుం = తమ చుట్టమును, బాంధవాః ఇవ = బందుగులవలె, ఊరువేగోద్ధతాః = (ఆతని) ఊరుబలముచే పైకి ఎగసినట్టి, వృక్షాః = అచటి వృక్షములు, ముహూర్తం = ఒక ముహూర్తకాలము, కపిమ్ అన్వయుః = హనుమంతుని, వెంబడించినవి.

**తాత్పర్యము** :– దీర్ఘ ప్రయాణమునకై, బయలుదేరిన తన బంధువును వెంట నరుగుచు, సాగనంపు బంధువులవలె నాతని తొడల వేగముచే మీదికి లేచిన వృక్షములు, రెండుక్షణముల కాల మాతనిని వెంబడించి ఎగిరినవి.

**శ్లో॥ తమూరువేగోన్మథితా స్సాలాశ్చాన్యే నగోత్తమాః ।**
**అనుజగ్ముర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిమ్ ॥ 47**

**పదచ్ఛేదము** :– తమ్ – ఊరువేగోన్మథితాః – సాలాః – చ – అన్యే – నగోత్తమాః – అనుజగ్ముః – హనూమంతం – సైన్యాః – ఇవ – మహీపతిమ్ ॥

**అన్వయక్రమము** :– మహీపతిం సైన్యాః ఇవ, తం హనూమంతం ఊరువేగోన్మథితాః సాలాః, అన్యే నగోత్తమాశ్చ అనుజగ్ముః.

**ప్రతిపదార్థము** :– మహీపతిం = మహారాజును, సైన్యాః ఇవ = (అతని) సైనికులు వలె, తం హనూమంతం = ఆ (ఎగురుచున్న) హనుమను, ఊరువేగోన్మథితాః = తొడలవేగముచే పెల్లగించబడిన, సాలాః = మద్దిచెట్లును, అన్యే నగోత్తమాశ్చ =

ఇతరమైన పెద్ద పెద్ద చెట్లును, అనుజగ్ముః = (అతనిని) వెంబడించి వెళ్లెను.

**తాత్పర్యము :–** హనుమ ఊరువేగమువలన పైకి ఎగిరిన మద్దిచెట్లును మిగిలిన పెద్ద పెద్ద వృక్షములును, సైన్యము మహారాజును అనుసరించి నట్లుగా వెంబడించినవి.

**శ్లో॥ సుపుష్పితాగ్రై ర్బహుభిః పాదపైరన్వితః కపిః ।**
**హనూమా న్పర్వతాకారో బభూవాద్భుతదర్శనః ॥ 48**

**పదచ్ఛేదము :–** సుపుష్పితాగ్రైః – బహుభిః – పాదపైః – అన్వితః – కపిః – హనూమాన్ – పర్వతాకారః – బభూవ – అద్భుతదర్శనః ॥

**అన్వయక్రమము :–** బహుభిః సుపుష్పితాగ్రైః పాదపైః అన్వితః కపిః హనూమాన్ పర్వతాకారః (సన్) అద్భుతదర్శనః బభూవ.

**ప్రతిపదార్థము :–** బహుభిః = లెక్కలేనన్ని, సుపుష్పితాగ్రైః పాదపైః = చక్కగా పూచి యున్నట్టి వృక్షములతో, అన్వితః = కూడి యున్నట్టి, కపిః హనూమాన్ = ఆ హనుమంతుడు, పర్వతాకారః (సన్) = గొప్ప పర్వతమువంటి ఆకారము గలవాడై, అద్భుతదర్శనః = అద్భుతముగా కనబడుచున్నవాడు, బభూవ = అయ్యెను.

**తాత్పర్యము :–** చక్కగా పూచిన పెక్కు వృక్షములచే పరివేష్టితుడైన హనుమంతుడు, పర్వతమువంటి ఆకారముతో మహాద్భుతముగా గానవచ్చెను.

**శ్లో॥ సారవంతోఽథ యే వృక్షా న్యమజ్జన్ లవణాంభసి ।**
**భయాదివ మహేంద్రస్య పర్వతా వరుణాలయే ॥ 49**

**పదచ్ఛేదము :–** సారవంతః – అథ – యే – వృక్షాః – న్యమజ్జన్– లవణాంభసి – భయాత్ – ఇవ – మహేంద్రస్య – పర్వతాః – వరుణాలయే ॥

**అన్వయక్రమము :–** అథ, మహేంద్రస్య భయాత్, పర్వతాః వరుణాలయే ఇవ, యే సారవంతః వృక్షాః (తే) లవణాంభసి న్యమజ్జన్.

**ప్రతిపదార్థము :–** అథ = అప్పుడు, మహేంద్రస్య భయాత్ = దేవేంద్రుని భయముచే, పర్వతాః = పర్వతములు, వరుణాలయే ఇవ = సముద్రమునందువలె (పడినరీతిగా) సారవంతః యే వృక్షాః = బలమైనట్టి, ఏవృక్షములున్నవో, తే = ఆ వృక్షములు, లవణాంభసి న్యమజ్జన్ = ఆ మహాసముద్రమునందు (పడి) మునిగిపోయెను.

**తాత్పర్యము :–** ఇంద్రుని భయముచే, కొండలు సముద్రమునందు మునిగి, దాగికొన్నట్లుగా సారవంతమైన అచటి పెద్ద వృక్షములు తమ బరువుచే దూరము

పోలేక సముద్రమునందు పడిపోయినవి.

**శ్లో॥ స నానాకుసుమైః కీర్ణః కపిస్సాంకురకోరకైః ।**
**శుశుభే మేఘసంకాశః ఖద్యోతైరివ పర్వతః ॥ 50**

**పదచ్ఛేదము** :– సః – నానాకుసుమైః – కీర్ణః – కపిః – సాంకురకోరకైః – శుశుభే – మేఘసంకాశః – ఖద్యోతైః – ఇవ – పర్వతః ॥

**అన్వయక్రమము** :– సాంకురకోరకైః నానాకుసుమైః కీర్ణః, మేఘసంకాశః సః కపిః ఖద్యోతైః పర్వతః ఇవ శుశుభే.

**ప్రతిపదార్థము** :– సాంకురకోరకైః = చిగుళ్ళతోడను మొగ్గలతోడను, నానాకుసుమైః = పలువిధములగు పువ్వులతోను, కీర్ణః = వ్యాపించి యుండిన, మేఘసంకాశః = మేఘములతో సమానమైయున్న, సః కపిః = ఆ హనుమ, ఖద్యోతైః = మిణుగురు పురుగులతో, పర్వతః ఇవ = పర్వతము వలె, శుశుభే = శోభిల్లెను.

**తాత్పర్యము** :– చిగుళ్లతోను, మొగ్గలతోను, వివిధపుష్పములతోను నిండి, మేఘమువలె ప్రకాశించుచున్న ఆ హనుమంతుడు, మిణుగురు పురుగులతో రాత్రికాలమున ప్రకాశించు కొండవలె చూడ ముచ్చటగా నుండెను.

**శ్లో॥ విముక్తాస్తస్య వేగేన ముక్త్వా పుష్పాణి తే ద్రుమాః ।**
**అవశీర్యంత సలిలే నివృత్తాస్సుహృదో యథా ॥ 51**

**పదచ్ఛేదము** :– విముక్తాః – తస్య – వేగేన – ముక్త్వా – పుష్పాణి – తే – ద్రుమాః – అవశీర్యంత – సలిలే – నివృత్తాః – సుహృదః – యథా ॥

**అన్వయక్రమము** :– తస్య వేగేన విముక్తాః తే ద్రుమాః పుష్పాణి ముక్త్వా, నివృత్తాః సుహృదో యథా, సలిలే అవశీర్యంత.

**ప్రతిపదార్థము** :– తస్య వేగేన = ఆ హనుమంతుని వేగముచే, విముక్తాః = విడివడినట్టి, తే ద్రుమాః = ఆ వృక్షములు, పుష్పాణి ముక్త్వా = పువ్వులను రాల్చి, నివృత్తాః సుహృదో యథా = వెనుతిరిగి పోవుచున్న స్నేహితులవలె, సలిలే అవశీర్యంత = (ఆ సముద్ర) జలమున మునిగి పోయినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము** :– వెడలిపోవుచున్న మిత్రులను సాగనంపి తిరిగివచ్చుచు కన్నీటిని విడుచుచు శోకసాగరమున నిమగ్నులగు ఉత్తమమిత్రుల విషయము ఇచట ధ్వనించుచున్నది.

**భూషణము :–** "ఉదకాంతాత్ స్నిగ్ధో బంధుమ్ అనువ్రజేత్" అను ఆర్షవాక్యమును అనుసరించి, ఆ హనుమను చెట్లు మిత్రునివలె సాగనంపి నీటిని చేరినవి.

**తాత్పర్యము :–** ఆ చెట్లు పూవులు రాల్చుచు వెనుకకు తగ్గి సముద్రమున బడినవి. అట్టి ఆ చెట్లు దూరదేశమున కేగుచున్న మిత్రుని సాగనంపుచు నీటిపట్టువరకు వెళ్లి కన్నీరు గార్చుచు దుఃఖములో మునిగిన ఆప్తులవలె, కనిపించెను.

**శ్లో॥ లఘుత్వే నోపపన్నం తద్విచిత్రం సాగరేఽపతత్ ।**
**ద్రుమాణాం వివిధం పుష్పం కపివాయుసమీరితమ్ ॥ 52**

**పదచ్ఛేదము :–** లఘుత్వేన – ఉపపన్నం – తత్ – విచిత్రం – సాగరే – అపతత్ – ద్రుమాణాం – వివిధం – పుష్పం – కపివాయుసమీరితమ్ ॥

**అన్వయక్రమము :–** కపివాయుసమీరితం లఘుత్వేన ఉపపన్నం, ద్రుమాణాం తత్ వివిధం పుష్పం విచిత్రం సాగరే అపతత్.

**ప్రతిపదార్థము :–** కపివాయుసమీరితమ్ = హనుమయొక్క (వేగముచే కలిగిన) వాయువుచే చెదరగొట్టబడి, లఘుత్వేన ఉపపన్నం = తేలికగా నున్న, ద్రుమాణాం తత్ వివిధం పుష్పం = చెట్లయొక్క పలు విధములైనట్టి ఆ పుష్పసమూహము, విచిత్రం = విచిత్రముగా, సాగరే అపతత్ = సముద్రమున బడెను.

**తాత్పర్యము :–** ఆ చెట్లయొక్క పువ్వులు తేలికగా నుండుటవలన ఆ హనుమంతుని వేగమువలన కల్గిన గాలిచేత, చాల దూర మతనిని వెంబడించి తుదకు అవి సముద్రమున బడెను.

**శ్లో॥ తారాశత మివాకాశం ప్రబభౌ స మహార్ణవః ।**
**పుష్పౌఘే ణానుబద్ధేన నానావర్ణేన వానరః ।**
**బభౌ మేఘ ఇవాకాశే విద్యుద్గణవిభూషితః ॥ 53**

**పదచ్ఛేదము :–** తారాశతమ్ – ఇవ – ఆకాశం – ప్రబభౌ – సః – మహార్ణవః – పుష్పౌఘేణ – అనుబద్ధేన – నానావర్ణేన – వానరః – బభౌ – మేఘః – ఇవ – ఆకాశే – విద్యుద్గణవిభూషితః ॥

**అన్వయక్రమము :–** స మహార్ణవః తారాశతమ్ ఆకాశఇ ఇవ ప్రబభౌ. అనుబద్ధేన నానావర్ణేన పుష్పౌఘేణ స వానరః ఆకాశే విద్యుద్గణవిభూషితః మేఘ ఇవ బభౌ.

**ప్రతిపదార్థము :–** సః మహార్ణవః = (ఆ పువ్వులతో కూడిన) మహాసముద్రము, తారాశతమ్ ఆకాశం ఇవ = వందలకొలది నక్షత్రములతో కూడిన ఆకాశమువలె,

ప్రబభౌ = మిక్కిలి ప్రకాశించెను. అనుబద్ధేన = తనను అంటిపెట్టుకొనియున్న, నానావర్ణేణ పుష్పౌఘేణ = పలువిధములగు వర్ణములతో కూడియున్న పుష్పసమూహముతో, సః వానరః = ఆ హనుమంతుడు, ఆకాశే = ఆకాశమునందు, విద్యుద్గణవిభూషితః = మెరుపు తీగలతో ప్రకాశించుచున్న, మేఘః ఇవ = మేఘమువలె, బభౌ = విరాజిల్లెను.

**తాత్పర్యము** :– అప్పుడా సముద్రము తనపై నున్న పుష్పములతో అనేక నక్షత్రములతో గూడి యున్నట్టి ఆకాశమువలె ప్రకాశించెను. చిత్రవిచిత్ర వర్ణములుగల పుష్పములచే నిండిన దేహముగల యా హనుమంతుడు, మెరపులతో నిండిన మేఘమువలె ఆకాశమునందు ప్రకాశించుచుండెను.

**శ్లో॥ తస్య వేగసమాధూతైః పుష్పైస్తోయమదృశ్యత ।**
**తారాభి రభిరామాభి రుదితాభి రివాంబరమ్ ॥ 54**

**పదచ్ఛేదము** :– తస్య – వేగసమాధూతైః – పుష్పైః – తోయమ్ – అదృశ్యత – తారాభిః – అభిరామాభిః –ఉదితాభిః – ఇవ – అంబరమ్ ॥

**అన్వయక్రమము** :– తస్య వేగసమాధూతైః పుష్పైః తోయమ్ ఉదితాభిః అభిరామాభిః తారాభిః అంబరమ్ ఇవ, అదృశ్యత.

**ప్రతిపదార్థము** :– తస్య = ఆ హనుమంతునియొక్క, వేగసమాధూతైః = వేగముచే రాల్చబడిన, పుష్పైః = పువ్వులతో, తోయం = ఆ (సముద్ర) జలము, ఉదితాభిః = (అప్పుడే) ఉదయించినట్టి, అభిరామాభిః తారాభిః = సుందరములైన నక్షత్రములతో, అంబరమ్ ఇవ = ఆకాశమువలె, అదృశ్యత = గోచరించెను.

**తాత్పర్యము** :– ఆ చెట్లయందలి పుష్పములు, సముద్రజలమునందు రాలియుండగా ఆ జలము అప్పుడే ఉదయించి ప్రకాశించుచున్న నక్షత్రములతో విరాజిల్లుచున్న ఆకాశమువలె కనబడెను.

**శ్లో॥ తస్యాంబరగతౌ బాహూ దదృశాతే ప్రసారితౌ ।**
**పర్వతాగ్రా ద్వినిష్క్రాంతౌ పంచాస్యావివ పన్నగౌ ॥ 55**

**పదచ్ఛేదము** :– తస్య – అంబరగతౌ – బాహూ – దదృశాతే – ప్రసారితౌ – పర్వతాగ్రాత్ – వినిష్క్రాంతౌ – పంచాస్యౌ – ఇవ – పన్నగౌ ॥

**అన్వయక్రమము** :– తస్య ప్రసారితౌ అంబరగతౌ బాహూ, పర్వతాగ్రాత్ వినిష్క్రాంతౌ పంచాస్యౌ పన్నగౌ ఇవ, దదృశాతే.

**ప్రతిపదార్థము** :– తస్య = ఆ హనుమంతునియొక్క, ప్రసారితౌ = ముందునకు చాచబడినట్టి, అంబరగతౌ బాహూ = ఆకాశమునందు వ్యాపించియున్న రెండు భుజములును, పర్వతాగ్రాత్ = కొండకొననుండి, వినిష్క్రాంతౌ = వెలుపలికి వచ్చినట్టి, పంచాస్యౌ పన్నగౌ ఇవ = ఐదునోళ్ళుగల రెండు సర్పములవలె, దదృశాతే = చూపట్టినవి.

**తాత్పర్యము** :– హనుమంతుడు, పర్వతము నుండి ఎగురుచు తన చేతులను పొడవుగా చాపగా, అప్పుడా బాహువులు పర్వతము నుండి పైకిలేచిన ఐదునోరులు గల రెండు సర్పములవలె కనుపించినవి.

**శ్లో॥ పిబన్నివ బభౌ చాపి సోర్మిజాలం మహార్ణవమ్ ।**
**పిపాసురివ చాకాశం దదృశే స మహాకపిః ॥ 56**

**పదచ్ఛేదము** :– పిబన్ + ఇవ – బభౌ – చ – అపి – సోర్మిజాలం – మహార్ణవమ్ – పిపాసుః – ఇవ – చ – ఆకాశం – దదృశే – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః, సోర్మిజాలం మహార్ణవం పిబన్నివ బభౌ, ఆకాశం పిపాసుః ఇవ చ దదృశే.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ హనుమ, సోర్మిజాలం = తరంగములతోగూడిన, మహార్ణవం = ఆ మహాసముద్రమును, పిబన్నివ బభౌ = త్రాగివేయుచున్నట్లుగా, విరాజిల్లెను. (మఱియు) ఆకాశం పిపాసుః ఇవ చ = ఆకాశమును త్రాగివేయ గోరుచున్నట్లుగా గూడ, దదృశే = కాన్పించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– పిబన్నివ = హనుమ నోరు తెరుచుకొని యుండుటచే, సముద్రమును త్రాగివేయుచున్నట్లుండెనని భావము. అతడు తన ముఖమును క్రిందికి వంచి యున్నప్పు డిట్లు గాన్పించెను. తిరిగి తన ముఖమును అతడు పైకి ఎత్తినపుడు ఆకాశమునే త్రాగివేయ గోరుచున్నట్లుగా కనుపించెను.

**భూషణము** :– మహార్ణవమును, ఆకాశమును త్రాగగోరినట్లున్న దనుటచే అతని ఉద్యమముయొక్క గొప్పతనము సూచింపబడుచున్నది. వేగముచే అతడు ముందునకు వచ్చుచుండగా గడచిన సముద్రమును, ఆకాశమును హనుమచే త్రాగివేయబడినట్లుగనే యుండెనని భావము.

**తాత్పర్యము** :– హనుమంతుడు సముద్రజలమును సమీపించి పోవుచున్నపుడు

సముద్రమును త్రాగివేయుచున్నట్లుగను మీదికెగయుచు ఆకసమువైపు చూచుచుండగా, ఆకాశమునే మ్రింగబోవుచున్నట్లుగను, చూచువారికి కన్పట్టెను.

**శ్లో॥ తస్య విద్యుత్ప్రభాకారే వాయుమార్గానుసారిణః ।**
**నయనే విప్రకాశేతే పర్వతస్థావివానలౌ ॥ 57**

**పదచ్ఛేదము** :– తస్య – విద్యుత్ప్రభాకారే – వాయుమార్గానుసారిణః – నయనే – విప్రకాశేతే – పర్వతస్థౌ – ఇవ – అనలౌ ॥

**అన్వయక్రమము** :– వాయుమార్గానుసారిణః తస్య, విద్యుత్ప్రభాకారే నయనే, పర్వతస్థౌ అనలౌ ఇవ విప్రకాశేతే.

**ప్రతిపదార్థము** :– వాయుమార్గానుసారిణః = ఆకాశమునందు పయనించునట్టి, తస్య = ఆ హనుమంతునియొక్క, విద్యుత్ప్రభాకారే = మెరుపుల కాంతులను బోలినట్టి, నయనే = రెండు కన్నులను, పర్వతస్థౌ అనలౌ ఇవ = పర్వతముపైగల రెండు అగ్నులవలె, విప్రకాశేతే = ప్రకాశించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– పర్వతస్థౌ అనలౌ = రెండు దావాగ్నుల వలె నున్నవని భావము.

**తాత్పర్యము** :– అంతరిక్షమునందు ఉగ్రరూపుడై పోవుచున్న యా హనుమంతుని విద్యుల్లతలవంటి నేత్రములు, కొండపై నున్నట్టి అగ్నులవలె ప్రకాశించెను.

**శ్లో॥ పింగే పింగాక్షముఖ్యస్య బృహతీ పరిమండలే ।**
**చక్షుషీ సంప్రకాశేతే చంద్రసూర్యావివోదితౌ ॥ 58**

**పదచ్ఛేదము** :– పింగే – పింగాక్షముఖ్యస్య – బృహతీ – పరిమండలే – చక్షుషీ – సంప్రకాశేతే – చంద్రసూర్యౌ – ఇవ – ఉదితౌ ॥

**అన్వయక్రమము** :– పింగాక్షముఖ్యస్య (తస్య) బృహతీ పరిమండలే చక్షుషీ ఉదితౌ చంద్రసూర్యౌ ఇవ సంప్రకాశేతే.

**ప్రతిపదార్థము** :– పింగాక్షముఖ్యస్య తస్య = వానరశ్రేష్ఠుడైన యా హనుమంతుని యొక్క, బృహతీ = పెద్దవియును, పరిమండలే = వర్తులములును అగు, చక్షుషీ = రెండు కన్నులును, ఉదితౌ = అప్పుడే ఉదయించినట్టి, చంద్రసూర్యౌ ఇవ = చంద్రసూర్యులవలె, సంప్రకాశేతే = మిక్కిలి ప్రకాశించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– పరిమండలే = ప్రభామండలమునందు, పరివేషముతో నున్న అని, చంద్రసూర్యులకు విశేషణముగా చెప్పవచ్చును, సూర్యచంద్రు లిరువురును ఒకే పర్వతమునందు ఉదయించుటచే, పింగళవర్ణముగల మండలముతో నుండిరని భావము గ్రాహ్యము.

**భూషణము** :– చంద్రసూర్యు లిరువురును ఒకే పర్వతమునందు ఒకమా రుదయించి నట్లుండెననుట అభూతోపమాలంకారముగా ఎన్నబడును.

**తాత్పర్యము** :– వానరోత్తముడైన, యా హనుమంతునియొక్క కన్నులు గుండ్రముగా నుండి పింగళవర్ణముతో గొప్పగా వెలుగుచు, ఒకేమారు పర్వతముపై నుదయించిన సూర్యచంద్రులవలె ప్రకాశించెను.

**శ్లో॥ ముఖం నాసికయా తస్య తామ్రయా తామ్రమాబభౌ ।**
**సంధ్యయా సమభిస్పృష్టం యథా తత్సూర్యమండలమ్ ॥ 59**

**పదచ్ఛేదము** :– ముఖం – నాసికయా – తస్య – తామ్రయా – తామ్రమ్ – ఆబభౌ – సంధ్యయా – సమభిస్పృష్టం – యథా – తత్ – సూర్యమండలమ్ ॥

**అన్వయక్రమము** :– తస్య తామ్రయా నాసికయా తామ్రం ముఖం, సంధ్యయా సమభిస్పృష్టం తత్ సూర్యమండలం యథా ఆబభౌ.

**ప్రతిపదార్థము** :– తస్య = ఆ హనుమంతునియొక్క, తామ్రయా నాసికయా = ఎఱ్ఱనైన నాసికచే, తామ్రం ముఖమ్ = ఎఱ్ఱనై యున్న ముఖము, సంధ్యయా సమభిస్పృష్టం = ఎఱ్ఱని సంధ్యాకాంతిచే ఆవరింపబడిన, తత్ సూర్యమండలం యథా = ఆ సూర్యబింబమువలె, ఆబభౌ = మిక్కిలి ప్రకాశించెను.

**తాత్పర్యము** :– ఎఱ్ఱని నాసికయొక్క కాంతిచేత, ఎఱ్ఱగ నున్నట్టి ఆ హనుమంతుని ముఖము సంధ్యాకాలపు అరుణిమతో కూడిన సూర్యమండలమువలె ప్రకాశించెను.

**శ్లో॥ లాంగూలం చ సమావిద్ధం ప్లవమానస్య శోభతే ।**
**అంబరే వాయుపుత్రస్య శక్రధ్వజ ఇవోచ్ఛ్రితః ॥ 60**

**పదచ్ఛేదము** :– లాంగూలం – చ – సమావిద్ధం – ప్లవమానస్య – శోభతే – అంబరే – వాయుపుత్రస్య – శక్రధ్వజః – ఇవ – ఉచ్ఛ్రితః ॥

**అన్వయక్రమము** :– అంబరే ప్లవమానస్య వాయుపుత్రస్య సమావిద్ధం లాంగూలం,

ఉచ్ఛ్రితః శక్రధ్వజః ఇవ శోభతే.

**ప్రతిపదార్థము :–** అంబరే ప్లవమానస్య = ఆకాశమునందెగురుచున్నట్టి, వాయుపుత్రస్య = హనుమంతునియొక్క, సమావిద్ధం లాంగూలం = ఎత్తబడియున్నట్టి వాలము, ఉచ్ఛ్రితః శక్రధ్వజః ఇవ = నిలబెట్టబడిన ఇంద్రధ్వజమువలె, శోభతే = ప్రకాశించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి :–** ప్రక్కనుండి హనుమను జూచినచో పైకి ఎత్తబడి తలకు తాకునట్లు వంచబడిన తోక ఇంద్రధనుస్సువలె కనుపించును.

**తాత్పర్యము :–** సముద్రమును దాటుచున్నప్పుడు పైకి ఎత్తబడిన హనుమంతుని వాలము, నిలబెట్టిన ఇంద్రధ్వజమువలె ప్రకాశించెను.

**శ్లో॥ లాంగూలచక్రేణ మహాన్ శుక్లదంష్ట్రోఽనిలాత్మజః ।**
**వ్యరోచత మహాప్రాజ్ఞః పరివేషీవ భాస్కరః ॥ 61**

**పదచ్ఛేదము :–** లాంగూలచక్రేణ – మహాన్ – శుక్లదంష్ట్రః – అనిలాత్మజః – వ్యరోచత – మహాప్రాజ్ఞః – పరివేషీ – ఇవ – భాస్కరః ॥

**అన్వయక్రమము :–** మహాప్రాజ్ఞః శుక్లదంష్ట్రః మహాన్ అనిలాత్మజః, లాంగూలచక్రేణ పరివేషీ భాస్కరః ఇవ, వ్యరోచత.

**ప్రతిపదార్థము :–** మహాప్రాజ్ఞః = మహాప్రాజ్ఞుడైనట్టి, శుక్లదంష్ట్రః = తెల్లని కోరలతో ప్రకాశించుచున్న, మహాన్ అనిలాత్మజః = మహాత్ముడైన హనుమంతుడు, లాంగూల చక్రేణ = వర్తులాకారముతో నున్న తనయొక్క వాలముచే, పరివేషీ భాస్కరః ఇవ = పరివేషముతో కూడిన సూర్యునివలె, వ్యరోచత = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** తెల్లని కోఱలుగల మహాత్ముడైన యా హనుమంతుడు తనపై గుండ్రముగ చుట్టబడియున్న వాలముచే పరివేషముతో కూడియున్న సూర్యునివలె ప్రకాశించెను.

**శ్లో॥ స్ఫిగ్దేశేనాఽభితామ్రేణ రరాజ స మహాకపిః ।**
**మహతా దారితేనేవ గిరిః గైరికధాతునా ॥ 62**

**పదచ్ఛేదము :–** స్ఫిగ్దేశేన – అభితామ్రేణ – రరాజ – సః – మహాకపిః – మహతా – దారితేన – ఇవ – గిరిః – గైరికధాతునా ॥

**అన్వయక్రమము :–** సః మహాకపిః, అభితామ్రేణ స్ఫిగ్దేశేన దారితేన మహతా గైరిక

ధాతునా గిరిః ఇవ, రరాజ.

**ప్రతిపదార్థము :–** అభితామ్రేణ = మిక్కిలి ఎఱ్ఱనైనట్టి, స్ఫిగ్దేశేన = పృష్ఠప్రదేశముచేత, సః మహాకపిః = ఆ హనుమంతుడు, దారితేన = బ్రద్దలు కొట్టబడిన, మహతా గైరిక ధాతునా = గొప్పదైన గైరికధాతుశిలతోడ, గిరిః ఇవ = పర్వతమువలె, రరాజ = ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** స్ఫిగ్దేశేన = ఎఱ్ఱని, కటిప్రదేశముతోనని భావము.

**తాత్పర్యము :–** వానరశ్రేష్ఠుడైన యాతడు మిక్కిలి ఎఱ్ఱనైన తన వాలమూలప్రదేశముతో పగిలియున్న ఎఱ్ఱని, గైరికాది ధాతువులతో కూడిన పర్వతమువలె ప్రకాశించెను.

**శ్లో॥ తస్య వానరసింహస్య ప్లవమానస్య సాగరమ్ ।**
**కక్షాంతరగతో వాయుర్జీమూత ఇవ గర్జతి ॥ 63**

**పదచ్ఛేదము :–** తస్య – వానరసింహస్య – ప్లవమానస్య – సాగరమ్ – కక్షాంతర గతః – వాయుః – జీమూతః – ఇవ – గర్జతి ॥

**అన్వయక్రమము :–** సాగరం ప్లవమానస్య, తస్య వానరసింహస్య, కక్షాంతరగతః వాయుః జీమూతః ఇవ గర్జతి.

**ప్రతిపదార్థము :–** సాగరం ప్లవమానస్య = సముద్రమును దాటుచున్నట్టి, తస్య వానరసింహస్య = ఆ వానరశ్రేష్ఠునియొక్క, కక్షాంతరగతః = బాహుమూలముల ప్రవేశించినట్టి, వాయుః = గాలి, జీమూతః ఇవ = మహామేఘమువలె, గర్జతి = గర్జించుచున్నది.

**తాత్పర్యము :–** హనుమంతు డతివేగముతో సముద్రమును దాటుచుండగా అతని బాహుమూలములయందు ప్రవేశించిన వాయువుయొక్క శబ్దము మేఘము గర్జించినట్లుండెను.

**శ్లో॥ ఖే యథా నిపతత్యుల్కా హ్యుత్తరాంతాద్వినిస్సృతా ।**
**దృశ్యతే సానుబంధా చ తథా స కపికుంజరః ॥ 64**

**పదచ్ఛేదము :–** ఖే – యథా – నిపతతి – ఉల్కా – హి – ఉత్తరాంతాత్ – వినిస్సృతా – దృశ్యతే – సానుబంధా – చ – తథా – సః – కపికుంజరః ॥

**అన్వయక్రమము :–** ఉత్తరాంతాత్ వినిస్సృతా సానుబంధా ఉల్కా, ఖే యథా నిపతతి,

తథా సః కపికుంజరః దృశ్యతే.

**ప్రతిపదార్థము :–** ఉత్తరాంతాత్ = ఉత్తరపుకొననుండి, వినిస్సృతా = దక్షిణమునకు బయలు వెడలిన, సానుబంధా = పుచ్ఛముతో కూడిన, ఉల్కా = తోకచుక్క, ఖే = ఆకాశమునందు, యథా నిపతతి = ఎట్లు పడుచుండునో (పోవుచుండునో), తథా = ఆ రీతిగా, సః కపికుంజరః = ఆ వానరశ్రేష్ఠుడగు హనుమ (వాలయుక్తుడై), దృశ్యతే = (దక్షిణదిక్కుకు పోవుచు) కనుపించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సానుబంధా = ఇతరములగు, సూక్ష్మమగు ఉల్కలచే అనుబద్ధమై.

**రామాయణశిరోమణి :–** సానుబంధా = పుచ్ఛాకృతి తేజోవిశేషయుక్తమైనదై.

**భూషణము :–** తోకచుక్క, పుచ్ఛయుక్తమై పడును.

**రామానుజీయము :–** హనుమంతుని గమనమును ఉల్కాపాతముతో పోల్చి వర్ణించుటచే రావణునకు భావికాలమున కలుగబోవు అశుభము సూచింపబడుచున్నది.

**తాత్పర్యము :–** ఉత్తరదిక్కునుండి, దక్షిణదిక్కునకు వెడలుచున్నట్టి హనుమంతుడు రావణానర్థ సూచకముగా పొడమిన తోకచుక్కవలె ఆకసమునందు గాన్పించుచుండెను.

**శ్లో॥ పతత్పతంగసంకాశో వ్యాయతశ్శుశుభే కపిః ।**
**ప్రవృద్ధ ఇవ మాతంగః కక్ష్యయా బధ్యమానయా ॥ 65**

**పదచ్ఛేదము :–** పతత్పతంగసంకాశః – వ్యాయతః – శుశుభే – కపిః – ప్రవృద్ధః – ఇవ – మాతంగః – కక్ష్యయా – బధ్యమానయా ॥

**అన్వయక్రమము :–** బధ్యమానయా, కక్ష్యయా ప్రవృద్ధః, మాతంగః ఇవ వ్యాయతః (స) కపిః, పతత్పతంగసంకాశః (సన్) శుశుభే.

**ప్రతిపదార్థము :–** బధ్యమానయా కక్ష్యయా = నడుమునకు కట్టబడిన పటకాతో, ప్రవృద్ధః = దీర్ఘరూపముతో నున్న, మాతంగః ఇవ = మదగజమువలె, వ్యాయతః (సః) కపిః = ముందునకు సాగియున్నట్టి ఆ హనుమంతుడు, పతత్పతంగసంకాశః = ముందునకు పోవు సూర్యునితో సమానుడై, శుశుభే = విరాజిల్లెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** పతత్పతంగసంకాశః = ముందునకు పోవుచున్న సూర్యునితో సమానుడై.

కక్ష్య = ఏనుగు నడుముకు బంధించిన బంధనరజ్జువు.

**రామాయణశిరోమణి :–** ఇచ్చట హనుమంతుని లాంగూల యువకుడుగా గ్రహించవలెను (వ్యాయతః, అనుటచే), ప్రవృద్ధః = మహాకాయుడైన.

**తాత్పర్యము :–** సూర్యసదృశుడై, మహోన్నతాకారుడై ముందునకు పోవుచున్న హనుమ నడుమునకు తోలుపటకా కట్టబడియున్న, గజేంద్రమువలె ప్రకాశించుచుండెను.

**శ్లో॥ ఉపరిష్టాచ్ఛరీరేణ ఛాయయా చావగాఢయా ।**
**సాగరే మారుతావిష్టా నౌరివాసీత్తదా కపిః ॥ 66**

**పదచ్ఛేదము :–** ఉపరిష్టాత్ – శరీరేణ – ఛాయయా – చ – అవగాఢయా – సాగరే – మారుతావిష్టా – నౌః – ఇవ–ఆసీత్–తదా–కపిః ॥

**అన్వయక్రమము :–** సాగరే ఉపరిష్టాత్ శరీరేణ, అవగాఢయా ఛాయయా చ, తదా కపిః, మారుతావిష్టా నౌః ఇవ ఆసీత్.

**ప్రతిపదార్థము :–** సాగరే = సముద్రమునందు, ఉపరిష్టాత్ = పై భాగమున, శరీరేణ = తన దేహముచేత, అవగాఢయా = నీటిలో ప్రతిబింబించిన, ఛాయయా చ = తన నీడచేతను, తదా = ఆ సమయమునందు, కపిః = హనుమంతుడు, మారుతావిష్టా = గాలిచే నింపబడిన (తెరచాపగల), నౌః ఇవ = ఓడవలె, ఆసీత్ = ఉండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** వాయువశముచే, ఓడ వేగముగా పోవును. కావున నీటిపైనున్న హనుమంతుని కాయము, తెరచాపతో పోల్చబడినట్లు వర్ణింపబడినది.

**తాత్పర్యము :–** హనుమ ఆకసమునందు పయనించుచుండగా, అతని నీడ సముద్రము నందు పడియుండెను. నీటి పైభాగమున నల్లని నీడయు, ఆకసమునందు ప్రకాశవంతమైన హనుమంతుని దేహమును, మహావేగముతో ముందునకు పోవుచుండగా పెద్దగాలితో నింపబడిన తెరచాపగల పెద్ద ఓడ మహావేగముతో సముద్రముపై పోవుచున్నట్లుండెను.

**శ్లో॥ యం యం దేశం సముద్రస్య జగామ స మహాకపిః ।**
**స స తస్యోరువేగేన సోన్మాద ఇవ లక్ష్యతే ॥ 67**

**పదచ్ఛేదము :–** యం – యం – దేశం – సముద్రస్య – జగామ – సః – మహాకపిః – సః – సః – తస్య – ఊరువేగేన – సోన్మాదః – ఇవ – లక్ష్యతే ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః సముద్రస్య యం యం దేశం జగామ తస్య ఊరువేగేన సః సః (దేశః) సోన్మాదః ఇవ లక్ష్యతే.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = వానరశ్రేష్ఠుడైన యా హనుమ, సముద్రస్య = సాగరముయొక్క, యం యం దేశం = ఏయే ప్రదేశమును, జగామ = చేరెనో, సః సః (దేశః) = ఆయా ప్రదేశము, తస్య = అతనియొక్క, ఊరువేగేన = ఊరువులయొక్క వేగముచే, సోన్మాదః ఇవ = పిచ్చిఎక్కినదివలె, లక్ష్యతే = కాన్పించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సోన్మాదః = అపస్మారరోగివలె గుండ్రముగ తిరుగుట, నురుగులు గ్రక్కుట, వింతధ్వనులు చేయుట మున్నగు వికారములవల్ల.

**రామాయణశిరోమణి** :– సోన్మాదః = వెఱ్ఱి ఆనందమును పొందినదానివలె.

**తాత్పర్యము** :– హనుమంతుని గమనవేగము తగిలిన సముద్రప్రదేశమెల్లను, సుడులతోను, నురుగులతోను శబ్దములతోడను కూడినదై ఉన్మత్తుని చేష్టలతో గూడినట్లుగా వింతగా గోచరించుచుండెను.

**శ్లో॥ సాగర స్యోర్మిజాలానాముర సా శైలవర్ష్మణామ్ ।**
**అభిఘ్నంస్తు మహావేగః పుప్లువే స మహాకపిః ॥ 68**

**పదచ్ఛేదము** :– సాగరస్య – ఊర్మిజాలానామ్ – ఉరసా – శైలవర్ష్మణామ్ – అభిఘ్నన్ – తు–మహావేగః–పుప్లువే–సః–మహాకపిః ॥

**అన్వయక్రమము** :– శైలవర్ష్మణామ్ సాగరస్య ఊర్మిజాలానాం ఉరసా అభిఘ్నన్, సః మహాకపిః మహావేగః పుప్లువే.

**ప్రతిపదార్థము** :– శైలవర్ష్మణాం = పర్వతమువలె స్థూలమైనట్టి, సాగరస్య ఊర్మి జాలానాం = సముద్రముయొక్క తరంగసమూహములను, ఉరసా = తన ఱొమ్ముతో, అభిఘ్నన్ = అదుముచు, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, మహావేగః = తీవ్రమైన వేగము గలవాడై, పుప్లువే = ఎగురుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :– శైలవర్ష్మణా, ఉరసా, ఊర్మిజాలాని ఇతి పాఠాంతరమ్ – పర్వతము వలె స్థూలమైన తన ఱొమ్ముతో హనుమ సముద్రముయొక్క ఉన్నతమైన తరంగములను, క్రిందికి అణచి వేయుచుండెనని భావము.

**తాత్పర్యము** :– ఆంజనేయుడు అతివేగముగా ముందునకు పోవుచు శైలమువలె ఉన్నతములైనట్టి సాగరతరంగములను తన ఱొమ్ముచేత క్రిందకు అదిమివేయు చుండెను.

**శ్లో॥ కపివాతశ్చ బలవాన్ మేఘవాతశ్చ నిస్సృతః ।**
**సాగరం భీమనిర్ఘోషం కంపయామాసతుర్భృశమ్ ॥ 69**

**పదచ్ఛేదము** :– కపివాతః – చ–బలవాన్–మేఘవాతః–చ – నిస్సృతః – సాగరం – భీమనిర్ఘోషం – కంపయామాసతుః – భృశమ్ ॥

**అన్వయక్రమము** :– నిస్సృతః కపివాతశ్చ, బలవాన్ మేఘవాతశ్చ, భీమనిర్ఘోషం సాగరం, భృశమ్ కంపయామాసతుః.

**ప్రతిపదార్థము** :– నిస్సృతః = (అప్పుడు) బయలు వెడలిన, కపివాతశ్చ = హనుమంతుని (వేగముచే కలిగిన) వాయువును, బలవాన్ = తీవ్రమైనట్టి, మేఘవాతశ్చ = మేఘమువలన కలిగిన వాయువును, భీమనిర్ఘోషం = భీకరధ్వనులతో కూడియున్న, సాగరం = ఆ సముద్రమును, భృశమ్ = గాఢముగా, కంపయామాసతుః = కలచి వైచినవి.

**తాత్పర్యము** :– అప్పుడు హనుమవేగముచే జనించినట్టి వాయువును, మేఘ మండలమునందలి వాయువును కలిసి, భీకరమైన ధ్వనితో సాగరమును తీవ్రముగా కలచివేయుచుండెను.

**శ్లో॥ వికర్షన్నూర్మిజాలాని బృహంతి లవణాంభసి ।**
**పుప్లువే కపిశార్దూలో వికిరన్నివ రోదసీ ॥ 70**

**పదచ్ఛేదము** :– వికర్షన్ – ఊర్మిజాలాని – బృహంతి – లవణాంభసి – పుప్లువే – కపిశార్దూలః – వికిరన్ – ఇవ – రోదసీ ॥

**అన్వయక్రమము** :– లవణాంభసి, బృహంతి ఊర్మిజాలాని వికర్షన్ (సః) కపిశార్దూలః, రోదసీ వికిరన్ ఇవ, పుప్లువే.

**ప్రతిపదార్థము** :– లవణాంభసి = ఆ మహాసముద్రమున, బృహంతి ఊర్మిజాలాని = పెద్దవైన కెరటముల గుంపులను, వికర్షన్ = ప్రక్కలకు నెట్టివేయుచు, (సః) కపి శార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడు, రోదసీ = భూమి ఆకాశములను, వికిరన్ ఇవ = వేరుచేయుచున్నట్లుగా, పుప్లువే = ఎగురుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :- భూమిని, ఆకాశమును, సముద్రపు జలమునందు పడవేయుచున్నట్లుగా, హనుమంతుడు ముందునకు పోవుచుండెను.

**భూషణము** :- భూమిని, ఆకాశమును వేరుచేయుచున్నట్లుగా నుండెను.

**తాత్పర్యము** :- హనుమంతుడు సముద్రమును దాటునప్పుడు తన గొప్పతనము చూపుచు నిండుతరంగముల గుంపులను ప్రక్కలకు తోసివేయుచు, ఆకాశమునకు భూమికిని ఎల్లలు ఏర్పాటు చేయుచున్నాడో అనునట్లుండెను.

**శ్లో॥ మేరుమందరసంకాశా నుద్ధతాన్ స మహార్ణవే ।**
**అతిక్రామన్మహావేగ స్తరంగా న్గణయన్నివ ॥ 71**

**పదచ్ఛేదము** :- మేరుమందరసంకాశాన్ - ఉద్ధతాన్-సః - మహార్ణవే - అతిక్రామత్ - మహావేగః -తరంగాన్-గణయన్-ఇవ ॥

**అన్వయక్రమము** :- మహార్ణవే ఉద్ధతాన్ మేరుమందరసంకాశాన్ తరంగాన్ గణయన్నివ, మహావేగః సః అతిక్రామత్.

**ప్రతిపదార్థము** :- మహార్ణవే = ఆ మహాసముద్రమునందు, ఉద్ధతాన్ = మీదికి ఎగయుచున్న, మేరుమందరసంకాశాన్ = మేరుపర్వతముతోడను, మందర పర్వతముతోడను సమానమైన, తరంగాన్ = కెరటములను, గణయన్ ఇవ = లెక్కపెట్టుచున్నట్లుగా, మహావేగః = గొప్పవేగముకల, సః = ఆ హనుమంతుడు, అతిక్రామత్ = ముందునకు సాగిపోవు చుండెను.

**తాత్పర్యము** :- హనుమంతు డతివేగముగా సముద్రమును లంఘించుచుండగా మిక్కిలి ఎత్తుగానున్న ఆ సముద్రతరంగముల నన్నిటిని లెక్కపెట్టుచు పోవుచున్నట్లుగా కనిపించెను.

**శ్లో॥ తస్య వేగసముద్ధూతం జలం సజలదం తదా ।**
**అంబరస్థం విబభ్రాజ శారదాభ్ర మివాతతమ్ ॥ 72**

**పదచ్ఛేదము** :- తస్య - వేగసముద్ధూతం - జలం - సజలదం - తదా - అంబరస్థం - విబభ్రాజ - శారదాభ్రమ్ - ఇవ - ఆతతమ్ ॥

**అన్వయక్రమము** :- తదా తస్య వేగసముద్ధూతం సజలదం జలమ్ అంబరస్థమ్ ఆతతం, శారదాభ్రమ్ ఇవ విబభ్రాజ.

**ప్రతిపదార్థము** :– తదా = ఆ సమయమున, తస్య = ఆ హనుమంతునియొక్క, వేగ సముద్ధూతం = వేగముచే మీది కెగుర గొట్టబడిన, సజలదం జలం = మేఘములతో గూడిన జలము, అంబరస్థమ్ = ఆకాశముపై నున్నదై, ఆతతమ్ = విశాలమైనట్టి, శారదాభ్రమ్ ఇవ = శరత్కాలమందలి మేఘమువలె, విబభ్రాజ = మిక్కిలి ప్రకాశించు చుండెను.

**తాత్పర్యము** :– అప్పుడా హనుమంతుని వేగముచే మీదికి చిమ్మబడిన తెల్లనైన సముద్రజలము మేఘమండలము వరకును వ్యాపించి, అచ్చట శరత్కాలమేఘ బృందమువలె ప్రకాశించెను.

**శ్లో॥ తిమినక్రఝషాః కూర్మా దృశ్యన్తే వివృతాస్తదా ।**
**వస్త్రాపకర్షణేనేవ శరీరాణి శరీరిణామ్ ॥ 73**

**పదచ్ఛేదము** :– తిమినక్రఝషాః – కూర్మాః – దృశ్యంతే – వివృతాః – తదా – వస్త్రాపకర్షణేన – ఇవ – శరీరాణి – శరీరిణామ్ ॥

**అన్వయక్రమము** :– తదా, వివృతాః తిమినక్రఝషాః కూర్మాః, వస్త్రాపకర్షణేన శరీరిణాం శరీరాణి ఇవ దృశ్యంతే.

**ప్రతిపదార్థము** :– తదా = (నీరు తొలగింపబడియున్నట్టి) ఆ సమయమునందు, వివృతాః = వెల్లడియై యున్నట్టి, తిమినక్రఝషాః కూర్మాః = తిమింగిలములు, మొసళ్లు, చేపలు, తాబేళ్లు, శరీరిణాం = మనుష్యులయొక్క, వస్త్రాపకర్షణేన = వస్త్రములను లాగివేయుటచే (అగపడు), శరీరాణి ఇవ = (నగ్న) శరీరములవలె, దృశ్యంతే = కానవచ్చుచుండెను.

**తాత్పర్యము** :– వస్త్రమును లాగివేయుటచే, నగ్నశరీరమునందు మనుజుల అవయవములు స్పష్టముగా కానవచ్చునట్లు హనుమ వేగముచే సముద్రజలము ఛేదిల్లి (ప్రక్కలకు తొలగి) ఆకసమున కెగయగా అందలి చేపలు, మొసళ్ళు, తాబేళ్ళు స్పష్టమైన ఆకారములతో కాన్పించెను.

**శ్లో॥ ప్లవమానం సమీక్ష్యాథ భుజంగా స్సాగరాలయాః ।**
**వ్యోమ్ని తం కపిశార్దూలం సుపర్ణ ఇతి మేనిరే ॥ 74**

**పదచ్ఛేదము** :– ప్లవమానం – సమీక్ష్య – అథ – భుజంగాః – సాగరాలయాః – వ్యోమ్ని–తం–కపిశార్దూలం – సుపర్ణః–ఇతి–మేనిరే ॥

**అన్వయక్రమము** :– అథ వ్యోమ్ని ప్లవమానం తం కపిశార్దూలం సమీక్ష్య సాగరాలయాః

భుజంగాః సుపర్ణః ఇతి మేనిరే.

**ప్రతిపదార్థము** :– అథ = అప్పుడు, వ్యోమ్ని = ఆకాశమున, ప్లవమానం = ఎగురుచున్నట్టి, తం కపిశార్దూలం = ఆ హనుమంతుని, సమీక్ష్య = చూచి, సాగరాలయాః = సముద్రమునందు నివసించుచున్న, భుజంగాః = సర్పములు, సుపర్ణః ఇతి = గరుత్మంతుడేమో యని, మేనిరే = భావించినవి.

**తాత్పర్యము** :– సముద్రమునందలి సర్పములు ఆకాశమునందు మహావేగముతో బోవు హనుమంతుని విలోకించి తమపై ఎగురుచున్నది గరుత్మంతుడేమో యని భీతి చెందెను.

**శ్లో॥ దశయోజనవిస్తీర్ణా త్రింశద్యోజన మాయతా ।**
**ఛాయా వానరసింహస్య జలే చారుతరాఽభవత్ ॥ 75**

**పదచ్ఛేదము** :– దశయోజనవిస్తీర్ణా – త్రింశద్యోజనమ్ – ఆయతా – ఛాయా – వానర సింహస్య – జలే – చారుతరా – అభవత్

**అన్వయక్రమము** :– దశయోజనవిస్తీర్ణా, త్రింశద్యోజనమ్ ఆయతా, వానరసింహస్య ఛాయా, జలే చారుతరా అభవత్.

**ప్రతిపదార్థము** :– జలే = జలమునందు, దశయోజనవిస్తీర్ణా = పది యోజనములు వెడల్పుగలిగినదియును, త్రింశత్‌యోజనం ఆయతా = ముప్పదియోజనముల పొడవును గలిగినట్టి, వానరసింహస్య = హనుమంతునియొక్క, ఛాయా = నీడ, చారుతరా అభవత్ = మిక్కిలిరమణీయమైనదై యుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ఛాయాప్రమాణవర్ణనముచే హనుమంతుని శరీరప్రమాణముగూడ వర్ణింపబడినట్లయ్యెను. ఈ నీడ మధ్యాహ్నకాలమందలిదే యని చెప్పవలెను.

**రామాయణశిరోమణి** :– 'జలే' అను పదమునకు 'జవే'యని పాఠాంతరము. అందుచేత అతని వేగమునందు కూడ అతని నీడ సుందరముగా నున్నదని భావము.

**భూషణము** :– ముప్పదియోజనముల పొడవు హనుమంతునకు సహజముగనే యున్నచో, నాల్గవ అడుగు వేయకయే అతడు లంకలో చేరగలడు. మైనాకసంవాదము సురసాసంవాదము మున్నగు ఘట్టములతో విరోధముగూడ ప్రాప్తించును. బింబముకంటె ప్రతిబింబముయొక్క పొడవు ఇంత అధికముగా ఎట్లుండునని శంకింప నవసరములేదు. ఉదయకాలమునం దతని నీడ మిక్కిలి దీర్ఘముగా నుండుట సంభవమే. హనుమంతుడు సముద్రతరణమును ఉదయముననే ప్రారంభించెను.

అప్పుడు అతని నీడ దీర్ఘమై యుండును గదా.

**తాత్పర్యము :–** ఆ హనుమంతునియొక్క పది యామడల వెడల్పు, ముప్పదియామడల పొడవును గల శరీరము నీడ నీటిపై బడి మిక్కిలి సుందరముగా ప్రకాశించెను.

**శ్లో॥ శ్వేతాభ్రఘనరాజీవ వాయుపుత్రానుగామినీ ।**
**తస్య సా శుశుభే ఛాయా వితతా లవణాంభసి ॥ 76**

**పదచ్ఛేదము :–** శ్వేతాభ్రఘనరాజీ – ఇవ – వాయుపుత్రానుగామినీ – తస్య–సా–శుశుభే – ఛాయా – వితతా – లవణాంభసి ॥

**అన్వయక్రమము :–** లవణాంభసి వితతా వాయుపుత్రానుగామినీ తస్య ఛాయా శ్వేతాభ్రఘనరాజీవ శుశుభే.

**ప్రతిపదార్థము :–** లవణాంభసి = సాగరజలమునందు, వితతా = విస్తరించియున్నట్టి, వాయుపుత్రానుగామినీ = హనుమంతుని వెంబడించి పోవుచున్నట్టి, తస్య ఛాయా = అతని నీడ, శ్వేతాభ్రఘనరాజీవ = తెల్లనైన మేఘములయొక్క పెద్దవరుసవలె, శుశుభే = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** సముద్రమునందు వ్యాపించియున్నట్టి యా హనుమంతుని నీడ, అతనిని వెంబడించి పోవుచున్నదై, తెల్లనైనట్టి మేఘములయొక్క దట్టమైన పంక్తివలె ప్రకాశించెను.

**శ్లో॥ శుశుభే స మహాతేజా మహాకాయో మహాకపిః ।**
**వాయుమార్గే నిరాలంబే పక్షవానివ పర్వతః ॥ 77**

**పదచ్ఛేదము :–** శుశుభే – సః – మహాతేజాః – మహాకాయః – మహాకపిః – వాయుమార్గే – నిరాలంబే – పక్షవాన్ – ఇవ – పర్వతః ॥ ॥

**అన్వయక్రమము :–** సః మహాకాయః మహాతేజాః మహాకపిః నిరాలంబే వాయుమార్గే పక్షవాన్ పర్వతః ఇవ శుశుభే.

**ప్రతిపదార్థము :–** మహాకాయః = గొప్ప శరీరము గల్గినట్టివాడును, మహాతేజాః = అపరిమితమైన తేజస్సుగలవాడునగు, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, నిరాలంబే వాయుమార్గే = ఆధారరహితమైనట్టి ఆకాశమార్గమునందు, పక్షవాన్ పర్వతః ఇవ = రెక్కలుగల్గినట్టి కొండవలె, శుశుభే = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** గొప్ప శరీరము, గొప్ప తేజస్సు గల ఆ మారుతాత్మజుడు, నిరాధారమగు

ఆకాశమున ఎగురుచు ఱెక్కలతో గూడియున్న పర్వతమువలె శోభిల్లెను.

**శ్లో॥ యేనాసౌ యాతి బలవాన్ వేగేన కపికుంజరః ।**
**తేన మార్గేణ సహసా ద్రోణీకృత ఇవార్ణవః ॥ 78**

**పదచ్ఛేదము :–** యేన – అసౌ – యాతి – బలవాన్ – వేగేన – కపికుంజరః – తేన – మార్గేణ – సహసా – ద్రోణీకృతః – ఇవ – అర్ణవః ॥

**అన్వయక్రమము :–** అసౌ బలవాన్ కపికుంజరః వేగేన యేన మార్గేణ యాతి, తేన మార్గేణ అర్ణవః సహసా ద్రోణీకృతః ఇవ ఆసీత్.

**ప్రతిపదార్థము :–** బలవాన్ = మహాబలాఢ్యుడైన, అసౌ కపికుంజరః = ఈ హనుమ, వేగేన = మహావేగముతో, యేన మార్గేణ యాతి = ఏ మార్గమున పోవుచుండెనో, తేన మార్గేణ = ఆ మార్గమున, అర్ణవః = సముద్రము, సహసా = తత్క్షణమే, ద్రోణీకృతః ఇవ = దొన్నెగా చేయబడినదివలె, ఆసీత్ = ఉండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ద్రోణీ = ఇండ్లయందు నీరు వెడలుటకై నిర్మించబడిన కాష్ఠయంత్రము (తూము). ఆకాశమునందు ఎగురుచున్న హనుమంతుడు మేఘములను తాకుటచే, అతని ఒత్తిడికి మేఘములలో నుండు నీరు నీటి గొట్టములలో నుండి వచ్చు నీటివలె ప్రక్కకు చిమ్మబడుచుండెను.

**భూషణము :–** ద్రోణీ = కటాహము లేక గంగాళము.

**తాత్పర్యము :–** బలవంతుడైన, హనుమంతుడు వేగముగా బోవు ఆ మార్గమంతయును, దోనెవలె నడుమ భాగమున పల్లమును, ఈవలావలను ఎత్తుగా గలదై, త్రవ్వించిన కాలువవలె కానవచ్చెను.

**శ్లో॥ ఆపాతే పక్షిసంఘానాం పక్షిరాజ ఇవ వ్రజన్ ।**
**హనుమాన్ మేఘజాలాని ప్రకర్షన్ మారుతో యథా ॥ 79**

**పదచ్ఛేదము :–** ఆపాతే – పక్షిసంఘానాం – పక్షిరాజః – ఇవ – వ్రజన్ – హనుమాన్ – మేఘజాలాని – ప్రకర్షన్ – మారుతః – యథా ॥

**అన్వయక్రమము :–** పక్షిసంఘానామ్ ఆపాతే పక్షిరాజః ఇవ, మేఘజాలాని మారుతః యథా, ప్రకర్షన్ హనుమాన్ యయౌ.

**ప్రతిపదార్థము :–** పక్షిసంఘానామ్ ఆపాతే = పక్షుల సమూహముయొక్క మార్గమునందు, పక్షిరాజః ఇవ = గరుత్మంతుడువలె, మేఘజాలాని = మేఘముల గుంపులను, మారుతః యథా = వాయువువలెనే, ప్రకర్షన్ = త్రోసివేయుచు, హనుమాన్ = హనుమంతుడు, యయౌ = ముందునకు పోవుచుండెను.

**తాత్పర్యము :–** ఆకాశమార్గమున హనుమ మేఘశ్రేణిని ఒరయుచు, మేఘములను చెదరగొట్టుచు పక్షుల నడుమ గరుత్మంతునివలె ముందునకు పోవుచుండెను.

**శ్లో॥ పాండురారుణవర్ణాని నీలమాంజిష్ఠకాని చ ।**
**కపినాఽఽఽ కృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే ॥ 80**

**పదచ్ఛేదము :–** పాండురారుణవర్ణాని – నీలమాంజిష్ఠకాని – చ – కపినా – ఆకృష్యమాణాని – మహాభ్రాణి – చకాశిరే ॥

**అన్వయక్రమము :–** కపినా ఆకృష్యమాణాని మహాభ్రాణి, పాండురారుణవర్ణాని నీలమాంజిష్ఠకాని చ చకాశిరే.

**ప్రతిపదార్థము :–** కపినా = హనుమంతునిచే, ఆకృష్యమాణాని = ఆకర్షింపబడుచున్నట్టి, మహాభ్రాణి = పెద్దపెద్ద మేఘములు, పాండురారుణవర్ణాని = తెల్లని, ఎఱ్ఱని వర్ణములుగలవియు, నీలమాంజిష్ఠకాని చ = నల్లని, పచ్చని రంగులుగలవిగాను, చకాశిరే = ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఆకృష్యమాణాని = మేఘములు గాలిచే ఆకర్షింపబడినట్లుండెనని భావము.

**తాత్పర్యము :–** హనుమంతునిచే ఆకర్షింపబడినట్టి మేఘములు, అతని శరీరాభరణ విశేషములచే తెలుపు, ఎరుపు, నలుపు, పసుపు రంగులు గలవై ముచ్చటగా ప్రకాశించుచుండెను.

**శ్లో॥ ప్రవిశన్నభ్రజాలాని నిష్పతంశ్చ పునః పునః ।**
**ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ చంద్రమా ఇవ లక్ష్యతే ॥ 81**

**పదచ్ఛేదము :–** ప్రవిశన్ – అభ్రజాలాని – నిష్పతన్ –చ – పునః – పునః – ప్రచ్ఛన్నః – చ – ప్రకాశః – చ – చంద్రమాః – ఇవ – లక్ష్యతే ॥

**అన్వయక్రమము :–** పునః పునః అభ్రజాలాని ప్రవిశన్ నిష్పతన్ చ (సః హనుమాన్), ప్రచ్ఛన్నః చ ప్రకాశః చ చంద్రమాః ఇవ లక్ష్యతే.

**ప్రతిపదార్థము** :- సః హనుమాన్ = ఆ హనుమంతుడు, పునః పునః = మరల మరల, అభ్రజాలాని = మేఘముల గుంపులను, ప్రవిశన్ = ప్రవేశించుచు, నిష్పతన్ చ = వెలువడుచును, ప్రచ్ఛన్నః = మరుగుపడియున్నవాడును, ప్రకాశః చ (కనబడుచు) వెలుగుచున్నవాడును అగు, చంద్రమాః ఇవ = చంద్రునివలె, లక్ష్యతే = కానవచ్చుచుండెను.

**తాత్పర్యము** :- ఆ హనుమంతుడు మేఘశ్రేణిని ప్రవేశించుచు మరల అందుండి వెలువడుచు, కొద్దిసేపు మబ్బులచాటునను, కొద్దిసేపు ఆకసమునందును గోచరించునట్టి చంద్రునివలె గన్పట్టెను.

**శ్లో॥ ప్లవమానం తు తం దృష్ట్వా ప్లవంగం త్వరితం తదా ।**
**వవర్షుః పుష్పవర్షాణి దేవగంధర్వదానవాః ॥ 82**

**పదచ్ఛేదము** :- ప్లవమానం - తు - తం - దృష్ట్వా - ప్లవంగం - త్వరితం - తదా - వవర్షుః - పుష్పవర్షాణి - దేవగంధర్వదానవాః ॥

**అన్వయక్రమము** :- తదా త్వరితం ప్లవమానం తం ప్లవంగం దృష్ట్వా దేవ గంధర్వదానవాః పుష్పవర్షాణి వవర్షుః.

**ప్రతిపదార్థము** :- తదా = ఆ సమయమున, త్వరితం = మహావేగముగా, ప్లవమానం = ఎగిరిపోవుచున్నట్టి, తం ప్లవంగం = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, దేవగంధర్వదానవాః = దేవతలును గంధర్వులును దానవులును, పుష్పవర్షాణి వవర్షుః = పుష్పవర్షమును గురిపించిరి.

**తాత్పర్యము** :- సముద్రమును అద్భుతమైన శక్తితో, మహావేగముగా దాటుచున్న యా హనుమంతుని గాంచి, దేవగంధర్వదానవులు ఆనందాశ్చర్యములతో అతనిపై పూలవాన గురిపించిరి.

**శ్లో॥ తతాప న హి తం సూర్యః ప్లవంతం వానరోత్తమమ్ ।**
**సిషేవే చ తదా వాయూ రామకార్యార్థసిద్ధయే ॥ 83**

**పదచ్ఛేదము** :- తతాప - న-హి-తం - సూర్యః - ప్లవంతం - వానరోత్తమం - సిషేవే - చ - తదా - వాయుః - రామకార్యార్థసిద్ధయే ॥

**అన్వయక్రమము** :- రామకార్యర్థసిద్ధయే ప్లవంతం తం వానరోత్తమం, తదా సూర్యః న హి తతాప; వాయుః చ సిషేవే.

**ప్రతిపదార్థము :-** రామకార్యార్థసిద్ధయే = శ్రీరాముని కార్యమును సిద్ధింపజేయుటకై, ప్లవంతం = (ఆకాశమున) ఎగిరి పోవుచున్నట్టి, తం వానరోత్తమమ్ = ఆ వానర శ్రేష్ఠుడైన హనుమను, తదా = ఆ సమయమునందు, సూర్యః = సూర్యుడు, న హి తతాప = ఏమియు తాపము కలుగనీయకుండెను; వాయుః చ = వాయువుగూడ, సిషేవే = (శ్రమతొలగునట్లు వీచి) సేవించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** వాయుదేవుడు తన పుత్రుడైన హనుమకు శ్రమ కలుగకుండ సుఖకరముగా వీచెను అని సేవించెనను పదమునకు భావము.

**రామాయణశిరోమణి :-** తన వంశమువాడైన శ్రీరాముని కార్యసాధనకై వెడలుచున్నాడు కాబట్టి, ఆ హనుమకు సూర్యుడు తాపము కలుగకుండ చేసెనని భావము.

**తాత్పర్యము :-** శ్రీరాముని కార్యమును సాధించుటకై ఆకసమునందు పయనించుచున్న హనుమకు తాపము కలుగకుండ సూర్యభగవానుడు చల్లగనే ప్రకాశించెను. అట్లే వాయుదేవుడును హనుమంతునకు శ్రమతొలగునట్లుగా సుఖకరముగా వీచుచుండెను.

**శ్లో॥ ఋషయస్తుష్టువు శ్చైనం ప్లవమానం విహాయసా ।**
**జగుశ్చ దేవగంధర్వాః ప్రశంసంతో మహౌజసమ్ ॥ 84**

**పదచ్ఛేదము :-** ఋషయః - తుష్టువుః - చ - ఏనం - ప్లవమానం - విహాయసా - జగుః - చ - దేవగంధర్వాః - ప్రశంసంతః - మహౌజసమ్ ॥

**అన్వయక్రమము :-** విహాయసా ప్లవమానమ్ ఏనమ్, ఋషయః తుష్టువుః చ; మహౌజసం తం ప్రశంసంతః, దేవగంధర్వాః జగుః చ.

**ప్రతిపదార్థము :-** విహాయసా = ఆకాశమార్గమున, ప్లవమానం = ఎగురుచున్న, ఏనం = ఈ హనుమంతుని, ఋషయః = మహర్షులు, తుష్టువుః చ = స్తుతించిరి కూడను. మహౌజసం తం = మహాప్రతాపశాలియైన అతనిని, దేవగంధర్వాః = దేవతలును గంధర్వులును, ప్రశంసంతః = మిక్కిలి శ్లాఘించుచున్నవారై, జగుః చ = (కీర్తిని) గానము చేసిరి కూడను.

**తాత్పర్యము :-** ఆకాశమార్గమున అట్లు పయనించుచున్న ఆ హనుమను మహర్షులు మిక్కిలి స్తుతించుచుండిరి. అట్లే మహాప్రతాపసంపన్నుడైన అతనిని, దేవతలును గంధర్వులును గొప్పగా శ్లాఘించుచు, అతని కీర్తిని గానము చేయుచుండిరి.

**శ్లో॥ నాగాశ్చ తుష్టువుర్యక్షరక్షాంసి విబుధాః ఖగాః ।**
**ప్రేక్ష్య సర్వే కపివరం సహసా విగతక్లమమ్ ॥ 85**

**పదచ్ఛేదము** :– నాగాః – చ – తుష్టువుః – యక్షరక్షాంసి – విబుధాః – ఖగాః – ప్రేక్ష్య – సర్వే – కపివరం – సహసా – విగతక్లమమ్ ॥

**అన్వయక్రమము** :– విగతక్లమమ్ (తం) కపివరం ప్రేక్ష్య సహసా సర్వే నాగాః యక్ష రక్షాంసి విబుధాః ఖగాశ్చ తుష్టువుః.

**ప్రతిపదార్థము** :– విగతక్లమమ్ = శ్రమను ఎరుగనట్టి, (తం) కపివరం = ఆ హనుమంతుని, ప్రేక్ష్య = చూచి, సహసా = వెంటనే, సర్వే నాగాః = నాగులందరును, యక్షరక్షాంసి = యక్షులును రాక్షసులును, విబుధాః = దేవతలు, ఖగాశ్చ = పక్షులును, తుష్టువుః = స్తుతించిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'రక్షాంసి' ఈ రాక్షసులు దిక్పాలకులలోని, నైఋతి దిక్కును పాలించు రక్షోగణము.

**తాత్పర్యము** :– శ్రమను ఎరుగకుండ అద్భుతమైన ఆకాశగమనము చేయుచున్న ఆ హనుమంతుని గాంచి అచ్చటి నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు మున్నగువారు ఎల్లరును ఆనందముతో, అతనిని ప్రశంసించిరి.

**శ్లో॥ తస్మిన్ ప్లవగశార్దూలే ప్లవమానే హనూమతి ।**
**ఇక్ష్వాకులమానార్థీ చింతయామాస సాగరః ॥ 86**

**పదచ్ఛేదము** :– తస్మిన్ – ప్లవగశార్దూలే – ప్లవమానే – హనూమతి – ఇక్ష్వాకు కులమానార్థీ – చింతయామాస – సాగరః ॥

**అన్వయక్రమము** :– తస్మిన్ ప్లవగశార్దూలే హనూమతి ప్లవమానే (సతి), ఇక్ష్వాకుకుల మానార్థీ సాగరః చింతయామాస.

ప్రతిపదార్థము :– తస్మిన్ ప్లవగశార్దూలే = ఆ వానరశ్రేష్ఠుడైనట్టి, హనూమతి = హనుమంతుడు, ప్లవమానే (సతి) = సముద్రమును దాటుచుండగా, ఇక్ష్వాకు కులమానార్థీ = ఇక్ష్వాకువంశముయొక్క గౌరవమును కోరునట్టి, సాగరః = సముద్రుడు, చింతయామాస = (ఇట్లు) ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–**
**రామాయణశిరోమణి :–**
**భూషణము :–**

సాగరః = ఇక్ష్వాకు వంశీయుడైన, సగరునిచే నిర్మింపబడినవాడని సముద్రుని పూర్వవృత్తాంతము ఈ పదముచే సూచితము. అద్దానిచే ఇతడు ఇక్ష్వాకు కులమానార్థి యయ్యెను. ఇచ్చట మానము అనగా బహుమానము అని, పూజ యని వివిధ వ్యాఖ్యాతలు నుడివిరి.

**తాత్పర్యము :–** ఆంజనేయుడు సముద్రమును దాటుచుండగా సముద్రుడు తాను ఇక్ష్వాకువంశమువాడైన సగరుని పుత్రులచే పెంచబడినవాడగుటచే ఇక్ష్వాకు వంశముయొక్క శ్రేయస్సును కోరినవాడై తన మనస్సునం దిట్లని యోచించెను.

**శ్లో॥ సాహాయ్యం వానరేంద్రస్య యది నాహం హనూమతః ।**
**కరిష్యామి భవిష్యామి సర్వవాచ్యో వివక్షతామ్ ॥ 87**

**పదచ్ఛేదము :–** సాహాయ్యం – వానరేంద్రస్య – యది–న–అహం– హనూమతః – కరిష్యామి – భవిష్యామి – సర్వవాచ్యః – వివక్షతామ్ ॥

**అన్వయక్రమము :–** వానరేంద్రస్య హనూమతః సాహాయ్యమ్ అహం న కరిష్యామి యది, (తదా) వివక్షతాం సర్వవాచ్యః భవిష్యామి.

**ప్రతిపదార్థము :–** వానరేంద్రస్య = వానరశ్రేష్ఠుడైన, హనూమతః = హనుమంతునికి, సాహాయ్యం = సహాయమును, అహం = నేను, న కరిష్యామి యది = చేయక పోయినచో, (తదా = ఈ విషయమున), వివక్షతాం = మంచి చెడ్డలు చెప్పుకొను లోకులకు, సర్వవాచ్యః = అన్ని విధములుగను నింద్యుడను, భవిష్యామి = కాగలను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**భూషణము :–** వివక్షతాం = కుత్సితమైన అపవాదులు వేయు జనులకు.

**తాత్పర్యము :–** ప్రస్తుతము హనుమంతునికి నేను సహాయము చేయకపోయినచో మంచిచెడ్డలు విమర్శించి మాటలాడునట్టి లోకులకు నేను సర్వవిధముల నింద్యుడను కాగలను గదా.

**శ్లో॥ అహమిక్ష్వాకునాథేన సగరేణ వివర్ధితః ।**
**ఇక్ష్వాకుసచివశ్చాయం నావసీదితు మర్హతి ॥ 88**

**పదచ్ఛేదము** :- అహమ్ - ఇక్ష్వాకునాథేన - సగరేణ - వివర్ధితః - ఇక్ష్వాకుసచివః - చ - అయం - న - అవసీదితుమ్ - అర్హతి.

**అన్వయక్రమము** :- ఇక్ష్వాకునాథేన సగరేణ అహం వివర్ధితః; ఇక్ష్వాకుసచివః అయం అవసీదితుం న అర్హతి.

**ప్రతిపదార్థము** :- అహం = నేను, ఇక్ష్వాకునాథేన = ఇక్ష్వాకువంశశ్రేష్ఠుడైన, సగరేణ = సగరమహారాజుచేత, వివర్ధితః = పెంపొందింపబడితిని. ఇక్ష్వాకుసచివః = ఇక్ష్వాకురాజుకార్యార్థియైన, అయం = ఈ హనుమంతుడు, అవసీదితుం = మిక్కిలి శ్రమపడుటకు, న అర్హతి = తగడు.

**తాత్పర్యము** :- ఇక్ష్వాకువంశమునందు శ్రేష్ఠుడైన సగరునిచే నేను పెంపబడితిని. ఆ వంశజుడైన శ్రీరాముని కార్యార్థియై పోవుచున్న ఈతడు కష్టపడుచుండగ చూచి నేనూరకుండజాలను.

**శ్లో॥ తథా మయా విధాతవ్యం విశ్రమేత యథా కపిః ।**
**శేషం చ మయి విశ్రాంతస్సుఖేనాతిపతిష్యతి ॥ 89**

పదచ్ఛేదము :- తథా - మయా - విధాతవ్యం - విశ్రమేత - యథా - కపిః - శేషం - చ - మయి - విశ్రాంతః - సుఖేన - అతిపతిష్యతి ॥

**అన్వయక్రమము** :- కపిః యథా విశ్రమేత మయా తథా విధాతవ్యమ్; మయి విశ్రాంతః శేషం సుఖేన అతిపతిష్యతి.

**ప్రతిపదార్థము** :- కపిః = ఈ హనుమంతుడు, యథా విశ్రమేత = ఏ విధముగ విశ్రాంతి తీసుకొనగలడో, మయా = నాచేత, తథా విధాతవ్యం = ఆ రీతిగా చేయబడవలసియున్నది, మయి విశ్రాంతః = నాయందు విశ్రమించినట్టివాడై, శేషం = మిగిలినట్టి దూరమును, సుఖేన = అనాయాసముగా, అతిపతిష్యతి = దాటిపోగలడు.

**తాత్పర్యము** :- సముద్రుడు తన మనంబున తాను ఇట్లు యోచించెను. ఇప్పుడు ఈ హనుమంతుడు ఏ విధముగ విశ్రాంతి తీసుకొనగలడో ఆ రీతిగా నేను అతడు శ్రమ తీర్చుకొనుటకు చేయవలసియున్నది. అతడు నాయందు విశ్రమించినట్టివాడై మిగిలిన దూరమును సునాయాసముగా పోగలడు.

**శ్లో॥ ఇతి కృత్వా మతిం సాధ్వీం సముద్రశ్ఛన్నమంభసి ।**
**హిరణ్యనాభం మైనాక మువాచ గిరిసత్తమమ్ ॥ 90**

**పదచ్ఛేదము** :– ఇతి – కృత్వా – మతిం – సాధ్వీం – సముద్రః – ఛన్నమ్ – అంభసి – హిరణ్యానాభం – మైనాకమ్ – ఉవాచ – గిరిసత్తమమ్ ॥

**అన్వయక్రమము** :– ఇతి సాధ్వీం మతిం కృత్వా సముద్రః అంభసి ఛన్నం హిరణ్యానాభం గిరిసత్తమం మైనాకమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :– ఇతి = (అని) ఈరీతిగా, సాధ్వీం మతిం కృత్వా = ఉత్తమమైన ఆలోచన చేసి, సముద్రః = సముద్రుడు, అంభసి ఛన్నం = తననీటియందు దాగియున్నట్టి, హిరణ్యానాభం = స్వర్ణశృంగములు కల్గినట్టి, గిరిసత్తమం = పర్వతశ్రేష్ఠుడగు, మైనాకమ్ = మైనాకుని గూర్చి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :– ఇట్లు హనుమంతునికి సహాయము చేయదలచిన ఆలోచనతో, తనయందే దాగియున్న పర్వతశ్రేష్ఠుడైన మైనాకుని గూర్చి సముద్రుడు ఇట్లు పలికెను.

**శ్లో॥ త్వమిహాసురసంఘానాం పాతాళతలవాసినామ్ ।**
**దేవరాజ్ఞా గిరిశ్రేష్ఠ పరిఘ స్సన్నివేశితః ॥ 91**

**పదచ్ఛేదము** :– త్వమ్ – ఇహ – అసురసంఘానాం – పాతాళతలవాసినామ్ – దేవరాజ్ఞా – గిరిశ్రేష్ఠ – పరిఘః – సన్నివేశితః ॥

**అన్వయక్రమము** :– హే గిరిశ్రేష్ఠ త్వం దేవరాజ్ఞా పాతాళతలవాసినామ్ అసుర సంఘానామ్ ఇహ పరిఘః సన్నివేశితః.

**ప్రతిపదార్థము** :– హే గిరిశ్రేష్ఠ = ఓ పర్వతరాజమా! త్వం = నీవు, దేవరాజ్ఞా = దేవేంద్రునిచే, పాతాళతలవాసినాం = పాతాళలోకనివాసులగు, అసురసంఘానాం = రాక్షససమూహములకు, ఇహ = ఈ సముద్రమునందు, పరిఘః = అడ్డుగడియగా, సన్నివేశితః = ఏర్పాటు చేయబడితివి.

**తాత్పర్యము** :– ఓ పర్వతశ్రేష్ఠుడా! నీవు పాతాళనివాసులగు రాక్షసులనుండి రక్షణ కొఱకు పాతాళద్వారమునకు ఇనుపగడియగా దేవేంద్రునిచే నిలిపియుంచబడితివి.

**శ్లో॥ త్వమేషాం జాతవీర్యాణాం పునరేవోత్పతిష్యతామ్ ।**
**పాతాళస్యా ఽ ప్రమేయస్య ద్వారమావృత్య తిష్ఠసి ॥ 92**

**పదచ్ఛేదము** :– త్వమ్ – ఏషాం – జాతవీర్యాణాం – పునః – ఏవ– ఉత్పతిష్యతామ్ – పాతాళస్య – అప్రమేయస్య – ద్వారమ్ – ఆవృత్య – తిష్ఠసి.

**అన్వయక్రమము** :– త్వం జాతవీర్యాణాం పునరేవ ఉత్పతిష్యతామ్ ఏషామ్

అప్రమేయస్య పాతాళస్య ద్వారమ్ ఆవృత్య తిష్ఠసి.

**ప్రతిపదార్థము** :- త్వం = నీవు, జాతవీర్యాణాం = పరాక్రమవంతులైనట్టియు, పునరేవ ఉత్పతిష్యతాం = తిరిగి (మీది లోకమునకు) ఎగురబోవుచున్నట్టి, ఏషామ్ = ఈ రాక్షసులయొక్క, అప్రమేయస్య పాతాళస్య = అనంతమైనట్టి ఈ పాతాళలోకము యొక్క, ద్వారమ్ = ద్వారమును, ఆవృత్య = అడ్డగించి, తిష్ఠసి = నిలువబడియున్నావు.

**తాత్పర్యము** :- పరాక్రమవంతులై తిరిగి పైలోకమునకు ఎగురబోవునట్టి రాక్షసుల పాతాళద్వారమునకు నీ స్థూలమైన శరీరముతో నీవు అడ్డుగడియవలె నిలచి యున్నావుగదా.

**శ్లో॥ తిర్య గూర్ధ్వమధశ్చైవ శక్తిస్తే శైల వర్ధితుమ్ ।**
**తస్మాత్సంచోదయామి త్వాముత్తిష్ఠ గిరిసత్తమ ॥ 93**

**పదచ్ఛేదము** :- తిర్యక్ - ఊర్ధ్వమ్ - అధః - చ - ఏవ - శక్తిః - తే - శైల - వర్ధితుమ్ - తస్మాత్ - సంచోదయామి - త్వామ్ - ఉత్తిష్ఠ - గిరిసత్తమ ॥

**అన్వయక్రమము** :- హై శైల! తే తిర్యక్ ఊర్ధ్వమ్, అధశ్చ వర్ధితుమ్ శక్తిః అస్తి, తస్మాత్ త్వాం సంచోదయామి, హే గిరిసత్తమ ఉత్తిష్ఠ.

**ప్రతిపదార్థము** :- హే శైల! = ఓ పర్వతోత్తమా! తే = నీకు, తిర్యక్ = అడ్డముగాను, ఊర్ధ్వమ్ = మీదుగాను, అధశ్చ = క్రిందుగను, వర్ధితుం = పెరుగుటకు, శక్తిః అస్తి = సామర్థ్యముగలదు, తస్మాత్ = అందుచే, త్వామ్ = నిన్ను, సంచోదయామి = ప్రోత్సహించుచున్నాను. హే గిరిసత్తమ! = ఓ పర్వతశ్రేష్ఠమా, ఉత్తిష్ఠ! = లెమ్ము!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- వర్ధితుం శక్తిః అస్తి అనుటచే నీవు పాతాళద్వారము నుండి విడచి రాకుండగనే మీదికి పెరిగి రావలసియున్నదని సూచించుచున్నాడు.

**మహేశ్వరతీర్థులు** :- తనయొక్క పక్షములు ఛేదింపబడునను భయముచే మైనాకుడు సముద్రమునందు దాగియున్న తరువాత, దేవేంద్రుడు పాతాళవాసులైన రాక్షసులను అడ్డగించు కార్యమును మైనాకునకు నియోగించెనని తెలియుచున్నది.

**తాత్పర్యము** :- నీవు అడ్డముగను పొడవుగను క్రిందుగను యథేచ్ఛముగా పెరిగి ఎంతమేరకైనను విస్తరించుటకు శక్తి గలిగియున్నావు. అందుచేతనే నిన్ను నేను ప్రోత్సాహపరుచుచున్నాను. కావున నీవు దయచేసి మీదికి లెమ్ము.

**శ్లో॥ స ఏష కపిశార్దూల స్త్వాముపర్యేతి వీర్యవాన్ ।**
**హనుమాన్ రామకార్యార్థం భీమకర్మా ఖమాప్లుతః ॥ 94**

**పదచ్ఛేదము** :– సః – ఏషః – కపిశార్దూలః – త్వామ్ – ఉపరి – ఏతి – వీర్యవాన్ – హనుమాన్ – రామకార్యార్థం – భీమకర్మా – ఖమ్ – ఆప్లుతః ॥

**అన్వయక్రమము** :– వీర్యవాన్ కపిశార్దూలః సః ఏషః త్వామ్ ఉపరి ఏతి భీమకర్మా హనుమాన్ రామకార్యార్థం ఖమ్ ఆప్లుతః.

**ప్రతిపదార్థము** :– వీర్యవాన్ = పరాక్రమవంతుడును, కపిశార్దూలః = వానర శ్రేష్ఠుడునగు, సః ఏషః = అదిగో ఈ హనుమంతుడు, త్వామ్ ఉపరి = నీకు మీదుగా (ఆకసమునందు) ఏతి = పోవుచున్నాడు, భీమకర్మా హనుమాన్ = భయంకరమైన కార్యమును చేయబూనినట్టి ఈ హనుమంతుడు, రామకార్యార్థం = శ్రీరాముని కార్యమును సాధించుటకై, ఖమ్ ఆప్లుతః = ఆకసమున పయనించుచున్నాడు.

**తాత్పర్యము** :– ఓ మైనాకా! ఈ హనుమంతుడు ఇప్పుడు నీకు మీదుగా పయనించు చున్నాడు. ఈతడు శ్రీరాముని కార్యమును సాధింపగోరినవాడై భీకరమైన కృత్యమును పూని, ఇట్లు ఆకాశమార్గమున వెడలుచున్నాడు.

**శ్లో॥ అస్య సాహ్యం మయా కార్య మిక్ష్వాకుకులవర్తినః ।**
**మమ హీక్ష్వాకవః పూజ్యాః పరం పూజ్యతమాస్తవ ॥ 95**

**పదచ్ఛేదము** :– అస్య – సాహ్యం – మయా – కార్యమ్ – ఇక్ష్వాకుకులవర్తినః – మమ – హి – ఇక్ష్వాకవః – పూజ్యాః – పరం – పూజ్యతమాః – తవ ॥

**అన్వయక్రమము** :– ఇక్ష్వాకుకులవర్తినః అస్య మయా సాహ్యం కార్యమ్. మమ ఇక్ష్వాకవః పూజ్యాః; తవ పరం పూజ్యతమాః.

**ప్రతిపదార్థము** :– ఇక్ష్వాకుకులవర్తినః = ఇక్ష్వాకుకులమందలి రాజుయొక్క క్షేమమునకై ప్రవర్తించుచున్నట్టి, అస్య = ఈతనికి, మయా = నాచేత, సాహ్యం కార్యమ్ = సహాయము తప్పక చేయబడవలెను. మమ = నాకు, ఇక్ష్వాకవః = ఇక్ష్వాకువంశపురాజులు, పూజ్యాః హి = పూజనీయులు గదా, తవ = నీకు, పరం = మరియును, పూజ్యతమాః = మిక్కిలి పూజనీయులగుదురు సుమా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– పూజ్యతమాః = అనగా నీ విచట నివాసము చేయగల్గుచున్నావు.

కాబట్టి ఇక్ష్వాకువంశపురాజు లెల్లరును నాకంటెను నీకు పూజ్యతములగుదురు.

**తాత్పర్యము** :- ఇక్ష్వాకువంశమువారి కార్యముపై పయనించుచున్న ఈతనికి నేను తప్పక సహాయము చేయవలసియున్నది. నాకు ఇక్ష్వాకువంశీయు లెల్లరును పూజ్యులే! అట్లే నాకంటెను కూడ వారు నీకు పూజనీయులగుదురు సుమా!

**శ్లో॥ కురు సాచివ్య మస్మాకం న నః కార్య మతిక్రమేత్ ।**
**కర్తవ్య మకృతం కార్యం సతాం మన్యుముదీరయేత్ ॥ 96**

**పదచ్ఛేదము** :- కురు - సాచివ్యమ్ - అస్మాకం - న - నః - కార్యమ్ - అతిక్రమేత్ - కర్తవ్యమ్ - అకృతం - కార్యం - సతాం - మన్యుమ్ - ఉదీరయేత్ ॥

**అన్వయక్రమము** :- అస్మాకం, సాచివ్యం కురు. నః కార్యం న అతిక్రమేత్; కర్తవ్యం కార్యమ్ అకృతం (చేత్) సతాం మన్యుమ్ ఉదీరయేత్.

**ప్రతిపదార్థము** :- అస్మాకం = మాకు, సాచివ్యం = సహాయము, కురు = చేయుము, నః కార్యం = మన కర్తవ్యమైన పని, న అతిక్రమేత్ = అతిక్రమింపగూడదు, కర్తవ్యం కార్యం = చేయవలసియున్నట్టి కార్యము, అకృతం చేత్ = చేయబడకుండినచో, సతాం = సత్పురుషులకు, మన్యుమ్ = కోపమును, ఉదీరయేత్ = కలిగింపవచ్చును.

**తాత్పర్యము** :- మేము తలచిన కార్యము మీరిపోవకుండగా నీవు మాకు సహాయము చేయుము. చేయవలసియున్న సత్కార్యము చేయకున్నచో, సజ్జనులకు కోపము వచ్చును.

**శ్లో॥ సలిలాదూర్ధ్వ ముత్తిష్ఠ తిష్ఠ త్వేష కపిస్త్వయి ।**
**అస్మాక మతిథిశ్చైవ పూజ్యశ్చ ప్లవతాం వరః ॥ 97**

**పదచ్ఛేదము** :- సలిలాత్ - ఊర్ధ్వమ్ - ఉత్తిష్ఠ - తిష్ఠతు - ఏషః - కపిః - త్వయి - అస్మాకమ్ - అతిథిః - చ - ఏవ - పూజ్యః - చ - ప్లవతాం - వరః ॥

**అన్వయక్రమము** :- సలిలాత్ ఊర్ధ్వమ్ ఉత్తిష్ఠ, ఏషః కపిః త్వయి తిష్ఠతు; ఏషః ప్లవతాం వరః అస్మాకమ్, అతిథిశ్చ, పూజ్యః చ.

**ప్రతిపదార్థము** :- సలిలాత్ = జలమునుండి, ఊర్ధ్వం = మీదికి, ఉత్తిష్ఠ = లెమ్ము, ఏషః కపిః = ఈ హనుమంతుడు, త్వయి = నీపై, తిష్ఠతు = (కొద్దిసేపు) నిలచియుండు గాక, ప్లవతాం వరః (ఏషః) = వానరులలో ఘనుడైన ఈతడు, అస్మాకం = మనకు, అతిథిశ్చ = అతిథియును, పూజ్యః చ = పూజింపదగినవాడును గూడ.

**తాత్పర్యము** :- అందుచేత, నీవు నీటిమీదికి రమ్ము. ఈతడు నీపై కొంతసేపు

విశ్రమించుగాక; ఈ హనుమంతుడు నేడు మనకు అతిథియే గాక మిక్కిలి పూజనీయుడు గూడను సుమా!

**శ్లో॥ చామీకరమహానాభ దేవగన్ధర్వసేవిత ।**
**హనుమాం స్త్వయి విశ్రాన్త స్తత శ్శేషం గమిష్యతి ॥ 98**

**పదచ్ఛేదము** :– చామీకరమహానాభ – దేవగన్ధర్వసేవిత – హనుమాన్ – త్వయి – విశ్రాంతః – తతః – శేషం – గమిష్యతి ॥

**అన్వయక్రమము** :– చామీకరమహానాభ దేవగంధర్వసేవిత హనుమాన్, త్వయి విశ్రాంతః, తతః శేషం గమిష్యతి.

**ప్రతిపదార్థము** :– చామీకరమహానాభ = సువర్ణశిఖరములతో ప్రకాశించునట్టి వాడవును, దేవగంధర్వసేవిత = దేవతలచేతను గంధర్వులచేతను సేవింప బడువాడవును అగు, ఓ పర్వతశ్రేష్ఠమా! హనుమాన్ = ఈ హనుమంతుడు, త్వయి విశ్రాంతః = నీపై విశ్రమించినవాడై, తతః = తరువాత, శేషం = మార్గశేషమును, గమిష్యతి = సుఖముగా పోగలడు.

**తాత్పర్యము** :– ఓ పర్వతశ్రేష్ఠుడా! నీవు స్వర్ణశిఖరములతో విరాజిల్లుచు దేవ గంధర్వులచే సేవింపబడునట్టివాడవు. ఈ హనుమంతుడు నీపై కొంతసేపు విశ్రమించి పిమ్మట తనదారిని సుఖముగా సాగిపోవును.

**శ్లో॥ కాకుత్స్థస్యానృశంస్యం చ మైథిల్యాశ్చ వివాసనమ్ ।**
**శ్రమం చ ప్లవగేన్ద్రస్య సమీక్ష్యోత్థాతు మర్హసి ॥ 99**

**పదచ్ఛేదము** :– కాకుత్స్థస్య – ఆనృశంస్యం – చ – మైథిల్యాః – చ – వివాసనమ్ – శ్రమం – చ – ప్లవగేంద్రస్య – సమీక్ష్య – ఉత్థాతుమ్ – అర్హసి ॥

**అన్వయక్రమము** :– కాకుత్స్థస్య, ఆనృశంస్యం చ మైథిల్యాః వివాసనమ్ చ – ప్లవగేంద్రస్య – శ్రమం చ సమీక్ష్య ఉత్థాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము** :– కాకుస్థస్య = శ్రీరామునియొక్క, ఆనృశంస్యం చ = దయాశీలతయు, మైథిల్యాః = జానకీదేవియొక్క, వివాసనమ్ చ = పరదేశవాసమును, ప్లవగేంద్రస్య = హనుమయొక్క, శ్రమం చ = క్లేశమున్ను, సమీక్ష్య = గమనించి, ఉత్థాతుమ్ అర్హసి = బైటకు రావలయును.

**తాత్పర్యము** :– శ్రీరాముని దయావిశేషమున్ను జానకమ్మయొక్క పరదేశవాసమున్ను గమనించి హనుమంతునికి సహాయముచేయుటకై నీవిప్పుడు తప్పక లేచి రావలెను.

**శ్లో॥ హిరణ్యనాభో మైనాకో నిశమ్య లవణాంభసః ।**
**ఉత్పపాత జలాత్తూర్ణం మహాద్రుమలతాయుతః ॥ 100**

**పదచ్ఛేదము :–** హిరణ్యనాభః – మైనాకః – నిశమ్య – లవణాంభసః – ఉత్పపాత – జలాత్ – తూర్ణం – మహాద్రుమలతాయుతః ॥

**అన్వయక్రమము :–** హిరణ్యనాభః మైనాకః లవణాంభసః (వచనం) నిశమ్య మహాద్రుమలతాయుతః జలాత్ తూర్ణమ్ ఉత్పపాత.

**ప్రతిపదార్థము :–** హిరణ్యనాభః = సువర్ణశిఖరుడైన, మైనాకః = మైనాకుడు, లవణాంభసః = సముద్రునియొక్క, వచనం = మాటను, నిశమ్య = విని, మహాద్రుమలతాయుతః = మహావృక్షములతోడను లతలతోడను కూడినవాడై, తూర్ణం = శీఘ్రముగా, జలాత్ = సముద్రమునుండి, ఉత్పపాత = మీదికి వచ్చెను.

**తాత్పర్యము :–** ఈ ప్రకారము సముద్రుడు పలికిన మాటలు విని మైనాకుడు శీఘ్రమే సముద్రజలమునుండి మీదికి లేచెను.

**శ్లో॥ స సాగరజలం భిత్త్వా బభూవాభ్యుత్థిత స్తదా ।**
**యథా జలధరం భిత్త్వా దీప్తరశ్మిర్దివాకరః ॥ 101**

**పదచ్ఛేదము :–** సః – సాగరజలం – భిత్త్వా – బభూవ – అభ్యుత్థితః – తదా – యథా – జలధరం – భిత్త్వా – దీప్తరశ్మిః – దివాకరః ॥

**అన్వయక్రమము :–** జలధరం భిత్త్వా దీప్తరశ్మిః దివాకరః యథా, సః సాగరజలం భిత్త్వా తదా అభ్యుత్థితః.

**ప్రతిపదార్థము :–** జలధరం భిత్త్వా = మేఘమును భేదించి, దీప్తరశ్మిః = తీక్ష్ణమైన ప్రకాశముగల, దివాకరః యథా = సూర్యుడువలె, సః = ఆ మైనాకుడు, సాగరజలం = సముద్రజలమును, భిత్త్వా = ఛేదించుకొని, తదా = అప్పుడు, అభ్యుత్థితః = మీదికి వచ్చెను.

**తాత్పర్యము :–** అప్పుడు మైనాకుడు మేఘమండలమును ఛేదించుకొని, వెలుపలికి వచ్చు సూర్యునివలె సముద్రజలమును ఛేదించుకొని వెలుపలికి వచ్చెను.

**శ్లో॥ స మహాత్మా ముహూర్తేన పర్వతస్సలిలావృతః ।**
**దర్శయామాస శృంగాణి సాగరేణ నియోజితః ॥ 102**

శ్లో॥ **శాతకుంభమయై శృంగైః సకిన్నరమహోరగైః ।**
**ఆదిత్యోదయసంకాశైః ఆలిఖద్భిరివాంబరమ్ ॥** **103**

**పదచ్ఛేదము** :– సః–మహాత్మా–ముహూర్తేన – పర్వతః – సలిలావృతః – దర్శయామాస – శృంగాణి – సాగరేణ – నియోజితః – శాతకుంభమయైః – శృంగైః – సకిన్నరమహోరగైః – ఆదిత్యోదయసంకాశైః – ఆలిఖద్భిః – ఇవ – అంబరమ్ ॥

**అన్వయక్రమము** :– సాగరేణ నియోజితః సలిలావృతః మహాత్మా స పర్వతః, అంబరమ్ ఆలిఖద్భిః, ఆదిత్యోదయసంకాశైః సకిన్నరమహోరగైః శాతకుంభమయైః శృంగైః (అభ్యుత్థితః) శృంగాణి దర్శయామాస.

**ప్రతిపదార్థము** :– సాగరేణ నియోజితః = సముద్రునిచే నియోగింపబడినవాడై, సలిలావృతః = నీటిలో మునిగియున్నట్టి, మహాత్మా సః పర్వతః = మహనీయుడైన ఆ మైనాకుడు, అంబరమ్ ఆలిఖద్భిః = ఆకాశము నొఱయుచున్నట్టియును, ఆదిత్యోదయ సంకాశైః = ఉదయించుచున్న సూర్యునితో సమానమైనట్టియును, సకిన్నరమహోరగైః = కిన్నరులతోడను మహోరగములతోడను కూడినట్టియును, శాతకుంభమయైః శృంగైః = సువర్ణమయమైనట్టి శిఖరములతోడను, (అభ్యుత్థితః = మీదికి వచ్చిన వాడై) శృంగాణి = శిఖరములను, దర్శయామాస = (హనుమంతునకు) ప్రదర్శించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– ఆదిత్యోదయసంకాశైః = సూర్యోదయముచే, ప్రకాశించుచున్న లేదా ఉదయకాలపు సూర్యునివలె ప్రకాశించుచున్నట్టివి.

**తాత్పర్యము** :– సముద్రునిచే ప్రేరితుడై నీటినుండి బయలువెడలిన మహాత్ముడైన మైనాకుడు యక్షకిన్నరాదులకు నివాసమైనట్టియును, ఆకసము నంటియుండున ట్లగుపడుటచే ఉదయకాలపు సూర్యునివలె ప్రకాశించుచున్నట్టివియును అగు శృంగములతో మీదికి వచ్చి, తన శిఖరమును హనుమంతునకు ప్రదర్శించెను.

శ్లో॥ **తప్తజాంబూనదై శృంగైః పర్వతస్య సముత్థితైః ।**
**ఆకాశం శస్త్రసంకాశ మభవత్కాంచనప్రభమ్ ॥** **104**

**పదచ్ఛేదము** :– తప్తజాంబూనదైః – శృంగైః – పర్వతస్య – సముత్థితైః – ఆకాశం – శస్త్రసంకాశమ్ – అభవత్ – కాంచనప్రభమ్ ॥

**అన్వయక్రమము** :– సముత్థితైః తప్తజాంబూనదైః పర్వతస్య శృంగైః శస్త్రసంకాశమ్ ఆకాశం కాంచనప్రభమ్ అభవత్.

**ప్రతిపదార్థము :–** సముత్థితైః = మీదికి లేచియున్న, తప్తజాంబూనదైః = కరిగిపోయిన బంగారుమయమైన, పర్వతస్య శృంగైః = పర్వతముయొక్క శిఖరములచే, శస్త్రసంకాశం = లోహశస్త్రములవలె (నల్లగనుండు), ఆకాశం = ఆకాశము, కాంచనప్రభమ్ = సువర్ణచ్ఛాయగలదిగా, అభవత్ = అయ్యెను.

**తాత్పర్యము :–** అప్పుడాకాశము స్వతస్సిద్ధముగా నల్లనిదైనను, మైనాకుని బంగారు శిఖరములకాంతి దట్టముగ వ్యాపించుటచే అది బంగారుఛాయ గలదిగనే కన్పట్టెను.

**శ్లో॥ జాతరూపమయైః శృంగై ర్భ్రాజమానై స్స్వయంప్రభైః ।**
**ఆదిత్యశతసంకాశ స్సోఽభవద్గిరిసత్తమః ॥ 105**

**పదచ్ఛేదము :–** జాతరూపమయైః – శృంగైః – భ్రాజమానైః – స్వయంప్రభైః – ఆదిత్యశతసంకాశః – సః – అభవత్ – గిరిసత్తమః ॥

**అన్వయక్రమము :–** భ్రాజమానైః స్వయంప్రభైః జాతరూపమయైః శృంగైః సః గిరిసత్తమః ఆదిత్యశతసంకాశః అభవత్.

**ప్రతిపదార్థము :–** భ్రాజమానైః = మిక్కిలి ప్రకాశించుచున్నట్టియును, స్వయంప్రభైః = సహజముగనే గొప్పకాంతి గలిగినట్టియును, జాతరూపమయైః = సువర్ణమయమైన, శృంగైః = శిఖరములతో గూడినట్టి, సః గిరిసత్తమః = ఆ పర్వతశ్రేష్ఠము, ఆదిత్య శతసంకాశః = నూర్గురు సూర్యులతో సమానమైనదిగా, అభవత్ = అయ్యెను.

**తాత్పర్యము :–** మిక్కిలి కాంతిగల బంగారు శిఖరములతో కూడిన, ఆ మైనాక పర్వతము ఒక్కమారుగా ఉదయించిన నూఱు సూర్యులతో సమానమువలె అమితమైన తేజస్సుతో ప్రకాశించెను.

**శ్లో॥ తముత్థిత మసంగేన హనుమానగ్రతః స్థితమ్ ।**
**మధ్యే లవణతోయస్య, విఘ్నోఽయమితి నిశ్చితః ॥ 106**

**పదచ్ఛేదము :–** తమ్ – ఉత్థితమ్ – అసంగేన – హనుమాన్ – అగ్రతః – స్థితమ్ – మధ్యే – లవణతోయస్య – విఘ్నః – అయం – ఇతి – నిశ్చితః ॥

**అన్వయక్రమము :–** హనుమాన్ లవణతోయస్య మధ్యే ఉత్థితమ్, అగ్రతః స్థితం తమ్ అసంగేన వీక్ష్య అయం విఘ్నః ఇతి నిశ్చితః.

**ప్రతిపదార్థము :–** హనుమాన్ = హనుమంతుడు, లవణతోయస్య మధ్యే = ఆ మహాసముద్రముయొక్క మధ్యమందు, ఉత్థితమ్ = మీదికి లేచినట్టియు, అగ్రతః

స్థితం = ఎదుట (అడ్డముగా) నున్నట్టియు, తం = ఆ మైనాకపర్వతమును, అసంగేన = నిర్లక్ష్యముగా, వీక్ష్య = చూచి, అయం విఘ్నః = (నాకిది) ఒక అడ్డము లేక అవరోధము, ఇతి నిశ్చితః = అని భావించెను.

**తాత్పర్యము :–** అట్లు పొడవుగా ఎట్టఎదుట నిలచియున్నట్టి ఆ మైనాక పర్వతమును హేలనగా చూచి, ఆంజనేయుడు సముద్రమధ్యమునందు నా పయనమునకు ఇది యొక విఘ్నము కాబోలునని తలంచెను.

**శ్లో॥ స తముచ్ఛ్రిత మత్యర్థం మహావేగో మహాకపిః ।**
**ఉరసా పాతయామాస జీమూత మివ మారుతః ॥ 107**

**పదచ్ఛేదము :–** సః – తమ్ – ఉచ్ఛ్రితమ్ – అత్యర్థం – మహావేగః – మహాకపిః – ఉరసా – పాతయామాస – జీమూతమ్ – ఇవ – మారుతః ॥

**అన్వయక్రమము :–** సః మహావేగః మహాకపిః అత్యర్థమ్ ఉచ్ఛ్రితం తం మారుతః జీమూతమ్ ఇవ ఉరసా పాతయామాస.

**ప్రతిపదార్థము :–** మహావేగః = అమితవేగముతో బోవుచున్నట్టి, సః మహాకపిః = ఆ హనుమంతుడు, అత్యర్థం = మిక్కిలిగా, ఉచ్ఛ్రితమ్ = ఉన్నతమైనట్టి, తం = ఆ మైనాకమును, మారుతః = వాయువు, జీమూతమ్ ఇవ = మబ్బునువలె, ఉరసా పాతయామాస = (తన) రొమ్ముతో పడగొట్టెను.

**తాత్పర్యము :–** అప్పు డాంజనేయుడు మబ్బుగుంపులను వాయువు ఎగురగొట్టునట్లు ఆ మైనాకపర్వతమును తన రొమ్ముతో అదిమి క్రిందికి పడద్రోసెను.

**శ్లో॥ స తదా పాతితస్తేన కపినా పర్వతోత్తమః ।**
**బుద్ధ్వా తస్య కపేర్వేగం జహర్ష చ ననంద చ ॥ 108**

**పదచ్ఛేదము :–** సః – తదా – పాతితః – తేన – కపినా – పర్వతోత్తమః – బుద్ధ్వా – తస్య – కపేః – వేగం – జహర్ష – చ – ననంద – చ ॥

**అన్వయక్రమము :–** తదా తేన కపినా పాతితః సః పర్వతోత్తమః తస్య కపేః వేగం బుద్ధ్వా జహర్ష చ ననంద చ.

**ప్రతిపదార్థము :–** తదా = అప్పుడు, తేన కపినా = ఆ హనుమంతునిచే, పాతితః = పడగొట్టబడినట్టి, సః పర్వతోత్తమః = ఆ పర్వతశ్రేష్ఠము, తస్య కపేః = ఆ హనుమంతుని యొక్క, వేగం = వేగమును, బుద్ధ్వా = గ్రహించి, జహర్ష చ = హర్షమునొందెను మరియు, ననంద చ = గొప్ప ఆనందమును గూడ పొందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి ప్రతి :–** 'జహర్ష చ ననంద చ' అను దానికి బదులుగా 'జహర్ష చ ననాద చ' అని పాఠాంతరము. 'ననాద' = శబ్దమును చేసెను.

**రామానుజీయము :–** 'జహర్ష చ, ననంద చ'యను పదద్వయముచే శారీరకముగను, మానసికముగను గూడ మైనాకు డానందించెనని గ్రహించవలెను.

**తాత్పర్యము :–** అప్పు డారీతిగా హనుమచే పడగొట్టబడినట్టి పర్వతశ్రేష్ఠుడైన మైనాకుడు హనుమ వేగవిశేషమును గ్రహించి, ఆనందాశ్చర్యములను పొందెను.

**శ్లో॥ తమాకాశగతం వీర మాకాశే సముపస్థితః ।**
**ప్రీతో హృష్టమనా వాక్యమబ్రవీత్పర్వతః కపిమ్ ।**
**మానుషం ధారయన్ రూపమాత్మన శ్శిఖరే స్థితః ॥ 109**

**పదచ్ఛేదము :–** తమ్ – ఆకాశగతం – వీరమ్ – ఆకాశే – సముపస్థితః – ప్రీతః – హృష్టమనాః – వాక్యమ్ – అబ్రవీత్ – పర్వతః – కపిమ్ – మానుషం – ధారయన్ – రూపమ్ – ఆత్మనః – శిఖరే – స్థితః ॥

**అన్వయక్రమము :–** ఆకాశగతం, వీరం తం కపిం, ఆకాశే సముపస్థితః మానుషం రూపం ధారయన్ ఆత్మనః శిఖరే స్థితః పర్వతః ప్రీతః హృష్టమనాః వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** ఆకాశగతం = ఆకాశమునందున్నట్టి, వీరం = మహావీరుడైన, తం కపిం = ఆ హనుమంతుని, ఆకాశే = ఆకాశమునందే, సముపస్థితః = ఉన్నవాడును, మానుషం రూపం = మానవశరీరమును, ధారయన్ = ధరించినవాడై, ఆత్మనః = తనయొక్క, శిఖరే = శిఖరమునందే, స్థితః = ఉన్నవాడునగు, పర్వతః = మైనాకుడు, ప్రీతః = ప్రీతినొందినవాడై, హృష్టమనాః = హర్షముగల మనస్సుగలవాడు అగుచు, వాక్యం = ఈ వచనములను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** ఆ మైనాకుడు ఆంజనేయుని పరాక్రమాతిశయమునకు మిక్కిలి సంతసించి తన శిఖరమునందు నిలచి ఆకసమునందున్న హనుమతో నిట్లు బలికెను.

**శ్లో॥ దుష్కరం కృతవాన్కర్మ త్వమిదం వానరోత్తమ ।**
**నిపత్య మమ శృంగేషు విశ్రమస్వ యథాసుఖమ్ ॥ 110**

**పదచ్ఛేదము :–** దుష్కరం – కృతవాన్ – కర్మ – త్వమ్ – ఇదం – వానరోత్తమ – నిపత్య – మమ – శృంగేషు – విశ్రమస్వ – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము :–** హే వానరోత్తమ! త్వమ్ ఇదం దుష్కరం కర్మ కృతవాన్. మమ శృంగేషు నిపత్య యథాసుఖం విశ్రమస్వ.

**ప్రతిపదార్థము :–** హే వానరోత్తమ = ఓ వానరశ్రేష్ఠుడా, త్వం = నీవు, ఇదం = ఈ, దుష్కరం = దుస్సాధ్యమైన, కర్మ = మహాకార్యమును, కృతవాన్ = సాధించియుంటివి, మమ = నాయొక్క, శృంగేషు = శిఖరములందు, నిపత్య = దిగి, యథాసుఖమ్ = సుఖముగా, విశ్రమస్వ = విశ్రాంతి తీసికొనుము.

**తాత్పర్యము :–** ఓ వానరశ్రేష్ఠుడా! ఎవ్వరికిని సాధ్యముగాని ఈ సముద్రలంఘనము నీవు చేయుచున్నావు. కొద్దిసేపు నాశిఖరమున నీవు సుఖముగ విశ్రమింపుము.

**శ్లో॥ రాఘవస్య కులే జాతై రుదధిః పరివర్ధితః ।**
**స త్వాం రామహితే యుక్తం ప్రత్యర్చయతి సాగరః ॥ 111**

**పదచ్ఛేదము :–** రాఘవస్య – కులే – జాతైః – ఉదధిః – పరివర్ధితః – సః – త్వాం – రామహితే – యుక్తం – ప్రత్యర్చయతి – సాగరః ॥

**అన్వయక్రమము :–** రాఘవస్య కులే జాతైః ఉదధిః పరివర్ధితః. రామహితే యుక్తం త్వాం సః సాగరః ప్రత్యర్చయతి.

**ప్రతిపదార్థము :–** ఉదధిః = సాగరుడు, రాఘవస్య = శ్రీరామునియొక్క, కులే = వంశమునందు, జాతైః = (పూర్వము) ఉద్భవించిన రాజులచేత, పరివర్ధితః = పెంపబడియుండెను. సః సాగరః = ఆ సముద్రుడు, రామహితే = శ్రీరామునియొక్క మేలునందు, యుక్తం = నిమగ్నుడవైయున్నట్టి, త్వాం = నిన్ను, ప్రత్యర్చయతి = ప్రత్యుపకారముగా సేవించుచున్నాడు.

**తాత్పర్యము :–** ఈ సముద్రుడు శ్రీరాముని పూర్వులచే పెంపొందింపబడియున్నాడు. కాబట్టి, నేడు శ్రీరాముని కార్యమునందు నిమగ్నుడవై యున్న నిన్ను సేవించి ప్రత్యుపకారము చేయదలచి యున్నాడు.

**శ్లో॥ కృతే చ ప్రతికర్తవ్య మేష ధర్మస్సనాతనః ।**
**సోఽయం త్వత్ప్రతికారార్థీ త్వత్త స్సమ్మానమర్హతి ॥ 112**

**పదచ్ఛేదము :–** కృతే – చ – ప్రతికర్తవ్యమ్ – ఏషః – ధర్మః – సనాతనః – సః – అయం – త్వత్ప్రతికారార్థీ – త్వత్తః – సమ్మానమ్ – అర్హతి ॥

**అన్వయక్రమము :–** కృతే చ ప్రతికర్తవ్యం (భవతి). ఏషః సనాతనః ధర్మః. త్వత్ప్రతికారార్థీ సః అయం త్వత్తః సమ్మానమ్ అర్హతి.

**ప్రతిపదార్థము :–** కృతే = ఉపకారము చేసినప్పుడు, ప్రతికర్తవ్యం = ప్రత్యుపకారము చేయవలసియున్నది. ఏషః = ఇది, సనాతనః ధర్మః = ప్రాచీనమైన ఉత్తమధర్మము, త్వత్ప్రతికారార్థీ = నీకు ప్రత్యుపకారము చేయబోవుచున్నట్టి, సః అయం = ఆ ఈతడు, త్వత్తః = నీనుండి, సమ్మానం = గౌరవమును పొందుటకు, అర్హతి = తగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సమ్మానం – రాఘవకుల పూజారూపమైనట్టి గౌరవమని భావము.

**గోవిందరాజీయము :–** సమ్మానం – అతడు చేయు సత్కారమును స్వీకరించుటయే అతనిని గౌరవించుట యని భావము.

**తాత్పర్యము :–** లోకమునందు ఉపకారము చేసినవారికి ప్రత్యుపకారము చేయుట ప్రాచీనధర్మము. శ్రీరామునకు ప్రత్యుపకారము చేయగోరియున్న ఈ సముద్రుడు నీకు చేయు సమ్మానమును స్వీకరించి యాతనిని గౌరవింపుము.

**శ్లో॥ త్వన్నిమిత్త మనేనాహం బహుమానాత్ప్రచోదితః ।**
**తిష్ఠ త్వం కపిశార్దూల! మయి విశ్రమ్య గమ్యతామ్ ॥ 113**

**శ్లో॥ యోజనానాం శతం చాపి కపిరేష సమాప్లుతః ।**
**తవ సానుషు విశ్రాంత శ్శేషం ప్రక్రమతామితి ॥ 114**

**పదచ్ఛేదము :–** త్వన్నిమిత్తమ్ – అనేన – అహం – బహుమానాత్ – ప్రచోదితః – తిష్ఠ – త్వం – కపిశార్దూల – మయి – విశ్రమ్య – గమ్యతామ్ – యోజనానాం – శతం – చ – అపి – కపిః – ఏషః – సమాప్లుతః – తవ – సానుషు – విశ్రాంతః – శేషం – ప్రక్రమతామ్ – ఇతి ॥

**అన్వయక్రమము :–** ఏషః కపిః యోజనానాం శతం చ, సమాప్లుతః; తవ సానుషు విశ్రాంతః (సన్) శేషం ప్రక్రమతామ్ ఇతి, త్వన్నిమిత్తమ్ అనేన బహుమానాత్ అహం ప్రచోదితః; హే కపిశార్దూల; తిష్ఠ, మయి విశ్రమ్య గమ్యతామ్.

**ప్రతిపదార్థము :–** యోజనానాం శతం చాపి = వందయోజనములు గూడ, సమాప్లుతః = దాటబోవుచున్నట్టి; ఏషః కపిః = ఈ హనుమంతుడు, తవ సానుషు = నీయొక్క చరియలపై, విశ్రాంతః (సన్) = విశ్రమించినట్టివాడై, శేషం = మార్గశేషమును, ప్రక్రమతాం = పయనించుగాక, ఇతి = అని, త్వన్నిమిత్తం = నీయొక్క సౌకర్యమును గూర్చి, బహుమానాత్ = (నీపై) గౌరవమువలన, అనేన = ఈ సముద్రునిచే, అహం = నేను, ప్రచోదితః = ప్రేరేపింపబడియుంటిని, హే కపిశార్దూల! = ఓ వానరశ్రేష్ఠుడా!

త్వం = నీవు, తిష్ఠ = నిలువుము, మయి = నా (చరియ) పై, విశ్రమ్య = విశ్రాంతి గైకొని, గమ్యతాం = పోవుదువుగాక!

**తాత్పర్యము** :– ఈ హనుమంతుడు నూరు యోజనముల సముద్రము దాటి పోవుచున్నాడు. నీసానువులందు కొద్దిసేపు విశ్రమించి మిగిలిన మార్గము సుఖముగా దాటిపోవుగాక, అని గౌరవముతో నిన్ను గూర్చి సముద్రుడు నన్ను ప్రేరేపించెను. కాబట్టి ఓ వానరశ్రేష్ఠుడా! నీవు కొద్దిసేపు ఆగి నాపై విశ్రాంతి తీసుకొని వెడలిపొమ్ము.

**శ్లో॥ తదిదం గంధవత్స్వాదు కందమూలఫలం బహు ।**
**తదాస్వాద్య హరిశ్రేష్ఠ! విశ్రాంతోఽనుగమిష్యసి ॥ 115**

**పదచ్ఛేదము** :– తత్ – ఇదం – గంధవత్ – స్వాదు – కందమూలఫలం – బహు – తత్ – ఆస్వాద్య – హరిశ్రేష్ఠ – విశ్రాంతః – అనుగమిష్యసి ॥

**అన్వయక్రమము** :– తత్ హే హరిశ్రేష్ఠ! ఇదం గంధవత్ స్వాదు బహు కందమూలఫలం (యత్ విద్యతే) తత్ ఆస్వాద్య విశ్రాంతః అనుగమిష్యసి.

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ కారణముచే, హే హరిశ్రేష్ఠ! = ఓ వానరశ్రేష్ఠుడా!, ఇదం = ఇచ్చట గల, గంధవత్ = పరిమళయుక్తమై యున్నదియును, స్వాదు = రుచికరమైనట్టిదియును, బహు = అధికముగ నున్నట్టిదియును అగు, కందమూలఫలం = దుంపలు, వేరులు, పండ్లు మున్నగునవి, (యత్ విద్యతే = ఏది యున్నదో), తత్ = దానిని, ఆస్వాద్య = ఆరగించి, విశ్రాంతః = విశ్రమించి, అనుగమిష్యసి = వెడలిపోవగలవు.

**తాత్పర్యము** :– అందుచే ఓ నరోత్తమా! సుగంధయుక్తములును మధురములను అగు నిచ్చటి కందమూలఫలములను ఆరగించి విశ్రమించి ముందునకు పోవుదువుగాక!

**శ్లో॥ అస్మాకమపి సంబంధః కపిముఖ్య త్వయాస్తి వై ।**
**ప్రఖ్యాతస్త్రిషు లోకేషు మహాగుణపరిగ్రహః ॥ 116**

**పదచ్ఛేదము** :– అస్మాకమ్ – అపి – సంబంధః – కపిముఖ్య – త్వయా – అస్తి – వై – ప్రఖ్యాతః – త్రిషు – లోకేషు – మహాగుణపరిగ్రహః ॥

**అన్వయక్రమము** :– హే కపిముఖ్య! త్వయా అస్మాకమపి సంబంధః అస్తి వై. మహాగుణ పరిగ్రహః త్రిషు లోకేషు ప్రఖ్యాతః.

**ప్రతిపదార్థము** :– హే కపిముఖ్య = ఓ వానరశ్రేష్ఠుడా! త్వయా = నీతోడ, అస్మాకమపి

= మాకుగూడ, సంబంధః = సంబంధము (బంధుత్వము), అస్తి వై = ఉన్నది సుమా! మహాగుణపరిగ్రహః = పెద్దల యొక్క సాహచర్యము, త్రిషు లోకేషు = ముల్లోకములందును, ప్రఖ్యాతః = ప్రసిద్ధమై యుండును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మహాగుణపరిగ్రహః = పెద్దవారి సాహచర్యము.

**తాత్పర్యము :–** మహాత్మా! నీతో సంబంధము మాకును గూడ ఉన్నది సుమా! మహాగుణ సంపన్నుడవైన నీవు త్రిలోకములందును ప్రసిద్ధుడవు.

**శ్లో॥ వేగవంతః ప్లవంతో యే ప్లవగా మారుతాత్మజ ।**
**తేషాం ముఖ్యతమం మన్యే త్వామహం కపికుంజర ॥ 117**

**పదచ్ఛేదము :–** వేగవంతః – ప్లవంతః – యే – ప్లవగాః – మారుతాత్మజ – తేషాం – ముఖ్యతమం – మన్యే – త్వామ్ – అహం – కపికుంజర ॥

**అన్వయక్రమము :–** హే మారుతాత్మజ! కపికుంజర! యే వేగవంతః ప్లవంతః ప్లవగాః (విద్యన్తే) తేషాం త్వాం ముఖ్యతమమ్ అహం మన్యే.

**ప్రతిపదార్థము :–** హే మారుతాత్మజ! = ఓ వాయుపుత్రా! కపికుంజర = ఓ వానరశ్రేష్ఠుడా! వేగవంతః = మహావేగముగలవియును, ప్లవంతః = గాలిలో ఎగురగలవియును, యే ప్లవంగాః విద్యంతే = ఏ వానరము లున్నవో, తేషాం = వారిలో, త్వాం = నిన్ను, ముఖ్యతమం = సర్వశ్రేష్ఠునిగా, అహం = నేను, మన్యే = భావించుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! లోకములో గల వేగసంపన్నులయిన వానరు లందరిలోను నీవే ముఖ్యుడవని నేను భావించుచున్నాను.

**శ్లో॥ అతిథిః కిల పూజార్హః ప్రాకృతోఽపి విజానతా ।**
**ధర్మం జిజ్ఞాసమానేన కిం పునస్త్వాదృశో మహాన్ ॥ 118**

**పదచ్ఛేదము :–** అతిథిః – కిల – పూజార్హః – ప్రాకృతః – అపి – విజానతా – ధర్మం – జిజ్ఞాసమానేన – కిం – పునః – త్వాదృశః – మహాన్ ॥

**అన్వయక్రమము :–** విజానతా ధర్మం జిజ్ఞాసమానేన ప్రాకృతః అపి అతిథిః పూజార్హః కిల, త్వాదృశః మహాన్ పునః కిమ్?

**ప్రతిపదార్థము :–** ధర్మం = ధర్మమును, విజానతా = తెలిసినవానికి, జిజ్ఞాసమానేన

= తెలిసికొనన కోరిక గలవారికిన్ని, ప్రాకృతః అపి = పామరుడైనప్పటికిని, అతిథిః = అతిథియగువాడు, పూజార్హః కిల = పూజనీయుడే యగును సుమా! త్వాదృశః మహాన్ = నీబోటిమహాత్ముడు (అతిథియైనచో), పునః కిమ్? = తిరిగి చెప్పవలసినదేమున్నది.

**తాత్పర్యము :–** అతిథియైనవాడు ఎంత పామరుడైనను, ధర్మము తెలిసినట్టి పండితునకు పూజార్హుడే; అట్టిచో నీవంటి మహాత్ముడే అతిథిగ వచ్చినప్పుడు ఇంక చెప్పవలసిన దేమున్నది?

**శ్లో॥ త్వం హి దేవవరిష్ఠస్య మారుతస్య మహాత్మనః ।**
**పుత్రస్తస్యైవ వేగేన సదృశః కపికుంజర ॥ 119**

**పదచ్ఛేదము :–** త్వం – హి – దేవవరిష్ఠస్య – మారుతస్య – మహాత్మనః – పుత్రః – తస్య – ఏవ – వేగేన – సదృశః – కపికుంజర ॥

**అన్వయక్రమము :–** హే కపికుంజర! త్వం దేవవరిష్ఠస్య మహాత్మనః మారుతస్య పుత్రః హి, వేగేన తస్య సదృశః ఏవ (భవసి).

**ప్రతిపదార్థము :–** హే కపికుంజర! = ఓ వానరశ్రేష్ఠుడా! త్వం = నీవు, దేవవరిష్ఠస్య = దేవతలలో అగ్రగణ్యుడైనట్టి, మహాత్మనః మారుతస్య = మహనీయుడైన వాయుదేవునకు, పుత్రః హి = పుత్రుడవు గదా! వేగేన = వేగాతిశయముతో, తస్య ఏవ = ఆ వాయుదేవునకే, సదృశః = సాటియైనవాడవు.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! నీవు దేవశ్రేష్ఠుడైన మహనీయుడగు వాయుదేవుని పుత్రుడవుగదా! వేగమునందు నీవాతనితో సర్వవిధముల సమానుడవే!

**శ్లో॥ పూజితే త్వయి ధర్మజ్ఞ పూజాం ప్రాప్నోతి మారుతః ।**
**తస్మాత్త్వం పూజనీయో మే శృణు చాప్యత్ర కారణమ్ ॥ 120**

**పదచ్ఛేదము :–** పూజితే – త్వయి – ధర్మజ్ఞ – పూజాం – ప్రాప్నోతి – మారుతః – తస్మాత్ – త్వం – పూజనీయః – మే – శృణు – చ – అపి – అత్ర – కారణమ్ ॥

**అన్వయక్రమము :–** హే! ధర్మజ్ఞ! త్వయి పూజితే (సతి) మారుతః పూజాం ప్రాప్నోతి. తస్మాత్ త్వం మే పూజనీయః. అత్ర కారణమ్ అపి చ శృణు.

**ప్రతిపదార్థము :–** హే! ధర్మజ్ఞ! = ఓ ధర్మజ్ఞుడా! త్వయి పూజితే (సతి) = నీవు పూజింపబడినవాడవైయుండగా, మారుతః = వాయుదేవుడు, పూజాం = సత్కారమును, ప్రాప్నోతి = పొందుచున్నాడు. తస్మాత్ = ఆ కారణముచేత, త్వం = నీవు, మే = నాకు, పూజనీయః (భవసి) = పూజింపదగినవాడవగుచున్నావు. అత్ర = (మిమ్ము

పూజించు) ఈ విషయమున, కారణం చ అపి = ఇతర కారణమునుగూడ, శృణు = వినుము.

**తాత్పర్యము** :- నిన్ను పూజించినయెడల వాయుదేవునే పూజించినట్లగును. ఓ ధర్మజ్ఞుడా! అందుచేతనే నీవు మాకు పూజనీయుడవగుచున్నావు. నిన్ను పూజించుట కింకొక కారణము గూడ నున్నది. వినుము.

**రామానుజీయము** :- అతిథియైన నిన్ను పూజించిన మా కోరిక నెరవేరును. ఇంతియేగాక వాయువునకు గూడ ప్రత్యుపకారము చేసినవారమగుదుము.

**శ్లో॥ పూర్వం కృతయుగే తాత పర్వతాః పక్షిణోఽభవన్ ।**
**తే హి జగ్ముర్దిశస్సర్వాః గరుడానిలవేగినః ॥ 121**

**పదచ్ఛేదము** :- పూర్వం - కృతయుగే - తాత - పర్వతాః - పక్షిణః - అభవన్ - తే - హి - జగ్ముః - దిశః - సర్వాః - గరుడానిలవేగినః ॥

**అన్వయక్రమము** :- హే తాత! పూర్వం కృతయుగే పర్వతాః పక్షిణః అభవన్. తే గరుడానిలవేగినః సర్వాః దిశః జగ్ముః హి.

**ప్రతిపదార్థము** :- హే తాత! = నాయనా! పూర్వం = పూర్వకాలమున, కృతయుగే = ఆదియుగమున, పర్వతాః = పర్వతములన్నియును, పక్షిణః = ఱెక్కలుగలవిగా, అభవన్ = ఉండెడివి, తే = అవి, గరుడానిలవేగినః = గరుత్మంతుని యొక్కయును వాయువు యొక్కయు వేగముగలవై, సర్వాః దిశః = అన్నిదిక్కులనుగూర్చి, జగ్ముర్హి = వెడలిపోవు చుండెడివట.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- కృతయుగే = ఉత్పత్తి కాలమునందు, 'గరుడానిలవేగినః' దీనికి 'గరుడా ఇవ వేగినః' అని బొంబాయి ముద్రణ పాఠము.

**తాత్పర్యము** :- నాయనా! కృతయుగమునందు పర్వతములకు ఱెక్కలుండెడివి. అవి గరుత్మంతునివలెను, వాయువువలెను మహావేగముతో సకలదిక్కులకును ఎగిరిపోవు చుండెడివి.

**శ్లో॥ తతస్తేషు ప్రయాతేషు దేవసంఘాస్సహర్షిభిః ।**
**భూతాని చ భయం జగ్ముస్తేషాం పతనశంకయా ॥ 122**

**పదచ్ఛేదము** :- తతః - తేషు - ప్రయాతేషు - దేవసంఘాః - సహర్షిభిః - భూతాని

– చ – భయం – జగ్ముః – తేషాం – పతనశంకయా ॥

**అన్వయక్రమము** :– తతః తేషు ప్రయాతేషు తేషాం పతనశంకయా ఋషిభిః సహ దేవసంఘాః భూతాని చ భయం జగ్ముః.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, తేషు ప్రయాతేషు (సత్సు) = ఆ పర్వతములు (ఇటు నటు) పయనించుచుండగా, తేషాం = ఆ పర్వతములయొక్క, పతనశంకయా = పతనమునందలి శంకతో, ఋషిభిః సహ = మహర్షులతోడ గూడ, దేవసంఘాః = దేవబృందములున్నూ, భూతాని చ = భూతములున్ను (అనగా ఇతరప్రాణులు), భయం జగ్ముః = భీతిని పొందినవి.

**తాత్పర్యము** :– అప్పు డా పర్వతములు నలుమూలలందునను సంచరించుచుండగా ఋషులు, దేవతలు సమస్తప్రాణులును ఆ పర్వతములు తమపై బడునను భయముతో మిక్కిలి వ్యాకులత నొందుచుండెను.

**శ్లో॥ తతః క్రుద్ధస్సహస్రాక్షః పర్వతానాం శతక్రతుః ।**
**పక్షాన్ చిచ్ఛేద వజ్రేణ తత్ర తత్ర సహస్రశః ॥ 123**

**పదచ్ఛేదము** :– తతః – క్రుద్ధః – సహస్రాక్షః – పర్వతానాం – శతక్రతుః – పక్షాన్ – చిచ్ఛేద – వజ్రేణ – తత్ర – తత్ర – సహస్రశః ॥

**అన్వయక్రమము** :– తతః సహస్రాక్షః శతక్రతుః క్రుద్ధః సన్ తత్ర తత్ర సహస్రశః పర్వతానాం పక్షాన్ వజ్రేణ చిచ్ఛేద.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, సహస్రాక్షః = వేయికన్నులుగల, శతక్రతుః = దేవేంద్రుడు, క్రుద్ధః (సన్) = కోపించినవాడై, తత్ర తత్ర = అచ్చటచ్చట (గల), పర్వతానాం = పర్వతములయొక్క, పక్షాన్ = రెక్కలను, సహస్రశః = వేలకొలది పర్యాయములు, వజ్రేణ = వజ్రాయుధముచే, చిచ్ఛేద = ఛేదించివైచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి పాఠము** :– 'తత్ర తత్ర సహస్రశః' కి బదులుగా 'తతః శతసహస్రశః' అని పాఠాంతరము.

**తాత్పర్యము** :– అప్పుడు వేయికన్నుల వేల్పయిన దేవేంద్రుడు అత్తరి నమితక్రోధము నొంది తన వజ్రాయుధముతో ఆ పర్వతములను వెదకి వెదకి వాని రెక్కలను వేయితునుకలుగా ఖండించి వైచెను.

**శ్లో॥ స మాముపాగతః క్రుద్ధో వజ్రముద్యమ్య దేవరాట్ ।**
**తతోఽహం సహసా క్షిప్త శ్శ్వసనేన మహాత్మనా ॥ 124**

**పదచ్ఛేదము :–** సః – మామ్ – ఉపాగతః – క్రుద్ధః – వజ్రమ్ – ఉద్యమ్య – దేవరాట్ – తతః – అహం – సహసా – క్షిప్తః – శ్వసనేన – మహాత్మనా ॥

**అన్వయక్రమము :–** తతః క్రుద్ధః సః దేవరాట్ వజ్రమ్ ఉద్యమ్య మామ్ ఉపాగతః; తతః అహం మహాత్మనా శ్వసనేన సహసా క్షిప్తః.

**ప్రతిపదార్థము :–** క్రుద్ధః = క్రోధమునొందియున్న, సః దేవరాట్ = ఆ దేవేంద్రుడు, వజ్రం = వజ్రాయుధమును, ఉద్యమ్య = (చేత) పూని, మామ్ ఉపాగతః = నామీదికి వచ్చెను, తతః = అప్పుడు, అహం = నేను, మహాత్మనా = మహానుభావుడైన, శ్వసనేన = వాయుదేవునిచే, సహసా = వెంటనే, క్షిప్తః = (దూరముగా) త్రోసివేయ బడితిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** క్షిప్తః = ఆకాశమున మీది కెగురగొట్టబడె నని భావము.

**తాత్పర్యము :–** దేవేంద్రుడు తీవ్రమైన క్రోధముతో వజ్రాయుధమును ధరించి నామీదికి రాగా మహాత్ముడైన వాయుదేవుడు మిక్కిలి వేగముగా నన్ను దూరమునకు గొనిపోయెను.

**శ్లో॥ అస్మిన్ లవణతోయే చ ప్రక్షిప్తః ప్లవగోత్తమ ।**
**గుప్తపక్షసమగ్రశ్చ తవ పిత్రాఽభిరక్షితః ॥ 125**

**పదచ్ఛేదము :–** అస్మిన్ – లవణతోయే – చ – ప్రక్షిప్తః – ప్లవగోత్తమ – గుప్తపక్ష సమగ్రః – చ – తవ – పిత్రా – అభిరక్షితః ॥

**అన్వయక్రమము :–** హే ప్లవగోత్తమ! అస్మిన్ లవణతోయే ప్రక్షిప్తః గుప్తపక్షసమగ్రః తవ పిత్రా అభిరక్షితః చ.

**ప్రతిపదార్థము :–** హే ప్లవగోత్తమ! = ఓ వానర శ్రేష్ఠుడా! అస్మిన్ లవణతోయే = ఈ సముద్రజలమునందు, ప్రక్షిప్తః = పడవేయబడినవాడనై, తవ = నీయొక్క, పిత్రా = తండ్రి (యైన వాయుదేవుని)చే, గుప్తపక్షసమగ్రః = భద్రముగ నుంచబడిన ఱెక్కలుగలవాడనై, అభిరక్షితః చ = (సుఖముగ) రక్షింపబడితిని గూడ.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** గుప్తపక్షసమగ్రః = నా రెక్కలు చెక్కుచెదరకుండ చక్కగా

రక్షింపబడితిని. సముద్రమునందు నన్ను అట్లు త్రోసి నీ తండ్రి నాకు గొప్ప ఉపకారము చేసెను.

**తాత్పర్యము :–** అప్పుడు పుణ్యాత్ముడైన నీ తండ్రిచే ఈ సముద్రజలమునందు చేర్చబడి నా రెక్క లన్నిటితోడను నేను భద్రముగా రక్షింపబడియుంటిని.

**శ్లో॥ తతో౽హం మానయామి త్వాం మాన్యో హి మమ మారుతః ।**
**త్వయా మే హ్యేష సంబంధః కపిముఖ్య మహాగుణః ॥ 126**

**పదచ్ఛేదము :–** తతః – అహం – మానయామి – త్వాం – మాన్యః – హి – మమ – మారుతః – త్వయా – మే – హి – ఏషః – సంబంధః – కపిముఖ్య – మహాగుణః ॥

**అన్వయక్రమము :–** తతః త్వామ్ అహం మానయామి; మమ మారుతః మాన్యః హి; హే కపిముఖ్య! త్వయా మహాగుణః మే సంబంధః ఏషః హి.

**ప్రతిపదార్థము :–** తతః = ఆ కారణముచే, అహం = నేను, త్వాం = నిన్ను, మానయామి = గౌరవించుచున్నాను, మమ = నాకు, మారుతః = (నీ తండ్రియైన) వాయుదేవుడు, మాన్యః హి = గౌరవింపవలసినవాడు సుమా! హే కపిముఖ్య = ఓ వానరశ్రేష్ఠుడా! త్వయా = నీతో, మహాగుణః = గొప్పవిశేషము కల్గిన, మే = నాయొక్క, సంబంధః = బాంధవ్యము, ఏషః హి = ఇదియే సుమా!

**తాత్పర్యము :–** అందుచేత నిన్నిప్పుడు నేను గౌరవించుచున్నాను. నీ తండ్రియైన వాయుదేవుడు నా కెంతయును గౌరవార్హుడు గదా! ఓ వానరశ్రేష్ఠుడా! నీతో నాకు గల సంబంధము ఇంత గొప్పది సుమా!

**శ్లో॥ అస్మిన్నేవంగతే కార్యే సాగరస్య మమైవ చ ।**
**ప్రీతిం ప్రీతమనాః కర్తుం త్వమర్హసి మహాకపే ॥ 127**

**పదచ్ఛేదము :–** అస్మిన్ – ఏవం – గతే – కార్యే – సాగరస్య – మమ – ఏవ – చ – ప్రీతిం – ప్రీతమనాః – కర్తుం – త్వమ్ – అర్హసి – మహాకపే ॥

**అన్వయక్రమము :–** ఏవం గతే అస్మిన్ కార్యే హే మహాకపే! ప్రీతమనాః త్వం సాగరస్య, మమైవ చ ప్రీతిం కర్తుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :–** ఏవం గతే అస్మిన్ కార్యే = ఈ రీతిగా నున్నట్టి ప్రస్తుత కార్యమునందు, హే మహాకపే = వానరశ్రేష్ఠుడా! ప్రీతమనాః = సంతోషించిన మనస్సుగలవాడవై, త్వం = నీవు, సాగరస్య = సముద్రమునకును, మమైవ చ = నాకును, ప్రీతిం = సంతోషమును, కర్తుమ్ అర్హసి = సమకూర్పదగియున్నావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ఏవంగతే కార్యే = బంధుత్వము నీవు తెలుసుకొంటివి గాబట్టి.

**తాత్పర్యము** :- మనకు గల సంబంధము నీవు చక్కగా తెలుసుకొంటివి. కాబట్టి నీవు సంతోషముతో నాకును సముద్రునకును గూడ ప్రీతికరముగా నా అతిథ్యమును స్వీకరించి సంతోషము గలిగింపవలసియున్నది సుమా!

**శ్లో॥ శ్రమం మోక్షయ పూజాం చ గృహాణ కపిసత్తమ ।**
**ప్రీతిం చ బహుమన్యస్వ ప్రీతోఽస్మి తవ దర్శనాత్ ॥ 128**

**పదచ్ఛేదము** :- శ్రమం - మోక్షయ - పూజాం - చ - గృహాణ - కపిసత్తమ - ప్రీతిం - చ - బహుమన్యస్వ - ప్రీతః - అస్మి - తవ - దర్శనాత్ ॥

**అన్వయక్రమము** :- హే కపిసత్తమ! శ్రమం మోక్షయ; పూజాం చ గృహాణ; ప్రీతిం చ బహుమన్యస్వ; తవ దర్శనాత్ ప్రీతః అస్మి.

**ప్రతిపదార్థము** :- హే కపిసత్తమ! = ఓ వానరోత్తముడా! శ్రమం = (నీ) బడలికను, మోక్షయ = తొలగించుకొనుము, పూజాం చ = (మా) ఆతిథ్యమును, గృహాణ = స్వీకరింపుము, ప్రీతిం చ = (మా) స్నేహమును, బహుమన్యస్వ = మన్నింపుము, తవ = నీయొక్క, దర్శనాత్ = దర్శనమువలన, ప్రీతః అస్మి = ఎంతయో సంతోషించితిని.

**తాత్పర్యము** :- ఓ వానరశ్రేష్ఠుడా! నా శిఖరముపై విశ్రమించి నీ శ్రమను తొలగించు కొనుము. మే మొసగు ఆతిథ్యమును స్వీకరింపుము. మాకు నీపైగల ప్రేమను గౌరవముతో గ్రహింపుము. నిన్ను జూచుటవలన నా కెంతయో ఆనందము కలిగినది.

**శ్లో॥ ఏవముక్తః కపిశ్రేష్ఠస్తం నగోత్తమ మబ్రవీత్ ।**
**ప్రీతోఽస్మి కృతమాతిథ్యం మన్యు రేషోఽపనీయతామ్ ॥ 129**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - ఉక్తః - కపిశ్రేష్ఠః - తం - నగోత్తమమ్ - అబ్రవీత్ - ప్రీతః - అస్మి - కృతమ్ - ఆతిథ్యం - మన్యుః - ఏషః - అపనీయతామ్ ॥

**అన్వయక్రమము** :- ఏవమ్ ఉక్తః కపిశ్రేష్ఠః తం నగోత్తమమ్ అబ్రవీత్; ప్రీతః అస్మి; కృతమ్ ఆతిథ్యమ్; ఏషః మన్యుః అపనీయతామ్.

**ప్రతిపదార్థము** :- ఏవం = ఈ రీతిగా, ఉక్తః = చెప్పబడినట్టి, కపిశ్రేష్ఠః = హనుమంతుడు, తం నగోత్తమమ్ = ఆ మైనాకుని గూర్చి, అబ్రవీత్ = (ఇట్లు)

పలికెను. ప్రీతః అస్మి = సంతుష్టుడనయితిని, ఆతిథ్యం = అతిథిసత్కారము, కృతం = (చక్కగా) చేయబడినది, ఏషః మన్యుః = ఈ కోపము, అపనీయతామ్ = తొలగింపబడుగాక!

**తాత్పర్యము :–** ఈ రీతిగా మైనాకుడు ప్రీతితో బలికిన మాటలు విని హనుమంతుడు అతనితో నిట్లనెను, 'ఓ పూజ్యుడా! ప్రేమగౌరవములతో నీవు బలికిన వచనములకు నేను మిక్కిలి సంతసించితిని. నీ ఆతిథ్యమును స్వీకరించి నట్లే తలచుము. నీ కోరికను మన్నింపలేదని కోపము బూనకుము.

**శ్లో॥ త్వరతే కార్యకాలో మే అహశ్చాప్యతివర్తతే ।**
**ప్రతిజ్ఞా చ మయా దత్తా న స్థాతవ్య మిహాంతరే ॥ 130**

**పదచ్ఛేదము :–** త్వరతే – కార్యకాలః – మే – అహః – చ – అపి – అతివర్తతే – ప్రతిజ్ఞా – చ – మయా – దత్తా – న – స్థాతవ్యమ్ – ఇహ – అంతరే.

**అన్వయక్రమము :–** మే కార్యకాలః త్వరతే; అహః చ అపి అతివర్తతే; మయా ప్రతిజ్ఞా చ దత్తా; అంతరే ఇహ న స్థాతవ్యమ్.

**ప్రతిపదార్థము :–** మే = నాకు, కార్యకాలః = కర్తవ్యమునకు సమయము, త్వరతే = వేగిరపెట్టుచున్నది, అహః చ అపి = పగటిభాగము గూడ, అతివర్తతే = గడచి పోవుచున్నది. మయా = నాచేత, ప్రతిజ్ఞా చ = వాగ్దానముగూడ, దత్తా = ఈయబడినది, అంతరే ఇహ = మధ్యలో ఇచ్చట, న స్థాతవ్యం = నిలువకూడదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** అహః అతివర్తతే = లంకాద్వీప ప్రవేశయోగ్యమైన పగటి భాగము మించిపోవుచున్నదని భావము. ప్రతిజ్ఞా 'యథా రాఘవనిర్ముక్తః శరః...' 'నేను శ్రీరాముడు విడిచిపెట్టిన బాణమువలె పోవుదును.' అని నేను చేసిన ప్రతిజ్ఞ.

**తాత్పర్యము :–** నా కార్యమునకు వేళ మీరుచున్నది. ప్రొద్దు పోవుచున్నది. కార్యము సాధించువరకును విశ్రమించనని నేను ప్రతిజ్ఞ చేసితిని. కావున మధ్యలో నేను నిలువగూడదు.

**శ్లో॥ ఇత్యుక్త్వా పాణినా శైల మాలభ్య హరిపుంగవః ।**
**జగా మాకాశ మావిశ్య వీర్యవాన్ ప్రహసన్నివ ॥ 131**

**పదచ్ఛేదము :–** ఇతి – ఉక్త్వా – పాణినా – శైలమ్ – ఆలభ్య – హరిపుంగవః –

జగామ – ఆకాశం – ఆవిశ్య – వీర్యవాన్ – ప్రహసన్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– హరిపుంగవః ఇతి ఉక్త్వా పాణినా శైలమ్ ఆలభ్య వీర్యవాన్ (సః) ప్రహసన్నివ ఆకాశమ్ ఆవిశ్య జగామ.

**ప్రతిపదార్థము** :– హరిపుంగవః = హనుమంతుడు, ఇతి ఉక్త్వా = ఈ రీతిగా బలికి, పాణినా = తనచేతితో, శైలమ్ ఆలభ్య = మైనాకుని మేను నిమిరి, వీర్యవాన్ (సః) = పరాక్రమశాలియైన ఆతడు, ప్రహసన్నివ = చిరునవ్వు నవ్వుచు, ఆకాశమ్ ఆవిశ్య = ఆకాశములోనికి చొచ్చుకొనిపోయి, జగామ = వెడలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– ప్రహసన్నివ = ప్రసన్నముఖుడై నవ్వుచున్నాడని భావము.

**తిలకము** :– ప్రహసన్నివ = మీరిరువురును (మైనాక సముద్రులు) నేను చేసిన ఈ చిన్న కార్యమునకే నాకు శ్రమము కలుగుచున్నదని నన్నుగూర్చి ప్రయాసపడుచున్నారని హనుమ నవ్వుచున్నాడని భావము.

**తాత్పర్యము** :– హనుమంతుడట్లు పలికి తనచేతితో ప్రేమగా మైనాకుని శరీరమును నిమిరి తన పరాక్రమమును జూపుచు మరల నభోమండలమున కెగసి చిరునవ్వు చిందుచున్న మోముతో పోవదొడగెను.

**శ్లో॥ స పర్వతసముద్రాభ్యాం బహుమానాదవేక్షితః ।**
**పూజితశ్చోపపన్నాభిరాశీర్భి రనిలాత్మజః ॥ 132**

**పదచ్ఛేదము** :– సః – పర్వతసముద్రాభ్యాం – బహుమానాత్ – అవేక్షితః – పూజితః – చ – ఉపపన్నాభిః – ఆశీర్భిః – అనిలాత్మజః ॥

**అన్వయక్రమము** :– సః అనిలాత్మజః పర్వతసముద్రాభ్యాం బహుమానాత్ అవేక్షితః ఉపపన్నాభిః ఆశీర్భిః పూజితశ్చ.

**ప్రతిపదార్థము** :– సః అనిలాత్మజః = ఆ హనుమంతుడు, పర్వతసముద్రాభ్యాం = మైనాకునిచేతను సముద్రునిచేతను, బహుమానాత్ = గౌరవమువలన, అవేక్షితః = సత్కరింపబడినవాడగుచు, ఉపపన్నాభిః = సముచితములైన, ఆశీర్భిః = ఆశీర్వాదములచే, పూజితశ్చ (సన్) = పూజింపబడినవాడగుచు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము** :– ఉపపన్నాభిః = రామకార్యార్థసిద్ధికి సముచితములైనట్టి.

**తిలకము :–** 'ఉపపన్నాభిః' = తత్కాలమునకు యుక్తములైనట్టి ఆశీస్సులచే.

**తాత్పర్యము :–** హనుమంతుడు ఆ పర్వత సముద్రములచే గౌరవపూర్వకముగా సత్కరింపబడి సత్కారోపయుక్తములైన ఆశీర్వచనములచే అభినందింపబడినవాడై (పై శ్లోకముతో అన్వయము).

**శ్లో॥ అథోర్ధ్వం దూరముత్ప్లుత్య హిత్వా శైలమహార్ణవౌ ।**
**పితుః పంథానమాస్థాయ జగామ విమలేఽంబరే ॥ 133**

**పదచ్ఛేదము :–** అథ – ఊర్ధ్వం – దూరం – ఉత్ప్లుత్య – హిత్వా – శైలమహార్ణవౌ – పితుః – పంథానమ్ – ఆస్థాయ – జగామ – విమలే – అంబరే ॥

**అన్వయక్రమము :–** అథ శైలమహార్ణవౌ హిత్వా, ఊర్ధ్వం దూరం ఉత్ప్లుత్య, పితుః పంథానమ్ ఆస్థాయ, విమలే అంబరే జగామ.

**ప్రతిపదార్థము :–** అథ = అప్పుడు, శైలమహార్ణవౌ = పర్వతసముద్రుల నిరువురను, హిత్వా = విడిచిపెట్టి, ఊర్ధ్వం = ఊర్ధ్వదిశగా, దూరం ఉత్ప్లుత్య = దూరముగా ఎగసి, పితుః పంథానం = తన తండ్రియైన వాయుదేవునియొక్క మార్గమును, ఆస్థాయ = చేరి, విమలే = నిర్మలమైన, అంబరే = ఆకాశమునందు, జగామ = ముందునకు పోవుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** శైలమహార్ణవౌ – అనినప్పుడు మనుష్యరూపములో నున్న పర్వతసముద్రుల నని భావము.

**రామాయణ శిరోమణి :–** 'శైలమహార్ణవౌ' – తనను సత్కరించుటకు వచ్చియున్న పర్వత సముద్రులను అని భావము.

**తాత్పర్యము :–** పిదప హనుమంతుడు అట్లు తన్ను సత్కరించుటకై మనుష్యరూపములో వచ్చియున్నట్టి ఆ శైలసాగరములను విడిచి ఎత్తుగా పైకి ఎగిరి వాయుమార్గముగా నిర్మలాకాశమున బోవసాగెను.

**శ్లో॥ భూయశ్చోర్ధ్వగతిం ప్రాప్య గిరిం తమవలోకయన్ ।**
**వాయుసూనుర్నిరాలంబే జగామ విమలేఽంబరే ॥ 134**

**పదచ్ఛేదము :–** భూయః – ఊర్ధ్వగతిం – ప్రాప్య – గిరిం – తమ్ – అవలోకయన్ – వాయుసూనుః – నిరాలంబే – జగామ – విమలే – అంబరే ॥

**అన్వయక్రమము** :- భూయః ఊర్ధ్వగతిం ప్రాప్య తం గిరిమ్ అవలోకయన్ వాయుసూనుః నిరాలంబే విమలే అంబరే జగామ.

**ప్రతిపదార్థము** :- భూయః = తిరిగి, ఊర్ధ్వగతిం ప్రాప్య = ఆకాశమువైపు ముఖముగనే, గమనమును సాగించి, తం గిరిమ్ అవలోకయన్ = ఆ మైనాకపర్వతమును తిలకించుచు, వాయుసూనుః = వాయుపుత్రుడు, నిరాలంబే = ఆధారరహితమైనట్టి, విమలే అంబరే = నిర్మలమైన ఆకాశమున, జగామ = వెడలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- తం గిరిమ్ అవలోకయన్ = తనకు క్రిందుగా నున్న పర్వతమును చూచుచు అని భావము.

**భూషణము** :- గిరిం తం = ఆ మైనాకుని, సముద్రుని.

**బొంబాయి ప్రతి** :- 'నిరాలంబే జగామ విమలే అంబరే'కి బదులుగా 'నిరాలంబో జగామ కపికుంజరః' అని పాఠాంతరము. హనుమంతు డాధారరహితుడుగనే పయనము సాగించుచుండెను.

**తాత్పర్యము** :- హనుమంతుడు ఇంకను ఎత్తునకు ఎగిరి తనకు క్రింద గాన్పించుచున్న మైనాకుని జూచుచు నిరాలంబమగు ఆకాశమార్గమున ప్రయాణము సాగించెను.

**శ్లో॥ తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్ ।**
**ప్రశశంసు స్సురాస్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః ॥ 135**

**పదచ్ఛేదము** :- తత్ - ద్వితీయం - హనుమతః - దృష్ట్వా - కర్మ - సుదుష్కరం - ప్రశశంసుః - సురాః - సర్వే - సిద్ధాః - చ - పరమర్షయః ॥

**అన్వయక్రమము** :- హనుమతః తత్ ద్వితీయం సుదుష్కరం కర్మ దృష్ట్వా, సర్వే సురాః సిద్ధాః పరమఋషయశ్చ ప్రశశంసుః.

**ప్రతిపదార్థము** :- హనుమతః = హనుమంతునియొక్క, తత్ ద్వితీయం = ఆ రెండవది యైన, సుదుష్కరం కర్మ = అతికఠినమైనట్టి కృత్యమును, దృష్ట్వా = చూచి, సర్వే సురాః = దేవతలందరును, సిద్ధాః = సిద్ధులును, పరమఋషయశ్చ = మహాఋషులెల్లరును, ప్రశశంసుః = మిక్కిలిగా శ్లాఘించిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'తద్ద్వితీయం' = పర్వతజయరూపమైనట్టి కృత్యమును.

**మహేశ్వరతీర్థులు** :– మైనాకగిరియందు విశ్రమింపకుండ సాగిపోవుట రెండవ దుష్కర కృత్యము.

**తిలకము** :– 'ద్వితీయం కర్మ' = విశ్రమింపకుండగనే మిక్కిలి ఊర్ధ్వముగా ఎగురుట యను దుష్కరకృత్యము.

**తాత్పర్యము** :– హనుమంతుడు మైనాక పర్వతమునందు విశ్రమింపకుండగనే, ముందునకు పోవుచుండుట యను ఆ రెండవ దుష్కరకార్యమును గాంచి, శ్లాఘించి సకలదేవతలును, సిద్ధులును మహాఋషులును అతనిని మిక్కిలి ప్రశంసించిరి.

**శ్లో॥ దేవతాశ్చాభవన్ హృష్టాస్తత్రస్థాస్తస్య కర్మణా ।**
**కాంచనస్య సునాభస్య సహస్రాక్షశ్చ వాసవః ॥ 136**

**శ్లో॥ ఉవాచ వచనం ధీమాన్ పరితోషాత్సగద్గదమ్ ।**
**సునాభం పర్వతశ్రేష్ఠం స్వయమేవ శచీపతిః ॥ 137**

**పదచ్ఛేదము** :– దేవతాః – చ – అభవన్ – హృష్టాః – తత్రస్థాః – తస్య – కర్మణా – కాంచనస్య – సునాభస్య – సహస్రాక్షః – చ – వాసవః – ఉవాచ – వచనం – ధీమాన్ – పరితోషాత్ – సగద్గదమ్ – సునాభం – పర్వతశ్రేష్ఠం – స్వయమ్ – ఏవ – శచీపతిః ॥

**అన్వయక్రమము** :– కాంచనస్య సునాభస్య తస్య కర్మణా తత్రస్థాః దేవతాః హృష్టాః అభవన్. ధీమాన్ సహస్రాక్షః శచీపతిః వాసవః పరితోషాత్ పర్వతశ్రేష్ఠం సగద్గదం స్వయమేవ ఇదం వచనమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :– కాంచనస్య సునాభస్య = సువర్ణశిఖరములతో శోభితుడైన, తస్య = ఆ మైనాకునియొక్క, కర్మణా = కృత్యముచేత, తత్రస్థాః = అచట గల, దేవతాశ్చ = దేవతలెల్లరును, హృష్టాః అభవన్ = హర్షము నొందినవారైరి. సహస్రాక్షః = వేయికన్నులుగలవాడును, శచీపతిః = శచీదేవికి వల్లభుడును, ధీమాన్ = ప్రజ్ఞావంతుడును అగు, వాసవః = దేవేంద్రుడు, పరితోషాత్ = ఆనందాతిశయముతో, పర్వతశ్రేష్ఠం సునాభం = పర్వతశ్రేష్ఠుడైన మైనాకుని, సగద్గదం = డగ్గుత్తికపడిన కంఠముతో, స్వయమేవ = స్వయముగనే, ఇదం వచనమ్ ఉవాచ = ఈ మాటలను పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– 'తస్య కర్మణా' = అతని పనిచేత విశ్రాంతి తీసుకొనుమని

ప్రార్థించుట మున్నగు కృత్యముచేత, తత్రస్థాః దేవతాః = అక్కడనున్నట్టి హనుమంతుని కృత్యము నవలోకించుటకై కూడా నున్నట్టి దేవతలు.

**బొంబాయి ప్రతి అన్వయము** :– హనుమంతుని కర్మనుజూచి దేవతలును సహస్రాక్షుడైన వాసవుడుగూడ సంతసించిన వారయిరి. వాసవుడు గూడ సంతసించినవాడాయెను. అని ప్రత్యేకముగా కూడా అన్వయించుట రామానుజీయము, గోవిందరాజీయము కూడా అంగీకరించెను.

**తాత్పర్యము** :– అంజనేయుని విషయమునందు మైనాకు డొనర్చిన కృత్యమునకు దేవతలెల్లరును మిక్కిలిగ సంతసించిరి. వేయి కన్నుల వేల్పయిన దేవేంద్రుడు గూడ మిక్కిలి సంతోషముతో డగ్గుత్తిక నొందిన కంఠముతో మైనాకుని జూచి ఈ విధముగ బలికెను.

**శ్లో॥ హిరణ్యనాభ శైలేంద్ర పరితుష్టోఽస్మి తే భృశమ్ ।**
**అభయం తే ప్రయచ్ఛామి తిష్ఠ సౌమ్య యథాసుఖమ్ ॥ 138**

**పదచ్ఛేదము** :– హిరణ్యనాభ – శైలేంద్ర – పరితుష్టః – అస్మి – తే – భృశమ్ – అభయం – తే – ప్రయచ్ఛామి – తిష్ఠ – సౌమ్య – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము** :– హే హిరణ్యనాభ! శైలేంద్ర! భృశమ్ పరితుష్టః అస్మి, తే అభయం ప్రయచ్ఛామి; హే సౌమ్య! యథాసుఖం తిష్ఠ!

**ప్రతిపదార్థము** :– హే హిరణ్యనాభ! శైలేంద్ర! = ఓ మైనాకా! పర్వతశ్రేష్ఠుడా! తే = నీయెడ, భృశమ్ = మిక్కిలిగ, పరితుష్టః అస్మి = సంతోషించినవాడనైతిని, తే = నీకు, అభయం ప్రయచ్ఛామి = అభయప్రదానము చేయుచున్నాను, హే సౌమ్య! = ఓ ఉత్తముడా, యథాసుఖం తిష్ఠ = సుఖముగ నుండుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అభయమ్ = తాను రెక్కలను ఖండించునను శంకవలన భయము లేకుండగా నని భావము.

**తాత్పర్యము** :– ఓ శైలేంద్ర! నీవొనర్చిన కృత్యమునకు నే నత్యంతముగ సంతసించితిని. నేను నీ కభయ మొసంగుచున్నాను. ఇక నీవు నిర్భయముగ సుఖముగా నుండుము.

**శ్లో॥ సాహ్యం కృతం తే సుమహ ద్విక్రాంతస్య హనూమతః ।**
**క్రమతో యోజనశతం నిర్భయస్య భయే సతి ॥ 139**

**పదచ్ఛేదము** :– సాహ్యం – కృతం – తే – సుమహత్ – విక్రాంతస్య – హనూమతః – క్రమతః – యోజనశతం – నిర్భయస్య – భయే – సతి ॥

**అన్వయక్రమము** :– భయే సతి నిర్భయస్య, యోజనశతం క్రమతః, విక్రాంతస్య, హనూమతః తే సుమహత్ సాహ్యం కృతమ్.

**ప్రతిపదార్థము** :– భయే సతి = (అమితమగు) భయమేర్పడి యుండగా, నిర్భయస్య = భయరహితుడై యున్నవాడును, యోజనశతం క్రమతః = నూరుయోజనములు ప్రయాణము పూని యున్నవాడును, విక్రాంతస్య = అమితవిక్రమము ప్రదర్శించుచున్న వాడునగు, హనూమతః = హనుమంతునకు, తే = నీచేత, సుమహత్ సాహ్యం కృతం = మిక్కిలి గొప్పదైన సహాయము చేయబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– 'భయే సతి' – సుగ్రీవునివలన వానరసమూహమున కంతకును శిక్షరూపమగు భయము తటస్థించి యుండగా.

**గోవిందరాజీయము** :– 'భయే సతి' – సముద్రలంఘనమునందు ఈ హనుమంతుని కేమి ఆపద వాటిల్లునో యని దేవతల మగు మేము భయపడుచుండగా.

**మహేశ్వరతీర్థులు** :– 'భయే సతి' నేను రెక్కలు తెగ గొట్టుదు నేమో యను భయము బాధించుచున్నప్పటికిని.

**బొంబాయిప్రతి** :– 'విక్రాంతస్య'కి బదులుగా, 'విశ్రాంతస్య'యని ఈ ప్రతియందు పాఠాంతరము గలదు.

**తాత్పర్యము** :– పరాక్రమశాలియగు హనుమంతునకు నీవు గొప్ప సహాయము చేసితివి. అతిభయంకరమైన నూఱు యోజనముల సముద్రము నాతడు నిర్భయుడై దాటుచున్నాడు గదా!

**శ్లో॥ రామస్యైవ హి దూత్యేన యాతి దాశరథేర్హరిః ।**
**సత్క్రియాం కుర్వతా తస్య తోషితోఽస్మి దృఢం త్వయా ॥ 140**

**పదచ్ఛేదము** :– రామస్య – ఏవ – హి – దూత్యేన – యాతి – దాశరథేః – హరిః – సత్క్రియాం – కుర్వతా – తస్య – తోషితః – అస్మి – ధృఢం – త్వయా ॥

**అన్వయక్రమము** :– దాశరథేః రామస్య ఏవ దూత్యేన హరిః యాతి. తస్య సత్క్రియాం కుర్వతా త్వయా దృఢం తోషితః అస్మి.

**ప్రతిపదార్థము :–** దాశరథేః రామస్య = దశరథపుత్రుడైన శ్రీరామునియొక్క, దూత్యేన ఏవ = దూతకృత్యముతోడనే, హరిః = ఈ హనుమంతుడు, యాతి = (ఇట్లు) పయనించుచున్నాడు. తస్య = అట్టి అతనికి, సత్క్రియాం కుర్వతా = సత్కారమును చేయుచున్నట్టి, త్వయా = నీచేత, దృఢం = మిక్కిలి అధికముగా, తోషితః అస్మి = సంతోషపెట్టబడిన వాడనైతిని.

**బొంబాయిప్రతియందు దున్న పాఠము**

**శ్లో॥ రామస్యైష హితాయైవ యాతి దాశరథేః కపిః ।**
**సత్క్రియాం కుర్వతా శక్త్యా తోషితోఽస్మి దృఢం త్వయా ॥**

**పదచ్ఛేదము :–** రామస్య – ఏషః – హితాయ – ఏవ – యాతి – దాశరథేః – కపిః – సత్క్రియాం – కుర్వతా – శక్త్యా – తోషితః – అస్మి – ధృఢం – త్వయా ॥

**ప్రతిపదార్థము :–** రామస్య హితాయ = రామునియొక్క ప్రియముకొఱకు, శక్త్యా = నీవు శక్తితో (అతనిని సత్కరించితివి గావున)

**తాత్పర్యము :–** ఈ హనుమంతుడు దశరథరాముని దూతయై ఈరీతిగా పోవుచున్నాడు. ఇతనికి సహాయ మొనర్చబూనిన నిన్ను జూచి నేను మిక్కిలి సంప్రీతుడనైతిని.

**శ్లో॥ తతః ప్రహర్ష మగమద్విపులం పర్వతోత్తమః ।**
**దేవతానాం పతిం దృష్ట్వా పరితుష్టం శతక్రతుమ్ ॥ 141**

**పదచ్ఛేదము :–** తతః – ప్రహర్షమ్ – అగమత్ – విపులం – పర్వతోత్తమః – దేవతానాం – పతిం – దృష్ట్వా – పరితుష్టం – శతక్రతుమ్ ॥

**అన్వయక్రమము :–** తతః పర్వతోత్తమః దేవతానాం పతిం శతక్రతుం పరితుష్టం దృష్ట్వా విపులం ప్రహర్షమ్ అగమత్.

**ప్రతిపదార్థము :–** తతః = అంతట, పర్వతోత్తమః = పర్వతశ్రేష్ఠుడైన మైనాకుడు, దేవతానాం పతిం = దేవతలకు ప్రభువైనట్టి, శతక్రతుం = వాసవుని, పరితుష్టం దృష్ట్వా = సంతుష్టుడైనవానినిగా తెలుసుకొని, విపులం ప్రహర్షమ్ అగమత్ = అమితమైన సంతోషము నొందెను.

**తాత్పర్యము :–** అట్లు సంతుష్టి నొందియున్న దేవేంద్రుని జూచి మైనాకుడు అమితమైన ఆనందము నొందెను.

**శ్లో॥ స వై దత్తవర శ్శైలో బభూవావస్థిత స్తదా ।**
**హనుమాంశ్చ ముహూర్తేన వ్యతిచక్రామ సాగరమ్ ॥ 142**

**పదచ్ఛేదము :–** సః – వై – దత్తవరః – శైలః – బభూవ – అవస్థితః – తదా – హనుమాన్ – చ – ముహూర్తేన – వ్యతిచక్రామ – సాగరమ్ ॥

**అన్వయక్రమము :–** సః శైలః తదా దత్తవరః (సన్) అవస్థితః బభూవ; హనుమాన్ చ ముహూర్తేన సాగరం వ్యతిచక్రామ.

**ప్రతిపదార్థము :–** సః శైలః = ఆ మైనాకగిరి, తదా = ఆ నాడు, దత్తవరః = దేవేంద్రునిచే ఇవ్వబడిన అభయము గలదై, అవస్థితః బభూవ = సముద్రజలమునందు సుఖముగ నున్నదాయెను. హనుమాన్ చ = హనుమంతుడును, ముహూర్తేన = కొద్దిక్షణములలో, సాగరం వ్యతిచక్రామ = ఆ సాగరప్రదేశమును అతిక్రమించి ముందుకు సాగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :–** అవస్థితః = అనగా స్వస్థచిత్తుడాయెనని భావము.

**తిలకము :–** సాగరమ్ – మైనాకాధిష్ఠిత సాగరప్రదేశమునని భావము.

**తాత్పర్యము :–** అప్పుడు మైనాకుడట్లు దేవేంద్రునిచే వరమును బడసి స్వస్థ చిత్తుడాయెను. హనుమంతుడును కొద్ది క్షణములలోనే ఆ ప్రదేశము దాటి ముందునకు సాగిపోయెను.

**శ్లో॥ తతో దేవాస్సగంధర్వాస్సిద్ధాశ్చ పరమర్షయః ।**
**అబ్రువన్సూర్యసంకాశాం సురసాం నాగమాతరమ్ ॥ 143**

**పదచ్ఛేదము :–** తతః – దేవాః – సగంధర్వాః – సిద్ధాః – చ – పరమర్షయః – అబ్రువన్ – సూర్యసంకాశాం – సురసాం – నాగమాతరమ్ ॥

**అన్వయక్రమము :–** తతః సగంధర్వాః దేవాః సిద్ధాః పరమర్షయః చ సూర్యసంకాశాం నాగమాతరం సురసామ్ అబ్రువన్.

**ప్రతిపదార్థము :–** తతః = అటు పిమ్మట, సగంధర్వాః = గంధర్వులతో గూడియున్న, దేవాః = దేవతలున్ను, సిద్ధాః = సిద్ధులున్ను, పరమర్షయశ్చ = మహాఋషులును, సూర్యసంకాశాం = సూర్యునితో సమానమైన తేజస్సు కలిగినట్టి, నాగమాతరం సురసాం = నాగమాతయైన సురసనుగూర్చి, అబ్రువన్ = (ఈరీతిగా) బలికిరి.

**తాత్పర్యము :–** అటుపిమ్మట దేవతలును, గంధర్వులును, సిద్ధులును, మహర్షులును మహాతేజోవంతురాలైన నాగజనని యగు సురసతో నిట్లు బలికిరి.

**శ్లో॥ అయం వాతాత్మజ శ్శ్రీమాన్ ప్లవతే సాగరోపరి ।**
**హనుమాన్నామ తస్య త్వం ముహూర్తం విఘ్న మాచర ॥ 144**

**శ్లో॥ రాక్షసం రూపమస్థాయ సుఘోరం పర్వతోపమమ్ ।**
**దంష్ట్రాకరాళం పింగాక్షం వక్త్రం కృత్వా నభస్సమమ్ ॥ 145**

**పదచ్ఛేదము :–** అయం – వాతాత్మజః – శ్రీమాన్ – ప్లవతే – సాగరోపరి – హనుమాన్ – నామ – తస్య – త్వం – ముహూర్తం – విఘ్నమ్ – ఆచర – రాక్షసం – రూపమ్ – ఆస్థాయ – సుఘోరం – పర్వతోపమమ్ – దంష్ట్రాకరాళం – పింగాక్షం – వక్త్రం – కృత్వా – నభస్సమమ్ ॥

**అన్వయక్రమము :–** అయం శ్రీమాన్ హనుమాన్ నామ వాతాత్మజః సాగరోపరి ప్లవతే; త్వం సుఘోరం పర్వతోపమం రాక్షసం రూపమ్ ఆస్థాయ దంష్ట్రాకరాళం పింగాక్షం నభస్సమం వక్త్రం కృత్వా తస్య ముహూర్తం విఘ్నమ్ ఆచర.

**ప్రతిపదార్థము :–** అయం = ఈ, శ్రీమాన్ = సర్వశుభలక్షణ సమన్వితుడును, హనుమాన్ నామ = హనుమంతుడను పేరుగలవాడునగు, వాతాత్మజః = వాయుపుత్రుడు, సాగరోపరి = సముద్రముమీదుగా, ప్లవతే = ఎగురుచు పోవుచున్నాడు. త్వం = నీవు, సుఘోరం = మిక్కిలి భయంకర మైనదియును, పర్వతోపమం = పర్వత సదృశమైనట్టిదియును అగు, రాక్షసం రూపం = రాక్షసాకారమును, ఆస్థాయ = ధరించి, దంష్ట్రాకరాళం = కోరలతో భీకరముగ నున్నట్టిదియును, పింగాక్షం = పచ్చని కన్నులు గలదియును, నభస్సమం = ఆకాశము వంటిదియు నగు, వక్త్రమ్ = నోటిని, కృత్వా = ధరించి, తస్య = ఆ హనుమంతునకు, ముహూర్తం = రెండు క్షణముల కాలము, విఘ్నమ్ ఆచర = విఘ్నమును కలిగింపుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :–** 'శ్రీమాన్' = అతిదూర సముద్ర లంఘనమునందు గూడ అంత కంతకు బలము అభివృద్ధి నొందినట్టి 'సుషమ' యను శక్తిగల వాడని భావము.

**తాత్పర్యము :–** వాయుపుత్రుడగు హనుమ సముద్రమును దాటుచున్నాడు. ఎంతదూర మేగినను అతని కాంతి పెరుగుచున్నదే గాని, వాడుట లేదు. నీ వాతనికి ఒక్కసారి విఘ్నమును గలిగించుము. ఘోరమగు రాక్షసరూపమును దాల్చి పర్వతమువలె త్రోవలో

అడ్డముగ నిలచి కోరలతో భీకరమైన నోటిని ఆకాశమంతగా పెంచి అతనిని అడ్డుకొనుము.

**శ్లో॥ బలమిచ్ఛామహే జ్ఞాతుం భూయశ్చాస్య పరాక్రమమ్ ।**
**త్వాం విజేష్యత్యుపాయేన విషాదం వా గమిష్యతి ॥ 146**

**పదచ్ఛేదము :–** బలమ్ – ఇచ్ఛామహే – జ్ఞాతుం – భూయః – చ – అస్య పరాక్రమమ్ – త్వాం – విజేష్యతి – ఉపాయేన – విషాదం – వా – గమిష్యతి ॥

**అన్వయక్రమము :–** త్వామ్ ఉపాయేన విజేష్యతి వా విషాదం గమిష్యతి వా (ఇతి) భూయః అస్య బలం పరాక్రమం చ జ్ఞాతుమ్ ఇచ్ఛామహే.

**ప్రతిపదార్థము :–** త్వాం = నిన్ను, ఉపాయేన = ఉపాయముగా, విజేష్యతి వా = జయించునో లేక, విషాదం = చింతను, గమిష్యతి వా = పొందునో (ఇతి = అను), భూయః = తిరిగి, అస్య = ఈ హనుమంతునియొక్క, బలం = శక్తిని, పరాక్రమం చ = విక్రమమును, జ్ఞాతుం ఇచ్ఛామహే = తెలిసికొనగోరుచున్నాము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** బలం = జ్ఞానేంద్రియసామర్థ్యము, పరాక్రమం = శత్రు విఘాతకమైన శక్తి, జయమువలన శక్తియు, విషాదమువలన అతని శక్తిలోపమును కనుగొనగలమని ఆ దేవతల భావము.

**శ్రీమాన్ తెన్మఠం రంగాచార్యులుగారు :–** భూయః = అనగా పుట్టినది మొదలు సూర్య భక్షణాది కార్యములచే ఈతని సామర్థ్యము అసామాన్యమైనదని జగత్ప్రసిద్ధము. అయినను ఆనాటి సామర్థ్య మిప్పు డున్నదో లేదో యను సందేహనివృత్తికొరకు తిరిగి అతని సామర్థ్యము తెలుసుకొనదలచిరి.

**తాత్పర్యము :–** ఈ హనుమంతుడు తగు ఉపాయముతో నిన్ను జయించగలడా? లేక నిన్ను జూచి భీతిచే చింతాగ్రస్తుడగునా యని ఈతని బలమును గూర్చియు, పరాక్రమమును గూర్చియును ఇంకొకమారు తెలుసుకొన గోరుచున్నాము.

**శ్లో॥ ఏవముక్తా తు సా దేవీ దైవతైరభిసత్కృతా ।**
**సముద్రమధ్యే సురసా బిభ్రతీ రాక్షసం వపుః ॥ 147**

**శ్లో॥ వికృతం చ విరూపం చ సర్వస్య చ భయావహమ్ ।**
**ప్లవమానం హనూమంత మావృత్యేద మువాచ హ ॥ 148**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తా – తు – సా – దేవీ – దైవతైః – అభిసత్కృతా – సముద్రమధ్యే – సురసా – బిభ్రతీ – రాక్షసం – వపుః ॥ వికృతం – చ – విరూపం – చ – సర్వస్య – చ – భయావహమ్ – ప్లవమానం – హనూమంతమ్ – ఆవృత్య – ఇదమ్ – ఉవాచ – హ ॥

**అన్వయక్రమము :–** దైవతైః ఏవమ్ ఉక్త్వా అభిసత్కృతా సా దేవీ సురసా సముద్రమధ్యే వికృతం విరూపం సర్వస్య చ భయావహం వపుః బిభ్రతీ, ప్లవమానం హనూమంతమ్ ఆవృత్య ఇదం ఉవాచ.

**ప్రతిపదార్థము :–** దైవతైః = దేవతలచేత, అభిసత్కృతా = మిక్కిలి గౌరవింపబడినదై, ఏవమ్ ఉక్తా = ఈరీతిగా చెప్పబడినదై, సా దేవీ సురసా = పూజ్యురాలైన ఆ సురస, సముద్రమధ్యే = ఆ సాగరమధ్యమందు, వికృతం విరూపం చ = వికారముగా నున్నదియును విలక్షణముగ నున్నదియును, సర్వస్య చ భయావహం = ఎల్లరకును భీతి గొల్పునదియును, రాక్షసం వపుః = రాక్షసరూపమైన శరీరమును, బిభ్రతీ = ధరించినదై, ప్లవమానం హనూమంతం = ఎగిరిపోవుచున్న హనుమను, ఆవృత్య = అడ్డగించి, ఇదమ్ ఉవాచ = ఈరీతిగా బలికెను.

**తాత్పర్యము :–** మిక్కిలి గౌరవముతో దేవతలు తనను ఈ రీతిగా అడుగగా సురసాదేవి వికారముగాను సర్వభయంకరముగాను ఉండునట్టి రాక్షసరూపమును ధరించినదై సముద్రముపై ఎగిరి పోవుచున్న హనుమంతుని మార్గమధ్యమున అడ్డగించి ఇట్లు పలికెను.

**శ్లో॥ మమ భక్షః ప్రదిష్ట స్త్వ మీశ్వరైర్వానరర్షభ ।**
**అహం త్వాం భక్షయిష్యామి ప్రవిశేదం మమాననమ్ ॥ 149**

**పదచ్ఛేదము :–** మమ – భక్షః – ప్రదిష్టః – త్వమ్ – ఈశ్వరైః – వానరర్షభ – అహం – త్వాం – భక్షయిష్యామి – ప్రవిశ – ఇదం – మమ – ఆననమ్ ॥

**అన్వయక్రమము :–** హే వానరర్షభ! త్వం మమ ఈశ్వరైః భక్షః ప్రదిష్టః; అహం త్వాం భక్షయిష్యామి; ఇదం మమ ఆననం ప్రవిశ.

**ప్రతిపదార్థము :–** హే వానరర్షభ = ఓ వానరశ్రేష్ఠుడా! త్వం = నీవు, మమ = నాకు, ఈశ్వరైః = దేవతలచేత, భక్షః ప్రదిష్టః = ఆహారముగా పంపబడితివి. అహం = నేను, త్వాం = నిన్ను, భక్షయిష్యామి = భక్షించెదను, ఇదం మమ ఆననం = ఈ నా ముఖమును, ప్రవిశ = ప్రవేశింపుము.

**తాత్పర్యము :–** ఓ వానరశ్రేష్ఠుడా! నీవు నాకు దేవతలచేత ఆహారముగా పంపబడి

యున్నావు. కావున నేను ఇప్పుడే నిన్ను భక్షించెదను. ఇదిగో వెంటనే నా నోటిలో ప్రవేశింపుము.

**శ్లో॥ వర ఏష పురా దత్తో మమ ధాత్రేతి సత్వరా ।**
**వ్యాదాయ విపులం వక్త్రం స్థితా సా మారుతేః పురః ॥ 150**
(ఈ శ్లోకము ఒక్క బొంబాయి ప్రతియందు మాత్రమే గలదు)

**పదచ్ఛేదము :–** వరః – ఏషః – పురా – దత్తః – మమ – ధాత్రా – ఇతి – సత్వరా – వ్యాదాయ – విపులం – వక్త్రం – స్థితా – సా – మారుతేః – పురః ॥

**అన్వయక్రమము :–** పురా మమ ధాత్రా ఏషః వరః దత్తః ఇతి సత్వరా సా విపులం వక్త్రం వ్యాదాయ మారుతేః పురః స్థితా.

**ప్రతిపదార్థము :–** పురా = పూర్వకాలమునందు, మమ = నాకు, ధాత్రా = బ్రహ్మదేవునిచేత, ఏషః వరః దత్తః = ఈ వర మొసగబడినది, ఇతి = అని (పలికి), సత్వరా సా = వేగిరపాటు కలిగినదైనట్టి ఆ సురస, విపులం వక్త్రం = (తన) విశాలమైన నోటిని, వ్యాదాయ = తెరచుకొని, మారుతేః పురః = హనుమంతుని ఎదుట, స్థితా = నిలువబడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఏష వరః = ఎదుటబడినవాడు తన నోటిలోనికి ప్రవేశించునట్టి వరము.

**రామాయణశిరోమణి :–** ఏష వరః = ఎదుటికి వచ్చిన వానిని మాత్రమే తిని జీవించి యుండగల శక్తి.

**తాత్పర్యము :–** పూర్వము బ్రహ్మదేవుడు నా కీ వరమొసంగి యున్నాడు అని పలికి ఆమె అతివేగముగా తన నోటిని తెరచుకొని హనుమంతుని ఎదుటికి పోయి అడ్డముగా నిలువబడెను.

**శ్లో॥ ఏవముక్త స్సురసయా ప్రాంజలి ర్వానరర్షభః ।**
**ప్రహృష్టవదనః శ్రీమానిదం వచనమబ్రవీత్ ॥ 151**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తః – సురసయా – ప్రాంజలిః – వానరర్షభః – ప్రహృష్ట వదనః – శ్రీమాన్ – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** సురసయా ఏవమ్ ఉక్తః శ్రీమాన్ వానరర్షభః ప్రహృష్టవదనః ప్రాంజలిః (సన్) ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- సురసయా = సురసచే, ఏవమ్ ఉక్తః = ఈ రీతిగా చెప్పబడిన, శ్రీమాన్ వానరర్షభః = శుభలక్షణసమన్వితుడైన ఆ వానరశ్రేష్ఠుడు, ప్రహృష్టవదనః = హర్షాతిశయముగల ముఖము గలవాడును, ప్రాంజలిః (సన్) = దోసిలి యొగ్గిన వాడు నయి, ఇదం వచనమ్ అబ్రవీత్ = ఈ మాటను బలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ప్రహృష్టవదనః = ఆమెకు భక్షించు వర మున్నప్పటికిని తనకు ఆ యపాయమును తొలగించుకొను ఉపాయము గలదని సహర్షవదను డయ్యెనని భావము.

**రామానుజీయము** :- ఇచ్చట 'శ్రీ'శబ్దము చేత అతిదూర సముద్రలంఘనము నందుగూడ మీదు మిక్కిలి బలాభివృద్ధిని గూర్చెడి 'సుషమ' యను శక్తిగలవాడని భావము.

**తాత్పర్యము** :- సురస ఇట్లు పలికిన పలుకులు విని వానరశ్రేష్ఠుడైన హనుమ మహాసంతోషముతో వినయపూర్వకముగా, ఆమెతో నిట్లు బలికెను.

**శ్లో॥ రామో దాశరథిర్నామ ప్రవిష్టో దండకావనమ్ ।**
**లక్ష్మణేన సహ భ్రాత్రా వైదేహ్యా చాపి భార్యయా ॥ 152**

**పదచ్ఛేదము** :- రామః – దాశరథిః – నామ – ప్రవిష్టః – దండకావనం – లక్ష్మణేన – సహ – భ్రాత్రా – వైదేహ్యా – చ – అపి – భార్యయా ॥

**అన్వయక్రమము** :- రామః నామ దాశరథిః భ్రాత్రా లక్ష్మణేన భార్యయా వైదేహ్యా చ అపి సహ దండకావనం ప్రవిష్టః.

**ప్రతిపదార్థము** :- రామః నామ = శ్రీరాముడను పేరుగల, దాశరథిః = దశరథుని కుమారుడు, భ్రాత్రా లక్ష్మణేన = తమ్ముడైన లక్ష్మణునితోను, భార్యయా వైదేహ్యా చ, అపి సహ = భార్యయైన సీతతోడను గూడ, దండకావనం = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించి యుండెను.

**తాత్పర్యము** :- దశరథుని పుత్రుడైన శ్రీరాముడను నాతడు లక్ష్మణుడను తమ్మునితోడను, సీతయను భార్యతోడను గలసి దండకారణ్యమునకు వచ్చెను.

**శ్లో॥ అన్యకార్యవిషక్తస్య బద్ధవైరస్య రాక్షసైః ।**
**తస్య సీతా హృతా భార్యా రావణేన యశస్వినీ ॥ 153**

**పదచ్ఛేదము** :– అన్యకార్యవిషక్తస్య – బద్ధవైరస్య – రాక్షసైః – తస్య – సీతా – హృతా – భార్యా – రావణేన – యశస్వినీ ॥

**అన్వయక్రమము** :– అన్యకార్యవిషక్తస్య రాక్షసైః బద్ధవైరస్య తస్య యశస్వినీ భార్యా సీతా రావణేన హృతా.

**ప్రతిపదార్థము** :– అన్యకార్యవిషక్తస్య = వేఱుపనిలో నిమగ్నుడై యున్నవాడును (అనగా మాయామృగము నన్వేషించుచు దానిని కొని తెచ్చుటకై దూరమునకు బోయి యుండగా) రాక్షసైః బద్ధవైరస్య = రాక్షసులతో విరోధము కల్గియున్నవాడు నగునట్టి, తస్య = ఆ శ్రీరామునియొక్క, యశస్వినీ = ఉత్తమురాలని వన్నెకెక్కినట్టి, భార్యా సీతా = భార్యయగు సీతాదేవి, రావణేన = రావణునిచేత, హృతా = దొంగిలింపబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అన్యకార్యవిషక్తుడు = మాయామృగవధయందు నిమగ్నుడై యున్నవాడని భావము. బద్ధవైరుడు = శూర్పణఖ ముక్కుచెవులు గోయుటచే ఆగ్రహము పూనిన రాక్షసులతో వైరము గల్గినవాడు.

**గోవిందరాజీయము** :– అన్యకార్యవిషక్తస్య = మారీచమృగమును గ్రహించుటయందు నిమగ్నుడై యుండగా.

**మహేశ్వరతీర్థులు** :– అన్యకార్యవిషక్తస్య = మాయామృగవధకొఱకై దూరముగ చనియుండగా.

**తాత్పర్యము** :– శ్రీరాముడు ఇతరకార్యమునందు నిమగ్నుడై దూరమున నుండగా రాక్షసులను సంహరించుచున్నాడని విరోధభావము బూని రావణుడు పరమ పతివ్రతయగు సీతయను పేరుగల అతని భార్యను అపహరించెను.

**శ్లో॥ తస్యాస్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్ ।**
**కర్తుమర్హసి రామస్య సాహ్యం విషయవాసిని ॥ 154**

**పదచ్ఛేదము** :– తస్యాః – సకాశం – దూతః – అహం – గమిష్యే – రామశాసనాత్ – కర్తుమ్ – అర్హసి – రామస్య – సాహ్యం – విషయవాసిని ॥

**అన్వయక్రమము** :– రామశాసనాత్ అహం దూతః (సన్) తస్యాః సకాశం గమిష్యే. హే విషయవాసిని! రామస్య సాహ్యం కర్తుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము** :– రామశాసనాత్ = శ్రీరాముని ఆజ్ఞవలన, అహం = నేను, తస్యాః

సకాశం = ఆమె కడకు, దూతః (సన్) = దూతనగుచు, గమిష్యే = పోవుచున్నాను. హే విషయవాసిని = (అతని) రాజ్యమునందున్నట్టి ఓ ఉత్తమురాలా! త్వం = నీవు, రామస్య = శ్రీరామునికి, సాహ్యం కర్తుం అర్హసి = సహాయము చేయదగియున్నావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** విషయవాసిని = రాముడు సర్వాధిపతి గావున సురస యున్నది గూడ శ్రీరాముని రాజ్యమే.

**గోవిందరాజీయము:–** విషయవాసిని = రామరాజ్యవాసిని.

**మహేశ్వరతీర్థులు :–** విషయవాసిని – రామరాజ్యవాసిని అనగా శ్రీరాముడు త్రిలోకనాథుడై యుండుటవలన.

**తాత్పర్యము :–** శ్రీరాముని ఆజ్ఞప్రకారము నేను దూతకృత్యము బూని సీతయున్న చోటికి పోవుచున్నాను. నీవును శ్రీరాముని రాజ్యమునందే నివసించుచున్నదానవు కాబట్టి అతనికి సహాయము చేయవలసిన దానవే గదా!

**శ్లో॥ అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్ ।**
**ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే ॥ 155**

**పదచ్ఛేదము :–** అథవా – మైథిలీం – దృష్ట్వా – రామం – చ – అక్లిష్టకారిణమ్ – ఆగమిష్యామి – తే – వక్త్రం – సత్యం – ప్రతిశృణోమి – తే ॥

**అన్వయక్రమము :–** అథవా, మైథిలీమ్ అక్లిష్టకారిణం రామం చ దృష్ట్వా, తే వక్త్రమ్ ఆగమిష్యామి. తే సత్యం ప్రతిశృణోమి.

**ప్రతిపదార్థము :–** అథవా = లేక, మైథిలీమ్ = సీతను, అక్లిష్టకారిణం రామం చ = ఎల్లరకును క్షేమమును గూర్చునట్టి శ్రీరాముని, దృష్ట్వా = దర్శించి, తే వక్త్రమ్ ఆగమిష్యామి = నీ నోటికడకు రాగలను, తే సత్యం ప్రతిశృణోమి = నీకు ప్రమాణము చేసి సత్యమును చెప్పుచున్నాను.

**తాత్పర్యము :–** శ్రీరామునికి సహాయము చేయనందువేని నే నిప్పుడే పోయి సీతాదేవిని వెదికి కనుగొని మహాత్ముడైన శ్రీరామునికి సీత విషయము నివేదించి వెంటనే నీకు ఆహారముగా నీ కడకు వచ్చివేయుదును. నేను ప్రమాణపూర్వకముగా నీ కిది చెప్పుచున్నాను.

**శ్లో॥ ఏవముక్తా హనుమతా సురసా కామరూపిణీ ।**
**అబ్రవీ న్నాతివర్తేత కశ్చి దేష వరో మమ ॥ 156**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తా – హనుమతా – సురసా – కామరూపిణీ – అబ్రవీత్ – న – అతివర్తేత – కః – చిత్ – ఏషః – వరః – మమ ॥

**అన్వయక్రమము :–** హనుమతా ఏవమ్ ఉక్తా కామరూపిణీ సురసా అబ్రవీత్; కశ్చిత్ న అతివర్తేత; మమ ఏషః వరః.

**ప్రతిపదార్థము :–** హనుమతా = హనుమంతునిచే, ఏవమ్ ఉక్తా = ఈరీతిగా చెప్పబడినదై, కామరూపిణీ సురసా = కామరూపిణి యగు ఆ సురస, అబ్రవీత్ = (ఇట్లు) పలికెను. కశ్చిత్ = ఎవ్వడును, న అతివర్తేత = నన్ను మీరిపోవుటకు వీలులేదు, మమ = నాకు, ఏషః వరః = ఇది వరముగ నీయబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** ఏషః మమ వరః = బ్రహ్మదేవునిచే ఈయబడినట్టిదని భావము.

**తాత్పర్యము :–** హనుమంతుడిట్లు చెప్పగా విని కామరూపిణియైన సురస అతనితో నిట్లు పలికెను. ఎవ్వరికిని నన్ను మీరి పోవుటకు శక్యము గాదు. నాకీ వరమును దేవతలిచ్చిరి.

**శ్లో॥ తం ప్రయాంతం సముద్వీక్ష్య సురసా వాక్యమబ్రవీత్ ।**
**బలం జిజ్ఞాసమానా సా నాగమాతా హనూమతః ॥ 157**

**పదచ్ఛేదము :–** తం – ప్రయాంతం – సముద్వీక్ష్య – సురసా – వాక్యమ్ – అబ్రవీత్ – బలం – జిజ్ఞాసమానా – సా – నాగమాతా – హనూమతః ॥

**అన్వయక్రమము :–** ప్రయాంతం తం సముద్వీక్ష్య సా నాగమాతా సురసా హనూమతః బలం జిజ్ఞాసమానా వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** ప్రయాంతం = వెడలిపోవుచున్నట్టి, తం = ఆ హనుమను, సముద్వీక్ష్య = చూచి, సా నాగమాతా సురసా = నాగమాతయైన ఆ సురస, హనూమతః = హనుమంతునియొక్క, బలం = శక్తిని, జిజ్ఞాసమానా = తెలిసికొన గోరినదై, వాక్యమ్ అబ్రవీత్ = ఈ వాక్యమును బలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ప్రయాంతం = వరదానవిషయమును విని కూడ వెడలిపోవుచున్నట్టి వాడని భావము.

**మహేశ్వరతీర్థులు** :- బ్రహ్మ తన కిచ్చిన వరదాన విషయమును విని గూడ వెడలి పోవుచున్నాడని సురస అతనితో తిరిగి పలికెనని భావము.

**తాత్పర్యము** :- తనకు జవాబు చెప్పుచు ముందునకు పోవుచున్నట్టి హనుమంతుని జూచి ఆ సురస అతని శక్తి ఎంతటిదో తెలిసికొనవలసియున్నది. కాబట్టి అతనితో ఇట్లు పలికినది.

**శ్లో॥ నివిశ్య వదనం మేఽద్య గంతవ్యం వానరోత్తమ ।**
**వర ఏష పురా దత్తో మమ ధాత్రేతి సత్వరా ।**
**వ్యాదాయ విపులం వక్త్రం స్థితా సా మారుతేః పురః ॥ 158**

**పదచ్ఛేదము** :- నివిశ్య – వదనం – మే – అద్య – గంతవ్యం – వానరోత్తమ – వరః – ఏషః – పురా – దత్తః – మమ – ధాత్రా – ఇతి – సత్వరా – వ్యాదాయ – విపులం – వక్త్రం – స్థితా – సా – మారుతేః – పురః ॥

**అన్వయక్రమము** :- హే! వానరోత్తమ! అద్య మే వదనం నివిశ్య గంతవ్యమ్; ఏషః వరః ధాత్రా పురా మమ దత్తః. ఇతి సత్వరా సా విపులం వక్త్రం వ్యాదాయ మారుతేః పురః స్థితా.

**ప్రతిపదార్థము** :- హే! వానరోత్తమ = ఓ వానరశ్రేష్ఠుడా! అద్య = ఇప్పుడు, మే వదనం నివిశ్య = నా నోటిలోనికి ప్రవేశించి, గంతవ్యమ్ = వెళ్ళవలసియున్నది, ఏషః వరః = ఈ వరము, ధాత్రా = బ్రహ్మదేవునిచేత, పురా = పూర్వకాలమున, మమ దత్తః = నాకు ఈయబడినది, ఇతి = అని పలికి, సత్వరా = వేగముతోడ, సా = ఆ సురస, విపులం వక్త్రం = పెద్దదైన (తన) నోటిని, వ్యాదాయ = తెరచి, మారుతేః పురః = హనుమంతుని ఎదుట, స్థితా = నిలువబడెను.

*గమనిక :- కొన్ని ప్రతులలో 'నివిశ్య'కు బదులుగా 'ప్రవిశ్య' అని గలదు.*

**తాత్పర్యము** :- ఓ వానరశ్రేష్ఠుడా! ఇప్పుడు నీవు నా నోటిలో ప్రవేశించకుండగ ముందునకు పోవుటకు వీలులేదు. ఇది నాకు పూర్వము బ్రహ్మదేవు డొసగిన వరము. అని పలుకుచు ఆమె పెద్దదైనట్టి తన నోటిని మిక్కిలి వెడల్పుగా తెరచి హనుమకు ఎదురుగ నిలువబడెను.

**శ్లో॥ ఏవముక్త స్సురసయా క్రుద్ధో వానరపుంగవః ।**
**అబ్రవీత్కురు వై వక్త్రం యేన మాం విషహిష్యసే ॥ 159**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - ఉక్తః - సురసయా - క్రుద్ధః - వానరపుంగవః - అబ్రవీత్ - కురు - వై - వక్త్రం - యేన - మాం - విషహిష్యసే ॥

**అన్వయక్రమము** :- సురసయా ఏవమ్ ఉక్తః వానరపుంగవః క్రుద్ధః (సన్) అబ్రవీత్. యేన మాం విషహిష్యసే తం వక్త్రం కురు.

**ప్రతిపదార్థము** :- సురసయా = సురసచే, ఏవమ్ ఉక్తః = ఈ విధముగా చెప్పబడినట్టి, వానరపుంగవః = హనుమంతుడు, క్రుద్ధః (సన్) = క్రోధము నొందినవాడై, అబ్రవీత్ = (ఇట్లు) పలికెను. యేన = ఎట్టి నోటితో, మాం = నన్ను, విషహిష్యసే = భరింపగలవో (తం) వక్త్రం = అట్టి నోటిని, కురు = పూనుము.

**తాత్పర్యము** :- సురస అట్లు పలుకగనే హనుమంతుడు క్రుద్ధుడై ఆమెతో ఇట్లు పలికెను. అయినచో నన్ను మ్రింగగలిగినంతగా నీ నోరు తెరువుము.

**శ్లో॥ ఇత్యుక్త్వా సురసాం క్రుద్ధో దశయోజన మాయతః ।**
**దశయోజనవిస్తారో హనుమానభవత్తదా ॥ 160**

**పదచ్ఛేదము** :- ఇతి - ఉక్త్వా - సురసాం - క్రుద్ధః - దశయోజనమ్ - ఆయతః - దశయోజనవిస్తారః - హనుమాన్ - అభవత్ - తదా ॥

**అన్వయక్రమము** :- ఇతి సురసామ్ ఉక్త్వా హనుమాన్ క్రుద్ధః సన్ తదా దశయోజనమ్ ఆయతః దశయోజనవిస్తారః అభవత్.

**ప్రతిపదార్థము** :- సురసాం = సురసను, ఇతి ఉక్త్వా = ఇట్లు పలికి, క్రుద్ధః = కోపించియున్నట్టి, హనుమాన్ = హనుమ, తదా = అప్పుడు, దశయోజన మాయతః = దశయోజనములు పొడవుగలవాడును, దశయోజనవిస్తారః = దశయోజనముల వెడల్పుగలవాడును, అభవత్ = ఆయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము** :- దశయోజన మాయతః = ఇంతకు ముందు 'దశయోజన విస్తీర్ణా త్రింశత్ యోజనమాయతా ఛాయా వానరసింహస్య' అని వర్ణింపబడిన ఆ పరిమాణమును సురసాదర్శనమునకు పూర్వమే సంక్షేపించుకొని ఆకసమునందు హనుమ ఎగురుచుండెనని గ్రహించవలెను.

**తాత్పర్యము :–** హనుమంతుడిట్లు చెప్పి కోపముతో తాను గూడ దశయోజనముల పొడవును వెడల్పు గల శరీరముతో ఆమె ముందుండెను.

**శ్లో॥ తం దృష్ట్వా మేఘసంకాశం దశయోజన మాయతమ్ ।**
**చకార సురసా ప్యాస్యం వింశద్యోజన మాయతమ్ ॥ 161**

**పదచ్ఛేదము :–** తం – దృష్ట్వా – మేఘసంకాశం – దశయోజనమ్ – ఆయతమ్ – చకార – సురసా – అపి – ఆస్యం – వింశద్యోజనమ్ – ఆయతమ్ ॥

**అన్వయక్రమము :–** మేఘసంకాశం తం దశయోజనమ్ ఆయతమ్ దృష్ట్వా సురసా అపి ఆస్యం వింశద్యోజనమ్ ఆయతం చకార.

**ప్రతిపదార్థము :–** మేఘసంకాశం తం = మహామేఘముతో సమానుడై యున్న అతనిని, దశయోజనమ్ ఆయతం దృష్ట్వా = పది యామడల పొడవైయున్న వానినిగా జూచి, సురసా అపి = సురసగూడ, ఆస్యం = (తన) నోటిని, వింశద్యోజనమ్ ఆయతం = ఇరువది యామడల పొడవుగల దానినిగా, చకార = చేసెను.

**తాత్పర్యము :–** పెద్ద మేఘమువలె పదియామడల పొడవైన శరీరముతో నున్న ఆ హనుమంతుని జూచి సురస వెంటనే తన నోటిని ఇరువది ఆమడల పొడవైనదిగా చేసెను.

**శ్లో॥ హనుమాం స్తు తతః క్రుద్ధ స్త్రింశద్యోజన మాయతః ।**
**చకార సురసా వక్త్రం చతుర్వింశత్తథోచ్ఛ్రితమ్ ॥ 162**

**పదచ్ఛేదము :–** హనుమాన్ – తు – తతః – క్రుద్ధః – త్రింశద్యోజనమ్ – ఆయతః – చకార – సురసా – వక్త్రం – చతుర్వింశత్ – తథా – ఉచ్ఛ్రితమ్ ॥

**అన్వయక్రమము :–** హనుమాన్ తు క్రుద్ధః తతః త్రింశద్యోజనమ్ ఆయతః (అభవత్). సురసా (అపి) తథా వక్త్రం, చతుర్వింశత్ ఉచ్ఛ్రితమ్ చకార.

**ప్రతిపదార్థము :–** హనుమాన్ తు = హనుమంతు డప్పుడు, క్రుద్ధః = కోపించినవాడై, తతః = వెంటనే, త్రింశద్యోజనం = ముప్పది యామడల, ఆయతః (అభవత్) = పొడవైనవాడయ్యెను, సురసా (అపి) = సురస (గూడ), తథా = ఆప్రకారముగనే, వక్త్రం = (తన) నోటిని, చతుర్వింశత్ ఉచ్ఛ్రితమ్ = నలుబదియామడల పొడవుగా, చకార = చేసెను.

**తాత్పర్యము :–** హనుమంతు డప్పుడు కోపించి వెంటనే తన దేహమును ముప్పది యామడల పొడవుగా పెంచెను. అది చూచి సురస గూడ తన నోటిని నలుబది

యోజనముల పొడవు చేసెను.

**శ్లో॥ బభూవ హనుమాన్వీరః పంచాశద్యోజనోచ్ఛ్రితః ।**
**చకార సురసా వక్త్రం షష్టిం యోజనముచ్ఛ్రితమ్ ॥ 163**

**పదచ్ఛేదము :**– బభూవ – హనుమాన్ – వీరః – పంచాశద్యోజనోచ్ఛ్రితః – చకార – సురసా – వక్త్రం – షష్టిం – యోజనమ్ – ఉచ్ఛ్రితమ్ ॥

**అన్వయక్రమము :**– వీరః హనుమాన్ పంచాశద్యోజనోచ్ఛ్రితః బభూవ. సురసా వక్త్రం షష్టియోజనమ్ ఉచ్ఛ్రితమ్ చకార.

**ప్రతిపదార్థము :**– వీరః హనుమాన్ = వీరుడైన హనుమంతుడు, పంచాశద్యోజనోచ్ఛ్రితః = ఏబదియోజనముల పొడవుగా, బభూవ = అయ్యెను. సురసా = సురసయు, వక్త్రం = (తన) నోటిని, షష్టియోజనమ్ ఉచ్ఛ్రితం = అరువది యోజనములు పొడవైనదిగా, చకార = చేసెను.

**తాత్పర్యము :**– వీరుడైన హనుమంతు డపుడు తాను ఏబది యామడల పొడవరిగా పెరిగెను. వెంటనే సురస తన నోటిని అరువది యామడల పొడవైనదానిగా చేసెను.

**శ్లో॥ తదైవ హనుమాన్ వీరః సప్తతిం యోజనోచ్ఛ్రితః ।**
**చకార సురసా వక్త్రమ్ అశీతిం యోజనోచ్ఛ్రితమ్ ॥ 164**

**పదచ్ఛేదము :**– తదా – ఏవ – హనుమాన్ – వీరః – సప్తతిం – యోజనోచ్ఛ్రితః – చకార – సురసా – వక్త్రమ్ – అశీతిం – యోజనోచ్ఛ్రితమ్ ॥

**అన్వయక్రమము :**– వీరః హనుమాన్ తదైవ సప్తతిం యోజనోచ్ఛ్రితః (అభవత్). సురసా వక్త్రమ్ అశీతిం యోజనోచ్ఛ్రితం చకార.

**ప్రతిపదార్థము :**– వీరః హనుమాన్ = వీరుడైన హనుమంతుడు, తదైవ = వెంటనే, సప్తతిం యోజనోచ్ఛ్రితః = డెబ్బది యోజనముల పొడగరి, (అభవత్ = అయ్యెను), సురసా = సురస, వక్త్రం = నోటిని, అశీతిం యోజనోచ్ఛ్రితం = ఎనుబదియోజనముల పొడవుగ, చకార = చేసెను.

**తాత్పర్యము :**– మహావీరుడైన హనుమ అప్పుడు డెబ్బది యామడల పొడవైన రూపమును పూనియుండెను. అంతట సురస తన నోటిని ఎనుబది యోజనముల పొడవునకు పెంచెను.

**శ్లో॥ హనుమానచలప్రఖ్యో నవతిం యోజనోచ్ఛ్రితః ।**
**చకార సురసా వక్త్రం శతయోజన మాయతమ్ ॥ 165**

**పదచ్ఛేదము** :- హనుమాన్ - అచలప్రఖ్యః - నవతిం - యోజనోచ్ఛ్రితః - చకార - సురసా - వక్త్రం - శతయోజనమ్ - ఆయతమ్ ॥

**అన్వయక్రమము** :- అచలప్రఖ్యః హనుమాన్ నవతిం యోజనోచ్ఛ్రితః (అభవత్) సురసా వక్త్రం శతయోజనమ్ ఆయతం చకార.

**ప్రతిపదార్థము** :- అచలప్రఖ్యః హనుమాన్ = పర్వతసదృశుడైన హనుమ, నవతిం యోజనోచ్ఛ్రితః = తొంబది యోజనముల ఉన్నతుడు, (అభవత్ = అయ్యెను), సురసా = సురస, వక్త్రం = నోటిని, శతయోజనమ్ ఆయతం చకార = నూఱామడల పొడవు జేసెను.

**తాత్పర్యము** :- పర్వతాకారుడైన ఆంజనేయుడు తన దేహమును తొంబది యోజనముల పొడవు గావించెను. వెంటనే సురస తన నోటిని శతయోజనముల విశాలమును జేసెను.

**శ్లో॥ తద్దృష్ట్వా వ్యాదితం త్వాస్యం వాయుపుత్రస్సుబుద్ధిమాన్ ।**
**దీర్ఘజిహ్వం సురసయా సుఘోరం నరకోపమమ్ ॥ 166**

**శ్లో॥ స సంక్షిప్యాత్మనః కాయం జీమూత ఇవ మారుతిః ।**
**తస్మిన్ ముహూర్తే హనుమాన్ బభూవాంగుష్ఠమాత్రకః ॥ 167**

**పదచ్ఛేదము** :- తత్ - దృష్ట్వా - వ్యాదితం - తు - ఆస్యం - వాయుపుత్రః - సుబుద్ధిమాన్ - దీర్ఘజిహ్వం - సురసయా - సుఘోరం - నరకోపమమ్ - సః - సంక్షిప్య - ఆత్మనః - కాయం - జీమూతః - ఇవ - మారుతిః - తస్మిన్ - ముహూర్తే - హనుమాన్ - బభూవ - అంగుష్ఠమాత్రకః.

**అన్వయక్రమము** :- వాయుపుత్రః సుబుద్ధిమాన్ మారుతిః సః హనుమాన్ సురసయా వ్యాదితం దీర్ఘజిహ్వం సుఘోరం నరకోపమం తత్ ఆస్యం దృష్ట్వా తస్మిన్ ముహూర్తే ఆత్మనః కాయం జీమూతః ఇవ సంక్షిప్య అంగుష్ఠమాత్రకః బభూవ.

**ప్రతిపదార్థము** :- వాయుపుత్రః = వాయునందనుడును, సుబుద్ధిమాన్ = గొప్ప ప్రజ్ఞగలవాడును, మారుతిః = మారుతాత్మజుడునగు, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, సురసయా వ్యాదితం = సురసచే తెరువబడియున్నట్టి, దీర్ఘజిహ్వం = పొడవైన నాలుక గలదియును, సుఘోరం = మిక్కిలి భీకరమైనదియును,

నరకోపమం = నరకలోకమును బోలియున్నదియునగు, తత్ ఆస్యం = ఆ నోటిని, దృష్ట్వా = చూచి, తస్మిన్ ముహూర్తే = ఆ క్షణమునందే, ఆత్మనః కాయం = తన శరీరమును, జీమూతః ఇవ = మేఘమువలె, సంక్షిప్య = సంకోచింపజేసి, అంగుష్ఠమాత్రకః = బొటనవ్రేలి యంతటివాడు, బభూవ = అయ్యెను.

**తాత్పర్యము :–** గొప్ప ప్రజ్ఞాశాలియైన ఆంజనేయుడు నరకలోకమువలె భీకరమైయున్న ఆ సురస నోటిని చూచి తత్క్షణమే తన దేహమును మేఘము తన రూపమును కుదింపచేసినట్లుగా సంకోచింప జేసుకొని కేవలము ఒక బొటనవ్రేలంతటి వాడుగా నయ్యెను.

**శ్లో॥ సోఽభిపద్యాథ తద్వక్త్రం నిష్పత్య చ మహాబలః ।**
**అంతరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్ ॥ 168**

**పదచ్ఛేదము :–** సః – అభిపద్య – అథ – తద్వక్త్రం – నిష్పత్య – చ – మహాబలః – అంతరిక్షే – స్థితః – శ్రీమాన్ – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** మహాబలః శ్రీమాన్ సః తద్వక్త్రం అభిపద్య అథ నిష్పత్య చ అంతరిక్షే స్థితః (సన్) ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మహాబలః = బలశాలియును, శ్రీమాన్ = శుభలక్షణసమన్వితుడును అగు, సః = ఆ హనుమంతుడు, తద్వక్త్రం = ఆ సురసనోటిలోనికి, అభిపద్య = ప్రవేశించి, అథ = పిమ్మట, నిష్పత్య చ = బయటికి వచ్చివేసి, అంతరిక్షే స్థితః (సన్) = ఆకాశమున నిలచినవాడై, ఇదం వచనం అబ్రవీత్ = ఈ వాక్యమును పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

సోఽభిపద్యాథ తద్వక్త్రం .............
సోఽభిపత్యాశు అని తెలుగు ప్రతులందు గలదు.
సోఽభిపత్యాథ అని బొంబాయి పాఠము
(అథ = అనంతరము, ఆశు = శీఘ్రముగా)

**గోవిందరాజీయము :–** 'సుబుద్ధిమాన్' అను విశేషణముచే అతివిస్తృతమైన ఆమె నోటిలోనికి సూక్ష్మరూపముతో ప్రవేశించి శ్రమలేకుండగనే బయట పడవచ్చునని గ్రహించినవాడు అని సూచింప బడుచున్నది.

(166 శ్లో. = తద్దృష్ట్వా ...... చూడుము)

**తాత్పర్యము :–** అమితబలాఢ్యుడైన హనుమ ఆ సురస నోటిలోనికి ప్రవేశించి తిరిగి

ఈవలికి వచ్చి ఆకాశమున నిలచి ఆమెతో నిట్లు పలికెను.

**శ్లో॥ ప్రవిష్టోఽస్మి హి తే వక్త్రం దాక్షాయణి నమోఽస్తు తే ।**
**గమిష్యే యత్ర వైదేహీ సత్యశ్చాసీద్వరస్తవ ॥ 169**

**పదచ్ఛేదము :–** ప్రవిష్టః – అస్మి – హి – తే – వక్త్రం – దాక్షాయణి – నమః – అస్తు – తే – గమిష్యే – యత్ర – వైదేహీ – సత్యః – చ – ఆసీత్ – వరః – తవ ॥

**అన్వయక్రమము :–** హే దాక్షాయణి! తే వక్త్రం ప్రవిష్టః అస్మి. తే నమః అస్తు; యత్ర వైదేహీ (వర్తతే తత్ర) గమిష్యే. తవ వరః సత్యః ఆసీత్.

**ప్రతిపదార్థము :–** హే దాక్షాయణి! = దక్షప్రజాపతి పుత్రికవైన ఓ సురసా దేవీ, తే వక్త్రం = నీ నోటిలోనికి, ప్రవిష్టః అస్మి = ప్రవేశించియుంటిని, తే నమః అస్తు = నీకు నమస్కారము, యత్ర వైదేహీ (వర్తతే) = సీతమ్మ ఎచ్చట (నుండునో), (తత్ర) గమిష్యే = (అచ్చటికి) బోయెదను, తవ వరః = నీకుగల వరము లేక నీయొక్క వరము, సత్యః ఆసీత్ = నెరవేరినదయ్యెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** దాక్షాయణి = దక్షప్రజాపతి కుమార్తె యగుటచేతనే హనుమంతుడు నమస్కరించెనని గ్రహించవలెను.

**గోవిందరాజీయము :–**
**రామానుజీయము :–**
{ హనుమంతునకు తన వరప్రదానమును గూర్చి చెప్పుచున్నప్పుడే సురస తాను దక్షుని కుమార్తెనని హనుమంతునకు తెలిపినది.

**తాత్పర్యము :–** దక్షపుత్రికయైన ఓ సురసాదేవీ! నీవు కోరినట్లు నీ నోటిలోనికి ప్రవేశించితిని గదా! నా నమస్కారమును స్వీకరింపుము. ఇక నేను సీతమ్మ ఎచ్చట నుండెనో అక్కడికి వెదుకుచు పోయెదను. నీకు బ్రహ్మ యొసగిన వరమును నేను నిజము చేసితినిగదా!

**శ్లో॥ తం దృష్ట్వా వదనాన్ముక్తం చన్ద్రం రాహుముఖాదివ ।**
**అబ్రవీత్సురసా దేవీ స్వేన రూపేణ వానరమ్ ॥ 170**

**పదచ్ఛేదము :–** తం – దృష్ట్వా – వదనాత్ – ముక్తం – చంద్రం – రాహుముఖాత్ – ఇవ – అబ్రవీత్ – సురసా – దేవీ – స్వేన – రూపేణ – వానరమ్ ॥

**అన్వయక్రమము :–** రాహుముఖాత్ ముక్తం చంద్రమ్ ఇవ వదనాత్ ముక్తం తం

దృష్ట్వా దేవీ సురసా స్వేన రూపేణ వానరమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** రాహుముఖాత్ ముక్తం = రాహువు నోటినుండి విడివడిన, చంద్రం ఇవ (స్థితమ్) = చంద్రునివలె నున్నట్టి, తం = ఆ హనుమంతుని, వదనాత్ ముక్తం దృష్ట్వా = తన నోటినుండి విడివడిన వానినిగా జూచి, దేవీ సురసా = పూజ్యురాలైన ఆ సురస, స్వేన రూపేణ = (తన) నిజరూపముతో, వానరమ్ అబ్రవీత్ = హనుమంతునితో నిట్లు పలికెను.

**తాత్పర్యము :–** రాహువు నోటినుండి విడివడిన చంద్రునివలె నున్నట్టి తన నోటినుండి తిరిగి ఈవలకు వచ్చియున్న ఆ హనుమంతుని గాంచి సురసాదేవి (తన) నిజరూపముతో నిలచి ఇట్లు పలికెను.

**శ్లో॥ అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్ ।**
**సమానయ చ వైదేహీం రాఘవేణ మహాత్మనా ॥ 171**

**పదచ్ఛేదము :–** అర్థసిద్ధ్యై – హరిశ్రేష్ఠ – గచ్ఛ – సౌమ్య – యథాసుఖమ్ – సమానయ – చ – వైదేహీం – రాఘవేణ – మహాత్మనా ॥

**అన్వయక్రమము :–** హే సౌమ్య! హరిశ్రేష్ఠ! యథాసుఖమ్ అర్థసిద్ధ్యై గచ్ఛ; వైదేహీం మహాత్మనా రాఘవేణ సమానయ చ.

**ప్రతిపదార్థము :–** హే సౌమ్య! హరిశ్రేష్ఠ! = ఉత్తముడవైనట్టి ఓ వానరశ్రేష్ఠుడా, యథాసుఖమ్ = మహాసుఖముగా, అర్థసిద్ధ్యై = (నీ) ప్రయోజనము సాధించుకొనుటకు, గచ్ఛ = సాగిపొమ్ము, వైదేహీం = జానకీదేవిని, మహాత్మనా రాఘవేణ = మహనీయుడైన శ్రీరామునితో, సమానయ = కలసికొనునట్లు చేయుము.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! నీవు పూనిన కార్యమును సిద్ధింప చేసుకొనుటకుగాను సుఖముగా సాగిపొమ్ము. జానకిదేవిని శ్రీరామునితో కలుపునట్టి ఘనకార్యము నెరవేర్చుము.

**శ్లో॥ తత్తృతీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరమ్ ।**
**సాధు సాధ్వితి భూతాని ప్రశశంసుర్మహాకపిమ్ ॥ 172**

**పదచ్ఛేదము :–** తత్ – తృతీయం – హనుమతః – దృష్ట్వా – కర్మ – సుదుష్కరమ్ – సాధు – సాధు – ఇతి – భూతాని – ప్రశశంసుః – మహాకపిమ్ ॥

**అన్వయక్రమము :–** హనుమతః సుదుష్కరం తత్ తృతీయం కర్మ దృష్ట్వా మహాకపిం

సాధు సాధు ఇతి భూతాని ప్రశశంసుః.

**ప్రతిపదార్థము** :- హనుమతః = హనుమంతునియొక్క, సుదుష్కరం = మిక్కిలి కఠినమైనట్టి, తత్ తృతీయం కర్మ = ఆ మూడవ కార్యమును, దృష్ట్వా = చూచి, భూతాని = ప్రాణులన్నియును, సాధు సాధు ఇతి = మేలు మేలు అని, మహాకపిం = హనుమంతుని, ప్రశశంసుః = శ్లాఘించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- తృతీయకర్మ = సురస నోటినుండి వెలువడి వచ్చుట యను మూడవ దుష్కరకార్యము.

**తాత్పర్యము** :- హనుమంతు డొనర్చిన ఈ సురసావిజయరూపమైన మూడవ దుష్కరకార్యమును చూచిన ప్రాణులన్నియును మేలు మేలని హనుమంతుని శ్లాఘించెను.

**శ్లో॥ స సాగర మనాధృష్యమభ్యేత్య వరుణాలయమ్ ।**
**జగామాకాశ మావిశ్య వేగేన గరుడోపమః ॥ 173**

**పదచ్ఛేదము** :- సః - సాగరమ్ - అనాధృష్యమ్ - అభ్యేత్య - వరుణాలయమ్ - జగామ - ఆకాశమ్ - ఆవిశ్య - వేగేన - గరుడోపమః ॥

**అన్వయక్రమము** :- సః అనాధృష్యం వరుణాలయం సాగరమ్ అభ్యేత్య ఆకాశం ఆవిశ్య వేగేన గరుడోపమః (సన్) జగామ.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమంతుడు, అనాధృష్యం = చేర భయంకరమైనట్టి, వరుణాలయం సాగరం = వరుణుని నిలయమైన సముద్రమును, అభ్యేత్య = సమీపించి, ఆకాశం ఆవిశ్య = ఆకాశమును ప్రవేశించి, వేగేన = వేగముతో, గరుడోపమః (సన్) = గరుత్మంతుని బోలినవాడై, జగామ = పోవుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- ఆకాశగమన మతిదుష్కరమైనదని సూచించుటచే ఆకాశ స్వరూపమును ఇటుపై నేడు శ్లోకములతో వర్ణించుచున్నాడు.

**తాత్పర్యము** :- భయంకరమైన సముద్రునిపై బోవుచు హనుమంతుడు గరుత్మంతునితో సమానమైన వేగముతో ఆకాశమునందు పయనించు చుండెను.

**శ్లో॥ సేవితే వారిధారాభిః పతగైశ్చ నిషేవితే ।**
**చరితే కైశికాచార్యై రైరావతనిషేవితే ॥ 174**

**పదచ్ఛేదము** :– సేవితే – వారిధారాభిః – పతగైః – చ – నిషేవితే – చరితే – కైశికాచార్యైః – ఐరావతనిషేవితే ॥

**అన్వయక్రమము** :– వారిధారాభిః సేవితే, పతగైః చ నిషేవితే, కైశికాచార్యైః చరితే, ఐరావతనిషేవితే.

**ప్రతిపదార్థము** :– వారిధారాభిః సేవితే = జలధారలచే ఒప్పుచున్నదియును, పతగైః నిషేవితే = పక్షివిశేషములతో గూడియున్నదియును, కైశికాచార్యైః చరితే = గానవిద్యాప్రవీణులైన విద్యాధరులతో కూడినదియును, ఐరావతనిషేవితే = పొడవైన ఇంద్రధనుస్సులతో ప్రకాశించుచున్నదియును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– కైశికాచార్యైః = కైశిక మనగా రాగవిశేషము. దానియందు ఆచార్యులైనవారు విద్యాధరులని భావము.

**తిలకము** :– కైశికము – గాననృత్యవిద్యలయందు ఆచార్యులు తుంబురుడు నారదుడు మొదలగువారు. ఐరావతమనగా ఋజువుగను దీర్ఘముగను నుండు ఇంద్రధనుస్సు అని మహేశ్వరతీర్థులవారున్ను, గజవిశేషమని మరికొందరు వాఖ్యాతలును చెప్పిరి.

**తాత్పర్యము** :– హనుమంతుడు అప్పు డెగురుచున్న ఆకాశ మెట్లున్నదనగా ఒకచో నది జలధారలతో కూడియున్నది. అందు ఒకచోట పక్షివిశేషములు ఎగురుచున్నవి. తుంబరుడు నారదుడు మున్నగువారు విద్యాధరులును ఒక చోట సంచరించుచున్నారు. పొడవైన ఇంద్రధనుస్సు ఒకచోట ప్రకాశించుచున్నది.

**శ్లో॥ సింహకుంజరశార్దూలపతగోరగవాహనైః ।**
**విమానై స్సంపతద్భిశ్చ విమలైస్సమలంకృతే ।**
**వజ్రాశనిసమస్పర్శైః పావకైరుపశోభితే ॥ 175**

**పదచ్ఛేదము** :– సింహకుంజరశార్దూలపతగోరగవాహనైః – విమానైః – సంపతద్భిః – చ – విమలైః – సమలంకృతే – వజ్రాశనిసమస్పర్శైః – పావకైః – ఉపశోభితే ॥

**అన్వయక్రమము** :– సింహకుంజరశార్దూలపతగోరగవాహనైః సంపతద్భిః చ విమలైః విమానైః సమలంకృతే వజ్రాశనిసమస్పర్శైః పావకైః ఉపశోభితే.

**ప్రతిపదార్థము :–** సింహ = సింహములు, కుంజర = ఏనుగులు, శార్దూల = పులులు, పతగ = పక్షులు, ఉరగ వాహనైః = సర్పములు వహించుచున్నట్టియు, సంపతద్భిః = క్రిందకు దిగుచున్నట్టియు, విమలైః = ప్రకాశించునట్టియునగు, విమానైః = విమానములచే, సమలంకృతే = విరాజిల్లుచున్నదియును, వజ్రాశనిసమస్పర్శైః = వజ్రాయుధముతోడను పిడుగులతోడను సమానమైన వేడిమిగల, పావకైః = అగ్నులతో, ఉపశోభితే = ప్రకాశించుచున్నదియును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** వజ్రాశనిసమస్పర్శైః = వజ్రమువలెను పిడుగువలెను ప్రాణములు హరించునట్టివి.

**తాత్పర్యము :–** ఆ యాకాశమునందు క్రిందికి దిగుచున్న సింహములు మున్నగు వానిచే వహింపబడుచున్న సుందరమైన విమానములు ప్రకాశించుచున్నవి. వజ్రాయుధమువలెను, పిడుగులవలెను తీవ్రమైన వేడిమిగల అగ్నులు ఉజ్జ్వలముగా మెఱయుచున్నవి.

**శ్లో॥ కృతపుణ్యైర్మహాభాగైః స్వర్గజిద్భిరధిష్ఠితే ।**
**వహతా హవ్య మత్యర్థం సేవితే చిత్రభానునా ।**
**గ్రహనక్షత్రచంద్రార్కతారాగణవిభూషితే ॥ 176**

**పదచ్ఛేదము :–** కృతపుణ్యైః – మహాభాగైః – స్వర్గజిద్భిః – అధిష్ఠితే – వహతా – హవ్యమ్ – అత్యర్థం – సేవితే – చిత్రభానునా – గ్రహనక్షత్రచంద్రార్కతారాగణ విభూషితే ॥

**అన్వయక్రమము :–** కృతపుణ్యైః స్వర్గజిద్భిః మహాభాగైః అధిష్ఠితే హవ్యం వహతా చిత్రభానునా అత్యర్థం సేవితే గ్రహనక్షత్రచంద్రార్కతారాగణవిభూషితే.

**ప్రతిపదార్థము :–** కృతపుణ్యైః = గొప్పపుణ్యము చేసుకొన్న, స్వర్గజిద్భిః = స్వర్గము సంపాదించిన, మహాభాగైః = మహాత్ములచేత, అధిష్ఠితే = నివసింపబడునదియును, హవ్యం వహతా = (దేవతలకొఱకై) హవిస్సును వహించుచున్నట్టి, చిత్రభానునా = చిత్రభానుడను అగ్నిదేవునిచేత, అత్యంతం సేవితే = అధికముగా ఆశ్రయింప బడినదియును, గ్రహనక్షత్రచంద్రార్కతారాగణవిభూషితే = గ్రహ నక్షత్రాదులచేత ప్రకాశించుచున్నదియును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– చిత్రభానునా = పంచాగ్నిభిన్నమైన వేఱొక అగ్నిచేత అని అర్థము. ఇంతకుముందు పావకైః అనునప్పుడు ఐదగ్నులచేత అని అర్థము.

**తాత్పర్యము** :– ఆ యాకాశము గొప్ప పుణ్యము చేసికొని స్వర్గలోకము సంపాదించుకొన్న మహనీయులచే శోభించుచున్నది. వివిధదేవతలకొఱకు అర్పింపబడిన హవ్యమును వహించుచున్న చిత్రభానుడను అగ్నిచే మిక్కిలి ప్రకాశించుచున్నది. అంగారకాది గ్రహములు అశ్విన్యాది నక్షత్రములు చంద్రుడు సూర్యుడు మిగిలిన వివిధనక్షత్రముల సమూహము అనువానిచే అలంకరింపబడినదై యున్నది.

**శ్లో॥ మహర్షిగణగంధర్వనాగయక్షసమాకులే ।**
**వివిక్తే విమలే విశ్వే విశ్వావసునిషేవితే ॥ 177**

**పదచ్ఛేదము** :– మహర్షిగణగంధర్వనాగయక్షసమాకులే – వివిక్తే – విమలే – విశ్వే – విశ్వావసునిషేవితే ॥

**ప్రతిపదార్థము** :– మహర్షిగణ = మహర్షుల సమూహముచేత, గంధర్వ = గంధర్వులచేతను, నాగ = నాగులచేతను, యక్ష = యక్షులచేతను, సమాకులే = నిండియున్నదియును, వివిక్తే = ఏకాంతముగ నున్నదియును, విమలే = స్వచ్ఛమైనదియును, విశ్వే = అనంతమైనదియును, విశ్వావసునిషేవితే = విశ్వావసుడను (గంధర్వరాజుచే) మహనీయునిచే సేవింపబడుచున్నదియును.

**తాత్పర్యము** :– ఆ యాకాశము కశ్యపాదిమహర్షులచేతను, గంధర్వులచేతను, నాగులచేతను, యక్షులచేతను నిండియున్నది. ఏకాంతముగను నిర్మలముగను, అనంతముగను విశ్వావసుప్రభృతిమహాత్ములచేతను ఆశ్రయింపబడియున్నది.

**శ్లో॥ దేవరాజగజాక్రాంతే చంద్రసూర్యపథే శివే ।**
**వితానే జీవలోకస్య వితతే బ్రహ్మనిర్మితే ॥ 178**

**పదచ్ఛేదము** :– దేవరాజగజాక్రాంతే – చంద్రసూర్యపథే – శివే – వితానే – జీవలోకస్య – వితతే – బ్రహ్మనిర్మితే ॥

**అన్వయక్రమము** :– దేవరాజగజాక్రాంతే చంద్రసూర్యపథే శివే జీవలోకస్య వితానే బ్రహ్మనిర్మితే వితతే.

**ప్రతిపదార్థము** :– దేవరాజగజాక్రాంతే = దేవేంద్రుని ఐరావతముతో కూడినదియును,

చంద్రసూర్యపథే శివే = చంద్రసూర్యులకు మార్గమై మంగళకరమైనదియును, జీవలోకస్య వితానే = ప్రాణిలోకమునకు మీదుగ కట్టిన మేల్కట్టు (చాందినీ) వలె నున్నదియును, బ్రహ్మనిర్మితే వితతే = బ్రహ్మ నిర్మించిన విశాలసృష్టియైనదియును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** దేవరాజగజాక్రాంతే = పుండరీకము మున్నగు దిక్పాలుర ఏనుగులతో (ఇదివరకు ఐరావతము చెప్పబడినది).

**తాత్పర్యము :–** దేవేంద్రాదుల వాహనములైన ఐరావతము మున్నగు దిగ్గజములతో కూడియున్నదియును, చంద్రసూర్యులు సంచరించు మార్గమై మంగళకరమైనదియును, ప్రాణికోటి వసించు భూమికి మీదుగ కట్టిన చాందినీవలె నున్నదియును, బ్రహ్మ నిర్మించిన అతివిశాలమైన సృష్టియైనదియును అగు ఆ యాకాశము మిగుల రమ్యమై యుండెను.

**శ్లో॥ బహుశస్సేవితే వీరైర్విద్యాధరగణైర్వృతే ।**
**జగామ వాయుమార్గే చ గరుత్మానివ మారుతిః ॥ 179**

**పదచ్ఛేదము :–** బహుశః – సేవితే – వీరైః – విద్యాధరగణైః – వృతే – జగామ – వాయుమార్గే చ – గరుత్మాన్ – ఇవ – మారుతిః ॥

**అన్వయక్రమము :–** వీరైః బహుశః సేవితే, విద్యాధరగణైః వృతే, వాయుమార్గే మారుతిః గరుత్మాన్ ఇవ జగామ.

**ప్రతిపదార్థము :–** వీరైః = వీరులైన పురుషులచే, బహుశః = పెక్కుమారులు, సేవితే = ఆశ్రయింపబడినదియును, విద్యాధరగణైః = విద్యాధరుల సమూహములచే, వృతే = ఆవరింపబడినదియును అగు, వాయుమార్గే = ఆకాశమార్గమునందు, మారుతిః = ఆ హనుమ, గరుత్మాన్ ఇవ = గరుత్మంతునివలెనే, జగామ = పోవుచుండెను.

**తాత్పర్యము :–** ఆ యాకాశమునందు మహావీరులైనవారు ఎందరెందరో చరించుచున్నారు. విద్యాధరులు గుంపులు గుంపులుగా నందే విహరించుచున్నారు. అట్టి వాయుమార్గమునందు హనుమంతుడు గరుత్మంతునివలె ఎగిరిపోవుచుండెను.

(బొంబాయి పాఠము)

**శ్లో॥ హనుమాన్ మేఘజాలాని ప్రాకర్షన్ మారుతో యథా ।**
**కాలాగురుసవర్ణాని రక్తపీతసితాని చ ।**
**కపినా కృష్యమాణాని మహాభ్రాణి చకాశిరే ॥ 180**

**పదచ్ఛేదము** :– హనుమాన్ – మేఘజాలాని – ప్రాకర్షత్ – మారుతః – యథా; కాలాగురుసవర్ణాని – రక్తపీతసితాని చ – కపినా – కృష్యమాణాని – మహాభ్రాణి – చకాశిరే ॥

**అన్వయక్రమము** :– హనుమాన్ మేఘజాలాని మారుతో యథా ప్రాకర్షత్. కపినా కృష్యమాణాని మహాభ్రాణి కాలాగురుసవర్ణాని రక్తపీతసితాని చ చకాశిరే.

**ప్రతిపదార్థము** :– హనుమాన్ = హనుమంతుడు, మేఘజాలాని = మేఘసమూహమును, మారుతః యథా = వాయువువలె, ప్రాకర్షత్ = చెదరగొట్టెను. కపినా = హనుమంతునిచేత, కృష్యమాణాని = చెదరగొట్టబడినట్టి, మహాభ్రాణి = ఆ పెద్దవైన మేఘములు, కాలాగురుసవర్ణాని = నల్లని అగరువంటి రంగుగలవిగాను, రక్తపీతసితాని చ = ఎఱ్ఱవిగను పచ్చవిగను తెల్లవిగను, చకాశిరే = ప్రకాశించినవి.

**తాత్పర్యము** :– హనుమంతుడు ఆకసమునందు ఎగిరిపోవుచుండగా అచటి మేఘములు చెదరిపోవుచుండెను. అట్లు చెదరిపోయిన మేఘములు హనుమయొక్క వేరు వేరు అవయవములయొక్క రంగులు తమపై బడుచుండగా కొన్ని నల్లనివిగాను, కొన్ని ఎఱుపు, పసుపు, తెలుపు రంగులు గలవిగాను చూచుటకు ఇంపుగా ప్రకాశించు చుండెను.

(బొంబాయి పాఠము)

**శ్లో॥ ప్రవిశన్నభ్రజాలాని నిష్పతంశ్చ పునః పునః ।**
**ప్రావృషీందు రివాభాతి నిష్పతన్ ప్రవిశంస్తదా ॥ 181**

**పదచ్ఛేదము** :– ప్రవిశన్ – అభ్రజాలాని – నిష్పతన్ – చ – పునః – పునః – ప్రావృషి – ఇందుః – ఇవ – ఆభాతి – నిష్పతన్ – ప్రవిశన్ – తదా ॥

**అన్వయక్రమము** :– (హనుమాన్) తదా, అభ్రజాలాని పునః పునః ప్రవిశన్ నిష్పతన్ చ ప్రావృషి అభ్రజాలాని నిష్పతన్ ప్రవిశన్ ఇందుః ఇవ ఆభాతి.

**ప్రతిపదార్థము** :– (హనుమాన్ = ఆ హనుమంతుడు) తదా = ఆ సమయమునందు, అభ్రజాలాని = మేఘముల సమూహములను, నిష్పతన్ = దాటివచ్చుచు, ప్రవిశన్ = లోనికి ప్రవేశించుచు నుండునట్టి, ఇందుః ఇవ = చంద్రునివలె, ఆభాతి = మిక్కిలి ప్రకాశించెను.

**తాత్పర్యము** :– హనుమంతుడప్పుడు మేఘముల సమూహములోనికి ప్రవేశించుచు నుండగా వర్షాకాలమున మబ్బుల వెనుకకు బోవుచు తిరిగి ఈవలికి వచ్చుచున్న

చంద్రునివలె చూడ ముచ్చటగ నుండెను.

**శ్లో॥ ప్రదృశ్యమాన స్సర్వత్ర హనుమాన్ మారుతాత్మజః ।**
**భేజేఽంబరం నిరాలంబం పక్షయుక్త ఇవాద్రిరాట్ ॥ 182**

**పదచ్ఛేదము :-** ప్రదృశ్యమానః – సర్వత్ర – హనుమాన్ – మారుతాత్మజః – భేజే – అంబరం – నిరాలంబం – పక్షయుక్తః – ఇవ – అద్రిరాట్ ॥

**అన్వయక్రమము :-** మారుతాత్మజః హనుమాన్ సర్వత్ర ప్రదృశ్యమానః (సన్) పక్షయుక్తః అద్రిరాట్ ఇవ నిరాలంబమ్ అంబరం భేజే.

**ప్రతిపదార్థము :-** మారుతాత్మజః = వాయుపుత్రుడైన, హనుమాన్ = ఆ హనుమ, సర్వత్ర = ఆకసమునం దంతటను, ప్రదృశ్యమానః = కనపడుచున్నవాడగుచు, పక్షయుక్తః అద్రిరాట్ ఇవ = రెక్కలు గలిగినట్టి పర్వతరాజమువలె, నిరాలంబం = ఆధారరహిత మైనట్టి, అంబరం = ఆకాశమును, భేజే = సేవించెను.

**తాత్పర్యము :-** హనుమంతుడు ఆకాశమునందు అన్నివైపులనుండి చక్కగా గానవచ్చుచు రెక్కలున్న పర్వతమువలె తన పయనము సాగించెను.

**శ్లో॥ ప్లవమానం తు తం దృష్ట్వా సింహికా నామ రాక్షసీ ।**
**మనసా చింతయామాస ప్రవృద్ధా కామరూపిణీ ॥ 183**

**పదచ్ఛేదము :-** ప్లవమానం – తు – తం – దృష్ట్వా – సింహికా – నామ – రాక్షసీ – మనసా – చింతయామాస – ప్రవృద్ధా – కామరూపిణీ ॥

**అన్వయక్రమము :-** ప్లవమానం తం దృష్ట్వా ప్రవృద్ధా కామరూపిణీ సింహికా నామ రాక్షసీ మనసా చింతయామాస.

**ప్రతిపదార్థము :-** ప్లవమానం తం దృష్ట్వా = ఆకాశమునందు ఎగురుచున్నట్టి ఆ హనుమంతుని జూచి, ప్రవృద్ధా = పెద్దశరీరముగలదియును, కామరూపిణీ = కామరూపము ధరించు శక్తి గలదియును అగు, సింహికా నామ రాక్షసీ = సింహిక యనెడు రాక్షసి, మనసా చింతయామాస = మనస్సునం దిట్లు తలచెను.

**తాత్పర్యము :-** ఆకసమునం దట్లు ఎగురుచున్నట్టి హనుమను జూచి, పెద్దశరీరము గలదియును కామరూపశక్తి గలదియును అగు సింహిక యను రక్కసి తన మనస్సునం దీరీతిగా ఆలోచించెను.

**శ్లో॥ అద్య దీర్ఘస్య కాలస్య భవిష్యామ్యహ మాశితా ।**
**ఇదం మమ మహాసత్త్వం చిరస్య వశమాగతమ్ ॥ 184**

**పదచ్ఛేదము :–** అద్య – దీర్ఘస్య – కాలస్య – భవిష్యామి – అహమ్ – ఆశితా; ఇదం – మమ – మహాసత్త్వం – చిరస్య – వశమ్ – ఆగతమ్ ॥

**అన్వయక్రమము :–** దీర్ఘకాలస్య, అద్య అహమ్ ఆశితా భవిష్యామి. మమ చిరస్య ఇదం మహాసత్త్వం వశమ్ ఆగతమ్.

**ప్రతిపదార్థము :–** దీర్ఘ కాలస్య = చిరకాలమునకు, అద్య = నేడు, అహమ్ ఆశితా, భవిష్యామి = నేను తృప్తిగ భుజించిన దానను కాగలను, మమ = నాకు, చిరస్య = చిరకాలమునకు, ఇదం మహాసత్త్వం = పెద్దదైనట్టి ఈ ప్రాణి, వశమ్ ఆగతమ్ = వశమగుచున్నది.

**తాత్పర్యము :–** ఎంతో కాలమునకు ఈనాడు నేను తృప్తిగా భుజించినదానను కాబోవుచున్నాను. పెద్దదైన ఈప్రాణి ఇంతకాలమునకు నాకు చిక్కినది.

**శ్లో॥ ఇతి సంచింత్య మనసా ఛాయామస్య సమాక్షిపత్ ।**
**ఛాయాయాం గృహ్యమాణాయాం చింతయామాస వానరః ॥ 185**

**పదచ్ఛేదము :–** ఇతి – సంచింత్య – మనసా – ఛాయామ్ – అస్య – సమాక్షిపత్ – ఛాయాయాం – గృహ్యమాణాయాం – చింతయామాస – వానరః ॥

**అన్వయక్రమము :–** ఇతి మనసా సంచింత్య అస్య ఛాయాం సమాక్షిపత్. ఛాయాయాం గృహ్యమాణాయాం వానరః చింతయామాస.

**ప్రతిపదార్థము :–** ఇతి = ఈరీతిగా, మనసా సంచింత్య = మనస్సులోన ఆలోచించి, అస్య = ఆ హనుమంతునియొక్క, ఛాయాం = నీడను, సమాక్షిపత్ = ఆకర్షించెను, ఛాయాయాం గృహ్యమాణాయాం = నీడ ఆకర్షింపబడుచుండగా, వానరః = హనుమంతుడు, చింతయామాస = (ఇట్లు) ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఛాయాం సమాక్షిపత్ = నీడచేతనే దానికి మూలమైన వస్తువును గ్రహించగలశక్తి ఆమెకు బ్రహ్మచే నొసంగబడెను.

**తాత్పర్యము :–** సింహిక తన మనస్సునందు ఇట్లు ఆలోచించి సముద్రముపై నున్న హనుమంతుని నీడను (గట్టిగా) పట్టి లాగెను. అట్లు ఆమె తన నీడను పట్టి లాగుచుండగా

ఆ హనుమ ఇట్లు ఆలోచింప సాగెను.

**శ్లో॥ సమాక్షిప్తోఽస్మి సహసా పంగూకృతపరాక్రమః ।**
**ప్రతిలోమేన వాతేన మహానౌరివ సాగరే ॥ 186**

**పదచ్ఛేదము :–** సమాక్షిప్తః – అస్మి – సహసా – పంగూకృతపరాక్రమః – ప్రతిలోమేన – వాతేన – మహానౌః – ఇవ – సాగరే ॥

**అన్వయక్రమము :–** సాగరే ప్రతిలోమేన వాతేన మహానౌః ఇవ పంగూకృతపరాక్రమః (సన్) సహసా సమాక్షిప్తః అస్మి.

**ప్రతిపదార్థము :–** సాగరే = సముద్రజలమునందు, ప్రతిలోమేన వాతేన = ప్రతికూలముగా వీచుచున్న వాయువుచే, మహానౌః ఇవ = పెద్దయోడవలె, పంగూకృత పరాక్రమః (సన్) = కుంఠితమైన పరాక్రమముగల వాడనై, సహసా = హఠాత్తుగా, సమాక్షిప్తః అస్మి = లాగివేయబడిన వాడనైతిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** పంగూకృతపరాక్రమః = లంగరు వేయుటచే ఓడ ఆపివేయబడినట్లుగా నాకు గతినిరోధము సంభవించె నని భావము.

**తాత్పర్యము :–** సముద్రమునందు ఎదురుగాలిచే వెనుకకు నెట్టి వేయబడు ఓడవలె నేను నాపరాక్రమమంతయు నిష్ఫలమైపోయి హఠాత్తుగా వెనుకకు లాగివేయబడు చున్నానుగదా!

**శ్లో॥ తిర్యగూర్ధ్వమధశ్చైవ వీక్షమాణ స్తదా కపిః ।**
**దదర్శ స మహాసత్త్వ ముత్థితం లవణాంభసి ॥ 187**

**పదచ్ఛేదము :–** తిర్యక్ – ఊర్ధ్వమ్ – అధః – చ – ఏవ – వీక్షమాణః – తదా – కపిః – దదర్శ – సః – మహాసత్త్వమ్ – ఉత్థితం – లవణాంభసి ॥

**అన్వయక్రమము :–** తదా సః కపిః తిర్యక్ ఊర్ధ్వమ్ అధః చైవ వీక్షమాణః లవణాంభసి ఉత్థితం మహాసత్త్వం దదర్శ.

**ప్రతిపదార్థము :–** తదా = అప్పుడు, సః కపిః = ఆ హనుమంతుడు, తిర్యక్ = అడ్డముగను, ఊర్ధ్వం = మీదికిని, అధః చైవ = క్రిందికిని, వీక్షమాణః = చూచుచున్న వాడై, లవణాంభసి = (ఆ) సముద్రమునందు, ఉత్థితం = మీదికి లేచియున్నట్టి, మహాసత్త్వం = గొప్ప పరాక్రమముగల ప్రాణిని, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– మహాసత్త్వం = స్త్రీరూపములో నున్న ప్రాణి అని అర్థము.

**తాత్పర్యము** :– అప్పుడా హనుమ చుట్టును, నలుమూలలకును మీదికిని, క్రిందికిని, దృష్టిని సారించి సముద్రజలముపై కానవచ్చిన ఒక పెద్ద ప్రాణిని చూచెను.

**శ్లో॥ తద్దృష్ట్వా చింతయామాస మారుతిర్వికృతాననమ్ ।**
**కపిరాజేన కథితం సత్త్వ మద్భుతదర్శనమ్ ।**
**ఛాయాగ్రాహి మహావీర్యం తదిదం నాత్ర సంశయః ॥ 188**

**పదచ్ఛేదము** :– తత్ – దృష్ట్వా – చింతయామాస – మారుతిః – వికృతాననమ్ – కపిరాజేన – కథితం – సత్త్వమ్ – అద్భుతదర్శనమ్ – ఛాయాగ్రాహి – మహావీర్యం – తత్ – ఇదం – న – అత్ర – సంశయః ॥

**అన్వయక్రమము** :– మారుతిః వికృతాననమ్ తత్ దృష్ట్వా చింతయామాస; ఇదమ్ అద్భుతదర్శనం సత్త్వం కపిరాజేన యథా ఆఖ్యాతం తత్ ఛాయాగ్రాహి మహావీర్యమ్; అత్ర న సంశయః.

**ప్రతిపదార్థము** :– మారుతిః = హనుమంతుడు, వికృతాననం తత్ దృష్ట్వా = వికారమైన ముఖము గలిగినట్టి ఆ మహాసత్త్వమును జూచి, చింతయామాస = ఇట్లు ఆలోచించెను, ఇదం అద్భుతదర్శనం సత్త్వం = వింతగా కనబడుచున్న ఈ మహాప్రాణి, కపిరాజేన = సుగ్రీవునిచే, కథితం = చెప్పబడిన, తత్ ఛాయాగ్రాహి మహావీర్యం = ఆరీతిని నీడను బట్టి ప్రాణులను బంధించునట్టి మహాశక్తి గల్గినట్టిది, అత్ర సంశయః న = ఈ విషయములో సందేహములేదు.

**తాత్పర్యము** :– వికారమైన ముఖముగల ఆ మహాసత్త్వమును జూచి హనుమంతుడు ఇట్లాలోచించెను. వింతగా కనబడుచున్న ఈ అద్భుతసత్త్వము పూర్వము సుగ్రీవునిచే చెప్పబడిన రీతిగా ఛాయనుబట్టి ప్రాణులను కబళింపగల మహాశక్తి గల్గినట్టిది. ఇందుల కేమియును సందేహము లేదు.

**శ్లో॥ స తాం బుద్ధ్వార్థతత్త్వేన సింహికాం మతిమాన్ కపిః ।**
**వ్యవర్ధత మహాకాయః ప్రావృషీవ వలాహకః ॥ 189**

**పదచ్ఛేదము** :– సః – తాం – బుద్ధ్వా – అర్థతత్త్వేన – సింహికాం – మతిమాన్ కపిః – వ్యవర్ధత – మహాకాయః – ప్రావృషి – ఇవ – వలాహకః ॥

**అన్వయక్రమము** :– మతిమాన్ సః మహాకపిః తామ్ అర్థతత్త్వేన సింహికాం బుద్ధ్వా

ప్రావృషి వలాహకః ఇవ మహాకాయః వ్యవర్ధత.

**ప్రతిపదార్థము** :– మతిమాన్ = గొప్ప బుద్ధివిశేషము గల, సః కపిః = ఆ హనుమంతుడు, తాం = ఆ స్త్రీరూపముననున్న ప్రాణిని, అర్థతత్త్వేన = లక్షణములపద్ధతిచే, సింహికాం బుద్ధ్వా = సింహికనుగా తెలుసుకొని, ప్రావృషి = వర్షకాలమునందు, వలాహకః ఇవ = మేఘమువలె, మహాకాయః వ్యవర్ధత = గొప్పదైన శరీరము గలవాడుగా పెరిగిపోయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అర్థతత్త్వేన = చాయాగ్రహణరూపమైన దాని విలక్షణక్రియచేత నని అర్థము.

**తాత్పర్యము** :– గొప్ప ఆలోచనగల ఆ హనుమంతుడు ఆ మహాసత్త్వము పూర్వము తాను వినిన లక్షణములచే సింహికయే యని గ్రహించి వర్షాకాలమున మేఘము పెరిగినట్లుగా తానును తన శరీరమును పెంచెను.

**శ్లో॥ తస్య సా కాయ ముద్వీక్ష్య వర్ధమానం మహాకపేః ।**
**వక్త్రం ప్రసారయామాస పాతాళాంబరసన్నిభమ్ ।**
**ఘనరాజీవ గర్జంతీ వానరం సమభిద్రవత్ ॥ 190**

**పదచ్ఛేదము** :– తస్య – సా – కాయమ్ – ఉద్వీక్ష్య – వర్ధమానం – మహాకపేః – వక్త్రం – ప్రసారయామాస – పాతాళాంబరసన్నిభమ్ – ఘనరాజీ – ఇవ – గర్జంతీ – వానరం – సమభిద్రవత్ ॥

**అన్వయక్రమము** :– వర్ధమానం తస్య మహాకపేః కాయమ్ ఉద్వీక్ష్య సా వక్త్రం పాతాళాంబరసన్నిభమ్ ప్రసారయామాస; ఘనరాజీ ఇవ గర్జంతీ వానరం సమభిద్రవత్.

**ప్రతిపదార్థము** :– వర్ధమానం = పెద్దగా పెరుగుచున్న, తస్య మహాకపేః కాయం = ఆ వానరశ్రేష్ఠునియొక్క శరీరమును, ఉద్వీక్ష్య = చూచి, సా = ఆ సింహిక, వక్త్రం = (తన) నోటిని, పాతాళాంబరసన్నిభమ్ = పాతాళమునకును ఆకాశమునకును నడుమయంతగా, ప్రసారయామాస = విస్తరింపజేసెను, ఘనరాజీవ = మేఘముల సమూహమువలె, గర్జంతీ = ఉఱుముచున్నదై, వానరం = హనుమంతుని, సమభిద్రవత్ = మీదికి పరుగెత్తెను.

**తాత్పర్యము** :– పెద్దదిగా పెరిగిపోవుచున్న ఆ హనుమంతుని దేహమును జూచి సింహిక తన నోటిని అతని శరీరమును మ్రింగుటకు సరిపడునట్లుగా ఆకాశమంత

పెద్దదిగా చేయుచు తెరచెను. మఱియు పెద్దమేఘముల గుంపువలె భీకరముగా నుఱుముచు హనుమమీదికి వచ్చెను.

**శ్లో॥ స దదర్శ తతస్తస్యా వివృతం సుమహన్ముఖమ్ ।**
**కాయమాత్రం చ మేధావీ మర్మాణి చ మహాకపిః ॥ 191**

**పదచ్ఛేదము :–** సః – దదర్శ – తతః – తస్యాః – వివృతం – సుమహత్ – ముఖం – కాయమాత్రం – చ – మేధావీ – మర్మాణి – చ – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** తతః మేధావీ మహాకపిః సః తస్యాః వివృతం సుమహత్ ముఖం కాయమాత్రం చ మర్మాణి చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, సః మేధావీ మహాకపిః = మహామేధావియైన ఆ హనుమంతుడు, తస్యాః = ఆ సింహికయొక్క, వివృతం సుమహత్ ముఖం = తెరువబడియున్నట్టి గొప్పదైన నోరును, కాయమాత్రం చ = శరీరముయొక్క పరిమాణమును, మర్మాణి చ = ఆయువుపట్టులను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** మర్మాణి దదర్శ = మర్మములను భేదించుటకు చూసెనని భావము.

**తిలకము :–** కాయమాత్రం చ = మ్రింగుటకొరకై వీలగునట్లుగా ఆమె శరీరమును మాత్రము చూచెనని భావము.

**తాత్పర్యము :–** అప్పుడు గొప్ప మేధావియైన హనుమ తెఱచుకొనియున్న ఆ రాక్షసియొక్క పెద్దదైన నోటిని, ఆమె శరీరపరిమాణమును, దేహములోపలి ఆయువు పట్టులను చూచెను.

**శ్లో॥ స తస్యా వివృతే వక్త్రే వజ్రసంహననః కపిః ।**
**సంక్షిప్య ముహురాత్మానం నిపపాత మహాకపిః ॥ 192**

**పదచ్ఛేదము :–** సః – తస్యాః – వివృతే – వక్త్రే – వజ్రసంహననః – కపిః – సంక్షిప్య – ముహుః – ఆత్మానం – నిపపాత – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** వజ్రసంహననః సః మహాకపిః ఆత్మానం ముహుః సంక్షిప్య తస్యాః వివృతే వక్త్రే నిపపాత.

**ప్రతిపదార్థము :–** వజ్రసంహననః = వజ్రమువంటి దేహముగల, సః మహాకపిః =

ఆ వానరశ్రేష్ఠుడు, ఆత్మానం = తనను, ముహుః సంక్షిప్య = ఎక్కువగా సంకోచింప చేసుకొని, తస్యాః = ఆ సింహికయొక్క, వివృతే వక్త్రే = తెరువబడియున్న నోటియందు, నిపపాత = ఉరికెను.

**తాత్పర్యము :–** వజ్రకాయుడైనట్టి ఆ వానరశ్రేష్ఠుడు తన దేహమును చాల చిన్నదిగా చేసుకొని ఆమె తెరచి యుంచిన నోటిలోనికి ఉరికెను.

**శ్లో॥ ఆస్యే తస్యా నిమజ్జంతం దదృశు స్సిద్ధచారణాః ।**
**గ్రస్యమానం యథా చంద్రం పూర్ణే పర్వణి రాహుణా ॥ 193**

**పదచ్ఛేదము :–** ఆస్యే – తస్యాః – నిమజ్జంతం – దదృశుః – సిద్ధచారణాః – గ్రస్యమానం – యథా – చంద్రం – పూర్ణే – పర్వణి – రాహుణా ॥

**అన్వయక్రమము :–** పూర్ణే పర్వణి, రాహుణా గ్రస్యమానం చంద్రం యథా, సిద్ధచారణాః తస్యాః ఆస్యే నిమజ్జంతం (తం) దదృశుః.

**ప్రతిపదార్థము :–** పూర్ణే పర్వణి = పూర్ణిమ యను పర్వదినమున, రాహుణా గ్రస్యమానం = రాహువుచే మ్రింగబడుచున్నట్టి, చంద్రం యథా = చంద్రునివలె, సిద్ధచారణాః = ఆకాశచారులైన సిద్ధులును చారణులును, తస్యాః ఆస్యే = ఆ సింహికయొక్క నోటియందు, నిమజ్జంతం = మునిగిపోవుచున్నట్టి, (తం = ఆ హనుమంతుని), దదృశుః = చూచిరి.

**తాత్పర్యము :–** హనుమంతు డా సింహిక నోటిలోనికి ప్రవేశించుచుండగా ఆకాశము నందు సంచరించుచున్నట్టి సిద్ధులకును చారణులకును ఆ దృశ్యము పూర్ణిమనాడు రాహువుచే మ్రింగబడుచున్న చంద్రుడువలె కనపడెను.

**శ్లో॥ తత స్తస్యా నఖై స్తీక్ష్ణైర్మర్మాణ్యుత్కృత్య వానరః ।**
**ఉత్పపాతాథ వేగేన మనస్సంపాతవిక్రమః ॥ 194**

**పదచ్ఛేదము :–** తతః – తస్యాః – నఖైః – తీక్ష్ణైః – మర్మాణి – ఉత్కృత్య – వానరః – ఉత్పపాత – అథ – వేగేన – మనస్సంపాతవిక్రమః ॥

**అన్వయక్రమము :–** తతః, వానరః, తీక్ష్ణైః, నఖైః, తస్యాః, మర్మాణి, ఉత్కృత్య, అథ మనస్సంపాతవిక్రమః (సన్) వేగేన, ఉత్పపాత.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, వానరః = హనుమంతుడు, తీక్ష్ణైః నఖైః = (తన) వాడియైన గోళ్ళతో, తస్యాః = ఆ సింహికయొక్క, మర్మాణి = ఆయువు పట్టువులను, ఉత్కృత్య = పెరికివేసి, అథ = అనంతరము, మనస్సంపాతవిక్రమః =

మనోవేగతుల్యమైన గమనము గలవాడై, వేగేన = శీఘ్రముగా, ఉత్పపాత = మీదికి ఎగసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :–** ఉత్పపాత = ముఖము ద్వారా వేగముగా ఎగసి వచ్చెను. నోరు మూసివేయకుండగనే వేగముగా హనుమ ఈవలకు వచ్చివేసెనని భావము.

**తాత్పర్యము :–** తరువాత హనుమంతుడు, తన వాడియైన గోళ్ళతో ఆ సింహికయొక్క మర్మావయవములను ఆయువు పట్టులను పెరికివేసి, మనోవేగతుల్యుడై (అది నోరుమూయు లోపల) బయటకువచ్చి మీదికెగసెను.

**శ్లో॥ తాం తు దృష్ట్వా చ ధృత్యా చ దాక్షిణ్యేన నిపాత్య చ ।**
**స కపిప్రవరో వేగాద్వవృధే పునరాత్మవాన్ ॥ 195**

**పదచ్ఛేదము :–** తాం – తు – దృష్ట్వా – చ – ధృత్యా – చ – దాక్షిణ్యేన – నిపాత్య – చ – సః – కపిప్రవరః – వేగాత్ – వవృధే – పునః – ఆత్మవాన్ ॥

**అన్వయక్రమము :–** ఆత్మవాన్ సః కపిప్రవరః తాం దృష్ట్వా ధృత్యా చ దాక్షిణ్యేన చ నిపాత్య, పునః వేగాత్ వవృధే.

**ప్రతిపదార్థము :–** ఆత్మవాన్ = గొప్ప ప్రజ్ఞగల, సః కపిప్రవరః = ఆ వానరశ్రేష్ఠుడు, తాం = ఆ సింహికను, దృష్ట్వా = దూరదృష్టితోడను, ధృత్యా చ = గొప్పధైర్యముతోడను, దాక్షిణ్యేన చ = గొప్ప సామర్థ్యముచేతను, నిపాత్య = పడగొట్టి, పునః = తిరిగి, వేగేన = శీఘ్రముగా, వవృధే = పెద్ద శరీరము గల వాడయ్యెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** దిష్ట్యా = దైవానుగ్రహముచేత, దృష్ట్వా (పాఠాంతరము) = సూక్ష్మదర్శనశక్తిచే చూచి యని యర్థము. ధృత్యా = సహజమైన ధైర్యముచేత, దాక్షిణ్యేన = కాలోచితకృత్య చాతుర్యముచే, ఆత్మవాన్ = వాయువువలె స్వాధీనమైన గమనశక్తి గలవాడని భావము.

**రామాయణశిరోమణి :–** దిష్ట్యా = దేవతలయొక్క భాగ్యవిశేషముచే, ఆత్మవాన్ = గొప్ప పూనికగలవాడును.

**గోవిందరాజీయము :–** దృష్ట్వా = దూరమునుండియే చూచుటచేత, ధృత్యా = ముఖము మూసికొని నప్పటికిని, ఈవలికి రాగల ధైర్యముతో నని భావము.

**తాత్పర్యము :–** హనుమంతు డా సింహికను దేవతలయొక్క అదృష్టముచేత దూరదృష్టి తోడను, తన గొప్పదైన ధైర్యవిశేషముచేతను, సామర్థ్యవిశేషముచేతను పడగొట్టి వెంటనే తన ప్రజ్ఞచే తిరిగి ఎప్పటివలె తన శరీరమును పెంచెను.

**శ్లో॥ హృతహృత్సా హనుమతా పపాత విధురాంభసి ।**
**స్వయంభువైవ హనుమాన్ సృష్టస్తస్యా నిపాతనే ॥ 196**

**పదచ్ఛేదము :–** హృతహృత్ – సా – హనుమతా – పపాత – విధురా – అంభసి – స్వయంభువా – ఏవ – హనుమాన్ – సృష్టః – తస్యాః – నిపాతనే ॥

**అన్వయక్రమము :–** హనుమతా హృతహృత్ సా విధురా (సతీ) అంభసి పపాత; తస్యాః నిపాతనే హనుమాన్ స్వయంభువా ఏవ సృష్టః.

**ప్రతిపదార్థము :–** హనుమతా = హనుమంతునిచేత, హృతహృత్ = హరింపబడిన గుండె కలిగినట్టి, సా = ఆ సింహిక, విధురా (సతీ) = ప్రాణము గోల్పోయినదై, అంభసి = సాగరజలమునందు, పపాత = పడిపోయెను. తస్యాః నిపాతనే = ఆ సింహికను కూల్చు విషయమై, హనుమాన్ = హనుమంతుడు, స్వయంభువా ఏవ = బ్రహ్మచేతనే, సృష్టః = సృజింపబడియుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** స్వయంభువా ఏవ సృష్టః = రావణుని పరిమార్చుటకు రాముని సృష్టించినట్లుగనే ఛాయను గ్రహించినంత మాత్రముననే ప్రాణులను చంపు శక్తిగల సింహికను సంహరించుటకై బ్రహ్మయే హనుమంతుని సృష్టించెనని భావము.

**తాత్పర్యము :–** హనుమంతుడా సింహిక గుండెను పెకలించివేసినంతనే ఆమె ప్రాణములు గోల్పోయి సముద్రమున గూలెను. ఆమెనిట్లు గూల్చుట కొఱకే బ్రహ్మదేవుడు హనుమంతుని సృష్టించియుండెను.

**శ్లో॥ తాం హతాం వానరేణాశు పతితాం వీక్ష్య సింహికామ్ ।**
**భూతాన్యాకాశచారీణి తమూచుః ప్లవగోత్తమమ్ ॥ 197**

**పదచ్ఛేదము :–** తాం – హతాం – వానరేణ – ఆశు – పతితాం – వీక్ష్య – సింహికామ్ – భూతాని – ఆకాశచారీణి – తమ్ – ఊచుః – ప్లవగోత్తమమ్ ॥

**అన్వయక్రమము :–** వానరేణ హతాం, ఆశు పతితాం, తాం సింహికాం వీక్ష్య ఆకాశచారీణి భూతాని, తం ప్లవగోత్తమమ్, ఊచుః.

**ప్రతిపదార్థము :–** వానరేణ హతాం = హనుమచే సంహరింపబడి, ఆశు పతితాం = త్వరలోనే అట్లు గూలినట్టి, తాం సింహికాం = ఆ సింహికను, వీక్ష్య = చూచి, ఆకాశచారీణి భూతాని = ఆకాశమునందు చరించునట్టి సత్త్వములు, తం ప్లవగోత్తమం = ఆ వానరశ్రేష్ఠుని గూర్చి, ఊచుః = (ఇట్లు) బలికిరి.

**తాత్పర్యము :–** హనుమంతునిచేత సంహరింపబడి తేలికగా అట్లు గూలిపోయిన సింహికను గాంచి ఆకాశచారులైన దేవగణములు హనుమంతునితో నిట్లు బలికిరి.

**శ్లో॥ భీమమద్య కృతం కర్మ మహాసత్త్వం త్వయా హతమ్ ।**
**సాధయార్థ మభిప్రేతమరిష్టం ప్లవతాం వర ॥ 198**

**పదచ్ఛేదము :–** భీమమ్ – అద్య – కృతం – కర్మ – మహాసత్త్వం – త్వయా – హతమ్ – సాధయ – అర్థమ్ – అభిప్రేతమ్ – అరిష్టం – ప్లవతాం – వర ॥

**అన్వయక్రమము :–** హే ప్లవతాం వర! అద్య త్వయా భీమం కర్మ కృతమ్; మహాసత్త్వం హతమ్; అభిప్రేతమ్ అరిష్టమ్ అర్థం సాధయ.

**ప్రతిపదార్థము :–** హే ప్లవతాం వర = ఓ వానరశ్రేష్ఠుడా! అద్య = నేడు, త్వయా = నీచేత, భీమం కర్మ కృతం = భయంకరమైన కృత్యము గావింపబడినది, మహాసత్త్వం హతమ్ = గొప్పదైన భూతము సంహరింపబడినది, అభిప్రేతం = నీ యభీష్టమైన, అరిష్టమ్ అర్థం = మంగళకరమైన ప్రయోజనమును, సాధయ = సాధించుకొనుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మహాసత్త్వం = పరులు సంహరించుటకు శక్యముగానిది యగు సింహిక (రావణుని వలెనే మహాబలవంతురాలని భావము), అరిష్టం = బాధారహితముగా.

**భూషణము :–** మహాసత్త్వం హతం = సింహికచే పడగొట్టబడినది, అనగా చంపబడ లేదని తెలుసుకొనవలెను. సర్వధర్మజ్ఞుడైన హనుమ ఒక్క స్త్రీని వధించెననుట యుక్తముగాదుగదా! వెనుక సురసను గాని ఇకముందు లంకిణిని గాని జయించి విడిచినట్లే వర్ణింపబడినదిగదా!

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! నేడు నీవు మహాభీకరమైన కార్యమును గావించితివి. ఒక గొప్ప భూతమును నీవు గూల్చి దుష్టసంహారము చేసితివి. ఇక నీవు తలపెట్టిన మంగళకరమైన కార్యమును నిర్విఘ్నముగా సాధించుదువుగాక!

**శ్లో॥ యస్య త్వేతాని చత్వారి వానరేంద్ర యథా త్వయి ।**
**ధృతి ర్దృష్టిర్మతి ర్దాక్ష్యం స్వకర్మసు న సీదతి ॥ 199**

**పదచ్ఛేదము** :- యస్య - తు - ఏతాని - చత్వారి - వానరేంద్ర - యథా - త్వయి; ధృతిః - దృష్టిః - మతిః - దాక్ష్యం - (సః) స్వకర్మసు న సీదతి ॥

**అన్వయక్రమము** :- హే వానరేంద్ర! యస్య తు ధృతిః దృష్టిః మతిః దాక్ష్యం ఏతాని చత్వారి త్వయి యథా (వర్తంతే) (సః) స్వకర్మసు న సీదతి.

**ప్రతిపదార్థము** :- హే వానరేంద్ర! = ఓ వానరోత్తమా! యస్య తు = ఎవ్వనికైతే, ధృతిః = ధీరత్వము, దృష్టిః = సరియైనచూపు, ధృతిః = ముందుఆలోచన, దాక్ష్యం = సామర్థ్యము అనెడి, ఏతాని చత్వారి = ఈ నాలుగు, త్వయి యథా = నీయందువలె, (వర్తంతే = ఉండునో), సః = అతడు, స్వకర్మసు = తన కృత్యములందు, న సీదతి = విఫలుడుగాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- ఏ సింహికకు సూక్ష్మమైన దృష్టియును, గొప్ప మతివిశేషము, క్రియాశూరత్వము, ధైర్యమున్ను అను నాలుగు లక్షణములున్నూ నీకుండినట్లుగా యున్నవో అట్టి సింహిక యను మహాసత్త్వమును నీవే హతమార్చ గల్గితివి. అని ఒక అన్వయము (ఈ నాల్గు లక్షణములును గలవాడెవ్వడును తన పూనికయందు విఫలుడుగాడు. (రామాయణశిరోమణి).

**తాత్పర్యము** :- ఓ వానరశ్రేష్ఠుడా! నీ యందున్నట్లుగా ధైర్యగుణము, విషయములను సరిగా చూడగలిగిన దృష్టి, తగిన ఆలోచనా శక్తి, నిర్వహణ సామర్థ్యము అనునట్టి ఈ నాలుగు ఉత్తమ గుణములును, ఎవ్వనియం దుండునో అతడు తన కర్తవ్యకార్యములం దెన్నడును వైఫల్యము నొందదు.

**శ్లో॥ స తైః సంపూజితః పూజ్యః ప్రతిపన్నప్రయోజనైః ।**
**జగామాకాశ మావిశ్య పన్నగాశనవత్కపిః ॥ 200**

**పదచ్ఛేదము** :- సః - తైః - సంపూజితః - పూజ్యః - ప్రతిపన్నప్రయోజనైః - జగామ - ఆకాశమ్ - ఆవిశ్య - పన్నగాశనవత్ - కపిః ॥

**అన్వయక్రమము** :- ప్రతిపన్నప్రయోజనైః తైః సంపూజితః పూజ్యః సః కపిః పన్నగాశనవత్ ఆకాశమ్ ఆవిశ్య జగామ.

**ప్రతిపదార్థము** :- ప్రతిపన్నప్రయోజనైః = నెరవేరిన ప్రయోజనము కల్గినట్టి, తైః = ఆ దేవగణములచేత, సంపూజితః పూజ్యః సః కపిః = ప్రశంసింపబడినట్టి పూజ్యుడైన ఆ హనుమంతుడు, పన్నగాశనవత్ = గరుత్మంతునివలె, ఆకాశమ్ ఆవిశ్య =

ఆకాశమునుచేరి, జగామ = పయనము సాగించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** ప్రతిపన్నప్రయోజనః.

ఈ పాఠము భూషణమునందు వ్యాఖ్యాతచే గూడ గ్రహింపబడినది. తెలుగు ముద్రణములలో గూడ నిట్లేయున్నది. అందుచే సాధించుకొనిన ప్రయోజనము గలవాడు హనుమ యని చెప్పుట యుక్తముగా నున్నది.

**తాత్పర్యము :–** తమ కోరిక నెరవేరినట్టి ఆ దేవగణములు పూజ్యుడైన ఆ హనుమంతుని గౌరవానందములతో మిక్కిలి ప్రశంసింపగా ఆతడు గరుత్మంతునివలె ఆకసమున తన పయనమును సాగించెను.

**శ్లో॥ ప్రాప్తభూయిష్ఠపారస్తు సర్వతః పరిలోకయన్ ।**
**యోజనానాం శత స్యాంతే వనరాజీం దదర్శ సః ॥ 201**

**పదచ్ఛేదము :–** ప్రాప్తభూయిష్ఠపారః – తు – సర్వతః – పరిలోకయన్ – యోజనానాం – శతస్య – అంతే – వనరాజీం – దదర్శ – సః ॥

**అన్వయక్రమము :–** ప్రాప్తభూయిష్ఠపారః సః సర్వతః పరిలోకయన్ యోజనానాం శతస్య అంతే వనరాజీం దదర్శ.

**ప్రతిపదార్థము :–** ప్రాప్తభూయిష్ఠపారః = దగ్గరకుచేరియున్న తీరప్రదేశము కల్గినట్టి, సః = ఆ హనుమంతుడు, సర్వతః పరిలోకయన్ = అన్నివైపులకు చూచుచు, యోజనానాం శతస్య అంతే = నూఱుయోజనములకు చివరను, వనరాజీం దదర్శ = వనసమూహమును జూచెను.

**తాత్పర్యము :–** ఇంచు మించుగా ఆవలియొడ్డుకు చేరుకొన్న హనుమ దూరముగనున్న ప్రాంతమునంతయును పరికించుచు నూఱుయోజనముల అనంతరము చివరకు నేలపై గానవచ్చు వనముల వరుసను చూచెను.

**శ్లో॥ దదర్శ చ పతన్నేవ వివిధద్రుమభూషితమ్ ।**
**ద్వీపం శాఖామృగశ్రేష్ఠో మలయోపవనాని చ ॥ 202**

**పదచ్ఛేదము :–** దదర్శ – చ – పతన్ – ఏవ – వివిధద్రుమభూషితమ్ – ద్వీపం – శాఖామృగశ్రేష్ఠః – మలయోపవనాని – చ ॥

**అన్వయక్రమము :–** శాఖామృగశ్రేష్ఠః పతన్ ఏవ వివిధద్రుమభూషితమ్ ద్వీపం

మలయోపవనాని చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** శాఖామృగశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, పతన్ ఏవ = ఎగురుచు వచ్చుచునే, వివిధద్రుమభూషితం = పలువిధములైన వృక్షములతో శోభించుచున్నట్టి, ద్వీపం = లంకాద్వీపమును, మలయోపవనాని చ = మలయగిరిపై నున్న ఉద్యానవనములను గూడ, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మలయోపవనాని చ = సముద్రమునకు ఉత్తరతీరమునందు వలె దక్షిణ తీరమునందు గూడ మలయ మను పేరుగల పర్వతమున్నదని తెలియుచున్నది.

**మహేశ్వరతీర్థులు :–** మలయోపవనాని చ = లంకలో కూడ మలయ మను పర్వత మున్నది.

**తాత్పర్యము :–** వృక్షశాఖలందు సంచరించు శీలముగల ఆ వానరశ్రేష్ఠుడు సముద్రముపై ఎగిరిపోవుచునే పలువిధములగు వృక్షములతో శోభించుచున్న లంకాద్వీపమును, అందు మలయగిరిపై నున్న ఉద్యానవనములను గూడ చూచెను.

**శ్లో॥ సాగరం సాగరానూపాన్ సాగరానూపజాన్ ద్రుమాన్ ।**
**సాగరస్య చ పత్నీనాం ముఖాన్యపి విలోకయన్ ॥ 203**

**పదచ్ఛేదము :–** సాగరం – సాగరానూపాన్ – సాగరానూపజాన్ – ద్రుమాన్ – సాగరస్య – చ – పత్నీనాం – ముఖాని – అపి – విలోకయన్ ॥

**అన్వయక్రమము :–** సాగరం సాగరానూపాన్ సాగరానూపజాన్ ద్రుమాన్ సాగరస్య పత్నీనాం ముఖాని చ అపి విలోకయన్.

**ప్రతిపదార్థము :–** సాగరం = సముద్రమును, సాగరానూపాన్ = సాగరతీర ప్రదేశములను, సాగరానూపజాన్ ద్రుమాన్ = సముద్రపుటొడ్డున మొలచిన వృక్షములను, సాగరస్య పత్నీనాం ముఖాని చ అపి = సముద్రుని భార్యలైన నదుల ముఖములను గూడ, విలోకయన్ = తిలకించుచు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సాగరస్య పత్నీనాం ముఖాని = లంకనుండి వచ్చి సముద్రమున కలియుచున్న నదీసంగమస్థానములు.

**రామాయణశిరోమణి** :– సాగరస్య పత్నీనాం ముఖాని = నదీ సాగర సంగమ స్థానములని భావము గ్రహించవలెను.

**భూషణము** :– సాగరస్య పత్నీనాం ముఖాని = నదులు త్రికూటపర్వతమునుండి ప్రవహించుచు సముద్రమున గలియు ప్రదేశములు.

**తాత్పర్యము** :– హనుమంతుడు అప్పుడు సముద్రమును, సముద్రతీరములను, ఆ తీరమునందు మొలచిన చెట్లను, సముద్రమునందు కలియుచున్న నదుల సుందర దృశ్యములను చూచుచు.....

**శ్లో॥ స మహామేఘసంకాశం సమీక్ష్యాత్మానమాత్మవాన్ ।**
**నిరుంధంత మివాకాశం చకార మతిమాన్మతిమ్ ॥ 204**

**పదచ్ఛేదము** :– సః – మహామేఘసంకాశం – సమీక్ష్య – ఆత్మానమ్ – ఆత్మవాన్ – నిరుంధంతమ్ – ఇవ – ఆకాశం – చకార – మతిమాన్ – మతిమ్ ॥

**అన్వయక్రమము** :– ఆకాశం నిరుంధంతమ్ ఇవ (స్థితం) మహామేఘసంకాశమ్ ఆత్మానం సమీక్ష్య మతిమాన్ ఆత్మవాన్ సః (ఇత్థం) మతిం చకార.

**ప్రతిపదార్థము** :– ఆకాశం నిరుంధంతమ్ ఇవ (స్థితం) = ఆకాశమును అడ్డి వేయుచున్నట్లుగానున్న, మహామేఘసంకాశమ్ = పెద్దదైన మేఘమువలెనున్న, ఆత్మానం = తన శరీరమును, సమీక్ష్య = చూచి, మతిమాన్ = గొప్ప బుద్ధివిశేషము గలవాడును, ఆత్మవాన్ = గొప్ప ప్రజ్ఞగలవాడు నగు, సః = ఆ హనుమంతుడు (ఇత్థం = ఈ రీతిగా), మతిం చకార = నిశ్చయించుకొనెను.

**తాత్పర్యము** :– పెద్దమేఘమువలె, ఆకాశమును కప్పివేయుచున్నట్లున్న తన శరీరమును జూచుకొని, గొప్ప ప్రజ్ఞావిశేషమును, బుద్ధివిశేషమును గల హనుమంతుడు ఇట్లు నిశ్చయించుకొనెను.

**శ్లో॥ కాయవృద్ధిం ప్రవేగం చ మమ దృష్ట్వైవ రాక్షసాః ।**
**మయి కౌతూహలం కుర్యురితి మేనే మహామతిః ॥ 205**

**పదచ్ఛేదము** :– కాయవృద్ధిం – ప్రవేగం – చ – మమ – దృష్ట్వా – ఏవ – రాక్షసాః మయి – కౌతూహలం – కుర్యుః – ఇతి – మేనే – మహామతిః ॥

**అన్వయక్రమము** :– మమ కాయవృద్ధిం ప్రవేగం చ దృష్ట్వా ఏవ రాక్షసాః మయి కౌతూహలం కుర్యుః ఇతి మహామతిః మేనే.

**ప్రతిపదార్థము** :– మమ = నాయొక్క, కాయవృద్ధిం = అధికమైన దేహపరిమాణమును, ప్రవేగం చ = గమనవేగమున్ను, దృష్ట్వా ఏవ = చూడగానే, రాక్షసాః = రాక్షసులు, మయి = నా విషయమునందు, కౌతూహలం కుర్యుః = జిజ్ఞాసగలవారగుదురు, ఇతి = అని, మహామతిః = గొప్ప బుద్ధివిశేషముగల హనుమ, మేనే = తలపోసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– కౌతూహలం = ఆశ్చర్యముతో, చూడగోరిక.

**తాత్పర్యము** :– గొప్పదైన నా శరీరమును నా గమనవేగమును జూచి, లంకలోని రాక్షసులు నన్నుగూర్చి తెలుసుకొన వలెనని, కుతూహలము గలవారైయుందురుగదా! అని తన బుద్ధివిశేషముచే హనుమ ముందుగనే గ్రహించెను.

**శ్లో॥ తత శ్శరీరం సంక్షిప్య తన్మహీధరసన్నిభమ్ ।**
**పునః ప్రకృతి మాపేదే వీతమోహ ఇవాత్మవాన్ ॥ 206**

**పదచ్ఛేదము** :– తతః – శరీరం – సంక్షిప్య – తత్ – మహీధరసన్నిభమ్ – పునః – ప్రకృతిమ్ – ఆపేదే – వీతమోహాః – ఇవ – ఆత్మవాన్ ॥

**అన్వయక్రమము** :– తతః మహీధరసన్నిభం తత్ శరీరం సంక్షిప్య వీతమోహాః ఆత్మవాన్ ఇవ పునః ప్రకృతిమ్ ఆపేదే.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, మహీధరసన్నిభం = పర్వతముతో సమానముగా నున్నట్టి, తత్ శరీరం = ఆ మహాకాయమును, సంక్షిప్య = సంకోచింపజేసి, వీతమోహాః = మాయను తొలగించు కొన్నట్టి, ఆత్మవాన్ ఇవ = ఆత్మజ్ఞుడైన పురుషుని వలె, పునః = తిరిగి, ప్రకృతిమ్ ఆపేదే = స్వస్వరూపమును పొందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– వీతమోహాః = తొలగిపోయినట్టి వాసనాజన్య కామాదిమోహములు గలవాడు. ఆత్మవాన్ = జీవన్ముక్తయోగి, ప్రకృతిం = భగవదభిన్నమైన, లక్షణముగల స్వభావమును.

**రామాయణశిరోమణి** :– ప్రకృతిం = నిత్యానంద స్వరూపమును.

**మహేశ్వరతీర్థులు** :– వీతమోహాః = నివృత్తమైన అవిద్యగలవాడు.

**తాత్పర్యము** :– వెంటనే హనుమంతుడు పెద్ద పర్వతముతో సమానముగానున్న తన శరీరమును, సంకోచింపజేసి ఆత్మజ్ఞుడైన పురుషుడు మాయను తొలగించుకొని

స్వస్వరూపము నొందినట్లు తిరిగి అతని నిజరూపమును దాల్చెను.

**శ్లో॥ తద్రూపమతిసంక్షిప్య హనుమాన్ ప్రకృతౌ స్థితః ।**
**త్రీన్ క్రమానివ విక్రమ్య బలివీర్యహరో హరిః ॥ 207**

**పదచ్ఛేదము :–** తత్ – రూపమ్ – అతిసంక్షిప్య – హనుమాన్ – ప్రకృతౌ – స్థితః – త్రీన్ – క్రమాన్ – ఇవ – విక్రమ్య – బలివీర్యహరః – హరిః ॥

**అన్వయక్రమము :–** బలివీర్యహరః హరిః త్రీన్ క్రమాన్ విక్రమ్య ఇవ హనుమాన్ తత్ రూపమ్ అతిసంక్షిప్య ప్రకృతౌ స్థితః.

**ప్రతిపదార్థము :–** బలివీర్యహరః = బలిచక్రవర్తి యొక్క ప్రతాపమును హరించినట్టి, హరిః = విష్ణుమూర్తి, త్రీన్ క్రమాన్ = మూడు అడుగులను (చాచి), విక్రమ్య ఇవ = పిమ్మట ముల్లోకములను వ్యాపించినట్లు, హనుమాన్ = హనుమ, తత్ రూపం = పర్వతతుల్యమైన ఆ రూపమును, అతిసంక్షిప్య = మిక్కిలిగా సంకోచింపజేసి, ప్రకృతౌ స్థితః = నిజరూపమున నుండెను.

**బొంబాయిప్రతి :–** 'తతః శరీరం సంక్షిప్య' అని పాఠాంతరము.

**తాత్పర్యము :–** పూర్వము బలిచక్రవర్తి యొక్క ప్రతాపమును హరింప నుద్యుక్తుడైన విష్ణుమూర్తి ముల్లోకములను గూడ మూడడుగులతో వ్యాపించుటకు పూనిన విశ్వరూపమును పిమ్మట ఉపసంహరించినట్లుగా హనుమంతుడు సాగరలంఘనార్థము ధరించి యున్నట్టి, ఆ పర్వతసదృశశరీరమును సంకోచింపజేసి తన నిజరూపమును దాల్చెను.

**శ్లో॥ స చారునానావిధరూపధారీ పరం సమాసాద్య సముద్రతీరమ్ ।**
**పరైరశక్యం ప్రతిపన్నరూప స్సమీక్షితాత్మా సమవేక్షితార్థః ॥ 208**

**శ్లో॥ తతస్స లంబస్య గిరేస్సమృద్ధే విచిత్రకూటే నిపపాత కూటే ।**
**సకేతకోద్దాలకనారికేళమహాభ్రకూటప్రతిమో మహాత్మా ॥ 209**

**పదచ్ఛేదము :–** సః – చారునానావిధరూపధారీ – పరం – సమాసాద్య – సముద్రతీరమ్ – పరైః – అశక్యం – ప్రతిపన్నరూపః – సమీక్షితాత్మా – సమవేక్షి తార్థః ॥

తతః – సః – లంబస్య – గిరేః – సమృద్ధే – విచిత్రకూటే – నిపపాత – కూటే – సకేతకోద్దాలకనారికేళే – మహాభ్రకూటప్రతిమః – మహాత్మా ॥

**అన్వయక్రమము :–** చారునానావిధరూపధారీ సః సమీక్షితాత్మా సమవేక్షితార్థః (సన్) ప్రతిపన్నరూపః పరైః (ప్రాప్తుం) అశక్యం పరం సముద్రతీరం సమాసాద్య

మహాభ్రకూటప్రతిమః మహాత్మా సః తతః సకేతకోద్దాలకనారికేళే విచిత్రకూటే సమృద్ధే లంబస్య గిరేః కూటే నిపపాత.

**ప్రతిపదార్థము** :- చారునానావిధరూపధారీ = సుందరమైనట్టి బహువర్ణముగల వివిధరూపములు ధరించునట్టి, సః = ఆ హనుమ, సమీక్షితాత్మా = గొప్పదైయున్న తన ప్రస్తుతరూపమును చూచుకొన్నవాడై, సమవేక్షితార్థః (సన్) = అనంతరము తాను చేయవలసిన కార్యమును నిశ్చయించుకొన్నవాడగుచు, ప్రతిపన్నరూపః = తత్కాలోచితమైన రూపమును ధరించినవాడై, పరైః (ప్రాప్తుం) అశక్యం = ఇతరులకు చేర శక్యముగానట్టి, పరం సముద్రతీరం = సముద్రముయొక్క ఆవలి యొడ్డును, సమాసాద్య = చేరి, మహాభ్రకూటప్రతిమః = మహామేఘసమూహమువలె శోభించుచున్నవాడై, సః మహాత్మా = ఆ హనుమంతుడు, తతః = అప్పుడు, సకేత కోద్దాలకనారికేళే = మొగలి, విరిగి, కొబ్బరిచెట్లతో నిండి యున్నట్టిదియును, విచిత్రకూటే = విచిత్రమైన శృంగములు గలదియును, సమృద్ధే = ఫలపుష్పాదులు సమృద్ధిగ గలదియును అగు, లంబస్య గిరేః కూటే = లంబగిరిశిఖరమునందు, నిపపాత = దిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- చారునానావిధరూపధారీ = నానావర్ణములు గల ఆకృతులతో నుండు రూపమును ధరించినవాడు; ఈ విషయము హనుమదుపాసకుల ధ్యానగమ్యమైనది.

**రామాయణశిరోమణి** :- సమీక్షితాత్మా = తెలిసికొన్న అన్వేషణ ప్రయత్నము గలవాడు.

**రామానుజీయము** :- చారునానావిధరూపధారీ = తత్తత్కార్యానుగుణముగా రమణీయములైన స్థూల, సూక్ష్మాది రూపములు ధరించువాడు, పరైః = సింహిక మున్నగువారిచేత.

**గోవిందరాజీయము** :- లంబగిరి = అగ్రము కనుపించనంతటి పొడవైనది, విచిత్రకూటే = విచిత్రములకు నిలయమైనట్టిది.

**తాత్పర్యము** :- సుందరములును, వివిధవర్ణములు గలవియును, పలువిధములగు ఆకారములు గలవియును అగు బహురూపములను ధరింపగలవాడైన ఆ హనుమంతుడు మహాపర్వతమువలెనున్న ప్రస్తుతాకారమును చూచుకొని ఇకముందు తాను చేయవలసిన కార్యమును తలచుకొని తత్కార్యనిర్వహణకు, తగియున్న రూపమును ధరింప బూనినవాడై ఇతరు లెవ్వరును చేరజాలని మహోదధి ఆవలి తీరమును జేరి, మొగలి, విరిగి, కొబ్బరిచెట్లతో నిండియున్నదై, విచిత్రములైన

శృంగములతో శోభిల్లుచు, ఫలపుష్పాదుల సమృద్ధి గల్గియున్న లంబగిరియొక్క శిఖరమునందు మహామేఘసన్నిభుడై దిగెను.

**శ్లో॥ తతస్తు సంప్రాప్య సముద్రతీరం**
**సమీక్ష్య లంకాం గిరివర్యమూర్ధ్ని ।**
**కపిస్తు తస్మిన్నిపపాత పర్వతే**
**విధూయ రూపం వ్యథయన్మృగద్విజాన్ ॥ 210**

**పదచ్ఛేదము** :– తతః – తు – సంప్రాప్య – సముద్రతీరం – సమీక్ష్య – లంకాం – గిరివర్యమూర్ధ్ని – కపిః – తు – తస్మిన్ – నిపపాత – పర్వతే – విధూయ – రూపం – వ్యథయన్ – మృగద్విజాన్ ॥

**అన్వయక్రమము** :– సముద్రతీరం సంప్రాప్య, కపిః తతః గిరివర్యమూర్ధ్ని (స్థితాం) లంకాం సమీక్ష్య, (పూర్వం) రూపం విధూయ, మృగద్విజాన్ వ్యథయన్.

**ప్రతిపదార్థము** :– సముద్రతీరం సంప్రాప్య = మహోదధితీరము చేరి, కపిః = ఆ హనుమంతుడు, తతః = పిమ్మట, గిరివర్యమూర్ధ్ని (స్థితాం) = పర్వత శిఖరముపై నున్న, లంకాం సమీక్ష్య = లంకను గాంచి, (పూర్వం) రూపం విధూయ = వెనుకటి రూపమును విడిచిపెట్టి, మృగద్విజాన్ వ్యథయన్ = జంతువులను, పక్షులను, భయపెట్టుచున్నవాడై, తస్మిన్ పర్వతే = ఆ లంబపర్వతముపై, నిపపాత = దిగెను.

**తాత్పర్యము** :– సముద్రతీరముయొక్క ఆవలి యొడ్డును చేరిన పిమ్మట హనుమంతుడు ఉన్నతమైన పర్వతముపై విరాజిల్లుచున్న లంకానగరముజూచి, తన వెనుకటి భీకర రూపమును ఉపసంహరించుకొని అచటి మృగపక్షులకు భీతిగొల్పుచున్నవాడై, లంబపర్వతముపై దిగెను.

**శ్లో॥ స సాగరం దానవపన్నగాయుతం**
**బలేన విక్రమ్య మహోర్మిమాలినమ్ ।**
**నిపత్య తీరే చ మహోదధే స్తదా**
**దదర్శ లంకా మమరావతీమివ ॥ 211**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సాగరలంఘనం" నామ*
*ప్రథమస్సర్గః.*

**పదచ్ఛేదము** :- సః - సాగరం - దానవపన్నగాయుతం - బలేన - విక్రమ్య - మహోర్మిమాలినమ్ - నిపత్య - తీరే - చ - మహోదధేః - తదా - దదర్శ - లంకామ్ - అమరావతీమ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- సః దానవపన్నగాయుతం మహోర్మిమాలినం సాగరం బలేన విక్రమ్య, తదా మహోదధేః తీరే నిపత్య అమరావతీమ్ ఇవ (విరాజమానాం) లంకాం దదర్శ.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమంతుడు, దానవపన్నగాయుతం = రాక్షసుల తోడను, సర్పములతోడను, నిండి యున్నదియును, మహోర్మిమాలినం = పెద్ద కెరటములతో గూడినదియును అగు, సాగరం = సముద్రమును, బలేన విక్రమ్య = తన శక్తిచే (అతిక్రమించి) లంఘించి, తదా = అప్పుడు, మహోదధేః తీరే = మహోదధి తీరమున, నిపత్య = అవతరించి, అమరావతీమ్ ఇవ (విరాజమానాం) = అమరావతీ నగరమువలె శోభిల్లుచున్న, లంకాం = లంకాపట్టణమును, దదర్శ = చూచెను (దర్శించెను).

**తాత్పర్యము** :- అంత హనుమంతుడు రాక్షసులతోను, పెద్ద కెరటములతోను భయంకరమై యున్న మహాసముద్రమును అద్భుతమైన తన పరాక్రమవిశేషముచే లంఘించి, మహోదధితీరముపై దిగి, దేవేంద్రుని రాజధాని యగు అమరావతివలె విరాజిల్లుచున్న లంకానగరమును దర్శించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సాగరలంఘనము" అను*
*మొదటిసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ద్వితీయసర్గ

**శ్లో॥ స సాగర మనాధృష్య మతిక్రమ్య మహాబలః ।
త్రికూటశిఖరే లంకాం స్థితాం స్వస్థో దదర్శ హ ॥ 1**

**పదచ్ఛేదము** :- సః - సాగరమ్ - అనాధృష్యమ్ - అతిక్రమ్య - మహాబలః - త్రికూటశిఖరే - లంకాం - స్థితాం - స్వస్థః - దదర్శ - హ ॥

**అన్వయక్రమము** :- సః మహాబలః అనాధృష్యం సాగరమ్ అతిక్రమ్య, స్వస్థః (సన్) త్రికూటశిఖరే స్థితాం లంకాం దదర్శ హ.

**ప్రతిపదార్థము** :- మహాబలః సః = అమితబలశాలియైన యా హనుమ, అనాధృష్యం సాగరమ్ అతిక్రమ్య = అసాధ్యమైన మహాసముద్రమును లంఘించి, స్వస్థః = స్వస్థచిత్తుడై, త్రికూటశిఖరే స్థితాం = త్రికూటపర్వతశిఖరమునం దున్నట్టి, లంకాం = లంకానగరమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- త్రికూటస్య తటే అని పాఠాంతరము. లంబగిరికే త్రికూటమని నామాంతరము.

**రామాయణశిరోమణి** :- త్రికూట పర్వతము, గిరివర్య పర్వతము అనునవి రెండును పర్యాయపదములే.

**తాత్పర్యము** :- మహాబలశాలియైన హనుమంతుడు సమీపించుటకే భయంకరమై యుండునట్టి ఆ మహాసముద్రమును అతిక్రమించి ఆవలియొడ్డున గల త్రికూట పర్వతశిఖరముపై నున్న లంకానగరమును గాంచెను.

**శ్లో॥ తతః పాదపముక్తేన పుష్పవర్షేణ వీర్యవాన్ ।
అభివృష్టస్థిత స్తత్ర బభౌ పుష్పమయో యథా ॥ 2**

**పదచ్ఛేదము** :- తతః - పాదపముక్తేన - పుష్పవర్షేణ - వీర్యవాన్ - అభివృష్టః -

స్థితః – తత్ర – బభౌ – పుష్పమయః – యథా ॥

**అన్వయక్రమము** :– తతః పాదపముక్తేన పుష్పవర్షేణ అభివృష్టః తత్ర స్థితః వీర్యవాన్ సః పుష్పమయో యథా బభౌ.

**ప్రతిపదార్థము** :– తతః = అంతట, పాదపముక్తేన = (అచటి) వృక్షములనుండి రాలినట్టి, పుష్పవర్షేణ = పూలవానచే, అభివృష్టః = నిండుగ వర్షింపబడినట్టివాడై, తత్ర స్థితః = అచట నిలచినట్టి, వీర్యవాన్ సః = వీరుడైన ఆ యాంజనేయుడు, పుష్పమయో యథా = పువ్వులతో నిర్మింపబడిన వానివలె, బభౌ = ప్రకాశించెను.

**తాత్పర్యము** :– ఆ త్రికూటపర్వతమునందలి చెట్లనుండి ఆంజనేయునిపై వర్షమువలె పువ్వులు కురిసెను. అప్పుడు అతడు పువ్వులతో నిర్మింపబడిన వింత వానరమువలె చూడముచ్చటగ నుండెను.

**శ్లో॥ యోజనానాం శతం శ్రీమాంస్తీర్త్వాఽప్యుత్తమవిక్రమః ।**
**అనిశ్శ్వసన్ కపిస్తత్ర న గ్లాని మధిగచ్ఛతి ॥ 3**

**పదచ్ఛేదము** :– యోజనానాం – శతం – శ్రీమాన్ – తీర్త్వా – అపి – ఉత్తమవిక్రమః – అనిశ్శ్వసన్ – కపిః – తత్ర – న – గ్లానిమ్ – అధిగచ్ఛతి ॥

**అన్వయక్రమము** :– శ్రీమాన్ ఉత్తమవిక్రమః కపిః, యోజనానాం శతం తీర్త్వా అపి, తత్ర అనిశ్శ్వసన్, గ్లానిం న అధిగచ్ఛతి.

**ప్రతిపదార్థము** :– శ్రీమాన్ = శుభలక్షణములతో నిండినవాడును, ఉత్తమవిక్రమః = శ్రేష్ఠమైన పరాక్రమముగలవాడునగు, కపిః = ఆ హనుమంతుడు, యోజనానాం శతం = నూఱుయోజనములు, తీర్త్వా అపి = దాటిగూడ, తత్ర = ఆ తీరప్రదేశమునందు, అనిశ్శ్వసన్ = ఊపిరి తీసుకొనుటయైనను లేక, గ్లానిం న అధిగచ్ఛతి = శ్రమను పొందనేలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అనిశ్శ్వసన్ = శ్రమచే గలుగునట్టి ఊర్పులేనివాడై.

**మహేశ్వరతీర్థులు** :– అనిశ్శ్వసన్ = శ్రమసంజనితమైన, దీర్ఘమగు ఊర్పును విడువకుండ, తత్ర = లంఘననిమిత్తముగా.

**తాత్పర్యము** :– లోకోత్తరపరాక్రమసంపన్నుడైన, ఆ మహామహిమాఢ్యుడగు హనుమంతుడు నూఱుయోజనముల సముద్రము దాటినను, నిట్టూర్పునైన విడువక

ఎట్టి శ్రమను బొందక సుఖముగా నిలచియుండెను.

**శ్లో॥ శతాన్యహం యోజనానాం క్రమేయం సుబహూన్యపి ।**
**కిం పున స్సాగరస్యాంతం సంఖ్యాతం శతయోజనమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– శతాని – అహం – యోజనానాం – క్రమేయం – సుబహూని – అపి – కిం – పునః – సాగరస్య – అంతం – సంఖ్యాతం – శతయోజనమ్ ॥

**అన్వయక్రమము** :– అహం, యోజనానాం సుబహూని శతాని అపి, క్రమేయమ్ సాగరస్య సంఖ్యాతం శతయోజనమ్ అంతం పునః కిం (వక్తవ్యమ్).

**ప్రతిపదార్థము** :– అహం = నేను, సుబహూని = అనేకములైన, యోజనానాం శతాని అపి = వందల యోజనములు గూడ, క్రమేయం = దాటిపోగలను. సాగరస్య = ఈ సముద్రముయొక్క, సంఖ్యాతం = లెక్కపెట్టదగిన, శతయోజనమ్ అంతం పునః కిం (వక్తవ్యమ్) = నూఱుయోజనముల ఆవలి యొడ్డును గూర్చి, వేరుగా చెప్పవలసిన దేమున్నది ?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ఈ శ్లోకము హనుమ వచనములలో చెప్పబడినట్లు రచింపబడెను.

**తాత్పర్యము** :– "నేను, అనేక శతసంఖ్యల యోజనముల దూరమునైనను, దాటి పోవగలవాడను. ఈ నూఱు యోజనముల పరిమితిగల సముద్రమును దాటుట వేరుగా చెప్పుకొనవలసిన విషయమగునా" అని హనుమ తన మనంబున తలచెను.

**శ్లో॥ స తు వీర్యవతాం శ్రేష్ఠః ప్లవతామపి చోత్తమః ।**
**జగామ వేగవాంల్లంకాం లంఘయిత్వా మహోదధిమ్ ॥ 5**

**పదచ్ఛేదము** :– సః – తు – వీర్యవతాం – శ్రేష్ఠః – ప్లవతామ్ – అపి – చ – ఉత్తమః – జగామ – వేగవాన్ – లంకాం – లంఘయిత్వా – మహోదధిమ్ ॥

**అన్వయక్రమము** :– వీర్యవతాం శ్రేష్ఠః, ప్లవతామ్ అపి చ ఉత్తమః, వేగవాన్ సః, తు, మహోదధిం లంఘయిత్వా, లంకాం జగామ.

**ప్రతిపదార్థము** :– వీర్యవతాం శ్రేష్ఠః = మహావీరులలో శ్రేష్ఠుడును, ప్లవతాం అపి చ = ఆకసమున ఎగురు వానరులలో గూడ, ఉత్తమః = సర్వశ్రేష్ఠుడును, వేగవాన్ = అమితవేగముగల, సః = ఆ హనుమంతుడు, మహోదధిం లంఘయిత్వా = మహాసముద్రమును దాటి, లంకాం జగామ = లంకను చేరెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** లంకాం జగామ = పర్వతశిఖరము నుండి దిగిన పిమ్మట యని గ్రహింప వలెను.

**తాత్పర్యము :-** బలవంతులలో అగ్రగణ్యుడు, వానరులలో శ్రేష్ఠుడగు హనుమంతుడు మహావేగముతో, ఆ రీతిగ సముద్రమును దాటి లంకకు చేరుకొనెను.

**శ్లో॥ శాద్వలాని చ నీలాని గంధవంతి వనాని చ ।**
**గండవంతి చ మధ్యేన జగామ నగవంతి చ ॥ 6**

**పదచ్ఛేదము :-** శాద్వలాని – చ – నీలాని – గంధవంతి – వనాని – చ – గండవంతి – చ – మధ్యేన – జగామ – నగవంతి – చ ॥

**అన్వయక్రమము :-** (సః) నీలాని శాద్వలాని చ, గంధవంతి, గండవంతి చ నగవంతి చ వనాని, మధ్యేన జగామ.

**ప్రతిపదార్థము :-** (సః = ఆ హనుమంతుడు) నీలాని శాద్వలాని చ = నల్లనైయున్న పచ్చికబయళ్ళను, గంధవంతి = సువాసనగలవియును, గండవంతి = పెద్దపెద్ద శిలలతో నిండినవియును, నగవంతి చ = చిన్న పర్వతములతో గూడినవియునగు, వనాని = అరణ్యములను (దాటుచు), మధ్యేన జగామ = వాటినడుమగా పోవుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** మధ్యేన జగామ = మధ్యమార్గమున వనములు మున్నగునవి చూచుచు పోయెనని భావము.

**రామాయణశిరోమణి :-** 'గండవంతి' – 'మధుమంతి' అని బొంబాయి పాఠము. మధుమంతి అనగా తేనెలతో నిండియున్న.

**తాత్పర్యము :-** హనుమంతుడు అటనుండి నల్లని పచ్చికబయళ్ళను, సువాసనలు వెదజల్లు చెట్లతోడను కూడియుండి, చిన్న పర్వతములు, పెద్ద రాతిబండలు కలిగి యున్నట్టి ఆ సుందరమైన వనములను చూచుచు, వాటినడుమ నుండి పోవుచుండెను.

**శ్లో॥ శైలాంశ్చ తరుసంఛన్నాన్ వనరాజీశ్చ పుష్పితాః ।**
**అభిచక్రామ తేజస్వీ హనుమాన్ ప్లవగర్షభః ॥ 7**

**పదచ్ఛేదము :-** శైలాన్ – చ – తరుసంఛన్నాన్ – వనరాజీః – చ – పుష్పితాః

–అభిచక్రామ – తేజస్వీ – హనుమాన్ – ప్లవగర్షభః ॥

**అన్వయక్రమము :–** తేజస్వీ ప్లవగర్షభః హనుమాన్, తరుసంఛన్నాన్ శైలాన్ చ పుష్పితాః వనరాజీః చ అభిచక్రామ.

**ప్రతిపదార్థము :–** తేజస్వీ = మహాతేజశ్శాలియును, ప్లవగర్షభః = వానరశ్రేష్ఠుడును అగు, హనుమాన్ = హనుమంతుడు, తరుసంఛన్నాన్ = చెట్లచే గప్పబడిన, శైలాన్ చ = పర్వతములను, పుష్పితాః = పుష్పించియున్న, వనరాజీః చ = వన సమూహములను, అభిచక్రామ = దాటిపోవుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** శైలాన్ – లంబపర్వతముయొక్క పాదపర్వతములను.

**రామానుజీయము :–** ఈ శ్లోకమునందు శైలశబ్దము శృంగవాచకము.

**తాత్పర్యము :–** చెట్లతో నిండిన కొండలను, పుష్పించియున్న వనశ్రేణులను తిలకించుచు మహాతేజస్వియైన హనుమ ముందునకు సాగి పోవుచుండెను.

**శ్లో॥ స తస్మిన్నచలే తిష్ఠన్వనాన్యుపవనాని చ ।**
**స నగాగ్రే చ తాం లంకాం దదర్శ పవనాత్మజః ॥ 8**

**పదచ్ఛేదము :–** సః – తస్మిన్ – అచలే – తిష్ఠన్ – వనాని – ఉపవనాని – చ – సః – నగాగ్రే – చ – తాం – లంకాం – దదర్శ – పవనాత్మజః ॥

**అన్వయక్రమము :–** సః తస్మిన్ అచలే తిష్ఠన్ వనాని ఉపవనాని చ (దదర్శ). సః పవనాత్మజః నగాగ్రే తాం లంకాం చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ వాయుపుత్రుడు, తస్మిన్ అచలే = ఆ పర్వతమునందు, తిష్ఠన్ = నిలచినవాడై, వనాని = అరణ్యములను, ఉపవనాని చ = ఉద్యానవనములను, దదర్శ = చూచెను. సః పవనాత్మజః = ఆ హనుమంతుడు, నగాగ్రే = పర్వత శిఖరముపైనున్న, తాం లంకాం చ = ఆ లంకానగరమునున్ను, దదర్శ = తిలకించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** గిరివర్యసమీపమునందు నిలచి అని చెప్పుకోవలెను.

**తాత్పర్యము :–** హనుమంతుడా కొండయందు నిలచి, అచ్చట వనములను, ఉప వనములను, మఱియు త్రికూటపర్వతముయొక్క శిఖరముపై నున్న లంకానగరమును గాంచెను.

శ్లో॥ సరళాన్ కర్ణికారాంశ్చ ఖర్జూరాంశ్చ సుపుష్పితాన్ ।
ప్రియాళాన్ ముచుళిందాంశ్చ కుటజాన్ కేతకానపి ॥ **9**

శ్లో॥ ప్రియంగూన్ గంధపూర్ణాంశ్చ నీపాన్ సప్తచ్ఛదాం స్తథా ।
అసనాన్ కోవిదారాంశ్చ కరవీరాంశ్చ పుష్పితాన్ ॥ **10**

శ్లో॥ పుష్పభారనిబద్ధాంశ్చ తథా ముకుళితానపి ।
పాదపాన్ విహగాకీర్ణాన్ పవనాధూతమస్తకాన్ ॥ **11**

శ్లో॥ హంసకాండవాకీర్ణా వాపీః పద్మోత్పలాయుతాః ।
ఆక్రీడాన్వివిధాన్రమ్యాన్వివిధాంశ్చ జలాశయాన్ ॥ **12**

శ్లో॥ సంతతాన్వివిధైర్వృక్షైః సర్వర్తుఫలపుష్పితైః ।
ఉద్యానాని చ రమ్యాణి దదర్శ కపికుంజరః ॥ **13**

**పదచ్ఛేదము** :-(9) సరళాన్ - కర్ణికారాన్ - చ - ఖర్జూరాన్ - చ - సుపుష్పితాన్ - ప్రియాళాన్ - ముచుళిందాన్ - చ - కుటజాన్ - కేతకాన్ - అపి ॥

(10) ప్రియంగూన్ - గంధపూర్ణాన్ - చ - నీపాన్ - సప్తచ్ఛదాన్ - తథా అసనాన్ - కోవిదారాన్ - చ - కరవీరాన్ - చ - పుష్పితాన్ ॥

(11) పుష్పభారనిబద్ధాన్ - చ - తథా - ముకుళితాన్ - అపి - పాదపాన్ - విహగాకీర్ణాన్ - పవనాధూతమస్తకాన్ ॥

(12) హంసకాండవాకీర్ణాః - వాపీః - పద్మోత్పలాయుతాః - ఆక్రీడాన్ - వివిధాన్ - రమ్యాన్ - వివిధాన్ - చ - జలాశయాన్ ॥

(13) సంతతాన్ - వివిధైః - వృక్షైః - సర్వర్తుఫలపుష్పితైః - ఉద్యానాని - చ - రమ్యాణి - దదర్శ - కపికుంజరః ॥

**ప్రతిపదార్థము** :- కపికుంజరః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, సరళాన్ = దేవదారు వృక్షములను, కర్ణికారాన్ చ = కొండగోగుచెట్లను, పుష్పితాన్, ఖర్జూరాన్ చ = చక్కగా పుష్పించిన ఖర్జూరపు చెట్లను, ప్రియాళాన్ = మోరటి వృక్షములను, ముచుళిందాన్ చ = పెద్ద నారింజలను, కుటజాన్ = గిరిమల్లెలను, కేతకాన్ అపి = మొగిలి చెట్లను, ప్రియంగూన్ = పిప్పలి చెట్లను, గంధపూర్ణాన్ = గొప్ప పరిమళముతో నిండినట్టి, నీపాన్ = కడిమి చెట్లను, సప్తచ్ఛదాన్ = ఏడాకుల అరటిచెట్లను, తథా అసనాన్ = అట్లే వేగిసచెట్లను, కోవిదారాన్ చ = కాంచన వృక్షములను, పుష్పితాన్ కరవీరాన్ చ

= పుష్పించిన గన్నేరు చెట్లను, తథా = ఆ ప్రకారముగనే, పుష్పభారనిబద్ధాన్ = పువ్వుల బరువుచే వంగినవియు, ముకుళితాన్ అపి = మొగ్గలు తొడిగియున్నట్టివి యును, విహగాకీర్ణాన్ = పక్షులతో నిండి యున్నట్టివి యును, పవనాధూతమస్తకాన్ = గాలిచే ఊపివేయబడుచున్న, శిఖరములు గల్గియున్నవియునగు, పాదపాన్ = వివిధవృక్షములను, హంసకాండవాకీర్ణాః = హంసలతోడను, కన్నె లేడిపిట్టలతోడను నిండినవియునగు, పద్మోత్పలాయుతాః = తామరపువ్వులతోడను, కలువలతోడను, నిండినవియునగు, వాపీః = దిగుడుబావులను, వివిధాన్ = వివిధములైన, రమ్యాన్ ఆక్రీడాన్ = సుందరములైన ఉద్యానవనములను, సర్వర్తుఫలపుష్పితైః = అన్ని ఋతువులందలి ఫలములతోడను, పూలతోడను నిండినట్టి, వివిధైః వృక్షైః = బహువిధములగు వృక్షములతో, సంతతాన్ = దట్టముగ నిండియున్నట్టి, వివిధాన్ జలాశయాన్ చ = వివిధములైన సరోవరములను, రమ్యాణి ఉద్యానాని చ = మనోహరములైన విహారవనములనుగూడ, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- రావణుని తపోబలమువలన ఆ లంకయందలి వృక్షములన్నియును ఎల్లప్పుడును పుష్పించియే యుండునని గ్రహించవలెను. రమ్యాన్ ఆక్రీడాన్ - క్రీడా పర్వతములని కతక వ్యాఖ్యానము.

**మహేశ్వరతీర్థులు** :- రాజులు ప్రత్యేకముగా నిర్మించుకొన్న ఉద్యాన వనములు.

**తాత్పర్యము** :- అప్పుడా హనుమ అచ్చట గల దేవదారు వృక్షములను, కొండగోగుచెట్లను, చక్కగా పుష్పించిన ఖర్జూరములను, మోరటిచెట్లను, పెద్దనారింజచెట్లను, గిరిమల్లికలను, మొగలిపొదలను, పిప్పలి చెట్లను, గొప్ప పరిమళముతోగూడిన కడిమి చెట్లను, ఏడాకుల అరటిచెట్లను, వేగిస చెట్లను, కాంచనవృక్షములను, పూచియున్న గన్నేరువృక్షములను, మఱియు పువ్వుల బరువుచే వంగియున్నవియును, మొగ్గలు తొడిగియున్నవియును, పక్షులతో నిండియున్నవియును, గాలికి కదులుచున్న కొనకొమ్మలుగల మఱికొన్ని ఇతర వృక్షములను; అట్లే హంసలతోడను కన్నెలేడిపిట్టల తోడను నిండినవై తామరపువ్వులతోడను, కలువపువ్వులతోడను కలకలలాడుచున్న దిగుడు బావులను; పలువిధములైన సుందరములగు క్రీడాపర్వతములను, వివిధములగు సరస్సులను అన్ని ఋతువులయందును పండ్లతోను, పూవులతోను నిండియుండు చెట్లుగలిగి, ముచ్చట గొల్పుచున్న ఉద్యానవనములను గాంచెను.

**శ్లో॥ సమాసాద్య చ లక్ష్మీవాన్ లంకాం రావణపాలితామ్ ।**
**పరిఖాభిస్సపద్మాభిస్సోత్పలాభి రలంకృతామ్ ॥ 14**

**శ్లో॥ సీతాపహరణార్థేన రావణేన సురక్షితామ్ ।**
**సమంతాద్విచరద్భిశ్చ రాక్షసై రుగ్రధన్విభిః ॥ 15**

**శ్లో॥ కాంచనేనావృతాం రమ్యాం ప్రాకారేణ మహాపురీమ్ ।**
**గృహైశ్చ గ్రహసంకాశైః శారదాంబుదసన్నిభైః ॥ 16**

**శ్లో॥ పాండురాభిః ప్రతోలీభిరుచ్చాభి రభిసంవృతామ్ ।**
**అట్టాలకశతాకీర్ణాం పతాకాధ్వజమాలినీమ్ ॥ 17**

**శ్లో॥ తోరణైః కాంచనైర్దివ్యైర్లతాపంక్తివిచిత్రితైః ।**
**దదర్శ లంకాం హనుమాన్ దివి దేవపురీమివ ॥ 18**

**పదచ్ఛేదము** :-(14) సమాసాద్య – చ – లక్ష్మీవాన్ – లంకాం – రావణపాలితామ్ – పరిఖాభిః – సపద్మాభిః – సోత్పలాభిః – అలంకృతామ్ ॥

(15) సీతాపహరణార్థేన – రావణేన – సురక్షితామ్ – సమంతాత్ – విచరద్భిః – చ – రాక్షసైః – ఉగ్రధన్విభిః ॥

(16) కాంచనేన – ఆవృతాం – రమ్యాం – ప్రాకారేణ – మహాపురీమ్ – గృహైః – చ – గ్రహసంకాశైః – శారదాంబుదసన్నిభైః ॥

(17) పాండురాభిః – ప్రతోలీభిః – ఉచ్చాభిః – అభిసంవృతామ్ – అట్టాలకశతకీర్ణాం – పతాకాధ్వజమాలినీమ్ ॥

(18) తోరణైః – కాంచనైః – దివ్యైః – లతాపంక్తివిచిత్రితైః – దదర్శ – లంకాం – హనుమాన్ – దివి – దేవపురీమ్ – ఇవ ॥

**ప్రతిపదార్థము** :- లక్ష్మీవాన్ హనుమాన్ = మహాశోభాసమన్వితుడైన హనుమ, రావణపాలితాం లంకాం = రావణునిచే పాలింపబడుచున్న లంకను, సమాసాద్య = చేరుకొని, సపద్మాభిః = తామరపువ్వులతోడను, సోత్పలాభిః = కలువపూవులతోడను కూడిన, పరిఖాభిః = అగడ్తలతో, అలంకృతామ్ = అలంకరింపబడినట్టిదియును, సీతాపహరణార్థేన = సీతమ్మను దొంగిలించు నిశ్చయముగల, రావణేన = రావణుని చేతను, (మరియు) సమంతాత్ = అంతటను, విచరద్భిః = సంచరించుచున్నవారును, ఉగ్రధన్విభిః = భీకరమైన ధనుస్సులు ధరించిన వారగు, రాక్షసైశ్చ = రాక్షసులచేగూడ,

సురక్షితాం = రక్షింపబడుచున్నదియును, కాంచనేన ప్రాకారేణ = బంగారు ప్రాకారములతో, ఆవృతాం = చుట్టుకొనబడినట్టిదియును, రమ్యాం మహాపురీం = సుందరమైన మహానగరమైనట్టిదియును, గ్రహసంకాశైః = సూర్య చంద్రాది గ్రహములతో సమానమైనట్టి, శారదాంబుదసన్నిభైః = శరత్కాల మేఘములవలె స్వచ్ఛముగ నున్నట్టి, గృహైశ్చ = భవనములతోడను, ఉచ్చాభిః = ఉన్నతమైనట్టి, పాండురాభిః = తెల్లనైనట్టి, ప్రతోళీభిః = రాజవీథులతో, అభిసంవృతామ్ = నిండియున్నట్టిదియును, అట్టాలకశతాకీర్ణాం = వందల కొలది కోట బురుజులతో నిండియున్నట్టిదియును, పతాకాధ్వజమాలినీమ్ = పతాకములతో గూడిన ధ్వజముల యొక్క వరుసలతో ప్రకాశించుచున్నదియును, లతాపంక్తివిచిత్రితైః = వివిధములైన లతారూపములలో నున్న శిల్పములతో ప్రకాశించుచున్నట్టి, కాంచనైః = సువర్ణమయములైన, దివ్యైః తోరణైః = మిక్కిలి సుందరమైన గోపురద్వారములతోడను (ప్రకాశించుచున్నట్టి), లంకాం = ఆ లంకానగరమును, దివి దేవపురీమివ = స్వర్గమునం దమరావతీపురమును (చూచి)నట్లుగా, దదర్శ = (ఆశ్చర్యముతో) చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– లక్ష్మీవాన్ = జయలక్ష్మితో ప్రకాశించుచున్నవాడు.

**తిలకము** :– దేవపురీమ్ ఇవ దదర్శ = హనుమంతుడు లంకను అమరావతిని చూచినట్లు చూచి ఆనందించెను. అనగా శత్రునగరమును జూచి ఆతడేమియు భీతిని చెందలేదని సూచితము.

**మహేశ్వరతీర్థులు** :– సురక్షితామ్ = అపహృతద్రవ్యమైన సీతమ్మను భద్రముగా రక్షించుకొనవలసిన బాధ్యతచే లంక రావణునిచే సురక్షితమై యున్నదని భావము.

**తాత్పర్యము** :– హనుమంతుడు, రావణునిచే పాలింపబడుచున్న లంకను జేరి, పద్మములతోను, కలువలతోను శోభిల్లుచున్న అగడ్తలను జూచెను. రావణాసురుడును మరియు రాక్షసులును భయంకరములైన శస్త్రములు ధరించి, అన్ని మూలలలందును సంచరించుచు లంకను కాపాడుటను హనుమ జూచెను. ఆ మహానగరమును చుట్టియున్న బంగారు ప్రాకారములను, అత్యున్నతములైన తెల్లని కాంతితోడ ప్రకాశించుచున్న భవనములను జూచెను. తెల్లని భవనములతో ప్రకాశించు దీర్ఘములైన రాజవీథులను, పతాకములతో గూడిన ధ్వజములతో ప్రకాశించు వందలకొలది కోటబురుజులను చూచెను. వివిధ శిల్పములుగల దివ్యమైన బంగారు గోపుర ద్వారములను జూచెను. ఇట్టి విశేషములుగల ఆ లంకానగరము ఆ హనుమకు స్వర్గమునందలి అమరావతివలెనే ఆనందకరముగా గాన్పించెను.

**శ్లో॥ గిరిమూర్ధ్ని స్థితాం లంకాం పాండురైర్భవనైశ్శుభైః ।**
**దదర్శ స కపిశ్రేష్ఠః పురమాకాశగం యథా ॥ 19**

**పదచ్ఛేదము** :– గిరిమూర్ధ్ని – స్థితాం – లంకాం – పాండురైః – భవనైః – శుభైః – దదర్శ – సః – కపిశ్రేష్ఠః – పురమ్ – ఆకాశగం – యథా ॥

**అన్వయక్రమము** :– పాండురైః శుభైః భవనైః గిరిమూర్ధ్ని స్థితాం లంకాం, సః కపిశ్రేష్ఠః ఆకాశగం పురం యథా దదర్శ.

**ప్రతిపదార్థము** :– పాండురైః = ధవళములైనట్టి, శుభైః భవనైః = మంగళకరమైన భవనములతో, గిరిమూర్ధ్ని స్థితాం = త్రికూట పర్వత శిఖరమున నున్నట్టి, లంకాం = లంకానగరమును, సః కపిశ్రేష్ఠః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, ఆకాశగం పురం యథా = ఆకాశమున నున్నట్టి పట్టణమునువలెనే, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– మిక్కిలి తెల్లనివియును, మంగళకరములును అగు భవనములతో, పర్వతాగ్రమున ప్రకాశించుచున్న ఆ నగరము ఆకాశమునందు నిర్మింపబడిన పట్టణమువలెనే అతనికి గానవచ్చెను.

**శ్లో॥ పాలితాం రాక్షసేంద్రేణ నిర్మితాం విశ్వకర్మణా ।**
**ప్లవమానా మివాకాశే దదర్శ హనుమాన్పురీమ్ ॥ 20**

**పదచ్ఛేదము** :– పాలితాం – రాక్షసేంద్రేణ – నిర్మితాం – విశ్వకర్మణా – ప్లవమానామ్ – ఇవ – ఆకాశే – దదర్శ – హనుమాన్ – పురీమ్ ॥

**అన్వయక్రమము** :– రాక్షసేంద్రేణ పాలితాం, విశ్వకర్మణా నిర్మితాం, (తాం పురీం) హనుమాన్, ఆకాశే ప్లవమానామ్ ఇవ, దదర్శ.

**ప్రతిపదార్థము** :– రాక్షసేంద్రేణ పాలితాం = రాక్షసరాజుచే పాలింపబడుచున్నదియును, విశ్వకర్మణా నిర్మితాం = విశ్వకర్మచే నిర్మింపబడినదియునగు, (తాం పురీం = ఆ లంకానగరమును) హనుమాన్ = హనుమంతుడు, ఆకాశే ప్లవమానామ్ ఇవ = (రాక్షసప్రభావముచే) ఆకాశమునం దెగురుచున్న నగరమునువలె, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'దదర్శ' యని ముమ్మారు ప్రయోగించుటచే ఆ పట్టణశోభ హనుమంతునకు చూచుట కంత ఆకర్షణీయముగా నుండెనని సూచింపబడినది.

**తాత్పర్యము** :– రాక్షసరాజైన రావణునిచే పాలింపబడుచు విశ్వకర్మచే ప్రత్యేకమైన

శ్రద్ధతో నిర్మింపబడిన ఆ పట్టణము నిజముగా ఆకాశమునందు ఎగురుచున్నట్లుగనే హనుమంతునకు కాన్పించెను.

**శ్లో॥ వప్రప్రాకారజఘనాం విపులాంబునవాంబరామ్ ।**
**శతఘ్నీశూలకేశాంతా మట్టాలకవతంసకామ్ ॥ 21**

**పదచ్ఛేదము** :- వప్రప్రాకారజఘనాం - విపులాంబునవాంబరామ్ - శతఘ్నీ శూలకేశాంతామ్ - అట్టాలకవతంసకామ్ ॥

**శ్లో॥ మనసేవ కృతాం లంకాం నిర్మితాం విశ్వకర్మణా ।**
**ద్వారముత్తరమాసాద్య చింతయామాస వానరః ॥ 22**

**పదచ్ఛేదము** :- మనసా - ఇవ - కృతాం - లంకాం - నిర్మితాం - విశ్వకర్మణా - ద్వారమ్ ఉత్తరమ్ - ఆసాద్య - చింతయామాస - వానరః ॥

**అన్వయక్రమము** :- వప్రప్రాకారజఘనాం, విపులాంబునవాంబరామ్, శతఘ్నీశూల కేశాంతామ్, అట్టాలకవతంసకామ్ ॥ విశ్వకర్మణా, మనసా కృతామ్ ఇవ, నిర్మితాం లంకాం దదర్శ. ఉత్తరద్వారమ్ ఆసాద్య, వానరః చింతయామాస.

**ప్రతిపదార్థము** :- వప్రప్రాకారజఘనాం = కోటలును ప్రాకారములును అనెడు జఘనము గలదియును, విపులాంబునవాంబరామ్ = సముద్రజలమనెడు విశాలమైన నూతన వస్త్రమును ధరించినదియును, శతఘ్నీశూలకేశాంతాం = శతఘ్నులు శూలములనెడు కేశములు గలదియును, అట్టాలకవతంసకామ్ = బురుజులనెడు సిగలోని పువ్వులు గలదియును అగు దివ్యమైన వనితగా.

(2) విశ్వకర్మణా నిర్మితాం = విశ్వకర్మచే నిర్మింపబడినట్టి, మనసా కృతామ్ ఇవ = మనస్సుచే ఊహించినదానినివలె, లంకాం = ఆ లంకానగరమును, దదర్శ = చూచెను. ఉత్తరద్వారమ్ ఆసాద్య = ఉత్తరగోపురద్వారమును జేరి, వానరః = హనుమంతుడు, చింతయామాస = ఇట్లు చింతింపదొడగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ఉత్తరం ద్వారమ్ ఆసాద్య = సముద్రముయొక్క దక్షిణతటమును ఎగిరివచ్చి చేరిన హనుమంతునకు మొదట కాన్పించునది ఉత్తరద్వారమే.

**గోవిందరాజీయము** :- చింతయామాస వానరః = వైదేహి దర్శనోపాయమును చింతించెను. మనసా కృతామ్ ఇవ = ఆలోచించి చూడగా ఏ మహానుభావునియొక్క

మనస్సంకల్పమాత్రముననో నిర్మింపబడినట్లున్నది.

**రామాయణశిరోమణి** :- మనసా కృతామ్ ఇవ = బ్రహ్మయొక్క ఇచ్ఛామాత్రముచేతనే చేయబడినట్లున్నది.

**తాత్పర్యము** :- ఆ లంకానగర మొక సుందరాంగివలె నుండెను. ఆ నగరమునందలి కోటలును, ప్రాకారములును ఆ సుందరి జఘనమువలెను, సాగరజలము ఆమె ధరించిన వస్త్రమువలెను, ప్రాకారముపైనున్న శతఘ్నులును, శూలములును కేశములవలెను, అందలి బురుజులు సిగలో ధరించిన పువ్వులవలెను గాన్పించు చుండెను.

**తాత్పర్యము** :- ఈ నగరమును విశ్వకర్మ మనస్సుతో ముందు సుందరముగా నూహించుకొని సరిగా అంత అద్భుతముగాను నిర్మించినట్లుగా కానవచ్చుచుండెను. అట్టి ఆ నగరముయొక్క ఉత్తరద్వారమును చేరి మారుతి ఈ రీతిగా తలపోసెను.

**శ్లో॥ కైలాసశిఖరప్రఖ్యామాలిఖంతీ మివాంబరమ్ ।**
**డీయమానా మివాకాశముచ్ఛ్రితైర్భవనోత్తమైః ॥ 23**

**పదచ్ఛేదము** :- కైలాసశిఖరప్రఖ్యామ్ - ఆలిఖంతీమ్ - ఇవ - అంబరమ్ - డీయమానామ్ - ఇవ - ఆకాశమ్ - ఉచ్ఛ్రితైః - భవనోత్తమైః ॥

**శ్లో॥ సంపూర్ణాం రాక్షసైర్ఘోరై ర్నాగైర్భోగవతీమివ ।**
**అచింత్యాం సుకృతాం స్పష్టాం కుబేరాధ్యుషితాం పురా ॥ 24**

**పదచ్ఛేదము** :- సంపూర్ణాం - రాక్షసైః - ఘోరైః - నాగైః - భోగవతీమ్ - ఇవ - అచింత్యాం - సుకృతాం - స్పష్టాం - కుబేరాధ్యుషితాం - పురా ॥

**శ్లో॥ దంష్ట్రిభిర్బహుభి శ్శూరైశ్శూలపట్టిసపాణిభిః ।**
**రక్షితాం రాక్షసై ర్ఘోరైర్గుహా మాశీవిషైరివ ॥ 25**

**పదచ్ఛేదము** :- దంష్ట్రిభిః - బహుభిః - శూరైః - శూలపట్టిసపాణిభిః - రక్షితాం - రాక్షసైః - ఘోరైః - గుహామ్ - ఆశీవిషైః - ఇవ ॥

**శ్లో॥ తస్యాశ్చ మహతీం గుప్తిం సాగరం చ నిరీక్ష్య సః ।**
**రావణం చ రిపుం ఘోరం చింతయామాస వానరః ॥ 26**

**పదచ్ఛేదము** :- తస్యాః - చ - మహతీం - గుప్తిం - సాగరం - చ - నిరీక్ష్య - సః, రావణం - చ - రిపుం - ఘోరం - చింతయామాస - వానరః ॥

**ప్రతిపదార్థము** (23–26):– కైలాసశిఖరప్రఖ్యాం = కైలాసపర్వత శిఖరమువలె నున్నదియును, అంబరమ్ ఆలిఖంతీమ్ ఇవ = ఆకాశమును ఒరసుకొనుచున్నట్లు ఉన్నదియును, నాగైః భోగవతీమ్ ఇవ = నాగజాతివీరులతో (నిండిన) పాతాళలోకమువలె, ఘోరైః రాక్షసైః సంపూర్ణాం = భయంకరులైన, రాక్షసులతో నిండినదియును, అచింత్యాం = ఊహకందనిరీతిగా ఆశ్చర్యకరముగ నున్నదియును, సుకృతాం = చక్కగా నిర్మింపబడినదియును, స్పష్టాం = విశదమై యున్నదియును, పురా = పూర్వము, కుబేరాధ్యుషితాం = కుబేరునిచే నివసింపబడినదియును, ఆశీవిషైః = సర్పములచే (రక్షితాం = రక్షింపబడిన), గుహామ్ ఇవ = గుహనువలె, దంష్ట్రిభిః = భీకరమైన కోరలు గలవాడును, శూలపట్టిస పాణిభిః = శూలములు పట్టిసములు మున్నగు శస్త్రములను చేతియందు ధరించినట్టి, బహుభిః = పెక్కుమంది, శూరైః = శూరులును, ఘోరైః = భయంకరులును అగు, రాక్షసైః = రాక్షసులచే, రక్షితాం = రక్షింపబడుచున్నట్టి, లంకాం = లంకానగరమును; తస్యాః = ఆ లంకానగరమునకుగల, మహతీం గుప్తిం = గొప్పదైన రక్షణమును, సాగరం చ = సముద్రమును, ఘోరం రిపుం = భయంకరశత్రువైన, రావణం చ = రావణుని, నిరీక్ష్య = చూచి, సః వానరః = ఆ హనుమంతుడు, చింతయామాస = (ఈ రీతిగా) చింతింపదొడగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిప్రతి** :– 23) శ్లో ॥ "డీయమానాం"కు బదులుగా ధ్రియమాణాం – అని గలదు. అనగా, అందలి భవనములచేత ఆకాశమును మోయుచున్నట్లు ఉన్నదని అర్థము.

**తిలకము** :– కైలాసనిలయప్రఖ్యాం = శివభక్తుడైన రావణుని లంకయొక్క ఉత్తర పురద్వారము, కైలాసనిలయమువలె నున్నదనుట ఎంతగానో సమంజసముగా నున్నది.

**తాత్పర్యము** :– లంకానగరము, కైలాసశిఖరమువలె గానవచ్చుచు ఆకసమును ఒరయు నట్లుండెను. అందలి ఎత్తైన భవనములతో, ఆ పురము ఆకాశమున ఎగురుచున్నట్టుగనే కానవచ్చెను. సర్పములతో నిండిన పాతాళలోకమువలె ఆ నగరము భీకరమైన రాక్షసులతో నిండియుండెను. ఈ యద్భుత వైభవముగలిగి ఊహాతీతసౌందర్యముగల నగరమునందు తొల్లి కుబేరుడు నివసించుచుండెడివాడు. నిధులున్న గుహను, సర్పములు కాపాడునట్లుగా ఈ నగరమును భయంకరమైన ఆయుధములను ధరించిన రాక్షసులు జాగరూకులై కాచుచున్నారు. ఇట్టి ఈ నగరమున గల రక్షణవ్యవస్థను చుట్టునున్న మహాసముద్రమును, శత్రువైన రావణాసురుని మనస్సునందు దలచుకొని

హనుమ ఈరీతిగా చింతింపసాగెను.

**శ్లో॥ ఆగత్యాపీహ హరయో భవిష్యంతి నిరర్థకాః ।**
**నహి యుద్ధేన వై లంకా శక్యా జేతుం సురైరపి ॥ 27**

**పదచ్ఛేదము :–** ఆగత్య – అపి – ఇహ – హరయః – భవిష్యంతి – నిరర్థకాః – న – హి – యుద్ధేన – వై – లంకా – శక్యా – జేతుం – సురైః – అపి ॥

**అన్వయక్రమము :–** ఇహ ఆగత్య అపి హరయః నిరర్థకాః భవిష్యంతి; లంకా యుద్ధేన జేతుం సురైః అపి న హి శక్యా.

**ప్రతిపదార్థము :–** హరయః = వానరులు, ఇహ = ఈ లంకకు, ఆగత్య అపి = వచ్చికూడ (వచ్చినప్పటికిని), నిరర్థకాః భవిష్యంతి = విఫలులై పోగలరు; లంకా = ఈ లంకానగరము, యుద్ధేన జేతుం = యుద్ధముచే జయించుటకు, సురైః అపి న హి శక్యా = దేవతలచే గూడ శక్యముగాదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** ఆగత్య అపి = వచ్చినప్పటికిని అనగా వచ్చుటకు అవశ్యమని సూచింపబడినది.

**తాత్పర్యము :–** వానరులు ఇచ్చటికి దండెత్తి వచ్చినప్పటికిని వీరినేమియు చేయజాలరు. దేవతలు కూడ యుద్ధము జేసి ఈ నగరమును జయింపజాలరు.

**శ్లో॥ ఇమాం తు విషమాం దుర్గాం లంకాం రావణపాలితామ్ ।**
**ప్రాప్యాపి స మహాబాహుః కిం కరిష్యతి రాఘవః ॥ 28**

**పదచ్ఛేదము :–** ఇమాం – తు – విషమాం – దుర్గాం – లంకాం – రావణపాలితామ్ – ప్రాప్య – అపి – సః – మహాబాహుః – కిం – కరిష్యతి – రాఘవః.

**అన్వయక్రమము :–** ఇమాం విషమాం దుర్గాం రావణపాలితాం లంకాం ప్రాప్య అపి సః మహాబాహుః రాఘవః కిం కరిష్యతి.

**ప్రతిపదార్థము :–** విషమాం = సమముగానిది, దుర్గాం = గమనమునకు సాధ్యముగానట్టిదియును, రావణపాలితాం = రావణునిచే పాలింపబడుచున్నట్టిదియును అగు, ఇమాం లంకాం = ఈ లంకాపట్టణమును, ప్రాప్య అపి = చేరుకొనినప్పటికిని, సః మహాబాహుః రాఘవః = ఆ వీరుడైన శ్రీరాముడు (మాత్రము), కిం కరిష్యతి = ఏమి చేయగలడు ?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** ప్రాప్య అపి = పాదచారియైన శ్రీరాముడు సముద్రమును దాటి, లంకకు వచ్చుటయే అసాధ్యమని భావము.

'ఇమాం త్వవిషమాం' అని బొంబాయి పాఠము. అనగా రాక్షసులకు తప్ప ఇతరులకు నెలవు కానట్టి లంకను.

**తాత్పర్యము :-** అత్యంత విషమమును, ప్రవేశింప నశక్యమునగు రావణరక్షితమైన ఈ లంకను ఎట్లో చేరుకొన్నప్పటికిని, ఎంత పరాక్రమవంతుడైనను శ్రీరాముడు మాత్రము వీరిముందు ఏమి చేయగలడు ?

**శ్లో॥ అవకాశో న సాంత్వస్య రాక్షసేష్వభిగమ్యతే ।**
**న దానస్య న భేదస్య నైవ యుద్ధస్య దృశ్యతే ॥ 29**

**పదచ్ఛేదము :-** అవకాశః - న - సాంత్వస్య - రాక్షసేషు - అభిగమ్యతే - న - దానస్య - న - భేదస్య - న - ఏవ - యుద్ధస్య - దృశ్యతే ॥

**అన్వయక్రమము :-** రాక్షసేషు సాంత్వస్య అవకాశః న అభిగమ్యతే; (తథా) దానస్య న భేదస్య న యుద్ధస్య చ నైవ దృశ్యతే.

**ప్రతిపదార్థము :-** రాక్షసేషు = రాక్షసులయందు, సాంత్వస్య = సామోపాయమునకు, అవకాశః = అవకాశము; న అభిగమ్యతే = కాన్పించుట లేదు. (తథా = అట్లే) దానస్య = దానోపాయమునకును, న = లేదు, భేదస్య = భేదోపాయమునకును, న = లేదు, యుద్ధస్య = యుద్ధోపాయమునకును, నైవ దృశ్యతే = (అవకాశము ఎంత మాత్రమును) కనుపించుటలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** ప్రోగుబడియున్న ధనము గలవారగుటచేతను, బలదర్పితులై యుండుట చేతను, పరాక్రమసంపన్నులై యుండుటచేతను, పరస్పరమైత్రి గలవారగుటచేతను, ధృఢమైన స్వభావము గలవారగుటచేతను, సామాది చతురుపాయములచేత గూడ రాక్షసులు వశముగారని హనుమ భావము.

**రామానుజీయము :-** సాంత్వమునకు అవకాశము లేకపోవుట ఆసురీప్రకృతి గలవారు అగుటచేతను; దానమునకు అవకాశము లేకపోవుట ఐశ్వర్యవంతులగుటచేత, భేదమున కవకాశము లేకపోవుట బలదర్పితులై యుండుటచేతను; యుద్ధమున కవకాశము

లేకపోవుట గొప్ప బుద్ధి పరాక్రమము గలవారగుటచేతను.

**తాత్పర్యము** :– ఈ రాక్షసులు రాక్షసప్రకృతి గలవా రగుటచే మంచిమాటలకు లొంగరు. అమితధనాఢ్యులై యుండుటచే ద్రవ్యముచే స్వాధీనులుగారు. మిక్కిలి ఐకమత్యము గలవారై యుండుటచే భేదోపాయమును వీరియెడల పనిచేయదు. గొప్ప బుద్ధి చాతుర్యము, పరాక్రమము గలవారగుటచే యుద్ధముచేత గూడ స్వాధీనులుగారు.

**శ్లో॥ చతుర్ణామేవ హి గతి ర్వానరాణాం మహాత్మనామ్ ।**
**వాలిపుత్రస్య నీలస్య మమ రాజ్ఞశ్చ ధీమతః ॥ 30**

**పదచ్ఛేదము** :– చతుర్ణామ్ – ఏవ – హి – గతిః – వానరాణాం – మహాత్మనామ్ – వాలిపుత్రస్య – నీలస్య – మమ – రాజ్ఞః – చ – ధీమతః ॥

**అన్వయక్రమము** :– మహాత్మనాం వానరాణాం వాలిపుత్రస్య నీలస్య, మమ ధీమతః రాజ్ఞః చ, చతుర్ణాం ఏవ గతిః.

**ప్రతిపదార్థము** :– మహాత్మనాం వానరాణాం = మహనీయులైన వానరులలో, వాలిపుత్రస్య = వాలికుమారుడైన అంగదునకును, నీలస్య = నీలునకును, మమ చ = నాకును, ధీమతః రాజ్ఞః చ = ప్రజ్ఞాశాలియైన రాజైన సుగ్రీవునకును, చతుర్ణాం ఏవ = ఈ నలుగురికి మాత్రమే, గతిః = (సముద్రము దాటి రాగల) గమనశక్తి (ఉన్నది).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– వెనుక వానరులు వచ్చియు ఏమియు చేయలేరని చెప్పబడినది. ప్రస్తుతము వానరులలో రాగలవారు ఎంతమంది యని లెక్క వేసిన నలుగురే యున్నారని నిరాశతో హనుమ చేసిన ఆలోచన కవి తెలుపుచున్నాడు.

**రామాయణశిరోమణి** :– అంగదుడు మున్నగు నలుగురు మాత్రమే రాగలరు. కనుక రాక్షసులతో యుద్ధము అసంభవమని సూచించు చున్నాడు.

**తాత్పర్యము** :– మహాబలవంతులైన మా వానరులలో వాలి పుత్రులైన అంగదుడు, నీలుడు, మా రాజు సుగ్రీవుడును, నేనును ఈ నలుగురు మాత్రమే ఈ లంకను చేరుకోగలము.

**శ్లో॥ యావజ్జానామి వైదేహీం యది జీవతి వా న వా ।**
**తత్రైవ చింతయిష్యామి దృష్ట్వా తాం జనకాత్మజామ్ ॥ 31**

**పదచ్ఛేదము :–** యావత్ – జానామి – వైదేహీం – యది – జీవతి – వా – న – వా – తత్ర – ఏవ – చింతయిష్యామి – దృష్ట్వా – తాం – జనకాత్మజామ్ ॥

**అన్వయక్రమము :–** యది జీవతి వా న వా ఇతి వైదేహీం జానామి యావత్. తాం జనకాత్మజామ్ దృష్ట్వా తత్ర ఏవ చింతయిష్యామి.

**ప్రతిపదార్థము :–** యది జీవతి వా = జీవించియున్నదా, న వా = లేక జీవముతో లేదా, ఇతి = అని, వైదేహీం = జానకిని గూర్చి, జానామి యావత్ = ముందు తెలుసుకొందును, తాం జనకాత్మజామ్ = ఆ సీతను, దృష్ట్వా = కనులతో చూచి, తత్ర ఏవ = అచ్చటనే, చింతయిష్యామి = (తరువాతి విషయము) నాలోచించెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** వైదేహీం న జానామి యావత్ = జానకి బ్రతికియున్న సంగతిగాని లేని సంగతిగాని నాకు తెలియదుగదా!

**తాత్పర్యము :–** జానకమ్మ జీవముతో నున్నదో లేదో నేను ముందు తెలుసుకొందును. ఆమెను కనులారా చూచిన పిమ్మటనే భావికృత్యమును గూర్చి ఆలోచించెదను.

**శ్లో॥ తత స్స చింతయామాస ముహూర్తం కపికుంజరః ।**
**గిరిశృంగే స్థిత స్తస్మిన్ రామ స్యాభ్యుదయే రతః ॥ 32**

**పదచ్ఛేదము :–** తతః – సః – చింతయామాస – ముహూర్తం – కపికుంజరః । గిరిశృంగే – స్థితః – తస్మిన్ – రామస్య – అభ్యుదయే – రతః.

**అన్వయక్రమము :–** తతః తస్మిన్ గిరిశృంగే స్థితః, రామస్య అభ్యుదయే రతః సః కపికుంజరః ముహూర్తం చింతయామాస.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, రామస్య అభ్యుదయే రతః = రాముని కార్యమునందు నిమగ్నుడైనట్టి, సః కపికుంజరః = వానరశ్రేష్ఠుడైన యా హనుమంతుడు, తస్మిన్ గిరిశృంగే స్థితః = ఆ పర్వతశిఖరమునందు నిలచినవాడై, ముహూర్తం చింతయామాస = రెండు క్షణముల కాలము ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** రామస్య అభ్యుదయమ్ = రాముని అభ్యుదయరూపమైన సీతాన్వేషణ ఉపాయమని అర్థము.

**తాత్పర్యము :–** రామకార్యనిరతుడైన యా హనుమంతు డప్పుడా పర్వతశిఖరమున ఒక ముహూర్తకాలము నిలువబడి ఇట్లు చింతించెను.

**శ్లో॥ అనేన రూపేణ మయా న శక్యా రక్షసాం పురీ ।**
**ప్రవేష్టుం రాక్షసైర్గుప్తా క్రూరైర్బలసమన్వితైః ॥ 33**

**పదచ్ఛేదము :–** అనేన – రూపేణ – మయా – న – శక్యా – రక్షసాం – పురీ – ప్రవేష్టుం – రాక్షసైః – గుప్తా – క్రూరైః – బలసమన్వితైః ॥

**అన్వయక్రమము :–** క్రూరైః బలసమన్వితైః రాక్షసైః గుప్తా రక్షసాం పురీ అనేన రూపేణ మయా ప్రవేష్టుం న శక్యా.

**ప్రతిపదార్థము :–** క్రూరైః = క్రూరులును, బలసమన్వితైః = (బహువిధ) బలములు కల్గియున్నవారును అగు, రాక్షసైః = దానవులచే, గుప్తా = రక్షింపబడుచున్నట్టి, రక్షసాం పురీ = ఈ లంకానగరము, అనేన రూపేణ = ప్రస్తుతరూపముతోడనే, మయా = నాచేత, ప్రవేష్టుం న శక్యా = ప్రవేశించుటకు శక్యముగాదు.

**తాత్పర్యము :–** క్రూరులును, బహువిధమగు బలముగలవారును అగు రాక్షసులు, ఈ లంకను అప్రమత్తులై కాచుచున్నారు. నే నీ రూపముతోడనే ఇందు ప్రవేశించుట సాధ్యముగాదు.

**శ్లో॥ ఉగ్రౌజసో మహావీర్యా బలవంతశ్చ రాక్షసాః ।**
**వంచనీయా మయా సర్వే జానకీం పరిమార్గతా ॥ 34**

**పదచ్ఛేదము :–** ఉగ్రౌజసః – మహావీర్యాః – బలవంతః – చ – రాక్షసాః । వంచనీయాః – మయా – సర్వే – జానకీం – పరిమార్గతా ॥

**అన్వయక్రమము :–** రాక్షసాః ఉగ్రౌజసః, మహావీర్యాః, బలవంతశ్చ; జానకీం పరిమార్గతా మయా (తే) సర్వే, వంచనీయాః.

**ప్రతిపదార్థము :–** రాక్షసాః = ఈ రక్కసులు, ఉగ్రౌజసః = తీవ్రమైన ప్రతాపముగలవారు, మహావీర్యాః = మహాపరాక్రమము గలవారును, బలవంతశ్చ = మహాబలాఢ్యులును; జానకీం పరిమార్గతా = సీతాదేవిని అన్వేషించుచున్నట్టి, మయా = నాచేత, (తే) సర్వే = వారందరును, వంచనీయాః = వంచింపవలసినవారు.

**తాత్పర్యము :–** ఈ దానవులు మహోగ్రమైన తేజోదర్పములు గలవారును, బలపరాక్రమ సంపన్నులునుగదా. సీతాదేవిని అన్వేషించుటకు ఉద్యుక్తుడనైన నేను వీరినందరిని వంచింపవలసినదే!

**శ్లో॥ లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ లంకాపురీ మయా ।**
**ప్రవేష్టుం ప్రాప్తకాలం మే కృత్యం సాధయితుం మహత్ ॥ 35**

**పదచ్ఛేదము** :- లక్ష్యాలక్ష్యేణ - రూపేణ - రాత్రౌ - లంకాపురీ - మయా - ప్రవేష్టుం - ప్రాప్తకాలం - మే - కృత్యం - సాధయితుం - మహత్ ॥

**అన్వయక్రమము** :- మే మహత్ కృత్యం సాధయితుం లక్ష్యాలక్ష్యేణ రూపేణ రాత్రౌ మయా లంకాపురీ ప్రవేష్టుం ప్రాప్తకాలమ్.

**ప్రతిపదార్థము** :- మే = నాయొక్క, మహత్ కృత్యం = గొప్పదైన కర్తవ్యమును, సాధయితుం = సాధించుటకుగాను, లక్ష్యాలక్ష్యేణ = కనబడియు కనబడనట్టి, రూపేణ = రూపముతోడ, రాత్రౌ = రాత్రియందే, మయా = నాచేత, లంకాపురీ = లంకా నగరము, ప్రవేష్టుం ప్రాప్తకాలమ్ = ప్రవేశించుటకుచితము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- లక్ష్యాలక్ష్యేణ = కనబడురూపమైన, రక్కసులచే ప్రమాదము వాటిల్లును. కనబడని రూపమైన, లంక అంతయును చూచుటకు కష్టముగదా!

**తాత్పర్యము** :- రక్కసులకు కనుపించునంత పెద్దశరీరము గాకుండగా, లంక అంతయును తిరుగుటకు శక్యమైనట్టి సామాన్యరూపమును ధరించి, రాత్రి సమయమున లంకలో ప్రవేశించి, నా కర్తవ్యమును సాధించుట ఉచితమైయుండును.

**శ్లో॥ తాం పురీం తాదృశీం దృష్ట్వా దురాధర్షాం సురాసురైః ।**
**హనుమాన్ చింతయామాస వినిశ్చిత్య ముహుర్ముహుః ॥ 36**

**పదచ్ఛేదము** :- తాం - పురీం - తాదృశీం - దృష్ట్వా - దురాధర్షాం - సురాసురైః హనుమాన్ - చింతయామాస - వినిశ్చిత్య - ముహుః - ముహుః ॥

**అన్వయక్రమము** :- సురాసురైః దురాధర్షాం తాదృశీం తాం పురీం దృష్ట్వా హనుమాన్ ముహుః ముహుః వినిశ్చిత్య చింతయామాస.

**ప్రతిపదార్థము** :- సురాసురైః = దేవదానవులచే, దురాధర్షాం = ఎదిరింప శక్యముగాని, తాదృశీం తాం పురీం = అంతటి (వైభవముగల) ఆ నగరమును, దృష్ట్వా = చూచి, హనుమాన్ = హనుమంతుడు, వినిశ్చిత్య = నిర్ణయము చేసుకొని, ముహుః ముహుః చింతయామాస = మరల మరల ఆలోచింపసాగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :–** వినిశ్చిత్య ముహుర్ముహుః అనుటచే, సముద్ర లంఘనముకంటెను గూడ, లంకాప్రవేశమే దుష్కరమని కవి సూచించు చున్నాడు.

**బొంబాయిప్రతి :–** 'వినిశ్చిత్య'కు బదులుగా 'వినిశ్వస్య' అని యున్నది. అనగా, పెద్ద నిట్టూర్పు విడచి అని అర్థము. వ్యాఖ్యాన చతుష్టయమున గూడ అట్లే గలదు.

**తాత్పర్యము :–** దేవదానవులుగూడ, కన్నెత్తిచూడ శక్యముగాని ఆ లంకానగరమును గాంచి తన కర్తవ్యమునుగూర్చి నిశ్చయించుకొన్నవాడైనను, హనుమంతు డిట్లు మరల మరల ఆలోచింపసాగెను.

**శ్లో॥ కేనోపాయేన పశ్యేయం మైథిలీం జనకాత్మజామ్ ।**
**అదృష్టో రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా ॥ 37**

**పదచ్ఛేదము :–** కేన – ఉపాయేన – పశ్యేయం – మైథిలీం – జనకాత్మజామ్ – అదృష్టః – రాక్షసేంద్రేణ – రావణేన – దురాత్మనా ॥

**అన్వయక్రమము :–** దురాత్మనా రాక్షసేంద్రేణ రావణేన అదృష్టః, జనకాత్మజాం మైథిలీం, కేనోపాయేన పశ్యేయమ్ ?

**ప్రతిపదార్థము :–** దురాత్మనా = దుర్మార్గుడైన, రాక్షసేంద్రేణ రావణేన = రాక్షసరాజయిన రావణునిచే, అదృష్టః = చూడబడనివాడనై, జనకాత్మజాం మైథిలీం = జనకరాజు పుత్రికయైన సీతాదేవిని, కేనోపాయేన = ఎటువంటి ఉపాయముచే, పశ్యేయమ్ = చూడగలుగుదును ?

**తాత్పర్యము :–** దుర్మార్గుడైన రావణుని కంటబడకుండ జానకిని కనుగొనుటకు నాకు ఏమి యుపాయమున్నది ?

**శ్లో॥ న వినశ్యేత్కథం కార్యం రామస్య విదితాత్మనః ।**
**ఏకామేకశ్చ పశ్యేయం రహితే జనకాత్మజామ్ ॥ 38**

**పదచ్ఛేదము :–** న – వినశ్యేత్ – కథం – కార్యం – రామస్య – విదితాత్మనః – ఏకామ్ – ఏకః – చ – పశ్యేయం – రహితే – జనకాత్మజామ్ ॥

**అన్వయక్రమము :–** విదితాత్మనః రామస్య కార్యం కథం న వినశ్యేత్ ? జనకాత్మజాం, రహితే, ఏకామ్ ఏకః కథం పశ్యేయమ్ ?

**ప్రతిపదార్థము :–** విదితాత్మనః = మహాత్ముడైన, రామస్య = శ్రీరామునియొక్క, కార్యం = కృత్యము, కథం న వినశ్యేత్ = చెడిపోవకుండగ ఎట్లుండగలదు, రహితే = ఏకాంతప్రదేశమునందు, జనకాత్మజామ్ = జానకీదేవిని, ఏకామ్ = ఒంటరిగనుండగా, ఏకః = నేనొక్కడను, కథం పశ్యేయమ్ = ఎట్లుగా చూడగల్గుదును.

**తాత్పర్యము :–** మహాత్ముడైన శ్రీరాముని కార్యమునకు భంగము కలుగకుండ ఎట్లు నెరవేరును ? ఒంటరిగా నున్న జానకిని ఇతరు లెరుగకుండగా, నేనొక్కడనే ఎట్లు చూడగల్గుదును?

**శ్లో॥ భూతాశ్చార్థా విపద్యంతే దేశకాలవిరోధితాః ।**
**విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా ॥ 39**

**పదచ్ఛేదము :–** భూతాః – చ – అర్థాః – విపద్యంతే – దేశకాలవిరోధితాః – విక్లబం – దూతమ్ – ఆసాద్య – తమః – సూర్యోదయే – యథా ॥

**అన్వయక్రమము :–** భూతాః అర్థాః చ, విక్లబం దూతమ్ ఆసాద్య, దేశకాలవిరోధితాః, సూర్యోదయే తమః యథా విపద్యంతే.

**ప్రతిపదార్థము :–** భూతాః అర్థాశ్చ = పూర్వము నెరవేరినట్టి కార్యములుగూడ, విక్లబం దూతమ్ ఆసాద్య = వివేకహీనుడైన దూతను చేరి, దేశకాలవిరోధితాః = దేశమునకు, కాలమునకును విరుద్ధముగా జరుపబడినవై, సూర్యోదయే తమః యథా = సూర్యోదయమునందు చీకటివలె, విపద్యంతే = చెడిపోవుచుండును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** భూతాః అర్థాశ్చ = ఉచితమైన ఉపాయముచే నెరవేరినట్టి విషయములు కూడను.

**తాత్పర్యము :–** యుక్తాయుక్తవివేకము లేని దూత కార్యమును చేయబూనుకొన్నచో, పూర్వము చక్కగా నెరవేరిన కార్యములుగూడ దేశకాలవిరోధమునకు లోనై సూర్యోదయ సమయమున చీకటులు నశించిపోవునట్టుగనే చెడిపోవును.

**శ్లో॥ అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాపి న శోభతే ।**
**ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః ॥ 40**

**పదచ్ఛేదము :–** అర్థానర్థాంతరే – బుద్ధిః – నిశ్చితా – అపి – న – శోభతే – ఘాతయంతి – హి – కార్యాణి – దూతాః – పండితమానినః ॥

**అన్వయక్రమము** :– అర్థానర్థాంతరే నిశ్చితా బుద్ధిః అపి న శోభతే. పండితమానినః దూతాః కార్యాణి ఘాతయంతి హి.

**ప్రతిపదార్థము** :– అర్థానర్థాంతరే = కర్తవ్యాకర్తవ్య విమర్శయందు, నిశ్చితా = సమర్థులచే నిర్ణయింపబడినదైన, బుద్ధిః అపి = ఆలోచనము గూడ, న శోభతే = (అవివేకియైన దూతవలన) రాణించదు; పండితమానినః = తామే విజ్ఞుల మనుకొనునట్టి, దూతాః = దూతలు, కార్యాణి = (నెరవేరుచున్నట్టి) కార్యములను (గూడ), ఘాతయంతి హి = పాడుచేయుదురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– నిశ్చితా అపి = రాజుచేతను, మంత్రులచేతను చక్కగా నిశ్చయింపబడినదైనప్పటికిని.

**మహేశ్వరతీర్థులు** :– దూతల దోషమువలననే తరచుగా రాజులకు కార్యహాని జరుగుచుండునని సూచింపబడినది.

**తాత్పర్యము** :– పండితమ్మన్యులై, అహంకారముతో వర్తించు దూతలు, తమ ప్రభువుల కార్యములను భగ్నమొనర్చుచుందురు. రాజుచేతను మంత్రులచేతను చక్కగా నిర్ణయింపబడిన ఆలోచనలు గూడ అట్టి దూతలవలన నిష్ప్రయోజనములే యగుచుండును.

**శ్లో॥ న వినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్ ।**
**లంఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్ ॥ 41**

**పదచ్ఛేదము** :– న – వినశ్యేత్ – కథం – కార్యం – వైక్లబ్యం – న – కథం – భవేత్ । లంఘనం – చ – సముద్రస్య – కథం – ను – న – వృథా – భవేత్ ॥

**అన్వయక్రమము** :– కార్యం కథం న వినశ్యేత్ ? వైక్లబ్యం కథం న భవేత్ ? సముద్రస్య లంఘనం చ కథం ను వృథా న భవేత్ ?

**ప్రతిపదార్థము** :– కార్యం = (ప్రారంభించిన) పని, కథం న వినశ్యేత్ = ఎట్లు చెడకుండగ నుండును? వైక్లబ్యం కథం న భవేత్ = ఎట్లుగా వివేకహీనత వాటిల్లకుండును? సముద్రస్య లంఘనం చ = (సముద్రమును) లంఘించుట గూడ, కథం ను = ఏరీతిగా, వృథా న భవేత్ = నిష్ప్రయోజనము గాకుండును?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- వైక్లబ్యం = బుద్ధిహీనత.

**తాత్పర్యము** :- తనకును, రాఘవునకును కార్యమెట్లు చెడిపోవకుండునో గదా? అవివేకమునకు లోనుగాకుండ ఎట్లు కార్యము సాధింతునో గదా? ఇంతవరకు సాధించిన సముద్రలంఘన ఘనకార్యము నిష్ప్రయోజనము గాకుండగా సఫలమగుట ఎట్లో గదా!

**శ్లో॥ మయి దృష్టే తు రక్షోభీ రామస్య విదితాత్మనః ।**
**భవే ద్వ్యర్థమిదం కార్యం రావణానర్థ మిచ్ఛతః ॥ 42**

**పదచ్ఛేదము** :- మయి - దృష్టే - తు - రక్షోభిః - రామస్య - విదితాత్మనః - భవేత్ - వ్యర్థమ్ - ఇదం - కార్యం - రావణానర్థమ్ - ఇచ్ఛతః ॥

**అన్వయక్రమము** :- మయి రక్షోభిః దృష్టే తు రావణానర్థమ్ ఇచ్ఛతః, విదితాత్మనః, రామస్య ఇదం కార్యం వ్యర్థం భవేత్.

**ప్రతిపదార్థము** :- మయి = నేను, రక్షోభిః దృష్టే తు = రాక్షసులచే చూడబడినంతనే, రావణానర్థమ్ ఇచ్ఛతః = రావణుని నాశనమును గోరుచున్నట్టి, విదితాత్మనః రామస్య = మహాత్ముడైన రామునియొక్క, ఇదం కార్యం = ఈ (తలపెట్టిన) పని (సీతాన్వేషణము), వ్యర్థం భవేత్ = నిష్ఫలమైపోవును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :- రామదూతయైన తనను జూచి రాక్షసులు సీతను ఇంకను అతిరహస్యమైన ప్రదేశమున దాచివేయుదురని భావము.

**గోవిందరాజీయము** :- ప్రస్తుతసమయ మపరాహ్ణము గనుక వారి కంటబడుట తథ్యమని హనుమయొక్క వితర్కము.

**తాత్పర్యము** :- నన్ను రాక్షసులు చూచినయెడల రావణవధను బూనినట్టి శ్రీరామచంద్రుని కార్యమంతయును వ్యర్థమైపోవునుగదా!

**శ్లో॥ న హి శక్యం క్వచి త్థ్సాతు మవిజ్ఞాతేన రాక్షసైః ।**
**అపి రాక్షసరూపేణ కిముతాన్యేన కేనచిత్ ॥ 43**

**పదచ్ఛేదము** :- న - హి - శక్యం - క్వ - చిత్ - స్థాతుమ్ - అవిజ్ఞాతేన - రాక్షసైః

– అపి – రాక్షసరూపేణ – కిమ్ – ఉత – అన్యేన – కేన – చిత్ ॥

**అన్వయక్రమము** :– రాక్షసైః, అవిజ్ఞాతేన క్వచిత్ స్థాతుం న హి శక్యమ్; రాక్షసరూపేణాపి (న శక్యమ్); అన్యేన కేనచిత్ (రూపేణ) కిమ్ ఉత.

**ప్రతిపదార్థము** :– రాక్షసైః అవిజ్ఞాతేన = రాక్షసులచేత తెలియబడకుండ, క్వచిత్ స్థాతుం = ఎచ్చటను నిలుచుటకు (గూడ), న హి శక్యమ్ = సాధ్యముగాదు, రాక్షస రూపేణాపి (న శక్యమ్) = రాక్షసరూపముతోనైనను అసాధ్యమే, కేన చిత్ అన్యేన (రూపేణ) కిముత ? = ఏదేని ఇతర రూపముతో (నేను నిలచినచో) ఇక చెప్పవలసిన దేమున్నది ?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– రాక్షసులు లంకనిండ అంతగా వ్యాపించియున్నారనియు, వా రతినైపుణ్యము గలవారనియు, వెల్లడి యగుచున్నది.

**తాత్పర్యము** :– రాక్షసులకు తెలియకుండ ఈ లంకలో ఎచ్చటను నిలువబడుటకు గూడ సాధ్యము గాదు. రాక్షసరూపము ధరించినను, వీరిని వంచించుట సాధ్యముగాదు. ఇతర రూపములతో నున్నచో ఇంక చెప్పవలసినదేమున్నది ?

**శ్లో॥ వాయు రప్యత్ర నాజ్ఞాత శ్చరేదితి మతిర్మమ ।**
**న హ్యా స్త్యవిదితం కించి ద్రాక్షసానాం బలీయసామ్ ॥ 44**

**పదచ్ఛేదము** :– వాయుః – అపి – అత్ర – న – అజ్ఞాతః – చరేత్ – ఇతి – మతిః – మమ – న – హి – అస్తి – అవిదితం – కిం – చిత్ – రాక్షసానాం – బలీయసామ్ ॥

**అన్వయక్రమము** :– అత్ర వాయుః అపి, అజ్ఞాతః న చరేత్ ఇతి మమ మతిః; బలీయసాం రాక్షసానామ్, అవిదితం న హి కించిదస్తి.

**ప్రతిపదార్థము** :– అత్ర = ఈ లంకయందు, వాయుః అపి = గాలి కూడా, అజ్ఞాతః = (రాక్షసులకు) తెలియబడనిదై, న చరేత్ = చరింపజాలదు, ఇతి = అని, మమ మతిః = నా యభిప్రాయము, బలీయసాం రాక్షసానాం = అమిత బలశాలురైన రాక్షసులకు, అవిదితం = తెలియబడనట్టిది, నహి కించిదస్తి = కొంచెము కూడా లేదు గదా!

**తాత్పర్యము** :– ఈ లంకలో రాక్షసులకు తెలియకుండ చరించుట గాలికికూడా

సాధ్యముగాదని నా అభిప్రాయము. బలవంతులగు ఈ రాక్షసులకు తెలియకయుండు విషయమేమియును లేదు.

**శ్లో॥ ఇహాహం యది తిష్ఠామి స్వేన రూపేణ సంవృతః ।**
**వినాశ ముపయాస్యామి భర్తు రర్థశ్చ హీయతే ॥ 45**

**పదచ్ఛేదము :–** ఇహ – అహం – యది – తిష్ఠామి – స్వేన – రూపేణ – సంవృతః । వినాశమ్ – ఉపయాస్యామి – భర్తుః – అర్థః – చ – హీయతే ॥

**అన్వయక్రమము :–** అహమ్, ఇహ స్వేన రూపేణ సంవృతః తిష్ఠామి యది, వినాశమ్ ఉపయాస్యామి; భర్తుః అర్థశ్చ హీయతే.

**ప్రతిపదార్థము :–** అహమ్ = నేను, ఇహ = ఇచ్చట, స్వేన రూపేణ = నిజరూపముతో, సంవృతః = దాగియున్నవాడనై, తిష్ఠామి యది = ఉన్నయెడల, వినాశమ్ ఉపయాస్యామి = వినాశము నొందెదను. భర్తుః అర్థశ్చ = స్వామికార్యముగూడ, హీయతే = భగ్నమగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఇహ = ఈ ప్రదేశమున, ఈ పగటిభాగమునందు.

**తాత్పర్యము :–** నేను, నా రూపముతోడనే, ఈ సమయమున ఇచ్చట నుంటినేని, తప్పక వినాశము నొందుదును, మఱియు నా ప్రభువు కార్యముగూడ భగ్నమగును.

**శ్లో॥ త దహం స్వేన రూపేణ రజన్యాం హ్రస్వతాం గతః ।**
**లంకా మభిపతిష్యామి రాఘవ స్యార్థసిద్ధయే ॥ 46**

**పదచ్ఛేదము :–** తత్ – అహం – స్వేన – రూపేణ – రజన్యాం – హ్రస్వతాం – గతః – లంకామ్ – అభిపతిష్యామి – రాఘవస్య – అర్థసిద్ధయే ॥

**అన్వయక్రమము :–** తత్ అహం రజన్యాం స్వేన రూపేణ హ్రస్వతాం గతః (సన్) రాఘవస్య అర్థసిద్ధయే లంకామ్ అభిపతిష్యామి.

**ప్రతిపదార్థము :–** తత్ = ఆ కారణముచేత, అహం = నేను, రజన్యాం = రాత్రియందు, స్వేన రూపేణ = నా వానరరూపముతోడనే, హ్రస్వతాం గతః (సన్) = చిన్నరూపమును ధరించినవాడనై, రాఘవస్య అర్థసిద్ధయే = శ్రీరామునికార్యము నెరవేరుటకై, లంకామ్ అభిపతిష్యామి = లంకను ప్రవేశించెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :- లంకామ్ అభిపతిష్యామి = వాయువు కంటెనుగూడ తన సామర్థ్యము అధిక మను విశ్వాసముతోడనే లంకలో ప్రవేశించెదను అని నిశ్చయముగా చెప్పెను అని భావము.

**తాత్పర్యము** :- అందుచేత, ఈ రాత్రి సమయమునందు చిన్నదైన వానరరూపమును ధరించి శ్రీరాముని కార్యమును సాధించుటకై లంకలో ప్రవేశించెదను.

**శ్లో॥ రావణస్య పురీం రాత్రౌ ప్రవిశ్య సుదురాసదామ్ ।**
**విచిన్వన్ భవనం సర్వం ద్రక్ష్యామి జనకాత్మజామ్ ॥ 47**

**పదచ్ఛేదము** :- రావణస్య - పురీం - రాత్రౌ - ప్రవిశ్య - సుదురాసదామ్ - విచిన్వన్ - భవనం - సర్వం - ద్రక్ష్యామి - జనకాత్మజామ్ ॥

**అన్వయక్రమము** :- రావణస్య సుదురాసదాం పురీం, రాత్రౌ ప్రవిశ్య, సర్వం భవనం విచిన్వన్, జనకాత్మజాం ద్రక్ష్యామి.

**ప్రతిపదార్థము** :- సుదురాసదాం = పరులు ప్రవేశించుటకు శక్యముగానట్టి, రావణస్య పురీం = రావణుని నగరమైన లంకను, రాత్రౌ ప్రవిశ్య = రాత్రిసమయమునందే ప్రవేశించి, సర్వం భవనం విచిన్వన్ = (అందలి) సమస్త భవనమును అన్వేషించుచు, జనకాత్మజాం ద్రక్ష్యామి = జానకిని కనుగొనెదను.

**తాత్పర్యము** :- ఇతరులెవ్వరును ప్రవేశింపలేనట్టి, రావణుని నగరమును, నేను రాత్రి కాలమున ప్రవేశించి, అందలి సకలభవనములను వెదకి జానకిని దర్శించెదను.

**శ్లో॥ ఇతి సంచింత్య హనుమాన్ సూర్య స్యాస్తమయం కపిః ।**
**ఆచకాంక్షే తదా వీరో వైదేహ్యా దర్శనోత్సుకః ॥ 48**

**పదచ్ఛేదము** :- ఇతి - సంచింత్య - హనుమాన్ - సూర్యస్య - అస్తమయం - కపిః - ఆచకాంక్షే - తదా - వీరః - వైదేహ్యాః - దర్శనోత్సుకః ॥

**అన్వయక్రమము** :- ఇతి సంచింత్య, వీరః, కపిః, హనుమాన్ వైదేహ్యాః దర్శనోత్సుకః (సన్) తదా సూర్యస్య అస్తమయమ్ ఆచకాంక్షే.

**ప్రతిపదార్థము** :- ఇతి = ఈవిధముగా, సంచింత్య = చక్కగా ఆలోచించి, వీరః = మహావీరుడైన, కపిః హనుమాన్ = కపిశ్రేష్ఠుడగు హనుమంతుడు, వైదేహ్యాః దర్శనోత్సుకః (సన్) = సీతాదేవి దర్శనమునకై ఔత్సుక్యముగలవాడై, తదా = ఆ సమయమున,

సూర్యస్య అస్తమయం = సూర్యాస్తమయమును, ఆచకాంక్షే = కోరుచుండెను.

**తాత్పర్యము** :- హనుమంతు డిట్లు ఆలోచించి, సీతాసందర్శనోత్సుకుడై సూర్యాస్తమయముకొఱకై ఎదురుచూచుచుండెను.

**శ్లో॥ సూర్యే చాస్తం గతే రాత్రౌ దేహం సంక్షిప్య మారుతిః ।**
**వృషదంశకమాత్ర స్సన్ బభూవాద్భుతదర్శనః ॥ 49**

**పదచ్ఛేదము** :- సూర్యే - చ - అస్తం - గతే - రాత్రౌ - దేహం - సంక్షిప్య - మారుతిః - వృషదంశకమాత్రః (సన్) - బభూవ - అద్భుతదర్శనః ॥

**అన్వయక్రమము** :- సూర్యే అస్తంగతే, మారుతిః, రాత్రౌ దేహం సంక్షిప్య, వృషదంశకమాత్రః (సన్), అద్భుతదర్శనః బభూవ.

**ప్రతిపదార్థము** :- సూర్యే అస్తంగతే = సూర్యు డస్తమింపగా, మారుతిః = హనుమంతుడు, రాత్రౌ = ఆ రాత్రిసమయమునందు, దేహం సంక్షిప్య = శరీరమును సంకోచింపజేసి, వృషదంశకమాత్రః (సన్) = మార్జాలపరిమాణము గలవాడై, అద్భుతదర్శనః = అద్భుతదర్శనముగలవాడు, బభూవ = అయ్యెను.

**శ్రీభాష్యం అప్పలాచార్యస్వామి** :- మార్జాలముతో పోలికయును, అద్భుతదర్శనుడనుటయును, రాత్రి సమయమునందు వెదకుచు సంచరించుటకు గల శక్తిని సూచించుచున్నది.

**తాత్పర్యము** :- సూర్యు డస్తమింపగనే, హనుమంతుడు ఆ నిశాసమయమున తన శరీరమును సూక్ష్మముగా నొనర్చి, మార్జాలమంతటి రూపముగలవాడై అద్భుత దృష్టిగలవాడై కానవచ్చుచుండెను.

**శ్లో॥ ప్రదోషకాలే హనుమాన్ తూర్ణముత్ప్లుత్య వీర్యవాన్ ।**
**ప్రవివేశ పురీం రమ్యాం సువిభక్తమహాపథామ్ ॥ 50**

**పదచ్ఛేదము** :- ప్రదోషకాలే - హనుమాన్ - తూర్ణమ్ - ఉత్ప్లుత్య - వీర్యవాన్ । ప్రవివేశ - పురీం - రమ్యాం - సువిభక్తమహాపథామ్ ॥

**అన్వయక్రమము** :- వీర్యవాన్ హనుమాన్, ప్రదోషకాలే తూర్ణమ్ ఉత్ప్లుత్య, సువిభక్త మహాపథాం రమ్యాం పురీం, ప్రవివేశ.

**ప్రతిపదార్థము** :- వీర్యవాన్ హనుమాన్ = పరాక్రమశాలియైన హనుమ, ప్రదోషకాలే = సాయం సమయమున, తూర్ణమ్ ఉత్ప్లుత్య = శీఘ్రముగా లంఘించి, సువిభక్త

మహాపథాం = చక్కగా తీర్చిదిద్దబడియున్న మార్గములు గలిగియున్నట్టి, రమ్యాం పురీం = సుందరమైన ఆ లంకానగరమును, ప్రవివేశ = ప్రవేశించెను (ప్రవేశింప నుద్యమించెను)

**తాత్పర్యము** :- మహావీరుడైన హనుమంతుడు ప్రదోషకాలమునందు చక్కగా తీర్చిదిద్దబడిన రాజమార్గములు గల సుందరమైన లంకానగరమున ప్రవేశింప ముందునకు లంఘించెను.

**శ్లో॥ ప్రాసాదమాలావితతాం స్తంభైః కాంచనరాజతైః ।**
**శాతకుంభమయై ర్జాలైః గంధర్వనగరోపమామ్ ॥ 51**

**పదచ్ఛేదము** :- ప్రాసాదమాలావితతాం - స్తంభైః - కాంచనరాజతైః - శాతకుంభ మయైః - జాలైః - గంధర్వనగరోపమామ్ ॥

**అన్వయక్రమము** :- కాంచనరాజతైః స్తంభైః, శాతకుంభమయైః జాలైః, ప్రాసాదమాలా వితతాం, గంధర్వనగరోపమామ్ (మహాపురీం సః దదర్శ).

**ప్రతిపదార్థము** :- కాంచనరాజతైః = సువర్ణమయమైనట్టివియు, రజతమయ మైనట్టివియును, స్తంభైః = స్తంభములతోడను, శాతకుంభమయైః జాలైః = బంగారు కిటికీలతోడను (కూడియున్న), ప్రాసాదమాలావితతాం = ఉన్నత సౌధముల వరుసలతో నిండియున్నట్టిదై, గంధర్వనగరోపమాం = గంధర్వనగరమును పోలియున్నట్టి (తాం మహాపురీం దదర్శ = ఆ లంకానగరమును హనుమ దర్శించెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- గంధర్వనగరము అనగా నానారత్నమయ గోపురప్రాసాదాది యుక్త నగరమువలె మెరయుచుండు ఆకాశచిత్రము అనగా మహాశ్చర్యకరమైనదని భావము.

**[శ్లో॥ అనేకరత్నాకృతి ఖే విరాజతే పురం పతాకధ్వజతోరణాన్వితమ్ ।**
**యదా, తదా హస్తిమనుష్యవాజినాం పిబత్యసృగ్భూరి రణే వసుంధరా ॥**

**తాత్పర్యము** :- ఎప్పుడైతే రత్నములతో మెరయు పతాకాధ్వజతోరణాన్వితమైన పురము ఆకాశమున ప్రకాశించునో, అప్పుడా రణరంగమునందు భూదేవి ఏనుగుల యొక్కయు, గుఱ్ఱముల యొక్కయు, మనుష్యుల యొక్కయు, అమితమైన రక్తమును పానము చేయును. అద్దాన లంకకు అనతికాలములో ఈ స్థితి కలుగబోవుచున్నదని కవిచే ఈ యుపమాన మీయబడినది.]

**తాత్పర్యము :-** ఆ నగరమునందలి సౌధములు, కనకరజతమయములైన స్తంభములతోడను, సువర్ణగవాక్షములతోడను ప్రకాశించుచు, వరుసలు వరుసలుగా నుండి ఆ నగరము గంధర్వనగరమువలెనే అత్యాశ్చర్యకరమైనదిగా కనుపట్టు చుండెను.

**శ్లో॥ సప్తభౌమాష్టభౌమైశ్చ స దదర్శ మహాపురీమ్ ।**
**తలైః స్ఫాటికసంకీర్ణైః కార్తస్వరవిభూషితైః ॥ 52**

**పదచ్ఛేదము :-** సప్తభౌమాష్టభౌమైః - చ - సః - దదర్శ - మహాపురీం - తలైః - స్ఫాటికసంకీర్ణైః - కార్తస్వరవిభూషితైః ॥

**అన్వయక్రమము :-** సః సప్తభౌమాష్టభౌమైః చ స్ఫాటికసంకీర్ణైః, కార్తస్వరవిభూషితైః, తలైః (విరాజమానాం) మహాపురీం దదర్శ.

**ప్రతిపదార్థము :-** సప్తభౌమాష్టభౌమైః = ఏడు అంతస్తులతోను ఎనిమిది అంతస్తులతోను కూడిన, స్ఫాటికసంకీర్ణైః = స్ఫటికశిలలతోగూడిన, కార్తస్వరవిభూషితైః = సువర్ణ అలంకారములచే నిండినట్టి; తలైః = ప్రదేశములతోడను, విరాజమానాం = ప్రకాశించుచున్న, మహాపురీం = లంకానగరమును, సః = ఆ హనుమ, సందదర్శ = చూచెను.

**బొంబాయి ముద్రణము :-** తలైః కి బదులుగా స్థలైః.

**తాత్పర్యము :-** ఆ మహానగరమునందు ఏడేసియును, ఎనిమిదేసియును అంతస్తులుగల మేడలుండెను. అందలి నేలలు, గోడలు స్ఫటికమణులతోడను, బంగారముతోడను నిర్మింపబడి అతిమనోహరముగా వెలయుచుండెను.

**శ్లో॥ వైదూర్యమణిచిత్రైశ్చ ముక్తాజాలవిభూషితైః ।**
**తలై శ్శుశుభిరే తాని భవనా న్యత్ర రక్షసామ్ ॥ 53**

**పదచ్ఛేదము :-** వైదూర్యమణిచిత్రైః - చ - ముక్తాజాలవిభూషితైః - తలైః - శుశుభిరే - తాని - భవనాని - అత్ర - రక్షసామ్ ॥

**అన్వయక్రమము :-** అత్ర రక్షసాం తాని భవనాని, వైదూర్యమణిచిత్రైః, ముక్తాజాల విభూషితైః తలైః శుశుభిరే.

**ప్రతిపదార్థము :-** అత్ర = ఈ నగరమున, రక్షసాం = రాక్షసులయొక్క, తాని భవనాని = ఆ భవనములు, వైదూర్యమణిచిత్రైః = వైదూర్యమణులచే చిత్రింపబడినట్టియు, ముక్తాజాలవిభూషితైః = ముత్యాలమాలలతో అలంకరింపబడినట్టివియునగు, తలైః = ప్రదేశములతో, శుశుభిరే = శోభిల్లుచుండెను.

**బొంబాయి ముద్రణము :–** తలైః కి బదులుగా తైస్తైః యని.

**తాత్పర్యము :–** ఆ నగరమున రాక్షసులు నివసించు ఆ భవనముల నేలలును, గోడలును అన్నియును, వైడూర్యమణిచిత్రితములై ముత్యాలహారములతో అలంకరింపబడినట్టివై శోభిల్లుచుండెను.

**శ్లో॥ కాంచనాని చ చిత్రాణి తోరణాని చ రక్షసామ్ ।**
**లంకా ముద్ద్యోతయామాసు స్సర్వత స్సమలంకృతామ్ ॥ 54**

**పదచ్ఛేదము :–** కాంచనాని – చ – చిత్రాణి – తోరణాని – చ – రక్షసామ్ । లంకామ్ – ఉద్ద్యోతయామాసుః – సర్వతః – సమలంకృతామ్ ॥

**అన్వయక్రమము :–** రక్షసాం కాంచనాని చిత్రాణి చ తోరణాని, సర్వతః సమలంకృతాం, లంకామ్, ఉద్ద్యోతయామాసుః.

**ప్రతిపదార్థము :–** రక్షసాం = రాక్షసులయొక్క, కాంచనాని = సువర్ణనిర్మితములును, చిత్రాణి = చిత్రమైన శిల్పములతో గూడినవియు నగు, తోరణాని = భవనద్వారములు, సర్వతః సమలంకృతాం = అంతటను చక్కగా అలంకరింపబడినట్టి, లంకామ్ = లంకానగరమును, ఉద్ద్యోతయామాసుః = మిక్కిలిగా ప్రకాశింపచేసినవి.

**తాత్పర్యము :–** అంతటను చక్కగా అలంకరింపబడినట్టి, ఆ లంకానగరమును, చిత్రచిత్రములైన బంగారుభవనద్వారములు మిక్కిలిగా ప్రకాశింపజేయుచుండెను.

**శ్లో॥ అచింత్యా మద్భుతాకారాం దృష్ట్వా లంకాం మహాకపిః ।**
**ఆసీ ద్విషణ్ణో హృష్టశ్చ వైదేహ్యా దర్శనోత్సుకః ॥ 55**

**పదచ్ఛేదము :–** అచింత్యామ్ – అద్భుతాకారాం – దృష్ట్వా – లంకాం – మహాకపిః – ఆసీత్ – విషణ్ణః – హృష్టః – చ – వైదేహ్యాః – దర్శనోత్సుకః ॥

**అన్వయక్రమము :–** మహాకపిః, వైదేహ్యాః దర్శనోత్సుకః (సన్) అచింత్యామ్, అద్భుతాకారాం లంకాం దృష్ట్వా, విషణ్ణః, హృష్టః చ ఆసీత్.

**ప్రతిపదార్థము :–** మహాకపిః = ఆ వానరోత్తముడు, వైదేహ్యాః దర్శనోత్సుకః (సన్) = జానకమ్మను చూచునట్టి కుతూహలము గలవాడై, అచింత్యామ్ = ఊహకందనట్టియు, అద్భుతాకారాం = ఆశ్చర్యకరమైన రూపము గలదియునగు, లంకాం = లంకా నగరమును, దృష్ట్వా = చూచి, విషణ్ణః = విషాదముగలవాడును, హృష్టః చ = సంతోషము గలవాడునుకూడ, ఆసీత్ = అయ్యెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- అచింత్యాం = (ఆశ్చర్యకరమైన) అశక్యమైన అన్వేషణ చింత గలిగి, అందుచేతనే విషణ్ణుడాయెను.

**రామాయణశిరోమణి** :- అచింత్యాం = అద్భుతనిర్మాణముచేత చింతించుటకు శక్యము గానిది, విషణ్ణః - సీతమ్మ వృత్తాంతము లభించక పోవుటచే; హృష్టః - కాన్పించుచున్న శుభశకునములచే.

**గోవిందరాజీయము** :- అచింత్యాం = ప్రవేశించుటకు అసాధ్యమైనది; అద్దాననే, అతడు విషణ్ణుడాయెను.

**తాత్పర్యము** :- సీతాదర్శనోత్సుకుడైన యా హనుమ ఊహాతీతమైనట్టి దాని నిర్మాణమును జూచి ఇందు ప్రవేశించుట అసాధ్యమని క్షణకాలము విషణ్ణుడాయెను. మఱియు, ఆ నగరముయొక్క అద్భుతసౌందర్యమును జూచి హర్షము నొందెను.

**శ్లో॥ స పాండురోద్విద్ధవిమానమాలినీం**
**మహార్హజాంబూనదజాలతోరణామ్ ।**
**యశస్వినీం రావణబాహుపాలితాం**
**క్షపాచరై ర్భీమబలై స్సమావృతామ్ ॥ 56**

**పదచ్ఛేదము** :- సః - పాండురోద్విద్ధవిమానమాలినీం - మహార్హ జాంబూనదజాల తోరణాం - యశస్వినీం - రావణబాహుపాలితాం - క్షపాచరైః - భీమబలైః - సమావృతామ్ ॥

**అన్వయక్రమము** :- సః, పాండురోద్విద్ధవిమానమాలినీం మహార్హ జాంబూనదజాల తోరణాం, యశస్వినీం, రావణబాహుపాలితాం, భీమబలైః, క్షపాచరైః, సమావృతాం (లంకాం దదర్శ)

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమంతుడు, పాండురోద్విద్ధవిమానమాలినీం = తెల్లనివియును ఉన్నతమైనవియునగు ప్రాసాదముల వరుస గల్గినట్టియును, మహార్హ జాంబూనదజాలతోరణాం = గొప్పవైన సువర్ణనిర్మితములైన గవాక్షములతోను ద్వారములతోను కూడిన, యశస్వినీం = గొప్ప విఖ్యాతి గల్గినట్టిదియును, రావణ బాహుపాలితాం = రావణుని భుజబలముచే చక్కగా సంరక్షింపబడుచున్నదియును, భీమబలైః = భయంకరమైన శక్తిగల, క్షపాచరైః = రాక్షసులచే, సమావృతాం = నిండినది లేక ఆవరింపబడినదియునగు, (లంకాం = లంకను, దదర్శ = చూచెను

లేదా వివేశ = ప్రవేశించెను).

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** విమానమాలినీం = ఏడంతస్తుల మేడలుగలది.

**గోవిందరాజీయము :–** విమానమనగా, దేవతల వాహనమనియు, ఏడంతస్తులుగల మేడయనియు, వైజయంతీ నిఘంటువున చెప్పబడెను.

**తాత్పర్యము :–** ఆ నగరమునందు తెల్లనైన ఏడంతస్తుల మేడలు ఎన్నియో వరుసలు తీరి యుండెను. వానియందు సువర్ణనిర్మితమైన గవాక్షములును, భవనద్వారములును, సుందరముగ కానవచ్చుచుండెను. ఇట్టి ఆ లంకానగరము, రావణుని భుజబలముచే సంరక్షింపబడుచు, గొప్ప విఖ్యాతిని బొందియుండెను. ఆ నగరమును మహాబలాఢ్యులైన పెక్కుమంది రాక్షసులు చుట్టునుండి కాపాడుచుండిరి.

**శ్లో॥ చంద్రోఽపి సాచివ్య మివాస్య కుర్వన్**
**తారాగణైర్మధ్యగతో విరాజన్ ।**
**జ్యోత్స్నావితానేన వితత్య లోక**
**ముత్తిష్ఠతే నైకసహస్రరశ్మిః ॥ 57**

**పదచ్ఛేదము :–** చంద్రః – అపి – సాచివ్యమ్ – ఇవ – అస్య – కుర్వన్ – తారాగణైః – మధ్యగతః – విరాజన్ – జ్యోత్స్నావితానేన – వితత్య – లోకమ్ – ఉత్తిష్ఠతే – నైకసహస్రరశ్మిః ॥

**అన్వయక్రమము :–** అస్య చంద్రః అపి, సాచివ్యం కుర్వన్ ఇవ, మధ్యగతః తారాగణైః, విరాజన్, జ్యోత్స్నావితానేన లోకం వితత్య నైకసహస్రరశ్మిః (సన్) ఉత్తిష్ఠతే.

**ప్రతిపదార్థము :–** అస్య = ఈ హనుమంతునకు, చంద్రః అపి = (సముద్రుడు, మైనాకుడు వలెనే) చంద్రుడు గూడా, సాచివ్యం = సహాయమును, కుర్వన్ ఇవ = చేయుచున్నవాడు వలె, మధ్యగతః = ఆకాశమధ్యమందున్నవాడై, జ్యోత్స్నావితానేన = వెన్నెల సమూహముచే, లోకం వితత్య = లోకమున వ్యాపించి, నైకసహస్రరశ్మిః (సన్) = పెక్కువేల కిరణములు కలవాడై, ఉత్తిష్ఠతే = ఉదయించు చుండెను.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఇచ్చట ప్రదోషసమయమున చంద్రుడుదయించుట అనునది అష్టమినాడే సంభవించును గదా! అప్పుడాతనికి వేలకిరణములు కలిగియుండుట ఎట్లు సాధ్యమని

శంకింపనక్కరలేదు. శుక్లపక్ష ఏకాదశి దినమున చంద్రుడు చాలవరకును, పూర్ణ రూపముతోనే యుండును. మఱియు ఆనాడు ఆకాశమధ్యమునకు సమీపమున ఉదయించుటచే ఆకాశమధ్యగతత్వము కూడ ఉచితమే యగును. అందుచేతనే హనుమ ఆనాడే లంకలో ప్రవేశించెను అని చెప్పవచ్చును. మఱియు చంద్రుడు, ఆ రాత్రి అస్తమించిన పిమ్మటనే రావణుడు దీపసహస్రములతో సీతదగ్గరకు వచ్చుట గూడ సరిపడును. ఈ శుక్లద్వాదశిగూడ మార్గశిరమాసమునందే యగును. ఫాల్గుణమున సీతాదేవి లంకలో ప్రవేశించినది మొదలు అప్పటికి పది మాసములగును.

**గోవిందరాజీయము** :- మధ్యగతః = తారాగణమధ్యగతుడని చెప్పవచ్చును.

**రామానుజీయము** :- మధ్యగతః = తారాగణములతో కూడిన చంద్రు డుదయించెనని చెప్పుట యుక్తము.

**తాత్పర్యము** :- చంద్రుడు గూడ హనుమకు తోడుపడ గోరినవాడై ఆకాశమధ్యమున నక్షత్రగణములతో ప్రకాశించుచు తన వెన్నెలతో లోకమును నింపుచు బహుసహస్ర కిరణములతో విరాజిల్లుచు నుదయించెను.

**శ్లో॥ శంఖప్రభం క్షీరమృణాళవర్ణ**
**ముద్గచ్ఛమానం వ్యవభాసమానమ్ ।**
**దదర్శ చంద్రం స హరిప్రవీరః**
**పోప్లూయమానం సరసీవ హంసమ్ ॥ 58**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"నిశానిరీక్షణం" నామ*
*ద్వితీయస్సర్గః.*

**పదచ్ఛేదము** :- శంఖప్రభం - క్షీరమృణాళవర్ణమ్ - ఉద్గచ్ఛమానం - వ్యవభాసమానం - దదర్శ - చంద్రం - సః - హరిప్రవీరః - పోప్లూయమానం - సరసి - ఇవ - హంసమ్ ॥

**అన్వయక్రమము** :- సః హరిప్రవీరః, శంఖప్రభం క్షీరమృణాళవర్ణమ్ ఉద్గచ్ఛమానం వ్యవభాసమానం చంద్రం, సరసి పోప్లూయమానం హంసమ్ ఇవ దదర్శ.

**ప్రతిపదార్థము** :- సః హరిప్రవీరః = ఆ వానరశ్రేష్ఠుడు, శంఖప్రభం = శంఖమువలె తెల్లని కాంతి గలవాడును, క్షీరమృణాళవర్ణం = క్షీరమువంటియు మృణాళము వంటియు తెల్లని వర్ణము గలవాడును, ఉద్గచ్ఛమానం = ఆకసముమీదికి చేరుచున్నవాడును,

వ్యవభాసమానం = మిక్కిలిగా ప్రకాశించు చున్నవాడునగు, చంద్రం = చంద్రుని, సరసి = సరస్సునందు, ప్రోప్లూయమానం = తేలియాడు చున్నట్టి, హంసమ్ ఇవ = హంసను వలె, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– వానరశ్రేష్ఠుడైన హనుమ శంఖము, క్షీరము, మృణాళము వంటి స్వచ్ఛమైన తెల్లని కాంతితో క్రమముగా ఆకసము మీదకు వచ్చుచు, సరోవరమునందు తేలియాడుచున్న హంసవలె చూడ రమ్యముగానున్నట్టి చంద్రుని తిలకించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"నిశానిరీక్షణము" అను*
*రెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# తృతీయసర్గ

**శ్లో॥ స లంబశిఖరే లంబే లంబతోయదసన్నిభే ।**
**సత్త్వమాస్థాయ మేధావీ హనుమాన్మారుతాత్మజః ॥ 1**

**పదచ్ఛేదము :-** సః - లంబశిఖరే - లంబే - లంబతోయదసన్నిభే - సత్త్వమ్ - ఆస్థాయ - మేధావీ - హనుమాన్ - మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :-** సః, మేధావీ మారుతాత్మజః, హనుమాన్ లంబే లంబతోయద సన్నిభే, లంబశిఖరే, సత్త్వమ్ ఆస్థాయ, (లంకాం వివేశ).

**ప్రతిపదార్థము :-** మేధావీ = ప్రజ్ఞావంతుడైన, మారుతాత్మజః సః హనుమాన్ = వాయుపుత్రుడైన ఆ హనుమంతుడు, లంబతోయదసన్నిభే = దీర్ఘమైన మేఘము వంటి, లంబే లంబశిఖరే = ఉన్నతమైన ఆ లంబపర్వత శిఖరమునందు, సత్త్వమ్ ఆస్థాయ = (తనకు అవసరమై యున్న) శక్తిని సంపాదించుకొని, లంకాం వివేశ = లంకను ప్రవేశించెను.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** సత్త్వం = సత్త్వగుణము, అపేక్షిత బలము, మేధావీ = కాలోచితమైన విచారముచేయు శక్తి గలవాడు.

**గోవిందరాజీయము :-** సత్త్వం = వ్యవసాయాత్మిక బుద్ధి.

**తాత్పర్యము :-** పొడవైన మేఘము వంటి ఉన్నత మైనట్టి ఆ లంబపర్వతశిఖరమున నిలచి మేధావి యగు ఆ వాయునందనుడు తత్కాలోచితమైన శక్తిని కూర్చుకొని (లంకను ప్రవేశించెను).

**శ్లో॥ నిశి లంకాం మహాసత్త్వో వివేశ కపికుంజరః ।**
**రమ్యకాననతోయాఢ్యాం పురీం రావణపాలితామ్ ॥ 2**

**పదచ్ఛేదము :-** నిశి - లంకాం - మహాసత్త్వః - వివేశ - కపికుంజరః - రమ్యకానన

తోయాఢ్యాం – పురీం – రావణపాలితామ్ ॥

**అన్వయక్రమము** :– మహాసత్త్వః, కపికుంజరః, రమ్యకాననతోయాఢ్యాం, రావణపాలితాం, లంకాం పురీం నిశి వివేశ.

**ప్రతిపదార్థము** :– మహాసత్త్వః కపికుంజరః = మహాశక్తిసంపన్నుడైన హనుమంతుడు, రమ్యకాననతోయాఢ్యాం = రమణీయములైన అరణ్యములును సరస్సులును కల్గినట్టి, రావణపాలితాం లంకాం పురీం = రావణునిచే పాలింపబడుచున్న లంకానగరమును, నిశి = రాత్రిభాగమున, వివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము** :– మహాసత్త్వసంపన్నుడైన హనుమ సుందరమైన వనములను, సరస్సులను, కలిగినట్టి ఆ రావణాసురుని లంకానగరమును ఆ నిశాసమయమున ప్రవేశించెను.

**శ్లో॥ శారదాంబుధరప్రఖ్యైః భవనై రుపశోభితామ్ ।**
**సాగరోపమనిర్ఘోషాం సాగరానిలసేవితామ్ ॥ 3**

**పదచ్ఛేదము** :– శారదాంబుధరప్రఖ్యైః – భవనైః – ఉపశోభితాం – సాగరోపమ నిర్ఘోషాం – సాగరానిలసేవితామ్ ॥

**అన్వయక్రమము** :– సమానము..

**ప్రతిపదార్థము** :– శారదాంబుధరప్రఖ్యైః = శరత్కాలమేఘములవలె ప్రకాశించునట్టి, భవనైః = భవనములతో, ఉపశోభితాం = ప్రకాశించునట్టిదియును, సాగరోపమ నిర్ఘోషాం = సముద్రఘోషవంటి రాక్షసులుచేయు కోలాహలము గల్గినదియును, సాగరా నిలసేవితాం = సముద్ర వాయువులచే సేవింపబడుచున్నదియునగు, (లంకాం వివేశ = లంకను ప్రవేశించెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– శారదాంబుధరములతో పోలికను చెప్పుటచే అచ్చుటి మేడలు, రజతనిర్మితములని చెప్పుకోవలెను.

**తాత్పర్యము** :– శరత్కాలమేఘమువలె తెల్లగానున్న సౌధములచే లంక మిక్కిలి ప్రకాశించుచుండెను. రాక్షసులు చేయు కోలాహలధ్వని సముద్రఘోషవలె ఆ నగరము నుండి వినవచ్చుచుండెను. సముద్రము మీది వాయువులు ఎల్లప్పుడు ఆ నగరమును బహువిధముగా సేవించుచుండెను.

**శ్లో॥ సుపుష్టబలసంఘుష్టాం యథైవ విటపావతీమ్ ।**
**చారుతోరణనిర్యూహాం పాండురద్వారతోరణామ్ ॥ 4**

**పదచ్ఛేదము :**– సుపుష్టబలసంఘుష్టాం – యథా – ఏవ – విటపావతీం – చారు తోరణనిర్యూహాం – పాండురద్వారతోరణామ్ ॥

**అన్వయక్రమము :**– సమానము.

**ప్రతిపదార్థము :**– విటపావతీం యథా = అలకానగరమువలె, సుపుష్టబలసంఘుష్టాం = బలిష్ఠులైన భటులయొక్క శబ్దములతో కూడినట్టివియును, చారుతోరణనిర్యూహాం = సుందరమైన ద్వారములముందు మదించిన ఏనుగులుగలదియును, పాండురద్వార తోరణాం = తెల్లని లోపలిద్వారములును బహిర్ద్వారములును గలిగినట్టిదియును అగు (లంకాం వివేశ = లంకను ప్రవేశించెను)

**తాత్పర్యము :**– బలిష్ఠులైన భటులు చేయు గర్జనలతోగూడి అలకానగరమునందువలె సుందరములైన తెల్లనివగు లోపలి ద్వారములును, సింహద్వారములును గలదియును గుమ్మములముందు మదించిన ఏనుగులు గలదియును అగు లంకను హనుమంతుడు చూచెను.

**శ్లో॥ భుజగాచరితాం గుప్తాం శుభాం భోగవతీ మివ ।**
**తాం సవిద్యుద్ఘనాకీర్ణాం జ్యోతిర్మార్గనిషేవితామ్ ॥ 5**

**పదచ్ఛేదము :**– భుజగాచరితాం – గుప్తాం – శుభాం – భోగవతీమ్ – ఇవ – తాం సవిద్యుద్ఘనాకీర్ణాం – జ్యోతిర్మార్గనిషేవితామ్ ॥

**అన్వయక్రమము :**– సమానము.

**ప్రతిపదార్థము :**– శుభాం భోగవతీమ్ ఇవ = శుభప్రదమైన భోగవతీనగరమువలె, భుజగాచరితాం = సర్పములచే సంచరింపబడుచున్నదియును, గుప్తాం = భద్రముగ రక్షింపబడుచున్నదియును, సవిద్యుద్ఘనాకీర్ణాం = మెరపులతో గూడిన మేఘములచే వ్యాపింపబడినదియును, జ్యోతిర్మార్గనిషేవితామ్ = చంద్రసూర్యాదుల మార్గముచే సేవింపబడుచున్నదియును అగు (తాం లంకాం వివేశ) = ఆ లంకానగరమును ప్రవేశించెను.

(ఆ లంకానగరము నందలి భవనముల నిడివి పాతాళమునుండి గ్రహమండలమువరకును వ్యాపించియున్నట్లుండెను).

**తాత్పర్యము** :- ఆ లంకానగరము పాతాళలోకరాజధానియైన భోగవతీనగరమువలె భుజగములతో నిండి, భద్రముగ కాపాడుచు, శుభప్రదముగా నుండెను. అందలి ప్రాసాదములు మెరపులతో గూడిన మేఘమండలమువలె ఉన్నతములై సూర్యచంద్ర నక్షత్రాదుల మార్గము నంటుచుండెను.

**శ్లో॥ మందమారుతసంచారాం యథేంద్రస్యామరావతీమ్ ।**
**శాతకుంభేన మహతా ప్రాకారే ణాభిసంవృతామ్ ॥ 6**

**పదచ్ఛేదము** :- మందమారుతసంచారాం - యథా - ఇంద్రస్య - అమరావతీం - శాతకుంభేన - మహతా - ప్రాకారేణ - అభిసంవృతామ్ ॥

**ప్రతిపదార్థము** :- మందమారుతసంచారాం = మందమైన వాయుసంచారము గలదియును, ఇంద్రస్య అమరావతీం యథా = దేవేంద్రుని అమరావతీ పట్టణమువలె, మహతా శాతకుంభేన ప్రాకారేణ అభిసంవృతామ్ = గొప్పదైన బంగారు ప్రాకారములతో చుట్టుకొనబడియున్నదియును అగు (లంకాం వివేశ = లంకను ప్రవేశించెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి ముద్రణము** :- మందమారుతసంచారాం అను శబ్దమునకు బదులుగా (చండమారుతనిర్హ్రాదాం అని కలదు) అనగా భయంకరమైన వాయువుల ధ్వనిగలది.

**తిలకము** :- చండమారుతముయొక్క ధ్వనిగలది. చండమారుతములు అనగా సప్తవాయువులలో, పరివహము మొదలైన వాయువుల యొక్క శబ్దము గల్గినట్టిది. ఇదియే ఇచ్చటి అమరావతి. అమరావతి యనగా అంతరిక్షము. దేవేంద్రుని అమరావతి అని చెప్పుటకు వీలులేదు. ఉత్సాహవంతులైన రాక్షసులతోను వారి కోలాహలముతోను నిండియుండుట అను లక్షణము అమరావతికి విరుద్ధమైనదని కతక వ్యాఖ్యానముగూడ చెప్పుచున్నది.

**తాత్పర్యము** :- లంకయందు మారుతము మందముగా సుఖముగా వీచుచుండెను. బంగారు ప్రాకారములుగల్గి, ఆ నగరము అమరావతీ పట్టణమును పోలుచు మిక్కిలి రమణీయముగ నుండెను.

**శ్లో॥ కింకిణీజాలఘోషాభిః పతాకాభి రలంకృతామ్ ।**
**ఆసాద్య సహసా హృష్టః ప్రాకారమభిపేదివాన్ ॥ 7**

**పదచ్ఛేదము** :- కింకిణీజాలఘోషాభిః - పతాకాభిః - అలంకృతామ్ - ఆసాద్య -

సహసా – హృష్టః – ప్రాకారమ్ – అభిపేదివాన్.

**అన్వయక్రమము** :– కింకిణీజాలఘోషాభిః, పతాకాభిః, అలంకృతామ్ (లంకాం) ఆసాద్య – హృష్టః, సహసా, ప్రాకారమ్, అభిపేదివాన్.

**ప్రతిపదార్థము** :– కింకిణీజాలఘోషాభిః = చిరుగంటల సమూహముయొక్క ధ్వనులుగల, పతాకాభిః = ధ్వజపతాకములతో, అలంకృతామ్ = అలంకరింపబడినట్టి, లంకాం = లంకానగరమును, ఆసాద్య = చేరి, హృష్టః = సంతోషనిమగ్నుడై, సహసా = వెంటనే, ప్రాకారమ్ అభిపేదివాన్ = నగరప్రాకారముమీదికి చేరుకొనెను.

**తాత్పర్యము** :– చిరుగంటల ధ్వనులతో గూడిన ధ్వజపతాకములతో శోభిల్లుచున్న లంకానగరము చేరి మిక్కిలి సంతోషము నొందినవాడై వెంటనే హనుమ యా నగర ప్రాకారముమీదికి చేరెను.

**శ్లో॥ విస్మయావిష్టహృదయః పురీమాలోక్య సర్వతః ।**
**జాంబూనదమయైర్ద్వారైర్వైదూర్యకృతవేదికైః ॥ 8**

**పదచ్ఛేదము** :– విస్మయావిష్టహృదయః – పురీమ్ – ఆలోక్య – సర్వతః – జాంబూనదమయైః – ద్వారైః – వైడూర్యకృతవేదికైః ॥

**అన్వయక్రమము** :– జాంబూనదమయైః, ద్వారైః, వైడూర్యకృతవేదికైః విరాజమానాం పురీం సర్వతః, ఆలోక్య, విస్మయావిష్టహృదయః (అభవత్).

**ప్రతిపదార్థము** :– జాంబూనదమయైః ద్వారైః = సువర్ణనిర్మితములైన ద్వారముల తోడను, వైడూర్య కృత వేదికైః = వైడూర్య మణులచే నిర్మింపబడిన వేదికలతోడను, (విరాజమానాం = ప్రకాశించుచున్నట్టి) పురీం = లంకానగరమును, సర్వతః = అన్నివైపులను, ఆలోక్య = చూచి, విస్మయావిష్టహృదయః = ఆశ్చర్యనిమగ్నమైన మనస్సుగలవాడు, (అభవత్ = అయ్యెను).

**తాత్పర్యము** :– బంగారు ద్వారములతోడను వైడూర్య రత్నఖచితపు వేదికలతోడను, ప్రకాశించుచున్నట్టి లంకానగరమును నలుమూలల జూచి ఆశ్చర్యనిమగ్న మానసుడయ్యెను.

**శ్లో॥ వజ్రస్ఫటికముక్తాభి ర్మణికుట్టిమభూషితైః ।**
**తప్తహాటకనిర్యూహై రాజతామలపాండురైః ॥ 9**

**పదచ్ఛేదము** :– వజ్రస్ఫటికముక్తాభిః – మణికుట్టిమభూషితైః – తప్తహాటకనిర్యూహైః

– రాజతామలపాండురైః ॥

**ప్రతిపదార్థము** :– వజ్రస్ఫటికముక్తాభిః (యుక్తైః) = వజ్రములు, స్ఫటికములు, ముత్యములు అనువానితో గూడినవియు, మణికుట్టిమభూషితైః = మణులతో నిర్మించిన నేలలచే అలంకరింపబడినవియు, తప్తహాటకనిర్యూహైః (యుక్తైః) = కరిగించిన బంగారముతో నిర్మించిన ఏనుగుబొమ్మలతో కూడినవియు, రాజతామలపాండురైః = వెండివలె స్వచ్ఛమైన తెల్లని రంగురంగులుగల (ద్వారైః యుక్తాం నగరీం వీక్ష్య జహర్ష = ద్వారములతో కూడిన నగరిని చూచి సంతసించెను).

**తాత్పర్యము** :– వజ్రములు, స్ఫటికములు, ముత్యములు మున్నగు రత్నములతో నిర్మింపబడిన నేలలు గలదియును, పుటముపెట్టిన బంగారముతో నిర్మింపబడిన ముంజూరులతో, వెండివలె స్వచ్ఛమైన తెల్లని ద్వారములతో కూడినట్టి నగరమును హనుమంతుడు చూచి సంతసించెను.

**శ్లో॥ వైదూర్యకృతసోపానై స్స్ఫాటికాంతరపాంసుభిః ।**
**చారుసంజవనోపేతైః ఖమివోత్పతితై శ్శుభైః ॥ 10**

**పదచ్ఛేదము** :– వైదూర్యకృతసోపానైః – స్ఫాటికాంతరపాంసుభిః – చారుసంజవనోపేతైః – ఖమ్ – ఇవ – ఉత్పతితైః – శుభైః ॥

**అన్వయక్రమము** :– వైదూర్యకృతసోపానైః స్ఫాటికాంతరపాంసుభిః, చారుసంజవ నోపేతైః, ఖమ్, ఉత్పతితైః ఇవ, స్థితైః, శుభైః ప్రాసాదైః, యుతాం నగరీం వీక్ష్య జహర్ష.

**ప్రతిపదార్థము** :– వైదూర్యకృతసోపానైః = వైదూర్య మణి సోపానములతోడను, చారుసంజవనోపేతైః = సుందరమైన చతుశ్శాలా మందిరములతో గూడినదియును, ఖమ్ ఉత్పతితైః ఇవ (స్థితైః) = ఆకాశమునకు ఎగురుచున్నట్లుగా నున్నవియును, శుభైః = మంగళకరములును అగు, ప్రాసాదైః యుతాం = మేడలతో గూడిన, నగరీం వీక్ష్య జహర్ష = నగరమును జూచి సంతోషించెను.

**తాత్పర్యము** :– వైదూర్యరత్నములతో నిర్మింపబడిన సోపానములు గలిగి సుందరమైన చతుశ్శాలామందిరములు గలిగి ఆకసము నంటుచున్న మంగళకరములగు ప్రాసాదములతో గూడిన ఆ నగరమును హనుమ తిలకించి సంతోషించెను.

**శ్లో॥ క్రౌంచబర్హిణసంఘుష్టైః రాజహంసనిషేవితైః ।**
**తూర్యాభరణనిర్ఘోషైః సర్వతః ప్రతినాదితామ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** క్రౌంచబర్హిణసంఘుష్టైః – రాజహంసనిషేవితైః – తూర్యాభరణ నిర్ఘోషైః – సర్వతః – ప్రతినాదితామ్ ॥

**ప్రతిపదార్థము :–** క్రౌంచబర్హిణసంఘుష్టైః = క్రౌంచపక్షులయొక్కయు నెమళ్ళ యొక్కయు కూజితములతోడను, రాజహంసనిషేవితైః = రాజహంసల శబ్దముల చేతను, తూర్యాభరణ నిర్ఘోషైః = వాద్యములయొక్కయు ఆభరణములయొక్కయు ధ్వనులతోడను, సర్వతః = అన్నిచోటులయందును, ప్రతినాదితామ్ = ప్రతిధ్వనులు కలిగియున్నట్టి (పురీం దదర్శ = లంకను గాంచెను)

**తాత్పర్యము :–** క్రౌంచ పక్షుల యొక్కయు, నెమళ్ళ యొక్కయు, రాజహంసల యొక్కయు, కూజితములతోడను వివిధవాద్యముల యొక్కయు ఆభరణముల యొక్కయును ధ్వనులతోడను, నలుమూలల ప్రతిధ్వనించుచున్నట్టి లంకానగరమును హనుమ గాంచెను.

**శ్లో॥ వస్వౌకసారాప్రతిమాం తాం వీక్ష్య నగరీం తతః ।**
**ఖమివోత్పతితుం కామాం జహర్ష హనుమాన్ కపిః ॥ 12**

**పదచ్ఛేదము :–** వస్వౌకసారాప్రతిమాం – తాం – వీక్ష్య – నగరీం – తతః – ఖమ్ – ఇవ – ఉత్పతితుం – కామాం – జహర్ష – హనుమాన్ – కపిః ॥

**అన్వయక్రమము :–** ఖమ్ ఉత్పతితుం కామాం, ఇవ (దృశ్యమానాం) వస్వౌకసారాప్రతిమాం, తాం నగరీం, వీక్ష్య, కపిః హనుమాన్ జహర్ష.

**ప్రతిపదార్థము :–** ఖమ్ ఉత్పతితుం = ఆకాశమున ఎగిరిపోవుటకు, కామామ్ ఇవ = కోరిక గల్గినదివలె, దృశ్యమానాం = కనబడుచున్నట్టి, వస్వౌకసారాప్రతిమాం = అలకాపట్టణముతో సమానమైనట్టి, తాం నగరీం = ఆ లంకానగరిని, వీక్ష్య = చూచి, కపిః హనుమాన్ = వానరశ్రేష్ఠుడైన హనుమ, జహర్ష = ఆనందము నొందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఖమ్ ఉత్పతితుం కామాం = పర్వతాగ్రమునందుండుటచే లంకానగరము ఆకాశమునకు ఎగిరిపోవ గోరుచున్నట్లు ఉన్నదనుట సమంజసము.

**గోవిందరాజీయము :–** వస్వౌకసారాప్రతిమాం = ఇచ్చట చెప్పిన ఉపమానము అలకాపురితో గాదు. (యథైవ విటపావతీం) అని పూర్వమే అలకాసామ్యము

చెప్పబడినది గదా, వస్వౌకసార అనగా తూర్పుదిక్కున నున్న దేవేంద్రుని పట్టణము.

**విష్ణుపురాణం :-**

శ్లో॥ వస్వౌకసారా శక్రస్య యామ్యా సంయమనీ తథా ।
పురీ సుఖా జలేశస్య సోమస్య చ విభావతీ ॥

**తాత్పర్యము :-** అలకానగరమును బోలియున్నట్టిదియును, ఆకాశమునంటుచున్న దియును అగు ఆ నగరమును గాంచి హనుమంతుడు మిక్కిలి ఆనందమునొందెను.

**శ్లో॥ తాం సమీక్ష్య పురీం రమ్యాం రాక్షసాధిపతే శ్శుభామ్ ।**
**అనుత్తమా మృద్ధియుతాం చింతయామాస వీర్యవాన్ ॥ 13**

**పదచ్ఛేదము :-** తాం - సమీక్ష్య - పురీం - రమ్యాం - రాక్షసాధిపతేః - శుభామ్ - అనుత్తమామ్ - ఋద్ధియుతాం - చింతయామాస - వీర్యవాన్ ॥

**అన్వయక్రమము :-** అనుత్తమామ్ ఋద్ధియుతాం శుభామ్ రమ్యాం తాం రాక్షసాధిపతేః పురీం సమీక్ష్య వీర్యవాన్ (సః) చింతయామాస.

**ప్రతిపదార్థము :-** అనుత్తమాం = మిక్కిలి ఉత్తమమైనదియును, ఋద్ధియుతాం = సర్వసమృద్ధి సంపన్నమైనదియును, శుభాం = మంగళకరమైనదియును, రమ్యాం = మనోహరమైనదియును అగు, తాం రాక్షసాధిపతేః పురీం = ఆ రావణునియొక్క నగరమును, సమీక్ష్య = చూచి, వీర్యవాన్ (సః) = మహావీరుడైన హనుమ, చింతయామాస = చింతింపదొడగెను.

**తాత్పర్యము :-** సర్వశ్రేష్ఠమును, సర్వసమృద్ధియుతమును మంగళకరమును మనోజ్ఞమును నైయున్నట్టి ఆ రావణుని నగరమును గాంచి మహావీరుడైన హనుమ ఇట్లు చింతింపసాగెను.

**శ్లో॥ నేయ మన్యేన నగరీ శక్యా ధర్షయితుం బలాత్ ।**
**రక్షితా రావణబలై రుద్యతాయుధధారిభిః ॥ 14**

**పదచ్ఛేదము :-** న - ఇయమ్ - అన్యేన - నగరీ - శక్యా - ధర్షయితుం - బలాత్ - రక్షితా - రావణబలైః - ఉద్యతాయుధధారిభిః ॥

**అన్వయక్రమము :-** ఉద్యతాయుధధారిభిః, రావణబలైః రక్షితా ఇయం నగరీ, అన్యేన, బలాత్, ధర్షయితుం, న శక్యా.

**ప్రతిపదార్థము :-** ఉద్యతాయుధధారిభిః = సన్నద్ధములైన ఆయుధములను ధరించి

యున్నట్టి, రావణబలైః = రావణుని భటులచే, రక్షితా = రక్షింపబడుచున్నట్టి, ఇయం నగరీ = ఈ లంకానగరము, బలాత్ = పరాక్రమమువలన, ధర్షయితుం = ఎదుర్కొనుటకు, న శక్యా = శక్యముగాదు.

**తాత్పర్యము** :– ఆయుధసన్నద్ధులైన, రావణుని భటులచే సంరక్షింపబడుచున్న ఈ నగరమును తమ పరాక్రమమును జూపి, ఎవ్వరికిని ఎదుర్కొనుటకు శక్యము గాదు.

**శ్లో॥ కుముదాంగదయోర్వాపి సుషేణస్య మహాకపేః ।**
**ప్రసిద్ధేయం భవేద్భూమిః మైందద్వివిదయోరపి ॥ 15**

**పదచ్ఛేదము** :– కుముదాంగదయోః – వా – అపి – సుషేణస్య – మహాకపేః – ప్రసిద్ధా – ఇయం – భవేత్ – భూమిః – మైందద్వివిదయోః – అపి ॥

**అన్వయక్రమము** :– కుముదాంగదయోః, మహాకపేః సుషేణస్య, మైందద్వివిదయోః, అపి వా, ఇయం ప్రసిద్ధా (పురీ) భూమిః, భవేత్.

**ప్రతిపదార్థము** :– కుముదాంగదయోః = కుముదునకును అంగదునకును, మహాకపేః సుషేణస్య అపి = వానరశ్రేష్ఠుడైన సుషేణునకుగాని, మైందద్వివిదయోః అపి వా = మైందునకును ద్వివిదునకును గాని, ఇయం ప్రసిద్ధా (పురీ) = ఈ ప్రసిద్ధమైన లంక, భూమిః భవేత్ = ప్రవేశించుటకు విషయమైనది కాగలదు.

**తాత్పర్యము** :– వానరబలమునందు కుముదునకో, అంగదునకో లేక బలాఢ్యుడైన సుషేణునకో లేక మైందద్వివిదులకో మాత్రమే ఈ నగరమున ప్రవేశించుటకు సాధ్యమగును.

**శ్లో॥ వివస్వత స్తనూజస్య హరేశ్చ కుశపర్వణః ।**
**ఋక్షస్య కేతుమాలస్య మమ చైవ గతి ర్భవేత్ ॥ 16**

**పదచ్ఛేదము** :– వివస్వతః – తనూజస్య – హరేః – చ – కుశపర్వణః – ఋక్షస్య – కేతుమాలస్య – మమ – చ – ఏవ – గతిః – భవేత్ ॥

**అన్వయక్రమము** :– వివస్వతః, తనూజస్య, కుశపర్వణః, హరేశ్చ, ఋక్షస్య, కేతుమాలస్య, మమ చ, (అత్ర) గతిః భవేత్.

**ప్రతిపదార్థము** :– వివస్వతః తనూజస్య = సూర్యుని కుమారుడైన సుగ్రీవునకును, కుశపర్వణః హరేశ్చ = కుశపర్వుడను వానరవీరునకును, ఋక్షస్య = ఋక్షునకును, కేతుమాలస్య = కేతుమాలునకును, మమ చ ఏవ = నాకును మాత్రమే, (అత్ర) గతిః

భవేత్ = (ఈ నగరమున) ప్రవేశము గలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- కుశపర్వణః = కుశపర్వసదృశములైన రోమములు గలవాడు అని ఋక్షున కిది విశేషణము.

**గోవిందరాజీయము** :- మమ చ అని తనను చిట్టచివర చెప్పుకొనుట వినయ సూచకముగా తెలుపబడెనని గ్రాహ్యము.

**తాత్పర్యము** :- సూర్యసుతుడైన సుగ్రీవునకును, కుశపర్వునకును, ఋక్షునకును, కేతుమాలునకును, నాకును మాత్రమే ఈ పురమున ప్రవేశించుటకు శక్యమగును.

**శ్లో॥ సమీక్ష్య తు మహాబాహూ రాఘవస్య పరాక్రమమ్ ।**
**లక్ష్మణస్య చ విక్రాంత మభవ త్ప్రీతిమా న్కపిః ॥ 17**

**పదచ్ఛేదము** :- సమీక్ష్య - తు - మహాబాహుః - రాఘవస్య - పరాక్రమం - లక్ష్మణస్య - చ - విక్రాంతమ్ - అభవత్ - ప్రీతిమాన్ - కపిః ॥

**అన్వయక్రమము** :- మహాబాహుః కపిః రాఘవస్య పరాక్రమం లక్ష్మణస్య చ విక్రాంతం సమీక్ష్య తు ప్రీతిమాన్ అభవత్.

**ప్రతిపదార్థము** :- మహాబాహుః కపిః = మహావీరుడైన హనుమ, రాఘవస్య పరాక్రమం = శ్రీరాముని పరాక్రమమును, లక్ష్మణస్య విక్రాంతం చ = లక్ష్మణుని విక్రమమును, సమీక్ష్య తు = పరికించినంతనే, ప్రీతిమాన్ అభవత్ = సంతోషముగలవాడయ్యెను.

**బొంబాయి ప్రతియందలి పాఠము** :- మహాబాహుః అను పదమునకు బదులుగా, "మహాబాహోః" - దీనికి శ్రీరామునకు విశేషణముగా అన్వయము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- సమీక్ష్య = రాక్షసవైభవము, పరాక్రమవైభవము, ఎంత ఘనమైనదైనను, రామబాణములముం దల్పమే అగునని గ్రహించి అని అర్థము.

**తాత్పర్యము** :- మహావీరుడైన హనుమంతుడు శ్రీరాముని పరాక్రమమును, లక్ష్మణుని శౌర్యమును దలచుకొని మిక్కిలి ధైర్యమును, ఆనందమును పొందెను.

**శ్లో॥ తాం రత్నవసనోపేతాం కోష్ఠాగారావతంసకామ్ ।**
**యంత్రాగారస్తనీ మృద్ధాం ప్రమదామివ భూషితామ్ ॥ 18**

**పదచ్ఛేదము :–** తాం – రత్నవసనోపేతాం – కోష్ఠాగారావతంసకామ్ – యంత్రాగార స్తనీమ్ – ఋద్ధాం – ప్రమదామ్ – ఇవ – భూషితామ్ ॥

**అన్వయక్రమము :–** రత్నవసనోపేతాం, కోష్ఠాగారావతంసకాం, యంత్రాగారస్తనీమ్ – ఋద్ధాం, భూషితాం, ప్రమదామివ, (స్థితాం) తాం, నగరీం దదర్శ.

**ప్రతిపదార్థము :–** రత్నవసనోపేతాం = రత్నములే వస్త్రముగా గలదియును, కోష్ఠాగారావతంసకాం = గో, వాజిశాలలును, ధనధాన్యాగారములును కర్ణాభరణములుగా గలదియును, యంత్రాగారస్తనీమ్ = యంత్రభవనములు స్తనములుగా గలదియును, ఋద్ధాం = వృద్ధిబొందిన యౌవనవయస్సు కలిగినట్టి, భూషితాం ప్రమదామ్ ఇవ (స్థితాం) = అలంకరించుకొన్న తరుణివలెనున్న, తాం, నగరీం దదర్శ = ఆ పట్టణమును జూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** రత్నవసనోపేతాం = రత్నప్రాకారములు వస్త్రములుగా గలది.

**రామాయణశిరోమణి :–** రత్నవసనోపేతాం = రత్నాకరము వస్త్రముగా గలది.

**తాత్పర్యము :–** ఆ లంకానగరము రత్నములనెడు వస్త్రములను ధరించి, గో, వాజిశాలలు, ధనధాన్యాగారములును అనెడు కర్ణాభరణములను ధరించి యంత్రాగారము లనెడు స్తనములతో నొప్పచు చక్కగా అలంకరించుకొనిన ఒక తరుణివలె గానవచ్చెను.

**శ్లో॥ తాం నష్టతిమిరాం దీప్తై ర్భాస్వరై శ్చ మహాగ్రహైః ।**
**నగరీం రాక్షసేంద్రస్య దదర్శ స మహాకపిః ॥ 19**

**పదచ్ఛేదము :–** తాం – నష్టతిమిరాం – దీప్తైః – భాస్వరైః – చ – మహాగృహైః – నగరీం – రాక్షసేంద్రస్య – దదర్శ – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** సః మహాకపిః, దీప్తైః, భాస్వరైః, మహాగృహైః చ నష్టతిమిరాం తాం రాక్షసేంద్రస్య నగరీం దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, దీప్తైః = గొప్ప దీపములచేతను, భాస్వరైః మహాగృహైః = వెలుగులు చిమ్ముచుండు మహాభవనములతోడను, నష్టతిమిరాం = నశించిన చీకటులు కలిగిన, తాం రాక్షసేంద్రస్య నగరీం = ఆ రాక్షసరాజుపట్టణమును, దదర్శ = గాంచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిప్రతి :–** మహోగృహైః కి బదులుగా మహోగ్రహైః అని ఇందు గలదు. అప్పుడు సూర్యగ్రహము, చంద్రగ్రహములచే అని చెప్పుకొనవలెను.

**తాత్పర్యము :–** ఎడతెగని దీపములచేతను, రత్నములతో ప్రకాశించు మహాభవనముల తోడను, చీకట్లను పారద్రోలుచున్న ఆ లంకానగరిని వానరశ్రేష్ఠుడైన హనుమ ఆ కాంతులలో స్పష్టముగ జూచెను.

**శ్లో॥ అథ సా హరిశార్దూలం ప్రవిశంతం మహాబలమ్ ।**
**నగరీ స్వేన రూపేణ దదర్శ పవనాత్మజమ్ ॥ 20**

**పదచ్ఛేదము :–** అథ – సా – హరిశార్దూలం – ప్రవిశంతం – మహాబలమ్ – నగరీ – స్వేన – రూపేణ – దదర్శ – పవనాత్మజమ్ ॥

**అన్వయక్రమము :–** అథ ప్రవిశంతం, మహాబలం హరిశార్దూలం, పవనాత్మజమ్, సా నగరీ, స్వేన రూపేణ, దదర్శ.

**ప్రతిపదార్థము :–** అథ = అప్పుడు, ప్రవిశంతం = లంకలో ప్రవేశించుచున్నట్టి, మహాబలం = అమితబలశాలియును, హరిశార్దూలం = వానరశ్రేష్ఠుడును అగు, పవనాత్మజమ్ = ఆంజనేయుని, సా నగరీ = సుప్రసిద్ధురాలయిన ఆ నగరి (అధిష్ఠానదేవత) స్వేన రూపేణ = మానవాకారముతో, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** అప్పుడు లంకాధిష్ఠానదేవత, మానవరూపముతో తన పట్టణమున ప్రవేశించుచున్న మహాబలాఢ్యుడైన ఆ వానరశ్రేష్ఠుని జూచెను.

**శ్లో॥ సా తం హరివరం దృష్ట్వా లంకా రావణపాలితా ।**
**స్వయమే వోత్థితా తత్ర వికృతాననదర్శనా ॥ 21**

**పదచ్ఛేదము :–** సా – తం – హరివరం – దృష్ట్వా – లంకా – రావణపాలితా స్వయమ్ – ఏవ – ఉత్థితా – తత్ర – వికృతాననదర్శనా ॥

**అన్వయక్రమము :–** సా రావణపాలితా లంకా తం హరివరం దృష్ట్వా వికృతానన దర్శనా (సతీ) తత్ర, స్వయమేవ ఉత్థితా.

**ప్రతిపదార్థము :–** రావణపాలితా = రావణునిచే పాలింపబడుచున్నట్టి, సా లంకా = ఆ లంకాధిదేవత, తం హరివరం దృష్ట్వా = ఆ వానరశ్రేష్ఠుని జూచి, వికృతానన దర్శనా (సతీ) = వికారమైన ముఖభంగిమము గలదై, తత్ర = ఆ హనుమంతుని

ఎదుట, స్వయమేవ ఉత్థితా = స్వయముగనే లేచి నిలచెను.

**తాత్పర్యము :–** రావణరక్షితమైన ఆ లంకాధిదేవత, హనుమంతుని జూచి, వికారమైన నోరును, కన్నులును గలదై, స్వయముగా అతనిముందు నిలచెను.

**శ్లో॥ పురస్తా త్కపివర్యస్య వాయుసూనో రతిష్ఠత ।**
**ముంచమానా మహానాద మబ్రవీ త్పవనాత్మజమ్ ॥ 22**

**పదచ్ఛేదము :–** పురస్తాత్ – కపివర్యస్య – వాయుసూనోః – అతిష్ఠత – ముంచమానా – మహానాదమ్ – అబ్రవీత్ – పవనాత్మజమ్ ॥

**అన్వయక్రమము :–** మహానాదం ముంచమానా కపివర్యస్య, వాయుసూనోః పురస్తాత్, అతిష్ఠత, పవనాత్మజమ్ అబ్రవీత్ (చ).

**ప్రతిపదార్థము :–** మహానాదం ముంచమానా = గొప్పగర్జనము గావించుచు, కపివర్యస్య వాయుసూనోః పురస్తాత్ = వానరశ్రేష్ఠుడైన హనుమంతుని ఎదుట, అతిష్ఠత = నిలువబడెను, పవనాత్మజమ్ అబ్రవీత్ (చ) = హనుమంతుని గూర్చి ఇట్లు పలికెను.

**తాత్పర్యము :–** గొప్పదైన గర్జనము చేయుచు ఆమె హనుమంతునికి అడ్డముగ నిలువబడెను. నిలచి ఇట్లు పలికెను.

**శ్లో॥ క స్త్వం కేన చ కార్యేణ ఇహ ప్రాప్తో వనాలయ ।**
**కథయస్వేహ య త్తత్త్వం యావత్ప్రాణా ధరంతి తే ॥ 23**

**పదచ్ఛేదము :–** కః – త్వం – కేన – చ – కార్యేణ – ఇహ – ప్రాప్తః – వనాలయ – కథయస్వ – ఇహ – యత్ – తత్త్వం – యావత్ – ప్రాణాః – ధరంతి – తే ॥

**అన్వయక్రమము :–** హే వనాలయ! త్వం కః? ఇహ కేన కార్యేణ ప్రాప్తః (అసి)? యావత్ తే ప్రాణాః ధరంతి (తావత్) ఇహ యత్ తత్త్వం (తత్) కథయస్వ.

**ప్రతిపదార్థము :–** హే వనాలయ = ఓ వనచరుడా! త్వం కః = నీవెవ్వడవు? ఇహ = ఈ పట్టణమునకు, కేన కార్యేణ ప్రాప్తః (అసి) = ఏమి పని మీద చేరియుంటివి? యావత్ తే ప్రాణాః ధరంతి = ఎంతవరకు నీ ప్రాణములు నిలచియుండునో, (తావత్ = అంతలో) యత్ తత్త్వం = యథార్థమైనది ఏ మున్నదో, (తత్) కథయస్వ = దానిని తెలుపుము.

**తాత్పర్యము :–** ఓ వనచరుడా! నీ వెవరవు? ఏమి పనిమీద ఇచ్చటికి వచ్చితివి? నీ ప్రాణములు పోకుండగనే ఆ యథార్థము లన్నియు నాకు తెలుపుము.

**శ్లో॥ న శక్యం ఖల్వియం లంకా ప్రవేష్టుం వానర త్వయా ।**
**రక్షితా రావణబలై రభిగుప్తా సమంతతః ॥ 24**

**పదచ్ఛేదము :–** న – శక్యం – ఖలు – ఇయం – లంకా – ప్రవేష్టుం – వానర – త్వయా – రక్షితా – రావణబలైః – అభిగుప్తా – సమంతతః ॥

**అన్వయక్రమము :–** హే వానర! రావణబలైః సమంతతః అభిగుప్తా, రక్షితా, ఇయం లంకా, ప్రవేష్టుం త్వయా, న శక్యం ఖలు.

**ప్రతిపదార్థము :–** హే వానర! = ఓ వానరుడా! రావణబలైః = రావణుని భటులచే, సమంతతః = అంతటను, అభిగుప్తా రక్షితా = రహస్య సంచారముచే వ్యాప్తమై రక్షింపబడుచున్నట్టి, ఇయం లంకా = ఈ లంకాపట్టణము, ప్రవేష్టుం = ప్రవేశించుటకు, త్వయా న శక్యం ఖలు = నీచేత సాధ్యము కాదు సుమా!

**తాత్పర్యము :–** ఓ వానరుడా! రావణుని భటులు గూఢచారులై నగర మెల్లయెడలను జాగరూకులై కాచుచుండగా నీ విందు ప్రవేశించుట సాధ్యమగు పని గాదు సుమా!

**శ్లో॥ అథ తా మబ్రవీ ద్వీరో హనుమా నగ్రత స్థితామ్ ।**
**కథయిష్యామి తే తత్త్వం యన్మాం త్వం పరిపృచ్ఛసి ॥ 25**

**పదచ్ఛేదము :–** అథ – తామ్ – అబ్రవీత్ – వీరః – హనుమాన్ – అగ్రతః – స్థితామ్ – కథయిష్యామి – తే – తత్త్వం – యత్ – మాం – త్వం – పరిపృచ్ఛసి ॥

**అన్వయక్రమము :–** వీరః, హనుమాన్, అథ అగ్రతః స్థితాం, తాం అబ్రవీత్; యత్ త్వం, మాం, పరిపృచ్ఛసి, తత్ తత్త్వం, తే కథయిష్యామి.

**ప్రతిపదార్థము :–** వీరః హనుమాన్ = మహావీరుడైన హనుమంతుడు, అథ = పిమ్మట, అగ్రతః స్థితాం = ఎదుట నిలచియున్నట్టి, తాం = ఆ లంకాధిదేవతను గూర్చి, అబ్రవీత్ = ఇట్లు పలికెను, యత్ = దేనిని, త్వం మాం పరిపృచ్ఛసి = నీవు నన్ను అడుగుచున్నావో, తత్ తత్త్వం = ఆ యథార్థమును, తే = నీకు, కథయిష్యామి = చెప్పగలను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** కథయిష్యామి = చెప్పగలను. ఇదిగో చెప్పుచున్నాను అనకుండా చెప్పగలను అని భవిష్యత్తును ఉపయోగించుట ఏలననగా మొదట నేనడిగిన ప్రశ్నలకు జవాబిచ్చిన పిమ్మటనే చెప్పెదనని సూచించుచున్నాడు.

**తాత్పర్యము :–** హనుమంతు డప్పుడు తన ఎదుట నిలువబడియున్న లంకిణితో ఇట్లనెను. నీవు నన్నడుగుచున్న విషయమంతయును, నేను చెప్పగలను సుమా! (ముందు నా ప్రశ్నలకు జవాబు నిమ్ము).

**శ్లో॥ కా త్వం విరూపనయనా పురద్వారే ఽ వతిష్ఠసి ।**
**కిమర్థం చాపి మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి దారుణా ॥ 26**

**పదచ్ఛేదము :–** కా – త్వం – విరూపనయనా – పురద్వారే – అవతిష్ఠసి – కిమర్థం – చ – అపి – మాం – రుద్ధ్వా – నిర్భర్త్సయసి – దారుణా ॥

**అన్వయక్రమము :–** విరూపనయనా, పురద్వారే అవతిష్ఠసి, కా త్వం? కిమర్థం చ, దారుణా (సతీ) మాం రుద్ధ్వా, నిర్భర్త్సయసి అపి.

**ప్రతిపదార్థము :–** విరూపనయనా = వికారములైన నేత్రములు గలిగినదానవై, పురద్వారే అవతిష్ఠసి = పట్టణద్వారమునందు నిలచియున్నావు, కా త్వం = నీ వెవతెవు? కిమర్థం = ఎందుకొఱకై, దారుణా (సతీ) = క్రూరురాలివై, మాం రుద్ధ్వా నిర్భర్త్సయసి అపి = నన్ను అడ్డగించి గద్దించుచున్నావు కూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఈ ప్రశ్న లడుగుటలో హనుమ ఉద్దేశ్యము ఏమనగా సురసవలె ఈమె పూజ్యురా లగునా లేక సింహికవలె వధ్యురాలగునా యని నిర్ణయించుకొనుటకే.

**తాత్పర్యము :–** వికారమైన కన్నులతో పట్టణద్వారమునం దడ్డముగ నిలచియున్న నీ వెవ్వతెవు ? దారుణముగా నన్నడ్డగించి నన్ను బెదిరించుచున్నావు. ఇది యంతయు ఎందుకొఱకు ?

**శ్లో॥ హనుమద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ ।**
**ఉవాచ వచనం క్రుద్ధా పరుషం పవనాత్మజమ్ ॥ 27**

**పదచ్ఛేదము :–** హనుమద్వచనం – శ్రుత్వా – లంకా – సా – కామరూపిణీ – ఉవాచ – వచనం – క్రుద్ధా – పరుషం – పవనాత్మజమ్ ॥

**అన్వయక్రమము :–** హనుమద్వచనం శ్రుత్వా, కామరూపిణీ సా లంకా పవనాత్మజం (ప్రతి) క్రుద్ధా (సతీ) పరుషం, వచనమ్, ఉవాచ.

**ప్రతిపదార్థము :–** హనుమద్వచనం శ్రుత్వా = హనుమంతుని మాటలను విని, కామరూపిణీ సా లంకా = కామరూపిణియైన ఆ లంకాధిదేవత, పవనాత్మజం ప్రతి

= వాయునందనుని గూర్చి, క్రుద్ధా (సతీ) = క్రోధమునొందినదై, పరుషం వచనమ్ = పరుషమైనమాటలను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** హనుమంతుని మాటలను విని కామరూపిణియైన ఆ లంకాధిదేవత, హనుమంతునిగూర్చి మిక్కిలి కుపితురాలై ఈ రీతిగా పరుషమైన వాక్యములను జవాబుగా పలికెను.

**శ్లో॥ అహం రాక్షసరాజస్య రావణస్య మహాత్మనః ।**
**ఆజ్ఞాప్రతీక్షా దుర్ధర్షా రక్షామి నగరీ మిమామ్ ॥ 28**

**పదచ్ఛేదము :–** అహం – రాక్షసరాజస్య – రావణస్య – మహాత్మనః – ఆజ్ఞాప్రతీక్షా – దుర్ధర్షా – రక్షామి – నగరీమ్ – ఇమామ్ ॥

**అన్వయక్రమము :–** మహాత్మనః రాక్షసరాజస్య, రావణస్య, అహమ్, ఆజ్ఞాప్రతీక్షా; దుర్ధర్షా (అహం) ఇమాం, నగరీం, రక్షామి.

**ప్రతిపదార్థము :–** మహాత్మనః = మహనీయుడైనట్టి, రాక్షసరాజస్య రావణస్య = రాక్షసాధిపతియైన రావణునకు, అహం = నేను, ఆజ్ఞాప్రతీక్షా = ఆజ్ఞాకారిణియైన పరిచారికను; దుర్ధర్షా (అహం) = పరులకు లొంగనట్టి నేను, ఇమాం నగరీం = ఈ పట్టణమును, రక్షామి = కాపాడుచుందును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** ఆజ్ఞాప్రతీక్షా = ఆజ్ఞానువర్తిని.

**తాత్పర్యము :–** మహాత్ముడైన రావణప్రభువునకు నేను, ఆజ్ఞానువర్తినినైన సేవకురాలిని. పరులు జయించుటకు శక్యము గాని నే నీ నగరమును కాపాడుచుందును.

**శ్లో॥ న శక్యా మా మవజ్ఞాయ ప్రవేష్టుం నగరీ త్వయా ।**
**అద్య ప్రాణైః పరిత్యక్తః స్వప్స్యసే నిహతో మయా ॥ 29**

**పదచ్ఛేదము :–** న – శక్యా – మామ్ – అవజ్ఞాయ – ప్రవేష్టుం – నగరీ – త్వయా – అద్య – ప్రాణైః – పరిత్యక్తః – స్వప్స్యసే – నిహతః – మయా ॥

**అన్వయక్రమము :–** మామ్ అవజ్ఞాయ, నగరీ ప్రవేష్టుం, త్వయా న శక్యా; అద్య మయా, నిహతః, ప్రాణైః పరిత్యక్తః, స్వప్స్యసే.

**ప్రతిపదార్థము :–** మామ్ అవజ్ఞాయ = నన్ను తిరస్కరించి, నగరీ = నగరము,

ప్రవేష్టుం = ప్రవేశించుటకు, త్వయా న శక్యా = నీచేత సాధ్యముగాదు, అద్య = ఇప్పుడే, మయా నిహతః = నాచేత కొట్టబడినవాడవై, ప్రాణైః పరిత్యక్తః = ప్రాణములచే విడువబడినవాడవై, స్వప్స్యసే = (దీర్ఘముగా) నిద్రింతువు.

**తాత్పర్యము :–** నన్ను ధిక్కరించి ఈ నగరమున ప్రవేశించుటకు నీకు అసాధ్యము. ఇప్పుడే నీవు నాచేత నిహతుడవై, ప్రాణములను వీడి దీర్ఘనిద్ర నొందెదవు.

**శ్లో॥ అహం హి నగరీ లంకా స్వయ మేవ ప్లవంగమ! ।**
**సర్వతః పరిరక్షామి హ్యేత త్తే కథితం మయా ॥ 30**

**పదచ్ఛేదము :–** అహం – హి – నగరీ – లంకా – స్వయమ్ – ఏవ – ప్లవంగమ! సర్వతః – పరిరక్షామి – హి – ఏతత్ – తే – కథితం – మయా ॥

**అన్వయక్రమము :–** హే ప్లవంగమ, లంకానగరీ అహం హి, సర్వతః, స్వయమేవ, (ఇమాం) పరిరక్షామి, ఏతత్, తే, మయా, కథితం హి.

**ప్రతిపదార్థము :–** హే ప్లవంగమ = ఓ వానరుడా, లంకానగరీ అహం హి = లంకానగరము నేనే సుమా!, సర్వతః = పట్టణమంతయును వ్యాపించి, స్వయమేవ = నేనే, (ఇమాం) పరిరక్షామి = ఈ నగరిని కాపాడుచుందును. ఏతత్ = ఈ వృత్తాంత మంతయు, తే = నీకు, మయా కథితం హి = నాచేత చెప్పబడినది గదా!

**తాత్పర్యము :–** ఓ వానరుడా! లంకానగరి అనగా, నేనే సుమా! నగరమంతయును వ్యాపించి, నేనే, ఈ నగరమును కాచుచుందును. ఇదిగో నా వృత్తాంతమంతయును నీకు చెప్పితిని.

**శ్లో॥ లంకాయా వచనం శ్రుత్వా హనుమాన్మారుతాత్మజః ।**
**యత్నవాన్ స హరిశ్రేష్ఠ స్థ్సిత శ్శైల ఇ వాపరః ॥ 31**

**పదచ్ఛేదము :–** లంకాయాః – వచనం – శ్రుత్వా – హనుమాన్ – మారుతాత్మజః – యత్నవాన్ – సః – హరిశ్రేష్ఠః – స్థితః – శైలః – ఇవ – అపరః ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః, హనుమాన్, లంకాయాః, వచనం శ్రుత్వా, అపరః, శైలః ఇవ, సః, హరిశ్రేష్ఠః, యత్నవాన్, స్థితః.

**ప్రతిపదార్థము :–** సః హరిశ్రేష్ఠః = ఆ వానరశ్రేష్ఠుడైన, మారుతాత్మజః హనుమాన్ = వాయునందనుడైన హనుమ, లంకాయాః వచనం శ్రుత్వా = లంకాదేవతయొక్క మాట విని, యత్నవాన్ = భావికృత్యమునకు యత్నమును పూనినవాడై, అపరః శైలః ఇవ

= ఇంకొక పర్వతమువలె, స్థితః = (నిర్భయముగ) నిలచెను.

**తాత్పర్యము** :- వాయునందనుడైన హనుమ లంకాదేవి పలికిన మాటలు విని, పర్వతమువలె చలింపనివాడై, భావికృత్యమునకు వలయు ప్రయత్నము గలవాడయ్యెను.

**శ్లో॥ స తాం స్త్రీరూపవికృతాం దృష్ట్వా వానరపుంగవః ।**
**ఆబభాషేఽథ మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః ॥ 32**

**పదచ్ఛేదము** :- సః - తాం - స్త్రీరూపవికృతాం - దృష్ట్వా - వానరపుంగవః । ఆబభాషే - అథ - మేధావీ - సత్త్వవాన్ - ప్లవగర్షభః ॥

**అన్వయక్రమము** :- సః వానరపుంగవః, మేధావీ సత్త్వవాన్ ప్లవగర్షభః తాం స్త్రీరూపవికృతాం దృష్ట్వా అథ ఆబభాషే.

**ప్రతిపదార్థము** :- వానరపుంగవః = వానరశ్రేష్ఠుడును, మేధావీ = మేధాశాలియును, సత్త్వవాన్ = బలశాలియును, ప్లవగర్షభః = వానరోత్తముడును అగు, సః = ఆ హనుమ, స్త్రీరూపవికృతాం, తాం దృష్ట్వా = వికారమైన స్త్రీరూపమును ధరించియున్న ఆమెను జూచి, ఆబభాషే = పలికెను.

**తాత్పర్యము** :- గొప్పమేధావియును, బలశాలియును అగు, నా వానరశ్రేష్ఠుడైన హనుమ వికారమైన స్త్రీరూపములో నున్న ఆమెను జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ ద్రక్ష్యామి నగరీం లంకాం సాట్టప్రాకారతోరణామ్ ।**
**ఇత్యర్థ మిహ సంప్రాప్తః పరం కౌతూహలం హి మే ॥ 33**

**పదచ్ఛేదము** :- ద్రక్ష్యామి - నగరీం - లంకాం - సాట్టప్రాకారతోరణామ్ - ఇత్యర్థమ్ - ఇహ - సంప్రాప్తః - పరం - కౌతూహలం - హి - మే ॥

**అన్వయక్రమము** :- సాట్టప్రాకారతోరణామ్, లంకానగరీం, ద్రక్ష్యామి; ఇత్యర్థమ్, ఇహ సంప్రాప్తః, మే, పరం కౌతూహలం (అస్తి) హి.

**ప్రతిపదార్థము** :- సాట్టప్రాకారతోరణామ్ లంకానగరీం = బురుజులును ప్రాకారములును ద్వారములును కలిగి మిక్కిలి సుందరముగనున్న లంకానగరమును, ద్రక్ష్యామి = చూచెదను. ఇత్యర్థం = ఈ నిమిత్తమై, ఇహ = ఇటకు, సంప్రాప్తః = చేరుకొంటిని, మే = నాకు, పరం కౌతూహలం (అస్తి) హి = గొప్పదైన కుతూహలము గలదు సుమా!

**తాత్పర్యము** :- అతిసుందరములైన ప్రాకారములు, బురుజులు మున్నగువానితో

గూడియున్న ఈ నగరము చూడగోరి నేనిటకు వచ్చితిని. ఈ విషయమున నాకు గొప్ప కుతూహలము గలదు సుమా!

**శ్లో॥ వనా న్యుపవనా నీహ లంకాయాః కాననాని చ ।**
**సర్వతో గృహముఖ్యాని ద్రష్టు మాగమనం హి మే ॥ 34**

**పదచ్ఛేదము** :– వనాని – ఉపవనాని – ఇహ – లంకాయాః – కాననాని – చ । సర్వతః – గృహముఖ్యాని – ద్రష్టుమ్ – ఆగమనం – హి – మే ॥

**అన్వయక్రమము** :– ఇహ లంకాయాః వనాని ఉపవనాని కాననాని చ సర్వతః గృహముఖ్యాని ద్రష్టుం హి మే ఆగమనమ్.

**ప్రతిపదార్థము** :– ఇహ = ఇచ్చట, లంకాయాః = లంకయొక్క, వనాని = తోటలను, ఉపవనాని = ఉద్యానవనములను, కాననాని చ = అరణ్యములను, సర్వతః = అన్ని ప్రాంతములందలి, గృహముఖ్యాని = గొప్పభవనములను, ద్రష్టుం హి = చూచుట కొఱకై సుమా!, మే ఆగమనం = నా యొక్క రాక!

**తాత్పర్యము** :– ఈ లంకయందలి అరణ్యములను, తోటలను, ఉద్యానవనములను, సుందరమైన భవనములను, అంతటను తిరిగి చూడవలయునని, ఇప్పు డిచ్చటికి వచ్చియుంటిని సుమా!

**శ్లో॥ తస్య త ద్వచనం శ్రుత్వా లంకా సా కామరూపిణీ ।**
**భూయ ఏవ పున ర్వాక్యం బభాషే పరుషాక్షరమ్ ॥ 35**

**పదచ్ఛేదము** :– తస్య – తత్ – వచనం – శ్రుత్వా – లంకా – సా – కామరూపిణీ – భూయః – ఏవ – పునః – వాక్యం – బభాషే – పరుషాక్షరమ్ ॥

**అన్వయక్రమము** :– తస్య తద్వచనం శ్రుత్వా, సా కామరూపిణీ లంకా, భూయః, ఏవ, పరుషాక్షరం వాక్యం, పునః, బభాషే.

**ప్రతిపదార్థము** :– తస్య = ఆ హనుమంతునియొక్క, తద్వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, కామరూపిణీ సా లంకా = కామరూపిణియైన ఆ లంకాధిదేవత, పునః = తిరిగి, భూయః ఏవ పరుషాక్షరం వాక్యం = పూర్వముకన్నను పరుషమైన వాక్యమును, బభాషే = పలికెను.

**తాత్పర్యము** :– కామరూపిణియైన ఆ లంకాదేవత హనుమంతునియొక్క మాటలను విని, మరల ఇంకను పరుషమైన వాక్యములను ఇట్లు పలికెను.

**శ్లో॥ మా మనిర్జిత్య దుర్బుద్ధే రాక్షసేశ్వరపాలితామ్ ।**
**న శక్య మద్య తే ద్రష్టుం, పురీయం వానరాధమ ॥ 36**

**పదచ్ఛేదము :–** మామ్ – అనిర్జిత్య – దుర్బుద్ధే – రాక్షసేశ్వరపాలితామ్ – న – శక్యమ్ – అద్య – తే – ద్రష్టుం – పురీ – ఇయం – వానరాధమ ॥

**అన్వయక్రమము :–** హే దుర్బుద్ధే! వానరాధమ! రాక్షసేశ్వరపాలితాం, మామ్ అనిర్జిత్య – అద్య – ఇయం పురీ ద్రష్టుం, తే న శక్యమ్.

**ప్రతిపదార్థము :–** హే దుర్బుద్ధే వానరాధమ = దుర్బుద్ధివైన ఓ వానరాధముడా! రాక్షసేశ్వరపాలితాం మాం = రాక్షసప్రభువుచే కాపాడబడుచున్నట్టి నన్ను, అనిర్జిత్య = జయింపకుండ, ఇయం పురీ = ఈ పట్టణము, ద్రష్టుం = చూచుటకు, అద్య = ఇప్పుడు, తే న శక్యమ్ = నీకు శక్యముగాదు.

**తాత్పర్యము :–** ఓ వానరాధమా! రాక్షసప్రభువుచే పాలింపబడుచున్న నన్ను జయింపకుండ ఈ పట్టణమును చూచుట నీకు శక్యము గాదు సుమా!

**శ్లో॥ తత స్స కపిశార్దూల స్తా మువాచ నిశాచరీమ్ ।**
**దృష్ట్వా పురీ మిమాం భద్రే పున ర్యాస్యే యథాగతమ్ ॥ 37**

**పదచ్ఛేదము :–** తతః – సః – కపిశార్దూలః – తామ్ – ఉవాచ – నిశాచరీమ్ – దృష్ట్వా – పురీమ్ – ఇమాం – భద్రే – పునః – యాస్యే – యథాగతమ్.

**అన్వయక్రమము :–** తతః సః కపిశార్దూలః, తాం నిశాచరీమ్ ఉవాచ; భద్రే ఇమాం పురీం దృష్ట్వా పునః యథాగతమ్ యాస్యే.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, సః కపిశార్దూలః = వానరశ్రేష్ఠుడైన యా హనుమ, తాం నిశాచరీం = ఆ రక్కసిని గూర్చి, ఉవాచ = పలికెను. భద్రే = పూజ్యురాలా! ఇమాం పురీం దృష్ట్వా = ఈ నగరమును తిలకించి, పునః = తిరిగి, యథాగతమ్, యాస్యే = వచ్చినట్లుగనే వెళ్లిపోయెదను.

**తాత్పర్యము :–** అపుడా హనుమ రక్కసితో ఇట్లు పలికెను. ఓ పూజ్యురాలా! నేను లంకను చూచి వెంటనే వచ్చినట్లుగనే వెడలి పోయెదను సుమా!

**శ్లో॥ తతః కృత్వా మహానాదం సా వై లంకా భయావహమ్ ।**
**తలేన వానరశ్రేష్ఠం తాడయామాస వేగితా ॥ 38**

**పదచ్ఛేదము :–** తతః – కృత్వా – మహానాదం – సా – వై – లంకా – భయావహమ్

– తలేన – వానరశ్రేష్ఠం – తాడయామాస – వేగితా ॥

**అన్వయక్రమము** :– సా లంకా, తతః, భయావహం మహానాదం కృత్వా, వేగితా, తలేన, వానరశ్రేష్ఠం, తాడయామాస.

**ప్రతిపదార్థము** :– సా లంకా = ఆ రక్కసి, తతః = అప్పుడు, భయావహం మహానాదం కృత్వా = భయంకరమైన గొప్పగర్జన చేసి, వేగితా = మహావేగముగలదై, తలేన = అరచేతితో, వానరశ్రేష్ఠం = హనుమంతుని, తాడయామాస = ప్రహరించెను.

**తాత్పర్యము** :– అంతట ఆ రక్కసి భయంకరముగా సింహనాదమును గావించి, మహావేగముగా తన అరచేతితో హనుమంతుని ప్రహరించెను.

**శ్లో॥ తత స్స కపిశార్దూలో లంకయా తాడితో భృశమ్ ।**
**ననాద సుమహానాదం వీర్యవాన్ పవనాత్మజః ॥ 39**

**పదచ్ఛేదము** :– తతః – సః – కపిశార్దూలః – లంకయా – తాడితః – భృశమ్ । ననాద – సుమహానాదం – వీర్యవాన్ – పవనాత్మజః ॥

**అన్వయక్రమము** :– తతః వీర్యవాన్ పవనాత్మజః సః కపిశార్దూలః లంకయా భృశం తాడితః (సన్) సుమహానాదం ననాద.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, వీర్యవాన్ = వీర్యవంతుడును, పవనాత్మజః = వాయునందనుడును అగు, సః కపిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడు, సుమహానాదం ననాద = గొప్పధ్వని కలుగునట్లుగా గర్జించెను.

**తాత్పర్యము** :– మహాపరాక్రమశాలియైన ఆ వానరశ్రేష్ఠుడు అట్లు ఆ రక్కసిచే తీవ్రముగా కొట్టబడినవాడై గొప్పధ్వని కలుగునట్లు పెద్దగా గర్జించెను.

**శ్లో॥ తత స్సంవర్తయామాస వామహస్తస్య సోఽంగులీః ।**
**ముష్టినాఽభిజఘా నైనాం హనుమాన్ క్రోధమూర్ఛితః ॥ 40**

**పదచ్ఛేదము** :– తతః – సంవర్తయామాస – వామహస్తస్య – సః – అంగులీః – ముష్టినా – అభిజఘాన – ఏనాం – హనుమాన్ – క్రోధమూర్ఛితః ॥

**అన్వయక్రమము** :– తతః క్రోధమూర్ఛితః సః హనుమాన్ వామహస్తస్య అంగులీః సంవర్తయామాస; ఏనాం ముష్టినా అభిజఘాన.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, క్రోధమూర్ఛితః సః హనుమాన్ = క్రోధవివశుడైన ఆ హనుమ, వామహస్తస్య = ఎడమచేతియొక్క, అంగులీః = వ్రేళ్ళను, సంవర్తయామాస

= ముడిచెను, ఏనాం = ఆ రక్కసిని, ముష్టినా = పిడికిటితో, అభిజఘాన = గట్టిగాకొట్టెను.

**తాత్పర్యము :–** హనుమంతు డంతట క్రోధవివశుడై తన ఎడమచేతి వ్రేళ్ళను ముడిచి ఆ పిడికిటితో ఆమెను గట్టిగా ఒక దెబ్బ కొట్టెను.

**శ్లో॥ స్త్రీ చేతి మన్యమానేన నాతిక్రోధ స్స్వయం కృతః ।**
**సా తు తేన ప్రహారేణ విహ్వలాంగీ నిశాచరీ ॥ 41**
**(పపాత సహసా భూమౌ వికృతాననదర్శనా ॥)**

**పదచ్ఛేదము :–** స్త్రీ – చ – ఇతి – మన్యమానేన – న – అతిక్రోధః – స్వయం – కృతః – సా – తు – తేన – ప్రహారేణ – విహ్వలాంగీ – నిశాచరీ ॥
(పపాత – సహసా – భూమౌ – వికృతాననదర్శనా ॥)

**అన్వయక్రమము :** స్త్రీ చ ఇతి మన్యమానేన స్వయం అతిక్రోధః న కృతః, సా నిశాచరీ తు, తేన ప్రహారేణ విహ్వలాంగీ వికృతాననదర్శనా చ సతీ సహసా భూమౌ పపాత.

**ప్రతిపదార్థము :–** స్త్రీ చ ఇతి మన్యమానేన = అడుదికూడను అని తలచుచున్న హనుమంతునిచేత, స్వయం = స్వయముగా, అతిక్రోధః న కృతః = తీవ్రక్రోధము కనబరచబడలేదు. సా నిశాచరీ తు = ఆ రక్కసి మాత్రము, తేన ప్రహారేణ = ఆ దెబ్బచేత, విహ్వలాంగీ = శిథిలమైన దేహము గలదియును, వికృతాననదర్శనా = వికారమైన ముఖము కన్నులు గలదియును అగుచు, సహసా = తత్క్షణమే, భూమౌ పపాత = నేలపై బడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తేన ప్రహారేణ = ఎడమచేతితో, జాలితో గొట్టిన ఆ చిఱుదెబ్బచే.

**తాత్పర్యము :–** ఆమె స్త్రీ యను ధర్మబుద్ధితో, హనుమ తీవ్రకోపమును వహింపడాయెను. ఆమె మాత్రము ఆ దెబ్బచేతనే శిథిలమైన దేహముగలదై వికృతములైన కన్నులును, నోరును గలిగి వెంటనే నేలపై బడెను.

**శ్లో॥ తత స్తు హనుమాన్ ప్రాజ్ఞ స్తాం దృష్ట్వా వినిపాతితామ్ ।**
**కృపాం చకార తేజస్వీ మన్యమానః స్త్రియం తు తామ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** తతః – తు – హనుమాన్ – ప్రాజ్ఞః – తాం – దృష్ట్వా – వినిపాతితామ్

– కృపాం – చకార – తేజస్వీ – మన్యమానః – స్త్రియం – తు – తామ్ ॥

**అన్వయక్రమము :–** తతః తేజస్వీ సః ప్రాజ్ఞః హనుమాన్ వినిపాతితాం తాం దృష్ట్వా తాం స్త్రియం మన్యమానః కృపాం చకార.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, తేజస్వీ ప్రాజ్ఞః హనుమాన్ = పరాక్రమముగల ప్రజ్ఞావంతుడైన హనుమ, వినిపాతితాం తాం దృష్ట్వా = పడగొట్టబడిన ఆమెను గాంచి, తాం స్త్రియం మన్యమానః = ఆమెను స్త్రీనిగా భావించుచు, కృపాం చకార = దయను బూనెను.

**తాత్పర్యము :–** అంతట పరాక్రమవంతుడును, ప్రాజ్ఞుడును అగు హనుమంతుడు, నేలపై బడిన ఆమెను జూచి, 'అయ్యో! నేను ఒక అబల యగు స్త్రీని హింసించితినే' యని తలంచుచు జాలినొందెను.

**శ్లో॥ తతో వై భృశసంవిగ్నా లంకా సా గద్గదాక్షరమ్ ।**
**ఉవా చాగర్వితం వాక్యం హనుమంతం ప్లవంగమమ్ ॥ 43**

**పదచ్ఛేదము :–** తతః – వై – భృశసంవిగ్నా – లంకా – సా – గద్గదాక్షరమ్ – ఉవాచ – అగర్వితం – వాక్యం – హనుమంతం – ప్లవంగమమ్ ॥

**అన్వయక్రమము :–** తతః భృశసంవిగ్నా సా లంకా, హనుమంతం ప్లవంగమం గద్గదాక్షరమ్ అగర్వితం వాక్యమ్, ఉవాచ.

**ప్రతిపదార్థము :–** తతః = అంతట, భృశసంవిగ్నా = మిక్కిలి భయవిహ్వలురాలయిన, సా లంకా = ఆ లంకాధిదేవత, హనుమంతం ప్లవంగమం = వానరశ్రేష్ఠుడైన హనుమను, గద్గదాక్షరం = తొట్రుపడుచున్న అక్షరములు కలిగినట్టి, అగర్వితం వాక్యం = గర్వరహితమైనట్టి వచనమును, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** అంతట ఆమె మిక్కిలి భయగ్రస్తయై, గర్వమును వీడి, గద్గదాక్షరములతో హనుమంతుని గూర్చి ఇట్లు పలికెను.

**శ్లో॥ ప్రసీద సుమహాబాహో త్రాయస్వ హరిసత్తమ ।**
**సమయే సౌమ్య తిష్ఠంతి సత్త్వవంతో మహాబలాః ॥ 44**

**పదచ్ఛేదము :–** ప్రసీద – సుమహాబాహో – త్రాయస్వ – హరిసత్తమ – సమయే – సౌమ్య – తిష్ఠంతి – సత్త్వవంతః – మహాబలాః ॥

**అన్వయక్రమము :–** సుమహాబాహో హరిసత్తమ ప్రసీద త్రాయస్వ సౌమ్య సత్త్వవంతః

మహాబలాః సమయే తిష్ఠంతి.

**ప్రతిపదార్థము** :- సుమహాబాహో = మహావీరుడా!, ప్రసీద = దయచూపుము, హరిసత్తమ = ఓ వానరోత్తముడా!, త్రాయస్వ = నన్ను రక్షింపుము, సౌమ్య! = ఓ సజ్జనుడా! సత్త్వవంతః మహాబలాః = ధైర్యము గల వీరులు, సమయే = ధర్మమునందు, తిష్ఠంతి = నిలుతురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- సమయే తిష్ఠంతి = శాస్త్రమర్యాదయందు నిలుతురు. "స్త్రీ న హంతవ్యా" అనునది శాస్త్రవాక్యము కదా!)

**గోవిందరాజీయము** :- సమయము = వ్యవస్థ, కట్టుబాటు, నియమము. సత్త్వవంతః = ధైర్యవంతః.

**తాత్పర్యము** :- మహావీరుడా! అనుగ్రహింపుము. వానరోత్తముడా, నన్ను రక్షింపుము; ఓ సజ్జనుడా! ఉత్తములైన వీరులు, ధర్మనియమములకు కట్టుబడియుందురుగదా!

**శ్లో॥ అహం తు నగరీ లంకా స్వయమేవ ప్లవంగమ ।**
**నిర్జితాహం త్వయా వీర విక్రమేణ మహాబల ॥ 45**

**పదచ్ఛేదము** :- అహం - తు - నగరీ - లంకా - స్వయమ్ - ఏవ - ప్లవంగమ । నిర్జితా - అహం - త్వయా - వీర - విక్రమేణ - మహాబల ॥

**అన్వయక్రమము** :- ప్లవంగమ! అహం తు స్వయమేవ, లంకా నగరీ; వీర! మహాబల! అహం విక్రమేణ త్వయా నిర్జితా.

**ప్రతిపదార్థము** :- ప్లవంగమ! = ఓ వానరోత్తముడా! అహం తు = నే ననగా, స్వయమేవ = స్వయముగనే, లంకానగరీ = లంకానగరిని, వీర! = ఓ వీరుడా, మహాబల! = ఓ బలాఢ్యుడా, విక్రమేణ = పరాక్రమముచేత, అహం = నేను, త్వయా నిర్జితా = నీచేత నోడింపబడితిని.

**తాత్పర్యము** :- ఓ మహావీరుడా! నేనే స్వయముగా లంకానగరాధిదేవతను. అట్టి నేను నీయొక్క పరాక్రమముచే నేడు పూర్తిగా ఓడింపబడితిని.

**శ్లో॥ ఇదం తు తథ్యం శృణు వై బ్రువంత్యా మే హరీశ్వర ।**
**స్వయంభువా పురా దత్తం వరదానం యథా మమ ॥ 46**

**పదచ్ఛేదము** :– ఇదం – తు – తథ్యం – శృణు – వై – బ్రువంత్యా – మే – హరీశ్వర! స్వయంభువా – పురా – దత్తం – వరదానం – యథా – మమ ॥

**అన్వయక్రమము** :– హరీశ్వర! పురా స్వయంభువా మమ వరదానం యథా దత్తం, ఇదం తథ్యం బ్రువంత్యాః మే శృణు.

**ప్రతిపదార్థము** :– హరీశ్వర! = ఓ వానరశ్రేష్ఠుడా! పురా = పూర్వము, స్వయంభువా = బ్రహ్మదేవునిచేత, మమ = నాకు, వరదానం యథా దత్తం = వరదానమెట్లు చేయబడినదో, బ్రువంత్యాః = చెప్పుచున్నట్టి, మే = నాయొక్క, ఇదం తథ్యం = ఈ యథార్థవచనమును, శృణు = వినుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– శృణు = నీపై దయతో, నీకు ఉపయోగించు విషయమును చెప్పుచున్నాను. కావున సావధానముగా వినుము.

**తాత్పర్యము** :– ఓ వానరశ్రేష్ఠుడా! పూర్వము బ్రహ్మదేవునిచే నా కీయబడిన వరమును గూర్చి చెప్పుచున్నాను; నీ వా యథార్థవిషయమును శ్రద్ధగా వినుము.

**శ్లో॥ యదా త్వాం వానరః కశ్చి ద్విక్రమా ద్వశ మానయేత్ ।**
**తదా త్వయా హి విజ్ఞేయం రక్షసాం భయ మాగతమ్ ॥ 47**

**పదచ్ఛేదము** :– యదా – త్వాం – వానరః – కశ్చిత్ – విక్రమాత్ – వశమ్ – ఆనయేత్ – తదా – త్వయా – హి – విజ్ఞేయం – రక్షసాం – భయమ్ – ఆగతమ్ ॥

**అన్వయక్రమము** :– యదా త్వాం కశ్చిత్ వానరః విక్రమాత్ వశం ఆనయేత్, తదా త్వయా రక్షసాం భయమ్ ఆగతం (ఇతి) విజ్ఞేయం హి.

**ప్రతిపదార్థము** :– యదా = ఎప్పుడయితే, త్వాం = నిన్ను, కశ్చిత్ వానరః = ఒకనొక వానరుడు, విక్రమాత్ = పరాక్రమమువలన, వశమ్ ఆనయేత్ = వశము చేసుకొనునో (జయించునో), తదా = అప్పుడు, రక్షసాం = రాక్షసులకు, భయమ్ ఆగతం (ఇతి) = భయము వచ్చినది (అని), విజ్ఞేయం హి = తెలిసికొనవలెను సుమా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రక్షసాం భయం = తన అపజయమనగా, సర్వరాక్షసులకు సంభవించిన అపజయమని తెలుపబడెను.

**గోవిందరాజీయము :–** రావణుని దిగ్విజయకాలమున శివునిభటులైన నందీశ్వరుదు మున్నగువారు లంకను వెంటనే నశింపచేయగోరి శపింపబోవగా, ఆ లంకాధిదేవత, ఆ వినాశమును తప్పింపుమని బ్రహ్మదేవుని వేడుకొనెను. ఆయన ఆమెతో నీకు వినాశ మిప్పుడు తప్పును. కాని ఒకానొక వానరుడు నిన్నెప్పుడు ఓడించునో అప్పుడు నీకు వినాశము సంభవించును అని ఆనాడు జరిగినగాథ నిచ్చట స్మరించుకొనవలెను.

**తాత్పర్యము :–** ఒకానొక వానరుడు ఎప్పుడయితే నిన్ను జయించునో అప్పుడే రాక్షసు లెల్లరకును, కీడు మూడినదని గ్రహింపుము.

**శ్లో॥ స హి మే సమయ స్సౌమ్య ప్రాప్తోఽద్య తవ దర్శనాత్ ।**
**స్వయంభువిహిత స్సత్యో న తస్యాఽస్తి వ్యతిక్రమః ॥ 48**

**పదచ్ఛేదము :–** సః – హి – మే – సమయః – సౌమ్య – ప్రాప్తః – అద్య – తవ – దర్శనాత్ – స్వయంభువిహితః – సత్యః – న – తస్య – అస్తి – వ్యతిక్రమః ॥

**అన్వయక్రమము :–** సౌమ్య! అద్య మే తవ దర్శనాత్ సః సమయః ప్రాప్తః హి; స్వయంభువిహితః సత్యః; తస్య, వ్యతిక్రమః న అస్తి.

**ప్రతిపదార్థము :–** సౌమ్య! = ఓ ఉత్తముడా, అద్య = నేడు, మే = నాకు, తవ దర్శనాత్ = నీ దర్శనమువలన, సః సమయః = ఆ నిర్ణయము, ప్రాప్తః హి = ప్రాప్తించినదిగదా! స్వయంభువిహితః = బ్రహ్మదేవునిచే విధింపబడినట్టిది, సత్యః = యథార్థమేయగును, తస్య = ఆ నిర్ణయమునకు, వ్యతిక్రమః = వ్యతిరేకము, న అస్తి = ఉండదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** రావణుడు నందికేశ్వరుని ఎదుర్కొనినప్పుడు, నందికేశ్వరుడొసంగిన శాపముచే, ఆనాడే సంభవింపవలసిన లంకావినాశము, బ్రహ్మదేవుని వరప్రభావముచే వానరాగమనపర్యంతము ఆగెననెడి కథ ఇచ్చట చేర్చుకొనవలెను. అని మహేశ్వరతీర్థులు అను వ్యాఖ్యానకారుడు నుడివెను.

**తాత్పర్యము :–** నేడు నాకు నీ దర్శన మయినందువలన బ్రహ్మదేవుడు చేసిన నిర్ణయసమయము తటస్థించినది. సృష్టికర్తయగు బ్రహ్మ నిర్ణయము సత్యమై తీరును. ఆయన నిర్ణయమునకు విపర్యయ మెన్నడును ఉండదు.

**శ్లో॥ సీతానిమిత్తం రాజ్ఞస్తు రావణస్య దురాత్మనః ।**
**రక్షసాం చైవ సర్వేషాం వినాశ స్సముపాగతః ॥ 49**

**పదచ్ఛేదము :–** సీతానిమిత్తం – రాజ్ఞః – తు – రావణస్య – దురాత్మనః – రక్షసాం – చ – ఏవ – సర్వేషాం – వినాశః – సముపాగతః ॥

**అన్వయక్రమము :–** సీతానిమిత్తం, దురాత్మనః, రాజ్ఞః, రావణస్య, సర్వేషాం, రక్షసాం చైవ, వినాశః, సముపాగతః.

**ప్రతిపదార్థము :–** సీతానిమిత్తం = సీతమ్మకారణముగా, దురాత్మనః = దుర్మార్గుడైనట్టి, రాజ్ఞః రావణస్య = రాజగు రావణునికిని, సర్వేషాం రక్షసాం చైవ = ఎల్ల రాక్షసులకును గూడ, వినాశః సముపాగతః = వినాశము సంప్రాప్తించినది.

**తాత్పర్యము :–**ఇట్లు సీతానిమిత్తముగా దుర్మార్గుడైన రావణునికిని, సమస్త రాక్షసులకును నేడు వినాశము సంభవించుచున్నది సుమా!

**శ్లో॥ తత్ప్రవిశ్య హరిశ్రేష్ఠ పురీం రావణపాలితామ్ ।**
**విధత్స్వ సర్వకార్యాణి యాని యానీహ వాంఛసి ॥ 50**

**పదచ్ఛేదము :–** తత్ – ప్రవిశ్య – హరిశ్రేష్ఠ! – పురీం – రావణపాలితామ్ – విధత్స్వ – సర్వకార్యాణి – యాని – యాని – ఇహ – వాంఛసి ॥

**అన్వయక్రమము :–** తత్, హే హరిశ్రేష్ఠ! రావణపాలితాం పురీం ప్రవిశ్య, యాని యాని వాంఛసి (తాని) సర్వాణి కార్యాణి, ఇహ విధత్స్వ.

**ప్రతిపదార్థము :–** తత్ = ఆ కారణముచేత, హే హరిశ్రేష్ఠ ! = ఓ వానరోత్తముడా! రావణపాలితాం పురీం = రావణునిచే పాలింపబడిన నగరమును, ప్రవిశ్య = ప్రవేశించి, యాని యాని = వేటిని వేటిని, వాంఛసి = (చేయ) కోరుచున్నావో, (తాని) సర్వాణి కార్యాణి = ఆ పనులన్నిటిని, ఇహ = లంకలో, విధత్స్వ = నెరవేర్చుకొనుము.

**తాత్పర్యము :–** మహాత్మా! రావణరక్షితమైన ఈ నగరమును ప్రవేశించి, నీ వే యే కార్యములను చేయగోరుచున్నావో, ఆ సమస్తకార్యములను చక్కగా నెరవేర్చుకొనుము.

**శ్లో॥ ప్రవిశ్య శాపోపహతాం హరీశ్వర**
**శుభాం పురీం రాక్షసముఖ్యపాలితాం ।**
**యదృచ్ఛయా త్వం జనకాత్మజాం సతీం**
**విమార్గ సర్వత్రగతో యథాసుఖమ్ ॥ 51**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే ఆదికావ్యే సుందరకాండే*
*"లంకాధిదేవతావిజయో నామ" నామ తృతీయస్సర్గః.*

**పదచ్ఛేదము :–** ప్రవిశ్య – శాపోపహతాం – హరీశ్వర – శుభాం – పురీం – రాక్షస ముఖ్యపాలితాం – యదృచ్ఛయా – త్వం – జనకాత్మజామ్ – సతీం – విమార్గ – సర్వత్ర – గతః – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము :–** హే హరీశ్వర! శాపోపహతాం, రాక్షసముఖ్యపాలితాం, శుభాం పురీం, త్వం యదృచ్ఛయా, ప్రవిశ్య, సర్వత్ర గతః (సన్) యథాసుఖం, సతీం, జనకాత్మజాం! విమార్గ.

**ప్రతిపదార్థము :–** హే హరీశ్వర! = ఓ వానరశ్రేష్ఠుడా! శాపోపహతాం = నందికేశ్వరుని శాపముచేత నిర్వీర్యమైన, రాక్షసముఖ్యపాలితాం = రావణాసురునిచే పాలింపబడు చున్నట్టి, శుభాం పురీం = ఈ ఉత్తమమైన నగరమును, త్వం = నీవు, యదృచ్ఛయా = దైవనిర్ణయముచే, ప్రవిశ్య = ప్రవేశించి, యథాసుఖం = నీకు సుఖమని తోచినట్లుగా, సర్వత్ర గతః (సన్) = అన్ని ప్రదేశములకును పోయినవాడవై, సతీం = మహాపతివ్రతయైన జానకీదేవిని, విమార్గ = అన్వేషింపుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** శాపోపహతాం = నందికేశ్వరుని శాపముచే, నాశనమునొందు కాలము సమీపించియున్న, సర్వత్ర = రావణాంతఃపురపర్యంతము, 'జానకీం విమార్గ' = అనుటచే, సీత లంకలోనే యున్నదని సూచింపబడినది.

**తాత్పర్యము :–** నందికేశ్వరుని శాపముచే దుర్బలమైనట్టి, శుభకరమైన రావణనగరము నందు ప్రవేశించి, మహాపతివ్రతయైన సీతను ఎల్లయెడల సుఖముగా వెదుకుము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్ర వివరణమునందు*
*"లంకాధిదేవతా విజయము" అను*
*తృతీయసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుర్థసర్గ

**శ్లో॥ స నిర్జిత్య పురీం శ్రేష్ఠాం లంకాం తాం కామరూపిణీమ్ ।**
**విక్రమేణ మహాతేజా హనుమా న్కపిసత్తమః ॥ 1**

**శ్లో॥ అద్వారేణ మహాబాహుః ప్రాకార మభిపుప్లువే ।**
**నిశి లంకాం మహాసత్త్వో వివేశ కపికుంజరః ॥ 2**

**పదచ్ఛేదము :–** సః – నిర్జిత్య – పురీం – శ్రేష్ఠాం – లంకాం – తాం – కామరూపిణీం – విక్రమేణ – మహాతేజాః – హనుమాన్ – కపిసత్తమః ॥ అద్వారేణ – మహాబాహుః – ప్రాకారమ్ – అభిపుప్లువే – నిశి – లంకాం – మహాసత్త్వః – వివేశ – కపికుంజరః ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః మహాబాహుః కపిసత్తమః సః హనుమాన్, కామరూపిణీం శ్రేష్ఠాం తాం లంకాం పురీం, విక్రమేణ నిర్జిత్య, అద్వారేణ ప్రాకారమ్ అభిపుప్లువే. మహాసత్త్వః సః కపికుంజరః, నిశి లంకాం వివేశ.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః = గొప్ప తేజస్సుగలవాడును, మహాబాహుః = గొప్ప పరాక్రమము గలవాడును, కపిసత్తమః = వానరులలో శ్రేష్ఠుడును అగు, సః హనుమాన్ = ఆ హనుమ, కామరూపిణీం = కామరూపము గలిగినట్టి, తాం లంకాం పురీం = ఆ లంకానగరిని, విక్రమేణ = పరాక్రమముచే, నిర్జిత్య = జయించి, అద్వారేణ = ప్రక్కమార్గమున, ప్రాకారమ్ అభిపుప్లువే = నగరప్రాకారమును దాటి లోనికి గెంతెను. మహాసత్త్వః సః కపికుంజరః = సత్త్వశాలియైన ఆ వానరశ్రేష్ఠుడు, లంకాం = లంకానగరమును, నిశి = రాత్రిసమయమున, వివేశ = ప్రవేశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిప్రతి :–** "అభిపుప్లువే" అనుటకు బదులుగా "అవపుప్లువే" అని కలదు. అప్పుడు హనుమ ప్రాకారమునుండి క్రిందికి దూకెను అని అర్థము.

**తిలకము :–** "అద్వారేణ" = 'శత్రోః పురం గ్రామం గృహం వా అద్వారేణ ప్రవిశేత్ శత్రువినాశాయ' అను నీతిస్మృతి ననుసరించి, శత్రువినాశము కోరువాడు, ఆ శత్రువు

యొక్క పట్టణమును గాని, గ్రామమునుగాని, గృహమునుగాని, ద్వారముగుండా కాక, ప్రక్కత్రోవనుండియే ప్రవేశింపవలెను.

**వాసుదాసస్వామి :–**

శ్లో॥ అద్వారేణ రిపో ర్గేహం ద్వారేణ సుహృదో గృహాన్ ।
ప్రవిశంతి నరా ధీరా ద్వారా ణ్యేతాని ధర్మతః ॥
– భారతము, సభాపర్వము

శత్రుస్థానమును అద్వారమున ప్రవేశించుట రాజనీతి. జరాసంధునిమీదికి యుద్ధమునకు పోయినపుడు శ్రీకృష్ణభీమార్జునులు అద్వారముననే ప్రవేశించిరిగదా!

**తాత్పర్యము :–** అమితబలసంపన్నుడైన ఆ మహాసత్త్వుడు వానరశ్రేష్ఠుడగు హనుమ, తన పరాక్రమముచే కామరూపిణియైన లంకను జయించి, ద్వారము నుండిగాక, ఆ లంకాప్రాకారమును, ప్రక్కనుండియే అధిరోహించి, ఆ రాత్రి సమయమున లంకానగరమున ప్రవేశించెను.

**శ్లో॥ ప్రవిశ్య నగరీం లంకాం కపిరాజహితంకరః ।**
**చక్రేఽథ పాదం సవ్యం చ శత్రూణాం స తు మూర్ధని ॥ 3**

**పదచ్ఛేదము :–** ప్రవిశ్య – నగరీం – లంకాం – కపిరాజహితంకరః । చక్రే – అథ – పాదం – సవ్యం – చ – శత్రూణాం – సః – తు – మూర్ధని ॥

**అన్వయక్రమము :–** అథ, సః కపిరాజహితంకరః, లంకాం నగరీం ప్రవిశ్య, శత్రూణాం మూర్ధని చ, సవ్యం పాదం చక్రే.

**ప్రతిపదార్థము :–** అథ = ఆ తరువాత, సః కపిరాజహితంకరః = వానర (శ్రేష్ఠుడైన) రాజైన సుగ్రీవునకు ప్రియమును గూర్చునట్టి ఆ హనుమ, లంకానగరీం ప్రవిశ్య = లంకానగరమును ప్రవేశించి, శత్రూణాం మూర్ధని చ = శత్రువుల శిరమునందు గూడ, సవ్యం పాదం చక్రే = ఎడమ పాదమును మోపెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** శత్రునగరమున మొట్టమొదట ఎడమకాలు మోపుట యనగా, శత్రువుల తలలపై మోపుటయే యగును. అట్లుగా, విజయప్రద మగుననియే ఇచ్చటి భావము.

శ్లో॥ ప్రయాణకాలే స్వగృహప్రవేశే వివాహకాలేఽపి చ దక్షిణాంఘ్రిమ్ ।
కృత్వాగ్రతః శత్రుపురప్రవేశే వామం నిదధ్యాత్ చరణం నృపాలః ॥
– (బృహస్పతి వచనము)

ప్రయాణసమయమునందును, తనయింటిని ప్రవేశించునప్పుడును, వివాహ సమయమునందును, కుడికాలును మొదట మోపవలెను. శత్రుపురప్రవేశమున మాత్రము ఎడమకాలును ముందు మోపవలెను.

**తాత్పర్యము :-** వానరరాజైన సుగ్రీవుడు తనకు అప్పగించిన ప్రియమైన కార్యమును సాధించుచున్నట్టి ఆ హనుమ, లంకానగరమును ప్రవేశించుచు, మొదటగా తన ఎడమపాదమును మోపెను. ఆ మోపుట శత్రువుల శిరముపై మోపుటయే అయ్యెను.

**శ్లో॥ ప్రవిష్ట స్సత్త్వసంపన్నో నిశాయాం మారుతాత్మజః ।**
**స మహాపథ మాస్థాయ ముక్తాపుష్పవిరాజితమ్ ॥ 4**

**పదచ్ఛేదము :-** ప్రవిష్టః - సత్త్వసంపన్నః - నిశాయాం - మారుతాత్మజః - సః మహాపథమ్ - ఆస్థాయ - ముక్తాపుష్పవిరాజితమ్ ॥

**అన్వయక్రమము :-** ప్రవిష్టః, మారుతాత్మజః, సత్త్వసంపన్నః సః, ముక్తాపుష్పవిరాజితం మహాపథమ్ ఆస్థాయ (లంకామ్, అభియయౌ).

**ప్రతిపదార్థము :-** ప్రవిష్టః= అట్లు ప్రవేశించినట్టి, మారుతాత్మజః = వాయునందనుడును, సత్త్వసంపన్నః = మహాబలశాలియును అగు, సః = ఆ హనుమ, ముక్తాపుష్పవిరాజితం = ముత్యములతోడను పుష్పములతోడను విరాజిల్లునట్టి, మహాపథం = రాజమార్గమును, ఆస్థాయ = చేరి, (లంకాం = లంకనుగూర్చి, అభియయౌ = వెడలెను).

**తాత్పర్యము :-** మహాబలాఢ్యుడైన హనుమ, రాత్రిసమయమునందే అట్లు ప్రవేశించి ముత్యములతోడను పుష్పములతోడను ప్రకాశించుచున్న రాజమార్గమును చేరి ఆ మార్గముగుండా లంకలోని కేగెను.

**శ్లో॥ సేవితాం రాక్షసై ర్భీమై ర్బలిభి శ్శస్త్రపాణిభిః ।**
**తత స్తు తాం పురీం లంకాం రమ్యా మభియయౌ కపిః ॥ 5**

**పదచ్ఛేదము :-** సేవితాం - రాక్షసైః - భీమైః - బలిభిః -శస్త్రపాణిభిః - తతః - తు - తాం - పురీం - లంకాం - రమ్యామ్ - అభియయౌ - కపిః ॥

**అన్వయక్రమము :-** తతః, కపిః, భీమైః బలిభిః శస్త్రపాణిభిః రాక్షసైః సేవితాం, రమ్యాం, తాం లంకాపురీమ్ అభియయౌ.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, కపిః = హనుమ, భీమైః = భీకరులును, బలిభిః = బలాఢ్యులును, శస్త్రపాణిభిః = ఆయుధహస్తులునైనట్టి, రాక్షసైః = రాక్షసులచే,

సేవితాం = సేవింపబడినట్టి, రమ్యాం = సుందరమైనట్టి, తాం లంకాపురీం = ఆ లంకానగరిని, అభియయౌ = ప్రవేశింపబోయెను.

**తాత్పర్యము :–** మహాభయంకరులైన ఆయుధహస్తులైన రాక్షసులచే రక్షింపబడుచున్న రమ్యమైనట్టి ఆ లంకానగరిని హనుమ చేర జనుచుండెను.

**శ్లో॥ హసితోత్కృష్టనినదై స్తూర్యఘోషపురస్సరైః ।**
**వజ్రాంకుశనికాశై శ్చ వజ్రజాలవిభూషితైః ।**
**గృహమేఘైః పురీ రమ్యా బభాసే ద్యౌరివాంబుదైః ॥ 6**

**పదచ్ఛేదము :–** హసితోత్కృష్టనినదైః – తూర్యఘోషపురస్సరైః – వజ్రాంకుశనికాశైః – చ – వజ్రజాలవిభూషితైః – గృహమేఘైః – పురీ – రమ్యా – బభాసే – ద్యౌః – ఇవ – అంబుదైః ॥

**అన్వయక్రమము :–** హసితోత్కృష్టనినదైః, తూర్యఘోషపురస్సరైః, వజ్రాంకుశనికాశైః, వజ్రజాలవిభూషితైః, గృహమేఘైః, రమ్యా పురీ, అంబుదైః, ద్యౌః ఇవ బభాసే.

**ప్రతిపదార్థము :–** హసితోత్కృష్టనినదైః = పెద్ద నవ్వులతో గూడిన ధ్వనులతో, తూర్యఘోషపురస్సరైః = వివిధవాద్యముల ధ్వనులతోడను, వజ్రాంకుశనికాశైః = వజ్రము అంకుశము మున్నగువానితో పోలినట్టి, వజ్రజాలవిభూషితైః = వజ్రగవాక్షములతో వెలయుచున్నట్టి, గృహమేఘైః = గృహశ్రేష్ఠములతో, రమ్యా పురీ = సుందరమైన ఆ నగరి, అంబుదైః, ద్యౌః ఇవ = మేఘములతో ఆకాశమువలె, బభాసే = మిక్కిలి ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** వజ్రాంకుశనికాశైః = వజ్రము అంకుశముగా గల్గినట్టి ఐరావత దిగ్గజముతో సమానమైనట్టి.

**తాత్పర్యము :–** వివిధవాద్యధ్వనులతో పెద్ద నవ్వుల ధ్వనులతో నిండినవియును, ఐరావత దిగ్గజమువలె తెల్లనివియును, వజ్రనిర్మితమైన గవాక్షములతో ప్రకాశించుచున్నవియును అగు ఉన్నతమైన గృహములతో ఆ లంకానగరము మేఘములతో ఆకాశమువలె మిక్కిలి సుందరముగా ప్రకాశించెను.

**శ్లో॥ ప్రజజ్వాల తదా లంకా రక్షోగణగృహై శ్శుభైః ।**
**సితాభ్రసదృశై శ్చిత్రైః పద్మస్వస్తికసంస్థితైః ।**
**వర్ధమానగృహై శ్చాపి సర్వత స్సువిభూషితా ॥ 7**

**పదచ్ఛేదము :–** ప్రజజ్వాల – తదా – లంకా – రక్షోగణగృహైః – శుభైః – సితాభ్రసదృశైః – చిత్రైః – పద్మస్వస్తికసంస్థితైః – వర్ధమానగృహైః – చ – అపి – సర్వతః – సువిభూషితా ॥

**అన్వయక్రమము :–** సితాభ్రసదృశైః చిత్రైః పద్మస్వస్తికసంస్థితైః వర్ధమానగృహైః చ అపి, శుభైః రక్షోగణగృహైః, సర్వతః సువిభూషితా, లంకా తదా ప్రజజ్వాల.

**ప్రతిపదార్థము :–** సితాభ్రసదృశైః = తెల్లని మేఘములతో సమానముగానున్న, చిత్రైః = రంగురంగులతో ప్రకాశించుచున్నవియును, పద్మస్వస్తికసంస్థితైః = పద్మము స్వస్తికము అను లక్షణములు గలవియును, వర్ధమానగృహైః చ = వర్ధమానమను పేరుగల గృహములును, శుభైః = మంగళకరములును అగు, రక్షోగణగృహైః = రాక్షస సమూహములయొక్క భవనములతో, సర్వతః సువిభూషితా = అంతటను ప్రకాశించుచున్నట్టి (అలంకరింపబడి ప్రకాశించుచున్న), లంకా = లంకానగరి, తదా = ఆ సమయమున, ప్రజజ్వాల = గొప్పగా ప్రజ్వరిల్లుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** వర్ధమానగృహైః = 'వర్ధమాన'మను సంజ్ఞగల గృహములచే.

శ్లో॥ చతుశ్శాలం చతుర్ద్వారం సర్వతోభద్రసంజ్ఞితమ్ ।
పశ్చిమద్వారరహితం నంద్యావర్తాహ్వయం తు తత్ ।
దక్షిణద్వారరహితం వర్ధమానం ధనప్రదమ్ ।
ప్రాగ్ద్వారరహితం స్వస్తికాఖ్యం పుత్రధనప్రదమ్ ॥

– (వరాహమిహిర సంహిత)

1) నాలుగు వసారాలును, నాలుగు ద్వారములును గలది సర్వతోభద్రము.
2) పశ్చిమద్వారము లేనట్టి భవనము నంద్యావర్తము అనబడును.
3) దక్షిణద్వారములేనిది వర్ధమానమని పిలువబడును. ఇది అధిక ధనప్రదమైన దగును.
4. తూర్పున గుమ్మములేనిది స్వస్తిక మనబడును. ఈ భవనము పుత్రధనప్రదమై యుండును. (ఇవి అన్నియును రాజుల గృహభేదములు)

**తాత్పర్యము :–** తెల్లని మేఘమువంటివియును, రంగురంగులతో ప్రకాశించునవియును, పద్మము, స్వస్తికము, వర్ధమానము అను పేరుగల భవనవిశేషములు గలవియును, మంగళకరములును అగు రాక్షసమందిరములతో ఎల్లయెడల ముచ్చట గొలుపుచున్న

ఆ లంకానగరము గొప్పకాంతితో విరాజిల్లుచుండెను.

**శ్లో॥ తాం చిత్రమాల్యాభరణాం కపిరాజహితంకరః ।**
**రాఘవార్థం చరన్ శ్రీమాన్ దదర్శ చ ననంద చ ॥ 8**

**పదచ్ఛేదము :–** తాం – చిత్రమాల్యాభరణాం – కపిరాజహితంకరః – రాఘవార్థం – చరన్ – శ్రీమాన్ – దదర్శ – చ – ననంద – చ ॥

**అన్వయక్రమము :–** కపిరాజహితంకరః, శ్రీమాన్, సః రాఘవార్థం చరన్, చిత్రమాల్యాభరణాం, తాం దదర్శ చ, ననంద చ.

**ప్రతిపదార్థము :–** కపిరాజహితంకరః = సుగ్రీవునకు ప్రియమును గూర్చునట్టి, శ్రీమాన్ = శుభలక్షణపూర్ణుడైన హనుమ, రాఘవార్థం చరన్ = శ్రీరామునికొఱకు పర్యటించుచు, చిత్రమాల్యాభరణాం = విచిత్రములైన మాలికలును ఆభరణములును గలిగినట్టి, తాం = ఆ లంకానగరిని, దదర్శ = చూచెను, ననంద చ = ఆనందించెను కూడ.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :–** ననంద చ = 'దుష్ప్రవేశమైనదైనప్పటికిని లంకను సునాయాసముగ ప్రవేశించి చూడగల్గుచున్నాను. అందుచేత రామసుగ్రీవుల మనోరథసిద్ధి జరుగును.' అని ఆనందించెను.

**తాత్పర్యము :–** విచిత్రములైన మాలికలతోడను, ఆభరణములతోడను, రమ్యమైయున్న ఆ లంకను, రామకార్యార్థమై సుగ్రీవప్రియమును గోరి, సంచరించుచు, నగర దృశ్యములను జూచుచు తన కార్యము ఫలోన్ముఖము కాబోవుచున్నదని ఆనందించెను.

**శ్లో॥ భవనా ద్భవనం గచ్ఛన్ దదర్శ పవనాత్మజః ।**
**వివిధాకృతిరూపాణి భవనాని తత స్తతః ॥ 9**

**పదచ్ఛేదము :–** భవనాత్ – భవనం – గచ్ఛన్ – దదర్శ – పవనాత్మజః – వివిధాకృతిరూపాణి – భవనాని – తతః – తతః ॥

**అన్వయక్రమము :–** పవనాత్మజః, భవనాత్, భవనం, గచ్ఛన్, తతః, తతః, వివిధాకృతిరూపాణి, భవనాని, దదర్శ.

**ప్రతిపదార్థము :–** పవనాత్మజః = వాయునందనుడు, భవనాత్ భవనం గచ్ఛన్ = ఒక భవనమునుండి వేరొక భవనమునకు బోవుచు, తతః తతః = ఆయా భవనములపై నుండి, వివిధాకృతిరూపాణి = వివిధములైన ఆకారములను స్వరూపములను కలిగినట్టి,

భవనాని = భవనములను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమ ఒక యింటినుండి వేరొకయింటికి వెడలుచు, వివిధములైన ఆకారములతో సుందరమైన రూపములుగలిగిన అచ్చటి భవనములను నలువైపుల నుండి చూచెను.

**శ్లో॥ శుశ్రావ మధురం గీతం త్రిస్థానస్వరభూషితమ్ ।**
**స్త్రీణాం మదసమృద్ధానాం దివి చాప్సరసా మివ ॥ 10**

**పదచ్ఛేదము :–** శుశ్రావ – మధురం – గీతం – త్రిస్థానస్వరభూషితమ్ – స్త్రీణాం – మదసమృద్ధానాం – దివి – చ – అప్సరసామ్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** దివి, అప్సరసామ్ ఇవ, మదసమృద్ధానాం స్త్రీణాం, త్రిస్థాన స్వరభూషితమ్ – మధురం – గీతం – శుశ్రావ.

**ప్రతిపదార్థము :–** దివి = స్వర్గమునందు, అప్సరసామ్ ఇవ = అప్సరసలవలెనున్నట్టి, మదసమృద్ధానాం = మదవతులై యున్న, స్త్రీణాం = సుందరులయొక్క, త్రిస్థాన స్వరభూషితమ్ = (వక్షము, కంఠము, శిరము అను) మూడుస్థానములందు వెలసినట్టి, మధురం గీతం = (మంద్రమధ్యమతారస్వరములతో) మధురముగ పాడబడుచున్నట్టి గానమును, శుశ్రావ = వినెను.

**తాత్పర్యము :–** స్వర్గమునందలి అప్సరసలవలె, విలాసవతులైన స్త్రీలు వక్షము, కంఠము, శిరము అను మూడు స్థానములందు జనించు మంద్ర మధ్యమ తారస్వరములతో, మధురముగా పాడుచున్న గీతములను హనుమంతుడాకర్ణించెను.

**శ్లో॥ శుశ్రావ కాంచీనినదం నూపురాణాం చ నిస్వనమ్ ।**
**సోపాననినదాం శ్చైవ భవనేషు మహాత్మనామ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** శుశ్రావ – కాంచీనినదం – నూపురాణాం – చ – నిస్వనమ్ – సోపాననినదాన్ – చ – ఏవ – భవనేషు – మహాత్మనామ్ ॥

**అన్వయక్రమము :–** మహాత్మనాం భవనేషు కాంచీనినదం, నూపురాణాం, నిస్వనం చ, సోపాననినదాన్ చ ఏవ శుశ్రావ.

**ప్రతిపదార్థము :–** మహాత్మనాం భవనేషు = మహనీయులైన (రాక్షసుల) భవనముల యందు, కాంచీనినదం = స్త్రీల మొలనూలు లందలి చిరుగంటల ధ్వనిని, నూపురాణాం నిస్వనం చ = కాలియందెల రవళిని, సోపాననినదాన్ చైవ = మెట్లపై వారు నడచునప్పుడు కలిగిన ధ్వనులను, శుశ్రావ = ఆలకించెను.

**తాత్పర్యము** :- దానవుల భవనములందు స్త్రీలు సంచరించునప్పుడు, కలుగునట్టి బంగరు మొలనూలు గంటల ధ్వనులను, మణినూపురనినాదములను, సోపానములపై ఆభరణములతో వారు చరించునప్పుడు కలుగు ధ్వనులను హనుమ వినుచుండెను.

**శ్లో॥ ఆస్ఫోటితనినాదాం శ్చ క్ష్వేళితాం శ్చ తత స్తతః ।**
**శుశ్రావ జపతాం తత్ర మంత్రాన్ రక్షోగృహేషు వై ॥ 12**

**పదచ్ఛేదము** :- ఆస్ఫోటితనినాదాన్ - చ - క్ష్వేళితాన్ - చ - తతః - తతః - శుశ్రావ - జపతాం - తత్ర - మంత్రాన్ - రక్షోగృహేషు - వై ॥

**అన్వయక్రమము** :- రక్షోగృహేషు ఆస్ఫోటితనినాదాన్, తతః తతః క్ష్వేళితాన్ తత్ర జపతాం మంత్రాన్ శుశ్రావ.

**ప్రతిపదార్థము** :- రక్షోగృహేషు = ఆ రాక్షసభవనములయందు, తతః తతః = అచ్చటచ్చట, ఆస్ఫోటితనినాదాన్ = జబ్బలపై చరచుకొనుచున్న శబ్దములను, క్ష్వేళితాన్ చ = సింహగర్జనలవంటి ధ్వనులను, తత్ర = ఆ భవనములందు, జపతాం మంత్రాన్ = జపము చేసుకొనువారి మంత్రోచ్చారణములను, శుశ్రావ = వినెను.

**తాత్పర్యము** :- హనుమ, ఆ రాక్షసభవనములం దచ్చటచ్చట వీరులైన భటులయొక్క భుజాస్ఫాలనశబ్దములను, సింహగర్జనలను, మరికొన్ని చోట్ల జపమునం దుచ్చరింపబడుచున్న చతుర్వేదమంత్రములను ఆకర్ణించెను.

**శ్లో॥ స్వాధ్యాయనిరతాం శ్చైవ యాతుధానాన్ దదర్శ సః ।**
**రావణస్తవసంయుక్తాన్ గర్జతో రాక్షసా నపి ॥ 13**

**పదచ్ఛేదము** :- స్వాధ్యాయనిరతాన్ - చ - ఏవ - యాతుధానాన్ - దదర్శ - సః - రావణస్తవసంయుక్తాన్ - గర్జతః - రాక్షసాన్ - అపి ॥

**అన్వయక్రమము** :- సః, స్వాధ్యాయనిరతాన్, యాతుధానాన్ చైవ, రావణస్తవ సంయుక్తాన్, గర్జతః, రాక్షసాన్ అపి దదర్శ.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమ, స్వాధ్యాయనిరతాన్ = వేదాధ్యయనమునందు నిమగ్నులైన, యాతుధానాన్ చైవ = దానవులను, రావణస్తవసంయుక్తాన్ = రావణుని స్తోత్రములతో గూడిన, గర్జతః = గర్జించుచున్నట్టి, రాక్షసానపి = రాక్షసులను గూడ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- వేదాధ్యయననిరతులైన దానవులను, రావణునిపై స్తోత్రపాఠములను చదువుచు, గర్జించుచున్న పెక్కుమంది రాక్షసులను గూడ హనుమ గాంచెను.

**శ్లో॥ రాజమార్గం సమావృత్య స్థితం రక్షోబలం మహత్ ।**
**దదర్శ మధ్యమే గుల్మే రావణస్య చరాన్ బహూన్ ॥ 14**

**పదచ్ఛేదము** :- రాజమార్గం - సమావృత్య - స్థితం - రక్షోబలం - మహత్ - దదర్శ - మధ్యమే - గుల్మే - రావణస్య - చరాన్ - బహూన్ ॥

**అన్వయక్రమము** :- రాజమార్గం సమావృత్య స్థితం మహత్ రక్షోబలం, మధ్యమే గుల్మే రావణస్య బహూన్ చరాన్, దదర్శ.

**ప్రతిపదార్థము** :- రాజమార్గం సమావృత్య = రాజబాట నావరించి, స్థితం = ఉన్నట్టి, మహత్ రక్షోబలం = గొప్పదైన రాక్షససైన్యమును, మధ్యమే గుల్మే = మధ్యమ విభాగమునందు, రావణస్య = రావణునియొక్క, బహూన్ చరాన్ = పెక్కుమంది గూఢచారులను, దదర్శ = చూచెను.

**విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు**

**తిలకము** :- 'చరాన్' = నగరవృత్తాంతమును ఎప్పటికప్పుడు, రావణునకు నివేదించు గూఢచారులను.

**గోవిందరాజీయము** :- స్వజనుల వృత్తాంతమును తెలుసుకొనగోరి, మంత్రులు మున్నగువారిచే ప్రేరితులైన గూఢచారులు.

**తాత్పర్యము** :- రాజమార్గము నావరించియున్న మధ్యకక్ష్యయందు మారువేషములతో సంచరించుచున్న పెక్కుమంది గూఢచారులను హనుమంతుడు కనుగొనెను.

**శ్లో॥ దీక్షితాన్ జటిలాన్ ముండాన్ గోఽజినాంబరవాససః ।**
**దర్భముష్టిప్రహరణా నగ్నికుండాయుధాం స్తథా ॥ 15**

**పదచ్ఛేదము** :- దీక్షితాన్ - జటిలాన్ - ముండాన్ - గోఽజినాంబరవాససః । దర్భముష్టిప్రహరణాన్ - అగ్నికుండాయుధాన్ - తథా ॥

**ప్రతిపదార్థము** :- దీక్షితాన్ = క్రతుదీక్షను బూనినవారును, జటిలాన్ = జడలను ధరించినవారును, ముండాన్ = ముండనము గావించుకొన్నవారును, గోఽజినాం బరవాసనః = వృషభచర్మమునే వస్త్రముగా ధరించినవారును, దర్భముష్టిప్రహరణాన్ = దర్భముష్టులనే ఆయుధములుగా ధరించినవారును, అగ్నికుండాయుధాన్ = అగ్నికుండములనే ఆయుధములుగా గలిగియున్నవారును. (అగు పెక్కుమంది రక్కసులను గాంచెను.)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– లంకాద్వీపము భరతఖండమునకు వెలుపలి దేశమే యగుటచే దానికి కర్మభూమిత్వము లేకపోవుచున్నదిగదా! అచ్చట రాక్షసులకు కర్మదీక్షయందు అధికారము ఎట్లు సంభవించునని శంకింపనవసరము లేదు. రావణాదులయొక్క తపోమాహాత్మ్యము చేత కామ్యకర్మసిద్ధి యా దేశమునకు లభించినది. దర్భముష్టిప్రహరణాన్ = అరిష్టనివారణపూర్వకముగా అనుష్ఠాననిర్వహణముకొఱకై, దర్భముష్టిప్రహరణము వారి కవశ్య మైయున్నది. 'యథా వజ్రం హరేః పాణౌ, తథా విప్రకరే కుశః' అని ధర్మశాస్త్రము.

**మహేశ్వరతీర్థులు** :– "అగ్నికుండాయుధాన్" కృత్య మున్నగు శక్తులను ఉత్పత్తిచేసి శత్రుమారణము చేయుటకే, అగ్నికుండములు ఆయుధములుగా ఉపయోగింపబడును.

**తాత్పర్యము** :– వివిధకర్మలయందు దీక్షవహించినవారును, జడలను ధరించినవారును, ముండితులైనవారును, వృషభచర్మమును వస్త్రముగా ధరించినవారును, దర్భలకట్టలనే ఆయుధములుగా గలవారును, అగ్నికుండములనే ఆయుధములుగా తమవెంట నుంచుకొన్నవారును అగు బహువిధములుగనున్న రాక్షసులను హనుమ గాంచెను.

**శ్లో॥ కూటముద్గరపాణీం శ్చ దండాయుధధరా నపి ।**
**ఏకాక్షా నేకకర్ణాం శ్చ లంబోదరపయోధరాన్ ॥ 16**

**పదచ్ఛేదము** :– కూటముద్గరపాణీన్ – చ – దండాయుధధరాన్ – అపి – ఏకాక్షాన్ – ఏకకర్ణాన్ – చ – లంబోదరపయోధరాన్ ॥

**ప్రతిపదార్థము** :– కూటముద్గరపాణీన్ = కూటములు ముద్గరములు అను ఆయుధములు చేతియందు గలిగినవారిని, దండాయుధధరాన్ అపి = దండమును ఆయుధముగా ధరించినవారిని, ఏకాక్షాన్ = ఒకేకన్ను గలవారిని, ఏకకర్ణాన్ = ఒకే చెవిగలవారిని, లంబోదరపయోధరాన్ = వ్రేలాడుచున్న కడుపులును, స్తనములును గలవారిని, (దదర్శ = చూచెను)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– కూటము అనగా సమూహము, మాయ, గిరిశిఖరము, ఇనుపభవనము, మోసము, బాణవిశేషము, కపటము, కొమ్ములు విరిగిన వృషభము అని వివిధ అర్థములు గలవు.

**తాత్పర్యము** :– హనుమంతుడు అచ్చట ఆ రాక్షసులలో కూటములు, ముద్గరములు అను ఆయుధములు ధరించినవారిని, దండములను ఆయుధములుగా పూనినవారిని, ఒకకన్ను గలవారిని, ఒకచెవి గలవారిని, వ్రేలాడుచున్న స్తనములు, ఉదరములు గలవారిని జూచెను.

**శ్లో॥ కరాళాన్ భుగ్నవక్త్రాంశ్చ వికటాన్ వామనాం స్తథా ।**
**ధన్వినః ఖడ్గిన శ్చైవ శతఘ్నీముసలాయుధాన్ ॥ 17**

**పదచ్ఛేదము** :– కరాళాన్ – భుగ్నవక్త్రాన్ – చ – వికటాన్ – వామనాన్ – తథా । ధన్వినః – ఖడ్గినః – చ – ఏవ – శతఘ్నీముసలాయుధాన్ ॥

**ప్రతిపదార్థము** :– కరాళాన్ = భయంకరమగు, భుగ్నవక్త్రాన్ = వంకరనోళ్లుగలవారిని, వికటాన్ = వికారమైనవారిని, వామనాన్ = మరుగుజ్జువారిని, ధన్వినః = విలుకాండ్రను, ఖడ్గినః = ఖడ్గధారులను, శతఘ్నీముసలాయుధాన్ = శతఘ్నులును, ముసలములును, ఆయుధములుగా ధరించినవారిని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు భయంకరులును, వంకరమూతివారును, వికారరూపులును, మరుగుజ్జువారును, విండ్లను, కత్తులను పూనినవారును, శతఘ్నులను, ముసలములను ఆయుధముగా ధరించినవారు నగు పెక్కుమంది రాక్షసులను అచ్చట చూచెను.

**శ్లో॥ పరిఘోత్తమహస్తాం శ్చ విచిత్రకవచోజ్జ్వలాన్ ।**
**నాతిస్థూలా న్నాతికృశా న్నాతిదీర్ఘాతిహ్రస్వకాన్ ॥ 18**

**పదచ్ఛేదము** :– పరిఘోత్తమహస్తాన్ – చ – విచిత్రకవచోజ్జ్వలాన్ – న – అతి స్థూలాన్– న – అతికృశాన్ – న – అతిదీర్ఘాతిహ్రస్వకాన్ ॥

**ప్రతిపదార్థము** :– పరిఘోత్తమహస్తాన్ = శ్రేష్ఠమైన పరిఘ యను ఆయుధము చేతియందు గలవారిని, విచిత్రకవచోజ్జ్వలాన్ = విచిత్రములైన కవచములచే మెరయుచున్న వారిని, నాతిస్థూలాన్ = కొద్దిపాటి స్థూలముగా నున్నవారిని, నాతికృశాన్ = కొద్దిగా కృశించియున్నవారిని, నాతిదీర్ఘాతిహ్రస్వకాన్ = కొద్దిపొడవుగను, కొద్దిపొట్టిగను యున్నవారిని (దదర్శ = చూచెను).

**తాత్పర్యము** :– హనుమంతు డచ్చట చూచిన రాక్షసులు కొందరు పరిఘలను తమచేత ధరించియుండిరి. కొందరు విచిత్రమైన కవచములు ధరించి, ఎక్కువ స్థూలముగను కాక, ఎక్కువ కృశించియును గాక యుక్తమైన ఆకారముతో నున్నవారై యుండిరి.

**శ్లో॥ నాతిగౌరాన్ నాతికృష్ణాన్ నాతికుబ్జా న్న వామనాన్ ।**
**విరూపాన్ బహురూపాంశ్చ సురూపాంశ్చ సువర్చసః ॥ 19**

**పదచ్ఛేదము** :– న – అతిగౌరాన్ – న – అతికృష్ణాన్ – న – అతికుబ్జాన్ – న – వామనాన్ – విరూపాన్ – బహురూపాన్ – చ – సురూపాన్ – చ – సువర్చసః ॥

**ప్రతిపదార్థము** :– నాతిగౌరాన్ = కొద్దితెలుపుగలవారిని, నాతికృష్ణాన్ = కొద్దినలుపు (రంగు) గలవారిని, నాతికుబ్జాన్ = అంతమరుగుజ్జు కానివారిని, న వామనాన్ = మిక్కిలి పొట్టిగానివారిని, విరూపాన్ = వికృతరూపులను, బహురూపాన్ = పెక్కు వేషములు ధరించువారిని, సురూపాన్ చ = సుందరమైన రూపముగలవారిని, సువర్చసః = సుందరమైన తేజస్సుగలవారిని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతు డచ్చట కొద్ది తెల్లనివారును, కొద్ది నల్లనివారును, కొద్ది మరుగుజ్జువారును, కొద్ది పొట్టివారును, వికృతాకారములు గలవారును, వివిధ రూపములు ధరించువారును, సుందరమైన రూపముగలవారును, గొప్ప తేజస్సు గలవారునుగా, బహువిధములుగానున్న రాక్షసులను జూచెను.

**శ్లో॥ ధ్వజీన్ పతాకిన శ్చైవ దదర్శ వివిధాయుధాన్ ।**
**శక్తివృక్షాయుధాం శ్చైవ పట్టసాశనిధారిణః ॥ 20**

**పదచ్ఛేదము** :– ధ్వజీన్ – పతాకినః – చ – ఏవ – దదర్శ – వివిధాయుధాన్ – శక్తివృక్షాయుధాన్ – చ – ఏవ – పట్టసాశనిధారిణః ॥

**ప్రతిపదార్థము** :– ధ్వజీన్ = ధ్వజములుగలవారిని, పతాకినః = జెండాలుగలవారిని, వివిధాయుధాన్ = బహువిధములగు ఆయుధములు ధరించినవారిని, శక్తివృక్షా యుధాన్ = శక్తి యను ఆయుధమును, వృక్షములను కలిగియున్నవారిని, పట్టసాశని ధారిణః =పట్టిసము, అశని అను ఆయుధములను ధరించినవారిని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు ధ్వజములను, పతాకములను పూనియున్నవారిని, పలువిధములగు ఆయుధములను ధరించియున్నవారిని, శక్తి యను ఆయుధమును ధరించినవారిని, వృక్షములనే ఆయుధములుగా చేసుకొన్నవారిని పట్టిసమును, వజ్రమును ధరించినవారిని రాక్షసులను పెక్కుమందిని జూచెను.

**శ్లో॥ క్షేపణీపాశహస్తాం శ్చ దదర్శ స మహాకపిః ।**
**స్రగ్విణ స్త్వనులిప్తాం శ్చ వరాభరణభూషితాన్ ॥ 21**

**పదచ్ఛేదము** :– క్షేపణీపాశహస్తాన్ – చ – దదర్శ – సః – మహాకపిః – స్రగ్విణః –

తు – అనులిప్తాన్ – చ – వరాభరణభూషితాన్ ॥

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, క్షేపణీ పాశహస్తాన్ = భిందిపాల మను ఆయుధమును, పాశమును చేతియందు ధరించిన వారిని, స్రగ్విణః = హారములు ధరించినవారిని, అనులిప్తాన్ = సుగంధములను పూసుకొన్నవారిని, వరాభరణభూషితాన్ = శ్రేష్ఠమైన ఆభరణములతో అలంకరించు కొన్నవారిని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– ఆ హనుమంతుడు క్షేపణి, పాశము అను ఆయుధములను ధరించియున్న వారిని, వివిధములగు హారములను ధరించినవారిని, సుగంధములను పూసికొని యున్నవారిని, గొప్పవైన ఆభరణములతో అలంకరించుకొని యున్నవారిని, పెక్కుమంది రక్కసులను జూచెను.

**శ్లో॥ నానావేషసమాయుక్తాన్ యథాస్వైరగతాన్ బహూన్ ।**
**తీక్ష్ణశూలధరాం శ్చైవ వజ్రిణశ్చ మహాబలాన్ ॥ 22**

**పదచ్ఛేదము** :– నానావేషసమాయుక్తాన్ – యథాస్వైరగతాన్ –బహూన్ – తీక్ష్ణశూల ధరాన్ – చ – ఏవ – వజ్రిణః – చ – మహాబలాన్ ॥

**ప్రతిపదార్థము** :– నానావేషసమాయుక్తాన్ = బహువిధములగు వేషములతో గూడినవారిని, యథాస్వైరగతాన్ = స్వేచ్ఛగా విహరించుచున్నవారిని, తీక్ష్ణశూల ధరాన్ = వాడియైన శూలములను ధరించినవారిని, వజ్రిణః = వజ్రాయుధము ధరించియున్నవారిని, మహాబలాన్ = గొప్పదైన బలముకల్గియున్నవారిని, బహూన్ దదర్శ = పెక్కుమందిని గాంచెను.

**తాత్పర్యము** :– హనుమ అచ్చట వివిధములగు వేషములను ధరించియున్నవారిని, స్వేచ్ఛగా విహరించుచున్నవారిని, వాడియైన శూలములను, వజ్రములను ధరించిన వారిని, మహాబలాఢ్యులైనవారిని, పెక్కుమంది రక్కసులను జూచెను.

**శ్లో॥ శతసాహస్ర మవ్యగ్ర మారక్షం మధ్యమం కపిః ।**
**రక్షోధిపతినిర్దిష్టం దదర్శాంతఃపురాగ్రతః ॥ 23**

**పదచ్ఛేదము** :– శతసాహస్రమ్ – అవ్యగ్రమ్ – ఆరక్షం – మధ్యమం – కపిః – రక్షోధిపతినిర్దిష్టం – దదర్శ – అంతఃపురాగ్రతః ॥

**అన్వయక్రమము** :– కపిః, అంతఃపురాగ్రతః, రక్షోధిపతినిర్దిష్టం, మధ్యమమ్, ఆరక్షం, అవ్యగ్రం, శతసాహస్రం, దదర్శ.

**ప్రతిపదార్థము** :– కపిః = హనుమంతుడు, అంతఃపురాగ్రతః = అంతఃపుర భవనమునకు ముందుగా, రక్షోధిపతినిర్దిష్టం = రావణునిచే ఏర్పాటుచేయబడిన, అవ్యగ్రం = ఏమరుపాటులేనిదైన, శతసాహస్రం = నూరువేల సంఖ్యగల, మధ్యమం = నడుమనుండు, ఆరక్షం = సేనావిభాగమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు అంతఃపురభవనముల కెదుటనున్న మధ్యమ గుల్మమునందు, రావణాసురునిచే ఏర్పాటుచేయబడినట్టి ఏమరుపాటు లేక, జాగరూకతతో కాచుచున్నట్టి నూరువేలమంది రక్షకభటులను జూచెను.

**శ్లో॥ స తదా త ద్గృహం దృష్ట్వా మహాహాటకతోరణమ్ ।**
**రాక్షసేంద్రస్య విఖ్యాత మద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్ ॥ 24**

**శ్లో॥ పుండరీకావతంసాభిః పరిఖాభి రలంకృతమ్ ।**
**ప్రాకారావృత మత్యంతం దదర్శ స మహాకపిః ॥ 25**

**పదచ్ఛేదము** :– సః – తదా – తత్ – గృహం – దృష్ట్వా – మహాహాటకతోరణమ్ – రాక్షసేంద్రస్య – విఖ్యాతమ్ – అద్రిమూర్ధ్ని – ప్రతిష్ఠితమ్ – పుండరీకావతంసాభిః – పరిఖాభిః – అలంకృతమ్ – ప్రాకారావృతమ్ – అత్యంతం – దదర్శ – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సః, తదా, అద్రిమూర్ధ్ని ప్రతిష్ఠితమ్, తత్ గృహం దృష్ట్వా, మహాహాటకతోరణం, పుండరీకావతంసాభిః, పరిఖాభిః అలంకృతమ్, అత్యంతం, ప్రాకారావృతం, రాక్షసేంద్రస్య, తత్ విఖ్యాతం గృహం, సః, మహాకపిః (శ్రద్ధయా) దదర్శ.

**ప్రతిపదార్థము** :– తథా = అప్పుడు, సః = ఆ హనుమ, అద్రిమూర్ధ్ని = పర్వతశిఖరముపై, ప్రతిష్ఠితమ్ = నెలకొల్పబడినట్టి, తత్ గృహం = ఆ భవనమును, దృష్ట్వా = చూచి, మహాహాటకతోరణం = గొప్పదైన బంగారు బహిర్ద్వారములు కల్గియున్నట్టిదియును, పుండరీకావతంసాభిః = తామరపువ్వులను ఆభరణములుగా కల్గినట్టి, పరిఖాభిః = అగడ్తలచే, అలంకృతమ్ = అలంకరింపబడినట్టిదియును, అత్యంతం = మిక్కిలిగా, ప్రాకారావృతం = ప్రాకారములచే చుట్టబడియున్నదియునగు, రాక్షసేంద్రస్య = రావణునియొక్క, తత్ = ఆ, విఖ్యాతం = సుప్రసిద్ధమైన, గృహం = భవనమును, సః, మహాకపిః = ఆ హనుమ, (శ్రద్ధయా) దదర్శ = (శ్రద్ధతో) తిలకించెను.

**తాత్పర్యము** :– అప్పుడా హనుమ పర్వతశిఖరముపై నిర్మింపబడియున్నట్టి,

మేలిమిబంగారు సింహద్వారములతోను, తామరపువ్వులు నిండుగానున్న అగడ్తలతోను, ఉన్నతమైన గొప్ప ప్రాకారములతోడను, వైభవోపేతముగానున్న రావణాసురుని దివ్యభవనమును శ్రద్ధతో తిలకించెను.

**శ్లో॥ త్రివిష్టపనిభం దివ్యం దివ్యనాదవినాదితమ్ ।**
**వాజిహేషితసంఘుష్టం నాదితం భూషణై స్తథా ॥ 26**

**పదచ్ఛేదము** :– త్రివిష్టపనిభం – దివ్యం – దివ్యనాదవినాదితమ్ – వాజిహేషిత సంఘుష్టం – నాదితం – భూషణైః – తథా ॥

**ప్రతిపదార్థము** :– త్రివిష్టపనిభం = స్వర్గముతో సమానమైనట్టిదియును, దివ్యం = ఉజ్జ్వలమైనట్టిదియును, దివ్యనాదవినాదితమ్ = దివ్యమైన నాదముతో ప్రతిధ్వనించు చున్నదియును, వాజిహేషితసంఘుష్టం = గుఱ్ఱపు సకిలింపులచే మాఱుమ్రోగు చున్నదియును, తథా = అట్లే, భూషణైః = రాక్షసులు ధరించిన ఆభరణములచే, నాదితం = ధ్వని కలిగియున్నదియునగు, తత్ గృహం దదర్శ = ఆ రావణాసురుని గృహమును జూచెను.

**తాత్పర్యము** :– ఆ రావణుని భవనము స్వర్గతుల్యమై యుండెను. అందుండి దివ్యమైన నాదములు ప్రతిధ్వనించుచుండెను. గుఱ్ఱముల సకిలింపుల కోలాహలము వినవచ్చు చుండెను. వివిధభూషణముల ధ్వనులు వినిపించుచుండెను.

**శ్లో॥ రథై ర్యానై ర్విమానై శ్చ తథా హయగజై శ్శుభైః ।**
**వారణై శ్చ చతుర్దంతైః శ్వేతాభ్రనిచయోపమైః ॥ 27**

**శ్లో॥ భూషితం రుచిరద్వారం మత్తై శ్చ మృగపక్షిభిః ।**
**రక్షితం సుమహావీర్యై ర్యాతుధానై స్సహస్రశః ।**
**రాక్షసాధిపతే ర్గుప్త మావివేశ మహాకపిః ॥ 28**

**పదచ్ఛేదము** :– రథైః – యానైః – విమానైః – చ – తథా – హయగజైః – శుభైః – వారణైః – చ – చతుర్దంతైః – శ్వేతాభ్రనిచయోపమైః – భూషితం – రుచిరద్వారం – మత్తైః – చ – మృగపక్షిభిః – రక్షితం – సుమహావీర్యైః – యాతుధానైః – సహస్రశః – రాక్షసాధిపతేః – గుప్తమ్ – ఆవివేశ – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– మహాకపిః, రథైః యానైః విమానైశ్చ తథా, శుభైః హయగజైః, శ్వేతాభ్రనిచయోపమైః, చతుర్దంతైః వారణైశ్చ మత్తైః మృగపక్షిభిశ్చ భూషితమ్ రుచిరద్వారం, సహస్రశః, సుమహావీర్యైః యాతుధానైః, రక్షితం, రాక్షసాధిపతేః గుప్తం

తత్ గృహమ్ ఆవివేశ.

**ప్రతిపదార్థము** :- మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, రథైః = రథముల తోడను, యానైః = పల్లకీలు మున్నగు యానములతోడను, విమానైః = పుష్పకము మున్నగు విమానములతోడను, శుభైః హయగజైః = ఉత్తమములైన గుఱ్ఱములతోడను, ఏనుగులతోడను, చతుర్దంతైః = నాల్గుదంతములు కలిగినట్టి, శ్వేతాభ్రనిచయోపమైః వారణైః = తెల్లని మేఘబృందమును బోలినట్టి ఏనుగులతోడను, మత్తైః = మదించి యున్న, మృగపక్షిభిశ్చ = మృగములతోడను, పక్షులతోను, భూషితం = అలంకరింపబడి యున్నదియును, సుమహావీర్యైః = గొప్ప పరాక్రమము గల్గినట్టి, సహస్రశః యాతుధానైః = వేలకొలది రాక్షసులచే, రక్షితం = రక్షింపబడుచున్నదియును, గుప్తం = రహస్యముగ నుంచబడినదియును అగు, రాక్షసాధిపతేః = రావణాసురునియొక్క, తత్ గృహం = ఆ భవనమును, ఆవివేశ = ప్రవేశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తాత్పర్యము** :- రథములతోడను, పల్లకీలు మున్నగు వివిధ యానములతోడను, విమానములతోడను, ఉత్తమ జాతి అశ్వ గజముల తోడను, శరత్కాలమేఘములవంటి, తెల్లని, ఎత్తైన నాల్గుదంతములు గల ఏనుగులతోడను, మదించిన జంతువులతోడను, పక్షులతోడను, ఆ భవనము ఉజ్జ్వలముగా ప్రకాశించుచుండెను. మఱియు, వేలకొలది మహావీరులైన రాక్షసభటులు, అప్రమత్తులై దానిని కాచుచుండిరి. అట్టి రావణాంతః పురమును హనుమ ప్రవేశించెను.

**శ్లో॥ స హేమజాంబూనదచక్రవాళమ్**
**మహార్హముక్తామణిభూషితాంతమ్ ।**
**పరార్థ్యకాలాగరుచందనాక్తం**
**స రావణాంతఃపుర మావివేశ ॥ 29**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"లంకాపురీప్రవేశో" నామ*
*చతుర్థస్సర్గః.*

**పదచ్ఛేదము** :-స హేమజాంబూనదచక్రవాళమ్ - మహార్హ ముక్తామణిభూషితాంతమ్ - పదార్థ్యకాలాగరుచందనాక్తం - సః - రావణాంతఃపురమ్ - ఆవివేశ ॥

**ప్రతిపదార్థము :–** సహేమజాంబూనదచక్రవాళమ్ = మేలిమి బంగారు ప్రాకారములతో గూడినదియును, మహార్హ ముక్తామణి భూషితాంతమ్ = అమూల్యమైన ముత్యములతోడను, రత్నములతోను అలంకరింపబడిన లోపలి భాగములు గలదియును, పరార్థ్య కాలాగరు చందనాక్తం = శ్రేష్ఠమైన కృష్ణాగరు, శ్రీగంధము మున్నగు సుగంధజలములతో పరిమళించుచున్నదియును అగు, రావణాంతఃపురం = రావణాసురుని అంతఃపురమును, ఆవివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము :–** మేలిమిబంగారు ప్రాకారములతో గూడి అమూల్యములైన ముత్యముల తోడను, రత్నములతోడను లోపలి భాగమంతయును అలంకరింపబడి మిక్కిలి శ్రేష్ఠమైన సుగంధములతో పరిమళించుచున్న రావణాసురుని అంతఃపురమును హనుమ ప్రవేశించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"లంకాపురీ ప్రవేశము" అను*
*నాల్గవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచమసర్గ

**శ్లో॥ తత స్స మధ్యంగత మంశుమంతం**
**జ్యోత్స్నావితానం మహ దుద్వమంతమ్ ।**
**దదర్శ ధీమాన్ దివి భానుమంతం**
**గోష్ఠే వృషం మత్త మివ భ్రమంతమ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – సః – మధ్యంగతమ్ – అంశుమంతం – జ్యోత్స్నావితానం – మహత్ – ఉద్వమంతమ్ – దదర్శ – ధీమాన్ – దివి – భానుమంతం – గోష్ఠే – వృషం – మత్తమ్ – ఇవ – భ్రమంతమ్ ॥

**అన్వయక్రమము :–** తతః ధీమాన్ సః గోష్ఠే భ్రమంతం మత్తం వృషమ్ ఇవ, దివి మధ్యంగతమ్, అంశుమంతం, మహత్ జ్యోత్స్నావితానమ్ ఉద్వమంతం, భానుమంతం దదర్శ.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, ధీమాన్ = ప్రశస్తమైన బుద్ధికల, సః = ఆ హనుమ, గోష్ఠే = ఆవులమందయందు, భ్రమంతం = తిరుగాడుచున్న, మత్తం వృషమ్ ఇవ = మదించిన ఆబోతువలె, దివి = ఆకాశమున, మధ్యంగతం = నట్టనడిమికి చేరియున్నట్టియు, అంశుమంతం = ఉజ్జ్వలమైన కిరణములు కలిగినట్టియు, మహత్ = గొప్పదైన, జ్యోత్స్నావితానం = వెన్నెలల సముదాయమును, ఉద్వమంతం = వెడలగ్రక్కుచున్నట్టియు, భానుమంతం = చంద్రుని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** అంతట బుద్ధిశాలియగు హనుమంతుడు ఆకాశమధ్యమున నక్షత్రముల నడుమ, ఆవులమందలో మదించి తిరుగాడుచున్న ఆబోతువలె చూడముచ్చటగా నుండి, వెన్నెలలు విరజిమ్ముచు విరాజిల్లుచున్న చంద్రుని గాంచెను.

**శ్లో॥ లోకస్య పాపాని వినాశయంతం**
**మహోదధిం చాపి సమేధయంతమ్ ।**
**భూతాని సర్వాణి విరాజయంతం**
**దదర్శ శీతాంశు మథాభియాంతమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :- లోకస్య - పాపాని - వినాశయంతం - మహోదధిం - చ - అపి - సమేధయంతమ్, - భూతాని - సర్వాణి - విరాజయంతం - దదర్శ - శీతాంశుమ్ - అథ - అభియాంతమ్ ॥

**అన్వయక్రమము** :- (సః) అథ లోకస్య పాపాని వినాశయంతం మహోదధిం సమేధయంతం చ అపి, సర్వాణి భూతాని విరాజయంతమ్, అభియాంతం శీతాంశుం దదర్శ.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమంతుడు, అథ = పిమ్మట, లోకస్య పాపాని = లోకముయొక్క పాపములను (అనగా చీకటిరూపమై నట్టియు, తాపరూపమైనట్టియు పాపములను) వినాశయంతం = పోగొట్టుచున్నవాడును, మహోదధిం = మహాసముద్రమును, సమేధయంతం చాపి = ఉప్పొంగచేయుచున్నవాడును, సర్వాణి భూతాని = సమస్త భూతములను, అనగా పంచమహాభూతములను, విరాజయంతం = ప్రకాశింపచేయుచున్న వాడును, అభియాంతం = ఆకసముమీదికి వచ్చుచున్నవాడునగు, శీతాంశుం = చంద్రుని, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- లోకస్య పాపాని వినాశయంతం - తాపజనకములైన దుఃఖములను పోగొట్టి, ఆహ్లాదమును కలిగించుట చంద్రుని స్వభావము గదా! అతడాకాశ మధ్యమునకు వచ్చుటచే హనుమకు అంతఃపురదర్శనము సుకరమగుచున్నదని భావము.

**రామాయణ శిరోమణి** :- లోకస్య పాపాని - అనగా చౌర్యాదిక్రియలకు ఆటంకము కలిగించుచు పాపనాశకుడగుచున్నాడని భావము.

**తాత్పర్యము** :- లోకముయొక్క తాపములను పోగొట్టుచు, మహాసముద్రమును ఉప్పొంగచేయుచును, పంచమహాభూతములను ప్రకాశింపచేయుచును, ఆకాశమధ్యమునకు చేరుచున్న శీతకిరణుడగు చంద్రుని హనుమ కనుల పండువుగా చూచెను.

**శ్లో॥ యా భాతి లక్ష్మీర్భువి మందరస్థా**
**తథా ప్రదోషేషు చ సాగరస్థా ।**
**తథైవ తోయేషు చ పుష్కరస్థా**
**రరాజ సా చారునిశాకరస్థా ॥ 3**

**పదచ్ఛేదము** :– యా – భాతి – లక్ష్మీః – భువి – మందరస్థా – తథా – ప్రదోషేషు – చ – సాగరస్థా, తథా – ఏవ – తోయేషు – చ – పుష్కరస్థా – రరాజ – సా – చారునిశాకరస్థా ॥

**అన్వయక్రమము** :– భువి యా లక్ష్మీః మందర స్థా భాతి, తథా ప్రదోషేషు సాగరస్థా (భాతి), తథా ఏవ తోయేషు చ పుష్కరస్థా (భాతి) సా లక్ష్మీః చారునిశాకరస్థా రరాజ ॥

**ప్రతిపదార్థము** :– యా లక్ష్మీః = ఏ శోభ, భువి = భూలోకమున, మందరస్థా భాతి = మందరపర్వతమునం దున్నదై ప్రకాశించుచుండునో, తథా = అట్లే, ప్రదోషేషు = సాయంసమయములందు, సాగరస్థా భాతి = సముద్రమునం దున్నదై ప్రకాశించుచుండునో, తథైవ = అట్లే, తోయేషు చ = జలములందును, పుష్కరస్థా భాతి = తామరపువ్వులం దున్నదై ప్రకాశించుచుండునో, సా = ఆ శోభ, చారునిశాకరస్థా = సుందరమైన చంద్రబింబమునం దున్నదై, రరాజ = విరాజిల్లుచుండెను.

**తాత్పర్యము** :– భూమియందు మందరపర్వతమున ఏ శోభావిశేషముండునో, సాయం సమయమున మహాసముద్రమున ఏ తేజోవిశేషముండునో, అట్లే జలములందున్నట్టి కమలములందు ఏ శోభ యుండునో, అట్టి అద్భుతమగు శోభ, చంద్రునియందు అపుడు విరాజిల్లుచుండెను.

**శ్లో॥ హంసో యథా రాజతపంజరస్థః**
**సింహో యథా మందరకందరస్థః ।**
**వీరో యథా గర్వితకుంజరస్థః**
**చంద్రోఽపి బభ్రాజ తథాంబరస్థః ॥** 4

**పదచ్ఛేదము** :– హంసః – యథా – రాజతపంజరస్థః – సింహః – యథా – మందరకందరస్థః – వీరః – యథా – గర్వితకుంజరస్థః – చంద్రః – అపి – బభ్రాజ – తథా – అంబరస్థః ॥

**అన్వయక్రమము** :– హంసః యథా రాజతపంజరస్థః రాజతే, యథా సింహః మందరకందరస్థః (రాజతే,) యథా వీరః గర్వితకుంజరస్థః రాజతే, తథా చంద్రః అపి అంబరస్థః (సన్) బభ్రాజ.

**ప్రతిపదార్థము** :– హంసః = రాజహంస, యథా = ఏరీతిగా, రాజతపంజరస్థః = వెండిపంజరమునందున్నదై (రాజతే=విరాజిల్లుచున్నదో), యథా = ఏరీతిగా, సింహః = సింహము, మందరకందరస్థః = మందరగుహయందున్నదై (రాజతే = విరాజిల్లునో) యథా = ఏరీతిగా, వీరః = వీరుడు, గర్వితకుంజరస్థః = మదించిన ఏనుగు నారోహించి,

(రాజతే = విరాజిల్లునో), తథా = ఆరీతిగనే, చంద్రః అపి = చంద్రుడుగూడ, అంబరస్థః (సన్) = ఆకాశమున నిలచినవాడై, బభ్రాజ = తేజరిల్లు చుండెను.

**తాత్పర్యము** :- రజతపంజరమునందున్న తెల్లని హంస ఎట్లు ప్రకాశించునో, మందరగిరి యొక్క గుహయందున్న సింహ మెట్లు విరాజిల్లుచుండునో, మదించిన ఏనుగుపై నారోహించినట్టి మహావీరు డెట్లు ప్రకాశించుచుండునో, అట్లే విశాలాకాశమధ్యమున చంద్రుడుగూడ అపుడు మహాశోభతో విరాజిల్లుచుండెను.

**శ్లో॥ స్థితః కకుద్మానివ తీక్ష్ణశృంగో**
**మహాచల శ్శ్వేత ఇ వోచ్చశృంగః ।**
**హస్తీవ జాంబూనదబద్ధశృంగః**
**రరాజ చంద్రః పరిపూర్ణశృంగః ॥ 5**

**పదచ్ఛేదము** :- స్థితః - కకుద్మాన్ - ఇవ - తీక్ష్ణశృంగః - మహాచలః - శ్వేతః - ఇవ - ఉచ్చశృంగః - హస్తీ - ఇవ - జాంబూనదబద్ధశృంగః - రరాజ - చంద్రః - పరిపూర్ణశృంగః ॥

**అన్వయక్రమము** :- స్థితః తీక్ష్ణశృంగః కకుద్మాన్ ఇవ, ఉచ్చశృంగః శ్వేతః మహాచలః ఇవ, జాంబూనదబద్ధశృంగః హస్తీ ఇవ, పరిపూర్ణశృంగః చంద్రః రరాజ.

**ప్రతిపదార్థము** :- స్థితః = నిలచియున్నట్టి, తీక్ష్ణశృంగః = వాడియైన కొమ్ములుగల, కకుద్మాన్ ఇవ = ఆబోతువలెను, ఉచ్చశృంగః = ఉన్నతమైన శిఖరములుగల, శ్వేతః మహాచలః ఇవ = తెల్లని మహాపర్వతమువలెను, జాంబూనదబద్ధశృంగః = బంగారు తొడుగులచే కట్టబడిన దంతములు కలిగినట్టి, హస్తీ ఇవ = మదపుటేనుగువలెను, పరిపూర్ణశృంగః = నిండుగ నున్నట్టి కొనలుగలవా డయిన, చంద్రః = చంద్రుడు, రరాజ = విరాజిల్లుచుండెను.

**తాత్పర్యము** :- వాడియైన కొమ్ములతో నిలువబడియున్న ఆబోతువలెను, ఉన్నతమైన శిఖరములతో ప్రకాశించు కైలాసపర్వతమువలెను, బంగారు తొడుగులతో కూడిన దంతములుగల మదగజమువలెను, స్ఫుటముగనున్న కొనలతో ప్రకాశించుచున్న చంద్రుడు కడుదర్శనీయుడై విరాజిల్లుచుండెను.

**శ్లో॥ వినష్టశీతాంబుతుషారపంకో**
**మహాగ్రహగ్రాహవినష్టపంకః ।**
**ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకో**
**రరాజ చంద్రో భగవాన్ శశాంకః ॥ 6**

**పదచ్ఛేదము** :- వినష్టశీతాంబుతుషారపంకః - మహాగ్రహగ్రాహవినష్టపంకః - ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకః - రరాజ - చంద్రః - భగవాన్ - శశాంకః ॥

**ప్రతిపదార్థము** :- వినష్టశీతాంబుతుషారపంకః = నశించినట్టి మంచునీటి బిందువులనెడి పంకము గలవాడును, మహాగ్రహగ్రాహవినష్టపంకః = మహాగ్రహమైన సూర్యునినుండి కిరణములను గ్రహించుటచే నశించిన చీకటిగలవాడును, ప్రకాశలక్ష్మ్యాశ్రయనిర్మలాంకః =ప్రకాశించుచున్న శోభకు ఆశ్రయమైనందున స్పష్టముగ గానవచ్చుచున్నట్టి మచ్చ గలవాడును, భగవాన్ = మహాప్రభావశాలియు (నగు), శశాంకః చంద్రః = శశిధరుడైన చంద్రుడు, రరాజ = విరాజిల్లుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- వినష్టశీతాంబుతుషారపంకః - హిమాలయపర్వతము మిక్కిలి దూరము నందుండుటచే, లంకలో మంచుబిందు సంపర్కము తక్కువగా నుండెనని భావము.

**గోవిందరాజీయము** :- మహాగ్రహగ్రాహవినష్టపంకః = మహాగ్రహములైన శుక్ర బృహస్పతులను ఆచ్ఛాదించి, తాను నిర్మలముగా ప్రకాశించుచున్నాడని భావము.

"సలిలసమే శశిని రవేః దీధితయః మూర్ఛితాః తమో నైశమ్; క్షపయంతి దర్పణోదరనిహితా ఇవ మందిర స్యాన్తః" అని వరాహమిహిరుడు చెప్పెను. అనగా చంద్రుడు జలసమానుడు. అందు సూర్యకిరణములు పడి, ప్రతిఫలించినవై రాత్రికాలము చీకటిని పోగొట్టుచున్నవి. ఎట్లనగా, అద్దముపైబడిన సూర్యునియొక్క ప్రతిబింబము చీకటిగదిలోనికి వెలుగునొసగుచున్నట్లని భావము.

**తాత్పర్యము** :- మంచునీటి మాలిన్యమును నశింపచేసిన వాడును, సూర్యుని కిరణములను గ్రహించి చీకటిని అణచినవాడును, ఉజ్జ్వలమైన తన శోభచే, తన మచ్చ యను దోషమును పోగొట్టుకొన్నవాడును, అగు చంద్రభగవాను డాకాశమున కడు సుందరముగ వెల్గుచుండెను.

**శ్లో॥ శిలాతలం ప్రాప్య యథా మృగేంద్రో**
**మహారణం ప్రాప్య యథా గజేంద్రః ।**
**రాజ్యం సమాసాద్య యథా నరేంద్రః**
**తథా ప్రకాశో విరరాజ చంద్రః ॥** **7**

**పదచ్ఛేదము** :- శిలాతలం - ప్రాప్య - యథా - మృగేంద్రః - మహారణం - ప్రాప్య - యథా - గజేంద్రః - రాజ్యం - సమాసాద్య - యథా - నరేంద్రః - తథా -

ప్రకాశః - విరరాజ - చంద్రః ॥

**అన్వయక్రమము** :- యథా మృగేంద్రః శిలాతలం ప్రాప్య (రాజతే), గజేంద్రః మహారణం ప్రాప్య యథా (రాజతే), నరేంద్రః రాజ్యం సమాసాద్య యథా (రాజతే), తథా ప్రకాశః చంద్రః విరరాజ.

**ప్రతిపదార్థము** :- మృగేంద్రః = మృగరాజైన సింహము, శిలాతలం = (తన గుహకు ముందుగా నున్న) విశాలమైన శిలను, ప్రాప్య = చేరి, యథా (రాజతే) = ఎట్లు ప్రకాశించునో, గజేంద్రః = మదించినట్టి ఏనుగు, మహారణం ప్రాప్య = గొప్ప సమర రంగమును చేరి, యథా (రాజతే) = ఎట్లు ప్రకాశించునో, నరేంద్రః = మహారాజు, రాజ్యం సమాసాద్య = రాజ్యమును పొంది, యథా (రాజతే) = ఎట్లు ప్రకాశించునో, తథా = ఆ ప్రకారముగనే, ప్రకాశః చంద్రః = గొప్ప ప్రకాశము కల్గియున్నట్టి చంద్రుడు, విరరాజ = మిక్కిలిగా తేజరిల్లుచుండెను.

**తాత్పర్యము** :- తనగుహకు ముందున్న శిలాతలమును అధివసించియున్న మృగేంద్రము వలెను, రణరంగమును చేరిన గజరాజువలెను, తన రాజ్యమును సంపాదించుకొన్న భూపతివలెను, ప్రకాశమునకు నిలయమైన చంద్రుడు మిక్కిలిగా విరాజిల్లుచుండెను.

**శ్లో॥ ప్రకాశచంద్రోదయనష్టదోషః**
**ప్రవృత్తరక్షఃపిశితాశదోషః ।**
**రామాభిరామేరితచిత్తదోషః**
**స్వర్గప్రకాశో భగవాన్ ప్రదోషః ॥** 8

**పదచ్ఛేదము** :- ప్రకాశచంద్రోదయనష్టదోషః -ప్రవృత్తరక్షఃపిశితాశదోషః - రామాభిరామేరితచిత్తదోషః - స్వర్గప్రకాశః - భగవాన్ - ప్రదోషః ॥

**ప్రతిపదార్థము** :- ప్రకాశచంద్రోదయనష్టదోషః = గొప్ప ప్రకాశము గల్గిన చంద్రుని యొక్క ఉదయముచే నశించినట్టి చీకటి గలదియును, ప్రవృత్తరక్షఃపిశితాశదోషః = మొదలు పెట్టబడిన రాక్షసుల మాంసాహారరూపమైన పాపము గలదియును, రామాభి రామేరితచిత్తదోషః = యువతులందును, ప్రియులందును వృద్ధినొందింపబడిన మనస్సునందలి కామముగలదియును, స్వర్గప్రకాశః = స్వర్గతేజస్సువంటి ప్రకాశముగల, భగవాన్ ప్రదోషః = పూజ్యమైనట్టి ఆ ప్రదోషకాలము, విరరాజ = మిక్కిలి ప్రకాశించెను.

**తాత్పర్యము** :- ఉజ్జ్వలమైన చంద్రుని ప్రకాశముచే అంధకారమును పోగొట్టియు, రాక్షసులకు మాంసభక్షణమునకు సమయమును సమకూర్చియు, కాముకుల మనస్సునందు కామము ప్రజ్వలింపజేసియు, స్వర్గశోభవలె ఆ ప్రదోషసమయము

గొప్ప ఆనందమును గలిగించుచు ప్రకాశించుచుండెను.

**శ్లో॥ తంత్రీస్వనాః కర్ణసుఖాః ప్రవృత్తాః**
**స్వపంతి నార్యః పతిభి స్సువృత్తాః ।**
**నక్తంచరా శ్చాపి తథా ప్రవృత్తాః**
**విహర్తు మత్యద్భుతరౌద్రవృత్తాః ॥ 9**

**పదచ్ఛేదము** :– తంత్రీస్వనాః – కర్ణసుఖాః – ప్రవృత్తాః – స్వపంతి – నార్యః – పతిభిః – సువృత్తాః – నక్తంచరాః – చ – అపి – తథా – ప్రవృత్తాః – విహర్తుమ్ – అత్యద్భుతరౌద్రవృత్తాః ॥

**అన్వయక్రమము** :– కర్ణసుఖాః, తంత్రీస్వనాః, ప్రవృత్తాః; సువృత్తాః, నార్యః, పతిభిః స్వపంతి; తథా నక్తంచరాః చ అపి అత్యద్భుతరౌద్రవృత్తాః (సంతః) విహర్తుం ప్రవృత్తాః ॥

**ప్రతిపదార్థము** :– కర్ణసుఖాః = చెవికి ఇంపయినట్టి, తంత్రీస్వనాః = (వీణ మున్నగు వానియొక్క) తీగలధ్వనులు, ప్రవృత్తాః = ప్రవర్తిల్లుచుండెను; సువృత్తాః నార్యః = పతివ్రతలైన స్త్రీలు, పతిభిః స్వపంతి = భర్తలతో నిద్రించుచుండిరి; తథా = అట్లే, నక్తంచరాః చ అపి = నిశాచరులు గూడ, అత్యద్భుతరౌద్రవృత్తాః (సంతః) = మిక్కిలి ఆశ్చర్యకరమైన ఉగ్రవర్తనములు గలవారై, విహర్తుం ప్రవృత్తాః = విహరింపదొడగిరి.

**తాత్పర్యము** :– వీణాదివాద్యములయొక్క తంత్రుల నాదము రమ్యముగా వినవచ్చు చుండెను. ఉత్తమచరిత్రలైన స్త్రీలు తమ భర్తలతో సుఖముగ నిద్రించుచుండిరి. నిశాచరులైన రక్కసులు మహాభయంకరమైన వర్తనముతో స్వేచ్ఛగా విహరింపసాగిరి.

**శ్లో॥ మత్తప్రమత్తాని సమాకులాని**
**రథాశ్వభద్రాసనసంకులాని ।**
**వీరశ్రియా చాపి సమాకులాని**
**దదర్శ ధీమాన్ స కపిః కులాని ॥ 10**

**పదచ్ఛేదము** :– మత్తప్రమత్తాని – సమాకులాని – రథాశ్వభద్రాసనసంకులాని – వీరశ్రియా – చ – అపి – సమాకులాని – దదర్శ – ధీమాన్ – సః – కపిః – కులాని ॥

**అన్వయక్రమము** :– ధీమాన్ సః కపిః, మత్తప్రమత్తాని, సమాకులాని, రథాశ్వభద్రాసన సంకులాని, వీరశ్రియా చ అపి సమాకులాని, కులాని, దదర్శ.

**ప్రతిపదార్థము :–** ధీమాన్ సః కపిః = మహాప్రాజ్ఞుడైన యా హనుమ, మత్తప్రమత్తాని = మదించియు మైమరచియునున్న జనులు గలవియును, సమాకులాని = కోలాహలముతో కూడినవియును, రథాశ్వభద్రాసనసంకులాని = రథములతోడను, గుఱ్ఱములతోడను, బంగారు సింహాసనములతోడను నిండియున్నవియును, వీరశ్రియా చ అపి = వీరుల యొక్క వైభవముతోగూడ, సమాకులాని = నిండియున్నవియునగు, కులాని = గృహములను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మత్తప్రమత్తాని = ఐశ్వర్యాదులచే మత్తులును, మద్యాదిపానములచే ప్రమత్తులును అని భావము.

**రామాయణ శిరోమణి :–** సమాకులాని కులాని – ఒకదానితో నొకటి కలసిపోయి యున్నట్టి గృహములు.

**తాత్పర్యము :–** ఐశ్వర్యముచే మత్తులును, మద్యపానముచే ప్రమత్తులును అగు జనులచే నిండియున్నవియును, రథములు, అశ్వములు, సువర్ణసింహాసనములు మున్నగువానితో కోలాహలముగ నున్నవియును, వీరపురుషుల వైభవముతో నిండియున్నవియును అగు లంకయందలి భవనములను బుద్ధిశాలియైన హనుమంతుడు శ్రద్ధగా విలోకించు చుండెను.

**శ్లో॥ పరస్పరం చాధిక మాక్షిపంతి**
**భుజాం శ్చ పీనా నధికం క్షిపంతి ।**
**మత్తప్రలాపా నధికం క్షిపంతి**
**మత్తాని చాన్యోన్య మధిక్షిపంతి ॥ 11**

**పదచ్ఛేదము :–** పరస్పరం – చ – అధికమ్ – ఆక్షిపంతి – భుజాన్ – చ – పీనాన్ – అధికం – క్షిపంతి –మత్తప్రలాపాన్ – అధికం – క్షిపంతి – మత్తాని – చ – అన్యోన్యమ్ – అధిక్షిపంతి ॥

**అన్వయక్రమము :–** పరస్పరమ్ అధికమ్ ఆక్షిపంతి, పీనాన్ భుజాన్ అధికం క్షిపంతి, మత్తప్రలాపాన్ అధికం క్షిపంతి, మత్తాని చ అన్యోన్యమ్ అధిక్షిపంతి రక్షాంసి దదర్శ.

**ప్రతిపదార్థము :–** పరస్పరం = ఒండొరులను, అధికం = తీవ్రముగా, ఆక్షిపంతి చ = తమవైపునకు లాగుకొనుచున్న వారును, పీనాన్ భుజాన్ = బలసియున్న తమ బాహువులను, అధికం = మిక్కిలిగా, క్షిపంతి = (ప్రక్కవారిపై) పడవేయుచున్న వారును,

మత్తప్రలాపాన్ = ఒడలెరుంగని ప్రలాపములను, అధికం = హెచ్చుగా, క్షిపంతి = ఒరులను గూర్చి చేయుచున్నవారును, మత్తాని = మదించినవారై, అన్యోన్యం = ఒకరినొకరు, అధిక్షిపంతి = అధిక్షేపములు చేయుచున్నవారును అగు, రక్షాంసి = రాక్షసులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– అచ్చటి రాక్షసులు మదించినవారై ఒకరినొకరు లాగికొనుచుండిరి. బలసియున్న తమ బాహువులను తమ ప్రక్కవారిపై పడవేయుచుండిరి. ఒడలెరుంగ కుండగ ఇతరులను అధికముగా నిందించుచుండిరి. మదించినవారై ఒకరినొకరు తిరస్కరించుకొనుచుండిరి.

**శ్లో॥ రక్షాంసి వక్షాంసి చ విక్షిపంతి**
**గాత్రాణి కాంతాసు చ విక్షిపంతి ।**
**రూపాణి చిత్రాణి చ విక్షిపంతి**
**దృఢాని చాపాని చ విక్షిపంతి ॥ 12**

**పదచ్ఛేదము** :– రక్షాంసి – వక్షాంసి – చ – విక్షిపంతి – గాత్రాణి – కాంతాసు – చ – విక్షిపంతి – రూపాణి – చిత్రాణి – చ – విక్షిపంతి – దృఢాని – చాపాని – చ – విక్షిపంతి ॥

**అన్వయక్రమము** :– కాంతాసు వక్షాంసి చ విక్షిపంతి, గాత్రాణి చ విక్షిపంతి, చిత్రాణి రూపాణి చ విక్షిపంతి, దృఢాని చాపాని చ విక్షిపంతి, రక్షాంసి దదర్శ.

**ప్రతిపదార్థము** :– కాంతాసు = స్త్రీలపై, వక్షాంసి చ = (తమ) రొమ్ములనుగూడ, విక్షిపంతి = పడవేయుచున్నవారును, గాత్రాణి చ = తమ శరీరములనుగూడ, విక్షిపంతి = పడవేయుచున్నవారును, చిత్రాణి రూపాణి చ = వివిధములైన చిత్రరూపములను గూడ, విక్షిపంతి = (హఠాత్తుగా) ధరించుచున్నవారును, దృఢాని చాపాని చ = బలమైన ధనుస్సులను గూడ, విక్షిపంతి = మోపెట్టుచున్నవారును అగు, రక్షాంసి = రాక్షసులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– ప్రక్కనున్న స్త్రీలపై తమ రొమ్ములను పడవేయుచున్నవారును, అట్లే వారిపై తమ శరీరములను సైతము పడవేయు చున్నవారును, పెక్కు చిత్రరూపములను ధరించుచున్నవారును, బలమైన విండ్లను మోపెట్టుచున్న వారు నగు రాక్షసులను హనుమ చూచెను.

**శ్లో॥ దదర్శ కాంతా శ్చ సమాలభంత్యః**
**తథా ఽ పరా స్తత్ర పున స్స్వపంత్యః ।**
**సురూపవక్త్రాశ్చ తథా హసంత్యః**
**క్రుద్ధాః పరా శ్చాపి వినిశ్శ్వసంత్యః ॥ 13**

**పదచ్ఛేదము :-** దదర్శ - కాంతాః - చ - సమాలభంత్యః - తథా - అపరాః - తత్ర - పునః - స్వపంత్యః - సురూపవక్త్రాః - చ - తథా -హసంత్యః - క్రుద్ధాః - పరాః - చ - అపి - వినిశ్శ్వసంత్యః ॥

**అన్వయక్రమము :-** సమాలభంత్యః, తథా తత్ర పునః స్వపంత్యః, అపరాః, సురూపవక్త్రాశ్చ, తథా హసంత్యః, క్రుద్ధాః, వినిశ్శ్వసంత్యః అపి పరాశ్చ, కాంతాః దదర్శ.

**ప్రతిపదార్థము :-** సమాలభంత్యః = ఒడలిపై చందనాది సుగంధములను పూసికొనుచున్నట్టివారును, తథా = అట్లే, తత్ర = ఆ భవనములందు, పునః = తిరిగి, స్వపంత్యః = నిద్రించుచున్నట్టివారునగు, అపరాః = మరికొందరిని, సురూపవక్త్రాః చ = సుందరమైన ముఖములు గలవారిని, తథా = అట్లే, హసంత్యః = నవ్వుచున్నట్టివారిని, క్రుద్ధాః = కోపించియున్నట్టివారిని, వినిశ్శ్వసంత్యః = నిట్టూర్పులు విడుచుచున్నట్టి వారైన, పరాః కాంతాశ్చాపి = మరికొంతమంది స్త్రీలను గూడ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :-** ఆ లంకయందు హనుమంతుడు, ఒడలి నిండుగా చందనము మున్నగు సుగంధలేపములను పూసికొనుచున్నవారును, నిద్రపోవుచున్నట్టివారును, సుందరమైన రూపము ముఖము కలిగియున్న వారును, నవ్వుమొగముతో నున్నవారును కోపించియున్నవారును, నిట్టూర్పులు విడుచుచున్నవారును అగు వివిధరీతులలో నున్న పెక్కుమంది వనితలను గాంచెను.

**శ్లో॥ మహాగజై శ్చాపి తథా నదద్భిః**
**సుపూజితైశ్చాపి తథా సుసద్భిః ।**
**రరాజ వీరై శ్చ వినిశ్శ్వసద్భిః**
**హ్రదో భుజంగై రివ నిశ్శ్వసద్భిః ॥ 14**

**పదచ్ఛేదము :-** మహాగజైః - చ - అపి - తథా - నదద్భిః - సుపూజితైః - చ - అపి - తథా - సుసద్భిః - రరాజ - వీరైః - చ - వినిశ్శ్వసద్భిః - హ్రదః - భుజంగైః - ఇవ - నిశ్శ్వసద్భిః ॥

**అన్వయక్రమము :–** తథా – నదద్భిః, మహాగజైః చ అపి, తథా సుపూజితైః సుసద్భిః చాపి, నిశ్శ్వసద్భిః భుజంగైః హ్రదః ఇవ, నిశ్శ్వసద్భిః వీరైః చ రరాజ.

**ప్రతిపదార్థము :–** తథా = అట్లే, నదద్భిః = ఘీంకారములు చేయుచున్న, మహాగజైః చ అపి = మదగజములచేతను, తథా = అట్లే, సుపూజితైః = చక్కగా గౌరవింపబడిన, సుసద్భిః = ఉత్తములగు సత్పురుషులతోడను, నిశ్శ్వసద్భిః = బుసలుకొట్టుచున్న, భుజంగైః = సర్పములచే, హ్రదః ఇవ = మడుగువలె, వినిశ్శ్వసద్భిః = నిట్టూర్పులు విడుచుచున్న, వీరైః = శూరులచే, (సా నగరీ = ఆ లంకానగరము), రరాజ = విరాజిల్లుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సుసద్భిః – ఉత్తమపురుషులచే. ఇక్కడ సత్‌పురుషులనగా విభీషణాదులు.

**గోవిందరాజీయము :–** వినిశ్శ్వసద్భిః = యుద్ధము చేయుటకు తమకు తగిన ప్రతివీరులు లేకుండుటచే వారు నిట్టూర్పులు విడుచుచున్నారని భావము.

**తాత్పర్యము :–** ఆ లంకానగరము ఘీంకారములు చేయుచున్న మదపుటేనుగులతోడను, మిక్కిలిగా గౌరవింపబడిన విభీషణాది సత్పురుషులచేతను, ఎదురుగా నిలచి పోరాడుటకై తమకు తగినట్టి ప్రతివీరుడు లేకపోవుటచే బుసలు కొట్టుచున్న మడుగులోని సర్పములవలె నిట్టూర్పులు విడుచుచున్నట్టి రాక్షసవీరులచేతను, ఎంతయో ప్రకాశించుచుండెను.

**శ్లో॥ బుద్ధిప్రధానాన్ రుచిరాభిధానాన్**
**సంశ్రద్దధానాన్ జగతః ప్రధానాన్ ।**
**నానావిధానాన్ రుచిరాభిధానాన్**
**దదర్శ తస్యాం పురి యాతుధానాన్ ॥** **15**

**పదచ్ఛేదము :–** బుద్ధిప్రధానాన్ – రుచిరాభిధానాన్ – సంశ్రద్దధానాన్ – జగతః – ప్రధానాన్ – నానావిధానాన్ – రుచిరాభిధానాన్ – దదర్శ – తస్యాం – పురి – యాతుధానాన్ ॥

**అన్వయక్రమము :–** తస్యాం పురి బుద్ధిప్రధానాన్, సంశ్రద్దధానాన్, జగతః ప్రధానాన్ రుచిరాభిధానాన్, నానావిధానాన్, యాతుధానాన్ దదర్శ.

**ప్రతిపదార్థము :–** తస్యాం పురి = ఆ లంకానగరమునందు, బుద్ధిప్రధానాన్ = గొప్ప ప్రజ్ఞావంతులును, రుచిరాభిధానాన్ = రమ్యముగ మాటలాడునట్టివారును,

సంశ్రద్దధానాన్ = వేదశాస్త్రములందు శ్రద్ధగలవారును, జగతః ప్రధానాన్ = లోకమున ముఖ్యులైనవారును, రుచిరాభిధానాన్ = సుందరమైన పేర్లుగలవారును అగు, నానావిధానాన్ = బహువిధములైనట్టి ఆకారములుగల, యాతుధానాన్ = రక్కసులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతుడా లంకయందు గొప్పబుద్ధిశాలులును, సుందరమైన భూషణములు గలవారును, ఆస్తిక్యబుద్ధిగలవారును, లోకమునందు ప్రసిద్ధులై యున్నవారును, బహువిధములైన ఆకారములు గలవారును, సుందరమైన నామధేయములు గలవారునగు బహువిధములైన రాక్షసులను జూచెను.

**శ్లో॥ ననంద దృష్ట్వా స చ తాన్ సురూపాన్**
**నానాగుణా నాత్మగుణానురూపాన్ ।**
**విద్యోతమానాన్ స తదాஉనురూపాన్**
**దదర్శ కాంశ్చి చ్చ పున ర్విరూపాన్ ॥ 16**

**పదచ్ఛేదము** :– ననంద – దృష్ట్వా – సః – చ – తాన్ – సురూపాన్ – నానాగుణాన్ – ఆత్మగుణానురూపాన్ – విద్యోతమానాన్ – సః – తదా – అనురూపాన్ – దదర్శ – కాన్ – చిత్ – చ – పునః – విరూపాన్ ॥

**అన్వయక్రమము** :– సః సురూపాన్ నానాగుణాన్, ఆత్మగుణానురూపాన్ తాన్ దృష్ట్వా ననంద. తదా సః పునః విద్యోతమానాన్, అనురూపాన్ కాంశ్చిత్ విరూపాన్ చ దదర్శ.

**ప్రతిపదార్థము** :– సః = ఆ హనుమంతుడు, సురూపాన్ = సుందరమైన రూపము గలవారును, నానాగుణాన్ = పెక్కు సద్గుణములు గలవారును, ఆత్మగుణానురూపాన్ = తమ గుణములకు అనుకూలమైనట్టి వైఖరి గలవారును అగు, తాన్ = ఆ రాక్షసులను (కొంతమందిని), దృష్ట్వా = చూచి, ననంద = ఆనందించెను. తదా = అప్పుడు, సః = ఆ హనుమంతుడు, పునః = తిరిగి, విద్యోతమానాన్ = వెల వెల బోవుచున్న వారును, అనురూపాన్ = వికృతరూపమునకు తగిన అవగుణములు గలవారును, విరూపాన్ = వికృతమైన ఆకారము గలవారునగు, కాంశ్చిచ్చ = మరికొందరిని గూడ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు సుందరమైన రూపములు గుణములును కలిగి తమ కనుగుణమైన రూపముతో నున్నవారిని కొందరిని చూచి ఆనందించెను. మరల అచ్చటనే వికారమైన తమ రూపమునకు తగిన అవగుణములు కలిగియున్న

రక్కసులను మరికొందరిని కూడ చూచెను.

**శ్లో॥ తతో వరార్హా స్సువిశుద్ధభావాః**
**తేషాం స్త్రియ స్తత్ర మహానుభావాః ।**
**ప్రియేషు పానేషు చ సక్తభావాః**
**దదర్శ తారా ఇవ సుప్రభావాః ॥ 17**

**పదచ్ఛేదము** :– తతః – వరార్హాః – సువిశుద్ధభావాః – తేషాం – స్త్రియః – తత్ర – మహానుభావాః – ప్రియేషు – పానేషు – చ – సక్తభావాః – దదర్శ – తారాః – ఇవ – సుప్రభావాః ॥

**అన్వయక్రమము** :– తతః వరార్హాః, సువిశుద్ధభావాః, మహానుభావాః, ప్రియేషు పానేషు చ సక్తభావాః తారాః ఇవ సుప్రభావాః తేషాం స్త్రియః తత్ర దదర్శ.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, తత్ర = ఆ భవనమునందు, వరార్హాః = పరమపతివ్రతలును, సువిశుద్ధభావాః = మిక్కిలి పవిత్రమైన ఆలోచనలు గలవారును, మహానుభావాః = ఉన్నతమైన ఆశయములు గలవారును, ప్రియేషు = భర్తలయందును, పానేషు = మద్యపానములందును, సక్తభావాః = లగ్నమైన మనస్సు గలవారును, తారాః ఇవ = నక్షత్రములవలె, సుప్రభావాః = గొప్పతేజస్సు గలవారునగు, తేషాం స్త్రియః = ఆ రాక్షసులయొక్క భార్యలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– పిమ్మట హనుమంతుడచ్చట శ్రేష్ఠమైన ఆభరణములతో సుందరమైన దేహములు గలవారును, పాతివ్రత్యప్రభావము గలవారును, ప్రియులయందును, పానీయములందును గాఢమైన అనురాగము గలవారును, నక్షత్రములవలె గొప్ప తేజస్సు గలవారును అగు రాక్షసస్త్రీలను గాంచెను.

**శ్లో॥ శ్రియా జ్వలంతీ స్త్రపయోపగూఢాః**
**నిశీథకాలే రమణోపగూఢాః ।**
**దదర్శ కాశ్చి త్ప్రమదోపగూఢాః**
**యథా విహంగాః కుసుమోపగూఢాః ॥ 18**

**పదచ్ఛేదము** :– శ్రియా – జ్వలంతీః – త్రపయా – ఉపగూఢాః – నిశీథకాలే – రమణోపగూఢాః – దదర్శ – కాః – చిత్ – ప్రమదోపగూఢాః – యథా – విహంగాః – కుసుమోపగూఢాః ॥

**అన్వయక్రమము** :– నిశీథకాలే శ్రియా జ్వలంతీః, త్రపయా ఉపగూఢాః రమణోప

గూఢాః ప్రమదోపగూఢాః విహంగాః యథా కుసుమోపగూఢాః కాశ్చిత్ దదర్శ.

**ప్రతిపదార్థము** :- నిశీథకాలే = రాత్రి సమయమున, త్రపయా ఉపగూఢాః = సిగ్గుచే ఆవరింపబడినవారును, రమణోపగూఢాః = ప్రియులచే కౌగిలింపబడిన వారును, ప్రమదోపగూఢాః = స్త్రీలచేత కౌగిలింపబడి యున్నవారును, కుసుమోపగూఢాః = పువ్వులచే కప్పివేయబడిన, విహంగాః యథా = పక్షులవలె, శ్రియా జ్వలంతీః = సౌందర్యముచే ప్రకాశించువారును అగు, కాశ్చిత్ = కొంతమంది రాక్షసవనితలను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ప్రమదోపగూఢాః - సంతోషముతో నిండినవారు, యథా విహంగాః కుసుమోపగూఢాః - ఉన్నతమైన మేడలపై నున్న ఆ స్త్రీలను పక్షులతో పోల్చుట ఉచితమే గదా!

**తాత్పర్యము** :- హనుమంతుడా నిశీథసమయమున సిగ్గుచే కుంచించుకొని యున్న వారును, భర్తలచే కౌగిలింపబడియున్న వారును, స్త్రీలచే కౌగిలింపబడి యున్నవారును, పువ్వులచే కప్పబడిన పక్షులవలె నున్నవారును, తమ శరీరశోభతో వెలుగొందు వారును అగు మఱికొద్దిమంది స్త్రీలను జూచెను.

**శ్లో॥ అన్యాః పున ర్హర్మ్యతలోపవిష్టాః**
**తత్ర ప్రియాంకేషు సుఖోపవిష్టాః ।**
**భర్తుః ప్రియా ధర్మపరా నివిష్టాః**
**దదర్శ ధీమాన్ మదనాభివిష్టాః ॥ 19**

**పదచ్ఛేదము** :- అన్యాః - పునః - హర్మ్యతలోపవిష్టాః - తత్ర - ప్రియాంకేషు - సుఖోపవిష్టాః - భర్తుః - ప్రియాః - ధర్మపరాః - నివిష్టాః - దదర్శ - ధీమాన్ - మదనాభివిష్టాః ॥

**అన్వయక్రమము** :- ధీమాన్ (సః) తత్ర పునః హర్మ్యతలోపవిష్టాః, ప్రియాంకేషు సుఖోపవిష్టాః భర్తుః ప్రియాః, ధర్మపరాః, మదనాభివిష్టాః, నివిష్టాః, అన్యాః దదర్శ.

**ప్రతిపదార్థము** :- ధీమాన్ (సః) = ప్రాజ్ఞుడైన యా హనుమ, తత్ర = ఆ యంతఃపురము నందు, పునః = తిరిగి, హర్మ్యతలోపవిష్టాః = సౌధప్రదేశమున కూర్చుండి యున్నవారును, ప్రియాంకేషు = భర్తల ఒడిలో, సుఖోపవిష్టాః = సుఖముగా విశ్రమించి యున్నవారును, భర్తుః ప్రియాః = భర్తకు ప్రియురాండ్రైయున్న వారును, ధర్మపరాః =

ధర్మతత్పరులై యున్నవారును, మదనాభివిష్టాః = మన్మథోద్రేకము గలవారును, నివిష్టాః = శాస్త్రీయముగ వివాహితులైనవారును అగు, అన్యాః = ఇతరస్త్రీలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతుడచ్చట సౌధోపరిభాగమునందు కూర్చుండియున్న వారును, భర్త ఒడిలో సుఖముగా విశ్రమించి యున్నవారును, భర్తమనస్సును చూరగొన్నవారును, ధర్మతత్పరత గలవారును, మన్మథోద్రేకము కలిగి యున్నవారును శాస్త్రీయముగ పాణిగృహీతలయి యున్నవారును అగు మరికొంత మంది స్త్రీలను గాంచెను.

**శ్లో॥ అప్రావృతాః కాంచనరాజివర్ణాః**
**కాశ్చి త్పరార్ధ్యా స్తపనీయవర్ణాః ।**
**పున శ్చ కాశ్చి చ్ఛశలక్ష్మవర్ణాః**
**కాంతప్రహీణా రుచిరాంగవర్ణాః ॥ 20**

**శ్లో॥ తతః ప్రియాన్ ప్రాప్య మనోభిరామాః**
**సుప్రీతియుక్తాః ప్రసమీక్ష్య రామాః ।**
**గృహేషు హృష్టాః పరమాభిరామాః**
**హరిప్రవీర స్స దదర్శ రామాః ॥ 21**

**పదచ్ఛేదము** :– అప్రావృతాః – కాంచనరాజివర్ణాః – కాః చిత్ – పరార్ధ్యాః – తపనీయవర్ణాః – పునః – కాః – చిత్ – శశలక్ష్మవర్ణాః – కాంతప్రహీణాః – రుచిరాంగవర్ణాః – తతః – ప్రియాన్ – ప్రాప్య – మనోభిరామాః – సుప్రీతియుక్తాః – ప్రసమీక్ష్య – రామాః – గృహేషు – హృష్టాః – పరమాభిరామాః – హరిప్రవీరః – సః – దదర్శ – రామాః ॥

**అన్వయక్రమము** :– హరిప్రవీరః సః అప్రావృతాః, కాంచనరాజివర్ణాః, పరార్ధ్యాః, తపనీయవర్ణాః – కాశ్చిత్, పునః శశలక్ష్మవర్ణాః, రుచిరాంగవర్ణాః కాంతప్రహీణాః కాశ్చిత్, తతః ప్రియాన్ ప్రాప్యమనోభిరామాః, సుప్రీతియుక్తాః, రామాః ప్రసమీక్ష్య, గృహేషు పరమాభిరామాః, హృష్టాః, రామాః దదర్శ.

**ప్రతిపదార్థము** :– హరిప్రవీరః సః = వానరశ్రేష్ఠుడైన ఆ హనుమంతుడు, అప్రావృతాః = పైట చెరగులు లేని వారును, కాంచన రాజివర్ణాః = బంగారు కణిక వంటి రంగు గలవారును, పరార్ధ్యాః = ఉత్తమకులము వారును, తపనీయవర్ణాః = మేలిమి బంగారము వంటి దేహచ్ఛాయ గలవారును నైనట్టి, కాశ్చిత్ = కొద్ది మంది స్త్రీలను, పునః చ = తిరిగి, శశలక్ష్మవర్ణాః = చంద్రుని వంటి తెల్లనైన దేహచ్ఛాయ గలవారై,

రుచిరాంగవర్ణాః = సుందరమైన దేహచ్ఛాయ గలవారును, కాంతప్రహీణాః = భర్తృహీనలయినట్టివారునగు, కాశ్చిత్ = మరికొద్దిమంది స్త్రీలను, తతః = పిమ్మట, ప్రియాన్ ప్రాప్య = ఇష్టులైన ప్రియులను బొంది, మనోభిరామాః = మనస్సునందు ఆనందముతోనున్నవారును, సుప్రీతియుక్తాః = మిక్కిలి ప్రేమతో గూడినవారునగు, రామాః = కొద్దిమంది స్త్రీలను, ప్రసమీక్ష్య = చూచి, గృహేషు = రాక్షసగృహములందు, హృష్టాః = మిక్కిలి హర్షము నొందియున్నట్టి, రామాభిరామాః రామాః = మిక్కిలి సుందరులైనట్టి స్త్రీలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :-** ఆ యంతఃపురమునందు, పైట చెరగులు లేనివారై, బంగారు కణికవంటి శరీరముతో కొందరును, మేలిమి బంగారమువంటి దేహచ్ఛాయతోడ నున్న కొందరు స్త్రీలను, భర్తృహీనలై చంద్రునివలె తెల్లని సుందరమైన దేహచ్ఛాయ కలిగిన కొందరిని, దూరమునందున్న ప్రియులైన భర్తలను పొంది, సంతోషముతోనున్న తరుణులను కొందరిని, ఇండ్లయందే మిక్కిలి ఆనందముతో జీవించుచున్న మహాసుందరులైన మరికొద్దిమంది స్త్రీలను హనుమ జూచెను.

**శ్లో॥ చంద్రప్రకాశా శ్చ హి వక్త్రమాలాః**
**వక్రాక్షిపక్ష్మా శ్చ సునేత్రమాలాః ।**
**విభూషణానాం చ దదర్శ మాలాః**
**శతహ్రదానా మివ చారుమాలాః ॥** **22**

**పదచ్ఛేదము :-** చంద్రప్రకాశాః - చ - హి - వక్త్రమాలాః - వక్రాక్షిపక్ష్మాః - చ - సునేత్రమాలాః - విభూషణానాం - చ - దదర్శ - మాలాః - శతహ్రదానాం - ఇవ - చారుమాలాః ॥

**అన్వయక్రమము :-** చంద్రప్రకాశాః, వక్త్రమాలాశ్చ, వక్రాక్షిపక్ష్మాః, సునేత్రమాలాశ్చ, శతహ్రదానాం - చారుమాలాః ఇవ - విభూషణానాం మాలాః చ దదర్శ.

**ప్రతిపదార్థము :-** చంద్రప్రకాశాః = చంద్రునివలె శోభించునట్టి, వక్త్రమాలాశ్చ = ముఖముల మాలికలను, వక్రాక్షిపక్ష్మాః = వంకర గలిగియున్న కంటి రెప్పలుగల, సునేత్రమాలాశ్చ = సుందరమైన కన్నుల మాలికలను, శతహ్రదానాం చారుమాలాః ఇవ = మెరపుతీగలయొక్క సుందరమైన మాలికలవంటి, విభూషణానాం మాలాః చ = ఆభరణములయొక్క మాలికలను, దదర్శ = కాంచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** వక్రాక్షిపక్ష్మాః = నేత్రములు వంకరగ నున్నవని పరికించి

తెలిసికొనుట, వారు రాక్షసస్త్రీలే యని అతడు నిర్ణయించుకొనుటకే. వారి ఆభరణములను పరిశీలించి చూచుట సీత ఆభరణముల వంటివేమో అని పరికించి చూచి, తెలిసికొనుటకని భావము.

**తాత్పర్యము :–** హనుమంతుడచ్చట చంద్రబింబమువలె నున్న అచ్చటి స్త్రీల ముఖముల మాలికలను, కొద్ది వంకరగలిగిన రెప్పలుగల నేత్రముల మాలికలను, మెరుపుతీగల వరుసవలె మిరుమిట్లు గొలుపు చున్న ఆభరణముల మాలికలను చూచెను.

**శ్లో॥ న త్వేవ సీతాం పరమాభిజాతాం**
**పథి స్థితే రాజకులే ప్రజాతామ్ ।**
**లతాం ప్రఫుల్లా మివ సాధుజాతాం**
**దదర్శ తన్వీం మనసాఽభిజాతామ్ ॥ 23**

**పదచ్ఛేదము :–** న – తు – ఏవ – సీతాం – పరమాభిజాతాం – పథి – స్థితే – రాజకులే – ప్రజాతాం – లతాం – ప్రఫుల్లామ్ – ఇవ – సాధుజాతాం – దదర్శ – తన్వీం – మనసా – అభిజాతామ్ ॥

**అన్వయక్రమము :–** పరమాభిజాతాం, పథి స్థితే రాజకులే ప్రజాతాం, మనసా అభిజాతాం సాధుజాతాం ప్రపుల్లాం లతామివ తన్వీం సీతాం న త్వేవ దదర్శ.

**ప్రతిపదార్థము :–** పరమాభిజాతాం = ఉన్నతమైన వంశము గలదియును, పథి స్థితే = ధర్మమార్గమునందు నిలచియున్న, రాజకులే = రాజవంశమునందు, ప్రజాతాం = జన్మించినదియును, మనసా = దైవముయొక్క సంకల్పముచే, అభిజాతాం = చక్కగా మొలచినట్టి, ప్రఫుల్లాం లతామివ = చక్కగా వికసించిన (పువ్వులు గల) తీగవలె (నుండినట్టి), తన్వీం = కృశించిన, సీతాం తు = సీతను మాత్రము, నైవ దదర్శ = చూడలేకపోయెను.

**తాత్పర్యము :–** లంకలోని అంతఃపురమునందలి స్త్రీల నందరిని వెదకి చూచినను, ఉన్నతమైన జనకరాజవంశమున జన్మించినదియును, దైవసంకల్పముచే భూమిపై అవతరించినదియును, చక్కగా పుష్పించి, పెరిగి కృశించిన తీగవలె నుండునదియును అగు సీతమ్మను మాత్రము కనుగొన లేక పోయెను.

**శ్లో॥ సనాతనే వర్త్మని సన్నివిష్టాం**
**రామేక్షణాం తాం మదనాభివిష్టామ్ ।**
**భర్తు ర్మనః శ్రీమదనుప్రవిష్టాం**
**స్త్రీభ్యో వరాభ్య శ్చ సదా విశిష్టామ్ ॥ 24**

**పదచ్ఛేదము** :- సనాతనే - వర్త్మని - సన్నివిష్టాం - రామేక్షణాం - తాం - మదనాభివిష్టామ్ - భర్తుః - మనః - శ్రీమత్ - అనుప్రవిష్టాం - స్త్రీభ్యః - వరాభ్యః - చ - సదా - విశిష్టామ్ ॥

**అన్వయక్రమము** :- సనాతనే వర్త్మని సన్నివిష్టాం, రామేక్షణాం, మదనాభివిష్టాం, శ్రీమత్ భర్తుః మనః అనుప్రవిష్టాం, వరాభ్యః స్త్రీభ్యః చ - సదా విశిష్టాం తాం (సీతాం నైవ దదర్శ).

**ప్రతిపదార్థము** :- సనాతనే వర్త్మని = ప్రాచీన ధర్మమార్గమునందు, సన్నివిష్టాం = తత్పరురాలై యున్నదియును, రామేక్షణాం = రామునియందే దృష్టి కలిగియున్నది యును, మదనాభివిష్టాం = మన్మథునిచే పీడింపబడుచున్నదియును, శ్రీమత్ = శుభలక్షణములుగల, భర్తుః మనః = భర్తయొక్క మనస్సును, అనుప్రవిష్టాం = చూరగొన్నదియును, వరాభ్యః, స్త్రీభ్యః చ = ఉత్తములైన స్త్రీలకంటెను, సదా విశిష్టాం = ఎల్లప్పుడును ప్రత్యేకమయిన ఔన్నత్యము కల్గియున్నదియునగు, తాం = సీతను, (నైవ దదర్శ = కనుగొనలేకపోయెను).

**తాత్పర్యము** :- ధర్మమార్గతత్పరురాలును, రామైకగతమైన దృష్టిగలదియును, భర్తృవిరహముచే కృశించినదియును, రాముని మనస్సు చూరగొన్నదియును, స్త్రీలోకమున, విశిష్టగుణములచే వెలయుచున్నదియునగు, సీతమ్మను, ఎచ్చటను కాంచలేకుండెను.

**శ్లో॥ ఉష్ణార్దితాం సానుసృతాస్రుకంఠీం**
**పురా వరార్హోత్తమనిష్కకంఠీమ్ ।**
**సుజాతపక్ష్మా మభిరక్తకంఠీం**
**వనే ప్రవృత్తా మివ నీలకంఠీమ్ ॥** **25**

**పదచ్ఛేదము** :- ఉష్ణార్దితాం - సానుసృతాస్రుకంఠీం - పురా -వరార్హోత్తమనిష్కకంఠీమ్ - సుజాతపక్ష్మామ్ - అభిరక్తకంఠీం - వనే - ప్రవృత్తామ్ - ఇవ - నీలకంఠీమ్ ॥

**అన్వయక్రమము** :- ఉష్ణార్దితాం, సానుసృతాస్రుకంఠీం, పురా వరార్హోత్తమనిష్కకంఠీం, సుజాతపక్ష్మామ్, అభిరక్తకంఠీం, వనే ప్రవృత్తాం నీలకంఠీమ్ ఇవ స్థితాం, (సీతాం నైవ దదర్శ)

**ప్రతిపదార్థము** :- ఉష్ణార్దితాం = తాపముచే పీడింపబడియున్నది, సానుసృతాస్రు కంఠీం = నిరంతరము స్రవించు కన్నీటిచే గద్గదస్వరము గలదియును, పురా = పూర్వము, వరార్హోత్తమనిష్కకంఠీం = మిక్కిలి విలువైనవియు శ్రేష్ఠమైనవియు నగు

కంఠాభరణములను ధరించిన మెడగలదియును, సుజాతపక్ష్మాం = సుందరమైన కనురెప్పలు గలదియును, అభిరక్తకంఠీం = అనురాగముతో నిండిన కంఠస్వరము గలదియును, వనే ప్రవృత్తాం = అడవిలో తిరుగునట్టి, నీలకంఠీమివ స్థితాం = నెమిలివలె నున్నదియునగు, (సీతాం నైవ దదర్శ) = సీతమ్మను చూడలేకపోయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** వరార్హోత్తమనిష్కకంఠీం = రాముడు తన ప్రక్కనున్నంత కాలము మక్కువతో, కంఠాభరణములను ధరించినదని భావము.

**తాత్పర్యము :–** విరహతాపముచే పీడితురాలును, గద్గదకంఠము నొందియున్నదియును, చిరకాలము కంఠాభరణములు ధరించియున్నదియును, సుందరమైన కనురెప్పలు గలదియును, అడవిలో చరించు ఆడునెమిలివలె నున్నదియునగు సీతమ్మను మాత్రము చూడలేకపోయెను.

**శ్లో॥ అవ్యక్తరేఖా మివ చంద్రరేఖాం**
**పాంసుప్రదిగ్ధా మివ హేమరేఖామ్ ।**
**క్షతప్రరూఢా మివ బాణరేఖాం**
**వాయుప్రభిన్నా మివ మేఘరేఖామ్ ॥ 26**

**పదచ్ఛేదము :–** అవ్యక్తరేఖామ్ – ఇవ – చంద్రరేఖాం –పాంసుప్రదిగ్ధామ్ – ఇవ – హేమరేఖాం – క్షతప్రరూఢామ్ – ఇవ – బాణరేఖాం – వాయుప్రభిన్నామ్ – ఇవ – మేఘరేఖామ్ ॥

**అన్వయక్రమము :–** అవ్యక్తరేఖాం చంద్రరేఖామ్ ఇవ, పాంసుప్రదిగ్ధాం హేమరేఖామ్ ఇవ, క్షతప్రరూఢాం బాణరేఖామ్ ఇవ, వాయుప్రభిన్నాం మేఘరేఖామ్ ఇవ (వర్తమానాం సీతాం నైవ దదర్శ).

**ప్రతిపదార్థము :–** అవ్యక్తరేఖాం = స్పష్టముగా కాన్పింపని రేఖలుగల, చంద్రరేఖామ్ ఇవ = చంద్రవంకవలెను; పాంసుప్రదిగ్ధాం = దుమ్ము అంటుకొనియున్న, హేమరేఖామ్ ఇవ = బంగరుతీగవలెను, క్షతప్రరూఢాం = గాయమునందు గ్రుచ్చుకొనియున్న, బాణరేఖామ్ ఇవ = బాణపుముల్కివలెను, వాయుప్రభిన్నాం = గాలిచే చెదరగొట్టబడిన, మేఘరేఖామ్ ఇవ = మబ్బుతునకవలెను, (వర్తమానాం సీతాం = ఉన్నట్టి సీతమ్మను, నైవ దదర్శ = చూడలేకపోయెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** 'క్షతప్రరూఢాం బాణరేఖాం' సీతమ్మ గాయమునందు గుచ్చుకొనిన బాణపు ములికివలె నున్నదనెడి అనుభవము ఒక విధముగా రామునకును, ఒక విధముగా రావణునకును అన్వయించును.

**తాత్పర్యము :-** కొనలు కనిపించనట్టి, మబ్బువెనుకనున్న చంద్రరేఖవలెను, దుమ్ములో మునిగియున్నట్టి బంగారు తీగవలెను, గాయమునందు గ్రుచ్చుకొనియున్న బాణపుములికివలెను, గాలికి చెదరిపోయిన మబ్బుతునకవలెను, ఉండు జానకిని మాత్రము హనుమ చూడలేకపోయెను.

**గోవిందరాజీయము :-** అవ్యక్తరేఖాం = అవ్యక్తరేఖయైన చంద్రరేఖతో సామ్యము తెలుపుటవలన సీతమ్మ మిక్కిలి కృశించి, కాంతిహీనయై యున్నదని తెలియుచున్నది. 'పాంసుప్రదిగ్ధమైన హేమరేఖ'వలె నున్నదనుటచే జానకియొక్క స్వతస్సిద్ధమైన పరిశుద్ధ రూపమునకు ఆగంతుకమైన మాలిన్య మంటినదని తెలియుచున్నది. క్షతప్రరూఢమైన బాణరేఖ వలె నున్నదనుటచే సీతమ్మయొక్క హృదయాంతర్గతమైన వేదన సూచింప బడుచున్నది. వాయుప్రభిన్నయైన మేఘరేఖవలె నున్నదనుటచే ఆమె అవయవశైథిల్యము సూచింపబడుచున్నది.

**శ్లో॥ సీతా మపశ్య న్మనుజేశ్వరస్య**
**రామస్య పత్నీం వదతాం వరస్య ।**
**బభూవ దుఃఖాభిహత శ్చిరస్య**
**ప్లవంగమో మంద ఇ వాచిరస్య ॥ 27**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"భవనవిచయో" నామ*
*పంచమ స్సర్గః*

**పదచ్ఛేదము :-** సీతామ్ - అపశ్యన్ - మనుజేశ్వరస్య - రామస్య - పత్నీం - వదతాం - వరస్య - బభూవ - దుఃఖాభిహతః - చిరస్య - ప్లవంగమః - మందః - ఇవ - అచిరస్య ॥

**అన్వయక్రమము :-** వదతాం వరస్య, మనుజేశ్వరస్య, రామస్య పత్నీం సీతాం, చిరస్య అపశ్యన్ ప్లవంగమః, దుఃఖాభిహతః (సన్), అచిరస్య మందః ఇవ బభూవ.

**ప్రతిపదార్థము :–** వదతాం వరస్య = చక్కగా భాషించువారిలో శ్రేష్ఠుడైన, మనుజేశ్వరస్య = మహారాజయిన, రామస్య = శ్రీరామునియొక్క, పత్నీం సీతాం = భార్యయైన జానకిని, చిరస్య = చిరకాలము, అపశ్యన్ = చూడనివాడై, ప్లవంగమః = హనుమంతుడు, దుఃఖాభిహతః (సన్) = దుఃఖగ్రస్తుడై, అచిరస్య = కొద్దికాలము, మందః ఇవ బభూవ = జడుడువలె నాయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మందః ఇవ = అనగా అన్వేషణకు అసమర్థుడని దుఃఖితుడయ్యెను అని భావము.

**తాత్పర్యము :–** మహానుభావుడైన శ్రీరాముని అర్ధాంగిని చిరకాలము వెదకియు కానలేక హనుమంతుడు, దుఃఖగ్రస్తుడై కొలదిసేపు మూఢునివలె చింతించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమునకు*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"భవనవిచయము" అను*
*ఐదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# షష్ఠసర్గ

**శ్లో॥ స నికామం విమానేషు విషణ్ణః కామరూపధృత్ ।**
**విచచార పున ర్లంకాం లాఘవేన సమన్వితః ॥ 1**

**పదచ్ఛేదము** :- సః - నికామం - విమానేషు - విషణ్ణః - కామరూపధృత్ - విచచార - పునః - లంకాం - లాఘవేన - సమన్వితః ॥

**అన్వయక్రమము** :- కామరూపధృత్ సః, విమానేషు, నికామం విషణ్ణః, పునః లాఘవేన సమన్వితః లంకాం విచచార.

**ప్రతిపదార్థము** :- కామరూపధృత్ సః = కామరూపమును ధరించినట్టి ఆ హనుమంతుడు, విమానేషు = ఉన్నతసౌధములందు, నికామం విషణ్ణః = మిక్కిలిగా విషాదము నొందినవాడై, లాఘవేన సమన్వితః = వేగముతో కూడినవాడై, పునః = తిరిగి, లంకాం విచచార = లంకయందు కలయదిరిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- విమానేషు = ఏడు అంతస్థుల మేడలయందు.

**రామాయణ శిరోమణి** :- 'విమానేషు విచరన్' = విమానములందు తిరుగుచు 'నికామం లంకాం విచచార' = స్వేచ్ఛగా లంకలో సంచరించెను.

**రామానుజీయము** :- కామరూపధృత్ = కామరూపమును ధరించి హనుమ తిరిగి లంకలో చరించెనని భావము.

**తాత్పర్యము** :- అష్టసిద్ధులు కలిగిన యా హనుమంతుడు అంతఃపురసౌధములందు సీతను అన్వేషించి చూడలేక మహావేగముతో మరల తిరుగ దొడగెను.

**శ్లో॥ ఆససాదాఽథ లక్ష్మీవాన్ రాక్షసేంద్రనివేశనమ్ ।**
**ప్రాకారేణార్కవర్ణేన భాస్వరేణాఽభిసంవృతమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :- ఆససాద - అథ - లక్ష్మీవాన్ - రాక్షసేంద్రనివేశనమ్ - ప్రాకారేణ

– అర్కవర్ణేన – భాస్వరేణ – అభిసంవృతమ్ ॥

**అన్వయక్రమము** :– అథ లక్ష్మీవాన్ అర్కవర్ణేన భాస్వరేణ ప్రాకారేణ అభిసంవృతం రాక్షసేంద్రనివేశనమ్ ఆససాద.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, లక్ష్మీవాన్ = శుభలక్షణ సముపేతుడైన హనుమంతుడు, అర్కవర్ణేన = సూర్యుని కాంతిగల, భాస్వరేణ = మిక్కిలిగా ప్రకాశించుచున్నట్టి, ప్రాకారేణ = ప్రాకారముచే, అభిసంవృతం = చుట్టుకొనబడి యున్నట్టి, రాక్షసేంద్రనివేశనం = రావణుని భవనమును, ఆససాద = చేరెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి** :– లక్ష్మీవాన్ = అతివీర్య సంపత్తి విశిష్టుడు.

**రామానుజీయము** :– ఆససాద అథ లక్ష్మీవాన్ రాక్షసేంద్రనివేశనమ్ = ఇదివరకే రావణభవనమును ప్రవేశించియున్న హనుమ, ఇప్పుడు తిరిగి రావణభవనమును ప్రవేశించెనని మరల చెప్పుటచే మొదట ఒకసారి హనుమ రావణభవనమును ప్రవేశింపగా అచటి రాక్షసులెల్లరును మేల్కొనియుండుటచే ఇది సమయము కాదని వెడలిపోయి లంకను వెదకి తిరిగి రాక్షసభవనమున కిప్పుడు వచ్చెనని తెలియుచున్నది.

లోగడ రావణభవన ప్రాకారములలో దిఱుఁగుచు నిప్పుడు ఆ భవనములోని శయనాగారాది ముఖ్యభాగములను జూడ ప్రవేశించెనని, సమన్వయము.

**తాత్పర్యము** :– అంతట ఉత్సాహశాలియైన హనుమ లేత సూర్యునివలె మెరయుచున్న బంగారు ప్రాకారములు గల్గినట్టి రావణాసురుని భవనము చేరెను.

**శ్లో॥ రక్షితం రాక్షసై ర్ఘోరై స్సింహై రివ మహద్వనమ్ ।**
**సమీక్షమాణో భవనం చకాశే కపికుంజరః ॥ 3**

**పదచ్ఛేదము** :– రక్షితం – రాక్షసైః – ఘోరైః – సింహైః – ఇవ – మహత్ – వనమ్ సమీక్షమాణః – భవనం – చకాశే – కపికుంజరః ॥

**అన్వయక్రమము** :– మహద్వనం సింహైః ఇవ, ఘోరైః రాక్షసైః రక్షితం భవనం సమీక్షమాణః కపికుంజరః చకాశే.

**ప్రతిపదార్థము** :– ఘోరైః సింహైః = భీకరమైన సింహములచే, రక్షితం మహద్వనం ఇవ = రక్షింపబడుచున్నట్టి మహారణ్యమునువలె, ఘోరైః రాక్షసైః = భయంకరులైన రాక్షసులచే, రక్షితం భవనం = రక్షింపబడుచున్నట్టి భవనమును, సమీక్షమాణః

కపికుంజరః = చూచుచున్నట్టి వానరశ్రేష్ఠుడు, చకాశే = ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** చకాశే = చంద్రుని సాన్నిధ్యమువలన సీతను వెదకుటకు చక్కని ప్రకాశముగలవా డయ్యెనని భావము.

**గోవిందరాజీయము :–** 'చకాశే' = సంతోషించెనని భావము.

**రామానుజీయము :–** 'చకాశే' = సూర్యవర్ణప్రాకారముల సమీపమున నుండుటచే, ఆ భవనముయొక్క తేజస్సు తనపై ప్రసరించి, తద్ద్వారా హనుమ గొప్పగా ప్రకాశించెను.

**తాత్పర్యము :–** సింహములచే రక్షింపబడుచున్న అరణ్యమువలె, భీకరదానవులచే రక్షింపబడుచున్న ఆ మందిరమును చూచుచు దానితేజోవిశేషమునకు హనుమ మిక్కిలి ఆశ్చర్యమును, ఆనందమును పొందెను.

**శ్లో॥ రూప్యకోపహితై శ్చిత్రై స్తోరణై ర్హేమభూషితైః ।**
**విచిత్రాభిశ్చ కక్ష్యాభి ర్ద్వారై శ్చ రుచిరై ర్వృతమ్ ॥ 4**

**పదచ్ఛేదము :–** రూప్యకోపహితైః – చిత్రైః – తోరణైః – హేమభూషితైః – విచిత్రాభిః – చ – కక్ష్యాభిః – ద్వారైః – చ – రుచిరైః – వృతమ్ ॥

**అన్వయక్రమము :–** రూప్యకోపహితైః చిత్రైః, హేమభూషితైః తోరణైః, విచిత్రాభిః కక్ష్యాభిః, రుచిరైః ద్వారైః చ, వృతం (భవనం దదర్శ).

**ప్రతిపదార్థము :–** రూప్యకోపహితైః = వెండితో నిర్మింపబడినట్టి, చిత్రైః = చిత్తరువులతోడను, హేమభూషితైః = బంగారముతో అలంకరింపబడినట్టి, తోరణైః = బహిర్ద్వారములతోడను; విచిత్రాభిః = విస్మయకరమైనట్టి, కక్ష్యాభిః = విభాగములతోడను, రుచిరైః ద్వారైః చ = సుందరమైన ద్వారములచేతను, వృతం = కూడియున్నట్టి, (భవనం దదర్శ = భవనమును చూచెను.)

**తాత్పర్యము :–** వెండితో చేయబడిన చిత్తరువులతోడను, బంగారముతో అలంకరింపబడిన సింహద్వారములతోడను, ఆశ్చర్యకరమైన కక్ష్యలతోడను, సుందరముగ మెరయుచున్న ద్వారములతోడను ఆవరింపబడియున్న భవనమును హనుమ చూచెను.

**శ్లో॥ గజాస్థితై ర్మహామాత్రై శ్శూరై శ్చ విగతశ్రమైః ।**
**ఉపస్థిత మసంహార్యై ర్హయై స్స్యందనయాయిభిః ॥ 5**

**పదచ్ఛేదము :–** గజాస్థితైః – మహామాత్రైః – శూరైః – చ – విగతశ్రమైః – ఉపస్థితమ్ – అసంహార్యైః – హయైః – స్యందనయాయిభిః.

**అన్వయక్రమము :–** గజాస్థితైః మహామాత్రైః విగతశ్రమైః శూరైః చ, అసంహార్యైః స్యందనయాయిభిః హయైః చ, ఉపస్థితం (భవనం దదర్శ).

**ప్రతిపదార్థము :–** గజాస్థితైః = గజారూఢులయిన, మహామాత్రైః = మావటీంద్రచేతను, విగతశ్రమైః శూరైః చ = శ్రమ ఎరుగనట్టి వీరులచేతను, అసంహార్యైః = అవధ్యములైనట్టి, స్యందనయాయిభిః = రథములను నడుపునట్టి, హయైః చ = అశ్వములతోడను, ఉపస్థితం = కూడి యున్నట్టి, (భవనం దదర్శ = భవనమును చూచెను)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** మహామాత్రైః = ప్రధానులచేనని అర్థము.

**తాత్పర్యము :–** గజారూఢులైన మావటీంద్రతోడను, శ్రమ నెరుగని వీరులచేతను, అజేయములై రథములను నడుపగలిగినట్టి అశ్వములతోడను కూడియున్న రావణ భవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ సింహవ్యాఘ్రతనుత్రాణై ర్దాంతకాంచనరాజతైః ।**
**ఘోషవద్భి ర్విచిత్రై శ్చ సదా విచరితం రథైః ॥ 6**

**పదచ్ఛేదము :–** సింహవ్యాఘ్రతనుత్రాణైః – దాంతకాంచనరాజతైః – ఘోషవద్భిః – విచిత్రైః – చ – సదా – విచరితం – రథైః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** సింహవ్యాఘ్రతనుత్రాణైః = సింహములయొక్కయు వ్యాఘ్రముల యొక్కయు చర్మములచే నిర్మింపబడిన కవచములు గల్గినట్టియు, దాంతకాంచనరాజతైః = గజదంతములతోడను, బంగారముతోడను, వెండితోడను నిర్మింపబడినవియును, ఘోషవద్భిః = చక్కని ధ్వని గలవియును, విచిత్రైః = విస్మయకరమైన రూపములు గలిగినట్టివియునగు, రథైః = రథములచే, సదా = నిత్యము, విచరితం = సంచరింపబడుచున్నట్టి (భవనం దదర్శ = భవనమును చూచెను)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** దాంతకాంచనరాజతైః = దంతముతోడను, బంగారముతోడను,

వెండితోడను నిర్మింపబడిన బొమ్మలతో, అలంకరింపబడిన రథములని భావము.

**తాత్పర్యము** :– సింహవ్యాఘ్రచర్మ నిర్మిత కవచములతో కూడినవియును, దంతము, కాంచనము, వెండి యను వానితో, నిర్మింపబడినవియును, శ్రావ్యమైన ధ్వనిగలిగి, విచిత్రముగ కాన్పించునవియును అగు రథములు సంచరించుచున్నట్టి, ఆ రావణ భవనమును హనుమ జూచెను.

**శ్లో॥ బహురత్నసమాకీర్ణం పరార్ధ్యాసనభాజనమ్ ।**
**మహారథసమావాసం మహారణమహాస్వనమ్ ॥ 7**

**పదచ్ఛేదము** :– బహురత్నసమాకీర్ణం – పరార్ధ్యాసనభాజనమ్ – మహారథసమావాసం – మహారణమహాస్వనమ్ ॥

**ప్రతిపదార్థము** :– బహురత్నసమాకీర్ణం = బహువిధములైన రత్నములతో నిండియున్నట్టి దియును, పరార్ధ్యాసనభాజనం = అమూల్యములైన ఆసనవిశేషములను కలిగియున్న దియును, మహారథసమావాసం = మహారథములకు నెలవైయున్నదియును, మహారణమహాస్వనం = పెద్దరణరంగమునందలి గొప్ప కోలాహలమువంటి ధ్వని కలిగినదియును అగు (భవనం దదర్శ = రావణభవనమును జూచెను).

**బొంబాయి ప్రతి** :– మహారణమహాస్వనమ్ అనుదానికి బదులుగా, 'మహారథ మహాస్వనమ్' అని బొంబాయి ముద్రణ. అనగా ఒక మహారథశబ్దమునకు గొప్పరథ మని అర్థముకాగా, రెండవ మహారథశబ్దమునకు మహావీరుడని అర్థము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– " ఏకో దశసహస్రాణి యోధయేత్ య స్తు ధన్వినామ్,
శస్త్రశాస్త్రప్రవీణ శ్చ స మహారథ ఉచ్యతే."

**తాత్పర్యము** :– బహువిధములగు రత్నములతో నిండి యున్నదియును, అమూల్యములైన ఆసనములతో నిండియున్నదియును, గొప్ప రథములకు నిలయమై యున్నదియును, మహారణమునందలి ధ్వనివంటి మహాధ్వని కలిగియున్నదియును అగు రావణభవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ దృశ్యైశ్చ పరమోదారై స్తై స్తై శ్చ మృగపక్షిభిః ।**
**వివిధై ర్బహుసాహస్రైః పరిపూర్ణం సమంతతః ॥ 8**

**పదచ్ఛేదము** :- దృశ్యైః - చ - పరమోదారైః - తైః - తైః - చ - మృగపక్షిభిః - వివిధైః - బహుసాహస్రైః - పరిపూర్ణం - సమంతతః ॥

**అన్వయక్రమము** :- పరమోదారైః దృశ్యైః చ, వివిధైః బహుసాహస్రైః తైః తైః మృగ పక్షిభిః చ సమంతతః పరిపూర్ణం (భవనం దదర్శ).

**ప్రతిపదార్థము** :- పరమోదారైః = మిక్కిలి గొప్పవియైన, దృశ్యైః చ = దృశ్యముల తోడను, వివిధైః = బహువిధములైన, బహుసాహస్రైః = పెక్కువేలైనట్టి, తైః తైః మృగపక్షిభిః చ = ఆ యా జంతువులతోడను పక్షులతోడను, సమంతతః = నలుమూలలందును, పరిపూర్ణం = నిండియున్నట్టి (భవనం దదర్శ = రావణ భవనమును చూచెను).

**తాత్పర్యము** :- చూడదగియున్నవియును, మిక్కిలి గొప్పవైనవియును, పెక్కువేల సంఖ్యలో నున్నవియును, బహువిధములైనట్టివియును, అగు వింత వింత జంతువుల తోడను, పక్షులతోడను, ఎల్ల యెడల నిండియున్నట్టి రావణ భవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ వినీతై రంతపాలై శ్చ రక్షోభి శ్చ సురక్షితం ।**
**ముఖ్యాభి శ్చ వరస్త్రీభిః పరిపూర్ణం సమంతతః ॥ 9**

**పదచ్ఛేదము** :- వినీతైః - అంతపాలైః - చ - రక్షోభిః - చ - సురక్షితమ్ - ముఖ్యాభిః - చ - వరస్త్రీభిః - పరిపూర్ణం - సమంతతః ॥

**అన్వయక్రమము** :- వినీతైః అంతపాలైః చ రక్షోభిః చ సురక్షితం, సమంతతః ముఖ్యాభిః వరస్త్రీభిః పరిపూర్ణం (రావణభవనం దదర్శ).

**ప్రతిపదార్థము** :- వినీతైః = సుశిక్షితులగు, అంతపాలైః చ = ద్వారపాలకులచేతను, రక్షోభిః చ = రాక్షసులచేతను, సురక్షితం = భద్రముగ కాపాడబడుచున్నదియును, సమంతతః = అంతటను, ముఖ్యాభిః వరస్త్రీభిః = విశేషమైన సుందరాంగనలతో, పరిపూర్ణం = నిండియున్నదియునగు, (రావణభవనం దదర్శ = రావణభవనమును గాంచెను).

**తాత్పర్యము** :- సుశిక్షితులైన ద్వారపాలకులచేతను, రాక్షసవీరులచేతను, భద్రముగ రక్షింపబడుచున్నదియును, శ్రేష్ఠమైన సుందరాంగనలతో అంతటను నిండియున్న దియును, అగు రావణభవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ ముదితప్రమదారత్నం రాక్షసేంద్రనివేశనమ్ ।**
**వరాభరణసంహ్రాదై స్సముద్రస్వననిస్వనమ్ ॥ 10**

**పదచ్ఛేదము** :–ముదితప్రమదారత్నం – రాక్షసేంద్రనివేశనమ్ – వరాభరణసంహ్రాదైః – సముద్రస్వననిస్వనమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– ముదితప్రమదారత్నం = సంతోషముతో నిండియున్న శ్రేష్ఠమైన స్త్రీలతో కూడియున్నదియును, రాక్షసేంద్రనివేశనం = రాక్షసశ్రేష్ఠుల నివాసభవనములు గలదియును, వరాభరణసంహ్రాదైః = గొప్పవైన ఆభరణములయొక్క ధ్వనులచే, సముద్రస్వననిస్వనం= సముద్రఘోషమువంటి ధ్వనికలిగి యున్నదియును అగు (భవనం దదర్శ = రావణుని భవనము చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రాక్షసేంద్రనివేశనం = మహాపార్శ్వుడు మున్నగు రాక్షసశ్రేష్ఠుల గృహములతో నిండియున్నదని భావము.

**తాత్పర్యము** :– సంతోషముతో నివసించుచున్న గొప్పగొప్ప స్త్రీలతో గూడినదియును, రాక్షస వీరుల నివాసములతో కూడినదియును, గొప్పవైన ఆభరణముల శబ్దములచే సముద్రఘోషవంటి గొప్ప ధ్వని కలిగి యున్నదియును అగు రావణుని భవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ తద్రాజగుణసంపన్నం ముఖ్యై శ్చాఽగరుచందనైః ।**
**మహాజనై స్సమాకీర్ణం సింహై రివ మహ ద్వనమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– తద్రాజగుణసంపన్నం – ముఖ్యైః చ – అగరుచందనైః – మహాజనైః – సమాకీర్ణం – సింహైః ఇవ – మహత్ – వనమ్ ॥

**అన్వయక్రమము** :– ముఖ్యైః అగరుచందనైః చ తద్రాజగుణసంపన్నం, సింహైః మహత్ వనమ్ ఇవ, మహాజనైః సమాకీర్ణం, (భవనం దదర్శ).

**ప్రతిపదార్థము** :– ముఖ్యైః అగరుచందనైః చ = విశేషములైన అగరు చందనాది పరిమళ ద్రవ్యములచేతను, తద్రాజగుణసంపన్నం = ప్రసిద్ధములైన మహారాజ లక్షణములతోనిండి యున్నదియును, సింహైః = సింహములచే, మహత్ వనం ఇవ = గొప్పదైన అరణ్యము వలె, మహాజనైః సమాకీర్ణం = మహాజనులతో నిండినదియును అగు, (భవనం దదర్శ = భవనమును చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తద్రాజగుణసంపన్నం = అనగా ప్రసిద్ధమైన రాజభవనముల కుండవలసిన లక్షణములతో, అనగా ఛత్రచామరాది రాజలాంఛనములతో నిండియున్నది అని భావము.

**తాత్పర్యము :–** రాజచిహ్నములైన ఛత్రచామరాదులతోడను, చందనాగరుప్రభృతి సుగంధద్రవ్యములతోడను, సింహములతో అరణ్యము నిండియున్నట్లు మహాజనుల తోడను ఎల్లయెడల నిండియున్న రావణభవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ భేరీమృదంగాభిరుతం శంఖఘోషనినాదితమ్ ।**
**నిత్యార్చితం పర్వహుతం పూజితం రాక్షసైః సదా ॥ 12**

**పదచ్ఛేదము :–** భేరీమృదంగాభిరుతం – శంఖఘోషనినాదితమ్ – నిత్యార్చితం పర్వహుతం – పూజితం – రాక్షసైః – సదా ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** భేరీమృదంగాభిరుతం = భేరీమృదంగాదుల ధ్వనితో కూడినదియును, శంఖఘోషనినాదితమ్ = శంఖధ్వనులతో మారుమ్రోగుచున్నదియును, నిత్యార్చితం = నిత్యము పూజింపబడుచున్నదియును, పర్వహుతం = పర్వకాలములందు హోమము చేయబడుచున్నదియును, రాక్షసైః = రాక్షసులచే, సదా = ఎల్లప్పుడు, పూజితం = పూజింపబడుచున్నదియును అగు (భవనం దదర్శ = రావణభవనమును జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'పర్వహుతం' అనుటకు బదులుగా 'పర్వసుతం' అని బొంబాయి ముద్రణము. ఈ పాఠమునకు పర్వకాలములలో, సోమరసముతో యాగములు చేయబడునట్టిదని అర్థము.

**గోవిందరాజీయము :–** నిత్యార్చితం – గంధ పుష్పాదులచే నిత్యము అర్చింపబడునట్టిది. పర్వహుతం = రావణ డాహితాగ్ని అయి యుండుటచే అతని గృహమున పర్వదినములందు దర్శపూర్ణమాసాది హోమములు జరుగుచుండును. ఈతడు గొప్ప ఆహితాగ్నియని యుద్ధకాండమున తెలుపబడినది. పూజితం రాక్షసైః = తమ ప్రభువు భవనమగుటచే, అది రాక్షసులచే నిత్యము మ్రొక్కబడుచుండెను.

**తాత్పర్యము :–** భేరీమృదంగాది ధ్వనులతో గూడినదియును శంఖధ్వనులతో ప్రతి

ధ్వనించుచున్నదియును, నిత్యము ఈశ్వరార్చనలతో నిండియుండినదియును, ప్రతి పర్వమునందును హోమములు చేయబడునదియును నిత్యము రాక్షసులెల్లరిచే మ్రొక్కబడునదియును అగు రావణభవనమును హనుమ గాంచెను.

**శ్లో॥ సముద్ర మివ గంభీరం సముద్ర మివ నిస్స్వనమ్ ।**
**మహాత్మనో మహ ద్వేశ్మ మహారత్నపరిచ్ఛదమ్ ।**
**మహారత్నసమాకీర్ణం దదర్శ స మహాకపిః ॥ 13**

**పదచ్ఛేదము** :– సముద్రమ్ – ఇవ – గంభీరం – సముద్రమ్ – ఇవ – నిస్స్వనమ్, మహాత్మనః – మహత్ – వేశ్మ – మహారత్నపరిచ్ఛదమ్ – మహారత్నసమాకీర్ణం – దదర్శ – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః సముద్రమ్ ఇవ గంభీరం సముద్రమ్ ఇవ నిస్స్వనం, మహారత్నపరిచ్ఛదం మహారత్నసమాకీర్ణం, మహాత్మనః (తత్) మహత్ వేశ్మ దదర్శ.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, సముద్రమివ గంభీరం = మహాసాగరమువలె గంభీరమైయున్నదియును, సముద్రమివ నిస్స్వనం = మహాసముద్రమువలె నిశ్శబ్దమైయున్నదియును, మహారత్నపరిచ్ఛదం = మహారత్నాలంకారములతో నిండియున్నదియును, మహారత్నసమాకీర్ణం = అమూల్యమైన మణులతో నిండియున్నదియును అగు, మహాత్మనః = మహనీయుడైన రావణునియొక్క, (తత్) మహత్ వేశ్మ = ఆ మహాభవనమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– సముద్రమివ నిస్స్వనమ్ = రావణుని భవనములో వెలుపలి భాగములు కోలాహలముగలవైయున్నను లోపలి కక్ష్యలు నిశ్శబ్దముగా నున్నవని భావము. సముద్రసమనిస్స్వనమ్ = సముద్రముతో సమానమైనధ్వని గల్గియున్నట్టిది అని బొంబాయి ముద్రణము.

**తాత్పర్యము** :– మహాసాగరమువలె గంభీరముగను, నిశ్శబ్దముగను నున్నట్టి లోపలి మందిరము గలదియును, అమూల్యరత్నాభరణములతో నిండియున్నదియును, శ్రేష్ఠమైన మణిగణములతో వెలయుచున్నదియునగు మహాత్ముడైన రావణుని ఆ మహాభవనమును మహాకపియైన హనుమ దర్శించెను.

**శ్లో॥ విరాజమానం వపుషా గజాశ్వరథసంకులమ్ ।**
**లంకాభరణ మి త్యేవ సోఽమన్యత మహాకపిః ॥ 14**

**పదచ్ఛేదము** :– విరాజమానం – వపుషా – గజాశ్వరథసంకులమ్ – లంకాభరణమ్ – ఇతి – ఏవ – సః – అమన్యత – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః గజాశ్వరథసంకులం, వపుషా విరాజమానం (తత్ భవనం) లంకాభరణమ్ ఏవ ఇతి అమన్యత.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, గజాశ్వరథసంకులం = ఏనుగులతోడను, రథములతోడను, గుఱ్ఱములతోడను, క్రిక్కిరిసి యున్నదై, వపుషా విరాజమానం = తన రూపముచే మిక్కిలిగా ప్రకాశించుచున్నట్టి, తత్ భవనం = ఆ భవనమును, లంకాభరణమ్ ఏవ ఇతి = లంకానగరమునకే ఆభరణము అని, అమన్యత = భావించెను.

**తాత్పర్యము** :– ఏనుగులు, గుఱ్ఱములు, రథములు మున్నగు వానితో క్రిక్కిరిసియుండి, తన స్వరూపముచే దేదీప్యమానముగా నున్న యా భవనమును గాంచి, హనుమ ఈ భవనము లంకకే శోభను తెచ్చు ఆభరణముగా నున్నది అని భావించెను

**శ్లో॥ చచార హనుమాం స్తత్ర రావణస్య సమీపతః ॥ 15**

**పదచ్ఛేదము** :– చచార – హనుమాన్ – తత్ర – రావణస్య – సమీపతః ॥

**ప్రతిపదార్థము** :– హనుమాన్ = హనుమంతుడు, తత్ర = అక్కడ, రావణస్య సమీపతః = రావణుని భవన సమీపమున, చచార = తిరుగాడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రావణస్య సమీపతః = రావణుని భవన ప్రాకార ప్రదేశమునందు.

**తాత్పర్యము** :– అచ్చట, హనుమంతుడు రావణుని భవన సమీపమున కొద్దిసేపు తిరుగాడెను.

**శ్లో॥ గృహా ద్గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః ।**
**వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః ॥ 16**

**పదచ్ఛేదము** :– గృహాత్ – గృహం – రాక్షసానామ్ – ఉద్యానాని – చ – వానరః – వీక్షమాణః – హి – అసంత్రస్తః – ప్రాసాదాన్ – చ – చచార – సః ॥

**అన్వయక్రమము** :– సః వానరః, గృహాత్ గృహం (గచ్ఛన్) రాక్షసానామ్ ఉద్యానాని, ప్రాసాదాన్ చ, వీక్షమాణః, అసంత్రస్తః, చచార.

**ప్రతిపదార్థము** :– సః వానరః = ఆ హనుమ, గృహాత్ గృహం (గచ్ఛన్) = ఒక ఇంటినుండి వేరొక ఇంటినిగూర్చి (పోవుచు), రాక్షసానామ్ = రాక్షసులయొక్క, ఉద్యానాని = ఉద్యానవనములను, ప్రాసాదాన్ చ = సౌధములను, వీక్షమాణః = పరికించుచున్న వాడై, అసంత్రస్తః = భయము లేనివాడై, చచార = పరిభ్రమించెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు, అచటి రాక్షసులయొక్క ఒక ఇంటినుండి వేరొక ఇంటికి పోవుచు, వారి యుద్యానవనములను, వారి మేడలను, విసుగు చెందకుండగా, పరికించుచున్నవాడై, నిర్భయముగా సంచరించుచుండెను.

**శ్లో॥ అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్ ।**
**తతోఽన్య త్పుప్లువే వేశ్మ మహాపార్శ్వస్య వీర్యవాన్ ॥ 17**

**పదచ్ఛేదము** :– అవప్లుత్య – మహావేగః – ప్రహస్తస్య – నివేశనమ్ – తతః – అన్యత్ – పుప్లువే – వేశ్మ – మహాపార్శ్వస్య – వీర్యవాన్ ॥

**అన్వయక్రమము** :– మహావేగః, వీర్యవాన్, (సః) ప్రహస్తస్య, నివేశనమ్ అవప్లుత్య, తతః, అన్యత్ – మహాపార్శ్వస్య – వేశ్మ – పుప్లువే.

**ప్రతిపదార్థము** :– మహావేగః = మహావేగము గలవాడును, వీర్యవాన్ = మహాపరాక్రమముగలవాడునగు, సః = ఆ హనుమ, ప్రహస్తస్య నివేశనమ్ అవప్లుత్య = ప్రహస్తునియొక్క భవనమునుండి దిగి, తతః = అటనుండి, అన్యత్ = వేరైనట్టి, మహాపార్శ్వస్య వేశ్మ = మహాపార్శ్వునియొక్క ఇంటినిగూర్చి, పుప్లువే = గెంతెను.

**తాత్పర్యము** :– మహాపరాక్రమము గలవాడును, అమితవేగము గలవాడును, అగు ఆ హనుమ, రావణుని మంత్రియైన ప్రహస్తుని ఇంటిలోనికి ఉరికి అచ్చటినుండి రాక్షసవీరుడైన మహాపార్శ్వుని ఇంటిలోనికి దూకెను.

**శ్లో॥ అథ మేఘప్రతీకాశం కుంభకర్ణనివేశనమ్ ।**
**విభీషణస్య చ తదా పుప్లువే స మహాకపిః ॥ 18**

**పదచ్ఛేదము** :– అథ – మేఘప్రతీకాశం – కుంభకర్ణనివేశనమ్ – విభీషణస్య – చ – తదా – పుప్లువే – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– అథ సః మహాకపిః మేఘప్రతీకాశం, కుంభకర్ణనివేశనం, తదా విభీషణస్య (నివేశనం చ) పుప్లువే.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, మేఘ ప్రతీకాశం = గొప్పమేఘమును బోలియున్న, కుంభకర్ణనివేశనం = కుంభకర్ణుని

యొక్క భవనమును, తదా = అప్పుడు, విభీషణస్య (నివేశనం చ) = విభీషణునియొక్క మందిరమును గూర్చి, పుప్లువే = ఎగిరెను.

**తాత్పర్యము** :– పిమ్మట హనుమంతుడు మహామేఘమును బోలియున్న కుంభకర్ణుని భవనమునకు బోయెను. అచ్చటినుండి విభీషణుని మందిరమునకు ఎగిరెను.

**శ్లో॥ మహోదరస్య చ గృహం విరూపాక్షస్య చైవ హి ।**
**విద్యుజ్జిహ్వస్య భవనం విద్యున్మాలే స్తథైవ చ ॥ 19**

**పదచ్ఛేదము** :– మహోదరస్య – చ – గృహం – విరూపాక్షస్య – చ – ఏవ – హి – విద్యుజ్జిహ్వస్య – భవనం – విద్యున్మాలేః – తథా – ఏవ – చ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– మహోదరస్య గృహం = మహోదరునియొక్క ఇంటిని, విరూపాక్షస్య గృహం చైవ = విరూపాక్షునియొక్క గృహమును, విద్యుజ్జిహ్వస్య భవనం = విద్యుజ్జిహ్వుని భవనమును, తథైవ చ = అట్లే, విద్యున్మాలేః భవనం చ = విద్యున్మాలియొక్క భవనమును, (పుప్లువే హి = ఎగిరెను).

**తాత్పర్యము** :– పిమ్మట మహోదరుని ఇంటికిని, అటనుండి విరూపాక్షుని ఇంటికిని, పిమ్మట విద్యుజ్జిహ్వుని భవనమునకును, అటు పిమ్మట విద్యున్మాలి భవనమునకును హనుమ ఎరుగుచు వెడలెను.

**శ్లో॥ వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః ।**
**శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః ॥ 20**

**పదచ్ఛేదము** :– వజ్రదంష్ట్రస్య – చ – తథా – పుప్లువే – సః – మహాకపిః – శుకస్య – చ – మహాతేజాః – సారణస్య – చ – ధీమతః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సః మహాతేజాః మహాకపిః = ఆ మహాతేజస్సుగల వానరశ్రేష్ఠుడు, తథా = ఆరీతిగా, వజ్రదంష్ట్రస్య భవనం పుప్లువే = వజ్రదంష్ట్రునియొక్క భవనమును గూర్చి లంఘించెను, శుకస్య = శుకునియొక్కయు, ధీమతః సారణస్య = ధీమంతుడైన సారణునియొక్కయు, భవనం పుప్లువే = గృహమునుగూర్చి లంఘించెను.

**తాత్పర్యము** :– అప్పుడా హనుమ, వజ్రదంష్ట్రుని ఇంటికెగిరి అటనుండి శుకుని భవనమునకును పిమ్మట సారణుని భవనమునకును వెడలెను.

**శ్లో॥ తథా చేంద్రజితో వేశ్మ జగామ హరియూథపః ।**
**జంబుమాలే స్సుమాలే శ్చ జగామ హరిసత్తమః ॥ 21**

**పదచ్ఛేదము** :– తథా – చ – ఇంద్రజితః – వేశ్మ – జగామ – హరియూథపః – జంబుమాలేః – సుమాలేః – చ – జగామ – హరిసత్తమః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సః హరియూథపః = ఆ వానరవీరుడు, తథా = అట్లు, ఇంద్రజితః వేశ్మ చ = ఇంద్రజిత్తునియొక్క భవనమునుగూర్చి, జగామ = వెడలెను, హరిసత్తమః = ఆ వానరశ్రేష్ఠుడు, జంబుమాలేః = జంబుమాలియొక్కయు, సుమాలేః = సుమాలి యొక్కయు, వేశ్మ చ = భవనమును గూడ, జగామ = వెడలెను.

**తాత్పర్యము** :– ఆ వానరవీరుడు అట్లు ఇంద్రజిత్తు భవనమునకు వెడలి అటనుండి జంబుమాలియొక్కయు సుమాలియొక్కయు భవనములకు గూడ వెడలెను.

**శ్లో॥ రశ్మికేతో శ్చ భవనం సూర్యకేతో స్తథైవ చ ।**
**వజ్రకాయస్య చ తథా పుప్లువే స మహాకపిః ॥ 22**

**పదచ్ఛేదము** :– రశ్మికేతోః – చ – భవనం – సూర్యకేతోః – తథా – ఏవ – చ – వజ్రకాయస్య – చ – తథా – పుప్లువే – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరోత్తముడు, రశ్మికేతోః భవనం = రశ్మికేతువు యొక్క భవనమును, తథైవ = అటులనే, సూర్యకేతోః భవనం చ = సూర్యకేతువు యొక్క భవనమును, తథా = అట్లే, వజ్రకాయస్య భవనం చ = వజ్రకాయుని యొక్క భవనమును, పుప్లువే = లంఘించెను.

**తాత్పర్యము** :– వానరోత్తముడైన హనుమ, జానకి నన్వేషించుచు, రశ్మికేతువు భవనమునకేగి, అటనుండి సూర్యశత్రువు నిలయమును చేరి, అచ్చటి నుండి వజ్రకాయుని మందిరమునుగూర్చి లంఘించెను.

సూర్యశత్రువని పాఠాంతరము న్యాయముగా దోచుచున్నది.

**శ్లో॥ ధూమ్రాక్షస్య చ సంపాతేః భవనం మారుతాత్మజః ।**
**విద్యుద్రూపస్య భీమస్య ఘనస్య విఘనస్య చ ॥ 23**

**పదచ్ఛేదము** :– ధూమ్రాక్షస్య – చ – సంపాతేః – భవనం – మారుతాత్మజః –

విద్యుద్రూపస్య – భీమస్య – ఘనస్య – విఘనస్య – చ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– ధూమ్రాక్షస్య = ధూమ్రాక్షునియొక్కయు, సంపాతేః చ = సంపాతి యొక్కయు, విద్యుద్రూపస్య = విద్యుద్రూపునియొక్కయు, భీమస్య = భీమునియొక్కయు, ఘనస్య = ఘనునియొక్కయు, విఘనస్య చ = విఘనునియొక్కయు, భవనాని = భవనములనుగూర్చి, మారుతాత్మజః = హనుమంతుడు (పుప్లువే= ఎగిరెను).

**తాత్పర్యము** :– హనుమంతుడప్పుడు సీతమ్మను అన్వేషించుచు పోయి పోయి, ధూమ్రాక్షునియొక్కయు, సంపాతియొక్కయు, విద్యుద్రూపునియొక్కయు, భీముని యొక్కయు, ఘనునియొక్కయు, విఘనునియొక్కయు, భవనములలోనికి ఎగిరెను.

**శ్లో॥ శుకనాసస్య వక్రస్య శఠస్య వికటస్య చ ।**
**బ్రహ్మకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః ॥ 24**

**పదచ్ఛేదము** :– శుకనాసస్య – వక్రస్య – శఠస్య – వికటస్య – చ – బ్రహ్మకర్ణస్య – దంష్ట్రస్య – రోమశస్య – చ – రక్షసః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– శుకనాసస్య = శుకనాసునియొక్కయు, వక్రస్య = వక్రునియొక్కయు, శఠస్య = శఠునియొక్కయు, వికటస్య = వికటునియొక్కయు, బ్రహ్మకర్ణస్య = బ్రహ్మకర్ణునియొక్కయు, దంష్ట్రస్య = దంష్ట్రునియొక్కయు, రక్షసః రోమశస్య చ = రాక్షసుడైన రోమశునియొక్కయు, (భవనాని పుప్లువే = భవనములనుగూర్చి లంఘించెను).

**తాత్పర్యము** :– పిమ్మట హనుమ శుకనాసుడు, వక్రుడు, శఠుడు, వికటుడు, బ్రహ్మకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు అను రాక్షసవీరుల గృహములను గూడ సీత నన్వేషించుచు వెడలెను.

**శ్లో॥ యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య నాదినః ।**
**విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం తథా హస్తిముఖస్య చ ॥ 25**

**పదచ్ఛేదము** :– యుద్ధోన్మత్తస్య – మత్తస్య – ధ్వజగ్రీవస్య – నాదినః – విద్యుజ్జిహ్వేంద్ర జిహ్వానాం – తథా – హస్తిముఖస్య – చ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– యుద్ధోన్మత్తస్య = యుద్ధోన్మత్తునియొక్కయు, మత్తస్య = మత్తుని యొక్కయు, ధ్వజగ్రీవస్య = ధ్వజగ్రీవునియొక్కయు, నాదినః = నాది అనువాని యొక్కయు, విద్యుజ్జిహ్వేంద్రజిహ్వానాం = విద్యుజ్జిహ్వుడు ఇంద్రజిహ్వుడు అనువారల యొక్కయు, తథా = అట్లే, హస్తిముఖస్య = హస్తిముఖునియొక్కయు, భవనాని చ పుప్లువే = భవనములనుగూర్చి గూడ లంఘించెను.

**తాత్పర్యము** :– యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, నాది, విద్యుజ్జిహ్వుడు, ఇంద్రజిహ్వుడు మఱియు హస్తిముఖుడు అనువారల భవనములనుగూర్చి కూడ హనుమ సీతాన్వేషణార్థమై యరిగెను.

**శ్లో॥ కరాళస్య పిశాచస్య శోణితాక్షస్య చైవ హి ।**
**క్రమమాణః క్రమేణైవ హనుమాన్మారుతాత్మజః ॥ 26**

**పదచ్ఛేదము** :– కరాళస్య – పిశాచస్య – శోణితాక్షస్య – చ – ఏవ – హి – క్రమమాణః – క్రమేణ – ఏవ – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– మారుతాత్మజః హనుమాన్ = వాయుపుత్రుడైన హనుమ, క్రమేణైవ = క్రమముగనే, క్రమమాణః = ముందున కేగుచు, కరాళస్య = కరాళునియొక్కయు, పిశాచస్య = పిశాచునియొక్కయు, శోణితాక్షస్య చ = శోణితాక్షునియొక్కయు (భవనాని = భవనములను, పుప్లువే = ఎగిరెను.)

**తాత్పర్యము** :– వాయుసుతుడైన హనుమంతుడు సీతాన్వేషణతత్పరుడై, ఇంటినుండి ఇంటికెగురుచు, పెక్కు ఇళ్ళు గడచి, కరాళుడు, పిశాచుడు, శోణితాక్షుడు అనువారల భవనములకు గూడ వెడలెను.

**శ్లో॥ తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః ।**
**తేషా మృద్ధిమతా మృద్ధిం దదర్శ సః మహాకపిః ॥ 27**

**పదచ్ఛేదము** :– తేషు – తేషు – మహార్హేషు – భవనేషు – మహాయశాః – తేషామ్ – ఋద్ధిమతామ్ – ఋద్ధిం – దదర్శ – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సః మహాయశాః మహాకపిః తేషు తేషు మహార్హేషు భవనేషు, ఋద్ధిమతాం తేషామ్, ఋద్ధిం దదర్శ.

**ప్రతిపదార్థము** :– మహాయశాః స మహాకపిః = మహాయశస్సు గల ఆ వానర శ్రేష్ఠుడు,

తేషు తేషు మహార్హేషు భవనేషు = ఆయా గొప్ప వైభవముగల భవనములందు, బుద్ధిమతాం తేషామ్ = మహాసంపన్నులై యున్నట్టి ఆ రాక్షసులయొక్క, బుద్ధిం = ఐశ్వర్యమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– మహాత్ముడైన యా హనుమ, తాను వెడలినట్టి, ఆయా మహాభవనము లందు మహావిభవసంపన్నులైన వారివారి ఐశ్వర్యవిశేషములను తిలకించెను.

**శ్లో॥ సర్వేషాం సమతిక్రమ్య భవనాని సమంతతః ।**
**ఆససా దాథ లక్ష్మీవా న్రాక్షసేంద్రనివేశనమ్ ॥ 28**

**పదచ్ఛేదము** :– సర్వేషాం – సమతిక్రమ్య – భవనాని – సమంతతః – ఆససాద – అథ – లక్ష్మీవాన్ – రాక్షసేంద్రనివేశనమ్ ॥

**అన్వయక్రమము** :– లక్ష్మీవాన్ (సః) సర్వేషాం భవనాని, సమంతతః, సమతిక్రమ్య, అథ, రాక్షసేంద్రనివేశనమ్, ఆససాద.

**ప్రతిపదార్థము** :– లక్ష్మీవాన్ = సర్వశుభలక్షణోపేతుడైన, (సః = ఆ హనుమ), సర్వేషాం = రాక్షసులందరియొక్కయు, భవనాని = నిలయములను, సమంతతః = అంతటను, సమతిక్రమ్య = దాటి, అథ = పిమ్మట, రాక్షసేంద్రనివేశనం = రాక్షసరాజైన రావణుని భవనమును, ఆససాద = చేరుకొనెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు, ఆ రాక్షసశ్రేష్ఠుల భవనముల నన్నింటిని, తిరిగి, వెదకి, పిమ్మట రావణుని భవనమును చేరుకొనెను.

**శ్లో॥ రావణ స్యోపశాయిన్యో దదర్శ హరిసత్తమః ।**
**విచర న్హరిశార్దూలో రాక్షసీ ర్వికృతేక్షణాః ॥ 29**

**పదచ్ఛేదము** :– రావణస్య – ఉపశాయిన్యః – దదర్శ – హరిసత్తమః – విచరన్ – హరిశార్దూలః – రాక్షసీః – వికృతేక్షణాః ॥

**అన్వయక్రమము** :– హరిసత్తమః, హరిశార్దూలః, విచరన్, వికృతేక్షణాః, రావణస్య ఉపశాయిన్యః, రాక్షసీః, దదర్శ.

**ప్రతిపదార్థము** :– హరిసత్తమః = వానరోత్తముడును, హరిశార్దూలః = కపిశ్రేష్ఠుడును అగు హనుమ, వికృతేక్షణాః = వికారములైన కన్నులు గల్గినట్టి, రావణస్య ఉపశాయిన్యః = రావణుని శయనరక్షకురాండ్రయిన, రాక్షసీః = రాక్షసస్త్రీలను, విచరన్ = సంచరించుచు, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** ఉపశాయిన్యః = పర్యాయశాయినులు (అనగా రావణాసురుడు నిద్రించునప్పుడు మేల్కొనియుండువారును, మేల్కొనినప్పుడు శయనించి యుండువారును.)

**తాత్పర్యము :–** హనుమ అచ్చట సంచరించుచు వికృతమైన నేత్రములు కలిగినట్టి రావణుని శయనరక్షకురాండ్రయిన రాక్షసస్త్రీలను చూచెను.

**శ్లో॥ శూలముద్గరహస్తా శ్చ శక్తితోమరధారిణీః ।**
**దదర్శ వివిధాన్ గుల్మాన్ తస్య రక్షపతే ర్గృహే ॥ 30**

**పదచ్ఛేదము :–** శూలముద్గరహస్తాః – చ – శక్తితోమరధారిణీః – దదర్శ – వివిధాన్ – గుల్మాన్ – తస్య – రక్షపతేః – గృహే ॥

**అన్వయక్రమము :–** తస్య రక్షఃపతేః గృహే, శూలముద్గరహస్తాః, శక్తితోమరధారిణీః వివిధాన్ గుల్మాన్ చ, దదర్శ.

**ప్రతిపదార్థము :–** తస్య రక్షఃపతేః = ఆ రాక్షసరాజుయొక్క, గృహే = భవనమునందు, శూలముద్గరహస్తాశ్చ = శూలము, ముద్గరము చేతియందు కలిగియున్న వారును, శక్తితోమరధారిణీః = శక్తి, తోమరము అను ఆయుధమును ధరించినవారునగు రాక్షస స్త్రీలను, వివిధాన్ గుల్మాన్ చ = వివిధములైన సైనికసమూహములను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** రావణుని భవనముముందు హనుమ శూలము, ముద్గరము, శక్తి, తోమరము వంటి ఆయుధములను ధరించినట్టి అంతఃపురరక్షకురాండ్రైన పెక్కుమంది రాక్షసస్త్రీలను, పలువిధములగు సేనాసమూహములను గాంచెను.

**శ్లో॥ రాక్షసాం శ్చ మహాకాయా న్నానాప్రహరణోద్యతాన్ ।**
**రక్తాన్ శ్వేతాన్ స్థితాం శ్చైవ హరీంశ్చాపి మహాజవాన్ ॥ 31**

**పదచ్ఛేదము :–** రాక్షసాన్ – చ – మహాకాయాన్ – నానాప్రహరణోద్యతాన్ – రక్తాన్ – శ్వేతాన్ – స్థితాన్ – చ – ఏవ – హరీన్ – చ – అపి – మహాజవాన్ ॥

**అన్వయక్రమము :–** మహాకాయాన్ నానాప్రహరణోద్యతాన్ రాక్షసాన్, రక్తాన్ శ్వేతాన్ స్థితాన్ చైవ మహాజవాన్ హరీన్ చాపి దదర్శ.

**ప్రతిపదార్థము :–** మహాకాయాన్ = పెద్ద శరీరము గలిగిన వారును, నానా

ప్రహరణోద్యతాన్ = వివిధములైన ఆయుధములతో సిద్ధముగ నున్నవారునగు, రాక్షసాన్ చ = రాక్షసులను, మహాజవాన్ = అమితమగు వేగముగలవియును, రక్తాన్ = ఎఱ్ఱనివియును, శ్వేతాన్ = తెల్లనివియును, స్థితాన్ చ = (యుద్ధమునకై) నిలచియున్నవియును అగు, హరీన్ చ = అశ్వములను, దదర్శ = చూచెను. 'స్థితాన్'కి బదులుగా, 'సితాన్' అని పాఠాంతరము. అనగా బంధింపబడియున్నవని, అర్థము.

**తాత్పర్యము** :- ఉన్నతమైన శరీరములు గలిగి, బహువిధములైన ఆయుధములను చేత ధరించియున్న రాక్షసులను, మహావేగము గలిగిన ఎఱ్ఱనివి, తెల్లనివి, యుద్ధమునకు సిద్ధముగా నిలచియున్నవియునగు అశ్వములను హనుమ తిలకించెను.

**శ్లో॥ కులీనాన్ రూపసంపన్నాన్ గజా న్పరగజారుజాన్ ।**
**నిష్ఠితాన్ గజశిక్షాయా మైరావతసమాన్ యుధి ॥ 32**

**పదచ్ఛేదము** :- కులీనాన్ - రూపసంపన్నాన్ - గజాన్ - పరగజారుజాన్ - నిష్ఠితాన్ - గజశిక్షాయామ్ - ఐరావతసమాన్ - యుధి ॥

**అన్వయక్రమము** :- కులీనాన్, రూపసంపన్నాన్, పరగజారుజాన్, గజశిక్షాయాం, నిష్ఠితాన్, యుధి, ఐరావతసమాన్, గజాన్, దదర్శ.

**ప్రతిపదార్థము** :- కులీనాన్ = ఉత్తమజాతికి చెందినవియును, రూపసంపన్నాన్ = గొప్ప రూపవైభవము కల్గియున్నవియును, పరగజారుజాన్ = శత్రుగజముల అంతమొందింపచేయునవియును, గజశిక్షాయాం నిష్ఠితాన్ = గజశిక్షయందు నిగురియున్నవియును, యుధి = యుద్ధరంగమున, ఐరావతసమాన్ = ఐరావతముతో సమానమైనవియును అగు, గజాన్ = ఏనుగులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- ఉత్తమజాతికి చెందినవియును, సుందరమైన రూపసంపద గలవియును, శత్రుగజములను మర్దింపజాలినవియును, గజశిక్షణ నొంది, ఆరితేరి యున్నవియును, యుద్ధసమయమున ఐరావతమును, తలపింప చేయునవియును అగు రావణుని ఏనుగులను హనుమ గాంచెను.

**శ్లో॥ నిహంతౄన్ పరసైన్యానాం గృహే తస్మిన్ దదర్శ సః ।**
**క్షరత శ్చ యథా మేఘాన్ స్రవత శ్చ యథా గిరీన్ ॥ 33**

**శ్లో॥ మేఘస్తనితనిర్ఘోషాన్ దుర్ధర్షాన్ సమరే పరైః ॥ 34**

**పదచ్ఛేదము** :- నిహంతౄన్ - పరసైన్యానాం - గృహే - తస్మిన్ - దదర్శ - సః క్షరతః - చ - యథా - మేఘాన్ - స్రవతః - చ - యథాగిరీన్ - మేఘ

స్తనితనిర్ఘోషాన్ – దుర్ధర్షాన్ – సమరే – పరైః ॥

**అన్వయక్రమము :–** సః క్షరతః మేఘాన్ యథా, స్రవతః గిరీన్ యథా చ స్థితాన్, మేఘస్తనిత నిర్ఘోషాన్, సమరే పరైః దుర్ధర్షాన్, పరసైన్యానాం నిహంతౄన్ గజాన్ దదర్శ.

**ప్రతిపదార్థము :–** క్షరతః = వర్షించుచున్న, మేఘాన్ యథా = మేఘములవలెను, స్రవతః = నీటిని స్రవించుచున్న, గిరీన్ యథా చ = పర్వతములవలెను, స్థితాన్ = ఉన్నట్టివియును, మేఘస్తనితనిర్ఘోషాన్ = మేఘముల ఉరుములవంటి ఘీంకారనాదములు గలవియును, సమరే = యుద్ధమున, పరైః = శత్రువులచే, దుర్ధర్షాన్ = అజేయములై యుండునవియును, పరసైన్యానాం నిహంతౄన్ = శత్రుసైన్యములను సంహరించు నట్టివియునగు, గజాన్ = ఏనుగులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** ఆ రావణభవనమునందు హనుమ వర్షించుచున్న మేఘమువలెను, నీటిధారలను స్రవించు కొండవలెను, మదజలములను వెడలగ్రక్కుచున్నట్టివై మేఘము ఉరిమినట్లు ఘీంకారములు చేయుచు, శత్రువులకు సమీపింపశక్యముగానివై శత్రువీరులను చీల్చి చెండాడు మదగజములను గాంచెను.

**శ్లో॥ సహస్రం వాహినీ స్తత్ర జాంబూనదపరిష్కృతాః ।**
**హేమజాలపరిచ్ఛిన్నా స్తరుణాదిత్యసన్నిభాః ।**
**దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే ॥ 35**

**పదచ్ఛేదము :–** సహస్రం – వాహినీః – తత్ర – జాంబూనదపరిష్కృతాః – హేమజాలపరిచ్ఛిన్నాః – తరుణాదిత్యసన్నిభాః – దదర్శ – రాక్షసేంద్రస్య – రావణస్య – నివేశనే ॥

**అన్వయక్రమము :–** తత్ర రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే, జాంబూనదపరిష్కృతాః, హేమజాలపరిచ్ఛిన్నాః తరుణాదిత్యసన్నిభాః, సహస్రం వాహినీః దదర్శ.

**ప్రతిపదార్థము :–** తత్ర = అచ్చట, రాక్షసేంద్రస్య రావణస్య = రాక్షసప్రభువైన రావణునియొక్క, నివేశనే = భవనమునందు, జాంబూనదపరిష్కృతాః = సువర్ణములచే అలంకరింపబడినవియును, హేమజాలపరిచ్ఛిన్నాః = బంగారు ఆభరణములయొక్క సమూహముతో నిండియున్నవియును, తరుణాదిత్యసన్నిభాః = బాలసూర్యునివంటి ప్రకాశముగలవియును అగు, సహస్రం వాహినీః = వేలకొలది సేనలను, దదర్శ = (హనుమ) గాంచెను.

**తాత్పర్యము :–** రావణుని భవనమునందు సువర్ణాభరణములు ధరించి బాలసూర్యునివలె ప్రకాశించుచున్నట్టి వేలకొలది సైనికులను హనుమ గాంచెను.

**శ్లో॥ శిబికా వివిధాకారా స్స కపి ర్మారుతాత్మజః ।**
**లతాగృహాణి చిత్రాణి చిత్రశాలాగృహాణి చ ॥ 36**

**పదచ్ఛేదము :–** శిబికాః – వివిధాకారాః – సః – కపిః – మారుతాత్మజః – లతాగృహాణి – చిత్రాణి – చిత్రశాలాగృహాణి – చ ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః సః కపిః, వివిధాకారాః శిబికాః, చిత్రాణి లతాగృహాణి, చిత్రశాలాగృహాణి చ, (దదర్శ).

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః సః కపిః = వాయునందనుడైన యా వానరశ్రేష్ఠుడు, వివిధాకారాః శిబికాః = బహువిధములైన ఆకారములు గల్గినట్టి పల్లకీలను, చిత్రాణి లతాగృహాణి = చిత్రములైన పొదరిండ్లను, చిత్రశాలాగృహాణి చ = బహువిధములగు చిత్రములను ప్రదర్శించు చిత్రశాలలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** పలువిధములైన పద్ధతులలో నున్న పల్లకీలను, వివిధమగు ఆకారములలో నున్న సుందరమైన పూపొదరిండ్లను, బహువిధములైన చిత్తరువులను ప్రదర్శించు చిత్రశాలలను హనుమ గాంచెను.

**శ్లో॥ క్రీడాగృహాణి చాఽన్యాని దారుపర్వతకా నపి ।**
**కామస్య గృహకం రమ్యం దివాగృహక మేవ చ ।**
**దదర్శ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే ॥ 37**

**పదచ్ఛేదము :–** క్రీడాగృహాణి – చ – అన్యాని – దారుపర్వతకాన్ – అపి – కామస్య – గృహకం – రమ్యం – దివాగృహకమ్ – ఏవ – చ – దదర్శ – రాక్షసేంద్రస్య – రావణస్య – నివేశనే ॥

**అన్వయక్రమము :–** రాక్షసేంద్రస్య రావణస్య నివేశనే, అన్యాని క్రీడాగృహాణి, దారుపర్వతకాన్ అపి, కామస్య రమ్యం గృహకం, దివాగృహకమ్ ఏవ చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** రాక్షసేంద్రస్య రావణస్య = రాక్షసరాజైన రావణునియొక్క, నివేశనే = భవనమునందు, అన్యాని = ఇతరములైనట్టి, క్రీడాగృహాణి = క్రీడామందిరములను, దారుపర్వతకాన్ అపి = కొయ్యతో నిర్మింపబడిన క్రీడాపర్వతములను, రమ్యం కామస్య గృహకం = సుందరమైన మన్మథవిహారభవనములను, దివాగృహకమ్ ఏవ చ = పగటి పూటమాత్రమే నివసించుటకై కట్టబడిన మందిరమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– రాక్షసరాజైన రావణుని భవనమునందు హనుమంతుడు ఎన్నో క్రీడామందిరములను, ఎన్నో దారునిర్మితమైన క్రీడాపర్వతములను, సుందరమైన మన్మథ విహారశాలను, పగటివేళ నివసించుటకై నిర్మించిన భవనమును గాంచెను.

**శ్లో॥ స మందరగిరిప్రఖ్యం మయూరస్థానసంకులమ్ ।**
**ధ్వజయష్టిభి రాకీర్ణం దదర్శ భవనోత్తమమ్ ॥ 38**

**పదచ్ఛేదము** :– సః – మందరగిరిప్రఖ్యం – మయూరస్థానసంకులమ్ – ధ్వజయష్టిభిః – ఆకీర్ణం – దదర్శ – భవనోత్తమమ్ ॥

**అన్వయక్రమము** :– సః మందరగిరిప్రఖ్యం, మయూరస్థానసంకులం ధ్వజయష్టిభిః ఆకీర్ణం, భవనోత్తమం దదర్శ.

**ప్రతిపదార్థము** :– సః = ఆ హనుమ, మందరగిరిప్రఖ్యం = మందర పర్వతమువలె గొప్పదైనట్టియును, మయూరస్థానసంకులం = నెమిళ్ళ గూళ్ళతో ప్రకాశించు చున్నదియును, ధ్వజయష్టిభిః ఆకీర్ణం = ధ్వజస్తంభములతో నిండినదియును అగు, భవనోత్తమం = శ్రేష్ఠమైన రావణభవనమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– మందరపర్వతమువలె నున్నత మైనదియును, నెమలిగూండ్లతో నిండి చూడముచ్చటగా నున్నదియును, పెక్కు ధ్వజస్తంభములతో వెలయుచున్నదియును అగు రావణుని మహోజ్జ్వలమైన భవనమును హనుమ కనుగొనెను.

**శ్లో॥ అనేకరత్నసంకీర్ణం నిధిజాలం సమంతతః ।**
**ధీరనిష్ఠితకర్మాంతం గృహం భూతపతే రివ ॥ 39**

**పదచ్ఛేదము** :– అనేకరత్నసంకీర్ణం – నిధిజాలం – సమంతతః – ధీరనిష్ఠితకర్మాంతం – గృహం – భూతపతేః – ఇవ ॥

**అన్వయక్రమము** :– (సః) సమంతతః అనేకరత్నసంకీర్ణం నిధిజాలం భూతపతేః గృహమ్ ఇవ ధీరనిష్ఠితకర్మాంతం (భవనోత్తమం దదర్శ).

**ప్రతిపదార్థము** :– సః = ఆ హనుమ, సమంతతః = అంతటను, అనేకరత్నసంకీర్ణం = పెక్కు రత్నములతో నిండినట్టి, నిధిజాలం = నవనిధులు గలదియును, భూతపతేః = భూతగణాధినాథుడగు శివునియొక్క, గృహమ్ ఇవ = నిలయమువలె (కైలాసమువలె) ధీరనిష్ఠితకర్మాంతం = ధీరులైన యోగుల ఉత్తమకర్మలకు ఫలితముగా నున్నట్టిదియు నగు, భవనోత్తమం = రావణుని రాజభవనమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు ఎల్లెడల నానావిధరత్నములతో నిండిన నిధులుగలదై, మహేశ్వరుని నిలయమైన కైలాసమువలె మహాయోగుల మహాసాధనఫలితముగా లభించిన పదమువలె నున్నట్టి రావణభవనమును చూచెను.

**శ్లో॥ అర్చిర్భి శ్చాపి రత్నానాం తేజసా రావణస్య చ ।**
**విరరాజాథ తద్వేశ్మ రశ్మిమా నివ రశ్మిభిః ॥ 40**

**పదచ్ఛేదము :–** అర్చిర్భిః – చ – అపి – రత్నానాం – తేజసా – రావణస్య – చ – విరరాజ – అథ – తత్ – వేశ్మ – రశ్మిమాన్ – ఇవ – రశ్మిభిః ॥

**అన్వయక్రమము :–** అథ తత్ వేశ్మ రత్నానాం అర్చిర్భిః చ, రావణస్య తేజసా చ, రశ్మిభిః రశ్మిమాన్ ఇవ విరరాజ.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, తత్ వేశ్మ = ఆ (రావణ) భవనము, రత్నానాం = మణులయొక్క, అర్చిర్భిః = కాంతులచేతను, రావణస్య = రావణాసురునియొక్క, తేజసా చ = తేజస్సుచేతను, రశ్మిభిః = కిరణములచే, రశ్మిమాన్ ఇవ = సూర్యునివలె, విరరాజ = తేజరిల్లుచుండెను.

**తాత్పర్యము :–** అచటి బహువిధములగు మణిగణముల కాంతులచేతను, రావణుని ప్రభచేతను, వేయికిరణములతో ప్రకాశించు సూర్యమండలము వలెనే ఆ రావణ భవనము తేజరిల్లుచుండెను.

**శ్లో॥ జాంబూనదమయా న్యేవ శయనా న్యాసనాని చ ।**
**భాజనాని చ ముఖ్యాని దదర్శ హరియూథపః ॥ 41**

**పదచ్ఛేదము :–** జాంబూనదమయాని – ఏవ – శయనాని – ఆసనాని చ – భాజనాని చ – ముఖ్యాని – దదర్శ – హరియూథపః ॥

**అన్వయక్రమము :–** హరియూథపః శయనాని ఆసనాని చ ముఖ్యాని భాజనాని చ జాంబూనదమయాని ఏవ దదర్శ.

**ప్రతిపదార్థము :–** హరియూథపః = వానరశ్రేష్ఠుడైన హనుమ, శయనాని = తల్పములను, ఆసనాని చ = వివిధములైన ఆసనములను, ముఖ్యాని భాజనాని చ = ప్రధానమైన పాత్రలను, జాంబూనదమయాని ఏవ = బంగారు నిర్మితములైనట్టివిగానే, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమ అచ్చటగల వివిధములైన శయ్యలును, శయనములును, బహువిధములైన ఆసనములును, ముఖ్యములైన పాత్రలును అన్నియును సువర్ణ

నిర్మితములైనవిగనే యుండుట చూచెను.

**శ్లో॥ మధ్వాసవకృతక్లేదం మణిభాజనసంకులమ్ ।**
**మనోరమ మసంబాధం కుబేరభవనం యథా ॥ 42**

**పదచ్ఛేదము** :– మధ్వాసవకృతక్లేదం – మణిభాజనసంకులమ్ – మనోరమమ్ – అసంబాధం – కుబేరభవనం – యథా ॥

**అన్వయక్రమము** :– కుబేరభవనం యథా మధ్వాసవకృతక్లేదం, మణిభాజనసంకులం మనోరమమ్, అసంబాధం, మహాగృహం ప్రవివేశ.

**ప్రతిపదార్థము** :– కుబేరభవనం యథా = కుబేరుని మందిరమువలె, మధు ఆసవకృత క్లేదం = మధువులచేతను, ఆసవములచేతను చిత్తడియైన నేల గలదియును, మణిభాజన సంకులం = రత్నకలశములచే నిండియున్నదియును, మనోహరమ్ = మనోహరమై యున్నదియును, అసంబాధం = విశాలముగ నున్నదియునగు, (మహాగృహం ప్రవివేశ = మహాభవనమును ప్రవేశించెను).

**తాత్పర్యము** :– కుబేరుని భవనమువలె మద్యములతోడను, పానీయములతోడను తడియైయున్న నేల గలదియును, రత్నకలశములతో నిండియున్నదియును, మనోహరమై విశాలముగ గానవచ్చుచున్నదియును అగు రావణుని భవనమును హనుమ ప్రవేశించెను.

**శ్లో॥ నూపురాణాం చ ఘోషేణ కాంచీనాం నినదేన చ ।**
**మృదంగతలఘోషై శ్చ ఘోషవద్భి ర్వినాదితమ్ ॥ 43**

**శ్లో॥ ప్రాసాదసంఘాతయుతం స్త్రీరత్నశతసంకులమ్ ।**
**సువ్యూఢకక్ష్యం హనుమా న్ప్రవివేశ మహాగృహమ్ ॥ 44**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రావణగృహావేక్షణం" నామ*
*షష్ఠస్సర్గః*

**పదచ్ఛేదము** :– నూపురాణాం – చ – ఘోషేణ – కాంచీనాం – నినదేన – చ – మృదంగతలఘోషైః – చ – ఘోషవద్భిః – వినాదితమ్ – ప్రాసాదసంఘాతయుతం – స్త్రీరత్నశతసంకులమ్ – సువ్యూఢకక్ష్యం – హనుమాన్ – ప్రవివేశ – మహాగృహమ్ ॥

**అన్వయక్రమము** :- హనుమాన్ నూపురాణాం ఘోషేణ చ కాంచీనాం నినదేన చ ఘోషవద్భిః మృదంగతలఘోషైశ్చ వినాదితం ప్రాసాదసంఘాతయుతం స్త్రీరత్న శతసంకులమ్ సువ్యూఢకక్ష్యం మహాగృహం ప్రవివేశ.

**ప్రతిపదార్థము** :- హనుమాన్ = హనుమంతుడు, నూపురాణాం ఘోషేణ చ = అందెలయొక్క ధ్వనులచేతను, కాంచీనాం నినదేన చ = మొలనూలుల (చిరుగంటల) యొక్క సవ్వడిచేతను, ఘోషవద్భిః = ధ్వనిగల, మృదంగతలఘోషైశ్చ = మద్దెలల మ్రోతలచేతనున్ను, వినాదితం = ప్రతిధ్వనించు చున్నట్టిదియును, ప్రాసాద సంఘాతయుతం = ఉన్నతసౌధములయొక్క సమూహముతో కూడినదియును, స్త్రీరత్న శతసంకులమ్ = వందలకొలది ఉత్తమస్త్రీలతో నిండినదియును, సువ్యూఢకక్ష్యం = చక్కగా తీర్చియున్న విభాగములు గలదియును అగు, మహాగృహం = గొప్ప భవనమును, ప్రవివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము** :- స్త్రీల కాలి అందెల మ్రోతలతోడను, మొలనూలి గంటల సవ్వడులతోడను, మృదంగవాద్యముల ధ్వనులతోడను, ప్రతిధ్వనించుచున్నట్టిదియును, ఉన్నతమైన ప్రాసాదముల వరుసలతో నిండియున్నదియును, రత్నములవంటి స్త్రీలతో ప్రకాశించుచున్నదియును, విశాలమైన ముంగిళ్ళతో కానవచ్చుచున్నదియును, అగు రావణుని యొక్క మహాభవనమును హనుమంతుడు ప్రవేశించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రావణగృహావేక్షణము" అను*
*ఆఱవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తమసర్గ

**శ్లో॥ స వేశ్మజాలం బలవాన్ దదర్శ**
**వ్యాసక్తవైడూర్యసువర్ణజాలమ్ ।**
**యథా మహత్ప్రావృషి మేఘజాలం**
**విద్యుత్పినద్ధం సవిహంగజాలమ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** సః – వేశ్మజాలం – బలవాన్ – దదర్శ – వ్యాసక్తవైడూర్యసువర్ణజాలమ్ – యథా – మహత్ – ప్రావృషి – మేఘజాలం – విద్యుత్పినద్ధం – సవిహంగజాలమ్ ॥

**అన్వయక్రమము :–** బలవాన్ సః ప్రావృషి విద్యుత్‌పినద్ధం మహత్ మేఘజాలం యథా వ్యాసక్తవైడూర్యసువర్ణజాలం సవిహంగజాలం వేశ్మజాలం దదర్శ.

**ప్రతిపదార్థము :–** బలవాన్ సః = బలశాలియైన ఆ హనుమ, ప్రావృషి = వర్షాకాలమునందు, విద్యుత్పినద్ధం = మెఱుపుతో కప్పబడియున్న, మహత్ మేఘజాలం యథా = గొప్పదైన మేఘమండలమువలె, వ్యాసక్తవైడూర్యసువర్ణజాలమ్ = పొదగబడిన వైడూర్యరత్నములుగల బంగారు కిటికీలు గలదియును, సవిహంగజాలం = పక్షుల సమూహములతో కూడినదియును అగు, వేశ్మజాలం = భవనముల సమూహములను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** బలశాలియైన హనుమంతుడు వైడూర్యమణులు పొదిగిన బంగారు గవాక్షములతోడను, వివిధములగు పక్షుల సమూహములతోడను, వర్షాకాలమునందు మెరపుతీగలతో కప్పబడియున్న మేఘసమూహమువలె ఒప్పారుచున్న రావణుని భవనసమూహమును చూచెను.

**శ్లో॥ నివేశనానాం వివిధా శ్చ శాలాః**
**ప్రధానశంఖాయుధచాపశాలాః ।**
**మనోహరా శ్చాఽపి పునర్విశాలాః**
**దదర్శ వేశ్మాద్రిషు చంద్రశాలాః ॥ 2**

**పదచ్ఛేదము** :- నివేశనానాం - వివిధాః - చ - శాలాః - ప్రధానశంఖాయుధ చాపశాలాః - మనోహరాః - చ - అపి - పునః - విశాలాః - దదర్శ - వేశ్మాద్రిషు - చంద్రశాలాః ॥

**అన్వయక్రమము** :- నివేశనానాం వివిధాః శాలాశ్చ ప్రధానశంఖాయుధచాపశాలాః - వేశ్మాద్రిషు మనోహరాః విశాలాః చంద్రశాలాః అపి దదర్శ.

**ప్రతిపదార్థము** :- నివేశనానాం = భవనములయొక్క, వివిధాః శాలాః = వివిధములైన శాలలను, ప్రధానశంఖాయుధచాపశాలాః = ముఖ్యములైన శంఖములు, ఆయుధములు, ధనుస్సులు అనువానితో ప్రకాశించుచున్నట్టి శాలలను, వేశ్మాద్రిషు = పర్వతములవంటి ఉన్నత భవనములందు, మనోహరాః = సుందరమైనవియును, విశాలాః = విశాలములైనవియును అగు, చంద్రశాలాః = శిరోగృహములను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- హనుమంతుడు కొండలవంటి ఆ భవనములందు విడిదికి అనుకూలమైన వివిధశాలలను, శంఖములు, ధనుస్సులు, మున్నగు ఆయుధములను భద్రపరచిన మందిరములను, సుందరములును సువిశాలములునగు డాబాలుగల మేడలను చూచెను.

**శ్లో॥ గృహాణి నానావసురాజితాని**
**దేవాసురై శ్చాఽపి సుపూజితాని ।**
**సర్వై శ్చ దోషైః పరివర్జితాని**
**కపి ర్దదర్శ స్వబలార్జితాని ॥ 3**

**పదచ్ఛేదము** :- గృహాణి - నానావసురాజితాని - దేవాసురైః - చ - అపి - సుపూజితాని - సర్వైః - చ - దోషైః - పరివర్జితాని - కపిః - దదర్శ - స్వబలార్జితాని ॥

**అన్వయక్రమము** :- కపిః నానావసురాజితాని దేవాసురైః చ అపి సుపూజితాని, సర్వైః దోషైశ్చ పరివర్జితాని, స్వబలార్జితాని, గృహాణి దదర్శ.

**ప్రతిపదార్థము** :- కపిః = హనుమంతుడు, నానావసురాజితాని = బహువిధములైన సంపదలచే విరాజిల్లుచున్నదియును, దేవాసురైః చ అపి = దేవతలచేతను రాక్షసులచేతను గూడ, సుపూజితాని = మిక్కిలి పూజింపబడుచున్నవియును, సర్వైః దోషైశ్చ పరివర్జితాని = సర్వవిధములైన దోషములచేతను రహితములై యున్నట్టివియును, స్వబలార్జితాని = తన బలముచే సంపాదించు కొనబడినవియును అగు, గృహాణి = భవనములను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** స్వబలార్జితాని = కుబేరునివద్దనుండి రావణుడు లంకను బలవంతముగా తీసుకొనుటచే లంక అతనికి స్వబలార్జితమయ్యెను. లేక హనుమంతుడు తన పరాక్రమముచే ఇచ్చటికి ప్రవేశము సంపాదించెను. కాబట్టి ఇచట స్వశబ్దమునకు హనుమంతునియొక్క అని కూడా అర్థము చెప్పవచ్చును.

**రామాయణ శిరోమణి :–** దేవాసురైః సుపూజితాని = దేవతలచేతను, అసురులచేతను సమముగా ప్రశంసింపబడినట్టివి రావణుని భవనములు.

**తాత్పర్యము :–** సర్వసంపదలతో విరాజిల్లుచున్నవియును, దేవాసురు లందరిచే ప్రశంసింపబడుచున్నవియును వాస్తుదోషములుమున్నగు దోషములు లేనట్టివియును, రావణుని నిజబలముచే సంపాదించుకొన్నవియును అగు భవనములను హనుమ దర్శించెను.

**శ్లో॥ తాని ప్రయత్నాభిసమాహితాని**
**మయేన సాక్షా దివ నిర్మితాని ।**
**మహీతలే సర్వగుణోత్తరాణి**
**దదర్శ లంకాధిపతే ర్గృహాణి ॥** 4

**పదచ్ఛేదము :–** తాని – ప్రయత్నాభిసమాహితాని – మయేన – సాక్షాత్ – ఇవ – నిర్మితాని – మహీతలే – సర్వగుణోత్తరాణి – దదర్శ – లంకాధిపతేః – గృహాణి ॥

**అన్వయక్రమము :–** ప్రయత్నాభిసమాహితాని మయేన సాక్షాత్ ఇవ నిర్మితాని, మహీతలే సర్వగుణోత్తరాని తాని లంకాధిపతేః గృహాణి (కపిః) దదర్శ.

**ప్రతిపదార్థము :–** ప్రయత్నాభిసమాహితాని = ప్రత్యేకప్రయత్నముచే నిర్మించబడినవియును, సాక్షాత్ = స్వయముగ, మయేన ఇవ నిర్మితాని = మయబ్రహ్మచే నిర్మించబడినట్లున్నవియును, మహీతలే = భూమండలమున, సర్వగుణోత్తరాణి = సమస్తమైన ఉత్తమగుణములచే శ్రేష్ఠమైయున్నట్టివియునగు, లంకాధిపతేః = రావణసురునియొక్క, గృహాణి = ఆ భవనములను, (కపిః) దదర్శ = (హనుమ) గాంచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మయేన సాక్షాత్ ఇవ నిర్మితాని = వస్తుతః విశ్వకర్మచే

నిర్మింపబడినప్పటికిని ఆ భవనములందు గల మాయారచనలనుబట్టి మాయావియైన మయునిచేతనే అవి రచింపబడినట్లుగా నున్నవి అని తెలుపబడెను.

**రామాయణ శిరోమణి** :– ప్రయత్నాభిసమాహితాని = నాల్గుదిక్కులయందును చక్కగాను దృఢముగాను నిర్మింపబడినట్టివి.

**గోవిందరాజీయము** :– మయేన సాక్షాత్ ఇవ నిర్మితాని = ప్రస్తుత భవనములు, రావణుడే స్వయముగా ప్రణాళికవేసి నిర్మించుకొన్నప్పటికిని తన ప్రజ్ఞావిశేషముచే మయునిచేత నిర్మింపబడినట్లుగనే నిర్మింపగల్గెనను భావము వ్యక్తమగును.

**తాత్పర్యము** :– ప్రత్యేక ప్రయత్నముచే నిర్మింపబడినవియును, విశ్వకర్మచే నిర్మితములైనను మాయాదక్షుడైన మయునిచేతనే నిర్మింపబడినట్లుగా కానవచ్చుచున్నవియును భూమిపైగల ఎల్ల భవనముల కంటెను మిక్కిలి శ్రేష్ఠమైయున్నవియునగు రావణుని భవనములను హనుమ తిలకించెను.

**శ్లో॥ తతో దదర్శోచ్ఛ్రితమేఘరూపం**
**మనోహరం కాంచనచారురూపమ్ ।**
**రక్షోఽధిప స్యాఽఽత్మబలానురూపం**
**గృహోత్తమం హ్యప్రతిరూపరూపమ్ ॥** **5**

**పదచ్ఛేదము** :– తతః – దదర్శ – ఉచ్ఛ్రితమేఘరూపం – మనోహరం – కాంచనచారురూపమ్ – రక్షోధిపస్య – ఆత్మబలానురూపం – గృహోత్తమం – హి – అప్రతిరూపరూపమ్ ॥

**అన్వయక్రమము** :– తతః ఉచ్ఛ్రితమేఘరూపం, మనోహరం కాంచనచారురూపం, రక్షోధిపస్య ఆత్మబలానురూపం అప్రతిరూపరూపం గృహోత్తమం దదర్శ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, ఉచ్ఛ్రితమేఘరూపం = ఉన్నతమైన మేఘమువంటి రూపము కలిగినట్టిదియును, మనోహరం = రమణీయమైనట్టిదియును, కాంచనచారురూపం = బంగారముచేత సుందరమైన రూపముగలదియును, రక్షోధిపస్య = రాక్షసరాజుయొక్క, ఆత్మబలానురూపం = స్వీయశక్తికి తగినట్లుగ నున్నట్టిదియును, అప్రతిరూపరూపం = సాటిలేని రూపవైభవము గలదియును అగు, గృహోత్తమం = శ్రేష్ఠమైన భవనమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– ఉన్నతమైన మేఘమువంటి ఆకారముగలదియును, మనోహరమైన సువర్ణకాంతి గలిగి రావణునిశక్తికి తగినట్లుండి లోకమున సాటిలేనిదనిపించుకొన్న

రావణుని ఆ శ్రేష్ఠమైన భవనమును హనుమంతుడు చూచెను.

**శ్లో॥ మహీతలే స్వర్గ మివ ప్రకీర్ణం**
**శ్రియా జ్వలంతం బహురత్నకీర్ణమ్ ।**
**నానాతరూణాం కుసుమావకీర్ణం**
**గిరే రివాఽగ్రం రజసాఽవకీర్ణమ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** మహీతలే – స్వర్గమ్ – ఇవ – ప్రకీర్ణం – శ్రియా – జ్వలంతం బహురత్నకీర్ణం – నానాతరూణాం – కుసుమావకీర్ణం – గిరేః – ఇవ – అగ్రం – రజసా – అవకీర్ణమ్ ॥

**అన్వయక్రమము :–** మహీతలే ప్రకీర్ణం స్వర్గమ్ ఇవ శ్రియా జ్వలంతం బహురత్నకీర్ణం, నానాతరూణాం కుసుమావకీర్ణం, రజసా అవకీర్ణం గిరేః అగ్రమ్ ఇవ స్థితం, గృహోత్తమం దదర్శ.

**ప్రతిపదార్థము :–** మహీతలే = భూతలముపై, ప్రకీర్ణం = జారిపడినట్టి, స్వర్గమ్ ఇవ = స్వర్గమువలె, శ్రియా జ్వలంతం = శోభతో వెలుగుచున్నదియును, బహురత్న కీర్ణం = బహువిధములగు రత్నములచే నిండియున్నదియును, నానాతరూణాం కుసుమావకీర్ణం = బహువిధములగు వృక్షములయొక్క పుష్పములతో నిండియున్నది యును, రజసా అవకీర్ణం = పుప్పొడిచే కప్పబడిన, గిరేః అగ్రమ్ ఇవ = కొండయొక్క కొనవలె, స్థితం = ఉన్నట్టి, గృహోత్తమం దదర్శ = (రావణుని) గొప్ప భవనమును చూచెను.

**తాత్పర్యము :–** భూమి మీదికి దిగివచ్చిన, స్వర్గమువలె గొప్ప శోభతో తేజరిల్లుచు, బహువిధములగు రత్నములతో నిండినట్టి వివిధవృక్షములయొక్క పుష్పములచేతను, పుప్పొడులచేతను కప్పబడిన కొండశిఖరమువలె నున్నట్టి రావణుని భవనరాజమును హనుమంతుడు ముచ్చటగా చూచెను.

**శ్లో॥ నారీప్రవేకై రివ దీప్యమానం**
**తటిద్భి రంభోదవ దర్చ్యమానమ్ ।**
**హంసప్రవేకై రివ వాహ్యమానం**
**శ్రియా యుతం ఖే సుకృతాం విమానమ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** నారీప్రవేకైః – ఇవ – దీప్యమానం – తటిద్భిః – అంభోదవత్ – అర్చ్యమానం – హంసప్రవేకైః – ఇవ – వాహ్యమానం – శ్రియా – యుతం – ఖే –

సుకృతాం – విమానమ్ ॥

**అన్వయక్రమము :–** నారీప్రవేకైః ఇవ దీప్యమానం తటిద్భిః అంభోదవత్ అర్చ్యమానం హంసప్రవేకైః ఇవ వాహ్యమానం సుకృతాం శ్రియా యుతం ఖే విమానం దదర్శ.

**ప్రతిపదార్థము :–** నారీప్రవేకైః ఇవ = స్త్రీరత్నములచేతవలె, దీప్యమానం = ప్రకాశించుచున్నదియును, అంభోదవత్ = మేఘమువలె, తటిద్భిః = మెరపుతీగలచే, అర్చ్యమానం = సేవింపబడుచున్నదియును, హంసప్రవేకైః ఇవ = రాజహంసల చేతవలె, వాహ్యమానం = వహింప బడుచున్నదియును, సుకృతాం శ్రియా యుతం = సత్పురుషులయొక్క పుణ్యసంపదతో నిండినదియు నగు, విమానం = విమానమును, ఖే = ఆకాశమునందు, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు అచ్చట ఆకాశమునందు సుందరులైన స్త్రీలతో ప్రకాశించుచున్నదియును, ఆకసమునందలి మెరపులచే మేఘమువలె సేవింపబడు చున్నదియును, రాజహంసలచే వహింపబడుచున్నదియును, సత్పురుషులయొక్క పుణ్యసంపదతో నిండియున్నదియును అగు పుష్పకవిమానమును చూచెను.

**శ్లో॥ యథా నగాగ్రం బహుధాతుచిత్రం**
**యథా నభశ్చ గ్రహచంద్రచిత్రమ్ ।**
**దదర్శ యుక్తీకృతమేఘచిత్రం**
**విమానరత్నం బహురత్నచిత్రమ్ ॥ 8**

**పదచ్ఛేదము :–** యథా – నగాగ్రం – బహుధాతుచిత్రం – యథా – నభః – చ – గ్రహచంద్రచిత్రమ్ – దదర్శ – యుక్తీకృతమేఘచిత్రం – విమానరత్నం – బహురత్నచిత్రమ్ ॥

**అన్వయక్రమము :–** బహుధాతుచిత్రం నగాగ్రం యథా గ్రహచంద్రచిత్రం నభః యథా యుక్తీకృతమేఘచిత్రం బహురత్నచిత్రం విమానరత్నం దదర్శ.

**ప్రతిపదార్థము :–** బహుధాతుచిత్రం = వివిధములగు గైరికాదిధాతువులచే చిత్రవర్ణము కలిగియున్న, నగాగ్రం యథా = పర్వతశిఖరమువలె యున్నదియును, గ్రహచంద్ర చిత్రం = గ్రహములు, చంద్రుడు అనెడి చిత్రములతో కూడిన, నభః యథా = ఆకాశమువలె, యుక్తీకృతమేఘచిత్రం = గుంపుగా చేయబడిన మేఘమనెడి చిత్రమువలె నున్నదియును, బహురత్నచిత్రం = బహువిధములగు రత్నములచే చిత్రవర్ణములు కలిగియున్నదియును అగు, విమానరత్నం = శ్రేష్ఠమైన యా పుష్పక విమానమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– పలురంగులుగల ధాతుశిలలచే చిత్రవర్ణము కలిగియున్న పర్వతశిఖరమువలెను, చంద్రుడు మున్నగు గ్రహములచే చిత్రముగనుండు ఆకాశమువలెను, గుంపుగా చేయబడిన మేఘములయొక్క చిత్రము వలెను, బహువిధరత్నములయొక్క చిత్రమైన కాంతులతో నిండియున్నట్టి ఆ పుష్పక విమానమును హనుమ గాంచెను.

**శ్లో॥ మహీ కృతా పర్వతరాజిపూర్ణా**
**శైలాః కృతా వృక్షవితానపూర్ణాః ।**
**వృక్షాః కృతాః పుష్పవితానపూర్ణాః**
**పుష్పం కృతం కేసరపత్రపూర్ణమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :– మహీ – కృతా – పర్వతరాజిపూర్ణా – శైలాః – కృతాః – వృక్షవితానపూర్ణాః – వృక్షాః – కృతాః – పుష్పవితానపూర్ణాః – పుష్పం – కృతం – కేసరపత్రపూర్ణమ్ ॥

**ప్రతిపదార్థము** :– మహీ = (ఆ పుష్పకవిమానమునందున్న) భూమి, పర్వతరాజిపూర్ణా = పర్వతముల వరుసతో నిండినదిగా, కృతా = చేయబడినది, శైలాః = పర్వతములు, వృక్షవితానపూర్ణాః = వృక్షసమూహములతో నిండినవిగ, కృతాః = చేయబడినవి, వృక్షాః = వృక్షములు, పుష్పవితానపూర్ణాః = పూలసమూహముతో నిండినవిగా, కృతాః = చేయబడినవి, పుష్పం = పుష్పజాతి, కేసరపత్రపూర్ణమ్ = కేసరముల తోడను, దళములతోడను నిండినదిగా, కృతం = చేయబడినది.

**తాత్పర్యము** :– ఆ పుష్పకవిమానమునందు గల నేల అంతయును కొండలవరుసతో నింపబడెను. ఆ కొండలన్నియును వృక్షసమూహముతో నింపబడెను. ఆ వృక్షము లన్నియును పువ్వుల సమూహముతో నింపబడెను. ఆ పువ్వులన్నియును కేసరముల తోడను, దళముల తోడను నిండి యున్నట్లుగా నిర్మింపబడెను.

**శ్లో॥ కృతాని వేశ్మాని చ పాండురాణి**
**తథా సుపుష్పా ణ్యపి పుష్కరాణి ।**
**పున శ్చ పద్మాని సకేసరాణి**
**ధన్యాని చిత్రాణి తథా వనాని ॥ 10**

**పదచ్ఛేదము** :– కృతాని – వేశ్మాని – చ – పాండురాణి – తథా – సుపుష్పాణి – అపి – పుష్కరాణి – పునః – చ – పద్మాని – సకేసరాణి – ధన్యాని – చిత్రాణి – తథా – వనాని ॥

**అన్వయక్రమము :–** వేశ్మాని పాండురాణి, తథా పుష్కరాణి సుపుష్పాణి, పునశ్చ పద్మాని సకేసరాణి, తథా వనాని ధన్యాని, చిత్రాణి చ కృతాని.

**ప్రతిపదార్థము :–** వేశ్మాని = మందిరములు, పాండురాణి = తెల్లవిగాను, తథా = అట్లే, పుష్కరాణి = సరస్సులు, సుపుష్పాణి = ఉత్తమములైన పుష్పములతో నిండినవిగాను, పునశ్చ = తిరిగి, పద్మాని = తామరపూవులు, సకేసరాణి = కేసరములతో నిండినవిగాను, తథా = అట్లే, వనాని = ఉద్యానవనములు, ధన్యాని = శ్రేష్ఠమైనవిగను, చిత్రాణి చ = వివిధవర్ణములు గలవిగాను, కృతాని = చేయబడినవి.

**తాత్పర్యము :–** ఆ పుష్పకవిమానమున మందిరము లన్నియును తెల్లనివై యుండునట్లును, సరస్సు లన్నియును పద్మాదిపుష్పభరితములై యుండునట్లును, పద్మములన్నియును కేసరములతో నిండియుండునట్లుగను, అటులనే ఉద్యానవనము లన్నియును మిక్కిలి మనోహరములై యుండునట్లుగను నిర్మింపబడెను.

**శ్లో॥ పుష్పాహ్వయం నామ విరాజమానం**
**రత్నప్రభాభిశ్చ వివర్ధమానమ్ ।**
**వేశ్మోత్తమానా మపి చోచ్చమానం**
**మహాకపి స్తత్ర మహావిమానమ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** పుష్పాహ్వయం – నామ – విరాజమానం – రత్నప్రభాభిః – చ – వివర్ధమానమ్ – వేశ్మోత్తమానామ్ – అపి – చ – ఉచ్చమానం – మహాకపిః – తత్ర – మహావిమానమ్ ॥

**అన్వయక్రమము :–** మహాకపిః తత్ర రత్నప్రభాభిః, వివర్ధమానం వేశ్మోత్తమానాం అపి చ ఉచ్చమానం పుష్పాహ్వయం నామ విరాజమానం, మహావిమానం దదర్శ.

**ప్రతిపదార్థము :–** మహాకపిః = వానరశ్రేష్ఠుడైన యా హనుమంతుడు, రత్నప్రభాభిః = రత్నములయొక్క ప్రభలచే, వివర్ధమానం = పెరుగుచున్నదియును, వేశ్మోత్తమానామ్ అపి చ = శ్రేష్ఠమైన భవనములకంటెను గూడ, ఉచ్చమానం = ఉన్నతమైన ప్రమాణముగలదియును (గొప్పదైన కీర్తిగలదియును), పుష్పాహ్వయం నామ = పుష్పకమను పేరు కలిగినదియునై, విరాజమానం = గొప్పదైన విమానమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'వేశ్మోత్తమానామ్ అపి ఉచ్చమానం' – దేవాలయ గోపురములకంటెను,

ఉన్నతమైన స్థానము కల్గినట్టిది.

**తాత్పర్యము :–** రత్నముల కాంతులచే ఉజ్జ్వలముగా ప్రకాశించుచున్నదియును, అచ్చటి శ్రేష్ఠమైన భవనములకంటెను ఉన్నతమైన ప్రమాణము గలదియును, పుష్పకమను పేరుతో విరాజిల్లు చున్నదియునగు మహావిమానమును హనుమ గాంచెను.

**శ్లో॥ కృతాశ్చ వైడూర్యమయా విహంగాః**
**రూప్యప్రవాళై శ్చ తథా విహంగాః ।**
**చిత్రా శ్చ నానావసుభి ర్భుజంగాః**
**జాత్యానురూపా స్తురగా శ్శుభాంగాః ॥ 12**

**పదచ్ఛేదము :–** కృతాః – చ – వైడూర్యమయాః – విహంగాః – రూప్యప్రవాళైః – చ – తథా – విహంగాః – చిత్రాః – చ – నానావసుభిః – భుజంగాః – జాత్యా – అనురూపాః – తురగాః – శుభాంగాః ॥

**అన్వయక్రమము :–** (తత్ర) వైడూర్యమయాః విహంగాః కృతాః, తథా రూప్యప్రవాళైశ్చ విహంగాః కృతాః, నానావసుభిః చిత్రాః భుజంగాశ్చ కృతాః, జాత్యా అనురూపాః శుభాంగాః తురగాః కృతాః.

**ప్రతిపదార్థము :–** తత్ర = ఆ పుష్పకమునందు, వైడూర్యమయాః = వైడూర్యమణి నిర్మితమైనట్టి, విహంగాః కృతాః = పక్షులు నిర్మింపబడినవి, తథా = అట్లే, రూప్య ప్రవాళైః చ = వెండితోడను పగడముతోడను కూడ, విహంగాః కృతాః = కొన్ని పక్షులు నిర్మింపబడియున్నవి, నానావసుభిః = వివిధములైన రత్నములచే, చిత్రాః భుజంగాః = చిత్రములైన సర్పములున్ను, కృతాః = నిర్మింపబడినవి, జాత్యా అనురూపాః = తమ ఉత్తమజాతికి తగినట్లుగా, శుభాంగాః = మంగళకరమైన అవయవములు కలిగియుండునట్లుగా, తురగాః కృతాః = అశ్వములును నిర్మింపబడియున్నవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** జాత్యానురూపాః = విమానస్థితి యోగ్యమగు అని భావము.

**తాత్పర్యము :–** ఆ విమానమునందు వైడూర్యరత్నములతోడను, వెండితోడను, పగడములతోడను, సుందరమైన పక్షులు నిర్మింపబడి అలంకరింపబడి యున్నవి. అట్లే వివిధరత్నములతో సర్పములు నిర్మింపబడియున్నవి. ఉత్తమజాతి అనిపించు నట్లుగా ఉత్తమమైన అవయవములతో ఒప్పారునట్టి గుఱ్ఱములు గూడ నిర్మింపబడినవి.

**శ్లో॥ ప్రవాళజాంబూనదపుష్పపక్షాః**
**సలీల మావర్జితజిహ్మపక్షాః ।**
**కామస్య సాక్షా దివ భాంతి పక్షాః**
**కృతా విహంగా స్సుముఖా స్సుపక్షాః ॥ 13**

**పదచ్ఛేదము :–** ప్రవాళజాంబూనదపుష్పపక్షాః – సలీలమ్ – ఆవర్జితజిహ్మపక్షాః – కామస్య – సాక్షాత్ – ఇవ – భాంతి – పక్షాః – కృతాః – విహంగాః – సుముఖాః – సుపక్షాః ॥

**అన్వయక్రమము :–** తత్ర ప్రవాళజాంబూనదపుష్పపక్షాః, సలీలమ్ ఆవర్జితజిహ్మపక్షాః సుముఖాః సుపక్షాః కృతాః విహంగాః సాక్షాత్ కామస్య పక్షాః ఇవ భాంతి.

**ప్రతిపదార్థము :–** తత్ర = ఆ విమానమునందు, ప్రవాళజాంబూనదపుష్పపక్షాః = పగడములచేతను బంగారముచేతను నిర్మింపబడిన పుష్పములతో అలంకరింపబడిన రెక్కలు గలవిగను, సలీలం = విలాసముగా, ఆవర్జిత = వంచబడిన, జిహ్మ = వంకరయైన, పక్షాః = రెక్కలుగలవిగను, సుముఖాః = చక్కని ముక్కులుగలవిగను, సుపక్షాః = అందమైన రెక్కలుగలవిగను, కృతాః = నిర్మింపబడిన, విహంగాః = పక్షులు, సాక్షాత్ = సాక్షాత్తుగా, కామస్య = మన్మథునియొక్క, పక్షాః ఇవ = సైన్యములువలె, భాంతి = ప్రకాశించుచున్నవి.

**తాత్పర్యము :–** ఆ విమానమునందలి పక్షులు, పగడములతోడను, బంగారముతోడను నిర్మింపబడిన పువ్వులతో అలంకరింపబడియుండెను. అవి తమ వంకరయైన రెక్కలలోనికి మెడలు వంకరగాచేసి జొనిపి చూడముచ్చటగా నుండెను. వాటియొక్క ముట్టెలును, రెక్కలును కూడా సుందరముగా కానవచ్చుచుండెను. ఆ కారణముచేత నవి మన్మథుని సైనికులా యనునట్లొప్పుచుండెను.

**శ్లో॥ నియుజ్యమానా స్తు గజా స్సుహస్తా**
**స్సకేసరా శ్చోత్పలపత్రహస్తాః ।**
**బభూవ దేవీ చ కృతా సుహస్తా**
**లక్ష్మీస్తథా పద్మిని పద్మహస్తా ॥ 14**

**పదచ్ఛేదము :–** నియుజ్యమానాః – తు – గజాః – సుహస్తాః – సకేసరాః – చ – ఉత్పలపత్రహస్తాః – బభూవ – దేవీ – చ – కృతా – సుహస్తా – లక్ష్మీః – తథా – పద్మిని – పద్మహస్తా ॥

**అన్వయక్రమము :–** తత్ర గజాః సుహస్తాః సకేసరాః ఉత్పలపత్రహస్తాః చ నియుజ్యమానాః కృతాః, తథా పద్మిని దేవీ లక్ష్మీః సుహస్తా పద్మహస్తా చ కృతా బభూవ.

**ప్రతిపదార్థము :–** తత్ర = ఆ విమానమునందు, గజాః = ఏనుగులు, సుహస్తాః = సుందరములైన తొండములుగలవిగను, సకేసరాః = కేసరములవంటి రోమములు గలవిగను, నియుజ్యమానాః = నియోగింపబడినవై, కృతాః = నిర్మింపబడినవి. తథా = అట్లే, పద్మిని = తామరకొలనునందు, దేవీ లక్ష్మీః = లక్ష్మీదేవి, సుహస్తా = సుందరమైన హస్తములు కలదిగను, పద్మహస్తా = తామరపువ్వు చేతియందు గలదిగను, కృతా బభూవ = నిర్మింపబడినదై యుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** నియుజ్యమానాః = ఉత్తరార్ధమున, చెప్పబోవు లక్ష్మీదేవిని, అభిషేకించు కొఱకై నియోగింపబడినదని భావము.

**తాత్పర్యము :–** ఏనుగులు అందమైన తొండములుగలవిగను, కేసరములవంటి రోమములు గలవిగను, ఉత్పలములను తొండములచే ధరించి యున్నట్లుగను నిర్మింపబడి, లక్ష్మీదేవియొక్క అభిషేకమునకు ఆయత్తమై యుండునట్లు నిర్మింపబడినవి. లక్ష్మీదేవి పద్మసరస్సునం దున్నదై చేతియందు పద్మమును ధరించి మంగళకరమైన హస్తములు గలదిగా నిర్మింపబడియుండెను.

**శ్లో॥ ఇతీవ తద్గృహ మభిగమ్య శోభనం**
**సవిస్మయో నగ మివ చారు శోభనమ్ ।**
**పున శ్చ తత్పరమసుగన్ధి సున్దరం**
**హిమాత్యయే నగ మివ చారుకన్దరమ్ ॥ 15**

**పదచ్ఛేదము :–** ఇతి – ఇవ – తద్గృహమ్ – అభిగమ్య – శోభనం – సవిస్మయః – నగమ్ – ఇవ – చారు – శోభనం – పునః – చ – తత్ – పరమసుగంధి – సుందరం – హిమాత్యయే – నగమ్ – ఇవ – చారుకన్దరమ్ ॥

**అన్వయక్రమము :–** ఇతి ఇవ హిమాత్యయే పరమసుగంధి, సుందరం చారుకందరం శోభనం నగమివ (స్థితం) శోభనం తత్ గృహం అభిగమ్య పునః చ సవిస్మయః (బభూవ).

**ప్రతిపదార్థము :–** ఇతి ఇవ = ఇట్లుండగా, హిమాత్యయే = శిశిరఋతువు

అవసానమున, పరమసుగంధి = గొప్పదైన మంచి పరిమళముగలదియును, సుందరం = మనోహరమైనదియు, చారుకందరమ్ = రమ్యమైన తొఱ్ఱలుగలదియును అగు, నగమ్ ఇవ = వృక్షమువలె నున్నట్టి, చారు శోభనం = సుందరమైన శోభగలదగు, నగమ్ ఇవ (స్థితం) = పర్వతమువలెనున్నట్టి, శోభనం తత్ గృహం = మంగళకరమైన ఆ గృహమును, అభిగమ్య = చేరి, పునః = మరల, సవిస్మయః బభూవ = ఆశ్చర్యసమన్వితుడాయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** అభిగమ్య పునః సవిస్మయః బభూవ = ఆ వింతలకు పరిమితి లేకపోవుటచే తిరిగి తిరిగి హనుమ ఆశ్చర్యమును పొందుచుండెనని భావము.

**గోవిందరాజీయము :–** పునశ్చ అభిగమ్య = తిరిగి తిరిగి చూచి హనుమ యా అద్భుతదృశ్యమునకు ఆశ్చర్యము నొందెనని భావము.

**రామానుజీయము :–** అభిగమ్య పునః సవిస్మయః బభూవ = ఇంతదూరము వెదకినను కాంతాజనముతో కూడిన రావణు డుండు ప్రదేశమును కనుగొనజాలనందులకు ఆశ్చర్యము నొందెనని భావము.

**తాత్పర్యము :–** వసంతఋతువునందు పుష్పించి పరిమళించుచు అందమైన కోటరములతో రమణీయమై యుండు వృక్షమువలెను, సుందరమైన పర్వతమువలెను, అతిరమణీయమై మంగళకరమై ఉన్నట్టి ఆ రావణుని గృహమును చేరి రావణాసురుని కనుగొనజాలక ఆ పుష్పకవిమానముయొక్క వైశాల్యమున కచ్చెరువొందెను.

**శ్లో॥ తత స్స తాం కపి రభిపత్య పూజితాం**
**చరన్ పురీం దశముఖబాహుపాలితామ్ ।**
**అదృశ్య తాం జనకసుతాం సుపూజితాం**
**సుదుఃఖితః పతిగుణవేగనిర్జితామ్ ॥ 16**

**పదచ్ఛేదము :–** తతః – సః – తాం – కపిః – అభిపత్య – పూజితాం – చరన్ – పురీం – దశముఖబాహుపాలితామ్ – అదృశ్య – తాం – జనకసుతాం – సుపూజితాం – సుదుఃఖితః – పతిగుణవేగనిర్జితామ్ ॥

**అన్వయక్రమము :–** తతః దశముఖబాహుపాలితాం, పూజితాం తాం పురీమ్, అభిపత్య, చరన్, కపిః, పతిగుణవేగనిర్జితాం, సుపూజితాం, తాం జనకసుతామ్, అదృశ్య, సుదుఃఖితః, బభూవ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, దశముఖబాహుపాలితాం = దశగ్రీవుని భుజ బలముచే పాలింపబడుచున్నదియును, పూజితాం = గౌరవింపబడుచున్నదియును, తాం పురీం = ఆ లంకాపురిని, అభిపత్య = చేరి, చరన్ = చరించుచు, కపిః = హనుమ, పతిగుణవేగనిర్జితాం = భర్తయొక్క గుణప్రభావముచే ఆకృష్టయైనదియును, సుపూజితాం = మిక్కిలి మన్నింపబడుచున్నదియునగు, తాం జనకసుతాం = ఆ సీతాదేవిని, అదృశ్య = కనుగొనజాలక, సుదుఃఖితః బభూవ = మిక్కిలి దుఃఖించినవాడయ్యెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి** :– పతిగుణవేగనిర్జితాం = భర్తయైన శ్రీరామునియొక్క అద్భుత గుణములయొక్క స్మరణచే కలిగిన ఉద్వేగముచే లొంగిపోయి యున్నదని భావము.

**తాత్పర్యము** :– పిమ్మట హనుమ రావణుని పరాక్రమముచే సంరక్షింపబడుచున్నట్టి ఆ లంకాపురియందు చరించుచు, శ్రీరాముని కళ్యాణగుణవశీకృతయై జగత్ పూజ్యురాలయిన జనకతనయను కనుగొనజాలక కడుదిగులునొందెను.

**శ్లో॥ తత స్తదా బహువిధభావితాత్మనః**
**కృతాత్మనో జనకసుతాం సువర్త్మనః ।**
**అపశ్యతో ఌభవ దతిదుఃఖితం మనః**
**సుచక్షుషః ప్రవిచరతో మహాత్మనః ॥ 17**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"పుష్పకదర్శనం" నామ*
*సప్తమస్సర్గః.*

**పదచ్ఛేదము** :– తతః – తదా – బహువిధభావితాత్మనః – కృతాత్మనః – జనకసుతాం – సువర్త్మనః – అపశ్యతః – అభవత్ – అతిదుఃఖితం – మనః – సుచక్షుషః – ప్రవిచరతః – మహాత్మనః ॥

**అన్వయక్రమము** :– తతః బహువిధభావితాత్మనః, కృతాత్మనః, సువర్త్మనః, సుచక్షుషః, ప్రవిచరతః, మహాత్మనః, జనకసుతామ్ అపశ్యతః, హనుమతః మనః అతిదుఃఖితం అభవత్.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, బహువిధభావితాత్మనః = బహువిధములుగా

ఊహించుచున్న ఆత్మకర్తవ్యముగలవాడును, కృతాత్మనః = ధృఢమైన మనస్సు గలవాడును, సువర్త్మనః = సన్మార్గవర్తియును, సుచక్షుషః = ఉత్తమమైన చూపు గలవాడును, ప్రవిచరతః = అంతటను సంచరించుచున్నవాడును, మహాత్మనః = మహనీయుడును, జనకసుతామ్ అపశ్యతః = జానకిని చూడలేనివాడునగు, హనుమతః = హనుమంతునియొక్క, మనః = మనస్సు, తదా = ఆ సమయమునందు, అతిదుఃఖితమ్ అభవత్ = మిక్కిలి చింతాకులమైన దాయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సుచక్షుషః = శ్రుతిస్మృతిన్యాయరూపమైన నేత్రములు గలవాడని అర్థము.

**రామాయణ శిరోమణి :–** బహువిధభావితాత్మనః = దాస్యము మున్నగు బహువిధములైన భక్తిభావములచే అర్చింపబడిన పరమాత్మస్వరూపుడైన శ్రీరాముడు గలవాడు, సుచక్షుషః = అప్రాకృతమైన నేత్రములు గలవాడు.

**గోవిందరాజీయము :–** సువర్త్మనః = సదాచారసంపన్నుడు, సుచక్షుషః = దూర సూక్ష్మ విషయదర్శనమునందు అప్రతిహతమైన నేత్రదృష్టిగలవాడు.

**రామానుజీయము :–** సుచక్షుషః = ఒక్కసారి చూచుట మాత్రముచేతనే కరతలా మలకముగా సర్వమును స్పష్టముగ చూడశక్తి గలవాడు.

**తాత్పర్యము :–** అంతట బహువిధములైన భావనలతో నిండిన మనస్సు గలవాడును, సన్మార్గవర్తనుడును, గొప్ప దర్శనశక్తి గలవాడును అగు ఆ హనుమంతుడు సీతమ్మను కనుగొనజాలక చింతావ్యాకులచిత్తుడయ్యెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"పుష్పకదర్శనము" అను*
*ఏడవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## అష్టమసర్గ

**శ్లో॥ స తస్య మధ్యే భవనస్య సంస్థితం**
**మహ ద్విమానం మణివజ్రచిత్రితమ్ ।**
**ప్రతప్తజాంబూనదజాలకృత్రిమం**
**దదర్శ వీరః పవనాత్మజః కపిః ॥ 1**

**పదచ్ఛేదము :–** సః – తస్య – మధ్యే – భవనస్య – సంస్థితం – మహత్ – విమానం – మణివజ్రచిత్రితమ్ – ప్రతప్తజాంబూనదజాలకృత్రిమం – దదర్శ – వీరః – పవనాత్మజః – కపిః ॥

**అన్వయక్రమము :–** సః, వీరః, పవనాత్మజః కపిః, తస్య భవనస్య మధ్యే సంస్థితం, మణివజ్రచిత్రితం ప్రతప్తజాంబూనదజాలకృత్రిమం, మహత్ విమానం దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ, వీరః = మహావీరుడైన, పవనాత్మజః కపిః = వాయునందనుడైన హనుమ, తస్య భవనస్య మధ్యే = ఆ భవనముయొక్క మధ్యభాగమున, సంస్థితః = అలరారుచున్నట్టి, ప్రతప్తజాంబూనదజాలకృత్రిమం = పుటముపెట్టబడి మేలిమి బంగారముతో నిర్మింపబడినదియును, మణివజ్రచిత్రితం = మణులతోడను వజ్రములతోడను చిత్రింపబడినదియునగు, మహద్విమానం = గొప్పదైన పుష్పకవిమానమును, దదర్శ = తిలకించెను.

**తాత్పర్యము :–** ఆ మహాభవనములమధ్య శుద్ధసువర్ణముతోడను, వజ్రవైడూర్యాది రత్నములతోడను నిర్మింపబడిన బహువిధములగు చిత్రములుగల పుష్పకవిమానమును హనుమ తిలకించెను.

**శ్లో॥ త దప్రమేయాప్రతికారకృత్రిమం**
**కృతం స్వయం సాధ్వితి విశ్వకర్మణా ।**
**దివం గతం వాయుపథప్రతిష్ఠితం**
**వ్యరాజతాஉஉదిత్యపథస్య లక్ష్మవత్ ॥ 2**

**పదచ్ఛేదము** :- తత్ - అప్రమేయాప్రతికారకృత్రిమం - కృతం - స్వయం - సాధు - ఇతి - విశ్వకర్మణా - దివం - గతం - వాయుపథప్రతిష్ఠితం - వ్యరాజత - ఆదిత్యపథస్య - లక్ష్మవత్ ॥

**అన్వయక్రమము** :- అప్రమేయాప్రతికారకృత్రిమం, విశ్వకర్మణా స్వయం సాధు ఇతి కృతం, దివం గతం, వాయుపథప్రతిష్ఠితం తత్, ఆదిత్యపథస్య లక్ష్మవత్ వ్యరాజత.

**ప్రతిపదార్థము** :- అప్రమేయాప్రతికారకృత్రిమం = అపరిమితముగాను, అనుపమానముగాను నిర్మింపబడినదియును, విశ్వకర్మణా = విశ్వకర్మచే, స్వయం = తనంతటతాను, సాధు ఇతి = మేలైనది యని, కృతం = నిర్మింపబడినదియును, దివం గతం = ఆకాశమునందున్నదియును, వాయుపథప్రతిష్ఠితం = అంతరిక్ష మార్గమున స్థాపింపబడినదియును అగు, తత్ = ఆ పుష్పకవిమానము, ఆదిత్యపథస్య = సూర్యుని మార్గమునకు, లక్ష్మవత్ = చిహ్నమువలె, వ్యరాజత = విరాజిల్లుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- అప్రమేయ అప్రతికారకృత్రిమం = అనగా ఇంత యనరాని సౌందర్యాదులచే ప్రతిమలచే సంపాదించిన చిత్రశోభగలది.

**తాత్పర్యము** :- అపరిమితమును, అనుపమానముగా విశ్వకర్మచే తన నిర్మాణములలోకెల్ల శ్రేష్ఠమైన నిర్మాణమనిపించుకొనుటకై నిర్మింపబడినదియును అగు ఆ విమానము ఆకాశమున వెలుగొందుచు సూర్యుని మార్గమును తెలుపు సుందరమైన ఒక చిహ్నముగా విరాజిల్లుచుండెను.

**శ్లో॥ న తత్ర కించి న్న కృతం ప్రయత్నతో**
**న తత్ర కించి న్న మహార్హరత్నవత్ ।**
**న తే విశేషా నియతా స్సురేష్వపి**
**న తత్ర కించి న్న మహావిశేషవత్ ॥ 3**

**పదచ్ఛేదము** :- న - తత్ర - కించిత్ - న - కృతం - ప్రయత్నతః - న - తత్ర - కించిత్ - న - మహార్హరత్నవత్ - న - తే - విశేషాః - నియతాః - సురేషు - అపి - న - తత్ర - కించిత్ - న - మహావిశేషవత్ ॥

**అన్వయక్రమము** :- తత్ర ప్రయత్నతః న కృతం కించిత్ నాస్తి; తత్ర మహార్హరత్నవత్ కించిత్ నాస్తి; తే విశేషాః సురేష్వపి న నియతాః; తత్ర న మహావిశేషవత్ కించిత్ నాస్తి.

**ప్రతిపదార్థము** :– తత్ర = ఆ పుష్పకవిమానమునందు, ప్రయత్నతః = విశేష ప్రయత్నముచేత, న కృతం = చేయబడనిది, కించిత్ నాస్తి = కొంచెముగూడ లేదు, తత్ర = అచ్చట, న మహార్ఘరత్నవత్ = అమూల్యములైన రత్నములతో నిర్మింపబడనిది, కించిత్ = కొంచెముగూడ, నాస్తి = లేదు; తే విశేషాః = అచ్చటనున్న ఆ విశేషములు, సురేష్వపి = దేవతలలోగూడ, న సంతి = లేవు; తత్ర = అచ్చట, న మహావిశేషవత్ = అద్భుతమైన విశేషము కలిగి యుండనిది, కించిత్ నాస్తి = కొంచెముగూడ లేదు.

**తాత్పర్యము** :– ఆ పుష్పకవిమానమునందు కనుపించున వన్నియును గొప్ప ప్రయత్నముచే సాధించినట్టివే. అచ్చట గల వస్తువులన్నియును అమూల్యములైన రత్నములతో నిర్మితమైనవియే. అచ్చట గల విశేషములు దేవలోకమునందుగాని, దేవవిమానములందుగాని కన్పింపవు. అచ్చట అద్భుతముకానట్టి విషయమేమియును లేదు.

**శ్లో॥ తపస్సమాధానపరాక్రమార్జితం**
**మనస్సమాధానవిచారచారిణమ్ ।**
**అనేకసంస్థానవిశేషనిర్మితం**
**తత స్తత స్తుల్యవిశేషదర్శనమ్ ॥** 4

**పదచ్ఛేదము** :– తపస్సమాధానపరాక్రమార్జితం – మనస్సమాధానవిచారచారిణమ్ – అనేకసంస్థానవిశేషనిర్మితం – తతః – తతః – తుల్యవిశేషదర్శనమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– తపస్సమాధానపరాక్రమార్జితం = తపస్సుచేతను, యోగశక్తిచేతను, పరాక్రమముచేతను అర్జింపబడినదియును, మనస్సమాధానవిచారచారిణమ్ = మనస్సునందలి తలంపుననుసరించి సంచరించగల శక్తిగలదియును, అనేకసంస్థాన విశేషనిర్మితం = బహువిధములైన దృశ్యవిశేషములతో నిర్మింపబడినదియును, తతః తతః = తరువాత తరువాత, తుల్యవిశేషదర్శనం = ఒకదానితో నొకటి సర్వసమానము గాను, ఒకదానికంటె నొకటి గొప్ప విశేషముగలదిగాను కనిపించునట్టిదై యున్నట్టి, పుష్పకం దదర్శ = పుష్పకవిమానమును చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– తపస్సమాధానపరాక్రమార్జితం = తపస్సుచేతను ఉపవాసాదులచేతను, సమాధియోగములచేతను, లభించిన పరాక్రమముచే అర్జించుకొన్నది.

**గోవిందరాజీయము** :- అనేకసంస్థానవిశేషనిర్మితం = విమానగోపురాది సన్నివేశములతో నిర్మింపబడినది.

**తాత్పర్యము** :- రావణాసురుడు తపస్సుచే సాధించిన పరాక్రమముచే అర్జించినదియును, మనస్సునందలి తలంపుననుసరించి సంచరించునదియును, బహువిధములైన గోపురాదివిశేషములతో నిర్మింపబడినదియును, ఒకచోట అన్నియు నొకే విధములై కన్పించునట్లుగను, ఇంకొకచోట ఒకదానివలె నింకొకటి లేకుండునట్లుగను నిర్మింపబడిన పుష్పకవిమానమును హనుమ దర్శించెను.

**శ్లో॥ మన స్సమాధాయ తు శీఘ్రగామినం**
**దురావరం మారుతతుల్యగామినమ్ ।**
**మహాత్మనాం పుణ్యకృతాం మహర్ధినాం**
**యశస్వినా మగ్ర్యముదా మివాలయమ్ ॥ 5**

**పదచ్ఛేదము** :- మనః – సమాధాయ – తు – శీఘ్రగామినం – దురావరం – మారుతతుల్యగామినమ్ – మహాత్మనాం – పుణ్యకృతాం – మహర్ధినాం – యశస్వినామ్ – అగ్ర్యముదామ్ – ఇవ – ఆలయమ్ ॥

**ప్రతిపదార్థము** :- మనః సమాధాయ = (యజమాని) మనస్సును గ్రహించి, శీఘ్రగామినం = వేగముగా పోవునట్టిదియును, దురావరం = అడ్డుకొన శక్యముగా నిదియును, మారుతతుల్యగామినం = వాయువుతో సమానముగా పోవునదియును, మహాత్మనాం = మహనీయులయొక్కయు, పుణ్యకృతాం = పుణ్యాత్ములయొక్కయు, మహర్ధినాం = మహైశ్వర్యవంతులయొక్కయు, యశస్వినాం = కీర్తిసంపన్నుల యొక్కయు, అగ్ర్యముదాం = మహానందమునకు అధికారులైన దేవేంద్రాదుల యొక్కయు, ఆలయమ్ ఇవ స్థితం = నిలయమువలెనున్నట్టి, పుష్పకం దదర్శ = పుష్పక విమానమును చూచెను.

**బొంబాయిప్రతి** :- దురావరం కి బదులుగా దురాసదం అని గలదు; అనగా అల్పులకు పొంద శక్యము గానిది.

**తాత్పర్యము** :- యజమానియొక్క మనస్సును అనుసరించి వేగమును పెంచి పోవునదియును, శత్రువు ఎదుర్కొనుటకు సాధ్యము కానిదియును, వాయువేగము గలదియును, మహాత్ములును, పుణ్యాత్ములును, తపస్సంపన్నులును, మహాయశ స్సంపన్నులును, మహానందమునకు అధికారులు నగు దేవేంద్రాదులకు నివాసముగా నుండదగినట్టి పుష్పకవిమానమును హనుమ దర్శించెను.

**శ్లో॥ విశేష మాలంబ్య విశేషసంస్థితం**
**విచిత్రకూటం బహుకూటమండితమ్ ।**
**మనోభిరామం శరదిందునిర్మలం**
**విచిత్రకూటం శిఖరం గిరే ర్యథా ॥ 6**

**పదచ్ఛేదము** :– విశేషమ్ – ఆలంబ్య – విశేషసంస్థితం – విచిత్రకూటం – బహుకూట మండితమ్ – మనోభిరామం – శరదిందునిర్మలం – విచిత్రకూటం – శిఖరం – గిరేః – యథా ॥

**ప్రతిపదార్థము** :– విశేషమ్ ఆలంబ్య = విశేషవస్తువును ఆధారముగా చేసుకొని, విశేషసంస్థితం = అసాధారణముగ నిర్మింపబడినదియును, విచిత్రకూటం = ఆశ్చర్యకరములైన శిఖరములు గలదియును, బహుకూటమండితం = బహు శిఖరములతో అలంకరింపబడినదియును, మనోభిరామం = మనోజ్ఞమైనట్టిదియును, శరదిందునిర్మలం = శరత్కాలచంద్రునివలె స్వచ్ఛమైనదియును, విచిత్రకూటం = విచిత్రములైన శిఖరములు గలదియును అగు, పుష్పకం దదర్శ = పుష్పకవిమానమును (హనుమ) చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– విశేషమ్ ఆలంబ్య విశేషసంస్థితం = ఒకానొక గతివిశేషమును అవలంబించి విశేషమైన ప్రదేశమైన ఆకాశమునందు నిలచియున్నట్టి, విచిత్రకూటం = ఆశ్చర్యవస్తువులకు నిలయమైనట్టి, బహుకూటమండితం = పెక్కుశాలలతో నిండినట్టిది.

**తాత్పర్యము** :– గొప్పవైన విశేషవస్తువులతో గొప్పదైన విశేషవస్తువుగా నిర్మింపబడిన దియును, (విశేషమైన గమనశక్తిచే విశేషమైన ప్రదేశమునందు నిలుచునట్టిదియును) శరత్కాలపు చంద్రునివలె మనోహరమైయుండునదియును, మహాపర్వతశిఖరమువలె విచిత్రములైన శృంగములతో ప్రకాశించునదియును అగు పుష్పకవిమానమును హనుమ దర్శించెను.

**శ్లో॥ వహంతి యం కుండలశోభితాననాః**
**మహాశనా వ్యోమచరా నిశాచరాః ।**
**వివృత్తవిధ్వస్తవిశాలలోచనాః**
**మహాజవా భూతగణా స్సహస్రశః ॥ 7**

**పదచ్ఛేదము** :– వహంతి – యం – కుండలశోభితాననాః – మహాశనాః – వ్యోమచరాః – నిశాచరాః – వివృత్తవిధ్వస్తవిశాలలోచనాః – మహాజవాః – భూతగణాః – సహస్రశః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– యం = ఏ పుష్పకవిమానము నైతే, కుండలశోభితాననాః = కర్ణాభరణములతో ప్రకాశించు ముఖముగలవారును, మహాశనాః = అమితాహారులును, వ్యోమచరాః = గగనచారులును, నిశాచరాః = రాత్రించరులును, వివృత్త విధ్వస్త విశాలలోచనాః = గుండ్రని వంకరయైన పెద్దకన్నులుగలవారును, మహాజవాః = మహావేగము గలవారును అగు, సహస్రశః భూతగణాః = వేలకొలదిగ భూత సమూహములు, వహంతి = మోయుచున్నవో, తం పుష్పకం దదర్శ = అట్టి పుష్పకమును (హనుమ) గాంచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'మహాశనాః' = మహాదేహులు, వివృత్తవిధ్వస్తవిశాలలోచనాః = వర్తులములైనట్టి, వంగియున్నట్టి, విశాలలోచనములు గలవారు, వహంతి భూతగణాః = ఆలయముపై గోపురమును వహించువారి చిత్రములున్నట్లుగా ఇచ్చట ప్రతిమారూపముగా భూతగణములు పుష్పకమును వహించియున్నవని గ్రహించవలెను. లేనిచో రావణాంతఃపురమునందు పురుషసంచారము శక్యముగానందున వీరి సంచారము అసాధ్యము.

**తాత్పర్యము** :– కర్ణాభరణములతో ప్రకాశించువారును, పెద్ద పొట్టలు గలవారును, గగనవిహారులును, రాత్రించరులును, గుండ్రని వంకరయైన పెద్ద కన్నులు గలవారును, అమితమగు వేగము గలవారును, అగు వేలకొలది భూతముల సమూహము లా పుష్పకవిమానమును మోయుచుండెను.

**శ్లో॥ వసంతపుష్పోత్కరచారుదర్శనం**
**వసంతమాసా దపి కాంతదర్శనమ్ ।**
**స పుష్పకం తత్ర విమాన ముత్తమం**
**దదర్శ త ద్వానరవీరసత్తమః ॥ 8**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే ఆదికావ్యే సుందరకాండే*
*"పుష్పకానువర్ణనం" నామ అష్టమస్సర్గః.*

**పదచ్ఛేదము** :– వసంతపుష్పోత్కరచారుదర్శనం – వసంతమాసాత్ – అపి –

కాంతదర్శనమ్ – సః – పుష్పకం – తత్ర – విమానమ్ – ఉత్తమం – దదర్శ – తత్ – వానరవీరసత్తమః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– తత్ర = ఆ లంకానగరమునందు, వానరవీరసత్తమః సః = వానరవీరులలో శ్రేష్ఠుడైనట్టి ఆ హనుమ, వసంతపుష్పోత్కరచారుదర్శనం = వసంత ఋతువునందలి పుష్పసముదాయమువలె సుందరముగా కానవచ్చునదియును, వసంతమాసాత్ అపి = వసంతఋతువుకంటెనుగూడ, కాంతదర్శనమ్ = మనోహరముగా కానవచ్చునదియును అగు, తత్ ఉత్తమం పుష్పకం విమానం = ఆ శ్రేష్ఠమైనట్టి పుష్పకవిమానమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమంతు డచ్చట వసంతఋతువునందు వికసించు పుష్ప సముదాయమువలె సుందరముగా గానవచ్చుచున్నదియును, వసంతకాలముకంటెను గూడ మనోహరమై కాన్పించుచున్నదియునగు అద్భుతమైన ఆ పుష్పకవిమానమును ముచ్చటగా జూచెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"పుష్పకానువర్ణనము" అను*
*ఎనిమిదవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# నవమసర్గ

**శ్లో॥ త స్యాలయవరిష్ఠస్య మధ్యే విపుల మాయతమ్ ।**
**దదర్శ భవనశ్రేష్ఠం హనుమా న్మారుతాత్మజః ॥ 1**

**పదచ్ఛేదము** :- తస్య - ఆలయవరిష్ఠస్య - మధ్యే - విపులమ్ - ఆయతమ్ - దదర్శ - భవనశ్రేష్ఠం - హనుమాన్ - మారుతాత్మజః ॥॥

**అన్వయక్రమము** :- మారుతాత్మజః హనుమాన్, తస్య ఆలయవరిష్ఠస్య మధ్యే విపులమ్ ఆయతం, భవనశ్రేష్ఠం దదర్శ.

**ప్రతిపదార్థము** :- మారుతాత్మజః హనుమాన్ = వాయునందనుడైన హనుమ, తస్య ఆలయవరిష్ఠస్య మధ్యే = ఆ భవనరాజమైన పుష్పకముయొక్క మధ్యమునందు, విపులమ్ ఆయతం = విశాలమైనదియును దీర్ఘమైనదియును అగు, భవనశ్రేష్ఠం = శ్రేష్ఠమైన గృహమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- తస్య ఆలయవరిష్ఠస్య మధ్యే = లంక మధ్యనుగల పెక్కుగృహములు తనయందు ఇముడ్చుకొన్న ఒక గృహముయొక్క నడుమ.

**గోవిందరాజీయము** :- ఆలయవరిష్ఠస్య మధ్యే అనగా పుష్పకవిమానముయొక్క నడుమ.

**రామానుజీయము** :- ఆలయవరిష్ఠస్య మధ్యే = పుష్పకమునకు ఆధారభూతమైన రావణుని గృహమునందు, భవనశ్రేష్ఠమ్ = అనగా పుష్పకవిమానము.

**తాత్పర్యము** :- హనుమంతుడా ఉత్తమభవనముయొక్క మధ్యమునందు ఒకానొక సువిశాలమైన భవనమును గాంచెను (అనగా పుష్పకమును అని భావము)

**శ్లో॥ అర్ధయోజనవిస్తీర్ణ మాయతం యోజనం హి తత్ ।**
**భవనం రాక్షసేంద్రస్య బహుప్రాసాదసంకులమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :– అర్ధయోజనవిస్తీర్ణమ్ – ఆయతం – యోజనం – హి – తత్ – భవనం – రాక్షసేంద్రస్య – బహుప్రాసాదసంకులమ్ ॥

**అన్వయక్రమము** :– అర్ధయోజనవిస్తీర్ణం, యోజనమ్ ఆయతం, తత్ రాక్షసేంద్రస్య భవనం బహుప్రాసాదసంకులమ్ (అవర్తత).

**ప్రతిపదార్థము** :– అర్ధయోజనవిస్తీర్ణం = అర్ధయోజనము వెడల్పును, యోజనమ్ ఆయతం = యోజనము పొడవును కల్గినట్టి, తత్ రాక్షసేంద్రస్య భవనం = ఆ రావణాసురుని భవనము, బహుప్రాసాదసంకులమ్ (అవర్తత) = పెక్కు సౌధములతో నిండినదైయుండెను.

**తాత్పర్యము** :– రావణాసురుని ఆ భవనము అర్ధయోజనము వెడల్పును, ఆమడ పొడవును కలిగియుండి ఎన్నియో సౌధములతో నిండి యుండెను.

**శ్లో॥ మార్గమాణ స్తు వైదేహీం సీతా మాయతలోచనామ్ ।**
**సర్వతః పరిచక్రామ హనుమా నరిసూదనః ॥ 3**

**పదచ్ఛేదము** :– మార్గమాణః – తు – వైదేహీం – సీతామ్ – ఆయతలోచనామ్ – సర్వతః – పరిచక్రామ – హనుమాన్ – అరిసూదనః ॥

**అన్వయక్రమము** :– అరిసూదనః హనుమాన్ ఆయతలోచనాం వైదేహీం సీతాం మార్గమాణః (తత్ భవనం) సర్వతః పరిచక్రామ.

**ప్రతిపదార్థము** :– అరిసూదనః హనుమాన్ = శత్రువినాశకుడైన హనుమ, ఆయతలోచనాం = విశాలమైన నేత్రములు కలిగినట్టి, వైదేహీం సీతాం = విదేహ రాజపుత్రియైన సీతను, మార్గమాణః = అన్వేషించుచున్నవాడై, తత్ భవనం = ఆ భవనమును, సర్వతః పరిచక్రామ = నలుమూలలను పరిభ్రమించెను.

**తాత్పర్యము** :– శత్రుసంహారకుడైన హనుమ జానకి నన్వేషించుచు, రావణుని భవనమునందు అన్నివైపులా చక్కగా తిరుగుచుండెను.

**శ్లో॥ ఉత్తమం రాక్షసావాసం హనుమా నవలోకయన్ ।**
**ఆససాదాఽథ లక్ష్మీవాన్ రాక్షసేంద్రనివేశనమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– ఉత్తమం – రాక్షసావాసం – హనుమాన్ – అవలోకయన్ – ఆససాద – అథ – లక్ష్మీవాన్ – రాక్షసేంద్రనివేశనమ్ ॥

**అన్వయక్రమము** :– లక్ష్మీవాన్ హనుమాన్, ఉత్తమం, రాక్షసావాసమ్, అవలోకయన్

అథ రాక్షసేంద్రనివేశనం, ఆససాద.

**ప్రతిపదార్థము** :- లక్ష్మీవాన్ హనుమాన్ = శుభ లక్షణ సమన్వితుడైన హనుమ, ఉత్తమం రాక్షసావాసం = శ్రేష్ఠమైన ఆ రాక్షసనివాసమును, అవలోకయన్ = పరికించుచు, అథ = పిమ్మట, రాక్షసేంద్ర నివేశనమ్ = రావణాసురుని భవనమును, ఆససాద = చేరుకొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- రాక్షసేంద్రనివేశనమ్ ఆససాద = అని తిరిగి మొదలుపెట్టి చెప్పుట, అపూర్వమైన మరికొన్ని విశేషములను చెప్పుటకొఱకే యని గ్రహించవలెను.

**తాత్పర్యము** :- శ్రేష్ఠమైన ఆ రాక్షసభవనమును పరికించుచు ప్రజ్ఞాశాలి యగు హనుమ రావణాసురుని నివాసగృహమును చేరుకొనెను.

**శ్లో॥ చతుర్విషాణై ర్ద్విరదై స్త్రివిషాణై స్తథైవ చ ।**
**పరిక్షిప్త మసంబాధం రక్ష్యమాణ ముదాయుధైః ॥ 5**

**పదచ్ఛేదము** :- చతుర్విషాణైః - ద్విరదైః - త్రివిషాణైః - తథా - ఏవ - చ - పరిక్షిప్తమ్ - అసంబాధం - రక్ష్యమాణమ్ - ఉదాయుధైః ॥

**అన్వయక్రమము** :- చతుర్విషాణైః తథైవ త్రివిషాణైశ్చ ద్విరదైః ఉదాయుధైః రక్ష్యమాణం పరిక్షిప్తమ్ అసంబాధం నివేశనమ్ ఆససాద.

**ప్రతిపదార్థము** :- చతుర్విషాణైః = నాలుగు దంతములు గలవియును, తథైవ = అట్లే, త్రివిషాణైః = మూడు దంతములు గలవియును అగు, ద్విరదైః పరిక్షిప్తమ్ = ఏనుగులచే చుట్టబడియున్నదియును, ఉదాయుధైః = ఆయుధసన్నద్ధులైన భటులచే, రక్ష్యమాణమ్ = రక్షింపబడుచున్నదియును, అసంబాధం = విశాలముగ నున్నదియును అగు, రాక్షసేంద్రనివేశనమ్ ఆససాద = రావణుని భవనమును చేరెను.

**తాత్పర్యము** :- నాలుగు దంతములు గలవియును, మూడు దంతములు గలవియును అగు ఏనుగులచే పరివేష్టింపబడి, ఆయుధసన్నద్ధులైన భటులచే ఆ రావణభవనము రక్షింపబడుచుండెను.

**శ్లో॥ రాక్షసీభి శ్చ పత్నీభీ రావణస్య నివేశనమ్ ।**
**ఆహృతాభి శ్చ విక్రమ్య రాజకన్యాభి రావృతమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :- రాక్షసీభిః - చ - పత్నీభిః - రావణస్య - నివేశనమ్ - ఆహృతాభిః

– చ – విక్రమ్య – రాజకన్యాభిః – ఆవృతమ్ ॥

**అన్వయక్రమము :–** రావణస్య నివేశనం, పత్నీభిశ్చ, రాక్షసీభిః విక్రమ్య ఆహృతాభిః, రాజకన్యాభిశ్చ ఆవృతం, (అవర్తత).

**ప్రతిపదార్థము :–** రావణస్య నివేశనం = రావణుని భవనము, పత్నీభిశ్చ రాక్షసీభిః = ధర్మపత్నులైన రాక్షసాంగనలచేతను, విక్రమ్య ఆహృతాభిః = పరాక్రమము జూపి తేబడినట్టి, రాజకన్యాభిః చ = రాజపుత్రికలచేతను, ఆవృతమ్ = నిండియుండెను.

**తాత్పర్యము :–** ఆ రావణుని భవనము అతని భార్యలైన రాక్షసస్త్రీలచేతను, తన పరాక్రమముచే జయించుకొని తేబడినట్టి రాజపుత్రికలచేతను నిండియుండెను.

**శ్లో॥ తన్నక్రమకరాకీర్ణం తిమింగిలఝషాకులమ్ ।**
**వాయువేగసమాధూతం పన్నగై రివ సాగరమ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** తత్ – నక్రమకరాకీర్ణం – తిమింగిలఝషాకులమ్ – వాయువేగ సమాధూతం – పన్నగైః – ఇవ – సాగరమ్ ॥

**అన్వయక్రమము :–** తత్ నక్రమకరాకీర్ణం, తిమింగిలఝషాకులమ్, వాయువేగ సమాధూతం, పన్నగైః (యుతం) సాగరమ్ ఇవ (అవర్తత).

**ప్రతిపదార్థము :–** తత్ = ఆ భవనము, నక్రమకరాకీర్ణం = మొసళ్ళతోడను, మహామీనములతోడను నిండియున్నదియును, తిమింగిలఝషాకులమ్ = తిమింగలములతోడను, చేపలతోడను వ్యాకులమైనదియును, వాయువేగసమాధూతం = వాయువుయొక్క వేగముచే కల్లోలమైనదియును, పన్నగైః యుతమ్ = సర్పములతో కూడియున్నదియు నగు, సాగరమ్ ఇవ (అవర్తత) = సముద్రమువలె నుండెను.

**తాత్పర్యము :–** రావణుని భవనము మొసళ్లతోడను, మహామీనములతోడను, తిమింగిలములతోడను, మత్స్యములతోడను, సర్పములతోడను సంకులమైయుండి, వాయువేగముచే కల్లోలితమైన మహాసాగరమువలె కానవచ్చుచుండెను.

**శ్లో॥ యా హి వైశ్రవణే లక్ష్మీః యా చేంద్రే హరివాహనే ।**
**సా రావణగృహే సర్వా నిత్యమేవాఽనపాయినీ ॥ 8**

**పదచ్ఛేదము :–** యా – హి – వైశ్రవణే – లక్ష్మీః – యా – చ – ఇంద్రే – హరివాహనే – సా – రావణగృహే – సర్వా – నిత్యమ్ – ఏవ – అనపాయినీ ॥

**అన్వయక్రమము :–** యా హి లక్ష్మీః వైశ్రవణే, యా లక్ష్మీః, హరివాహనే ఇంద్రే, సా

సర్వా లక్ష్మీః, రావణగృహే, నిత్యమేవ, అనపాయినీ, వసతి.

**ప్రతిపదార్థము :-** యా హి లక్ష్మీః = ఏ లక్ష్మి, వైశ్రవణే వసతి = కుబేరుని భవనమునందు గలదో, యా లక్ష్మీః = ఏ లక్ష్మి అయితే, హరివాహనే ఇంద్రే = ఉచ్చైశ్శ్రవము వాహనముగాగల దేవేంద్రునియందు (కలదో), సా లక్ష్మీః = ఆ సంపద, సర్వా = అంతయును, రావణగృహే = రావణుని భవనమునందు, నిత్యమేవ = ఎల్లప్పుడును, అనపాయినీ = ఎడబాయనిదై, వసతి హి = ఉన్నదిగదా.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :-** ఇచ్చట ఇంద్రుని, కుబేరుని గ్రహించుట సర్వదిక్పాలురను గ్రహించుటయే యననొప్పును. అందుచేత సర్వదిక్పాలుర ఐశ్వర్యమును రావణుని భవనమునందు శాశ్వతముగా చేరియున్నదని భావము.

**తాత్పర్యము :-** ఇంద్రుని భవనమునందున, కుబేరుని భవనమునందున, ఏ సంపత్ సమృద్ధి గానవచ్చునో, ఆయా దిక్పాలుర ఐశ్వర్యమంతయు రావణాసురుని భవనము నందు నిత్యము నిరపాయముగా వెలయుచున్నది.

**శ్లో॥ యా చ రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ ।**
**తాదృశీ తద్విశిష్టా వా ఋద్ధీ రక్షోగృహే ష్విహ ॥ 9**

**పదచ్ఛేదము :-** యా – చ – రాజ్ఞః – కుబేరస్య – యమస్య – వరుణస్య – చ – తాదృశీ – తద్విశిష్టా – వా – ఋద్ధిః – రక్షోగృహేషు – ఇహ ॥

**అన్వయక్రమము :-** రాజ్ఞః కుబేరస్య యమస్య వరుణస్య చ యా ఋద్ధిః, తాదృశీ, తద్విశిష్టా వా ఋద్ధిః, ఇహ రక్షోగృహేషు, దృశ్యతే.

**ప్రతిపదార్థము :-** యా ఋద్ధిః = ఏ యైశ్వర్యము, రాజ్ఞః కుబేరస్య = రాజైన కుబేరునకును, యమస్య = యమునకును, వరుణస్య చ = వరుణునకును గలదో, తాదృశీ = అట్టిదిగాని, తద్విశిష్టా వా = అంతకుమించినట్టిదిగాని యగు, ఋద్ధిః = ఐశ్వర్యము, ఇహ = ఈ లంకయందు, రక్షోగృహేషు = రాక్షసభవనములందు, దృశ్యతే = కానవచ్చుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము :-** రక్షోగృహేషు = అనగా, రావణుని సోదరులయొక్కయు కుమారుల యొక్కయు, మంత్రుల యొక్కయు, భవనములందని భావము. ఇచ్చట సంపద

అంతయు నని అనక యుండుటచే కుబేరాదులలో ఒక్కొక్క దిక్పాలుని ఐశ్వర్యమువంటిదే ఒక్కొక్క రాక్షసునియింట ప్రత్యేకముగా నిండియున్నదని భావము.

**తాత్పర్యము :–** కుబేరుడు, యముడు, వరుణుడు, అనువారలకు ఎంతటి ఐశ్వర్య సమృద్ధియున్నదో అంతటి సమృద్ధిగాని అంతకు మించిగాని ఈ లంకయందు రావణుని పుత్ర భాతృ మిత్రాదుల భవనములందు వెలుగొందుచున్నది.

**శ్లో॥ తస్య హర్మ్యస్య మధ్యస్థం వేశ్మ చాఽన్య త్సునిర్మితమ్ ।**
**బహునిర్యూహసంకీర్ణం దదర్శ పవనాత్మజః ॥ 10**

**పదచ్ఛేదము :–** తస్య – హర్మ్యస్య – మధ్యస్థం – వేశ్మ – చ – అన్యత్ – సునిర్మితమ్ – బహునిర్యూహసంకీర్ణం – దదర్శ – పవనాత్మజః ॥

**అన్వయక్రమము :–** పవనాత్మజః తస్య హర్మ్యస్య మధ్యస్థం బహునిర్యూహసంకీర్ణం సునిర్మితమ్ అన్యత్ వేశ్మ దదర్శ.

**ప్రతిపదార్థము :–** పవనాత్మజః = వాయునందనుడు, తస్య హర్మ్యస్య = ఆ భవనమునకు, మధ్యస్థం = మధ్యగ నున్నట్టిదియును, బహునిర్యూహసంకీర్ణం = పెక్కు మదపుటేనుగులతో నిండియున్నదియును, సునిర్మితం = చక్కగా నిర్మింపబడినదియును నగు, అన్యత్ వేశ్మ = ఇంకొక భవనమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** తిరిగి భవనమును వర్ణించుట ఎందుల కనగా ఆ పుష్పక విమానముయొక్క మధ్యమునందే రావణుని నివాసభవనము వేరొకటి యున్నదను విషయమును స్పష్టపరచుటకే.

**తాత్పర్యము :–** ఆ భవనమధ్యమున పెక్కు మదపుటేనుగులచే కాపలాకాయబడుచున్న సుందరమైన వేరొక భవనమును హనుమంతుడు కనుగొనెను.

**శ్లో॥ బ్రహ్మణో ఽర్థే కృతం దివ్యం దివి య ద్విశ్వకర్మణా ।**
**విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** బ్రహ్మణః – అర్థేః – కృతం – దివ్యం – దివి – యత్ – విశ్వకర్మణా విమానం – పుష్పకం – నామ – సర్వరత్నవిభూషితమ్ ॥

**అన్వయక్రమము :–** విశ్వకర్మణా దివి బ్రహ్మణః అర్థే దివ్యం సర్వరత్నవిభూషితం పుష్పకం నామ యత్ విమానం కృతం తత్ దదర్శ.

**ప్రతిపదార్థము** :– విశ్వకర్మణా = దేవశిల్పియైన విశ్వకర్మచే, దివి = స్వర్గమునందు, బ్రహ్మణః అర్థే = బ్రహ్మనిమిత్తము, దివ్యం = శ్రేష్ఠమైన, సర్వరత్నవిభూషితం = సమస్తరత్నములతో అలంకరింపబడినట్టి, పుష్పకం నామ = పుష్పక మను పేరు కలిగినట్టి, యత్ విమానం కృతం = ఏ విమానము నిర్మింపబడియుండెనో, తత్ దదర్శ = దానిని చూచెను.

**తాత్పర్యము** :– పూర్వము దేవశిల్పియైన విశ్వకర్మచే స్వర్గలోకమునందు బ్రహ్మదేవుని ఉపయోగము నిమిత్తమై సమస్తరత్నములతో అలంకరింపబడినట్టి దివ్యమైన ఏ పుష్పకవిమానము నిర్మింపబడియుండెనో అద్దానిని హనుమ గాంచెను.

**శ్లో॥ పరేణ తపసా లేభే య త్కుబేరః పితామహాత్ ।**
**కుబేర మోజసా జిత్వా లేభే త ద్రాక్షసేశ్వరః ॥ 12**

**పదచ్ఛేదము** :– పరేణ – తపసా – లేభే – యత్ – కుబేరః – పితామహాత్ – కుబేరమ్ – ఓజసా – జిత్వా – లేభే – తత్ – రాక్షసేశ్వరః ॥

**అన్వయక్రమము** :– కుబేరః పరేణ తపసా పితామహాత్ యత్ పుష్పకం లేభే, తత్ రాక్షసేశ్వరః, ఓజసా కుబేరం జిత్వా లేభే.

**ప్రతిపదార్థము** :– కుబేరః = కుబేరుడు, పరేణ తపసా = తీవ్రమైన తపస్సుచే, పితామహాత్ = బ్రహ్మదేవునినుండి, యత్ పుష్పకం = ఏ పుష్పకవిమానమును, లేభే = పొందెనో, తత్ = ఆ పుష్పకమును, కుబేరం = కుబేరుని, ఓజసా = పరాక్రమముచే, జిత్వా = జయించి, రాక్షసేశ్వరః = రాక్షసరా జయిన రావణుడు, లేభే = పొందెను.

**తాత్పర్యము** :– పూర్వము కుబేరుడు గొప్ప తపస్సు చేసి బ్రహ్మదేవునినుండి ఆ పుష్పకవిమానమును మొదట తాను సంపాదించెను. పిమ్మట రావణుడు తన పరాక్రమముచే ఆ కుబేరుని జయించి ఆ పుష్పకమును అతనినుండి మరల తాను గైకొనెను.

**శ్లో॥ ఈహామృగసమాయుక్తైః కార్తస్వరహిరణ్మయైః ।**
**సుకృతైరాచితం స్తంభైః ప్రదీప్తమివ చ శ్రియా ॥ 13**

**పదచ్ఛేదము** :– ఈహామృగసమాయుక్తైః – కార్తస్వరహిరణ్మయైః – సుకృతైః – ఆచితం – స్తంభైః – ప్రదీప్తమ్ – ఇవ – చ – శ్రియా ॥

**అన్వయక్రమము** :– కార్తస్వరహిరణ్మయైః ఈహామృగసమాయుక్తైః సుకృతైః స్తంభైః ఆచితం, శ్రియా ప్రదీప్తమ్ ఇవ. (స్థితం పుష్పకమ్ ఆరురోహ) చూ.శ్లో. 19

**ప్రతిపదార్థము** :– కార్తస్వరహిరణ్మయైః = బంగారముతోడను వెండితోడను నిర్మింపబడిన, ఈహామృగసమాయుక్తైః = తోడేళ్ళ (బొమ్మల)తో గూడినట్టి, సుకృతైః = సుందరముగా నిర్మింపబడినట్టి, స్తంభైః = స్తంభములతో, ఆచితం = వ్యాప్తమైనట్టిదియును, శ్రియా ప్రదీప్తమ్ ఇవ = శోభతో తేజరిల్లుచున్నదియు నగు. (ఇచ్చట 'ఇవ' వాక్యాలంకారము) పుష్పకం = పుష్పకమును, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము** :– బంగారముతోను, వెండితోను నిర్మింపబడిన తోడేలు బొమ్మలుగల సుందరమైన స్తంభములతో నిండియున్నదియును, అనుపమానమైన శోభతో తేజరిల్లుచున్నదియు నగు (ఆ పుష్పకవిమానమును హనుమ ఆరోహించెను).

**శ్లో॥ మేరుమందరసంకాశై రుల్లిఖద్భి రి వాంబరమ్ ।**
**కూటాగారై శ్శుభాకారై స్సర్వత స్సమలంకృతమ్ ॥ 14**

**పదచ్ఛేదము** :– మేరుమందరసంకాశైః – ఉల్లిఖద్భిః – ఇవ – అంబరమ్ – కూటాగారైః – శుభాకారైః – సర్వతః – సమలంకృతమ్ ॥

**అన్వయక్రమము** :– మేరుమందరసంకాశైః అంబరమ్ ఉల్లిఖద్భిః ఇవ శుభాకారైః కూటాగారైః సర్వతః సమలంకృతమ్.

**ప్రతిపదార్థము** :– మేరుమందరసంకాశైః = మేరుపర్వతము వలెను మందరపర్వతము వలెను, అంబరమ్ ఉల్లిఖద్భిః ఇవ = ఆకాశమును ఒరయుచున్నట్లుగా నున్నవియును, శుభాకారైః = మంగళకరమైన రూపము కలిగినవియును అగు, కూటాగారైః = రహస్యభవనములచే, సర్వతః సమలంకృతమ్ = అంతటను చక్కగా అలంకరింప బడినట్టి, (పుష్పకమ్ ఆరురోహ = పుష్పకమును ఆరోహించెను).

**తాత్పర్యము** :– ఆ పుష్పకవిమానము ఎల్లయెడల ఆకసము నంటుచు మేరుమందర పర్వతములను పోలి రమణీయములై యున్న రహస్యభవనములతో నిండియుండెను.

**శ్లో॥ జ్వలనార్కప్రతీకాశం సుకృతం విశ్వకర్మణా ।**
**హేమసోపానసంయుక్తం చారుప్రవరవేదికమ్ ॥ 15**

**పదచ్ఛేదము** :– జ్వలనార్కప్రతీకాశం – సుకృతం – విశ్వకర్మణా – హేమసోపాన సంయుక్తం – చారుప్రవరవేదికమ్ ॥ (విమానమ్ ఆరురోహ)

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– విశ్వకర్మణా సుకృతం = విశ్వకర్మచే చక్కగ నిర్మింపబడినట్టిదియును,

జ్వలనార్క ప్రతీకాశం = అగ్నితోడను సూర్యునితోడను సమమైనదియును, హేమసోపాన సంయుక్తం = బంగారు సోపానములతో కూడినట్టిదియును, చారుప్రవరవేదికం = అందమైన, శ్రేష్ఠమైన వేదికలు కలిగినట్టిదియును అగు, పుష్పకం (ఆరురోహ = పుష్పకము నారోహించెను.)

**తాత్పర్యము** :- విశ్వకర్మ తన నేర్పుమీద నిర్మించినదియును, అగ్నివలెను, సూర్యునివలెను తేజరిల్లుచున్నదియును, సువర్ణసోపానములతో గూడినదియును, సుందరమై ఉన్నతమైనట్టి వేదికలు కలిగి యున్నదియును అగు నా పుష్పకవిమానమును హనుమ ఆరోహించెను.

**శ్లో॥ జాలవాతాయనై ర్యుక్తం కాంచనైః స్ఫాటికై రపి ।**
**ఇంద్రనీలమహానీలమణిప్రవరవేదికమ్ ॥ 16**

**పదచ్ఛేదము** :- జాలవాతాయనైః - యుక్తం - కాంచనైః - స్ఫాటికైః - అపి - ఇంద్రనీలమహానీలమణిప్రవరవేదికమ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- కాంచనైః = సువర్ణమయ మైనట్టియు, స్ఫాటికైః = స్ఫటికనిర్మితము లైనట్టియు, జాలవాతాయనైః = చిన్నవియు పెద్దవియు నగు గవాక్షములతో, యుక్తం = కూడినదియును, ఇంద్రనీల మహానీలమణిప్రవర వేదికం = ఇంద్రనీలములు, మహానీలములు అనెడి శ్రేష్ఠమైన రత్నములతో నిర్మింపబడిన వేదికలు కలిగినట్టిదియు నగు (పుష్పకమ్ ఆరురోహ = పుష్పకమును ఆరోహించెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- ఇంద్రనీలః = ఇంద్రనీల మనగా క్షీరమునకు నీలత్వమును అనగా నైల్యప్రకాశమును చేయునది, మహానీలమనగా సింహళమునందు పుట్టినట్టిది.

**గోవిందరాజీయము** :-

శ్లో॥ క్షీరమధ్యే క్షిపే న్నీలం క్షీరం చేన్నీలతాం వ్రజేత్ ।
ఇంద్రనీల మితి ఖ్యాత మితి చాగస్త్యభాషితమ్ ॥

శ్లో॥ సింహళాకరసంభూతా మహానీలా ఇతి స్మృతాః ॥

**తాత్పర్యము** :- బంగారముతోను, స్ఫటికముతోను నిర్మించిన వివిధగవాక్షములు గలదియును, ఇంద్రనీల మహానీల మణులచే నిర్మింపబడిన పెద్దవైన వేదికలు

కల్గినట్టిదియును అగు పుష్పకమును హనుమ గాంచెను.

**శ్లో॥ విద్రుమేణ విచిత్రేణ మణిభి శ్చ మహాధనైః ।**
**నిస్తులాభి శ్చ ముక్తాభి స్తలేనాఽభివిరాజితమ్ ॥ 17**

**పదచ్ఛేదము :–** విద్రుమేణ – విచిత్రేణ – మణిభిః – చ – మహాధనైః – నిస్తులాభిః – చ – ముక్తాభిః – తలేన – అభివిరాజితమ్ ॥

**అన్వయక్రమము :–** విచిత్రేణ విద్రుమేణ, మహాధనైః మణిభిః చ, నిస్తులాభిః ముక్తాభిః చ తలేన అభివిరాజితం. (పుష్పకమ్ ఆరురోహ).

**ప్రతిపదార్థము :–** విచిత్రేణ విద్రుమేణ = విచిత్రములైన పగడములతోడను, మహాధనైః మణిభిశ్చ = అమూల్యములైన మణిగణములతోడను, నిస్తులాభిః ముక్తాభిః చ = సాటిలేని ముత్యములతోడను (నిర్మింపబడిన), తలేన = అడుగుభాగముచే, విరాజితం = ప్రకాశించుచున్నట్టి (పుష్పకమ్ ఆరురోహ = పుష్పకమును అధిరోహించెను).

**తాత్పర్యము :–** విచిత్రములైన పగడములతోడను, అమూల్యములైన రత్నములతోడను, సాటిలేని ముత్యములతోడను నిర్మింపబడినట్టి గచ్చునేలతో ప్రకాశించుచున్న పుష్పకమును హనుమ ఆరోహించెను.

**శ్లో॥ చందనేన చ రక్తేన తపనీయనిభేన చ ।**
**సుపుణ్యగంధినా యుక్త మాదిత్యతరుణోపమమ్ ॥ 18**

**పదచ్ఛేదము :–** చందనేన – చ – రక్తేన – తపనీయనిభేన – చ – సుపుణ్యగంధినా – యుక్తమ్ – ఆదిత్యతరుణోపమమ్ ॥

**అన్వయక్రమము :–** రక్తేన, తపనీయనిభేన, సుపుణ్యగంధినా చ, చందనేన యుక్తం, ఆదిత్యతరుణోపమం (పుష్పకమ్ ఆరురోహ)

**ప్రతిపదార్థము :–** రక్తేన = ఎఱ్ఱనైనట్టిదియును, తపనీయనిభేన = సువర్ణముతో సమానమైనట్టిదియును, సుపుణ్యగంధినా = పవిత్రమైన పరిమళముగలదియును అగు, చందనేన = మంచిగంధముతో, యుక్తం = కూడియున్నదియును, ఆదిత్యతరుణోపమం = లేతసూర్యునివలె ప్రకాశించుచున్నదియునగు, (పుష్పకమ్ ఆరురోహ = పుష్పకమును అధిరోహించెను).

**తాత్పర్యము :–** ఎఱ్ఱని బంగారువన్నె కలిగినట్టియు, పవిత్రమైన పరిమళముతో కూడిన చందనముతో నిండియున్నదై, బాలసూర్యునివలె ప్రకాశించుచున్నట్టి పుష్పక

విమానమును హనుమ ఆరోహించెను.

**శ్లో॥ కూటాగారై ర్వరాకారై ర్వివిధై స్సమలంకృతమ్ ।**
**విమానం పుష్పకం దివ్య మారురోహ మహాకపిః ॥ 19**

**పదచ్ఛేదము :–** కూటాగారైః – వరాకారైః – వివిధైః – సమలంకృతమ్ – విమానం – పుష్పకం – దివ్యమ్ – ఆరురోహ – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** వివిధైః వరాకారైః కూటాగారైః సమలంకృతం, దివ్యం పుష్పకం విమానం మహాకపిః ఆరురోహ.

**ప్రతిపదార్థము :–** వివిధైః = బహువిధములైనట్టి, వరాకారైః = గొప్ప ఆకారములతో నున్నట్టి, కూటాగారైః = రహస్యభవనములచే, సమలంకృతం = అలంకరింపబడినట్టి, దివ్యం పుష్పకం విమానం = శ్రేష్ఠమైన పుష్పకవిమానమును, మహాకపిః ఆరురోహ = హనుమ ఆరోహించెను.

**తాత్పర్యము :–** వివిధములైన, సుందరములైన కూటాగారములతో వెలయుచున్నట్టి దివ్యమైన ఆ పుష్పకవిమానమును హనుమ ఆరోహించెను.

**శ్లో॥ తత్రస్థ స్స తదా గంధం పానభక్ష్యాన్నసంభవమ్ ।**
**దివ్యం సమ్మూర్ఛితం జిఘ్ర ద్రూపవంత మి వాఽనిలమ్ ॥ 20**

**పదచ్ఛేదము :–** తత్రస్థః – సః – తదా – గంధం – పానభక్ష్యాన్నసంభవమ్ – దివ్యం – సమ్మూర్ఛితం – జిఘ్రత్ – రూపవంతమ్ – ఇవ – అనిలమ్ ॥

**అన్వయక్రమము :–** తత్రస్థః సః పానభక్ష్యాన్నసంభవం దివ్యం సమ్మూర్ఛితం గంధం తదా రూపవంతమ్ అనిలమ్ ఇవ జిఘ్రత్.

**ప్రతిపదార్థము :–** తత్రస్థః = ఆ పుష్పకవిమానమునందున్నవాడై, సః = ఆ హనుమంతుడు, తదా = అప్పుడు, పానభక్ష్యాన్నసంభవం = పానీయములనుండియు, భక్ష్యములనుండియును, ఇతరాహారములనుండియు వెడలినదై, సమ్మూర్ఛితం = వ్యాపించినట్టి, దివ్యగంధం = గొప్పదైన పరిమళమును, రూపవంతమ్ అనిలమ్ ఇవ = మూర్తీభవించిన వాయువునువలె, జిఘ్రత్ = వాసన చూచెను.

**తాత్పర్యము :–** హనుమ ఆ పుష్పకమునందుండి అచ్చటి పానీయములయొక్కయు భక్ష్యములయొక్కయు దివ్యమైన పరిమళము తనను ముసురుకొనుచుండగా ఆ పరిమళమును, రూపమును ధరించిన తండ్రియైన వాయువును చూచినట్లే ఎంచి ప్రీతిగా వాసనచూచెను.

**శ్లో॥ స గంధ స్తం మహాసత్త్వం బంధు ర్బంధు మి వోత్తమమ్ ।**
**ఇత ఏ హీ త్యువా చేవ తత్ర యత్ర స రావణః ॥ 21**

**పదచ్ఛేదము** :– సః – గంధః – తం – మహాసత్త్వం – బంధుః – బంధుమ్ – ఇవ – ఉత్తమమ్ – ఇతః – ఏహి – ఇతి – ఉవాచ – ఇవ – తత్ర – యత్ర – సః – రావణః ॥

**అన్వయక్రమము** :– సః గంధః, తం మహాసత్త్వమ్, ఉత్తమం బంధుం బంధుః ఇవ, యత్ర సః రావణః, తత్ర, ఇతః ఏహి, ఇతి ఉవాచ ఇవ.

**ప్రతిపదార్థము** :– సః గంధః = ఆ పరిమళము, తం మహాసత్త్వం = ఆ మహా బలాఢ్యుడైన హనుమను, బంధుః = బంధువు, ఉత్తమం బంధుమ్ ఇవ = ఉత్తముడైన బంధువునివలె, యత్ర సః రావణః = ఆ రావణుడెక్కడనుండెనో, తత్ర = అచ్చటికి, ఇతః ఏహి = ఇచ్చటికి రమ్ము, ఇతి = అని, ఉవాచ ఇవ = పలికినట్లుండెను.

**తాత్పర్యము** :– ఆ పరిమళము బలశాలియైన హనుమను గూర్చి రావణు డిచ్చట నున్నాడు, ఇటకు రమ్ము అని, ఒక బంధువు తనకిష్టుడైన ఇంకొక బంధువును పిలుచునట్లుగా రావణు డున్నచోటికి పిలిచినట్లుండెను.

**శ్లో॥ తత స్తాం ప్రస్థితః శాలాం దదర్శ మహతీం శుభాం ।**
**రావణస్య మనఃకాంతాం కాంతా మివ వరస్త్రియమ్ ॥ 22**

**పదచ్ఛేదము** :– తతః – తాం – ప్రస్థితః – శాలాం – దదర్శ – మహతీం – శుభామ్ – రావణస్య – మనఃకాంతాం – కాంతామ్ – ఇవ – వరస్త్రియమ్ ॥

**అన్వయక్రమము** :– తతః ప్రస్థితః, రావణస్య మనఃకాంతాం, కాంతాం వరస్త్రియమ్ ఇవ శుభాం, మహతీం, తాం శాలాం దదర్శ.

**ప్రతిపదార్థము** :– తతః = అటనుండి, ప్రస్థితః = బయలుదేరినవాడై, రావణస్య మనఃకాంతాం = రావణునకు మనోహరమైనట్టి, కాంతాం వరస్త్రియమ్ ఇవ = రమణీయమైన ఉన్నతజాతిస్త్రీనివలె, శుభాం = మంగళకరమైనట్టి, తాం మహతీం శాలాం = ఆ గొప్పదైనట్టి శాలను, దదర్శ = చూచెను.

**బొంబాయిప్రతి** :– మనఃకాంతాం కి బదులుగా మహాకాంతాం అని పాఠము.

**తాత్పర్యము** :– హనుమంతుడు అచ్చటినుండి వెడలి రావణాసురుని మనస్సునకు ప్రియమైన సుందరియగు ఉన్నతకులస్త్రీవలె మంగళప్రదముగా గానవచ్చుచున్న గొప్పదైన ఆ శాలను గాంచెను.

**శ్లో॥ మణిసోపానవికృతాం హేమజాలవిభూషితామ్ ।**
**స్ఫాటికై రావృతతలాం దంతాంతరితరూపికామ్ ॥ 23**

**పదచ్ఛేదము** :- మణిసోపానవికృతాం - హేమజాలవిభూషితామ్ - స్ఫాటికైః - ఆవృతతలాం - దంతాంతరితరూపికామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- మణిసోపానవికృతాం = మణిమయ సోపానములతో ఒప్పుచున్నది యును, హేమజాలవిభూషితాం = బంగారు కిటికీలతో వెలయుచున్నదియును, స్ఫాటికైః ఆవృతతలాం = స్ఫటికఫలకములతో కప్పబడిన నేలగలదియును, దంతాంతరిత రూపికామ్ = దంతములచే నడుమ నతుకబడిన ప్రతిమలుగలదియును అగు, (తాం శాలాం దదర్శ = ఆ శాలను గాంచెను).

**తాత్పర్యము** :- రత్నములతో కట్టబడిన మెట్లు గలదియును, స్వర్ణమయములైన గవాక్షములు కలదియును, స్ఫటికఫలకములతో కప్పబడిన నేలగలదియును, దంతముతో నిర్మించిన శిల్పములు గలదియును అగు రావణుని శాలను హనుమ గాంచెను.

**శ్లో॥ ముక్తాభి శ్చ ప్రవాళై శ్చ రూప్యచామీకరై రపి ।**
**విభూషితాం మణిస్తంభై స్సుబహుస్తంభభూషితామ్ ॥ 24**

**పదచ్ఛేదము** :- ముక్తాభిః - చ - ప్రవాళైః - చ - రూప్యచామీకరైః - అపి - విభూషితాం - మణిస్తంభైః - సుబహుస్తంభభూషితామ్ ॥

**అన్వయక్రమము** :- ముక్తాభిశ్చ ప్రవాళైః చ రూప్యచామీకరైః అపి మణిస్తంభైః విభూషితాం సుబహుస్తంభభూషితాం తాం శాలాం దదర్శ.

**ప్రతిపదార్థము** :- ముక్తాభిశ్చ = ముత్యములతోడను, ప్రవాళైశ్చ = పగడములతోడను, రూప్యచామీకరైః అపి = వెండిబంగారముల తోడను (నిర్మింపబడిన), మణిస్తంభైః = రత్నస్తంభములచే, విభూషితాం = అలంకరింపబడినట్టిదియు, సుబహుస్తంభభూషితాం = అనేకములైన స్తంభములచే అలంకరింపబడినట్టిదియును అగు, (తాం శాలాం దదర్శ = రావణుని శాలను గాంచెను).

**తాత్పర్యము** :- ముత్యములతోడను, పగడములతోడను, వెండి బంగారములతోడను నిర్మింపబడిన అసంఖ్యాకములైన స్తంభములతో విరాజిల్లుచున్న ఆ రావణుని శాలను గాంచెను.

**శ్లో॥ సమై ర్బుజుభి రత్యుచ్చై స్సమంతా త్సువిభూషితైః ।**
**స్తంభైః పక్షై రి వాత్యుచ్చై ర్దివం సంప్రస్థితామివ ॥ 25**

**పదచ్ఛేదము** :- సమైః - ఋజుభిః - అత్యుచ్చైః - సమంతాత్ - సువిభూషితైః - స్తంభైః - పక్షైః - ఇవ - అత్యుచ్చైః - దివం - సంప్రస్థితామ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- సమైః, ఋజుభిః, అత్యుచ్చైః, సమంతాత్ సువిభూషితైః, స్తంభైః, పక్షైః దివం సంప్రస్థితామివ, (స్థితాం శాలాం దదర్శ).

**ప్రతిపదార్థము** :- సమైః = సమానముగానున్నవియును, ఋజుభిః = వక్రముగ లేకున్నవియును, అత్యుచ్చైః = మిక్కిలి ఉన్నతమైనవియును, సమంతాత్ సువిభూషితైః = అంతటను చక్కగా అలంకరింపబడినట్టివియును అగు, స్తంభైః = స్తంభములతో, అత్యుచ్చైః పక్షైః = ఉన్నతమైన రెక్కలతో, దివం సంప్రస్థితామ్ ఇవ స్థితాం = స్వర్గమునకు ఎగిరిపోవ గోరుచున్నట్లుగానున్నట్టి, (శాలాం దదర్శ = శాలను చూచెను).

**తాత్పర్యము** :- సమానమైనవియును, వక్రములుగానివియును, మిక్కిలి ఉన్నతములును, చక్కగా అలంకరింపబడినవియును అగు తనయొక్క స్తంభములతో ఉన్నతమైన అెక్కలతో స్వర్గమునకు ఎగురబోవుచున్న పక్షివలె కానవచ్చుచున్న ఆ శాలను హనుమ గాంచెను.

**శ్లో॥ మహత్యా కుథయాఽఽస్తీర్ణాం పృథివీలక్షణాంకయా ।**
**పృథివీ మివ విస్తీర్ణాం సరాష్ట్రగృహమాలినీమ్ ॥ 26**

**పదచ్ఛేదము** :- మహత్యా - కుథయా - ఆస్తీర్ణాం - పృథివీలక్షణాంకయా - పృథివీమ్ - ఇవ - విస్తీర్ణాం - సరాష్ట్రగృహమాలినీమ్ ॥

**అన్వయక్రమము** :- పృథివీలక్షణాంకయా మహత్యా కుథయా ఆస్తీర్ణాం, సరాష్ట్ర గృహమాలినీం, విస్తీర్ణాం, పృథివీమ్ ఇవ స్థితాం శాలాం దదర్శ.

**ప్రతిపదార్థము** :- పృథివీలక్షణాంకయా = భూమియొక్క లక్షణములైన చిహ్నములతోటి గూడిన, మహత్యా కుథయా = విశాలమైన తివాచితో, ఆస్తీర్ణాం = పఱువబడినది యును, సరాష్ట్రగృహమాలినీం = దేశములోని గృహములవఱుస కలిగిన, విస్తీర్ణాం పృథివీమ్ ఇవ (దృశ్యమానాం) = విశాలమైన భూమివలె కనబడుచున్న, శాలాం దదర్శ = శాలను జూచెను).

**తాత్పర్యము** :- ఆ శాలయందలి నేల భూమిలక్షణములు కలిగినట్టి తివాచీలతో కప్పబడి యుండెను. అందలి చిత్రములను చూడగా అది తివాచీవలెగాక

గృహములతోడను, గ్రామములతోడను గూడియుండిన భూమివలెనే యుండెను. అట్టి రావణుని శాలను హనుమ గాంచెను.

**శ్లో॥ నాదితాం మత్తవిహగై ర్దివ్యగంధాధివాసితాం ।**
**పరార్ధ్యాస్తరణోపేతాం రక్షోధిపనిషేవితామ్ ॥ 27**

**పదచ్ఛేదము** :- నాదితాం - మత్తవిహగైః - దివ్యగంధాధివాసితామ్ - పరార్ధ్యాస్తరణోపేతాం - రక్షోధిపనిషేవితామ్ ॥

**ప్రతిపదార్థము** :- మత్తవిహగైః నాదితాం = మదించిన పక్షులచే కూయబడుచున్నదియును, దివ్యగంధాధివాసితాం = దివ్యమైన సువాసనలతో పరిమళింపచేయబడుచున్నదియును, పరార్ధ్యాస్తరణోపేతాం = శ్రేష్ఠమైన, పరచబడిన కంబళాదులతో కూడినదియును, రక్షోధిపనిషేవితాం = రాక్షసరాజయిన రావణునిచే సేవింపబడుచున్నదియును అగు (శాలాం దదర్శ = శాలను చూచెను)

**తాత్పర్యము** :- అచట మదించిన పక్షులు శ్రావ్యముగా ధ్వనులు చేయుచుండెను. దివ్యమైన పరిమళములు అంతటను వ్యాపించుచుండెను. అమూల్యములైన తివాచీలు చక్కగా పఱువబడియుండెను. అది రాక్షసరాజయిన రావణునికి నివాసమై అలరుచుండెను. అట్టి శాలను హనుమ గాంచెను.

**శ్లో॥ ధూమ్రా మగరుధూపేన విమలాం హంసపాండురామ్ ।**
**చిత్రాం పుష్పోపహారేణ కల్మాషీ మివ సుప్రభామ్ ॥ 28**

**పదచ్ఛేదము** :- ధూమ్రామ్ - అగరుధూపేన - విమలాం - హంసపాండురామ్ - చిత్రాం - పుష్పోపహారేణ - కల్మాషీమ్ - ఇవ - సుప్రభామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- అగరుధూపేన ధూమ్రాం = ధూపద్రవ్యములయొక్క పొగచే నల్లనైయున్నదియును, హంసపాండురాం విమలాం = హంసలవంటి ధావళ్యముగలదై ధవళవర్ణము కలిగినదియును, పుష్పోపహారేణ చిత్రాం = పుష్పములయొక్క సముదాయముచే చిత్రవర్ణము కలిగినదియును, కల్మాషీమ్ ఇవ సుప్రభామ్ = వసిష్ఠుని కామధేనువు వలె గొప్ప తేజస్సుకలదియును అగు, (శాలాం దదర్శ = శాలను జూచెను).

**తాత్పర్యము** :- ఆ శాల అచ్చట పరిమళద్రవ్యములయొక్క ధూపముచే నల్లనై యుండెను. కొన్నిచోట్ల రాజహంసల ఛాయను బోలి ధవళమై యుండెను. కొన్నిచోట్ల వివిధపుష్పముల వర్ణములచే చిత్రవర్ణము గలదై యుండెను. వసిష్ఠుని హోమధేనువైన

కల్మాషివలె మహాతేజస్సుతో వెలుగొందుచుండెను. హనుమంతుడు అట్టి శాలను గాంచెను.

**శ్లో॥ మనస్సంహ్లాదజననీం వర్ణస్యాపి ప్రసాదినీం ।**
**తాం శోకనాశినీం దివ్యాం శ్రియ స్సంజననీ మివ ॥ 29**

**పదచ్ఛేదము** :– మనస్సంహ్లాదజననీం – వర్ణస్య – అపి – ప్రసాదినీం – తాం – శోకనాశినీం – దివ్యాం – శ్రియః – సంజననీమ్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– శ్రియః సంజననీమ్ ఇవ, మనస్సంహ్లాదజననీం, వర్ణస్య అపి ప్రసాదినీం, శోకనాశినీం, దివ్యాం (తాం శాలాం దదర్శ).

**ప్రతిపదార్థము** :– శ్రియః = సంపదకు, సంజననీమ్ ఇవ = పుట్టినిల్లువలె, మనస్సంహ్లాదజననీం = మనస్సునకు ఆహ్లాదమును పుట్టించునదియును, వర్ణస్య అపి = (దేహ) కాంతికికూడ, ప్రసాదినీం = స్వస్థత కల్గించునదియును, శోకనాశినీం = మనస్సునందలి శోకమును పోగొట్టునదియును, దివ్యాం = లోకోత్తరమైనదియును అగు, (తాం శాలాం దదర్శ = ఆ శాలను హనుమ జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి ముద్రణము** :– వర్ణస్యాపి ప్రసాదినీమ్ కి బదులుగా వర్ణస్యాపి ప్రసాధినీమ్ అని గలదు. అనగా దేహచ్ఛాయను అలంకరించునట్టిది అని అర్థము.

**తాత్పర్యము** :– సిరికి పుట్టినిల్లువలె నున్నట్టి ఆ శాల మనస్సునకు ఆహ్లాదమును పుట్టించునదిగ నుండెను. దేహమునకు ప్రసన్నత కల్గించునదై యుండెను. మనస్సు నందలి శోకమును నశింపచేయునదై యుండెను. అట్టి లోకోత్తరమైన రావణుని శాలను హనుమ గాంచెను.

**శ్లో॥ ఇంద్రియా ణీంద్రియార్థై స్తు పంచ పంచభి రుత్తమైః ।**
**తర్పయామాస మాతేవ తదా రావణపాలితా ॥ 30**

**పదచ్ఛేదము** :– ఇంద్రియాణి – ఇంద్రియార్థైః – తు – పంచ – పంచభిః – ఉత్తమైః తర్పయామాస – మాతా – ఇవ – తదా – రావణపాలితా ॥

**అన్వయక్రమము** :– తదా రావణపాలితా శాలా ఉత్తమైః పంచభిః ఇంద్రియార్థైః పంచ ఇంద్రియాణి మాతా ఇవ తర్పయామాస.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, రావణపాలితా (శాలా) = రావణునిచే పాలించబడు

ఆ శాల, పంచభిః ఉత్తమైః ఇంద్రియార్థైః = శ్రేష్ఠమైన ఐదు ఇంద్రియ విషయములచేతను, పంచ ఇంద్రియాణి = ఐదు ఇంద్రియములను, మాతా ఇవ = తల్లివలె, తర్పయామాస = తృప్తిపఱచెను.

**తాత్పర్యము :–** అప్పుడు ఆ రావణుని శాల హనుమంతునియొక్క శ్రోత్రత్వక్చక్షురసనా ఘ్రాణములను ఐదు ఇంద్రియములను శబ్ద స్పర్శ రూప రసగంధములనెడి ఐదు ఇంద్రియ విషయములచేతను, తల్లి బిడ్డను సంతోషపెట్టునట్లుగా తృప్తిని కలిగించెను. ఎట్లనగా సుఖస్పర్శనమైన వాయువుచే త్వగింద్రియమునకును, సుందరమైన దృశ్యముచే చక్షురింద్రియమునకును, మధురమైన గానముచే శ్రవణేంద్రియమునకును, రుచికరమైన భక్ష్యభోజ్యాదులచేత రసనేంద్రియమునకును, మనోహరపరిమళముచే ఘ్రాణేంద్రియమునకును తృప్తిని కలిగించుచుండెను.

**శ్లో॥ స్వర్గోఽయం దేవలోకోఽయ మింద్రస్యేయం పురీ భవేత్ ।**
**సిద్ధి ర్వేయం పరా హి స్యా దిత్యమన్యత మారుతిః ॥ 31**

**పదచ్ఛేదము :–** స్వర్గః – అయం – దేవలోకః – అయమ్ – ఇంద్రస్య – ఇయం – పురీ భవేత్ – సిద్ధిః – వా – ఇయం – పరా – హి – స్యాత్ – ఇతి – అమన్యత – మారుతిః ॥

**అన్వయక్రమము :–** మారుతిః అయం స్వర్గః భవేత్, అయం దేవలోకః భవేత్, ఇయం ఇంద్రస్య పురీ భవేత్, ఇయం పరా సిద్ధిర్వా స్యాత్ ఇతి అమన్యత.

**ప్రతిపదార్థము :–** మారుతిః = హనుమంతుడు, అయం స్వర్గః = ఇది స్వర్గలోకము, భవేత్ = కావలెను, అయం దేవలోకః భవేత్ = ఇది దేవతలయొక్క ఒక లోకము గావలయును, ఇయం ఇంద్రస్య పురీ భవేత్ = ఇది దేవేంద్రుని పట్టణమైన అమరావతియై యుండును, వా = లేక, ఇయం = ఇది, పరా సిద్ధిః స్యాత్ = బ్రహ్మదేవునియొక్క ఉత్కృష్టమైన తపస్సిద్ధి (గా వెలసిన లోకము) గావలయును. ఇతి అమన్యత = అని (హనుమ) తలచెను.

**తాత్పర్యము :–** తాను చూచుచున్న ఈ దృశ్యము స్వర్గమై యుండునా? లేక ఏ దేవతయొక్కయో లోకమై యుండునా? లేక ఇంద్రునియొక్క అమరావతీ నగరమై యుండునా? యని హనుమ ఆశ్చర్యనిమగ్నుడై తలచుచుండెను.

**శ్లో॥ ప్రధ్యాయత ఇ వాఽపశ్య త్ప్రదీప్తాం స్తత్ర కాంచనాన్ ।**
**ధూర్తానివ మహాధూర్తై ర్దేవనేన పరాజితాన్ ॥ 32**

**పదచ్ఛేదము :–** ప్రధ్యాయతః – ఇవ – అపశ్యత్ – ప్రదీప్తాన్ – తత్ర – కాంచనాన్ – ధూర్తాన్ – ఇవ – మహాధూర్తైః – దేవనేన – పరాజితాన్ ॥

**అన్వయక్రమము :–** దేవనేన మహాధూర్తైః పరాజితాన్ ధూర్తాన్ ఇవ తత్ర ప్రదీప్తాన్ కాంచనాన్ (దీపాన్) ప్రధ్యాయతః ఇవ అపశ్యత్.

**ప్రతిపదార్థము :–** దేవనేన = ద్యూతక్రీడచేత, మహాధూర్తైః = పెద్దజూదగాండ్రచే, పరాజితాన్ = ఓడింపబడినట్టి, ధూర్తాన్ ఇవ = జూదరులనువలె, తత్ర = ఆ శాలయందు, ప్రదీప్తాన్ కాంచనాన్ (దీపాన్) = గొప్పగా వెలుగుచున్న బంగారు (స్తంభముమీది) దీపములను, ప్రధ్యాయతః ఇవ = నిశ్చలముగా (కొద్దికాంతితో) నున్నట్లుగా, అపశ్యత్ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ప్రధ్యాయతః ఇవ = మందమైన, తేజస్సుతో నిశ్చలముగా, వెలుగుటకు కారణము, తేజశ్శాలియైన, రావణునిముందు దీపములు వెలవెల బోవుటయని భావము.

**తాత్పర్యము :–** హనుమకు అచట కాంచన స్తంభములమీద వెలుగుచున్న దీపములు గానవచ్చెను. అవి రావణుని ప్రభముందు, ద్యూతప్రవీణులచే ఓడిపోయి దిగులుతో కూడిన సామాన్య జూదరులవలె, తేజోహీనములై కాన్పించుచుండెను.

**శ్లో॥ దీపానాం చ ప్రకాశేన తేజసా రావణస్య చ ।**
**అర్చిర్భి ర్భూషణానాం చ ప్రదీప్తే త్యభ్యమన్యత ॥ 33**

**పదచ్ఛేదము :–** దీపానాం – చ – ప్రకాశేన – తేజసా – రావణస్య – చ – అర్చిర్భిః – భూషణానాం – చ – ప్రదీప్తా – ఇతి – అభ్యమన్యత ॥

**అన్వయక్రమము :–** దీపానాం ప్రకాశేన చ, రావణస్య తేజసా చ భూషణానాం అర్చిర్భిః చ, (సా శాలా) ప్రదీప్తా ఇతి, అభ్యమన్యత.

**ప్రతిపదార్థము :–** దీపానాం ప్రకాశేన చ = దీపముల ప్రకాశముచేతనున్ను, రావణస్య తేజసా చ = రావణునియొక్క తేజస్సు చేతనున్ను, భూషణానాం అర్చిర్భిః = ఆభరణముల కాంతులచేతను, సా శాలా = ఆ శాల, ప్రదీప్తా ఇతి = జ్వలించుచున్నదని, అభ్యమన్యత = అనుకొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'ప్ర దీప్తా' = అనుటచే సమీపకాలములో జరుగబోవు, అగ్నిదాహము, సూచింపబడినది.

**తాత్పర్యము :–** ఆ శాలయందలి దీపములయొక్క ప్రకాశముచేతను, రావణుని తేజస్సుచేతను, అచ్చటివారి వివిధాభరణముల కాంతులచేతను, ఉజ్జ్వలముగా గానవచ్చుచున్న ఆ శాల, అగ్నిచేత జ్వలించుచున్న శాలయా? యని హనుమకు అనిపించెను.

**శ్లో॥ తతోఽపశ్య త్కుథాసీనం నానావర్ణాంబరస్రజమ్ ।**
**సహస్రం వరనారీణాం నానావేషవిభూషితమ్ ॥ 34**

**పదచ్ఛేదము :–** తతః – అపశ్యత్ – కుథాసీనం – నానావర్ణాంబరస్రజమ్ – సహస్రం – వరనారీణాం – నానావేషవిభూషితమ్ ॥

**అన్వయక్రమము :–** తతః కుథాసీనం నానావర్ణాంబరస్రజం నానావేషవిభూషితం, వరనారీణాం సహస్రమ్, అపశ్యత్.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, కుథాసీనం = రత్నకంబళమునందున్నదియును, నానావర్ణాంబరస్రజం = వివిధవర్ణములుగల వస్త్రములను మాలికలను ధరించియున్నట్టిదియు, నానావేషవిభూషితం = పలువిధములైన వేషములతో అలంకరించుకొన్నట్టిదియు అగు, వరనారీణాం సహస్రం = ఉత్తమస్త్రీలయొక్క సహస్రమును, అపశ్యత్ = తిలకించెను.

**తాత్పర్యము :–** వివిధవర్ణముల వస్త్రములను, మాలికలను ధరించి, బహువిధములైన సుందరవేషములతో అలంకరించుకొని, అచటి రత్నకంబళులపై శయనించియున్న వేలకొలది ఉత్తమస్త్రీలను హనుమ గాంచెను.

**శ్లో॥ పరివృత్తేఽర్ధరాత్రే తు పాననిద్రావశం గతం ।**
**క్రీడి త్వోపరతం రాత్రౌ సుష్వాప బలవ త్తదా ॥ 35**

**పదచ్ఛేదము :–** పరివృత్తే – అర్ధరాత్రే – తు – పాననిద్రావశం – గతమ్ – క్రీడిత్వా – ఉపరతం – రాత్రౌ – సుష్వాప – బలవత్ – తదా ॥

**అన్వయక్రమము :–** రాత్రౌ క్రీడిత్వా ఉపరతం, పాననిద్రావశం గతం, అర్ధరాత్రే పరివృత్తే తదా బలవత్ సుష్వాప.

**ప్రతిపదార్థము :–** రాత్రౌ = రాత్రిసమయమునందు, క్రీడిత్వా = క్రీడించి, ఉపరతం = అలసియుండి, పాననిద్రావశం గతం = మద్యపానమునకును నిద్రకును వశమై యుండి, అర్ధరాత్రే పరివృత్తే = సగము రాత్రి గడచి పోగా, తత్ = ఆ స్త్రీసమూహము, తదా = అప్పుడు, బలవత్ సుష్వాప = గాఢముగా నిద్రించెను.

**తాత్పర్యము :–** అర్ధరాత్రిసమయమువరకును, విశృంఖలముగా క్రీడించి, మద్యపానాదులచే వివశులై, అప్పుడు ఒడలెఱుంగకుండ గాఢముగా నిద్రించియుండిరి.

**శ్లో॥ త త్ప్రసుప్తం విరురుచే నిశ్శబ్దాంతరభూషణం ।**
**నిశ్శబ్దహంసభ్రమరం యథా పద్మవనం మహత్ ॥ 36**

**పదచ్ఛేదము :–** తత్ – ప్రసుప్తం – విరురుచే – నిశ్శబ్దాంతరభూషణమ్ – నిశ్శబ్ద హంసభ్రమరం – యథా – పద్మవనం – మహత్ ॥

**అన్వయక్రమము :–** నిశ్శబ్దాంతరభూషణం ప్రసుప్తం తత్, నిశ్శబ్దహంసభ్రమరం మహత్ పద్మవనం యథా, విరురుచే.

**ప్రతిపదార్థము :–** నిశ్శబ్దాంతరభూషణం = ధ్వని చేయుట మాని యున్నట్టి ఆభరణములు కలిగియున్న, ప్రసుప్తం తత్ = గాఢనిద్రలో మునిగి యున్నట్టి ఆ స్త్రీ సమూహము, నిశ్శబ్దహంసభ్రమరం = శబ్దము చేయుట మానినట్టి హంసలును, తుమ్మెదలునుగల, మహత్ పద్మవనం యథా = గొప్పదైన తామరకొలనువలె, విరురుచే = మిక్కిలి ప్రకాశించుచుండెను.

**తాత్పర్యము :–** తమ తమ ఆభరణముల ధ్వనులు అణగియుండగా గాఢనిద్రలో మునిగియున్నట్టి ఆ స్త్రీసమూహము, శబ్దము చేయుట మానినట్టి హంసలతోడను, తుమ్మెదలతోడను కూడియున్న పెద్ద తామరకొలనువలె, హనుమకు సుందరముగా కానవచ్చెను.

**శ్లో॥ తాసాం సంవృతదంతాని మీలితాక్షాణి మారుతిః ।**
**అపశ్య త్పద్మగంధీని వదనాని సుయోషితామ్ ॥ 37**

**పదచ్ఛేదము :–** తాసాం – సంవృతదంతాని – మీలితాక్షాణి – మారుతిః – అపశ్యత్ – పద్మగంధీని – వదనాని – సుయోషితామ్ ॥

**అన్వయక్రమము :–** మారుతిః, సంవృతదంతాని, మీలితాక్షాణి, పద్మగంధీని, తాసాం సుయోషితాం వదనాని, అపశ్యత్.

**ప్రతిపదార్థము** :- మారుతిః = హనుమ, సంవృతదంతాని = మూసికొనియున్న దంతములు కలిగినట్టియు, మీలితాక్షాణి = మూసికొనియున్న కన్నులు గలిగినట్టియు, పద్మగంధీని = పద్మముయొక్క పరిమళము వంటి పరిమళము కలిగినట్టియు, తాసాం యోషితాం = ఆ ఉత్తమస్త్రీలయొక్క, వదనాని = ముఖములను, అపశ్యత్ = చూచెను.

**తాత్పర్యము** :- హనుమంతుడప్పుడు దంతములను, కనులను మూసికొని నిద్రించు చున్న ఆ ఉత్తమస్త్రీలయొక్క పద్మపరిమళములు కలిగినట్టి ముఖములను చూచెను.

**శ్లో॥ ప్రబుద్ధానీవ పద్మాని తాసాం భూత్వా క్షపాక్షయే ।**
**పున స్సంవృతపత్రాణి రాత్రా వివ బభు స్తదా ॥ 38**

**పదచ్ఛేదము** :- ప్రబుద్ధాని – ఇవ – పద్మాని – తాసాం – భూత్వా – క్షపాక్షయే – పునః – సంవృతపత్రాణి – రాత్రౌ – ఇవ – బభుః – తదా ॥

**అన్వయక్రమము** :- క్షపాక్షయే ప్రబుద్ధాని పద్మాని పునః రాత్రౌ సంవృతపత్రాణి ఇవ తదా తాసాం ముఖాని బభుః.

**ప్రతిపదార్థము** :- క్షపాక్షయే = ప్రభాతసమయమున, ప్రబుద్ధాని పద్మాని = చక్కగా వికసించిన పద్మములు, రాత్రౌ = రాత్రిసమయమునందు, పునః = తిరిగి, సంవృత పత్రాణి భూత్వా ఇవ = ముడుచుకొని యున్న దళములు కలిగియున్నట్లుగా, తాసాం ముఖాని = ఆ స్త్రీల ముఖములు, తదా = ఆ సమయమున, బభుః = ప్రకాశించు చుండెను.

**తాత్పర్యము** :- అచ్చటి, ఆ స్త్రీలయొక్క ముఖములు, ఉదయకాలమునందు, చక్కగా వికసించినవై రాత్రి సమయమునందు తిరిగి ముకుళించుకొనిన దళములు గలిగినట్టి పద్మములవలె, చూచుటకు రమ్యముగా గానవచ్చుచుండెను.

**శ్లో॥ ఇమాని ముఖపద్మాని నియతం మత్తషట్పదాః ।**
**అంబుజానీవ ఫుల్లాని ప్రార్థయంతి పునః పునః ॥ 39**

**పదచ్ఛేదము** :- ఇమాని – ముఖపద్మాని – నియతం – మత్తషట్పదాః – అంబుజాని – ఇవ – ఫుల్లాని – ప్రార్థయంతి – పునః – పునః ॥

**అన్వయక్రమము** :- మత్తషట్పదాః నియతం ఫుల్లాని అంబుజాని ఇవ, ఇమాని ముఖపద్మాని పునః పునః ప్రార్థయంతి.

**ప్రతిపదార్థము** :- మత్తషట్పదాః = మదించిన గండు తుమ్మెదలు, నియతం = నిశ్చయముగా, ఫుల్లాని అంబుజాని ఇవ = చక్కగా వికసించిన తామరపువ్వులనువలె,

ఇమాని ముఖపద్మాని = ఈ ముఖములనెడు పద్మములను, పునః పునః = తిరిగి తిరిగి, ప్రార్థయంతి = ముసురు కొనుచున్నవి.

**తాత్పర్యము :–** ఆ స్త్రీల ముఖములు, వికసించిన తామరపూవులవలె నుండుటచే గండు తుమ్మెదలు మధురసమును గ్రోలుటకై మరల మరల దగ్గరకువచ్చి చుట్టును పరిభ్రమించుచు ఆ స్త్రీల ముఖములను విడువలేకపోవుచున్నవి.

**శ్లో॥ ఇతి చామన్యత శ్రీమా నుపపత్త్యా మహాకపిః ।**
**మేనే హి గుణత స్తాని సమాని సలిలోద్భవైః ॥ 40**

**పదచ్ఛేదము :–** ఇతి – చ – అమన్యత – శ్రీమాన్ – ఉపపత్త్యా – మహాకపిః – మేనే – హి – గుణతః – తాని – సమాని – సలిలోద్భవైః ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్ మహాకపిః తాని ఉపపత్త్యా ఇతి అమన్యత, గుణతః (తాని) సలిలోద్భవైః సమాని మేనే.

**ప్రతిపదార్థము :–** శ్రీమాన్ = శుభలక్షణసంపన్నుడైన, మహాకపిః = ఆ వానర శ్రేష్ఠుడు, ఉపపత్త్యా = యుక్తమైన కారణముచే, ఇతి అమన్యత = ఇట్లు తలచెను, గుణతః = గుణవిశేషముచే, తాని = ఆ స్త్రీల ముఖములను, సలిలోద్భవైః సమాని = తామరపువ్వులతో సమానమైనవానినిగా, మేనే = తలచెను.

**తాత్పర్యము :–** ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, ఆ స్త్రీల ముఖములను పరిమళము, సౌందర్యము మున్నగు గుణములచే తామరపువ్వులతో భేదములేనట్టివిగనే భావించెను.

**శ్లో॥ సా తస్య శుశుభే శాలా తాభి స్స్త్రీభి ర్విరాజితా ।**
**శారదీవ ప్రసన్నా ద్యౌ స్తారాభి రభిశోభితా ॥ 41**

**పదచ్ఛేదము :–** సా – తస్య – శుశుభే – శాలా – తాభిః – స్త్రీభిః – విరాజితా – శారదీ – ఇవ – ప్రసన్నా – ద్యౌః – తారాభిః – అభిశోభితా ॥

**అన్వయక్రమము :–** తస్య సా శాలా తాభిః స్త్రీభిః విరాజితా (సతీ) తారాభిః, అభిశోభితా ప్రసన్నా శారదీ ద్యౌః ఇవ శుశుభే.

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ రావణాసురునియొక్క, సా శాలా = ఆ శయనశాల, తాభిః స్త్రీభిః విరాజితా సతీ = ఆ స్త్రీలచే ప్రకాశించుచున్నదై, తారాభిః అభిశోభితా = నక్షత్రములచే ప్రకాశించుచున్నట్టి, ప్రసన్నా = నిర్మలమైయున్న, శారదీ ద్యౌః ఇవ = శరదృతువునందలి ఆకాశమువలె, శుశుభే = శోభిల్లుచుండెను.

**తాత్పర్యము** :- శరత్కాలమునందు నిర్మలమైన ఆకాశము నక్షత్రములతో ప్రకాశించునట్లుగా నిద్రించుచున్న ఆ సుందరీమణులచే, విరాజిల్లుచున్న ఆ రావణుని శయనాగారము ఎంతయును శోభిల్లుచుండెను.

**శ్లో॥ స చ తాభిః పరివృతః శుశుభే రాక్షసాధిపః ।**
**యథా హ్యుడుపతిః శ్రీమాం స్తారాభి రభిసంవృతః ॥ 42**

**పదచ్ఛేదము** :- సః – చ – తాభిః – పరివృతః – శుశుభే – రాక్షసాధిపః – యథా – హి – ఉడుపతిః – శ్రీమాన్ – తారాభిః – అభిసంవృతః ॥

**అన్వయక్రమము** :- తాభిః పరివృతః, సః రాక్షసాధిపశ్చ, తారాభిః అభిసంవృతః శ్రీమాన్ ఉడుపతిః యథా, శుశుభే.

**ప్రతిపదార్థము** :- తాభిః = ఆ స్త్రీలచే, పరివృతః = పరివేష్టింపబడినట్టి, సః రాక్షసాధిపశ్చ = ఆ రాక్షసరాజయిన రావణుడున్ను, తారాభిః అభిసంవృతః = నక్షత్రములచే పరివేష్టింపబడియున్న, శ్రీమాన్ ఉడుపతిః యథా = శోభావంతుడైన చంద్రునివలె, శుశుభే = శోభిల్లెను.

**తాత్పర్యము** :- ఆ సుందరీమణుల నడుమనున్న లంకేశ్వరుడు, తారలమధ్యమునందు ప్రకాశించుచున్న చంద్రునివలెనే పరమశోభతో విరాజిల్లుచుండెను.

**శ్లో॥ యా శ్చ్యవంతేఽంబరా త్తారాః పుణ్యశేషసమావృతాః ।**
**ఇమా స్తా స్సంగతాః కృత్స్నా ఇతి మేనే హరి స్తదా ॥ 43**

**పదచ్ఛేదము** :- యాః – చ్యవంతే – అంబరాత్ – తారాః – పుణ్యశేషసమావృతాః – ఇమాః – తాః – సంగతాః – కృత్స్నాః – ఇతి – మేనే – హరిః – తదా ॥

**అన్వయక్రమము** :- పుణ్యశేషసమావృతాః యాః తారాః అంబరాత్ చ్యవంతే తాః కృత్స్నాః ఇమాః సంగతాః ఇతి తదా హరిః మేనే.

**ప్రతిపదార్థము** :- పుణ్యశేషసమావృతాః = పుణ్యముయొక్క శేషముతో కూడియున్నవై, యాః తారాః = ఏ తారలు, అంబరాత్ చ్యవంతే = ఆకాశమునుండి జారిపడినవో, తాః కృత్స్నాః = ఆ నక్షత్రములు అన్నియును, సంగతాః = కలిసికొన్నవై, ఇమాః = ఈ స్త్రీలుగా, (అభూవన్ = అయినవి), ఇతి = అని, తదా = అప్పుడు, హరిః = హనుమ, మేనే = తలచెను.

**తాత్పర్యము** :- ఆకాశమునుండి శేషించిన పుణ్యముతో ఏ తారలు భూమిమీదికి జారిపడినవో అవి అన్నియును ఈ రీతిగా ఇచ్చట కలసికొన్నవి; అని హనుమ ఆ

సుందరీమణులను జూచి తలచెను.

**శ్లో॥ తారాణా మివ సువ్యక్తం మహతీనాం శుభార్చిషామ్ ।**
**ప్రభావర్ణప్రసాదా శ్చ విరేజు స్తత్ర యోషితామ్ ॥ 44**

**పదచ్ఛేదము :–** తారాణామ్ – ఇవ – సువ్యక్తం – మహతీనాం – శుభార్చిషామ్ – ప్రభావర్ణప్రసాదాః – చ – విరేజుః – తత్ర – యోషితామ్ ॥

**అన్వయక్రమము :–** మహతీనాం శుభార్చిషాం యోషితాం ప్రభావర్ణప్రసాదాః తత్ర తారాణామ్ ఇవ సువ్యక్తం విరేజుః.

**ప్రతిపదార్థము :–** మహతీనాం = గొప్పవైన, శుభార్చిషామ్ = పవిత్రమైన కాంతులుగల, యోషితాం = స్త్రీలయొక్క, ప్రభావర్ణప్రసాదాశ్చ = కాంతి, వర్ణము, ప్రసన్నత అనునట్టి విశేషములుగూడ, తత్ర = ఆ శయనాగారమునందు, తారాణాం = నక్షత్రములయొక్క, ప్రభావర్ణప్రసాదాః ఇవ = కాంతులును వర్ణములును ప్రసన్నతలవలె, సువ్యక్తం = స్పష్టముగ, విరేజుః = తేజరిల్లుచుండెను.

**తాత్పర్యము :–** ఆ శయనాగారమునందు శయనించియున్న సుందరీమణుల సౌందర్యమును, దేహకాంతులును, ప్రసన్నలావణ్యములును స్పష్టముగా అంతరిక్షము నందలి నక్షత్రములయొక్క కాంతులతోడను, సౌందర్యముతోడను, ప్రసన్నత తోడను తులతూగుచున్నవై విరాజిల్లుచుండెను.

**శ్లో॥ వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః ।**
**పానవ్యాయామకాలేషు నిద్రాపహృతచేతసః ॥ 45**

**పదచ్ఛేదము :–** వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః – పానవ్యాయామకాలేషు – నిద్రాపహృతచేతసః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** (తాః = ఆ స్త్రీలు) పానవ్యాయామకాలేషు = మధుపానము, విహారము మున్నగు సమయములందు, నిద్రాపహృతచేతసః = నిద్రచే అపహరింపబడిన మనస్సుగలవారై, వ్యావృత్తగురుపీనస్రక్ప్రకీర్ణవరభూషణాః = చెదరిపోయిన పెద్దవైన స్థూలమైన పూలదండలును, చెదరిన అమూల్యాభరణములు గలవారునుగా, (విరేజుః = ప్రకాశించిరి).

**తాత్పర్యము :–** ఆ స్త్రీలు ఆ శాలయందు ఆ రాత్రి అంతవరకును మధుపానముచేతను, నృత్యగీతాదుల శ్రమచేతను నిద్రావశులై చెదరిపోయిన స్థూలమైన పూలమాలలును,

ఇతరములైన అమూల్యాభరణములును గలవారై ప్రకాశించు చుండిరి.

**శ్లో॥ వ్యావృత్తతిలకాః కాశ్చి త్కాశ్చి దుద్భ్రాంతనూపురాః ।**
**పార్శ్వే గళితహారాశ్చ కాశ్చి త్పరమయోషితః ॥ 46**

**పదచ్ఛేదము** :- వ్యావృత్తతిలకాః - కాః - చిత్ - కాః - చిత్ - ఉద్భ్రాంతనూపురాః - పార్శ్వే - గళితహారాః - చ - కాః - చిత్ - పరమయోషితః ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- కాశ్చిత్ = కొద్దిమంది స్త్రీలు, వ్యావృత్తతిలకాః = చెదరిన తిలకములు గలవారుగను, కాశ్చిత్ = కొద్దిమంది స్త్రీలు, ఉద్భ్రాంతనూపురాః = మీదికి తోయబడిన అందెలు గలవారుగను, కాశ్చిత్ పరమయోషితః = కొద్దిమంది ఉత్తమాంగనలు, పార్శ్వే గళితహారాశ్చ = ప్రక్కకు జారిన ముత్యాలహారములు గలవారునుగాను, (ఆసన్ = ఉండిరి)

**తాత్పర్యము** :- అచ్చట కొద్దిమంది స్త్రీల ముఖములపై తిలకములు చెరిగియుండెను. కొద్దిమంది కాలిఅందెలు మీదికి ఎగత్రోయబడి యుండెను. కొంతమంది స్త్రీల కంఠహారములు ఒక ప్రక్కకు తొలగి వ్రేలాడు చుండెను.

**శ్లో॥ ముక్తాహారావృతా శ్చాన్యాః కాశ్చి ద్విస్రస్తవాససః ।**
**వ్యావిద్ధరశనాదామాః కిశోర్య ఇవ వాహితాః ॥ 47**

**పదచ్ఛేదము** :- ముక్తాహారావృతాః - చ - అన్యాః - కాః - చిత్ - విస్రస్తవాససః - వ్యావిద్ధరశనాదామాః - కిశోర్యః - ఇవ - వాహితాః ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- అన్యాః = మరికొందరు, ముక్తాహారావృతాః = (తెగిన) ముత్యముల దండలచే చుట్టబడి యుండిరి, కాశ్చిత్ = కొద్దిమంది, వ్యావిద్ధరశనాదామాః = తెగిపోయిన మొలనూళ్ళుగలవారై, వాహితాః కిశోర్యః ఇవ = నేలపై పొరలాడించబడిన ఆడుగుఱ్ఱపుపిల్లలవలె, విస్రస్తవాససః = జారిపోయిన వస్త్రములు గలవారుగా, ఆసన్ = ఉండిరి.

**తాత్పర్యము** :- వారిలో కొందరు స్త్రీలకు తెగిపోయిన తమ ముత్యాలదండలు తమ శరీరముమీదనే చుట్టుకొని యుండెను. మరికొద్ది మంది వారి మొలనూళ్ళు తెగిపోగా వస్త్రములు జారిపోయి, శ్రమతీరుటకై నేలపై దొర్లులాడించు ఆడుగుఱ్ఱపు పిల్లలవలె కాన్పించు చుండిరి.

**శ్లో॥ సుకుండలధరా శ్చాన్యా విచ్ఛిన్నమృదితస్రజః ।**
**గజేంద్రమృదితాః ఫుల్లా లతా ఇవ మహావనే ॥ 48**

**పదచ్ఛేదము** :– సుకుండలధరాః – చ – అన్యాః – విచ్ఛిన్నమృదితస్రజః – గజేంద్రమృదితాః – ఫుల్లాః – లతాః – ఇవ – మహావనే ॥

**ప్రతిపదార్థము** :– అన్యాః = మరికొద్దిమంది, మహావనే = మహారణ్యమునందు, గజేంద్రమృదితాః = మదపుటేనుగుచే చిందర వందర చేయబడిన, ఫుల్లాః లతాః ఇవ = పుష్పించిన లతలవలె, సుకుండలధరాః = కర్ణాభరణములను ధరించినవారై, విచ్ఛిన్నమృదితస్రజః = తెగిపోయినట్టి, నలిగిపోయినట్టి పూలదండలు గలవారుగా, ఆసన్ = ఉండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి పాఠము** :– 'సుకుండలధరాః' కి బదులుగా 'అకుండలధరాః' అని పాఠాంతరము.

**తాత్పర్యము** :– ఆ స్త్రీలలో కొద్దిమంది అరణ్యమునందు మదపుటేనుగులచే చిందర వందర చేయుబడిన పూలతీగలవలె ఉత్తమమైన కర్ణాభరణములు ధరించియున్నవారైనను తమ శరీరముపై ధరించిన పూల మాలలన్నియును తెగిపోయి, నలిగిపోయి వింతగ కానవచ్చుచుండిరి.

**శ్లో॥ చంద్రాంశుకిరణాభా శ్చ హారాః కాసాంచి దుత్కటాః ।**
**హంసా ఇవ బభు స్సుప్తాః స్తనమధ్యేషు యోషితామ్ ॥ 49**

**పదచ్ఛేదము** :– చంద్రాంశుకిరణాభాః – చ – హారాః – కాసాం – చిత్ – ఉత్కటాః – హంసాః – ఇవ – బభుః – సుప్తాః – స్తనమధ్యేషు – యోషితామ్ ॥

**అన్వయక్రమము** :– కాసాంచిత్ యోషితాం స్తనమధ్యేషు చంద్రాంశుకిరణాభాః ఉత్కటాః హారాః సుప్తాః హంసాః ఇవ బభుః.

**ప్రతిపదార్థము** :– కాసాంచిత్ యోషితాం = కొద్దిమంది స్త్రీలయొక్క, స్తనమధ్యేషు = స్తనముల నడుమ, చంద్రాంశుకిరణాభాః = చంద్రకిరణముల వంటి ప్రకాశముగల, ఉత్కటాః హారాః = పెద్దవైన ముత్యాలహారములు, సుప్తాః హంసాః ఇవ = నిద్రించియున్న హంసలవలె, బభుః = ప్రకాశించినవి.

**తాత్పర్యము** :– అచ్చట శయనించియున్న కొందరి స్త్రీల స్తనముల నడుమ

చంద్రకిరణములవలె ధవళమై స్థూలములైయున్న ముత్యాల హారములు ప్రోగుపడి యుండగా అవి అచట నిద్రించుచున్న హంసలుగా భ్రమగొల్పుచున్నవి.

**శ్లో॥ అపరాసాం చ వైడూర్యాః కాదంబా ఇవ పక్షిణః ।**
**హేమసూత్రాణి చాన్యాసాం చక్రవాకా ఇ వాభవన్ ॥ 50**

**పదచ్ఛేదము :**– అపరాసాం – చ – వైడూర్యాః – కాదంబాః – ఇవ – పక్షిణః – హేమసూత్రాణి – చ – అన్యాసాం – చక్రవాకాః – ఇవ – అభవన్ ॥

**అన్వయక్రమము :**– అపరాసాం వైడూర్యాః (హారాః) కాదంబాః పక్షిణః ఇవ (అభవన్) అన్యాసాం హేమసూత్రాణి చక్రవాకాః ఇవ అభవన్.

**ప్రతిపదార్థము :**– అపరాసాం = ఇతరస్త్రీలయొక్క, వైడూర్యాః (హారాః) = వైడూర్య రత్నహారములు, కాదంబాః పక్షిణః ఇవ (అభవన్) = తెల్లని కాదంబపక్షులవలె నుండెను. అన్యాసాం = మరి కొద్దిమంది ఇతరస్త్రీలయొక్క, హేమసూత్రాణి = బంగారు గొలుసులు, చక్రవాకాః ఇవ అభవన్ = (పచ్చని) చక్రవాకపక్షులవలె నుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :**– వెనుకటి శ్లోకమునందలి హంసలవలెనే, ఈ కాదంబములు, చక్రవాకములు స్తనమధ్యమునందు ప్రోగుపడియున్న ఆ యా వర్ణముల హారములకు ఉపమానముగా చెప్పబడినవి.

**తాత్పర్యము :**– కొద్దిమంది స్త్రీల వక్షస్థలములపై గల వైడూర్యహారములు కాదంబ పక్షులవలె ప్రకాశించు చుండెను. మరికొద్ది మంది స్త్రీల ఱొమ్ములపై ప్రోగుపడిన సువర్ణహారములు చక్రవాక పక్షులేమో యని భ్రమ కలిగించు చుండెను.

**శ్లో॥ హంసకారండవాకీర్ణాః చక్రవాకోపశోభితాః ।**
**ఆపగా ఇవ తా రేజుః జఘనైః పులినై రివ ॥ 51**

**పదచ్ఛేదము :**– హంసకారండవాకీర్ణాః – చక్రవాకోపశోభితాః – ఆపగాః – ఇవ – తాః – రేజుః – జఘనైః – పులినైః – ఇవ ॥

**అన్వయక్రమము :**– తాః హంసకారండవాకీర్ణాః చక్రవాకోపశోభితాః పులినైః ఇవ జఘనైః ఆపగాః ఇవ రేజుః.

**ప్రతిపదార్థము :**– తాః = ఆ స్త్రీలు, పులినైరివ స్థితైః = ఇసుక తిన్నెలవలెనున్నట్టి, జఘనైః = కటిప్రదేశములతో, హంసకారండవాకీర్ణాః = హంసలతోడను,

కారండవములతోడను వ్యాపించియున్నట్టివియు, చక్రవాకోపశోభితాః = చక్రవాక పక్షులతో ప్రకాశించు చున్నవియునగు, ఆపగాః ఇవ రేజుః = నదులవలెనే ప్రకాశించుచుండిరి.

**తాత్పర్యము** :– ఆ స్త్రీలు విశాలవైయున్న తమ కటిప్రదేశములనెడు ఇసుకతిన్నెలతోడను తమ ఱొమ్ముపై వెలయుచున్న వివిధములగు హారములనెడు హంసకారండవ చక్రవాకాది జలపక్షులతోడను, సుందరమైన నదులవలె ప్రకాశించు చుండిరి.

**శ్లో॥ కింకిణీజాలసంకోశా స్తా హైమవిపులాంబుజాః ।**
**భావగ్రాహా యశస్తీరా స్సుప్తా నద్య ఇ వాబభుః ॥ 52**

**పదచ్ఛేదము** :– కింకిణీజాలసంకోశాః – తాః – హైమవిపులాంబుజాః – భావగ్రాహాః – యశస్తీరాః – సుప్తాః – నద్యః – ఇవ – ఆబభుః ॥

**అన్వయక్రమము** :– సుప్తాః తాః కింకిణీజాలసంకోశాః హైమవిపులాంబుజాః భావగ్రాహాః యశస్తీరాః నద్యః ఇవ ఆబభుః.

**ప్రతిపదార్థము** :– సుప్తాః తాః = నిద్రించియున్న ఆ స్త్రీలు, కింకిణీజాలసంకోశాః = మొలనూలునందలి చిరుగంటలనెడు మొగ్గలు గలవియును, హైమవిపులాంబుజాః = స్వర్ణాభరణము లను తామరపువ్వులు గలవియును, భావగ్రాహాః = శృంగార భావము లనెడు మొసళ్ళు గలవియును అగు, నద్యః ఇవ = నదులవలెనే, ఆబభుః = ప్రకాశించుచుండిరి.

**తాత్పర్యము** :– నిద్రించుచున్న ఆ స్త్రీలు తమ మొలనూళ్లయందలి చిరుగంటలు తామరమొగ్గలవలె నుండగా, స్వర్ణభూషణములు కమలములవలె నుండగా తమ శృంగారచేష్టలు మొసళ్ల వంటి వగుచుండగా తమ సౌందర్యఖ్యాతి తీరమువలె నుండగా, వారు నదులవలెనే ప్రకాశించు చుండిరి.

**శ్లో॥ మృదు ష్వంగేషు కాసాంచి త్కుచాగ్రేషు చ సంస్థితాః ।**
**బభూవు ర్భూషణా నీవ శుభా భూషణరాజయః ॥ 53**

**పదచ్ఛేదము** :– మృదుషు – అంగేషు – కాసాం – చిత్ – కుచాగ్రేషు – చ – సంస్థితాః – బభూవుః – భూషణాని – ఇవ – శుభాః – భూషణరాజయః ॥

**అన్వయక్రమము** :– కాసాంచిత్ మృదుషు అంగేషు కుచాగ్రేషు చ సంస్థితాః శుభాః

భూషణరాజయః భూషణాని ఇవ బభూవుః.

**ప్రతిపదార్థము** :- కాసాంచిత్ = కొందరియొక్క, మృదుషు = కోమలమైనట్టి, అంగేషు = అవయవములందును, కుచాగ్రేషు చ = స్తనాగ్రములయందును, సంస్థితాః = కాన్పించుచున్నట్టి, శుభాః భూషణరాజయః = ఆభరణములయొక్క శుభకరమైన ఆనవాళ్ళు, భూషణాని ఇవ బభూవుః = (నిజమైన) ఆభరణములవలెనే ఉండెను.

**తాత్పర్యము** :- కొద్దిమంది స్త్రీలయొక్క మృదువైన శరీరములపైనున్న, కుచాగ్రములపైనను గల ఆభరణముల ఆనవాళ్ళు కూడా ఆభరణముల వలెనే ఆ స్త్రీలకు శోభను ఇచ్చు చుండెను.

**శ్లో॥ అంశుకాంతా శ్చ కాసాంచి న్ముఖమారుతకంపితాః ।**
**ఉప ర్యుపరి వక్త్రాణాం వ్యాధూయంతే పునః పునః ॥ 54**

**పదచ్ఛేదము** :- అంశుకాంతాః - చ - కాసాం - చిత్ - ముఖమారుతకంపితాః - ఉపరి - ఉపరి - వక్త్రాణాం - వ్యాధూయంతే - పునః పునః ॥

**అన్వయక్రమము** :- కాసాంచిత్ అంశుకాంతాః ముఖమారుతకంపితాః వక్త్రాణాం ఉపర్యుపరి పునః పునః వ్యాధూయంతే.

**ప్రతిపదార్థము** :- కాసాంచిత్ = కొందరి వనితలయొక్క, అంశుకాంతాః = పైట చెరగులయొక్క కొనలు, ముఖమారుతకంపితాః = నిశ్శ్వాస వాయువులచే కదల్పబడుచున్నవై, వక్త్రాణామ్ ఉపర్యుపరి = ముఖముల మీది భాగమునందు, పునః పునః = మరల మరల, వ్యాధూయంతే = ఎగురగొట్టబడు చున్నవి.

**తాత్పర్యము** :- కొంతమంది స్త్రీల ముఖములపై వారు కప్పుకొన్న పైటచెరగుల యంచులు తమ నిశ్శ్వాసవాయువులచే తమ ముఖములయందు మరల మరల తొలగ ద్రోయబడుచు సుందరముగా కానవచ్చుచుండెను.

**శ్లో॥ తాః పతాకా ఇ వోద్ధూతాః పత్నీనాం రుచిరప్రభాః ।**
**నానావర్ణసువర్ణానాం వక్త్రమూలేషు రేజిరే ॥ 55**

**పదచ్ఛేదము** :- తాః - పతాకాః - ఇవ - ఉద్ధూతాః - పత్నీనాం - రుచిరప్రభాః - నానావర్ణసువర్ణానాం - వక్త్రమూలేషు - రేజిరే ॥

**అన్వయక్రమము** :- నానావర్ణసువర్ణానాం పత్నీనాం వక్త్రమూలేషు రుచిరప్రభాః, తాః ఉద్ధూతాః, పతాకాః ఇవ రేజిరే.

**ప్రతిపదార్థము** :– నానావర్ణసువర్ణానాం = పలువన్నెలుగల బంగరు ఆభరణములు ధరించియున్న, పత్నీనాం = రావణాసురుని పత్నులయొక్క, వక్త్రమూలేషు = ముఖముల యొద్ద, రుచిరప్రభాః = సుందరమైన శోభగల, తా = ఆ స్త్రీలముఖములపైగల పైటచెరుగులు, ఉద్ధూతాః పతాకాః ఇవ = ఎగురవేయబడిన జండాల వలె, రేజిరే = ప్రకాశించినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– నానావర్ణసువర్ణానాం పతకాః ఇవ – అనగా వివిధ సుందరమైన వర్ణములతో ప్రకాశించు జండాలవలె ఒప్పుచున్నవని భావము.

**తాత్పర్యము** :– రావణాసురుని భార్యలయొక్క ఆ ముఖశ్వాసలకు ఎగురుచున్న సుందరమైన పైటచెరగులు వివిధవర్ణములతో ప్రకాశించు జండాలవలెనే, శోభిల్లు చుండెను.

**శ్లో॥ వవల్గు శ్చాత్ర కాసాంచి త్కుండలాని శుభార్చిషాం ।**
**ముఖమారుతసంసర్గా న్మందం మందం సుయోషితామ్ ॥ 56**

**పదచ్ఛేదము** :– వవల్గుః – చ – అత్ర – కాంసాం – చిత్ – కుండలాని – శుభార్చిషామ్ – ముఖమారుతసంసర్గాత్ – మందం – మందం – సుయోషితామ్ ॥

**అన్వయక్రమము** :– అత్ర శుభార్చిషాం కాసాంచిత్ సుయోషితాం ముఖమారుత సంసర్గాత్, కాసాంచిత్ కుండలాని మందం మందం వవల్గుః.

**ప్రతిపదార్థము** :– అత్ర = ఈ శయనాగారమున, శుభార్చిషాం = శుభకరమైన ప్రకాశముగల, కాసాంచిత్ సుయోషితాం = కొద్దిమంది అంగనామణులయొక్క, ముఖమారుతసంసర్గాత్ = నిశ్వాసవాయువుల తాకిడివలన, కాసాంచిత్ కుండలాని = ఇంక కొలదిమంది తరుణుల కర్ణాభరణములు, మందం మందం = నెమ్మది నెమ్మదిగా, వవల్గుః = కంపించినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి** :– ముఖమారుత సంపర్కముచేతనే, చలించునట్టి కర్ణాభరణములు మిక్కిలి తేలికైనవై యుండవలెను. అట్టి తేలికైన కర్ణాభరణములు ధరించినవారనగా ఆ సుందరీమణులు మిగుల సుకుమారలని సూచింపబడినది.

**గోవిందరాజీయము** :– తలగడాపై, ఆనియుండుటవలన కర్ణకుండలములు

ముఖమారుతమునకు తేలికగా చలించినవని భావము.

**తాత్పర్యము :–** అచ్చటి కొందరు వనితలు ధరించిన, సుందరమైన కర్ణాభరణములు ప్రక్కనున్న స్త్రీల నిశ్వాసవాయువుల తాకిడికి మెల్ల మెల్లగా కదలుచుండెను.

**శ్లో॥ శర్కరాసవగంధై శ్చ ప్రకృత్యా సురభి స్సుఖః ।**
**తాసాం వదననిశ్వాస స్సిషేవే రావణం తదా ॥ 57**

**పదచ్ఛేదము :–** శర్కరాసవగంధైః – చ – ప్రకృత్యా – సురభిః – సుఖః – తాసాం – వదననిశ్వాసః – సిషేవే – రావణం – తదా ॥

**అన్వయక్రమము :–** తదా ప్రకృత్యా సుఖః తాసాం శర్కరాసవగంధైః సురభిః వదన నిశ్వాసః రావణం సిషేవే.

**ప్రతిపదార్థము :–** తదా = ఆ సమయమున, ప్రకృత్యా = స్వభావముచేతనే, సుఖః = సుఖప్రదమైనదియును, తాసాం = వారలయొక్క, శర్కరాసవగంధైః చ = చక్కెరతో చేయబడిన మద్యములయొక్క సువాసనలచే, సురభిః = మిక్కిలి పరిమళవంతమై యున్నట్టి, వదననిశ్వాసః = ముఖమునుండి వెలువడిన వాయువు, రావణం = రావణాసురుని, సిషేవే = సేవించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ప్రకృత్యా అసురభిః = సహజముగా సువాసనగలది కాకపోయినను ఆ స్త్రీలు సేవించిన మద్యవిశేషముచే సుఖప్రదముగ నున్నదని చెప్పవచ్చును.

**తాత్పర్యము :–** సహజముగనే పరిమళవంతమును, సుఖప్రదమును అయిన రావణుని ప్రియురాండ్ర ముఖమారుతము, శర్కరాసవపరిమళముచే ఇంకను పరిమళపూర్ణమై రావణాసురుని ఆసక్తితో సేవించుచున్నట్లుండెను.

**శ్లో॥ రావణాననశంకా శ్చ కాశ్చి ద్రావణయోషితః ।**
**ముఖాని స్మ సపత్నీనా ముపాజిఘ్ర న్పునః పునః ॥ 58**

**పదచ్ఛేదము :–** రావణాననశంకాః – చ – కాః – చిత్ – రావణయోషితః – ముఖాని – స్మ – సపత్నీనాం – ఉపాజిఘ్రన్ – పునః – పునః ॥

**అన్వయక్రమము :–** కాశ్చిత్ రావణయోషితః, సపత్నీనాం ముఖాని రావణాననశంకాః (సత్యః), పునః పునః ఉపాజిఘ్రన్.

**ప్రతిపదార్థము** :– కాశ్చిత్ రావణయోషితః = కొంతమంది రావణుని భార్యలు, సపత్నీనాం ముఖాని = తమ సవతులయొక్క ముఖములను, రావణాననశంకాః (సత్యః) = రావణుని ముఖ మను భ్రమగలవారై, పునః పునః = మరల మరల, ఉపాజిఘ్రన్ = మూర్కొనుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– మద్యసేవచేతను, నిద్రావశులై యుండుటచేతను వారికి అట్లు చిత్తభ్రమ కలుగుట సహజమే యని తెలియవలెను.

**తాత్పర్యము** :– రావణుని భార్యలు కొంతమంది, తమ సవతుల ముఖములనే, దగ్గరకు తీసుకొని, అది రావణుని ముఖమే – యను భ్రమచే మరల మరల చుంబించుచుండిరి.

**శ్లో॥ అత్యర్థం సక్తమనసో రావణే తా వరస్త్రియః ।**
**అస్వతంత్రా స్సపత్నీనాం ప్రియమేవాఽచరంస్తదా ॥ 59**

**పదచ్ఛేదము** :– అత్యర్థం – సక్తమనసః – రావణే – తాః – వరస్త్రియః – అస్వతంత్రాః – సపత్నీనాం – ప్రియమ్ – ఏవ – ఆచరన్ – తదా ॥

**అన్వయక్రమము** :– తదా రావణే అత్యర్థం సక్తమనసః అస్వతంత్రాః తాః వరస్త్రియః సపత్నీనాం, ప్రియమేవ ఆచరన్.

**ప్రతిపదార్థము** :– తదా = ఆ సమయమున, రావణే = రావణునియందు, అత్యర్థం సక్తమనసః = మిక్కిలిగా లగ్నమైన మనస్సు గలవారై, అస్వతంత్రాః = పరాధీనలైయున్న, తాః వరస్త్రియః = ఆ సుందరాంగులు, సపత్నీనాం = సవతులకు, ప్రియమేవ = ప్రియమునే, ఆచరన్ = ఆచరించుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రావణునిపైగల గాఢానురాగముచే అతని ప్రియురాండ్రందరును తమ సవతులయెడల ఎట్టి అసూయాద్వేషములును లేనివారై వారికి ప్రియముగనే వర్తించుచుండిరి.

**తాత్పర్యము** :– రావణాసురునియందు తీవ్రమైన అనురక్తి గలవారగుటచే ఆ సుందరీమణులు పరవశలైయుండి తమ సవతులయెడల ద్వేషము జూపక ప్రేమనే ప్రదర్శించుచుండిరి.

**శ్లో॥ బాహూ నుపనిధా యాన్యాః పారిహార్యవిభూషితాన్ ।**
**అంశుకాని చ రమ్యాణి ప్రమదా స్తత్ర శిశ్యిరే ॥ 60**

**పదచ్ఛేదము** :- బాహూన్ - ఉపనిధాయ - అన్యాః - పారిహార్యవిభూషితాన్ - అంశుకాని - చ - రమ్యాణి - ప్రమదాః - తత్ర - శిశ్యిరే ॥

**అన్వయక్రమము** :- అన్యాః ప్రమదాః తత్ర పారిహార్యవిభూషితాన్ బాహూన్ రమ్యాణి అంశుకాని చ ఉపనిధాయ శిశ్యిరే.

**ప్రతిపదార్థము** :- అన్యాః ప్రమదాః = మఱికొంతమంది తరుణులు, పారిహార్య విభూషితాన్ బాహూన్ = స్వర్ణకంకణములచే అలంకరింపబడి యున్న బాహువులను, రమ్యాణి అంశుకాని = సుందరమైన చీరలను, ఉపనిధాయ = తలగడగా చేసుకొని, తత్ర = ఆ శాలలో, శిశ్యిరే = శయనించియుండిరి.

**తాత్పర్యము** :- అచ్చట రావణుని ప్రియురాండ్రు కొందరు స్వర్ణాభరణములతో అలంకరింపబడిన తమ బాహువులను, మిక్కిలి రమణీయమైన తమ వస్త్రములను తలగడగా చేసుకొని నిద్రించుచుండిరి.

**శ్లో॥ అన్యా వక్షసి చాన్యస్యా స్తస్యాః కాశ్చి త్పున ర్భుజమ్ ।**
**అపరా త్వంక మన్యస్యా స్తస్యా శ్చా ప్యపరా భుజౌ ॥ 61**

**పదచ్ఛేదము** :- అన్యా - వక్షసి - చ - అన్యస్యాః - తస్యాః - కాః - చిత్ - పునః - భుజమ్ - అపరా - తు - అంకమ్ - అన్యస్యాః - తస్యాః - చ - అపి - అపరా - భుజౌ ॥

**అన్వయక్రమము** :- అన్యా అన్యస్యాః వక్షసి చ, కాశ్చిత్ పునః తస్యాః భుజం చ ఉపనిధాయ శిశ్యిరే, అపరా తు, అన్యస్యాః అంకమ్, అపరాః తస్యా భుజౌ (ఉపనిధాయ శిశ్యిరే).

**ప్రతిపదార్థము** :- అన్యా = వేఱొకతె, అన్యస్యాః వక్షసి = వేఱొకతెయొక్క ఱొమ్ముపై (శిశ్యే = నిద్రించుచుండెను), తస్యాః భుజం = ఆమె యొక్క భుజమునే, పునః = మరల, కాశ్చిత్ = కొద్దిమంది, (ఉపనిధాయ శిశ్యిరే = తలగడగా వేసుకొని నిద్రించుచుండిరి), అపరా తు = మరియొకతె, అన్యస్యాః అంకం = వేఱొకతెయొక్క ఒడిని, తస్యాః అపి భుజౌ = తిరిగి ఆమెయొక్క భుజములనే, అపరాః = మరి కొలదిమంది, (ఉపనిధాయ శిశ్యిరే = తలగడగా చేసుకొని నిద్రించుచుండిరి).

**తాత్పర్యము** :- ఒక తరుణియొక్క ఱొమ్ముపై తలయుంచి, వేఱొక సుందరి

నిద్రించుచుండగా, ఆమె భుజములనే మరికొందరు సుందరాంగనలు తలగడగ చేసుకొని నిద్రించుచుండిరి. ఒక యువతి ఒడిలో తలయుంచుకొని ఒక అంగన శయనించియుండగా ఆమె రెండు భుజములను తలగడగ చేసుకొని మరికొంతమంది నిద్రించుచుండిరి.

**శ్లో॥ ఊరుపార్శ్వకటీపృష్ఠ మన్యోన్యస్య సమాశ్రితాః ।**
**పరస్పరనివిష్టాంగ్యో మదస్నేహవశానుగాః ॥ 62**

**పదచ్ఛేదము** :– ఊరుపార్శ్వకటీపృష్ఠమ్ – అన్యోన్యస్య – సమాశ్రితాః – పరస్పర నివిష్టాంగ్యః – మదస్నేహవశానుగాః ॥

**ప్రతిపదార్థము** :– అన్యోన్యస్య = ఒండొరులయొక్క, ఊరుపార్శ్వకటీపృష్ఠం = తొడలను ప్రక్కలను పిరుదులను వీపును, సమాశ్రితాః = ఆశ్రయించినవారై, మదస్నేహ వశానుగాః = మదముచేతను అనురాగముచేతను పరవశలైనవారై, పరస్పరనివిష్టాంగ్యః = ఒండొరులతో పెనవైచుకొన్న శరీరము గలవారై, (తత్ర శిశ్యిరే = అచ్చట శయనించు చుండిరి)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రావణునిపై గల అనురాగముచే పరవశలై యని అర్థము.

**తాత్పర్యము** :– అచ్చట ఆ స్త్రీలు ఎదుటనున్న ఒండొరుల తొడలను, ప్రక్కలను, పిరుదులను, వీపులను తలగడలుగా చేసుకొనియు, మద్యపానముచే మత్తిల్లి, రావణునిపై గల ప్రేమచే, పరవశలై తమ ఎదుటి స్త్రీలను కౌగిలించుకొనియు నిద్రించు చుండిరి.

**శ్లో॥ అన్యోన్యభుజసూత్రేణ స్త్రీమాలా గ్రథితా హి సా ।**
**మాలేవ గ్రథితా సూత్రే శుశుభే మత్తషట్పదా ॥ 63**

**పదచ్ఛేదము** :– అన్యోన్యభుజసూత్రేణ – స్త్రీమాలా – గ్రథితా – హి – సా – మాలా – ఇవ – గ్రథితా – సూత్రే – శుశుభే – మత్తషట్పదా ॥

**అన్వయక్రమము** :– సూత్రే గ్రథితా మత్తషట్పదా మాలా ఇవ అన్యోన్యభుజసూత్రేణ గ్రథితా, సా స్త్రీమాలా శుశుభే.

**ప్రతిపదార్థము** :– సూత్రే గ్రథితా = దారమునందు గ్రుచ్చబడినట్టి, మత్తషట్పదా మాలా ఇవ = మదించిన తుమ్మెదలతో కూడిన పువ్వులదండవలె, అన్యోన్యభుజ సూత్రేణ గ్రథితా = పరస్పరభుజము లనెడి సూత్రముచే గ్రుచ్చబడినట్టి, సా స్త్రీమాలా = ఆ రావణుని సుందరీమణుల శ్రేణి యనెడి మాలిక, శుశుభే = శోభిల్లుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'మత్తషట్పదా' = మత్తషట్పదములవంటి కన్నులును, కచభారములును ఆ స్త్రీలు కలిగియున్నారని గ్రహించవలెను.

**తాత్పర్యము** :– మదించిన తుమ్మెదలతో గూడిన పూలతో చక్కగా కూర్చబడిన పుష్పమాలవలె, అచ్చటి రావణస్త్రీలు, ఒకరి భుజములతో ఒకరి భుజములు పెన వైచుకొని నిదురించుచుండగా, భుజము లనెడి సూత్రముతో గ్రుచ్చబడినట్టి ఒకానొక స్త్రీరత్నహారమువలె శోభిల్లుచుండిరి.

**శ్లో॥ లతానాం మాధవే మాసి ఫుల్లానాం వాయుసేవనాత్ ।**
**అన్యోన్యమాలాగ్రథితం సంసక్తకుసుమోచ్చయమ్ ॥ 64**

**శ్లో॥ వ్యతివేష్టితసుస్కంధ మన్యోన్యభ్రమరాకులమ్ ।**
**ఆసీ ద్వన మివోద్ధూతం స్త్రీవనం రావణస్య తత్ ॥ 65**

**పదచ్ఛేదము** :– లతానాం – మాధవే – మాసి – ఫుల్లానాం – వాయుసేవనాత్ – అన్యోన్యమాలాగ్రథితం – సంసక్తకుసుమోచ్చయమ్ ॥

**పదచ్ఛేదము** :– వ్యతివేష్టితసుస్కంధం – అన్యోన్యభ్రమరాకులమ్ – ఆసీత్ – వనమ్ – ఇవ – ఉద్ధూతం – స్త్రీవనం – రావణస్య – తత్ ॥

**అన్వయక్రమము** (శ్లో॥ 64, 65) :– అన్యోన్యమాలాగ్రథితం, సంసక్తకుసుమోచ్చయం, వ్యతివేష్టితసుస్కంధమ్, అన్యోన్యభ్రమరాకులం, వాయుసేవనాత్ ఉద్ధూతం, రావణస్య తత్ స్త్రీవనం మాధవే మాసి ఫుల్లానాం లతానాం వనమ్ ఇవ ఆసీత్.

**ప్రతిపదార్థము** :– అన్యోన్యమాలాగ్రథితం = పరస్పరము మాలికగా కూర్చబడిన దియును, సంసక్తకుసుమోచ్చయం = లగ్నమైయున్న పుష్పసముదాయము గలదియును, వ్యతివేష్టితసుస్కంధం = పెనవేసుకొనబడిన శరీరములు గలదియును, (లతాపక్షమున – చుట్టుకొనబడిన తరుస్కంధముగలది), అన్యోన్యభ్రమరాకులమ్ = ఒండొరుల యొక్క ముంగురులతో కలసిపోయియున్నదియు (లతాపక్షమున – పరస్పరము తుమ్మెదలచే వ్యాపింపబడినది), వాయుసేవనాత్ = నిట్టూర్పుల తాకిడివలన (లతాపక్షమున – గాలియొక్క వీవనలవలన), ఉద్ధూతం = కదల్చబడినదియునగు (లతాపక్షమున – ఎగురగొట్టబడిన), రావణస్య = రావణునియొక్క, తత్ స్త్రీవనం = ఆ స్త్రీల సమూహము, మాధవే మాసి = వైశాఖమాసమునందు, ఫుల్లానాం లతానాం = వికసించిన పూలతీగలయొక్క, వనమ్ ఇవ = వనమువలె, ఆసీత్ = ఉండెను.

**తాత్పర్యము :–** ఆ రావణుని స్త్రీల సముదాయము పరస్పరము మాలికవలె పెనవేసుకొని యున్నదై, పుష్పములు ధరించినదై, ఒండొరుల ముంగురులతో కలసిపోయి యున్నదై, నిట్టూర్పు వాయువులవలన కదల్చబడిన పైటచెరగులు కలిగియున్నదై వైశాఖ మాసమున పుష్పించి వికసించి మాలికగా నేర్పడి తరుస్కంధముల జుట్టుకొని తుమ్మెదలతో వ్యాకులముగా నుండి వాయువుచే కదల్చబడుచున్న పూలతీగల వనమువలె నొప్పారుచుండెను.

**శ్లో॥ ఉచితే ష్వపి సువ్యక్తం న తాసాం యోషితాం తదా ।**
**వివేక శ్శక్య ఆధాతుం భూషణాంగాంబరస్రజామ్ ॥ 66**

**పదచ్ఛేదము :–** ఉచితేషు – అపి – సువ్యక్తం – న – తాసాం – యోషితాం – తదా – వివేకః – శక్యః – ఆధాతుం – భూషణాంగాంబరస్రజామ్ ॥

**అన్వయక్రమము :–** తదా తాసాం యోషితామ్ ఉచితేషు సువ్యక్త మపి భూషణాంగాంబరస్రజాం వివేకః ఆధాతుం శక్యః న (అభవత్).

**ప్రతిపదార్థము :–** తదా = ఆ సమయమునందు, తాసాం యోషితాం = ఆ రావణస్త్రీల యొక్క, ఉచితేషు సువ్యక్తమపి = సముచితస్థానములందు స్పష్టముగ నున్నవైనప్పటికిని, భూషణాంగాంబరస్రజాం = నగలయొక్కయు, అవయవములయొక్కయు, వస్త్రముల యొక్కయు, వివేకః = వివేచనము, ఆధాతుం శక్యః న (అభవత్) = చేయుటకు సాధ్యము గానిదైయుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఆ స్త్రీలు ఒకరితో నొకరు పెనవైచుకొని పరుండి యుండుటచే వారి ఆభరణములన్నియు ఒకే విధముగ నుండుటచేతను ఏ యాభరణము ఎవరిదో తెలియకుండెనని భావము.

**తాత్పర్యము :–** ఆ సమయమున ఆ సుందరీమణులు ధరించిన ఆభరణాదులు యథాస్థానములందే యున్నను వారు ఒండొరులతో పెనవైచుకొని పరుండియుండుటచే ఏ యాభరణము ఎవరిదో, ఏ హస్తము ఎవరిదో తెలిసికొనుటకు శక్యముగాకుండెను.

**శ్లో॥ రావణే సుఖసంవిష్టే తా స్స్త్రియో వివిధప్రభాః ।**
**జ్వలంతః కాంచనా దీపాః ప్రైక్షం తానిమిషా ఇవ ॥ 67**

**పదచ్ఛేదము :–** రావణే – సుఖసంవిష్టే – తాః – స్త్రియః – వివిధప్రభాః – జ్వలంతః – కాంచనాః – దీపాః – ప్రైక్షంత – అనిమిషాః – ఇవ ॥

**అన్వయక్రమము :–** రావణే సుఖసంవిష్టే (సతి) జ్వలంతః కాంచనాః దీపాః వివిధప్రభాః తాః స్త్రియః అనిమిషాః ఇవ ప్రైక్షంత.

**ప్రతిపదార్థము :–** రావణే సుఖసంవిష్టే (సతి) = రావణుడు సుఖముగా నిద్రపోవుచుండగా, జ్వలంతః కాంచనాః దీపాః = జ్వలించుచున్న బంగారుదీపములు, వివిధప్రభాః తాః స్త్రియః = వివిధములైన తేజస్సును కలిగియున్న ఆ స్త్రీలను, అనిమిషాః ఇవ = రెప్పపాటు లేకున్నవివలె, ప్రైక్షంత = చూచినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** రావణుడు మేల్కొనియుండగా అతని స్త్రీలను కన్నెత్తి చూచుటకు దీపములు కూడ భయపడుచుండునని కవి చమత్కరించుచున్నాడు.

**తాత్పర్యము :–** రావణుడు సుఖముగా గాఢనిద్రలో మునిగియుండగా అచ్చట జ్వలించుచున్న కాంచనదీపములు, వివిధములగు సుందరములైన కాంతులతో వెలుగుచున్నట్టి ఆ రావణుని భార్యలను మిక్కిలి ఆసక్తితో రెప్పపాటులేకుండ చూచుచున్నట్లుగా వెలుగుచుండెను.

**శ్లో॥ రాజర్షిపితృదైత్యానాం గంధర్వాణాం చ యోషితః ।**
**రాక్షసానాం చ యాః కన్యా స్తస్య కామవశం గతాః ॥ 68**

**పదచ్ఛేదము :–** రాజర్షిపితృదైత్యానాం – గంధర్వాణాం – చ – యోషితః – రాక్షసానాం – చ – యాః – కన్యాః – తస్య – కామవశం – గతాః ॥

**ప్రతిపదార్థము :–** రాజర్షిపితృదైత్యానాం = రాజఋషుల యొక్కయు, పితృదేవతల యొక్కయు, దైత్యుల యొక్కయు, గంధర్వాణాం చ = గంధర్వులయొక్కయు, యోషితః = స్త్రీలును, రాక్షసానాం కన్యాః చ = రాక్షసులయొక్క పుత్రికలును, యాః = ఎవరైతే యున్నారో, తాః = వారందరును, తస్య కామవశం గతాః = ఆ రావణునికి ప్రేమవశలై యుండిరి.

**తాత్పర్యము :–** రాజఋషుల పితృదేవతల దైత్యుల గంధర్వుల స్త్రీలును, రాక్షసుల పుత్రికలును, ఎవ్వరెవ్వరున్నారో వారు ఎల్లరును ఆ రావణునియందు ప్రేమపరవశలై యుండిరి.

**శ్లో॥ యుద్ధకామేన తా స్సర్వా రావణేన హృతాః స్త్రియః ।**
**సమదా మదనే నైవ మోహితాః కాశ్చి దాగతాః ॥ 69**

**పదచ్ఛేదము** :– యుద్ధకామేన – తాః – సర్వాః – రావణేన – హృతాః – స్త్రియః – సమదాః – మదనేన – ఏవ – మోహితాః – కాః – చిత్ – ఆగతాః ॥

**అన్వయక్రమము** :– తాః సర్వాః స్త్రియః యుద్ధకామేన రావణేన హృతాః కాశ్చిత్ సమదాః మదనేన ఏవ మోహితాః (సత్యః) ఆగతాః.

**ప్రతిపదార్థము** :– తాః సర్వాః స్త్రియః = ఆ స్త్రీలెల్లరును, యుద్ధకామేన రావణేన = యుద్ధమును వాంఛించినట్టి రావణునిచేత, హృతాః = అపహరింపబడినట్టివారు, కాశ్చిత్ సమదాః = కొద్దిమంది మదవతులు మాత్రము, మదనేన ఏవ మోహితాః = మన్మథుని చేతనే రావణునిపై మోహము గలవారై, ఆగతాః = వచ్చినట్టివారు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :– ఆ రాజపుత్రికల నపహరించినచో, ఆ రాజులతో తేలికగా యుద్ధము తటస్థించునను యుద్ధకాంక్షచే ఆ రాజపుత్రికలను అపహరించెను. ఈ విధముగా రావణుడు ఎవ్వరిని కేవలము కామవాంఛచే అపహరించి తేలేదని భావము.

**తాత్పర్యము** :– అచ్చటనున్న స్త్రీలలో ఎక్కువ భాగము యుద్ధకాంక్షియైన రావణుడు తండ్రులతో యుద్ధము వాంఛించి, వారి పుత్రికలను అపహరించి తెచ్చినవారే. కొలదిమంది సహజమైన తమ యౌవనమదముచే రావణుని మోహించి అతనిని చేరియుండిరి.

**శ్లో॥ న తత్ర కాచి త్ప్రమదా ప్రసహ్య**
**వీర్యోపపన్నేన గుణేన లబ్ధా ।**
**న చాఽన్యకామాపి న చాఽన్యపూర్వా**
**వినా వరార్హాం జనకాత్మజాం తామ్ ॥ 70**

**పదచ్ఛేదము** :– న – తత్ర – కా – చిత్ – ప్రమదా – ప్రసహ్య – వీర్యోపపన్నేన – గుణేన – లబ్ధా – న – చ – అన్యకామా – అపి – న – చ – అన్యపూర్వా – వినా – వరార్హాం – జనకాత్మజాం – తామ్ ॥

**అన్వయక్రమము** :– తత్ర వరార్హాం తాం జనకాత్మజాం వినా, కాచిత్ ప్రమదా ప్రసహ్య హృతా న, వీర్యోపపన్నేన గుణేన లబ్ధా ఏవ, అన్యకామాపి న, అన్యపూర్వా అపి న.

**ప్రతిపదార్థము** :– వరార్హాం = పూజ్యురాలయిన, తాం జనకాత్మజాం వినా = ఆ జానకిని విడచి, తత్ర = ఆ రావణుని నగరమునందు, కాచిత్ ప్రమదా = ఏ స్త్రీయును,

ప్రసహ్య = బలాత్కారముగా, న హృతా = తేబడినది గాదు, (సర్వాప్రమదాః = స్త్రీగణము అంతయును), వీర్యోపపన్నేన గుణేన లబ్ధా = పరాక్రమయుక్తమైన ప్రభావముచేతనే లభించినట్టిది, అన్యకామాపి న = అట్లే ఇతరులను ప్రేమించిన స్త్రీయును లేదు, అన్యపూర్వా అపి న = పూర్వము ఇతరుని చేపట్టినదియును లేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** పూజ్యురాలైన జానకిని తప్ప ఇంతవరకును రావణుడు తన పరాక్రమాతిశయముచే ఇతరుని కామించినట్టి స్త్రీని బలాత్కరించి తీసుకొనిరాలేదు. ఇప్పుడీ సీతాపహరణముచే అతని వినాశము అచిరకాలములోనే సంభవించునని సూచింపబడినది.

**తాత్పర్యము :–** అచ్చటనున్న రావణుని స్త్రీలలో పూజ్యురాలయిన జానకిని తప్పించి బలవంతముగా తెచ్చినది ఏ ఒక్కతెయును లేదు. అట్లే ఏ యువతియును ఇతరులను కామించినట్టిది గాని లేక ఇతరుని వివాహమాడినట్టిదిగాని లేదు. అతని ప్రియురాంద్రందఱును అతని శౌర్యవిభవములచే మోహింపబడి వచ్చియున్నట్టివారే.

**శ్లో॥ న చాకులీనా న చ హీనరూపా**
**నాదక్షిణా నానుపచారయుక్తా ।**
**భార్యాఽభవత్తస్య న హీనసత్త్వా**
**న చాపి కాంతస్య న కామనీయా ॥ 71**

**పదచ్ఛేదము :–** న – చ – అకులీనా – న – చ – హీనరూపా – న – అదక్షిణా – న – అనుపచారయుక్తా – భార్యా – అభవత్ – తస్య – న – హీనసత్త్వా – న – చ – అపి – కాంతస్య – న – కామనీయా ॥

**అన్వయక్రమము :–** తస్య అకులీనా భార్యా న అభవత్; తథా హీనరూపా న; అదక్షిణా న; అనుపచారయుక్తా న; హీనసత్త్వాచ న; కాంతస్య తస్య అకామనీయా (కాచిత్) భార్యా న అభవత్.

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ రావణాసురునకు, అకులీనా = తక్కువ వంశమునందు జన్మించినట్టిది, భార్యా న అభవత్ = భార్యగా ఉండలేదు. (తథా = అట్లే) హీనరూపా న = తక్కువ సౌందర్యము గల వనిత, న = భార్యగా లేదు. అదక్షిణా న = తక్కువ సౌందర్యము గల వనిత, న = భార్యగా లేదు. అనుపచారయుక్తా = భర్తకు సేవచేయు నట్టి స్వభావము లేనిది, న = భార్య కాలేదు. హీనసత్త్వా చ = తక్కువ శక్తిగలదియును,

న = భార్య కాలేదు. అకామనీయా = కామింపదగనట్టి తరుణియు, భార్యా న అభవత్ = భార్య కాలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ఉపచారయుక్తా – ఉత్తమములైన అంబరములు, భూషణములు మున్నగు ఉపచారములతో వెలయునది.

**తాత్పర్యము** :– రావణుని భార్యలలో ఏ ఒక్కతెయును ఉన్నత వంశమునకు చెందనట్టిదిగాని, తక్కువ సౌందర్యము గలదిగాని, రావణుని సేవలో ఏమరుపాటు కల్గినట్టిదిగాని, తక్కువ శక్తిగలదిగాని, కమనీయుడైన అతనిచే కామింపబడనట్టిదిగాని లేనే లేదు.

**శ్లో॥ బభూవ బుద్ధి స్తు హరీశ్వరస్య**
**య దీదృశీ రాఘవధర్మపత్నీ ।**
**ఇమా యథా రాక్షసరాజభార్యాః**
**సుజాత మ స్యేతి హి సాధుబుద్ధేః ॥ 72**

**పదచ్ఛేదము** :– బభూవ – బుద్ధిః – తు – హరీశ్వరస్య – యది – ఈదృశీ – రాఘవధర్మపత్నీ – ఇమాః – యథా – రాక్షసరాజభార్యాః – సుజాతమ్ – అస్య – ఇతి – హి – సాధుబుద్ధేః ॥

**అన్వయక్రమము** :– రాఘవధర్మపత్నీ, ఇమాః రాక్షసరాజభార్యాః యథా, ఈదృశీ యది, అస్య సుజాతమ్ ఇతి, సాధుబుద్ధేః హరీశ్వరస్య బుద్ధిః బభూవ.

**ప్రతిపదార్థము** :– రాఘవధర్మపత్నీ = శ్రీరాముని ధర్మపత్నియైన జానకి, ఇమాః రాక్షసరాజభార్యాః యథా = ఈ రావణాసురుని భార్యలవలెనే, ఈదృశీ యది = ఇట్టి భోగములనుభవించునట్టిదైన యెడల, అస్య = ఈ రావణునకు, సుజాతం = క్షేమమే, ఇతి = అని, సాధుబుద్ధేః = మంచినే ఆలోచించు స్వభావముగల, హరీశ్వరస్య = హనుమంతునకు, బుద్ధిః బభూవ = ఆలోచన కలిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :– 1. ఈ రాక్షసరాజు భార్యలు ఎట్లుగా తమ భర్తతో గూడి సకల భోగములను అనుభవించుచున్నారో అట్లే రాఘవధర్మపత్ని గూడ తన భర్తతో కూడియున్నచో ఈ రావణునకు మేలు కలుగును గదా యని హనుమకు ఉత్తమమైన ఆలోచన కలిగెను.

2. ఈ రావణుడు రాఘవధర్మపత్నిని తిరిగి శ్రీరామునకు అప్పగించినచో ఈతని జన్మము మేలైనదగునని హనుమకు తోచెను.

3. రాఘవధర్మపత్ని రావణునిచే బలాత్కారముగా తేబడినట్లు ఈ రాక్షసరాజు భార్యలు సుగ్రీవునిచే అపహరింపబడినచో సుగ్రీవునకు మేలు గల్గును కదా! అని మంచి మంత్రిగా హనుమకు ఆలోచన కలిగెను.

4. ఈ రాక్షసరాజు భార్యల నందరిని రావణు డెట్లు హరించి తెచ్చెనో అట్లే రాఘవధర్మపత్నిని గూడ తెచ్చినప్పుడు ఈ రావణునికి మేలు ఎట్లు కలుగును? "నా ప్రియురాలిని అపహరించిన ఆ రక్కసుని యమసదనమునకు కొద్దికాలములోనే పంపగలను సుమా"యని సుగ్రీవునియొద్ద శ్రీరాముడు ప్రతిజ్ఞ చేయుటచే రావణునికి వినాశము తప్పదు అనుకొనెను.

5. ఈ రాక్షసరాజు భార్యలు నాచే ఏ రీతిగా చూడబడుచున్నారో అట్లే రాఘవ ధర్మపత్నికూడ నాచే చూడబడినయెడల ఈ భటునకు – అనగా నాకు జన్మసాఫల్యము లభించును గదా! "ఒక నెలలో తిరిగివచ్చి నేను సీతను చూచితిని అని చెప్పినవాడు నాతో సమానమైన భోగములతో విరాజిల్లగలడు. అట్టివానికంటె నాకు ప్రియమైనవాడు వేరొకడుండడు. అతడు నాకు ప్రాణాధికమైన మిత్రుడు కాగలడు" అని చెప్పినట్టి సుగ్రీవునకు ప్రియము గూర్చుటవలన నా జన్మ సఫలమగునని హనుమకు ఆలోచన కలిగెను.

6. రాఘవధర్మపత్ని ఇట్టిదిగానే కానవచ్చినయెడల సుగ్రీవునకును రామునకును భయపడుచున్నట్టి మా అంగదాది వానరసమూహమునకు మేలు కలుగును. "సీత లభింపకున్నచో భార్యాపుత్రాదులను వీడి ప్రాయోపవేశము చేయుటయే గతి యని ప్రాణభయముతో నున్న మా వానరవీరులకు తిరిగి జీవితలాభము కలుగగలదు." అని హనుమకు ఆలోచన కలిగెను.

7. ఈ రాక్షసరాజు భార్యలు జీవించియున్నట్లుగనే రాఘవధర్మపత్ని గూడ జీవించియున్న యెడల ఈ రామునకు మేలు కలుగును. "జానకి జీవించియున్నదో! లేదో! తెలిసికొనవలెను. ఆమెను విడచి నేను జీవింపజాలను" అని సీతయొక్క జీవితమునందే సంశయము నొందుచున్నట్టి రామునకు సీతాజీవితవార్త తెలియగనే అతనికి జీవితలాభము చేకూరును అని హనుమకు ఆలోచన కల్గెను.

8. ఓ రాక్షసరాజా! ఈ స్త్రీలను భార్యలుగా చేసికొనినట్లు రాఘవధర్మపత్నిని గూడ నీవు భార్యగా చేసుకొనదలచినచో సర్వసంపదలతో పుత్రపౌత్రులతో కూడిన నీకు

మేలు ఎట్లు కలుగును? నీకు సర్వనాశనమే కలుగును సుమా! అని రావణునకు హితము నుపదేశింపవలయునని హనుమకు ఆలోచన కలిగెను. ఇకముందు కలిసికొన బోవునప్పుడు గూడ రావణునకు నిట్లే హితము నుపదేశించెను గదా!

9. ఈ రాక్షసరాజభార్యలవలెనే ఇట్టి అల్పసౌందర్యమే కలిగియుండునా ఏమి మా సీతమ్మ! ఆమె త్రిలోకసుందరియై యుండును. అందుచే వారిలో సీతాదేవి యుండబోదు అని హనుమ నిశ్చయించుకొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** రాఘవధర్మపత్ని ఇట్టిదిగానే అనగా వీరివంటిదిగానే స్వయంవరమునకు పూర్వమే రావణునికి ధర్మపత్ని యైనయెడల ఈ రావణుడు అదృష్టవంతుడై యుండును అని హనుమకు వానరసహజమైన ఆలోచన కలిగెను. (కాని వెంటనే సాధుబుద్ధి గాబట్టి తన చెడు ఆలోచనకు తానే పశ్చాత్తాపము నొందెను.)

2. ఈ రాక్షసరాజు భార్యలు ఎట్లు తమ భర్తతోగూడి సకలభోగముల ననుభవించుచున్నారో అట్లే రాఘవధర్మపత్ని గూడ తన భర్తతోగూడి భోగముల నొందుచున్నయెడల ఈ రావణునకు మేలు కలుగును. అని సాధుబుద్ధియైన హనుమ పరుల క్షేమమునే ముఖ్యముగా నెంచువాడై ఆలోచించెను. అనగా ఈ రావణుడు రాఘవధర్మపత్నిని తిరిగి రామునకు అర్పించినయెడల వానికి జన్మసాఫల్యము కలుగును అని భావము.

**రామానుజీయము :-** ఈ రాక్షసరాజు భార్యలు ఏవిధముగా తమ భర్తతోగూడి సర్వసుఖముల ననుభవించుచున్నారో రాఘవధర్మపత్ని గూడ ఈ విధముగనే తన భర్తతో కూడియున్నయెడల ఈ రావణునకు మేలు కలుగును. అని సాధుబుద్ధియైన హనుమకు ఆలోచన కలిగెను. అనగా రావణుడు రాఘవధర్మపత్నిని తిరిగి అప్పగించినయెడల వాని జన్మ చరితార్థమగును. అని సాధుబుద్ధియైన హనుమకు ఆలోచన కలిగెను.

**తనిశ్లోకి :-** రావణుడు తన భార్యలతో ఎట్లుగా నిత్యము కలసి విహరించుచున్నాడో అట్లే రాముడు సీతతో గలసి విహరించువాడగుచో రావణుని ఐశ్వర్యము అవిచ్ఛిన్నముగా కొనసాగగలదు. అని శత్రువులకు గూడ మేలునే వాంఛించు సాధుబుద్ధియగు హనుమకు ఆలోచన కలిగెను.

**తిలకము :-** రాఘవధర్మపత్నిగూడ ఈ రాక్షసరాజు భార్యలవలెనే వీరిలోనే యుండి రావణుని సేవించుచున్నయెడల ఈ రావణునకు భద్రమే యగును. జానకి రావణుని

భార్యగా నున్నదని నేను రామునకు విన్నవింపగా అతడు సీతను మృతురాలినిగానే ఎంచి ఆమెయెడ ఉపేక్ష వహించుటచే రావణుని వధించు ప్రయత్నము యొక్క ప్రసక్తియే యుండదు. కాబట్టి రావణునకు ప్రమాదముండదు. అని హనుమ భావనము.

**'రామరత్నప్రకాశిక' యను మదరాసు ప్రతిలో కానవచ్చిన విశేషార్థములు :-**

ఈ శ్లోకమునందు వాక్యములు రెండుగా విభజించి ఇట్లు అర్థము గ్రహించవలెను.

**1వ వాక్యము :-** ఈ రావణుని భార్యలు కుల శీల సౌందర్యాది గుణములతో ఎట్లు సంతోషముతో నున్నారో అట్లే రాఘవధర్మపత్ని కూడ కుల శీలాది గుణసంపన్నురాలై సంతోషించుచున్నయెడల ఎంత బాగుండునో గదా!

**2వ వాక్యము :-** (ఆ యాలోచనను విడచి రావణుని వైభవము తన మనస్సును ఆకర్షింపగా) "ఈ రావణుని జన్మము ఎంత భాగ్యవంతమైనది!" (అని అంతఃపుర వైభవమునకు మెచ్చి హనుమ ఇచ్చట రావణుని ప్రశంసించుచున్నాడు).

**తాత్పర్యము :-** ఈ రాక్షసరాజభార్యలందరును ఎట్లు తమభర్త సేవచేయుచు సుఖించుచున్నారో అట్లే రాఘవధర్మపత్నిగూడ తన భర్తను జేరి పతిసేవానిమగ్నురాలు కాగలిగినచో ఈ రావణాసురునకు క్షేమము కలుగుట కవకాశమున్నది. లేనిచో ఇతనికి వినాశము తప్పదు గదా! అని హనుమ తలపోసెను.

**శ్లో॥ పున శ్చ సో ऽ చింతయ దార్తరూపో**
**ధ్రువం విశిష్టా గుణతో హి సీతా ।**
**అ థాయ మస్యాం కృతవాన్ మహాత్మా**
**లంకేశ్వరః కష్ట మనార్యకర్మ ॥ 73**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సంకులాంతఃపురవర్ణనం" నామ*
*నవమస్సర్గః.*

**పదచ్ఛేదము :-** పునః – సః – అచింతయత్ – ఆర్తరూపః – ధ్రువం – విశిష్టా – గుణతః – హి – సీతా – అథ – అయమ్ – అస్యాం – కృతవాన్ – మహాత్మా – లంకేశ్వరః – కష్టమ్ – అనార్యకర్మ ॥

**అన్వయక్రమము :-** పునః ఆర్తరూపః సః అచింతయత్; ధ్రువం సీతా గుణతః విశిష్టా

హి; అథ అయం మహాత్మా లంకేశ్వరః అస్యాం అనార్యకర్మ కృతవాన్; కష్టమ్.

**ప్రతిపదార్థము :–** పునః = తిరిగి, ఆర్తరూపః సః = ఖిన్నుడై యాతడు, అచింతయత్ = చింతించెను, ధ్రువం = నిశ్చయముగా, సీతా = జానకి, గుణతః = స్వభావముచే, విశిష్టా హి = శ్రేష్ఠురాలుకదా, అథ = కాని, అస్యాం = అట్టి ఆమె యెడలనే, అయం మహాత్మా లంకేశ్వరః = ఈ మహానుభావుడైన రాక్షసరాజు, అనార్యకర్మ = దుష్టమైన పనిని, కృతవాన్ = కావించియున్నాడు, కష్టమ్ = అయ్యో కష్టము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి ప్రతి :–** ఆత్తరూపః = గ్రహించిన రూపముగలవాడు.

**తాత్పర్యము :–** హనుమ తాను పూర్వమాలోచించిన ఊహకు తానే చింతించుచు సీతాదేవిని రాక్షసస్త్రీలతో పోల్చిన పాపమునకు పశ్చాత్తాపము నొందుచు విషణ్ణుడై మరల ఇట్లు చింతించెను. సీతాదేవి నిశ్చయముగా తన శీలస్వభావాదులచే ఎల్ల స్త్రీలకంటెను ఉత్కృష్టమైనట్టిది. అట్టి ఆ మహాసాధ్వియెడనే అక్కటా ఈ దురాత్ముడు ఇట్టి అపచారమును గావించెను గదా! అని చింతించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సంకులాంతఃపురవర్ణనము" అను*
*తొమ్మిదవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# దశమసర్గ

**శ్లో॥ తత్ర దివ్యోపమం ముఖ్యం స్ఫాటికం రత్నభూషితం ।**
**అవేక్షమాణో హనుమాన్ దదర్శ శయనాసనమ్ ॥ 1**

**శ్లో॥ దాంతకాంచనచిత్రాంగై ర్వైడూర్యైశ్చ వరాసనైః ।**
**మహార్హాస్తరణోపేతై రుపపన్నం మహాధనైః ॥ 2**

**పదచ్ఛేదము :–** తత్ర – దివ్యోపమం – ముఖ్యం – స్ఫాటికం – రత్నభూషితమ్ – అవేక్షమాణః – హనుమాన్ – దదర్శ – శయనాసనమ్ – దాంతకాంచనచిత్రాంగైః – వైడూర్యైః – చ – వరాసనైః – మహార్హాస్తరణోపేతైః – ఉపపన్నం – మహాధనైః ॥

**అన్వయక్రమము :–** తత్ర అవేక్షమాణః హనుమాన్ దివ్యోపమం, ముఖ్యం, స్ఫాటికం, రత్నభూషితం, దాంతకాంచనచిత్రాంగైః, వైడూర్యైః, మహార్హాస్తరణోపేతైః, మహాధనైః, వరాసనైశ్చ ఉపపన్నం శయనాసనం దదర్శ.

**ప్రతిపదార్థము :–** తత్ర అవేక్షమాణః = ఆ శయనశాలయందు సీతను వెదుకుచు, హనుమాన్ = హనుమంతుడు, దివ్యోపమం = దేవలోకములోని శయనము వంటిదియును, రత్నభూషితం = వివిధమగు రత్నములతో అలంకరింపబడినట్టి దియును, దాంతకాంచనచిత్రాంగైః = ఏనుగు దంతములతోను బంగారముతోను నిర్మింపబడిన భాగములు కలిగినవియు, వైడూర్యైః = వైడూర్య రత్నములచే నిర్మింపబడినవియును, మహార్హాస్తరణోపేతైః = మిక్కిలి విలువగలిగినట్టి కంబళ్ళతో కూడినవియు, మహాధనైః = అమూల్యము లైనవియును అగు, వరాసనైశ్చ = శ్రేష్ఠమైన పీఠములతోడను, ఉపపన్నం = కూడియున్నట్టిదియునగు, శయనాసనం = శయ్యలుండు ఒక మహావేదికను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** వరాసనైః = స్త్రీలు శయనించునట్టి పల్లకీలవంటి శయ్యలు.

**గోవిందరాజీయము :–** వరాసనైః = శయనమునుండి అవరోహించునపుడు విశ్రాంతి

తీసుకొనుటకై ఏర్పరచుకొన్నట్టి ఆసనములు.

**తాత్పర్యము :–** హనుమ ఆ శయనశాలయందు సీతను అన్వేషించుచున్నవాడై ఒకచోట స్వర్గమునందలి శయనవిశేషమువలె స్ఫటికములు మున్నగు రత్నములతోడను, ఏనుగుదంతములతోడను, సువర్ణముతోడను నిర్మించిన అవయవములు గలిగి వైడూర్య రత్ననిర్మితమైన అమూల్యములైనట్టి రత్నకంబళ్ళతోడను నిండియున్నట్టి శ్రేష్ఠమైన పీఠములుగల సుందరమైన వేదికను గాంచెను.

**శ్లో॥ తస్య చైకతమే దేశే సో ఽ గ్ర్యమాలావిభూషితమ్ ।**
**దదర్శ పాండురం ఛత్రం తారాధిపతిసన్నిభమ్ ॥ 3**

**పదచ్ఛేదము :–** తస్య – చ – ఏకతమే – దేశే – సః – అగ్ర్యమాలావిభూషితమ్ – దదర్శ – పాండురం – ఛత్రం – తారాధిపతిసన్నిభమ్ ॥

**అన్వయక్రమము :–** సః తస్య ఏకతమే దేశే అగ్ర్యమాలావిభూషితం తారాధిపతిసన్నిభం పాండురం ఛత్రం దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమంతుడు, తస్య = ఆ శయనవేదికయొక్క, ఏకతమే దేశే = ఒకానొక ప్రదేశమునందు, అగ్ర్యమాలావిభూషితం = శ్రేష్ఠమైన హారములతో అలంకరింపబడినట్టిదియును, తారాధిపతిసన్నిభం = చంద్రబింబముతో సమానముగా నున్నట్టిదియును అగు, పాండురం ఛత్రం = శ్వేతచ్ఛత్రమును, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమ ఆ శయనవేదిక శిరోభాగమున సుందరమైన హారములతో అలంకరింపబడి చంద్రబింబమువలె నున్నట్టి ఒకానొక శ్వేతచ్ఛత్రమును జూచెను.

**శ్లో॥ జాతరూపపరిక్షిప్తం చిత్రభానుసమప్రభమ్ ।**
**అశోకమాలావితతం దదర్శ పరమాసనమ్ ॥ 4**

**పదచ్ఛేదము :–** జాతరూపపరిక్షిప్తం – చిత్రభానుసమప్రభమ్ – అశోకమాలావితతం – దదర్శ – పరమాసనమ్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** జాతరూపపరిక్షిప్తం = సువర్ణముచే నిర్మింపబడినదియును, చిత్రభానుసమప్రభం = సూర్యునితో సమానమైన కాంతి గలదియును, అశోకమాలావితతం = అశోకపుష్పమాలికలతో నిండియున్నదియును అగు, పరమాసనం = ఒకానొక శ్రేష్ఠమైన శయ్యను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- చిత్రభానుసమప్రభం = అగ్నితో సమానమైనట్టి కాంతిగలది యని కూడ చెప్పవచ్చును.

**రామాయణ శిరోమణి** :- అశోకమాలావితతం = శోకాపహారకములైనట్టి, మాలికలతో గూడినట్టిది.

**తాత్పర్యము** :- అచ్చట బంగారముతో నిర్మింపబడి, సూర్యునివంటి కాంతిగలిగి, అశోక పుష్పమాలికలతో నిండినట్టి ఒక గొప్పదైనట్టి శయ్యను హనుమ చూచెను.

**శ్లో॥ వాలవ్యజనహస్తాభి ర్వీజ్యమానం సమంతతః ।**
**గంధై శ్చ వివిధై ర్జుష్టం వరధూపేన ధూపితమ్ ॥ 5**

**పదచ్ఛేదము** :- వాలవ్యజనహస్తాభిః - వీజ్యమానం - సమంతతః - గంధైః - చ - వివిధైః - జుష్టం - వరధూపేన - ధూపితమ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- వాలవ్యజనహస్తాభిః = వింజామరలు చేతియందుగల వనితలచే, సమంతతః = అన్నివైపులనుండి, వీజ్యమానం = వీవబడుచున్నట్టియు, వివిధైః గంధైః = బహువిధములైన సువాసనలచే, జుష్టం = వ్యాప్తమైయున్నదియును, వరధూపేన = శ్రేష్ఠమైన ధూపద్రవ్యముచే, ధూపితం = పొగవేయబడినదియును అగు, (పరమాసనం దదర్శ = గొప్పశయ్యను జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- రావణుని రహస్య శయనమందిరమునందు వింజామరలు ధరించిన స్త్రీలు నిలచి వీచుచుండుట, వారికి హనుమ అగపడకుండుట ఎట్లు సంభవమగును అను ప్రశ్నవచ్చును. గనుక ఆ వాలవ్యజనహస్తలైన స్త్రీలు యంత్రనిర్మితస్త్రీప్రతిమలని చెప్పుకొనవలెను.

**తాత్పర్యము** :- ఆ శయనము చుట్టును వింజామరలు తమ చేత ధరించి కొందరు వనితలు విసరుచుండిరి. ఆ శయనము వివిధములైన పరిమళములతో పరిమళించుచు అమూల్యములైన ధూపద్రవ్యముల పొగలతో వ్యాపించి యుండెను.

**శ్లో॥ పరమాస్తరణాస్తీర్ణమ్ అవికాజినసంవృతమ్ ।**
**దామభి ర్వరమాల్యానాం సమంతా దుపశోభితమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :– పరమాస్తరణాస్తీర్ణమ్ – ఆవికాజినసంవృతమ్ – దామభిః – వరమాల్యానాం – సమంతాత్ – ఉపశోభితమ్ ॥

**ప్రతిపదార్థము** :– పరమాస్తరణాస్తీర్ణం = శ్రేష్ఠమైన రత్నకంబళులచే పరువబడినది యును, ఆవికాజినసంవృతం = మృదురోమములుగల మృగచర్మములచే కప్పబడినదియును, సమంతాత్ = అన్నివైపులను, వరమాల్యానాం దామభిః = శ్రేష్ఠమైన పుష్పములయొక్క మాలికలచే, ఉపశోభితం = ప్రకాశించుచున్నదియునగు (పరమాసనం దదర్శ = గొప్పదైన శయ్యను జూచెను).

**తాత్పర్యము** :– మరియు ఆ శయ్య గొప్పవైన కంబళ్ళతో నిండి మృదురోమములుగల మృగచర్మములతో గప్పబడి శ్రేష్ఠమైన పువ్వులదండలతో అన్నివైపులను అలంకరింపబడి అద్భుతముగా గానవచ్చుచుండెను.

**శ్లో॥ తస్మిన్ జీమూతసంకాశం ప్రదీప్తోత్తమకుండలమ్ ।**
**లోహితాక్షం మహాబాహుం మహారజతవాససమ్ ॥ 7**

**పదచ్ఛేదము** :– తస్మిన్ – జీమూతసంకాశం – ప్రదీప్తోత్తమకుండలమ్ – లోహితాక్షం – మహాబాహుం – మహారజతవాససమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– తస్మిన్ = ఆ శయనమునందు, జీమూతసంకాశం = మేఘమువంటి ఆకారము గలవాడును, ప్రదీప్తోత్తమకుండలం = మిక్కిలి ప్రకాశించుచున్న గొప్పవైన కుండలములను ధరించినవాడును, లోహితాక్షం = ఎఱ్ఱని కన్నులుగలవాడును, మహాబాహుం = దీర్ఘమైన బలిష్ఠములగు భుజములు గలవాడును, మహారజతవాససం = బంగారు వస్త్రములను ధరించినవాడును అగు (రాక్షసాధిపం దదర్శ = రావణుని గాంచెను).

**తాత్పర్యము** :– హనుమ చూచినట్టి ఆ శయ్యయందు నిద్రించియున్న రావణుడు నల్లని మేఘమువలె నుండెను. అతని కుండలములు మిక్కిలిగ ప్రకాశించుచుండెను. అతని కన్నులెఱ్ఱగ నుండెను. భుజములు పొడవులై బలిష్ఠములై యుండెను. అతడు స్వర్ణమయమైన వస్త్రములను ధరించియుండెను.

**శ్లో॥ లోహితేనాఽనులిప్తాంగం చందనేన సుగంధినా ।**
**సంధ్యారక్త మివాకాశే తోయదం సతటిద్గణమ్ ॥ 8**

**పదచ్ఛేదము** :– లోహితేన – అనులిప్తాంగం – చందనేన – సుగంధినా – సంధ్యారక్తమ్

– ఇవ – ఆకాశే – తోయదం – సతటిద్గణమ్ ॥

**అన్వయక్రమము** :– లోహితేన సుగంధినా చందనేన అనులిప్తాంగమ్, ఆకాశే సతటిద్గణం, సంధ్యారక్తం తోయదమ్ ఇవ (స్థితం రాక్షసాధిపం దదర్శ).

**ప్రతిపదార్థము** :– లోహితేన = ఎఱ్ఱనైనట్టి, సుగంధినా = పరిమళము గలిగినట్టి, చందనేన = మంచిగంధముచే, అనులిప్తాంగం = పూయబడిన శరీరముగలవాడై, సంధ్యారక్తం = సంధ్యాసమయమునందు ఎఱ్ఱబడియున్నట్టియు, సతటిద్గణం = మెరపుతీగలతో కూడుకొన్నట్టియు, ఆకాశే తోయదం ఇవ (స్థితం) = ఆకాశమునందు మేఘమువలె నున్నట్టి, (రాక్షసాధిపం దదర్శ = రావణుని గాంచెను).

**తాత్పర్యము** :– మిక్కిలి పరిమళముగల ఎఱ్ఱని మంచిగంధముతో ప్రకాశించుచున్న ఆ రావణుడు సంధ్యాసమయమున ఎఱ్ఱగనున్న మేఘమువలె గానవచ్చుచుండెను. తాను ధరించిన కాంచనాంబరములు మేఘమునందలి మెరపు తీగలవలెనే శోభిల్లు చుండెను.

**శ్లో॥ వృత మాభరణై ర్దివ్యై స్సురూపం కామరూపిణమ్ ।**
**సవృక్షవనగుల్మాఢ్యం ప్రసుప్త మివ మందరమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :– వృతమ్ – ఆభరణైః – దివ్యైః – సురూపం – కామరూపిణమ్ – సవృక్షవనగుల్మాఢ్యం – ప్రసుప్తమ్ – ఇవ – మందరమ్ ॥

**అన్వయక్రమము** :– దివ్యైః ఆభరణైః వృతం, సురూపం, కామరూపిణం, సవృక్షవన గుల్మాఢ్యం, ప్రసుప్తం మందరమ్ ఇవ స్థితం (రాక్షసాధిపం దదర్శ).

**ప్రతిపదార్థము** :– దివ్యైః ఆభరణైః వృతం = దివ్యములైన భూషణములతో గూడిన వాడును, సురూపం = ఉత్తమమైన సౌందర్యము గలవాడును, కామరూపిణం = స్వేచ్ఛారూపము ధరించగలవాడును, సవృక్షవనగుల్మాఢ్యం = వృక్షములతోడను, అడవితుప్పలతోడను నిండియున్న, ప్రసుప్తం మందరమ్ ఇవ స్థితం = నిద్రించియున్న మందరపర్వతమువలెనున్న వాడును అగు, (రాక్షసాధిపం దదర్శ = రావణుని జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అతని బాహువులు వృక్షములవలె నుండెను. నాసిక మున్నగు అవయవములు గుల్మములవలె నుండెను.

**తాత్పర్యము** :– శ్రేష్ఠమైన ఆభరణములు ధరించి సుందరమైన రూపముతోనున్న కామరూపియగు ఆ రావణుడు నిద్రించియుండగా అతని బాహువులు వృక్షములవలెను,

నాసికయు, రోమసహితమైన ముఖమును గుల్మములవలెను ఉండుటచే అతడు నిద్రించియున్న మందరపర్వతమా! యన్నట్లు గానవచ్చుచుండెను.

**శ్లో॥ క్రీడిత్వోపరతం రాత్రౌ వరాభరణభూషితమ్ ।**
**ప్రియం రాక్షసకన్యానాం రాక్షసానాం సుఖావహమ్ ॥ 10**

**పదచ్ఛేదము** :– క్రీడిత్వా – ఉపరతం – రాత్రౌ – వరాభరణభూషితమ్ – ప్రియం – రాక్షసకన్యానాం – రాక్షసానాం – సుఖావహమ్ ॥

**ప్రతిపదార్థము** :– రాత్రౌ = రాత్రిసమయమున, క్రీడిత్వా = స్వేచ్ఛగా క్రీడించి, ఉపరతం = విశ్రమించియున్నవాడును, వరాభరణభూషితం = శ్రేష్ఠమైన ఆభరణములు ధరించినవాడును, రాక్షసకన్యానాం ప్రియం = రాక్షసకన్యలకు మనోహరుడైనవాడును, రాక్షసానాం సుఖావహం = రాక్షసులకు సౌఖ్యప్రదుడై యున్నవాడును అగు, (రాక్షసాధిపం దదర్శ = రావణుని జూచెను).

**తాత్పర్యము** :– రాత్రి స్వేచ్ఛగా క్రీడించి, విశ్రాంతిని అనుభవించుచున్నవాడును, అమూల్యములైన ఆభరణములతో ప్రకాశించుచున్నవాడును, రాక్షసకన్యలకు ప్రియుడును, రాక్షసులకు సుఖప్రదుడును అగు రావణుని హనుమ గాంచెను.

**శ్లో॥ పీత్వాఽ ప్యుపరతం చాపి దదర్శ స మహాకపిః ।**
**భాస్వరే శయనే వీరం ప్రసుప్తం రాక్షసాధిపమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– పీత్వా – అపి – ఉపరతం – చ – అపి – దదర్శ – సః – మహాకపిః – భాస్వరే – శయనే – వీరం – ప్రసుప్తం – రాక్షసాధిపమ్ ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః పీత్వా అపి ఉపరతం భాస్వరే శయనే ప్రసుప్తం, వీరం, రాక్షసాధిపం దదర్శ.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, పీత్వా అపి = స్వేచ్ఛగా మద్యమును సేవించియు, ఉపరతం = విశ్రమించియున్నవాడును, భాస్వరే శయనే = ప్రకాశించుచున్న శయనముపై, ప్రసుప్తం = నిదురించియున్నవాడును అగు, వీరం = వీరుడైన, రాక్షసాధిపం = రాక్షసరాజును, దదర్శ = కాంచెను.

**తాత్పర్యము** :– మద్యమును సేవించి, ఒడలు మరచి, దివ్యమైన ఆ శయనముపై శయనించి, మహావీరలక్షణములతో గానవచ్చుచున్న రాక్షసరాజైన రావణుని హనుమ గాంచెను.

**శ్లో॥ నిశ్శ్వసంతం యథా నాగం రావణం వానరర్షభః ।**
**ఆసాద్య పరమోద్విగ్న స్సోఽపాసర్ప త్సుభీతవత్ ॥ 12**

**పదచ్ఛేదము** :- నిశ్శ్వసంతం - యథా - నాగం - రావణం - వానరర్షభః - ఆసాద్య - పరమోద్విగ్నః - సః - అపాసర్పత్ - సుభీతవత్ ॥

**అన్వయక్రమము** :- సః వానరర్షభః నాగం యథా నిశ్శ్వసంతం రావణమ్ ఆసాద్య, పరమోద్విగ్నః, సుభీతవత్ అపాసర్పత్.

**ప్రతిపదార్థము** :- సః వానరర్షభః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, నాగం యథా = సర్పమువలె, నిశ్శ్వసంతం = (బుసకొట్టుచున్నట్లు) శ్వాసించుచున్న, రావణమ్ = రావణాసురుని, ఆసాద్య = సమీపించి, పరమోద్విగ్నః = మిక్కిలి ఉద్వేగమును చెందినవాడై, సుభీతవత్ = మిక్కిలి భయము చెందినవానివలె, అపాసర్పత్ = తప్పుకొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ఈతడు మహాపాపి, సీతామాతను అపహరించినట్టి ఈతని సమీపమున నిలుచుటయే అనుచితమగునని ఖిన్నచిత్తుడై తొలగిపోయెను. 'సుభీతవత్' - పిశాచములు మున్నగువాని ఎదుట ఎట్లు నిలబడుటకు భయమునొంది తొలగి పోవుదురో అట్టి భీతిచే హనుమ తొలగెనని భావము.

**రామాయణ శిరోమణి** :- ముందు జరుగబోవు అతని ఐశ్వర్యధ్వంసమును ఊహించి ఉద్వేగపూరితుడై దయాళువైనవా డగుటచే భీతినొంది అతని ఎదుటనుండి తొలగిపోయెను.

**తాత్పర్యము** :- సర్పము బుసకొట్టుచున్నట్లు నిశ్వాసములు విడుచుచున్న రావణుని హనుమంతుడు సమీపించి అతని ఆకారమునకును, శీలమునకును మనస్సునందు ఉద్వేగమునొందినవాడై, జానకమ్మ నపహరించిన అతని క్రూరత్వమును దుర్మార్గమును స్మరించి భయమునొందినవాని వలెనే వెంటనే ఎదుటనుండి ప్రక్కకు తప్పుకొనెను.

**శ్లో॥ అ థారోహణ మాసాద్య వేదికాంతర మాశ్రితః ।**
**సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ మహాకపిః ॥ 13**

**పదచ్ఛేదము** :- అథ - ఆరోహణమ్ - ఆసాద్య - వేదికాంతరమ్ - ఆశ్రితః - సుప్తం - రాక్షసశార్దూలం - ప్రేక్షతే - స్మ - మహాకపిః ॥

**అన్వయక్రమము :–** అథ సః మహాకపిః ఆరోహణమ్ ఆసాద్య వేదికాంతరమ్ ఆశ్రితః (సన్) సుప్తం రాక్షసశార్దూలం ప్రేక్షతే స్మ.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, సః మహాకపిః = ఆ హనుమ, ఆరోహణమ్ ఆసాద్య = సోపానము నొకదానిని చేరి, వేదికాంతరమ్ ఆశ్రితః = ఇంకొక తిన్నెపై నిలచినవాడై, సుప్తం రాక్షసశార్దూలం = నిద్రించియున్న రాక్షసరాజును, ప్రేక్షతే స్మ = చూచుచుండెను.

**తాత్పర్యము :–** అంతట హనుమ ఒక మేడమెట్టుపై జేరి అచటినుండి విశాలమైన వేదికపై కూర్చుండియున్నవాడై నిద్రించుచున్న ఆ రావణాసురుని శ్రద్ధగా తిలకించు చుండెను.

**శ్లో॥ శుశుభే రాక్షసేంద్రస్య స్వపత శ్శయనోత్తమమ్ ।**
**గంధహస్తిని సంవిష్టే యథా ప్రస్రవణం మహత్ ॥ 14**

**పదచ్ఛేదము :–** శుశుభే – రాక్షసేంద్రస్య – స్వపతః – శయనోత్తమమ్ – గంధహస్తిని – సంవిష్టే – యథా – ప్రస్రవణం – మహత్ ॥

**అన్వయక్రమము :–** గంధహస్తిని సంవిష్టే (సతి) యథా మహత్ ప్రస్రవణం శోభతే, తథా స్వపతః రాక్షసేంద్రస్య శయనోత్తమం శుశుభే.

**ప్రతిపదార్థము :–** గంధహస్తిని సంవిష్టే సతి = మదపుటేనుగు శయనించియుండగా, యథా మహత్ ప్రస్రవణం శోభతే = ఏరీతిగా గొప్పదైన ప్రస్రవణపర్వతము ప్రకాశించునో, తథా = ఆ రీతిగనే, స్వపతః రాక్షసేంద్రస్య = నిద్రించుచున్న ఆ రాక్షసరాజు యొక్క, శయనోత్తమం = దివ్యమైన శయనమున్ను, శుశుభే = శోభిల్లెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'గంధహస్తి' – దేనియొక్క గంధముచే, ఇతర గజములు పరుగెత్తుకొని పోవునో, దానిని గంధహస్తి (మదపుటేనుగు) అందురు.

**తాత్పర్యము :–** రాక్షసరాజు ఆ రీతిగా తన శయనముపై శయనించియుండగా ఆ శయ్య నిద్రించియున్న మదపుటేనుగుతో చూడముచ్చట గొలుపు ప్రస్రవణపర్వతము వలెనే విరాజిల్లుచుండెను.

**శ్లో॥ కాంచనాంగదసన్నద్ధౌ దదర్శ స మహాత్మనః ।**
**విక్షిప్తౌ రాక్షసేంద్రస్య భుజా వింద్రధ్వజోపమౌ ॥ 15**

**పదచ్ఛేదము** :- కాంచనాంగదసన్నద్ధౌ - దదర్శ - సః - మహాత్మనః - విక్షిప్తౌ - రాక్షసేంద్రస్య - భుజౌ - ఇంద్రధ్వజోపమౌ ॥

**అన్వయక్రమము** :- సః మహాత్మనః రాక్షసేంద్రస్య కాంచనాంగదసన్నద్ధౌ, విక్షిప్తౌ, ఇంద్రధ్వజోపమౌ భుజౌ దదర్శ.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమ, మహాత్మనః రాక్షసేంద్రస్య = మహనీయుడైన రావణునియొక్క, కాంచనాంగదసన్నద్ధౌ = బంగరు బాహుపురులతో అలంకరింప బడినట్టి, విక్షిప్తౌ = చాచియున్నట్టి, ఇంద్రధ్వజోపమౌ = ఇంద్రధ్వజమువలె నున్నట్టి, (భుజౌ = బాహువులను, దదర్శ = చూచెను).

**తాత్పర్యము** :- స్వర్ణాభరణములచే అలంకరింపబడి, పొడవుగ చాచియున్న యా మహాకాయుడైన రావణుని భుజములు ఇంద్రధ్వజములవలె చూడముచ్చటగా గానవచ్చెను.

**శ్లో॥ ఐరావతవిషాణాగ్రై రాపీడనకృతవ్రణౌ ।**
**వజ్రోల్లిఖితపీనాంసౌ విష్ణుచక్రపరిక్షతౌ ॥ 16**

**పదచ్ఛేదము** :- ఐరావతవిషాణాగ్రైః - ఆపీడనకృతవ్రణౌ - వజ్రోల్లిఖితపీనాంసౌ - విష్ణుచక్రపరిక్షతౌ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- ఐరావతవిషాణాగ్రైః = ఐరావతముయొక్క దంతాగ్రములచే, ఆపీడన కృతవ్రణౌ = గ్రుచ్చుకొనుటచే గలిగినట్టి గాయములు కలవియును, వజ్రోల్లిఖితపీనాంసౌ = వజ్రాయుధములచే గాయపడిన బలిష్ఠములైన మూపురములు కలిగినట్టివియును, విష్ణుచక్రపరిక్షతౌ = విష్ణుచక్రముచే గాయపడినట్టివియును అగు, (భుజౌ దదర్శ = బాహువులను జూచెను)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :-ఆపీడనకృతవ్రణౌ - యుద్ధమునందు కలిగిన గాయపుమచ్చలు గల్గినట్టి భుజములు, వజ్రోల్లిఖితపీనాంసౌ 'విష్ణుచక్రపరిక్షతౌ' అనుటచే ఇంద్రుని వజ్రమును, విష్ణువుయొక్క చక్రముగూడా అతనికి మృత్యువును కలిగింపలేకపోయెనని సూచింపబడినది.

**తాత్పర్యము** :- దేవేంద్రుని ఐరావతగజముయొక్క దంతాగ్రములచే కలిగిన గాయపు మచ్చలుగలవియును, వజ్రాయుధముచే గాయపరచబడిన అంసభాగములు

గలవియును, విష్ణుచక్రముచే గాయమునొందినవియును అగు ఆ భుజములు అతడు చేసిన మహాయుద్ధములను జ్ఞప్తికి తెచ్చుచు కానవచ్చెను.

**శ్లో॥ పీనౌ సమసుజాతాంసౌ సంగతౌ బలసంయుతౌ ।**
**సులక్షణనఖాంగుష్ఠౌ స్వంగులీతలలక్షితౌ ॥ 17**

**పదచ్ఛేదము** :– పీనౌ – సమసుజాతాంసౌ – సంగతౌ – బలసంయుతౌ – సులక్షణ నఖాంగుష్ఠౌ – స్వంగులీతలలక్షితౌ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– పీనౌ = బలసియున్నట్టివియును, సమసుజాతాంసౌ = సమానముగ పెరిగిన అంసభాగములు గలవియును, సంగతౌ = పరస్పరము కూడియున్నవియును, బలసంయుతౌ = మహాశక్తిసంపన్నములైనవియును, సులక్షణనఖాంగుష్ఠౌ = శుభ లక్షణములతో గూడిన గోళ్ళుగల బొటనవ్రేళ్లును గలవియును, స్వంగులీతలలక్షితౌ = శుభకరమైన వ్రేళ్లకణుపులతో కనబడుచున్నవియునగు, (భుజౌ దదర్శ = భుజములను చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సంగతౌ = ధృఢమైన సంధిబంధము గలవి. స్వంగులీతలలక్షితౌ అనుటకు, 'స్వంగులీయకలక్షితౌ' అని బొంబాయి ముద్రణము: అనగా చక్కని అంగులీయకములతో ప్రకాశించుచున్న వ్రేళ్లుగల భుజములని భావము.

**తాత్పర్యము** :– రావణాసురుని భుజములు బలిష్ఠములై సుందరమైన సమానమైన అంసభాగములు గలవై, మహాశక్తిసంపన్నములై, శుభలక్షణసమన్వితమైన గోళ్లును, బొటనవ్రేళ్లును, వ్రేలికణుపులును గలవై కానవచ్చెను.

**శ్లో॥ సంహతౌ పరిఘాకారౌ వృత్తౌ కరికరోపమౌ ।**
**విక్షిప్తౌ శయనే శుభ్రే పంచశీర్షా వివోరగౌ ॥ 18**

**పదచ్ఛేదము** :– సంహతౌ – పరిఘాకారౌ – వృత్తౌ – కరికరోపమౌ – విక్షిప్తౌ – శయనే – శుభ్రే – పంచశీర్షౌ – ఇవ – ఉరగౌ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సంహతౌ = చక్కని నిర్మాణముగలవియును, పరిఘాకారౌ = పరిఘ అను ఆయుధమును బోలియున్నవియును, వృత్తౌ = వర్తులములైనవియును, కరికరోపమౌ = ఏనుగుతొండమువలె నున్నవియును, శుభ్రే శయనే = తెల్లని పాన్పుపై,

పంచశీర్షా ఉరగౌ ఇవ విక్షిప్తౌ = ఐదు తలలుగల సర్పములవలె చాపబడియున్నవి యునగు, (భుజౌ దదర్శ = భుజములను చూచెను).

**తాత్పర్యము :–** పుష్టిగనుండి పరిఘవంటి ఆకారముగలవై, వర్తులములై, ఏనుగు తొండములవలె నున్నవై తెల్లనైన ఆ తల్పముపై ఐదు తలల సర్పములవలెనున్న రావణుని భుజములను హనుమ గాంచెను.

**శ్లో॥ శశక్షతజకల్పేన సుశీతేన సుగంధినా ।**
**చందనేన పరార్ధ్యేన స్వనులిప్తౌ స్వలంకృతౌ ॥ 19**

**పదచ్ఛేదము :–** శశక్షతజకల్పేన – సుశీతేన – సుగంధినా – చందనేన – పరార్ధ్యేన స్వనులిప్తౌ – స్వలంకృతౌ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** శశక్షతజకల్పేన = కుందేలు రక్తమువలె నున్నట్టి, సుశీతేన = మిక్కిలి చల్లనైనట్టి, సుగంధినా = మంచి పరిమళము గల్గినట్టి, పరార్ధ్యేన చందనేన = మిక్కిలి శ్రేష్ఠమైన చందనముచే, స్వనులిప్తౌ = చక్కగా పూయబడినట్టివియును, స్వలంకృతౌ = చక్కగా అలంకరింపబడినట్టివియు నగు, (భుజౌ దదర్శ = భుజములను చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** శశక్షతజకల్పము – అన్ని ప్రాణుల రక్తము కంటెను కుందేటి రక్తము ఎక్కువ ఎఱ్ఱనైనదని గ్రాహ్యము.

**తాత్పర్యము :–** కుందేటి రక్తమువలె మిక్కిలి ఎఱ్ఱనైనట్టి, చల్లనైనట్టి, మిక్కిలి పరిమళము గల్గినట్టి, మిక్కిలి శ్రేష్ఠమైనట్టి చందనముచే చక్కగా పూయబడినవియును చక్కగా అలంకరింపబడినవియును అగు రావణుని భుజములను హనుమ గాంచెను.

**శ్లో॥ ఉత్తమస్త్రీవిమృదితౌ గంధోత్తమనిషేవితౌ ।**
**యక్షపన్నగగంధర్వదేవదానవరావిణౌ ॥ 20**

**పదచ్ఛేదము :–** ఉత్తమస్త్రీవిమృదితౌ – గంధోత్తమనిషేవితౌ – యక్షపన్నగగంధర్వ దేవదానవరావిణౌ ॥

**ప్రతిపదార్థము :–** ఉత్తమస్త్రీవిమృదితౌ = ఉత్తమవనితలచే మర్దింపబడినవియును, గంధోత్తమనిషేవితౌ = శ్రేష్ఠమైన గంధముచే పూయబడినవియును, యక్షపన్నగ గంధర్వ

దేవదానవ రావిణౌ = యక్షులను, పన్నగులను, గంధర్వులను, దేవతలను, దానవులను, ఆక్రోశింపచేయునవియును అగు, (భుజౌ దదర్శ = భుజములను గాంచెను).

**తాత్పర్యము :–** పెక్కుమంది మేలుజాతిస్త్రీలచే ఆలింగనాదులచే మర్దింపబడినవియును, వివిధ పరిమళద్రవ్యములచే పూయబడినవియును, యక్షపన్నగగంధర్వదేవ దానవాదులను పలుమారు లాక్రోశింపచేసినవియు నగు, రావణుని భుజములను హనుమ గాంచెను.

**శ్లో॥ దదర్శ స కపి స్తస్య బాహూ శయనసంస్థితౌ ।**
**మందర స్యాంతరే సుప్తౌ మహాహీ రుషితా వివ ॥ 21**

**పదచ్ఛేదము :–** దదర్శ – సః – కపిః – తస్య – బాహూ – శయనసంస్థితౌ – మందరస్య – అంతరే – సుప్తౌ – మహాహీ – రుషితౌ – ఇవ ॥

**అన్వయక్రమము :–** సః కపిః మందరస్య అంతరే సుప్తౌ రుషితౌ, మహాహీ ఇవ (స్థితౌ) శయనసంస్థితౌ, తస్య బాహూ దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః కపిః = ఆ హనుమంతుడు, మందరస్య అంతరే = మందర పర్వతముయొక్క, గుహయందు, సుప్తౌ = శయనించియున్నవియును, రుషితౌ = క్రోధముతో నున్నవియును అగు, మహాహీ ఇవ (స్థితౌ) = రెండు గొప్పసర్పముల వలెనున్న, శయనసంస్థితౌ = తల్పముపై వెలయుచున్న, తస్య బాహూ = ఆ రావణాసురుని యొక్క రెండు భుజములను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఇచ్చట కవి రెండు భుజములు అనుటచే రావణుడు యుద్ధసమయము లందే పదితలలు ఇరువది భుజములు కల్గియుండుననియు మిగిలిన సమయములందు గాదనియు తెలిసికొనవలెను.

**గోవిందరాజీయము :–** ఇచ్చట రెండు భుజములు ఒక ముఖము కల్గియుండునట్లుగా చెప్పుట స్త్రీలకు కామింపదగినవాడుగా నుండుకొరకని తెలియవలెను.

**తాత్పర్యము :–** "మందర పర్వత గుహయందు రోషముతో నిద్రించియున్న రెండు ఉగ్రసర్పములవలె" తల్పముపై వెలయుచున్న రావణాసురుని భుజద్వయమును హనుమ విస్మయముతో జూచెను.

**శ్లో॥ తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః ।**
**శుశుభేఽచలసంకాశః శృంగాభ్యా మివ మందరః ॥ 22**

**పదచ్ఛేదము :–** తాభ్యాం – సః – పరిపూర్ణాభ్యాం – భుజాభ్యాం – రాక్షసేశ్వరః – శుశుభే – అచలసంకాశః – శృంగాభ్యామ్ – ఇవ – మందరః ॥

**అన్వయక్రమము :–** అచలసంకాశః సః రాక్షసేశ్వరః పరిపూర్ణాభ్యాం తాభ్యాం భుజాభ్యాం శృంగాభ్యాం మందరః ఇవ శుశుభే.

**ప్రతిపదార్థము :–** అచలసంకాశః = పర్వతసదృశుడైనట్టి, సః రాక్షసేశ్వరః = ఆ రాక్షసరాజు, పరిపూర్ణాభ్యాం = (ఉత్తమలక్షణ) పరిపూర్ణమైన, తాభ్యాం భుజాభ్యాం = ఆ భుజయుగళముచే, శృంగాభ్యాం = శిఖరయుగ్మముచే, మందరః ఇవ = మందరపర్వతమువలె, శుశుభే = శోభిల్లుచుండెను.

**తాత్పర్యము :–** ఉత్తమ లక్షణ పరిపూర్ణములైన తన రెండు భుజములతో మహాపర్వత సన్నిభుడైన ఆ రాక్షసరాజు, రెండు శిఖరములు కల్గినట్టి మందరపర్వతమువలె మిక్కిలి దర్శనీయుడై యుండెను.

**శ్లో॥ చూతపున్నాగసురభి ర్వకుళోత్తమసంయుతః ।**
**మృష్టాన్నరససంయుక్తః పానగంధపురస్సరః ॥ 23**

**శ్లో॥ తస్య రాక్షససింహస్య నిశ్చక్రామ మహాన్ ముఖాత్ ।**
**శయానస్య వినిశ్శ్వాసః పూరయ న్నివ తద్గృహమ్ ॥ 24**

**పదచ్ఛేదము :–** చూతపున్నాగసురభిః – వకుళోత్తమసంయుతః – మృష్టాన్నరససంయుక్తః – పానగంధపురస్సరః – తస్య – రాక్షససింహస్య – నిశ్చక్రామ – మహాన్ – ముఖాత్ – శయానస్య – వినిశ్శ్వాసః – పూరయన్ – ఇవ – తద్గృహమ్ ॥

**అన్వయక్రమము :–** శయానస్య తస్య రాక్షససింహస్య ముఖాత్ చూతపున్నాగసురభిః వకుళోత్తమసంయుతః మృష్టాన్నరససంయుక్తః పానగంధపురస్సరః మహాన్ వినిశ్శ్వాసః తత్ గృహం పూరయన్ ఇవ నిశ్చక్రామ.

**ప్రతిపదార్థము :–** శయానస్య = నిద్రించుచున్నట్టి, తస్య రాక్షససింహస్య = ఆ రాక్షసశ్రేష్ఠునియొక్క, ముఖాత్ = ముఖమునుండి, చూతపున్నాగసురభిః = మామిడి, పొన్నపువ్వులయొక్క పరిమళముగలదియును, వకుళోత్తమసంయుతః = శ్రేష్ఠమైన బొగడ పువ్వులయొక్క పరిమళముతో కూడినదియును, మృష్టాన్నరససంయుక్తః = మంచియాహారములయొక్క రుచులతో కూడినదియును, పానగంధపురస్సరః =

వివిధములగు పానీయముల పరిమళములతో కూడినదియును అగు, మహాన్ వినిశ్వాసః = గొప్పదైన ఊర్పుగాలి, తత్ గృహం పూరయన్నివ = ఆ మందిరమును నింపుచున్నట్లుగా, నిశ్చక్రామ = బయలువెడలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** పురుషవిశేషశ్వాసము వకుళగంధభరితమై యుండునని శాస్త్రము అని కతకవ్యాఖ్య. రావణుడు వామాచారపద్ధతిని శక్తిఉపాసన చేయువాడగుటచే మధుపానము సముచితమే.

**గోవిందరాజీయము :–** చూతపున్నాగవకుళాదులతో మద్యము తయారుచేయబడును గావున ఆ యా వాసనలు వానిని సేవించు రావణుని శ్వాసమునుండి వచ్చుట సహజమే.

**తాత్పర్యము :–** శయనించి యున్న ఆ రాక్షసరాజుయొక్క ముఖమునుండి చూతము, పున్నాగము, వకుళము మున్నగు పరిమళములతో గూడి షడ్రసోపేతభోజ్యపదార్థముల పరిమళములు కల్గి వివిధములగు పానీయములయొక్క సువాసనలు కలిగిన నిట్టూర్పు వాయువులు ఆ శయనమందిరమును పూరించుచు వెడలుచుండెను.

**శ్లో॥ ముక్తామణివిచిత్రేణ కాంచనేన విరాజితమ్ ।**
**మకుటేనాఽపవృత్తేన కుండలోజ్జ్వలితాననమ్ ॥ 25**

**పదచ్ఛేదము :–** ముక్తామణివిచిత్రేణ – కాంచనేన – విరాజితమ్ – మకుటేన – అపవృత్తేన – కుండలోజ్జ్వలితాననమ్ ॥

**ప్రతిపదార్థము :–** ముక్తామణివిచిత్రేణ = ముత్యములచే చిత్రముగ నిర్మింపబడినదియును, అపవృత్తేన = ప్రక్కకు జారినట్టిదియునగు, కాంచనేన మకుటేన = బంగారు కిరీటముతో, విరాజితం = ప్రకాశించుచున్నవాడును, కుండలోజ్జ్వలితాననం = కర్ణ కుండలములతో ప్రకాశించుచున్న ముఖము గలవాడు నగు, (రావణం హనుమాన్ దదర్శ = రావణుని హనుమ చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** అపవృత్తేన = ప్రక్కకు తొలగుట నిద్రావశముచేత.

**తాత్పర్యము :–** ముత్యములతో చిత్రముగ నిర్మింపబడినట్టి సువర్ణకిరీటము కొంచెము ప్రక్కకు ఒరిగియుండగా కర్ణకుండలములచే ప్రకాశించుచున్నట్టి ముఖముగల రావణుని

హనుమంతుడు చూచెను.

**శ్లో॥ రక్తచందనదిగ్ధేన తథా హారేణ శోభినా ।**
**పీనాయతవిశాలేన వక్షసా ఽభివిరాజితమ్ ॥ 26**

**పదచ్ఛేదము** :– రక్తచందనదిగ్ధేన – తథా – హారేణ – శోభినా – పీనాయతవిశాలేన – వక్షసా – అభివిరాజితమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– రక్తచందనదిగ్ధేన = ఎఱ్ఱని చందనముతో పూయబడినట్టి, పీనాయత విశాలేన = స్థూలమైనట్టియు, పొడవైనట్టియు, విశాలమైనట్టియు, వక్షసా = వక్షఃస్థలము తోడను, శోభినా హారేణ = మెరయుచున్నట్టి హారముతోడను, అభివిరాజితం = మిక్కిలి తేజరిల్లుచున్నట్టి (రావణం దదర్శ = రావణుని జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– శోభినా హారేణ = ప్రకాశించునట్టి హారముతో వెలయుచున్న వక్షఃస్థలము గలవాడని అన్వయము.

**తాత్పర్యము** :– సుందరమైన హారములతో ప్రకాశించుచు, ఎఱ్ఱని చందనముచే పూయబడి, మిక్కిలి బలిసి, గొప్పపొడవును వెడల్పును కలిగి, విశాలముగనున్న వక్షఃస్థలముతో, ప్రకాశించుచున్న రావణుని హనుమ గాంచెను.

**శ్లో॥ పాండరే ణాపవిద్ధేన క్షౌమేణ క్షతజేక్షణమ్ ।**
**మహార్హేణ సుసంవీతం పీతే నోఽత్తమవాససా ॥ 27**

**పదచ్ఛేదము** :– పాండరేణ – అపవిద్ధేన – క్షౌమేణ – క్షతజేక్షణమ్ – మహార్హేణ – సుసంవీతం – పీతేన – ఉత్తమవాససా ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– అపవిద్ధేన = జారినట్టి, పాండరేణ క్షౌమేణ = తెల్లని పట్టువస్త్రము తోడను, మహార్హేణ = అమూల్యమైన, పీతేన ఉత్తమవాససా = పచ్చని మేలైన వస్త్రము తోడను, సుసంవీతం = అలంకరింపబడియున్నట్టి, క్షతజేక్షణం = ఎఱ్ఱని కన్నులుగల్గిన, (రావణం దదర్శ = రావణుని జూచెను.)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తెల్లని వస్త్రమును ధరించి, పచ్చని ఉత్తరీయము తన వక్షముపై ధరించెనని భావము.

**తాత్పర్యము :–** తెల్లని పట్టువస్త్రమును ఉత్తరీయముగా ధరింపగా అది కొంచెము క్రిందకు జారియుండెను. అట్లు అమూల్యమైన పీతాంబరమును (కట్టువస్త్రముగా) ధరించినవాడై ఎఱ్ఱని కన్నులతో రావణుడు హనుమకు గానవచ్చెను.

**శ్లో॥ మాషరాశిప్రతీకాశం నిశ్వ్వసంతం భుజంగవత్ ।**
**గాంగే మహతి తోయాంతే ప్రసుప్త మివ కుంజరమ్ ॥ 28**

**పదచ్ఛేదము :–** మాషరాశిప్రతీకాశం – నిశ్వ్వసంతం – భుజంగవత్ – గాంగే – మహతి – తోయాంతే – ప్రసుప్తమ్ – ఇవ – కుంజరమ్ ॥

**ప్రతిపదార్థము :–** మాషరాశిప్రతీకాశం = మినుములరాశిని పోలియున్నవాడును, భుజంగవత్ నిశ్వ్వసంతం = సర్పము బుసకొట్టుచున్నట్లు నిశ్వసించుచున్నవాడును, మహతి = గొప్పదైనట్టి, గాంగే తోయాంతే = గంగాజలమధ్యమునందు, ప్రసుప్తం కుంజరమ్ ఇవ (స్థితం) = శయనించియున్న మదపుటేనుగువలె నున్నట్టివాడును అగు (రావణం దదర్శ = రావణుని జూచెను).

**తాత్పర్యము :–** పెద్ద మినుములరాశివలె కానవచ్చుచున్నవాడై, సర్పము బుసకొట్టు చున్నట్లు నిశ్వసించుచు గంగాప్రవాహముయొక్క మధ్యమునందు నిదురించుచున్న మదపుటేనుగువలె నున్న రావణుని హనుమ చూచెను.

**శ్లో॥ చతుర్భిః కాంచనై ర్దీపై ర్దీప్యమానచతుర్దిశమ్ ।**
**ప్రకాశీకృతసర్వాంగం మేఘం విద్యుద్గణై రివ ॥ 29**

**పదచ్ఛేదము :–** చతుర్భిః – కాంచనైః – దీపైః – దీప్యమానచతుర్దిశమ్ – ప్రకాశీకృతసర్వాంగం – మేఘం – విద్యుద్గణైః – ఇవ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** చతుర్భిః కాంచనైః దీపైః = నాల్గు బంగారుదీపములతో, దీప్యమాన చతుర్దిశమ్ = ప్రకాశింపజేయబడుచున్న నాలుగుదిక్కులుగలవాడై, విద్యుద్గణైః మేఘమ్ ఇవ = మెరుపుతీగల సమూహముచే మేఘమువలె, ప్రకాశీకృతసర్వాంగం = చక్కగా ప్రకాశింప చేయబడుచున్న సమస్తమైన దేహము గలవాడునగు, (రావణం దదర్శ = రావణుని జూచెను).

**తాత్పర్యము :–** మెరుపు తీగల సమూహముచే మేఘమంతయు ప్రకాశించుచున్నట్లు నాల్గుదిక్కులయందునుగల స్వర్ణస్తంభమునందలి దీపముచే మిక్కిలి ప్రకాశించుచున్న సమస్తదేహమును కలిగినట్టి రావణుని హనుమ గాంచెను.

**శ్లో॥ పాదమూలగతాశ్చాఽపి దదర్శ సుమహాత్మనః ।**
**పత్నీ స్స ప్రియభార్యస్య తస్య రక్షఃపతేర్గృహే ॥ 30**

**పదచ్ఛేదము :–** పాదమూలగతాః – చ – అపి – దదర్శ – సుమహాత్మనః – పత్నీః – సః – ప్రియభార్యస్య – తస్య – రక్షఃపతేః – గృహే ॥

**అన్వయక్రమము :–** సః తస్య రక్షఃపతేః గృహే ప్రియభార్యస్య సుమహాత్మనః పాదమూలగతాః పత్నీః అపి దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమ, తస్య రక్షఃపతేః గృహే = ఆ రాక్షసరాజుయొక్క భవనమునందు, ప్రియభార్యస్య = అనురాగముగల భార్యలు కలిగినట్టి, సుమహాత్మనః = మహాకాయుడైనట్టి రావణునియొక్క, పాదమూలగతాః = పాదములచెంతనున్నట్టి, పత్నీః చాపి = భార్యలనుగూడ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** రావణుని గృహమున, రావణాసురుని ఆతని పాదముల చెంత పరుండియున్న అతని ప్రియురాండ్రనుగూడ హనుమ చూచెను.

**శ్లో॥ శశిప్రకాశవదనా శ్చారుకుండలభూషితాః ।**
**అమ్లానమాల్యాభరణాః దదర్శ హరియూథపః ॥ 31**

**పదచ్ఛేదము :–** శశిప్రకాశవదనాః – చారుకుండలభూషితాః – అమ్లానమాల్యాభరణాః – దదర్శ – హరియూథపః ॥

**ప్రతిపదార్థము :–** హరియూథపః = వానరనాయకుడైన హనుమ, శశిప్రకాశవదనాః = చంద్రునివలె ప్రకాశించు ముఖము గలవారును, చారుకుండలభూషితాః = సుందరమైన కుండలములచే అలంకరింప బడినవారును, అమ్లానమాల్యాభరణాః = వాడని పూలమాలికలు అలంకారముగా గలవారునగు (తస్య పత్నీః = ఆ రావణుని భార్యలను), దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** అమ్లానమాల్యాభరణాః = అనగా దేవకన్యలని భావము.

**తాత్పర్యము :–** ఆ రావణునియొక్క శయనాగారమునందు చంద్రునివంటి

ముఖములతో, సుందరములైన కుండలములతో, ఎప్పుడును వాడని పుష్పమాలికలతో అలంకరింపబడి, ప్రకాశించుచున్నట్టి అతని భార్యలను హనుమ చూచెను.

**శ్లో॥ నృత్తవాదిత్రకుశలా రాక్షసేంద్రభుజాంకగాః ।**
**వరాభరణధారిణ్యో నిషణ్ణా దదృశే హరిః ॥ 32**

**పదచ్ఛేదము :–** నృత్తవాదిత్రకుశలాః – రాక్షసేంద్రభుజాంకగాః – వరాభరణధారిణ్యః – నిషణ్ణాః – దదృశే – హరిః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** హరిః = హనుమంతుడు, రాక్షసేంద్రభుజాంకగాః = రావణుని బాహువులను, ఒడిని చేరినవారై, నిషణ్ణాః = శయనించియున్నట్టివారును, నృత్తవాదిత్ర కుశలాః = నృత్యమునందును, వివిధములగు వాద్యములందును ప్రవీణురాండ్రయిన వారును, వరాభరణధారిణ్యః = గొప్పవైన భూషణములను ధరించినవారునగు (తస్య పత్నీః = ఆ రావణుని భార్యలను, దదృశే = చూచెను).

**తాత్పర్యము :–** ఆ రావణాసురుని భుజములమీదను, ఒడిలోను శయనించియున్నట్టి, గొప్ప నృత్యనిపుణులను, వాద్యప్రవీణులను, అమూల్యమైన భూషణములను ధరించిన వారిని పెక్కుమంది ప్రియురాండ్రను హనుమ గాంచెను.

**శ్లో॥ వజ్రవైడూర్యగర్భాణి శ్రవణాంతేషు యోషితాం ।**
**దదర్శ తాపనీయాని కుండలా న్యంగదాని చ ॥ 33**

**పదచ్ఛేదము :–** వజ్రవైడూర్యగర్భాణి – శ్రవణాంతేషు – యోషితాం – దదర్శ – తాపనీయాని – కుండలాని – అంగదాని – చ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** యోషితాం శ్రవణాంతేషు = ఆ రావణస్త్రీల కర్ణములపై, వజ్రవైడూర్యగర్భాణి = వజ్రములు వైడూర్యములచే పొదగబడినట్టి, తాపనీయాని = సువర్ణమయములైనట్టి, కుండలాని = కర్ణాభరణములను, అంగదాని చ = భుజకీర్తులను గూడ, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** రావణుని భార్యలు తమ బాహువులను తలగడగ చేసుకొనుటచే వారి భుజమునందలి ఆభరణములు చెవులవద్ద గానవచ్చుచున్నవని భావము.

**తాత్పర్యము** :– ఆ రావణుని భార్యల చెవులకడ వజ్రవైడూర్యఖచితములైనట్టి సువర్ణ కుండలములేగాక, తలగడగనున్న బాహువులందలి భుజకీర్తులుగూడ చూడముచ్చటగా గానవచ్చుచుండెను.

**శ్లో॥ తాసాం చంద్రోపమై ర్వక్త్రై శ్శుభై ర్లలితకుండలైః ।**
**విరరాజ విమానం తన్నభ స్తారాగణై రివ ॥ 34**

**పదచ్ఛేదము** :– తాసాం – చంద్రోపమైః – వక్త్రైః – శుభైః – లలితకుండలైః – విరరాజ – విమానం – తత్ – నభః – తారాగణైః – ఇవ ॥

**అన్వయక్రమము** :– తాసాం చంద్రోపమైః వక్త్రైః శుభైః లలితకుండలైః తత్ విమానం తారాగణైః నభః ఇవ విరరాజ.

**ప్రతిపదార్థము** :– తాసాం = ఆ రావణవనితలయొక్క, చంద్రోపమైః వక్త్రైః = చంద్రసన్నిభములైన ముఖములచేతనున్ను, శుభైః లలితకుండలైః = మంగళప్రదమైన సుందరమైన కుండలములచేతను, తత్ విమానం = ఆ శయనాగారము, తారాగణైః నభః ఇవ = నక్షత్రసమూహములచే ఆకాశమువలె, విరరాజ = విరాజిల్లెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– విమానము అనగా, రావణుని మంచక విశేషము. పుష్పకవిమానమని మరికొందరు అన్వయించిరి.

**రామాయణ శిరోమణి** :– లలితకుండలైః = సుందరమైన కుండలములు ధరించిన రావణకాంతల ముఖములచేతనని అన్వయము.

**తాత్పర్యము** :– మంగళప్రదమైన సుందరమైన కుండలములు ధరించిన ఆ రాక్షసరాజ భార్యలయొక్క చంద్రునివలె ప్రకాశించుచున్న ముఖములతో ఆ శయనమందిరము నక్షత్రములతో ప్రకాశించు ఆకాశమువలెనే మిక్కిలి శోభిల్లుచుండెను.

**శ్లో॥ మదవ్యాయామఖిన్నా స్తా రాక్షసేంద్రస్య యోషితః ।**
**తేషు తేష్వవకాశేషు ప్రసుప్తా స్తనుమధ్యమాః ॥ 35**

**పదచ్ఛేదము** :– మదవ్యాయామఖిన్నాః – తాః – రాక్షసేంద్రస్య – యోషితః – తేషు – తేషు – అవకాశేషు – ప్రసుప్తాః – తనుమధ్యమాః ॥

**అన్వయక్రమము** :– మదవ్యాయామఖిన్నాః తనుమధ్యమాః తాః రాక్షసేంద్రస్య యోషితః తేషు తేషు అవకాశేషు ప్రసుప్తాః.

**ప్రతిపదార్థము** :– మదవ్యాయామఖిన్నాః = మదనపరిశ్రమచే అలసినవారై, తనుమధ్యమాః = సన్నమైన నడుముగల, తాః రాక్షసేంద్రస్య యోషితః = ఆ రాక్షస రాజుయొక్క కాంతలు, తేషు తేషు = ఆ యా, అవకాశేషు = అవకాశమున్న ప్రదేశములందు, ప్రసుప్తాః = నిద్రించుచుండిరి.

**తాత్పర్యము** :– సన్నని నడుము కలిగినట్టి ఆ రాక్షసరాజవనితలు మన్మథపరిశ్రమచే అలసినట్టివారై తమకు అవకాశము చిక్కిన చోటులందెల్ల ఒరిగి నిద్రించుచుండిరి.

**శ్లో॥ అంగహారై స్తథై వాన్యా కోమలై ర్నృత్తశాలినీ ।**
**విన్యస్తశుభసర్వాంగీ ప్రసుప్తా వరవర్ణినీ ॥ 36**

**పదచ్ఛేదము** :– అంగహారైః – తథా – ఏవ – అన్యా – కోమలైః – నృత్తశాలినీ – విన్యస్తశుభసర్వాంగీ – ప్రసుప్తా – వరవర్ణినీ ॥

**అన్వయక్రమము** :– తథా ఏవ నృత్తశాలినీ అన్యా వరవర్ణినీ కోమలైః – అంగహారైః విన్యస్తశుభసర్వాంగీ ప్రసుప్తా.

**ప్రతిపదార్థము** :– తథైవ = అట్లే, నృత్తశాలినీ = నృత్యప్రవీణురాలయిన, అన్యా వరవర్ణినీ = ఇంకొక సుందరి, కోమలైః అంగహారైః = లలితములైన అవయవముల వంపులతో, విన్యస్తశుభసర్వాంగీ = శయ్యయం దుంచిన సుందరమైన సర్వావయవములు గలదై, ప్రసుప్తా = నిద్రించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– విన్యస్తశుభసర్వాంగీ = బ్రహ్మదేవునిచేతనే, నాట్యోపయుక్తముగా ప్రసాదింపబడిన సర్వావయవములు గలది.

**గోవిందరాజీయము** :– అంగహారమనగా నృత్తవిశేషమునందలి అంగవిక్షేపవిశేషము.

**మహేశ్వరతీర్థులు** :– ఆ వనిత నృత్తశాలిని అగుటచే శయ్యయందు పరుండి యున్నప్పటికిని ఆమె అవయవములు నృత్యముచేయుచున్నప్పటి ఒకానొక భంగిమము వలెనే కానవచ్చుచుండెను.

**తాత్పర్యము** :– నృత్యప్రవీణురాలైన ఒకానొక తరుణి కోమలములైన తన అవయవ విక్షేపణములను సూచించుచున్నట్లే తన సుందరమైన వంపులు గల అవయవములతో శయ్యపై పరుండి నిద్రించుచుండెను.

**శ్లో॥ కాచి ద్వీణాం పరిష్వజ్య ప్రసుప్తా సంప్రకాశతే ।**
**మహానదీప్రకీర్ణేవ నళినీ పోత మాశ్రితా ॥ 37**

**పదచ్ఛేదము** :– కా – చిత్ – వీణాం – పరిష్వజ్య – ప్రసుప్తా – సంప్రకాశతే – మహానదీప్రకీర్ణా – ఇవ – నళినీ – పోతమ్ – ఆశ్రితా ॥

**అన్వయక్రమము** :– కాచిత్ వీణాం పరిష్వజ్య, పోతం ఆశ్రితా మహానదీప్రకీర్ణా నళినీ ఇవ ప్రసుప్తా (సతీ) సంప్రకాశతే.

**ప్రతిపదార్థము** :– కాచిత్ = ఒకానొక యువతి, వీణాం పరిష్వజ్య = వీణను కౌగిలించు కొని, పోతమ్ ఆశ్రితా = చిన్న నావను అంటిపెట్టుకొన్న, మహానదీప్రకీర్ణా నళినీ ఇవ = మహానదిచే కొట్టుకొని వచ్చిన తామరతీగవలె, ప్రసుప్తా (సతీ) = నిద్రించుచున్నదై, సంప్రకాశతే = ప్రకాశించుచుండెను.

**తాత్పర్యము** :– ఒకానొకయువతి తన వీణను గట్టిగా కౌగిలించుకొని నదిచే చెదర గొట్టబడి ఒక చిన్న నావను చేరి దాని నంటిపెట్టుకొని నిలచియున్న తామరతీగవలె నిశ్చలముగ నిద్రించుచు చూడముచ్చట గొల్పుచుండెను.

**శ్లో॥ అన్యా కక్షగతే నైవ మడ్డుకేనాఽసితేక్షణా ।**
**ప్రసుప్తా భామినీ భాతి బాలపుత్రేవ వత్సలా ॥ 38**

**పదచ్ఛేదము** :– అన్యా – కక్షగతేన – ఏవ – మడ్డుకేన – అసితేక్షణా – ప్రసుప్తా – భామినీ – భాతి – బాలపుత్రా – ఇవ – వత్సలా ॥

**అన్వయక్రమము** :– అన్యా అసితేక్షణా, కక్షగతేన మడ్డుకేన ఏవ బాలపుత్రా, వత్సలా భామినీ ఇవ ప్రసుప్తా భాతి.

**ప్రతిపదార్థము** :– అన్యా అసితేక్షణా = ఇంకొక నీలికన్నులు గల కోమలి, కక్షగతేన మడ్డుకేన ఏవ = తన చంకయందు నొక్కియుంచుకొన్న కుంభమువంటి గుమ్మెట అను వాద్యవిశేషముతోనే, ప్రసుప్తా = నిద్రించుచున్నదై, బాలపుత్రా = పసిబిడ్డ గల్గిన, వత్సలా భామినీ ఇవ = పుత్రవాత్సల్యముగల అంగనవలె, భాతి = ప్రకాశించు చుండెను.

**తాత్పర్యము** :– నల్లకలువలవంటి మనోహరమైన కన్నులు గల ఇంకొక వనిత తన చంకను నొక్కిపెట్టిన గుమ్మెట యను వాద్యవిశేషముతో నిద్రించుచున్నదై అమితమైన వాత్సల్యముతో బిడ్డను కౌగిలించుకొని పరున్న తల్లివలె ప్రకాశించుచుండెను.

**శ్లో॥ పటహం చారుసర్వాంగీ పీడ్య శేతే శుభస్తనీ ।**
**చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్యేవ భామినీ ॥ 39**

**పదచ్ఛేదము** :– పటహం – చారుసర్వాంగీ – పీడ్య – శేతే – శుభస్తనీ – చిరస్య –

రమణం – లబ్ధ్వా – పరిష్వజ్య – ఇవ – భామినీ ॥

**అన్వయక్రమము** :– చారుసర్వాంగీ శుభస్తనీ కాచిత్ భామినీ పటహం పీడ్య చిరస్య రమణం లబ్ధ్వా పరిష్వజ్య ఇవ శేతే.

**ప్రతిపదార్థము** :– చారుసర్వాంగీ = సుందరమైన సర్వావయవములు కలిగినట్టి, శుభస్తనీ = శుభకరమైన స్తనములుగల, కాచిత్ భామినీ = ఒకానొక సుందరి, పటహం = పటహ మనెడు వాద్యమును, పీడ్య = అదిమిపట్టి, చిరస్య = చాలకాలమునకు, రమణం లబ్ధ్వా = ప్రియుని పొంది, పరిష్వజ్య ఇవ = కౌగిలించుకొని యున్నట్లు, శేతే = నిద్రపోవుచుండెను.

**తాత్పర్యము** :– చాల కాలమునకు వచ్చిన ప్రియుని జేరి, గాఢముగా కౌగిలించుకొన్నట్లు, శుభస్తనియు, సుందరాంగియునగు ఒక భామిని పటహమను తన వాద్యమును గట్టిగా కౌగిలించుకొని పరుండియుండెను.

**శ్లో॥ కాచి ద్వంశం పరిష్వజ్య సుప్తా కమలలోచనా ।**
**రహః ప్రియతమం గృహ్యా సకామేవ చ కామినీ ॥ 40**

**పదచ్ఛేదము** :– కా – చిత్ – వంశం – పరిష్వజ్య – సుప్తా – కమలలోచనా – రహః – ప్రియతమం – గృహ్యా – సకామా – ఇవ – చ – కామినీ ॥

**అన్వయక్రమము** :– సకామా కామినీ, రహః ప్రియతమం గృహ్యా ఇవ కాచిత్ కమలలోచనా, వంశం పరిష్వజ్య సుప్తా.

**ప్రతిపదార్థము** :– సకామా కామినీ = కామపరవశురాలైన కామిని, రహః = ఏకాంతమునందు, ప్రియతమం గృహ్యా ఇవ = మిక్కిలి ప్రియమైన నాథుని పట్టుకొన్నట్లు, కాచిత్ కమలలోచనా = ఒకానొక కమలాక్షి, వంశం పరిష్వజ్య = పిల్లనగ్రోవిని కౌగిలించుకొని, సుప్తా = నిద్రించుచుండెను.

**తాత్పర్యము** :– ప్రేమోన్మత్తురాలై ఏకాంతమునందు తన ప్రియతముని ఒడిసి పట్టుకొనినట్లుగా ఒకానొక కమలాక్షి పిల్లనగ్రోవిని పట్టుకొని కౌగిలించుకొని నిద్రించు చుండెను.

**శ్లో॥ విపంచీం పరిగృహ్యాఽన్యా నియతా నృత్తశాలినీ ।**
**నిద్రావశ మనుప్రాప్తా సహకాంతేవ భామినీ ॥ 41**

**పదచ్ఛేదము** :– విపంచీం – పరిగృహ్యా – అన్యా – నియతా – నృత్తశాలినీ –

నిద్రావశమ్ – అనుప్రాప్తా – సహకాంతా – ఇవ – భామినీ ॥

**అన్వయక్రమము** :– నృత్తశాలినీ అన్యా, విపంచీం పరిగృహ్య, సహకాంతా భామినీ ఇవ నియతా నిద్రావశమ్ అనుప్రాప్తా.

**ప్రతిపదార్థము** :– నృత్తశాలినీ అన్యా = నాట్యప్రవీణురాలయిన వేఱొకతె, విపంచీం పరిగృహ్య = వీణను దగ్గరకు తీసుకొని, సహకాంతా భామినీ ఇవ = ప్రియునితో గూడిన రమణివలె, నియతా = కదలనిదై, నిద్రావశమ్ అనుప్రాప్తా = నిద్రలో మునిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– విపంచి = సప్తతంత్రి; వీణ = ఆరు తంత్రులు గలది.

**తాత్పర్యము** :– ఒకానొక ఆటగత్తె తన వీణను దగ్గరకు తీసుకొని భర్తతో కలసి శయనించుచున్న భామినివలె నిశ్చింతగా నిద్రలో మునిగి యుండెను.

**శ్లో॥ అన్యా కనకసంకాశై ర్మృదుపీనై ర్మనోరమైః ।**
**మృదంగం పరిపీ డ్యాంగైః ప్రసుప్తా మత్తలోచనా ॥ 42**

**పదచ్ఛేదము** :– అన్యా – కనకసంకాశైః – మృదుపీనైః – మనోరమైః – మృదంగం – పరిపీడ్య – అంగైః – ప్రసుప్తా – మత్తలోచనా ॥

**అన్వయక్రమము** :– అన్యా మత్తలోచనా కనకసంకాశైః, మృదు పీనైః, మనోరమైః, అంగైః మృదంగం పరిపీడ్య ప్రసుప్తా.

**ప్రతిపదార్థము** :– అన్యా మత్తలోచనా = వేఱొక మదిరాక్షి, కనకసంకాశైః = సువర్ణముతో సమానమైనట్టి, మృదుపీనైః = కోమలముగను బలిష్ఠములుగ నున్నవై , మనోరమైః = మనోహరములైయున్న, అంగైః = (తన) అవయవములచే, మృదంగం పరిపీడ్య = మద్దెలను గట్టిగా అదిమిపట్టి, ప్రసుప్తా = గాఢముగా నిద్రించు చుండెను.

**తాత్పర్యము** :– వేఱొక మదిరాక్షి కోమలములును, బలసినవియును, సువర్ణచ్ఛాయ గలవియును అగు తన మనోహరములైన అవయవములతో మృదంగమును గట్టిగా కౌగిలించుకొని పరుండి యుండెను.

**శ్లో॥ భుజపార్శ్వాంతరస్థేన కక్షగేణ కృశోదరీ ।**
**పణవేన సహాఽనింద్యా సుప్తా మదకృతశ్రమా ॥ 43**

**పదచ్ఛేదము** :– భుజపార్శ్వాంతరస్థేన – కక్షగేణ – కృశోదరీ – పణవేన – సహ – అనిన్ద్యా – సుప్తా – మదకృతశ్రమా ॥

**అన్వయక్రమము** :– మదకృతశ్రమా, అనిన్ద్యా, కృశోదరీ భుజపార్శ్వాంతరస్థేన, కక్షగేణ, పణవేన సహ, సుప్తా.

**ప్రతిపదార్థము** :– మదకృతశ్రమా = మధుపానాది మదముచే శ్రమించియున్న, అనిన్ద్యా కృశోదరీ = ఉత్తమశీలవతియైనను తనుమధ్యమ, భుజపార్శ్వాంతరస్థేన = భుజములకును, ప్రక్కలకును మధ్యగానున్నట్టి, కక్షగేణ = చంకయం దిమిడ్చుకొన్నట్టి, పణవేన సహ = పణవముతో గూడి, సుప్తా = నిద్రించు చుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– పణవము = మద్దెల, మదకృతశ్రమా = వాద్యములచే పొందిన శ్రమ గలది.

**తాత్పర్యము** :– మధుసేవచే ఒడలెరుగక, శ్రమనుచెందిన కృశాంగియైన ఒకానొక ఉత్తమవనిత, పణవమనెడు వాద్యవిశేషమును, భుజములతో చంక నిరికించుకొని నిద్రించుచుండెను.

**శ్లో॥ డిండిమం పరిగృహ్యాన్యా తథై వాసక్తడిండిమా ।**
**ప్రసుప్తా తరుణం వత్స ముపగూహ్యేవ భామినీ ॥ 44**

**పదచ్ఛేదము** :– డిండిమం – పరిగృహ్య – అన్యా – తథా – ఏవ – ఆసక్తడిండిమా – ప్రసుప్తా – తరుణం – వత్సమ్ – ఉపగూహ్య – ఇవ – భామినీ ॥

**అన్వయక్రమము** :– ఆసక్తడిండిమా, అన్యా భామినీ తథైవ డిండిమం పరిగృహ్య, తరుణం, వత్సమ్, ఉపగూహ్య ఇవ ప్రసుప్తా.

**ప్రతిపదార్థము** :– ఆసక్తడిండిమా = అంటిపెట్టుకొన్న డిండిమముగల, అన్యా భామినీ = వేఱొక యువతి, తథైవ = అట్లే, డిండిమం పరిగృహ్య = (వేఱొక) డిండిమమును దగ్గరకు తీసుకొని, తరుణం = ప్రియుని, వత్సం = బిడ్డను (గూడ), ఉపగూహ్య ఇవ = కౌగిలించుకొని యున్నట్లు, ప్రసుప్తా = నిద్రించు చుండెను.

**తాత్పర్యము** :– ఆసక్తితో, డిండిమమును తన ఒడిలోనికి తీసుకొనియున్న భామిని యొకతె, వేఱొక డిండిమమునుగూడ ఇంకొక చేతితో దగ్గరకు తీసికొని తన భర్తను ఒక ప్రక్కను, బిడ్డను వేఱొక ప్రక్కను చేర్చుకొని కౌగిలించుకొన్నట్లుగా డిండిమములు

రెండింటితో నిద్రపోవు చుండెను.

**శ్లో॥ కాచి దాడంబరం నారీ భుజసంయోగపీడితమ్ ।**
**కృత్వా కమలపత్రాక్షీ ప్రసుప్తా మదమోహితా ॥ 45**

**పదచ్ఛేదము :–** కా – చిత్ – ఆడంబరం – నారీ – భుజసంయోగపీడితం – కృత్వా – కమలపత్రాక్షీ – ప్రసుప్తా – మదమోహితా ॥

**అన్వయక్రమము :–** కాచిత్ కమలపత్రాక్షీ నారీ మదమోహితా సతీ ఆడంబరం భుజసంయోగపీడితం కృత్వా ప్రసుప్తా.

**ప్రతిపదార్థము :–** కాచిత్ కమలపత్రాక్షీ నారీ = ఒకానొక కమలదళాక్షి, మదమోహితా సతీ = మదపరవశురాలై, ఆడంబరం = ఆడంబర మను వాద్యవిశేషమును, భుజసంయోగపీడితం కృత్వా = రెండు బాహువులయొక్క సంయోగముచే పీడించి, ప్రసుప్తా = గాఢముగా నిద్రించుచుండెను.

**తాత్పర్యము :–** ఒకానొక కమలాక్షి మదపరవశురాలై ఆడంబర మనెడి వాద్య విశేషమును తన రెండు బాహువులతో గట్టిగా అదిమిపట్టి గాఢముగా నిద్రించు చుండెను.

**శ్లో॥ కలశీ మపవిధ్యాన్యాః ప్రసుప్తా భాతి భామినీ ।**
**వసంతే పుష్పశబలా మాలేవ పరిమార్జితా ॥ 46**

**పదచ్ఛేదము :–** కలశీమ్ – అపవిధ్య – అన్యా – ప్రసుప్తా – భాతి – భామినీ – వసంతే – పుష్పశబలా – మాలా – ఇవ – పరిమార్జితా ॥

**అన్వయక్రమము :–** వసంతే పరిమార్జితా, పుష్పశబలా మాలా ఇవ, అన్యా భామినీ కలశీమ్ అపవిధ్య ప్రసుప్తా భాతి.

**ప్రతిపదార్థము :–** వసంతే = వసంత ఋతువునందు, పరిమార్జితా = చక్కగా తడుపబడిన, పుష్పశబలా మాలా ఇవ = వివిధవర్ణములు గల పూవులదండవలె, అన్యా భామినీ = వేరొక వనిత, కలశీమ్ అపవిధ్య = జలకలశమును ఒరగత్రోసి, ప్రసుప్తా = గాఢనిద్రాపరవశయై, భాతి = ప్రకాశించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** పుష్పశబలమైన, తడిసిన మాలవలె నున్నదనుటచే ఆ యువతి కుంకుమాది జలముచే తడిసియున్నదని తెలియవలెను లేదా వివిధమైన ఆభరణములతో

అలంకరింపబడియున్నదని గ్రహించవలెను. ఈ వనిత రావణునియొక్క పానపాత్రను ధరించు యువతియై యుండును.

**తాత్పర్యము :–** ఒకానొక యువతి, తన యొద్దనున్న జలకలశమును ఒరగ ద్రోచుకొని తడిసిపోయినప్పటికిని గాఢనిద్రాపరవశయై యుండెను. ఆమెను చూడగా వసంత ఋతువునందు రంగురంగుల పూవులతో నిర్మింపబడి చక్కగా తడుపబడిన పుష్పమాలికవలె నుండెను.

**శ్లో॥ పాణిభ్యాం చ కుచౌ కాచి త్సువర్ణకలశోపమౌ ।**
**ఉపగూహ్యాబలా సుప్తా నిద్రాబలపరాజితా ॥ 47**

**పదచ్ఛేదము :–** పాణిభ్యాం – చ – కుచౌ – కా – చిత్ – సువర్ణకలశోపమౌ – ఉపగూహ్య – అబలా – సుప్తా – నిద్రాబలపరాజితా ॥

**అన్వయక్రమము :–** కాచిత్ అబలా పాణిభ్యాం సువర్ణకలశోపమౌ కుచౌ ఉపగూహ్య, నిద్రాబలపరాజితా (సతీ) సుప్తా.

**ప్రతిపదార్థము :–** కాచిత్ అబలా = ఒకానొక స్త్రీ, సువర్ణకలశోపమౌ కుచౌ = స్వర్ణ కుంభముల వంటి కుచములను, పాణిభ్యామ్ ఉపగూహ్య = తన రెండు చేతుల తోడను కప్పుకొని, నిద్రాబలపరాజితా = నిద్రయొక్క తీవ్రతచే మైమరచినదై, సుప్తా = నిద్రించెను.

**తాత్పర్యము :–** మరియొకస్త్రీ సువర్ణకుంభములవంటి తన కుచములను రెండు చేతులతోడను కప్పుకొని గాఢనిద్రాపరవశయై శయనించి యుండెను.

**శ్లో॥ అన్యా కమలపత్రాక్షీ పూర్ణేందుసదృశాననా ।**
**అన్యా మాలింగ్య సుశ్రోణీం ప్రసుప్తా మదవిహ్వలా ॥ 48**

**పదచ్ఛేదము :–** అన్యా – కమలపత్రాక్షీ – పూర్ణేందుసదృశాననా – అన్యామ్ – ఆలింగ్య – సుశ్రోణీం – ప్రసుప్తా – మదవిహ్వలా ॥

**అన్వయక్రమము :–** కమలపత్రాక్షీ, పూర్ణేందుసదృశాననా, అన్యా మదవిహ్వలా సతీ అన్యాం, సుశ్రోణీమ్, ఆలింగ్య ప్రసుప్తా.

**ప్రతిపదార్థము :–** కమలపత్రాక్షీ = పద్మపత్రముల వంటి కన్నులు గలదియును, పూర్ణేందుసదృశాననా = నిండుచంద్రుని బోలిన ముఖము గలదియును అగు, అన్యా = వేరొక యువతి, మదవిహ్వలా సతీ = మదనపరవశయై, అన్యాం సుశ్రోణీం = ఘనమైన కటిప్రదేశముగల వేరొక యువతిని, ఆలింగ్య = కౌగిలించుకొని, ప్రసుప్తా

= గాఢముగ నిద్రించు చుండెను.

**తాత్పర్యము :–** పెద్ద కన్నులును, సుందరమైన ముఖమును గల వేఱొక యువతి, మదనపరవశురాలై విశాలమైన కటిప్రదేశముగల వేఱొక యువతిని కౌగిలించుకొని గాఢముగా నిద్రించు చుండెను.

**శ్లో॥ ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య వరస్త్రియః ।**
**నిపీడ్య చ కుచై స్సుప్తాః కామిన్యః కాముకా నివ ॥ 49**

**పదచ్ఛేదము :–** ఆతోద్యాని – విచిత్రాణి – పరిష్వజ్య – వరస్త్రియః – నిపీడ్య – చ – కుచైః – సుప్తాః – కామిన్యః – కాముకాన్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** కాముకాన్, కుచైః నిపీడ్య వరస్త్రియః విచిత్రాణి ఆతోద్యాని పరిష్వజ్య సుప్తాః.

**ప్రతిపదార్థము :–** కాముకాన్ = కాముకులను, కుచైః నిపీడ్యేవ = స్తనములతో పీడించినట్లుగా, వరస్త్రియః = సుందరులైన యువతులు, విచిత్రాణి ఆతోద్యాని = విచిత్రములైన వాద్యవిశేషములను, పరిష్వజ్య = కౌగిలించుకొని, సుప్తాః = నిద్రించు చుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** ఆతోద్యాని వీణాద్యాని – వీణాదికము (తతము), మురజాదికము (ఆనద్ధము), వంశాదికము (సుషిరము), కాంస్యతాళాదికము (ఘనము) ఈ నాల్గు విధములగు వాద్యములు వాదిత్రమనియు, ఆతోద్యమనియు పేర్కొన బడును.

**తాత్పర్యము :–** కొంతమంది సుందరులు, విచిత్రములైన తమ తమ వాద్య విశేషములను, కామినులైన స్త్రీలు, తమ కాముకులను కుచములతో అదిమి కౌగిలించుకొన్నట్లు కౌగిలించుకొని నిద్రించుచుండిరి.

**శ్లో॥ తాసా మేకాంతవిన్యస్తే శయానాం శయనే శుభే ।**
**దదర్శ రూపసంపన్నా మపరాం స కపి స్స్త్రియమ్ ॥ 50**

**పదచ్ఛేదము :–** తాసామ్ – ఏకాంతవిన్యస్తే – శయానాం – శయనే – శుభే – దదర్శ – రూపసంపన్నామ్ – అపరాం – సః – కపిః – స్త్రియమ్ ॥

**అన్వయక్రమము :–** సః కపిః తాసామ్ ఏకాంతవిన్యస్తే శయనే శయానాం రూప సంపన్నామ్ అపరాం స్త్రియం దదర్శ.

**ప్రతిపదార్థము** :– సః కపిః = ఆ హనుమంతుడు, తాసాం = ఆ స్త్రీలందరిలోను, ఏకాంతవిన్యస్తే = ప్రత్యేకముగా వేయబడినట్టి, శుభే శయనే = మంగళకరమైన శయ్యయందు, శయానాం = నిద్రించుచున్నట్టి, రూపసంపన్నాం = గొప్పదైన రూపవైభవము కలిగినట్టి, అపరాం స్త్రియం = వేరొక వనితను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– ఆ వనితలకు కొద్దిదూరమునందు వేఱుగా ఏర్పాటు చేయబడియున్న, ఉత్తమమైన శయ్యపై పవళించియున్న, గొప్పదైన రూపసంపదతో విరాజిల్లుచున్న వేఱొకవనితను ఆంజనేయుడు కనుగొనెను.

**శ్లో॥ ముక్తామణిసమాయుక్తై ర్భూషణై స్సువిభూషితామ్ ।**
**విభూషయంతీ మివ త త్స్వశ్రియా భవనోత్తమమ్ ॥ 51**

**పదచ్ఛేదము** :– ముక్తామణిసమాయుక్తైః – భూషణైః – సువిభూషితామ్ – విభూష యంతీమ్ – ఇవ – తత్ – స్వశ్రియా – భవనోత్తమమ్ ॥

**అన్వయక్రమము** :– ముక్తామణిసమాయుక్తైః భూషణైః సువిభూషితామ్ స్వశ్రియా తత్ భవనోత్తమం విభూషయంతీమ్ ఇవ (విరాజమానాం స్త్రియం దదర్శ).

**ప్రతిపదార్థము** :– ముక్తామణిసమాయుక్తైః = ముత్యములతోడను రత్నములతోడను గూడినట్టి, భూషణైః = ఆభరణములచే, సువిభూషితాం = చక్కగా అలంకరింపబడి యున్నదియును, స్వశ్రియా = తన శోభచే, తత్ భవనోత్తమం = ఆ దివ్యభవనమును, విభూషయంతీమ్ ఇవ = అలంకరించు చున్నదియునువలె (విరాజమానాం = శోభిల్లుచున్న, స్త్రియం = వనితను, దదర్శ = చూచెను).

**తాత్పర్యము** :– ముత్యములతోడను, రత్నములతోడను నిండిన ఆభరణములతో అలంకరింపబడిన ఆ దివ్యభవనమును తన శరీరశోభచే అలంకరించుచున్నట్టి, వేఱొక్క వనితను హనుమంతు డచట గాంచెను.

**శ్లో॥ గౌరీం కనకవర్ణాభా మిష్టా మంతఃపురేశ్వరీమ్ ।**
**కపి ర్మండోదరీం తత్ర శయానాం చారురూపిణీమ్ ॥ 52**

**పదచ్ఛేదము** :– గౌరీం – కనకవర్ణాభామ్ – ఇష్టామ్ – అంతఃపురేశ్వరీమ్ – కపిః – మండోదరీం – తత్ర – శయానాం – చారురూపిణీమ్ ॥

**అన్వయక్రమము** :– కపిః తత్ర శయానాం, గౌరీం, కనకవర్ణాభామ్, ఇష్టామ్, అంతఃపురేశ్వరీం, చారురూపిణీం, మండోదరీం, (దదర్శ).

**ప్రతిపదార్థము** :– కపిః = హనుమంతుడు, తత్ర శయానాం = అక్కడ

శయనించియున్న, గౌరీం = పచ్చని వర్ణము గలదియును, కనకవర్ణాభాం = సువర్ణచ్ఛాయతో ప్రకాశించు నదియును, ఇష్టాం = రావణునకు ప్రియురాలును, అంతఃపురేశ్వరీం = అంతః పురమునకు అధిపతి యైనదియును, చారురూపిణీం = సుందరమైన రూపము గలదియునగు, మండోదరీం = మండోదరిని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** మేలిమి బంగారమువంటి పచ్చని దేహచ్ఛాయ గలదియును, రావణుని కత్యంత ప్రియురాలును, అంతఃపురమునకు సర్వాధికారిణియును, సుందరమైన రూపము గలదియును అగు మండోదరి అచ్చట శయనించి యుండగా, హనుమ చూచెను.

**శ్లో॥ స తాం దృష్ట్వా మహాబాహుర్భూషితాం మారుతాత్మజః ।**
**తర్కయామాస సీతేతి రూపయౌవనసంపదా ॥ 53**

**పదచ్ఛేదము :–** సః – తాం – దృష్ట్వా – మహాబాహుః – భూషితాం – మారుతాత్మజః – తర్కయామాస – సీతా – ఇతి – రూపయౌవనసంపదా ॥

**అన్వయక్రమము :–** సః మహాబాహుః మారుతాత్మజః, భూషితాం తాం దృష్ట్వా రూపయౌవనసంపదా సీతా ఇతి, తర్కయామాస.

**ప్రతిపదార్థము :–** సః మహాబాహుః మారుతాత్మజః = ఆ మహావీరుడైన హనుమంతుడు, భూషితాం తాం దృష్ట్వా = చక్కగా అలంకరింపబడియున్న, ఆమెను గాంచి, రూపయౌవనసంపదా = సౌందర్యముయొక్కయు, యౌవనముయొక్కయు వైభవముచే, సీతా ఇతి = సీత యని, తర్కయామాస = ఊహించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మండోదరి వేరుగా ఏకాంతశయ్యపై పరుండి యుండుటచే ఆమె సీత యను ఊహ హనుమకు గల్గెను.

**తాత్పర్యము :–** అనేకభూషణములతో అలంకరింపబడి రూపయౌవనసంపదలచే విరాజిల్లుచున్న ఆ మండోదరిని చూడగనే హనుమంతునకు ఆమె సీతయేమో యను ఊహ పొడమెను.

**శ్లో॥ హర్షేణ మహతా యుక్తో ననంద హరియూథపః ॥ 54**

**పదచ్ఛేదము :–** హర్షేణ – మహతా – యుక్తః – ననంద – హరియూథపః ॥

**ప్రతిపదార్థము** :– హరియూథపః = వానరాగ్రేసరుడైన హనుమ, మహతా హర్షేణ యుక్తః = గొప్పదైన హర్షముతో కూడినవాడై, ననంద = ఆనందించెను.

**తాత్పర్యము** :– వానరశ్రేష్ఠుడైన యా హనుమ, సీతను జూచి, చూచితినను భావనతో అమితమైన హర్షమును పొంది మిక్కిలిగా ఆనందించెను.

(వ్యాఖ్యానకారులందరును, శారీరకమైనది హర్షమనియు, మానసికమైనది ఆనందము అనియును చెప్పిరి)

**శ్లో॥ ఆస్ఫోటయామాస చుచుంబ పుచ్ఛం**
**ననంద చిక్రీడ జగౌ జగామ ।**
**స్తంభా నరోహ న్నిపపాత భూమౌ**
**నిదర్శయన్ స్వాం ప్రకృతిం కపీనామ్ ॥ 55**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"మండోదరీదర్శనం" నామ*
*దశమస్సర్గః.*

**పదచ్ఛేదము** :– ఆస్ఫోటయామాస – చుచుంబ – పుచ్ఛం – ననంద – చిక్రీడ – జగౌ – జగామ – స్తంభాన్ – అరోహత్ – నిపపాత – భూమౌ – నిదర్శయన్ – స్వాం – ప్రకృతిం – కపీనామ్ ॥

**అన్వయక్రమము** :– సః స్వాం ప్రకృతిం నిదర్శయన్ ఆస్ఫోటయామాస, పుచ్ఛం చుచుంబ, ననంద, చిక్రీడ, జగౌ, జగామ, స్తంభాన్ అరోహత్, భూమౌ నిపపాత.

**ప్రతిపదార్థము** :– సః = హనుమంతుడు, స్వాం = తనదైన, కపీనాం ప్రకృతిం = వానరస్వభావమును, నిదర్శయన్ = చూపుచు, ఆస్ఫోటయామాస = (భుజములను) చరిచెను, పుచ్ఛం చుచుంబ = తోకను ముద్దిడుకొనెను, ననంద = ఆనందము నొందెను, చిక్రీడ = ఆటలాడెను, జగౌ = పాడెను, జగామ = వెడలెను, స్తంభాన్ అరోహత్ = స్తంభములను ఆరోహించెను, భూమౌ నిపపాత = నేలమీదికి ఉరికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– చిక్రీడ = నృత్యము చేసెను.

**మహేశ్వరతీర్థులు** :– జగౌ = సంతోషముచే కూనిరాగములు తీసెను.

**తిలకము :–** ఈ చేష్టలన్నియును ఏకాంతమునందున్న హనుమకు సహజములు.

**తాత్పర్యము :–** సీతను చూచితినను ఆనందముతో హనుమ తన సహజమైన కపి స్వభావమును వెల్లడించుచు జబ్బలు చరచుచు, తోకను ముద్దిడుకొని, ఆనందముతో గెంతుచు, పాడుచు, వెనుకముందులకు పరుగిడుచు, స్తంభము లెక్కుచు, క్రిందికి దుముకుచు, తన ఆనందాతిశయమును పలువిధములుగా వెల్లడించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్ర వివరణమునందు*
*"మండోదరీదర్శనము" అను*
*పదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకాదశసర్గ

**శ్లో॥ అవధూయ చ తాం బుద్ధిం బభూ వావస్థిత స్తదా ।**
**జగామ చాపరాం చింతాం సీతాం ప్రతి మహాకపిః ॥ 1**

**పదచ్ఛేదము :–** అవధూయ – చ – తాం – బుద్ధిం – బభూవ – అవస్థితః – తదా – జగామ – చ – అపరాం – చింతాం – సీతాం – ప్రతి – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** మహాకపిః తదా తాం బుద్ధిమ్ అవధూయ, అవస్థితః బభూవ, సీతాం ప్రతి అపరాం చింతాం జగామ.

**ప్రతిపదార్థము :–** మహాకపిః = వానరశ్రేష్ఠుడైన ఆ హనుమ, తదా = అప్పుడు, తాం బుద్ధిం = ఆ ఊహను, అవధూయ = తొలగించుకొని, అవస్థితః బభూవ = స్వస్థచిత్తుడై యుండెను. సీతాం ప్రతి = సీతమ్మను గూర్చి, అపరాం చింతాం = వేఱుచింతను, జగామ = పొందెను.

**తాత్పర్యము :–** ఆంజనేయుడు వెంటనే తనకు కలిగిన భ్రమాత్మకమైన ఆ భావనను తొలగించుకొని స్వస్థచిత్తుడై యుండెను. అప్పుడు అతడు సీతామాతను గూర్చి తిరిగి ఈ రీతిగా ఆలోచింపదొడగెను.

**శ్లో॥ న రామేణ వియుక్తా సా స్వప్తు మర్హతి భామినీ ।**
**న భోక్తుం నాప్యలంకర్తుం న పాన ముపసేవితుమ్ ॥ 2**

**పదచ్ఛేదము :–** న రామేణ – వియుక్తా – సా – స్వప్తుమ్ – అర్హతి – భామినీ – న – భోక్తుం – న – అపి – అలంకర్తుం – న – పానమ్ – ఉపసేవితుమ్ ॥

**అన్వయక్రమము :–** రామేణ వియుక్తా సా భామినీ స్వప్తుం న అర్హతి; భోక్తుం న అర్హతి; అలంకర్తుమ్ అపి, న అర్హతి, పానమ్ ఉపసేవితుం చ, న అర్హతి.

**ప్రతిపదార్థము :–** రామేణ వియుక్తా = రామునిచే ఎడబాటు నొందినట్టి, సా భామినీ = ఆ సీతమ్మ, స్వప్తుం న అర్హతి = నిద్రించుటకు తగదు. భోక్తుం న అర్హతి = భుజించుటకు తగదు, అలంకర్తుమ్ అపి = అలంకరించుకొనుటకును, నార్హతి =

తగియుండదు, పానమ్ ఉపసేవితుం చ = మద్యమును సేవించుటకును, నార్హతి = తగదు.

**తాత్పర్యము** :- రామునినుండి ఎడబాటు నొందిన సీతమ్మ నిద్రించుటకు గాని, భుజించుటకు గాని, అలంకరించుకొనుటకుగాని, మద్యమును సేవించుటకు గాని ఎన్నడును తగియుండదు.

**శ్లో॥ నాన్యం నర ముపస్థాతుం సురాణా మపి చేశ్వరమ్ ।**
**న హి రామసమః కశ్చి ద్విద్యతే త్రిదశే ష్వపి ।**
**అన్యేయమితి నిశ్చిత్య పానభూమౌ చచార సః ॥ 3**

**పదచ్ఛేదము** :- న - అన్యం - నరమ్ - ఉపస్థాతుం - సురాణామ్ - అపి - చ - ఈశ్వరమ్ - న - హి - రామసమః - కః - చిత్ - విద్యతే - త్రిదశేషు - అపి - అన్యా - ఇయమ్ - ఇతి - నిశ్చిత్య - పానభూమౌ - చచార - సః ॥

**అన్వయక్రమము** :- (సా) అన్యం నరమ్ ఉపస్థాతుం నార్హతి, సురాణామ్ ఈశ్వరం చాపి ఉపస్థాతుం నార్హతి. త్రిదశేషు అపి రామసమః కశ్చిత్ నహి విద్యతే. ఇయం అన్యా ఇతి నిశ్చిత్య సః పానభూమౌ చచార.

**ప్రతిపదార్థము** :- సా = ఆ సీతాసాధ్వి, అన్యం నరం = పరపురుషుని, ఉపస్థాతుం = సేవించుటకు, న అర్హతి = తగదు, సురాణామ్ ఈశ్వరం చాపి = దేవతలకు అధిపతియైన ఇంద్రునిగూడ, (ఉపస్థాతుం = సేవించుటకు), న అర్హతి = తగదు, త్రిదశేషు అపి = దేవతలలో గూడ, రామసమః = శ్రీరామునితో సమానమైనవాడు, కశ్చిత్ నహి విద్యతే = ఎవ్వడును ఉండడు, ఇయం = ఈమె, అన్యా = వేఱొక్కతె, ఇతి = అని, నిశ్చిత్య = నిశ్చయించుకొని, (సః=ఆ హనుమ), పానభూమౌ = పాన మందిరమునందు, చచార = తిరుగుచుండెను.

**తాత్పర్యము** :- సీతాసాధ్వి పరపురుషు నెవ్వరిని చేరనంగీకరించదు. త్రిలోకాధిపతిని గూడ కన్నెత్తి చూడదు. దేవతలందరిలో గూడ శ్రీరామునితో సమానమైన వాడుండబోడు. ఇచట నేను చూచుచున్న ఈమె వేఱెవ్వతెయో అయియుండును. అని నిశ్చయించుకొని హనుమ తిరిగి ఆ పానమందిరమునందు తిరుగాడ దొడగెను.

**శ్లో॥ క్రీడితే నాపరాః క్లాంతా గీతేన చ తథాఽపరాః ।**
**నృత్తేన చాపరాః క్లాంతాః పానవిప్రహతా స్తథా ॥ 4**

**పదచ్ఛేదము** :- క్రీడితేన - అపరాః - క్లాంతాః - గీతేన - చ - తథా - అపరాః -

నృత్తేన – చ – అపరాః – క్లాంతాః – పానవిప్రహతాః – తథా ॥

**అన్వయక్రమము :–** అపరాః క్రీడితేన క్లాంతాః, తథా అపరాః గీతేన క్లాంతాః, నృత్తేన అపరాః క్లాంతాః, తథా అపరాః పానవిప్రహతాః.

**ప్రతిపదార్థము :–** అపరాః = కొంతమంది స్త్రీలు, క్రీడితేన క్లాంతాః = ఆటచే అలసియుండిరి, తథా అపరాః = అట్లే మరికొంతమంది స్త్రీలు, గీతేన క్లాంతాః = గానముచేత అలసియుండిరి, అపరాః నృత్తేన క్లాంతాః = మరికొంతమంది నాట్యముచే అలసియుండిరి, తథా అపరాః పానవిప్రహతాః = అట్లే మరికొందరు స్త్రీలు మద్యపానముచే తెలివి నశించి యుండిరి.

**తాత్పర్యము :–** ఆ పానభూమియందు, కొందరు ఆడి యాడి అలసియుండిరి; మరికొందరు పాడి పాడి ఒడలెరుగక నిద్రించిరి; గొప్పగా నృత్యమును ప్రదర్శించి మరికొందరు అలసిపోయిరి; మరికొందరు తప్పత్రాగి ఒడలెరుంగక పడియుండిరి; అట్టి స్త్రీలను హనుమ చూచెను.

**శ్లో॥ మురజేషు మృదంగేషు పీఠికాసు చ సంస్థితాః ।**
**తథాఽఽస్తరణముఖ్యేషు సంవిష్టా శ్చాపరాః స్త్రియః ॥ 5**

**పదచ్ఛేదము :–** మురజేషు – మృదంగేషు – పీఠికాసు – చ – సంస్థితాః – తథా – ఆస్తరణముఖ్యేషు – సంవిష్టాః – చ – అపరాః – స్త్రియః ॥

**అన్వయక్రమము :–** అపరాః స్త్రియః మురజేషు మృదంగేషు, పీఠికాసు చ సంస్థితాః, తథా అపరాః ఆస్తరణముఖ్యేషు సంవిష్టాః.

**ప్రతిపదార్థము :–** అపరాః స్త్రియః = కొద్దిమంది స్త్రీలు, మురజేషు = మురజములందును, మృదంగేషు = మృదంగములందును, పీఠికాసు చ = పీఠములందును, సంస్థితాః = శయనించి యుండిరి, తథా = అట్లే, అపరాః = మరికొద్దిమంది, ఆస్తరణముఖ్యేషు = ఉత్తమమైన తివాచీలపై, సంవిష్టాః = విశ్రమించియుండిరి.

**తాత్పర్యము :–** ఆ పానమందిరమునందు మురజములందు కొందరును, మృదంగము లందు కొందరును, పీఠములందు కొందరును, ఉత్తమమైన తివాచీలు మున్నగు వానియందు మరికొందరును, విశ్రమించి యుండ హనుమ వారి నెల్లరను జూచెను.

**శ్లో॥ అంగనానాం సహస్రేణ భూషితేన విభూషణైః ।**
**రూపసల్లాపశీలేన యుక్తగీతార్థభాషిణా ॥ 6**

**శ్లో॥ దేశకాలాభియుక్తేన యుక్తవాక్యాభిధాయినా ।**
**రతాభిరతసంసుప్తం దదర్శ హరియూథపః ॥ 7**

**పదచ్ఛేదము** :– అంగనానాం – సహస్రేణ – భూషితేన – విభూషణైః – రూప సల్లాపశీలేన – యుక్తగీతార్థభాషిణా – దేశకాలాభియుక్తేన – యుక్తవాక్యాభిధాయినా – రతాభిరతసంసుప్తం – దదర్శ – హరియూథపః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– విభూషణైః భూషితేన = ఆభరణములచే అలంకరింపబడినట్టియు, రూపసల్లాపశీలేన = రూపము, సంభాషణశీలము కల్గినట్టియు, యుక్తగీతార్థభాషిణా = యుక్తమైన గీతముల అర్థమును, భాషించునట్టియు, దేశకాలాభియుక్తేన = దేశకాలములకు తగియున్నట్టియు, యుక్తవాక్యాభిధాయినా = యోగ్యమైన వాక్యములను పలుకునట్టిదియునగు, అంగనానాం సహస్రేణ = వేలకొలదిగనున్న స్త్రీసమూహముతో, రతాభిరతసంసుప్తం = రతిక్రీడలు గావించి నిద్రించియున్నట్టి, (రావణం = రావణుని), హరియూథపః = వానరశ్రేష్ఠుడైన హనుమ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– వివిధాభరణములతో అలంకరింపబడి ఉత్తమరూప భాషణచాతుర్యము గల్గి, సంగీతమునందును, గీతార్థవివరణమునందును నేర్పుగలిగి, దేశకాలోచితముగ భాషించు నేర్పు కలిగినట్టి ఉత్తమస్త్రీసహస్రముతో రతిక్రీడలుసలిపి నిద్రించియున్న రావణుని హనుమ చూచెను.

**శ్లో॥ తాసాం మధ్యే మహాబాహు శ్శుశుభే రాక్షసేశ్వరః ।**
**గోష్ఠే మహతి ముఖ్యానాం గవాం మధ్యే యథావృషః ॥ 8**

**పదచ్ఛేదము** :– తాసాం – మధ్యే – మహాబాహుః – శుశుభే – రాక్షసేశ్వరః – గోష్ఠే – మహతి – ముఖ్యానాం – గవాం – మధ్యే – యథా – వృషః ॥

**అన్వయక్రమము** :– మహాబాహుః రాక్షసేశ్వరః తాసాం మధ్యే మహతి గోష్ఠే ముఖ్యానాం గవాం మధ్యే వృషః యథా శుశుభే.

**ప్రతిపదార్థము** :– మహాబాహుః రాక్షసేశ్వరః = మహావీరుడైన రావణాసురుడు, తాసాం మధ్యే = ఆ స్త్రీల నడుమ, మహతి గోష్ఠే = గొప్పదైన గోశాలయందు, ముఖ్యానాం గవాం మధ్యే = శ్రేష్ఠములైన గోవులనడుమ, వృషః యథా = ఆబోతు రీతిగా, శుశుభే = శోభిల్లెను.

**తాత్పర్యము** :– మహావీరుడైన ఆ రాక్షసాధిపతి, అంతఃపురమునందు, ఆ స్త్రీలనడుమ

గొప్పదైన గోశాలయందు ఉత్తమజాతి గోవుల నడుమ నున్న ఆబోతువలెనే చూడముచ్చటగా కాన్పించెను.

**శ్లో॥ స రాక్షసేంద్ర శ్శుశుభే తాభిః పరివృత స్స్వయమ్ ।**
**కరేణుభి ర్యథాఽరణ్యే పరికీర్ణో మహాద్విపః ॥ 9**

**పదచ్ఛేదము :-** సః - రాక్షసేంద్రః - శుశుభే - తాభిః - పరివృతః - స్వయమ్ - కరేణుభిః - యథా - అరణ్యే - పరికీర్ణః - మహాద్విపః ॥

**అన్వయక్రమము :-** తాభిః స్వయం పరివృతః సః రాక్షసేంద్రః అరణ్యే కరేణుభిః పరికీర్ణః మహాద్విపః యథా శుశుభే.

**ప్రతిపదార్థము :-** తాభిః = ఆ స్త్రీలచే, స్వయం పరివృతః = స్వయముగా పరివేష్టింపబడి యున్నట్టి, సః రాక్షసేంద్రః = ఆ దానవాధిపతి, అరణ్యే = అరణ్యమునందు, కరేణుభిః పరికీర్ణః = ఆడు ఏనుగులచే పరివేష్టింపబడినట్టి, మహాద్విపః యథా = మదగజమువలె, శుశుభే = శోభిల్లెను.

**తాత్పర్యము :-** అంతఃపురస్త్రీలచే సేవింపబడుచు, వారి నడుమనున్న ఆ రావణుడు అరణ్యమున ఆడు ఏనుగుల గుంపు నడుమనున్న మదపుటేనుగువలె శోభిల్లుచుండెను.

**శ్లో॥ సర్వకామై రుపేతాం చ పానభూమిం మహాత్మనః ।**
**దదర్శ హరిశార్దూల స్తస్య రక్షఃపతేర్గృహే ॥ 10**

**పదచ్ఛేదము :-** సర్వకామైః - ఉపేతాం - చ - పానభూమిం - మహాత్మనః - దదర్శ - హరిశార్దూలః - తస్య - రక్షఃపతేః - గృహే ॥

**అన్వయక్రమము :-** హరిశార్దూలః మహాత్మనః తస్య రక్షఃపతేః గృహే సర్వకామైః ఉపేతాం పానభూమిం చ దదర్శ.

**ప్రతిపదార్థము :-** హరిశార్దూలః = వానరశ్రేష్ఠుడైన హనుమ, మహాత్మనః = మహనీయుడైన, తస్య రక్షఃపతేః = ఆ రాక్షసరాజుయొక్క, గృహే = భవనమునందు, సర్వకామైః ఉపేతాం = అన్ని పదార్థములతో కూడినట్టి, పానభూమిం చ దదర్శ = పానశాలను గూడ చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** పూర్వము స్త్రీలుగల రావణాంతఃపురభవనమును వెదకి, పిమ్మట ఈవలనున్న పానభూమికి వచ్చి, హనుమ వెదకుచున్నాడని తెలిసికొనవలెను. పూర్వము

నృత్యాదికళలందు ప్రవీణలైన స్త్రీలను జూచెను. ఇప్పుడు అచ్చటి సర్వకామ ప్రదమైన మందిరవైభవమును చూచుచున్నాడు.

**తాత్పర్యము :–** రావణుని భవనమునందు ఎల్లకోరికలను తీర్చగల్గినట్టి పానభూమిని జేరి హనుమ అచ్చటి విశేషములను చూచుచుండెను.

**శ్లో॥ మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః ।**
**తత్ర న్యస్తాని మాంసాని పానభూమౌ దదర్శ సః ॥ 11**

**పదచ్ఛేదము :–** మృగాణాం – మహిషాణాం – చ – వరాహాణాం – చ – భాగశః – తత్ర – న్యస్తాని – మాంసాని – పానభూమౌ – దదర్శ – సః ॥

**అన్వయక్రమము :–** పానభూమౌ తత్ర న్యస్తాని మృగాణాం మహిషాణాం చ వరాహాణాం చ భాగశః న్యస్తాని మాంసాని సః దదర్శ.

**ప్రతిపదార్థము :–** తత్ర పానభూమౌ = అచటి పానభూమియందు, మృగాణాం = లేళ్ళయొక్కయు, మహిషాణాం చ = దున్నపోతులయొక్కయు, వరాహాణాం చ = అడవిపందులయొక్కయు, భాగశః న్యస్తాని = వేరువేరుగా నుంచబడినట్టి, మాంసాని = మాంసములను, సః దదర్శ = ఆ హనుమ జూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడా పానభూమియందు వేరు వేరుగా నుంచబడినట్టి లేళ్ళ మాంసమును, దున్నపోతుల మాంసమును, అడవిపందుల మాంసమును జూచెను.

**శ్లో॥ రౌక్మేషు చ విశాలేషు భాజనే ష్వర్ధభక్షితాన్ ।**
**దదర్శ హరిశార్దూలో మయూరాన్ కుక్కుటాం స్తథా ॥ 12**

**పదచ్ఛేదము :–** రౌక్మేషు – చ – విశాలేషు – భాజనేషు – అర్ధభక్షితాన్ – దదర్శ – హరిశార్దూలః – మయూరాన్ – కుక్కుటాన్ – తథా ॥

**అన్వయక్రమము :–** హరిశార్దూలః విశాలేషు రౌక్మేషు భాజనేషు అర్ధభక్షితాన్ మయూరాన్ తథా కుక్కుటాన్ దదర్శ.

**ప్రతిపదార్థము :–** హరిశార్దూలః = వానరశ్రేష్ఠుడైన హనుమ, విశాలేషు = విశాలముగ నున్న, రౌక్మేషు భాజనేషు = బంగరుపాత్రలయందు, అర్ధభక్షితాన్ = సగము తినబడిన, మయూరాన్ = నెమళ్ళను, తథా కుక్కుటాన్ = అట్లే కోడిపుంజులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడా పానభూమియందు పెద్దపెద్ద బంగారు పాత్రలయందు

సగము తిని యుంచబడినట్టి పెక్కు నెమళ్ళను, కోడిపుంజులను చూచెను.

**శ్లో॥ వరాహవా్ర్ధ్రాణసకాన్ దధిసౌవర్చలాయుతాన్ ।**
**శల్యా న్మృగమయూరాం శ్చ హనుమా నన్వవైక్షత ॥ 13**

**పదచ్ఛేదము** :– వరాహవా్ర్ధ్రాణసకాన్ – దధిసౌవర్చలాయుతాన్ – శల్యాన్ – మృగమయూరాన్ – చ – హనుమాన్ – అన్వవైక్షత ॥

**అన్వయక్రమము** :– హనుమాన్ (అర్ధభక్షితాన్) వరాహవా్ర్ధ్రాణసకాన్, దధిసౌవర్చలా యుతాన్, శల్యాన్, మృగమయూరాన్ చ అన్వవైక్షత.

**ప్రతిపదార్థము** :– హనుమాన్ = హనుమంతుడు, (అర్ధభక్షితాన్ = సగము తినబడిన) వరాహవా్ర్ధ్రాణసకాన్ = అడవిపందులను, వా్ర్ధ్రాణసము లను మృగములను, దధి సౌవర్చలాయుతాన్ = పెరుగు, సౌవర్చలవణము అను వానితో గూడియున్నట్టి, శల్యాన్ = ముళ్ళపంది మాంసములను, మృగమయూరాన్ చ = వివిధజాతుల లేళ్ళ నెమిళ్ళ మాంసమును, అన్వవైక్షత = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– వా్ర్ధ్రాణసము = ఒకజాతిపక్షి.

**విశేషము** :– “కృష్ణగ్రీవః రక్తశిరాః శ్వేతపక్షః విహంగమః స వై వా్ర్ధ్రాణసః ప్రోక్తః” అని విష్ణుధర్మగ్రంథమునందు చెప్పబడినది. ఒకానొక మేకపోతని కొందరి అభిప్రాయము. ఖడ్గమృగమని కొందరు వ్యాఖ్యాతలు చెప్పిరి. “త్రిపిబం త్వింద్రియక్షీణం శ్వేతం వృద్ధమజాపతిమ్ వా్ర్ధ్రాణసం చ తం ప్రాహుర్యాజ్ఞికాః శ్రాద్ధకర్మణి” తన నోటను, చెవులను, ముక్కునను, మూడింట ద్రాగునదియును, ఇంద్రియములు క్షీణించి యుండునదియును, తెల్లనిదియును, ముదుసలిదియును, ఆడుమేకలకు పెనిమిటియు నగు మేక వా్ర్ధ్రాణస మనబడును. – (పరమార్థచంద్రికావ్యాఖ్య)

**తాత్పర్యము** :– హనుమంతు డా పానభూమియందు సగము తిని యుంచిన అడవిపందులను, వా్ర్ధ్రాణసమృగములను, పెరుగు, సౌవర్చలవణము కలిపియుంచిన ఏదుపంది మాంసములను, వివిధజాతుల లేళ్ళయొక్కయు, నెమిళ్ళయొక్కయు మాంసములను చూచెను.

**శ్లో॥ క్రకరా న్వివిధా న్సిద్ధాం శ్చకోరా నర్ధభక్షితాన్ ।**
**మహిషా నేకశల్యాం శ్చ ఛాగాం శ్చ కృతనిష్ఠితాన్ ॥ 14**

**పదచ్ఛేదము** :– క్రకరాన్ – వివిధాన్ – సిద్ధాన్ – చకోరాన్ – అర్ధభక్షితాన్ – మహిషాన్ – ఏకశల్యాన్ – చ – ఛాగాన్ – చ – కృతనిష్ఠితాన్ ॥

**ప్రతిపదార్థము** :– వివిధాన్ = పలువిధములైన, సిద్ధాన్ = వండి సిద్ధముచేసిన, క్రకరాన్ = కొక్కెరల మాంసమును, చకోరాన్ = చకోరపక్షులను, అర్ధభక్షితాన్ = సగము తిని యుంచిన, మహిషాన్ = దున్నపోతులను, ఏకశల్యాన్ = ఏకశల్యములైన చేపలను, కృతనిష్ఠితాన్ = చక్కగా వండబడినట్టి, ఛాగాన్ = మేకపోతులను (హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను).

**తాత్పర్యము** :– వివిధములైన కొక్కెరల మాంసమును, వండి సిద్ధము చేయబడిన చకోరములను, సగము తిని యుంచిన ఎనుబోతులను, ఏకశల్యములైన మత్స్యములను, చక్కగా పక్వము చేయబడిన మేకపోతు మాంసములను ఆ పానభూమియందు హనుమ గాంచెను.

**శ్లో॥ లేహ్యా నుచ్చావచా న్పేయాన్ భోజ్యాని వివిధాని చ ॥ 15**

**పదచ్ఛేదము** :– లేహ్యాన్ – ఉచ్చావచాన్ – పేయాన్ – భోజ్యాని – వివిధాని – చ ॥

**ప్రతిపదార్థము** :– ఉచ్చావచాన్ = అనేకవిధములైనట్టి, లేహ్యాన్ = పచ్చళ్ళను, పేయాన్ = పానీయములను, వివిధాని = పలువిధములైన, భోజ్యాని = భోజ్యపదార్థములను, (హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను).

**తాత్పర్యము** :– హనుమంతు డాపానభూమియందు అనేకవిధములైన పచ్చళ్ళను పానీయములను బహువిధములగు భోజ్యపదార్థములను గాంచెను.

**శ్లో॥ తథాఽ మ్లలవణోత్తంసై ర్వివిధై రాగషాడబైః ।**
**హారనూపురకేయూరై రపవిద్ధై ర్మహాధనైః ॥ 16**

**శ్లో॥ పానభాజనవిక్షిప్తైః ఫలై శ్చ వివిధై రపి ।**
**కృతపుష్పోపహారా భూ రధికం పుష్యతి శ్రియమ్ ॥ 17**

**పదచ్ఛేదము** :– తథా – ఆమ్లలవణోత్తంసైః – వివిధైః – రాగషాడబైః – హారనూపుర కేయూరైః – అపవిద్ధైః – మహాధనైః – పానభాజనవిక్షిప్తైః – ఫలైః – చ – వివిధైః – అపి – కృతపుష్పోపహారా – భూః – అధికం – పుష్యతి – శ్రియమ్ ॥

**ప్రతిపదార్థము** :– తథా = అట్లే, ఆమ్లలవణోత్తంసైః = పులుపు ఉప్పు అనువానితో మిళితమైన, వివిధైః = బహువిధములైన, రాగషాడబైః = పలుచనివియు, చిక్కనివియు నగు వివిధఫలరసములతోడను, అపవిద్ధైః = తొలగించబడినట్టి, మహాధనైః =

అమూల్యములైనట్టి, హారనూపురకేయూరైః = ముత్యాలహారములు కాలిఅందెలు భుజకీర్తులను ఆభరణములచేతను, పానభాజనవిక్షిప్తైః = పానపాత్రలం దుంచబడినట్టి, వివిధైః ఫలైశ్చాపి = పలువిధములగు పండ్లతోడను, కృతపుష్పోపహారా = చేయబడిన పూలదండల అలంకారము గలిగినట్టి, భూః = ఆ పానభూమి, అధికం = మిక్కిలిగా, శ్రియం = శోభను, పుష్యతి = పెంపొందించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** రాగషాడబము అనగా (షాడబమునకు ఖాండవము అని బొంబాయి ప్రతి) "సితామధ్వాదిమధురో ద్రాక్షాదాడిమజో రసః, విరళశ్చేత్ కృతో రాగః సాంద్రశ్చేత్ షాడవః స్మృతః" అనగా పంచదార, తేనె మున్నగు వానిచే తీయనైనట్టి, ద్రాక్షపండ్ల రసమును, దానిమ్మపండ్ల రసమును, పల్చగనున్నచో రాగమనియు, చిక్కగానున్నచో షాడబము (షాడవము) అనియు చెప్పబడును.

**తాత్పర్యము :–** ఆమ్లముతో, లవణముతో మిశ్రితమైన పలువిధములగు, ద్రాక్షాదాడి మాది ఫలరసములతోడను, ఒడలినుండి తీసియుంచిన అమూల్యములైన ముత్యాల హారములు, కాలి అందెలు, భుజకీర్తులు అను ఆభరణములతోడను, పానపాత్రలందు అమర్చబడిన బహువిధములైన ఫలజాతులతోడను నిండియుండి పుష్పమాలికలతో అలంకరింపబడియున్న ఆ పానశాలయందలి భూమి అద్భుతమైన శోభతో వెలుగొందు చుండెను.

**శ్లో॥ తత్ర తత్ర చ విన్యస్తై స్సుశ్లిష్టై శ్శయనాసనైః ।**
**పానభూమి ర్వినా వహ్నిం ప్రదీప్తే వోపలక్ష్యతే ॥ 18**

**పదచ్ఛేదము :–** తత్ర – తత్ర – చ – విన్యస్తైః – సుశ్లిష్టైః – శయనాసనైః – పానభూమిః – వినా – వహ్నిం – ప్రదీప్తా – ఇవ – ఉపలక్ష్యతే ॥

**అన్వయక్రమము :–** తత్ర తత్ర చ విన్యస్తైః సుశ్లిష్టైః శయనాసనైః పానభూమిః వహ్నిం వినా ప్రదీప్తా ఇవ ఉపలక్ష్యతే.

**ప్రతిపదార్థము :–** తత్ర తత్ర = అచ్చటచ్చట, విన్యస్తైః = అమర్చబడిన, సుశ్లిష్టైః = ఒకదానితో నొకటి చక్కగా కలిసియున్న, శయనాసనైః = శయ్యలతోడను, ఆసనములతోడను, పానభూమిః = ఆ పానీయశాల, వహ్నిం వినా = అగ్నిలేకయే, ప్రదీప్తా ఇవ = ప్రజ్వరిల్లుచున్నదివలె, ఉపలక్ష్యతే = కానవచ్చుచుండెను.

**తాత్పర్యము :–** బంగారముతోను, రత్నములతోను నిర్మింపబడి అచ్చట అమర్చ బడియున్న శయ్యలును ఆసనములును దగ్గరదగ్గరగా నుండి, నలుమూలలందును

గొప్ప కాంతితో మెరయుచు కానవచ్చుచుండ ఆ పానభూమి అగ్నిలేకయే ప్రజ్వరిల్లు చున్నట్లు కానవచ్చుచుండెను.

**శ్లో॥ బహుప్రకారై ర్వివిధై ర్వరసంస్కారసంస్కృతైః ।**
**మాంసైః కుశలసంపృక్తైః పానభూమిగతైః పృథక్ ॥ 19**

**పదచ్ఛేదము** :– బహుప్రకారైః – వివిధైః – వరసంస్కారసంస్కృతైః – మాంసైః – కుశలసంపృక్తైః – పానభూమిగతైః – పృథక్ ॥

**అన్వయక్రమము** :– బహుప్రకారైః, వివిధైః, వరసంస్కారసంస్కృతైః, కుశలసంపృక్తైః, పృథక్ పానభూమిగతైః, మాంసైః (సంయుతా పానభూమిః ఉపలక్ష్యతే).

**ప్రతిపదార్థము** :– బహుప్రకారైః = బహువిధములైనట్టి, వివిధైః = పలురీతులుగా, వరసంస్కారసంస్కృతైః = శ్రేష్ఠమైన పద్ధతులతో వండబడినవియును, కుశలసంపృక్తైః = గొప్ప నేర్పుగలవారిచే వండబడినవియును, పృథక్ పానభూమిగతైః = వేరువేరుగా ఆ పానభూమియం దున్నట్టి, మాంసైః = మాంసాహారములతో, సంయుతా = నిండియున్నదై (పానభూమిః ఉపలక్ష్యతే = ఆ పానశాల కానవచ్చుచుండెను).

**తాత్పర్యము** :– నిపుణులైన పాచకులచే శ్రేష్ఠమైన రీతులలో వండబడినట్టి బహువిధములైన మాంసాహారములు ఆ పానభూమియందు వేరువేరుగా నున్నవై చూచుటకు గొప్పగా కాన్పించుచుండెను.

**శ్లో॥ దివ్యాః ప్రసన్నా వివిధా స్సురాః కృతసురా అపి ।**
**శర్కరాసవమాధ్వీక పుష్పాసవఫలాసవాః ॥ 20**

**శ్లో॥ వాసచూర్ణై శ్చ వివిధై ర్దృష్టా స్తై స్తైః పృథక్పృథక్ ।**
**సంతతా శుశుభే భూమి ర్మాల్యై శ్చ బహుసంస్థితైః ॥ 21**

**పదచ్ఛేదము** :– దివ్యాః – ప్రసన్నాః – వివిధాః – సురాః – కృతసురాః – అపి – శర్కరాసవమాధ్వీకపుష్పాసవఫలాసవాః – వాసచూర్ణైః – చ – వివిధైః – దృష్టాః – తైః – తైః – పృథక్ – పృథక్ – సంతతా – శుశుభే – భూమిః – మాల్యైః – చ – బహుసంస్థితైః ॥

**అన్వయక్రమము** :– దివ్యాః, ప్రసన్నాః, వివిధాః, శర్కరాసవమాధ్వీకపుష్పాసవ ఫలాసవాః సురాః, కృతసురాః అపి, వివిధైః తైః తైః వాసచూర్ణైః, పృథక్ పృథక్ దృష్టాః బహుసంస్థితైః మాల్యైః సంతతా, భూమిః, శుశుభే.

**ప్రతిపదార్థము** :- దివ్యాః = దివ్యములైనట్టియు, ప్రసన్నాః = నిర్మలమైనట్టియు, వివిధాః = బహువిధము లైనట్టియు, శర్కరాసవ = శర్కరామద్యము, మాధ్వీక = ఇప్పపువ్వుకల్లు; పుష్పాసవ = ఇతర పుష్పమద్యములు, ఫలాసవాః = వివిధ ఫల సంభరిత మద్యములు మున్నుగాగల, సురాః = సహజమైన మద్యములును, కృతసురాః అపి = కృత్రిమములైన మద్యములును, వివిధైః తైః తైః వాసచూర్ణైః = బహువిధములైన ఆయా చూర్ణములతో, వాసితాః = పరిమళించుచున్నవై, పృథక్ పృథక్ దృష్టాః = వేరువేరుగా కాన్పించు చుండెను. బహుసంస్థితైః = పలువిధములుగ కూర్చబడిన, మాల్యైః చ = పుష్పమాలికలతోడను, సంతతా = నిండియున్నదై, భూమిః = ఆ పానభూమి, శుశుభే = శోభిల్లుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- "పానకం ద్రాక్షమాధూకం ఖార్జూరం తాళమైక్షవం, మధూత్థం శీధుమాధ్వీకం, మైరేయం నారికేళజమ్" అని అర్ణవమునందు మద్యభేదములు వివరింపబడినవి.

**తాత్పర్యము** :- శర్కరతో నిర్మింపబడినవి, తేనెతో నిర్మింపబడినవి, బహువిధ పుష్పములతో నిర్మింపబడినవి, వివిధములగు ఫలములతో తయారు చేయబడినవియును అగు కృత్రిమమైన మద్యములును, దివ్యములు నిర్మలములు అగు వివిధములైన సహజములైన మద్యములును ఆయా పరిమళచూర్ణములతో వేరువేరుగా అమర్చబడిన వివిధములగు మద్యములు నచ్చట కానవచ్చినవి. మఱియు అచ్చటి భూమి బహువిధములైన పుష్పమాలికలతో నిండి ఎంతగానో శోభిల్లుచుండెను.

**శ్లో॥ హిరణ్మయై శ్చ వివిధై ర్భాజనైః స్ఫాటికై రపి ।**
**జాంబూనదమయై శ్చాన్యైః కరకైరభిసంవృతా ॥ 22**

**పదచ్ఛేదము** :- హిరణ్మయైః - చ - వివిధైః - భాజనైః - స్ఫాటికైః - అపి - జాంబూనదమయైః - చ - అన్యైః - కరకైః - అభిసంవృతా ॥

**అన్వయక్రమము** :- వివిధైః హిరణ్మయైః చ స్ఫాటికైః భాజనైః చ అపి అన్యైః జాంబూనదమయైః కరకైః చ (భూమిః) అభిసంవృతా (విరాజతే).

**ప్రతిపదార్థము** :- వివిధైః = బహువిధములైనట్టి, హిరణ్మయైః = స్వర్ణమయము లైనట్టియు, స్ఫాటికైః = స్ఫటికమణినిర్మితములైనట్టియు, భాజనైః చ అపి = పాత్రలతోడను, అన్యైః = వేరువిధములైన, జాంబూనదమయైః = సువర్ణనిర్మితములైన, కరకైః చ = కమండలములవంటి కలశములతోడను, భూమిః = ఆ పానభూమి,

అభిసంవృతా = నిండినదై, విరాజతే = విరాజిల్లుచుండెను.

**తాత్పర్యము** :- ఆ పానభూమి, బంగారముతోడను, స్ఫటికమణులతోడను నిర్మింపబడిన బహువిధములగు పాత్రలతోడను, సువర్ణనిర్మితములైన వేరువేరు రీతులగు కమండలములవంటి కలశములతోడను నిండి మిక్కిలి ప్రకాశించుచుండెను.

**శ్లో॥ రాజతేషు చ కుంభేషు జాంబూనదమయేషు చ ।**
**పానశ్రేష్ఠం తదా భూరి కపి స్తత్ర దదర్శ హ ॥ 23**

**పదచ్ఛేదము** :- రాజతేషు - చ - కుంభేషు - జాంబూనదమయేషు - చ - పానశ్రేష్ఠం - తదా - భూరి - కపిః - తత్ర - దదర్శ - హ ॥

**అన్వయక్రమము** :- రాజతేషు చ జాంబూనదమయేషు చ కుంభేషు భూరి పానశ్రేష్ఠం తదా తత్ర కపిః దదర్శ.

**ప్రతిపదార్థము** :- రాజతేషు చ = రజతమయము లైనట్టివియు, జాంబూనదమయేషు చ = సువర్ణనిర్మితములైనట్టివియునగు, కుంభేషు = గూనలయందు, భూరి = అపరిమితమైనట్టి, పానశ్రేష్ఠం = శ్రేష్ఠమైనట్టి మద్యమును, తదా = అప్పుడు, తత్ర = ఆ పానభూమియందు, కపిః = హనుమంతుడు, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- అప్పుడా హనుమంతుడా పానశాలయందు పెద్దవైన వెండి కడవలయందును, సువర్ణకుంభములందును మేలురకమైన మద్యములు అపరిమితముగ నుండుట గాంచెను.

**శ్లో॥ సోఽపశ్య చ్ఛాతకుంభాని శిలామణిమయాని చ ।**
**రాజతాని చ పూర్ణాని భాజనాని మహాకపిః ॥ 24**

**పదచ్ఛేదము** :- సః - అపశ్యత్ - శాతకుంభాని - శిలామణిమయాని - చ - రాజతాని - చ - పూర్ణాని - భాజనాని - మహాకపిః ॥

**అన్వయక్రమము** :- సః మహాకపిః, శాతకుంభాని, శిలామణిమయాని, రాజతాని చ, పూర్ణాని భాజనాని అపశ్యత్.

**ప్రతిపదార్థము** :- సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, శాతకుంభాని = స్వర్ణనిర్మితములును, శిలామణిమయాని చ = స్ఫటికరత్ననిర్మితములును, రాజతాని చ = రజతనిర్మితములును అగు, పూర్ణాని భాజనాని = నిండియున్నట్టి పాత్రలను, అపశ్యత్ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడచ్చుట స్వర్ణమయములు, స్ఫటిక రత్నమయములు, రజత నిర్మితములును అగు పెక్కు పాత్రలు మద్యములతో నిండియున్నవై యుండుటను గాంచెను.

**శ్లో॥ క్వచి దల్పావశేషాణి క్వచి త్పీతాని సర్వశః ।**
**క్వచి న్నైవ ప్రపీతాని పానాని స దదర్శ హ ॥ 25**

**పదచ్ఛేదము :–** క్వచిత్ – అల్పావశేషాణి – క్వచిత్ – పీతాని – సర్వశః – క్వచిత్ – న – ఏవ – ప్రపీతాని – పానాని – సః – దదర్శ – హ ॥

**అన్వయక్రమము :–** సః క్వచిత్ అల్పావశేషాణి, క్వచిత్ సర్వశః పీతాని, క్వచిత్ నైవ ప్రపీతాని, పానాని దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమంతుడు, క్వచిత్ = ఒకచోట, అల్పావశేషాణి = కొద్దిగా మిగిలియున్నట్టియు, క్వచిత్ = ఒకానొకచోట, సర్వశః పీతాని = సర్వవిధముల త్రాగబడినట్టివియును, క్వచిత్ = మరియొకచోట, నైవ ప్రపీతాని = ఎంతమాత్రము త్రాగబడనట్టివియును అగు, పానాని = పానపాత్రలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడచ్చుట కొంచెము మద్యము మిగిలియున్న పాత్రలను కొన్నిచోట్లను, పూర్తిగా త్రాగివేసిన మద్యము గల పాత్రలను కొన్నిచోట్లను, ఎంత మాత్రము త్రాగని పాత్రలను కొన్నిచోట్లను జూచెను.

**శ్లో॥ క్వచి ద్భక్ష్యాం శ్చ వివిధాన్ క్వచి త్పానాని భాగశః ।**
**క్వచి దర్ధావశేషాణి పశ్య న్వై విచచార హ ॥ 26**

**పదచ్ఛేదము :–** క్వచిత్ – భక్ష్యాన్ – చ – వివిధాన్ – క్వచిత్ – పానాని – భాగశః – క్వచిత్ – అర్ధావశేషాణి – పశ్యన్ – వై – విచచార – హ ॥

**అన్వయక్రమము :–** (సః తత్ర) క్వచిత్ వివిధాన్ భక్ష్యాన్ చ క్వచిత్ భాగశః పానాని, క్వచిత్ అర్ధావశేషాణి, పానాని పశ్యన్ విచచార.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమ, తత్ర = ఆ పానభూమియందు, క్వచిత్ = ఒకానొకచోట, వివిధాన్ భక్ష్యాన్ చ = బహువిధములైన పిండివంటలను, క్వచిత్ భాగశః పానాని = కొన్నిచోట్ల కొన్నివంతుల పానీయములను, క్వచిత్ అర్ధావశేషాణి = కొన్నిచోట్ల సగము మిగిలినట్టి పానీయములను, పశ్యన్ = చూచుచు, విచచార = పరిభ్రమించెను.

**తాత్పర్యము :-** ఒకచోట బహువిధములైన పిండివంటలను మరియొకచోట వంతులు వంతులుగానున్న పానీయములను, మరికొన్ని చోట్ల సగము మాత్రమే త్రాగిన పానీయములను చూచుచు హనుమ అచ్చట తిరుగాడుచుండెను.

**శ్లో॥ క్వచి త్ప్రభిన్నైః కరకైః క్వచి దాలోళితైర్ఘటైః ।**
**క్వచిత్ సంపృక్తమాల్యాని జలాని చ ఫలాని చ ॥ 27**

**శ్లో॥ శయనా న్యత్ర నారీణాం శుభ్రాణి బహుధా పునః ॥ 28**

**పదచ్ఛేదము :-** క్వచిత్ – ప్రభిన్నైః – కరకైః – క్వచిత్ – ఆలోళితైః – ఘటైః – క్వచిత్ – సంపృక్తమాల్యాని – జలాని – చ – ఫలాని – చ – శయనాని – అత్ర – నారీణాం – శుభ్రాణి – బహుధా – పునః ॥

**అన్వయక్రమము :-** క్వచిత్ ప్రభిన్నైః కరకైః క్వచిత్ ఆలోళితైః ఘటైః క్వచిత్ సంపృక్తమాల్యాని, జలాని చ, ఫలాని చ పశ్యన్, అత్ర, పునః, నారీణాం, శుభ్రాణి శయనాని చ, బహుధా (పశ్యన్ విచచార).

**ప్రతిపదార్థము :-** క్వచిత్ = ఒకానొకచోట, ప్రభిన్నైః కరకైః = బ్రద్దలైన కలశముల చేతను, క్వచిత్ = ఒకానొకచోట, ఆలోళితైః ఘటైః = దొర్లిపోయిన కడవలచేతను, క్వచిత్ = ఒకచోట, సంపృక్తమాల్యాని = నీటితో తడిసిన పుష్పమాలికలను, జలాని చ = జలములను, ఫలాని చ = పండ్లను, (పశ్యన్ = చూచుచు), అత్ర = ఆ పానభూమి యందు, పునః = తిరిగి, నారీణాం = స్త్రీలయొక్క, శుభ్రాణి శయనాని = స్వచ్ఛముగా నున్న శయ్యలను, (సః = ఆ హనుమ) బహుధా = పెక్కు మారులు (పశ్యన్ విచచార = చూచుచు తిరుగు చుండెను).

**తాత్పర్యము :-** హనుమంతుడచ్చట కొన్నిచోట్ల బ్రద్దలైన కలశములనుండియు, కొన్నిచోట్ల బోరగిలపడిన కడవలనుండియు స్రవించుచున్న నీళ్ళను, ఆ నీటితో తడిసిన పూలమాలికలను, పండ్లను మఱియు ఇంకొకచోట స్వచ్ఛముగా వెలయుచున్న నారీమణుల శయ్యలను పలుమారులు విలోకించుచు తిరుగాడు చుండెను.

**శ్లో॥ పరస్పరం సమాశ్లిష్య కాశ్చి త్సుప్తా వరాంగనాః ।**
**కాశ్చి చ వస్త్ర మన్యస్యా స్స్వపంత్యాః పరిధాయ చ ।**
**ఆహృత్య చాఽబలా స్సుప్తా నిద్రాబలపరాజితాః ॥ 29**

**పదచ్ఛేదము :-** పరస్పరం – సమాశ్లిష్య – కాః – చిత్ – సుప్తాః – వరాంగనాః – కాః – చిత్ – చ – వస్త్రమ్ – అన్యస్యాః – స్వపంత్యాః – పరిధాయ చ – ఆహృత్య

– చ – అబలాః – సుప్తాః – నిద్రాబలపరాజితాః ॥

**అన్వయక్రమము :–** కాశ్చిత్ వరాంగనాః పరస్పరం సమాశ్లిష్య సుప్తాః; కాశ్చిత్ అబలాః స్వపంత్యాః అన్యస్యాః వస్త్రమ్ ఆహృత్య, పరిధాయ చ నిద్రాబలపరాజితాః, సుప్తాః.

**ప్రతిపదార్థము :–** కాశ్చిత్ వరాంగనాః = కొద్దిమంది ఉత్తమస్త్రీలు, పరస్పరం సమాశ్లిష్య = ఒండొరులను కౌగిలించుకొని, సుప్తాః = నిద్రించియుండిరి. కాశ్చిత్ అబలాః చ = మఱికొంతమంది అంగనలు, స్వపంత్యాః అన్యస్యాః = నిద్రించుచున్న వేఱొకతెయొక్క, వస్త్రమ్ = చీరను, ఆహృత్య = లాగికొని, పరిధాయ చ = కట్టుకొనియును, నిద్రాబలపరాజితాః = నిద్రాప్రాబల్యమునకు లోబడినవారై, సుప్తాః = నిద్రించియుండిరి.

**తాత్పర్యము :–** అచట కొందరు సుందరీమణు లొండొరులను కౌగిలించుకొని పరుండి యుండిరి. మరికొందరంగనలు తమ ప్రక్కనే నిద్రపోవుచున్న తరుణుల చీరలను లాగివైచి తాము కట్టుకొని నిద్దుర మైకములో మునిగియుండిరి.

**శ్లో॥ తాసా ముచ్ఛ్వాసవాతేన వస్త్రం మాల్యం చ గాత్రజమ్ ।**
**నాత్యర్థం స్పందతే చిత్రం ప్రాప్య మంద మి వానిలమ్ ॥ 30**

**పదచ్ఛేదము :–** తాసాం – ఉచ్ఛ్వాసవాతేన – వస్త్రం – మాల్యం – చ – గాత్రజమ్ – న – అత్యర్థం – స్పందతే – చిత్రం – ప్రాప్య – మందమ్ – ఇవ – అనిలమ్ ॥

**అన్వయక్రమము :–** తాసామ్ ఉచ్ఛ్వాసవాతేన గాత్రజం వస్త్రం మాల్యం చ మందమ్ అనిలం ప్రాప్య ఇవ న అత్యర్థం స్పందతే.

**ప్రతిపదార్థము :–** తాసాం = ఆ స్త్రీలయొక్క, ఉచ్ఛ్వాసవాతేన = ఉచ్ఛ్వాసవాయువుల చేత, గాత్రజం = వారి శరీరమునందలి, వస్త్రం = పైటచెరుగు, మాల్యం చ = పూల మాలికయును, మందమ్ అనిలం = మందమైన వాయువును, ప్రాప్య ఇవ = పొందుటచేతవలె, చిత్రం = చిత్రముగా, నాత్యర్థం స్పందతే = కొద్దిగా చలించుచున్నది.

**తాత్పర్యము :–** అచ్చటి నారీమణులయొక్క ఉచ్ఛ్వాసవాయువుచే వారి ఱొమ్ములపైనున్న పైటచెరగులుగాని, పూలమాలికలుగాని మందమైన వాయువుచేతవలె కొంచెముగానే చలించెను.

**శ్లో॥ చందనస్య చ శీతస్య శీధో ర్మధురసస్య చ ।**
**వివిధస్య చ మాల్యస్య ధూపస్య వివిధస్య చ ॥**

**శ్లో॥ బహుధా మారుత స్తత్ర గంధం వివిధ ముద్వహన్ ॥ 31**

**పదచ్ఛేదము :–** చందనస్య – చ – శీతస్య – శీధోః – మధురసస్య – చ – వివిధస్య

– చ – మాల్యస్య – ధూపస్య – వివిధస్య – చ – బహుధా – మారుతః – తత్ర – గంధం – వివిధమ్ – ఉద్వహన్ ॥

**అన్వయక్రమము** :– శీతస్య చందనస్య చ, మధురసస్య శీధోశ్చ వివిధస్య మాల్యస్య చ, వివిధస్య ధూపస్య చ, వివిధం గంధం ఉద్వహన్ తత్ర మారుతః బహుధా ప్రవవౌ.

**ప్రతిపదార్థము** :– శీతస్య చందనస్య చ = చల్లని చందనముయొక్కయు, మధురసస్య శీధోశ్చ = తియ్యని మద్యముయొక్కయు, వివిధస్య మాల్యస్య చ = పలువిధములైనపూల మాలికలయొక్కయు, వివిధస్య ధూపస్య చ = బహువిధములైన ధూపముయొక్కయు, వివిధం గంధం = బహువిధమగు పరిమళమును, ఉద్వహన్ = వహించుచు, బహుధా = బహుముఖముల, మారుతః = వాయువు, (ప్రవవౌ = వీచుచుండెను).

**తాత్పర్యము** :– అచ్చట చల్లని చందనము, తియ్యని మద్యము బహువిధములైన పుష్పమాలికలు, పలువిధములగు ధూపద్రవ్యములు పుష్కలముగా నుండగా వాయువు ఆయా పరిమళములను అన్నింటిని వహించుచు బహుముఖముగా మనోహరముగా వీచుచుండెను.

**శ్లో॥ రసానాం చందనానాం చ ధూపానాం చైవ మూర్ఛితః ।**
**ప్రవవౌ సురభి ర్గంధో విమానే పుష్పకే తదా ॥ 32**

**పదచ్ఛేదము** :– రసానాం – చందనానాం – చ – ధూపానాం – చ – ఏవ – మూర్ఛితః – ప్రవవౌ – సురభిః – గంధః – విమానే – పుష్పకే – తదా ॥

**అన్వయక్రమము** :– తదా రసానాం, చందనానాం చ, ధూపానాం చ ఏవ, మూర్ఛితః, సురభిః గంధః, పుష్పకే విమానే ప్రవవౌ.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, రసానాం = మద్యములయొక్కయు, చందనానాం చ = మంచిగంధముల యొక్కయు, ధూపానాం చైవ = ధూపద్రవ్యముల యొక్కయు, మూర్ఛితః = విస్తరించియున్నట్టి, సురభిః గంధః = మనోహరమైన పరిమళము, పుష్పకే విమానే = పుష్పక విమానమునందు, ప్రవవౌ = అధికముగ వీచుచుండెను.

**తాత్పర్యము** :– అప్పుడచ్చటి ఆయా మద్యముల యొక్కయు, మంచి గంధముల యొక్కయు, ధూపద్రవ్యముల యొక్కయు మధురమైన పరిమళము విస్తరించినదై పుష్పక విమానమంతయును వ్యాపించుచు వీచెను.

**శ్లో॥ శ్యామావదాతా స్తత్రాన్యాః కాశ్చి త్కృష్ణా వరాంగనాః ।**
**కాశ్చి త్కాంచనవర్ణాంగ్యః ప్రమదా రాక్షసాలయే ॥ 33**

**పదచ్ఛేదము** :– శ్యామావదాతాః – తత్ర – అన్యాః – కాశ్చిత్ – కృష్ణాః – వరాంగనాః కాశ్చిత్ – కాంచనవర్ణాంగ్యః – ప్రమదాః – రాక్షసాలయే ॥

**అన్వయక్రమము** :– రాక్షసాలయే తత్ర అన్యాః శ్యామావదాతాః కాశ్చిత్ వరాంగనాః కృష్ణాః కాశ్చిత్ ప్రమదాః కాంచనవర్ణాంగ్యః (ఆసన్)

**ప్రతిపదార్థము** :– తత్ర రాక్షసాలయే = ఆ రావణభవనమునందు, అన్యాః = కొందరు, శ్యామావదాతాః = నలుపును తెలుపును కలిపిన రంగురంగులవారుగాను (అనగా చామనచాయ), కాశ్చిత్ వరాంగనాః = కొందరు నారీమణులు, కృష్ణాః = నల్లని వర్ణము వారుగాను, కాశ్చిత్ ప్రమదాః = మరికొందరు వనితలు, కాంచనవర్ణాంగ్యః = బంగరువన్నెగల దేహము గలవారుగాను, (ఆసన్ = ఉండిరి).

**తాత్పర్యము** :– ఆ రావణాసురుని అంతఃపురమునందు కొందరు తరుణీమణులు చామనచాయగల వారుగను, మరికొందరు నల్లనివారుగను, మరికొంతమంది బంగారము వంటి దేహచ్ఛాయ గలవారుగను కానవచ్చిరి.

**శ్లో॥ తాసాం నిద్రావశత్వా చ్చ మదనేన విమూర్ఛితమ్ ।**
**పద్మినీనాం ప్రసుప్తానాం రూప మాసీ ద్యథైవ హి ॥ 34**

**పదచ్ఛేదము** :– తాసాం – నిద్రావశత్వాత్ – చ – మదనేన – విమూర్ఛితమ్ – పద్మినీనాం – ప్రసుప్తానాం – రూపమ్ – ఆసీత్ – యథా – ఏవ – హి ॥

**అన్వయక్రమము** :– నిద్రావశత్వాత్ చ మదనేన విమూర్ఛితం తాసాం రూపం, ప్రసుప్తానాం పద్మినీనాం రూపం యథైవ, ఆసీత్.

**ప్రతిపదార్థము** :– నిద్రావశత్వాత్ చ = నిద్రావశమై యుండుటవలననున్ను, మదనేన విమూర్ఛితం = మన్మథుని క్రీడచే బడలిక చెందియున్న, తాసాం రూపం = ఆ స్త్రీల యొక్క రూపము, ప్రసుప్తానాం పద్మినీనాం = ముకుళించియున్న తామర తీగల యొక్క, రూపం యథైవ = ఆకారమువలెనే, ఆసీత్ = ఉండెను.

**తాత్పర్యము** :– నిద్రావశమై యుండుటచేతను, మన్మథక్రీడలచే డస్సి యుండుట చేతను, ఆ స్త్రీలయొక్క రూపము ముకుళించియున్న తామరతీగ ఆకారమువలె సుందరముగనే యుండెను.

**శ్లో॥ ఏవం సర్వ మశేషేణ రావణాంతఃపురం కపిః ।**
**దదర్శ సుమహాతేజా న దదర్శ చ జానకీమ్ ॥ 35**

**పదచ్ఛేదము** :– ఏవం – సర్వమ్ – అశేషేణ – రావణాంతఃపురం – కపిః – దదర్శ – సుమహాతేజాః – న – దదర్శ – చ – జానకీమ్ ॥

**అన్వయక్రమము** :– సుమహాతేజాః కపిః ఏవం సర్వం రావణాంతఃపురమ్ అశేషేణ దదర్శ, జానకీం చ న దదర్శ.

**ప్రతిపదార్థము** :– సుమహాతేజాః కపిః = మహాపరాక్రమశాలియైన హనుమ, ఏవం = ఈరీతిగా, రావణాంతఃపురం, సర్వం = రావణుని అంతఃపుర మంతయు, అశేషేణ దదర్శ = నిశ్శేషముగా తిలకించెను, జానకీం చ = జానకిని మాత్రము, న దదర్శ = చూడలేక పోయెను.

**తాత్పర్యము** :– మహనీయుడైన హనుమ ఈవిధముగా రావణుని అంతఃపురమంతయు నిశ్శేషముగా వెదకెను. కాని సీతమ్మను మాత్రము కనుగొనజాలడాయెను.

**శ్లో॥ నిరీక్షమాణ శ్చ తదా తా స్స్రియ స్స మహాకపిః ।**
**జగామ మహతీం చింతాం ధర్మసాధ్వసశంకితః ॥ 36**

**పదచ్ఛేదము** :– నిరీక్షమాణః – చ – తదా – తాః – స్త్రియః – సః – మహాకపిః – జగామ – మహతీం – చింతాం – ధర్మసాధ్వసశంకితః ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః తదా తాః స్త్రియః నిరీక్షమాణః చ ధర్మసాధ్వస శంకితః (సన్) మహతీం చింతాం జగామ.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, తదా = అప్పుడు, తాః స్త్రియః = ఆ స్త్రీలను, నిరీక్షమాణః చ = పరికించి చూచుచున్నవాడై, ధర్మసాధ్వస శంకితః సన్ = ధర్మ (లోప)మును గూర్చిన భయముచే శంకనొందినవాడై, మహతీం చింతాం = గొప్పచింతను, జగామ = పొందెను.

**తాత్పర్యము** :– అప్పు డా హనుమ రావణాంతఃపురమునందున్న స్త్రీలను పరికించి చూచుచున్నవాడై పరస్త్రీదర్శనము తనకు అధర్మము అగునని భయముగలిగి దిగులు నొందినవా డాయెను.

**శ్లో॥ పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్ ।**
**ఇదం ఖలు మమాఽత్యర్థం ధర్మలోపం కరిష్యతి ॥ 37**

**పదచ్ఛేదము** :– పరదారావరోధస్య – ప్రసుప్తస్య – నిరీక్షణమ్ – ఇదం – ఖలు – మమ – అత్యర్థం – ధర్మలోపం – కరిష్యతి ॥

**అన్వయక్రమము :–** ఇదం, ప్రసుప్తస్య పరదారావరోధస్య నిరీక్షణం, మమ, అత్యర్థం, ధర్మలోపం, కరిష్యతి, ఖలు.

**ప్రతిపదార్థము :–** ఇదం = ఈ, ప్రసుప్తస్య పరదారావరోధస్య = నిద్రించుచున్న పరభార్యల సమూహముయొక్క, నిరీక్షణం = పరికించిచూచుట, మమ = నాకు, అత్యర్థం = మిక్కిలిగా, ధర్మలోపం కరిష్యతి ఖలు = ధర్మలోపమును గావించునుగదా! (ఇతి తస్య చింతా అభూత్ = అని హనుమకు చింత పొడమెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "నేక్షేత నగ్నాం పరస్త్రియమ్" అనెడి శాస్త్రవచనముచేత హనుమ ధర్మలోపము జరిగెనని శంకించెను.

**మహేశ్వరతీర్థులు :–** "నేక్షేతార్కం న నగ్నాం స్త్రియమ్" అనగా సూర్యుని, దిగంబరస్త్రీని చూడరాదు.

**తాత్పర్యము :–** నేనిచ్చట ఈ అంతఃపురమునందు నిద్రించుచున్న పరస్త్రీలను పరికించి చూచుట నాకెంతయు ధర్మలోపమును గూర్చునుగదా! (అని హనుమకు చింత పొడమెను)

**శ్లో॥ న హి మే పరదారాణాం దృష్టి ర్విషయవర్తినీ ।**
**అయం చాఽత్ర మయా దృష్టః పరదారపరిగ్రహః ॥ 38**

**పదచ్ఛేదము :–** న – హి – మే – పరదారాణాం – దృష్టిః – విషయవర్తినీ – అయం – చ – అత్ర – మయా – దృష్టః – పరదారపరిగ్రహః ॥

**అన్వయక్రమము :–** పరదారాణాం మే దృష్టిః విషయవర్తినీ న (భవతి). అత్ర అయం పరదారపరిగ్రహశ్చ మయా దృష్టః.

**ప్రతిపదార్థము :–** పరదారాణాం = పరస్త్రీలయెడ, మే దృష్టిః = నా చూపు, విషయవర్తినీ న భవతి = ఆసక్తిగలదిగా నుండలేదు. అయం పరదారపరిగ్రహః = పరదారలను చేపట్టినట్టి, ఈ రావణాసురుడు, మయా దృష్టః = నాచేత చూడబడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** నేటివరకును పరదారలపై నాకు చూపు కలుగలేదు. కనుక ఈ దృష్టిలో నాకు ఎట్టి ఆసక్తియులేదు గాని పరస్త్రీరతుడైన మహాపాపి యగు రావణుడు నాకంట బడినాడు. ఇదియే నాకు ధర్మలోపము కలిగించునని భయపడుచున్నాను.

**తాత్పర్యము :–** నా దృష్టి ఎన్నడును పరదారలను చూచుటకై ఆసక్తిగల్గియుండలేదు. కాని ఇప్పటి నా చింత ఏమనగా పరవనితాసక్తుడైన పాపాత్ముడగు ఈ రావణుని చూచుట నాకు ధర్మలోపమును గూర్చునను భయము కలుగుచున్నది.

**శ్లో॥ తస్య ప్రాదురభూ చ్చింతా పుర రన్యా మనస్వినః ।**
**నిశ్చితైకాంతచిత్తస్య కార్యనిశ్చయదర్శినః ॥ 39**

**పదచ్ఛేదము :–** తస్య – ప్రాదురభూత్ – చింతా – పునః – అన్యా – మనస్వినః – నిశ్చితైకాంతచిత్తస్య – కార్యనిశ్చయదర్శినః ॥

**అన్వయక్రమము :–** నిశ్చితైకాంతచిత్తస్య, కార్యనిశ్చయదర్శినః మనస్వినః తస్య పునః అన్యా చింతా ప్రాదురభూత్.

**ప్రతిపదార్థము :–** నిశ్చితైకాంతచిత్తస్య = నిశ్చయించుకొన్న ధృడసంకల్పము కల్గినట్టియు, కార్యనిశ్చయదర్శినః = భావికార్యమును గూర్చి నిర్ణయము చేసుకొన్నట్టియు, మనస్వినః = పౌరుషవంతుడైనట్టియు, తస్య = ఆ హనుమకు, పునః = తిరిగి, అన్యా చింతా = వేరొక చింత, ప్రాదురభూత్ = ఉద్భవించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** కార్యనిశ్చయదర్శినీ = కర్తవ్యాకర్తవ్యనిర్ణయసమర్థమైనట్టిదని భావము.

**రామాయణ శిరోమణి :–** (అన్యా చింతా) సీతాన్వేషణ మార్గమును తెలుపగలిగినట్టిది.

**తాత్పర్యము :–** ఏకాగ్రమైన చిత్తముగలవాడును, భావికార్యనిశ్చయము చేసికొన్నవాడును, గొప్ప వివేకవంతుడు నగు హనుమకు ఈ విధముగ కొత్త ఆలోచన గూడ గలిగెను.

**శ్లో॥ కామం దృష్టా మయా సర్వా విశ్వస్తా రావణస్త్రియః ।**
**న హి మే మనసః కించి ద్వైకృత్య ముపపద్యతే ॥ 40**

**పదచ్ఛేదము :–** కామం – దృష్టాః – మయా – సర్వాః – విశ్వస్తాః – రావణస్త్రియః – న – హి – మే – మనసః – కించిత్ – వైకృత్యమ్ – ఉపపద్యతే ॥

**అన్వయక్రమము :–** మయా సర్వాః విశ్వస్తాః రావణస్త్రియః కామం దృష్టాః; మే మనసః కించిదపి వైకృత్యం నహి ఉపపద్యతే.

**ప్రతిపదార్థము :–** మయా = నాచేత, విశ్వస్తాః = నమ్మి పరుండియున్న, సర్వాః రావణస్త్రియః = రావణకాంతలెల్లరును, కామం దృష్టాః = స్వేచ్ఛగా చూడబడిరి. మే

మనసః = నా మనస్సునకు, కించిదపి వైకృత్యం = కొంచెముగూడ వికారము, నహి ఉపపద్యతే = సంభవింపనేలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** విశ్వస్తాః = పరులు తమ్ము చూతురను భయము లేకుండగా నమ్మకముతో పరుండియున్నవారు.

**తాత్పర్యము :–** పరులు తమ్ముచూతురను భయము లేనందున యథేచ్ఛగా పరుండియున్న రావణాసురుని కాంతలనందరిని నేను స్వేచ్ఛగా చూచితిని. ఐనను నా మనస్సునకు ఎట్టి వికారమును సంభవింపలేదు.

**శ్లో॥ మనో హి హేతు స్సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే ।**
**శుభాశుభా స్వవస్థాసు త చ్చ మే సువ్యవస్థితమ్ ॥ 41**

**పదచ్ఛేదము :–** మనః – హి – హేతుః – సర్వేషామ్ – ఇంద్రియాణాం – ప్రవర్తనే – శుభాశుభాసు – అవస్థాసు – తత్ – చ – మే – సువ్యవస్థితమ్ ॥

**అన్వయక్రమము :–** సర్వేషామ్ ఇంద్రియాణాం ప్రవర్తనే, శుభాశుభాసు అవస్థాసు మనః హి హేతుః; మే తత్ చ సువ్యవస్థితమ్.

**ప్రతిపదార్థము :–** శుభాశుభాసు అవస్థాసు = మంచిపరిస్థితులందైనను, చెడ్డ పరిస్థితులందైనను, సర్వేషామ్ ఇంద్రియాణాం ప్రవర్తనే = సర్వములైన ఇంద్రియముల యొక్క నడిపించుటయందు, మనః హి హేతుః = మనస్సే కదా మూలము; తత్ చ = ఆ మనస్సుగూడ, మే = నాకు, సువ్యవస్థితమ్ = చక్కని కట్టుబాటులో నున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సువ్యవస్థితమ్ = పరదారలయందు రక్తిలేనిదై శుద్ధముగ నున్నది.

**రామాయణ శిరోమణి :–** శుభాశుభాసు = ధర్మకరమైనట్టియు అధర్మకరమైనట్టియు పరిస్థితులయందు.

**గోవిందరాజీయము :–** శుభాశుభాసు = శుభాచరణ పాపాచరణ విషయములయందు.

**తాత్పర్యము :–** ధర్మకార్యములందును, అధర్మకార్యములందును ఎల్ల ఇంద్రియములను ప్రవర్తింప చేయుటలో మూలమైనట్టిది మనస్సే కదా! ఆ మనస్సు నాకు పాపచింతా రహితమై పరిశుద్ధముగనే యున్నది.

**శ్లో॥ నాన్యత్ర హి మయా శక్యా వైదేహీ పరిమార్గితుమ్ ।**
**స్త్రియో హి స్త్రీషు దృశ్యంతే సదా సంపరిమార్గణే ॥ 42**

**పదచ్ఛేదము :–** న – అన్యత్ర – హి – మయా – శక్యా – వైదేహీ – పరిమార్గితుమ్ – స్త్రియః – హి – స్త్రీషు – దృశ్యంతే – సదా – సంపరిమార్గణే ॥

**అన్వయక్రమము :–** వైదేహీ పరిమార్గితుమ్, అన్యత్ర మయా న హి శక్యా; సంపరిమార్గణే స్త్రియః స్త్రీషు హి దృశ్యంతే.

**ప్రతిపదార్థము :–** వైదేహీ = సీతమ్మ, మయా = నాచేత, అన్యత్ర పరిమార్గితుం = వేరుచోట వెదకుటకు, న హి శక్యా = శక్యము గాదుకదా! సంపరిమార్గణే = వెదకుట యందు, స్త్రియః = స్త్రీలు, సదా = ఎల్లప్పుడును, స్త్రీషు హి దృశ్యంతే = స్త్రీలయందే కాన్పింతురుగదా.

**తాత్పర్యము :–** నేను ప్రభువుయొక్క ఆజ్ఞచే సీతాదేవిని వెదుకవలసియున్నప్పుడు వేరుచోట్ల ఆమెను వెదుకుట ఎట్లు సాధ్యమగును? స్త్రీలను వెదకవలసివచ్చినప్పుడు స్త్రీలయందే ఆమె యుండునని చూడవలయును గదా!

**శ్లో॥ యస్య సత్త్వస్య యా యోని స్తస్యాం తత్ పరిమార్గ్యతే ।**
**న శక్యా ప్రమదా నష్టా మృగీషు పరిమార్గితుమ్ ॥ 43**

**పదచ్ఛేదము :–** యస్య – సత్త్వస్య – యా – యోనిః – తస్యాం – తత్ – పరిమార్గ్యతే – న – శక్యా – ప్రమదా – నష్టా – మృగీషు – పరిమార్గితుమ్ ॥

**అన్వయక్రమము :–** యస్య సత్త్వస్య యా యోనిః తత్ తస్యాం పరిమార్గ్యతే; నష్టా ప్రమదా మృగీషు పరిమార్గితుం న శక్యా.

**ప్రతిపదార్థము :–** యస్య సత్త్వస్య = ఏ ప్రాణికి, యా యోనిః = ఏది జన్మమైన జాతియో, తత్ = ఆ ప్రాణి, తస్యాం = ఆ జాతియందే, పరిమార్గ్యతే = వెదుక బడుచుండును, నష్టా ప్రమదా = హరింపబడిన మనుష్యస్త్రీ, మృగీషు పరిమార్గితుం = లేడిమందలయందు వెదకుటకు, న శక్యా = సాధ్యముగాదు.

**తాత్పర్యము :–** ఏ ప్రాణి ఏజాతియందు జన్మించియున్నదో ఆ ప్రాణిని ఆ జాతియందే వెదకి పట్టుకొనవలెను. హరింపబడిన మనుషస్త్రీని ఆడులేళ్ళ మందలో వెదకి పట్టుకొనలేము గదా!

**శ్లో॥ త దిదం మార్గితం తావ చ్ఛుద్ధేన మనసా మయా ।**
**రావణాంతఃపురం సర్వం దృశ్యతే న చ జానకీ ॥ 44**

**పదచ్ఛేదము** :– తత్ – ఇదం – మార్గితం – తావత్ – శుద్ధేన – మనసా – మయా – రావణాంతఃపురం – సర్వం – దృశ్యతే – న – చ – జానకీ ॥

**అన్వయక్రమము** :– తత్ ఇదం సర్వం రావణాంతఃపురం మయా శుద్ధేన మనసా మార్గితం తావత్; జానకీ న చ దృశ్యతే.

**ప్రతిపదార్థము** :– తత్ = అందుచేత, ఇదం రావణాంతఃపురం సర్వం = ఈ రావణాంతఃపురమంతయును, మయా = నాచేత, శుద్ధేన మనసా = పరిశుద్ధమైన మనస్సుతో, మార్గితం తావత్ = పూర్తిగా అన్వేషింపబడినది, జానకీ న చ దృశ్యతే = సీతమ్మ ఏమాత్రము కానరాకున్నది.

**తాత్పర్యము** :– అందుచేతనే నేను ఈ రావణాంతఃపురమునంతను నిష్కల్మషమైన మనస్సుతో చక్కగా వెదకియుంటిని. కాని నాకు జానకమ్మ మాత్ర మెచ్చటను కానరాకున్నది.

**శ్లో॥ దేవగంధర్వకన్యాశ్చ నాగకన్యా శ్చ వీర్యవాన్ ।**
**అవేక్షమాణో హనుమాన్ నై వాపశ్యత జానకీమ్ ॥ 45**

**పదచ్ఛేదము** :– దేవగంధర్వకన్యాః – చ – నాగకన్యాః – చ – వీర్యవాన్ – అవేక్షమాణః – హనుమాన్ – న – ఏవ – అపశ్యత – జానకీమ్ ॥

**అన్వయక్రమము** :– వీర్యవాన్ హనుమాన్, దేవగంధర్వకన్యాః చ, నాగకన్యాః చ, అవేక్షమాణః, జానకీం నైవ అపశ్యత.

**ప్రతిపదార్థము** :– వీర్యవాన్ హనుమాన్ = పరాక్రమశాలియైన హనుమంతుడు, దేవగంధర్వకన్యాః చ = దేవకన్యలను గంధర్వకన్యలను, నాగకన్యాః చ = నాగకన్య లనున్ను, అవేక్షమాణః = చూచుచున్నవాడై, జానకీం నైవ అపశ్యత = సీతమ్మను కనుగొనలేకపోయెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు దేవకన్యలను, గంధర్వయువతులను, నాగతరుణులను వరుసగా చూచుచున్నవాడై ఎచ్చటను జానకమ్మను చూడలేకపోయెను.

**శ్లో॥ తా మపశ్యన్ కపి స్తత్ర పశ్యం శ్చాన్యా వరస్త్రియః ।**
**అపక్రమ్య తదా వీరః ప్రధ్యాతు ముపచక్రమే ॥ 46**

**పదచ్ఛేదము** :- తామ్ - అపశ్యన్ - కపిః - తత్ర - పశ్యన్ - చ - అన్యాః - వరస్త్రియః - అపక్రమ్య - తదా - వీరః - ప్రధ్యాతుమ్ - ఉపచక్రమే ॥

**అన్వయక్రమము** :- వీరః కపిః, తత్ర తామ్ అపశ్యన్, అన్యాః వరస్త్రియః పశ్యన్, తదా ప్రధ్యాతుమ్ ఉపచక్రమే.

**ప్రతిపదార్థము** :- వీరః కపిః = వీరుడైన హనుమ, తత్ర = ఆ ప్రదేశమునందు, తామ్ అపశ్యన్ = ఆ సీతామాతను చూడజాలక, అన్యాః వరస్త్రియః = వేరు ఉత్తమవనితలను, పశ్యన్ చ = చూచుచును, అపక్రమ్య = తొలగి, ప్రధ్యాతుమ్ ఉపచక్రమే = తీవ్రముగ నాలోచింప నారంభించెను.

**తాత్పర్యము** :- మహావీరుడైన హనుమంతుడు సీతామాత నచ్చట కనుగొనజాలక, అచ్చటి ఉత్తమస్త్రీల నందరును జూచుచు దాటివచ్చి ఒకచోట కూర్చుండి తీవ్రముగా నాలోచింపసాగెను.

**శ్లో॥ స భూయ స్తు పరం శ్రీమాన్ మారుతి ర్యత్న మాస్థితః ।**
**ఆపానభూమి ముత్సృజ్య త ద్విచేతుం ప్రచక్రమే ॥ 47**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"పానభూమివిచయో" నామ*
*ఏకాదశస్సర్గః*

**పదచ్ఛేదము** :- సః - భూయః - తు - పరం - శ్రీమాన్ - మారుతిః - యత్నమ్ - ఆస్థితః - ఆపానభూమిమ్ - ఉత్సృజ్య - తత్ - విచేతుం - ప్రచక్రమే ॥

**అన్వయక్రమము** :- శ్రీమాన్ సః మారుతిః భూయః పరం యత్నమ్ ఆస్థితః, ఆపానభూమిమ్ ఉత్సృజ్య తత్ విచేతుం ప్రచక్రమే.

**ప్రతిపదార్థము** :- శ్రీమాన్ = శుభలక్షణసమన్వితుడైన, సః మారుతిః = ఆ హనుమంతుడు, భూయః = తిరిగి, పరం యత్నమ్ ఆస్థితః = తీవ్రమైన యత్నమును పూనినవాడై, ఆపానభూమిమ్ ఉత్సృజ్య = పానశాలను వీడి, తత్ = ఆ పుష్పక విమానమును, విచేతుం = వెదకుటకు, ప్రచక్రమే = ఆరంభించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'తత్'కి బదులుగా 'తామ్' అని బొంబాయి ముద్రణము.

ఈ పాఠమును అనుసరించి సీతమ్మను వెదకుటకై ప్రారంభించెనని అర్థము.

**తాత్పర్యము** :- మహాత్ముడైన హనుమ తిరిగి తీవ్రమైన అన్వేషణసంకల్పమును పూనినవాడై ఆ పానశాలను వీడి పుష్పకవిమానమున సీతనన్వేషింపసాగెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"పానభూమి విచయము" అను*
*పదునొకండవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ద్వాదశసర్గ

**శ్లో॥ స తస్య మధ్యే భవనస్య మారుతి**
**ర్లతాగృహాం శ్చిత్రగృహా న్నిశాగృహాన్ ।**
**జగామ సీతాం ప్రతి దర్శనోత్సుకో**
**న చైవ తాం పశ్యతి చారుదర్శనామ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** సః – తస్య – మధ్యే – భవనస్య – మారుతిః – లతాగృహాన్ – చిత్రగృహాన్ – నిశాగృహాన్ – జగామ – సీతాం – ప్రతి – దర్శనోత్సుకః – న – చ – ఏవ – తాం – పశ్యతి – చారుదర్శనామ్ ॥

**అన్వయక్రమము :–** సః మారుతిః సీతాం ప్రతి దర్శనోత్సుకః తస్య భవనస్య మధ్యే లతాగృహాన్, చిత్రగృహాన్ నిశాగృహాన్ జగామ.

**ప్రతిపదార్థము :–** సః మారుతిః = ఆ హనుమంతుడు, సీతాం ప్రతి దర్శనోత్సుకః = సీతమ్మను దర్శించునట్టి కుతూహలము గలవాడై, తస్య భవనస్య మధ్యే = ఆ రావణుని భవనమునడుమ, లతాగృహాన్ = లతాగృహములను, చిత్రగృహాన్ = చిత్రమందిరములను, నిశాగృహాన్ = రాత్రులందు వసింపదగిన భవనములను, జగామ = చేరుచుండెను. న చైవ చారుదర్శనాం, పశ్యతి = కాని సుందరముగా కనపడునట్టి సీతమ్మను మాత్రము చూడలేకుండెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు రావణుని భవనమునకు మధ్యనున్న లతామందిర ములను, చిత్రశాలలను, నిశాభవనములను, సీతమ్మను దర్శింపగోరినవాడై పట్టుదలతో తిరుగుచుండెను గాని ఆ సుందరాంగియగు సీతమ్మను మాత్రము కనుగొనలేకుండెను.

**శ్లో॥ స చింతయామాస తతో మహాకపిః**
**ప్రియా మపశ్య న్రఘునందనస్య తామ్ ।**
**ధ్రువం హి సీతా మ్రియతే యథా న మే**
**విచిన్వతో దర్శన మేతి మైథిలీ ॥ 2**

**పదచ్ఛేదము** :– సః – చింతయామాస – తతః – మహాకపిః – ప్రియామ్ – అపశ్యన్ – రఘునందనస్య – తామ్ – ధ్రువం – హి – సీతా – మ్రియతే – యథా – న – మే – విచిన్వతః – దర్శనమ్ – ఏతి – మైథిలీ ॥

**అన్వయక్రమము** :– తతః రఘునందనస్య ప్రియాం తామ్ అపశ్యన్ సః మహాకపిః చింతయామాస. యథా మైథిలీ విచిన్వతః మే దర్శనం న ఏతి ధ్రువం సీతా మ్రియతే హి.

**ప్రతిపదార్థము** :– తతః = అంతట, రఘునందనస్య ప్రియాం తాం = శ్రీరాముని ప్రియురాలైన ఆ సీతాదేవిని, అపశ్యన్ = చూడనివాడై, సః మహాకపిః = ఆ హనుమంతుడు, చింతయామాస = చింతింపదొడగెను, యథా = ఏ కారణమున, మైథిలీ = సీతమ్మ, విచిన్వతః మే = వెదకుచున్నట్టి నాకు, దర్శనం నైతి = గోచరించుటలేదో, తథా = ఆ కారణమున, ధ్రువం = నిశ్చయముగా, సీతా మ్రియతే హి = సీత చనిపోయియే యున్నది.

**తాత్పర్యము** :– శ్రీరాముని ప్రియురాలయిన జానకిని కనుగొన లేక హనుమ ఇట్లు చింతింప దొడగెను. నే నెంత వెదకుచున్నను వైదేహి గానవచ్చుటలేదు కాబట్టి ఆమె నిశ్చయముగా మరణించియే యుండును.

**శ్లో॥ సా రాక్షసానాం ప్రవరేణ జానకీ**
**స్వశీలసంరక్షణతత్పరా సతీ ।**
**అనేన నూనం ప్రతిదుష్టకర్మణా**
**హతా భవే దార్యపథే పరే స్థితా ॥ 3**

**పదచ్ఛేదము** :– సా – రాక్షసానాం – ప్రవరేణ – జానకీ – స్వశీలసంరక్షణతత్పరా – సతీ – అనేన – నూనం – ప్రతిదుష్టకర్మణా – హతా – భవేత్ – ఆర్యపథే – పరే – స్థితా ॥

**అన్వయక్రమము** :– స్వశీలసంరక్షణతత్పరా సతీ సా జానకీ పరే ఆర్యపథే స్థితా అనేన ప్రతిదుష్టకర్మణా నూనం హతా భవేత్.

**ప్రతిపదార్థము** :– స్వశీలసంరక్షణతత్పరా సతీ = తన పాతివ్రత్యమును కాపాడుకొనుటయందే ఆసక్తిగలదై, సా జానకీ = ఆ సీతాదేవి, పరే ఆర్యపథే స్థితా = శ్రేష్ఠమైన ఉత్తములయొక్క మార్గమునందు నిలచియున్నదై, అనేన ప్రతిదుష్టకర్మణా = ఈ అతిదుర్మార్గుడైన రావణునిచే, నూనం = నిశ్చయముగా, హతా భవేత్ = సంహరింపబడి యుండును.

**తాత్పర్యము :–** తన పాతివ్రత్యమును కాపాడుకొనుటయందు నిశ్చయముగలదై సీతమ్మ శ్రేష్ఠమైన సజ్జనులమార్గము నవలంబించినదై రావణుని తిరస్కరించినందున ఆ దుర్మార్గునిచే తప్పక వధింపబడియుండును.

**శ్లో॥ విరూపరూపా వికృతా వివర్చసో**
**మహాననా దీర్ఘవిరూపదర్శనాః ।**
**సమీక్ష్య సా రాక్షసరాజయోషితో**
**భయా ద్వినష్టా జనకేశ్వరాత్మజా ॥ 4**

**పదచ్ఛేదము :–** విరూపరూపాః – వికృతాః – వివర్చసః – మహాననాః – దీర్ఘవిరూప దర్శనాః – సమీక్ష్య – సా – రాక్షసరాజయోషితః – భయాత్ – వినష్టా – జన కేశ్వరాత్మజా ॥

**అన్వయక్రమము :–** విరూపరూపాః వికృతాః వివర్చసః, మహాననాః దీర్ఘవిరూప దర్శనాః, రాక్షసరాజయోషితః సమీక్ష్య సా జనకేశ్వరాత్మజా భయాత్ వినష్టా.

**ప్రతిపదార్థము :–** విరూపరూపాః = వికృతమైన ఆకారముగలవారును, వికృతాః = వికృతమైన చేష్టలుగలవారును, వివర్చసః = తేజోవిహీనలును, మహాననాః = పెద్ద నోరులుగలవారును, దీర్ఘవిరూపదర్శనాః = మిక్కిలి వికృతముగా కనబడునట్టి వారును అగు, రాక్షసరాజయోషితః = రావణునిచే నియోగింపబడిన స్త్రీలను, సమీక్ష్య = చూచి, భయాత్ = భీతివశమున, సా జనకేశ్వరాత్మజా = ఆ జనకరాజపుత్రి, వినష్టా = ప్రాణములు గోల్పోయినదై యుండును.

**తాత్పర్యము :–** వికృతములైన అవయవములతో, వికారమైన ఆకారముతో, తేజోహీనమైన దేహముతో, విపరీతమైన ముఖములతో, పొడవై భయంకరమైన కన్నులు మున్నగు అవయవములతో, భీకరముగా తనచుట్టును కావలి యుంచబడిన రావణుని పరిచారికలను చూచి భయముచే జానకి ప్రాణములు విడచియేయుండును.

**శ్లో॥ సీతా మదృష్ట్వా హ్యనవాప్య పౌరుషం**
**విహృత్య కాలం సహ వానరై శ్చిరమ్ ।**
**న మేఽస్తి సుగ్రీవసమీపగా గతి**
**స్సుతీక్ష్ణదండో బలవాం శ్చ వానరః ॥ 5**

**పదచ్ఛేదము :–** సీతామ్ – అదృష్ట్వా – హి – అనవాప్య – పౌరుషం – విహృత్య – కాలం – సహ – వానరైః – చిరం – న – మే – అస్తి – సుగ్రీవసమీపగా – గతిః –

సుతీక్ష్ణదండః - బలవాన్ - చ - వానరః ॥

**అన్వయక్రమము** :- సీతామ్ అదృష్ట్వా పౌరుషమ్ అనవాప్య వానరైః చిరం కాలం విహృత్య, మే, సుగ్రీవసమీపగా గతిః నాస్తి; వానరః సుతీక్ష్ణదండః, బలవాన్ చ ॥

**ప్రతిపదార్థము** :- సీతామ్ అదృష్ట్వా = జానకిని కనుగొనకుండగను, పౌరుషమ్ అనవాప్య = (సముద్రలంఘనాది) పురుషయత్నమునకు ఫలితమును సంపాదించ కుండగను, వానరైః సహ = అంగదాది వానరులతోగూడ, చిరం కాలం విహృత్య = చిరకాలము స్వేచ్ఛగా గడపివైచి, మే = నాకు, సుగ్రీవసమీపగా = సుగ్రీవుని సమీపమునకు చేరునట్టి, గతిః = మార్గము, నాస్తి = లేదు. వానరః = వానరరాజైన సుగ్రీవుడు, సుతీక్ష్ణదండః = తీవ్రముగ దండించు పద్ధతిగలవాడు, బలవాన్ చ = అమితబలశాలియు గూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- కాలం విహృత్య = సుగ్రీవుడు పెట్టిన కాలనియమమును అతిక్రమించి.

**తాత్పర్యము** :- జానకిని కనుగొనలేకయు, సముద్రమును దాటి చేసిన పురుష ప్రయత్నమునకు ఫలమును పొందకుండగను, నియమించిన కాలమంతయు వానరులతో విహరించి అతిక్రమించియు, విఫలుడైనట్టి నాకీనాడు సుగ్రీవుని సమీపమునకు బోయి నిలచుటకు మార్గములేదు. ఆ సుగ్రీవుడు మిక్కిలి క్రూరమైన దండన పద్ధతి గలవాడును, మహాపరాక్రమశాలియును గదా! అందుచే వానికి కనుపించు యోగ్యత నాకు లేదు.

**శ్లో॥ దృష్ట మంతఃపురం సర్వం దృష్టా రావణయోషితః ।**
**న సీతా దృశ్యతే సాధ్వీ వృథా జాతో మమ శ్రమః ॥ 6**

**పదచ్ఛేదము** :- దృష్టమ్ - అంతఃపురం - సర్వం - దృష్టాః - రావణయోషితః - న - సీతా - దృశ్యతే - సాధ్వీ - వృథా - జాతః - మమ - శ్రమః ॥

**అన్వయక్రమము** :- అంతఃపురం సర్వం దృష్టం, సర్వాః రావణయోషితః దృష్టాః, సాధ్వీ సీతా న దృశ్యతే, మమ శ్రమః వృథా జాతః.

**ప్రతిపదార్థము** :- సర్వమ్ అంతఃపురం దృష్టమ్ = అంతఃపురమంతయును చూడబడినది. సర్వాః రావణయోషితః దృష్టాః = రావణాసురుని భార్యలందరును పరికింపబడిరి. సాధ్వీ సీతా న దృశ్యతే = పతివ్రతయగు జానకమ్మ మాత్రము చూడబడలేదు. మమ శ్రమ = నాయొక్క శ్రమ, వృథా జాతః = వ్యర్థమయ్యెను.

**తాత్పర్యము :-** రావణుని అంతఃపుర మంతయును గాలించితిని; వాని భార్యలనందరిని పరికించితిని; నాకు సీతాసాధ్వి మాత్రము గానరాలేదు. నాశ్రమ వ్యర్థమయ్యెను గదా!

**శ్లో॥ కిం ను మాం వానరా స్సర్వే గతం వక్ష్యంతి సంగతాః ।**
**గత్వా తత్ర త్వయా వీర కిం కృతం త ద్వదస్వ నః ॥ 7**

**పదచ్ఛేదము :-** కిం - ను - మాం - వానరాః - సర్వే - గతం - వక్ష్యంతి - సంగతాః, గత్వా - తత్ర - త్వయా - వీర - కిం - కృతం - తత్ - వదస్వ - నః ॥

**అన్వయక్రమము :-** సంగతాః సర్వే వానరాః గతం మాం కిం ను వక్ష్యంతి? హే వీర!, తత్ర గత్వా, త్వయా, కిం కృతమ్? తత్ నః వదస్వ.

**ప్రతిపదార్థము :-** సంగతాః సర్వే వానరాః = పోగుబడి (నన్ను) చేరెడి ఆ వానరులందరును, గతం మాం = (అచ్చటకు) చేరుకొన్న నన్ను, కిం ను వక్ష్యంతి = ఏమని చెప్పుదురు? హే వీర! = ఓ మహావీరుడా!, తత్ర గత్వా = ఆ లంకలోని కేగి, త్వయా = నీచేత, కిం కృతం = ఏమి చేయబడినది? తత్ నః వదస్వ = అది మాకు చెప్పుము.

**తాత్పర్యము :-** నేను సముద్రమును దాటి తమ ముందుకు చేరుకొనగానే మా అంగదాది వానరు లందరును నాచుట్టును మూగి ఏమందురు? ఓ మహావీరుడా! నీ వా లంకకు బోయి ఏమి సాధించుకొని వచ్చితివి? అది ఏదో మాకు చెప్పుము అని అడుగుదురు గదా!

**శ్లో॥ అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తా మహం జనకాత్మజామ్ ।**
**ధ్రువం ప్రాయ ముపైష్యంతి కాలస్య వ్యతివర్తనే ॥ 8**

**పదచ్ఛేదము :-** అదృష్ట్వా - కిం - ప్రవక్ష్యామి - తామ్ - అహం - జనకాత్మజామ్ - ధ్రువం - ప్రాయమ్ - ఉపైష్యంతి - కాలస్య - వ్యతివర్తనే ॥

**అన్వయక్రమము :-** తాం జనకాత్మజామ్ అదృష్ట్వా, అహం కిం ప్రవక్ష్యామి? కాలస్య వ్యతివర్తనే, ధ్రువం ప్రాయమ్ ఉపైష్యంతి.

**ప్రతిపదార్థము :-** తాం జనకాత్మజాం = ఆ సీతాదేవిని, అదృష్ట్వా = చూడకుండగ, అహం = నేను, కిం ప్రవక్ష్యామి = ఏమని బదులు చెప్పుదును? కాలస్య వ్యతివర్తనే = నియమితకాలము అతిక్రమించిన దగుచుండగా, ధ్రువం = నిశ్చయముగా, ప్రాయం ఉపైష్యంతి = (అంగదాది వానరవీరులు) మరణమును పొందుదురు.

**తాత్పర్యము** :– సీతాదేవిని చూడలేనట్టి నేను వారి కేమని జవాబు చెప్పుదును? ఇచ్చటనే కొంతకాలము గడిపి వెళ్ళుదునందునా సుగ్రీవుడొసగిన కాలము గడచిపోయిన వెంటనే అంగదాదులు మరణముకొఱకై ప్రాయోపవేశము పూని యుండగలరు.

**శ్లో॥ కిం వా వక్ష్యతి వృద్ధ శ్చ జాంబవా నంగద శ్చ సః ।**
**గతం పారం సముద్రస్య వానరా శ్చ సమాగతాః ॥ 9**

**పదచ్ఛేదము** :– కిం – వా – వక్ష్యతి – వృద్ధః – చ – జాంబవాన్ – అంగదః – చ – సః – గతం – పారం – సముద్రస్య – వానరాః – చ – సమాగతాః ॥

**అన్వయక్రమము** :– సముద్రస్య పారం గతం మాం సమాగతాః వానరాః కిం వా వక్ష్యంతి? వృద్ధః జాంబవాన్ చ సః అంగదశ్చ కిం వక్ష్యతి?

**ప్రతిపదార్థము** :– సముద్రస్య = సముద్రముయొక్క, పారం గతం మాం = ఆవలియొడ్డునకు చేరిన నన్ను, సమాగతాః వానరాః = ఆ చుట్టును చేరిన వానరవీరులు, కిం వా వక్ష్యంతి = ఏమని చెప్పుదురు? వృద్ధః జాంబవాన్ = వృద్ధుడైన జాంబవంతుడు; కిం వక్ష్యతి = ఏమనును? సః అంగదశ్చ = ఆ అంగదుడును, కిం వక్ష్యతి = ఏమనును?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– కిం వా వక్ష్యతి మాం = నన్ను ఈసడించి మాట్లాడుదురు గదా యని భావము.

**రామానుజీయము** :– అనుపమానమైన పరాక్రమశాలి యని ప్రశంసించిన జాంబవంతుడు నన్ను ఏమని ఈసడించునో? బిలప్రవేశయత్నమునుండి నాచే విరమింప చేయబడిన అంగదుడు నేడేమని ఈసడించునో? కృతకార్యుడనై వచ్చెదనని మా ఎదుట ప్రగల్భములు చెప్పితివా యని వానరులందరును నన్నేమి ఈసడింతురో యని హనుమ ఈ మూడు విధములుగా తన విచారమును వ్యక్తము చేసెను.

**తాత్పర్యము** :– సముద్రము దాటి తిరిగి ఒడ్డునకు చేరిన నన్ను చుట్టుముట్టి మా వానరవీరులు నన్నేమని ఈసడింతురో గదా? నాపై అమితగౌరవముగల వృద్ధుడైన జాంబవంతుడు నన్ను గూర్చి ఏమనునో గదా? నేనెన్నో ఆశలు కల్పించిన అంగదుడు నా వైఫల్యమునకు రోసి ఏమని పలుకునో గదా?

**శ్లో॥ అనిర్వేద శ్శ్రియో మూల మనిర్వేదః పరం సుఖమ్ ।**
**అనిర్వేదో హి సతతం సర్వార్థేషు ప్రవర్తకః ॥ 10**

**పదచ్ఛేదము :–** అనిర్వేదః – శ్రియః – మూలమ్ – అనిర్వేదః – పరం – సుఖమ్ – అనిర్వేదః – హి – సతతం – సర్వార్థేషు – ప్రవర్తకః ॥

**ప్రతిపదార్థము :–** అనిర్వేదః = నిరాశ నొందకుండుట, శ్రియః మూలం = శ్రేయస్సునకు మూలమగును, అనిర్వేదః = నిరాశ నొందకుండుటయే, పరం సుఖమ్ = గొప్పదైన సుఖము, సతతం = ఎల్లప్పుడును, అనిర్వేదః హి = నిరాశనొందకుండుటయే, సర్వార్థేషు ప్రవర్తకః = అన్నికార్యములను సాధించునది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** పౌరుషహీనుడై చదికిలబడుటయే నిర్వేదము.

**రామాయణ శిరోమణి :–** కృత్యముల నుండి నివృత్తుడైయుండుట.

**తాత్పర్యము :–** ఉత్సాహమును పూనుటయే శ్రేయమునకు మూలమైయుండును. ఉత్సాహమే మానవునకు పరమసౌఖ్యమును గూర్చును. ఉత్సాహమును పూనియుండుటయే సర్వకార్యములను నిర్వహింపగల సాధనమై యుండును.

**శ్లో॥ కరోతి సఫలం జంతోః కర్మ యత్త త్కరోతి సః ।**
**తస్మా దనిర్వేదకృతం యత్నం చేష్టేఽహముత్తమమ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** కరోతి – సఫలం – జంతోః – కర్మ – యత్ – తత్ – కరోతి – సః । తస్మాత్ – అనిర్వేదకృతం – యత్నం – చేష్టే – అహమ్ – ఉత్తమమ్ ॥

**అన్వయక్రమము :–** సః యత్ కర్మ కరోతి తత్ జంతోః, సఫలం కరోతి, తస్మాత్ అనిర్వేదకృతమ్, ఉత్తమం యత్నమ్, అహం చేష్టే.

**ప్రతిపదార్థము :–** సః = ఆ అనిర్వేదము, యత్ కర్మ కరోతి = ఏ కార్యము గావించునో, జంతోః = ప్రాణికి, తత్ కర్మ = ఆ కర్మను, సఫలం కరోతి = సఫలము గావించును, తస్మాత్ = అందువలన, అనిర్వేదకృతం = ఉత్సాహముతో చేయబడిన, ఉత్తమం యత్నం = ఉత్తమమైన ప్రయత్నమును, అహం చేష్టే = నేను గావించెదను.

**తాత్పర్యము :–** ఒక ప్రాణి ఏ ఘనకార్యమును చేపట్టునో ఆ ప్రాణియొక్క ఆ ఘన కార్యమును, అతని ఉత్సాహమే సఫలమొనర్చును. అందుచే నేనిప్పుడు ఉత్సాహ పూర్వకముగా ఉత్తమమైన ప్రయత్నమును బూని నా కర్తవ్యమును నేను నెరవేర్తును.

**శ్లో॥ భూయ స్తావ ద్విచేష్యామి దేశా న్రావణపాలితాన్ ।**
**ఆపానశాలా విచితా స్తథా పుష్పగృహాణి చ ॥ 12**

**పదచ్ఛేదము :–** భూయః – తావత్ – విచేష్యామి – దేశాన్ – రావణపాలితాన్ – ఆపానశాలాః – విచితాః – తథా – పుష్పగృహాణి – చ ॥

**అన్వయక్రమము :–** భూయః రావణపాలితాన్ దేశాన్ విచేష్యామి. ఆపానశాలాః విచితాః తథా పుష్పగృహాణి చ (విచితాని).

**ప్రతిపదార్థము :–** భూయః = మరల, రావణపాలితాన్ దేశాన్ = రావణుని పాలనలోనున్నట్టి ప్రదేశములనన్నిటిని, తావత్ విచేష్యామి = అంతయును వెతికెదను, ఆపానశాలాః విచితాః = పానశాలలన్నియును వెదుకబడినవి, తథా = అట్లే, పుష్ప గృహాణి చ విచితాని = పుష్పమందిరములు గూడను వెదుకబడినవి.

**తాత్పర్యము :–** అందుచే నేను రావణుని పాలనయందున్న ప్రదేశములనన్నిటిని తిరిగి వెదకి వచ్చెదను. ఇప్పటివరకు అన్ని పానశాలలను అన్ని పుష్ప మందిరములను గూడ వెదకితిని గదా!

**శ్లో॥ చిత్రశాలాశ్చ విచితా భూయః క్రీడాగృహాణి చ ।**
**నిష్కుటాంతరరథ్యా శ్చ విమానాని చ సర్వశః ॥ 13**

**పదచ్ఛేదము :–** చిత్రశాలాః – చ – విచితాః – భూయః – క్రీడాగృహాణి – చ – నిష్కుటాంతరరథ్యాః – చ – విమానాని – చ – సర్వశః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** చిత్రశాలాః విచితాః = చిత్రశాల లన్నియును వెదుకబడినవి. భూయః = అధికముగా, క్రీడాగృహాణి విచితాని = క్రీడామందిరములును వెదుకబడినవి, నిష్కుటాంతరరథ్యాశ్చ విచితాః = ఉద్యానవనములును, అందలి వీథులును వెదుకబడినవి. విమానాని చ సర్వశః విచితాని = సౌధములన్నియును వెదుకబడినవి.

**తాత్పర్యము :–** చిత్రశాలలును, క్రీడామందిరములును, ఉద్యానవనములును, అందలి వీథులును, ఉన్నతమైన ప్రాసాదములును అన్నియును ఇంతవరకు వెదుకబడినవి.

**శ్లో॥ ఇతి సంచింత్య భూయోఽపి విచేతు ముపచక్రమే ।**
**భూమీగృహాం శ్చైత్యగృహాన్ గృహాతిగృహకా నపి ॥ 14**

**పదచ్ఛేదము :–** ఇతి – సంచింత్య – భూయః – అపి – విచేతుమ్ – ఉపచక్రమే –

భూమీగృహాన్ – చైత్యగృహాన్ – గృహాతిగృహకాన్ – అపి ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– ఇతి సంచింత్య = ఇట్లని ఆలోచించి, భూయః అపి = మరల, భూమీగృహాన్ = పాతాళగృహములను, చైత్యగృహాన్ = మండప భవనములను, గృహాతిగృహకాన్ = నగరమునకు దూరమున నిర్మించిన క్రీడాగృహములను, విచేతుం ఉపచక్రమే = వెదకుటకు ప్రారంభించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– గృహాతిగృహకాన్ = గృహోపరిభాగమునందు క్రీడార్థమై నిర్మితమైనట్టి గృహములు.

**మహేశ్వరతీర్థులు** :– నగరమునకు దూరమున విహారార్థమై నిర్మింపబడిన గృహములు.

**తాత్పర్యము** :– హనుమంతుడు ఈరీతిగా ఆలోచించి తిరిగి భూబిలములందలి గృహములను, వీథులనడుమ నుండు మండపములను వీథుల చివరనుండు క్రీడామందిరములను వెదుకసాగెను.

**శ్లో॥ ఉత్పత న్నిష్పతం శ్చాపి తిష్ఠన్ గచ్ఛన్ పునః పునః ।**
**అపావృణ్వం శ్చ ద్వారాణి కవాటా న్యవఘాటయన్ ॥ 15**

**శ్లో॥ ప్రవిశన్నిష్పతంశ్చాపి ప్రపత న్నుత్పతన్నపి ।**
**సర్వ మప్యవకాశం స విచచార మహాకపిః ॥ 16**

**పదచ్ఛేదము** :– ఉత్పతన్ – నిష్పతన్ – చ – అపి – తిష్ఠన్ – గచ్ఛన్ – పునః – పునః – అపావృణ్వన్ – చ – ద్వారాణి – కవాటాని – అవఘాటయన్ ॥ ప్రవిశన్ – నిష్పతన్ చ – అపి – ప్రపతన్ – ఉత్పతన్ – అపి – సర్వమ్ – అపి – అవకాశం – సః – విచచార – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– సః మహాకపిః ప్రవిశన్ నిష్పతన్ చ అపి పునః పునః తిష్ఠన్, గచ్ఛన్, ద్వారాణి అపావృణ్వన్ చ, కవాటాని అవఘాటయన్ సర్వమ్ అవకాశమ్ అపి, విచచార.

**ప్రతిపదార్థము** :– సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, ఉత్పతన్, నిష్పతన్ చ అపి = ఎగురుచును, క్రిందకి దుముకుచును, పునః పునః = మాటిమాటికిని, తిష్ఠన్, గచ్ఛన్ = నిలుచుచును, ముందుకుపోవుచును, ద్వారాణి అపావృణ్వన్ = వాకిళ్లు తెరుచుచు,

కవాటాని అవఘాటయన్ = తలుపులను పడద్రోయుచు, సర్వమ్ అవకాశం అపి = ఆ ప్రదేశమునంతను, విచచార = పరిభ్రమించెను.

**తాత్పర్యము** :– హనుమంతుడచటి భవనములన్నింటిలోనికిని ప్రవేశించుచు ఈవలకు వచ్చుచు ప్రాకారముమీదికి లంఘించుచు క్రిందికి అవరోహించుచు ద్వారములను తెరుచుచు తలుపులను పడద్రోయుచు మరల మరల నలువైపులకు పోవుచు నిలచుచు ఆ ప్రదేశమునం దంతటను కలయదిరిగెను.

**శ్లో॥ చతురంగుళమాత్రోఽపి నావకాశ స్స విద్యతే ।**
**రావణాంతఃపురే తస్మిన్ యం కపి ర్న జగామ సః ॥ 17**

**పదచ్ఛేదము** :– చతురంగుళమాత్రః – అపి – న – అవకాశః – సః – విద్యతే – రావణాంతఃపురే – తస్మిన్ – యం – కపిః – న – జగామ – సః ॥

**అన్వయక్రమము** :– సః కపిః తస్మిన్ రావణాంతఃపురే, యం న జగామ సః అవకాశః చతురంగుళమాత్రః అపి న విద్యతే.

**ప్రతిపదార్థము** :– సః కపిః = ఆ హనుమంతుడు, తస్మిన్ రావణాంతఃపురే = రావణునియొక్క ఆ యంతఃపురమునందు, యం న జగామ = ఏ ప్రదేశమును గూర్చి వెళ్లలేదో, సః అవకాశః = అట్టి ప్రదేశము, చతురంగుళమాత్రః అపి = నాలుగు అంగుళములమేరగూడ, న విద్యతే = లేకుండెను.

**తాత్పర్యము** :– రావణాంతఃపురమునందు హనుమంతుడు చొరకుండగా విడిచినట్టి ప్రదేశము నాలుగు అంగుళములమేరకూడ ఉండదని చెప్పవచ్చును.

**శ్లో॥ ప్రాకారాంతరరథ్యా శ్చ వేదికా శ్చైత్యసంశ్రయాః ।**
**దీర్ఘికాః పుష్కరిణ్య శ్చ సర్వం తేనావలోకితమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– ప్రాకారాంతరరథ్యాః – చ – వేదికాః – చైత్యసంశ్రయాః – దీర్ఘికాః – పుష్కరిణ్యః – చ – సర్వం – తేన – అవలోకితమ్ ॥

**అన్వయక్రమము** :– ప్రాకారాంతరరథ్యాః చైత్రసంశయాః వేదికాః చ దీర్ఘికాః పుష్కరిణ్యః చ సర్వం తేన అవలోకితమ్.

**ప్రతిపదార్థము** :– ప్రాకారాంతరరథ్యాః = కోటయందలి మార్గములన్నియును, చైత్యసంశ్రయాః వేదికాః = చతుష్పథములందలి చెట్లచుట్టునుగల వేదికలును, దీర్ఘికాః

= దిగుడుబావులును, పుష్కరిణ్యశ్చ = సరస్సులును, సర్వం = సమస్తము, తేన = ఆ హనుమంతునిచే, అవలోకితమ్ = చూడబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ప్రాకారాంతర 'రథ్యాః' కి బదులుగా 'వీథ్యః' అని బొంబాయి పాఠము.

ప్రాకారము లోపలిభాగములో నున్న మంత్రికుమారాదుల గృహములున్న వీథులని భావము.

చైత్యము అనగా, నాల్గువీథుల మొగలోనున్న వృక్షము.

**తాత్పర్యము :–** కోటలో నున్న మంత్రులయొక్కయు, రాజపుత్రులయొక్కయు భవనములు గల వీథులను చతుష్పథములందలి సమావేశవేదికలను, దిగుడు బావులను, తటాకములను అన్నింటిని హనుమ శ్రద్ధగా పరిశీలించెను.

**శ్లో॥ రాక్షస్యో వివిధాకారా విరూపా వికృతా స్తథా ।**
**దృష్టా హనుమతా తత్ర న తు సా జనకాత్మజా ॥ 19**

**పదచ్ఛేదము :–** రాక్షస్యః – వివిధాకారాః – విరూపాః – వికృతాః – తథా । దృష్టాః – హనుమతా – తత్ర – న – తు – సా – జనకాత్మజా ॥

**అన్వయక్రమము :–** వివిధాకారాః, విరూపాః తథా వికృతాః రాక్షస్యః, తత్ర హనుమతా దృష్టాః, సా జనకాత్మజా తు న దృష్టా.

**ప్రతిపదార్థము :–** వివిధాకారాః = వివిధములైన రూపములుగలవారును, విరూపాః = వికృతమైన రూపముగలవారును, తథా వికృతాః = అట్లే వికారపుచేష్టలు గలవారును అగు, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, దృష్టాః = చూడబడిరి. సా జనకాత్మజా తు = ఆ జానకీదేవి మాత్రము, న దృష్టా = చూడబడలేదు.

**తాత్పర్యము :–** చూచుట కసహ్యముగానున్నవారును, వికృతావయవములు గలవారును, వివిధములగు ఆకారములు గల్గియున్న వారును అగు, రాక్షసవనితల నెందరినో చూచెను. కాని జానకమ్మయొక్క జాడ మాత్రము కానరాకుండెను.

**శ్లో॥ రూపేణాఽప్రతిమా లోకే వరా విద్యాధరస్త్రియః ।**
**దృష్టా హనుమతా తత్ర న తు రాఘవనందినీ ॥ 20**

**పదచ్ఛేదము :–** రూపేణ – అప్రతిమాః – లోకే – వరాః – విద్యాధరస్త్రియః – దృష్టాః

– హనుమతా – తత్ర – న – తు – రాఘవనందినీ ॥

**అన్వయక్రమము :–** లోకే, రూపేణ అప్రతిమాః, వరాః విద్యాధరస్త్రియః తత్ర హనుమతా దృష్టాః, సా రాఘవనందినీ తు న దృష్టా.

**ప్రతిపదార్థము :–** లోకే = భూమిపై, రూపేణ అప్రతిమాః = సౌందర్యమున సాటిలేనట్టి, వరాః విద్యాధరస్త్రియః = ఎన్నికైన విద్యాధరరమణులు, హనుమతా = హనుమంతునిచే, తత్ర = ఆ రావణభవనమునందు, దృష్టాః = చూడబడిరి. రాఘవనందినీ తు = రఘురాముని కానందము కలిగించు సీతమ్మ మాత్రము, న దృష్టా = కనబడలేదు.

**తాత్పర్యము :–** లోకమున సాటిలేని సౌందర్యవతులని వాసికెక్కిన విద్యాధరవనితల నెందరినో చూచెను. కాని రాముని ప్రియురాలయిన సీతాదేవి మాత్రము హనుమకు కానరాకుండెను.

**శ్లో॥ నాగకన్యా వరారోహాః పూర్ణచంద్రనిభాననాః ।**
**దృష్టా హనుమతా తత్ర న తు సీతా సుమధ్యమా ॥ 21**

**పదచ్ఛేదము :–** నాగకన్యాః – వరారోహాః – పూర్ణచంద్రనిభాననాః – దృష్టాః – హనుమతా – తత్ర – న – తు – సీతా – సుమధ్యమా ॥

**అన్వయక్రమము :–** పూర్ణచంద్రనిభాననాః వరారోహాః నాగకన్యాః తత్ర హనుమతా దృష్టాః; సుమధ్యమా సీతా తు న దృష్టా.

**ప్రతిపదార్థము :–** పూర్ణచంద్రనిభాననాః = నిండు చందురుని బోలిన ముఖము గలవారును, వరారోహాః = సుందరమైన కటిసీమ గలవారును అగు, నాగకన్యాః = నాగయువతులు, తత్ర = ఆ రావణుని అంతఃపురమునందు, హనుమతా దృష్టాః = హనుమచేత చూడబడిరి; సుమధ్యమా సీతా తు = సుందరమైన నడుముగల సీతాదేవి మాత్రము, న దృష్టా = చూడబడలేదు.

**తాత్పర్యము :–** నిండు చంద్రునివంటి మోముగల సుందరాంగులైన నాగకన్యలను చూడగల్గెనేగాని హనుమ సౌందర్యరాశియైన సీతాదేవిని మాత్రము కనజాలకపోయెను.

**శ్లో॥ ప్రమథ్య రాక్షసేంద్రేణ దేవకన్యా బలాద్ధృతాః ।**
**దృష్టా హనుమతా తత్ర న సా జనకనందినీ ॥ 22**

**పదచ్ఛేదము :–** ప్రమథ్య – రాక్షసేంద్రేణ – దేవకన్యాః – బలాత్ – హృతాః– దృష్టాః – హనుమతా – తత్ర – న – సా – జనకనందినీ ॥

**అన్వయక్రమము :–** రాక్షసేంద్రేణ ప్రమథ్య బలాత్ హృతాః దేవకన్యాః తత్ర హనుమతా దృష్టాః సా జనకనందినీ న దృష్టా.

**ప్రతిపదార్థము :–** రాక్షసేంద్రేణ = రావణునిచే, ప్రమథ్య = యుద్ధమున ఓడించి, బలాత్ హృతాః = బలవంతముగా అపహరింపబడినట్టి, దేవకన్యాః = సురాంగనలు, తత్ర = ఆ యంతఃపురమునందు, హనుమతా దృష్టాః = హనుమంతునిచే కనుగొనబడిరి, సా జనకనందినీ న దృష్టా = ఆ జనకరాజుయొక్క పుత్రిక యగు సీతాదేవి మాత్రము చూడబడలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** వెనుకటి శ్లోకములో నాగకన్యలు వివాహితలు; ఇచ్చటి నాగకన్యలు బలవంతముగా బంధించి తేబడినవారు అని భావము.

**తాత్పర్యము :–** రావణుడు బలాత్కారముగా తండ్రులను జయించి తెచ్చినట్టి దేవకన్యలను ఎందరినో చూడగల్గెనేగాని జనకరాజనందనయైన సీతాదేవిని మాత్రము కనుగొనజాలడయ్యెను.

**శ్లో॥ సోఽపశ్యం స్తాం మహాబాహుః పశ్యం శ్చాన్యా వరస్త్రియః ।**
**విషసాద ముహు ర్ధీమాన్ హనుమాన్ మారుతాత్మజః ॥ 23**

**పదచ్ఛేదము :–** సః – అపశ్యన్ – తాం – మహాబాహుః – పశ్యన్ – చ – అన్యాః – వరస్త్రియః – విషసాద – ముహుః – ధీమాన్ – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :–** సః మహాబాహుః ధీమాన్ మారుతాత్మజః హనుమాన్ తామ్ అపశ్యన్ అన్యాః వరస్త్రియః పశ్యన్ చ, ముహుః విషసాద.

**ప్రతిపదార్థము :–** సః మహాబాహుః ధీమాన్ = ఆ మహావీరుడును, ప్రజ్ఞాశాలియును అగు, మారుతాత్మజః హనుమాన్ = వాయునందనుడైన హనుమంతుడు, అన్యాః వరస్త్రియః పశ్యన్ = ఇతరులైన సుందరీమణులను కనుగొనుచు, తామ్ అపశ్యన్ = ఆ సీతాదేవిని కనుగొనలేకయు, ముహుః = మరల మరల, విషసాద = విషాదము నొందెను.

**తాత్పర్యము :–** పరాక్రమశాలియును, ధీశాలియునగు వాయునందనుడైన హనుమ ఎందరినో సుందరీమణులను కనుగొనుచు సీతమ్మను మాత్రము ఎచ్చటను కనుగొన జాలక మాటిమాటికి విషాదగ్రస్తు డగుచుండెను.

**శ్లో॥ ఉద్యోగం వానరేంద్రాణాం ప్లవనం సాగరస్య చ ।**
**వ్యర్థం వీక్ష్యానిలసుత శ్చింతాం పునరుపాగమత్ ॥ 24**

**పదచ్ఛేదము :–** ఉద్యోగం – వానరేంద్రాణాం – ప్లవనం – సాగరస్య – చ – వ్యర్థం – వీక్ష్య – అనిలసుతః – పునః – చింతామ్ – ఉపాగమత్ ॥

**అన్వయక్రమము :–** వానరేంద్రాణామ్ ఉద్యోగం సాగరస్య ప్లవనం చ వ్యర్థం వీక్ష్య, అనిలసుతః పునః చింతామ్ ఉపాగమత్.

**ప్రతిపదార్థము :–** వానరేంద్రాణామ్ ఉద్యోగం = వానరవీరులయొక్క ఉద్యమమును, సాగరస్య ప్లవనం చ = సముద్రముయొక్క లంఘనమున్నూ, వ్యర్థం వీక్ష్య = విఫలమైనదిగా తలంచి, అనిలసుతః = వాయునందనుడైన హనుమ, పునః = తిరిగి, చింతామ్ ఉపాగమత్ = చింతనొందెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు వానరవీరులు చేసిన ప్రయత్నమును, తన మహాసముద్రలంఘనమును, వ్యర్థమైపోవుటను తలచుకొని తిరిగి చింతానిమగ్నుడయ్యెను.

**శ్లో॥ అవతీర్య విమానా చ్చ హనుమా న్మారుతాత్మజః ।**
**చింతా ముపజగామాఽథ శోకోపహతచేతనః ॥ 25**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనూమద్విషాదో" నామ*
*ద్వాదశ స్సర్గః*

**పదచ్ఛేదము :–** అవతీర్య – విమానాత్ – చ – హనుమాన్ – మారుతాత్మజః – చింతామ్ – ఉపజగామ – అథ – శోకోపహతచేతనః ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః హనుమాన్ విమానాత్ చ అవతీర్య అథ శోకోపహతచేతనః (సన్) చింతామ్ ఉపజగామ.

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః హనుమాన్ = పవనసుతుడైన హనుమ, విమానాత్ అవతీర్య = విమానమునుండి క్రిందికి దిగి, అథ = పిమ్మట, శోకోపహతచేతనః (సన్) = శోకముచే వ్యాకులమైన మనస్సు గలవాడగుచు, చింతామ్ ఉపజగామ = చింతను పొందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'విమానాత్ అవతీర్య' అని కవి ప్రయోగించుటచేత, ఇంతవరకును చూచిన దృశ్యమంతయు పుష్పకవిమానమునందే అని భావము.

**తాత్పర్యము** :– హనుమంతుడు పుష్పకవిమానమునుండి దిగి, శోకముచే వ్యాకులమైన మనస్సుగలవాడై తిరిగి చింతాగ్రస్తుడయ్యెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమద్విషాదము" అను*
*పండ్రెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# త్రయోదశసర్గ

**శ్లో॥ విమానాత్తు సుసంక్రమ్య ప్రాకారం హరియూథపః ।**
**హనుమా న్వేగవా నాసీ ద్యథా విద్యు ద్ఘనాంతరే ॥ 1**

**పదచ్ఛేదము :–** విమానాత్ – తు – సుసంక్రమ్య – ప్రాకారం – హరియూథపః – హనుమాన్ – వేగవాన్ – ఆసీత్ – యథా – విద్యుత్ – ఘనాంతరే ॥

**అన్వయక్రమము :–** హరియూథపః హనుమాన్ విమానాత్ ప్రాకారం సుసంక్రమ్య ఘనాంతరే, విద్యుత్ యథా వేగవాన్ ఆసీత్.

**ప్రతిపదార్థము :–** హరియూథపః హనుమాన్ = వానరశ్రేష్ఠుడైన హనుమంతుడు, విమానాత్ = పుష్పక విమానమునుండి, ప్రాకారం సుసంక్రమ్య = ప్రాకారముమీదికి లంఘించి, ఘనాంతరే = మేఘముమధ్య, విద్యుత్ యథా = మెరుపుతీగ వలె, వేగవాన్ ఆసీత్ = అమితవేగము గలవాడయ్యెను.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'యథా విద్యుద్ఘనాంతరే' = తప్తకాంచనసన్నిభమైన దేహముగల హనుమ మెరపుతీగవలె నుండగా అచటి ప్రాకారము నల్లని మేఘమువలె నుండెననియు అవి నల్లనివిగా నుండుటకు కారణము అవి ఇంద్రనీలమణినిర్మితములనియును గ్రహించవలెను.

**తాత్పర్యము :–** పుష్పకవిమానమునుండి ప్రాకారముమీదికి లంఘించి అందు హనుమ వేగముగా పరుగిడుచుండగా తప్తకాంచనదేహుడైన హనుమ మెరపుతీగవలెను, ఇంద్రనీలమణినిర్మితమైన ప్రాకారము నీలమేఘమువలెను గోచరించుచు ఆ దృశ్యము కన్నులపండువుగా నుండెను.

**శ్లో॥ సంపరిక్రమ్య హనుమా న్రావణస్య నివేశనాత్ ।**
**అదృష్ట్వా జానకీం సీతా మబ్రవీ ద్వచనం కపిః ॥ 2**

**పదచ్ఛేదము :–** సంపరిక్రమ్య – హనుమాన్ – రావణస్య – నివేశనాత్ – అదృష్ట్వా

– జానకీం – సీతామ్ – అబ్రవీత్ – వచనం – కపిః ॥

**అన్వయక్రమము** :– రావణస్య నివేశనాత్ సంపరిక్రమ్య జానకీం సీతామ్ అదృష్ట్వా కపిః హనుమాన్ వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– జానకీం సీతాం = జనకరాజపుత్రిక యగు సీతమ్మను, అదృష్ట్వా = కనుగొనలేక, రావణస్య నివేశనాత్ = రావణుని భవనమునుండి, సంపరిక్రమ్య = ఈవలకు వచ్చి, కపిః హనుమాన్ = వానరోత్తముడైన హనుమ, వచనమ్ అబ్రవీత్ = (తనలో) ఈ మాటను పలికెను.

**తాత్పర్యము** :– సీతమ్మ కన్పించకపోవుటచే హనుమ రావణుని భవనమునుండి ఈవలకు వచ్చి ప్రాకారమును జేరి తనలో ఈరీతిగా తలచుచుండెను.

**శ్లో॥ భూయిష్ఠం లోళితా లంకా రామస్య చరతా ప్రియమ్ ।**
**న హి పశ్యామి వైదేహీం సీతాం సర్వాంగశోభనామ్ ॥ 3**

**పదచ్ఛేదము** :– భూయిష్ఠం – లోళితా – లంకా – రామస్య – చరతా – ప్రియమ్ – న – హి – పశ్యామి – వైదేహీం – సీతాం – సర్వాంగశోభనామ్ ॥

**అన్వయక్రమము** :– రామస్య ప్రియం చరతా లంకా భూయిష్ఠం లోళితా; సర్వాంగ శోభనాం వైదేహీం సీతాం న హి పశ్యామి.

**ప్రతిపదార్థము** :– రామస్య ప్రియం చరతా = రామునకు ప్రియము నాచరించుచున్నట్టి, (మయా = నాచేత) లంకా = ఈ లంకానగరము, భూయిష్ఠం లోళితా = ఎక్కువగా వెదుకబడినది, సర్వాంగశోభనాం = సర్వమంగళలక్షణయుక్తురాలగు, వైదేహీం సీతాం = విదేహపుత్రియగు సీతాదేవిని, న హి పశ్యామి = కనుగొనలేకపోతినిగదా.

**తాత్పర్యము** :– శ్రీరామునకు ప్రియము గూర్చవలెనను ఆశతో శ్రద్ధగా ఈ లంక నంతయును వెదికితిని. కాని సర్వాంగశోభనయైన ఆ సీతమ్మను మాత్రము చూడ జాలకున్నాను.

**శ్లో॥ పల్వలాని తటాకాని సరాంసి సరిత స్తథా ।**
**నద్యోఽనూపవనాంతా శ్చ దుర్గా శ్చ ధరణీధరాః ॥**
**లోళితా వసుధా సర్వా న తు పశ్యామి జానకీమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– పల్వలాని – తటాకాని – సరాంసి – సరితః – తథా – నద్యః – అనూపవనాంతాః – చ – దుర్గాః – చ – ధరణీధరాః – లోళితా – వసుధా – సర్వా – న – తు – పశ్యామి – జానకీమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– పల్వలాని = నీటిగుంటలు, తటాకాని = చెరువులు, సరాంసి = సరోవరములు, లోళితాని = వెదుకబడినవి. తథా = అట్లే, సరితః = చిన్ననదులు, నద్యః = మహానదులు, అనూపవనాంతాశ్చ = నీరుగల తోటలును, దుర్గాః ధరణీధరాశ్చ = చేరుటకు శక్యముగాని మహాపర్వతములును, లోళితాః = వెదుకబడినవి. సర్వా వసుధా చ = సమస్తమైన భూమియును, లోళితా = వెదుకబడినది. జానకీం నహి పశ్యామి = సీతమ్మను మాత్రము చూడలేకపోతిని.

**తాత్పర్యము** :– ఎల్లనీటిపడియలను, చెరువులను, సరోవరములను, చిన్న నదులను, మహానదులను, వివిధములైన అరణ్యములను, దుర్గమమైన పర్వతములను, సమస్త వసుధను నేను అన్వేషించితిని. కాని సీతమ్మమాత్రము కానరాకున్నది.

**శ్లో॥ ఇహ సంపాతినా సీతా రావణస్య నివేశనే ।**
**ఆఖ్యాతా గృధ్రరాజేన న చ పశ్యామి తా మహమ్ ॥ 5**

**పదచ్ఛేదము** :– ఇహ – సంపాతినా – సీతా – రావణస్య – నివేశనే – ఆఖ్యాతా – గృధ్రరాజేన – న – చ – పశ్యామి – తామ్ – అహమ్ ॥

**అన్వయక్రమము** :– గృధ్రరాజేన సంపాతినా ఇహ రావణస్య నివేశనే సీతా ఆఖ్యాతా; తామ్ అహం న చ పశ్యామి.

**ప్రతిపదార్థము** :– గృధ్రరాజేన = పక్షిరాజైన, సంపాతినా = సంపాతిచే, ఇహ = ఇచ్చట, రావణస్య నివేశనే = రావణాసురుని భవనమునందు, సీతా ఆఖ్యాతా = సీత (యున్నట్లుగా) చెప్పబడినది. తాం = ఆమెను, అహం = నేను, న చ పశ్యామి = చూచుటలేదు.

**తాత్పర్యము** :– పక్షిరాజైన సంపాతి సీతమ్మ రావణుని భవనమునం దున్నదని వెల్లడించి యున్నాడు. కాని ఎందుచేతనో నేనామెను కనుగొనలేకున్నాను.

**శ్లో॥ కిం ను సీతాఽథ వైదేహీ మైథిలీ జనకాత్మజా ।**
**ఉపతిష్ఠేత వివశా రావణం దుష్టచారిణమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :– కిం – ను – సీతా – అథ – వైదేహీ – మైథిలీ – జనకాత్మజా – ఉపతిష్ఠేత – వివశా – రావణం – దుష్టచారిణమ్ ॥

**అన్వయక్రమము** :– వైదేహీ, మైథిలీ, వివశా, దుష్టచారిణం రావణమ్ ఉపతిష్ఠేత కిం ను?

**ప్రతిపదార్థము :–** వైదేహీ = విదేహరాజపుత్రియు, మైథిలీ = మిథిలానివాసినియును, జనకాత్మజా = జనకుని కుమార్తెయునగు సీతమ్మ, వివశా = వివశురాలై, దుష్టచారిణం రావణం = దుర్మార్గుడైన రావణాసురుని, ఉపతిష్ఠేత కిం ను = సేవించునా?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

"రావణం దుష్టచారిణమ్"కు బదులుగా "రావణేన హృతా బలాత్" అని బొంబాయి పాఠము.

**తిలకము :–** "సీత" లాంగలపద్ధతి జనితయై అయోనిజ యగునట్టిదిగాన సామాన్య స్త్రీగాదు.

"వైదేహీ" – జగత్ప్రశస్తమైన విదేహవంశమున పెరిగినది.

"జనకాత్మజా" – బ్రహ్మజ్ఞానియగు తండ్రి పెంపకమున పెరిగినది.

"కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః" – భగవద్గీత.

**గోవిందరాజీయము :–** మైథిలీ – ఆచారప్రధానమైన కులమునందు పుట్టినది. వివశా = కామవశురాలై.

**రామానుజీయము :–** 'మైథిలి' అనుటచే సదాచారసంపత్తిగల సత్పురుషులకు వాసభూతమైన నగరమున పెరిగినట్టిది అని భావము.

**తాత్పర్యము :–** పవిత్రమైన వంశమునందు జన్మించినదియును, సదాచారసంపత్తిగల పెద్దలలో మెలగినదియును, బ్రహ్మజ్ఞాని కుమార్తె యైనట్టిదియును, అయోనిజయై అద్భుతమైన జన్మపద్ధతి గలదియునగు సీతమ్మ ప్రాకృతస్త్రీవలె వివశురాలై దుష్ట చరిత్రుడైన రావణుని సేవించుటకు ఎట్లు అంగీకరించును?

**శ్లో॥ క్షిప్ర ముత్పతతో మన్యే సీతా మాదాయ రక్షసః ।**
**బిభ్యతో రామబాణానా మంతరా పతితా భవేత్ ॥ 7**

**పదచ్ఛేదము :–** క్షిప్రమ్ – ఉత్పతతః – మన్యే – సీతామ్ – ఆదాయ – రక్షసః – బిభ్యతః – రామబాణానామ్ – అంతరా – పతితా – భవేత్ ॥

**అన్వయక్రమము :–** రామబాణానాం బిభ్యతః రక్షసః సీతామ్ ఆదాయ క్షిప్రమ్ ఉత్పతతః (సతః) అంతరా సీతా పతితా భవేత్ (ఇతి) మన్యే.

**ప్రతిపదార్థము :–** రామబాణానాం బిభ్యతః = రాముని బాణములకు భయపడినట్టి, రక్షసః = రావణుడు, క్షిప్రమ్ ఉత్పతతః (సతః) = వేగముగా ఎగిరిపోవుచుండగా,

అంతరా = మార్గమధ్యమున, సీతా = సీతమ్మ, పతితా భవేత్ = పడిపోయి యుండును, (ఇతి) మన్యే = అని భావించుచున్నాను.

**తాత్పర్యము :–** రాముని బాణతీక్ష్ణతకు భీతినొందిన రావణుడు సముద్రముపైన సీతను మహావేగముతో గొనిపోవుచుండగా మార్గమధ్యమున సీతమ్మ సాగరజలములో పడిపోయి యుండునని భావించుచున్నాను.

**శ్లో॥ అథవా హ్రియమాణాయాః పథి సిద్ధనిషేవితే ।**
**మన్యే పతిత మార్యాయా హృదయం ప్రేక్ష్య సాగరమ్ ॥ 8**

**పదచ్ఛేదము :–** అథ – వా – హ్రియమాణాయాః – పథి – సిద్ధనిషేవితే – మన్యే – పతితమ్ – ఆర్యాయాః – హృదయం – ప్రేక్ష్య – సాగరమ్ ॥

**అన్వయక్రమము :–** అథవా, సిద్ధనిషేవితే పథి, హ్రియమాణాయాః ఆర్యాయాః, హృదయం, సాగరం ప్రేక్ష్య పతితం (ఇతి) మన్యే.

**ప్రతిపదార్థము :–** అథవా = లేక, సిద్ధనిషేవితే పథి = సిద్ధులు సంచరించునట్టి మార్గమగు ఆకాశమున, హ్రియమాణాయాః = అపహరింపబడుచున్నట్టి, ఆర్యాయాః = పూజ్యురాలైన సీతమ్మయొక్క, హృదయం = గుండె (అనగా దేహమని భావము), సాగరం ప్రేక్ష్య = (భయంకరమైన) సముద్రమును జూచి, పతితం (ఇతి) మన్యే = పడిపోయెనని భావించెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** 'ఆర్యాయాః హృదయం పతితం' అనగా సీతమ్మయొక్క మనస్సు జారిపోయినది. మనస్సు జారిపోవుటయే మరణము. అనగా ఆమె చనిపోయినదని హనుమ తలచెనని భావము.

**గోవిందరాజీయము :–** 'ఆర్యాయాః హృదయం పతితం' – సముద్రమును జూచి భీతినొందిన హృదయము సముద్రములో పడిపోయెనని హనుమ తలచుచున్నాడు. హృదయము భయమునకు స్థానమగుట ప్రసిద్ధము. హృదయము పడుట యనగా, దాని కాధారమైన శరీరము పడుటయే.

**తాత్పర్యము :–** లేక రావణుడు ఆ సమయమునందు తనను గ్రహించి పయనించు చుండగా క్రిందనున్న భయంకరమగు సముద్రమును జూచి సీతమ్మ హృదయము భయగ్రస్తమై ఆమె సముద్రమున పడిపోయిన దేమో!

**శ్లో॥ రావణ స్యోరువేగేన భుజాభ్యాం పీడితేన చ ।**
**తయా మన్యే విశాలాక్ష్యా త్యక్తం జీవిత మార్యయా ॥ 9**

**పదచ్ఛేదము :–** రావణస్య – ఉరువేగేన – భుజాభ్యాం – పీడితేన – చ – తయా – మన్యే – విశాలాక్ష్యా – త్యక్తం – జీవితమ్ – ఆర్యయా ॥

**అన్వయక్రమము :–** రావణస్య ఉరువేగేన, భుజాభ్యాం పీడితేన చ, విశాలాక్ష్యా తయా ఆర్యయా జీవితం త్యక్తమ్ ఇతి మన్యే.

**ప్రతిపదార్థము :–** రావణస్య = రావణునియొక్క, ఉరువేగేన = గొప్పదైన వేగము చేతను, భుజాభ్యాం = భుజములచే, పీడితేన చ = పీడనముచేతను, విశాలాక్ష్యా తయా ఆర్యయా = విశాలమైన నేత్రములుగల ఆ పూజ్యురాలైన సీతాదేవిచేత, జీవితం త్యక్తం = ప్రాణము విడువబడెను, ఇతి మన్యే = అని భావింతును.

**తాత్పర్యము :–** రావణునియొక్క మహావేగమును, బాహువుల పీడనమును సహింపలేక పూజ్యురాలైన సీతాదేవి తన ప్రాణములను విడిచియుండునని భావింతును.

**శ్లో॥ ఉపర్యుపరి వా నూనం సాగరం క్రమత స్తదా ।**
**వివేష్టమానా పతితా సముద్రే జనకాత్మజా ॥ 10**

**పదచ్ఛేదము :–** ఉపరి – ఉపరి – వా – నూనం – సాగరం – క్రమతః – తదా – వివేష్టమానా – పతితా – సముద్రే – జనకాత్మజా ॥

**అన్వయక్రమము :–** తదా రావణస్య సాగరం ఉపరి ఉపరి క్రమతః (సతః) జనకాత్మజా వివేష్టమానా సముద్రే నూనం పతితా.

**ప్రతిపదార్థము :–** తదా = ఆనాడు, రావణస్య = రావణుడు, సాగరమ్ ఉపరి ఉపరి = సముద్రము మీదుగా, క్రమతః (సతః) = పయనించుచుండగా, జనకాత్మజా = సీతమ్మ, వివేష్టమానా = (అవయవములను) విదుల్చుచున్నదై, సముద్రే = సముద్రమునందు, నూనం = నిశ్చయముగా, పతితా వా = పడియుండెనేమో!

**తాత్పర్యము :–** ఆనాడు సముద్రముమీద నుండి రావణుడు తనను గొనిపోవుచుండగా సీతాదేవి తన చేతులను కాళ్ళను విదుల్చుచు నిశ్చయముగా సముద్రమునందే పడిపోయి యుండును.

**శ్లో॥ అహో క్షుద్రేణ వా౽నేన రక్షంతీ శీల మాత్మనః ।**
**అబంధు ర్భక్షితా సీతా రావణేన తపస్వినీ ॥ 11**

**పదచ్ఛేదము :–** అహో – క్షుద్రేణ – వా – అనేన – రక్షంతీ – శీలమ్ – ఆత్మనః – అబంధుః – భక్షితా – సీతా – రావణేన – తపస్వినీ ॥

**అన్వయక్రమము :–** వా, క్షుద్రేణ అనేన రావణేన, ఆత్మనః శీలం రక్షంతీ, అబంధుః, తపస్వినీ, సీతా, అహో భక్షితా భవేత్.

**ప్రతిపదార్థము :–** వా = లేక, క్షుద్రేణ అనేన రావణేన = నీచుడైన ఈ రావణునిచే, ఆత్మనః శీలం రక్షంతీ = తన శీలమును కాపాడుకొనుచున్నదై, అబంధుః = నిస్సహాయురాలయిన, తపస్వినీ = దయనీయమైన స్థితిలోనున్న, సీతా = సీతమ్మ, అహో భక్షితా భవేత్ = అయ్యో తినివేయబడినదేమో!

**తాత్పర్యము :–** తన పాతివ్రత్యమును పట్టుదలతో కాపాడుకొనుచు నిస్సహాయురాలై, దయనీయస్థితిలో నున్న సీతాదేవి నీచుడైన ఈ రావణునిచే భక్షింపబడినదేమో!

**శ్లో॥ అథవా రాక్షసేంద్రస్య పత్నీభి రసితేక్షణా ।**
**అదుష్టా దుష్టభావాభి ర్భక్షితా సా భవిష్యతి ॥ 12**

**పదచ్ఛేదము :–** అథ – వా – రాక్షసేంద్రస్య – పత్నీభిః – అసితేక్షణా – అదుష్టా – దుష్టభావాభిః – భక్షితా – సా – భవిష్యతి ॥

**అన్వయక్రమము :–** అథవా దుష్టభావాభిః రాక్షసేంద్రస్య పత్నీభిః, అదుష్టా అసితేక్షణా సా, భక్షితా భవిష్యతి.

**ప్రతిపదార్థము :–** అథవా = లేక, దుష్టభావాభిః = దుర్మార్గమైనట్టి ఆలోచనలుగల, రాక్షసేంద్రస్య పత్నీభిః = రావణుని భార్యలచే, అదుష్టా = ఉత్తమమైన స్వభావముగల, అసితేక్షణా సా = నల్లని కన్నులు గల ఆ సీతమ్మ, భక్షితా భవిష్యతి = తినివేయబడి యుండును.

**తాత్పర్యము :–** లేక ఈ పరమదుర్మార్గురాండ్రయిన రావణుని భార్యలే, ఏ దుష్ట మార్గమును ఎఱుగనట్టి సీతాదేవిని భక్షించియుందురు.

**శ్లో॥ సంపూర్ణచంద్రప్రతిమం పద్మపత్రనిభేక్షణమ్ ।**
**రామస్య ధ్యాయతీ వక్త్రం పంచత్వం కృపణా గతా ॥ 13**

**పదచ్ఛేదము :–** సంపూర్ణచంద్రప్రతిమం – పద్మపత్రనిభేక్షణమ్ – రామస్య – ధ్యాయతీ – వక్త్రం – పంచత్వం – కృపణా – గతా ॥

**అన్వయక్రమము :–** కృపణా, సంపూర్ణచంద్రప్రతిమం, పద్మపత్రనిభేక్షణం, రామస్య

వక్త్రం ధ్యాయతీ, పంచత్వం గతా.

**ప్రతిపదార్థము** :– కృపణా = దీనురాలైన సీత, సంపూర్ణచంద్రప్రతిమం = నిండు చంద్రునితో సమానమైనట్టియు, పద్మపత్రనిభేక్షణం = పద్మదళములవంటి కన్నులు గలదియును అగు, రామస్య వక్త్రం = శ్రీరాముని ముఖమును, ధ్యాయతీ = ధ్యానించు చున్నదై, పంచత్వం గతా (స్యాత్) = మరణమును పొందియుండును.

**తాత్పర్యము** :– దీనురాలైన సీత పద్మదళముల వంటి కన్నులు గలిగి, రమ్యమైయుండు రాముని ముఖారవిందమును ధ్యానించుచున్నదై మృత్యువు నొందియుండును.

**శ్లో॥ హా రామ లక్ష్మణేత్యేవం హాఽయోధ్యే చేతి మైథిలీ ।**
**విలప్య బహు వైదేహీ న్యస్తదేహా భవిష్యతి ॥ 14**

**పదచ్ఛేదము** :– హా – రామ – లక్ష్మణ – ఇతి – ఏవం – హా అయోధ్యే – చ – ఇతి – మైథిలీ – విలప్య – బహు – వైదేహీ – న్యస్తదేహా – భవిష్యతి ॥

**అన్వయక్రమము** :– హా రామ, లక్ష్మణ, హా అయోధ్యే, ఇతి చ ఏవం బహు విలప్య మైథిలీ వైదేహీ న్యస్తదేహా భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– హా రామ = అయ్యో రామా!, హా లక్ష్మణ = అయ్యో లక్ష్మణా!, హా అయోధ్యే = అయ్యో అయోధ్యానగరమా!, ఇతి = అని, ఏవం = ఈరీతిగా, బహు విలప్య = మిక్కిలిగా శోకించి, మైథిలీ వైదేహీ = మిథిలాపతియొక్క కన్యయైన సీతాదేవి, న్యస్తదేహా భవిష్యతి = శరీరమును విడిచినదై యుండును.

**తాత్పర్యము** :– హా రామా! హా లక్ష్మణా! అనియును, అయ్యో! అయోధ్యనగరమా అనియు, ఎంతగనో విలపించి సీతాదేవి తన దేహమును విడిచి యుండును.

**శ్లో॥ అథవా నిహితా మన్యే రావణస్య నివేశనే ।**
**నూనం లాలప్యతే సీతా పంజరస్థేవ శారికా ॥ 15**

**పదచ్ఛేదము** :– అథ – వా – నిహితా – మన్యే – రావణస్య – నివేశనే – నూనం – లాలప్యతే – సీతా – పంజరస్థా – ఇవ – శారికా ॥

**అన్వయక్రమము** :– అథవా రావణస్య నివేశనే నిహితా (సతీ) సీతా పంజరస్థా శారికా ఇవ లాలప్యతే ఇతి మన్యే.

**ప్రతిపదార్థము** :– అథవా = లేక, రావణస్య నివేశనే = రావణుని భవనమునందు, నిహితా = ఉంచబడినదై, సీతా = సీతమ్మ, పంజరస్థా శారికా ఇవ = పంజరమునందు

బంధింపబడిన గోరువంకవలె, నూనం = నిశ్చయముగా, లాలప్యతే = మిక్కిలి విలపించుచున్నది, ఇతి మన్యే = అని భావింతును.

**తాత్పర్యము :–** లేక రావణుని భవనమునందే ఏ పాతాళభవనమునందో దాచబడినదై పంజరములోని మైనగోరపిట్టవలె నిశ్చయముగా సీతాదేవి ఎంతగనో విలపించు చుండును.

**శ్లో॥ జనకస్య సుతా సీతా రామపత్నీ సుమధ్యమా ।**
**కథ ముత్పలపత్రాక్షీ రావణస్య వశం వ్రజేత్ ॥ 16**

**పదచ్ఛేదము :–** జనకస్య – సుతా – సీతా – రామపత్నీ – సుమధ్యమా – కథమ్ – ఉత్పలపత్రాక్షీ – రావణస్య – వశం – వ్రజేత్ ॥

**అన్వయక్రమము :–** జనకస్య సుతా రామపత్నీ, సుమధ్యమా, ఉత్పలపత్రాక్షీ సీతా రావణస్య వశం కథం వ్రజేత్.

**ప్రతిపదార్థము :–** జనకస్య సుతా = బ్రహ్మజ్ఞానియైన జనకుని కుమార్తెయు, రామపత్నీ = శ్రీరాముని భార్యయును, సుమధ్యమా = సుందరమైన నడుముగలదియును, ఉత్పల పత్రాక్షీ = తామరరేకులవంటి కన్నులు గలదియును అగు, సీతా = సీతమ్మ, కథం = ఏవిధముగా, రావణస్య = రావణునికి, వశం వ్రజేత్ = వశము కాగలదు?

**తాత్పర్యము :–** జనకమహారాజుయొక్క కుమార్తెయును, శ్రీరాముని ధర్మపత్నియు, సర్వశుభలక్షణసంపన్నయునగు సీతమ్మ నీచుడైన రావణునకు ఎన్నటికి వశము గానేరదు.

**శ్లో॥ వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా ।**
**రామస్య ప్రియభార్యస్య న నివేదయితుం క్షమమ్ ॥ 17**

**పదచ్ఛేదము :–** వినష్టా – వా – ప్రణష్టా – వా – మృతా – వా – జనకాత్మజా – రామస్య – ప్రియభార్యస్య – న – నివేదయితుం – క్షమమ్ ॥

**అన్వయక్రమము :–** వినష్టా వా ప్రణష్టా వా మృతా వా జనకాత్మజా రామస్య ప్రియభార్యస్య రామస్య నివేదయితుం న క్షమమ్.

**ప్రతిపదార్థము :–** వినష్టా వా = ఎచ్చటనో దాచబడి కాన్పింపకున్నను, ప్రణష్టా వా = దూరమునందుండుటచే కాన్పింపకున్నను, మృతా వా = మరణించియున్నను, జనకాత్మజా = సీతమ్మ, ప్రియభార్యస్య = భార్యయం దమితప్రేమగల, రామస్య = శ్రీరామునకు, నివేదయితుం = విన్నవించుటకు, న క్షమమ్ = ఉచితముగాదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** 'వినష్టా వా' – అన్ని ప్రదేశములనుగూడ వెదకి యుండుటచే ఎచ్చటనో అతి రహస్యమైనచోట నున్న దనుకొనుటకును వీలులేదుగదా! ప్రణష్టా వా – దూరమునం దున్నదనియును స్పష్టముగా తెలియలేదుగదా! మృతా వా – మరణించినది అనుటకును ప్రమాణము లేదుగదా! అందుచేత శ్రీరామునకేమి చెప్పుటకును అశక్యమే యని హనుమ భావించుట యుక్తమే!

**గోవిందరాజీయము :–** వినష్టా = పాతాళగృహాదులందు దాచబడుటచే కాన్పింప కున్నది. ప్రణష్టా = సముద్రపతనాదులచే త్యక్తజీవితయైనది. మృతా = రామవిరహ దుఃఖమును సహింపలేక మృతిచెందినది.

**తాత్పర్యము :–** సీతామాత పరులకు కాన్పించకుండగా ఎచ్చటనో దాచబడినది. లేక ఏ సముద్రమునందో జారిపడిపోయినది. లేక భర్తృవిరహదుఃఖమును భరింపలేక తానే ప్రాణములను విడచినది. ఎట్టి పరిస్థితియందైనను భార్యను అమితముగా ప్రేమించు శ్రీరామున కే విషయమైన తెలియజేయుట అశక్యముగనే కాన్పించుచున్నది.

**శ్లో॥ నివేద్యమానే దోష స్స్యాద్దోష స్యా దనివేదనే ।**
**కథం ను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతి మే ॥ 18**

**పదచ్ఛేదము :–** నివేద్యమానే – దోషః – స్యాత్ – దోషః – స్యాత్ – అనివేదనే – కథం – ను – ఖలు – కర్తవ్యం – విషమం – ప్రతిభాతి – మే ॥

**అన్వయక్రమము :–** నివేద్యమానే దోషః స్యాత్, అనివేదనే దోషః స్యాత్, కథం ను ఖలు కర్తవ్యం, మే విషమం ప్రతిభాతి.

**ప్రతిపదార్థము :–** నివేద్యమానే = విన్నవింపబడినచో, దోషః స్యాత్ = దోషమగును, అనివేదనే = విన్నవింపనిచో, దోషః స్యాత్ = దోషము సంభవించును, కథం ను ఖలు కర్తవ్యం = ఏమి చేయవలసియున్నదో గదా! మే విషమం ప్రతిభాతి = నాకు విరుద్ధముగా కానవచ్చుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** విషమం = దురనుష్ఠేయము అనగా ఆచరణకు అసాధ్యము.

**తాత్పర్యము :–** యథార్థమును నేను శ్రీరామునకు విన్నవించినచో అతనికి ప్రాణహాని కలిగించిన దోషము సంభవించును. ఏమియు తెలుపక ఊరకుండినచో స్వామివంచన రూపమగు దోషము తటస్థించును. ఇట్టి స్థితిలో నాకు నా కర్తవ్యము అంతయును

విషమముగా గానవచ్చుచున్నది.

**శ్లో॥ అస్మి న్నేవంగతే కార్యే ప్రాప్తకాలం క్షమం చ కిమ్ ।**
**భవే దితి మతం భూయో హనుమా న్ప్రవిచారయత్ ॥ 19**

**పదచ్ఛేదము :–** అస్మిన్ – ఏవం – గతే – కార్యే – ప్రాప్తకాలం – క్షమం – చ – కిమ్ – భవేత్ – ఇతి – మతం – భూయః – హనుమాన్ – ప్రవిచారయత్ ॥

**అన్వయక్రమము :–** ఏవం గతే అస్మిన్ కార్యే ప్రాప్తకాలం క్షమం చ కిం భవేత్? ఇతి భూయః హనుమాన్ మతం ప్రవిచారయత్.

**ప్రతిపదార్థము :–** ఏవం గతే = ఈరీతిగానున్నట్టి, అస్మిన్ కార్యే = ఈ కార్యమునందు, ప్రాప్తకాలం = కాలోచితమైనట్టిదియును, క్షమం చ = చేయదగినట్టిదియును, కిం భవేత్ = ఏమైయుండును? ఇతి = అని, హనుమాన్ = హనుమంతుడు, భూయః = తిరిగి, మతం ప్రవిచారయత్ = ఉత్తమపద్ధతినిగూర్చి ఆలోచింపసాగెను.

**తాత్పర్యము :–** కార్య మీరీతిగ నుండగా కాలోచితముగా చేయవలసిన పని ఏమై యుండును? అని సమర్థమైన పద్ధతిని గూర్చి హనుమంతుడు తిరిగి ఆలోచింపసాగెను.

**శ్లో॥ యది సీతా మదృష్ట్వాఽహం వానరేంద్రపురీ మితః ।**
**గమిష్యామి తతః కో మే పురుషార్థో భవిష్యతి ॥ 20**

**పదచ్ఛేదము :–** యది – సీతామ్ – అదృష్ట్వా – అహం – వానరేంద్రపురీమ్ – ఇతః – గమిష్యామి – తతః – కః – మే – పురుషార్థః – భవిష్యతి ॥

**అన్వయక్రమము :–** యది అహం సీతామ్ అదృష్ట్వా ఇతః వానరేంద్రపురీం గమిష్యామి, తతః మే కః పురుషార్థః భవిష్యతి ॥

**ప్రతిపదార్థము :–** అహం = నేను, సీతాం అదృష్ట్వా = సీతమ్మను చూడకుండ, ఇతః = ఈ లంకానగరమునుండి, వానరేంద్రపురీం = కిష్కింధానగరమునుగూర్చి, గమిష్యామి యది = వెళ్లినయెడల, తతః = అప్పుడు, మే = నాకు, కః పురుషార్థః భవిష్యతి = ఏమి పురుషార్థము కాగలదు?

**తాత్పర్యము :–** సీతమ్మను చూడకయే నే నీ లంకానగరము నుండి కిష్కింధకు పోయినచో నేనేమి పురుషార్థమును సాధించినవాడనగుదును ?

**శ్లో॥ మ మేదం లంఘనం వ్యర్థం సాగరస్య భవిష్యతి ।**
**ప్రవేశ శ్చైవ లంకాయా రాక్షసానాం చ దర్శనమ్ ॥ 21**

**పదచ్ఛేదము** :– మమ – ఇదం – లంఘనం – వ్యర్థం – సాగరస్య – భవిష్యతి – ప్రవేశః – చ – ఏవ – లంకాయాః – రాక్షసానాం – చ – దర్శనమ్ ॥

**అన్వయక్రమము** :– మమ ఇదం సాగరస్య లంఘనం వ్యర్థం భవిష్యతి; లంకాయాః ప్రవేశశ్చ ఏవ రాక్షసానాం దర్శనం చ వ్యర్థం భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– మమ = నాయొక్క, ఇదం సాగరస్య లంఘనం = ఈ సముద్రముయొక్క దాటుటయును, లంకాయాః ప్రవేశశ్చ = లంకలోనికి ప్రవేశించుటయును, రాక్షసానాం దర్శనం చ = రాక్షసులయొక్క పరికించుటయును, వ్యర్థం భవిష్యతి = వ్యర్థమే కాగలదు.

**తాత్పర్యము** :– నేను గావించిన ఈ సముద్రలంఘనము గాని ఈ లంకానగర ప్రవేశముగాని ఈ రాక్షసుల నెల్లరను పరికించుట గాని అంతయును నిరర్థకమే అయిపోవును గదా!

**శ్లో॥ కిం మాం వక్ష్యతి సుగ్రీవో హరయో వా సమాగతాః ।**
**కిష్కింధాం సమనుప్రాప్తం తౌ వా దశరథాత్మజౌ ॥ 22**

**పదచ్ఛేదము** :– కిం – మాం – వక్ష్యతి – సుగ్రీవః – హరయః – వా – సమాగతాః – కిష్కింధాం – సమనుప్రాప్తం – తౌ – వా – దశరథాత్మజౌ ॥

**అన్వయక్రమము** :– కిష్కింధాం సమనుప్రాప్తం మాం సుగ్రీవః కిం వక్ష్యతి? సమాగతాః హరయో వా (కిం వక్ష్యంతి?) తౌ దశరథాత్మజౌ వా (కిం వక్ష్యతః?).

**ప్రతిపదార్థము** :– కిష్కింధాం సమనుప్రాప్తం = కిష్కింధానగరమును చేరుకొన్నట్టి, మాం = నన్ను, సుగ్రీవః కిం వక్ష్యతి = సుగ్రీవు డేమనును? సమాగతాః = నా చుట్టును మూగినట్టి, హరయో వా = వానరులు గాని, (కిం వక్ష్యంతి = ఏమందురు?) తౌ దశరథాత్మజౌ వా = ఆ దశరథపుత్రు లిరువురు గాని, (కిం వక్ష్యతః = ఏమందురు?).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'కిం వక్ష్యతి ?' = చెడ్డగానే మాటలాడును.

**రామాయణ శిరోమణి** :– 'కిం వక్ష్యతి ?' = ఛీ ఏమి పని చేసితివని అందురు.

**తాత్పర్యము** :– నేను కిష్కింధకు చేరుకొనగానే నన్ను జూచి మారాజు సుగ్రీవుడు ఏమనును? మా వానరులు నన్ను చుట్టును చేరి ఏమందురు? ఆ రామలక్ష్మణులు

నన్ను గూర్చి ఏమనగలరో గదా!

**శ్లో॥ గత్వా తు యది కాకుత్థ్సం వక్ష్యామి పరమప్రియం ।**
**న దృష్టేతి మయా సీతా తత స్త్యక్ష్యతి జీవితమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :– గత్వా – తు – యది – కాకుత్థ్సం – వక్ష్యామి – పరమ్ – అప్రియం – న – దృష్టా – ఇతి – మయా – సీతా – తతః – త్యక్ష్యతి – జీవితమ్ ॥

**అన్వయక్రమము** :– కాకుత్థ్సం గత్వా మయా సీతా న దృష్టా ఇతి పరమ్ అప్రియం వక్ష్యామి యది తతః (సః) జీవితం త్యక్ష్యతి.

**ప్రతిపదార్థము** :– గత్వా = (కిష్కింధకు) పోయి, కాకుత్థ్సం = శ్రీరాముని గూర్చి, మయా = నాచే, సీతా = సీతమ్మ, న దృష్టా = చూడబడలేదు, ఇతి = అని, పరమ్ అప్రియం = మిక్కిలి దుఃఖకరమైన వార్తను, వక్ష్యామి యది = చెప్పినయెడల, తతః = వెంటనే, (సః = ఆ రాఘవుడు) జీవితం త్యక్ష్యతి = ప్రాణమును విడుచును.

**తాత్పర్యము** :– నేను కిష్కింధ కేగి శ్రీరాముని సమీపించి నాకు సీతమ్మ కాన్పింపలేదు అని పరమదారుణమైన దుర్వార్తను పలికిన యెడల ఆ రాఘవుడు ఉత్తరక్షణముననే తన ప్రాణమును విడుచునుగదా!

**శ్లో॥ పరుషం దారుణం క్రూరం తీక్ష్ణ మింద్రియతాపనమ్ ।**
**సీతానిమిత్తం దుర్వాక్యం శ్రుత్వా స న భవిష్యతి ॥ 24**

**పదచ్ఛేదము** :– పరుషం – దారుణం – క్రూరం – తీక్ష్ణమ్ – ఇంద్రియతాపనమ్ – సీతానిమిత్తం – దుర్వాక్యం – శ్రుత్వా – సః – న – భవిష్యతి ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– పరుషం = కర్ణకఠోరమైనదియును, దారుణం = భయంకరమైనదియును, తీక్ష్ణం = సహింప శక్యముగానిదియును, క్రూరం = ఉగ్రమైనదియును, ఇంద్రియతాపనం = సర్వేంద్రియములకును సంతాపము కలుగచేయునదియును అగు, సీతానిమిత్తం = సీతను గురించినట్టి, దుర్వాక్యం = దుర్వచనమును, శ్రుత్వా = విని, సః న భవిష్యతి = ఆ రాముడు జీవింపడు.

**తాత్పర్యము** :– సీతనుగురించి కర్ణకఠోరమును, దారుణమును, భయంకరమును, హృదయవిదారకమును, సర్వేంద్రియములకును సంతాపము కలిగించునదియును అగు "చూడలేకపోతిని" అను దుర్వాక్యమును నేను పలుకగా విని రామచంద్రుడు ఈ లోకముననే యుండడు.

**శ్లో॥ తం తు కృచ్ఛ్రగతం దృష్ట్వా పంచత్వగతమానసమ్ ।**
**భృశానురక్తో మేధావీ న భవిష్యతి లక్ష్మణః ॥ 25**

**పదచ్ఛేదము** :- తం - తు - కృచ్ఛ్రగతం - దృష్ట్వా - పంచత్వగతమానసమ్ - భృశానురక్తః - మేధావీ - న - భవిష్యతి - లక్ష్మణః ॥

**అన్వయక్రమము** :- పంచత్వగతమానసం కృచ్ఛ్రగతం తం దృష్ట్వా భృశానురక్తః, మేధావీ లక్ష్మణః న భవిష్యతి.

**ప్రతిపదార్థము** :- కృచ్ఛ్రగతం = ఆపదలో చిక్కిన, పంచత్వగతమానసం = మరణము నందున్న మనస్సు గలిగిన, తం దృష్ట్వా = ఆయనను జూచి, భృశానురక్తః = గాఢమైన అనురాగము కలిగినట్టి, మేధావీ లక్ష్మణః = జ్ఞానియైన లక్ష్మణుడు, న భవిష్యతి = ప్రాణముతో నుండడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- పంచత్వగతమానసం = మరణమునకు నిశ్చయించుకొన్నవాడు.

**తాత్పర్యము** :- దారుణమైన ఆపదలో చిక్కి, మరణింపబోవుచున్న అన్నను జూచి అన్నపై నత్యంతము అనురాగము పూనియుండు లక్ష్మణు డొక్క నిమిషమైనను జీవింపడు.

**శ్లో॥ వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా భరతో ఽపి మరిష్యతి ।**
**భరతం చ మృతం దృష్ట్వా శత్రుఘ్నో న భవిష్యతి ॥ 26**

**పదచ్ఛేదము** :- వినష్టౌ - భ్రాతరౌ - శ్రుత్వా - భరతః - అపి - మరిష్యతి - భరతం - చ - మృతం - దృష్ట్వా - శత్రుఘ్నః - న - భవిష్యతి ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- వినష్టౌ భ్రాతరౌ శ్రుత్వా = చనిపోయిన సోదరులను గూర్చి విని, భరతః అపి = భరతుడుగూడ, మరిష్యతి = మరణించును, భరతం మృతం దృష్ట్వా = భరతుడు చనిపోవుట చూచి, శత్రుఘ్నః న భవిష్యతి = శత్రుఘ్నుడు ప్రాణముతో నుండడు.

**తాత్పర్యము** :- సోదరు లిరువురును చనిపోయిరని వినగనే భరతుడు ప్రాణములను గోల్పోవును. భరతుడు చనిపోవుట జూచి శత్రుఘ్నుడును జీవింపడు.

**శ్లో॥ పుత్రాన్ మృతాన్ సమీక్ష్యాఽథ న భవిష్యంతి మాతరః ।**
**కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ న సంశయః ॥ 27**

**పదచ్ఛేదము :–** పుత్రాన్ – మృతాన్ – సమీక్ష్య – అథ – న – భవిష్యంతి – మాతరః – కౌసల్యా – చ – సుమిత్రా – చ – కైకేయీ – చ – న – సంశయః ॥

**అన్వయక్రమము :–** పుత్రాన్ మృతాన్ సమీక్ష్య అథ మాతరః కౌసల్యా చ సుమిత్రా చ కైకేయీ చ న భవిష్యంతి; న సంశయః.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, పుత్రాన్ = బిడ్డలను, మృతాన్ సమీక్ష్య = చనిపోయినవారినిగా జూచి, మాతరః = తల్లులు, కౌసల్యా చ, సుమిత్రా చ, కైకేయీ చ = కౌసల్యయు, సుమిత్రయు, కైకేయియును, న భవిష్యంతి = జీవించియుండరు, న సంశయః = సందేహములేదు.

**తాత్పర్యము :–** పిమ్మట పుత్రులు చనిపోవుట గాంచి, వారితల్లులైన కౌసల్యయు, సుమిత్రయు, కైకేయియు మువ్వురును ప్రాణములు విడుచుదురు; సందేహము లేదు.

**శ్లో॥ కృతజ్ఞ స్సత్యసంధశ్చ సుగ్రీవః ప్లవగాధిపః ।**
**రామం తథాగతం దృష్ట్వా తత స్త్యక్ష్యతి జీవితమ్ ॥ 28**

**పదచ్ఛేదము :–** కృతజ్ఞః – సత్యసంధః – చ – సుగ్రీవః – ప్లవగాధిపః – రామం – తథాగతం – దృష్ట్వా – తతః – త్యక్ష్యతి – జీవితమ్ ॥

**అన్వయక్రమము :–** తతః కృతజ్ఞః సత్యసంధశ్చ ప్లవగాధిపః సుగ్రీవః రామం తథాగతం దృష్ట్వా జీవితం త్యక్ష్యతి.

**ప్రతిపదార్థము :–** తతః = తరువాత, కృతజ్ఞః = చేసిన మేలును మరువనట్టివాడును, సత్యసంధశ్చ = సత్యసంధుడును అగు, ప్లవగాధిపః సుగ్రీవః = వానరరాజైన సుగ్రీవుడు, తథాగతం = అట్టి స్థితిలోనున్న, రామం = రాముని, దృష్ట్వా = చూచి, జీవితం = ప్రాణమును, త్యక్ష్యతి = విడుచును.

**తాత్పర్యము :–** చేసిన మేలును చిరకాలము స్మరించుకొనువాడును, ఆడి తప్పనివాడును అగు వానరరాజైన సుగ్రీవుడు శ్రీరాముడు మరణించుటను కనులతో జూచి వెంటనే ప్రాణమును విడుచును.

**శ్లో॥ దుర్మనా వ్యథితా దీనా నిరానందా తపస్వినీ ।**
**పీడితా భర్తృశోకేన రుమా త్యక్ష్యతి జీవితమ్ ॥ 29**

**పదచ్ఛేదము** :– దుర్మనాః – వ్యథితా – దీనా – నిరానందా – తపస్వినీ – పీడితా – భర్తృశోకేన – రుమా – త్యక్ష్యతి – జీవితమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– దుర్మనాః = చిత్తవైకల్యము నొందినదియును, వ్యథితా = దుఃఖపీడితు రాలును, దీనా = దయనీయురాలును, నిరానందా = ఆనందశూన్యమైనదియును, తపస్వినీ = కరుణింపదగినదియును, భర్తృశోకేన పీడితా = భర్తృవిరహదుఃఖముచే పీడింపబడినదియు నగు, రుమా = (సుగ్రీవుని భార్యయగు) రుమ, జీవితం త్యక్ష్యతి = ప్రాణమును విడుచును.

**తాత్పర్యము** :– వికలమనస్కురాలును, దుఃఖపీడితురాలును, దీనురాలును, ఆనంద శూన్యురాలును, తాపయుక్తురాలును, భర్తృవిరహదుఃఖపీడితయు నగు సుగ్రీవపత్ని రుమ వెంటనే ప్రాణములు విడుచును గదా!

**శ్లో॥ వాలిజేన తు దుఃఖేన పీడితా శోకకర్శితా ।**
**పంచత్వం చ గతే రాజ్ఞి తారాపి న భవిష్యతి ॥ 30**

**పదచ్ఛేదము** :– వాలిజేన – తు – దుఃఖేన – పీడితా – శోకకర్శితా – పంచత్వం – చ – గతే – రాజ్ఞి – తారా – అపి – న – భవిష్యతి ॥

**అన్వయక్రమము** :– వాలిజేన దుఃఖేన పీడితా, శోకకర్శితా, తారా అపి రాజ్ఞి చ పంచత్వం గతే సతి న భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– వాలిజేన దుఃఖేన = వాలి (మరణము) వలన గలిగిన దుఃఖముచేత, పీడితా = పీడింపబడుచున్నదై, శోకకర్శితా = శోకముచే కృశించియున్నట్టి, తారాపి = తారగూడ, రాజ్ఞి చ = రాజైన సుగ్రీవుడును, పంచత్వం గతే సతి = చనిపోవగా, న భవిష్యతి = జీవించియుండదు.

**తాత్పర్యము** :– వాలి మరణముచేత గలిగిన దుఃఖముతోడనే పీడింపబడుచు కృశించి యున్న తారగూడ నేడు వానరరాజు మరణించగనే తానును ప్రాణములు వీడును.

**శ్లో॥ మాతాపిత్రో ర్వినాశేన సుగ్రీవవ్యసనేన చ ।**
**కుమారో ఒప్యంగదః కస్మా ద్ధారయిష్యతి జీవితమ్ ॥ 31**

**పదచ్ఛేదము** :– మాతాపిత్రోః – వినాశేన – సుగ్రీవవ్యసనేన – చ – కుమారః – అపి – అంగదః – కస్మాత్ – ధారయిష్యతి – జీవితమ్ ॥

**ప్రతిపదార్థము** :– మాతాపిత్రోః వినాశేన = తల్లిదండ్రులైన తారావాలులయొక్క మరణముచేతను, సుగ్రీవవ్యసనేన చ = సుగ్రీవుని మరణముచేతనున్ను, కుమారః అంగదః అపి = పుత్రుడైన అంగదుడు కూడ, కస్మాత్ జీవితం ధారయిష్యతి = ఎట్లు జీవితమును నిలుపుకొన గలడు?

**తాత్పర్యము** :– తల్లిదండ్రులైన తారయు వాలియును, మరణించుటచేతను పినతండ్రి యగు సుగ్రీవుడు మృతిచెందుటచేతను యువకుడైన అంగదుడు మాత్రము ఎట్లు జీవించి యుండగలడు?

**శ్లో॥ భర్తృజేన తు దుఃఖేన హ్యభిభూతా వనౌకసః ।**
**శిరాం స్యభిహనిష్యంతి తలై ర్ముష్టిభి రేవ చ ॥ 32**

**పదచ్ఛేదము** :– భర్తృజేన – తు – దుఃఖేన – హి – అభిభూతాః – వనౌకసః – శిరాంసి – అభిహనిష్యంతి – తలైః – ముష్టిభిః – ఏవ – చ ॥

**ప్రతిపదార్థము** :– భర్తృజేన దుఃఖేన = ప్రభువు (మరణము) వలన కలిగిన దుఃఖముచే, అభిభూతాః వనౌకసః = పీడింపబడినట్టి వానరులు, తలైః = అరచేతులతోడను, ముష్టిభిః ఏవ చ = పిడికిళ్ళతోడనున్ను, శిరాంసి అభిహనిష్యంతి = తలలు బ్రద్దలుకొట్టు కొందురు.

**తాత్పర్యము** :– తమ రాజయిన సుగ్రీవుని మరణముచే కలిగిన దుఃఖముచే సంత ప్తులైన వానరులు అరచేతులతోడను, పిడికిళ్ళతోడను మొత్తుకొని తమ తలలు బ్రద్దలు కొట్టుకొందురుగదా!

**శ్లో॥ సాంత్వే నానుప్రదానేన మానేన చ యశస్వినా ।**
**లాలితాః కపిరాజేన ప్రాణాం స్త్యక్ష్యంతి వానరాః ॥ 33**

**పదచ్ఛేదము** :– సాంత్వేన – అనుప్రదానేన – మానేన – చ – యశస్వినా – లాలితాః – కపిరాజేన – ప్రాణాన్ – త్యక్ష్యంతి – వానరాః ॥

**అన్వయక్రమము** :– యశస్వినా కపిరాజేన సాంత్వేన, అనుప్రదానేన, మానేన చ లాలితాః వానరాః ప్రాణాన్ త్యక్ష్యంతి.

**ప్రతిపదార్థము** :– యశస్వినా కపిరాజేన = మహాయశస్సంపన్నుడైన సుగ్రీవునిచే, సాంత్వేన = ప్రియవచనములచేతను, అనుప్రదానేన = కోరిన వస్తువు లొసంగుటచేతను, మానేన చ = గౌరవముచేతను, లాలితాః వానరాః = ప్రేమతో చూడబడిన వానరులు, ప్రాణాన్ త్యక్ష్యంతి = ప్రాణములను విడిచెదరు.

**తాత్పర్యము** :- పరివారమును ప్రేమతో చూచుటయందు పేరుపడిన సుగ్రీవునిచే ప్రియవచనములచేతను, ప్రియవస్తుప్రదానములచేతను, ఆదరగౌరవములచేతను లాలింపబడినట్టి వానరభటు లందరును నేడు ప్రాణములను విడుచుదురు.

**శ్లో॥ న వనేషు న శైలేషు న నిరోధేషు వా పునః ।**
**క్రీడా మనుభవిష్యంతి సమేత్య కపికుంజరాః ॥ 34**

**పదచ్ఛేదము** :- న - వనేషు - న - శైలేషు - న - నిరోధేషు - వా - పునః - క్రీడామ్ - అనుభవిష్యంతి - సమేత్య - కపికుంజరాః ॥

**అన్వయక్రమము** :- పునః కపికుంజరాః సమేత్య, వనేషు, న క్రీడాం అనుభవిష్యన్తి; శైలేషు న; నిరోధేషు వా న.

**ప్రతిపదార్థము** :- పునః = తిరిగి, కపికుంజరాః = వానరశ్రేష్ఠులు, సమేత్య = గుమి గూడి, వనేషు = అరణ్యములందు, క్రీడాం న అనుభవిష్యన్తి = క్రీడను అనుభవింపలేరు, శైలేషు =పర్వతములందు, న = క్రీడను అనుభవింపలేరు. నిరోధేషు వా = ఇండ్లయందు, న = క్రీడ ననుభవింపలేరు.

**తాత్పర్యము** :- మా వానరశ్రేష్ఠులు పూర్వమువలె అరణ్యములందుగాని, పర్వతము లందుగాని పదిమంది కలసి తిరిగి క్రీడావినోదములను అనుభవింపజాలరు గదా!

**శ్లో॥ సపుత్రదారా స్సామాత్యా భర్తృవ్యసనపీడితాః ।**
**శైలాగ్రేభ్యః పతిష్యంతి సమేత్య విషమేషు చ ॥ 35**

**పదచ్ఛేదము** :- సపుత్రదారాః - సామాత్యాః - భర్తృవ్యసనపీడితాః - శైలాగ్రేభ్యః పతిష్యంతి - సమేత్య - విషమేషు - చ ॥

**ప్రతిపదార్థము** :- సపుత్రదారాః = భార్యాపుత్రులతో గూడినవారును, సామాత్యాః = స్నేహితులతో గూడినవారును అగు, వానరాః = వానరులు, భర్తృవ్యసనపీడితాః = ప్రభువుయొక్క ఆపదచే పీడింపబడినవారై, సమేత్య = సంఘముగా కూడి, శైలాగ్రేభ్యః = పర్వతశిఖరములనుండి, విషమేషు(చ) = లోతైనప్రదేశములందు, పతిష్యంతి = దూకెదరు.

**తాత్పర్యము** :- వానరులు తమ భార్యాపుత్రులతోడను మిత్రులతోడను గూడి తమ ప్రభువునకు గల్గిన ఆపదకు దుఃఖించినవారై ఉన్నతమైన శైలశిఖరములనుండి లోయలలోనికి దుమికి మరణింతురు.

**శ్లో॥ విష ముద్బంధనం వాఽపి ప్రవేశం జ్వలనస్య వా ।**
**ఉపవాస మథో శస్త్రం ప్రచరిష్యంతి వానరాః ॥ 36**

**పదచ్ఛేదము :–** విషమ్ – ఉద్బంధనం – వా – అపి – ప్రవేశం – జ్వలనస్య – వా – ఉపవాసమ్ – అథో – శస్త్రం – ప్రచరిష్యంతి – వానరాః ॥

**ప్రతిపదార్థము :–** అథో = పిమ్మట, వానరాః = వానరులు, విషం = విషమునుగాని, ఉద్బంధనం వా అపి = ఉటిపోసుకొనుటను గాని, జ్వలనస్య ప్రవేశం వా = అగ్నిలోనికి ప్రవేశించుటను గాని, ఉపవాసం = నిరాహారమును గాని, శస్త్రం = ఖడ్గాది ఆయుధమును గాని, ప్రచరిష్యంతి = ప్రయోగించుకొందురు.

**తాత్పర్యము :–** ఆ వానరులు విషమును త్రాగి గాని, ఉటిపోసుకొని గాని, అగ్నిలో ప్రవేశించి గాని, ప్రాయోపవేశముచేసి గాని, ఖడ్గాదిశస్త్రము ప్రయోగించుకొని గాని ఆత్మహత్య చేసికొందురు.

**శ్లో॥ ఘోర మారోదనం మన్యే గతే మయి భవిష్యతి ।**
**ఇక్ష్వాకుకులనాశ శ్చ నాశ శ్చైవ వనౌకసామ్ ॥ 37**

**పదచ్ఛేదము :–** ఘోరమ్ – ఆరోదనం – మన్యే – గతే – మయి – భవిష్యతి – ఇక్ష్వాకుకులనాశః – చ – నాశః – చ – ఏవ – వనౌకసామ్ ॥

**అన్వయక్రమము :–** మయి (కిష్కింధాం) గతే (సతి) ఘోరమ్ ఆరోదనం భవిష్యతి; ఇక్ష్వాకుకులనాశశ్చ, వనౌకసాం నాశశ్చ ఏవ భవిష్యతి (ఇతి) మన్యే.

**ప్రతిపదార్థము :–** మయి = నేను, (కిష్కింధాం) గతే (సతి) = కిష్కింధ చేరుకొనగనే, ఘోరమ్ ఆరోదనం భవిష్యతి = దారుణమైన ఆక్రందనము జరుగగలదు. ఇక్ష్వాకుకులనాశః చ = ఇక్ష్వాకుకులనాశమున్నూ, వనౌకసాం నాశః చ ఏవ = వానరుల వినాశమున్ను, భవిష్యతి = జరుగగలదు. (ఇతి) మన్యే = (అని) భావింతును.

**తాత్పర్యము :–** నేను కిష్కింధకు చేరుకొనగానే దారుణమైన ఆక్రందనము, కోలాహలము సంభవించును. అట్లే ఇక్ష్వాకుకులనాశనమున్ను, వానరుల సర్వనాశనమున్నూ తటస్థించునని భావించెదను.

**శ్లో॥ సోఽహం నైవ గమిష్యామి కిష్కింధాం నగరీమితః ।**
**న చ శక్ష్యా మ్యహం ద్రష్టుం సుగ్రీవం మైథిలీం వినా ॥ 38**

**పదచ్ఛేదము :–** సః – అహం – న – ఏవ – గమిష్యామి – కిష్కింధాం – నగరీమ్ –

ఇతః – న – చ – శక్ష్యామి – అహం – ద్రష్టుం – సుగ్రీవం – మైథిలీం – వినా ॥

**అన్వయక్రమము :–** సః అహమ్ ఇతః, కిష్కింధాం నగరీం నైవ గమిష్యామి, మైథిలీం వినా సుగ్రీవం ద్రష్టుం న చ శక్ష్యామి;

**ప్రతిపదార్థము :–** సః అహం = అట్టి నేను, ఇతః = ఈ లంక నుండి, కిష్కింధాం నగరీం = కిష్కింధాపట్టణమును, నైవ గమిష్యామి = వెళ్ళనే వెళ్ళను, మైథిలీం వినా = జానకి లేకుండగా, అహం = నేను, సుగ్రీవం = సుగ్రీవుని, ద్రష్టుం న చ శక్ష్యామి = దర్శింపనే లేను.

**తాత్పర్యము :–** సీతాదేవి వృత్తాంతమును గైకొనిపోకుండగా నేను సుగ్రీవుని దర్శింప జాలను. అందుచేత, ఈ లంకానగరమునుండి నేను కిష్కింధకు పోవనే పోవను.

**శ్లో॥ మ య్యగచ్ఛతి చేహస్థే ధర్మాత్మానౌ మహారథౌ ।**
**ఆశయా తౌ ధరిష్యేతే వానరా శ్చ మనస్వినః ॥ 39**

**పదచ్ఛేదము :–** మయి – అగచ్ఛతి – చ – ఇహస్థే – ధర్మాత్మానౌ – మహారథౌ – ఆశయా – తౌ – ధరిష్యేతే – వానరాః – చ – మనస్వినః ॥

**అన్వయక్రమము :–** మయి ఇహస్థే అగచ్ఛతి చ (సతి) ధర్మాత్మానౌ మహారథౌ తౌ ఆశయా మనస్వినః, వానరాశ్చ ధరిష్యేతే.

**ప్రతిపదార్థము :–** మయి ఇహస్థే = నేను ఇచటనే యుండి, (కిష్కింధాం) అగచ్ఛతి చ (సతి) = (కిష్కింధకు) పోవనప్పుడు, ధర్మాత్మానౌ = ధర్మాత్ములును, మహారథౌ = మహావీరులునగు, తౌ = (ఆ సోదరు) లిరువురును, ఆశయా = ఆశతో, ధరిష్యేతే = ప్రాణములను నిలుపుకొని యుందురు. మనస్వినః వానరాశ్చ = పౌరుషవంతులైన వానరులున్నూ, ధరిష్యంతే = ప్రాణములు ధరించియుందురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'ఆశయా' – సీతమ్మయొక్క జాడ తెలియుననెడి ఆశతో,

**తాత్పర్యము :–** నే నీ లంకయందే యుండి కిష్కింధానగరమునకు పోకున్నయెడల ధర్మాత్ములును, మహావీరులును అగు ఆ సోదరులు, రామలక్ష్మణులు సీత క్షేమవార్తను వినగల మను ఆశతో ప్రాణములను ధరించి యుందురు. అట్లే మా వానరులును నాకై ఎదురుచూచుచు ప్రాణములతో నుందురు.

**శ్లో॥ హస్తాదానో ముఖాదానో నియతో వృక్షమూలికః ।**
**వానప్రస్థో భవిష్యామి హ్యదృష్ట్వా జనకాత్మజామ్ ॥ 40**

**శ్లో॥ సాగరానూపజే దేశే బహుమూలఫలోదకే ॥ 41**

**పదచ్ఛేదము :–** హస్తాదానః – ముఖాదానః – నియతః – వృక్షమూలికః – వానప్రస్థః – భవిష్యామి – హి – అదృష్ట్వా – జనకాత్మజామ్ – సాగరానూపజే – దేశే – బహుమూలఫలోదకే ॥

**అన్వయక్రమము :–** జనకాత్మజామ్ అదృష్ట్వా వృక్షమూలికః, నియతః, హస్తాదానః, ముఖాదానః సన్ సాగరానూపజే, బహుమూలఫలోదకే దేశే వానప్రస్థః భవిష్యామి.

**ప్రతిపదార్థము :–** జనకాత్మజామ్ అదృష్ట్వా = జానకమ్మను చూడక, వృక్షమూలికః = వృక్షమూలము నివాసముగా గలవాడనై, నియతః = నియమము అవలంబించినవాడనై, హస్తాదానః = చేతికందినట్టి ఆహారమును భుజించువాడును, ముఖాదానః (సన్) = నోటికందిన ఆహారమును భుజించువాడను అగుచు, సాగరానూపజే = సముద్ర తీరమునందు, బహుమూలఫలోదకే = పెక్కుకందమూలములను, పండ్లను, జలమును కలిగినట్టి, దేశే = ప్రదేశమునందు, వానప్రస్థః భవిష్యామి = వానప్రస్థుడనై యుండెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** హస్తాదానః = హస్తప్రాప్తఫలాదిగ్రహీత, ముఖాదానః = ముఖపతిత ఫలాదిగ్రాహకుడు. వృక్షమూలికః = (వృక్షమూలనివాసి) వృక్షమూలములను మాత్రమే భుజించువాడు. నియతః = నియతేంద్రియుడు.

**తాత్పర్యము :–** నేను సీతమ్మను చూడలేకపోతిని గాబట్టి వృక్షమూలమునే వాసముగా చేసుకొని చేతికి లభించినదియును నోటికి లభించినదియును మాత్రమే భుజించుచు ఈ సముద్రతీరమునందే పెక్కు కందమూలఫలములును జలములును గల ప్రదేశము చూచుకొని వానప్రస్థుడనై యుండిపోయెదను.

**శ్లో॥ చితాం కృత్వా ప్రవేక్ష్యామి సమిద్ధ మరణీసుతమ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** చితాం – కృత్వా – ప్రవేక్ష్యామి – సమిద్ధమ్ – అరణీసుతమ్ ॥

**ప్రతిపదార్థము :–** చితాం కృత్వా = చితిని పేర్చుకొని, సమిద్ధమ్ అరణీసుతం = ప్రజ్వరిల్లిన అగ్నిని, ప్రవేక్ష్యామి = ప్రవేశించెదను.

**తాత్పర్యము :–** లేక ఇచ్చటనే నేను చితిని పేర్చుకొని, అగ్నిని రగుల్చుకొని అందు

ప్రవేశించి మరణించెదను.

**శ్లో॥ ఉపవిష్టస్య వా సమ్య గ్లింగినీం సాధయిష్యతః ।**
**శరీరం భక్షయిష్యంతి వాయసా శ్శ్వాపదాని చ ॥ 43**

**పదచ్ఛేదము :–** ఉపవిష్టస్య – వా – సమ్యక్ – లింగినీం – సాధయిష్యతః – శరీరం – భక్షయిష్యంతి – వాయసాః – శ్వాపదాని – చ ॥

**ప్రతిపదార్థము :–** ఉపవిష్టస్య = ప్రాయోపవేశమును బూని కూర్చుండునట్టి, లింగినీం = దేహమునుండి ప్రాణమును వెడలించునట్టి లింగిని యను పద్ధతిని, సమ్యక్ సాధయిష్యతః = శాస్త్రప్రకారము అవలంబించునట్టి, మమ = నాయొక్క, శరీరం = దేహమును, వాయసాః = కాకులును, శ్వాపదాని చ = క్రూరమృగములును, భక్ష యిష్యంతి = భుజింపగలవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'లింగినీం' = శరీరమునుండి ఆత్మను వేరుచేయునట్టి యోగము.

లింగం = సంన్యాసః (అనశనం) తద్వతీ లింగినీ.

**తాత్పర్యము :–** నేను శరీరమునుండి ప్రాణమును తొలగించునట్టి లింగినీమార్గమును బూని ప్రాయోపవిష్టుడనై యుండగా నా శరీరమును వాయసములును, క్రూర మృగములును భుజించగలవు.

**శ్లో॥ ఇదం మహర్షిభి ర్దృ ష్టం నిర్యాణ మితి మే మతిః ॥ 44**

**పదచ్ఛేదము :–** ఇదం – మహర్షిభిః – దృష్టం – నిర్యాణమ్ – ఇతి – మే – మతిః ॥

**ప్రతిపదార్థము :–** ఇదం = ఇది, మహర్షిభిః దృష్టం = మహాఋషులచే కనుగొన బడినట్టిదైన, నిర్యాణమ్ = ప్రాణత్యాగోపాయము, ఇతి = అని, మే మతిః = నా అభిప్రాయము.

**తాత్పర్యము :–** అగ్నిప్రవేశము, లింగిని అనెడి యోగము మహర్షులు నిర్ణయించినట్టి ప్రాణత్యాగమార్గములని నా అభిప్రాయము.

**శ్లో॥ సమ్య గాపః ప్రవేక్ష్యామి న చేత్ పశ్యామి జానకీమ్ ॥ 45**

**పదచ్ఛేదము :–** సమ్యక్ – ఆపః – ప్రవేక్ష్యామి – న – చేత్ – పశ్యామి – జానకీమ్ ॥

**అన్వయక్రమము :–** జానకీం న పశ్యామి చేత్ సమ్యక్ ఆపః ప్రవేక్ష్యామి.

**ప్రతిపదార్థము :–** జానకీం = సీతాదేవిని, న పశ్యామి చేత్ = చూడలేకపోయినచో, సమ్యక్ = తిన్నగా, ఆపః ప్రవేక్ష్యామి = జలమునందు ఉరికెదను.

**తాత్పర్యము :–** నే నిచట సీతాదేవిని కనుగొనలేనియెడల, నీటిలో దుమికి ప్రాణములను విడిచిపెట్టెదను.

**శ్లో॥ సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ ।**
**ప్రభగ్నా చిరరాత్రీయం మమ సీతా మపశ్యతః ॥ 46**

**పదచ్ఛేదము :–** సుజాతమూలా – సుభగా – కీర్తిమాలా – యశస్వినీ – ప్రభగ్నా – చిరరాత్రీ – ఇయం – మమ – సీతామ్ – అపశ్యతః ॥

**అన్వయక్రమము :–** సుజాతమూలా సుభగా కీర్తిమాలా యశస్వినీ ఇయం చిరరాత్రీ సీతామ్, అపశ్యతః మమ ప్రభగ్నా.

**ప్రతిపదార్థము :–** సుజాతమూలా = చక్కని ప్రారంభముగలదియును, సుభగా = ఉత్తమమైనదియును (సుందరమైనది), కీర్తిమాలా = యశఃపరంపరలు గలదియును, యశస్వినీ = ప్రతిష్ఠను గూర్చునదియునగు, ఇయం చిరరాత్రీ = ఈ దీర్ఘమైనట్టి రాత్రి, సీతామ్ అపశ్యతః మమ = సీతను కనుగొనజాలనట్టి నాకు, ప్రభగ్నా = ఎంతయు భగ్నమైనది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'యశస్వినీ' – చనిపోయినవానికి ఖ్యాతి గూర్చునది. సుజాతమూలా = శ్రేష్ఠమైన కారణములు, (కీర్తికారణములు) కల్పించినది. కీర్తిమాలా = బ్రతికియున్న వానికి కలుగు ప్రతిష్ఠల పరంపర గలది.

**బొంబాయి ముద్రణము :–** చిరరాత్రాయ – అని పాఠాంతరము. అనగా శాశ్వతముగా అని అర్థము. నాకు అమితమైన కీర్తిప్రతిష్ఠలను సంపాదించవలసిన ఈ యత్నము నేను సీతమ్మను కనుగొనలేక పోవుటచే శాశ్వతముగా భగ్నమైపోయినదని భావము.

**మహేశ్వరతీర్థులు :–** 'సుజాతమూలా' = మొదటినుండియును సీతాన్వేషణకు ఉపయుక్తమై యుండుటచే మంగళకరమైన ప్రారంభము గలది. సుభగా = సీతాన్వేషణకు సౌకర్యమును గూర్చు వెన్నెలచే రమణీయమైనట్టిదియును, కీర్తిమాలా = సీతాన్వేషణకు సహకరించినట్టిదని లోకులెల్లరిచేత కీర్తింపబడినట్టిది. (కీర్తి = కీర్తనము) చిరరాత్రీ = దీర్ఘరాత్రియైనట్టిది. రామకార్యసహాయముకొరకై రాత్రియే

కోరి దీర్ఘముగా వృద్ధి చెందినదని భావము.

**రామాయణశిరోమణి** :- సుజాతమూలా = రామ సుగ్రీవ సంబంధమైన వార్తాహరత్వ కృషితో ప్రారంభమైనట్టిది. సుభగా = శోభనైశ్వర్యము నొసగినది. యశస్వినీ = అంగుళీయక ప్రదానముచే వెల్లడియైన రాముని ప్రీతికి పాత్రు డను ఖ్యాతిని గూర్చునది.

**గోవిందరాజీయము** :- సుజాతమూలా = లంకాధిదేవతాజయముచే మంగళకరమైన ఆరంభముగలది. సుభగా = చంద్రోదయముచే సుందరమైనది. యశస్వినీ = హనుమంతుడు లంకను ప్రవేశించినట్టి రాత్రి యని లోకమున విఖ్యాతి గన్నట్టిది. చిరరాత్రీ = తన జాగరణముచే దీర్ఘముగ కనిపించునట్టి రాత్రి, ప్రభగ్నా = సమాప్తమైనది.

**తాత్పర్యము** :- చక్కగా ప్రారంభమై సుందరముగ నడచినదై నాకు కీర్తిప్రతిష్ఠలను గూర్చుచున్నట్టి ఈ సుదీర్ఘమైన నేటి రాత్రి నేను సీతమ్మను కనుగొనలేకపోవుటచే అంతయు నిష్ఫలమైనది గదా!

**శ్లో॥ తాపసో వా భవిష్యామి నియతో వృక్షమూలికః ।**
**నేతః ప్రతిగమిష్యామి తా మదృష్ట్వాఽసితేక్షణామ్ ॥ 47**

**పదచ్ఛేదము** :- తాపసః - వా - భవిష్యామి - నియతః - వృక్షమూలికః - న - ఇతః - ప్రతిగమిష్యామి - తామ్ - అదృష్ట్వా - అసితేక్షణామ్ ॥

**అన్వయక్రమము** :- వా వృక్షమూలికః నియతః తాపసః భవిష్యామి తామ్ అసితేక్షణామ్, అదృష్ట్వా, ఇతః, న ప్రతిగమిష్యామి.

**ప్రతిపదార్థము** :- వా = లేక, వృక్షమూలికః = వృక్షమూలమునందు నివసించు చున్నవాడనై, నియతః = (కఠిన) నియమములను పూనినవాడనై, తాపసః భవిష్యామి = తపస్విని గాగలను. తామ్ అసితేక్షణాం = నల్లని కన్నులుగల ఆ జానకమ్మను, అదృష్ట్వా = దర్శింపకుండ, ఇతః = ఈ లంకానగరమునుండి, న ప్రతిగమిష్యామి = వెడలిపోవను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- తాపసః భవిష్యామి = ఆత్మహత్య చేసికొనుటకంటె మునివృత్తిని స్వీకరించుట మేలుగదా! యని హనుమయొక్క అభిప్రాయము.

**మహేశ్వరతీర్థులు** :– హనుమ తలపెట్టిన రెండు ప్రయత్నములలోను మొదటిదే (వానప్రస్థాశ్రమస్వీకారము) ఉచితమని ఇచ్చట నిశ్చయించుకొనెను.

**తాత్పర్యము** :– వృక్షమూలము నాశ్రయించి కఠినమైన నియమములను బూని, తాపసుడనై జీవింతును. అంతియే గాని జానకమ్మను దర్శింపకుండగ నే నీలంక నుండి తిరిగిపోవను.

**శ్లో॥ య దీతః ప్రతిగచ్ఛామి సీతా మనధిగమ్య తామ్ ।**
**అంగద స్సహ తై స్సర్వై ర్వానరై ర్న భవిష్యతి ॥ 48**

**పదచ్ఛేదము** :– యది – ఇతః – ప్రతిగచ్ఛామి – సీతామ్ – అనధిగమ్య – తామ్ – అంగదః – సహ – తైః – సర్వైః – వానరైః – న – భవిష్యతి ॥

**అన్వయక్రమము** :– తాం సీతామ్, అనధిగమ్య ఇతః ప్రతిగచ్ఛామి యది, తైః సర్వైః వానరైః సహ, అంగదః న భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– తాం సీతాం = ఆ జానకీదేవిని, అనధిగమ్య = తెలిసికొనకుండ, ఇతః = ఈ లంకానగరమునుండి, ప్రతిగచ్ఛామి యది = వెనుకకు బోయినయెడల, తైః సర్వైః వానరైః సహ = ఆ వానరులెల్లరితో గూడి, అంగదః = అంగదుడు, న భవిష్యతి = జీవించియుండడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– సుగ్రీవుని సమీపమునకు పోకుండగా అంగదాదులకడనే నిలచి పోవచ్చునుగదా! అని శంకించుకొని అతడు మాత్ర మెట్లు జీవించి యుండునని హనుమ భయము నొందుచున్నాడు.

**తాత్పర్యము** :– సీతను దర్శింపకుండ వెనుదిరిగి పోయినచో మా వానరులును, అంగదుడును గూడ నా యత్నవైఫల్యమునకు నిరాశను చెంది ప్రాణములను విడచెదరు.

**శ్లో॥ వినాశే బహవో దోషా జీవన్ భద్రాణి పశ్యతి ।**
**తస్మా త్ప్రాణా న్ధరిష్యామి ధ్రువో జీవతి సంగమః ॥ 49**

**పదచ్ఛేదము** :– వినాశే – బహవః – దోషాః – జీవన్ భద్రాణి – పశ్యతి – తస్మాత్ – ప్రాణాన్ – ధరిష్యామి – ధ్రువః – జీవతి – సంగమః ॥

**అన్వయక్రమము** :– వినాశే (సతి), దోషాః బహవః, (సంతి) జీవన్ (పురుషః), భద్రాణి పశ్యతి, తస్మాత్, ప్రాణాన్ ధరిష్యామి, జీవతి (సతి), సంగమః ధ్రువః.

**ప్రతిపదార్థము :–** వినాశే (సతి) = చనిపోవుట సంభవించినపుడు, దోషాః బహవః (సంతి) = దోషములు ఎక్కువగా నుండును, జీవన్ (పురుషః) = బ్రదికియున్న పురుషుడు, భద్రాణి పశ్యతి = మంగళములను గాంచును, తస్మాత్ = అందువలన, ప్రాణాన్ ధరిష్యామి = ప్రాణములను నిలుపుకొొందును, జీవతి (సతి) = జీవించియుండగా, సంగమః = (కోరినదానిని) బడయుట, ధ్రువః = నిశ్చయము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** బహవః దోషాః = ఆత్మహత్యాదోషము, రాముడు మున్నగువారు మరణించుట యను దోషము మున్నగు పెక్కుదోషములు.

**గోవిందరాజీయము :–** బహవః దోషాః = సర్వవానరవినాశము మున్నగు దోషములు, సంగమః ధ్రువః = శ్రేయస్సంగమము నిశ్చయము.

**బొంబాయి పాఠము :–** జీవితసంగమః అనగా శ్రేయస్సంగమము.

**తాత్పర్యము :–** మరణించుట కంగీకరించినచో పెక్కు దోషములు కానవచ్చుచున్నవి. బ్రదికియున్న పురుషుడే భద్రములను బడయగలడు. అందుచే నేను ప్రాణములను విడువను. జీవించియే యున్నచో శ్రేయస్సులను సాధించుటకు నిశ్చయముగా అవకాశమున్నది.

**శ్లో॥ అథ వైనం సముత్క్షిప్య హ్యుపర్యుపరి సాగరమ్ ।**
**రామాయోపహరిష్యామి పశుం పశుపతే రివ ॥ 50**

**పదచ్ఛేదము :–** అథవా – ఏనం – సముత్క్షిప్య – హి – ఉపరి – ఉపరి – సాగరమ్ – రామాయ – ఉపహరిష్యామి – పశుం – పశుపతేః – ఇవ ॥

**అన్వయక్రమము :–** అథవా ఏనం సముత్క్షిప్య సాగరమ్ ఉపరి ఉపరి, పశుపతేః పశుమ్ ఇవ, రామాయ, ఉపహరిష్యామి.

**ప్రతిపదార్థము :–** అథవా = అట్లుగానిచో, ఏనం సముత్క్షిప్య = ఈ రావణుని లేవనెత్తికొనిపోయి, సాగరమ్ ఉపరి ఉపరి = సముద్రము మీదుగనే, పశుపతేః పశుమ్ ఇవ = యాగాగ్నికి యజ్ఞపశువును వలె, రామాయ ఉపహరిష్యామి = రామునకు అర్పించెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** అథవా = సీతను చూడలేక రావణుని నేను చంపితిని అని పలికినను

రామునకు నిశ్చయము కలుగకపోవచ్చునుగదా! కావున ఆ రావణాసురునే సజీవముగ రామున కప్పగించెదను.

**గోవిందరాజీయము** :– పశుపతేః పశుమ్ ఇవ = అగ్నికి మేకపోతును వలె,

"ఇమం పశుం పశుపతే తే అద్య బధ్నామి" అని మంత్రప్రమాణము.

**తాత్పర్యము** :– లేక యజ్ఞపశువును, యాగాగ్నికి అర్పించునట్లుగా ఈ రావణాసురుని జీవముతోనే ఎత్తుకొనిపోయి సముద్రము మీదుగా రామునికడకు చేర్చి అతని కర్పించెదను.

**శ్లో॥ ఇతి చింతాం సమాపన్న స్సీతా మనధిగమ్య తామ్ ।**
**ధ్యానశోకపరీతాత్మా చింతయామాస వానరః ॥ 51**

**పదచ్ఛేదము** :– ఇతి – చింతాం – సమాపన్నః – సీతామ్ – అనధిగమ్య – తామ్ – ధ్యానశోకపరీతాత్మా – చింతయామాస – వానరః ॥

**అన్వయక్రమము** :– తాం సీతామ్ అనధిగమ్య వానరః ధ్యానశోకపరీతాత్మా (సన్) చింతాం సమాపన్నః ఇతి చింతయామాస.

**ప్రతిపదార్థము** :– తాం సీతామ్ అనధిగమ్య = ఆ జానకమ్మను కనుగొనజాలక; వానరః = హనుమ; ధ్యానశోకపరీతాత్మా (సన్) = తీవ్రమైన ఆలోచనము దిగులు అను వానితో నిండినవాడై, చింతాం సమాపన్నః = విషాదము నొందినవాడై, ఇతి చింతయామాస = ఈ రీతిగా ఆలోచింపసాగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రావణుని బంధించికొని పోయినప్పటికిని, రాక్షసులు లంకలో సీతను వధింతురేమో యని హనుమంతుడు దిగులు నొందెనని భావము.

**తాత్పర్యము** :– హనుమంతుడు సీతను కనుగొనలేక చింతానిమగ్నుడై తీవ్రమైన ఆలోచనతోడను, శోకముతోడను నిండినవాడై తిరిగి ఈ రీతిగా తలపోయుచుండెను.

**శ్లో॥ యావ త్సీతాం హి పశ్యామి రామపత్నీం యశస్వినీమ్ ।**
**తావ దేతాం పురీం లంకాం విచినోమి పునః పునః ॥ 52**

**పదచ్ఛేదము** :– యావత్ – సీతాం – హి – పశ్యామి – రామపత్నీం – యశస్వినీమ్ – తావత్ – ఏతాం – పురీం – లంకాం – విచినోమి – పునః – పునః ॥

**అన్వయక్రమము** :– యావత్ యశస్వినీం రామపత్నీం సీతాం పశ్యామి తావత్ ఏతాం లంకాం పురీం పునః పునః విచినోమి.

**ప్రతిపదార్థము** :– యావత్ = ఎప్పటికి, యశస్వినీం = కీర్తిమంతురాలయిన, రామపత్నీం సీతాం = రాముని ధర్మపత్నియైన సీతను, పశ్యామి హి = చూచెదనో, తావత్ = అంతవరకును, ఏతాం లంకాం పురీం = ఈ లంకానగరమును, పునః పునః విచినోమి = మరల మరల వెదకుచుందును.

**తాత్పర్యము** :– శ్రీరాముని పట్టమహిషియైన జానకీసాధ్వి నాకు కానవచ్చునంత వరకును ఈ లంకానగరమును మరల మరల వెదకి చూచెదనుగాక!

**శ్లో॥ సంపాతివచనా చ్చాపి రామం య ద్యానయా మ్యహమ్ ।**
**అపశ్యన్ రాఘవో భార్యాం నిర్దహే త్సర్వవానరాన్ ॥ 53**

**పదచ్ఛేదము** :– సంపాతివచనాత్ – చ – అపి – రామం – యది – ఆనయామి – అహమ్ – అపశ్యన్ – రాఘవః – భార్యాం – నిర్దహేత్ – సర్వవానరాన్ ॥

**అన్వయక్రమము** :– అపి చ, సంపాతివచనాత్ రామమ్ అహమ్ ఆనయామి యది రాఘవః భార్యామ్ అపశ్యన్ సర్వవానరాన్ నిర్దహేత్.

**ప్రతిపదార్థము** :– అపి చ = మరియు, సంపాతివచనాత్ = సంపాతిపక్షి మాటలను అనుసరించి, రామం = శ్రీరాముని, అహమ్ ఆనయామి యది = నేను తీసుకొని వచ్చినయెడల, రాఘవః = శ్రీరాముడు; భార్యామ్ అపశ్యన్ = సీతాదేవిని కనుగొనక; సర్వవానరాన్ = వానరుల నెల్లరను; నిర్దహేత్ = భస్మము చేయునుగదా!

**తాత్పర్యము** :– సంపాతి మాటలప్రకారము సీత ఇచ్చట నున్నదని ధైర్యముతో శ్రీరామునే ఇచ్చటకు నేనొకవేళ తీసుకువచ్చినను నాకు కాన్పించనట్లే శ్రీరామునకును సీతాదేవి కనబడకున్న యెడల అతడు నాపై క్రోధముతో మా వానరుల నందఱను దహించివేయునుగదా!

**శ్లో॥ ఇ హైవ నియతాహారో వత్స్యామి నియతేంద్రియః ।**
**న మత్కృతే వినశ్యేయు స్సర్వే తే నరవానరాః ॥ 54**

**పదచ్ఛేదము** :– ఇహ – ఏవ – నియతాహారః – వత్స్యామి – నియతేంద్రియః – న – మత్కృతే – వినశ్యేయుః – సర్వే – తే – నరవానరాః ॥

**అన్వయక్రమము** :– ఇహ ఏవ నియతాహారః నియతేంద్రియః (సన్), వత్స్యామి; తే

నరవానరాః సర్వే మత్కృతే న వినశ్యేయుః.

**ప్రతిపదార్థము** :– ఇహ ఏవ = ఈ లంకానగరమునందే, నియతాహారః = నియమితమైన ఆహారము గలవాడనై, నియతేంద్రియః = ఇంద్రియములను జయించినవాడనై, వత్స్యామి = నివసించెదను, మత్కృతే = నా నిమిత్తముగ, తే నరవానరాః సర్వే = ఆ నరులు, వానరులు ఎల్లరును, న వినశ్యేయుః = వినాశనము నొందకుందురుగాక!

**తాత్పర్యము** :– అందుచేత నేను ఈ లంకానగరమునందే ఆహారనియమముతో ఇంద్రియములను జయించి తాపసవృత్తిలో నివసించెదను. రామాదినరపుంగవులును, సుగ్రీవాదివానరశ్రేష్ఠులును నాములముగ నశించిపోకుందురుగాక!

**శ్లో॥ అశోకవనికా చేయం దృశ్యతే యా మహాద్రుమా ।**
**ఇమా మధిగమిష్యామి న హీయం విచితా మయా ॥ 55**

**పదచ్ఛేదము** :– అశోకవనికా – చ – ఇయం – దృశ్యతే – యా – మహాద్రుమా – ఇమామ్ – అధిగమిష్యామి – న – హి – ఇయం – విచితా – మయా ॥

**అన్వయక్రమము** :– యా ఇయం మహాద్రుమా అశోకవనికా దృశ్యతే, ఇమాం అధిగమిష్యామి; మయా ఇయం న హి విచితా.

**ప్రతిపదార్థము** :– యా ఇయం మహాద్రుమా అశోకవనికా = ఏ మహావృక్షములు కలిగిన ఈ అశోకవనము, దృశ్యతే = కాన్పించుచున్నదో, ఇమామ్ అధిగమిష్యామి = దీనిని చేరెదను, ఇయం = ఈ అశోకవనిక; మయా = నాచేత, న హి విచితా = వెదుకబడియుండలేదు.

**తాత్పర్యము** :– నాకెదురుగా కనబడుచున్న మహావృక్షములు గల్గినట్టి ఈ అశోక వనమునకు ఇప్పుడే పోయి నేను వెదుకగలను. ఇంతవరకును ఈ వనమునందు నేను సీతమ్మను వెదుకలేదు గదా!

**శ్లో॥ వసూన్ రుద్రాం స్తథాదిత్యా నశ్వినౌ మరుతో ఽపి చ ।**
**నమస్కృత్వా గమిష్యామి రక్షసాం శోకవర్ధనః ॥ 56**

**పదచ్ఛేదము** :– వసూన్ – రుద్రాన్ – తథా – ఆదిత్యాన్ – అశ్వినౌ – మరుతః – అపి – చ – నమస్కృత్వా – గమిష్యామి – రక్షసాం – శోకవర్ధనః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము :–** వసూన్ = అష్టవసువులను, రుద్రాన్ = ఏకాదశ రుద్రులను; తథా = అట్లే; ఆదిత్యాన్ = ద్వాదశ ఆదిత్యులను; అశ్వినౌ = అశ్వినీదేవతలను, మరుతః అపి చ = సప్తమరుత్తులను గూడ, నమస్కృత్వా = నమస్కరించి, రక్షసాం = రాక్షసులకు; శోకవర్ధనః (సన్) = దుఃఖమును వృద్ధిచేయువాడనై, గమిష్యామి = వెడలెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఇచ్చటగూడ సీత కాన్పింపదేమో యను భీతిచే దైవానుకూల్యము నొంది తన కార్యము సాధింపగోరి దేవతలకు మ్రొక్కుచున్నాడని భావము.

**తాత్పర్యము :–** అష్టవసువులను, ఏకాదశ రుద్రులను, ద్వాదశాదిత్యులను, ఉభయాశ్వినీ దేవతలను, సప్తమరుత్తులను నా కార్యము సిద్ధింపచేయుడని మ్రొక్కి అచ్చటి రాక్షసులకు శోకమును కలిగించువాడనై నే నచ్చట సీతమ్మను వెదుకుటకు బోయెదను.

**శ్లో॥ జిత్వా తు రాక్షసాన్ సర్వా నిక్ష్వాకుకులనందినీమ్ ।**
**సంప్రదాస్యామి రామాయ యథా సిద్ధిం తపస్వినే ॥ 57**

**పదచ్ఛేదము :–** జిత్వా – తు – రాక్షసాన్ – సర్వాన్ – ఇక్ష్వాకుకులనందినీమ్ – సంప్రదాస్యామి – రామాయ – యథా – సిద్ధిం – తపస్వినే ॥

**అన్వయక్రమము :–** రాక్షసాన్ సర్వాన్ జిత్వా, తపస్వినే సిద్ధిం యథా, రామాయ ఇక్ష్వాకుకులనందినీం సంప్రదాస్యామి.

**ప్రతిపదార్థము :–** రాక్షసాన్ సర్వాన్ జిత్వా = రాక్షసుల నెల్లరను జయించి, తపస్వినే సిద్ధిం యథా = తపశ్శాలికి తపఃఫలము (నొసగు) నటుల, రామాయ = శ్రీరామునకు, ఇక్ష్వాకుకులనందినీం = ఇక్ష్వాకువంశవర్ధిని యగు జానకమ్మను, సంప్రదాస్యామి = సమర్పింతును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తపస్వినే సిద్ధిం యథా – అనగా తపఃప్రసన్నురాలైన దేవత తపశ్శాలికి తపఃఫలము నొసంగిన రీతిగా అని అర్థము.

**తాత్పర్యము :–** ఇచ్చట రాక్షసుల నందరను యుద్ధమునందు ఓడించి, తీవ్రతపము చేసిన తపశ్శాలికి ఇష్టదైవము ఆ తపఃఫలమును ఇచ్చునట్లు నేను ఇక్ష్వాకుకుల నందినియైన సీతాదేవిని రామునకు అర్పించి ధన్యుడనయ్యెదను.

**శ్లో॥ స ముహూర్త మివ ధ్యాత్వా చింతావగ్రథితేంద్రియః ।**
**ఉదతిష్ఠ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః ॥ 58**

**పదచ్ఛేదము** :– సః – ముహూర్తమ్ – ఇవ – ధ్యాత్వా – చింతావగ్రథితేంద్రియః – ఉదతిష్ఠత్ – మహాతేజాః – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము** :– మహాతేజాః మారుతాత్మజః సః హనుమాన్ చింతావగ్రథితేంద్రియః (సన్) ముహూర్తమ్ ఇవ ధ్యాత్వా ఉదతిష్ఠత్.

**ప్రతిపదార్థము** :– మహాతేజాః = గొప్పతేజశ్శాలియును, మారుతాత్మజః = వాయునందనుడునగు, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, చింతావగ్రథితేంద్రియః = చింతచే వ్యాకులమైన ఇంద్రియములు గలవాడై, ముహూర్తమ్ ఇవ = రెండు క్షణముల కాలము, ధ్యాత్వా = ఆలోచించి, ఉదతిష్ఠత్ = లేచి నిలువబడెను.

**తాత్పర్యము** :– మహాబుద్ధిశాలియైన ఆ వాయునందనుడు చింతతో వ్యాకులమైన మనస్సుగలవాడై రెండు క్షణముల కాలము ఏకాగ్రచిత్తుడై ఆలోచనచేసి వెంటనే లేచి నిలువబడెను.

**శ్లో॥ నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ**
**దేవ్యై చ తస్యై జనకాత్మజాయై ।**
**నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో**
**నమోఽస్తు చంద్రార్కమరుద్గణేభ్యః ॥ 59**

**పదచ్ఛేదము** :– నమః – అస్తు – రామాయ – సలక్ష్మణాయ – దేవ్యై – చ – తస్యై – జనకాత్మజాయై – నమః – అస్తు – రుద్రేంద్రయమానిలేభ్యః – నమః – అస్తు – చంద్రార్కమరుద్గణేభ్యః ॥

**అన్వయక్రమము** :– సలక్ష్మణాయ, రామాయ నమః అస్తు; తస్యై దేవ్యై, జనకాత్మజాయై చ నమః అస్తు; రుద్రేంద్రయమానిలేభ్యః నమః అస్తు; చంద్రార్కమరుద్గణేభ్యః నమః అస్తు.

**ప్రతిపదార్థము** :– సలక్ష్మణాయ రామాయ నమః అస్తు = లక్ష్మణసహితుడైన శ్రీరామచంద్రునకు నమస్కారము అగుగాక, తస్యై దేవ్యై జనకాత్మజాయై చ నమః = పూజ్యురాలయిన ఆ జానకమ్మకును నమస్కారము అగుగాక. రుద్రేంద్రయమానిలేభ్యః నమః అస్తు = రుద్రునకును, ఇంద్రునకును, యమునకును, వాయువునకును నమస్కారము అగు గాక; చంద్రార్కమరుద్గణేభ్యః నమః అస్తు = చంద్రునకును,

సూర్యునకును, సప్తమరుత్తులకును నమస్కారము అగుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– పూర్వము తాను చెప్పినట్లుగనే దేవతలకు హనుమ ఇచ్చట మ్రొక్కుచున్నాడు. మొదట రామునకు మ్రొక్కుటలో శ్రీరాముడు సాక్షాత్ భగవంతుని పరిపూర్ణావతారమని సూచించుచున్నాడు. రుద్రాదులకు నమస్కరించుట భగవంతునియొక్క విరాడ్రూపమునకు మ్రొక్కుట.

**గోవిందరాజీయము** :– 'సర్వాన్ దేవాన్ నమస్యంతి రామస్యార్థే యశస్వినః' అని పూర్వము చెప్పినట్లు త్వరలో తన అభీష్టసిద్ధికొఱకై రుద్రుడు మున్నగు దేవతలందరకును హనుమ మ్రొక్కుచున్నాడు.

**తాత్పర్యము** :– తమ్ముడైన లక్ష్మణునితో కూడిన మా శ్రీరామచంద్రునకు నమస్కారము. మా సీతమ్మ తల్లికి నమస్కారము. ఈశ్వరునకును, ఇంద్రునకును, యమునకును, వాయుదేవునకును, నమస్కారము. చంద్రునకును, సూర్యునకును సప్తమరుత్తులకును నమస్కారము.

**శ్లో॥ స తేభ్యస్తు నమస్కృత్వా సుగ్రీవాయ చ మారుతిః ।**
**దిశ స్సర్వా స్సమాలోక్య హ్యశోకవనికాం ప్రతి ॥ 60**

**శ్లో॥ స గత్వా మనసా పూర్వ మశోకవనికాం శుభామ్ ।**
**ఉత్తరం చింతయామాస వానరో మారుతాత్మజః ॥ 61**

**పదచ్ఛేదము** :– సః – తేభ్యః – తు – నమస్కృత్వా – సుగ్రీవాయ – చ – మారుతిః – దిశః – సర్వాః – సమాలోక్య – హి – అశోకవనికాం – ప్రతి ॥ సః – గత్వా – మనసా – పూర్వమ్ – అశోకవనికాం – శుభామ్ – ఉత్తరం – చింతయామాస – వానరః – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము** :– సః మారుతిః తేభ్యః, సుగ్రీవాయ చ, నమస్కృత్వా అశోకవనికాం ప్రతి సర్వాః దిశః సమాలోక్య, పూర్వం శుభామ్ అశోకవనికాం, మనసా గత్వా సః మారుతాత్మజః వానరః ఉత్తరం చింతయామాస.

**ప్రతిపదార్థము** :– సః మారుతిః = ఆ హనుమంతుడు, తేభ్యః = శ్రీరామునకును, రుద్రాదిదేవతలకును, సుగ్రీవాయ చ = సుగ్రీవునకును, నమస్కృత్వా = నమస్కరించి, అశోకవనికాం ప్రతి = అశోకవనమును గూర్చి, సర్వాః దిశః సమాలోక్య = అన్ని దిక్కులకును దృష్టిని సారించి; పూర్వం = ముందుగనే; శుభామ్ అశోకవనికాం =

మంగళకరమైన ఆ యశోకవనమునకు, మనసా గత్వా = మానసికముగా వెడలి, సః మారుతాత్మజః వానరః = ఆ వాయునందనుడైన హనుమ; ఉత్తరం చింతయామాస = అనంతరకర్తవ్యమును గూర్చి ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సుగ్రీవునకు నమస్కారమేల ననగా, తనకు ప్రభువగుటవలనను, సూర్యుని అంశ (పుత్రుడు) అగుట వలనను.

**గోవిందరాజీయము** :– సర్వా దిశః సమాలోక్య – అనగా అశోకవనముయొక్క పరిమాణమును చక్కగా గమించుటకొఱకు.

**తాత్పర్యము** :– హనుమంతుడు శ్రీరామునకును, రుద్రాదులకును, తన ప్రభువైన సుగ్రీవునకును భక్తితో నమస్కరించి, ఆ యశోకవనముయొక్క అన్నివైపులకును దృష్టి సారించి తన మనస్సును ఆ మంగళకరమైన అశోకవనమునందు నిలిపి తదనంతర కర్తవ్యమును గూర్చి ఆలోచింపసాగెను.

**శ్లో॥ ధ్రువం తు రక్షోబహుళా భవిష్యతి వనాకులా ।**
**అశోకవనికా చింత్యా సర్వసంస్కారసంస్కృతా ॥ 62**

**పదచ్ఛేదము** :– ధ్రువం – తు – రక్షోబహుళా – భవిష్యతి – వనాకులా – అశోకవనికా – చింత్యా – సర్వసంస్కారసంస్కృతా ॥

**అన్వయక్రమము** :– ధ్రువం వనాకులా, సర్వసంస్కారసంస్కృతా, రక్షోబహుళా అశోకవనికా (మయా) చింత్యా భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– వనాకులా = జలప్రవాహములతో నిండినదియును, సర్వసంస్కార సంస్కృతా = వృక్షములకు కావలసియున్న సర్వసదుపాయములును సమకూర్చబడి యున్నదియును, రక్షోబహుళా = రాక్షసులచే క్రిక్కిరిసి యున్నదియును అగు, అశోకవనికా = అశోకవనము, (మయా) ధ్రువం చింత్యా = నాచేత తప్పక వెదుక బడవలసియున్నది, భవిష్యతి = కాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'వనాకులా' = అడవులచే చుట్టబడి యున్నది. ధ్రువం రక్షోబహుళా' అనుటచే, చంద్రాస్తమయమై చీకటి క్రమ్ముటచే రాక్షసులు పెక్కుమంది యుందురని హనుమ ఊహించుచున్నాడు.

**తాత్పర్యము :–** ఈ యశోకవనము జలప్రవాహములతోడను, దున్నుట మున్నగు సర్వసంస్కారములతోడను కూడిన వృక్షములతోను, రక్షకులుగానున్న పెక్కుమంది రాక్షసులతోను నిండి నేను తప్పక వెదుకవలసినదిగా నున్నది.

**శ్లో॥ రక్షిణ శ్చాత్ర విహితా నూనం రక్షంతి పాదపాన్ ।**
**భగవానపి సర్వాత్మా నాతిక్షోభం ప్రవాతి వై ॥ 63**

**పదచ్ఛేదము :–** రక్షిణః – చ – అత్ర – విహితాః – నూనం – రక్షంతి – పాదపాన్ – భగవాన్ – అపి – సర్వాత్మా – న – అతిక్షోభం – ప్రవాతి – వై ॥

**అన్వయక్రమము :–** అత్ర విహితాః రక్షిణః నూనం పాదపాన్ రక్షంతి; సర్వాత్మా భగవాన్ అపి న అతిక్షోభం ప్రవాతి.

**ప్రతిపదార్థము :–** అత్ర విహితాః రక్షిణః = ఇచ్చట నియుక్తులైన వనరక్షకులు, నూనం పాదపాన్ రక్షంతి = నిశ్చయముగా ఇచటి వృక్షములను (జాగరూకులై) రక్షించుచున్నారు. భగవాన్ సర్వాత్మా అపి = భగవానుడైన వాయుదేవుడు గూడ, న అతిక్షోభం ప్రవాతి = పీడ కలుగకుండ వీచుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** వృక్షరక్షకులైన రాక్షసులకు వెఱచి వాయువు కూడ, వృక్షములకు క్షోభ కలుగకుండగనే వీచుచున్నాడు.

**తాత్పర్యము :–** ఇచ్చట వృక్షముల రక్షణకొఱకై నియుక్తులైన రాక్షసులు నిశ్చయముగా మిక్కిలి శ్రద్ధతో ఈ వనమును రక్షించుచున్నారు. అందుచేతనే వాయుదేవుడు కూడ ఈ వృక్షములకు ఎట్టి క్షోభయును కలుగకుండ మెల్లగా వీచుచున్నాడు.

**శ్లో॥ సంక్షిప్తో ఽ యం మయా ఽ ఽ త్మా చ రామార్థే రావణస్య చ ।**
**సిద్ధిం మే సంవిధాస్యంతి దేవా స్సర్షిగణా స్త్విహ ॥ 64**

**పదచ్ఛేదము :–** సంక్షిప్తః – అయం – మయా – ఆత్మా – చ – రామార్థే – రావణస్య – చ – సిద్ధిం – మే – సంవిధాస్యంతి – దేవాః – సర్షిగణాః – తు – ఇహ ॥

**అన్వయక్రమము :–** మయా రామార్థే, రావణస్య (అర్థే చ) అయం ఆత్మా సంక్షిప్తః; సర్షిగణాః దేవాః ఇహ మే సిద్ధిం సంవిధాస్యంతి.

**ప్రతిపదార్థము :–** రామార్థే = శ్రీరాముని (కార్యసిద్ధి) కొఱకును, రావణస్య అర్థే చ = రావణునకు కనబడకుండుటకును; మయా = నాచే, అయం ఆత్మా = ఈ శరీరము,

సంక్షిప్తః = చిన్నదిగా చేయబడినది. ఇహ = ఈ ఉద్యమమునందు, సర్షిగణాః దేవాః = ఋషిగణములతో కూడిన దేవతలు, మే = నాకు, సిద్ధిం సంవిధాస్యంతి = సిద్ధిని కలిగింతురు.

**తాత్పర్యము** :– శ్రీరాముని కార్యము నెఱవేర్చుటకును, రావణునికి గోచరము కాకుండగను, నా శరీరమును చిన్నదిగ చేసుకొంటిని. ఈ నా యత్నమునందు దేవతలును, ఋషిగణములును నాకు కార్యసిద్ధిని సమకూర్తురుగాక!

**శ్లో॥ బ్రహ్మా స్వయంభూర్భగవాన్ దేవాశ్చైవ దిశంతు మే ।**
**సిద్ధి మగ్ని శ్చ వాయుశ్చ పురుహూత శ్చ వజ్రభృత్ ॥ 65**

**శ్లో॥ వరుణః పాశహస్త శ్చ సోమాదిత్యౌ తథైవ చ ।**
**అశ్వినౌ చ మహాత్మానౌ మరుత శ్శర్వ ఏవ చ ॥ 66**

**పదచ్ఛేదము** :– బ్రహ్మా – స్వయంభూః – భగవాన్ – దేవాః – చ – ఏవ – దిశన్తు – మే – సిద్ధిమ్ – అగ్నిః – చ – వాయుః – చ – పురుహూతః – చ – వజ్రభృత్ – వరుణః – పాశహస్తః – చ – సోమాదిత్యౌ – తథా – ఏవ – చ – అశ్వినౌ – చ – మహాత్మానౌ – మరుతః – శర్వః – ఏవ – చ ॥

**అన్వయక్రమము** :– స్వయంభూః, భగవాన్ బ్రహ్మా, దేవా శ్చైవ, అగ్నిశ్చ, వాయుశ్చ, వజ్రభృత్ పురుహూతశ్చ, పాశహస్తః వరుణశ్చ, తథైవ, సోమాదిత్యౌ చ, మహాత్మానౌ అశ్వినౌ చ, మరుతః, శర్వ ఏవ చ, మే సిద్ధిం దిశంతు.

**ప్రతిపదార్థము** :– స్వయంభూః భగవాన్ బ్రహ్మా = స్వయంభువైన బ్రహ్మదేవుడు, దేవాశ్చ = సర్వదేవతలును, అగ్నిః వాయుశ్చ = అగ్నియును వాయువును, వజ్రభృత్ పురుహూతశ్చ = వజ్రాయుధధారియైన దేవేంద్రుడును, పాశహస్తః వరుణశ్చ = పాశాయుధహస్తుడైన వరుణదేవుడున్ను, తథైవ సోమాదిత్యౌ చ = అట్లే చంద్ర సూర్యులును, మహాత్మానౌ అశ్వినౌ చ = మహనీయులైన అశ్వినీదేవత లిరువురును, మరుతః = మరుద్గణములున్ను, శర్వ ఏవ చ = ఈశ్వరుడున్ను, సిద్ధిం దిశంతు = సాఫల్యమును కూర్చెదరుగాక!

**తాత్పర్యము** :– స్వయంభువైన బ్రహ్మదేవుడును, సమస్తదేవతలును, అగ్నియును, వాయువును, వజ్రపాణియైన దేవేంద్రుడును, పాశహస్తుడైన వరుణుడును, అశ్వినీ దేవతలును, మరుద్గణములును, సర్వేశ్వరుడును, నాకు కార్యసిద్ధిని ప్రసాదింతురుగాక!

**శ్లో॥ సిద్ధిం సర్వాణి భూతాని భూతానాం చైవ యః ప్రభుః ।**
**దాస్యన్తి మమ యే చాన్యే హ్యదృష్టాః పథి గోచరాః ॥ 67**

**పదచ్ఛేదము :–** సిద్ధిం – సర్వాణి – భూతాని – భూతానాం – చ – ఏవ – యః – ప్రభుః । దాస్యన్తి – మమ – యే – చ – అన్యే – హి – అదృష్టాః – పథి – గోచరాః ॥

**అన్వయక్రమము :–** సర్వాణి భూతాని, భూతానాం యః ప్రభుః (సః) చైవ, పథి గోచరాః, అదృష్టాః, అన్యే చ యే (సంతి తే) చ మమ సిద్ధిం దాస్యన్తి.

**ప్రతిపదార్థము :–** సర్వాణి భూతాని = సమస్తభూతములున్ను, భూతానాం యః ప్రభుః = సకలభూతములకును ప్రభువై ఎవ్వడున్నాడో, సః చైవ = అతడున్ను, పథి గోచరాః = మార్గమునందు నాకు గోచరమైయున్నట్టియు, అదృష్టాః అన్యే చ = అగోచరులైయున్న ఇతరులైనట్టి, యే (సంతి తే) = ఏ దేవతలున్నారో వారును, మమ = నాకు, సిద్ధిం దాస్యంతి = కార్యసిద్ధిని ప్రసాదింతురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** భూతానాం ప్రభుః = ప్రజాపతి; దాస్యంతి = ఇచ్చెదరు అనుటచే రాముని కార్యము వారెల్లరకును ప్రియమైనదే యని వెల్లడించుచున్నాడు. అట్లే పూర్వము తన ప్రార్థనను తెలిపి ఇప్పుడు తన నిశ్చయమును తెలుపుచున్నాడు. పథి గోచరాః = శాస్త్రమార్గమునందు కనిపించినవారు. అదృష్టాః = కనబడనివారు.

**గోవిందరాజీయము :–** భూతానాం ప్రభుః = పూర్వము చెప్పబడినట్టి విష్ణువే ఇచ్చట చెప్పబడెను.

**తాత్పర్యము :–** సమస్తభూతములును, ఈ సకలభూతాళికిని ప్రభువైన ఆ దేవదేవుడును, నాకు మార్గమున గానవచ్చినవారును, అగోచరులై యున్నవారును, అగు దేవతలందరును, నాకు కార్యసిద్ధిని తప్పక యనుగ్రహింతురు.

**శ్లో॥ త దున్నసం పాండురదంత మవ్రణం**
**శుచిస్మితం పద్మపలాశలోచనమ్ ।**
**ద్రక్ష్యే త దార్యావదనం కదా న్వహం**
**ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్ ॥ 68**

**పదచ్ఛేదము :–** తత్ – ఉన్నసం – పాండురదంతమ్ – అవ్రణం – శుచిస్మితం – పద్మపలాశలోచనమ్ – ద్రక్ష్యే – తత్ – ఆర్యావదనం – కదా – ను – అహం – ప్రసన్నతారాధిపతుల్యదర్శనమ్ ॥

**అన్వయక్రమము** :– తత్, ఉన్నసం, పాండురదంతమ్, అవ్రణం, శుచిస్మితం, పద్మపలాశలోచనం, ప్రసన్నతారాధిపతుల్యదర్శనం తత్ ఆర్యావదనమ్ అహం కదా ను ద్రక్ష్యే!

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ కారణమున, ఉన్నసం = ఉన్నతమైన నాసికగలదియును, పాండురదంతం = శుద్ధమైన పలువరుస గలదియును, అవ్రణం = నిష్కళంకమై నట్టిదియును, శుచిస్మితం = పరిశుద్ధమైన చిరునగవు గలిగినదియును, పద్మపలాశ లోచనం = తామరరేకులవంటి కన్నులు గలదియును, ప్రసన్నతారాధిపతుల్యదర్శనం = నిర్మలమైన చంద్రునిబోలిన రూపముగలదియునగు, తత్ ఆర్యావదనం = ఆ సీతామాత వదనమును, కదా ను ద్రక్ష్యే = ఎప్పుడు చూచెదనోగదా!

**తాత్పర్యము** :– ఉన్నతమైన నాసికతో, తెల్లని పలువరుసతో శుద్ధమైన మందస్మితముతో, కమలపత్రములవంటి కన్నులతో, నిండు చందురుని బోలిన పవిత్రసౌందర్యముతో నిండిన, మా జానకమ్మ ముఖము నేనెప్పుడు దర్శించెదనోగదా!

**శ్లో॥ క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా**
**సుదారుణాలంకృతవేషధారిణా ।**
**బలాభిభూతా హ్యబలా తపస్వినీ**
**కథం ను మే దృష్టిపథే ఽ ద్య సా భవేత్ ॥ 69**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనూమన్నిర్వేదో" నామ*
*త్రయోదశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– క్షుద్రేణ – పాపేన – నృశంసకర్మణా – సుదారుణాలంకృతవేషధారిణా – బలాభిభూతా – హి – అబలా – తపస్వినీ – కథం – ను – మే – దృష్టిపథే – అద్య – సా – భవేత్ ॥

**అన్వయక్రమము** :– క్షుద్రేణ పాపేన నృశంసకర్మణా సుదారుణాలంకృతవేషధారిణా తేన రావణేన బలాభిభూతా తపస్వినీ సా అబలా, కథం ను అద్య మే దృష్టిపథే భవేత్!

**ప్రతిపదార్థము** :– క్షుద్రేణ = నీచుడును, పాపేన = పాపాత్ముడును, నృశంసకర్మణా = క్రూరకృత్యములు సలుపువాడును, సుదారుణాలంకృతవేషధారిణా = భయంకరమైన

అలంకారములను దుస్తులను ధరించువాడును అగు, తేన రావణేన = ఆ రావణాసురునిచే, బలాభిభూతా = బలాత్కారముగా అపహరింపబడినదియును, తపస్వినీ = దీనురాలును అగు, సా అబలా = ఆ కోమలాంగి, కథం ను = ఎట్లుగా, అద్య = నేడు, మే దృష్టిపథే భవేత్ = నాకు గోచరము కాగలదో!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సుదారుణాలంకృతవేషధారిణా = క్రూరుడైనను, పరులను నమ్మించుటకై ఉత్తమమైన భూషణములను ధరించువాడు.

**తాత్పర్యము** :– నీచుడును, పాతకియును, క్రూరకర్మశీలుడును, బాహ్యమైన ఉత్తమ వేషభూషణములను ధరించువాడును అగు రావణాసురునిచే బలవంతముగా నపహరింపబడి, దీనురాలై యుండు ఆ సీతామాతను నా కన్నులారా గాంచుట ఎప్పుడో కదా!

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనూమన్నిర్వేదము" అను*
*పదుమూడవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుర్దశసర్గ

**శ్లో॥ స ముహూర్తమివ ధ్యాత్వా మనసా చాధిగమ్య తామ్ ।**
**అవప్లుతో మహాతేజాః ప్రాకారం తస్య వేశ్మనః ॥ 1**

**పదచ్ఛేదము :–** సః – ముహూర్తమ్ – ఇవ – ధ్యాత్వా – మనసా – చ – అధిగమ్య – తామ్ – అవప్లుతః – మహాతేజాః – ప్రాకారం – తస్య – వేశ్మనః ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః సః ముహూర్తం ఇవ ధ్యాత్వా, తాం మనసా అధిగమ్య, తస్య వేశ్మనః ప్రాకారమ్ అవప్లుతః.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః సః = తేజస్సంపన్నుడైన హనుమ, ముహూర్తం (ఇవ) = రెండుక్షణములకాలము, ధ్యాత్వా = ఆలోచించి, తాం = ఆ యశోకవనమును, మనసా అధిగమ్య = మానసికముగా చేరి, తస్య వేశ్మనః = ఆ రావణుని భవనము నుండి, ప్రాకారమ్ అవప్లుతః = (అశోకవన) ప్రాకారమును గూర్చి లంఘించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'తామ్ అధిగమ్య' = ఆ సీతమ్మను ధ్యానించి.

**తాత్పర్యము :–** హనుమంతుడు రెండుక్షణముల కాలము ఈ రీతిగా సీతను గూర్చి చింతించుచు ఆ అశోకవనవిషయమై ఆలోచించి రావణాసురుని భవనమునుండి అశోకవనప్రాకారముమీదికి లంఘించెను.

**శ్లో॥ స తు సంహృష్టసర్వాంగః ప్రాకారస్థో మహాకపిః ।**
**పుష్పితాగ్రా న్వసంతాదౌ దదర్శ వివిధాన్ ద్రుమాన్ ॥ 2**

**పదచ్ఛేదము :–** సః – తు – సంహృష్టసర్వాంగః – ప్రాకారస్థః – మహాకపిః – పుష్పితాగ్రాన్ – వసంతాదౌ – దదర్శ – వివిధాన్ – ద్రుమాన్ ॥

**అన్వయక్రమము :–** సంహృష్టసర్వాంగః ప్రాకారస్థః సః మహాకపిః వసంతాదౌ పుష్పితాగ్రాన్ వివిధాన్ ద్రుమాన్ దదర్శ.

**ప్రతిపదార్థము :–** సంహృష్టసర్వాంగః = ఆనందముచే పులకరించినట్టి సమస్త శరీరము కల్గినట్టివాడు, ప్రాకారస్థః = అశోకవనికా ప్రాకారముపై నున్నట్టివాడునగు, సః మహాకపిః = ఆ హనుమంతుడు, వసంతాదౌ = వసంత ఋతువు ప్రారంభమునందు, పుష్పితాగ్రాన్ = పుష్పించియున్న శిఖరములు కలిగినట్టి, వివిధాన్ ద్రుమాన్ = బహువిధములగు వృక్షములను; దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** ఫాల్గుణ పౌర్ణమాసికి ముందు దినముననే, హనుమన్న లంకను ప్రవేశించెను. పూర్ణిమనుండి పూర్ణిమకు నెల యను పక్షమున వసంతఋతువు ప్రారంభమగుచుండె ననుట యుక్తమే.

**తాత్పర్యము :–** హనుమంతుడు అశోకవనముయొక్క ప్రాకారము మీదికి చేరి, ఆనందముచే పులకరించిన యొడలు గలవాడై వసంతఋతువు ప్రారంభమునందు పుష్పించియున్న కొమ్మలతో కూడిన పలువిధములగు వృక్షములను సంతోషముతో దర్శించెను.

**శ్లో॥ సాలానశోకాన్భవ్యాంశ్చ చంపకాంశ్చ సుపుష్పితాన్ ।**
**ఉద్దాలకా న్నాగవృక్షాం శ్చూతా న్కపిముఖానపి ॥ 3**

**పదచ్ఛేదము :–** సాలాన్ – అశోకాన్ – భవ్యాన్ – చ – చంపకాన్ – చ – సుపుష్పితాన్ – ఉద్దాలకాన్ – నాగవృక్షాన్ – చూతాన్ – కపిముఖాన్ – అపి ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** సాలాన్ = మద్దిచెట్లను, అశోకాన్ = అశోకవృక్షములను, భవ్యాన్ = మనోహరములైన, సుపుష్పితాన్ చంపకాన్ చ = చక్కగ పూచినట్టి సంపెంగచెట్లను, ఉద్దాలకాన్ = ఉద్దాలకవృక్షములను, నాగవృక్షాన్ = నాగకేసరవృక్షములను, చూతాన్ = మామిడిచెట్లను, కపిముఖాన్ అపి = కోతిమూతిగల మామిడిపండ్ల చెట్లను, (తీగకానుగుచెట్లను), హనుమాన్ = హనుమంతుడు, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడచ్చుట మద్దిచెట్లను, అశోకవృక్షములను, పుష్పించిన సంపెంగలు, ఉద్దాలకములు, నాగకేసరవృక్షములు, మామిడిచెట్లు మున్నగు మహా వృక్షములను పెక్కింటిని చూచెను.

**శ్లో॥ అ థామ్రవణసంఛన్నాం లతాశతసమావృతామ్ ।**
**జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికామ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– అథ – ఆమ్రవణసంఛన్నాం – లతాశతసమావృతాం – జ్యాముక్తః – ఇవ – నారాచః – పుప్లువే – వృక్షవాటికామ్ ॥

**అన్వయక్రమము** :– అథ ఆమ్రవణసంఛన్నాం, లతాశతసమావృతాం, వృక్షవాటికాం జ్యాముక్తః నారాచః ఇవ పుప్లువే.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, ఆమ్రవణసంఛన్నాం = మామిడిచెట్ల గుంపుచే కప్పబడియున్నదియును, లతాశతసమావృతాం = పెక్కుతీగలచే చుట్టబడియున్నది యునగు, వృక్షవాటికాం = వనవాటికను, జ్యాముక్తః నారాచః ఇవ = వింటినారి నుండి విడువబడిన బాణమువలె, పుప్లువే = గెంతెను.

**తాత్పర్యము** :– పిమ్మట హనుమంతుడు, మామిడిచెట్లచే చుట్టుకొనబడియున్నదియును, బహువిధములగు లతలతో అల్లుకొనబడి యున్నదియునగు అచటి వృక్షవాటికను, ధనుస్సునుండి విడువబడిన బాణమువలె ఒక్కగెంతుతో చేరుకొనెను.

**శ్లో॥ స ప్రవిశ్య విచిత్రాం తాం విహగై రభినాదితాం ।**
**రాజతైః కాంచనై శ్చైవ పాదపై స్సర్వతో వృతామ్ ॥ 5**

**శ్లో॥ విహగై ర్మృగసంఘై శ్చ విచిత్రాం చిత్రకాననామ్ ।**
**ఉదితాదిత్యసంకాశాం దదర్శ హనుమాన్ కపిః ॥ 6**

**పదచ్ఛేదము** :– సః – ప్రవిశ్య – విచిత్రాం – తాం – విహగైః – అభినాదితాం – రాజతైః – కాంచనైః – చ – ఏవ – పాదపైః – సర్వతః – వృతాం – విహగైః – మృగసంఘైః – చ – విచిత్రాం – చిత్రకాననామ్ – ఉదితాదిత్యసంకాశాం – దదర్శ – హనుమాన్ – కపిః ॥

**అన్వయక్రమము** :– సః కపిః హనుమాన్, తాం ప్రవిశ్య విహగైః అభినాదితాం, రాజతైః కాంచనైః పాదపైః సర్వతః వృతాం విహగైః మృగసంఘైశ్చ విచిత్రామ్ ఉదితాదిత్యసంకాశాం, చిత్రకాననాం దదర్శ.

**ప్రతిపదార్థము** :– సః కపిః హనుమాన్ = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, విచిత్రాం తాం = వింతగనున్నట్టి ఆ వనవాటికను, ప్రవిశ్య = ప్రవేశించి, విహగైః అభినాదితాం = పక్షులచే ధ్వనిచేయబడు చున్నదియును, రాజతైః కాంచనైః = వెండిరంగు కల్గినట్టియు, బంగారురంగు కల్గినట్టియు, పాదపైః = వృక్షములతో, సర్వతః వృతాం = నలుమూలల ఆవరింపబడి యున్నట్టియు; విహగైః మృగసంఘైశ్చ = పక్షుల గుంపులతోడను, జంతువుల మందలతోడను, విచిత్రాం = వింతవింతగనున్నట్టియు, ఉ

దితాదిత్యసంకాశాం = ఉదయించిన సూర్యునితో సమానముగ ప్రకాశించు చున్నదియును అగు, చిత్రకాననాం = చిత్రమైనట్టి ఆ వనమును, దదర్శ = తిలకించెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు వింతగనున్న ఆ వృక్షవాటికను ప్రవేశించి పక్షుల కలకల ధ్వనితో మారుమ్రోగుచున్నదియును, వెండివలెను, బంగారమువలెను ప్రకాశించుచున్న వృక్షములతో ఎల్ల యెడల నిండి యున్నదియును, వివిధపక్షిగణముల తోడను, జంతుసమూహముల తోడను, విచిత్రముగ కనబడుచున్నదియును, లేత సూర్యుని ప్రకాశమువంటి కాంతితో వెలుగుచున్నదియునగు ఆ విచిత్రమైన వనమును తిలకించెను.

**శ్లో॥ వృతాం నానావిధై ర్వృక్షైః పుష్పోపగఫలోపగైః ।**
**కోకిలై ర్భృంగరాజై శ్చ మత్తైర్నిత్యనిషేవితామ్ ॥ 7**

**శ్లో॥ ప్రహృష్టమనుజే కాలే మృగపక్షిసమాకులే ।**
**మత్తబర్హిణసంఘుష్టాం నానాద్విజగణాయుతామ్ ॥ 8**

**పదచ్ఛేదము** :– వృతాం – నానావిధైః – వృక్షైః – పుష్పోపగఫలోపగైః – కోకిలైః – భృంగరాజైః– చ – మత్తైః – నిత్యనిషేవితామ్ – ప్రహృష్టమనుజే – కాలే – మృగపక్షి సమాకులే – మత్తబర్హిణసంఘుష్టాం – నానాద్విజగణాయుతామ్ ॥

**అన్వయక్రమము** :– పుష్పోపగఫలోపగైః నానావిధైః వృక్షైః వృతాం, మత్తైః కోకిలైః భృంగరాజైశ్చ నిత్యనిషేవితాం, ప్రహృష్టమనుజే మృగపక్షిసమాకులే కాలే, మత్త బర్హిణసంఘుష్టాం, నానాద్విజగణాయుతాం, (చిత్రకాననాం హనుమాన్ దదర్శ).

**ప్రతిపదార్థము** :– పుష్పోపగఫలోపగైః = పుష్పభరితములును, ఫలభరితములును అగు, నానావిధైః వృక్షైః = బహువిధములగు వృక్షములచే, వృతాం = చుట్టుకొనబడి యున్నదియును, కోకిలైః = కోయిలలచేతను, మత్తైః భృంగరాజైశ్చ = మదించిన గండు తుమ్మెదలచేతను, నిత్యనిషేవితాం = ఎల్లప్పుడును సేవింపబడుచున్నదియును, మృగపక్షిసమాకులే = జంతువులతోడను, పక్షులతోడను కలకలలాడుచుండినట్టి, ప్రహృష్టమనుజే కాలే = ఆనందపరవశులై యున్న మనుష్యులు గల (వసంత) కాలము నందు, మత్తబర్హిణసంఘుష్టాం = మదించిన నెమళ్ళకూతలతో నిండినదియును, నానాద్విజగణాయుతాం = వివిధములగు పక్షుల గుంపులతో నిండినదియును అగు, (చిత్రకాననాం హనుమాన్ దదర్శ = చిత్రవనమును హనుమంతుడు జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "కాలే" = సర్వకాలములందును పుష్పఫలసమన్వితమై యున్నది.

**తాత్పర్యము :–** పుష్పములతోడను, ఫలములతోడను నిండిన బహువిధవృక్షములతో ఆవరింపబడియున్నదియును, ఎల్లకాలములందును కోకిలలతోడను, మత్తభ్రమరముల తోడను సేవింపబడుచున్నదియును, ఆనందనిమగ్నులైయున్న మనుజులతోడను, జంతువులతోడను, పక్షులతోడను కలకల లాడుచున్నదియును, మదించిన నెమళ్ళ ధ్వనితో నిండియున్నదియును, బహువిధపక్షిగణముతో సుందరముగ నున్నదియును అగు చిత్రకాననమును, హనుమ దర్శించెను.

**శ్లో॥ మార్గమాణో వరారోహాం రాజపుత్రీ మనిందితామ్ ।**
**సుఖప్రసుప్తాన్ విహగాన్ బోధయామాస వానరః ॥ 9**

**పదచ్ఛేదము :–** మార్గమాణః – వరారోహాం – రాజపుత్రీమ్ – అనిందితాం – సుఖప్రసుప్తాన్ – విహగాన్ – బోధయామాస – వానరః ॥

**అన్వయక్రమము :–** వానరః వరారోహామ్, అనిందితాం, రాజపుత్రీం మార్గమాణః, సుఖప్రసుప్తాన్ విహగాన్ బోధయామాస.

**ప్రతిపదార్థము :–** వానరః = హనుమ, వరారోహాం = (పృథుశ్రోణియగు) సుందరాంగి యును, అనిందితాం = పూజ్యురాలునగు, రాజపుత్రీం = జానకమ్మను, మార్గమాణః = అన్వేషించుచున్నవాడై, సుఖప్రసుప్తాన్ = సుఖముగ నిద్రించుచున్న, విహగాన్ = పక్షులను, బోధయామాస = మేలుకొలిపెను.

**తాత్పర్యము :–** పూజ్యురాలయిన జానకమ్మను అన్వేషించుచు, వృక్షములపై దుముకుచు సంచరించుచుండుటవలన హనుమ సుఖముగ నిద్రించుచున్న అందలి పక్షులను మేల్కొన జేసినవాడయ్యెను.

**శ్లో॥ ఉత్పతద్భి ర్ద్విజగణైః పక్షై స్సాలా స్సమాహతాః ।**
**అనేకవర్ణా వివిధా ముముచుః పుష్పవృష్టయః ॥ 10**

**పదచ్ఛేదము :–** ఉత్పతద్భిః – ద్విజగణైః – పక్షైః – సాలాః – సమాహతాః – అనేకవర్ణాః – వివిధాః – ముముచుః – పుష్పవృష్టయః ॥

**అన్వయక్రమము :–** ఉత్పతద్భిః ద్విజగణైః పక్షైః సమాహతాః సాలాః అనేకవర్ణాః వివిధాః పుష్పవృష్టయః ముముచుః.

**ప్రతిపదార్థము :–** ఉత్పతద్భిః ద్విజగణైః = మీదికి ఎగురుచున్నట్టి పక్షుల సమూహముల చేతను, పక్షైః = (వాని) రెక్కలచేతను, సమాహతాః = కొట్టబడినట్టి, సాలాః = వృక్షములు, అనేకవర్ణాః = పలువిధములగు రంగులు కలిగినట్టియు, వివిధాః = బహువిధములుగ నున్నట్టియు, పుష్పవృష్టయః = పుష్పవర్షములను, ముముచుః = విడిచినవి.

**తాత్పర్యము :–** అట్లు హనుమచే మేల్కొల్పబడిన పక్షులు లేచి ఎగురుచుండగా వాటి రెక్కల తాకిడిచే, కదల్పబడిన కొమ్మలుగల వృక్షములు రంగు రంగుల పలురీతుల పుష్పవర్షములను కురిసినవి.

**శ్లో॥ పుష్పావకీర్ణ శ్శుశుభే హనుమా న్మారుతాత్మజః ।**
**అశోకవనికామధ్యే యథా పుష్పమయో గిరిః ॥ 11**

**పదచ్ఛేదము :–** పుష్పావకీర్ణః – శుశుభే – హనుమాన్ – మారుతాత్మజః – అశోక వనికామధ్యే – యథా – పుష్పమయః – గిరిః ॥

**అన్వయక్రమము :–** పుష్పావకీర్ణః సన్ మారుతాత్మజః హనుమాన్, అశోకవనికామధ్యే పుష్పమయః గిరిః యథా శుశుభే.

**ప్రతిపదార్థము :–** పుష్పావకీర్ణః సన్ = పుష్పములచే నిండినవాడై, మారుతాత్మజః హనుమాన్ = మరున్నందనుడైన హనుమ, అశోకవనికామధ్యే = అశోకవనము నడుమ, పుష్పమయః గిరిః యథా = పూవుల కొండవలె; శుశుభే = శోభిల్లెను.

**తాత్పర్యము :–** అట్లు వృక్షములు వర్షించిన పూవులన్నియును తనపైబడగా హనుమ ఆ పువ్వులచే కప్పబడి ఆ యశోకవనము నడుమ ప్రకాశించుచున్న ఒక పుష్ప పర్వతమువలె విరాజిల్లెను.

**శ్లో॥ దిశ స్సర్వాః ప్రధావంతం వృక్షషండగతం కపిం ।**
**దృష్ట్వా సర్వాణి భూతాని వసంత ఇతి మేనిరే ॥ 12**

**పదచ్ఛేదము :–** దిశః – సర్వాః – ప్రధావంతం – వృక్షషండగతం – కపిం – దృష్ట్వా – సర్వాణి – భూతాని – వసంతః – ఇతి – మేనిరే ॥

**అన్వయక్రమము :–** సర్వాః దిశః ప్రధావంతం, వృక్షషండగతం, కపిం దృష్ట్వా సర్వాణి భూతాని వసంతః ఇతి మేనిరే.

**ప్రతిపదార్థము :–** సర్వాః దిశః ప్రధావంతం = అన్నివైపులకును పరుగిడుచున్నట్టి, వృక్షషండగతం = వృక్షసమూహముల నడుమ నున్నట్టి, కపిం = హనుమను, దృష్ట్వా

= చూచి; సర్వాణి భూతాని = సమస్తప్రాణులును, వసంతః ఇతి = వసంతుడని, మేనిరే = భావించిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– "వసంత ఇతి మేనిరే" – ఇచ్చట ప్రవేశించుటకు ఎవ్వరికిని అశక్యమగుటచే సాక్షాత్ వసంతుడే వృక్షసంచారమున కుచితమైన కపిరూపమును స్వీకరించి సంచరించు చున్నాడని భావము.

**తాత్పర్యము** :– అట్లు పుష్పములతో నిండి, వనమునందు అన్నివైపులకును పరుగిడుచు ఆ వృక్షముల నడుమ కానవచ్చుచున్న హనుమను గాంచి, అచ్చటి సమస్తప్రాణులును వసంతఋతువు అనగా ఈతడే యైయుండునని భావించుచుండిరి. [అచ్చటి చూపరులకు దైవానుకూల్యముచే హనుమపై విరోధభావము లేకుండుట సంభవమాయెను అని ఇచ్చట కవి సూచించుచున్నాడు]

**శ్లో॥ వృక్షేభ్యః పతితైః పుష్పైః అవకీర్ణా పృథగ్విధైః ।**
**రరాజ వసుధా తత్ర ప్రమదేవ విభూషితా ॥ 13**

**పదచ్ఛేదము** :– వృక్షేభ్యః – పతితైః – పుష్పైః – అవకీర్ణా – పృథగ్విధైః – రరాజ – వసుధా – తత్ర – ప్రమదా – ఇవ – విభూషితా ॥

**అన్వయక్రమము** :– వృక్షేభ్యః పతితైః, పృథగ్విధైః పుష్పైః అవకీర్ణా తత్ర వసుధా, విభూషితా ప్రమదా ఇవ రరాజ.

**ప్రతిపదార్థము** :– వృక్షేభ్యః పతితైః = చెట్లనుండి రాలినట్టి, పృథగ్విధైః పుష్పైః = వేరువేరు విధములగు పువ్వులతో, అవకీర్ణా = చల్లబడినట్టి, తత్ర = ఆ వనమునందలి; వసుధా = భూమి, విభూషితా ప్రమదా ఇవ = చక్కగా అలంకరించుకొన్న సుందరాంగివలె; రరాజ = విరాజిల్లెను.

**తాత్పర్యము** :– అట్లు వృక్షములనుండి రాలినట్టి వివిధములగు పుష్పములతో నిండిన అచ్చటి వసుధాస్థలి చక్కగా అలంకరించుకొన్న ఒక సుందరాంగివలె శోభిల్లుచుండెను.

**శ్లో॥ తరస్వినా తే తరవః తరసాభిప్రకంపితాః ।**
**కుసుమాని విచిత్రాణి సస్పృజుః కపినా తదా ॥ 14**

**పదచ్ఛేదము** :– తరస్వినా – తే – తరవః – తరసా – అభిప్రకంపితాః – కుసుమాని – విచిత్రాణి – సస్పృజుః – కపినా – తదా ॥

**అన్వయక్రమము :–** తరస్వినా కపినా తరసా అభిప్రకంపితాః తే తరవః తదా విచిత్రాణి కుసుమాని సస్రృజుః.

**ప్రతిపదార్థము :–** తరస్వినా కపినా = వేగవంతుడైన హనుమచే, తరసా = బలముగా; అభిప్రకంపితాః = మిక్కిలి కంపింపచేయబడిన; తే తరవః = ఆ వృక్షములు, తదా = ఆ సమయమునందు, విచిత్రాణి కుసుమాని = రంగు రంగుల పువ్వులను, సస్రృజుః = రాల్చినవి.

**తాత్పర్యము :–** వేగముగా పరుగిడుచున్న బలాఢ్యుడైన హనుమచేత బలముగా కంపితములైనట్టి అచ్చటి వృక్షము లాసమయమున బహువర్ణములు గల సుందరమైన కుసుమములను నేలపై కురిపించినవి.

**శ్లో॥ నిర్ధూతపత్రశిఖరా శ్శీర్ణపుష్పఫలా ద్రుమాః ।**
**నిక్షిప్తవస్త్రాభరణా ధూర్తా ఇవ పరాజితాః ॥ 15**

**పదచ్ఛేదము :–** నిర్ధూతపత్రశిఖరాః – శీర్ణపుష్పఫలాః – ద్రుమాః – నిక్షిప్తవస్త్రాభరణాః – ధూర్తాః – ఇవ – పరాజితాః ॥

**అన్వయక్రమము :–** నిర్ధూతపత్రశిఖరాః, శీర్ణపుష్పఫలాః ద్రుమాః, పరాజితాః, నిక్షిప్త వస్త్రాభరణాః, ధూర్తాః ఇవ (అదృశ్యంత).

**ప్రతిపదార్థము :–** నిర్ధూతపత్రశిఖరాః = రాలిపోయిన ఆకులు కొమ్మలు గలిగిన, శీర్ణపుష్పఫలాః = రాలిపోయిన పువ్వులును పండ్లును కలిగినట్టి, ద్రుమాః = వృక్షములు, పరాజితాః = ఓడిపోయినవారై, నిక్షిప్తవస్త్రాభరణాః = ఊడదీసి అప్పగించిన వస్త్రములు కల, ధూర్తాః ఇవ = జూదగాండ్రవలె, (అదృశ్యంత = కాన్పించినవి).

**తాత్పర్యము :–** అట్లు హనుమయొక్క గమనవేగముచే ఆకులన్నియును రాలిపోయి పుష్పములను పోగొట్టుకొన్న అచ్చటి వృక్షములు, జూదమునందు ఓడింప బడినవారై తమ వస్త్రములను ఆభరణములను తీసివైచి నిలచియున్న జూదగాండ్రవలె కాన్పించు చుండెను.

**శ్లో॥ హనూమతా వేగవతా కంపితాస్తే నగోత్తమాః ।**
**పుష్పపర్ణఫలా న్యాశు ముముచుః పుష్పశాలినః ॥ 16**

**పదచ్ఛేదము :–** హనూమతా – వేగవతా – కంపితాః – తే – నగోత్తమాః – పుష్పపర్ణఫలాని – ఆశు – ముముచుః – పుష్పశాలినః ॥

**అన్వయక్రమము :–** వేగవతా హనూమతా కంపితాః, పుష్పశాలినః నగోత్తమాః ఆశు

పుష్పపర్ణఫలాని ముముచుః.

**ప్రతిపదార్థము** :– వేగవతా హనుమతా = మిక్కిలి వేగముగల హనుమంతునిచే, కంపితాః = కంపింప చేయబడినట్టివియును, పుష్పశాలినః = పుష్పసంభరితములై నట్టివియును అగు, తే నగోత్తమాః = ఆ మహావృక్షములు, ఆశు = శీఘ్రముగా, పుష్పపర్ణఫలాని = పూవులను, పత్రములను, ఫలములను, ముముచుః = రాల్చినవి.

**తాత్పర్యము** :– అట్లు అచ్చట వేగముగా చరించుచున్న హనుమచే ప్రకంపితములైనట్టి ఆ వృక్షములన్నియును పుష్పములను, పర్ణములను, ఫలములను, కొన్ని క్షణములలో నేలపై రాల్చినవి.

**శ్లో॥ విహంగసంఘై ర్హీనా స్తే స్కంధమాత్రాశ్రయా ద్రుమాః ।**
**బభూవు రగమా స్సర్వే మారుతే నేవ నిర్ధుతాః ॥ 17**

**పదచ్ఛేదము** :– విహంగసంఘైః – హీనాః – తే – స్కంధమాత్రాశ్రయాః – ద్రుమాః – బభూవుః – అగమాః – సర్వే – మారుతేన – ఇవ – నిర్ధుతాః ॥

**అన్వయక్రమము** :– విహంగసంఘైః హీనాః స్కంధమాత్రాశ్రయాః తే ద్రుమాః సర్వే మారుతేన నిర్ధుతాః అగమాః ఇవ బభూవుః.

**ప్రతిపదార్థము** :– విహంగసంఘైః హీనాః = పక్షిసంఘములు లేనట్టియు, స్కంధమాత్రా శ్రయాః = కొమ్మలతో మాత్రమే నిలచియున్నట్టియు, తే ద్రుమాః సర్వే = ఆ వృక్షము లన్నియును, మారుతేన నిర్ధుతాః ఇవ = గాలిచే రాల్చివేయబడినట్టివి వలె, అగమాః బభూవుః = చేరుటకు యోగ్యముగానివిగా నుండెను.

**తాత్పర్యము** :– అచటి ఆ వృక్షములన్నియు, తమపై ఒక పక్షి గూడ లేకుండ కేవలము కొమ్మలతో మాత్రమే నిలచియుండుటచే పెనుగాలిచే దులిచి వేయబడిన చెట్లవలె చేరుటకు అయోగ్యమైనవిగా నుండెను.

**శ్లో॥ నిర్ధూతకేశీ యువతి ర్యథా మృదితవర్ణకా ।**
**నిష్పీతశుభదంతోష్ఠీ నఖైర్దంతై శ్చ విక్షతా ॥ 18**

**శ్లో॥ తథా లాంగూలహస్తైశ్చ చరణాభ్యాం చ మర్దితా ।**
**బభూ వాశోకవనికా ప్రభగ్నవరపాదపా ॥ 19**

**పదచ్ఛేదము** :– నిర్ధూతకేశీ – యువతిః – యథా – మృదితవర్ణకా – నిష్పీత శుభదంతోష్ఠీ – నఖైః – దంతైః – చ – విక్షతా ॥ తథా – లాంగూలహస్తైః – చ – చరణాభ్యాం – చ – మర్దితా – బభూవ – అశోకవనికా – ప్రభగ్నవరపాదపా ॥

**అన్వయక్రమము** :- (రతికేళిసమయే) యథా యువతిః నిర్ధూతకేశీ, మృదితవర్ణకా, నిష్పీతశుభదంతోష్ఠీ, నఖైః, దంతైః చ విక్షతా భవతి; తథా (హనుమతా) అశోకవనికా లాంగూలహస్తైః చ, చరణాభ్యాం చ మర్దితా (సతీ) ప్రభగ్నవరపాదపా బభూవ.

**ప్రతిపదార్థము** :- (రతికేళిసమయే = రతిక్రీడా సమయమున), యథా = ఏవిధముగా, యువతిః = తరుణి, నిర్ధూతకేశీ = చెదరగొట్టబడిన కేశములు గలదియును, మృదిత వర్ణకా = తుడిచి వేయబడిన మైపూత గలదియును, నిష్పీతశుభదంతోష్ఠీ = పానము చేయబడిన సుందరమైన దంతములు గల పెదవులు గలదియును, నఖైః దంతైః చ విక్షతా = గోళ్ళచేతను, పండ్లచేతను, గాయపరుపబడినది, (భవతి = అగునో), తథా = ఆ రీతిగా, (హనుమతా = హనుమంతునిచే), అశోకవనికా = ఆ యశోకవనము, లాంగూలహస్తైః చ = వాలముచేతను, హస్తములచేతను, చరణాభ్యాం చ = పాదములచేతను, మర్దితా (సతీ) = మర్దింపబడినదై, ప్రభగ్నవరపాదపా = కూల్చివేయబడిన గొప్పవైన వృక్షములుగలది, బభూవ = అయినది.

**తాత్పర్యము** :- ఆ యశోకవనమును హనుమంతుడు, తన తోకతోడను, హస్తముల తోడను, పాదములతోడను, మిక్కిలిగా పీడించి విడుచుటచే, ఆ యశోకవనిక, రతిక్రీడయందు ఆలింగనాదికృత్యములచే జడ ముడి వీడి, చెదరిన కేశములుగలదై, ఒడలియందలి మైపూత రాలినదై, ఆసక్తితో పానము చేయబడిన అధరముగలదై, గోళ్ళచేతను, దంతములచేతను క్షతములను పొందియున్న తరుణివలె గానవచ్చెను.

**శ్లో॥ మహాలతానాం దామాని వ్యధమత్తరసా కపిః ।**
**యథా ప్రావృషి వింధ్యస్య మేఘజాలాని మారుతః ॥ 20**

**పదచ్ఛేదము** :- మహాలతానాం – దామాని – వ్యధమత్ – తరసా – కపిః – యథా – ప్రావృషి – వింధ్యస్య – మేఘజాలాని – మారుతః ॥

**అన్వయక్రమము** :- ప్రావృషి మారుతః యథా వింధ్యస్య మేఘజాలాని (వ్యధమత్) తథా కపిః, తరసా మహాలతానాం దామాని వ్యధమత్.

**ప్రతిపదార్థము** :- ప్రావృషి = వర్షాకాలమున, మారుతః = వాయువు, యథా = ఏరీతిగా, వింధ్యస్య మేఘజాలాని = వింధ్యపర్వతముపైగల మబ్బుల గుంపులను, (వ్యధమత్ = చెదరగొట్టెనో), తథా = ఆ రీతిగా, కపిః = హనుమ, మహాలతానాం దామాని = పెద్ద పెద్ద తీగలసమూహములను, తరసా = బలముతో, వ్యధమత్ = చిమ్మివేసెను.

**తాత్పర్యము** :- వర్షాకాలమునందు వాయువు వింధ్యపర్వతముపై చేరిన మేఘ

సముదాయముల నెట్లు దూరముగ చిమ్మివేయునో అట్లే హనుమంతుడు అశోకవనము నందలి పెద్ద పెద్ద పూలతీగలు మున్నగు వానిని బలముగ చిమ్మి దూరముగ చెదరగొట్టెను.

**శ్లో॥ స తత్ర మణిభూమీ శ్చ రాజతీ శ్చ మనోరమాః ।**
**తథా కాంచనభూమీ శ్చ దదర్శ విచర న్కపిః ॥ 21**

**పదచ్ఛేదము :–** సః – తత్ర – మణిభూమీః – చ – రాజతీః – చ – మనోరమాః – తథా – కాంచనభూమీః – చ – దదర్శ – విచరన్ – కపిః ॥

**అన్వయక్రమము :–** సః – కపిః తత్ర విచరన్, మణిభూమీః చ, రాజతీః (భూమీః చ) తథా, మనోరమాః కాంచనభూమీః చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః కపిః = ఆ హనుమ, తత్ర విచరన్ = ఆ యశోకవనమునందు సంచరించుచు, మణిభూమీః చ = రత్నస్థగితములైన నేలలను, రాజతీః (భూమీః) చ = రజతనిర్మితభూములను, తథా = ఆ రీతిగనే, కాంచనభూమీః చ = స్వర్ణనిర్మితమగు భూములను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** ఆ హనుమంతు డచ్చట తిరుగాడుచు ఆ యశోకవనమునందు మనోహరములైనట్టి రత్నమయములైన భూములను, రజతమయమైన భూములను, సువర్ణమయభూములను దర్శించెను.

**శ్లో॥ వాపీ శ్చ వివిధాకారాః పూర్ణాః పరమవారిణా ।**
**మహార్హై ర్మణిసోపానైః ఉపపన్నా స్తతస్తతః ॥ 22**

**పదచ్ఛేదము :–** వాపీః – చ – వివిధాకారాః – పూర్ణాః – పరమవారిణా – మహార్హైః – మణిసోపానైః – ఉపపన్నాః – తతః – తతః ॥

**అన్వయక్రమము :–** వివిధాకారాః, పరమవారిణా పూర్ణాః, తతః తతః, మహార్హైః మణిసోపానైః ఉపపన్నాః, వాపీః చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** వివిధాకారాః = పలువిధములగు ఆకృతులు గలిగినవియును, పరమవారిణా పూర్ణాః = శ్రేష్ఠములైన జలములతో నిండినవియును, తతః తతః = అచ్చటచ్చట, మహార్హైః మణిసోపానైః = అమూల్యములైనట్టి రత్నమయములైన సోపానములతో, ఉపపన్నాః = కూడినవియునగు, (వాపీః = దిగుడు బావులను, దదర్శ = చూచెను).

**తాత్పర్యము :–** హనుమ అచ్చట పలువిధములగు ఆకృతులు గలిగి శ్రేష్ఠమైన

జలములతో నిండి రత్నమయములైన సోపానములతో శోభిల్లుచున్న దిగుడు బావులను అచ్చటచ్చట చూచెను.

**శ్లో॥ ముక్తాప్రవాళసికతాః స్ఫాటికాంతరకుట్టిమాః ।**
**కాంచనై స్తరుభి శ్చిత్రై స్తీరజై రుపశోభితాః ॥ 23**

**పదచ్ఛేదము :–** ముక్తాప్రవాళసికతాః – స్ఫాటికాంతరకుట్టిమాః – కాంచనైః – తరుభిః – చిత్రైః – తీరజైః – ఉపశోభితాః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** ముక్తాప్రవాళసికతాః = ముత్యములయొక్కయు పగడములయొక్కయు పొడియే ఇసుకగా గలవియును, స్ఫాటికాంతరకుట్టిమాః = స్ఫటికమణిమయము లైన తిన్నెలు గలవియును, చిత్రైః = రంగు రంగులుగల, తీరజైః = తీరమున మొలచిన, కాంచనైః తరుభిః = బంగారు వృక్షములతో, ఉపశోభితాః = విరాజిల్లుచున్నట్టివియునగు, (వాపీః = దిగుడుబావులను, దదర్శ = చూచెను).

**తాత్పర్యము :–** హనుమ అచ్చట అందమైన దిగుడుబావులను జూచెను. ఆ దిగుడు బావులకడనున్న ఇసుకతిప్పలు ముత్యములయొక్కయు, పగడములయొక్కయు చూర్ణములతో నిర్మింపబడినవి. అచ్చటి తిన్నెలు స్ఫటికమణిమయములు; ఆ బావులకు చుట్టును తీరములపై రంగురంగుల బంగరువృక్షములు ఎన్నియో చూచుటకు రమణీయములై ఒప్పుచుండెను.

**శ్లో॥ ఫుల్లపద్మోత్పలవనా శ్చక్రవాకోపకూజితాః ।**
**నత్యూహరుతసంఘుష్టా హంససారసనాదితాః ॥ 24**

**పదచ్ఛేదము :–** ఫుల్లపద్మోత్పలవనాః – చక్రవాకోపకూజితాః – నత్యూహరుత సంఘుష్టాః – హంససారసనాదితాః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** ఫుల్లపద్మోత్పలవనాః = వికసించిన కమలములయొక్కయు కలువల యొక్కయును సమూహములు గలవియును, చక్రవాకోపకూజితాః = జక్కవ పిట్టలచే ధ్వనింప జేయబడినవియును, నత్యూహరుతసంఘుష్టాః = వానకోయిలల కూతలచే ధ్వనింప చేయబడినవియును, హంస సారస నాదితాః = హంసలచేతను, బెగ్గురు పక్షులచేతను ధ్వనింప చేయబడినవియునగు (వాపీః దదర్శ = దిగుడు బావులను చూచెను).

**తాత్పర్యము :–** ఆ హనుమ జూచిన దిగుడుబావుల నిండ చక్కగా వికసించియున్న తామరపువ్వులును, కలువలును గానవచ్చుచుండెను. ఆ నడబావియందు జక్కవ పిట్టలు, వానకోయిలలు, హంసలు, బెగ్గురు పిట్టలు, శ్రావ్యముగ కూయుచుండ వాని కోలాహలధ్వని కర్ణపేయముగా నుండెను.

**శ్లో॥ దీర్ఘాభి ర్ద్రుమయుక్తాభి స్సరిద్భి శ్చ సమంతతః ।**
**అమృతోపమతోయాభి శ్శివాభి రుపసంస్కృతాః ॥ 25**

**పదచ్ఛేదము :–** దీర్ఘాభిః – ద్రుమయుక్తాభిః – సరిద్భిః – చ – సమంతతః – అమృతోపమతోయాభిః – శివాభిః – ఉపసంస్కృతాః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** దీర్ఘాభిః = పొడవైనట్టివియును, ద్రుమయుక్తాభిః = వృక్షములతో కూడియున్నట్టియు, అమృతోపమతోయాభిః = అమృతతుల్యమగు జలములతో కూడినవియును, శివాభిః = మంగళకరములైనట్టివియునగు, సరిద్భిః = నదీ ప్రవాహములచే, సమంతతః = నలువైపులను, ఉపసంస్కృతాః = అలంకరింపబడి యున్నవియు నగు, (వాపీః దదర్శ = దిగుడుబావులను చూచెను).

**తాత్పర్యము :–** పొడవైన చెట్లు తీరమునందు గలిగి, అమృతతుల్యమైన పరిశుద్ధ జలములతో నిండిన నదీప్రవాహములచే ఆ నడబావులు నలువైపులను చుట్టుకొనబడి యుండి మిక్కిలి ప్రకాశించుచుండెను.

**శ్లో॥ లతాశతై రవతతాః సంతానకుసుమావృతాః ।**
**నానాగుల్మావృతఘనాః కరవీరకృతాంతరాః ॥ 26**

**పదచ్ఛేదము :–** లతాశతైః – అవతతాః – సంతానకుసుమావృతాః – నానాగుల్మా వృతఘనాః – కరవీరకృతాంతరాః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** లతాశతైః అవతతాః = వందలకొలది తీగలతో వ్యాపించి యున్నవియును, సంతానకుసుమావృతాః = కల్పవృక్షముల పుష్పములతో నిండినవియును, నానాగుల్మావృతఘనాః = బహువిధములైన పొదలచే దట్టముగ నావరింపబడి యున్నవియును, కరవీరకృతాంతరాః = గన్నేరు వృక్షములతో నిండిన మధ్యభాగములు గలవియునగు (వాపీః దదర్శ = దిగుడు బావులను చూచెను).

**తాత్పర్యము :–** ఆ దీర్ఘికలు వివిధములైన పుష్పలతలతోడను, కల్పవృక్షములతోడను,

ఆవరింపబడియున్నవి. సుందరమైన పలు విధములైన పొదలతోడను, నడుమ నడుమ గన్నేరు మున్నగు వృక్షములతోడను నిండియుండెను.

**శ్లో॥ తతో౽ంబుధరసంకాశం ప్రవృద్ధశిఖరం గిరిమ్ ।**
**విచిత్రకూటం కూటై శ్చ సర్వతః పరివారితమ్ ॥ 27**

**శ్లో॥ శిలాగృహై రవతతం నానావృక్షై స్సమావృతమ్ ।**
**దదర్శ హరిశార్దూలో రమ్యం జగతి పర్వతమ్ ॥ 28**

**పదచ్ఛేదము** :– తతః – అంబుధరసంకాశం – ప్రవృద్ధశిఖరం – గిరిమ్ – విచిత్రకూటం – కూటైః – చ – సర్వతః – పరివారితమ్, శిలాగృహైః – అవతతం – నానావృక్షైః – సమావృతమ్ – దదర్శ – హరిశార్దూలః – రమ్యం – జగతి – పర్వతమ్ ॥

**అన్వయక్రమము** :– తతః హరిశార్దూలః అంబుధరసంకాశం, ప్రవృద్ధశిఖరం, విచిత్రకూటం, సర్వతః కూటైః పరివారితం, శిలాగృహైః అవతతం, నానావృక్షైః సమావృతం, జగతి రమ్యం పర్వతం గిరిం దదర్శ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, హరిశార్దూలః = వానరశ్రేష్ఠుడైన హనుమ, అంబుధరసంకాశం = మేఘసన్నిభమైనదియును, ప్రవృద్ధశిఖరం = పెరిగియున్న శిఖరములు గలదియును, విచిత్రకూటం = చిత్రములైన శృంగములు గలదియును, సర్వతః కూటైః పరివారితం = అన్నివైపులను చిన్నచిన్న శిఖరములతో చుట్టబడి యున్నదియును, శిలాగృహైః అవతతం = శిలామందిరములతో కూడియున్నదియును, నానావృక్షైః సమావృతం = బహువిధములగు వృక్షములచే ఆవరింపబడి యున్నదియును, జగతి = భూమియందెల్లెడ, రమ్యం = సుందరమైన, పర్వతం = పర్వతమైనట్టిదియునగు, గిరిం = క్రీడాపర్వతమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామానుజీయము** :– 'జగతిపర్వతం' లేక జగతీపర్వతము అనగా మన్ను అధికముగాగల కొండయని అర్థము. లేక జగతిపర్వతమను పేరుగల కొండ యని యర్థము.

**మహేశ్వరతీర్థులు** :– మృణ్మయపర్వతము.

**తాత్పర్యము** :– పిమ్మట హనుమ మేఘమువలె ఉన్నతమైనదియును, పొడవైన శిఖరములు గలదియును, విచిత్రములై చుట్టునుగల శృంగములతో వెలయు

చున్నదియును, శిలాగృహములతో నిండినదియును, బహువిధములగు వృక్షములతో నిండినదియును, భూమిపై మిక్కిలి సుందరమై యున్నదియును అగు ఒకానొక క్రీడా పర్వతమును ఆ యశోకవనమున గాంచెను.

**శ్లో॥ దదర్శ చ నగా త్తస్మా న్నదీం నిపతితాం కపిః ।**
**అంకా దివ సముత్పత్య ప్రియస్య పతితాం ప్రియామ్ ॥ 29**

**శ్లో॥ జలే నిపతితాగ్రై శ్చ పాదపై రుపశోభితాం ।**
**వార్యమాణా మివ క్రుద్ధాం ప్రమదాం ప్రియబంధుభిః ॥ 30**

**పదచ్ఛేదము :-** దదర్శ - చ - నగాత్ - తస్మాత్ - నదీం - నిపతితాం - కపిః - అంకాత్ - ఇవ - సముత్పత్య - ప్రియస్య - పతితాం - ప్రియామ్ ॥ జలే - నిపతితాగ్రైః - చ - పాదపైః - ఉపశోభితాం - వార్యమాణామ్ - ఇవ - క్రుద్ధాం - ప్రమదాం - ప్రియబంధుభిః ॥

**అన్వయక్రమము :-** (సః) కపిః ప్రియస్య అంకాత్ సముత్పత్య పతితామ్ ఇవ చ, ప్రియబంధుభిః వార్యమాణాం క్రుద్ధాం ప్రియాం ప్రమదామ్ ఇవ చ స్థితాం, తస్మాత్ నగాత్ నిపతితాం, జలే నిపతితాగ్రైః పాదపైః ఉపశోభితాం చ నదీం దదర్శ.

**ప్రతిపదార్థము :-** (సః) కపిః = ఆ హనుమ, ప్రియస్య = వల్లభునియొక్క, అంకాత్ = ఒడినుండి, సముత్పత్య = బయటకువెడలి, పతితామ్ ఇవ చ = పారిపోవుచున్న దానివలెను, ప్రియబంధుభిః = ప్రియునియొక్క లేక ఆప్తులైన బంధువులచే, వార్యమాణాం = అడ్డగింపబడుచున్నట్టియును, క్రుద్ధాం = అలిగియున్నదియునగు, ప్రియాం ప్రమదా మివ చ (స్థితాం = ప్రియురాలైన ఇల్లాలివలెను, ఉన్నట్టి), తస్మాత్ నగాత్ = ఆ పర్వతమునుండి, నిపతితాం = క్రిందికి పడుచున్నదియును, జలే = నీటియందు, నిపతితాగ్రైః = వాలియున్న కొనలు గల్గినట్టి, పాదపైః = వృక్షములచే, ఉపశోభితాం = ప్రకాశించుచున్నట్టిదియునగు, నదీం = నదిని; దదర్శ = చూచెను.

**తాత్పర్యము :-** ఆ పర్వతము మీదనుండి ఒకానొక నది నేలమీదికి వచ్చి పడుచుండెను. ఆ దృశ్యము ప్రియుని ఒడినుండి అలుకతో లేచి ఈవలకు పరువెత్తివచ్చుచున్న ఒక భామినిని తలపించుచుండెను. మఱల ఆ కొండవాగు నేలపై ప్రవహించుచుండగా గట్టుపైనున్న చెట్ల కొమ్మలు ఆ నీటిలోనికి వ్రాలి, దాని వేగము నడ్డగించుచుండెను. ఇప్పుడా దృశ్యము అట్లు అలిగి ఇంటినుండి వెడలిపోవుచున్న ఆ జవరాలిని ఆమెయనుంగు చుట్టములు చేతులతో పట్టి ఆపుచున్నట్లుండెను.

**శ్లో॥ పున రావృత్తతోయాం చ దదర్శ స మహాకపిః ।**
**ప్రసన్నా మివ కాంతస్య కాంతాం పున రుపస్థితామ్ ॥ 31**

**పదచ్ఛేదము** :- పునః - ఆవృత్తతోయాం - చ - దదర్శ - సః - మహాకపిః - ప్రసన్నామ్ - ఇవ - కాంతస్య - కాంతాం - పునః - ఉపస్థితామ్ ॥

**అన్వయక్రమము** :- కాంతస్య ప్రసన్నాం, పునః ఉపస్థితాం కాంతామ్ ఇవ (దృశ్యమానాం) పునః ఆవృత్తతోయాం (తాం నదీం) సః మహాకపిః దదర్శ.

**ప్రతిపదార్థము** :- కాంతస్య ప్రసన్నాం = ప్రియునికి ప్రసన్నురాలై, పునః ఉపస్థితాం = తిరిగి చేరుకొన్నట్టి, కాంతామ్ ఇవ = కాంతవలె, దృశ్యమానాం = కానవచ్చుచున్న, పునః ఆవృత్తతోయాం = తిరిగి మరలి వచ్చుచున్న నీరుగల, (తాం నదీం = ఆ నదిని), సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, దదర్శ = కాంచెను.

**తాత్పర్యము** :- ఆ సెలయేటికి కొన్ని బండలును చెట్లును అడ్డువచ్చుటచే కొంత దూరమున ఆ జలము వెనుకకు మరలి ప్రవహించుచుండెను. ఆ దృశ్యము ప్రియునిపై అలుకదీరి కలకదేరిన ఆ కాంత తిరిగి ఇంటికి వచ్చుచున్నట్లు కానవచ్చుచుండెను.

**శ్లో॥ తస్యాదూరా త్స పద్మిన్యో నానాద్విజగణాయుతాః ।**
**దదర్శ హరిశార్దూలో హనుమా న్మారుతాత్మజః ॥ 32**

**పదచ్ఛేదము** :- తస్య - అదూరాత్ - సః - పద్మిన్యః - నానాద్విజగణాయుతాః - దదర్శ - హరిశార్దూలః - హనుమాన్ - మారుతాత్మజః ॥

**అన్వయక్రమము** :- హరిశార్దూలః (సః) మారుతాత్మజః, హనుమాన్, తస్య అదూరాత్ నానాద్విజగణాయుతాః పద్మిన్యః దదర్శ.

**ప్రతిపదార్థము** :- హరిశార్దూలః = వానర శ్రేష్ఠుడగు, మారుతాత్మజః సః హనుమాన్ = వాయునందనుడైన యా హనుమ, తస్య అదూరాత్ = ఆ గిరికి సమీపమున, నానాద్విజగణాయుతాః = పెక్కు పక్షిసంఘములతో కూడిన, పద్మిన్యః = తామర కొలకులను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- హనుమంతుడా పర్వతసమీపమున వివిధములగు జలపక్షుల సమూహములతో నిండియున్న తామరకొలకులను జూచెను.

**శ్లో॥ కృత్రిమాం దీర్ఘికాం చాపి పూర్ణాం శీతేన వారిణా ।**
**మణిప్రవరసోపానాం ముక్తాసికతశోభితామ్ ॥ 33**

**పదచ్ఛేదము** :– కృత్రిమాం – దీర్ఘికాం – చ – అపి – పూర్ణాం – శీతేన – వారిణా – మణిప్రవరసోపానాం – ముక్తాసికతశోభితామ్ ॥

**అన్వయక్రమము** :– శీతేన వారిణా పూర్ణాం, మణిప్రవరసోపానాం, ముక్తాసికత శోభితాం, కృత్రిమాం, దీర్ఘికాం చ అపి (హనుమాన్ దదర్శ).

**ప్రతిపదార్థము** :– శీతేన వారిణా = చల్లని జలముతో, పూర్ణాం = నిండినదియును, మణిప్రవరసోపానాం = శ్రేష్ఠమైన రత్నములతో నిర్మింపబడిన మెట్లు గలదియును, ముక్తాసికతశోభితాం = ముత్యముల ఇసుకతో మెఱయుచున్నదియును అగు, కృత్రిమాం దీర్ఘికాం చ అపి = నిర్మించుకొన్న దిగుడు బావినికూడ (హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను).

**తాత్పర్యము** :– అచ్చటనే హనుమ చల్లని నీటితో నిండి, రత్నమయసోపానములు గలిగి, ముత్యాల ఇసుకతో ప్రకాశించుచున్నట్టి ఒకానొక క్రీడాసరస్సును కూడ జూచెను.

**శ్లో॥ వివిధై ర్మృగసంఘైశ్చ విచిత్రాం చిత్రకాననామ్ ।**
**ప్రాసాదై స్సుమహద్భి శ్చ నిర్మితై ర్విశ్వకర్మణా ।**
**కాననైః కృత్రిమై శ్చాపి సర్వత స్సమలంకృతామ్ ॥ 34**

**పదచ్ఛేదము** :– వివిధైః – మృగసంఘైః – చ – విచిత్రాం – చిత్రకాననామ్ – ప్రాసాదైః – సుమహద్భిః – చ – నిర్మితైః – విశ్వకర్మణా – కాననైః – కృత్రిమైః – చ – అపి – సర్వతః – సమలంకృతామ్ ॥

**అన్వయక్రమము** :– విశ్వకర్మణా నిర్మితైః, సుమహద్భిః ప్రాసాదైః, వివిధైః మృగసంఘైః చ, కృత్రిమైః కాననైః చ అపి సర్వతః సమలంకృతాం, విచిత్రాం చిత్రకాననాం దదర్శ.

**ప్రతిపదార్థము** :– విశ్వకర్మణా నిర్మితైః = విశ్వకర్మచే నిర్మింపబడినట్టి, సుమహద్భిః ప్రాసాదైః = మిక్కిలి గొప్పవైన సౌధములతోడను, వివిధైః మృగసంఘైః చ = బహు విధములగు జంతుసమూహములతోడను, కృత్రిమైః కాననైః చ అపి = నిర్మించుకొన్న క్రీడారణ్యములతోడను గూడ, సర్వతః సమలంకృతామ్ = అంతటను అలంకరింప బడియున్నదియును, విచిత్రాం = సుందరమైనట్టిదియును, చిత్రకాననాం = చిత్రమైన కాననములతో కూడినదియునగు, (దీర్ఘికాం = దిగుడు బావిని, హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను.)

**తాత్పర్యము** :- విశ్వకర్మచే నిర్మింపబడిన గొప్ప గొప్ప సౌధములచే చుట్టుకొనబడి యున్నదియును, బహువిధజంతుసంఘములతో నిండి చిత్రమైన కాననములతో కూడినదియును నాల్గువైపులనున్న పెక్కు క్రీడారణ్యములతో సుందరముగ ప్రకాశించు చున్నదియునగు క్రీడాసరస్సును హనుమ గాంచెను.

**శ్లో॥ యే కేచి త్పాదపా స్తత్ర పుష్పోపగఫలోపగాః ।**
**సచ్ఛత్రా స్సవితర్దీకా స్సర్వే సౌవర్ణవేదికాః ॥ 35**

**పదచ్ఛేదము** :- యే - కే - చిత్ - పాదపాః - తత్ర - పుష్పోపగఫలోపగాః - సచ్ఛత్రాః - సవితర్దీకాః - సర్వే - సౌవర్ణవేదికాః.

**అన్వయక్రమము** :- తత్ర పుష్పోపగఫలోపగాః, యే కే చిత్ పాదపాః (వర్తంతే) తే సర్వే, సచ్ఛత్రాః సవితర్దీకాః, సౌవర్ణవేదికాః చ (ఆసన్).

**ప్రతిపదార్థము** :- తత్ర = అచ్చట, పుష్పోపగఫలోపగాః = పుష్పభరితములును, ఫలభరితములును అగు, యే కేచిత్ పాదపాః వర్తంతే = ఏ యే వృక్షములున్నవో, తే సర్వే = అవి యన్నియును, సచ్ఛత్రాః = ఛత్రములతో కూడినవియును, సౌవర్ణ వేదికాః = సువర్ణమయమైన తిన్నెలతో కూడినవియును, సవితర్దీకాః = అరుగులతో కూడినవియును, (ఆసన్ = ఉన్నవి).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'సవితర్దీకాః సౌవర్ణవేదికాః" - విశాలమైన వెండితిన్నెలపై, బంగారు వేదిక లమర్పబడినవని భావము.

**తాత్పర్యము** :- అచ్చట గల పుష్పవృక్షములు ఫలవృక్షములు అన్నియుగూడ విశ్రమించు వారికి సుఖమును గూర్చునట్టి ఛత్రములతోడను, వెండితిన్నెలతోడను, బంగారు వేదికలతోడను కూడియుండెను.

**శ్లో॥ లతాప్రతానై ర్బహుభిః పర్ణై శ్చ బహుభి ర్వృతామ్ ।**
**కాంచనీం శింశుపామేకాం దదర్శ హరియూథపః ।**
**వృతాం హేమమయీభి స్తు వేదికాభి స్సమంతతః ॥ 36**

**పదచ్ఛేదము** :- లతాప్రతానైః - బహుభిః - పర్ణైః - చ - బహుభిః - వృతామ్ - కాంచనీం - శింశుపామ్ - ఏకాం - దదర్శ - హరియూథపః - వృతాం - హేమమయీభిః - తు - వేదికాభిః - సమంతతః ॥

**అన్వయక్రమము :–** సః హరియూథపః బహుభిః లతాప్రతానైః, బహుభిః పర్ణైః చ వృతాం, హేమమయీభిః వేదికాభిః సమంతతః వృతామ్, ఏకాం కాంచనీం శింశుపాం దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః హరియూథపః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, బహుభిః లతా ప్రతానైః = పెక్కుతీగల సమూహముతోడను, బహుభిః పర్ణైః చ = పెక్కుపత్రముల తోడను, వృతాం = చుట్టుకొనబడియున్నదియును, హేమమయీభిః = స్వర్ణమయమైన తిన్నెలతో, సమంతతః = అంతటను, వృతాం = చుట్టుకొనబడియున్నదియునగు, ఏకాం కాంచనీం = ఒక బంగారపు, శింశుపాం = శింశుపావృక్షమును, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఏకాం శింశుపాం = ప్రధానముగ నున్నదియును, ఇతరవృక్షములతో సంబంధము లేకుండ నున్నదియునని భావము.

**తాత్పర్యము :–** హనుమంతుడచ్చట పెక్కుతీగలతో చుట్టబడి, ఆకులతో దట్టముగ నుండి, సువర్ణమయమైన వేదికలతో ప్రకాశించుచున్నట్టి ఒకానొక శింశుపా (ఇరుగుడు) వృక్షమును చూచెను.

**శ్లో॥ తేషాం ద్రుమాణాం ప్రభయా మేరో రివ దివాకరః ।**
**అమన్యత తదా వీరః కాంచనోఽస్మీతి వానరః ॥ 37**

**పదచ్ఛేదము :–** తేషాం – ద్రుమాణాం – ప్రభయా – మేరోః – ఇవ – దివాకరః – అమన్యత – తదా – వీరః – కాంచనః – అస్మి – ఇతి – వానరః ॥

**అన్వయక్రమము :–** వీరః వానరః తదా మేరోః ప్రభయా దివాకరః ఇవ, తేషాం ద్రుమాణాం ప్రభయా (అహం) సర్వతః కాంచనః అస్మి, ఇతి అమన్యత.

**ప్రతిపదార్థము :–** వీరః వానరః = వీరుడైన ఆ హనుమ, తదా = ఆ సమయమున, మేరోః ప్రభయా = మేరుపర్వతముయొక్క కాంతిచే, దివాకరః ఇవ = సూర్యుడువలె, తేషాం ద్రుమాణాం ప్రభయా = ఆ వృక్షములయొక్క ప్రకాశముచే, అహం = నేను, కాంచనః అస్మి = సువర్ణమయుడనైతిని, ఇతి అమన్యత = అని తలచెను.

**తాత్పర్యము :–** అచ్చటి బంగరు వృక్షముల ప్రకాశముచే హనుమ, మేరుపర్వత ప్రభలచే సూర్యుడు పచ్చగా కానవచ్చునట్లుగా, తానిప్పుడు బంగారు రూపము గలవాడనైతినని తలచెను.

**శ్లో॥ సోఽపశ్య ద్భూమిభాగాం శ్చ గర్తప్రస్రవణాని చ ।**
**సువర్ణవృక్షా నపరాన్ దదర్శ శిఖిసన్నిభాన్ ॥ 38**

**పదచ్ఛేదము :–** సః – అపశ్యత్ – భూమిభాగాన్ – చ – గర్తప్రస్రవణాని – చ – సువర్ణవృక్షాన్ – అపరాన్ – దదర్శ – శిఖిసన్నిభాన్ ॥

**అన్వయక్రమము :–** సః గర్తప్రస్రవణాని చ, భూమిభాగాన్ చ, అపశ్యత్; శిఖిసన్నిభాన్ అపరాన్ సువర్ణవృక్షాన్ చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమ, గర్తప్రస్రవణాని చ = నేలలో ప్రవహించుచున్న కాలువలను, భూమిభాగాన్ చ = భూప్రదేశములను, అపశ్యత్ = చూచెను. శిఖిసన్నిభాన్ = అగ్నిహోత్రముతో సమానమైనట్టి, అపరాన్ సువర్ణవృక్షాన్ చ = మరికొన్ని బంగరువృక్షములను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు ఆ వృక్షములకు నీటిని అందజేయుటకై ఏర్పఱచిన చక్కని కాలువలను, వాటితో అందముగ కానవచ్చు నేలలను, మఱికొన్ని అగ్నిహోత్రమువలె ప్రకాశించుచున్న సువర్ణవృక్షములను గూడ గాంచెను.

**శ్లో॥ తాం కాంచనై స్తరుగణై ర్మారుతేన చ వీజితాం ।**
**కింకిణీశతనిర్ఘోషాం దృష్ట్వా విస్మయ మాగమత్ ॥ 39**

**పదచ్ఛేదము :–** తాం – కాంచనైః – తరుగణైః – మారుతేన – చ – వీజితామ్ – కింకిణీశతనిర్ఘోషాం – దృష్ట్వా – విస్మయమ్ – ఆగమత్ ॥

**అన్వయక్రమము :–** మారుతేన వీజితాం, కింకిణీశతనిర్ఘోషాం – కాంచనైః తరుగణైః యుతాం, తాం దృష్ట్వా, హనుమాన్ విస్మయమ్ ఆగమత్.

**ప్రతిపదార్థము :–** మారుతేన వీజితాం = వాయువుచే కదల్పబడినదియును, కింకిణీ శతనిర్ఘోషాం = వందలకొలది చిఱుగంటలయొక్క గొప్ప ధ్వని గలిగినదియును, కాంచనైః తరుగణైః యుతాం = బంగారువృక్షముల సమూహముతో కూడినదియునగు, తాం = ఆ శింశుపావృక్షమును, దృష్ట్వా = చూచి, హనుమాన్ = హనుమ, విస్మయమ్ ఆగమత్ = ఆశ్చర్యమును పొందెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు ఆ శింశుపావృక్షముచుట్టును పెక్కు బంగరు వృక్షము లుండుటయును, అవి యన్నియును గాలికి కదలి పెక్కు చిఱుగంటల మ్రోతలను వినిపించుటయును జూచి మిక్కిలి ఆశ్చర్యము నొందెను.

**శ్లో॥ స పుష్పితాగ్రాం రుచిరాం తరుణాంకురపల్లవామ్ ।**
**తా మారుహ్య మహాబాహు శ్శింశుపాం పర్ణసంవృతామ్ ॥ 40**

**శ్లో॥ ఇతో ద్రక్ష్యామి వైదేహీం రామదర్శనలాలసామ్ ।**
**ఇత శ్చేతశ్చ దుఃఖార్తాం సంపతంతీం యదృచ్ఛయా ॥ 41**

**పదచ్ఛేదము :–** సః – పుష్పితాగ్రాం – రుచిరాం – తరుణాంకురపల్లవామ్ – తామ్ – ఆరుహ్య – మహాబాహుః – శింశుపాం – పర్ణసంవృతామ్ – ఇతః – ద్రక్ష్యామి – వైదేహీం – రామదర్శనలాలసామ్ – ఇతః – ఇతః – చ – దుఃఖార్తాం – సంపతన్తీం – యదృచ్ఛయా ॥

**అన్వయక్రమము :–** సః మహాబాహుః పుష్పితాగ్రాం, రుచిరాం తరుణాంకురపల్లవాం, పర్ణసంవృతాం, తాం శింశుపామ్ ఆరుహ్య, రామదర్శనలాలసాం దుఃఖార్తాం, యాదృచ్ఛయా ఇతః ఇతః చ సంపతన్తీం వైదేహీమ్ ఇతః ద్రక్ష్యామి (ఇతి అమన్యత).

**ప్రతిపదార్థము :–** సః మహాబాహుః = ఆ మహావీరుడైన హనుమ, పుష్పితాగ్రాం = పుష్పించిన కొమ్మలు గలదియును, రుచిరాం = సుందరమైనదియును, తరుణాంకుర పల్లవాం = లేతచివురుటాకులు గలదియును, పర్ణసంవృతాం = ఆకులతో దట్టముగ నున్నదియును అగు, తాం శింశుపాం = ఆ శింశుపావృక్షమును, ఆరుహ్య = అధిష్ఠించి, రామదర్శనలాలసాం = రాముని చూచుటకై పరితపించుచున్నదియును, దుఃఖార్తాం = దుఃఖముచే దీనురాలై యున్నదియును, యదృచ్ఛయా = దైవవశమున, ఇతః ఇతః చ సంపతంతీం = ఈ యీ ప్రదేశములకు వచ్చుచున్నదియునగు, వైదేహీం = సీతాదేవిని, ఇతః = ఇచ్చటనుండియే, ద్రక్ష్యామి = చూచెదను, (ఇతి అమన్యత = అని తలచెను).

**తాత్పర్యము :–** చక్కగా పూచియున్నదియును, సుందరమైన లేత చివుళ్ళతో కూడియున్న దియును, దట్టమైన ఆకులతో గుబురుగ నున్నదియు నగు ఆ శింశుపావృక్షమును అధిరోహించి, రాముని దర్శనముకొఱకై తపించుచున్నదియును, దుఃఖముచే దీనురాలై యున్నదియును, దైవవశమున ఈ ప్రాంతము సంచరింపగోరి వచ్చునదియు నగు సీతాదేవిని ఇచ్చటనే యుండి చూచెదను గాక యని హనుమ తన మనస్సులో నిశ్చయించుకొనెను.

**శ్లో॥ అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః ।**
**చంపకై శ్చందనై శ్చాపి వకుళై శ్చ విభూషితా ॥ 42**

**పదచ్ఛేదము** :- అశోకవనికా - చ - ఇయం - ధృఢం - రమ్యా - దురాత్మనః - చంపకైః - చందనైః - చ - అపి - వకుళైః - చ - విభూషితా ॥

**అన్వయక్రమము** :- చంపకైః, చందనైః, వకుళైః చ అపి విభూషితా, దురాత్మనః ఇయమ్ అశోకవనికా చ ధృఢం రమ్యా.

**ప్రతిపదార్థము** :- చంపకైః = సంపెంగచెట్లతోడను, చందనైః = మంచి గంధపు వృక్షములతోడను, వకుళైః చ అపి = పొగడ చెట్లతోడనున్ను, విభూషితా = అలంకరింపబడియున్న, దురాత్మనః = ఆ దుర్మార్గునియొక్క, ఇయమ్ అశోకవనికా చ = ఈ అశోకవనము గూడ, ధృఢం = మిక్కిలి; రమ్యా = మనోహరముగా నున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ధృఢమ్ ఇయం చ (తస్య) దురాత్మనః - ఈ సుందరమైనట్టి అద్భుతమైనట్టి అశోకవనముగూడ నిశ్చయముగా ఆ దుర్మార్గుడైన రావణునిదే యని భావము.

**తాత్పర్యము** :- ఈ చంపకవృక్షములతోడను, మంచిగంధపు చెట్లతోడను, వకుళ ద్రుమములతోడను అలంకరింపబడియున్న, ఈ దుర్మార్గుని అశోకవనము గూడ నిశ్చయముగా మిక్కిలి మనోహరముగా నున్నదిగదా!

**శ్లో॥ ఇయం చ నళినీ రమ్యా ద్విజసంఘనిషేవితా ।**
**ఇమాం సా రామమహిషీ నూన మేష్యతి జానకీ ॥ 43**

**పదచ్ఛేదము** :- ఇయం - చ - నళినీ - రమ్యా - ద్విజసంఘనిషేవితా - ఇమాం సా - రామమహిషీ - నూనం - ఏష్యతి - జానకీ ॥

**అన్వయక్రమము** :- ద్విజసంఘనిషేవితా, ఇయం నళినీ చ రమ్యా, సా రామమహిషీ జానకీ, ఇమాం నూనం ఏష్యతి.

**ప్రతిపదార్థము** :- ద్విజసంఘనిషేవితా = పక్షుల గుంపులచే సేవింపబడుచున్న, ఇయం నళినీ చ = ఈ తామరకొలను కూడ, రమ్యా = మనోహరముగ నున్నది, ఇమాం = ఈ తామరకొలనునుగూర్చి, సా రామమహిషీ జానకీ =ఆ రాముని ధర్మపత్నియైన సీతాదేవి, నూనం ఏష్యతి = తప్పకుండ రాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'రాజమహిషీ' యని బొంబాయిపాఠము. రాజమహిషి గాబట్టి సుందరమైన దృశ్యములపై ఆసక్తిగలదై ఈ సుందరమైన తామరకొలనుకు సీతమ్మ తప్పక రాగలదని

భావము.

**తాత్పర్యము :–** వివిధములగు జలపక్షుల సంచారముతో కూడియున్న ఈ తామరకొలను కూడ రమణీయమై ఒప్పుచున్నది. ఇట్టి సుందరప్రదేశమునకు సౌందర్య ప్రియురాలగు సీతాదేవి తప్పక రాగలదు.

**శ్లో॥ సా రామా రామమహిషీ రాఘవస్య ప్రియా సతీ ।**
**వనసంచారకుశలా నూన మేష్యతి జానకీ ॥ 44**

**పదచ్ఛేదము :–** సా – రామా – రామమహిషీ – రాఘవస్య – ప్రియా – సతీ – వనసంచారకుశలా – నూనం – ఏష్యతి – జానకీ ॥

**అన్వయక్రమము :–** రామమహిషీ, రాఘవస్య ప్రియా, వనసంచారకుశలా సా రామా సతీ జానకీ నూనం ఏష్యతి.

**ప్రతిపదార్థము :–** రామమహిషీ = రాముని పట్టమహిషియును, రాఘవస్య ప్రియా = శ్రీరామునకు ప్రియురాలైన భార్యయును, వనసంచారకుశలా = వనములో సంచరించుటయందు ఆసక్తి గలదియునగు, సా రామా సతీ జానకీ = పతివ్రతయైనట్టి ఆ సీతాసుందరి, నూనం ఏష్యతి = తప్పక వచ్చును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సా అరామా = అనగా రాముడు దగ్గరలేనట్టి సీత, తన శోకనివృత్తి కొరకై ఇచ్చటికి వచ్చునని భావము.

**తాత్పర్యము :–** రాముని భార్యయైన సీతాదేవి రామునితో వనసంచారమునందు ఆసక్తితో నైపుణ్యము గడించి యున్నది గావున ఆ యాసక్తిచే, సీతాదేవి తప్పక ఈ ప్రదేశమునకు రాగలదు.

**శ్లో॥ అథవా మృగశాబాక్షీ వన స్యాస్య విచక్షణా ।**
**వన మేష్యతి సాఽఽర్యేహ రామచింతానుకర్శితా ॥ 45**

**పదచ్ఛేదము :–** అథవా – మృగశాబాక్షీ – వనస్య – అస్య – విచక్షణా – వనం – ఏష్యతి – సా – ఆర్యా – ఇహ – రామచింతానుకర్శితా ॥

**అన్వయక్రమము :–** అథవా, మృగశాబాక్షీ అస్య వనస్య విచక్షణా, రామచింతాను కర్శితా సా ఆర్యా, ఇహ వనం ఏష్యతి.

**ప్రతిపదార్థము** :- అథవా = అట్లుగాకపోయినను, మృగశాబాక్షీ = లేడిపిల్లయొక్క కన్నులవంటి కన్నులు గలిగినట్టిదియును, అస్య వనస్య విచక్షణా = ఈ వనముతో మిక్కిలి పరిచయము గలిగి యున్నదియును, రామచింతానుకర్శితా = రాముని స్మరణచే కృశించియున్నదియునగు, సా ఆర్యా = ఆ పూజ్యురాలు, ఇహ వనం = ఈ కొలనుగూర్చి, ఏష్యతి = రాగలదు.

**తాత్పర్యము** :- భయంకరమైన చూపులతో, కాలము గడుపుచు, ఈ వనమునందే పరిచయముగా సంచరించుచుండు సీతాదేవి, రాముని స్మరణముచే వివశమైన మనస్సుగలదై విశ్రాంతికొరకైనను ఈ ప్రదేశమునకు తప్పక రాగలదు.

**శ్లో॥ రామశోకాభిసంతప్తా సా దేవీ వామలోచనా ।**
**వనవాసే రతా నిత్య మేష్యతే వనచారిణీ ॥ 46**

**పదచ్ఛేదము** :- రామశోకాభిసంతప్తా - సా - దేవీ - వామలోచనా - వనవాసే - రతా - నిత్యమ్ - ఏష్యతే - వనచారిణీ ॥

**అన్వయక్రమము** :- రామశోకాభిసంతప్తా, వామలోచనా వనవాసే రతా, వనచారిణీ, సా దేవీ! నిత్యమ్ (ఇహ) ఏష్యతే.

**ప్రతిపదార్థము** :- రామశోకాభిసంతప్తా = రామునిగూర్చిన దుఃఖముచే పరితపించు చున్నట్టిదియును, వామలోచనా = సుందరమైన కన్నులు గలదియును, వనవాసే రతా = వనవాసమునం దాసక్తి గలదియును, వనచారిణీ = వనమునందే చరించు చున్నదియునగు; సా దేవీ = ఆ జానకమ్మ, నిత్యం = ప్రతిదినమును, ఇహ ఏష్యతే = ఇచ్చటికి వచ్చుచుండును.

**తాత్పర్యము** :- రాముని గూర్చిన దిగులుచే పరితపించుచున్నదియగు ఆ సీతాదేవి వననివాసమునందుగల ఆసక్తిచే వనమునందు సంచరించుచున్నదగుటచే, నిత్యము ఇచ్చటికి వచ్చుచునేయుండును.

**శ్లో॥ వనేచరాణాం సతతం నూనం స్పృహయతే పురా ।**
**రామస్య దయితా భార్యా జనకస్య సుతా సతీ ॥ 47**

**పదచ్ఛేదము** :- వనేచరాణాం - సతతం - నూనం - స్పృహయతే - పురా - రామస్య - దయితా - భార్యా - జనకస్య - సుతా - సతీ ॥

**అన్వయక్రమము** :- రామస్య దయితా భార్యా, జనకస్య సుతా సతీ పురా నూనం సతతం వనేచరాణాం స్పృహయతే.

**ప్రతిపదార్థము :–** రామస్య దయితా భార్యా = రామునకు ప్రియురాలైన భార్యయగుచును, జనకస్య సుతా సతీ = జనకమహారాజు కుమార్తెయై యుండియును, పురా = పూర్వమే, సతతం = నిత్యమును, నూనం = నిశ్చయముగా, వనేచరాణాం స్పృహయతే = వనసంచారులపై (పశుపక్షివానరులపై) మక్కువగలిగి యుండును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** ఏ రూపముతోడనైనను రాముని బంటు ఒకడు నన్ను వెదకికొనుచు ఈ వనమునకు రాగలడను భావముతో సీత ఇచ్చటకు రాగలదు.

**తాత్పర్యము :–** రామునకు ప్రియురాలును, జనకునకు కుమార్తెయైనట్టి సీతాదేవి దయాపూరితహృదయముగలది గావున వనమునందు చరించు పశుపక్షి వానరాదులపై చిన్ననాటినుండియు ప్రేమగలదై యుండును.

**శ్లో॥ సంధ్యాకాలమనా శ్శ్యామా ధ్రువమేష్యతి జానకీ ।**
**నదీం చేమాం శివజలాం సంధ్యార్థే వరవర్ణినీ ॥ 48**

**పదచ్ఛేదము :–** సంధ్యాకాలమనాః – శ్యామా – ధ్రువం – ఏష్యతి – జానకీ – నదీం – చ – ఇమాం – శివజలాం – సంధ్యార్థే – వరవర్ణినీ ॥

**అన్వయక్రమము :–** సంధ్యాకాలమనాః శ్యామా, వరవర్ణినీ, జానకీ శివజలామ్, ఇమాం నదీం సంధ్యార్థే ధ్రువం ఏష్యతి.

**ప్రతిపదార్థము :–** సంధ్యాకాలమనాః = సంధ్యాసమయమునందు శ్రద్ధగలదై, శ్యామా = యౌవనవతియును, వరవర్ణినీ = సుందరియును అగు, జానకీ = సీతాదేవి, సంధ్యార్థే = సంధ్యాసమయమునందలి ధ్యానముకొరకు, శివజలామ్ ఇమాం నదీం = పవిత్రమైన జలములు గలిగినట్టి ఈ నదినిగూర్చి, ధ్రువం ఏష్యతి = తప్పక రాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "సంధ్యాకాలమనాః" – సంధ్యాసమయమునందు చేయవలసిన కర్మలయందు ఆసక్తి గల్గినట్టిది. సంధ్యార్థే = సంధ్యాసమయమునందు చేయవలసిన స్నానజపాదిక్రియలకొరకు. ఇక్కడ సంధ్యాశబ్దము ప్రాతఃసంధ్యను సూచించుచున్నది.

**వరవర్ణినీ :–** "శీతే సుఖోష్ణసర్వాంగీ గ్రీష్మే తు సుఖశీతలా, భర్తృరక్తా చ యా నారీ సా భవే ద్వరవర్ణినీ" –

అనగా శీతాకాలమునందు సుఖోష్ణమును, గ్రీష్మకాలమునందు చల్లదనమును

గల శరీరము గల్గిన స్త్రీ వరవర్ణిని అనబడును. ఇచ్చట కవి ఈ పదప్రయోగము చేయుటచే సీతమ్మ అట్టి ఉత్తమస్త్రీలక్షణయుక్తురాలైనట్టి దనుట.

**వాసుదాసస్వామి :–** పూర్వయుగములందు స్త్రీలకు సంధ్యావందనము, ఉపనయనము గలదు.

"స్త్రీణాం వివాహ ఏవ ఉపనయన మిత్యాహ మనుః"

శ్లో॥ వైవాహికో విధిః స్త్రీణా మౌపనాయనికః స్మృతః ।
పతిసేవా గురౌ వాసో, గృహార్థోఽ గ్నిపరిక్రియా ॥ –
(మనుస్మృతి)

వివాహమే స్త్రీల కుపనయనము, పతిసేవయే గురుకులవాసము, గృహకృత్య నిర్వాహకమే అగ్నిహోత్రము, మంగళసూత్రధారణము స్మార్తము గావున, నుపవీతము నకు బదులు, మంగళసూత్రము లేర్పడినవి.

పూర్వకల్పమునందు కన్యలకు మౌంజీబంధము చెప్పబడెను. వేదా ధ్యయనము, గాయత్రీ జపమును గలదు.

**మనుస్మృతి :–** "పురాకల్పే కుమారీణాం మౌంజీబంధన మిష్యతే ।
అధ్యాపనం చ వేదానాం సావిత్రీవచనం తథా ॥"

ఈ కారణమున త్రేతాయుగమునందలి స్త్రీకి సంధ్యావందనము గలదు.

**తాత్పర్యము :–** సంధ్యాసమయమును ప్రతీక్షించుచున్నదై సంధ్యాసమయస్నానధ్యానాది కృత్యములకొరకై సీతాదేవి పవిత్రమైన జలముగల ఈ నదికి తప్పక రాగలదు.

**శ్లో॥ తస్యా శ్చాప్యనురూపేయ మశోకవనికా శుభా ।**
**శుభా యా పార్థివేంద్రస్య పత్నీ రామస్య సమ్మతా ॥ 49**

**పదచ్ఛేదము :–** తస్యాః – చ – అపి – అనురూపా – ఇయమ్ – అశోకవనికా – శుభా – శుభా – యా – పార్థివేంద్రస్య – పత్నీ – రామస్య – సమ్మతా ॥

**అన్వయక్రమము :–** యా పార్థివేంద్రస్య రామస్య సమ్మతా, శుభా పత్నీ, తస్యాః ఇయం శుభా అశోకవనికా అనురూపా.

**ప్రతిపదార్థము :–** యా = ఏ పూజ్యురాలు, పార్థివేంద్రస్య రామస్య = మహారాజైన శ్రీరామునకు; సమ్మతా = ప్రియురాలైనట్టి, శుభా పత్నీ = పవిత్రమైన భార్యయో, తస్యాః = ఆ సీతాదేవికి, ఇయం శుభా = ఈ మంగళకరమైన, అశోకవనికా =

అశోకవనము, అనురూపా = తగియున్నది.

**తాత్పర్యము :–** శ్రీరామచంద్రునకు ప్రియురాలైన, పతివ్రతయైన భార్యయైనట్టి ఈ సీతాదేవికి ఈ పవిత్రమైన అశోకవనమును ఇచ్చుటి ఈ నదియును ఎంతయు తగియున్నవి.

**శ్లో॥ యది జీవతి సా దేవీ తారాధిపనిభాననా ।**
**ఆగమిష్యతి సాఽవశ్య మిమాం శివజలాం నదీమ్ ॥ 50**

**పదచ్ఛేదము :–** యది – జీవతి – సా – దేవీ – తారాధిపనిభాననా – ఆగమిష్యతి – సా – అవశ్యం – ఇమాం – శివజలాం – నదీమ్ ॥

**అన్వయక్రమము :–** తారాధిపనిభాననా సా దేవీ జీవతి యది, సా శివజలాం ఇమాం నదీమ్ అవశ్యమ్ ఆగమిష్యతి.

**ప్రతిపదార్థము :–** తారాధిపనిభాననా = చంద్రుని వంటి సుందరమైన ముఖముగల, సా దేవీ = ఆ జానకీదేవి, జీవతి యతి = జీవించియున్న యెడల, శివజలామ్ ఇమాం నదీం = పవిత్రమైన జలములు గల ఈ నదిని గూర్చి, సా = ఆమె, అవశ్యమ్ ఆగమిష్యతి = తప్పక రాగలదు.

**తాత్పర్యము :–** పూజ్యురాలైన ఆ సీతా సుందరి జీవించియే యున్నయెడల పవిత్రమైన జలములుగల ఈ నదిని గూర్చి తప్పక విచ్చేయును.

**శ్లో॥ ఏవం తు మత్వా హనుమా న్మహాత్మా**
**ప్రతీక్షమాణో మనుజేంద్రపత్నీమ్ ।**
**అవేక్షమాణ శ్చ దదర్శ సర్వం**
**సుపుష్పితే పర్ణఘనే నిలీనః ॥ 51**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*“అశోకవనికావిచయో” నామ*
*చతుర్దశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** ఏవం – తు – మత్వా – హనుమాన్ – మహాత్మా – ప్రతీక్షమాణః – మనుజేంద్రపత్నీమ్ – అవేక్షమాణః – చ – దదర్శ – సర్వం – సుపుష్పితే – పర్ణఘనే – నిలీనః ॥

**అన్వయక్రమము :–** మహాత్మా హనుమాన్ ఏవం మత్వా మనుజేంద్రపత్నీం ప్రతీక్షమాణః సుపుష్పితే పర్ణఘనే నిలీనః (సన్) అవేక్షమాణః సర్వం దదర్శ.

**ప్రతిపదార్థము :–** మహాత్మా హనుమాన్ = మహనీయుడైన హనుమ, ఏవం మత్వా = ఈ విధముగా తలచి, మనుజేంద్రపత్నీం = సీతాదేవినిగూర్చి, ప్రతీక్షమాణః = నిరీక్షించుచున్నవాడై, సుపుష్పితే = చక్కగా పుష్పించియున్న, పర్ణఘనే = ఆకుల గుబురునందు, నిలీనః (సన్) = లీనమై యున్నవాడై, అవేక్షమాణః = పరికించి చూచుచున్నవాడై, సర్వం దదర్శ = సమస్త (ప్రదేశ)మును తిలకించుచుండెను.

**తాత్పర్యము :–** మహనీయుడైన హనుమంతు డిట్లాలోచించి జనకాత్మజయొక్క దర్శనమున కెదురు జూచుచు, పుష్పఫలభరితమైన ఆ శింశుపావృక్షముమీద గుబురుగా నున్న ఆకులనడుమ నణగియుండి యా వనమంతయును కలయజూచు చుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"అశోకవనికావిచయము" అను*
*పదునాల్గవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచదశసర్గ

**శ్లో॥ స వీక్షమాణ స్తత్రస్థో మార్గమాణ శ్చ మైథిలీమ్ ।**
**అవేక్షమాణ శ్చ మహీం సర్వాం తా మన్వవైక్షత ॥ 1**

**పదచ్ఛేదము :-** సః – వీక్షమాణః – తత్రస్థః – మార్గమాణః – చ – మైథిలీమ్ – అవేక్షమాణః – చ – మహీం – సర్వాం – తామ్ – అన్వవైక్షత ॥

**అన్వయక్రమము :-** సః తత్రస్థః వీక్షమాణః మైథిలీం మార్గమాణశ్చ, మహీమ్ అవేక్షమాణశ్చ తాం సర్వామ్ అన్వవైక్షత.

**ప్రతిపదార్థము :-** సః = ఆ హనుమంతుడు, తత్రస్థః = ఆ శింశుపావృక్షము నందున్నవాడై, వీక్షమాణః = పరికించుచున్నవాడై, మైథిలీం = సీతాదేవిని, మార్గమాణః = అన్వేషించుచున్నవాడై, మహీమ్ అవేక్షమాణః = ఆ ప్రదేశమును గమనించు చున్నవాడై, తాం సర్వామ్ అన్వవైక్షత = ఆ యశోకవనము నంతను కలయ జూచెను.

**విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు**

**మహేశ్వరతీర్థులు :-** వీక్షమాణః = చుట్టును పరికించుచు, అవేక్షమాణః = క్రిందికి చూచుచు.

**తాత్పర్యము :-** హనుమంతుడు శింశుపావృక్షముపై ఆకుల గుబురులో కూర్చుండి, నలువైపులకును చూచుచు, సీతామాతను చూడగోరి క్రిందనున్న భూభాగమునంతయు కలయచూచుచు, నలువైపులను పరికించుచుండెను.

**శ్లో॥ సంతానకలతాభి శ్చ పాదపై రుపశోభితామ్ ।**
**దివ్యగంధరసోపేతాం సర్వత స్సమలంకృతామ్ ॥ 2**

**పదచ్ఛేదము :-** సంతానకలతాభిః – చ – పాదపైః – ఉపశోభితాం – దివ్యగంధ రసోపేతాం – సర్వతః – సమలంకృతామ్ ॥

**అన్వయక్రమము :-** సంతానకలతాభిః, పాదపైః చ, ఉపశోభితాం, దివ్యగంధ రసోపేతాం, సర్వతః సమలంకృతాం (తాం మహీమ్ అన్వవైక్షత)

**ప్రతిపదార్థము** :- సంతానకలతాభిః = కల్పలతలతోడను, పాదపైః చ = వృక్షముల తోడను, ఉపశోభితాం = ప్రకాశించుచున్నదియును, దివ్యగంధరసోపేతాం = దివ్యమైన పరిమళములతోడను, సర్వతః సమలంకృతాం = అంతటను చక్కగా అలంకరింప బడియున్నదియును అగు, (తాం మహీమ్ అన్వవైక్షత = ఆ ప్రదేశమును పరికించి చూచెను).

**తాత్పర్యము** :- వివిధములగు కల్పలతలతోడను, వృక్షములతోడను, దివ్యమైన పరిమళములతోడను, మకరందములతోడను, కలకలలాడుచున్న ఆ వనభూమిని హనుమ గాంచెను.

**శ్లో॥ తాం స నందనసంకాశాం మృగపక్షిభి రావృతాం ।**
**హర్మ్యప్రాసాదసంబాధాం కోకిలాకులనిస్వనామ్ ॥ 3**

**పదచ్ఛేదము** :- తాం - సః - నందనసంకాశాం - మృగపక్షిభిః - ఆవృతామ్ - హర్మ్యప్రాసాదసంబాధాం - కోకిలాకులనిస్వనామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమ, నందనసంకాశాం = (దేవేంద్రుని) నందనవనముతో సమానముగనున్నదియును, మృగపక్షిభిః ఆవృతాం = జంతువుల తోడను పక్షులతోడను నిండినదియును, హర్మ్యప్రాసాదసంబాధాం = పెద్ద భవనముల తోడను, సౌధములతోడను, దట్టముగ నిండియున్నదియును, కోకిలాకులనిస్వనామ్ = కోయిలలయొక్క (కోలాహల) ధ్వనులు కలదియునగు, (తాం మహీమ్ అన్వవైక్షత = ఆ వనభూమిని గాంచెను).

**తాత్పర్యము** :- వివిధములగు మృగములతోడను, పక్షులతోడను నిండియున్నదియును, కోయిలల కలకలధ్వనులతో మనోహరమైనదియును, పెద్దవైన భవనములతో, సౌధములతో క్రిక్కిరిసి యున్నదియును, దేవేంద్రుని నందనవనమును బోలియున్నది యునగు, అశోకవనికాభూమిని హనుమంతుడు పరికించి చూచెను.

**శ్లో॥ కాంచనోత్పలపద్మాభి ర్వాపీభి రుపశోభితామ్ ।**
**బహ్వాసనకుథోపేతాం బహుభూమిగృహాయుతామ్ ॥ 4**

**పదచ్ఛేదము** :- కాంచనోత్పలపద్మాభిః - వాపీభిః - ఉపశోభితామ్ - బహ్వాసన కుథోపేతాం - బహుభూమిగృహాయుతామ్ ॥

**ప్రతిపదార్థము** :- కాంచనోత్పలపద్మాభిః = బంగరు కలువలును, కమలములును

గల, వాపీభిః = దిగుడుబావులతో, ఉపశోభితాం = ప్రకాశించు చున్నదియును, బహ్వాసనకుథోపేతాం = పెక్కుపీఠములతోడను, తివాచీలతోడను కూడినదియును, బహుభూమిగృహాయుతాం = పెక్కు అంతస్థులుగల సౌధములతో కూడినదియునగు, (తామ్ అన్వవైక్షత = ఆ వనభూమిని పరికించిచూచెను).

**తాత్పర్యము** :- హనుమ జూచిన వనభూమి, బంగరు కలువలతోడను, కమలముల తోడను నిండియుండిన దిగుడుబావులతో ప్రకాశించుచుండెను. రత్నకంబళములతో గూడిన బహువిధములగు వనములతో విరాజిల్లుచుండెను.

**శ్లో॥ సర్వర్తుకుసుమై రమ్యాం ఫలవద్భి శ్చ పాదపైః ।**
**పుష్పితానా మశోకానాం శ్రియా సూర్యోదయప్రభామ్ ॥ 5**

**పదచ్ఛేదము** :- సర్వర్తుకుసుమైః - రమ్యాం - ఫలవద్భిః - చ - పాదపైః - పుష్పితానామ్ - అశోకానాం - శ్రియా - సూర్యోదయప్రభామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- సర్వర్తుకుసుమైః = అన్ని ఋతువులందలి పుష్పములు గలవియును, ఫలవద్భిశ్చ = పండ్లుగలవియునగు, రమ్యైః పాదపైః = రమణీయములగు వృక్షములతో, యుతాం = కూడియున్నదియును, పుష్పితానామ్ అశోకానాం = పూచియున్న అశోక వృక్షములయొక్క, శ్రియా = శోభచేత, సూర్యోదయప్రభాం = సూర్యోదయ సమయము నందలి శోభ గలిగియున్నదియునగు, (తాం మహీమ్ అన్వవైక్షత = ఆ వనభూమిని చూచెను).

**తాత్పర్యము** :- ఆ వనభూమి ఎల్లఋతువులందును, పుష్పించునట్టివియును, ఫలించునట్టివియును అగు రమణీయమైన వృక్షములతో నిండి సూర్యోదయశోభను వెదజల్లునట్టి అశోకపుష్పములకాంతితో వెలుగొందుచుండెను.

**శ్లో॥ ప్రదీప్తా మివ తత్రస్థో మారుతి స్సముదైక్షత ।**
**నిష్పత్రశాఖాం విహగైః క్రియమాణా మివాసకృత్ ॥ 6**

**పదచ్ఛేదము** :- ప్రదీప్తామ్ - ఇవ - తత్రస్థః - మారుతిః - సముదైక్షత - నిష్పత్రశాఖాం - విహగైః - క్రియమాణామ్ - ఇవ - అసకృత్ ॥

**అన్వయక్రమము** :- తత్రస్థః మారుతిః ప్రదీప్తామివ అసకృత్ విహగైః నిష్పత్రశాఖాం క్రియమాణామ్ ఇవ (స్థితాం) (తాం) సముదైక్షత.

**ప్రతిపదార్థము** :- తత్రస్థః మారుతిః = ఆ శింశుపావృక్షమునందున్న హనుమ,

ప్రదీప్తామివ (స్థితాం) = ప్రజ్వలించుచున్నట్లుగ నున్నదియును, విహగైః = పక్షులచే, అసకృత్ = మాటిమాటికిని, నిష్పత్రశాఖాం క్రియమాణామ్ ఇవ (స్థితాం) = ఆకులు లేకుండా చేయబడుచున్నట్లుగా నున్నదియునగు, (తాం) సముద్వైక్షత = (ఆ వనభూమిని) పరికించి చూచెను.

**తాత్పర్యము** :– ఆ శింశుపావృక్షమునందున్నట్టి హనుమ పక్షుల సంచారముచే మిక్కిలిగా రాలిపోవుచున్న ఆకులు గలిగి మిక్కిలి ప్రకాశవంతముగానున్న ఆ వనభూమిని శ్రద్ధతో పరికించి చూచెను.

**శ్లో॥ వినిష్పతద్భి శ్శతశ శ్చిత్రైః పుష్పావతంసకైః ।**
**ఆమూలపుష్పనిచితై రశోకై శ్శోకనాశనైః ॥ 7**

**శ్లో॥ పుష్పభారాతిభారై శ్చ స్పృశద్భి రివ మేదినీం ।**
**కర్ణికారైః కుసుమితైః కింశుకైశ్చ సుపుష్పితైః ॥ 8**

**పదచ్ఛేదము** :– వినిష్పతద్భిః – శతశః – చిత్రైః – పుష్పావతంసకైః – ఆమూలపుష్పనిచితైః – అశోకైః – శోకనాశనైః – పుష్పభారాతిభారైః – చ – స్పృశద్భిః – ఇవ – మేదినీమ్ – కర్ణికారైః – కుసుమితైః – కింశుకైః – చ – సుపుష్పితైః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– శతశః = వందలకొలదిగా, వినిష్పతద్భిః = క్రిందికి రాలుచున్న, చిత్రైః పుష్పావతంసకైః = రంగురంగుల పూలగుత్తులతోడను, ఆమూలపుష్పనిచితైః = మొదళ్ళనుండియు పూచిన పుష్పములు గల్గినట్టియు, శోకనాశనైః = శోకమును నశింపచేయునట్టియును, పుష్పభారాతిభారైః = పువ్వుల బరువుచే మిక్కిలి బరువెక్కి యున్నవై, మేదినీం స్పృశద్భిః ఇవ స్థితైః = నేలకు అంటుచున్నట్లుగ నున్నవియును అగు, అశోకైః = అశోకవృక్షములచేతను, కుసుమితైః కర్ణికారైః = పుష్పించియున్న కొండగోగు వృక్షములతోడను, సుపుష్పితైః కింశుకైశ్చ = చక్కగా పూచియున్న మోదుగు చెట్లతోడను, (పూర్ణాం = నిండియున్నట్టి, తాం మహీమ్ అన్వవైక్షత = ఆ వనభూమిని హనుమ పరికించి చూచెను).

**తాత్పర్యము** :– హనుమ జూచిన ఆ వనభూమియందు వృక్షములనుండి వివిధములైన వర్ణములుగల పుష్పములు మాటిమాటికి వందలకొలదిగ రాలుచుండెను. ఆ యశోక వృక్షములు మొదళ్ళనుండియు పుష్పించుచు చూచువారి శోకములను నశింప జేయుచున్నట్లుగా నుండెను. నిండుగ పూచిన తమ పుష్పముల భారముచే అచటి కర్ణికారవృక్షములును శింశుపావృక్షములును క్రిందికి వంగి నేలను తాకుచు

చూడముచ్చటగా నుండెను.

**శ్లో॥ స దేశః ప్రభయా తేషాం ప్రదీప్త ఇవ సర్వతః ॥ 9**

**పదచ్ఛేదము** :– సః – దేశః – ప్రభయా – తేషాం – ప్రదీప్తః – ఇవ –సర్వతః ॥

**అన్వయక్రమము** :– తేషాం ప్రభయా సః దేశః సర్వతః, ప్రదీప్తః ఇవ (స్థితః).

**ప్రతిపదార్థము** :– తేషాం ప్రభయా = ఆ పుష్పవృక్షములయొక్క కాంతిచే, సః దేశః = ఆ వనప్రదేశము, సర్వతః ప్రదీప్తః ఇవ (స్థితః) = అంతటను ప్రజ్వలించుచున్నట్లుండెను.

**తాత్పర్యము** :– ఆ పుష్పించిన వృక్షములయొక్క శోభ నలుమూలలకును వ్యాపించి ఆ యశోకవన ప్రదేశమంతయును అద్భుతమైన కాంతితో ప్రజ్వలించుచున్నట్లుండెను.

**శ్లో॥ పున్నాగా స్సప్తపర్ణా శ్చ చంపకోద్దాలకా స్తథా ।**
**వివృద్ధమూలా బహవ శ్శోభన్తే స్మ సుపుష్పితాః ॥ 10**

**పదచ్ఛేదము** :– పున్నాగాః – సప్తపర్ణాః – చ – చంపకోద్దాలకాః – తథా – వివృద్ధమూలాః – బహవః – శోభన్తే – స్మ – సుపుష్పితాః ॥

**ప్రతిపదార్థము** :– వివృద్ధమూలాః = బాగుగా పెరిగిన మొదళ్ళు కలిగిన, బహవః = పెక్కు, పున్నాగాః = పొన్నచెట్లును, సప్తపర్ణాః చ = ఏడాకుల అరటిచెట్లును, తథా = అట్టి, చంపకోద్దాలకాః = సంపంగి చెట్లును, విరిగి (లేక) బరిగి చెట్లును, సుపుష్పితాః = చక్కగా పుష్పించినవై, శోభన్తే స్మ = మిక్కిలిగా శోభచెందుచుండెను.

**తాత్పర్యము** :– చక్కగా పెరిగిన మ్రానులు గలిగి అందముగ పుష్పించిన పొన్నచెట్లును, ఏడాకుల అరటిచెట్లును, సంపంగిచెట్లును, బరిగిచెట్లును అసంఖ్యాకములుగ నుండి కన్నుల పండువు చేయుచుండెను.

**శ్లో॥ శాతకుంభనిభాః కేచి త్కేచి దగ్నిశిఖోపమాః ।**
**నీలాంజననిభాః కేచి త్తత్రాఽశోకా స్సహస్రశః ॥ 11**

**పదచ్ఛేదము** :– శాతకుంభనిభాః – కేచిత్ – కేచిత్ – అగ్నిశిఖోపమాః – నీలాంజననిభాః – కేచిత్ – తత్ర – అశోకాః – సహస్రశః

**అన్వయక్రమము** :– తత్ర (స్థితాః) సహస్రశః అశోకాః కేచిత్ అగ్నిశిఖోపమాః, కేచిత్ నీలాంజననిభాః (శోభంతే స్మ).

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ వనమునందు, (స్థితాః = ఉన్నట్టి), సహస్రశః = వేలకొలదిగనున్న, అశోకాః = అశోకవృక్షములు, కేచిత్ శాతకుంభనిభాః = కొన్ని బంగరు కడవలవలెను, కేచిదగ్నిశిఖోపమాః = మరికొన్ని అగ్నిజ్వాలలవలెను, కేచిత్ నీలాంజననిభాః = కొన్ని నల్లని కాటుకవలెను నున్నవై, శోభన్తే స్మ = ప్రకాశించు చుండెను.

**తాత్పర్యము** :- వేలకొలదిగ నున్న ఆ యశోకవనమునందలి వృక్షములు, కొన్ని స్వర్ణకుంభముల వలెను, కొన్ని అగ్నిజ్వాలలవలెను, కొన్ని కాటుకకొండల వలెను చూడముచ్చట గొలుపుచుండెను.

**శ్లో॥ నందనం వివిధోద్యానం చిత్రం చైత్రరథం యథా ।**
**అతివృత్త మి వాచింత్యం దివ్యం రమ్యం శ్రియా వృతమ్ ॥ 12**

**పదచ్ఛేదము** :- నందనం - వివిధోద్యానం - చిత్రం - చైత్రరథం - యథా - అతివృత్తమ్ - ఇవ - అచింత్యం - దివ్యం - రమ్యం - శ్రియా - వృతమ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- వివిధోద్యానం = వివిధములగు సుందరమైన ఉద్యానవనములు గల, నందనం యథా = నందనవనము వలెను, చిత్రం చైత్రరథం యథా = చిత్రమైన చైత్రరథమువలెను, (స్థితం సత్ = ఉన్నదై), అతివృత్తమ్ ఇవ = (సర్వవనములను) అతిక్రమించినదివలె, అచింత్యం = ఊహింపనలవిగాని (వైభవముగల) దియును, దివ్యం = దివ్యమైనదియును, రమ్యం = రమణీయమైనదియును, శ్రియా వృతం (సత్) = గొప్ప శోభతో నిండియున్నదియునునై, శోభతే స్మ = ప్రకాశించుచుండెను.

**తాత్పర్యము** :- ఆ యశోకవనము బహువిధవనశోభలతో ప్రకాశించు దేవేంద్రుని నందనవనమువలెను చిత్రమైన నిర్మాణముగల కుబేరుని చైత్రరథవనము వలెను సాటిలేనిదై, ఊహింప శక్యముగానిదై దివ్యమైన రమణీయమైన గొప్ప శోభతో విరాజిల్లు చుండెను.

**శ్లో॥ ద్వితీయ మివ చాకాశం పుష్పజ్యోతిర్గణాయుతమ్ ।**
**పుష్పరత్నశతై శ్చిత్రం పంచమం సాగరం యథా ॥ 13**

**పదచ్ఛేదము** :- ద్వితీయమ్ - ఇవ - చ - ఆకాశం - పుష్పజ్యోతిర్గణాయుతమ్ - పుష్పరత్నశతైః - చిత్రం - పంచమం - సాగరం - యథా ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము :-** పుష్పజ్యోతిర్గణాయుతం = పుష్పములనెడు నక్షత్రసమూహములతో గూడిన, ద్వితీయమ్ ఆకాశం ఇవ = రెండవ ఆకాశము వలెను, పుష్పరత్నశతైః = పుష్పములనెడు రత్నసమూహముతో, చిత్రం పంచమం సాగరం యథా = చిత్రమైన ఐదవ సముద్రమువలెను, (స్థితం సత్ తత్ వనం శోభతే స్మ = ఉన్నదై యా వనము ముచ్చట గొల్పుచుండెను).

**తాత్పర్యము :-** ఆ వనము పుష్పములనెడి నక్షత్రములతో వెలుగొందుచున్న రెండవ ఆకాశమువలె ప్రకాశించుచుండెను. మరియు పుష్పములనెడు రత్నసమూహములతో వెలయుచున్న చిత్రమైన ఐదవ సముద్రమువలె ప్రకాశించుచుండెను.

**శ్లో॥ సర్వర్తుపుష్పై ర్నిచితం పాదపై ర్మధుగంధిభిః ।**
**నానానినాదై రుద్యానం రమ్యం మృగగణై ర్ద్విజైః ॥ 14**

**పదచ్ఛేదము :-** సర్వర్తుపుష్పైః - నిచితం - పాదపైః - మధుగంధిభిః - నానానినాదైః - ఉద్యానం - రమ్యం - మృగగణైః ద్విజైః ॥

**అన్వయక్రమము :-** సర్వర్తుపుష్పైః మధుగంధిభిః పాదపైః నిచితం నానానినాదైః మృగగణైః ద్విజైః రమ్యమ్ (తత్) ఉద్యానం (శోభతే స్మ).

**ప్రతిపదార్థము :-** మధుగంధిభిః = తీయని పరిమళము గల్గినట్టి, సర్వర్తుపుష్పైః = సమస్తమైన ఋతువులందలి పుష్పములతో గూడినట్టి, పాదపైః = వృక్షములతో, నిచితం = కూడియున్నదియును, నానానినాదైః = బహువిధములగు అరపులు గల్గినట్టి, మృగగణైః = జంతువుల సమూహముల తోడను, ద్విజైః = పక్షులతోడను, రమ్యం = రమణీయముగానున్న, (తత్) ఉద్యానం = ఆ యశోకవనము, (శోభతే స్మ = ప్రకాశించు చుండెను).

**తాత్పర్యము :-** ఆ యశోకవనము తియ్యని పరిమళము వెదజల్లు సర్వకాల పుష్పములతో నిండిన వృక్షములు గలిగి, శ్రావ్యములైన ధ్వనులు చేయుచున్న మృగముల సమూహములును, పక్షుల గుంపులును కలిగి మిక్కిలి మనోహరముగ నుండెను.

**శ్లో॥ అనేకగంధప్రవహం పుణ్యగంధం మనోరమమ్ ।**
**శైలేంద్ర మివ గంధాఢ్యం ద్వితీయం గంధమాదనమ్ ॥ 15**

**పదచ్ఛేదము :-** అనేకగంధప్రవహం - పుణ్యగంధం - మనోరమమ్ - శైలేంద్రమ్ - ఇవ - గంధాఢ్యం - ద్వితీయం - గంధమాదనమ్ ॥

**అన్వయక్రమము :-** మనోరమమ్ అనేకగంధప్రవహం, పుణ్యగంధం (తత్ ఉద్యానం)

గంధాఢ్యం, ద్వితీయం, గంధమాదనం శైలేంద్రమ్ ఇవ (శోభతే స్మ).

**ప్రతిపదార్థము** :– మనోరమం = మనోహరమైనట్టి, అనేకగంధప్రవహం = బహువిధ పరిమళములను వెదజల్లునట్టి, పుణ్యగంధం = పవిత్రమైన సువాసనగలిగినట్టి, (తత్ ఉద్యానం = ఆ యశోకవనము), గంధాఢ్యం = గొప్ప పరిమళముతో నిండినట్టి, ద్వితీయం గంధమాదనం శైలేంద్రమ్ ఇవ = రెండవ గంధమాదనపర్వతమువలె, (శోభతే స్మ = విరాజిల్లుచుండెను).

**తాత్పర్యము** :– ఆ యశోకవనము మనోహరమైనట్టి వివిధములైన, పవిత్రములైన పరిమళములను వెదజల్లుచు పరిమళములకు నిలయమైనట్టి రెండవ గంధమాదన పర్వతమా యనునట్లు వెలయుచుండెను.

**శ్లో॥ అశోకవనికాయాం తు తస్యాం వానరపుంగవః ।**
**స దదర్శావిదూరస్థం చైత్యప్రాసాద ముచ్ఛ్రితమ్ ॥ 16**

**శ్లో॥ మధ్యే స్తంభసహస్రేణ స్థితం కైలాసపాండురమ్ ।**
**ప్రవాళకృతసోపానం తప్తకాంచనవేదికమ్ ॥ 17**

**శ్లో॥ ముష్ణంత మివ చక్షూంషి ద్యోతమాన మివ శ్రియా ।**
**విమలం ప్రాంశుభావత్వా దుల్లిఖంత మి వాంబరమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– అశోకవనికాయాం – తు – తస్యాం – వానరపుంగవః – సః – దదర్శ – అవిదూరస్థం – చైత్యప్రాసాదమ్ – ఉచ్ఛ్రితమ్ – మధ్యే – స్తంభసహస్రేణ – స్థితం – కైలాసపాండురమ్ – ప్రవాళకృతసోపానం – తప్తకాంచనవేదికం – ముష్ణంతమ్ – ఇవ – చక్షూంషి – ద్యోతమానమ్ – ఇవ – శ్రియా – విమలం – ప్రాంశుభావత్వాత్ – ఉల్లిఖంతమ్ – ఇవ – అంబరమ్ ॥

**అన్వయక్రమము** :– తస్యామ్ అశోకవనికాయాం సః వానరపుంగవః స్తంభసహస్రేణ మధ్యే స్థితం, కైలాసపాండురం, ప్రవాళకృతసోపానం, తప్తకాంచనవేదికమ్, శ్రియా చక్షూంషి ముష్ణంతమివ ద్యోతమానం, ప్రాంశుభావత్వాత్ అంబరమ్ ఉల్లిఖంతమ్ ఇవ స్థితం, విమలమ్, ఉచ్ఛ్రితమ్, అవిదూరస్థం చైత్యప్రాసాదం దదర్శ.

**ప్రతిపదార్థము** :– తస్యామ్ అశోకవనికాయాం = ఆ యశోకవనమునందు, సః వానరపుంగవః = వానరశ్రేష్ఠుడైన యా హనుమ, మధ్యే = (ఆ యశోకవన) మధ్యమునందు, స్తంభసహస్రేణ స్థితం = వేలకొలది స్తంభములతో నిలచి యున్నదియును, కైలాసపాండురం = కైలాసపర్వతమువలె ధవళమై యున్నదియును,

ప్రవాళకృతసోపానం = పగడములతో నిర్మించబడిన మెట్లుగలదియును, తప్తకాంచన వేదికం = మేలిమి బంగారపు తిన్నెలు గలదియును, చక్షూంషి ముష్ణంతమ్ ఇవ = కనులను హరించుచున్నదివలె, శ్రియా ద్యోతమానం = దివ్యశోభతో ప్రజ్వలించు చున్నదియును, ప్రాంశుభావత్వాత్ = మిక్కిలి పొడవుగా నుండుటవలన, అంబరమ్ ఉల్లిఖంతమ్ ఇవ స్థితం = ఆకాశమును రాచుకొనుచున్నట్లున్నదియును, విమలం = పరిశుద్ధమైనదియును అగు, అవిదూరస్థమ్ = సమీపముననేయున్నట్టి, ఉచ్ఛ్రితం చైత్యప్రాసాదం = ఉన్నతమైనట్టి చైత్యప్రాసాదమును, దదర్శ = గాంచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- చైత్యమ్ - గుండ్రముగా, వర్తులాకారముగా, బౌద్ధమందిరమువలె నున్నమేడ.

**తాత్పర్యము** :- ఆ యశోకవనమునందు తనకు సమీపమునందే వనమధ్యమునందు వేలకొలది స్తంభములపై నిర్మింపబడి కైలాసగిరివలె ధవళచ్ఛాయ గలిగి, పగడపుమెట్ల తోడను, మేలిమిబంగరు వేదికలతోడను, కన్నులకు మిరుమిట్లుగొలుపు అద్భుతమైన శోభతో, ప్రజ్వలించుచు, ఉన్నతమైన శిఖరములతో ఆకసమును ఒరసికొనుచు అత్యున్నతముగనున్న ఒక చైత్యప్రాసాదమును హనుమ కనుగొనెను.

**శ్లో॥ తతో మలినసంవీతాం రాక్షసీభి స్సమావృతామ్ ।**
**ఉపవాసకృశాం దీనాం నిశ్శ్వసన్తీం పునః పునః ।**
**దదర్శ శుక్లపక్షాదౌ చంద్రరేఖా మివాఽమలామ్ ॥ 19**

**పదచ్ఛేదము** :- తతః - మలినసంవీతాం - రాక్షసీభిః - సమావృతామ్ - ఉపవాసకృశాం - దీనాం - నిశ్శ్వసంతీం - పునః - పునః - దదర్శ - శుక్లపక్షాదౌ - చంద్రరేఖామ్ - ఇవ - అమలామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, మలినసంవీతాం = మలినమైన వస్త్రములు ధరించినదియును, రాక్షసీభిః సమావృతాం = రాక్షసస్త్రీలచే పరివేష్టింపబడి యున్నదియును, ఉపవాసకృశాం = ఉపవాసములచే కృశించినదియును, దీనాం = దీనురాలై యున్నదియును, పునః పునః నిశ్శ్వసంతీం = మాటిమాటికి, నిట్టూర్పులు విడుచుచున్నదియును, అమలాం = పరిశుద్ధురాలును, శుక్లపక్షాదౌ చంద్రరేఖామివ స్థితాం = శుక్లపక్షపు ప్రథమదినమునాటి చంద్రరేఖవలె నున్నదియును అగు, (కాంచిత్

= ఒకానొకస్త్రీని), దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** హనుమంతుడా చైత్యప్రాసాదమును జూచు చుండగా అచ్చటనే మలిన వస్త్రముల ధరించి రాక్షసస్త్రీలచే పరివేష్టింపబడి ఉపవాసములచే కృశించియున్నదై దీనురాలై మాటిమాటికిని నిట్టూర్పులు విడుచుచు శుక్లపక్షపు పాడ్యమినాటి చంద్రరేఖవలె నున్నట్టి కళంకరహితురాలైయున్న ఒకానొక వనితను గాంచెను.

**శ్లో॥ మందం ప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభామ్ ।**
**పినద్ధాం ధూమజాలేన శిఖా మివ విభావసోః ॥ 20**

**పదచ్ఛేదము :–** మందం – ప్రఖ్యాయమానేన – రూపేణ – రుచిరప్రభామ్ – పినద్ధాం – ధూమజాలేన – శిఖామ్ – ఇవ – విభావసోః ॥

**అన్వయక్రమము :–** ధూమజాలేన పినద్ధాం, విభావసోః శిఖామ్ ఇవ మందం ప్రఖ్యాయమానేన రూపేణ రుచిరప్రభాం (దదర్శ).

**ప్రతిపదార్థము :–**ధూమజాలేన పినద్ధాం = దట్టమైన పొగచే కప్పుబడినట్టి, విభావసోః శిఖామ్ ఇవ = అగ్నిహోత్రుని జ్వాలవలె, మందం ప్రఖ్యాయమానేన రూపేణ = మందముగా వెల్లడియగుచున్న సౌందర్యముతో, రుచిరప్రభాం = రమ్యమైన శోభగల్గిన స్త్రీని, (దదర్శ = చూచెను).

**తాత్పర్యము :–** పొగచే గప్పుబడిన అగ్నిజ్వాలవలె కొలదిగ మాత్రమే వెల్లడియగుచున్న సౌందర్యముగల ఒకానొక వనితను హనుమ గాంచెను.

**శ్లో॥ పీతే నైకేన సంవీతాం క్లిష్టే నోత్తమవాససా ।**
**సపంకా మనలంకారాం విపద్మా మివ పద్మినీమ్ ॥ 21**

**పదచ్ఛేదము :–** పీతేన – ఏకేన – సంవీతాం – క్లిష్టేన – ఉత్తమవాససా – సపంకామ్ – అనలంకారాం – విపద్మామ్ – ఇవ – పద్మినీమ్ ॥

**అన్వయక్రమము :–** పీతేన, క్లిష్టేన ఏకేన ఉత్తమవాససా సంవీతాం, విపద్మాం పద్మినీమ్ ఇవ సపంకామ్ అనలంకారాం (దదర్శ).

**ప్రతిపదార్థము :–** పీతేన = పచ్చని, క్లిష్టేన = నలిగిన, ఏకేన ఉత్తమవాససా = శ్రేష్ఠమైన ఏకవస్త్రముచే, సంవీతాం = ధరింపబడియున్నదియును, విపద్మాం పద్మినీం ఇవ = తామరపువ్వులు లేని తామరతీగవలె, సపంకాం = బురదకలిగినదియును, అనలంకారాం = ఆభరణములు లేక యున్నదియు నగు స్త్రీని, (దదర్శ = చూచెను).

**తాత్పర్యము** :– మిక్కిలి నలిగిపోయినట్టి శ్రేష్ఠమైన ఒక పచ్చని వస్త్రమును ధరించి తామరపువ్వులు లేని తామరతీగవలె బురద అంటిన శరీరముతో ఆభరణహీనయై యున్న ఒకానొక వనితను హనుమ గాంచెను.

**శ్లో॥ వ్రీడితాం దుఃఖసంతప్తాం పరిమ్లానాం తపస్వినీమ్ ।**
**గ్రహేణాంఽగారకేణేవ పీడితా మివ రోహిణీమ్ ॥ 22**

**పదచ్ఛేదము** :– వ్రీడితాం – దుఃఖసంతప్తాం – పరిమ్లానాం – తపస్వినీమ్ – గ్రహేణ – అంగారకేణ – ఇవ – పీడితామ్ – ఇవ – రోహిణీమ్ ॥

**ప్రతిపదార్థము** :– వ్రీడితాం = సిగ్గునొందియున్నదియును, దుఃఖసంతప్తాం = దుఃఖముచే తపించుచున్నదియును, పరిమ్లానాం = బడలియున్నదియును, తపస్వినీం = దీనురాలై యున్నదియును, అంగారకేణ గ్రహేణ = అంగారకగ్రహముచే, పీడితాం రోహిణీమ్ ఇవ స్థితాం = పీడింపబడినట్టి రోహిణీనక్షత్రమువలె నున్నదియును అగు స్త్రీని, (దదర్శ = చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– "అంగారకేణేవ గ్రహేణ" = అంగారకుని వంటి గ్రహముచేత అనగా కేతువుచేత.

**రామాయణ శిరోమణి** :– "అంగారకేణేవ గ్రహేణ" = క్రూరగ్రహముచే.

**తాత్పర్యము** :– లజ్జాగ్రస్తయై దుఃఖసంతప్తురాలై బడలిక చెంది యున్నదై దీనస్థితిలో నుండి క్రూరమైన అంగారకగ్రహముచే పీడింపబడిన రోహిణీనక్షత్రమువలె గానవచ్చు చున్న ఒక వనితను హనుమ గాంచెను.

**శ్లో॥ అశ్రుపూర్ణముఖీం దీనాం కృశా మనశనేన చ ।**
**శోకధ్యానపరాం దీనాం నిత్యం దుఃఖపరాయణామ్ ॥ 23**

**పదచ్ఛేదము** :– అశ్రుపూర్ణముఖీం – దీనాం – కృశామ్ – అనశనేన – చ శోకధ్యానపరాం – దీనాం – నిత్యం – దుఃఖపరాయణామ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– అశ్రుపూర్ణముఖీం = కన్నీటితో నిండిన ముఖము గలదియును, దీనాం = దీనురాలై యున్నదియును, అనశనేన కృశాం = ఆహారము మానుటచే కృశించియున్నదియును, శోకధ్యానపరాం = దిగులుతోడను, చింతతోడను వివశురాలై

యున్నదియును, దీనాం = దైన్యముతో నున్నదియును, నిత్యం దుఃఖ పరాయణాం = నిత్యము దుఃఖమగ్నురాలై యున్నదియునగు స్త్రీని, (దదర్శ = చూచెను).

**తాత్పర్యము :–** కన్నీటితో నిండిన మొగముతో ఆహారము మానుటచే కృశించియుండి, చింతానిమగ్నురాలై దుఃఖపీడితయై దీనస్థితిలోనున్న ఒక వనితను గాంచెను.

**శ్లో॥ ప్రియం జన మపశ్యన్తీం పశ్యన్తీం రాక్షసీగణమ్ ।**
**స్వగణేన మృగీం హీనాం శ్వగణాభివృతా మివ ॥ 24**

**పదచ్ఛేదము :–** ప్రియం – జనమ్ – అపశ్యన్తీం – పశ్యంతీం – రాక్షసీగణమ్ – స్వగణేన – మృగీం – హీనాం – శ్వగణాభివృతామ్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** ప్రియం జనమ్ అపశ్యన్తీం = ఇష్టులైన వారిని చూడకున్నదియును, రాక్షసగణం పశ్యంతీం = రాక్షసస్త్రీలను జూచుచున్నదియును, స్వగణేన హీనాం = తనవారులేనిదై, శ్వగణాభివృతాం = వేటకుక్కలచే చుట్టుకొనబడియున్నట్టి, మృగీమ్ ఇవ స్థితాం = ఆడులేడివలె నున్నట్టిదియునగు స్త్రీని, (దదర్శ = చూచెను).

**తాత్పర్యము :–** తన మందలోని లేళ్ళకు దూరమై వేటకుక్కల మధ్య చిక్కుకొన్న హరిణాంగనవలె తనకు కావలసినవారు కానరాక పోవుటచేతను, భీకరులైన రాక్షసస్త్రీలు ఎదురుగ నుండి గద్దించుచుండుటచేతను భయవిహ్వాలయైయున్న ఒక వనితను చూచెను.

**శ్లో॥ నీలనాగాభయా వేణ్యా జఘనం గతయైకయా ।**
**నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ ॥ 25**

**పదచ్ఛేదము :–** నీలనాగాభయా – వేణ్యా – జఘనం – గతయా – ఏకయా – నీలయా – నీరదాపాయే – వనరాజ్యా – మహీమ్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** నీరదాపాయే నీలయా వనరాజ్యా మహీమ్ ఇవ (స్థితాం) నీలనాగాభయా జఘనం గతయా ఏకయా వేణ్యా (స్థితాం వనితాం దదర్శ)

**ప్రతిపదార్థము :–** నీరదాపాయే = మబ్బులు తొలగినపిమ్మట, నీలయా వనరాజ్యా = నల్లని వృక్షశ్రేణితోడి, మహీమ్ ఇవ (స్థితాం) = భూమివలెనున్నట్టి, జఘనం గతయా = పిరుదులవరకు వ్రేలాడుచున్న, నీలనాగాభయా = నల్లని త్రాచువలె ప్రకాశించుచున్న, ఏకయా వేణ్యా = ఏకమైయున్న కేశపాశముతో, (స్థితాం వనితాం దదర్శ = ఉన్న వనితను గాంచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ఏకయా వేణ్యా = అపహరణదినమున చేసుకొనిన సంస్కారము తప్ప వేరు సంస్కారము లేకుండుటచే కేశపాశము జడగట్టియున్నది. నీలనాగాభయా వేణ్యా = ఇచ్చట కవి ఆడుత్రాచుపాముతో పోలికచెప్పుటచే ఆ వేణీస్పర్శము మరణహేతువని సూచించెను.

**తాత్పర్యము** :- పిరుదులవరకును వ్రేలాడుచున్న జడగట్టియున్న దీర్ఘమైన నల్లని కేశపాశముతో ఆమె, మబ్బులు తొలగిన పిమ్మట నల్లని వృక్షపంక్తితో గానవచ్చు భూమివలెనే గాన్పించుచుండెను.

**శ్లో॥ సుఖార్హాం దుఃఖసంతప్తాం వ్యసనానా మకోవిదామ్ ।**
**తాం సమీక్ష్య విశాలాక్షీ మధికం మలినాం కృశామ్ ।**
**తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః ॥ 26**

**పదచ్ఛేదము** :- సుఖార్హాం - దుఃఖసంతప్తాం - వ్యసనానామ్ - అకోవిదామ్ - తాం - సమీక్ష్య - విశాలాక్షీమ్ - అధికం - మలినాం - కృశామ్ - తర్కయామాస - సీతా - ఇతి - కారణైః - ఉపపాదిభిః ॥

**అన్వయక్రమము** :- సుఖార్హాం వ్యసనానామ్ అకోవిదాం దుఃఖసంతప్తామ్ అధికం మలినాం కృశాం, తాం విశాలాక్షీం సమీక్ష్య, ఉపపాదిభిః కారణైః సీతా ఇతి తర్కయామాస.

**ప్రతిపదార్థము** :- సుఖార్హాం = సుఖములకే తగియున్నట్టిదియును, వ్యసనానామ్ అకోవిదాం = కష్టములనెరుగనిదియును, దుఃఖసంతప్తాం = దుఃఖముచే పరితాపము నొందుచున్నదియును, అధికం మలినాం = మిక్కిలి మలినమై యున్నదియును, కృశాం = కృశించియున్నదియునగు, తాం విశాలాక్షీం సమీక్ష్య = ఆ సుందరాంగిని జూచి, ఉపపాదిభిః కారణైః = యుక్తిసమ్మతమైన కారణములచే, సీతా ఇతి తర్కయామాస = సీతయే యని ఊహించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- ఉపపాదిభిః కారణైః = ముందుచెప్పబోవునట్టి కారణములచే.

**తాత్పర్యము** :- హనుమ చూచిన ఆ వనిత సౌకుమార్యము గలిగి సుఖములకొఱకే పుట్టి దుఃఖముల నెన్నడును ఎరుగని కోమలివలె నుండెను. కాని నేడు దుఃఖముతో

మిక్కిలి తపించుచుండెను. మిక్కిలి మలినమై కృశించియున్న శరీరముగల అట్టి ఆ సౌందర్యరాశిని గాంచి హనుమంతుడు తాను తెలిసికొన్న కారణములచే ఈమె సీతయే యని ఊహించెను.

**శ్లో॥ హ్రియమాణా తదా తేన రక్షసా కామరూపిణా ।**
**యథారూపా హి దృష్టా వై తథారూపేయ మంగనా ॥ 27**

**పదచ్ఛేదము :**– హ్రియమాణా – తదా – తేన – రక్షసా – కామరూపిణా – యథారూపా – హి – దృష్టా – వై – తథారూపా – ఇయమ్ – అంగనా ॥

**అన్వయక్రమము :**– తదా కామరూపిణా తేన రక్షసా యథారూపా హ్రియమాణా దృష్టా ఇయమ్ అంగనా తథారూపా హి.

**ప్రతిపదార్థము :**– తదా = ఆనాడు, కామరూపిణా = కామరూపమును ధరించిన, తేన రక్షసా = (సన్న్యాసిరూపములోనున్న) ఆ రావణునిచే, యథారూపా = ఎట్టిరూపము గలదై; హ్రియమాణా దృష్టా = అపహరింపబడుచు చూడబడినదో, ఇయమ్ అంగనా = ఈ వనిత, తథారూపా హి = అట్టి ఆకారము గలదిగనే యున్నది గదా!

**తాత్పర్యము :**– ఆనాడు మేము కిష్కింధలో ఋశ్యమూకపర్వతముపై నుండగా మాయారూపధారియైన రావణునిచే అపహరింపబడి కొనిపోబడుచున్న యామె ఎట్టి ఆకారముతో మాకు కాన్పించినదో సరిగా అట్టి ఆకారము గలదిగనే ఇప్పుడు ఈమె గానవచ్చుచున్నది గదా!

**శ్లో॥ పూర్ణచంద్రాననాం సుభ్రూం చారువృత్తపయోధరాం ।**
**కుర్వన్తీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః ॥ 28**

**పదచ్ఛేదము :**– పూర్ణచంద్రాననాం – సుభ్రూం – చారువృత్తపయోధరామ్ – కుర్వంతీం – ప్రభయా – దేవీం – సర్వాః – వితిమిరాః – దిశః ॥

**అన్వయక్రమము :**– సుగమము.

**ప్రతిపదార్థము :**– పూర్ణచంద్రాననాం = నిండు చందురుని వంటి ముఖము గలదియును, సుభ్రూం = సుందరమైన కనుబొమలు గలదియును, చారువృత్త పయోధరాం = సుందరమైన వర్తులమైన స్తనములు గలదియును, ప్రభయా = (తన శరీర) కాంతిచే, సర్వాః దిశః = ఎల్లదిక్కులను, వితిమిరాః కుర్వంతీం = చీకటిలేనివిగా చేయుచున్నట్టిదియునగు, (తాం దేవీం సమీక్ష్య = ఆ పూజ్యురాలిని గాంచి).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** "ప్రభయా సర్వాః దిశః వితిమిరాః కుర్వంతీం" పదినెలలు స్నానపానాదులు లేక మాలిన్యముతో నున్నను తన ప్రకాశముచే దిక్కులందలి చీకటిని పారద్రోలుచున్నదనగా ఆమె ప్రభాతిశయ మెట్టిదియో వెల్లడియగుచున్నదిగదా!

**తాత్పర్యము :–** నిండుచంద్రునివంటి ముఖముతోడను, అందమైన కనుబొమలతోడను, సుందరములై వర్తులములైన స్తనములతోడను వెలుగొందుచున్నట్టి ఆమె తన ప్రకాశముచే ఎల్లదిక్కులను వెలుగుతో నింపుచున్నట్లుండెను.

**శ్లో॥ తాం నీలకేశీం బింబోష్ఠీం సుమధ్యాం సుప్రతిష్ఠితామ్ ।**
**సీతాం పద్మపలాశాక్షీం మన్మథస్య రతిం యథా ॥ 29**

**పదచ్ఛేదము :–** తాం – నీలకేశీం – బింబోష్ఠీం – సుమధ్యాం – సుప్రతిష్ఠితామ్ – సీతాం – పద్మపలాశాక్షీం – మన్మథస్య – రతిం – యథా ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** మన్మథస్య రతిం యథా = మన్మథుని (పత్నియైన) రతీదేవివలె, నీలకేశీం = నల్లని కేశములు గలదియును, బింబోష్ఠీం = దొండపండువంటి పెదవిగలదియును, సుమధ్యాం = చక్కని నడుము గలదియును, సుప్రతిష్ఠితాం = సుందరమైన (అవయవముల) సన్నివేశము గలదియును, పద్మపలాశాక్షీం = తామర రేకులవంటి కన్నులు గలదియును అగు, (తాం సమీక్ష్య = ఆమెను గాంచి).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** సుప్రతిష్ఠితాం = చక్కగా నిలిపిన పాదతలము గలదియును.

**తాత్పర్యము :–** ఆమె నల్లని కేశములు, దొండపండువంటి పెదవి, చక్కని నడుము, చక్కని అవయవసన్నివేశము, పద్మపత్రములవంటి కన్నులును కలిగి మన్మథుని భార్యయైన రతీదేవివలె నుండెను.

**శ్లో॥ ఇష్టాం సర్వస్య జగతః పూర్ణచంద్రప్రభా మివ ।**
**భూమౌ సుతను మాసీనాం నియతా మివ తాపసీమ్ ।**
**నిశ్శ్వాసబహులాం భీరుం భుజగేంద్రవధూ మివ ॥ 30**

**పదచ్ఛేదము :–** ఇష్టాం – సర్వస్య – జగతః – పూర్ణచంద్రప్రభామ్ – ఇవ – భూమౌ

– సుతనుమ్ – ఆసీనాం – నియతామ్ – ఇవ – తాపసీమ్ – నిశ్శ్వాసబహుళాం – భీరుం – భుజగేంద్రవధూమ్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– పూర్ణచంద్రప్రభామ్ ఇవ సర్వస్య జగతః ఇష్టాం, నియతాం తాపసీమ్ ఇవ సుతనుం, భూమౌ ఆసీనాం, భుజగేంద్రవధూమ్ ఇవ నిశ్శ్వాసబహుళాం, భీరుం (తాం సమీక్ష్య.....)

**ప్రతిపదార్థము** :– పూర్ణచంద్రప్రభామ్ ఇవ = నిండుచంద్రుని కాంతివలె, సర్వస్య జగతః ఇష్టాం = లోకమునకంతకును ఇష్టురాలై యున్నదియును, నియతాం తాపసీం ఇవ = కఠినమైన నియమములు గలిగిన తాపసస్త్రీవలె, సుతనుం = పవిత్రమైన శరీరముగలదై, భూమౌ ఆసీనాం = నేలపై కూర్చున్నదియును, భుజగేంద్రవధూం ఇవ = సర్పరాజు భార్యవలె, నిశ్శ్వాసబహుళాం = నిట్టూర్పుల ఆధిక్యము గలదియును, భీరుం = భీతురాలై యున్నదియును అగు, (తాం సమీక్ష్య = ఆమెను గాంచి)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– నియతాం = భూశయనము మున్నగు కఠోరనియమములు గలది. భుజగేంద్రవధూమ్ ఇవ = సర్పరాజు భార్యతో సాదృశ్యముచే చేరుటకు శక్యము గానిదనియు రాక్షసకులనాశహేతువై యున్నది యనియును సూచింపబడినది.

**తాత్పర్యము** :– నిండు చంద్రుని వెన్నెలవలె జగత్తున కంతకును ఇష్టమైయున్నదియును, కఠోరనియమములు పూనిన తాపసస్త్రీవలె పవిత్రమైన శరీరముతో భూమిపై కూర్చున్నదియును, సర్పరాజు భార్యవలె మాటిమాటికిని బుసకొట్టుచున్నట్లు నిట్టూర్పులు విడుచుచు భీతురాలై యున్నదియును అగు ఆ సీతమ్మను హనుమ గాంచెను.

**శ్లో॥ శోకజాలేన మహతా వితతేన న రాజతీమ్ ।**
**సంసక్తాం ధూమజాలేన శిఖా మివ విభావసోః ॥ 31**

**పదచ్ఛేదము** :– శోకజాలేన – మహతా – వితతేన – న – రాజతీమ్ – సంసక్తాం – ధూమజాలేన – శిఖామ్ – ఇవ – విభావసోః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– ధూమజాలేన సంసక్తాం = దట్టమైన పొగతో చుట్టుకొనబడినట్టి, విభావసోః శిఖామ్ ఇవ = అగ్నియొక్క జ్వాలవలె, వితతేన = విస్తారమై యున్నట్టి, మహతా శోకజాలేన = గొప్పదైన దుఃఖబాహుళ్యముచే, న రాజతీం = ప్రకాశింప

కున్నట్టిదియగు, (తాం సమీక్ష్య = ఆమెను గాంచి).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** విభావసోః శిఖామ్ ఇవ = అనుటచే పాతివ్రత్యతేజస్సుతో ప్రకాశించు చున్నదని భావము.

**తాత్పర్యము :-** దట్టమైన పొగతో గప్పబడినట్టి అగ్నిజ్వాలవలె గొప్పదైన శోకభారముచే సంపూర్ణముగా వ్యక్తముగాని తేజస్సుగల సీతమ్మను హనుమ గాంచెను.

**శ్లో॥ తాం స్మృతీ మివ సందిగ్ధా మృద్ధిం నిపతితా మివ ।**
**విహతా మివ చ శ్రద్ధా మాశాం ప్రతిహతా మివ ॥ 32**

**పదచ్ఛేదము :-** తాం - స్మృతీమ్ - ఇవ - సందిగ్ధామ్ - ఋద్ధిం - నిపతితామ్ - ఇవ - విహతామ్ - ఇవ - చ - శ్రద్ధామ్ - ఆశాం - ప్రతిహతామ్ - ఇవ ॥

**అన్వయక్రమము :-** సుగమము.

**ప్రతిపదార్థము :-** సందిగ్ధాం స్మృతీమ్ ఇవ = సందేహగ్రస్తమైయున్న ధర్మశాస్త్రము వలెను, నిపతితామ్ ఋద్ధిమ్ ఇవ = కూలిపోయిన అభ్యుదయమువలెను, విహతాం శ్రద్ధామ్ ఇవ = క్షీణించిన శ్రద్ధవలెను, ప్రతిహతామ్ ఆశామ్ ఇవ = భగ్నమైన ఆశవలెను, స్థితాం తాం సమీక్ష్య = కానవచ్చుచున్నట్టి ఆమెను గాంచి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** సందిగ్ధాం స్మృతీమ్ ఇవ - అర్థవిషయమున సందేహము కల్గించునట్టి ధర్మశాస్త్రమువలె, ఋద్ధిం నిపతితామ్ ఇవ - అన్యాయప్రవర్తనముచే నశించిన అభ్యుదయమువలె, విహతాం శ్రద్ధామ్ ఇవ = నాస్తికబుద్ధిచే చెడిన శ్రద్ధవలె.

**తాత్పర్యము :-** అర్థనిర్ణయమున సందేహమును కలిగించు ధర్మశాస్త్రమువలెను, క్షీణించి పోయినట్టి ఐశ్వర్యమువలెను, చెడిపోయిన శ్రద్ధవలెను, భగ్నమైన ఆశవలెను, దీనమైన స్థితిలో నున్నట్టి సీతాదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ సోపసర్గాం యథా సిద్ధిం బుద్ధిం సకలుషా మివ ।**
**అభూతే నాపవాదేన కీర్తిం నిపతితా మివ ॥ 33**

**పదచ్ఛేదము :-** సోపసర్గాం - యథా - సిద్ధిం - బుద్ధిం - సకలుషామ్ - ఇవ అభూతేన - అపవాదేన - కీర్తిం - నిపతితామ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- సోపసర్గాం సిద్ధిం యథా = విఘ్నముతో గూడిన కార్యసిద్ధివలెను, సకలుషాం బుద్ధిమ్ ఇవ = కాలుష్యముతో గూడిన బుద్ధివలెను, అభూతేన అపవాదేన = అసత్యమైనట్టి అపవాదుచే, నిపతితాం కీర్తిమ్ ఇవ = చెడిపోయిన ప్రతిష్ఠవలెను ఉన్నట్టి, తాం సమీక్ష్య = ఆమెను గాంచి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- "సకలుషాం" = రాగద్వేషాది కాలుష్యములతో కూడియున్న బుద్ధివలె.

**తాత్పర్యము** :- విఘ్నములచే ఆగిపోయిన కార్యసిద్ధివలెను, రాగద్వేషాది కల్మషములచే చెడిన గొప్ప బుద్ధివలెను, అసత్యమైనట్టి అపవాదుచే దెబ్బతిన్న కీర్తివలెను, కష్టములో చిక్కుకొనియున్న సీతాదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ రామోపరోధవ్యథితాం రక్షోహరణకర్శితామ్ ।**
**అబలాం మృగశాబాక్షీం వీక్షమాణాం తత స్తతః ॥ 34**

**పదచ్ఛేదము** :- రామోపరోధవ్యథితాం - రక్షోహరణకర్శితామ్ - అబలాం - మృగశాబాక్షీం - వీక్షమాణాం - తతః - తతః ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- రామోపరోధవ్యథితాం = రాముని చేరుటకు విఘ్నము కలుగుటచే బాధనొందుచున్నదియును, రక్షోహరణకర్శితామ్ = రావణు డపహరించుటచే కృశించియున్నదియును, అబలాం = దుర్బలురాలును, మృగశాబాక్షీం = లేడిపిల్ల కన్నులవంటి కన్నులు గల్గినదియును, తతః తతః వీక్షమాణాం = ఇటునటు చూచుచున్న దియును అగు, (తాం సమీక్ష్య = ఆమెను గాంచి).

**తాత్పర్యము** :- రామునికి దూరమై యుండుటచే వ్యథనొంది యున్నదియును, రావణు డపహరించుటచే కలిగిన దుఃఖముచే కృశించినదియును, బెదరిన లేడిపిల్లవలె భీతితో నలువైపులను చూచుచున్నదియు నగు సీతమ్మను హనుమ గాంచెను.

**శ్లో॥ బాష్పాంబుపరిపూర్ణేన కృష్ణవక్రాక్షిపక్ష్మణా ।**
**వదనే నాప్రసన్నేన నిశ్శ్వసన్తీం పునః పునః ॥ 35**

**పదచ్ఛేదము** :- బాష్పాంబుపరిపూర్ణేన - కృష్ణవక్రాక్షిపక్ష్మణా - వదనేన - అప్రసన్నేన - నిశ్శ్వసంతీం - పునః - పునః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– బాష్పాంబుపరిపూర్ణేన = కన్నీటితో నిండినట్టియు, కృష్ణవక్రాక్షిపక్ష్మణా = నల్లని వంకరైనట్టి కంటిఱెప్పలు గలిగినట్టి, అప్రసన్నేన వదనేన = విచారముతో గూడిన ముఖముతో, పునః పునః నిశ్వసంతీం = మాటిమాటికి నిట్టూర్పులు విడుచు చున్నదియునగు, (తాం సమీక్ష్య = ఆమెను గాంచి)

**తాత్పర్యము** :– దుఃఖబాష్పములతో నిండి, నల్లని వంకరైన కంటిఱెప్పలు గలిగి విచారగ్రస్తమైయున్న ముఖముతో మాటిమాటికి నిట్టూర్పులు విడుచుచున్నట్టి సీతమ్మను హనుమ గాంచెను.

**శ్లో॥ మలపంకధరాం దీనాం మండనార్హా మమండితామ్ ।**
**ప్రభాం నక్షత్రరాజస్య కాలమేఘై రివావృతామ్ ॥ 36**

**పదచ్ఛేదము** :– మలపంకధరాం – దీనాం – మండనార్హామ్ – అమండితామ్ – ప్రభాం – నక్షత్రరాజస్య – కాలమేఘైః – ఇవ – ఆవృతామ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– మలపంకధరాం = మట్టిబురదను ధరించినదియును, దీనాం = దీనురాలై యున్నదియును, మండనార్హామ్ అమండితామ్ = అలంకారమునకు తగియున్నదియును, అలంకరణములు లేనట్టిదియును, కాలమేఘైః ఆవృతాం = కాఱుమబ్బులచే ఆవరింపబడినట్టి, నక్షత్రరాజస్య ప్రభామ్ ఇవ (స్థితాం) = చంద్రుని కాంతివలె నున్నట్టిదియునగు, (తాం సమీక్ష్య = ఆమెను గాంచి).

**తాత్పర్యము** :– మలినమైయున్న దేహముతో నిండి నిండుగ అలంకారములు ధరింప వలసినట్టి తన సుందరమైన దేహమును ఏమియు అలంకరించుకొనక యున్నదియును, కాఱుమబ్బులచే గప్పబడిన చంద్రబింబము వలెనున్నదియునగు సీతమ్మను హనుమ గాంచెను.

**శ్లో॥ తస్య సందిదిహే బుద్ధి ర్ముహుః సీతాం నిరీక్ష్య తు ।**
**ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలా మివ ॥ 37**

**పదచ్ఛేదము** :– తస్య – సందిదిహే – బుద్ధిః – ముహుః – సీతాం – నిరీక్ష్య – తు – ఆమ్నాయానామ్ – అయోగేన – విద్యాం – ప్రశిథిలామ్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– ఆమ్నాయానామ్ అయోగేన ప్రశిథిలాం విద్యామ్ ఇవ స్థితాం

సీతాం నిరీక్ష్య, తస్య బుద్ధిః ముహుః సందిదిహే ॥

**ప్రతిపదార్థము :–** ఆమ్నాయానామ్ అయోగేన = మననములు లేకుండుటచే, ప్రశిథిలాం విద్యామ్ ఇవ స్థితాం = విస్మృతి నొందియున్న విద్యవలె నున్నట్టి, సీతాం నిరీక్ష్య = సీతాదేవిని జూచి, తస్య బుద్ధిః = ఆ హనుమంతుని బుద్ధి, ముహుః సందిదిహే = మాటిమాటికిని సందేహము నొందుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'ముహుః సందిదిహే' = గుర్తుపట్టుటకు వీలులేకుండ కృశించుట, మలినమై యుండుట మున్నగు కారణములచే సందేహమునకు కారణమయ్యెను.

**తాత్పర్యము :–** తిరిగి మననము చేయకుండుటచే శైథిల్యమునొందిన విద్యవలె, కృశత్వము మున్నగు కారణములచే పూర్వరూపము గోల్పోయియున్న సీతను జూచినట్టి హనుమంతుని మనస్సు సందేహమునకు లోనయ్యెను.

**శ్లో॥ దుఃఖేన బుబుధే సీతాం హనుమా ననలంకృతామ్ ।**
**సంస్కారేణ యథా హీనాం వాచ మర్థాంతరం గతామ్ ॥ 38**

**పదచ్ఛేదము :–** దుఃఖేన – బుబుధే – సీతాం – హనుమాన్ – అనలంకృతామ్ – సంస్కారేణ – యథా – హీనాం – వాచమ్ – అర్థాంతరం – గతామ్ ॥

**అన్వయక్రమము :–** సంస్కారేణ హీనామ్, అర్థాంతరం గతాం వాచం యథా దృశ్యమానామ్ అనలంకృతాం సీతాం హనుమాన్ దుఃఖేన బుబుధే.

**ప్రతిపదార్థము :–** సంస్కారేణ హీనాం = శబ్దసంబంధనియమములు లేనట్టిదై (యుండుటచే), అర్థాంతరం గతాం = వేఱైనట్టి అర్థమును బోధించుచున్నట్టి, వాచం యథా దృశ్యమానాం = వాక్కువలె కనబడుచున్న, అనలంకృతాం సీతాం = అలంకారవిహీనమైన సీతాదేవిని, హనుమాన్ = హనుమంతుడు, దుఃఖేన బుబుధే = అతిక్లేశముచే గ్రహించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** శబ్దవ్యుత్పత్తిలేని పామరుని వాక్కును వ్యాకరణాదికృషిచే అతికష్టముపై అర్థముచేసికొనినట్లు, అలంకారశూన్యమై మలినమై దేశాంతరగతురాలైయున్న సీతను హనుమంతు డతికష్టముమీద గ్రహించెనని భావము.

**గోవిందరాజీయము :–** వ్యుత్పత్తిశూన్యతచే చెప్పదలచినది గాక విపరీతార్థమును

బోధించు అల్పజ్ఞుని వచనములు ఎట్లో ప్రయాసచే ఆ వక్త చెప్పదలచిన అర్థమును వెల్లడించునట్లుగా సీతాదేవిని కష్టముచే మాత్రమే తన రూపమును గ్రహింపచేయు చున్నదని భావము.

**తాత్పర్యము :–** వ్యుత్పత్తి మున్నగు వ్యాకరణజ్ఞానము లేకుండుటచేత కోరిన అర్థమును తెలుపలేక విపరీతార్థమును బోధించుచున్న అజ్ఞాని వాక్కువలె, అలంకారరహితమై మలినమై యున్నట్టి సీతాదేవి రూపమును జూచి హనుమంతుడు అతికష్టముమీదనే ఆమెయే సీత యని గ్రహింపగల్గెను.

**శ్లో॥ తాం సమీక్ష్య విశాలాక్షీం రాజపుత్రీ మనిందితామ్ ।**
**తర్కయామాస సీతేతి కారణై రుపపాదిభిః ॥ 39**

**పదచ్ఛేదము :–** తాం – సమీక్ష్య – విశాలాక్షీం – రాజపుత్రీమ్ – అనిందితామ్ – తర్కయామాస – సీతా – ఇతి – కారణైః – ఉపపాదిభిః ॥

**అన్వయక్రమము :–** ఆనిందితాం, రాజపుత్రీం, విశాలాక్షీం తాం సమీక్ష్య (సః) ఉపపాదిభిః కారణైః సీతా ఇతి తర్కయామాస.

**ప్రతిపదార్థము :–** అనిందితాం = శ్లాఘ్యమైన లక్షణములు గలదై, రాజపుత్రీం = రాజపుత్రికయై యున్నదియును; విశాలాక్షీం = విశాలములైన నేత్రములు కలిగి యున్నదియును అగు, తాం = ఆమెను, సమీక్ష్య = చూచి, సః = ఆ హనుమ, ఉపపాదిభిః కారణైః = యుక్తిసమ్మతములైన కారణములచే, సీతా ఇతి తర్కయామాస = సీతయని ఊహించెను.

**తాత్పర్యము :–** ఉత్తమమైన లక్షణములతో రాజపుత్రికవలె విశాలమైన కన్నులతోనున్న ఆమెనుజూచి యుక్తియుక్తములైన కారణములవల్ల ఆమె సీతయే యని ఊహించెను.

**శ్లో॥ వైదేహ్యా యాని చాంగేషు తదా రామోఽన్వకీర్తయత్ ।**
**తా న్యాభరణజాలాని గాత్రశోభీ న్యలక్షయత్ ॥ 40**

**పదచ్ఛేదము :–** వైదేహ్యాః – యాని – చ – అంగేషు – తదా – రామః – అన్వకీర్తయత్ – తాని – ఆభరణజాలాని – గాత్రశోభీని – అలక్షయత్ ॥

**అన్వయక్రమము :–** తదా రామః వైదేహ్యాః అంగేషు యాని (ఆభరణాని) అన్వకీర్తయత్, తాని ఆభరణజాలాని గాత్రశోభీని (సః) అలక్షయత్.

**ప్రతిపదార్థము :–** తదా = ఆనాడు, రామః = శ్రీరాముడు, వైదేహ్యాః అంగేషు =

సీతాదేవి అవయవములందు, యాని (ఆభరణాని) = ఏ యాభరణములనైతే, అన్వకీర్తయత్ = పేర్కొనియుండెనో, తాని ఆభరణజాలాని = ఆ యాభరణ సమూహములను, గాత్రశోభీని = దేహమునందు వెలుగొందుచున్న వానినిగా, సః = ఆ హనుమ, అలక్షయత్ = కనుగొనెను.

'గాత్రశోభీని' అనుటకు బదులుగా 'శాఖాశోభీని' అని పాఠాంతరము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

మహేశ్వరతీర్థులు మున్నగువారు 'శాఖాశోభీని' అను పాఠమును గ్రహించి రామునితో వియోగకాలమున ఆమె ఆభరణములను తొలగించి కొమ్మకు తగిలించినదని వ్యాఖ్యానము చేసిరి. కాని (శ్యామాని చిరయుక్తత్వాత్) చిరకాలము ధరించియుండుటవలన నల్లబడియున్నవి అని ముందు శ్లోకములో వర్ణించినదానికి విరోధము సంభవించును. కావున ఆ పాఠము ఉపేక్షణీయమని తిలకము తన పాఠమును సమర్థించెను.

**తిలకము :–** శ్రీరాముడు, హనుమ ప్రయాణసమయమున సీతమ్మ ఏ అవయవములందే ఆభరణములు ధరించెనని చెప్పెనో అవి ఆ అవయవములందు వెలయుచుండుటచే సీతను గుర్తించుటకు వీలుకల్గెను.

**వాసుదాసస్వామి :–** ఆనాడు శ్రీరామచంద్రమూర్తి సీతసొమ్ములివి యని వేనిని జెప్పెనో, యవి ధరించియుండిన దేహమునం దెట్టి గుర్తులు పడియుండునో, ఆ గుర్తు లీమె దేహమునందున్నవి. సీతాదేవి తీసి పారవైచినవి గాక అప్పుడు తొందరలో తీయుటకు సాధ్యముగానివి దేహమందే యుంచుకొనెను. ఆ సొమ్ము లిందున్నవి. ఇది యాప్తవాక్యము.

**తాత్పర్యము :–** తాను లంకకు బయలుదేరునప్పుడు తనతో శ్రీరాముడు సీతాదేవి ఏ యే అవయవములం దే యే ఆభరణములు ధరించెనని చెప్పెనో, ఆ యాభరణములు ఇప్పుడు ఆమె యొడలిపై కానవచ్చుచున్నవి.

**శ్లో॥ సుకృతౌ కర్ణవేష్టౌ చ శ్వదంష్ట్రౌ చ సుసంస్థితౌ ।**
**మణివిద్రుమచిత్రాణి హస్తే ష్వాభరణాని చ ॥ 41**

**పదచ్ఛేదము :–** సుకృతౌ – కర్ణవేష్టౌ – చ – శ్వదంష్ట్రౌ – చ – సుసంస్థితౌ – మణివిద్రుమచిత్రాణి – హస్తేషు – ఆభరణాని – చ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సుకృతౌ కర్ణవేష్టౌ చ = సుందరమైన కర్ణాభరణములును; సుసంస్థితౌ శ్వదంష్ట్రౌ చ = చక్కగా అమరియున్న త్రికర్ణకభూషణములున్ను; హస్తేషు = చేతులయందు, మణివిద్రుమచిత్రాణి ఆభరణాని చ = రత్నములు పగడములు మున్నగు వానితో సుందరములైయున్న ఆభరణములున్ను.

**శ్లో॥ శ్యామాని చిరయుక్తత్వా త్తథా సంస్థానవంతి చ ।**
**తా న్యే వైతాని మన్యేఽ హం యాని రామోఽన్వకీర్తయత్॥ 42**

**పదచ్ఛేదము** :– శ్యామాని – చిరయుక్తత్వాత్ – తథా – సంస్థానవంతి – చ – తాని – ఏవ – ఏతాని – మన్యే – అహం – యాని – రామః – అన్వకీర్తయత్ ॥

**అన్వయక్రమము** :– ఏతాని చిరయుక్తత్వాత్ శ్యామాని; తథా సంస్థానవంతి చ; (అతః) రామః యాని అన్వకీర్తయత్, తాని ఏతాని ఏవ (ఇతి) అహం మన్యే.

**ప్రతిపదార్థము** :– (ఏతాని = ఈ యాభరణములు), చిరయుక్తత్వాత్ = చిరకాలము ధరింపబడుటచే, శ్యామాని = నల్లబడియున్నవి; తథా = అట్లే, సంస్థానవంతి చ = ఆనవాళ్ళు గల్గియున్నవి; (అతః = అందుచే) రామః యాని అన్వకీర్తయత్ = శ్రీరాముడు వేటినిగూర్చి పలికియుండెనో; తాని ఏతాని = అవి ఇవియే, ఇతి అహం మన్యే = అని నేను తలచుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– కర్ణవేష్టనములు = కుండలములు, శ్వదంష్ట్రము = 'త్రికర్ణకః శ్వదంష్ట్రశ్చ' అనగా, త్రికర్ణక మను పుష్పాకారమైన కర్ణపార్శ్వభూషణము, శ్యామాని = విరహతాపముయొక్క వేడిమిచే నల్లబడినవి. అట్లే చిరకాలము ధరించుటచే ఆ అవయవములపై ఆనవాళ్లు పడెను.

**తాత్పర్యము** :– కర్ణములందు చక్కగ నిర్మింపబడిన కుండలములున్ను, వానివెనుక త్రికర్ణములనెడి కర్ణాభరణములును, చేతులందు రత్నములు, పగడములు గల సుందరమైన కడియములును, చిరకాలము సంస్కరింపకపోవుటచే నల్లబడినవై అవి యుండుచోట్ల ఆనవాళ్ళు గలిగి గాన్పించుచున్నవి. ఇవి యన్నియును శ్రీరాముడు నాతో చెప్పినవే యని తలచుచున్నాను.

**శ్లో॥ తత్ర యా న్యవహీనాని తా న్యహం నోపలక్షయే ।**
**యా న్యస్యా నావహీనాని తా నీమాని న సంశయః ॥ 43**

**పదచ్ఛేదము** :– తత్ర – యాని – అవహీనాని – తాని – అహం – న – ఉపలక్షయే – యాని – అస్యాః – న – అవహీనాని – తాని – ఇమాని – న – సంశయః ॥

**అన్వయక్రమము** :– తత్ర యాని అవహీనాని తాని అహం (అత్ర) న ఉపలక్షయే, అస్యాః యాని చ అవహీనాని, తాని ఇమాని, న సంశయః.

**ప్రతిపదార్థము** :– తత్ర = ఆ ఋశ్యమూక పర్వతమునందు, యాని = ఏ యాభరణము లయితే, అవహీనాని = పడవేయబడినవో, తాని = ఆ యాభరణములను, అహం = నేను, అత్ర = ఈమెయొద్ద; న ఉపలక్షయే = చూడలేకున్నాను. అస్యాః = ఈమెయొక్క, యాని = ఏ యాభరణములయితే, న అవహీనాని = (అచ్చట) పడవేయబడలేదో, తాని ఇమాని = ఆ యాభరణములే యివి. న సంశయః = సందేహము లేదు.

**తాత్పర్యము** :– పూర్వ మా ఋశ్యమూకపర్వతముపై ఏ యాభరణములు పడవేయబడి యుండెనో, అవి ఏవియు నిచ్చట కానబడుటలేదు. ఈమె అచ్చట పడవేయనట్టి ఆభరణములు మాత్రమే ఇచ్చట గానవచ్చుచున్నవి. ఇందుల కేమియు సందేహము లేదు.

**శ్లో॥ పీతం కనకపట్టాభం స్రస్తం తద్వసనం శుభమ్ ।**
**ఉత్తరీయం నగాసక్తం తదా దృష్టం ప్లవంగమైః ॥ 44**

**పదచ్ఛేదము** :– పీతం – కనకపట్టాభం – స్రస్తం – తత్ – వసనం – శుభమ్ – ఉత్తరీయం – నగాసక్తం – తదా – దృష్టం – ప్లవంగమైః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– పీతం = పచ్చనైనదియును, కనకపట్టాభం = బంగరు జలతారుతో ప్రకాశించు చున్నదియును, స్రస్తం = జారిపోయినదియును, ఉత్తరీయం = ఉత్తర వస్త్రముగా ధరించునట్టి, తద్వసనం = ఆమెచీరయే, నగాసక్తం = ఆ (పర్వతమునందలి) చెట్టుపై వ్రేలుచున్నదై, ప్లవంగమైః = వానరులచే, తదా = ఆనాడు, దృష్టం = చూడబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– ఆకాశమునుండి, కొండమీద పడవైచినపుడు సొమ్ములు విరిగి తునకలైపోకుండునా యను సందేహమును వాల్మీకి ఇచ్చట పరిహరించుచున్నాడు. సీతాదేవి బండలమీద పాఱవేయలేదు. చెట్టుమీద బడునట్లు మూటగాకట్టి విసరెను. అది చెట్టు కొమ్మలకు తగిలి, నేలపై బడెను. కావున సొమ్ములు తునుకలు గాలేదు.

**తాత్పర్యము :-** బంగరు జలతారుగల పచ్చనైన పవిత్రమైన ఈమె యుత్తరీయముగా ధరించు వస్త్రమే ఆ పర్వతముమీద చెట్టుపై వ్రేలాడుచు, ఆనాడు మా సుగ్రీవాది వానరులచే కనుగొనబడినది.

**శ్లో॥ భూషణాని చ ముఖ్యాని దృష్టాని ధరణీతలే ।**
**అన యైవాపవిద్ధాని స్వనవంతి మహాంతి చ ॥ 45**

**పదచ్ఛేదము :-** భూషణాని - చ - ముఖ్యాని - దృష్టాని - ధరణీతలే - అనయా - ఏవ - అపవిద్ధాని - స్వనవంతి - మహాంతి - చ ॥

**అన్వయక్రమము :-** ధరణీతలే దృష్టాని స్వనవంతి మహాంతి ముఖ్యాని భూషణాని అనయా ఏవ అపవిద్ధాని.

**ప్రతిపదార్థము :-** ధరణీతలే = నేలపై, దృష్టాని = చూడబడినట్టి, స్వనవంతి = ధ్వనిచేయుచున్నవియును, మహాంతి = గొప్పవైనవియునగు, ముఖ్యాని భూషణాని = ప్రధానములైన యాభరణములు, అనయా ఏవ అపవిద్ధాని = ఈమెచేతనే పడవేయ బడినవి.

**తాత్పర్యము :-** ఆనాడు ఋశ్యమూకపర్వతమున నేలపై ఘల్లుమని శబ్దము చేయుచు ఏ అమూల్యములైనట్టి యాభరణములు నాకు కనబడినవో అవి ఈమెచేతనే అప్పుడు పడవేయబడినవి.

**శ్లో॥ ఇదం చిరగృహీతత్వా ద్వసనం క్లిష్టవత్తరమ్ ।**
**తథాపి నూనం తద్వర్ణం తథా శ్రీమ ద్యథేతరత్ ॥ 46**

**పదచ్ఛేదము :-** ఇదం - చిరగృహీతత్వాత్ - వసనం - క్లిష్టవత్తరమ్ - తథా - అపి - నూనం - తద్వర్ణం - తథా - శ్రీమత్ - యథా - ఇతరత్ ॥

**అన్వయక్రమము :-** ఇదం వసనం చిరగృహీతత్వాత్ క్లిష్టవత్తరమ్. తథాపి తద్వర్ణం ఇతరత్ యథా స్థితమ్ తథా నూనం శ్రీమత్.

**ప్రతిపదార్థము :-** ఇదం వసనం = ఈ వస్త్రము, చిరగృహీతత్వాత్ = చిరకాలము కట్టుకొని యుండుటవలన, క్లిష్టవత్తరమ్ = మిక్కిలి నలిగిపోయినది; తథాపి = ఐనప్పటికిని, తద్వర్ణం = ఆ వస్త్రముయొక్క ఛాయమాత్రము, ఇతరత్ యథా = ఆ రెండవదివలెనే (అనగా ఉత్తరీయవస్త్రమువలెనే) (స్థితం = ఉన్నది); నూనం = నిశ్చయము; తథా = ఆ రీతిగనే, శ్రీమత్ = గొప్ప శోభగలిగియున్నది.

**తాత్పర్యము** :- ఈ ధరించియున్న ఈమె చీర చిరకాలము కట్టుకొని యుండుటచే మిక్కిలి నలిగిపోయి యున్నది. అయినప్పటికిని ఈ వస్త్రముయొక్క ఛాయ మాత్రము ఆనాడు మేము చూచిన ఉత్తరీయమువలెనే గొప్ప శోభ గలిగి యున్నది.

**శ్లో॥ ఇయం కనకవర్ణాంగీ రామస్య మహిషీ ప్రియా ।**
**ప్రణష్టాஉపి సతీ యాஉస్య మనసో న ప్రణశ్యతి ॥ 47**

**పదచ్ఛేదము** :- ఇయం - కనకవర్ణాంగీ - రామస్య - మహిషీ - ప్రియా - ప్రణష్టా - అపి - సతీ - యా - అస్య - మనసః - న - ప్రణశ్యతి ॥

**ప్రతిపదార్థము** :- యా = ఏ పూజ్యురాలు, ప్రణష్టా సతీ అపి = కనులకు దూరమైయున్నదైనప్పటికిని, అస్య = ఆ శ్రీరామునియొక్క, మనసః = మనస్సునుండి, స ప్రణశ్యతి = తొలగిపోవకున్నదో, కనకవర్ణాంగీ ఇయం = సువర్ణచ్ఛాయ గల దేహము గల్గిన ఈమె, (నూనం = నిశ్చయముగా) రామస్య ప్రియా మహిషీ = రామునకు ప్రియురాలైన ధర్మపత్నియే.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :- బాలకాండమున శ్రీరామచంద్రునకు హృదయేశ్వరి సీతాదేవి, శ్రీ సీతామాత హృదయేశ్వరుడు శ్రీరామచంద్రుడని చెప్పబడినట్లు సీతారాములు ఇరువురును ఏకహృదయము గలవారే. ఆ విషయమే ఇచట హనుమముఖతః మరల ఇట్లు తెలుపబడినది. అందులకే వారి నిరువురిని విధిగా యుగళరూపమున అర్చించవలెను అని పెద్దల సంప్రదాయము.

**తాత్పర్యము** :- కన్నులకు దూరమై అగోచరమైనప్పటికిని, ఏ పూజ్యురాలు శ్రీరాముని మనస్సునుండి ఒక క్షణము గూడ తొలగిపోవుట లేదో ఆ సువర్ణాంగియైన ఈమె రామునికి ప్రియమైన పట్టమహిషి యగు జానకీదేవియే!

**శ్లో॥ ఇయం సా యత్కృతే రామః చతుర్భిః పరితప్యతే ।**
**కారుణ్యే నానృశంస్యేన శోకేన మదనేన చ ॥ 48**

**పదచ్ఛేదము** :- ఇయం - సా - యత్కృతే - రామః - చతుర్భిః - పరితప్యతే - కారుణ్యేన - ఆనృశంస్యేన - శోకేన - మదనేన - చ ॥

**అన్వయక్రమము** :- యత్కృతే రామః కారుణ్యేన, ఆనృశంస్యేన, శోకేన, మదనేన చ చతుర్భిః పరితప్యతే సా ఇయమ్.

**ప్రతిపదార్థము** :– యత్కృతే = ఏ పూజ్యురాలిని గూర్చి, రామః = శ్రీరాముడు, కారుణ్యేన = కారుణ్యముతోడను, ఆనృశంస్యేన = మార్దవముతోడను, శోకేన = దుఃఖముతోడను, మదనేన చ = ప్రణయముతోడను, చతుర్భిః = ఈ నాలుగు లక్షణములతో, పరితప్యతే = పరితాపము నొందుచున్నాడో, సా = ఆయమ, ఇయం = ఈమెయే.

**తాత్పర్యము** :– ఏ మహనీయురాలిని గూర్చి శ్రీరాముడు కారుణ్యము, మార్దవము, దుఃఖము, ప్రణయము అను నాలుగు లక్షణములతో సంతాపము నొందుచున్నాడో పూజ్యురాలైన ఆ సాధ్వి ఈమెయే.

**శ్లో॥ స్త్రీ ప్రణష్టేతి కారుణ్యా దాశ్రితే త్యానృశంస్యతః ।**
**పత్నీ నష్టేతి శోకేన ప్రియేతి మదనేన చ ॥ 49**

**పదచ్ఛేదము** :– స్త్రీ – ప్రణష్టా – ఇతి – కారుణ్యాత్ – ఆశ్రితా – ఇతి – ఆనృశంస్యతః – పత్నీ – నష్టా – ఇతి – శోకేన – ప్రియా – ఇతి – మదనేన – చ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– స్త్రీ ప్రణష్టా = (రక్షింపవలసిన) అబల దూరమైపోయినది, ఇతి = అని, కారుణ్యాత్ = కారుణ్యభావముచేతను, ఆశ్రితా ఇతి = (నమ్మి) ఆశ్రయించినది యని, ఆనృశంస్యతః = అనుతాపముచేతను, పత్నీ నష్టా ఇతి = భార్య కానరాకున్నది యని, శోకేన = దుఃఖముచేతను, ప్రియా ఇతి = ప్రియురాలని, మదనేన చ = ప్రణయభావముచేతను, (రామః పరితప్యతే = శ్రీరాముడు పరితాపము నొందు చున్నాడు.)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ప్రణష్టా = ఇతరులచే పీడింపబడుచున్నదై యుండి నాచే రక్షింపబడలేదు. ఆపదనొందిన ఏ స్త్రీయైనను రక్షింపబడవలసినదే. ఆ మాత్రము రక్షణముకూడ చేయలేక పోతినని శ్రీరామునకు కారుణ్యము; వనమునందుగూడ తనను ఆశ్రయించియున్నట్టి దానిని కాపాడలేకుంటినని ఆశ్రితరక్షణస్వభావముగల ఆతనికి అనుతాపము, సర్వధర్మములకు సాధనభూతురాలైన ధర్మపత్నిని గోల్పోయితినని దుఃఖము. అపూర్వ రూపలావణ్యవతియై ఉత్తమసుఖసాధనభూతురాలైన ప్రియురాలు దూరమై పోయినదని ప్రణయతాపమును కలుగుచున్నవని భావము.

**తాత్పర్యము** :– సహజముగనే రక్షణీయురాలైనట్టి స్త్రీని రక్షింపలేకపోయితినని

కరుణచేతను, అరణ్యవాసమునందు గూడ తన్ను విడువక ఆశ్రయించియున్నట్టి భార్యను దక్కించుకొనలేక పోయితినని అనుతాపముచేతను, అర్ధదేహమై సర్వధర్మసాధన భూతయైన ధర్మపత్నిని గోల్పోయితినని దుఃఖముచేతను, తన మనస్సును హరించిన ప్రియురాలు దూరమైనదని ప్రణయాతిశయముచేతను శ్రీరాముడు మిక్కిలి పరితపించు చున్నాడు.

**శ్లో॥ అస్యా దేవ్యా యథా రూప మంగప్రత్యంగసౌష్ఠవమ్ ।**
**రామస్య చ యథా రూపం త స్యేయ మసితేక్షణా ॥ 50**

**పదచ్ఛేదము** :– అస్యాః – దేవ్యాః – యథా – రూపం – అంగప్రత్యంగసౌష్ఠవమ్ – రామస్య – చ – యథా – రూపం – తస్య – ఇయమ్ – అసితేక్షణా ॥

**అన్వయక్రమము** :– అస్యాః దేవ్యాః రూపమ్ అంగప్రత్యంగసౌష్ఠవం యథా రామస్య చ తథా; తస్య రూపం యథా అస్యాః చ తథా; (అతః) ఇయం అసితేక్షణా తస్య (యోగ్యా).

**ప్రతిపదార్థము** :– అస్యాః దేవ్యాః = ఈ మహనీయురాలియొక్క, రూపం = సౌందర్యమున్ను, అంగప్రత్యంగసౌష్ఠవం = అవయవముల సౌష్ఠవమును, యథా = ఏవిధమైనట్టిదియో, రామస్య చ = శ్రీరామునకును, (తథా = ఆ విధముగనే యున్నది); తస్య = ఆ శ్రీరామునియొక్క, రూపం = సౌందర్యము, యథా = ఏవిధమైనదో, అస్యాః చ = ఆ సీతాదేవికి గూడ, తథా = ఆ విధమైనట్టిదై యున్నది, (అతః = అందుచే), ఇయం అసితేక్షణా = ఈ నీలికన్నులుగల సౌందర్యవతి, తస్య = ఆ శ్రీరామునకు, (యోగ్యా = యోగ్యురాలు).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ఈ వర్ణనముచే సీతారాములు ఒకరికొకరు సర్వవిధముల తగియుండు రీతిగా సృజింపబడినట్టివారని వెల్లడింపబడినది.

**తాత్పర్యము** :– ఈ సీతాదేవియొక్క సౌందర్యవిశేషమును సాముద్రికశాస్త్ర ప్రసిద్ధమైన అవయవసౌష్ఠవమును ఎంతటి విశేషమైయున్నవో, అట్లే శ్రీరామునకు గూడ అమరియున్నవి. అట్లే శ్రీరామునియొక్క ఆ రూపమహత్త్వ మంతయును ఈమెలో గానవచ్చుచున్నది. అందుచే శ్రీరామునకు ఈ మహనీయసౌందర్యవతి సర్వవిధముల తగియున్నది.

**శ్లో॥ అస్యా దేవ్యా మన స్తస్మిం స్తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్ ।**
**తే నేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి ॥ 51**

**పదచ్ఛేదము :–** అస్యాః – దేవ్యాః – మనః – తస్మిన్ – తస్య – చ – అస్యాం – ప్రతిష్ఠితమ్ – తేన – ఇయం – సః – చ – ధర్మాత్మా – ముహూర్తమ్ – అపి – జీవతి ॥

**అన్వయక్రమము :–** అస్యాః దేవ్యాః మనః తస్మిన్ ప్రతిష్ఠితమ్; తస్య మనః చ అస్యాం ప్రతిష్ఠితమ్. తేన ముహూర్తమపి ఇయం జీవతి; సః ధర్మాత్మా చ జీవతి.

**ప్రతిపదార్థము :–** అస్యాః దేవ్యాః = ఈ మహనీయురాలియొక్క, మనః = హృదయము, తస్మిన్ = ఆ శ్రీరామునియందు, ప్రతిష్ఠితం = స్థిరముగా నిలచియున్నది, తస్య మనః = శ్రీరామునియొక్క మనస్సు, అస్యాం చ = ఈ సీతాదేవియందును, ప్రతిష్ఠితమ్ = స్థిరముగ నిలచియున్నది, తేన = ఆ కారణముచేత, ఇయం = ఈ సీతాదేవి, ముహూర్తమపి = కొన్నిక్షణముల కాలమైనను, జీవతి = జీవించియున్నది, ధర్మాత్మా సః చ = ధర్మతత్పరుడైన ఆ శ్రీరాముడును, జీవతి = జీవించుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవింద రాజీయము :–** తమ మనస్సులయందు సీతారాము లుభయులకును పరస్పర రూపములు నిలచి యుండనిచో ఏకహృదయులైనట్టి వారు క్షణకాలము గూడ జీవించుట సంభవించదు. కావున కవిచే వియోగకాలమునందు వారు జీవించి యుండుటకు కారణము ఇట్లు చెప్పబడినది.

**వాసుదాసస్వామి :–** "అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా" సూర్యునకు తేజస్సువలె సీత నా కనన్య; నన్ను విడిచియుండదు. ఆమెను విడిచి నేనుండ నని శ్రీరాముడే చెప్పెను గదా!

**తాత్పర్యము :–** ఈ సీతాదేవియొక్క హృదయము శ్రీరామునియందు చక్కగా నిలచియున్నది. అందుచేతనే ఆతడు కొద్ది కాలమైనను జీవింపగల్గుచున్నాడు. అట్లే శ్రీరాముని హృదయము ఈమెయందు స్థిరముగ నెలకొనియున్నది. కాబట్టియే ఈమె ఈ రాక్షసీమధ్యమున జీవముతో నుండగల్గినది.

**శ్లో॥ దుష్కరం కృతవా న్రామో హీనో య దనయా ప్రభుః ।**
**ధారయ త్యాత్మనో దేహం న శోకే నావసీదతి ॥ 52**

**పదచ్ఛేదము :–** దుష్కరం – కృతవాన్ – రామః – హీనః – యత్ – అనయా –

ప్రభుః – ధారయతి – ఆత్మనః – దేహం – న – శోకేన – అవసీదతి ॥

**అన్వయక్రమము :–** రామః అనయా హీనః ప్రభుః (సన్) ఆత్మనః దేహం ధారయతి, శోకేన న అవసీదతి – ఇతి యత్, తత్ దుష్కరం కృతవాన్.

**ప్రతిపదార్థము :–** రామః = శ్రీరాముడు, అనయా హీనః = ఈ మహనీయురాలిచే వియోగము నొందినవాడై, ప్రభుః (సన్) = సమర్థుడగుచు, ఆత్మనః దేహం = తన శరీరమును, ధారయతి = ధరించుచున్నాడు, శోకేన = దుఃఖముతో, న అవసీదతి = నశించిపోవుటలేదు, ఇతి యత్ = అనునది ఏది యున్నదో, రామః = శ్రీరాముడు, తత్ దుష్కరం కృతవాన్ = ఆ మిక్కిలి దుష్కరమైన పనిని చేయుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** వెనుక మాల్యవత్పర్వతమునందు శ్రీరాముడు పొందుచున్నట్టి సీతావిరహవేదనను, అప్పటి అతని దీనస్థితిని జూచి హనుమ "ఆహా! వసిష్ఠశిష్యుడైన ఈ రాజకుమారుడు ఒకస్త్రీని గూర్చి ఇంత దారుణముగా విలపించునా! ఇసీ! యని తన మనస్సులో నిందాపూర్వకముగా పరిహసించి యుండెను. సహజముగా తాను విరాగి కావున అప్పు డాతని కా భావము కల్గుట సహజమే!

కాని ఇప్పుడు అతడు సీతాదేవియొక్క అద్భుతమైన లోకోత్తర రూపాతిశయమును స్వయముగా గాంచి యథార్థస్థితిని గ్రహించెను. గావున తిరిగి అతడిట్లు అనుకొనుచున్నాడు.

ఇట్టి ఈ సీతాదేవి నుండి వియోగము నొంది శ్రీరాముడు జీవనములతో నుండగల్గుటయే గొప్ప దుర్ఘటమైన విషయము! ఒక రాజకుమారునకు అశ్వములు, గజములు మున్నగు రాజ్యసంపదలను దిద్దుకొను సామర్థ్యమెంతైన నుండవచ్చును. కాని తన ప్రణయసామ్రాజ్యసౌధమున మొదటి మెట్టుకడనే ఇట్టి ఆఘాతము వాటిల్లినప్పుడు దానిని తట్టుకొని నిలువగల్గుట ఎంతటివానికైనను ఎట్లు సాధ్యము? ఆహా! శ్రీరాముడు ఎంతటి దారుణవ్యథను భరించుచు యల్పమైన తన శరీరమును నిల్పుకొనుచున్నాడు! తన వశములో లేని పని సీతావియోగమునాడు జరిగినది, కాని తన ప్రాణము విడుచుట నేడు తన చేతిలోని పనియే గదా! అట్టి దేమియు చేయకుండ లోకోత్తరధీరత్వముతో శ్రీరాముడు జీవములతో నుండి గొప్ప దుష్కరకార్యమే చేయుచున్నాడు! – అని హనుమ భావము.

**తాత్పర్యము :–** ఇట్టి నిరుపమసౌందర్యాది మహనీయగుణవిశేషములు గల్గిన సీతను విడచి, ఎంత సమర్థుడైనను శోకముతో క్రుంగి కృశించిపోకుండ తన దేహమును

నిలుపుకొనుచున్నా డనగా ఆహా! శ్రీరాముడు ఎంత గొప్పదుర్ఘటకార్యము గావించు చున్నాడు!

**శ్లో॥ దుష్కరం కురుతే రామో య ఇమాం మత్తకాశినీమ్ ।**
**సీతాం వినా మహాబాహు ర్ముహూర్తమపి జీవతి ॥ 53**

**పదచ్ఛేదము :–** దుష్కరం – కురుతే – రామః – యః – ఇమాం – మత్తకాశినీమ్ – సీతాం – వినా – మహాబాహుః – ముహూర్తమ్ – అపి – జీవతి ॥

**అన్వయక్రమము :–** ఇమాం మత్తకాశినీం సీతాం వినా యః ముహూర్తం అపి జీవతి, సః మహాబాహుః రామః దుష్కరం కురుతే.

**ప్రతిపదార్థము :–** ఇమాం మత్తకాశినీం సీతాం వినా = ఈ మదిరేక్షణయైన సీత లేకుండ, యః ముహూర్త మపి జీవతి = ఏ శ్రీరాముడు కొన్ని క్షణములైనను జీవించి యున్నాడో, సః మహాబాహుః = ఆ మహావీరుడు, దుష్కరం కురుతే = మిక్కిలి దుష్కరకృత్యమును గావించుచున్నాడు.

**తాత్పర్యము :–** ఇట్టి సౌందర్యరాశిని విడచి కొన్ని క్షణములైనను శ్రీరాముడు జీవించి యున్నాడనగా, ఆ మహావీరుడు ఎంత దుష్కరకార్యము గావించుచున్నాడో గదా!

**శ్లో॥ ఏవం సీతాం తదా దృష్ట్వా హృష్టః పవనసంభవః ।**
**జగామ మనసా రామం ప్రశశంస చ తం ప్రభుమ్ ॥ 54**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సీతోపలంభః" నామ*
*పంచదశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** ఏవం – సీతాం – తదా – దృష్ట్వా – హృష్టః – పవనసంభవః – జగామ – మనసా – రామం – ప్రశశంస – చ – తం – ప్రభుమ్ ॥

**అన్వయక్రమము :–** పవనసంభవః తదా ఏవం సీతాం దృష్ట్వా హృష్టః మనసా రామం జగామ; తం ప్రభుం ప్రశశంస చ.

**ప్రతిపదార్థము :–** పవనసంభవః = వాయుపుత్రుడైన హనుమ, తదా = అప్పుడు, ఏవం సీతాం దృష్ట్వా = ఈ రీతిగా సీతను గాంచి, హృష్టః = ఆనందము నొందినవాడై, మనసా రామం జగామ = మానసికముగా రాముని (సన్నిధిని) పొందెను, తం ప్రభుం = ఆ స్వామిని, ప్రశశంస చ = మిక్కిలి మెచ్చుకొనెను కూడను!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- "ఏవం సీతాం" మలినవస్త్రములు, ఉపవాసకృశత్వము, శోకధ్యాన పరాయణత్వము మున్నగు పాతివ్రత్యధర్మములతో వెలయుచున్నట్టి సీతను చూచి యని భావము.

"రామం ప్రశశంస చ" – ఇట్టి పాతివ్రత్యగుణసంపన్నురాలైన భార్యను పొందిన భాగ్యవంతుడని రాముని ప్రశంసించెను. ఇట్టి ఈమె వియోగముచేతనే ఇంతటి వ్యథనొందెను. ఇంతటి తీవ్రమైన ఉద్యమమును పూనె ననియును ప్రశంసించెను. ఇట్టి కష్టస్థితియందు గూడ పాతివ్రత్యమునకు భంగము లేకుండగ వర్తించుచున్నందులకు సీతమ్మను గూడ ప్రశంసించెను అనియును (చకారమును వెనుకకు అన్వయించి) చెప్పవచ్చును.

**వాసుదాసస్వామి** :- "స్మరణమాత్రసంతుష్టాయ" యనినట్లు తనను స్మరించిన మాత్రముననే సంతోషించువాడు కాబట్టి రామచంద్రుని నిరంతరము పరిపరి విధముల హనుమ స్మరించుచుండును.

**తాత్పర్యము** :- ఈ విధముగ పాతివ్రత్యాదిసద్గుణశోభితురాలైన సీతమ్మను గాంచి హనుమ మహానందము నొందినవాడై, ఒక్కమారుగ భక్తితో తన మనస్సునందు శ్రీరాముని స్మరించెను. ఇట్టి మహనీయురాలి భర్తయైనందులకును, ఆమెను గూర్చి ఆయనకు కల్గిన శోకమునకును, అతని ప్రయత్నవిశేషములకును తన స్వామిని మిక్కిలిగా ప్రశంసించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతోపలంభము" అను*
*పదునైదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీమద్వాల్మీకి రామాయణము

# సుందరకాండము

## ద్వితీయ సంపుటము

(16-40 సర్గలు)

పదచ్ఛేద - అన్వయక్రమ - ప్రతిపదార్థ - వ్యాఖ్యానవిశేష -
తాత్పర్యములతో కూడిన

## సుబోధినీ వివరణ సహితము


విద్యాప్రవీణ, భాషాప్రవీణ
**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయినపల్లి**
**కామేశ్వరరావు,** బి.ఏ

## విషయ సూచిక - I

# విషయ సూచిక - II

★★★

శ్రీ

# సీతామాతృవందనము

**శ్లో॥ శ్రీరామ వామ లలితాంక విరాజమానే!**
**భూపుత్త్రికే! భువనపావన సచ్చరిత్రే!**
**మాతః! కృపామృతనిధే! శ్రితకల్పవల్లి!**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 1**

**తాత్పర్యము** :– శ్రీరామచంద్రుని కోమల సుందరమైన వామాంకతలమున వెలయుచున్నదానవు; లోకములను పావనముచేయు పుణ్యచరిత్రము కలదానవు; ఆశ్రయించిన భక్తులను తనియజేయు దయామృతనిధివి; కామితఫలము లొసగు కల్పవృక్షమవు; రామచంద్రప్రభుని హృదయాధీశ్వరివి; దేవీ! భూపుత్రీ! సీతామాతా! నీకు వందనము.

**శ్లో॥ యజ్ఞావనే ర్జనకరాట్సుకృతాత్ త్వ మాప్తా**
**యజ్ఞే మహేశధనుషా సుపరీక్ష్య దత్తా ।**
**యజ్ఞప్రభావజనితాయ హి; యజ్ఞసేవ్యే!**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 2**

**తాత్పర్యము** :– జనకభూపాలుని భాగ్యవిశేషముచే అతని యాగభూమినుండి ఉద్భవించినదానవు; ఆ మహీపతి ఏర్పఱచిన ధనుర్యాగమునందలి పరీక్షలో మహేశ్వరచాపము నెక్కుపెట్టి విజయము నొందినట్టి యజ్ఞప్రభావసంభవుడైన వరుని చేపట్టినదానవు; తల్లీ! నీ జననము, పరిణయము అన్నియు యజ్ఞప్రభావమూలములే గదా! యజ్ఞసేవ్యమైన మైథిలీ! రామపత్నీ! నీకు వందనము.

**శ్లో॥ వైదేహ రాజముని శిక్షణ నీత బాల్యే!**
**బాల్యా దవాప్త మునిదుర్లభ దివ్యవిద్యే!**
**విద్యాసమేధిత మహాసుషమాభిరామే!**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 3**

**తాత్పర్యము** :– బ్రహ్మవేత్తయైన జనక రాజయోగి శిక్షణమునందు గడచిన బాల్యము గలదానవు; ఆ మహాయోగి యొడిలో పెరుగుచు మహామునులకు గూడ దుర్లభమగునట్టి అనుభవయుక్తమైన అధ్యాత్మవిద్యను గడించితివి; ఆ దివ్యవిద్యాప్రభావముచే నీయందు

అద్భుతమైన దివ్యశోభ నెలకొనియుండగా జగదేకసుందరిగా వన్నెకెక్కి శ్రీరామచంద్రుని హృదయేశ్వరివైతివి; దేవీ! వైదేహీ! నీకు వందనము.

**శ్లో॥ ధాత్రీ బభూవ తవ మంగళగాత్రి! ధాత్రీ**
**రాజర్షివర్యజనకో జనకస్తథా తే ।**
**భర్తా హి తే రఘువరోఽఖిలలోకభర్తా**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 4**

**తాత్పర్యము :–** ఓ మంగళస్వరూపిణీ! నీ కుటుంబ మెంత విశిష్టమైనది! భూతధాత్రియే నీ ధాత్రిగదా, (భూమాతయే మాత) రాజర్షి జనకుడే నీ జనకుడుగదా! లోకైకనాథుడే (శ్రీరాముడు) నీ నాథుడుగదా! అపూర్వదివ్యచరితా! రామదయితా! జానకీమాతా! నీకు వందనము.

**శ్లో॥ ప్రాప్య స్నుషాం నిరుపమాం శుభలక్షణాం త్వాం**
**వృద్ధ స్తదా దశరథో మహిషీ తథా సా ।**
**సమ్మోదితా వియ ది తీరితు మంబ! కోఽర్హః**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 5**

**తాత్పర్యము :–** ఆనాడు వృద్ధదంపతులైన ఆ దశరథమహారాజును, కౌసల్యామహిషి యును తమ బహిఃప్రాణమైన ప్రియపుత్రుని ప్రక్క నిలచి కోడలుగా తమకు పాదాభివందనము చేయుచున్న నిన్ను చూచుకొని నీ నిరుపమాన రూపాతిశయము నకును, నీ శుభలక్షణ సంపత్తికిని ఎంత ఆనందతన్మయత్వము నొందిరో గదా! ఆ మహాసంతోషము మాటలతో వర్ణింప నెవరితరము! కౌసలేయవధూరత్నమా! శ్రీరామహృదయేశ్వరీ! నీకు వందనము.

**శ్లో॥ లోకాభిరామ మధురాకృతి శోభితస్య**
**కళ్యాణ దివ్యగుణ నిర్భర ధర్మమూర్తేః ।**
**సర్వాత్మనా రఘుపతే స్సదృశీ సతీ త్వం**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 6**

**తాత్పర్యము :–** లోకమోహనమైన మధురసౌందర్యముతో విరాజిల్లుచుండువాడును, కళ్యాణదివ్యగుణసాగరుడై, ధర్మవర్తనము, ధర్మరక్షణము తన జీవితసర్వస్వముగా నున్నవాడును అగు రఘుపతికి "దేవతాభి స్సమా రూపే సీతా శ్రీరివ రూపిణీ"

(దేవతాసౌందర్యముతో ప్రకాశించు సీతాదేవి, మానవరూపముతో కాన్పించుచున్న లక్ష్మీదేవియే) అనియును, "త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్ కలామ్." (త్రిలోకసామ్రాజ్య వైభవముల విలువ, సీతాదేవి రూపశీలముల విలువముందు శతాంశము కూడ కాజాలదు) అనియును, "రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా" (రఘురాముడే జానకిని చేపట్టగల అర్హతగలవాడు; ఆ కమలాక్షునికి అర్ధాంగి కాదగినది ఈ నీలిసోగకన్నుల శోభనాంగియే) అనియును ప్రశంసింపబడినదాన వైన నీవు సర్వవిధముల తగినట్టి సతివి. తల్లీ! శ్రీరామధర్మపత్నీ! నీకు వందనము.

**శ్లో॥ ప్రీతి ర్న తే నిజసుఖానుభవే, సదైవ**
**ధర్మానువర్తనపరా భవతీ, హ్యత స్త్వమ్ ।**
**ప్రేమైకపాత్ర మసి ధర్మపరస్య భర్తుః**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 7**

**తాత్పర్యము** :– అఖండమైన భోగభాగ్యములు గలిగి నిత్యసుఖోచితవై సుకుమారురాల వైయున్న నీకు, ఆసక్తి భోగానుభవములందు గాక ధర్మాచరణమునందు మాత్రమేగదా! ఉదాత్తమైన ఇట్టి నీ గుణవిశేషములచేతనే నీవు ధర్మమూర్తియైన శ్రీరాముని మనసును చూఱగొని అతని హృదయేశ్వరి వైతివి! ఆ ప్రేమమూర్తి వనవాసమునకు వెడలు సమయమున "స మా మనాదాయ వనం న త్వం ప్రస్థాతు మర్హసి" "ఇతి జానన్ పరాం ప్రీతిం గచ్ఛ రామ మయా సహ" (ధర్మజ్ఞుడవగు నీవు నన్ను వెంటగొని పోకుండ అడవికి వెడల దగవు. ధర్మసమ్మతమైన నా నిశ్చయమును, ప్రేమను గుర్తించి నాతోగూడియే అరణ్యమునకు బయలుదేరుము.) అని అతనిని ఆజ్ఞాపించుచున్నట్లే మాటలాడి పిమ్మట ఆతనిచేతనే "నేదానీం త్వదృతే సీతే స్వర్గోఽపి మమ రోచతే." (సీతా, నీమనసు గ్రహించితిని, నాకిపుడు నీవు లేనిదే స్వర్గముకూడ రుచింపదుసుమా) అనిపించుకొంటివి గదా! అట్లు నీ వల్లభుని హృదయము నీవశమై యుండుటచేతనే నీ వియోగకాలమున "తయా విహీనః కృపణః కథం లక్ష్మణ ధారయే; న జీవేయం క్షణమపి తా మృతే జనకాత్మజామ్; అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా." (లక్ష్మణా! సీతలేని దీనుడను; నా ప్రాణముల నెట్లు నిలుపుకొందును!... జానకిలేనిదే నేను క్షణము కూడ జీవింపజాలను;.... సూర్యుడును తేజస్సును వేఱు వేఱుగా నుండనట్లు సీత నానుండి వేఱుగా నుండునదికాదు.)" అనియు, భవభూతి కథనము "త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయమ్' (సీతా, నీవు నా జీవితము.

నా రెండవ హృదయమే నీవు) అనియు ఆ ధర్మమూర్తిచే అనిపించుకొన్న ధన్యవు గదా నీవు! తల్లీ! శ్రీరామచంద్రహృదయేశ్వరీ! నీకు వందనము.

**శ్లో॥ కర్తవ్యపాలనవిధౌ న విగణ్య బాధాః**
**ధర్మే స్థిరా బహుళకష్టదశాసు చాపి ।**
**త్వం లక్ష్యభూతచరితా హ్యసి మానవానాం**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 8**

**తాత్పర్యము :–** రాజ్యభ్రంశము, అరణ్యవాసము, దనుజవంచనము, పతివియోగము, రాక్షసనిర్భర్త్సనము, భర్తృతిరస్కారము వంటి దారుణములైన ఆపదలందు సైతము ధర్మమునుండి చలింపనిదానవు. ఎదురైన క్లేశములనెల్ల సహించుచు నీవు "జీవితసాఫల్యము భోగసంపాదనమునందు కాదు, ధర్మనిర్వహణమునందు మాత్రమే" అని లోకమునకు జీవితలక్ష్యమునుగూర్చి నీ ఆచరణమూలముగా బోధించియున్నావు గదా! తల్లీ! శ్రీరామధర్మపత్నీ! నీకు వందనము.

**శ్లో॥ ధీరా స్వధర్మనిరతా భవతీ న భీతా**
**క్రూరా త్త్రిలోకభయదా ద్దశకంఠదైత్యాత్ ।**
**కించ త్వయా ఖలు ఖల స్స తృణీకృతోఽభూత్**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 9**

**తాత్పర్యము :–** "ఉత్పాట్య వా తే హృదయం భక్షయిష్యామి మైథిలి" (జానకీ! నీవు రావణుని అంగీకరింపకున్నచో నీ ఱొమ్ము చీల్చి నీ గుండెను తినివేసెదను) అనుచు రావణపరిచారికలు నిన్ను హింసలకు గుఱిచేయుచుండగా "కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః" (మీ యిష్టము వచ్చినట్లు నన్ను తినివేయుడు. మీ మాటలను నేను పాటింపను. – అని నిర్భయముగా బదులుచెప్పుచు త్రిలోకభీకరుడైన ఆ రాక్షసరాజే నీ ఎదుటికివచ్చి ప్రగల్భములు పలుకుచుండగా వాని క్రౌర్యదర్పములకు భీతినొందకుండ ఒక గడ్డిపోచ నడ్డముగానుంచి ఈసడించుచు ఇట్లు పలికితివిగదా! "కథం వ్యాహరతో మాం తే న జిహ్వా వ్యవశీర్యతే? ..... శూరేణ ధనదభ్రాత్రా బలై స్సముదితేన చ, వ్యపోహ్య రామం కస్మా ద్ధి దారచౌర్యం త్వయా కృతమ్?" (రావణా! రఘుకులవధువునైన నన్నుగూర్చి యిట్లు నీచముగా మాటలాడుచున్న నీనాలుక ఏల చీలికలై పోవకున్నది?..... మహావీరుడను! కుబేరుని అన్నను! అమితబలసంపన్నుడను! అనుచున్నావే! అంతటి ఘనుడవు నా నాథుని మోసముచే దూరముచేసి కుత్సితమైన

పరస్త్రీచౌర్యమున కేల పాల్పడితివి?) అనుచు ఇట్లు మృత్యుముఖమునందు గూడ ధీరతను జూపిన ఓ ధర్మవీరా! రఘువీర ధర్మపత్నీ! జానకీ! నీకు వందనమమ్మా!

**శ్లో॥ సంసేవతే స్మ జననీ మివ లక్ష్మణ స్త్వాం**
**స్వాత్మేష్ట దైవ మితి మారుతి రర్చతి త్వామ్ ।**
**త్వాం శంసతి స్మ కమలేయ మితి స్వయంభూః**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 10**

**తాత్పర్యము** :– నీ మఱది లక్ష్మణుడు నిన్ను తన మాతృదేవిగా భావించి సేవించి నాడు. రామదూత మారుతి నిన్ను తన యిష్టదైవముగా మనసున నిలుపుకొని అర్చించుచున్నాడు. బ్రహ్మదేవుడు స్వయముగా నిన్ను గూర్చి "సీతా లక్ష్మీర్భవాన్ విష్ణుః" (సీత లక్ష్మీదేవి; రామా! నీవు విష్ణుడవు) అని యుగ్గడించి యున్నాడు గదా! సకలవిబుధ సంపూజితా! రామదయితా! సీతామాతా! నీకు వందనము.

**శ్లో॥ వాల్మీకినా మధుగిరా హ్యుపవర్ణితాఽసి**
**తేనైవ వత్సలహృదా హ్యుపలాలితాఽసి ।**
**లోకస్తుతస్వచరితా ఽపి కృతాఽసి తేన**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 11**

**తాత్పర్యము** :– మహాముని వాల్మీకి తనకు వాణీప్రసాదముచే లభ్యమైన మధుమయ ఫణితితో రామాయణ మను పేర 'సీతాయా శ్చరితం మహత్.' అను నీభవ్యచరిత్రమునే తనివిదీఱ వర్ణించినాడు. దైవవశమున నీవు క్లేశములలో చిక్కుకొనగా ఉప్పొంగిన దయాహృదయముతో ఆ తపస్వి కన్నబిడ్డనువలె నిన్ను దగ్గఱకు తెచ్చుకొని ఆదరించినాడు. మఱియు నీపై మూర్ఖజనులలో కలిగిన అపవాదును దూరముచేసి లోకము నీ పావనశీలమును గ్రహించి నీకు తలవంచి మ్రొక్కునట్లు చేసెనుగదా! తల్లీ! ధర్మవిజయమునకు తార్కాణమైన దివ్యచరిత్రముగల రామపత్నీ! సీతాసతీ! నీకు వందనము.

**శ్లో॥ త్వత్ప్రీతయే తవ సుతౌ సమగాయతాం తౌ**
**రామాయణం గురుకృతిం మధురం పురా యత్ ।**
**త చ్ఛ్రూయతే హి సకలై రధునాఽపి నిత్యం**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 12**

**తాత్పర్యము :-** పూర్వ మానాడు నీ ముద్దుబిడ్డలు కుశలవులు, వ్యాకులత తొలగి నీవు సంతోషము నొందుటకొఱకై తమ గురువు తమకు గఱపిన ఏ రామకథను మధురమైన తమ కోమలకంఠముతో గానముచేసి నీకు వినిపించి యుండిరో! "రామస్య మధురం వృత్తం గాయంతౌ మాతు రగ్రతః । తద్వియోగవ్యథాం కించి చ్ఛిథిలీచక్రతు స్సుతౌ." (బిడ్డలు కుశలవులు తల్లి యెదుట శ్రీరాముని మధురగాథను గానము చేయుచున్నవారై ఆమె మనసునందలి పతివియోగవ్యథను కొలదిగ తొలగింపగలుగుచుండిరి - కాళిదాసు రఘువంశము) ఆనాటి ఆ మధురకావ్యము నేటికిని అట్లే లోకమున ఎల్లయెడల ఎల్లరికిని వీనులవిందుగా వినిపించుచున్నదై ఆనందతన్మయత్వము గూర్చుచున్నది సుమా! తల్లీ! శ్రీరామరమణీ! నీకు వందనము.

**శ్లో॥ రామో వికుంఠనిలయో భగవాన్ స విష్ణుః**
**త్వం దేవి విష్ణుభగవద్హృదయాలయా శ్రీః ।**
**తత్ త్వాం నతో భజతి విష్ణుపదం ప్రమోదాత్**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 13**

**తాత్పర్యము :-** వైకుంఠవిలసితుడైన విష్ణుభగవానుడే శ్రీరాముడు; ఆ మహావిష్ణువు వక్షమున అధివసించు లక్ష్మీదేవివే నీవు; కావున తల్లీ! నిన్ను భక్తితో మ్రొక్కు సుకృతాత్ముడు సహజముగనే సంతోషముతో విష్ణుపదప్రాప్తి నొందుచున్నాడు. (విష్ణుపద మనగా ఆకాశము అని కూడ అర్థము కాబట్టి మహానందముతో మిన్ను ముట్టుచున్నాడని భావము.) తల్లీ! శ్రీరామహృదయేశ్వరీ! నీకు వందనము.

**శ్లో॥ సర్వజ్ఞయోగిపురుషా భవతీం వదంతి**
**భక్తౌఘరక్షణవిధాన గృహీతదేహామ్ ।**
**శక్తిం పరాం నిఖిలవిశ్వనియంత్రిణీం తాం**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 14**

**తాత్పర్యము :-** పరబ్రహ్మతత్త్వమును పరిపూర్ణముగా నెఱిగిన జ్ఞానయోగులు నీ నిజరూపమును గ్రహించినవారై నీవు పరాశక్తివి, సమస్తవిశ్వమును శాసించి నడిపించు మూలప్రకృతివి, భక్తకోటిని అనుగ్రహింపగోరి లీలావిగ్రహధారిణివై సీతారూపమున లోకమున కుపాస్యవగుచున్నావని తెలుపుచున్నారు. "ఉత్పత్తిస్థితిసంహారకారిణీ సర్వదేహినామ్, సీతా భగవతీ జ్ఞేయా మూలప్రకృతిసంజ్ఞితా, ..... శ్రీరామసాన్నిధ్యవశా జ్జగదానందకారిణీ, ..... తద్ బ్రహ్మసత్తాసామాన్యం సీతాతత్త్వ ముపాస్మహే" (సీతా

భగవతి యనగా సర్వజీవుల సృష్టిస్థితిసంహారకారిణియగు మూలప్రకృతి; తానుకోరి శ్రీరాముని సన్నిధి నున్నదై జగత్తునకు ఆనందప్రదాయిని యగుచున్నది; కావున మూలకారణశక్తియైన ఆ సీతాతత్త్వము నెఱిగి యుపాసించెదము. (ఆథర్వణీయము – సీతోపనిషత్తు, శౌనకీయము) శ్రీరామహృదయేశ్వరీ! జగదీశ్వరీ! సీతామాతా! నీకిదే మా వందనము.

**శ్లో॥ శ్రీరామ వామలలితాంక విరాజమానే!**
**భూపుత్త్రికే! భువనపావనసచ్చరిత్రే!**
**మాతః! కృపామృతనిధే! శ్రితకల్పవల్లి!**
**శ్రీరామచంద్రహృదయేశ్వరి! తే నమోఽస్తు ॥ 15**

హరిః ఓం తత్ సత్.

★ ★ ★

## విజయతే శ్రీవేంకటేశః ప్రభుః

శ్లో॥ లభ్యతే దర్శనా ద్యస్య
నిర్వృతి ర్నేత్రయోః, హృది ।
బ్రహ్మానందానుభూతి శ్చ
తం భజే వేంకటప్రభుమ్ ॥

శ్లో॥ వినుతిః కలిదోషశోషణాయ
ప్రణతి ర్వాంఛితసిద్ధయే చ యస్య ।
స్మరణం చిరసౌఖ్యలబ్ధయే స్యాత్
కలయే తం హృది వేంకటాద్రినాథమ్ ॥

శ్లో॥ యో దేవ స్స్వజనావనాయ కృతసంకల్పోఽవతీర్ణః క్షితౌ
లక్ష్మీశోభితవిగ్రహః ప్రవిలసద్వైకుంఠరమ్యాలయః ।
అశ్రాంతోత్సవరాజితో ఘనదయాసింధు స్స బంధు స్సతాం
భక్తాభీష్టవరప్రదో విజయతే శ్రీవేంకటేశః ప్రభుః ॥

సుబోధినీసమర్పకులు

**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయనపల్లి కామేశ్వరరావు** బి.ఏ.,

# శ్రీజానకీప్రియ గుణకీర్తనమ్

**శ్లో॥ ప్రాణప్రియా ధరణిజా నిజవామభాగే**
**వామేతరే ప్రియతమోఽనుజలక్ష్మణ శ్చ ।**
**యస్య ప్రియో ఽనుచరమారుతి రగ్రతః సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥** 1

తన ఎడమప్రక్క తన నీడవలె నిత్యానపాయినిగా నుండు సీతమ్మ, 'అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా.' ఆమె తనకు ప్రాణసమానురాలు. "రామస్య దయితా భార్యా నిత్యం ప్రాణసమా హితా." ఈవలివైపు తన బహిఃప్రాణమైన లక్ష్మణుడు. "లక్ష్మణో లక్ష్మిసంపన్నో బహిఃప్రాణ ఇ వాపరః." ఆతడు లేనిదే రామునకు అన్నము కూడ రుచింపదట. "మృష్టమన్న ముపానీత మశ్నాతి నహి తం వినా." ఆతనిని చూచుకొనియే రాముడు చనిపోయిన తండ్రిని మరువగలిగెను.... నా కంటెను గూడ సుకుమార వీరుడైన లక్ష్మణుడే అన్నకు ఇష్టుడు" అనునట సీతమ్మ. "మృదు ర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః, యం దృష్ట్వా రాఘవో నైవ వృత్త మార్య మనుస్మరేత్,.. మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః." రాముడు కూడ "లక్ష్మణా! నీకొఱకే సుమా, నాకీ రాజ్యమును భోగములును" అనునట – "సౌమిత్రే భుంక్ష్వ భోగాం శ్చ రాజ్యాని చ సుఖాని చ, జీవితం చ హి రాజ్యం చ త్వదర్థ మభికామయే". ఎట్టఎదుట తన కత్యంత ప్రియమునుగూర్చి నిత్యసాన్నిధ్యము సంపాదించుకొన్న మారుతి. ఆతడు తనకు చేసిన ప్రియములకు తన పంచప్రాణములిచ్చినను చాలవు; అందుకే ఋణపడి యుండవలసి నదే యనునట రాముడు – 'ఏకైక స్యోపకారస్య ప్రాణాన్ దాస్యామి తే కపే, శేష స్యే హోపకారస్య భవామ ఋణినో వయమ్.'

ఇట్లు హనుమత్సీతాలక్ష్మణసమేతుడై భక్తహృదయపుటముద్రితుడైయుండు రామభద్రుడే నాకు రక్ష.

**శ్లో॥ కోదండమండితకరః కమలాయతాక్షః**
**పీతాంబరో మణిసువర్ణకిరీటహారః ।**
**వర్షాభ్రనీలసుతనూసుషమాభిరామః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥** 2

తన దుష్టసంహార లక్ష్యమును వెల్లడించు కోదండము చేతిలో వెలయుచుండ,

కనులకు విందు గూర్చు తామర పువ్వులవంటి వెడద కన్నులు కరుణార్ద్ర దృష్టుల నీనుచుండ, కటితటమున పచ్చని బంగరు పుట్టము, ఉరమున నవరత్నహారములు, శిరమున మణిగణ ఖచిత సువర్ణ కిరీటము మెఱయుచుండ, వర్షాకాల మేఘము వంటి నీలసుందరమైన దేహచ్ఛాయతో శోభిల్లుచుండు సీతావల్లభుడే నాకు రక్షకుడు.

శ్లో॥ ప్రేమామృతైకనిలయః కరుణార్ద్రదృష్టిః
త్రైలోక్యమోహనవపుః ప్రియదర్శన శ్చ ।
కళ్యాణ సద్గుణగణార్ణవ ఆర్తబంధుః
శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 3

శ్రీరాముడు ప్రేమమూర్తి, అమృతహృదయుడు. ఆతనికి తనవారి సంతోషమే తన సంతోషము. 'ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి." అతని ప్రేమ నిరుపమానమైనది. తన వనవాసమునకును, రాజ్యభ్రంశమునకును కారణ మనవలసినవాడైనను, భరతునిపై తన పూర్వప్రేమ ఏమియు చెక్కుచెదరలేదు. 'నా తమ్మునికి రాజ్యమిచ్చుటకు వేఱొకరు నన్ను కోరవలెనా – 'అహం హి సీతాం రాజ్యం చ ప్రాణా నిష్టాన్ ధనాని చ, హృష్టో భ్రాత్రే స్వయం దద్యాం భరతా యాప్రచోదితః' అనినాడు. అతడు కరుణామయుడు. పరుల కష్టములు గాంచిన ఆతని హృదయము ద్రవించిపోవును – 'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' తన సీతకై ప్రాణము లర్పించిన పక్షిరాజును ఒడిలోనికి తీసికొని 'తం గృధ్రం ప్రేక్ష్య... గతాసుం స్వబంధుమివ' దుఃఖించినాడు. శ్రీరాముడు భువన మోహన సౌందర్యముతో ప్రియదర్శనుడైనవాడు – "లోకకాంత శ్శశీ యథా; సదైవ ప్రియదర్శనః." చూచిన కొలది పురుషులకు కూడ కనులకును మనస్సునకును ఆనంద ముప్పొంగ జేయునట్టి అద్భుతదర్శన మాతనిది – "రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహరకః... "నహి తస్మా న్మనః కశ్చి చ్చక్షుషీ వా నరోత్తమాత్, నరః శక్నోత్యపాక్రష్టు మతిక్రాంతే ఒపి రాఘవే". "ఆనాడు రాముని చూడనివాని జన్మ నిరర్థకమట. అట్లే తనను రాముడు చూడని వాని పుట్టుకయు అట్టిదేయట – "యశ్చ రామం న పశ్యేత్తు యం చ రామో న పశ్యతి, నిందిత స్స భవే ల్లోకే స్వాత్మా ఒ ప్యేనం విగర్హతే." ఆతని కళ్యాణగుణములు అనంతములు. పౌరులు దశరథునితో "బహవో నృప కళ్యాణగుణాః పుత్రస్య సంతి తే" అనుచుందురట. అతడు ధర్మప్రియుడు, సత్యప్రియుడు, సజ్జనప్రియుడు, సర్వలోకప్రియుడు, ప్రియభాషి, సత్యభాషి, మృదుభాషి, మధురాభాషి, పూర్వభాషి, హితభాషి, మితభాషి, నయవంతుడు, వినయవంతుడు, ఆత్మవంతుడు, వశి, విజయి, కాలప్రవాహమునకు చిక్కి కొట్టుకొనిపోవని స్థితప్రజ్ఞుడు – ఇట్లు చెప్పి చెప్పి మన

నోరు, మనస్సు శ్రమ నొందునేమో కాని, "మతిక్షయా న్నివర్తంతే న గోవిందగుణక్షయాత్" అనినట్లుగా ఆతని గుణములకు మాత్రము అంతముండదు.

ఇట్టి మంగళగుణసింధువు ఆర్తబంధువునగు రామభద్రుడే నాకు రక్షకుడు.

**శ్లో॥ త్రైలోక్య గణ్య సుకృతాంచిత దంపతీభ్యాం**
**కౌసల్యయా దశరథేన చిరా దవాప్తః ।**
**సూనుః ప్రియః ప్రియతమోఽఖిలదేహభాజాం**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 4**

కౌసల్యాదశరథులు చేసిన పుణ్యము మిక్కిలి గణ్యమైనది. మిగుల ఘనమైనది. దశరథుడు అనెను – "షష్టిర్వర్షసహస్రాణి జాతస్య మమ కౌశిక, దుఃఖే నోత్పాదిత శ్చాయమ్." కౌసల్య అనెను – "ఉపవాసై శ్చ యోగైశ్చ బహుభి శ్చ పరిశ్రమైః అవాప్తః." ఆ పుణ్యదంపతులు కన్నకుమారుడు లోకమున సాటిలేని బిడ్డడు – 'భూమావనుపమ స్సూనుః.' ఆ పుత్రుడు ఆ ఒక్క తల్లిదండ్రులకు మాత్రమే ప్రియుడు కాడు. జనులందరికిని, సర్వప్రాణులకును కూడ అత్యంతప్రియుడట – 'ఇష్ట స్సర్వస్య లోకస్య సర్వసత్త్వమనోహరః.' ఆనాడు జనులకు రామునితోడిదే లోకమయ్యెను. – 'రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః రామభూతం జగదభూత్.' రాముని క్షేమము కోరుచు స్త్రీలు, వృద్ధులు, యువతులు ఎల్లవేళల దేవత లెల్లరకును మ్రొక్కుచుండువారట – 'స్త్రియో వృద్ధాస్తరుణ్య శ్చ సాయంప్రాత స్సమాహితాః, సర్వాన్ దేవాన్ నమస్యంతి రామ స్యార్థే మనస్వినః.' ఇంతటి ప్రియతముడు కనుకనే అతడు అడవికి వెడలుచున్నప్పుడు అతనిని వెంబడించుచు, దూడలను గోల్పోయిన గోవులవలె విలపించినారట– "అనుజగ్ముః ప్రయాంతం తం వనవాసాయ.... విలపంతి స్మ దుఃఖార్తాః వివత్సా ఇవ ధేనవః. అశ్రూణి ముముచు స్సర్వే". ఆనాడు ఇంటిలో వంటలు మానిరట – 'నాపచన్ గృహమేధినః." లేక లేక పుట్టిన కొడుకు కూడ తల్లికి సంతోషము కల్గించ లేక పోయెనట – "పుత్రం ప్రథమజం లబ్ధ్వా జననీ నాభ్యనందత" ఇంక ఆనాటి సుమంత్రుని దుఃఖము వర్ణనాతీతము. 'నిన్ను రథముపై విహరింప జేయు భాగ్యమునకే ఇంతవయస్సులో కూడ నేనీ రథసారథ్యము చేయుచున్నాను – 'త్వత్కృతే హి మయాఽవాప్తం రథచర్యాకృతం సుఖమ్." అనెను. నన్ను నీతో రానిమ్ము. లేనిచో నే నిదే అగ్నిలో దూకెదను – 'వనవా సానుయానాయ మా మనుజ్ఞాతు మర్హసి; సరథోఽగ్నిం ప్రవేక్ష్యామి త్యక్తమాత్ర ఇహ త్వయా." అనెను. 'నీవు కూర్చుండని యెడల గుఱ్ఱములు రథమును లాగజాలవు – 'కథం రథం త్వయా హీనం ప్రవక్ష్యంతి హయోత్తమాః' నీవు లేని రథమును చూచిన అయోధ్యానగరి

గుండె బ్రద్దలైపోవును – "వినా రామం రథం దృష్ట్వా విదీర్యేతాపి సా పురీ." అనెను. రాముని దుఃఖము చెట్లు చేమలు గూడ భరింపలేవట – 'అపి వృక్షాః పరిమ్లానాః సపుష్పాంకురపల్లవాః".

ఇట్టి సర్వసత్త్వప్రియుడైన రామచంద్రుడే నాకు రక్ష.

**శ్లో॥ బాల్యా ద్వసిష్ఠ కుశికాత్మజ శస్తశీల**
**సన్మౌన్యగస్త్యముఖ సంస్తుత ధర్మనిష్ఠః ।**
**వాల్మీకి ముఖ్య కవిపుంగవ గీతకీర్తిః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 5**

శ్రీరాముడు బాల్యవయస్సునుండి ప్రభావశాలి వినయశీలి – అని వసిష్ఠ విశ్వామిత్రాది మహర్షులచే మెచ్చుబడినవాడు. విశ్వామిత్రుడు – "అహం వేద్మి మహాత్మానం రామం సత్యపరాక్రమమ్, వసిష్ఠో ఽపి మహాతేజా యే చేమే తపసి స్థితాః." సాటిలేని ధర్మనిష్ఠ గలవాడని అగస్త్యాది మహామునులచే శ్లాఘింపబడినవాడు. అగస్త్యుడు – "రంస్యసే త్వం పితు ర్వాక్యం యథోక్త మనుపాలయన్....ధన్య స్తే జనకో రామ, ....యస్త్వయా జ్యేష్ఠపుత్రేణ యయాతి రివ తారితః." వాల్మీకి ప్రభృతులైన మహనీయ కవులచే కీర్తింపబడిన చరితము కలవాడు – "ధర్మార్థగుణవిస్తరమ్.. తత్సర్వం తత్త్వతో జ్ఞాత్వా...అభిరామస్య రామస్య చరితం చకార భగవాన్ ఋషిః." మురారి మహాకవి – ఎంతో మంది చెప్పిన ఆ రామకథనే మఱల నీవు కూడ చెప్పుదు వేల? అందురేమో! మఱి సర్వోత్తముడైన మహాపురుషుని చరిత్రము చెప్పవలెనన్నచో ఇంకొక్క డెవ డున్నాడు? – 'యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం గుణై రేతావద్భిః జయతి పునరన్యో జగతి కః' అని అడిగినాడట.'

ఇట్టి కీర్తనీయవిశిష్టచరితుడైన శ్రీరాముడే నాకు రక్షకుడు.

**శ్లో॥ యేన ప్రభాకరకులం భవతి ప్రదీప్తం**
**మేనేఽహ మేవ సుకృతీతి గురుర్హి యస్య ।**
**సంస్తూయతే స్మ నిహతైః రిపుభిశ్చ యః, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 6**

శ్రీరాముడు సర్వలోకప్రకాశకుడైన సూర్యుని వంశమునకే ప్రకాశము చేకూర్చినవాడు. నీకు విద్యగఱుపు అదృష్టము పట్టినది, నేనెంత ధన్యుడను!" అని తనగురువులనే సంతసింప జేసినవాడు. నీ చేతిలో మరణించు భాగ్యము కలిగినది. నేనెంత ధన్యుడనో' అని శత్రువులచే గూడ కీర్తింపబడినవాడు. తనచే వధించబడిన

విరాధుడు – 'భవనం స్వం గమిష్యామి స్వస్తి వోఽస్తు పరంతప...తవ ప్రసాదా న్ముక్తోఽహ మభిశాపాత్ సుదారుణాత్." అని సంతోషముతో పలికెను. అట్లే మారీచుడు – 'రామో విగ్రహవాన్ ధర్మః, సాధుః సత్యపరాక్రమః, రాజా సర్వస్య లోకస్య' అనుచు ఇంకొక మహాశత్రువు ఎదుట ప్రశంసించినాడు. వాలి కూడ మొదట నిందించినప్పటికిని చివరికి 'అయుక్తం తు మయా పూర్వం ప్రమాదా దభిభాషితమ్' అని తన తప్పు దిద్దుకొని 'త్వం హి దృష్టార్థతత్త్వజ్ఞః ప్రజానాం చ హితే రతః' అనుచు శ్లాఘించినాడు. వారు వీరు అని యేమి, రామునిలో దోషము చూపుచు పలికినవారే లేరట –'న తం పశ్యా మ్యహం లోకే యో న రామ మనువ్రతః, అమిత్రో ఽపి నిరస్తోఽపి యోఽస్య దోషముదాహరేత్." ఇట్టి ఉదాత్తగుణవిశిష్టుడైన జానకీనాయకుడే నాకు రక్ష.

**శ్లో॥ య స్సత్యధర్మసుజనావనసక్తచిత్తః**
**య శ్శాంతిదాంతినిలయో జగదేకవీరః ।**
**యశ్చైవ రావణఖరాదిఖలాంతకః, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥** **7**

సత్యపాలనము, ధర్మరక్షణము, సజ్జనపరిత్రాణము, దుష్టసంహారము అనునవి శ్రీరాముని జీవితలక్ష్యములు. ఇవియే అతని చరిత్రము కూడ, అని జగద్విదితము. ఇక శమము దమము అను ఈ రెండు గుణములును ఆతని జీవనాడులే. కాబట్టియే కొద్ది సేపటిలో తానధిష్ఠింపవలసియున్న రాజ్యసింహాసనము తనకు లేక, అరణ్యమునకు పోవలసివచ్చినప్పుడు కూడ అతని సహజసంతోషస్థితిలో ఎట్టి మార్పును రాలేదట – 'ఉచితం చ మహాబాహుః న జహౌ హర్ష మాత్మనః, వ్యాహృతే ఽ ప్యభిషేకేఽస్య పరితాపో న విద్యతే.'

ఆతని బలపరాక్రమములు సాటిలేనివి. ఆతని మహాసత్త్వము శివ ధనుర్భంగమున వెల్లడియైనది గదా – "లీలయా స ధను ర్మధ్యే జగ్రాహ.... పూరయామాస తద్ధనుః....తద్ బభంజ ధను ర్మధ్యే.... తస్య శబ్దో మహానాసీత్... భూమికంపశ్చ సుమహాన్...నిపేతు శ్చ జనా స్సర్వే." అప్పుడు జనకుని ఆశ్చర్యము – "అత్యద్భుత మచింత్యం చ అతర్కిత మిదం మయా!". ఇట్లే ఇంకొకమాఱు – సుగ్రీవునికి తన సామర్థ్యమును చూపినప్పుడు –"దుందుభేః కాయ ముత్తమమ్,... మహాపర్వత సన్నిభం...పాదాంగుష్ఠేన చిక్షేప సంపూర్ణం శతయోజనమ్; బిభేద చ పునః సాలాన్ సప్తైకేన మహేషుణా,గిరిం రసాతలం చైవ జనయన్ ప్రత్యయం తదా." అంతటి నిరుపమాన పరాక్రమ సంపన్నుడు కనుకనే దుర్వారబలగర్వితులైన రావణ

కుంభకర్ణ ఖర దూషణాది దుష్టదానవులను అంత మొందించి జగదేకవీరుడైనాడు.

అట్టి సాధురక్షకుడైన మహావీరుడు శ్రీరాముడే నాకు రక్ష.

**శ్లో॥ వీతస్పృహా మునివరా అపి జాతకామాః**
**య స్యాద్భుతానుపమ మోహన రమ్య మూర్త్యై ।**
**స్వీచక్రిరే జనన మేవ పునః క్షితౌ, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 8**

లోకసౌఖ్యములపై వాంఛలను వీడిన మహామునులనుగూడ అపూర్వమైన తన అద్భుతసౌందర్యముచే మోహింపజేసి జన్మబంధములను ఱోసినట్టి ఆ వైరాగ్యవంతులచేతనే తన సౌందర్యోపాసనకొఱకై మఱల జన్మనెత్తుటకు ఇష్టపడునట్లు చేసిన భువనమోహనుడు శ్రీరాముడు. ఈ విషయమునందు అభియుక్తోక్తి – "య త్సౌందర్య మవేక్ష్య జీర్ణమునయః వాతాంబుపర్ణశానాః గాఢాలింగనకామినః సమభవన్ –" వాల్మీకిచరిత్రము – ప్రావృణ్ణీలఘనశ్యామం సీతాలక్ష్మణసంయుతం, మనయః మునిపత్న్యశ్చ దృష్ట్వా మోహం ప్రపేదిరే." అపుడు శ్రీరాముడు వారితో – "కృష్ణావతారే భవతాం కామః పూర్ణో భవిష్యతి, యూయం హి గోపికా భూత్వా సర్వాన్ కామా నవాప్స్యథ" అనెనట.

అట్టి దివ్యసుందరలీలావిగ్రహుడు రామచంద్రుడే నాకు రక్ష.

**శ్లో॥ రాజ్యం కళత్ర మపి యస్య తృణం బభూవ**
**ప్రేమాస్పదాః శబరవానరపక్షిణోఽపి ।**
**కర్తవ్యపాలనమతేః కరుణాంబుధేః, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 9**

కర్తవ్యపాలనమే జీవితమున ప్రధానమని యెంచి లోభమోహములను దరిచేరనీయని ఆ ధర్మవీరునకు రాజ్యమును అర్ధాంగియు కూడ తృణప్రాయమైనారు. దయాసముద్రుడు కావున ఆటవికులైన గుహుడు, శబరి వంటి వారిని కూడ కోరి చేరి ఆదరించినాడు –'తతో నిషాదాధిపతిం దృష్ట్వా దూరా దుపస్థితం, సహ సౌమిత్రిణా రామః సమాగచ్ఛత్ గుహేన సః.... భుజాభ్యాం సాధువృత్తాభ్యాం పీడయ న్నిద మబ్రవీత్'. ఇట్లే – 'సో ఽభ్యగచ్ఛ న్మహాతేజాః శబరీం ధర్మచారిణీమ్.' ప్రేమపూర్ణుడైన ఆ ధర్మాత్మునకు మరణావస్థలో నున్న పక్షిరాజు జటాయువు తండ్రికంటెను అధికుడైన బంధువైనాడు – 'తం గృధ్రం ప్రేక్ష్య ధర్మాత్మా గతాసు మచలోపమం, రామః సుబహుభిర్దుఃఖైః...దదాహ రామో ధర్మాత్మా స్వబంధు మివ దుఃఖితః.' వనచరులైన

అసంఖ్య మగు వానరులు అతనికి చిరకాలానుచరులైనారు గదా. హనుమంతుని మొదటిమాఱుగా చూచినప్పుడు రాముడు లక్ష్మణునితో – 'అభిభాషస్వ సౌమిత్రే సుగ్రీవసచివం కపిం, వాక్యజ్ఞం మధురై ర్వాక్యైః స్నేహయుక్త మరిందమ.' అనెను. ఆతని మృదుమధుర హృదయమునకు మానవులలోనే గాదు పశుపక్ష్యాదులలో సైతము ఎల్లయెడల సాధువులు, ధార్మికులు, శూరులు, శరణ్యులే కనపడుదురు – "సర్వత్ర ఖలు దృశ్యంతే సాధవో ధర్మచారిణః, శూరాః శరణ్యాః సౌమిత్రే తిర్యగ్యోనిగతే ష్వపి." రామునిలోని ఇట్టి విశేషములను గమనించియే భవభూతి మహాకవి – "వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమా దపి, లోకోత్తరాణాం చేతాంసి–' అనెను. ఇట్టి ధర్మవీరుడు దయాసాగరుడునగు దశరథాత్మజుడే నాకు రక్ష.

**శ్లో॥ యస్య ప్రసూశ్చ జనకశ్చ తథాఽనుజాశ్చ**
**పత్నీ సుతౌ చ సుహృదో ఽనుచరాః ప్రజాశ్చ ।**
**ధర్మప్రధానచరితా న రతాః సుఖే, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 10**

శ్రీరాముని గన్న తల్లిదండ్రులు, ఆతని అనుగుదమ్ములు, ఆతని ఇల్లాలు, బిడ్డలు, మిత్రులు, అనుచరులు, తుదకు ఆతని ఏలుబడిలోని ప్రజలెల్లరును గూడ ధర్మానువర్తనమునందే ఆనందము, ఆత్మోన్నతి కలదనియు, అనిత్యమైన లోక సుఖములకై ప్రాకులాడుట కూడదనియును గ్రహించిన ధర్మప్రియులు. ఉదాహరణమునకు రామానుజుడైన భరతుడు తల్లివలన ఉప్పతలిన దారుణమును గూర్చి తనకు తెలియగనే ఎదలోని ప్రేమతో పెనవేసికొన్న తన ధర్మవర్తనమునకు ఘోరమైన ఆఘాతము కలిగి ఎంతగా తల్లడిల్లనాడో – తల్లి అనకుండ అప్పు డాతడు ఆమెపై కురిపించిన వాక్ శరములే తెలుపుచున్నవి. 'రాజ్యాత్ భ్రంశస్వ కైకేయి, నృశంసే, దుష్టచారిణి, ...కైకేయి, నరకం గచ్ఛ దుర్వృత్తే, పతిఘాతిని, నతు కామం కరిష్యామి త వాహం పాపనిశ్చయే,... సా త్వ మగ్నిం ప్రవిశ వా,... రజ్జుం బధాన వా కంఠే." అని శపించును. "....నివర్తయిత్వా రామస్య దాసో భవిష్యామి... స్వయమేవ ప్రవేక్ష్యామి వనం... కథం దశరథాత్ జాతో భవేత్ రాజ్యాపహారకః?... త్రయాణా మపి లోకానాం రాజ్య మర్హతి రాఘవః' అనుచు ఆమెకు తన నిర్ణయమును తెలిపి రాముని రాజ్యమునకు మఱలించి తెచ్చుటకై అడవికి పోవుచుండగా త్రోవలో గుహుడు ఆతనిని గాంచి శంకించి – 'రాముడు నాకు అత్యంతప్రియుడు...నీ వాతని కేమియు హాని తలపెట్టుట లేదు గదా? '....నహి రామాత్ ప్రియతరః మ మాస్తి భువి కశ్చన... కశ్చిన్న దుష్టో వ్రజసి రామ స్యాక్లిష్టకర్మణః...' అని అడిగెనట. ఈ ప్రశ్నకు ఆ

భరతుని హృదయము ఎంత క్షోభించినదో ఆ అవమానము దిగమ్రింగి – అయ్యా, రాముడు నా అన్న, నాతండ్రితో సమానుడు; ఆతనిని రాజ్యమునకు తిరిగి తీసికొని వచ్చుటకే నేనిపుడు పోవుచున్నాను. – 'రాఘవ స్స హి మే భ్రాతా జ్యేష్ఠః పితృసమో మతః.. తం నివర్తయతుం యామి...'అనెను. ఆ మాట వినగానే భరతుని ధర్మ బుద్ధికి గుహుని గుండె కరిగి పోయినది. వెంటనే 'ధన్యస్త్వం న త్వయా తుల్యం పశ్యామి జగతీతలే, అయత్నా దాగతం రాజ్యం య స్త్వం త్యక్తు మి హేచ్ఛసి.' అనుచు మహానందముతో ఆతనిని ముక్తకంఠముగా మెచ్చుకొనినాడు. రాముని పాలనలోని ప్రజలెల్లరును గూడ ధర్మనిరతులే. "సర్వే లక్షణసంపన్నాః సర్వే ధర్మపరాయణాః, సర్వే లోభవివర్జితాః.... స్వకర్మసు ప్రవర్తంతే తుష్టాః స్వై రేవ కర్మభిః" ఇట్లు ధర్మశాఖికి మూలకందమైన రామభద్రుడే నాకు రక్ష.

**శ్లో॥ హే రామ రక్ష కృపయేతి నితాంతభక్త్యా**
**యో హి స్తుతో బహువిధం బహుకోటికోటి ।**
**కంఠైః శుభాని తనుతే జగతాం సదా, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 11**

అనంతకాలమునుండి అనంతకోటిమానవులు, అనంతమైన రీతులలో శ్రీరాముని వేడుచున్నారు. వారి అందరి ప్రార్థనయు ఒక్కటే. 'రామా నీవే నా సర్వస్వము. నీవే నన్ను దయతో బ్రోవవలెను." అని ఏ రీతిలో తనను సేవించినను వారి భక్తికి వశుడై వారి వారి కోరికలను తీర్చి శుభములను గూర్చుచున్నాడు. 'శ్రీరామమంత్ర స్తవరాజము – 'పరస్య యోగ్యతాపేక్షారహితో నిత్యమంగళం దదాత్యేవ నిజౌదార్యాత్ య స్తం భద్రం నమా మ్యహమ్.'

అట్టి సర్వలోకశరణ్యుడు సర్వశుభప్రదుడు రామభద్రుడే నాకు రక్ష.

**శ్లో॥ య స్యైవ నామ మధురం మహితప్రభావం**
**సాక్షా చ్ఛివో హ్యుపదిదేశ ముదా భవాన్యై ।**
**య స్యైవ నామ భవసాగరతారకం సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 12**

రామనామము మధురము – 'మధురమధుర మేతత్ మంగళం మంగళానామ్.' మహాప్రభావసంపన్నము – రామపూర్వతాపనీయోపనిషత్. – 'యథైవ వటబీజస్థః ప్రాకృతశ్చ మహాద్రుమః, తథైవ రామనామస్థం జగ దేత చ్చరాచరమ్.' ఆ రామనామప్రభావము పూర్తిగా తెలిసినవాడు ఒక్క మహేశ్వరుడు మాత్రమే –

"శివ ఏ వాస్య జానాతి రహస్యం స్వస్వరూపకమ్." కాబట్టియే ఆతడీ మంత్రరాజమును తన అర్ధాంగికి మిక్కిలి మక్కువతో ఉపదేశించినాడు. ఉమాసంహితలో శివుడు పార్వతినిగూర్చి, "శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే, సహస్ర నామత స్తుల్యం రామనామ వరాననే." ప్రపంచదుఃఖములనుండి సర్వ జనులను సులభముగా విడిపింప గల మహామంత్రము రామనామమే. "సంసారార్ణవ సమ్మగ్నం నరం య స్తారయే న్మనుః, స ఏవ తారక స్త్రత్ర రామమంత్రః ప్రకథ్యతే." (తంత్రశాస్త్రము)

అట్టి మధురతారకనాముడు రాముడే నాకు రక్ష.

**శ్లో॥ య స్యైవ మంగళ గుణా ననిశం స్మరంతః**
**స్వాంతా దపాస్య దురితావహభావనాని ।**
**మర్త్యా భవంతి మహితాశయదీపితాః, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 13**

రామభద్రుని మంగళగుణములు అతివిశిష్టమైనవి. మక్కువతో వానిని మననము చేయుకొలది మానవుల మానసములందు దురితచింతలు తొలగి నిర్మలత్వము నొంది ఉన్నతాశయములు కలిగి అవి ఫలింపజేసికొని నరులు జన్మ సాఫల్యము నొందగల్గుచున్నారు.

అట్టి భవ్యగుణవిరాజితుడైన రాఘురాముడే నాకు రక్షకుడు.

**శ్లో॥ ప్రాప్నోతి యస్య ఖలు నామ జపన్ మనుష్యః**
**పాపౌఘనాశ మతినిర్మలచిత్తతాం చ ।**
**ఆత్మోన్నతిం చిరసుఖానుభవం పరం, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 14**

"మధురమధుర మేతత్." మహామహిమోపేతమైన రామనామమును జపముచేయు ధన్యుడు పాపసంచయములను తొలగించుకొని అతినిర్మలమైన అంతఃకరణము నొంది ఆత్మవికాసమును సాధించుకొని తేలికగా బ్రహ్మానందానుభవము పొందగల్గుచున్నాడు. ఉమాసంహిత – 'శ్రీరామప్రాతిపదిక మవశే నాపి సంగృణన్, ముక్తిం ప్రాప్నోతి మనుజః, కిం, పున ర్బుద్ధిపూర్వకమ్?' సూతసంహిత – 'యః శ్రీరామపదం నరః ప్రతిపదం సంకీర్తయేత్ తత్ క్షణం, ముక్తో దుష్కృతరాశితః...త్యక్త్వా సంసృతిరూపదుఃఖపటలం సంశుద్ధచిత్తః పుమాన్....ఉన్నతం పరపదం ప్రాప్నోతి.' శ్రీరామ శరణ గురుదేవుల నామమహిమార్ణవము – రామనామ్నః పరో మంత్రః న భూతో న భవిష్యతి.

అట్టి శాశ్వతానందమూలకందమైన రామదైవమే నాకు శరణము.

**శ్లో॥ రామాత్ పరో న శరణాగతవత్సలాత్ త**
**దక్లిష్టకర్మణ ఇనాన్వయసింధుసోమాత్ ।**
**ధర్మాత్మనో జగతి సత్యపరాక్రమాత్, తత్**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 15**

శ్రీరాముడు శరణాగతవత్సలుడు. తన చర్యలవలన పరులకు ఎట్టి క్లేశమును కలుగుటకు అంగీకరింపనివాడు. ఘనమైన తన చరిత్రముచేత సూర్యవంశమను సముద్రమును పూర్ణచంద్రునివలె ఉప్పొంగజేయునట్టివాడు. సర్వవిధముల ధర్మమును ఆచరించువాడు. రామరహస్యోపనిషత్ – 'ధర్మమార్గం చరిత్రేణ జ్ఞానమార్గం తు నామతః.' సత్యమును జయింప జేయు అమోఘమైన పరాక్రమము గలవాడు. శ్రీరాముని శరణాగతవత్సలత్వము జగద్విదితము – "విదిత స్స హి ధర్మాత్మా శరణాగతవత్సలః." అని సీత రావణునకు తెలిపినదికదా! ఇచట వాయసవృత్తాంతము స్మరింపదగినది – శ్రీరాముని అస్త్రము తనను వెంటాడుచుండగా ఘోరాపరాధియైన ఆ వాయసము "స పిత్రా చ పరిత్యక్తః..త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త మేవ శరణం గతః... స తం నిపతితం భూమౌ శరణ్యః శరణాగతం, వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్." విభీషణశరణాగతియు ఇట్టిదే..."అహం.... త్యక్త్వా పుత్రాం శ్చ పౌత్రాం శ్చ రాఘవం శరణం గతః" అనుచు విభీషణుడు రాముని శరణువేడినప్పుడు సుగ్రీవాదులు "ఈతడు శత్రుసోదరుడు" అని అనుమానించుచుండగా శ్రీరాముడు వారిని మృదువుగా వారించి "సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదా మ్యేతత్ వ్రతం మమ." అని అతనికి అభయమిచ్చి ఆత్మీయుని చేసికొన్నాడు. ఇట్టి సర్వలోకశరణ్యుడైన దయామయునికంటె వేఱురక్షకు డెవ్వడున్నాడు? 'రామాత్ నాన్య త్పరం కించిత్.' శ్రీరామశరణగురుదేవుల శ్రీరామోపాసనాసర్వస్వము – 'రామచంద్రాత్ పరో దేవో న భూతో న భవిష్యతి.'

ఇట్టి జానకీజాని శ్రీరాముడే నాకు శరణ్యము.

**శ్లో॥ భక్తేషు వత్సలతయా సులభైకసేవ్యం**
**స్వీకృత్య మానుషతనుం భువి యోఽవతీర్ణః ।**
**సచ్చిన్ముదాకృతి రనాది పరం మహః, సః**
**శ్రీరామ ఏవ శరణం మమ జానకీశః ॥ 16**

శ్రీరామచంద్రుడు భక్తజనులపై అవ్యాజానురాగముతో వారికి సులభ

సేవ్యమైన మానవరూపమున భూమిపై అవతరించినట్టి సచ్చిదానందరూపుడైన పరంజ్యోతియే. "ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః, జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కా ఽ ప్యుపజాయతే".... "స హి దేవై రుదీర్ణస్య రావణస్య వధార్థిభిః,అర్థితో మానుషే లోకే జజ్ఞే విష్ణుః సనాతనః. వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే..." బ్రహ్మసంహిత – 'చిన్మయానందసారాత్మాఽ నంతమాధుర్యవిగ్రహః, పరిపూర్ణతమం బ్రహ్మ స్వయం రామ స్సనాతనః." ఇట్టి లీలామానుషవిగ్రహుడు, భక్తశరణ్యుడు నగు శ్రీరామపరబ్రహ్మమే నాకు శరణ్యము.

హరిః ఓం తత్ సత్.

శ్రీరామార్పణమస్తు.

"దాశరథాయ విద్మహే సీతావల్లభాయ ధీమహి
తన్నో రామః ప్రచోదయాత్"

## జానకీప్రియ గాయత్రీ

**తత్పరో లభతే శ్రేయః ధ్యాయన్ భక్తో దయామయమ్ ।**
**సత్యం శివం సుందరం యం స రామోఽవతు న స్సదా ॥ 1**

శ్రీరాముడు సత్య శివ సుందర రూపుడైన వేలుపు. తనను నమ్మి కొలచు భక్తులను ఆ దయామయుడు సర్వశ్రేయముల నొసగి కాచుచుండును. అట్టి కళ్యాణమూర్తి మమ్మెల్లవేళల కాపాడుచుండుగాక.

**సవితు ర్వంశసంభూతో భాసయ త్యద్భుతప్రభః ।**
**యోఽంతర్బహిశ్చ భూతానాం స రామోఽవతు న స్సదా ॥ 2**

భాస్కరుని వంశమునందు జనించిన శ్రీరాముని ప్రకాశము ఉజ్జ్వలమై యుండుటలో విశేషము లేదు. రామతేజము ఇంకను విశిష్టమైనది. అద్భుతమైనది. ఆ తేజస్సు లోకుల అంతరంగములందు గూడ ప్రసరించి దివారాత్రములు వాటిని ప్రకాశింపజేయుచుండును. అట్టి దివ్యతేజోమూర్తి మమ్ము సదా రక్షించుగాక.

**విశ్వామిత్ర వసిష్ఠాత్రి వాల్మీక్యాది మునిస్తుతః ।**
**వేదవేద్యనరశ్రేష్ఠ స్స రామో ఽవతు న స్సదా ॥ 3**

నరవరుడైన దశరథరాముని విశిష్టతనుగూర్చి తెలిసికొన్నచో బోధపడున దేమనగా – మానవుడు ప్రాపంచిక ప్రలోభములకు వశుడు గాకుండ నిష్ఠతో ధర్మపరాయణుడై వర్తించినయెడల ఆదర్శపురుషుడుగా వన్నెకెక్కి మహామునులకు గూడ స్తవనీయు డగుచు వేదప్రస్తూయమానుడగు పరమపురుషుడుగా తేజరిల్లును – అను సత్యము! అట్టి పరమపురుషుడు సదా మమ్ము రక్షించుగాక.

**తురీయాశ్రమిణశ్చాపి యస్య లీలామృతం ముహుః ।**
**సేవమానా నైవ తృప్తా స్స రామోఽవతు న స్సదా ॥ 4**

గుణాతీతస్థితిని పొంది శుద్ధపరబ్రహ్మ నుపాసించు పరమయోగులు సైతము శ్రీరాముడు లోకమునందు కనబఱచిన లీలావిభూతి చెవుల బడుచున్నప్పుడు ఆనంద తన్మయత్వము నొందుచు మఱల మఱల ఆతని చరితామృతమును గ్రోలుటకై మనసుపడుచుందురు. అట్టి మధురచరితుడు నిత్యము మమ్ము రక్షించుగాక.

**వరేణ్యో వారిజాతాక్షో వర్షాభ్రశ్యామసుందరః ।**
**విశాలదృఢవక్షా య స్స రామోఽవతు న స్సదా ॥ 5**

ఆర్తశరణ్యుడైన ప్రభువరేణ్యుడుగా, కరుణామృతము వర్షించు కమల లోచనుడుగా, వర్షామేఘమువలె స్నిగ్ధశ్యామలమైన దేహశోభగల సౌందర్యమూర్తిగా, వీరతాస్ఫోరక విశాల దృఢవక్షుడుగా భక్తులకు కనుల పండువు సేయు శ్రీరాముడు సదా మమ్ము రక్షించుగాక.

**రేణూన్ యత్పాదపద్మస్థాన్ ధారయంత స్స్వమూర్ధసు ।**
**రమంతే యోగినో యస్మిన్ స రామోఽవతు న స్సదా ॥ 6**

మహాయోగులు సమాధిస్థితిలోనుండి శ్రీరాముని జగన్మోహనమూర్తిని సాక్షాత్కరింపజేసికొని ఆతని పాదములకు మోకరిల్లుదురు. తమ వాంఛితమున కనుగుణముగా ఆ దివ్యమూర్తి పాదపద్మపరాగరేణువులు తమ శిరములపై పడుచుండగా అమితానందము నొందుచుందురు. అట్టి యోగివంద్యుడు సదా మమ్ము గాచుగాక.

**నియమ్య సుదృఢం చిత్తం స్వధర్మం బహుమన్వతే ।**
**త్యక్తమోహా యస్య భక్తా స్స రామోఽవతు న స్సదా ॥ 7**

శ్రీరాముని త్యాగమయజీవితము తమ్ము ప్రభావితులను జేయుచుండగా ఆతని భక్తులు తమ మనస్సును అల్పవిషయములనుండియు తాత్కాలికభోగముల నుండియు మఱలించుకొని మోహరహితులై జీవితపరమార్థము నిజధర్మనిర్వహణము నందే యున్నదను ఎఱుక కలిగి ఆదర్శప్రాయమైన ఉత్తమజీవితమును గడుపుదురు. అట్టి మహనీయచరితుడు సదా మమ్ము రక్షించు గాక.

**యం సన్మధురనామానం భవాన్యా సహ శంకరః ।**
**గాయన్ సమ్మోదతే నిత్యం స రామోఽవతు న స్సదా ॥ 8**

శ్రీరాముని నామమాధుర్యము సంపూర్ణముగా నెఱిగిన మహేశ్వరుడు తన అర్ధాంగి గౌరితో కలిసి నిరంతరము రామనామమును గానముచేయుచు తన్నామామృత సేవనమున ఆనందతన్మయుడై యుండును. అట్టి మధురనాముడు మాకు రక్షకుడై యుండుగాక.

**భర్తా య స్సర్వలోకానాం దాతా య స్సర్వసంపదామ్ ।**
**హర్తా యో భవదుఃఖానాం స రామోఽవతు న స్సదా ॥ 9**

శ్రీరాముడు సర్వలోకముల యోగక్షేమములను వహించు సకలజగత్ప్రభువు. భక్తులకు సమస్తవిభవములను గూర్చు ఇలువేలుపు. వారికి జీవితములో కలుగు క్లేశములను బాపి కాపాడు భక్తవత్సలుడు. అట్టి రామప్రభువు మమ్మెల్లవేళల కాపాడుచుండుగాక.

**గోప్తా స్వపరధర్మాణాం గోప్తా య శ్శరణార్థినామ్ ।**
**గోచరో హృది భక్తానాం స రామోఽవతు న స్సదా ॥ 10**

ధర్మరక్షణార్థమై భూమిపై అవతరించిన శ్రీరాముడు తన ధర్మము నెడ ఎట్టి దీక్ష కలిగియుండునో పరులు కూడ అట్టి దీక్షతోడనే తమ ధర్మమును నిర్వహింపవలె నని కోరి వారికి తోడుగ నిలచుచుండును. తనను శరణు కోరిన ఆపన్నుల కభయ మొసగి కాపాడుచుండును. నిత్యయుక్తులై తన్మయత్వముతో తన్ను ధ్యానించువారు కోరినప్పుడెల్ల హృదయమునందు సాక్షాత్కరించి వారి నానందింపజేయు చుండును. అట్టి కరుణాళువు సదా మమ్ము గాచుగాక.

**దేవదేవో దశగ్రీవ ఖరా ద్యరి నిషూదనః ।**
**విభీషణశరణ్యో య స్స రామోఽవతు న స్సదా ॥ 11**

రామప్రభువు దేవతల కామితములను గూడ తీర్చు దేవదేవుడు. లోకోప ద్రవకరులైన ఖరుడు, దశకంఠుడు మున్నగు ఖలులను రూపుమాపు జగదేకవీరుడు. దానవులైనను విభీషణునివలె సాధువర్తనులైన యెడల వారి కభయమొసగి శ్రేయములను గూర్చు సుజనబంధువు. అట్టి మహనీయుడు సదా మమ్ము గాచుగాక.

**వత్సలో భ్రాతృషు స్వేషు భక్తభృత్యజనేషు చ ।**
**వత్సల స్సర్వభూతేషు స రామోఽవతు న స్సదా ॥ 12**

ప్రేమమూర్తియైన శ్రీరామునికి తమ్ములపైగల అనురాగము అనుపమాన మైనది. ఆతని వాత్సల్యామృతము ఆశ్రితులైన వారి కెల్లరికి ననుభవములో నున్నట్టిదే. వారు వీరననేల? ఆతని ప్రేమసుధ సమయము వచ్చినప్పుడెల్ల ఎల్లజీవులయెడ సమముగానే జాలువారుచుండును. అట్టి వత్సలహృదయుడు సదా మమ్ము రక్షించుగాక.

**స్యందమానామృతరసై ర్వీక్షణై ర్భాషణైరపి ।**
**హృదిస్థోఽవతి భక్తాన్ య స్స రామోఽవతు న స్సదా ॥ 13**

భక్తసులభుడైన శ్రీరాముడు తనకు తమ సర్వస్వము నర్పించి తన సేవలోనే నిమగ్నులై యుండు భక్తుల హృదయపీఠమున అధివసించి ఆప్తబంధువువలె ప్రేమామృత పూర్ణములైన వీక్షణములతోడను భాషణములతోడను వారి నానందింపజేయుచుండును.

అట్టి భక్తజనబాంధవుడు సదా మమ్ము బ్రోచుగాక.

**ధీరో మేరురి వాత్యంతం గంభీర స్సాగరో యథా ।**
**సుధీవేద్యచరిత్రో య స్స రామోఽవతు న స్సదా ॥ 14**

మేరునగధీరుడును సాగరగంభీరుడునగు శ్రీరాముని గుణగణములను సంపూర్ణముగా గ్రహింపగలిగినవారు వసిష్ఠాది మహాజ్ఞానులు మాత్రమే. కావుననే వారాతనిని లోకాభిరాముడనియు, అప్రతిమప్రభావుడనియు, కళ్యాణగుణ సాగరుడనియు వేనోళ్ల కీర్తించుచుందురు. అట్టి మహనీయచరితుడు మమ్ము సదా రక్షించుగాక.

**మరున్నందన హస్తాబ్జ సంసేవిత పదాంబుజః ।**
**మహాబాహు ర్మహేష్వాస స్స రామోఽవతు న స్సదా ॥ 15**

ప్రియభక్తుడైన మహావీరుడగు మరున్నందనుడు నిరంతరము తన సన్నిధి నుండి సేవించుచుండగా ఆజానుబాహువులలో ప్రకాశించు జగదేక ధనుర్ధరుడగు వీరరాఘవుడు సకలలోకములకును అభయప్రదాయియైన వేలుపు. అట్టి జగత్ప్రభువు సదా మమ్ము రక్షించుగాక.

**హితకృ త్సచ్చరిత్రాణాం భయకృ ద్యో దురాత్మనామ్ ।**
**హిమాంశువ జ్జనానందీ స రామోఽవతు న స్సదా ॥ 16**

సాధుజనపరిత్రాణము దుష్టజనవినాశనము అను తన అవతార ప్రయోజనములను నెఱవేర్చు రఘువీరుడైన రామచంద్రుడు పూర్ణచంద్రునివలె జగజ్జనా నందకరుడు. అట్టి మేలైన వేలుపు ఎల్లవేళల మాకు మేలు గూర్చుచు మమ్మేలుగాక.

**ధిషణో ధిషణాయాం యః ప్రభాయాం యః ప్రభాకరః ।**
**సుందర స్సుందరాణాం య స్స రామోఽవతు న స్సదా ॥ 17**

అసాధారణ గుణవిలసితుడగు శ్రీరాముడు ప్రజ్ఞాతిశయమున బృహస్పతి; తేజస్సంపదయందు ప్రభాకరుడు; సౌందర్యవిశేషమునందు సాటిలేని జగదేక సుందరుడు. అట్టి విశిష్టగుణాకరుని రక్షణము సదా మాకు లభించుగాక.

**యో యత్ఫలం కామయతే యోజయ త్యేష తేన తమ్ ।**
**యో భక్తానాం కల్పవృక్ష స్స రామోఽవతు న స్సదా ॥ 18**

ఏయే భక్తు డే యే ఫలము నాసించి తనను సేవించునో వాని వాని కా యా ఫలము ప్రసాదించి పూర్ణమనోరథుని చేయు కల్పవృక్షమే రాముడు. అట్టి

మహిమోదారుడు మమ్ము సఫలురను చేసి రక్షించుగాక.

**యో బ్రాహ్మ మస్త్రం వేదాంశ్చ వేద వేదవిదాం వరః ।**
**యో నః కళ్యాణకృత్ స్వామీ స రామోఽవతు న స్సదా ॥ 19**

శ్రీరాముడు బ్రహ్మాస్త్రప్రయోగదక్షుడైన మహాస్త్రకోవిదుడు. వేదవేత్తలలో అగ్రగణ్యుడైన వేదశాస్త్రార్థతత్త్వజ్ఞుడు. భక్తులకు సమస్తసన్మంగళముల నొసగు స్వామి. అట్టి ప్రభువు సదా మమ్ము రక్షించుగాక.

**నతాస్సంతః ప్రభో ర్యస్య చరణాంబుజసన్నిధౌ ।**
**భవం త్యత్యున్నతా స్సంత స్స రామోఽవతు న స్సదా ॥ 20**

రామదేవుని భక్తుల భాగ్యము అద్భుతమైనది. ఆ ధన్యాత్ములు తమ స్వామి పాదపద్మములముందు మోకరిల్లుచు భక్తితో క్రిందికి వంగుదురు. తత్ఫలితముగా వారు అత్యున్నతమైన పదవులు పొంది గొప్ప ఉచ్చస్థితి నొందుదురు. అట్టి ఆశ్రిత జనోద్ధరణుడు సదా మమ్ము బ్రోచుగాక.

**ప్రమోదజనకో యోఽభూత్ జనన్యాః జనకస్య చ ।**
**జనకస్య చ జానక్యా స్స రామోఽవతు న స్సదా ॥ 21**

సకలజనానందకరుడైన రామచంద్రుడు ప్రధానముగా చిరకాలతపః ఫలముగా జనించిన ముద్దుబిడ్డగా కన్న తల్లిదండ్రులైన కౌసల్యకును దశరథునకును మహానందము కూర్చినాడు. అట్లే దుష్కరమైన తన ప్రతిజ్ఞకు భంగము వాటిల్లకుండ లభించిన వీరవరుడుగా తన మామయైన జనకునకును అర్ధాంగి జానకికిని సాటిలేని ఆనందము కలిగించినాడు. అట్టి ఆనందనిలయుడు అనవరతము మమ్ము రక్షించుగాక.

**చోదయన్ మానవాన్ సర్వాన్ స్వీయాచరణవర్త్మనా ।**
**నియుంక్తే య స్స్వధర్మేషు స రామోఽవతు న స్సదా ॥ 22**

లోకమునందు ధర్మమును స్థాపించుటయే లక్ష్యముగా నుండిన శ్రీరాముడు ప్రజలను ధర్మవర్తనులనుగా చేయుటకై చేపట్టిన మార్గము – తానా ధర్మములను స్వయముగా ఆచరించి చూపుటయే. ఆతని ఆ వర్తనమే జనులకు మహోపదేశముగా, ప్రభుశాసనముగా నుండి వారిని ధర్మము తప్పని సద్వర్తనులనుగా తీర్చిదిద్దినది. అట్టి ధర్మమూర్తి మమ్ము సదా రక్షించుగాక.

**దయామృతమహాసింధు ర్దాంతో దశరథాత్మజః ।**
**దక్షోఽక్షోభ్యో దక్షిణో య స్స రామోఽవతు న స్సదా ॥ 23**

దయామృతసాగరుడైన దశరథనందనుడు దాంతుడు, దక్షుడు, దాక్షిణ్యగుణ శోభితుడు. ఎట్టి పరిస్థితియందును క్షుభితముగాని ఆత్మశక్తి గలవాడు. అట్టి మహాత్ముడు మమ్ము రక్షించుగాక.

**యాతి ప్రచోదనాం ధర్మే యాతి చానంద మక్షయమ్ ।**
**యం గాయన్ శుద్ధధీ ర్మర్త్య స్స రామోఽవతు న స్సదా ॥ 24**

శ్రీరాముని పావనచరితమును గానముచేయు మానవుడు పరిశుద్ధ హృదయుడగును. నిర్మలచిత్తముతో ధర్మాచరణము చేయుచు జీవితపరమార్థమైన ఆత్మవికాసమును పొంది శాశ్వతానందసిద్ధి నందును. అట్టి రామవిభుడు మాకు చిరతరానందమును గూర్చి రక్షించుగాక.

జానకీప్రియ గాయత్ర్యాః పఠనం ప్రీతయే భవేత్ ।
రామస్య చైవ సీతాయాః గాయత్ర్యాశ్చ హనూమతః ॥

గాయత్రీమంత్రవర్ణాఢ్యా వర్ణితాత్మేశసద్గుణా ।
జానకీప్రియగాయత్రీ స్యా దేషా సకలప్రియా ॥

*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

# ఆమోదము

శ్రీశ్రీశ్రీ జగద్గురు శంకరాచార్య
పుష్పగిరి మహాసంస్థాన పీఠాధిపతులు
**శ్రీ విద్యానృసింహభారతీస్వామివారు**
పుష్పగిరి, కడపజిల్లా

## నమామ వేదమాతరమ్

అస్మదత్యంతప్రియశిష్యులైన శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యము, శ్రీ బోయినపల్లి కామేశ్వరరావుగారలకు ఆశీర్వచనపురఃసరముగా –

రామాయణ మహాకావ్యమునకు హృదయము సుందరకాండము. దానిని ప్రతిపదార్థ తాత్పర్యములతో ప్రకటించుటకు బూనుకొనిన మీరు నాల్గవ సంపుటమును ప్రకటింపబోవుచున్నారని విని యానందించుచున్నాను. ఆ సంపుటము 26వ సర్గ నుండి 34వ సర్గతో అనగా తొమ్మిది సర్గలతో ప్రణవరూపమున అవతరించబోవు చున్నది. ఈ సర్గలలోనే సుందరుడు, మహాయోగి, వానరపుంగవుడు నయిన హనుమంతుడు ప్రప్రథమముగా పరాదేవతారూపిణి యగు సీతతో సంభాషించును. ఆమెతో తన స్వరూపమునుగూర్చి వర్ణించి చెప్పికొనుట ప్రధానవిషయము. పరాదేవతతో సంభాషించిన హనుమంతుడు తన వానరత్వమును సార్థకపఱచుకొనుట గమనింపదగినది.

వానరులనగా వనచరములని సామాన్యార్థము. కిష్కింధలోని వానరుల వానరత్వము వేరు. వన శబ్దము పరమాత్మ వాచకము. “వనమేవ వానం” – వన వానర శబ్దములు సమానార్థకములు. “వానం పరమాత్మానం రాతీతి వానరః” – పరమాత్మను దర్శించువాడని యర్థము. హనుమంతు డట్టి వానరుడు; మహాజ్ఞాని; అట్టి హనుమంతుడు బ్రహ్మవిద్యాస్వరూపిణియైన సీతను దర్శించి, యామెతో భాషించి తన వానరత్వమును సార్థకపఱచుకొనినాడు. కనుకనే యామె నిట్లు సంబోధింపగలుగు చున్నాడు.

**“కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే ।**
**వసూనాం చ వరారోహే దేవతా ప్రతిభాసి మే ॥**

**కిం ను చంద్రమసా హీనా పతితా విబుధాలయాత్ ।**
**రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠసర్వగుణాన్వితా ॥**

**కాత్వం భవసి కల్యాణి త్వ మనిందితలోచనే ।**
**కోపాద్వా యది వా మోహాత్ భర్తార మసితేక్షణే ॥**

**వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యా ణ్యరున్ధతీ ।**
**రావణేన జనస్థానాత్ బలా దపహృతా యది ।**
**సీతా త్వమసి భద్రం తే త న్మమాచక్ష్వ పృచ్ఛతః ॥"**

ఇట్లు హనుమంతునకు వివిధరూపములతో సాక్షాత్కరించిన సీతాపరాదేవతా స్వరూపవిశేషములతో, త్రిజటాస్వప్నాది వివిధసన్నివేశముల నిగూఢతత్త్వమును, గ్రంథకర్తలు పరిశీలనాత్మకదృష్టితో వివరించుచు నాల్గవసంపుటమును సర్వాంగ సుందరముగా వెలుగులోనికి తీసికొని రాగలరని యాశించుచున్నాను.

శుభం భవతు.

ఇతి నారాయణస్మృతిః
**శ్రీ విద్యానృసింహ భారతీ స్వామినః**

# మంగళాశాసనము

శ్రీశ్రీశ్రీ త్రిదండి
**శ్రీమన్నారాయణ రామానుజ చినజీయరు స్వామివారు**
అధ్యక్షులు - సాంగవేద విశ్వవిద్యాలయం, విజయవాడ

**శ్లో॥ అనన్యదైవత్వ మియం క్షమా చ**
**భూమౌ చ శయ్యా నియమశ్చ ధర్మే ।**
**పతివ్రతాత్వం విఫలం మమేదం**
**కృతం కృతఘ్నేష్వివ మానుషాణామ్ ॥** - సుం. 28-12

'శ్రీరాముని తప్ప వేరొకరిని దైవమని భావించలేదు. రక్షించువా డతడే యని నా ప్రయత్నమేమియు లేక ఎంత బాధ కల్గిననూ ఓరిమినే వహించియుంటిని. శ్రీరాముని సుకుమారగాత్రమున కర్హమైన ఈ దేహమును నేలపై శయనింపజేసితిని. శ్రీరాముని చేతనే నియమింపబడుట యనెడి ధర్మము ఎప్పుడును వీడలేదు. పతినే సకల వ్రతములుగ ఆశ్రయించి యుంటిని. అయినా యివన్నియు వ్యర్థమైనవి. ఎట్లు? (మానుషాణాం (మధ్యే) కృతఘ్నేషు కృతమివ) మానవులలో కృతఘ్నులయిన మనుష్యులకై చేసిన ధర్మపాలన ఎట్లు వ్యర్థమో అట్లు శ్రీరాముని విషయములో నే పాలించిన ధర్మము నట్లే వ్యర్థమైనది.' ఇది సీతమ్మ ఆవేదనతో నిండిన దుఃఖపు పొంగు. పై రకమైన అన్వయంలో అంతగ దుఃఖము కన్పడుటలేదు. కారణమేమంటే మానవులలో కొందరు మంచివా రుండవచ్చు. కొందరు దుష్టులునూ ఉండవచ్చు. మంచివారిని వదిలివేస్తే దుష్టులను మాత్రమే సీతమ్మ నిందించినట్లు పై శ్లోకభావము స్ఫురిస్తున్నది. కాని ఆమె కోపమునకు మానవులంతా, అపుడు గురికావలసి వచ్చినదట. ఎట్లు? "మానుషాణాం విషయే కృతం, యత్, తత్ కృతఘ్నేషు కృతమివ" అనగా మానవుల విషయంలో ఎంత చేసినా సరే! అబ్బా! కృతజ్ఞత అనేదే అసలు తెలియని వానికి చేసినదానితో సమమే. మానవులంతా కృతఘ్నుతే స్వరూపంగా కలవారని సీతమ్మ అభిప్రాయం. అందుకనే తననుకూడ "మానవునిగనే" భావించుకొనినందున ఆతనికి, చెప్పకనే ఈ కృతఘ్నుత జాతిలక్షణ మయ్యెను. మరి తానో అనగా, తాను అయోనిజ కనుక మానవత్వ దోష మామెకు లేదట. మానవుల విషయంలో యింత కోపమును పొందినప్పటికీ సీతమ్మకు తన సంతానమైన ఈ జీవులంటే వల్లమాలిన వాత్సల్యం. కనుకనే రావణవధానంతరము హనుమ ఈ ఆర్ద్రాపరాధలగు రాక్షస స్త్రీలను హింసింతునని కోరగనే 'న కశ్చిన్నాపరాధ్యతి' ఈ లోకమున తప్పుచేయని

వారెవరు? అని నిలదీసి యడిగినది. దానికి ప్రతిగనే త్రిజటాస్వప్నమును విని గజగజ వణికి సీతమ్మకే విజయము కలిగితే తమందరను ఏ రకముగ చిత్రహింసల పాలు చేయునో అని భయపడిన రాక్షసస్త్రీలను గూర్చి వారడుగక పోయిననూ 'భవేయం శరణం హి వః' అట్టి శుభసమయమే ఆసన్నమైతే తానే వారందరిని రక్షిస్తానని, హింసించుచున్న రాక్షసస్త్రీలకు అభయమిచ్చినది మన సీతమ్మ. తాత్కాలికకోపంతో అంత కఠినముగ పల్కిననూ తాను వాత్సల్యమే, క్షమాగుణమే రూపుదాల్చిన మూర్తి సుమా యని అనేక సందర్భములలో నిరూపించినది మన సీతమ్మ. అందుచే ఆమె మన కందరకూ ఆశ్రయణీయురాలు. తన భర్తగారియొక్క యింటిగుట్టులను గూడ మనమీది వాత్సల్యముచే బట్టబయలు చేసిన దయామయి సీతమ్మ. అవి ఏమియనగా శ్రీరాముడు లోకములన్నింటిని భరించు భర్త. కావలెనని యే రడిగిన వారికి అన్ని ఫలములను ఒసంగు సమర్థుడు. అంతియేగాక ఎన్ని ఘోర తప్పిదములు చేసిననూ తెలిసిన నాటినుండి ఒక్కసారి 'తవాస్మి' అని ఎవరనిననూ, అట్టివారిని రక్షించుట ధర్మమని ఎఱింగిన 'శరణాగతవత్సలుడు' మా శ్రీరాముడు. అని రావణాదులకు గూడ హితోపదేశము చేసినది మన సీతమ్మ. ఇంతగా ఈ జీవులను ప్రేమించిన దెందులకు? అనిన, స్వామిచే రక్షింపజేసి త్వరలో తన సన్నిధిని ఆనందింప జేసుకొనవలె ననెడి కృపచే. రక్షించువాడు స్వామి. కాని అచ్చటికి చేర్చి రక్షింపజేయునది మాత్రము మన అమ్మయే.

అమ్మలో నుండెడి కృపా, పారతంత్ర్యము, శ్రీరామునికే చెందియుండెడి అనన్యార్హత్వం అనెడి మూడు గుణములే మనకు రక్షకములు. ఇవి సీతమ్మలో పుష్కలముగా నిండియున్నవి కనుకనే శ్రీరాముడా అమ్మను వెదుకుకొని పోయెను. ఈ మూడు గుణము లున్నందుననే సీతమ్మ శ్రీరామునికంటే నేత్ర సౌందర్యాది గుణములలో గొప్పదని హనుమ గుర్తించెను. ఆ గుణాధిక్యముచేతనే ఈమె యనిన శ్రీరాము దంత మోహపడుచున్నాడని, ఈమెకై, రోగాతురుడైనవాడు ఔషధముకొఱ కెట్లు పరితపించునో అట్లు శ్రీరాముడునూ 'ఏతేన ఖలు జీవిష్యే', హనుమా! నీవు చెప్పబోవు సీతమ్మ పలుకులనే ప్రియఓషధిగ గ్రహించి దానితోనే జీవించి యుందును. ఏమన్నది నా భామిని? అని పరితపించెను. ఆ మూడు గుణములున్న సీతమ్మ పలుకే మధురమని, విడువలేక విడువలేక మరల మరల హనుమను శ్రీరాముడు అడిగెను. "మధురా మధురాలాపా కిమాహ మమ భామినీ?" ఆమె మాటల గొప్పదన మెంత దనినచో అది విని వచ్చి తిరిగి నావద్ద పలుక బోవునపుడు నీమాటలను కూడ తన మాటలవలెనే మార్చివేయగల్గినంత మాధుర్యము కల నా భామిని ఏమన్నదని ప్రశ్నించెను. ఆమెకై అన్నిటికి తెగించి యీ నగరమున ప్రవేశించెను. వీరుడు ప్రియురాలి

మెప్పునకై పులి ఉండు పొదలోనికి దూరి, దానితో పోరు సల్పునటుల మనలను రక్షించు దీక్షకలది అమ్మ. ఆమె మాటలనే పదిలముగ మూటలు కట్టి జీవించు లోకశరణ్యుడునగు శ్రీరాముడు మన తండ్రి, అయిఉండి గూడ వారిని మరచి ఈ క్షుద్రప్రకృతి అనెడి ఏడిపించి ఆనందించు రావణుని చేత మనము పడితిమి.

'రావయతీతి' ఏడిపించువాడే మన మనస్సనెడి రావణుడు. కోరిన కోరికలు తీర్చనిచో ఈ మనస్సు ఎంత ఏడిపించును? ఈ అసురుని రాజ్యమే అందమైన లంకానగరము, ఈ శరీరము. దీనిని ఆవరించిన సాగరమే, లోతు తెలియని సంసారమనే ఘోరజలధి. ఈ అసురుని దశ శిరస్సులే పది ఇంద్రియములు. ఇందెందరో కామక్రోధాది మూలబలము రావణున కున్నది. రామునితో ప్రియవార్తాలాపన చేయు యోగ్యతగల ఈ సీతమ్మవంటి "ఆత్మ" కూడా వెంటనే రావణుని చెఱన బడినది. అయితే వెంటనే గుర్తించి మిగిలిన స్త్రీలవలె రావణుని సౌందర్యానికో ఐశ్వర్యానికో లొంగక, రామునికైయ్యే, ఆర్తితో ఆక్రోశించి, రామదూతగా నిర్ణయించుకొనియే తన గురుతును శ్రీరామునకు హనుమ ద్వారా పంపగలిగినది. కనుకనే ఆమెకై ఎదురు తెన్నులు స్వామి చూచినాడు. అట్లు చేసినాడు గూడ. ఈ వివరము తెలిసి శరీరమనే అందమైన లంకలో పడి దుఃఖించు జీవులందరకునూ ఏదో ఒకనా డట్టి సుందరదిన మాసన్నము కావలెనని, సుందరుడగు ఆచార్యుని ప్రాప్తి కల్గి, సుందరుడగు భగవానుని గుర్తు తెలిసి, అతనిదైన సుందరమగు ఆత్మను ఆతనికే ఆచార్యునిద్వారా అర్పించే సుందరదినం ఏనాడొస్తే ఆనాడే ఈ జన్మ సుందరము తప్ప లేనిచో వినాశకరమని సుందరకాండయందు శ్రీవాల్మీకి భగవానుడు నిరూపించెను. అట్టి సుందర ఆత్మను పొందదలచును ఆతడు. ఆతడు సుందరుడు గాన పొందవలెననే తపన ఈ జీవునికీ కల్గుట సహజము. అయితే ఇరువురిలో ఎవరి తపన అధికము? జీవులమైన మనకే తప్ప ఆతని కేమి ఉండును? అని అనిపించును గాని నిజమునకు ఆతని దుఃఖము ముందు మన దుఃఖమెంత కనుక?

"మాసాదూర్ధ్వం న జీవిష్యే" రాముని విడచి యిక ఒక్కనెలకంటే ఎక్కువ జీవించనని తెలుపు మనెను సీతమ్మ. అది విన్న శ్రీరాముడు దీర్ఘముగా నిశ్వసించి 'నెలరోజులు జీవించగల సీతమ్మ చిరకాలము జీవించియే ఉండగలదు. అందేమీ సందేహములేదు. కాని హనుమా! ఆమెను వీడి నేను మాత్రము 'న జీవేయం క్షణమపి' ఒక్క క్షణము గూడ తాళ జాలనయ్యా, అని విలపించెను. అట్టి ఆర్తత్రాణపరాయణునికి 'నీరక్షణకు ఆటంకములేదు గాన నీవే వచ్చి నా ఆటంకములు నిర్మూలించి 'మాం నయేద్యది' నన్నుగైకొన్నచో అది నీ స్వరూపమున కనురూపము సుమా! అని ఒక్కమారు అనగలిగితే, అంతకుమించిన ప్రియవార్త మరొకటి ఉండనే ఉండదు. జీవునకు రామ

వృత్తాన్తము 'మృతసంజీవని' అని అందురు. అందుకు కారణము మెడకు ఉచ్చు బిగించుచున్న సీతమ్మకు 'రాజా దశరథో నామ....' అని ఆరంభించగనే తెలియకనే ఉచ్చు సడలి తిరిగి దేహము లభించి జీవించెను గనుక. కాని మరికొంచెము ఆలోచించినచో, జీవుని విశ్లేషము నోర్వజాలని వెర్రిప్రేమచే పీడింపబడ్డ భగవానునికి ఈ జీవుడు పలికెడి 'మాం నయేద్యది....' నీవేనన్ను గైకొనుట నీకుచితము. అట్లు గైకొనబడుట నాస్వరూపమనియెడి పలుకులు మాత్రమే 'మృతసంజీవనములు.' ఆతనిని జీవించి పోషించు ఓషధులు. వీనితోనే 'భేషజేన ఆతురో యథా' దీర్ఘరోగి ఓషధులతోనే జీవించునట్లు తాను జీవించును. ఇది తెలిసి అతని వ్యాధిని తొలగించునట్లు ఆతనికి ధైర్యము చిక్కునట్లున్ను మన రక్షణ నాతనికి అప్పజెప్పవలెనని, అట్లు చెప్పుటకు 'సుందరకాండ'యే పట్టుకొమ్మయని ఎఱింగి, కాని భావమెరుగక, అర్థమెఱుంగక పోవుటచే అందరకునూ అందు రుచి ఉన్ననూ శ్రద్ధ కల్గుట లేదని గుర్తించి చాలాకాలం తదుపరి వావిళ్ళవారి తర్వాత మరల శ్రద్ధతో శ్రీమాన్ బోయినపల్లి కామేశ్వరరావుగారు పూనుకొని శ్రీమాన్ మైలవరపు సుబ్రహ్మణ్యం శర్మగారిచే శ్లోక, ప్రతిపదార్థ, అన్వయక్రమ, తాత్పర్యములను, అక్కడక్కడ విశేషార్థములను వ్రాయించి చిన్న చిన్న పుస్తకములుగ రూపొందించి జనులకు అందింప దలచుట ఎంతయో శ్లాఘనీయము. ఇది విద్యార్థులకేమి సంస్కృతము నేర్వదలచిన వారికేమి చాల ఉపయోగకారి అనుటలో సందేహమిసుమంతైననూ లేదు. వీరిరువురి కృషికి తగిన ఫలితము శ్రద్ధాళువులీ గ్రంథములను ఉపయోగించుటయే. అట్లుపయోగిస్తున్నామని మరల వారికి తెలిపితే అంతకు మించిన పురస్కృతి ఈ జంటకు మరొకటి ఉండదని మా యూహ.

వీరి కృషి యిట్లే దినదిన ప్రవర్ధమాన మగుచు మరిన్ని ఆధ్యాత్మికసేవలను జనులకు అందించునట్లు చల్లనిచూపులతో శ్రీరామచంద్రప్రభు వనుగ్రహించుగాక యని ప్రార్థిస్తూ అనేక మంగళాశాసనములను వీరిరువురకూ చేయుచున్నాము.

(సం) చిన శ్రీ.రా.జీయరు,
సీతానగరం 16-1-88

శ్రీః

శ్రీ చన్ద్రమౌళీశ్వరాయ నమః

జగద్గురు శ్రీ శఙ్కర భగవత్పాదాచార్య పరంపరాగతం

**శ్రీ కామకోటి పీఠ మహా సంస్థానమ్**

కాఞ్చీపురమ్

17-10-1987

శ్రీపాదానాం

## ఆశీర్వచనపత్రమ్

ఆదికవేః శ్రీవాల్మీకేః రామాయణే సుందరకాండస్య ఆంధ్రాను వాదాత్మకస్య ప్రతిపదార్థాది విశేషయుక్తస్య అంగులీయకప్రదాన నామకః పంచమో భాగః ప్రకాశ్యతే శ్రీ ఎమ్.సుబ్రహ్మణ్య, శ్రీ బి.కామేశ్వరరావు సుకృతిభ్యాం ఇతి జ్ఞాత్వా భృశం సంతుష్యామః.

పూర్వేభ్యః చతుర్భ్యో భాగేభ్యోఽపి అత్యధికం జనమనోమోదకత్వం అస్య పంచమస్య భవతు శ్రీరామచంద్రప్రసాదేన ఇ త్యాశాస్మహే ॥

**నారాయణస్మృతిః**

---

ప్రస్తుత పంచమ సంపుట ముద్రణము పూర్తి అయి బైండింగునకు వెళ్ళుచున్న చివరిక్షణములో శ్రీకామకోటి పీఠ మహాసంస్థానమునుండి శ్రీపాదుల ఈ ఆశీర్వచనానుగ్రహము లభించినది. విశిష్టమైన ఈ భాగమును అద్దానిచే అలంకరించుకొను భాగ్యము కలిగించిన శ్రీ జగద్గురుపాదులకు కృతజ్ఞులమై నమ శ్శతము లర్పించుచున్నాము.

**సుబోధినీ సమర్పకులు**

# అభినందన ప్రసూనోపాయనమ్

కథాగాన కళాప్రపూర్ణ

శ్రీమాన్ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసుగారు
తిరుమల తిరుపతి దేవస్థాన ఆస్థాన విద్వాంసులు,
నరసాపురము (ప.గో.జిల్లా.)

శ్లో॥ శ్రీమద్రామ పదాంబుజాత మధుపాన ప్రస్ఫుర ద్బంభరం
గోష్పాదీకృతవార్ధిలంఘనవిధౌ చుంబద్వి శాలాంబరమ్ ।
లంకాదాహక విక్రమోజ్జ్వలిత సాక్షీభూత వైశ్వానరం
వందే ధీరసమీరనందన మహం భక్త్యా కపీనాం వరమ్ ॥

శ్లో॥ శ్రీమైలవరపు వంశ్య సుబ్రహ్మణ్యాఖ్య కవివరేణ్యశ్చ సదా ।
విజయేతాం శ్రీబోయనపలి కామేశ్వర కవీంద్రవర్యశ్చ ముదా ॥

శ్లో॥ శ్రీమద్రామాయణే కాండే సుందరే శ్లోకసంతతేః ।
అన్వయక్రమ తాత్పర్యాద్యర్థ వ్యాఖ్యాన విస్తృతా ।
సుబోధినీ వివరణ ప్రఖ్యాతా భవతోః కృతిః ।
భూయాత్ లోకోపకారాయ తథైవ విదుషాం ముదే ॥

తనిశ్లోక్యాది ప్రాచీన వ్యాఖ్యానాంశ విభూషితా ।
సుబోధినీ సుధీబోధిన్యపి స్యాత్ భవతోః కృతిః ॥

"తృణ మంతరతః కృత్వా" ముఖ్యశ్లోకార్థసంచయే ।
భవతో స్సాహితీ శ్లాఘ్యా నాన్యసామాన్యతాం గతా ॥

శ్లో॥ శ్రీవాణీ ధృతవల్లకీ మృదుకరాబ్జా గానసాహిత్యవి
జ్ఞానానందమయీ విధాతృవదనశ్రీపద్మసంవాసినీ ।
విద్వల్లోక సమర్చితాంఘ్రియుగళా విష్ణుస్నుషా సంతతం
పాయాత్ వాఙ్మయసేవకౌ కృషిఫలం దత్త్వా భవంతా వుభౌ ॥

శ్లో॥ నవనవభావసంభృత, మనన్యసుధీమహిమాభిరామ, మా
ర్యవినుత మాదిసత్కవివర ప్రవిగీత మనోజ్ఞ కావ్య శి
ల్పవిభవ నిర్భరం బగుచు వాసి గడించెడు మీ సుబోధినీ
వివరణ మక్షరాక్షరపవిత్రము సన్నుతిపాత్ర మెన్నగన్ ॥

మ. కవి కన్పించును కావ్యశిల్పమున; తత్కావ్యప్రశస్తిన్ నిస
ర్గవిధిన్ వ్యాకృతి చేసి పుష్టి సమకూర్పం జాలు వ్యాఖ్యాతలో
కవి జీవించును; కావ్యమున్ కవిని ఉత్కర్షించి తాదాత్మ్యసి
ద్ధి విడంబించు రసజ్ఞబుద్ధిఁ గవి శాంతిం బొందు నశ్రాంతమున్ ॥

మ. భవదుత్కృష్టమనీష స్తుత్య మగు సుబ్రహ్మణ్య కామేశరా
య విశుద్ధాశయులార! సర్వజనమాన్యత్వం బుటంకించు న
ధ్యవసాయంబున అద్వితీయకృషి సేయంజాలు మీశక్తి ధీ
లవశూన్యుండను నేను వర్ణనము సల్ప న్నేర్తునే లేశమున్ ॥

శ్లో॥ స్వస్త్యస్తు నిస్తులజయోఽస్తు చిరాయు రస్తు
ఆరోగ్యమస్తు భవదన్వయవృద్ధి రస్తు ॥
సారస్వతప్రవణ ధీబలసిద్ధి రస్తు
వాం సంతతం దశదిశావృత సద్యశోఽస్తు ॥

సుధీవిధేయుడు
**దీక్షితదాసు**



# ఆమోదము

కళాప్రపూర్ణ

**డాక్టరు దివాకర్ల వెంకటావధానిగారు**

M.A. (Hons) Ph.D, హైదరాబాదు–27

**యథా సర్వేషు దేవేషు రామః ప్రియతమో మతః ।**
**తథా రామాయణే సర్వే సుందరః కాండ ఉత్తమః ॥**

అను నభియుక్తోక్తి రామాయణము నందలి సుందరకాండమునకు గల ప్రాశస్త్యమును విశదీకరించుచున్నది. అందు కనేకకారణములున్నవి. వాల్మీకి మహర్షి రామాయణమునందలి యితరకాండములకు, అందలి కథాసందర్భములను బట్టి పేరుపెట్టి, సుందరకాండమును మాత్రము వేఱుగా పేర్కొనెను. సుందరు డనగా, హనుమంతుడని చెప్పుటకు ఆధారములున్నవి. పద్మపురాణమున శివుడు పార్వతితో "మదంశజో మహాబాహుః మహాబలపరాక్రమః । సుభగ స్సుందరః శ్రీమాన్ భక్త రక్షాపరాయణః" అని చెప్పుచు, హనుమంతునికి సుందరుడను విశేషణమును గూడ వేసియుండెను. ఆంజనేయుడు సుందరుడా! అను సందేహము కొందఱి కుదయింప వచ్చును. కాని అతడు కాంచనాద్రి కమనీయ విగ్రహుడు; బుద్ధిమతాం వరిష్ఠుడు. అదిగాక, వానరుల సౌందర్యమును సమీక్షించునపుడు వారిని, వానరులతోడనే పోల్చవలయునుగాని తదితరులతో పోల్చరాదు. ఆ వానరులలో హనుమంతుడు సుందరుడనుటలో సందేహములేదు. సుందరశబ్దమునకు – "సుం = శోకం, దారయతి = ఖండయతి ఇతి సుందరః" అని వ్యుత్పత్తి. హనుమంతుడు సముద్రమును దాటి, సీతను దర్శించి, రాముని క్షేమవార్త నామెకును, తిరిగి వచ్చి, సీతాక్షేమవార్త రామునకును తెలిపి, వారిరువురి శోకములను రూపుమాపెను. అందుచే గూడ నతడు సుందరు డగుచున్నాడు. సుందరశబ్దమునకు "సుతరా మాద్రియతే" అను వ్యుత్పత్త్యర్థము గూడకలదు. అనగా మిక్కిలి ఆదరింపబడు వాడని యర్థము. హనుమంతుడు రుద్రాంశ సంభూతుడగుటచే శైవులకును, రామభక్తుడగుటచే వైష్ణవులకును, వాయుసూనుడగుటచే మాధ్వులకును ఆదరణీయుడగుచున్నాడు! ఏ మతమువారుకాని, ఆతనిని ఆదరముతో పూజింపని వారుండరు. మఱియు

"సుందరే సుందరో రామః సుందరే సుందరః కపిః... సుందరే సుందరీ సీతా సుందరే కిం న సుందరమ్" అను నార్యోక్తి కూడ కపిసత్తముడైన యాతడు సుందరుడని తెల్పుచున్నది.

సాధారణముగా కావ్యములందు ఆరంభమునందే నాయక వర్ణన ముండును. కాని రామాయణమున రాముని సంపూర్ణ సౌందర్యము నెఱుంగవలె నన్న, సుందరకాండమునే పఠింపవలయును. ఏలయన, సీత రాముని అవయవములను వర్ణింపుమని కోరినపుడు హనుమంతు డాతని సర్వావయవముల సౌందర్యమును వివరించి చెప్పెను. రాముని సౌందర్యమును తెల్పు కాండము గావున, దీనిని సుందర కాండమని పిలువవచ్చును. కవితా విషయమున గూడ ఇతర కాండము లందలి కవిత్వముకంటె, సుందర కావ్యమునందలి కవిత్వము సుందరతరముగా నుండును. మఱియు నొక్క విశేషము కలదు. రామాయణము నంతను పఠింపలేనివారు, ఒక్క సుందరకాండమునైన పఠించి, తత్పుణ్యమును బడయఁజాలుదురని పెద్దలందురు. హనుమంతుడు అశోకవృక్షశాఖపై కూర్చుండి, తాను హఠాత్తుగా సీతను దర్శించినచో నామె సందేహించునేమో యను భయమున శ్రీరామ జననము మొదలు, తానచ్చటికి వచ్చువరకును జరిగిన వృత్తాంతము నంతను చెప్పెను. తరువాత సీతకు తన్నెఱింగించి కొని, ముందు రాముడు లక్ష్మణునితోడను, వానరసైన్యముతోడను వచ్చి, రావణుని సంహరించి, యామెను గొనిపోవునని ధైర్యము చెప్పెను. ఈ విధముగా రామాయణ కథయంతయు సుందర కాండమున హనుమత్ప్రోక్తమై సంగ్రహరూపమున గానవచ్చును.

సుందరకాండమును పారాయణము చేయునపుడు, వినాయక సరస్వతీ వాల్మీకి ప్రార్థనలతోపాటు, హనుమత్ స్తోత్రమునుకూడ చేయుట సంప్రదాయ సిద్ధమైయున్నది. ఇక్కడ హనుమంతుని స్తుతించు శ్లోకములలో వర్ణింపఁబడిన హనుమంతుని గుణములన్నియు సుందరకాండమున కానిపించును. అతడు మనోజవుడు, మారుతతుల్యవేగుడు. సీతాన్వేషణమునకై రావణాంతఃపురమును దర్శించునపుడు ఆతని మనస్సున ఎట్టి వైకల్యమును కలుగకుండుట, ఆతని జితేంద్రియత్వమును చెప్పక చెప్పుచున్నది. అతడు సాధారణ వానరుడు కాదు. రామాయణ మహామాలారత్నమని ప్రశస్తి పొందినవాడు. మఱియు పురుషసూక్తమున "త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుష" అను వాక్యమున్నది. హనుమత్సహస్రనామములలో త్రిపాదూర్ధ్వగాయ నమః అను నామముకూడ కానవచ్చుచున్నది. దీనిని బట్టి పెద్దలతనిని పరబ్రహ్మస్వరూపునిగా భావించిరని తెలియుచున్నది. అట్టి మహానుభావుని గుణగణములను వర్ణించు కాండము సుందరము కాక, మఱియేమగును?

హనుమంతుడు గొప్పయోగివలె కన్పించును. శ్రీరాముడు ప్రథమ దర్శనముననే ఆతని మాహాత్మ్యమును గ్రహించెను. అందుచేతనే, ఆత దుంగరము నితరవానరుల కీయక హనుమంతుని కొసంగెను. సుగ్రీవుని పరివారములో నున్న

వానరులలో అతడొక్కడే సీతను దర్శింపగలడను విశ్వాస మాతనికి కలదు. వసుచరిత్రకారుడు శ్రీరామునికిని, హనుమంతునికిని కూడ భక్తుడు. ఆతడు –

"తరుణార్క కబళనోద్ధతిఁ జూపె నెవ్వాడు రుచులచే ఫలమోహరుచులచేత" ఇత్యాది సీసపద్యమున "అక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాడు రణముచే నియమ ధారణముచేత"

అనికూడ చెప్పియుండెను. ఇందలి రెండవయర్థమున, అతడు నియమ ధారణముచే అనగా యోగాభ్యాసాదులచే ఇంద్రియదమనము కావించెనని చెప్పవలయును. అతడట్టి మహాయోగి కావుననే శతయోజన విస్తీర్ణమయిన సముద్రమును దాటఁ జాలెను. మఱియు లంకను దహించునపుడు, అందలి యిండ్లన్నియు కాలెను గాని ఆతని తోకమాత్రము కాలియుండలేదు. ఇదంతయు యోగమహిమమే. జగద్గురు శంకరాచార్యులవారు "మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం స్థితం స్వాధిష్ఠానే" అను సౌందర్యలహరియందలి శ్లోకమునందు కుండలినీశక్తి నుత్థాపనముచేయగల యోగి కసాధ్యమేదియు నుండదని చెప్పియున్నారు. సాంకేతికముగా చూచినచో అశోకవనము సహస్రారమనియు, హనుమంతుడను మహాయోగి అన్ని ప్రలోభనములను తరించి, జగజ్జననియు, పరబ్రహ్మస్వరూపిణియు నగు సీతను దర్శింపఁ జాలెననియు చెప్పవచ్చును. యోగాభ్యాసము చేయువాని కెట్టి ప్రలోభనములు కల్గునో, ఎట్టి యాటంకము లుప్పతిల్లునో, అవి అన్నియు వాల్మీకి హనుమంతునికి కలిగించెను. ఆ యోగిశిఖామణి వానిని లెక్కచేయక జగజ్జననీదర్శనము కావించి, తిరిగి, రామునికడకు రాఁజాలెను. సుందరకాండ మంతయు హనుమంతుని పరాక్రమ మనోనిగ్రహాది గుణగణము లన్నింటిని చక్కగా వర్ణించును.

కొందరు విద్వాంసులు త్రిజటాస్వప్నమున గాయత్రీవర్ణనము కలదని చెప్పుదురు. మఱియు వాల్మీకి, గాయత్రీమంత్రము నందలి యొక్కొక్క యక్షరమునకు, ఒక్కొక్క వేయిచొప్పున శ్రీమద్రామాయణమున మొత్తము 24వేల శ్లోకములు రచించియుండెను. అందు సుందరకాండమున మూడు బీజాక్షరములు నిక్షిప్తములై యున్నవి. ఇట్లే సుందరకాండ మాహాత్మ్యమును నిరూపించుట కింకను వేఱుకారణము లనేకములున్నవి.

అట్టి సుందరకాండమునకు తెలుగున గద్యపద్యానువాదము లెన్నో వెలువడి యున్నవి. పలువురు టీకాతాత్పర్యములను కూడ రచించి యున్నారు. ఇటీవల శ్రీ బి.కామేశ్వరరావుగారి ప్రేరణమున పండితవరేణ్యులయిన, శ్రీ మైలవరపు

సుబ్రహ్మణ్యముగారు సుందరకాండము నందలి ప్రతిశ్లోకమునకును అన్వయ క్రమమును, ప్రతిపదార్థమును, తాత్పర్య విశేషములను వెలయించి యుండిరి. ఇట్లు చేసినచో సుందరకాండము బహుసంపుటములతో కూడిన పెద్ద గ్రంథ మగును. అయిన నేమి! సామాన్యులకు కూడ ఉత్తమమయిన యా కాండమునందలి ప్రతిపదము నర్థముచేసికొని పారాయణము చేయుటకు అవకాశము లభించును.

ఈ మహాకార్యమును నిర్వహించుచున్న రచయిత లిరువురికిని లభించు పుణ్యమింత యంత యని చెప్పజాలము. వ్యయప్రయాసములతో గూడిన యీ పనిని వారెంతో ఆనందోత్సాహవిశేషముతో చేయుచున్నారు. వారు నన్ను చూచుటకు వచ్చినపుడు, వారి యుత్సాహానందముల నేను స్వయముగా చూచి, ఆశ్చర్యచకితుడ నైతిని.

అన్వయక్రమమును, అర్థతాత్పర్య విశేషములను రచించుటలో రచయితలు బహువ్యాఖ్యానముల సాహాయ్యమున చూపిన పాండితీ పరిశ్రమ, పాటవమును వర్ణింపఁజాలము. జగద్ధితకరమయిన యీ కార్యమును చేయుచున్న వారిని శ్రీరామచంద్రుడును, తద్భక్తుడగు హనుమంతుడును, అనుగ్రహింతు రనుటలో సందేహములేదు. పారాయణము చేయువారును వారి యనుగ్రహమునకు పాత్రులు కాఁగలరు. ఈ వ్యాఖ్యకు సుబోధినీ వ్యాఖ్య అను పే రన్వర్థమైయున్నది. మిగిలిన సర్గములను కూడ నిట్లే సత్వరముగా ప్రకటించి, ఆ పుణ్యాత్ము లిరువురును ఆంధ్రలోకమునకు సుందరకాండమును ప్రతిపదార్థ తాత్పర్య విశేషములతో పారాయణము చేసి, సర్వశుభముల నందుట కవకాశము కల్గింతురని వేడుచు, వారిని హృదయపూర్వకముగా నభినందించుచున్నాను.

**దివాకర్ల వేంకటావధాని**

# ప్రశంస

కళాప్రపూర్ణ

**శ్రీ తుమ్మల సీతారామమూర్తి గారు,**

అప్పికట్ల, తెనాలితాలూకా.

రవికులవార్ధి సోమునకు రామునకున్ సకలప్రపంచ గౌ
రవము లభింప భారత ధరాప్రజ కీ నరపాల మౌళి వే
ల్పవుట విచిత్రమా! తనువు నందిన ధర్మువు గాన రాముఁ డీ
భవికము పొందఁగల్గెఁ; మనపల్లెకు, వీటికి, వాడవాడకున్
నవనవశోభ గూర్చుచు ననారతపూజల నందుచున్ రఘు
ప్రవరుని కోవెలల్ వెలసె; భవ్యగుణాకర సీత వీనికిన్
దవిన వెలంది యయ్యె; శుచితానిధిగా జగదేకమాతగా
స్తవనము లందె; నీయుగళి నామములన్ దనబిడ్డలన్ మహో
త్సవమునఁ బిల్వసాగె మనధాత్రి దనర్చు గృహస్థకోటి; శ్రీ
నవమికి సీతపెండ్లి నభినంద్యకళాకమనీయ వార్షికో
ద్ధవముగ నూరనూర నియతమ్ముగఁ జేయ నుపక్రమించె; సత్
త్కవికులచక్రవర్తి యనఁగా నుతికెక్కిన పుట్టపుట్టు వీ
కవకథ పల్కి మమ్మొదటి కైసరుఁ డయ్యెఁ దదీయకావ్య మీ
భువి కెనలేని భాగ్యముగఁ బొల్చె; శతాధికదేశభాషలం
దవితథరూపముం బడసె; నాంధ్రకవుల్ సడిసన్నవారు మ
క్కువపడి రీచరిత్రమునకున్; విదుషీమణి మొల్ల కప్రపున్
రవలకు; దేనెసోనలకు రంగముగా, శరదిందుచంద్రికా
భవనముగాఁ బటీరగిరి పంచిన మందసమీరవీచిగా,
జివగల తల్లిబాస కొరక చిన్నయగాఁ దనకైత గూర్చి మా
న్యవనిత యయ్యె; నింత నిజ; మైనను మూలముగుట్టెఱుంగఁగాఁ
దవులము సూపువారలకు దక్కదు సంస్కృతవాణి రాక ని
క్కువమగు తుష్టి; యాకొఱఁతకున్ గుఱియై దిగులందు తెల్గువా
రవహితచిత్తులై తనియునట్లు మహర్షి గభీరవాణికిన్

సవరని తెన్గుఁబల్కుల రసజ్ఞులపాలిటి మేలివిందుగా,
వివిధవిశేషముల్ పగటు వేదికగా, రుచిరార్థరాశిగా
వివరణ సంతరించిన కవిప్రవరున్, రఘునాథభక్తి వై
భవుని, వినీతు "మైలవర" పావనవంశ్యునిఁ సాహితీయశః
ప్రవణత రామమంత్రజపపారగతన్ నిఖిలాంధ్రమండల
స్తవముల నందుకొన్న బుధచంద్రుని "బోయనపల్లి" సత్కులున్
సువచన దీప్తితోడ నొక సుందరకాండము కాక జానకీ
ధవ కథ యెల్లఁ జాటఁగ నితాంతజయమ్ముల నందఁగా శతా
యువు నిడి రామదూత, కరుణోదధి మారుతి ప్రోచుఁగావుతన్!

**శ్రీ తుమ్మల సీతారామమూర్తి**

# ఆప్తవాక్యము

*డాక్టర్ కలిదిండి వెంకటరామరాజుగారు*
భాషాప్రవీణ, ఎమ్.ఏ; పిహెచ్.డి.
రీడరు, పి.జి.తెలుఁగుశాఖ,
డి.యన్.ఆర్.కాలేజి.
భీమవరం, ప॥ గో॥ జిల్లా.

**శ్లో॥ కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరం ।**
**ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్ ॥**

ఆదర్శప్రాయములైన మాన్యమానవప్రవృత్తులను దైవశక్తితో ముడిపెట్టి లలిత పదజాల సంయుత సరళశైలిలో లోకమున కందించిన మొట్టమొదటి మహాకావ్యము రామాయణము. కనుకనే రామాయణము నాదికావ్యమని, తత్కర్తయైన వాల్మీకి నాదికవి యనియు మనము కీర్తించుచున్నాము. భగవత్సంసారమంతయు రామాయణములో ప్రతిబింబితమైనది. సకలవేదసారరూపమైనది రామాయణము. రసమయ రమణీయ రచనా ఫణితులలో మానవహృదయమును సంస్కరించుచు దివ్యసందేశామృతమును నిరంతరము పంచి యిచ్చు రామాయణము మహాకావ్యరాజము. శ్రీమన్నారాయణుని యవతారమై, మానవోత్తముఁడైన శ్రీరామచంద్రుడే కావ్యమహానాయకుఁడు.

**శ్లో॥ వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే ।**
**వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షా ద్రామాయణాత్మనా ॥**

అని వేదవేద్యుఁడైన శ్రీమహావిష్ణువు శ్రీరామచంద్రుఁడుగ నవతరించగ, వేదమే వాల్మీకి ముఖ కమలమునుండి రామాయణ రూపమున వెలువడినదని రామాయణ ప్రతిపత్తిని ప్రశంసించుచున్నారు. కష్టనష్టాలతోఁ గూడిన మానవ జీవితమునకు సమధిక ప్రాధాన్యము నిచ్చి యవతారపురుషుఁడైన శ్రీరామచంద్రుని మానవోత్తమునిగ, సాధ్వీమతల్లియైన సీతాదేవిని నారీతిలకముగను తీర్చిదిద్ది రమణీయ రామాయణ కావ్యమును సర్వాంగసుందరముగ కూర్చి లోకమున కందించిన వాల్మీకి మునిపుంగవుఁడు సకలజనహృదయవేదికలపై తిష్ఠవేసి యాదికవిగా నాత్మకవితా ప్రభావములను నేటికిని నెఱపుచునే యున్నాఁడు. ఏ శుభసమయములో ప్రారంభించి యా కవితల్లజుఁడు పావన సీతారామాది పాత్రలను తన మధురలేఖినితో మలచినాఁడో కాని యవి యజరామరములై మానవహృదయసదనములలో నేటికిని ప్రాభవాంచిత

విన్యాసములు సల్పుచునే యున్నవి. రసనాగ్రసీమలపై రసమయ నాట్యములు చేయుచునే యున్నవి. నిరంతరము శారీరక మానసిక వ్యథలకు గుఱియై బండరాళ్లుగూఁడ కరఁగునట్లు గుండె లవియ విలపించి కడగండ్ల సుడిగుండములలో పరిభ్రమించుచు మానవత్వములో దైవత్వమును నిరూపించిన సీతారాములవంటి ధర్మమూర్తులు సృష్టిలో కానరారు. కనుకనే 'రామో విగ్రహవాన్ ధర్మః' అని రామునకు, 'సీతాయాః చరితం మహత్' అని సీతాచరిత్రకును కమనీయత పత్రములు లభించినవి. రూపుగట్టిన ధర్మమే రాముఁడు. రూపు గట్టిన యకళంకశీలమే సీత. అట్టి మహత్త్వపూరిత సీతారాముల చరిత్ర నుట్టంకించి రామాయణము పావన కావ్యరాజముగ ప్రసిద్ధికెక్కినది; కాలగతిలో నది యన్ని భాషలలో నెన్ని ప్రక్రియారూపములు దాల్చినను దాని సహజ సుందర రూపరేఖలు, నిస్సీమవ్యాప్తి దీప్తులును సడలలేదు. ఆ మహా కావ్య వైభవము, తద్గత ముఖ్య పాత్రల స్థితిగతులు నట్టివి.

అట్టి రామాయణములో సుందరకాండమునకు ప్రత్యేకప్రతిపత్తి గలదు. ఈ యంతర్గతకాండమే యొక ప్రత్యేకకావ్య మనఁదగియున్నది. దీనికి హనుమంతుఁడు నాయకుఁడు, శ్రీరాము ననుచరుఁడు. ఈశ్వరాంశసంభూతుఁడై భగవద్రూపమును తన హృదయమున నిలుపుకొనిన మహాభక్తుఁడు, దివ్యజ్ఞానసంపన్నుఁడు నైన హనుమంతునియొక్క బాహ్యాంతస్సౌందర్యము లిందు ప్రధానముగ చిత్రింపబడినవి గనుక దీనికీ సుందరకాండ వ్యవహారము సార్థకమైనది. భగవద్గుణత్రయములో నొకటగు సౌందర్యమును లోకోత్తరదంపతులగు సీతారాముల నాధారముగఁ జేసికొని సాంగోపాంగముగ చిత్రించిన దగుటచే నీ కాండమునకు సుందర విశేషణము తగిన రీతిగ నందగించియున్నది.

మఱియు నీకాండము సత్ఫలముల నిచ్చునట్టి బీజాక్షరములతో కూడుకొని గంభీర శైలీ సమనిత్వమై లౌకిక పారమార్థిక సుందరార్థములను మనోహర ఫణితులలో ప్రతిపాదించుచున్నది గనుక నీ పూర్వానుబంధ రూప సుందర శబ్ద మన్ని విధములుగా తగియున్నది.

అట్టి పటిష్ఠరచనా సమన్వితమగు సుందరకాండము తమ సుబోధినీ వ్యాఖ్యతో మాన్యులు, విద్వత్కవులునైన శ్రీబోయనపల్లి కామేశ్వరరావుగారు, శ్రీమైలవరపు సుబ్రహ్మణ్యముగారును ముందుగ ప్రకటింప బూనుట మిక్కిలి ముదావహమైన విషయము. రామాయణ భారత భాగవతములు విపుల వ్యాఖ్యలతో వెలువడవలసిన యావశ్యకత యెంతేని యున్నది. శ్లోకములకు పదచ్ఛేద, క్రమాన్వయ, ప్రతిపదార్థ,

తాత్పర్య, విషయవిశేషములతోఁ గూడిన విపుల వ్యాఖ్యానము రామాయణమున కింతకు ముందు సుబోధకమగు సరళశైలిలో వెలువడలేదు. ఈ వ్యాఖ్యానముయొక్క తీరును బట్టి దీనికి సుబోధినీ నామము సమర్థనీయముగ నున్నది. ఈ సుబోధిని తన లలితపదహస్తాలతో తెలుగువారిని తట్టి లేపి, హృదయస్పందన కలుగు నట్లు ప్రబోధించి, వాల్మీకిహృదయము నందించి రామాయణము వేసిన వెలుగుబాటను చూపగలదు. వ్యయప్రయాసల కోర్చి తమ ప్రతిభావ్యుత్పన్నతలకు నికషోపలమువంటి యిట్టి బృహత్కార్యమునకు పూనుకొనిన యీ మాన్యమూర్తిద్వయము ధన్యము. మిగిలిన సుందరకాండ సంపుటములే గాక తదితరకాండములు గూడ వీరి యమృతలేఖినీ విన్యాసాత్మక వ్యాఖ్యానముతో త్వరలో వెలువడి వ్యాఖ్యాసమన్విత రామాయణ మంతయు నాంధ్రుల నోముల పంటగ నందఁగలదని విశ్వసించుచున్నాను. ఈ భారవ త్కార్యక్రమమునకు సహృదయులైన సంపన్నులు, ప్రభుత్వాధికారులు, టి.టి.డి.వారు, తదితర సహాయక సంస్థలు నార్థికముగ సహకరించినచో వీరి యక్షయకృషి త్వరిత గతిని ముద్రితాక్షరరూపమును దాల్చగలదు. మీ ప్రయోజనాత్మకకృషికి నా యామోదమును తెలియజేయుచున్నాను.

మీ వ్యాఖ్యానాత్మకకృషికి నా పావనదంపతులగు సీతారాములు, కామితదాయకుఁడగు నాంజనేయస్వామియు సర్వవిధముల సహకరించుగాక.

శుభం భూయాత్.

ఇట్లు

**కలిదిండి వెంకట రామరాజు**

## శుభాశీస్సులు

శ్రీసనాతన భాగవత భక్త సమాధ్యక్షులు,
ప్రశాంతి విద్వన్మహాసభా కేంద్ర పండితులు,
ఎండోమెంటు పరిపాలనాశాఖ మతసలహా సభ్యులు
మంత్ర శాస్త్ర ప్రవీణ, హనుమదుపాసక
**బ్రహ్మశ్రీ శిష్టా చంద్రమౌళిశాస్త్రిగారు**
పెదపాడు ప॥ గో॥ జిల్లా.

**శ్లో॥ "యథా సర్వేషు దేవేషు శ్రీరామః పరమో మతః ।**
**తథా రామాయణే శ్రీమాన్ సుందరః కాండ ఉత్తమః ॥**

దేవత లందఱియందును శ్రీరాముఁ డుత్తముఁ డైనట్లు శ్రీరామాయణము నందలి కాండములలో సుందరకాండ ముత్తమ మైనది.

**"బీజకాండ మితి ప్రోక్తం సర్వరామాయణే ష్వపి ।"**

సమస్తరామాయణములందును సున్దరకాణ్డయే బీజకాణ్డము అనగా ప్రధానము.

**శ్లో॥ సప్తసర్గక్రమేణైవ నిత్యం యః పఠతే పుమాన్ ।**
**స పుమాన్ జయ మాప్నోతి సర్వకార్యేషు సర్వదా ॥**

సప్తసర్గక్రమముతో నిత్యపారాయణ మొనర్చు మానవులకు సర్వకార్య జయము చేకూరును.

మహాభారతమునందు 'భగవద్గీత' ప్రధానము, రామాయణమునందు 'సున్దరకాణ్డ' ప్రధానము. కాగా – భగవద్గీత కేవల మోక్షప్రదము. కాని సున్దరకాణ్డ భోగమోక్షప్రదము.

**శ్లో॥ యత్రాస్తి భోగో నహి తత్ర మోక్షః యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః ।**
**శ్రీమారుతే స్సేవనతత్పరాణాం భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ ॥**

– (హనుమత్తత్త్వబోధిని)

అట్టి విశిష్టమైన సున్దరకాండమునందు 'అంగులీయకప్రదానవృత్తాన్తము' అత్యంతప్రధానమును, రమణీయమునైనది. తత్సంబంధమగు 36వ సర్గను

నియమముగా పారాయణమొనర్చు భక్తులకు క్రింది ఫలితము లభించఁగలదు.

**శ్లో॥ విశిష్టబంధుసంయోగకామనా చే ద్ధనూమతః ।**
**రామాంగులీయార్పణం తు సీతాయై సంధ్యయోః పఠేత్ ॥**
**ఆదా వంతేఽపి వా నిత్యం పనసామ్రఫలార్పణమ్ ॥**

మిత్రులు శత్రులుగ మారినపుడు గాని, భార్యాభర్తలు మున్నగు ఆప్తులు, సోదరులు, దేశాంతరములయం దున్నవారలు తిరిగి యొకచోట చేరవలెనని కోరుకొను నపుడుగాని శ్రీరామముద్రికను హనుమంతుడు సీత కొసగిన సుందరకాండ ముప్పదియారవసర్గను త్రికాలములయందు పఠించి పఠనమునకు ముందు, అనంతరము పనసఫలములు కాని, మామిడిపండ్లు కాని నివేదించవలెను. (లేదా సంప్రాప్తఫలముల నివేదించవచ్చును.)

అట్టి మహిమోపేతమైన సద్గ్రన్థమునకు – పరమహనుమద్భక్తులగు శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారును, శ్రీ బోయనపల్లి కామేశ్వరరావుగారును – సుహృద్భావముతో అన్యోన్యసహకారముతో, ఉపయుక్తములైన పెక్కు విశేషములుచేర్చి జగద్ధితమైన వ్యాఖ్యానము రచించి భక్తజనుల కందించిరి.

సర్వదేవతాస్వరూపుడగు ఆంజనేయస్వామి వారిని సర్వదా రక్షించుగాత!!!

'ఇతి శమ్'

ఇట్లు
"హనుమదుపాసక"
**శిష్ట్లా చంద్రమౌళిశాస్త్రి**

# శుభాకాంక్ష

భాషాప్రవీణ, విద్యాప్రవీణ,
ఉ.వే.ప్ర.శ్రీమాన్ శ్రీమత్తిరుమల పురిహెళ్ల
**వేంకట కోనప్పాచార్య స్వామిగారు.**
రిటైర్డు ప్రిన్సిపాలు, ఆంధ్రయువతీ కళాశాల, రాజమండ్రి

శ్రీ రామాయణ మహాభారతములు రెండును సుప్రసిద్ధేతిహాసము లైనను అందు శ్రీరామాయణము చాల మంది భారతీయులచే నిత్యపారాయణ గ్రంథముగా ఆదరింపబడుచున్నది. అది ఉత్తమమైన వేదోపబృంహక గ్రంథరాజము. వేదాంతులకు ఉపనిషదర్థమంజూష, సాహితీ ప్రియులకు మహోత్తమకావ్యము. అందలి పాత్రలు ఆదర్శనీయములు. అందలి ప్రతి సూక్తియు హృదయ పేటికలో భద్రపరచు కొనవలసినది. అందలి ధర్మములు త్రికాలాబాధితములు, శ్రీ రామాయణ మందలి సుందరకాండము మహాప్రభావ సంపన్నము. పారాయణ మొనర్చు వారికి అభీష్ట ఫలముల నీయగల అమోఘశక్తిసంభరితమైనది. ప్రతిసర్గము ఒక మంత్రరాజమే. తజ్జపమువలన అభీష్టప్రాప్తి, అనిష్టనివృత్తి పొందిన ధన్యులెందరో కలరు.

శ్రీరామాయణము నందు అయిదవ కాండకు సుందర కాండము అని పేరు. ఈ పేరు చాలా విలక్షణమైనది. తక్కిన కాండములకు ఆ భాగములలోని కథా విషయమును బట్టి అయోధ్య, అరణ్య, కిష్కింధ, యుద్ధకాండములని పేరులు అమరియున్నవి. ఈ అయిదవ కాండకు "సుందర" కాండ మను పేరే అందలి నిగూఢార్థవైలక్షణ్యమును వెల్లడించుచున్నది.

"సుందరే సుందరో రామః సుందరే సుందరః కపిః ।
సుందరే సుందరీ సీతా సుందరే సుందరం వనమ్ ॥

సుందరే సుందరం కావ్యం ....." ఇత్యాదిగ నెందరో సుందరుల సౌందర్యము ఇందు వర్ణింపబడి యుండుటచే ఇది సుందరకాండ మనుట సమంజసమే. ఈ రీతిగా పై శ్లోకమునందు చెప్పబడిన సీతారామాంజనేయుల సౌందర్యము బాహ్య మైనట్టిది కాదు. అంతర మైనట్టిది. ఆ అంతర సౌందర్య వర్ణనము చేతనే ఇది సుందరకాండ మైనది.

ఆ ఆంతర సౌందర్యమేమి? అనగా ప్రకృతిబద్ధుడైన జీవునకు స్వస్వరూప, పరస్వరూప జ్ఞానములను బోధించి ఉజ్జీవింప జేయుట. అదియే ఇందు వ్యంగ్యార్థముగా చెప్పబడినది. ఇందు సీత జీవాత్మ, లంక ప్రకృతి, ఆంజనేయుడు ఆచార్యుడు, రాముడు

పరమాత్మ. ఇట్టి అర్థవిశేషము లెన్నియో సుందరకాండమునందు వ్యక్తమగుచున్నవి. వ్యాఖ్యాతలగు గోవిందరాజాచార్యాదులు ఆ విషయములను చక్కగా వ్యాఖ్యానించి యున్నారు. వేదాంతులు అట్టి అర్థవిశేషములను బట్టియే సుందరకాండ సౌందర్యమును మెచ్చుకొందురు.

కేవల సాహితీపరమైన దృష్టితో చూచినప్పటికిని ఇందు వ్యంగ్యార్థ వైభవమునకు లోటులేదు. ఇంచుమించు ప్రతి శ్లోకమునందు వాచ్యార్థమును మించినట్టి వ్యంగ్యార్థము అతి సుందరముగా గోచరించుచునే యుండును.

సీత జాడ తెలియక రాముడు, సుగ్రీవుడు, సీతాన్వేషణముకొరకై బయలుదేరిన వానరులు అందరును ఆందోళన నొందుచున్నారు. సీత కూడ రాముని జాడ తెలియక వేదనపడుచున్నది. చివరకు ఈ సుందరకాండలో ఆంజనేయుని కృషి ఫలించి అందరి ఆందోళనమును తొలగి సుఖపర్యవసాయి యైనది. కావుననే అశుభములు తొలగి శుభములను బడయుటకై సుందరకాండమును వివిధనియమములతో పారాయణము చేయుచున్నవారును చేయించుకొనుచున్న వారును ఉన్నారు. వారు తమ అభీష్టములను బడయుట చూచుచున్నాము.

ఇట్టి మహామహిమోపేతమైన, గంభీరార్థ బోధకమైన వాల్మీకి రామాయణాంతర్గత సుందరకాండను సుప్రసిద్ధములైన పూర్వవ్యాఖ్యాతల వ్యాఖ్యానములను పరిశీలించి ఆ యంశముల నన్నింటిని తమ సుబోధినీ వ్యాఖ్యలో చేర్చి సుబోధకమైన భాషలో, శైలిలో పండిత, సామాన్య, జన గ్రాహ్యముగా సుందరకాండ రహస్యార్థములను వివరించి శ్రీ సుబ్రహ్మణ్య కామేశ్వరరావుగార లిద్దరును తెలుగువారికి మహోపకారమొనర్చి యున్నారు. దాదాపు మూడు వేల శ్లోకములు గల సుందరకాండమును ప్రతిపదార్థ తాత్పర్య విశేషార్థములతో వివరింప బూనుట మహా సాహసిక కృత్యము. ఈ సాహసకృత్యములో శ్రీ సుబ్రహ్మణ్యము గారును, శ్రీ కామేశ్వరరావు గారును చరితార్థులైనట్లుగనే భావింపవచ్చును. ఇప్పటికి నలభై సర్గల వ్యాఖ్యానము పూర్తియైనది. ఐదు సంపుటములు వెలువడినవి. తక్కిన భాగము మరియొక మూడు సంపుటములు కావచ్చును. అవియును ఆ శ్రీనివాసుని దయా విశేషముచే తొందరగా వెలువడి ఈ మహనీయుల ఉభయుల కృషి పూర్తిగా సఫలము కావలెనని నా ఆకాంక్ష.

**ఎస్.టి.పి.వి.కోనప్పాచార్యులు**

# సుందర కాండ సౌందర్య దీప్తి

కళాప్రపూర్ణ, ఆంధ్రసరస్వతి,
సాహితీ రుద్రమ, ధర్మప్రచార భారతి,
**డా. ఊటుకూరి లక్ష్మికాన్తమ్మగారు**
బాపట్ల, గుంటూరు జిల్లా.

ప్రపంచ వాఙ్మయములలో ఆదికావ్యమై ప్రాణికోటియొక్క ముఖ్యముగ మానవులయొక్క జీవిత నైతిక ప్రమాణాదర్శ కావ్యరాజమై విలసిల్లినది వాల్మీకికృతమైన శ్రీమద్రామాయణము!

విగ్రహవంతమైన ధర్మలక్షణము, రామాయణకావ్య నాయకుడైన శ్రీరాముని మూర్తిగా నవతరించి 'త్యాగేనై కేన అమృత మశ్నుతే' అను నార్యోక్తి యుద్భవించుటకు ప్రాణభూతమైన, సీతారాముల మహిమోత్తరమైనట్టి దివ్యత్యాగమే శ్రీమద్రామాయణము నకు ఇతివృత్తము!

శ్రీరామావతారమునకు పూర్వము ప్రవర్తిల్లిన మత్స్య, కూర్మ, వరాహా ద్యవతారముల సమయముల యందు సంభవింపని శక్త్యవతరణము మహాసాధ్వీ శిరోరత్నమైన సీతామహాదేవీ రూపముగ త్రేతాయుగమున సంఘటితమైనది. అదియును శివభక్తుడును, మహాతపస్వియు, మహాపరాక్రమశాలియు నగు అంజనాసూనుని యంతటివానిచే "అహో రూప మహోబలం" అనుచు మహోత్కృష్టముగ వర్ణింపబడ దగినంతటి ఉజ్జ్వల బలరూప సంపన్నుడై విరాజిల్లియు, కామ క్రోధ మద మాత్సర్యా ద్యరిషట్కమును జయింపజాలక పరదారా వ్యామోహ వ్యసనముచే నంధీభూత చేతస్కుడును, స్వయంకృతాపరాధ తిరస్కృత తేజో బలసంపన్నుడునై, ఆసుర కృత్యాచరణముచే నసురయై, లోక విద్రావణుడుగా పరిణమిల్లిన రావణాసురుని సంహారణార్థము సంఘటితమైనది.

కావుననే ఆదికవి "సీతాయా శ్చరితం మహత్; పౌలస్త్యవధ మిత్యేవ" అని రామాయణ కావ్యమునకు ప్రయోజన రూపముగా సత్యేతరముకాని సార్థక్య భాషణ మొనరించి యున్నాడు.

అట్టి మహత్తర ప్రయోజన సాధనా రూపమైన రామాయణమునకు మహామాలారత్నముగా అభిలేఖ్యమైన అనుపమ సౌందర్యాంచిత మైన కాండము – సుందరకాండము.

జీవ తత్త్వమును, జీవేశ తత్త్వమును ఎన్నడును విడదీయరాని ప్రణయైక్య సంధాన ప్రతిరూపములు.

ఆసురీ గుణాహంకారాభినివిష్టుడై పరమమూర్ఖుడై త్రైలోక్యాపత్సంపాదనా పరాయణ కారణమైన స్వార్థ ప్రవృత్తి శిరోమణియైన రావణుని సంహరించి జగచ్ఛ్రేయమును కల్పించుటకై జగన్మాతయైన సీతా సీమంతినీమతల్లి శ్రీరామచంద్రుని యొక్క విరహమును అనుభవింపవలసి వచ్చినది.

అట్లగుట సృష్టికారణమైన జీవ జీవేశ దివ్య ప్రణయానుసంధానమునకే ముప్పు వాటిల్లినది. ఈ ప్రమాదముచే "సోऽ కామయత బహుస్యాం ప్రజాయే యేతి" అను పరమాత్మ నిర్దేశమునకు, మహా సంకల్పమునకు మహోపద్రవము కల్గి జగత్త్రయము సౌందర్యవిహీనము కాగల ప్రమాదస్థితి యేర్పడినది.

పరమాత్ముని సంకల్ప రూపమైన సృష్టికార్యమున మూల మాతృకయై ప్రకృతి తత్త్వముగ భువి నవతరించిన పరమ పతివ్రతా శిరోమణియైన సీతా మహాసాధ్వీ విరహముతో కృశించియున్న పరంధాముడైన శ్రీరామచంద్రునకును శ్రీరామ విరహముతో అహితమైన లంకాద్వీపమహారణ్యమున నశోకతరుచ్ఛాయను అత్యంత దుర్భర విరహాగ్నికీలా దందహ్యమానయై దురపిల్లుచున్న జనకాత్మజకును పున రనుసంధానమునకు తగు పథకమును ఊహించి మహాసృష్టి విరమణ రూపమగు మహా ప్రళయమును నివారించి తిరిగి త్రిభువనములును, పాంచభౌతికమగు దివ్య సౌందర్యానందానుభూతి నవిరామముగ పొందుటకు కారణభూతుడైనది మహాసత్త్వ సంపన్నుడు, అత్యంత బుద్ధిశాలి, మనోహర తేజోలంకారుడునగు హనుమయే.

కావుననే 'కర్మసు కౌశల'మును యోగముగా పొంది, 'బుద్ధిమతాం వరః' అను ప్రస్తుతి నొంది, అమేయ జవసత్త్వ సంపత్తి కలిగి, రామదూతగా మాత్రమే తన అభిధేయము శాశ్వతత్త్వము నొందవలె ననెడు త్యాగ సౌందర్య ప్రతిపత్తి ప్రవృత్తిగా కల మహనీయుడు హనుమ నాయకుడుగా కల కాండమును ఋషిసత్తముడైన వాల్మీకి మహాకవి సుందరకాండముగ భావించి కీర్తించి అఖిల జగచ్ఛ్రేయ స్సంపాదకుడౌ హనుమను యుక్తరీతిని సంభావించి సుందరకాండమున సంకీర్తన మొనరించినాడు.

ఇంత మహానుభావుకతా ప్రతిపన్నమైన సుందరకాండకు పూర్వగౌతమీ మండల నివసన పుణ్యకీర్తులు, మహనీయమూర్తులు, విద్వత్కవితా శిరోలంకారులు, అఖండ పాండితీ మండితులునైన శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్య భాగధేయులును, శ్రీ బోయనపల్లి కామేశ్వర సుధీ సంపన్నులును గొప్ప కృషి సలిపి పుణ్యకార్య

లవలేశమును సహింపక, నిరంతర దురంత దురిత మహార్ణవమగ్నులై విద్వేష కార్యాచరణ ధూర్తమతులైన మర్త్యులతో నిండియున్న నేటి స్వార్థపరపౌరజీవన వ్యవసాయకమైన దుర్జన సమాజమునకు విశ్రుత మగుటకును, ఈ భయంకర జనారణ్యమున ఈ ధార్మిక కావ్యము విస్తృత ప్రచారము నంది అపమార్గ ప్రవృత్తులగు నేటి దుర్జన సమాజమునం దొకింతయైన శోభనాస్పదమగు పరిణతి కల్గుటకొఱకును ఈ సుందరకాండమునకు అతిసరళమును సాంప్రదాయికము నగు పద్ధతిలో వ్యాఖ్యానమును రచించి ఆంధ్రలోకమునకు అందించిరి.

అంతేకాదు; గోవిందరాజీయము, తిలకము, వాసుదాసస్వామి మందరము మున్నగు వ్యాఖ్యాన విశేషములను కూడ అవసరమైనప్పుడు ఉటంకించుటచే రామాయణ మహాకావ్య వ్యాఖ్యాతల అందఱి భావములను ఒక్కచో చేర్చి మన కందించినవారైరి.

ఉదాహరణకు సుందరకాండయందలి ప్రధానమైన అంగులీయక ప్రదానఘట్టము నొకించుక పరిశీలింతము –

"వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః ।
రామనామాంకితం చేదం పశ్య దే వ్యంగులీయకమ్ ॥"

అని చెప్పుచు హనుమ సీతమ్మ చేతికి శ్రీరాముని నామాంకితమైన అంగులీయకమును అందించినాడు. ఇచట విశేష మేమనగా శ్రీరామచంద్రుని హస్తమునే ఆమె కందించి ఆ మహాపవిత్రమూర్తుల సుచిర విరహ శోకమునకు స్వస్తి పలికినాడు. ఈ అంగులీయక ప్రదాన ఘట్టమునకు నిజమైన అర్థ మిదియే. ఆ యంశమును విశదీకరించు –

"గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్ ।
భర్తారమివ సంప్రాప్తా జానకీ ముదితా ఽభవత్ ॥"

అను ఈ శ్లోకమున ఆ మహనీయార్థము ధ్వనించుచునే యున్నది. ఆ ధ్వనిని ఇందలి గోవిందరాజీయవ్యాఖ్య సుస్పష్టముగ మనకు హృద్గతము చేసినది.

ఇట్టి మహనీయసుబోధినీవివరణముతో సుందరకాండమును మన కందించిన శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్య వరేణ్యులకును శ్రీ బోయనపల్లి కామేశ్వర రాయ ధుర్యులకును మనఃపూర్వక ప్రణతిశతము నందించుచు విరమించుచున్నాను.

-ఊ. లక్ష్మీకాన్తమ్మ

# సుందర సుబోధిని

ఆచార్య **ఎమ్.ఆర్. అప్పారావుగారు**
మాజీ పార్లమెంటు సభ్యులు
మాజీ ఆంధ్రప్రదేశ ప్రభుత్వామాత్యులు
మాజీ ఆంధ్ర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు
ఉయ్యూరు గార్డెన్స్ - నూజివీడు, కృష్ణా జిల్లా.

శ్రీమద్వాల్మీకి రామాయణము సంపూర్ణ మానవుని జీవిత యాత్రను చిత్రించు మహాకావ్యము. ఆదర్శగ్రంథము. మానవేతిహాసమున జరిగే పరస్పర సంఘర్షణలకును, సమస్యలకును, చక్కని పరిష్కారమును సూచించు విజ్ఞానదీపిక. ఆధ్యాత్మిక సంపదకు ఆలవాలము. షట్కాండ పరిమితమైన ఈ రామాయణమున సుందరకాండము ఆధి వ్యాధి నివారణయును, సకల కార్యసిద్ధియును, విజయ సంపాదనమును కరతలామలకము చేయుచున్న పారాయణ గ్రంథము.

ముఖ్యముగా సీతారాముల చిత్తవృత్తినీ, రామభక్తుడైన హనుమానుని అసామాన్య ప్రజ్ఞా పాటవాన్నీ, వాక్చాతుర్యాన్నీ, శాస్త్రవైదుష్యాన్నీ, లోకజ్ఞతనూ, ఈ సుందరకాండము నిరూపించుచున్నది. అందువలననే సౌందర్యోపాసన ప్రాధాన్యమునొంది ఈ కాండము “సుందరకాండము” అను అన్వర్థనామము సంతరించు కొనినది. ఈ ఆయిదవ సంపుటమునందు సుందరకాండములోని 32వ సర్గనుండి 40వ సర్గవరకు ఆరు సర్గలు కలవు.

వాల్మీకి రామాయణమునకు ఆయా మతముల వారు స్వీయ మతాను గుణముగ ఎన్నో వ్యాఖ్యానములు రచించినారు. ఆ వ్యాఖ్యానములను అర్థము చేసికొని, భావములను గ్రహించుటకు, అపారపాండిత్యము, శాస్త్ర వైదుష్యము, మత సిద్ధాంత పరిచయమును, కావలయును. సామాన్యులకు అవి అందుబాటులో నుండవు. సామాన్యులను దృష్టిలో నుంచుకొని శ్లోకమును, శ్లోకములోని పద విభాగమును, అన్వయ క్రమమును, ప్రతి పదార్థమును ఆయా మత పరములైన వ్యాఖ్యాన విశేషములను, సంగ్రహముగా తాత్పర్యమును, ఈ అయిదవ సంపుటమున విశదము చేయుటచే “సుబోధిని” అను పేరు ఈ ఆంధ్ర వివరణమునకు తగియున్నది. సరళముగ, సుబోధకముగ, ఈ వివరణము వ్రాయబడినది. ఆ యా శ్లోకములలోని విశేషముల ననుసరించి వివరణ విపులముగా నుండుటచే పాఠకుల కవసర మనుకున్నచో వివరముగను, సంగ్రహ మనుకున్నచో సంగ్రహముగను సూచింపబడినది.

ఈ అయిదవ సంపుటమునందు 35వ సర్గలో హనుమంతుడు, తాను రామదూత యను నమ్మకమును సీతమ్మకు కల్గించును. 36వ సర్గలో అంగుళీయక ప్రదానము జరుగును. 37వ సర్గలో సీతమ్మను తాను తీసుకొని రాకపోవుటలోని ఔచిత్యము వివరింపబడినది. 38వ సర్గలో రామునకు నమ్మకము కలిగించు వాయస వృత్తాంత కథ వివరింపబడినది. 39వ సర్గలో హనుమత్సందేశమున్నూ, 40వ సర్గలో హనుమత్ప్రేషణమున్నూ వివరింపబడినది.

రామాయణముపట్ల అనాదిగా పెరిగిన ఆదరము, మరింత వృద్ధి యగుటకును, క్రమపద్ధతిలో సంస్కృతరామాయణము నర్థము చేసికొని విజ్ఞాన మార్జించుటకును, మానసికోల్లాసమును పొందుటకును, ఈ గ్రంథము మిక్కిలి ఉపకరించుచున్నది.

రామాయణమున కంతకును ఇట్టి సుబోధక వివరణ మవసరమే. ఇట్టి సత్కృషికి, సత్ప్రయత్నమునకును శ్రీ సుబ్రహ్మణ్యము గారికిని, శ్రీ కామేశ్వరరావు గారికిని దేవదేవుడైన శ్రీరామచంద్రుని అనుగ్రహము తప్పక లభ్యమై యుండును. మిగిలిన సంపుటములు గూడ త్వరలోనే వెలువడగలవనియు, అవి కూడ తప్పక సామాన్య పాఠకుల ఆదరణకు నోచుకొనగల వనియు ఆశించుచున్నాను. అట్టి శక్తి యుక్తులను ఈ ఉభయులకును తప్పక సర్వజగత్ స్వామియైన శ్రీరామచంద్రమూర్తి అనుగ్రహింప గలడనుటలో సందేహము లేదు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

**ఆచార్య ఎమ్.ఆర్.అప్పారావు**

# విజ్ఞాపనము

శ్రీరామప్రభువు కృపచే "ప్రియవార్తాధిగమము" అను ఈ నాల్గవ సంపుటముతో మా "సుందరకాండ సుబోధిని" సగభాగము ముద్రణము పూర్తి అయినది. ఇట్లు తెల్పుకొను భాగ్యము కలిగించిన రామదేవునకు మా కృతజ్ఞతా వందనము లర్పించుకొనుచున్నాము.

రామప్రభువు కృపవలననే ఇప్పటివఱకును కూడ మా కృషిలో సహృదయ మహనీయులైన పలువురు పండితవరేణ్యుల ఆశీస్సులను, ఆమోదప్రోత్సాహములను పొందగల్గుచున్నాము. మొట్టమొదటి సంపుటములో ఆశీర్వాదపూర్వకముగా మమ్ము అభినందించిన నలువురు విద్వద్వర్యులువలెనే అటుతరువాత కూడ ఒక్కొక్క సంపుటము ప్రకటించుటకు ముందు ప్రత్యేకముగా మేము దర్శించి అర్థించిన సౌజన్యపూర్ణులైన విఖ్యాతవిద్వాంసులు అందరును కూడ అవ్యాజమైన అనురాగముతో ఈ మూడు భాగములకును తమ అభినందన శుభాకాంక్షలు ప్రసాదించి మమ్ము ప్రోత్సహించినారు.

శ్రీరామదేవుని సేవగా మేము గావించుచున్న ఈ మాకృషికి మేము కోరునట్టి పరమార్థము కూడ దైవీభావసంపన్నులైన ఇట్టి పెద్దల, సహృదయుల ఆమోదాభిమానములే. అర్థార్జనము కూడ కలిసివచ్చు పద్ధతిలో ఆధ్యాత్మికగ్రంథములను ప్రకటించుచు కృతకృత్యులగుచున్న తత్కళాకోవిదులు కొందఱుండవచ్చును కాని ఇంత వఱకును మా అనుభవమును బట్టి ఆ కళ మాకు అలభ్యమని బోధపడినది.

ఏతదనుగుణముగానే మా అల్పసంతుష్టిని, అనల్పోత్సాహమును గమనించి మేము కోరిన ఈ మహనీయులెల్లరును తమ సహజసౌమనస్యముతో తమ ఆమోద ముద్రనొసగి ఈ పావనగ్రంథవిశిష్టతను ఇనుమడింప జేసియున్నారు. ఇట్టి సౌజన్య పూరితములైనవారి అమృతహృదయములకు కృతజ్ఞతాపూర్ణహృదయముతో ప్రణామాంజలి ఘటించుచున్నాము. అవ్యాజమైన గౌరవానురాగములతో మమ్ము గూర్చి వారు గావించిన ప్రశంసలు మా శక్తికి మించిన వైనను మా కృషిలో మాకు ఆత్మ విశ్వాసమును గూర్చి మమ్ము పురోగమింప జేయుచున్నవని సంతోషించుచున్నాము.

వాల్మీకిమహాకవి ప్రసాదించిన వాఙ్మయమధువును తన్మహర్షినిరూపితమైన గ్రంథపరమార్థమును ఆంధ్రసహృదయభక్తలోకమునకు ఏ కొంచె మందింప గల్గినను ఈ సుబోధిని ధన్యమే అనియు, మేము రామానుగ్రహమునకు పాత్రులమే అనియును ఆనందింతుము.

మఱియు ధర్మ సంవర్ధన నిరతుడును, ఆశ్రిత వత్సలుడును అగు సప్తగిరి స్వామి ఈ గ్రంథప్రకటనమునందు మాపై జూపుచున్న కృపను మఱల మఱల కృతజ్ఞతతో స్మరించుచున్నాము.

ఇట్లు
బుధజన విధేయులు,
**సుబోధినీ సమర్పకులు**

# విజ్ఞప్తి

జగత్ప్రాణదేవుని కరుణచే జనించిన తన నందనుని రూపలావణ్యములకు మురిసి జనని అంజన ఆతనిని ముద్దుగా సుందరా! యని పిలుచుచుండెడిదట. అట్లు సుందరుడగు హనుమ జగదేకసుందరుడగు నాథుని రాముని క్షేమవార్తను త్రిజగత్సుందరియైన జానకికి అంగుళీయక ప్రదాన పూర్వకముగా సుందరముగా తెలిపినాడు. రమణీయ రామాయణ సుందరకాండమునందు అది అతిమనోహరమైన ఘట్టము.

కాలప్రభావముచేత సీతాసతి జీవితముపై ఱోతనొంది శోకాంధకార నిమగ్నయై యుండగా హనుమ ఆమెకు ప్రియమైన ప్రియునివార్తను తెలిపి ఆమె హృదయమున జీవనసౌందర్యమును ప్రకాశింపజేసినాడు. ఈ సందర్భమును వాల్మీకి మహర్షి తన దివ్యచక్షువుతో దర్శించి పవిత్ర మధురాక్షర రూపమున మంత్రరాజమైన సత్కావ్యఖండముగా లోకమునకు ప్రసాదించినాడు. కాబట్టి ఈ ఘట్టము భక్తజనులకు అఘహరమై శోకసంతమస ముడిపి జీవితమున ఆనందప్రకాశము నొసగుచు శ్రేయోదాయకమై వెలయుచున్నది.

ఇట్టి పావనసుందరకృతిని యథాశక్తిగా సుబోధము గావించి ఆంధ్ర సోదరులకు సమర్పింపగల్గుచున్నందుకు సంతసించుచున్న ఈ మధ్యకాలమునందు మమ్ము బాధించిన అనారోగ్యాది అంతరాయ క్లేశములను దైవకృపచే దాటి యుంటిమని మనవిచేయుచున్నాము. అపుడపుడు కలుగుచుండు దైవికపరీక్షలను తట్టుకొని నిలచునప్పుడే మానవులకు చేసిన పుణ్యములు ఫలించి దైవకృప సిద్ధించుననిగదా పెద్దల సిద్ధాంతము. అట్టిదే మా అనుభవము! మా గురుదేవుల ఆదేశానుసారము ఇటీవలి కాలమున సరయూ త్రివేణి జాహ్నవీ బ్రహ్మకుండాది తీర్థములు సేవించుచు అయోధ్యా ప్రయాగ వారణాసీ హరిద్వారాది క్షేత్రములలో పరిమితకాలము కృతనివాసులమై రామదేవుని కృపనర్థించి తపించి చేసికొన్న సుకృతము, సంపాదించుకొన్న రామానుగ్రహము మమ్ము తప్పక కృతకృత్యులను చేయును అను మా ధైర్యవిశ్వాసములు ఫలించి మమ్ము వేధించిన క్లేశములు తొలగిన వని సగర్వముగ తెలుపుకొను భాగ్యము నేటికి గలిగినది. కొద్ది కాలవిలంబమైనను తిరిగి యత్నపరులము కాగలిగితిమి.

ఈ మహిమాన్వితకృతిని గూర్చి మేము యథాశక్తిగా చేయుచున్న మా కృషిని అభినందించుచు మేము దర్శించిన శతవృద్ధులు సంతత సీతారామ

హనుమద్ధ్యానైకచిత్తులు, హనుమత్ పరబ్రహ్మ ప్రతిరూపులు నైన శ్రీ చంద్రమౌళిశాస్త్రి గారును, నిరంతర రామాయణార్థానుసంధాన, ప్రవచననిరతులును, మాపై చిరతరానురక్తులును అగు శ్రీమాన్ కోనప్పాచార్య విద్వద్వర్యులును, ఇట్లే లోకమునకు సీతామాతృచరిత్రను సమర్పించుచున్న గౌతమీతీరమువారము అని మమ్ము గుఱించి తెలుపుకొనగనే అమితమైన ఆదరముతో సంభావించి ఈ సుందరకృతికి సౌందర్యదీప్తి నొసగిన విద్వత్కవయిత్రి, సీతాభారతీరుద్రమా లక్షణలసితయైన డా. లక్ష్మీకాంతమ్మ గారును మరియు బహుళములైన ముఖ్యకార్యములందు వ్యగ్రులై యుండియు మాయెడను, మా కృషియెడను ప్రత్యేకాభిమానముతో తమ అమూల్య సమయమును వెచ్చించి మా కోరిక మేరకు ప్రత్యేక ప్రాధాన్యము గల ఈ సంపుటమును తమ సహజసౌజన్యముతోడను కళాభినివేశముతోడను సమగ్రముగ పరిశీలించి తమ ఆమోదవచనములను అందజేసి మా నిరీక్షణమును ఫలింపజేసిన ఆచార్య ఎమ్. ఆర్. అప్పారాయ మహోదయులును అవ్యాజానురాగముతో మమ్ము ప్రోత్సహించిన విధము మేము మఱువజాలనిది.

ఈ కృతి ప్రకటనమున జరిగిన విలంబమున మమ్ము మఱల మఱల ప్రబోధించుచు మాపై కృప నెఱపిన తిరుమల వేంకట ప్రభు కృపావీక్షణములకు కృతజ్ఞులమై యున్నాము

ఇట్లు బుధవిధేయులు

**సుబోధినీసమర్పకులు**

# అంగుళీయక ప్రదానము

**శ్లో॥ వానరోఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః ।**
**రామనామాంకితం చేదం పశ్య దే వ్యంగుళీయకమ్ ॥**

**ప్రత్యయార్థం త వానీతం తేన దత్తం మహాత్మనా ।**
**సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి ॥**

తా॥ మహాత్మురాలవైన ఓ సీతాసాధ్వీ! నేను ప్రజ్ఞాశాలియైన శ్రీరాముని దూతను. ఆ మహాత్ముడు నీకు నమ్మకము కలుగుటకొఱకై ఇచ్చిన రామనామాంకితమైన అంగుళీయకమును గొని వచ్చితిని. చూడుము. పూర్వపాపఫలితమైన నీ దుఃఖ మంతయును నశించి పోయినది. ఊరడిల్లుము. నీకు మంగళము అగును.

– 36వ సర్గము 2,3 శ్లో.లు.

శ్రీరామాయ నమః
శ్రీరామశరణ గురుభ్యో నమః

# శ్రీమద్వాల్మీకి రామాయణము

# సుందర కాండము

## షోడశసర్గ

**శ్లో॥ ప్రశస్య తు ప్రశస్తవ్యాం సీతాం తాం హరిపుంగవః ।**
**గుణాభిరామం రామం చ పున శ్చింతాపరోఽభవత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** ప్రశస్య – తు – ప్రశస్తవ్యాం – సీతాం – తాం – హరిపుంగవః – గుణాభిరామం – రామం – చ – పునః – చింతాపరః – అభవత్ ॥

**అన్వయక్రమము :–** హరిపుంగవః ప్రశస్తవ్యాం తాం సీతాం గుణాభిరామం రామం చ ప్రశస్య, పునః చింతాపరః అభవత్.

**ప్రతిపదార్థము :–** హరిపుంగవః = వానరశ్రేష్ఠుడైన హనుమ, ప్రశస్తవ్యాం తాం సీతాం = ప్రశంసింపదగినట్టి ఆ సీతాదేవిని, గుణాభిరామం రామం చ = సద్గుణములచే ప్రకాశించుచున్నవాడగు శ్రీరాముని, ప్రశస్య = మిక్కిలి శ్లాఘించి, పునః = తిరిగి, చింతాపరః అభవత్ = చింతానిమగ్నుడయ్యెను.

**తాత్పర్యము :–** ఈ రీతిగా స్తుతింపదగిన చరిత్రముగల సీతమ్మను, సద్గుణములచే శోభించుచున్న శ్రీరాముని, ప్రశంసించి వానర శ్రేష్ఠుడైన హనుమ తిరిగి చింతానిమగ్నుడయ్యెను.

**శ్లో॥ స ముహూర్త మివ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః ।**
**సీతా మాశ్రిత్య తేజస్వీ హనుమా న్విలలాప హ ॥ 2**

**పదచ్ఛేదము :–** సః – ముహూర్తమ్ – ఇవ – ధ్యాత్వా – బాష్పపర్యాకులేక్షణః – సీతామ్ – ఆశ్రిత్య – తేజస్వీ – హనుమాన్ – విలలాప – హ ॥

**అన్వయక్రమము :–** సః తేజస్వీ హనుమాన్ సీతామ్ ఆశ్రిత్య ముహూర్తమ్ ఇవ ధ్యాత్వా బాష్పపర్యాకులేక్షణః (సన్) విలలాప హ.

**ప్రతిపదార్థము :–** సః తేజస్వీ హనుమాన్ = ఆ తేజశ్శాలియైన హనుమంతుడు, సీతామ్ ఆశ్రిత్య = సీతాదేవిని గూర్చి, ముహూర్తమ్ ఇవ ధ్యాత్వా = కొద్దిక్షణముల కాల మాలోచించి, బాష్పపర్యాకులేక్షణః (సన్) = కన్నీటితో నిండిన నేత్రములు

గలవాడై, విలలాప హ = విలపించెను.

**తాత్పర్యము :–** మహాతేజస్సంపన్నుడైన హనుమ, సీతాదేవి పరిస్థితినిగూర్చి, కొద్దిసేపు ఆలోచించి, దుఃఖబాష్పములతో నిండిన కన్నులు గలవాడై, ఈ విధముగా విలపింప సాగెను.

**శ్లో॥ మాన్యా గురువినీతస్య లక్ష్మణస్య గురుప్రియా ।**
**యది సీతాఽపి దుఃఖార్తా కాలో హి దురతిక్రమః ॥ 3**

**పదచ్ఛేదము :–** మాన్యా – గురువినీతస్య – లక్ష్మణస్య – గురుప్రియా – యది – సీతా – అపి – దుఃఖార్తా – కాలః – హి – దురతిక్రమః ॥

**అన్వయక్రమము :–** గురువినీతస్య లక్ష్మణస్య మాన్యా గురుప్రియా సీతా అపి దుఃఖార్తా యది, కాలః దురతిక్రమః హి.

**ప్రతిపదార్థము :–** గురువినీతస్య లక్ష్మణస్య = వసిష్ఠాది గురువులచే శిక్షింపబడినట్టి లక్ష్మణునకు, మాన్యా = పూజ్యురాలైనదియును, గురుప్రియా = మహనీయులకు ప్రీతిపాత్రురాలైనదియునగు, సీతా అపి = సీతాదేవిగూడ, దుఃఖార్తా యది = దుఃఖముచే దీనస్థితినొంది యున్నది యైనచో, కాలః = కాలము, దురతిక్రమః హి = అనుల్లంఘ నీయమైనదిగదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'లక్ష్మణస్య మాన్యా సీతా' = లక్ష్మణునియంతటి వానిచే ఉపాస్యదైవముగ సేవింపబడుచున్న సీత ఇట్టి కష్టములకు జిక్కుట ఆశ్చర్యకరమని భావము. భగవదిచ్ఛారూపమైన కాలమున ఎన్ని ఆశ్చర్యకరమైన సంఘటనలైనను జరుగవచ్చును; అవి సీతారాములకు సమ్మతములే; వారు భగవత్ స్వరూపులైనను, మానవశరీరమును ధరించినట్టివారు గాన మానవోచితమైన సుఖదుఃఖములను ప్రదర్శింప దలచియున్న వారే గదా!

**మహేశ్వరతీర్థులు :–** సకల జగద్రక్షకులైన రామలక్ష్మణులచే రక్షింపబడినట్టి సీతాదేవికి గూడ ఇట్టి మహాదుఃఖము సంభవించుట కాలవైపరీత్యమే.

**వాసుదాసస్వామి :–** లక్ష్మణస్య మాన్యా – 'యస్య దేవే పరా భక్తిర్యథా దేవే తథా గురౌ' అన్నట్లు భగవంతునం దెంత భక్తియో యంత భక్తి యన్నయందు గలవాడు. అటువంటి వానికి మాన్య సీతమ్మ. ప్రకృతి కతీత. అనగా అందరివలె పాంచభౌతికమైన

గర్భము నుండి, కర్మానుభవమునకై పుట్టినదిగాదు. అట్టి ఆమెకే వ్యసనము ప్రాప్తించినచో, నింక లోకమునందు కాలము నతిక్రమించువా డెవడు?

**తాత్పర్యము** :– వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, సుమిత్ర మున్నగు పెద్దలచే శిక్షణము నొందియున్న లక్ష్మణునకు ఉపాస్యదైవమైయుండి, శ్రీరామునకు ప్రియురాలైయున్న సీతాదేవిగూడ దుఃఖములకు చిక్కి దీనురాలై యున్నచో, ఈ లోకమున కష్టములను జయింప నెవరికి సాధ్యమగును? ఈ కష్టసుఖములను నియమించునది కాలమే గాన దానిని ఉల్లంఘించుట ఎవ్వరికిని సాధ్యముగాదు.

**శ్లో॥ రామస్య వ్యవసాయజ్ఞా లక్ష్మణస్య చ ధీమతః ।**
**నాత్యర్థం క్షుభ్యతే దేవీ గంగేవ జలదాగమే ॥ 4**

**పదచ్ఛేదము** :– రామస్య – వ్యవసాయజ్ఞా – లక్ష్మణస్య – చ – ధీమతః – న – అత్యర్థం – క్షుభ్యతే – దేవీ – గంగా – ఇవ – జలదాగమే ॥

**అన్వయక్రమము** :– రామస్య, ధీమతః లక్ష్మణస్య చ, వ్యవసాయజ్ఞా దేవీ, జలదాగమే గంగా ఇవ అత్యర్థం న క్షుభ్యతే.

**ప్రతిపదార్థము** :– రామస్య = శ్రీరామునియొక్కయు, ధీమతః లక్ష్మణస్య చ = ప్రజ్ఞావంతుడైన లక్ష్మణునియొక్కయు, వ్యవసాయజ్ఞా = ప్రయత్నమును గూర్చి తెలిసినదైన, దేవీ = సీతాదేవి, జలదాగమే = వర్షాకాలమునందు, గంగా ఇవ = గంగానదివలె, అత్యర్థం = మిక్కిలిగా, న క్షుభ్యతే = క్షోభనొందుటలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రామస్య లక్ష్మణస్య వ్యవసాయజ్ఞా – ఇట్టి దుర్గమమైన లంకయందు ఉన్నప్పటికిని సముద్రమును లంఘించి ఇచ్చటికివచ్చి తమ దివ్యాస్త్రములతో శత్రువును జయింపగలరని వారి పరాక్రమమును గూర్చి తెలిసినట్టిది సీత యని భావము. "అత్యర్థం న క్షుభ్యతే" – నిరాశను పొంది ప్రాణత్యాగము నొనరించుకొనలేదని భావము. 'జలదాగమే గంగా ఇవ' – వర్షాకాలమునందు పొంగి పొర్లునట్టి క్షుద్రనదులవలెగాక గంగ ఎల్లప్పుడును కల్లోలము నొందక యుండునది యని భావము.

**గోవిందరాజీయము** :– రామస్య వ్యవసాయజ్ఞా – "అప్యహం జీవితం జహ్యాం" అని ఆశ్రిత సంరక్షణమును గూర్చి పూర్వము శ్రీరాముడు ప్రతిజ్ఞ చేసిన విధము ఇట సీత స్మరించుచున్నది. 'ధీమతః లక్ష్మణస్య' మాయామృగముయొక్క యథార్థరూపమును

సకాలమున గుర్తించి ఆ సందర్భమునందు శ్రీరామునికంటెను ఆశ్రితసంరక్షణమున శ్రద్ధ వహించిన వాడై సీతమ్మ రక్షణమే ప్రధానమని భావించిన బుద్ధిశాలి గదా లక్ష్మణుడు!

**వాసుదాసస్వామి** :- సుమిత్ర కొడుకగు లక్ష్మణుని బుద్ధి ఎప్పుడును ప్రమాద పడునదిగాదు. మాయామృగవిషయమున సీతారాము లిరువురును ప్రమాదపడినను లక్ష్మణుడు ప్రమాదపడలేదు. అది మాయామృగ మనియే చెప్పెను. మారీచుని కూతవిషయమున సీత పొరబడినను లక్ష్మణుడు ప్రమాదపడలేదు. అతడట్టి ధీమంతుడు. అతని బుద్ధి చక్కని ఆలోచనలతో నిండియుండును.

**తాత్పర్యము** :- అనుపమాన పరాక్రమశాలియైన శ్రీరామునియొక్కయు అమిత బుద్ధిశాలియైన లక్ష్మణునియొక్కయు ప్రయత్నతీవ్రతనుగూర్చి నమ్మకము గలదికాబట్టి సీతాదేవి వర్షాకాలమునందు పొంగి పొరలు ఇతర నదులవలెగాక, నిత్యము ప్రశాంతముగనే యుండు గంగానదివలెనే యుండెను. విపరీతమైన క్షోభ నొందుట లేదు.

**శ్లో॥ తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణాం ।**
**రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా ॥ 5**

**పదచ్ఛేదము** :- తుల్యశీలవయోవృత్తాం - తుల్యాభిజనలక్షణాం - రాఘవః - అర్హతి - వైదేహీం - తం - చ - ఇయమ్ - అసితేక్షణా ॥

**అన్వయక్రమము** :- తుల్యశీలవయోవృత్తాం తుల్యాభిజనలక్షణాం వైదేహీం రాఘవః అర్హతి; తం చ ఇయమ్ అసితేక్షణా అర్హతి.

**ప్రతిపదార్థము** :- తుల్యశీలవయోవృత్తాం = సమానమైన స్వభావము, వయస్సు చరిత్రము కలిగినట్టి, తుల్యాభిజనలక్షణాం = సమానమైన వంశమును, ఉత్తమలక్షణములను కలిగినట్టి, వైదేహీం = సీతాదేవిని (పొందుటకు), రాఘవః అర్హతి = శ్రీరాముడు తగియున్నాడు, తం చ = ఆ శ్రీరాముని (పొందుటకును), ఇయం అసితేక్షణా అర్హతి = ఈ సౌందర్యవతి తగియున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'తుల్యాభిజనలక్షణాం' = సాముద్రికశాస్త్రమునందు చెప్పబడిన లక్షణములని భావము. ఈ పరస్పరార్హత యుండుటచేతనే సీతమ్మకు ఇతరపురుషుని యందును, శ్రీరామునికి ఇతరస్త్రీయందును దృష్టి లేకుండుట సహజమని సూచింప బడినది.

**గోవిందరాజీయము :–** 'తుల్యాభిజనలక్షణాం' – షోడశవర్షవయస్కుడైన శ్రీరామునకు ద్వాదశవత్సరవయస్కురాలైన జానకి తుల్యవయస్కురాలే యని చెప్పబడుచున్నది. తుల్యవయోవృత్తము లనగా అనురూపమైన వయస్సు, చరిత్రము, స్వభావము మొదలగునవి.

**తుల్యాభిజనలక్షణాం :–** సార్వభౌమ లక్షణములు గలిగిన రామునకు పట్టమహిషిగాగల సాముద్రికశాస్త్ర లక్షణములు కలిగియున్నట్టిది సీత అని భావము. లోకములో సామాన్యముగ సౌందర్యాది సల్లక్షణములు గల పురుషునకు అనురూపమైన భార్యయును, సౌందర్యాది గుణాతిశయముగల వనితకు అనురూపమైన వరుడును దొరకుట అసంభవముగా నుండును. సీతారాముల దాంపత్యమునందు అట్టి అన్యోన్యానురూప్యము లభించినది యనుట ఆశ్చర్యకరమైన విషయము. "అసితేక్షణ" యనుటచే కమలపత్రాక్షుడైన శ్రీరామునికంటెను గూడ సీతమ్మ నయనసౌందర్యము అత్యధికమైనదని తెలుపబడినది. అందుచేతనే శ్రీరాముడు "న జీవేయం క్షణమపి వినా తామ్ అసితేక్షణాం' అని వగచెను.

**వాసుదాసస్వామి :–** ఇప్పుడు శ్రీరామచంద్రమూర్తికి ముప్పదితొమ్మిది సంవత్సరములు; సీతమ్మకు ముప్పదిరెండు సంవత్సరములు. సీతారాములు వయస్సునం దెట్లు తగియున్నారో శీలమునం దట్లే తగియున్నారు. ఎట్టులనిన – రామచంద్రమూర్తి 'వానియెడనుండెనేని యేదేని దోషమద్ది గర్హ్యంబుకాదు సదాళుల'కని చెప్పెను. సీతమ్మయో! "వధకు పాత్రులపట్లన్ గృపజూపవలయు సజ్జను; డపరాధము చేయనట్టి యతడుం గలడే" యని చెప్పెను.

సాముద్రిక శాస్త్ర ప్రకారము సార్వభౌముడుకాగల చిహ్నములు రామచంద్రు నందు గలవు. అట్టివానికి భార్యగా నుండదగిన స్త్రీకి ఉండవలసిన లక్షణములు సీతమ్మ యందున్నవి. ఇక వంశమునందు శ్రీరాముడు సూర్యవంశమున ప్రసిద్ధికెక్కిన వాని కుమారుడు. సీతమ్మ చంద్రవంశమున జగత్ప్రసిద్ధిగన్న జనకుని కూతురు.

"అయోధ్యాపురనేతారం మిథిలాపురనాయకీమ్,
రాఘవాణా మలంకారం వైదేహానా మలంక్రియామ్,

రఘూణాం కులదీపం చ నిమీనాం కులదీపికామ్,
సూర్యవంశసముద్భూతం సోమవంశసముద్భవామ్,

సర్వలోకవిధాతారం సర్వలోకవిధాయినీమ్,
లోకాభిరామం శ్రీరామమ్ అభిరామాం చ మైథిలీమ్,

అన్యోన్యసదృశావేతౌ త్రైలోక్యగృహదంపతీ."

(హనుమద్విరచిత సీతారామ స్తోత్రము)

కావుననే న్యాసవిద్యయందు శరణాగతి ఇరువురకును చెప్పబడెను. శ్రీరాముడు స్మరణమాత్రసంతుష్టుడు. జానకమ్మ ప్రణతిప్రసన్న.

**తాత్పర్యము** :- అనురూపమైన ఉత్తమస్వభావము, యౌవనము, చరిత్రము, ఉన్నతవంశము, సాముద్రిక శాస్త్రప్రసిద్ధమైన శుభలక్షణములను కలిగియున్న ఈమెను భార్యగా బడయుటకు శ్రీరాముడే తగియున్నాడు. లోకోత్తర శుభలక్షణ విశిష్టుడైన శ్రీరాముని భర్తగా పొందుటకు ఉత్తమమైన గుణ సౌందర్యాది సర్వయోగ్యతలు కల్గిన ఈ జానకియే తగియున్నది.

**శ్లో॥ తాం దృష్ట్వా నవహేమాభాం లోకకాంతా మివ శ్రియమ్ ।**
**జగామ మనసా రామం వచనం చేద మబ్రవీత్ ॥ 6**

**పదచ్ఛేదము** :- తాం - దృష్ట్వా - నవహేమాభాం - లోకకాంతామ్ - ఇవ - శ్రియమ్ - జగామ - మనసా - రామం - వచనం - చ - ఇదమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- నవహేమాభాం లోకకాంతాం శ్రియమ్ ఇవ (స్థితాం) తాం దృష్ట్వా మనసా రామం జగామ. ఇదం వచనం చ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- నవహేమాభాం = నూతన సువర్ణచ్ఛాయ గలదియును, లోకకాంతాం శ్రియం ఇవ = లోకమును మోహింపజేయు లక్ష్మివలె, (స్థితాం = ఉన్న) తాం = ఆ సీతాదేవిని, దృష్ట్వా = చూచి, మనసా = మనస్సుచేత, రామం జగామ = రాముని చేరెను. ఇదం వచనం చ అబ్రవీత్ = ఈ మాటను గూడ పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :- 'నవహేమాభాం' - 'హిరణ్మయీం లక్ష్మీం' అని శ్రీసూక్తమున చెప్పినట్లు సీతమ్మ హేయగుణరహిత యగు సుగుణములరాశి. పుటము పెట్టిన బంగారము. లోకకాంతా మివ శ్రియమ్ - సీతమ్మ లోకేశ్వరి యయిన శ్రీమహాలక్ష్మి యనియే హనుమ స్పష్టముగ చెప్పుచున్నాడు. సకల సమృద్ధి స్వరూపయగు లక్ష్మియున్న చోట శ్రీనివాసుడుండును. కనుక శ్రుతులు సీతమ్మను భగవంతుడైన శ్రీరామునికన్న భిన్నమని చెప్పవు.

**తాత్పర్యము** :- లోకమునంతను ప్రకాశింపచేయు లక్ష్మివలె, తప్తకాంచన ప్రభలతో విరాజిల్లు ఆ సీతాదేవిని గాంచి, హనుమ ఒక్క మారుగ తన మనస్సునందు రాముని

స్మరించి, ఈరీతిగా పలుకదొడగెను.

**శ్లో॥ అస్యా హేతో ర్విశాలాక్ష్యా హతో వాలీ మహాబలః ।**
**రావణప్రతిమో వీర్యే కబంధశ్చ నిపాతితః ॥ 7**

**పదచ్ఛేదము :–** అస్యాః – హేతోః – విశాలాక్ష్యాః – హతః – వాలీ – మహాబలః – రావణప్రతిమః – వీర్యే – కబంధః – చ – నిపాతితః ॥

**అన్వయక్రమము :–** విశాలాక్ష్యాః అస్యాః హేతోః మహాబలః వాలీ హతః. వీర్యే రావణప్రతిమః కబంధః చ నిపాతితః.

**ప్రతిపదార్థము :–** విశాలాక్ష్యాః అస్యాః హేతోః = విశాలములైన కన్నులుగల ఈమెనిమిత్తమే, మహాబలః వాలీ హతః = మహాబలుడైన వాలి సంహరింపబడినాడు, వీర్యే = పరాక్రమమునందు, రావణప్రతిమః = రావణ సమానుడైనట్టి, కబంధః చ = కబంధుడును, నిపాతితః = కూల్చివేయబడినాడు.

**తాత్పర్యము :–** ఈ సౌందర్యవతిని గూర్చియేగదా మహాబలాఢ్యుడైన వాలిని శ్రీరాముడు హతమార్చెను! పరాక్రమమునందు రావణునికి సాటిరాగల కబంధుని ఆతడు సంహరించినదిగూడ ఈ సీతాదేవి నిమిత్తమే గదా!

**శ్లో॥ విరాధశ్చ హత స్సంఖ్యే రాక్షసో భీమవిక్రమః ।**
**వనే రామేణ విక్రమ్య మహేంద్రేణేవ శంబరః ॥ 8**

**పదచ్ఛేదము :–** విరాధః – చ – హతః – సంఖ్యే – రాక్షసః – భీమవిక్రమః – వనే – రామేణ – విక్రమ్య – మహేంద్రేణ – ఇవ – శంబరః ॥

**అన్వయక్రమము :–** సంఖ్యే మహేంద్రేణ శంబరః ఇవ, వనే భీమవిక్రమః విరాధః రాక్షసః రామేణ విక్రమ్య హతః.

**ప్రతిపదార్థము :–** సంఖ్యే = యుద్ధమునందు, మహేంద్రేణ = దేవేంద్రునిచే, శంబరః ఇవ = శంబరాసురుడువలె, వనే = అరణ్యమునందు, రామేణ = శ్రీరామునిచే, విక్రమ్య = విజృంభించి, భీమవిక్రమః = భయంకరమైన శౌర్యము గలిగినట్టి, విరాధః రాక్షసః = విరాధుడను రక్కసుడు, హతః = పరిమార్చబడినాడు.

**తాత్పర్యము :–** ఈ సీతాదేవి నిమిత్తమేగదా, పూర్వము భీకరమగు యుద్ధమునందు, దేవేంద్రుడు శంబరాసురుని సంహరించినట్లు శ్రీరాముడు అరణ్యమునందు తన పరాక్రమమునుజూపి భయంకరవిక్రమమును జూపుచున్న విరాధుని అల్పకాలములోనే హతమార్చినాడు.

**శ్లో॥ చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్ ।**
**నిహతాని జనస్థానే శరై రగ్నిశిఖోపమైః ॥ 19**

**పదచ్ఛేదము** :- చతుర్దశసహస్రాణి - రక్షసాం - భీమకర్మణామ్ - నిహతాని - జనస్థానే - శరైః - అగ్నిశిఖోపమైః ॥

**అన్వయక్రమము** :- జనస్థానే భీమకర్మణాం రక్షసాం చతుర్దశసహస్రాణి అగ్నిశిఖోపమైః శరైః నిహతాని.

**ప్రతిపదార్థము** :- జనస్థానే = జనస్థానమునందు, భీమకర్మణాం రక్షసాం = భీకర కృత్యములుగల రాక్షసులయొక్క, చతుర్దశసహస్రాణి = పదునాల్గువేలు, అగ్నిశిఖోపమైః శరైః = అగ్నిజ్వాలలవంటి బాణములచే, నిహతాని = సంహరించబడిరి.

**తాత్పర్యము** :- ఈ సీతాదేవి నిమిత్తమేగదా, ఆనాడు (శ్రీరాముడు) జనస్థానమునందు పదునాల్గు వేలమంది మహాభయంకరులైన దుష్టరాక్షసులను అగ్నిజ్వాలలవంటి తన బాణపరంపరలచే నేలగూల్చినాడు.

**శ్లో॥ ఖరశ్చ నిహత స్సంఖ్యే త్రిశిరాశ్చ నిపాతితః ।**
**దూషణశ్చ మహాతేజా రామేణ విదితాత్మనా ॥ 10**

**పదచ్ఛేదము** :- ఖరః - చ - నిహతః - సంఖ్యే - త్రిశిరాః - చ - నిపాతితః - దూషణః - చ - మహాతేజాః - రామేణ - విదితాత్మనా ॥

**అన్వయక్రమము** :- సంఖ్యే విదితాత్మనా రామేణ ఖరః చ నిహతః; త్రిశిరాః చ నిపాతితః; మహాతేజాః దూషణః చ నిపాతితః.

**ప్రతిపదార్థము** :- విదితాత్మనా రామేణ = ఆత్మతత్త్వవేత్తయైన శ్రీరామునిచే, సంఖ్యే = సంగ్రామమునందు, ఖరః చ నిహతః = ఖరుడు అను రాక్షసుడును సంహరింపబడినాడు, త్రిశిరాః చ నిపాతితః = త్రిశిరుడను రక్కసుడును నేలగూల్చ బడినాడు, మహాతేజాః దూషణశ్చ (నిపాతితః) = మహాపరాక్రమశాలియైన దూషణు డను అసురుడును కూల్చబడినాడు.

**తాత్పర్యము** :- మహాప్రభావసంపన్నుడైన శ్రీరాముడు ఈమెకొరకే గదా ఆనాడు సంగ్రామమునందు ఖరుడను రక్కసు గూల్చినాడు; త్రిశిరుడను అసురుని రూపుమాపి నాడు; మహాపరాక్రమోపేతుడైన దూషణాసురునిగూడ నేలగూల్చినాడు.

**శ్లో॥ ఐశ్వర్యం వానరాణాం చ దుర్లభం వాలిపాలితమ్ ।**
**అస్యా నిమిత్తే సుగ్రీవః ప్రాప్తవాన్ లోకసత్కృతమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– ఐశ్వర్యం – వానరాణాం – చ – దుర్లభం – వాలిపాలితమ్ – అస్యాః – నిమిత్తే – సుగ్రీవః – ప్రాప్తవాన్ – లోకసత్కృతమ్ ॥

**అన్వయక్రమము** :– అస్యాః నిమిత్తే వాలిపాలితం లోకసత్కృతం దుర్లభం వానరాణామ్ ఐశ్వర్యం సుగ్రీవః ప్రాప్తవాన్.

**ప్రతిపదార్థము** :– అస్యాః నిమిత్తే = ఈమె కారణముగా, లోకసత్కృతం = లోకముచే ప్రశంసింపబడినట్టి, దుర్లభం = అనితరలభ్యమైనట్టి, వాలిపాలితం = వాలిచే పరిపాలింపబడుచున్న, వానరాణామ్ ఐశ్వర్యం = వానరుల సామ్రాజ్యమును, సుగ్రీవః = సుగ్రీవుడు, ప్రాప్తవాన్ = పొందెను.

**తాత్పర్యము** :– ఈ మహాత్మురాలి కారణముగానే లోకముచే మెచ్చబడినట్టి, వాలివశము నందుండి, పరులకు కన్నెత్తి చూచుట కశక్యమైనట్టి, వానరసామ్రాజ్యమును సుగ్రీవుడు అనాయాసముగా సంపాదించుకొనగల్గినాడు.

**శ్లో॥ సాగరశ్చ మయా క్రాంత శ్రీమా న్నదనదీపతిః ।**
**అస్యా హేతో ర్విశాలాక్ష్యాః పురీ చేయం నిరీక్షితా ॥ 12**

**పదచ్ఛేదము** :– సాగరః – చ – మయా – క్రాంతః – శ్రీమాన్ – నదనదీపతిః – అస్యాః – హేతోః – విశాలాక్ష్యాః – పురీ – చ – ఇయం – నిరీక్షితా ॥

**అన్వయక్రమము** :– విశాలాక్ష్యాః అస్యాః హేతోః నదనదీపతిః శ్రీమాన్ సాగరః చ మయా క్రాంతః; ఇయం పురీ చ నిరీక్షితా;

**ప్రతిపదార్థము** :– విశాలాక్ష్యాః అస్యాః హేతోః = విశాలాక్షియైన ఈ సీతాదేవిని గురించియే, నదనదీపతిః = సమస్తనదీనదములకును ప్రభువైనట్టి, శ్రీమాన్ సాగరః = శ్రీమంతుడైన సముద్రుడు, మయా క్రాంతః = నాచే దాటబడెను; ఇయం పురీ చ = ఈ లంకానగరమున్ను, మయా = నాచే, నిరీక్షితా = చక్కగా పరికింపబడినది.

**తాత్పర్యము** :– ఈ లోకోత్తరసుందరి నిమిత్తమే గదా సమస్త నదీనదములకును ప్రభువై, నిరుపమాన శోభాసంపదలకు నిలయమైయున్న మహాసాగరమును నేను దాటివచ్చితిని; ఈమెను గూర్చియే కదా లంకనంతను నేను పరిశోధించి చూచితిని!

**శ్లో॥ యది రామ స్సముద్రాంతాం మేదినీం పరివర్తయేత్ ।**
**అస్యాః కృతే జగచ్చాపి యుక్త మిత్యేవ మే మతిః ॥ 13**

**పదచ్ఛేదము** :- యది - రామః - సముద్రాంతాం - మేదినీం - పరివర్తయేత్ - అస్యాః - కృతే - జగత్ - చ - అపి - యుక్తమ్ - ఇతి - ఏవ - మే - మతిః ॥

**అన్వయక్రమము** :- అస్యాః కృతే రామః సముద్రాంతాం మేదినీం, జగత్ చ పరివర్తయేత్ యది, యుక్తం ఇతి ఏవ మే మతిః.

**ప్రతిపదార్థము** :- అస్యాః కృతే = ఈమె నిమిత్తమై, రామః = శ్రీరాముడు, సముద్రాంతాం మేదినీం = సముద్రములవరకునుగల భూమిని, జగత్ చ అపి = సమస్త జగత్తును గూడ, పరివర్తయేత్ యది = తలక్రిందులు చేసినయెడల, యుక్తమ్ ఇతి ఏవ = యుక్తము అనియే, మే మతిః = నా యభిప్రాయము.

**తాత్పర్యము** :- ఈ మహనీయురాలిని గూర్చి శ్రీరాముడు చతుస్సముద్ర పర్యంతమును గల ఈ భూమినంతను, అట్లే సమస్త జగత్తును కూడ తలక్రిందులు చేసివైచినను సముచితమైన కృత్యమే యగునని నా నిశ్చయము.

**శ్లో॥ రాజ్యం వా త్రిషు లోకేషు సీతా వా జనకాత్మజా ।**
**త్రైలోక్యరాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలామ్ ॥ 14**

**పదచ్ఛేదము** :- రాజ్యం - వా - త్రిషు - లోకేషు - సీతా - వా - జనకాత్మజా - త్రైలోక్యరాజ్యం - సకలం - సీతాయాః - న - ఆప్నుయాత్ - కలామ్ ॥

**అన్వయక్రమము** :- త్రిషు లోకేషు రాజ్యం వా, జనకాత్మజా సీతా వా, (కిం శ్రేష్ఠం ఇతి శంకాయాం) సకలం త్రైలోక్యరాజ్యం, సీతాయాః కలాం న ఆప్నుయాత్.

**ప్రతిపదార్థము** :- త్రిషు లోకేషు రాజ్యం వా = ముల్లోకముల సామ్రాజ్యమా? జనకాత్మజా సీతా వా = జనకతనయ యగు సీతాదేవియా? (కిం శ్రేష్ఠమ్ ఇతి శంకాయాం = ఏది గొప్పదను శంక కలిగినప్పుడు) సకలం త్రైలోక్యరాజ్యం = సమస్తమైన త్రిభువన సామ్రాజ్యము, సీతాయాః = సీతాదేవియొక్క, కలాం న ఆప్నుయాత్ = ఒక్క అంశమును గూడ పొందజాలదు.

**తాత్పర్యము** :- ఒకవంక ముల్లోకముల ఆధిపత్యము, వేఱొకవంక సీతాదేవి, యున్నప్పుడు ఈ రెండింటిలో ఏది గొప్పదని సంశయము కల్గినచో ఆ త్రిభువన సామ్రాజ్యము సీతాదేవి కాలి కొనగోటికికూడ సరిపోదు అనియే చెప్పవలెను.

**శ్లో॥ ఇయం సా ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః ।**
**సుతా జనకరాజస్య సీతా భర్తృదృఢవ్రతా ॥ 15**

**పదచ్ఛేదము :–** ఇయం – సా – ధర్మశీలస్య – మైథిలస్య – మహాత్మనః – సుతా – జనకరాజస్య – సీతా – భర్తృదృఢవ్రతా ॥

**అన్వయక్రమము :–** భర్తృదృఢవ్రతా, ధర్మశీలస్య మైథిలస్య మహాత్మనః జనకరాజస్య సుతా, సా సీతా ఇయమ్.

**ప్రతిపదార్థము :–** భర్తృదృఢవ్రతా = పతిభక్తి పరాయణురాలైనదియు, ధర్మశీలస్య = ధర్మాచరణపరుడైనట్టి, మహాత్మనః మైథిలస్య జనకరాజస్య = మహాత్ముడైన మిథిలాపతియగు జనకునియొక్క, సుతా సా సీతా = తనయ యగు ఆ సీతాదేవి, ఇయమ్ = ఈమెయే!

**తాత్పర్యము :–** పతిభక్తి పరాయణురాలైనట్టిదియును, ధర్మశీలుడు, మహనీయుడు, మిథిలాపతి యగు జనకుని కుమార్తెయైనట్టియునగు ఆ సీతాదేవి ఈమెయే! సందేహము లేదు.

**శ్లో॥ ఉత్థితా మేదినీం భిత్త్వా క్షేత్రే హలముఖక్షతే ।**
**పద్మరేణునిభైః కీర్ణా శుభైః కేదారపాంసుభిః ॥ 16**

**పదచ్ఛేదము :–** ఉత్థితా – మేదినీం – భిత్త్వా – క్షేత్రే – హలముఖక్షతే – పద్మరేణునిభైః – కీర్ణా – శుభైః – కేదారపాంసుభిః ॥

**అన్వయక్రమము :–** హలముఖక్షతే క్షేత్రే మేదినీం భిత్త్వా, పద్మరేణునిభైః శుభైః కేదారపాంసుభిః కీర్ణా, ఉత్థితా.

**ప్రతిపదార్థము :–** హలముఖక్షతే క్షేత్రే = నాగేటిమొనతో దున్నబడినట్టి పొలమునందు, మేదినీం భిత్త్వా = భూమిని బ్రద్దలుచేసికొని, పద్మరేణునిభైః = తామరపుప్పొడివంటి, శుభైః కేదారపాంసుభిః = మంగళకరమైన పొలమునందలి మట్టికణములచే, కీర్ణా = నిండియున్నదై, ఉత్థితా = మీదికి వెడలివచ్చినట్టిది, (ఇయమ్ = ఈమెయే).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మేదినీం భిత్త్వా ఉత్థితా = ఈమె భూమిజ గావుననే అయోనిజయగుటచే లోకోత్తరమైన సౌందర్యము పొందగల్గి యున్నదని హనుమ ఊహించుచున్నాడు.

**తాత్పర్యము :–** యాగనిర్వహణము కొరకై నాగలితో దున్నిన పవిత్ర క్షేత్రమునుండి భూమిని బ్రద్దలు చేసికొని, తామర పుప్పొడివంటి ఆ పొలమునందలి పవిత్రమైన ధూళికణములను ఒడలిపై ధరించి, ఈ లోకమున వెలసిన మహనీయురాలు ఈమెయే.

**శ్లో॥ విక్రాంత స్యార్యశీలస్య సంయుగే ష్వనివర్తినః ।**
**స్నుషా దశరథ స్యైషా జ్యేష్ఠా రాజ్ఞో యశస్వినీ ॥ 17**

**పదచ్ఛేదము :–** విక్రాంతస్య – ఆర్యశీలస్య – సంయుగేషు – అనివర్తినః – స్నుషా – దశరథస్య – ఏషా – జ్యేష్ఠా – రాజ్ఞః – యశస్వినీ.

**అన్వయక్రమము :–** విక్రాంతస్య, ఆర్యశీలస్య సంయుగేషు అనివర్తినః దశరథస్య రాజ్ఞః జ్యేష్ఠా యశస్వినీ స్నుషా ఏషా.

**ప్రతిపదార్థము :–** విక్రాంతస్య = పరాక్రమశాలియును, ఆర్యశీలస్య = ఉత్తమ చరిత్రగలవాడును, సంయుగేషు అనివర్తినః = యుద్ధమునందు వెన్నుజూపని వాడు నగు, రాజ్ఞః దశరథస్య = మహారాజైన దశరథునికి, యశస్వినీ = గొప్పకీర్తిగల్గిన, జ్యేష్ఠా స్నుషా = పెద్దకోడలు, ఏషా = ఈమెయే.

**తాత్పర్యము :–** పరాక్రమమునకును, ఉత్తమచరిత్రకును, సాహసమునకును, పేరుబడిన దశరథమహారాజునకు తగినట్టి సత్కీర్తి గల్గిన పెద్దకోడలు ఈమెయే!

**శ్లో॥ ధర్మజ్ఞస్య కృతజ్ఞస్య రామస్య విదితాత్మనః ।**
**ఇయం సా దయితా భార్యా రాక్షసీవశ మాగతా ॥ 18**

**పదచ్ఛేదము :–** ధర్మజ్ఞస్య – కృతజ్ఞస్య – రామస్య – విదితాత్మనః – ఇయం – సా – దయితా – భార్యా – రాక్షసీవశమ్ – ఆగతా ॥

**అన్వయక్రమము :–** ధర్మజ్ఞస్య, కృతజ్ఞస్య, విదితాత్మనః రామస్య దయితా భార్యా సా ఇయం రాక్షసీవశమ్ ఆగతా.

**ప్రతిపదార్థము :–** ధర్మజ్ఞస్య = ధర్మవేత్తయును, కృతజ్ఞస్య = కృతజ్ఞుడును, విదితాత్మనః = ఆత్మజ్ఞానియునగు, రామస్య = రామునకు, దయితా = ప్రియురాలయినట్టి, భార్యా = ధర్మపత్నియగు, సా ఇయం = ఆ ఈమె, రాక్షసీవశమ్ ఆగతా = రాక్షసస్త్రీల వశమై యున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'రాక్షసీవశమ్' ఆగతా – అలంఘ్యమైన కాలము యొక్క ప్రభావము చేతనని భావము.

**తాత్పర్యము :–** పరమధార్మికుడైన, మహాత్ముడైన శ్రీరామునకు ప్రియురాలుగానున్న ఈ పూజ్యురాలుగూడ రాక్షసస్త్రీలకు వశమై దీనస్థితి నొందియున్నదిగదా!

**శ్లో॥ సర్వా న్భోగా న్పరిత్యజ్య భర్తృస్నేహబలాత్కృతా ।**
**అచింతయిత్వా దుఃఖాని ప్రవిష్టా నిర్జనం వనమ్ ॥ 19**

**పదచ్ఛేదము** :– సర్వాన్ – భోగాన్ – పరిత్యజ్య – భర్తృస్నేహబలాత్కృతా – అచింతయిత్వా – దుఃఖాని – ప్రవిష్టా – నిర్జనం – వనమ్ ॥

**అన్వయక్రమము** :– భర్తృస్నేహబలాత్కృతా, సర్వాన్ భోగాన్ పరిత్యజ్య – దుఃఖాని అచింతయిత్వా, నిర్జనం వనం ప్రవిష్టా.

**ప్రతిపదార్థము** :– భర్తృస్నేహబలాత్కృతా = భర్తయందలి ప్రేమచే బలాత్కరింపబడినదై, సర్వాన్ భోగాన్ పరిత్యజ్య = సమస్త భోగములను పరిత్యజించి, దుఃఖాని అచింతయిత్వా = క్లేశములను లెక్కింపక, నిర్జనం వనం = నిర్మానుష్యమైన అరణ్యమును, ప్రవిష్టా = ప్రవేశించినది.

**తాత్పర్యము** :– ఈమె భర్తపైగల ప్రేమకు లోబడినదై, రాజభవనమునందలి, సమస్త భోగములను విడిచిపెట్టి, ముందుకాలమున సంభవింపబోవు కష్టములను గూర్చి ఆలోచింపకుండ భీకరమైన నిర్జనారణ్యమును చేరినది.

**శ్లో॥ సంతుష్టా ఫలమూలేన భర్తృశుశ్రూషణే రతా ।**
**యా పరాం భజతే ప్రీతిం వనేఽ పి భవనే యథా ॥ 20**

**శ్లో॥ సేయం కనకవర్ణాంగీ నిత్యం సుస్మితభాషిణీ ।**
**సహతే యాతనా మేతా మనర్థానా మభాగినీ ॥ 21**

**పదచ్ఛేదము** :– సంతుష్టా – ఫలమూలేన – భర్తృశుశ్రూషణే – రతా – యా – పరాం – భజతే – ప్రీతిం – వనే – అపి – భవనే – యథా. సా – ఇయం – కనక వర్ణాంగీ – నిత్యం – సుస్మితభాషిణీ – సహతే – యాతనామ్ – ఏతామ్ – అనర్థానాం – అభాగినీ ॥

**అన్వయక్రమము** :– యా, ఫలమూలేన సంతుష్టా, భర్తృశుశ్రూషణే రతా (సతీ), వనే అపి భవనే యథా పరాం ప్రీతిం భజతే, సా కనకవర్ణాంగీ, నిత్యం సుస్మితభాషిణీ, అనర్థానామ్ అభాగినీ, ఇయమ్ ఏతాం యాతనాం సహతే.

**ప్రతిపదార్థము** :– యా = ఏ మహనీయురాలు, ఫలమూలేన సంతుష్టా = పండ్లచేతను, కందమూలాదులచేతను సంతృప్తినొందుచున్నదై, భర్తృశుశ్రూషణే రతా (సతీ) = పెనిమిటియొక్క పరిచర్యయందు నిమగ్నురాలగుచు, వనే అపి = అడవియందుగూడ, భవనే యథా = ఇంటియందువలెనే, పరాం ప్రీతిం = గొప్పదైన సంతోషమును,

భజతే = పొందుచుండెడిదో, సా = అట్టి, కనకవర్ణాంగీ = సువర్ణఛాయగల దేహము గలదియును, నిత్యం సుస్మితభాషిణీ = ఎల్లప్పుడును చిరునగవుతో మాటలాడునట్టి దియును, అనర్థానామ్ అభాగినీ = కష్టములకు అనర్హురాలైనట్టిదియునగు, ఇయం = ఈమె, ఏతాం యాతనాం = ఇట్టివ్యథను, సహతే = సహించుచున్నది.

**తాత్పర్యము** :– అరణ్యమునందలి పండ్లతోడను, కందమూలములతోడను సంతుష్టి నొందుచు, భర్తృపరిచర్యనే ప్రధానకర్తవ్యముగా ఎంచుకొని, నట్టడవియందుగూడ అంతఃపురమునందువలెనే గొప్పదైన ఆనందము ననుభవించుచు, ఎల్లప్పుడును చిరునగవుతోడనే మాటలాడుచు, దుఃఖముల కర్హముగానట్టి తన బంగారు మేనితో ఈ యాతనలను ఎట్లు ఓర్చుకొనుచున్నదో గదా!

**శ్లో॥ ఇమాం తు శీలసంపన్నాం ద్రష్టు మర్హతి రాఘవః ।**
**రావణేన ప్రమథితాం ప్రపా మివ పిపాసితః ॥ 22**

**పదచ్ఛేదము** :– ఇమాం – తు – శీలసంపన్నాం – ద్రష్టుమ్ – అర్హతి – రాఘవః – రావణేన – ప్రమథితాం – ప్రపామ్ – ఇవ – పిపాసితః ॥

**అన్వయక్రమము** :– శీలసంపన్నాం, రావణేన ప్రమథితాం, ఇమాం రాఘవః, పిపాసితః ప్రపామ్ ఇవ, ద్రష్టుమ్ అర్హతి.

**ప్రతిపదార్థము** :– శీలసంపన్నాం = ఉత్తమమైన శీలసంపద గలదియును, రావణేన ప్రమథితాం = రావణునిచే హింసింపబడుచున్నదియునగు, ఇమాం = ఈమెను, రాఘవః = శ్రీరాముడు, పిపాసితః ప్రపామ్ ఇవ = దప్పిగొన్నవాడు చలిపందిరినివలె, ద్రష్టుమ్ అర్హతి = చూడదగియున్నాడు.

**తాత్పర్యము** :– రావణాసురునిచే క్రూరముగ హింసింపబడుచుగూడ గొప్పదైన శీలసంపద కల్గియున్నట్టి ఈ మహనీయురాలిని, శ్రీరాముడు, దప్పికతో తపించుచున్న వాడు చల్లని పానీయశాలను కనుగొనినట్లు, మహానందముతో చూడవలసియున్నాడు.

**శ్లో॥ అస్యా నూనం పున ర్లాభా ద్రాఘవః ప్రీతి మేష్యతి ।**
**రాజా రాజ్యపరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేదినీమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :– అస్యాః – నూనం – పునః – లాభాత్ – రాఘవః – ప్రీతిమ్ – ఏష్యతి, రాజా – రాజ్యపరిభ్రష్టః – పునః – ప్రాప్య – ఇవ – మేదినీమ్ ॥

**అన్వయక్రమము** :– రాఘవః అస్యాః లాభాత్ రాజ్యపరిభ్రష్టః రాజా మేదినీం పునః ప్రాప్య ఇవ నూనం ప్రీతిమ్ ఏష్యతి.

**ప్రతిపదార్థము** :– రాఘవః = శ్రీరాముడు, అస్యాః పునః లాభాత్ = ఈమె తిరిగి దొరకుటవలన, రాజ్యపరిభ్రష్టః రాజా = రాజ్యమును గోల్పోయినట్టి రాజు, మేదినీం = రాజ్యమును, పునః ప్రాప్య ఇవ = తిరిగి పొందివలె, నూనం = నిశ్చయముగా, ప్రీతిమ్ ఏష్యతి = ఆనందమును పొందగలడు.

**తాత్పర్యము** :– శ్రీరాముడు ఈమె తనకు తిరిగి లభించినందులకు, రాజ్యమును గోల్పోయిన రాజు, తిరిగి తనరాజ్యమును లభించినప్పుడువలె, ఎంతయో ఆనందము నొందునుగదా!

**శ్లో॥ కామభోగైః పరిత్యక్తా హీనా బంధుజనేన చ ।**
**ధారయ త్యాత్మనో దేహం తత్సమాగమకాంక్షిణీ ॥ 24**

**పదచ్ఛేదము** :– కామభోగైః – పరిత్యక్తా – హీనా – బంధుజనేన – చ – ధారయతి – ఆత్మనః – దేహం – తత్సమాగమకాంక్షిణీ ॥

**అన్వయక్రమము** :– కామభోగైః పరిత్యక్తా బంధుజనేన హీనా చ, తత్‌సమాగమ కాంక్షిణీ (ఏషా) ఆత్మనః దేహం ధారయతి.

**ప్రతిపదార్థము** :– కామభోగైః పరిత్యక్తా = కోరిన భోగములచే విడువబడినదియును, బంధుజనేన హీనా చ = కావలసినవారికి దూరమైనదియు నగు (ఏషా = ఈమె), తత్ సమాగమకాంక్షిణీ = భర్తయొక్క సమాగమమును ఆశించుచున్నదై, ఆత్మనః దేహం = తన శరీరమును, ధారయతి = నిలుపుకొనుచున్నది.

**తాత్పర్యము** :– తాను కోరుకొన్న భోగములు తొలగిపోవగా, కావలసినవారు దూరమైపోవగా, దుఃఖసముద్రమునందున్న ఈమె, భర్తయొక్క పునస్సమాగమము నాసించుచున్నదై, తన శరీరము నెట్లో నిలుపుకొనుచున్నది.

**శ్లో॥ నైషా పశ్యతి రాక్షస్యో నేమాన్ పుష్పఫలద్రుమాన్ ।**
**ఏకస్థహృదయా నూనం రామ మే వానుపశ్యతి ॥ 25**

**పదచ్ఛేదము** :– న – ఏషా – పశ్యతి – రాక్షస్యః – న – ఇమాన్ – పుష్పఫల ద్రుమాన్ – ఏకస్థహృదయా – నూనం – రామమ్ – ఏవ – అనుపశ్యతి ॥

**అన్వయక్రమము** :– ఏషా రాక్షస్యః న పశ్యతి; ఇమాన్ పుష్పఫలద్రుమాన్ న పశ్యతి; నూనం ఏకస్థహృదయా రామమ్ ఏవ అనుపశ్యతి.

**ప్రతిపదార్థము** :– ఏషా = ఈమె, రాక్షస్యః న పశ్యతి = రాక్షసస్త్రీలను చూచుటలేదు,

ఇమాన్ పుష్పఫలద్రుమాన్ న పశ్యతి = ఈ పుష్పవృక్షములను పండ్లచెట్లను చూచుటలేదు, నూనం = నిశ్చయముగా, ఏకస్థహృదయా = ఏకాగ్రచిత్తముగలదై, రామమ్ ఏవ అనుపశ్యతి = శ్రీరామునే కనుగొనుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** తనకు భయమును గొల్పు రాక్షసీగణముగాని ఆనందమును గూర్చు పుష్పఫలవృక్షములు గాని సీతమ్మయొక్క దృష్టికి గోచరించి ఎట్టి వికారమును కల్పింపలేకున్నవి. ఎటుచూచినను ఆమెకు శ్రీరాము డొక్కడే గాన్పించుచుండెను.

**తాత్పర్యము :–** ఇప్పు డీమె తనచుట్టునున్న ఈ రాక్షసస్త్రీలనుగాని, ఈ పూలచెట్లనుగాని, ఫలవృక్షములనుగాని ఏమియును చూచుట లేదు. ఏకాగ్రమైన మనస్సుగలదై నిశ్చయముగా ఒక్క శ్రీరామునే చూచుచున్నది.

**శ్లో॥ భర్తా నామ పరం నార్యా భూషణం భూషణాదపి ।**
**ఏషా తు రహితా తేన భూషణార్హా న శోభతే ॥ 26**

**పదచ్ఛేదము :–** భర్తా – నామ – పరం – నార్యాః – భూషణం – భూషణాత్ – అపి – ఏషా – తు – రహితా – తేన – భూషణార్హా – న – శోభతే ॥

**ప్రతిపదార్థము :–** భర్తా నామ = భర్త యనగా, నార్యాః = స్త్రీకి, భూషణాదపి = ఆభరణముకంటెను గూడ, పరం భూషణమ్ = శ్రేష్ఠమైన ఆభరణము. భూషణార్హా = ఆభరణములకు తగియున్నట్టి, ఏషా తు = ఈ సీతాదేవి మాత్రము, తేన రహితా = అట్టి భర్త లేకున్నదై, న శోభతే = ప్రకాశించుటలేదు.

**తాత్పర్యము :–** స్త్రీకి భర్తయే సమస్తాభరణముల కంటెను, గొప్ప శోభను గూర్చు మేటి ఆభరణమై యుండును. ఈనాడు, ఈ సీత ఇచ్చట అట్టి భర్తకు దూరమై, భూషణహీన యైనట్లుగా శోభారహితయై యున్నది.

**శ్లో॥ దుష్కరం కురుతే రామో హీనో య దనయా ప్రభుః ।**
**ధారయ త్యాత్మనో దేహం న దుఃఖే నావసీదతి ॥ 27**

**పదచ్ఛేదము :–** దుష్కరం – కురుతే – రామః – హీనః – యత్ – అనయా – ప్రభుః – ధారయతి – ఆత్మనః – దేహం – న – దుఃఖేన – అవసీదతి ॥

**అన్వయక్రమము :–** అనయా హీనః, రామః, ప్రభుః (సన్) ఆత్మనః దేహం ధారయతి, దుఃఖేన న అవసీదతి (ఇతి యత్) (తత్) దుష్కరం కురుతే.

**ప్రతిపదార్థము** :– అనయా హీనః = ఈ సీతాదేవికి దూరమైనవాడై, రామః = శ్రీరాముడు, ప్రభుః (సన్) = సామర్థ్యము గలవాడై, ఆత్మనః దేహం = తన శరీరమును, ధారయతి = నిలుపుకొనుచున్నాడు. దుఃఖేన న అవసీదతి = దుఃఖముచే అణగి పోవలేదు, (ఇతి యత్ = అనున దేది గలదో), తత్ = అది, దుష్కరం కురుతే = దుర్ఘటమైన కార్యము నాచరించుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– "అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా" సూర్యునకు ఎండవలె సీత నా కనన్య అని రాముని వాక్యము. ఎండను విడిచి సూర్యుడువలె, సీతను విడిచి రాము డుండుట దుష్కరము గదా!

**తాత్పర్యము** :– ఇట్టి సీతాదేవిని పోగొట్టుకొని, శ్రీరాముడు సామర్థ్యముతో తన శరీరమును నిలుపుకొనుచున్నాడు. విషాదమగ్నుడై క్రుంగి పోవలే దనునది చూడగా అతడు గొప్పదైన దుర్ఘటకార్యము చేయుచున్నాడని నాకు తోచుచున్నది.

**శ్లో॥ ఇమా మసితకేశాంతాం శతపత్రనిభేక్షణామ్ ।**
**సుఖార్హాం దుఃఖితాం దృష్ట్వా మమాపి వ్యథితం మనః ॥ 28**

**పదచ్ఛేదము** :– ఇమామ్ – అసితకేశాంతాం – శతపత్రనిభేక్షణామ్ – సుఖార్హాం – దుఃఖితాం – దృష్ట్వా – మమ – అపి – వ్యథితం – మనః ॥

**అన్వయక్రమము** :– అసితకేశాంతాం, శతపత్రనిభేక్షణాం, సుఖార్హామ్, ఇమాం దుఃఖితాం దృష్ట్వా మమ మనః అపి వ్యథితమ్.

**ప్రతిపదార్థము** :– శతపత్రనిభేక్షణాం = పద్మపత్రములవంటి కన్నులు గలదియును, సుఖార్హాం = సుఖములకే తగియున్నట్టిదియును అగు, ఇమాం = ఈ పూజ్యురాలిని, దుఃఖితాం దృష్ట్వా = దుఃఖమునొందియున్న దానినిగా జూచి, మమ మనః అపి = నా (వంటివాని) మనస్సు గూడ, వ్యథితం = వేదనము చెందినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– "అసితకేశాంతాం" – కేశములయొక్క కొనలయందు నీలిమయుండుట స్త్రీలకు దుర్లభమైన విషయము. సీతయొక్క నల్లని కేశములు ప్రత్యేకమైన సౌందర్యము గలిగినవి. 'శతపత్రనిభేక్షణాం' – కమలాక్షుడైన శ్రీరామునకు గూడ సీతకన్నులు వ్యామోహమును కలిగించునట్టివని భావము. సుఖార్హాం – రఘురాముని యొడిలో కూర్చొనియుండు సుఖార్హత కల్గినట్టిది. దుఃఖితాం – రాక్షసస్త్రీల నడుమ చిక్కియున్నది.

'మమాపి వ్యథితం మనః' – శాఖాచరమృగమునైన నా మనస్సే వ్యథనొందుచున్నది; పరమదయాళువైన రాముని హృదయముమాట చెప్పవలసిన దేమున్నది? లేక శోకహర్షములను దూరము చేసికొన్న నాకే వ్యథ కలుగుచున్నది. ఇక ప్రేమపాశబద్ధుడై యున్నవాని విషయము చెప్పనేల?

**వాసుదాసస్వామి :–** 'జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాఽప్యుపజాయతే' అన్నట్లు తన యంశమైన జీవునకు తాను భర్తగాను, స్వామిగాను, ఆధారముగను, శరణ్యుడుగను నుండునట్టి జీవుడు, సంసారములోబడి దుఃఖించుచుండ జగత్పతియు, కరుణానిధియు, వాత్సల్యసాగరుడునైన భగవంతునకు దయ పుట్టకుండునా!

**తాత్పర్యము :–** అతిమనోహరములైన కేశములును, విశాలములై సుందరములైన కన్నులును కలిగి సుఖమునకు మాత్రమే అర్హురా లనిపించుచున్న ఈమె శోకగ్రస్తురాలై యుండుట చూడగా, శాఖామృగమునైనట్టి నా మనస్సుగూడ విషాదభరితమై యున్నది. పరమకారుణికుడైన శ్రీరాముని హృదయము ఎట్లుండునో ఇంక వేరుగ చెప్పవలయునా?

**శ్లో॥ క్షితిక్షమా పుష్కరసన్నిభాక్షీ**
**యా రక్షితా రాఘవలక్ష్మణాభ్యామ్ ।**
**సా రాక్షసీభి ర్వికృతేక్షణాభి**
**స్సంరక్ష్యతే సంప్రతి వృక్షమూలే ॥ 29**

**పదచ్ఛేదము :–** క్షితిక్షమా – పుష్కరసన్నిభాక్షీ – యా – రక్షితా – రాఘవలక్ష్మణాభ్యామ్ – సా – రాక్షసీభిః – వికృతేక్షణాభిః – సంరక్ష్యతే – సంప్రతి – వృక్షమూలే ॥

**అన్వయక్రమము :–** క్షితిక్షమా, పుష్కరసన్నిభాక్షీ, యా రాఘవలక్ష్మణాభ్యాం రక్షితా, సా సంప్రతి వృక్షమూలే వికృతేక్షణాభిః రాక్షసీభిః సంరక్ష్యతే.

**ప్రతిపదార్థము :–** క్షితిక్షమా = భూదేవిని పోలిన సహనము గలదియును, పుష్కర సన్నిభాక్షీ = తామరపువ్వులను బోలిన కన్నులు గలదియు నగు, యా = ఏ మహనీయురాలు, రాఘవలక్ష్మణాభ్యాం రక్షితా = శ్రీరామునిచేతను, లక్ష్మణునిచేతను సంరక్షింపబడి యుండెనో, సా = అట్టి ఆమె, సంప్రతి = నేడు, వృక్షమూలే = చెట్టుమొదట, వికృతేక్షణాభిః రాక్షసీభిః = వికారమైన చూపులు గల రాక్షస స్త్రీలచే, సంరక్ష్యతే = కావలి కాయబడుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** క్షితిక్షమా – తన కంటి చూపుచేతనే రావణుని భస్మము చేయకపోవుటకు

కారణ మామెయొక్క సహనశీలమే గదా. రాక్షసీభిః సంరక్ష్యతే = పరులు అపహరింపకుండ కావలి కాయబడుచున్నది.

**తాత్పర్యము :–** భూదేవితో సమానమైన ఓర్పు గలదియును, పద్మపత్రములనుబోలు సుందర నేత్రములు గలదియును, మహావీరులైన రామలక్ష్మణులచే కంటికి రెప్పవలె కాపాడబడుచున్నట్టిదియునగు ఈమె నేడు మహాభయంకరమైన చూపులుగల రాక్షసస్త్రీలచే చుట్టుకొనబడి యున్నదిగదా!

**శ్లో॥ హిమహతనళినీవ నష్టశోభా**
**వ్యసనపరంపరయా నిపీడ్యమానా ।**
**సహచరరహితేవ చక్రవాకీ**
**జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా ॥ 30**

**పదచ్ఛేదము :–** హిమహతనళినీ – ఇవ – నష్టశోభా – వ్యసనపరంపరయా – నిపీడ్యమానా – సహచరరహితా – ఇవ – చక్రవాకీ – జనకసుతా – కృపణాం – దశాం – ప్రపన్నా ॥

**అన్వయక్రమము :–** హిమహతనళినీ ఇవ నష్టశోభా, వ్యసనపరంపరయా నిపీడ్యమానా జనకసుతా, సహచరరహితా చక్రవాకీ ఇవ, కృపణాం దశాం ప్రపన్నా.

**ప్రతిపదార్థము :–** హిమహతనళినీ ఇవ = మంచుచే శిథిలమైన తామరతీగవలె, నష్టశోభా = చెడిపోయిన సౌందర్యము గలదియును, వ్యసనపరంపరయా = దుఃఖముల పరంపరచే, నిపీడ్యమానా = మిక్కిలి పీడింపబడుచున్నదియునై, జనకసుతా = జానకీదేవి, సహచరరహితా = ప్రియునికి దూరమైనట్టి, చక్రవాకీ ఇవ = ఆడుచక్రవాక పక్షివలె, కృపణాం దశాం = దయనీయమైన స్థితిని, ప్రపన్నా = పొందియున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** సహచరరహితా చక్రవాకీ ఇవ, చక్రవాకాంగన – విశ్రాంతిని పొందవలసిన రాత్రికాలమున ప్రియవియోగము గలిగి, దానిని భరింపలేక బాధనొందుచుండుట ప్రసిద్ధము.

**తాత్పర్యము :–** మంచుదెబ్బచే శిథిలమైన తామరతీగవలె, తన సహజశోభను గోల్పోయి ఎడతెగని దుఃఖములచే తీవ్రముగ పీడింపబడుచున్న ఈసీతాదేవి, తన ప్రియ విరహముచే రాత్రికాలమునందు పరితాపమునొందునట్టి చక్రవాకాంగనవలె మిక్కిలి దయనీయమైన స్థితి నొందియున్నదిగదా!

**శ్లో॥ అస్యా హి పుష్పావనతాగ్రశాఖా**
**శ్శోకం దృఢం వై జనయం త్యశోకాః ।**
**హిమవ్యపాయేన చ మందరశ్మి**
**రభ్యుత్థితో నైకసహస్రరశ్మిః ॥ 31**

**పదచ్ఛేదము** :- అస్యాః - హి - పుష్పావనతాగ్రశాఖాః - శోకం - దృఢం - వై - జనయంతి - అశోకాః - హిమవ్యపాయేన - చ - మందరశ్మిః - అభ్యుత్థితః - నైక సహస్రరశ్మిః ॥

**అన్వయక్రమము** :- అస్యాః, పుష్పావనతాగ్రశాఖాః అశోకాః, హిమవ్యపాయేన మందరశ్మిః, అభ్యుత్థితః నైకసహస్రరశ్మిః చ దృఢం శోకం జనయంతి.

**ప్రతిపదార్థము** :- అస్యాః = ఈమెకు, పుష్పావనతాగ్రశాఖాః = పుష్పముల (బరువు)చే వంగిపోయిన కొన కొమ్మలు గలిగినట్టి, అశోకాః = అశోక వృక్షములును, హిమవ్యపాయేన = మంచు వ్యాపించుటచే (తొలగుటచే),మందరశ్మిః = మందమైన కాంతులు గల్గినట్టి వాడై, అభ్యుత్థితః = ఉదయించినట్టి, నైకసహస్రరశ్మిః చ = పెక్కువేల కిరణములుగల చంద్రుడునుగూడ, దృఢం = మిక్కుటముగా, శోకం జనయంతి = శోకమును పుట్టించు చున్నారు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- హిమవ్యపాయేన = వసంతఋతువుచేత.

**తాత్పర్యము** :- ఈ సీతాదేవి కిప్పుడు పూలబరువుచే వంగిన కొమ్మలు గల్గినట్టి, సుందరమైన అశోక వృక్షములును, శిశిరఋతువు తొలగుటచే స్ఫుటమైన తన వేలకొలది కిరణములతో ఉదయించిన చంద్రుడును గూడ, తీవ్రముగ దుఃఖమును కలిగించుచున్నారు గదా!

**శ్లో॥ ఇ త్యేవ మర్థం కపి రన్వవేక్ష్య**
**సీతేయ మిత్యేవ నివిష్టబుద్ధిః ।**
**సంశ్రిత్య తస్మి న్నిషసాద వృక్షే**
**బలీ హరీణా మృషభ స్తరస్వీ ॥ 32**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే ఆదికావ్యే సుందరకాండే*
*"హనూమత్పరితాపో" నామ షోడశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– ఇతి – ఏవం – అర్థం – కపిః – అన్వవేక్ష్య – సీతా – ఇయం – ఇతి – ఏవ – నివిష్టబుద్ధిః – సంశ్రిత్య – తస్మిన్ – నిషసాద – వృక్షే – బలీ – హరీణామ్ – ఋషభః – తరస్వీ ॥

**అన్వయక్రమము** :– బలీ హరీణామ్ ఋషభః, తరస్వీ కపిః ఇతి ఏవమ్ అర్థమ్ అన్వవేక్ష్య, ఇయం సీతా ఏవ, ఇతి నివిష్టబుద్ధిః, (సన్) తస్మిన్ వృక్షే సంశ్రిత్య నిషసాద.

**ప్రతిపదార్థము** :– బలీ = బలాఢ్యుడును, హరీణామ్ ఋషభః = వానరులలో శ్రేష్ఠుడును, తరస్వీ = బలవంతుడును అగు, కపిః = హనుమ, ఇతి = ఈ విధముగా, ఏవమ్ అర్థం = ఈ రీతి భావమును, అన్వవేక్ష్య = భావించి, ఇయం సీతా ఏవ = ఈమె సీతయే, ఇతి = అని, నివిష్టబుద్ధిః = నిశ్చయించుకొన్న మనస్సుగలవాడై, తస్మిన్ వృక్షే = ఆ శింశుపావృక్షమునందు, సంశ్రిత్య = అణగియుండి, నిషసాద = కూర్చుండెను.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'తస్మిన్ వృక్షే నిషసాద' – తరువాత చేయదలచిన కృత్యము నాచరించగోరి, ఆవృక్షమునందే విశ్రమించినవాడై, ఆ రాత్రిశేషమును పరదినమును గూడ కూర్చుండెనని భావము. సముద్రలంఘనదినమునాటి రాత్రియందే రావణ అంతఃపురముతో సహా లంకనంతను ఆ రాత్రి మొదటి మూడు జాములయందును అన్వేషించి యుండెను. నాల్గవ జాముననే అశోకవనమును ప్రవేశించెనని తెలిసికొనవలెను.

**తాత్పర్యము** :– వానరశ్రేష్ఠుడును, మహావీరుడు నగు హనుమ, ఈ విధమైన ఆలోచనలను చేసి ఈమె సీతయే యని నిర్ణయమునకు వచ్చి భావికార్యనిర్ణయము చేయగోరుచు ఆ వృక్షమునందే ఆ రాత్రిశేషము గడపుటకే కూర్చొనియుండెను.

*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనూమత్పరితాపము" అను*
*పదునాఱవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తదశసర్గ

**శ్లో॥ తతః కుముదషండాభో నిర్మలో నిర్మలం స్వయమ్ ।**
**ప్రజగామ నభ శ్చంద్రో హంసో నీల మి వోదకమ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – కుముదషండాభః – నిర్మలః – నిర్మలం – స్వయమ్ ప్రజగామ – నభః – చంద్రః – హంసః – నీలమ్ – ఇవ – ఉదకమ్ ॥

**అన్వయక్రమము :–** తతః కుముదషండాభః, నిర్మలః చంద్రః, హంసః నీలమ్ ఉదకం ఇవ, నిర్మలం నభః స్వయం ప్రజగామ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, కుముదషండాభః = తెల్ల కలువల సమూహమువంటి ప్రకాశము కలిగినట్టి, నిర్మలః చంద్రః = స్వచ్ఛమైన రూపముగల చంద్రుడు, హంసః నీలమ్ ఉదకమ్ ఇవ = రాజహంస నల్లని తటాకజలమునువలె, నిర్మలం నభః = నిర్మలమైన ఆకాశమును, స్వయం = స్వయముగా, ప్రజగామ = చేరెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'తతః' అనగా ఆ పగటిని గడిపిన తరువాత ఆకాశము నల్లగా నున్నదనుట కవి సమయము.

**బొంబాయి ప్రతి :–** కుముదషండమునకు మారుగా కుముదఖండమని గలదు. ఖండమన్నను సమూహమనియే అర్థము.

**తాత్పర్యము :–** అటుపిమ్మట రాజహంస నల్లని తటాక జలమును చేరినట్లుగా, తెల్లకలువల రాశివలె, స్వచ్ఛమైన ధవళకాంతితో ప్రకాశించుచున్న చంద్రుడు వినీలాకాశమును చేరి మనోహరముగ గానవచ్చుచుండెను.

**శ్లో॥ సాచివ్య మివ కుర్వన్ స ప్రభయా నిర్మలప్రభః ।**
**చంద్రమా రశ్మిభి శ్శీతై స్సిషేవే పవనాత్మజమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :- సాచివ్యమ్ - ఇవ - కుర్వన్ - సః - ప్రభయా - నిర్మలప్రభః - చంద్రమాః - రశ్మిభిః - శీతైః - సిషేవే - పవనాత్మజమ్ ॥

**అన్వయక్రమము** :- సః నిర్మలప్రభః చంద్రమాః, ప్రభయా సాచివ్యం కుర్వన్ ఇవ, శీతైః రశ్మిభిః పవనాత్మజం సిషేవే.

**ప్రతిపదార్థము** :- నిర్మలప్రభః = స్వచ్ఛమైన కాంతిగలిగినట్టి, సః చంద్రమాః = ఆ చంద్రుడు, ప్రభయా = వెలుగుతో, సాచివ్యం కుర్వన్ ఇవ = సాహాయ్యము చేయుచున్న వాడువలె, శీతైః రశ్మిభిః = చల్లని కిరణములచే, పవనాత్మజం = వాయునందనుని, సిషేవే = సేవించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'సాచివ్యం కుర్వన్ ఇవ' - పగటి భాగమున ఎక్కడో ఒకచోట ఏకాంత ప్రదేశమున గడిపియుండుటచేతను, నిద్రావ్యాకులుడై యుండుటచేతను, సీతను, రాక్షస స్త్రీలను సరిగా చూడలేక పోయెను. సమీపముననున్న హనుమకు రాత్రియందు సీతమ్మను చూచుటలో చంద్రోదయమే సహాయమైనది.

**తాత్పర్యము** :- స్వచ్ఛమైన కాంతిగల చంద్రుడు తన చల్లని వెన్నెలతో హనుమకు సహాయము చేయురీతిగా తన శీతకిరణములతో ఆతని శ్రమను పోగొట్టుచు సేవించెను.

**శ్లో॥ స దదర్శ తత స్సీతాం పూర్ణచంద్రనిభాననామ్ ।**
**శోకభారై రివ న్యస్తాం భారై ర్నావ మి వాంభసి ॥ 3**

**పదచ్ఛేదము** :- సః - దదర్శ - తతః - సీతాం - పూర్ణచంద్రనిభాననామ్ । శోకభారైః - ఇవ - న్యస్తాం - భారైః - నావమ్ - ఇవ - అంభసి ॥

**అన్వయక్రమము** :- సః తతః, అంభసి, భారైః న్యస్తాం నావమ్ ఇవ శోకభారైః న్యస్తాం, పూర్ణచంద్రనిభాననామ్ సీతాం దదర్శ.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమ, తతః = పిమ్మట, అంభసి = జలమునందలి, భారైః న్యస్తాం నావమ్ ఇవ = బరువులతో నింపబడిన నావనువలె, శోకభారైః న్యస్తాం ఇవ (స్థితాం) = దుర్భరమైన దుఃఖభారముతో నింపబడినట్లుగ నున్నట్టి, పూర్ణచంద్రనిభాననామ్ సీతాం = నిండుచంద్రుని బోలిన ముఖము గలిగిన సీతాదేవిని, దదర్శ = కనుగొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– శోకభారైః న్యస్తామ్ ఇవ – దుఃఖభారముచే తీవ్రముగా అణచి వేయబడు చున్నట్టి సీతను;

**తాత్పర్యము** :– నీటిలో అమితమైన భారముచే మునిగిపోవుచున్న నావరీతిగా, దుఃఖభారముచే అణగి క్రుంగిపోవుచున్న ఆ నిండు చంద్రుని వంటి ముఖముగల సీతాదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ దిదృక్షమాణో వైదేహీం హనుమా న్మారుతాత్మజః ।**
**స దద ర్శావిదూరస్థా రాక్షసీ ర్ఘోరదర్శనాః ॥ 4**

**పదచ్ఛేదము** :– దిదృక్షమాణః – వైదేహీం – హనుమాన్ – మారుతాత్మజః – సః – దదర్శ – అవిదూరస్థాః – రాక్షసీః – ఘోరదర్శనాః ॥

**అన్వయక్రమము** :– సః మారుతాత్మజః హనుమాన్, వైదేహీం దిదృక్షమాణః, అవిదూరస్థాః, ఘోరదర్శనాః రాక్షసీః దదర్శ.

**ప్రతిపదార్థము** :– మారుతాత్మజః సః హనుమాన్ = వాయునందనుడైన యా హనుమ, వైదేహీం దిదృక్షమాణః = సీతాదేవిని చూడగోరుచున్నవాడై, అవిదూరస్థాః = సమీపముననే యున్నట్టి, ఘోరదర్శనాః రాక్షసీః = భీకరాకారలగు రాక్షసస్త్రీలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమ సీతాదేవిని స్పష్టముగ చూడగోరినవాడై ఆమెవైపు చూచుచు ఆమె చుట్టునుగల భీకరాకారలైన పలువురు రాక్షసస్త్రీలను గాంచెను.

**శ్లో॥ ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా ।**
**అకర్ణాం శంకుకర్ణాం చ మస్తకోచ్ఛ్వాసనాసికామ్ ॥ 5**

ఇటనుండి 15వ శ్లోకము వఱకును పదచ్ఛేదము, అన్వయక్రమము కూడ సుగమములు.

**ప్రతిపదార్థము** :– ఏకాక్షీం = ఒంటికన్నుగల దానిని, ఏకకర్ణాం చ = ఒక్కచెవి గల్గిన రాక్షసిని, తథా కర్ణప్రావరణాం = అట్లే వ్రేలాడు చెవులు గలదానిని, అకర్ణాం = చెవులులేని దానిని, శంకుకర్ణాం చ = సూదియైన చెవులుగల దానిని, మస్తకోచ్ఛ్వాస నాసికాం = తలయందే శ్వాసను పీల్చు ముక్కుగల్గిన రాక్షసిని (హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను).

**తాత్పర్యము :–** సీతమ్మచుట్టునుగల వికారమైనట్టి ఆకారములుగల ఆ రాక్షసస్త్రీలలో, ఒక్కతెకు ఒక కన్నేయుండెను. ఒకతెకు ఒకచెవియే యుండెను. వేరొక్కతె చెవులు దాని భుజము వరకును వ్రేలాడు చుండెను. ఇంకొకతెకు చెవులే లేకుండెను. ఒక్కతె చెవి శంకువువలె సూదిమొన గల్గియుండెను. ఒక రాక్షసికి తన తలపైని నాసికగల్గి ఆమె దానితోనే శ్వాసించు చుండెను.

**శ్లో॥ అతికాయోత్తమాంగీం చ తనుదీర్ఘశిరోధరాం ।**
**ధ్వస్తకేశీం తథాఽకేశీం కేశకంబళధారిణీమ్ ॥ 6**

**ప్రతిపదార్థము :–** అతికాయోత్తమాంగీం = శరీరమునకు మించిన పెద్ద శిరస్సుగల దానిని, తనుదీర్ఘశిరోధరామ్ = సన్ననై పొడవైన మెడకలిగినట్టిదానిని, ధ్వస్తకేశీం = రాలిపోయిన తలవెండ్రుకలు గలదానిని, తథా అకేశీం = అట్లే పూర్తిగా కేశములే లేనట్టిదానిని, కేశకంబళధారిణీం = కంబళమువలె బొచ్చు వెండ్రుకలు గలదానిని (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము :–** చిన్న శరీరముపై పెద్దతల గలది యొకతె, సన్ననై పొడవైన మెడగలది యొకతె, కేశములు పూర్తిగా రాలిపోయినది ఒకతె, తలపై కేశములే లేని దొకతె, గొఱ్ఱెబొచ్చువంటి కేశములుగలది యొకతె – అట్టి ఆ రాక్షసస్త్రీలను హనుమ గాంచెను.

**శ్లో॥ లంబకర్ణలలాటాం చ లంబోదరపయోధరాం ।**
**లంబోష్ఠీం చుబుకోష్ఠీం చ లంబాస్యాం లంబజానుకామ్ ॥ 7**

**ప్రతిపదార్థము :–** లంబకర్ణలలాటాం చ = వ్రేలాడుచున్న చెవులును, నుదురును గలదానిని, లంబోదరపయోధరాం = వ్రేలాడుచున్న కడుపును, స్తనములును గల్గిన దానిని, లంబోష్ఠీం = వ్రేలాడుచున్న పెదవిగలదానిని, చుబుకోష్ఠీం = గడ్డము వరకు వ్రేలాడుచున్న పెదవి గలదానిని, లంబాస్యాం = పొడవైన నోరు గలదానిని, లంబజానుకాం = పొడవైన మోకాళ్ళు గలదానిని, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీలలో ఒకతెకు చెవులును నుదురును వ్రేలాడు చుండెను. ఇంకొకతెకు కడుపును స్తనములును వ్రేలాడుచుండెను. ఒకతెకు పెదవి వ్రేలాడు చుండెను. ఇంకొకతె పెదవి తన గడ్డము వరకును వ్రేలాడు చుండెను. ఒకతె నోరు మిక్కిలి పొడవుగ నుండెను. ఇంకొకతెకు మోకాళ్లు మిక్కిలి పొడవైయుండెను.

**శ్లో॥ హ్రస్వాం దీర్ఘాం తథా కుబ్జాం వికటాం వామనాం తథా ।**
**కరాళాం భుగ్నవక్త్రాం చ పింగాక్షీం వికృతాననామ్ ॥ 8**

**ప్రతిపదార్థము :–** హ్రస్వాం = పొట్టిగానున్న దానిని, తథా కుబ్జాం = అట్లే మఱుగుజ్జు దానిని, వికటాం = వంకరయైన దానిని, వామనాం = పొట్టిగనున్న దానిని, కరాళాం = భయంకరమైనదానిని, భుగ్నవక్త్రాం చ = అణగియున్న ముఖము గలదానిని, పింగాక్షీం = పచ్చని కన్నులుగల దానిని, వికృతాననాం = వికారమైన ముఖము గలదానిని, (హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను).

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీలలో ఒకతె మిక్కిలి పొట్టిగ నుండెను. ఒకతె మిక్కిలి పొడవుగ నుండెను. ఒకతె మరుగుజ్జుగ యుండెను. ఒకతె అవయవములు వికటముగా నుండెను. ఒకతె భీకరయై యుండెను. ఒకతె ముఖము వెనుకకు అణగి యుండెను. ఒకతె పిల్లి కన్నులు గలదై యుండెను. ఒకతె వికారమైన నోరు కలిగియుండెను.

**శ్లో॥ వికృతాః పింగళాః కాళీః క్రోధనాః కలహప్రియాః ।**
**కాలాయస మహాశూల కూటముద్గరధారిణీః ॥ 9**

**ప్రతిపదార్థము :–** వికృతాః = వికారమైన అవయవములు గలవారిని, పింగళాః = పచ్చనిదేహముగల వారిని, కాళీః = నల్లని శరీరము గలవారిని, క్రోధనాః = తీవ్ర కోపస్వభావము గలవారిని, కలహప్రియాః = కయ్యమునకు సిద్ధమై యుండువారిని, కాలాయస = నల్లని ఇనుముతో నిర్మించిన, మహాశూల = పెద్దశూలములను, కూట = సమ్మెటలను, ముద్గర = గుదియలను, ధారిణీః = ధరించిన వారిని (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీలలో కొందరు వికారమైన శరీరము గలవారు. కొందరు పచ్చని రంగుగలవారు, కొందరు నల్లని రంగు గలవారు. కొందరు తీవ్రమైన కోపశీలము గలవారు. కొందరు కలహప్రియులు. కొందరు స్థూలమైన ఇనుప శూలములను, నల్లని ఇనుప సమ్మెటలను, గుదియలను ధరించిన వారుగా నుండిరి.

**శ్లో॥ వరాహమృగ శార్దూల మహిషాజశివాముఖీః ।**
**గజోష్ట్రహయపాదీశ్చ నిఖాతశిరసోఽపరాః ॥ 10**

**ప్రతిపదార్థము :–** వరాహమృగ శార్దూల మహిష + అజశివాముఖీః = అడవిపంది ముఖములు, లేడి ముఖములు, పెద్దపులి ముఖములు, దున్నపోతు ముఖములు, గొఱ్ఱె ముఖములు, నక్కముఖములు గల్గినట్టివారిని, గజోష్ట్రహయపాదీశ్చ = ఏనుగు ఒంటె గుఱ్ఱముల యొక్క పాదములవంటి పాదములు గలవారిని, నిఖాతశిరసః అపరాః = మొండెములోనికే దిగిపోయిన తలగల వారిని మరి కొంతమందిని, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీలలో కొందరు అడవిపంది ముఖములు, లేడిముఖములు, పెద్దపులి ముఖములు, దున్నపోతు ముఖములు, గొఱ్ఱె ముఖములు, నక్క ముఖములు గలవారుగా నుండిరి. ఏనుగు పాదములు గలవారు కొందరు, ఒంటెకాళ్లు గలవారు కొందరు, గుఱ్ఱముకాళ్లు గలవారు కొందరు నుండిరి. కొంతమంది శిరస్సులు వారి మొండెములోనికి అణిగిపోయి యుండెను.

**శ్లో॥ ఏకహస్తైకపాదాశ్చ ఖరకర్ణ్యశ్వకర్ణికాః ।**
**గోకర్ణీ ర్హస్తికర్ణీశ్చ హరికర్ణీ స్తథాఽపరాః ॥ 11**

**ప్రతిపదార్థము :–** ఏకహస్తైకపాదాశ్చ = ఏకహస్తము, ఏకపాదము గలవారిని, ఖరకర్ణీ + అశ్వకర్ణికాః = గాడిద చెవులును, గుఱ్ఱము చెవులును గలవారిని, గోకర్ణీః = ఆవుచెవులు గలవారిని, తథా హరికర్ణీః అపరాః = అట్లే సింహము చెవులు గల మరికొందరిని, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీలలో కొందరు ఒకే చెవిగలవారు, ఒకే పాదము గలవారు; అట్లే కొందరు ఒకే చెవిగలవారు, గుఱ్ఱము చెవులవారు, ఆవు చెవులవారు, గాడిద చెవులవారు, సింహము చెవులవారునుగా నుండిరి.

**శ్లో॥ అనాసా అతినాసాశ్చ తిర్యఙ్నాసా వినాసికాః ।**
**గజసన్నిభనాసాశ్చ లలాటోచ్ఛ్వాసనాసికాః ॥ 12**

**ప్రతిపదార్థము :–** అనాసాః = ముక్కులేనివారిని, అతినాసాః = బొఱ్ఱముక్కు గలవారిని, తిర్యఙ్నాసాః = అడ్డుతిరిగిన ముక్కు గలవారిని, వినాసికాః = వంకర తిరిగిన నాసిక గలవారిని, గజసన్నిభనాసాశ్చ = ఏనుగు తొండముతో సమానమైన నాసిక గలవారిని, లలాటోచ్ఛ్వాసనాసికాః = నుదుటియందే శ్వాసను తీసుకొను నాసిక గలవారగు రక్కసులను, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీలలో కొందరు ముక్కులేనివారు, బొఱ్ఱముక్కులవారు, అడ్డుతిరిగిన ముక్కు గలవారు, వంకరలు తిరిగిన ముక్కు గలవారు, ఏనుగు తొండము వంటి ముక్కు గలవారు నుదుటియందే రంధ్రముకలిగి దానితోనే శ్వాసించుచుండు వారునుగా నుండిరి.

**శ్లో॥ హస్తిపాదా మహాపాదా గోపాదాః పాదచూళికాః ।**
**అతిమాత్రశిరోగ్రీవా అతిమాత్రకుచోదరీః ॥ 13**

**ప్రతిపదార్థము :–** హస్తిపాదాః = ఏనుగు పాదములు గలవారిని, గోపాదాః =

గోవుపాదములవంటి పాదములు గలవారిని, పాదచూళికాః = పాదములయందు బొచ్చుగలవారిని, అతిమాత్రశిరోగ్రీవాః = విపరీతమైన తలకాయలును మెడలును గలవారిని, అతిమాత్రకుచోదరీః = విపరీతమైన స్తనములు, కడుపులు గలవారిని, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము** :– ఆ రాక్షసస్త్రీలలో కొందరు ఏనుగు పాదములవారు, విపరీతమైన పాదములవారు, గోవు పాదములు గలవారు, తమ పాదముల నిండుగ బొచ్చుగలవారు, విపరీతమైన కంఠముగలవారు. అతిస్థూలమైన స్తనములు, పొట్టలుగలవారునుగా నుండిరి.

**శ్లో॥ అతిమాత్రాస్యనేత్రాశ్చ దీర్ఘజిహ్వానఖా స్తథా ।**
**అజాముఖీ ర్హస్తిముఖీ ర్గోముఖీ స్సూకరీముఖీః ॥ 14**

**ప్రతిపదార్థము** :– అతిమాత్రాస్యనేత్రాశ్చ = మిక్కిలి విపరీతమైన నోళ్లు, కన్నులు గలవారిని, తథా దీర్ఘజిహ్వానఖాః = అట్లే విపరీతమైన పొడవుగల నాలుకలు, గోళ్లు గలవారిని, అజాముఖీః = మేక ముఖము గలవారిని, హస్తిముఖీః = ఏనుగు ముఖము, గోముఖీః = ఆవుముఖము గలవారిని, సూకరీముఖీః = పంది ముఖము గలవారిని, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను).

**తాత్పర్యము** :– ఆ రాక్షస స్త్రీలలో కొందరు మిక్కిలి పెద్దవైన నోళ్ళును, కళ్ళును గలవారు, మిక్కిలి పొడవైన నాలుకలును గోళ్ళును గలవారునుగా నుండిరి. అట్లే మఱికొందరు మేకముఖము గలవారు, ఏనుగు ముఖము గలవారు, ఆవు ముఖము గలవారు, పంది ముఖము గలవారునుగా నుండిరి.

**శ్లో॥ హయోష్ట్రఖరవక్త్రాశ్చ రాక్షసీ ర్ఘోరదర్శనాః ।**
**శూలముద్గరహస్తాశ్చ క్రోధనాః కలహప్రియాః ॥ 15**

**పదచ్ఛేదము** :– హయోష్ట్రఖరవక్త్రాః – చ – రాక్షసీః – ఘోరదర్శనాః – శూలముద్గర హస్తాః – చ – క్రోధనాః – కలహప్రియాః ॥

**ప్రతిపదార్థము** :– హయ + ఉష్ట్రఖర వక్త్రాః = గుఱ్ఱము యొక్కయు, ఒంటె యొక్కయు, గాడిద యొక్కయు ముఖము వంటి ముఖము గలవారును, ఘోరదర్శనాః = భయంకరమైన రూపము గలవారును, శూలముద్గరహస్తాః చ = శూలములను, ఇనుపగుదియలను చేతియందు ధరించిన వారును, క్రోధనాః = తీవ్రమైన క్రోధ స్వభావము గలవారును, కలహప్రియాః = కయ్యమునం దిష్టముగలవారును అగు, రాక్షసీః = రాక్షసస్త్రీలను, (హనుమాన్ దదర్శ = హనుమంతుడు చూచెను).

**తాత్పర్యము** :– ఆ రాక్షసస్త్రీలు గుఱ్ఱపు మూతులు, ఒంటె మూతులు, గాడిద ముఖములును కలిగి భయంకరమైన రూపముతో నుండిరి. మఱియు శూలములను, ఇనుపగుదియలను తమ చేత ధరించి కలహస్వభావము గలవారై కయ్యమునకు గాలుదువ్వువారుగా నుండిరి.

**శ్లో॥ కరాళా ధూమ్రకేశీశ్చ రాక్షసీ ర్వికృతాననాః ।**
**పిబంతీ స్సతతం పానం సదా మాంససురాప్రియాః ॥ 16**

**పదచ్ఛేదము** :– కరాళాః – ధూమ్రకేశీః – చ – రాక్షసీః – వికృతాననాః – పిబంతీః – సతతం – పానం – సదా – మాంససురాప్రియాః ॥

**ఈ ఘట్టమునందలి శ్లోకములకు అన్వయక్రమము సుగమము.**

**ప్రతిపదార్థము** :– కరాళాః = భీకరాకారము గలవారును, ధూమ్రకేశీః = బూడిద వర్ణముగల జుట్టు గలవారును, వికృతాననాః = వికారమైన మిట్టపల్లముగల ముఖములు గలవారును, సదా మాంససురాప్రియాః = నిత్యము మాంసమునందును, మద్యము నందు నధికమైన ప్రీతి గలవారై, సతతం పానం పిబంతీః = ఎడతెగకుండగా మద్యమును పానము చేయుచున్నవారునగు, రాక్షసీః = రాక్షసస్త్రీలను, (హనుమాన్ దదర్శ = హనుమ చూచెను.)

**తాత్పర్యము** :– భయంకరమైన శరీరములును, బూడిదరంగుగల జుట్టును, వికారమైన ముఖములును, గలవారై మద్యమాంసములందు అత్యధికప్రీతిగలవారై అదేపనిగ విడువకుండ సురాపానము చేయుచున్న రాక్షసస్త్రీలు అచట హనుమకు గానవచ్చిరి.

**శ్లో॥ మాంసశోణితదిగ్ధాంగీ ర్మాంసశోణితభోజనాః ।**
**తా దదర్శ కపిశ్రేష్ఠో రోమహర్షణదర్శనాః**
**స్కంధవంత ముపాసీనాః పరివార్య వనస్పతిమ్ ॥ 17**

**పదచ్ఛేదము** :– మాంసశోణితదిగ్ధాంగీః – మాంసశోణితభోజనాః – తాః – దదర్శ – కపిశ్రేష్ఠః – రోమహర్షణదర్శనాః – స్కంధవంతమ్ – ఉపాసీనాః – పరివార్య – వనస్పతిమ్ ॥

**ప్రతిపదార్థము** :– మాంసశోణిత దిగ్ధాంగీః = మాంసముతో, రక్తముతో పూయబడిన శరీరముగలవారును, మాంసశోణితభోజనాః = మాంసము, రక్తము మాత్రమే ఆహారముగా కలిగినవారును, రోమహర్షణ దర్శనాః = ఒడలికి గగుర్పాటు కలిగించు రూపము గలవారునగు, స్కంధవంతం వనస్పతిం = పెద్ద బోదెగల ఆ శింశుపా

వృక్షమును, పరివార్య ఉపాసీనాః = చుట్టునుజేరి కూర్చుండియున్న, తాః = ఆ రాక్షసస్త్రీలను, కపిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన హనుమ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– ఒడలినిండ మాంసము యొక్కయు, రక్తము యొక్కయు ముక్కలును, చారలును గలిగి, మాంసము రక్తము మాత్రమే ఆహారముగానున్న వారును, చూడగనే ఒడలు గగురుపొడుచు భీకరమైన ఆకారము గలవారునై, పెద్ద కొమ్మలును, బోదెయును గలిగియున్న ఆ శింశుపావృక్షము చుట్టును చేరి కూర్చున్న అచ్చటి ఆ రాక్షసస్త్రీలను హనుమ చూచెను.

**శ్లో॥ త స్యాధస్తాచ్చ తాం దేవీం రాజపుత్రీ మనిందితామ్ ।**
**లక్షయామాస లక్ష్మీవాన్ హనుమాన్ జనకాత్మజామ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– తస్య – అధస్తాత్ – చ – తాం – దేవీం – రాజపుత్రీమ్ – అనిందితామ్, లక్షయామాస – లక్ష్మీవాన్ – హనుమాన్ – జనకాత్మజామ్ ॥

**ప్రతిపదార్థము** :– లక్ష్మీవాన్ హనుమాన్ = శోభాసంపన్నుడైన హనుమ, తస్య అధస్తాత్ = ఆ శింశుపావృక్షము యొక్క క్రిందిభాగమునందు, అనిందితాం = ఉత్తము రాలైనట్టి, దేవీం = మహనీయురాలైనట్టి, రాజపుత్రీం = మహారాజు కుమార్తెయైనట్టి, తాం జనకాత్మజాం = ఆ జానకీదేవిని, లక్షయామాస = కనుగొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– లక్ష్మీవాన్ = సీతమ్మతల్లి దర్శనముచేత కలిగినట్టి దివ్యమైన శోభగలవాడు.

**తాత్పర్యము** :– ఆ శింశుపావృక్షము క్రిందనేయున్న ఉత్తమురాలైన జనకమహారాజు కుమార్తెయగు ఆ సీతాదేవిని హనుమంతుడు తన చిరకాలతపఃఫలితముగా మహానందముతో విప్పారిన నేత్రములతో కనుగొనెను.

**శ్లో॥ నిష్ప్రభాం శోకసంతప్తాం మలసంకులమూర్ధజామ్ ।**
**క్షీణపుణ్యాం చ్యుతాం భూమౌ తారాం నిపతితామివ ।**
**చారిత్రవ్యపదేశాఢ్యాం భర్తృదర్శనదుర్గతామ్ ॥ 19**

**పదచ్ఛేదము** :– నిష్ప్రభాం – శోకసంతప్తాం – మలసంకుల మూర్ధజామ్, క్షీణపుణ్యాం – చ్యుతాం – భూమౌ – తారాం – నిపతితామ్ – ఇవ, చారిత్రవ్యపదేశాఢ్యాం – భర్తృదర్శనదుర్గతామ్ ॥

**ప్రతిపదార్థము** :– నిష్ప్రభాం = ప్రభను గోలుపోయి యున్నదియును, శోకసంతప్తాం = దుఃఖముచే పరితపింపజేయబడు చున్నదియును, మల సంకుల మూర్ధజామ్ = దుమ్ముతో నిండి చెదిరిపోయిన కేశములు గలదియును, భూమౌ నిపతితాం తారామివ = భూమిపై రాలిన నక్షత్రమువలె, క్షీణపుణ్యాం = క్షీణించియున్న పుణ్యముగలదియును, చ్యుతాం = (క్షీణస్థితికి) జారినదియును, భర్తృదర్శనదుర్గతాం = భర్తృదర్శనము లభింపకుండుటచే, దుస్థితి నొంది యున్నదియునగు, (జానకీం లక్షయామాస = జానకీదేవిని చూచెను.)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– చారిత్రవ్యపదేశాఢ్యాం = పతివ్రతాధర్మాచరణమున ఖ్యాతిని పొందియున్నది.

**తాత్పర్యము** :– సహజమైన తన శరీరప్రభను గోల్పోయి శోకసంతప్తురాలై, ధూళి – ధూసరితములైన కేశములు గల్గి, పుణ్యము నశించుటచే దివినుండి రాలి భూమిపై బడిన నక్షత్రమువలె గాన్పించుచు పాతివ్రత్యప్రభావమును వెల్లడించు రూపము కలిగి, భర్త కాన్పింపకపోవుట యనెడి దుఃస్థితి నొందియున్నట్టి ఆ జానకీదేవిని హనుమ కనులారా గాంచెను.

**శ్లో॥ భూషణై రుత్తమై ర్హీనాం భర్తృవాత్సల్యభూషణామ్ ।**
**రాక్షసాధిపసంరుద్ధాం బంధుభిశ్చ వినాకృతామ్ ॥ 20**

**పదచ్ఛేదము** :– భూషణైః – ఉత్తమైః – హీనాం – భర్తృవాత్సల్యభూషణామ్ – రాక్షసాధిప సంరుద్ధాం – బంధుభిః – చ – వినాకృతామ్ ॥

**ప్రతిపదార్థము** :– ఉత్తమైః భూషణైః హీనాం = శ్రేష్ఠమైన ఆభరణములు లేనట్టిదియును, భర్తృవాత్సల్య భూషణాం = భర్తయొక్క ప్రేమయే ఆభరణముగా నున్నదియును, రాక్షసాధిప సంరుద్ధాం = రాక్షసరాజైన రావణునిచే బంధింపబడినదియును, బంధుభిః వినాకృతామ్ = తన వారికి దూరమైపోయియున్నదియును అగు; (జానకీం లక్షయామాస = సీతాదేవిని గాంచెను).

**తాత్పర్యము** :– శ్రేష్ఠమైన ఇతరాభరణము లేమియును లేక పోయినప్పటికిని భర్తృప్రేమ యనెడి అమూల్యమైన ఆభరణముతో శోభించు చున్నదియును, బంధువులకు దూరము చేయబడి రావణునిచే బంధింపబడి యున్నదియునగు ఆ సీతాదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ వియూథాం సింహసంరుద్ధాం బద్ధాం గజవధూమివ ।**
**చంద్రరేఖాం పయోదాంతే శారదాభ్రైరివావృతామ్ ॥ 21**

**పదచ్ఛేదము** :– వియూథాం – సింహసంరుద్ధాం – బద్ధాం – గజవధూమ్ – ఇవ, చంద్రరేఖాం – పయోదాంతే – శారదాభ్రైః – ఇవ – ఆవృతామ్ ॥

**ప్రతిపదార్థము** :– వియూథాం = తన మందనుండి తప్పిపోయినదియును, సింహసంరుద్ధాం = సింహముచే అడ్డగింపబడినదియు నగు, బద్ధాం గజవధూమ్ ఇవ = బంధింపబడినట్టి ఆడుఏనుగువలె నున్నదియును, పయోదాంతే = వర్షాకాలపు చివరి కాలమున, శారదాభ్రైః ఆవృతాం = శరత్కాల మేఘములచే ఆవరింపబడినట్టి, చంద్రరేఖామ్ ఇవ = చంద్రరేఖవలె నున్నదియు నగు, (జానకీం లక్షయామాస = జానకీదేవిని చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– పయోదాంతే శారదాభ్రైః ఆవృతాం – అనుటచే సీతాదేవియొక్క దుఃఖములు అత్యల్పములే మిగిలియున్నవని సూచింపబడినవి.

**తాత్పర్యము** :– తన మందనుండి దూరమైపోయి, సింహముచే అడ్డగింపబడి, బంధములో చిక్కుకొన్న ఆడుఏనుగు వలెను, వర్షాకాలము తొలగిపోగా శరత్కాల మేఘములచే కప్పబడుచున్న, సన్నని చంద్రరేఖ వలెను కాన్పించు చున్నట్టి ఆ సీతాదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ క్లిష్టరూపా మసంస్పర్శా దయుక్తామివ వల్లకీమ్ ।**
**సీతాం భర్తృవశే యుక్తా మయుక్తాం రాక్షసీవశే ॥ 22**

**పదచ్ఛేదము** :– క్లిష్టరూపామ్ – అసంస్పర్శాత్ – అయుక్తామ్ – ఇవ – వల్లకీమ్ – సీతాం – భర్తృవశే – యుక్తామ్ – అయుక్తాం – రాక్షసీవశే ॥

**ప్రతిపదార్థము** :– అసంస్పర్శాత్ = శరీర సంస్కారము లేకుండుటచే, క్లిష్టరూపాం = నలిగిపోయియున్న రూపముగలదియును, అయుక్తాం వల్లకీమ్ ఇవ = తీగలు కూర్చబడని వీణవలెనున్నదియును, భర్తృవశే యుక్తాం = భర్తయధీనమునందు ఉండదగినదియును, రాక్షసీవశే అయుక్తాం = రాక్షసుల అధీనమునం దుండుటకు తగనిదియును అగు, సీతాం = జానకీదేవిని, (హనుమాన్ లక్షయామాస = హనుమంతుడు గాంచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అసంస్పర్శాత్ = భర్తయొక్క స్పర్శ లేకుండుటచే, 'అయుక్తాం వల్లకీమివ' – మ్రోగించుటయను ఉపయోగము లేనిదై యుండుటచే మూలబడియున్నట్టి వీణవలె నున్నది.

బొంబాయి ముద్రణమున భర్తృవశే యుక్తాం – అనుదానికి బదులుగా, భర్తృహితే యుక్తాం – అను పాఠము గలదు. అనగా భర్తక్షేమమును కోరుచున్నది యని అర్థము.

**తాత్పర్యము** :– తన సుఖముపై శ్రద్ధలేకుండుటచే సంస్కారహీనమై మలినమై నలిగిపోయియున్న దేహముతో తీగలుకూర్చని వీణవలె నున్నదియును, భర్తృలాలనము నందుండి సుఖించు చుండవలసినట్టిదియును, రాక్షసుల అధీనమున నుండుటకు తగనిదియును, అగు జానకీదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ అశోకవనికామధ్యే శోకసాగరమాప్లుతామ్ ।**
**తాభిః పరివృతాం తత్ర సగ్రహా మివ రోహిణీమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :– అశోకవనికామధ్యే – శోకసాగరమ్ – ఆప్లుతామ్, తాభిః – పరివృతాం – తత్ర – సగ్రహామ్ – ఇవ – రోహిణీమ్ ॥

**ప్రతిపదార్థము** :– అశోకవనికామధ్యే = అశోకవనము నడుమ, శోకసాగరమ్ ఆప్లుతామ్ = దుఃఖసముద్రమునందు తేలుచున్నదియును, సగ్రహాం రోహిణీమ్ ఇవ = (క్రూర) గ్రహములతో కూడిన రోహిణీ నక్షత్రమువలె, తత్ర = ఆ శింశుపావృక్షము క్రింద, తాభిః పరివృతామ్ = ఆ క్రూరరాక్షసస్త్రీలచే చుట్టబడియున్నట్టి, (సీతాం లక్షయామాస = జానకీదేవిని చూచెను).

**తాత్పర్యము** :– ఆ యశోకవన మధ్యమునందు, దుఃఖసముద్రమునందు మునిగి తేలుచున్నదై, క్రూరగ్రహములతో కూడిన సుకుమారమైన రోహిణీ నక్షత్రమువలె, భీకరాకారముగల ఆ రాక్షసస్త్రీలచే ఆవరింపబడియున్నట్టి ఆ సీతాదేవిని హనుమ గాంచెను.

**శ్లో॥ దదర్శ హనుమాన్ దేవీం లతా మకుసుమామివ ॥ 24**

**పదచ్ఛేదము** :– దదర్శ – హనుమాన్ – దేవీం – లతామ్ – అకుసుమామ్ – ఇవ ॥

**ప్రతిపదార్థము** :– అకుసుమాం లతామివ = పువ్వులులేనట్టి తీగవలెనున్న, దేవీం = సీతాదేవిని, హనుమాన్ = హనుమ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- హనుమంతునకు అప్పుడు ఆ సీతాదేవి ఒక్క పుష్పముగూడ లేనట్టి పూలతీగవలె గాన్పించెను.

**శ్లో॥ సా మలేన చ దిగ్ధాంగీ వపుషా చాప్యలంకృతా ।**
**మృణాళీ పంకదిగ్ధేవ విభాతి న విభాతి చ ॥ 25**

**పదచ్ఛేదము** :- సా - మలేన - చ - దిగ్ధాంగీ - వపుషా - చ - అపి - అలంకృతా, మృణాళీ - పంకదిగ్ధా - ఇవ - విభాతి - న - విభాతి - చ ॥

**ప్రతిపదార్థము** :- మలేన దిగ్ధాంగీ = ధూళిచే నిండిన శరీరముగలది, అపి చ = అయినప్పటికిని, వపుషా అలంకృతా = శరీరముచేత అలంకరింపబడినదై, పంకదిగ్ధా మృణాళీ ఇవ = బురదతో నిండిన తామరతీగవలె, సా = ఆ సీతాదేవి, విభాతి = ప్రకాశించుచున్నది, న విభాతి చ = ప్రకాశించుటలేదు కూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- విభాతి న విభాతి చ - స్వభావసౌందర్యమువలన ప్రకాశించుచున్నది, సంస్కారరాహిత్యముచే ప్రకాశించుట లేదు కూడను.

**తాత్పర్యము** :- ఒడలినిండ ధూళి క్రమ్మి తన సహజ సౌందర్య విశేషము మాత్రము వెల్లడియగుచుండగా సీతాదేవి బురదతో కూడిన తామరతీగవలె ప్రకాశించుచు గూడ ప్రకాశములేక యుండెను.

**శ్లో॥ మలినేన తు వస్త్రేణ పరిక్లిష్టేన భామినీమ్ ।**
**సంవృతాం మృగశాబాక్షీం దదర్శ హనుమా న్కపిః ॥ 26**

**శ్లో॥ తాం దేవీం దీనవదనా మదీనాం భర్తృతేజసా ।**
**రక్షితాం స్వేన శీలేన సీతా మసితలోచనామ్ ॥ 27**

**పదచ్ఛేదము** :- మలినేన - తు - వస్త్రేణ - పరిక్లిష్టేన - భామినీమ్, సంవృతాం - మృగశాబాక్షీం - దదర్శ - హనుమాన్ - కపిః - తాం - దేవీం - దీనవదనామ్ - అదీనాం - భర్తృతేజసా - రక్షితాం - స్వేన - శీలేన - సీతామ్ - అసితలోచనామ్.

**అన్వయక్రమము** :- మలినేన, పరిక్లిష్టేన వస్త్రేణ సంవృతాం మృగశాబాక్షీం, భామినీం, దీనవదనాం, భర్తృతేజసా అదీనాం స్వేన శీలేన రక్షితామ్, అసితలోచనాం, తాం దేవీం సీతాం, కపిః హనుమాన్ దదర్శ.

**ప్రతిపదార్థము** :- మలినేన = మలినమైయున్నట్టి, పరిక్లిష్టేన = మిక్కిలి నలిగిపోయి

యున్నట్టి, వస్త్రేణ = చీరచేత, సంవృతాం = కప్పబడి యున్నదియును, మృగశాబాక్షీం = లేడిపిల్ల కన్నులవంటి కన్నులు గల్గియున్నదియును, భామినీం = సుందరాంగియును, దీనవదనాం = దీనమైయున్న ముఖము గలదియును, భర్తృతేజసా అదీనాం = శ్రీరాముని తేజస్సుచే దైన్యము లేనిదైయున్నదియును, స్వేన శీలేన రక్షితాం = తన పాతివ్రత్యముచేత రక్షణ నొందియున్నదియును, అసితలోచనాం = నల్లని కన్నులు గలదియునగు, తాం దేవీం సీతాం = ఆ మహనీయురాలైన సీతాదేవిని, కపిః హనుమాన్ = వానరశ్రేష్ఠుడైన హనుమ, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– భర్తృతేజసా అదీనాం – భర్తయొక్క పరాక్రమమును మనస్సునందు స్మరించుచుండుటచే దైన్యములేని హృదయము గలదని భావము.

**తాత్పర్యము** :– మిక్కిలి నలిగిపోయి మలినమైన వస్త్రమును ధరించి, లేడిపిల్లవలె బెదరుచూపులతో, మిక్కిలి దీనస్థితిలోనున్నను భర్తయొక్క పరాక్రమమును స్మరించుకొనుటచే తన మనస్సునందు దైన్యములేనిదై, తన పాతివ్రత్యముచేతనే తనను కాపాడుకొనుచు, సుందరములైన నల్లని నేత్రములతో ప్రకాశించుచున్న ఆ సీతాదేవిని హనుమంతుడు చూచెను.

**శ్లో॥ తాం దృష్ట్వా హనుమాన్ సీతాం మృగశాబనిభేక్షణామ్ ।**
**మృగకన్యా మివ త్రస్తాం వీక్షమాణాం సమంతతః ॥ 28**

**శ్లో॥ దహంతీమివ నిశ్శ్వాసై ర్వృక్షాన్ పల్లవధారిణః ।**
**సంఘాతమివ శోకానాం దుఃఖ స్యోర్మి మి వోత్థితామ్ ॥ 29**

**శ్లో॥ తాం క్షమాం సువిభక్తాంగీం వినాభరణశోభినీమ్ ।**
**ప్రహర్ష మతులం లేభే మారుతిః ప్రేక్ష్య మైథిలీమ్ ॥ 30**

**పదచ్ఛేదము** :– తాం – దృష్ట్వా – హనుమాన్ – సీతాం – మృగశాబనిభేక్షణామ్, మృగకన్యాం – ఇవ – త్రస్తాం – వీక్షమాణాం – సమంతతః; దహంతీమ్ – ఇవ – నిశ్శ్వాసైః – వృక్షాన్ – పల్లవధారిణః – సంఘాతమ్ – ఇవ – శోకానాం – దుఃఖస్య – ఊర్మిమ్ – ఇవ – ఉత్థితాం – తాం – క్షమాం – సువిభక్తాంగీం – వినాభరణశోభినీం – ప్రహర్షమ్ – అతులం – లేభే – మారుతిః – ప్రేక్ష్య – మైథిలీమ్ ॥

**ప్రతిపదార్థము** :– మృగశాబనిభేక్షణాం = లేడిపిల్ల కన్నులవంటి కన్నులు

గలిగినదియును, త్రస్తాం మృగకన్యామ్ ఇవ = బెదిరిపోయిన ఆడులేడిపిల్లవలె, సమంతతః వీక్షమాణాం = అన్నివైపులకును చూచుచున్నదియును, నిశ్వాసైః = నిట్టూర్పులచే, పల్లవధారిణః వృక్షాన్ = చిగుళ్ళుతొడిగియున్న చెట్లను, దహంతీమ్ ఇవ = కాల్చివేయుచున్నదివలె నున్నదియును, శోకానాం సంఘాతమ్ ఇవ = దుఃఖముల రాశివలె నున్నదియును, దుఃఖస్య ఉత్థితామ్ ఊర్మిమ్ ఇవ = దుఖసముద్రము యొక్క ఉన్నతమైన కెరటమువలె నున్నదియును, క్షమాం = మూర్తీభవించిన సహనమువలె నున్నదియును, సువిభక్తాంగీం = చక్కని పొందికగల అవయవములు గల్గినదియును, వినాభరణశోభినీం = ఆభరణములు లేకయే ప్రకాశించు చున్నదియును అగు, మైథిలీం తాం సీతాం = మిథిలాధిపుని కుమార్తెయైన ఆ సీతాదేవిని, దృష్ట్వా = చూచి, ప్రేక్ష్య = బాగుగా పరికించి, మారుతిః హనుమాన్ = వాయునందనుడైన హనుమ, అతులం ప్రహర్షం = నిరుపమానమైన ఆనందమును, లేభే = పొందెను.

**తాత్పర్యము** :- బెదిరిన ఆడులేడిపిల్లవలె తనను రక్షించువారికొఱకై నలువైపుల చూచుచున్నదియును, తన వేడి నిట్టూర్పులచే చిగిర్చియున్న చెట్ల పల్లవములను మాడ్చివేయుచున్నట్లున్నదియును, ప్రోగుబడిన దుఃఖములవలె కాన్పించుచున్నదియును, ఉవ్వెత్తుగ లేచియున్న దుఃఖసముద్రపు కెరటమువలె గానవచ్చుచున్నదియును, గొప్ప ఓర్పుగలిగి యున్నదియును, సుందరమైన పొందికగల అవయవములతో ప్రకాశించు చున్నదియును, ఆభరణములు లేకయే గొప్ప శోభగల శరీరము గలదియును అగు ఆ సీతాదేవిని దర్శించి, వాయునందనుడు అమితమైన ఆనందము నొందెను.

**శ్లో॥ హర్షజాని చ సోఽ౽ శ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షణాం ।**
**ముమోచ హనుమాం స్తత్ర నమశ్చక్రే చ రాఘవమ్ ॥ 31**

**పదచ్ఛేదము** :- హర్షజాని – చ – సః – అశ్రూణి – తాం – దృష్ట్వా – మదిరేక్షణామ్ – ముమోచ – హనుమాన్ – తత్ర – నమః – చక్రే – చ – రాఘవమ్ ॥

**అన్వయక్రమము** :- తాం మదిరేక్షణాం దృష్ట్వా, సః హనుమాన్ హర్షజాని అశ్రూణి ముమోచ, తత్ర రాఘవం నమః చక్రే చ.

**ప్రతిపదార్థము** :- మదిరేక్షణాం తాం దృష్ట్వా = సౌందర్యవతియైన ఆ సీతాదేవిని గాంచి, సః హనుమాన్ = ఆ హనుమంతుడు, హర్షజాని అశ్రూణి = ఆనందముచే కలిగిన బాష్పములను, ముమోచ = విడిచెను, తత్ర = అచ్చట, రాఘవం = శ్రీరాముని గూర్చి, నమః చక్రే చ = నమస్కారము చేసెను కూడ.

**తాత్పర్యము :–** ఆ సీతాదేవిని కనులార గాంచి హనుమంతుడు తన కన్నులనుండి జలజల ఆనందబాష్పములను రాల్చెను. అచ్చటినుండియే ఆ యానందముతో అతడు శ్రీరామునకు భక్తిపూర్వకముగ నమస్కారము చేసెను గూడను.

**శ్లో॥ నమస్కృత్వా చ రామాయ లక్ష్మణాయ చ వీర్యవాన్ ।**
**సీతాదర్శనసంహృష్టః హనుమాన్ సంవృతోఽభవత్ ॥ 32**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రాక్షసీపరీవారః" నామ*
*సప్తదశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** నమః – కృత్వా – చ – రామాయ – లక్ష్మణాయ – చ – వీర్యవాన్ – సీతాదర్శనసంహృష్టః – హనుమాన్ – సంవృతః – అభవత్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** రామాయ = శ్రీరామునకును, లక్ష్మణాయ చ = లక్ష్మణునకును, నమస్కృత్వా చ = నమస్కారముచేసి వెంటనే, సీతాదర్శనసంహృష్టః = సీతయొక్క దర్శనముచే కలిగిన ఆనందముతో నిండినట్టి, వీర్యవాన్ హనుమాన్ = పరాక్రమ శాలియైన హనుమంతుడు, సంవృతః అభవత్ = దాగియున్నవాడయ్యెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'సంవృతః అభవత్' – రాక్షసస్త్రీల దృష్టిని తప్పించుకొనుటకు సూక్ష్మరూపమునే ధరించి, ఆ చెట్టుకొమ్మలయందే అణగియుండెనని భావము.

**తాత్పర్యము :–** సీతమ్మను దర్శింపగలిగినందులకు మహానందమునొంది పరాక్రమ శాలియైన ఆ హనుమ, రామునకును, లక్ష్మణునకును నమస్కరించి అచటి రాక్షసస్త్రీల కంట బడకుండుటకై ఆ శింశుపావృక్షముయొక్క ఆకుల వెనుక సూక్ష్మరూపముతో దాగియుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రాక్షసీపరీవారము" అను*
*పదునేడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

⋆⋆⋆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# అష్టాదశసర్గ

**శ్లో॥ తథా విప్రేక్షమాణస్య వనం పుష్పితపాదపమ్ ।**
**విచిన్వత శ్చ వైదేహీం కించిచ్ఛేషా నిశాఽభవత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తథా – విప్రేక్షమాణస్య – వనం – పుష్పితపాదపమ్, విచిన్వతః – చ – వైదేహీం – కించిత్‌శేషా – నిశా – అభవత్ ॥

**అన్వయక్రమము :–** (తస్య) తథా పుష్పితపాదపం వనం విప్రేక్షమాణస్య వైదేహీం విచిన్వతః చ నిశా కించిత్‌శేషా అభవత్.

**ప్రతిపదార్థము :–** (తస్య = ఆ హనుమ) తథా = ఆరీతిగా, పుష్పితపాదపం = చక్కగా పుష్పించియున్న వృక్షములు గల్గినట్టి, వనం = ఆ యశోకవనమును, విప్రేక్షమాణస్య = ఆసక్తితో పరికించి చూచుచుండగాను, వైదేహీం విచిన్వతః చ = సీతాదేవిని వెదకుచుండగను, నిశా = ఆ రాత్రి, కించిత్‌శేషా అభవత్ = కొంచెము మాత్రమే మిగిలినదయ్యెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'కించిత్‌శేషా నిశా' – చివరి జాము మాత్రము మిగిలినది. సీతను స్పష్టముగా చూచుటకొఱకై రాక్షసులు నిద్రించు సమయముకొఱకై వేచియుండి సీతను జూచునప్పటికి ఒకజాము రాత్రి మాత్రము మిగిలియుండెను.

**తాత్పర్యము :–** చక్కగా పూచియున్న పుష్పవృక్షములుగల ఆ యశోకవనిక సౌందర్యమును జూచుచు, రాక్షసస్త్రీలు నిద్రించు సమయముకొఱకు వేచియుండి సీతను వెదుకుచున్న హనుమంతునకు రాత్రికాలము ఒక్క జాము మాత్రము మిగిలి యుండెను.

**శ్లో॥ షడంగవేదవిదుషాం క్రతుప్రవరయాజినామ్ ।**
**శుశ్రావ బ్రహ్మఘోషాంశ్చ విరాత్రే బ్రహ్మరక్షసామ్ ॥ 2**

**పదచ్ఛేదము** :– షడంగవేదవిదుషాం – క్రతుప్రవరయాజినామ్, శుశ్రావ – బ్రహ్మఘోషాన్ – చ – విరాత్రే – బ్రహ్మరక్షసామ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ హనుమ) విరాత్రే = రాత్రియొక్క చివరి భాగమునందు, షడంగవేదవిదుషాం = వేదాంగము లారింటితో గూడినట్టి వేదములను తెలిసిన వారును, క్రతుప్రవరయాజినాం = గొప్ప యజ్ఞములు గావించినవారును అగు, బ్రహ్మరక్షసాం = బ్రహ్మరక్షస్సులయొక్క, బ్రహ్మఘోషాన్ = వేదఘోషలను, శుశ్రావ = ఆకర్ణించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– బ్రహ్మరక్షసామ్ – బ్రహ్మశబ్దమునకు వేదము అని కూడ అర్థము గలదు. గావున బ్రహ్మరక్షస్సులనగా వేదవేత్తలైన రాక్షసులు.

**రామాయణ శిరోమణి** :– బ్రహ్మరక్షసామ్ – బ్రాహ్మణ రాక్షసులయొక్క.

**వాసుదాసస్వామి** :– షడంగవేదవిదుల్, శిక్షావ్యాకరణాదులగు నాఱంగములతో గూడిన వేదము నెఱిగినవారు. బ్రహ్మరాక్షసులు = రాక్షసులందు బ్రాహ్మణులు. రావణాదులు క్షత్రియులు కావున వర్ణాశ్రమవిభాగము రాక్షసులందును గలదని యేర్పడుచున్నది. బ్రాహ్మణబీజోద్భవులగు పౌలస్త్యులు (కొందరు తలచునట్లు) అనార్యులు గారు. క్రూరకర్ములగుటచే రాక్షసులైరి. బ్రహ్మఘోషముల్ = వేదధ్వనులు. 'పరమాత్మా తపో వేదో బ్రహ్మ, బ్రహ్మోఽబ్జజే ద్విజే' – నానార్థరత్నమాల.

**తాత్పర్యము** :– హనుమ ఆ బ్రాహ్మీముహూర్తమునందు వేదవేదాంగవేత్తలును, పెక్కు యాగములు చేసిన ఆహితాగ్నులును అగు బ్రాహ్మణరాక్షసులు గావించు వేదాధ్యయన ఘోషలను ఆలకించెను.

**శ్లో॥ అథ మంగళవాదిత్రశబ్దై శ్శ్రోత్రమనోహరైః ।**
**ప్రాబోధ్యత మహాబాహు ర్దశగ్రీవో మహాబలః ॥ 3**

**పదచ్ఛేదము** :– అథ – మంగళవాదిత్రశబ్దైః – శ్రోత్రమనోహరైః – ప్రాబోధ్యత – మహాబాహుః – దశగ్రీవః – మహాబలః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, మహాబాహుః మహాబలః = మహాబల

పరాక్రమములు కలిగినట్టి, దశగ్రీవః = దశకంఠుడు, శ్రోత్రమనోహరైః = చెవుల కింపుగనున్నట్టి, మంగళవాదిత్రశబ్దైః = మంగళవాద్య ధ్వనులచే, ప్రాబోధ్యత = మేల్కొల్పబడెను.

ప్రాబుధ్యత యని పాఠాంతరము.

**తాత్పర్యము** :- అంతట మహావీరుడైన రావణుడు చెవుల కింపుగ వినబడుచున్న మంగళవాద్య ధ్వనులు వినుచు నిద్రనుండి మేల్కొనెను.

**శ్లో॥ విబుధ్య తు యథాకాలం రాక్షసేంద్రః ప్రతాపవాన్ ।**
**స్రస్తమాల్యాంబరధరో వైదేహీ మన్వచింతయత్ ॥ 4**

**పదచ్ఛేదము** :- విబుధ్య - తు - యథాకాలం - రాక్షసేంద్రః - ప్రతాపవాన్ - స్రస్తమాల్యాంబరధరః - వైదేహీమ్ - అన్వచింతయత్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- ప్రతాపవాన్ రాక్షసేంద్రః = మహాప్రతాపశాలియైన రాక్షసరాజు, యథాకాలం విబుధ్య = యుక్తమైన కాలమున మేల్కొని, స్రస్తమాల్యాంబరధరః = జారిపోయిన ఆభరణములను, వస్త్రములను (సరిచేసికొని) ధరించినవాడై, వైదేహీం = సీతాదేవిని గూర్చి, అన్వచింతయత్ = ఆలోచించెను.

**తాత్పర్యము** :- ఆ రాక్షసాధిపతి సకాలమున మేల్కొంచి నిద్రావశముచే చెదరియున్న ఆభరణములను, వస్త్రములను సరిచేసికొని సీతాదేవిని గురించి చింతింపసాగెను.

**శ్లో॥ భృశం నియుక్త స్తస్యాం చ మదనేన మదోత్కటః ।**
**న స తం రాక్షసః కామం శశా కాత్మని గూహితుమ్ ॥ 5**

**పదచ్ఛేదము** :- భృశం - నియుక్తః - తస్యాం - చ మదనేన - మదోత్కటః - న - సః - తం - రాక్షసః - కామం - శశాక - ఆత్మని - గూహితుమ్ ॥

**అన్వయక్రమము** :- తస్యాం భృశం నియుక్తః, మదనేన మదోత్కటః రాక్షసః ఆత్మని తం కామం నిగూహితుం న శశాక.

**ప్రతిపదార్థము** :- తస్యాం = ఆ సీతాదేవియందు, భృశం = మిక్కిలిగ, నియుక్తః = వ్యామోహితుడై, మదనేన = కామముచే, మదోత్కటః = మిక్కిలి మదించియున్నవాడై, రాక్షసః = ఆ రావణుడు, ఆత్మని = తనమనస్సునందు, తం కామం = ఆ సీతావిషయకమైన కామమును, నిగూహితుం = అణచిపెట్టుకొనుటకు, న శశాక = శక్తుడు గాకపోయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** 'మదనేన మదోత్కటః' అనుచోట, మదనే = మన్మథ వికారము కలిగినప్పటికిని, న మదోత్కటః = మదమునకు పరతంత్రుడు గానివాడుగా నుండెను. అందుచేతనే, తస్యాం భృశం నియుక్తః = ఆ సీతాదేవియందు మిక్కిలిగా తీవ్రమైన యుక్తమైన భావమే గలవాడయ్యెను, అనగా పూజ్యభావము గలవాడయ్యెను, 'కామం అత్మని గూహితుం న శశాక' = అను వాక్యమునకు, కాకుస్వరముతో పఠించిన 'తన కామము నణచుకొనలేకపోయెనా? అనగా తప్పక రావణుడు కామమును తనలోనే అణచుకొనగల్గెను' అని భావము.

**తిలకము :–** ఈ శ్లోకమునకు మహేశ్వరతీర్థుడు ఇచ్చిన వ్యాఖ్యానము భ్రాంతి మూలకము. తమోగుణవిశిష్టుడై భగవన్మాయామోహితుడై యున్నట్టి ఆ రాక్షసునకు అకృత్యాచరణమునందే ఆసక్తి గానబడును. అట్లుగాక ఈతడు ఈ అకృత్యము చేయుచున్నను సీతారాముల పరమ పవిత్ర నామములను స్మరించుచున్నాడు గదా! అందువలన ఉత్తమఫలము కలుగునుగదా! అనినచో తప్పక కలిగినది. ఎట్లనగా ఈతడు జన్మాంతరమునందు చేదివంశపు రాజకుటుంబమున శిశుపాలుడుగా జన్మించుటయను ఉత్తమఫలము నొందెను కదా!

ఇచ్చట వేదప్రామాణ్య మిట్లున్నది –

ఋక్షాశ్వమేధుడను పేరుగల రాజుయొక్క దానమును స్తుతించునట్టి ఋగ్వేదమంత్రము – "న యుష్మే వాజబంధవో నినుత్సుశ్చ న మర్త్యం! అవద్య మధి దీధరత" ॥

ఓ వాజబంధువులారా! (అనగా) "అన్నదానముచే ఎల్లరకును బంధువులైనవారా! మీ పై నిందవేయు మనుష్యుడుగూడ చెడుగును పొందడు. ఎందుచేతననగా, మీరు మిమ్ము స్మరించుచు నిందించువారికి గూడ ఉత్తమఫలము నొసంగుదురు."

అదేవిధముగ సాక్షాత్ లక్ష్మీస్వరూపురాలైన సీతమ్మను దుష్టభావముతో నైనను పలుమాఱులు స్మరించినవాడు గావున రావణునకు అట్టి ఉత్తమజన్మ లభించినది.

**తాత్పర్యము :–** రావణాసురుడు మదనతాపముచే పీడింపబడుచు సీతయందు లగ్నమైన భావము గలవాడై, తన మనస్సునందలి ఆ కామమును అణచుకొనజాలకపోయెను.

**శ్లో॥ స సర్వాభరణై ర్యుక్తో బిభ్రచ్ఛ్రియ మనుత్తమామ్ ।**
**తాం నగై ర్బహుభి ర్జుష్టాం సర్వపుష్పఫలోపగైః ॥ 6**

శ్లో॥ వృతాం పుష్కరిణీభిశ్చ నానాపుష్పోపశోభితామ్ ।
సదామదైశ్చ విహగై ర్విచిత్రాం పరమాద్భుతామ్ ॥ 7

శ్లో॥ ఈహామృగైశ్చ వివిధై ర్జుష్టాం దృష్టిమనోహరైః ।
వీథీ స్సంప్రేక్షమాణశ్చ మణికాంచనతోరణామ్ ॥ 8

శ్లో॥ నానామృగగణాకీర్ణాం ఫలైః ప్రపతితై ర్వృతాం ।
అశోకవనికా మేవ ప్రావిశ త్సంతతద్రుమామ్ ॥ 9

**పదచ్ఛేదము** :– సః – సర్వాభరణైః – యుక్తః – బిభ్రత్ – శ్రియమ్ – అనుత్తమామ్, తాం – నగైః – బహుభిః – జుష్టాం – సర్వపుష్పఫలోపగైః ॥ వృతాం – పుష్కరిణీభిః – చ – నానాపుష్పోపశోభితామ్ – సదామదైః – చ – విహగైః – విచిత్రాం – పరమాద్భుతామ్ ॥ ఈహామృగైః – చ – వివిధైః – జుష్టాం – దృష్టిమనోహరైః – వీథీః – సంప్రేక్షమాణః – చ – మణికాంచనతోరణామ్ ॥ నానామృగగణాకీర్ణాం – ఫలైః – ప్రపతితైః – వృతామ్, అశోకవనికామ్ – ఏవ – ప్రావిశత్ – సంతత ద్రుమామ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సర్వాభరణైః యుక్తః = సమస్తమైన భూషణములతో కూడినవాడై, అనుత్తమాం శ్రియం బిభ్రత్ = మిక్కిలి శ్రేష్ఠమైన శోభను వహించుచున్నవాడై, సః = ఆ రావణుడు, సర్వపుష్పఫలోపగైః = సమస్తవిధములైన పుష్పములతోడను, ఫలములతోడను కూడినట్టి, బహుభిః = బహువిధములైన, నగైః = వృక్షములచే, జుష్టాం = సేవింపబడినదియును, నానాపుష్పోపశోభితాం = పలువిధములగు పుష్పములతో ప్రకాశించుచున్నదియును, సదామదైః = నిత్యమును మదించి యుండు, విహగైః = పక్షులతో, విచిత్రాం = పలురంగులు గలిగియున్నదియును, పరమాద్భుతాం = మిక్కిలి ఆశ్చర్యకరముగ నున్నదియును, వివిధైః దృష్టిమనోహరైః ఈహామృగైః జుష్టాం = పలువిధములైన చూడముచ్చట గొలుపు తోడేళ్ళగుంపులచే సేవింపబడిన దియును, నానామృగగణాకీర్ణాం = పలువిధములగు లేళ్లగుంపులతో నిండినదియును, ప్రపతితైః ఫలైః వృతాం = నేలపైబడిన పండ్లతో కూడినదియును, సంతతద్రుమాం = దట్టమైన చెట్లుగలిగియున్నట్టిదియునగు, అశోకవనికామ్ ఏవ = అశోకవనమునే, మణికాంచనతోరణామ్ = రత్నసువర్ణ నిర్మితములైన తోరణములుగల, వీథీః = శ్రేణులను (ఉద్యానవీథులను), సంప్రేక్షమాణః = పరికించి చూచుచున్నవాడై, ప్రావిశత్ = ప్రవేశించెను.

**తాత్పర్యము** :– రావణాసురుడు సమస్తాభరణములను ధరించి, మిక్కిలి శోభతో వెలుగొందుచున్నవాడై సర్వఋతుపుష్పఫలములతో నిండిన చెట్లతోడను, తామరకొలనులతోడను, బహువిధపుష్పములతోడను, మదించియున్న పక్షులతోడను, చూడముచ్చటగొలుపు తోడేళ్లతోడను, బహువిధమృగములతోడను, రాలిపడియున్న మధురఫలములతోడను సుందరముగా అద్భుతముగా గానవచ్చుచున్న ఆ వృక్షశ్రేణులను తిలకించుచు, అశోకవనమునందు ప్రవేశించెను.

**శ్లో॥ అంగనాశతమాత్రం తు తం వ్రజంత మనువ్రజత్ ।**
**మహేంద్రమివ పౌలస్త్యం దేవగంధర్వయోషితః ॥ 10**

**పదచ్ఛేదము** :– అంగనాశతమాత్రం – తు – తం – వ్రజంతమ్ – అనువ్రజత్ – మహేంద్రమ్ – ఇవ – పౌలస్త్యం – దేవగంధర్వయోషితః ॥

**అన్వయక్రమము** :– వ్రజంతం తం పౌలస్త్యం, మహేంద్రం దేవగంధర్వయోషితః ఇవ అంగనాశతమాత్రం తు అనువ్రజత్.

**ప్రతిపదార్థము** :– వ్రజంతం = వెడలుచున్నట్టి, తం పౌలస్త్యం = ఆ రావణాసురుని, మహేంద్రం = దేవేంద్రుని, దేవగంధర్వయోషితః ఇవ = అప్సరస్త్రీలును గంధర్వ వనితలునువలె, అంగనాశతమాత్రం తు = వందమంది అంగనలు మాత్రము, అనువ్రజత్ = వెంబడించి వెళ్లుచుండిరి.

**తాత్పర్యము** :– దేవేంద్రుని అప్సరస్త్రీలును, గంధర్వాంగనలును, అనుసరించి నడచునట్లు, అశోకవనికకు పయనమై నడచుచున్న ఆ రావణాసురుని వందమంది సుందరీమణులు మాత్రము వెంట నడుచుచుండిరి.

**శ్లో॥ దీపికాః కాంచనీః కాశ్చి జ్జగృహు స్తత్ర యోషితః ।**
**వాలవ్యజనహస్తాశ్చ తాలవృంతాని చాపరాః ॥ 11**

**పదచ్ఛేదము** :– దీపికాః – కాంచనీః – కాః – చిత్ – జగృహుః – తత్ర – యోషితః – వాలవ్యజనహస్తాః – చ – తాలవృంతాని – చ – అపరాః ॥

**అన్వయక్రమము** :– తత్ర కాశ్చిత్ యోషితః కాంచనీః దీపికాః జగృహుః, కాశ్చిత్ వాలవ్యజనహస్తాః చ ఆసన్; అపరాః తాలవృంతాని జగృహుః.

**ప్రతిపదార్థము** :– తత్ర = అందు, కాశ్చిత్ యోషితః = కొంతమంది స్త్రీలు, కాంచనీః దీపికాః = బంగారు దీపికలను, జగృహుః = పట్టుకొనిరి, (కాశ్చిత్ = కొంతమంది), వాలవ్యజనహస్తాః చ = వింజామరములు చేతియందు కలిగిన వారుగాను, ఆసన్ =

ఉండిరి, అపరాః = మరికొంతమంది స్త్రీలు, తాలవృంతాని = విసనకర్రలను, జగృహుః = ధరించిరి.

**తాత్పర్యము :–** ఆ రావణునివెంట వచ్చుచున్న స్త్రీలలో కొందరు సువర్ణదీపికలను, కొందరు వింజామరలను, మరికొందరు విసనకర్రలను పట్టుకొని వచ్చుచుండిరి.

**శ్లో॥ కాంచనై రపి భృంగారై ర్జహ్రు స్సలిల మగ్రతః ।**
**మండలాగ్రాన్ బృసీం చైవ గృహ్యాన్యాః పృష్ఠతో యయుః ॥ 12**

**పదచ్ఛేదము :–** కాంచనైః – అపి – భృంగారైః – జహ్రుః –సలిలమ్ – అగ్రతః – మండలాగ్రాన్ – బృసీం – చ – ఏవ – గృహ్య – అన్యాః – పృష్ఠతః – యయుః ॥

**అన్వయక్రమము :–** కాశ్చిత్ అగ్రతః కాంచనైః భృంగారైః సలిలం జహ్రుః; అన్యాః మండలాగ్రాన్, బృసీం చైవ గృహ్య పృష్ఠతః యయుః ॥

**ప్రతిపదార్థము :–** కాశ్చిత్ = కొంతమంది, అగ్రతః = ముందు భాగమున, కాంచనైః భృంగారైః = బంగారు కలశములతో, సలిలం = నీటిని, జహ్రుః = తెచ్చుచుండిరి, అన్యాః = మరికొంతమంది, మండలాగ్రాన్ = ఖడ్గములను, బృసీం చైవ = కూర్చుండు ఆసనమును, గృహ్య = గ్రహించి, పృష్ఠతః = వెనుకభాగమున, యయుః = పోవుచుండిరి.

**తాత్పర్యము :–** కొందరు సుందరులు ఆతనికి ముందుభాగమునందు నడచుచు, బంగారు కలశములతో జలమును గొనివచ్చుచుండిరి. మరికొందరు ఖడ్గములను, కూర్చుండు ఆసనములను తమచేత ధరించి ఆతనివెంట నడచుచుండిరి.

**శ్లో॥ కాచి ద్రత్నమయీం స్థాలీం పూర్ణాం పానస్య భామినీ ।**
**దక్షిణా దక్షిణే నైవ తదా జగ్రాహ పాణినా ॥ 13**

**పదచ్ఛేదము :–** కా – చిత్ – రత్నమయీం – స్థాలీం – పూర్ణాం – పానస్య – భామినీ, దక్షిణా – దక్షిణేన – ఏవ – తదా – జగ్రాహ – పాణినా ॥

**అన్వయక్రమము :–** తదా దక్షిణా కాచిత్ భామినీ రత్నమయీం పూర్ణాం పానస్య స్థాలీం దక్షిణేన పాణినా ఏవ జగ్రాహ.

**ప్రతిపదార్థము :–** తదా = ఆ సమయమునందు, దక్షిణా = సమర్థతకలిగిన, కాచిత్ భామినీ = ఒకానొక తరుణి, రత్నమయీం = రత్ననిర్మితమైనట్టి, పూర్ణాం = నిండియున్నట్టి, పానస్య స్థాలీం = మద్యపు పాత్రను, దక్షిణేన పాణినా ఏవ =

కుడిచేతితోడనే, జగ్రాహ = పట్టుకొనెను.

**తాత్పర్యము :–** మంచి సామర్థ్యము కలిగినట్టి ఒకానొక సుందరి రత్ననిర్మితమైన పూర్ణమైన మద్యపాత్రను తన కుడిచేతితో జాగ్రత్తగ పట్టుకొని అతని ప్రక్కగా నడచి వచ్చుచుండెను.

**శ్లో॥ రాజహంసప్రతీకాశం ఛత్రం పూర్ణశశిప్రభమ్ ।**
**సౌవర్ణదండ మపరా గృహీత్వా పృష్ఠతో యయౌ ॥ 14**

**పదచ్ఛేదము :–** రాజహంసప్రతీకాశం – ఛత్రం – పూర్ణశశిప్రభమ్, సౌవర్ణదండమ్ – అపరా – గృహీత్వా – పృష్ఠతః – యయౌ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** అపరా = వేరొకస్త్రీ, రాజహంసప్రతీకాశం = రాజహంసవలె నున్నదియును, పూర్ణశశిప్రభం = నిండుచంద్రుని కాంతివంటి కాంతి గలిగినదియును, సౌవర్ణదండం = బంగారుదండము గలదియును అగు, ఛత్రం = గొడుగును, గృహీత్వా = గ్రహించి, పృష్ఠతః యయౌ = వెనుక భాగమున నడచు చుండెను.

**తాత్పర్యము :–** ఇంకొక యువతి రాయంచవలె తెల్లగను, నిండుచంద్రునివలె సుందరముగను నున్నట్టి సువర్ణదండముగల శ్వేతచ్ఛత్రమును తన చేత పట్టుకొని అతని వెనుకభాగమున నడచుచుండెను.

**శ్లో॥ నిద్రామదపరీతాక్ష్యో రావణ స్యోత్తమాః స్త్రియః ।**
**అనుజగ్ముః పతిం వీరం ఘనం విద్యుల్లతా ఇవ ॥ 15**

**పదచ్ఛేదము :–** నిద్రామదపరీతాక్ష్యః – రావణస్య – ఉత్తమాః – స్త్రియః – అనుజగ్ముః – పతిం – వీరం – ఘనం – విద్యుల్లతాః – ఇవ ॥

**అన్వయక్రమము :–** రావణస్య ఉత్తమాః స్త్రియః నిద్రామదపరీతాక్ష్యః (సత్యః) విద్యుల్లతాః ఘనమ్ ఇవ, వీరం పతిమ్ అనుజగ్ముః.

**ప్రతిపదార్థము :–** రావణస్య = రావణాసురునియొక్క, ఉత్తమాః స్త్రియః = ఉత్తమస్త్రీలు, నిద్రామదపరీతాక్ష్యః (సత్యః) = నిద్రయందలి మత్తుతోనిండిన కన్నులు గలవారై, విద్యుల్లతాః ఘనమ్ ఇవ = మెరపుతీగలు మేఘునివలె, వీరం పతిం = వీరుడైన (తమ) భర్తను, అనుజగ్ముః = వెంబడించిరి.

**తాత్పర్యము :–** మరికొంతమంది ఉత్తమస్త్రీలు నిద్రతోడను మత్తుతోడను వివశమైన

కన్నులు గలవారై, మెరపుతీగలు మేఘము ననుసరించు చున్నట్లుగా, వీరుడైన తమ భర్తయగు రావణాసురుని వెంటనంటి నడచి వచ్చుచుండిరి.

**శ్లో॥ వ్యావిద్ధహారకేయూరా స్సమామృదితవర్ణకాః ।**
**సమాగళితకేశాంతా స్సస్వేదవదనా స్తథా ॥ 16**

**శ్లో॥ ఘూర్ణంత్యో మదశేషేణ నిద్రయా చ శుభాననాః ।**
**స్వేదక్లిష్టాంగకుసుమా స్సుమాల్యాకులమూర్ధజాః ॥ 17**

**శ్లో॥ ప్రయాంతం నైరృతపతిం నార్యో మదిరలోచనాః ।**
**బహుమానాచ్చ కామాచ్చ ప్రియా భార్యాస్త మన్వయుః ॥ 18**

**పదచ్ఛేదము** :– వ్యావిద్ధహారకేయూరాః – సమామృదితవర్ణకాః – సమాగళితకేశాంతాః – సస్వేదవదనాః – తథా ॥ ఘూర్ణంత్యః – మదశేషేణ – నిద్రయా – చ – శుభాననాః – స్వేదక్లిష్టాంగకుసుమాః – సుమాల్యాకులమూర్ధజాః ॥ ప్రయాంతం – నైరృతపతిం – నార్యః – మదిరలోచనాః – బహుమానాత్ – చ – కామాత్ – చ – ప్రియాః – భార్యాః – తమ్ – అన్వయుః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– వ్యావిద్ధహారకేయూరాః = చెదరిపోయియున్న ముత్యాలహారములును భుజకీర్తులును గలవారును, సమామృదిత వర్ణకాః = నలిగి రాలిపోయిన మైపూతగల వారును, సమాగళితకేశాంతాః = జారిన కేశాంతములు గలవారును, తథా = అట్లే, సస్వేదవదనాః = చెమటలతో కూడిన ముఖము గలవారును, మదశేషేణ = శేషించియున్న మత్తుచేతను, ఘూర్ణంత్యః = ఊగిపోవుచున్నవారును, శుభాననాః = మంగళకరమైన ముఖముగలవారును, స్వేదక్లిష్టాంగకుసుమాః = చెమటతో తడిసిపోయిన శరీరమును, పుష్పములును గలవారును, సుమాల్యాకులమూర్ధజాః = పూలమాలలతో చిక్కుపడియున్న తలవెండ్రుకలు గలవారును, మదిరలోచనాః = ఎఱ్ఱని కన్నులు గలవారునగు, ప్రియాః భార్యాః నార్యః = ప్రియభార్యలైన నారీమణులు, బహుమానాత్ చ = గొప్పదైన గౌరవముచేతను, కామాత్ చ = ప్రేమచేతను, ప్రయాంతం = పోవుచున్నట్టి, తం నైరృతపతిం = ఆ రాక్షసరాజును, అన్వయుః = వెంట వెడలిరి.

**తాత్పర్యము** :– అట్లు నడచి వచ్చుచున్న ఆ రాక్షసరాజును చెదరిపోయిన ముత్యాలహారములు భుజకీర్తులు మున్నగు ఆభరణములతోడను, రాలిపోయిన

మైపూతగల శరీరముతోడను, విడిపోయి జారిపోవుచున్న జుట్టుముడులతోడను, చెమటతో నిండిన ముఖములతోడను, శేషించిన మద్యపుమత్తుతోడను, నిద్రతోడను తడబడుచున్న నడకలతోడను, వాడియున్నను సుందరమైన ముఖములతోడను, చెమటతో నిండిన సుకుమారమైన శరీరముతోడను, పూలదండలతో చిక్కుపడియున్న తలవెంద్రుకలతోడను, రావణునకు ప్రియురాండ్రైన భార్యలు ఆతనిపైగల గౌరవాతి శయముచేతను, ప్రేమాతిశయముచేతను అతనిని వెంటనంటి వచ్చుచుండిరి.

**శ్లో॥ స చ కామపరాధీనః పతి స్తాసాం మహాబలః ।**
**సీతాసక్తమనా మందో మదాంచితగతి ర్బభౌ ॥ 19**

**పదచ్ఛేదము** :– సః – చ – కామపరాధీనః – పతిః – తాసాం – మహాబలః – సీతాసక్తమనాః – మందః – మదాంచితగతిః – బభౌ ॥

**అన్వయక్రమము** :– మహాబలః తాసాం పతిః సః సీతాసక్తమనాః కామపరాధీనః మందః మదాంచితగతిః (సన్) బభౌ.

**ప్రతిపదార్థము** :– మహాబలః = అమితబలాఢ్యుడైన, తాసాం పతిః = ఆ స్త్రీల భర్తయగు, సః = ఆ రావణుడు, సీతాసక్తమానాః = సీతాదేవియందు లగ్నమైన మనస్సుగలవాడై, కామపరాధీనః = మన్మథునకు వశమైనవాడై, మందః = మూర్ఖుడై, మదాంచితగతిః (సన్) = మదముచే ఠీవిగానున్న గమనముగలవాడై, బభౌ = ప్రకాశించెను.

**తాత్పర్యము** :– మహాబలశాలియగు, ఆ స్త్రీల భర్తయైన ఆ రావణుడు సీతయందే లగ్నమైయున్న మనస్సుచే కామపరవశుడై, మూర్ఖుడైయుండి తన మదోద్రేకముచే హెచ్చియున్న ఠీవితో వెలయుచున్న గమనముతో అప్పుడు మిక్కిలి ప్రకాశించు చుండెను.

**శ్లో॥ తతః కాంచీనినాదం చ నూపురాణాం చ నిస్వనమ్ ।**
**శుశ్రావ పరమస్త్రీణాం స కపి ర్మారుతాత్మజః ॥ 20**

**పదచ్ఛేదము** :– తతః – కాంచీనినాదం – చ – నూపురాణాం – చ – నిస్వనమ్ । శుశ్రావ – పరమస్త్రీణాం – సః – కపిః – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము** :– తతః మారుతాత్మజః సః కపిః పరమస్త్రీణాం కాంచీనినాదం చ నూపురాణాం నిస్వనం చ శుశ్రావ.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, మారుతాత్మజః సః కపిః = వాయునందనుడైన

యా హనుమ, పరమస్త్రీణాం = ఉత్తమవనితలయొక్క, కాంచీనినాదం చ = మొల నూలిగంటల ధ్వనులను, నూపురాణాం నిస్వనం చ = కాలియందెల మ్రోతలను, శుశ్రావ = ఆలకించెను.

**తాత్పర్యము :–** అప్పుడు చెట్టుపైనున్న హనుమకు కొలది దూరము నుండి వచ్చుచున్నట్టి ఆ రావణాంగనలయొక్క మొల నూలి చిఱుగంటల సవ్వడియు కాలియందెల మ్రోతలును వినబడెను.

**శ్లో॥ తం చాప్రతిమకర్మాణ మచింత్యబలపౌరుషం ।**
**ద్వారదేశ మనుప్రాప్తం దదర్శ హనుమాన్ కపిః ॥ 21**

**పదచ్ఛేదము :–** తం – చ – అప్రతిమకర్మాణమ్ – అచింత్యబలపౌరుషమ్, ద్వారదేశమ్ – అనుప్రాప్తం – దదర్శ – హనుమాన్ – కపిః ॥

**అన్వయక్రమము :–** కపిః హనుమాన్ అప్రతిమకర్మాణమ్ అంచిత్యబలపౌరుషం ద్వారదేశమ్ అనుప్రాప్తం తం చ దదర్శ.

**ప్రతిపదార్థము :–** కపిః హనుమాన్ = వానరశ్రేష్ఠుడైన హనుమ, ద్వారదేశమ్ అనుప్రాప్తం = ద్వారదేశమును చేరవచ్చియున్నట్టి, అప్రతిమకర్మాణం = సాటిలేని కర్మల నాచరించినవాడును, అంచిత్యబలపౌరుషం = ఊహింపజాలని బలపరాక్రమములు గలవాడును అగు, తం చ = ఆ రావణునికూడ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** పిమ్మట హనుమ సాటిలేని కృత్యములచే ప్రసిద్ధుడైనవాడును, ఊహింపనలవిగాని బలపరాక్రమములు గలవాడు నగు రావణుడు ఆ యశోకవన ద్వారమునకు వచ్చుచుండుట గాంచెను.

**శ్లో॥ దీపికాభి రనేకాభి స్సమంతా దవభాసితమ్ ।**
**గంధతైలావసిక్తాభి ర్ధ్రియమాణాభి రగ్రతః ॥ 22**

**పదచ్ఛేదము :–** దీపికాభిః – అనేకాభిః – సమంతాత్ – అవభాసితమ్, గంధతైలావసిక్తాభిః – ధ్రియమాణాభిః – అగ్రతః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** అగ్రతః ధ్రియమాణాభిః = ఎదురుగ పట్టుకొనబడియున్నట్టి, గంధతైలావసిక్తాభిః = సుగంధతైలములతో తడుపబడుచున్నవగు, అనేకాభిః దీపికాభిః = పెక్కుకాగడాలతో, సమంతాత్ అవభాసితం = చుట్టుప్రక్కల ప్రకాశింపజేయు

చున్నట్టి, (తం దదర్శ = ఆ రావణుని జూచెను).

**తాత్పర్యము :–** తనకు ఎదుట నడుచుచు స్త్రీలు సుగంధతైలములతో తడుపుచు పట్టుకొని వచ్చుచున్న పెక్కు కాగడాల కాంతులు చుట్టుప్రక్కల ప్రదేశముల నన్నింటిని ప్రకాశింప జేయుచుండగా సమీపించుచున్న ఆ రావణుని హనుమ చూచెను.

**శ్లో॥ కామదర్పమదైర్యుక్తం జిహ్మతామ్రాయతేక్షణమ్ ।**
**సమక్షమివ కందర్ప మపవిద్ధశరాసనమ్ ॥ 23**

**పదచ్ఛేదము :–** కామదర్పమదైః – యుక్తం – జిహ్మతామ్రాయతేక్షణమ్, సమక్షమ్ – ఇవ – కందర్పమ్ – అపవిద్ధశరాసనమ్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** కామదర్పమదైః యుక్తం = కామముతోడను గర్వముతోడను మదముతోడను కూడినట్టివాడును, జిహ్మతామ్రాయతేక్షణం = వంకరలై ఎఱ్ఱనివై విశాలములైయున్న కన్నులుగలవాడును, అపవిద్ధశరాసనం = విడచిన ధనుస్సు గలిగినట్టి, సమక్షం కందర్పమ్ ఇవ (స్థితం) = కనులఎదుట నిలచిన మన్మథునివలెనున్న, (తం దదర్శ = ఆ రావణుని జూచెను).

**తాత్పర్యము :–** గొప్పదైన కామము గర్వము మదము గలిగి ఎఱ్ఱనై వక్రమై విశాలములైయున్న కన్నులతో, ధనుస్సును విడిచిపెట్టిన మన్మథునివలె మహాసుందరుడుగా గాన్పించుచున్న, ఆ రావణాసురుని హనుమ చూచెను.

**శ్లో॥ మథితామృతఫేనాభ మరజోవస్త్ర ముత్తమమ్ ।**
**సలీల మనుకర్షంతం విముక్తం సక్త మంగదే ॥ 24**

**పదచ్ఛేదము :–** మథితామృతఫేనాభం – అరజోవస్త్రమ్ – ఉత్తమమ్, సలీలమ్ – అనుకర్షంతం – విముక్తం – సక్తమ్ – అంగదే ॥

**అన్వయక్రమము :–** మథితామృతఫేనాభమ్ ఉత్తమం విముక్తమ్ అంగదే సక్తమ్ అరజోవస్త్రం సలీలమ్ అనుకర్షంతం (తం దదర్శ).

**ప్రతిపదార్థము :–** మథితామృతఫేనాభం = చిక్కని మజ్జిగవలెను, అప్పుడు పిదికిన పాల నురుగువలెను ప్రకాశించుచున్నట్టిదియును, ఉత్తమం = శ్రేష్ఠమైనదియును, విముక్తమ్ = జారినదై, అంగదే సక్తం = తన భుజకీర్తిని చిక్కుకొని యున్నదియునగు, అరజోవస్త్రం = అరజోవస్త్రమును, సలీలమ్ అనుకర్షంతం = ఒయ్యారముగా లాగి సర్దుకొనుచున్నట్టి, (తం దదర్శ = రావణుని జూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'మథిత అమృతఫేనాభం' = చిలికిన పాలనురుగు వంటి తెల్లని కాంతిగలది.

**బొంబాయి ముద్రణము** :– 'సలీల మనుకర్షంతం' – అను దానికి బదులుగా 'సపుష్ప మవకర్షంతం' అని గలదు. అనగా పూలమాలలతో గూడిన వస్త్రమును విడిపించు కొనుచున్నాడని భావము. విముక్తం = విశేషమైన ముత్యములతో గూడినది.

**మహేశ్వరతీర్థులు** :– విముక్తం = స్వస్థానమునుండి చలించినట్టి.

**గోవిందరాజీయము** :– 'ధారోష్ణం తు అమృతం పయః' అప్పుడు పిదికి వేడి చల్లారని పాలు అమృతమని 'వైజయంతి'. మథితం = తక్రము (చిలికిన మజ్జిగ).

**తాత్పర్యము** :– చిలికిన చిక్కని మజ్జిగవలెను, అప్పుడే పిదికిన పాలనురుగువలెను ప్రకాశించుచు మిక్కిలి ధవళమై సుందరమైనట్టి తన ఉత్తరీయము జాతి భుజకీర్తుల యందు చిక్కుపడియుండగా దానిని ఒయ్యారముగా విడిపించుకొనుచు వచ్చుచున్న రావణుని హనుమ గాంచెను.

**శ్లో॥ తం పత్రవిటపే లీనః పత్రపుష్పఘనావృతః ।**
**సమీపమివ సంక్రాంతం నిధ్యాతు ముపచక్రమే ॥ 25**

**పదచ్ఛేదము** :– తం – పత్రవిటపే – లీనః – పత్రపుష్పఘనావృతః – సమీపమ్ – ఇవ – సంక్రాంతం – నిధ్యాతుమ్ – ఉపచక్రమే ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– పత్రవిటపే లీనః = ఆకులతోగూడిన కొమ్మపై దాగియున్నవాడై, పత్రపుష్పఘనావృతః = దట్టముగనున్న ఆకులతోడను పువ్వులతోడను ఆవరింప బడినవాడై, సమీపం సంక్రాంతమ్ ఇవ (స్థితం) = మిక్కిలి దగ్గరకు వచ్చినట్లుగనున్న, తం = ఆ రావణాసురుని, నిధ్యాతుం ఉపచక్రమే = పరికించి చూడదొడగెను.

**తాత్పర్యము** :– హనుమంతుడు దట్టమైన ఆకులుగల కొమ్మపై కూర్చుండి ఆ కొమ్మయొక్క ఆకులతోడను, పూవులతోడను కప్పబడి యున్నవాడై, తనకు మిక్కిలి సమీపముగా వచ్చియున్నట్టి ఆ రావణాసురుని పరిశీలించి చూడసాగెను.

**శ్లో॥ అవేక్షమాణ స్తు తతో దదర్శ కపికుంజరః ।**
**రూపయౌవనసంపన్నా రావణస్య వరస్త్రియః ॥ 26**

**పదచ్ఛేదము** :– అవేక్షమాణః – తు – తతః – దదర్శ – కపికుంజరః – రూపయౌవనసంపన్నాః – రావణస్య – వరస్త్రియః ॥

**అన్వయక్రమము** :– తతః కపికుంజరః అవేక్షమాణః రూపయౌవనసంపన్నాః రావణస్య వరస్త్రియః దదర్శ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, కపికుంజరః = వానరశ్రేష్ఠుడైన హనుమ, అవేక్షమాణః = చూచుచున్నవాడై, రూపయౌవనసంపన్నాః = సౌందర్యముతోడను, యౌవనముతోడను నిండియున్నట్టి, రావణస్య వరస్త్రియః = రావణుని భార్యలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమ రావణాసురుని చూచుచునే గొప్ప సౌందర్యసంపదయును యౌవనసంపదయును కలిగినట్టి ఆ రావణాసురుని భార్యలు అతనిచుట్టు నుండగ చూచెను.

**శ్లో॥ తాభిః పరివృతో రాజా సురూపాభి ర్మహాయశాః ।**
**తన్మృగద్విజసంఘుష్టం ప్రవిష్టః ప్రమదావనమ్ ॥ 27**

**పదచ్ఛేదము** :– తాభిః – పరివృతః – రాజా – సురూపాభిః – మహాయశాః – తత్ – మృగద్విజసంఘుష్టం – ప్రవిష్టః – ప్రమదావనమ్ ॥

**అన్వయక్రమము** :– మహాయశాః రాజా తాభిః సురూపాభిః పరివృతః, మృగద్విజసంఘుష్టం తత్ ప్రమదావనం ప్రవిష్టః.

**ప్రతిపదార్థము** :– మహాయశాః రాజా = గొప్ప కీర్తిశాలియైన ఆ రాక్షసరాజు, తాభిః సురూపాభిః = ఆ సుందరాంగనలచే, పరివృతః = పరివేష్టింపబడినవాడై, మృగద్విజ సంఘుష్టం = జంతువులచేతను, పక్షులచేతను ధ్వనింపచేయబడుచున్నట్టి, తత్ ప్రమదావనం = ఆ యుద్యానవనమును, ప్రవిష్టః = ప్రవేశించెను.

**తాత్పర్యము** :– గొప్ప యశస్సుగలవాడైన ఆ రావణుడు అతిసౌందర్యవతులైన తన అంతఃపురస్త్రీలతోగూడి రమణీయమైన మృగములయొక్కయు పక్షులయొక్కయు ధ్వనులతో నిండిన ఆ యశోకవనమునందు ప్రవేశించెను.

**శ్లో॥ క్షీబో విచిత్రాభరణ శ్శంకుకర్ణో మహాబలః ।**
**తేన విశ్రవసః పుత్ర స్స దృష్టో రాక్షసాధిపః ।**
**వృతః పరమనారీభి స్తారాభి రివ చంద్రమాః ॥ 28**

**పదచ్ఛేదము :–** క్షీబః – విచిత్రాభరణః – శంకుకర్ణః – మహాబలః – తేన – విశ్రవసః – పుత్రః – సః – దృష్టః – రాక్షసాధిపః – వృతః – పరమనారీభిః – తారాభిః – ఇవ – చంద్రమాః ॥

**అన్వయక్రమము :–** క్షీబః, విచిత్రాభరణః, శంకుకర్ణః మహాబలః, విశ్రవసః పుత్రః, సః రాక్షసాధిపః తారాభిః వృతః చంద్రమాః ఇవ, పరమనారీభిః వృతః (సన్) తేన దృష్టః.

**ప్రతిపదార్థము :–** క్షీబః = మదించియున్నవాడును, విచిత్రాభరణః = వివిధవర్ణములు గల భూషణములు గలవాడును, శంకుకర్ణః = కొనదేరిన చెవులుగలవాడును, మహాబలః = గొప్ప బలముగలవాడును, విశ్రవసః పుత్రః = విశ్రవసుడను బ్రహ్మ కుమారుడును అగు, సః రాక్షసాధిపః = ఆ రాక్షసరాజు, తారాభిః = నక్షత్రములచే, వృతః = చుట్టు కొనబడియున్న, చంద్రమాః ఇవ = చంద్రుడువలె, పరమనారీభిః = ఉత్తమ స్త్రీలచే, వృతః (సన్) = పరివేష్టింపబడినవాడై, తేన = ఆ హనుమచే, దృష్టః = చూడబడెను.

**తాత్పర్యము :–** మిక్కిలి మదించియున్నవాడై వివిధవర్ణములగు భూషణములు ధరించి సూదిగనున్న చెవులతో మహాబలాఢ్యుడుగానున్న విశ్రవోబ్రహ్మకుమారుడైన ఆ రావణుడు ఉత్తమస్త్రీలచే పరివేష్టింపబడినవాడై నక్షత్రములమధ్య వెలయుచున్న చంద్రునివలె ప్రకాశించుచు హనుమకు గాన్పించెను.

**శ్లో॥ తం దదర్శ మహాతేజా స్తేజోవంతం మహాకపిః ॥ 29**

**పదచ్ఛేదము :–** తం – దదర్శ – మహాతేజాః – తేజోవంతం – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః మహాకపిః తం తేజోవంతం దదర్శ.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః = గొప్ప తేజశ్శాలియైన, మహాకపిః = వానరశ్రేష్ఠుడు, తం = అట్టి, తేజోవంతం = తేజస్వియైన రావణుని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** గొప్ప తేజశ్శాలియైన హనుమ అట్టి తేజోవంతుడైన రావణుని గాంచెను.

**శ్లో॥ రావణో ఽయం మహాబాహు రితి సంచింత్య వానరః ।**
**(సో ఽయమేవ పురా శేతే పురమధ్యే గృహోత్తమే)**
**అవప్లుతో మహాతేజా హనుమా న్మారుతాత్మజః ॥ 30**

**పదచ్ఛేదము :–** రావణః – అయం – మహాబాహుః – ఇతి – సంచింత్య – వానరః,

సః – అయమ్ – ఏవ – పురా – శేతే – పురమధ్యే – గృహోత్తమే – అవప్లుతః – మహాతేజాః – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :–** పురా పురమధ్యే అయమేవ శేతే; మహాబాహుః అయం రావణః; ఇతి సంచింత్య, మహాతేజాః, మారుతాత్మజః వానరః హనుమాన్ అవప్లుతః.

**ప్రతిపదార్థము :–** పురా = పూర్వము, పురమధ్యే = లంకానగరమునందు, గృహోత్తమే = శ్రేష్ఠమైన భవనమునందు, అయమేవ శేతే = ఈతడే నిద్రించుచుండెను, మహాబాహుః అయం రావణః = మహావీరుడైన ఇతడు రావణుడు, ఇతి సంచింత్య = ఇట్లని ఆలోచించి, మహాతేజాః = మహాతేజశ్శాలియును, మారుతాత్మజః = వాయునందను డును, వానరః = వానరోత్తముడునగు,హనుమాన్ = హనుమ, అవప్లుతః = క్రిందికి దిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'అవప్లుతః' = అనగా క్రిందికొమ్మమీదికి ఉరికెను అని భావము.

**తిలకము :–**
**రామాయణ శిరోమణి :–**
**మహేశ్వరతీర్థులు :–**
} తన కొమ్మనుండి మీదకొమ్మ మీదికి లంఘించెను.

**తాత్పర్యము :–** లంకానగరమున శ్రేష్ఠమైన ఆ భవనమునందు నిద్రించుచు నాకు గానవచ్చిన యాతడీతడే. మహావీరుడైన రావణుడనగా ఈతడేకదా అని నిశ్చయించుకొని మహాతేజశ్శాలియైన హనుమ క్రిందికొమ్మమీదికి దిగెను.

**శ్లో॥ స తథా ఽప్యుగ్రతేజాస్స న్నిర్ధూత స్తస్య తేజసా ।**
**పత్రగుహ్యాంతరే సక్తో హనుమాన్ సంవృతో ఽభవత్ ॥ 31**

**పదచ్ఛేదము :–** సః – తథా – అపి – ఉగ్రతేజాః – సన్ – నిర్ధూతః – తస్య – తేజసా – పత్రగుహ్యాంతరే – సక్తః – హనుమాన్ – సంవృతః – అభవత్ ॥

**అన్వయక్రమము :–** సః హనుమాన్ తథా ఉగ్రతేజాః సన్ అపి, తస్య తేజసా నిర్ధూతః సన్ పత్రగుహ్యాంతరే సక్తః, సంవృతః అభవత్.

**ప్రతిపదార్థము :–** సః హనుమాన్ = ఆ హనుమంతుడు, తథా = ఆ రీతిగా, ఉగ్రతేజాః సన్ అపి = తీక్ష్ణమైన తేజస్సుగలవాడైనప్పటికిని, తస్య తేజసా = ఆ రావణాసురుని యొక్క తేజస్సుచే, నిర్ధూతః (సన్) = తిరస్కరింపబడినవాడై, పత్రగుహ్యాంతరే సక్తః =

గుబురుగనున్న ఆకులయందు లీనమైనవాడై, సంవృతః అభవత్ = చక్కగా కప్పబడినవాడుగా నుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తథా ఉగ్రతేజాః = సముద్రలంఘన మొనర్చినట్టి మహాపరాక్రమశాలి యైనప్పటికిని, హనుమ రావణుని తేజస్సుచే జంకి, ఎదుట నిలచుటకు శక్తిలేకయే ఆకుల గుబురునందు దాగెను. అన్నిమాయలను మించిన మహామాయలు కలిగిన రావణుని దృష్టిని భరింపలేక తన కామరూపాదికమైన శక్తి ఆతనియందు అల్పమైనదని హనుమ భయపడెననియే చెప్పవలెను.

**రామాయణ శిరోమణి :–** రావణుని తేజస్సుచే భీతుడై తన కార్యసిద్ధికొరకు ఆకులవెనుకకు పోయి దాగెను.

**తాత్పర్యము :–** సహజముగా తాను మహోగ్రతేజశ్శాలియైనను రావణుని తేజోవిశేషము చూచునప్పటికి హనుమ కొద్ది జంకుతో వెనుకకు తగ్గి ఆకుల గుబురులో దాగికొనియుండెను.

**శ్లో॥ స తా మసితకేశాంతాం సుశ్రోణీం సంహతస్తనీం ।**
**దిదృక్షు రసితాపాంగా ముపావర్తత రావణః ॥ 32**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రావణాగమనం" నామ*
*అష్టాదశస్సర్గః*

**పదచ్ఛేదము :–** సః – తామ్ – అసితకేశాంతాం – సుశ్రోణీం – సంహతస్తనీం, దిదృక్షుః – అసితాపాంగామ్ – ఉపావర్తత – రావణః ॥

**అన్వయక్రమము :–** సః రావణః అసితకేశాంతాం, సుశ్రోణీం, సంహతస్తనీమ్, అసితాపాంగాం తాం దిదృక్షుః ఉపావర్తత.

**ప్రతిపదార్థము :–** సః రావణః = ఆ రావణాసురుడు, అసితకేశాంతాం = నల్లని కేశాగ్రములు గలదియును, సుశ్రోణీం = సుందరమైన పిరుదులు గలదియును, సంహతస్తనీం = పరస్పరము ఒరసికొనుచున్న స్తనములు గలదియును, అసితాపాంగాం = నల్లని కంటికొనలు గలదియును అగు, తాం = ఆ సీతాదేవిని, దిదృక్షుః = చూడగోరుచున్నవాడై, ఉపావర్తత = సమీపమునకు వచ్చెను.

**తాత్పర్యము :–** ఆ రావణుడు నల్లని కేశపాశమును, సుందరములగు పిఱుదులును, పరస్పరము ఒరసికొనుచున్న స్తనములును, నల్లని క్రీగంటి చూపులును గల ఆ సీతాదేవిని చూడగోరినవాడై ఆమె సమీపమునకు వచ్చుచుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రావణాగమనము" అను*
*పదునెనిమిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకోనవింశసర్గ

**శ్లో॥ తస్మిన్నేవ తతః కాలే రాజపుత్రీ త్వనిందితా ।**
**రూపయౌవనసంపన్నం భూషణోత్తమభూషితమ్ ॥ 1**

**శ్లో॥ తతో దృష్ట్వైవ వైదేహీ రావణం రాక్షసాధిపమ్ ।**
**ప్రావేపత వరారోహా ప్రవాతే కదళీ యథా ॥ 2**

**పదచ్ఛేదము :–** తస్మిన్ – ఏవ – తతః – కాలే – రాజపుత్రీ – తు – అనిందితా – రూపయౌవనసంపన్నం – భూషణోత్తమభూషితమ్ ॥ తతః – దృష్ట్వా – ఏవ – వైదేహీ – రావణం – రాక్షసాధిపమ్, ప్రావేపత – వరారోహా – ప్రవాతే – కదళీ – యథా ॥

**అన్వయక్రమము :–** తతః తస్మిన్నేవ కాలే, అనిందితా, రాజపుత్రీ, వరారోహా, వైదేహీ, రూపయౌవనసంపన్నం, భూషణోత్తమభూషితం, రాక్షసాధిపం, రావణం తతః, దృష్ట్వా ఏవ, ప్రవాతే, కదళీ యథా, ప్రావేపత.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, తస్మిన్నేవ కాలే = అదే సమయమున, అనిందితా = కళంకము లేనిదియును, రాజపుత్రీ = మహారాజు కుమార్తెయైనదియును, వరారోహా = గొప్ప పిఱుదులు గలదియును అగు, వైదేహీ = జానకీదేవి, రూపయౌవన సంపన్నం = సౌందర్య సంపదయు, వయస్సంపదయు కలిగివాడును, భూషణోత్తమ భూషితం = శ్రేష్ఠమైన ఆభరణములచే ఆలంకరింపబడినవాడును, రాక్షసాధిపం = రాక్షసులకు ప్రభువును అగు, రావణం = రావణాసురుని, తతః = అచటినుండి, దృష్ట్వా ఏవ = చూచినంతనే, ప్రవాతే = పెనుగాలియందు, కదళీ యథా = అరటిచెట్టువలె, ప్రావేపత = మిక్కిలి కంపించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'తస్మిన్నేవ కాలే' = హనుమ వచ్చిననాటి రాత్రి యొక్క చివరిజామునందే.

**తాత్పర్యము :–** అంతట నిష్కళంకచరిత్రురాలైన రాజపుత్రియగు సీతాసుందరి,

సౌందర్యముతోడను యౌవనముతోడను ప్రకాశించుచు ఉత్తమాభరణములు ధరించి తనకడకు వచ్చుచున్న రాక్షసరాజైన రావణుని దూరమునుండియే చూచి, ఝంఝా మారుతమునకు ఊగిపోవుచున్న అరటిచెట్టువలె కంపించిపోవుచుండెను.

**శ్లో॥ ఆచ్ఛా ద్యోదర మూరుభ్యాం బాహుభ్యాం చ పయోధరౌ ।**
**ఉపవిష్టా విశాలాక్షీ రుదంతీ వరవర్ణినీ ॥ 3**

**పదచ్ఛేదము** :- ఆచ్ఛాద్య - ఉదరమ్ - ఊరుభ్యాం - బాహుభ్యాం - చ - పయోధరౌ, ఉపవిష్టా - విశాలాక్షీ - రుదంతీ - వరవర్ణినీ ॥

**అన్వయక్రమము** :- విశాలాక్షీ వరవర్ణినీ ఊరుభ్యామ్ ఉదరం, బాహుభ్యాం పయోధరౌ చ ఆచ్ఛాద్య, రుదంతీ ఉపవిష్టా.

**ప్రతిపదార్థము** :- విశాలాక్షీ వరవర్ణినీ = విశాలమైన కన్నులు గలదియును, ఉత్తమ లక్షణములు గలదియును అగు సీతాదేవి, ఉదరమ్ = కడుపును, ఊరుభ్యాం = రెండు తొడలతోడను, పయోధరౌ = రెండు స్తనములను, బాహుభ్యాం చ = రెండు భుజములతోడను, ఆచ్ఛాద్య = కప్పుకొని, రుదంతీ ఉపవిష్టా = శోకించుచున్నదై కూర్చుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**పరమార్థచంద్రిక** :- వరవర్ణినీ = ఉష్ణకాలమునందు సుఖశీతలమును, శీతాకాలము నందు సుఖోష్ణమునునగు అంగములు గలిగి భర్తయం దనురాగము గల్గిన స్త్రీ.

**వాసుదాసస్వామి** :- తన సొమ్ములు మూటగట్టి యుత్తరీయమును బారవైచిన కారణముచే బైటకొంగు సరిగ లేకయుండుటచే తన కడుపు కానరాకుండ తొడలను, వక్షస్థలము గానరాకుండ మోకాళ్ళను అడ్డముంచి ఆ కాళ్ళను రెండుచేతులతో కట్టుకొని బిగించెనని భావము.

**తాత్పర్యము** :- పెద్ద కన్నులుగలిగిన పతివ్రతయైనట్టి సీతాదేవి దూరమునుండి రావణుని చూచినవెంటనే తన కడుపును తొడలతోడను, తన స్తనములను భుజములతోడను, గప్పివైచుకొని కూర్చుండి రావణునివలన భయమును శంకించుచున్నదై విలపించుచుండెను.

**శ్లో॥ దశగ్రీవస్తు వైదేహీం రక్షితాం రాక్షసీగణైః ।**
**దదర్శ సీతాం దుఃఖార్తాం నావం సన్నామి వార్ణవే ॥ 4**

**పదచ్ఛేదము** :– దశగ్రీవః – తు – వైదేహీం – రక్షితాం – రాక్షసీగణైః – దదర్శ – సీతాం – దుఃఖార్తాం – నావం – సన్నామ్ – ఇవ – అర్ణవే ॥

**అన్వయక్రమము** :– దశగ్రీవః, రాక్షసీగణైః, రక్షితామ్, అర్ణవే, సన్నాం నావమ్ ఇవ, దుఃఖార్తాం, వైదేహీం సీతాం దదర్శ.

**ప్రతిపదార్థము** :– దశగ్రీవః = దశకంఠుడు, రాక్షసీగణైః రక్షితాం = రాక్షసస్త్రీలచే కావలియుంచబడినట్టిదియును, అర్ణవే = సముద్రమునందు, సన్నాం నావమ్ ఇవ = శిథిలమైయున్న నావవలె (నావలోని జనమువలె) దుఃఖార్తాం = దుఃఖముతో దీనురాలైయున్నట్టి, వైదేహీం సీతాం = జనకరాజపుత్రియగు సీతను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– రావణాసురుడు, రాక్షసస్త్రీలచే కావలియుంచబడి, మహాసముద్రము నందు శిథిలమైపోయియున్న నావలో నిలచియున్నట్టి జనమువలె దుఃఖనిమగ్నురాలై యున్నట్టి సీతను గాంచెను.

**శ్లో॥ అసంవృతాయా మాసీనాం ధరణ్యాం సంశితవ్రతామ్ ।**
**ఛిన్నాం ప్రపతితాం భూమౌ శాఖామివ వనస్పతేః ॥ 5**

**పదచ్ఛేదము** :– అసంవృతాయామ్ – ఆసీనాం – ధరణ్యాం – సంశితవ్రతామ్, ఛిన్నాం – ప్రపతితాం – భూమౌ – శాఖామ్ – ఇవ – వనస్పతేః ॥

**అన్వయక్రమము** :– అసంవృతాయాం ధరణ్యామ్ ఆసీనాం, సంశితవ్రతాం, ఛిన్నాం, భూమౌ ప్రపతితాం వనస్పతేః శాఖామివ (స్థితాం) (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :– అసంవృతాయాం ధరణ్యాం = ఆస్తరణము లేని భూమిపై (కటికినేలపై), ఆసీనాం = కూర్చుండియున్నదియును, సంశితవ్రతాం = తీక్ష్ణమైన నియమములు గలదియును, ఛిన్నాం = తెగగొట్టబడినదై, భూమౌ ప్రపతితాం = నేలపై కూలియున్న, వనస్పతేః శాఖామివ (స్థితాం) = మహావృక్షముయొక్క కొమ్మవలె నున్నట్టి, (సీతాం దదర్శ = సీతను చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సంశితవ్రతామ్ = రావణవధకై తీవ్రమైన వ్రతము నాచరించుచున్నదివలె నున్నది.

**తాత్పర్యము** :– తీవ్రమైన దీక్షతో వ్రతము నాచరించుచు కటికినేలపై కూర్చుండి, తెగగొట్టి నేలపై కూల్చబడిన మహావృక్షముయొక్క శాఖవలెనున్నట్టి సీతను రావణుడు చూచెను.

**శ్లో॥ మలమండనచిత్రాంగీం మండనార్హా మమండితామ్ ।**
**మృణాళీ పంకదిగ్ధేవ న విభాతి విభాతి చ ॥ 6**

**పదచ్ఛేదము** :– మలమండనచిత్రాంగీం – మండనార్హామ్ – అమండితామ్, మృణాళీ – పంకదిగ్ధా – ఇవ – న – విభాతి – విభాతి – చ ॥

**అన్వయక్రమము** :– (యా) పంకదిగ్ధా మృణాళీ ఇవ న విభాతి, విభాతి చ, (తాం) మలమండనచిత్రాంగీం, మండనార్హామ్, అమండితాం (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :– (యా = ఏ తరుణి) పంకదిగ్ధా మృణాళీ ఇవ = బురదచే కప్పబడియున్న తామరతీగవలె, న విభాతి = ప్రకాశించుటలేదో (మఱియు), విభాతి చ = ప్రకాశించుచునే యున్నదో, తాం = అట్టి, మలమండనచిత్రాంగీం = ధూళియే ఆభరణముగా చిత్రమైన వర్ణములుగల శరీరము కలిగియున్నదియును, మండనార్హామ్ = ఆభరణములకు తగియున్నదియును, అమండితాం = భూషణములు లేకయున్నదియునగు, (సీతాం దదర్శ = సీతాదేవిని చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'మలమండనదిగ్ధాంగీ' యని బొంబాయి పాఠము. అనగా ధూళియే ఆభరణములుగా పూయబడియున్న శరీరము గలది.

**మహేశ్వరతీర్థులు** :– ధూళియను ఆభరణముచే పలురంగులు గల శరీరము గలది.

**గోవిందరాజీయము** :– మలినమైయున్న దేహము గలదై యున్నను, ఆశ్చర్యకరమైన సౌందర్యమునే కలిగియున్నది.

**తాత్పర్యము** :– ముఱికిపట్టి రంగుల వర్ణములతో ప్రకాశించుచు, ఆ సీతాదేవి బురదతోనిండిన తామరతీగవలె ఒకవంక కొంత తన అందమును గోల్పోయినను సుందరముగనే గానవచ్చుచుండెను. ఒడలినిండ ఆభరణములు ధరింపవలసిన ఈమె ఒక్క ఆభరణముగూడ లేకయున్నదే యని అనిపించుచున్నట్టి ఆ సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ సమీపం రాజసింహస్య రామస్య విదితాత్మనః ।**
**సంకల్పహయసంయుక్తై ర్యాంతీమివ మనోరథైః ॥ 7**

**పదచ్ఛేదము** :– సమీపం – రాజసింహస్య – రామస్య – విదితాత్మనః – సంకల్పహయసంయుక్తైః – యాంతీమ్ – ఇవ – మనోరథైః ॥

**అన్వయక్రమము** :- విదితాత్మనః, రాజసింహస్య రామస్య సమీపం, సంకల్పహయ సంయుక్తైః, మనోరథైః యాంతీమ్ ఇవ, (స్థితాం సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :- విదితాత్మనః = ఆత్మవేత్తయైనట్టి, రాజసింహస్య = రాజసింహమైన, రామస్య = శ్రీరామునియొక్క, సమీపం = సన్నిధికి, సంకల్పహయసంయుక్తైః = తన సంకప్రములనెడి అశ్వములతో గూడినట్టి, మనోరథైః = మనోరథములతో, యాంతీం ఇవ = పయనించుచున్నట్టిదిగా, (స్థితాం సీతాం దదర్శ = ఉన్నట్టి సీతను జూచెను).

**తాత్పర్యము** :- తన హృదయమునందలి సంకల్పములనే గుఱ్ఱములుగా చేసి పూన్చిన మనోరథములతో, తన ఆత్మతత్త్వమును గ్రహించినట్టి రాజసింహుడైన శ్రీరాముని కడకు మహావేగముతో పోవుచున్నదా యన్నట్లుగా కానవచ్చుచున్న సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ శుష్యంతీం రుదతీ మేకాం ధ్యానశోకపరాయణాం ।**
**దుఃఖ స్యాంత మపశ్యంతీం రామాం రామ మనువ్రతామ్ ॥ 8**

**పదచ్ఛేదము** :- శుష్యంతీం - రుదతీమ్ - ఏకాం - ధ్యానశోకపరాయణామ్, దుఃఖస్య - అంతమ్ - అపశ్యంతీం - రామాం - రామమ్ - అనువ్రతామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- శుష్యంతీం = శుష్కించిపోవుచున్నదియును, రుదతీం = విలపించు చున్నదియును, ఏకాం = ఒంటరియైయున్నదియును, ధ్యానశోకపరాయణాం = ఆలోచనమునందును దుఃఖమునందును మునిగి యున్నదియును, దుఃఖస్య = తన దుఃఖమునకు, అంతమ్ = అంతమును, అపశ్యంతీం = చూడకున్నదియును, రామమ్ అనువ్రతాం = శ్రీరాముని అనుసరించుటయను వ్రతము గలదియును, రామాం = సుందరాంగియునగు (సీతాం దదర్శ = సీతను రావణుడు చూచెను).

**తాత్పర్యము** :- నానాటికి కృశించు చున్నదియును, తీవ్రముగ దుఃఖించు చున్నదియును, నిత్యము చింతలందును, దుఃఖములందును నిమగ్నమై యున్నదియును, తన దుఃఖమునకు అంతము గానరాక దిగులు చెందియున్నదియును, శ్రీరాముని యందు లగ్నమైన మనస్సు గల్గినదియునగు సీతాసుందరిని రావణుడు గాంచెను.

**శ్లో॥ వేష్టమానాం తథా ఽఽవిష్టాం పన్నగేంద్రవధూమివ ।**
**ధూప్యమానాం గ్రహేణేవ రోహిణీం ధూమకేతునా ॥ 9**

**పదచ్ఛేదము** :– వేష్టమానాం – తథా – ఆవిష్టాం – పన్నగేంద్రవధూమ్ ఇవ – ధూప్యమానాం – గ్రహేణ – ఇవ – రోహిణీం – ధూమకేతునా ॥

**అన్వయక్రమము** :– ఆవిష్టాం, తథా వేష్టమానాం పన్నగేంద్రవధూమ్ ఇవ, ధూమకేతునా గ్రహేణ ధూప్యమానాం రోహిణీమ్ ఇవ స్థితాం (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :– ఆవిష్టాం = మంత్రముచేతను మణిచేతను బంధింపబడినదై, తథా = అట్లే, వేష్టమానాం = చుట్టుకొనుచున్నదై యున్నట్టి, పన్నగేంద్రవధూమ్ ఇవ = గొప్ప జాతి త్రాచుపామువలెను, ధూమకేతునా గ్రహేణ = ధూమవర్ణముగల కేతుగ్రహముచే, ధూప్యమానాం = తపింపచేయబడుచున్నట్టి, రోహిణీమ్ ఇవ = రోహిణీ నక్షత్రము వలెను, (స్థితాం = ఉన్నట్టి), (సీతాం దదర్శ = సీతాదేవిని చూచెను).

**తాత్పర్యము** :– విషవైద్యులు ప్రయోగించిన మణి మంత్రములచే బంధింపబడి రోషముతో తనలో తాను చుట్టుకొనుచున్న గొప్ప జాతి త్రాచుపామువలెను, ధూమవర్ణము కలిగియున్న క్రూరమైన కేతుగ్రహముచే పట్టి పీడింపబడుచున్న రోహిణీ నక్షత్రమువలెను కానవచ్చుచున్న ఆ సీతాదేవిని రావణుడు గాంచెను.

**శ్లో॥ వృత్తశీలకులే జాతా మాచారవతి ధార్మికే ।**
**పున స్సంస్కార మాపన్నాం జాతా మివ చ దుష్కులే ॥ 10**

**పదచ్ఛేదము** :– వృత్తశీలకులే – జాతామ్ – ఆచారవతి – ధార్మికే – పునః – సంస్కారమ్ – ఆపన్నాం – జాతామ్ – ఇవ – చ – దుష్కులే ॥

**అన్వయక్రమము** :– ఆచారవతి ధార్మికే వృత్తశీలకులే జాతాం పునః దుష్కులే జాతామ్ ఇవ సంస్కారమ్ ఆపన్నామ్ ఇవ చ స్థితాం (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :– ఆచారవతి = గొప్ప సదాచారము కలిగినట్టిదియు, ధార్మికే = ధర్మనిష్ఠ గలిగినట్టిదియు నగు, వృత్తశీలకులే = ఉత్తమమైన నడతయు పవిత్రమైన స్వభావమునుగల కులమునందు, జాతాం = జన్మించినదై, దుష్కులే జాతామ్ ఇవ = దుష్టవంశమునందు జన్మించినదానివలె, పునః సంస్కారమ్ ఆపన్నామ్ ఇవ = తిరిగి ప్రాయశ్చిత్తాది సంస్కారములు పొందియున్న వధువువలె, (స్థితాం = ఉన్నట్టి, సీతాం దదర్శ = సీతాదేవిని రావణుడు చూచెను).

**తాత్పర్యము** :– గొప్ప సదాచారము, ధర్మనిష్ఠ, సత్‌స్వభావము గల ఉన్నతవంశము నందు జన్మించిన కన్యకు వలె తిరిగి ప్రాయశ్చిత్తమువంటి సంస్కారములను చేయింపబడిన వధువువలె పరాభవదుఃఖము నొందుచున్నట్టి, సీతాదేవిని రావణుడు జూచెను.

**శ్లో॥ అభూతే నాపవాదేన కీర్తిం నిపతితామివ ।**
**ఆమ్నాయానా మయోగేన విద్యాం ప్రశిథిలామివ ॥ 11**

**పదచ్ఛేదము** :– అభూతేన – అపవాదేన – కీర్తిం – నిపతితామ్ – ఇవ – ఆమ్నాయానామ్ – అయోగేన – విద్యాం – ప్రశిథిలామ్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– అభూతేన అపవాదేన = మిథ్యాపవాదముచేత, నిపతితాం కీర్తిమ్ ఇవ = కళంకితమైన కీర్తివలెను, ఆమ్నాయానామ్ అయోగేన = మననమును చేయకుండుటచే, ప్రశిథిలాం విద్యామ్ ఇవ = మఱపునకువచ్చిన విద్యవలెను, (స్థితాం సీతాం దదర్శ = ఉన్న సీతను రావణుడు చూచెను).

**తాత్పర్యము** :– కిట్టనివారు కల్పించిన అపవాదముచే కళంకము నొందిన కీర్తివలెను, తిరిగి మననము చేయకుండుటచే విస్మృతిపాలైన ఉత్తమ విద్యవలెను కానవచ్చుచున్నట్టి సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ సన్నామివ మహాకీర్తిం శ్రద్ధామివ విమానితామ్ ।**
**పూజామివ పరిక్షీణా మాశాం ప్రతిహతామివ ॥ 12**

**పదచ్ఛేదము** :– సన్నామ్ – ఇవ – మహాకీర్తిం – శ్రద్ధామ్ – ఇవ – విమానితామ్, పూజామ్ – ఇవ – పరిక్షీణామ్ – ఆశాం – ప్రతిహతామ్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సన్నాం మహాకీర్తిమ్ ఇవ = క్షీణించిపోయిన గొప్ప కీర్తివలెను, విమానితాం శ్రద్ధామ్ ఇవ = అవమానింపబడిన పూజ్యభావమువలెను, పరిక్షీణాం పూజామ్ ఇవ = సన్నగిల్లిపోయిన సత్కారభావము వలెను, ప్రతిహతామ్ ఆశామ్ ఇవ = భగ్నమైపోయిన ఆశవలెను, (స్థితాం = ఉన్నట్టి, సీతాం దదర్శ = సీతను చూచెను).

**బొంబాయి ముద్రణము** :– 'పూజామివ పరిక్షీణాం' అను దానికి బదులుగా 'ప్రజ్ఞామివ పరిక్షీణాం' అని గలదు.

**తాత్పర్యము** :– దురదృష్టవశమున క్షీణించిపోయినట్టి అద్భుతకీర్తివలెను, అజ్ఞులచే అవమానింపబడిన శ్రద్ధాభావమువలెను, అకారణముగా క్షీణించిపోయిన గౌరవము వలెను, భగ్నమైపోయిన ఆశవలెను దీనస్థితిలోనున్నట్టి సీతను రావణుడు చూచెను.

**శ్లో॥ ఆయతీమివ విధ్వస్తా మాజ్ఞాం ప్రతిహతామివ ।**
**దీప్తామివ దిశం కాలే పూజా మపహృతామివ ॥ 13**

**పదచ్ఛేదము** :- ఆయతీమ్ - ఇవ - విధ్వస్తామ్ - ఆజ్ఞాం - ప్రతిహతామ్ - ఇవ - దీప్తామ్ - ఇవ - దిశం - కాలే - పూజామ్ - అపహృతామ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- విధ్వస్తాం ఆయతీమ్ ఇవ = చెడగొట్టబడిన మహాలాభమువలెను, ప్రతిహతాం ఆజ్ఞామ్ ఇవ = ధిక్కరింపబడిన ఆజ్ఞవలెను, కాలే = ఉపద్రవ సమయము నందు, దీప్తాం = మండుచున్న, దిశమ్ ఇవ = దిక్కువలెను, అపహృతాం = అపహరింపబడిన, పూజామ్ ఇవ = సత్కారమువలెను, (స్థితాం సీతాం దదర్శ = ఉన్నట్టి సీతను చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'పూజామ్ అపహృతామివ' - అపహరింపబడిన పూజాద్రవ్యము వలె నున్నదని భావము.

**తాత్పర్యము** :- పరులచే చెడగొట్టబడిన మహాలాభమువలెను, అగౌరవముచే, ధిక్కరింపబడిన రాజాజ్ఞవలెను, ఉత్పాతకాలమునందు దహింపబడుచున్న ప్రదేశము వలెను, పరులచే అపహరింపబడిన ఘనసన్మానమువలెను, దయనీయమైన స్థితిలో నున్నట్టి సీతాదేవిని రావణాసురుడు చూచెను.

**శ్లో॥ పద్మినీమివ విధ్వస్తాం హతశూరాం చమూమివ ।**
**ప్రభామివ తమోధ్వస్తా ముపక్షీణా మి వాపగామ్ ॥ 14**

**పదచ్ఛేదము** :- పద్మినీమ్ - ఇవ - విధ్వస్తాం - హతశూరాం - చమూమ్ - ఇవ - ప్రభామ్ - ఇవ - తమోధ్వస్తామ్ - ఉపక్షీణామ్ - ఇవ - ఆపగామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- విధ్వస్తాం పద్మినీమ్ ఇవ = ధ్వంసముచేయబడిన తామరతీగవలెను, హతశూరాం చమూమ్ ఇవ = చంపబడిన వీరులుగల సైన్యమువలెను, తమోధ్వస్తాం ప్రభాం ఇవ = రాహువుచే నశింపచేయబడిన (చంద్రసూర్యుల) కాంతివలెను, ఉపక్షీణామ్ ఆపగామ్ ఇవ = క్షీణించిపోయిన నదివలెను, (స్థితాం సీతాం దదర్శ = ఉన్నట్టి సీతను చూచెను).

**తాత్పర్యము** :- మంచుచే చెడగొట్టబడిన తామరతీగవలెను, వధింపబడిన వీరులుగల సైన్యమువలెను, రాహువుచే నశింపచేయబడిన సూర్యకాంతి వలెను, క్షీణించిపోయిన జలముగల నది వలెను, దీనస్థితిలోనున్నట్టి సీతను రావణుడు జూచెను.

**శ్లో॥ వేదీమివ పరామృష్టాం శాంతా మగ్నిశిఖామివ ।**
**పౌర్ణమాసీ మివ నిశాం రాహుగ్రస్తేందుమండలామ్ ॥ 15**

**పదచ్ఛేదము** :- వేదీమ్ - ఇవ - పరామృష్టాం - శాంతామ్ - అగ్నిశిఖామ్ - ఇవ - పౌర్ణమాసీమ్ - ఇవ - నిశాం - రాహుగ్రస్తేందుమండలామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- పరామృష్టాం వేదీమ్ ఇవ = (అపవిత్రునిచే) స్పృశింపబడిన యజ్ఞవేదిక వలెను, శాంతామ్ అగ్నిశిఖామ్ ఇవ = చల్లారిన అగ్నిజ్వాలవలెను, రాహుగ్రస్తేందు మండలాం = రాహువుచే మ్రింగబడిన చంద్రబింబము గలిగినట్టి, పౌర్ణమాసీం నిశామ్ ఇవ = పున్నమనాటి రాత్రివలెను, (స్థితాం సీతాం దదర్శ = ఉన్నట్టి సీతను చూచెను).

**తాత్పర్యము** :- అపవిత్రునిచే అంటబడిన యజ్ఞాగ్ని వేదికవలెను, ఆరిపోయిన అగ్నిజ్వాలవలెను, చంద్రగ్రహణసమయమునందలి రాత్రి సమయమువలెను క్షీణస్థితినొందియున్న సీతాదేవిని జూచెను.

**శ్లో॥ ఉత్కృష్టపర్ణకమలాం విత్రాసితవిహంగమామ్ ।**
**హస్తిహస్తపరామృష్టా మాకులాం పద్మినీ మివ ॥ 16**

**పదచ్ఛేదము** :- ఉత్కృష్టపర్ణకమలాం - విత్రాసితవిహంగమాం - హస్తి హస్తపరామృష్టామ్ - ఆకులాం - పద్మినీమ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- హస్తిహస్తపరామృష్టామ్ = ఏనుగుతొండముచే లాగివేయబడినది యును, ఉత్కృష్టపర్ణకమలాం = పెరికివేయబడిన ఆకులును తామరపువ్వులును గలదియును, విత్రాసితవిహంగమామ్ = తరిమివేయబడిన జలపక్షులు గలదియును అగు, ఆకులాం పద్మినీమ్ ఇవ (స్థితాం) = నలిగిపోయియున్న తామరతీగవలె నున్నట్టి, (సీతాం దదర్శ = సీతను రావణుడు జూచెను).

**తాత్పర్యము** :- ఏనుగుతొండముచే లాగివేయబడుటచేతను, ఆకులును, పువ్వులును పెఱికివేయబడుటచేతను, జలపక్షులు తరిమివేయబడుటచేతను వాడి నలిగిపోయి

శోభాహీనముగానున్న తామరతీగవలె గాన్పించుచున్నట్టి సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ పతిశోకాతురాం శుష్కాం నదీం విస్రావితామివ ।**
**పరయా మృజయా హీనాం కృష్ణపక్షనిశా మివ ॥ 17**

**పదచ్ఛేదము** :– పతిశోకాతురాం – శుష్కాం – నదీం – విస్రావితామ్ – ఇవ – పరయా – మృజయా – హీనాం – కృష్ణపక్షనిశామ్ – ఇవ ॥

**అన్వయక్రమము** :– విస్రావితాం, శుష్కాం నదీమ్ ఇవ పతిశోకాతురాం, కృష్ణపక్షనిశాం ఇవ, పరయా మృజయా హీనాం, (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :– విస్రావితాం = ప్రక్కకు ప్రవహింప జేయబడిన, శుష్కాం = ఎండిపోయినట్టి, నదీమ్ ఇవ = నదివలె, పతిశోకాతురాం = భర్తృవిరహశోకముచే కృశించియున్నదియును, కృష్ణపక్షనిశామ్ ఇవ = కృష్ణపక్షపు రాత్రివలె, పరయా మృజయా హీనాం = ఉత్తమమైన దేహసంస్కారము లేకయున్నదియును అగు, (సీతాం దదర్శ = సీతమ్మను జూచెను).

**తాత్పర్యము** :– నీటిని అంతను ప్రక్కకు ప్రవహింపచేయుటచే ఎండిపోయియున్న నదివలె పతి విరహదుఃఖముచే శుష్కించి యున్నట్టిదియును, కృష్ణపక్షనిశవలె దేహసంస్కారము మానుటచే మలినమై యున్నదియును అగు సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ సుకుమారీం సుజాతాంగీం రత్నగర్భగృహోచితామ్ ।**
**తప్యమానా మివోష్ణేన మృణాళీ మచిరోద్ధృతామ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– సుకుమారీం – సుజాతాంగీం – రత్నగర్భగృహోచితామ్ – తప్యమానామ్ – ఇవ – ఉష్ణేన – మృణాళీమ్ – అచిరోద్ధృతామ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– సుకుమారీం = గొప్ప సౌకుమార్యముగలదియును, సుజాతాంగీం = సుందరమైన అవయవ సన్నివేశము గలదియును, రత్నగర్భగృహోచితాం = రత్నభవనములందు నివసింపదగినదియును, అచిరోద్ధృతాం = అప్పుడే పీకివేయబడినట్టిదై, ఉష్ణేన తప్యమానాం = వేడిమిచే తపింపజేయబడుచున్న, మృణాళీమ్ ఇవ స్థితాం = తామరతూడువలెనున్నట్టి, (సీతాం దదర్శ = సీతను చూచెను).

**తాత్పర్యము** :- అతిసుకుమారురాలును, సుందరాంగియును మణిమయభవనముల యందు మాత్రమే నివసింపదగినదియును, అప్పుడే పెరికివేయబడి ఎండకు వడలిపోవుచున్న తామరతూడువలె కాన్పించుచున్నదియు నగు సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ గృహీతా మాళితాం స్తంభే యూథపేన వినాకృతామ్ ।**
**నిశ్శ్వసంతీం సుదుఃఖార్తాం గజరాజవధూ మివ ॥ 19**

**పదచ్ఛేదము** :- గృహీతామ్ - ఆళితాం - స్తంభే - యూథపేన - వినాకృతామ్, నిశ్శ్వసంతీం - సుదుఃఖార్తాం - గజరాజవధూమ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- యూథపేన వినాకృతాం, గృహీతాం, స్తంభే ఆళితాం, నిశ్వసంతీం, సుదుఃఖార్తాం గజరాజవధూమ్ ఇవ (స్థితాం సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :- యూథపేన వినాకృతాం = నాయకుడైన ఏనుగుచే వియోగము కల్పింపబడినదై, గృహీతాం = బంధింపబడినదై, స్తంభే ఆళితాం = కట్టుగుంజకు కట్టివేయబడినదై, నిశ్శ్వసంతీం = నిట్టూర్చుచున్నట్టి, సుదుఃఖార్తాం గజరాజవధూం ఇవ స్థితాం = మిక్కిలి దుఃఖముచే దిగులునొందిన గొప్పజాతి ఆడుఏనుగువలె నున్న, (సీతాం దదర్శ = సీతాదేవిని చూచెను).

**తాత్పర్యము** :- తన మందనుండి తొలగించి ఇంటికి తెచ్చి, కట్టుస్తంభమునకు బంధింపబడి మహాదుఃఖముతో నిట్టూర్పులు విడుచుచున్నట్టి భద్రజాతి గజాంగనవలె కానవచ్చుచున్న సీతను రావణుడు చూచెను.

**శ్లో॥ ఏకయా దీర్ఘయా వేణ్యా శోభమానా మయత్నతః ।**
**నీలయా నీరదాపాయే వనరాజ్యా మహీ మివ ॥ 20**

**పదచ్ఛేదము** :- ఏకయా - దీర్ఘయా - వేణ్యా - శోభమానామ్ - అయత్నతః - నీలయా - నీరదాపాయే - వనరాజ్యా - మహీమ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- నీరదాపాయే నీలయా వనరాజ్యా మహీమ్ ఇవ అయత్నతః ఏకయా దీర్ఘయా వేణ్యా శోభమానాం (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము** :- నీరదాపాయే = వర్షాకాలము గడచినపిమ్మట, నీలయా వనరాజ్యా = నల్లనైన వృక్షశ్రేణిచే, మహీమ్ ఇవ = వనభూమివలె, అయత్నతః = సంస్కారము లేకపోవుటవలన, ఏకయా దీర్ఘయా వేణ్యా = ఒకటిగానున్న, పొడవైన కేశపాశముచే,

శోభమానాం = ప్రకాశించుచున్నట్టి, (సీతాం దదర్శ = సీతను చూచెను).

**తాత్పర్యము :–** వర్షాకాలము గడచినపిమ్మట నల్లబడిపోయిన చెట్లవరుసతో వనభూమి ఎట్లు కానవచ్చునో, అట్లే ఎట్టి సంస్కారము చేయకుండుటచే జడగట్టిపోయియున్న పొడవైన నల్లని కేశపాశముతో ప్రకాశించుచున్నట్టి సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ ఉపవాసేన శోకేన ధ్యానేన చ భయేన చ ।**
**పరిక్షీణాం కృశాం దీనా మల్పాహారాం తపోధనామ్ ॥ 21**

**పదచ్ఛేదము :–** ఉపవాసేన – శోకేన – ధ్యానేన – చ – భయేన – చ – పరిక్షీణాం – కృశాం – దీనామ్ – అల్పాహారాం – తపోధనామ్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** ఉపవాసేన = ఉపవాసముచేతను, శోకేన = దుఃఖముచేతను, ధ్యానేన = తీవ్రమైన చింతచేతను, భయేన చ = భీతిచేతను, పరిక్షీణాం = మిక్కిలి క్షీణించి యున్నదియును, కృశాం = కృశించియున్నదియును, దీనాం = దీనస్థితి నొందియున్నదియును, అల్పాహారాం = అల్పమైన ఆహారమునే స్వీకరించుచున్నది యును, తపోధనాం = తపస్సే ధనముగ కలదియు నగు, (సీతాం దదర్శ = సీతను చూచెను).

**తాత్పర్యము :–** నిత్యోపవాసముచేతను, తీవ్రదుఃఖముచేతను, నిరంతరధ్యానముచేతను, అధికమగు భయముచేతను, మిక్కిలి క్షీణించినదై, కృశించినదై, దీనురాలై స్వల్పమైన ఆహారమును భుజించుచు తపోనిమగ్నురాలైయున్న సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ ఆయాచమానాం దుఃఖార్తాం ప్రాంజలిం దేవతా మివ ।**
**భావేన రఘుముఖ్యస్య దశగ్రీవపరాభవమ్ ॥ 22**

**పదచ్ఛేదము :–** ఆయాచమానాం – దుఃఖార్తాం – ప్రాంజలిం – దేవతామ్ – ఇవ – భావేన – రఘుముఖ్యస్య – దశగ్రీవపరాభవమ్ ॥

**అన్వయక్రమము :–** రఘుముఖ్యస్య భావేన దశగ్రీవపరాభవం దేవతామ్ ఆయాచమానమ్ ఇవ ప్రాంజలిం, దుఃఖార్తాం (సీతాం దదర్శ).

**ప్రతిపదార్థము :–** రఘుముఖ్యస్య భావేన = శ్రీరాముని ప్రభావముచేత, దశగ్రీవ పరాభవం = రావణుని పరాభవమును, దేవతామ్ = తన ఇష్టదైవమును, ఆయాచమానామ్ ఇవ = ప్రార్థించుచున్నదివలె, ప్రాంజలిం = దోసిలొగ్గియున్నదై,

దుఃఖార్తాం = దుఃఖముచే కృంగియున్నట్టి, (సీతాం దదర్శ = సీతను చూచెను).

**తాత్పర్యము :–** తన ప్రియుడైన శ్రీరాముని ప్రభావముచే రావణాసురునకు పరాభవము కలుగవలయునని మనస్సునందు కోరుచు తన ఇష్టదైవమును ప్రార్థించు చున్నట్లుగా దుఃఖార్తయై, చేతులు జోడించుకొనియున్న సీతాదేవిని రావణుడు చూచెను.

**శ్లో॥ సమీక్షమాణాం రుదతీ మనిందితాం**
**సుపక్ష్మతామ్రాయత శుక్లలోచనామ్ ।**
**అనువ్రతాం రామ మతీవ మైథిలీం**
**ప్రలోభయామాస వధాయ రావణః ॥ 23**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"క్లేశగత సీతోపమాః" నామ*
*ఏకోనవింశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** సమీక్షమాణాం – రుదతీమ్ – అనిందితాం – సుపక్ష్మతామ్రాయత శుక్లలోచనామ్, అనువ్రతాం – రామమ్ – అతి – ఇవ – మైథిలీం – ప్రలోభయామాస – వధాయ – రావణః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** సమీక్షమాణాం = (నలువైపులను) చూచుచున్నదియును, రుదతీం = శోకించుచున్నదియును, అనిందితాం = ఉత్తమురాలును, సుపక్ష్మతామ్రాయత శుక్లలోచనాం = సుందరమైన రెప్పలతో గూడిన ఎఱ్ఱని విశాలమైన తెల్లని కన్నులు గలదియును, రామమ్ అతీవ అనువ్రతాం = శ్రీరామునే మిక్కిలిగ నమ్మియున్నదియును అగు, మైథిలీం = జానకీదేవిని, రావణః = రావణాసురుడు, వధాయ = మరణము కొరకై, ప్రలోభయామాస = లోభపెట్టెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'వధాయ' రావణుని దుష్టయత్నము తన వధకొరకే యైనది; తన ఇష్టసిద్ధికి కాలేదని భావము.

**తాత్పర్యము :–** తనను రక్షించు వారినిగూర్చి నలువైపులకు చూచుచు, సహజముగా ఎఱ్ఱనైన తన విశాల సుందర నేత్రములు దుఃఖముచే తెల్లబడి యుండగా విలపించుచు,

రామునియందే లగ్నమైన చిత్తముతో నిర్దుష్టమైన వర్తనముతోనున్న సీతాదేవిని రావణాసురుడప్పుడు తన వధకొరకైయున్నట్లు ఆమెను లోభపెట్టుచు మాటలాడదొడగెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"క్లేశగత సీతోపమానములు" అను*
*పందొమ్మిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# వింశసర్గ

**శ్లో॥ స తాం పతివ్రతాం దీనాం నిరానందాం తపస్వినీమ్ ।**
**సాకారై ర్మధురై ర్వాక్యై ర్న్యదర్శయత రావణః ॥ 1**

**పదచ్ఛేదము :–** సః – తాం – పతివ్రతాం – దీనాం – నిరానందాం – తపస్వినీమ్, సాకారైః – మధురైః – వాక్యైః – న్యదర్శయత – రావణః ॥

**అన్వయక్రమము :–** పతివ్రతాం, దీనాం, నిరానందాం, తపస్వినీం, తాం, సః రావణః, సాకారైః, మధురైః, వాక్యైః (స్వాభిప్రాయం) న్యదర్శయత.

**ప్రతిపదార్థము :–** పతివ్రతాం = పతివ్రతయును, దీనాం = దీనురాలును, నిరానందాం = ఆనందమును గోల్పోయినదియును, తపస్వినీం = బాధలకు లోనైనదియును నగు, తాం = ఆ సీతాదేవినిగూర్చి, సః రావణః = ఆ రావణాసురుడు, సాకారైః = తన భావమును వెల్లడించునట్టి, మధురైః = తీయనైనట్టి, వాక్యైః = మాటలతో, (స్వాభిప్రాయం) న్యదర్శయత = (తన అభిప్రాయమును) వెలిబుచ్చెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'పతివ్రతాం' అనుటకు బదులుగా 'పరివృతాం' అని బొంబాయి ముద్రణము. అనగా రాక్షసులచే పరివేష్టింపబడియున్నది.

**తాత్పర్యము :–** పతివ్రతయై ఆనందమునకు దూరమై దీనావస్థలో నున్నట్టి ఆ సీతాదేవిని గూర్చి ఆమెకడకు వచ్చిన రావణుడు తియ్యనైన అభిప్రాయగర్భితములగు మాటలతో తన హృదయము నిట్లు వెల్లడించెను.

**శ్లో॥ మాం దృష్ట్వా నాగనాసోరు గూహమానా స్తనోదరమ్ ।**
**అదర్శన మి వాత్మానం భయా న్నేతుం త్వ మిచ్ఛసి ॥ 2**

**పదచ్ఛేదము :–** మాం – దృష్ట్వా – నాగనాసోరు – గూహమానా – స్తనోదరమ్, అదర్శనమ్ – ఇవ – ఆత్మానం – భయాత్ – నేతుం – త్వమ్ – ఇచ్ఛసి ॥

**అన్వయక్రమము :–** నాగనాసోరు, మాం దృష్ట్వా, స్తనోదరం, గూహమానా, భయాత్, ఆత్మానమ్ అదర్శనం నేతుమ్ ఇవ, త్వం (కుతః) ఇచ్ఛసి?

**ప్రతిపదార్థము :–** నాగనాసోరు = ఏనుగుతొండములవంటి ఊరువులుగల యో సుందరీ, మాం దృష్ట్వా = నన్ను జూచి, స్తనోదరం గూహమానా = స్తనములను ఉదరమును కప్పివేసికొన్నదానవై, భయాత్ = భీతివలన, ఆత్మానమ్ అదర్శనం నేతుం ఇవ = నీ రూపమును కనబడకుండ చేయుటకువలె, త్వం (కుతః) ఇచ్ఛసి? = నీవేల కోరుచున్నావు?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** అదర్శనం నేతుం (కుతః) ఇచ్ఛసి? వాస్తవమునకు పుత్రసముడైన భృత్యుని చూచునపుడు భయాదుల నొందుట ఉచితము కాదని రహస్యార్థము.

**తాత్పర్యము :–** ఓ సుందరాంగీ! నన్ను చూడగనే నీ స్తనములను ఉదరమునకు కప్పుకొనుచు నాకు నీ రూపము కనబడకుండ చేయుటకై భీతితో నీవేల ప్రవర్తించు చుంటివి?

**శ్లో॥ కామయే త్వాం విశాలాక్షి బహుమన్యస్వ మాం ప్రియే ।**
**సర్వాంగగుణసంపన్నే సర్వలోకమనోహరే ॥ 3**

**పదచ్ఛేదము :–** కామయే – త్వాం – విశాలాక్షి – బహుమన్యస్వ – మాం – ప్రియే – సర్వాంగగుణసంపన్నే – సర్వలోకమనోహరే ॥

**అన్వయక్రమము :–** సర్వాంగగుణసంపన్నే, సర్వలోకమనోహరే, విశాలాక్షి! త్వాం కామయే; ప్రియే! మాం బహుమన్యస్వ.

**ప్రతిపదార్థము :–** సర్వాంగగుణసంపన్నే = అన్ని అవయవములయందును శుభలక్షణములు కలిగినట్టి, సర్వలోకమనోహరే = సమస్త లోకములకును మనోహరమైన సౌందర్యముగల, విశాలాక్షి = విశాలమైన నేత్రములుగల సుందరీ! త్వాం కామయే = నిన్ను కామించుచున్నాను. ప్రియే! = ఓ ప్రియురాలా! మాం బహుమన్యస్వ = నన్ను గౌరవింపుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** 'త్వాం కామయే' = నాకు పరమేశ్వరినిగా నిన్ను కోరుచున్నాను అని రహస్యార్థము

**తాత్పర్యము :–** సర్వసద్గుణములతో ప్రకాశించుచు సర్వలోకములయొక్క మనస్సులను హరించునట్టి ఓ సుందరాంగీ! నిన్ను నేను కోరుచున్నాను. నాకు ప్రియురాలివై నన్ను ప్రేమతో మన్నింపుము.

**శ్లో॥ నేహ కేచి న్మనుష్యా వా రాక్షసాః కామరూపిణః ।**
**వ్యపసర్పతు తే సీతే భయం మత్తస్సముత్థితమ్ ॥ 4**

**పదచ్ఛేదము :–** న – ఇహ – కే – చిత్ – మనుష్యాః – వా – రాక్షసాః – కామరూపిణః – వ్యపసర్పతు – తే – సీతే – భయం – మత్తః – సముత్థితమ్ ॥

**అన్వయక్రమము :–** సీతే, ఇహ కేచిత్ మనుష్యాః వా, కామరూపిణః రాక్షసాః వా న; మత్తః సముత్థితం భయం తే వ్యపసర్పతు.

**ప్రతిపదార్థము :–** సీతే! = ఓ జానకీ! ఇహ = ఇచట, కేచిత్ మనుష్యాః వా = ఏ మనుష్యులుగాని, కామరూపిణః రాక్షసాః వాః = కామరూపులైన రాక్షసులుగాని, న = లేరు, మత్తః సముత్థితం = నా నుండి కలిగినట్టి, తే = నీయొక్క, భయం = భయము, వ్యపసర్పతు = తొలగిపోవుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** నన్ను మించిన భయహేతువులైన మనుష్యులు గాని రాక్షసులు గాని ఇట నెవ్వరును లేరని భావము.

**మహేశ్వరతీర్థులు :–** ఇచ్చట మనుష్యులుగాని రాక్షసులుగాని నీకు భయము కలిగించు వారు ఎవ్వరును లేరు. సర్వేశ్వరియైన నీకు ఎవ్వరివలనను భయముగాని శంకగాని యుండదుగదా యని రహస్యార్థము.

**తాత్పర్యము :–** ఓ జానకీ! ఇచట నీవు సందేహింపవలసినట్టి మనుష్యులుగాని కామరూపులైన రాక్షసులుగాని ఎవ్వరునులేరు. నావలన భయపడవలసినది నీకెన్నడును లేదుసుమా!

**శ్లో॥ స్వధర్మో రక్షసాం భీరు సర్వథైవ న సంశయః ।**
**గమనం వా పరస్త్రీణాం హరణం సంప్రమథ్య వా ॥ 5**

**పదచ్ఛేదము :–** స్వధర్మః – రక్షసాం – భీరు – సర్వథా – ఏవ – న – సంశయః – గమనం – వా – పరస్త్రీణాం – హరణం – సంప్రమథ్య – వా ॥

**అన్వయక్రమము :–** భీరు, పరస్త్రీణాం గమనం వా, సంప్రమథ్య హరణం వా, రక్షసాం

సర్వథా స్వధర్మః ఏవ, న సంశయః.

**ప్రతిపదార్థము :–** భీరు! = ఓ భయస్వభావురాలవైన జానకీ!, పరస్త్రీణాం గమనం = పరస్త్రీలను పొందుటయు, సంప్రమథ్య హరణం వా = బలాత్కరించి అపహరించుట యును, రక్షసాం = రాక్షసజాతివారికి, సర్వథా = ఎల్లవిధములను, స్వధర్మః ఏవ = కులధర్మమే, న సంశయః = సందేహములేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'న సంశయః' = బలాత్కారముగా పరునిచే అపహరింపబడుచున్నది గావున సహజముగా అస్వతంత్రురాలగు స్త్రీకి దోషశంక గూడ అక్కరలేదని రావణుని భావము.

**రామాయణ శిరోమణి :–** పరస్త్రీహరణాది దోషకృత్యము చేసిన పాతకుని చూచుటయు అధర్మము అని శంకింపనక్కరలేదు. అది మా రాక్షసులకు సహజమైన ధర్మమే యని రావణాసురుడు తెలుపుచున్నాడు.

**తాత్పర్యము :–** ఓ భీతచిత్తురాలవైయున్న జానకీ! పరస్త్రీల ననుభవించుటయు, బలాత్కరించి ఇంటికి తెచ్చుకొనుటయు, మా రాక్షసవంశమువారికి సర్వవిధముల కులసిద్ధమైన ధర్మమైయున్నది. కాబట్టి నన్ను చేబట్టు విషయమున నీకు ఎట్టి శంకకును తావులేదు.

**శ్లో॥ ఏవం చైత దకామాం తు న త్వాం స్ప్రక్ష్యామి మైథిలి ।**
**కామం కామ శ్శరీరే మే యథాకామం ప్రవర్తతామ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** ఏవం – చ – ఏతత్ – అకామాం – తు – న – త్వాం – స్ప్రక్ష్యామి – మైథిలి – కామం – కామః – శరీరే – మే – యథాకామం – ప్రవర్తతామ్ ॥

**అన్వయక్రమము :–** మైథిలి, ఏతత్, ఏవమ్, అకామాం త్వాం తు న స్ప్రక్ష్యామి; మే శరీరే కామః కామం యథాకామం, ప్రవర్తతామ్.

**ప్రతిపదార్థము :–** మైథిలి = ఓ జానకీ! ఏతత్ ఏవమ్ = ఇది ఇట్టిదైనను, అకామాం త్వాం తు = (నాపై) కామములేనట్టి నిన్నుమాత్రము, న స్ప్రక్ష్యామి = తాకను, మే శరీరే = నా శరీరమునందు, కామః = (నా) కామము, కామం యథాకామం = ఎంతయు ఇష్టమువచ్చిన రీతిగా, ప్రవర్తతామ్ = చరించుచు నుండుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'కామః మే శరీరే యథాకామం కామం ప్రవర్తతామ్' = మన్మథుడు నా శరీరమునందు స్వేచ్ఛగా కామమును విస్తరింపచేయుగాక!

**రామాయణ శిరోమణి :–** నాపై కామములేకయున్న నిన్ను తాకుట యనునది జరుగనీయను. నిన్ను నా కన్నులతో మాత్రమే చూచెదను. నీ దర్శనేచ్ఛారూపమైన కామము మాత్రమే నా శరీరమున చెలరేగు చుండుగాక!

**మహేశ్వరతీర్థులు :–** పరదారాహరణము మున్నగునవి రాక్షసులయొక్క స్వభావమైనను, నేను మాత్రము అకామవైన నిన్ను – (అ=అనగా విష్ణుమూర్తియందు మాత్రమే; కామః = కోరికయున్న నిన్ను, నేను తాకనైనను తాకను. నా మన్మథవికారము నా శరీరమునందే అణగియుండు గాక! నీఆజ్ఞలేనిదే పూజార్థముగా కూడ నిన్ను తాకను అని రహస్యార్థము.

**తాత్పర్యము :–** ఏమయినను, నన్ను కామింపనట్టి నిన్ను నేను ఎంతమాత్రము తాకను సుమా! ఓ జానకీ! నాలో విజృంభించుచున్న మన్మథవికారము నా శరీరమునందే అణగియుండుగాక.

**శ్లో॥ దేవి నేహ భయం కార్యం మయి విశ్వసిహి ప్రియే ।**
**ప్రణయస్వ చ తత్త్వేన మైవం భూ శ్శోకలాలసా ॥ 7**

**పదచ్ఛేదము :–** దేవి – న – ఇహ – భయం – కార్యం – మయి – విశ్వసిహి – ప్రియే – ప్రణయస్వ – చ – తత్త్వేన – మా – ఏవం – భూః – శోకలాలసా ॥

**అన్వయక్రమము :–** దేవి, ఇహ భయం న కార్యమ్; ప్రియే, మయి విశ్వసిహి; తత్త్వేన ప్రణయస్వ చ; ఏవం శోకలాలసా మా భూః.

**ప్రతిపదార్థము :–** దేవి! = ఓ పూజ్యురాలా! ఇహ = ఈ శీలరక్షణవిషయమున, భయం న కార్యం = భయపడనక్కరలేదు, ప్రియే! = ఓ ప్రియురాలా! మయి విశ్వసిహి = నాయందు విశ్వాసముంచుము, తత్త్వేన ప్రణయస్వ చ = వాస్తవముగనే నాయందు ప్రేమ గలిగి యుండుము, ఏవం = ఈరీతిగా, శోకలాలసా మా భూః = దుఃఖ నిమగ్నురాలవు గాకయుండుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** దేవి! = అంతఃపురమునకంతకును పూజ్యురాలవై యుండునట్టి ఓ రమణీ!

**తాత్పర్యము :–** ఓ పూజ్యురాలా! నీ శీలరక్షణమునుగూర్చి భయపడకుము. నాపై పూర్తిగా విశ్వాసమును కలిగియుండుము. నన్ను హృదయపూర్వకముగ ప్రేమింపుము. ఈ విధముగా దుఃఖనిమగ్నురాలవై యుండకుము.

**శ్లో॥ ఏకవేణీ ధరాశయ్యా ధ్యానం మలిన మంబరమ్ ।**
**అస్థానే ఉ పృుపవాసశ్చ నైతా న్యౌపయికాని తే ॥ 8**

**పదచ్ఛేదము :–** ఏకవేణీ – ధరాశయ్యా – ధ్యానం – మలినమ్ – అంబరమ్, అస్థానే – అపి – ఉపవాసః – చ – న – ఏతాని – ఔపయికాని – తే ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** ఏకవేణీ = జటకట్టిన కేశములు, ధరాశయ్యా = నేలపై పరుండుట, ధ్యానం = తీవ్రచింతనము, మలినమ్ అంబరం = మలినవస్త్రము, అస్థానే ఉపవాసః అపి = అనావశ్యకముగ ఉపవసించు చుండుటయును, ఏతాని = ఇవి, తే = నీకు, ఔపయికాని న = యుక్తమయినవిగావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** న ఔపయికాని – పురుషార్థములకు ఉపయుక్తము లైనవి గావు.

**రామాయణ శిరోమణి :–** 'అస్థానే' అనుపదము ఏకవేణీ మున్నగు అన్నిటికిని అన్వయించును.

**తాత్పర్యము :–** ఈరీతిగా కేశములను జడకట్టించుట, నేలపై పరుండుట, చింతా నిమగ్నురాలవై యుండుట, మలినమైన వస్త్రములు ధరించియుండుట, నిష్కారణముగా ఉపవాసము చేయుచుండుట అను నీ కృత్యము లెంతమాత్రమును నీకు తగినవి కావుసుమా!

**శ్లో॥ విచిత్రాణి చ మాల్యాని చందనా న్యగరూణి చ ।**
**వివిధాని చ వాసాంసి దివ్యా న్యాభరణాని చ ॥ 9**

**శ్లో॥ మహార్హాణి చ పానాని శయనా న్యాసనాని చ ।**
**గీతం నృత్తం చ వాద్యం చ లభ మాం ప్రాప్య మైథిలి ॥ 10**

**పదచ్ఛేదము :–** విచిత్రాణి – చ – మాల్యాని – చందనాని – అగరూణి – చ – వివిధాని – చ, వాసాంసి – దివ్యాని – ఆభరణాని – చ – మహార్హాణి – చ –

పానాని – శయనాని – ఆసనాని – చ – గీతం – నృత్తం – చ – వాద్యం – చ – లభ – మాం – ప్రాప్య – మైథిలి ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– మైథిలి = ఓ జానకీ! మాం ప్రాప్య = నన్ను పొంది, విచిత్రాణి మాల్యాని = చిత్రవిచిత్రములైన పుష్పమాలికలను, చందనాని = సుగంధములను, అగరూణి చ = అగరుధూపములను, వివిధాని వాసాంసి చ = బహువిధములైన వస్త్రములను, దివ్యాని ఆభరణాని చ = లోకోత్తరములైన భూషణములను, మహార్హాణి = అమూల్యములైనట్టి, పానాని = పానీయములను, శయనాని = తల్పములను, ఆసనాని చ = పీఠములను, గీతం = సంగీతమును, నృత్తం చ = నాట్యమును, వాద్యం చ = వాద్యమును, లభ = సంపాదించుకొనుము.

**తాత్పర్యము** :– ఓ జానకీ! నీవు నన్ను స్వీకరించి చిత్రవిచిత్రములైన పుష్పమాలికలను, చందనాది సుగంధములను, అగరుప్రభృతి ధూపములను పలువిధములగు వస్త్ర విశేషములను, లోకోత్తరములగు భూషణములను, అమూల్యములైన పానీయములను, హంసతూలికాతల్పములను, వివిధమణిమయాసనములను నృత్యగీతవాద్యాది విలాసములను పొంది తనివితీర అనుభవింపుము.

**శ్లో॥ స్త్రీరత్న మసి మైవం భూః కురు గాత్రేషు భూషణమ్ ।**
**మాం ప్రాప్య హి కథం ను స్యా స్త్వ మనర్హా సువిగ్రహే ॥ 11**

**పదచ్ఛేదము** :– స్త్రీరత్నమ్ – అసి – మా – ఏవం – భూః – కురు – గాత్రేషు – భూషణమ్; మాం – ప్రాప్య – హి – కథం – ను – స్యాః – త్వమ్ – అనర్హా – సువిగ్రహే ॥

**అన్వయక్రమము** :– స్త్రీరత్నమ్ అసి; ఏవం మా భూః; గాత్రేషు భూషణం కురు; సువిగ్రహే; మాం ప్రాప్య త్వం కథం ను అనర్హా స్యాః ?

**ప్రతిపదార్థము** :– స్త్రీరత్నమ్ అసి = స్త్రీలలో శ్రేష్ఠురాలవు, ఏవం మా భూః = ఈ రీతిగా నుండకుము, గాత్రేషు భూషణం కురు = అవయవములయందు ఆభరణములను ధరింపుము, సువిగ్రహే! = ఓ సుందరాంగీ! మాం ప్రాప్య = నన్ను పొంది, త్వం = నీవు, కథం ను = ఎట్లుగా, అనర్హా స్యాః = అర్హురాలివి కాకుండ నుండగలవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి :–** 'అనర్హా' = అపూజిత. నన్ను చేబట్టి పూజితురాలవు గాకుండగ ఎట్లుందువు.

**తాత్పర్యము :–** నీవు స్త్రీజాతికి మేలుబంతివి. ఈ రీతిగా మలినరూపముతో నుండ కూడదు. ఒడలినిండ ఆభరణములను ధరింపుము, దివ్యమైన రూపసంపదగల ఓ సుందరీ! నన్ను చేపట్టిన పిమ్మట అలంకారయుక్తురాలవు గాకుండ ఎట్లుండగలవు?

**శ్లో॥ ఇదం తే చారు సంజాతం యౌవనం వ్యతివర్తతే ।**
**య దతీతం పునర్నైతి స్రోత శ్శీఘ్ర మపామివ ॥ 12**

**పదచ్ఛేదము :–** ఇదం – తే – చారు – సంజాతం – యౌవనం – వ్యతివర్తతే – యత్ – అతీతం – పునః – న – ఏతి – స్రోతః – శీఘ్రమ్ – అపామ్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** చారుసంజాతం తే యౌవనం వ్యతివర్తతే; అపాం శీఘ్రం స్రోతః ఇవ, యత్ అతీతం, తత్ పునః న ఏతి.

**ప్రతిపదార్థము :–** చారుసంజాతం = సుందరముగా లభించినట్టి, తే = నీయొక్క, ఇదం = ఈ, యౌవనం = యౌవనవయస్సు, వ్యతివర్తతే = అతిక్రమించిపోవుచున్నది, అపాం = నీటియొక్క, శీఘ్రం స్రోతః ఇవ = వేగమైన ప్రవాహమువలె, యత్ అతీతం = ఏది దాటిపోయినదో, తత్ = అది, పునః న ఏతి = తిరిగిరాజాలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** భోగములను అనుభవించుట కిదియే తగిన కాలము. నీకు భృత్యుడనైన నా వయస్సు వ్యర్థముగా గడచిపోవుచున్నది. అందుచే నాకు యోగ్యమైనట్టి నీ పూజకై అనుజ్ఞ నొసగుమని నిగూఢమైన భావము.

**తాత్పర్యము :–** నదియందు ప్రవహించు నీరువలె గడచిపోయినది వెనుకకు రాదు గదా! అనన్యదుర్లభమైన నీ యౌవన వయస్సు వ్యర్థముగా గడచిపోవుచున్నది సుమా!

**శ్లో॥ త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా స విశ్వసృట్ ।**
**న హి రూపోపమా త్వన్యా త వాస్తి శుభదర్శనే ॥ 13**

**పదచ్ఛేదము :–** త్వాం – కృత్వా – ఉపరతః – మన్యే – రూపకర్తా – సః – విశ్వసృట్ – న – హి – రూపోపమా – తు – అన్యా – తవ – అస్తి – శుభదర్శనే ॥

**అన్వయక్రమము** :- శుభదర్శనే! రూపకర్తా, సః విశ్వసృట్ త్వాం కృత్వా, ఉపరతః, (ఇతి) మన్యే, తవ రూపోపమా అన్యా నాస్తి హి.

**ప్రతిపదార్థము** :- రూపకర్తా = సుందరరూపమును సృష్టిచేయు, సః విశ్వసృట్ = ఆ సృష్టికర్త, త్వాం = నిన్ను, కృత్వా = నిర్మాణము చేసి, ఉపరతః (ఇతి) = విరమించుకొన్నాడని, మన్యే = భావించుచున్నాను, శుభదర్శనే = మంగళకరమైన దర్శనముగల ఓ జానకీ! తవ = నీకు, రూపోపమా = సౌందర్యముచే సాటియైన, అన్యా = ఇంకొకస్త్రీ, న అస్తి హి = లేదుగదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'రూపకర్తా' - దివ్య సౌందర్యమును సృష్టింప తలపెట్టిన బ్రహ్మదేవునకు తిరిగి అత డెంత యత్నించినను, ఇట్టి నిర్మాణము సాధ్యముకాదని భావము. అందుచేతనే బ్రహ్మ ఇట్టి సౌందర్యనిర్మాణమును తిరిగి తలపెట్టడని తెలుపుచున్నాడు.

**గోవిందరాజీయము** :- ఉత్తరోత్తర సౌందర్యనిర్మాణము చేయగోరుచు, నీ సౌందర్య అతిశయమును సృష్టించి, ఇట్టి నిర్మాణ మసాధ్యమని తెలిసికొని బ్రహ్మ తిరిగి ఆ పనిని విరమించెను అని భావము.

**తాత్పర్యము** :- లోకోత్తరసౌందర్యమును నిర్మింపదలచినట్టి ఆ సృష్టికర్తయైన బ్రహ్మ నిన్నే సౌందర్యరాశిగా నిర్మించి, ఇంతకంటెను ఉత్తమనిర్మాణము అసాధ్యమని తెలిసికొని అటుపిమ్మట అతడు సుందరరూపసృష్టినే మానుకొనెనని తలచుచున్నాను. ఎందుచేత ననగా, మంగళకరమైన దివ్యసౌందర్యముగల నీకు సాటివచ్చు సుందరి సృష్టిలో వేరొకతె లేదు గదా!

**శ్లో॥ త్వాం సమాసాద్య వైదేహి రూపయౌవనశాలినీమ్ ।**
**కః పుమా నతివర్తేత సాక్షాదపి పితామహః ॥ 14**

**పదచ్ఛేదము** :- త్వాం - సమాసాద్య - వైదేహి - రూపయౌవనశాలినీమ్, కః - పుమాన్ - అతివర్తేత - సాక్షాత్ - (అపి) పితామహః ॥

**అన్వయక్రమము** :- వైదేహి! రూపయౌవనశాలినీం త్వాం సమాసాద్య సాక్షాత్ పితామహః అపి కః పుమాన్ అతివర్తేత!

**ప్రతిపదార్థము** :- వైదేహీ = ఓ జానకీ! రూపయౌవనశాలినీం = సౌందర్యముతోడను, యౌవనముతోడను ప్రకాశించుచున్నట్టి, త్వాం సమాసాద్య = నిన్ను చేరి, సాక్షాత్

పితామహః అపి = స్వయముగా బ్రహ్మదేవుడయినను, కః పుమాన్ = ఏ పురుషుడు, అతివర్తేత = దాటి పోవగలడు!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- 'సీతా లక్ష్మీః భవాన్ విష్ణుః' అని ముందు చెప్పబోవురీతిగా, సాక్షాత్ బ్రహ్మదేవుడుకూడ సీతసన్నిధికి వచ్చినప్పుడు, ఆరాధింపక వెడలిపోలేడు. ఇతరపురుషుడు ఎవడు మ్రొక్కకుండ బోవును? అని గూఢమైన భావము.

**తాత్పర్యము** :- లోకోత్తర రూపయౌవనములచే ప్రకాశించుచున్నట్టి నిన్నుజూచిన ఏ పురుషుడు నిగ్రహించుకొనగలడు! స్వయముగ బ్రహ్మదేవుడయినను మనస్సునందు క్షోభను పొందక యుండగలడా!

**శ్లో॥ యద్యత్పశ్యామి తే గాత్రం శీతాంశుసదృశాననే ।**
**తస్మిం స్తస్మిన్ పృథుశ్రోణి చక్షుర్మమ నిబధ్యతే ॥ 15**

**పదచ్ఛేదము** :- యత్ - యత్ - పశ్యామి - తే - గాత్రం - శీతాంశుసదృశాననే - తస్మిన్ - తస్మిన్ - పృథుశ్రోణి - చక్షుః - మమ - నిబధ్యతే ॥

**అన్వయక్రమము** :- శీతాంశుసదృశాననే, పృథుశ్రోణి! తే యత్ యత్ గాత్రం పశ్యామి, తస్మిన్ తస్మిన్ మమ చక్షుః నిబధ్యతే.

**ప్రతిపదార్థము** :- శీతాంశుసదృశాననే = చంద్రబింబమువంటి ముఖముగల ఓ సుందరీ, పృథుశ్రోణి = విశాలమైన కటిసీమగల ఓ కోమలీ! తే యత్ యత్ గాత్రం పశ్యామి = నీ యొక్క ఏ యే అవయవమును చూచుచున్నానో, తస్మిన్ తస్మిన్ = ఆయా అవయవమునందు, మమ చక్షుః నిబధ్యతే = నాదృష్టి కట్టివేయబడుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- ఇష్టదేవతవైన నీ దర్శనము ముక్తిసాధన మగుటవలన నాదృష్టి నీయందు బంధింపబడుచున్నది యని రహస్యార్థము.

**రామాయణ శిరోమణి** :- ఈ వర్ణనముచే సీతాదేవి చరణారవింద దర్శన మహిమకూడ వర్ణింపబడినది.

**తాత్పర్యము** :- హిమాంశుశీతలమైన ముఖప్రకాశముగల ఓ సుందరాంగీ! నీ శరీరమునందలి ఏ అవయవమును జూచిన, ఆ యవయవమునందే నాదృష్టి బంధింపబడి పోవుచున్నది సుమా!

**శ్లో॥ భవ మైథిలి భార్యా మే మోహ మేనం విసర్జయ ।**
**బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మితస్తతః ।**
**సర్వాసామేవ భద్రం తే మ మాగ్రమహిషీ భవ ॥ 16**

**పదచ్ఛేదము** :– భవ – మైథిలి – భార్యా – మే – మోహమ్ – ఏనం – విసర్జయ, బహ్వీనామ్ – ఉత్తమస్త్రీణామ్ – ఆహృతానామ్ – ఇతః – తతః – సర్వాసామ్ – ఏవ – భద్రం – తే – మమ – అగ్రమహిషీ – భవ ॥

**అన్వయక్రమము** :– మైథిలి! మే భార్యా భవ, ఏనం మోహం విసర్జయ, ఇతః తతః ఆహృతానాం, బహ్వీనాం, సర్వాసామ్ ఉత్తమస్త్రీణాం త్వమేవ మమ అగ్రమహిషీ భవ, తే భద్రం (భవేత్).

**ప్రతిపదార్థము** :– మైథిలి = ఓ జానకీ! మే భార్యా భవ = నాకు భార్యవగుము, ఏనం మోహం విసర్జయ = ఈ భ్రాంతిని విడిచి పెట్టుము, ఇతః తతః ఆహృతానాం = ఇచటినుండి అచటినుండి తీసికొని రాబడినట్టి, బహ్వీనాం = అసంఖ్యాకలైన, సర్వాసామ్ ఉత్తమస్త్రీణాం = ఎల్ల ఉత్తమస్త్రీలలో, త్వమేవ = నీవే, మమ = నాకు, అగ్రమహిషీ భవ = పట్టమహిషివి అగుము, తే భద్రం (భవేత్) = నీకు క్షేమము అగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– మోహం విసర్జయ = ఈతనికి నేనేల భార్యను గావలెను అను అజ్ఞానమును విడువుము.

**మహేశ్వరతీర్థులు** :– భార్యా భవ – (భయా కాంత్యా ఆర్యా – భార్యా) = నీ సహజ ప్రకాశముచే శ్రేష్ఠురాలవై యుండుము, ఏనం మోహం విసర్జయ = నాయందు శత్రుత్వశంకను విడువుము, ఉత్తమస్త్రీణాం, మమ చ, యా అగ్రమహిషీ తస్యాః చ ఈశ్వరీ భవ = ఉత్తమస్త్రీలైన నా ఇతరభార్యలకును, పట్టమహిషియైన మందోదరికిని, నాకును ఈశ్వరివిగా నుండుమని రహస్యార్థము.

**తాత్పర్యము** :– ఓ జానకీ! నాకు భార్యవగుము. అనావశ్యకమైన శంకను విడువుము. నే నెల్ల లోకములనుండి తీసికొనివచ్చిన అసంఖ్యాకలుగా నున్న నాభార్య లందరకును, నీవే పట్టమహిషివిగా నుండి గొప్పమేలు సంపాదించుకొనుము.

**శ్లో॥ లోకేభ్యో యాని రత్నాని సంప్రమ థ్యాహృతాని వై ।**
**తాని మే భీరు సర్వాణి రాజ్యం చైత దహం చ తే ॥ 17**

**పదచ్ఛేదము** :– లోకేభ్యః – యాని – రత్నాని – సంప్రమథ్య – ఆహృతాని – వై – తాని – మే – భీరు – సర్వాణి – రాజ్యం – చ – ఏతత్ – అహం – చ – తే ॥

**అన్వయక్రమము** :– భీరు! లోకేభ్యః యాని రత్నాని, సంప్రమథ్య, ఆహృతాని, తాని సర్వాణి, ఏతత్ మే రాజ్యం చ, అహం చ, తే (భవిష్యామః).

**ప్రతిపదార్థము** :– భీరు = ఓ భీతచిత్తురాలా! లోకేభ్యః = లోకములనుండి, యాని రత్నాని = ఏ శ్రేష్ఠవస్తువులైతే, సంప్రమథ్య = యుద్ధమున ఓడించి, ఆహృతాని = తేబడినవో, తాని సర్వాణి = ఆ వస్తువులన్నియును, ఏతత్ రాజ్యం చ = ఈ సామ్రాజ్యమున్ను, అహం చ = నేనుకూడను, తే (భవిష్యామః) = నీవి (కాగలము).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :– ఇష్టదేవతయైన సీతాదేవికి రావణుడు ఇచ్చుట, ఆత్మసమర్పణము గావించుకొనుచున్నాడు, 'అహం చ తే' – అనుటచే ఆత్మసమర్పణమును; "తాని సర్వాణి రత్నాని' – అనుటచే ఆత్మీయసర్వవస్తుసమర్పణమును చేయుచున్నాడు అని గూఢార్థము.

**తాత్పర్యము** :– భయస్వభావురాలవైన ఓ జానకీ! యుద్ధములో జయించి వచ్చునపుడు ఏ యే అమూల్యములైన శ్రేష్ఠవస్తువులను తెచ్చియుంటినో అవి యన్నియును, ఈ నా సామ్రాజ్యమంతయును, నేనును నేటినుండి నీయధీనమై యుందుము సుమా!

**శ్లో॥ విజిత్య పృథివీం సర్వాం నానానగరమాలినీమ్ ।**
**జనకాయ ప్రదాస్యామి తవ హేతో ర్విలాసిని ॥ 18**

**పదచ్ఛేదము** :– విజిత్య – పృథివీం – సర్వాం – నానానగరమాలినీం – జనకాయ – ప్రదాస్యామి – తవ – హేతోః – విలాసిని ॥

**అన్వయక్రమము** :– విలాసిని! నానానగరమాలినీం సర్వాం పృథివీం విజిత్య, తవ హేతోః జనకాయ ప్రదాస్యామి.

**ప్రతిపదార్థము** :– విలాసిని = ఓ సుందరాంగీ! నానానగరమాలినీం = బహువిధ పట్టణసమూహములతో, సర్వాం పృథివీం = భూమండలమునంతయు, విజిత్య = జయించి, తవ హేతోః = నీనిమిత్తమై, జనకాయ ప్రదాస్యామి =(నీతండ్రియైన) జనకున కొసగెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- తవ హేతోః = నీకు ప్రీతికలుగు నిమిత్తము.

**తాత్పర్యము** :- ఓ సుందరాంగీ! నీకు ప్రీతిని కూర్చుటకై కావలసినచో నే నిప్పుడే పోయి వివిధమహాపట్టణములతో కూడిన సమస్త భూమండలమును జయించి నీ జనకున కొసంగెదను.

**శ్లో॥ నేహ పశ్యామి లోకేఽన్యం యో మే ప్రతిబలో భవేత్ ।**
**పశ్య మే సుమహ ద్వీర్య మప్రతిద్వంద్వ మాహవే ॥ 19**

**పదచ్ఛేదము** :- న - ఇహ - పశ్యామి - లోకే - అన్యం - యః - మే - ప్రతిబలః - భవేత్ - పశ్య - మే - సుమహత్ - వీర్యమ్ - అప్రతిద్వంద్వమ్ - ఆహవే ॥

**అన్వయక్రమము** :- యః మే లోకే ప్రతిబలః భవేత్ (తం) అన్యమ్ ఇహ న పశ్యామి, ఆహవే అప్రతిద్వంద్వం మే సుమహద్ వీర్యం పశ్య.

**ప్రతిపదార్థము** :- యః = ఎవ్వడు, మే = నాకు, లోకే = లోకమునందు, ప్రతిబలః భవేత్ = ప్రతివీరుడుగా నుండగలడో, తమ్ అన్యం = అట్టి వేరొకనిని, ఇహ = ఈ భూమిపై, న పశ్యామి = చూడను, ఆహవే = యుద్ధమునందు, అప్రతిద్వంద్వం = ఎదురులేనట్టి, మే = నా యొక్క, సుమహత్ వీర్యం = మిక్కిలి గొప్పదైన పరాక్రమమును, పశ్య = చూడుము.

**తాత్పర్యము** :- నా కెదురు నిలచి యుద్ధము చేయగల వీరుడు లోకమునం దెక్కడను నాకు కాన్పింపలేదు. యుద్ధమునందు ఎదురు లేనట్టి నా పరాక్రమ మెట్టిదో నీవే తెలిసికొనుము.

**శ్లో॥ అసకృ త్సంయుగే భగ్నా మయా విమృదితధ్వజాః ।**
**అశక్తాః ప్రత్యనీకేషు స్థాతుం మమ సురాసురాః ॥ 20**

**పదచ్ఛేదము** :- అసకృత్ - సంయుగే - భగ్నాః - మయా - విమృదితధ్వజాః - అశక్తాః - ప్రత్యనీకేషు - స్థాతుం - మమ - సురాసురాః ॥

**అన్వయక్రమము** :- మమ సంయుగే, ప్రత్యనీకేషు స్థాతుమ్ అశక్తాః, సురాసురాః అసకృత్ మయా విమృదితధ్వజాః (సంతః) భగ్నాః.

**ప్రతిపదార్థము** :- మమ సంయుగే = నాయొక్క యుద్ధమునందు, ప్రత్యనీకేషు = విరోధిసైన్యమునందు, స్థాతుం = నిలచుటకు, అశక్తాః = శక్తిలేనివారై, సురాసురాః

= దేవతలును రాక్షసులును, అసకృత్ = పలుమారులు, మయా = నాచేత, విమృదిత ధ్వజాః (సంతః) = కూల్చబడిన ధ్వజములు గలవారై, భగ్నాః = భంగపాటునొందిరి.

**తాత్పర్యము :–** పెక్కు పర్యాయములు యుద్ధమునందు నా కెదురుగా శత్రుసైన్యము నందు నిలువలేక దేవతలును దానవులును గూడ తమతమ రథధ్వజములు నేలగూలగా వెన్నిచ్చి పారిపోయిరి.

**శ్లో॥ ఇచ్ఛయా క్రియతా మద్య ప్రతికర్మ త వోత్తమమ్ ।**
**సప్రభా ణ్యవసజ్యంతాం తవాంగే భూషణాని చ ॥ 21**

**పదచ్ఛేదము :–** ఇచ్ఛయా – క్రియతామ్ – అద్య – ప్రతికర్మ – తవ – ఉత్తమమ్; సప్రభాణి – అవసజ్యంతాం – తవ – అంగే – భూషణాని – చ ॥

**అన్వయక్రమము :–** ఇచ్ఛయా అద్య ఉత్తమం ప్రతికర్మ క్రియతామ్; తవ అంగే సప్రభాణి భూషణాని చ అవసజ్యంతామ్.

**ప్రతిపదార్థము :–** ఇచ్ఛయా = కోరికతో, అద్య = నేడు, తవ = నీకు, ఉత్తమం ప్రతికర్మ = మేలైన అలంకరణము, క్రియతాం = చేయబడుగాక! తవ అంగే = నీ శరీరమునందు, సప్రభాణి భూషణాని చ = గొప్ప ప్రకాశముగల ఆభరణములు గూడ, అవసజ్యంతామ్ = అలంకరింపబడుగాక!

"ఇచ్ఛయా"కు బదులుగా "ఇచ్ఛ మాం" అని బొంబాయి ముద్రణము. అనగా నన్ను కోరుకొనుము అని అర్థము.

**తాత్పర్యము :–** నేడు నీవు మనస్ఫూర్తిగా నీ ఒడలిని అలంకరించుకొనుము. నీ వంగీకరింపుము. నీ శరీరమును నా పరిచారికలు అలంకరింతురు. నీయొడలినిండ ధగధగమెఱయు ఆభరణములు ప్రకాశించుగాక!

**శ్లో॥ సాధు పశ్యామి తే రూపం సంయుక్తం ప్రతికర్మణా ।**
**ప్రతికర్మాభిసంయుక్తా దాక్షిణ్యేన వరాననే ।**
**భుఙ్క్ష్వ భోగా న్యథాకామం పిబ భీరు రమస్వ చ ॥ 22**

**పదచ్ఛేదము :–** సాధు – పశ్యామి – తే – రూపం – సంయుక్తం – ప్రతికర్మణా – ప్రతికర్మాభిసంయుక్తా – దాక్షిణ్యేన – వరాననే, భుఙ్క్ష్వ – భోగాన్ – యథాకామం – పిబ – భీరు – రమస్వ – చ ॥

**అన్వయక్రమము :–** తే సాధురూపం ప్రతికర్మణా సంయుక్తం పశ్యామి, వరాననే! దాక్షిణ్యేన ప్రతికర్మాభిసంయుక్తా (సతీ) యథాకామం, భోగాన్ భుంక్ష్వ; భీరుః పిబ,

రమస్వ చ.

**ప్రతిపదార్థము :–** తే = నీయొక్క, సాధురూపం = మేలైన రూపమును, ప్రతికర్మణా సంయుక్తం = అలంకరణములతో కూడినదానినిగా, పశ్యామి = చూచెదను; వరాననే = ఓ సుందరాంగీ! దాక్షిణ్యేన = దయతో, ప్రతికర్మాభిసంయుక్తా = అలంకరణములతో కూడినదానవై, యథాకామం = స్వేచ్ఛగా, భోగాన్ భుంక్ష్వ = భోగములను అనుభవింపుము, భీరు = భీతచిత్తురాలవైన ఓ జానకీ! పిబ = త్రాగుము, రమస్వ చ = మఱియు క్రీడింపుము.

**తాత్పర్యము :–** సుందరీ! నీరూపమును చక్కగా అలంకరించుకొనియుండగా, నాకు చూడవలెననియున్నది. ఓ కోమలీ! నాపై దయజూపి చక్కగా అలంకరించుకొని స్వేచ్ఛగా సకలభోగములను అనుభవింపుము. సుఖముగా త్రాగి క్రీడింపుము.

**శ్లో॥ యథేష్టం చ ప్రయచ్ఛ త్వం పృథివీం వా ధనాని చ ।**
**లలస్వ మయి విస్రబ్ధా ధృష్ట మాజ్ఞాపయస్వ చ ।**
**మత్ప్రసాదా ల్లలంత్యాశ్చ లలంతాం బాంధవా స్తవ ॥ 23**

**పదచ్ఛేదము :–** యథేష్టం – చ – ప్రయచ్ఛ – త్వం – పృథివీం – వా – ధనాని – చ – లలస్వ – మయి – విస్రబ్ధా – ధృష్టమ్ – ఆజ్ఞాపయస్వ – చ – మత్ప్రసాదాత్ – లలంత్యాః – చ – లలంతాం – బాంధవాః – తవ ॥

**అన్వయక్రమము :–** త్వం పృథివీం వా ధనాని చ యథేష్టం ప్రయచ్ఛ చ; విస్రబ్ధా, మయి లలస్వ, ధృష్టం ఆజ్ఞాపయస్వ చ; మత్ప్రసాదాత్ లలంత్యాః తవ బాంధవాః చ లలంతామ్.

**ప్రతిపదార్థము :–** త్వం = నీవు, పృథివీం వా = భూమిని గాని, ధనాని చ = ధనములను గాని, యథేష్టం = స్వేచ్ఛగా, ప్రయచ్ఛ చ = ఇచ్చుకొనుము, విస్రబ్ధా = (నాపై) నమ్మకము కలిగినదానివై, మయి = నాయందు, లలస్వ = ప్రేమకలిగి యుండుము, ధృష్టం = నిర్భయముగా, ఆజ్ఞాపయస్వ చ = ఆజ్ఞాపింపుము కూడ, మత్ప్రసాదాత్ = నా అనుగ్రహమువలన, తవ = నీవు, లలంత్యాః (సత్యాః) = సంతోషించుచున్నదాన వగుచుండగా, బాంధవాః చ = నీ బంధువులు గూడ, లలంతాం = సంతోషింతురు గాక!

**తాత్పర్యము :–** నాకు పట్టమహిషివై స్వేచ్ఛగా కావలసినన్ని భూములను, సంపదలను నీయిష్టము వచ్చినవారికి ఇచ్చుకొనుము. నాయందు నమ్మకముంచి, నన్ను ప్రేమింపుము. నా రాజ్యమున సమస్తమైన అధికారములును కల్గి ఎదురులేనిదానవై

నీ ఆజ్ఞను చెల్లించుకొనుము. నా అనుగ్రహము పొంది నీవు సంతోషించుచుండగా నిన్ను జూచి నీ బంధువు లెల్లరును సంతోషింతురు గాక!

**శ్లో॥ బుద్ధిం మ మానుపశ్య త్వం శ్రియం భద్రే యశశ్చ మే ॥ 24**

**పదచ్ఛేదము** :- బుద్ధిం - మమ - అనుపశ్య - త్వం - శ్రియం - భద్రే - యశః - చ - మే ॥

**అన్వయక్రమము** :- భద్రే! త్వం, మమ బుద్ధిం, మే శ్రియం యశశ్చ అనుపశ్య.

**ప్రతిపదార్థము** :- భద్రే! = ఓ మంగళస్వరూపురాలా! త్వం = నీవు, మమ = నా యొక్క, బుద్ధిం = సమృద్ధిని, మే = నా యొక్క, శ్రియం = ఐశ్వర్యమును, యశః చ = కీర్తిని కూడ, అనుపశ్య = తెలిసికొనుము.

**తాత్పర్యము** :- ఓ జానకీ! నా సంపదలను, నా ఐశ్వర్యమును, నా కీర్తిప్రతిష్ఠలను గూర్చి బాగుగా తెలిసికొనుము.

**శ్లో॥ కిం కరిష్యసి రామేణ సుభగే చీరవాససా ।**
**నిక్షిప్తవిజయో రామో గతశ్రీ ర్వనగోచరః ॥ 25**

**పదచ్ఛేదము** :- కిం - కరిష్యసి - రామేణ - సుభగే - చీరవాససా - నిక్షిప్తవిజయః - రామః - గతశ్రీః - వనగోచరః ॥

**అన్వయక్రమము** :- సుభగే! చీరవాససా రామేణ కిం కరిష్యసి? నిక్షిప్తవిజయః, గతశ్రీః రామః వనగోచరః (వర్తతే).

**ప్రతిపదార్థము** :- సుభగే! = ఓ సుందరాంగీ! చీరవాససా రామేణ = నారబట్టలు గట్టుకొన్న ఆ రామునితో, కిం కరిష్యసి = ఏమి చేయుదువు ? నిక్షిప్తవిజయః = తొలగిపోయిన విజయము గలవాడై, గతశ్రీః = నశించిన ఐశ్వర్యము గలవాడై, రామః = రాముడు, వనగోచరః (వర్తతే) = అడవులయందు తిరుగువాడుగా నున్నాడు.

**తాత్పర్యము** :- ఓ సుందరాంగీ! నారబట్టలు కట్టుకొని, అడవుల వెంబడిని తిరుగుచు, రాజ్యమును ఐశ్వర్యమును, పోగొట్టుకొన్న ఆ రాముడు నీకేమి సౌఖ్యమును కూర్పగలడు?

**శ్లో॥ వ్రతీ స్థండిలశాయీ చ శంకే జీవతి వా నవా ।**
**న హి వైదేహి రామ స్త్వాం ద్రష్టుం వా ప్యుపలప్స్యతే ।**
**పురోబలాకై రసితై ర్మేఘై ర్జ్యోత్స్నా మివావృతామ్ ॥ 26**

**పదచ్ఛేదము :–** వ్రతీ – స్థండిలశాయీ – చ – శంకే – జీవతి – వా – న – వా – న – హి – వైదేహి – రామః – త్వాం – ద్రష్టుం – వా – అపి – ఉపలప్స్యతే, పురోబలాకైః – అసితైః – మేఘైః – జ్యోత్స్యామ్ – ఇవ – ఆవృతామ్ ॥

**అన్వయక్రమము :–** వ్రతీ, స్థండిలశాయీ చ రామః జీవతి వా న వా (ఇతి) శంకే; వైదేహి! అసితైః, పురోబలాకైః, మేఘైః, ఆవృతాం, జ్యోత్స్నామ్ ఇవ, త్వాం ద్రష్టుం రామః న ఉపలప్స్యతే.

**ప్రతిపదార్థము :–** వైదేహి! = ఓ జానకీ!, వ్రతీ = వ్రతములను బూనియున్నవాడును, స్థండిలశాయీ చ = కటికినేలపై నిద్రించువాడునై, రామః = రాముడు, జీవతి వా న వా = బ్రతికియున్నాడో లేదో, (ఇతి = అని) శంకే = సందేహించు చున్నాను, పురోబలాకైః = ముందు బెగ్గురుపక్షులుగల, అసితైః మేఘైః = నల్లనివైన మబ్బులచే, ఆవృతాం = కప్పబడియున్న, జ్యోత్స్నామివ = వెన్నెలనువలె, త్వాం = నిన్ను, ద్రష్టుం వాపి = చూచుటకుకూడ, న ఉపలప్స్యతే = లభింపడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'ద్రష్టుం వాపి న ఉపలప్స్యతే' = చూచుటకు కూడ లభింపడు అనగా నిన్ను తీసికొని వెళ్ళుట అసంభవమే యని భావము.

**మహేశ్వరతీర్థులు :–** నేను జీవించియుండగా రాముడు నిన్ను తీసికొనివెళ్ళడు. అనగా నావధ జరిగినపిమ్మట రాముడు నిన్ను జూచి, తీసికొని వెళ్ళగలడు అని రావణుడు నిగూఢముగ తెలుపుచున్నాడు.

**తాత్పర్యము :–** ఓ జానకీ! వానప్రస్థవ్రతమును పూనినవాడై కటికినేలపై శయనించుచు జీవితమును గడుపుచున్న రాముడు ప్రస్తుతము జీవించియున్నాడో లేదో యని కూడ నాకు అనుమానము. దట్టమైన బెగ్గురుపక్షులతో గూడిన మబ్బులచే కప్పబడిన వెన్నెల చూచుటకు కనబడనట్లు, నిన్ను రాముడు చూచుటయే అసంభవము.

**శ్లో॥ న చాపి మమ హస్తా త్త్వాం ప్రాప్తు మర్హతి రాఘవః ।**
**హిరణ్యకశిపుః కీర్తి మింద్రహస్తగతామివ ॥ 27**

**పదచ్ఛేదము :–** న – చ – అపి – మమ – హస్తాత్ – త్వాం – ప్రాప్తుమ్ – అర్హతి – రాఘవః – హిరణ్యకశిపుః – కీర్తిమ్ – ఇంద్రహస్తగతామ్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** హిరణ్యకశిపుః ఇంద్రహస్తగతాం కీర్తిమ్ ఇవ, రాఘవః మమ హస్తాత్ త్వాం ప్రాప్తుం న అపి అర్హతి చ.

**ప్రతిపదార్థము** :- హిరణ్యకశిపుః = హిరణ్యకశిపుడు, ఇంద్రహస్తగతాం కీర్తిమ్ ఇవ = ఇంద్రుని చేతికి చిక్కిన కీర్తినివలె (భార్యను వలె), రాఘవః = రాముడు, మమ హస్తాత్ = నాచేతినుండి, త్వాం = నిన్ను, ప్రాప్తుం న అపి అర్హతి చ = పొందజాలడుకూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- "వ్యలుంపన్ రాజశిబిరం అమరా రాజ్యకాంక్షిణః, ఇంద్రస్తు రాజమహిషీం మాతరం మమ చాగ్రహీత్." అనగా, రాజ్యకాంక్షులైన దేవతలు మా రాజశిబిరమును ధ్వంసముచేసిరి. ఇంద్రుడు నా తల్లియైన రాజమహిషిని గొనిపోయెను. పిమ్మట నారదు డామెను హిరణ్యకశిపునికి అప్పగించెనని పూర్వగాథ.

**వాసుదాసస్వామి** :- ఇక్కడ కీర్తికారణమైన భార్యయని గ్రహించవలెను. భార్యాహరణము కీర్తిహరణమేగదా! హిరణ్యకశిపుని భార్యను ఇంద్రుడు హరింపగలిగెను గాని రాముడు నాచేత జిక్కిన నిన్ను మరల హరింపజాలడు. మరల రాముడు నిన్ను హరించెనేని నాకీర్తి హరించినట్లే. ఇంద్రుడు హిరణ్యకశిపుని భార్యను హరించి నారదాశ్రమమున నుంచెననియు మరల హిరణ్యకశిపుడు నారదుని మూలమున ఆమెను గ్రహించెననియు భాగవతమున గలదు. ఇది వైధర్మ్యదృష్టాంతము.

**తాత్పర్యము** :- పూర్వము ఇంద్రుని చేతికి చిక్కిన తన భార్యను హిరణ్యకశిపుడు నారదుని సహాయముతో తిరిగి సంపాదించుకొన్నట్లు, నిన్ను రాముడు తిరిగి సంపాదించుకొనునని ఆశించుచుంటివేమో, నా చేతులనుండి శ్రీరాముడు నిన్నెంత మాత్రమును తిరిగి సంపాదించుకొనలేడు సుమా!

**శ్లో॥ చారుస్మితే చారుదతి చారునేత్రే విలాసిని ।**
**మనో హరసి మే భీరు సుపర్ణః పన్నగం యథా ॥ 28**

**పదచ్ఛేదము** :- చారుస్మితే - చారుదతి - చారునేత్రే - విలాసిని - మనః - హరసి - మే - భీరు - సుపర్ణః - పన్నగం - యథా ॥

**అన్వయక్రమము** :- చారుస్మితే, చారుదతి, చారునేత్రే, విలాసిని, భీరు! సుపర్ణః పన్నగం యథా, (త్వం) మే మనః, హరసి.

**ప్రతిపదార్థము** :- చారుస్మితే = సుందరమైన చిరునగవు గలదానవును, చారుదతి = రమణీయమైన పలువరుస గలదానవును, చారునేత్రే = రమ్యమైన నేత్రములు గలదానవును, విలాసిని = విలాసములు గలదానవును, భీరు! = ఓ భీతచిత్తవైన

జానకీ!, సుపర్ణః = గరుత్మంతుడు, పన్నగం యథా = సర్పమునువలె, త్వం = నీవు, మే మనః = నా మనస్సును, హరసి = హరించుచున్నావు.

**తాత్పర్యము :–** మనోహరమైన చిరునగవు, సుందరమైన పలువరుస, విశాలనేత్రములు, దృష్టివిలాసములు కలిగి భయమును వెల్లడించుచున్న, ఓ జానకీ! గరుడపక్షి సర్పము నపహరించునట్లు నీవు నా హృదయమును అపహరించుచున్నావు సుమా!

**శ్లో॥ క్లిష్టకౌశేయవసనాం తన్వీ మ ప్యనలంకృతామ్ ।**
**త్వాం దృష్ట్వా స్వేషు దారేషు రతిం నోపలభా మ్యహమ్ ॥ 29**

**పదచ్ఛేదము :–** క్లిష్టకౌశేయవసనాం – తన్వీమ్ అపి – అనలంకృతామ్ – త్వాం – దృష్ట్వా – స్వేషు – దారేషు – రతిం – న – ఉపలభామి – అహమ్ ॥

**అన్వయక్రమము :–** క్లిష్టకౌశేయవసనామ్ అపి, తన్వీమపి అనలంకృతామపి, త్వాం దృష్ట్వా, స్వేషు దారేషు అహం రతిం న ఉపలభామి.

**ప్రతిపదార్థము :–** క్లిష్టకౌశేయవసనామ్ అపి = నలిగిపోయియున్న పట్టుచీరను ధరించిన దానవైనను, తన్వీమపి = కృశించినదానవైనను, అనలంకృతామపి = ఆభరణములు ధరింపనిదానవైయున్నను, త్వాం దృష్ట్వా = నిన్ను జూచి, అహం = నేను, స్వేషు దారేషు = నా భార్యలయందు, రతిం న ఉపలభామి = ఆసక్తిని చూపలేకున్నాను.

**తాత్పర్యము :–** జానకీ! నీవు నలిగిపోయిన పట్టుచీరను ధరించియుంటివి. మిక్కిలి కృశించియుంటివి. ఏ ఆభరణమును గూడ ధరింపకుంటివి. అటులయ్యును నిన్ను చూచుచుండగా, నాకు నా భార్యలమీద మనసు పోవుటలేదు.

**శ్లో॥ అంతఃపురనివాసిన్య స్స్త్రియ స్సర్వగుణాన్వితాః ।**
**యావంత్యో మమ సర్వాసా మైశ్వర్యం కురు జానకి ॥ 30**

**పదచ్ఛేదము :–** అంతఃపురనివాసిన్యః – స్త్రియః – సర్వగుణాన్వితాః – యావంత్యః – మమ – సర్వాసామ్ – ఐశ్వర్యం – కురు – జానకి ॥

**అన్వయక్రమము :–** జానకి! సర్వగుణాన్వితాః యావంత్యః అంతఃపురనివాసిన్యః స్త్రియః మమ (సంతి) (తాసాం) సర్వాసామ్ ఐశ్వర్యం కురు.

**ప్రతిపదార్థము :–** జానకి! = ఓ సీతా! సర్వగుణాన్వితాః = సమస్త సద్గుణములతో నిండియున్న, యావంత్యః = ఎంతమంది అయితే, అంతఃపురనివాసిన్యః స్త్రియః = అంతఃపురకాంతలు, (మమ) (సంతి = నాకున్నారో), తాసాం సర్వాసాం =

వారందరకును, ఐశ్వర్యం కురు = ఆధిపత్యమును వహింపుము.

**తాత్పర్యము** :- నా యంతఃపురమునందు సమస్తసద్గుణములతో వెలయుచున్నట్టి, సుందరీమణులు ఎంతమంది యున్నారో వారందరిపై కూడ నీవు ఆధిపత్యమును వహింపుము.

**శ్లో॥ మమ హ్యసితకేశాంతే త్రైలోక్యప్రవరా స్త్రియః ।**
**తా స్త్వాం పరిచరిష్యంతి శ్రియ మప్సరసో యథా ॥ 31**

**పదచ్ఛేదము** :- మమ - హి - అసితకేశాంతే - త్రైలోక్యప్రవరాః - స్త్రియః - తాః - త్వాం - పరిచరిష్యన్తి - శ్రియమ్ - అప్సరసః - యథా ॥

**అన్వయక్రమము** :- అసితకేశాంతే, త్రైలోక్యప్రవరాః తాః మమ స్త్రియః, శ్రియమ్ అప్సరసః యథా, త్వాం పరిచరిష్యన్తి.

**ప్రతిపదార్థము** :- అసితకేశాంతే = నల్లని కేశాగ్రములుగల ఓ జానకీ, త్రైలోక్య ప్రవరాః = త్రిభువనములయందును శ్రేష్ఠులైనట్టి, తాః మమ స్త్రియః = ఆ నా భార్యలు, శ్రియం = లక్ష్మీదేవిని, అప్సరసః యథా = అప్సరస్త్రీలవలె, త్వాం = నిన్ను, పరిచరిష్యన్తి = సేవించుచుండగలరు.

**తాత్పర్యము** :- ఓ సుందరాంగీ! ముల్లోకములందును శ్రేష్ఠు లనిపించుకొన్న నాయొక్క అంతఃపురస్త్రీలు ఎల్లరును, లక్ష్మీదేవిని అప్సరస్త్రీలు సేవించువిధముగా, నిన్ను చేరి పరిచర్యలు చేయగలరుసుమా!

**శ్లో॥ యాని వైశ్రవణే సుభ్రు రత్నాని చ ధనాని చ ।**
**తాని లోకాంశ్చ సుశ్రోణి మాం చ భుంక్ష్వ యథాసుఖమ్ ॥ 32**

**పదచ్ఛేదము** :- యాని - వైశ్రవణే - సుభ్రు - రత్నాని - చ - ధనాని - చ - తాని - లోకాన్ - చ - సుశ్రోణి - మాం - చ - భుంక్ష్వ - యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము** :- సుభ్రు! సుశ్రోణి! వైశ్రవణే, యాని రత్నాని, ధనాని చ (సంతి), తాని, లోకాంశ్చ, మాం చ, యథాసుఖం భుంక్ష్వ.

**ప్రతిపదార్థము** :- సుభ్రు = సుందరమైన కనుబొమ్మలుగలదానవును, సుశ్రోణి = మనోహరమైన కటిసీమగల దానవును అగు ఓ జానకీ! వైశ్రవణే = కుబేరుని అధీనము నందు, యాని రత్నాని చ = ఏ రత్నములును, ధనాని చ (సంతి) = సంపదలును గలవో, తాని = వానిని, లోకాంశ్చ = మరియు సమస్తలోకములను, మాం చ = నన్నునుకూడ, యథాసుఖం భుంక్ష్వ = తనివితీర అనుభవింపుము.

**తాత్పర్యము** :- ఓ సుందరాంగీ! కుబేరుని నవనిధులందు ఏ అపూర్వమైన రత్నములును, సంపదలును ఉన్నవో, వానినన్నింటిని, సమస్తలోకములందలి సంపదలను, నన్నును నా యైశ్వర్యమును గూడ నీ తనివిదీఱ సుఖముగ అనుభవించుము.

**శ్లో॥ న రామ స్తపసా దేవి న బలేన న విక్రమైః ।**
**న ధనేన మయా తుల్య స్తేజసా యశసాఽపి వా ॥ 33**

**పదచ్ఛేదము** :- న - రామః - తపసా - దేవి - న - బలేన - న - విక్రమైః - న - ధనేన - మయా - తుల్యః - తేజసా - యశసా - అపి - వా ॥

**అన్వయక్రమము** :- దేవి, రామః, తపసా మయా తుల్యః న; బలేన న; విక్రమైః న; ధనేన న; తేజసా న; యశసా అపి వా తుల్యః న.

**ప్రతిపదార్థము** :- దేవి = ఓ పూజ్యురాలా!, రామః = రాముడు, తపసా = తపస్సుచేత, మయా = నాతో, తుల్యః న = సమానుడు కాడు, బలేన న = శక్తిచేతను సమానుడు గాడు, విక్రమైః న = పరాక్రమములచేతను సమానుడు గాడు, ధనేన న = ఐశ్వర్యము చేతను సమానుడు గాడు. తేజసా న = ప్రతాపముచేతను సమానుడుగాడు. యశసా అపి వా న = కీర్తిచేతనుగూడ సమానుడు గాడు.

**తాత్పర్యము** :- సుందరీ! నీ భర్తయైన శ్రీరాముడు తపస్సునందుగాని, బలపరాక్రమము లందుగాని, ఐశ్వర్యమునందుగాని, ప్రతాపమునందుగాని కీర్తిప్రతిష్ఠలయందుగాని ఎందును గూడ నాకు సాటి కాజాలడు సుమా!

**శ్లో॥ పిబ విహర రమస్వ భుంక్ష్వ భోగాన్**
**ధననిచయం ప్రదిశామి మేదినీం చ ।**
**మయి లల లలనే యథాసుఖం త్వం**
**త్వయి చ సమేత్య లలంతు బాంధవా స్తే ॥ 34**

**పదచ్ఛేదము** :- పిబ - విహర - రమస్వ - భుంక్ష్వ - భోగాన్ - ధననిచయం - ప్రదిశామి - మేదినీం - చ - మయి - లల - లలనే - యథాసుఖం - త్వం - త్వయి - చ - సమేత్య - లలంతు - బాంధవాః - తే ॥

**అన్వయక్రమము** :- లలనే! ధననియం మేదినీం చ ప్రదిశామి; యథాసుఖం పిబ; విహర; రమస్వ; భోగాన్ భుంక్ష్వ; త్వం మయి లల; తే బాంధవాః సమేత్య త్వయి లలంతు.

**ప్రతిపదార్థము** :- లలనే = ఓ కామినీ! ధననిచయం = ఐశ్వర్యసమూహమును, మేదినీం చ = సమస్త సామ్రాజ్యమును, ప్రదిశామి = అర్పించెదను, యథాసుఖం = తనివితీరగా, పిబ = త్రాగుము, విహర = తిరుగుము, రమస్వ = క్రీడింపుము, భోగాన్ భుంక్ష్వ = భోగములను అనుభవింపుము, త్వం = నీవు, మయి లల = నాపై ప్రేమ గలిగి యుండుము. తే బాంధవాః చ = నీ బంధువులును, సమేత్య = చేరి, త్వయి లలంతు = నీయందు ప్రేమతో నుందురుగాక.

**తాత్పర్యము** :- సుందరీ! నీకు కావలసిన ధనరాశిని ఒసగెదను. రాజ్యము నంతయును నీకు అర్పించెదను. స్వేచ్ఛగా త్రాగుము, విహరింపుము, వినోదింపుము, సమస్త భోగములను అనుభవింపుము. ఇట్లు సుఖముగా నుండి నీవు నాపై ప్రేమను జూపుము. అప్పుడు నీ బంధువు లెల్లరును నీకడకు వచ్చి నీపై ప్రేమ చూపెదరు లెమ్ము.

**శ్లో॥ కుసుమితతరుజాలసంతతాని**
**భ్రమరయుతాని సముద్రతీరజాని ।**
**కనకవిమలహారభూషితాంగీ**
**విహర మయా సహ భీరు కాననాని ॥ 35**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"ప్రణయప్రార్థనా" నామ*
*వింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :- కుసుమితతరుజాలసంతతాని - భ్రమరయుతాని - సముద్రతీరజాని - కనకవిమలహారభూషితాంగీ - విహర - మయా - సహ - భీరు - కాననాని ॥

**అన్వయక్రమము** :- భీరు! సముద్రతీరజాని, భ్రమరయుతాని, కుసుమితతరుజాలసంతతాని కాననాని కనకవిమలహారభూషితాంగీ (సతీ) మయా సహ విహర.

**ప్రతిపదార్థము** :- భీరు! = భీతచిత్తురాలవైన ఓ జానకీ, సముద్రతీరజాని = సముద్రతీరమందున్నట్టివియును, భ్రమరయుతాని = తుమ్మెదలతో నిండియున్నట్టివియును, కుసుమితతరుజాలసంతతాని = పుష్పవృక్షముల సమూహములతో నిండినట్టివియునగు, కాననాని = వనములను, కనకవిమలహారభూషితాంగీ (సతీ) = సువర్ణ సుందరహారములతో అలంకరించుకొన్నదానవై, మయా సహ విహర = నాతో కూడి విహరింపుము.

**తాత్పర్యము** :- ఓ సుందరీ! నీవు సువర్ణరత్నహారములను ధరించి, సముద్రతీరము నందున్నట్టి సురభిళ పుష్పభరితములైన వృక్షములతో నిండియున్న వనములందు నాతో కలసి సుఖముగా విహరింపుము.

ఇది శ్రీమత్సుందరకాండమున

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకవింశసర్గ

**శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా సీతా రౌద్రస్య రక్షసః ।**
**ఆర్తా దీనస్వరా దీనం ప్రత్యువాచ శనై ర్వచః ॥ 1**

**పదచ్ఛేదము** :- తస్య - తత్ - వచనం - శ్రుత్వా - సీతా - రౌద్రస్య - రక్షసః - ఆర్తా - దీనస్వరా - దీనం - ప్రత్యువాచ - శనైః - వచః ॥

**అన్వయక్రమము** :- రౌద్రస్య తస్య రక్షసః తద్వచనం శ్రుత్వా ఆర్తా దీనస్వరా (చ సతీ) సీతా శనైః దీనం వచః ప్రత్యువాచ.

**ప్రతిపదార్థము** :- రౌద్రస్య తస్య రక్షసః = క్రూరుడైన ఆ రాక్షసునియొక్క, తద్వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, ఆర్తా దీనస్వరా (చ సతీ) = విషణ్ణురాలును, దీనమైన కంఠస్వరము గలదియు నగుచు, సీతా = సీతాదేవి, శనైః = మెల్లగా, దీనం వచః = దీనమైన వచనమును, ప్రత్యువాచ = జవాబుగా పలికెను.

**తాత్పర్యము** :- దుర్మార్గుడైన ఆ రాక్షసరాజు పలికిన ఆ మాటలను విని, సీతాదేవి మిక్కిలి విషాదమునొంది దీనమైన స్వరముతో మెల్లగా రావణునకు ఇట్లు జవాబు చెప్పెను.

**శ్లో॥ దుఃఖార్తా రుదతీ సీతా వేపమానా తపస్వినీ ।**
**చింతయంతీ వరారోహా పతిమేవ పతివ్రతా ।**
**తృణ మంతరతః కృత్వా ప్రత్యువాచ శుచిస్మితా ॥ 2**

**పదచ్ఛేదము** :- దుఃఖార్తా - రుదతీ - సీతా - వేపమానా - తపస్వినీ - చింతయంతీ - వరారోహా - పతిమ్ - ఏవ - పతివ్రతా - తృణమ్ - అంతరతః - కృత్వా - ప్రత్యువాచ - శుచిస్మితా ॥

**అన్వయక్రమము** :- దుఃఖార్తా, రుదతీ, వేపమానా, తపస్వినీ, వరారోహా, శుచిస్మితా, పతివ్రతా సీతా పతిమేవ చింతయంతీ తృణమ్ అంతరతః కృత్వా ప్రత్యువాచ.

**ప్రతిపదార్థము** :- దుఃఖార్తా = దుఃఖముచే ఆర్తురాలై యున్నదియును, రుదతీ =

విలపించుచున్నదియును, వేపమానా = కంపించుచున్నదియును, తపస్వినీ = దీనురాలును, వరారోహా = సుందరమైన కటిసీమగలదియును, శుచిస్మితా = స్వచ్ఛమైన చిఱునగవుగలదియును, పతివ్రతా = పతివ్రతయును అగు, సీతా = సీతాదేవి, పతిమేవ చింతయంతీ = భర్తను గూర్చియే చింతించుచు, తృణమ్ అంతరతః కృత్వా = గడ్డిపోచను నడుమ నుంచుకొని, ప్రత్యువాచ = జవాబు చెప్పెను.

**తాత్పర్యము** :- దుఃఖముచే పీడింపబడి శోకించుచు, దిగులుతో కంపించుచు, పతివ్రతయైనట్టి ఆ సీతాదేవి మనస్సునందు భర్తనే ధ్యానించుచు రావణుని నీచబుద్ధి తనకు ఈసడింపుతో కూడిన చిరునవ్వు కలిగించుచుండగా వానికిని తనకును నడుమ నొక గడ్డిపోచ నుంచి ఇట్లు జవాబు చెప్పదొడగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'తృణమ్ అంతరతః కృత్వా' - పరపురుషునితో ప్రత్యక్షముగా సంభాషించుట అనర్హము గనుక సీతమ్మ తృణమును వ్యవధానము చేసికొనెనని భావము. లేదా

నేలపై నేదేని అడ్డము నుంచుకొని మూత్రమును విసర్జించుట ఆచారమైనట్లుగా రావణుని ముఖమునకు తృణమును అడ్డముగ నుంచి సీతమ్మ జవాబు చెప్పుచున్నదని భావము.

'శుచిస్మితా' - రజస్తమోగుణముల విజృంభణముచే దుష్టబుద్ధియై యున్న ఈ దుర్మార్గునకు ఎట్టి దుర్బుద్ధి కలిగినది యని సీతకు చిరునగవు వచ్చినది! అని భావము. మఱియు

అంతటి రావణుని తృణీకరించి సీతాదేవి నిర్భయముగా జవాబు చెప్పినదని భావము.

**తనిశ్లోకీవ్యాఖ్యానము** :- 1) గడ్డిపోచవలె ఆతనిని నిర్లక్ష్యము చేయుచు, నేను చెప్పబోవు మాట వీనికి తృణప్రాయమే కాగలదు, అనుకొన్నదని భావము. లేదా -

2) తన దృష్టిపాతముచే ఆతడు మహాభాగ్యశాలి కావలసియుండును, కాబట్టి అట్లు గాకుండ సీతమ్మ తృణమునే చూచుచు పలికెనని భావము.
ఎట్లనగా -

**స శ్లాఘ్య స్స గుణీ ధన్య స్స కులీన స్స బుద్ధిమాన్ ।**
**స శూర స్స చ విక్రాంతో యం త్వం దేవి నిరీక్షసే ॥**

ఓ లక్ష్మీదేవి! నీవు ఎవ్వనిపై నీ దృష్టిని సారింతువో, అతడు శ్లాఘ్యు డగును; అతడే గుణవంతుడును అగును. అతడే ధన్యుడగును; అతడే మహోన్నతకుల జాతుడగును; అతడే బుద్ధిమంతుడగును; శూరుడగును, పరాక్రమవంతుడగును, అను నీ విషయము ప్రసిద్ధము కదా! లేదా –

3) శ్రీరామచంద్రుడు తృణమును గైకొని మున్ను కాకాసురుని పారద్రోలినట్లు ఈతడును ఇపుడు అట్టి గడ్డిపోచతోనే నిర్జింపదగినవాడు అని ఆమె భావము. లేదా –

4) సమీపమునందున్న ఈ దుర్జనునకు కొద్ది వ్యవధానముండుట ఉచితమని భావము. లేదా –

5) నీవు పశుసమానుడవు గనుక నీ కిదే ఉచితపదార్థము అని భావము. లేదా–

6) రామవిరోధముచే నీవు సపరివారముగా నశింతువని ఈ తృణమును ఛేదించుచు నీకు తెలుపుచున్నాను అని భావము.

**వాసుదాసస్వామి :–** 1) వీడు తనయందు దుష్టభావము గలవా డయినను ప్రభువు, క్షత్రియుడు. ఇట్టి వీడు తన యొద్దకు వచ్చినపుడు అతిథి వంటివాడే. ఆ యతిథికి ఆసనమో అన్నమో నీరో యథాశక్తిగ నీయవలయును, 'ఆసనం చాన్న ముదకం దేయం' అని శాస్త్రవాక్యము గలదు గదా, కావున అప్పటికి తనకు లభించిన ఆ తృణమునే అట్లు ఆసనముగా త్రుంచివైచెనని భావము.

2) అలకాపురి మరియు లోకమున గల రత్నాభరణముల నన్నింటి నిచ్చెద నంటివే! అవియును, నీయొక్క ఐశ్వర్య మంతయును, నాకు ఈ తృణముతో సమానము సుమా! అని తెలుపుటకు గాను గడ్డిపోచ నెదురుగ వైచెనని భావము.

3) ఎంతటి శత్రువైనను గడ్డిపోచ తన నోట గరచుకొన్నచో వానిని వీరులు చంపరు. కావున నీవు బ్రతుకగోరెదవేని దీనిని నీనోట గరచుకొని రామునియొద్దకు బొమ్ము. ఆ కరుణాకాకుత్థ్సుడు నిన్ను రక్షించును. లేకుండిన అతడు నిన్ను చంపుట తథ్యము అని భావము.

4) నన్ను నీవు బాధించితివా, హిరణ్యకశిపునిచే బాధపడు ప్రహ్లాదుని రక్షించుటకై స్తంభమునుండి నృసింహమూర్తి ఉద్భవించినట్లే ఈ తృణమునందు శ్రీరామమూర్తి ఉద్భవించి నిన్నిచ్చటనే సంహరించును అని భావము.

5) నా అవయవములందు నీ దృష్టి నిలచి మరలుట లేదని యంటివి, నీ దృష్టి మరలక అంతటితోనే హతమగునట్లు పూర్వము వామనుడు శుక్రాచార్యుని కన్ను దర్భతో పొడిచినట్లుగా నీ కన్నులు పొడిచెదను అని భావము.

6) నీవు రాముని గెలిచెద నంటివి. రామచంద్రమూర్తి విడిచిన ఆ దర్భను బ్రహ్మరుద్రేంద్రాదులును మరలింపలేకపోయిరి. అట్టివానిని నీవేమి చేయగలవు అని భావము.

7) ఈ తృణమును త్రుంచునట్లు నీ పదితలలను త్రుంచెదను సుమీ యని సూచింప గోరుచు సీతమ్మ తృణమును త్రుంచివైచెను అని భావము.

8) పతివ్రతల కోపదృష్టి కోపింపజేసినవారిని దహించును. దమయంతి ఎరుకలవానిని దహించెను; గాంధారియొక్క చూపు ధర్మరాజు పదనఖముల పైబడి అవి కమిలిపోయెను. – (భారతము – స్త్రీపర్వము – 1అ. 176 శ్లో)

అట్లే వీడును తన దృష్టి పడెనా, భస్మమగును. అట్లు వానిని ఒక్కనిని మాత్రమే భస్మముచేయుట తనకు సమ్మతము కాదు. (ఈతడు విష్ణుమందిర ద్వారపాలకులగు జయవిజయుల లోనివాడు గదా) వీడు పరస్త్రీహరణము తన కులధర్మమని చెప్పెను. అందుచేత అట్టి కులమునే నిర్మూలింపవలెను. గాని కేవల మొకవ్యక్తిని మాత్రము నిర్దహించిన లాభ మేమి యని తలచి వాడు దగ్ధుడు కాకుండుటకై సీతమ్మ తృణమును అడ్డముగ వైచెను అని భావము.

9) నీవు నాకు కోపము వచ్చునట్లు చేసితివేని నా కోపాగ్నికి నీవు తృణప్రాయము సుమా! కావున నాకు కోపము వచ్చునట్లు చేయకుము. అని భావము.

“శుచిస్మితా” – పాము తనను మ్రింగుచుండగా తాను గండుచీమను మ్రింగబోవునట్టి కప్పవలె, తనను మృత్యుదేవత వాతవేసికొనుచుండుట ఎరుగలేక రావణుడు తన్ను ఆశించుచున్నాడే! వీ డెంతటి మూర్ఖుడని సీతమ్మ నవ్వెను అని భావము.

రఘురాముడు బలపరాక్రమంబుల నాకు సరిగాడని యంటివే! దానికి సమాధానము వినుము – ఆ మహావీరుడు “ధన్వినాం రామః” అని ప్రసిద్ధి నొంది నట్టివాడు. ఆతడు ఆశ్రమమున లేనప్పుడుగదా నన్ను తెచ్చితివి. అట్టి పిరికిపందవు చాటున ఆడువారిముందు నీవు దంభములు పలికెదవే! యని సీతమ్మ నవ్వెను అని భావము.

ఈ నవ్వు సామాన్యమైన నవ్వుగాదు.

'శుచిస్మిత' అనగా అగ్నిహోత్రమువంటి నవ్వు, అదియే వానిని నాశనము చేయగలదు. (శుచి అనగా అగ్ని అని అర్థము).

**శ్లో॥ నివర్తయ మనో మత్త స్స్వజనే క్రియతాం మనః ।**
**న మాం ప్రార్థయితుం యుక్తం సుసిద్ధిమివ పాపకృత్ ॥ 3**

**పదచ్ఛేదము** :- నివర్తయ - మనః - మత్తః - స్వజనే - క్రియతాం - మనః - న - మాం - ప్రార్థయితుం - యుక్తం - సుసిద్ధిమ్ - ఇవ - పాపకృత్ ॥

**అన్వయక్రమము** :- మత్తః మనః నివర్తయ; స్వజనే మనః క్రియతామ్; పాపకృత్ సుసిద్ధిమ్ ఇవ (త్వం) మాం ప్రార్థయితుం న యుక్తమ్.

**ప్రతిపదార్థము** :- మత్తః = నానుండి, మనః నివర్తయ = మనస్సును మరలించు కొనుము; స్వజనే = నీ భార్యలయందు, మనః క్రియతాం = మనస్సును నిల్పుకొనుము, పాపకృత్ = పాపాత్ముడు, సుసిద్ధిమ్ ఇవ = ఉత్తమమైన కార్యసిద్ధినివలె, త్వం = నీవు, మాం ప్రార్థయితుం న యుక్తమ్ = నన్ను కోరుకొనుట తగదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయి ముద్రణము** :- 'మనః క్రియతాం' అనుదానికి బదులుగా 'మనః ప్రీయతాం' అని గలదు. అనగా మనస్సు ప్రీతినొందుగాక.

**తిలకము** :- 'సుసిద్ధి' = అనగా బ్రహ్మలోకప్రాప్తి.

**శ్రీ భాష్యం అప్పలాచార్యస్వామి** :- "మనః నివర్తయ". "మనః" అనుదానిని అనగా మనశ్శబ్దమును తిరుగవేసిన "నమః" అగును అనగా నాది కాదు అని భావము. దానిని పెంపొందించుకొనుము అని భావము.

**తాత్పర్యము** :- నీ మనస్సును నానుండి మరలించుకొనుము. నీ భార్యలందే మనస్సు నిల్పి సంతోషము నొందుము. పాపాచరణపరుడు ఉత్తమగతిని పొందలేనట్లు నీవు నన్ను కోరుటకే తగదు.

**శ్లో॥ అకార్యం న మయా కార్య మేకపత్న్యా విగర్హితమ్ ।**
**కులం సంప్రాప్తయా పుణ్యం కులే మహతి జాతయా ॥ 4**

**పదచ్ఛేదము** :- అకార్యం - న - మయా - కార్యమ్ - ఏకపత్న్యా - విగర్హితమ్, కులం - సంప్రాప్తయా - పుణ్యం - కులే - మహతి - జాతయా ॥

**అన్వయక్రమము :–** ఏకపత్న్యా మహతి కులే జాతయా పుణ్యం కులం సంప్రాప్తయా మయా విగర్హితమ్ అకార్యం న కార్యమ్.

**ప్రతిపదార్థము :–** మహతి కులే జాతయా = గొప్పదైన కులమునందు జన్మించినట్టియు, పుణ్యం కులం సంప్రాప్తయా = పవిత్రమైన వంశమును పొందినట్టియు, ఏకపత్న్యా = పతివ్రతయైనట్టియు, మయా = నాచేత, విగర్హితం = నింద్యమైనట్టి, అకార్యం = పాపకృత్యము, న కార్యమ్ = చేయదగినది గాదు.

**తాత్పర్యము :–** ఉన్నతమైన వంశమునందు జన్మించి, పవిత్రమైన వంశమునందలి భర్తను పొందినట్టి పతివ్రతనైన నేను పెద్దలు నిందించునట్టి పాపకృత్యమును తలపెట్టజాలను.

**శ్లో॥ ఏవ ముక్త్వా తు వైదేహీ రావణం తం యశస్వినీ ।**
**రాక్షసం పృష్ఠతః కృత్వా భూయో వచన మబ్రవీత్ ॥ 5**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్త్వా – తు – వైదేహీ – రావణం – తం – యశస్వినీ – రాక్షసం – పృష్ఠతః – కృత్వా – భూయః – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** యశస్వినీ వైదేహీ రావణమ్ ఏవమ్ ఉక్త్వా తం రాక్షసం పృష్ఠతః కృత్వా, భూయః వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** యశస్వినీ వైదేహీ = కీర్తిసంపన్నురాలైన సీతాదేవి, రావణమ్ ఏవమ్ ఉక్త్వా = రావణుని గూర్చి ఇట్లు పలికి, తం రాక్షసం = ఆ రాక్షసుని, పృష్ఠతః కృత్వా = వెనుక చేసి, భూయః = తిరిగి, వచనం = మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** సీతాదేవి రావణునితో ఇట్లు పలికి వెంటనే వెనుకకు తిరిగి, మరల ఆ రాక్షసునిగూర్చి ఈ రీతిగా చెప్పదొడగెను.

**శ్లో॥ నాహ మౌపయికీ భార్యా పరభార్యా సతీ తవ ।**
**సాధు ధర్మ మవేక్షస్వ సాధు సాధువ్రతం చర ॥ 6**

**పదచ్ఛేదము :–** న – అహం – ఔపయికీ – భార్యా – పరభార్యా – సతీ – తవ – సాధు – ధర్మమ్ – అవేక్షస్వ – సాధు – సాధువ్రతం – చర ॥

**అన్వయక్రమము :–** పరభార్యా సతీ, అహం తవ ఔపయికీ భార్యా న (భవామి.) సాధుధర్మం సాధు అవేక్షస్వ; సాధువ్రతం సాధు చర.

**ప్రతిపదార్థము :–** పరభార్యా సతీ = ఇతరుని భార్యనైయున్నదాననై, అహం = నేను,

తవ = నీకు, ఔపయికీ భార్యా న (భవామి) = యుక్తమైన భార్యను కాజాలను, సాధు ధర్మం = సత్పురుషుల ధర్మమును, సాధు అవేక్షస్వ = చక్కగా గ్రహింపుము, సాధువ్రతం = సత్పురుషుల నియమమును, సాధు చర = చక్కగా ఆచరించుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** 'నాహం తవ భార్యా' = నేను నీకు భరింపదగినదానను గాను, పరభార్యా = శ్రేష్ఠుడైన రామునిచే మాత్రమే భరింపదగినదానను, అని రహస్యార్థము.

**తాత్పర్యము :–** పరుని భార్యనైన నేను నీకు యోగ్యమైన భార్య నెట్లగుదును? సత్పురుషుల ధర్మము చక్కగా గ్రహించి సత్పురుషుల నియమములను చక్కగా పాటించుట నేర్చుకొనుము.

**శ్లో॥ యథా తవ తథాఽన్యేషాం దారా రక్ష్యా నిశాచర ।**
**ఆత్మాన ముపమాం కృత్వా స్వేషు దారేషు రమ్యతామ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** యథా – తవ – తథా – అన్యేషాం – దారాః – రక్ష్యాః – నిశాచర – ఆత్మానమ్ – ఉపమాం – కృత్వా – స్వేషు – దారేషు – రమ్యతామ్ ॥

**అన్వయక్రమము :–** నిశాచర! యథా తవ భార్యాః రక్ష్యాః, తథా అన్యేషాం దారాః చ తవ రక్ష్యాః; ఆత్మానమ్ ఉపమాం కృత్వా, స్వేషు దారేషు రమ్యతామ్.

**ప్రతిపదార్థము :–** నిశాచర! = ఓ రాక్షసుడా! యథా = ఏరీతిగా, తవ దారాః = నీ భార్యలు, రక్ష్యాః = రక్షించుకొనదగియున్నారో, తథా = ఆ రీతిగా, అన్యేషాం దారాః చ = ఇతరుల భార్యలును, తవ = నీకు, రక్ష్యాః = రక్షింపదగినవారే, ఆత్మానమ్ ఉపమాం కృత్వా = నిన్ను (నీవు) ఉదాహరణముగా చేసికొని, స్వేషు దారేషు = నీ భార్యలయందే, రమ్యతాం = విహరింపబడుగాక.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** నీ భార్యలకు నీయందే ప్రీతియుండవలెనని నీకు ఎట్లు కోరికయుండునో, అట్లే పరులకును అట్టి కోరిక యుండునుగదా!

**మహేశ్వరతీర్థులు :–** నీకు నీభార్యలు పవిత్రులుగా నుండవలెనని కోరికయున్నట్లే, ఆత్మదృష్టాంతముతో పరదారానిస్పృహుడవై స్వదారనిరతుడ వగుము.

**తాత్పర్యము :–** నీ కోరికను నీ నిశ్చయమును పోలికగా చేసికొని, నీభార్యల శీల మెట్లు రక్షింపబడవలెనని నీవు కోరుదువో అట్లే పరుల భార్యల శీలమును గూడ

నీవు కాపాడ వలసియున్నది సుమా!

**శ్లో॥ అతుష్టం స్వేషు దారేషు చపలం చలితేంద్రియమ్ ।**
**నయంతి నికృతిప్రజ్ఞం పరదారాః పరాభవమ్ ॥ 8**

**పదచ్ఛేదము** :– అతుష్టం – స్వేషు – దారేషు – చపలం – చలితేంద్రియమ్, నయంతి – నికృతిప్రజ్ఞం – పరదారాః – పరాభవమ్ ॥

**అన్వయక్రమము** :– స్వేషు దారేషు అతుష్టం, చపలం, చలితేంద్రియం, నికృతిప్రజ్ఞం, పరదారాః పరాభవం నయంతి.

**ప్రతిపదార్థము** :– స్వేషు దారేషు అతుష్టం = తనభార్యలయందు తృప్తిని బొందనివాడును, చపలం = చాపల్యము గలవాడును, చలితేంద్రియం = చలించిపోవు ఇంద్రియములు గలవాడును, నికృతిప్రజ్ఞం = నింద్యమైన ప్రజ్ఞగలవాడును అగువానిని, పరదారాః = పరస్త్రీలు, పరాభవం నయంతి = అవమానము పాలుచేయుదురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'పరాభవం' = ఆయురైశ్వర్యాదిక్షయ రూపమైన పరాభవము.

**రామాయణ శిరోమణి** :– 'పరదారాః' – అనగా పరభార్యలను వంచించినట్టి దోషము.

**తాత్పర్యము** :– తనభార్యలయందు తృప్తినొందక ఇంద్రియలోలుడై, చపల స్వభావము కలిగినట్టి నింద్యమైన ప్రజ్ఞగల పాపాత్ముడు చేసిన పరదారలను మోసగించుట అను ఆ దోషము వాని ఆయురైశ్వర్యాదులను క్షీణింప జేసి నశింపజేయును.

**శ్లో॥ ఇహ సంతో న వా సంతి సతో వా నానువర్తసే ।**
**తథా హి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా ॥ 9**

**పదచ్ఛేదము** :– ఇహ – సంతః – న – వా – సంతి – సతః – వా – న – అనువర్తసే? తథా – హి – విపరీతా – తే – బుద్ధిః – ఆచారవర్జితా ॥

**అన్వయక్రమము** :– ఇహ సంతః న సంతి వా? సతః న అనువర్తసే వా? తథాహి, తే విపరీతా బుద్ధిః ఆచారవర్జితా.

**ప్రతిపదార్థము** :– ఇహ = ఇచట (ఈ రాజ్యమున), సంతః = సత్పురుషులైనవారు, న సంతి వా = లేనే లేరా! సతః = ఉన్నవారిని, న అనువర్తసే వా = నీవు అనుసరింపవా! తథా హి = అది స్పష్టమే! తే బుద్ధిః = నీ బుద్ధి, విపరీతా = విపరీతమైనదిగను, ఆచారవర్జితా = సదాచారమును విడచినదిగను, (స్థితా = ఉన్నది).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- సతః న వా - విభీషణుడు మున్నగువారున్నారు గనుక లేరని చెప్పుటకు వీలులేదు.

**తిలకము** :- సంతః - ఇహలోక పరలోక హితమును బోధించు సత్పురుషులు.

**తాత్పర్యము** :- నీ లంకారాజ్యమునందు మంచిచెడ్డలను బోధించు పెద్దలెవ్వరును లేరా! అట్టివారున్నను నీవు వారిని సేవించి, సదాచారమును కోరి తెలిసికొనుటలేదా! విరుద్ధమైన కోరికలతో సదాచారమును విడిచినట్టి నీ ప్రవర్తన వలననే, నీవు అట్టి సత్పురుషులసేవ చేయలేదని స్పష్టముగ తెలియుచున్నది.

**శ్లో॥ వచో మిథ్యాప్రణీతాత్మా పథ్య ముక్తం విచక్షణైః ।**
**రాక్షసానా మభావాయ త్వం వా న ప్రతిపద్యసే ॥ 10**

**పదచ్ఛేదము** :- వచః - మిథ్యాప్రణీతాత్మా - పథ్యమ్ - ఉక్తం - విచక్షణైః - రాక్షసానామ్ - అభావాయ - త్వం - వా - న - ప్రతిపద్యసే ॥

**అన్వయక్రమము** :- మిథ్యాప్రణీతాత్మా, విచక్షణైః ఉక్తం పథ్యం వచః రాక్షసానాం అభావాయ, త్వం న ప్రతిపద్యసే వా.

**ప్రతిపదార్థము** :- మిథ్యాప్రణీతాత్మా = మిథ్యావినయము గల స్వభావము గలవాడవై, విచక్షణైః ఉక్తం = పెద్దలచే చెప్పబడినట్టి, పథ్యం వచః = శ్రేయస్కరమైన మాటలను, రాక్షసానామ్ అభావాయ = రాక్షసకులవినాశనము కొరకై, త్వం = నీవు, న ప్రతిపద్యసే వా = అనుసరించుట లేదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- మిథ్యాప్రణీతాత్మా రాక్షసానా మభావాయ పథ్యం వచః న ప్రతిపద్యసే - రాక్షసులపై కపటప్రేమను ప్రకటించుచు మనస్సునందు మాత్రము వారి వినాశనమునే కోరి పెద్దలమాటను పెడచెవిని పెట్టుచున్నావని భావము.

**తాత్పర్యము** :- నీ భావిహితము నాలోచించి పెద్దలు చెప్పిన హితవచనములను, మిథ్యావినయములను ప్రదర్శించుచు, నీ రాక్షసవంశమునకు వినాశనము తెచ్చుకొనుచు నీవే పెడచెవిని పెట్టుచున్నావేమో!

**శ్లో॥ అకృతాత్మాన మాసాద్య రాజాన మనయే రతమ్ ।**
**సమృద్ధాని వినశ్యంతి రాష్ట్రాణి నగరాణి చ ॥ 11**

**పదచ్ఛేదము** :- అకృతాత్మానమ్ - ఆసాద్య - రాజానమ్ - అనయే - రతమ్, సమృద్ధాని - వినశ్యంతి - రాష్ట్రాణి - నగరాణి - చ ॥

**అన్వయక్రమము** :- అనయే రతమ్ అకృతాత్మానం రాజానమ్ ఆసాద్య సమృద్ధాని నగరాణి రాష్ట్రాణి చ వినశ్యంతి.

**ప్రతిపదార్థము** :- అనయే రతం = అవినీతియందు ఆసక్తుడైన, అకృతాత్మానం = మూర్ఖుడైనట్టి, రాజానం = ప్రభువును, ఆసాద్య = పొంది, సమృద్ధాని = ఐశ్వర్యవంతము లైనట్టి, నగరాణి = పట్టణములును, రాష్ట్రాణి చ = రాష్ట్రములునుగూడ, వినశ్యంతి = వినాశమునొందును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- అకృతాత్మా = సదుపదేశమును గ్రహింపలేని మందబుద్ధి గలవాడు.

**తాత్పర్యము** :- అవినీతికి అలవాటుపడినవాడై చెడునడతతో కూడియున్నట్టి ప్రభువు నాశ్రయించిన నగరములును, రాష్ట్రములును, తమ పూర్వపు ఐశ్వర్యమును క్షీణింప చేసికొని క్రమముగా పూర్తిగా నాశనము నొందును.

**శ్లో॥ తథేయం త్వాం సమాసాద్య లంకా రత్నౌఘసంకులా ।**
**అపరాధా త్తవైకస్య నచిరా ద్వినశిష్యతి ॥ 12**

**పదచ్ఛేదము** :- తథా - ఇయం - త్వాం - సమాసాద్య - లంకా - రత్నౌఘసంకులా - అపరాధాత్ - తవ - ఏకస్య - నచిరాత్ - వినశిష్యతి ॥

**అన్వయక్రమము** :- తథా ఇయం రత్నౌఘసంకులా లంకా, త్వాం సమాసాద్య తవ ఏకస్య అపరాధాత్, నచిరాత్ వినశిష్యతి.

**ప్రతిపదార్థము** :- తథా = ఆ రీతిగనే, రత్నౌఘసంకులా = అమూల్యమైన సంపదలతో నిండిన, ఇయం లంకా = ఈ లంకారాజ్యము, త్వాం సమాసాద్య = నిన్ను చేరి, తవ ఏకస్య అపరాధాత్ = నీ ఒక్కని అపరాధమువలన, నచిరాత్ = స్వల్పకాలములోనే, వినశిష్యతి = నశించిపోగలదు.

**తాత్పర్యము** :- అట్లే మహాసంపదలకు నిలయమైయున్న ఈ లంకారాజ్యమంతయు ఈనాటికి నిన్ను చేరి నీ వొక్కడవు చేసిన అపరాధమువలన అచిరకాలములోనే సర్వనాశనము కాబోవుచున్నది సుమా!

**శ్లో॥ స్వకృతై ర్హన్యమానస్య రావణాదీర్ఘదర్శినః ।**
**అభినందంతి భూతాని వినాశే పాపకర్మణః ॥ 13**

**పదచ్ఛేదము :–** స్వకృతైః – హన్యమానస్య – రావణ – అదీర్ఘదర్శినః – అభినందంతి – భూతాని – వినాశే – పాపకర్మణః ॥

**అన్వయక్రమము :–** రావణ! స్వకృతైః హన్యమానస్య, అదీర్ఘదర్శినః పాపకర్మణః వినాశే (సతి) భూతాని అభినందంతి.

**ప్రతిపదార్థము :–** రావణ = ఓ రావణాసురుడా, అదీర్ఘదర్శినః = దూరదృష్టిలేనివాడై, స్వకృతైః హన్యమానస్య = తన కృత్యములచేతనే చెడిపోవుచున్నట్టి, పాపకర్మణః = పాపకృత్యములు చేయు వానియొక్క, వినాశే (సతి) = వినాశనము జరిగినప్పుడు, భూతాని = సమస్తప్రాణులును, అభినందంతి = ఆనందింతురు.

**తాత్పర్యము :–** ఓ రావణా! భావికాలమున కలుగునట్టి మంచి చెడ్డలను గ్రహింపలేక తన దుష్టచేష్టలచేతనే తాను చెడిపోవుచున్న ఆ పాపకర్ముడు వినాశము నొంది కడతేరగా, సమస్తప్రాణులును ఎంతయో సంతోషింతురు గాని విచారించువా రెవ్వరు నుండరు.

**శ్లో॥ ఏవం త్వాం పాపకర్మాణం వక్ష్యంతి నికృతా జనాః ।**
**దిష్ట్యైత ద్వ్యసనం ప్రాప్తో రౌద్ర ఇత్యేవ హర్షితాః ॥ 14**

**పదచ్ఛేదము :–** ఏవం – త్వాం – పాపకర్మాణం – వక్ష్యంతి – నికృతాః – జనాః, దిష్ట్యా – ఏతత్ – వ్యసనం – ప్రాప్తః – రౌద్రః – ఇతి – ఏవ – హర్షితాః ॥

**అన్వయక్రమము :–** ఏవం నికృతాః జనాః పాపకర్మాణం త్వాం, రౌద్రః దిష్ట్యా ఏతత్ వ్యసనం ప్రాప్తః ఇత్యేవ హర్షితాః వక్ష్యంతి.

**ప్రతిపదార్థము :–** ఏవం = ఈ రీతిగా, నికృతాః జనాః = అవమానింపబడిన జనులు, పాపకర్మాణం త్వాం = పాపాచరణుడవైన నిన్ను గురించి, రౌద్రః = దుర్మార్గుడు, దిష్ట్యా = అదృష్టవశముచే, ఏతత్ వ్యసనం = ఈ వినాశమును, ప్రాప్తః = పొందియున్నాడు, ఇత్యేవ = అనియే, హర్షితాః = సంతోషించినవారై, వక్ష్యంతి = చెప్పుదురు.

**తాత్పర్యము :–** ఆ విధముగా వినాశమునొందునట్టి పాపకర్ముడవైన నిన్నుజూచి నీచే అవమానింపబడినట్టి జనులెల్లరును ఈ దుర్మార్గుడు మన అదృష్టవశముచేతనే ఇట్టి నాశము నొందినాడు అని మహానందముతో చెప్పుకొందురు.

**శ్లో॥ శక్యా లోభయితుం నాహ మైశ్వర్యేణ ధనేన వా ।**
**అనన్యా రాఘవే ణాహం భాస్కరేణ ప్రభా యథా ॥ 15**

**పదచ్ఛేదము :-** శక్యా – లోభయితుం – న – అహమ్ – ఐశ్వర్యేణ – ధనేన – వా – అనన్యా – రాఘవేణ – అహం – భాస్కరేణ – ప్రభా – యథా ॥

**అన్వయక్రమము :-** ఐశ్వర్యేణ, ధనేన వా అహం లోభయితుం న శక్యా; భాస్కరేణ ప్రభా యథా, అహం రాఘవేణ అనన్యా.

**ప్రతిపదార్థము :-** ఐశ్వర్యేణ = అధికారముచేతగాని, ధనేన వా = సంపదచేతగాని, అహం = నేను, లోభయితుం = ప్రలోభపెట్టుటకు, న శక్యా = శక్యమైనదానను గాను, భాస్కరేణ = సూర్యునితో, ప్రభా యథా = ప్రకాశమువలెనే, రాఘవేణ = శ్రీరామునితో, అహం = నేను, అనన్యా = వేఱుకానిదానను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** ఐశ్వర్యేణ = అంతఃపురస్త్రీల ఆధిపత్యముచేతను, ధనేన = ఆభరణములు మున్నగు సంపదలచేతను.

రాఘవేణ అనన్యా = మహావిష్ణు వేయే రూపముతో ఎచ్చటెచ్చట అవతరించు చుండునో అచ్చటచ్చట లక్ష్మీదేవికూడ అవతరించుచునేయుండునని భావము.

భాస్కరేణ ప్రభా యథా = సూర్యునికంటెను సూర్యప్రకాశ మధికమైనట్లు తనయొక్క ఆధిక్యమును సీతమ్మ ఇచ్చట చక్కగా వెల్లడించినది.

ఆ కారణముచేతనే 'అప్రమేయం హి తత్ తేజః యస్య సా జనకాత్మజా' అని వెనుక మారీచుని హితవచనములందు తెలుపబడినట్టి, సీతతో కూడిన రాముని యొక్క తేజోతిశయము ఇచ్చట జ్ఞాపకము చేయబడుచున్నది.

**తాత్పర్యము :-** ఐశ్వర్యమును జూపిగాని, వివిధ సంపదలను చూపిగాని, నన్ను లోభపెట్టుట సాధ్యము కాదు సుమా! సూర్యునితో అతని ప్రకాశమును వేఱుచేయుట అసాధ్యమైనట్లు, నన్ను శ్రీరామునినుండి వేఱుచేయుట సాధ్యము గాని కార్యమని తెలిసికొనుము.

**శ్లో॥ ఉపధాయ భుజం తస్య లోకనాథస్య సత్కృతమ్ ।**
**కథం నామోపధాస్యామి భుజ మన్యస్య కస్యచిత్ ॥ 16**

**పదచ్ఛేదము :-** ఉపధాయ – భుజం – తస్య – లోకనాథస్య – సత్కృతమ్ – కథం

- నామ - ఉపధాస్యామి - భుజమ్ - అన్యస్య - కస్య - చిత్ ॥

**అన్వయక్రమము :-** లోకనాథస్య తస్య సత్కృతం భుజమ్ ఉపధాయ, అన్యస్య కస్యచిత్ భుజం, కథం నామ ఉపధాస్యామి?

**ప్రతిపదార్థము :-** లోకనాథస్య తస్య = జగన్నాథుడైనట్టి ఆ మహనీయుని, సత్కృతం భుజం = పూజ్యమైనట్టి భుజమును, ఉపధాయ = తలగడగా చేసికొని, అన్యస్య కస్యచిత్ భుజం = వేరొకని ఎవ్వని భుజమునో, కథం నామ = ఎట్లుగా, ఉపధాస్యామి = తలగడగా చేసికొందును?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** లోకనాథస్య - బ్రహ్మాదిలోకపాలకులచే తమ తమ ఉన్నతి కొఱకు ప్రార్థింపబడునట్టి దేవదేవునియొక్క, సత్కృతం భుజం = దక్షిణభుజమును, కస్యచిత్ = అనామకుడైన క్షుద్రుడైన నీవంటివానియొక్క.

**తాత్పర్యము :-** సర్వలోకప్రభువైన ఆ మహాత్ముని దక్షిణభుజమును ఆశ్రయించు భాగ్యము కలిగిన నేను, క్షుద్రుడైన పరుని భుజమును ఎట్లు స్పృశింతును ?

**శ్లో॥ అహ మౌపయికీ భార్యా త స్యైవ వసుధాపతేః ।**
**వ్రతస్నాతస్య విప్రస్య విద్యేవ విదితాత్మనః ॥ 17**

**పదచ్ఛేదము :-** అహమ్ - ఔపయికీ - భార్యా - తస్య - ఏవ - వసుధాపతేః - వ్రతస్నాతస్య - విప్రస్య - విద్యా - ఇవ - విదితాత్మనః ॥

**అన్వయక్రమము :-** వ్రతస్నాతస్య, విదితాత్మనః విప్రస్య విద్యా ఇవ, అహం తస్య వసుధాపతేః ఏవ ఔపయికీ భార్యా.

**ప్రతిపదార్థము :-** వ్రతస్నాతస్య = వేదవ్రతములు ముగించుకొన్నవాడును, విదితాత్మనః = ఆత్మసాక్షాత్కారము నొందినవాడునగు, విప్రస్య = విప్రునకు, విద్యా ఇవ = బ్రహ్మవిద్యవలె, అహం = నేను, తస్య వసుధాపతేః ఏవ = ఆ రామభూపాలునికే, ఔపయికీ భార్యా = యోగ్యమైన భార్యను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** వ్రతస్నాతస్య, విదితాత్మనః తస్య రామస్య, అని ఈ రెండు విశేషణములను విప్రునకేగాక రామునకు గూడ అన్వయించవలెను.

"విప్రస్య విద్యా ఇవ" – బ్రాహ్మణునకే న్యాయప్రాప్తమైన సన్యాసము విధింపబడినది గనుకను బ్రహ్మవిద్య వేదసాధ్యము గావునను, వేదాధ్యయనపరుడైన బ్రాహ్మణునికే బ్రహ్మవిద్యాధికారమున్నదని భావము.

**గోవిందరాజీయము** :– విద్య అనగా యోగాభ్యాసవిద్య. ఆత్మవేత్తకు మాత్రమే యోగాభ్యాసవిద్య లభించునని భావము.

అహం తస్యైవ ఔపయికీ భార్యా – తుల్యమైన వయస్సు శీలము వర్తనమును గలిగియుండుటచే నేను రామునకే తగిన భార్య నని చెప్పబడినది.

**తాత్పర్యము** :– వేదాధ్యయనానంతరము వేదవ్రతమును ముగించుకొని, ఆత్మజ్ఞానమును సాధించుకొన్న విప్రునకు మాత్రమే ఎట్లు బ్రహ్మవిద్య యోగ్యమై యుండునో అట్లే తుల్యశీలవయోవృత్తములు గలిగిన నేను శ్రీరామచంద్రునికే తగిన భార్యనై యుందును.

**శ్లో॥ సాధు రావణ రామేణ మాం సమానయ దుఃఖితామ్ ।**
**వనే వాశితయా సార్ధం కరేణ్వేవ గజాధిపమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– సాధు – రావణ – రామేణ – మాం – సమానయ – దుఃఖితామ్, వనే – వాశితయా – సార్ధం – కరేణ్వా – ఇవ – గజాధిపమ్ ॥

**అన్వయక్రమము** :– రావణ! వనే వాశితయా కరేణ్వా సార్ధం గజాధిపమ్ ఇవ దుఃఖితాం మాం రామేణ సాధు సమానయ.

**ప్రతిపదార్థము** :– రావణ = ఓ రావణుడా! వనే = అడవియందు, వాశితయా = భర్తకు దూరమైన, కరేణ్వా సార్ధం = ఆడఏనుగుతోడ, గజాధిపమ్ ఇవ = పురుష గజమునువలె, దుఃఖితాం = శోకగ్రస్తురాలనైన, మాం = నన్ను, రామేణ = శ్రీరామునితో, సాధు = చక్కగా, సమానయ = కూర్చుము.

**సూచన** :– ఈ శ్లోకమున ఉపమానోపమేయ వాక్యములలోని పదముల విభక్తులను మార్చుచేసి అర్థము చెప్పుకొనవలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– రావణుడు శుద్ధబ్రాహ్మణుడు కాడు శుద్ధక్షత్రియుడును కాడు. అనులోమ సంకరజాతివాడు.

ఇచట సీతమ్మ తన్ను తీసికొనిపోయి రామునియొద్ద విడువుమని చెప్పలేదు. ఏలనన అట్లు చెప్పినచో ఆ నెపమున తనను తాకునేమోయని భయపడినది. కావున

రావణునితో రామునే ఇచటకు తెమ్మనెను. అటులైన నీవు నయమతి వనిపించు కొందువు. నీకిప్పుడు వచ్చిన దుర్నీతిపరుడను పేరు పోవును అనెను.

**గోవిందరాజీయము :–** "వాశితయా" యౌవనవయస్సు నందున్న గజయువతితో అని అర్థము. లేక వనే వాశితయా వనమునందు బంధింపబడిన ఆడుఏనుగుతో అని అర్థము.

**సాధురావణ :–** సాధున్ రావయతీతి సాధురావణః = అనగా సాధువులను విలపింప జేయువాడని అర్థము.

**తాత్పర్యము :–** రావణా! అరణ్యమునందు పతివియోగమును పొంది దుఃఖించుచున్న గజాంగనను, యూథనాథుడైన గజముతో కూర్చి పుణ్యము కట్టుకొన్నట్లు, పతిశోక గ్రస్తురాలనైన నన్ను నా రామునితో కూర్చి నాకు మేలుగూర్చి నీకు క్షేమమును సంపాదించుకొనుము.

**శ్లో॥ మిత్ర మౌపయికం కర్తుం రామస్థానం పరీప్సతా ।**
**వధం చానిచ్ఛతా ఘోరం త్వయాసౌ పురుషర్షభః ॥ 19**

**పదచ్ఛేదము :–** మిత్రమ్ – ఔపయికం – కర్తుం – రామః – స్థానం – పరీప్సతా – వధం – చ – అనిచ్ఛతా – ఘోరం – త్వయా – అసౌ – పురుషర్షభః ॥

**అన్వయక్రమము :–** స్థానం పరీప్సతా, ఘోరం వధం చ అనిచ్ఛతా త్వయా అసౌ పురుషర్షభః రామః మిత్రం కర్తుమ్ ఔపయికమ్.

**ప్రతిపదార్థము :–** స్థానం పరీప్సతా = నీ యునికిని పరిరక్షించుకొన గోరువాడవును, ఘోరం వధమ్ అనిచ్ఛతా చ = దారుణమైన మారణమును కోరనివాడవు అగు, త్వయా = నీచేత, అసౌ పురుషర్షభః = ఈ పురుషసింహుడైన, రామః = శ్రీరాముడు, మిత్రం కర్తుం = స్నేహితునిగా చేసికొనుటకు, ఔపయికమ్ = తగియుండును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** స్థానం = (లంకాం) లంకను, ఘోరం వధం = సకలకుటుంబ మారణమును.

**గోవిందరాజీయము :–** శరణు వేడుకొనుము అనవలసిన సందర్భమున మిత్రునిగా చేసికొను మనుట దురభిమానియైన రావణునకు నచ్చునట్లు చెప్పవలెనను కోరికతోడనే అట్లు సీతమ్మ చెప్పినది. "మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన" అని శ్రీరాముని ప్రతిజ్ఞను ఆమె జ్ఞప్తికి తెచ్చుకొనియే అట్లు చెప్పినది.

ఘోరం వధం = చిత్రవధ అని భావము.

**బొంబాయి పాఠము** :– "వధం చ" అనిచ్ఛతా అనుటకు బదులు "బంధం చ" అనిచ్ఛతా యని యున్నది.

అసౌ రామః – ఈ రాముడు అనుటకు కారణము నిరంతరస్మరణముచే శ్రీరాము డామెకు ప్రత్యక్షముగనే కాన్పించుచున్నాడని తెలిసికొనవలెను.

పురుషర్షభః – నేను చేసిన ఈ ఘోరపాపము నాత డెట్లు క్షమించునని శంకింప పనిలేదు. రఘురాముడు పురుషులలో ఉత్తమోత్తముడు గదా!

**తాత్పర్యము** :– నిన్ను, నీపట్టణమును, నీరాజ్యమును నీవు రక్షించుకొనదలచుకొందు వేని, దారుణమైన మృత్యువును నీకును నీవారికిని తప్పింపదలచితివేని, పురుషులందు ఉత్తమోత్తముడగు రామచంద్రునితో మైత్రిని కోరుకొనుటయే నీకు కర్తవ్యమై యున్నది.

**శ్లో॥ విదిత స్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః ।**
**తేన మైత్రీ భవతు తే యది జీవితు మిచ్ఛసి ॥ 20**

**పదచ్ఛేదము** :– విదితః – సః – హి – ధర్మజ్ఞః – శరణాగతవత్సలః – తేన – మైత్రీ – భవతు – తే – యది – జీవితుమ్ – ఇచ్ఛసి ॥

**అన్వయక్రమము** :– సః ధర్మజ్ఞః, శరణాగతవత్సలః ఇతి విదితః. హి జీవితుం ఇచ్ఛసి యది, తే తేన మైత్రీ భవతు.

**ప్రతిపదార్థము** :– సః = ఆ శ్రీరామచంద్రుడు, ధర్మజ్ఞః = సర్వధర్మవేత్తయైనవాడు, శరణాగతవత్సలః = శరణుగోరినవారియెడ వాత్సల్యము కలిగియుండువాడు, ఇతి = అని, విదితః = సువిదితమైనవాడు, జీవితుమ్ ఇచ్ఛసి యది = బ్రతికియుండుట కోరుకొందువేని, తే = నీకు, తేన = ఆ దీనవత్సలునితో, మైత్రీ భవతు = స్నేహము కలుగుగాక.

**తాత్పర్యము** :– ఆ శ్రీరామచంద్రుడు సర్వధర్మములు తెలిసినవాడుగను, తనను శరణు వేడిన వారియెడ వాత్సల్యభావము ప్రకటించువాడుగను జగద్విదితుడుగదా! అందుచే నీకు జీవింపకోరికయే యున్నచో ఆతనితో మైత్రిని నెఱపుదువుగాక!

**శ్లో॥ ప్రసాదయస్వ త్వం చైనం శరణాగతవత్సలమ్ ।**
**మాం చాస్మై ప్రయతో భూత్వా నిర్యాతయితు మర్హసి ॥ 21**

**పదచ్ఛేదము** :– ప్రసాదయస్వ – త్వం – చ – ఏనం – శరణాగతవత్సలమ్, మాం

– చ – అస్మై – ప్రయతః – భూత్వా – నిర్యాతయితుమ్ – అర్హసి ॥

**అన్వయక్రమము** :– ఏనం శరణాగతవత్సలం త్వం చ ప్రసాదయస్వ. ప్రయతః భూత్వా అస్మై మాం నిర్యాతయితుం చ అర్హసి.

**ప్రతిపదార్థము** :– శరణాగతవత్సలమ్ ఏనం = శరణాగతరక్షణతత్పరుడైన శ్రీరామ చంద్రుని, త్వం చ ప్రసాదయస్వ = నీవు కూడ బ్రతిమాలుకొనుము. ప్రయతః భూత్వా = నిష్కళంకమైన చిత్తముగలవాడవై, అస్మై = ఈ శ్రీరామచంద్రునకు, మాం = నన్ను, నిర్యాతయితుం చ అర్హసి = తిరిగి అప్పచెప్పుటకు తగుదువు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**పరమార్థచంద్రిక** :– "ఏనం త్వం చ ప్రసాదయస్వ" శ్రీరాముని నీవును బ్రతిమాలు కొనుము. అనగా నీకొరకై నేనుగూడ అతనిని నీపై ప్రేమయుక్తునిగా చేయుటకు, తోడుపడెదనని భావము. లేక – పూర్వము ఎందరో అతనికి అపకారము చేసినవారు, అతనిని శరణువేడి రక్షింపబడిరి. అట్లే నీవుకూడ అట్లు వేడుకొని అతని దయకు పాత్రుడవు కమ్ము అని భావము.

**తాత్పర్యము** :– శరణాగతరక్షణతత్పరుడైనట్టి ఆ రామచంద్రుని తప్పక నీవు బ్రతిమాలుకొనుము. నేనుకూడ నిన్ను క్షమింపకోరెదను. ఉత్తమమైన మనస్సుతో నన్ను వెంటనే ఆయన కప్పజెప్పుటయే ఇప్పుడు నీకు తగియున్న పని.

**శ్లో॥ ఏవం హి తే భవేత్ స్వస్తి సంప్రదాయ రఘూత్తమే ।**
**అన్యథా త్వం హి కుర్వాణో వధం ప్రాప్స్యసి రావణ ॥ 22**

**పదచ్ఛేదము** :– ఏవం – హి – తే – భవేత్ – స్వస్తి – సంప్రదాయ – రఘూత్తమే – అన్యథా – త్వం – హి – కుర్వాణః – వధం – ప్రాప్స్యసి – రావణ ॥

**అన్వయక్రమము** :– రావణ, రఘూత్తమే, (మాం) సంప్రదాయ, తే స్వస్తి భవేత్, అన్యథా కుర్వాణః, త్వం వధం, ప్రాప్స్యసి హి.

**ప్రతిపదార్థము** :– రావణ = ఓ రావణుడా! ఏవం = ఈరీతిగా, మాం రఘూత్తమే సంప్రదాయ = నన్ను శ్రీరామచంద్రునకు సమర్పించి (యున్నయెడల), తే స్వస్తి భవేత్ = నీకు క్షేమము కలుగును. అన్యథా కుర్వాణః = వేరుగా చేయుచున్న వాడవైనచో, వధం ప్రాప్స్యసి హి = మరణమునే పొందెదవు సుమా!

**తాత్పర్యము** :– నేను చెప్పినట్లుగా నన్ను శ్రీ రామచంద్రునకు సమర్పించితివేని నీకు క్షేమమేయగును. లేక వేఱువిధముగా ప్రవర్తించిన యెడల శ్రీరాముని వలన నీవు

వధను పొందక తప్పదు.

**శ్లో॥ వర్జయే ద్వజ్ర ముత్సృష్టం వర్జయే దంతక శ్చిరమ్ ।**
**త్వద్విధం తు న సంక్రుద్ధో లోకనాథ స్స రాఘవః ॥ 23**

**పదచ్ఛేదము :–** వర్జయేత్ – వజ్రమ్ – ఉత్సృష్టం – వర్జయేత్ – అంతకః – చిరమ్, త్వద్విధం – తు – న – సంక్రుద్ధః – లోకనాథః – సః – రాఘవః ॥

**అన్వయక్రమము :–** ఉత్సృష్టం వజ్రం వర్జయేత్; అంతకః చిరం వర్జయేత్; సంక్రుద్ధః లోకనాథః, సః రాఘవః తు త్వద్విధం న వర్జయేత్.

**ప్రతిపదార్థము :–** ఉత్సృష్టం వజ్రం = (దేవేంద్రునిచే) ప్రయోగింపబడిన వజ్రాయుధము, వర్జయేత్ = విడువవచ్చును. అంతకః = యముడు, చిరం = శాశ్వతముగా, వర్జయేత్ = విడువవచ్చును. సంక్రుద్ధః = మిక్కిలి క్రోధము నొందియున్నట్టి, లోకనాథః = జగత్ప్రభువైనట్టి, సః రాఘవః తు = ఆ శ్రీరాముడు మాత్రము, త్వద్విధం = నీవంటి పాపకర్ముని, న వర్జయేత్ = విడిచిపెట్టడు.

**తాత్పర్యము :–** దేవేంద్రుడు ప్రయోగించినట్టి వజ్రాయుధము ఒకప్పుడు నిన్ను చంపక విడిచినను విడువవచ్చును. అట్లే యముడు గూడ చిరకాలము చంపక నిన్ను విడిచినను విడువవచ్చును గాని, నీపై క్రోధము నొందియున్న జగత్ప్రభుడైన ఆ శ్రీరాముడు మాత్రము నీవంటి పాతకిని ఎన్నడును విడువడు.

**శ్లో॥ రామస్య ధనుష శ్శబ్దం శ్రోష్యసి త్వం మహాస్వనమ్ ।**
**శతక్రతువిసృష్టస్య నిర్ఘోష మశనేరివ ॥ 24**

**పదచ్ఛేదము :–** రామస్య – ధనుషః – శబ్దం – శ్రోష్యసి – త్వం – మహాస్వనమ్, శతక్రతువిసృష్టస్య – నిర్ఘోషమ్ – అశనేః – ఇవ ॥

**అన్వయక్రమము :–** "శతక్రతువిసృష్టస్య అశనేః నిర్ఘోషమ్ ఇవ" రామస్య ధనుషః మహాస్వనం శబ్దం త్వం శ్రోష్యసి.

**ప్రతిపదార్థము :–** శతక్రతువిసృష్టస్య = దేవేంద్రునిచే ప్రయోగింపబడినట్టి, అశనేః నిర్ఘోషమ్ ఇవ = వజ్రాయుధముయొక్క భీకరధ్వనినివలె, రామస్య ధనుషః = శ్రీరాముని ధనుస్సుయొక్క, మహాస్వనం శబ్దం = గొప్ప నిర్ఘోషముతో కూడినట్టి శబ్దమును, త్వం = నీవు, శ్రోష్యసి = వినగలవు.

**తాత్పర్యము :–** దేవేంద్రుడు ప్రయోగించినట్టి వజ్రాయుధముయొక్క భయంకర

శబ్దమువలె శ్రీరాముని ధనుస్సుయొక్క ప్రతిధ్వనులతో భీకరమైయుండు వింటినారి శబ్దమును కొలదికాలములోనే నీవు తప్పక వినెదవుసుమా!

**శ్లో॥ ఇహ శీఘ్రం సుపర్వాణో జ్వలితాస్యా ఇవోరగాః ।**
**ఇషవో నిపతిష్యంతి రామలక్ష్మణలక్షణాః ॥ 25**

**పదచ్ఛేదము :–** ఇహ – శీఘ్రం – సుపర్వాణః – జ్వలితాస్యాః – ఇవ – ఉరగాః – ఇషవః – నిపతిష్యంతి – రామలక్ష్మణలక్షణాః ॥

**అన్వయక్రమము :–** ఇహ జ్వలితాస్యాః ఉరగాః ఇవ రామలక్ష్మణలక్షణాః సుపర్వాణః ఇషవః శీఘ్రం నిపతిష్యంతి.

**ప్రతిపదార్థము :–** ఇహ = ఈ లంకానగరమునందు, జ్వలితాస్యాః ఉరగాః ఇవ = ప్రజ్వలించుచున్న నోరులుగల సర్పములవలె, రామలక్ష్మణలక్షణాః = రామలక్ష్మణులయొక్క నామములతో ముద్రితములైనట్టి, సుపర్వాణః ఇషవః = మంచికణుపులు కలిగినట్టిబాణములు, శీఘ్రం = త్వరలో, నిపతిష్యంతి = పడును.

**తాత్పర్యము :–** కొలదికాలములోనే ఈ లంకానగరమందు మంటలను గ్రక్కు సర్పముల వంటివియును, రామలక్ష్మణుల పేర్లు చెక్కబడిన అందమైన కణుపులు గలిగినట్టివి యును అగు బాణములు వచ్చిపడి ముంచియెత్తగలవు సుమా!

**శ్లో॥ రాక్షసేంద్రమహాసర్పాన్ స రామగరుడో మహాన్ ।**
**ఉద్ధరిష్యతి వేగేన వైనతేయ ఇ వోరగాన్ ॥ 26**

**పదచ్ఛేదము :–** రాక్షసేంద్రమహాసర్పాన్ – సః – రామగరుడః – మహాన్ – ఉద్ధరిష్యతి – వేగేన – వైనతేయః – ఇవ – ఉరగాన్ ॥

**అన్వయక్రమము :–** మహాన్ సః రామగరుడః, వైనతేయః ఉరగాన్ ఇవ, రాక్షసేంద్ర మహాసర్పాన్ వేగేన ఉద్ధరిష్యతి.

**ప్రతిపదార్థము :–** మహాన్ సః రామగరుడః = గొప్పదైనట్టి రాముడను గరుత్మంతుడు, వైనతేయః ఉరగాన్ ఇవ = గరుడుడు సర్పములనువలె, రాక్షసేంద్రమహాసర్పాన్ = రాక్షసవీరులనెడి మహాసర్పములను, వేగేన ఉద్ధరిష్యతి = శీఘ్రముగ ఎత్తుకొని పోగలడు.

**తాత్పర్యము :–** శ్రీరాముడనెడి గరుత్మంతుడు – గరుడపక్షి సర్పములను తన్నుకొని పోయినట్లు, అతిశీఘ్రముగా ఇచటి రాక్షసులనెడి సర్పములను ఎత్తుకొనిపోవును సుమా!

**శ్లో॥ అపనేష్యతి మాం భర్తా త్వత్త శ్శీఘ్ర మరిందమః ।**
**అసురేభ్య శ్శ్రియం దీప్తాం విష్ణు స్త్రిభిరివ క్రమైః ॥ 27**

**పదచ్ఛేదము :–** అపనేష్యతి – మాం – భర్తా – త్వత్తః – శీఘ్రమ్ – అరిందమః – అసురేభ్యః – శ్రియం – దీప్తాం – విష్ణుః – త్రిభిః – ఇవ – క్రమైః ॥

**అన్వయక్రమము :–** విష్ణుః, త్రిభిః క్రమైః, అసురేభ్యః, దీప్తాం శ్రియమ్ ఇవ, అరిందిమః (మమ) భర్తా, మాం త్వత్తః శీఘ్రమ్ అపనేష్యతి.

**ప్రతిపదార్థము :–** విష్ణుః = శ్రీమహావిష్ణువు, అసురేభ్యః = రాక్షసులనుండి, త్రిభిః క్రమైః = మూడు అడుగులతో, దీప్తాం శ్రియమ్ ఇవ = ఉజ్జ్వలమైన సంపదనువలె, అరిందమః (మమ) భర్తా = శత్రుసంహారకుడైన నా భర్త, మాం = నన్ను, త్వత్తః = నీకడనుండి, శీఘ్రం అపనేష్యతి = త్వరలోనే తరలించుకొనిపోగలడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "న చాపి మమ హస్తాత్ త్వాం ప్రాప్తుమ్ అర్హతి రాఘవః" అని ముందు రావణుడు పలికినట్టి ప్రగల్భములకు సీతమ్మ ఇట్లు సూటియైన జవాబు చెప్పినది.

**వాసుదాసస్వామి :–** ఇంద్రవిరోధియగు బలిచక్రవర్తి పూర్వమింద్రునిస్థానమాక్రమించి తానే ఇంద్రుడై యుండగా, విష్ణువు దానిని మఱల తన వశముచేసికొనలేదా! అట్టులే రాముడు నీ స్వాధీన మందుండు నన్ను తోడ్కొనిపోవును. వామను డొంటరివాడు గాదా! బలపరాక్రమములు లెక్కగాని, యొంటరి సంటరితనము లెక్కగాదు.

**తాత్పర్యము :–** వామనరూపముతో పూర్వము శ్రీ మహావిష్ణువు మూడడుగులతోడనే బలిచక్రవర్తియొక్క మహైశ్వర్యమును గొనిపోయినట్లు శత్రుమర్దనుడైన నాభర్త నీచేతులనుండి అతిత్వరలోనే నన్ను విడిపించుకొని పోవగలడు సుమా!

**శ్లో॥ జనస్థానే హతస్థానే నిహతే రక్షసాం బలే ।**
**అశక్తేన త్వయా రక్షః కృత మేత దసాధు వై ॥ 28**

**పదచ్ఛేదము :–** జనస్థానే – హతస్థానే – నిహతే – రక్షసాం – బలే – అశక్తేన – త్వయా – రక్షః – కృతమ్ – ఏతత్ – అసాధు – వై ॥

**అన్వయక్రమము :–** రక్షః! జనస్థానే హతస్థానే (సతి) రక్షసాం బలే నిహతే (సతి) అశక్తేన త్వయా, ఏతత్ అసాధు కృతం వై.

**ప్రతిపదార్థము :–** రక్షః = ఓ రాక్షసుడా! జనస్థానే = దండకయందలి జనస్థానము,

హతస్థానే (సతి) = పాడుపడిపోయి యుండగా, రక్షసాం బలే = రాక్షససైన్యము, నిహతే (సతి) = రూపుమాపబడియుండగా, అశక్తేన త్వయా = అశక్తుడవైన నీచేత, ఏతత్ అసాధు = ఈ నీచమైనపని, కృతం వై = చేయబడినదిగదా!

**తాత్పర్యము** :- ఓ రావణా! దండకారణ్యమునందలి జనస్థానమున నీ రాక్షస బలమంతయును నిర్మూలమై పాడుపడియుండగా, నీవు నిర్వీర్యుడవై దొంగతనముగా నన్ను ఇచటికి తీసికొనివచ్చి అతినీచమైన కృత్యము చేసితివి కదా!

**శ్లో॥ ఆశ్రమం తు తయో శ్శూన్యం ప్రవిశ్య నరసింహయోః ।**
**గోచరం గతయో ర్భ్రాత్రో రపనీతా త్వయాఽధమ ॥ 29**

**పదచ్ఛేదము** :- ఆశ్రమం - తు - తయోః - శూన్యం - ప్రవిశ్య - నరసింహయోః - గోచరం - గతయోః - భ్రాత్రోః - అపనీతా - త్వయా - అధమ ॥

**అన్వయక్రమము** :- అధమ! నరసింహయోః, తయోః భ్రాత్రోః గోచరం గతయోః (సతోః) శూన్యమ్ ఆశ్రమం ప్రవిశ్య త్వయా (అహమ్) అపనీతా.

**ప్రతిపదార్థము** :- అధమ! = ఓ నీచుడా! నరసింహయోః = పురుషశ్రేష్ఠులైన, తయోః భ్రాత్రోః = ఆ సోదరు లిరువురును, గోచరం గతయోః (సతోః) = దూరమున నుండగా, శూన్యమ్ ఆశ్రమం = నిస్సహాయమైన ఆశ్రమమును, ప్రవిశ్య = ప్రవేశించి, త్వయా = నీచేత, (అహం = నేను) అపనీతా = దొంగలింపబడితిని.

**తాత్పర్యము** :- ఆనాడు మాయలేడిని వెంబడించుచు పురుషసింహులైన యా సోదరు లిరువురును దూరముగా వెడలిపోగా పురుషశూన్యమైన ఆశ్రమమున ప్రవేశించి నీచుడవై నీవు నన్ను అపహరించితివి గదా!

**శ్లో॥ నహి గంధ ముపాఘ్రాయ రామలక్ష్మణయో స్త్వయా ।**
**శక్యం సందర్శనే స్థాతుం శునా శార్దూలయోరివ ॥ 30**

**పదచ్ఛేదము** :- న - హి - గంధమ్ - ఉపాఘ్రాయ - రామలక్ష్మణయోః - త్వయా - శక్యం - సందర్శనే - స్థాతుం - శునా - శార్దూలయోః - ఇవ ॥

**అన్వయక్రమము** :- శార్దూలయోః గంధమ్ ఉపాఘ్రాయ శునా ఇవ, త్వయా, రామలక్ష్మణయోః గంధమ్ ఉపాఘ్రాయ (తయోః) సందర్శనే స్థాతుం న శక్యం హి.

**ప్రతిపదార్థము** :- శార్దూలయోః = పెద్దపులులయొక్క, గంధం = వాసనను, ఉపాఘ్రాయ = ఆఘ్రాణించి, శునా ఇవ = కుక్కచేత వలె, రామలక్ష్మణయోః గంధం ఉపాఘ్రాయ = రామలక్ష్మణుల వాసనను ఆఘ్రాణించి, త్వయా = నీచేత (తయోః),

సందర్శనే స్థాతుం = వారిఎదుట నిలచుటకు, న శక్యం హి = శక్యముగాదు సుమా!

**తాత్పర్యము :–** పెద్దపులుల వాసనను పసిగట్టిన శునకమువలె వీరులైన రామలక్ష్మణుల గాలి సోకినట్టి నీవు ఆ యన్నదమ్ముల కనులముందు నిలచుటకు గూడ శక్యముకాదు సుమా!

**శ్లో॥ తస్య తే విగ్రహే తాభ్యాం యుగగ్రహణ మస్థిరమ్ ।**
**వృత్రస్యేవేంద్రబాహుభ్యాం బాహో రేకస్య నిగ్రహః ॥ 31**

**పదచ్ఛేదము :–** తస్య – తే – విగ్రహే – తాభ్యాం – యుగగ్రహణమ్ – అస్థిరమ్ – వృత్రస్య – ఇవ – ఇంద్రబాహుభ్యాం – బాహోః – ఏకస్య – నిగ్రహః ॥

**అన్వయక్రమము :–** తస్య తే తాభ్యాం విగ్రహే (సతి) యుగగ్రహణమ్ అస్థిరమ్; ఇంద్రబాహుభ్యాం వృత్రస్య ఏకస్య బాహోః ఇవ (తవ) నిగ్రహః (స్థిరః).

**ప్రతిపదార్థము :–** తస్య తే = అట్టి అల్పుడవైన నీకు, తాభ్యాం = ఆ వీరులైన సోదరులతో, విగ్రహే (సతి) = యుద్ధము కలుగగా, యుగగ్రహణం = జయసంపాదనము, అస్థిరమ్ = అసాధ్యము. ఇంద్రబాహుభ్యాం = ఇంద్రునియొక్క రెండుభుజములతో, వృత్రస్య = వృత్రాసురునియొక్క, ఏకస్య బాహోః ఇవ = ఒంటిభుజమునకువలె, (తవ = నీకు) నిగ్రహః = బంధనము, స్థిరః = నిశ్చయము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** దేవేంద్రునిచేతిలో వృత్రాసురునకు బాహుచ్ఛేదము సంభవించినట్లు నీకును రామలక్ష్మణులచే అట్టి హాని తప్పదని సూచింపబడినది.

**తాత్పర్యము :–** పూర్వము వృత్రాసురుడు బాహుచ్ఛేదము కలిగి ఏకహస్తుడై, రెండు భుజములతో యుద్ధము చేయుచున్నట్టి దేవేంద్రుని నుండి ఓటమిని పొందినట్లుగా అసమర్థుడవై ఒంటరివై యుండు నీకు ఆ సోదరులిరువురితో యుద్ధము సంభవించినపుడు నీవు జయమును సంపాదించుట అసంభవము.

**శ్లో॥ క్షిప్రం తవ స నాథో మే రామ స్సౌమిత్రిణా సహ ।**
**తోయ మల్ప మి వాదిత్యః ప్రాణా నాదాస్యతే శరైః ॥ 32**

**పదచ్ఛేదము :–** క్షిప్రం – తవ – సః – నాథః – మే – రామః – సౌమిత్రిణా – సహ – తోయమ్ – అల్పమ్ – ఇవ – ఆదిత్యః – ప్రాణాన్ – ఆదాస్యతే – శరైః ॥

**ప్రతిపదార్థము :–** మే నాథః = నా భర్తయైనట్టి, సః రామః = ఆ శ్రీరాముడు,

సౌమిత్రిణా సహ = లక్ష్మణునితోగూడ, ఆదిత్యః = సూర్యుడు, అల్పం తోయమ్ ఇవ = స్వల్పముగనున్న నీటినివలె, క్షిప్రం = త్వరలో, తవ ప్రాణాన్ = నీ ప్రాణములను, శరైః = బాణములతో, ఆదాస్యతే = గ్రహింపగలడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– ఎండాకాలము సూర్యుడు నీళ్ళను తన కిరణములచే పీల్చువిధమున, నీవు కైలాసపర్వతములోనగు నూర్ధ్వలోకంబుల దాగినను, సముద్రములో వరుణుని పట్టణములోనగు నధోలోకములందు దాగినను, నాభర్త తన తమ్మునితో వచ్చి పిడుగు వృక్షమును గూల్చునట్లు నిన్ను గూల్చును.

**తాత్పర్యము** :– మడుగులో అడుగుననున్న అల్పజలమును సూర్యుడు త్వరలోనే హరించివేయునట్లు, నా భర్తయైన రాముడు అనుజునితో కూడి యుద్ధమున నీపై బాణములను గురిపించి నీ ప్రాణములను త్వరలోనే తీయగలడు సుమా!

**శ్లో॥ గిరిం కుబేరస్య గతోऽపధాయ వా**
**సభాం గతో వా వరుణస్య రాజ్ఞః ।**
**అసంశయం దాశరథేర్న మోక్ష్యసే**
**మహాద్రుమః కాలహతో ऽ శనేరివ ॥ 35**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రావణతృణీకరణం" నామ*
*ఏకవింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– గిరిం – కుబేరస్య – గతః – అపధాయ – వా, సభాం – గతః – వా – వరుణస్య – రాజ్ఞః, అసంశయం – దాశరథేః – న – మోక్ష్యసే – మహాద్రుమః – కాలహతః – అశనేః – ఇవ ॥

**అన్వయక్రమము** :– కాలహతః (త్వమ్) అపధాయ, కుబేరస్య గిరిం గతః వా, వరుణస్య రాజ్ఞః సభాం గతః వా, అశనేః, మహాద్రుమః ఇవ అసంశయం, దాశరథేః న మోక్ష్యసే.

**ప్రతిపదార్థము** :– కాలహతః = దైవోపహతుడవైన, త్వం = నీవు, అపధాయ = పరుగెత్తి పోయి, కుబేరస్య గిరిం గతః వా = కుబేరుని పర్వతమైన కైలాసమును జేరినను, వరుణస్య రాజ్ఞః = వరుణదేవునియొక్క, సభాం గతః వా = ఆస్థానమును చేరుకొన్నను, అశనేః = పిడుగునుండి, మహాద్రుమః ఇవ = మహావృక్షమువలె,

అసంశయం = నిస్సందేహముగా, దాశరథేః = శ్రీరామునినుండి, న మోక్ష్యసే = విడిపింపబడవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- కుబేరస్య గిరిం = గంధమాదనపర్వతమును, 'కుబేరస్య గిరిం, వరుణస్య సభాం' అని ఈ రెంటిని పేర్కొనుటచే ఊర్ధ్వలోకములును అధోలోకములును రెండును ఇచట సూచించబడినవి.

**తాత్పర్యము** :- రావణా, నీవు కుబేరుని పర్వతముమీదికి పోయినను, వరుణదేవుని సభాస్థానములో దాగినను శ్రీరామునిచే ప్రయోగింపబడినట్టి బాణములనుండి ఎంతమాత్రమును తప్పించుకొనలేవు. పిడుగు పడినప్పుడు భస్మమగు మహావృక్షమువలె శ్రీరాముని చేతినుండి నీకు వినాశము తప్పదు సుమా!

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రావణతృణీకరణము" అను*
*ఇరువదియొకటవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ద్వావింశఃసర్గ

**శ్లో॥ సీతాయా వచనం శ్రుత్వా పరుషం రాక్షసాధిపః ।**
**ప్రత్యువాచ తత స్సీతాం విప్రియం ప్రియదర్శనామ్ ॥ 1**

**పదచ్ఛేదము** :- సీతాయాః - వచనం - శ్రుత్వా - పరుషం - రాక్షసాధిపః - ప్రత్యువాచ - తతః - సీతాం - విప్రియం - ప్రియదర్శనామ్ ॥

**అన్వయక్రమము** :- రాక్షసాధిపః సీతాయాః పరుషం వచనం శ్రుత్వా, తతః ప్రియదర్శనాం సీతాం విప్రియం వచనం ప్రత్యువాచ.

**ప్రతిపదార్థము** :- రాక్షసాధిపః = రాక్షసరాజైన రావణుడు, సీతాయాః = సీతాదేవియొక్క, పరుషం వచనం = పరుషమైన మాటను, శ్రుత్వా = విని, ప్రియదర్శనాం సీతాం = సుందరాంగియైన సీతాదేవినిగూర్చి, తతః = పిమ్మట, విప్రియం = కఠినముగా, ప్రత్యువాచ = జవాబుచెప్పెను.

**తాత్పర్యము** :- రావణాసురుడు సీతాదేవి చెప్పిన పరుషమైన మాటలు విని సుందరాంగియైన ఆమెను గూర్చి తిరిగి కఠినముగా ఇట్లు పలికెను.

**శ్లో॥ యథా యథా సాంత్వయితా వశ్యః స్త్రీణాం తథా తథా ।**
**యథా యథా ప్రియం వక్తా పరిభూత స్తథా తథా ॥ 2**

**పదచ్ఛేదము** :- యథా - యథా - సాంత్వయితా - వశ్యః - స్త్రీణాం - తథా - తథా - యథా - యథా - ప్రియం - వక్తా - పరిభూతః - తథా - తథా ॥

**అన్వయక్రమము** :- యథా యథా (పురుషః), సాంత్వయితా తథా తథా స్త్రీణాం వశ్యః; యథా యథా ప్రియం వక్తా, తథా తథా పరిభూతః (భవతి).

**ప్రతిపదార్థము** :- యథా యథా = ఎంతవిశేషముగ, (పురుషః) సాంత్వయితా = (పురుషుడు) బ్రతిమాలుచుండువాడగునో, తథా తథా = అంత అధికముగా, స్త్రీణాం = స్త్రీలకు, వశ్యః భవతి = లోబడిపోయిన వాడగును, యథా యథా = ఎంత అధికముగా, ప్రియం వక్తా = ప్రియముగా మాటలాడువాడగునో, తథా తథా = అంత ఎక్కువగా, పరిభూతః భవతి = పరాభవింపబడువా డగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "వశ్యః భవతి" – ఇష్టు డగును. ఇది లోకమునందలి సామాన్యధర్మము. కాని నీయెడల అది విరుద్ధమైనదని రావణుని తాత్పర్యము.

**తాత్పర్యము :–** లోకమున పురుషుడు స్త్రీల నెంతగ బ్రతిమాలుకొనుచుండునో అంతకు అంతగా వారికి వశుడై లోకువయై పోవుచుండును. వారితో ఎంత ప్రియముగా మాటలాడుచుండునో అంతగా వారిచే పరాభవింప బడుచుండును.

**శ్లో॥ సన్నియచ్ఛతి మే క్రోధం త్వయి కామ స్సముత్థితః ।**
**ద్రవతో ఽ మార్గ మాసాద్య హయా నివ సుసారథిః ॥ 3**

**పదచ్ఛేదము :–** సన్నియచ్ఛతి – మే – క్రోధం – త్వయి – కామః – సముత్థితః – ద్రవతః – అమార్గమ్ – ఆసాద్య – హయాన్ – ఇవ – సుసారథిః ॥

**అన్వయక్రమము :–** త్వయి సముత్థితః కామః, అమార్గం ఆసాద్య ద్రవతః హయాన్ సుసారథిః ఇవ, త్వయి సముత్థితం క్రోధం సన్నియచ్ఛతి.

**ప్రతిపదార్థము :–** త్వయి సముత్థితః కామః = నీయం దేర్పడినట్టి కామము, అమార్గం ఆసాద్య = పెడత్రోవను బట్టి, ద్రవతః హయాన్ = పరుగిడుచున్న గుఱ్ఱములను, సుసారథిః ఇవ = నేర్పరియైన సారథివలె, త్వయి సముత్థితం క్రోధం = నీయందు కల్గినట్టి క్రోధమును, సన్నియచ్ఛతి = అణచివేయుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "క్రోధం తం నియచ్ఛతి" – క్రోధకార్యమైన నిన్ను చంపివేయుటను మాన్పించుచున్నది.

**తాత్పర్యము :–** తప్పుడు మార్గమునకు లాగికొని పోవుచున్న గుఱ్ఱములను నిపుణుడైన రథచోదకుడు పగ్గములను నేర్పుగా బిగబట్టి మఱలించినట్లు, నీయందు నాకున్న ప్రేయమే నీపై నాకు కలుగు క్రోధమునంతను అణచివేయుచున్నది సుమా!

**శ్లో॥ వామః కామో మనుష్యాణాం యస్మిన్ కిల నిబధ్యతే ।**
**జనే తస్మిం స్త్వనుక్రోశ స్స్నేహశ్చ కిల జాయతే ॥ 4**

**పదచ్ఛేదము :–** వామః – కామః – మనుష్యాణాం – యస్మిన్ – కిల – నిబధ్యతే – జనే – తస్మిన్ – తు – అనుక్రోశః – స్నేహః – చ – కిల – జాయతే ॥

**అన్వయక్రమము :-** మనుష్యాణాం కామః వామః. (సః) యస్మిన్ జనే కిల నిబధ్యతే, తస్మిన్ జనే, అనుక్రోశః, స్నేహశ్చ, జాయతే కిల.

**ప్రతిపదార్థము :-** మనుష్యాణాం = మనుష్యులకు, కామః = కామమనునది, వామః = దుష్టమైనది, (సః = అది) యస్మిన్ జనే కిల = ఏ మనుజునియం దయితే, నిబధ్యతే = లగ్నమైయుండునో, తస్మిన్ జనే = ఆ మనుష్యునియందు, అనుక్రోశః = కారుణ్యమును, స్నేహశ్చ = స్నేహమును, జాయతే కిల = పుట్టుచుండును గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** వామః - క్రూరః, క్రోధముకంటెను కూడ కామము తీవ్రముగ క్రూరమైనది.

**తాత్పర్యము :-** మనుష్యులచే కామము మిక్కిలి విపరీతమైన పనులు చేయించు చుండును. నరునకు ఎవ్వరియందు ఈ కామము జనించునో అట్టివారు ఎంతో క్రోధమునకు గుఱికావలసిన వారయినప్పటికిని వారిపైని కరుణయును స్నేహమును మాత్రమే కలుగుచుండును.

**శ్లో॥ ఏతస్మా త్కారణా న్న త్వాం ఘాతయామి వరాననే ।**
**వధార్హా మవమానార్హాం మిథ్యాప్రవ్రజితే రతామ్ ॥ 5**

**పదచ్ఛేదము :-** ఏతస్మాత్ - కారణాత్ - న - త్వాం - ఘాతయామి - వరాననే - వధార్హామ్ - అవమానార్హాం - మిథ్యాప్రవ్రజితే - రతామ్ ॥

**అన్వయక్రమము :-** వరాననే! ఏతస్మాత్ కారణాత్ వధార్హామ్ అవమానార్హాం మిథ్యాప్రవ్రజితే రతాం, త్వాం న ఘాతయామి.

**ప్రతిపదార్థము :-** వరాననే = ఓ శ్రేష్ఠమైన ముఖము గల సీతా, ఏతస్మాత్ కారణాత్ = ఈ కారణమువలన, వధార్హాం = వధించుటకు అర్హమైయున్న దానవును, అవమానార్హాం = అవమానించుటకు తగియున్న దానవును, మిథ్యాప్రవ్రజితే రతామ్ = కపటమైన వనవాసవ్రతమును చేయుచున్న వానియందు మనసుపడుచున్న దానవు నగు, త్వాం = నిన్ను, న ఘాతయామి = చంపివేయుట లేదు.

**బొంబాయి ముద్రణము :-** 'ప్రవ్రజితే రతామ్' అనుదానికి బదులుగా 'ప్రవ్రజనే రతామ్' అని గలదు. అనగా నిష్ప్రయోజనముగా భోగత్యాగరూపమైన ప్రవ్రజన (సం న్యాస) మార్గమునందు ఆసక్తురాలవై యున్నదానవని భావము.

**తాత్పర్యము :–** ఓ సుందరవదనా! నీపై నాకు ఉత్కటమైన కామము కల్గియున్న కారణముచేతనే ఆ కపటపరివ్రాజకునియందు మనస్సు నిల్పుకొన్న నీవు నాకు వధ్యురాలవైనను, అవమానింపదగినదాన వైనను నిన్ను నేను చంపక ఉపేక్షించు చున్నాను.

**శ్లో॥ పరుషా ణీహ వాక్యాని యాని యాని బ్రవీషి మాం ।**
**తేషు తేషు వధో యుక్త స్తవ మైథిలి దారుణః ॥ 6**

**పదచ్ఛేదము :–** పరుషాణి – ఇహ – వాక్యాని – యాని – యాని – బ్రవీషి – మామ్, తేషు – తేషు – వధః – యుక్తః – తవ – మైథిలి – దారుణః ॥

**అన్వయక్రమము :–** మైథిలి, ఇహ యాని యాని పరుషాణి వాక్యాని మాం బ్రవీషి, తేషు తేషు తవ దారుణః వధః యుక్తః.

**ప్రతిపదార్థము :–** మైథిలి = ఓ జానకీ! మాం = నన్ను గూర్చి, ఇహ = ఈ సందర్భమున, యాని యాని పరుషాణి వాక్యాని = ఏ యే పరుషవచనములను, బ్రవీషి = పలుకుచున్నావో, తేషు తేషు = ఆ యా వాక్యములందు, తవ = నీకు, దారుణః వధః = క్రూరమైన వధ, యుక్తః = తగియున్నది.

**తాత్పర్యము :–** జానకీ! ఇప్పుడు నన్నుగూర్చి ఏ యే కటువచనములు నీవు పలికియున్నావో వానిలో ప్రతి ఒక్క వాక్యమునకును నీకు మరణదండనమే విధింపవలసియున్నది సుమా!

**శ్లో॥ ఏవ ముక్త్వా తు వైదేహీం రావణో రాక్షసాధిపః ।**
**క్రోధసంరంభసంయుక్త స్సీతా ముత్తరమబ్రవీత్ ॥ 7**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్త్వా – తు – వైదేహీం – రావణః – రాక్షసాధిపః, క్రోధసంరంభసంయుక్తః – సీతామ్ – ఉత్తరమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** రాక్షసాధిపః రావణః, వైదేహీమ్ ఏవమ్ ఉక్త్వా తు, క్రోధసంరంభ సంయుక్తః, సీతామ్ ఉత్తరమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** రాక్షసాధిపః రావణః = రాక్షసరాజైన రావణుడు, వైదేహీం = సీతనుగూర్చి, ఏవమ్ ఉక్త్వా తు = ఈరీతిగా పలికి పిమ్మట; క్రోధసంరంభసంయుక్తః = క్రోధావేశపూరితుడై, సీతామ్ = సీతనుగూర్చి, ఉత్తరమ్ అబ్రవీత్ = సమాధానము పలికెను.

**తాత్పర్యము** :- రాక్షసరాజైన రావణుడు, సీతనుగూర్చి ఈ రీతిగా పలికి తీవ్రమైన క్రోధావేశముతో తిరిగి ఇట్లనెను.

**శ్లో॥ ద్వౌ మాసౌ రక్షితవ్యౌ మే యోఽవధిస్తే మయా కృతః ।**
**తత శ్శయన మారోహ మమ త్వం వరవర్ణిని ॥ 8**

**పదచ్ఛేదము** :- ద్వౌ - మాసౌ - రక్షితవ్యౌ - మే - యః - అవధిః - తే - మయా - కృతః, తతః - శయనమ్ - ఆరోహ - మమ - త్వం - వరవర్ణిని ॥

**అన్వయక్రమము** :- వరవర్ణిని! మయా యః అవధి కృతః, (తదనుసారేణ) మే ద్వౌ మాసౌ రక్షితవ్యౌ; తతః త్వం మమ శయనమ్ ఆరోహ.

**ప్రతిపదార్థము** :- వరవర్ణిని = ఓ సుందరాంగీ! తే = నీకు, మయా = నాచేత, యః అవధిః కృతః = ఏ హద్దు ఏర్పరచబడినదో, (తదనుసారేణ = ఆహద్దు ననుసరించి) మే = నాకు, ద్వౌ మాసౌ = రెండునెలలు, రక్షితవ్యౌ = వేచియుండవలసి యున్నది. తతః = పిమ్మట, త్వం = నీవు, మమ శయనం = నాశయ్యను, ఆరోహ = అధిష్ఠింపుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'వర్తతే దశమో మాసౌ ద్వౌ తు శేషౌ ప్లవంగమ' అని సీతమ్మ ముందు చెప్పబోవు వచనమున కీ రెండుమాసముల అవధి స్వల్పదినముల భేదమే కావున విరుద్ధము గాదు.

**రామాయణశిరోమణి** :- "తతః మమ శయనమ్ ఆరోహ", మమ = నాకు, శయనం = దీర్ఘనిద్రారూపమైన మరణము అని, ఆరోహ = తెలిసికొనుము, అనగా నీవు రామస్మరణ విడువనిచో నీ ఎదుటనే నేను మరణింతునని రావణుని భావము.

**తాత్పర్యము** :- సుందరీ! నీ కొసగినట్టి సమయమును అనుసరించి ఇంకను నేను రెండు మాసములు కాచుకొని యుండవలసియున్నది. ఆ రెండు నెలలపిమ్మట నీవు నా శయనమును ఆరోహింపక తప్పదు సుమా!

**శ్లో॥ ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం భర్తారం మా మనిచ్ఛతీమ్ ।**
**మమ త్వాం ప్రాతరాశార్థ మాలభంతే మహానసే ॥ 9**

**పదచ్ఛేదము** :- ఊర్ధ్వం - ద్వాభ్యాం - తు - మాసాభ్యాం - భర్తారం - మామ్ - అనిచ్ఛతీమ్, మమ - త్వాం - ప్రాతరాశార్థమ్ - ఆలభంతే - మహానసే ॥

**అన్వయక్రమము** :- ద్వాభ్యాం మాసాభ్యామ్ ఊర్ధ్వం తు మాం భర్తారమ్ అనిచ్ఛతీం

త్వాం మమ మహానసే ప్రాతరాశార్థమ్ ఆలభంతే.

**ప్రతిపదార్థము :–** ద్వాభ్యాం మాసాభ్యాం ఊర్ధ్వం తు = రెండునెలలు దాటిన పిమ్మట మాత్రము, మాం = నన్ను, భర్తారం = భర్తగా, అనిచ్ఛతీం = అంగీకరించనట్టి, త్వాం = నిన్ను, మమ మహానసే = నా వంటయింటియందు, ప్రాతరాశార్థం = ఉదయకాలపు భోజనమునకై, ఆలభంతే = చంపివేయుదురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి :–** "భర్తారం" – నీ భర్తయైనట్టి రాముని మఱియు 'మాం అనిచ్ఛతీమ్ త్వాం' నా లంకైశ్వర్యమును ఒల్లని నిన్నును గూడ వధింతురు అని భావము.

**బొంబాయి ముద్రణము :–** "ఆలభంతే మహానసే" అనుటకు బదులుగా "సుదాశ్ఛేత్స్యంతి ఖండశః" అని గలదు (నా వంటలవారు నిన్ను ముక్కలుగా ఖండింతురు).

**తాత్పర్యము :–** ఆ రెండునెలలు గడచిన పిమ్మట మాత్రము అప్పటికిని నీవు నన్ను భర్తగా అంగీకరింపక పోయినచో నా వంటలవారు నిన్ను నా వంటయింటిలో నా ప్రాతఃకాలభోజనముకొఱకై నిన్ను చంపి వండి పెట్టుదురు సుమా!

**శ్లో॥ తాం తర్జ్యమానాం సంప్రేక్ష్య రాక్షసేంద్రేణ జానకీమ్ ।**
**దేవగంధర్వకన్యా స్తా విషేదు ర్వికృతేక్షణాః ॥ 10**

**పదచ్ఛేదము :–** తాం – తర్జ్యమానాం – సంప్రేక్ష్య – రాక్షసేంద్రేణ – జానకీమ్, దేవగంధర్వకన్యాః – తాః – విషేదుః – వికృతేక్షణాః ॥

**అన్వయక్రమము :–** రాక్షసేంద్రేణ తర్జ్యమానాం, తాం జానకీం సంప్రేక్ష్య, తాః దేవగంధర్వకన్యాః వికృతేక్షణాః (సత్యః) విషేదుః.

**ప్రతిపదార్థము :–** రాక్షసేంద్రేణ = రాక్షసరాజుచే, తర్జ్యమానాం = గద్దింపబడుచున్నట్టి, తాం జానకీం = ఆ సీతాదేవిని, సంప్రేక్ష్య = చూచి, తాః దేవగంధర్వకన్యాః = ఆ దేవగంధర్వకన్యకలు, వికృతేక్షణాః (సత్యః) = వికారము నొందినట్టి కన్నులు గలవారై, విషేదుః = దుఃఖించిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'దేవగంధర్వకన్యాః' – సీతవలెనే బలాత్కారముగా, తీసికొని రాబడినట్టి వారు, అతనిని విధిలేక అంగీకరించినట్టివారు.

**తాత్పర్యము** :- ఆ రాక్షసరాజుచే ఈ విధముగా క్రూరముగా గద్దింపబడుచున్నట్టి సీతాదేవిని జూచి, దేవగంధర్వకుమారికలు తమ తమ కన్నులు చెమ్మగిల్లుచుండగా మిక్కిలి విషాదమును పొందిరి.

**శ్లో॥ ఓష్ఠప్రకారై రపరా వక్త్రనేత్రై స్తథాపరాః ।**
**సీతా మాశ్వాసయామాసు స్తర్జితాం తేన రక్షసా ॥ 11**

**పదచ్ఛేదము** :- ఓష్ఠప్రకారైః - అపరాః - వక్త్రనేత్రైః - తథా - అపరాః - సీతామ్ - ఆశ్వాసయామాసుః - తర్జితాం - తేన - రక్షసా ॥

**అన్వయక్రమము** :- తేన రక్షసా తర్జితాం సీతామ్ అపరాః ఓష్ఠప్రకారైః, తథా అపరాః వక్త్రనేత్రైః ఆశ్వాసయామాసుః.

**ప్రతిపదార్థము** :- తేన రక్షసా = ఆ రాక్షసునిచే, తర్జితాం సీతాం = బెదిరింపబడుచున్న సీతాదేవిని, అపరాః = కొంతమంది దేవగంధర్వకన్యలు, ఓష్ఠప్రకారైః = పెదవుల కదలికచేతను, తథా అపరాః = అట్లే మరికొందరు, వక్త్రనేత్రైః = నోటితోడను, కన్నులతోడను, ఆశ్వాసయామాసుః = ఓదార్చుచుండిరి.

**తాత్పర్యము** :- ఈ విధముగా రావణుడు సీతను భయంకరముగా బెదరించుచుండగా, అచటి దేవగంధర్వకన్యలు, దీనికి నీవేమియు బెదరిపోవకు మని తమ పెదవుల యొక్కయు, నోటియొక్కయు, కన్నుల యొక్కయు, కదలికలతో గూడిన సంజ్ఞలతో ఓదార్చి సీతమ్మకు ధైర్యమును చెప్పుచుండిరి.

**శ్లో॥ తాభి రాశ్వాసితా సీతా రావణం రాక్షసాధిపమ్ ।**
**ఉవా చాత్మహితం వాక్యం వృత్తశౌండీర్యగర్వితమ్ ॥ 12**

**పదచ్ఛేదము** :- తాభిః - ఆశ్వాసితా - సీతా - రావణం - రాక్షసాధిపమ్ - ఉవాచ, ఆత్మహితం - వాక్యం - వృత్తశౌండీర్యగర్వితమ్ ॥

**అన్వయక్రమము** :- తాభిః ఆశ్వాసితా సీతా, రాక్షసాధిపం రావణం వృత్తశౌండీర్య గర్వితమ్, ఆత్మహితం వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :- తాభిః అశ్వాసితా = ఆ దేవతాగంధర్వకన్యలచే ఊరడింపబడినట్టి, సీతా = సీతాదేవి, రాక్షసాధిపం రావణం = రాక్షసరాజైన రావణుని గూర్చి, వృత్త శౌండీర్య గర్వితం = తన పాతివ్రత్య ప్రభావముచే కలిగిన గర్వముతో కూడినట్టి, ఆత్మహితం వాక్యం = తనకు హితమైన వాక్యమును, ఉవాచ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "ఆత్మహితం వాక్యం" – రావణుని ఆత్మకు హితమైన, వృత్త శౌండీర్య గర్వితం = తన పాతివ్రత్యముచేతను, భర్తయొక్క శౌర్యమహిమచేతను లభించిన గర్వము కలిగినట్టి.

**తాత్పర్యము :–** ఆ దేవగంధర్వకన్యలచే ఓదార్చబడుచున్న సీతాదేవి, తన పాతివ్రత్యము చేతను, శ్రీరాముని పరాక్రమముచేతను కలిగిన గర్వముతో, తనకు హితమైన వచనములను తిరిగి ఇట్లు పలికెను.

**శ్లో॥ నూనం న తే జనః కశ్చి దస్తి నిశ్శ్రేయసే స్థితః ।**
**నివారయతి యో న త్వాం కర్మణో ఽస్మాద్విగర్హితాత్ ॥ 13**

**పదచ్ఛేదము :–** నూనం – న – తే – జనః – కశ్చిత్ – అస్తి – నిశ్శ్రేయసే – స్థితః – నివారయతి – యః – న – త్వాం – కర్మణః – అస్మాత్ – విగర్హితాత్ ॥

**అన్వయక్రమము :–** యః త్వామ్ అస్మాత్ విగర్హితాత్ కర్మణః నివారయతి; తే నిఃశ్రేయసే స్థితః సః జనః నూనం కశ్చిత్ న అస్తి.

**ప్రతిపదార్థము :–** యః = ఎవడయితే, విగర్హితాత్ = నింద్యమైనట్టి, కర్మణః = ఈ కృత్యము నుండి, నివారయతి = నివర్తింపజేయునో, తే నిఃశ్రేయసే స్థితః = నీక్షేమము నందుండునో, సః జనః = ఆ మనుష్యుడు, నూనం = నిశ్చయముగా, కశ్చిత్ న అస్తి = ఎవ్వడును లేడు.

**తాత్పర్యము :–** ఓ రావణాసురుడా! ఈ లంకానగరమునందు పరదారచౌర్యమువంటి గర్హణీయమైన కృత్యము చేయకుండ నిన్ను నివారించునట్టి నీమేలు కోరిన వ్యక్తి ఎవ్వరును నిశ్చయముగా లేనే లేరని అనుకొనుచున్నాను.

**శ్లో॥ మాం హి ధర్మాత్మనః పత్నీం శచీమివ శచీపతేః ।**
**త్వదన్య స్త్రిషు లోకేషు ప్రార్థయే న్మనసాఽపి కః ॥ 14**

**పదచ్ఛేదము :–** మాం – హి – ధర్మాత్మనః – పత్నీం – శచీమ్ – ఇవ – శచీపతేః – త్వదన్యః – త్రిషు – లోకేషు – ప్రార్థయేత్ – మనసా – అపి – కః ॥

**అన్వయక్రమము :–** శచీపతేః శచీమ్ ఇవ, ధర్మాత్మనః పత్నీం మాం త్రిషు లోకేషు మనసా అపి, త్వదన్యః కః ప్రార్థయేత్ ?

**ప్రతిపదార్థము :-** శచీపతేః శచీమ్ ఇవ = దేవేంద్రుని పట్టమహిషియైన శచీదేవినివలె, ధర్మాత్మనః పత్నీం మాం = పరమధార్మికుడైన శ్రీరాముని భార్యనగు నన్ను, త్రిషు లోకేషు = ముల్లోకములందును, త్వదన్యః కః = నీకంటె వేరెవ్వడు, మనసా అపి = మనస్సుచే గూడ, ప్రార్థయేత్ = కోరును ?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** "మనసాపి కః ప్రార్థయేత్" మాటలతో కోరువాడు ఉండుట పూర్తిగా అసంభవమని భావము.

**తాత్పర్యము :-** దేవేంద్రుని పట్టమహిషియైన శచీదేవిని భార్యగా కోరినట్లుగా, ధర్మాత్ముడైన యా శ్రీరాముని భార్యనగు నన్ను, ముజ్జగములందును నీవు గాక మఱియెవ్వడును తన మనస్సునందైన వాంఛింపగలడా!

**శ్లో॥ రాక్షసాధమ రామస్య భార్యా మమితతేజసః ।**
**ఉక్తవా నసి యత్పాపం క్వ గత స్తస్య మోక్ష్యసే ॥ 15**

**పదచ్ఛేదము :-** రాక్షసాధమ - రామస్య - భార్యామ్ - అమితతేజసః - ఉక్తవాన్ - అసి - యత్ - పాపం - క్వ - గతః - తస్య - మోక్ష్యసే ?

**అన్వయక్రమము :-** రాక్షసాధమ! అమితతేజసః రామస్య భార్యాం యత్ పాపమ్ ఉక్తవాన్ అసి, క్వ గతః తస్య మోక్ష్యసే ?

**ప్రతిపదార్థము :-** రాక్షసాధమ = రాక్షసులందెల్ల అధముడైన రావణా! అమితతేజసః = అపారమైన పరాక్రమముగల, రామస్య = శ్రీరామునియొక్క, భార్యాం = ధర్మపత్నియైన నన్నుగూర్చి, యత్ పాపమ్ ఉక్తవాన్ అసి = ఏ పాపవచనము పలికినవాడవైతివో, తస్య (తస్మాత్) = ఆ పాతకమునుండి, క్వ గతః = ఎచటికి పోయినవాడవై, మోక్ష్యసే = విడువబడగలవు?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** "యత్ పాపం" - 'మమ శయనమ్ ఆరోహ' ఇత్యాదిరూపమ్ - నా శయ్యపై చేరవలసినదని నీవు పలికిన పాపపు మాటలు, 'క్వ గతః మోక్ష్యసే' - ఆ పాపముచే ఫలించునట్టి నీ సమూలవినాశనమునకు పరిహారము ఎచటకు పోయినను అశక్యము అని భావము.

**తాత్పర్యము :-** ఓ రాక్షసాధమా! అమితప్రతాపశాలియైన శ్రీరాముని భార్యను గూర్చి

ఏ పాపవచనములు నీవు పలికియుంటివో ఆ పాతకమును నీవు ఎచటికి బోయి ఏమి చేసి పోగొట్టుకొనగలవు?

**శ్లో॥ యథా దృప్తశ్చ మాతంగః శశశ్చ సహితౌ వనే ।**
**తథా ద్విరదవ ద్రామ స్త్వం నీచశశవత్ స్మృతః ॥ 16**

**పదచ్ఛేదము** :– యథా – దృప్తః – చ – మాతంగః – శశః – చ – సహితౌ – వనే – తథా – ద్విరదవత్ – రామః – త్వం – నీచశశవత్ – స్మృతః ॥

**అన్వయక్రమము** :– వనే యథా దృప్తః మాతంగశ్చ, శశశ్చ సహితౌ, తథా (అత్ర) రామః ద్విరదవత్, త్వం నీచశశవత్ స్మృతః.

**ప్రతిపదార్థము** :– వనే = అరణ్యమునందు, యథా = ఏ విధముగా, దృప్తః మాతంగశ్చ = మదించినట్టి ఏనుగును, శశశ్చ = కుందేలును, సహితౌ = కూడియుండునో, తథా = ఆ రీతిగా, అత్ర = ఇచ్చుట, రామః ద్విరదవత్ = శ్రీరాముడు మత్తగజము వంటివాడుగా, స్మృతః = తలచబడును. త్వం నీచశశవత్ = నీవు క్షుద్రమైన కుందేలు వంటివాడవుగా, స్మృతః = తలచబడుదువు.

పాఠాంతరము – సహితో వనే – అని కలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– ఇచట రావణుడు తనకు మదపుటేనుగుతో సామ్యము చెప్పబడుచున్నదని భ్రమ చెందకుండ రాముడు ఏనుగువంటివాడు నీవు కుందేటివంటి వాడవని సీతమ్మయే స్పష్టము చేసి చెప్పినది.

**తాత్పర్యము** :– అరణ్యమునందు మదపుటేనుగున్న చోటికి కుందేలు చేరి నీతో యుద్ధమునకు వచ్చితి నన్నట్లుగా, మత్తేభమువంటి శ్రీరామునితో కుందేలు వంటి నీవు సామ్యము చెప్పుకొనుచున్నావు.

**శ్లో॥ స త్వ మిక్ష్వాకునాథం వై క్షిప న్నిహ న లజ్జసే ।**
**చక్షుషో ర్విషయం తస్య న తావ దుపగచ్ఛసి ॥ 17**

**పదచ్ఛేదము** :– సః – త్వమ్ – ఇక్ష్వాకునాథం – వై – క్షిపన్ – ఇహ – న – లజ్జసే, చక్షుషోః – విషయం – తస్య – న – తావత్ – ఉపగచ్ఛసి ॥

**అన్వయక్రమము** :– సః త్వమ్ ఇక్ష్వాకునాథం క్షిపన్ ఇహ న లజ్జసే, తస్య చక్షుషోః విషయం తావత్ న ఉపగచ్ఛసి.

**ప్రతిపదార్థము :-** సః త్వం = అట్టి నీవు, ఇక్ష్వాకునాథం = ఇక్ష్వాకుప్రభువును, ఇహ = ఈ లంకయందు, క్షిపన్ = నిందించుచు, న లజ్జసే = సిగ్గుపడుటలేదు, తస్య చక్షుషోః విషయం తావత్ = ఆ మహాత్ముని కన్నులకు కాన్పించుట మాత్రము, న ఉపగచ్ఛసి = పొందలేకున్నావు.

**తాత్పర్యము :-** కుందేలువలె క్షుద్రుడవైన నీవు ఈ లంకలో కూర్చుండి మదగజమువంటి ఆ ఇక్ష్వాకుప్రభువును నిందించుటకు ఏమియును సిగ్గుపడకున్నావు. ఇంతకును అతని కన్నుల ఎదుట నిలుచు ధైర్యము ఎప్పుడును నీవు చూపలేదు గదా!

**శ్లో॥ ఇమే తే నయనే క్రూరే విరూపే కృష్ణపింగళే ।**
**క్షితౌ న పతితే కస్మా న్మా మనార్య నిరీక్షతః ॥ 18**

**పదచ్ఛేదము :-** ఇమే - తే - నయనే - క్రూరే - విరూపే - కృష్ణపింగళే - క్షితౌ - న - పతితే - కస్మాత్ - మామ్ - అనార్య - నిరీక్షతః ॥

**అన్వయక్రమము :-** అనార్య! మాం నిరీక్షతః తే ఇమే క్రూరే, విరూపే, కృష్ణపింగళే నయనే కస్మాత్ క్షితౌ న పతితే ?

**ప్రతిపదార్థము :-** అనార్య = ఓ నీచుడా! మాం నిరీక్షతః = నన్ను (దుష్టబుద్ధితో) చూచుచున్న, తే = నీయొక్క, ఇమే = ఈ, క్రూరే = క్రూరమైనట్టి, విరూపే = వికృతములైనట్టి, కృష్ణపింగళే = నల్లని పచ్చని రంగుతో నున్న, నయనే = రెండు కన్నులును, కస్మాత్ = ఎందువలన, క్షితౌ న పతితే = నేలపై రాలిపోకున్నవి?

**తాత్పర్యము :-** ఓ నీచుడా! నన్ను పాపబుద్ధితో చూచుచున్నట్టి నీ క్రూరమైన, వికారమైన, భీకరవర్ణము గల ఈ నీ రెండు కన్నులును ఇంకను ఎందుచేత నేలపై రాలి పోవకున్నవి?

**శ్లో॥ తస్య ధర్మాత్మనః పత్నీం స్నుషాం దశరథస్య చ ।**
**కథం వ్యాహరతో మాం తే న జిహ్వా వ్యవశీర్యతే ॥ 19**

**పదచ్ఛేదము :-** తస్య - ధర్మాత్మనః - పత్నీం - స్నుషాం - దశరథస్య - చ - కథం - వ్యాహరతః - మాం - తే - న - జిహ్వా - వ్యవశీర్యతే ॥

**అన్వయక్రమము :-** ధర్మాత్మనః తస్య పత్నీం, దశరథస్య స్నుషాం మాం వ్యాహరతః తే జిహ్వా కథం న వ్యవశీర్యతే ?

**ప్రతిపదార్థము** :- తస్య ధర్మాత్మనః పత్నీం = ఆ పరమధార్మికుడైన శ్రీరాముని భార్యనైనట్టి, తస్య దశరథస్య స్నుషాం = ఆ దశరథుని కోడలినైనట్టి, మాం = నన్ను, వ్యాహరతః = (ఇష్టము వచ్చినట్లు) మాటలాడుచున్న, తే = నీయొక్క, జిహ్వా = నాలుక, కథం న వ్యవశీర్యతే = ఏల చీలికయైపోవుటలేదు?

**తాత్పర్యము** :- ధర్మాత్ముడైన శ్రీరాముని భార్యను, దశరథుని కోడలిని అగు నన్ను, నోటికి వచ్చినట్లు దుర్భాషలాడుచున్న నీ నాలుక ఏల చీలిపోకయున్నదోకదా!

**శ్లో॥ అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్ ।**
**న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హతేజసా ॥ 20**

**పదచ్ఛేదము** :- అసందేశాత్ - తు - రామస్య - తపసః - చ - అనుపాలనాత్ - న - త్వాం - కుర్మి - దశగ్రీవ - భస్మ - భస్మార్హతేజసా ॥

**అన్వయక్రమము** :- దశగ్రీవ! రామస్య అసందేశాత్, తపసః అనుపాలనాత్ చ, త్వాం భస్మార్హతేజసా, భస్మ న కుర్మి.

**ప్రతిపదార్థము** :- దశగ్రీవ! = ఓ దశకంఠుడా! రామస్య అసందేశాత్ = రాముని ఆజ్ఞ లేకపోవుటవలనను, తపసః అనుపాలనాత్ చ = తపోవ్రతమును అనుసరించుట వలనను, భస్మార్హతేజసా = భస్మము చేయుటకు శక్తిగల నా తేజముచేత, త్వాం = నిన్ను, భస్మ న కుర్మి = భస్మము చేయకున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- "భస్మార్హ తేజసా" అను పదమునందు 'భస్మార్హ' అనునది సంబోధనముగా చేసి (భస్మమగుటకు తగినవాడా! అని) అర్థము చెప్పవచ్చును.

**వాసుదాసస్వామి** :- నిన్ను చంపుటకు రామచంద్రమూర్తి రావలయునా? నేనే నిన్ను భస్మము చేయలేనా? నీ కింత శక్తి యుండిన ఏల చేయరా దందువా? నేను కేవలము పరతంత్రురాలను; నాయొక్క రక్షణభారము నాభర్తపైన వైచియున్నదానను. అప్పట్లో నేను స్వతంత్రించి నిన్ను చంపితినా నా పారతంత్ర్యమునకు హానివచ్చును. భర్త యాజ్ఞ లేని కార్యము నేను చేసినచో నా పాతివ్రత్యమునకే హానివచ్చును గదా!

**తాత్పర్యము** :- భస్మము చేయవలసియున్న పాతకుడైన ఓదశకంఠుడా! నా రాముడు నాకు అనుజ్ఞ ఇవ్వకుండుటచేతను, నా పాతివ్రత్యతపస్సునకు భంగము కలుగ గూడదనియును ప్రచండమైన నా తేజముచేత నిన్ను భస్మము చేయదలచుకొనలేదు సుమా!

**శ్లో॥ నాపహర్తు మహం శక్యా త్వయా రామస్య ధీమతః ।**
**విధి స్తవ వధార్థాయ విహితో నాత్ర సంశయః ॥ 21**

**పదచ్ఛేదము :-** న - అపహర్తుమ్ - అహం - శక్యా - త్వయా - రామస్య - ధీమతః, విధిః - తవ - వధార్థాయ - విహితః - న - అత్ర - సంశయః ॥

**అన్వయక్రమము :-** ధీమతః రామస్య అహం త్వయా అపహర్తుం న శక్యా; (ఏషః) విధిః, తవ వధార్థాయ విహితః; అత్ర సంశయః న.

**ప్రతిపదార్థము :-** ధీమతః రామస్య = ప్రజ్ఞాశాలియైన శ్రీరామునియొక్క, అహం = (భార్యనైన) నేను, త్వయా = నీచే, అపహర్తుం = దొంగిలింపబడుటకు, న శక్యా = సాధ్యురాలను గాను, ఏషః విధిః = ఈ ఘటనము, తవ వధార్థాయ = నీ మృత్యువుకొరకు (విహితః = విధింపబడినది), అత్ర సంశయః న = ఇందు సందియము లేదు.

**తాత్పర్యము :-** ప్రజ్ఞాశాలియైన ఆ శ్రీరాముని అధీనమందున్న నన్ను దొంగిలించుట నీకు శక్యమైన విషయము కాదు. కాని దైవమే నీకు మృత్యువును కల్పించుటకు ఈ విధముగా ఏర్పాటుచేసినాడు. ఈ విషయమున సందేహము లేదు.

**శ్లో॥ శూరేణ ధనదభ్రాత్రా బలై స్సముదితేన చ ।**
**అపోహ్య రామం కస్మాద్ధి దారచౌర్యం త్వయా కృతమ్ ॥ 22**

**పదచ్ఛేదము :-** శూరేణ - ధనదభ్రాత్రా - బలైః - సముదితేన - చ - అపోహ్య - రామం - కస్మాత్ - హి - దారచౌర్యం - త్వయా - కృతమ్ ॥

**అన్వయక్రమము :-** శూరేణ, ధనదభ్రాత్రా, బలైః సముదితేన చ త్వయా రామం అపోహ్య కస్మాత్ దారచౌర్యం కృతమ్ ?

**ప్రతిపదార్థము :-** శూరేణ = మహావీరుడవును, ధనదభ్రాత్రా = కుబేరునకు తమ్ముడవును, బలైః సముదితేన = బలముతో తులతూగు చున్నవాడవునగు, త్వయా = నీచేత, కస్మాత్ = ఏకారణమువలన, రామమ్ అపోహ్య = శ్రీరాముని దూరముచేసి, దారచౌర్యం కృతం = భార్యాపహరణము చేయబడినది.

**తాత్పర్యము :-** మహావీరుడవును, కుబేరుని తమ్ముడవును, అమితబలసంపదలతో విరాజిల్లుచున్నవాడవు నైనట్టి ఘనుడవు, ఆనాడు పర్ణశాలలో నా భర్తయైన శ్రీరాముని, అతని సోదరుని దూరముచేసి నన్ను ఏల దొంగిలించి తెచ్చితివి?

**శ్లో॥ సీతాయా వచనం శ్రుత్వా రావణో రాక్షసాధిపః ।
వివృత్య నయనే క్రూరే జానకీ మన్వవైక్షత ॥ 23**

**పదచ్ఛేదము :-** సీతాయాః - వచనం - శ్రుత్వా - రావణః - రాక్షసాధిపః - వివృత్య - నయనే - క్రూరే - జానకీమ్ - అన్వవైక్షత ॥

**అన్వయక్రమము :-** రాక్షసాధిపః రావణః, సీతాయాః వచనం శ్రుత్వా, క్రూరే నయనే వివృత్య, జానకీమ్ అన్వవైక్షత.

**ప్రతిపదార్థము :-** రాక్షసాధిపః రావణః = రాక్షసరాజైన రావణుడు, సీతాయాః వచనం = సీతమ్మమాటలను, శ్రుత్వా = విని, క్రూరే = తీక్ష్ణములైన, నయనే = కన్నులను, వివృత్య = పెద్దవిగ చేసి, జానకీం = సీతాదేవిని, అన్వవైక్షత = చూచెను.

**తాత్పర్యము :-** రావణాసురుడు సీతాదేవి పలికిన మాటలు విని భీకరమైన తన నేత్రములను పెద్దవిగ చేసి ఆమెవైపు ఉగ్రముగా చూచెను.

**శ్లో॥ నీలజీమూతసంకాశః మహాభుజశిరోధరః ।
సింహసత్త్వగతి శ్రీమాన్ దీప్తజిహ్వాగ్రలోచనః ॥ 24**

**పదచ్ఛేదము :-** నీలజీమూతసంకాశః - మహాభుజశిరోధరః - సింహసత్త్వగతిః - శ్రీమాన్ - దీప్తజిహ్వాగ్రలోచనః ॥

**అన్వయక్రమము :-** సుగమము.

**ప్రతిపదార్థము :-** నీలజీమూతసంకాశః = నల్లని మేఘముతో సమానుడును, మహాభుజశిరోధరః = గొప్పవైన భుజములును, కంఠమును గలవాడును, సింహసత్త్వగతిః = సింహమువంటి బలమును గమనమును గలవాడును, శ్రీమాన్ = గొప్పశోభకల్గియున్నవాడును, దీప్తజిహ్వాగ్రలోచనః = జ్వలించుచున్న నాలుక కొనయును, కన్నులును గల్గియున్న వాడును అగు, (రావణః = రావణుడు), ఉవాచ = పలికెను. (అని 30వ శ్లోకముతో అన్వయము).

**తాత్పర్యము :-** రావణుడు అప్పుడు నల్లని పెద్దమేఘమువలె కానవచ్చుచుండెను. దీర్ఘములైన బాహువులను కంఠమును కల్గి యుండెను. అతని బలమును, గమనమును సింహమును బోలియుండెను. ప్రజ్వలించుచున్న కనులును జిహ్వాగ్రమును గలవాడై అతడు సీతను చూచి ఇట్లు పలికెను.

శ్లో॥ చలాగ్రమకుటప్రాంశు శ్చిత్రమాల్యానులేపనః ।
రక్తమాల్యాంబరధర స్తప్తాంగదవిభూషణః ॥ 25

**పదచ్ఛేదము** :- చలాగ్రమకుటప్రాంశుః - చిత్రమాల్యానులేపనః - రక్త మాల్యాంబరధరః - తప్తాంగదవిభూషణః ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- చలాగ్రమకుటప్రాంశుః = చలించుచున్న చివరి భాగముగల కిరీటముతో మిక్కిలి పొడగరియైనవాడును, చిత్రమాల్యానులేపనః = రంగు రంగుల పూలమాలికలును, మైపూతలును గలవాడును, రక్తమాల్యాంబరధరః = ఎర్రని పుష్పమాలికలను వస్త్రములను ధరించినవాడును, తప్తాంగదవిభూషణః = ప్రకాశించుచున్న భుజకీర్తులు ఆభరణములుగ ధరించినవాడును అగు (రావణః = రావణుడు, ఉవాచ = పలికెను).

**తాత్పర్యము** :- పొడవైన అతని శరీరమున కిరీటముయొక్క అగ్రము కదులుచుండెను. అతడు రంగు రంగుల పూలమాలికలను, మైపూతలను ధరించియుండెను. మరియు నాతడు ఎఱ్ఱనిపుష్పమాలికలను వస్త్రములను ధరించియుండెను. అతని భుజకీర్తులు గొప్ప ప్రకాశముతో మెఱయుచుండెను. ఇట్టి అతడు సీతను చూచి ఇట్లు పలికెను.

శ్లో॥ శ్రోణిసూత్రేణ మహతా మేచకేన సుసంవృతః ।
అమృతోత్పాదనద్ధేన భుజగేనేవ మందరః ॥ 26

**పదచ్ఛేదము** :- శ్రోణిసూత్రేణ - మహతా - మేచకేన - సుసంవృతః - అమృతోత్పాదనద్ధేన - భుజగేన - ఇవ - మందరః ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- అమృతోత్పాదనద్ధేన = అమృతసంపాదనము కొరకు చుట్టబెట్టినట్టి, భుజగేన = సర్పముచే (వాసుకిచే), మందరః ఇవ = మందర పర్వతమువలె, మేచకేన = నల్లనైన (నెమలికన్నులవంటి) రంగుకలిగిన, మహతా శ్రోణిసూత్రేణ = పెద్దదైన మొలనూలిచే, సుసంవృతః = చక్కగా చుట్టబడియున్న వాడును అగు (రావణః = రావణుడు, ఉవాచ = పలికెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- మేచకేన - ఇంద్రనీలమణులచే పొదగబడి యుండుటచే మొలనూలు నల్లగ నున్నదని భావము. వాసుకి నల్లనిరంగు వాడని చెప్పుదురు.

**తాత్పర్యము :–** అమృతోత్పాదనముకొరకై నల్లనైన వాసుకియను సర్పముచే చుట్టబడినట్టి మందరపర్వతమువలె రావణుడు, ఇంద్రనీలములతో నల్లగనున్న పెద్దదైన కటి సూత్రమును తన నడుముపై ధరించి యుండెను.

**శ్లో॥ తాభ్యాం స పరిపూర్ణాభ్యాం భుజాభ్యాం రాక్షసేశ్వరః ।**
**శుశుభే ఽచలసంకాశ శ్శృంగాభ్యామివ మందరః ॥ 27**

**పదచ్ఛేదము :–** తాభ్యాం – సః – పరిపూర్ణాభ్యాం – భుజాభ్యాం – రాక్షసేశ్వరః – శుశుభే – అచలసంకాశః – శృంగాభ్యామ్ – ఇవ – మందరః ॥

**అన్వయక్రమము :–** సః రాక్షసేశ్వరః శృంగాభ్యాం మందరః ఇవ, పరిపూర్ణాభ్యాం తాభ్యామ్ భుజాభ్యామ్, అచలసంకాశః, (సన్) శుశుభే, (ఉవాచ చ).

**ప్రతిపదార్థము :–** సః రాక్షసేశ్వరః = ఆ రాక్షసచక్రవర్తి, శృంగాభ్యాం మందరః ఇవ = రెండు శిఖరములతో నున్న మందరపర్వతమువలె, పరిపూర్ణాభ్యాం = నిండుగ నున్నట్టి, తాభ్యాం భుజాభ్యాం = జగత్ప్రసిద్ధములైన రెండుబాహువులతో, అచల సంకాశః, (సన్) = పర్వతసన్నిభుడై, శుశుభే = శోభిల్లెను. (ఉవాచ = పలికెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "భుజాభ్యాం" – రావణునకు యుద్ధము మున్నగు సమయములందే ఇరువది బాహువులుండును. కాని అతడు నిత్యము ద్విభుజములతో మాత్రమే యుండునని తెలిసికొనవలెను. కొందరు వ్యాఖ్యాతలు అతని కుడి ఎడమ బాహువులను రెండింటిని మాత్రమే విభజించుచు ద్వివచనము వాడబడిన దనిరి.

**రామాయణ శిరోమణి :–** రావణుడు కామరూపి గావున అతడు తన ఇష్టము వచ్చినట్లు స్వేచ్ఛగా ఎన్నిభుజములతో నైన నుండును.

**తాత్పర్యము :–** అప్పుడు బలిష్ఠములయిన తన రెండు భుజములతో గంభీరమైన దేహము కలిగిన రావణుడు, రెండు శిఖరములతో కూడిన మందరపర్వతమువలె శోభిల్లుచు సీతమ్మతో ఇట్లు పలికెను.

**శ్లో॥ తరుణాదిత్యవర్ణాభ్యాం కుండలాభ్యాం విభూషితః ।**
**రక్తపల్లవపుష్పాభ్యా మశోకాభ్యా మివాచలః ॥ 28**

**పదచ్ఛేదము :–** తరుణాదిత్యవర్ణాభ్యాం – కుండలాభ్యాం – విభూషితః – రక్తపల్లవ పుష్పాభ్యామ్ – అశోకాభ్యామ్ – ఇవ – అచలః ॥

**అన్వయక్రమము** :- రక్తపల్లవపుష్పాభ్యామ్, అశోకాభ్యామ్ అచలః ఇవ, తరుణాదిత్య వర్ణాభ్యాం కుండలాభ్యాం విభూషితః (సన్) (ఉవాచ = పలికెను.)

**ప్రతిపదార్థము** :- రక్తపల్లవపుష్పాభ్యాం = ఎఱ్ఱని చిగుళ్ళతోను, పుష్పములతోను నిండిన, అశోకాభ్యాం = రెండు అశోకవృక్షములతో, అచలః ఇవ = పర్వతమువలె, తరుణాదిత్యవర్ణాభ్యాం = లేత సూర్యుని వన్నెగల, కుండలాభ్యాం = కుండలద్వయముతో, విభూషితః (సన్) = అలంకరింపబడినవాడై, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :- లేతసూర్యునివలె ఎఱ్ఱనికాంతితో ప్రకాశించు కర్ణాభరణములతో విరాజిల్లుచున్నట్టి ఆతడు, ఎఱ్ఱని చివుళ్ళను పుష్పములును గల రెండు అశోక వృక్షములతో ముచ్చటగనున్న పర్వతమువలెనే శోభిల్లుచు సీతమ్మతో పలికెను.

**శ్లో॥ స కల్పవృక్షప్రతిమో వసంత ఇవ మూర్తిమాన్ ।**
**శ్మశానచైత్యప్రతిమో భూషితోఽపి భయంకరః ॥ 29**

**పదచ్ఛేదము** :- సః - కల్పవృక్షప్రతిమః - వసంతః - ఇవ - మూర్తిమాన్ - శ్మశానచైత్యప్రతిమః - భూషితః - అపి - భయంకరః ॥

**అన్వయక్రమము** :- కల్పవృక్షప్రతిమః సః, మూర్తిమాన్ వసంతః ఇవ, భూషితః అపి, శ్మశానచైత్యప్రతిమః భయంకరః (సన్ ఉవాచ).

**ప్రతిపదార్థము** :- కల్పవృక్షప్రతిమః సః = కల్పవృక్షముతో సమానుడైన రావణుడు, మూర్తిమాన్ = శరీరమును ధరించిన, వసంతః ఇవ = వసంతుడువలె, భూషితః అపి = అలంకరింపబడినవాడైనప్పటికిని, శ్మశానచైత్యప్రతిమః = శ్మశానము నందలి మండపము వంటివాడుగా, భయంకరః సన్ = భయంకరుడగుచు, (ఉవాచ = పలికెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- రావణుడు తన అలంకారములతో గూడి కల్పవృక్షమువలె సుందరముగానున్నను, తనయొక్క రాక్షసజాతి సహజమైన భయంకరత్వముచే శ్మశానమండపమువలె భీతిగొల్పుచు నుండెనని భావము.

**తిలకము** :- "శ్మశానచైత్యప్రతిమః" - (చైత్యం బౌద్ధాయతనం) శ్మశానమును, బౌద్ధమందిరమును చూడరానివి గదా!

**తాత్పర్యము** :- కల్పవృక్షము వలెను, మూర్తీభవించినట్టి వసంతమువలెను, చక్కని

ఆభరణములతో నిండియున్నను, శ్మశానమునందలి బౌద్ధాయతనమువలె భయంకరముగ కాన్పించుచు, రావణుడు సీతమ్మతో ఇట్లు పలికెను.

**శ్లో॥ అవేక్షమాణో వైదేహీం కోపసంరక్తలోచనః ।**
**ఉవాచ రావణ స్సీతాం భుజంగ ఇవ నిశ్శ్వసన్ ॥ 30**

**పదచ్ఛేదము** :– అవేక్షమాణః – వైదేహీం – కోపసంరక్తలోచనః – ఉవాచ – రావణః – సీతాం – భుజంగః – ఇవ – నిశ్శ్వసన్ ॥

**అన్వయక్రమము** :– కోపసంరక్తలోచనః (సన్) రావణః వైదేహీమ్ అవేక్షమాణః, భుజంగః ఇవ నిశ్శ్వసన్ సీతామ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :– రావణః = రావణుడు, కోపసంరక్తలోచనః = క్రోధముచే ఎఱ్ఱబారినట్టి కన్నులుగలవాడై, వైదేహీమ్ అవేక్షమాణః = సీతాదేవిని చూచుచు, భుజంగః ఇవ నిశ్శ్వసన్ = సర్పమువలె నిట్టూర్చుచు, సీతామ్ ఉవాచ = సీతనుగూర్చి పలికెను.

**తాత్పర్యము** :– రావణుడు అమితమైన క్రోధముచే ఎఱ్ఱబడినట్టి కన్నులు గలవాడై, సీతను క్రూరముగా చూచుచు, మహాసర్పము బుసకొట్టుచున్నట్టు నిట్టూర్చుచు ఆమెతో తిరిగి ఇట్లు పలికెను.

**శ్లో॥ అనయే నాభిసంపన్న మర్థహీన మనువ్రతే ।**
**నాశయా మ్యహ మద్య త్వాం సూర్య స్సంధ్యామివౌజసా ॥ 31**

**పదచ్ఛేదము** :– అనయేన – అభిసంపన్నమ్ – అర్థహీనమ్ – అనువ్రతే – నాశయామి – అహమ్ – అద్య – త్వాం – సూర్యః – సంధ్యామ్ – ఇవ – ఓజసా ॥

**అన్వయక్రమము** :– అనయేన అభిసంపన్నమ్, అర్థహీనమ్ అనువ్రతే! త్వామ్ అహమ్ అద్య సూర్యః ఓజసా సంధ్యామ్ ఇవ నాశయామి.

**ప్రతిపదార్థము** :– అనయేన అభిసంపన్నం = అక్రమములతో నిండి యున్నవాడును, అర్థహీనం = ధనహీనుడునగు (రాముని), అనువ్రతే = అనుసరించుచున్నదానా, త్వాం = నిన్ను, అహం = నేను, అద్య = నేడు, సూర్యః = సూర్యుడు, ఓజసా = (తన) ప్రభచే, సంధ్యామ్ ఇవ = (ఉదయకాలపు) సంధ్యనువలె, నాశయామి = నశింపజేసెదను.

**తాత్పర్యము** :– నీతిమాలినవాడును, ధనహీనుడును అగు రామునియందు అనురక్తిగల ఓ అజ్ఞానురాలా! సూర్యుడు ఉదయకాలమునందలి చీకటిని నాశనము చేసినట్లుగా నిన్ను ఇప్పుడే నశింపచేసెదను చూడుము.

**శ్లో॥ ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః ।**
**సందిదేశ తత స్సర్వా రాక్షసీ ర్ఘోరదర్శనాః ॥ 32**

**పదచ్ఛేదము** :– ఇతి – ఉక్త్వా – మైథిలీం – రాజా – రావణః – శత్రురావణః – సందిదేశ – తతః – సర్వాః – రాక్షసీః – ఘోరదర్శనాః ॥

**అన్వయక్రమము** :– శత్రురావణః, రాజా రావణః, మైథిలీమ్ ఇతి ఉక్త్వా, తతః ఘోరదర్శనాః, సర్వాః రాక్షసీః సందిదేశ.

**ప్రతిపదార్థము** :– శత్రురావణః = శత్రువుల నాక్రోశింప చేయునట్టి, రాజా రావణః = రాక్షసరాజైన రావణుడు, మైథిలీం = సీతాదేవిని గూర్చి, ఇతి ఉక్త్వా = ఈరీతిగా పలికి, తతః = పిమ్మట, ఘోరదర్శనాః = భయంకరమైన దర్శనముగల, సర్వాః రాక్షసీః = అచ్చట రాక్షస స్త్రీలనందరను, సందిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :– శత్రుభీకరుడైన ఆ రావణుడు సీతాదేవితో ఈ రీతిగా బలికి, పిమ్మట అచ్చటనున్న మహాభయంకరులైన రాక్షసాంగనల నెల్లరనుజూచి ఈ విధముగా నాజ్ఞాపించెను.

**శ్లో॥ ఏకాక్షీ మేకకర్ణాం చ కర్ణప్రావరణాం తథా ।**
**గోకర్ణీం హస్తికర్ణీం చ లంబకర్ణీ మకర్ణికామ్ ॥ 33**

**పదచ్ఛేదము** :– ఏకాక్షీమ్ – ఏకకర్ణాం – చ – కర్ణప్రావరణాం – తథా – గోకర్ణీం – హస్తికర్ణీం – చ – లంబకర్ణీమ్ – అకర్ణికామ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– ఏకాక్షీం = ఒంటికన్ను గలదానిని, ఏకకర్ణాం = ఒంటిచెవి గలదానిని, తథా = అట్లు, కర్ణప్రావరణాం = చెవులే ఉత్తరీయముగా గలదానిని, గోకర్ణీం = ఆవుచెవులవంటి చెవులుగల దానిని, హస్తికర్ణీం = ఏనుగుచెవులవంటి చెవులు గలదానిని, లంబకర్ణీం = పొడవుగ వ్రేలాడు చెవులు గలదానిని, అకర్ణికాం = చెవులు లేనిదానిని, (ఆదిదేశ = ఆజ్ఞాపించెను).

**తాత్పర్యము** :– ఆ భీకరాకారలగు రాక్షసాంగనలలో ఏకాకియు, ఏకకర్ణయు, దుప్పటి వంటి కర్ణములు గలదియు, గోకర్ణియు, హస్తికర్ణియు, లంబకర్ణియు, కర్ణములే లేనిదియునగు ఆ యా రాక్షస స్త్రీలను జూచి రావణు డిట్లాజ్ఞాపించెను.

శ్లో॥ **హస్తిపాద్యశ్వపాద్యౌ చ గోపాదీం పాదచూళికామ్ ।**
**ఏకాక్షీ మేకపాదీం చ పృథుపాదీ మపాదికామ్ ॥ 34**

**పదచ్ఛేదము :–** హస్తిపాద్యశ్వపాద్యౌ – చ – గోపాదీం – పాదచూళికామ్, ఏకాక్షీమ్ – ఏకపాదీం – చ – పృథుపాదీమ్ – అపాదికామ్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** హస్తిపాద్యశ్వపాద్యౌ చ = ఏనుగుపాదమువంటి పాదముగలదానిని, గుఱ్ఱము పాదమువంటి పాదము కలదానిని, గోపాదీం = గోవుపాదమువంటి పాదము గలదానిని, పాదచూళికాం = పాదములయందు జుట్టుకలదానిని, ఏకాక్షీం = ఒక్కకన్నుగల దానిని, పృథుపాదీం = స్థూలమైన పాదములు గలదానిని, అపాదికామ్ = పాదములే లేనట్టిదానిని, (ఆదిదేశ = ఆజ్ఞాపించెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఏకాక్షీం – ఇచట తెలుపబడిన ఏకాక్షి మరియొక రాక్షసి, అనగా ఇరువురు ఏకాక్షరాక్షసవనితలు గలరని చెప్పబడెను.

**రామాయణశిరోమణి :–** ఏకాక్షీం – చిన్ని కన్నులుగల దానిని అని అర్థము.

**గోవిందరాజీయము :–** ఏకాక్షీం – అక్షమనగా ఇంద్రియము, ఇచ్చటి ఏకాక్షికి నేత్ర శ్రోతాదీంద్రియములు ఒక్కొక్కటి గలవని తెలుపబడినది.

**తాత్పర్యము :–** మఱియు హస్తిపాదియు, అశ్వపాదియు, గోపాదియు, పాదముల యందు కేశములు గలదియును, ఒంటికన్ను, ఒంటిచెవి, ఒంటి ముక్కును గలదియును, ఏకపాదియు, స్థూలపాదియు పాదములే లేనట్లుగ నున్నదియు నగు ఆయా రాక్షస వనితలను చూచి రావణు డిట్లాజ్ఞాపించెను.

శ్లో॥ **అతిమాత్రశిరోగ్రీవా మతిమాత్రకుచోదరీం ।**
**అతిమాత్రాస్యనేత్రాం చ దీర్ఘజిహ్వా మజిహ్వికామ్ ॥ 35**

**పదచ్ఛేదము :–** అతిమాత్రశిరోగ్రీవాం – అతిమాత్రకుచోదరీమ్ – అతిమాత్రాస్యనేత్రాం – చ – దీర్ఘజిహ్వామ్ – అజిహ్వికామ్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** అతిమాత్రశిరోగ్రీవాం = విపరీతమైన తలయు కంఠము గలదానిని, అతిమాత్రకుచోదరీం = మిక్కిలి స్థూలమైన స్తనములను ఉదరమును గలదానిని,

అతిమాత్రాస్యనేత్రాం = మిక్కిలి పెద్దదయిన నోరును, నేత్రములును గలదానిని, దీర్ఘజిహ్వాం = మిక్కిలి పొడవైన నాలుక గలదానిని, అజిహ్వికాం = నాలుకయే లేనిదానిని, (ఆదిదేశ = ఆజ్ఞాపించెను).

**తాత్పర్యము :–** మరియు పెద్దదయిన శిరస్సు, కంఠమును కలదియు, మిక్కిలి స్థూలమైన కుచములు, పొట్ట గలదియును, మిక్కిలి పెద్దదయిన నోరు, కన్నులును గలదియును, అతిదీర్ఘమైన నాలుక గలదియును, నాలుకయే లేనిదిగ నున్నట్టిదియు నగు ఆయా రాక్షసస్త్రీలను జూచి రావణు డిట్లాజ్ఞాపించెను.

**శ్లో॥ అనాసికాం సింహముఖీం గోముఖీం సూకరీముఖీమ్ ।**
**యథా మద్వశగా సీతా క్షిప్రం భవతి జానకీ ।**
**తథా కురుత రాక్షస్య స్సర్వాః క్షిప్రం సమేత్య చ ॥ 36**

**పదచ్ఛేదము :–** అనాసికాం – సింహముఖీం – గోముఖీం – సూకరీముఖీం – యథా – మద్వశగా – సీతా – క్షిప్రం – భవతి – జానకీ । తథా – కురుత – రాక్షస్యః – సర్వాః – క్షిప్రం – సమేత్య – చ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** అనాసికాం = ముక్కులేనిదానిని, సింహముఖీం = సింహముఖము వంటి ముఖముకలదానిని, గోముఖీం = గోవుముఖము వంటి ముఖముగలదానిని, సూకరీముఖీం = పందిముట్టివంటి ముఖముగలదానిని (ఏవం సందిదేశ = ఇట్లాజ్ఞాపించెను) సర్వాః రాక్షస్యః = ఎల్ల రాక్షసాంగనలారా! జానకీ సీతా = జనకరాజ తనయయైన సీత, యథా = ఏరీతిగా, క్షిప్రం = శీఘ్రముగా, మద్వశగా భవతి = నాకు వశమైనదగునో, తథా = ఆ రీతిగా, క్షిప్రం = తొందరగా, సమేత్య చ = (మీరందరును) కలసియు, కురుత = నిర్వహింపుడు.

**తాత్పర్యము :–** అనాసికయు, సింహముఖియు, గోముఖియు, సూకరీముఖియు నగు ఆయా రాక్షసవనితలను రావణుడు ఇట్లాజ్ఞాపించెను. ఇచ్చటనున్నట్టి మీరు ఎల్లరును, అనగా మీరు ఒక్కొక్కరునుగాని లేక ఎల్లరును కలిసియుగాని ఈ జానకి అతిత్వరలో ఎట్లు నాకు వశమగునో ఆ విధానమును ఆలోచించి పని నిర్వహింపుడు.

**శ్లో॥ ప్రతిలోమానులోమైశ్చ సామదానాదిభేదనైః ।**
**ఆవర్జయత వైదేహీం దండ స్యోద్యమనేన చ ॥ 37**

**పదచ్ఛేదము :–** ప్రతిలోమానులోమైః – సామదానాదిభేదనైః – ఆవర్జయత – వైదేహీం

– దండస్య – ఉద్యమనేన – చ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– ప్రతిలోమానులోమైశ్చ = ప్రతికూలానుకూలము లైనట్టి, సామదానాది భేదనైః = సామదాన భేదోపాయముల చేతను, దండస్య ఉద్యమనేన చ = దండోపాయముయొక్క ప్రయోగముచేతను, వైదేహీం = జానకిని, ఆవర్జయత = వశముచేసికొనుడు.

**తాత్పర్యము** :– ఆమెకు అనుకూలముగా మాటలాడియు పరుషముగ మాటలాడియు, సామదాన భేదదండములనెడి చతుర్విధోపాయములను ప్రయోగించి, జానకిని త్వరలో నాకు వశమును చేయుడు.

**శ్లో॥ ఇతి ప్రతిసమాదిశ్య రాక్షసేంద్రః పునః పునః ।**
**కామమన్యుపరీతాత్మా జానకీం పర్యతర్జయత్ ॥ 38**

**పదచ్ఛేదము** :– ఇతి – ప్రతిసమాదిశ్య – రాక్షసేంద్రః – పునః – పునః – కామమన్యుపరీతాత్మా – జానకీం – పర్యతర్జయత్ ॥

**అన్వయక్రమము** :– రాక్షసేంద్రః ఇతి ప్రతిసమాదిశ్య, కామమన్యుపరీతాత్మా సన్ జానకీం పునః పునః పర్యతర్జయత్.

**ప్రతిపదార్థము** :– రాక్షసేంద్రః = రావణుడు, ఇతి = ఈరీతిగా, ప్రతిసమాదిశ్య = ఆజ్ఞాపించి, కామమన్యుపరీతాత్మా సన్ = కామక్రోధములతో నిండిన మనస్సుగలవాడై, జానకీం = సీతాదేవిని, పునః పునః = తిరిగి తిరిగి, పర్యతర్జయత్ = బెదిరించెను.

**తాత్పర్యము** :– రావణుడు రాక్షసస్త్రీలను ఈరీతిగా ఆజ్ఞాపించి, కామక్రోధావిష్టచిత్తుడై సీతాదేవిని చూచుచు మఱల మఱల బెదిరించుచుండెను.

**శ్లో॥ ఉపగమ్య తతః క్షిప్రం రాక్షసీ ధాన్యమాలినీ ।**
**పరిష్వజ్య దశగ్రీవ మిదం వచన మబ్రవీత్ ॥ 39**

**పదచ్ఛేదము** :– ఉపగమ్య – తతః – క్షిప్రం – రాక్షసీ – ధాన్యమాలినీ – పరిష్వజ్య – దశగ్రీవమ్ – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– తతః ధాన్యమాలినీ రాక్షసీ క్షిప్రమ్ ఉపగమ్య దశగ్రీవం పరిష్వజ్య ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, ధాన్యమాలినీ = ధాన్యమాలిని యను, రాక్షసీ =

రాక్షసి, క్షిప్రం = వెంటనే, ఉపగమ్య = దగ్గరకువచ్చి, దశగ్రీవం పరిష్వజ్య = రావణుని కౌగిలించుకొని, ఇదం వచనం = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** 'ధాన్యమాలినీ' శబ్దముచేతనే మందోదరి అని గూడ గ్రహించవలసి యున్నది.

**తిలకము :-** పరిష్వజ్య = రావణపట్టమహిషి ఆ సమయమున వానిని కౌగిలించుకొని ఈవలకు లాగి, ఆతడు సీతచెంతకు పోకుండగా నేర్పుగా నివారించినది.

**రామాయణశిరోమణి :-** 'రాక్షసీ, ధాన్యమాలినీ' - రాక్షసీస్వామినియైన మండోదరియు, ధాన్యమాలినియు అని అర్థము చెప్పవచ్చును. ముందుకథలో హనుమ మండోదరివచ్చి ఈ సమయమున అడ్డుకొనెనని చెప్పబోవును గదా!

**వాసుదాసస్వామి :-** ఇట్లడ్డమువచ్చిన స్త్రీనిగూర్చి పిమ్మట హనుమంతుడు అంగదాదులతో చెప్పునపుడు మందోదరి యని చెప్పెను. రూపసామ్యముచేతనే భ్రమించెనో, సుప్రసిద్ధురాలగు మందోదరి పేరు తెలిసియుండి ఈమె పేరు తెలియక పోవుటచేతనో, లేక ఇరువురును అడ్డమురాగా, ఒకరి పేరిచ్చుట, ఒకరి పేరచ్చుటను వాల్మీకి చెప్పెనో!

మహాపతివ్రతయగు సీత తటాలున శపించిన రావణుడు చచ్చినతో తనకు వైధవ్యము వచ్చునని అడ్డము వచ్చియుండవచ్చును.

**తాత్పర్యము :-** అప్పుడు వెంటనే ధాన్యమాలిని రావణుని దగ్గరకు బోయి వానిని కౌగిలించుకొని సీతనుండి వానిని ప్రక్కకు మఱలించి ఆతనితో నిట్లు పలికెను.

**శ్లో॥ మయా క్రీడ మహారాజ సీతయా కిం త వానయా ।**
**వివర్ణయా కృపణయా మానుష్యా రాక్షసేశ్వర ॥ 40**

**పదచ్ఛేదము :-** మయా - క్రీడ - మహారాజ - సీతయా - కిం - తవ - అనయా - వివర్ణయా - కృపణయా - మానుష్యా - రాక్షసేశ్వర ॥

**అన్వయక్రమము :-** రాక్షసేశ్వర! మహారాజ! మయా క్రీడ, వివర్ణయా, కృపణయా, మానుష్యా అనయా సీతయా తవ కిమ్ ?

**ప్రతిపదార్థము :-** రాక్షసేశ్వర మహారాజ = రాక్షసప్రభువైన ఓమహారాజా! మయా క్రీడ = నాతో క్రీడింపుము, వివర్ణయా = కాంతిహీనురాలును, కృపణయా =

దీనురాలును, మానుష్యా = మనుష్యస్త్రీయునగు, అనయా సీతయా = ఈ సీతతో, తవ కిమ్ = నీకు ఏమి ప్రయోజనము?

**తాత్పర్యము :–** ఓ రాక్షసేశ్వరా! నీవు నాతోడ స్వేచ్ఛగా విహరింపుము. మలినురాలును, దీనురాలును, మానవాంగనయు నగు ఈ సీత నీకేల?

**శ్లో॥ నూన మస్యా మహారాజ న దివ్యాన్ భోగసత్తమాన్ ।**
**విదధా త్యమరశ్రేష్ఠ స్తవ బాహుబలార్జితాన్ ॥ 41**

**పదచ్ఛేదము :–** నూనం – అస్యాః – మహారాజ – న – దివ్యాన్ – భోగసత్తమాన్ – విదధాతి – అమరశ్రేష్ఠః – తవ – బాహుబలార్జితాన్ ॥

**అన్వయక్రమము :–** మహారాజ! నూనమ్ అమరశ్రేష్ఠః దివ్యాన్ తవ బాహుబలార్జితాన్ భోగసత్తమాన్ అస్యాః న విదధాతి.

**ప్రతిపదార్థము :–** మహారాజ! = ఓ రాక్షసరాజా, అమరశ్రేష్ఠః = బ్రహ్మదేవుడు, నూనం = నిశ్చయముగా, తవ బాహుబలార్జితాన్ = నీ భుజశక్తిచే సంపాదింప బడినట్టి, దివ్యాన్ భోగసత్తమాన్ = దివ్యములైన మహాభోగములను, అస్యాః = ఈమెకు, న విదధాతి = సమకూర్చలేదు.

**తాత్పర్యము :–** మహారాజా! నీ బాహుబలముచే సంపాదించి పెట్టినట్టి ఈ మహాభోగములు ఈమె నుదుట బ్రహ్మదేవుడు వ్రాసిపెట్టలేదు. సందేహము లేదు. అందులకే ఈమె ఇట్టి మూర్ఖపు పట్టుదలతో నున్నది.

**శ్లో॥ అకామాం కామయానస్య శరీరముపతప్యతే ।**
**ఇచ్ఛంతీం కామయానస్య ప్రీతి ర్భవతి శోభనా ॥ 42**

**పదచ్ఛేదము :–** అకామాం – కామయానస్య – శరీరమ్ – ఉపతప్యతే – ఇచ్ఛంతీం – కామయానస్య – ప్రీతిః – భవతి – శోభనా ॥

**అన్వయక్రమము :–** ఆకామాం కామయానస్య శరీరమ్ ఉపతప్యతే, ఇచ్ఛంతీం కామయానస్య శోభనా ప్రీతిః భవతి.

**ప్రతిపదార్థము :–** అకామాం = అనురాగములేని వనితను, కామయానస్య = కామించుచున్న వానియొక్క, శరీరం = దేహము, ఉపతప్యతే = తాపమునొందు చుండును, ఇచ్ఛంతీం = ప్రేమించుచున్నట్టి తరుణిని, కామయానస్య = కామించువానికి, శోభనా ప్రీతిః = మంగళకరమైన ఆనందము, భవతి = కలుగును.

**తాత్పర్యము :–** తనపై ప్రేమలేనట్టి వనితను కామించునట్టి పురుషునకు శరీరమున గొప్పతాపము కలుగును. అట్లుగాక తనను ప్రేమించుచున్న కోమలిని కామించినచో తనకు మంగళకరమైన ఆనందము కల్గును.

**శ్లో॥ ఏవ ముక్తస్తు రాక్షస్యా సముత్క్షిప్త స్తతో బలీ ।**
**ప్రహస న్మేఘసంకాశో రాక్షస స్స న్యవర్తత ॥ 43**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తః – తు – రాక్షస్యా – సముత్క్షిప్తః – తతః – బలీ – ప్రహసన్ – మేఘసంకాశః – రాక్షసః – సః – న్యవర్తత ॥

**అన్వయక్రమము :–** తతః రాక్షస్యా ఏవమ్ ఉక్తః సముత్క్షిప్తః, మేఘసంకాశః, బలీ సః, రాక్షసః ప్రహసన్ న్యవర్తత.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, రాక్షస్యా = ధాన్యమాలినిచే, ఏవమ్ ఉక్తః = ఈవిధముగా చెప్పబడినవాడై, సముత్క్షిప్తః = పైకిలేవనెత్తబడినవాడై, మేఘసంకాశః = మేఘసన్నిభుడైనట్టి, బలీ సః రాక్షసః = బలాఢ్యుడైన ఆ రావణుడు, ప్రహసన్ = పెద్దగా నవ్వుచు, న్యవర్తత = మఱలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "ప్రహసన్" – ధాన్యమాలిని సమయోచితముగా వ్యవహరించి తాను ఆవేశముతో స్త్రీపై చేయిచేసికొను అపకీర్తిని తప్పించినది యని ప్రసన్నతాపూర్వకముగా నవ్వుచు;

**రామాయణశిరోమణి :–** సముత్క్షిప్తః – ప్రక్కకు తొలగింపబడినవాడై.

**తాత్పర్యము :–** ధాన్యమాలిని రావణునితో నిట్లు పలుకుచు అతనిని ప్రక్కకు తీసికొనిపోగా, నల్లని కాఱుమేఘమువలె మహాబలాఢ్యుడై యున్న రావణుడు ఆమెయొక్క సమయోచితమైన వర్తనమునకు మనస్సునందు సంతోషించుచు బిగ్గరగ నవ్వుచు అటనుండి వెడలెను.

**శ్లో॥ ప్రస్థిత స్స దశగ్రీవః కంపయ న్నివ మేదినీమ్ ।**
**జ్వలద్భాస్కరవర్ణాభం ప్రవివేశ నివేశనమ్ ॥ 44**

**పదచ్ఛేదము :–** ప్రస్థితః – సః – దశగ్రీవః – కంపయన్ – ఇవ – మేదినీమ్ – జ్వలద్భాస్కరవర్ణాభం – ప్రవివేశ – నివేశనమ్ ॥

**అన్వయక్రమము :–** సః దశగ్రీవః, మేదినీం కంపయన్నివ ప్రస్థితః సన్, జ్వలద్భాస్కర

వర్ణాభం నివేశనం ప్రవివేశ.

**ప్రతిపదార్థము** :– సః దశగ్రీవః = ఆ దశకంఠుడు, మేదినీం కంపయన్నివ = భూమిని కంపింపజేయుచున్న వాడువలె, ప్రస్థితః = (అటనుండి) బయలువెడలినవాడై, జ్వలత్ భాస్కరవర్ణాభం = ప్రజ్వలించుచున్న సూర్యునితో సమానమైన తేజస్సు కలిగినట్టి, నివేశనం = (తన) భవనమును, ప్రవివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము** :– రావణుడప్పుడు భూమినంతను వడకించుచు అటనుండి బయలు వెడలినవాడై మధ్యాహ్నకాలపు సూర్యునివలె తీక్ష్ణమైన ప్రకాశముతో శోభిల్లుచున్న తన భవనమునందు ప్రవేశించెను.

**శ్లో॥ దేవగంధర్వకన్యాశ్చ నాగకన్యాశ్చ సర్వతః ।**
**పరివార్య దశగ్రీవం వివిశు స్తం గృహోత్తమమ్ ॥ 45**

**పదచ్ఛేదము** :– దేవగంధర్వకన్యాః – చ – నాగకన్యాః – చ – సర్వతః – పరివార్య – దశగ్రీవం – వివిశుః – తం – గృహోత్తమమ్ ॥

**అన్వయక్రమము** :– దేవగంధర్వకన్యాః చ, నాగకన్యాః చ, దశగ్రీవం, సర్వతః పరివార్య తం గృహోత్తమం వివిశుః.

**ప్రతిపదార్థము** :– దేవగంధర్వకన్యాః చ = దేవగంధర్వకన్యలును, నాగకన్యాః చ = నాగకన్యలును, దశగ్రీవం = రావణాసురుని, సర్వతః పరివార్య = చుట్టును చేరి, తం గృహోత్తమం = ఆ రావణభవనమును, వివిశుః = ప్రవేశించిరి.

**తాత్పర్యము** :– రావణుని వెంటనున్న ఆ దేవగంధర్వకన్యలును, నాగకన్యలును అతని చుట్టునుండి నడచుచు అతని వెంబడినే రావణుని భవనములోనికి ప్రవేశించిరి.

**శ్లో॥ స మైథిలీం ధర్మపరా మవస్థితాం**
**ప్రవేపమానాం పరిభర్త్స్య రావణః ।**
**విహాయ సీతాం మదనేన మోహితః**
**స్వ మేవ వేశ్మ ప్రవివేశ భాస్వరమ్ ॥ 46**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"మాసద్వయావధికరణం" నామ*
*ద్వావింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :- సః - మైథిలీం - ధర్మపరామ్ - అవస్థితాం - ప్రవేపమానాం - పరిభర్త్స్య - రావణః - విహాయ - సీతాం - మదనేన - మోహితః - స్వమ్ - ఏవ - వేశ్మ - ప్రవివేశ - భాస్వరమ్ ॥

**అన్వయక్రమము** :- సః రావణః, ధర్మపరాం, ప్రవేపమానామ్ అవస్థితాం, మైథిలీం, సీతాం పరిభర్త్స్య, (తాం) విహాయ, మదనేన మోహితః (సన్) భాస్వరం, స్వం వేశ్మ ఏవ ప్రవివేశ.

**ప్రతిపదార్థము** :- సః రావణః = ఆ రావణుడు, ధర్మపరాం = ధర్మపరాయణురాలును, అవస్థితాం = దృఢచిత్తురాలును, ప్రవేపమానాం = వణుకుచున్నదియునగు, మైథిలీం = జానకిని, పరిభర్త్స్య = మిక్కిలిగా గద్దించి, సీతాం విహాయ = ఆమెను విడచి, మదనేన మోహితః = మన్మథతాపముచే మోహమునొందియున్నవాడై, భాస్వరం = గొప్ప ప్రకాశముగల్గిన, స్వం వేశ్మ ఏవ = తన భవనమునే, ప్రవివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము** :- రావణుడు ఈరీతిగా ధర్మతత్పరురాలును, దృఢచిత్తురాలును, భయముచేత వణకుచున్నదియునగు సీతాదేవిని పలువిధములుగ గద్దించుచు మాటలాడి తుదకామెను వీడి మదనపరవశుడై తిరిగి తన భవనమును చేరుకొనెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"మాసద్వయావధికరణము" అను*
*ఇఱువదిరెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# త్రయోవింశసర్గ

**శ్లో॥ ఇత్యుక్త్వా మైథిలీం రాజా రావణ శ్శత్రురావణః ।**
**సందిశ్య చ తత స్సర్వా రాక్షసీ ర్నిర్జగామ హ ॥ 1**

**పదచ్ఛేదము :–** ఇతి – ఉక్త్వా – మైథిలీం – రాజా – రావణః – శత్రురావణః – సందిశ్య – చ – తతః – సర్వాః – రాక్షసీః – నిర్జగామ – హ ॥ ॥

**అన్వయక్రమము :–** శత్రురావణః, రాజా రావణః మైథిలీమ్ ఇతి ఉక్త్వా, సర్వాః రాక్షసీః సందిశ్య, తతః నిర్జగామ హ.

**ప్రతిపదార్థము :–** శత్రురావణః = శత్రువులను ఆక్రోశింపచేయునట్టి, రాజా రావణః = (రాక్షస) రాజైన రావణుడు, మైథిలీం = సీతను గూర్చి, ఇతి ఉక్త్వా = ఈరీతిగా పలికి, సర్వాః రాక్షసీః = రాక్షసస్త్రీల నెల్లరను, సందిశ్య = ఆజ్ఞాపించి, తతః నిర్జగామ హ = అటనుండి వెడలి పోయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "శత్రురావణః" – తన శత్రువులను హాహాకారము చేయించువాడు.

**తాత్పర్యము :–** శత్రుభయంకరుడైన రాక్షసరాజగు రావణుడు సీతాదేవితో ఈరీతిగా పలికి అచ్చటనున్నట్టి రాక్షసస్త్రీలకు తగు ఆజ్ఞల నొసగి అటనుండి మరలి తన భవనమున కేగెను.

**శ్లో॥ నిష్క్రాంతే రాక్షసేంద్రే తు పున రంతఃపురం గతే ।**
**రాక్షస్యో భీమరూపా స్తా స్సీతాం సమభిదుద్రువుః ॥ 2**

**పదచ్ఛేదము :–** నిష్క్రాంతే – రాక్షసేంద్రే – తు – పునః – అంతఃపురం – గతే – రాక్షస్యః – భీమరూపాః – తాః – సీతాం – సమభిదుద్రువుః ॥

**అన్వయక్రమము :–** రాక్షసేంద్రే నిష్క్రాంతే, పునః అంతఃపురం గతే (సతి) భీమరూపాః తాః రాక్షస్యః సీతాం సమభిదుద్రువుః.

**ప్రతిపదార్థము** :- రాక్షసేంద్రే = రాక్షసరాజైన రావణుడు, నిష్క్రాంతే = వెడలిపోయిన వాడై, పునః అంతఃపురం గతే (సతి) = తిరిగి అంతఃపురము చేరుకొనగానే, భీమరూపాః = భయంకరాకారము కల్గినట్టి, తాః రాక్షస్యః = ఆ రాక్షసవనితలు, సీతాం సమభిదుద్రువుః = సీతమీదికి పరుగెత్తిరి.

**తాత్పర్యము** :- రావణుడు అటనుండి వెడలి తన అంతఃపురమునకు చేరుకొనగనే సీతకడనున్న ఘోరరూపములు గల రాక్షసస్త్రీలు అందరు ఒక్కుమ్మడిగా ఆమె మీదికి పరుగెత్తుకొనిపోయిరి.

**శ్లో॥ తత స్సీతా ముపాగమ్య రాక్షస్యః క్రోధమూర్ఛితాః ।**
**పరం పరుషయా వాచా వైదేహీ మిద మబ్రువన్ ॥ 3**

**పదచ్ఛేదము** :- తతః - సీతామ్ - ఉపాగమ్య - రాక్షస్యః - క్రోధమూర్ఛితాః - పరం - పరుషయా - వాచా - వైదేహీమ్ - ఇదమ్ - అబ్రువన్ ॥

**అన్వయక్రమము** :- తతః, రాక్షస్యః, క్రోధమూర్ఛితాః (సత్యః) సీతామ్ ఉపాగమ్య, పరం పరుషయా వాచా వైదేహీమ్ ఇదమ్ అబ్రువన్.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, క్రోధమూర్ఛితాః (సత్యః) = క్రోధపరవశ లగుచున్నవారై, సీతామ్ ఉపాగమ్య = సీతను సమీపించి, పరం పరుషయా వాచా = మిక్కిలి కఠినమైన మాటతో, వైదేహీమ్ = సీతనుగూర్చి, ఇదమ్ అబ్రువన్ = ఈ మాటను పలికిరి.

**తాత్పర్యము** :- అటుపిమ్మట ఆ రాక్షసవనితలు అమితమైన క్రోధావేశముతో సీతను జేరి ఆమెతో ఇట్లు పలికిరి.

**శ్లో॥ పౌలస్త్యస్య వరిష్ఠస్య రావణస్య మహాత్మనః ।**
**దశగ్రీవస్య భార్యాత్వం సీతే న బహుమన్యసే ॥ 4**

**పదచ్ఛేదము** :- సీతే - పౌలస్త్యస్య - వరిష్ఠస్య - రావణస్య - మహాత్మనః - దశగ్రీవస్య - భార్యాత్వం - సీతే - న - బహుమన్యసే ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- సీతే = ఓ జానకీ, పౌలస్త్యస్య = పులస్త్యుని పౌత్రుడును, వరిష్ఠస్య = శ్రేష్ఠుడును, మహాత్మనః = మహాపూజ్యుడును అగు, దశగ్రీవస్య రావణస్య = దశకంఠుడయిన రావణునకు, భార్యాత్వం = భార్యగా నుండుటను, న బహుమన్యసే = గొప్పగా ఎంచుకొనకున్నావు.

**తాత్పర్యము :–** పులస్త్యబ్రహ్మకు పౌత్రుడును, లోకవిఖ్యాతి గన్నవాడు నగు దశకంఠునకు భార్యవగు భాగ్యమును నీవు తృణీకరించుచున్నావు. ఓ జానకీ! నీవు ఎంత అజ్ఞానురాలవు.

**శ్లో॥ తత స్త్వేకజటా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**ఆమంత్ర్య క్రోధతామ్రాక్షీ సీతాం కరతలోదరీమ్ ॥ 5**

**పదచ్ఛేదము :–** తతః – తు – ఏకజటా – నామ – రాక్షసీ – వాక్యమ్ – అబ్రవీత్ – ఆమంత్ర్య – క్రోధతామ్రాక్షీ – సీతాం – కరతలోదరీమ్ ॥

**అన్వయక్రమము :–** తతః కరతలోదరీం సీతామ్ ఆమంత్ర్య క్రోధతామ్రాక్షీ (సతీ) ఏకజటా నామ రాక్షసీ వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, కరతలోదరీం సీతాం = అరచేయివంటి ఉదరము కల్గినట్టి సీతాదేవిని, ఆమంత్ర్య = పిలచి, క్రోధతామ్రాక్షీ (సతీ) = కోపముచే నెఱ్ఱబారిన కన్నులుగలదై, ఏకజటా నామ రాక్షసీ = ఏకజట యనెడి రక్కసి, వాక్యమ్ అబ్రవీత్ = (ఈ) మాటను బలికెను.

**తాత్పర్యము :–** పిమ్మట ఏకజట యను పేరుగల ఒకానొక రాక్షసాంగన సుకుమారియైన ఆ సీతాదేవిని క్రోధముచే ఎర్రబారిన కన్నులతో గద్దించుచు ఈ విధముగా పలికెను.

**శ్లో॥ ప్రజాపతీనాం షణ్ణాం తు చతుర్థో యః ప్రజాపతిః ।**
**మానసో బ్రహ్మణః పుత్రః పులస్త్య ఇతి విశ్రుతః ॥ 6**

**పదచ్ఛేదము :–** ప్రజాపతీనాం – షణ్ణాం – తు – చతుర్థః – యః – ప్రజాపతిః – మానసః – బ్రహ్మణః – పుత్రః – పులస్త్యః – ఇతి – విశ్రుతః ॥

**అన్వయక్రమము :–** యః షణ్ణాం ప్రజాపతీనాం చతుర్థః ప్రజాపతిః, బ్రహ్మణః మానసః పుత్రః సః, పులస్త్యః ఇతి విశ్రుతః ఆసీత్.

**ప్రతిపదార్థము :–** షణ్ణాం ప్రజాపతీనాం = ప్రసిద్ధురాలైన ఆరుగురు ప్రజాపతులలో, యః = ఎవడు, చతుర్థః ప్రజాపతిః = నాల్గవ ప్రజాపతి యైనట్టివాడో, బ్రహ్మణః మానసః పుత్రః = బ్రహ్మదేవునకు మానసపుత్రుడైన, సః = ఆతడు, పులస్త్యః ఇతి = పులస్త్యుడు అని, విశ్రుతః = ప్రసిద్ధుడు, ఆసీత్ = ఆయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మరీచి అత్రి అంగిరసుడు పులస్త్యుడు పులహుడు క్రతువు అను వఋసలో

పులస్త్యుడు నాల్గవవాడు.

**తాత్పర్యము :–** మరీచి మున్నగు ఆరుగురు ప్రజాపతులలో నాలుగవవాడు బ్రహ్మమానస పుత్రుడు పులస్త్యుడుగా లోకవిఖ్యాతి నొందెను.

**శ్లో॥ పులస్త్యస్య తు తేజస్వీ మహర్షి ర్మానస స్సుతః ।**
**నామ్నా స విశ్రవా నామ ప్రజాపతిసమప్రభః ॥ 7**

**పదచ్ఛేదము :–** పులస్త్యస్య – తు – తేజస్వీ – మహర్షిః – మానసః – సుతః – నామ్నా – సః – విశ్రవాః – నామ – ప్రజాపతిసమప్రభః ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** పులస్త్యస్య తు = పులస్త్యబ్రహ్మకు, మానసః సుతః = మానసపుత్రుడు, తేజస్వీ = మహాతేజశ్శాలియై, నామ్నా విశ్రవాః నామ = పేరుచే విశ్రవసుడనబడువాడు. సః = అతడు, ప్రజాపతిసమప్రభః = ప్రజాపతులతో సమానమైన తేజస్సుగలవాడు.

**తాత్పర్యము :–** ఆ పులస్త్యప్రజాపతియొక్క మానసపుత్రుడైన విశ్రవసుడనువాడు మహాతేజస్వి; ప్రజాపతులతో సమానమైనట్టి తేజస్సుగలవాడై మహాప్రసిద్ధుడై యుండెను.

**శ్లో॥ తస్య పుత్రో విశాలాక్షి రావణ శ్శత్రురావణః ।**
**తస్య త్వం రాక్షసేంద్రస్య భార్యా భవితు మర్హసి ॥ 8**

**పదచ్ఛేదము :–** తస్య – పుత్రః – విశాలాక్షి – రావణః – శత్రురావణః – తస్య – త్వం – రాక్షసేంద్రస్య – భార్యా – భవితుమ్ – అర్హసి ॥

**అన్వయక్రమము :–** విశాలాక్షి! శత్రురావణః రావణః తస్య పుత్రః, తస్య రాక్షసేంద్రస్య త్వం భార్యా భవితుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :–** విశాలాక్షి = ఓ సుందరీ! శత్రురావణః రావణః = శత్రువులను ఆక్రోశింపచేయువాడైన రావణుడు, తస్య పుత్రః = ఆ విశ్రవోబ్రహ్మయొక్క కుమారుడు, తస్య రాక్షసేంద్రస్య = ఆ రాక్షసరాజునకు, త్వం = నీవు, భార్యా భవితుమ్ అర్హసి = భార్యవు కాదగియున్నావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** తస్య పుత్రః – అట్టివాని పుత్రుడనుటచే లోకోత్తరమైన రావణుని మహాకులీనత్వము ఇట సూచింపబడుచున్నది.

**వాసుదాసస్వామి :–** ఆర్వురు ప్రజాపతులలో నాల్గవవాడు పులస్త్యుడు. ఆయన బ్రహ్మకు మానసపుత్రుడు. ఆయన సంకల్పమువలన కలిగినవాడు విశ్రవుడు. ఆయన కొడుకు రావణుడు. ఇక ఇతడు బలమునందా శత్రువుల నేడిపించువాడు, ఇట్టి గొప్పవాడు తానైవచ్చి నిన్ను ప్రార్థింప నీకేల ఈ బిగువని ప్రశ్నించుచున్నది.

**తాత్పర్యము :–** ఓ సుందరీ! శత్రుభీకరుడైన రావణాసురు డనగా బ్రహ్మదేవునకు నాల్గవ తరమువాడు సుమా! అట్టి మహాకులీనుడైన వానికి భార్యగా నుండుట నీ అదృష్టముగదా!

**శ్లో॥ మయోక్తం చారుసర్వాంగి వాక్యం కిం నానుమన్యసే ? 9**

**పదచ్ఛేదము :–** మయా – ఉక్తం – చారుసర్వాంగి – వాక్యం – కిం – న – అనుమన్యసే ॥

**ప్రతిపదార్థము :–** చారుసర్వాంగి = ఓ సుందరమైన సమస్తావయవములు కల్గిన తరుణీ! మయా = నాచే, ఉక్తం = చెప్పబడిన, వాక్యం = మాటను, కిం న అనుమన్యసే = ఏల అంగీకరింపకున్నావు?

**తాత్పర్యము :–** ఓ సర్వాంగసుందరీ! నేను నీ హితమునుకోరి చెప్పినమాటలను తెలివిమాలి ఏల అంగీకరింపకున్నావు?

**శ్లో॥ తతో హరిజటా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**వివర్త్య నయనే కోపా న్మార్జారసదృశేక్షణా ॥ 10**

**పదచ్ఛేదము :–** తతః – హరిజటా – నామ – రాక్షసీ – వాక్యమ్ – అబ్రవీత్ – వివర్త్య – నయనే – కోపాత్ – మార్జారసదృశేక్షణా ॥

**అన్వయక్రమము :–** తతః మార్జారసదృశేక్షణా హరిజటా నామ రాక్షసీ కోపాత్ నయనే వివర్త్య వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, మార్జారసదృశేక్షణా = పిల్లికన్నులవంటి కన్నులుగల, హరిజటా నామ రాక్షసీ = హరిజట యను రక్కసి, నయనే వివర్త్య = (తన) రెండుకన్నులును త్రిప్పి, కోపాత్ = క్రోధమువలన, వాక్యమ్ అబ్రవీత్ = (ఈ) వాక్యము పలికెను.

**తాత్పర్యము :–** పిమ్మట హరిజట యను రాక్షసి పిల్లి కన్నులవంటి తన కన్నులను క్రిందికిని మీదికిని త్రిప్పుచు కోపముతో సీతాదేవిని చూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ యేన దేవా స్త్రయస్త్రింశ ద్దేవరాజశ్చ నిర్జితాః ।**
**తస్య త్వం రాక్షసేంద్రస్య భార్యా భవితు మర్హసి ॥ 11**

**పదచ్ఛేదము :-** యేన - దేవాః - త్రయస్త్రింశత్ - దేవరాజః - చ - నిర్జితాః - తస్య - త్వం - రాక్షసేంద్రస్య - భార్యా - భవితుమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము :-** యేన, త్రయస్త్రింశత్ దేవాః, దేవరాజః చ, నిర్జితాః, తస్య రాక్షసేంద్రస్య భార్యా భవితుం త్వమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :-** యేన = ఏ దశకంఠునిచే, త్రయస్త్రింశత్ దేవాః = ముప్పదిమూడు (కోట్ల) దేవతలును, దేవరాజశ్చ = దేవేంద్రుడును, నిర్జితాః = ఓడింపబడియుండిరో, తస్య రాక్షసేంద్రస్య = ఆ రాక్షసప్రభువైన రావణునకు, భార్యా భవితుం = భార్యవగుటకు, త్వమ్ అర్హసి = నీవు తగియున్నావు.

**తాత్పర్యము :-** ఓ సీతా! ఏ మహావీరునిచే ముప్పదిమూడుకోట్ల దేవతలును, దేవేంద్రుడును ఓడిపోయియున్నారో, అట్టి రాక్షసప్రభువునకు భార్యవగు భాగ్యమునకు నీవే తగుదువు.

**శ్లో॥ తతస్తు ప్రఘసా నామ రాక్షసీ క్రోధమూర్ఛితా ।**
**భర్త్సయంతీ తదా ఘోర మిదం వచన మబ్రవీత్ ॥ 12**

**పదచ్ఛేదము :-** తతః - తు - ప్రఘసా - నామ - రాక్షసీ - క్రోధమూర్ఛితా - భర్త్సయంతీ - తదా - ఘోరమ్ - ఇదం - వచనమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :-** సుగమము.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, ప్రఘసా నామ రాక్షసీ = ప్రఘస యను పేరుగల రక్కసి, క్రోధమూర్ఛితా సతీ = క్రోధావిష్టురాలై, భర్త్సయంతీ = గద్దించుచు, తదా = అప్పుడు, ఇదం ఘోరం వచనం = ఈ దారుణమైన మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :-** పిమ్మట ప్రఘస యను రక్కసి క్రోధపరవశురాలై సీతాదేవిని గద్దించుచు ఈ విధముగా పలికెను.

**శ్లో॥ వీర్యోత్సిక్తస్య శూరస్య సంగ్రామే ష్వనివర్తినః ।**
**బలినో వీర్యయుక్తస్య భార్యాత్వం కిం న లప్స్యసే ॥ 13**

**పదచ్ఛేదము :-** వీర్యోత్సిక్తస్య - శూరస్య - సంగ్రామేషు - అనివర్తినః - బలినః -

వీర్యయుక్తస్య – భార్యాత్వం – కిం – న – లప్స్యసే ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– వీర్యోత్సిక్తస్య = శౌర్యముచే గర్వితుడును, శూరస్య = వీరుడును, సంగ్రామేషు అనివర్తినః = యుద్ధములందు వెన్నుజూపనివాడును, వీర్యయుక్తస్య = పరాక్రమము కలిగినట్టివాడును, బలినః = బలాఢ్యుడును అగు, తస్య = ఆ రావణునకు, భార్యాత్వం = భార్యయగుటను, కిం న లప్స్యసే = ఏల పొందకున్నావు?

**తాత్పర్యము** :– మహాశూరుడును, వీర్యాతిరేకముచే గర్వితుడై యున్నవాడును, యుద్ధము నం దపజయము ఎరుగనివాడును అగు ఆ దశగ్రీవుని భార్య ననిపించుకొను భాగ్యమును నీవు ఏల వలదనుచున్నావు?

**శ్లో॥ ప్రియాం బహుమతాం భార్యాం త్యక్త్వా రాజా మహాబలః ।**
**సర్వాసాం చ మహాభాగాం త్వా ముపైష్యతి రావణః ॥ 14**

**పదచ్ఛేదము** :– ప్రియాం – బహుమతాం – భార్యాం – త్యక్త్వా – రాజా – మహాబలః – సర్వాసాం – చ – మహాభాగాం – త్వామ్ – ఉపైష్యతి – రావణః ॥

**అన్వయక్రమము** :– మహాబలః రాజా రావణః సర్వాసాం బహుమతాం ప్రియాం భార్యాం, త్యక్త్వా మహాభాగాం త్వామ్ ఉపైష్యతి.

**ప్రతిపదార్థము** :– మహాబలః రాజా రావణః = మహాబలశాలియైన రాజు రావణుడు, సర్వాసాం = (తనభార్య) లెల్లరిలోను, బహుమతాం = మిక్కిలి ఇష్టురాలును, ప్రియాం = ప్రియురాలునగు, భార్యాం = మందోదరిని, త్యక్త్వా = విడిచి, మహాభాగాం త్వాం = భాగ్యవంతురాలవైన నిన్ను, ఉపైష్యతి = చేరుకొనగలడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :– బహుమతాం = పెక్కుమందిచే కోరబడినట్టి (మందోదరిని).

**తాత్పర్యము** :– మహాపరాక్రమశాలియైన రావణుడు తనకు మిక్కిలి గౌరవార్హురాలును ప్రియురాలునగు మందోదరిని సైతము విడిచి అదృష్టవంతురాలవైన నిన్ను కోరుకొన నున్నాడు!

**శ్లో॥ సమృద్ధం స్త్రీసహస్రేణ నానారత్నోపశోభితమ్ ।**
**అంతఃపురం సముత్సృజ్య త్వా ముపైష్యతి రావణః ॥ 15**

**పదచ్ఛేదము** :- సమృద్ధం - స్త్రీసహస్రేణ - నానారత్నోపశోభితమ్ - అంతఃపురం - సముత్సృజ్య - త్వామ్ - ఉపైష్యతి - రావణః ॥

**అన్వయక్రమము** :- రావణః స్త్రీసహస్రేణ సమృద్ధం, నానారత్నోపశోభితమ్ అంతఃపురం సముత్సృజ్య త్వామ్ ఉపైష్యతి.

**ప్రతిపదార్థము** :- రావణః = రావణుడు, స్త్రీసహస్రేణ సమృద్ధం = వేలకొలది భార్యలతో నిండియున్నదియును, నానారత్నోపశోభితం = బహువిధరత్నములతో వెలయుచున్న దియునగు, అంతఃపురం = అంతఃపురమును, సముత్సృజ్య = విడిచిపెట్టి, త్వామ్ = నిన్ను, ఉపైష్యతి = చేరుచున్నాడు.

**తాత్పర్యము** :- వేలకొలది యువతులతో కూడినదియును, సమస్తభాగ్యములతో నిండినదియు నగు తన అంతఃపురమునంతను విడిచిపెట్టి రావణుడు భాగ్యవంతురాల వైన నిన్ను వరించుచున్నాడుగదా!

**శ్లో॥ అన్యా తు వికటా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**అసకృ ద్దేవతాయుద్ధే నాగగంధర్వదానవాః ।**
**నిర్జితా స్సమరే యేన స తే పార్శ్వ ముపాగతః ॥ 16**

**పదచ్ఛేదము** :- అన్యా - తు - వికటా - నామ - రాక్షసీ - వాక్యమ్ - అబ్రవీత్ - అసకృత్ - దేవతాయుద్ధే - నాగగంధర్వదానవాః - నిర్జితాః - సమరే - యేన - సః - తే - పార్శ్వమ్ - ఉపాగతః ॥

**అన్వయక్రమము** :- వికటా నామ అన్యా రాక్షసీ వాక్యమ్ అబ్రవీత్, యేన దేవతాయుద్ధే, నాగగంధర్వదానవాః, అసకృత్ సమరే నిర్జితాః, సః తే పార్శ్వమ్ ఉపాగతః.

**ప్రతిపదార్థము** :- వికటా నామ = వికట యను పేరు కలిగినట్టి, అన్యా రాక్షసీ = వేరొక రక్కసి, వాక్యమ్ అబ్రవీత్ = ఈ మాటను పలికెను, యేన = ఏ మహావీరునిచే, దేవతాయుద్ధే = దేవతలతో యుద్ధమునందు, నాగగంధర్వదానవాః = నాగులును గంధర్వులును, దానవులును, సమరే = యుద్ధమునందు, అసకృత్ = పలుమారులు, నిర్జితాః = ఓడింపబడిరో, సః = ఆ మహావీరుడు, తే పార్శ్వమ్ = నీ పజ్జను, ఉపాగతః = చేరినాడు.

**తాత్పర్యము** :- పిమ్మట వికట యను వేరొకరక్కసి ఈ రీతిగ పలికెను. ఏ మహావీరుడు పలుమారులు యుద్ధమునందు దేవతలను, గంధర్వులను, దైత్యులను ఓడించియున్నాడో అతడు నేడు నిన్ను గోరి నీపజ్జను చేరినాడు సుమా!

**శ్లో॥ తస్య సర్వసమృద్ధస్య రావణస్య మహాత్మనః ।**
**కి మద్య రాక్షసేంద్రస్య భార్యాత్వం నేచ్ఛసేఽధమే ॥ 17**

**పదచ్ఛేదము** :– తస్య – సర్వసమృద్ధస్య – రావణస్య – మహాత్మనః – కిమ్ – అద్య – రాక్షసేంద్రస్య – భార్యాత్వం – న – ఇచ్ఛసే – అధమే ॥

**అన్వయక్రమము** :– అధమే! సర్వసమృద్ధస్య, మహాత్మనః రాక్షసేంద్రస్య తస్య రావణస్య భార్యాత్వం కిం నేచ్ఛసే ?

**ప్రతిపదార్థము** :– అధమే = ఓ అధమురాలా! సర్వసమృద్ధస్య = సమస్త సమృద్ధులు కలిగినట్టి, మహాత్మనః = మహనీయుడైన, రాక్షసేంద్రస్య = రాక్షసప్రభువగు, తస్య రావణస్య = ఆ రావణునకు, భార్యాత్వం = భార్యయగుటను, కిం నేచ్ఛసే = ఏల కోరకున్నావు?

**తాత్పర్యము** :– సర్వసమృద్ధులును కలిగిన మహాప్రభావశాలియగు రావణునికి భార్యవగు భాగ్యమును ఓసీ! నీవేల ఒల్లకుంటివి?

**శ్లో॥ తతస్తు దుర్ముఖీ నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**యస్య సూర్యో న తపతి భీతో యస్య చ మారుతః ।**
**న వాతి స్మాయతాపాంగే కిం త్వం తస్య న తిష్ఠసి ॥ 18**

**పదచ్ఛేదము** :– తతః – తు – దుర్ముఖీ – నామ – రాక్షసీ – వాక్యమ్ – అబ్రవీత్ – యస్య – సూర్యః – న – తపతి – భీతః – యస్య – చ – మారుతః – న – వాతి – స్మ – ఆయతాపాంగే – కిం – త్వం – తస్య – న – తిష్ఠసి ॥

**అన్వయక్రమము** :– తతః దుర్ముఖీ నామ రాక్షసీ వాక్యమ్ అబ్రవీత్ – ఆయతాపాంగే! యస్య భీతః, సూర్యః న తపతి; మారుతః చ యస్య (భీతః) న వాతి స్మ, త్వం తస్య (వశే) కిం న తిష్ఠసి ?

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, దుర్ముఖీ నామ రాక్షసీ = దుర్ముఖి యను రక్కసి, వాక్యం అబ్రవీత్ = (ఈ) మాటను బలికెను. ఆయతాపాంగే! = దీర్ఘమైన నేత్రాంతములు గల ఓ సుందరీ! యస్య భీతః = ఎవనికి భయపడినవాడై, సూర్యః = సూర్యుడు, న తపతి = తపింపజేయకుండునో, మారుతః చ = వాయుదేవుడును, యస్య భీతః = ఎవనికి భయపడినవాడై, న వాతి స్మ = వీవకుండునో, తస్య వశే = ఆతని అధీనమునందు, త్వం = నీవు, కిం న తిష్ఠసి = ఏల నుండవు.

**తాత్పర్యము :-** అటుపిమ్మట దుర్ముఖి యనెడు రాక్షసాంగన సీతతో ఇట్లు పలికెను. ఓ సుందరాంగీ! ఏ ప్రభావశాలికి భయపడి సూర్యుడు హెచ్చుగ వేడిమిని ప్రసరింప జేయడో, వాయువు అననుకూలముగా వీచకుండునో అట్టి ఆ మహనీయుని వశములో నుండుటకు నీవేల నొల్లవు ?

**శ్లో॥ పుష్పవృష్టిం చ తరవో ముముచు ర్యస్య వై భయాత్ ।**
**శైలాశ్చ సుభ్రు పానీయం జలదాశ్చ యదేచ్ఛతి ॥ 19**

**శ్లో॥ తస్య నైరృతరాజస్య రాజరాజస్య భామిని ।**
**కిం త్వం న కురుషే బుద్ధిం భార్యార్థే రావణస్య హి ॥ 20**

**పదచ్ఛేదము :-** పుష్పవృష్టిం - చ - తరవః - ముముచుః - యస్య - వై - భయాత్ - శైలాః - చ - సుభ్రు - పానీయం - జలదాః - చ - యదా - ఇచ్ఛతి - తస్య - నైరృతరాజస్య - రాజరాజస్య - భామిని - కిం - త్వం - న - కురుషే - బుద్ధిం - భార్యార్థే - రావణస్య - హి ॥

**అన్వయక్రమము :-** సుభ్రు! యస్య భయాత్, తరవః పుష్పవృష్టిం, ముముచుః, యదా (సః) ఇచ్ఛతి, (తదా) జలదాః చ, శైలాః చ, పానీయం ముముచుః, భామిని, తస్య, నైరృతరాజస్య, రాజరాజస్య, రావణస్య, భార్యార్థే బుద్ధిం త్వం కిం న కురుషే?

**ప్రతిపదార్థము :-** సుభ్రు = సుందరమైన కనుబొమలుగల ఓ జానకీ! యస్య భయాత్ = ఎవనియొక్క భయము వల్లనైతే, (సః = అతడు), యదా ఇచ్ఛతి = ఎప్పుడు కోరునో, (తదా) ఏవ = అప్పుడే, తరవః = వృక్షములు, పుష్పవృష్టిం = పుష్పవర్షమును, ముముచుః = విడచునో, శైలాః చ జలదాః చ = పర్వతములును, మేఘములును, పానీయం ముముచుః = జలమును కురిపించునో, భామిని = ఓ సుందరీ, తస్య = అట్టి, నైరృతరాజస్య = రాక్షసప్రభువైనట్టి, రాజరాజస్య = రాజాధిరాజయిన, రావణస్య = రావణునకు, భార్యార్థే = భార్యవగుటకొరకై, త్వం = నీవు, బుద్ధిం కిం న కురుషే = ఎందులకు నిశ్చయించుకొనవు?

**తాత్పర్యము :-** ఓ సుందరీ! ఎవరికి భయము నొంది కోరిన వెంటనే ఆ యా వృక్షములు, పుష్పవర్షమును కురిపించుచుండునో, అట్లే పర్వతములును, మేఘములును, జలమును వర్షించుచుండునో అట్టి రాక్షసాధిపతియైన రావణునికి భార్యగా నుండుటకు ఏల నిశ్చయించుకొనలేకున్నావు?

**శ్లో॥ సాధు తే తత్త్వతో దేవి కథితం సాధు భామిని ।**
**గృహాణ సుస్మితే వాక్య మన్యథా న భవిష్యసి ॥ 21**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రాక్షసీప్రరోచనం" నామ*
*త్రయోవింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– సాధు – తే – తత్త్వతః – దేవి – కథితం – సాధు – భామిని! గృహాణ – సుస్మితే – వాక్యమ్ – అన్యథా – న – భవిష్యసి ॥

**అన్వయక్రమము** :– దేవి! భామిని! తే, తత్త్వతః సాధు కథితం వాక్యం సాధు గృహాణ; సుస్మితే! అన్యథా (త్వం) న భవిష్యసి.

**ప్రతిపదార్థము** :– దేవి! = ఓ పూజ్యురాలా, భామిని = ఓ సుందరీ! తే = నీకు, సాధు = లెస్సగా, తత్త్వతః = యథార్థము ననుసరించి, కథితం = చెప్పబడిన, వాక్యం = వచనమును, సాధు గృహాణ = లెస్సగా స్వీకరింపుము, సుస్మితే = చక్కని చిరునవ్వుగల యో తరుణీ! అన్యథా = వేరొకరీతిగా, (నడచిన) (త్వం = నీవు) న భవిష్యసి = జీవింపవు.

**తాత్పర్యము** :– ఓ సీతాదేవీ! మేము నీకు వాస్తవవిషయమును చక్కగా తెలిపియుంటిమి. నీవు కూడ మేము చెప్పినదానిని చక్కగా గ్రహింపుము. రావణుని భర్తగా స్వీకరింపుము. అట్లు గానియెడల నీవు జీవములతో నుండవు సుమా!

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రాక్షసీప్రరోచనము" అను*
*ఇఱువదిమూడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుర్వింశసర్గ

**శ్లో॥ తత స్సీతా ముపాగమ్య రాక్షస్యో వికృతాననాః ।**
**పరుషం పరుషా నార్య ఊచు స్తాం వాక్య మప్రియమ్ ॥ 1**

**పదచ్ఛేదము :-** తతః - సీతామ్ - ఉపాగమ్య - రాక్షస్యః - వికృతాననాః - పరుషం - పరుషాః - నార్యః - ఊచుః - తాం - వాక్యమ్ - అప్రియమ్ ॥

**అన్వయక్రమము :-** తతః వికృతాననాః, పరుషాః, రాక్షస్యః నార్యః తాం సీతామ్ ఉపాగమ్య, పరుషమ్, అప్రియం వాక్యమ్ ఊచుః.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, వికృతాననాః = వికారమైన ముఖములు కలిగియున్న, పరుషాః = పరుషస్వభావము కలిగినట్టి, రాక్షస్యః నార్యః = రాక్షస స్త్రీలు, తాం సీతాం = ఆ సీతాదేవిని, ఉపాగమ్య = చేరి, పరుషం = పరుషమైనరీతిగా, అప్రియం వాక్యం = అప్రియమైన వచనమును, ఊచుః = పలికిరి.

**తాత్పర్యము :-** అటుపిమ్మట వికారమైన రూపములు కలిగినట్టి ఆ రాక్షసస్త్రీలు సీతాదేవిని సమీపించి ఆమెనుగూర్చి అతిపరుషముగా అప్రియములైనట్టి వచనములను ఈరీతిగా బలుకదొడగిరి.

**శ్లో॥ కిం త్వ మన్తఃపురే సీతే సర్వభూతమనోహరే ।**
**మహార్హశయనోపేతే న వాస మనుమన్యసే ॥ 2**

**పదచ్ఛేదము :-** కిం - త్వమ్ - అంతఃపురే - సీతే - సర్వభూతమనోహరే - మహార్హ శయనోపేతే - న - వాసమ్ - అనుమన్యసే ॥

**అన్వయక్రమము :-** సీతే! సర్వభూతమనోహరే మహార్హశయనోపేతే, అంతఃపురే, వాసం త్వం కిం న అనుమన్యసే?

**ప్రతిపదార్థము :-** సీతే! = ఓ జానకీ! సర్వభూతమనోహరే = సమస్తప్రాణులకును ఆనందకరమై యున్నట్టి, మహార్హశయనోపేతే = అమూల్యములైన శయనములతో కూడినట్టి, అంతఃపురే = (రావణుని) అంతఃపురమున, వాసం = వసించుటను, త్వం = నీవు, కిం న అనుమన్యసే = ఏల అంగీకరింపకున్నావు?

**తాత్పర్యము** :– ఓ జానకీ! సర్వజనుల హృదయములను ఆకర్షించునట్టి అద్భుతమైన శయ్యలతో విరాజిల్లుచున్న రావణుని దివ్యమైన అంతఃపురమునందు సుఖముగా భోగముల ననుభవించుటకు నీవేల సమ్మతింపకున్నావు?

**శ్లో॥ మానుషీ మానుష స్యైవ భార్యాత్వం బహుమన్యసే ।**
**ప్రత్యాహర మనో రామా న్న త్వం జాతు భవిష్యసి ॥ 3**

**పదచ్ఛేదము** :– మానుషీ – మానుషస్య – ఏవ – భార్యాత్వం – బహుమన్యసే – ప్రత్యాహర – మనః – రామాత్ – న – త్వం – జాతు – భవిష్యసి ॥

**అన్వయక్రమము** :– మానుషీ (త్వం) మానుషస్య భార్యాత్వం ఏవ బహుమన్యసే; రామాత్ మనః ప్రత్యాహర; త్వం న జాతు భవిష్యసి.

**ప్రతిపదార్థము** :– మానుషీ = మనుష్యస్త్రీవైన, త్వం = నీవు, మానుషస్య = మానవునకు, భార్యాత్వమ్ ఏవ = భార్యగా నుండుటను మాత్రమే, బహుమన్యసే = గొప్పగా తలచు కొనుచున్నావు, రామాత్ = రామునినుండి, మనః = మనస్సును, ప్రత్యాహర = మఱలించుకొనుము. త్వం = నీవు, న జాతు భవిష్యసి = ఎన్నటికిని (అతనికి భార్యగా) నుండబోవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'న జాతు భవిష్యసి' – రావణుని అంగీకరింప కున్నచో మేము నిన్ను చంపివేయుదుము కాబట్టి రామునకు కూడ భార్యగా నుండబోవని భావము.

**తాత్పర్యము** :– నీవు మనుష్యస్త్రీవి కాబట్టి, ఒక మనుష్యునకు భార్యగా నుండుట మాత్రమే ఘనమైనదని భావించుచున్నావు. తప్పుడు భావమును సరిదిద్దుకొని మానవమాత్రుడైన రామునినుండి నీ మనస్సును మఱలించుకొనుము. రావణుని చేపట్టుము. ఏది ఏమయినను, నీవు రామునకు భార్యగా నుండుట భవిష్యత్తులో జరుగని పని సుమా!

**శ్లో॥ త్రైలోక్యవసుభోక్తారం రావణం రాక్షసేశ్వరమ్ ।**
**భర్తార ముపసంగమ్య విహరస్వ యథాసుఖమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– త్రైలోక్యవసుభోక్తారం – రావణం – రాక్షసేశ్వరమ్, భర్తారమ్ – ఉపసంగమ్య – విహరస్వ – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము** :– త్రైలోక్యవసుభోక్తారం రాక్షసేశ్వరం రావణం భర్తారమ్ ఉపసంగమ్య

యథాసుఖం విహరస్వ.

**ప్రతిపదార్థము** :- త్రైలోక్యవసుభోక్తారం = ముల్లోకములందలి ఐశ్వర్యములను అనుభవించుచున్నట్టి, రాక్షసేశ్వరం రావణం = రాక్షసరాజైన రావణుని, భర్తారమ్ ఉపసంగమ్య = నాథునిగా చేపట్టి, యథాసుఖం = సుఖముగా, విహరస్వ = క్రీడింపుము.

**తాత్పర్యము** :- ముల్లోకములందలి సంపదలను అనుభవించు భాగ్యశాలియైన రావణాసురుని భర్తగా స్వీకరించి నీవు స్వేచ్ఛగా విహరింపవచ్చును గదా!

**శ్లో॥ మానుషీ మానుషం తం తు రామ మిచ్ఛసి శోభనే ।**
**రాజ్యా ద్భ్రష్ట మసిద్ధార్థం విక్లబం త్వ మనిన్దితే ॥ 5**

**పదచ్ఛేదము** :- మానుషీ - మానుషం - తం - తు - రామమ్ - ఇచ్ఛసి - శోభనే - రాజ్యాత్ - భ్రష్టమ్ - అసిద్ధార్థం - విక్లబం - త్వమ్ - అనిందితే ॥

**అన్వయక్రమము** :- శోభనే! అనిందితే! మానుషీ త్వం మానుషం, రాజ్యాత్ భ్రష్టమ్, అసిద్ధార్థం, విక్లబం తం రామమ్ ఇచ్ఛసి.

**ప్రతిపదార్థము** :- శోభనే = ఓ మంగళ ప్రదమైనదానా, అనిందితే! = ఓ ఉత్తమురాలా! మానుషీ = మానవస్త్రీవైన, త్వం = నీవు, మానుషం = మానవుడును, రాజ్యాత్ = రాజ్యమునుండి, భ్రష్టం = తొలగినవాడును, అసిద్ధార్థం = సిద్ధించని కోరికలు గలవాడును, విక్లబం = ధైర్యహీనుడును అగు, తం రామం = ఆ రాముని, ఇచ్ఛసి = కోరుకొనుచున్నావు.

**తాత్పర్యము** :-ఓ ఉత్తమురాలా! నీవు మానవస్త్రీవి కాబట్టి రాజ్యమునుండి తరిమివేయబడినప్పటికిని ఏ ప్రయోజనము సాధింపలేని వాడైనప్పటికిని ధైర్యహీనుడై నప్పటికిని ఒకానొక మానవమాత్రునే ఇప్పటికిని భర్తగా ప్రేమించుచున్నావు.

**శ్లో॥ రాక్షసీనాం వచః శ్రుత్వా సీతా పద్మనిభేక్షణా ।**
**నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యా మిదం వచన మబ్రవీత్ ॥ 6**

**పదచ్ఛేదము** :- రాక్షసీనాం - వచః - శ్రుత్వా - సీతా - పద్మనిభేక్షణా - నేత్రాభ్యామ్ - అశ్రుపూర్ణాభ్యామ్ - ఇదం - వచనమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- పద్మనిభేక్షణా సీతా రాక్షసీనాం వచః శ్రుత్వా అశ్రుపూర్ణాభ్యాం నేత్రాభ్యామ్ ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** పద్మనిభేక్షణా = పద్మములవంటి కన్నులుగల, సీతా = సీతాదేవి, రాక్షసీనాం = రాక్షసాంగనలయొక్క, వచః = వచనమును, శ్రుత్వా = విని, అశ్రు పూర్ణాభ్యాం = దుఃఖబాష్పములతో నిండిన, నేత్రాభ్యాం = కన్నులతో, ఇదం వచనం = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** రాక్షసవనితలు పలికిన ఆ మాటల నాలకించి సీతాదేవి తామర పువ్వులవలె తన కన్నులనిండ దుఃఖబాష్పములు అలముకొనుచుండ వారి కీవిధముగ ప్రత్యుత్తర మొసగెను.

**శ్లో॥ య దిదం లోకవిద్విష్ట ముదాహరథ సంగతాః ।**
**నైతన్మనసి వాక్యం మే కిల్బిషం ప్రతిభాతి వః ॥ 7**

**పదచ్ఛేదము :–** యత్ – ఇదం – లోకవిద్విష్టమ్ – ఉదాహరథ – సంగతాః – న – ఏతత్ – మనసి – వాక్యం – మే – కిల్బిషం – ప్రతిభాతి – వః ॥

**అన్వయక్రమము :–** సంగతాః లోకవిద్విష్టమ్ ఇదం యత్ ఉదాహరథ, ఏతత్ వాక్యం మే మనసి న; వః కిల్బిషం ప్రతిభాతి.

**ప్రతిపదార్థము :–** సంగతాః = గుమికూడినవారై, లోకవిద్విష్టం = లోకనింద్యమైనట్టి, ఇదం = ఈ మాటను, యత్ ఉదాహరథ = ఏది బోధించుచున్నారో, ఏతత్ వాక్యం = ఈ వచనము, మే మనసి న = నామనస్సునందు నిలువదు. వః = మీకు, కిల్బిషం = పాపహేతువుగా, ప్రతిభాతి = (నాకు) తోచుచున్నది.

**తాత్పర్యము :–** ఓ రాక్షసాంగనలారా! మీరందరును కలసి లోకనింద్యములైన మాటలను పలుకుచు నాకు బోధించుచున్న ఈ విషయ మేమియు నా మనస్సున కొప్పదు. మీకు ఇది మహాపాతకమును కలిగించు కార్యమని నా నిశ్చయము.

**శ్లో॥ న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి ।**
**కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః ॥ 8**

**పదచ్ఛేదము :–** న – మానుషీ – రాక్షసస్య – భార్యా – భవితుమ్ – అర్హతి – కామం – ఖాదత – మాం – సర్వాః – న – కరిష్యామి – వః – వచః ॥

**అన్వయక్రమము :–** మానుషీ రాక్షసస్య భార్యా భవితుం న అర్హతి; మాం సర్వాః కామం ఖాదత; వః వచః న కరిష్యామి.

**ప్రతిపదార్థము :–** మానుషీ = మానవస్త్రీ, రాక్షసస్య = రాక్షసునకు, భార్యా = పత్ని, భవితుం = అగుటకు, న అర్హతి = తగియుండదు, సర్వాః = (మీరు) అందరును,

కామం = యథేచ్ఛగా, మాం = నన్ను, ఖాదత = తినివేయుడు, వః వచః = మీ మాటను, న కరిష్యామి = ఆచరింపను.

**తాత్పర్యము :–** మనుష్యకాంత ఎన్నడును రాక్షసునకు భార్య కాజాలదు. మీరందరును కలసి నన్ను తినివేయుడు. మీరేమి చేయబూనినను మీ మాటలను మాత్రము నేను ఆలకింపను, పాటింపను.

**శ్లో॥ దీనో వా రాజ్యహీనో వా యో మే భర్తా స మే గురుః ।**
**తం నిత్య మనురక్తా ఽస్మి యథా సూర్యం సువర్చలా ॥ 9**

**పదచ్ఛేదము :–** దీనః – వా – రాజ్యహీనః – వా – యః – మే – భర్తా – సః – మే – గురుః – తం – నిత్యమ్ – అనురక్తా – అస్మి – యథా – సూర్యం – సువర్చలా ॥

**అన్వయక్రమము :–** దీనో వా రాజ్యహీనో వా, యః మే భర్తా, సః మే గురుః; సువర్చలా సూర్యం యథా (అహం) తం నిత్యం అనురక్తా అస్మి.

**ప్రతిపదార్థము :–** దీనో వా = దీనుడైనను, రాజ్యహీనః వా = రాజ్యము లేనివాడైనను, యః = ఎవ్వడు, మే = నాకు, భర్తా = ప్రభువో, సః = అతడు, మే = నాకు, గురుః = సేవనీయుడు, సువర్చలా = సువర్చలాదేవి, సూర్యం యథా = సూర్యునివలె, (అహం = నేను) తం = అతనినిగూర్చి, నిత్యం = ఎల్లప్పుడు, అనురక్తా అస్మి = అనురాగము గలదాననై యున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సువర్చలా – సూర్యాభిముఖములైన పుష్పములు గల్గియుండు ఒక మొక్క యని కొందరి భావము.

**తాత్పర్యము :–** అతడు దీనుడై యుండవచ్చును, రాజ్యభ్రష్టుడై యుండవచ్చును; ఆ పురుషుడు నా పెనిమిటి కాబట్టి నాకు దైవసమానుడే యగును. సువర్చలాదేవి సూర్యభగవానుని యెడవలెనే నేను నా భర్తయైన ఆ రామునియెడనే ఎట్టి పరిస్థితి యందైనను అనురాగపూర్ణురాలనై యుందును.

**శ్లో॥ యథా శచీ మహాభాగా శక్రం సముపతిష్ఠతి ।**
**అరుంధతీ వసిష్ఠం చ రోహిణీ శశినం యథా ॥ 10**

**శ్లో॥ లోపాముద్రా యథాగస్త్యం సుకన్యా చ్యవనం యథా ।**
**సావిత్రీ సత్యవంతం చ కపిలం శ్రీమతీ యథా ॥ 11**

**శ్లో॥ సౌదాసం మదయంతీవ కేశినీ సగరం యథా ।**
**నైషధం దమయంతీవ భైమీ పతి మనువ్రతా ॥ 12**

**శ్లో॥ తథా ఉహ మిక్ష్వాకువరం రామం పతి మనువ్రతా ॥ 13**

**పదచ్ఛేదము** :- సుగమము ॥

**అన్వయక్రమము** :- యథా మహాభాగా శచీ శక్రం సముపతిష్ఠతి, (యథా) అరుంధతీ చ వసిష్ఠం (సముపతిష్ఠతి), యథా రోహిణీ శశినం (సముపతిష్ఠతి), యథా లోపాముద్రా అగస్త్యం (సముపతిష్ఠతి), యథా సుకన్యా చ్యవనం (సముపతిష్ఠతి), యథా సావిత్రీ చ సత్యవంతం (సముపతిష్ఠతి), యథా శ్రీమతీ కపిలం (సముపతిష్ఠతి), మదయంతీ సౌదాసం ఇవ, యథా కేశినీ పతిం సగరం అనువ్రతా, భైమీ దమయంతీ నైషధమ్ ఇవ, తథా అహమ్ ఇక్ష్వాకువరం పతిం రామమ్ అనువ్రతా.

**ప్రతిపదార్థము** :- యథా = ఎట్లు, మహాభాగా శచీ = భాగ్యశాలినియైన శచీదేవి, శక్రం = దేవేంద్రుని, సముపతిష్ఠతి = సేవించునో, యథా = ఎట్లు, అరుంధతీ చ = అరుంధతియును, వసిష్ఠం సముపతిష్ఠతి = వసిష్ఠుని సేవించునో, యథా = ఎట్లు, రోహిణీ = రోహిణీతార, శశినం = చంద్రుని సేవించునో, యథా = ఎట్లు, లోపాముద్రా = లోపాముద్ర, అగస్త్యం = అగస్తమహర్షిని సేవించునో, యథా = ఎట్లు, సుకన్యా = సుకన్య, చ్యవనం = చ్యవనమహర్షిని సేవించునో, యథా = ఎట్లు, సావిత్రీ చ = సావిత్రియును, సత్యవంతం = సత్యవంతుని సేవించునో, యథా = ఎట్లు, శ్రీమతీ = శ్రీమతి యను సాధ్వి, కపిలం = కపిలమహర్షిని సేవించునో, మదయంతీ = మందయంతి యను నామె, సౌదాసం ఇవ = సౌదాసునివలె, భైమీ దమయంతీ = భీమభూపాలుని తనయయైన దమయంతి, నైషధమ్ ఇవ = నిషధమహీపతియైన నలునివలె, యథా = ఎట్లుగా, కేశినీ = కేశిని యను సాధ్వి, పతిం సగరం = భర్తయైన సగరభూపతిని, అనువ్రతా = అనుసరించునట్టిదో, తథా = అట్లుగా, అహం = నేను, ఇక్ష్వాకువరం = ఇక్ష్వాకుకులతిలకుడైన, పతిం రామం = భర్తయైన రాముని, అనువ్రతా = అనుసరించునట్టిదానను.

**తాత్పర్యము** :- జగద్విఖ్యాతి నొందిన మహాసాధ్వులుగా కీర్తింపబడు శచీదేవి దేవేంద్రునివలె, అరుంధతి వసిష్ఠమహర్షినివలె, రోహిణీతార చంద్రునివలె, లోపాముద్ర అగస్త్యమహర్షినివలె, రాజకన్యయైన సుకన్య చ్యవనమహర్షినివలె, మద్రరాజపుత్రియైన సావిత్రి సత్యవంతునివలె, శ్రీమతి కపిలమహర్షినివలె, మదయంతి సౌదాసునివలె, భీమరాజసుతయైన దమయంతి నలమహారాజునువలె, కేశిని సగరభూపాలునివలె,

నేనుకూడ అచంచలమైన గౌరవానురాగములతో నా నాథుడైన ఆ ఇక్ష్వాకుకులతిలకునే సహ ధర్మచారిణినై సేవించునట్టిదానను అని తెలిసికొనుడు.

**శ్లో॥ సీతాయా వచనం శ్రుత్వా రాక్షస్యః క్రోధమూర్ఛితాః ।**
**భర్త్సయంతి స్మ పరుషై ర్వాక్యై రావణచోదితాః ॥ 14**

**పదచ్ఛేదము** :- సీతాయాః - వచనం - శ్రుత్వా - రాక్షస్యః - క్రోధమూర్ఛితాః, భర్త్సయంతి - స్మ - పరుషైః - వాక్యైః - రావణచోదితాః ॥

**అన్వయక్రమము** :- సీతాయాః వచనం శ్రుత్వా రాక్షస్యః క్రోధమూర్ఛితాః రావణచోదితాః పరుషైః వాక్యైః (సీతాం) భర్త్సయంతి స్మ.

**ప్రతిపదార్థము** :- సీతాయాః = సీతాదేవియొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, రాక్షస్యః = రాక్షసవనితలు, క్రోధమూర్ఛితాః = కోపముచే వివశురాండ్రై, రావణచోదితాః = రావణునిచే ప్రేరేపింపబడినవారై, పరుషైః = కటువైన, వాక్యైః = మాటలతో, (సీతాం = సీతాదేవిని) భర్త్సయంతి స్మ = భయపెట్టసాగిరి.

**తాత్పర్యము** :- సీత చెప్పిన మాటలు విని అచ్చటి రాక్షసాంగనలు క్రోధావేశము నొంది రావణుడు తమ్ము ఆదేశించిన రీతిగా సీతాదేవిని కటువైన మాటలతో తిరిగి బెదిరింప సాగిరి.

**శ్లో॥ అవలీన స్స నిర్వాక్యో హనుమాన్ శింశుపాద్రుమే ।**
**సీతాం సంతర్జయంతీ స్తా రాక్షసీ రశృణోత్కపిః ॥ 15**

**పదచ్ఛేదము** :- అవలీనః - సః - నిర్వాక్యః - హనుమాన్ - శింశుపాద్రుమే - సీతాం - సంతర్జయంతీః - తాః - రాక్షసీః - అశృణోత్ - కపిః ॥

**అన్వయక్రమము** :- శింశుపాద్రుమే అవలీనః సః కపిః హనుమాన్ నిర్వాక్యః (సన్) సీతాం సంతర్జయంతీః తాః రాక్షసీః అశృణోత్.

**ప్రతిపదార్థము** :- శింశుపాద్రుమే = శింశుపావృక్షముపై, అవలీనః = దాగియున్నట్టి, సః కపిః హనుమాన్ = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, నిర్వాక్యః (సన్) = ఏమియు పలుకనివాడై, సీతాం సంతర్జయంతీః = సీతాదేవిని గద్దించుచున్నట్టి, తాః రాక్షసీః = ఆ రాక్షసస్త్రీలను, అశృణోత్ = వినుచుండెను.

**తాత్పర్యము** :- ఆ శింశుపావృక్షముపై కొమ్మలమాటున దాగియున్న హనుమ సీతాదేవిని ఇట్లు భీకరముగా గద్దించుచు రాక్షసస్త్రీలు పలికిన మాటలను మౌనముగా నుండి వినుచుండెను.

**శ్లో॥ తా మభిక్రమ్య సంక్రుద్ధా వేపమానాం సమంతతః ।**
**భృశం సంలిలిహు ర్దీప్తాన్ ప్రలంబాన్ దశనచ్ఛదాన్ ॥ 16**

**పదచ్ఛేదము :–** తామ్ – అభిక్రమ్య – సంక్రుద్ధాః – వేపమానాం – సమంతతః – భృశం – సంలిలిహుః – దీప్తాన్ – ప్రలంబాన్ – దశనచ్ఛదాన్ ॥

**అన్వయక్రమము :–** వేపమానాం తాం సమంతతః అభిక్రమ్య సంకృద్ధాః తాః దీప్తాన్, ప్రలంబాన్ దశనచ్ఛదాన్ భృశం సంలిలిహుః.

**ప్రతిపదార్థము :–** వేపమానాం = వణికిపోవుచున్న, తాం = ఆ సీతాదేవిని, సమంతతః = చుట్టును, అభిక్రమ్య = గుమిగూడి, సంక్రుద్ధాః = మిక్కిలి క్రోధావేశము నొందిన, తాః = ఆ రాక్షసస్త్రీలు, దీప్తాన్ = ప్రకాశించుచున్నట్టి, ప్రలంబాన్ = వ్రేలాడుచున్న, దశనచ్ఛదాన్ = పెదవులను, భృశం = మాటిమాటికి, సంలిలిహుః = నాకికొను చుండిరి.

**తాత్పర్యము :–** భయముచే మిక్కిలి వణకిపోవుచున్న సీతాదేవి చుట్టును ఆ రాక్షసస్త్రీలు ఎల్లరును మూగి వ్రేలాడుచున్న తమ ఎఱ్ఱని పెదవులను క్రోధముతో మాటిమాటికి నాకుకొనుచుండిరి.

**శ్లో॥ ఊచుశ్చ పరమక్రుద్ధాః ప్రగృహ్యాశు పరశ్వధాన్ ।**
**నేయ మర్హతి భర్తారం రావణం రాక్షసాధిపమ్ ॥ 17**

**పదచ్ఛేదము :–** ఊచుః – చ – పరమక్రుద్ధాః – ప్రగృహ్య – ఆశు – పరశ్వధాన్ – న – ఇయమ్ – అర్హతి – భర్తారం – రావణం – రాక్షసాధిపమ్ ॥

**అన్వయక్రమము :–** ఆశు పరశ్వధాన్ ప్రగృహ్య పరమక్రుద్ధాః ఊచుః చ; ఇయం, రాక్షసాధిపం రావణం భర్తారం న అర్హతి.

**ప్రతిపదార్థము :–** ఆశు = శీఘ్రముగ, పరశ్వధాన్ = గండ్రగొడ్డళ్ళను, ప్రగృహ్య = చేతబూని, పరమక్రుద్ధాః = మిక్కిలి క్రోధోద్రిక్తలై, ఊచుః చ = పలికిరి, ఇయం = ఈమె, రాక్షసాధిపం రావణం = రాక్షసప్రభువైన రావణుని, భర్తారం = భర్తనుగా, న అర్హతి = (చేసికొనుటకు) తగదు.

**తాత్పర్యము :–** మఱియు వారు తమ ఆయుధములైన గండ్రగొడ్డళ్ళను చేత బూని తీవ్రమైన క్రోధముతో "ఈ జానకికి ప్రభువైన రావణుని భర్తగా పొందు యోగ్యత లేదు" అని పలుకదొడగిరి.

**శ్లో॥ సా భర్త్స్యమానా భీమాభీ రాక్షసీభి ర్వరాననా ।**
**సా బాష్ప మపమార్జంతీ శింశుపాం తా ముపాగమత్ ॥ 18**

**పదచ్ఛేదము :-** సా - భర్త్స్యమానా - భీమాభిః - రాక్షసీభిః - వరాననా, సా - బాష్పమ్ - అపమార్జంతీ - శింశుపాం - తామ్ - ఉపాగమత్ ॥

**అన్వయక్రమము :-** సా వరాననా భీమాభిః రాక్షసీభిః భర్త్స్యమానా (అభూత్;) సా బాష్పమ్ అపమార్జంతీ తాం శింశుపామ్ ఉపాగమత్.

**ప్రతిపదార్థము :-** సా వరాననా = ఆ సుముఖి సీత, భీమాభిః = భయమునుగొల్పునట్టి, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, భర్త్స్యమానా = గద్దింపబడుచున్నది, (అభూత్ = ఆయెను;) సా = ఆమె, బాష్పం = కన్నీటిని, అపమార్జంతీ = తుడుచుకొనుచు, తాం శింశుపామ్ = ఆ శింశుపావృక్షమును, ఉపాగమత్ = చేరుకొనెను.

**తాత్పర్యము :-** సీతాదేవి క్రూరురాండ్రైన ఆ రాక్షసవనితలు తనను నిర్దయగా గద్దించుచుండగా కన్నులనుండి వచ్చుచున్న దుఃఖబాష్పములను తుడుచుకొనుచు లేచి అచటనున్న శింశుపావృక్షము క్రిందకు చేరెను.

**శ్లో॥ తత స్తాం శింశుపాం సీతా రాక్షసీభి స్సమావృతా ।**
**అభిగమ్య విశాలాక్షీ తస్థౌ శోకపరిప్లుతా ॥ 19**

**పదచ్ఛేదము :-** తతః - తాం - శింశుపాం - సీతా - రాక్షసీభిః - సమావృతా - అభిగమ్య - విశాలాక్షీ - తస్థౌ - శోకపరిప్లుతా ॥

**అన్వయక్రమము :-** తతః విశాలాక్షీ సీతా రాక్షసీభిః సమావృతా, శోకపరిప్లుతా (సతీ) తాం శింశుపామ్ అభిగమ్య తస్థౌ.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, విశాలాక్షీ = విశాలములైన నేత్రములుగల, సీతా = సీతాదేవి, రాక్షసీభిః = రాక్షసవనితలచే, సమావృతా = చుట్టుకొనబడినదై, శోకపరిప్లుతా (సతీ) = దుఃఖముతో నిండినదై, తాం శింశుపాం = ఆ శింశుపా వృక్షమును, అభిగమ్య = చేరి, తస్థౌ = నిలచియుండెను.

**తాత్పర్యము :-** భయంకరులైన ఆ రాక్షసస్త్రీలు తనను చుట్టుముట్టి యుండగా దుఃఖ సంతప్తురా లగుచు సీతాదేవి శింశుపావృక్షముక్రిందకు పోయి నిలచియుండెను.

**శ్లో॥ తాం కృశాం దీనవదనాం మలినాంబరధారిణీమ్ ।**
**భర్త్సయాంచక్రిరే సీతాం రాక్షస్య స్తాం సమంతతః ॥ 20**

**పదచ్ఛేదము :-** తాం - కృశాం - దీనవదనాం - మలినాంబరధారిణీమ్, భర్త్సయాం చక్రిరే - సీతాం - రాక్షస్యః - తాం - సమంతతః ॥

**అన్వయక్రమము :-** తాం కృశాం దీనవదనాం, మలినాంబరధారిణీం సీతాం, రాక్షస్యః సమంతతః (అభిగమ్య) భర్త్సయాంచక్రిరే.

**ప్రతిపదార్థము :-** తాం = ఆవిధమైన, కృశాం = కృశించియున్నది, దీనవదనాం = దీనమైన ముఖముతో నున్నదియును, మలినాంబరధారిణీం = మలినవస్త్రముతో నున్నదియునగు, సీతాం = సీతాదేవిని, సమంతతః = చుట్టును, అభిగమ్య = గుమికూడి, రాక్షస్యః = ఆ రాక్షసస్త్రీలు, భర్త్సయాంచక్రిరే = భయపెట్టసాగిరి.

**తాత్పర్యము :-** అట్లు కృశించి దీనవదనయై మలినవస్త్రముతో నున్న ఆ సీతాదేవిని ఆ రాక్షసస్త్రీ లెల్లరును అచ్చటగూడ చుట్టుముట్టి తిరిగి ఆమెను బహువిధములుగ భయపెట్టసాగిరి.

**శ్లో॥ తత స్తాం వినతా నామ రాక్షసీ భీమదర్శనా ।**
**అబ్రవీత్ కుపితాకారా కరాళా నిర్ణతోదరీ ॥ 21**

**పదచ్ఛేదము :-** తతః - తాం - వినతా - నామ - రాక్షసీ - భీమదర్శనా - అబ్రవీత్ - కుపితాకారా - కరాళా - నిర్ణతోదరీ ॥

**అన్వయక్రమము :-** తతః భీమదర్శనా, కుపితాకారా, కరాళా నిర్ణతోదరీ, వినతా నామ రాక్షసీ తామ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, భీమదర్శనా = భయంకరాకారము గలదియును, కుపితాకారా = క్రోధమూర్తియును, కరాళా = భీకరురాలును, నిర్ణతోదరీ = అణగియున్న పొట్టగలదియును అగు, వినతా నామ రాక్షసీ = వినత యను రాక్షసవనిత, తాం = ఆ సీతాదేవిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :-** అప్పుడు భయంకరమైన రూపము గలదియును మూర్తీభవించిన క్రోధమువలె నున్నదియును, లోతైన పొట్టగలదియునైన వినత యను ఒకానొక వనిత సీతాదేవిని సంబోధించుచు ఈరీతిగా పలుకదొడగెను.

**శ్లో॥ సీతే పర్యాప్త మేతావ ద్భర్తృస్నేహో నిదర్శితః ।**
**సర్వ త్రాతికృతం భద్రే వ్యసనా యోపకల్పతే ॥ 22**

**పదచ్ఛేదము :-** సీతే - పర్యాప్తమ్ - ఏతావత్ - భర్తృస్నేహః - నిదర్శితః - సర్వత్ర - అతికృతం - భద్రే - వ్యసనాయ - ఉపకల్పతే ॥

**అన్వయక్రమము** :- సీతే, (త్వయా) భర్తృస్నేహః, నిదర్శితః; ఏతావత్ పర్యాప్తమ్; భద్రే! సర్వత్ర అతికృతం వ్యసనాయ ఉపకల్పతే.

**ప్రతిపదార్థము** :- సీతే = ఓ జానకీ! త్వయా = నీచేత, భర్తృస్నేహః = భర్తపై (నుండవలసిన) ప్రేమ, నిదర్శితః = ప్రదర్శింపబడినది, ఏతావత్ = ఇంతమాత్రము, పర్యాప్తమ్ = చాలును, భద్రే = ఓ మంగళస్వరూపురాలా! సర్వత్ర = ఎల్లయెడలను, అతికృతం = మితిమీఱి చేయబడినది, వ్యసనాయ = కష్టమునకే, ఉపకల్పతే = కారణము కాగలదు.

**తాత్పర్యము** :- ఓ జానకీ! నీ భర్తపై చూపవలసిన ప్రేమనంతయు నీవు చక్కగనే ప్రదర్శించితివి; ఇప్పటికిది ఇంతమాత్రము చాలును; ఎచ్చటనైనను మితిమీరి గావించిన ఎట్టిపని యైనను తనకు కష్టమునే కలిగించును సుమా!

**శ్లో॥ పరితుష్టాస్మి భద్రం తే మానుష స్తే కృతో విధిః ।**
**మమాపి తు వచః పథ్యం బ్రువంత్యాః కురు మైథిలి ॥ 23**

**పదచ్ఛేదము** :- పరితుష్టా - అస్మి - భద్రం - తే - మానుషః - తే - కృతః - విధిః - మమ - అపి - తు - వచః - పథ్యం - బ్రువంత్యాః - కురు - మైథిలి ॥

**అన్వయక్రమము** :- పరితుష్టా అస్మి; తే భద్రమ్; మానుషః తే విధిః కృతః; మైథిలి, బ్రువంత్యాః మమాపి పథ్యం వచః తు కురు.

**ప్రతిపదార్థము** :- పరితుష్టా అస్మి = మిక్కిలి సంతోషించితిని. తే = నీకు, భద్రం = క్షేమము. మానుషః = మానవప్రయత్నమైన, తే విధిః = నీ ధర్మము, కృతః = నెరవేర్పబడినది. మైథిలి = ఓ జానకీ, బ్రువంత్యాః = చెప్పుచున్నట్టి, మమ = నాయొక్క, పథ్యం వచః అపి = మేలునుగూర్చు మాటనుగూడ, కురు = ఆచరింపుము.

**తాత్పర్యము** :- నీవర్తనము నాకు చాలా సంతసము కల్గించినది. నీకు మేలు కలుగుగాక! నీవు చేయవలసిన మనుష్యప్రయత్నమంతయును చక్కగా చేసితివి. ఓ జానకీ! ఇప్పుడు నీ శ్రేయస్సుగోరి చెప్పుచున్న నామాటలను గూడ, కొంచెము విని ఆ ప్రకారము నడచుకొనుము.

**శ్లో॥ రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్ ।**
**విక్రాంతం రూపవంతం చ సురేశమివ వాసవమ్ ॥ 24**

**పదచ్ఛేదము** :- రావణం - భజ - భర్తారం - భర్తారం - సర్వరక్షసామ్, విక్రాంతం - రూపవంతం - చ - సురేశమ్ - ఇవ - వాసవమ్ ॥

**అన్వయక్రమము** :- సర్వరక్షసాం భర్తారం, సురేశం వాసవమ్ ఇవ విక్రాంతం, రూపవంతం రావణం భర్తారం భజ.

**ప్రతిపదార్థము** :- సర్వరక్షసాం = సర్వదానవులకును, భర్తారం = ప్రభువైనవాడును, సురేశం వాసవమివ = దేవరాజైన ఇంద్రునివలె, రూపవంతం = రూపవంతుడును అగు, రావణం = రావణుని, భర్తారం = భర్తనుగా, భజ = సేవింపుము.

**తాత్పర్యము** :- సర్వరాక్షసవంశములకును ప్రభువైనవాడును దేవరాజైన మహేంద్రుని వలె సౌందర్యవంతుడును పరాక్రమవంతుడును అగు రావణుని భర్తగా చేపట్టుము.

**శ్లో॥ దక్షిణం త్యాగశీలం చ సర్వస్య ప్రియదర్శనమ్ ।**
**మానుషం కృపణం రామం త్యక్త్వా రావణ మాశ్రయ ॥ 25**

**పదచ్ఛేదము** :- దక్షిణం - త్యాగశీలం - చ - సర్వస్య - ప్రియదర్శనమ్, మానుషం - కృపణం - రామం - త్యక్త్వా - రావణమ్ - ఆశ్రయ ॥

**అన్వయక్రమము** :- మానుషం, కృపణం, రామం త్యక్త్వా, దక్షిణం, త్యాగశీలం సర్వస్య ప్రియదర్శనం, రావణమ్ ఆశ్రయ.

**ప్రతిపదార్థము** :- మానుషం = మానవమాత్రుడును, కృపణం = దీనుడును అగు, రామం = రాముని, త్వక్త్వా = విడిచి, దక్షిణం = సమర్థుడును, త్యాగశీలం = త్యాగ స్వభావము గలవాడును, సర్వస్య = ఎల్లరకును, ప్రియదర్శనం = ప్రియముగా గానవచ్చువాడును అగు, రావణం = రావణుని, ఆశ్రయ = ఆశ్రయింపుము.

**తాత్పర్యము** :- మానవమాత్రుడును, దీనుడైనవాడు నగు రాముని విడచి, ఎల్లరకును ప్రియంకరమైన రూపము కలిగి త్యాగశీలుడై సర్వసమర్థుడై యున్న రావణుని ఆశ్రయింపుము.

**శ్లో॥ దివ్యాంగరాగా వైదేహి దివ్యాభరణభూషితా ।**
**అద్య ప్రభృతి సర్వేషాం లోకానా మీశ్వరీ భవ ॥ 26**

**పదచ్ఛేదము** :- దివ్యాంగరాగా - వైదేహి - దివ్యాభరణభూషితా - అద్య - ప్రభృతి - సర్వేషాం - లోకానామ్ - ఈశ్వరీ - భవ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- వైదేహి = ఓ జానకీ! దివ్యాంగరాగా = దివ్యములైన అంగరాగములు గలదానవై, దివ్యాభరణభూషితా = దివ్యములైన భూషణములతో అలంకరించుకొనిన

దానవై, అద్య ప్రభృతి = నేటినుండి, సర్వేషాం = సమస్తమైన, లోకానాం = లోకములకును, ఈశ్వరీ = ఆధిపత్యము గలదానవు, భవ = అగుము.

**తాత్పర్యము :–** ఓ జానకీ! దివ్యమైన మైపూతలను ఉపయోగించుకొనుచు అమూల్యమైన ఆభరణములతో అలంకరించుకొనుచు నేటినుండి నీవు సమస్తలోకములకును అధీశ్వరివి గమ్ము!

**శ్లో॥ అగ్నే స్స్వాహా యథా దేవీ శచీ వేంద్రస్య శోభనే ।**
**కిం తే రామేణ వైదేహి కృపణేన గతాయుషా ॥ 27**

**పదచ్ఛేదము :–** అగ్నేః – స్వాహా – యథా – దేవీ – శచీ – ఇవ – ఇంద్రస్య – శోభనే – కిం – తే – రామేణ – వైదేహి – కృపణేన – గతాయుషా ॥

**అన్వయక్రమము :–** అగ్నేః స్వాహా యథా, ఇంద్రస్య దేవీ శచీ ఇవ, శోభనే! (త్వం రావణస్య దేవీ భవ) వైదేహి! కృపణేన, గతాయుషా రామేణ తే కిమ్ ?

**ప్రతిపదార్థము :–** అగ్నేః = అగ్నిదేవునకు, స్వాహా యథా = స్వాహాదేవివలెను, ఇంద్రస్య = దేవేంద్రునకు, దేవీ శచీ ఇవ = శచీదేవివలెను, శోభనే = ఓ మంగళ స్వరూపురాలా! (త్వం రావణస్య దేవీ భవ = నీవు రావణునకు భార్యవుగమ్ము) వైదేహి = ఓ జానకీ! కృపణేన = దీనుడైనట్టి, గతాయుషా = ఆయుర్దాయము చెల్లిపోయినట్టి, రామేణ = రామునితో, తే = నీకు, కిమ్ = ఏమి ప్రయోజనమున్నది?

**తాత్పర్యము :–** ఓ జానకీ! అగ్నిదేవునకు స్వాహాదేవి భార్యయైనట్లును, దేవేంద్రునకు శచీదేవి పట్టమహిషి యైనట్లును, నీవు రావణునకు ఇష్టురాలైన పత్నివై యుండుటయే ఉచితమగును. దీనుడై రావణునిచేతిలో ఆయువును పోగొట్టుకొనువాడయిన ఆ రాముని వలన నీకేమి ప్రయోజనము?

**శ్లో॥ ఏత దుక్తం చ మే వాక్యం యది త్వం న కరిష్యసి ।**
**అస్మిన్ముహూర్తే సర్వా స్త్వాం భక్షయిష్యామహే వయమ్ ॥ 28**

**పదచ్ఛేదము :–** ఏతత్ – ఉక్తం – చ – మే – వాక్యం – యది – త్వం – న – కరిష్యసి – అస్మిన్ – ముహూర్తే – సర్వాః – త్వాం – భక్షయిష్యామహే – వయమ్ ॥

**అన్వయక్రమము :–** త్వమ్ ఉక్తం మే ఏతత్ వాక్యం, న కరిష్యసి యది, అస్మిన్ ముహూర్తే, వయం సర్వాః, త్వాం భక్షయిష్యామహే.

**ప్రతిపదార్థము :–** ఉక్తం = చెప్పబడినట్టి, మే ఏతత్ వాక్యం = నా యీ వచనమును, త్వం = నీవు, న కరిష్యసి యది = చేయకుందువేని, అస్మిన్ ముహూర్తే = ఈ

క్షణమునందే, వయం సర్వాః = మేమందరము, త్వాం = నిన్ను, భక్షయిష్యామహే = భక్షించివేసెదము.

**తాత్పర్యము** :– నీ మేలును గోరి నేను చెప్పిన వాక్యమును నీ వనుసరింపనియెడల ఈ క్షణమే మేమందరము గలసి నిన్ను చంపి తినివేసెదము సుమా!

**శ్లో॥ అన్యా తు వికటా నామ లంబమానపయోధరా ।**
**అబ్రవీ త్కుపితా సీతాం ముష్టి ముద్యమ్య గర్జతీ ॥ 29**

**పదచ్ఛేదము** :– అన్యా – తు – వికటా – నామ – లంబమానపయోధరా – అబ్రవీత్ – కుపితా – సీతాం – ముష్టిమ్ – ఉద్యమ్య – గర్జతీ ॥

**అన్వయక్రమము** :– లంబమానపయోధరా, వికటా నామ, అన్యా కుపితా (సతీ) ముష్టిమ్ ఉద్యమ్య గర్జతీ, సీతామ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– లంబమానపయోధరా = వ్రేలాడుచున్న స్తనములుగల, వికటా నామ = వికట యను పేరుగల, అన్యా = వేరొకవనిత, కుపితా (సతీ) = కోపముగలిగినదై, ముష్టిమ్ = పిడికిలిని, ఉద్యమ్య = మీదికి ఎత్తి, గర్జతీ = గర్జించుచున్నదై, సీతాం = సీతాదేవిని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :– వికారముగా వ్రేలాడుచున్న స్తనములు గల వికట యను వేఱొకరక్కసి మిక్కిలి క్రోధమునొందినదై పిడికిలిని బిగించి మీదికి ఎత్తి పెద్దగర్జన చేయుచు సీతాదేవిని గూర్చి ఈరీతిగా పలికెను.

**శ్లో॥ బహూ న్యప్రియరూపాణి వచనాని సుదుర్మతే ।**
**అనుక్రోశా న్మృదుత్వాచ్చ సోఢాని తవ మైథిలి ॥ 30**

**పదచ్ఛేదము** :– బహూని – అప్రియరూపాణి – వచనాని – సుదుర్మతే – అనుక్రోశాత్ – మృదుత్వాత్ – చ – సోఢాని – తవ – మైథిలి ॥

**అన్వయక్రమము** :– సుదుర్మతే! మైథిలి! అనుక్రోశాత్, మృదుత్వాత్ చ, అప్రియరూపాణి, బహూని తవ వచనాని సోఢాని.

**ప్రతిపదార్థము** :– సుదుర్మతే = ఓ దుర్మార్గురాలా! మైథిలి = ఓ జానకీ, అనుక్రోశాత్ = దయవలనను, మృదుత్వాత్ చ = మృదుస్వభావమువలనను, అప్రియరూపాణి = మిక్కిలి అనిష్టములైనట్టి, బహూని = అనేకములైన, తవ వచనాని = నీ మాటలు, సోఢాని = ఓర్చుకొనబడినవి.

**తాత్పర్యము** :- దుర్మార్గురాలవైన ఓ జానకీ! ఇంతవఱకును మేము మాలోని దయాస్వభావము చేతను, మా మృదుస్వభావము చేతను, మాకు అనిష్టకరముగా నీవెన్ని మాటలు చెప్పుచున్నను ఓర్పు వహించియుంటిమి.

**శ్లో॥ న చ నః కురుషే కార్యం హితం కాలపురస్కృతమ్ ।**
**ఆనీతాసి సముద్రస్య పార మన్యై ర్దురాసదమ్ ।**
**రావణాంతఃపురం ఘోరం ప్రవిష్టా చాసి మైథిలి ॥ 31**

**పదచ్ఛేదము** :- న - చ - నః - కురుషే - కార్యం - హితం - కాలపురస్కృతమ్ - ఆనీతా - అసి - సముద్రస్య - పారమ్ - అన్యైః - దురాసదమ్ - రావణాంతఃపురః - ఘోరం - ప్రవిష్టా - చ - అసి - మైథిలి ॥

**అన్వయక్రమము** :- మైథిలి, హితం, కాలపురస్కృతం, నః వాక్యం న కురుషే; అన్యైః దురాసదం, సముద్రస్య పారమ్, ఆనీతా అసి; ఘోరం రావణాంతఃపురం ప్రవిష్టా అసి చ.

**ప్రతిపదార్థము** :- మైథిలి! = ఓ జానకీ! హితం = పథ్యమైనదియును, కాలపురస్కృతం = కాలోచిత మైనట్టిదియునగు, నః వాక్యం = మా వచనమును, న కురుషే = ఆచరింపకున్నావు, అన్యైః = ఇతరులచే, దురాసదం = చేరుటకు అశక్యమైనట్టి, సముద్రస్య = సముద్రముయొక్క, పారం = దూరతీరమునకు, ఆనీతా అసి = తీసికొనిరాబడితివి, ఘోరం = భయంకరమైనట్టి, రావణాంతఃపురం = రావణాసురుని అంతఃపురమును, ప్రవిష్టా అసి చ = ప్రవేశించియుంటివి గూడను.

**తాత్పర్యము** :- మేము నీశ్రేయస్సును గోరి కాలోచితముగ చెప్పిన మాటలను నీవెంతమాత్రము అవలంబింపకున్నావు. ఇతరులు సమీపించుటకు శక్యముగాని సముద్రమును, దాటించి ఈవలితీరము మీదకు తెచ్చి, భయంకరమైన రావణుని అంతఃపురమునందు ప్రవేశపెట్టబడి యుంటివి అని తెలిసికొనుము.

**శ్లో॥ రావణస్య గృహే రుద్ధా మస్మాభిస్తు సురక్షితామ్ ।**
**న త్వాం శక్తః పరిత్రాతు మపి సాక్షాత్పురందరః ॥ 32**

**పదచ్ఛేదము** :- రావణస్య - గృహే - రుద్ధామ్ - అస్మాభిః - తు - సురక్షితామ్, న - త్వాం - శక్తః - పరిత్రాతుమ్ - అపి - సాక్షాత్ - పురందరః ॥

**అన్వయక్రమము** :- రావణస్య గృహే రుద్ధామ్, అస్మాభిః సురక్షితామ్, త్వాం పరిత్రాతుం సాక్షాత్ పురందరః అపి, పరిత్రాతుం శక్తః న.

**ప్రతిపదార్థము :–** రావణస్య = రావణునియొక్క, గృహే = భవనమునందు, రుద్ధాం = బంధింపబడినదానవును, అస్మాభిః = మాచే, సురక్షితాం = సంరక్షింపబడుచున్న దానవును అగు, త్వాం = నిన్ను, పరిత్రాతుం = సంరక్షించుటకు, సాక్షాత్ = సాక్షాత్తుగా, పురందరః అపి = దేవేంద్రుడైనను, శక్తః న = సమర్థుడు కాడు.

**తాత్పర్యము :–** రావణుని వంటివాని భవనములో బంధింపబడి మావంటివారిచే కావలికాయబడుచున్న నిన్ను మావశమునుండి రక్షించుటకు దేవేంద్రుడు దిగివచ్చినను సాధ్యము కాదు సుమా!

**శ్లో॥ కురుష్వ హితవాదిన్యా వచనం మమ మైథిలి ।**
**అల మశ్రుప్రపాతేన త్యజ శోక మనర్థకమ్ ॥ 33**

**పదచ్ఛేదము :–** కురుష్వ – హితవాదిన్యాః – వచనం – మమ – మైథిలి! – అలమ్ – అశ్రుప్రపాతేన – త్యజ – శోకమ్ – అనర్థకమ్ ॥

**అన్వయక్రమము :–** మైథిలి! హితవాదిన్యాః మమ వచనం కురుష్వ; అశ్రుప్రపాతేన అలమ్; అనర్థకం శోకం త్యజ.

**ప్రతిపదార్థము :–** మైథిలి = ఓ జానకీ, హితవాదిన్యాః = హితకరముగా పలుకుచున్న, మమ = నాయొక్క, వచనం = మాటను, కురుష్వ = ఆచరింపుము. అశ్రుప్రపాతేన అలం = కన్నీరు విడుచుట చాలును. అనర్థకం = అనర్థకమైన, శోకం = శోకమును, త్యజ = విడువుము.

**తాత్పర్యము :–** ఓ జానకీ! నీమేలుకోరి చెప్పుచున్నాము కాబట్టి మా మాటలు గ్రహించి అనుసరించుము. ఈ కన్నీటిధారలు ఎందుకు? నిరర్థకమైన నీ శోకము మానుము.

**శ్లో॥ భజ ప్రీతిం చ హర్షం చ త్యజైతాం నిత్యదైన్యతామ్ ।**
**సీతే రాక్షసరాజేన సహ క్రీడ యథాసుఖమ్ ॥ 34**

**పదచ్ఛేదము :–** భజ – ప్రీతిం – చ – హర్షం – చ – త్యజ – ఏతాం – నిత్యదైన్యతాం – సీతే – రాక్షసరాజేన – సహ – క్రీడ – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము :–** సీతే, ప్రీతిం చ హర్షం చ, భజ; ఏతాం నిత్యదైన్యతాం, త్యజ; రాక్షసరాజేన సహ యథాసుఖం క్రీడ.

**ప్రతిపదార్థము :–** సీతే! = ఓ జానకీ, ప్రీతిం చ = ప్రీతిని, హర్షం చ = ఆనందమును, భజ = సంపాదించుకొనుము, ఏతాం నిత్యదైన్యతాం = ఈ విధమైన నిరంతర దైన్యమును, త్యజ = విడిచిపెట్టుము. రాక్షసరాజేన సహ = రాక్షసరాజైన రావణునితో

కూడి, యథాసుఖం = సుఖముగా, క్రీడ = విహరింపుము.

**తాత్పర్యము :–** ఓ జానకీ! రావణునిపై ప్రేమను చూపుము; ఆనందమును సంపాదించు కొనుము. ఈ రీతిగా ఎల్లప్పుడును దీనురాలై యుండుట నీకు తగదు. రాక్షసప్రభువైన రావణునితో గూడి స్వేచ్ఛగా విహరింపుము.

**శ్లో॥ జానాసి హి యథా భీరు స్త్రీణాం యౌవన మధ్రువమ్ ।**
**యావ న్న తే వ్యతిక్రామే త్తావ త్సుఖ మవాప్నుహి ॥ 35**

**పదచ్ఛేదము :–** జానాసి – హి – యథా – భీరు – స్త్రీణాం – యౌవనమ్ – అధ్రువమ్, యావత్ – న – తే – వ్యతిక్రామేత్ – తావత్ – సుఖమ్ – అవాప్నుహి ॥

**అన్వయక్రమము :–** భీరు! స్త్రీణాం యౌవనం యథా అధ్రువం, జానాసి హి; తే (తత్ యౌవనం) యావత్ వ్యతిక్రామేత్ తావత్ సుఖమ్ అవాప్నుహి.

**ప్రతిపదార్థము :–** భీరు! = భీతిస్వభావురాలైన ఓ సీతా, స్త్రీణాం = స్త్రీలకు, యౌవనం = యౌవనవయస్సు, యథా అధ్రువం = ఎట్లు అశాశ్వతముగా నుండునో, జానాసి హి = ఎరిగియేయున్నావుగదా! తత్ యౌవనం = ఆ యౌవనము, తే = నీకు, యావత్ = ఎంతలో, న వ్యతిక్రామేత్ = గడచిపోవకుండునో, తావత్ = అంతలోనే, సుఖమ్ = సుఖమును, అవాప్నుహి = పొందుము.

**తాత్పర్యము :–** భయస్వభావురాలవైన ఓ సీతా! స్త్రీలకు యౌవనదశ చిరకాలము ఉండునది గాదని నీకు తెలియును గదా! కాబట్టి అట్టి యౌవనవయస్సు తొలగిపోయి వార్థక్యము రాకుండగనే యౌవనసుఖములు యథేచ్ఛగా అనుభవింపుము.

**శ్లో॥ ఉద్యానాని చ రమ్యాణి పర్వతోపవనాని చ ।**
**సహ రాక్షసరాజేన చర త్వం మదిరేక్షణే ॥ 36**

**పదచ్ఛేదము :–** ఉద్యానాని – చ – రమ్యాణి – పర్వతోపవనాని – చ – సహ – రాక్షసరాజేన – చర – త్వం – మదిరేక్షణే ॥

**అన్వయక్రమము :–** మదిరేక్షణే! త్వం రాక్షసరాజేన సహ, రమ్యాణి ఉద్యానాని, పర్వతోపవనాని చ, చర.

**ప్రతిపదార్థము :–** మదిరేక్షణే! = ఎఱ్ఱని కన్నులుగల ఓ జానకీ! త్వం = నీవు, రాక్షసరాజేన సహ = రాక్షసప్రభువైన రావణునితో గూడి, రమ్యాణి = సుందరములైనట్టి, ఉద్యానాని = ఉద్యానవనములను, పర్వతోపవనాని చ = క్రీడాపర్వతములను, ఆరామములను, చర = విహరింపుము.

**తాత్పర్యము** :- ఓ సుందరీ! మా రాక్షసప్రభువుతో గూడి, మనోహరములైన ఉద్యానవనము లందును, క్రీడాపర్వతములందును, అందలి ఆరామములందును యథేచ్ఛగా విహరింపుము.

**శ్లో॥ స్త్రీసహస్రాణి తే సప్త వశే స్థాస్యంతి సుందరి ।**
**రావణం భజ భర్తారం భర్తారం సర్వరక్షసామ్ ॥ 37**

**పదచ్ఛేదము** :- స్త్రీసహస్రాణి - తే - సప్త - వశే - స్థాస్యంతి - సుందరి - రావణం - భజ - భర్తారం - భర్తారం - సర్వరక్షసామ్ ॥

**అన్వయక్రమము** :- సుందరి! సప్త స్త్రీసహస్రాణి తే వశే స్థాస్యంతి, సర్వరక్షసాం భర్తారం రావణం, భర్తారం భజ.

**ప్రతిపదార్థము** :- సుందరి = ఓ మోహనాంగీ! సప్త స్త్రీసహస్రాణి = ఏడువేలమంది అంతఃపురస్త్రీలు, తే వశే = నీ యధీనమునందు, స్థాస్యంతి = ఉండగలదు, సర్వ రక్షసాం భర్తారం = రాక్షసులెల్లరకును ప్రభువైనట్టి, రావణం = రావణాసురుని, భర్తారం = భర్తగాను, భజ = సేవింపుము.

**తాత్పర్యము** :- సమస్తరాక్షసలోకమునకును ప్రభువైనట్టి రావణాసురుని నీవు భర్తగా చేసికొనుము. అతని అంతఃపురవనితలు ఏడువేల మందియు నీకు అధీనులై వర్తించెదరు.

**శ్లో॥ ఉత్పాట్య వా తే హృదయం భక్షయిష్యామి మైథిలి ।**
**యది మే వ్యాహృతం వాక్యం న యథావ త్కరిష్యసి ॥ 38**

**పదచ్ఛేదము** :- ఉత్పాట్య - వా - తే - హృదయం - భక్షయిష్యామి - మైథిలి! యది - మే - వ్యాహృతం - వాక్యం - న - యథావత్ - కరిష్యసి ॥

**అన్వయక్రమము** :- మైథిలి! వా, వ్యాహృతం మే వాక్యం, యథావత్ న కరిష్యసి యది, తే హృదయం ఉత్పాట్య భక్షయిష్యామి.

**ప్రతిపదార్థము** :- మైథిలి = ఓ జానకీ! వా = అట్లుగాక, వ్యాహృతం = చెప్పబడిన, మే వాక్యం = నా మాటను, యథావత్ = చెప్పినట్లుగా, న కరిష్యసి యది = ఆచరింపకుంటివేని, తే హృదయం = నీ గుండెకాయను, ఉత్పాట్య = పెల్లగించి, భక్షయిష్యామి = తినివేసెదను.

**తాత్పర్యము** :- ఓ జానకీ! ఇంతగా చెప్పుచున్నట్టి నా మాటలను నేను చెప్పినరీతిగా నీ వాచరింపక పోయినచో నే నిప్పుడే నీ గుండెకాయను పెల్లగించి తీసి తినివేసెదను.

సుమా!

**శ్లో॥ తత శ్చండోదరీ నామ రాక్షసీ క్రోధమూర్ఛితా ।**
**భ్రామయంతీ మహ చ్ఛూల మిదం వచన మబ్రవీత్ ॥ 39**

**పదచ్ఛేదము :–** తతః – చండోదరీ – నామ – రాక్షసీ – క్రోధమూర్ఛితా – భ్రామయంతీ – మహత్ – శూలమ్ – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, చండోదరీ నామ = చండోదరి యను పేరు గల, రాక్షసీ = రక్కసి, క్రోధమూర్ఛితా = క్రోధముచే ఒడలు తెలియనిదై, మహత్ = గొప్పదైన, శూలం = శూలాయుధమును, భ్రామయంతీ = త్రిప్పుచున్నదై, ఇదం వచనమ్ = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** అటుపిమ్మట చండోదరి యను రక్కసి క్రోధముచే ఒడలు తెలియనిదై తన చేతిలోని పెద్దదైన శూలమును హేలగా త్రిప్పుచు సీతాదేవితో ఈ విధముగా పలికెను.

**శ్లో॥ ఇమాం హరిణలోలాక్షీం త్రాసోత్కంపిపయోధరామ్ ।**
**రావణేన హృతాం దృష్ట్వా దౌహృదో మే మహానభూత్ ॥ 40**

**పదచ్ఛేదము :–** ఇమాం – హరిణలోలాక్షీం – త్రాసోత్కంపిపయోధరామ్ – రావణేన – హృతాం – దృష్ట్వా – దౌహృదః – మే – మహాన్ – అభూత్ ॥

**అన్వయక్రమము :–** రావణేన హృతాం, త్రాసోత్కంపిపయోధరాం, హరిణలోలాక్షీం ఇమాం దృష్ట్వా మే మహాన్ దౌహృదః అభూత్.

**ప్రతిపదార్థము :–** రావణేన = రావణునిచే, హృతాం = అపహరింపబడినదియును, త్రాసోత్కంపిపయోధరాం = భయముచే కంపించుచున్నట్టి స్తనములు గలదియును అగు, హరిణలోలాక్షీమ్ ఇమాం = లేడివలె చంచలములైన కన్నులు గల ఈమెను, దృష్ట్వా = చూచి, మే = నాకు, మహాన్ = గొప్పదైన, దౌహృదః = చూలింతలకు గల్గు కోరిక, అభూత్ = కలిగెను.

**తాత్పర్యము :–** రావణుడు తెచ్చి నిర్బంధించుటవలన, భయముచే వణకి పోవుచున్న స్తనములును, చంచలములైన లేడి చూపులవంటి చూపులును గల ఈమెను చూడగనే చూలింతరాలినగు నాకు ఒక గొప్ప కోరిక కలిగినది.

**శ్లో॥ యకృత్ప్లీహ మ థోత్పీడం హృదయం చ సబంధనమ్ ।**
**ఆంత్రాణ్యపి తథా శీర్షం ఖాదేయ మితి మే మతిః ॥ 41**

**పదచ్ఛేదము :–** యకృత్ప్లీహమ్ – అథ – ఉత్పీడం – హృదయం – చ – సబంధనమ్, ఆంత్రాణి – అపి – తథా – శీర్షం – ఖాదేయమ్ – ఇతి – మే – మతిః ॥

**ప్రతిపదార్థము :–** యకృత్ = ఎడమవైపు కడుపునందుండు యకృత్తు అను మాంసమును, ప్లీహ మను మాంసమును, ఉత్పీడం = ఉత్పీడ మను గుండెకాయకు పైనుండు మాంసఖండమును, సబంధనం = నాడులతో గూడిన, హృదయం చ = గుండెకాయను, ఆంత్రాణి అపి = ప్రేగులను గూడ, తథా = అట్లే, శీర్షం = కపాలము నందలి మెదడును, ఖాదేయం = తినివేయవలెను, ఇతి = అని, మే = నాయొక్క, మతిః = కోరిక.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'యకృత్' – కడుపులో దక్షిణభాగమునం దుండు కాలఖండమను మాంస విశేషము.

ప్లీహము – గుండెకాయకు ఎడమభాగమునం దుండు గుల్మ మను మాంస విశేషము. ఉత్పీడం – గుండెకు పైభాగమున నుండు మాంసబంధనము.

**తాత్పర్యము :–** ఈమె ఉదరమునందు కుడిఎడమలందు ఉండు యకృత్ ప్లీహము లనెడి రుచికరమైన మాంసఖండములను, గుండెపైనుండు ఉత్పీడనమును, అన్ని నాడులతో కూడిన గుండెకాయను, కడుపులోని ప్రేగులను, శిరమునందలి మెదడు మాంసమును, తృప్తిగా భక్షింపవలెనని కోరికయై యున్నది.

**శ్లో॥ తతస్తు ప్రఘసా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**కంఠ మస్యా నృశంసాయాః పీడయామ కి మాస్యతే ॥ 42**

**పదచ్ఛేదము :–** తతః – తు – ప్రఘసా – నామ – రాక్షసీ – వాక్యమ్ – అబ్రవీత్ – కంఠమ్ – అస్యాః – నృశంసాయాః – పీడయామ – కిమ్ – ఆస్యతే ॥

**అన్వయక్రమము :–** సుగమము.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, ప్రఘసా నామ = ప్రఘస యను పేరుగల, రాక్షసీ = రాక్షసి, వాక్యమ్ అబ్రవీత్ = మాటను పలికెను, అస్యాః నృశంసాయాః = ఈ క్రూరురాలియొక్క, కంఠం = కంఠమును, పీడయామ = నులిమి వేసెదము, కిం ఆస్యతే = ఏల ఊరకుండుట.

**తాత్పర్యము :–** పిమ్మట ప్రఘస యను రాక్షసాంగన ఈ రీతిగా పలికెను – 'క్రూరురాలైన ఈమె కంఠమును మనమందరమును నులిమి వేయుదము, ఆలస్యమెందులకు?

**శ్లో॥ నివేద్యతాం తతో రాజ్ఞే మానుషీ సా మృతేతి హ ।**
**నాత్ర కశ్చన సందేహః ఖాదతేతి స వక్ష్యతి ॥ 43**

**పదచ్ఛేదము :–** నివేద్యతాం – తతః – రాజ్ఞే – మానుషీ – సా – మృతా – ఇతి – హ – న – అత్ర – కః – చన – సందేహః – ఖాదత – ఇతి – సః – వక్ష్యతి ॥

**అన్వయక్రమము :–** తతః రాజ్ఞే సా మానుషీ మృతా ఇతి నివేద్యతామ్; సః ఖాదత ఇతి వక్ష్యతి; అత్ర కశ్చన సందేహః న అస్తి.

**ప్రతిపదార్థము :–** తతః = అటు పిమ్మట, రాజ్ఞే = రావణునకు, సా మానుషీ = ఆ మనుష్యస్త్రీ, మృతా = చనిపోయినది, ఇతి = అని, నివేద్యతాం = చెప్పబడుగాక! సః = ఆ రావణుడు, ఖాదత = మీరు తినివేయుడు, ఇతి = అని, వక్ష్యతి = చెప్పగలడు, అత్ర = ఈ విషయమున, కశ్చన సందేహః నాస్తి = ఏమియును సందేహములేదు.

**తాత్పర్యము :–** వెంటనే మనము రాజుకడకుబోయి నీవు మాకు అప్పగించిన ఆ మనుష్యస్త్రీ ఇప్పుడే చనిపోయిన దని చెప్పెదము. రావణుడు, అట్లయిన ఆమెను మీరందరు కలసి తిని వేయుడని వెంటనే మనకు చెప్పగలడు; ఇందు సందేహ మిసుమంతయు లేదు.

**శ్లో॥ తత స్త్వజాముఖీ నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**విశ స్యేమాం తత స్సర్వా స్సమాన్ కురుత పీలుకాన్ ॥ 44**

**పదచ్ఛేదము :–** తతః – తు – అజాముఖీ – నామ – రాక్షసీ – వాక్యమ్ – అబ్రవీత్ – విశస్య – ఇమాం – తతః – సర్వాః – సమాన్ – కురుత – పీలుకాన్ ॥

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, అజాముఖీ నామ = అజాముఖి యను, రాక్షసీ = రక్కసి, వాక్యమ్ అబ్రవీత్ = మాటను పలికెను, సర్వాః = అందఱును, ఇమాం = ఈమెను, విశస్య = ఖండించి, సమాన్ = సమానమైన, పీలుకాన్ = మాంస ఖండములను, కురుత = చేయుడు.

**తాత్పర్యము :–** అంతట అజాముఖి యను రాక్షసాంగన వారితో "మీరందరును ఈమెను ముక్కలుగా నరికి ఆ మాంసమును సమానమైన భాగములుగా వేరువేరుగా నుంచుడు." అని పలికెను.

**శ్లో॥ విభజామ తత స్సర్వా వివాదో మే న రోచతే ।**
**పేయ మానీయతాం క్షిప్రం లేహ్యా ముచ్చావచం బహు ॥ 45**

**పదచ్ఛేదము** :– విభజామ – తతః – సర్వాః – వివాదః – మే – న – రోచతే – పేయమ్ – ఆనీయతాం – క్షిప్రం – లేహ్యామ్ – ఉచ్చావచం – బహు ॥

**అన్వయక్రమము** :– తతః, సర్వాః విభజామ; మే వివాదః న రోచతే; క్షిప్రం పేయం, ఉచ్చావచం లేహ్యం చ, బహు ఆనీయతామ్.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, సర్వాః = అందరమును, విభజామ = పంచుకొందము, మే = నాకు, వివాదః = కలహము, న రోచతే = ఇష్టముండదు, క్షిప్రం = శీఘ్రమే, పేయం = మద్యమును, ఉచ్చావచం = వివిధమైన, లేహ్యం చ = లేహ్యమును, బహు = ఎక్కువగా, ఆనీయతాం = తేబడుగాక.

**తాత్పర్యము** :– తరువాత మన మందరమును కలసి సమానముగా పంచుకొందము, వివాదములకు తావిచ్చుట నాకెప్పుడును ఇష్టముండదు. శీఘ్రముగా స్వేచ్ఛగా త్రాగుటకు మద్యమును, నంజుకొనుటకై పలువిధములగు నంజుళ్ళనుగూడ కావలసినన్ని గైకొని రండు.

**శ్లో॥ తత శూర్పణఖా నామ రాక్షసీ వాక్య మబ్రవీత్ ।**
**అజాముఖ్యా య దుక్తం హి తదేవ మమ రోచతే ॥ 46**

**పదచ్ఛేదము** :– తతః – శూర్పణఖా – నామ – రాక్షసీ – వాక్యమ్ – అబ్రవీత్ – అజాముఖ్యా – యత్ – ఉక్తం – హి – తత్ – ఏవ – మమ – రోచతే ॥

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, శూర్పణఖా నామ రాక్షసీ = శూర్పణఖ యను రక్కసి, వాక్యమ్ అబ్రవీత్ = మాటను పలికెను. అజాముఖ్యా = అజాముఖిచే, యత్ ఉక్తం = ఏ మాట చెప్పబడియున్నదో, తత్ ఏవ = అదియే, మమ = నాకు, రోచతే = నచ్చినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ఇచ్చట పేర్కొనబడిన ఈ శూర్పణఖ రావణుని సోదరి గాక వేఱొకతె.

**తాత్పర్యము** :– అప్పుడు శూర్పణఖ యను దైత్యవనిత ఇట్లు పలికెను. అజాముఖి న్యాయముగా చెప్పినదే నాకు బాగుగా నచ్చినది.

**శ్లో॥ సురా చానీయతాం క్షిప్రం సర్వశోకవినాశినీ ।**
**మానుషం మాంస మాస్వాద్య నృత్యామోஉథ నికుంభిలామ్ ॥47**

**పదచ్ఛేదము** :- సురా - చ - ఆనీయతాం - క్షిప్రం - సర్వశోకవినాశినీ - మానుషం - మాంసమ్ - ఆస్వాద్య - నృత్యామః - అథ - నికుంభిలామ్ ॥

**అన్వయక్రమము** :- క్షిప్రం, సర్వశోకవినాశినీ, సురా చ ఆనీయతామ్; అథ మానుషం మాంసమ్ ఆస్వాద్య నికుంభిలాం నృత్యామః.

**ప్రతిపదార్థము** :- క్షిప్రం = వెంటనే, సర్వశోకవినాశినీ = సమస్తశోకముల నశింపచేయునట్టి, సురా చ = మద్యముగూడ, ఆనీయతామ్ = కొనిరాబడుగాక! అథ = పిమ్మట, మానుషం మాంసం = మనుష్యమాంసమును, ఆస్వాద్య = భుజించి, నికుంభిలాం = నికుంభిలానృత్యమును, నృత్యామః = నాట్యము గావింతము.

**గోవిందరాజీయము** :- నికుంభిలా - లంకయొక్క పశ్చిమద్వారమున నున్న భద్రకాళి యను దేవత.

**తాత్పర్యము** :- సమస్తశోకములను పారద్రోలునట్టి మద్యమును వెంటనే తీసికొనిరండు; మనుష్యమాంసమును చక్కగా భుజించి వెంటనే నికుంభిలాదేవికి ప్రీతికరముగా నృత్యము గావింతుము.

**శ్లో॥ ఏవం సంభర్త్స్యమానా సా సీతా సురసుతోపమా ।**
**రాక్షసీభి స్సుఘోరాభి ర్ధైర్య ముత్సృజ్య రోదితి ॥ 48**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రాక్షసీభర్త్సనమ్" నామ*
*చతుర్వింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :- ఏవం - సంభర్త్స్యమానా - సా - సీతా - సురసుతోపమా - రాక్షసీభిః - సుఘోరాభిః - ధైర్యమ్ - ఉత్సృజ్య - రోదితి ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- సురసుతోపమా = దేవతాకన్యలతో సమానురాలైన, సా సీతా = ఆ సీతాదేవి, సుఘోరాభిః = మహాభయంకరులైన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, ఏవం = ఈరీతిగా, సంభర్త్స్యమానా = బెదిరింపబడుచున్నదై, ధైర్యమ్ = ధైర్యమును, ఉత్సృజ్య = వీడి, రోదితి = విలపించుచుండెను.

**తాత్పర్యము :–** దేవకన్యలతో సమానమైన సర్వవైభవములు కల్గిన ఆ సీతాదేవి దైవవశమున క్రూరహృదయలైన రాక్షసవనితలచే ఈ విధముగ భయంకరముగా గద్దింపబడుచు తన సహజధైర్యమును గోల్పోయి విలపింపదొడగెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రాక్షసీభర్త్సనము" అను*
*ఇఱువదినాల్గవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచవింశసర్గ

**శ్లో॥ తథా తాసాం వదంతీనాం పరుషం దారుణం బహు ।**
**రాక్షసీనా మసౌమ్యానాం రురోద జనకాత్మజా ॥ 1**

**పదచ్ఛేదము :-** తథా - తాసాం - వదంతీనాం - పరుషం - దారుణం - బహు - రాక్షసీనామ్ - అసౌమ్యానాం - రురోద - జనకాత్మజా ॥

**అన్వయక్రమము :-** తథా పరుషం, బహు దారుణం వదంతీనామ్, అసౌమ్యానాం, తాసాం రాక్షసీనాం (వచనం శ్రుత్వా) జనకాత్మజా రురోద.

**ప్రతిపదార్థము :-** తథా = ఆవిధముగా, పరుషం = కటువుగాను, బహుదారుణం = మిక్కిలి క్రూరముగాను, వదంతీనాం = మాటలాడుచున్నట్టి, అసౌమ్యానాం = దుర్మార్గురాండ్రయిన, తాసాం రాక్షసీనాం = ఆ రాక్షసస్త్రీలయొక్క, వచః శ్రుత్వా = మాటలను విని, జనకాత్మజా = సీతాదేవి, రురోద = విలపించెను.

**తాత్పర్యము :-** ఆవిధముగా కఠోరముగను, మిక్కిలి దారుణముగను తనను గద్దించుచున్న క్రూరురాండ్రైన ఆ రాక్షసవనితల మాటలు విని సీతాదేవి చేయునది లేక మిక్కిలి విలపించుచుండెను.

**శ్లో॥ ఏవ ముక్తా తు వైదేహీ రాక్షసీభి ర్మనస్వినీ ।**
**ఉవాచ పరమత్రస్తా బాష్పగద్గదయా గిరా ॥ 2**

**పదచ్ఛేదము :-** ఏవమ్ - ఉక్తా - తు - వైదేహీ - రాక్షసీభిః - మనస్వినీ - ఉవాచ - పరమత్రస్తా - బాష్పగద్గదయా - గిరా ॥

**అన్వయక్రమము :-** ఏవం రాక్షసీభిః ఉక్తా మనస్వినీ వైదేహీ పరమత్రస్తా (సతీ) బాష్పగద్గదయా గిరా ఉవాచ.

**ప్రతిపదార్థము :-** రాక్షసీభిః = రాక్షసాంగనలచే, ఏవం = ఈ రీతిగా, ఉక్తా = పలుకబడినదై, మనస్వినీ = దృఢమనస్కురాలైన, వైదేహీ = సీతాదేవి, పరమత్రస్తా (సతీ) = మిక్కిలి భీతిచెందినదగుచు, బాష్పగద్గదయా = కన్నీటి బిందువులచే

దగ్గుత్తికవడిన, గిరా = కంఠముతో, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** రాక్షసవనితలు తనను ఈరీతిగా బెదిరించుచుండగా, తన పాతివ్రత్య రక్షణమునకు దృఢముగా నిశ్చయించుకొన్న సీతాదేవి మిక్కిలి ఉద్వేగము నొందినదై దుఃఖబాష్పములతో దగ్గుత్తికబడిన స్వరముతో ఈ రీతిగా పలికెను.

**శ్లో॥ న మానుషీ రాక్షసస్య భార్యా భవితు మర్హతి ।**
**కామం ఖాదత మాం సర్వా న కరిష్యామి వో వచః ॥ 3**

**పదచ్ఛేదము :–** న – మానుషీ – రాక్షసస్య – భార్యా – భవితుమ్ – అర్హతి – కామం – ఖాదత – మాం – సర్వాః – న – కరిష్యామి – వః – వచః ॥

**అన్వయక్రమము :–** మానుషీ రాక్షసస్య భార్యా భవితుం న అర్హతి. సర్వాః మాం కామం ఖాదత; వః వచః న కరిష్యామి.

**ప్రతిపదార్థము :–** మానుషీ = మనుష్యస్త్రీ, రాక్షసస్య = రాక్షసునకు, భార్యా భవితుం = భార్యగ నుండుటకు, న అర్హతి = తగదు, సర్వాః = అందరును, కామం = స్వేచ్ఛగా, ఖాదత = తినివేయుడు. వః = మీయొక్క, వచః = మాటలను, న కరిష్యామి = ఆచరింపను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఈ సందర్భమునందలి సీతావిలాపమంతయును, మానవరూపము ధరించినందులకు తగినట్లుగా ఆమె ఒక నటివలె నరులను అనుకరించుచు పలికిన మాటలని తెలిసికొనవలెను.

**తాత్పర్యము :–** ఓ రాక్షసవనితలారా! మనుష్యస్త్రీ ఎన్నడును మీ రాక్షసునకు భార్యగ నుండజాలదు. మీరందరును కలసి మీయిష్టము వచ్చినట్లు నన్ను తినివేయుడు. నేను మాత్రము మీమాటలను అంగీకరింపను.

**శ్లో॥ సా రాక్షసీమధ్యగతా సీతా సురసుతోపమా ।**
**న శర్మ లేభే దుఃఖార్తా రావణేన చ తర్జితా ॥ 4**

**పదచ్ఛేదము :–** సా – రాక్షసీమధ్యగతా – సీతా – సురసుతోపమా – న – శర్మ – లేభే – దుఃఖార్తా – రావణేన – చ – తర్జితా ॥

**అన్వయక్రమము :–** రాక్షసీమధ్యగతా, సురసుతోపమా సా సీతా, రావణేన తర్జితా, దుఃఖార్తా చ (సతీ) శర్మ న లేభే.

**ప్రతిపదార్థము :-** రాక్షసీమధ్యగతా = రాక్షసస్త్రీల నడుమనున్న, సురసుతోపమా = దేవకన్యలను బోలినట్టి, సా సీతా = ఆ సీతాదేవి, దుఃఖార్తా = దుఃఖముచే పీడింపబడినదియును, రావణేన తర్జితా చ (సతీ) = రావణునిచే బెదరింపబడినదియు నగుచు, శర్మ న లేభే = సుఖము నొందకుండెను.

**తాత్పర్యము :-** దేవకన్యలను పోలినట్టి ఆ సీతాదేవి రాక్షసస్త్రీల నడుమను చిక్కుకొని మిక్కిలి శోకార్తురాలై రావణునిచే భయంకరముగా గద్దింపబడి అమితమైన వ్యథ నొందెను.

**శ్లో॥ వేపతే స్మాధికం సీతా విశంతీ వాంగ మాత్మనః ।**
**వనే యూథపరిభ్రష్టా మృగీ కోకైరివార్దితా ॥ 5**

**పదచ్ఛేదము :-** వేపతే - స్మ - అధికం - సీతా - విశంతీ - ఇవ - అంగమ్ - ఆత్మనః - వనే - యూథపరిభ్రష్టా - మృగీ - కోకైః - ఇవ - అర్దితా ॥

**అన్వయక్రమము :-** వనే యూథపరిభ్రష్టా, కోకైః అర్దితా మృగీ ఇవ సీతా ఆత్మనః అంగం విశంతీ ఇవ అధికం వేపతే స్మ.

**ప్రతిపదార్థము :-** వనే = అరణ్యమునందు, యూథపరిభ్రష్టా = తన మందనుండి విడిపోయినదై, కోకైః అర్దితా = తోడేళ్ళచే బాధింపబడుచున్నట్టి, మృగీ ఇవ = ఆడు లేడివలె, సీతా = సీతాదేవి, అధికం = మిక్కిలిగా, వేపతే స్మ = కంపించిపోవుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** ఆత్మనః అంగం విశంతీ ఇవ = తాబేలు తన శరీరమును తనలోనికి ముడుచుకొన్నట్లుగా.

**తాత్పర్యము :-** అడవిలో తన మందనుండి తప్పిపోయి తోడేళ్ళనడుమ చిక్కుకొన్నదై వాటిచే వేధింపబడుచున్నట్టి ఆడులేడివలె సీతాదేవి తాబేలువలె తన శరీరమును సిగ్గుచేతను, దుఃఖముచేతను సంకోచపరచుకొనుచున్నదై మిక్కిలిగా వణకదొడగెను.

**శ్లో॥ సా త్వశోకస్య విపులాం శాఖా మాలంబ్య పుష్పితాం ।**
**చింతయామాస శోకేన భర్తారం భగ్నమానసా ॥ 6**

**పదచ్ఛేదము :-** సా - తు - అశోకస్య - విపులాం - శాఖామ్ - ఆలంబ్య - పుష్పితాం - చింతయామాస - శోకేన - భర్తారం - భగ్నమానసా ॥

**ప్రతిపదార్థము :-** సా = ఆ సీతాదేవి, విపులాం = పెద్దదియును, పుష్పితాం = చక్కగ

పూచియున్నదియునగు, అశోకస్య = అశోకవృక్షముయొక్క, శాఖాం = కొమ్మను, ఆలంబ్య = పట్టుకొని, శోకేన = దుఃఖముచే, భగ్నమానసా సతీ = బ్రద్దలైన మనస్సు గలదై, భర్తారం = భర్తనుగూర్చి, చింతయామాస = చింతింపదొడగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- అశోకవనమునందు శింశుపావృక్షమునకు ప్రక్కగనే ఇంకొక అశోక వృక్షమున్నదని భావము.

**తాత్పర్యము** :- సీతాదేవి తాను కూర్చుండిన శింశుపావృక్షమునకు చేరి చక్కగా పుష్పించియున్న అశోకవృక్షముయొక్క ఒక పెద్దకొమ్మను తన చేతితో పట్టుకొని శోకముచే చెదరిన మనస్సుతో తన భర్తయైన శ్రీరామునిగూర్చి చింతింపసాగెను.

**శ్లో॥ సా స్నాపయంతీ విపులౌ స్తనౌ నేత్రజలస్రవైః ।**
**చింతయంతీ న శోకస్య త దాంత మధిగచ్ఛతి ॥ 7**

**పదచ్ఛేదము** :- సా - స్నాపయంతీ - విపులౌ - స్తనౌ - నేత్రజలస్రవైః - చింతయంతీ - న - శోకస్య - తదా - అంతం - అధిగచ్ఛతి ॥

**అన్వయక్రమము** :- సా విపులౌ స్తనౌ నేత్రజలస్రవైః స్నాపయంతీ, చింతయంతీ, తదా శోకస్య అంతం న అధిగచ్ఛతి.

**ప్రతిపదార్థము** :- సా = ఆ సీతాదేవి, విపులౌ = స్థూలములైన, స్తనౌ = స్తనములను, నేత్రజలస్రవైః = కన్నీటిధారలచే, స్నాపయంతీ = తడపివైచుచు, చింతయంతీ = దుఃఖించుచు, శోకస్య = శోకమునకు, తదా = ఆ సమయమున, అంతం = సమాప్తిని, న అధిగచ్ఛతి = పొందలేకుండెను.

**తాత్పర్యము** :- సీతాదేవి, నిరంతరముగ స్రవించుచున్న కన్నీటిధారలు స్థూలములైన తన స్తనములను తడిపివేయుచుండగా, మిక్కిలిగ విలపించుచు తన శోకమున కాసమయమున అంతమును గానలేకుండెను.

**శ్లో॥ సా వేపమానా పతితా ప్రవాతే కదలీ యథా ।**
**రాక్షసీనాం భయత్రస్తా వివర్ణవదనా ఽభవత్ ॥ 8**

**పదచ్ఛేదము** :- సా - వేపమానా - పతితా - ప్రవాతే - కదలీ - యథా - రాక్షసీనాం - భయత్రస్తా - వివర్ణవదనా - అభవత్ ॥

**అన్వయక్రమము** :- సా ప్రవాతే పతితా కదలీ యథా వేపమానా, రాక్షసీనాం (వచోభిః),

భయత్రస్తా (సతీ) వివర్ణవదనా అభవత్.

**ప్రతిపదార్థము** :- సా = ఆ సీతాదేవి, వేపమానా = కంపించిపోవుచున్నదై, ప్రవాతే = పెనుగాలియందు, కదళీ యథా = అరటిచెట్టువలె, పతితా = పడినదై, రాక్షసీనాం = రాక్షసాంగనలయొక్క, (వచోభిః = వాక్కులచే), భయత్రస్తా = భీతిచే వ్యథనొందినదై, వివర్ణవదనా = పాలిపోయినట్టి ముఖముగలది, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము** :- సీతాదేవి రాక్షసుల క్రూరత్వమునకు మిక్కిలి భయపడుచున్నదై, కంపించిపోవుచు పెనుగాలికి ఊగి నేలపైబడిన అరటిచెట్టువలె నేలకొరిగి, పాలిపోయినట్టి ముఖముతో శోకమగ్నయై యుండెను.

**శ్లో॥ తస్యా స్సా దీర్ఘవిపులా వేపంత్యా సీతయా తదా ।**
**దదృశే కంపినీ వేణీ వ్యాళీవ పరిసర్పతీ ॥ 9**

**పదచ్ఛేదము** :- తస్యాః - సా - దీర్ఘవిపులా - వేపంత్యా - సీతయా - తదా - దదృశే - కంపినీ - వేణీ - వ్యాళీ - ఇవ - పరిసర్పతీ ॥ ॥

**అన్వయక్రమము** :- వేపంత్యాః తస్యాః సీతయా (సీతాయాః) కంపినీ, దీర్ఘవిపులా సా వేణీ తదా పరిసర్పతీ వ్యాళీ ఇవ దదృశే.

**ప్రతిపదార్థము** :- వేపంత్యాః = కంపించుచున్నట్టి, తస్యాః సీతయా (సీతాయాః) = ఆ సీతాదేవియొక్క, దీర్ఘవిపులా = పొడవుగను లావుగనున్నట్టి, కంపినీ = కదలుచున్నట్టి, వేణీ = కేశపాశము, తదా = ఆ సమయమునందు, పరిసర్పతీ = చరచరప్రాకుచున్న, వ్యాళీ ఇవ = స్త్రీసర్పములె, దదృశే = కానవచ్చెను.

**తాత్పర్యము** :- అట్లు పొడవుగను లావుగను నున్నట్టి ఆమె కేశపాశము ఇటునటు కదలుచుండగా అది చరచర ప్రాకుచున్న నల్లత్రాచువలె గానవచ్చుచుండెను.

సూచన :- ఈ శ్లోకమున 'సీతయా' అను తృతీయావిభక్తి పదమునకు ఆర్ష ప్రయోగముగా షష్ఠీవిభక్తి అర్థము చెప్పుకొనవలెను.

**శ్లో॥ సా నిశ్వసంతీ దుఃఖార్తా శోకోపహతచేతనా ।**
**ఆర్తా వ్యసృజ దశ్రూణి మైథిలీ విలలాప హ ॥ 10**

**పదచ్ఛేదము** :- సా - నిశ్వసంతీ - దుఃఖార్తా - శోకోపహతచేతనా - ఆర్తా - వ్యసృజత్ - అశ్రూణి - మైథిలీ - విలలాప - హ ॥

**అన్వయక్రమము** :- సా మైథిలీ శోకోపహతచేతనా, దుఃఖార్తా నిశ్వసంతీ అశ్రూణి

వ్యసృజత్; ఆర్తా విలలాప హ.

**ప్రతిపదార్థము** :- సా = ఆ సీతాదేవి, దుఃఖార్తా = దుఃఖముచే దీనురాలై, శోకోపహతచేతనా = దుఃఖముచే కోల్పోయిన చైతన్యము గలదై, నిశ్వసంతీ = నిట్టూర్పులు విడుచుచు, అశ్రూణి = దుఃఖబాష్పములను, వ్యసృజత్ = విడిచెను. ఆర్తా = వ్యథనొందియున్న, మైథిలీ = జానకి, విలలాప హ = శోకించెను.

**తాత్పర్యము** :- ఆ సీతాదేవి రాక్షసులయొక్క మాటలచే కలిగిన దుఃఖమును భరించలేనిదై, చైతన్యమును గోల్పోయి, దీర్ఘమైన నిట్టూర్పులు విడుచుచు తన కన్నుల నుండి దుఃఖబాష్పములు స్రవించుచుండగా మిక్కిలి ఆర్తురాలై శోకించుచుండెను.

**శ్లో॥ హా రామేతి చ దుఃఖార్తా హా పున ర్లక్ష్మణేతి చ ।**
**హా శ్వశ్రు మమ కౌసల్యే హా సుమిత్రేతి భామినీ ॥ 11**

**పదచ్ఛేదము** :- హా - రామ - ఇతి - చ - దుఃఖార్తా - హా - పునః - లక్ష్మణ - ఇతి - చ - హా - శ్వశ్రు - మమ - కౌసల్యే - హా - సుమిత్రే - ఇతి - భామినీ ॥

**అన్వయక్రమము** :- దుఃఖార్తా భామినీ హా రామ ఇతి (చ), పునః, హా లక్ష్మణ ఇతి చ, హా మమ శ్వశ్రు కౌసల్యే, హా సుమిత్రే ఇతి (చ) విలలాప.

**ప్రతిపదార్థము** :- దుఃఖార్తా = దుఃఖపీడితురాలైన, భామినీ = సీతమ్మ, హా రామ ఇతి చ = హా రామా యనియు, పునః = తిరిగి, హా లక్ష్మణ ఇతి చ = హా లక్ష్మణా యనియును, హా మమ శ్వశ్రు కౌసల్యే = నా అత్తగారయిన హా కౌసల్యా యనియును, హా సుమిత్రే ఇతి చ = హా సుమిత్రా యనియును, విలలాప = విలపించెను.

**తాత్పర్యము** :- దుఃఖనిమగ్నురాలైన ఆ సీతాదేవి హా రామా యనియు, హా లక్ష్మణా యనియు, అయ్యో మా అత్త కౌసల్యా యనియును, హా సుమిత్రా యనియును విలపించు చుండెను.

**శ్లో॥ లోకప్రవాద స్సత్యో ఽయం పండితై స్సముదాహృతః ।**
**అకాలే దుర్లభో మృత్యు స్స్త్రియా వా పురుషస్య వా ॥ 12**

**శ్లో॥ య త్రాహ మేవం క్రూరాభీ రాక్షసీభి రి హార్దితా ।**
**జీవామి హీనా రామేణ ముహూర్త మపి దుఃఖితా ॥ 13**

**పదచ్ఛేదము** :- లోకప్రవాదః - సత్యః - అయం - పండితైః - సముదాహృతః - అకాలే - దుర్లభః - మృత్యుః - స్త్రియాః - వా - పురుషస్య - వా - యత్ర -

అహం - ఏవం - క్రూరాభిః - రాక్షసీభిః - అర్దితా - జీవామి - హీనా - రామేణ - ముహూర్తమ్ - అపి - దుఃఖితా ॥

**అన్వయక్రమము** :- యత్ర ఏవం క్రూరాభిః రాక్షసీభిః అర్దితా అహం దుఃఖితా, రామేణ హీనా ముహూర్తమపి జీవామి; తత్ స్త్రియః వా, పురుషస్య వా మృత్యుః అకాలే దుర్లభః, ఇతి పండితైః సముదాహృతః, అయం లోకప్రవాదః, సత్యః ॥

**ప్రతిపదార్థము** :- యత్ర = ఏకారణమున, క్రూరాభిః రాక్షసీభిః = క్రూరురాండ్రయిన రాక్షసస్త్రీలచే, ఇహ = ఇచ్చట, ఏవం = ఈరీతిగా, అర్దితా = పీడింపబడుచున్నదాననై, దుఃఖితా = దుఃఖము నొందుచున్నదాననై, రామేణ హీనా = రాముడులేకుండ, ముహూర్తమపి = క్షణకాలమైనను, జీవామి = బ్రతుకుచున్నానో (తత్ = ఆ కారణమున) స్త్రియాః వా పురుషస్య వా = స్త్రీకిగాని, పురుషునకుగాని, మృత్యుః = మరణము, అకాలే = కాలము కానప్పుడు, దుర్లభః = అలభ్యమే! ఇతి = అను, పండితైః = విద్వాంసులచే, సముదాహృతః = పేర్కొనబడినట్టి, అయం లోకప్రవాదః = ఈ లోకోక్తి, సత్యః = యథార్థము.

**తాత్పర్యము** :- ఈ క్రూరరాక్షసస్త్రీలచే ఈవిధముగా బాధల నొందుచు, దుఃఖగ్రస్తు రాలనై నారాముని విడిచి కొద్దికాలమైనను జీవముతో నున్నందువలన నాకిప్పుడు బోధపడినది; లోకమున పురుషునకుగాని స్త్రీకిగాని దైవసంకల్పము లేనిదే కోరుకొన్నంత మాత్రమున మరణము లభింపదు అని పెద్దలు చెప్పుమాట పరమసత్యము.

**శ్లో॥ ఏషాఽల్పపుణ్యా కృపణా వినశిష్యా మ్యనాథవత్ ।**
**సముద్రమధ్యే నౌః పూర్ణా వాయువేగై రివాహతా ॥ 14**

**పదచ్ఛేదము** :- ఏషా - అల్పపుణ్యా - కృపణా - వినశిష్యామి - అనాథవత్ - సముద్రమధ్యే - నౌః - పూర్ణా - వాయువేగైః - ఇవ - ఆహతా ॥

**అన్వయక్రమము** :- సముద్రమధ్యే వాయువేగైః ఆహతా, పూర్ణా నౌః ఇవ, ఏషా అల్పపుణ్యా, కృపణా (అహం) అనాథవత్ వినశిష్యామి.

**ప్రతిపదార్థము** :- సముద్రమధ్యే = నడిసముద్రమునందు, వాయువేగైః = పెద్దగాలుల వడిచే, ఆహతా = ఒరగిపోయినట్టి, పూర్ణానౌః ఇవ = నిండుఓడవలె, అల్పపుణ్యా = పుణ్యహీనురాలనై, కృపణా = దీనురాలనైయున్న, ఏషా (అహం) = ఈనేను, అనాథవత్ = దిక్కులేనిదానివలె, వినశిష్యామి = నశించిపోవుదును.

**తాత్పర్యము** :- సముద్రమధ్యమునందు పెనుగాలులయొక్క తాకిడికి ఒరగిపోయిన

నిండైన ఓడవలె, క్షీణపుణ్యురాలనై దీనురాలనైయున్న నేనిప్పుడు దిక్కులేనిదానివలె నశించిపోవుదునుగదా!

**శ్లో॥ భర్తారం త మపశ్యంతీ రాక్షసీవశ మాగతా ।**
**సీదామి ఖలు శోకేన కూలం తోయహతం యథా ॥ 15**

**పదచ్ఛేదము** :– భర్తారం – తమ్ – అపశ్యంతీ – రాక్షసీవశమ్ – ఆగతా – సీదామి – ఖలు – శోకేన – కూలం – తోయహతం – యథా ॥

**అన్వయక్రమము** :– తం భర్తారమ్ అపశ్యంతీ, తోయహతం కూలం యథా రాక్షసీవశమ్ ఆగతా, (అహం) శోకేన సీదామి ఖలు.

**ప్రతిపదార్థము** :– తం భర్తారం = జగత్ప్రసిద్ధుడైన నా నాథుని, అపశ్యంతీ = చూడలేనిదాననై, రాక్షసీవశమ్ ఆగతా = ఈ రాక్షసస్త్రీల కధీనురాలనై, తోయహతం కూలం యథా = జలముచే కూల్చబడిన గట్టువలె, అహం = నేను, శోకేన = దుఃఖముతో, సీదామి ఖలు = నశించిపోవుదునుగదా!

**తాత్పర్యము** :– లోకనాథుడైన నా నాథుని కానలేనట్టి నేను రాక్షసస్త్రీల చేతికి చిక్కినదాననై, ప్రవాహజలముయొక్క ఒరిపిడికి దెబ్బతిన్న ఏటిగట్టువలె దుర్భరమైన దుఃఖముతో నశించిపోవుదునుగదా!

**శ్లో॥ తం పద్మదళపత్రాక్షం సింహవిక్రాంతగామినమ్ ।**
**ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్ ॥ 16**

**పదచ్ఛేదము** :– తం – పద్మదళపత్రాక్షం – సింహవిక్రాంతగామినం – ధన్యాః – పశ్యంతి – మే – నాథం – కృతజ్ఞం – ప్రియవాదినమ్ ॥

**అన్వయక్రమము** :– పద్మదళపత్రాక్షం, సింహవిక్రాంతగామినం, కృతజ్ఞం, ప్రియవాదినం, తం మే నాథం ధన్యాః పశ్యంతి.

**ప్రతిపదార్థము** :– పద్మదళపత్రాక్షం = తామరరేకులవంటి కన్నులుగలవాడును, సింహవిక్రాంతగామినం = సింహగమనమువంటి నడకగలవాడును, కృతజ్ఞం = ఉపకారమును స్మరించువాడును, ప్రియవాదినం = ప్రియముగ మాటలాడువాడునగు, తం మే నాథం = విఖ్యాతుడైన నాభర్తను, ధన్యాః = అదృష్టవంతులు, పశ్యంతి = చూచెదరు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'తం మే నాథం' అనగా - "బహవో నృప కళ్యాణగుణాః పుత్రస్య సంతి తే" రాజా! నీపుత్రుడైన రామునిలో లెక్కలేనన్ని కళ్యాణగుణములున్నవి సుమా! యని కీర్తింపబడినట్టి సుప్రసిద్ధుడైన ఆ శ్రీరాముడు అని భావము.

"ధన్యాః పశ్యంతి" - అనగా నేను గతించిపోవుచున్నాను గనుక మిగిలిన ధన్యులుమాత్రమే నా సర్వస్వము అని భావించుకొన్న నా నాథుని చూచు అదృష్టము కల్గియుందురని భావము.

**వాసుదాసస్వామి** :- ఇందాత్మగుణములు, దేహగుణములు కలిపి చెప్పుటచే సగుణబ్రహ్మమే సేవ్యమని యట్టివాని సాక్షాత్కారము గలవారే పుణ్యాత్ములని మోక్షార్హులని యేర్పడుచున్నది. "వేదః ప్రాచేతసా దాసీ త్సాక్షాద్రామాయణాత్మనా" యన్నట్లు సాక్షాద్వేదమైన శ్రీమద్రామాయణము "ఎవ్వడు గుణవంతు"డని ప్రారంభించి శ్రీరామచంద్రమూర్తియందు అనురాగముగల వారందరును ముక్తులైరని యుపక్రమోప సంహారములయందు ఏకవిధము గలదయ్యెను.

అటులనే పంచమవేదము "నారాయణం నమస్కృత్య, నారాయణకథా మిమామ్"అని ప్రారంభించి ముఖ్యములైన విష్ణుసహస్రనామములు, భగవద్గీత - సగుణబ్రహ్మోపాసనమే మోక్షసాధనమని నిర్వచించెను.

"శ్రీమద్భాగవతము - విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన" నని సగుణ బ్రహ్మముతోనే ప్రారంభించి "హరిందలంపు మిక జన్మముకలుగ" దని ముగించెను. బ్రహ్మసూత్రములు "బ్రహ్మజిజ్ఞాస"యని ప్రారంభించుచు "జన్మాద్యస్య యతః"యని సగుణబ్రహ్మో పాసనతో ప్రారంభించి, ముగింపులో అట్టి వారికి శ్రుతిప్రమాణమున పునర్జన్మ లేదని "అనావృత్తి శ్శబ్దాత్" అని సూత్రించెను.

**తాత్పర్యము** :- తామరఱేకులవలె అతివిశాలములైన సుందరములగు నయనములు గలవాడు; మృగరాజముయొక్క విక్రమముతో నొప్పు గమనము గలవాడు! పరులుచేసిన చిన్నమేలును గొప్పగా నెంచునట్టి శీలముగలవాడు! ఎల్లరతోడను మధురముగ మాడలాడువాడు; ఇట్టి సద్గుణసాగరుడైన నా నాథుని దర్శించుభాగ్యము ఇకమీదట నాకులేదు. ఏ పుణ్యాత్ములకో మాత్రమే యుండును.

**శ్లో॥ సర్వథా తేన హీనాయా రామేణ విదితాత్మనా ।**
**తీక్ష్ణం విష మివాస్వాద్య దుర్లభం మమ జీవితమ్ ॥ 17**

**పదచ్ఛేదము** :- సర్వథా - తేన - హీనాయాః - రామేణ - విదితాత్మనా - తీవ్రం - విషమ్ - ఇవ - ఆస్వాద్య - దుర్లభం - మమ - జీవితమ్ ॥

**అన్వయక్రమము** :- విదితాత్మనా తేన రామేణ హీనాయాః మమ జీవితం తీక్ష్ణం విషమ్ ఆస్వాద్య ఇవ, సర్వథా దుర్లభమ్.

**ప్రతిపదార్థము** :- విదితాత్మనా = ఆత్మవేదియైన, తేన రామేణ = ఆ శ్రీరామునిచే, హీనాయాః = ఎడబాటునొందిన, మమ = నాకు, తీక్ష్ణం = గాఢమైన, విషం = విషమును, ఆస్వాద్య ఇవ = మ్రింగినట్లుగ, సర్వథా = ఎల్లవిధములను, జీవితం = జీవితము, దుర్లభమ్ = దుర్లభము.

**తాత్పర్యము** :- ఉత్తమజ్ఞానసంపన్నుడుగా జగత్ప్రసిద్ధుడైన నారామునినుండి దీర్ఘమైన యెడబాటునొందితిని! ఇట్టి నాకు గాఢమైన విషము త్రాగిన నరునికివలె ఎల్లవిధముల జీవితాశ దుర్లభమైనదే!

**శ్లో॥ కీదృశం తు మయా పాపం పురా జన్మాంతరే కృతమ్ ।**
**యేనేదం ప్రాప్యతే దుఃఖం మయా ఘోరం సుదారుణమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :- కీదృశం - తు - మయా - పాపం - పురా - జన్మాంతరే - కృతమ్, యేన - ఇదం - ప్రాప్యతే - దుఃఖం - మయా - ఘోరం - సుదారుణమ్ ॥

**అన్వయక్రమము** :- యేన మయా ఇదం ఘోరం సుదారుణం దుఃఖం ప్రాప్యతే, (తేన) మయా పురా జన్మాంతరే కీదృశం తు పాపం కృతమ్.

**ప్రతిపదార్థము** :- యేన = ఏకారణముచే, మయా = నాచేత, ఇదం = ఈ, ఘోరం = భయంకరమైనదియును, సుదారుణం = మిక్కిలి తీవ్రమైనదియునగు, దుఃఖం = దుఃఖము, ప్రాప్యతే = పొందబడుచున్నదో, (తేన = ఆకారణముచే) మయా = నాచేత, పురా = పూర్వము, జన్మాంతరే = వేఱుజన్మమునందు, కీదృశం తు = ఎంతటి దారుణమైనట్టి, పాపం = పాతకము, కృతమ్ = చేయబడినదో!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :- పూర్వజన్మమనగా ఇచ్చట బాల్యమని అర్థము గ్రహించవలెను. తనను అరణ్యమునకు తనతో తీసికొనిపోనని శ్రీరామచంద్రమూర్తి పలికినపుడు నీవు పురుషవిగ్రహము దాల్చిన స్త్రీవని సీతమ్మ శ్రీరామచంద్రుని దూషించెనుగదా! ఆ పాపమిట్లు తనను బాధించుచున్నదని ఆమె తలపోయుచున్నదని గ్రహించవలెను. జన్మాంతరమనగా దేహముపోయి వేఱుదేహము వచ్చుటేకదా! ఏడు సంవత్సరములకు

పరిపూర్ణనూతన దేహము వచ్చుచుండును కావున ఇచ్చట సీతమ్మ అనాలోచిత వాక్యము చెప్పలేదని గ్రహించవలెను.

**తాత్పర్యము :–** నేడు భయంకరమై మహాదారుణమైనట్టి, ఈ విధమగు దుఃఖము నాకు సంప్రాప్తించుటకు, వెనుకటి జన్మమునందు నేనెట్టి మహాపాతకము చేసి యుంటినోగదా!

**శ్లో॥ జీవితం త్యక్తు మిచ్ఛామి శోకేన మహతా వృతా ।**
**రాక్షసీభిశ్చ రక్షంత్యా రామో నాసాద్యతే మయా ॥ 19**

**పదచ్ఛేదము :–** జీవితం – త్యక్తుమ్ – ఇచ్ఛామి – శోకేన – మహతా – ఆవృతా – రాక్షసీభిః – చ – రక్షంత్యా – రామః – న – ఆసాద్యతే – మయా ॥

**అన్వయక్రమము :–** రాక్షసీభిః రక్షంత్యా మయా రామః న ఆసాద్యతే (అతః) మహతా శోకేన ఆవృతా (అహం) జీవితం త్యక్తుం ఇచ్ఛామి.

**ప్రతిపదార్థము :–** రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, రక్షంత్యా = కావలి కాయబడుచున్న, మయా = నాచేత, రామః = శ్రీరాముడు, న ఆసాద్యతే = పొందబడుటలేదు, (అతః = అందువలన) మహతా = గొప్పదైన, శోకేన = దుఃఖముతో, ఆవృతా = చుట్టుకొనబడి నట్టి, (అహం = నేను) జీవితం = జీవితమును, త్యక్తుమ్ ఇచ్ఛామి = విడువగోరు చున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** భక్తుడు తన సర్వస్వము ధారపోసినను భగవంతుడు తనకు సాక్షాత్కరింపనప్పుడు “కలదు కలండనెడువాడు గలడో లేడో”యని ఆతనికి సందేహము గలుగవచ్చును, కాని అప్పట్ల నాస్తికునివలె భగవంతుడు లేడనుకొనరాదు. తనయం దేదో లోపమున్నది. అందువలన భగవంతుడు కరుణించలేదని ఊహించుకొనవలెను.

**తాత్పర్యము :–** రాక్షసస్త్రీల రక్షణలో పరితపించుచున్న నాకు ఎప్పటికిని రఘురాముడు లభించుటలేదు. దుర్భరమైన ఈశోకములో మునిగియున్న నేను ఈ జీవితమునే విడువ దలచుచున్నాను.

**శ్లో॥ ధిగస్తు ఖలు మానుష్యం ధి గస్తు పరవశ్యతాం ।**
**న శక్యం య త్పరిత్యక్తు మాత్మచ్ఛందేన జీవితమ్ ॥ 20**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే ఆదికావ్యే సుందరకాండే*
*“సీతానిర్వేదః” నామ పంచవింశస్సర్గః*

**పదచ్ఛేదము** :– ధిక్ – అస్తు – ఖలు – మానుష్యం – ధిక్ – అస్తు – పరవశ్యతామ్ – న – శక్యం – యత్ – పరిత్యక్తుమ్ – ఆత్మచ్ఛందేన – జీవితమ్ ॥

**అన్వయక్రమము** :– యత్ ఆత్మచ్ఛందేన జీవితం పరిత్యక్తుం న శక్యం, (తత్) మానుష్యం ధిక్ అస్తు; పరవశ్యతాం ధిక్ అస్తు.

**ప్రతిపదార్థము** :– యత్ = ఏకారణమువలన, ఆత్మచ్ఛందేన = తనకోరికచేత, జీవితం = జీవితమును, పరిత్యక్తుం = విడుచుటకు, న శక్యం = శక్యముగాకున్నదో, (తత్ = ఆకారణమువలన) మానుష్యం = మానవ జన్మమును గూర్చి, ధిక్ అస్తు = నిందయగుగాక! పరవశ్యతాం = పరాధీనజీవితమును గూర్చి, ధిక్ అస్తు = నిందయగుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'ధిక్ అస్తు ఖలు మానుష్యం' – మానవుడు విషాగ్ని ప్రభృతిసాధనములచే దేహత్యాగము చేసికొనుటకు వీలున్నను, అవి పాపహేతువులుగా నిశ్చయించబడుటచే ఎంతటి ఘోరదుఃఖములనైనను భరించుటయే తప్ప గత్యంతరములేకపోవుటచే ఈ మనుష్యదేహము నింద్యమైనదని చెప్పబడుచున్నది.

**వాసుదాసస్వామి** :– "సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్'అని స్మృతి ప్రమాణము. మనుష్యజన్మమేల నింద్యమనిన, నది పరవశమైన బ్రతుకు గావున; సంసారబద్ధుడైన జీవుడు స్వతంత్రించి చచ్చినను, అసురలోకములు తప్పవు. స్త్రీపర్యాయంబున నేను పతివ్రతను; భర్తకు పరాధీనురాలను. కావున బతియాజ్ఞలేక చచ్చుటకు అధికారములేని ఈ యస్వతంత్రపు బ్రతుకు, పాడుబ్రదుకుగదా యని సీతమ్మ భావము. దీనివలన దేహికి సుఖమో దుఃఖమో ప్రారబ్ధమనుభవింపవలయునే గాని దానిని తప్పించుకొన యత్నింపరాదని యేర్పడుచున్నది.

ఇక నీదుఃఖము వాయుటెట్లు? ఎన్నాళ్లని ఈ దుఃఖ మనుభవింపవలెననిన, దాని కుపాయమిక సీతాదేవి చెప్పినట్లు రామచంద్రమూర్తిని దలచుకొని తలచుకొని సర్వథా ధ్యానించుట, గుణవర్ణనము చేయుట, నిర్వేదపడుటయేగాని, వేఱు ఉపాయము లేదు. దీనికే అభ్యాసయోగమని పేరు.

**అధ్యాత్మరామాయణము** :– "తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్, ఏకాంతతత్పరత్వం చ తదభ్యాసం విదుర్బుధాః"

**భగవద్గీత :-**

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ ॥

ఈ తీవ్రనిర్వేదనఫలమే ఆచార్యప్రాప్తి, అదియే ఇకమీదట ఆమెకు కలుగబోవు హనుమత్సమాగమము.

**తాత్పర్యము :-** తన కోరికనుబట్టి జీవితమును విడుచుటకు వీలులేనట్టి, ఈ మానవ జన్మము అతినింద్యమైనది అట్లే పరాధీనమైన జీవితము కూడ పరమనింద్యమైనదే! (భగవంతుని సమీపములో తన జీవితము గడపవలసిన నరుడు ఆతనికి దూరమైనచో తిరిగి ఆతనిని చేరువఅకును ఆ నరుని జీవితము దుఃఖభాజనమై నింద్యమగునని సీతామాత ఇచట మనకు ఇట్లు సందేశము ఇచ్చుచున్నది అని గ్రహించవలెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతానిర్వేదము" అను*
*ఇఋవదియైదవవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# షడ్వింశసర్గ

**శ్లో॥ ప్రసక్తాశ్రుముఖీ త్వేవం బ్రువంతీ జనకాత్మజా ।**
**అధోముఖముఖీ బాలా విలప్తు ముపచక్రమే ॥ 1**

**శ్లో॥ ఉన్మత్తేవ ప్రమత్తేవ భ్రాంతచిత్తేవ శోచతీ ।**
**ఉపావృత్తా కిశోరీవ వివేష్టంతీ మహీతలే ॥ 2**

**పదచ్ఛేదము :** ప్రసక్తాశ్రుముఖీ - తు- ఏవం - బ్రువంతీ - జనకాత్మజా - అధోముఖముఖీ - బాలా - విలప్తుమ్ - ఉపచక్రమే ॥ ఉన్మత్తా - ఇవ - ప్రమత్తా - ఇవ - భ్రాంతచిత్తా - ఇవ - శోచతీ - ఉపావృత్తా - కిశోరీ - ఇవ - వివేష్టంతీ - మహీతలే ॥

**అన్వయక్రమము :-** ఏవం బ్రువంతీ ప్రసక్తాశ్రుముఖీ బాలా జనకాత్మజా, ఉన్మత్తా ఇవ, ప్రమత్తా ఇవ, భ్రాంతచిత్తా ఇవ శోచతీ, ఉపావృత్తా కిశోరీ ఇవ మహీతలే వివేష్టంతీ, అధోముఖముఖీ విలప్తుమ్ ఉపచక్రమే.

**ప్రతిపదార్థము :-** ఏవం = ఈరీతిగా, బ్రువంతీ = పలుకుచున్నదై, ప్రసక్తాశ్రుముఖీ = స్రవించుచున్న కన్నీరుగల ముఖముగలదై, బాలా జనకాత్మజా = జానకీకుమారి, ఉన్మత్తా ఇవ = (భూతావిష్టురాలయిన) పిచ్చిదానివలెను, ప్రమత్తా ఇవ = (ఆహారదోషముచే) మత్తునొందిన దాని వలెను, భ్రాంతచిత్తా ఇవ = భ్రమచే కలతనొందిన మనస్సుగల దానివలెను, శోచతీ = శోకించుచున్నదియునై, ఉపావృత్తా కిశోరీ ఇవ = నేలపై బొర్లాడు గుఱ్ఱపుపిల్లవలె, మహీతలే = నేలపై, వివేష్టంతీ = దొర్లుచు, అధోముఖముఖీ = క్రిందికి వంచినట్టి ముఖముగలదై, విలప్తుమ్ ఉపచక్రమే = విలపింపదొడగెను.

**తాత్పర్యము :-** సుకుమారురాలైన సీతాదేవి కన్నీటితో తడిసిపోయిన ముఖము గలిగి పిచ్చిదానివలెను, మత్తునొందినదానివలెను, భ్రాంతిలో మునిగిన మనస్సుగల దానివలెను మిక్కిలి దుఃఖించుచున్నదై రక్కసులతో ఆ రీతిగా పలుకుచు, అలసట తొలగుటకై నేలపై దొర్లు ఆడు గుఱ్ఱపుపిల్లవలె భూమిపై దొర్లుచు, ముఖము క్రిందికి

వంచుకొని దీనముగా శోకింపసాగెను.

**శ్లో॥ రాఘవస్య ప్రమత్తస్య రక్షసా కామరూపిణా ।**
**రావణేన ప్రమథ్యాహ మానీతా క్రోశతీ బలాత్ ॥ 3**

**పదచ్ఛేదము :-** రాఘవస్య - ప్రమత్తస్య - రక్షసా - కామరూపిణా - రావణేన - ప్రమథ్య - అహమ్ - ఆనీతా - క్రోశతీ - బలాత్ ॥

**అన్వయక్రమము :-** రాఘవస్య ప్రమత్తస్య, కామరూపిణా రక్షసా రావణేన బలాత్ ప్రమథ్య అహం క్రోశతీ, ఆనీతా.

**ప్రతిపదార్థము :-** రాఘవస్య = శ్రీరాముడు, ప్రమత్తస్య = ఏమఱుపాటుగా నుండగా, అహం = నేను, కామరూపిణా = స్వేచ్ఛారూపము ధరించినట్టి, రావణేన రక్షసా = రావణాసురునిచేత, బలాత్ = బలవంతముగా, ప్రమథ్య = వశముచేసికొని, ఆక్రోశతీ = అఱచుచున్నదాననై, ఆనీతా (అస్మి) = తీసికొని రాబడితిని.

**తాత్పర్యము :-** శ్రీరాము డేమఱుపాటుగా నుండగా, మాఱురూపమును ధరించి రావణాసురుడు, నన్ను క్రూరముగా పీడించి రక్షణ లేక నేను వివశురాలనై యఱచుచుండగా ఇచ్చటికి నన్ను బలవంతముగా తీసికొని వచ్చినాడు.

**శ్లో॥ రాక్షసీవశ మాపన్నా భర్త్స్యమానా సుదారుణమ్ ।**
**చింతయంతీ సుదుఃఖార్తా నాహం జీవితు ముత్సహే ॥ 4**

**పదచ్ఛేదము :-** రాక్షసీవశమ్ - ఆపన్నా - భర్త్స్యమానా - సుదారుణం - చింతయంతీ - సుదుఃఖార్తా - న-అహం - జీవితుమ్ - ఉత్సహే ॥

**అన్వయక్రమము :-** రాక్షసీవశమ్ ఆపన్నా, సుదారుణం భర్త్స్యమానా సుదుఃఖార్తా, చింతయంతీ అహం జీవితుం న ఉత్సహే.

**ప్రతిపదార్థము :-** రాక్షసీవశమ్ ఆపన్నా = రాక్షసస్త్రీల యధీనమున చిక్కుకొన్నదాననై, సుదారుణం = మిక్కిలి దారుణముగా, భర్త్స్యమానా = బెదరింపబడుచున్నదాననై; సుదుఃఖార్తా = గొప్పదుఃఖముచే పీడింపబడుచున్నదాననై, చింతయంతీ = శోకించుచు, జీవితుం = బ్రతికి యుండుటకు, అహం = నేను, న ఉత్సహే = ఇష్టపడుటలేదు.

**తాత్పర్యము :-** ఇచ్చట క్రూరులైన రాక్షసాంగనల వశములో నుండి అతిదారుణముగా వారిచే గద్దింపబడుచు, అమితమైన దుఃఖము నన్ను పీడించుచుండగా శోకపరాయణురాలనై జీవించి యుండుట ఇంక నాకు ఇష్టము లేదు.

**శ్లో॥ నహి మే జీవితే నార్థో నై వార్థైర్న చ భూషణైః ।**
**వసంత్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథమ్ ॥ 5**

**పదచ్ఛేదము** :- న - హి - మే - జీవితేన - అర్థః - న - ఏవ - అర్థైః - న - చ - భూషణైః - వసంత్యాః - రాక్షసీమధ్యే - వినా - రామం - మహారథమ్ ॥

**అన్వయక్రమము** :- మహారథం రామం వినా, రాక్షసీమధ్యే వసంత్యాః మే జీవితేన అర్థః నహి; అర్థైః నైవ; భూషణైః చ అర్థః నైవ అస్తి.

**ప్రతిపదార్థము** :- మహారథం = మహాపరాక్రమశాలియైన, రామం వినా = శ్రీరాముని విడచి, రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీలనడుమ, వసంత్యాః = వసించుచున్నట్టి, మే = నాకు, జీవితేన = జీవితముతో, అర్థః = ప్రయోజనము, నహి = ఏమియు లేదు; అర్థైః = సంపదలతోడను, అర్థః = ప్రయోజనము, నైవ = ఉండబోదు; భూషణైః చ = ఆభరణములతోడనుకూడ, అర్థః = ప్రయోజనము, న(అస్తి) = లేదు.

**తాత్పర్యము** :- మహాపరాక్రమసంపన్నుడైన శ్రీరామునకు దూరమై ఈ రాక్షస స్త్రీలనడుమ వసియింపవలసి వచ్చిన నాకు ఈ జీవితముతో ఏమి పనియున్నది? ఎన్ని సంపదలు దక్కినను, ఎన్ని ఆభరణములు లభించినను ఈ జీవితమునకు ఫలితమేమున్నది? నా సర్వస్వము నా జీవితేశుడైన ఆ శ్రీరాముడే.

**శ్లో॥ అశ్మసార మిదం నూన మథ వా ప్యజరామరమ్ ।**
**హృదయం మమ యే నేదం న దుఃఖే నావశీర్యతే ॥ 6**

**పదచ్ఛేదము** :- అశ్మసారమ్ - ఇదం - నూనమ్ - అథవా - అపి - అజరామరమ్, హృదయం - మమ - యేన-ఇదం - న - దుఃఖేన-అవశీర్యతే ॥

**అన్వయక్రమము** :- ఇదం మమ హృదయం నూనమ్ అశ్మసారమ్; అథవా అజరామరమ్ అపి, యేన ఇదం దుఃఖేన న అవశీర్యతే ।

**ప్రతిపదార్థము** :- ఇదం = ఈ, మమ = నాయొక్క, హృదయం = గుండె, నూనం = నిశ్చయముగా, అశ్మసారం = ఊయివలె ధృఢ మైనది, అథవాఽపి = అట్లుగాకున్నప్పటికిని, అజరామరం = జరామరణములు లేనట్టిది, యేన = ఎందుచేతననగా, ఇదం = ఈ గుండె, దుఃఖేన = (ఇంతటి) దుఃఖముచేతను, న అవశీర్యతే = బ్రద్దలై పోవుటలేదు.

**తాత్పర్యము** :- నా గుండెకాయ నిజముగా పాషాణమువలె మిక్కిలి కఠోరమైనది; మఱియు నిది ఏ శైథిల్యము వినాశము గూడ లేనట్టిది వలె నున్నది. లేనిచో ఇంతటి

దుఃఖము సంభవించినప్పుడు ఇది ముక్కలు ముక్కలు గాకుండ ఎట్లు నిలిచియుండ గలిగినది!

**శ్లో॥ ధిఙ్మా మనార్యా మసతీం యాఽహం తేన వినా కృతా ।**
**ముహూర్తమపి రక్షామి జీవితం పాపజీవితా ॥ 7**

**పదచ్ఛేదము :-** ధిక్ - మామ్ - అనార్యామ్ - అసతీం-యా - అహం - తేన - వినా - కృతా, ముహూర్తమ్ - అపి - రక్షామి - జీవితం - పాపజీవితా ॥

**అన్వయక్రమము :-** పాపజీవితా యా అహం తేన వినాకృతా ముహూర్తమపి జీవితం రక్షామి, (తాం) అనార్యామ్, అసతీం(మాం)ధిక్.

**ప్రతిపదార్థము :-** పాపజీవితా = పాపజీవితముగల, యా = ఏ, అహం = నేను, తేన వినా కృతా = అతనిచే వియోగము నొందినదాననై, ముహూర్తమపి = రెండు క్షణముల కాలమైనను, జీవితం = ప్రాణములను, రక్షామి = కాపాడు కొనుచున్నానో, తామ్ అనార్యాం = అట్టి పాపాత్మురాలనైన, అసతీం = పతివ్రతనుగానట్టి, మాం = నన్నుగూర్చి, ధిక్ = నిందయగుగాక ।

**తాత్పర్యము :-** పాపముతో నిండిన జీవితము గలదాననై నా నాథునికి దూరముగనుండి కొన్నిక్షణముల కాలమైనను ఈ పాడు జీవితమును నేను నిలుపుకొనుచున్నా ననగా నావంటి పాపాత్మురాలును, పాతివ్రత్యధర్మహీనురాలును వేఱొకతె యుండదు. అయ్యో! నా జన్మమేల?

**శ్లో॥ కా చ మే జీవితే శ్రద్ధా సుఖే వా తం ప్రియం వినా ।**
**భర్తారం సాగరాంతాయా వసుధాయాః ప్రియంవదమ్ ॥ 8**

**పదచ్ఛేదము :** - కా - చ - మే - జీవితే - శ్రద్ధా - సుఖే - వా - తం - ప్రియం - వినా - భర్తారం - సాగరాంతాయా - వసుధాయాః - ప్రియంవదమ్ ॥

**అన్వయక్రమము :** - సాగరాంతాయాః వసుధాయాః భర్తారం, ప్రియంవదం తం ప్రియం వినా, మే జీవితే, సుఖే వా కా శ్రద్ధా?

**ప్రతిపదార్థము :** - సాగరాంతాయాః = సముద్రము లంతముగా గల్గిన, వసుధాయాః = భూమండలమునకు, భర్తారం = అధిపతియును, ప్రియంవదం = ప్రియభాషియు నగు, తం ప్రియం వినా = అట్టి ప్రియుని విడిచి, మే = నాకు, జీవితే = జీవితమునందుగాని, సుఖే వా = సుఖమునందుగాని, కా శ్రద్ధా = ఎట్టి ఆసక్తి (ఉండగలదు?).

**తాత్పర్యము** : – నాల్గు సముద్రములవఱకును వ్యాపించి యున్న భూమండలమున కంతకును నాథుడై సర్వలోకప్రియుడైనట్టి నా ప్రియుడు నాకు లేనప్పుడు జీవితముపైగాని సుఖములపైగాని నాకేమి ఆసక్తి యుండును?

**శ్లో॥ భిద్యతాం భక్ష్యతాం వాఽపి శరీరం విసృజా మ్యహమ్ ।**
**న చా ప్యహం చిరం దుఃఖం సహేయం ప్రియవర్జితా ॥ 9**

**పదచ్ఛేదము** :– భిద్యతాం – భక్ష్యతాం – వా – అపి – శరీరం – విసృజామి – అహం – న – చ – అపి – అహం – చిరం – దుఃఖం – సహేయం – ప్రియవర్జితా ॥

**అన్వయక్రమము** :– (మమ) శరీరం భిద్యతాం, భక్ష్యతాం వా అపి; అహం శరీరం విసృజామి; ప్రియవర్జితా అహం దుఃఖం చిరం న చ సహేయమ్.

**ప్రతిపదార్థము** :– మమ శరీరం = నాశరీరము, భిద్యతాం= ముక్కలు చేయబడుగాక! భక్ష్యతాం వా అపి = లేక మఱియు తినివేయబడుగాక! అహం = నేను, శరీరం = దేహమును, విసృజామి = వదలివేయుదును, ప్రియవర్జితా = ప్రియునిచే వర్జింపబడినట్టి, అహం = నేను, దుఃఖం = దుఃఖమును, చిరం = చిరకాలము, న చ సహేయమ్ = సహింపనేలేను.

**తాత్పర్యము** :– ఓ రాక్షసస్త్రీలారా! నా శరీరమును మీ ఇష్టము వచ్చినట్లు ముక్కలు ముక్కలు చేయుడు; తినివేయుడు; నే నీ శరీరమును విడిచివేయుదును. నా నాథునికి దూరముగా నుండి ఈ దుఃఖమును నేను చిరకాలము సహింపజాలను.

**శ్లో॥ చరణేనాపి సవ్యేన న స్పృశేయం నిశాచరమ్ ।**
**రావణం కిం పున రహం కామయేయం విగర్హితమ్ ॥ 10**

**పదచ్ఛేదము** :– చరణేన – అపి – సవ్యేన – న – స్పృశేయం – నిశాచరం – రావణం – కిం – పునః – అహం – కామయేయం – విగర్హితమ్ ॥

**అన్వయక్రమము** :– సవ్యేన చరణేనాపి నిశాచరం న స్పృశేయమ్; విగర్హితం రావణం అహం పునః కిం కామయేయమ్.

**ప్రతిపదార్థము** :– సవ్యేన చరణేన అపి = ఎడమ కాలితో గూడ, నిశాచరం = రాక్షసుడును, విగర్హితం = పరమనిందితుడు నగు, రావణం = రావణుని, న స్పృశేయం = అంటను. పునః = తిరిగి, కిం = ఎట్లుగా, కామయేయమ్ = ప్రేమించెదను?

**తాత్పర్యము :-** నిశాచరుడును, నింద్యచరిత్రుడు నగు ఈ రావణుని, నేను నా ఎడమకాలితో గూడ తాకను; అట్టియెడ నాతనిని నే నెట్లు కామించెదను?

**శ్లో॥ ప్రత్యాఖ్యానం న జానాతి నాత్మానం నాత్మనః కులమ్ ।**
**యో నృశంసస్వభావేన మాం ప్రార్థయితు మిచ్ఛతి ॥ 11**

**పదచ్ఛేదము :-** ప్రత్యాఖ్యానం - న - జానాతి - న - ఆత్మానం - న - ఆత్మనః - కులమ్ - యః - నృశంసస్వభావేన - మాం - ప్రార్థయితుమ్ - ఇచ్ఛతి ॥

**అన్వయక్రమము :-** నృశంసస్వభావేన మాం ప్రార్థయితుం యః ఇచ్ఛతి (సః రావణః) ప్రత్యాఖ్యానం న జానాతి; ఆత్మానం న జానాతి; ఆత్మనః కులం న జానాతి.

**ప్రతిపదార్థము :-** నృశంసస్వభావేన = క్రూరస్వభావముతో, మాం ప్రార్థయితుం = నన్ను (భార్యగా) కోరుటకు, యః ఇచ్ఛతి = ఎవరు సిద్ధపడుచున్నాడో, (సః రావణః = ఆ రావణుడు) ప్రత్యాఖ్యానం = తిరస్కారమును, న జానాతి = తెలిసికొనుటలేదు, ఆత్మానం = తనస్థితిని, న జానాతి = తెలిసికొనుట లేదు, ఆత్మనః కులం = తనవంశ మర్యాదను, న జానాతి = తెలిసికొన లేకున్నాడు.

**తాత్పర్యము :-** ఈ రావణుడు పరమక్రూరస్వభావముతో నన్ను కామించుచున్నాడే గాని నేను చూపునట్టి తిరస్కారభావమును గాని తన గౌరవమును గాని, తనవంశ గౌరవమును గాని గ్రహింపలేకున్నాడు.

**శ్లో॥ ఛిన్నా భిన్నా విభక్తా వా దీప్తే వాగ్నౌ ప్రదీపితా ।**
**రావణం నోపతిష్ఠేయం కిం ప్రలాపేన వ శ్చిరమ్ ॥ 12**

**పదచ్ఛేదము :-** ఛిన్నా - భిన్నా - విభక్తా - వా - దీప్తే - వా - అగ్నౌ - ప్రదీపితా, రావణం - న - ఉపతిష్ఠేయం - కిం - ప్రలాపేన - వః - చిరమ్ ॥

**అన్వయక్రమము :-** ఛిన్నా భిన్నా విభక్తా వా; దీప్తే అగ్నౌ ప్రదీపితా వా, రావణం న ఉపతిష్ఠేయం; వః చిరం ప్రలాపేన కిమ్?

**ప్రతిపదార్థము :-** ఛిన్నా = తెంపబడినను, భిన్నా = బ్రద్దలు కొట్టబడినను, విభక్తా వా = ముక్కలు ముక్కలు చేయబడినను, దీప్తే = ప్రజ్వలించియున్న, అగ్నౌ = అగ్నిలో, ప్రదీపితా వా = కాల్చివేయబడినను, రావణం = రావణుని, న ఉపతిష్ఠేయం = చేరబోవను, వః = మీయొక్క, చిరం = చిరకాలము, ప్రలాపేన = ప్రలాపముచే, కిం = ఏమి ప్రయోజనము?

**తాత్పర్యము :–** ఓ రాక్షసాంగనలారా! నన్ను మీరు నరికి వేసినను సరియే, ముక్కలు ముక్కలుగా చీల్చినను సరియే, అవయవములను లాగివేసినను సరియే, అగ్నిలో గాల్చివేసినను సరియే; నేను మాత్రము రావణుని కన్నెత్తి చూడను. మీరు ఎంతకాలము ఎన్ని విధముల ప్రలాపములు చేసినను ఏమియు ప్రయోజనములేదు.

**శ్లో॥ ఖ్యాతః ప్రాజ్ఞః కృతజ్ఞ శ్చ సానుక్రోశశ్చ రాఘవః ।**
**సద్వృత్తో నిరనుక్రోశ శ్శంకే మద్భాగ్యసంక్షయాత్ ॥ 13**

**పదచ్ఛేదము :** – ఖ్యాతః – ప్రాజ్ఞః – కృతజ్ఞః – చ – సానుక్రోశః – చ – రాఘవః – సద్వృత్తః – నిరనుక్రోశః – శంకే – మద్భాగ్యసంక్షయాత్ ॥

**అన్వయక్రమము :** – ఖ్యాతః, ప్రాజ్ఞః,కృతజ్ఞః, సానుక్రోశః, సద్వృత్తః చ రాఘవః, మద్భాగ్యసంక్షయాత్ నిరనుక్రోశః (సంజాతః ఇతి) శంకే.

**ప్రతిపదార్థము :** – ఖ్యాతః = శత్రువులచేగూడ కొనియాడ బడిన వాడును, ప్రాజ్ఞః = దోషులయందుగూడ గుణమును గ్రహింపగలవాడును, కృతజ్ఞః = చిన్న మేలునుగూడ గొప్పగా నెంచువాడును, సానుక్రోశః = పరులకష్టములను జూచి మిక్కిలిగా దుఃఖించువాడును, సద్వృత్తః చ = ఇతరులకు మేలుచేయు సాధువర్తనము గలవాడు నగు, రాఘవః = శ్రీరాముడు, మత్‌భాగ్యసంక్షయాత్ = నా భాగ్యములు క్షీణించుట వలన, నిరనుక్రోశః = కృపారహితుడుగ (సంజాతః ఇతి = ఆయెనని) శంకే = ఊహించుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :** – ఇట్టి భావము నిజమగు భక్తుని లక్షణము. భక్తుడు భగవత్కటాక్షము తనయందు కలుగనిచో, ఆయన భగవంతుని తప్పుపట్టడు. ఆయన కటాక్షము వచ్చుటకు నాయందుగల లోపములను సరిచేసికొనెదనని తన్నుతాను తప్పు పట్టుకొనునేగాని తాను చేయవలసిన దంతయుచేసి పూర్ణభక్తి సంపాదించుకొనిన ట్లును, భగవంతుడు కఠినుడై తనను అనుగ్రహింపనట్లుగను భావింపడు. తాను పరిపూర్ణభక్తుడనని తలచువాడు నిజమైన భక్తుడు గాదు.

**తాత్పర్యము :–** దోషులయందుగూడ గుణములు దర్శింపగలవాడు, చిన్న ఉపకారమునే గొప్పగా చేసి ఎల్లకాలము స్మరించువాడు, ఎవరికి కష్టము గల్గినను మిక్కిలి దుఃఖము నొందువాడు, పరులకు ప్రేమతో మేలు గూర్చునట్టి సచ్చరిత్రుడు – అని శత్రువుల గోష్ఠులందు గూడ ఎన్నబడునట్టి నా శ్రీరాముడు నా భాగ్యక్షయముచేతనే నాపై నేడు

దయాహీనుడై యున్నాడని నే ననుకొనుచున్నాను.

**శ్లో॥ రాక్షసానాం సహస్రాణి జనస్థానే చతుర్దశ ।**
**యే నైకేన నిరస్తాని స మాం కిం నాభిపద్యతే ॥ 14**

**పదచ్ఛేదము :–** రాక్షసానాం – సహస్రాణి – జనస్థానే – చతుర్దశ – యేన – ఏకేన – నిరస్తాని – సః – మాం – కిం – న – అభిపద్యతే ॥

**అన్వయక్రమము :–** జనస్థానే రాక్షసానాం చతుర్దశ సహస్రాణి ఏకేన యేన నిరస్తాని, సః మాం – కిం – న – అభిపద్యతే !

**ప్రతిపదార్థము :–** జనస్థానే = జనస్థానమునందు, రాక్షసానాం చతుర్దశ సహస్రాణి = పదునాల్గువేలమంది రాక్షసులు, ఏకేన = ఏకాకియైన, యేన = ఏ వీరునిచే, నిరస్తాని = సంహరింపబడిరో, సః = ఆ శ్రీరాముడు, మాం = నన్ను, కిం న అభిపద్యతే = ఏల రక్షింపకున్నాడు?

**తాత్పర్యము :–** ఆనాడు జనస్థానమునందు పదునాల్గువేల రాక్షసయోధులను తానొక్కడే ఏకాకియై సంహరించిన ఆ రఘురాముడు నేడు ఇటకు వచ్చి నన్నేల రక్షింపకున్నాడు?

**శ్లో॥ నిరుద్ధా రావణే నాహ మల్పవీర్యేణ రక్షసా ।**
**సమర్థః ఖలు మే భర్తా రావణం హంతు మాహవే ॥ 15**

**పదచ్ఛేదము :–** నిరుద్ధా – రావణేన – అహమ్ – అల్పవీర్యేణ – రక్షసా, సమర్థః – ఖలు – మే – భర్తా – రావణం – హంతుమ్ – ఆహవే ॥

**అన్వయక్రమము :–** అహమ్ అల్పవీర్యేణ రావణేన రక్షసా నిరుద్ధా! ఆహవే రావణం హంతుం మే భర్తా సమర్థః ఖలు ॥

**ప్రతిపదార్థము :–** అహం = నేను, అల్పవీర్యేణ = అల్పమైన శౌర్యముగల, రావణేన రక్షసా = రావణాసురునిచే, నిరుద్ధా = నిర్బంధింప బడితిని, ఆహవే = యుద్ధమునందు, రావణం = రావణుని, హంతుం = వధించుటకు, మే భర్తా = నా నాథుడు, సమర్థః ఖలు = సమర్థుడుగదా!

**తాత్పర్యము :–** ఈ రావణాసురుని యుద్ధములో నేలగూల్చుటకు నా భర్త ఎంతయును సమర్థుడే, ఐనను నేను ఒక సామాన్యవీరుడైన ఈ రావణాసురునిచే, నేడీ రీతిగా ఇక్కడ బంధింపబడి యున్నాను గదా!

**శ్లో॥ విరాధో దండకారణ్యే యేన రాక్షసపుంగవః ।**
**రణే రామేణ నిహత స్స మాం కిం నాభిపద్యతే ॥ 16**

**పదచ్ఛేదము** :- విరాధః - దండకారణ్యే - యేన - రాక్షసపుంగవః - రణే - రామేణ - నిహతః - సః - మాం - కిం - న - అభిపద్యతే ॥

**అన్వయక్రమము** :- దండకారణ్యే రణే రాక్షసపుంగవః విరాధః యేన రామేణ నిహతః, సః మాం కిం న అభిపద్యతే?

**ప్రతిపదార్థము** :- దండకారణ్యే = దండకారణ్యమునందు, రణే = యుద్ధమున, రాక్షసపుంగవః = రాక్షసశ్రేష్ఠుడైన, విరాధః = విరాధుడు, యేన రామేణ = ఏ రామునిచే, నిహతః = సంహరింపబడెనో, సః = అట్టి శ్రీరాముడు, మాం = నన్ను, కిం న అభిపద్యతే = ఏల రక్షింపకున్నాడు?

**తాత్పర్యము** :- ఆనాడు దండకాటవియందు విరాధుడను ఆ రాక్షసయోధుని నేల గూల్చినట్టి నా శ్రీరాముడు ఈనాడు ఇటకు వచ్చి నన్నేల రక్షించుటలేదు?

**శ్లో॥ కామం మధ్యే సముద్రస్య లంకేయం దుష్ప్రధర్షణా ।**
**న తు రాఘవబాణానాం గతిరోధీహ విద్యతే ॥ 17**

**పదచ్ఛేదము** :- కామం - మధ్యే - సముద్రస్య - లంకా - ఇయం - దుష్ప్రధర్షణా - న - తు - రాఘవబాణానాం - గతిరోధీ - ఇహ - విద్యతే ॥

**అన్వయక్రమము** :- మధ్యే సముద్రస్య ఇయం లంకా కామం దుష్ప్రధర్షణా (అస్తు); రాఘవబాణానాం గతిరోధీ తు ఇహ న విద్యతే.

**ప్రతిపదార్థము** :- మధ్యే సముద్రస్య = సముద్రమునడుమ, ఇయం లంకా = ఈ లంకాపట్టణము, కామం = ఎంతయును, దుష్ప్రధర్షణా (అస్తు) = ఎదుర్కొన శక్యము కానిది గావచ్చును; రాఘవబాణానాం తు =శ్రీరాముని బాణములకు మాత్రము, గతిరోధీ = అడ్డగించునట్టిది, ఇహ = ఈ లోకమున, న విద్యతే = లేదు.

**తాత్పర్యము** :- సముద్రము నట్టనడుమ నున్నట్టి ఈ లంకాపట్టణము ఈ లోకమున ఎదుర్కొనుటకు ఎల్లరికిని భయంకరమైనది కావచ్చును కాని శ్రీరాముని శరపరంపరకు మాత్రము చేరరాని తా వీ జగమున నుండబోవదు.

**శ్లో॥ కిన్ను తత్కారణం యేన రామో దృఢపరాక్రమః ।**
**రక్షసాపహృతాం భార్యా మిష్టాం నాభ్యవపద్యతే ॥ 18**

**పదచ్ఛేదము :–** కిం – ను – తత్ – కారణం – యేన – రామః – దృఢపరాక్రమః – రక్షసా – అపహృతాం – భార్యామ్ – ఇష్టాం – న – అభ్యవపద్యతే ॥

**అన్వయక్రమము :–** దృఢపరాక్రమః రామః రక్షసా అపహృతామ్ ఇష్టాం భార్యాం యేన న అభ్యవపద్యతే తత్ కారణం కిం ను?

**ప్రతిపదార్థము :–** దృఢపరాక్రమః రామః = మహాపరాక్రమశాలియైన రాముడు, రక్షసా = రక్కసునిచే, అపహృతామ్ = దొంగిలింపబడినట్టి, ఇష్టాం = మిక్కిలి ప్రియురాలైన, భార్యాం = భార్యను, యేన = ఏకారణముచే, న అభ్యవపద్యతే = రక్షింపకున్నాడో, తత్ కారణం = అట్టి కారణము, కిం ను = ఏమో గదా?

**తాత్పర్యము :–** అమితపరాక్రమశాలియైన నా రాముడు రాక్షసు డపహరించిన తన ప్రియురాలైన భార్యను రక్షింప రాకున్నట్టి ఆ కారణ మేమై యుండునో గదా?

**శ్లో॥ ఇహస్థాం మాం న జానీతే శంకే లక్ష్మణపూర్వజః ।**
**జానన్నపి హి తేజస్వీ ధర్షణం మర్షయిష్యతి ॥ 19**

**పదచ్ఛేదము : –** ఇహస్థాం – మాం – న – జానీతే – శంకే – లక్ష్మణపూర్వజః – జానన్ – అపి – హి – తేజస్వీ – ధర్షణం – మర్షయిష్యతి ॥

**అన్వయక్రమము :–** లక్ష్మణపూర్వజః మామ్ ఇహస్థాం న జానీతే (ఇతి) శంకే; హి – జానన్ అపి తేజస్వీ (సః) ధర్షణం మర్షయిష్యతి (కిమ్?)

**ప్రతిపదార్థము :–** లక్ష్మణపూర్వజః = లక్షణాగ్రజుడైన రాముడు, మాం = నన్ను, ఇహస్థాం = ఇచ్చట నున్నదానిగా, న జానీతే = తెలిసికొని యుండడు, (ఇతి) శంకే = (అని) ఊహించుచున్నాను; హి = ఎందుచేత ననగా, జానన్ అపి = తెలియుచుగూడ, తేజస్వీ (సః) = మహాప్రతాపశాలియైన యాతడు, ధర్షణం = అవమానమును, మర్షయి ష్యతి (కిం) = సహింపగలడా యేమి?

**తాత్పర్యము :–** లక్ష్మణసహితుడై, దయాళువును, మానధనుడు నగు నా శ్రీరాముడు నే నిచ్చట నున్నట్లు ఎఱుగ డని నేను ఊహించుచున్నాను. ఎఱిగియే యున్నచో అంతటి పరాక్రమవంతుడు శత్రువు చేసినట్టి ఈ యవమానమును ఎట్లు సహించి యూరకుండ గలడు!

**శ్లో॥ హృతేతి యోఽధిగత్వా మాం రాఘవాయ నివేదయేత్ ।**
**గృధ్రరాజోఽపి స రణే రావణేన నిపాతితః ॥ 20**

**పదచ్ఛేదము** :- హృతా - ఇతి - యః - అధిగత్వా - మాం - రాఘవాయ - నివేదయేత్ - గృధ్రరాజః - అపి - సః - రణే - రావణేన - నిపాతితః ॥

**అన్వయక్రమము** :- యః మాం హృతా ఇతి అధిగత్వా రాఘవాయ నివేదయేత్, సః గృధ్రరాజః అపి రణే రావణేన నిపాతితః ॥

**ప్రతిపదార్థము** :- యః = ఎవ్వడు, మాం = నన్నుగూర్చి, హృతా ఇతి = దొంగిలింప బడినదని, అధిగత్వా = తెలిసికొని, రాఘవాయ = శ్రీరామునకు, నివేదయేత్ = విన్నవింపగలడో, సః గృధ్రరాజః అపి = ఆ పక్షిరాజగు జటాయువు గూడ, రణే = యుద్ధమునందు, రావణేన = రావణాసురునిచే, నిపాతితః = కూల్చబడెను.

**తాత్పర్యము** :- నేను దొంగిలింపబడినట్టి విషయమును శ్రీరామునకు విన్నవింప గలిగినట్టి ఆ పక్షిరాజైన జటాయువు గూడ, రావణునివలన యుద్ధమున నేల గూలెను గదా!

**శ్లో॥ కృతం కర్మ మహత్తేన మాం తథాఽభ్యవపద్యతా ।**
**తిష్ఠతా రావణద్వంద్వే వృద్ధేనాపి జటాయుషా ॥ 21**

**పదచ్ఛేదము** :- కృతం - కర్మ - మహత్ - తేన - మాం - తథా - అభ్యవపద్యతా - తిష్ఠతా - రావణద్వంద్వే - వృద్ధేన - అపి - జటాయుషా ॥

**అన్వయక్రమము** :- మాం తథా అభ్యవపద్యతా, రావణద్వంద్వే తిష్ఠతా, వృద్ధేనాపి తేన జటాయుషా మహత్ కర్మ కృతమ్ ॥

**ప్రతిపదార్థము** :- మాం = నన్ను, తథా = ఆ రీతిగా, అభ్యవపద్యతా = రక్షించుచున్నవాడును, రావణద్వంద్వే = రావణునితోడి ద్వంద్వయుద్ధమునందు, తిష్ఠతా = నిలచినవాడును, వృద్ధేనాపి = వృద్ధుడైనప్పటికిని, తేన జటాయుషా = ఆ జటాయువుచే, మహత్ కర్మ = గొప్ప కార్యము, కృతమ్ = నెఱవేర్పబడెనుగదా !

**తాత్పర్యము** :- ఆనాడు నన్ను రక్షించుటకై రావణుని ఎదుర్కొని ద్వంద్వయుద్ధ మొనర్చిన ఆ జటాయువు కడువృద్ధుడైనను నాకొఱకై ఎంతయో దుష్కర మైన కృత్యము నొనర్చెను.

**శ్లో॥ యది మామిహ జానీయా ద్వర్తమానాం స రాఘవః ।**
**అద్య బాణై రభిక్రుద్ధః కుర్యాల్లోక మరాక్షసమ్ ॥ 22**

**పదచ్ఛేదము** :- యది - మామ్ - ఇహ - జానీయాత్ - వర్తమానాం - సః - రాఘవః - అద్య - బాణైః - అభిక్రుద్ధః - కుర్యాత్ - లోకమ్ - అరాక్షసమ్ ॥

**అన్వయక్రమము** :- సః రాఘవః మామ్ ఇహ వర్తమానాం జానీయాత్ యది, అభిక్రుద్ధః అద్య బాణైః లోకమ్ అరాక్షసం కుర్యాత్.

**ప్రతిపదార్థము** :- సః రాఘవః = ఆ శ్రీరాముడు, మాం = నన్ను, ఇహ = ఇక్కడ, వర్తమానాం = ఉన్నదానినిగా, జానీయాత్ యది = తెలిసికొన్న యెడల, అభిక్రుద్ధః = తీవ్రమైన క్రోధమునొందినవాడై, అద్య = ఇప్పుడే, బాణైః = శరములచే, లోకం = జగమును, అరాక్షసం = రాక్షసశూన్యముగా, కుర్యాత్ = చేసివైచును.

**తాత్పర్యము** :- నా శ్రీరాముడు నే నీ లంకలో నున్నట్లుగా ఏమాత్రము తెలిసికొనినప్పటికిని తీవ్రమైన క్రోధముతో వెంటనే తన శరపరంపరల ప్రభావముచే ఈ లోకమునే రాక్షసరహితముగా చేసివైచును.

**శ్లో॥ విధమే చ్ఛ పురీం లంకాం శోషయేచ్ఛ మహెూదధిమ్ ।**
**రావణస్య చ నీచస్య కీర్తిం నామ చ నాశయేత్ ॥ 23**

**పదచ్ఛేదము** :- విధమేత్ - చ - పురీం - లంకాం - శోషయేత్ - చ - మహోదధిమ్, రావణస్య - చ - నీచస్య - కీర్తిం - నామ - చ - నాశయేత్ ॥

**అన్వయక్రమము** :- (సః) లంకాం పురీం విధమేచ్ఛ, మహోదధిం శోషయేత్ చ; నీచస్య రావణస్య కీర్తిం నామ చ నాశయేత్ చ.

**ప్రతిపదార్థము** :- (సః = అతడు) లంకాం పురీ = లంకానగరమును, విధమేచ్ఛ = ఊదివేయును; మహోదధిం శోషయేత్ చ = మహాసాగరమును ఎండింపచేయును; నీచస్య రావణస్య = నీచుడైన రావణునియొక్క, కీర్తిం నామ చ = యశస్సును పేరును గూడ, నాశయేత్ చ = నశింపజేసి వేయును గూడను.

**తాత్పర్యము** :- మఱియు నా శ్రీరాము డీ లంకానగరము నంతను భస్మముచేసి ఎగురగొట్టి వేయును. ఈ మహాసముద్రమును ఒక్క నీటి చుక్క లేకుండగ శుష్కింపజేసి యుండును. నీచుడైన ఈ రావణుని ఊరును పేరును లేకుండ నశింపచేసి యుండును.

**శ్లో॥ తతో నిహతనాథానాం రాక్షసీనాం గృహే గృహే,**
**యథాహ మేవం రుదతీ తథా భూయో న సంశయః ॥ 24**

**పదచ్ఛేదము** :- తతః - నిహతనాథానాం - రాక్షసీనాం - గృహే - గృహే - యథా - అహమ్ - ఏవం - రుదతీ - తథా - భూయః - న - సంశయః ॥

**అన్వయక్రమము** :- తతః అహమ్ ఏవం యథా రుదతీ; నిహతనాథానాం రాక్షసీనాం

గృహే గృహే తథా భూయః (రోదనం భవిష్యతి) న సంశయః.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, అహం = నేను, యథా ఏవం రుదతీ = ఏరీతిగా నిట్లు దుఃఖించుచున్నానో, తథా = ఆ రీతిగా, భూయః = తిరిగి, నిహతనాథానాం రాక్షసీనాం = భర్తలను గోల్పోయినట్టి రాక్షసస్త్రీలయొక్క; గృహే గృహే = ప్రతిఇంటియందును, (రోదనం భవిష్యతి = శోకము కలుగగలదు;) న సంశయః = సందేహము లేదు.

**తాత్పర్యము** :- నే నిప్పు డేరీతిగా దుఃఖములపాలైయున్నానో తిరిగి ఇదే రీతిగా నా భర్త లంకను నశింపచేసి రాక్షసశూన్యము చేసినప్పుడు విగతభర్తృకలైన రాక్షసస్త్రీ లందరును ఇంటింటను రోదనములు గావించి తీరుదురు; సందేహము లేదు.

**శ్లో॥ అన్విష్య రక్షసాం లంకాం కుర్యా ద్రామ స్సలక్ష్మణః ।**
**న హి తాభ్యాం రిపు ర్దృష్టో ముహూర్త మపి జీవతి ॥ 25**

**పదచ్ఛేదము** :- అన్విష్య - రక్షసాం - లంకాం - కుర్యాత్ - రామః - సలక్ష్మణః - న - హి - తాభ్యాం - రిపుః - దృష్టః - ముహూర్తమ్ - అపి - జీవతి ॥

**అన్వయక్రమము** :- సలక్ష్మణః రామః, రక్షసాం లంకామ్ అన్విష్య (హతరాక్షసాం) కుర్యాత్; తాభ్యాం దృష్టః రిపుః ముహూర్త మపి న హి జీవతి.

**ప్రతిపదార్థము** :- సలక్ష్మణః రామః = లక్ష్మణునితో కూడి యున్న శ్రీరాముడు, రక్షసాం లంకాం = రాక్షసుల లంకను, అన్విష్య = వెదకి, హతరాక్షసాం కుర్యాత్ = రాక్షసశూన్యముగా చేసివేయును. హి = ఎందుచేత ననగా, తాభ్యాం దృష్టః రిపుః = ఆ సోదరు లిరువురిచే చూడబడిన శత్రువు, ముహూర్త మపి = క్షణకాలము గూడ, నహి జీవతి = జీవించి యుండడు.

**తాత్పర్యము** :- లక్ష్మణుడు తోడయియున్నట్టి నా శ్రీరాముడు లంకనంతయును వెదకి, ఒక్క రాక్షసుడు గూడ లేకుండగ నశింపజేయును. ఆ సోదరుల కంటబడిన శత్రువెవ్వడైనను జీవముతో నుండుట అసంభవము.

**శ్లో॥ చితాధూమాకులపథా గృధ్రమండలసంకులా ।**
**అచిరేణ తు లంకేయం శ్మశానసదృశీ భవేత్ ॥ 26**

**పదచ్ఛేదము** :- చితాధూమాకులపథా - గృధ్రమండలసంకులా - అచిరేణ - తు - లంకా - ఇయం - శ్మశానసదృశీ - భవేత్ ॥

**అన్వయక్రమము** :- ఇయం లంకా అచిరేణ చితాధూమాకులపథా, గృధ్రమండల సంకులా (చ సతీ) శ్మశానసదృశీ భవేత్.

**ప్రతిపదార్థము** :- ఇయం లంకా = ఈ లంకానగరము, అచిరేణ = కొద్దికాలములోనే, చితాధూమాకులపథా = చితాధూమము వ్యాపించినట్టి వీథులు గలదిగను, గృధ్రమండల సంకులా = గ్రద్దల గుంపులతో నిండినదిగను, (సత్ = అగుచు) శ్మశానసదృశీ భవేత్ = వల్లకాటిని పోలినది అగును.

**తాత్పర్యము** :- ఈ లంకానగరము అచిరకాలములోనే వీథులన్నియు చితాధూమములతో వ్యాపించి యుండగా, గుంపులు గుంపులుగా గ్రద్దలు సంచరించు చుండగా, శ్మశానవాటిక కాగలదు.

**శ్లో॥ అచిరే ణైవ కాలేన ప్రాప్స్యా మ్యేవ మనోరథమ్ ।**
**దుష్ప్రస్థానో౽ యమాఖ్యాతి సర్వేషాం వో విపర్యయమ్ ॥ 27**

**పదచ్ఛేదము**:- అచిరేణ - ఏవ - కాలేన - ప్రాప్స్యామి - ఏవ - మనోరథమ్, దుష్ప్రస్థానః - అయమ్ - ఆఖ్యాతి - సర్వేషాం - వః - విపర్యయమ్ ॥

**అన్వయక్రమము** :- అచిరేణ కాలేన ఏవ మనోరథం ప్రాప్స్యామి ఏవ; అయం దుష్ప్రస్థానః వః సర్వేషాం విపర్యయమ్ ఆఖ్యాతి.

**ప్రతిపదార్థము** :- అచిరేణ కాలేన ఏవ = కొద్ది కాలముననే, మనోరథం ప్రాప్స్యామి ఏవ = అభీష్టమును తప్పక పొందగలను. అయం దుష్ప్రస్థానః = ఈ విధమైన (మీ)దురాచరణమే, వః సర్వేషాం విపర్యయం = మీయందరియొక్క ప్రమాదమును, ఆఖ్యాతి = తెలుపుచున్నది.

**తాత్పర్యము** :- మీరు చేయుచున్న ఈ దురాచరణమే మీకు కలుగబోవు కీడును స్పష్టముగా తెలుపుచున్నది. అందుచేత అచిరకాలముననే నా మనోరథము తప్పక సిద్ధింపగలదు.

**శ్లో॥ యాదృశా నీహ దృశ్యంతే లంకాయా మశుభాని వై ।**
**అచిరేణ తు కాలేన భవిష్యతి హతప్రభా ॥ 28**

**పదచ్ఛేదము** :- యాదృశాని - ఇహ - దృశ్యంతే - లంకాయామ్ - అశుభాని - వై - అచిరేణ - తు - కాలేన - భవిష్యతి - హతప్రభా ॥

**అన్వయక్రమము** :- ఇహ లంకాయాం యాదృశాని అశుభాని దృశ్యంతే, (తేన)

అచిరేణ కాలేన, (లంకా) హతప్రభా భవిష్యతి.

**ప్రతిపదార్థము** :- ఇహ లంకాయాం = ఈ లంకానగరమునందు, యాదృశాని అశుభాని దృశ్యంతే = ఎట్టి అమంగళకరమైన దృశ్యములు కాన్పించుచున్నవో, తేన = ఆ కారణమున, లంకా = లంకానగరము, అచిరేణ కాలేన = అతిస్వల్పమైన కాలముననే, హతప్రభా భవిష్యతి = తేజోవిహీనమైనది కాగలదు.

**తాత్పర్యము** :- ఈ లంకానగరమునందు కాన్పించుచున్నట్టి అమంగళకరమైన అపశకునములచే అతిస్వల్పకాలములోనే ఈ లంకానగరము రూపు మాసిపోవునని తెలియుచున్నది.

**శ్లో॥ నూనం లంకా హతే పాపే రావణే రాక్షసాధమే ।**
**శోషం యాస్యతి దుర్ధర్షా ప్రమదా విధవా యథా ॥ 29**

**పదచ్ఛేదము** :- నూనం - లంకా - హతే - పాపే - రావణే - రాక్షసాధమే - శోషం - యాస్యతి - దుర్ధర్షా - ప్రమదా - విధవా - యథా ॥

**అన్వయక్రమము** :- రాక్షసాధమే పాపే రావణే హతే (సతి) దుర్ధర్షా లంకా విధవా ప్రమదా యథా నూనం శోషం యాస్యతి.

**ప్రతిపదార్థము** :- రాక్షసాధమే = నీచరాక్షసు డైనట్టి, పాపే రావణే = పాపాత్ముడైన రావణుడు, హతే (సతి) = చనిపోవగనే, దుర్ధర్షా లంకా = పరులకు చేర శక్యముగాని లంకానగరము, విధవా ప్రమదా యథా = భర్తను గోల్పోయిన తరుణివలె, నూనం = నిశ్చయముగా, శోషం యాస్యతి = శుష్కమై పోవును.

**తాత్పర్యము** :- రాక్షసాధముడైన మహాపాపాత్ముడగు రావణుడు శ్రీరాముని చేతిలో ప్రాణములు గోల్పోవగనే నేటివఱకు పరులకు దుర్గమముగా నున్న ఈ లంకానగరము రేపు భర్తను పోగొట్టుకొన్న యువతివలె, కళావిహీనమై వినాశము నొందగలదు.

**శ్లో॥ పుణ్యోత్సవసముత్థా చ నష్టభర్త్రీ సరాక్షసీ ।**
**భవిష్యతి పురీ లంకా నష్టభర్త్రీ యథాఽంగనా ॥ 30**

**పదచ్ఛేదము** :- పుణ్యోత్సవసముత్థా - చ- నష్టభర్త్రీ - సరాక్షసీ - భవిష్యతి - పురీ - లంకా - నష్టభర్త్రీ - యథా - అంగనా ॥

**అన్వయక్రమము** :- నష్టభర్త్రీ, పుణ్యోత్సవసముత్థా, సరాక్షసీ లంకాపురీ, నష్టభర్త్రీ అంగనా యథా భవిష్యతి.

**ప్రతిపదార్థము** :- నష్టభర్తృ = చనిపోయిన నాథుడుగల, సరాక్షసీ లంకాపురీ = రాక్షసులతో గూడిన ఈ లంకాపట్టణము, నష్టభర్తృ అంగనా యథా = వితంతువైన స్త్రీ వలె, పుణ్యోత్సవసముత్థా భవిష్యతి = పుణ్యోత్సవవిహీనమైనది కాగలదు.

**తాత్పర్యము** :- రాక్షసాధిపతియగు రావణుని గోల్పోయిన ఈ లంకా నగరమంతయును, వైధవ్యము నొందిన స్త్రీవలెనే, సర్వశుభములకును, ఉత్సవము లకును దూరమైనది కాగలదు.

**శ్లో॥ నూనం రాక్షసకన్యానాం రుదంతీనాం గృహే గృహే ।**
**శ్రోష్యామి నచిరా దేవ దుఃఖార్తానా మిహ ధ్వనిమ్ ॥ 31**

**పదచ్ఛేదము** :- నూనం - రాక్షసకన్యానాం - రుదంతీనాం - గృహే - గృహే - శ్రోష్యామి - నచిరాత్ - ఏవ - దుఃఖార్తానామ్ - ఇహ - ధ్వనిమ్ ॥

**అన్వయక్రమము** :- ఇహ గృహే గృహే దుఃఖార్తానాం రుదంతీనాం రాక్షసకన్యానాం ధ్వనిం నూనం నచిరాదేవ శ్రోష్యామి.

**ప్రతిపదార్థము** :- ఇహ = ఈ లంకలో, గృహే గృహే = ఇంటింటను, దుఃఖార్తానాం = శోకార్తలై, రుదంతీనాం = విలపించునట్టి, రాక్షసకన్యానాం = రాక్షసయువతుల యొక్క, ధ్వనిం = ధ్వనిని, నూనం = నిశ్చయముగా, న చిరా దేవ శ్రోష్యామి = స్వల్పకాలములోనే వినగలను.

**తాత్పర్యము** :- ఈ లంకలో ప్రతిగృహమునందును దుఃఖార్తలై విలపించుచున్న రాక్షస కన్యల రోదనధ్వని, అల్పకాలములోనే తప్పక నాకు వినిపించును.

**శ్లో॥ సాంధకారా హతద్యోతా హతరాక్షసపుంగవా ।**
**భవిష్యతి పురీ లంకా నిర్దగ్ధా రామసాయకైః ॥ 32**

**శ్లో॥ యది నామ స శూరో మాం రామో రక్తాంతలోచనః ।**
**జానీయా ద్వర్తమానాం హి రావణస్య నివేశనే ॥ 33**

**పదచ్ఛేదము** :- సాంధకారా - హతద్యోతా - హతరాక్షసపుంగవా - భవిష్యతి - పురీ - లంకా - నిర్దగ్ధా - రామసాయకైః - యది - నామ - సః - శూరః - మాం - రామః - రక్తాంతలోచనః - జానీయాత్ - వర్తమానాం - హి - రావణస్య - నివేశనే ॥

**అన్వయక్రమము** :- రక్తాంతలోచనః, శూరః స రామః మాం రావణస్య నివేశనే వర్తమానాం యది నామ జానీయాత్; (తదా) లంకా పురీ రామసాయకైః నిర్దగ్ధా (సతీ), సాంధకారా హతద్యోతా, హతరాక్షసపుంగవా భవిష్యతి.

**ప్రతిపదార్థము** :- రక్తాంతలోచనః = ఎఱ్ఱని కంటి కొనలు గల్గినట్టి, శూరః స రామః = శూరుడగు ఆ శ్రీరాముడు, మాం = నన్ను, రావణస్య నివేశనే వర్తమానాం = రావణుని మందిరము నందున్న దానినిగా, యది నామ జానీయాత్ = తెలిసికొనియే యున్నచో, లంకాపురీ = లంకానగరము, రామసాయకైః నిర్దగ్ధా(సతీ) = రామ బాణములచే దహింపబడినదై, సాంధకారా = చీకట్లు గ్రమ్మినదిగను, హతద్యోతా = కాంతిశూన్య మైనదిగాను, హతరాక్షసపుంగవా = హతమారిన రాక్షసులు గలదిగను, భవిష్యతి = కాగలదు.

**తాత్పర్యము** :- మహావీరుడును, క్రోధముచే అరుణములైన కంటి కొనలు గలవాడును అగు శ్రీరాముడు నే నిచ్చట నున్నట్లు తెలిసికొనుటయే జరిగినచో ఈ లంకానగర మంతయును ఆతని బాణాగ్నిచే దగ్ధమై రాక్షసు లెల్లరును నశించిపోగా వెలుగులేక చీకట్లు గ్రమ్మి పాడుపడిన పట్టణమై పోవును.

**శ్లో॥ అనేన తు నృశంసేన రావణే నాధమేన మే ।**
**సమయో యస్తు నిర్దిష్ట స్తస్య కాలోఽయ మాగతః ।**
**స చ మే విహితో మృత్యురస్మిన్ దుష్టేన వర్తతే ॥ 34**

**పదచ్ఛేదము** :- అనేన – తు – నృశంసేన – రావణేన – అధమేన – మే – సమయః – యః – తు – నిర్దిష్టః – తస్య – కాలః – అయమ్ – ఆగతః – సః – చ – మే – విహితః – మృత్యుః – అస్మిన్ – దుష్టేన – వర్తతే ॥

**అన్వయక్రమము** :- అధమేన, నృశంసేన అనేన రావణేన యః సమయః నిర్దిష్టః,తస్య అయం కాలః ఆగతః; (అనేన) దుష్టేన విహితః, సః మృత్యుః చ అస్మిన్ కాలే వర్తతే.

**ప్రతిపదార్థము** :- అధమేన = నీచుడును, నృశంసేన = క్రూరుడును అగు, అనేన రావణేన = ఈ రావణునిచే, మే = నాకు, యః సమయః నిర్దిష్టః = ఏ యవధి నిర్ణయింపబడినదో, తస్య అయం కాలః = దానియొక్క ఆ గడువు కాలము, ఆగతః = వచ్చియున్నది. అనేన దుష్టేన విహితః = ఈ దుర్మార్గునిచే నిర్ణయింపబడిన, సః మృత్యుః చ = ఆ మృత్యువు కూడ, అస్మిన్ కాలే = ఈ సమయమున, వర్తతే = సంభవించును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:-** సమయః - ద్వాదశమాసరూప మైనట్టి కాలావధి. ఈ యవధి ఇంకను రెండు మాసములున్నను, సంవత్సరము గడువు ముగిసినట్లే ఎంచుకొనవలసి యున్నది.

**తాత్పర్యము :-** దుర్మార్గుడైన ఈ రాక్షసాధముడు నాకు నిర్ణయించిన రెండునెలలు గడువు సమీపించుచున్నది. నాకు ఈ దుష్టునిచేత మృత్యువు అతిసన్నిహితముగనే యున్నది.

**శ్లో॥ అకార్యం యే న జానంతి నైర్ఋతాః పాపకారిణః ।**
**అధర్మాత్తు మహోత్పాతో భవిష్యతి హి సాంప్రతమ్ ॥ 35**

**పదచ్ఛేదము :-** అకార్యం - యే - న - జానంతి - నైర్ఋతాః - పాపకారిణః - అధర్మాత్ - తు - మహోత్పాతః - భవిష్యతి - హి - సాంప్రతమ్ ॥

**అన్వయక్రమము :-** పాపకారిణః యే నైర్ఋతాః అకార్యం న జానంతి (తేషాం) అధర్మాత్ సాంప్రతం మహోత్పాతః భవిష్యతి.

**ప్రతిపదార్థము :-** పాపకారిణః = పాపకర్ము లైనట్టి, యే నైర్ఋతాః = ఏ రాక్షసులు, అకార్యం న జానంతి = దుష్టకృత్యమును గూర్చి తెలిసికొనలేరో, తేషాం = ఆ రాక్షసులయొక్క, అధర్మాత్ = అధర్మాచరణమువలన, సాంప్రతం = ఇప్పుడు, మహోత్పాతః భవిష్యతి = గొప్ప ఉపద్రవము సంభవింప బోవుచున్నది.

**తాత్పర్యము :-** కార్యాకార్య విచక్షణాజ్ఞానములేని ఈ రాక్షసులు చేయు పాపకృత్యములచే కలిగిన అధర్మమువలననే, ప్రస్తుతము వీరికి మహోపద్రవము సంభవింపబోవుచున్నది.

**శ్లో॥ నైతే ధర్మం విజానంతి రాక్షసాః పిశితాశనాః ।**
**ధ్రువం మాం ప్రాతరాశార్థే రాక్షసః కల్పయిష్యతి ॥ 36**

**పదచ్ఛేదము :-** న - ఏతే - ధర్మం - విజానంతి - రాక్షసాః - పిశితాశనాః - ధ్రువం - మాం - ప్రాతరాశార్థే - రాక్షసః - కల్పయిష్యతి.

**అన్వయక్రమము :-** ఏతే పిశితాశనాః రాక్షసాః ధర్మం న విజానంతి; (అయం) రాక్షసః ధ్రువం మాం ప్రాతరాశార్థే కల్పయిష్యతి.

**ప్రతిపదార్థము :-** ఏతే పిశితాశనాః రాక్షసాః = ఈ మాంసాహారులైనట్టి రాక్షసులు,

ధర్మం న విజానంతి = ధర్మమును గూర్చి తెలిసికొనలేరు. (అయం) రాక్షసః = ఈ రావణాసురుడు, ధ్రువం = నిశ్చయముగా, మాం = నన్ను, ప్రాతరాశార్థే కల్పయిష్యతి = ప్రాతఃకాలపు ఆహారమునకై వినియోగింపగలడు.

**తాత్పర్యము :–** మాంసభోజనులైన ఈ రాక్షసులకు ధర్మమును గూర్చి ఏమి తెలియును? ఈ రావణాసురుడు తప్పక నన్ను ఒకనాడు తన ప్రాతఃకాలపు ఆహారమునకై వినియోగించుకొనగలడు.

**శ్లో॥ సా౽హం కథం కరిష్యామి తం వినా ప్రియదర్శనమ్ ।**
**రామం రక్తాంతనయన మపశ్యంతీ సుదుఃఖితా ॥ 37**

**పదచ్ఛేదము :–** సా – అహం – కథం – కరిష్యామి – తం – వినా – ప్రియదర్శనమ్, రామం – రక్తాంతనయనమ్ – అపశ్యంతీ – సుదుఃఖితా ॥

**అన్వయక్రమము :–** రక్తాంతనయనం రామమ్ అపశ్యంతీ సుదుఃఖితా సా అహం తం ప్రియదర్శనం వినా దేహధారణం కథం కరిష్యామి?

**ప్రతిపదార్థము :–** రక్తాంతనయనం రామం = ఎఱ్ఱని కంటి కొనలు గలిగిన శ్రీరాముని, అపశ్యంతీ = చూడలేని దాననై, సుదుఃఖితా = దుఃఖగ్రస్తురాలనై యున్న, సా అహం = ఇట్టి నేను, తం ప్రియదర్శనం వినా = ఆ ప్రియుని దర్శనము లేకుండ, దేహధారణం = శరీరధారణమును, కథం కరిష్యామి = ఎట్లు చేయగలను?

**తాత్పర్యము :–** లోకమోహనమైన నేత్రసౌందర్యముతో విరాజిల్లు నా ప్రియుడైన శ్రీరాముని చూచుకొన లేక దుఃఖములో మునిగి యున్న నేను ఈ దేహమును ఎట్లు నిలుపుకొన గలను?

**శ్లో॥ యది కశ్చి త్ప్రదాతా మే విష స్యాద్య భవే దిహ ।**
**క్షిప్రం వైవస్వతం దేవం పశ్యేయం పతినా వినా ॥ 38**

**పదచ్ఛేదము :–** యది – కశ్చిత్ – ప్రదాతా – మే – విషస్య – అద్య – భవేత్ – ఇహ – క్షిప్రం – వైవస్వతం – దేవం – పశ్యేయం – పతినా – వినా ॥

**అన్వయక్రమము :–** మే ఇహ అద్య విషస్య ప్రదాతా కశ్చిత్ భవేత్ యది, పతినా వినా (అహం) క్షిప్రం, వైవస్వతం దేవం పశ్యేయమ్.

**ప్రతిపదార్థము :–** మే = నాకు, ఇహ = ఇచ్చట, అద్య = నేడు, విషస్య ప్రదాతా = విషము నొసగు నట్టివాడు, కశ్చిత్ = ఎవడైనను, భవేత్ యది = ఉన్నయెడల,

పతినా వినా = భర్తలేకుండగా (నున్న) అహం = నేను, క్షిప్రం = శీఘ్రముగ, వైవస్వతం దేవం = యమధర్మరాజును, పశ్యేయం = దర్శింపగలను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు.

**రా. శిరోమణి :-** అద్య = ఇప్పుడు, అనగా రాక్షసులు నన్ను వధించుటకు పూర్వము.

**తాత్పర్యము :-** ఈ సమయమున నాకు ఇంత విషము నిచ్చి పుణ్యము గట్టుకొను మహాత్మ్ము డెవ్వడైన నున్న యెడల, భర్త నెడబాసి యున్న నేను శీఘ్రముగ ఈ లోకమును విడిచి పోయి యమధర్మరాజును దర్శింపగలను.

**శ్లో॥ నాజానా జ్జీవతీం రామ స్స మాం లక్ష్మణపూర్వజః ।**
**జానంతౌ తౌ న కుర్యాతాం నోర్వ్యాం హి మమ మార్గణమ్ ॥39**

**పదచ్ఛేదము :-** న - అజానాత్ - జీవతీం - రామః - సః - మాం - లక్ష్మణ పూర్వజః - జానంతౌ - తౌ - న - కుర్యాతాం - న - ఉర్వ్యాం - హి - మమ - మార్గణమ్ ॥

**అన్వయక్రమము :-** లక్ష్మణపూర్వజః సః రామః, మాం జీవతీం, న అజానాత్; హి, జానంతౌ తౌ ఉర్వ్యాం మమ మార్గణం న న కుర్యాతామ్.

**ప్రతిపదార్థము :-** లక్ష్మణపూర్వజః = లక్ష్మణాగ్రజుడైన, సః రామః = ఆ శ్రీరాముడు, మాం = నన్ను, జీవతీం = బ్రదికియుండినదాననుగా, న అజానాత్ = ఎఱుగడు, హి = ఎందుచేతననగా, జానంతౌ = ఎఱిగియున్న (యెడల), తౌ = ఆ సోదరు లిరువురును, ఉర్వ్యాం = భూమిపై, మమ మార్గణం = నా అన్వేషణమును, న న కుర్యాతాం = చేయకుండ నుండరు.

**తాత్పర్యము :-** రామలక్ష్మణులు నేను జీవించి యున్న సంగతి ఏమియు నెఱుగరు. ఎఱిగియే యున్నచో వారిరువురును నన్ను గూర్చి భూమి అంతయు గాలించి నన్ను వెదికి పట్టుకొని తీరెదరు.

**శ్లో॥ నూనం మ మైవ శోకేన స వీరో లక్ష్మణాగ్రజః ।**
**దేవలోక మితో యాత స్త్యక్త్వా దేహం మహీతలే ॥ 40**

**పదచ్ఛేదము :-** నూనం - మమ - ఏవ - శోకేన - సః - వీరః - లక్ష్మణాగ్రజః - దేవలోకమ్ - ఇతః - యాతః - త్యక్త్వా - దేహం - మహీతలే ॥

**అన్వయక్రమము :-** లక్ష్మణాగ్రజః సః వీరః, నూనం మమ శోకేన ఏవ దేహం

మహీతలే త్యక్త్వా ఇతః దేవలోకం యాతః.

**ప్రతిపదార్థము :–** లక్ష్మణాగ్రజః సః వీరః = లక్ష్మణుని యన్న యగు ఆ మహావీరుడు శ్రీరాముడు, నూనం = నిశ్చయముగా, మమ శోకేన ఏవ = నన్ను గూర్చిన దుఃఖముతోడనే, మహీతలే దేహం త్యక్త్వా = భూమిపై దేహమును వీడి, ఇతః దేవలోకం యాతః = ఈ లోకమునుండి స్వర్గలోకమునకు వెడలిపోయినాడు.

**తాత్పర్యము :–** నిశ్చయముగా లక్ష్మణాగ్రజుడైన నా నాథుడు నా విరహదుఃఖమును భరింపలేకయే శరీరమును విడిచి స్వర్గలోకమునకు వెడలిపోయి యుండును.

**శ్లో॥ ధన్యా దేవా స్సగంధర్వా స్సిద్ధా శ్చ పరమర్షయః ।**
**మమ పశ్యంతి యే నాథం రామం రాజీవలోచనమ్ ॥ 41**

**పదచ్ఛేదము :–** ధన్యాః – దేవాః – సగంధర్వాః – సిద్ధాః – చ – పరమర్షయః – మమ – పశ్యంతి – యే – నాథం – రామం – రాజీవలోచనమ్ ॥

**అన్వయక్రమము :–** రాజీవలోచనం మమ నాథం రామం యే పశ్యంతి (తే) దేవాః సగంధర్వాః సిద్ధాః పరమర్షయః చ ధన్యాః.

**ప్రతిపదార్థము :–** రాజీవలోచనం = పద్మములవంటి లోచనములు గల, మమ నాథం రామం = నాప్రభువైన శ్రీరాముని, యే పశ్యంతి = ఎవరు చూడగలుగుచున్నారో, (తే) దేవాః = (ఆ) దేవతలును, సగంధర్వాః సిద్ధాః = గంధర్వులతో గూడినట్టి సిద్ధులును, పరమర్షయః చ = మహామునీశ్వరులును, ధన్యాః = అదృష్టవంతులు.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:–** సంసారమం దున్నప్పుడు భక్తు లెట్టి రూపమునం దాసక్తులై చూడగోరుదురో వారు పరమపదమునం దట్టి రూపమునే చూడగలరు. ఇహలోకమునందు సీతారాములను సేవించుచు ముక్తులగువారికి పరమునందు భగవానుడు సీతారామమూర్తిగనే కానవచ్చు చుండును.

**తాత్పర్యము :–** ఆ స్వర్గలోకమునందు కమలాయతలోచనుడైన నా భర్తను కన్నులార దర్శించు భాగ్యముగల ఆ దేవతలును గంధర్వులును, సిద్ధులును, పరమఋషులును ఎంత ధన్యులో గదా!

**శ్లో॥ అథవా కిన్ను త స్యార్థో ధర్మకామస్య ధీమతః ।**
**మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః ॥ 42**

**పదచ్ఛేదము :–** అథవా – కిం – ను – తస్య – అర్థః – ధర్మకామస్య – ధీమతః – మయా – రామస్య – రాజర్షేః – భార్యయా – పరమాత్మనః ॥

**అన్వయక్రమము :–** అథవా ధర్మకామస్య ధీమతః, రాజర్షేః పరమాత్మనః తస్య రామస్య భార్యయా మయా కిం ను అర్థః?

**ప్రతిపదార్థము :–** అథవా = అట్లుగాక, ధర్మకామస్య = ధర్మమునందే ప్రీతిగలిగినట్టియు, ధీమతః = ప్రజ్ఞావంతు డైనట్టియు, రాజర్షేః = రాజఋషిగా నున్నట్టియు, పరమాత్మనః = ఉత్కృష్టమైనట్టి మనస్సుగల, తస్య రామస్య = ఆ శ్రీరామునకు, మయా భార్యయా = భార్యనైన నాతో, కిం ను అర్థః = ఏమి ప్రయోజన (ముండును?)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** పరమాత్మనః – జీవన్ముక్తుడైయున్నట్టి.

**గోవిందరాజీయము :–** పరమాత్మనః – ఉత్కృష్టస్వభావము కల్గియున్న.

**తాత్పర్యము :–** కేవలము ధర్మమునే కోరువాడును, ప్రజ్ఞాశాలియును, రాజర్షిగా చరించుచున్నవాడును, ఆత్మజ్ఞానియును అగు శ్రీరామునకు – భార్య నగు నాతో ఏమి ప్రయోజనము? నేను లేకున్నను అతనికి కొదువ యేమి?

**శ్లో॥ దృశ్యమానే భవే త్ప్రీతి స్సౌహృదం నా స్త్యపశ్యతః ।**
**నాశయంతి కృతఘ్నాస్తు న రామో నాశయిష్యతి ॥ 43**

**పదచ్ఛేదము :–** దృశ్యమానే – భవేత్ – ప్రీతిః – సౌహృదం – న – అస్తి – అపశ్యతః – నాశయంతి – కృతఘ్నాః – తు – న – రామః – నాశయిష్యతి ॥

**అన్వయక్రమము :–** దృశ్యమానే ప్రీతిః భవేత్; అపశ్యతః సౌహృదం నాస్తి; కృతఘ్నాః తు సౌహృదం నాశయంతి; రామః తు న నాశయిష్యతి.

**ప్రతిపదార్థము :–** దృశ్యమానే = చూచుచున్నప్పుడు, ప్రీతిః భవేత్ = ప్రీతి గలుగు చుండును; అపశ్యతః = చూడకున్నవానికి, సౌహృదం నాస్తి = స్నేహముండదు. కృతఘ్నాః = కృతఘ్నులైన వారు, సౌహృదం నాశయంతి = సౌహార్దమును నశింప చేయుదురు. రామః తు = రాముడు మాత్రము, న నాశయిష్యతి = నశింపచేయడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** రామచంద్రమూర్తి తనకు ఒక్క ఉపకారము చేసినను కలకాలము

దానిని తన స్మృతియం దుంచుకొనును. ఆయన ప్రత్యక్షమందును పరోక్షమందును ఏకవిధముగ నుండును. అనగా జీవాత్మలు భగవంతుని విషయమున ఎన్ని అపచారములైనను చేయుదురు, గాని భగవంతు డట్లు చేయడు.

**తాత్పర్యము :–** సామాన్యముగా లోకములో ఎదుటనుండి చూచు నట్టి వస్తువులపై ప్రీతి కలుగుట సహజము. కనుమఱుగైన వానిపై అనురాగముండుట కష్టము. కాని దూరముగ నుండుటచే ప్రీతిని గోల్పోవు నట్టి కృతఘ్నులైన ఆ సామాన్యుల విషయము వేఱు. నా శ్రీరాముడు మాత్రము నా ప్రేమను ఎట్టి పరిస్థితిలోకూడ మఱచునట్టివాడు కాడు.

**శ్లో॥ కిం ను మే న గుణాః కేచి త్కిం వా భాగ్యక్షయో మమ ।**
**యాఽహం సీదామి రామేణ హీనా ముఖ్యేన భామినీ ॥ 44**

**పదచ్ఛేదము :–** కిం – ను – మే – న – గుణాః – కేచిత్ – కిం – వా – భాగ్యక్షయః – మమ – యా – అహం – సీదామి – రామేణ – హీనా – ముఖ్యేన – భామినీ ॥

**అన్వయక్రమము :–** ముఖ్యేన రామేణ హీనా భామినీ యా అహం సీదామి, (తస్యాః) మే కేచిత్ గుణాః న (సంతి) కిం ను? కిం వా మమ భాగ్యక్షయః?

**ప్రతిపదార్థము :–** ముఖ్యేన రామేణ హీనా = ప్రధానుడైన రాముడు లేనిదాననై, భామినీ = అబల నగు, యా అహం = ఏ నేను, సీదామి = క్షీణించుచున్నానో, తస్యాః = అట్టి, మే = నాకు, కేచిత్ గుణాః = కొన్ని (ఆవశ్యకములైన) గుణములు, న (సంతి) కిం ను = లేకున్నవా యేమి! కిం వా మమ భాగ్యక్షయః = లేక నా భాగ్య క్షీణతయో!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** నగుణాః – అనగా పాపములు, నా దుస్థితికి నా పాపములే కారణమా?

**తాత్పర్యము :–** అబలనైన నేను ఇట్లు నా ప్రాణనాథుడైన రామునికి దూరమై దుఃఖించుటకు నాలోని గుణలోపము కారణమై యుండునా లేక నా యదృష్టమే క్షీణించి యుండెనా?

**శ్లో॥ శ్రేయో మే జీవితా న్మర్తుం విహీనాయా మహాత్మనః ।**
**రామా దక్లిష్టచారిత్రా చ్ఛూరా చ్ఛత్రునిబర్హణాత్ ॥ 45**

**పదచ్ఛేదము :-** శ్రేయః - మే - జీవితాత్ - మర్తుం - విహీనాయాః - మహాత్మనః - రామాత్ - అక్లిష్టచారిత్రాత్ - శూరాత్ -శత్రునిబర్హణాత్ ॥

**అన్వయక్రమము :-** అక్లిష్టచారిత్రాత్, శూరాత్, శత్రునిబర్హణాత్, మహాత్మనః రామాత్ విహీనాయాః మే, జీవితాత్ మర్తుం శ్రేయః.

**ప్రతిపదార్థము :-** అక్లిష్టచారిత్రాత్ = ఉత్తమమైన వర్తనము గలవాడును, శూరాత్ = వీరుడును, శత్రునిబర్హణాత్ = శత్రుసంహారకుడును అగు, మహాత్మనః రామాత్ = మహనీయుడైన శ్రీరామునినుండి, విహీనాయాః మే = ఎడబాటు నొంది యున్నట్టి నాకు, జీవితాత్ = బ్రదికి యుండుటకంటే, మర్తుం = మరణించుటయే, శ్రేయః = మేలు.

**తాత్పర్యము :-** పరమదయాళువును, మహావీరుడును, శత్రుసంహారకుడు నగు ఆ మహాత్ముడైన శ్రీరాముడు నాకు దూరమైయున్నప్పుడు నేను జీవించి యుండుట మేలు కాదు. మరణించుటయే యుక్తము.

**శ్లో॥ అథవా న్యస్తశస్త్రౌ తౌ వనే మూలఫలాశినౌ ।**
**భ్రాతరౌ హి నరశ్రేష్ఠౌ సంవృత్తౌ వనగోచరౌ ॥ 46**

**పదచ్ఛేదము :-** అథవా - న్యస్తశస్త్రౌ - తౌ - వనే - మూలఫలాశినౌ - భ్రాతరౌ - హి - నరశ్రేష్ఠౌ - సంవృత్తౌ - వనగోచరౌ ॥

**అన్వయక్రమము :-** అథవా నరశ్రేష్ఠౌ, భ్రాతరౌ, వనే మూలఫలాశినౌ (సంతౌ), న్యస్తశస్త్రౌ వనగోచరౌ సంవృత్తౌ (కిమ్)?

**ప్రతిపదార్థము :-** అథవా = లేక, నరశ్రేష్ఠౌ తౌ భ్రాతరౌ = పురుషోత్తములైన ఆ యన్నదమ్ము లిరువురును, వనే = అరణ్యమునందు, న్యస్తశస్త్రౌ = ఆయుధములను విడిచి వేసినవారై, మూలఫలాశినౌ (సంతౌ) = కందమూలఫలములను తినుచున్నవారై, వనగోచరౌ సంవృత్తౌ(కిమ్) = మునివృత్తిని అవలంబించినవా రయిరా ఏమి?

**తాత్పర్యము :-** లేక పురుషశ్రేష్ఠులైన ఆ యన్నదమ్ము లిరువురును ఆయుధములను విసర్జించి అరణ్యమునందు కందమూలములను తినుచు తాపసవృత్తిని అవలంబించి యున్నారేమో! అట్టివారికి స్త్రీచింత యేముండును!

**శ్లో॥ అథవా రాక్షసేంద్రేణ రావణేన దురాత్మనా ।**
**ఛద్మనా ఘాతితౌ శూరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ॥ 47**

**పదచ్ఛేదము :–** అథవా – రాక్షసేంద్రేణ – రావణేన – దురాత్మనా – ఛద్మనా – ఘాతితౌ – శూరౌ – భ్రాతరౌ – రామలక్ష్మణౌ॥

**అన్వయక్రమము :–** అథవా శూరౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ దురాత్మనా రాక్షసేంద్రేణ రావణేన ఛద్మనా ఘాతితౌ!

**ప్రతిపదార్థము :–** అథవా = అట్లుగాక, శూరౌ = మహావీరులైన, భ్రాతరౌ రామలక్ష్మణౌ = సోదరులైన ఆ రామలక్ష్మణు లిరువురును, దురాత్మనా = దుర్మార్గుడైనట్టి, రాక్షసేంద్రేణ = రాక్షసరాజైన, రావణేన = రావణునిచే, ఛద్మనా = మోసముచే, ఘాతితౌ = పరిమార్చబడి యుందురు.

**తాత్పర్యము :–** అట్లుగాని యెడల ఎంతటి మహావీరులైనప్పటికిని ఆ యన్నదమ్ముల నిరువురిని మహాదుర్మార్గుడైన ఆ రావణుడు ఏదియో గొప్ప మోసము చేసి చంపివేసి యుండును.

**శ్లో॥ సాఽహ మేవం గతే కాలే మర్తు మిచ్ఛామి సర్వథా ।**
**న చ మే విహితో మృత్యు రస్మిన్ దుఃఖేఽపి వర్తతి ॥ 48**

**పదచ్ఛేదము :–** సా – అహం – ఏవం – గతే – కాలే – మర్తుమ్ – ఇచ్ఛామి – సర్వథా – న – చ – మే – విహితః – మృత్యుః – అస్మిన్– దుఃఖే – అపి – వర్తతి ॥

**అన్వయక్రమము :–** ఏవం కాలే గతే, సా అహం సర్వథా మర్తుమ్ ఇచ్ఛామి; అస్మిన్ దుఃఖే వర్తతి అపి, మే మృత్యుః న చ విహితః.

**ప్రతిపదార్థము :–** ఏవం కాలే గతే = ఈ రీతిగా కాలము గడచిపోవుచుండగా, సా అహం = అట్టి దుఃస్థితిలో నున్న నేను, సర్వథా = ఎల్ల విధములను, మర్తుమ్ ఇచ్ఛామి = మరణించుటకే కోరుచున్నాను, అస్మిన్ దుఃఖే = ఇంతటి దుఃఖము, వర్తతి అపి = చుట్టుకొనియున్నప్పటికిని, మే = నాకు, మృత్యుః = మరణము, న చ విహితః = విధింపబడి యుండలేదు గదా!

**తాత్పర్యము :–** ఈరీతిగా కాలమంతయు గడచి పోవుచున్నది గాని ఏ విధమగు ఆశయును నాకు కన్పించుట లేదు. కాబట్టి నా అంతట నేను చనిపోవుటయే నేను చేయదగినపని. ఇంత దుఃఖము నన్ను అలముకొన్నను నాకు దైవమువలన సహజమైన

మృత్యువు ప్రాప్తింపకున్నది.

**శ్లో॥ ధన్యాః ఖలు మహాత్మానో మునయ స్త్యక్తకిల్బిషాః,**
**జితాత్మానో మహాభాగా యేషాం న స్తః ప్రియాప్రియే ॥ 49**

**పదచ్ఛేదము :-** ధన్యాః - ఖలు - మహాత్మానః - మునయః - త్యక్తకిల్బిషాః- జితాత్మానః - మహాభాగాః - యేషాం - న - స్తః - ప్రియాప్రియే ॥

**అన్వయక్రమము :-** యేషాం ప్రియాప్రియే న స్తః తే జితాత్మానః, మహాభాగాః, త్యక్తకిల్బిషాః, మహాత్మానః మునయః ధన్యాః ఖలు!

**ప్రతిపదార్థము :-** యేషాం = ఏ మహనీయులకు, ప్రియాప్రియే = ప్రియము అప్రియము అనునవి, న స్తః = లేకుండ నుండునో, తే = అట్టి, జితాత్మానః = జితేంద్రియులును, మహాభాగాః = మహాభాగ్యవంతులును, త్యక్తకిల్బిషాః = పాపవిదూరులును అగు, మహాత్మానః మునయః = మహాత్ములైన ఋషులు, ధన్యాః ఖలు = అదృష్టవంతులు గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:-** మహాభాగాః - పూర్వజన్మాదులయందు ఆర్జించి నట్టి ఉత్తమ కర్మరూపమున మహాభాగ్యము కల్గినట్టివారు.

**తాత్పర్యము :-** ఇది ప్రియము, ఇది యప్రియము అను భేదదృష్టి లేక, ఇంద్రియములను జయించి, పాపములకు దూరముగా నుండు భాగ్యవంతులైన మహాఋషులు ఎంత ధన్యజీవనులో గదా!

**శ్లో॥ ప్రియాన్న సంభవే ద్దుఃఖ మప్రియా దధికం భయమ్ ।**
**తాభ్యాం హి యే వియుజ్యంతే నమ స్తేషాం మహాత్మనామ్॥ 50**

**పదచ్ఛేదము :-** ప్రియాత్ - న - సంభవేత్ - దుఃఖమ్ - అప్రియాత్ - అధికం - భయం - తాభ్యాం - హి - యే - వియుజ్యంతే - నమః - తేషాం - మహాత్మనామ్ ॥

**అన్వయక్రమము :-** ప్రియాత్ దుఃఖం న సంభవేత్; అప్రియాత్ అధికం భయం సంభవేత్; యే హి తాభ్యాం వియుజ్యన్తే, తేషాం మహాత్మనాం నమః.

**ప్రతిపదార్థము :-** లోకే = లోకమునందు, ప్రియాత్ = ప్రియమైనదానివలన, దుఃఖం న సంభవేత్ = దుఃఖము సంభవింపకుండును, అప్రియాత్ = అప్రియమైనదాని

వలన, అధికం భయం సంభవేత్ = అధికమైన భయము సంభవించును. యే హి = ఎవరైతే, తాభ్యాం = ఆ ప్రియాప్రియముల రెండింటినుండి, వియుజ్యంతే = దూరముగ నుందురో, తేషాం మహాత్మనాం = ఆ మహానుభావులకు, నమః = నమస్కారము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:–** దేహాభిమానము గల వారికి ప్రియము కలిగెనా సంతోషము కలుగును. అప్రియము కలిగెనా భయము కలుగును. కావున మనస్సు ప్రియము మీదికిని అప్రియము మీదికిని పోక పోయెనా ముదము లేదు, భయమును లేదు.

(మునులని చెప్పబడుటచే ఇచట ఇది వానప్రస్థుల విషయ మని యేర్పడుచున్నది).

**తాత్పర్యము :–** ఏ మహానుభావులకు ప్రియవస్తువు తొలగి పోయినను దుఃఖము లేక సుఖమే కలుగునో, అప్రియవస్తువులవలన కూడ భయము సంభవింపక సుఖమే కలుగుచుండునో, అట్టి ద్వంద్వాతీతులైన మహాత్ముల దివ్యశక్తికి నమస్కరించు చున్నాను.

**శ్లో॥ సాఽ హం త్యక్తా ప్రియార్హేణ రామేణ విదితాత్మనా ।**
**ప్రాణాం స్త్యక్ష్యామి పాపస్య రావణస్య గతా వశమ్ ॥ 51**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సీతాప్రాణత్యాగచింతనం" నామ*
*షడ్వింశస్సర్గః*

**పదచ్ఛేదము :–** సా – అహం – త్యక్తా – ప్రియార్హేణ – రామేణ – విదితాత్మనా – ప్రాణాన్ – త్యక్ష్యామి – పాపస్య – రావణస్య – గతా – వశమ్.

**అన్వయక్రమము :–** ప్రియార్హేణ, విదితాత్మనా రామేణ త్యక్తా పాపస్య రావణస్య వశం గతా సా అహం ప్రాణాన్ త్యక్ష్యామి.

**ప్రతిపదార్థము :–** ప్రియార్హేణ = మిక్కిలి ప్రియుడును, విదితాత్మనా = ఆత్మజ్ఞానముగలవాడు నగు, రామేణ = రామునిచే, త్యక్తా = విడువబడినదాననై, పాపస్య రావణస్య = పాపాత్ముడైన రావణునకు, వశం గతా = అధీనురాలనై యున్నట్టి, సా అహం = ఆ నేను, ప్రాణాన్ త్యక్ష్యామి = ప్రాణములను విడిచెదను.

**తాత్పర్యము :–** నాకు అత్యంతప్రియుడగు మహాత్ముడైన నా ప్రాణనాథునిచే విడువబడి

మహాపాపాత్ముడైన రావణునకు వశమై ఇట్టి దీనస్థితియందున్న నేను ఇప్పుడే ప్రాణములను విడిచెదను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతాప్రాణత్యాగచింతనము" అను*
*ఇఱువదియాఱవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తవింశసర్గ

**శ్లో॥ ఇ త్యుక్తా స్సీతయా ఘోరా రాక్షస్యః క్రోధమూర్ఛితాః ।**
**కాశ్చి జ్జగ్మ స్త దాఖ్యాతుం రావణస్య తరస్వినః ॥ 1**

**పదచ్ఛేదము :–** ఇతి – ఉక్తాః – సీతయా – ఘోరాః – రాక్షస్యః – క్రోధమూర్ఛితాః – కాశ్చిత్ – జగ్ముః – తత్ – ఆఖ్యాతుం – రావణస్య – తరస్వినః ॥

**అన్వయక్రమము :–** ఇతి సీతయా ఉక్తాః, ఘోరాః, క్రోధమూర్ఛితాః కాశ్చిత్ రక్షస్యః తత్ రావణస్య ఆఖ్యాతుం తరస్వినః (సత్యః) జగ్ముః.

**ప్రతిపదార్థము :–** ఇతి = ఈ విధముగా, సీతయా = సీతాదేవిచే, ఉక్తాః = చెప్పబడినవారై, ఘోరాః = భీకరులును, క్రోధమూర్ఛితాః = క్రోధావేశము నొందిన వారు నగు, కాశ్చిత్ రాక్షస్యః = కొలదిమంది రాక్షసస్త్రీలు, తత్ = ఆ విషయమును, రావణస్య ఆఖ్యాతుం = రావణునకు విన్నవించుటకై, తరస్వినః (సత్యః) జగ్ముః = వేగము గలవారై వెడలిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** తత్ ఆఖ్యాతుం అనగా సీతాదేవి మరణనిశ్చయమును చెప్పుటకు.

**తాత్పర్యము :–** ఈ విధముగా సీతాదేవి పలుకగా భయంకరులైన ఆ రాక్షసస్త్రీలు క్రోధావేశము నొంది కొందరు ఆ సీతాదేవి మరణనిశ్చయమును రావణునకు తెలుపుటకై వెంటనే బయలుదేరి పోయిరి.

**శ్లో॥ తత స్సీతా ముపాగమ్య రాక్షస్యో ఘోరదర్శనాః ।**
**పునః పరుష మేకార్థ మనర్థార్థ మ థాబ్రువన్ ॥ 2**

**పదచ్ఛేదము :–** తతః – సీతామ్ – ఉపాగమ్య – రాక్షస్యః – ఘోరదర్శనాః – పునః – పరుషమ్ – ఏకార్థమ్ – అనర్థార్థమ్ – అథ – అబ్రువన్ ॥

**అన్వయక్రమము :–** తతః ఘోరదర్శనాః రాక్షస్యః సీతామ్ ఉపాగమ్య, అథ పరుషమ్,

ఏకార్థమ్, అనర్థార్థం (వచః) పునః అబ్రువన్.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, ఘోరదర్శనాః రాక్షస్యః = భీకరాకారులైన రాక్షస స్త్రీలు, సీతామ్ ఉపాగమ్య = సీతను సమీపించి, పునః = తిరిగి, పరుషం = కటువైనదియు, ఏకార్థమ్ = ఒకే అర్థము కల్గినట్టిదియు, అనర్థార్థమ్ = అనర్థకరమైన అర్థము గలదియు నగు, (వచః = మాటను) అథ = అంతట, అబ్రువన్ = పలికిరి.

**తాత్పర్యము :-** పిమ్మట ఆ భీకరాకారులైన రాక్షసవనితలు సీతమ్మ సమీపమునకు వచ్చి తిరిగి వెనుకటి వలెనే, అనర్థకరమైన వచనములను పరుషముగా ఇట్లు పలుక దొడగిరి.

**శ్లో॥ అ ద్యేదానీం తవానార్యే సీతే పాపవినిశ్చయే ।**
**రాక్షస్యో భక్షయిష్యంతి మాంస మేత ద్యథాసుఖమ్ ॥ 3**

**పదచ్ఛేదము :-** అద్య - ఇదానీం - తవ - అనార్యే - సీతే - పాపవినిశ్చయే - రాక్షస్యః - భక్షయిష్యంతి - మాంసమ్ - ఏతత్ - యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము :-** అనార్యే పాపవినిశ్చయే సీతే; అద్య ఇదానీం తవ ఏతత్ మాంసం రాక్షస్యః యథాసుఖం భక్షయిష్యంతి.

**ప్రతిపదార్థము :-** అనార్యే = ఓ దుష్టురాలా! పాపవినిశ్చయే = పాపనిశ్చయము కల్గినట్టి, సీతే! = ఓ జానకీ! అద్య = నేడే, ఇదానీం = ఈక్షణముననే, ఏతత్ = ఈ, తవ మాంసం = నీ మాంసమును, యథాసుఖం = తృప్తికరముగా, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, భక్షయిష్యంతి = భక్షింపగలరు!

**తాత్పర్యము :-** దుర్మార్గురాలవై పాపనిశ్చయము కలిగిన ఓ జానకీ! నేడు ఈ క్షణము నందే నీశరీరమునందలి మాంసమును మా రాక్షసస్త్రీలు ఎల్లరును తృప్తికరముగా భక్షింపగలరు సుమా!

**శ్లో॥ సీతాం తాభి రనార్యాభి ర్దృష్ట్వా సంతర్జితాం తదా ।**
**రాక్షసీ త్రిజటా వృద్ధా శయానా వాక్య మబ్రవీత్ ॥ 4**

**పదచ్ఛేదము :-** సీతాం - తాభిః - అనార్యాభిః - దృష్ట్వా - సంతర్జితాం - తదా - రాక్షసీ - త్రిజటా - వృద్ధా - శయానా - వాక్యమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :-** తాభిః అనార్యాభిః సంతర్జితాం సీతాం దృష్ట్వా, తదా శయానా, వృద్ధా త్రిజటా రాక్షసీ వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** తాభిః అనార్యాభిః = ఆ దుర్మార్గురాండ్రైన రాక్షసస్త్రీలచే, సంతర్జితాం = గద్దింపబడినట్టి, సీతాం = జానకిని, దృష్ట్వా = చూచి, తదా = అప్పుడు, శయానా = పరుండియున్నట్టి, వృద్ధా = వృద్ధురాలైన, త్రిజటా రాక్షసీ = త్రిజట యను రాక్షసి, వాక్యమ్ అబ్రవీత్ = ఈ మాటలను పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** వృద్ధా – ధర్మమునందును, యోగమునందును, జ్ఞానమునందును, వయస్సునందునుకూడ వృద్ధురాలైనది. శయానా అనుటకు బదులుగా 'ప్రబుద్ధా' యని పాఠాంతరము. (నిద్రనుండి మేల్కొనినది అని అర్థము).

**గోవిందరాజీయము:–** త్రిజటా – విభీషణుని కుమార్తె. శయానా – స్వప్నవృత్తాంతము తెలుపుటకై వేగిరపాటుతో అప్పుడే లేచినది యని భావము.

**తాత్పర్యము :–** ఈ విధముగా దుర్మార్గురాండ్రైన ఆ రాక్షసస్త్రీలు సీతాదేవిని భయపెట్టుచు పలుకుచుండగా చూచి త్రిజట యను ఒక వృద్ధురాలైన రాక్షసస్త్రీ అప్పుడే నిద్రనుండి మేల్కొని వారితో ఈ విధముగా పలికెను.

**శ్లో॥ ఆత్మానం ఖాద తానార్యా న సీతాం భక్షయిష్యథ ।**
**జనకస్య సుతా మిష్టాం స్నుషాం దశరథస్య చ ॥ 5**

**పదచ్ఛేదము :–** ఆత్మానం – ఖాదత – అనార్యాః – న – సీతాం – భక్షయిష్యథ – జనకస్య – సుతామ్ – ఇష్టాం – స్నుషాం – దశరథస్య – చ ॥

**అన్వయక్రమము :–** అనార్యాః, ఆత్మానం ఖాదత; జనకస్య సుతాం, దశరథస్య ఇష్టాం స్నుషాం, సీతాం న భక్షయిష్యథ.

**ప్రతిపదార్థము :–** (హే) అనార్యాః = ఓ దుష్టవనితలారా! ఆత్మానం ఖాదత = నన్ను తినుడు. జనకస్య సుతాం = జనకమహారాజు పుత్రికయు, దశరథస్య ఇష్టాం స్నుషాం = దశరథమహారాజునకు ప్రియమైన కోడలునగు, సీతాం = సీతాదేవిని, న భక్షయిష్యథ = భక్షింపకుడు.

**తాత్పర్యము :–** ఓ దుర్బుద్ధులారా! సీతమ్మను తినెద మనుచున్నారా? వలసినచో నన్ను తినుడు. అంతియే కాని జనకమహారాజు కుమార్తెయును, దశరథునకు ప్రియమైన కోడలు నగు సీతమ్మను మాత్రము తినకుడు.

**శ్లో॥ స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః ।**
**రాక్షసానా మభావాయ భర్తు రస్యా జయాయ చ ॥ 6**

**పదచ్ఛేదము :–** స్వప్నః – హి – అద్య – మయా – దృష్టః – దారుణః – రోమహర్షణః, రాక్షసానామ్ – అభావాయ – భర్తుః – అస్యాః – జయాయ – చ ॥

**అన్వయక్రమము :–** రాక్షసానామ్ అభావాయ, అస్యాః భర్తుః జయాయ చ, మయా దారుణః, రోమహర్షణః స్వప్నః అద్య దృష్టః.

**ప్రతిపదార్థము :–** రాక్షసానామ్ అభావాయ = రాక్షసుల వినాశము కొఱకును, అస్యాః భర్తుః = ఈమె పెనిమిటికి, జయాయ చ = విజయముకొఱకును, అద్య = ఇప్పుడే, మయా = నాచేత, దారుణః = భయంకరమును, రోమహర్షణః = గగుర్పాటును కలిగించునదియు నగు, స్వప్నః = (ఒక) కల, దృష్టః = కనబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** దారుణః – రాక్షసులకు వినాశకరము కాబట్టి ఘోరమైనది,రోమహర్షణః – శ్రీరామునకు విజయమును గల్గించునది కాబట్టి అద్భుతమైనట్టిది.

'జయాయ చ' అను చివరి మాటకు బదులుగా భవాయ చ అని బొంబాయి ముద్రణము (అనగా అభ్యుదయముకొఱకు)

**తాత్పర్యము :–** రాక్షసవంశమునకు వినాశకరమైనదియును, ఘోరమైనదియును ఈమె భర్తకు లభించబోవు విజయమును సూచించునదియు నగు అద్భుతమైన ఒకానొక స్వప్నము నేడు నాకు కనవచ్చినది.

**శ్లో॥ ఏవ ముక్తా స్త్రిజటయా రాక్షస్యః క్రోధమూర్ఛితాః ।**
**సర్వా ఏ వాబ్రువన్భీతా స్త్రిజటాం తా మిదం వచః ॥ 7**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తాః – త్రిజటయా – రాక్షస్యః – క్రోధమూర్ఛితాః, సర్వాః – ఏవ – అబ్రువన్ – భీతాః – త్రిజటాం – తామ్ – ఇదం – వచః ॥

**అన్వయక్రమము :–** క్రోధమూర్ఛితాః రాక్షస్యః, త్రిజటయా ఏవం ఉక్తాః (సత్యః) సర్వాః ఏవ, తాం త్రిజటామ్ ఇదం వచః అబ్రువన్.

**ప్రతిపదార్థము :–** క్రోధమూర్ఛితాః = క్రోధావేశము నొందిన, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, త్రిజటయా = త్రిజటచే, ఏవమ్ ఉక్తాః = ఈరీతిగా పలుకబడినవారై, భీతాః సత్యః =

భయపడినవారై, సర్వాః ఏవ = అందరును, తాం త్రిజటాం = ఆ త్రిజటను గూర్చి, ఇదం వచః = ఈ మాటను, అబ్రువన్ = పలికిరి.

**తాత్పర్యము :–** ఆ త్రిజట ఇట్లు పలుకగనే క్రోధావేశముతో నున్న రాక్షసస్త్రీ లెల్లరును మిక్కిలి భయము నొంది ఆమెతో ఈరీతిగా పలికిరి.

**శ్లో॥ కథయస్వ త్వయా దృష్టః స్వప్నోఽయం కీదృశో నిశి ॥ 8**

**పదచ్ఛేదము :–** కథయస్వ – త్వయా – దృష్టః – స్వప్నః – అయం – కీదృశః – నిశి ॥

**అన్వయక్రమము :–** నిశి త్వయా దృష్టః, అయం స్వప్నః కీదృశః? కథయస్వ.

**ప్రతిపదార్థము :–** నిశి = రాత్రివేళ, త్వయా దృష్టః = నీచే కనబడినట్టి, అయం స్వప్నః = ఈ స్వప్నము, కీదృశః = ఎట్టిది?, కథయస్వ = చెప్పుము.

**తాత్పర్యము :–** ఈ రాత్రి నీకు వచ్చినట్టి కల ఎట్టిదో మాకు చెప్పుము.

**శ్లో॥ తాసాం శ్రుత్వా తు వచనం రాక్షసీనాం ముఖా చ్చ్యుతమ్ ।**
**ఉవాచ వచనం కాలే త్రిజటా స్వప్నసంశ్రితమ్ ॥ 9**

**పదచ్ఛేదము :–** తాసాం – శ్రుత్వా – తు – వచనం – రాక్షసీనాం – ముఖాత్ – చ్యుతమ్ – ఉవాచ – వచనం – కాలే – త్రిజటా – స్వప్నసంశ్రితమ్ ॥

**అన్వయక్రమము :–** తాసాం రాక్షసీనాం ముఖాత్ చ్యుతం వచనం శ్రుత్వా, త్రిజటా కాలే స్వప్నసంశ్రితం వచనమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** తాసాం రాక్షసీనాం = ఆ రాక్షసస్త్రీలయొక్క, ముఖాత్ = నోటినుండి, చ్యుతం = వెడలినట్టి, వచనం = మాటను, శ్రుత్వా = విని, త్రిజటా = త్రిజట యను ఆ రక్కసి, కాలే = ఉషఃకాలమునందు, స్వప్నసంశ్రితం వచనం = స్వప్నసంబంధమైన వచనమును, ఉవాచ = పలికెను.

**తిలకము:–** 'కాలే' – ప్రాతఃకాలమునం దని భావము. తెల్లవారుజామున వచ్చినట్టి కల తప్పక ఫలించునని శాస్త్రసిద్ధాంతము.

**తాత్పర్యము :–** రాక్షసస్త్రీలు ఆరీతిగా అడుగగా త్రిజట తెల్లవారుజామున తనకు వచ్చిన కలలోని విషయములను ఆ రాక్షసస్త్రీలకు ఈరీతిగా తెలిపినది.

శ్లో॥ గజదంతమయీం దివ్యాం శిబికా మంతరిక్షగామ్ ।
యుక్తాం హంససహస్రేణ స్వయ మాస్థాయ రాఘవః ।
శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సహాగతః ॥ 10

**పదచ్ఛేదము :-** గజదంతమయీం - దివ్యాం - శిబికామ్ - అంతరిక్షగామ్, యుక్తాం - హంససహస్రేణ - స్వయమ్ - ఆస్థాయ - రాఘవః - శుక్లమాల్యాంబరధరః - లక్ష్మణేన - సహ - ఆగతః ॥

**అన్వయక్రమము :-** రాఘవః లక్ష్మణేన సహ గజదంతమయీమ్ అంతరిక్షగాం హంససహస్రేణ యుక్తాం దివ్యాం శిబికాం స్వయమ్ ఆస్థాయ శుక్లమాల్యాంబరధరః (సన్) ఆగతః.

**ప్రతిపదార్థము :-** రాఘవః = శ్రీరాముడు, శుక్లమాల్యాంబరధరః = తెల్లని పుష్పహారములను వస్త్రములను ధరించినవాడై, లక్ష్మణేన సహ = లక్ష్మణునితో గూడ, గజదంతమయీం = ఏనుగు దంతముతో నిర్మించబడినదియును, అంతరిక్షగాం = ఆకసమునందు పయనించుచున్నది యగు, దివ్యాం శిబికాం = దివ్యమైన పల్లకీని, స్వయమ్ ఆస్థాయ = స్వయముగా అధిష్ఠించి, ఆగతః = వచ్చెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

'హంససహస్రేణ' అనుటకు బదులుగా 'వాజిసహస్రేణ' యని బొంబాయి పాఠము.

**తిలకము:-** ఈ సందర్భము ననుసరించి శిబిక యనగా విమాన మని అర్థము చెప్పుకొన వలెను.

**తాత్పర్యము :-** ఏనుగు దంతముతో నిర్మింపబడి వేలకొలది హంసలచే వహింపబడుచు, అంతరిక్షమున పయనించుచున్న పల్లకియందు తెల్లని పూల మాలలను, వస్త్రములను ధరించిన శ్రీరాముడు లక్ష్మణునితో గూడి లంకానగరమునకు విచ్చేసెను.

శ్లో॥ స్వప్నే చాద్య మయా దృష్టా సీతా శుక్లాంబరావృతా ।
సాగరేణ పరిక్షిప్తం శ్వేతం పర్వత మాస్థితా ।
రామేణ సంగతా సీతా భాస్కరేణ ప్రభా యథా ॥ 11

**పదచ్ఛేదము :-** స్వప్నే - చ - అద్య - మయా - దృష్టా - సీతా - శుక్లాంబరావృతా, సాగరేణ - పరిక్షిప్తం - శ్వేతం - పర్వతమ్ - ఆస్థితా - రామేణ - సంగతా - సీతా

– భాస్కరేణ – ప్రభా – యథా ॥

**అన్వయక్రమము** :– అద్య మయా స్వప్నే శుక్లాంబరావృతా సీతా చ దృష్టా; భాస్కరేణ ప్రభా యథా, రామేణ సీతా సంగతా, సాగరేణ పరిక్షిప్తం శ్వేతం పర్వతమ్ ఆస్థితా.

**ప్రతిపదార్థము** :– అద్య = నేడు, మయా = నాచేత, శుక్లాంబరావృతా సీతా చ = ధవళవస్త్రములు ధరించియున్నట్టి సీతయును, దృష్టా = చూడబడినది, భాస్కరేణ = సూర్యునితో, ప్రభా యథా = తేజస్సు వలె, రామేణ = రామునితో, సీతా = సీత, సంగతా = కలసియున్నదై, సాగరేణ పరిక్షిప్తం = సముద్రముచే పరివేష్టింపబడిన, శ్వేతం పర్వతం = తెల్లని పర్వతమును, ఆస్థితా = అధిరోహించి యుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:– సాగరేణ – క్షీరసాగరముచే.

**తాత్పర్యము** :– నేడు ఆ స్వప్నమునందే సీతాదేవి గూడ శ్వేతమాల్యాంబరధారిణియై గానవచ్చినది. ప్రభాదేవి భాస్కరునితో గూడియున్నట్లు సీతాదేవి శ్రీరామునితో కూడినదై క్షీరసముద్రముచే పరివేష్టింపబడిన తెల్లని పర్వతమును అధిరోహించి యుండెను.

**శ్లో॥ రాఘవ శ్చ మయా దృష్ట శ్చతుర్దంతం మహాగజమ్ ।**
**ఆరూఢ శ్శైలసంకాశం చచార సహలక్ష్మణః ॥ 12**

**పదచ్ఛేదము** :– రాఘవః – చ – మయా – దృష్టః – చతుర్దంతం –మహాగజమ్ – ఆరూఢః – శైలసంకాశం – చచార – సహలక్ష్మణః ॥

**అన్వయక్రమము** :– మయా దృష్టః, రాఘవః చ సహలక్ష్మణః చతుర్దంతం, శైలసంకాశం మహాగజమ్ ఆరూఢః చచార.

**ప్రతిపదార్థము** :– మయా దృష్టః రాఘవః = నాచేత చూడబడిన శ్రీరాముడు, సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినవాడై, చతుర్దంతం = నాలుగు దంతములు కలిగినట్టి, శైలసంకాశం = పర్వతసన్నిభమైనట్టి, మహాగజమ్ ఆరూఢః = భద్రగజమును ఆరోహించినవాడై, చచార = పర్యటించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిపాఠము** :– "రాఘవశ్చ మయా దృష్టః' కు బదులుగా "రాఘవశ్చ పునః దృష్టః" అని గలదు. మఱియు "చచార సహలక్ష్మణః" అనుటకు బదులుగా "చకాస సహలక్ష్మణః" అని గలదు.

**గోవిందరాజీయము** :- ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాదశైలాగ్ర వనస్పతీనాం, విష్ఠానులేపో రుదితం మృతం చ స్వప్నే ష్వగమ్యాగమనం చ ధన్యమ్.
(స్వప్నాధ్యాయగ్రంథము)

అనగా స్వప్నమునందు మహాగజమును ఆరోహించినట్లు కానవచ్చుట మహాభాగ్యసూచకము.

**తిలకము**:- రామేణ సంగతా సీతా - అనుటచే శ్రీరాము డీ లంకయందే సీతను చూచునని సూచింపబడెను.

**తాత్పర్యము** :- పర్వతమును బోలి యుండి, నాల్గు దంతములుగలదై యున్న ఒక మహాగజమును లక్ష్మణునితో కలసి ఆరోహించి శ్రీరాముడు సీతను వెదకికొనుచు వచ్చుటను గూడ నేను జూచితిని.

**శ్లో॥ తత స్తౌ నరశార్దూలౌ దీప్యమానౌ స్వతేజసా ।**
**శుక్లమాల్యాంబరధరౌ జానకీం పర్యుపస్థితౌ ॥ 13**

**పదచ్ఛేదము** :- తతః - తౌ - నరశార్దూలౌ - దీప్యమానౌ - స్వతేజసా - శుక్లమాల్యాంబరధరౌ - జానకీం - పర్యుపస్థితౌ ॥

**అన్వయక్రమము** :- తతః శుక్లమాల్యాంబరధరౌ, స్వతేజసా దీప్యమానౌ తౌ నరశార్దూలౌ జానకీం పర్యుపస్థితౌ.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, శుక్లమాల్యాంబరధరౌ = తెల్లని పుష్పమాలికలను వస్త్రములను ధరించినట్టియు, స్వతేజసా = తమ తేజముచే, దీప్యమానౌ = మిక్కిలి ప్రకాశించుచున్నట్టియు, తౌ నరశార్దూలౌ = ఆ పురుష పుంగవులిరువురును, జానకీం = సీతాదేవిని, పర్యుపస్థితౌ = సమీపించిరి.

**తాత్పర్యము** :- పిమ్మట తెల్లని పుష్పమాలలను, వస్త్రములను ధరించి తమ దేహకాంతులతో మిక్కిలిగా దీపించుచున్న ఆ పురుషశ్రేష్ఠు లిరువురును జానకిని సమీపించిరి.

**శ్లో॥ తత స్తస్య నగ స్యాగ్రే హ్యాకాశస్థస్య దంతినః ।**
**భర్త్రా పరిగృహీతస్య జానకీ స్కంధ మాశ్రితా ॥ 14**

**పదచ్ఛేదము** :- తతః - తస్య - నగస్య - అగ్రే - హి - ఆకాశస్థస్య - దంతినః - భర్త్రా - పరిగృహీతస్య - జానకీ - స్కంధమ్ - ఆశ్రితా ॥

**అన్వయక్రమము :–** తతః జానకీ తస్య నగస్య అగ్రే ఆకాశస్థస్య, భర్త్రా పరిగృహీతస్య దంతినః స్కంధమ్ ఆశ్రితా.

**ప్రతిపదార్థము :–** తతః = అటు పిమ్మట, జానకీ = సీతాదేవి, తస్య నగస్య అగ్రే = ఆ శ్వేతపర్వతము యొక్క శిఖరమున, ఆకాశస్థస్య = ఆకాశమునం దున్నట్టి, భర్త్రా పరిగృహీతస్య = భర్తయైన శ్రీరామునిచే స్వీకరింపబడినట్టి (ఆరోహింపబడినట్టి) దంతినః = ఏనుగుయొక్క, స్కంధం = మూపును, ఆశ్రితా = ఆశ్రయించినది (కూర్చుండినది)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు:–** ఈ శ్లోకమునకు పూర్వము పండ్రెండువేల శ్లోకములు పూర్తి అయినవి. ఈ శ్లోకము పదమూడవ సహస్రమున మొదటిది. గాయత్రీమంత్రములోని పదమూడవ అక్షరమైన 'స్య' తతస్తస్య – అను ఈ పాదములోని నాల్గవ అక్షరముగా కూర్చబడినది.

**తాత్పర్యము :–** పిమ్మట సీతాదేవి ఆకాశమున శ్వేతపర్వతముపై శ్రీరాము డధిష్ఠించియున్న ఆ దివ్యగజము మూపున, భర్తను జేరి కూర్చుండెను.

**శ్లో॥ భర్తు రంకా త్సముత్పత్య తతః కమలలోచనా ।**
**చంద్రసూర్యౌ మయా దృష్టా పాణినా పరిమార్జతీ ॥ 15**

**పదచ్ఛేదము :–** భర్తుః – అంకాత్ – సముత్పత్య – తతః – కమలలోచనా – చంద్రసూర్యౌ – మయా – దృష్టా – పాణినా – పరిమార్జతీ ॥

**అన్వయక్రమము :–** తతః కమలలోచనా భర్తుః అంకాత్ సముత్పత్య పాణినా చంద్ర సూర్యౌ పరిమార్జతీ మయా దృష్టా.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, కమలలోచనా = కమలాక్షియైన సీతాదేవి, భర్తుః అంకాత్ = భర్తయొక్క ఒడినుండి, సముత్పత్య = మీదికి లేచి, చంద్రసూర్యౌ = చంద్రసూర్యులను, పాణినా పరిమార్జతీ = చేతితో తుడుచుచున్నదిగా, మయా = నాచే, దృష్టా = చూడబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి :–** "ఆదిత్యమండలం వాపి చంద్రమండల మేవ వా, స్వప్నే గృహ్ణాతి హస్తాభ్యాం మహ ద్రాజ్యం సమాప్నుయాత్" అని స్వప్ననిర్ణయమున చెప్పబడిన ప్రకారము సీతమ్మకు ఇది భావిశుభసూచకము.

చంద్రసూర్యౌ మయా దృష్టౌ - అని పాఠాంతరము.

**తాత్పర్యము :-** పిమ్మట సీతాదేవి శ్రీరాముని ఒడినుండి లేచి చేయి చాచి ఆకసము నందున్న సూర్యచంద్రులను పట్టుకొని తుడుచుచున్నట్లుగా నాకు కాన్పించినది.

**శ్లో॥ తత స్తాభ్యాం కుమారాభ్యా మాస్థిత స్స గజోత్తమః ।**
**సీతయా చ విశాలాక్ష్యా లంకాయా ఉపరి స్థితః ॥ 16**

**పదచ్ఛేదము :-** తతః - తాభ్యాం - కుమారాభ్యామ్ - ఆస్థితః - సః - గజోత్తమః - సీతయా - చ - విశాలాక్ష్యా - లంకాయాః - ఉపరి - స్థితః ॥

**అన్వయక్రమము :-** తతః తాభ్యాం కుమారాభ్యాం విశాలాక్ష్యా సీతయా చ, ఆస్థితః సః గజోత్తమః లంకాయాః ఉపరి స్థితః.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, తాభ్యాం కుమారాభ్యాం = ఆ యువకులైన రామలక్ష్మణు లిరువురిచేతను, విశాలాక్ష్యా సీతయా చ = వెడల్పయిన కన్నులుగల సీతచేతను, ఆస్థితః = అధిష్ఠింపబడినట్టి, సః గజోత్తమః = ఆ మేలు జాతి ఏనుగు, లంకాయాః ఉపరి స్థితః = లంకానగరము మీద నిలచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :-** 'ఆరోహణం గోవృషకుంజరాణాం ప్రాసాదశైలాగ్రవనస్పతీనాం, విష్ఠానులేపో రుదితం మృతం చ స్వప్నే ష్వగమ్యాగమనం చ ధన్యమ్' (స్వప్నాధ్యాయము) కలలందు ఎద్దులను, ఏనుగులను, మేడలను, కొండశిఖరములను, కాచుచున్నట్టి చెట్లను ఎక్కుట, మలము పూసికొనుట, ఏడ్చుట, చచ్చుట, పొందరాని దానిని పొందుట ఇవి శుభములు.

**తాత్పర్యము :-** అటు పిమ్మట రామలక్ష్మణులును, సీతాదేవియును అధిష్ఠించియున్న ఆ భద్రగజము లంకానగరము మీదకి వచ్చి నిలచి యుండెను.

**శ్లో॥ పాండరర్షభయుక్తేన రథే నాష్టయుజా స్వయమ్ ।**
**ఇ హోపయాతః కాకుత్థ్స స్సీతయా సహ భార్యయా ॥ 17**

**పదచ్ఛేదము :-** పాండరర్షభయుక్తేన - రథేన - అష్టయుజా - స్వయమ్, ఇహ - ఉపయాతః - కాకుత్స్థః - సీతయా - సహ - భార్యయా ॥

**అన్వయక్రమము :-** కాకుత్స్థః భార్యయా సీతయా సహ పాండరర్షభయుక్తేన అష్టయుజా

రథేన, ఇహ ఉపయాతః.

**ప్రతిపదార్థము :–** కాకుత్స్థః = శ్రీరాముడు, భార్యయా సీతయా సహ = భార్యయైన సీతాదేవితో గలసి, అష్టయుజా పాండరర్షభయుక్తేన = ఎనిమిది తెల్లని వృషభములతో గూడిన, రథేన = రథముచే, ఇహ = ఈ లంకానగరమునకు, ఉపయాతః = విచ్చేసెను.

**తాత్పర్యము :–** శ్రీరాముడు ఎనిమిది శ్వేత వృషభములు వహించుచున్న రథముపై సీతాదేవితో గూడి ఈ లంకానగరమునకు విచ్చేసెను.

**శ్లో॥ శుక్లమాల్యాంబరధరో లక్ష్మణేన సహాగతః ।**
**తతో ఽన్యత్ర మయా దృష్టో రామ స్సత్యపరాక్రమః ॥ 18**

**పదచ్ఛేదము :–** శుక్లమాల్యాంబరధరః – లక్ష్మణేన – సహ – ఆగతః, తతః – అన్యత్ర – మయా – దృష్టః – రామః – సత్యపరాక్రమః ॥

**అన్వయక్రమము :–** తతః అన్యత్ర శుక్లమాల్యాంబరధరః, సత్యపరాక్రమః రామః లక్ష్మణేన సహ ఆగతః మయా దృష్టః.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, అన్యత్ర = వేఱొక స్వప్నమున, శుక్లమాల్యాబరధరః = తెల్లని పూలమాలలను దుస్తులను ధరించినట్టి, సత్యపరాక్రమః రామః =సత్యమైన పరాక్రమము గల్గినట్టి శ్రీరాముడు, లక్ష్మణేన సహ ఆగతః = లక్ష్మణునితో కలసి వచ్చినవాడుగా, మయా దృష్టః = నాచేత చూడబడెను.

**తాత్పర్యము :–** పిమ్మట ఇంకొక కలయందు మహాపరాక్రమసంపన్నుడైన శ్రీరాముడు తెల్లని పూలమాలలను చీనాంబరములను ధరించి లక్ష్మణునితో గలసి వచ్చుచున్నట్లుగా నాకు కాన్పించినాడు.

**శ్లో॥ లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ వీర్యవాన్ ।**
**ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభమ్ ।**
**ఉత్తరాం దిశ మాలోక్య జగామ పురుషోత్తమః ॥ 19**

**పదచ్ఛేదము :–** లక్ష్మణేన – సహ – భ్రాత్రా – సీతయా – సహ – వీర్యవాన్ – ఆరుహ్య – పుష్పకం – దివ్యం – విమానం – సూర్యసన్నిభమ్, ఉత్తరాం – దిశమ్ – ఆలోక్య – జగామ – పురుషోత్తమః ॥

**అన్వయక్రమము :–** వీర్యవాన్ పురుషోత్తమః సూర్యసన్నిభం, దివ్యం, పుష్పకం విమానం భ్రాత్రా లక్ష్మణేన, సీతయా చ సహ ఆరుహ్య ఉత్తరాం దిశమ్ ఆలోక్య, జగామ.

**ప్రతిపదార్థము :–** వీర్యవాన్ పురుషోత్తమః = పరాక్రమవంతుడగు శ్రీరాముడు, భ్రాత్రా = లక్ష్మణుని తోడను, సీతయా చ సహ = (భార్యయైన) సీతతోడను గూడి, సూర్యసన్నిభం = సూర్యునితో సమానముగా నున్నట్టి, దివ్యం = మహాప్రభావ సంపన్నమైన, పుష్పకం విమానం = పుష్పకవిమానమును, ఆరుహ్య = ఆరోహించి, ఉత్తరాం దిశమ్ ఆలోక్య = ఉత్తరదిశను ఉద్దేశించి, జగామ = వెడలిపోయెను.

**తాత్పర్యము :–** పరాక్రమశాలియైన శ్రీరాముడు తమ్ముడైన లక్ష్మణునితోడను, భార్యయైన సీతతోడను గలసి సూర్యునివలె గొప్ప ప్రకాశముతో ప్రజ్వలించుచున్న దివ్యమైన ఆ పుష్పకవిమానము నారోహించి ఉత్తరదిశగా వెడలెను.

**శ్లో॥ ఏవం స్వప్నే మయా దృష్టో రామో విష్ణుపరాక్రమః ।**
**లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ రాఘవః ॥ 20**

**పదచ్ఛేదము :–** ఏవం – స్వప్నే – మయా – దృష్టః – రామః – విష్ణుపరాక్రమః – లక్ష్మణేన – సహ – భ్రాత్రా – సీతయా – సహ – రాఘవః ॥

**అన్వయక్రమము :–** ఏవం, విష్ణుపరాక్రమః, రాఘవః రామః స్వప్నే మయా భ్రాత్రా లక్ష్మణేన సహ, సీతయా చ సహ దృష్టః.

**ప్రతిపదార్థము :–** ఏవం = ఈరీతిగా, మయా = నాచేత, స్వప్నే = స్వప్నమునందు, విష్ణుపరాక్రమః = విష్ణుతుల్యమైన పరాక్రమము కలిగినట్టి, రాఘవః రామః = రఘువంశతిలకుడైన శ్రీరాముడు, భ్రాత్రా లక్ష్మణేన సహ = తమ్ముడైన లక్ష్మణునితోడను, సీతయా చ సహ = భార్యయైన సీతతోడను గూడి, దృష్టః = చూడబడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** ఇచ్చట స్వప్నక్రమ మిట్టిది – శ్రీరాముడు (శిబిక) పల్లకీయందు గాన్పించినాడు. సీతాదేవి శ్వేతపర్వతముపై గాన్పించినది. శ్రీరాముడు శిబికనుండి ఏనుగు నెక్కి లక్ష్మణుడు వెంబడి రాగా పర్వతము కడకు వచ్చెను, అచ్చట నున్న సీతను, తన ఏనుగుపై కూర్చుండ పెట్టుకొని లంకానగరము మీదికి వచ్చి నిలచెను. పిమ్మట వా రిరువురితో ఎనిమిది వృషభములు వహించుచున్న రథము నధిరోహించి, కొంతదూరము వచ్చి, వా రిరువురితోడనే పుష్పకవిమానము నారోహించి తన నగరమునకు వెడలిపోయెను.

కొన్ని ప్రతులలో కానవచ్చుచున్న – "సాందం త్రిభువనం" అని ప్రారంభించి

"రామః సత్యపరాక్రమః" అను శ్లోకము వఱకును గల మొత్తము 14 శ్లోకములు ప్రక్షిప్తములని తెలియవలెను. ఏలననగా పూర్వము చెప్పిన 'విష్ణుపరాక్రమః' అను శ్రీరాముని విశేషణముతో ఈ శ్లోకములందలి 'విష్ణు రేవ స్వయం భూత్వా' అను వచనమునకు విరోధము స్పష్టముగా కానవచ్చుచున్నది కాబట్టి.

**తాత్పర్యము :–** ఈ విధముగా నా కలలో విష్ణుతుల్యపరాక్రముడైన శ్రీరాముడు తమ్ముడైన లక్ష్మణునితోడను భార్యయైన సీతతోడను నాకు అద్భుతముగా కానవచ్చెను.

ఈ ఘట్టమునకు సంబంధించిన మఱికొన్ని విశేషాంశములు – "షోడశిరామాయణ రహస్యములు" నుండి – రచయిత – శ్రీగుంటూరు శేషేంద్రశర్మ.

ఈ త్రిజటాస్వప్నఘట్టమునందలి "భర్తు రంకా త్సముత్పత్య" అను 15వ శ్లోకము రామాయణగ్రంథముయొక్క నట్టనడుమ నున్నట్టి పదమూడవ వెయ్యికి మొట్టమొదటిది. ఈ శ్లోకముయొక్క ఆద్యవర్ణమైన భకారము –"భర్గో దేవస్య ధీమహి"అను గాయత్రీమంత్ర ద్వితీయపాద ప్రథమాక్షరము. అనగా మంత్రమధ్యమున నున్న అక్షరము.

వాల్మీకిచే ఈ త్రిజటాస్వప్నఘట్టము అను రత్నము – రామాయణ రత్నహారమున నాయకమణిగా ఉద్దేశింపబడినది. సుందరకాండము రామాయణమునకు హృదయము కాగా త్రిజటాస్వప్నము ఆ సుందరకాండము నకు హృదయము అని ఋషిహృదయము.

ఈ త్రిజటాస్వప్నవృత్తాంతమును వాల్మీకి ఉత్తమఫలము నిచ్చు ఒక స్వప్నము యొక్క వర్ణనము గానే గాక సంపూర్ణ గాయత్రీ మహామంత్రముయొక్క రూపవర్ణనముగా కూడ ధ్వనిమార్గమున మనకు ప్రసాదించినాడు.

ఈ స్వప్నవర్ణనమున రామునకును గాయత్రీ మంత్రాధిష్ఠాన దైవతమైన పరబ్రహ్మమునకును అభేదము చెప్పబడినది. ఎట్లనగా – "గజదంతమయీం దివ్యాం శిబికామంతరిక్షగామ్, యుక్తాం హంససహస్రేణ స్వయ మాస్థాయ రాఘవః" అనుచు గజశబ్దముచేత గాయత్రీ అష్టాక్షరపాదము సూచింపబడినది. దంతశబ్దముచేత ఈ మంత్రముయొక్క మొత్తము అక్షరములు – 32 అని చెప్పబడినది. "అంతరిక్షగాం శిబికాం" అనుచు ఆకాశతత్త్వమయమగు విశుద్ధచక్రస్థానమైన కంఠదేశమునందు చరించునది అనగా గానముచేయబడునది (గాయంతం త్రాయతే ఇతి గాయత్రీ) అని చెప్పబడినది.

(తరువాతి దృశ్యమున కూడ మరల 'చతుర్దంతం మహాగజం' అనుచు

పాదచతుష్టయ విశిష్టమైన సంపూర్ణగాయత్రియే చెప్పబడినది).

స్వయ మాస్థాయ రాఘవః – అనుచు ఇట్టి దివ్యమైన గాయత్రీమంత్రమును అధిష్ఠించిన పరబ్రహ్మయే రాముడు అని వర్ణింపబడినది.

గాయత్రీమంత్రమున అక్షరములు 24 కదా! 32 ఉండుట యెట్లు? అనగా – సామాన్యమైన గాయత్రి త్రిపద. ఈ మూడుపాదముల మంత్రమునకు అక్షరములు (3×8) 24. యతులు జపించునట్టిది సంపూర్ణ గాయత్రి. దానికి నాలుగుపాదములు. అందుండునవి (4×8) 32 అక్షరములు."పరో రజసి సా వ దోమ్" అనునది ఆ చతుర్థపాదము.

వెనుకటి దృశ్యముతో కలిపి ఆ స్వప్నమునందు త్రిజటకు మొత్తము నాలుగు దృశ్యములు కానవచ్చినవి.

రెండవమాఱు "రాఘవ శ్చ మయా దృష్టః చతుర్దంతం మహాగజమ్, ఆరూఢ శ్శైలసంకాశం చకాస సహలక్ష్మణః." నాలుగుదంతముల మహాగజము అనగా ఐరావతమునెక్కి రాముడు ప్రకాశించెను.

మూడవమాఱు 'పాండరర్షభయుక్తేన రథే నాష్టయుజా స్వయమ్, ఇహోపయాతః కాకుత్థ్సః సీతయా సహ భార్యయా" – తెల్లని ఎనిమిది వృషభములు పూన్చిన రథమెక్కి రాముడు సీతతోకూడి వచ్చెను.

నాల్గవమాఱు "లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా సహ వీర్యవాన్, ఆరుహ్య పుష్పకం దివ్యం విమానం సూర్యసన్నిభమ్" – సీతాలక్ష్మణసహితుడై సూర్యసన్నిభమైన విమానము నెక్కి శ్రీరాముడు వెడలెను.

ఈ దృశ్యములలో మొదటి మూడిటియందును వఱుసగా హంస, ఐరావతము, వృషభము వాహనములుగా చెప్పబడెను. మూడు పాదములు గల త్రిపదా గాయత్రి – సగుణబ్రహ్మాత్మకముగా బ్రహ్మ విష్ణు శివాత్మకము అగుచున్నది. 'గుణత్రయాత్మకాః ప్రోక్తాః బ్రహ్మ విష్ణు మహేశ్వరాః' (దేవీభాగవతము) ఈ హంస, ఐరావతము, వృషభము అనునవి ఆ త్రిమూర్తుల వాహనములేగదా!' "హంసస్థా గరుడారూఢా తథా వృషభవాహనా', గాయత్రి త్రిసంధ్యలయందును బ్రహ్మవిష్ణు మహేశ్వర రూపములు కలిగి తత్తద్వాహనలాంఛనములతో విలసిల్లుచుండును. ఇందు గరుడునికి మాఱుగా ఐరావతము చెప్పబడినది. విష్ణువు ఉపేంద్రుడు కాబట్టి ఐరావతము అతనికికూడ వాహనము కావచ్చును. అందుచేతనే మాధ్యాహ్నిక గాయత్రియైన ఈ వైష్ణవి "ఐంద్రీ హ్యైరావతారూఢా చైహికాముష్మికప్రదా" అని

చెప్పబడినది.

మూడవదృశ్యమున – 'పాండరర్షభయుక్తేన రథే నాష్టయుజా స్వయమ్' అనుచు "రమతే పరబ్రహ్మ అత్ర ఇతి రథః" అని గాయత్రీ మహామంత్రమును రథముగా చెప్పి ఎనిమిది శ్వేతవృషభములు దానిని వహించుచున్నట్లు చెప్పెను. సప్తవ్యాహృతియుక్త గాయత్రీ మంత్రము నందలి ఎనిమిది ఓంకారములే ఈ అష్టవృషభము లని తెలియవచ్చును. 'త్రిధా బద్ధో వృషభో రోరవీతి' అను వేదమంత్రము ప్రసిద్ధము. ఈ వృషభములు తెల్లని వనుటకు 'చతుశ్శృంగో వమీద్గౌర ఏతత్' అని శ్రుతి ప్రమాణము.

నాల్గవదృశ్యమున వాహనము చెప్పబడలేదు. "దివ్యం విమానం సూర్యసన్నిభమ్"అని మాత్రమే చెప్పబడెను. గాయత్రీమంత్రమున కుపాస్యదైవము సూర్యుడే కాబట్టి ఇచటి సూర్యశబ్దము సార్థకము. ఈ దృశ్యము గాయత్రీ తురీయపాద గమ్యమైన నిర్గుణపరబ్రహ్మమునే ప్రతిపాదించుచున్నది కావున వాహనప్రసక్తి లేకుండుట సముచితమేగదా!

ఈ ఘట్టమునందు పేర్కొనబడిన 'త్రిజట' త్రిపాదసమ్మితగా ప్రసిద్ధమైన గాయత్రియే యని చెప్పనగును. గాయత్రీ సహస్రనామములలో 'త్రిజటా తిత్తిరీ తృష్ణా త్రివిధా తరుణాకృతిః' అని చెప్పబడినది.

కొందరు భ్రమించుచున్నట్లు ఈ త్రిజట విభీషణపుత్రిక కాదు. ఈ త్రిజట వృద్ధురాలు. 'రాక్షసీ త్రిజటా వృద్ధా ప్రబుద్ధా వాక్య మబ్రవీత్', విభీషణుని పుత్రిక పేరు 'నల.' జ్యేష్ఠా కన్యా నలా నామ విభీషణసుతా కపే' అని కదా చెప్పబడెను. విభీషణుడే వృద్ధుడు కాడు. అతని కుమార్తె వృద్ధురా లెట్లగును? సాయంసంధ్యా దేవతయైన గాయత్రి వృద్ధ, ప్రబుద్ధ, జ్ఞానస్వరూపిణి అని ప్రసిద్ధము. అందుచే వాల్మీకి త్రిజటకు ఉపయోగించిన విశేషణములు సార్థకములు.

ఈ స్వప్నము గాయత్రీరూప మనుటకు మఱియొక నిదర్శనము – గాయత్రి ప్రధానముగా శ్వేతవర్ణ, "శ్వేతవర్ణా సాంఖ్యాయనసగోత్రా గాయత్రీ" అనికదా గాయత్రీ ప్రస్తుతి. త్రిజటకు స్వప్నమున కాన్పించిన సీతారామలక్ష్మణమూర్తులు – 'శుక్ల మాల్యాంబరావృతా" అనియు 'శుక్లమాల్యాంబరధరౌ' అనియే కదా వర్ణింపబడిరి. ఆ దృశ్యము గాయత్రీరూపము కాక మ ఱేమగును?

ఇట్లు రామాయణమహాకావ్యమున ఈ త్రిజటాస్వప్నదృశ్యముచే వాల్మీకి మహర్షి గాయత్రీస్వరూపమును కావ్యమార్గమున లోకమునకు ప్రసాదించి తన

ఆదికవితను లోకమున అద్వితీయకవిత అనిపించుకొన్నాడు.

(ఈ విశేషాంశములకు మూలమైన ప్రకరణము – "త్రిజటాస్వప్నము గాయత్రీ మంత్రమే" అనునది).

**శ్లో॥ న హి రామో మహాతేజా శ్శక్యో జేతుం సురాసురైః ।**
**రాక్షసై ర్వాపి చాన్యై ర్వా స్వర్గః పాపజనై రివ ॥ 21**

**పదచ్ఛేదము :–** న – హి – రామః – మహాతేజాః – శక్యః – జేతుం – సురాసురైః – రాక్షసైః – వా – అపి – చ – అన్యైః – వా – స్వర్గః – పాపజనైః – ఇవ ॥

**అన్వయక్రమము :–** స్వర్గః పాపజనైః ఇవ, మహాతేజాః రామః సురాసురైః, రాక్షసైః వా, అపి చ అన్యైః వా జేతుం న హి శక్యః.

**ప్రతిపదార్థము :–** స్వర్గః పాపజనైః ఇవ = స్వర్గలోకము పాపాత్ములచేతవలె, మహాతేజాః రామః = మహాప్రతాపశాలియైన శ్రీరాముడు, సురాసురైః = దేవాసురుల చేతగాని, రాక్షసైః వా = రాక్షసులచేతగాని, అపిచ = మఱియును, అన్యైః వా = వేఱెవ్వరి చేతనుగాని, జేతుం నహి శక్యః = జయించుటకు శక్యమైన వాడుగాదు సుడీ!

**తాత్పర్యము :–** స్వర్గలోకము పాపాత్ములకు చేర సాధ్యము గానట్లుగా మహాపరాక్రమ వంతుడైన శ్రీరాముడు దేవదానవులకు గాని, రాక్షసులకుగాని, ఇంకెవ్వరికినైన గాని జయించుటకు వీలుపడదుసుడీ!

**శ్లో॥ రావణ శ్చ మయా దృష్టః క్షితౌ తైలసముక్షితః ।**
**రక్తవాసాః పిబన్మత్తః కరవీరకృతస్రజః ॥ 22**

**పదచ్ఛేదము :–** రావణః – చ – మయా – దృష్టః – క్షితౌ – తైలసముక్షితః – రక్తవాసాః – పిబన్ – మత్తః – కరవీరకృతస్రజః ॥

**అన్వయక్రమము :–** రావణః చ, తైలసముక్షితః, రక్తవాసాః, కరవీరకృతస్రజః, పిబన్ మత్తః, క్షితౌ మయా దృష్టః.

**ప్రతిపదార్థము :–** రావణః చ = రావణుడుగూడ, తైలసముక్షితః = నూనెచే తడుపబడినవాడై, రక్తవాసాః = ఎఱ్ఱని వస్త్రములు గలవాడై, కరవీరకృతస్రజః = గన్నేరు పువ్వులదండలు గలవాడై, పిబన్ = త్రాగుచు, మత్తః = ఒడలెఱుగనివాడై, క్షితౌ = నేలపై (పొరలుచు), మయా = నాచే, దృష్టః =చూడబడెను.

**తాత్పర్యము :–** రావణుడు ఒడలి నిండ నూనె పూసికొని ఎఱ్ఱని దుస్తులు ధరించి

మెడనిండ గన్నేరు పూలదండలు వేసికొని, తప్పత్రాగి మత్తెక్కి నేలపై దొర్లుచు నాకు కానబడినాడు.

**శ్లో॥ విమానా త్పుష్పకా దద్య రావణః పతితో భువి ।**
**కృష్యమాణః స్త్రియా దృష్టో ముండః కృష్ణాంబరః పునః ॥ 23**

**పదచ్ఛేదము** :– విమానాత్ – పుష్పకాత్ – అద్య – రావణః – పతితః – భువి – కృష్యమాణః – స్త్రియా – దృష్టః – ముండః – కృష్ణాంబరః – పునః ॥

**అన్వయక్రమము** :– పునః, అద్య, రావణః, పుష్పకాత్ విమానాత్ స్త్రియా కృష్యమాణః, కృష్ణాంబరః, ముండః – భువి పతితః దృష్టః.

**ప్రతిపదార్థము** :– పునః = తిరిగి వేఱొక మాఱు కలలో, అద్య = నేడు, రావణః = రావణుడు, పుష్పకాత్ విమానాత్ = పుష్పకవిమానమునుండి, భువి = నేలపై, పతితః = పడినవాడై, స్త్రియా కృష్యమాణః = ఒకస్త్రీచే లాగబడు చున్నవాడై, ముండః = ముండితశిరస్కుడై, కృష్ణాంబరః = మలినవస్త్రములను ధరించినవాడై, దృష్టః = చూడబడెను.

**తాత్పర్యము** :– తిరిగి కలలోనే వేఱొకమాఱు రావణుడు నల్లని వస్త్రములను ధరించి ముండితశిరస్కుడై విమానమునుండి క్రింద బడి ఒక స్త్రీచే లాగివేయబడుచు కానవచ్చినాడు.

**శ్లో॥ రథేన ఖరయుక్తేన రక్తమాల్యానులేపనః ।**
**పిబం స్తైలం హస న్నృత్యన్ భ్రాంతచిత్తాకులేంద్రియః ।**
**గర్దభేన యయౌ శీఘ్రం దక్షిణాం దిశ మాస్థితః ॥ 24**

**పదచ్ఛేదము** :– రథేన – ఖరయుక్తేన – రక్తమాల్యానులేపనః – పిబన్ – తైలం – హసన్ – నృత్యన్ – భ్రాంతచిత్తాకులేంద్రియః – గర్దభేన – యయౌ – శీఘ్రం – దక్షిణాం – దిశమ్ – ఆస్థితః ॥

**అన్వయక్రమము** :– రక్తమాల్యానులేపనః, భ్రాంతచిత్తాకులేంద్రియః, తైలం పిబన్, హసన్, నృత్యన్ ఖరయుక్తేన రథేన దక్షిణాం దిశమ్ ఆస్థితః గర్దభేన శీఘ్రం యయౌ.

**ప్రతిపదార్థము** :– రక్తమాల్యానులేపనః = ఎఱ్ఱని పూలమాలికలును, చందనపు పూతయును గలవాడై, భ్రాంతచిత్తాకులేంద్రియః = భ్రాంతి నొందిన మనస్సును ఇంద్రియములును గలవాడై, తైలం పిబన్ = నూనెను త్రాగుచు, హసన్ = నవ్వుచును,

నృత్యన్ = నాట్యముచేయుచు, ఖరయుక్తేన రథేన = గాడిదలు పూన్చిన రథముతో, దక్షిణాం దిశం = దక్షిణదిక్కును, ఆస్థితః = చేరినవాడై, శీఘ్రం = వేగముగా, గర్దభేన యయౌ = గాడిదమీదనే వెడలిపోయెను.

**తాత్పర్యము :–** ఎఱ్ఱని పూలమాలలను మైపూతలను ధరించిన వాడై, కుదురులేని మనస్సు, ఇంద్రియములును గలవాడై, అతడు నూనెను త్రాగుచు, పిచ్చిగా నవ్వుచు, గంతులు వేయుచు, గాడిదలు పూన్చిన రథమునెక్కి, కొంతదూర మేగి పిమ్మట దక్షిణ దిక్కుగా గాడిదపై మహావేగముతో పోవుచుండెను.

**శ్లో॥ పున రేవ మయా దృష్టో రావణో రాక్షసేశ్వరః ।**
**పతితో ఽ వాక్ఛిరా భూమౌ గర్దభా ద్భయమోహితః ।**
**సహ సోత్థాయ సంభ్రాంతో భయార్తో మదవిహ్వలః ॥ 25**

**పదచ్ఛేదము :–** పునః – ఏవ – మయా – దృష్టః – రావణః – రాక్షసేశ్వరః – పతితః – అవాక్ఛిరాః – భూమౌ – గర్దభాత్ – భయమోహితః – సహసా – ఉత్థాయ – సంభ్రాంతః – భయార్తః – మదవిహ్వలః ॥

**అన్వయక్రమము :–** పునః ఏవ రాక్షసేశ్వరః రావణః భయమోహితః గర్దభాత్ భూమౌ అవాక్ఛిరాః పతితః, సహసా ఉత్థాయ సంభ్రాంతః, మదవిహ్వలః, భయార్తః (సన్) మయా దృష్టః.

**ప్రతిపదార్థము :–** పునః ఏవ = తిరిగి ఇంకొకమాఱు, రాక్షసేశ్వరః రావణః = రాక్షసరాజైన రావణుడు, గర్దభాత్ = గాడిదనుండి, భయమోహితః = భయవిహ్వలుడై అవాక్ఛిరాః = తలక్రిందుగా, భూమౌ = నేలపై, పతితః = పడినవాడై, సహసా ఉత్థాయ = వెంటనే లేచి, మదవిహ్వలః = గర్వముచేత వివశుడై, సంభ్రాంతః = తొట్రుపాటు నొందుచున్నవాడై, భయార్తః (సన్) = భయముచే దీనస్థితి నొందినవాడై, మయా దృష్టః = నాచే చూడబడెను.

**తాత్పర్యము :–** ఇంకొక కలలో ఆ రావణుడు ఆ గాడిదనుండి భయవిహ్వలుడై తలక్రిందుగా నేలపైబడి వెంటనే లేచి తొట్రుపడుచు, ఒక వంక గర్వము, వేఱొక వంక భయము తనను పీడించుచుండగా నేలపై దొర్లుచు గానవచ్చెను.

**శ్లో॥ ఉన్మత్త ఇవ దిగ్వాసా దుర్వాక్యం ప్రలప న్బహు ।**
**దుర్గంధం దుస్సహం ఘోరం తిమిరం నరకోపమమ్ ।**
**మలపంకం ప్రవి శ్యాశు మగ్న స్తత్ర స రావణః ॥ 26**

**పదచ్ఛేదము** :- ఉన్మత్తః - ఇవ - దిగ్వాసాః - దుర్వాక్యం - ప్రలపన్ - బహు - దుర్గంధం - దుస్సహం - ఘోరం - తిమిరం - నరకోపమమ్, మలపంకం - ప్రవిశ్య - ఆశు - మగ్నః - తత్ర - సః - రావణః ॥

**అన్వయక్రమము** :- ఉన్మత్తః ఇవ దిగ్వాసాః సన్ బహు దుర్వాక్యం ప్రలపన్, దుర్గంధం, దుస్సహం, ఘోరం తిమిరం, నరకోపమం మలపంకం ప్రవిశ్య సః రావణః తత్ర ఆశు మగ్నః.

**ప్రతిపదార్థము** :- ఉన్మత్తః ఇవ = పిచ్చివాడువలె, దిగ్వాసాః (సన్) = దిగంబరుడై, బహు దుర్వాక్యం ప్రలపన్ = బహుదుర్భాష లాడుచు, దుర్గంధం = దుర్వాసనగలదియును, దుస్సహం = అసహ్యమైనదియును, ఘోరం = దారుణమైనదియును, తిమిరం = చీకటిగనున్నదియును, నరకోపమం = నరకమువలె నున్నదియును అగు, మలపంకం = మలపంకమును, ప్రవిశ్య = ప్రవేశించి, సః రావణః = ఆ రావణుడు, తత్ర = ఆ బురదలో, ఆశు = వెంటనే, మగ్నః =దిగబడి పోయెను.

**తాత్పర్యము** :- ఆ రావణుడు ఉన్మత్తుని వలె దిగంబరుడై పలు విధములైన దుర్భాషల నాడుచు, గొప్పదుర్వాసనతో, ఘోరముగా అసహ్యముగానున్న మలముతో నిండి నరకము వలె నున్న ఒక బావిలోనికి దిగి అందు కూరుకొని పోయెను.

**శ్లో॥ కంఠే బద్ధ్వా దశగ్రీవం ప్రమదా రక్తవాసినీ ।**
**కాలీ కర్దమలిప్తాంగీ దిశం యామ్యాం ప్రకర్షతి ॥ 27**

**పదచ్ఛేదము** :- కంఠే - బద్ధ్వా - దశగ్రీవం - ప్రమదా - రక్తవాసినీ - కాలీ - కర్దమలిప్తాంగీ - దిశం - యామ్యాం - ప్రకర్షతి ॥

**అన్వయక్రమము** :- రక్తవాసినీ, కర్దమలిప్తాంగీ, కాలీ ప్రమదా దశగ్రీవం కంఠే బద్ధ్వా యామ్యాం దిశం ప్రకర్షతి.

**ప్రతిపదార్థము** :- రక్తవాసినీ = ఎఱ్ఱని వస్త్రము ధరించిన, కర్దమలిప్తాంగీ = బురదతో పూయబడిన శరీరము గలిగినట్టి, కాలీ ప్రమదా = నల్లని స్త్రీ యొకతె, దశగ్రీవం = రావణుని, కంఠే = కంఠమునందు, బద్ధ్వా = పాశమును బిగించి, యామ్యాం దిశం ప్రకర్షతి = దక్షిణ దిక్కునకు ఈడ్చుచుండెను.

**తాత్పర్యము** :- ఎఱ్ఱని వస్త్రములు ధరించి ఒడలినిండ బురద కలిగియున్నదై, కాటుక కొండవలె కాన్పించుచు కాళీ యను ఒక రాక్షసస్త్రీ రావణుని కంఠమునకు పాశమును

బిగించి, దక్షిణ దిక్కుగా ఈడ్చుకొని పోవుచుండెను.

**శ్లో॥ ఏవం తత్ర మయా దృష్టః కుంభకర్ణో నిశాచరః ।**
**రావణస్య సుతా స్సర్వే దృష్టా స్తైలసముక్షితాః ॥ 28**

**పదచ్ఛేదము** :- ఏవం - తత్ర - మయా - దృష్టః - కుంభకర్ణః - నిశాచరః - రావణస్య - సుతాః - సర్వే - దృష్టాః - తైలసముక్షితాః ॥

**అన్వయక్రమము** :- నిశాచరః కుంభకర్ణః (చ) మయా తత్ర ఏవం దృష్టః, రావణస్య సర్వే సుతాః, తైలసముక్షితాః దృష్టాః.

**ప్రతిపదార్థము** :- నిశాచరః కుంభకర్ణః = రాక్షసశ్రేష్ఠుడైన కుంభకర్ణుడు కూడ, తత్ర = ఆ స్వప్నమునందు, మయా = నాచేత, ఏవం దృష్టః = ఇట్లే చూడబడెను. రావణస్య సర్వే సుతాః = రావణుని పుత్రులందరును, తైలసముక్షితాః = నూనెతో పూయబడిన వారుగా, దృష్టాః = చూడబడిరి.

**తాత్పర్యము** :- నా కా స్వప్నమునందు రావణసోదరుడైన కుంభకర్ణుడు గూడ రావణుని రీతిగనే ఆ స్థితిలోనే గానవచ్చినాడు. మఱియు రావణుని పుత్రులెల్లరును నూనెలో మునిగి తేలుచు గానవచ్చినారు.

**శ్లో॥ వరాహేణ దశగ్రీవ శ్శింశుమారేణ చేంద్రజిత్ ।**
**ఉష్ట్రేణ కుంభకర్ణశ్చ ప్రయాతా దక్షిణాం దిశమ్ ॥ 29**

**పదచ్ఛేదము** :- దశగ్రీవః - వరాహేణ - శింశుమారేణ - చ - ఇంద్రజిత్ - ఉష్ట్రేణ - కుంభకర్ణః - చ - ప్రయాతాః - దక్షిణాం - దిశమ్ ॥

**అన్వయక్రమము** :- దశగ్రీవః వరాహేణ, ఇంద్రజిత్ శింశుమారేణ, కుంభకర్ణః ఉష్ట్రేణ చ, దక్షిణాం దిశం ప్రయాతాః.

**ప్రతిపదార్థము** :- దశగ్రీవః వరాహేణ = రావణుడు సూకరము మీదను, ఇంద్రజిత్ శింశుమారేణ = ఇంద్రజిత్తు మకరము మీదను, కుంభకర్ణః ఉష్ట్రేణ = కుంభకర్ణుడు ఒంటె మీదను, దక్షిణాం దిశం ప్రయతాః = దక్షిణ దిక్కుగా వెడలిపోయిరి.

**తాత్పర్యము** :- రావణుడు వరాహవాహనమును, ఇంద్రజిత్తు మకరవాహనమును, కుంభకర్ణుడు ఉష్ట్రవాహనమును, ఆరోహించినవారై, దక్షిణదిక్కుగా తిరిగి పోవు చుండిరి.

**శ్లో॥ ఏక స్తత్ర మయా దృష్టః శ్వేతచ్ఛత్రో విభీషణః ।**
**శుక్లమాల్యాంబరధర శ్శుక్లగంధానులేపనః ॥ 30**

**పదచ్ఛేదము** :- ఏకః - తత్ర - మయా - దృష్టః - శ్వేతచ్ఛత్రః - విభీషణః - శుక్లమాల్యాంబరధరః - శుక్లగంధానులేపనః ॥

**అన్వయక్రమము** :- తత్ర ఏకః విభీషణః శ్వేతచ్ఛత్రః, శుక్లమాల్యాంబరధరః, శ్వేతగంధానులేపనః మయా దృష్టః.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ స్వప్నమునందు, ఏకః విభీషణః = విభీషణుడొక్కడు, శ్వేతచ్ఛత్రః = తెల్లని గొడుగు గలవాడై, శుక్లమాల్యాంబరధరః = తెల్లని పూలమాలలను వస్త్రములను ధరించినవాడై, శ్వేతగంధానులేపనః = తెల్లని చందనము పూత కలవాడై, మయా దృష్టః = నాచే చూడబడినాడు.

**తాత్పర్యము** :- నాకు ఆ స్వప్నమునందు విభీషణుడొక్కడు మాత్రము శ్వేతచ్ఛత్రముతో విరాజిల్లుచు, తెల్లని పుష్పమాలలను చీనాంబరములను ధరించి తెల్లని గంధములతో అలంకరింపబడి సుందరముగా గాన వచ్చినాడు.

**శ్లో॥ శంఖదుందుభినిర్ఘోషై ర్నృత్తగీతై రలంకృతః ।**
**ఆరుహ్య శైలసంకాశం మేఘస్తనిత నిస్వనమ్ ।**
**చతుర్దంతం గజం దివ్య మాస్తే తత్ర విభీషణః ॥ 31**

**పదచ్ఛేదము** :- శంఖదుందుభినిర్ఘోషైః - నృత్తగీతైః - అలంకృతః - ఆరుహ్య - శైలసంకాశం - మేఘస్తనితనిస్వనమ్, చతుర్దంతం - గజం - దివ్యమ్ - ఆస్తే - తత్ర - విభీషణః.

**అన్వయక్రమము** :- తత్ర అలంకృతః, విభీషణః శంఖదుందుభినిర్ఘోషైః, నృత్తగీతైః శైలసంకాశం, మేఘస్తనితనిస్వనం, చతుర్దంతం దివ్యం గజమ్ ఆరుహ్య ఆస్తే.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ స్వప్నమునందు, అలంకృతః = అలంకరింపబడి యున్న, విభీషణః = విభీషణుడు, శంఖదుందుభినిర్ఘోషైః = శంఖములయొక్కయు దుందుభులయొక్కయు మ్రోతలతోడను, నృత్తగీతైః = నాట్యము తోడను గీతముల తోడను, శైలసంకాశం = పర్వతసన్నిభమైనట్టియు, మేఘస్తనితనిస్వనం = మేఘము ఉఱుముల వంటి ధ్వని గలిగినట్టియు, చతుర్దంతం = నాల్గుదంతములు కల్గినట్టియు, దివ్యం గజం = అద్భుతమైన ఏనుగును, ఆరుహ్య = అధిష్ఠించి, ఆస్తే = విరాజిల్లు చుండెను.

**తాత్పర్యము** :- ఆ స్వప్నమునందే రాజలాంఛనములతో చక్కగా అలంకరింప బడియున్న ఆ విభీషణుడు, శంఖధ్వానములతోడను దుందుభివాద్యములతోడను,

నృత్తగీతములతోడను కదలివచ్చుచు, పర్వతములవలె ఉన్నతమై, మేఘముల ఉఱుముల వంటి గంభీరమైన ధ్వనులు చేయుచున్న నాల్గు దంతములుగల ఒక భద్రగజమును అధిష్ఠించి రాజశ్రీవితో విరాజిల్లుచుండెను.

**శ్లో॥ చతుర్భి స్సచివై స్సార్థం వైహాయస ముపస్థితః ॥ 32**

**పదచ్ఛేదము** :- చతుర్భిః - సచివైః - సార్థం - వైహాయసమ్ - ఉపస్థితః ॥

**అన్వయక్రమము** :- (సః) చతుర్భిః, సచివైః, సార్థం, వైహాయసమ్, ఉపస్థితః.

**ప్రతిపదార్థము** :- (సః = ఆ విభీషణుడు) చతుర్భిః సచివైః సార్థం = (తన) నలుగురు మంత్రులతోడను, వైహాయసమ్ ఉపస్థితః = ఆకాశమున సంచరించు చుండెను.

**తాత్పర్యము** :- అట్టి ఆ విభీషణుడు తన నలుగురు మంత్రులతో కూడి గగనమార్గమున చరించుచుండెను.

**శ్లో॥ సమాజ శ్చ మయా దృష్టో గీతవాదిత్రనిస్వనః ।**
**పిబతాం రక్తమాల్యానాం రక్షసాం రక్తవాససామ్ ॥ 33**

**పదచ్ఛేదము** :- సమాజః - చ - మయా - దృష్టః - గీతవాదిత్రనిస్వనః - పిబతాం - రక్తమాల్యానాం - రక్షసాం - రక్తవాససామ్ ॥

**అన్వయక్రమము** :- (తత్ర) పిబతాం, రక్తమాల్యానాం, రక్తవాససాం రక్షసాం గీత వాదిత్రనిస్వనః సమాజః చ మయా దృష్టః.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ స్వప్నమునందు, పిబతాం = తైలపానము చేయుచున్నట్టియు, రక్తమాల్యానాం = ఎఱ్ఱని పూలమాలలు కలిగినట్టియు, రక్తవాససాం = ఎఱ్ఱని వస్త్రములు కలిగినట్టియు, రక్షసాం = రాక్షసులయొక్క, గీతవాదిత్రనిస్వనః సమాజః చ = పాటల యొక్కయు వాద్యముల యొక్కయు ధ్వనులతో గూడిన గుంపుకూడ, మయా దృష్టః = నాచే చూడబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- పిబతాం = తైలాదిపానము చేయుచున్నట్టి.

**తాత్పర్యము** :- ఆ స్వప్నమునందు నూనెలు త్రాగుచు ఎఱ్ఱని పూలమాలలు, వస్త్రములు ధరించి పాటలతోను వాద్యములతోను పెద్దగోల చేయుచున్న రాక్షసుల మూకగూడ నాకు గానవచ్చెను.

**శ్లో॥ లంకా చేయం పురీ రమ్యా సవాజిరథకుంజరా ।**
**సాగరే పతితా దృష్టా భగ్నగోపురతోరణా ॥ 34**

**పదచ్ఛేదము** :- లంకా - చ - ఇయం - పురీ - రమ్యా - సవాజిరథకుంజరా - సాగరే - పతితా - దృష్టా - భగ్నగోపురతోరణా ॥

**అన్వయక్రమము** :- రమ్యా ఇయం లంకా పురీ చ సవాజిరథకుంజరా, భగ్నగోపురతోరణా (సతీ) సాగరే పతితా దృష్టా.

**ప్రతిపదార్థము** :- ఇయం = ఈ, రమ్యా = సుందరమైన, లంకా పురీ చ = లంకాపురముగూడ, భగ్నగోపురతోరణా (సతీ) = విఱిగిపోయిన గోపురములు, తోరణములును గలదై, సవాజిరథకుంజరా = గుఱ్ఱములతోడను, రథములతోడనుగూడ, సాగరే = సముద్రమున, పతితా = కూలిపోయినదిగా, దృష్టా = చూడబడినది.

**తాత్పర్యము** :- ఎంతయో రమణీయమైన ఈ లంకానగరము గూడ, భవనములు గోపురములు విఱిగిపోయి, ఇచ్చటి గుఱ్ఱములతోడను ఏనుగులతోడను సముద్రములో దిగబడిపోయినదిగా కానవచ్చినది.

**శ్లో॥ లంకా దృష్టా మయా స్వప్నే రావణే నాభిరక్షితా ।**
**దగ్ధా రామస్య దూతేన వానరేణ తరస్వినా ॥ 35**

**పదచ్ఛేదము** :- లంకా - దృష్టా - మయా - స్వప్నే - రావణేన - అభిరక్షితా - దగ్ధా - రామస్య - దూతేన - వానరేణ - తరస్వినా ॥

**అన్వయక్రమము** :- మయా స్వప్నే రావణేన అభిరక్షితా లంకా రామస్య దూతేన, తరస్వినా వానరేణ దగ్ధా దృష్టా.

**ప్రతిపదార్థము** :- మయా = నాచేత, స్వప్నే = స్వప్నమునందు, రావణేన అభిరక్షితా = రావణునిచే భద్రముగా కాపాడబడినట్టి, లంకా = లంకానగరము, రామస్య దూతేన = శ్రీరాముని దూతయైనట్టి, తరస్వినా వానరేణ = బలాఢ్యుడైన ఒక వానరునిచే, దగ్ధా దృష్టా = దహింపబడినదిగా చూడబడినది.

**తాత్పర్యము** :- ఆ స్వప్నమునందు నాకు రావణుడు భద్రముగా కాపాడుచున్నట్టి, ఈ లంకానగరమును శ్రీరాముని దూతయైన ఒకానొక బలశాలియగు వానరుడు భయంకరముగా తగులపెట్టుట కానవచ్చెను.

**సూచన** :- ఈ శ్లోకం ప్రక్షిప్తమని కొందరి భావము.

**శ్లో॥ పీత్వా తైలం ప్రనృత్తా శ్చ ప్రహసంత్యో మహాస్వనాః ।**
**లంకాయాం భస్మరూక్షాయాం ప్రవిష్టా రాక్షసస్త్రియః ॥ 36**

**పదచ్ఛేదము :-** పీత్వా - తైలం - ప్రనృత్తాః - చ - ప్రహసంత్యః - మహాస్వనాః - లంకాయాం - భస్మరూక్షాయాం - ప్రవిష్టాః - రాక్షసస్త్రియః ॥

**అన్వయక్రమము :-** రాక్షసస్త్రియః తైలం పీత్వా, ప్రనృత్తాః, ప్రహసంత్యః మహాస్వనాః, భస్మరూక్షాయాం లంకాయాం ప్రవిష్టాః.

**ప్రతిపదార్థము :-** రాక్షసస్త్రియః = రాక్షసస్త్రీలు, తైలం పీత్వా = నూనెను త్రాగి, ప్రనృత్తాః = గంతులు వేయుచున్నవారై, ప్రహసంత్యః = వికటముగా నవ్వుచున్నవారై, మహాస్వనాః = పెద్దగోల చేయుచున్నవారై, భస్మరూక్షాయాం = బూడిద గ్రమ్మియున్న, లంకాయాం = లంకలోనికి, ప్రవిష్టాః = ప్రవేశించిరి.

"ప్రనృత్తాః" అనుటకు బదులుగా "ప్రమత్తాః" అని పాఠాంతరము.

**తాత్పర్యము :-** మఱియు నిచ్చటి రాక్షస స్త్రీలెల్లరును తైలపానము చేయుచు, గంతులు వేయుచు పెద్ద గోలతో, బూడిదయైయున్న లంకలోనికి పోవుచు కాన్పించిరి.

**శ్లో॥ కుంభకర్ణాదయ శ్చేమే సర్వే రాక్షసపుంగవాః ।**
**రక్తం నివసనం గృహ్య ప్రవిష్టా గోమయహ్రదే ॥ 37**

**పదచ్ఛేదము :-** కుంభకర్ణాదయః - చ - ఇమే - సర్వే - రాక్షసపుంగవాః - రక్తం - నివసనం - గృహ్య - ప్రవిష్టాః - గోమయహ్రదే ॥

**అన్వయక్రమము :-** ఇమే కుంభకర్ణాదయః సర్వే రాక్షసపుంగవాః రక్తం నివసనం గృహ్య, గోమయహ్రదే ప్రవిష్టాః.

**ప్రతిపదార్థము :-** ఇమే కుంభకర్ణాదయః = ఈ కుంభకర్ణుడు మొదలైనట్టి, సర్వే రాక్షసపుంగవాః = రాక్షసవీరు లెల్లరును, రక్తం నివసనం గృహ్య = ఎఱ్ఱని వస్త్రములను ధరించి, గోమయహ్రదే ప్రవిష్టాః = పేడమడుగులోనికి దిగబడిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:-** రామాయణమునందు దశరథస్వప్నము, భరతస్వప్నము త్రిజటాస్వప్నము, అని మూడు కలలు గలవు. ఈ మూడు కలలును సత్యములే అయ్యెను. కావున రామాయణము స్వప్నములు సత్యములే అని సాధించుచున్నది.

బృహదారణ్యకోపనిషనిత్తునం దిట్లు చెప్పబడెను 4-3-9

పురుషునకు అనగా జీవాత్మకు రెండు స్థానములే గలవు. ఈ లోకము, పరలోకము. మూడవది స్వప్నమను స్థానము. జీవుడు ఇహలోకమునకు పరలోకమునకు సంధిస్థానము అగు ఈ స్వప్నప్రపంచమున నిలచి రెంటిని జూచును. భగవంతుడు వీనిని నిద్రపుచ్చునపుడు ఈతనికి మేలుకొన్నప్పుడున్న జ్ఞానమును, ఇంద్రియములను తానే గ్రహించి బాహ్యేంద్రియముల నెల్ల నివర్తింపజేసి స్వప్నపదార్థములను వారి వారి అదృష్టము కొలది సృష్టించి యా పదార్థములను తన జ్యోతిచే ప్రకాశింపజేసి స్వప్నమునందలి ఆలోచనము తానే ప్రకాశింపచేయును. అప్పుడు జీవి స్వయంజ్యోతి యగును.

**తాత్పర్యము** :- కుంభకర్ణుడు మున్నగు ఈ రాక్షసశ్రేష్ఠులందరును గూడ ఎఱ్ఱని చింకిగుడ్డలను కట్టుకొని, పేడతో నిండియున్న మడుగులో దిగబడిపోయిరి.

**శ్లో॥ అపగచ్ఛత నశ్యధ్వం సీతా మాప స రాఘవః ।**
**ఘాతయే త్పరమామర్షీ సర్వై స్సార్ధం హి రాక్షసైః ॥ 38**

**పదచ్ఛేదము** :- అపగచ్ఛత - నశ్యధ్వమ్ - సీతామ్ - ఆప - సః - రాఘవః - ఘాతయేత్ - పరమామర్షీ - సర్వైః - సార్ధం - హి - రాక్షసైః ॥

**అన్వయక్రమము** :- అపగచ్ఛత; నశ్యధ్వమ్; సః రాఘవః సీతామ్ ఆప; పరమామర్షీ సః సర్వైః రాక్షసైః సార్ధం (యుష్మాన్) ఘాతయేత్.

**ప్రతిపదార్థము** :- అపగచ్ఛత = తొలగిపొండు, నశ్యధ్వం = నశించిపొండు, సః రాఘవః = ఆ శ్రీరాముడు, సీతామ్ ఆప = సీతను పొందెను. (అనగా త్వరలోనే పొందగలడు) పరమామర్షీ సః = మహాక్రోధయుక్తుడైన ఆ శ్రీరాముడు, సర్వైః = సార్ధం = రాక్షసు లెల్లరితో కూడ, (యుష్మాన్ = మిమ్ములను) ఘాతయేత్ = పరిమార్చగలడు, బొంబాయి పాఠము నందిట్లున్నది - అపగచ్ఛత పశ్యధ్వం సీతా మాప్నోతి రాఘవః, ఘాతయేత్ పరమామర్షీ యుష్మాన్ సార్ధం హి రాక్షసైః.

**తాత్పర్యము** :- వెంటనే సీతకడనుండి మీరు తొలగిపోవుడు, లేనిచో మీరు నశించిపోయెదరు; ఆ శ్రీరాము డిప్పుడే వచ్చి సీతను గొనిపోవుచున్నాడు; క్రోధము నొందిన ఆతడు ఇచ్చటి రాక్షసు లెల్లరితో కలిపి మిమ్ము త్వరలోనే హతమార్చును.

**శ్లో॥ ప్రియాం బహుమతాం భార్యాం వనవాస మనువ్రతామ్ ।**
**భర్త్సితాం తర్జితాం వాపి నానుమంస్యతి రాఘవః ॥ 39**

**పదచ్ఛేదము** :- ప్రియాం - బహుమతాం - భార్యాం - వనవాసమ్ - అనువ్రతామ్, భర్త్సితాం - తర్జితాం - వా - అపి - న - అనుమంస్యతి - రాఘవః ॥

**అన్వయక్రమము** :- రాఘవః వనవాసమ్ అనువ్రతాం, ప్రియాం, బహుమతాం భార్యాం, భర్త్సితాం, తర్జితాం వా అపి న అనుమంస్యతి.

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, వనవాసమ్ అనువ్రతాం = వనవాసమును గూడ అనుమతించి అనుసరించుచున్నదియును, ప్రియాం = ఇష్టురాలును, బహుమతాం = గౌరవార్హురాలు నగు, భార్యాం = భార్యయైన సీతను, భర్త్సితాం = అవమానింపబడినదానినిగా గాని, తర్జితాం వా అపి = బెదరింపబడినదానినిగా గాని, న అనుమంస్యతి = అంగీకరింపడు (సహింపడు).

**తాత్పర్యము** :- తనకు మిక్కిలి ఇష్టురాలును, మిక్కిలి గౌరవార్హురాలును, అరణ్య వాసమున గూడ తనను అనుసరించుచున్నదియునగు తన భార్యను మీరు ఏ మాత్రము అవమానించినను, బెదిరించినను శ్రీరాముడు ఏమియు సహింపడు సుమా!

**శ్లో॥ తదలం క్రూరవాక్యై ర్వ స్సాంత్వ మే వాభిధీయతామ్ ।**
**అభియాచామ వైదేహీ మేత ద్ధి మమ రోచతే ॥ 40**

**పదచ్ఛేదము** :- తత్ - అలం - క్రూరవాక్యైః - వః - సాంత్వమ్ - ఏవ - అభిధీయతామ్ - అభియాచామ - వైదేహీమ్ - ఏతత్ - హి - మమ - రోచతే ॥

**అన్వయక్రమము** :- తత్ వః క్రూరవాక్యైః అలమ్; సాంత్వమ్ ఏవ అభిధీయతామ్; వైదేహీమ్ (క్షమాం) అభియాచామ; మమ ఏతత్ హి రోచతే.

**ప్రతిపదార్థము** :- తత్ = అందువలన, వః క్రూరవాక్యైః అలం = మీ క్రూరవచనములచే చాలును, సాంత్వమ్ ఏవ =సామవచనమే, అభిధీయతామ్ = పలుకబడుగాక! వైదేహీం = సీతను, (క్షమాం) అభియాచామ = (అభయమును) వేడుకొందము, మమ = నాకు, ఏతత్ హి = ఇదియే, రోచతే = ఇష్టమగుచున్నది.

**తాత్పర్యము** :- అందుచే ఈమెను గూర్చి మీరిక క్రూరవచనములు పలుకకుడు. సామవచనములే పలుకుడు. మన మామెను అభయమును వేడుకొందము. ఇదియే నాకు నచ్చిన పద్ధతి.

**శ్లో॥ యస్యా మేవంవిధః స్వప్నో దుఃఖితాయాం ప్రదృశ్యతే ।**
**సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా ప్రియం ప్రాప్నోత్యనుత్తమమ్ ॥ 41**

**పదచ్ఛేదము :–** యస్యామ్ – ఏవంవిధః – స్వప్నః – దుఃఖితాయాం – ప్రదృశ్యతే – సా – దుఃఖైః – వివిధైః – ముక్తా – ప్రియం – ప్రాప్నోతి – అనుత్తమమ్ ॥

**అన్వయక్రమము :–** యస్యాం దుఃఖితాయామ్ ఏవంవిధః స్వప్నః ప్రదృశ్యతే, సా, వివిధైః దుఃఖైః ముక్తా అనుత్తమం ప్రియం ప్రాప్నోతి.

**ప్రతిపదార్థము :–** యస్యాం దుఃఖితాయాం = ఏ వనిత దుఃఖించుచుండగా, ఏవంవిధః స్వప్నః = ఈ విధమైనట్టి స్వప్నము, ప్రదృశ్యతే = చూడబడుచున్నదో, సా = ఆ వనిత, వివిధైః దుఃఖైః = సమస్తవిధములైన దుఃఖములచేతను, ముక్తా = విడువబడినదై, అనుత్తమం ప్రియం = సర్వశ్రేష్ఠమైన మేలును, ప్రాప్నోతి = పొందును.

**తాత్పర్యము :–** ఈమె ఈరీతిగా దుఃఖములలో చిక్కుకొని యుండగా నాకీరీతి స్వప్నము వచ్చినది కాబట్టి ఈమెకు నిశ్చయముగా ఈ దుఃఖము లన్నియు తొలగి గొప్పమేలును పొందగలదు.

**శ్లో॥ భర్త్సితా మపి యాచధ్వం రాక్షస్యః కిం వివక్షయా ।**
**రాఘవాద్ధి భయం ఘోరం రాక్షసానా ముపస్థితమ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** భర్త్సితామ్ – అపి – యాచధ్వం – రాక్షస్యః – కిం – వివక్షయా – రాఘవాత్ – హి – భయం – ఘోరం – రాక్షసానామ్ – ఉపస్థితమ్.

**అన్వయక్రమము :–** (హే) రాక్షస్యః, భర్త్సితామ్ అపి (సీతామ్ అభయం) యాచధ్వమ్; కిం వివక్షయా? రాక్షసానాం రాఘవాత్ ఘోరం భయమ్ ఉపస్థితం హి.

**ప్రతిపదార్థము :–** (హే) రాక్షస్యః = ఓ రాక్షసాంగనలారా! వివక్షయా కిం = మాటలతో పని ఏమి? భర్త్సితామ్ అపి = నిందించబడినప్పటికిని, (సీతామ్ = సీతను, అభయం = అభయము) యాచధ్వం = వేడుకొనుడు; రాక్షసానాం = రాక్షసులకు, రాఘవాత్ = శ్రీరామునివలన, ఘోరం భయం = దారుణమైన ప్రమాదము, ఉపస్థితం హి = వచ్చినదిగదా!

**తాత్పర్యము :–** ఓ రాక్షసవనితలారా! పెక్కుమాటలు చెప్ప వలసిన పనిలేదు. ఇంతవఱకు మీరు సీతను ఎంత హింసించినను, ఇప్పుడు వెంటనే ఆమెను అభయము వేడుకొనుడు. నేడు శ్రీరామునివలన రాక్షసుల కెల్లరకును దారుణమైన మహాప్రమాదము వచ్చిపడుచున్నది.

**శ్లో॥ ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా ।**
**అల మేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్ ॥ 43**

**పదచ్ఛేదము :–** ప్రణిపాతప్రసన్నా – హి – మైథిలీ – జనకాత్మజా – అలమ్ – ఏషా – పరిత్రాతుం – రాక్షస్యః – మహతః – భయాత్ ॥

**అన్వయక్రమము :–** రాక్షస్యః! మైథిలీ జనకాత్మజా, ప్రణిపాతప్రసన్నా హి; ఏషా మహతో భయాత్ (అస్మాన్) పరిత్రాతుమ్ అలమ్.

**ప్రతిపదార్థము :–** రాక్షస్యః = ఓ రాక్షసాంగనలారా! జనకాత్మజా మైథిలీ = జనకమహారాజు పుత్రికయైన సీతాదేవి, ప్రణిపాతప్రసన్నా హి = నమస్కారమాత్రము చేతనే ప్రసన్నురా లగునట్టిది, ఏషా = ఈమెయే, మహతో భయాత్ = గొప్పభయమునుండి (అస్మాన్ = మనను) పరిత్రాతుం = కాపాడుటకు, అలం =సమర్థురాలైనట్టిది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:–** 'సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీం, క్షిప్రప్రసాదినీం లక్ష్మీం శరణ్యా మనుచింతయేత్' సమస్తకామితముల నిచ్చునదియు, మనోజ్ఞమైనదియు, సంసారసముద్రమును దాటించునదియు, శీఘ్రముగ ననుగ్రహించునదియు అగు లక్ష్మీదేవిని శరణు వేడ నర్హమగు రక్షకురాలినిగా ధ్యానించవలెను.

**తాత్పర్యము :–** నమస్కారమాత్రముచేతనే ప్రసన్నురాలగు ఈ జానకీదేవియే మనకు సంభవించిన నేటి మహావిపత్తునుండి మనను కాపాడుటకు సమర్థురాలుసుమా!

**శ్లో॥ అపి చాస్యా విశాలాక్ష్యా న కించి దుపలక్షయే ।**
**విరూప మపి చాంగేషు సుసూక్ష్మ మపి లక్షణమ్ ॥ 44**

**పదచ్ఛేదము :–** అపి – చ – అస్యాః – విశాలాక్ష్యాః – న – కించిత్ – ఉపలక్షయే – విరూపమ్ – అపి – చ – అంగేషు – సుసూక్ష్మమ్ – అపి –లక్షణమ్ ॥

**అన్వయక్రమము :–** అపిచ, అస్యాః విశాలాక్ష్యాః అంగేషు కించిత్ విరూపమ్ అపి, సుసూక్ష్మం లక్షణమ్ అపి న ఉపలక్షయే.

**ప్రతిపదార్థము :–** అపిచ = మఱియును, అస్యాః విశాలాక్ష్యాః = ఈ సుందరీమణి యొక్క, అంగేషు = అవయవములందు, కించిత్ విరూపమ్ అపి = కొంచెము విరూపముగాని, సుసూక్ష్మం లక్షణమ్ అపి = చిన్న దైన అశుభలక్షణముగాని, న

ఉపలక్షయే = చూడకున్నాను.

**తాత్పర్యము** :- మఱియు ఈ సుందరాంగి అవయవ ములందు విపత్తిసూచకమైన ఏ చిన్న అవలక్షణముగాని, ఎట్టి దుర్లక్షణముగాని కొంచెము గూడ కానవచ్చుటలేదు.

**శ్లో॥ ఛాయావైగుణ్యమాత్రం తు శంకే దుఃఖ ముపస్థితమ్ ।**
**అదుఃఖార్హామిమాం దేవీం వైహాయస ముపస్థితామ్ ॥ 45**

**పదచ్ఛేదము** :- ఛాయావైగుణ్యమాత్రం - తు - శంకే - దుఃఖమ్ - ఉపస్థితమ్ - అదుఃఖార్హామ్ - ఇమాం - దేవీం - వైహాయసమ్ - ఉపస్థితామ్ ॥

**అన్వయక్రమము** :- వైహాయసమ్ ఉపస్థితామ్, అదుఃఖార్హామ్ ఇమాం దేవీం, ఛాయావైగుణ్యమాత్రం దుఃఖమ్, ఉపస్థితం శంకే.

**ప్రతిపదార్థము** :- వైహాయసమ్ ఉపస్థితాం = దివ్యభోగములకు అర్హమైనట్టియు, అదుఃఖార్హాం = దుఃఖములకు తగనిదియునగు, ఇమాం దేవీం = ఈ సీతాదేవినిగూర్చి, ఛాయావైగుణ్యమాత్రం = తేజస్సు తగ్గుట మాత్రమైన, దుఃఖం = దుఃఖమును, ఉపస్థితం = సంభవించినదానినిగా, శంకే = ఊహించుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- 'ఛాయావైగుణ్యమాత్రం' - స్నానము, అనులేపనము మున్నగునవి లేకుండుటచే శోభ లోపించుట అని భావము. అంతియే గాని ముఖము పాలిపోవుట, కుడికన్ను అదురుట మున్నగు దుర్నిమిత్తములు, ఎవ్వియును లేవని తెలుపబడినది. వైహాయసమ్ ఉపస్థితాం - స్వప్నమునందు కాన్పించిన రూపమును అనుసరించి అని భావము.

**తాత్పర్యము** :- దివ్యమైన భోగములకు తగిన వర్చస్సు గలిగి దుఃఖములకు ఎంతమాత్రము తగనట్టి ఈ సీతాదేవికి స్నానపానాదుల అభావముచే శరీరచ్ఛాయ తఱుగుట అనులోప మొక్కటి మాత్రమే గానవచ్చు చున్నదని నా భావము.

**శ్లో॥ అర్థసిద్ధిం తు వైదేహ్యాః పశ్యా మ్యహ ముపస్థితామ్ ।**
**రాక్షసేంద్రవినాశం చ విజయం రాఘవస్య చ ॥ 46**

**పదచ్ఛేదము** :- అర్థసిద్ధిం - తు - వైదేహ్యాః - పశ్యామి - అహమ్ - ఉపస్థితామ్, - రాక్షసేంద్రవినాశం - చ - విజయం - రాఘవస్య - చ ॥

**అన్వయక్రమము** :- వైదేహ్యాః అర్థసిద్ధిమ్ ఉపస్థితామ్ అహం పశ్యామి; రాక్షసేంద్రవినాశం చ, రాఘవస్య విజయం చ ఉపస్థితం పశ్యామి.

**ప్రతిపదార్థము** :- వైదేహ్యాః = సీతాదేవికి, అర్థసిద్ధిం = కార్యసిద్ధిని, ఉపస్థితాం = సంప్రాప్తించినదానినిగా, అహం = నేను, పశ్యామి = చూచుచున్నాను. రాక్షసేంద్రవినాశం చ = రావణుని వినాశమును, రాఘవస్య విజయం చ = శ్రీరామునకు విజయమును, ఉపస్థితం = సమీపించినదానినిగా, పశ్యామి = చూచుచున్నాను.

**తాత్పర్యము** :- సీతాదేవికి ఇష్టసిద్ధి సంభవింపబోవుచున్నదనియు, రావణునకు వినాశము కలుగబోవుచున్నదనియు, శ్రీరామునకు విజయము ప్రాప్తింప బోవుచున్నదనియు నాకు స్పష్టముగా తెలియుచున్నది.

**శ్లో॥ నిమిత్తభూత మేత త్తు శ్రోతు మస్యా మహత్ప్రియమ్ ।**
**దృశ్యతే చ స్ఫురచ్చక్షుః పద్మపత్ర మివాయతమ్ ॥ 47**

**పదచ్ఛేదము** :- నిమిత్తభూతమ్ – ఏతత్ – తు – శ్రోతుమ్ – అస్యాః – మహత్ – ప్రియమ్ – దృశ్యతే – చ – స్ఫురత్ – చక్షుః – పద్మపత్రమ్ – ఇవ – ఆయతమ్ ॥

**అన్వయక్రమము** :- పద్మపత్రమ్ ఇవ ఆయతం (వామం) చక్షుః స్ఫురత్ దృశ్యతే చ; మహత్ ప్రియం శ్రోతుం ఏతత్ నిమిత్తభూతమ్.

**ప్రతిపదార్థము** :- పద్మపత్రమ్ ఇవ = తామరరేకువలె, ఆయతం = విశాలమైనట్టి, అస్యాః = ఈమెయొక్క, (వామం) చక్షుః = ఎడమకన్ను, స్ఫురత్ = అదురుచు, దృశ్యతే = కనబడుచున్నది. అస్యాః = ఈమెకు, మహత్ ప్రియం = గొప్పశుభమును, శ్రోతుం = వినుటకు, ఏతత్ = ఇది, నిమిత్తభూతమ్ = కారణభూతమై యున్నది.

**తాత్పర్యము** :- సీతాదేవికి త్వరలో కలుగబోవు గొప్పదైన ప్రియము వినిపించుటకు కారణభూతముగా – తామరరేకువలె విశాలమైన ఈమె ఎడమ కన్ను అదురుట కానవచ్చుచున్నది. చూడుడు!

**శ్లో॥ ఈషచ్చ హృషితో వాస్యా దక్షిణాయా హ్యదక్షిణః ।**
**అకస్మాదేవ వైదేహ్యా బాహు రేకః ప్రకంపతే ॥ 48**

**పదచ్ఛేదము** :- ఈషత్ – చ – హృషితః – వా – అస్యాః – దక్షిణాయాః – హి – అదక్షిణః – అకస్మాత్ – ఏవ – వైదేహ్యాః – బాహుః – ఏకః – ప్రకంపతే.

**అన్వయక్రమము :-** దక్షిణాయాః, అస్యాః వైదేహ్యాః, ఏకః అదక్షిణః బాహుః ఈషత్ హృషితః అకస్మాత్ ప్రకంపతే.

**ప్రతిపదార్థము :-** దక్షిణాయాః = సమర్థురాలైనట్టి, అస్యాః వైదేహ్యాః = ఈ సీతాదేవియొక్క, ఏకః అదక్షిణః బాహుః = ఒక్క ఎడమ భుజము మాత్రము, ఈషత్ హృషితః = కొలదిగ గగుర్పాటు నొందినదై, అకస్మాత్ (ఏవ) = హఠాత్తుగనే, ప్రకంపతే = అదురుచున్నది.

**తాత్పర్యము :-** ఈ ఉత్తమురాలి ఎడమ భుజ మొక్కటియే కొద్దిగ గగుర్పాటు నొందుచు, అకస్మాత్తుగ కంపించుచున్నది. చూడుడు!

**శ్లో॥ కరేణుహస్తప్రతిమ స్సవ్య శ్చోరు రనుత్తమః ।**
**వేపమాన స్సూచయతి రాఘవం పురతః స్థితమ్ ॥ 49**

**పదచ్ఛేదము :-** కరేణుహస్తప్రతిమః - సవ్యః - చ - ఊరుః - అనుత్తమః - వేపమానః - సూచయతి - రాఘవం - పురతః - స్థితమ్.

**అన్వయక్రమము :-** కరేణుహస్తప్రతిమః అనుత్తమః (అస్యాః) సవ్యః ఊరుః చ వేపమానః (సన్) రాఘవం పురతః స్థితం సూచయతి.

**ప్రతిపదార్థము :-** కరేణుహస్తప్రతిమః = ఆడు ఏనుగు తొండమును బోలినట్టి, అనుత్తమః (అస్యాః) సవ్యః ఊరుః చ = సుందరమైనట్టి ఈమె ఎడమతొడ గూడ, వేపమానః (సన్) = కంపించుచున్నదై, రాఘవం = శ్రీరాముని, పురతః స్థితం = ఎదుట నిలచియున్న వానినిగా, సూచయతి = సూచించుచున్నది.

**తాత్పర్యము :-** ఏనుగు తొండమును బోలిన సుందరమైన ఈమె ఎడమతొడ గూడ అదురుచు శ్రీరాముడు ఎదుటికి వచ్చి నిలచియున్నా డని తెలుపుచున్నది చూచితిరా!

**శ్లో॥ పక్షీ చ శాఖానిలయః ప్రహృష్టః**
**పునః పున శ్చోత్తమసాంత్వవాదీ ।**
**సుస్వాగతాం వాచ ముదీరయానః**
**పునః పున శ్చోదయతీవ హృష్టః ॥ 50**

**పదచ్ఛేదము :-** పక్షీ - చ- శాఖానిలయః - ప్రహృష్టః - పునః -పునః - చ - ఉత్తమసాంత్వవాదీ -సుస్వాగతాం - వాచమ్ - ఉదీరయానః - పునః - పునః - చోదయతి - ఇవ - హృష్టః ॥

**అన్వయక్రమము :–** శాఖానిలయః, ప్రహృష్టః, పక్షీ చ పునః పునః ఉత్తమసాంత్వవాదీ (సన్) హృష్టః, సుస్వాగతాం వాచమ్ ఉదీరయానః, పునః పునః చోదయతి ఇవ.

**ప్రతిపదార్థము :–** శాఖానిలయః = కొమ్మ నివాసముగా గలిగినట్టి, ప్రహృష్టః = సంతోషము నొందియున్నట్టి, పక్షీ చ = (ఈ) పక్షిగూడ, పునః పునః = మఱల మఱల, ఉత్తమసాంత్వవాదీ (సన్) =శ్రేష్ఠమైన సాంత్వన వచనములు పలుకు చున్నదై, సుస్వాగతాం వాచం = ప్రియబంధువు యొక్క రాకను తెలుపునట్టి మాటను, ఉదీరయానః = పలుకుచున్నదై, హృష్టః = ఆనందము నొందినదై, పునః పునః = మఱల మఱల, చోదయతి ఇవ = ప్రోత్సహించుచున్నదివలె (నున్నది).

**తాత్పర్యము :–** ఈ పచ్చని చెట్టుకొమ్మపై గూటిలోనున్న ఈ పక్షికూడ మహానందముతో సీతమ్మ మనస్సునకు ఊరట కలుగునట్లుగా ఇంపుగా కూయుచు, ప్రియమైన ఆమె ఆత్మబంధువు వచ్చుచున్నాడని సూచించుచు "నీ మనస్సులోని దిగులు తొలగించుకొని ఉత్సాహముగా నుండు"మని ఆమెకు ధైర్యము చెప్పుచున్నదా యన్నట్లున్నది, చూడుడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** ఇచ్చట పక్షి యనగా గొప్పపక్షములు అనగా ఱెక్కలు గలది. అనగా బలమైన ఱెక్కలతో స్వేచ్ఛగా విహరింపగలది.

**శాఖానిలయః :–** చక్కగా పుష్పించి పల్లవించి యున్న శాఖయందు గల తన గూటిలో భద్రముగ కూర్చొనియున్నది. పచ్చని తరుశాఖకే శాఖ యని వ్యవహారము. తన ఱెక్కలను చక్కగా చాచి, ప్రదక్షిణముగా ఎగురుచు పచ్చని కొమ్మపై కూర్చొని యుండుట ఒక శుభశకునము.

**ప్రహృష్టః :–** అచ్చటి ఫలము లారగించుటచే మిక్కిలి సంతోషముగ నున్నది.

పునః పునః చ ఉత్తమసాంత్వవాదీ :– ఉత్తరోత్తరవిశేషముగా సాంత్వన వచనములు పలుకుచున్నది. అనగా 'దుఃఖింపకుము. నీ భర్త ఇప్పుడే రాగలడు. దుఃఖింపవలసిన అవసరములేదు' అని ఓదార్చుచున్నట్లుగ నున్నది.

**సుస్వాగతాం వాచమ్ ఉదీరయానః : –** ఉత్తమబంధువుయొక్క రాకను సూచించు మాటను (సు+స్వ+ఆగతాం, వాచం – స్వ అనగా బంధువని అర్థము) పలుకు చున్నది. నీ ప్రియుడు నీకంటెను అమితమైన విరహతాపము నొందుచు త్వరలో రాబోవుచున్నాడని సూచించుచున్నది.

**పునః పునః చోదయతీవ** :– నీ ప్రియునిరాక నిశ్చయమై యుండగా, ఏల అభ్యంగనము, అలంకారము మున్నగునవి గావించుకొనవు అని సీతాదేవిని ప్రేరేపించుచున్నది వలె నున్నది.

**హృష్టః**:– శ్రీరాముని రాకవలన కలుగు ఆనందము తాను గూడ పొందుచున్నట్లు తన శరీరమునందలి పులకాంకురములచే సూచించుచున్నది.

ఈ రామాయణ కావ్య ముత్తమకావ్యము గదా! ఉత్తమకావ్య మనగా ధ్వని ప్రధానమైన కావ్యము. ఆ ధ్వని పదగతము, వాక్యగతము, ప్రబంధగతము అని మూడు విధములని శాస్త్రకారులయొక్క నిర్ణయము. ఇచ్చటనున్న ధ్వని ఈ సుందరకాండ రూపప్రబంధగతమైనది. ఎట్లనగా అనాదిగా భగవత్‌సంబంధముగల జీవుని ఉద్ధరించుటకు పూనుకొనియున్న ఆచార్యునియొక్క ప్రవృత్తి ఇచ్చట ధ్వనించు చున్నది. ఈ విషయమే ఈ కాండముయొక్క మొదటి శ్లోకమునందును తెలుపబడినది.

ఇచ్చట 'లంక' యనగా శరీరము. ఏకాక్షి ప్రభృతులైనట్టి రాక్షసీగణము ఇంద్రియములు. రావణకుంభకర్ణులు అహంకారమమకారములు. ఇంద్రజిత్ ప్రభృతులు కామక్రోధలోభమోహ మద మాత్సర్య దంభాదులు. అట్టి లంకలో బంధింపబడినది సీతారూపముగ నున్న జీవుడు. ఆ జీవికి భగవద్‌జ్ఞానమును ఉపదేశించు ఆచార్యుడే హనుమంతుడు. అట్టి ఆచార్యునియొక్క లక్షణమే ఈ శ్లోకముచే సూచింపబడుచున్నది.

పక్షి యనగా భగవత్ప్రాప్తికొఱకు సాధనములైన జ్ఞానకర్మలు అనెడి, రెండు పక్షములను వహించినవాడు.

"ఉభాభ్యా మేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః,
తథైవ జ్ఞానకర్మభ్యాం నియతా పరమా గతిః."

అని ఇట్లు జ్ఞానకర్మలకు అంగాంగిభవముండుటవలన ఆచార్యుడు ఆ రెండింటిని కలిగియుండవలయును. ఇచ్చట శ్రుతి ప్రమాణము – 'బ్రాహ్మణా వివిదిషంతి, యజ్ఞేన దానేన తపసా అనాశకేన'. అనగా యజ్ఞముచేతను, దానముచేతను, ఉపవాసములచేతను, బ్రాహ్మణుడు, జ్ఞాని యగుచున్నాడు. ఆచార్య శబ్దనిర్వచన మిట్లు చెప్పబడి యుండెను.

"ఆచినోతి హి శాస్త్రార్థాన్ ఆచారే స్థాపయ త్యపి,
స్వయ మాచరతే యస్మాత్, తస్మాదాచార్య ఉచ్యతే."

**శాఖానిలయః :–** ఇచ్చటి శాఖాశబ్దము వేదశాఖలను తెలుపుచున్నది. నిలయశబ్దము ఆ వేదాధ్యయననిష్ఠను తెలుపుచున్నది. వేదపరిత్యాగముచే గొప్ప ప్రత్యవాయము కలుగునని శాస్త్రమున చెప్పబడి యున్నది గదా!

"అధీత మపి యో వేదం విముంచతి నరాధమః,
భ్రూణహా స తు విజ్ఞేయః వియోని మధిగచ్ఛతి."

మఱియు శాఖానిలయః అనుటచే ఆ వేదార్థ విషయములయొక్క శ్రవణ మనన నిదిధ్యాస రూపమైన అనుష్ఠానములని గూడ చెప్పబడుచున్నది. అంతటి అనుష్ఠానము గలవాడే గురుపదమునకు అర్హుడై యుండును.

"ఆచార్యో వేదసంపన్నః విష్ణుభక్తో విమత్సరః,
మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయ శ్శుచిః,
గురుభక్తిసమాయుక్తః పురాణజ్ఞో విశేషతః,
ఏవంలక్షణసంపన్నో గురు రి త్యభిధీయతే."

ప్రహృష్టః – అనగా నిత్యము సంతుష్టహృదయుడని అర్థము. అనగా ఎల్లప్పుడును ఆనందరూపముతో నుండి ఎల్లవేళల సేవనీయుడై యుండువాడని అర్థము.

"ఆహ్లాదశీతనేత్రాంబుః పులకీకృతగాత్రవాన్,
సదా వరగుణావిష్టో ద్రష్టవ్య స్సర్వదేహిభిః."

పునః పునః చ ఉత్తమసాంత్వవాదీ – ఉత్తము డనగా ఉత్తమపురుషుడు. "ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః' అనుటచే ఉత్తమపురుషు డనగా పరమాత్మ. ఆ ఉత్తమపురుషుని విషయమైన సాంత్వమును – అనగా మంచి మాటను తన శిష్యులకు తెలుపువాడు ఉత్తమసాంత్వవాది.

'త్వం మే' 'ఉ హం మే.' 'కుత!' 'స్త'త్తదపి కుత?'
'ఇదం వేదమూలప్రమాణాత్.

ఏత చ్చానాదిసిద్ధా, దనుభవవిభవా 'త్తర్హి సాక్రోశ ఏవ.' ।

క్వాఉ ఉ క్రోశః? కస్య?' 'గీతాదిషు మమ విదితః' 'కోఉ త్ర సాక్షీ?'
'సుధీః స్యా' ।

'ద్ధంత! త్వ త్పక్షపాతీ స' ఇతి నృకలహే మృగ్యమధ్యస్థవత్త్వమ్.'॥

అని చెప్పబడిన రీతిగా భగవంతునితో మూర్ఖులైన మనుష్యులకు కలహము సంభవింపగా

"యమో వైవస్వతో రాజా యస్తవైవ హృది స్థితః, తేన చేదపి వాద స్తే మా గంగాం మా కురూన్ గమః" అనుచు సాంత్వనవచనములతో సమ్యగ్ జ్ఞాన ముపదేశించువాడు గురువే.

పునః పునః అనగా కర్షకుడు ఒకప్పుడు తన కృషి ఫలించలేదను కారణమున అంతటితో విడువకుండ తనకృషిని మఱలమఱల ఎట్లు సాగించునో, అట్లే ఆచార్యుడు గూడ తన వచనము వినకపోయినను శిష్యున కుపదేశింపక మానడు అని తెలుపబడుచున్నది. అందుచేతనే గురువు భగవంతుని కంటెను గూడ శ్రేష్ఠుడు. శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు గీత నుపదేశించి తిరిగి మఱియొక మాఱు (అశ్వమేధ పర్వమునందు) పూర్వోపదేశమును మఱచితిని, తిరిగి తెలుపుము, అని అడుగగా, నేను రెండవ మాఱు చెప్పనని శ్రీకృష్ణ పరమాత్మ తిరస్కరించెను.

"నూన మశ్రద్దధానోఽసి, దుర్మేధా శ్చాసి పాండవ!"

మఱియు 'సుస్వాగతాం వాచమ్ ఉదీరయానః', అనగా ఉత్తమ సంప్రదాయ పూర్వకమైనట్టి ఆచార్యపరంపరగా తనకు ప్రాప్తించిన వచనములను అనగా అష్టాక్షరి ఇత్యాది మంత్రములను నిర్హేతుకమైన దయతో శిష్యులకు ఉపదేశించువాడు.

'పునః పునః చోదయతి ఇవ' – అనగా తెలిసిన విషయమును ఆచరించుట కొఱకై ప్రోత్సహించుచున్నవాడై యని అర్థము. అట్టి ప్రోత్సాహము లేనిచో ఉపదేశము వ్యర్థమై పోవునుగదా! అందుచేతనే 'స్థాలిత్యే శాసితారం' అని గురువును ప్రశంసించెదరు.

హృష్టః – అనుటచే శిష్యులకు ఉపదేశించుచు ఆ యుపదేశముచే తనకు ప్రయోజనము సిద్ధించినట్లు గురువు సంతోషించునని సూచింపబడినది.

మహేశ్వరతీర్థులు:– శాఖానిలయం ప్రవిష్టః – అనగా కొమ్మపై నున్నట్టి గూటిని చేరినది. 'ఉత్తమ సాంత్వవాదీ ' – ఉత్తమమైన శాంతస్వరముతో పలుకు చున్నది. "సుస్వాగతాం వాచమ్ ఉదీరయానః" నీకు మంగళము సంభవించిన దను మాటను పలుకుచున్నది. "పునః పునః చోదయతి" – నీకు మంగళము సంభవించినది. లేచి ఎదురేగుమని మఱల మఱల ప్రబోధించు చున్నది.

'పక్షీ చ శాఖానిలయం ప్రవిష్టః' అని పాఠాంతరము.

**శ్లో॥ తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయహర్షితా ।**
**అవోచ ద్యది త త్తథ్యం భవేయం శరణం హి వః ॥ 51**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"త్రిజటాస్వప్నో' నామ*
*సప్తవింశస్సర్గః.*

**పదచ్ఛేదము :-** తతః - సా - హ్రీమతీ - బాలా - భర్తుః - విజయహర్షితా, అవోచత్ - యది - తత్ - తథ్యం - భవేయం - శరణం - హి - వః ॥

**అన్వయక్రమము :-** తతః హ్రీమతీ సా బాలా భర్తుః విజయహర్షితా (సతీ) అవోచత్ - తత్ తథ్యం - (భవేత్) యది, (అహం) వః శరణం భవేయం హి.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, హ్రీమతీ = లజ్జాశీలయైన, సా = ఆ, బాలా = ముగ్ధయైన సీతమ్మ, భర్తుః = నాథునియొక్క, విజయహర్షితా (సతీ) = విజయమునకు ఆనందము నొందినదై, అవోచత్ = పలికెను. తత్ = ఆ స్వప్నఫలితము, తథ్యం = యథార్థమైనది (భవేత్) యది = అయిన యెడల, (అహం) = నేను, వః = మీకు, శరణం = రక్షకురాలిని, భవేయం హి = కాగలను.

**తాత్పర్యము :-** త్రిజట తెలిపిన స్వప్నవృత్తాంతమును విని సీతమ్మ తన సహజమైన లజ్జాస్వభావముచే వంచికొనియున్న తలను ఎత్తకుండగనే తన ప్రాణనాథునికి కలుగబోవు విజయమునకు ఆనందము నొంది ఆ రాక్షసాంగలను జూచి ఈ స్వప్న ఫలితము సిద్ధించినప్పుడు మీకు ఎట్టి హాని కలుగకుండ రక్షణము కలిగించెదను అని అభయవచనము పలికెను.

సూచన:- ఈ చివరి శ్లోకము కొన్ని ప్రతులలో మాత్రమే కానవచ్చుచున్నది.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"త్రిజటాస్వప్నము" అను*
*ఇఱువదియేడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## అష్టావింశసర్గ

శ్లో॥ సా రాక్షసేంద్రస్య వచో నిశమ్య
త ద్రావణ స్యాప్రియ మప్రియార్తా ।
సీతా వితత్రాస యథా వనాంతే
సింహాభిపన్నా గజరాజకన్యా ॥ 1

**పదచ్ఛేదము** :- సా - రాక్షసేంద్రస్య - వచః - నిశమ్య - తత్ - రావణస్య - అప్రియమ్ - అప్రియార్తా - సీతా - వితత్రాస - యథా - వనాంతే - సింహాభిపన్నా - గజరాజకన్యా ॥

**అన్వయక్రమము** :- అప్రియార్తా సా సీతా రాక్షసేంద్రస్య రావణస్య తత్ అప్రియం వచః నిశమ్య, వనాంతే, సింహాభిపన్నా గజరాజకన్యా యథా వితత్రాస.

**ప్రతిపదార్థము** :- అప్రియార్తా సా = అప్రియ (సంఘటన) ములచే వ్యథ నొందియున్న, సా సీతా = ఆ సీతాదేవి, రాక్షసేంద్రస్య = రాక్షసరాజైన, రావణస్య = రావణుని యొక్క, తత్ అప్రియం వచః = ఆ దారుణమైన మాటను, నిశమ్య = విని, వనాంతే = అరణ్యమధ్యమున, సింహాభిపన్నా = సింహముచే పట్టుబడిన, గజరాజకన్యా యథా = గజేంద్రుని పుత్రికవలె, వితత్రాస = భీతినొందెను.

### విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :- త్రిజటాస్వప్నవృత్తాంతమును విని, కొంత యూరట చెంది నప్పటికిని, అంతకు పూర్వము రావణుడు దారుణముగా పలికినమాటలు, జ్ఞాపకము వచ్చుటచే కలిగిన దుఃఖముతో సీత ఇట్లు విలపించు చున్నదని కవి హృదయము.

**తాత్పర్యము** :- రాక్షసరాజైన రావణుని దారుణవచనములను విని సీతాదేవి యా దుఃఖముచే వివశురాలై, అడవి నడుమ సింహమునకు చిక్కిన గజరాజవధువువలె, అమితమైన భీతినొందెను.

**శ్లో॥ సా రాక్షసీమధ్యగతా చ భీరు**
**ర్వాగ్భి ర్భృశం రావణతర్జితా చ ।**
**కాంతారమధ్యే విజనే విసృష్టా**
**బాలేవ కన్యా విలలాప సీతా ॥ 2**

**పదచ్ఛేదము** :– సా – రాక్షసీమధ్యగతా – చ – భీరుః – వాగ్భిః – భృశం – రావణతర్జితా – చ – కాంతారమధ్యే – విజనే – విసృష్టా – బాలా – ఇవ – కన్యా – విలలాప – సీతా ॥

**అన్వయక్రమము** :– రాక్షసీమధ్యగతా, వాగ్భిః భృశం రావణతర్జితా చ, భీరుః సా సీతా, విజనే కాంతారమధ్యే విసృష్టా బాలా కన్యా ఇవ, విలలాప.

**ప్రతిపదార్థము** :– రాక్షసీమధ్యగతా = రాక్షసస్త్రీల మధ్య నున్నదై, వాగ్భిః = (క్రూర) వచనములచే, భృశం = తీవ్రముగా, రావణతర్జితా చ = రావణాసురునిచే గద్దింపబడినదై, సా సీతా = ఆ సీతాదేవి, విజనే = నిర్మానుష్యమైన, కాంతారమధ్యే = అరణ్యమధ్యమునందు, విసృష్టా = విడిచిపెట్టబడినట్టి, బాలా కన్యా ఇవ = చిన్న ఆడుపిల్లవలె, విలలాప = శోకించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:– విసృష్టా బాలా కన్యా ఇవ – మహాదుర్భిక్షము ఏర్పడి, ఆ క్షోభను భరింప జాలక కన్నబిడ్డను అడవిలో విడిచిపెట్టినప్పుడు తటస్థించిన ఆ బిడ్డయొక్క స్థితిని ఇచ్చట స్మరించుకొనవలెను. (అనగా అక్రమసంతానమైనట్టి బిడ్డ కాదని భావము).

**తాత్పర్యము** :– క్రూరులైన రాక్షసీగణము మధ్యనుండి దారుణములైన రావణుని మాటలచే గుండె చెదిరిపోయి యున్న సీతాదేవి ధైర్యమును గోల్పోయి, నిర్జనారణ్యము నందు పరిత్యజింపబడిన పసిబిడ్డవలె విలపించుచుండెను.

**శ్లో॥ సత్యం బతేదం ప్రవదంతి లోకే**
**నాకాలమృత్యు ర్భవతీతి సంతః ।**
**య త్రాహ మేవం పరిభర్త్స్యమానా**
**జీవామి కించి త్క్షణ మ ప్యపుణ్యా ॥ 3**

**పదచ్ఛేదము** :– సత్యం – బత – ఇదం – ప్రవదంతి – లోకే – న – అకాలమృత్యుః – భవతి – ఇతి – సంతః – యత్ర – అహమ్ – ఏవం – పరిభర్త్స్యమానా – జీవామి – కించిత్ – క్షణమ్ – అపి – అపుణ్యా ॥

**అన్వయక్రమము :–** యత్ర ఏవం పరిభర్త్స్యమానా, అపుణ్యా అహం క్షణమపి కించిత్ జీవామి; తత్ర, బత! లోకే అకాలమృత్యుః న భవతి, ఇతి సంతః యత్ ప్రవదన్తి, తత్ ఇదం సత్యమ్.

**ప్రతిపదార్థము :–** యత్ర = ఏకారణమున, ఏవం = ఈరీతిగా, పరిభర్త్స్యమానా = బెదరింపబడుచు, అపుణ్యా = పుణ్యహీనురాలనైన, అహం = నేను, క్షణ మపి = క్షణకాలమైనను, కించిత్ = కొన ఊపిరితో, జీవామి = బ్రతికి యున్నానో, తత్ర = ఆ కారణమున, బత = అయ్యో, లోకే = లోకమున, అకాలమృత్యుః = కాలము రాకుండగా మరణము, న భవతి = సంభవింపదు, ఇతి = అని, సంతః = పెద్దలు, యత్ ప్రవదన్తి = ఏ మాటను పలుకుచున్నారో, ఇదం తత్ = ఇయ్యది, సత్యం = యథార్థము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:–** అపుణ్యా = స్నానాదుల అభావముచే శుద్ధిహీననై యున్నానని సీతమ్మ భావము.

**గోవిందరాజీయము:–** కించిత్ జీవామి – కుత్సితమైన జీవితమును భరించుచున్నానని భావము.

**తాత్పర్యము :–** దుష్టుడైన రావణునిచే అవాచ్యములైన దుర్వచనములకు గుఱియగుచు, నా పుణ్యవిశేష మేమియును ఫలింపక ఇట్లు ప్రాణములతో ఇంతకాలము నిలచి యున్నా ననగా, "కాలము తటస్థింపనిదే మరణము ఎవ్వరికిని సంభవింప"దను పెద్దలమాట పరమసత్యము గదా!

**శ్లో॥ సుఖా ద్విహీనం బహుదుఃఖపూర్ణ**
**మిదం తు నూనం హృదయం స్థిరం మే ।**
**విశీర్యతే యన్న సహస్రధాఽద్య**
**వజ్రాహతం శృంగ మి వాచలస్య ॥ 4**

**పదచ్ఛేదము :–** సుఖాత్ – విహీనం – బహుదుఃఖపూర్ణమ్ – ఇదం – తు – నూనం – హృదయం – స్థిరం – మే – విశీర్యతే – యత్ – న – సహస్రధా – అద్య – వజ్రాహతం – శృంగమ్ – ఇవ – అచలస్య ॥

**అన్వయక్రమము :–** సుఖాత్ విహీనం, బహుదుఃఖపూర్ణం ఇదం మే హృదయం, వజ్రాహతమ్ అచలస్య శృంగమ్ ఇవ సహస్రధా యత్ న విశీర్యతే, తత్ నూనమ్ ఇదం స్థిరమ్.

**ప్రతిపదార్థము** :– సుఖాత్ = సుఖమునుండి, విహీనం = తొలగినదియు, బహుదుఃఖపూర్ణం = పెక్కుదుఃఖములతో నిండినదియునగు, మే = నాయొక్క, ఇదం హృదయం = ఈ గుండె, వజ్రాహతం = వజ్రాయుధముచే ప్రహరింపబడిన, అచలస్య = పర్వతముయొక్క, శృంగమ్ ఇవ = శిఖరమువలె, సహస్రధా = వేయి తునకలుగా, యత్ = ఏ కారణమున, న విశీర్యతే = ఖండములు గాకున్నదో, తత్ = ఆ కారణమున, నూనం = నిశ్చయముగా, ఇదం = ఈ గుండె, స్థిరం = కఠినమైనది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:**– స్థిరమ్ – ఆ శైలశిఖరముకంటెను గూడ కఠోరమైనదని భావము.

**తాత్పర్యము** :– సుఖములకు దూరమై, బహువిధములగు దుఃఖములకు నిలయమై యున్నట్టి ఈ నా గుండె పిడుగుపాటునకు వేయి తునుకలు అగు కొండశిఖరమువలె ఖండఖండములు గాకుండ నిబ్బరముగా నున్న దనగా నా హృదయ మా పాషాణ శిఖరము కంటెను గూడ కఠోరమైనది గదా!

**శ్లో॥ నై వాస్తి దోషం మమ నూన మత్ర**
**వధ్యాఽహ మస్యాఽప్రియదర్శనస్య ।**
**భావం న చాస్యాహ మనుప్రదాతు**
**మలం ద్విజో మంత్ర మి వాద్విజాయ ॥ 5**

**పదచ్ఛేదము** :– న – ఏవ – అస్తి – దోషం – మమ – నూనమ్ – అత్ర – వధ్యా – అహమ్ – అస్య – అప్రియదర్శనస్య – భావం – న – చ – అస్య – అహమ్ – అనుప్రదాతుమ్ – అలం – ద్విజః – మంత్రమ్ – ఇవ – అద్విజాయ ॥

**అన్వయక్రమము** :– అప్రియదర్శనస్య అస్య అహం వధ్యా; అత్ర మమ దోషం నూనం నైవ అస్తి; ద్విజః అద్విజాయ మంత్రం అనుప్రదాతుమ్ ఇవ, అహమ్ అస్య భావమ్ అనుప్రదాతుం న అలమ్.

**ప్రతిపదార్థము** :– అప్రియదర్శనస్య = అసహ్యరూపము కలిగినట్టి, అస్య = ఈ రావణునకు, అహం = నేను, వధ్యా = వధింపబడవలసిన దాననే, అత్ర = ఇప్పట్టున, (అనగా ఆత్మహత్యయందు), మమ = నాకు, దోషం = దోషము, నైవ అస్తి = ఎంతమాత్రములేదు, ద్విజః = బ్రాహ్మణుడు, అద్విజాయ = బ్రాహ్మణేతరునకు, మంత్రం = మంత్రమును, అనుప్రదాతుమ్ ఇవ = ఇచ్చుటకువలె, అహం = నేను, అస్య = ఈ రావణునకు, భావం = మనస్సును, అనుప్రదాతుం = ఇచ్చుటకు, న అలం =

సమర్థురాలనుగాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** వధ్యా అహమ్ అస్య – నైవాస్తి నూనం మమ దోష మత్ర – నేను ప్రాణత్యాగముచేసినను, నాకు ఆత్మహత్యాదోషము లేదు. రావణుని చేతనైనను నాకు దుర్మరణమే సంభవింపనున్నదిగదా! ధర్మశాస్త్రములు ఆత్మహత్య చేసికొన్నవానికిని, బ్రాహ్మణునిచే చంపబడినవానికిని సమానముగనే దహనాదిసంస్కారములకు అర్హతలేదని వక్కాణించుచున్నవి. అందుచే తన ప్రాణత్యాగముతో అతిప్రధానమైన పాతివ్రత్యరక్షణము చేసికొనుటయే సర్వదోషపరిహారమని సీతాదేవి భావము.

**గోవిందరాజీయము:–** అహం అస్య భావం ప్రదాతుం న అలం – నాహృదయము ఏనాడో శ్రీరామునకు వశమై పోయియున్నది. అతని సొత్తుగా నున్న నా మనస్సును వేఱొకనికి ఈయగల్గుట ఎట్లు సాధ్యమగునని సీతాదేవి భావము.

**వాసుదాసస్వామి:–** ఒక ఋషీశ్వరుడు శూద్రున కొకనికి వైదికవిధానముగ పైతృకకర్మము తెలిపి వానిచే నట్లు చేయించి, రాజపురోహితుడుగా బుట్టినట్లుగా భారతము – అనుశాసనపర్వమున గలదు. కాని ఈ శాస్త్రము ముముక్షువునకు భగవన్మంత్రము నుపదేశించుటను నిషేధింపదు. ఏలన – భక్తి ప్రపత్తి మార్గమున మోక్షమున కందరు అధికారులే. ఒక్క వైదికకర్మములందు మాత్రము శూద్రున కధికారము లేదు. కావున వాని విధానము మాత్రము చెప్పరాదని భావము.

**తాత్పర్యము :–** ఈ దుర్మార్గుడు ఎట్లయినను నన్ను చంపగలడు. ఈ నీచుని చేతిలో మృతికంటె ఆత్మహత్య ఎక్కువ దోషావహమైనది గాదు. ద్విజేతరునకు వేదమంత్రమును ఉపదేశించుట యోగ్యము కానట్టు నేను నా మనస్సును ఈ దుర్మార్గున కిచ్చుటమాత్రము సాధ్యముకాదు.

**శ్లో॥ నూనం మమాంగాన్యచిరా దనార్య**
**శ్శస్త్రై శ్శితై శ్ఛేత్స్యతి రాక్షసేంద్రః ।**
**తస్మి న్ననాగచ్ఛతి లోకనాథే**
**గర్భస్థజంతో రివ శల్యకృంతః ॥ 6**

**పదచ్ఛేదము :–** నూనం – మమ – అంగాని – అచిరాత్ – అనార్యః – శస్త్రైః – శితైః – ఛేత్స్యతి – రాక్షసేంద్రః – తస్మిన్ – అనాగచ్ఛతి – లోకనాథే – గర్భస్థజంతోః – ఇవ – శల్యకృంతః ॥

**అన్వయక్రమము** :- లోకనాథే తస్మిన్ అనాగచ్ఛతి సతి, శల్యకృంతః గర్భస్థజంతోః అంగాని ఇవ, అనార్యః రాక్షసేంద్రః, అచిరాత్ శితైః శస్త్రైః మమ అంగాని నూనం ఛేత్స్యతి.

**ప్రతిపదార్థము** :- లోకనాథే తస్మిన్ = జగత్ప్రభువైన ఆ శ్రీరాముడు, అనాగచ్ఛతి = రాకున్నయెడ, అనార్యః = దుర్మార్గుడైన, రాక్షసేంద్రః = రావణుడు, శల్యకృంతః = శస్త్రచికిత్సకుడు, గర్భస్థజంతోః అంగాని ఇవ = గర్భములోని శిశువుయొక్క అవయవములను వలె, మమ = నాయొక్క, అంగాని = అవయవములను, నూనం = నిశ్చయముగా, అచిరాత్ = శీఘ్రముగనే, శితైః = వాడియైన, శస్త్రైః = శస్త్రములచే, ఛేత్స్యతి = ఖండించును.

**తాత్పర్యము** :- లోకరక్షకుడైన శ్రీరాముడు గడువు ముగియక ముందు రాని యెడల ఈ దుర్మార్గుడు, మరణించిన గర్భస్థశిశువును వెలికి తీయుటకు శస్త్రచికిత్సకుడు దానిని ఖండఖండములు చేయునట్లుగా, నా అవయవములను తప్పక ముక్కలుగా ఖండించి తీరును.

**శ్లో॥ దుఃఖం బతేదం మమ దుఃఖితాయా**
**మాసౌ చిరాయాధిగమిష్యతో ద్వౌ ।**
**బద్ధస్య వధ్యస్య తథా నిశాంతే**
**రాజాపరాధా దివ తస్కరస్య ॥ 7**

**పదచ్ఛేదము** :- దుఃఖం - బత - ఇదం - మమ - దుఃఖితాయాః - మాసౌ - చిరాయ - అధిగమిష్యతః - ద్వౌ - బద్ధస్య - వధ్యస్య - తథా - నిశాంతే - రాజాపరాధాత్ - ఇవ - తస్కరస్య ॥

**అన్వయక్రమము** :- బత! ఇదం దుఃఖం, రాజాపరాధాత్ బద్ధస్య, తథా నిశాంతే వధ్యస్య తస్కరస్య ఇవ, చిరాయ దుఃఖితాయాః మమ ద్వౌ మాసౌ అధిగమిష్యతః.

**ప్రతిపదార్థము** :- బత = అయ్యో! ఇదం = ఇది, దుఃఖం = సంతాపకరమైనది, రాజాపరాధాత్ = రాజద్రోహ మను అపరాధమువలన, బద్ధస్య = బంధింప బడినట్టియు, తథా = అట్లు, నిశాంతే వధ్యస్య = తెల్లవారగనే చంపబడవలసి యున్నట్టియు, తస్కరస్య ఇవ = దొంగవానికివలె, చిరాయ = చిరకాలము, దుఃఖితాయాః = దుఃఖించి యున్నట్టి, మమ = నాకు, ద్వౌ మాసౌ = రెండు నెలలును, అధిగమిష్యతః = సమీపించుచున్నవి.

**తాత్పర్యము** :- రాజద్రోహ మను అపరాధమునకు బంధించి తెల్లవారగనే వధింపవలసియున్న చోరునకువలె చిరకాలము దుఃఖించి యున్న నాకు మిగిలిన ఈ రెండు నెలలును త్వరలోనే గడచిపోవునుగదా! ఆ తరువాతి విషయ మూహించిన ఎంత ఘోరముగా నుండును.

**శ్లో॥ హా రామ హా లక్ష్మణ హా సుమిత్రే**
**హా రామమాత స్సహ మే జనన్యా ।**
**ఏషా విపద్యా మ్యహ మల్పభాగ్యా**
**మహార్ణవే నౌ రివ మూఢవాతా ॥ 8**

**పదచ్ఛేదము** :- హా - రామ - హా - లక్ష్మణ - హా - సుమిత్రే - హా - రామమాతః - సహ - మే - జనన్యా - ఏషా - విపద్యామి - అహమ్ - అల్పభాగ్యా - మహార్ణవే - నౌః - ఇవ - మూఢవాతా ॥

**అన్వయక్రమము** :- హా రామ! హా లక్ష్మణ! హా సుమిత్రే! మే జనన్యా సహ హా రామమాతః! మహార్ణవే మూఢవాతా నౌః ఇవ అల్పభాగ్యా ఏషా అహం విపద్యామి.

**ప్రతిపదార్థము** :- హా రామ = అయ్యో శ్రీరామా! హా లక్ష్మణ = అయ్యో లక్ష్మణా, హా సుమిత్రే = అయ్యో సుమిత్రా! మే జనన్యా సహ = నాతల్లితో గూడిన, హా రామమాతః = అయ్యో రాముని తల్లివైన ఓ కౌసల్యా దేవీ! మహార్ణవే = నట్టనడి సముద్రమున, మూఢవాతా = పెనుగాలి కలిగియున్న, నౌః ఇవ = ఓడవలె, అల్పభాగ్యా = భాగ్యహీనురాలనైనట్టి, ఏషా అహం = ఈ నేను, విపద్యామి = నశించి పోవుచున్నాను.

**తాత్పర్యము** :- అయ్యో శ్రీరామచంద్రా! హా లక్ష్మణా! హా సుమిత్రా! అయ్యో! నా కన్నతల్లీ! శ్రీరామజననివైన ఓ కౌసల్యా! నట్టనడిసముద్రమున పెనుతుఫానులో చిక్కుకొన్న నౌకవలె మీకెల్లరకును దూరమై ఇచ్చట నేను ఈరీతిగా అంతరించి పోవుచున్నాను.

**శ్లో॥ తరస్వినౌ ధారయతా మృగస్య**
**సత్త్వేన రూపం మనుజేంద్రపుత్రౌ ।**
**నూనం విశస్తౌ మమ కారణా త్తౌ**
**సింహర్షభౌ ద్వా వివ వైద్యుతేన ॥ 9**

**పదచ్ఛేదము** :- తరస్వినౌ - ధారయతా - మృగస్య - సత్త్వేన - రూపం -

మనుజేంద్రపుత్రౌ - నూనం - విశస్తౌ - మమ - కారణాత్ - తౌ - సింహర్షభౌ - ద్వౌ - ఇవ - వైద్యుతేన ॥

**అన్వయక్రమము** :- మృగస్య రూపం ధారయతా సత్త్వేన వైద్యుతేన ద్వౌ సింహర్షభౌ ఇవ తౌ తరస్వినౌ మనుజేంద్రపుత్రౌ మమ కారణాత్ నూనం విశస్తౌ.

**ప్రతిపదార్థము** :- మృగస్య = లేడియొక్క, రూపం = రూపమును, ధారయతా = ధరించినట్టి, సత్త్వేన = ప్రాణిచే, వైద్యుతేన = పిడుగుచేత, ద్వౌ సింహర్షభౌ ఇవ = రెండు సింహవృషభములవలె, తరస్వినౌ = ప్రతాపవంతులైన, తౌ మనుజేంద్రపుత్రౌ = ఆ రాజకుమారు లిరువురును, మమ కారణాత్ = నామూలముననే, నూనం = నిశ్చయముగా, విశస్తౌ = వధింపబడిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము**:- ద్వౌ సింహర్షభౌ ఇవ - రెండు సింహములవలెను, రెండు వృషభముల వలెను.

**రా. శిరోమణి**:- సింహర్షభౌ - రెండు శ్రేష్ఠములైన సింహములవలె.

**తాత్పర్యము** :- పెద్దపిడుగుపాటుచే హతమారిన సింహముల జంటవలెను, వృషభముల జంటవలెను, మహావీరులైన ఈ రాజకుమారు లిరువురును దుష్టమైన నాకోరిక కారణముగా, లేడిరూపమును ధరించి వచ్చిన ఒకానొక దుష్టసత్త్వము చేతిలో చనిపోయిరి. ఇదే యథార్థము.

**శ్లో॥ నూనం స కాలో మృగరూపధారీ**
**మా మల్పభాగ్యాం లులుభే తదానీమ్ ।**
**య త్రార్యపుత్రం విససర్జ మూఢా**
**రామానుజం లక్ష్మణపూర్వజం చ ॥** 10

**పదచ్ఛేదము** :- నూనం - సః - కాలః - మృగరూపధారీ - మామ్ - అల్పభాగ్యాం లులుభే - తదానీం - యత్ర - ఆర్యపుత్రం - విససర్జ - మూఢా - రామానుజం - లక్ష్మణపూర్వజం - చ ॥

**అన్వయక్రమము** :- యత్ర అహం రామానుజమ్ ఆర్యపుత్రం లక్ష్మణపూర్వజం చ మూఢా విససర్జ, తదానీం నూనం సః కాలః మృగరూపధారీ సన్ అల్పభాగ్యాం మాం లులుభే.

**ప్రతిపదార్థము** :- యత్ర = ఎచ్చట, ఆర్యపుత్రం = నా భర్తయును, లక్ష్మణపూర్వజం = లక్ష్మణుని అన్నయునైనట్టి శ్రీరాముని, రామానుజం = రామునికి ప్రియుడైన తమ్ముడగు లక్ష్మణుని, మూఢా = మూర్ఖురాలనై, విససర్జ = పంపి వేసియుంటినో, తదానీం = ఆ సమయమున, కాలః = యమధర్మరాజే, సః మృగరూపధారీ సన్ = ఆ లేడి రూపమును ధరించినవాడై, నూనం = నిశ్చయముగా, అల్పభాగ్యాం = భాగ్య హీనురాలనైనట్టి, మాం = నన్ను, లులుభే = లోభపెట్టెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:**- రామానుజం లక్ష్మణపూర్వజం చ - బాల్యమునుండియు పరమస్నేహముతో నుండుటచేతను ఒకరిని బోలి ఒక రుండుటచేతను, రామలక్ష్మణులకు ఈ పర్యాయపదములు ఇట సరసముగ వాడబడినవి.

వారిని వాల్మీకి పరస్పరస్య సదృశౌ - అని పూర్వమే వర్ణించియుండెను.

**వాసుదాసస్వామి:**- కవి ఇచ్చట ఈ ప్రయోగము చేయుట ఇరువురును ఇంచు మించు సమానులని తెలుపుటకని ఎఱుగునది. 'ద్వా సుపర్ణా సయుజౌ సఖాయౌ' అను శ్రుతి నిట అనుసంధించునది. దీనివలన శుద్ధాత్మ పరమాత్మ లించుమించుగా సమానులని భావము.

**తాత్పర్యము** :- నిశ్చయముగా ఆనాడు ఆ యమధర్మరాజే ఆ లేడిరూపమును ధరించి నిర్భాగ్యురాలనైన నన్ను లోభమునకు గుఱిచేసెను. లేనిచో ఆ విధముగా మూర్ఖురాలనై లక్ష్మణప్రియసోదరుడైన శ్రీరాముని, అతని ముద్దుల తమ్ముడైన లక్ష్మణుని, నేను దూరము చేసికొందునా!

**శ్లో॥ హా రామ సత్యవ్రత దీర్ఘబాహో**
**హా పూర్ణచంద్రప్రతిమానవక్త్ర ।**
**హా జీవ లోకస్య హితః ప్రియ శ్చ**
**వధ్యాం న మాం వేత్సి హి రాక్షసానామ్ ॥ 11**

**పదచ్ఛేదము** :- హా - రామ - సత్యవ్రత - దీర్ఘబాహో - హా - పూర్ణచంద్రప్రతిమానవక్త్ర - హా - జీవ - లోకస్య - హితః - ప్రియః - చ - వధ్యాం - న - మాం - వేత్సి - హి - రాక్షసానామ్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము :-** హా రామ = అయ్యో శ్రీరామా! సత్యవ్రత = సత్యవాక్యపరిపాలకుడా!, దీర్ఘబాహో = మహావీరలక్షణసంయుతుడా, హా పూర్ణచంద్రప్రతిమానవక్త్ర = అయ్యో! నిండు చందురుని బోలిన ముఖము గలవాడా! హా జీవ! = అయ్యో నా ప్రాణమా! లోకస్య = జగత్తునకు, హితః = శ్రేయస్సును గూర్చువాడవును, ప్రియ శ్చ = ప్రియమైన వాడవునగు, త్వం = నీవు, రాక్షసానాం = రాక్షసులకు, వధ్యాం = వధ్యురాలనుగా నున్న, మాం = నన్ను గూర్చి, న వేత్సి హి = ఎఱుగకున్నావు గదా!

**తాత్పర్యము :-** అయ్యో! శ్రీరామచంద్రా! సత్యపాలకుడా! పూర్ణచంద్ర సన్నిభ సుందర వదనారవిందుడా! సమస్తలోకమునకును క్షేమమును, ప్రియమును గూర్చు నీవు ఇచ్చట రాక్షసుల చేతిలో వధింపబడబోవుచున్న నన్ను గూర్చి ఒకింతయును తెలియలేకుంటివి గదా!

**శ్లో॥ అనన్యదైవత్వ మియం క్షమా చ**
**భూమౌ చ శయ్యా నియమ శ్చ ధర్మే ।**
**పతివ్రతాత్వం విఫలం మ మేదం**
**కృతం కృతఘ్నే ష్వివ మానుషాణామ్ ॥ 12**

**పదచ్ఛేదము :-** అనన్యదైవత్వమ్ - ఇయం - క్షమా - చ - భూమౌ - చ - శయ్యా - నియమః - చ - ధర్మే, పతివ్రతాత్వం - విఫలం - మమ - ఇదం - కృతం - కృతఘ్నేషు - ఇవ - మానుషాణామ్ ॥

**అన్వయక్రమము :-** సుగమము.

**ప్రతిపదార్థము :-** కృతఘ్నేషు = చేసినమేలు మఱచు దుష్టులయందు, మానుషాణాం = మానవులయొక్క, కృతమ్ ఇవ = ఉపకారము వలె, మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, అనన్యదైవత్వం = భర్తపై ఏకైకదైవత్వభావమును, ఇయం = ఈ, క్షమా చ = కష్టసహనమును, భూమౌ = భూతలమందు, శయ్యా చ = శయనమును, ధర్మే = ధర్మమునందు, నియమః చ = నియమమును, ఇదం = ఈ, పతివ్రతాత్వం చ = పాతివ్రత్యధర్మమును, విఫలమ్ = వ్యర్థము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:-** 'ధర్మో రక్షతి రక్షితః' = అను నిర్వివాదమైన సత్యము నాయెడల నిష్ఫలమైనది. నా క్షమాగుణము అనగా శాపముచే శత్రువులను సంహరించునట్టి శక్తియున్నను దానిని వినియోగింపక కష్టములను వహించుచున్న నా ఓర్పు

నిష్ఫలమైనది.

**గోవిందరాజీయము:–** 'ధర్మే నియమః చ' – రక్షకత్వధర్మము (బాధ్యత) శ్రీరాముని యందే గలదని, అతని అనుజ్ఞలేనిదే ఆత్మరక్షణప్రయత్నము గూడ అధర్మమే యగునని సీతమ్మ రావణుడు పెట్టుచున్న బాధలను సహించెనే గాని ప్రతీకారమునకు పూనుకొనలేదు. ఈ విషయమే 'న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హతేజసా' అని రావణునితో పలికియున్నది గదా!

**వాసుదాసస్వామి:–** "అనన్యదైవత్వం, పతివ్రతాత్వం" – భక్తుడు, ప్రపన్నుడు, పతివ్రత – ఈ మువ్వురును సమానులు. కావున పతివ్రతయైన సీతమ్మ భావమిట్లున్నది. "నాథా! నీయందు నేను ఏకభక్తిగలదాన నగుటచేతనే నీవు నారాయణపూజ చేయునప్పుడు నేను నీసహాయురాలుగా నుండి కావలసినవి అందిచ్చుచుంటినేగాని నారాయణునందు గూడ దైవబుద్ధి నుంచి యర్చించినదానను కాదు గదా!

'ఏకభక్తి ర్విశిష్యతే.' 'అనన్యా శ్చింతయంతో మాం' 'అనన్యచేతా స్సతతం, అనన్యభాక్, అనన్యమనసః, అనన్యయోగేన' ఇత్యాది భగవద్గీతావాక్యము లిచట అనుసంధించుకొనవలెను.

**తాత్పర్యము :–** చేసిన మేలు మఱచునట్టి దుర్మార్గుల యెడల కావించిన ఉపకారమువలె, నాభర్తృసేవ, నా సహనశీలము, నా నియమపాలనము, నా ధర్మాచరణము, నా పాతివ్రత్యము, సర్వము నేడు విఫలమయ్యెను గదా!

**శ్లో॥ మోఘో హి ధర్మ శ్చరితో మయాఽయం**
**త థైకపత్నీత్వ మిదం నిరర్థకమ్ ।**
**యా త్వాం న పశ్యామి కృశా వివర్ణా**
**హీనా త్వయా సంగమనే నిరాశా ॥ 13**

**పదచ్ఛేదము :–** మోఘః – హి – ధర్మః – చరితః – మయా – అయమ్ – తథా – ఏకపత్నీత్వమ్ – ఇదం – నిరర్థకమ్, యా – త్వాం – న – పశ్యామి – కృశా – వివర్ణా – హీనా – త్వయా – సంగమనే – నిరాశా ॥

**అన్వయక్రమము :–** త్వయా సంగమనే నిరాశా, హీనా, కృశా, వివర్ణా, యా అహం త్వాం న పశ్యామి, (తయా) మయా చరితః అయం ధర్మః మోఘః హి; తథా (మమ) ఇదమ్ ఏకపత్నీత్వం నిరర్థకమ్.

**ప్రతిపదార్థము :–** త్వయా = నీతోడ, సంగమనే = కలసికొనుట యందు, నిరాశా =

ఆశలేనిదాననై, హీనా = భాగ్యహీనురాలనై, కృశా = కృశించినదాననై, వివర్ణా = దీనురాలనైయున్న, (యా) అహం = (ఏ) నేను, త్వాం = నిన్ను, న పశ్యామి = చూడలేక పోవుచున్నానో, (తయా) మయా = అట్టి నాచేత, చరితః = ఆచరింపబడినట్టి, అయం ధర్మః = ఈ ధర్మము, మోఘః హి = వ్యర్థమే గదా! తథా = అట్లే, ఇదమ్ ఏకపత్నీత్వం = ఈ పాతివ్రత్య ధర్మము, నిరర్థకమ్ = వ్యర్థము.

**తాత్పర్యము :–** నీకు దూరమై, నిన్ను కలసికొను ఆశ లేనిదాననై, కృశించి, దైన్యముతో నిన్ను గనలేకున్నట్టి నేను చేసిన ధర్మమంతయును వ్యర్థమైనదిగదా! నా పాతివ్రత్య విశేషము గూడ నిరర్థకమే యైనది గదా!

**శ్లో॥ పితు ర్నిదేశం నియమేన కృత్వా**
**వనా న్నివృత్త శ్చరితవ్రతశ్చ ।**
**స్త్రీభి స్తు మన్యే విపులేక్షణాభి**
**స్త్వం రంస్యసే వీతభయః కృతార్థః ॥ 14**

**పదచ్ఛేదము :–** పితుః – నిదేశం – నియమేన – కృత్వా – వనాత్ – నివృత్తః – చరితవ్రతః – చ – స్త్రీభిః – తు – మన్యే – విపులేక్షణాభిః – త్వం – రంస్యసే – వీతభయః – కృతార్థః ॥

**అన్వయక్రమము :–** నియమేన పితుః నిదేశం కృత్వా, చరితవ్రతః, వనాత్ నివృత్తః త్వం కృతార్థః, వీతభయః చ సన్, విపులేక్షణాభిః స్త్రీభిః రంస్యసే ఇతి మన్యే.

**ప్రతిపదార్థము :–** నియమేన = నియమముతో, పితుః = తండ్రియొక్క, నిదేశం = ఆజ్ఞను, కృత్వా = పాలించి, చరితవ్రతః = నెఱవేర్చుకొన్న నియమపాలనము గలవాడవై, వనాత్ = అరణ్యము నుండి, నివృత్తః = వెనుకకు వెళ్లినవాడవై, కృతార్థః = చరితార్థుడవును, వీతభయః చ(సన్) = భయముతొలగిన వాడవు నగుచు, త్వం = నీవు, విపులేక్షణాభిః = పెద్దకన్నులు గల్గినట్టి, స్త్రీభిః = కాంతలతో, రంస్యసే = క్రీడింపగలవు, ఇతి = అని, మన్యే = తలంచుచున్నాను.

**తాత్పర్యము :–** నీ తండ్రి ఆజ్ఞను యథావిధిగా నెఱవేర్చి కృతకృత్యుడవై అరణ్యము నుండి మఱలి అయోధ్యకు చేరుకొని తలపెట్టిన కార్యమును సాధించి సంతోషముతోను, తొలగిన శత్రుభయముతోడను నిన్ను కామించు పెక్కుమంది కాంతలను చేరదీసి నీవు స్వేచ్ఛగా విహరింప గలవు గదా! అని నేను తలంచుచున్నాను.

**శ్లో॥ అహం తు రామ త్వయి జాతకామా**
**చిరం వినాశాయ నిబద్ధభావా ।**
**మోఘం చరిత్వా చ తపో వ్రతం చ**
**త్యక్ష్యామి ధి గ్జీవిత మల్పభాగ్యా ॥ 15**

**పదచ్ఛేదము** :- అహం - తు - రామ - త్వయి - జాతకామా - చిరం - వినాశాయ - నిబద్ధభావా - మోఘం - చరిత్వా - చ - తపః - వ్రతం - చ - త్యక్ష్యామి - ధిక్ - జీవితమ్ - అల్పభాగ్యా ॥

**అన్వయక్రమము** :- హే రామ! త్వయి జాతకామా అహం వినాశాయ త్వయి నిబద్ధభావా, తపః చ వ్రతం చ మోఘం చరిత్వా, అల్పభాగ్యా జీవితం త్యక్ష్యామి; మాం ధిక్.

**ప్రతిపదార్థము** :- హే రామ = ఓ రామా! త్వయి = నీ యందు, జాతకామా = జనించిన ప్రేమగలదాననై, వినాశాయ = నాశనముకొఱకు, త్వయి = నీయందు, చిరం = చిరకాలము, నిబద్ధభావా = లగ్నమైనట్టి హృదయము గలదాననై, మోఘం = వ్యర్థమైన, తపః = తపస్సును, వ్రతం చ = వ్రతమును, చరిత్వా = ఆచరించి, అల్పభాగ్యా = క్షీణభాగ్యురాలనై, జీవితం = ప్రాణమును, త్యక్ష్యామి = విడిచెదను, మాం = నన్నుగూర్చి, ధిక్ = నిందయగు గాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి**:- ఇందు చెప్పబడిన వన్నియు పరమభక్తులయు, ప్రపన్నులయు కృత్యములు. ఏకదేవోపాస్తి గలవాడైన భక్తుడు భగవచ్చరిత్రములు తప్ప వేఱు లౌకిక వార్తలు వినరాదు. తన దేహసుఖములు కోరరాదు. రక్షకుడు భగవంతుడే యని దృఢవిశ్వాసము గలిగి, తన యోగక్షేమములకై తానుగా ప్రయత్నించరాదు.

**తాత్పర్యము** :- ఓ రామా! నేను నిన్ను ప్రేమించినదాననై నీయందే హృదయమును నిల్పుకొని చిరకాలము గడిపి చివరకు వినాశము తెచ్చుకొని వ్యర్థమైన తపస్సును, వ్రతమును గావించుచు భాగ్యహీనురాలనై చివర కిట్లు ప్రాణము గోల్పోవుచున్నాను. ఇట్టి నే నెంత నిర్భాగ్యురాలనో గదా!

**శ్లో॥ సా జీవితం క్షిప్ర మహం త్యజేయం**
**విషేణ శస్త్రేణ శితేన వాపి ।**

**విషస్య దాతా న హి మే ఽస్తి కశ్చి**
**చ్ఛస్త్రస్య వా వేశ్మని రాక్షసస్య ॥ 16**

**పదచ్ఛేదము :–** సా – జీవితం – క్షిప్రమ్ – అహం – త్యజేయం – విషేణ – శస్త్రేణ – శితేన – వా – అపి – విషస్య – దాతా – న – హి – మే – అస్తి – కశ్చిత్ – శస్త్రస్య – వా – వేశ్మని – రాక్షసస్య ॥

**అన్వయక్రమము :–** సా అహం క్షిప్రం విషేణ, శితేన శస్త్రేణ వా అపి జీవితం త్యజేయం, రాక్షసస్య వేశ్మని మే విషస్య, శస్త్రస్య వా దాతా కశ్చిత్ నాస్తి హి!

**ప్రతిపదార్థము :–** సా అహం = అట్టి నేను, విషేణ = విషముచేత గాని, శితేన = వాడియైన, శస్త్రేణ వా అపి = ఆయుధముచేత గాని, క్షిప్రం = శీఘ్రముగా, జీవితం = జీవితమును, త్యజేయం = విడిచిపెట్టెదను, రాక్షసస్య = (ఈ) రాక్షసునియొక్క, వేశ్మని = భవనమునందు, మే = నాకు, విషస్య = విషముయొక్క గాని, శస్త్రస్య వా = శస్త్రముయొక్క గాని, దాతా = ఇచ్చువాడు, కశ్చిత్ = ఎవ్వడును, న అస్తి హి = లేడుగదా!

**తాత్పర్యము :–** ఈ విధముగా నిర్భాగ్యురాలనైన నేను ఏ విషమును మ్రింగియో, ఏ శస్త్రమును ప్రయోగించియో శీఘ్రముగా నా జీవితమును అంతమొందించుకొందును. కాని అయ్యో! ఈ రాక్షసుని మందిరమునందు నాకింత విషము నిచ్చువాడు గాని, ఏ ఖడ్గమునైన నొసగువాడు గాని ఎవ్వడును లేడు గదా!

**శ్లో॥ ఇతీవ దేవీ బహుధా విలప్య**
**సర్వాత్మనా రామ మనుస్మరంతీ ।**
**ప్రవేపమానా పరిశుష్కవక్త్రా**
**నగోత్తమం పుష్పిత మాససాద ॥ 17**

**పదచ్ఛేదము :–** ఇతి – ఇవ – దేవీ – బహుధా – విలప్య – సర్వాత్మనా – రామమ్ – అనుస్మరంతీ – ప్రవేపమానా – పరిశుష్కవక్త్రా – నగోత్తమం – పుష్పితమ్ – ఆససాద ॥

**అన్వయక్రమము :–** దేవీ ఇతీవ బహుధా విలప్య సర్వాత్మనా రామమ్ అనుస్మరంతీ, ప్రవేపమానా, పరిశుష్కవక్త్రా పుష్పితం నగోత్తమమ్ ఆససాద.

**ప్రతిపదార్థము :–** దేవీ = పూజ్యురాలైన సీతాదేవి, ఇతీవ = ఇటువలె, బహుధా = పెక్కుభంగుల, విలప్య = విలపించి, సర్వాత్మనా = సర్వవిధముల, రామమ్ అనుస్మరంతీ

= రాముని ధ్యానించుచు, ప్రవేపమానా = మిక్కిలి కంపించుచున్నదై, పరిశుష్కవక్త్రా = తడి యారిపోయిన నోరు గలది యగుచు, పుష్పితం = పూచియున్న, నగోత్తమం = శ్రేష్ఠమైన (శింశుపా) వృక్షమును, ఆససాద = చేరెను.

**తాత్పర్యము :–** సీతాదేవి ఈ విధముగా పెక్కురీతులుగా విలపించుచు సర్వవిధముల శ్రీరామునే చింతించుచు, దుఃఖభారముచే వణకిపోవుచు సంతాపాతిశయముచే నోరు ఎండిపోవుచుండగా, చక్కగా పుష్పించియున్న ఆ శింశుపావృక్షము మొదటికి చేరెను.

**శ్లో॥ శోకాభితప్తా బహుధా విచింత్య**
**సీతాఽథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా ।**
**ఉద్బుధ్య వేణ్యుద్గ్రథనేన శీఘ్ర**
**మహం గమిష్యామి యమస్య మూలమ్ ॥ 18**

**శ్లో॥ ఉపస్థితా సా మృదుసర్వగాత్రీ**
**శాఖాం గృహీత్వాఽథ నగస్య తస్య. 19**

**పదచ్ఛేదము :–** శోకాభితప్తా – బహుధా – విచింత్య – సీతా – అథ – వేణ్యుద్గ్రథనం – గృహీత్వా – ఉద్బుధ్య – వేణ్యుద్గ్రథనేన – శీఘ్రమ్ – అహం – గమిష్యామి – యమస్య – మూలమ్. ఉపస్థితా – సా – మృదుసర్వగాత్రీ – శాఖాం – గృహీత్వా – అథ – నగస్య – తస్య ॥

**అన్వయక్రమము :–** అథ మృదుసర్వగాత్రీ సా సీతా వేణ్యుద్గ్రథనేన ఉద్బుధ్య అహం శీఘ్రం యమస్య మూలం గమిష్యామి, ఇతి శోకాభితప్తా బహుధా విచింత్య, అథ వేణ్యుద్గ్రథనం గృహీత్వా తస్య నగస్య శాఖాం గృహీత్వా ఉపస్థితా.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, మృదుసర్వగాత్రీ = కోమలమైన సర్వావయవములును గలిగినట్టి, సా సీతా = ఆ సీతాదేవి, వేణ్యుద్గ్రథనేన = జడముడితో, ఉద్బుధ్య = ఉరిపోసికొని, అహం = నేను, శీఘ్రం = వెంటనే, యమస్య = యమునియొక్క, మూలం = సన్నిధినిగూర్చి, గమిష్యామి = పోయెదను, ఇతి = అని, శోకాభితప్తా = శోకముచే సంతాపము నొందినదై, బహుధా = పెక్కువిధములుగా, విచింత్య = ఆలోచించి, అథ = అనంతరము, వేణ్యుద్గ్రథనం = జడను, గృహీత్వా = పట్టుకొని, తస్య నగస్య = ఆ (శింశుపా) వృక్షముయొక్క, శాఖాం = కొమ్మను, గృహీత్వా = (ఇంకొకచేతితో) పట్టుకొని, ఉపస్థితా = నిలచియుండెను.

**బొంబాయి పాఠము:–** 'వేణ్యుద్గ్రథనం'కు మాఱుగా 'వేణీగ్రథనం' అని పాఠము కలదు.

**తాత్పర్యము :-** అటు పిమ్మట కుసుమకోమలాంగియైన ఆ సీతాదేవి పలువిధములగు చింతలతో సంతాపము నొంది పెక్కు ఆలోచనలు చేసి పిమ్మట నా కేశపాశముతోడనే మెడకు ఉరిపోసికొని త్వరలో యముని చేరుకొందునని తన జడముడిని ఒక చేతితో పట్టుకొని ఆ శింశుపావృక్షముయొక్క కొమ్మను క్రిందికి లాగి ఇంకొక చేతితో పట్టుకొని అచట నిలచి యుండెను.

**శ్లో॥ తస్యాస్తు రామం ప్రవిచింతయంత్యా**
**రామానుజం స్వం చ కులం శుభాంగ్యాః ।**
**శోకానిమిత్తాని తథా బహూని**
**ధైర్యార్జితాని ప్రవరాణి లోకే ।**
**ప్రాదు ర్నిమిత్తాని తదా బభూవుః**
**పురాఽపి సిద్ధా న్యుపలక్షితాని ॥ 20**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"ఉద్బంధనప్రయత్నో" నామ*
*అష్టావింశస్సర్గః.*

**పదచ్ఛేదము :-** తస్యాః - తు - రామం - ప్రవిచింతయంత్యాః - రామానుజం - స్వం - చ - కులం - శుభాంగ్యాః - శోకానిమిత్తాని - తథా - బహూని - ధైర్యార్జితాని - ప్రవరాణి - లోకే - ప్రాదుః - నిమిత్తాని - తదా - బభూవుః - పురా - అపి - సిద్ధాని - ఉపలక్షితాని ॥

**అన్వయక్రమము :-** రామం, రామానుజం, స్వం కులం చ ప్రవిచింతయంత్యాః, శుభాంగ్యాః తస్యాః బహూని, శోకానిమిత్తాని, ధైర్యార్జితాని, తథా లోకే ప్రవరాణి, పురా అపి సిద్ధాని ఉపలక్షితాని నిమిత్తాని తదా ప్రాదుర్బభూవుః.

**ప్రతిపదార్థము :-** రామం = శ్రీరాముని గూర్చియు, రామానుజం = లక్ష్మణుని గూర్చియు, స్వం కులం చ = తన కులమును గూర్చియు, ప్రవిచింతయంత్యాః = మిక్కిలిగా ఆలోచించుచున్నట్టి, శుభాంగ్యాః తస్యాః = శుభలక్షణసంపన్నయైనట్టి ఆ సీతమ్మకు, తదా = అప్పుడు, శోకానిమిత్తాని = శోకమునకు కారణము గానట్టియును, ధైర్యార్జితాని = ధైర్యమును గూర్చునట్టివియు, తథా = అట్లే, లోకే = లోకమున, ప్రవరాణి = ప్రసిద్ధమైనవియును, పురా అపి = పూర్వకాలమునందుగూడ, సిద్ధాని

= సఫలమైనవిగా, ఉపలక్షితాని = నిర్ణయింప బడినట్టివియు నగు, బహూని నిమిత్తాని = పెక్కు శుభశకునములు, ప్రాదుర్బభూవుః = సంభవించినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** స్వం కులం చ విచింతయంత్యాః – అనుటచే తనవంశమునకు మచ్చతెచ్చు ఆత్మహత్యకు భయపడుచున్నదని సూచింపబడినది.

**రా.శిరోమణి :–** పురా అపి సిద్ధాని – పూర్వము మిథిలయందు తాను రాముని చూడబోవుటకు ముం దెట్టి శుభశకునములు గాన్పించినవో, అట్టి శుభశకునములు సీతమ్మకు గోచరించెనని భావము.

**వాసుదాసస్వామి:–** అవమానము వలన గాని, అతికోపముచే గాని, స్నేహముచేగాని, భయముచేగాని, ఉరిపోసుకొనియో, ఏ బలవంతపు మరణము చేతనో స్త్రీయైనను, పురుషుడైనను చచ్చిన యెడల దుర్గంధముతో కూడిన యంధతమిస్ర మను నరకమున బడి యుండవలెను.

జనకుని వంటి మహాత్ముని వంశమున బుట్టినదాననై ఇట్టి నీచపు చావు ఎట్లు చత్తునా యని ఆలోచించెను.

రామలక్ష్మణులను దలచుట – నేనిట్లు చేసిన వారి కపకీర్తి రాదా! వారేమైన యత్నము చేయుచున్నారేమో! నేనిప్పుడు చచ్చినచో వారు అసమర్థులై ఆడుదానిని రక్షింపలేక చావవిడిచిరని లోకులు తలపోయుదురేమో! అనియు తలచెను.

**తాత్పర్యము :–** తన భర్తయైన శ్రీరాముని, అతని ప్రియసోదరుడైన లక్ష్మణుని, నిష్కళంకమైన తన వంశమును గూర్చి తలచుకొనుచున్న ఆ సీతాదేవికి ధైర్యమును కల్పించునవియును, శోకము నణచునవియును, శుభశకునములుగా లోకప్రసిద్ధమైనవియును, పలుమాఱులు తనకు శుభసూచకములుగా అనుభవమున నున్నవియును అగు శుభశకునములు ఎన్నియో గాన్పింపసాగెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"ఉద్బంధనప్రయత్నము" అను*
*ఇఱువదిఎనిమిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకోనత్రింశసర్గ

**శ్లో॥ తథాగతాం తాం వ్యథితా మనిందితాం**
**వ్యపేతహర్షాం పరిదీనమానసాం ।**
**శుభాం నిమిత్తాని శుభాని భేజిరే**
**నరం శ్రియా జుష్టమి వోపజీవినః ॥ 1**

**పదచ్ఛేదము** :– తథాగతాం – తాం – వ్యథితామ్ – అనిందితాం – వ్యపేతహర్షాం – పరిదీనమానసామ్, శుభాం – నిమిత్తాని – శుభాని – భేజిరే – నరం – శ్రియా – జుష్టమ్ – ఇవ – ఉపజీవినః ॥

**అన్వయక్రమము** :– తథాగతాం, వ్యథితామ్, అనిందితాం, వ్యపేతహర్షాం, పరిదీన మానసాం, తాం శుభాం శ్రియా జుష్టం నరమ్ ఉపజీవినః ఇవ, శుభాని నిమిత్తాని భేజిరే.

**ప్రతిపదార్థము** :– తథాగతాం = అట్టిస్థితిలో నున్నట్టిదియు, వ్యథితామ్ = దిగులు చెందినదియు, అనిందితాం = ఉత్తమ స్వభావురాలైనట్టిదియును, వ్యపేతహర్షాం = తొలగిపోయిన సంతోషము గల్గినదియు, పరిదీనమానసాం = శోకముతో నిండినట్టి మనస్సు గలదియు నగు, తాం శుభాం = ఆ మంగళస్వరూపురాలైన సీతను, శ్రియా = ఐశ్వర్యముతో, జుష్టం = నిండిన, నరం = పురుషుని, ఉపజీవినః ఇవ = అనుచరులువలె, శుభాని = శుభసూచకములైన, నిమిత్తాని = శకునములు, భేజిరే = పొందినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము**:– తథాగతాం – 'రహస్యం చ ప్రకాశం చ' అని గ్రంథాదియందు చెప్పినట్లుగా సీతారాముల చరిత్ర సర్వమును తనకు గోచరించుచున్నట్టి దైనప్పటికిని ఆ సమయమునందలి సీతమ్మ దుఃఖము తన వాక్కుల కందనిదిగా తానే చెప్పుకొనుచు అట్టి దుఃఖములో మునిగియున్నదని ఆదికవియైన వాల్మీకి యథార్థమును వెల్లడించు

చున్నాడు. అట్లే ఈ శ్లోకమున 'సీతాం' అని చెప్పక 'తాం' అని చెప్పుటచే అచ్చట సీతగాక మూర్తీభవించిన ఒక శోకదేవతయే యున్నదని కవి మనకు తెలుపుచున్నాడు.

'అనిందితాం' – శ్రీరాముని ఎడబాటు కాలమున అతని ధర్మపత్ని నిందకు దూరముగా ఎట్లుండవలెనో అట్లే యున్నట్టిది.

శుభాని నిమిత్తాని భేజిరే – సేవాభావముతో స్వయముగా శుభశకునములు సీతమ్మకు గాన్పించుచు తమ ఉనికిని అవి సార్థకము చేసికొన్నవి.

**తాత్పర్యము** :– అపారమైన దుఃఖభారముతో మునిగి సంతోషమునకు దూరమై, దిగులుతో నిండిన హృదయముతో నుండియు నిందకు దూరమైన వర్తనముతో చరించుచున్న ఆ సీతాదేవికి ఐశ్వర్యవంతుడైన ఉదారపురుషుని (కడకు చేరి) ఆశ్రితులు చుట్టు ముట్టునట్లుగా ఎన్నియో శుభశకునములు పరంపరగ గోచరింపసాగెను.

**శ్లో॥ తస్యా శ్శుభం వామ మరాళపక్ష్మ**
**రాజీవృతం కృష్ణవిశాలశుక్లమ్ ।**
**ప్రాస్పంద తైకం నయనం సుకేశ్యా**
**మీనాహతం పద్మ మి వాభితామ్రమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :– తస్యాః – శుభం – వామమ్ – అరాళపక్ష్మరాజీవృతం – కృష్ణవిశాల – శుక్లం – ప్రాస్పందత – ఏకం – నయనం – సుకేశ్యాః – మీనాహతం – పద్మమ్ – ఇవ – అభితామ్రమ్.

**అన్వయక్రమము** :– తస్యాః సుకేశ్యాః, శుభమ్, అరాళపక్ష్మరాజీవృతం, కృష్ణ విశాలశుక్లమ్, అభితామ్రం, వామమ్ ఏకం నయనం, మీనాహతం పద్మమ్ ఇవ ప్రాస్పందత.

**ప్రతిపదార్థము** :– తస్యాః సుకేశ్యాః = సుందరమైన కేశ సంపదగల ఆ సీతాదేవి యొక్క, శుభం = మంగళకరమును, అరాళపక్ష్మరాజీవృతం = వంపుతిరిగి యున్న కను బొమల వెంట్రుకలతో చుట్టుకొనబడి యున్నదియును, కృష్ణవిశాలశుక్లం = నల్లనిదియును విస్తారమైన తెలుపుగలదియునగు, అభితామ్రం = చుట్టును ఎఱుపుగల, వామమ్ ఏకం నయనం = ఎడమ కన్నొకటి, మీనాహతం = చేపచే కదల్పబడినట్టి, పద్మమ్ ఇవ = తామర పువ్వువలె, ప్రాస్పందత = కంపించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:-** అభితామ్రం నయనం - "ప్రాంతరక్తే చ నేత్రే"యని కంటి చుట్టును ఎఱ్ఱనిరేఖలు గలిగి యుండుట పద్మినీ జాతి స్త్రీకి లక్షణము.

**తాత్పర్యము :-** వంగియున్న కనుబొమలతోగూడి కొనలందు ఎఱ్ఱని రేఖలతో ప్రకాశించుచు, తెల్లని కంటియందు నల్లని పాపతో శోభిల్లుచున్న ఆమె ఎడమ కన్ను, చేప యొరసికొనుటచే చలించిన తామరపువ్వు వలె కంపించెను.

**శ్లో॥ భుజ శ్చ చార్వంచితపీనవృత్తః**
**పరార్ధ్య కాలాగరుచందనార్హః ।**
**అనుత్తమే నాధ్యుషితః ప్రియేణ**
**చిరేణ వామ స్సమవేపతాఽఽశు ॥ 3**

**పదచ్ఛేదము :-** భుజః - చ - చార్వంచితపీనవృత్తః - పరార్ధ్యకాలాగరుచందనార్హః, అనుత్తమేన - అధ్యుషితః - ప్రియేణ - చిరేణ - వామః - సమవేపత - ఆశు.

**అన్వయక్రమము :-** చార్వంచితపీనవృత్తః, పరార్ధ్యకాలాగరు చందనార్హః, చిరేణ అనుత్తమేన ప్రియేణ అధ్యుషితః, వామః భుజః చ ఆశు సమవేపత.

**ప్రతిపదార్థము :-** చార్వంచితపీనవృత్తః = సుందరముగను శ్రేష్ఠముగను బలసి గుండ్రముగ నున్నదియును, పరార్ధ్యకాలాగరుచందనార్హః = శ్రేష్ఠములైన కాలాగరు చందన ద్రవ్యములకు పాత్రమైనదియును, చిరేణ = చిరకాలము, అనుత్తమేన = సర్వోత్తముడైన, ప్రియేణ = భర్తచే, అధ్యుషితః = సేవింపబడినదియు నగు, వామః భుజః చ = ఎడమ భుజముగూడ, ఆశు = తత్క్షణమే, సమవేపత = కంపించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:-** అనుత్తమే నాధ్యుషితః - లోకములన్నింటిలోని వారికంటె శ్రేష్ఠుడైన నాథుడు; లోకనాథులనిపించుకొన్న వారందరకును నాథుడని భావము. ఏకో దేవో నారాయణః. "ఏకమేవాద్వితీయమ్, న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యః" భ.గీ - 11-43. అను శ్రుతిస్మృతివాక్యములు ఇట స్మరణీయములు అని వాల్మీకి అభిప్రాయము.

**తాత్పర్యము :-** సుందరముగాను, బలసి గుండ్రముగాను ఉండి, శ్రేష్ఠమైన సుగంధ ద్రవ్యములకు యోగ్యమై, చిరకాలము సర్వోత్తముడైన భర్తచే సేవింపబడిన ఆ సీతాదేవి

ఎడమభుజము కూడ ఆ క్షణమున ఒక్క మాఱు కంపించెను.

**శ్లో॥ గజేంద్రహస్తప్రతిమశ్చ పీన**
**స్తయో ర్ద్వయో స్సంహతయో స్సుజాతః ।**
**ప్రస్పందమానః పున రూరు రస్యా**
**రామం పురస్తాత్ స్థిత మాచచక్షే ॥ 4**

**పదచ్ఛేదము** :– గజేంద్రహస్తప్రతిమః – చ – పీనః – తయోః – ద్వయోః – సంహతయోః – సుజాతః – ప్రస్పందమానః – పునః – ఊరుః – అస్యాః – రామం – పురస్తాత్ – స్థితమ్ – ఆచచక్షే.

**అన్వయక్రమము** :– సంహతయోః తయోః ద్వయోః, గజేంద్రహస్తప్రతిమః, పీనః, సుజాతః, అస్యాః (వామః) ఊరుః చ పునః ప్రస్పందమానః (సన్), రామం పురస్తాత్ స్థితమ్ ఆచచక్షే.

**ప్రతిపదార్థము** :– సంహతయోః = పరస్పరము చక్కగ కలిసి యున్నట్టి, తయోః ద్వయోః = ఆమె యూరుద్వయమునందు, గజేంద్రహస్తప్రతిమః = ఏనుగు తొండమును బోలియున్నట్టి, పీనః = స్థూలమైనదియును, సుజాతః = శుభలక్షణోపేతమైనదియు నగు, అస్యాః = ఆమెయొక్క, (వామః) ఊరుః చ = ఎడమతొడగూడ, పునః = వెను వెంటనే, ప్రస్పందమానః (సన్) = కంపించుచున్నదగుచు, రామం = శ్రీరాముని,పురస్తాత్ = ఎదురుగా, స్థితమ్ = ఉన్నవానినిగా, ఆచచక్షే = చెప్పెను.

**తాత్పర్యము** :– శుభలక్షణోపేతమైయున్న ఆ సీతమ్మ యూరుద్వయమునందు, ఏనుగు తొండమువలె సుందరముగాను స్థూలముగాను ఉన్న ఎడమతొడకూడ అప్పుడే కంపము నొందుచు, ఇదే శ్రీరాముడు నీ ఎదుటికి వచ్చి నిలచుచున్నాడు చూడుము – అను ప్రియవార్త చెప్పినట్టు లుండెను.

**శ్లో॥ శుభం పున ర్హేమసమానవర్ణ**
**మీష ద్రజోధ్వస్తమి వామలాక్ష్యాః ।**
**వాస స్స్థితాయా శ్శిఖరాగ్రదత్యాః**
**కించి త్పరిస్రంసత చారుగాత్ర్యాః ॥ 5**

**పదచ్ఛేదము** :– శుభం – పునః – హేమసమానవర్ణమ్ – ఈషత్ – రజోధ్వస్తమ్ – ఇవ – అమలాక్ష్యాః – వాసః – స్థితాయాః – శిఖరాగ్రదత్యాః – కించిత్ – పరిస్రంసత – చారుగాత్ర్యాః ॥

**అన్వయక్రమము :–** అమలాక్ష్యాః, శిఖరాగ్రదత్యాః, చారుగాత్ర్యాః, స్థితాయాః సీతాయాః హేమసమానవర్ణమ్, ఈషత్ రజోధ్వస్తం, శుభం వాసః కించిత్ పరిస్రంసత.

**ప్రతిపదార్థము :–** అమలాక్ష్యాః = నిర్మలమైన నేత్రములు గల్గినదియును, శిఖరాగ్రదత్యాః = దాడిమ గింజలవంటి సుందరమైన పలువఱుస గలదియును, చారుగాత్ర్యాః = సుందరమైన శరీరము గలదియునగు, స్థితాయాః సీతయాః = నిలచియున్న ఆ సీతాదేవియొక్క, హేమసమానవర్ణం = సువర్ణసన్నిభమైన ఛాయగల్గినదై, ఈషత్ = కొలదిగ, రజోధ్వస్తం = ధూళితో ధూసరితమైన, శుభం = పవిత్రమైన, వాసః = చీర, కించిత్ = కొలదిగ, పరిస్రంసత = జాఱెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:–** శుభం పరిస్రంసత = శుభకరముగా జాఱినది యని భావము.

**గోవిందరాజీయము:–** కట్టుకొన్న చీర ఒడలినుండి జాఱుట ప్రియాగమనసూచకమని భావము. శిఖరాగ్రదత్యాః = కొనలుదేరిన పలువఱస గల్గియుండుట సాముద్రిక శాస్త్రప్రకారము అత్యంతమంగళకరము.

"స్నిగ్ధాః సమానరూపాః సుపంక్తయః శిఖరిణః శ్లక్ష్ణాః, దంతా భవంతి యాసాం తాసాం పాదే జగత్సర్వమ్." "యాసాం శిఖరిణో దంతాః దీర్ఘం జీవంతి తాః స్త్రియః".

**తాత్పర్యము :–** సుందరమైన కన్నులతో, కొనలుదేరినట్టి దాడిమ గింజల వంటి పలువఱుసతో, సుందరతరమైన శరీరముతో అచట నిలువబడియున్న సీతాదేవి ధరించియున్న –సువర్ణచ్ఛాయ గలిగినను కొలదిగ ధూళిధూసరితమైయున్నట్టి – చీర చెఱగు ఆమె భుజమునుండి కొద్దిగా జాఱెను.

**శ్లో॥ ఏత్తై ర్నిమిత్తై రపరై శ్చ సుభ్రూ**
**స్సంబోధితా ప్రా గపి సాధుసిద్ధైః ।**
**వాతాతపక్లాంతమివ ప్రణష్టం**
**వర్షేణ బీజం ప్రతిసంజహర్ష ॥ 6**

**పదచ్ఛేదము :–** ఏతైః – నిమిత్తైః – అపరైః – చ – సుభ్రూః – సంబోధితా – ప్రాక్ – అపి – సాధు – సిద్ధైః – వాతాతపక్లాంతమ్ – ఇవ – ప్రణష్టం – వర్షేణ – బీజం – ప్రతిసంజహర్ష ॥

**అన్వయక్రమము :–** సుభ్రూః ప్రాక్ అపి సాధుసిద్ధైః ఏతైః సంబోధితా వాతాతప

క్లాంతం, ప్రణష్టం బీజం, వర్షేణ ఇవ, ప్రతిసంజహర్ష.

**ప్రతిపదార్థము :–** సుభ్రూః = మంచి కనుబొమలు గల్గిన సీత, ప్రాక్ అపి = పూర్వకాలమునందు గూడ, సాధుసిద్ధైః = చక్కగా సిద్ధిని కనబఱచినట్టి, ఏతైః = ఈ చెప్పబడినట్టివియును, అపరైః చ = మఱి వేఱయినట్టియును అగు, నిమిత్తైః = (శుభ) శకునములచే, సంబోధితా = చక్కగా తెలుపబడినదై, వాతాతపక్లాంతం = గాలుల చేతను ఎండచేతను వాడిపోయినదై, ప్రణష్టం = చెడిపోయియున్నట్టి (అనగా నేల అడుగున బడిన) బీజం = విత్తనము, వర్షేణ ఇవ = వర్షముచేతవలె, ప్రతిసంజహర్ష = గొప్పసంతోషము నొందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:–** ప్రాక్ అపి సాధుసిద్ధైః = పూర్వము మిథిలానగరమునందు గూడ కార్యసిద్ధిని సూచించిన శుభశకునములని భావము.

**గోవిందరాజీయము:–** ప్రణష్టం బీజం – నేలలో లోతున ఎండిపోయి యున్నట్టి విత్తనమని భావము.

**తాత్పర్యము :–** పూర్వకాలమునుండియు తనకు కార్యసిద్ధిని సూచించు విషయమున అనుభవములో నున్న ఇట్టి ఈ శుభశకునములచేతను, ఇట్టివే యగు మఱికొన్నిటిచేతను, సీతాదేవి తగురీతిగ ఊరట నొందినదై ఎండకును గాలికిని వాడిపోయి, అణగిపోయి యున్న విత్తనము సువృష్టిచే చక్కగా అంకురించినట్లు మిక్కిలి ఆనందము నొందెను.

**శ్లో॥ తస్యాః పున ర్బింబఫలాధరోష్ఠం**
**స్వక్షిభ్రుకేశాంత మరాళపక్ష్మ ।**
**వక్త్రం బభాసే సితశుక్లదంష్ట్రం**
**రాహోర్ముఖా చ్చంద్ర ఇవ ప్రముక్తః ॥ 7**

**పదచ్ఛేదము :–** తస్యాః – పునః – బింబఫలాధరోష్ఠం – స్వక్షిభ్రుకేశాంతమ్ – అరాళపక్ష్మ – వక్త్రం – బభాసే – సితశుక్లదంష్ట్రం – రాహోః – ముఖాత్ – చంద్రః – ఇవ – ప్రముక్తః ॥

**అన్వయక్రమము :–** బింబఫలాధరోష్ఠం స్వక్షిభ్రుకేశాంతమ్ అరాళపక్ష్మ, సితశుక్లదంష్ట్రం తస్యాః వక్త్రం, రాహోః ముఖాత్ ప్రముక్తః చంద్రః ఇవ బభాసే.

**ప్రతిపదార్థము :–** బింబఫలాధరోష్ఠం = దొండపండువంటి క్రింది పెదవి గలదియును,

స్వక్షిభ్రుకేశాంతం = సుందరములైన కనుబొమలును, ముంగురులును గల్గినదియు, అరాళపక్ష్మ = వంపుతిరిగిన కనుఱెప్పలు కలదియును, సితశుక్లదంష్ట్రం = స్వచ్ఛమైన తెల్లని పలువఱుసగలదియుననగు, తస్యాః = ఆ సీతమ్మయొక్క, వక్త్రం = ముఖము, పునః = తిరిగి, రాహోః = రాహువుయొక్క, ముఖాత్ = నోటినుండి, ప్రముక్తః = విడువబడినట్టి, చంద్రః ఇవ = చంద్రునివలె, బభాసే = శోభిల్లెను.

**తాత్పర్యము** :- దొండపండువంటి పెదవియు, సుందరమైన కన్నులును, కనుబొమలును, ముంగురులును, వంపుతీరిన కనుఱెప్పలును, తెల్లని చక్కని పలువఱసయును కలిగియున్న ఆ సీతాదేవి ముఖము రాహువు నోటినుండి విడివడిన చంద్రబింబమువలె పూర్వతేజముతో మఱల వికసితమై విరాజిల్లెను.

**శ్లో॥ సా వీతశోకా వ్యపనీతతంద్రీ**
**శాంతజ్వరా హర్షవివృద్ధసత్త్వా ।**
**అశోభతాఽఽర్యా వదనేన శుక్లే**
**శీతాంశునా రాత్రి రి వోదితేన ॥ 8**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"శుభనిమిత్తాని" నామ*
*ఏకోనత్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :- సా - వీతశోకా - వ్యపనీతతంద్రీ - శాంతజ్వరా - హర్షవివృద్ధ సత్త్వా - అశోభత - ఆర్యా - వదనేన - శుక్లే - శీతాంశునా - రాత్రిః - ఇవ - ఉదితేన ॥

**అన్వయక్రమము** :- వీతశోకా, వ్యపనీతతంద్రీ, శాంతజ్వరా, హర్షవివృద్ధసత్త్వా సా ఆర్యా శుక్లే ఉదితేన శీతాంశునా రాత్రిః ఇవ, (వికసితేన) వదనేన అశోభత.

**ప్రతిపదార్థము** :- వీతశోకా = తొలగిన దిగులు గలదియును, వ్యపనీతతంద్రీ = పోయినట్టి నిరుత్సాహము గలదియును, శాంతజ్వరా = ఉపశమించిన తాపము గలదియును, హర్షవివృద్ధసత్త్వా = ఆనందముచే పెంపొందిన ఉత్సాహము గలదియు నగు, సా ఆర్యా = ఆ పూజ్యురాలైన సీతాదేవి, శుక్లే = శుక్లపక్షమునందు, ఉదితేన = ఉదయించిన, శీతాంశునా = చంద్రునిచే, రాత్రిః ఇవ = రాత్రివలె, (వికసితేన = విప్పారిన) వదనేన = ముఖముతో, అశోభిత = శోభిల్లెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:–** శీతాంశునా రాత్రి రివ – నిశాకాంతునితో కూడినప్పటి నిశవలె, రఘురాముని కాంతయగు సీత భర్తతో గూడినంత సంతోషము గల దయ్యెనని భావము.

**తాత్పర్యము :–** తన దిగులు నిరుత్సాహము అణిగిపోగా, మనస్తాపము తీరి, ఆనందము వృద్ధి అగుచుండగా, ఉత్సాహముతో ప్రకాశించుచున్న సీతాదేవి ముఖము, శుక్ల పక్షమునందు నిండు కళలతో ఉదయించిన చంద్రుని సాన్నిధ్యము నొందిన నిశాకాంతవలె మిక్కిలి శోభిల్లు చుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"శుభనిమిత్తములు" అను*
*ఇఱువదితొమ్మిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ్ గురుభ్యో నమః

# త్రింశసర్గ

**శ్లో॥ హనుమా నపి వి(క్రాంత స్సర్వం శు(శావ తత్త్వతః ।**
**సీతాయా స్త్రిజటాయాశ్చ రాక్షసీనాం చ తర్జనమ్ ॥ 1**

**పదచ్ఛేదము :-** హనుమాన్ – అపి – వి(క్రాంతః – సర్వం – శు(శావ – తత్త్వతః – సీతాయాః – త్రిజటాయాః – చ – రాక్షసీనాం – చ – తర్జనమ్ ॥

**అన్వయక్రమము :-** వి(క్రాంతః హనుమాన్ అపి సీతయాః (విలాపం) త్రిజటాయాః (స్వప్నవృత్తాంతం) చ, రాక్షసీనాం తర్జనం చ సర్వం తత్త్వతః శు(శావ.

**ప్రతిపదార్థము :-** వి(క్రాంతః = పరా(క్రమశాలియైన, హనుమాన్ అపి = హనుమంతుడును, సీతాయాః = సీతాదేవియొక్క, (విలాపం = విలాపమును), త్రిజటాయాః = త్రిజటయొక్క (స్వప్నవృత్తాంతం = స్వప్నవృత్తాంతమును) రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క, తర్జనం చ = బెదరింపును, సర్వం = అంతయును, తత్త్వతః = యథాతథముగా, శు(శావ = ఆలకించెను.

**తాత్పర్యము :-** మహావీరుడైన హనుమంతుడు, సీతాదేవి విలాపమును, త్రిజట స్వప్నవృత్తాంతమును, రాక్షసస్త్రీల బెదరింపులును, అంతయుగూడ సుస్పష్టముగా ఆకర్ణించెను.

**శ్లో॥ అవేక్షమాణ స్తాం దేవీం దేవతామివ నందనే ।**
**తతో బహువిధాం చింతాం చింతయామాస వానరః ॥ 2**

**పదచ్ఛేదము :-** అవేక్షమాణః – తాం – దేవీం – దేవతామ్ – ఇవ – నందనే – తతః – బహువిధాం – చింతాం – చింతయామాస – వానరః ॥

**అన్వయక్రమము :-** తతః వానరః నందనే దేవతామ్ ఇవ (స్థితాం) తాం దేవీమ్ అవేక్షమాణః బహువిధాం చింతాం చింతయామాస.

**ప్రతిపదార్థము :-** తతః = తరువాత, వానరః = హనుమంతుడు, నందనే =

నందనవనమునందలి, దేవతామ్ ఇవ (స్థితాం) = దేవతవలె (నున్నట్టి), తాం దేవీం = ఆ పూజ్యురాలైన సీతాదేవిని, అవేక్షమాణః = చూచుచున్నవాడై, బహువిధాం చింతాం = పెక్కువిధములగు ఆలోచనలను, చింతయామాస = చింతించెను.

**తాత్పర్యము** :– స్వర్గమునందలి నందనవనమునందు గోచరించు దేవతామూర్తివలె నున్న ఆ సీతామాతను చూచుచు హనుమ పెక్కు విధములుగా నిట్లు ఆలోచింపసాగెను.

**శ్లో॥ యాం కపీనాం సహస్రాణి సుబహూ న్యయుతాని చ ।**
**దిక్షు సర్వాసు మార్గంతే సేయ మాసాదితా మయా ॥ 3**

**పదచ్ఛేదము** :– యాం – కపీనాం – సహస్రాణి – సుబహూని – అయుతాని – చ – దిక్షు – సర్వాసు – మార్గంతే – సా – ఇయమ్ – ఆసాదితా – మయా ॥

**అన్వయక్రమము** :– కపీనాం సుబహూని అయుతాని, సహస్రాణి సర్వాసు దిక్షు యాం మార్గంతే, సా ఇయం మయా ఆసాదితా.

**ప్రతిపదార్థము** :– సుబహూని = అనేకములైన, కపీనాం = వానరులయొక్క, అయుతాని = పదివేలు, సహస్రాణి = వేలు, సర్వాసు = సమస్తములైన, దిక్షు = దిక్కులయందును, యాం = ఏ మహనీయురాలిని, మార్గంతే = వెదకుచున్నారో, సా ఇయం = అట్టి ఈ సీతాదేవి, మయా = నాచేత, ఆసాదితా = పొంద (చూడ)బడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము**:– వానరులందరును కోరుకొనుచున్న గౌరవవిశేషము తన ఒక్కనికే లభించినదని హనుమ ఆశ్చర్యానందముల నొందెను.

**తాత్పర్యము** :– వేలకొలది వానరసమూహములు ఏ మహాత్మురాలికొఱకు సర్వదిక్కుల యందును తీవ్రముగ వెదకుచున్నారో, ఆ సీతామహాసాధ్వి నా పుణ్యవిశేషముచే నాకే గోచరించినది.

**శ్లో॥ చారేణ తు సుయుక్తేన శత్రో శ్శక్తి మవేక్షతా ।**
**గూఢేన చరతా తావ దవేక్షిత మిదం మయా ॥ 4**

**పదచ్ఛేదము** :– చారేణ – తు – సుయుక్తేన – శత్రోః – శక్తిమ్ – అవేక్షతా – గూఢేన – చరతా – తావత్ – అవేక్షితమ్ – ఇదం మయా ॥

**అన్వయక్రమము** :– సుయుక్తేన చారేణ గూఢేన చరతా, శత్రోః శక్తిమ్ అవేక్షతా మయా ఇదం తావత్ అవేక్షితమ్.

**ప్రతిపదార్థము** :- సుయుక్తేన = చక్కగా నియమింపబడినట్టియు, చారేణ = చారుడనైనట్టియు, గూఢేన = రహస్యముగా, చరతా = సంచరించు చున్నట్టియు, శత్రోః = శత్రువుయొక్క, శక్తిమ్ = శక్తిని, అవేక్షతా = గ్రహించు చున్నట్టియు, మయా = నాచేత; ఇదం తావత్ = ఇది యంతయును, అవేక్షితమ్ = చూడబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:-** "యో యథా వర్తతే యస్మిన్ తస్మి న్నేవం ప్రవర్తయన్, నాధర్మం సమవాప్నోతి న చాశ్రేయశ్చ విందతి.(భార - ఉద్యో) అనగా ఎవని విషయమున ఎవడెట్లు వర్తించుచున్నాడో వాని విషయమున వాడట్లు వర్తించినచో ధర్మహాని లేదు. (భీష్మవాక్యము.)

ప్రజంతి తే మూఢధియః పరాభవం
భవంతి మాయావిషు యే న మాయినః.

(కిరాతార్జునీయము - 1 - 30)

అనగా మాయావుల విషయమై ఎవరు మాయతో వర్తింపరో వారు నాశన మగుదురు.

కావున చోరునివలె వర్తించిన రావణుని విషయమై హనుమంతుడు వంచనముగ వర్తించుట ధర్మవిరుద్ధముగాదు.

**తాత్పర్యము** :- నమ్మకముతో నియోగింపబడిన చారుడనైన నేను ఇచ్చట శత్రువుల శక్తిసామర్థ్యములను చక్కగా పరికించుచు రహస్యముగా సంచరించుచు ఇది యంతయును సమగ్రముగా అవలోకించితిని.

**శ్లో॥ రాక్షసానాం విశేషశ్చ పురీ చేయ మవేక్షితా ।**
**రాక్షసాధిపతే రస్య ప్రభావో రావణస్య చ ॥ 5**

**పదచ్ఛేదము** :- రాక్షసానాం - విశేషః - చ - పురీ - చ - ఇయమ్ - అవేక్షితా - రాక్షసాధిపతేః - అస్య - ప్రభావః - రావణస్య - చ ॥

**అన్వయక్రమము** :- రాక్షసానాం విశేషః చ (అవేక్షితః); ఇయం పురీ చ అవేక్షితా; రాక్షసాధిపతేః అస్య రావణస్య ప్రభావశ్చ అవేక్షితః.

**ప్రతిపదార్థము** :- రాక్షసానాం విశేషః చ = రాక్షసులయొక్క వివరమును, (అవేక్షితః = చూడబడెను) ఇయం = ఈ, పురీ చ = లంకానగరమును, అవేక్షితా =

పరికింపబడినది, రాక్షసాధిపతేః = రాక్షసరాజైన, అస్య రావణస్య = ఈ రావణాసురుని యొక్క, ప్రభావః చ = ఘనతయును, అవేక్షితః = చూడబడినది.

**తాత్పర్యము :–** ఇచ్చట గల రాక్షసుల పరాక్రమము, ఐశ్వర్యము మున్నగు విశేషములను గమనించితిని. లంకానగర వైభవము నంతను గాంచితిని. లంకాధిపతియైన రావణుని ప్రభావము గూడ తెలిసికొంటిని.

**శ్లో॥ యుక్తం తస్యాప్రమేయస్య సర్వసత్త్వదయావతః ।**
**సమాశ్వాసయితుం భార్యాం పతిదర్శనకాంక్షిణీమ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** యుక్తం – తస్య – అప్రేమయస్య – సర్వసత్త్వదయావతః – సమాశ్వాసయితుం – భార్యాం – పతిదర్శనకాంక్షిణీమ్ ॥

**అన్వయక్రమము :–** అప్రమేయస్య, సర్వసత్త్వదయావతః తస్య పతిదర్శనకాంక్షిణీం భార్యాం సమాశ్వాసయితుం యుక్తమ్.

**ప్రతిపదార్థము :–** అప్రమేయస్య = అపరిమితమైన పరాక్రమము గలవాడును, సర్వసత్త్వదయావతః = సమస్తప్రాణులందును, కరుణగలవాడునగు, తస్య = ఆ శ్రీరామునియొక్క, పతిదర్శనకాంక్షిణీం = భర్తృదర్శనమును కాంక్షించుచున్నట్టి, భార్యాం = ఇల్లాలిని, సమాశ్వాసయితుం = ఓదార్చుటకు, యుక్తం = తగియున్నది.

**తాత్పర్యము :–** అనంతమహామహిమోపేతుడును, సర్వభూతదయాపరుడు నగు ఆ శ్రీరాముని భార్యయగు ఈ సీతాదేవికి గల భర్తృదర్శనాభిలాషను ఫలింపచేయుచు ఆమెను ఓదార్చుట ఇప్పుడు నాకు న్యాయము.

**శ్లో॥ అహ మాశ్వాసయా మ్యేనాం పూర్ణచంద్రనిభాననామ్ ।**
**అదృష్టదుఃఖాం దుఃఖార్తాం దుఃఖ స్యాంత మగచ్ఛతీమ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** అహమ్ – ఆశ్వాసయామి – ఏనాం – పూర్ణచంద్రనిభాననామ్ – అదృష్టదుఃఖాం – దుఃఖార్తాం – దుఃఖస్య – అంతమ్ – అగచ్ఛతీమ్ ॥

**అన్వయక్రమము :–** పూర్ణచంద్రనిభాననామ్, అదృష్టదుఃఖాం దుఃఖార్తాం, దుఃఖస్య అంతమ్, అగచ్ఛతీం ఏనామ్ అహమ్ ఆశ్వాసయిష్యామి.

**ప్రతిపదార్థము :–** పూర్ణచంద్రనిభాననాం = నిండు చందురుని వంటి ముఖము గలదియును, అదృష్టదుఃఖాం = (పూర్వము) చూడని దుఃఖములు కలదియును, దుఃఖార్తాం = దుఃఖములచే పీడింపబడుచున్నదియును, దుఃఖస్య = దుఃఖమునకు,

అంతమ్ = అంతమును, అగచ్ఛతీమ్ = చేరకున్నదియునగు, ఏనామ్ = ఈ సీతాదేవిని, అహమ్ = నేను, ఆశ్వాసయిష్యామి = ఓదార్చెదను.

**తాత్పర్యము :-** పూర్ణచంద్రుని వంటి ముఖముతో ప్రకాశించుచున్న ఈమె దుఃఖములను ఎన్నడును ఎఱుగనట్టిది. అట్టి ఈమె నేడు దుఃఖములచే పీడింపబడుచు, ఈ దుఃఖములకు అవధి గానక తపించుచున్నది. ఈమెను నేనిప్పుడే ఓదార్చెదను.

**శ్లో॥ యద్య ప్యహ మిమాం దేవీం శోకోపహతచేతనామ్ ।**
**అనాశ్వాస్య గమిష్యామి దోషవ ద్గమనం భవేత్ ॥ 8**

**పదచ్ఛేదము :-** యది - అపి - ఇమాం - దేవీం - శోకోపహతచేతనామ్ - అనాశ్వాస్య - గమిష్యామి - దోషవత్ - గమనం - భవేత్ ॥

**అన్వయక్రమము :-** శోకోపహతచేతనామ్ ఇమాం దేవీం యది అహమ్ అనాశ్వాస్య గమిష్యామి (తదా మే) గమనం దోషవత్ భవేత్.

**ప్రతిపదార్థము :-** శోకోపహతచేతనాం = దుఃఖముచే క్రుంగియున్న హృదయము కలిగినట్టి, ఇమాం దేవీం = ఈ సీతాదేవిని, అహం = నేను, అనాశ్వాస్య = ఓదార్చకుండ, గమిష్యామి యది = వెళ్లిపోయెదనేని, తదా = అప్పుడు, మే = నాయొక్క, గమనం = ప్రయాణము, దోషవత్ = దోషముతో కూడినది, భవేత్ = కాగలదు.

**తాత్పర్యము :-** దుఃఖభారముచే వివశురాలైయున్న ఈ సీతామాతను నేనిప్పుడు ఓదార్చకుండ తిరిగి వెళ్లిపోయినచో ఇప్పటి ఈ నా రాక నిరుపయోగమే కాక ఒక దుష్కృతము కూడ కాగలదు.

**శ్లో॥ గతే హి మయి తత్రేయం రాజపుత్రీ యశస్వినీ ।**
**పరిత్రాణ మవిందంతీ జానకీ జీవితం త్యజేత్ ॥ 9**

**పదచ్ఛేదము :-** గతే - హి - మయి - తత్ర - ఇయం - రాజపుత్రీ - యశస్వినీ - పరిత్రాణమ్ - అవిందంతీ - జానకీ - జీవితం - త్యజేత్ ॥

**అన్వయక్రమము :-** మయి తత్ర గతే (సతి) ఇయం యశస్వినీ రాజపుత్రీ జానకీ పరిత్రాణమ్ అవిందంతీ జీవితం త్యజేత్ హి.

**ప్రతిపదార్థము :-** మయి = నేను, తత్ర = ఆ రాముని సన్నిధికి, గతే (సతి) = వెడలి పోయినవాడను కాగా, యశస్వినీ = కీర్తిమంతురాలును, రాజపుత్రీ = రాజకుమార్తెయు

నగు, జానకీ = సీతాదేవి, పరిత్రాణమ్ = రక్షణమును, అవిందంతీ = పొందనిదై, జీవితం = ప్రాణమును, త్యజేత్ హి = విడిచి పెట్టును గదా!

**తాత్పర్యము :–** నేను ఈమెతో మాటలాడకుండగ ఇట్లే శ్రీరామసన్నిధికి వెడలిపోయినచో అభిమానవంతురాలైన ఈ మహాసాధ్వి తనకు రక్షణ నొసగువారు కనుపించని కారణముచే తన ప్రాణములనే వదలివేయవచ్చును గదా!

**శ్లో॥ మయా చ స మహాబాహుః పూర్ణచంద్రనిభాననః ।**
**సమాశ్వాసయితుం న్యాయ్య స్సీతాదర్శనలాలసః ॥ 10**

**పదచ్ఛేదము :–** మయా – చ – సః – మహాబాహుః – పూర్ణచంద్రనిభాననః – సమాశ్వాసయితుం – న్యాయ్యః – సీతాదర్శనలాలసః ॥

**అన్వయక్రమము :–** పూర్ణచంద్రనిభాననః, సీతాదర్శనలాలసః సః మహాబాహుః చ మయా సమాశ్వాసయితుం న్యాయ్యః.

**ప్రతిపదార్థము :–** పూర్ణచంద్రనిభాననః = నిండుచంద్రునివంటి ముఖము కల్గిన వాడును, సీతాదర్శనలాలసః = సీతను చూచుటకై తహతహలాడుచున్నవాడు నగు, సః మహాబాహుః చ = ఆ మహావీరుడైన శ్రీరాముడు గూడ, సమాశ్వాసయితుం = ఓదార్చుటకు, న్యాయ్యః = తగినవాడు.

**తాత్పర్యము :–** మహావీరుడైన శ్రీరాముడు తన ప్రియురాలిని కనుగొనవలెనను ఉత్కంఠతో నిండు చందురుని యంత పెద్దమొగము చేసికొని వేచియుండునుగదా! అట్టి యాతనికి సీతావచనములను వినిపించి ఓదార్చుటయే న్యాయమగును.

**శ్లో॥ నిశాచరీణాం ప్రత్యక్ష మనర్హం చాపి భాషణమ్ ।**
**కథం ను ఖలు కర్తవ్య మిదం కృచ్ఛ్రగతో హ్యహమ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** నిశాచరీణాం – ప్రత్యక్షమ్ – అనర్హం – చ – అపి – భాషణమ్ – కథం – ను – ఖలు – కర్తవ్యమ్ – ఇదం – కృచ్ఛ్రగతః – హి – అహమ్ ॥

**అన్వయక్రమము :–** నిశాచరీణాం ప్రత్యక్షం భాషణమ్ అపి అనర్హమ్! ఇదం కథం ను ఖలు కర్తవ్యమ్; అహం కృచ్ఛ్రగతః హి!

**ప్రతిపదార్థము :–** నిశాచరీణాం ప్రత్యక్షం = రాక్షసస్త్రీల సమక్షమునందు, భాషణమ్ అపి = మాటలాడుటగూడ, అనర్హమ్ = తగనిది, ఇదం = ఇది, కథం ను ఖలు = ఎట్లుగా, కర్తవ్యమ్ = చేయవలెను. అహం = నేను, కృచ్ఛ్రగతః హి = చిక్కు పరిస్థితిలో పడినాడనుగదా!

**తాత్పర్యము** :- ఈ రాక్షసాంగనల యెదుట సీతాదేవితో మాటలాడుటకూడ ప్రమాదకరము. మాటలాడుటయా? మాటలాడకుండగ వెడలుటయా యను సందేహములో చిక్కుకొని యుంటిని. నేనిప్పుడు ఏమి చేయవలెనో గదా!

**శ్లో॥ అనేన రాత్రిశేషేణ యది నాశ్వాస్యతే మయా ।**
**సర్వథా నాస్తి సందేహః పరిత్యక్ష్యతి జీవితమ్ ॥ 12**

**పదచ్ఛేదము** :- అనేన - రాత్రిశేషేణ - యది - న - ఆశ్వాస్యతే - మయా - సర్వథా - న - అస్తి - సందేహః - పరిత్యక్ష్యతి - జీవితమ్ ॥

**అన్వయక్రమము** :- అనేన రాత్రిశేషేణ, ఏషా మయా నాశ్వాస్యతే యది, సర్వథా జీవితం పరిత్యక్ష్యతి; సందేహః నాస్తి.

**ప్రతిపదార్థము** :- అనేన రాత్రిశేషేణ = ఈ రాత్రిశేషమున, ఏషా = ఈ సీతాదేవి, మయా = నాచే, నాశ్వాస్యతే యది = ఓదార్పబడక పోయిన యెడల, సర్వథా = సర్వవిధముల, జీవితం = ప్రాణమును, పరిత్యక్ష్యతి = విడచిపెట్టును. సందేహః = సందేహము, నాస్తి = లేదు.

**తాత్పర్యము** :- ఈ రాత్రి గడచి పోకుండగనే నేనీమె నోదార్చకున్నచో తప్పక ఈమె ప్రాణములను విడిచి పెట్టును. ఇందు సందేహ మేమియును లేదు.

**శ్లో॥ రామశ్చ యది పృచ్ఛే న్మాం కిం మాం సీతాఽబ్రవీ ద్వచః ।**
**కి మహం తం ప్రతి బ్రూయా మసంభాష్య సుమధ్యమామ్॥ 13**

**పదచ్ఛేదము** :- రామః - చ - యది - పృచ్ఛేత్ - మాం - కిం - మాం - సీతా - అబ్రవీత్ - వచః - కిమ్ - అహం - తం - ప్రతి - బ్రూయామ్ - అసంభాష్య - సుమధ్యమామ్ ॥

**అన్వయక్రమము** :- రామః చ మాం సీతా కిం వచః అబ్రవీత్ (ఇతి) మాం పృచ్ఛేత్ యది, సుమధ్యమామ్ అసంభాష్య, అహం తం కిం ప్రతి బ్రూయామ్?

**ప్రతిపదార్థము** :- రామః చ = శ్రీరాముడును, సీతా = సీతాదేవి, మాం = నన్ను గూర్చి, కిం వచః = ఏ మాటను, అబ్రవీత్ = పలికినది, (ఇతి = అని) మాం = నన్ను, పృచ్ఛేత్ యది = అడిగినయెడల, సుమధ్యమాం = చక్కనినడుముగల సీతా సాధ్విని, అసంభాష్య = పలుకరించకుండగ, తం = శ్రీరాముని గూర్చి, అహం = నేను, కిం ప్రతి బ్రూయామ్ = ఏమని సమాధానము చెప్పగలను?

**తాత్పర్యము :-** మఱియు శ్రీరాముడు నన్ను 'సీత నాతో ఏమని చెప్పమన్నది' అని అడిగిన యెడల ఆమెతో మాటలాడకుండ శ్రీరామునకు నే నేమని సమాధానము చెప్పుదును?

**శ్లో॥ సీతాసందేశరహితం మా మిత స్త్వరయాఽఽగతమ్ ।**
**నిర్దహేదపి కాకుత్థ్సః క్రుద్ధ స్తీవ్రేణ చక్షుషా ॥ 14**

**పదచ్ఛేదము :-** సీతాసందేశరహితం - మామ్ - ఇతః - త్వరయా - ఆగతమ్ - నిర్దహేత్ - అపి - కాకుత్స్థః - క్రుద్ధః - తీవ్రేణ - చక్షుషా ॥

**అన్వయక్రమము :-** ఇతః త్వరయా సీతాసందేశరహితమ్ ఆగతం మాం కాకుత్స్థః క్రుద్ధః తీవ్రేణ చక్షుషా నిర్దహేత్ అపి.

**ప్రతిపదార్థము :-** ఇతః = ఈ లంకనుండి, త్వరయా = వేగిరపాటుతో, సీతాసందేశరహితం = సీతయొక్క సందేశము లేకుండగా, ఆగతం = వచ్చియున్నట్టి, మాం = నన్ను, కాకుత్స్థః = శ్రీరాముడు, క్రుద్ధః = కోపించినవాడై, తీవ్రేణ = తీక్ష్ణమైన, చక్షుషా = కంటితో, నిర్దహేత్ అపి = మాడ్చివేయును గూడ!

**తాత్పర్యము :-** సీతనుండి సందేశమును తీసికొని పోకుండ తొందరపాటుతో, నేనిటునుండి శ్రీరాముని కడకు చేరినచో, ఆతడు నా తెలివితక్కువతనమునకు క్రోధమునొంది తీవ్రమైన ఎఱ్ఱని ఆ చూపులతోనే నన్ను మాడ్చివేయును గూడ!

**శ్లో॥ యది చోద్యోజయిష్యామి భర్తారం రామకారణాత్ ।**
**వ్యర్థ మాగమనం తస్య ససైన్యస్య భవిష్యతి ॥ 15**

**పదచ్ఛేదము :-** యది - చ - ఉద్యోజయిష్యామి - భర్తారం - రామకారణాత్ - వ్యర్థమ్ - ఆగమనం - తస్య - ససైన్యస్య - భవిష్యతి ॥

**అన్వయక్రమము :-** రామకారణాత్, భర్తారం ఉద్యోజయిష్యామి యది చ, ససైన్యస్య తస్య ఆగమనం వ్యర్థం భవిష్యతి.

**ప్రతిపదార్థము :-** రామకారణాత్ = శ్రీరాముని కార్యనిర్వహణమున, భర్తారం = రాజైన సుగ్రీవుని, ఉద్యోజయిష్యామి యది చ = ప్రోత్సహించెద నేనియు, ససైన్యస్య = సైన్యసమేతుడైన, తస్య = ఆతనియొక్క, ఆగమనం = రాక, వ్యర్థం భవిష్యతి = నిరర్థకము కాగలదు.

**తాత్పర్యము :-** అట్లుగాక రాముని కడ కేగుట మాని శ్రీరాముని నిమిత్తమై మా

ప్రభువైన సుగ్రీవుని ప్రోత్సహించి ఇటకు గొనివచ్చినప్పటికిని, అంతవఱకు సీత జీవించి యుండుట సందేహమే కాబట్టి పెద్ద సైన్యముతో వచ్చిన ఆతని ఆగమనము కూడ వ్యర్థమే యగును.

**శ్లో॥ అంతరం త్వహ మాసాద్య రాక్షసీనా మిహ స్థితః ।**
**శనై రాశ్వాసయిష్యామి సంతాపబహుళా మిమామ్ ॥ 16**

**పదచ్ఛేదము :–** అంతరం – తు – అహమ్ – ఆసాద్య – రాక్షసీనామ్ – ఇహ – స్థితః – శనైః – ఆశ్వాసయిష్యామి – సంతాపబహుళామ్ – ఇమామ్ ॥

**అన్వయక్రమము :–** ఇహ స్థితః అహం రాక్షసీనామ్ అంతరమ్ ఆసాద్య, సంతాపబహుళామ్ ఇమాం శనైః ఆశ్వాసయిష్యామి ॥

**ప్రతిపదార్థము :–** అహం = నేను, ఇహ స్థితః = ఇచ్చట నున్నవాడనై, రాక్షసీనాం = రాక్షసాంగనలయొక్క, అంతరం = అవకాశమును, ఆసాద్య = పొంది, సంతాపబహుళాం = సంతాపముతో నిండియున్న, ఇమాం = ఈమెను, శనైః = నెమ్మదిగా, ఆశ్వాసయిష్యామి = ఓదార్చెదను.

**తాత్పర్యము :–** అందుచేత నేను ఇచ్చటనే యుండి ఈ రాక్షసాంగనలు దూరముగ నున్న సమయము చూచుకొని సంతాపములో మునిగి యున్న ఈమెను ఓదార్చి ఊఱట కలిగించెదను.

**శ్లో॥ అహం త్వతితనుశ్చైవ వానరశ్చ విశేషతః ।**
**వాచం చోదాహరిష్యామి మానుషీ మిహ సంస్కృతామ్ ॥ 17**

**పదచ్ఛేదము :–** అహం – తు – అతితనుః – చ – ఏవ – వానరః – చ – విశేషతః – వాచం – చ – ఉదాహరిష్యామి – మానుషీమ్ – ఇహ – సంస్కృతామ్ ॥

**అన్వయక్రమము :–** అహం తు అతితనుః, విశేషతః వానరః చ, ఇహ సంస్కృతాం, మానుషీం వాచమ్ ఉదాహరిష్యామి॥

**ప్రతిపదార్థము :–** అహం = నేను, అతితనుః = మిక్కిలి చిన్న శరీరముగలవాడను, విశేషతః = విశేషించి, వానరశ్చ = వానరుడను గూడను, ఇహ = ఇప్పుడు, సంస్కృతాం = సంస్కరింపబడినట్టి, మానుషీం వాచం = మానవభాషను, ఉదాహరిష్యామి = పలికెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- సంస్కృతాం వాచం - వ్యాకరణసంస్కారయుక్తమైనట్టి భాషను.

**రా. శిరోమణి** :- ప్రయోగసౌష్ఠవలక్షణములు కలిగినట్టి భాషను.

**మహేశ్వరతీర్థులు** :- గీర్వాణభాషను.

**గోవిందరాజీయము** :- గీర్వాణభాషను.

**తాత్పర్యము** :- నేనెట్లును చిన్న శరీరము గలవాడను, విశేషించి వానరరూపముతో నున్నవాడను, ఇప్పుడు ఈ రక్కసులకు తెలియని సంస్కృతభాషలో సీతామాతతో మాటాడుదునుగాక!

**శ్లో॥ యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్ ।**
**రావణం మన్యమానా మాం సీతా భీతా భవిష్యతి ॥ 18**

**పదచ్ఛేదము** :- యది - వాచం - ప్రదాస్యామి - ద్విజాతిః - ఇవ - సంస్కృతామ్ - రావణం - మన్యమానా - మాం - సీతా - భీతా - భవిష్యతి ॥

**అన్వయక్రమము** :- (కింతు) ద్విజాతిః ఇవ, సంస్కృతాం వాచం ప్రదాస్యామి యది మాం రావణం మన్యమానా సీతా భీతా భవిష్యతి.

**ప్రతిపదార్థము** :- (కింతు = కాని) ద్విజాతిః ఇవ = ద్విజుడువలె, సంస్కృతాం వాచం = సంస్కృతభాషను, ప్రదాస్యామి యది = మాటాడిన యెడల, సీతా = సీతాదేవి, మాం = నన్ను, రావణం = రావణునిగా, మన్యమానా = తలచుచున్నదై, భీతా = భయగ్రస్తురాలు, భవిష్యతి = కాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి**:- తనను అపహరించుసమయమున రావణుడు సంస్కృతమునే మాటాడెననియు, తిరిగి ఇప్పుడు తన సంస్కృతభాషణమును వినినచో, ఆమెకు ఆనాటి రావణుడు జ్ఞప్తికివచ్చి భీతి నొందును అనియును హనుమ ఊహించుచున్నాడు.

**తాత్పర్యము** :- కాని అగ్రజాతి వారివలె నేను సంస్కృతములోనే మాటలాడినయెడల సీతాదేవికి పూర్వము రావణుడు మాటలాడిన ఆ వెనుకటి భాషయే జ్ఞాపకమువచ్చి భయగ్రస్తురాలు కాగలదు.

**శ్లో॥ వానరస్య విశేషేణ కథం స్యా దభిభాషణమ్ ।**
**అవశ్యమేవ వక్తవ్యం మానుషం వాక్య మర్థవత్ ॥ 19**

**పదచ్ఛేదము** :- వానరస్య - విశేషేణ - కథం - స్యాత్ - అభిభాషణమ్, - అవశ్యమ్ - ఏవ - వక్తవ్యం - మానుషం - వాక్యమ్ - అర్థవత్ ॥

**అన్వయక్రమము** :- వానరస్య కథం విశేషేణ అభిభాషణం స్యాత్? అవశ్యమేవ మానుషమ్ అర్థవత్ వాక్యం వక్తవ్యమ్.

**ప్రతిపదార్థము** :- వానరస్య = మర్కటమునకు, విశేషేణ = విశిష్టమైన రీతిగా, అభిభాషణం = సంభాషించుట, కథం = ఎట్లు, స్యాత్ = సంభవము కాగలదు? అవశ్యమేవ = తప్పనిసరిగా, అర్థవత్ = చక్కగా అర్థమగునట్టి, మానుషం వాక్యం = మానవులయొక్క భాషను, వక్తవ్యమ్ = పలుక వలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి**:- వానరభాష సీతాదేవికి బోధపడక పోవచ్చును గనుక ఆమెను ఓదార్చుటకు మనుష్యభాషలోనే మాటాడవలెనని హనుమ నిశ్చయించుకొనెను.

**గోవిందరాజీయము**:- "మానుషం వాక్యం" అనగా కోసలదేశపు మనుష్యుల భాష యని అర్థము.

**తాత్పర్యము** :- ఒక వానరము విశిష్టమైన దేవభాషలో మాటాడుట ఎట్లు సంభవించును? అందుచేత నేను చక్కగా బోధపడురీతిని సాధారణమానవుల భాషలోనే మాటాడుదును గాక!

**శ్లో॥ మయా సాంత్వయితుం శక్యా నాన్యథేయ మనిందితా ।**
**సేయ మాలోక్య మే రూపం జానకీ భాషితం తథా ।**
**రక్షోభి స్త్రాసితా పూర్వం భూయ స్త్రాసం గమిష్యతి ॥ 20**

**పదచ్ఛేదము** :- మయా - సాంత్వయితుం - శక్యా - న - అన్యథా - ఇయమ్ - అనిందితా - సా - ఇయమ్ - ఆలోక్య - మే - రూపం - జానకీ - భాషితం - తథా - రక్షోభిః - త్రాసితా - పూర్వం - భూయః - త్రాసం - గమిష్యతి ॥

**అన్వయక్రమము** :- ఇయమ్ అనిందితా అన్యథా మయా సాంత్వయితుం న శక్యా, పూర్వం రక్షోభిః త్రాసితా ఇయం సా జానకీ మే రూపం, తథా భాషితమ్ ఆలోక్య, భూయః త్రాసం గమిష్యతి.

**ప్రతిపదార్థము** :- ఇయమ్ అనిందితా = ఈ ఉత్తమురాలు, అన్యథా = వేరొకరీతిగా, మయా = నాచేత, సాంత్వయితుం = ఓదార్చుటకు, న శక్యా = శక్యురాలు గాదు. పూర్వం = ఇంతకు ముందు, రక్షోభిః త్రాసితా = రాక్షసులచే పీడింపబడినట్టి, సా ఇయం జానకీ = ఆ ఈ సీతాదేవి, మే రూపం = నా రూపమును, ఆలోక్య = చూచి, తథా = అట్లే, భాషితం = మాటను, (శ్రుత్వా = వినియును) భూయః = తిరిగి, త్రాసం గమిష్యతి = భీతి నొందగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- వానరరూపమున ఎదుట నిలచి మనుష్యభాషలో మాటాడినచో, ఇది యంతయును రావణుని మాయయే యని సీతమ్మ భీతి నొందునని హనుమ భావము.

**తాత్పర్యము** :- సీతమ్మను ఓదార్చుటకు మనుష్యభాషలో మాటాడుట తప్ప గత్యంతరము లేదు గాని నేను వానరరూపములో గాన్పించుచు, మనుష్యభాషలో మాటలాడినచో, ఇంతవఱకును రక్కసులచే పలువిధములైన రీతులలో మోసగింపబడి బాధింపబడిన ఈమె తిరిగి ఇది మఱియొక మోసమని భీతి నొందునేమో?

**శ్లో॥ తతో జాతపరిత్రాసా శబ్దం కుర్యా న్మనస్వినీ ।**
**జానమానా విశాలాక్షీ రావణం కామరూపిణమ్ ॥ 21**

**పదచ్ఛేదము** :- తతః - జాతపరిత్రాసా - శబ్దం - కుర్యాత్ - మనస్వినీ - జానమానా - విశాలాక్షీ - రావణం - కామరూపిణమ్ ॥

**అన్వయక్రమము** :- (మాం) కామరూపిణం రావణం జానమానా, మనస్వినీ విశాలాక్షీ జాతపరిత్రాసా, తతః శబ్దం కుర్యాత్.

**ప్రతిపదార్థము** :- (మాం = నన్ను) కామరూపిణం రావణం = కామరూపుడైనట్టి రావణునిగా, జానమానా = తలచుచున్నదగుచు, తతః = అందువలన, జాతపరిత్రాసా = జనించిన భయముకలిగినదై, మనస్వినీ విశాలాక్షీ = అభిమానవతి యైనట్టి సీతాసుందరి, శబ్దం కుర్యాత్ = కేకపెట్ట వచ్చును.

**తాత్పర్యము** :- మనుష్యభాషలో మాటలాడుచున్న వానరుడైన నన్ను జూచి కామరూపియైన రావణుడే ఇట్లు వచ్చెనని భావించి అమితమైన భయముతో సీతాసుందరి బిగ్గరగా ఆక్రందనము చేయవచ్చును.

**శ్లో॥ సీతయా చ కృతే శబ్దే సహసా రాక్షసీగణః ।**
**నానాప్రహరణో ఘోర స్సమేయా దంతకోపమః ॥ 22**

**పదచ్ఛేదము** :- సీతయా - చ - కృతే - శబ్దే - సహసా - రాక్షసీగణః - నానాప్రహరణః - ఘోరః - సమేయాత్ - అంతకోపమః ॥

**అన్వయక్రమము** :- సీతయా, శబ్దే కృతే, సహసా అంతకోపమః, నానాప్రహరణః ఘోరః రాక్షసీగణః సమేయాత్.

**ప్రతిపదార్థము** :- సీతయా = సీతాదేవిచే, శబ్దే కృతే = శబ్దము చేయబడగా, సహసా = తత్క్షణమే, అంతకోపమః = యముని బోలినట్టి, ఘోరః రాక్షసీగణః = భీకరులైన రాక్షసస్త్రీల సమూహము, నానాప్రహరణః = వివిధమైన ఆయుధములు గలవారై, సమేయాత్ = మీదకు రావచ్చును.

**తాత్పర్యము** :- సీతాదేవి చేయునట్టి ఆక్రందనధ్వనిని విని వెంటనే యమునివలె భయంకరులైన పెక్కురు రాక్షసస్త్రీలు బహువిధములైన ఆయుధములను చేతబూని రావచ్చును.

**శ్లో॥ తతో మాం సంపరిక్షిప్య సర్వతో వికృతాననాః ।**
**వధే చ గ్రహణే చైవ కుర్యు ర్యత్నం యథాబలమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :- తతః - మాం - సంపరిక్షిప్య - సర్వతః - వికృతాననాః - వధే - చ - గ్రహణే - చ - ఏవ - కుర్యుః - యత్నం - యథాబలమ్ ॥

**అన్వయక్రమము** :- తతః వికృతాననాః (తాః) మాం సర్వతః సంపరిక్షిప్య వధే చ, గ్రహణే చ ఏవ యథాబలం యత్నం కుర్యుః.

**ప్రతిపదార్థము** :- తతః = ఆటుపిమ్మట, వికృతాననాః(తాః) = వికారమైన ముఖములు గల (ఆ రాక్షసస్త్రీలు), సర్వతః = నలుమూలలనుండి, మాం = నన్ను, సంపరిక్షిప్య = చుట్టుముట్టి, యథాబలం = శక్తిని అనుసరించి, వధే చ = చంపుటయందును, గ్రహణే చైవ = బంధించుటయందును, యత్నం = ప్రయత్నమును, కుర్యుః = చేయుదురు.

**తాత్పర్యము** :- అప్పుడు వికారమైన ముఖములుగల ఆ రాక్షసస్త్రీలు నన్ను చుట్టుముట్టి, వారికి చేతనైనంత వఱకు నన్ను బంధించుటకును చంపుటకును ప్రయత్నింపవచ్చును.

**శ్లో॥ గృహ్యా శాఖాః ప్రశాఖాశ్చ స్కంధాం శ్చోత్తమశాఖినామ్ ।**
**దృష్ట్వా విపరిధావంతం భవేయు ర్భయశంకితాః ॥ 24**

**పదచ్ఛేదము :–** గృహ్యా – శాఖాః – ప్రశాఖాః – చ – స్కంధాన్ – చ – ఉత్తమ శాఖినాం – దృష్ట్వా – విపరిధావంతం – భవేయుః – భయశంకితాః ॥

**అన్వయక్రమము :–** ఉత్తమశాఖినాం శాఖాః చ, ప్రశాఖాః చ, స్కంధాన్ చ గృహ్యా విపరిధావంతం (మాం) దృష్ట్వా (తాః) భయశంకితాః భవేయుః.

**ప్రతిపదార్థము :–** ఉత్తమశాఖినాం = గొప్ప వృక్షములయొక్క, శాఖాః చ = కొమ్మలను, ప్రశాఖాశ్చ = చిన్న కొమ్మలను, స్కంధాన్ చ = బోదెలను, గృహ్యా = పట్టుకొని విపరిధావంతం = అటు నిటు పరుగెత్తుచున్న, (మాం = నన్ను) దృష్ట్వా = చూచి, (తాః = ఆ రాక్షసస్త్రీలు) భయశంకితాః = భయముచే అనుమానము నొందినవారు, భవేయుః = కాగలరు.

**తాత్పర్యము :–** పెద్ద పెద్ద చెట్ల పెద్ద కొమ్మలను, చిన్న కొమ్మలను, బోదెలను చేతితో పట్టుకొని నలువైపులకును పరుగెత్తుచున్న నన్ను చూచి ఆ రాక్షసస్త్రీలకు భయమును అనుమానమును కలుగవచ్చును.

**శ్లో॥ మమ రూపం చ సంప్రేక్ష్య వనే విచరతో మహత్ ।**
**రాక్షస్యో భయవిత్రస్తా భవేయు ర్వికృతాననాః ॥ 25**

**పదచ్ఛేదము :–** మమ – రూపం – చ – సంప్రేక్ష్య – వనే – విచరతః – మహత్ – రాక్షస్యః – భయవిత్రస్తాః – భవేయుః – వికృతాననాః ॥

**అన్వయక్రమము :–** వనే విచరతః మమ మహత్ రూపం సంప్రేక్ష్య వికృతాననాః రాక్షస్యః భయవిత్రస్తాః భవేయుః.

**ప్రతిపదార్థము :–** వనే విచరతః = వనమునందు తిరుగాడుచున్నట్టి, మమ = నాయొక్క, మహత్ = గొప్పదైన, రూపం = రూపమును, సంప్రేక్ష్య = చూచి, వికృతాననాః = వికారమైన ముఖములుగల, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, భయవిత్రస్తాః = భయపీడితులు, భవేయుః = కాగలరు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** వారికి లొంగకుండుటకై నేను రూపమును పెంచుకొందును గనుక నా మహాకాయమును జూచి వారికి కంపము గలిగి గుండెలు చెదరి వికృతస్వరము

లేర్పడి, ఈతడు కేవల వానరుడు గాడు; కామరూపధరుడైన శత్రుపక్షమువాడని శంకించెదరని భావము.

'వికృతాననాః' కు బదులుగా 'వికృతస్వరాః' యని బొంబాయి పాఠము.

**తాత్పర్యము :–** నేను పెద్దదైన నా శరీరముతో ఈ వనమునందు సంచరించుట చూచి ఈ రాక్షసస్త్రీలు ఇంకను వికృతములైన ముఖములతో, స్వరములతో తీవ్రమైన భయాందోళనముల నొందగలరు.

**శ్లో॥ తతః కుర్యు స్సమాహ్వానం రాక్షస్యో రక్షసా మపి ।**
**రాక్షసేంద్రనియుక్తానాం రాక్షసేంద్రనివేశనే ॥ 26**

**పదచ్ఛేదము :–** తతః – కుర్యుః – సమాహ్వానం – రాక్షస్యః – రక్షసామ్ – అపి – రాక్షసేంద్రనియుక్తానాం – రాక్షసేంద్రనివేశనే ॥

**అన్వయక్రమము :–** తతః రాక్షస్యః రాక్షసేంద్రనివేశనే రాక్షసేంద్రనియుక్తానాం రక్షసాం సమాహ్వానం కుర్యుః అపి.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, రాక్షస్యః = ఆ రాక్షసస్త్రీలు, రాక్షసేంద్రనివేశనే = రాక్షసరాజైన రావణుని భవనమునందు, రాక్షసేంద్రనియుక్తానాం = రావణునిచే నియమింపబడినట్టి, రక్షసాం = రాక్షసుల యొక్క, సమాహ్వానం = ఆహ్వానమును, కుర్యుః అపి = చేయగలరు కూడను.

**తాత్పర్యము :–** అట్లు భయపీడితలైన ఆ రాక్షసస్త్రీలు రావణుని భవనమునందు నగరరక్షణకై అతనిచే నియమింపబడిన రాక్షసవీరులను పిలుచుకొని రాగలరు కూడను.

**శ్లో॥ తే శూలశక్తినిస్త్రింశవివిధాయుధపాణయః ।**
**ఆపతేయు ర్విమర్దేఽస్మి న్వేగే నోద్విగ్నకారిణః ॥ 27**

**పదచ్ఛేదము :–** తే – శూలశక్తినిస్త్రింశవివిధాయుధపాణయః – ఆపతేయుః – విమర్దే – అస్మిన్ – వేగేన – ఉద్విగ్నకారిణః ॥

**అన్వయక్రమము :–** అస్మిన్ విమర్దే ఉద్విగ్నకారిణః తే శూలశక్తినిస్త్రింశవివిధాయుధ పాణయః (సంతః) వేగేన ఆపతేయుః.

**ప్రతిపదార్థము :–** అస్మిన్ విమర్దే = ఈ కోలాహలమునందు, ఉద్విగ్నకారిణః = భయోద్వేగమును కల్గించు నట్టి వారైన, తే = ఆ రాక్షస వీరులు, శూలశక్తినిస్త్రింశ వివిధాయుధ పాణయః (సంతః) = శూలములు, శక్తులు, ఖడ్గములు మున్నగు,

బహువిధములైన ఆయుధములను చేతులందు ధరించినవారై, వేగేన = వేగముతో, ఆపతేయుః = మీదబడుదురు.

**తాత్పర్యము** :– అప్పు డేర్పడిన ఆ కోలాహలమునందు ఇంకను భయోద్వేగమును కల్గించుచు రావణుని భటులైన రాక్షసవీరులు శూలములు, శక్తులు, ఆయుధములు, ఖడ్గములు మున్నగు శస్త్రములను ధరించి నాపై బడుదురు.

**శ్లో॥ సంరుద్ధ స్తైస్తు పరితో విధమన్ రక్షసాం బలమ్ ।**
**శక్నుయాం నతు సంప్రాప్తుం పరం పారం మహోదధేః ॥ 28**

**పదచ్ఛేదము** :– సంరుద్ధః – తైః – తు – పరితః – విధమన్ – రక్షసాం – బలమ్ – శక్నుయాం – న – తు – సంప్రాప్తుం – పరం – పారం – మహోదధేః.

**అన్వయక్రమము** :– తైః పరితః సంరుద్ధః రక్షసాం, (తం బలం) విధమన్, మహోదధేః పరం పారం తు సంప్రాప్తుం న శక్నుయామ్.

**ప్రతిపదార్థము** :– తైః = ఆ రాక్షసవీరులచే, పరితః = చుట్టును, సంరుద్ధః = అడ్డగింపబడినవాడనై, రక్షసాం (తం బలం) = రాక్షసులయొక్క ఆ సైన్యసమూహమును, విధమన్ = తటిమికొట్టుచు, మహోదధేః = మహాసముద్రము యొక్క, పరం పారం తు = ఆవలి యొడ్డును మాత్రము, సంప్రాప్తుం = చేరుకొనుటకు, న శక్నుయామ్ = శక్తుడను గాక పోవచ్చును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :– రాక్షసవీరులను పరిమార్తునుగాని, సీతమ్మతో మాటాడినట్లు విని రాక్షసులామెను చంపివేసిన యెడల నాకు అప్పుడు సముద్రమును దాటి మా వా రున్నట్టి తీరమును చేరుకొను శక్తి యుండదు.

**తాత్పర్యము** :– ఆ రాక్షసవీరులు నన్ను చుట్టుముట్టి ఎదుర్కొనినప్పుడు నేను వారిని పరిమార్చుచు సముద్రమును దాటి ఆవలియొడ్డుకు చేరుకొనుటకు వీలు లేక పోవచ్చును.

**శ్లో॥ మాం వా గృహ్ణీయు రాప్లుత్య బహవ శ్శీఘ్రకారిణః ।**
**స్యా దియం చాగృహీతార్థా మమ చ గ్రహణం భవేత్ ॥ 29**

**పదచ్ఛేదము** :– మాం – వా – గృహ్ణీయుః – ఆప్లుత్య – బహవః – శీఘ్రకారిణః – ఇయం – చ – అగృహీతార్థా – మమ – చ – గ్రహణం – భవేత్ ॥

**అన్వయక్రమము :–** బహవః శీఘ్రకారిణః ఆప్లుత్య, మాం గృహ్ణీయుః వా; ఇయం చ అగృహీతార్థా స్యాత్, మమ గ్రహణం చ భవేత్.

**ప్రతిపదార్థము :–** శీఘ్రకారిణః = మహావేగము కల్గినట్టి, బహవః = పెక్కు మంది వీరులు, ఆప్లుత్య = ఎగిరి (వచ్చి), మాం = నన్ను, గృహ్ణీయుః వా = బంధింపవచ్చునేమో! ఇయం చ = ఈ సీతాదేవియును, అగృహీతార్థా స్యాత్ = తెలియని రామవృత్తాంతము గలది కాగలదు. మమ గ్రహణం చ = నాబంధనము కూడ, భవేత్ = సంభవింపవచ్చును.

**తాత్పర్యము :–** ఎట్లో నేను తప్పించుకొని సముద్రమును దాటి పోవుచున్నను మహాజవ సంపన్నులైన రాక్షసవీరులు పెక్కుమంది నన్ను వెంబడించి ఆకసమునందే బంధింపవచ్చును. నన్ను బంధించినప్పుడు సీతాదేవికి రామవృత్తాంతము తెలియక పోవుటయు సంభవించును గదా!

**శ్లో॥ హింసాభిరుచయో హింస్యు రిమాం వా జనకాత్మజామ్ ।**
**విపన్నం స్యాత్తతః కార్యం రామసుగ్రీవయో రిదమ్ ॥ 30**

**పదచ్ఛేదము :–** హింసాభిరుచయః – హింస్యుః – ఇమాం – వా – జనకాత్మజామ్ – విపన్నం – స్యాత్ – తతః – కార్యం – రామసుగ్రీవయోః – ఇదమ్.

**అన్వయక్రమము :–** హింసాభిరుచయః, (రాక్షసాః) ఇమాం జనకాత్మజాం హింస్యుః వా! తతః రామసుగ్రీవయోః ఇదం కార్యం విపన్నం స్యాత్.

**ప్రతిపదార్థము :–** హింసాభిరుచయః = హింసయందు అమితప్రీతి గలిగినట్టి, రాక్షసాః = రాక్షసులు, జనకాత్మజాం = జనకరాజపుత్రిని, హింస్యుః వా = చంపినను చంపవచ్చును, తతః = అందువలన, రామసుగ్రీవయోః = రామసుగ్రీవులయొక్క, ఇదం కార్యం = ఈ యుద్యమము, విపన్నం స్యాత్ = చెడిపోవగలదు.

**తాత్పర్యము :–** సజ్జనులను హింసించుటయందు అమితమైన ఆసక్తి గల ఈ రాక్షసులు సీతాదేవినే హింసించి పరిమార్చవచ్చును. అట్లు జరిగిన యెడల రామసుగ్రీవులు తలపెట్టినట్టి ఈ యుద్యమమే విఫలమై పోవును గదా!

**శ్లో॥ ఉద్దేశే నష్టమార్గే ఽస్మిన్ రాక్షసైః పరివారితే ।**
**సాగరేణ పరిక్షిప్తే గుప్తే వసతి జానకీ ॥ 31**

**పదచ్ఛేదము :–** ఉద్దేశే – నష్టమార్గే – అస్మిన్ – రాక్షసైః – పరివారితే – సాగరేణ

– పరిక్షిప్తే – గుప్తే – వసతి – జానకీ ॥

**అన్వయక్రమము** :– నష్టమార్గే, సాగరేణ పరిక్షిప్తే, రాక్షసైః, పరివారితే, అస్మిన్ గుప్తే ఉద్దేశే జానకీ వసతి.

**ప్రతిపదార్థము** :– నష్టమార్గే = త్రోవతెన్నులు లేనట్టియు, రాక్షసైః పరివారితే = రాక్షసులచే కావలి యుంచబడినట్టియు, సాగరేణ పరిక్షిప్తే = సముద్రముచే చుట్టబడియున్నట్టియు, అస్మిన్ గుప్తే ఉద్దేశే = ఈ రహస్యమైనట్టి ప్రదేశమునందు, జానకీ = సీతాదేవి, వసతి = వసించుచున్నది.

**తాత్పర్యము**:– ఈ ప్రదేశము చూడగా చేరుటకు తోవతెన్నులు లేనిది, నలువైపులను మహాసముద్రముచే మూసివేయబడినది, రాక్షసభటులచే కావలి యుంచబడినది. ఇట్టి రహస్యప్రదేశమునందు గదా సీతాదేవి చిక్కుకొని యున్నది.

**శ్లో॥ విశస్తే వా గృహీతే వా రక్షోభి ర్మయి సంయుగే ।**
**నాన్యం పశ్యామి రామస్య సాహాయ్యం కార్యసాధనే ॥ 32**

**పదచ్ఛేదము** :– విశస్తే – వా – గృహీతే – వా – రక్షోభిః – మయి – సంయుగే – న – అన్యం – పశ్యామి – రామస్య – సాహాయ్యం – కార్యసాధనే.

**అన్వయక్రమము** :– సంయుగే రక్షోభిః విశస్తే వా గృహీతే వా రామస్య కార్యసాధనే అన్యం సాహాయ్యం న పశ్యామి.

**ప్రతిపదార్థము** :– సంయుగే = యుద్ధమునందు, రక్షోభిః = రాక్షసులచే, మయి విశస్తే వా = నేను చంపబడినగాని, గృహీతే వా = బంధింపబడినగాని, రామస్య కార్యసాధనే = శ్రీరాముని కార్యమును సాధించు విషయమున, సాహాయ్యం = సహాయపడునట్టి వానిని, అన్యం = వేఱొక్కనిని, న పశ్యామి = చూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :– తన మరణముచే వానరవీరు లెల్లరును విషాదనిమగ్నులై యుందురు గావున సముద్రమును దాటివచ్చుశక్తి ఎవ్వరికిని ఉండదని భావము.

**తాత్పర్యము**:– ఈ జరుగబోవు యుద్ధమునందు రాక్షసులు నన్ను చంపినను బంధించినను శ్రీరాముని కార్యమును సాధింపగల్గినట్టి వీరుడు వేఱెవ్వడును ఉన్నట్లు నాకు గాన్పింపడు.

**శ్లో॥ విమృశంశ్చ న పశ్యామి యో హతే మయి వానరః ।**
**శతయోజనవిస్తీర్ణం లంఘయేత మహోదధిమ్ ॥ 33**

**పదచ్ఛేదము** :- విమృశన్ - చ - న - పశ్యామి - యః - హతే - మయి - వానరః - శతయోజనవిస్తీర్ణం - లంఘయేత - మహోదధిమ్ ॥

**అన్వయక్రమము** :- మయి హతే (సతి) శతయోజనవిస్తీర్ణం మహోదధిం యః వానరః లంఘయేత (తం) విమృశన్ చ న పశ్యామి.

**ప్రతిపదార్థము** :- మయి హతే (సతి) = నేను చంపబడగా, శతయోజనవిస్తీర్ణం = నూరు యోజనముల పొడవు గల్గిన, మహోదధిం = మహాసముద్రమును, యః వానరః = ఏ వానరుడు, లంఘయేత = దాటగల్గునో (తం = అట్టివానిని), విమృశన్ చ = ఆలోచించినను, న పశ్యామి = చూడలేకున్నాను.

**తాత్పర్యము**:- రక్కసుల చేతిలో నేను మరణించిన యెడల శతయోజనవిస్తీర్ణమైన ఈ మహాసముద్రమును దాటగల వానరు డెవ్వడును ఎంత ఆలోచించినప్పటికిని నాకు కాన్పించుటలేదు.

**శ్లో॥ కామం హంతుం సమర్థోఽ స్మి సహస్రాణ్యపి రక్షసామ్ ।**
**న తు శక్ష్యామి సంప్రాప్తుం పరం పారం మహోదధేః ॥ 34**

**పదచ్ఛేదము** :- కామం - హంతుం - సమర్థః - అస్మి - సహస్రాణి - అపి - రక్షసామ్ - న - తు - శక్ష్యామి - సంప్రాప్తుం - పరం - పారం - మహోదధేః ॥

**అన్వయక్రమము** :- రక్షసాం సహస్రాణి అపి కామం హంతుం సమర్థః అస్మి (కిం) తు మహోదధేః పరం పారం సంప్రాప్తుం న శక్ష్యామి.

**ప్రతిపదార్థము** :- కామం = నిరాటంకముగా, రక్షసాం సహస్రాణి అపి = రాక్షసులను వేలకొలది యైనను, హంతుం = హతమార్చుటకు, సమర్థః అస్మి = సమర్థుడను అగుదును, (కిం) తు = కాని, మహోదధేః = మహాసముద్రముయొక్క, పరం పారం = ఆవలి యొడ్డును, సంప్రాప్తుం = చేరుటకు, సమర్థః న అస్మి = సామర్థ్యమున్నవాడను గాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- సముద్రమును దాటుటకు తన యుద్ధపరిక్రాంతి అడ్డము రావచ్చునని భావము.

**రా. శిరోమణి:-** రాక్షసుల చేతిలో సీతమ్మ మరణించుననను దిగులుచే సముద్రలంఘనమునకు తగిన శక్తి తనకుండదని హనుమ భయము.

**తాత్పర్యము:-** ఈ రాక్షసవీరులు ఎన్ని వేలమంది వచ్చినను నిస్సంశయముగా నేను తెగటార్చగలను గాని ఈ మహాసముద్రమును దాటి ఆవలితీరము చేరుటకు మాత్రము నాకు శక్తి యుండదు.

**శ్లో॥ అసత్యాని చ యుద్ధాని సంశయో మే న రోచతే ।**
**కశ్చ నిస్సంశయం కార్యం కుర్యా త్ప్రాజ్ఞ స్ససంశయమ్ ॥ 35**

**పదచ్ఛేదము :-** అసత్యాని – చ – యుద్ధాని – సంశయః – మే – న – రోచతే, కః – చ – నిస్సంశయం – కార్యం – కుర్యాత్ – ప్రాజ్ఞః – ససంశయమ్ ॥

**అన్వయక్రమము :-** యుద్ధాని చ అసత్యాని; మే సంశయః న రోచతే; కః ప్రాజ్ఞః నిస్సంశయం కార్యం ససంశయం కుర్యాత్?

**ప్రతిపదార్థము :-** యుద్ధాని చ = యుద్ధములును, అసత్యాని = (జయము విషయమున) నిశ్చయము లేనట్టివి; మే = నాకు, సంశయః న రోచతే = సందిగ్ధవిషయము ఇష్టము లేదు, కః చ ప్రాజ్ఞః = ఏ తెలివైనవాడు, నిస్సంశయం కార్యం = సంశయ రహితముగా నున్న కార్యమును, ససంశయం కుర్యాత్ = సందేహగ్రస్తమైన దానినిగా చేయును.

**తాత్పర్యము:-** యుద్ధము తటస్థించినప్పుడు జయము తప్పక కలుగుననుట సందేహముగదా! ఇట్టి సంశయగ్రస్తమైన యుద్ధము కోరి తెచ్చుకొనుట నాకిష్టములేదు. తెలివైనవాడు ఎవ్వడును నిస్సంశయముగ ఫలమునిచ్చు బాటను వీడి సంశయగ్రస్తమైన మార్గమును చేపట్టడు గదా!

**శ్లో॥ ప్రాణత్యాగశ్చ వైదేహ్యా భవేదనభిభాషణే ।**
**ఏష దోషో మహాన్ హి స్యాన్మమ సీతాభిభాషణే ॥ 36**

**పదచ్ఛేదము :-** ప్రాణత్యాగః – చ – వైదేహ్యాః – భవేత్ – అనభిభాషణే – ఏషః – దోషః – మహాన్ – హి – స్యాత్ – మమ – సీతాభిభాషణే ॥

**అన్వయక్రమము :-** అనభిభాషణే వైదేహ్యాః ప్రాణత్యాగః భవేత్; సీతాభిభాషణే హి మమ ఏషః మహాన్ దోషః స్యాత్.

**ప్రతిపదార్థము :-** అనభిభాషణే = మాటాడని యెడల, వైదేహ్యాః = సీతాదేవికి,

ప్రాణత్యాగశ్చ భవేత్ = మరణము కలుగవచ్చును, సీతాభిభాషణే హి = సీతమ్మతో మాటాడిన యెడల, మమ = నాకు, ఏషః మహాన్ దోషః స్యాత్ = ఈ విధమైన మహాదోషము సంభవించును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:–** సీతమ్మతో మాటాడిన రాక్షసుల చేతిలో ఆమెకు మరణము సంభవించును. మాటాడకున్నచో స్వయముగనే సీతాదేవి మరణించును. ఇదియే హనుమంతు డూహించిన మహాదోషము.

**తాత్పర్యము:–** సీతాదేవికి రామసందేశమును వినిపించి మాటలాడనిచో భర్తృవియోగ వ్యథచే ఆమె తప్పక మరణించును. అట్లుగాక ఆమె ఎదుట నిలచి రాక్షసస్త్రీలు చూచుచుండగా రాముని వృత్తాంతమును తెలిపినచో ఆ రాక్షసస్త్రీల చేతిలో ఆమెకు మృత్యువు సంభవించవచ్చును. ఇట్లు ఈ పక్షమున గూడ నాకు మహాదోషమే తటస్థించుచున్నది.

**శ్లో॥ భూతా శ్చార్థా వినశ్యంతి దేశకాలవిరోధితాః ।**
**విక్లబం దూత మాసాద్య తమ స్సూర్యోదయే యథా ॥ 37**

**పదచ్ఛేదము :–** భూతాః – చ – అర్థాః – వినశ్యంతి – దేశకాలవిరోధితాః – విక్లబం – దూతమ్ – ఆసాద్య – తమః – సూర్యోదయే – యథా ॥

**అన్వయక్రమము :–** భూతాః అర్థాశ్చ విక్లబం దూతం ఆసాద్య, సూర్యోదయే తమః యథా, దేశకాలవిరోధితాః (సంతః) వినశ్యంతి.

**ప్రతిపదార్థము :–** భూతాః = సిద్ధించినట్టి, అర్థాశ్చ = కార్యములుగూడ, విక్లబం = మూర్ఖుడైన, దూతం = దూతను, ఆసాద్య = పొంది, సూర్యోదయే = సూర్యోదయ సమయమున, తమః యథా = చీకటివలె, దేశకాలవిరోధితాః (సంతః) = దేశకాలములతో విరోధించినవై, వినశ్యంతి = చెడిపోవుచున్నవి.

**తాత్పర్యము:–** అంతవఱకును చక్కగా నిర్వహింపబడియున్నట్టి కార్యములు గూడ అవివేకియైన దూతచేతిలో పడిన యెడల, సూర్యుడుదయించగనే చీకటి నశించి పోయినట్లు, దేశకాలముల ఔచిత్య మెఱుగక ప్రవర్తించిన ఆ దూతమూర్ఖత్వము వలన పూర్తిగా చెడిపోవుచుండును.

**శ్లో॥ అర్థానర్థాంతరే బుద్ధి ర్నిశ్చితాఽపి న శోభతే ।**
**ఘాతయంతి హి కార్యాణి దూతాః పండితమానినః ॥ 38**

**పదచ్ఛేదము :–** అర్థానర్థాంతరే – బుద్ధిః – నిశ్చితా – అపి – న – శోభతే – ఘాతయంతి – హి – కార్యాణి – దూతాః – పండితమానినః.

**అన్వయక్రమము :–** నిశ్చితా అపి బుద్ధిః అర్థానర్థాంతరే న శోభతే. పండితమానినః కార్యాణి ఘాతయంతి హి.

**ప్రతిపదార్థము :–** అర్థానర్థాంతరే = కార్యాకార్యవిషయమున, నిశ్చితా బుద్ధిః అపి = నిర్ణయింపబడిన ఆలోచనము గూడ, విక్లబం = అవివేకియైన, దూతం = దూతను, ఆసాద్య = చేరి, న శోభితే = శోభిల్లదు. పండితమానినః =తామే ప్రజ్ఞావంతుల మనుకొనునట్టి, దూతాః = దూతలు, కార్యాణి = కార్యములను, ఘాతయంతి హి = చెఱచివేయుచుందురు గదా!

**తాత్పర్యము:–** కర్తవ్యాకర్తవ్యములు తెలిసిన పెద్దలు చక్కగా నిర్ణయించి యుంచిన ఆలోచనలుకూడ మూర్ఖుడైన దూతవలన రాణింపు లేక నిష్ఫలమగుచున్నవి. తామే గొప్ప ప్రజ్ఞగలవార మనుకొను దూతలు చేపట్టిన కార్యములను తఱచుగా ధ్వంసము చేయుచుందురు.

**శ్లో॥ న వినశ్యే త్కథం కార్యం వైక్లబ్యం న కథం భవేత్ ।**
**లంఘనం చ సముద్రస్య కథం ను న వృథా భవేత్ ॥ 39**

**శ్లో॥ కథం ను ఖలు వాక్యం మే శృణుయా న్నోద్విజేత వా ।**
**ఇతి సంచింత్య హనుమాం శ్చకార మతిమా న్మతిమ్ ॥ 40**

**పదచ్ఛేదము :–** న – వినశ్యేత్ – కథం – కార్యం – వైక్లబ్యం – న – కథం – భవేత్ – లంఘనం – చ – సముద్రస్య – కథం – ను – న – వృథా – భవేత్, కథం – ను – ఖలు – వాక్యం – మే – శృణుయాత్ – న – ఉద్విజేత – వా, ఇతి – సంచింత్య – హనుమాన్ – చకార – మతిమాన్ – మతిమ్ ॥

**అన్వయక్రమము :–** కథం కార్యం న వినశ్యేత్! కథం వైక్లబ్యం న భవేత్? కథం ను సముద్రస్య లంఘనం వృథా న భవేత్, కథం ను మే వాక్యం సీతా శృణుయాత్? న వా ఉద్విజేత? ఇతి మతిమాన్ హనుమాన్ సంచింత్య మతిం చకార.

**ప్రతిపదార్థము :–** కథం = ఎట్లు, కార్యం = పని, న వినశ్యేత్ = చెడిపోవక యుండును? కథం = ఎట్లు, వైక్లబ్యం = కలవరపాటు చర్య, న భవేత్ = జరుగక యుండును,

కథం ను = ఎట్లుగా, సముద్రస్య లంఘనం = సముద్రలంఘనము, వృథా న భవేత్ = వ్యర్థము గాక యుండును, కథం ను = ఎట్లుగా, మే = నాయొక్క, వాక్యం = వచనము, (సీతా = సీతాదేవి) శృణుయాత్ = ఆలకించును? న వా ఉద్విజేత = భయచకితురాలు గాక యుండును, ఇతి = అని, మతిమాన్ = భవిష్యత్తు నూహించు ప్రజ్ఞగలవాడైన, హనుమాన్ = హనుమంతుడు, సంచింత్య = ఆలోచించి, మతిం = ఉత్తమ మైనట్టి నిర్ణయమును, చకార = చేసెను.

**తాత్పర్యము:**- నా స్వామి కార్యము ఎట్లు చెడిపోవక యుండును? కలవరపాటునకు తావులేకుండ కార్యము నెట్లు సాధింతును? నా సముద్రలంఘనప్రయాణము వ్యర్థము గాకుండ ఎట్లు ఫలించును? నా సందేశవచనములను సీతమ్మ ఎట్లు నిర్భయముగా వినగల్గును? వినునప్పుడు శంకవల్ల భీతురాలు గాకుండ ఎట్లుండగలదు? అని చక్కగా ఆలోచించి భావికర్తవ్యములను చక్కగా తెలిసికొను ప్రజ్ఞాశాలియైన హనుమంతుడు, సీతాదేవితో ఎట్టి ప్రమాదము లేకుండగ సంభాషించు పద్ధతిని నిర్ణయించుకొనెను.

**శ్లో॥ రామ మక్లిష్టకర్మాణం స్వబంధు మనుకీర్తయన్ ।**
**నైనా ముద్వేజయిష్యామి తద్బంధుగతమానసామ్ ॥ 41**

**పదచ్ఛేదము :**- రామమ్ - అక్లిష్టకర్మాణం - స్వబంధుమ్ - అనుకీర్తయన్ - న - ఏనాం - ఉద్వేజయిష్యామి - తద్బంధుగతమానసామ్.

**అన్వయక్రమము :**- అక్లిష్టకర్మాణం స్వబంధుం రామమ్ అనుకీర్తయన్ తద్బంధు గతమానసామ్ ఏనాం న ఉద్వేజయిష్యామి.

**ప్రతిపదార్థము :**- అక్లిష్టకర్మాణం = అక్లేశకరముగ కృత్యములు గావించు వాడును, స్వబంధుం = తనకు ఆప్తుదును అగు, రామం = శ్రీరాముని, అనుకీర్తయన్ = ప్రశంసించుచు, తద్బంధుగతమానసాం = తనకు ఆప్తుడైన అతనియందే లగ్నమైయున్న మనస్సు కల్గినట్టి, ఏనాం = ఈ సీతాదేవిని, న ఉద్వేజయిష్యామి = భయము కలుగకుండ చేసెదను.

**తాత్పర్యము:**- పరులకు క్లేశము సహింపని ఆచరణము కలవాడును, తన కత్యంత ప్రియుడు నగు శ్రీరాముని గుణవైభవమును కీర్తించుచు ఈ సీతమ్మ మనస్సునకు ఉద్వేగము కలుగకుండ నా మాటలు వినునట్లు చేసెదను.

**శ్లో॥ ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య రామస్య విదితాత్మనః ।**
**శుభాని ధర్మయుక్తాని వచనాని సమర్పయన్ ॥ 42**

**శ్లో॥ శ్రావయిష్యామి సర్వాణి మధురాం ప్రబ్రువన్ గిరిమ్ ।**
**శ్రద్ధాస్యతి యథా హీయం తథా సర్వం సమాదధే ॥ 43**

**పదచ్ఛేదము** :– ఇక్ష్వాకూణాం – వరిష్ఠస్య – రామస్య – విదితాత్మనః – శుభాని – ధర్మయుక్తాని – వచనాని – సమర్పయన్ – శ్రావయిష్యామి – సర్వాణి – మధురాం – ప్రబ్రువన్ – గిరమ్ – శ్రద్ధాస్యతి – యథా – హి – ఇయం – తథా – సర్వం – సమాదధే ॥

**అన్వయక్రమము** :– ఇక్ష్వాకూణాం వరిష్ఠస్య, విదితాత్మనః రామస్య, ధర్మయుక్తాని, శుభాని వచనాని సమర్పయన్, మధురాం గిరం ప్రబ్రువన్ సర్వాణి శ్రావయిష్యామి; ఇయం యథా శ్రద్ధాస్యతి, తథా సర్వం సమాదధే.

**ప్రతిపదార్థము** :– ఇక్ష్వాకూణాం = ఇక్ష్వాకువంశమువారిలో, వరిష్ఠస్య = శ్రేష్ఠుడై, విదితాత్మనః = ఆత్మవేదియైనట్టి, రామస్య = రామునియొక్క, ధర్మయుక్తాని = ధర్మోపేతములైనట్టి, శుభాని వచనాని = మంగళకరమైనట్టి వచనములను, సమర్పయన్ = నివేదించుచు, మధురాం = అన్ని విషయములను, శ్రావయిష్యామి = వినిపించెదను, ఇయం = ఈ సీతమ్మ, యథా = ఏ విధముగా, శ్రద్ధాస్యతి = నమ్మగలదో, తథా = ఆ విధముగా, సర్వం = సమస్తమును, సమాదధే = సమకూర్చెదను.

**తాత్పర్యము**:– ఇక్ష్వాకుకులభూషణుడును ఆత్మజ్ఞుడును అగు శ్రీరాముడు తెలుపుచున్న ధార్మికములైన శుభవచనముల నన్నింటిని మధురమైన వాక్కులతో ఈమె జాగ్రత్తగా విని నమ్మకము నొందునట్లు సముచితమైన రీతిలో ఈమెకు వినిపించెదను.

**శ్లో॥ ఇతి స బహువిధం మహానుభావో**
**జగతిపతేః ప్రమదా మవేక్షమాణః ।**
**మధుర మవితథం జగాద వాక్యం**
**ద్రుమవిటపాంతర మాస్థితో హనూమాన్ ॥ 44**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనుమత్ కృత్యాకృత్యవిచారణం" నామ*
*త్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– ఇతి – సః – బహువిధం – మహానుభావః – జగతిపతేః – ప్రమదామ్ – అవేక్షమాణః – మధురమ్ – అవితథం – జగాద – వాక్యం –

ద్రుమవిటపాంతరమ్ - ఆస్థితః - హనూమాన్.

**అన్వయక్రమము** :- మహానుభావః సః హనూమాన్, ఇతి బహువిధం (విచింత్య) జగతిపతేః ప్రమదామ్ అవేక్షమాణః, ద్రుమవిటపాంతరమ్ ఆస్థితః, మధురమ్, అవితథం వాక్యం జగాద.

**ప్రతిపదార్థము** :- మహానుభావః = మహాత్ముడైనట్టి, సః హనూమాన్ = ఆ హనుమ, ఇతి = ఇట్లు, బహువిధం = పెక్కుభంగుల, (విచింత్య = ఆలోచించి), జగతిపతేః = జగత్ప్రభువైన శ్రీరామునియొక్క, ప్రమదాం = ధర్మపత్నిని, అవేక్షమాణః = దర్శించు చున్నవాడై, ద్రుమవిటపాంతరమ్ = శింశుపావృక్షముయొక్క కొమ్మచాటున, ఆస్థితః = ఆసీనుడై, మధురమ్ = మధురమును, అవితథం = అమోఘమును అగు, వాక్యం = వచనమును, జగాద = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:**- లోకమునందు తఱచుగా ఇంద్రియముల మూలమున జ్ఞానము ప్రసరించి, విషయమును గ్రహించినపిమ్మటనే మనస్సున కాహ్లాదము కలుగుట జరుగును. ఈ మాటలు అట్లుగాక, స్వయముగనే అహ్లాదకరములు. ఇచ్చట మనసునకు అహ్లాదకరత్వము శబ్దమూలమున నని యెఱుంగునది. ఈ వాక్యములు సీతమ్మ వినిన తోడనే సంతోషపడి ప్రాణత్యాగప్రయత్నము మానునని భావము. ఏ యుద్దేశ్యముతో ఆ మాటలు చెప్పబడెనో దానిని నెఱవేర్చు శక్తి యా శబ్దములయందు గలదని భావము.

**తాత్పర్యము:**- మహాత్ముడైన ఆ హనుమంతుడు జగత్ప్రభువైన శ్రీరాముని అర్ధాంగిని అవలోకించుచు, ఇట్లు బహువిధములుగ ఆలోచించి తాను కూర్చున్న ఆ శింశుపావృక్షము కొమ్మ చాటునకు చేరి మధురములును సఫలములును నగు వచనములతో నిట్లు పలికెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమత్కృత్యాకృత్యవిచారణము" అను*
*ముప్పదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకత్రింశసర్గ

**శ్లో॥ ఏవం బహువిధాం చింతాం చింతయిత్వా మహాకపిః ।**
**సంశ్రవే మధురం వాక్యం వైదేహ్యా వ్యాజహార హ ॥ 1**

**పదచ్ఛేదము :–** ఏవం – బహువిధాం – చింతాం – చింతయిత్వా – మహాకపిః – సంశ్రవే – మధురం – వాక్యం – వైదేహ్యాః – వ్యాజహార – హ ॥

**అన్వయక్రమము :–** మహాకపిః ఏవం బహువిధాం చింతాం చింతయిత్వా వైదేహ్యాః సంశ్రవే, మధురం వాక్యం వ్యాజహార.

**ప్రతిపదార్థము :–** మహాకపిః = వానరశ్రేష్ఠుడైనట్టి హనుమంతుడు, ఏవం = ఈ రీతిగా, బహువిధాం = పలువిధములగు, చింతాం = ఆలోచనను, చింతయిత్వా = ఆలోచించి, వైదేహ్యాః = సీతాదేవికి, సంశ్రవే = వినపడునట్లుగా (అనగా సమీపమునందు) మధురం = మధురమైన, వాక్యం = వచనమును, వ్యాజహార = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** 'సంశ్రవే మధురం' అర్థావబోధము అక్కర లేకుండగనే, శ్రవణ మాత్రముచేతనే, పూర్వాపర సందర్భజ్ఞానము గూడ కోరకుండగనే వినినంతనే మధురమై యుండునట్టి వచనములని భావము. వైదేహ్యాః – దేహభ్రాంతి లేని జానకీదేవికి కూడ హనుమ వచనములు శ్రవణమధురములై యున్నవి.

**తాత్పర్యము:–** వానరశ్రేష్ఠుడైన హనుమ ఈ రీతిగా రామసందేశ కథనముకొఱకై, బహు విధములుగ ఆలోచనను చేసి, సీతాదేవికి మాత్రము వినిపించునట్లు సమీపమునకు చేరి చాటుగనే యుండి, శ్రవణమధురములైన వచనములతో ఇట్లు పలికెను.

**శ్లో॥ రాజా దశరథో నామ రథకుంజరవాజిమాన్ ।**
**పుణ్యశీలో మహాకీర్తి రృజు రాసీ న్మహాయశాః ॥ 2**

**పదచ్ఛేదము** :– రాజా – దశరథః – నామ – రథకుంజరవాజిమాన్ – పుణ్యశీలః – మహాకీర్తిః – ఋజుః – ఆసీత్ – మహాయశాః ॥

**అన్వయక్రమము** :– దశరథః నామ, రథకుంజరవాజిమాన్, పుణ్యశీలః, మహాకీర్తిః ఋజుః మహాయశాః, రాజా ఆసీత్.

**ప్రతిపదార్థము** :– దశరథః నామ = దశరథుడని విఖ్యాతి నొందినట్టి, రథకుంజర వాజిమాన్ = మేలైన రథములు, గజములు, అశ్వములును గలవాడును, పుణ్యశీలః = పవిత్రశీలుడును, మహాకీర్తిః = ఘనమైన యశస్సుగలవాడు నగు, రాజా = భూపతి, ఆసీత్ = ఉండెను.

**తాత్పర్యము**:– పూర్వము గొప్పదైన రథసంపద, గజసంపద, అశ్వసంపదయు గల్గినవాడును, పుణ్యచరిత్రుడును, మహాకీర్తిసంపన్నుడును, ఋజువర్తనుడును, యశశ్శాలియు నగు, దశరథుడను జగత్ప్రసిద్ధుడైన రాజు ఉండెను.

**శ్లో॥ రాజర్షీణాం గుణశ్రేష్ఠ స్తపసా చర్షిభిస్సమః ।**
**చక్రవర్తికులే జాతః పురందరసమో బలే ॥ 3**

**పదచ్ఛేదము** :– రాజర్షీణాం – గుణశ్రేష్ఠః – తపసా – చ – ఋషిభిః – సమః – చక్రవర్తికులే – జాతః – పురందరసమః – బలే ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ దశరథుడు) రాజర్షీణాం = రాజర్షులలో, గుణశ్రేష్ఠః = గొప్పగుణములచే ఎన్నదగినట్టివాడు, తపసా = తపస్సంపదచే, ఋషిభిః = మహాఋషులతో, సమః = సమమైనవాడు, చక్రవర్తికులే = చక్రవర్తుల వంశము నందు, జాతః = జనించినవాడు, బలే = పరాక్రమమునందు, పురందరసమః దేవేంద్రునికి సాటియైనవాడు.

**తాత్పర్యము**:– ఆ దశరథుడు రాజఋషు లందరిలోను శ్రేష్ఠుడైనవాడు, తపస్సంపదయందు మహాఋషులను బోలినట్టివాడు, గొప్ప చక్రవర్తులు జనించిన వంశమునకు చెందినవాడు మఱియు బలపరాక్రమములందు దేవేంద్రునితో తులతూగువాడు.

**శ్లో॥ అహింసారతి రక్షుద్రో ఘృణీ సత్యపరాక్రమః ।**
**ముఖ్య శ్చేక్ష్వాకువంశస్య లక్ష్మీవాన్ లక్ష్మివర్ధనః ॥ 4**

**పదచ్ఛేదము** :– అహింసారతిః – అక్షుద్రః – ఘృణీ – సత్యపరాక్రమః – ముఖ్యః –

చ – ఇక్ష్వాకువంశస్య – లక్ష్మీవాన్ – లక్ష్మివర్ధనః ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– అహింసారతిః = అహింసయందు ప్రీతి గలవాడును, అక్షుద్రః = నీచస్వభావము లేనివాడును, ఘృణీ = దయావంతుడును, సత్యపరాక్రమః = అమోఘమైన పరాక్రమముగలవాడును, లక్ష్మీవాన్ = గొప్పసంపదలు గలవాడును, లక్ష్మివర్ధనః = సర్వసంపదలను పెంపొందించు నట్టివాడును.

**తాత్పర్యము**:– ఆ దశరథుడు అహింసావ్రతము గలవాడు, ఉత్తముడు, దయాళువు, అమోఘపరాక్రముడు, ఇక్ష్వాకు వంశ విభూషణుడు, సర్వసంపదల కాస్పదమైనవాడు, మఱియు సమస్తసంపదలను వృద్ధిచేయు శక్తిగలవాడు.

**శ్లో॥ పార్థివవ్యంజనై ర్యుక్తః పృథుశ్రీః పార్థివర్షభః ।**
**పృథివ్యాం చతురంతాయాం విశ్రుత స్సుఖద స్సుఖీ ॥ 5**

**పదచ్ఛేదము** :– పార్థివవ్యంజనైః – యుక్తః – పృథుశ్రీః – పార్థివర్షభః – పృథివ్యాం – చతురంతాయాం – విశ్రుతః – సుఖదః – సుఖీ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ దశరథుడు) పార్థివవ్యంజనైః = సమస్తరాజ లక్షణములతో, యుక్తః = కూడియున్నవాడు, పృథుశ్రీః = విస్తారమైనట్టి సంపదగలవాడు, పార్థివర్షభః రాజులలో అగ్రగణ్యుడు, చతురంతాయాం = చతుస్సముద్ర పర్యంతమైన, పృథివ్యాం = భూమండలమునందు, విశ్రుతః = విఖ్యాతి నొందినవాడు, సుఖదః = (ప్రజలను) సుఖపెట్టువాడు, సుఖీ = (తాను) సుఖముగ నుండువాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:– పార్థివవ్యంజనైః యుక్తః – ఛత్రచామరాది రాజచిహ్నములు గల్గియుండుటయేగాక సాముద్రిక శాస్త్ర సమ్మతమైన రాజోచితమైన శరీరలక్షణము లన్నియు గల వాడని భావము.

**తాత్పర్యము**:– ఆ దశరథుడు సమస్తరాజ లక్షణములతో ప్రకాశించునట్టివాడు. అమితమైన సంపదలు గలవాడు. చక్రవర్తులలో అగ్రేసరుడు. చతుస్సముద్ర వలయిత భూమండలము నందెల్ల ఖ్యాతి గన్నట్టివాడు. తన వారి నెల్లరను చింతలులేకుండ సుఖపెట్టువాడు, మఱియు తాను నిర్విచారముగ నుండి సుఖింపగలవాడు.

**శ్లో॥ తస్య పుత్రః ప్రియో జ్యేష్ఠ స్తారాధిపనిభాననః ।**
**రామో నామ విశేషజ్ఞః శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** తస్య – పుత్రః – ప్రియః – జ్యేష్ఠః – తారాధిపనిభాననః – రామః – నామ – విశేషజ్ఞః – శ్రేష్ఠః – సర్వధనుష్మతామ్ ॥

**అన్వయక్రమము :–** తస్య, రామః, నామ, తారాధిపనిభాననః, విశేషజ్ఞః సర్వధనుష్మతాం శ్రేష్ఠః, జ్యేష్ఠః, పుత్రః ప్రియః (ఆసీత్).

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ దశరథునకు, తారాధిపనిభాననః = చంద్రునితో సమానమైన ముఖముగలవాడును, విశేషజ్ఞః = సర్వధర్మవిశేషముల నెఱిగినవాడును, సర్వధనుష్మతాం = విలుకాండ్రందరిలోను, శ్రేష్ఠః = మేటియైన వాడును అగు, రామః = రాముడను, నామ = పేరుగల, జ్యేష్ఠః పుత్రః = పెద్దకుమారుడు, ప్రియః (ఆసీత్) = ప్రీతిపాత్రుడైయుండెను.

**తాత్పర్యము:–** ఆ దశరథునకు చంద్రునివలె సుందరమైన ముఖము కలిగి, సర్వశాస్త్ర విశేషములను తెలిసి, ధనుర్ధారులలో మేటి యనిపించుకొన్న పెద్ద కుమారుడగు శ్రీరాముడు అత్యంతప్రీతిపాత్రుడై యుండెను.

**శ్లో॥ రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా ।**
**రక్షితా జీవలోకస్య ధర్మస్య చ పరంతపః ॥ 7**

**పదచ్ఛేదము :–** రక్షితా – స్వస్య – ధర్మస్య – స్వజనస్య – చ – రక్షితా – రక్షితా – జీవలోకస్య – ధర్మస్య – చ – పరంతపః ॥

**అన్వయక్రమము :–** పరంతపః (సః) స్వస్య ధర్మస్య రక్షితా, స్వజనస్య చ రక్షితా, జీవలోకస్య –ధర్మస్య చ రక్షితా.

**ప్రతిపదార్థము :–** పరంతపః (సః) = శత్రువులను తపింప చేయునట్టి ఆ శ్రీరాముడు, స్వస్య ధర్మస్య రక్షితా = తన ధర్మమును కాపాడు నట్టివాడు, జీవలోకస్య = ప్రాణిలోకమునకు, రక్షితా = రక్షకుడైనవాడు, ధర్మస్య చ = (వర్ణాశ్రమ) ధర్మమునకు గూడ, రక్షితా = రక్షకుడైనట్టివాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిపాఠము:–** మొదటి ధర్మస్య, అను పదమునకు బదులుగ వృత్తస్య అని పాఠాంతరము.

**వాసుదాసస్వామి:–** అన్నివిషయములయందును పూర్ణుడు అనగా సర్వజ్ఞత్వ సర్వశక్తి మత్త్వ సంహారకత్వ సర్వరక్షకత్వాది గుణములు గలవాడు.

"ఓహో యెవరో నా మగని పేరు ఇచ్చట చెప్పుచున్నారే ఆయన గుఱించి ఇంకను ఏమి చెప్పునో విందును గాక"యని, తహతహతో చెవియొగ్గి హృదయ కమలము విచ్చి వినుచున్నది సీతమ్మ.

**తాత్పర్యము:–** శత్రుసంహారకుడైన ఆ శ్రీరాముడు తన ధర్మము తాను ఏమఱక పాలించునట్టివాడు; తన వారి నెల్లరిని కాపాడునట్టివాడు; సమస్తప్రాణిలోకమును, ఎల్లవారి ధర్మములను కూడ రక్షించు నట్టివాడు.

**శ్లో॥ తస్య సత్యాభిసంధస్య వృద్ధస్య వచనా త్పితుః ।**
**సభార్య స్సహ చ భ్రాత్రా వీరః ప్రవాజితో వనమ్ ॥ 8**

**పదచ్ఛేదము :–** తస్య – సత్యాభిసంధస్య – వృద్ధస్య – వచనాత్ – పితుః – సభార్యః – సహ – చ – భ్రాత్రా – వీరః – ప్రవ్రాజితః – వనమ్ ॥

**అన్వయక్రమము :–** సత్యాభిసంధస్య, వృద్ధస్య, తస్య పితుః వచనాత్, సభార్యః, భ్రాత్రా సహ చ (సః) వీరః వనం ప్రవ్రాజితః.

**ప్రతిపదార్థము :–** సత్యాభిసంధస్య = సత్యము తప్పనట్టివాడును, వృద్ధస్య = వృద్ధుడును, అగు, తస్య పితుః = అతని తండ్రియైన దశరథునియొక్క, వచనాత్ = మాటవలన (సః) వీరః = ఆ వీరుడైన శ్రీరాముడు, సభార్యః = భార్యతో గూడినవాడై, భ్రాత్రా చ సహ = తమ్మునితోడను గూడ, వనం ప్రవ్రాజితః = అరణ్యమునకు వెడలు నట్లు చేయబడెను.

**తాత్పర్యము:–** సత్యప్రతిజ్ఞుడును, వృద్ధుడును అగు తన తండ్రియైన దశరథుడు తన భార్యయైన కైక కిచ్చిన వరముల ననుసరించి, ధర్మవీరుడగు ఆ శ్రీరాముడు తన భార్యతోడను తమ్మునితోడను రాజ్యము వీడి అడవికి వెడలెను.

**శ్లో॥ తేన తత్ర మహారణ్యే మృగయాం పరిధావతా ।**
**రాక్షసా నిహతా శ్శూరా బహవః కామరూపిణః ॥ 9**

**పదచ్ఛేదము :–** తేన – తత్ర – మహారణ్యే – మృగయాం – పరిధావతా – రాక్షసాః – నిహతాః – శూరాః – బహవః – కామరూపిణః ॥

**అన్వయక్రమము :–** తత్ర మహారణ్యే మృగయాం పరిధావతా తేన బహవః శూరాః,

కామరూపిణః రాక్షసాః నిహతాః.

**ప్రతిపదార్థము :-** తత్ర మహారణ్యే = ఆ ఘోరాటవి యందు, మృగయాం పరిధావతా = వేటనుగూర్చి పరిభ్రమించుచున్న, తేన = ఆ శ్రీరామునిచే, కామరూపిణః = కామరూపులైనట్టియు, శూరాః = వీరులైనట్టియు, బహవః రాక్షసాః = పెక్కుమంది రాక్షసులు, నిహతాః = వధింపబడిరి.

**తాత్పర్యము:-** ఆ మహారణ్యమునందు వేటాడుటకై పరిభ్రమించుచు ఆ శ్రీరాముడు కామరూపధరులైన మహావీరులగు పెక్కుమంది దుష్టరాక్షసులను వధించెను.

**శ్లో॥ జనస్థానవధం శ్రుత్వా హతౌ చ ఖరదూషణౌ ।**
**తత స్త్వమర్షాపహృతా జానకీ రావణేన తు ।**
**వంచయిత్వా వనే రామం మృగరూపేణ మాయయా ॥ 10**

**పదచ్ఛేదము :-** జనస్థానవధం - శ్రుత్వా - హతౌ - చ - ఖరదూషణౌ - తతః - తు - అమర్షాపహృతా - జానకీ - రావణేన - తు - వంచయిత్వా - వనే - రామం - మృగరూపేణ - మాయయా ॥

**అన్వయక్రమము :-** జనస్థానవధం, హతౌ ఖరదూషణౌ చ, శ్రుత్వా, రావణేన మాయయా మృగరూపేణ వనే రామం వంచయిత్వా, జానకీ తతః అమర్షాపహృతా.

**ప్రతిపదార్థము :-** జనస్థానవధం = జనస్థానమునందలి రాక్షసుల సంహారమును గూర్చియు, హతౌ ఖరదూషణౌ చ = చంపబడిన ఖరదూషణులను గూర్చియు, శ్రుత్వా = విని, రావణేన = రావణాసురునిచే, మాయయా = మాయచే, మృగరూపేణ = లేడిరూపమున, వనే = అరణ్యమునందు, రామం = శ్రీరాముని, వంచయిత్వా మోసగించి, తతః = ఆ యడవినుండి, జానకీ = సీతాదేవి, అమర్షాపహృతా = క్రోధముతో అపహరింపబడినది.

**తాత్పర్యము:-** ఆ యరణ్యమున జనస్థానమునందలి రాక్షసులవధను గూర్చియు, వధింపబడిన ఖరదూషణాదులను గూర్చియు విని రావణుడు రామునిపై కోపించి, బంగారులేడి రూపమున అతనిని వంచించి, ఆ యడవియందున్న సీతాదేవిని, దొంగిలించుకొని పోయెను.

**శ్లో॥ స మార్గమాణస్తాం దేవీం రామస్సీతా మనిందితామ్ ।**
**ఆససాద వనే మిత్రం సుగ్రీవం నామ వానరమ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** సః – మార్గమాణః – తాం – దేవీం – రామః – సీతామ్ – అనిందితామ్ – ఆససాద – వనే – మిత్రం – సుగ్రీవం – నామ – వానరమ్ ॥

**అన్వయక్రమము :–** సః రామః అనిందితాం తాం సీతాం దేవీం మార్గమాణః, వనే సుగ్రీవం నామ వానరం మిత్రమ్ ఆససాద.

**ప్రతిపదార్థము :–** సః రామః = ఆ శ్రీరాముడు, అనిందితాం = ఉత్తమురాలైనట్టి, తాం సీతాం దేవీం = ఆ సీతాదేవిని, మార్గమాణః = వెదకుచున్నవాడై, వనే = అరణ్యమునందు, సుగ్రీవం నామ వానరం = సుగ్రీవు డను వానరరాజును, మిత్రం = మిత్రునిగా, ఆససాద = పొందెను.

**తాత్పర్యము:–** ఆ శ్రీరాముడు పవిత్రురాలైన తన భార్య యగు సీతాదేవిని అన్వేషించుచుండగా ఆ యరణ్యమునందు సుగ్రీవు డనెడి వానరశ్రేష్ఠుడు మిత్రుడుగా లభించెను.

**శ్లో॥ తత స్స వాలినం హత్వా రామః పరపురంజయః ।**
**ప్రాయచ్ఛత్కపిరాజ్యం తత్సుగ్రీవాయ మహాబలః ॥ 12**

**పదచ్ఛేదము :–** తతః – సః – వాలినం – హత్వా – రామః – పరపురంజయః – ప్రాయచ్ఛత్ – కపిరాజ్యం – తత్ – సుగ్రీవాయ – మహాబలః ॥

**అన్వయక్రమము :–** తతః మహాబలః పరపురంజయః సః రామః వాలినం హత్వా తత్ కపిరాజ్యం సుగ్రీవాయ ప్రాయచ్ఛత్.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, మహాబలః = మహాబలాఢ్యుడును, పరపురంజయః = శత్రుపురవిజేతయు నగు, సః రామః = ఆ శ్రీరాముడు, వాలినం = వాలిని, హత్వా = చంపి, తత్ కపిరాజ్యం = ఆ వానరరాజ్యమును, సుగ్రీవాయ = సుగ్రీవునకు, ప్రాయచ్ఛత్ = ఒసగెను.

**తాత్పర్యము:–** మహావీరుడును శత్రువినాశకుడు నగు శ్రీరాముడు తన మిత్రుడైన సుగ్రీవునికి శత్రువగు వాలిని సంహరించి, ఆతని అధీనమున నున్న వానరరాజ్యమును సుగ్రీవున కొసగెను.

**శ్లో॥ సుగ్రీవేణాపి సందిష్టా హరయః కామరూపిణః ।**
**దిక్షు సర్వాసు తాం దేవీం విచిన్వంతి సహస్రశః ॥ 13**

**పదచ్ఛేదము :–** సుగ్రీవేణ – అపి – సందిష్టాః – హరయః – కామరూపిణః – దిక్షు – సర్వాసు – తాం – దేవీం – విచిన్వంతి – సహస్రశః ॥

**అన్వయక్రమము** :– సుగ్రీవేణ సందిష్టాః కామరూపిణః హరయః అపి సహస్రశః తాం దేవీం సర్వాసు దిక్షు విచిన్వంతి.

**ప్రతిపదార్థము** :– సుగ్రీవేణ = సుగ్రీవునిచే, సందిష్టాః = ఆజ్ఞాపింపబడినట్టి, కామరూపిణః = కామరూపధరులైనట్టి, హరయః అపి = వానరులుగూడ, సహస్రశః = వేలకొలదిగ, సర్వాసు దిక్షు = అన్ని దిక్కులయందును, తాం దేవీం = ఆ సీతాదేవిని, విచిన్వంతి = వెదకుచున్నారు.

**తాత్పర్యము:**– వానరరాజైన సుగ్రీవునిచే ఆజ్ఞాపింపబడి వేలకొలది కామరూపులైన వానరులు అన్ని దిక్కులయందును ఆ సీతమ్మకొఱకై వెదకుచున్నారు.

**శ్లో॥ అహం సంపాతివచనా చ్ఛతయోజన మాయతమ్ ।**
**అస్యా హేతో ర్విశాలాక్ష్యా స్సాగరం వేగవాన్ ప్లుతః ॥ 14**

**పదచ్ఛేదము** :– అహం – సంపాతివచనాత్ – శతయోజనమ్ – ఆయతమ్ – అస్యాః – హేతోః – విశాలాక్ష్యాః – సాగరం – వేగవాన్ – ప్లుతః ॥

**అన్వయక్రమము** :– సంపాతివచనాత్ అస్యాః విశాలాక్ష్యాః హేతోః శతయోజనమ్ ఆయతం సాగరం వేగవాన్ అహం ప్లుతః.

**ప్రతిపదార్థము** :– సంపాతివచనాత్ = సంపాతి యను పక్షియొక్క మాటవలన, అస్యాః విశాలాక్ష్యాః హేతోః = ఈ పద్మాక్షి యగు సీతాదేవికొఱకై, శతయోజనం ఆయతం = నూరామడల పొడవుగల, సాగరం = సముద్రమును, వేగవాన్ అహం = మహావేగము గలవాడనైన నేను, ప్లుతః = దాటితిని.

**తాత్పర్యము:**– సంపాతి యను పక్షి చెప్పిన మాట ననుసరించి ఈ మహనీయురాలి నిమిత్తమై శతయోజనవిస్తీర్ణమైన ఈ సాగరమును తరించి మహావేగముతో నే నిటకు చేరుకొంటిని.

**శ్లో॥ యథారూపాం యథావర్ణాం యథాలక్ష్మీం చ నిశ్చితామ్ ।**
**అశ్రౌషం రాఘవస్యాహం సేయ మాసాదితా మయా ॥ 15**

**పదచ్ఛేదము** :– యథారూపాం – యథావర్ణాం – యథాలక్ష్మీం – చ – నిశ్చితామ్ – అశ్రౌషం – రాఘవస్య – అహం – సా – ఇయమ్ – ఆసాదితా – మయా ॥

**అన్వయక్రమము** :– రాఘవస్య (ముఖాత్) యథారూపాం, యథా వర్ణాం, యథాలక్ష్మీం చ నిశ్చితామ్ అహమ్ అశ్రౌషం, సా ఇయం మయా ఆసాదితా.

**ప్రతిపదార్థము :–** రాఘవస్య ముఖాత్ = శ్రీరాముని ముఖమునుండి, యథారూపాం = ఎట్టి స్వరూపముగలదిగను, యథావర్ణాం = ఎట్టి వర్ణము గలదిగను, యథాలక్ష్మీం చ = ఎట్టి సౌందర్యముగలదిగను, నిశ్చితాం = నిశ్చయింపబడినదిగా, అహం = నేను, అశ్రౌషం = వినియుంటినో, సా ఇయం = ఆ విధమైనట్టి ఈమె, మయా = నాచేత ఆసాదితా = పొందబడినది (కనుగొనబడినది).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిపాఠము:–** యథాలక్ష్మీం చ నిశ్చితాం అను దానికి బదులుగా, "యథాలక్ష్మవతీం చ తాం" అని గలదు.

**వాసుదాసస్వామి:–** రామచంద్రమూర్తి చెప్పిన ఆకారము, వర్ణము, కాంతి, గుణము, సౌందర్యము గల ఈ పతివ్రతను నాపూర్వపుణ్యఫలముగ చూచితిని.

**తాత్పర్యము:–** శ్రీరాముని మాటలను బట్టి ఆమె ఎట్టి స్వరూపము గలదై ఎట్టి వర్ణముతో, ఎట్టి సౌందర్యముతో, ఎట్టి శుభలక్షణములతో, నున్నట్టిదిగా తెలిసికొంటినో సరిగా అట్టి ఆకృతియే గల ఈమె నాకు లభించినది.

**శ్లో॥ విరరా మైవ ముక్త్వాఽ సౌ వాచం వానరపుంగవః ।**
**జానకీ చాపి తచ్ఛ్రుత్వా పరం విస్మయ మాగతా ॥ 16**

**పదచ్ఛేదము :–** విరరామ – ఏవమ్ – ఉక్త్వా – అసౌ – వాచం – వానరపుంగవః – జానకీ – చ – అపి – తత్ – శ్రుత్వా – పరం – విస్మయమ్ – ఆగతా ॥

**అన్వయక్రమము :–** అసౌ వానరపుంగవః ఏవం వాచమ్ ఉక్త్వా విరరామ; జానకీ చ అపి తత్ శ్రుత్వా పరం విస్మయమ్ ఆగతా.

**ప్రతిపదార్థము :–** అసౌ వానరపుంగవః = ఈ వానరశ్రేష్ఠుడైన హనుమ, ఏవం = ఈరీతిగా, వాచం = వచనమును, ఉక్త్వా = పలికి, విరరామ = ఊరకుండెను, జానకీ చ అపి = సీతాదేవియును, తత్ = ఆ మాటను, శ్రుత్వా = విని, పరం విస్మయం ఆగతా = మిక్కిలి ఆశ్చర్యము నొందెను.

**తాత్పర్యము:–** హనుమ ఈ విధముగ పలికి ఊరకుండెను. సీతాదేవి అది అంతయు విని మిక్కిలి ఆశ్చర్యము నొందెను.

**శ్లో॥ తత స్సా వక్రకేశాంతా సుకేశీ కేశసంవృతమ్ ।**
**ఉన్నమ్య వదనం భీరు శ్శింశుపావృక్ష మైక్షత ॥ 17**

**పదచ్ఛేదము :–** తతః – సా – వక్రకేశాంతా – సుకేశీ – కేశసంవృతమ్ – ఉన్నమ్య – వదనం – భీరుః – శింశుపావృక్షమ్ – ఐక్షత ॥

**అన్వయక్రమము :–** తతః వక్రకేశాంతా సుకేశీ సా భీరుః కేశసంవృతం వదనమ్ ఉన్నమ్య శింశుపావృక్షమ్ ఐక్షత.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, వక్రకేశాంతా = వంకరగ నున్న ముంగురులు గలిగినట్టియు, సా భీరుః = ఆ భీతచిత్తురాలైన సీతాదేవి, కేశసంవృతం = జుట్టుచే కప్పబడినట్టి, వదనం = ముఖమును, ఉన్నమ్య = పైకి ఎత్తి, శింశుపావృక్షమ్ = శింశుపావృక్షమును, ఐక్షత = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** కేశసంవృతం వదనం – సంస్కారరాహిత్యముచే చెదరి సీతాదేవి జుట్టు ముఖముపై బడియుండెనని భావము.

**గోవిందరాజీయము:–** "సుకేశీ" – నీలసూక్ష్మకేశి;

**తాత్పర్యము:–** అప్పుడు వంకరలు తిరిగి ముంగురులతో కూడియున్న తన మృదువైన నల్లని కేశములను ముఖముమీదనుండి ప్రక్కలకు తప్పించి సవరించుకొని భీతచిత్తురాలై ఆ సీతాదేవి ముఖము మీదికి ఎత్తి శింశుపావృక్షమును చూచెను.

**శ్లో॥ నిశమ్య సీతా వచనం కపేశ్చ**
**దిశశ్చ సర్వాః ప్రదిశ శ్చ వీక్ష్య ।**
**స్వయం ప్రహర్షం పరమం జగామ**
**సర్వాత్మనా రామ మనుస్మరంతీ ॥ 18**

**పదచ్ఛేదము :–** నిశమ్య – సీతా – వచనం – కపేః – చ – దిశః – చ – సర్వాః – ప్రదిశః – చ – వీక్ష్య – స్వయం – ప్రహర్షం – పరమం – జగామ – సర్వాత్మనా – రామమ్ – అనుస్మరంతీ ॥

**అన్వయక్రమము :–** సీతా కపేః వచనం నిశమ్య సర్వాః దిశః ప్రదిశః చ వీక్ష్య సర్వాత్మనా రామమ్ అనుస్మరంతీ స్వయం పరమం ప్రహర్షం జగామ.

**ప్రతిపదార్థము :–** సీతా = సీతాదేవి, కపేః = హనుమయొక్క, వచనం = మాటను, నిశమ్య = ఆకర్ణించి, సర్వాః దిశః చ = అన్నిదిక్కులను, ప్రదిశః చ = మూలలను గూడ, వీక్ష్య = చూచి, సర్వాత్మనా = ఏకాగ్రచిత్తముతో, రామం = శ్రీరాముని,

అనుస్మరంతీ = ధ్యానించుచున్నదై, స్వయం = తాను, పరమం = గొప్పదైన, ప్రహర్షం = మహానందమును, జగామ = పొందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– అపదలయందు, భయములయందు, ఆనంద సమయములయందు, రామనామస్మరణంగా "అపదా మపహర్తార"మ్మను మంత్రశ్లోకమును పఠించిన ఆపద, భయము తొలగును, ఆనందము స్థిరమగును. ఇది రామభక్తులకు సువిదితము.

**తాత్పర్యము**:– సీతమ్మ హనుమ మాటలు విని అన్ని వైపులకును చూచి ఎల్లవేళల శ్రీరాముని ధ్యానించు అలవాటు ననుసరించి రామచంద్రుని స్మరించుకొనుచు హృదయము నిండ మహానందము నొందెను.

**శ్లో॥ సా తిర్య గూర్ధ్వం చ తథా ప్యధస్తా**
**న్నిరీక్షమాణా త మచింత్యబుద్ధిమ్ ।**
**దదర్శ పింగాధిపతే రమాత్యం**
**వాతాత్మజం సూర్య మి వోదయస్థమ్ ॥ 19**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రామవృత్తాంతకీర్తనం" నామ*
*ఏకత్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– సా – తిర్యక్ – ఊర్ధ్వం – చ – తథా – అపి – అధస్తాత్ – నిరీక్షమాణా – తమ్ – అచింత్యబుద్ధిమ్ – దదర్శ – పింగాధిపతేః – అమాత్యం – వాతాత్మజం – సూర్యమ్ – ఇవ – ఉదయస్థమ్ ॥

**అన్వయక్రమము** :– సా తిర్యక్ ఊర్ధ్వం చ, తథా అధస్తాత్ అపి నిరీక్షమాణా, ఉదయస్థం సూర్యమ్ ఇవ, తమ్ అచింత్యబుద్ధిం, పింగాధిపతేః అమాత్యం వాతాత్మజం దదర్శ.

**ప్రతిపదార్థము** :– సా = ఆ సీతాదేవి, తిర్యక్ = అడ్డముగను, ఊర్ధ్వం చ = మీదుగను, తథా = అట్లే, అధస్తాత్ అపి = క్రిందుగను గూడ, నిరీక్షమాణా = పరికించి చూచుచున్నదై, ఉదయస్థం సూర్యమ్ ఇవ = ఉదయమున నున్న సూర్యునివలె నున్నట్టి, అచింత్యబుద్ధిం = అమితమైన ప్రజ్ఞగల, పింగాధిపతేః అమాత్యం = సుగ్రీవుని

సచివుడైనట్టి, తం వాతాత్మజం = అ వాయునందనుని, దదర్శ = అవలోకించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** హనుమ మాటలు వినుచునే ఈ మాటలు పలుకుచున్న వ్యక్తి భయంకరమైన ఈ ప్రదేశమునకు వచ్చిన వాడనగా అద్భుతమైన ప్రజ్ఞ గలవా డనియును, అతని కంఠస్వరవిశేషమునుబట్టి, ఈతడు వానరుడు, తనరాజైనవాని కోరికపై ఆ రాజకార్యమును సాధించుటకు వచ్చిన మహనీయు డనియును, రాముని ప్రాణములను, తన ప్రాణములును, సర్వజీవుల ప్రాణములను నిలుపగలిగిన వాయుదేవుని పుత్రుడే యనియును ఆమె చక్కగా గ్రహించినదని భావము.

ఆ విధముగ ఆమెకు కానవచ్చిన హనుమ ఉదయపర్వతముపై నున్న అనూరునివలె గోచరించి అచిరకాలములో రామదివాకరుని రాకను వెల్లడించుచున్న ట్లుండెను.

**వాసుదాసస్వామి:–** తూరుపు కొండమీద అనూరుడు ఎఱ్ఱనివాడు, ఎత్తున నున్నవాడు అనుటచే, సూర్యబింబము కానవచ్చియు కానరాని సమయము సూచింపబడినది. హనుమంతు డనెడి అనూరుని దర్శన మగుటచే రామచంద్రమూర్తి యనెడి సూర్యుని దర్శనము శీఘ్రకాలమునందే తప్పక గల్గునని భావము.

**తాత్పర్యము:–** సీతాదేవి ప్రక్కలకును, మీదికిని, ఆ శింశుపావృక్షము క్రిందికిని, పరికించి చూచుచు, ఆ వృక్షశాఖపై, ఉదయించుచున్న సూర్యునివలె కన్నుల పండువు చేయుచున్న మహాప్రజ్ఞాశాలియైన వాయునందనుని గాంచెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రామవృత్తాంతకీర్తనము" అను*
*ముప్పదియొకటవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ద్వాత్రింశసర్గ

**శ్లో॥ తత శ్శాఖాంతరే లీనం దృష్ట్వా చలితమానసా ।**
**వేష్టితార్జునవస్త్రం తం విద్యుత్సంఘాతపింగళమ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – శాఖాంతరే – లీనం – దృష్ట్వా – చలితమానసా – వేష్టితార్జునవస్త్రం – తం – విద్యుత్సంఘాతపింగళమ్ ॥

**అన్వయక్రమము :–** తతః (సా) వేష్టితార్జునవస్త్రం, విద్యుత్సంఘాతపింగళం, శాఖాంతరే లీనం తం దృష్ట్వా చలితమానసా (అభవత్).

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, (సా = ఆ జానకీదేవి), వేష్టితార్జునవస్త్రం = (ధరించిన) తెల్లని బట్టలు గలవాడును, విద్యుత్సంఘాతపింగళమ్ = మెఱుపుతీగల సమూహమువలె పచ్చని వర్ణము గలవాడును, శాఖాంతరే లీనం = కొమ్మల నడుమ దాగియున్నవాడు నగు, తం = ఆ హనుమను, దృష్ట్వా = చూచి, చలితమానసా = చెదరిన మనస్సుగలది, (అభవత్ = అయ్యెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** 'చలితమానసా' వింతయైన రూపముతో నున్న ఈతడు తిరిగి ఏ మాయామృగమై యుండునో యని భీతిగ్రస్తురా లాయెనని భావము.

**తాత్పర్యము:–** పిమ్మట తెల్లని వస్త్రములను ధరించి, మెఱపుల సమూహము వంటి పచ్చని ఛాయతో, శింశుపావృక్షము కొమ్మల నడుమ దాగియున్న హనుమను జూచి సీతాదేవికి భీతిచే మనస్సునందు కలవరపాటు కలిగెను.

**శ్లో॥ సా దదర్శ కపిం తత్ర ప్రశ్రితం ప్రియవాదినమ్ ।**
**ఫుల్లాశోకోత్కరాభాసం తప్తచామీకరేక్షణమ్ ॥ 2**

**పదచ్ఛేదము :–** సా – దదర్శ – కపిం – తత్ర – ప్రశ్రితం – ప్రియవాదినం – ఫుల్లాశోకోత్కరాభాసం – తప్తచామీకరేక్షణమ్ ॥

**అన్వయక్రమము** :– సా తత్ర ప్రశ్రితం, ప్రియవాదినం, ఫుల్లాశోకోత్కరాభాసం, తప్తచామీకరేక్షణం, కపిం దదర్శ.

**ప్రతిపదార్థము** :– సా = ఆ సీతాదేవి, తత్ర = అచ్చట, ప్రశ్రితం = వినయవంతుడును, ప్రియవాదినం = ప్రియభాషియును, ఫుల్లాశోకోత్కరాభాసం = వికసించిన అశోకపుష్పముల సమూహమువలె ప్రకాశించుచున్నవాడును, తప్తచామీకరేక్షణం = కరిగింపబడిన బంగారమువలె పచ్చనైన కన్నులు గలవాడును అగు, కపిం = హనుమను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:– సా దదర్శ – సీతాదేవి పూర్వము హనుమను చూచినప్పుడు హఠాత్తుగా నూతనరూపదర్శనముచే భయము నొందినది. పిమ్మట శాంతముగా చూడగా హనుమ శాంతస్వరూపమే గానవచ్చెను.

**తాత్పర్యము**:– సీతాదేవి ఆ చెట్టుకొమ్మల నడుమ, వినయముతో ప్రియమైన మాటలు పలుకుచు, చక్కగ వికసించిన అశోకపుష్పములవలె ప్రకాశించుచున్న శరీరముతోడను, కరిగిపోసిన మేలిమిబంగారము వలె మెఱయుచున్న కన్నులతోడను అద్భుత రూపముతోడను నున్న హనుమను గాంచెను.

**శ్లో॥ సాఽథ దృష్ట్వా హరిశ్రేష్ఠం వినీతవ దవస్థితమ్ ।**
**మైథిలీ చింతయామాస విస్మయం పరమం గతా ॥ 3**

**పదచ్ఛేదము** :– సా – అథ – దృష్ట్వా – హరిశ్రేష్ఠం – వినీతవత్ – అవస్థితం – మైథిలీ – చింతయామాస – విస్మయం– పరమం – గతా ॥

**అన్వయక్రమము** :– అథ సా మైథిలీ, వినీతవ దవస్థితం హరిశ్రేష్ఠం దృష్ట్వా పరమం విస్మయం గతా చింతయామాస.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, సా మైథిలీ = ఆ సీతాదేవి, వినీతవత్ = మిక్కిలి వినయముగల వానివలె, అవస్థితం = కూర్చొనియున్నట్టి, హరిశ్రేష్ఠం = వానరశ్రేష్ఠుడైన యా హనుమను, దృష్ట్వా = చూచి, పరమం విస్మయం గతా = మిక్కిలి ఆశ్చర్యము నొందినదై, చింతయామాస = ఆలోచించెను.

**తాత్పర్యము**:– అప్పుడు సీతాదేవి అచ్చట మిక్కిలి వినయముతో కూర్చుండియున్న ఆ వానరోత్తముని గాంచి గొప్ప ఆశ్చర్యము నొంది ఇట్లు ఆలోచించెను.

**శ్లో॥ అహో భీమ మిదం రూపం వానరస్య దురాసదమ్ ।**
**దుర్నిరీక్ష్య మితి జ్ఞాత్వా పునరేవ ముమోహ సా ॥ 4**

**పదచ్ఛేదము :–** అహో – భీమమ్ – ఇదం – రూపం – వానరస్య – దురాసదం – దుర్నిరీక్ష్యమ్ – ఇతి – జ్ఞాత్వా – పునః – ఏవ – ముమోహ – సా ॥

**అన్వయక్రమము :–** అహో, వానరస్య ఇదం రూపం భీమం, దురాసదమ్; ఇదం దుర్నిరీక్ష్యమ్ ఇతి జ్ఞాత్వా సా పునరేవ ముమోహ.

**ప్రతిపదార్థము :–** అహో = ఆహా, వానరస్య = వానరుని యొక్క, ఇదం రూపం = ఈ రూపవిశేషము, భీమం = భయంకరమైనదియును, దురాసదం = చేరశక్యము గానిదిగను ఉన్నది, ఇదం = ఈ రూపము, దుర్నిరీక్ష్యం = చూచుటకు శక్యముగా నట్టిది, ఇతి = అని, జ్ఞాత్వా = తలచి, సా = ఆ సీతాదేవి, పునః ఏవ = మఱల, ముమోహ = మూర్ఛిల్లెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** పునరేవ ముమోహ సా – రాక్షసమాయయే ఇది యని ఆలోచన గలిగి తిరిగి సీతమ్మ మూర్ఛిల్లినది.

**తాత్పర్యము:–** "ఆహా! వానరుని ఈ రూపము భయంకరముగ నుండి సమీపించుట కశక్యముగ నున్నదే! మఱియు చూచుటకు గూడ ఈతని రూపము దుర్భరముగనే యున్నది" అని తలపోయుచు భీతితో తిరిగి సీతాదేవి మూర్ఛనొందెను.

**శ్లో॥ విలలాప భృశం సీతా కరుణం భయమోహితా ।**
**రామ రామేతి దుఃఖార్తా లక్ష్మణేతి చ భామినీ ॥ 5**

**పదచ్ఛేదము :–** విలలాప – భృశం – సీతా – కరుణం – భయమోహితా – రామ – రామ – ఇతి – దుఃఖార్తా – లక్ష్మణ – ఇతి – చ – భామినీ ॥

**అన్వయక్రమము :–** భామినీ సీతా భయమోహితా, దుఃఖార్తా రామ రామేతి, లక్ష్మణేతి చ భృశం కరుణం విలలాప.

**ప్రతిపదార్థము :–** భామినీ సీతా = స్త్రీయైన సీత, భయమోహితా = భయముచే విమోహితురాలును, దుఃఖార్తా = దుఃఖముచే పీడింపబడినదియునై, రామ రామేతి = హా రామా! రామా! యనుచు, లక్ష్మణ ఇతి చ = హా లక్ష్మణా! యనుచును, భృశం కరుణం = మిక్కిలి దీనముగా, విలలాప = శోకించెను.

**తాత్పర్యము:-** సీతాభామిని భయమోహితురాలును దుఃఖపీడితురాలును అగుచు, హా రామా! హా లక్ష్మణా! యని మిక్కిలి దీనముగా విలపించెను.

**శ్లో॥ రురోద సహసా సీతా మందం మందస్వరా సతీ ॥ 6**

**పదచ్ఛేదము :-** రురోద - సహసా - సీతా - మందం - మందస్వరా - సతీ ॥

**అన్వయక్రమము :-** సీతా సహసా మందస్వరా సతీ మందం రురోద.

**ప్రతిపదార్థము :-** సీతా = ఆ సీతమ్మ, సహసా = వెంటనే, మందస్వరా సతీ = మిక్కిలి మందమైన కంఠస్వరము గలదై, మందం = నెమ్మదిగ, రురోద = శోకించెను.

**తాత్పర్యము:-** అట్లు సీతాదేవి వెంటనే మిక్కిలి మందమైన స్వరముతో నెమ్మదిగ కొద్దిసేపు విలపించెను.

**శ్లో॥ సాఽథ దృష్ట్వా హరివరం వినీతవ దుపస్థితమ్ ।**
**మైథిలీ చింతయామాస స్వప్నోఽయ మితి భామినీ ॥ 7**

**పదచ్ఛేదము :-** సా - అథ - దృష్ట్వా - హరివరం - వినీతవత్ - ఉపస్థితం - మైథిలీ - చింతయామాస - స్వప్నః - అయమ్ - ఇతి - భామినీ ॥

**అన్వయక్రమము :-** అథ సా భామినీ మైథిలీ వినీతవత్ ఉపస్థితం హరివరం దృష్ట్వా అయం స్వప్నః ఇతి చింతయామాస.

**ప్రతిపదార్థము :-** అథ = పిమ్మట, సా భామినీ మైథిలీ = ఆ సీతాదేవి, వినీతవత్ ఉపస్థితం = వినయముగా చేరియున్న, హరివరం = హనుమను, దృష్ట్వా = చూచి, అయం స్వప్నః ఇతి = ఇది స్వప్నమా యని, చింతయామాస = భావించెను.

**తాత్పర్యము:-** అప్పుడు సీతాదేవి అచ్చట మిక్కిలి వినయముతో కూర్చుండియున్న ఆ హనుమను జూచి, ఇది యంతయును తనకు గలిగిన స్వప్నమేమో యని భావించెను.

**శ్లో॥ సా వీక్షమాణా పృథుభుగ్నవక్త్రం**
**శాఖామృగేంద్రస్య యథోక్తకారమ్ ।**
**దదర్శ పింగాధిపతే రమాత్యం**
**వాతాత్మజం బుద్ధిమతాం వరిష్ఠమ్ ॥ 8**

**పదచ్ఛేదము :-** సా - వీక్షమాణా - పృథుభుగ్నవక్త్రం - శాఖామృగేంద్రస్య - యథోక్తకారమ్, దదర్శ - పింగాధిపతేః - అమాత్యం - వాతాత్మజం - బుద్ధిమతాం

– వరిష్ఠమ్ ॥

**అన్వయక్రమము :–** సా వీక్షమాణా, పృథుభుగ్నవక్త్రం, శాఖామృగేంద్రస్య యథోక్తకారం, పింగాధిపతేః అమాత్యం, బుద్ధిమతాం వరిష్ఠం వాతాత్మజం దదర్శ.

**ప్రతిపదార్థము :–** సా = ఆ సీతాదేవి, వీక్షమాణా = శ్రద్ధగా చూచుచున్నదై, పృథుభుగ్నవక్త్రం = విశాలమై వంగియున్న ముఖము గలవాడును, శాఖామృగేంద్రస్య = వానరరాజయిన సుగ్రీవునియొక్క, యథోక్తకారం = ఆజ్ఞను నెరవేర్చు బంటు అయినవాడును, పింగాధిపతేః = వానర రాజయిన సుగ్రీవునియొక్క, అమాత్యం = మంత్రియును, బుద్ధిమతాం వరిష్ఠం = బుద్ధిశాలురలో శ్రేష్ఠుడును అగు, వాతాత్మజం = వాయునందనుడైనట్టి హనుమను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** వీక్షమాణా – రాక్షసస్త్రీలు ఎవ్వరైన ఈ వానరుని సంభాషణమును వినుచున్నారేమో యను శంకతో ఇటు నటు చూచుచున్నదని భావము. పృథుభుగ్నవక్త్రం – దేవేంద్రునియొక్క వజ్రప్రహారముచే అణగి వంకరయైయున్న ముఖముగలవాడని భావము.

**తాత్పర్యము:–** సీతాదేవి రాక్షసస్త్రీలకు వెఱచి నలువైపులకు చూచుచున్నదై తనకు సమీపముననున్న సుగ్రీవుని మంత్రియును, బుద్ధిశాలురలో అగ్రగణ్యుడును, వంగియున్నట్టి ముఖము గలవాడు నగు హనుమను గాంచెను.

**శ్లో॥ సా తం సమీక్ష్యైవ భృశం విపన్నా**
**గతాసుకల్పేవ బభూవ సీతా ।**
**చిరేణ సంజ్ఞాం ప్రతిలభ్య చైవం**
**విచింతయామాస విశాలనేత్రా ॥ 9**

**పదచ్ఛేదము :–** సా – తం – సమీక్ష్య – ఏవ – భృశం – విపన్నా – గతాసుకల్పా – ఇవ – బభూవ – సీతా – చిరేణ – సంజ్ఞాం – ప్రతిలభ్య – చ – ఏవం – విచింతయామాస – విశాలనేత్రా ॥

**అన్వయక్రమము :–** సా సీతా తం సమీక్ష్య ఏవ భృశం విపన్నా గతాసుకల్పా ఇవ బభూవ. విశాలనేత్రా (సా)చిరేణ సంజ్ఞాం ప్రతిలభ్య ఏవం విచింతయామాస.

**ప్రతిపదార్థము :–** సా సీతా = ఆ సీతాదేవి, తం = ఆ హనుమంతుని, సమీక్ష్య ఏవ

= చూచినంతనే, భృశం విపన్నా = మిక్కిలి క్లేశమునొందినదై, గతాసుకల్పా ఇవ = ప్రాణములు గోల్పోయినదివలె, బభూవ = ఆయెను, విశాలనేత్రా (సా) = విశాలమైన కన్నులుగల ఆమె, చిరేణ = చాలసేపటికి, సంజ్ఞాం = స్పృహను, ప్రతిలభ్య = పొంది, ఏవం = ఈ రీతిగా, విచింతయామాస = చింతింపసాగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:-** గతాసుకల్పా విపన్నా - సీతమ్మ తన ఎదుట నున్న హనుమంతుని రావణునిగానే భ్రమించి భీతిచే స్పృహను గోల్పోయి ప్రాణములు పోయినట్టి దానివలె నయ్యెనని భావము.

**తాత్పర్యము:-** సీతాదేవి అట్టి యా హనుమంతుని చూచిన వెంటనే తీవ్రమైన విపత్కరదశను పొంది ప్రాణములు గోల్పోయినట్లు కాన్పించెను. తిరిగి కొద్దిసేపటికి ఎట్లో స్పృహను పొంది ఇట్లు చింతింపసాగెను.

**శ్లో॥ స్వప్నో మయాయం వికృతోఽద్య దృష్టః**
**శాఖామృగ శ్శాస్త్రగణైర్నిషిద్ధః ।**
**స్వస్త్యస్తు రామాయ సలక్ష్మణాయ**
**తథా పితుర్మే జనకస్య రాజ్ఞః॥ 10**

**పదచ్ఛేదము :-** స్వప్నః - మయా - అయం - వికృతః - అద్య - దృష్టః - శాఖామృగః - శాస్త్రగణైః - నిషిద్ధః - స్వస్తి - అస్తు - రామాయ - సలక్ష్మణాయ - తథా - పితుః - మే - జనకస్య - రాజ్ఞః ॥

**అన్వయక్రమము :-** అద్య మయా అయం వికృతః స్వప్నః దృష్టః. శాస్త్రగణైః నిషిద్ధః శాఖామృగః (తత్ర) దృష్టః. సలక్ష్మణాయ రామాయ స్వస్తి అస్తు. తథా మే పితుః రాజ్ఞః జనకస్య (స్వస్తి అస్తు).

**ప్రతిపదార్థము :-** అద్య = నేడు, మయా = నాచేత, వికృతః = వికారమైనట్టి, అయం స్వప్నః = ఈ స్వప్నము, దృష్టః = చూడబడినది, శాస్త్రగణైః = ధర్మశాస్త్రములచే, నిషిద్ధః = నిషేధింపబడినట్టి, శాఖామృగః = వానరము (తత్ర దృష్టః = ఆ స్వప్నమున చూడబడెను.) సలక్ష్మణాయ = లక్ష్మణసహితుడైనట్టి, రామాయ = శ్రీరామునకు, స్వస్తి అస్తు = శుభమగుగాక! తథా = అట్లే, మే పితుః = నా తండ్రియైనట్టి, రాజ్ఞః జనకస్య = జనకమహారాజునకు, (స్వస్తి అస్తు = క్షేమమగుగాక!)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** శాస్త్రగణైః నిషిద్ధః – స్వప్నమున వానరుని చూచుట బంధు వినాశకరమని భావము.

**తాత్పర్యము:–** నేడు నాకు ఎంత భయంకరమైన స్వప్నము వచ్చినది! నా కా స్వప్నమున శాస్త్రములు నిషేధించిన వానరదర్శనము కలిగినది. ఇందువలన మావారి కెవ్వరి కేమి కీడు మూడునో గదా! మా లక్ష్మణునితో గూడిన శ్రీరామునకు శుభమగుగాక! నా తండ్రియైన జనకమహారాజునకు క్షేమ మగుగాక!

**శ్లో॥ స్వప్నో హి నాయం నహి మేఽస్తి నిద్రా**
**శోకేన దుఃఖేన చ పీడితాయాః ।**
**సుఖం హి మే నాస్తి యతో విహీనా**
**తేనేందుపూర్ణప్రతిమాననేన ॥ 11**

**పదచ్ఛేదము :–** స్వప్నః – హి – న – అయం – న – హి – మే – అస్తి – నిద్రా – శోకేన – దుఃఖేన – చ – పీడితాయాః – సుఖం – హి – మే – న – అస్తి – యతః – విహీనా – తేన – ఇందుపూర్ణప్రతిమాననేన ॥

**అన్వయక్రమము :–** అయం స్వప్నః నహి;శోకేన దుఃఖేన చ పీడితాయాః మే నిద్రా నహి అస్తి, యతః (అహం) ఇందుపూర్ణప్రతిమాననేన తేన విహీనా (అస్మి అతః) మే సుఖం నహి అస్తి.

**ప్రతిపదార్థము :–** అయం = ఇది, స్వప్నః = స్వప్నము, నహి అస్తి = కానేకాదు, శోకేన = శోకముచేతను, దుఃఖేన చ = దుఃఖముచేతను, పీడితాయాః = పీడింపబడినట్టి, మే = నాకు, నిద్రా = నిద్ర, నహి అస్తి = లేనే లేదు, యతః = ఏ కారణమున, (అహం = నేను) ఇందుపూర్ణప్రతిమాననేన = పూర్ణచంద్రసన్నిభమైన ముఖము కలిగినట్టి, తేన = ఆ శ్రీరామునిచే, విహీనా = వియోగము నొందినదాననో, అతః = అందువలన, మే = నాకు, సుఖం = సుఖము, నహి అస్తి = లేనే లేదు.

**తాత్పర్యము:–** నిండుచంద్రుని బోలిన ముఖము కలిగిన నా శ్రీరాముడు నాకు దూరమైయుండగా నాకు సుఖము ఎక్కడిది? సుఖములకు దూరమై దుఃఖములో మునిగియున్న నాకు నిద్ర ఎట్లు సంభవించును? నిద్రయే లేనప్పుడు స్వప్నము కలుగుట ఎట్లు సంభవమగును? కాబట్టి నేను వానరుని జూచుట స్వప్న మనుటకు వీలులేదు.

**శ్లో॥ రామేతి రామేతి సదైవ బుద్ధ్యా**
**విచింత్య వాచా బ్రువతీ తమేవ ।**
**తస్యానురూపం చ కథాం తదర్థామ్**
**ఏవం ప్రపశ్యామి తథా శృణోమి ॥ 12**

**పదచ్ఛేదము** :- రామ - ఇతి - రామ - ఇతి -సదా - ఏవ - బుద్ధ్యా - విచింత్య - వాచా - బ్రువతీ - తమ్ - ఏవ - తస్య - అనురూపం - చ - కథాం - తదర్థామ్ - ఏవం - ప్రపశ్యామి - తథా - శృణోమి ॥

**అన్వయక్రమము** :- (అహం) సదైవ రామేతి రామేతి బుద్ధ్యా విచింత్య వాచా తమేవ బ్రువతీ ఏవం తస్య అనురూపం ప్రపశ్యామి తథా ఏవం తదర్థాం కథాం చ శృణోమి.

**ప్రతిపదార్థము** :- (అహం = నేను) సదైవ = ఎల్లప్పుడును, రామేతి రామేతి = రామా రామా యని, బుద్ధ్యా విచింత్య = మనస్సున స్మరించి, వాచా = వాక్కుతో, త మేవ = ఆ శ్రీరాముని గూర్చియే, బ్రువతీ = పలుకుచున్నదాననై, ఏవం = ఈ రీతిగా, తస్య = ఆ శ్రీరామునకు, అనురూపం = తగినట్టుగా, ప్రపశ్యామి = చూచుచున్నాను, తథా = అట్లే, ఏవం = ఈ రీతిగా, తదర్థాం కథాం చ = శ్రీరాముని (చరిత్రనే బోధించునట్టి) వృత్తాంతమును, శృణోమి = వినుచున్నాను.

**తాత్పర్యము**:- నేను నిత్యము రామా రామా యని మనస్సునందు స్మరించుచు, వాక్కులతో ఆ శ్రీరామునే కీర్తించుచున్నదానను కాబట్టి నా భావన కనుగుణమైన దృశ్యమునే ఎల్లయెడల చూచుచున్నాను. అట్టి యాతని చరిత్రను తెలుపునట్టి విషయములనే ఎల్లవేళల వినుచున్నాను.

**శ్లో॥ అహం హి త స్యాద్య మనోభవేన**
**సంపీడితా తద్గతసర్వభావా ।**
**విచింతయంతీ సతతం తమేవ**
**తథైవ పశ్యామి తథా శృణోమి ॥ 13**

**పదచ్ఛేదము** :- అహం - హి - తస్య - అద్య - మనోభవేన - సంపీడితా - తద్గతసర్వభావా - విచింతయంతీ - సతతం - తమ్ - ఏవ - తథా - ఏవ - పశ్యామి - తథా - శృణోమి ॥

**అన్వయక్రమము** :- అహం అద్య మనోభవేన సంపీడితా సతతం తమేవ చింతయంతీ తద్గతసర్వభావా తథైవ తస్య రూపం పశ్యామి తథా (తస్య కథాం) శృణోమి.

**ప్రతిపదార్థము** :- అహం = నేను, అద్య = నేడు, మనోభవేన = మన్మథునిచే, సంపీడితా = పీడింపబడినదాననై, సతతం = నిరంతరము, తమేవ = ఆ శ్రీరామునే, చింతయంతీ = స్మరించుచున్నదాననై, తద్గతసర్వభావా = ఆ శ్రీరామునియందు లగ్నమైయున్న నా సమస్తమైన మనస్సు గలదాననై, తథైవ = ఆ రీతిగనే, తస్య రూపం = ఆ శ్రీరాముని రూపమును, పశ్యామి = కనుగొనుచున్నాను, తథా = ఆ రీతిగా, (తస్య కథాం = అతని చరిత్రను) శృణోమి = ఆలకించుచున్నాను.

**తాత్పర్యము**:- నేను నేడు మన్మథునిచే పీడింపబడుచు నిరంతరము నా నాథునే స్మరించుచు, నా సమస్తమైన ఆలోచనమును ఆతనియందే లగ్నముచేసి యుండుటచేత నా కన్నులతో నెల్ల యెడలను శ్రీరాముని స్వరూపమునే చూచుచున్నాను. అట్లే నా చెవులకు వినిపించునదిగూడ ఆతని చరిత్రయే అగుచున్నది.

**శ్లో॥ మనోరథ స్స్యా దితి చింతయామి**
**తథాఽపి బుద్ధ్యాపి వితర్కయామి ।**
**కిం కారణం తస్య హి నాస్తి రూపం**
**సువ్యక్తరూపశ్చ వద త్యయం మామ్ ॥ 14**

**పదచ్ఛేదము** :- మనోరథః - స్యాత్ - ఇతి - చింతయామి - తథా - అపి - బుద్ధ్యా - అపి - వితర్కయామి - కిం - కారణం - తస్య - హి - న - అస్తి - రూపం - సువ్యక్తరూపః - చ - వదతి - అయం - మామ్ ॥

**అన్వయక్రమము** :- అయం మనోరథః స్యాత్ ఇతి చింతయామి; తథాపి బుద్ధ్యా అపి (సః న ఇతి) వితర్కయామి; కిం కారణం (ఇతి చేత్) తస్య రూపం నాస్తి హి; అయం సువ్యక్తరూపః మాం వదతి చ.

**ప్రతిపదార్థము** :- అయం = ఈ సంఘటనము, (మే) మనోరథః స్యాత్ = నా మానసికమైన అభిలాషయే యగును, ఇతి = అని, చింతయామి = భావింతును, తథాపి = అయినను, బుద్ధ్యాపి = నిశ్చలమైన బుద్ధితో (సః న ఇతి = అట్టి మానసిక భావన కాదని) వితర్కయామి = ఊహించుచున్నాను. కిం కారణం (ఇతి చేత్) =కారణమేమి (అనగా), తస్య = ఆ మానసికభావనకు, రూపం నాస్తి హి = ప్రత్యక్షమైన రూపముండదు గదా! అయం = ఈ వానరుడు, సువ్యక్తరూపః = ప్రత్యక్షమైనట్టి రూపముగలవాడై, మాం వదతి చ = నన్ను గూర్చి మాటాడుచున్నాడు గూడను.

**తాత్పర్యము**:- నేను చూచుచున్న ఈ సంఘటనలు నా మనోరథానుకూలమైన భావన

యేమో అని నే ననుకొనుచున్నాను. కాని చక్కగా ఆలోచించి చూచినచో మఱల ఇది కేవలము నా భావన కాదని తెలియుచున్నది. ఎందుచేతననగా మానసికమైన భావనకు కన్నులకు గోచరించు స్వరూప ముండదు గదా! ఇప్పుడీ వానరుడు స్పష్టమైన రూపముతో నా ఎదుటనే మాటాడుచున్నాడు గదా!

**శ్లో॥ నమోఽస్తు వాచస్పతయే సవజ్రిణే**
**స్వయంభువే చైవ హుతాశనాయ ।**
**అనేన చోక్తం యదిదం మమాగ్రతః**
**వనౌకసా తచ్చ తథాఽస్తు నాన్యథా ॥ 15**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సీతావితర్కః" నామ*
*ద్వాత్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము :-** నమః - అస్తు - వాచస్పతయే - సవజ్రిణే - స్వయంభువే - చ - ఏవ - హుతాశనాయ - అనేన - చ - ఉక్తం - యత్ - ఇదం - మమ - అగ్రతః - వనౌకసా - తత్ - చ - తథా - అస్తు - న - అన్యథా ॥

**అన్వయక్రమము :-** సవజ్రిణే వాచస్పతయే నమః అస్తు; స్వయంభువే హుతాశనాయ (నమః అస్తు) మమ అగ్రతః అనేన వనౌకసా యత్ ఇదమ్ ఉక్తం, తత్ తథాస్తు; అన్యథా న అస్తు.

**ప్రతిపదార్థము :-** సవజ్రిణే = దేవేంద్రునితో కూడినట్టి, వాచస్పతయే = బృహస్పతికి, నమః అస్తు = నమస్కారమగుగాక! స్వయంభువే = బ్రహ్మదేవునకు, హుతాశనాయ చైవ = అగ్నిదేవునకును, నమః అస్తు = నమస్కారమగుగాక! మమ అగ్రతః = నా సమక్షమున, అనేన వనౌకసా = ఈ వానరునిచే, ఇదం యత్ ఉక్తం = ఇది ఏమి చెప్పబడెనో, తత్ = అది, తథాస్తు = అట్లే యగుగాక! అన్యథా న అస్తు = వేరొకరీతిగా కాకుండుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:-** హనుమంతుని వచనములు సత్యములే కావలెనని సీతమ్మ దేవతా వందనము గావించుచున్నది. బృహస్పతి, వాక్కులకు పతి (వాచస్పతి) కావున అతనికి నమస్కారము చేసినది. దేవేంద్రునికి వందన మెందుల కనగా, అతడు బృహస్పతికడ

సత్యవచనములైన శబ్దములను మంత్రరూపముగా పొంది ఉపాసించి నట్టివాడు గావున అతనికి మ్రొక్కినది. బ్రహ్మయనగా సత్యదేవుడు, వాక్కునకు సత్యత్వము ఆతనివలననే సిద్ధించును. అగ్నిదేవుడు వాక్కున కధిష్ఠానదైవము కావున బ్రహ్మకును అగ్నికిని సీతమ్మ వందన మిడెను అని గ్రహించవలెను. "అగ్ని ర్మే వాచి శ్రితః" అని శ్రుతి ప్రమాణము.

**తాత్పర్యము:** – దేవేంద్రసహితుడైన వాచస్పతియగు బృహస్పతికి నమస్కరించుచున్నాను. సత్యలోకప్రభువైన బ్రహ్మదేవునకు నమస్కారము. వాక్కుల కధిష్ఠానదైవమైన అగ్నిదేవునకు నమస్కారము. నేడు నాయెదుట ఈ వానరుడు పలికినట్టి ఈరీతి అంతయును యథార్థమగు గాక! ఇంకొక విధముగా గాకుండుగాక!

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతావితర్కము" అను*
*ముప్పదిరెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# త్రయస్త్రింశసర్గ

**శ్లో॥ సోఽవతీర్య ద్రుమా త్తస్మా ద్విద్రుమప్రతిమాననః ।**
**వినీతవేషః కృపణః ప్రణిప త్యోపసృత్య చ ॥ 1**

**శ్లో॥ తా మబ్రవీ న్మహాతేజా హనుమాన్ మారుతాత్మజః ।**
**శిర స్యంజలి మాధాయ సీతాం మధురయా గిరా ॥ 2**

**పదచ్ఛేదము :-** సః – అవతీర్య – ద్రుమాత్ – తస్మాత్ – విద్రుమప్రతిమాననః – వినీతవేషః – కృపణః – ప్రణిపత్య – ఉపసృత్య – చ – తామ్ – అబ్రవీత్ – మహాతేజాః – హనుమాన్ – మారుతాత్మజః – శిరసి – అంజలిమ్ – ఆధాయ – సీతాం – మధురయా – గిరా ॥

**అన్వయక్రమము :-** విద్రుమప్రతిమాననః వినీతవేషః కృపణః మహాతేజాః, మారుతాత్మజః సః హనుమాన్ తస్మాత్ ద్రుమాత్ అవతీర్య తాం సీతాం ప్రణిపత్య, ఉపసృత్య చ శిరసి అంజలిమ్ ఆధాయ మధురయా గిరా (ఏవమ్) అబ్రవీత్.

**ప్రతిపదార్థము :-** విద్రుమప్రతిమాననః = పగడముతో సమానమైన ముఖముగల వాడును, వినీతవేషః = వినయముగల వేషము గలవాడును, కృపణః = దీనుడును, మహాతేజాః = గొప్ప తేజస్సు గలవాడును, మారుతాత్మజః = వాయుపుత్రుడును అగు, సః హనుమాన్ = ఆ హనుమ, తస్మాత్ ద్రుమాత్ = ఆ చెట్టునుండి, అవతీర్య = దిగి, తాం సీతాం = ఆ సీతాదేవిని, ప్రణిపత్య = మ్రొక్కి, ఉపసృత్య చ = సమీపించియు, శిరసి = శిరస్సున, అంజలిమ్ ఆధాయ = అంజలిని ఘటించి, మధురయా గిరా = మధురమైనట్టి వాక్కుతో, (ఏవం = ఈరీతిగా) అబ్రవీత్ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :-** కృపణః = సీతమ్మయొక్క దుఃఖస్థితిని దర్శించుటచే దీనస్థితిని పొందిన వాడని అర్థము. అబ్రవీత్ – రాక్షసస్త్రీలు రాత్రి మేల్కొని నిద్రమత్తుతో

నుండుటచేతను, త్రిజటాస్వప్నవృత్తాంతమును విని భయమునొంది తమకు రక్షకురాలు సీతయే యను భావముతో వెనుకటివలె ఆమెను పీడింపకుండుటచేతను, దైవానుగ్రహముచేతను, ఆ సీతాహనుమంతుల సంభాషణము నిరాటంకముగా సాగినదని తెలియవలెను.

**తాత్పర్యము** :– పగడము వంటి ఎఱ్ఱని ముఖము గలిగిన, వినయమును సూచించు వేషమును ధరించియున్న ఆ హనుమ సహజముగా మహాతేజశ్శాలియైనను సీతమ్మ కష్టస్థితిని జూచి దీనుడై దూరమునుండియే సీతాదేవికి మ్రొక్కి, వినయముతో ఆమెను సమీపించి, (పై కొమ్మనుండి క్రింది కొమ్మ మీదికివచ్చి) చేతులు జోడించి తలమీదికి చేర్చి భక్తితో ఆమెను చూచుచు మధురములైన మాటలతో ఇట్లు పలికెను.

**శ్లో॥ కా ను పద్మపలాశాక్షి క్లిష్టకౌశేయవాసిని ।**
**ద్రుమస్య శాఖా మాలంబ్య తిష్ఠసి త్వ మనిందితా ॥ 3**

**పదచ్ఛేదము** :– కా – ను – పద్మపలాశాక్షి – క్లిష్టకౌశేయవాసిని – ద్రుమస్య – శాఖామ్ – ఆలంబ్య – తిష్ఠసి – త్వమ్ – అనిందితా ॥

**అన్వయక్రమము** :– పద్మపలాశాక్షి, క్లిష్టకౌశేయవాసిని, ద్రుమస్య శాఖామ్ ఆలంబ్య తిష్ఠసి, అనిందితా త్వం కా ను?

**ప్రతిపదార్థము** :– పద్మపలాశాక్షి = పద్మపత్రముల వంటి నేత్రములు గలదానవును, క్లిష్టకౌశేయవాసిని = నలిగిపోయిన పట్టువస్త్రములను ధరించిన దానవును అగు ఓయమ్మా, ద్రుమస్య = వృక్షముయొక్క, శాఖాం = కొమ్మను, ఆలంబ్య = పట్టుకొని, తిష్ఠసి = నిలచియున్నావు, అనిందితా త్వం = ఉత్తమురాలవైనట్టి నీవు, కా ను = ఎవరవో?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు**:– కా ను – స్పష్టమైన లక్షణములచే ఆమె సీతమ్మయే యని తనకు నిశ్చయము కల్గినను ఆమెచేతనే స్వయముగా చెప్పించుటకై ఎఱుగనివానివలె హనుమన్న సీత నిట్లడుగుచున్నాడని తెలియవలెను.

**తాత్పర్యము**:– నలిగిపోయిన పట్టుచీర ధరించి ఈ వృక్షశాఖను పట్టుకొని నిలచియున్నావు. పూజ్యురాలవైన ఓ పద్మాక్షీ! నీవు ఎవ్వతెవు?

**శ్లో॥ కిమర్థం తవ నేత్రాభ్యాం వారి స్రవతి శోకజమ్ ।**
**పుండరీకపలాశాభ్యాం విప్రకీర్ణ మి వోదకమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :- కిమర్థం - తవ - నేత్రాభ్యాం - వారి - స్రవతి - శోకజమ్ - పుండరీకపలాశాభ్యాం - విప్రకీర్ణమ్ - ఇవ - ఉదకమ్ ॥

**అన్వయక్రమము** :- పుండరీకపలాశాభ్యాం విప్రకీర్ణమ్ ఉదకమ్ ఇవ, తవ నేత్రాభ్యాం, కిమర్థం శోకజం వారి స్రవతి?

**ప్రతిపదార్థము** :- పుండరీకపలాశాభ్యాం = రెండు తామరపత్రముల నుండి, విప్రకీర్ణమ్ ఉదకమ్ ఇవ = కారిపోవుచున్న నీరువలె, తవ నేత్రాభ్యాం = నీ రెండు కన్నుల నుండియు, కిమర్థం = ఎందుకొఱకు, శోకజం వారి = దుఃఖబాష్పజలము, స్రవతి = స్రవించుచున్నది?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము**:- తవ నేత్రాభ్యాం - ఆనందబాష్పములు స్రవించవలసిన కన్నులనుండి , కిమర్థం - అనగా ఎవ్వని వంశచ్ఛేదము కొఱకో గదా అని భావము.

**తాత్పర్యము**:- పద్మపత్రములనుండి నీరు జారిపడుచున్నట్లుగా సుందరమైన నీకన్నులనుండి ఇట్లు దుఃఖబాష్పములు స్రవించుచున్నవి. కారణమేమి తల్లీ!

**శ్లో॥ సురాణా మసురాణాం చ నాగగంధర్వరక్షసామ్ ।**
**యక్షాణాం కిన్నరాణాం చ కా త్వం భవసి శోభనే ॥ 5**

**పదచ్ఛేదము** :- సురాణామ్ - అసురాణాం - చ - నాగగంధర్వరక్షసామ్, యక్షాణాం - కిన్నరాణాం - చ - కా - త్వం - భవసి - శోభనే ॥

**అన్వయక్రమము** :- శోభనే, త్వం సురాణామ్, అసురాణాం చ, నాగగంధర్వరక్షసాం, యక్షాణాం, కిన్నరాణాం చ కా భవసి?

**ప్రతిపదార్థము** :- శోభనే = ఓ మంగళస్వరూపురాలా! త్వం = నీవు, సురాణాం = దేవతలలోను, అసురాణాం చ = దానవులలోను, నాగగంధర్వరక్షసాం = నాగులలోను గంధర్వులలోను రక్కసులలోను, యక్షాణాం = యక్షులలోను, కిన్నరాణాం = కిన్నరులలోను, కా భవసి = ఎవ్వతెవై యున్నావు?

**తాత్పర్యము**:- ఓమంగళ స్వరూపిణీ! నీవు దేవదానవులలోను, నాగగంధర్వులలోను,

యక్షరాక్షసులలోను, కిన్నరులలోను ఏ వర్గమునకు చెందినదానవు?

**శ్లో॥ కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే ।**
**వసూనాం వా వరారోహే దేవతా ప్రతిభాసి మే ॥ 6**

**పదచ్ఛేదము** :– కా – త్వం – భవసి – రుద్రాణాం – మరుతాం – వా – వరాననే – వసూనాం – వా – వరారోహే – దేవతా – ప్రతిభాసి – మే ॥

**అన్వయక్రమము** :– వరాననే, వరారోహే, రుద్రాణాం మరుతాం వా, వసూనాం వా, త్వం కా భవసి; త్వం మే దేవతా ప్రతిభాసి.

**ప్రతిపదార్థము** :– వరాననే = పూజ్యమైన ముఖము కలిగినట్టి, వరారోహే = ఓ సుందరాంగీ! రుద్రాణాం = రుద్రులలోగాని, మరుతాం వా = మరుత్తులలోగాని, వసూనాం వా = వసువులలోగాని, త్వం = నీవు, కా భవసి? = ఏగణమునకు చెందినదానవు? త్వం = నీవు, మే = నాకు, దేవతా = దేవతవుగా, ప్రతిభాసి = తోచుచున్నావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

దేవతా ప్రతిభాసి మే – దివ్యమైన నీ సహజతేజముచే నీ పరాదేవతారూపము నాకు భాసించుచునే యున్నది. దీర్ఘశోకముతో ఉపవాసకృశమై ధూళిధూసరితమై యున్న నీ శరీరముగాని, నీ క్లిష్టకౌశేయవసనముగాని, మలినమై ఏకమైపోయియున్న నీ కేశజాలముగాని నీ దివ్యత్వమును నాకు మఱుగు పఱచలేకున్నవి సుమా అనుచు "బుద్ధిమతాం వరిష్ఠ" దైన హనుమ సీతమ్మ నిజరూపము చక్కగా గ్రహించెను, అని భావము.

కేవల తామసికులైన రక్కసులకే హనుమంతుని విక్రమమును గాంచుచున్నప్పుడు ఆతని స్వరూపము దివ్యమైనదిగా, త్రిమూర్త్యాత్మకమైనదిగా, "అనంత మవ్యక్త మచింత్య మేకం" (54 సర్గము 36, 37, 38 శ్లోకములు) అగు పరతత్త్వముగా భాసించినప్పుడు పరమసత్త్వసంపన్ను డైన ఆ మహనీయునకు సీతామాత స్వస్వరూపముతో భాసించుటలో ఆశ్చర్య మేమున్నది!

**తాత్పర్యము**:– పూజ్యురాలవైన ఓ సుందరీ! రుద్రులలోగాని మరుత్తులలోగాని, వసువులలోగాని, నీవు ఏ వర్గమునకు చెందిన దానవమ్మా! నాకు చూడగా నీవు మంగళదేవతవుగా గన్పించు చున్నావు!

**శ్లో॥ కిన్ను చంద్రమసా హీనా పతితా విబుధాలయాత్ ।**
**రోహిణీ జ్యోతిషాం శ్రేష్ఠా శ్రేష్ఠా సర్వగుణాధికా ॥ 7**

**పదచ్ఛేదము :-** కిం - ను - చంద్రమసా - హీనా - పతితా - విబుధాలయాత్ - రోహిణీ - జ్యోతిషాం - శ్రేష్ఠా - శ్రేష్ఠా - సర్వగుణాధికా ॥

**అన్వయక్రమము :-** (త్వం) విబుధాలయాత్ పతితా, జ్యోతిషాం శ్రేష్ఠా, సర్వగుణాధికా, చంద్రమసా హీనా శ్రేష్ఠా రోహిణీ కిం ను?

**ప్రతిపదార్థము :-** (త్వం = నీవు) విబుధాలయాత్ పతితా = స్వర్గలోకమునుండి పడినట్టి, జ్యోతిషాం శ్రేష్ఠా = నక్షత్రములలో శ్రేష్ఠురాలును, సర్వగుణాధికా = సద్గుణములచే మహనీయురాలును, చంద్రమసా హీనా = చంద్రునితో వియోగము నొందినదియు నగు, శ్రేష్ఠా రోహిణీ కిం ను = సర్వోత్తమురాలవైన రోహిణివా ఏమి?

శ్రేష్ఠగుణాధికా - అని పాఠాంతరము.

**తాత్పర్యము:-** సర్వగ్రహనక్షత్రములలో శ్రేష్ఠురాలును, సర్వసద్గుణములచే సర్వాధికురాలును, చంద్రునినుండి వియోగము నొంది స్వర్గమునుండి భూమిమీదకు జారిపడినదియు నగు ఆ రోహిణీతారవా యేమి?

**శ్లో॥ కాత్వం భవసి కల్యాణి త్వ మనిందితలోచనే ॥ 8**

**పదచ్ఛేదము :-** కా - త్వం - భవసి - కల్యాణి - త్వమ్ - అనిందితలోచనే ॥

**అన్వయక్రమము :-** కల్యాణి, అనిందితలోచనే! త్వం కా భవసి.

**ప్రతిపదార్థము :-** కల్యాణి! = ఓ మంగళస్వరూపురాలా! అనిందితలోచనే = ఉత్తమమైన నేత్రశోభగల ఓ సుందరీ! త్వం కా భవసి = నీవు ఎవ్వతెవైయున్నావు?

**తాత్పర్యము:-** ఉత్తమమైన నేత్రశోభతో వెలుగొందుచున్న ఓ మంగళస్వరూపిణీ! నీ వెవ్వతెవో నాకు తెలుపుము.

**శ్లో॥ కోపా ద్వా యది వా మోహాద్భర్తార మసితేక్షణే ।**
**వసిష్ఠం కోపయిత్వా త్వం నాసి కల్యా ణ్యరుంధతీ ॥ 9**

**పదచ్ఛేదము :-** కోపాత్ - వా - యది - వా - మోహాత్ - భర్తారమ్ - అసితేక్షణే - వసిష్ఠం - కోపయిత్వా - త్వం - న - అసి - కల్యాణీ - అరుంధతీ ॥

**అన్వయక్రమము** :- అసితేక్షణే, (త్వం) కోపాత్ వా, యది వా మోహాత్ భర్తారం వసిష్ఠం కోపయిత్వా, (విబుధాలయాత్ పతితా) కల్యాణీ అరుంధతీ న అసి కిమ్?

**ప్రతిపదార్థము** :- అసితేక్షణే = నల్లనికన్నులుగల ఓ సుందరీ! (త్వం = నీవు) కోపాత్ వా = కోపమువలనగాని, యది వా మోహాత్ = లేక మోహమువలనగాని, భర్తారం వసిష్ఠం = భర్తయైనట్టి వసిష్ఠమహర్షిని, కోపయిత్వా = కోపింపజేసి, విబుధాలయాత్ పతితా = స్వర్గమునుండి క్రిందికి పడిన, కల్యాణీ అరుంధతీ న అసి (కిం) = మంగళ స్వరూపురాలైన అరుంధతివి కావుగదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- 'కల్యాణీ అరుంధతీ' పూర్వము కాంతివిశేషముచే సీతమ్మను హనుమ రోహిణిగా శంకించినాడు. ఇచ్చట పాతివ్రత్యమహత్త్వముచే అరుంధతిగా శంకించు చున్నాడని తెలియవలెను.

**తాత్పర్యము**:- ఓ నీలికన్నుల సుందరీ! అలుకచేగాని, భ్రాంతిచేగాని, భర్తయైన వసిష్ఠమహర్షికి కోపము గలిగించి, దివినుండి భువికి దిగి వచ్చినట్టి సర్వలోక పూజ్యురాలైన అరుంధతివి గాని కాదుగదా నీవు?

**శ్లో॥ కో ను పుత్రః పితా భ్రాతా భర్తా వా తే సుమధ్యమే ।**
**అస్మాల్లోకాదముం లోకం గతం త్వ మనుశోచసి ॥ 10**

**పదచ్ఛేదము** :- కః - ను - పుత్రః - పితా - భ్రాతా - భర్తా - వా - తే - సుమధ్యమే - అస్మాత్ - లోకాత్ - అముం - లోకం - గతం - త్వమ్ - అనుశోచసి ॥

**అన్వయక్రమము** :- సుమధ్యమే! అస్మాత్ లోకాత్ అముం లోకం గతం (యం) త్వం అనుశోచసి, (సః) తే పుత్రః పితా, భ్రాతా, భర్తా వా, కో ను (భవతి?)

**ప్రతిపదార్థము** :- సుమధ్యమే = ఓ సుందరాంగీ, అస్మాత్ లోకాత్ = ఈ లోకమునుండి, అముం లోకం = ఆ (పై) లోకమునకు, గతం = పోయినట్టి, యం = ఎవ్వనినిగూర్చి అయితే, త్వం = నీవు, అనుశోచసి = శోకించుచున్నావో (సః = అతడు) తే = నీకు, పుత్రః = పుత్రుడా, పితా = తండ్రియా? భ్రాతా = సోదరుడా, భర్తా వా = లేక భర్తయా? కోను (భవతి) = ఎవ్వడై యున్నాడు?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** 'అముం లోకం గతా' అని పాఠాంతరము. స్వర్గలోకమునుండి భూలోకమునకు వచ్చిన దానవైన నీవు, పుత్రుని గూర్చియా? భర్తనుగూర్చియా? ఎవ్వరినిగూర్చి దుఃఖించుచున్నా?వని అర్థము చెప్పుకొనవలెను.

**తాత్పర్యము:–** ఈ లోకమును విడిచి పరలోకగతుడైనట్టి ఎవ్వనిగూర్చియో నీవు, దుఃఖించుచున్నట్లున్నది. ఆతడు నీకు పుత్రుడగునా? తండ్రియగునా? సోదరు డగునా? భర్తయగునా? నీ కాత దేమగును తల్లీ!

**శ్లో॥ రోదనా దతినిశ్వాసా ద్భూమిసంస్పర్శనాదపి ।**
**న త్వాం దేవీ మహం మన్యే రాజ్ఞ స్సంజ్ఞావధారణాత్ ॥ 11**

**పదచ్ఛేదము :–** రోదనాత్ – అతినిశ్వాసాత్ – భూమిసంస్పర్శనాత్ – అపి – న – త్వాం – దేవీమ్ – అహం – మన్యే – రాజ్ఞః – సంజ్ఞావధారణాత్ ॥

**అన్వయక్రమము :–** రోదనాత్, అతినిశ్వాసాత్, భూమిసంస్పర్శనాత్ అపి రాజ్ఞః సంజ్ఞావధారణాత్, అహం త్వాం దేవీం న మన్యే.

**ప్రతిపదార్థము :–** రోదనాత్ = ఏడ్పువలనను, అతినిశ్వాసాత్ = దీర్ఘమైన నిట్టూర్పుల వలనను, భూమిసంస్పర్శనాత్ అపి = భూమియొక్క స్పర్శచేతను, రాజ్ఞః = రాజైన రామునియొక్క, సంజ్ఞావధారణాత్ = నామమును గ్రహించుటచేతను, త్వాం = నిన్ను, అహం = నేను, దేవీం న మన్యే = దేవవనితగా భావింపను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** దుఃఖబాష్పములును, భూస్పర్శయును దేవతలకు గలుగవని ప్రసిద్ధము.

**గోవిందరాజీయము:–** రాజ్ఞః సంజ్ఞావధారణాత్ – రాజలక్షణములను కలిగియుండుట వలన, అనగా సీతమ్మలో రాజపుత్రికాలక్షణములు అన్నియును స్పష్టముగా గోచరించుచున్నవని భావము.

**వాసుదాసస్వామి:–** చక్రస్వస్తికవజ్రాంకం ధ్వజమీనాతపత్రవత్, యస్యాః పాదతలం బ్రహ్మన్ సా భవేత్ క్షితిపాంగనా, భవేదఖండభోగాయోర్వ్యాం మధ్యాంగులి సంగతం, ఉన్నతో మాంసలోఽ౦గుష్ఠో వర్తులోఽతులభోగదః.

చక్రము స్వస్తికము వజ్రము ధ్వజము మత్స్యము గొడుగు వీని

యాకారమువంటి రేఖలు, పాదములం దుండినచో ఆమె రాజపత్ని యగును.

కాలివ్రేళ్లనడిమిభాగము భూమిని దాకియుండిన అఖండభోగములు కల్గియుండును. బొటనవ్రేలు ఎత్తుగను, గుండ్రముగను నుండిన విశేషసౌఖ్యములు కలుగును.

రాజ్ఞీత్వసూచకం స్త్రీణాం పాదపృష్ఠం సమున్నతమ్,
అస్వేద మసిరాఢ్యం చ మసృణం మృదుమాంసలమ్.

మీగా లెత్తుగను, చెమట లేనిదిగను, నరములు తెలియనిదిగను, నునుపుగను, మెత్తగను, బలసినదిగను నుండినచో రాజభార్య యగును.

భ్రువోరంత ర్లలాటే వా మశకో రాజ్యసూచకః,
నాసాగ్రే మశకశ్శోణో మహిష్యాశ్చైవ జాయతే.

కనుబొమల నడుమగాని, లలాటమునందుగాని దోమవంటి సన్నని మచ్చ యుండిన రాజ్యప్రాప్తి గలదగును.

ఇత్యాదిచిహ్నములచే సీతాదేవి రాజపత్ని యని సాముద్రికశాస్త్రప్రవీణుడగు హనుమంతుడు గ్రహించెను అని భావము.

**తాత్పర్యము** :- శోకించుట, నిట్టూర్పులు విడుచుట, భూమిపై నిలుచుట, రాజైన రాముని నామమును కీర్తించుట రాజస్త్రీలక్షణములతో శోభిల్లుచుండుట యను గుర్తులను బట్టి నీవు దేవతాస్త్రీవని నేను భావింపను.

**శ్లో॥ వ్యంజనాని హి తే యాని లక్షణాని చ లక్షయే ।**
**మహిషీ భూమిపాలస్య రాజకన్యాఽసి మే మతా ॥ 12**

**పదచ్ఛేదము** :- వ్యంజనాని - హి - తే - యాని - లక్షణాని - చ - లక్షయే - మహిషీ - భూమిపాలస్య - రాజకన్యా - చ - మే - మతా ॥

**అన్వయక్రమము** :- తే యాని వ్యంజనాని, లక్షణాని చ లక్షయే (తాని) లక్షయతః మే (త్వం) రాజకన్యా, భూమిపాలస్య మహిషీ మతా.

**ప్రతిపదార్థము** :- తే = నీయొక్క, యాని వ్యంజనాని = ఏ సాముద్రికలక్షణములను, లక్షయే = కనుగొనుచున్నానో, (తాని లక్షయతః = వాటిని చూచుచున్నట్టి,) మే = నాకు, త్వం = నీవు, రాజకన్యా = రాజపుత్రివిగను, భూమిపాలస్య, మహిషీ = మహారాజుయొక్క పట్టమహిషివిగను, మతా = తోచుచున్నావు.

**గోవిందరాజీయము:–** వ్యంజనాని – స్తన జఘనాది అవయవములు, శుభకరమైన సుడులు, రేఖలు మున్నగుసాముద్రిక లక్షణములు.

**వాసుదాసస్వామి:–**

సువృత్తైః కరభాకారై రూరుభి ర్మసృణైర్ఘనైః,
సువృత్తైః రోమరహితైర్భవేయు ర్భూమివల్లభాః.

తొడలు దృఢముగను, ఏనుగుతొండము వలెను, నునుపుగను, లావుగను, గుండ్రముగను, వెండ్రుకలు లేనివిగను, నుండిన రాజభార్య యగును.

చతుర్భిరంగుళైశ్శస్తా కటి ర్వింశతి సంయుతైః,
సమున్నతనితంబాఢ్యా చతురశ్రా మృగీదృశామ్.
నితంబబింబో నారీణామున్నతో మాంసలః పృథుః,
మహాభోగాయ స ప్రోక్తస్తదన్యోఽ శర్మణే మతః.

మొల ఇరువది నాలుగు అంగుళములు వెడల్పు గలిగి, ఎత్తై చదరముగా నుండిన పిరుదులుగలది రాజపత్నియగును. పిరుదులున్నతముగను, బలసినవిగను, విశాలముగను నుండిన మహాభోగము గలది యగును.

**తాత్పర్యము:–** విశిష్టములైన నీ యవయవముల శోభను శాస్త్రసమ్మతమైన సాముద్రిక లక్షణములను బట్టి నీవు మహారాజపుత్రికవును, మహారాజు భార్యవును అని నేను గ్రహించుచున్నాను.

**శ్లో॥ రావణేన జనస్థానా ద్బలా త్ప్రమథితా యది ।**
**సీతా త్వమసి భద్రం తే తన్మమాచక్ష్వ పృచ్ఛతః ॥ 13**

**పదచ్ఛేదము :–** రావణేన – జనస్థానాత్ – బలాత్ – ప్రమథితా – యది – సీతా – త్వమ్ – అసి – భద్రం – తే – తత్ – మమ – ఆచక్ష్వ – పృచ్ఛతః ॥

**అన్వయక్రమము :–** త్వం జనస్థానాత్ రావణేన బలాత్ ప్రమథితా సీతా అసి యది, తే భద్రమ్ (అస్తు). పృచ్ఛతః మమ తత్ ఆచక్ష్వ.

**ప్రతిపదార్థము :–** త్వం = నీవు, జనస్థానాత్ = జనస్థానమునుండి, రావణేన = రావణునిచే, బలాత్ = బలవంతముగా, ప్రమథితా = పీడింపబడినట్టి, సీతా అసి యది = సీతయైన యెడల, తే భద్రమ్ (అస్తు) = నీకు శుభమగుగాక, పృచ్ఛతః మమ = ప్రశ్నించుచున్నట్టి నాకు, తత్ = ఆ సత్యమును, ఆచక్ష్వ = చెప్పుము.

**తాత్పర్యము:–** జనస్థానమునుండి ఆనాడు రావణుడు బలవంతముగా పీడించి తెచ్చిన సీతమ్మవే నీవైనచో నీకు మంగళమగుగాక! కోరి అడుగుచున్న నాకు ఆ యథార్థమును తెలుపుము తల్లీ!

**శ్లో॥ యథా హి తవ వై దైన్యం రూపం చాప్రతిమానుషమ్ ।**
**తపసా చాన్వితో వేషస్త్వం రామమహిషీ ధ్రువమ్ ॥ 14**

**పదచ్ఛేదము :–** యథా – హి – తవ – వై – దైన్యం – రూపం – చ – అప్రతిమానుషమ్ – తపసా – చ – అన్వితః – వేషః – త్వం – రామమహిషీ – ధ్రువమ్ ॥

**అన్వయక్రమము :–** తవ దైన్యం, అప్రతిమానుషం రూపం, తపసా అన్వితః వేషః చ, యథా (శ్రుతమ్) (తథా) (స్థితా) త్వం ధ్రువం రామమహిషీ అసి.

**ప్రతిపదార్థము :–** తవ = నీయొక్క, దైన్యం = దీనస్థితియును, అప్రతిమానుషం రూపం = మానవాతీతమైనట్టి రూపమును, తపసా అన్వితః = తపస్సుతో కూడినట్టి, వేషః చ = వేషమును, యథా = ఏరీతిగా, శ్రుతం = వినబడియుండెనో, తథా (స్థితా) = ఆ రీతిగా నున్నట్టి, త్వం = నీవు, ధ్రువం = నిశ్చయముగా, రామమహిషీ అసి = రామపత్నివే యగుదువు.

**తాత్పర్యము:–** దీనమైన నీపరిస్థితియు, మానవాతీతమైన నీరూపమును, తాపసోచితమైన నీవేషమును, నేను వినియున్నదానికి సరిపడియున్నవి. కాబట్టి నీవు నిశ్చయముగా శ్రీరాముని పట్టమహిషివే.

**శ్లో॥ సా తస్య వచనం శ్రుత్వా రామకీర్తనహర్షితా ।**
**ఉవాచ వాక్యం వైదేహీ హనూమంతం ద్రుమాశ్రితమ్ ॥ 15**

**పదచ్ఛేదము :–** సా – తస్య – వచనం – శ్రుత్వా – రామకీర్తనహర్షితా – ఉవాచ – వాక్యం – వైదేహీ – హనూమంతం – ద్రుమాశ్రితమ్ ॥

**అన్వయక్రమము :–** సా వైదేహీ తస్య వచనం శ్రుత్వా రామకీర్తనహర్షితా (సతీ) ద్రుమాశ్రితం హనూమంతం వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** సా వైదేహీ = ఆ సీతాదేవి, తస్య = ఆ హనుమంతునియొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, రామకీర్తనహర్షితా = శ్రీరాముని కీర్తించుటచే సంతోషించినదై, ద్రుమాశ్రితం = చెట్టును చేరియున్నట్టి, హనూమంతం = హనుమంతునిగూర్చి, వాక్యం ఉవాచ = (ఈ) వచనమును పలికెను.

**తాత్పర్యము:-** సీతాదేవి హనుమమాటలను ఆలకించి, ఆతనిచే గావింపబడిన రామసంకీర్తనమునకు హర్షము నొందినదై ఆ వృక్షము నాశ్రయించియున్న హనుమ నుద్దేశించి ఇట్లు పలికెను.

**శ్లో॥ పృథివ్యాం రాజసింహానాం ముఖ్యస్య విదితాత్మనః ।**
**స్నుషా దశరథ స్యాహం శత్రుసైన్యప్రణాశినః ॥ 16**

**పదచ్ఛేదము :-** పృథివ్యాం - రాజసింహానాం - ముఖ్యస్య - విదితాత్మనః, స్నుషా - దశరథస్య - అహం - శత్రుసైన్యప్రణాశినః ॥

**అన్వయక్రమము :-** పృథివ్యాం, రాజసింహానాం, ముఖ్యస్య, విదితాత్మనః, శత్రుసైన్యప్రణాశినః దశరథస్య అహం స్నుషా.

**ప్రతిపదార్థము :-** పృథివ్యాం = భూమియందు (గల), రాజసింహానాం = రాజశ్రేష్ఠులలో, ముఖ్యస్య = ప్రధానుడును, విదితాత్మనః = (ఆత్మజ్ఞానియును) సుప్రసిద్ధుడును, శత్రుసైన్యప్రణాశినః = శత్రుసైన్యములను నిర్మూలించునట్టివాడునగు, దశరథస్య = దశరథునకు, అహం = నేను, స్నుషా = కోడలిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:-** శత్రుసైన్యప్రణాశినః - నా మామగారు దశరథుడు శత్రువుల నుపేక్షించువారు గాదు. అతడే జీవించియున్నచో నేను ఈ విధముగా శత్రువులచే బాధనొందుదానను గానని సీతమ్మ భావము.

**తాత్పర్యము:-** భూమిపైగల రాజశ్రేష్ఠులలో ముఖ్యుడైనవాడు, జ్ఞాని, శత్రువీరులను హతమార్చు శౌర్యశాలి అని ప్రసిద్ధి నొందిన దశరథమహారాజునకు నేను కోడలిని.

**శ్లో॥ దుహితా జనక స్యాహం వైదేహస్య మహాత్మనః ।**
**సీతేతి నామ్నా చోక్తాహం భార్యా రామస్య ధీమతః ॥ 17**

**పదచ్ఛేదము :-** దుహితా - జనకస్య - అహం - వైదేహస్య - మహాత్మనః - సీతా - ఇతి - నామ్నా - చ - ఉక్తా - అహం - భార్యా - రామస్య - ధీమతః ॥

**అన్వయక్రమము :-** మహాత్మనః వైదేహస్య జనకస్య అహం దుహితా, నామ్నా సీతేతి ఉక్తా అహం ధీమతః రామస్య భార్యా (అస్మి).

**ప్రతిపదార్థము :-** మహాత్మనః = మహాత్ముడైన, వైదేహస్య జనకస్య = విదేహదేశాధిపతి

యగు జనకునకు, అహం = నేను, దుహితా = కుమార్తెను, నామ్నా = పేరుచే, సీతా ఇతి ఉక్తా = సీత యని పిలువబడుదాననైన, అహం = నేను, ధీమతః రామస్య = ధీశాలియైన రామునకు, భార్యా (అస్మి) = భార్యనైయున్నాను.

**తాత్పర్యము:-** నేను మహాత్ముడైన విదేహాధిపతి యగు జనకునకు కుమార్తెను. సీత యని పిలువబడెడుదానను. ధీమంతుడైన శ్రీరామునకు భార్యను.

**శ్లో॥ సమా ద్వాదశ తత్రాహం రాఘవస్య నివేశనే ।**
**భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ ॥ 18**

**పదచ్ఛేదము :-** సమాః - ద్వాదశ - తత్ర - అహం - రాఘవస్య - నివేశనే - భుంజానా - మానుషాన్ - భోగాన్ - సర్వకామసమృద్ధినీ ॥

**అన్వయక్రమము :-** తత్ర రాఘవస్య నివేశనే ద్వాదశ సమాః మానుషాన్ భోగాన్ భుంజానా, సర్వకామసమృద్ధినీ (ఆసమ్)

**ప్రతిపదార్థము :-** తత్ర = అచ్చట, రాఘవస్య = రఘువంశవర్ధనుని, నివేశనే = భవనమున, ద్వాదశ సమాః = పండ్రెండు సంవత్సరములు, మానుషాన్ భోగాన్ = మానవసౌఖ్యములను, భుంజానా = అనుభవించుచున్నదాననై, సర్వకామసమృద్ధినీ = అన్నిభోగ్యవస్తువులను సమృద్ధిగా గల్గినదాననుగా (ఆసమ్ = ఉంటిని)

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:-** మానుషాన్ భోగాన్ భుంజానా = మానవరూపములో నున్నందున మనుష్యభోగములను నా లీలగా అనుభవించితిని, అని సీతమ్మ తనకు మానవరూపము సహజమైనది గాదని ఇట్లు ధ్వనింపచేసినది.

**వాసుదాసస్వామి:-** ఇచ్చట పదియు రెండు సంవత్సరములు రామునింట నుండితి నని చెప్పెను. కాని రావణాసురునితో తాను రామునితో నరణ్యమునకు వచ్చునప్పటికి పదునెనిమిది సంవత్సరములని చెప్పెను. (చూ అర-767) కావున రామచంద్రమూర్తి ఇంటికి ఆరవసంవత్సరముననే వచ్చెనని యేర్పడుచున్నది.

**తాత్పర్యము :-** ఆ రఘుకులతిలకుని మందిరమున పండ్రెండు సంవత్సరములు మానవసౌఖ్యముల నన్నింటిని అనుభవించుచు సర్వభోగసమృద్ధి గల్గి సుఖముగ నుంటిని.

**శ్లో॥ తత స్త్రయోదశే వర్షే రాజ్యే చేక్ష్వాకునందనమ్ ।**
**అభిషేచయితుం రాజా సోపాధ్యాయః ప్రచక్రమే ॥ 19**

**పదచ్ఛేదము :–** తతః – త్రయోదశే – వర్షే – రాజ్యే – చ – ఇక్ష్వాకునందనమ్ – అభిషేచయితుం – రాజా – సోపాధ్యాయః – ప్రచక్రమే ॥

**అన్వయక్రమము :–** తతః త్రయోదశే వర్షే సోపాధ్యాయః రాజా ఇక్ష్వాకునందనం రాజ్యే అభిషేచయితుం ప్రచక్రమే.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, త్రయోదశే వర్షే = పదమూడవ ఏట, సోపాధ్యాయః = గురువైన వసిష్ఠునితో కూడినవాడై, రాజా = దశరథమహారాజు, ఇక్ష్వాకునందనం = ఇక్ష్వాకువంశవర్ధనుడైన శ్రీరాముని, రాజ్యే = రాజ్యమున, అభిషేచయితుం = పట్టముగట్టుటకు, ప్రచక్రమే = ఉపక్రమించెను.

**తాత్పర్యము:–** పిమ్మట పదుమూడవ ఏట దశరథమహారాజు తనగురువైన వసిష్ఠునితో గలసి నిజవంశవర్ధనుడైన శ్రీరాముని రాజ్యమున పట్టాభిషిక్తుని చేయవలెనని సంకల్పించెను.

**శ్లో॥ తస్మిన్ సంభ్రియమాణే తు రాఘవ స్యాభిషేచనే ।**
**కైకేయీ నామ భర్తార మిదం వచన మబ్రవీత్ ॥ 20**

**పదచ్ఛేదము :–** తస్మిన్ – సంభ్రియమాణే – తు – రాఘవస్య – అభిషేచనే – కైకేయీ – నామ – భర్తారమ్ – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** తస్మిన్ రాఘవస్య అభిషేచనే సంభ్రియమాణే తు (సతి), కైకేయీ నామ (తస్య పత్నీ) భర్తారమ్ ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** తస్మిన్ = ఆ, రాఘవస్య అభిషేచనే = శ్రీరాముని పట్టాభిషేకము, సంభ్రియమాణే తు (సతి) = ఏర్పాటు చేయబడుచుండగా, కైకేయీ నామ = కై కేయి అనెడు, (తస్య పత్నీ = ఆతని భార్య), భర్తారం = పెనిమిటిని గూర్చి, ఇదం వచనం అబ్రవీత్ = ఈ మాటలను పలికినది.

**తాత్పర్యము:–** శ్రీరాముని పట్టాభిషేకమును గూర్చి సన్నాహము జరుగుచుండగా కైకేయి యను దశరథుని చిన్నభార్య తన భర్తతో ఇట్లు పలికెను.

**శ్లో॥ న పిబేయం న ఖాదేయం ప్రత్యహం మమ భోజనమ్ ।**
**ఏష మే జీవితస్యాంతో రామో య ద్యభిషిచ్యతే ॥ 21**

**పదచ్ఛేదము** :- న - పిబేయం - న - ఖాదేయం - ప్రత్యహం - మమ - భోజనమ్ - ఏషః - మే - జీవితస్య - అంతః - రామః - యది - అభిషిచ్యతే ॥

**అన్వయక్రమము** :- రామః అభిషిచ్యతే యది అహం ప్రత్యహం న పిబేయమ్; మమ భోజనం న ఖాదేయమ్; ఏషః మే జీవితస్య అంతః (భవిష్యతి).

**ప్రతిపదార్థము** :- రామః = శ్రీరాముడు, అభిషిచ్యతే యది = పట్టాభిషిక్తుడైన యెడల, అహం = నేను, ప్రత్యహం = ప్రతిదినము, న పిబేయం = (నీరు) త్రాగను, మమ భోజనం = నా భోజనమును, న ఖాదేయం = తినను, ఏషః = ఈయది, మే = నాకు, జీవితస్య అంతః = జీవితమునకు అంతము, (భవిష్యతి = కాగలదు).

**తాత్పర్యము**:- శ్రీరాముడు నేడు పట్టాభిషిక్తుడైనచో నేటినుండి నేను ఏనాడును ఆహారపానీయములను ముట్టను; ఈ రామపట్టాభిషేకపు దినమే నా జీవితమునకు అంత్యదినము కాగలదు.

**శ్లో॥ యత్తదుక్తం త్వయా వాక్యం ప్రీత్యా నృపతిసత్తమ ।**
**తచ్చేన్న వితథం కార్యం వనం గచ్ఛతు రాఘవః ॥ 22**

**పదచ్ఛేదము** :- యత్ - తత్ - ఉక్తం - త్వయా - వాక్యం - ప్రీత్యా - నృపతిసత్తమ - తత్ - చేత్ - న - వితథం - కార్యం - వనం - గచ్ఛతు - రాఘవః ॥

**అన్వయక్రమము** :- తత్, నృపతిసత్తమ, త్వయా ప్రీత్యా (పూర్వం) యత్ వాక్యమ్ ఉక్తం, తత్ న వితథం కార్యం చేత్ రాఘవః వనం గచ్ఛతు.

**ప్రతిపదార్థము** :- తత్ = ఆ కారణమున, నృపతిసత్తమ = ఓ రాజోత్తమా! త్వయా = నీచేత, (పూర్వం = మున్ను), ప్రీత్యా = ప్రేమతో, యత్ వాక్యం = ఏ వచనమైతే, ఉక్తం = చెప్పబడినదో, తత్ = ఆ వచనము, న వితథం = అసత్యముకానిదిగా, కార్యం చేత్ = చేయదగినదియైన యెడల, రాఘవః = శ్రీరాముడు, వనం గచ్ఛతు = అడవికి వెడలుగాక!

**తాత్పర్యము**:- ఓ రాజోత్తమా! నీ వానాడు నేను చేసిన మేలునకు మెచ్చి, నాపై ప్రేమతో ఏ వరమును వాగ్దానము చేసితివో, ఆ వరదానవచనమును నీవు నిలబెట్టుకొనదలచిన యెడల నేడు శ్రీరాముడు అడవికి వెడలవలయును.

**శ్లో॥ స రాజా సత్యవాగ్దేవ్యా వరదాన మనుస్మరన్ ।**
**ముమోహ వచనం శ్రుత్వా కైకేయ్యాః క్రూర మప్రియమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :- సః - రాజా - సత్యవాక్ - దేవ్యాః - వరదానమ్ - అనుస్మరన్ - ముమోహ - వచనం - శ్రుత్వా - కైకేయ్యాః - క్రూరమ్ - అప్రియమ్ ॥

**అన్వయక్రమము** :- సత్యవాక్ సః రాజా దేవ్యాః (దత్తం) వరదానమ్ అనుస్మరన్, క్రూరమ్, అప్రియం, కైకేయ్యాః వచనం శ్రుత్వా ముమోహ.

**ప్రతిపదార్థము** :- సత్యవాక్ = సత్యవచనుడైన, సః రాజా = ఆ దశరథుడు, దేవ్యాః (దత్తం) = భార్యకు (ఇచ్చిన), వరదానం = వరదానమును, అనుస్మరన్ = జ్ఞాపకముచేసి కొనుచు, క్రూరం = ఘోరమైనట్టిదియును, అప్రియం = బాధాకరమైనట్టియు నగు, కైకేయ్యాః = కైకేయియొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, ముమోహ = మూర్ఛిల్లెను.

**తాత్పర్యము**:- సత్యపరిపాలకుడైన దశరథుడు తాను పూర్వము ఆమెకు చేసిన వాగ్దానమును జ్ఞాపకము చేసికొనుచు ఆమె పలికిన క్రూరమై, అప్రియమై యున్న ఆ మాటలకు వెంటనే మూర్ఛనొందెను.

**శ్లో॥ తత స్తం స్థవిరో రాజా సత్యధర్మే వ్యవస్థితః ।**
**జ్యేష్ఠం యశస్వినం పుత్రం రుద న్రాజ్యమయాచత ॥ 24**

**పదచ్ఛేదము** :- తతః - తం - స్థవిరః - రాజా - సత్యధర్మే - వ్యవస్థితః - జ్యేష్ఠం - యశస్వినం - పుత్రం - రుదన్ - రాజ్యమ్ - అయాచత.

**అన్వయక్రమము** :- తతః సత్యధర్మే వ్యవస్థితః స్థవిరః రాజా రుదన్, యశస్వినం తం జ్యేష్ఠం పుత్రం రాజ్యమ్ అయాచత.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, సత్యధర్మే = సత్యవ్రతమునందు, వ్యవస్థితః = కట్టుబడి యున్నట్టివాడైన, స్థవిరః రాజా = వృద్ధభూపతి, రుదన్ = విలపించుచు, యశస్వినం = కీర్తిశాలియగు, జ్యేష్ఠం పుత్రం = పెద్ద కుమారుని, రాజ్యమ్ అయాచత = రాజ్యమును యాచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి**:- 'రాజ్యమ్ అయాచత వనరాజ్యం అయాచత ఇత్యర్థః' వనరాజ్యమునే గైకొనుమని, శ్రీరాముని యాచించెనని భావము.

"సత్యధర్మే వ్యవస్థితః" అనుటకు బదులుగా "సత్యే ధర్మే వ్యవస్థితః" అని పాఠాంతరము.

**తాత్పర్యము:–** అప్పుడు సత్యమునకు కట్టుబడియుండు వాడైన ఆ వృద్ధభూపతి, ఈ దారుణపరిణామమునకు విలపించుచు, యశస్సునే (నిజజీవితలక్ష్యముగా) భావించునట్టి పెద్దకుమారుడైన శ్రీరాముని తనకు లభింపవలసిన రాజ్యమును (భరతునకు) ఇచ్చి వేయుమని యాచించెను.

**శ్లో॥ స పితు ర్వచనం శ్రీమా నభిషేకా త్పరం ప్రియమ్ ।**
**మనసా పూర్వ మాసాద్య వాచా ప్రతిగృహీతవాన్ ॥ 25**

**పదచ్ఛేదము :–** సః – పితుః – వచనం – శ్రీమాన్ – అభిషేకాత్ – పరం – ప్రియమ్ – మనసా – పూర్వమ్ – ఆసాద్య – వాచా – ప్రతిగృహీతవాన్ ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్ (సః) అభిషేకాత్ పరం ప్రియం పితుః వచనం మనసా పూర్వమ్ ఆసాద్య, (పునః) వాచా ప్రతిగృహీతవాన్.

**ప్రతిపదార్థము :–** శ్రీమాన్ = శుభలక్షణసంపన్నుడైన, సః = ఆ శ్రీరాముడు, అభిషేకాత్ = పట్టాభిషేకము కంటెను, పరం ప్రియం = మిక్కిలి ప్రియమైనట్టి, పితుః వచనం = తండ్రిమాటను, మనసా = మనఃపూర్వకముగా, పూర్వమ్ ఆసాద్య = మొదట స్వీకరించి, (పునః = తరువాత) వాచా = వాగ్రూపముగా, ప్రతిగృహీతవాన్ = స్వీకరించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** 'మనసా పూర్వమ్ ఆసాద్య' తండ్రియైన దశరథుడు తన నోటితో చెప్పక పూర్వమే దానిని నెరవేర్చుటకు నిశ్చయించు కొనెనని భావము.

**తాత్పర్యము:–** శుభలక్షణములకు నిలయమైన శ్రీరాముడు, తండ్రి తనకు చెప్పు మాటలను ఆచరించుటయే పట్టాభిషేకముకంటెగూడ ఘనముగా ఎంచుకొని, తనతండ్రి చెప్పక పూర్వమే తాను చేయుటకు మానసికముగ నిర్ణయించుకొని, పిమ్మట తండ్రిమాటలకు వాగ్రూపముగా తన అంగీకారము తెలిపెను.

**శ్లో॥ దద్యా న్న ప్రతిగృహ్ణీయా త్సత్యం బ్రూయాన్న చానృతమ్ ।**
**అపి జీవితహేతో ర్హి రామ స్సత్యపరాక్రమః ॥ 26**

**పదచ్ఛేదము :–** దద్యాత్ – న – ప్రతిగృహ్ణీయాత్ – సత్యం – బ్రూయాత్ – న – చ – అనృతమ్ – అపి – జీవితహేతోః – హి – రామః – సత్యపరాక్రమః ॥

**అన్వయక్రమము :–** సత్యపరాక్రమః రామః (స్వయం) దద్యాత్; జీవితహేతోః అపి న ప్రతిగృహ్ణీయాత్; సత్యం బ్రూయాత్; జీవితహేతో అపి అనృతం న చ బ్రూయాత్.

**ప్రతిపదార్థము :-** సత్యపరాక్రమః = సత్యపాలననిమిత్తపరాక్రముడైన, రామః = శ్రీరాముడు, (స్వయం = తాను) దద్యాత్ = దానము చేయవలెను, జీవితహేతోః అపి = జీవితరక్షణ కొఱకు గూడ, న ప్రతిగృహ్ణీయాత్ = పరులనుండి స్వీకరింపరాదు, సత్యం బ్రూయాత్ = నిజము పలుకవలెను, (జీవితహేతోః అపి = ప్రాణరక్షణకు గూడ), అనృతం నచ బ్రూయాత్ = అసత్యము నెంతమాత్రము పలుకరాదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :-** 'దద్యాత్ న ప్రతిగృహ్ణీయాత్' - శ్రీరాముడు ఏది ఇచ్చివేయునో దానిని తన ప్రాణములను నిలుపుకొనుటకు గూడ తిరిగి తీసికొనడని అర్థము.

**తాత్పర్యము:-** సత్యపాలనముకొఱకు వీరుడై జీవించుచున్నట్టి శ్రీరాముడు, తాను ఒకరికి ఇచ్చుటయేగాని తన ప్రాణసంరక్షణముకొఱకు గూడ పరులనుండి స్వీకరించుటకు అంగీకరింపడు. ఎట్టిపరిస్థితియందైనను సత్యమునే పలుక వలయునుగాని ప్రాణరక్షణమునకు గూడ అసత్యము నోట రానీయగూడదని ఆయన నిశ్చయము.

**శ్లో॥ స విహా యోత్తరీయాణి మహార్హాణి మహాయశాః ।**
**విసృజ్య మనసా రాజ్యం జనన్యై మాం సమాదిశత్ ॥ 27**

**పదచ్ఛేదము :-** సః - విహాయ - ఉత్తరీయాణి - మహార్హాణి - మహాయశాః - విసృజ్య - మనసా - రాజ్యం - జనన్యై - మాం - సమాదిశత్ ॥

**అన్వయక్రమము :-** మహాయశాః సః మహార్హాణి ఉత్తరీయాణి విహాయ, మనసా రాజ్యం విసృజ్య, మాం జనన్యై సమాదిశత్.

**ప్రతిపదార్థము :-** మహాయశాః = మహాయశస్సంపన్నుడైన, సః = ఆ శ్రీరాముడు, మహార్హాణి = అమూల్యము లైనట్టి, ఉత్తరీయాణి = దుస్తులను, విహాయ = విడచిపెట్టి, రాజ్యం = సామ్రాజ్యమును, మనసా విసృజ్య = మానసికముగా పరిత్యజించి, మాం = నన్ను, జనన్యై = తల్లియగు కౌసల్యకు, సమాదిశత్ = అప్పగించెను.

**తాత్పర్యము:-** యశోధనుడైనట్టి శ్రీరాముడు, అమూల్యములైన తన రాజోచిత వస్త్రములను వెంటనే విడిచిపెట్టి అట్లే తన సామ్రాజ్యమునుగూడ మనఃపూర్వకముగా పరిత్యజించి, నన్ను తన తల్లియైన కౌసల్యాదేవికడ నుండుటకు ఆదేశించెను.

**శ్లో॥ సాఽహం త స్యాగ్రత స్తూర్ణం ప్రస్థితా వనచారిణీ ।**
**నహి మే తేన హీనాయా వాస స్స్వర్గేఽపి రోచతే ॥ 28**

**పదచ్ఛేదము :–** సా – అహం – తస్య – అగ్రతః – తూర్ణం – ప్రస్థితా – వనచారిణీ – న – హి – మే – తేన – హీనాయాః – వాసః – స్వర్గే – అపి – రోచతే ॥

**అన్వయక్రమము :–** సా అహం, తస్య అగ్రతః తూర్ణం ప్రస్థితా వనచారిణీ (అభవమ్), తేన హీనాయాః మే స్వర్గే వాసః అపి న రోచతే.

**ప్రతిపదార్థము :–** సా అహం = అట్టి నేను, తస్య అగ్రతః = అతనికి ముందుగనే, తూర్ణం = శీఘ్రముగా, ప్రస్థితా = బయలుదేరినదాననై, వనచారిణీ (అభవమ్) = వనచారిణి నైతిని, తేన హీనాయాః = అతనినుండి వియోగము నొందినట్టి, మే = నాకు, స్వర్గే వాసః అపి = స్వర్గమునందలి నివాసముగూడ, న రోచతే = ఇష్టముగాదు.

**తాత్పర్యము:–** ఆ రీతిగా ఆదేశింపబడిన నేను, ఆయనకంటెను ముందుగనే అరణ్యవాసమునకై బయలుదేరితిని. శ్రీరాముడు నాతో లేని యెడల స్వర్గమునందుగూడ ఒక్క క్షణము నేను వసింపజాలను.

**శ్లో॥ ప్రాగేవ తు మహాభాగ స్సౌమిత్రి ర్మిత్రనందనః ।**
**పూర్వజ స్యానుయాత్రార్థే కుశచీరై రలంకృతః ॥ 29**

**పదచ్ఛేదము :–** ప్రాక్ – ఏవ – తు – మహాభాగః – సౌమిత్రిః – మిత్రనందనః – పూర్వజస్య – అనుయాత్రార్థే – కుశచీరైః – అలంకృతః ॥

**అన్వయక్రమము :–** మిత్రనందనః, మహాభాగః సౌమిత్రిః ప్రాక్ ఏవ పూర్వజస్య అనుయాత్రార్థే కుశచీరైః అలంకృతః (అభవత్).

**ప్రతిపదార్థము :–** మిత్రనందనః = మిత్రుల నానందింపచేయువాడును, మహాభాగః = మహాత్ముడును అగు, సౌమిత్రిః = సుమిత్రానందనుడైన లక్ష్మణుడు, ప్రాగేవ = ముందుగనే, పూర్వజస్య = అగ్రజుడైన శ్రీరామునియొక్క, అనుయాత్రార్థే = అనుగమించుటకై, కుశచీరైః = నారచీరలతో, అలంకృతః (అభవత్) = అలంకరించుకొనినవా డాయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** ప్రాగేవ – శ్రీరాముడు నారవస్త్రము లను ధరించిన పిమ్మటనే లక్ష్మణుడు ధరించెను. కాని ఆనాటి అతని ఉత్సాహమును వెల్లడించుటకొఱకే సీతమ్మ

ఇప్పుడిట్లు పలికినదని తెలియవలెను.

మహాభాగః – దశరథపుత్రుడుగా శ్రీరామునితో భూమిపై అవతరించి శ్రీమహావిష్ణువుయొక్క కర్తవ్యములో గొప్ప భాగమును తాను నిర్వహింతునని దేవతల కడ తాను చేసిన ప్రతిజ్ఞానుసారము దుష్టశిక్షణకై అరణ్యసంచారము చేయవలసి యున్నవాడు.

సౌమిత్రిః – 'సృష్టః త్వం వనవాసాయ' అనియును 'అయోధ్యా మటవీం విద్ధి' అనియును పలుకుచు, నీ కర్తవ్యమంతయును అరణ్యమునందే గలదు; అందులకే నీవు జన్మించితివి. దానిని నీవు పాలింపుమని ప్రోత్సహించినట్టి ఉదారశీలయైన తల్లి సుమిత్రకు తగిన పుత్రుడని భావము.

మిత్రనందనః – శ్రీరామునకు ఉచితమైన కైంకర్యమును నిర్వహింపగల సమర్థుడని మిత్రులచే సంతోషపూర్వకముగా ప్రశంసింపబడిన వాడని అర్థము.

పూర్వజస్య అనుయాత్రార్థే – తనకు ముందుగ జన్మించిన శ్రీరాముని అవతార ప్రయోజనమును సిద్ధింప చేయుటకై శ్రీరాముని అనుగమించుచున్నవాడని భావము.

**తాత్పర్యము:**– శ్రీరాముని సంరక్షణ విషయమున మిక్కిలి జాగరూకత గలవాడని మిత్రులచే అభినందింపబడిన మహాత్ముడు సుమిత్రానందనుడు అన్నతో వనవాసయాత్రకొఱకై వెడలుచు అతనికంటె ముందుగనే తాను నారవస్త్రములను ధరించి ఆతని ననుసరించెను.

**శ్లో॥ తే వయం భర్తు రాదేశం బహుమాన్య దృఢవ్రతాః ।**
**ప్రవిష్టాః స్మ పురాఽదృష్టం వనం గంభీరదర్శనమ్ ॥ 30**

**పదచ్ఛేదము** :– తే – వయం – భర్తుః – ఆదేశం – బహుమాన్య – దృఢవ్రతాః – ప్రవిష్టాః – స్మ – పురా – అదృష్టం – వనం – గంభీరదర్శనమ్.

**అన్వయక్రమము** :– తే వయం భర్తుః ఆదేశం బహుమాన్య దృఢవ్రతాః, పురా అదృష్టం, గంభీరదర్శనం వనం ప్రవిష్టాః స్మ.

**ప్రతిపదార్థము** :– తే వయం = ఆ మేము (మేము ముగ్వురము) భర్తుః ఆదేశం = ప్రభువుయొక్క ఆజ్ఞను, బహుమాన్య = గౌరవించి, దృఢవ్రతాః = స్థిరమైన నిశ్చయము గలవారమై, పురా అదృష్టం = పూర్వము చూచియుండనట్టి, గంభీరదర్శనం = భీకరమైన దృశ్యములు గల, వనం = అరణ్యమును, ప్రవిష్టాః స్మ = ప్రవేశించిన వారమైతిమి.

**తాత్పర్యము:–** ఆ విధముగా మేము మహారాజు నాజ్ఞను శిరసావహించి, దృఢమైన నిశ్చయముతో పూర్వపరిచయ మేమియునులేని భయంకరదృశ్యములు కల్గిన అరణ్యము ప్రవేశించితిమి.

**శ్లో॥ వసతో దండకారణ్యే త స్యాహ మమితౌజసః ।**
**రక్షసాఽపహృతా భార్యా రావణేన దురాత్మనా ॥ 31**

**పదచ్ఛేదము :–** వసతః – దండకారణ్యే – తస్య – అహమ్ – అమితౌజసః – రక్షసా – అపహృతా – భార్యా – రావణేన – దురాత్మనా ॥

**అన్వయక్రమము :–** దండకారణ్యే వసతః, అమితౌజసః తస్య భార్యా అహం, దురాత్మనా, రక్షసా రావణేన అపహృతా.

**ప్రతిపదార్థము :–** దండకారణ్యే = దండకారణ్యమునందు, వసతః = నివసించు చున్నట్టివాడైన, అమితౌజసః = అమితప్రతాపశాలియగు, తస్య = ఆ శ్రీరాముని యొక్క, భార్యా = భార్యనైనట్టి, అహం = నేను, దురాత్మనా = దుర్మార్గుడైనట్టి, రావణేన రక్షసా = రావణాసురునిచే, అపహృతా = అపహరించబడితిని.

**తాత్పర్యము:–** మహాప్రతాపసంపన్నుడైన శ్రీరాముడు దండకారణ్యమునందు, నివసించుచుండగా అతని భార్యనగు నన్ను దుర్మార్గుడైన రావణుడు అపహరించినాడు.

**శ్లో॥ ద్వౌ మాసౌ తేన మే కాలో జీవితానుగ్రహః కృతః ।**
**ఊర్ధ్వం ద్వాభ్యాం తు మాసాభ్యాం తత స్త్యక్ష్యామి జీవితమ్ ॥32**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనుమత్సీతాసంభాషణోపక్రమో" నామ*
*త్రయస్త్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** ద్వౌ – మాసౌ – తేన – మే – కాలః – జీవితానుగ్రహః – కృతః – ఊర్ధ్వం – ద్వాభ్యాం – తు – మాసాభ్యాం – తతః – త్యక్ష్యామి – జీవితమ్ ॥

**అన్వయక్రమము :–** తేన మే ద్వౌ మాసౌ జీవితానుగ్రహః కృతః. తతః ద్వాభ్యాం మాసాభ్యాం ఊర్ధ్వం, (స్వయమేవ) జీవితం త్యక్ష్యామి.

**ప్రతిపదార్థము :–** తేన = ఆ రావణునిచే, మే = నాకు, ద్వౌ మాసౌ = రెండునెలలు, జీవితానుగ్రహః = జీవితమునకు అనుమతి, కృతః = కల్పింపబడినది, తతః =

అటుపిమ్మట, ద్వాభ్యాం మాసాభ్యాం ఊర్ధ్వం = రెండునెలల అనంతరము, (స్వయమేవ = స్వయముగనే) జీవితం త్యక్ష్యామి = ప్రాణము విడిచెదను.

**తాత్పర్యము:–** ఆ రావణుడు నాకు రెండు నెలల కాలము మాత్రమే జీవితావధి అనుమతించినాడు. ఆ రెండు నెలల అనంతరము నేనే ప్రాణములను విడిచి పెట్టెదను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమత్సీతా సంభాషణోపక్రమము" అను*
*ముప్పదిమూడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుస్త్రింశసర్గ

**శ్లో॥ తస్యా స్తద్వచనం శ్రుత్వా హనుమాన్ హరిపుంగవః ।**
**దుఃఖా ద్దుఃఖాభిభూతాయా స్సాంత్వ ముత్తర మబ్రవీత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తస్యాః – తత్ – వచనం – శ్రుత్వా – హనుమాన్ – హరిపుంగవః – దుఃఖాత్ – దుఃఖాభిభూతాయాః – సాంత్వమ్ – ఉత్తరమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** హరిపుంగవః హనుమాన్ దుఃఖాభిభూతాయాః తస్యాః తత్ వచనం దుఃఖాత్ శ్రుత్వా, సాంత్వమ్ ఉత్తరమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** హరిపుంగవః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమ, దుఃఖాభి భూతాయాః = దుఃఖముచే పీడింపబడినట్టి, తస్యాః = ఆ సీతాదేవియొక్క, తత్ వచనం = ఆ మాటను, దుఃఖాత్ = దుఃఖమున, శ్రుత్వా = విని, సాంత్వమ్ ఉత్తరం = ఓదార్పు గల్గించునట్టి ప్రతివచనమును, అబ్రవీత్ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** దుఃఖాత్ దుఃఖాభిభూతాయాః – నిరంతర దుఃఖపీడితురాలైనట్టి సీతమ్మయొక్క అని అర్థము.

**తాత్పర్యము:–** వానరోత్తముడైన హనుమ నిరంతరము దుఃఖపీడితురాలై యున్న సీతాదేవి మాటలు విని విషాదముతో ఆమె నోదార్చుచు ఈ రీతిగా పలికెను.

**శ్లో॥ అహం రామస్య సందేశా ద్దేవి దూత స్తవాగతః ।**
**వైదేహి కుశలీ రామ స్స త్వాం కౌశల మబ్రవీత్ ॥ 2**

**పదచ్ఛేదము :–** అహం – రామస్య – సందేశాత్ – దేవి – దూతః – తవ – ఆగతః – వైదేహి – కుశలీ – రామః – సః – త్వాం – కౌశలమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** దేవి!, అహం రామస్య సందేశాత్ తవ (సమీపం) ఆగతః (అస్మి) వైదేహి, రామః కుశలీ; సః త్వాం కౌశలమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- దేవి = ఓ జానకీదేవీ!, అహం = నేను, రామస్య = శ్రీరాముని యొక్క, సందేశాత్ = సందేశమువలన, తవ (సమీపం) = నీదగ్గరకు, ఆగతః = వచ్చినట్టి, దూతః (అస్మి) = దూతనై యున్నాను, వైదేహి = ఓ జానకీ, రామః = శ్రీరాముడు, కుశలీ = క్షేమముగనున్నవాడు, సః = అతడు, త్వాం = నిన్ను, కౌశలం = కుశలవార్తను, అబ్రవీత్ = అడిగినాడు.

**తాత్పర్యము**:- తల్లీ! నేను శ్రీరాముని సందేశమును గైకొని దూతగా నీ యొద్దకు వచ్చితిని. అమ్మా! శ్రీరాముడు క్షేమముగ నున్నాడు. అతడు నీ క్షేమము నడిగినాడు.

**శ్లో॥ యో బ్రాహ్మ మస్త్రం వేదాం శ్చ వేద వేదవిదాం వరః ।**
**స త్వాం దాశరథీ రామో దేవి కౌశల మబ్రవీత్ ॥ 3**

**పదచ్ఛేదము** :- యః - బ్రాహ్మమ్ - అస్త్రం - వేదాన్ - చ - వేద - వేదవిదాం - వరః - సః - త్వాం - దాశరథిః - రామః - దేవి - కౌశలమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- దేవి! యః బ్రాహ్మమ్ అస్త్రం, వేదాన్ చ వేద, వేదవిదాం వరః, సః దాశరథిః రామః త్వాం కౌశలమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- దేవీ! = ఓ పూజ్యురాలా!, యః = ఏ మహనీయుడు, బ్రాహ్మమ్ అస్త్రం = బ్రహ్మాస్త్రమును, వేదాంశ్చ = చతుర్వేదములను, వేద = ఎఱిగియుండెనో, వేదవిదాం వరః = వేదవేత్తలలో అగ్రగణ్యుడగు, సః దాశరథిః రామః = ఆ దశరథ నందనుడైన రాముడు, త్వాం = నిన్ను, కౌశలమ్ అబ్రవీత్ = కుశలవార్త నడిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- యః బ్రాహ్మమ్ అస్త్రం వేద - అని కవి పలుకుటచే బ్రహ్మ సర్వదేవతలలో అధికుడైనట్లే, బ్రహ్మాస్త్రము సర్వాస్త్రములలోను శ్రేష్ఠము. బ్రహ్మాస్త్రము నేర్చిన వాడనగా సర్వాస్త్రములును అతనికి వశమైనట్లే అని చెప్పినట్లు కాగలదు.

వేదాంశ్చ వేద = సర్వకర్మపరిజ్ఞాత యని భావము.
వేదవిదాం వరః = జ్ఞానమార్గపారంగతుడని భావము.

**వాసుదాసస్వామి**:- బ్రహ్మాస్త్రము తెలిసిన వాడనుటచే సమస్తాస్త్రములు తెలిసిన వాడని అర్థము. వేదములు తెలిసినవాడనుటచే అర్థముతో వేదముల నధ్యయనము చేసెననియు ధర్మశాస్త్రము కర్మానుష్ఠానము కూడ తెలిసినవాడనియు అర్థము.

**తాత్పర్యము**:- అస్త్రరాజమైన బ్రహ్మాస్త్రమును, కర్మబ్రహ్మలను బోధించు వేదములను

చక్కగా నెఱిగియున్న దశరథనందనుడైన శ్రీరాముడు నిన్ను క్షేమవార్త నడుగుచున్నాడు తల్లీ!

**శ్లో॥ లక్ష్మణ శ్చ మహాతేజా భర్తు స్తేఽనుచరః ప్రియః ।**
**కృతవాన్ శోకసంతప్తః శిరసా తేఽభివాదనమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– లక్ష్మణః – చ – మహాతేజాః – భర్తుః – తే – అనుచరః – ప్రియః – కృతవాన్ – శోకసంతప్తః – శిరసా – తే – అభివాదనమ్ ॥

**అన్వయక్రమము** :– తే భర్తుః ప్రియః అనుచరః, మహాతేజాః లక్ష్మణః చ శోకసంతప్తః సన్ శిరసా తే అభివాదనం కృతవాన్.

**ప్రతిపదార్థము** :– తే భర్తుః = నీభర్తకు, ప్రియః అనుచరః = ప్రీతిపాత్రుడై తోడుగానుండు, మహాతేజాః = తేజశ్శాలియైన, లక్ష్మణశ్చ = లక్ష్మణుడును, శోకసంతప్తః సన్ = దుఃఖసంతప్తుడగుచు, శిరసా = శిరస్సుతో, తే = నీకు, అభివాదనం కృతవాన్ = అభివాదనము గావించి యున్నాడు.

**తాత్పర్యము**:– నీ భర్తకు ప్రీతిపాత్రుడైన అనుచరుడగు తేజశ్శాలి లక్ష్మణుడు దుఃఖసంతప్తమైన హృదయముతో నీకు శిరస్సు వంచి అభివాదనము గావించియున్నాడమ్మా!

**శ్లో॥ సా తయోః కుశలం దేవీ నిశమ్య నరసింహయోః ।**
**ప్రీతిసంహృష్టసర్వాంగీ హనూమంత మథాబ్రవీత్ ॥ 5**

**పదచ్ఛేదము** :– సా – తయోః – కుశలం – దేవీ – నిశమ్య – నరసింహయోః – ప్రీతిసంహృష్టసర్వాంగీ – హనూమంతమ్ – అథ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– అథ సా దేవీ తయోః నరసింహయోః కుశలం నిశమ్య, ప్రీతిసంహృష్టసర్వాంగీ (సతీ), హనూమంతమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, సా దేవీ = ఆ సీతాదేవి, తయోః నరసింహయోః= ఆ నరశ్రేష్ఠులైన రామలక్ష్మణులయొక్క, కుశలం = క్షేమమును, నిశమ్య = ఆకర్ణించి, ప్రీతిసంహృష్టసర్వాంగీ (సతీ) = ఆనందముచే గగుర్పాటు నొందిన సమస్తశరీరము గలదై, హనూమంతం = హనుమంతుని గూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము**:– అప్పుడు సీతాదేవి రామలక్ష్మణులయొక్క క్షేమవార్తను చెవులార విని,

ఆనందముచే ఒడలెల్లను గగుర్పాటు నొందుచుండగా హనుమంతుని జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ కల్యాణీ బత గాథేయం లౌకికీ ప్రతిభాతి మా ।**
**ఏతి జీవంత మానందో నరం వర్షశతా దపి ॥ 6**

**పదచ్ఛేదము :–** కల్యాణీ – బత – గాథా – ఇయం – లౌకికీ – ప్రతిభాతి – మా – ఏతి – జీవంతమ్ – ఆనందః – నరం – వర్షశతాత్ – అపి ॥

**అన్వయక్రమము :–** బత! జీవంతం నరం వర్షశతాత్ అపి ఆనందః ఏతి, ఇతి ఇయం లౌకికీ గాథా మా కల్యాణీ ప్రతిభాతి.

**ప్రతిపదార్థము :–** బత = ఆహా, జీవంతం నరం = జీవించియున్న మానవుని, వర్షశతాత్ అపి = నూఱు సంవత్సరములకు పిమ్మటనైనను, ఆనందః ఏతి = ఆనందము ప్రాప్తించును, ఇతి = అనునట్టి, ఇయం = ఈ, లౌకికీ గాథా = లౌకికమైన సూక్తి, మా = నాకు, కల్యాణీ ప్రతిభాతి = మంగళకరమైన సత్యవాక్కుగా తోచుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** కల్యాణీ – సత్యార్థా = యథార్థ మైనదని భావము.

**తాత్పర్యము:–** ఆహా! "కష్టములను సహించి జీవించి యుండు నరుడు, నూఱు సంవత్సరములకైనను తన జీవితమునకు సాఫల్యము లభించు ఆనందమును పొందితీరును" అను లోకములోని పెద్దల సూక్తి ఎంతయు యథార్థ మని నేడు నాకు అనుభవపూర్వకముగా బోధపడినది.

**శ్లో॥ తయో స్సమాగమే తస్మి న్ప్రీతిరుత్పాదితాద్భుతా ।**
**పరస్పరేణ చాలాపం విశ్వస్తౌ తౌ ప్రచక్రతుః ॥ 7**

**పదచ్ఛేదము :–** తయోః – సమాగమే – తస్మిన్ – ప్రీతిః – ఉత్పాదితా – అద్భుతా – పరస్పరేణ – చ – ఆలాపం – విశ్వస్తౌ – తౌ – ప్రచక్రతుః ॥

**అన్వయక్రమము :–** తస్మిన్ సమాగమే తయోః అద్భుతా ప్రీతిః ఉత్పాదితా; తౌ విశ్వస్తౌ పరస్పరేణ ఆలాపం ప్రచక్రతుః.

**ప్రతిపదార్థము :–** తస్మిన్ సమాగమే = ఆసమాగమమునందు, తయోః = వారిరువురికిని, అద్భుతా ప్రీతిః = మిక్కిలి గొప్పదైన ప్రీతి, ఉత్పాదితా = కలిగింప

బడినది, తౌ = వారిరువురును, విశ్వస్తౌ = నమ్మకము కలిగినవారై, పరస్పరేణ = ఒండొరులతో, ఆలాపం ప్రచక్రతుః = సంభాషణమును గావించిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** అద్భుతా ప్రీతిః – రామలక్ష్మణు లిరువురును తనను కలసికొన్నంత అద్భుతమైనట్టి సంతోషము సీతమ్మకు కలిగినది.

**గోవిందరాజీయము:–** పరస్పరేణ ఆలాపం ప్రచక్రతుః. ముందు సర్గలో వర్ణింపబోవు సంభాషణమును గూర్చి ఇచ్చట ఇట్లు చెప్పబడినది అని తెలియవలెను.

**తాత్పర్యము:–** సీతామారుతుల ఆ సమావేశమున, వారిరువురి హృదయములందును, అద్భుతమైన ఆనందము, ప్రీతి ఉదయించెను. ఒకరిపై ఒకరు పూర్తి విశ్వాసముతో సంభాషణమున కుపక్రమించిరి.

**శ్లో॥ తస్యా స్త ద్వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః ।**
**సీతాయా శ్శోకతప్తాయా స్సమీప ముపచక్రమే ॥ 8**

**పదచ్ఛేదము :–** తస్యాః – తత్ – వచనం – శ్రుత్వా – హనుమాన్ – మారుతాత్మజః – సీతాయాః – శోకతప్తాయాః – సమీపమ్ – ఉపచక్రమే ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః హనుమాన్ తస్యాః తద్వచనం శ్రుత్వా శోకతప్తాయాః సీతాయాః సమీపమ్ ఉపచక్రమే.

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః హనుమాన్ = వాయునందనుడైన హనుమ, తస్యాః = ఆ సీతాదేవియొక్క, త ద్వచనం శ్రుత్వా = ఆ మాట విని, శోకతప్తాయాః = శోకముచే సంతాపము నొందియున్నట్టి, సీతాయాః = సీతయొక్క, సమీపం = సన్నిధికి, ఉపచక్రమే = చేర దొడగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సమీపమ్ ఉపచక్రమే – ఇంకను క్రిందికొమ్మమీదికి వచ్చుచుండెనని భావము.

**తాత్పర్యము :–** వాయునందనుడైన హనుమ సీతమాటలను ఆకర్ణించి, శోకపరితప్తురాలైన ఆమె సమీపమునకు ఆత్రముతో చేర వచ్చుచుండెను.

**శ్లో॥ యథా యథా సమీపం స హనుమా నుపసర్పతి ।**
**తథా తథా రావణం సా తం సీతా పరిశంకతే ॥ 9**

**పదచ్ఛేదము** :- యథా - యథా - సమీపం - సః - హనుమాన్ - ఉపసర్పతి - తథా - తథా - రావణం - సా - తం - సీతా - పరిశంకతే ॥

**అన్వయక్రమము** :- సః హనుమాన్ యథా యథా (తస్యాః) సమీపమ్ ఉపసర్పతి, తథా తథా సా సీతా తం రావణం పరిశంకతే.

**ప్రతిపదార్థము** :- సః హనుమాన్ = ఆ హనుమ, యథా యథా = ఏ విధముగానైతే (తస్యాః), సమీపం = (ఆ సీతాదేవి) సమీపమునకు, ఉపసర్పతి = చేరుచున్నాడో, తథా తథా = ఆ విధముగనే, సా సీతా = ఆ జానకీదేవి, తం = ఆ హనుమను, రావణం = రావణునిగా, పరిశంకతే = శంకించుచుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- పరిశంకతే - ఇంతకు పూర్వము రామకుశలకీర్తనముచే విశ్వాసము గల్గియున్నప్పటికిని, రావణాసురుని మాయాధిక్యముయొక్క స్మరణము కలిగినంతనే శంకకు లోనైనదని భావము.

**తాత్పర్యము**:- అప్పుడు తనను హనుమంతుడు సమీపించుచున్నకొలదియును, సీతమ్మ అంతకంత కతనిని మఱల రావణునిగా శంకించుచు భయపడసాగెను.

**శ్లో॥ అహో ధి గ్ధి క్కృత మిదం కథితం హి యదస్య మే ।**
**రూపాంతర ముపాగమ్య స ఏ వాయం హి రావణః ॥ 10**

**పదచ్ఛేదము** :- అహో - ధిక్ - ధిక్ - కృతమ్ - ఇదం - కథితం - హి - యత్ - అస్య - మే - రూపాంతరమ్ - ఉపాగమ్య - సః - ఏవ - అయం - హి - రావణః ॥

**అన్వయక్రమము** :- అహో, మే అస్య యత్ కథితం, ఇదం ధిక్ ధిక్ (యతః) అయం రూపాంతరమ్ ఉపాగమ్య (ఆగతః) సః రావణః ఏవ హి.

**ప్రతిపదార్థము** :- అహో = అక్కటా, మే = నాకు, అస్య = ఈతనియొక్క (చేత), యత్ కథితం = చెప్పబడిన దేది యున్నదో, ఇదం = ఇది, ధిక్కృతం = మిక్కిలి నింద్యమైనది, యతః = ఎందుచేతననగా, అయం = ఈతడు, రూపాంతరమ్ =

మాఋవేషమును, ఉపాగమ్య = పొంది (ఆగతః = వచ్చినట్టి) సః రావణః ఏవ హి = ఆ రావణాసురుడే యగునుగదా.

**తాత్పర్యము:–** అక్కటా! ఈతడు నాతో పలికినదియు, నే నాతనితో పలికినదియు అంతయు మిక్కిలి నింద్యమైన విషయమే అయినది. ఏల ననగా, ఈతడు మాయారూపమును ధరించి వచ్చిన ఆ రావణాసురుడేగాని మఱెవ్వడును గాడు.

**శ్లో॥ తా మశోకస్య శాఖాం తు విముక్త్వా శోకకర్శితా ।**
**తస్యా మే వానవద్యాంగీ ధరణ్యాం సముపావిశత్ ॥ 11**

**పదచ్ఛేదము :–** తామ్ – అశోకస్య – శాఖాం – తు – విముక్త్వా – శోకకర్శితా – తస్యామ్ – ఏవ – అనవద్యాంగీ – ధరణ్యాం – సముపావిశత్ ॥

**అన్వయక్రమము :–** శోకకర్శితా, అనవద్యాంగీ సా అశోకస్య తాం శాఖాం విముక్త్వా, తస్యామ్ ఏవ ధరణ్యాం సముపావిశత్.

**ప్రతిపదార్థము :–** శోకకర్శితా = శోకపీడితురాలును, అనవద్యాంగీ = ఉత్తమమైన దేహముగలదియునగు, సా = ఆ సీతాదేవి, అశోకస్య = అశోకవృక్షముయొక్క, తాం శాఖాం = ఆ కొమ్మను, విముక్త్వా = విడిచిపెట్టి, తస్యాం ధరణ్యామ్ ఏవ = అచ్చటి నేలమీదనే, సముపావిశత్ = కూర్చుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** అశోకస్య శాఖాం – అశోకవనమునందలి శింశుపావృక్షముయొక్క శాఖను అని అర్థము.

**గోవిందరాజీయము:–** అశోకస్య శాఖాం – అచ్చట అశోకము, శింశుపము రెండు వృక్షములును కలసియే యున్నవని తెలియవలెను.

**తాత్పర్యము:–** శోకపీడితురాలైన ఆ సీతాసాధ్వి తాను పట్టుకొనియున్న వృక్షశాఖను విడిచిపెట్టి, ఆ చెట్టు క్రింద నేలపై చదికిలబడెను.

**శ్లో॥ హనుమా నతిదుఃఖార్తాం తాం దృష్ట్వా భయమోహితామ్ ।**
**అవందత మహాబాహు స్తత స్తాం జనకాత్మజామ్ ।**
**సా చైనం భయసంత్రస్తా భూయో నైన ముదైక్షత ॥ 12**

**పదచ్ఛేదము :–** హనుమాన్ – అతిదుఃఖార్తాం – తాం – దృష్ట్వా – భయమోహితామ్,

అవందత - మహాబాహుః - తతః - తాం - జనకాత్మజామ్, సా - చ - ఏనం - భయసంత్రస్తా - భూయః - న - ఏనమ్ - ఉదైక్షత ॥

**అన్వయక్రమము** :- మహాబాహుః హనుమాన్ అతిదుఃఖార్తాం, భయమోహితాం తాం దృష్ట్వా, తాం జనకాత్మజామ్ అవందత. ఏనం దృష్ట్వా భయసంత్రస్తా (సతీ) సా భూయః ఏనం న ఉదైక్షత.

**ప్రతిపదార్థము** :- మహాబాహుః హనుమాన్ = మహావీరుడైన హనుమ, అతిదుఃఖార్తాం = మిక్కిలిగ దుఃఖపీడితురాలును, భయమోహితాం = భయవివశురాలును అగు, తాం = ఆమెను, దృష్ట్వా = చూచి, తతః = పిమ్మట, తాం జనకాత్మజాం = ఆ సీతాదేవిని గూర్చి, అవందత = నమస్కరించెను. ఏనం = ఈతనిని, దృష్ట్వా = చూచి, భయసంత్రస్తా = భయవిహ్వలురాలైన, సా = ఆమె, భూయః = తిరిగి, ఏనం = ఈ హనుమను, న ఉదైక్షత = కన్నెత్తి చూడకుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి:-** తామ్ అవందత - రావణశంకానివారణార్థమై హనుమ అట్లు సీతమ్మకు మ్రొక్కెనని తెలియవలెను.

**తాత్పర్యము:-** అమితమైన భయముతోడను, దుఃఖముతోడను పీడింపబడుచున్నట్టి ఆ సీతాదేవి మనస్సునందున్న భయమును శంకను తొలగించుటకై హనుమ ఆమెకు శిరస్సు వంచి వందనము చేసెను. కాని భయవిహ్వలురాలైన ఆ సీతమ్మ మాత్రము అతని వైపు కన్నెత్తి చూడకుండెను.

**శ్లో॥ తం దృష్ట్వా వందమానం చ సీతా శశినిభాననా ।**
**అబ్రవీ ద్దీర్ఘ ముచ్ఛ్వస్య వానరం మధురస్వరా ॥ 13**

**పదచ్ఛేదము** :- తం - దృష్ట్వా - వందమానం - చ - సీతా - శశినిభాననా - అబ్రవీత్ - దీర్ఘమ్ - ఉచ్ఛ్వస్య - వానరం - మధురస్వరా ॥

**అన్వయక్రమము** :- శశినిభాననా సీతా వందమానం తం వానరం దృష్ట్వా, దీర్ఘం ఉచ్ఛ్వస్య మధురస్వరా అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- శశినిభాననా సీతా = చంద్రునివంటి ముఖము కలిగిన ఆ సీతాదేవి, వందమానం = మ్రొక్కుచున్నట్టి, తం వానరం = ఆ వానరపుంగవుని, దృష్ట్వా = చూచి, దీర్ఘమ్ ఉచ్ఛ్వస్య = దీర్ఘమైన నిట్టూర్పును వెడలించి, మధురస్వరా = తీయని

కంఠముగలదై, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము:–** చంద్రునిబోలు సుందరమైన ముఖముతో ప్రకాశించుచున్న ఆ సీతాదేవి తనకు మ్రొక్కుచున్న ఆ వానరశ్రేష్ఠుని గాంచి దిగులుతో దీర్ఘముగ నిట్టూర్పును విడిచి మధురమైన కంఠస్వరముతో ఈరీతిగ పలికెను.

**శ్లో॥ మాయాం ప్రవిష్టో మాయావీ యది త్వం రావణ స్స్వయమ్ ।**
**ఉత్పాదయసి మే భూయః సంతాపం తన్న శోభనమ్ ॥ 14**

**పదచ్ఛేదము :–** మాయాం – ప్రవిష్టః – మాయావీ – యది – త్వం – రావణః– స్వయమ్ – ఉత్పాదయసి – మే – భూయః – సంతాపం – తత్ – న – శోభనమ్ ॥

**అన్వయక్రమము :–** మాయావీ రావణః త్వం స్వయం మాయాం ప్రవిష్టః (సన్) మే సంతాపం ఉత్పాదయసి యది, తత్ శోభనం న.

**ప్రతిపదార్థము :–** మాయావీ రావణః = మాయావియైన రావణుడవగు, త్వం = నీవు, భూయః = తిరిగి, స్వయం = స్వయముగనే, మాయాం ప్రవిష్టః, (సన్) = మాయను స్వీకరించినవాడవై, మే = నాకు, సంతాపం = పరితాపమును, ఉత్పాదయసి యది = కల్గించుచున్న యెడల, తత్ = ఆ మాయాకృత్యము, శోభనం న = మేలుగాదు.

**తాత్పర్యము:–** రావణా! మాయావియైన నీవు తిరిగి నేడు స్వయముగ మాయారూపమును ధరించి ఈ విధముగా నాకు సంతాపమును కలిగించుట నీ కెంతమాత్రము మేలుగాదు సుమా!

**శ్లో॥ స్వం పరిత్యజ్య రూపం యః పరివ్రాజకరూపవాన్ ।**
**జనస్థానే మయా దృష్ట స్త్వం స ఏవ హి రావణః ॥ 15**

**పదచ్ఛేదము :–** స్వం – పరిత్యజ్య – రూపం – యః – పరివ్రాజకరూపవాన్ – జనస్థానే – మయా – దృష్టః – త్వం – సః – ఏవ – హి – రావణః ॥

**అన్వయక్రమము :–** యః స్వం రూపం పరిత్యజ్య, పరివ్రాజకరూపవాన్ (సన్) జనస్థానే మయా దృష్టః, త్వం సః రావణః ఏవ హి.

**ప్రతిపదార్థము :–** యః = ఏ నీవు, స్వం రూపం = నిజరూపమును, పరిత్యజ్య = విడిచి, పరివ్రాజకరూపవాన్ (సన్) = యతివేషమును ధరించినవాడవై, జనస్థానే = జనస్థానమునందు, మయా = నాచేత, దృష్టః = చూడబడితివో, త్వం = నీవు, సః రావణః ఏవ హి = ఆ రావణుడవేగదా!

**తాత్పర్యము:-** ఆ నాడు జనస్థానమునందు నీ నిజరూపమును విడిచి, యతివేషము ధరించి నాకు కాన వచ్చినట్టి ఆ రావణుడవే మఱల ఇప్పు డీ రూపమున ఇట్లు వచ్చితివిగదా.

**శ్లో॥ ఉపవాసకృశాం దీనాం కామరూప నిశాచర ।**
**సంతాపయసి మాం భూయః సంతాపం తన్న శోభనమ్ ॥ 16**

**పదచ్ఛేదము :-** ఉపవాసకృశాం - దీనాం - కామరూప - నిశాచర - సంతాపయసి - మాం - భూయః - సంతాపం - తత్ - న - శోభనమ్ ॥

**అన్వయక్రమము :-** కామరూప, నిశాచర, ఉపవాసకృశాం, దీనాం మాం భూయః సంతాపం సంతాపయసి, తత్ శోభనం న.

**ప్రతిపదార్థము :-** కామరూప! నిశాచర! = కామరూపుడవైన ఓ రక్కసుడా! ఉపవాసకృశాం = ఉపవాసముచే కృశించియున్నట్టి, దీనాం మాం = దీనురాలనైన నన్ను! భూయః = తిరిగి, సంతాపం = సంతాపము గల్గునట్లుగా, సంతాపయసి = పరితపింప జేయుచున్నావు, తత్ = ఆ కృత్యము, శోభనం న = క్షేమముగాదు.

**తాత్పర్యము:-** కామరూపమును ధరించుట స్వభావమైనట్టి ఓ రావణుడా! ఉపవాసములు చేయుచు కృశించి దీనురాలనై యున్న నన్ను ఈరీతిగ నింకను సంతాపము నొందించుట నీకెంత మాత్రమును క్షేమముగాదు సుమా.

**శ్లో॥ అథవా నైత దేవం హి య న్మయా పరిశంకితమ్ ।**
**మనసో హి మమ ప్రీతి రుత్పన్నా తవ దర్శనాత్ ॥ 17**

**పదచ్ఛేదము :-** అథవా - న - ఏతత్ - ఏవం - హి - యత్ - మయా - పరిశంకితమ్ - మనసః - హి - మమ - ప్రీతిః - ఉత్పన్నా - తవ - దర్శనాత్ ॥

**అన్వయక్రమము :-** అథవా, మయా యత్ పరిశంకితం ఏతత్ ఏవం నహి; హి, తవదర్శనాత్ మమ మనసః ప్రీతిః ఉత్పన్నా.

**ప్రతిపదార్థము :-** అథవా = లేక, మయా = నాచే, యత్ పరిశంకితం = ఏ (అనిష్టము) శంకింపబడినదో, ఏతత్ = ఇది, ఏవం =ఈ రీతిగా, నహి = కానేకాదు, హి = ఎందువల్లననగా, తవ దర్శనాత్ = నిన్ను జూచుటవలన, మమ మనసః = నా మనస్సునకు, ప్రీతిః ఉత్పన్నా = ఆనందము కలిగినది.

**తాత్పర్యము:-** లేక నేను శంకించినది యథార్థముగాదు అని ఒప్పుకొనవలెను.

ఎందుచేత ననగా, నిన్ను చూచుటచేత నా మనస్సునకు మిగుల హర్షమే కలిగినది గాని వ్యాకులత కలుగలేదు.

**శ్లో॥ యది రామస్య దూత స్త్వ మాగతో భద్ర మస్తు తే ।**
**పృచ్ఛామి త్వాం హరిశ్రేష్ఠ ప్రియా రామకథా హి మే ॥ 18**

**పదచ్ఛేదము** :– యది – రామస్య – దూతః – త్వమ్ – ఆగతః – భద్రమ్ – అస్తు – తే – పృచ్ఛామి – త్వాం – హరిశ్రేష్ఠ – ప్రియా – రామకథా – హి – మే ॥

**అన్వయక్రమము** :– త్వం రామస్య (సకాశాత్) ఆగతః దూతః యది, తే భద్రమ్ అస్తు; (రామకథాం) పృచ్ఛామి, హి, మే రామకథా ప్రియా.

**ప్రతిపదార్థము** :– త్వం = నీవు, రామస్య (సకాశాత్) = రాముని కడనుండి, ఆగతః = వచ్చినట్టి, దూతః యది = దూతవైన యెడల, తే = నీకు, భద్రమ్ అస్తు = మంగళమగు గాక! (రామకథాం) పృచ్ఛామి = రాముని కథను గూర్చి అడుగుచున్నాను, హి = ఎందుచేతననగా, మే = నాకు, రామకథా = రాముని వృత్తాంతము, ప్రియా = ఇష్టమైనది.

**తాత్పర్యము**:– నీవు శ్రీరామునికడనుండి వచ్చినట్టి దూతవే యైనయెడల, నీకు మంగళ మగుగాక! రాముని గూర్చిన కథను వినగోరుచున్నాను. నాకు రాముని వృత్తాంతము మిక్కిలి ఇష్టము సుమా!

**శ్లో॥ గుణా న్రామస్య కథయ ప్రియస్య మమ వానర ।**
**చిత్తం హరసి మే సౌమ్య నదీకూలం యథా రయః ॥ 19**

**పదచ్ఛేదము** :– గుణాన్ – రామస్య – కథయ – ప్రియస్య – మమ – వానర – చిత్తం – హరసి – మే – సౌమ్య – నదీకూలం – యథా – రయః ॥

**అన్వయక్రమము** :– వానర, మమ ప్రియస్య, రామస్య, గుణాన్ కథయ; సౌమ్య, రయః నదీకూలం యథా, త్వం మే చిత్తం హరసి.

**ప్రతిపదార్థము** :– వానర! = ఓ వానరశ్రేష్ఠుడా! మమ ప్రియస్య = నాకు ప్రియుడైనట్టి, రామస్య = శ్రీరామునియొక్క, గుణాన్ = గుణములను, కథయ = చెప్పుము, సౌమ్య! =ఓ వానరోత్తమా!, రయః = ప్రవాహవేగము, నదీకూలం యథా = ఏటిగట్టునువలె, త్వం = నీవు, మే చిత్తం = నా మనస్సును, హరసి = హరించుచున్నావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:–** దీనివలన భగవద్గుణానుభవమందు అభిలాష గలిగి, భగవద్గుణానుసంధానము చేయుచు, శిష్యునకు భగవద్గుణములు వర్ణించి చెప్పువాడు నిజమైన గురువు అని తెలిసికొనవలెను.

**తాత్పర్యము:–** ఓ వానరశ్రేష్ఠుడా! నా ప్రియుడైనట్టి శ్రీరాముని గుణములను కీర్తింపుము. ప్రవాహవేగము ఏటిగట్టును లోగొనునట్లు నీవు నా మనస్సును దోచుచున్నావు.

**శ్లో॥ అహో స్వప్నస్య సుఖతా యాఽహ మేవం చిరాహృతా ।**
**ప్రేషితం నామ పశ్యామి రాఘవేణ వనౌకసమ్ ॥ 20**

**పదచ్ఛేదము :–** అహో – స్వప్నస్య – సుఖతా – యా – అహమ్ – ఏవం – చిరాహృతా – ప్రేషితం – నామ – పశ్యామి – రాఘవేణ – వనౌకసమ్ ॥

**అన్వయక్రమము :–** చిరాహృతా, యా అహమ్ ఏవం రాఘవేణ ప్రేషితం వనౌకసం పశ్యామి, (తస్యాః మే) స్వప్నస్య సుఖతా అహో.

**ప్రతిపదార్థము :–** చిరాహృతా = చిరకాలము క్రిందట అపహరింపబడినట్టి, యా అహం = ఏ నేను, ఏవం = ఇట్లు, రాఘవేణ ప్రేషితం = శ్రీరామునిచే పంపబడినట్టి, వనౌకసం = వానరుని, పశ్యామి = చూచుచున్నానో, (తస్యాః మే = అట్టి నాకు), స్వప్నస్య = స్వప్నముయొక్క, సుఖతా = సౌఖ్యము, అహో = ఎంత గొప్పదో!

**తాత్పర్యము:–** ఆహా! ఈ స్వప్నము ఎంత సౌఖ్యము కలిగించుచున్నది! ఏనాడో రావణునిచే అపహరింప బడినట్టి నేను నా ప్రియుడు పంపిన దూతను, ఇట్లు నా కన్నులార గాంచగల్గుచున్నాను గదా!

**శ్లో॥ స్వప్నే ఽపి య ద్యహం వీరం రాఘవం సహలక్ష్మణమ్ ।**
**పశ్యేయం నావసీదేయం స్వప్నోఽపి మమ మత్సరీ ॥ 21**

**పదచ్ఛేదము :–** స్వప్నే – అపి – యది – అహం – వీరం – రాఘవం – సహలక్ష్మణమ్ – పశ్యేయం – న – అవసీదేయం – స్వప్నః – అపి – మమ – మత్సరీ ॥

**అన్వయక్రమము :–** స్వప్నే అపి, అహం సహలక్ష్మణం, వీరం రాఘవం పశ్యేయం యది, న అవసీదేయమ్. మమ స్వప్నః అపి మత్సరీ భవతి.

**ప్రతిపదార్థము :–** స్వప్నే అపి = స్వప్నమందైనను, సహలక్ష్మణం = లక్ష్మణునితో

గూడినట్టి, వీరం రాఘవం = వీరుడైన రాముని, అహం పశ్యేయం యది = నేను చూడగల్గినయెడల, న అవసీదేయమ్ = నశింపను. మమ = నాకు, స్వప్నః అపి = కలగూడ, మత్సరీ = మాత్సర్యముగలది, (భవతి = అగుచున్నది).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము:–** వీరం రాఘవం – రాక్షసీమధ్యమున నివసించుచున్నట్టి నా దుఃఖమును, స్వప్నమునందు కనబడినప్పటికిని వీరుడైన రాముడు పరిహరింపగలడని రామపరాక్రమమును సీతమ్మ ఇట్లు తెలుపుచున్నది.

**సహలక్ష్మణం రాఘవం :–** తాను పూర్వము ఇరువురిని కలిసి చూచినట్లుగా, స్వప్నములో గూడ తిరిగి ఇరువురిని కలిసియే చూడగోరుచున్నదని భావము. లేక తాను వారినుంచి వియోగము నొందినపుడు ఆ యన్నదమ్ము లిరువురును గూడ పరస్పరము వియోగము నొందియున్నారు గావున, తిరిగి వారిరువురును కలిసికొన్న దృశ్యము కలలోనైన చూడవలెనని సీతమ్మ కోరుచున్నదని భావము.

**తాత్పర్యము:–** నా స్వప్నమం దైనను తమ్ముడైన లక్ష్మణునితో కలసియున్న మహావీరుడైన శ్రీరాముని నా కన్నులార చూడగలిగిన యెడల నా కష్టములను ఎట్లో ఓర్చి జీవించగలను. కాని నాయెడ స్వప్నము గూడ మాత్సర్యము వహించి యున్నదిగదా. కావుననే కలయైనను వచ్చుటలేదు!

**శ్లో॥ నాహం స్వప్న మిమం మన్యే స్వప్నే దృష్ట్వా హి వానరమ్ ।**
**న శక్యోఽ భ్యుదయః ప్రాప్తుం ప్రాప్త శ్చాభ్యుదయో మమ ॥ 22**

**పదచ్ఛేదము :–** న – అహం – స్వప్నమ్ – ఇమం – మన్యే – స్వప్నే – దృష్ట్వా – హి – వానరమ్, – న – శక్యః – అభ్యుదయః – ప్రాప్తుం – ప్రాప్తః – చ – అభ్యుదయః – మమ ॥

**అన్వయక్రమము :–** అహమ్ ఇమం, స్వప్నం న మన్యే; స్వప్నే వానరం దృష్ట్వా, అభ్యుదయః ప్రాప్తుం నహి శక్యః, మమ అభ్యుదయశ్చ ప్రాప్తః.

**ప్రతిపదార్థము :–** అహం = నేను, ఇమం = దీనిని, స్వప్నం = స్వప్నమునుగా, న మన్యే = తలపోయను; స్వప్నే = స్వప్నమునందు, వానరం దృష్ట్వా = వానరుని జూచి, అభ్యుదయః ప్రాప్తుం = శ్రేయస్సు పొందుటకు, నహి శక్యః = సాధ్యముగాదు గదా, మమ = నాకు, అభ్యుదయః చ = శ్రేయస్సుగూడ, ప్రాప్తః = సిద్ధించినది.

**తాత్పర్యము:–** నేను చూచుచున్న సంఘటనము స్వప్నము అని అనుకొనను. స్వప్నము నందు వానరుడు కనబడినపుడు అభ్యుదయము సిద్ధించుట శక్యము కాదుగదా; నాకిప్పుడు హృదయానందరూపమైన అభ్యుదయమును లభించియున్నదిగదా! అందుచే ఇది స్వప్నముకాదు.

**శ్లో॥ కిన్ను స్యా చ్చిత్తమోహోఽయం భవే ద్వాతగతి స్త్వియమ్ ।**
**ఉన్మాదజో వికారో వా స్యా దయం మృగతృష్ణికా ॥ 23**

**పదచ్ఛేదము :–** కిం – ను – స్యాత్ – చిత్తమోహః – అయం – భవేత్ – వాతగతిః – తు – ఇయమ్; ఉన్మాదజః – వికారః – వా – స్యాత్ – ఇయం – మృగతృష్ణికా ॥

**అన్వయక్రమము :–** అయం చిత్తమోహః కిం ను? వా ఇయం వాతగతిః భవేత్? వా అయం ఉన్మాదజః వికారః స్యాత్? వా (ఇయం) మృగతృష్ణికా భవేత్?

**ప్రతిపదార్థము :–** అయం = ఇది, చిత్తమోహః కిం ను? = మనస్సునందైన మోహమా యేమి; వా = లేక, ఇయం = ఇది, వాతగతిః భవేత్ = వాయులక్షణమై యుండునా, వా = లేక, అయం = ఇది, ఉన్మాదజః వికారః స్యాత్ = ఉన్మాదము వలన జనించిన లక్షణమై యుండునా, వా = లేక, (ఇయం = ఇది) మృగతృష్ణికా భవేత్ = ఎండమావియై యుండునా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** చిత్తమోహః – నిరంతరరామధ్యానమువలన జనించిన – రాముడు పంపిన దూతను జూచుట, అతనితో సంభాషించుట మున్నగు రీతిగా కనబడినట్టి భ్రమ.

వాతగతిః – భూతావేశము మున్నగువానివలన కలిగినట్టి భ్రమ.

ఉన్మాదః – విరహదశలో నున్నవారికి పైత్యోద్రేకమువలన గలిగినట్టి వికార రూపమైన భ్రమ.

మృగతృష్ణికా – ఎండమావులవలె లేనిది ఉన్నట్లు కనిపించుటచే గల్గుభ్రమ.

**గోవిందరాజీయము:–** చిత్తమోహము, ఉన్మాదము ఈ రెండును మనస్స్వాస్థ్యము లేనివానికి జనించు వికారములు. వాతగతి, మృగతృష్ణిక యను ఈ రెండును, ఆరోగ్యవంతునికి గూడ కలుగు భ్రమలు.

**తాత్పర్యము:–** ఇది యంతయు నా మనస్సునందు గల్గుచున్న మోహమై యుండునా?

లేక వాయులక్షణముగా గలిగినట్టి వికారమై యుండునా? లేక నేను ఉన్మాదావస్థలో చిక్కుకొని యుంటినా? లేక ఈ సౌఖ్యము నా కొక ఎండమావియై యుండునా?

**శ్లో॥ అథవా నాయ మున్మాదో మోహో ఽప్యున్మాదలక్షణః ।**
**సంబుధ్యే చాహ మాత్మాన మిమం చాపి వనౌకసమ్ ॥ 24**

**పదచ్ఛేదము** :- అథవా - న - అయమ్ - ఉన్మాదః - మోహః - అపి - ఉన్మాదలక్షణః - సంబుధ్యే - చ - అహమ్ - ఆత్మానమ్ - ఇమం - చ - అపి - వనౌకసమ్ ॥

**అన్వయక్రమము** :- అథవా, అయం ఉన్మాదః న; ఉన్మాదలక్షణః మోహః అపి న; (యతః), అహమ్ ఆత్మానమ్, ఇమం వనౌకసం చ సంబుధ్యే.

**ప్రతిపదార్థము** :- అథవా = లేక, అయం = ఇది, ఉన్మాదః న = ఉన్మాదముగాదు; ఉన్మాదలక్షణః = ఉన్మాదముయొక్క లక్షణమైనట్టి, మోహః అపి = మోహముగూడ, న = కాదు, (యతః = ఎందుచేతననగా) అహం = నేను, ఆత్మానం = నన్ను, ఇమం వనౌకసం చ = ఈ వానరుని కూడ, సంబుధ్యే = చక్కగా గుర్తుపట్టుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము**:- వెనుక చెప్పినట్టి నాలుగు పక్షములును, బుద్ధి వివేకము గోల్పోయినట్టి వారికే సంభవించు నట్టివి. కాని నాకు నా బుద్ధి స్వాధీనములోనే యుండుటచే, మొదటి మూడును అసంభవములు. ఇక మృగతృష్ణికారూప భ్రమ, దూరమునందున్న విషయమును గూర్చియే గలుగును. ఈ వానరుడు నాకు నా ఎట్టఎదుటనే యున్నాడు, కాబట్టి అదియును అసంభవమే. కనుక ఈ విషయమున నాకు వెనుకటి భ్రమలకు తావు లేదని భావము.

**తాత్పర్యము**:- నేను జూచుచున్నట్టి ఇది యంతయు ఉన్మాదము కానేరదు; ఉన్మాదలక్షణమైనట్టి మోహము గూడ కాబోవదు. ఎందుచేతననగా నా బుద్ధి నావశముననే యుండి నన్ను, ఈ వానరుని గూడ నేను ఎట్టి భ్రమకు అవకాశము లేకుండగ చక్కగనే గుర్తించుచున్నాను.

**శ్లో॥ ఇత్యేవం బహుధా సీతా సంప్రధార్య బలాబలమ్ ।**
**రక్షసాం కామరూపత్వా న్మేనే తం రాక్షసాధిపమ్ ॥ 25**

**పదచ్ఛేదము** :- ఇతి - ఏవం - బహుధా - సీతా - సంప్రధార్య - బలాబలమ్,

రక్షసాం - కామరూపత్వాత్ - మేనే - తం - రాక్షసాధిపమ్ ॥

**అన్వయక్రమము :-** సీతా ఇతి ఏవం బలాబలం సంప్రధార్య, రక్షసాం కామరూపత్వాత్ తం రాక్షసాధిపం మేనే.

**ప్రతిపదార్థము :-** సీతా = సీతాదేవి, ఇతి = అని, ఏవం = ఇట్లు, బలాబలం = బలాబలములను, సంప్రధార్య = నిశ్చయించుకొని, రక్షసాం కామరూపత్వాత్ = రాక్షసులు కామరూపులై యుండుటవలన, తం = అతనిని, రాక్షసాధిపం = రావణునిగా, మేనే = తలచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:-** బలాబలం - బలమనగా రాక్షసులయొక్క కామరూపత్వ మనెడు బలము, అబలము అనగా రామదూతయైన వానరుడు సముద్రమును దాటి రాలేక పోవుట అనునది యనియు గ్రహించవలెను.

**గోవిందరాజీయము:-** బలాబలం - రావణునియొక్క బలమువలన తన మోహాదు లనెడు బలహీనతవలనను హనుమన్నను రావణునిగా భావించినదని భావము.

**తాత్పర్యము:-** ఈరీతిగా తన ఆలోచనలయొక్క బలాబలములను నిర్ణయించి రాక్షసులకు కామరూపశక్తి యుండుటచే ఎదుట నున్నట్టి ఆ వానరశ్రేష్ఠుని రావణాసురుడని తలంచెను.

**శ్లో॥ ఏతాం బుద్ధిం తదా కృత్వా సీతా సా తనుమధ్యమా ।**
**న ప్రతివ్యాజహారాథ వానరం జనకాత్మజా ॥ 26**

**పదచ్ఛేదము :-** ఏతాం - బుద్ధిం -తదా - కృత్వా - సీతా - సా - తనుమధ్యమా - న - ప్రతివ్యాజహార - అథ - వానరం - జనకాత్మజా ॥

**అన్వయక్రమము :-** అథ తనుమధ్యమా, జనకాత్మజా సా సీతా తదా ఏతాం బుద్ధిం కృత్వా తం వానరం న ప్రతివ్యాజహార.

**ప్రతిపదార్థము :-** అథ = పిమ్మట, తనుమధ్యమా = సన్నని నడుము గల్గినదియును, జనకాత్మజా = జనకుని పుత్రికయైనదియు నగు, సా సీతా = ఆ సీతాదేవి, తదా = ఆ సమయమున, ఏతాం బుద్ధిం కృత్వా = ఈ నిశ్చయమును చేసికొని, తం వానరం = ఆ వానరునిగూర్చి, న ప్రతివ్యాజహార = జవాబు చెప్పకుండెను.

**తాత్పర్యము:**– అప్పు డా సీతాసాధ్వి ఈ విధమైనట్టి నిశ్చయము గలిగి, ఎదుటనున్నట్టి వానరునితో ఏమియును పలుకక ఊరుకుండెను.

**శ్లో॥ సీతాయాః నిశ్చితం బుద్ధ్వా హనుమా న్మారుతాత్మజః ।**
**శ్రోత్రానుకూలై ర్వచనై స్తదా తాం సంప్రహర్షయన్ ॥ 27**

**పదచ్ఛేదము :**– సీతాయాః – నిశ్చితం – బుద్ధ్వా – హనుమాన్ – మారుతాత్మజః – శ్రోత్రానుకూలైః – వచనైః – తదా – తాం – సంప్రహర్షయన్ ॥

**అన్వయక్రమము :**– మారుతాత్మజః హనుమాన్ సీతాయాః నిశ్చితం బుద్ధ్వా తదా శ్రోత్రానుకూలైః వచనైః తదా తాం సంప్రహర్షయన్.

**ప్రతిపదార్థము :**– మారుతాత్మజః = వాయునందనుడైన, హనుమాన్ = హనుమ, సీతాయాః = సీతయొక్క, నిశ్చితం = నిశ్చయమును, బుద్ధ్వా = తెలిసికొని, తదా = అప్పుడు, శ్రోత్రానుకూలైః = చెవుల కింపయినట్టి, వచనైః = మాటలతో, తాం = ఆ సీతాదేవిని, సంప్రహర్షయన్ = మిక్కిలి సంతోషింపజేయుచు, (అబ్రవీత్ = పలికెను.)

**తాత్పర్యము:**– హనుమంతు డప్పుడు సీతాదేవికి గలిగినట్టి అభిప్రాయమును గ్రహించి వెంటనే ఆమె చెవులకు ఇంపుగ నుండునట్టి వచనములతో రాముని కీర్తించుచు ఆమె మనస్సునకు మిక్కిలి ఆనందకరముగా ఇట్లు పలుకదొడగెను.

**శ్లో॥ ఆదిత్య ఇవ తేజస్వీ లోకకాంత శ్శశీ యథా ।**
**రాజా సర్వస్య లోకస్య దేవో వైశ్రవణో యథా ॥ 28**

**శ్లో॥ విక్రమే ణోపపన్న శ్చ యథా విష్ణు ర్మహాయశాః ।**
**సత్యవాదీ మధురవాగ్దేవో వాచస్పతి ర్యథా ॥ 29**

**శ్లో॥ రూపవాన్ సుభగః శ్రీమాన్ కందర్ప ఇవ మూర్తిమాన్ ।**
**స్థానక్రోధే ప్రహర్తా చ శ్రేష్ఠో లోకే మహారథః ॥ 30**

**శ్లో॥ బాహుచ్ఛాయా మవష్టబ్ధో యస్య లోకో మహాత్మనః ॥ 31**

**పదచ్ఛేదము :**– ఆదిత్యః – ఇవ – తేజస్వీ – లోకకాంతః – శశీ – యథా – రాజా – సర్వస్య – లోకస్య – దేవః – వాచస్పతిః – యథా – విక్రమేణ – ఉపపన్నః – చ – యథా – విష్ణుః – మహాయశాః – సత్యవాదీ – మధురవాక్ – దేవః – వైశ్రవణః – యథా, – రూపవాన్ – సుభగః – శ్రీమాన్ – కందర్పః – ఇవ –

మూర్తిమాన్ - స్థానక్రోధే - ప్రహర్తా - చ - శ్రేష్ఠః - లోకే - మహారథః - బాహుచ్ఛాయామ్ - అవష్టబ్ధః - యస్య - లోకః - మహాత్మనః ॥

**అన్వయక్రమము :-** లోకః మహాత్మనః యస్య బాహుచ్ఛాయాం అవష్టబ్ధః, (సః రామః) ఆదిత్యః ఇవ, తేజస్వీ; శశీ యథా లోకకాంతః; వైశ్రవణః దేవః యథా సర్వస్య లోకస్య రాజా; విష్ణుః యథా మహాయశాః విక్రమేణ ఉపపన్నః చ, వాచస్పతిః దేవః యథా సత్యవాదీ మధురవాక్; మూర్తిమాన్ కందర్పః ఇవ శ్రీమాన్, రూపవాన్, సుభగః, స్థానక్రోధే ప్రహర్తా చ, లోకే శ్రేష్ఠః మహారథః చ (ఆస్తే).

**ప్రతిపదార్థము :-** లోకః = ఈ జగత్తు, మహాత్మనః = మహనీయుడైన, యస్య = ఏ పరమపురుషునియొక్క, బాహుచ్ఛాయాం = భుజముల నీడను, అవష్టబ్ధః = నిలచియున్నదో, (సః రామః = ఆ శ్రీరామచంద్రుడు) ఆదిత్యః ఇవ = భాస్కరునివలె, తేజస్వీ = తేజశ్శాలి; శశీ యథా = చంద్రునివలె, లోకకాంతః = జగత్తున కాహ్లాద కరమైనవాడు; వైశ్రవణః దేవః యథా = కుబేరుని వలె, సర్వస్య లోకస్య = సర్వలోకమునకును, రాజా = రాజు; విష్ణుః యథా = మహావిష్ణువువలె, మహాయశాః = అమితమైన యశస్సుగలవాడును, విక్రమేణ ఉపపన్నః చ = అమితపరాక్రమముతో కూడినట్టివాడును; దేవః వాచస్పతిః యథా = పూజ్యుడైనట్టి బృహస్పతివలె, సత్యవాదీ = సత్యవచనుడును, మధురవాక్ = మధురమైనట్టి వాక్కుగలవాడును; మూర్తిమాన్ కందర్పః ఇవ = శరీరముతో ప్రకాశించు మన్మథుడువలె, శ్రీమాన్ = గొప్పశోభతో నొప్పువాడును, రూపవాన్ = రమ్యమైన రూపముతో ప్రకాశించువాడును, సుభగః = లావణ్యముతో నొప్పువాడును; స్థానక్రోధే = ఆవశ్యకమైన క్రోధసమయమునందు, ప్రహర్తా చ = (శత్రువులను) రూపుమాపువాడును, లోకే = జగత్తునందు, శ్రేష్ఠః =సర్వశ్రేష్ఠుడైన, మహారథః = మహావీరుడునుగా, ఆస్తే = వెలయుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:-** సర్వస్య లోకస్య రాజా - ధనధాన్యాదిప్రదానముచేత సర్వలోకమునకును రంజకుడు. (కుబేరుడు అట్టివాడు).

**గోవిందరాజీయము:-** సర్వస్య లోకస్య రాజా - కుబేరునకు సర్వలోకరాజత్వము శ్రుతిసమ్మతము. "రాజాధిరాజాయ ప్రసహ్యా సాహినే, నమో వయం వైశ్రవణాయ కుర్మహే".

**తాత్పర్యము:-** ఈ లోకమంతయును ఏ మహాత్ముని బాహుచ్ఛాయయందు విశ్రమించి సుఖించుచున్నదో అట్టి శ్రీరామచంద్రుడు సూర్యునివలె తీవ్రమైన తేజస్సు గలవాడు.

చంద్రునివలె లోకప్రియమైన చల్లని కాంతిగలవాడు; కుబేరునివలె లోకు లెల్లరియొక్క కోర్కెలను దీర్చి రంజింపచేయు నట్టివాడు; శ్రీమహావిష్ణువు వలె సాటిలేని కీర్తితోను, అమితమైన విక్రమముతోను వెలయునట్టివాడు; బృహస్పతివలె సత్యమైన మధురమైన వాక్కులతో వెలయువాడు, శరీరముతో వెలయు మన్మథుని వలె దివ్యమైన శోభతోడను, సౌందర్యముతోడను, లావణ్యముతోడను ఒప్పారునట్టివాడు; కోపింపవలసిన సమయమునందు శత్రువును పరిమార్చగలవాడు; లోకమునందు సర్వాధికుడైన వీరుడు అని కీర్తింపబడుచున్నట్టివాడు సుమా.

**శ్లో॥ అపక్రమ్యాఽఽశ్రమపదా న్మృగరూపేణ రాఘవమ్ ।**
**శూన్యే యే నాపనీతాఽసి తస్య ద్రక్ష్యసి తత్ఫలమ్ ॥ 32**

**పదచ్ఛేదము** :– అపక్రమ్య – ఆశ్రమపదాత్ – మృగరూపేణ – రాఘవమ్, శూన్యే – యేన – అపనీతా – అసి – తస్య – ద్రక్ష్యసి – తత్ఫలమ్ ॥

**అన్వయక్రమము** :– ఆశ్రమపదాత్ మృగరూపేణ రాఘవమ్ అపక్రమ్య యేన శూన్యే అపనీతా అసి, తస్య తత్ఫలం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :– ఆశ్రమపదాత్ = ఆశ్రమస్థానమునుండి, మృగరూపేణ = మాయామృగరూపముతో, రాఘవం = శ్రీరాముని, అపక్రమ్య = దూరముచేసి, శూన్యే = నిర్జనమైనట్టి (స్థితియందు), యేన = ఏ రావణునిచే, అపనీతా అసి = అపహరింపబడి యుంటివో, తస్య = ఆ రావణునకు, తత్ఫలం = దానియొక్క ఫలితమును, ద్రక్ష్యసి = చూడగలవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :– తస్య తత్ ఫలం – ఆ రావణునకు మరణరూపమైనట్టి ఫలితమును అని భావము.

**తాత్పర్యము**:– ఆనాడు ఆశ్రమమునుండి మాయలేడి రూపముతో శ్రీరాముని దూరముచేసి ఒంటరిగనున్న నిన్ను ఏ నీచుడు అపహరించెనో అతడు తన పాపకృత్యమునకు తగు ఫలితము ననుభవించుట కొద్దికాలములోనే చూడగలవు.

**శ్లో॥ అచిరా ద్రావణం సంఖ్యే యో వధిష్యతి వీర్యవాన్ ।**
**క్రోధప్రముక్తై రిషుభి ర్జ్వలద్భిరివ పావకైః ।**
**తే నాహం ప్రేషితో దూత స్త్వత్సకాశ మిహాగతః ॥ 33**

**పదచ్ఛేదము** :- అచిరాత్ - రావణం - సంఖ్యే - యః - వధిష్యతి - వీర్యవాన్ - క్రోధప్రముక్తైః - ఇషుభిః - జ్వలద్భిః - ఇవ - పావకైః - తేన - అహం - ప్రేషితః - దూతః - త్వత్సకాశమ్ - ఇహ - ఆగతః ॥

**అన్వయక్రమము** :- వీర్యవాన్ యః, జ్వలద్భిః పావకైః ఇవ, క్రోధప్రముక్తైః ఇషుభిః అచిరాత్ సంఖ్యే రావణం వధిష్యతి, తేన ప్రేషితః దూతః అహం ఇహ త్వత్సకాశం ఆగతః.

**ప్రతిపదార్థము** :- వీర్యవాన్ యః = వీర్యశాలియైన ఏ మహనీయుడు, జ్వలద్భిః పావకైః ఇవ = ప్రజ్వలించు చున్న అగ్నులవంటి, క్రోధప్రముక్తైః = క్రోధముచే విడువ బడినట్టి, ఇషుభిః = శరములచే, అచిరాత్ = కొద్దికాలములోనే, సంఖ్యే = యుద్ధమునందు, రావణం = రావణాసురుని, వధిష్యతి = సంహరింపగలడో, తేన = ఆ మహనీయునిచే, ప్రేషితః = పంపబడినట్టి, దూతః = దూతనైన, అహం = నేను, ఇహ = ఇచ్చట, త్వత్సకాశం = నీ సన్నిధికి, ఆగతః = వచ్చినవాడను.

**తాత్పర్యము**:- ఏ మహావీరుడు తీవ్రమైన క్రోధముతో ప్రజ్వలించుచున్న అగ్నిశిఖల వంటి బాణములను ప్రయోగించి, కొలదికాలములోనే యుద్ధభూమిలో రావణుని నేల గూల్పనున్నాడో, ఆ మహాత్ముడు శ్రీరాముడు పంపగా నీకడకు నేను దూతగా వచ్చియుంటిని.

**శ్లో॥ త్వద్వియోగేన దుఃఖార్తస్స త్వాం కౌశల మబ్రవీత్ ॥ 34**

**పదచ్ఛేదము** :- త్వద్వియోగేన - దుఃఖార్తః - సః - త్వాం - కౌశలమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- త్వద్వియోగేన దుఃఖార్తః సః త్వాం కౌశలమ్ అబ్రవీత్ ॥

**ప్రతిపదార్థము** :- త్వద్వియోగేన = నీ వియోగముచే, దుఃఖార్తః = శోకపీడితుడై యున్నట్టి, సః = ఆ శ్రీరాముడు, త్వాం = నిన్ను, కౌశలమ్ అబ్రవీత్ = కుశలమడినాడు.

**తాత్పర్యము**:- నీ వియోగమువలన దుఃఖముచే పీడింపబడు ఆ శ్రీరాముడు నా ముఖమున (ద్వారా) నిన్ను క్షేమవార్త నడుగుచున్నాను.

**శ్లో॥ లక్ష్మణ శ్చ మహాతేజా స్సుమిత్రానందవర్ధనః ।**
**అభివాద్య మహాబాహుః స త్వాం కౌశల మబ్రవీత్ ॥ 35**

**పదచ్ఛేదము** :- లక్ష్మణః - చ - మహాతేజాః - సుమిత్రానందవర్ధనః - అభివాద్య - మహాబాహుః - సః - త్వాం - కౌశలమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః, మహాబాహుః, సుమిత్రానందవర్ధనః సః లక్ష్మణశ్చ, త్వామ్ అభివాద్య కౌశలమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః = తేజశ్శాలియును, మహాబాహుః = పరాక్రమ శాలియును, సుమిత్రానందవర్ధనః = సుమిత్రానందనుడును అగు, సః లక్ష్మణశ్చ = ఆ లక్ష్మణుడు గూడ, త్వామ్ అభివాద్య = నీకు వందనముచేసి, కౌశలమ్ అబ్రవీత్ = కుశల మడిగినాడు.

**తాత్పర్యము:–** మహాతేజస్సంపన్నుడును మహాపరాక్రమశాలియును, సుమిత్రప్రియ పుత్రుడు నైన, లక్ష్మణుడు గూడ, అభివాదనము గావించి నిన్ను కుశల వార్త నడుగుచున్నాడు.

**శ్లో॥ రామస్య చ సఖా దేవి సుగ్రీవో నామ వానరః ।**
**రాజా వానరముఖ్యానాం స త్వాం కౌశల మబ్రవీత్ ॥ 36**

**పదచ్ఛేదము :–** రామస్య – చ – సఖా – దేవి – సుగ్రీవః – నామ – వానరః – రాజా – వానరముఖ్యానాం – సః – త్వాం – కౌశలమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** దేవి! రామస్య సఖా, వానరముఖ్యానాం రాజా సః సుగ్రీవో నామ వానరః చ త్వాం కౌశలమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** దేవి! = ఓ పూజ్యురాలా! రామస్య సఖా = శ్రీరామునకు మిత్రుడును, వానరముఖ్యానాం రాజా = వానరశ్రేష్ఠులకు ప్రభువును అగు, సః సుగ్రీవః నామ వానరః చ = ఆ సుగ్రీవుడను వానరోత్తముడు గూడ, త్వాం = నిన్ను, కౌశలమ్ అబ్రవీత్ = క్షేమ మడిగినాడు.

**తాత్పర్యము:–** అమ్మా! శ్రీరామునికి స్నేహితుడును, వానరులకు మహారాజును అగు ఆ సుగ్రీవుడు గూడ నిన్ను క్షేమవార్తను అడుగుచున్నాడు.

**శ్లో॥ నిత్యం స్మరతి రామస్త్వాం ససుగ్రీవ స్సలక్ష్మణః ॥ 37**

**పదచ్ఛేదము :–** నిత్యం – స్మరతి – రామః – త్వాం – ససుగ్రీవః – సలక్ష్మణః ॥

**అన్వయక్రమము :–** ససుగ్రీవః, సలక్ష్మణః రామః నిత్యం త్వాం స్మరతి.

**ప్రతిపదార్థము :–** ససుగ్రీవః = సుగ్రీవునితో గూడినవాడును, సలక్ష్మణః = లక్ష్మణునితో గూడినవాడును అగు, రామః = శ్రీరాముడు, నిత్యం = ఎల్లప్పుడును, త్వాం = నిన్ను, స్మరతి = స్మరించుచున్నాడు.

**తాత్పర్యము:-** సుగ్రీవునితోడను, లక్ష్మణునితోడను, కూడియున్న శ్రీరామచంద్రుడు ఎల్లప్పుడు నిన్నే స్మరించుచున్నాడు సుమా.

**శ్లో॥ దిష్ట్యా జీవసి వైదేహి రాక్షసీవశ మాగతా ।**
**న చిరా ద్ద్రక్ష్యసే రామం లక్ష్మణం చ మహారథమ్ ।**
**మధ్యే వానరకోటీనాం సుగ్రీవం చామితౌజసమ్ ॥ 38**

**పదచ్ఛేదము :-** దిష్ట్యా - జీవసి - వైదేహి - రాక్షసీవశమ్ - ఆగతా - న - చిరాత్ - ద్రక్ష్యసే - రామం - లక్ష్మణం - చ - మహారథమ్, - మధ్యే - వానరకోటీనాం - సుగ్రీవం - చ - అమితౌజసమ్ ॥

**అన్వయక్రమము :-** వైదేహి! రాక్షసీవశమ్ ఆగతా, (త్వం) దిష్ట్యా జీవసి; వానరకోటీనాం మధ్యే అమితౌజసం సుగ్రీవం, మహారథం లక్ష్మణం, రామం చ నచిరాత్ ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము :-** వైదేహి = ఓ సీతాదేవీ! రాక్షసీవశమ్ ఆగతా = రాక్షసులకు చేజిక్కినట్టి, (త్వం = నీవు), దిష్ట్యా = అదృష్టవశముచే, జీవసి = జీవించియున్నావు, నచిరాత్ = త్వరలోనే, మహారథం రామం = మహావీరుడైన శ్రీరాముని, లక్ష్మణం చ = లక్ష్మణుని, వానరకోటీనాం మధ్యే = వానరకోటుల నడుమ, అమితౌజసం = అపారమైన ప్రతాపముగల, సుగ్రీవం చ = సుగ్రీవుని కూడ, ద్రక్ష్యసే = కనుగొనగలవు.

**తాత్పర్యము:-** తల్లీ, ఈ రాక్షసస్త్రీలకు జిక్కి నీవు మా అదృష్టవశముననే ప్రాణములతో నున్నావు. ఇక మిక్కిలి త్వరలోనే మహావీరులైన రామలక్ష్మణు లిరువురిని, అపార వానరసైన్యమధ్యమున తేజరిల్లు శౌర్యశాలి సుగ్రీవుని కన్నులార చూడగలవు.

**శ్లో॥ అహం సుగ్రీవసచివః హనుమా న్నామ వానరః ।**
**ప్రవిష్టో నగరీం లంకాం లంఘయిత్వా మహోదధిమ్ ॥ 39**

**శ్లో॥ కృత్వా మూర్ధ్ని పదన్యాసం రావణస్య దురాత్మనః ।**
**త్వాం ద్రష్టు ముపయాతోఽహం సమాశ్రిత్య పరాక్రమమ్ ॥ 40**

**పదచ్ఛేదము :-** అహం - సుగ్రీవసచివః - హనుమాన్ - నామ - వానరః - ప్రవిష్టః - నగరీం - లంకాం - లంఘయిత్వా - మహోదధిమ్, కృత్వా - మూర్ధ్ని - పదన్యాసం - రావణస్య - దురాత్మనః - త్వాం - ద్రష్టుమ్ - ఉపయాతః - అహం - సమాశ్రిత్య - పరాక్రమమ్ ॥

**అన్వయక్రమము** :- అహం, సుగ్రీవసచివః హనుమాన్నామ వానరః మహోదధిం లంఘయిత్వా, లంకానగరీం, ప్రవిష్టః (సన్), దురాత్మనః రావణస్య మూర్ధ్ని పదన్యాసం కృత్వా పరాక్రమం సమాశ్రిత్య అహం త్వాం ద్రష్టుమ్ ఉపయాతః అస్మి.

**ప్రతిపదార్థము** :- సుగ్రీవసచివః = సుగ్రీవుని మంత్రిని, హనుమాన్నామ వానరః = హనుమంతుడను పేరుగల వానరుడనైన, అహం = నేను, మహోదధిం = మహాసముద్రమును, లంఘయిత్వా = దాటి, లంకానగరీం = లంకానగరమును, ప్రవిష్టః (సన్) = ప్రవేశించినవాడనై, పరాక్రమం సమాశ్రిత్య = పరాక్రమమును బూని, దురాత్మనః = దుర్మార్గుడైనట్టి, రావణస్య = రావణునియొక్క, మూర్ధ్ని = తలపై, పదన్యాసం కృత్వా = పాదమును మోపి, త్వాం ద్రష్టుం = నిన్ను కనుగొనుటకై, అహం = నేను, ఉపయాతః అస్మి = వచ్చియున్నాను.

**తాత్పర్యము**:- సుగ్రీవుని మంత్రియగు హనుమంతుడనని పిలువబడు నేను, మహాసముద్రమును లంఘించి, లంకానగరమును జొచ్చి నా పరాక్రమమును ప్రదర్శించి, దుర్మార్గుడైన రావణుని శిరముపై నా వామపాదమును మోపి నిన్ను తిలకించుటకై వచ్చినవాడను సుమా!

**శ్లో॥ నాహ మస్మి తథా దేవి యథా మా మవగచ్ఛసి ।**
**విశంకా త్యజ్యతా మేషా శ్రద్ధత్స్వ వదతో మమ ॥ 41**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రావణశంకానివారణం" నామ*
*చతుస్త్రింశస్సర్గః*

**పదచ్ఛేదము** :- న - అహం - తథా - దేవి - యథా - మామ్ - అవగచ్ఛసి - విశంకా - త్యజ్యతామ్ - ఏషా - శ్రద్ధత్స్వ - వదతః - మమ ॥

**అన్వయక్రమము** :- దేవి! (త్వం) యథా మామ్ అవగచ్ఛసి, అహం తథా న అస్మి; ఏషా విశంకా త్యజ్యతామ్; వదతః మమ శ్రద్ధత్స్వ.

**ప్రతిపదార్థము** :- దేవి! = ఓ పూజ్యురాలా; (త్వం = నీవు) యథా = ఏరీతిగా, మాం అవగచ్ఛసి = నన్ను తలచుచున్నావో, అహం = నేను, తథా = ఆ రీతిగా, న అస్మి = కాను (సుమా), ఏషా విశంకా = ఈ యనుమానము, త్యజ్యతాం = విడువబడుగాక! వదతః మమ శ్రద్ధత్స్వ = (నీతో) మాటాడుతున్న నన్ను నమ్ముము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి:-** సీతమ్మ హనుమంతుని పరీక్షించుచున్నది. అట్లే గురువును శిష్యుడుగా నుండగోరువాడు పరీక్షించవలెను. రామచంద్రమూర్తియొద్దకు, మారువేషముతో పోవుటకు సాహసించిన హనుమంతుడు, సీతాదేవియొద్ద కట్లు పోవుట నిప్పుతో నాడుకొనుట వంటిదని తలచెను.

**తాత్పర్యము:-** తల్లీ, నన్ను మాయావియైన రావణుడని భ్రమించుచున్నావు. కాని నేను అట్టివాడనుగాను సుమా! నీ మనస్సునందున్న వ్యర్థమైన ఆశంకను విడిచిపెట్టుము. నీకు సత్యమును తెలుపగోరుచు చెప్పుచున్న నా మాటలను విశ్వసింపుము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రావణశంకానివారణము" అను*
*ముప్పదినాల్గవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచత్రింశసర్గ

**శ్లో॥ తాం తు రామకథాం శ్రుత్వా వైదేహీ వానరర్షభాత్ ।**
**ఉవాచ వచనం సాంత్వ మిదం మధురయా గిరా ॥ 1**

**పదచ్ఛేదము :–** తాం – తు – రామకథాం – శ్రుత్వా – వైదేహీ – వానరర్షభాత్ – ఉవాచ – వచనం – సాంత్వమ్ – ఇదం – మధురయా – గిరా ॥

**అన్వయక్రమము :–** వైదేహీ వానరర్షభాత్ తాం రామకథాం శ్రుత్వా మధురయా గిరా ఇదం సాంత్వం వచనమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** వైదేహీ = జానకీదేవి, వానరర్షభాత్ = వానరశ్రేష్ఠుడైన హనుమంతుని నుండి; తాం రామకథాం = ఆ శ్రీరాముని చరితమును, శ్రుత్వా = విని, మధురయా గిరా = తీయని మాటతో, ఇదం సాంత్వం వచనం = ఈ సౌమ్యమైన మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** సీతాదేవి హనుమంతుడు వినిపించిన ఆ శ్రీరాముని వృత్తాంతమును సంతోషముతో విని, మధురమైన వచనములతో సౌమ్యముగా హనుమంతుని చూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ క్వ తే రామేణ సంసర్గః కథం జానాసి లక్ష్మణమ్ ।**
**వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః ॥ 2**

**పదచ్ఛేదము :–** క్వ – తే – రామేణ – సంసర్గః – కథం – జానాసి – లక్ష్మణం – వానరాణాం – నరాణాం – చ – కథమ్ – ఆసీత్ – సమాగమః ॥

**అన్వయక్రమము :–** తే రామేణ సంసర్గః క్వ? (త్వం) లక్ష్మణం కథం జానాసి? వానరాణాం నరాణాం చ సమాగమః కథమ్ ఆసీత్?

**ప్రతిపదార్థము :–** తే = నీకు, రామేణ = శ్రీరామునితో, సంసర్గః = కలయిక, క్వ = ఎచ్చట ? (త్వం = నీవు) లక్ష్మణం = లక్ష్మణుని, కథం = ఎట్లు, జానాసి = ఎఱుగుదువు? వానరాణాం = వానరులకును, నరాణాం చ = నరులకును, సమాగమః

= సమావేశము, కథం ఆసీత్ = ఎట్లు ఆయెను ?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తనిశ్లోకీ** :- గురుకులవాసయోగ్యత లేనట్టి వానరులకును, వసిష్ఠశిష్యులైన రామలక్ష్మణులకును కలయిక ఎట్లు సంభవించెను? వానరులు శాస్త్రశిక్షాదూరులు గావున నాగరికులతో వారికి సంపర్కము అసంభవమై యుండును గదా యని సీతమ్మ భావము.

**తాత్పర్యము** :- నీకు శ్రీరామునితో పరిచయము ఎచ్చట లభించినది? నీవు లక్ష్మణుని ఎట్లు ఎఱుగుదువు? వానరులును ఈ సోదరులును కలసి మాటాడుకొనుట ఎట్లు సంభవమయినది?

**శ్లో॥ యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ వానర ।**
**తాని భూయ స్సమాచక్ష్వ న మాం శోక స్సమావిశేత్ ॥ 3**

**పదచ్ఛేదము** :- యాని - రామస్య - చిహ్నాని - లక్ష్మణస్య - చ - వానర, తాని - భూయః - సమాచక్ష్వ - న - మాం - శోకః - సమావిశేత్ ॥

**అన్వయక్రమము** :- వానర! రామస్య లక్ష్మణస్య చ యాని చిహ్నాని (సంతి) భూయః తాని సమాచక్ష్వ; మాం శోకః న సమావిశేత్.

**ప్రతిపదార్థము** :- వానర! = ఓ వానరోత్తమా! రామస్య = శ్రీరామునియొక్కయు, లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్కయు, యాని చిహ్నాని = ఏగుర్తులయితే, (సంతి = ఉన్నవో) తాని = ఆ గుర్తులను, భూయః = తిరిగి, సమాచక్ష్వ = బాగుగ చెప్పుము, మాం = నన్ను, శోకః = దుఃఖము, న సమావిశేత్ = చేరకుండుగాక.

**తాత్పర్యము** :- ఓ కపిసత్తమా! శ్రీరామునియొక్కయు లక్ష్మణునియొక్కయు రూపములందు గుర్తులెట్టివై యున్నవో వానిని నాకు మఱల వివరముగ తెలుపుము. నేను వానిని వినుచు నా శోకమును పోగొట్టుకొందును.

**శ్లో॥ కీదృశం తస్య సంస్థానం రూపం తస్య చ కీదృశమ్ ।**
**కథ మూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే ॥ 4**

**పదచ్ఛేదము** :- కీదృశం - తస్య - సంస్థానం - రూపం - తస్య - చ - కీదృశమ్, కథమ్ - ఊరూ - కథం - బాహూ - లక్ష్మణస్య - చ - శంస - మే ॥

**అన్వయక్రమము** :- తస్య సంస్థానం కీదృశమ్ ? తస్య రూపం కీదృశమ్? ఊరూ

కథమ్? బాహూ కథమ్? లక్ష్మణస్య చ (సంస్థానం రూపం చ కీదృశమ్?) మే శంస.

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ శ్రీరామునియొక్క, సంస్థానం = అవయవ సన్నివేశము, కీదృశమ్ = ఎట్టిది? తస్య = అతనియొక్క, రూపం చ = ఆకారమును, కీదృశమ్ = ఎట్టిది? ఊరూ కథమ్ = ఊరుద్వయ మెట్లుండును? బాహూ కథం = భుజద్వయ మెట్లుండును? లక్ష్మణస్య చ = లక్ష్మణునికిగూడ (సంస్థానం రూపం చ = అవయవస్థితియు ఆకారమును, కీదృశమ్ = ఎట్టిది?) మే శంస = నాకు చెప్పుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** సీతాదేవి ప్రశ్న విషమప్రశ్న. అందు రెండు భాగములు ఉన్నవి. బాహువులు బహిరంగము లెవరైనను చూడవచ్చును. తొడ లెట్టివని యడిగెను. అనగా మర్మాంగము లెట్టివని ప్రశ్న. ఇవి వస్త్రము మఱుగున నుండునవి. వీనిని ఈతడెట్లు తెలిసికొనును? తెలిసికొనెబో! స్త్రీయైన తనతో వానినెట్లు చెప్పును? ఔచిత్యమెఱుగునా యెఱుగడా? రాముని దూతయే యైన పక్షమునందు ఈత డౌచిత్య మెఱుగక మాట్లాడడు. అని సీతాదేవి తలంచి ఈప్రశ్న వేసెను.

దీనివలన ఆచార్యుడు భగవత్తత్త్వము నామూలాగ్రము సరహస్యముగ తెలిసినవాడై యుండవలెను. దాని నెవరి కెట్లు చెప్పవలయునో యదియును తెలిసినవాడై యుండవలయునని భావము.

**తాత్పర్యము :–** శ్రీరాముని అవయవసన్నివేశ మెట్టిది? ఆతని వర్ణము మున్నగు ఆకారవిశేష మెట్టిది? అతని ఊరువు లెట్టివి? భుజము లెట్టివి? మఱియు లక్ష్మణుని అవయవవిశేషమును ఆకారవిశేషమును ఎట్టివో నాకు తెలియజెప్పుము.

**శ్లో॥ ఏవ ముక్తస్తు వైదేహ్యా హనుమా న్మారుతాత్మజః ।**
**తతో రామం యథాతత్త్వ మాఖ్యాతు ముపచక్రమే ॥ 5**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తః – వైదేహ్యా – హనుమాన్ – మారుతాత్మజః – తతః – రామం – యథాతత్త్వమ్ – ఆఖ్యాతుమ్ – ఉపచక్రమే ॥

**అన్వయక్రమము :–** వైదేహ్యా ఏవమ్ ఉక్తః మారుతాత్మజః హనుమాన్ తతః రామం యథాతత్త్వమ్ ఆఖ్యాతుమ్ ఉపచక్రమే.

**ప్రతిపదార్థము :–** వైదేహ్యా = సీతాదేవిచే, ఏవమ్ ఉక్తః = ఈరీతిగా అడుగబడినవాడై, మారుతాత్మజః = వాయునందనుడగు, హనుమాన్ = హనుమంతుడు, తతః =

అటు పిమ్మట, రామం = శ్రీరాముని గూర్చి, యథాతత్త్వం = ఉన్నది యున్నట్లుగా, ఆఖ్యాతుమ్ = పేర్కొనుటకు, ఉపచక్రమే = మొదలుపెట్టెను.

**తాత్పర్యము** :– సీతాదేవి తనను ఈరీతిగా అడుగగా వాయునందనుడైన హనుమ అప్పుడు శ్రీరాముని యొక్క యథార్థమైన రూపమును వివరించుచు ఇట్లు చెప్పనారంభించెను.

**శ్లో॥ జానంతీ బత దిష్ట్యా మాం వైదేహి పరిపృచ్ఛసి ।**
**భర్తుః కమలపత్రాక్షి సంస్థానం లక్ష్మణస్య చ ॥ 6**

**పదచ్ఛేదము** :– జానంతీ – బత – దిష్ట్యా – మాం – వైదేహి – పరిపృచ్ఛసి, భర్తుః – కమలపత్రాక్షి – సంస్థానం – లక్ష్మణస్య – చ ॥

**అన్వయక్రమము** :– కమలపత్రాక్షి! వైదేహి! భర్తుః, లక్ష్మణస్య చ సంస్థానం జానంతీ (అపి) దిష్ట్యా మాం పరిపృచ్ఛసి.

**ప్రతిపదార్థము** :– కమలపత్రాక్షి = పద్మపత్రములవంటి నేత్రములు గలదానవైన, వైదేహి = ఓ జానకీ! భర్తుః = భర్తయొక్కయు, లక్ష్మణస్య చ = లక్ష్మణుని యొక్కయు, సంస్థానం = అవయవముల పొందికను, జానంతీ (అపి) = తెలిసినదానవైనను, దిష్ట్యా = భాగ్యవశమున, మాం = నన్ను, పరిపృచ్ఛసి = వివరముగ అడుగుచున్నావు, బత = ఆహా! (నా యదృష్టము!).

**తాత్పర్యము** :– ఓ జానకీ! నీ భర్తయొక్కయు లక్ష్మణునియొక్కయు రూపరేఖాదులను చక్కగా ఎఱిగియున్నదానవైనను నా భాగ్యవశమున నాచే చెప్పించుటకై నన్నడుగు చున్నావు గదా! ఆహా! ఏమి నా యదృష్టము.

**శ్లో॥ యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ యాని వై ।**
**లక్షితాని విశాలాక్షి వదతః శృణు తాని మే ॥ 7**

**పదచ్ఛేదము** :– యాని – రామస్య – చిహ్నాని – లక్ష్మణస్య – చ – యాని – వై, లక్షితాని – విశాలాక్షి – వదతః – శృణు – తాని – మే ॥

**అన్వయక్రమము** :– విశాలాక్షి! రామస్య యాని చిహ్నాని లక్షితాని, (తథా) లక్ష్మణస్య చ (యాని చిహ్నాని లక్షితాని) తాని వదతః మే (వచః) శృణు.

**ప్రతిపదార్థము** :– విశాలాక్షి! = విశాలమైన కన్నులుగలదానా! రామస్య = రాముని యొక్క, యాని చిహ్నాని = ఏ చిహ్నములయితే, లక్షితాని = గుర్తింపబడినవో, (తథా

= అట్లే) లక్ష్మణస్య చ = లక్ష్మణునియొక్కయు, యాని(చిహ్నాని) = ఏ (చిహ్నములయితే) లక్షితాని = కనుగొనబడినవో, తాని = ఆ చిహ్నములనుగూర్చి, వదతః = పేర్కొను చున్నట్టి, మే = నాయొక్క, (వచః = మాటను) శృణు = ఆలకింపుము.

**తాత్పర్యము :–** జానకీ! రాముని ఆకార విశేషములను నేనేమి గుర్తించితినో, లక్ష్మణుని రూపవిశేషములను నేనేమి చూచితినో వానిని నీకు తెలుపుచున్నాను, ఆలకింపుము.

**శ్లో॥ రామః కమలపత్రాక్షః పూర్ణచంద్రనిభాననః ।**
**రూపదాక్షిణ్యసంపన్నః ప్రసూతో జనకాత్మజే ॥ 8**

**పదచ్ఛేదము :–** రామః – కమలపత్రాక్షః – పూర్ణచంద్రనిభాననః – రూపదాక్షిణ్య సంపన్నః – ప్రసూతః – జనకాత్మజే ॥

**అన్వయక్రమము :–** జనకాత్మజే! రామః కమలపత్రాక్షః, పూర్ణచంద్రనిభాననః రూపదాక్షిణ్యసంపన్నః, ప్రసూతః.

**ప్రతిపదార్థము :–** జనకాత్మజే! = ఓ జానకీ! రామః = శ్రీరాముడు, కమలపత్రాక్షః = పద్మపత్రములవంటి నేత్రములు గలవాడుగను, పూర్ణచంద్రనిభాననః = నిండుచంద్రునితో సమానమైన ముఖము గలవాడుగను, రూపదాక్షిణ్యసంపన్నః = సౌందర్యముతోడను, దయాగుణముతోడను నిండియున్నట్టివాడుగను, ప్రసూతః = జన్మించినట్టివాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'పూర్ణచంద్రనిభాననః' అనుటకు బదులుగా 'సర్వసత్త్వ మనోహరః' అని ఒక పాఠము. అనగా సర్వప్రాణిమనోహరుడు.

తిర్యగ్జాతివాడనై చెట్టుకొమ్మలమధ్య తిరుగుచుండు నా మనస్సును గూడ నపహరించినవాడు. అనగా సామాన్యుల దృష్టినిగూడ నాకర్షించు సౌందర్యము గలవాడని భావము. రూపదాక్షిణ్యసంపన్నః – రూపమనుటచే సర్వవిధశరీర సౌందర్యముతో నిండినవాడనియు, దాక్షిణ్యమనుటచే సర్వవిధములైన ఆత్మగుణములతో నిండినవాడనియు భావము. సంపన్నః ప్రసూతః – రాముని గుణములన్నియు జన్మతః ప్రాప్తించినవేగాని తెచ్చిపెట్టుకొన్నవి గావని భావము.

**వాసుదాసస్వామి :–** కమలపత్రాక్షః – తామర ఱేకులవలె వెడల్పగు కన్నులు గలవాడు. శ్రీరాముడు సహజసుందరుడు. ఆయనయం దీ కన్ను లభిరామములై యున్నవి. ఆ "పుంసాం మోహనరూపుని" యొక్క సౌందర్యరసప్రవాహమున, ఈ కన్నులు దూరము

నుండి చూచువారిని సమీపమునకు ఆకర్షించును. సమీపమునకు రాగానే వారి మనస్సులను తమయందే లగ్నము చేసికొనును. రూపదాక్షిణ్యసంపన్నః – రూపము చేతను దాక్షిణ్యముచేతను పరిపూర్ణముగ నిండినవాడై పుట్టెను. అనగా ఆయనకళ్యాణ గుణము లాయనతోడనే పుట్టినవి, కాని నడుమ వచ్చినవి గావు. ఇది "పూర్ణమదః పూర్ణమిద"మ్మను శ్రుత్యర్థమును బోధించుచున్నది. అనగా పరత్వదశయం దే షాడ్గుణ్య పరిపూర్తి గలదో అవతారదశయందును నా యారు గుణములును గలవని భావము.

**తాత్పర్యము** :– ఓ సీతాదేవీ! శ్రీరాముడు పద్మపత్రములను బోలిన విశాలమైన నేత్రములు గలవాడు, నిండు చంద్రుని బోలిన ముఖము గలవాడు, ఇట్టి దేహ సౌందర్యము గలిగి గొప్ప దయాగుణముతో నిండియున్న హృదయము గలవాడుగా జన్మించినట్టి మహాపురుషుడు సుమా!

**శ్లో॥ తేజసాఽఽదిత్యసంకాశః క్షమయా పృథివీసమః ।**
**బృహస్పతిసమో బుద్ధ్యా యశసా వాసవోపమః ॥ 9**

**పదచ్ఛేదము** :– తేజసా – ఆదిత్యసంకాశః – క్షమయా – పృథివీసమః – బృహస్పతిసమః – బుద్ధ్యా – యశసా – వాసవోపమః ॥

**అన్వయక్రమము** :– (సః) తేజసా ఆదిత్యసంకాశః, క్షమయా పృథివీసమః, బుద్ధ్యా బృహస్పతిసమః, యశసా వాసవోపమః.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ శ్రీరాముడు) తేజసా = తేజస్సుచే, ఆదిత్యసంకాశః = సూర్యునితో సమానుడు, క్షమయా = ఓర్పుచే, పృథివీసమః = భూమితో సమానుడు, బుద్ధ్యా = బుద్ధిచే, బృహస్పతిసమః = బృహస్పతితో సమానుడు, యశసా = కీర్తిచే, వాసవోపమః = ఇంద్రునితో సమానుడు.

**తాత్పర్యము** :– ఆ శ్రీరాముడు తేజోవిశేషముచేత సూర్యుని బోలినట్టివాడు, సహనగుణమున భూదేవితో సమానుడు, బుద్ధివిశేషమున బృహస్పతికి సాటి వచ్చువాడు, యశస్సునందు దేవేంద్రునితో సమానుడు.

**శ్లో॥ రక్షితా జీవలోకస్య స్వజనస్య చ రక్షితా ।**
**రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్య చ పరంతపః ॥ 10**

**పదచ్ఛేదము** :– రక్షితా – జీవలోకస్య – స్వజనస్య – చ – రక్షితా – రక్షితా – స్వస్య – వృత్తస్య – ధర్మస్య – చ – పరంతపః ॥

**అన్వయక్రమము** :– పరంతపః (సః) జీవలోకస్య రక్షితా, స్వజనస్య చ రక్షితా, స్వస్య

వృత్తస్య ధర్మస్య చ రక్షితా.

**ప్రతిపదార్థము** :– పరంతపః = శత్రువులను తపింపజేయునట్టి, (సః = ఆ శ్రీరాముడు) జీవలోకస్య = ప్రాణిలోకమునకు, రక్షితా = రక్షకుడు, స్వజనస్య చ = తనవారికి, రక్షితా = రక్షకుడు, స్వస్య వృత్తస్య = తన నడవడికిని, ధర్మస్య చ = ధర్మమునకును, రక్షితా = రక్షకుడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– శ్రీరామచంద్రుడు మనుష్యులను హితమార్గమునందు ప్రవర్తింప చేయుటకై లోకసంగ్రహార్థము ధర్మరక్షణము, ధర్మానుష్ఠానమునుకూడ చేయుచున్నాడు. ఇట్లు రామచంద్రునం దుపదేశ పాండిత్యమేగాక అనుష్ఠానసామర్థ్యము కూడ చెప్పబడినది.

**తాత్పర్యము** :– శత్రుభయంకరుడైన శ్రీరాముడు సమస్తజీవలోకమును రక్షించునట్టి వాడు, తనవారి నెల్లరను కాపాడునట్టివాడు. తన చరిత్రమును కాపాడుకొనుచు ఇతరుల ధర్మమును కూడ జాగ్రత్తగా రక్షించునట్టివాడు.

**శ్లో॥ రామో భామిని లోకస్య చాతుర్వర్ణ్యస్య రక్షితా ।**
**మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా చ సః ॥ 11**

**పదచ్ఛేదము** :– రామః – భామిని – లోకస్య – చాతుర్వర్ణ్యస్య – రక్షితా – మర్యాదానాం – చ – లోకస్య – కర్తా – కారయితా – చ – సః ।

**అన్వయక్రమము** :– భామిని! రామః చాతుర్వర్ణ్యస్య లోకస్య రక్షితా; సః లోకస్య మర్యాదానాం కర్తా చ కారయితా చ.

**ప్రతిపదార్థము** :– భామిని! = వనితారత్నమా! రామః = శ్రీరాముడు, చాతుర్వర్ణ్యస్య = నాల్గువర్ణములు కలిగియున్నట్టి, లోకస్య = లోకమునకు, రక్షితా = రక్షకుడు. సః = ఆతడు, లోకస్య = లోకముయొక్క, మర్యాదానాం = కట్టుబాటులకు, కర్తా = కూర్చువాడును, కారయితా చ = ఆచరింపచేయువాడును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'లోకస్య కర్తా' – అనుటచే హర్తయు భర్తయు గూడ నని పూరించుకొన వలెను. ఇట్లు చెప్పుటచే శ్రీరాముడు సృష్టిస్థితిసంహారకారకుడైన పరబ్రహ్మ యని, గూఢముగ సూచింపబడినది. ఇట్లు హనుమ పలుకుట ఆ క్షణమున హనుమంతునిలోని

మాయాంశమును తొలగించి జ్ఞానమును ప్రకాశింపచేయుటచే గలిగినది. 'మర్యాదానాం కర్తా కారయితా' – తన అవతారప్రయోజనముగా, ధర్మరక్షణము తన కర్తవ్యమని ఇట్లు తెలుపబడినది.

**తాత్పర్యము** :– తల్లీ! శ్రీరాముడు చాతుర్వర్ణ్యసంయుతమైన ఈ లోకమును రక్షించువాడు. లోకమునందలి ధర్మవ్యవస్థను కాపాడుచు ఆ ధర్మమును తాను ఆచరించువాడును పరులచే ఆచరింపచేయునట్టివాడును సుమా!

**శ్లో॥ అర్చిష్మా నర్చితో ఒత్యర్థం బ్రహ్మచర్యవ్రతే స్థితః ।**
**సాధూనా ముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణామ్ ॥ 12**

**పదచ్ఛేదము** :– అర్చిష్మాన్ – అర్చితః – అత్యర్థం – బ్రహ్మచర్యవ్రతే – స్థితః – సాధూనామ్ – ఉపకారజ్ఞః – ప్రచారజ్ఞః – చ – కర్మణామ్ ॥

**అన్వయక్రమము** :– (సః) అర్చిష్మాన్, అత్యర్థమ్ అర్చితః, బ్రహ్మచర్యవ్రతే స్థితః, సాధూనామ్ ఉపకారజ్ఞః, కర్మణాం ప్రచారజ్ఞః చ.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ శ్రీరాముడు) అర్చిష్మాన్ = గొప్పతేజస్సు గలవాడు, అత్యర్థం = మిక్కిలిగా, అర్చితః = పూజింపబడినట్టివాడు, బ్రహ్మచర్యవ్రతే స్థితః = బ్రహ్మచర్య వ్రతమును పాలించువాడు, సాధూనామ్ = సత్పురుషులకు, ఉపకారజ్ఞః = ఉపకారము చేయుట తెలిసినవాడు, కర్మణాం = కార్యములయొక్క, ప్రచారజ్ఞః చ = ఆచరణ విశేషము నెఱిగినవాడును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– ప్రచారజ్ఞః – ఐహికాముష్మిక కర్మల ప్రయోగము తెలిసినవాడు.

**తిలకము** :– 'అర్చిష్మాన్ సన్ అర్చితః' – ప్రకాశస్వరూపుడైన ఆదిత్యరూపుడై బుధులచే ఆరాధింపబడుచున్నాడని భావము. 'బ్రహ్మచర్యవ్రతే స్థితః' – శాస్త్రమునందు తెలుపబడిన రీతిగా గృహస్థగ నుండి విధినిషేధములను పాటించునట్టి బ్రహ్మచర్యవ్రతమని భావము.

**రామాయణశిరోమణి** :– 'అర్చిష్మాన్ సన్ అర్చితః' ప్రకాశస్వరూపియైన పరమాత్మయై సర్వదేవతలచే పూజింపబడునట్టివాడని భావము. 'బ్రహ్మచర్యవ్రతే స్థితః' – తనచే నిర్మింపబడిన మర్యాదారూపములైన వేదోక్తనియమములకు బద్ధుడై యున్నవాడని భావము. (బ్రహ్మ = వేదము) ఉపకారజ్ఞః – ఉపకారము చేయుటయే ఎఱిగినట్టివాడు, అనగా అపకారము చేయుట ఎఱుగనివాడని భావము.

**తాత్పర్యము :–** అతడు మహాతేజస్సంపన్నుడై ఎల్లలోకములచే అర్చింపబడునట్టివాడు. శాస్త్రవిహితమైన బ్రహ్మచర్యవ్రతము ననుసరించువాడు. సత్‌పురుషులకు ఉపకారము చేయ నేర్చినవాడు. కర్తవ్యముల ఆచరణము చక్కగా తెలిసినవాడు.

**శ్లో॥ రాజనీత్యాం వినీతశ్చ బ్రాహ్మణానా ముపాసకః ।**
**జ్ఞానవాన్ శీలసంపన్నో వినీతశ్చ పరంతపః ॥ 13**

**పదచ్ఛేదము :–** రాజనీత్యాం – వినీతః – చ – బ్రాహ్మణానాం – ఉపాసకః, జ్ఞానవాన్ – శీలసంపన్నః – వినీతః – చ – పరంతపః ॥

**అన్వయక్రమము :–** (సః) రాజనీత్యాం వినీతః, బ్రాహ్మణానామ్ ఉపాసకః, జ్ఞానవాన్, శీలసంపన్నః, వినీతః చ, పరంతపః చ.

**ప్రతిపదార్థము :–** (సః) = ఆ శ్రీరాముడు, రాజనీత్యాం = రాజనీతియందు, వినీతః = శిక్షణము పొందినట్టివాడు, బ్రాహ్మణానామ్ ఉపాసకః = బ్రాహ్మణులను అర్చించునట్టి వాడు, జ్ఞానవాన్ = ఉత్తమజ్ఞానము కలిగియున్నవాడును, శీలసంపన్నః = ఉత్తమ చరిత్ర కలిగినట్టివాడును, వినీతః = వినయవంతుడును, పరంతపః చ = శత్రువులను తపింపచేయువాడును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'రాజవిద్యావినీతః' అని ఒక పాఠము. రాజవిద్యలు 4 – 1.ఆన్వీక్షికి, 2.త్రయి, 3.వార్త, 4.దండనీతి అనునవి. ఆన్వీక్షికి = తర్కవిద్య, త్రయి = మూడు వేదములు, వార్త = వాణిజ్యాదికము, దండము = దోషులను దండించుట.

**తాత్పర్యము :–** ఆ శ్రీరాముడు రాజనీతియందు చక్కగా శిక్షణ నొందినవాడు, బ్రాహ్మణుల యెడ భక్తిగలవాడు, ఉత్తమమైన జ్ఞానము నార్జించినవాడు, శ్రేష్ఠమైన చరిత్ర గలవాడు, వినయసంపన్నుడు, శత్రువుల నణచువాడును సుమా!

**శ్లో॥ యజుర్వేదవినీతశ్చ వేదవిద్భి స్సుపూజితః ।**
**ధనుర్వేదే చ వేదేషు వేదాంగేషు చ నిష్ఠితః ॥ 14**

**పదచ్ఛేదము :–** యజుర్వేదవినీతః – చ – వేదవిద్భిః – సుపూజితః, ధనుర్వేదే – చ – వేదేషు – వేదాంగేషు – చ – నిష్ఠితః ॥

**అన్వయక్రమము :–** (సః) యజుర్వేదవినీతః, వేదవిద్భిః సుపూజితః, ధనుర్వేదే చ, వేదేషు, వేదాంగేషు చ నిష్ఠితః.

**ప్రతిపదార్థము :–** (సః = ఆ శ్రీరాముడు) యజుర్వేదవినీతః = యజుర్వేదమునందు శిక్షను పొందినట్టివాడు, (శ్రీరామునిది యజుర్వేదము) వేదవిద్భిః = వేదవేత్తలచే, సుపూజితః = మిక్కిలి గౌరవింప బడినవాడు, ధనుర్వేదే చ = ధనుర్వేదము నందును, వేదేషు = చతుర్వేదములందును, వేదాంగేషు చ = వేదములయొక్క షడంగముల యందును, నిష్ఠితః = ప్రజ్ఞను సంపాదించినవాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** ఇందు యజుర్వేదమును ప్రత్యేకించి చెప్పుటచే శ్రీరామచంద్రమూర్తి యజుశ్శాఖి యని తెలియనగును.

**తాత్పర్యము :–** తన వేదమైన యజుర్వేదమును చక్కగా అధ్యయనము చేసినవాడు. వేదవేత్తలచే పూజింపబడువాడును. ధనుర్వేదమునందును నాల్గువేదములందును, ఆరు వేదాంగములందును సంపూర్ణప్రజ్ఞ గలిగియున్నవాడును సుమా!

**శ్లో॥ విపులాంసో మహాబాహుః కంబుగ్రీవ శ్శుభాననః ।**
**గూఢజత్రు స్సుతామ్రాక్షో రామో నామ జనైశ్శ్రుతః ॥ 15**

**పదచ్ఛేదము :–** విపులాంసః – మహాబాహుః – కంబుగ్రీవః – శుభాననః – గూఢజత్రుః – సుతామ్రాక్షః – రామః – నామ – జనైః – శ్రుతః ॥

**అన్వయక్రమము :–** (సః) విపులాంసః, మహాబాహుః, కంబుగ్రీవః, శుభాననః, గూఢజత్రుః సుతామ్రాక్షః, జనైః రామో నామ శ్రుతః.

**ప్రతిపదార్థము :–** (సః = ఆతడు) విపులాంసః = విశాలమైన మూపులు గలవాడు, మహాబాహుః = పొడవైన దృఢమైన భుజములు గలవాడు, కంబుగ్రీవః = శంఖమువంటి కంఠము గలవాడు, శుభాననః = మంగళకరమైన ముఖము గలవాడు, గూఢజత్రుః = పైకి కాన్పింపని మూపు సంధి ఎముకలు గలవాడు, జనైః = జనులచే, రామో నామ = రాముడను పేర, శ్రుతః = ప్రసిద్ధినొందినవాడు.

**తాత్పర్యము :–** అతడు విశాలమైన భుజశిరస్సులు గలవాడు, గొప్పవైన భుజములు గలవాడు, శంఖమువంటి కంఠము గలవాడు, మంగళకరమైన ముఖము గలవాడు, పైకి కాన్పింపని మూపు సంధి ఎముకలు గలవాడు, రాముడను పేర ప్రజలలో ప్రసిద్ధి నొందినట్టి వాడును సుమా!

**శ్లో॥ దుందుభిస్వననిర్ఘోషః స్నిగ్ధవర్ణః ప్రతాపవాన్ ।**
**సమశ్చ సువిభక్తాంగో వర్ణం శ్యామం సమాశ్రితః ॥ 16**

**పదచ్ఛేదము** :– దుందుభిస్వననిర్ఘోషః – స్నిగ్ధవర్ణః – ప్రతాపవాన్ – సమః – చ – సువిభక్తాంగః – వర్ణం – శ్యామం – సమాశ్రితః ॥

**అన్వయక్రమము** :– (సః) దుందుభిస్వననిర్ఘోషః, స్నిగ్ధవర్ణః, ప్రతాపవాన్, సమః, సువిభక్తాంగః, శ్యామం వర్ణం సమాశ్రితః చ.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ శ్రీరాముడు) దుందుభిస్వననిర్ఘోషః = దుందుభిధ్వనివంటి కంఠస్వరము గలవాడు, స్నిగ్ధవర్ణః = నున్నని చక్కని ఛాయగలవాడు, ప్రతాపవాన్ = గొప్ప ప్రతాపము గలవాడు, సమః = సమానమైన (శరీరావయవములుగల)వాడు, సువిభక్తాంగః = చక్కని విడివడిన అవయవములు గలవాడు, శ్యామం వర్ణం = మేఘవర్ణమును, సమాశ్రితః = పొందియున్నాడు.

**తాత్పర్యము** :– శ్రీరాముడు దుందుభిధ్వనివంటి కంఠస్వరము గలవాడు, నిగనిగలాడు నున్నని చిక్కనైన శరీరకాంతి గలవాడు, పరాక్రమవంతుడు, సమానమైన శరీర ప్రమాణములు గలవాడు, చక్కగా వేరుపడియున్న అవయవ సన్నివేశము గలవాడు, సుందరమైన మేఘవర్ణము వంటి నీలచ్ఛాయతో వెలయునట్టివాడు.

**శ్లో॥ త్రిస్థిర స్త్రిప్రలంబశ్చ త్రిసమ స్త్రిషు చోన్నతః ।**
**త్రితామ్ర స్త్రిషు చ స్నిగ్ధో గంభీర స్త్రిషు నిత్యశః ॥ 17**

**పదచ్ఛేదము** :– త్రిస్థిరః – త్రిప్రలంబః – చ – త్రిసమః – త్రిషు – చ – ఉన్నతః, త్రితామ్రః – త్రిషు – చ – స్నిగ్ధః – గంభీరః – త్రిషు – నిత్యశః ॥

**అన్వయక్రమము** :– (సః) త్రిస్థిరః, త్రిప్రలంబః, త్రిసమః, త్రిషు ఉన్నతః, త్రితామ్రః, త్రిషు స్నిగ్ధః, నిత్యశః త్రిషు గంభీరః చ.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ శ్రీరాముడు) త్రిస్థిరః = ఱొమ్ము మణికట్టు పిడికిలి యను మూడు స్థానములందును గట్టితనము గలవాడు, త్రిప్రలంబః = కనుబొమ్మలు, వృషణములు, బాహువులు అను మూడును పొడవుగా నుండువాడు, త్రిసమః = కేశాగ్రములు, వృషణములు, జానువులు అను మూడును సమముగ నుండువాడు, త్రిషు ఉన్నతః = బొడ్డు, పొట్ట, ఱొమ్ము అను మూడును ఉన్నతములై యుండువాడు, త్రితామ్రః = కంటి కొనలు, నఖములు, అరచేతులు (అరికాళ్ళు) అను మూడింటి యందును ఎఱ్ఱదనము గల్గియుండువాడు, త్రిషు స్నిగ్ధః = పాదరేఖలు, కేశములు, లింగమణి అను మూడింటియందును నున్నదనము గలవాడు, నిత్యశః = ఎల్లప్పుడును, త్రిషు గంభీరః చ = కంఠస్వరము, గమనము, నాభి యను మూడింటి యందును గాంభీర్యము గలవాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** త్రిస్థిరః – "ఉరశ్చ మణిబంధశ్చ ముష్టిశ్చ నృపతేః స్థిరాః" అనియు, త్రిప్రలంబః – "ప్రలంబా యస్య స ధనీ త్రయో భ్రూముష్కబాహవః" అనియు, త్రిసమః "కేశాగ్రం వృషణం జాను సమం యస్య స భూపతిః" అనియు, త్రిషు ఉన్నతః 'నాభ్యంతఃకుక్షివక్షోభిః ఉన్నతైః క్షితిపో భవేత్" అనియు, త్రితామ్రః "నేత్రాంత నఖపాణ్యంఘ్రితలైః తామ్రైః త్రిభి స్సుఖీ" యనియు, త్రిషు స్నిగ్ధః "స్నిగ్ధా భవంతి వై యేషాం పాదరేఖా శ్శిరోరుహాః, తథా లింగమణి స్తేషాం మహాభాగ్యం వినిర్దిశేత్" అనియు, త్రిషు గంభీరః "స్వరే సత్త్వే గతౌ నాభౌ గంభీరః త్రిషు శస్యతే" అనియును సాముద్రికశాస్త్రము.

**గోవిందరాజీయము :–** త్రిప్రలంబః – "దీర్ఘభ్రూబాహుముష్కస్తు చిరంజీవీ ధనీ నరః" అనియు లేక "త్రయశ్చ యస్య విద్యంతే ప్రలంబా మేఢ్రబాహవః" అనియు, త్రిషు ఉన్నతః "ఉన్నతకుక్షిః క్షితిపః పరిమండలోన్నతనాభయః క్షితిపాః, హృదయం సవేపనం పృథు సమోన్నతం మాంసళం చ నృపతీనామ్" – వరాహమిహిరుడు. త్రితామ్రః "శ్లిష్టాంగులీ రుచిరతామ్రనఖౌ సుపార్ష్ణి పాదౌ కరావపి సురక్తనఖాత్మరేఖౌ". త్రిషు గంభీరః 'స్వర స్సత్త్వం చ నాభిశ్చ గంభీరః శస్యతే బుధైః' వరరుచి.

తొడలు, స్తనములు, వృషణములు అనుచు స్త్రీలయెదుట ఆ యా అవయవముల నన్నింటిని కంఠతః నిర్దేశించుట ఉచితముకాదు గాబట్టి సర్వ శాస్త్రవిశారదురాలైన ఆ జానకీదేవికి తెలియునట్లుగా సాముద్రిక శాస్త్ర ప్రసిద్ధములైన పదములతో హనుమ ఇట్లు సూచించుచున్నాడని తెలియుచున్నది.

**తాత్పర్యము :–** శ్రీరాముడు ఱొమ్ము మణికట్టు పిడికిలి యను మూడు అవయవము లందును గట్టితనము గలవాడు, కనుబొమ్మలు బాహువులు వృషణములు అను మూడును పొడవుగ నుండువాడు, కేశాంతములు వృషణములు జానువులును సమానముగా నుండువాడు, పొట్ట బొడ్డు హృదయము అను మూడును ఎత్తుగ నుండువాడు, కంటికొనలు గోళ్ళు అరికాళ్ళు (అరిచేతులు) ఎఱ్ఱగనుండువాడు, పాదరేఖలు కేశములు లింగమణి అను మూడును, నున్నగ నుండువాడు, మాట, నడక, బొడ్డు అను మూడింటి యందును ఎల్లప్పుడు గాంభీర్యము గల్గియుండునట్టి వాడుసుమా!

**శ్లో॥ త్రివలీమాం స్త్ర్యవనత శ్చతుర్వ్యంగ స్త్రిశీర్షవాన్ ।**
**చతుష్కల శ్చతుర్లేఖ శ్చతుఃకిష్కు శ్చతుస్సమః ॥ 18**

**పదచ్ఛేదము :–** త్రివలీమాన్ – త్ర్యవనతః – చతుర్వ్యంగః – త్రిశీర్షవాన్, చతుష్కలః – చతుర్లేఖః – చతుఃకిష్కుః – చతుస్సమః ॥

**అన్వయక్రమము :–** (సః) త్రివలీమాన్, త్ర్యవనతః, చతుర్వ్యంగః, త్రిశీర్షవాన్, చతుష్కలః, చతుర్లేఖః, చతుఃకిష్కుః, చతుస్సమః చ.

**ప్రతిపదార్థము :–** (సః = ఆ శ్రీరాముడు), త్రివలీమాన్ = పొట్టయందు (కంఠమున, ఉదరమున గూడ) మూడు ముడుతలు కలిగినట్టివాడు, త్ర్యవనతః =స్తనములు, స్తనాగ్రములు, పాదరేఖలు, ఈ మూడును వంగియుండువాడు, చతుర్వ్యంగః = కంఠము, లింగము, పిక్కలు, పిఱుదులు అను నాలుగును పొట్టివిగ నుండువాడు, త్రిశీర్షవాన్ = మూడు సుడులుగల శిరస్సు గలవాడు, చతుష్కలః = నాలుగు (వేదముల ప్రాప్తిని సూచించు) రేఖలు బొటన వ్రేలిపై గలవాడు, చతుర్లేఖః = లలాటమున నాలుగు రేఖలు గలవాడు, చతుఃకిష్కుః = రెండు మోచేతులు, రెండు మోకాళ్ళు అను నాల్గును దృఢముగ నుండువాడు, చతుస్సమః = బాహువులు, పిక్కలు, తొడలు, చెక్కిళ్ళు అను నాల్గును సమముగ నుండువాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** చతుర్వ్యంగః "గ్రీవా ప్రజననం పృష్ఠం హ్రస్వే జంఘే చ పూజితే", త్రిశీర్షవాన్ "ఆవర్తత్రయయుక్తం యస్య శిరః క్షితిభృతా మయం నాథః" చతుష్కలః "మూలేఽంగుష్ఠస్య రేఖానాం చతస్రః త్రిస్ర ఏవ హి, ఏకా ద్వే వా యథాయోగం వేదరేఖా ద్విజన్మనామ్", చతుర్లేఖాః "లలాటే యస్య దృశ్యంతే చతుస్త్రిద్వ్యేకరేఖికాః, శతద్వయం శతం షష్టి స్తస్యాయుర్వింశతి స్తథా". చతుఃకిష్కుః – కిష్కుః అనగా ఇరువది నాలుగు అంగుళముల హస్తము. ఇట్టి నాల్గు కిష్కువుల ప్రమాణము గలవాడు. అనగా 96 అంగుళముల పొడవైనవాడని భావము. చతుస్సమః "బాహుజానూరు గండాని చత్వార్యథ సమాని చ" అనియు బ్రహ్మాండ పురాణము.

**గోవిందరాజీయము :–** త్ర్యవనతః "పీనోఽపచితై ర్నిమ్నైః క్షితిపతయ శ్చూచుకైః స్త నై స్సుఖినః, స్నిగ్ధా నిమ్నా రేఖా ధనినాం త ద్వ్యత్యయేన నిఃస్వానామ్" వరాహమిహిరుడు. చతుర్లేఖః – పాదతలమున నాల్గు రాజలక్షణరేఖలు గలవాడు. 'యస్య పాదతలే వజ్రధ్వజశంఖాంకుశోపమాః, రేఖాః సమ్యక్ ప్రకాశంతే మనుజేంద్రం త మాదిశేత్." అని నారదవచనము.

చతుఃకిష్కుః "షణ్ణవత్యంగులోత్సేధో యః పుమాన్ స దివౌకసః" బ్రహ్మాండ పురాణము.

**తాత్పర్యము :-** శ్రీరాముడు కంఠమునందును, ఉదరమునందును మూడు ముడుతలు గలవాడు; స్తనములు, స్తనాగ్రములు, పాదరేఖలు అను మూడును వంగియుండువాడు; కంఠము, పృష్ఠము, పిక్కలు అను నాల్గును పొట్టిగ నుండువాడు; మూడు సుడులతో గూడిన శిరస్సు గలవాడు; చతుర్వేదప్రాప్తిని సూచించు నాల్గురేఖలు చేతిబొటన వ్రేలిపై గలవాడు; తొంబదిఆరు అంగుళముల పొడవుగలవాడు; బాహువులు, పిక్కలు, తొడలు, చెక్కిళ్ళు అను నాల్గును సమముగ నుండువాడును సుమా!

**శ్లో॥ చతుర్దశసమద్వంద్వ శ్చతుర్దంష్ట్ర శ్చతుర్గతిః ।**
**మహోష్ఠహనునాసశ్చ పంచస్నిగ్ధో ఉ ష్టవంశవాన్ ॥ 19**

**పదచ్ఛేదము :-** చతుర్దశసమద్వంద్వః - చతుర్దంష్ట్రః - చతుర్గతిః - మహోష్ఠహనునాసః - చ - పంచస్నిగ్ధః - అష్టవంశవాన్ ॥

**అన్వయక్రమము :-** (సః) చతుర్దశసమద్వంద్వః చతుర్దంష్ట్రః చతుర్గతిః, మహోష్ఠహనునాసః, పంచస్నిగ్ధః, అష్టవంశవాన్.

**ప్రతిపదార్థము :-** (సః = ఆ శ్రీరాముడు) చతుర్దశసమద్వంద్వః = కనుబొమ్మలు, నాసాపుటములు, కన్నులు, చెవులు, పెదవులు, స్తనాగ్రములు, మోచేతులు, మణికట్టులు, మోకాళ్ళు, అండకోశము, కటిప్రదేశము, చేతులు, పాదములు, పిఱుదులు అను పదునాల్గు జంటలును సమానములై యుండువాడు. చతుర్దంష్ట్రః = శుభ లక్షణములు గల నాలుగు కోఱపన్నులు గలవాడు, చతుర్గతిః = సింహము, శార్దూలము, గజము, వృషభము అను నాల్గింటి గమనము వంటి గంభీరమైన గమనము గలవాడు. మహోష్ఠహనునాసః = శ్రేష్ఠములైన పెదవులు, చర్మము, కేశములు, పాదములు అను నైదును నునుపుగలిగి యుండువాడు, అష్టవంశవాన్ = ఎనిమిది పొడవైన ఎముకలుగల అవయవములు గలవాడు (వెన్నెముక, శరీరము, వ్రేళ్ళు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, మగగుఱి అను ఎనిమిది అవయవములును పొడవుగ నుండువాడు).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** చతుర్దశసమద్వంద్వః "భ్రువౌ నాసాపుటే నేత్రే కర్ణావోష్ఠౌ చ చూచుకే, కూర్పరే మణిబంధౌ చ జానునీ వృషణౌ కటీ, కరౌ పాదౌ స్ఫిజౌ యస్య సమౌ జ్ఞేయః స భూపతిః" చతుర్దంష్ట్రః - "స్నిగ్ధా ఘనాశ్చ దశనాః సుతీక్ష్ణదంష్ట్రాస్సమాశ్చ శుభాః" వరాహమిహిరుడు.

**రామాయణ శిరోమణి** :– "బాహూ చ నలకౌ చోరూ జంఘే చేత్యష్టవంశకాః" నలకౌ అనగా అంగుళీద్వయమని అర్థము.

**గోవిందరాజీయము** :– చతుర్గతిః – "గజసింహగతీ వీరౌ శార్దూలవృషభోపమౌ" అను బాలకాండము నందలి వచన మిచట అను సంధించుకొనవలెను. మహోష్ఠహనునాసః – "బంధుజీవకుసుమోపమోఽ ధరో, మాంసలో రుచిరబింబ రూపధృత్, పూర్ణమాంసళహనుస్తు భూమిప స్తుంగతుండరుచిరాకృతిస్తథా" (తుండమనగా నాసిక అని సంహితావచనము) పంచస్నిగ్ధః – చక్షుఃస్నేహేన సౌభాగ్యం దంతస్నేహేన భోజనం, త్వచస్స్నేహేన శయనం పాదస్నేహేన వాహనమ్"అని వరరుచి వాక్యము. "స్నిగ్ధ నీల మృదుకుంచితాః తథా, మూర్ధజా స్సుఖకరా స్సమం శిరః" వరాహమిహిరుడు. అష్టవంశవాన్ – "పృష్ఠవంశః శరీరం చ హస్తపాదాంగులీ కరౌ, నాసికా చక్షుషీ కర్ణౌ ప్రజనో యస్య చాయతాః" అని సాముద్రికవచనము.

**మహేశ్వరతీర్థులు** :– చతుర్దశసమద్వంద్వః "కర్ణాక్షిభ్రూగండనాసాదంతోష్ఠస్కంధ జత్రుణీ, పాదౌ కరౌ స్తనా వూరూ స్ఫిజౌ ద్వంద్వౌ చతుర్దశ". పంచస్నిగ్ధః "వాగ్వ క్త్రనఖలోమాని త్వచశ్చ" అను పంచావయవములు స్నిగ్ధములై యుండువాడు.

**తాత్పర్యము** :– శ్రీరాముడు కనుబొమలు, నాసాపుటములు, కన్నులు, చెవులు, పెదవులు, స్తనాగ్రములు, మోచేతులు, మణికట్టులు, మోకాళ్ళు, వృషణములు, కటిప్రదేశము, చేతులు, పాదములు, పిఱుదులు అను పదునాలుగు జంటలును సమానములై యుండువాడు. శుభలక్షణోపేతములైన నాలుగు కోఱపన్నులు గల్గియున్న వాడు. సింహ శార్దూల గజ వృషభ గమనములతో సమానమైన ఠీవిగల గమనము గల్గియున్నవాడు, కన్నులు, పన్నులు, చర్మము, కేశములు, పాదములు అను ఐదును నునుపు గలిగియుండువాడు. వెన్నెముక, శరీరము, వ్రేళ్ళు, చేతులు, ముక్కు, కన్నులు, చెవులు, మగగుఱి యను ఎనిమిది అవయవములును ప్రశస్తలక్షణోపేతములై యుండువాడును సుమా!

**శ్లో॥ దశపద్మో దశబృహ త్త్రిభి ర్వ్యాప్తో ద్విశుక్లవాన్ ।**
**షడున్నతో నవతను స్త్రిభి ర్వ్యాప్నోతి రాఘవః ॥ 20**

**పదచ్ఛేదము** :– దశపద్మః – దశబృహత్ – త్రిభిః – వ్యాప్తః – ద్విశుక్లవాన్ – షడున్నతః – నవతనుః – త్రిభిః – వ్యాప్నోతి – రాఘవః ॥

**అన్వయక్రమము** :– రాఘవః దశపద్మః, దశబృహత్, త్రిభిః వ్యాప్తః ద్విశుక్లవాన్, షడున్నతః, నవతనుః, త్రిభిః వ్యాప్నోతి.

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, దశపద్మః = ముఖము, కన్నులు, నాలుక, పెదవులు, చెవులు, స్తనములు, గోళ్ళు, చేతులు, పాదములు అను పది అవయవములు పద్మాకారముగ గల్గియుండువాడు, దశబృహత్ = వక్షము, శిరస్సు, నుదురు, కంఠము, బాహువులు, మూపులు, బొడ్డు, ప్రక్కలు, వెనుకభాగము, స్వరము అను పది ఎత్తైన అవయవములు గలవాడు, త్రిభిః వ్యాప్తః = తేజస్సు, యశస్సు, శోభ యను మూడింటిచే విస్తరించి యున్నవాడు, ద్విశుక్లవాన్ = పన్నులు, కన్నులు అను రెండు తెల్లని అవయవములు గలవాడు, షడున్నతః = కక్షము, కడుపు, వక్షము, ముక్కు, మూపు, లలాటము అను ఆరు ఉన్నతమైన అవయవములు గలవాడు, నవతనుః = కేశములు, మీసములు, గోళ్ళు, రోమములు, వ్రేళ్ళు, కణుపులు, చర్మము, లింగము, దృష్టి, బుద్ధి అను తొమ్మిది సూక్ష్మమైనవిగా గలవాడు, త్రిభిః వ్యాప్నోతి = పూర్వాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్ణము అను మూడు కాలములందును ధర్మార్థ కామము లను మూడు పురుషార్థములతో వ్యాపించియుండును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- దశపద్మః "ముఖనేత్రాస్యజిహ్వోష్ఠతాలుస్తననఖాః కరౌ, పాదౌ చ దశపద్మాని పద్మాకారాణి యస్య చ" (ఆస్యమనగా ఓష్ఠమధ్యము), దశబృహత్ – 'ఉరశ్శిరో లలాటం చ గ్రీవా బాహ్వంసనాభయః, పార్శ్వపృష్ఠస్వరా శ్చేతి విశాలా స్తే శుభప్రదాః – సాముద్రిక వచనము. ద్విశుక్లవాన్. "ద్వౌ శుద్ధౌ తు శుభౌ శుక్లౌ వంశౌ మాతుః పితుస్తథా" అనియును, షడున్నతః "కక్షః కుక్షిశ్చ వక్షశ్చ ఘ్రాణః స్కంధో లలాటికా, సర్వభూతేషు నిర్దిష్టా ఉన్నతాంగా శ్శుభప్రదాః" వరరుచి వాక్యము. నవతనుః "సూక్ష్మా ణ్యంగుళిపర్వాణి కేశలోమనఖత్వచః, శేఫశ్చ యేషాం సూక్ష్మాణి తే నరా దీర్ఘజీవినః" – అని వరరుచివాక్యము. మృదుశ్మశ్రుత, సూక్ష్మదృష్టి, సూక్ష్మబుద్ధి – అను మూడును గలసి మొత్తము తొమ్మిది యగును.

**గోవిందరాజీయము** :- దశబృహత్ – "శిరోలలాటే శ్రవణే గ్రీవా వక్షశ్చ హృత్తథా, ఉదరం పాణిపాదౌ చ పృష్ఠం దశ బృహంతి చ' (బ్రహ్మపురాణము). త్రిభి ర్వ్యాప్నోతి – "ధర్మార్థకామాః కాలేషు త్రిషు యస్య స్వనుష్ఠితాః" (బ్రహ్మపురాణము).

**మహేశ్వరతీర్థులు** :- త్రిభిర్వ్యాప్తః "త్రిభి ర్వ్యాప్తిశ్చ యస్య స్యాత్ తేజసా యశసా శ్రియా"

శ్రీరాముని ఈ అవయవప్రశంసలో కొన్ని పునరుక్తులు కానవచ్చుటకు కారణము, సాముద్రికశాస్త్రకర్తలలో గల మతభేదములే. శ్రీరాముడు సర్వమతములను అనుసరించి మహాపురుషలక్షణసమన్వితుడై యున్నాడని తెలుపుటయే కవిలక్ష్యమని

గ్రహించవలెను.

**తాత్పర్యము :–** రఘువంశతిలకుడైన శ్రీరాముని ముఖము, కన్నులు, నోరు, నాలుక, పెదవులు, దవడలు, స్తనములు, గోళ్ళు, హస్తములు, పాదములు అను పది అవయవములును తామరపువ్వులను బోలియుండును. అతని శిరస్సు, లలాటము, కరములు, కంఠము, వక్షము, హృదయము, ఉదరము, హస్తములు, పాదములు, పృష్ఠము అను పది అవయవములును స్థూలములై యుండును. అతని తేజస్సు, కీర్తి, శోభ యను మూడును మిక్కిలి విశిష్టమైనవి. అతని దంతములు, నేత్రములు అను రెండును ధవళవర్ణము గల్గి అందముగ నుండును. లేక పితృమాతృవంశములు రెండును నిష్కళంకముగ నున్నవాడు. అతని చంక, కడుపు, ఱొమ్ము, ముక్కు, మూపు, నుదురు అను నారును ఉన్నతములైనట్టివి. ఆతని వ్రేళ్ళకణుపులు, తలవెంట్రుకలు, గోళ్ళు, రోమములు, చర్మము, లింగము, మీసములు, దృష్టి, బుద్ధి యను తొమ్మిదియును మిక్కిలి సూక్ష్మమైనట్టివి. అతడు పూర్వ మధ్య అపరాహ్ణములను మూడు కాలములందును ధర్మార్థకామములను మూడు పురుషార్థములను సాధించు స్వభావము గలవాడు.

**శ్లో॥ సత్యధర్మపర శ్రీమాన్ సంగ్రహానుగ్రహే రతః ।**
**దేశకాలవిభాగజ్ఞః సర్వలోకప్రియంవదః ॥ 21**

**పదచ్ఛేదము :–** సత్యధర్మపరః – శ్రీమాన్ – సంగ్రహానుగ్రహే – రతః – దేశకాల విభాగజ్ఞః – సర్వలోకప్రియంవదః ॥

**అన్వయక్రమము :–** (సః) సత్యధర్మపరః, శ్రీమాన్, సంగ్రహానుగ్రహే రతః, దేశకాల విభాగజ్ఞః, సర్వలోకప్రియంవదః.

**ప్రతిపదార్థము :–** (సః = ఆ శ్రీరాముడు) సత్యధర్మపరః = సత్యమునందును, ధర్మమునందును గొప్ప ఆసక్తి గలిగి యుండువాడు, శ్రీమాన్ = శుభలక్షణ సముపేతుడు, సంగ్రహానుగ్రహే = సంగ్రహించుటయందును, (ఆ ద్రవ్యమును) వినియోగించుటయందును, రతః = మిక్కిలి ఆసక్తి గలవాడు, దేశకాలవిభాగజ్ఞః = దేశముయొక్కయు, కాలముయొక్కయు విభజనము తెలిసినవాడు, సర్వలోకప్రియంవదః = సమస్త జనులకును ప్రియముగ మాటాడునట్టివాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సంగ్రహానుగ్రహే రతః – ధనమును బలమును సంగ్రహించి వానితో ప్రజారక్షణము చేయుటలో నిపుణుడు.

**తాత్పర్యము** :- శ్రీరాముడు సత్యమునందును ధర్మమునందును మిక్కిలి ఆసక్తి గల్గి యుండువాడు. సర్వశుభలక్షణసంపన్నుడు. సంపదలను సంపాదించుటయందును ప్రజాహితముగ వినియోగించుటయందును గొప్పశ్రద్ధ గలవాడు. దేశముయొక్కయు, కాలముయొక్కయు విభాగములను చక్కగా గుర్తించి సద్వినియోగము చేయనేర్చినవాడు. సమస్తజనులకును ప్రియముగ భాషించువాడు.

**శ్లో॥ భ్రాతా తస్య చ ద్వైమాత్రః సౌమిత్రి రమితప్రభః ।**
**అనురాగేణ రూపేణ గుణై శ్చాపి తథావిధః ॥ 22**

**పదచ్ఛేదము** :- భ్రాతా - తస్య - చ - ద్వైమాత్రః - సౌమిత్రిః - అమితప్రభః - అనురాగేణ - రూపేణ - గుణైః - చ - అపి - తథావిధః ॥

**అన్వయక్రమము** :- తస్య ద్వైమాత్రః భ్రాతా సౌమిత్రిః చ అమితప్రభః అనురాగేణ, రూపేణ, గుణైశ్చ అపి తథావిధః.

**ప్రతిపదార్థము** :- తస్య = ఆ శ్రీరామునియొక్క, ద్వైమాత్రః = రెండవ తల్లి కుమారుడైన, భ్రాతా సౌమిత్రిః చ = సోదరుడైన సుమిత్రానందనుడగు లక్ష్మణుడును, అమితప్రభః = అపారమైన తేజస్సుగలవాడు, అనురాగేణ = ప్రేమచేతను, రూపేణ = సౌందర్యము చేతను, గుణైశ్చ = సద్గుణములచేతను, తథావిధః = ఆ శ్రీరాముని వంటివాడే.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- ద్వైమాత్రః = ఇరువురు తల్లుల బిడ్డడు అనగా సుమిత్రా కౌసల్యల నిరువురిని తన తల్లిగనే చూచుకొనునట్టివాడు.

**తాత్పర్యము** :- శ్రీరాముని సవతితల్లియైన సుమిత్ర కుమారుడగు లక్ష్మణుడు కౌసల్యాసుమిత్రలను ఇరువురను తన కన్నతల్లులవలె చూచుకొనువాడు. అమిత తేజస్సంపన్నుడు. అనురాగము, సౌందర్యము మున్నగు సద్గుణములచే సర్వవిధముల తన యన్నయైన శ్రీరాముని బోలినవాడు.

**శ్లో॥ స సువర్ణచ్ఛవి శ్శ్రీమాన్రామ శ్శ్యామో మహాయశాః ॥**

**పదచ్ఛేదము** :- సః - సువర్ణచ్ఛవిః - శ్రీమాన్ - రామః - శ్యామః - మహాయశాః ॥

**అన్వయక్రమము** :- సః (లక్ష్మణః) సువర్ణచ్ఛవిః; శ్రీమాన్ మహాయశాః రామః శ్యామః.

**ప్రతిపదార్థము** :- సః (లక్ష్మణః) = ఆ లక్ష్మణుడు, సువర్ణచ్ఛవిః = బంగారుకాంతి గలవాడు; శ్రీమాన్ = సర్వశుభలక్షణసంయుతుడును, మహాయశాః = గొప్ప కీర్తి

గలవాడు నగు, రామః = శ్రీరాముడు, శ్యామః = నీలవర్ణము గలవాడు.

**తాత్పర్యము :–** ఆ లక్ష్మణుడు బంగారుచాయతో నొప్పు మేను గలవాడు, మహాత్ముడైన శ్రీరాముడు మాత్రము నీలమేఘచ్ఛాయ గలవాడు.

సూచన : ఈ పాదము కొన్ని ప్రతులలో లేదు.

**శ్లో॥ తా వుభౌ నరశార్దూలౌ త్వద్దర్శనకృతోత్సవౌ ।**
**విచిన్వంతౌ మహీం కృత్స్నా మస్మాభి స్సహ సంగతౌ ॥ 23**

**పదచ్ఛేదము :–** తా – ఉభౌ – నరశార్దూలౌ – త్వద్దర్శనకృతోత్సవౌ – విచిన్వంతౌ – మహీం – కృత్స్నామ్ – అస్మాభిః – సహ – సంగతౌ ॥

**అన్వయక్రమము :–** నరశార్దూలౌ తౌ ఉభౌ త్వద్దర్శనకృతోత్సవౌ, కృత్స్నాం మహీం విచిన్వంతౌ, అస్మాభిః సహ సంగతౌ.

**ప్రతిపదార్థము :–** నరశార్దూలౌ తౌ ఉభౌ = పురుషశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణులు ఇరువురును, త్వద్దర్శనకృతోత్సవౌ = నిన్ను చూచుటయందు వేడుకగలవారై, కృత్స్నాం మహీం = భూమిని అంతను, విచిన్వంతౌ = వెదకుచున్నవారై, అస్మాభిః సహ = మాతోడ, సంగతౌ = కలిసినారు.

**తాత్పర్యము :–** పురుషసింహులైన ఆ యన్నదమ్ము లిరువురును నిన్ను కనుగొను కుతూహలముతో భూమినంతను పర్యటించుచు మమ్ము కలిసికొనిరి.

**శ్లో॥ త్వామేవ మార్గమాణౌ తౌ విచరంతౌ వసుంధరామ్ ।**
**దదర్శతు ర్మృగపతిం పూర్వజే నావరోపితమ్ ॥ 24**

**శ్లో॥ ఋష్యమూకస్య మూలే తు బహుపాదపసంకులే ।**
**భ్రాతు ర్భయార్త మాసీనం సుగ్రీవం ప్రియదర్శనమ్ ॥ 25**

**పదచ్ఛేదము :–** త్వామ్ – ఏవ – మార్గమాణౌ – తౌ – విచరంతౌ – వసుంధరామ్ – దదర్శతుః – మృగపతిం – పూర్వజేన – అవరోపితమ్ – ఋష్యమూకస్య – మూలే – తు – బహుపాదపసంకులే – భ్రాతుః – భయార్తమ్ – ఆసీనం – సుగ్రీవం – ప్రియదర్శనమ్ ॥

**అన్వయక్రమము :–**త్వామేవ మార్గమాణౌ, వసుంధరామ్ విచరంతౌ బహుపాదప సంకులే ఋష్యమూకస్య మూలే ఆసీనం, పూర్వజేన అవరోపితం, భ్రాతుః భయార్తం, ప్రియదర్శనం మృగపతిం దదర్శతుః.

**ప్రతిపదార్థము :-** త్వామేవ = నిన్నే, మార్గమాణౌ = వెదకుచున్నవారై, వసుంధరాం = భూమిపై, విచరంతౌ = పర్యటించుచున్నట్టి, తౌ = ఆ సోదరులిరువురును, బహుపాదపసంకులే = అసంఖ్యములైన వృక్షములతో దట్టముగనున్నట్టి, ఋష్య మూకస్య మూలే = ఋష్యమూకపర్వతముయొక్క దిగువభాగమున, ఆసీనం = కూర్చుండి యున్నట్టియు, పూర్వజేన = అన్నయైన వాలిచే, అవరోపితం = రాజ్యభ్రష్టుడుగ చేయబడినవాడును, భ్రాతుః భయార్తం = అన్నగారివలన భయముచే పీడింపబడుచున్నవాడును, ప్రియదర్శనం = సుందరమైన రూపముతో కానవచ్చువాడునగు, మృగపతిం = వానరశ్రేష్ఠుడైన, సుగ్రీవం = సుగ్రీవుని, దదర్శతుః = చూచిరి.

**తాత్పర్యము :-** ఆ రామలక్ష్మణు లిరువురును నిన్ను గూర్చియే వెదకుచు దేశము అంతయు తిరుగుచు ఋష్యమూకపర్వతము దిగువగల చెట్ల గుబురునందు అన్నచే రాజ్యభ్రష్టుడై, అతనికి భయపడుచు కూర్చుండియున్నట్టి సుందరరూపుడైన వానరశ్రేష్ఠుని జూచిరి.

**శ్లో॥ వయం చ హరిరాజం తం సుగ్రీవం సత్యసంగరమ్ ।**
**పరిచర్యామహే రాజ్యాత్ పూర్వజే నావరోపితమ్ ॥ 26**

**పదచ్ఛేదము :-** వయం – చ – హరిరాజం – తం – సుగ్రీవం – సత్యసంగరమ్ – పరిచర్యామహే – రాజ్యాత్ – పూర్వజేన – అవరోపితమ్ ॥

**అన్వయక్రమము :-** వయం చ పూర్వజేన రాజ్యాత్ అవరోపితం, సత్యసంగరం, హరిరాజం సుగ్రీవం పరిచర్యామహే.

**ప్రతిపదార్థము :-** వయం చ = మేమును, పూర్వజేన = అన్నగారిచే, రాజ్యాత్ = రాజ్యమునుండి, అవరోపితం = దింపివేయబడినట్టి వాడును, సత్యసంగరం = సత్యమైన ప్రతిజ్ఞగలవాడును అగు, హరిరాజం తం సుగ్రీవం = వానరేంద్రుడైన ఆ సుగ్రీవుని, పరిచర్యామహే = సేవించుచున్నాము.

**తాత్పర్యము :-** ఇచ్చటనే మేము వాలిచే రాజ్యము గోల్పోయియున్న ఉత్తమవీరుడైన వానరశ్రేష్ఠుడగు ఆ సుగ్రీవునికడ నుండి అతనిని సేవించుచు నుంటిమి.

**శ్లో॥ తత స్తౌ చీరవసనౌ ధనుఃప్రవరపాణినౌ ।**
**ఋష్యమూకస్య శైలస్య రమ్యం దేశ ముపాగతౌ ॥ 27**

**పదచ్ఛేదము :-** తతః – తౌ – చీరవసనౌ – ధనుఃప్రవరపాణినౌ – ఋష్యమూకస్య

– శైలస్య – రమ్యం – దేశమ్ – ఉపాగతౌ ॥

**అన్వయక్రమము :–** తతః చీరవసనౌ, ధనుఃప్రవరపాణినౌ, తౌ ఋష్యమూకస్య శైలస్య రమ్యం (తం) దేశమ్ ఉపాగతౌ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, చీరవసనౌ = నారచీరలు ధరించినవారై, ధనుఃప్రవరపాణినౌ = గొప్ప ధనుస్సులను చేతియందు పూనియున్నట్టి, తౌ = ఆ రామలక్ష్మణులిరువురును, ఋష్యమూకస్య శైలస్య = ఋష్యమూకపర్వతముయొక్క, రమ్యం తం దేశం = సుందరమైన ఆ ప్రదేశమును, ఉపాగతౌ = చేరినారు.

**తాత్పర్యము :–** అప్పుడు నారచీరలను ధరించి చేతులందు గొప్పవైన ధనుస్సులను దాల్చియున్నట్టి ఆ సోదరు లిరువురును సుందరమైన ఆ ఋష్యమూక పర్వత ప్రదేశమునకు వచ్చిరి.

**శ్లో॥ స తౌ దృష్ట్వా నరవ్యాఘ్రౌ ధన్వినౌ వానరర్షభః ।**
**అభిప్లుతో గిరే స్తస్య శిఖరం భయమోహితః ॥ 28**

**పదచ్ఛేదము :–** సః – తౌ – దృష్ట్వా – నరవ్యాఘ్రౌ – ధన్వినౌ – వానరర్షభః – అభిప్లుతః – గిరేః – తస్య – శిఖరం – భయమోహితః ॥

**అన్వయక్రమము :–** సః వానరర్షభః నరవ్యాఘ్రౌ ధన్వినౌ తౌ దృష్ట్వా భయమోహితః తస్య గిరేః శిఖరం అభిప్లుతః.

**ప్రతిపదార్థము :–** సః వానరర్షభః = వానరశ్రేష్ఠుడైన ఆ సుగ్రీవుడు, నరవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులును, ధన్వినౌ = గొప్ప ధనుస్సులను ధరించినవారునగు, తౌ = ఆ రామలక్ష్మణులను, దృష్ట్వా = చూచి, భయమోహితః = భయగ్రస్తుడై, తస్య గిరేః = ఆ ఋష్యమూక పర్వతముయొక్క, శిఖరమ్ అభిప్లుతః = శిఖరమును అధిరోహించినాడు.

**తాత్పర్యము :–** అప్పుడు సుగ్రీవుడు మహాధనుస్సులను ధరించియున్నట్టి ఆ మనుజశ్రేష్ఠుల నిరువురను గాంచి భయచకితుడై ఆ ఋష్యమూకపర్వతశిఖరము మీదికి పరుగుతో పోయి చేరుకొనెను.

**శ్లో॥ తత స్స శిఖరే తస్మిన్ వానరేంద్రో వ్యవస్థితః ।**
**తయో స్సమీపం మామేవ ప్రేషయామాస సత్వరమ్ ॥ 29**

**పదచ్ఛేదము :–** తతః – సః – శిఖరే – తస్మిన్ – వానరేంద్రః – వ్యవస్థితః – తయోః – సమీపం – మామ్ – ఏవ – ప్రేషయామాస – సత్వరమ్ ॥

**అన్వయక్రమము** :- తతః తస్మిన్ శిఖరే వ్యవస్థితః సః వానరేంద్రః తయోః సమీపం సత్వరం మామేవ ప్రేషయామాస.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, తస్మిన్ శిఖరే = ఆ పర్వతశిఖరమున, వ్యవస్థితః = కుదుటబడియున్న, సః వానరేంద్రః = ఆ వానరరాజగు సుగ్రీవుడు, సత్వరం = వెంటనే, మా మేవ = నన్నే, తయోః సమీపం = ఆ రామలక్ష్మణుల కడకు, ప్రేషయామాస = పంపించెను.

**తాత్పర్యము** :- పిమ్మట ఆ పర్వతశిఖరమున కొంచెము కుదుటబడి సుగ్రీవుడు వెంటనే నన్నే పిలచి ఆ రామలక్ష్మణులను గూర్చి తెలిసికొని రమ్మని పంపెను.

**శ్లో॥ తా వహం పురుషవ్యాఘ్రౌ సుగ్రీవవచనా త్ప్రభూ ।**
**రూపలక్షణసంపన్నౌ కృతాంజలి రుపస్థితః ॥ 30**

**పదచ్ఛేదము** :- తౌ - అహం - పురుషవ్యాఘ్రౌ - సుగ్రీవవచనాత్ - ప్రభూ - రూపలక్షణసంపన్నౌ - కృతాంజలిః - ఉపస్థితః ॥

**అన్వయక్రమము** :- అహం సుగ్రీవవచనాత్ పురుషవ్యాఘ్రౌ, రూపలక్షణసంపన్నౌ, తౌ ప్రభూ కృతాంజలిః (సన్) ఉపస్థితః.

**ప్రతిపదార్థము** :- అహం = నేను, సుగ్రీవవచనాత్ = సుగ్రీవుని ఆజ్ఞవలన, పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులైన, రూపలక్షణసంపన్నౌ = సౌందర్యముతోడను ఉత్తమలక్షణములతోడను కూడియున్నట్టి, తౌ ప్రభూ = ఆ స్వాముల నిరువురిని, కృతాంజలిః = దోసిలి ఒగ్గినవాడనై, ఉపస్థితః = సమీపించినాడను.

**తాత్పర్యము** :- నేను అప్పుడు సుగ్రీవుని ఆదేశము ననుసరించి, గొప్ప సౌందర్యము తోను, మహాపురుషలక్షణములతోను, వెలయుచున్న ఆ పురుషసింహుల కడకుపోయి దోసిలి ఒగ్గి వినయముతో చేరి నిలచితిని.

**శ్లో॥ తౌ పరిజ్ఞాతతత్త్వార్థౌ మయా ప్రీతిసమన్వితౌ ।**
**పృష్ఠ మారోప్య తం దేశం ప్రాపితౌ పురుషర్షభౌ ॥ 31**
**నివేదితౌ చ తత్త్వేన సుగ్రీవాయ మహాత్మనే ॥**

**పదచ్ఛేదము** :- తౌ - పరిజ్ఞాతతత్త్వార్థౌ - మయా - ప్రీతిసమన్వితౌ - పృష్ఠమ్ - ఆరోప్య - తం - దేశం - ప్రాపితౌ - పురుషర్షభౌ - నివేదితౌ - చ - తత్త్వేన - సుగ్రీవాయ - మహాత్మనే ॥

**అన్వయక్రమము** :– తౌ పురుషవ్యాఘ్రౌ మయా పరిజ్ఞాతతత్త్వార్థౌ, ప్రీతిసమన్వితౌ పృష్ఠమ్ ఆరోప్య తం దేశం ప్రాపితౌ; మహాత్మనే సుగ్రీవాయ తత్త్వేన నివేదితౌ చ.

**ప్రతిపదార్థము** :– తౌ పురుషవ్యాఘ్రౌ = ఆ పురుషశ్రేష్ఠు లిరువురును, మయా = నాచేత, పరిజ్ఞాతతత్త్వార్థౌ = తెలియచేయబడిన యథార్థవిషయముగలవారై, ప్రీతిసమన్వితౌ = సంతోషముతో గూడినవా రగుచు, పృష్ఠమ్ ఆరోప్య = (నా) వీపుపై నెక్కించుకొని, తం దేశం = (సుగ్రీవుడున్న) ఆ ప్రదేశమును, ప్రాపితౌ = చేర్చబడినారు, మహాత్మనే = మహానుభావుడైన, సుగ్రీవాయ = సుగ్రీవునకు, తత్త్వేన = యథార్థవిషయముచే, నివేదితౌ చ = విన్నవింపబడినారు కూడను.

**తాత్పర్యము** :– పిమ్మట పురుషశ్రేష్ఠులైన ఆ సోదరులు నానుండి మా చరిత్రనంతను తెలిసికొని సంతోషము నొందిరి. పిమ్మట నేను వారిని నా వీపుపై నెక్కించుకొని సుగ్రీవుని కడకు తీసికొనివచ్చి అతనికి వారిరువురి చరిత్రను విన్నవించితిని.

**శ్లో॥ తయో రన్యోన్యసంభాషా ద్భృశం ప్రీతి రజాయత ॥**

**పదచ్ఛేదము** :– తయోః – అన్యోన్యసంభాషాత్ – భృశం – ప్రీతిః – అజాయత ॥

**అన్వయక్రమము** :– తయోః అన్యోన్యసంభాషాత్ భృశం ప్రీతిః అజాయత.

**ప్రతిపదార్థము** :– తయోః = ఆ రామసుగ్రీవులకు, అన్యోన్యసంభాషాత్ = పరస్పర సంభాషణము వలన, భృశం = మిక్కిలిగా, ప్రీతిః అజాయత = పరస్పర ప్రేమ జనించెను.

**శ్లో॥ తత్ర తౌ కీర్తిసంపన్నౌ హరీశ్వరనరేశ్వరౌ ।**
**పరస్పరకృతాశ్వాసౌ కథయా పూర్వవృత్తయా ॥ 32**

**పదచ్ఛేదము** :– తత్ర – తౌ – కీర్తిసంపన్నౌ – హరీశ్వరనరేశ్వరౌ – పరస్పర కృతాశ్వాసౌ – కథయా – పూర్వవృత్తయా ॥

**అన్వయక్రమము** :– తత్ర కీర్తిసంపన్నౌ, తౌ హరీశ్వరనరేశ్వరౌ, పూర్వవృత్తయా కథయా పరస్పరకృతాశ్వాసౌ (అభవతామ్).

**ప్రతిపదార్థము** :– తత్ర = ఆ సమయమునందు, కీర్తిసంపన్నౌ = గొప్ప ప్రతిష్ఠనొంది యున్నట్టి, తౌ హరీశ్వరనరేశ్వరౌ = ఆ సుగ్రీవుడును, శ్రీరాముడును, పూర్వవృత్తయా = పూర్వముజరిగినట్టి, కథయా = చరిత్రచే, పరస్పరకృతాశ్వాసౌ = ఒండొరులను ఓదార్చుకొన్నవారు, (అభవతామ్) = అయిరి.

**తాత్పర్యము** :- అప్పుడు తమ పూర్వచరిత్రచే గొప్ప విఖ్యాతి గల్గిన ఆ రామసుగ్రీవు లిరువురును తాత్కాలికములైనట్టి తమ తమ విషాదగాథలను ఒకరి కొకరు తెలుపుకొనుచు ఊరట నొందిరి.

**శ్లో॥ తం తత స్సాంత్వయామాస సుగ్రీవం లక్ష్మణాగ్రజః ।**
**స్త్రీహేతో ర్వాలినా భ్రాత్రా నిరస్త మురుతేజసా ॥ 33**

**పదచ్ఛేదము** :- తం - తతః - సాంత్వయామాస - సుగ్రీవం - లక్ష్మణాగ్రజః - స్త్రీహేతోః - వాలినా - భ్రాత్రా - నిరస్తమ్ - ఉరుతేజసా ॥

**అన్వయక్రమము** :- తతః లక్ష్మణాగ్రజః ఉరుతేజసా, భ్రాత్రా వాలినా స్త్రీహేతోః నిరస్తం తం సుగ్రీవం సాంత్వయామాస.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, లక్ష్మణాగ్రజః = శ్రీరాముడు, ఉరుతేజసా = మహాప్రతాపసంపన్నుడైన, భ్రాత్రా వాలినా = సోదరుడైన వాలిచే, స్త్రీహేతోః = భార్యకారణముగా, నిరస్తం = వెడలగొట్టబడిన, తం సుగ్రీవం = ఆ సుగ్రీవుని, సాంత్వయామాస = ఓదార్చెను.

**తాత్పర్యము** :- పిమ్మట శ్రీరాముడు - గొప్ప పరాక్రమము గల్గిన తన సోదరుడైన వాలి తన భార్యను అపహరించి, తనను రాజ్యము నుండి వెడలగొట్టగా వ్యథనొందు చున్నట్టి ఆ సుగ్రీవుని ప్రేమవచనములతో నూరడించెను.

**శ్లో॥ తత స్త్వన్నాశజం శోకం రామ స్యాక్లిష్టకర్మణః ।**
**లక్ష్మణో వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్ ॥ 34**

**పదచ్ఛేదము** :- తతః - త్వన్నాశజం - శోకం - రామస్య - అక్లిష్టకర్మణః - లక్ష్మణః - వానరేంద్రాయ - సుగ్రీవాయ - న్యవేదయత్ ॥

**అన్వయక్రమము** :- తతః లక్ష్మణః అక్లిష్టకర్మణః రామస్య త్వన్నాశజం శోకం వానరేంద్రాయ సుగ్రీవాయ న్యవేదయత్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, లక్ష్మణః = లక్ష్మణుడు, వానరేంద్రాయ = వానరశ్రేష్ఠుడైనట్టి, సుగ్రీవాయ = సుగ్రీవునకు, అక్లిష్టకర్మణః = పరులకు క్లేశములు గల్గింపని కృత్యములు కలిగినట్టి, రామస్య = శ్రీరామునియొక్క, త్వన్నాశజం = నీ వియోగముచే గలిగినట్టి, శోకం = దిగులునుగూర్చి, న్యవేదయత్ = ఎఱుకపఱచెను.

**తాత్పర్యము** :- అటుపిమ్మట సుగ్రీవునికి లక్ష్మణుడు నీ వియోగమువలన రామభద్రునికి

కలిగిన శోకపరిస్థితినంతను గూర్చి తెలిపెను.

**శ్లో॥ స శ్రుత్వా వానరేంద్రస్తు లక్ష్మణే నేరితం వచః ।**
**త దాసీ న్నిష్ప్రభోఽ త్యర్థం గ్రహగ్రస్త ఇవాంశుమాన్ ॥ 35**

**పదచ్ఛేదము** :– సః – శ్రుత్వా – వానరేంద్రః – తు – లక్ష్మణేన – ఈరితం – వచః – తదా – ఆసీత్ – నిష్ప్రభః – అత్యర్థం – గ్రహగ్రస్తః – ఇవ – అంశుమాన్ ॥

**అన్వయక్రమము** :– సః వానరేంద్రః లక్ష్మణేన ఈరితం వచః శ్రుత్వా, తదా గ్రహగ్రస్తః అంశుమాన్ ఇవ అత్యర్థం నిష్ప్రభః ఆసీత్ ॥

**ప్రతిపదార్థము** :– సః వానరేంద్రః = ఆ వానరశ్రేష్ఠుడగు సుగ్రీవుడు, లక్ష్మణేన = లక్ష్మణునిచే, ఈరితం = చెప్పబడినట్టి, వచః = మాటను, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, గ్రహగ్రస్తః = రాహువుచే మ్రింగబడిన, అంశుమాన్ ఇవ = సూర్యుడువలె, అత్యర్థం = మిక్కిలి, నిష్ప్రభః = తేజోరహితుడు, ఆసీత్ = ఆయెను.

**తాత్పర్యము** :– అప్పుడు లక్ష్మణుడు తెలిపిన వృత్తాంత మంతయును విని సుగ్రీవుడు రాహువుచే గ్రసించబడిన సూర్యబింబమువలె మిక్కిలి విచారముతో తేజోవిహీనుడయ్యెను.

**శ్లో॥ తత స్త్వద్గాత్రశోభీని రక్షసా హ్రియమాణయా ।**
**యా న్యాభరణజాలాని పాతితాని మహీతలే ॥ 36**

**శ్లో॥ తాని సర్వాణి రామాయ ఆనీయ హరియూథపాః ।**
**సంహృష్టా దర్శయామాసుః గతిం తు న విదుస్తవ ॥ 37**

**పదచ్ఛేదము** :– తతః – త్వద్గాత్రశోభీని – రక్షసా – హ్రియమాణయా – యాని – ఆభరణజాలాని – పాతితాని – మహీతలే, తాని – సర్వాణి – రామాయ – ఆనీయ – హరియూథపాః – సంహృష్టాః – దర్శయామాసుః – గతిం – తు – న – విదుః – తవ ॥

**అన్వయక్రమము** :– తతః రక్షసా హ్రియమాణయా (త్వయా) త్వద్గాత్రశోభీని యాని ఆభరణజాలాని మహీతలే పాతితాని, తాని సర్వాణి ఆనీయ సంహృష్టాః హరియూథపాః రామాయ దర్శయామాసుః. (తే) తవ గతిం తు న విదుః.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, రక్షసా = రావణునిచే, హ్రియమాణయా = అపహరింపబడుచున్నట్టి, (త్వయా = నీచేత), త్వద్గాత్రశోభీని = నీ శరీరముపై

ప్రకాశించుచున్నట్టి, యాని ఆభరణజాలాని = ఏ భూషణముల సమూహములు, మహీతలే = నేలపై, పాతితాని = పడవేయబడినవో, తాని సర్వాణి = వాని నన్నింటిని, ఆనీయ = తీసికొనివచ్చి, సంహృష్టాః = సంతోషము నొందియున్నవారై, హరియూథపాః = వానరవీరులు, రామాయ = శ్రీరామునకు, దర్శయామాసుః = చూపించిరి, (తే = ఆ వానరవీరులు) తవ = నీ యొక్క, గతిం తు = ఉనికిని మాత్రము, న విదుః = ఎఱుగరు.

**తాత్పర్యము :-** అప్పుడు నిన్ను రావణాసురుడు అపహరించుకొని పోవుచున్నప్పుడు ఆకసమునుండి నీవు నీ యొడలిపై వెలయుచున్న ఏ యాభరణములను తీసివైచి నేలపై క్రిందికి పడవేసితివో ఆ యాభరణముల నన్నింటిని తీసికొనివచ్చి మా వానర వీరులు సంతోషముతో ఆనవాలుగా చూపుటకై శ్రీరామునకు ప్రదర్శించిరి. కాని వారికి నీ వెచ్చట నున్నావో మాత్రము తెలియకుండెను.

**శ్లో॥ తాని రామాయ దత్తాని మయై వోపహృతాని చ ।**
**స్వనవం త్యవకీర్ణాని తస్మిన్ విహతచేతసి ॥ 38**

**పదచ్ఛేదము :-** తాని - రామాయ - దత్తాని - మయా - ఏవ - ఉపహృతాని - చ - స్వనవంతి - అవకీర్ణాని - తస్మిన్ - విహతచేతసి ॥

**అన్వయక్రమము :-** తస్మిన్ విహతచేతసి (సతి) స్వనవంతి, అవకీర్ణాని, ఉపహృతాని తాని మయైవ రామాయ దత్తాని.

**ప్రతిపదార్థము :-** తస్మిన్ = ఆ శ్రీరాముడు, విహతచేతసి (సతి) = స్పృహ తప్పినవాడై యుండగా, స్వనవంతి = చప్పుడగుచున్నట్టివియును, అవకీర్ణాని = చెదరిపోయి యున్నట్టివియును, ఉపహృతాని = తేబడినట్టివియును అగు, తాని = ఆ యాభరణములు, మయైవ = నాచేతనే, రామాయ = శ్రీరామునకు, దత్తాని = ఈయబడినవి.

**తాత్పర్యము :-** ఆయాభరణములను కనుగొనగనే ప్రియాసంస్మరణముచే శ్రీరాముడు స్పృహను గోల్పోయెను. గల గల మను చప్పుడుతో నేలపై బడి చెదరిపోయినట్టి, ఆ యాభరణములను అక్కడ మావానరులు తెచ్చియుంచగా వాటిని నేనే శ్రీరాముని చేత నుంచితిని.

**శ్లో॥ తా న్యంకే దర్శనీయాని కృత్వా బహువిధం తదా ।**
**తేన దేవప్రకాశేన దేవేన పరిదేవితమ్ ॥ 39**

**పదచ్ఛేదము** :– తాని – అంకే – దర్శనీయాని – కృత్వా – బహువిధం – తదా – తేన – దేవప్రకాశేన – దేవేన – పరిదేవితమ్ ॥

**అన్వయక్రమము** :– తదా దేవప్రకాశేన తేన దేవేన దర్శనీయాని తాని అంకే కృత్వా బహువిధం పరిదేవితమ్.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, దేవప్రకాశేన = దేవతలతో సమానమైన తేజస్సు కల్గినట్టి, తేన దేవేన = ఆ పూజ్యునిచే, దర్శనీయాని = మనోహరములైనట్టి, తాని = ఆ యాభరణములను, అంకే కృత్వా = ఒడిలో నుంచుకొని, బహువిధం = పలువిధములుగా, పరిదేవితమ్ = దుఃఖింపబడెను.

**తాత్పర్యము** :– దేవతలతో సమానమైన తేజస్సుగల ఆ మహనీయుడు అప్పుడు కన్నుల పండువుగా కానవచ్చిన ఆ యాభరణములను తీసికొని తమ ఒడిలో నుంచుకొని పరిపరివిధములుగా విలపింప దొడగెను.

**శ్లో॥ పశ్యత స్తాని రుదత స్తామ్యతశ్చ పునః పునః ।**
**ప్రాదీపయ ద్దాశరథే స్తదా శోకహుతాశనమ్ ॥ 40**

**పదచ్ఛేదము** :– పశ్యతః – తాని – రుదతః – తామ్యతః – చ – పునః – పునః – ప్రాదీపయత్ – దాశరథేః – తదా – శోకహుతాశనమ్ ॥

**అన్వయక్రమము** :– తదా తాని పునః పునః పశ్యతః, రుదతః, తామ్యతః దాశరథేః (తత్) శోకహుతాశనం ప్రాదీపయత్.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, తాని = ఆ యాభరణములను, పునః పునః = మఱల మఱల, పశ్యతః = చూచుచున్నవాడును, రుదతః = శోకించుచున్న వాడును, తామ్యతః = కుమిలి పోవుచున్నవాడు నగు, దాశరథేః = శ్రీరామునికి, (తత్ = ఆ యాభరణ దర్శనము) శోకహుతాశనం = శోకాగ్నిని, ప్రాదీపయత్ = ప్రజ్వలింప చేసెను.

**తాత్పర్యము** :– అప్పు డా యాభరణములను మఱల మఱల చూచుచు శోకించుచు, తాపము నొందుచున్న ఆ శ్రీరామునికి తన హృదయమందున్న శోకాగ్ని ఒక్క మాఱుగా ప్రజ్వలింప దొడగెను.

**శ్లో॥ శాయితం చ చిరం తేన దుఃఖార్తేన మహాత్మనా ।**
**మయాపి వివిధై ర్వాక్యైః కృచ్ఛ్రాదుత్థాపితః పునః ॥ 41**

**పదచ్ఛేదము** :- శాయితం - చ - చిరం - తేన - దుఃఖార్తేన - మహాత్మనా - మయా - అపి - వివిధైః - వాక్యైః - కృచ్ఛ్రాత్ - ఉత్థాపితః - పునః ॥

**అన్వయక్రమము** :- దుఃఖార్తేన తేన మహాత్మనా చిరం శాయితం చ; మయా అపి వివిధైః వాక్యైః పునః కృచ్ఛ్రాత్ ఉత్థాపితః ॥

**ప్రతిపదార్థము** :- దుఃఖార్తేన = దుఃఖపీడితుడైనట్టి, తేన మహాత్మనా = ఆ మహనీయునిచే, చిరం = చిరకాలము, శాయితం చ = మూర్ఛనొందబడెను, మయా అపి = నాచేతకూడ, వివిధైః వాక్యైః = పలువిధములగు వచనములతో, పునః = తిరిగి, కృచ్ఛ్రాత్ = అతికష్టమున, ఉత్థాపితః = లేవనెత్తబడెను.

**తాత్పర్యము** :- శ్రీరాముడు దుర్భరమైనట్టి ఆ దుఃఖముచే చాలసేపటివఱకు మూర్ఛితుడై యుండెను. సుగ్రీవాదివానరులును నేనును గూడ బహువిధములగు సాంత్వన వచనములతో ఆతనిని అతికష్టము మీద స్పృహ నొందునట్లు చేయ గలిగితిమి.

**శ్లో॥ తాని దృష్ట్వా మహార్హాణి దర్శయిత్వా ముహుర్ముహుః ।**
**రాఘవ స్సహసౌమిత్రిః సుగ్రీవే సంన్యవేశయత్ ॥ 42**

**పదచ్ఛేదము** :- తాని - దృష్ట్వా - మహార్హాణి - దర్శయిత్వా - ముహుః - ముహుః - రాఘవః - సహసౌమిత్రిః - సుగ్రీవే - సంన్యవేశయత్ ॥

**అన్వయక్రమము** :- సహసౌమిత్రిః రాఘవః మహార్హాణి తాని ముహుర్ముహుః దృష్ట్వా దర్శయిత్వా సుగ్రీవే సంన్యవేశయత్.

**ప్రతిపదార్థము** :- సహసౌమిత్రిః = లక్ష్మణునితో గూడిన, రాఘవః = శ్రీరాముడు, మహార్హాణి = అమూల్యములైనట్టి, తాని = ఆ యాభరణములను, ముహుర్ముహుః = మఱల మఱల, దృష్ట్వా = చూచి, దర్శయిత్వా = (మాకు) చూపించి, సుగ్రీవే = సుగ్రీవుని అధీనమునందు, సంన్యవేశయత్ = ఉంచెను.

**తాత్పర్యము** :- ఆ యాభరణముల నన్నింటిని పెక్కు మాఱులు చూచి చూచి తన చుట్టునున్న మాయెల్లరకును చూపి చూపి వానిని భద్రపఱచుమని సుగ్రీవుని కొసగెను.

**శ్లో॥ స తవాదర్శనా దార్యే రాఘవః పరితప్యతే ।**
**మహతా జ్వలతా నిత్య మగ్నినే వాగ్నిపర్వతః ॥ 43**

**పదచ్ఛేదము** :- సః - తవ - అదర్శనాత్ - ఆర్యే - రాఘవః - పరితప్యతే - మహతా - జ్వలతా - నిత్యమ్ - అగ్నినా - ఇవ - అగ్నిపర్వతః ॥

**అన్వయక్రమము** :– ఆర్యే! రాఘవః తవ అదర్శనాత్ మహతా, జ్వలతా అగ్నినా అగ్నిపర్వతః ఇవ నిత్యం పరితప్యతే.

**ప్రతిపదార్థము** :– ఆర్యే! = ఓ పూజ్యురాలా! రాఘవః = శ్రీరాముడు, తవ అదర్శనాత్ = నీవు కాన్పింపకుండుటవలన, మహతా = గొప్పదైన, జ్వలతా అగ్నినా = మండుచున్నట్టి అగ్నిచే, అగ్నిపర్వతః ఇవ = అగ్నిపర్వతమువలె, నిత్యం = నిత్యము, పరితప్యతే = మిక్కిలి తాపము నొందింపబడుచున్నాడు.

**తాత్పర్యము** :– ఓ పూజ్యురాలా! శ్రీరాముడు నీవు కాన్పింపక పోవుటచే తీవ్రమైన జ్వాలలతో మండుచున్న అగ్నిపర్వతమువలె తనలో అహర్నిశలు ఎంతగనో పరితాపము నొందుచున్నాడు సుమా!

**శ్లో॥ త్వత్కృతే త మనిద్రా చ శోక శ్చింతా చ రాఘవమ్ ।**
**తాపయంతి మహాత్మాన మగ్న్యగార మివాగ్నయః ॥ 44**

**పదచ్ఛేదము** :– త్వత్కృతే – తమ్ – అనిద్రా – చ – శోకః – చింతా – చ రాఘవమ్, తాపయంతి – మహాత్మానమ్ – అగ్న్యగారమ్ – ఇవ – అగ్నయః ॥

**అన్వయక్రమము** :– మహాత్మానం తం త్వత్కృతే అనిద్రా చ, శోకశ్చ, చింతా చ అగ్న్యగారమ్ అగ్నయః ఇవ తాపయంతి.

**ప్రతిపదార్థము** :– మహాత్మానం తం = మహాత్ముడైన ఆ శ్రీరాముని, త్వత్కృతే = నీ కారణముగా, అనిద్రా చ = నిద్ర లేకపోవుటయును, శోకశ్చ = దుఃఖమును, చింతా చ = చింతయును, అగ్న్యగారం = అగ్నిగృహమును, అగ్నయః ఇవ = అగ్నులువలె, తాపయంతి = తపింపజేయుచున్నవి.

**తాత్పర్యము** :– నీ కారణముగా మహాత్ముడైన ఆ శ్రీరామునికి నిద్రలేకున్నది. అతనికి దుఃఖముతో చింతతో కలిగిన వేదనలు అగ్నిగృహమును ఆగ్నులు జ్వలింపచేసినట్లుగా అపరిమితమైన తాపము కల్గించుచున్నవి.

**శ్లో॥ త వాదర్శనశోకేన రాఘవః పరిచాల్యతే ।**
**మహతా భూమికంపేన మహా నివ శిలోచ్చయః ॥ 45**

**పదచ్ఛేదము** :– తవ – అదర్శనశోకేన – రాఘవః – పరిచాల్యతే – మహతా – భూమికంపేన – మహాన్ – ఇవ – శిలోచ్చయః ॥

**అన్వయక్రమము** :– రాఘవః తవ అదర్శనశోకేన, మహతా భూమికంపేన మహాన్

శిలోచ్చయః ఇవ పరిచాల్యతే ॥

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, తవ = నీయొక్క, అదర్శనశోకేన = కనపడక పోవుటవలన కలిగిన దుఃఖముచే, మహతా = గొప్పదైన, భూమికంపేన = భూకంపముచే, మహాన్ = గొప్పదైన, శిలోచ్చయః ఇవ = పర్వతమువలె, పరిచాల్యతే = కంపింప చేయబడుచున్నాడు.

**తాత్పర్యము** :- నీవు కాన్పింప కుండుటచే గలిగిన దుఃఖముచే, శ్రీరాముడు పెద్ద భూకంపమునకు మహాపర్వతము కంపించినట్లుగా కంపించి పోవుచున్నాడు సుమా.

**శ్లో॥ కాననాని సురమ్యాణి నదీప్రస్రవణాని చ ।**
**చర న్న రతి మాప్నోతి త్వా మపశ్య న్నృపాత్మజే ॥ 46**

**పదచ్ఛేదము** :- కాననాని - సురమ్యాణి - నదీప్రస్రవణాని చ - చరన్ - న - రతిమ్ - ఆప్నోతి - త్వామ్ - అపశ్యన్ - నృపాత్మజే ॥

**అన్వయక్రమము** :- నృపాత్మజే, (రామః) త్వామ్ అపశ్యన్ సురమ్యాణి కాననాని, నదీప్రస్రవణాని చ చరన్ రతిం న ఆప్నోతి.

**ప్రతిపదార్థము** :- నృపాత్మజే = ఓ రాజపుత్రీ! (రామః = శ్రీరాముడు) త్వామ్ అపశ్యన్ = నిన్ను గానక, సురమ్యాణి = మిక్కిలి మనోహరములైన, కాననాని = వనములను, నదీప్రస్రవణాని చ = నదులను, సెలయేళ్లను, చరన్ = పర్యటించుచు, రతిం = వేడుకను, న ఆప్నోతి = పొందుటలేదు.

**తాత్పర్యము** :- ఓ జానకీ! శ్రీరాముడు, నీవు కానరాకుండుటచే ఎంతయో రమ్యములైన వనములందును, నదీతీరములందును, సెలయేళ్ళ సమీపమునను సంచరించు చున్నప్పటికిని తన మనస్సున ఎట్టి ఆనందము నొందలేక పోవుచున్నాడుసుమా!

**శ్లో॥ స త్వాం మనుజశార్దూలః క్షిప్రం ప్రాప్స్యతి రాఘవః ।**
**సమిత్రబాంధవం హత్వా రావణం జనకాత్మజే ॥ 47**

**పదచ్ఛేదము** :- సః - త్వాం - మనుజశార్దూలః - క్షిప్రం - ప్రాప్స్యతి - రాఘవః, సమిత్రబాంధవం - హత్వా - రావణం - జనకాత్మజే ॥

**అన్వయక్రమము** :- జనకాత్మజే! మనుజశార్దూలః సః రాఘవః సమిత్రబాంధవం రావణం హత్వా త్వాం క్షిప్రం ప్రాప్స్యతి.

**ప్రతిపదార్థము** :- జనకాత్మజే! = ఓ జనకనందినీ! మనుజశార్దూలః = పురుష

శ్రేష్ఠుడైన, సః రాఘవః = ఆ శ్రీరాముడు, సమిత్రబాంధవం = మిత్రులతోడను బంధువుల తోడను గూడిన, రావణం = రావణాసురుని, హత్వా = చంపి, త్వాం = నిన్ను, క్షిప్రం = త్వరలో, ప్రాప్స్యతి = పొందగలడు.

**తాత్పర్యము** :– ఓ జనకరాజకుమారీ! మానవసింహుడైన ఆ వీరుడు మిత్రబంధు సమేతముగా రావణుని యుద్ధమున హతమార్చి నిన్ను అచిరకాలములోనే చేరుకొన గలడు సుమా!

**శ్లో॥ సహితౌ రామసుగ్రీవా వుభా వకురుతాం తదా ।**
**సమయం వాలినం హంతుం తవ చాన్వేషణం ప్రతి ॥ 48**

**పదచ్ఛేదము** :– సహితౌ – రామసుగ్రీవౌ – ఉభౌ – అకురుతాం – తదా – సమయం – వాలినం – హంతుం – తవ – చ – అన్వేషణం – ప్రతి ॥

**అన్వయక్రమము** :– తదా సహితౌ రామసుగ్రీవౌ ఉభౌ వాలినం హంతుం, తవ అన్వేషణం ప్రతి చ సమయం అకురుతామ్.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, సహితౌ = కలిసికొన్నట్టి, రామసుగ్రీవౌ ఉభౌ = రామసుగ్రీవు లిరువురును, వాలినం హంతుం = వాలిని వధించుటకు, తవ అన్వేషణం ప్రతి చ = నీ అన్వేషణమును గూర్చియును, సమయం అకురుతామ్ = ప్రతిజ్ఞను చేసిరి.

**తాత్పర్యము** :– అప్పుడు రామసుగ్రీవు లిరువురును పరస్పరసహకారముతో వాలిని సంహరించుటకును, నిన్ను వెదకి తెలిసికొనుటకును కలిసి ప్రతిజ్ఞచేసిరి.

**శ్లో॥ తత స్తాభ్యాం కుమారాభ్యాం వీరాభ్యాం స హరీశ్వరః ।**
**కిష్కింధాం సముపాగమ్య వాలీ యుద్ధే నిపాతితః ॥ 49**

**పదచ్ఛేదము** :– తతః – తాభ్యాం – కుమారాభ్యాం – వీరాభ్యాం – సః – హరీశ్వరః, కిష్కింధాం – సముపాగమ్య – వాలీ – యుద్ధే – నిపాతితః ॥

**అన్వయక్రమము** :– తతః సః హరీశ్వరః కిష్కింధాం సముపాగమ్య వీరాభ్యాం తాభ్యాం కుమారాభ్యాం వాలీ యుద్ధే నిపాతితః.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, సః హరీశ్వరః = ఆ వానరరాజైన సుగ్రీవుడు, కిష్కింధాం = కిష్కంధకు, సముపాగమ్య = చేరి, వీరాభ్యాం = వీరులైనట్టి, తాభ్యాం = ఆ, కుమారాభ్యాం = రాజపుత్రులచే, వాలీ = వాలి, యుద్ధే = యుద్ధమునందు,

నిపాతితః = కూల్చబడెను.

**తాత్పర్యము :-** అటుపిమ్మట సుగ్రీవుడు రామలక్ష్మణు లిరువురుతో కలిసి కిష్కింధ చేరుకొని వాలితో యుద్ధము చేసి ఆతనిని నేలగూల జేసెను.

**శ్లో॥ తతో నిహత్య తరసా రామో వాలిన మాహవే ।**
**సర్వర్క్షహరిసైన్యానాం సుగ్రీవ మకరో త్పతిమ్ ॥ 50**

**పదచ్ఛేదము :-** తతః - నిహత్య - తరసా - రామః - వాలినమ్ - ఆహవే - సర్వర్క్ష హరిసైన్యానాం - సుగ్రీవమ్ - అకరోత్ - పతిమ్ ॥

**అన్వయక్రమము :-** తతః రామః తరసా ఆహవే వాలినం నిహత్య సుగ్రీవం సర్వర్క్ష హరిసైన్యానాం పతిమ్ అకరోత్.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, రామః = శ్రీరాముడు, తరసా = బలముచే, ఆహవే = యుద్ధమునందు, వాలినం = వాలిని, నిహత్య = పరిమార్చి, సుగ్రీవం = సుగ్రీవుని, సర్వర్క్షహరిసైన్యానాం = సమస్తమైన భల్లూకములయొక్కయు వానరుల యొక్కయు సైన్యములకు, పతిం = రాజునుగా, అకరోత్ = చేసెను.

**తాత్పర్యము :-** అటు పిమ్మట శ్రీరాముడు తన పరాక్రమవిశేషముచే వాలిని యుద్ధమున సంహరించి సుగ్రీవుని సమస్తమైన భల్లూకములకును వానరములకును, ప్రభువు నొనరించెను.

**శ్లో॥ రామసుగ్రీవయో రైక్యం దే వ్యేవం సమజాయత ।**
**హనూమంతం చ మాం విద్ధి తయో ర్దూతమిహాగతమ్ ॥ 51**

**పదచ్ఛేదము :-** రామసుగ్రీవయోః - ఐక్యం - దేవి - ఏవం - సమజాయత - హనూమంతం - చ - మాం - విద్ధి - తయోః - దూతమ్ - ఇహ - ఆగతమ్ ॥

**అన్వయక్రమము :-** దేవి; ఏవం రామసుగ్రీవయోః ఐక్యం సమజాయత; మాం తయోః (సకాశాత్) ఉపాగతం దూతం హనుమంతం విద్ధి.

**ప్రతిపదార్థము :-** దేవి = ఓ పూజ్యురాలా! ఏవం = ఈరీతిగా, రామసుగ్రీవయోః = రామసుగ్రీవులకు, ఐక్యం = మైత్రి, సమజాయత = ఏర్పడినది, మాం = నన్ను, తయోః = వారియొక్క (సకాశాత్ = సన్నిధినుండి) ఉపాగతం = వచ్చినట్టి, దూతం = దూతయైన, హనుమంతం = హనుమంతునిగా, విద్ధి = తెలిసికొనుము.

**తాత్పర్యము :-** దేవీ! రామసుగ్రీవుల కీవిధముగ మైత్రి ఏర్పడినది. వారి సన్నిధి

నుండియే వచ్చిన దూతను నేను. నన్ను హనుమంతుడని యందురు.

**శ్లో॥ స్వం రాజ్యం ప్రాప్య సుగ్రీవః స్వా నానీయ మహాకపీన్ ।**
**త్వదర్థం ప్రేషయామాస దిశో దశ మహాబలాన్ ॥ 52**

**పదచ్ఛేదము** :- స్వం - రాజ్యం - ప్రాప్య - సుగ్రీవః - స్వాన్ - ఆనీయ - మహాకపీన్ - త్వదర్థం - ప్రేషయామాస - దిశః - దశ - మహాబలాన్ ॥

**అన్వయక్రమము** :- సుగ్రీవః స్వం రాజ్యం ప్రాప్య, స్వాన్ మహాబలాన్ మహాకపీన్ ఆనీయ త్వదర్థే దశదిశః ప్రేషయామాస.

**ప్రతిపదార్థము** :- సుగ్రీవః = సుగ్రీవుడు, స్వం రాజ్యం = తన రాజ్యమును, ప్రాప్య = పొంది, స్వాన్ = తన వారైన, మహాబలాన్ = అమిత బలాఢ్యులైన, మహాకపీన్ = వానరవీరులను, ఆనీయ = రప్పించి, త్వదర్థే = నీ కొఱకై, దశదిశః = పది దిక్కులను గూర్చి, ప్రేషయామాస = పంపించెను.

**తాత్పర్యము** :- సుగ్రీవుడు తన రాజ్యమును తిరిగి సంపాదించుకొన్న పిమ్మట నలుమూలల నున్న మహాబలశాలురైన తన వానరవీరుల నెల్లరను నగరమునకు రప్పించి నిన్ను వెదుకుటకొఱకై ఎల్ల దిక్కులకును పంపెను.

**శ్లో॥ ఆదిష్టా వానరేంద్రేణ సుగ్రీవేణ మహౌజసః ।**
**అద్రిరాజప్రతీకాశా స్సర్వతః ప్రస్థితా మహీమ్ ॥ 53**

**పదచ్ఛేదము** :- ఆదిష్టాః - వానరేంద్రేణ - సుగ్రీవేణ - మహౌజసః - అద్రిరాజ ప్రతీకాశాః - సర్వతః - ప్రస్థితాః - మహీమ్ ॥

**అన్వయక్రమము** :- వానరేంద్రేణ సుగ్రీవేణ ఆదిష్టాః మహౌజసః అద్రిరాజప్రతీకాశాః (వానరాః) మహీం సర్వతః ప్రస్థితాః.

**ప్రతిపదార్థము** :- వానరేంద్రేణ = వానరప్రభువయిన, సుగ్రీవేణ = సుగ్రీవునిచే, ఆదిష్టాః = ఆజ్ఞాపింపబడినవారై, మహౌజసః = మహాప్రతాపసంపన్నులును, అద్రిరాజప్రతీకాశాః = మహాపర్వతసన్నిభులును అగు, వానరాః = వానరులు, మహీం = భూమిని, సర్వతః = అంతటను, ప్రస్థితాః = బయలువెడలిరి.

**తాత్పర్యము** :- వానరరాజైన సుగ్రీవునిచే ఆజ్ఞాపింపబడినట్టి, మహాపరాక్రమ సంపన్నులైన మహాపర్వతసన్నిభులగు ఆ వానరవీరులు భూమిపై నెల్లయెడలను నిన్ను వెదకుటకై బయలుదేరి వెడలిరి.

**శ్లో॥ తత స్తే మార్గమాణా వై సుగ్రీవవచనాతురాః ।**
**చరంతి వసుధాం కృత్స్నాం వయ మన్యే చ వానరాః ॥ 54**

**పదచ్ఛేదము** :- తతః - తే - మార్గమాణాః - వై - సుగ్రీవవచనాతురాః - చరంతి - వసుధాం - కృత్స్నాం - వయమ్ - అన్యే - చ - వానరాః ॥

**అన్వయక్రమము** :- తతః సుగ్రీవవచనాతురాః తే వయం, అన్యే వానరాశ్చ కృత్స్నాం వసుధాం మార్గమాణాః చరంతి.

**ప్రతిపదార్థము** :- తతః = అటు పిమ్మట, సుగ్రీవవచనాతురాః = సుగ్రీవుని ఆజ్ఞకు భీతినొందినవారమై, తే వయం = అట్టి మేము, అన్యే వానరాశ్చ = ఇతరులైన వానరులును, కృత్స్నాం వసుధాం = సమస్తమైన భూమిని, మార్గమాణాః = వెదకుచున్నవారై, చరంతి = పరిభ్రమించుచున్నారు.

సూచన :- 'సుగ్రీవవచనానుగాః' అని పాఠాంతరము అనగా సుగ్రీవుని మాటను అనుసరించినవారమై.

**తాత్పర్యము** :- అటుపిమ్మట సుగ్రీవుని ఆజ్ఞకు బద్ధులమై మేమును, ఇతర వానరులమును నిన్ను వెదకుచున్నవారమై భూమండలము నంతటను పరిభ్రమించు చుంటిమి.

**శ్లో॥ అంగదో నామ లక్ష్మీవా న్వాలిసూను ర్మహాబలః ।**
**ప్రస్థితః కపిశార్దూల స్త్రిభాగబలసంవృతః ॥ 55**

**పదచ్ఛేదము** :- అంగదః - నామ - లక్ష్మీవాన్ - వాలిసూనుః - మహాబలః - ప్రస్థితః - కపిశార్దూలః - త్రిభాగబలసంవృతః ॥

**అన్వయక్రమము** :- అంగదః నామ లక్ష్మీవాన్ మహాబలః కపిశార్దూలః వాలిసూనుః త్రిభాగబలసంవృతః ప్రస్థితః.

**ప్రతిపదార్థము** :- అంగదః నామ = అంగదుడను పేరుగలిగినట్టి, లక్ష్మీవాన్ = శుభలక్షణ సముపేతుడును, మహాబలః = మహాబలశాలియును, కపిశార్దూలః = వానరశ్రేష్ఠుడును అగు, వాలిసూనుః = వాలి తనయుడు, త్రిభాగబలసంవృతః = మూడవవంతు సైన్యముతో గూడినవాడై, ప్రస్థితః = బయలుదేరెను.

**తాత్పర్యము** :- శుభలక్షణసమన్వితుడును, మహాబలాఢ్యుడును, వానరశ్రేష్ఠుడును అగు వాలితనయుడైన అంగదుడు మూడవవంతు వానరసైన్యమును వెంటనిడుకొని నిన్ను వెదకుటకై బయలుదేరెను.

**శ్లో॥ తేషాం నో విప్రణష్టానాం విన్ధ్యే పర్వతసత్తమే ।**
**భృశం శోకపరీతానా మహోరాత్రగణా గతాః ॥ 56**

**పదచ్ఛేదము** :- తేషాం - నః - విప్రణష్టానాం - విన్ధ్యే - పర్వతసత్తమే - భృశం - శోకపరీతానామ్ - అహోరాత్రగణాః - గతాః ॥

**అన్వయక్రమము** :- పర్వతసత్తమే విన్ధ్యే విప్రణష్టానాం, భృశం శోకపరీతానాం తేషాం నః అహోరాత్రగణాః గతాః.

**ప్రతిపదార్థము** :- పర్వతసత్తమే = పర్వతశ్రేష్ఠమైన, విన్ధ్యే = విన్ధ్యగిరియందు, విప్రణష్టానాం = మార్గము గోల్పోయినట్టియు, భృశం = మిక్కిలిగ, శోకపరీతానాం = శోకగ్రస్తులమైయున్నవారమునగు, తేషాం నః = అట్టి మాకు, అహోరాత్రగణాః = రాత్రింబవళ్ళ సమూహములు, గతాః = గడచిపోయినవి.

**తాత్పర్యము** :- మహాపర్వతమైన విన్ధ్యగిరిపై మార్గమును గోల్పోయి మిక్కిలిగ శోకసంతప్తులమై తిరుగుచుండగా, మాకు అచ్చట ఎన్నియో పగళ్లును, రాత్రులును గడచిపోయినవి.

**శ్లో॥ తే వయం కార్యనైరాశ్యా త్కాల స్యాతిక్రమేణ చ ।**
**భయాచ్చ కపిరాజస్య ప్రాణాం స్త్యక్తు ముపస్థితాః ॥ 57**

**పదచ్ఛేదము** :- తే - వయం - కార్యనైరాశ్యాత్ - కాలస్య - అతిక్రమేణ - చ - భయాత్ - చ - కపిరాజస్య - ప్రాణాన్ - త్యక్తుమ్ - ఉపస్థితాః ॥

**అన్వయక్రమము** :- తే వయం కార్యనైరాశ్యాత్, కాలస్య అతిక్రమేణ చ, కపిరాజస్య భయాత్ చ ప్రాణాన్ త్యక్తుమ్ ఉపస్థితాః.

**ప్రతిపదార్థము** :- తే వయం = అట్టి మేము, కార్యనైరాశ్యాత్ = కార్యము నెడగల్గిన నిరాశవలనను, కాలస్య అతిక్రమేణ చ = కాల మతిక్రమించుటచేతను, కపిరాజస్య భయాత్ చ = సుగ్రీవుని భయమువలనను, ప్రాణాన్ త్యక్తుం = ప్రాణములను విడుచుటకు, ఉపస్థితాః = సిద్ధపడితిమి.

**తాత్పర్యము** :- మా కర్తవ్యమును నెఱవేర్చలేనందువలన గలిగిన నిరాశవలనను, మా వానరరా జొసగిన కాల మతిక్రమించుటచేతను, చండశాసనుడైన సుగ్రీవుని భయమువలనను ముందు త్రోవ గానక ప్రాణములను వీడుటకే నిర్ణయించుకొంటిమి.

**శ్లో॥ విచిత్య గిరిదుర్గాణి నదీప్రస్రవణాని చ ।**
**అనాసాద్య పదం దేవ్యాః ప్రాణాంస్త్యక్తుం వ్యవస్థితాః ॥ 58**

**పదచ్ఛేదము** :- విచిత్య - గిరిదుర్గాణి - నదీప్రస్రవణాని - చ - అనాసాద్య - పదం - దేవ్యాః - ప్రాణాన్ - త్యక్తుం - వ్యవస్థితాః ॥

**అన్వయక్రమము** :- గిరిదుర్గాణి నదీప్రస్రవణాని చ విచిత్య దేవ్యాః పదం అనాసాద్య ప్రాణాన్ త్యక్తుం వ్యవస్థితాః.

**ప్రతిపదార్థము** :- గిరిదుర్గాణి = పర్వతదుర్గములను, నదీప్రస్రవణాని చ = నదులను సెలయేళ్ళను గూడ, విచిత్య = అన్వేషించి, దేవ్యాః పదం = పూజ్యురాలవైన నీ యునికిని, అనాసాద్య = కనుగొనలేక, ప్రాణాన్ త్యక్తుం = ప్రాణములను విడుచుటకు, వ్యవస్థితాః = నిశ్చయించుకొన్నాము.

**తాత్పర్యము** :- దుర్గమములైన పర్వతములను, నదులను, సెలయేళ్ళను ఎల్లయెడలను వెదకి వెదకి పూజ్యురాలవైన నీ యునికిని ఎందును కనుగొనజాలక చివరికి మా ప్రాణములను త్యజించుటకే నిశ్చయించుకొంటిమి.

**శ్లో॥ తత స్తస్య గిరే ర్మూర్ధ్ని వయం ప్రాయ ముపాస్మహే ॥**

**పదచ్ఛేదము** :- తతః - తస్య - గిరేః - మూర్ధ్ని - వయమ్ - ప్రాయం - ఉపాస్మహే ॥

**అన్వయక్రమము** :- తతః వయం తస్య గిరేః మూర్ధ్ని ప్రాయమ్ ఉపాస్మహే.

**ప్రతిపదార్థము** :- తతః = అటు పిమ్మట, వయం = మేము, తస్య గిరేః = ఆ వింధ్య పర్వతముయొక్క, మూర్ధ్ని = శిఖరముపై, ప్రాయమ్ ఉపాస్మహే = ప్రాయోపవేశమును బూని యుంటిమి.

**తాత్పర్యము** :- అట్లు ప్రాణములు విడుచుటకు నిశ్చయించుకొన్నట్టి మేము వెంటనే ఆ వింధ్యపర్వతశిఖరముపై ప్రాయోపవేశవ్రతమును బూని కూర్చుంటిమి.

సూచన :- ఈ పాదము ఉత్తరదేశప్రతులలో మాత్రమే గానవచ్చుచున్నది.

**శ్లో॥ దృష్ట్వా ప్రాయోపవిష్టాంశ్చ సర్వాన్వానరపుంగవాన్ ।**
**భృశం శోకార్ణవే మగ్నః పర్యదేవయ దంగదః ॥ 59**

**శ్లో॥ తవ నాశం చ వైదేహి వాలినశ్చ తథా వధమ్ ।**
**ప్రాయోపవేశ మస్మాకం మరణం చ జటాయుషః ॥ 60**

**పదచ్ఛేదము** :- దృష్ట్వా - ప్రాయోపవిష్టాన్ - చ - సర్వాన్ - వానరపుంగవాన్ - భృశం - శోకార్ణవే - మగ్నః - పర్యదేవయత్ - అంగదః - తవ - నాశం - చ - వైదేహి - వాలినః - చ - తథా - వధమ్ - ప్రాయోపవేశమ్ - అస్మాకం - మరణం - చ - జటాయుషః ॥

**అన్వయక్రమము** :- వైదేహి! అంగదః ప్రాయోపవిష్టాన్ సర్వాన్ వానరపుంగవాన్ దృష్ట్వా, తవ నాశం చ, వాలినః వధం చ, జటాయుషః మరణం చ, తథా అస్మాకం ప్రాయోపవేశం చ దృష్ట్వా శోకార్ణవే మగ్నః భృశం పర్యదేవయత్.

**ప్రతిపదార్థము** :- వైదేహి = ఓ జానకీ, ప్రాయోపవిష్టాన్ = ప్రాయోపవేశదీక్షను బూని యున్నట్టి, సర్వాన్ వానరపుంగవాన్ దృష్ట్వా = వానరశ్రేష్ఠుల నందరను జూచి, తవ నాశం చ = నీవు కనబడకుండుటను, వాలినః వధం చ = వాలి యొక్కవధను, జటాయుషః మరణం చ = జటాయువుయొక్క మరణమును, తథా = అట్లే, అస్మాకం ప్రాయోపవేశం చ = మా ప్రాయోపవేశమును, దృష్ట్వా = కనుగొని, శోకార్ణవే = శోకసాగరమున, మగ్నః = నిమగ్నుడై, భృశం = మిక్కిలిగా, పర్యదేవయత్ = విలపించెను.

**తాత్పర్యము** :- ప్రాయోపవేశదీక్షను బూనియున్న మా వానరవీరులను చూడగానే అంగదుడు, నీవు కనిపింపకుండుట, వాలి వధింపబడుట, జటాయువు మృతి నొందుట, అనువానితో బాటు మా ప్రాయోపవేశమును తలచుకొని శోకసముద్రమున మునిగి అమితముగ విలపింప దొడగెను.

**శ్లో॥ తేషాం న స్స్వామిసందేశా న్నిరాశానాం ముమూర్షతామ్ ।**
**కార్యహేతో రి హాయాతః శకుని ర్వీర్యవా న్మహాన్ ॥ 61**

**శ్లో॥ గృధ్రరాజస్య సోదర్యః సంపాతి ర్నామ గృధ్రరాట్ ।**
**శ్రుత్వా భ్రాతృవధం కోపా దిదం వచన మబ్రవీత్ ॥ 62**

**పదచ్ఛేదము** :- తేషాం - నః - స్వామిసందేశాత్ - నిరాశానాం - ముమూర్షతామ్ - కార్యహేతోః - ఇహ - ఆయాతః - శకునిః - వీర్యవాన్ - మహాన్ - గృధ్రరాజస్య - సోదర్యః - సంపాతిః - నామ - గృధ్రరాట్ - శ్రుత్వా - భ్రాతృవధం - కోపాత్ - ఇదం - వచనమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- తేషాం నః స్వామిసందేశాత్ ముమూర్షతామ్ (సతాం) గృధ్రరాజస్య సోదర్యః సంపాతిః నామ గృధ్రరాట్ మహాన్ వీర్యవాన్ శకునిః కార్యహేతోః ఇహ ఆయాతః, భ్రాతృవధం శ్రుత్వా కోపాత్ ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- తేషాం నః = అట్టి మేము, స్వామిసందేశాత్ = రాజాజ్ఞవలన, ముమూర్షతామ్ (సతాం) = చనిపోవగోరుచుండగా, గృధ్రరాజస్య = గృధ్రరాజైన జటాయువుయొక్క, సోదర్యః = సోదరుడగు, సంపాతిః నామ = సంపాతి యని ఖ్యాతిని గన్నట్టి, గృధ్రరాట్ = గృధ్రములలో శ్రేష్ఠుడైన, మహాన్ వీర్యవాన్ శకునిః = గొప్ప పరాక్రమశాలియగు పక్షి, కార్యహేతోః = పని కారణముగ, ఇహ = ఇచ్చటికి, ఆయాతః = వచ్చినవాడై, భ్రాతృవధం శ్రుత్వా = తమ్ముని మరణమును గూర్చి విని, కోపాత్ = క్రోధమున, ఇదం వచనం = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- అట్లు మేము వానరరాజు ఆజ్ఞకు భీతినొంది, ప్రాణములు వీడుటకు సిద్ధమై యుండగా, జటాయువు సోదరుడైన మహాపరాక్రమసంపన్నుడగు సంపాతి యనెడి పక్షిరాజు ఒకానొక కార్యమును గూర్చి మేమున్న ఆ వింధ్యపర్వతశిఖరము మీదకు వచ్చి తన సోదరుడైన జటాయువు మరణమును గూర్చి విని మిక్కిలి క్రోధముతో మమ్ము చూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ యవీయాన్ కేన మే భ్రాతా హతః క్వ చ నిపాతితః ।**
**ఏత దాఖ్యాతు మిచ్ఛామి భవద్భి ర్వానరోత్తమాః ॥ 63**

**పదచ్ఛేదము** :- యవీయాన్ - కేన - మే - భ్రాతా - హతః - క్వ - చ - నిపాతితః - ఏతత్ - ఆఖ్యాతుమ్ - ఇచ్ఛామి - భవద్భిః - వానరోత్తమాః ॥

**అన్వయక్రమము** :- వానరోత్తమాః! మే యవీయాన్ భ్రాతా కేన నిపాతితః? క్వ చ నిపాతితః? భవద్భిః ఏతత్ ఆఖ్యాతుమ్ ఇచ్ఛామి.

**ప్రతిపదార్థము** :- వానరోత్తమాః = ఓ వానరశ్రేష్ఠులారా! మే = నాయొక్క, యవీయాన్ = చిన్నవాడైన, భ్రాతా = సోదరుడు, కేన = ఎవ్వనిచే, నిపాతితః = వధింపబడెను? క్వ చ = ఎచ్చట, నిపాతితః = నేలగూల్పబడెను? భవద్భిః = మీచే, ఏతత్ = ఇది, ఆఖ్యాతుం = చెప్పుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తాత్పర్యము** :- నా తమ్ముడు ఎవనిచే వధింపబడినాడు? ఎచ్చట నేల గూల్పబడినాడు? ఓ వానరశ్రేష్ఠులారా! నాకీ విషయమును మీరు వివరముగా తెలుపుడు.

**శ్లో॥ అంగదో ఽకథయ త్తస్య జనస్థానే మహద్వధమ్ ।**
**రక్షసా భీమరూపేణ త్వాముద్దిశ్య యథార్థతః ॥ 64**

**పదచ్ఛేదము** :- అంగదః - అకథయత్ - తస్య - జనస్థానే - మహత్ - వధమ్ - రక్షసా - భీమరూపేణ - త్వామ్ - ఉద్దిశ్య - యథార్థతః ॥

**అన్వయక్రమము** :- జనస్థానే త్వామ్ ఉద్దిశ్య భీమరూపేణ రక్షసా తస్య మహద్వధం అంగదః యథార్థతః అకథయత్.

**ప్రతిపదార్థము** :- జనస్థానే = జనస్థానమునందు, త్వాం = నిన్ను, ఉద్దిశ్య = గుఱించి, భీమరూపేణ = భీకరాకారుడైన, రక్షసా = రాక్షసునిచే, తస్య = ఆ జటాయువు యొక్క, మహద్వధం = గొప్పదైన వధను గూర్చి, అంగదః = అంగదుడు, యథార్థతః = ఉన్నది యున్నట్లుగా, అకథయత్ = చెప్పెను.

**తాత్పర్యము** :- జనస్థానమునందు నీ గుఱించియే భయంకరుడైన ఒక రాక్షసునిచే ఆ జటాయువు యుద్ధమున నిహతుడయ్యెనని అంగదుడు జరిగిన ఆ యథార్థమును సంపాతికి వివరించెను.

**శ్లో॥ జటాయోస్తు వధం శ్రుత్వా దుఃఖిత స్సోఽరుణాత్మజః ।**
**త్వా మాహ స వరారోహే వసంతీం రావణాలయే ॥ 65**

**పదచ్ఛేదము** :- జటాయోః - తు - వధం - శ్రుత్వా - దుఃఖితః - సః - అరుణాత్మజః - త్వాం - ఆహ - సః - వరారోహే - వసంతీం - రావణాలయే ॥

**అన్వయక్రమము** :- వరారోహే! జటాయోః వధం శ్రుత్వా దుఃఖితః సః అరుణాత్మజః త్వాం రావణాలయే వసంతీమ్ ఆహ.

**ప్రతిపదార్థము** :- వరారోహే! = ఓ సుందరాంగీ! జటాయోః = జటాయువుయొక్క, వధం = వధనుగూర్చి, శ్రుత్వా = విని, దుఃఖితః = దుఃఖము నొందినట్టి, సః అరుణాత్మజః = ఆ అనూరుతనయుడైన సంపాతి, త్వాం = నిన్ను, రావణాలయే = రావణుని భవనమునందు, వసంతం = ఉన్నదానినిగా, ఆహ = పలికెను.

**తాత్పర్యము** :- ఓ సీతా సుందరీ! జటాయువధను గూర్చి విని దుఃఖితుడైన ఆ సంపాతి నీవు రావణుని భవనమునం దున్నావని మాకు తెలిపెను.

**శ్లో॥ తస్య త ద్వచనం శ్రుత్వా సంపాతేః ప్రీతివర్ధనమ్ ।**
**అంగదప్రముఖా స్సర్వే తతః సంప్రస్థితా వయమ్ ॥ 66**

**పదచ్ఛేదము** :- తస్య - తత్ - వచనం - శ్రుత్వా - సంపాతేః - ప్రీతివర్ధనమ్ - అంగదప్రముఖాః - సర్వే - తతః - సంప్రస్థితాః - వయమ్ ॥

**అన్వయక్రమము** :- తస్య సంపాతేః, ప్రీతివర్ధనం తద్వచనం శ్రుత్వా అంగదప్రముఖాః వయం సర్వే తతః సంప్రస్థితాః.

**ప్రతిపదార్థము** :- తస్య సంపాతేః = ఆ సంపాతియొక్క, ప్రీతివర్ధనం = సంతోష వర్ధకమైనట్టి, తద్వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, అంగదప్రముఖాః = అంగదుడు మున్నగు, వయం సర్వే = మే మెల్లరమును, తతః = అటనుండి, సంప్రస్థితాః = బయలు వెడలితిమి.

**తాత్పర్యము** :- సంపాతి చెప్పిన సంతోషకరమైన ఆ మాటను విని, అంగదుడు మున్నగు మేమందఱమును ఆ వింధ్యపర్వతమునుండి ముందునకు సాగిపోయితిమి.

**శ్లో॥ వింధ్యా దుత్థాయ సంప్రాప్తాః సాగర స్యాంత ముత్తమమ్ ।**
**త్వద్దర్శనే కృతోత్సాహా హృష్టాః పుష్టాః ప్లవంగమాః ॥ 67**

**పదచ్ఛేదము** :- వింధ్యాత్ - ఉత్థాయ - సంప్రాప్తాః - సాగరస్య - అంతమ్ - ఉత్తమమ్ - త్వద్దర్శనే - కృతోత్సాహాః - హృష్టాః - పుష్టాః - ప్లవంగమాః ॥

**అన్వయక్రమము** :- త్వద్దర్శనే కృతోత్సాహాః, హృష్టాః పుష్టాః ప్లవంగమాః వింధ్యాత్ ఉత్థాయ ఉత్తమం సాగరస్య అంతం సంప్రాప్తాః.

**ప్రతిపదార్థము** :- త్వద్దర్శనే = నీ దర్శనమునందు, కృతోత్సాహాః = కలిగిన ఉత్సాహము గలవారమై, హృష్టాః = సంతోషము కలిగియున్నవారమును, పుష్టాః = బలమునొందియున్నవారము నగు, ప్లవంగమాః = వానరులము, వింధ్యాత్ ఉత్థాయ = వింధ్యపర్వతమునుండి లేచి, ఉత్తమం = శ్రేష్ఠమైన, సాగరస్య అంతం = సముద్రము యొక్క తీరమును, సంప్రాప్తాః = చేరుకొంటిమి.

**తాత్పర్యము** :- నిన్ను దర్శించవలెనని ఉత్సాహము గలవారమై గొప్ప ఆనందముతో, గొప్ప బలము నొంది మా వానరులము ఆ వింధ్యపర్వతమునుండి కదలి విశాలమైన సముద్రతీరమును చేరుకొంటిమి.

**శ్లో॥ అంగదప్రముఖా స్సర్వే వేలోపాంత ముపాగతాః ।**
**చింతాం జగ్ముః పున ర్భీమాం త్వద్దర్శనసముత్సుకాః ॥ 68**

**పదచ్ఛేదము** :- అంగదప్రముఖాః - సర్వే - వేలోపాంతమ్ - ఉపాగతాః - చింతాం - జగ్ముః - పునః - భీమాం - త్వద్దర్శనసముత్సుకాః ॥

**అన్వయక్రమము** :- త్వద్దర్శనసముత్సుకాః అంగదప్రముఖాః సర్వే వేలోపాంతమ్ ఉపాగతాః పునః భీమాం చింతాం జగ్ముః.

**ప్రతిపదార్థము** :- త్వద్దర్శనసముత్సుకాః = నీ దర్శనమునందు వేగిరపాటు

కలిగినట్టివారైన, అంగదప్రముఖాః సర్వే = అంగదుడు మున్నగు వారెల్లరును, వేలోపాంతం = తీరప్రదేశమును, ఉపాగతాః = చేరినవారై, పునః = తిరిగి, భీమాం = భయంకరమైన, చింతాం = విచారమును, జగ్ముః = పొందిరి.

**తాత్పర్యము** :– నీ దర్శనమును గూర్చి తహతహలాడుచున్న అంగదాది వానరులెల్లరును సముద్రతీరమును చేరి అచ్చట భయంకరమైన ఆ మహాసాగరమును జూచి మిక్కిలి చింతకు లోనయిరి.

**శ్లో॥ అ థాహం హరిసైన్యస్య సాగరం ప్రేక్ష్య సీదతః ।**
**వ్యవధూయ భయం తీవ్రం యోజనానాం శతం ప్లుతః ॥ 69**

**పదచ్ఛేదము** :– అథ – అహం – హరిసైన్యస్య – సాగరం – ప్రేక్ష్య – సీదతః – వ్యవధూయ – భయం – తీవ్రం – యోజనానాం – శతం – ప్లుతః ॥

**అన్వయక్రమము** :– అథ అహం సాగరం ప్రేక్ష్య సీదతః హరిసైన్యస్య తీవ్రం భయం వ్యవధూయ యోజనానాం శతం ప్లుతః.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, అహం = నేను, సాగరం = సముద్రమును, ప్రేక్ష్య = చూచి, సీదతః = భయవిహ్వల మగుచున్న, హరిసైన్యస్య = వానరసైన్యము యొక్క, తీవ్రం = తీవ్రమైనట్టి, భయం = భీతిని, వ్యవధూయ = పోగొట్టి, యోజనానాం శతం = నూఱు యోజనములను, ప్లుతః = దాటినాను.

**తాత్పర్యము** :– అప్పుడు నేను సముద్రమును జూచి భీతిగ్రస్తులై యున్న మా వానర సైన్యమును బాధించుచున్న ఆ తీవ్రమైన భయమును పోగొట్టి నూఱు యోజనముల విస్తీర్ణముగల సముద్రమును దాటి వచ్చితిని.

**శ్లో॥ లంకా చాపి మయా రాత్రౌ ప్రవిష్టా రాక్షసాకులా ।**
**రావణశ్చ మయా దృష్టః త్వం చ శోకనిపీడితా ॥ 70**

**పదచ్ఛేదము** :– లంకా – చ – అపి – మయా – రాత్రౌ – ప్రవిష్టా – రాక్షసాకులా – రావణః – చ – మయా – దృష్టః – త్వం – చ – శోకనిపీడితా ॥

**అన్వయక్రమము** :– మయా – రాక్షసాకులా లంకా అపి చ రాత్రౌ ప్రవిష్టా, రావణశ్చ మయా దృష్టః, శోకనిపీడితా త్వం చ దృష్టా.

**ప్రతిపదార్థము** :– మయా = నాచేత, రాక్షసాకులా = రాక్షసులచే నిండినట్టి, లంకా అపి చ = లంకానగరముగూడ, రాత్రౌ = రాత్రియందు, ప్రవిష్టా = ప్రవేశింపబడినది, రావణశ్చ = రావణుడుగూడ, మయా = నాచేత, దృష్టః = చూడబడినాడు, శోకనిపీడితా

= శోకసంతప్తురాలవైన, త్వం చ = నీవుగూడ, దృష్టా = కనుగొనబడితివి.

**తాత్పర్యము :–** రాక్షసులతో నిండియున్న ఈ లంకానగరమును నేను రాత్రికాలమున ప్రవేశించితిని. రావణుని గూడ చూచితిని. శోకముచే మిక్కిలి కృశించియున్న నిన్నును కనుగొంటిని.

**శ్లో॥ ఏత త్తే సర్వ మాఖ్యాతం యథావృత్త మనిందితే ।**
**అభిభాషస్వ మాం దేవి దూతో దాశరథే రహమ్ ॥ 71**

**పదచ్ఛేదము :–** ఏతత్ – తే – సర్వమ్ – ఆఖ్యాతం – యథావృత్తమ్ – అనిందితే – అభిభాషస్వ – మాం – దేవి – దూతః – దాశరథేః – అహమ్ ॥

**అన్వయక్రమము :–** అనిందితే! ఏతత్ సర్వం తే యథావృత్తమ్ అఖ్యాతమ్. దేవి మాం అభిభాషస్వ, అహం దాశరథేః దూతః.

**ప్రతిపదార్థము :–** అనిందితే = ఓ పూజ్యురాలా, ఏతత్ = ఇది, సర్వం = అంతయును, తే = నీకు, యథావృత్తం = ఉన్నది యున్నట్లుగా, అఖ్యాతమ్ = చెప్పబడినది, దేవి = ఓ పూజ్యురాలా! మాం అభిభాషస్వ = నాతో భాషింపుము. అహం = నేను, దాశరథేః = దశరథరామునియొక్క, దూతః = దూతను.

**తాత్పర్యము :–** ఓ సీతాసాధ్వీ! నీకు ఉన్నది యున్నట్లుగా విషయమంతయును తెలిపి యుంటిని; తల్లీ! నాతో మాటాడుము. నేను దశరథరాముని దూతనుగాని వేఱొకడను గాను.

**శ్లో॥ త న్మాం రామకృతోద్యోగం త్వన్నిమిత్త మిహాగతమ్ ।**
**సుగ్రీవసచివం దేవి బుధ్యస్వ పవనాత్మజమ్ ॥ 72**

**పదచ్ఛేదము :–** తత్ – మాం – రామకృతోద్యోగం – త్వన్నిమిత్తమ్ – ఇహ – ఆగతమ్ – సుగ్రీవసచివం – దేవి – బుధ్యస్వ – పవనాత్మజమ్ ॥

**అన్వయక్రమము :–** దేవి! తత్ మాం రామకృతోద్యోగం ఇహ త్వన్నిమిత్తమ్ ఆగతం సుగ్రీవసచివం పవనాత్మజం బుధ్యస్వ.

**ప్రతిపదార్థము :–** దేవి! = ఓ పూజ్యురాలా! తత్ = ఆ కారణముచే, మాం = నన్ను, రామకృతోద్యోగం = శ్రీరామునిగుఱించి చేయుచున్న ప్రయత్నముగలవానినిగను, ఇహ = ఇచ్చట, త్వన్నిమిత్తం = నీకొఱకుగా, ఆగతం = వచ్చినవానినిగను, సుగ్రీవసచివం = సుగ్రీవుని మంత్రియైనట్టి, పవనాత్మజం = వాయుపుత్రునిగను, బుధ్యస్వ = తెలిసికొనుము.

**తాత్పర్యము** :- తల్లీ! నేనిచ్చటకు రామకార్యార్థముగా నిన్ను దర్శించుటకై వచ్చినట్టి సుగ్రీవుని మంత్రియైన వాయుసుతుడనని నన్ను గుఱించి తెలిసికొనుము.

**శ్లో॥ కుశలీ తవ కాకుత్థ్సః సర్వశస్త్రభృతాం వరః ।**
**గురో రారాధనే యుక్తో లక్ష్మణ శ్శుభలక్షణః ॥ 73**

**పదచ్ఛేదము** :- కుశలీ - తవ - కాకుత్థ్సః - సర్వశస్త్రభృతాం - వరః, గురోః - ఆరాధనే - యుక్తః - లక్ష్మణః - శుభలక్షణః ॥

**అన్వయక్రమము** :- సర్వశస్త్రభృతాం వరః తవ కాకుత్థ్సః, కుశలీ, గురోః ఆరాధనే యుక్తః శుభలక్షణః లక్ష్మణః చ కుశలీ.

**ప్రతిపదార్థము** :- సర్వశస్త్రభృతాం వరః = శస్త్రధారులైన వీరులందరిలో, వరః = శ్రేష్ఠుడైన, తవ కాకుత్‌స్థః = నీ శ్రీరాముడు, కుశలీ = క్షేమము గలిగి యున్నవాడు, గురోః = అన్నయొక్క, ఆరాధనే = సేవయందు, యుక్తః = లగ్నమైయున్నవాడును, శుభలక్షణః = శుభలక్షణసమన్వితుడును అగు, లక్ష్మణః చ = లక్ష్మణుడును, కుశలీ = కుశలముగ నున్నవాడు.

**తాత్పర్యము** :- తల్లీ! లోకమున మేటివీరుడైన నీ శ్రీరాముడు క్షేమముగ నున్నాడు. అన్నయైన అతని సేవయందు జాగరూకుడై యున్న శుభలక్షణసంపన్నుడగు లక్ష్మణుడు గూడ కుశలముగ నున్నాడు.

**శ్లో॥ తస్య వీర్యవతో దేవి భర్తు స్తవ హితే రతః ।**
**అహ మేకస్తు సంప్రాప్తః సుగ్రీవవచనా దిహ ॥ 74**

**పదచ్ఛేదము** :- తస్య - వీర్యవతః - దేవి - భర్తుః - తవ - హితే - రతః - అహం - ఏకః - తు - సంప్రాప్తః - సుగ్రీవవచనాత్ - ఇహ ॥

**అన్వయక్రమము** :- దేవి! వీర్యవతః తస్య తవ భర్తుః హితే రతః అహమ్ ఏకః సుగ్రీవవచనాత్ ఇహ సంప్రాప్తః.

**ప్రతిపదార్థము** :- దేవి! = ఓ పూజ్యురాలా! వీర్యవతః = పరాక్రమవంతుడైనట్టి, తస్య = అట్టి, తవ భర్తుః = నీ పెనిమిటియొక్క, హితే = క్షేమమునందు, రతః = ఆసక్తి గలవాడనై, అహం = నేను, ఏకః = ఒక్కడనే, సుగ్రీవవచనాత్ = సుగ్రీవుని ఆజ్ఞవలన, ఇహ = ఇటకు, సంప్రాప్తః = చేరియుంటిని.

**తాత్పర్యము** :- అమ్మా! పరాక్రమశాలియైన నీభర్తకు ప్రియమును సాధింపగోరినవాడనై సుగ్రీవుని ఆజ్ఞప్రకారము ఒంటరిగా ఈ లంకకు చేరుకొంటిని.

**శ్లో॥ మ యేయ మసహాయేన చరతా కామరూపిణా ।**
**దక్షిణా ది గనుక్రాన్తా త్వన్మార్గవిచయైషిణా ॥ 75**

**పదచ్ఛేదము** :- మయా - ఇయం - అసహాయేన - చరతా - కామరూపిణా - దక్షిణా - దిక్ - అనుక్రాంతా - త్వన్మార్గవిచయైషిణా ॥

**అన్వయక్రమము** :- అసహాయేన, త్వన్మార్గవిచయైషిణా, కామరూపిణా చరతా మయా ఇయం దక్షిణా దిక్ అనుక్రాంతా.

**ప్రతిపదార్థము** :- త్వన్మార్గవిచయైషిణా = నీజాడను తెలిసికొనగోరినట్టియు, అసహాయేన = ఒంటరినైనట్టియు, కామరూపిణా చరతా = కామరూపమును ధరించినవాడనై సంచరించుచున్నట్టియు, మయా = నాచేత, ఇయం దక్షిణా దిక్ = ఈ దక్షిణదిక్కు, అనుక్రాంతా = అనుసరింపబడినది.

**తాత్పర్యము** :- నిన్ను వెదుకగోరి ఒంటరిగనే కామరూపముతో బయలుదేరి చరించు చున్నట్టి నేను ఈ దక్షిణదిక్కును గైకొని వచ్చితిని.

**శ్లో॥ దిష్ట్యాహం హరిసైన్యానాం త్వన్నాశ మనుశోచతామ్ ।**
**అపనేష్యామి సంతాపం త వాధిగమశంసనాత్ ॥ 76**

**పదచ్ఛేదము** :- దిష్ట్యా - అహం - హరిసైన్యానాం - త్వన్నాశమ్ - అనుశోచతామ్, అపనేష్యామి - సంతాపం - తవ - అధిగమశంసనాత్ ॥

**అన్వయక్రమము** :- దిష్ట్యా అహం త్వన్నాశమ్ అనుశోచతామ్ హరిసైన్యానాం సంతాపం తవ అధిగమశంసనాత్ అపనేష్యామి.

**ప్రతిపదార్థము** :- దిష్ట్యా = భాగ్యవశమున, అహం = నేను, త్వన్నాశం = నీవు కనబడకుండుటను గూర్చి, అనుశోచతాం = పరితపించుచున్నట్టి, హరిసైన్యానాం = వానరసైన్యములయొక్క, సంతాపం = శోకమును, తవ = నీయొక్క, అధిగమ శంసనాత్ = సంప్రాప్తికథనమువలన, అపనేష్యామి = తొలగించగలను.

**తాత్పర్యము** :- నీవు కనబడుటలేదని దుఃఖించుచున్న, మా వానరవీరుల సంతాపము తొలగించుచు నీవు కాన్పించితి వను శుభవార్తను చెప్పి నా భాగ్యవశమువలన వారికి సంతోషము కలిగించెదను.

**శ్లో॥ దిష్ట్యా హి న మమ వ్యర్థం సాగర స్యేహ లంఘనమ్ ।**
**ప్రాప్స్య మ్యహ మిదం దేవి త్వద్దర్శనకృతం యశః ॥ 77**

**పదచ్ఛేదము** :- దిష్ట్యా - హి - న - మమ - వ్యర్థం - సాగరస్య - ఇహ - లంఘనమ్, ప్రాప్స్యామి - అహం - ఇదం - దేవి - త్వద్దర్శనకృతం - యశః ॥

**అన్వయక్రమము** :- దిష్ట్యా మమ సాగరస్య లంఘనమ్ ఇహ న హి వ్యర్థమ్. దేవి! అహం త్వద్దర్శనకృతమ్ ఇదం యశః ప్రాప్స్యామి.

**ప్రతిపదార్థము** :- దిష్ట్యా = అదృష్టవశముచే, మమ = నాయొక్క, సాగరస్య లంఘనం = సముద్రలంఘనము, ఇహ = ఇక్కడ, న హి వ్యర్థం = నిష్ప్రయోజనము గాలేదు, దేవి = ఓ పూజ్యురాలా, అహం = నేను, త్వద్దర్శనకృతం = నిన్ను దర్శించుటచే కలిగినట్టి, ఇదం యశః = ఈ కీర్తిని, ప్రాప్స్యామి = పొందగలను.

**తాత్పర్యము** :- నా యదృష్టవశమున నేను గావించినట్టి ఈ సముద్రలంఘన ప్రయాసము వ్యర్థము గాలేదు. తల్లీ! నిన్ను దర్శించితి నన్న కీర్తి నాకే దక్కగలదు.

**శ్లో॥ రాఘవశ్చ మహావీర్యః క్షిప్రం త్వా మభిపత్స్యతే ।**
**సపుత్రబాంధవం హత్వా రావణం రాక్షసాధిపమ్ ॥ 78**

**పదచ్ఛేదము** :- రాఘవః - చ - మహావీర్యః - క్షిప్రం - త్వామ్ - అభిపత్స్యతే - సపుత్రబాంధవం - హత్వా - రావణం - రాక్షసాధిపమ్ ॥

**అన్వయక్రమము** :- మహావీర్యః రాఘవశ్చ క్షిప్రం సపుత్రబాంధవం రాక్షసాధిపం రావణం హత్వా త్వామ్ అభిపత్స్యతే.

**ప్రతిపదార్థము** :- మహావీర్యః = మహాపరాక్రమశాలియగు, రాఘవశ్చ = శ్రీరాముడును, క్షిప్రం = శీఘ్రముగ, సపుత్రబాంధవం = పుత్రులతోడను బంధువుల తోడను గూడినట్టి, రాక్షసాధిపం = రాక్షసరాజైన, రావణం = రావణుని, హత్వా = సంహరించి, త్వాం = నిన్ను, అభిపత్స్యతే = చేరగలడు.

**తాత్పర్యము** :- మహావీరుడైన శ్రీరాముడు అచిరకాలములోనే కొడుకులతోడను, బంధువుల తోడను కూడిన ఆ రాక్షసప్రభువైన రావణుని పరిమార్చి నిన్ను పొందగలడుసుమా!

**శ్లో॥ మాల్యవా న్నామ వైదేహి గిరీణా ముత్తమో గిరిః ।**
**తతో గచ్ఛతి గోకర్ణం పర్వతం కేసరీ హరిః ॥ 79**

**పదచ్ఛేదము** :- మాల్యవాన్ - నామ - వైదేహి - గిరీణామ్ - ఉత్తమః - గిరిః, తతః - గచ్ఛతి - గోకర్ణం - పర్వతం - కేసరీ - హరిః ॥

**అన్వయక్రమము :-** వైదేహి, మాల్యవాన్ నామ గిరీణాం ఉత్తమః గిరిః (అస్తి). కేసరీ హరిః తతః గోకర్ణం పర్వతం గచ్ఛతి.

**ప్రతిపదార్థము :-** వైదేహి = ఓ జానకీ! మాల్యవాన్ నామ = మాల్యవంతము అను ప్రసిద్ధమైనట్టి, గిరిః = పర్వతము (అస్తి = ఉన్నది). కేసరీ హరిః = కేసరి యను వానరోత్తముడు, తతః = అచ్చటినుండి, గోకర్ణం పర్వతం = గోకర్ణ మను పర్వతమును గూర్చి, గచ్ఛతి = వెడలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :-** "యస్య న జ్ఞాయతే శీలం కులం యస్య చ సంశ్రయమ్ ।
న తస్య సంగతిం కుర్యా దిత్యువాచ బృహస్పతిః ॥"

ఎవని యాచారము, స్వభావము, కులము, ఎవరివద్ద నెచ్చోట నుండునది, తెలియదో వానితోడ గూడి యుండరాదు అని బృహస్పతి వచనము. కావున కులహీనునితో, ఆచారహీనునితో, సదాశ్రయములేని వారితో స్నేహం చేయగూడదు. కాబట్టి హనుమ సీతాదేవికి తన విషయము ఇచ్చట చెప్పుచున్నాడు. అదియునుగాక శిష్యులు సైతము గురువు వంశాదులను విచారించవలెనని ధ్వనితము.

**తాత్పర్యము :-** ఓ జానకీదేవీ! మాల్యవంతమని పేరువడసిన పర్వతశ్రేష్ఠము ఒకటి గలదు. అది నివాసముగా చేసికొన్న కేసరి యను వానరోత్తముడు ఒకమాఱు ఆ గిరినుండి గోకర్ణపర్వతమునకు వెడలియుండెను.

**శ్లో॥ స చ దేవర్షిభి ర్దిష్టః పితా మమ మహాకపిః ।**
**తీర్థే నదీపతేః పుణ్యే శంబసాదన ముద్ధరత్ ॥ 80**

**పదచ్ఛేదము :-** సః - చ - దేవర్షిభిః - దిష్టః - పితా - మమ - మహాకపిః - తీర్థే - నదీపతేః - పుణ్యే - శంబసాదనమ్ - ఉద్ధరత్ ॥

**అన్వయక్రమము :-** మమ పితా సః మహాకపిః దేవర్షిభిః దిష్టః నదీపతేః పుణ్యతీర్థే శంబసాదనమ్ ఉద్ధరత్.

**ప్రతిపదార్థము :-** మమ పితా = నా తండ్రియైనట్టి, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, దేవర్షిభిః = దేవఋషులచే, దిష్టః = ఆదేశింపబడినవాడై, నదీపతేః = సముద్రము యొక్క, పుణ్యతీర్థే = పవిత్రతీర్థమునందు, శంబసాదనం = శంబసాదనుడను రక్కసుని, ఉద్ధరత్ = సంహరించెను.

**తాత్పర్యము** :- నా తండ్రియైన కేసరి యను ఆ వానరోత్తముడు అచటి దేవఋషులచే ఆజ్ఞాపింపబడినవాడై పవిత్రమైన సాగరతీర్థమును పాడుచేయుచు అచటనే నివసించుచున్న శంబసాదనుడను రాక్షసుని సంహరించెను.

**శ్లో॥ త స్యాహం హరిణః క్షేత్రే జాతో వాతేన మైథిలి ।**
**హనుమానితి విఖ్యాతో లోకే స్వేనైవ కర్మణా ॥ 81**

**పదచ్ఛేదము** :- తస్య - అహం - హరిణః - క్షేత్రే - జాతః - వాతేన - మైథిలి - హనుమాన్ - ఇతి - విఖ్యాతః - లోకే - స్వేన - ఏవ - కర్మణా ॥

**అన్వయక్రమము** :- మైథిలి! అహం తస్య హరిణః క్షేత్రే వాతేన జాతః, స్వేన ఏవ కర్మణా హనుమాన్ ఇతి విఖ్యాతః.

**ప్రతిపదార్థము** :- మైథిలి! = ఓ జానకీ! అహం = నేను, తస్య = ఆ, హరిణః = వానరునియొక్క, క్షేత్రే = కళత్రమునందు, వాతేన = వాయుదేవునిచే, జాతః = జనించినాను, స్వేన = నాదైన, కర్మణా ఏవ = పనిచేతనే, హనుమాన్ ఇతి = హనుమంతుడని, విఖ్యాతః = పేరొందితిని.

**తాత్పర్యము** :- ఓ జానకీ! నేను ఆ కేసరి యను వానరశ్రేష్ఠుని కళత్రమైన అంజనాదేవి యందు వాయుదేవుని వరముచే జన్మించినట్టివాడను. నా చేష్ట కారణముగానే హనుమంతుడనని పేరు గాంచితిని.

**శ్లో॥ విశ్వాసార్థం తు వైదేహి భర్తు రుక్తా మయా గుణాః ।**
**అచిరాత్త్వా మితో దేవి రాఘవో నయితా ధ్రువమ్ ॥ 82**

**పదచ్ఛేదము** :- విశ్వాసార్థం - తు - వైదేహి - భర్తుః - ఉక్తాః - మయా - గుణాః - అచిరాత్ - త్వాం - ఇతః - దేవి - రాఘవః - నయితా - ధ్రువమ్ ॥

**అన్వయక్రమము** :- వైదేహి! (తవ) విశ్వాసార్థం మయా భర్తుః గుణాః ఉక్తాః; దేవి! రాఘవః త్వామ్ ఇతః అచిరాత్ ధ్రువం నయితా.

**ప్రతిపదార్థము** :- వైదేహి! = ఓ జానకీ! తవ = నీయొక్క, విశ్వాసార్థం = నమ్మకము కొఱకు, మయా = నాచేత, భర్తుః = ప్రభువుయొక్క, గుణాః = గుణములు, ఉక్తాః = చెప్పబడినవి, దేవి = ఓ పూజ్యురాలా! రాఘవః = శ్రీరాముడు, త్వాం = నిన్ను, ఇతః = ఇటనుండి, అచిరాత్ = త్వరలోనే, ధ్రువం = నిశ్చయముగా, నయితా = తీసికొని పోవగలడు.

**తాత్పర్యము** :- ఓ జానకీదేవీ! నీకు నమ్మకమును కలిగించుటకొఱకై స్వామి

గుణములను వర్ణించి చెప్పితిని. తల్లీ! శ్రీరాముడు నిన్ను రాక్షసమధ్యమునుండి అతిశీఘ్రకాలములోనే నిశ్చయముగా గొనిపోగలడు సుమా!

**శ్లో॥ ఏవం విశ్వాసితా సీతా హేతుభి శ్శోకకర్శితా ।**
**ఉపపన్నై రభిజ్ఞానై ర్దూతం త మధిగచ్ఛతి ॥ 83**

**పదచ్ఛేదము :–** ఏవం – విశ్వాసితా – సీతా – హేతుభిః – శోకకర్శితా – ఉపపన్నైః – అభిజ్ఞానైః – దూతం – తమ్ – అధిగచ్ఛతి ॥

**అన్వయక్రమము :–** శోకకర్శితా సీతా – ఏవం హేతుభిః విశ్వాసితా (సతీ) ఉపపన్నైః అభిజ్ఞానైః తం దూతమ్ అధిగచ్ఛతి.

**ప్రతిపదార్థము :–** శోకకర్శితా = దుఃఖముచే పీడింపబడినట్టి, సీతా = సీతాదేవి, ఏవం = ఈ రీతిగా, హేతుభిః = కారణములచే, విశ్వాసితా (సతీ) = నమ్మకము కల్గింపబడినదై, ఉపపన్నైః = యుక్తములైనట్టి, అభిజ్ఞానైః = గుర్తులచే, తం = ఆతనిని, దూతం = దూతగా, అధిగచ్ఛతి = గ్రహించినది.

**తాత్పర్యము :–** శోకపీడితురాలై యున్న సీతాదేవికి హనుమ ఈ విధముగా యుక్తమైన కారణములచే నమ్మకము కలిగించెను. ఆతనిలో కానవచ్చిన ఉత్తమలక్షణములచే సీతమ్మయు ఆతనిని శ్రీరామునిదూతగా నమ్మినది.

**శ్లో॥ అతులం చ గతా హర్షం ప్రహర్షేణ తు జానకీ ।**
**నేత్రాభ్యాం వక్రపక్ష్మాభ్యాం ముమో చానందజం జలమ్ ॥ 84**

**పదచ్ఛేదము :–** అతులం – చ – గతా – హర్షం – ప్రహర్షేణ – తు – జానకీ – నేత్రాభ్యాం – వక్రపక్ష్మాభ్యాం – ముమోచ – ఆనందజం – జలమ్ ॥

**అన్వయక్రమము :–** జానకీ అతులం హర్షం గతా (సతీ) ప్రహర్షేణ వక్రపక్ష్మాభ్యాం నేత్రాభ్యాం ఆనందజం జలం ముమోచ.

**ప్రతిపదార్థము :–** జానకీ = సీతాదేవి, అతులం హర్షం = సాటిలేని సంతోషమును, గతా (సతీ) = పొందినదై, ప్రహర్షేణ = మహానందముతో, వక్రపక్ష్మాభ్యాం = వంకరయైన కనుబొమ్మలు కలిగినట్టి, నేత్రాభ్యాం = కన్నులనుండి, ఆనందజం జలం = సంతోషబాష్పములను, ముమోచ = విడిచెను.

**తాత్పర్యము :–** సీతాదేవి అమితమైన ఆనందము నొందినదై ఆ మహానందముతో సుందరములైన కనుబొమలతో వెలయునట్టి తన కన్నులనుండి ఆనందబాష్పములను రాల్చినది.

**శ్లో॥ చారు తద్వదనం తస్యా స్తామ్రశుక్లాయతేక్షణమ్ ।**
**అశోభత విశాలాక్ష్యా రాహుముక్త ఇవోడురాట్ ॥ 85**

**పదచ్ఛేదము** :- చారు - తత్ - వదనం - తస్యాః - తామ్రశుక్లాయతేక్షణమ్ - అశోభత - విశాలాక్ష్యాః - రాహుముక్తః - ఇవ - ఉడురాట్ ॥

**అన్వయక్రమము** :- విశాలాక్ష్యాః తస్యాః తామ్రశుక్లాయతేక్షణం చారు తద్వదనం రాహుముక్తః ఉడురాట్ ఇవ అశోభత.

**ప్రతిపదార్థము** :- విశాలాక్ష్యాః = విశాలములైన నేత్రములు కల్గిన, తస్యాః = ఆమె యొక్క, తామ్రశుక్లాయతేక్షణం = ఎఱ్ఱని, తెల్లని వెడల్పైన నేత్రములతో కూడిన, చారు = సుందరమైన, తద్వదనం = ఆమె యొక్క ముఖము, రాహుముక్తః = రాహువుచే విడువబడిన, ఉడురాట్ ఇవ = చంద్రుడువలె, అశోభత = శోభిల్లెను.

**తాత్పర్యము** :- విశాలాక్షియైన ఆ సీతాదేవియొక్క ఎఱ్ఱగను తెల్లగను పొడవుగను నున్న కన్నులతో మనోహరమైనట్టి వదనము, ఆ సమయమున కలిగిన ఆనంద విశేషముచే రాహువుచే విడువబడి ప్రకాశించుచున్న పున్నమినాటి చంద్రునివలె ఎంతయో కాంతితో శోభిల్లెను.

**శ్లో॥ హనుమంతం కపిం వ్యక్తం మన్యతే నాఽన్యథేతి సా ।**
**అథోవాచ హనూమాం స్తా ముత్తరం ప్రియదర్శనామ్ ॥ 86**

**పదచ్ఛేదము** :- హనుమంతం - కపిం - వ్యక్తం - మన్యతే - న - అన్యథా - ఇతి సా - అథ - ఉవాచ - హనూమాన్ - తామ్ - ఉత్తరం - ప్రియదర్శనామ్ ॥

**అన్వయక్రమము** :- సా హనూమంతం వ్యక్తం కపిం మన్యతే, అన్యథా న ఇతి మన్యతే, అథ హనూమాన్ ప్రియదర్శనామ్ తామ్ ఉత్తరమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :- సా = ఆ సీతాదేవి, హనూమంతం = హనుమంతుని, వ్యక్తం కపిం = స్పష్టమైన వానరునిగా, మన్యతే = తలచెను, అన్యథా న ఇతి = వేఱొక విధముగా గాదనియు, మన్యతే = తలచినది, అథ = పిమ్మట, హనూమాన్ = హనుమంతుడు, ప్రియదర్శనాం తాం = సంతోషకరముగ గానవచ్చుచున్నట్టి ఆమెను, ఉత్తరం ఉవాచ = మీది విషయమును పలికెను.

**తాత్పర్యము** :- సీతాదేవి తనతో మాటాడుచున్న వానరుడు హనుమంతుడే గాని మాయావియైన వేఱొకడు గాడని గ్రహించినది. అప్పుడు సంతోషచిహ్నాములతో గానవచ్చుచున్న సీతాదేవిని గూర్చి హనుమంతుడు పైవిధముగ పలికెను.

**శ్లో॥ ఏత త్తే సర్వ మాఖ్యాతం సమాశ్వసిహి మైథిలి ।**
**కిం కరోమి కథం వా తే రోచతే ప్రతియా మ్యహమ్ ॥ 87**

**పదచ్ఛేదము :-** ఏతత్ - తే - సర్వమ్ - ఆఖ్యాతం - సమాశ్వసిహి - మైథిలి - కిం - కరోమి - కథం - వా - తే - రోచతే - ప్రతియామి - అహమ్ ॥

**అన్వయక్రమము :-** మైథిలి! తే ఏతత్ సర్వం (మయా) ఆఖ్యాతమ్. సమాశ్వసిహి. కిం కరోమి? కథం వా తే రోచతే? అహం ప్రతియామి.

**ప్రతిపదార్థము :-** మైథిలి = ఓ సీతాదేవీ! తే = నీకు, (మయా = నాచేత) ఏతత్ సర్వం = ఇది యంతయును, అఖ్యాతం = చెప్పబడినది, సమాశ్వసిహి = ఊరడిల్లుము, కిం కరోమి? = ఏమి చేయుదును? తే = నీకు, కథం వా = ఏ రీతిగా, రోచతే = ఇష్టమగును? అహం = నేను, ప్రతియామి = వెడలిపోవుదును.

**తాత్పర్యము :-** ఓ జానకీ! నీవడిగిన దాని కంతకును సమాధానము చెప్పితిని. నీవు ఊరట చెందియుండుము. నేను తిరిగి శ్రీరాముని కడకు వెడలి పోవుచున్నాను. ఇక నేనేమి చేయవలసి యుండును? నీ ఇష్టమైన దేమున్నదో చెప్పుము.

**శ్లో॥ హతే ఽసురే సంయతి శంబసాదనే**
**కపిప్రవీరేణ మహర్షిచోదనాత్ ।**
**తతో ఽస్మి వాయుప్రభవో హి మైథిలి**
**ప్రభావత స్తత్ప్రతిమశ్చ వానరః ॥ 88**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"విశ్వాసోత్పాదనం" నామ*
*పంచత్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము :-** హతే - అసురే - సంయతి - శంబసాదనే - కపిప్రవీరేణ - మహర్షిచోదనాత్ - తతః - అస్మి - వాయుప్రభవః - హి - మైథిలి - ప్రభావతః - తత్ప్రతిమః - చ - వానరః ॥

**అన్వయక్రమము :-** మైథిలి! మహర్షిచోదనాత్ కపిప్రవీరేణ సంయతి శంబసాదనే అసురే హతే (సతి) తతః అహం వాయుప్రభవః ప్రభావతః తత్ప్రతిమః వానరః అస్మి.

**ప్రతిపదార్థము** :– మైథిలి! = ఓ జానకీ! మహర్షిచోదనాత్ = దేవర్షులయొక్క ప్రేరణవలన, కపిప్రవీరేణ = వానరోత్తమునిచే, సంయతి = యుద్ధమున, శంబసాదనే అసురే = శంబసాదనుడను రాక్షసుడు, హతే (సతి) = నిహతుడై యుండగా, తతః = అందువలన, అహం = నేను, వాయుప్రభవః = వాయుదేవునివలన జనించినట్టి వాడను, ప్రభావతః = ప్రభావమున, తత్ప్రతిమః = ఆతనితో సమానుడనగు, వానరః అస్మి = వానరుడనై యున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– తతః = అందువలన శంబసాదనుడను రాక్షసుని వధించుటవలన ప్రీతినొందిన మహర్షులయొక్క అనుగ్రహమువలన అని భావము.

**మహేశ్వరతీర్థులు** :– ప్రభావతః తత్ప్రతిమః, కిం కరోమి? యని సీతాదేవిని అడుగుచు హనుమ తాను ఎట్టి ఘనకార్యమునైనను సాధింప గల సామర్థ్యము గలవాడనే యని ఆమెకు తెలుపుటకై నేను ప్రభావమునందు నా తండ్రియైన వాయుదేవునితో సమానుడనే యనెనని భావము.

**తాత్పర్యము** :– మహర్షుల ప్రేరణ ననుసరించి నా తండ్రియైన కేసరి రణరంగమున శంబసాదనుని వధింపగా తత్ఫలితముగా సంతోషము నొందియున్న వాయుదేవుని వరము వలన నేను జన్మించియున్నాను. ప్రభావవిశేషమున నేనును నా తండ్రియైన వాయుదేవుని యంతటివాడనే సుమా!

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"విశ్వాసోత్పాదనము" అను*
*ముప్పదియైదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## షట్త్రింశసర్గ

**శ్లో॥ భూయ ఏవ మహాతేజా హనుమా న్పవనాత్మజః ।**
**అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం సీతాప్రత్యయకారణాత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** భూయః – ఏవ – మహాతేజాః – హనుమాన్ – పవనాత్మజః – అబ్రవీత్ – ప్రశ్రితం – వాక్యం – సీతాప్రత్యయకారణాత్ ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః పవనాత్మజః హనుమాన్ సీతాప్రత్యయకారణాత్ భూయః ఏవ ప్రశ్రితం వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః = మహాతేజస్సంపన్నుడైన, పవనాత్మజః హనుమాన్ = వాయునందనుడగు హనుమ, సీతాప్రత్యయకారణాత్ = సీతకు నమ్మకము కల్గించు నిమిత్తముగా, భూయః ఏవ = తిరిగి వెంటనే, ప్రశ్రితం = వినయముతో గూడిన, వాక్యం = వచనమును, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** మహాతేజస్సంపన్నుడగు మారుతి సీతకు ఇంకను నమ్మకము కల్గించు కొఱకై వినయముతో తిరిగి ఈ విధముగ పలికెను.

**శ్లో॥ వానరో ఽహం మహాభాగే దూతో రామస్య ధీమతః ।**
**రామనామాంకితం చేదం పశ్య దే వ్యంగులీయకమ్ ॥ 2**

**శ్లో॥ ప్రత్యయార్థం త వానీతం తేన దత్తం మహాత్మనా ।**
**సమాశ్వసిహి భద్రం తే క్షీణదుఃఖఫలా హ్యసి ॥ 3**

**పదచ్ఛేదము :–** వానరః – అహం – మహాభాగే – దూతః – రామస్య – ధీమతః రామనామాంకితం – చ – ఇదం – పశ్య – దేవి – అంగులీయకమ్ ॥ ప్రత్యయార్థం – తవ – ఆనీతం – తేన – దత్తం – మహాత్మనా – సమాశ్వసిహి – భద్రం – తే – క్షీణదుఃఖఫలా – హి – అసి ॥

**అన్వయక్రమము :–** మహాభాగే! అహం ధీమతః రామస్య దూతః వానరః, దేవి! తేన మహాత్మనా దత్తం తవ ప్రత్యయార్థమ్ ఆనీతం రామనామాంకితమ్ ఇదమ్

అంగులీయకం చ పశ్య, క్షీణదుఃఖఫలా అసి హి; సమాశ్వసిహి, తే భద్రం (అస్తు).

**ప్రతిపదార్థము** :– మహాభాగే = ఓ మహాత్మురాలా! అహం = నేను, ధీమతః = ప్రజ్ఞాశాలియైన, రామస్య = శ్రీరామునియొక్క, దూతః = దూతయైన, వానరః = వానరుడను, దేవి! = ఓ పూజ్యురాలా! క్షీణదుఃఖఫలా = నశించిపోయిన దుఃఖ రూపమైన పాపఫలము గలదానవు, అసి హి = అవుచున్నావు సుమా! తవ ప్రత్యయార్థం = నీకు నమ్మకముకొఱకై, తేన మహాత్మనా = ఆ మహనీయునిచే, దత్తం = ఒసగబడినట్టి, (మయా) ఆనీతం = (నాచే) తీసుకొని రాబడినట్టి, రామనామాంకితం = రామనామచిహ్నము కలిగినట్టి, ఇదమ్ అంగులీయకం = ఈ యుంగరమును, పశ్య = చూడుము. సమాశ్వసిహి = ఊరడిల్లుము. తే = నీకు, భద్రం = మంగళము, అస్తు = అగుగాక!

**తాత్పర్యము** :– ఓ మహాత్మురాలా! నేను ధీశాలియైన రామునిదూతను. ఆ మహాత్ముడు నీకు నమ్మకము కలుగుటకొఱకై ఒసగిన రామనామాంకితమగు అంగులీయకమును కొనివచ్చితిని; చూడుము. పూర్వపాపఫలమైన నీ దుఃఖమంతయు నశించిపోయినది, ఊరడిల్లుము. నీకు మంగళము అగును.

**శ్లో॥ గృహీత్వా ప్రేక్షమాణా సా భర్తుః కరవిభూషణమ్ ।**
**భర్తార మివ సంప్రాప్తా జానకీ ముదితాఽభవత్ ॥** 4

**పదచ్ఛేదము** :– గృహీత్వా – ప్రేక్షమాణా – సా – భర్తుః – కరవిభూషణమ్ – భర్తారమ్ – ఇవ – సంప్రాప్తా – జానకీ – ముదితా – అభవత్ ॥

**అన్వయక్రమము** :– జానకీ భర్తుః (తత్) కరవిభూషణం గృహీత్వా ప్రేక్షమాణా భర్తారం సంప్రాప్తా ఇవ ముదితా అభవత్.

**ప్రతిపదార్థము** :– జానకీ = సీతమ్మ, భర్తుః = భర్తయొక్క, (తత్) కరవిభూషణం = ఆ హస్తాభరణమును, గృహీత్వా = గైకొని, ప్రేక్షమాణా = కన్నులారా చూచుకొను చున్నదై, భర్తారం = భర్తను, సంప్రాప్తా ఇవ = పొందినది వలెనే, ముదితా అభవత్ = ఆనందము నొందినదాయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'గృహీత్వా ప్రేక్షమాణా' ఇచ్చట కవి, 'తీసికొని చూచి' అనకుండ చూచుచున్నదై అని వచించుటచే సీతమ్మకు ఆ యంగులీయకము ఎంతతడవు చూచినను తనివి తీరక ఎంతయో తడవు అట్లే చూచుచుండెనని భావము. 'భర్తారం

సంప్రాప్తా ఇవ' భర్తను పొందినట్లుగనే అనగా అంగుళీయకము లభించిన వివాహసమయము నాటి నుండి దాని వియోగ సమయము వఱకును సీతారాముల ప్రణయవిహారములతో ఆ యుంగరము ప్రసంగమున వచ్చిన మధురఘట్టము లన్నియును ఆమెస్మృతికి వచ్చుచుండగా సీతమ్మకు తన ప్రియునియొక్క సుందర రూపమును, ప్రణయచేష్టలును దృగ్గోచరమాయెను. అనగా భర్తయొక్క సాన్నిధ్యము తనకు లభించినట్లే ఆమె ఆనందము నొందెనని భావము.

**వాసుదాసస్వామి :–** అనేకములగు పూర్వకృత్యము లా యుంగరము మూలమున జ్ఞప్తికి రాగా క్రమక్రమముగా నాకార మంతయు స్పష్టముగ భావనాతిశయబలమున గోచరింపగా తన భర్తయే ఎదుటవచ్చి నిలిచెనని శ్రీరాము డటకు వచ్చినట్లని కవి గూఢముగ సూచించుచున్నాడు. ఈ క్రమము భగవన్మూర్తియొక్క ధ్యానసోపాన మార్గమును తెలుపుచున్నది. శిష్యుడు భగవన్మూర్తి ఎదురుగవచ్చి నిలచినట్లు తోచువఱకు నిట్లుపాసించవలెను.

**తాత్పర్యము :–** రావణాసురుడేమో యను శంకిచే జంకుచున్న సీతాదేవి హనుమంతుని చేతినుండి ఆ యుంగరమును అమితమైన ఆనందముతో గైకొని మనస్సులోని శంక తొలగిపోవగా భర్తచేతి అలంకారమైన ఆ యుంగరమును తనివితీర చూచుచున్నదై భర్తయే తనయెదుటకు వచ్చి యున్నట్లుగ ఆనందము నొందియుండెను.

**శ్లో॥ చారు తద్వదనం తస్యా స్తామ్రశుక్లాయతేక్షణమ్ ।**
**బభూవ హర్షోదగ్రం చ రాహుముక్త ఇవోడురాట్ ॥ 5**

**పదచ్ఛేదము :–** చారు – తత్ – వదనం – తస్యాః – తామ్రశుక్లాయతేక్షణమ్ – బభూవ – హర్షోదగ్రం – చ – రాహుముక్తః – ఇవ – ఉడురాట్ ॥

**అన్వయక్రమము :–** తస్యాః తామ్రశుక్లాయతేక్షణం తత్ వదనం రాహుముక్తః ఉడురాట్ ఇవ హర్షోదగ్రం బభూవ.

**ప్రతిపదార్థము :–** తస్యాః = ఆ సీతాదేవియొక్క, తామ్రశుక్లాయతేక్షణం = ఎఱ్ఱనైన, తెల్లనైన, విశాలమైన కన్నులు గల్గినట్టి, తత్ వదనం = ఆ ముఖము, రాహుముక్తః = రాహువుచే విడువబడినట్టి, ఉడురాట్ ఇవ = చంద్రుడువలె, హర్షోదగ్రం = ఆనందముతో నిండినది, బభూవ = అయ్యెను.

**తాత్పర్యము :–** ఆ సీతాదేవి ముఖము అప్పుడు రాహువుచే విడువబడిన సంపూర్ణ చంద్రబింబమువలె మహానందముతో విరాజిల్లు చుండెను.

**శ్లో॥ తత స్సా హ్రీమతీ బాలా భర్తృసందేశహర్షితా ।**
**పరితుష్టా ప్రియం కృత్వా ప్రశశంస మహాకపిమ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** తతః – సా – హ్రీమతీ – బాలా – భర్తుః – సందేశహర్షితా – పరితుష్టా – ప్రియం – కృత్వా – ప్రశశంస – మహాకపిమ్ ॥

**అన్వయక్రమము :–** తతః హ్రీమతీ సా బాలా భర్తుః సందేశహర్షితా, పరితుష్టా (తం) మహాకపిం ప్రియం కృత్వా ప్రశశంస.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, హ్రీమతీ = లజ్జావతియైన, సా బాలా = ఆ సీతాతరుణి, భర్తుః = భర్తయొక్క, సందేశహర్షితా = సందేశముచే ఆనందము నొందినదై, పరితుష్టా = నిండుగ తృప్తి నొందినదై, (తం) మహాకపిం = ఆ వానర శ్రేష్ఠుడైన హనుమను, ప్రియం కృత్వా = ప్రీతిపాత్రునిగ చేసి, ప్రశశంస = శ్లాఘించినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** హ్రీమతీ = అంగులీయకసాన్నిధ్యముచే భర్తయొక్క సన్నిధిని సిగ్గుపడునట్లుగ సిగ్గు నొందినదని భావము.

**వాసుదాసస్వామి :–** హ్రీమతీ = లజ్జగలది. సీతమ్మ ఇప్పుడు ముప్పదిరెండేండ్లది గావున బాలనాయిక గాదు. అట్లుండియు బాలా అనుటచే నా సమయమున ముగ్ధానాయిక యందలి గుణము లజ్జ ఆమెయందు గానవచ్చి బాల అయ్యెనని భావము.

**ప్రశశంస :–** స్తవమొనరించె ననుట. గురుస్తోత్రము గురుమహాత్మ్యవర్ణనము తెలుపు చున్నది. భగవన్మూర్తిని సాక్షాత్కరింపచేసిన గురువు నెంత స్తోత్రము చేసినను గొఱతయే!

**తాత్పర్యము :–** సీతాదేవి ఆ యంగులీయకమును చూడగనే తన భర్తను చూచినట్లు కాగా కొద్దిగ సిగ్గునొంది ప్రియుని సందేశము లభించినందుకు అమితానందము నొందుచు తనకు ప్రియముగూర్చి ప్రేమపాత్రుడైన ఆ హనుమను ఇట్లు ఆదరముతో శ్లాఘించెను.

**శ్లో॥ విక్రాంత స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞస్త్వం వానరోత్తమ ।**
**యే నేదం రాక్షసపదం త్వ యైకేన ప్రధర్షితమ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** విక్రాంతః – త్వం – సమర్థః – త్వం – ప్రాజ్ఞః – త్వం – వానరోత్తమ – యేన – ఇదం – రాక్షసపదం – త్వయా – ఏకేన – ప్రధర్షితమ్ ॥

**అన్వయక్రమము** :- వానరోత్తమ! త్వం ప్రాజ్ఞః యేన ఇదం రాక్షసపదమ్ ఏకేన త్వయా ప్రధర్షితమ్.

**ప్రతిపదార్థము** :- వానరోత్తమ! = ఓ వానరశ్రేష్ఠుడా! త్వం విక్రాంతః = నీవు మహాపరాక్రమశాలివి, త్వం సమర్థః = నీవు గొప్ప సమర్థత గలవాడవు, త్వం ప్రాజ్ఞః = నీవు మహాబుద్ధిశాలివి, యేన = ఎందుచేతననగా, ఇదం రాక్షసపదం = ఈ రాక్షసనిలయము, ఏకేన త్వయా = ఒంటరివైన నీచేత, ప్రధర్షితమ్ = నిర్భయముగా ప్రవేశింపబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- విక్రాంతః - రాక్షసులను క్షోభింపచేయుటచే పరాక్రమశాలి, సమర్థః = ఒంటరిగనే రాక్షసులను జయించుటచే సమర్థుడు, ప్రాజ్ఞః = మాయావులైన రాక్షసులను జయించుటచే ప్రజ్ఞాశాలి యని భావము.

**వాసుదాసస్వామి** :- శూరుడవు, సమర్థుడవు, ప్రాజ్ఞుడవు అను పదములు జ్ఞానశక్తి బలములను తెలుపుచున్నవి, అనాయాసముగ జలనిధిని లఘించుటచే బలమును, ఒక్కడవే అనుటచే సామర్థ్యమును, లంకయందు ప్రవేశించి సీతమ్మను తెలిసికొనుటచే జ్ఞానమును తెలుపబడెను.

**తాత్పర్యము** :- వానరశ్రేష్ఠుడా! ఒంటరివై ఈ ఘోరరాక్షసుల నివాసమును నిర్భయముగా ప్రవేశించినట్టి నీవు సామాన్యుడవు కావు. విక్రమశాలివి, మహాసమర్థుడవు గొప్ప ప్రజ్ఞావంతుడవును సుమా!

**శ్లో॥ శతయోజనవిస్తీర్ణ స్సాగరో మకరాలయః ।**
**విక్రమశ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః ॥ 8**

**పదచ్ఛేదము** :- శతయోజనవిస్తీర్ణః - సాగరః - మకరాలయః - విక్రమశ్లాఘనీయేన - క్రమతా - గోష్పదీకృతః ॥

**అన్వయక్రమము** :- శతయోజనవిస్తీర్ణః మకరాలయః సాగరః క్రమతా విక్రమశ్లాఘనీయేన (త్వయా) గోష్పదీకృతః.

**ప్రతిపదార్థము** :- శతయోజనవిస్తీర్ణః = నూఱామడల పొడవైనదియును, మకరాలయః = మొసళ్లకు నివాసమైనట్టిదియునగు, సాగరః = సముద్రము, క్రమతా = దాటుచున్నట్టి, విక్రమశ్లాఘనీయేన = పరాక్రమముచే కీర్తింపదగినవాడవైన, (త్వయా = నీచేత) గోష్పదీకృతః = గోవుపాద మంతటిగ చేయబడినది.

**తాత్పర్యము :–** శ్లాఘనీయమైన పరాక్రమము గల్గిన నీవు నూఱుయోజనముల పొడవై భీకరజలజంతువులకు నిలయమైయున్న ఈ మహాసాగరమును ఒక గోవుపాదమంత చిన్నదిగాచేసి దాటివచ్చితివిగదా!

**శ్లో॥ నహి త్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ ।**
**యస్య తే నాస్తి సంత్రాసో రావణా దపి సంభ్రమః ॥ 9**

**పదచ్ఛేదము :–** న – హి – త్వాం – ప్రాకృతం – మన్యే – వానరం – వానరర్షభ – యస్య – తే – న – అస్తి – సంత్రాసః – రావణాత్ – అపి – సంభ్రమః ॥

**అన్వయక్రమము :–** వానరర్షభ యస్య తే (సాగరాత్) సంత్రాసః నాస్తి; రావణాత్ అపి సంభ్రమః నాస్తి; (తం) త్వాం ప్రాకృతం వానరం న మన్యే.

**ప్రతిపదార్థము :–** వానరర్షభ = ఓ వానరశ్రేష్ఠుడా! యస్య తే = ఏ నీకు, (సాగరాత్ = సముద్రమువలన) సంత్రాసః నాస్తి = భయము లేదో, (తం) త్వాం = అట్టి నిన్ను, ప్రాకృతం వానరం = సామాన్యమైన వానరునిగా, న మన్యే = తలవను.

**తాత్పర్యము :–** ఓ వానరశ్రేష్ఠుడా! నిన్ను నేను సామాన్య వానరునిగా భావింపజాలను. ఎందుచేతననగా నీవు మహాసముద్రమునకు భయము నొందలేదు. అంతటి రావణాసురుని గూర్చి బెదరు నొందకుంటివి.

**శ్లో॥ అర్హసే చ కపిశ్రేష్ఠ మయా సమభిభాషితుమ్ ।**
**యద్యసి ప్రేషిత స్తేన రామేణ విదితాత్మనా ॥ 10**

**పదచ్ఛేదము :–** అర్హసే – చ – కపిశ్రేష్ఠ – మయా – సమభిభాషితుమ్ – యది – అసి – ప్రేషితః – తేన – రామేణ – విదితాత్మనా ॥

**అన్వయక్రమము :–** కపిశ్రేష్ఠ! (త్వం) విదితాత్మనా రామేణ ప్రేషితః అసి యది, మయా సమభిభాషితుమ్ అర్హసే.

**ప్రతిపదార్థము :–** కపిశ్రేష్ఠ = ఓ వానరోత్తముడా, త్వం = నీవు, విదితాత్మనా = ఆత్మవేత్తయైన, రామేణ = శ్రీరామునిచే, ప్రేషితః అసి యది = పంపబడినవాడవైన యెడల, మయా = నాతో, సమభిభాషితుం = సంభాషించుటకు, అర్హసే = తగుదువు.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! నిన్ను ఆ మహాత్ముడైన శ్రీరాముడే పంపియున్న యెడల నీవు నాతో సంభాషించుటకు సర్వవిధముల తగినవాడవని యెంచెదను.

**శ్లో॥ ప్రేషయిష్యతి దుర్ధర్షో రామో న హ్యపరీక్షితమ్ ।**
**పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః ॥ 11**

**పదచ్ఛేదము :–** ప్రేషయిష్యతి – దుర్ధర్షః – రామః – న – హి – అపరీక్షితమ్ – పరాక్రమమ్ – అవిజ్ఞాయ – మత్సకాశం – విశేషతః ॥

**అన్వయక్రమము :–** దుర్ధర్షః రామః పరాక్రమమ్ అవిజ్ఞాయ (కమపి) నహి ప్రేషయిష్యతి; విశేషతః మత్సకాశమ్ అపరీక్షితం (నహి) ప్రేషయిష్యతి.

**ప్రతిపదార్థము :–** దుర్ధర్షః రామః = ఎదిరించుటకు శక్యముగాని శ్రీరాముడు, పరాక్రమమ్ అవిజ్ఞాయ = పరాక్రమమును గూర్చి తెలిసికొనకుండ, (కమపి = ఎవ్వనిని కూడ దూతగా) న హి ప్రేషయిష్యతి = పంపబోవడు, విశేషతః = విశేషించి, మత్సకాశం = నా కడకు, అపరీక్షితం = పరీక్షింపబడనట్టి (దూతను). (న హి ప్రేషయిష్యతి = ఎంతమాత్రము పంపడు).

**తాత్పర్యము :–** అసాధారణశౌర్యశాలియైన శ్రీరాముడు దూతయొక్క పరాక్రమమును గూర్చి తెలిసికొనకుండ పరుల కడకు పంపడు. అందునను విశేషించి నా కడకు పంపునపుడు దూత సామర్థ్యమును పరీక్షింపకుండ ఎన్నడును పంపడు.

**శ్లో॥ దిష్ట్యా చ కుశలీ రామో ధర్మాత్మా సత్యసంగరః ।**
**లక్ష్మణశ్చ మహాతేజా స్సుమిత్రానందవర్ధనః ॥ 12**

**పదచ్ఛేదము :–** దిష్ట్యా – చ – కుశలీ – రామః – ధర్మాత్మా – సత్యసంగరః – లక్ష్మణః – చ – మహాతేజాః – సుమిత్రానందవర్ధనః ॥

**అన్వయక్రమము :–** సత్యసంగరః ధర్మాత్మా రామః దిష్ట్యా కుశలీ? సుమిత్రానందవర్ధనః మహాతేజాః లక్ష్మణశ్చ కుశలీ?

**ప్రతిపదార్థము :–** సత్యసంగరః = సత్యసంధుడైన, ధర్మాత్మా = పరమధార్మికుడైన, రామః = శ్రీరాముడు, దిష్ట్యా = నా భాగ్యవశమున, కుశలీ! = క్షేమముగా నున్నాడుకదా, సుమిత్రానందవర్ధనః = సుమిత్రముద్దు బిడ్డడైన, మహాతేజాః = అమితతేజస్సంపన్నుడు అగు, లక్ష్మణశ్చ = లక్ష్మణుడును, కుశలీ! = క్షేమముతో నున్నాడుగదా!

**తాత్పర్యము :–** సత్యపాలనదీక్ష గలవాడును ధర్మాత్ముడును అగు శ్రీరాముడు నా యదృష్టవశమున క్షేమముగ నున్నాడు గదా! సుమిత్రానందనుడైన మహాతేజశ్శాలి యగు లక్ష్మణుడును క్షేమముగా నున్నాడుగదా!

**శ్లో॥ కుశలీ యది కాకుత్థ్సః కిం న సాగరమేఖలామ్ ।**
**మహీం దహతి కోపేన యుగాంతాగ్నిరివోత్థితః ॥ 13**

**పదచ్ఛేదము :–** కుశలీ – యది – కాకుత్థ్సః – కిం – న – సాగరమేఖలామ్ – మహీం – దహతి – కోపేన – యుగాంతాగ్నిః – ఇవ – ఉత్థితః ॥

**అన్వయక్రమము :–** కాకుత్థ్సః కుశలీ యది కోపేన ఉత్థితః యుగాంతాగ్నిః ఇవ సాగరమేఖలాం మహీం కిం న దహతి?

**ప్రతిపదార్థము :–** కాకుత్థ్సః = రఘురాముడు, కుశలీ యది = క్షేమముగ నున్నవాడయిన, కోపేన = క్రోధముచే, ఉత్థితః = ప్రజ్వరిల్లినట్టి, యుగాంతాగ్నిః ఇవ = ప్రళయాగ్నివలె, సాగరమేఖలాం = సముద్రమధ్యమునందుగల (సాగరమే మొల నూలుగాగల) మహీం = భూమిని, కిం న దహతి = ఏల దహించుటలేదు?

**తాత్పర్యము :–** శ్రీరాముడు క్షేమముగానే యున్నచో భార్య నపహరించిన శత్రువుపై క్రోధము నొంది ప్రళయకాలమునందు విజృంభించిన సంవర్తాగ్నివలె చతుస్సముద్ర మధ్యగతమైన భూమండలమునంతను వెంటనే ఏల దహించివేయుట లేదు?

**శ్లో॥ అథవా శక్తిమంతౌ తౌ సురాణామపి నిగ్రహే ।**
**మమైవ తు న దుఃఖానా మస్తి మన్యే విపర్యయః ॥ 14**

**పదచ్ఛేదము :–** అథవా – శక్తిమంతౌ – తౌ – సురాణామ్ – అపి – నిగ్రహే – మమ – ఏవ – తు – న – దుఃఖానాం – అస్తి – మన్యే – విపర్యయః ॥

**అన్వయక్రమము :–** అథవా తౌ సురాణాం నిగ్రహే అపి శక్తిమంతౌ; తు మమ ఏవ దుఃఖానాం విపర్యయః న (అస్తి ఇతి) మన్యే.

**ప్రతిపదార్థము :–** అథవా = లేక, తౌ = ఆ రామలక్ష్మణులు, సురాణాం = దేవతల యొక్క, నిగ్రహే అపి = నిర్జించుటయందు గూడ, శక్తిమంతౌ = సామర్థ్యముగలవారే, తు = కాని, మమ = నాయొక్క, దుఃఖానామ్ ఏవ = దుఃఖములకే, విపర్యయః = అంతము, నాస్తి ఇతి = లేదు అని, మన్యే = తలచుచున్నాను.

**తాత్పర్యము :–** లేక పురుషసింహులైన ఆ యన్నదమ్ము లిరువురును దేవతల నణచి వేయుటలో గూడ సామర్థ్యము గలవారలే గాని ప్రస్తుతము నా దుఃఖములకే అంత మనునది లేక యున్నదని నేను భావించుచున్నాను.

**శ్లో॥ కచ్చి న్న వ్యథతే రామః కచ్చి న్న పరితప్యతే ।**
**ఉత్తరాణి చ కార్యాణి కురుతే పురుషోత్తమః ॥ 15**

**పదచ్ఛేదము** :- కచ్చిత్ - న - వ్యథతే - రామః - కచ్చిత్ - న - పరితప్యతే - ఉత్తరాణి - చ - కార్యాణి - కురుతే - పురుషోత్తమః ॥

**అన్వయక్రమము** :- రామః వ్యథతే న కచ్చిత్! పరితప్యతే న కచ్చిత్! పురుషోత్తమః ఉత్తరాణి కార్యాణి కురుతే (కచ్చిత్!).

**ప్రతిపదార్థము** :- రామః = శ్రీరాముడు, వ్యథతే న కచ్చిత్ = దిగులు నొందుచుండుట లేదుగదా! పరితప్యతే న కచ్చిత్! = సంతాపము నొందుట లేదుగదా! పురుషోత్తమః = పురుషశ్రేష్ఠుడైన యాతడు, ఉత్తరాణి = ముందుకాలమున చేయదగిన, కార్యాణి = కృత్యములను, కురుతే కచ్చిత్! = చేయుచున్నాడుగదా!

**తాత్పర్యము** :- శ్రీరాముడు నన్ను దలచుకొనుచు వ్యథలో మునిగి యుండలేదుగదా! పురుషశ్రేష్ఠుడైన యాతడు నా విమోచనముకొఱకై ముందు జఱుపవలసిన కృత్యములను మెలకువతో చేయుచున్నాడు గదా!

**శ్లో॥ కచ్చి న్న దీన స్సంభ్రాంతః కార్యేషు చ న ముహ్యతి ।**
**కచ్చి త్పురుషకార్యాణి కురుతే నృపతే స్సుతః ॥ 16**

**పదచ్ఛేదము** :- కచ్చిత్ - న - దీనః - సంభ్రాంతః - కార్యేషు - చ - న - ముహ్యతి - కచ్చిత్ - పురుషకార్యాణి - కురుతే - నృపతేః - సుతః ॥

**అన్వయక్రమము** :- దీనః సంభ్రాంతః కార్యేషు న ముహ్యతి కచ్చిత్! నృపతేః సుతః పురుషకార్యాణి కురుతే కచ్చిత్?

**ప్రతిపదార్థము** :- దీనః = దైన్యము నొందినవాడును, సంభ్రాంతః = సంభ్రమము గలవాడునై, కార్యేషు = కర్తవ్యములందు, న ముహ్యతి కచ్చిత్ = మోహగ్రస్తుడై యుండుట లేదుగదా! నృపతేః సుతః = రాజకుమారుడైన యాతడు, పురుషకార్యాణి = పురుషయత్నముతో చేయు పనులను, కురుతే కచ్చిత్ = చేయుచున్నాడు గదా!

**తాత్పర్యము** :- దైన్యమునకు చిక్కినవాడై భ్రమకు వశుడగుచు తన కర్తవ్యములందు మోహగ్రస్తుడై యుండుటలేదు గదా! ఆ రాజకుమారుడు పురుషయత్నముతో సాధింపవలసిన కార్యములను విడువక నెఱవేర్చుచున్నాడు గదా!

**శ్లో॥ ద్వివిధం త్రివిధోపాయ ముపాయమపి సేవతే ।**
**విజిగీషు స్సుహృత్కచ్చి న్మిత్రేషు చ పరంతపః ॥ 17**

**పదచ్ఛేదము** :- ద్వివిధం - త్రివిధోపాయం - ఉపాయమ్ - అపి - సేవతే - విజిగీషుః - సుహృత్ - కచ్చిత్ - మిత్రేషు - చ - పరంతపః ॥

**అన్వయక్రమము :–** పరంతపః (సః) మిత్రేషు సుహృత్ (సన్) ద్వివిధమ్ ఉపాయం, అమిత్రేషు చ విజిగీషుః (సన్) త్రివిధోపాయం అపి సేవతే కచ్చిత్ ?

**ప్రతిపదార్థము :–** పరంతపః = శత్రుతాపనుడైన, (సః = ఆ శ్రీరాముడు) మిత్రేషు = మిత్రులయెడ, సుహృత్ (సన్) = సౌహార్దముగలవాడై, ద్వివిధమ్ ఉపాయం = (సామదానములను) రెండు ఉపాయములను, అమిత్రేషు చ = శత్రువులందును, విజిగీషుః (సన్) = విజయవాంఛగలవాడై, త్రివిధోపాయం = దానభేదదండములను మూడు ఉపాయములను, అపి సేవతే కచ్చిత్ = అవలంబించుచున్నాడు గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థీయము :–** మిత్రేషు చ ద్వివిధం ఉపాయం అనగా మిత్రులయెడ సామదానములను రెండు ఉపాయములు, చకారముచే ఆ మిత్రులయెడ భేద దండములను రెండు ఉపాయములను అని చెప్పనగును.

**తిలకము :–** ద్వివిధమ్ ఉపాయం – సౌమ్యా సౌమ్య రూప ద్వివిధోపాయములు – త్రివిధోపాయం ధర్మార్థకామములను మూడు పురుషార్థముల సంపాదనకు సాధన భూతమైన మూడు ఉపాయములను.

**రా.శిరోమణి :–** మిత్రేషు చ సుహృత్ – చకారమువలన శత్రువులయెడగూడ శ్రీరాముడు సౌహార్దముగలవాడు.

**ద్వివిధమ్ ఉపాయం :–** ఐహికాముష్మిక ప్రాప్తి ఉపాయములు.

**త్రివిధోపాయం :–** బ్రహ్మవిష్ణు మహేశ్వరులకు ప్రీతి సంపాదకములగు ఉపాయములు.

**తాత్పర్యము :–** మహావీరుడైన శ్రీరాముడు మిత్రులయెడ మంచి మనస్సుతో సామదానములనెడి ద్వివిధోపాయములను, శత్రువులయెడ విజయేచ్ఛతో దానభేద దండరూపమైన మూడు ఉపాయములను యుక్తముగ నెఱపుచున్నాడు కదా!

**శ్లో॥ కచ్చి న్మిత్రాణి లభతే మిత్త్రై శ్చాప్యభిగమ్యతే ।**
**కచ్చి త్కల్యాణమిత్రశ్చ మిత్త్రై శ్చాపి పురస్కృతః ॥ 18**

**పదచ్ఛేదము :–** కచ్చిత్ – మిత్రాణి – లభతే – మిత్త్రైః – చ – అపి – అభిగమ్యతే – కచ్చిత్ – కల్యాణమిత్రః – చ – మిత్రైః – చ – అపి – పురస్కృతః ॥

**అన్వయక్రమము :–** (సః) మిత్రాణి లభతే కచ్చిత్? మిత్త్రైః అభిగమ్యతే కచ్చిత్! కల్యాణమిత్రః భవతి కచ్చిత్! మిత్త్రైః పురస్కృతః అపి (భవతి కచ్చిత్)?

**ప్రతిపదార్థము** :- (సః = ఆ శ్రీరాముడు) మిత్రాణి లభతే కచ్చిత్ = మిత్రులను పొందుచున్నాడుగదా! (సంపాదించుచున్నాడుగదా), మిత్రైః అపి చ = మిత్రులతోగూడ, అభిగమ్యతే కచ్చిత్ = చేరబడుచున్నాడుగదా, కల్యాణమిత్రః (భవతి) కచ్చిత్ = ఉత్తములైన మిత్రులు గలవాడుగ నున్నాడుగదా! మిత్రైః చ అపి = మిత్రులచే గూడ, పురస్కృతః (భవతి) కచ్చిత్ = గౌరవింపబడుచున్నాడు గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :- అమిత్రైః అభిగమ్యతే కచ్చిత్ - తనవలన పరాభవింపబడిన శత్రువులచే శరణుగోరి సేవింపబడుచున్నాడుగదా!

**తాత్పర్యము** :- నా శ్రీరాముడు మిత్రులను సంపాదించుచు వారిచే సేవింపబడు చున్నాడుగదా! సత్పురుషులైన మిత్రులతో గలిసియుండి వారిచే గౌరవింపబడు చున్నాడుగదా!

**శ్లో॥ కచ్చి దాశాస్తి దేవానాం ప్రసాదం పార్థివాత్మజః ।**
**కచ్చి త్పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే ॥ 19**

**పదచ్ఛేదము** :- కచ్చిత్ - ఆశాస్తి - దేవానాం - ప్రసాదం - పార్థివాత్మజః - కచ్చిత్ - పురుషకారం - చ - దైవం - చ - ప్రతిపద్యతే ॥

**అన్వయక్రమము** :- పార్థివాత్మజః దేవానాం ప్రసాదమ్ ఆశాస్తి కచ్చిత్! పురుషకారం చ దైవం చ ప్రతిపద్యతే కచ్చిత్!

**ప్రతిపదార్థము** :- పార్థివాత్మజః = రాజకుమారుడైన శ్రీరాముడు, దేవానాం = దేవతల యొక్క, ప్రసాదం = అనుగ్రహమును, ఆశాస్తి కచ్చిత్ = కోరుచున్నాడుగదా! పురుషకారం చ = పురుషయత్నమును, దైవం చ = దైవానుగ్రహమును, ప్రతిపద్యతే కచ్చిత్ = పొందుచున్నాడుగదా!

**తాత్పర్యము** :- రాజపుత్రుడైన శ్రీరాముడు దేవతల అనుగ్రహమును యుక్తమైన రీతిలో ప్రార్థించి పొందుచున్నాడుగదా! తన పురుషకారమునకును దైవాను గ్రహమునకును యుక్తమైన ప్రాధాన్యము నిచ్చుచున్నాడుగదా!

**శ్లో॥ కచ్చి న్న విగతస్నేహః ప్రవాసాన్మయి రాఘవః ।**
**కచ్చి న్మాం వ్యసనా దస్మాన్మోక్షయిష్యతి రాఘవః ॥ 20**

**పదచ్ఛేదము** :- కచ్చిత్ - న - విగతస్నేహః - ప్రవాసాత్ - మయి - రాఘవః - కచ్చిత్ - మాం - వ్యసనాత్ - అస్మాత్ - మోక్షయిష్యతి - రాఘవః ॥

**అన్వయక్రమము** :- రాఘవః ప్రవాసాత్ మయి విగతస్నేహః న (భవతి) కచ్చిత్! రాఘవః మాం అస్మాత్ వ్యసనాత్ మోక్షయిష్యతి కచ్చిత్!

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, ప్రవాసాత్ = ప్రవాస కారణమున, మయి = నాయందు, విగతస్నేహః = నశించిన అనురాగము గలవాడు, న (భవతి) కచ్చిత్ = కాడుగదా! రాఘవః = రఘుకులభూషణుడు, మాం = నన్ను, అస్మాత్ వ్యసనాత్ = ఈ విపత్తునుండి, మోక్షయిష్యతి కచ్చిత్ = విడిపింపగలడుగదా!

"వినశ్యతి స్నేహః ప్రవాసాౖశయాత్" (స్నేహము దూరదేశవాసమువలన నశించును.) భర్తృహరి నుడివిన ఈ నీతిసూక్తికి ప్రస్తుతవాల్మీకిశ్లోకమే మూలము.

**తాత్పర్యము** :- శ్రీరాముడు నా ఈ దూరదేశస్థితివలన నాయెడ అనురాగహీనుడై యుండుటలేదుగదా! నాకు సంభవించిన ఈ విపత్తునుండి నన్ను ఆతడు త్వరలో విడిపించునుగదా!

**శ్లో॥ సుఖానా ముచితో నిత్య మసుఖానా మనూచితః ।**
**దుఃఖ ముత్తర మాసాద్య కచ్చి ద్రామో న సీదతి ॥ 21**

**పదచ్ఛేదము** :- సుఖానామ్ - ఉచితః - నిత్యమ్ - అసుఖానామ్ - అనూచితః - దుఃఖమ్ - ఉత్తరమ్ - ఆసాద్య - కచ్చిత్ - రామః - న - సీదతి ॥

**అన్వయక్రమము** :- నిత్యం సుఖానామ్ ఉచితః, అసుఖానామ్ అనూచితః రామః ఉత్తరం దుఃఖమ్ ఆసాద్య న సీదతి కచ్చిత్!

**ప్రతిపదార్థము** :- నిత్యం = ఎల్లప్పుడును, సుఖానాం = సుఖములకే, ఉచితః = తగినవాడును, అసుఖానాం = క్లేశములకు, అనూచితః = తగనివాడునగు, రామః = శ్రీరాముడు, ఉత్తరం = గొప్పదైన, దుఃఖం = దుఃఖమును, ఆసాద్య = పొంది, న సీదతి కచ్చిత్ = క్రుంగిపోవుటలేదుగదా!

**తాత్పర్యము** :- ఎల్లవేళల సుఖములకు మాత్రమే తగియున్నవాడును, కష్టములకు ఎంత మాత్రము తగనివాడు నగు శ్రీరాముడు ఈ తీవ్రమైన దుఃఖమును పొంది క్రుంగిపోవుట లేదుగదా!

**శ్లో॥ కౌసల్యాయా స్తథా కచ్చి త్సుమిత్రాయా స్తథైవ చ ।**
**అభీక్ష్ణం శ్రూయతే కచ్చి త్కుశలం భరతస్య చ ॥ 22**

**పదచ్ఛేదము** :- కౌసల్యాయాః - తథా - కచ్చిత్ - సుమిత్రాయాః - తథా - ఏవ - చ - అభీక్ష్ణం - శ్రూయతే - కచ్చిత్ - కుశలం - భరతస్య - చ ॥

**అన్వయక్రమము** :– కౌసల్యాయాః తథా సుమిత్రాయాః తథైవ భరతస్య చ కుశలం అభీక్ష్ణం శ్రూయతే కచ్చిత్?

**ప్రతిపదార్థము** :– కౌసల్యాయాః = కౌసల్యాదేవియొక్కయు, తథా = అట్లు, సుమిత్రాయాః = సుమిత్రయొక్కయు, తథైవ = అట్లే, భరతస్య చ = భరతుని యొక్కయును, కుశలం = క్షేమము, అభీక్ష్ణం = తఱచుగా, శ్రూయతే కచ్చిత్ = వినబడుచున్నదిగదా!

**తాత్పర్యము** :– కౌసల్యాదేవి క్షేమమును, సుమిత్రాదేవి కుశలమును, భరతుని క్షేమ వార్తయు తఱచు వినవచ్చుచున్నవిగదా!

**శ్లో॥ మన్నిమిత్తేన మానార్హః కచ్చి చ్ఛోకేన రాఘవః ।**
**కచ్చి న్నాన్యమనా రామః కచ్చి న్మాం తారయిష్యతి ॥ 23**

**పదచ్ఛేదము** :– మన్నిమిత్తేన – మానార్హః – కచ్చిత్ – శోకేన – రాఘవః – కచ్చిత్ – న – అన్యమనాః – రామః – కచ్చిత్ – మాం – తారయిష్యతి ॥

**అన్వయక్రమము** :– మానార్హః రాఘవః మన్నిమిత్తేన శోకేన పరితప్యతే న కచ్చిత్? రామః అన్యమనాః న (భవతి) కచ్చిత్? మాం తారయిష్యతి కచ్చిత్?

**ప్రతిపదార్థము** :– మానార్హః = గౌరవార్హుడైన, రాఘవః = శ్రీరాముడు, మన్నిమిత్తేన = నా కారణముగ కలిగినట్టి, శోకేన = దుఃఖముచే, (పరితప్యతే) (న కచ్చిత్) = సంతాపము నొందుటలేదుగదా! రామః = శ్రీరాముడు, అన్యమనాః = అన్యమనస్కుడు, న భవతి కచ్చిత్ = అగుటలేదుగదా? మాం = నన్ను, తారయిష్యతి కచ్చిత్ = దాటింపగలడుగదా!

**తాత్పర్యము** :– మాననీయుడైన శ్రీరాముడు నా వియోగముచే గలిగిన దుఃఖముతో మిక్కిలిగా తపించుటలేదుగదా! ఆతడు పరధ్యానములో నున్నవాడై కర్తవ్యమూఢు డగుటలేదుగదా! ధీరత్వము వహించి ఈ విపత్తునుండి నన్ను తప్పక ఉద్ధరింపగలడు గదా!

**శ్లో॥ కచ్చి దక్షౌహిణీం భీమాం భరతో భ్రాతృవత్సలః ।**
**ధ్వజినీం మంత్రిభి ర్గుప్తాం ప్రేషయిష్యతి మత్కృతే ॥ 24**

**పదచ్ఛేదము** :– కచ్చిత్ – అక్షౌహిణీం – భీమాం – భరతః – భ్రాతృవత్సలః – ధ్వజినీం – మంత్రిభిః – గుప్తాం – ప్రేషయిష్యతి – మత్కృతే ॥

**అన్వయక్రమము** :– భ్రాతృవత్సలః భరతః మంత్రిభిః గుప్తాం భీమామ్ అక్షౌహిణీం ధ్వజినీం మత్కృతే ప్రేషయిష్యతి కచ్చిత్ ?

**ప్రతిపదార్థము** :– భ్రాతృవత్సలః = సోదరునిపై ప్రేమగల, భరతః = భరతుడు, మంత్రిభిః గుప్తాం = మంత్రులచే రక్షింపబడుచున్న, భీమాం = భయంకరమైనట్టి, అక్షౌహిణీం = పెద్దసంఖ్యగల చతురంగబలము కలిగినట్టి, ధ్వజినీం = సైన్యమును, మత్కృతే = నా నిమిత్తమై, ప్రేషయిష్యతి కచ్చిత్ = పంపగలడు గదా!

**తాత్పర్యము** :– అమితమైన సోదరప్రేమగల మా భరతుడు అన్నకు గలిగిన కష్టమును తెలిసికొని సమర్థులైన యుద్ధమంత్రులను తోడిచ్చి చతురంగబలసంపన్నమైన శత్రు భయంకరమగు మహాసైన్యమును నన్ను విడిపించుటకై పంపును గదా.

**శ్లో॥ వానరాధిపతిః శ్రీమాన్ సుగ్రీవః కచ్చి దేష్యతి ।**
**మత్కృతే హరిభి ర్వీరై ర్వృతో దంతనఖాయుధైః ॥ 25**

**పదచ్ఛేదము** :– వానరాధిపతిః – శ్రీమాన్ – సుగ్రీవః – కచ్చిత్ – ఏష్యతి – మత్కృతే – హరిభిః – వీరైః – వృతః – దంతనఖాయుధైః ॥

**అన్వయక్రమము** :– వానరాధిపతిః శ్రీమాన్ సుగ్రీవః దంతనఖాయుధైః హరిభిః వృతః మత్కృతే ఏష్యతి కచ్చిత్?

**ప్రతిపదార్థము** :– వానరాధిపతిః = వానరరాజైన, శ్రీమాన్ సుగ్రీవః = శ్రీమంతుడైన సుగ్రీవుడు, దంతనఖాయుధైః = దంతములును నఖములును ఆయుధములుగా కలిగినట్టి, హరిభిః = వానరులతో, వృతః = కూడినవాడై, మత్కృతే = నా నిమిత్తమై, ఏష్యతి కచ్చిత్ = రాగలడుగదా!

**తాత్పర్యము** :– వానరాధీశుడైన మహనీయుడగు సుగ్రీవుడు తమ దంతములను, నఖములను ఆయుధములుగా చేసికొని యుద్ధముచేయు మహావీరులైన వానరులను వెంటబెట్టుకొని నన్ను విడిపించుటకొఱకై ఈ లంకకు త్వరలో రాగలడుగదా!

**శ్లో॥ కచ్చి న్న లక్ష్మణ శ్శూర స్సుమిత్రానందవర్ధనః ।**
**అస్త్రవి చ్ఛరజాలేన రాక్షసా న్విధమిష్యతి ॥ 26**

**పదచ్ఛేదము** :– కచ్చిత్ – న – లక్ష్మణః – శూరః – సుమిత్రానందవర్ధనః – అస్త్రవిత్ – శరజాలేన – రాక్షసాన్ – విధమిష్యతి ॥

**అన్వయక్రమము** :– సుమిత్రానందవర్ధనః, శూరః, అస్త్రవిత్ లక్ష్మణః శరజాలేన రాక్షసాన్ న విధమిష్యతి కచ్చిత్?

**ప్రతిపదార్థము** :- సుమిత్రానందవర్ధనః = సుమిత్రకు ఆనందమును పెంపొందింప చేయువాడును, శూరః = మహావీరుడునగు, అస్త్రవిత్ లక్ష్మణః = మహాస్త్రవేదియైన లక్ష్మణుడు, శరజాలేన = బాణసమూహముచే, రాక్షసాన్ = రక్కసులను, న విధమిష్యతి కచ్చిత్ = హతమార్చకుండునా!

**తాత్పర్యము** :- సుమిత్రానందనుడు, మహావీరుడు, వివిధాస్త్రకోవిదుడు అయిన మా మఱది లక్ష్మణుడు ఈ రాక్షసులపై బాణవర్షమును కురిపించి వారిని త్వరలో పరిమార్పగలడుగదా!

**శ్లో॥ రౌద్రేణ కచ్చి దస్త్రేణ రామేణ నిహతం రణే ।**
**ద్రక్ష్యా మ్యల్పేన కాలేన రావణం ససుహృజ్జనమ్ ॥ 27**

**పదచ్ఛేదము** :- రౌద్రేణ - కచ్చిత్ - అస్త్రేణ - రామేణ - నిహతం - రణే - ద్రక్ష్యామి - అల్పేన - కాలేన - రావణం - ససుహృజ్జనమ్ ॥

**అన్వయక్రమము** :- అల్పేన కాలేన రౌద్రేణ అస్త్రేణ రామేణ ససుహృజ్జనం రావణం రణే నిహతం ద్రక్ష్యామి కచ్చిత్!

**ప్రతిపదార్థము** :- అల్పేన కాలేన = స్వల్పకాలముననే, రౌద్రేణ అస్త్రేణ = భీకరమైన అస్త్రముతో, రామేణ = శ్రీరామునిచే, ససుహృజ్జనం = మిత్రవర్గముతో గూడినట్టి, రావణం = రావణాసురుని, రణే = యుద్ధమునందు, నిహతం = వధింపబడిన వానినిగా, ద్రక్ష్యామి కచ్చిత్ = చూడగలనుగదా!

**తాత్పర్యము** :- అచిరకాలములోనే యుద్ధమున శ్రీరాముడు భీకరమైన అస్త్రములను ప్రయోగించి మిత్రబంధుసమేతముగా నేలగూల్పగా చచ్చిపడియున్న రావణుని త్వరలోనే నేను చూడగలనుగదా!

**శ్లో॥ కచ్చి న్న త ద్ధేమసమానవర్ణం**
**త స్యాననం పద్మసమానగంధి ।**
**మయా వినా శుష్యతి శోకదీనం**
**జలక్షయే పద్మమి వాతపేన ॥ 28**

**పదచ్ఛేదము** :- కచ్చిత్ - న - తత్ - హేమసమానవర్ణం - తస్య - ఆననం - పద్మసమానగంధి - మయా - వినా - శుష్యతి - శోకదీనం - జలక్షయే - పద్మం - ఇవ - ఆతపేన ॥

**అన్వయక్రమము :–** హేమసమానవర్ణం, పద్మసమానగంధి తస్య తత్ ఆననం జలక్షయే ఆతపేన పద్మమ్ ఇవ మయా వినా శోకదీనం (సత్) శుష్యతి న కచ్చిత్!

**ప్రతిపదార్థము :–** హేమసమానవర్ణం = బంగారముతో సమానమైన వర్ణము గలదియును, పద్మసమానగంధి = పద్మముతో సమానమైన పరిమళము గలదియునగు, తస్య = ఆ శ్రీరామునియొక్క, తత్ ఆననం = ఆ ముఖము, జలక్షయే = నీరు క్షీణించినప్పుడు, ఆతపేన = ఎండచే, పద్మం ఇవ = తామరపువ్వువలె, మయా వినా = నేను లేకుండగా, శోకదీనం (సత్) = దుఃఖముచే వెలవెల బోయినదై, శుష్యతి న కచ్చిత్ = ఎండిపోవలేదు గదా!

**తాత్పర్యము :–** బంగారమువలె మనస్సును ఆకర్షించునట్టి రమ్యమైన వర్ణముగలిగి పద్మసౌరభమును వెదజల్లునట్టి నా ప్రియుని ముఖము నా వియోగమున సంతాపముచే చిక్కిపోయినదై, ఎండిపోవుచున్న సరస్సులో ఎండకు కమిలిపోయిన తామరపువ్వువలె శుష్కించి పోలేదు గదా!

**శ్లో॥ ధర్మాపదేశా త్త్యజత స్స్వరాజ్యం**
**మాం చా ప్యరణ్యం నయతః పదాతేః ।**
**నాసీ ద్వ్యథా యస్య న భీ ర్న శోకః**
**కచ్చి త్స ధైర్యం హృదయే కరోతి ॥** **29**

**పదచ్ఛేదము :–** ధర్మాపదేశాత్ – త్యజతః – స్వరాజ్యం – మాం – చ – అపి – అరణ్యం – నయతః – పదాతేః – న – ఆసీత్ – వ్యథా – యస్య – న – భీః – న – శోకః – కచ్చిత్ – సః – ధైర్యం – హృదయే – కరోతి ॥

**అన్వయక్రమము :–** ధర్మాపదేశాత్ స్వరాజ్యం త్యజతః, మామ్ అపి అరణ్యం నయతః, పదాతేః యస్య వ్యథా నాసీత్, భీః నాసీత్, శోకః చ నాసీత్, సః అద్య హృదయే ధైర్యం కరోతి కచ్చిత్?

**ప్రతిపదార్థము :–** ధర్మాపదేశాత్ = ధర్మము నిమిత్తమున, స్వరాజ్యం = తన రాజ్యమును, త్యజతః = పరిత్యజించుచున్నవాడును, మామ్ అపి = నన్ను గూడ, అరణ్యం నయతః = అడవికి గొనిపోవుచున్నవాడును, పదాతేః = కాలినడకను పోవుచున్నవాడును అగు, యస్య = ఏ ధీరునకు, వ్యథా = చింత, నాసీత్ = లేకుండెనో, శోకః చ = దుఃఖము కూడ, నాసీత్ = లేకుండెనో, సః = ఆ శ్రీరాముడు, అద్య = నేడు, హృదయే = మదిలో, ధైర్యం కరోతి కచ్చిత్ = ధైర్యమును పూనియున్నాడు గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- భీః = జానకిని వెంటగోని పోవుటకు భయము, శోకః - రాజ్యపరిత్యాగమునకు దుఃఖము, వ్యథా - అరణ్యావాసమునకు దిగులు.

**మహేశ్వరతీర్థులు** :- వ్యథా - రాజ్యత్యాగమువలన, భీః - అరణ్యసంచారమును గూర్చి, శోకః - సీతావనసంచారమునకు.

**వాసుదాసస్వామి** :- నేను పదునెనిమిదేళ్ళ పిల్లను కాఅడవులలో ముండ్లలో, రాళ్ళలో తన కన్నులయెదుట తిరుగుచున్నప్పుడును మనసున ధీరత నొందిన ధైర్యశాలి ఇప్పుడు సీత పోయిన పోనిమ్మని ధైర్యము విడువకయున్నాడుగదా!

**తాత్పర్యము** :- ధర్మపాలనముకొఅకై రాజ్యమును విడిచి పెట్టుచున్నప్పుడు గాని, నన్ను తన వెంట అరణ్యమునకు కాలినడకను గొనిపోవుచున్నప్పుడు గాని ఏ ధీరుడు ఎట్టి వ్యథయును భయమును దుఃఖమును లేక యుండగల్గెనో అట్టి ఆత డీనాడు నా వియోగముచే మనస్సునందు ధైర్యమును గోల్పోవుటలేదు గదా!

**శ్లో॥ న చాస్య మాతా న పితా న చాన్యః**
**స్నేహా ద్విశిష్టో ఽస్తి మయా సమో వా ।**
**తావ ద్ధ్యహం దూత జిజీవిషేయం**
**యావ త్ప్రవృత్తిం శృణుయాం ప్రియస్య ॥ 30**

**పదచ్ఛేదము** :- న - చ - అస్య - మాతా - న - పితా - న - చ - అన్యః - స్నేహాత్ - విశిష్టః - అస్తి - మయా - సమః - వా, తావత్ - హి - అహం - దూత - జిజీవిషేయం - యావత్ - ప్రవృత్తిం - శృణుయాం - ప్రియస్య ॥

**అన్వయక్రమము** :- స్నేహాత్ అస్య మాతా న విశిష్టా, పితా చ న విశిష్టః, అన్యశ్చ విశిష్టః న అస్తి, మయా సమః చ వా నాస్తి, దూతః ప్రియస్య ప్రవృత్తిం యావత్ శృణుయాం, తావత్ హి అహం జిజీవిషేయమ్.

**ప్రతిపదార్థము** :- స్నేహాత్ = స్నేహమువలన, అస్య = శ్రీరామునకు, మాతా = తల్లి, న విశిష్టా = అధికురాలుకాదు, పితా చ = తండ్రియును, న విశిష్టః = అధికుడు కాదు, అన్యశ్చ = ఇతరుడును, విశిష్టః = అధికుడు, నాస్తి = లేదు, మయా = నాతో, సమః చ వా = సమానుడునుగాని, నాస్తి = లేదు. దూత = ఓ చారుడా! ప్రియస్య = ప్రియునియొక్క, ప్రవృత్తిం = వార్తను, యావత్ = ఎప్పటివఅకు, శృణుయాం = వినగలుగుదునో, తావత్ హి = అంతవఅకే సుమా, అహం = నేను, జిజీవిషేయం

= జీవింప గోరెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** “స్నేహత్ విశిష్టః మయా సమో వా నాస్తి – ఆ పరమపురుషునియొక్క శక్తిరూపమైన దానను అని సీతమ్మ వెల్లడించుచున్నదని తెలియవలెను.

**గోవిందరాజీయము :–** రామవియోగము కలిగిన ఉత్తరక్షణముననే సీతమ్మ ప్రాణములను విడువవలసియున్నను అట్టి ప్రాణత్యాగము శ్రీరామునకు అభిమతము గాదని ఆమె ప్రాణములను ధరించియే యున్నది. తాను జీవించి యున్నప్పుడే శ్రీరాముడు శత్రువులపై ప్రతీకారము గావించుటకు అవకాశముండును. అట్టి అవకాశము రామునకొసగి ఆతడు లంకకు చేరునంతవఱకు తాను జీవించి యుండుట తన ధర్మమని తెలుపుచు అటుపిమ్మట విషయముపై తనకు ఆసక్తి లేదని రాముని వార్తయు చర్యయు వినువఱకును జీవించి యుందునని వ్యక్తపఱచెను.

**వాసుదాసస్వామి :–** ఇంతవరకు వానరేంద్ర కపీంద్రా యని సంబోధించిన సీత ఇప్పుడు దూతా! యని సంబోధించినది. ఏలననగా దూతతో చెప్పినమాట ఆతని స్వామితో చెప్పినట్లే! ఆతని స్వామి కా మాట లతడు చెప్పవలయుననియే యుద్దేశ్యము. ఈ విషయము శ్రీమద్ భాగవతములోని దశమస్కంధమునందలి భ్రమరగీతలతో పోల్చి చూడవలెను.

**తాత్పర్యము :–** దూతవైన ఓ హనుమా! శ్రీరాముడు నన్నే మిక్కిలి ప్రేమించినాడు. ఆతడు నన్ను ప్రేమించినంతగాని, అంతకంటే ఎక్కువగా గాని ఎవ్వరిని ప్రేమించలేదని నాకు తెలియును. తన తల్లిగాని, తండ్రి గాని, వేఱొకరుగాని ఆతని ప్రేమను చూఱగొనుటలో నా తరువాతివారే సుమా! అందుచేతనే ఆతని క్షేమవార్తను వినవలెనని ఎట్లో ఇంత కాలమును జీవించియుంటిని. తరువాతి విషయము నావశములోనిది గాదు సుమా!

**శ్లో॥ ఇతీవ దేవీ వచనం మహార్థం**
**తం వానరేంద్రం మధురార్థ ముక్త్వా ।**
**శ్రోతుం పున స్తస్య వచోఽభిరామం**
**రామార్థయుక్తం విరరామ రామా ॥ 31**

**పదచ్ఛేదము :–** ఇతి – ఇవ – దేవీ – వచనం – మహార్థం – తం – వానరేంద్రం – మధురార్థమ్ – ఉక్త్వా – శ్రోతుం – పునః – తస్య – వచః – అభిరామం –

రామార్థయుక్తం - విరరామ - రామా ॥

**అన్వయక్రమము :-** దేవీ రామా తం వానరేంద్రమ్ ఇతి ఇవ మహార్థం మధురార్థం వచనమ్ ఉక్త్వా రామార్థయుక్తం తస్య అభిరామం వచః పునః శ్రోతుం విరరామ.

**ప్రతిపదార్థము :-** దేవీ = పూజ్యురాలైన, రామా = ఆ సీతాదేవి, తం వానరేంద్రం = ఆ వానరశ్రేష్ఠునిగూర్చి, ఇతి ఇవ = ఈ విధముగా, మహార్థం = గొప్పదైన భావము కలిగినట్టిదియును, మధురార్థం = మధురమైన అర్థముగలదియునగు, వచనం = మాటను, ఉక్త్వా = పలికి, రామార్థయుక్తం = శ్రీరాముని ప్రయోజనముతో కూడినట్టి, తస్య = ఆ హనుమయొక్క, అభిరామం వచః = రమణీయమైన వాక్కును, పునః = తిరిగి, శ్రోతుం = వినుటకొఱకు, విరరామ = విరమించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** మహార్థం - సీతారాముల ప్రణయమునందలి సూక్ష్మములైన విషయము లింకను ఎన్నియో హనుమకు తెలిపినది. ఆ విషయములు తనకు గూడ అగోచరములైనవనియు ఆత్మీయునిగా నెంచిన హనుమకు మాత్రమే ఆమె తెలిపినది అనియు మహర్షి 'మహార్థం' అను పదముతో సూచించియున్నాడు. మధురార్థం - సీతామాత వచనము నందలి మాధుర్యముచే హనుమ ఏకాగ్రచిత్తుడై చిరకాలము వినుచు నిశ్శబ్దముగ నుండిపోయెను. అందుచేతనే సీతాదేవి హనుమముఖమున తన ప్రియుని గూర్చి ఇంకను వినవలయునను కుతూహలముతో ఆతనికి అవకాశము నిచ్చి తాను విరమించెనని భావము.

**తాత్పర్యము :-** సీతాదేవి ఈ రీతిగా మహార్థపూర్ణములును, మధురార్థభరితములును అగు వచనములను ఎన్నియో హనుమకు తెలిపి ఆ హనుమ ముఖమునుండి తిరిగి తన ప్రియునిగూర్చి మనోహరములైన వచనములను వినగోరి తన మాటలను చాలించెను.

**శ్లో॥ సీతాయా వచనం శ్రుత్వా మారుతి ర్భీమవిక్రమః ।**
**శిర స్యంజలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్ ॥ 32**

**పదచ్ఛేదము :-** సీతాయాః - వచనం - శ్రుత్వా - మారుతిః - భీమవిక్రమః - శిరసి - అంజలిమ్ - ఆధాయ - వాక్యమ్ - ఉత్తరమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :-** భీమవిక్రమః మారుతిః సీతాయాః వచనం శ్రుత్వా శిరసి అంజలిమ్ ఆధాయ ఉత్తరం వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** భీమవిక్రమః = భీకరపరాక్రమశాలియైన, మారుతిః = హనుమ, సీతాయాః = సీతయొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, శిరసి = తలపై, అంజలిం = దోయిలిని, ఆధాయ = ఉంచి, ఉత్తరం వాక్యం = ప్రత్యుత్తర వచనమును, అబ్రవీత్ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :–** ఉత్తరం వాక్యం – శ్రేష్ఠమైన వాక్యమును.

**తాత్పర్యము :–** భయంకరవిక్రముడైన హనుమ సీతాదేవి చెప్పిన మాటలను విని గౌరవాతిశయముతో శిరస్సు వంచి దోసిలి యొగ్గి ఇట్లు పలికెను.

**శ్లో॥ న త్వా మిహస్థాం జానీతే రామః కమలలోచనః ।**
**తేన త్వాం నానయ త్యాశు శచీమివ పురందరః ॥ 33**

**పదచ్ఛేదము :–** న – త్వామ్ – ఇహస్థాం – జానీతే – రామః – కమలలోచనః – తేన – త్వాం – న – ఆనయతి – ఆశు – శచీమ్ – ఇవ – పురందరః ॥

**అన్వయక్రమము :–** కమలలోచనః రామః త్వామ్ ఇహస్థాం న జానీతే, తేన శచీం పురందరః ఇవ (సః) త్వామ్ ఆశు న ఆనయతి.

**ప్రతిపదార్థము :–** కమలలోచనః = తామరపువ్వులవంటి విశాలమైన కన్నులుగల, రామః = శ్రీరాముడు, త్వాం = నిన్ను, ఇహస్థాం = ఇచ్చట నున్నదానినిగా, న జానీతే = ఎఱుగడు, తేన = అందుచేత, శచీం = శచీదేవిని, పురందరః ఇవ = దేవేంద్రుడువలె, త్వాం = నిన్ను, సః = ఆ శ్రీరాముడు, ఆశు = శీఘ్రముగా, న ఆనయతి = తీసికొని వచ్చుటలేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** శచీం పురందర ఇవ – అనుహ్లాదదైత్యునిచే అపహరింప బడినట్టి, శచీదేవిని వలెనని భావము, అనుహ్రాదుని చేజిక్కిన శచీదేవిని ఇంద్రుడు కొంతకాలము తెలిసికొనలేక, పిమ్మట తెలిసికొనిన వెంటనే ఏ విధముగా తెచ్చుకొనెనో అట్లని భావము.

**తాత్పర్యము :–** నిన్ను ప్రాణముగా చూచుకొను రాముడు నీ విచ్చట నున్నట్లు ఎఱుగడు కాబట్టి పూర్వము శత్రుహస్తగతయైన శచీదేవిని దేవేంద్రుడు తిరిగి తెచ్చుకొని నట్లుగా శీఘ్రముగా నిన్ను తీసికొని పోలేకయున్నాడు.

**శ్లో॥ శ్రుత్వైవ చ వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః ।**
**చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్షగణసంయుతామ్ ॥ 34**

**పదచ్ఛేదము** :- శ్రుత్వా - ఏవ - చ - వచః - మహ్యం - క్షిప్రమ్ - ఏష్యతి - రాఘవః - చమూం - ప్రకర్షన్ - మహతీం - హర్యృక్షగణసంయుతామ్ ॥

**అన్వయక్రమము** :- రాఘవః మహ్యం (మత్తః) వచః శ్రుత్వా ఏవ హర్యృక్షగణ సంయుతాం మహతీం చమూం ప్రకర్షన్ క్షిప్రమ్ ఏష్యతి.

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, మహ్యం (మత్తః) = నా నుండి, వచః = మాటను, శ్రుత్వా ఏవ = వినగనే, హర్యృక్షగణసంయుతాం = వానరులయొక్కయు భల్లూకములయొక్కయు సమూహములతో గూడినట్టి, మహతీం = గొప్పదైన, చమూం = సైన్యమును, ప్రకర్షన్ = తీసికొనివచ్చుచు, క్షిప్రం = శీఘ్రముగా, ఏష్యతి = రాగలడు.

**తాత్పర్యము** :- శ్రీరాముడు నేను తెలిపినమాట వినిన వెంటనే గొప్ప గొప్ప వానర వీరులతో భల్లూకయోధులతో గూడిన పెద్ద సైన్యమును నడిపించుకొనుచు ఇచ్చటికి అతిశీఘ్రకాలములోనే చేరగలడు సుమా!

**శ్లో॥ విష్టంభయిత్వా బాణౌఘై రక్షోభ్యం వరుణాలయమ్ ।**
**కరిష్యతి పురీం లంకాం కాకుత్థ్స శ్శాంతరాక్షసామ్ ॥ 35**

**పదచ్ఛేదము** :- విష్టంభయిత్వా - బాణౌఘైః - అక్షోభ్యం - వరుణాలయమ్, కరిష్యతి - పురీం - లంకాం - కాకుత్థ్సః - శాంతరాక్షసామ్ ॥

**అన్వయక్రమము** :- కాకుత్థ్సః అక్షోభ్యం వరుణాలయం బాణౌఘైః విష్టంభయిత్వా లంకాపురీం శాంతరాక్షసాం కరిష్యతి.

**ప్రతిపదార్థము** :- కాకుత్థ్సః = శ్రీరాముడు, అక్షోభ్యం = అతిక్రమింపజాలని, వరుణాలయం = సముద్రమును, బాణౌఘైః = బాణసమూహములచే, విష్టంభయిత్వా = స్తంభింపచేసి, లంకాపురీం = లంకానగరమును, శాంతరాక్షసాం = నశించిన రాక్షసులు గలదానినిగా, కరిష్యతి = చేయగలడు.

**తాత్పర్యము** :- శ్రీరాముడు దుర్గమమై భీకరమైయున్న సాగరమును తీవ్రమైన తన బాణసమూహముచే స్తంభింపజేసి దాటివచ్చి లంకానగరమును రాక్షసశూన్యముగా చేసివేయగలడు సుమా!

**శ్లో॥ తత్ర య ద్యంతరా మృత్యు ర్యది దేవా మహాసురాః ।**
**స్థాస్యంతి పథి రామస్య స తా నపి వధిష్యతి ॥ 36**

**పదచ్ఛేదము** :- తత్ర - యది - అంతరా - మృత్యుః - యది - దేవాః - మహాసురాః, స్థాస్యంతి - పథి - రామస్య - సః - తాన్ - అపి - వధిష్యతి ॥

**అన్వయక్రమము** :- తత్ర అంతరా మృత్యుః స్థాస్యతి యది, రామః తమ్ అపి వధిష్యతి, రామస్య పథి దేవాః మహాసురాః స్థాస్యంతి యది సః తానపి వధిష్యతి.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ యత్నమునందు, అంతరా = మధ్యలో, మృత్యుః = మృత్యుదేవత, స్థాస్యతి యది = నిలచిన యెడల, రామః = శ్రీరాముడు, తమ్ అపి వధిష్యతి = దానినిగూడ వధించగలడు, రామస్య పథి = శ్రీరాముని మార్గమున, దేవాః = దేవతలు, మహాసురాః = ఘోరరాక్షసులు, స్థాస్యంతి యది = నిలువబడిన యెడల, సః = ఆతడు, తానపి = వారినిగూడ, వధిష్యతి = సంహరించగలడు.

**తాత్పర్యము** :- శ్రీరాముడు నిన్ను విడిపించుటకై చేయు ప్రయత్నములో దేవతలు అడ్డమైనను, ఘోరరాక్షసులు అడ్డగించినప్పటికిని తుదకు మృత్యువు వచ్చినను ఆతడు వారినెల్లరను గూడ హతమార్చి నిన్నుగొని పోవగలడు సుమా!

**శ్లో॥ త వాదర్శనజే నార్యే శోకేన పరిపూరితః ।**
**న శర్మ లభతే రామః సింహార్దిత ఇవ ద్విపః ॥ 37**

**పదచ్ఛేదము** :- తవ - అదర్శనజేన - ఆర్యే - శోకేన - పరిపూరితః - న - శర్మ - లభతే - రామః - సింహార్దితః - ఇవ - ద్విపః ॥

**అన్వయక్రమము** :- ఆర్యే, రామః తవ అదర్శనజేన శోకేన పరిపూరితః, సింహార్దితః ద్విపః ఇవ శర్మ న లభతే.

**ప్రతిపదార్థము** :- ఆర్యే! = పూజ్యురాలా! రామః = శ్రీరాముడు, తవ అదర్శనజేన = నీవు గాన్పింపకుండుటచే గల్గినట్టి, శోకేన = దుఃఖముతో, పరిపూరితః = నిండినవాడై, సింహార్దితః = సింహముచే పీడింపబడిన, ద్విపః ఇవ = ఏనుగువలె, శర్మ = సుఖమును, న లభతే = పొందుటలేదు.

**తాత్పర్యము** :- తల్లీ! శ్రీరాముడు నీ వియోగముచే గల్గిన మహాదుఃఖముతో తపించుచు సింహముచే హింసింపబడిన ఏనుగువలె సుఖశాంతులకు దూరమైయున్నాడు సుమా!

**శ్లో॥ మందరేణ చ తే దేవి శపే మూలఫలేన చ ।**
**మలయేన చ వింధ్యేన మేరుణా దర్దురేణ చ ॥ 38**

**శ్లో॥ యథా సునయనం వల్గు బింబోష్ఠం చారుకుండలమ్ ।**
**ముఖం ద్రక్ష్యసి రామస్య పూర్ణచంద్రమి వోదితమ్ ॥ 39**

**పదచ్ఛేదము** :- మందరేణ - చ - తే - దేవి - శపే - మూలఫలేన - చ - మలయేన - చ - వింధ్యేన - మేరుణా - దర్దురేణ - చ - యథా - సునయనం - వల్గు - బింబోష్ఠం - చారుకుండలమ్, ముఖం - ద్రక్ష్యసి - రామస్య - పూర్ణచంద్రమ్ - ఇవ - ఉదితమ్ ॥

**అన్వయక్రమము** :- దేవి! ఉదితం పూర్ణచంద్రమ్ ఇవ(స్థితం) రామస్య సునయనం, వల్గు, బింబోష్ఠం చారుకుండలం ముఖం యథా ద్రక్ష్యసి తథా మందరేణ చ మలయేన చ వింధ్యేన చ మేరుణా చ దర్దురేణ చ మూలఫలేన చ శపే.

**ప్రతిపదార్థము** :- దేవి! = ఓ పూజ్యురాలా! ఉదితం = ఉదయించినట్టి, పూర్ణచంద్రమ్ ఇవ స్థితం = నిండుచంద్రునివలె నున్నట్టి, రామస్య = శ్రీరామునియొక్క, సునయనం = సుందరమైన నేత్రములు గల్గినట్టిదియు, వల్గు = మనోహరమైనట్టిదియు, బింబోష్ఠం = దొండపండువంటి పెదవి గల్గినట్టిదియును, చారుకుండలం = రమణీయమైన కర్ణాభరణములు గల్గినట్టిదియునగు, ముఖం = ముఖము, యథా = ఏ విధముగా, ద్రక్ష్యసి = చూచెదవో, తథా = ఆ విధముగా, మందరేణ చ = మందరగిరితోడను, మలయేన చ = మలయాద్రితోడను, వింధ్యేన చ = వింధ్యపర్వతముతోడను, మేరుణా చ = మేరునగముతోడను, దర్దురేణ చ = దర్దురగిరితోడను, మూలఫలేన చ = కందమూలఫలసమూహముతోడను, శపే = ఒట్టుపెట్టి చెప్పుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- దర్దురేణ - దర్దుర మనెడిది మలయగిరి పరిసరవర్తియైన చందనవృక్షములకు నిలయమైన ఒకానొక పర్వతము.

**తాత్పర్యము** :- అప్పుడే ఉదయించిన పున్నమినాటి చంద్రునివలె విశాలమైన నేత్రములతో దొండపండువంటి పెదవితో మనోజ్ఞములైన కర్ణాభరణములతో శోభిల్లుచున్న శ్రీరాముని సుందర వదనారవిందమును శీఘ్రమే నీవు చూడగలవని మందరపర్వతముమీదను, మలయగిరిమీదను, వింధ్యనగముమీదను, మేరు మహీధరముమీదను, దర్దురాద్రిమీదను, మాకు భోజ్యములైన కందమూల ఫలాదికముమీదను, ఒట్టుపెట్టి చెప్పుచున్నాను సుమా!

**శ్లో॥ క్షిప్రం ద్రక్ష్యసి వైదేహి రామం ప్రస్రవణే గిరౌ ।**
**శతక్రతుమి వాసీనం నాగపృష్ఠస్య మూర్ధని ॥ 40**

**పదచ్ఛేదము** :- క్షిప్రం - ద్రక్ష్యసి - వైదేహి - రామం - ప్రస్రవణే - గిరౌ - శతక్రతుమ్ - ఇవ - ఆసీనం - నాగపృష్ఠస్య - మూర్ధని ॥

**అన్వయక్రమము** :- వైదేహి, నాగపృష్ఠస్య మూర్ధని ఆసీనం శతక్రతుమ్ ఇవ క్షిప్రం ప్రస్రవణే గిరౌ రామం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :- వైదేహి = ఓ జానకీ! నాగపృష్ఠస్య మూర్ధని = ఐరావతగజము యొక్క మూపుపై, ఆసీనం = కూర్చొనియున్న, శతక్రతుమ్ ఇవ = దేవేంద్రునివలె, క్షిప్రం = శీఘ్రముగా, ప్రస్రవణే గిరౌ = ప్రస్రవణ పర్వతముపై, రామం = శ్రీరాముని, ద్రక్ష్యసి = చూడగలవు.

**సూచన** :- నాగపృష్ఠస్య అనుటకు బదులుగా 'నాకపృష్ఠస్య' అను పాఠాంతరముగలదు. అప్పుడు స్వర్గమునందున్నట్టి అని అర్థము చెప్పుకోవలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- నాగపృష్ఠము అని ఇంద్రునియొక్క అసాధారణ స్వర్ణభవనము.

**తాత్పర్యము** :- సీతాదేవీ! స్వర్గలోకమున ఐరావత గజముపై వెలయుచుండు దేవేంద్రునివలె ఇచ్చట ప్రస్రవణగిరిపై అధివసించియుండు నీ ప్రియుని అచిరకాలములోనే చూడగలవు సుమా!

**శ్లో॥ న మాంసం రాఘవో భుంక్తే న చైవ మధు సేవతే ।**
**వన్యం సువిహితం నిత్యం భక్త మశ్నాతి పంచమమ్ ॥ 41**

**పదచ్ఛేదము** :- న - మాంసం - రాఘవః - భుంక్తే - న - చ - ఏవ - మధు - సేవతే - వన్యం - సువిహితం - నిత్యం - భక్తమ్ - అశ్నాతి - పంచమమ్ ॥

**అన్వయక్రమము** :- రాఘవః మాంసం న భుంక్తే, మధు చ న సేవతే, నిత్యం సువిహితం వన్యం పంచమం భక్తమ్ అశ్నాతి.

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, మాంసం = మాంసమును, న భుంక్తే = తినుటలేదు, మధు చ = మద్యమును కూడ, న సేవతే = ఉపయోగించుటలేదు, నిత్యం = నిత్యమును, సువిహితం = శాస్త్రోక్తమైనట్టి, వన్యం = వనమున లభించునట్టి, భక్తం = ఆహారమును, పంచమం = ఐదవవంతు, అశ్నాతి = భుజించుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- పంచమమ్ అశ్నాతి - పంచమ కాలమున ప్రాతః సంగమ మధ్యాహ్న

అపరాహ్ణములు దాటినపిమ్మట ఐదవదియైన సాయంకాలముననే భుజించునని భావము. లేక ప్రాతఃకాలము సాయంకాలము మఱల ప్రాతఃకాలము సాయంకాలము యను నాల్గు పూటలు గడిచిన పిమ్మట ఐదవపూటకు మాత్రమే నిత్యము భుజించు చున్నాడని భావము.

**వాసుదాసస్వామి :–**

> "దృఙ్మనస్సంగసంకల్పజాగరాః కృశతాఽరతిః
> హ్రీత్యాగోన్మాదమూర్ఛాంతా ఇత్యనంగదశా దశ."

అని మన్మథావస్థలు పది, అందు అరతి యను అవస్థ ఇందు చెప్పబడెను. అరతి యనగా దేనియందును ప్రీతి లేకపోవుట.

**తాత్పర్యము :–** తల్లీ! నీ రాముడు మాంసమును భుజించుట మానెను. మద్యమును ముట్టుటయే లేదు. శాస్త్రానుసారముగా వానప్రస్థులకు విహితమైనట్టి వన్యమైన ఆహారములో తాను తినెడి దానిలో ఐదవవంతు మాత్రమే ఇప్పుడు భుజించుచున్నాడు సుమా!

**శ్లో॥ నైవ దంశా న్న మశకా న్న కీటా న్న సరీసృపాన్ ।**
**రాఘవోఽ పనయే ద్గాత్రాత్త్వద్గతే నాంతరాత్మనా ॥ 42**

**పదచ్ఛేదము :–** న – ఏవ – దంశాన్ – న – మశకాన్ – న – కీటాన్ – న – సరీసృపాన్ – రాఘవః – అపనయేత్ – గాత్రాత్ – త్వద్గతేన – అంతరాత్మనా ॥

**అన్వయక్రమము :–** రాఘవః త్వద్గతేన అంతరాత్మనా గాత్రాత్ దంశాన్ న అపనయేత్, మశకాన్ న, కీటాన్ న, సరీసృపాన్ న అపనయేత్.

**ప్రతిపదార్థము :–** రాఘవః = శ్రీరాముడు, త్వద్గతేన = నీయందు లగ్నమైనట్టి, అంతరాత్మనా = మనస్సుచే, గాత్రాత్ = శరీరమునుండి, దంశాన్ = ఈగలను, న అపనయేత్ = తొలగించుకొనడు, మశకాన్ న అపనయేత్ = దోమలను తొలగించుకొనడు, కీటాన్ న అపనయేత్ = పురుగులను తొలగించుకొనడు, సరీసృపాన్ న అపనయేత్ = పాములను తొలగించుకొనడు.

**తాత్పర్యము :–** శ్రీరాముడు తన మనస్సును నీయందే లగ్నము చేసియున్నాడు. ఆతనికి ఇతర మేమియును తెలియుటలేదు. తన ఒడలిపై వ్రాలిన ఈగలను త్రోలుకొనడు. దోమలను త్రోసివేయడు. పురుగులను దులుపుకొనడు. తుదకు పాములు తన మీద ప్రాకుచున్నను తప్పించుకొనడు సుమా!

**శ్లో॥ నిత్యం ధ్యానపరో రామో నిత్యం శోకపరాయణః ।**
**నా న్య చ్చింతయతే కించి త్సతు కామవశం గతః ॥ 43**

**పదచ్ఛేదము** :- నిత్యం - ధ్యానపరః - రామః - నిత్యం - శోకపరాయణః - న - అన్యత్ - చింతయతే - కించిత్ - సః - తు - కామవశం - గతః ॥

**అన్వయక్రమము** :- రామః నిత్యం ధ్యానపరః, నిత్యం శోకపరాయణః, కామవశం గతః సః తు అన్యత్ కించిత్ న చింతయతే.

**ప్రతిపదార్థము** :- రామః = శ్రీరాముడు, నిత్యం = ఎల్లప్పుడును, ధ్యానపరః = చింతానిమగ్నుడగును, నిత్యం = ఎల్లప్పుడును, శోకపరాయణః = దుఃఖనిమగ్నుడై యుండును, కామవశం గతః = కామమునకు లోబడి యున్నట్టి, సః తు = ఆతడు, అన్యత్ = వేఱైనది, కించిత్ = కొంచెముగూడ, న చింతయతే = ఆలోచించుటలేదు.

**తాత్పర్యము** :- తల్లీ! నీ రాము డెల్లప్పుడును ఏదియో చింతతో ధ్యాననిమగ్నుడై యుండును. నిరంతరమును దుఃఖగ్రస్తుడుగనే యుండును. నీ పైన ప్రేమతో ఆతడు కామపరవశుడై వేఱేమియు ఆలోచింపలేక పోవుచున్నాడు సుమా!

**శ్లో॥ అనిద్ర స్సతతం రామ స్సుప్తోఽపి చ నరోత్తమః ।**
**సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతిబుధ్యతే ॥ 44**

**పదచ్ఛేదము** :- అనిద్రః - సతతం - రామః - సుప్తః - అపి - చ - నరోత్తమః - సీతా - ఇతి - మధురాం - వాణీం - వ్యాహరన్ - ప్రతిబుధ్యతే ॥

**అన్వయక్రమము** :- రామః సతతం అనిద్రః (వర్తతే) (సః) నరోత్తమః సుప్తః అపి చ సీతా ఇతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతిబుధ్యతే.

**ప్రతిపదార్థము** :- రామః = శ్రీరాముడు, సతతం = ఎల్లప్పుడు, అనిద్రః (వర్తతే) = నిద్రాశూన్యుడైయుండును, (సః) నరోత్తమః = ఆ పురుషోత్తముడు, సుప్తోఽపి చ = నిద్రించిన వాడయినను, సీతా ఇతి = జానకీ యని, మధురాం వాణీం = తీయని మాటను, వ్యాహరన్ = పలుకుచు, ప్రతిబుధ్యతే = మేల్కొనును.

**తాత్పర్యము** :- శ్రీరాముడు ఎప్పుడు చూచినను నిద్రలేకయే గాన వచ్చును. ఒకప్పు డెట్టకేలకు నిద్రించినను కొద్దికాలములోనే హా! సీతా యనుచు మధురమైన నీ నామమును ఉచ్చరించుచు మేల్కొనును.

**శ్లో॥ దృష్ట్వా ఫలం వా పుష్పం వా య చ్చాన్యత్ స్త్రీమనోహరమ్ ।**
**బహుశో హా ప్రియే త్యేవం శ్వసం స్త్వా మభిభాషతే ॥ 45**

**పదచ్ఛేదము** :– దృష్ట్వా – ఫలం – వా – పుష్పం – వా – యత్ – చ – అన్యత్ – స్త్రీమనోహరమ్ – బహుశః – హా – ప్రియే – ఇతి – ఏవం – శ్వసన్ – త్వాం – అభిభాషతే ॥

**అన్వయక్రమము** :– ఫలం వా పుష్పం వా స్త్రీమనోహరం యత్ అన్యత్ చ వా దృష్ట్వా బహుశః శ్వసన్ హా ప్రియే ఇతి ఏవం త్వామ్ అభిభాషతే.

**ప్రతిపదార్థము** :– ఫలం వా = ఫలమును గాని, పుష్పం వా = పుష్పమునుగాని, స్త్రీమనోహరం = స్త్రీలకు ప్రియమైనట్టి, యత్ అన్యత్ చ వా = ఏ ఇతరమైనదియుగాని, దృష్ట్వా = చూచి, బహుశః = పలుమాఱులు, శ్వసన్ = నిట్టూర్చుచు, హా ప్రియే = ఓ ప్రియురాలా, ఇతి = అని, ఏవం = ఇట్లుగా, త్వాం = నిన్ను గూర్చి, అభిభాషతే = మాటాడును.

**తాత్పర్యము** :– అతడు మధురమైన ఫలమునుగాని రమ్యమైన పుష్పమునుగాని స్త్రీలు ముచ్చటపడు రమణీయమైన ఏ వస్తువును గాని చూచినప్పుడు పలుమాఱులు నిట్టూర్పులు విడుచుచు హా ప్రియా యనుచు నిన్నుగూర్చియే భాషించుచుండును.

**శ్లో॥ స దేవి నిత్యం పరితప్యమానః**
**త్వామేవ సీతే త్యభిభాషమాణః ।**
**ధృతవ్రతో రాజసుతో మహాత్మా**
**తవైవ లాభాయ కృతప్రయత్నః ॥ 46**

**పదచ్ఛేదము** :– సః – దేవి – నిత్యం – పరితప్యమానః – త్వామ్ – ఏవ – సీతా – ఇతి – అభిభాషమాణః – ధృతవ్రతః – రాజసుతః – మహాత్మా – తవ – ఏవ – లాభాయ – కృతప్రయత్నః ॥

**అన్వయక్రమము** :– దేవి! మహాత్మా స రాజసుతః నిత్యం పరితప్యమానః సీతా! ఇతి త్వామేవ అభిభాషమాణః ధృతవ్రతః తవ లాభాయ కృతప్రయత్నః ఏవ (అస్తి).

**ప్రతిపదార్థము** :– దేవి! = ఓ పూజ్యురాలా! మహాత్మా = మహనీయుడైన, సః రాజసుతః = ఆ రాజపుత్రుడు, నిత్యం = ఎల్లప్పుడును, పరితప్యమానః = పరితపించుచున్నవాడై, సీతా! ఇతి = జానకీ యని, త్వామేవ = నిన్నుగూర్చియే, అభిభాషమాణః = భాషించు చున్నవాడై, ధృతవ్రతః = ధరించిన దీక్షగలవాడై, తవ లాభాయ = నిన్ను సంపాదించుట కొఱకు, కృతప్రయత్నః ఏవ (అస్తి) = చేయబడిన ప్రయత్నము కలవాడుగానే యున్నాడు.

**తాత్పర్యము** :– తల్లీ! మహాత్ముడైన ఆ రాజకుమారుడు నిరంతరము నీకై పరితపించుచు

హా! సీతా యని నిన్ను గూర్చియే భాషించుచు దృఢమైన దీక్షతో నిన్ను తిరిగి సంపాదించుటకై తీవ్రమైన ప్రయత్నము చేయుచునే యున్నాడు సుమా!

**శ్లో॥ సా రామసంకీర్తనవీతశోకా**
**రామస్య శోకేన సమానశోకా ।**
**శరన్ముఖే సాంబుదశేషచంద్రా**
**నిశేవ వైదేహసుతా బభూవ ॥ 47**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"అంగులీయకప్రదానం" నామ*
*షట్త్రింశస్సర్గః*

**పదచ్ఛేదము** :- సా - రామసంకీర్తనవీతశోకా - రామస్య - శోకేన - సమానశోకా - శరన్ముఖే - సాంబుదశేషచంద్రా - నిశా - ఇవ - వైదేహసుతా - బభూవ ॥

**అన్వయక్రమము** :- రామసంకీర్తనవీతశోకా, రామస్య శోకేన సమానశోకా, సా వైదేహసుతా శరన్ముఖే సాంబుదశేషచంద్రా నిశా ఇవ బభూవ.

**ప్రతిపదార్థము** :- రామసంకీర్తనవీతశోకా = శ్రీరాముని సంకీర్తనమువలన తొలగిన శోకము గలదియును, రామస్య శోకేన = శ్రీరాముని దుఃఖముతో, సమానశోకా = సమానమైన దుఃఖముగలదియునగు, సా వైదేహసుతా = ఆ విదేహరాజతనయ, శరన్ముఖే = శరత్కాలారంభమున, సాంబుదశేషచంద్రా = మేఘశేషముతో గూడినట్టి చంద్రబింబము కలదగు, నిశా ఇవ = రాత్రివలె, బభూవ = ఉండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'వీతశోకా' - అనిద్రః సతతం రామః, అని తనపై ప్రేమగలిగియున్న నాథుని వర్తనమును తలచుకొని దుఃఖము తొలగియున్నది. న మాంసం రాఘవో భుంక్తే - అనురీతినిగల శ్రీరాముని దుఃఖమును తలచి అట్టి దుఃఖమునే పొందుచున్నది. శరన్ముఖే నిశా ఇవ - శరదృతుప్రారంభమున నిశలు పూర్తిగ తొలగిపోవని మేఘములచే చంద్రకాంతి గలవిగను లేనివిగను గూడ నున్నట్లే ఆమె శోకములేనిది గాను ఉన్నది గాను కూడ నుండెనని భావము.

**గోవిందరాజీయము** :- సీతమ్మకు రాముని హృదయము తెలియక కొంత శోకమును, ఆతని వియోగముచే కొంత శోకమును కలిసి మొత్తము రెట్టింపు శోకము గలిగి

యుండెను. ఇందు మొదటి సగము హనుమంతుని మాటలవలన తొలగినది. రెండవ శోకము మిగిలియేయున్నది. అందుచేతనే సగము శోకము తొలగినను ఇంకను రామునితో సమానమైన వియోగశోకము కలిగియే యున్నదని భావము. (రామస్య శోకేన సమానశోకా).

**తాత్పర్యము** :- శ్రీరాముని గూర్చి వినుటచే తన శోకము కొంత తొలగినను అతని దుఃఖమును గూర్చి వినుటచే సీత ఇంకను శోకమును పొందినదై శరత్కాలారంభమున సగము మేఘము కప్పియున్న చంద్రకాంతితో వెలుగును చీకటియును గల రాత్రివలె నుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"అంగుళీయకప్రదానము" అను*
*ముప్పదియాఱవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తత్రింశసర్గ

**శ్లో॥ సా సీతా వచనం శ్రుత్వా పూర్ణచంద్రనిభాననా ।**
**హనూమంత మువా చేదం ధర్మార్థసహితం వచః ॥ 1**

**పదచ్ఛేదము** :- సా - సీతా - వచనం - శ్రుత్వా - పూర్ణచంద్రనిభాననా - హనూమంతమ్ - ఉవాచ - ఇదం - ధర్మార్థసహితం - వచః ॥

**అన్వయక్రమము** :- పూర్ణచంద్రనిభాననా సా సీతా (తత్) వచనం శ్రుత్వా హనూమంతమ్ ఇదం ధర్మార్థసహితం వచః ఉవాచ.

**ప్రతిపదార్థము** :- పూర్ణచంద్రనిభాననా = నిండు చంద్రునితో సమానమైన ముఖము గలిగినట్టి, సా సీతా = సీతాదేవి, (తత్) వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, హనూమంతం = హనుమంతుని గూర్చి, ఇదం = ఈ, ధర్మార్థసహితం = ధర్మార్థయుక్తమైనట్టి, వచః = మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :- నిండుచంద్రుని వంటి ముఖము కల్గిన సీతాదేవి హనుమంతుడు పలికిన మాటలు విని అతనిని జూచి ధర్మార్థభరితములైన మాటలను తిరిగి ఇట్లు పలికెను.

**శ్లో॥ అమృతం విషసంయుక్తం త్వయా వానర భాషితమ్ ।**
**యచ్చ నాన్యమనా రామో యచ్చ శోకపరాయణః ॥ 2**

**పదచ్ఛేదము** :- అమృతం - విషసంయుక్తం - త్వయా - వానర - భాషితమ్, యత్ - చ - న - అన్యమనాః - రామః - యత్ - చ - శోకపరాయణః ॥

**అన్వయక్రమము** :- వానర! రామః యత్ చ నాన్యమనాః ఇతి (ఉక్తం) తత్ అమృతం, యత్ చ శోకపరాయణః ఇతి (ఉక్తం) తత్ విషసంయుక్తం త్వయా భాషితమ్.

**ప్రతిపదార్థము** :- వానర! = ఓ హనుమా! రామః = శ్రీరాముడు, యత్ చ = ఏ, నాన్యమనా ఇతి = అనన్యమనస్కుడని, (ఉక్తం = చెప్పబడెనో) తత్ అమృతం = అది అమృతముగను, యత్ చ శోకపరాయణః ఇతి = ఏ దుఃఖపరాయణుడు అని, ఉక్తం

= చెప్పబడినదో, తత్ = అది, విషసంయుక్తం = విషసంయుతముగను, త్వయా = నీచే, భాషితమ్ = చెప్పబడినది.

**తాత్పర్యము** :– ఓ వానరోత్తమా! రాముడు అనన్యమనస్కుడై నిన్ను దలచుచున్నాడు అన్నమాట నాకు అమృతమువలె నున్నది. కాని ఆతడు నిరంతరము శోకనిమగ్నుడై యున్నాడని నీవు తెలిపినది మాత్రము విషమిశ్రితమై యుండి నాకు బాధ కలిగించు చున్నది సుమా!

**శ్లో॥ ఐశ్వర్యే వా సువిస్తీర్ణే వ్యసనే వా సుదారుణే ।**
**రజ్జ్వేవ పురుషం బద్ధ్వా కృతాంతః పరికర్షతి ॥ 3**

**పదచ్ఛేదము** :– ఐశ్వర్యే – వా – సువిస్తీర్ణే – వ్యసనే – వా – సుదారుణే – రజ్జ్వా – ఇవ – పురుషం – బద్ధ్వా – కృతాంతః – పరికర్షతి ॥

**అన్వయక్రమము** :– సువిస్తీర్ణే ఐశ్వర్యే వా, సుదారుణే వ్యసనే వా, కృతాంతః రజ్జ్వా బద్ధ్వా ఇవ పురుషం పరికర్షతి.

**ప్రతిపదార్థము** :– సువిస్తీర్ణే = మిక్కిలి విస్తారమైన, ఐశ్వర్యే వా = ఐశ్వర్యమునందుగాని, సుదారుణే = ఘోరమైన, వ్యసనే వా = ఆపదయందుగాని, కృతాంతః = యమధర్మరాజు, రజ్జ్వా = త్రాడుతో, బద్ధ్వా ఇవ = కట్టివేసివలె, పురుషం = మనుజుని, పరికర్షతి = లాగికొని పోవుచుండును.

**తాత్పర్యము** :– గొప్పదైన ఐశ్వర్యమునందుగాని భయంకరమైన ఆపదయందుగాని దైవము త్రాటితో కట్టి తీసికొని పోవునట్లుగా నరుని (పూర్వకర్మమునుబట్టి తన నిర్ణయమున కనుకూలముగా) లాగికొనిపోవును.

**శ్లో॥ విధి ర్నూన మసంహార్యః ప్రాణినాం ప్లవగోత్తమ ।**
**సౌమిత్రిం మాం చ రామం చ వ్యసనైః పశ్య మోహితాన్ ॥ 4**

**పదచ్ఛేదము** :– విధిః – నూనమ్ – అసంహార్యః – ప్రాణినాం – ప్లవగోత్తమ – సౌమిత్రిం – మాం – చ – రామం – చ – వ్యసనైః – పశ్య – మోహితాన్ ॥

**అన్వయక్రమము** :– ప్లవగోత్తమ! నూనం ప్రాణినాం విధిః అసంహార్యః, వ్యసనైః మోహితాన్ సౌమిత్రిం, మాం చ, రామం చ పశ్య.

**ప్రతిపదార్థము** :– ప్లవగోత్తమ = ఓ వానరశ్రేష్ఠుడా! నూనం = నిశ్చయముగా, ప్రాణినాం = జీవులకు, విధిః = దైవము, అసంహార్యః = తప్పింపశక్యముగానిది,

వ్యసనైః = ఆపదలచే, మోహితాన్ = మూఢచిత్తులమైయున్న, సౌమిత్రిం = లక్ష్మణుని, మాం చ = నన్ను, రామం చ = రాముని, పశ్య = చూడుము.

**తాత్పర్యము :–** ఓ వానరశ్రేష్ఠుడా! జీవులకు దైవము నిస్సందేహముగా అనుల్లంఘనీయ మైనది. ఎందుచేత ననగా మా లక్ష్మణుడును నేనును తుదకు రాముడును ఎట్లు ఆపదలలో చిక్కుకొని భ్రాంతచిత్తులమై యున్నామో చూడుము.

**శ్లో॥ శోక స్యాస్య కథం పారం రాఘవో ఽధిగమిష్యతి ।**
**ప్లవమానః పరిక్రాంతో హతనౌ స్సాగరే యథా ॥ 5**

**పదచ్ఛేదము :–** శోకస్య – అస్య – కథం – పారం – రాఘవః – అధిగమిష్యతి – ప్లవమానః – పరిక్రాంతః – హతనౌః – సాగరే – యథా ॥

**అన్వయక్రమము :–** సాగరే హతనౌః (పురుషః) పరిక్రాంతః (సన్) బాహుభ్యాం ప్లవమానః యథా, రాఘవః అస్య శోకస్య పారం కథం అధిగమిష్యతి.

**ప్రతిపదార్థము :–** సాగరే = సముద్రమున, హతనౌః = చెడిపోయిన నావగల, పురుషః = పురుషుడు, పరిక్రాంతః సన్ = పరిభ్రమించు చున్నవాడై, బాహుభ్యాం = భుజములతో, ప్లవమానః యథా = ఈదుచున్నవాడు వలె, రాఘవః = శ్రీరాముడు, అస్య శోకస్య = ఈ దుఃఖమునకు, పారం = అంతమును, కథం అధిగమిష్యతి = ఎట్లు పొందగలడు?

**తాత్పర్యము :–** సముద్రమునందు నావ చెడిపోవగా దిక్కు తోచక తిరుగుచు బాహువులతో ఈదుచున్న మనుష్యుడువలె శ్రీరాముడు తన ఈ దుఃఖమునకు ఒడ్డును ఎప్పుడు చేరుకొనగలడోగదా!

**శ్లో॥ రాక్షసానాం వధం కృత్వా సూదయిత్వా చ రావణమ్ ।**
**లంకా మున్మథితాం కృత్వా కదా ద్రక్ష్యతి మాం పతిః ॥ 6**

**పదచ్ఛేదము :–** రాక్షసానాం – వధం – కృత్వా – సూదయిత్వా – చ – రావణమ్ – లంకామ్ – ఉన్మథితాం – కృత్వా – కదా – ద్రక్ష్యతి – మాం – పతిః ॥

**అన్వయక్రమము :–** పతిః రాక్షసానాం వధం కృత్వా రావణం సూదయిత్వా చ లంకాం ఉన్మథితాం కృత్వా చ మాం కదా ద్రక్ష్యతి?

**ప్రతిపదార్థము :–** పతిః = ప్రభువైన శ్రీరాముడు, రాక్షసానాం = రాక్షసులయొక్క, వధం = వధను, కృత్వా = చేసి, రావణం = రావణాసురుని, సూదయిత్వా చ =

పరిమార్చియు, లంకాం = లంకానగరిని, ఉన్మథితాం = కల్లోలము నొందించబడిన దానినిగా, కృత్వా చ = చేసియు, మాం = నన్ను, కదా = ఎప్పుడు, ద్రక్ష్యతి = చూడగలడో.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** "పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతా" మ్మన్నట్లు సీతాదేవిని గ్రహించుటయను సాధుపరిత్రాణము ముఖ్యకార్యము. దానికి విఘ్నము గలిగించు దుష్కృతుల వినాశము రెండవ కార్యము అని ఏర్పడుచున్నది.

**తాత్పర్యము :–** నా భర్త రాక్షసుల నందరను హతమార్చి, రావణుని పరిమార్చి లంకను కల్లోలిత మొనర్చి నన్నెప్పుడు గాంచునో కదా!

**శ్లో॥ స వాచ్య స్సంత్వర స్వేతి యావదేవ న పూర్యతే ।**
**అయం సంవత్సరః కాల స్తావద్ధి మమ జీవితమ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** సః – వాచ్యః – సంత్వరస్వ – ఇతి – యావత్ – ఏవ – న – పూర్యతే – అయం – సంవత్సరః – కాలః – తావత్ – హి – మమ – జీవితమ్ ॥

**అన్వయక్రమము :–** అయం సంవత్సరః కాలః యావదేవ న పూర్యతే, (తావదేవ) సంత్వరస్వ ఇతి సః వాచ్యః, మమ జీవితం తావత్ హి.

**ప్రతిపదార్థము :–** అయం = ఈ, సంవత్సరః కాలః = సంవత్సర కాలము, యావదేవ = ఎంతవఱకును, న పూర్యతే = పూర్తిచేయబడినదో, (తావదేవ = అంతలోనే) సంత్వరస్వ = వేగిరపడుము, ఇతి = అని, సః = ఆ శ్రీరాముడు, వాచ్యః = చెప్పబడ వలయును, మమ = నాకు, జీవితం = జీవితకాలము, తావత్ హి = అప్పటివఱకే సుమా.

**తాత్పర్యము :–** ఈ సంవత్సరకాలము ముగియుటకు పూర్వమే నన్ను విడిపించుటకై తొందరపడవలయును అని శ్రీరామునకు తెలుపుము. నా జీవనకాలము ఈ సంవత్సరము మాత్రమే సుమా!

**శ్లో॥ వర్తతే దశమో మాసో ద్వౌ తు శేషౌ ప్లవంగమ ।**
**రావణేన నృశంసేన సమయో యః కృతో మమ ॥ 8**

**పదచ్ఛేదము :–** వర్తతే – దశమః – మాసః – ద్వౌ – తు – శేషౌ – ప్లవంగమ – రావణేన – నృశంసేన – సమయః – యః – కృతః – మమ ॥

**అన్వయక్రమము** :– ప్లవంగమ! నృంశసేన రావణేన మమ యః సమయః కృతః, తస్య దశమః మాసః వర్తతే, ద్వౌ తు శేషౌ.

**ప్రతిపదార్థము** :– ప్లవంగమ! = ఓ హనుమా!, నృశంసేన = క్రూరుడైన, రావణేన = రావణునిచే, మమ = నాకు, యః సమయః = ఏ గడువు, కృతః = చేయబడినదో, తస్య = ఆ గడువునకు, దశమః మాసః = పదియవ మాసము, వర్తతే = జరుగుచున్నది, ద్వౌ తు = రెండు (నెలలు) మాత్రమే, శేషౌ = మిగిలియున్నవి.

**తాత్పర్యము** :– వానరోత్తమా! క్రూరుడైన రావణుడు నా జీవితమునకు నిర్ణయించిన గడువులో పదియవమాస మిప్పుడు జరుగుచున్నది. ఇంక రెండు నెలలు మాత్రమే మిగిలియున్నవి.

**శ్లో॥ విభీషణేన చ భ్రాత్రా మమ నిర్యాతనం ప్రతి ।**
**అనునీతః ప్రయత్నేన న చ త త్కురుతే మతిమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :– విభీషణేన – చ – భ్రాత్రా – మమ – నిర్యాతనం – ప్రతి – అనునీతః – ప్రయత్నేన – న – చ – తత్ – కురుతే – మతిమ్ ॥

**అన్వయక్రమము** :– భ్రాత్రా విభీషణేన మమ నిర్యాతనం ప్రతి ప్రయత్నేన అనునీతః, (రావణః) తత్ (తస్మిన్) మతిం న కురుతే.

**ప్రతిపదార్థము** :– భ్రాత్రా = సోదరుడైనట్టి, విభీషణేన = విభీషణునిచే, మమ = నా యొక్క, నిర్యాతనం ప్రతి = తిరిగి అప్పగించుటను గూర్చి, ప్రయత్నేన = గొప్ప ప్రయత్నముతో, అనునీతః = బ్రతిమాలుకొనబడినట్టి, (రావణః = రావణుడు) తత్ (తస్మిన్) = ఆ తిరిగి ఇచ్చివేయుట యను విషయమున, మతిం న కురుతే = ఇష్ట పడుటలేదు.

**తాత్పర్యము** :– తమ్ముడైన విభీషణుడు నన్ను తిరిగి ఇచ్చి వేయుమని ఎన్ని విధములుగనో ప్రయత్నించి బ్రతిమాలినాడుగాని రావణుడు ఆ పనికి ఎంత మాత్రమును ఇష్టపడుటలేదు.

**శ్లో॥ మమ ప్రతిప్రదానం హి రావణస్య న రోచతే ।**
**రావణం మార్గతే సంఖ్యే మృత్యుః కాలవశం గతమ్ ॥ 10**

**పదచ్ఛేదము** :– మమ – ప్రతిప్రదానం – హి – రావణస్య – న – రోచతే – రావణం – మార్గతే – సంఖ్యే – మృత్యుః – కాలవశం – గతమ్ ॥

**అన్వయక్రమము** :- మమ ప్రతిప్రదానం రావణస్య న హి రోచతే, కాలవశం గతం రావణం మృత్యుః సంఖ్యే మార్గతే.

**ప్రతిపదార్థము** :- రావణస్య = రావణునకు, మమ ప్రతిప్రదానం = నన్ను తిరిగి ఇచ్చివేయుట, నహి రోచతే = ఏమియును ఇష్టము అగుటలేదు. కాలవశం గతం = యమునకు అధీనుడైన, రావణం = రావణుని, మృత్యుః = మృత్యుదేవత, సంఖ్యే = యుద్ధమునందు, మార్గతే = వెదకి కొనుచున్నది.

**తాత్పర్యము** :- రావణునకు నన్ను తిరిగి ఇచ్చివేయుట ఎంత మాత్రము ఇష్టమగుట లేదు. కాలవశుడైయున్న అతనిని మృత్యుదేవత యుద్ధమునందు ఎప్పుడు దొరకునా యని అన్వేషించుచున్నది.

**శ్లో॥ జ్యేష్ఠా కన్యా ఽనలా నామ విభీషణసుతా కపే ।**
**తయా మ మైత దాఖ్యాతం మాత్రా ప్రహితయా స్వయమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :- జ్యేష్ఠా - కన్యా - అనలా - నామ - విభీషణసుతా - కపే - తయా - మమ - ఏతత్ - ఆఖ్యాతం - మాత్రా - ప్రహితయా - స్వయమ్ ॥

**అన్వయక్రమము** :- కపే! అనలా నామ విభీషణసుతా జ్యేష్ఠా కన్యా (అస్తి). మాత్రా ప్రహితయా తయా స్వయం మమ ఏతత్ అఖ్యాతమ్.

**ప్రతిపదార్థము** :- కపే! = ఓ హనుమా! అనలా నామ = అనల యను పేరుగల, జ్యేష్ఠా = పెద్దదైనట్టి, విభీషణసుతా = విభీషణుని కుమార్తెయైన, కన్యా = ఒక కన్య, (అస్తి = కలదు) మాత్రా = తల్లిచే, ప్రహితయా = పంపబడినట్టి, తయా = ఆమెచే, స్వయం = స్వయముగా, మమ = నాకు, ఏతత్ = ఈ విషయము, ఆఖ్యాతం = చెప్పబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- ఏతత్ - అనగా విభీషణుడు రావణుని అనునయించుట.

**వాసుదాసస్వామి** :- విభీషణుని భార్య సరమ యను నామె పతి యనుమతి దీసికొని తన కూతురగు ననల యను కన్యకచే ఈ విషయము సీతకు దెలిపెను. ఈ విషయమే రామునకు తెలిసి నిస్సంకోచముగా విభీషణుని మిత్రునిగా స్వీకరించి ఆతనికి లంకారాజ్యాభిషేకము చేయుటలోను కారణమైనది.

**పాఠాంతరము** :- 'అనలా నామ విభీషణసుతా' అనుదానికి మాఱుగా కలా నామ యని ఉత్తరదేశీయప్రతులందు కానవచ్చుచున్నది.

**తాత్పర్యము :–** వానరోత్తమా! విభీషణునకు అనల యను పేరుగల కన్యయైన జ్యేష్ఠ పుత్రిక గలదు. ఆమెచేతనే ఆమె తల్లి నా కీ విషయము స్వయముగా తెలిపియున్నది.

**శ్లో॥ అవింధ్యో నామ మేధావీ విద్వా న్రాక్షసపుంగవః ।**
**ధృతిమాన్ శీలవాన్ వృద్ధో రావణస్య సుసమ్మతః ॥ 12**

**శ్లో॥ రామాత్క్షయ మనుప్రాప్తం రక్షసాం ప్రత్యచోదయత్ ।**
**న చ తస్య స దుష్టాత్మా శృణోతి వచనం హితమ్ ॥ 13**

**పదచ్ఛేదము :–** అవింధ్యః – నామ – మేధావీ – విద్వాన్ – రాక్షసపుంగవః – ధృతిమాన్ – శీలవాన్ – వృద్ధః – రావణస్య – సుసమ్మతః – రామాత్ – క్షయం – అనుప్రాప్తం – రక్షసాం – ప్రత్యచోదయత్, న – చ – తస్య – సః – దుష్టాత్మా – శృణోతి – వచనం – హితమ్ ॥

**అన్వయక్రమము :–** మేధావీ విద్వాన్ ధృతిమాన్ శీలవాన్ వృద్ధః రావణస్య సుసమ్మతః అవింధ్యః నామ రాక్షసపుంగవః రక్షసాం రామాత్ ప్రాప్తం క్షయం ప్రతి అచోదయత్, సః దుష్టాత్మా తస్య హితం వచనం నచ శృణోతి.

**ప్రతిపదార్థము :–** మేధావీ = మేధాశాలియును, విద్వాన్ = విద్వాంసుడును, ధృతిమాన్ = ధైర్యశాలియును, శీలవాన్ = శీలసంపన్నుడును, వృద్ధః = వృద్ధుడును, రావణస్య = రావణునకు, సుసమ్మతః = మిక్కిలి ఇష్టుడును అగు, అవింధ్యః నామ = అవింధ్యుడను పేరుగల, రాక్షసపుంగవః = రాక్షసశ్రేష్ఠుడు, రక్షసాం = రాక్షసులకు, రామాత్ = శ్రీరామునివలన, ప్రాప్తం = సంభవించు, క్షయం ప్రతి = వినాశమును గూర్చి, అచోదయత్ = ప్రోత్సహించెను. సః దుష్టాత్మా = ఆ దుర్మార్గుడైన రావణుడు, తస్య = ఆ యవింధ్యునియొక్క, హితం వచనం = శ్రేయస్కరమైన మాటను, నచ శృణోతి = ఎంతమాత్రము వినుటలేదు.

**సూచన :** – పై రెండు శ్లోకములును ఉత్తరదేశీయప్రతులలో మాత్రమే కానవచ్చు చున్నవి.

**తాత్పర్యము :–** మేధావియు, విద్వాంసుడును, ధీరుడును, వృద్ధుడును, రావణునకు మిక్కిలి ఇష్టుడును అగు అవింధ్యుడను రాక్షసోత్తముడు శ్రీరామునివలన రాక్షస కులమునకు సంభవించు వినాశమును గూర్చి విశదముగ హెచ్చరించెను. కాని ఆ దుర్మార్గుడు ఆతని హితవచనములను చెవిని బెట్టలేదు.

**శ్లో॥ ఆశంసేయం హరిశ్రేష్ఠ క్షిప్రం మాం ప్రాప్స్యతే పతిః ।**
**అంతరాత్మా హి మే శుద్ధ స్తస్మింశ్చ బహవో గుణాః ॥ 14**

**పదచ్ఛేదము** :- ఆశంసేయం - హరిశ్రేష్ఠ - క్షిప్రం - మాం - ప్రాప్స్యతే - పతిః - అంతరాత్మా - హి - మే - శుద్ధః - తస్మిన్ - చ - బహవః - గుణాః ॥

**అన్వయక్రమము** :- హరిశ్రేష్ఠ! మే అంతరాత్మా శుద్ధః, తస్మిన్ చ బహవః గుణాః (అతః) పతిః మాం క్షిప్రం ప్రాప్స్యతే ఇతి ఆశంసేయమ్.

**ప్రతిపదార్థము** :- హరిశ్రేష్ఠ! = వానరశ్రేష్ఠుడా! మే అంతరాత్మా = నా అంతరాత్మ, శుద్ధః = పరిశుద్ధముగా నున్నది, తస్మిన్ = ఆ శ్రీరామునియందు, బహవః గుణాః = పెక్కు గొప్పగుణములున్నవి, (అతః = అందువలన) పతిః = (నా) భర్త, మాం = నన్ను, క్షిప్రం = శీఘ్రముగా, ప్రాప్స్యతే = పొందగలడు, ఇతి = అని, ఆశంసేయం = ఆశించు చున్నాను.

**సూచన** : - ఆశంసేయం అనుటకు బదులుగా అసంశయం అని పాఠాంతరము.

**తాత్పర్యము** :- ఓ వానరోత్తమా! నా యంతరాత్మ పరిశుద్ధమైయున్నది. శ్రీరాముని యందు చూడగా అసంఖ్యాకములైన ఉత్కృష్టగుణములున్నవి. అందుచే నా భర్త నన్ను త్వరలోనే పొందగలడని ఆశింప గల్గుచున్నాను.

**శ్లో॥ ఉత్సాహః పౌరుషం సత్త్వ మానృశంస్యం కృతజ్ఞతా ।**
**విక్రమశ్చ ప్రభావశ్చ సంతి వానర రాఘవే ॥ 15**

**పదచ్ఛేదము** :- ఉత్సాహః - పౌరుషం - సత్త్వమ్ - ఆనృశంస్యం - కృతజ్ఞతా - విక్రమః - చ - ప్రభావః - చ - సంతి - వానర - రాఘవే ॥

**అన్వయక్రమము** :- వానర! రాఘవే ఉత్సాహః, పౌరుషం, సత్త్వమ్, ఆనృశంస్యం, కృతజ్ఞతా, విక్రమః, ప్రభావః చ సంతి.

**ప్రతిపదార్థము** :- వానర! = ఓ హనుమా! రాఘవే = శ్రీరామునియందు, ఉత్సాహః = ఉత్సాహము, పౌరుషం = పురుషకారము, సత్త్వం = బలము, ఆనృశంస్యం = అక్రూరస్వభావము, కృతజ్ఞతా = కృతజ్ఞతయును, విక్రమః = పరాక్రమము, ప్రభావః = మహిమ, సంతి = ఉన్నవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- ఉత్సాహః - లోకోత్తరకార్యములందు స్థిరమైన ప్రయత్నము,

పౌరుషం = అట్టి కార్యసాధనము.

**తిలకము** :- ఆనృశంస్యం - ఆశ్రితజనులందు వాత్సల్యము, ప్రభావః - దివ్యాస్త్ర సంపదవలన జనించిన మహిమ.

**వాసుదాసస్వామి** :- కొందఱియందా గుణములు అల్పకాలమే యుండును. మఱికొందరి యం దిందు కొన్నియే యుండును. శ్రీరాముని యం దట్లుకాదు. కళ్యాణ గుణములన్నియు సంపూర్ణముగ శాశ్వతముగ నిలచియున్నవి.

**తాత్పర్యము** :- ఓ వానరశ్రేష్ఠుడా! నా శ్రీరామునియందు అమితమైన ఉత్సాహము, పౌరుషము, శక్తి, ఆశ్రితజనవాత్సల్యము, కృతజ్ఞత, పరాక్రమము, దివ్యాస్త్రప్రభావము అను అపూర్వగుణములు నిండుగ నిత్యముగా వెలయుచుండును సుమా!

**శ్లో॥ చతుర్దశ సహస్రాణి రాక్షసానాం జఘాన యః ।**
**జనస్థానే వినా భ్రాత్రా శత్రుః క స్తస్య నోద్విజేత్ ॥ 16**

**పదచ్ఛేదము** :- చతుర్దశ - సహస్రాణి - రాక్షసానాం - జఘాన - యః - జనస్థానే - వినా - భ్రాత్రా - శత్రుః - కః - తస్య - న - ఉద్విజేత్ ॥

**అన్వయక్రమము** :- జనస్థానే భ్రాత్రా వినా యః రాక్షసానాం చతుర్దశ సహస్రాణి జఘాన, తస్య శత్రుః కః నోద్విజేత్?

**ప్రతిపదార్థము** :- జనస్థానే = జనస్థానమునందు, భ్రాత్రా వినా = సోదరుడైన లక్ష్మణుడు లేకుండ, యః = ఏ వీరుడు, రాక్షసానాం = రాక్షసులయొక్క, చతుర్దశ సహస్రాణి = పదునాల్గువేలమందిని, జఘాన = సంహరించెనో, తస్య = అట్టి వీరునికి, శత్రుః = వైరియైన, కః = ఎవ్వడు, న ఉద్విజేత్ = భయము నొందకుండును?

**తాత్పర్యము** :- ఆనాడు జనస్థానమున తన సోదరుని సహాయము లేకుండగనే ఏ వీరుడు పదునాలుగు వేలమంది రాక్షసులను పరిమార్చెనో ఆతనిని జూచి శత్రువైన వాడెవ్వడు భయపడకుండగ నుండగలడు?

**శ్లో॥ న స శక్య స్తులయితుం వ్యసనైః పురుషర్షభః ।**
**అహం త స్యానుభావజ్ఞా శక్రస్యేవ పులోమజా ॥ 17**

**పదచ్ఛేదము** :- న - సః - శక్యః - తులయితుం - వ్యసనైః - పురుషర్షభః - అహం - తస్య - అనుభావజ్ఞా - శక్రస్య - ఇవ - పులోమజా ॥

**అన్వయక్రమము** :- సః పురుషర్షభః వ్యసనైః తులయితుం శక్యః న, పులోమజా

శక్రస్య ఇవ అహం తస్య అనుభావజ్ఞా.

**ప్రతిపదార్థము** :- సః పురుషర్షభః = ఆ పురుషసింహుడు, వ్యసనైః = ఆపదలచే, తులయితుం = చలింపచేయుటకు, శక్యః న = సాధ్యుడుగాడు, పులోమజా = పులోముని పుత్రికయైన శచీదేవి, శక్రస్య ఇవ = దేవేంద్రునియొక్క (ప్రభావమును) వలె, అహం = నేను, తస్య = ఆతనియొక్క, అనుభావజ్ఞా = ప్రభావము నెఱిగినదానను.

**తాత్పర్యము** :- పురుషసింహుడైన శ్రీరాముడు రాక్షసులు కల్పించు ఆపదలకు చలించునట్టివాడు గాదు. శచీదేవి దేవేంద్రుని ప్రభావమును పూర్తిగా ఎఱిగియున్నట్లు నేను నా శ్రీరాముని మహిమను సంపూర్ణముగా తెలిసియున్నదానను.

**శ్లో॥ శరజాలాంశుమాన్ శూరః కపే రామదివాకరః ।**
**శత్రురక్షోమయం తోయ ముపశోషం నయిష్యతి ॥ 18**

**పదచ్ఛేదము** :- శరజాలాంశుమాన్ - శూరః - కపే - రామదివాకరః - శత్రురక్షోమయం - తోయమ్ - ఉపశోషం - నయిష్యతి ॥

**అన్వయక్రమము** :- కపే! శూరః శరజాలాంశుమాన్ రామదివాకరః శత్రురక్షోమయం తోయమ్ ఉపశోషం నయిష్యతి.

**ప్రతిపదార్థము** :- కపే! = ఓ హనుమా! శూరః = మహావీరుడగు, శరజాలాంశుమాన్ = బాణసమూహములనెడి కిరణములు గలిగిన, రామదివాకరః = శ్రీరాముడనెడి సూర్యుడు, శత్రురక్షోమయం = శత్రువులనెడి రాక్షసుల రూపమైన, తోయం = జలమును, ఉపశోషం = ఎండిపోవుటను, నయిష్యతి = పొందింపగలడు.

**తాత్పర్యము** :- ఓ హనుమా! తన బాణములనెడి కిరణములతో కూడిన శూరుడైన రామదివాకరుడు, శత్రుపక్షీయులైన రాక్షసు లనెడి నీటిని పూర్తిగా ఎండించి వేయగలడు సుమా!

**శ్లో॥ ఇతి సంజల్పమానాం తాం రామార్థే శోకకర్శితామ్ ।**
**అశ్రుసంపూర్ణవదనా మువాచ హనుమా న్కపిః ॥ 19**

**పదచ్ఛేదము** :- ఇతి - సంజల్పమానాం - తాం - రామార్థే - శోకకర్శితామ్, అశ్రు సంపూర్ణవదనామ్ - ఉవాచ - హనుమాన్ - కపిః ॥

**అన్వయక్రమము** :- కపిః హనుమాన్ ఇతి సంజల్పమానాం, రామార్థే శోకకర్శితామ్, అశ్రుసంపూర్ణవదనాం తామ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :– కపిః హనుమాన్ = వానరశ్రేష్ఠుడగు హనుమ, ఇతి = ఈరీతిగా, సంజల్పమానాం = భాషించుచున్నదియును, రామార్థే = రామునికొఱకై, శోకకర్శితాం = దుఃఖముచే కృశించినదియును, అశ్రుసంపూర్ణవదనాం = దుఃఖబాష్పములతో నిండినముఖము గలదియునగు, తాం = ఆ సీతమ్మను గూర్చి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :– అప్పుడు వానరోత్తముడైన హనుమ ఈ విధముగా భాషించుచు, శ్రీరాముని గూర్చి శోకించుచు, కృశించి కన్నీటితో నిండిన ముఖముగల సీతమ్మను గూర్చి ఇట్లు పలికెను.

**శ్లో॥ శ్రుత్వైవ చ వచో మహ్యం క్షిప్ర మేష్యతి రాఘవః ।**
**చమూం ప్రకర్ష న్మహతీం హర్యృక్షగణసంకులామ్ ॥ 20**

**పదచ్ఛేదము** :– శ్రుత్వా – ఏవ – చ – వచః – మహ్యం – క్షిప్రమ్ – ఏష్యతి – రాఘవః – చమూం – ప్రకర్షన్ – మహతీం – హర్యృక్షగణసంకులామ్ ॥

**అన్వయక్రమము** :– రాఘవః మహ్యం (మత్తః) వచః శ్రుత్వా ఏవ హర్యృక్షగణసంకులాం మహతీం చమూం ప్రకర్షన్ క్షిప్రమ్ ఏష్యతి.

**ప్రతిపదార్థము** :– రాఘవః = శ్రీరాముడు, మహ్యం (మత్తః) = నానుండి, వచః = మాటను, శ్రుత్వా ఏవ = వినినంతనే, హర్యృక్షగణసంకులాం = వానరులయొక్కయు, భల్లూకములయొక్కయు సమూహముతో నిండినట్టి, మహతీం చమూం = గొప్పదైన సైన్యమును, ప్రకర్షన్ = తెచ్చుచు, క్షిప్రం = శీఘ్రముగా, ఏష్యతి = రాగలడు.

**తాత్పర్యము** :– శ్రీరాముడు నేను చెప్పిన మాటను వినిన వెంటనే అపారమైన వానరుల సమూహముతోడను, భల్లూకగణములతోడను కూడిన అమితమైన సైన్యమును నడిపించుకొనుచు అతి శీఘ్రకాలములోనే ఇటకు రాగలడు సుమా!

**శ్లో॥ అథవా మోచయిష్యామి త్వా మద్యైవ వరాననే ।**
**అస్మా ద్దుఃఖా దుపారోహ మమ పృష్ఠ మనిందితే ॥ 21**

**పదచ్ఛేదము** :– అథవా – మోచయిష్యామి – త్వామ్ – అద్య – ఏవ – వరాననే – అస్మాత్ – దుఃఖాత్ – ఉపారోహ – మమ – పృష్ఠమ్ – అనిందితే ॥

**అన్వయక్రమము** :– అథవా అద్య ఏవ త్వామ్ అస్మాత్ దుఃఖాత్ మోచయిష్యామి, వరాననే అనిందితే మమ పృష్ఠమ్ ఆరోహ.

**ప్రతిపదార్థము** :– అథవా = లేకపోయినచో, అద్య ఏవ = ఇప్పుడే, త్వాం = నిన్ను,

అస్మాత్ దుఃఖాత్ = ఈ దుఃఖమునుండి, మోచయిష్యామి = విడిపించెదను, వరాననే = ఓ చంద్రముఖీ! అనిందితే! = ఓ ఉత్తమురాలా! మమ పృష్ఠం = నా వీపును, ఉపారోహ = ఆరోహింపుము.

**సూచన :-** "వరాననే"కి బదులుగా "స రాక్షసాత్" అని పాఠాంతరము.

**తాత్పర్యము :-** శ్రీరాముడు వచ్చుట ఆలస్యమగునని శంకింతువేని నేనిప్పుడే నిన్ను నీ దుఃఖమునుండి విడిపించెదను. నా వీపుపై కూర్చుండుము.

**శ్లో॥ త్వాం తు పృష్ఠగతాం కృత్వా సంతరిష్యామి సాగరమ్ ।**
**శక్తి రస్తి హి మే వోఢుం లంకామపి సరావణామ్ ॥ 22**

**పదచ్ఛేదము :-** త్వాం - తు - పృష్ఠగతాం - కృత్వా - సంతరిష్యామి - సాగరమ్, శక్తిః - అస్తి - హి - మే - వోఢుం - లంకామ్ - అపి - సరావణామ్ ॥

**అన్వయక్రమము :-** త్వాం పృష్ఠగతాం కృత్వా సాగరం సంతరిష్యామి, సరావణాం లంకామ్ అపి వోఢుం మే శక్తిః అస్తి హి.

**ప్రతిపదార్థము :-** త్వాం = నిన్ను, పృష్ఠగతాం కృత్వా = వీపుపై నున్నదానినిగా చేసికొని, సాగరం = సముద్రమును, సంతరిష్యామి = దాటగలను, సరావణాం = రావణాసురునితో గూడిన, లంకామ్ అపి = లంకానగరమునుగూడ, వోఢుం = వహించుటకు, మే = నాకు, శక్తిః = సామర్థ్యము, అస్తి హి = ఉన్నది సుమా!

**తాత్పర్యము :-** నిన్ను నా వీపుపై నెక్కించుకొని ఈ మహాసముద్రమును దాటి వేయుదును. ఈ రావణాసురునితో సహితముగా లంకానగరమునంతను గూడ మోసికొని పోవుటకు కావలసినంత సామర్థ్యము నాకున్నది సుమా!

**శ్లో॥ అహం ప్రస్రవణస్థాయ రాఘవా యాద్య మైథిలి ।**
**ప్రాపయిష్యామి శక్రాయ హవ్యం హుతమి వానలః ॥ 23**

**పదచ్ఛేదము :-** అహం - ప్రసవణస్థాయ - రాఘవాయ - అద్య - మైథిలి - ప్రాపయిష్యామి - శక్రాయ - హవ్యం - హుతమ్ - ఇవ - అనలః ॥

**అన్వయక్రమము :-** మైథిలి! అనలః హుతం హవ్యం శక్రాయ ఇవ అహమ్ అద్య (త్వాం) ప్రస్రవణస్థాయ రాఘవాయ ప్రాపయిష్యామి.

**ప్రతిపదార్థము :-** మైథిలి! = ఓ జానకీ! అనలః = అగ్నిహోత్రుడు, హుతం = హోమము చేయబడిన, హవ్యం = హవిస్సును, శక్రాయ ఇవ = దేవేంద్రునకువలె,

అహం = నేను, అద్య = నేడు, త్వాం = నిన్ను, ప్రస్రవణస్థాయ = ప్రస్రవణ పర్వతముపై నున్నట్టి, రాఘవాయ = శ్రీరామునకు, ప్రాపయిష్యామి = చేర్చెదను.

**తాత్పర్యము** :– ఓ జానకీ! అగ్నిహోత్రుడు తనలో హోమము చేయబడినట్టి వస్తువును దేవేంద్రునకు సమర్పించినట్లుగా నేనిప్పుడు ప్రస్రవణపర్వతముపై నున్న శ్రీరామునకు నిన్ను సమర్పించెదను.

**శ్లో॥ ద్రక్ష్య స్యద్యైవ వైదేహి రాఘవం సహలక్ష్మణమ్ ।**
**వ్యవసాయసమాయుక్తం విష్ణుం దైత్యవధే యథా ॥ 24**

**పదచ్ఛేదము** :– ద్రక్ష్యసి – అద్య – ఏవ – వైదేహి – రాఘవం – సహలక్ష్మణమ్ – వ్యవసాయసమాయుక్తం – విష్ణుం – దైత్యవధే – యథా ॥

**అన్వయక్రమము** :– వైదేహి! సహలక్ష్మణం రాఘవం దైత్యవధే వ్యవసాయసమాయుక్తం విష్ణుం యథా అద్య ఏవ ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :– వైదేహి! = ఓ జానకీ! సహలక్ష్మణం = లక్ష్మణునితో కూడినట్టి, రాఘవం = శ్రీరాముని, దైత్యవధే = రాక్షససంహారమునందు, వ్యవసాయసమాయుక్తం = ప్రయత్నసమన్వితుడైనట్టి, విష్ణుం యథా = విష్ణువునువలె, అద్య ఏవ = నేడే, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :– ఓ జానకీదేవీ! తమ్ముడైన లక్ష్మణునితో కూడిన శ్రీరాముని రాక్షస సంహారమునకై యత్నపరుడైయున్న విష్ణుమూర్తినివలె నేడే కనులార దర్శింపగలవు సుమా!

**శ్లో॥ త్వద్దర్శనకృతోత్సాహ మాశ్రమస్థం మహాబలమ్ ।**
**పురందరమి వాసీనం నగరాజస్య మూర్ధని ॥ 25**

**పదచ్ఛేదము** :– త్వద్దర్శనకృతోత్సాహమ్ – ఆశ్రమస్థం – మహాబలమ్ – పురందరమ్ – ఇవ – ఆసీనం – నగరాజస్య – మూర్ధని ॥

**అన్వయక్రమము** :– నగరాజస్య మూర్ధని ఆసీనం పురందరమ్ ఇవ త్వద్దర్శన కృతోత్సాహం మహాబలమ్ ఆశ్రమస్థం (రాఘవం ద్రక్ష్యసి).

**ప్రతిపదార్థము** :– నగరాజస్య = మేరుపర్వతముయొక్క, మూర్ధని = శిఖరముపై, ఆసీనం = కూర్చున్నట్టి, పురందరమ్ ఇవ = దేవేంద్రునివలె, త్వద్దర్శనకృతోత్సాహం = నీ దర్శనమునకై వేగిరపడుచున్న ఉత్సాహముగలవాడును, మహాబలం = మహాబలాఢ్యుడును, ఆశ్రమస్థం = ఆశ్రమమునందున్నవాడు నగు, (రాఘవం =

శ్రీరాముని, ద్రక్ష్యసి = చూడగలవు).

**తాత్పర్యము** :– మేరుపర్వతశిఖరముపై ఆసీనుడై యున్న దేవేంద్రునివలె నిన్ను జూచుటకై వేగిరపడుచున్న శ్రీరాముడు తన ఆశ్రమమునందే యుండగా నీవిప్పుడే ఆతనిని కన్నులారా చూడగలవు సుమా!

**శ్లో॥ పృష్ఠ మారోహ మే దేవి మా వికాంక్షస్వ శోభనే ।**
**యోగ మన్విచ్ఛ రామేణ శశాంకేనేవ రోహిణీ ॥ 26**

**పదచ్ఛేదము** :– పృష్ఠమ్ – ఆరోహ – మే – దేవి – మా – వికాంక్షస్వ – శోభనే – యోగమ్ – అన్విచ్ఛ – రామేణ – శశాంకేన – ఇవ – రోహిణీ ॥

**అన్వయక్రమము** :– దేవి! మే పృష్ఠమ్ ఆరోహ, శోభనే! మా వికాంక్షస్వ; రోహిణీ శశాంకేన ఇవ (త్వం) రామేణ యోగమ్ అన్విచ్ఛ.

**ప్రతిపదార్థము** :– దేవి! = ఓ పూజ్యురాలా! మే = నా యొక్క, పృష్ఠం = వీపును, ఆరోహ = ఎక్కుము, శోభనే! = ఓ మంగళస్వరూపురాలా! మా వికాంక్షస్వ = ఉపేక్షింపకుము, రోహిణీ = రోహిణీతార, శశాంకేన ఇవ = చంద్రునితోవలె, (త్వం = నీవు) రామేణ = శ్రీరామునితో, యోగం = కలయికను, అన్విచ్ఛ = కోరుకొనుము.

**తాత్పర్యము** :– దేవీ! నా వీపుపై ఆరోహింపుము, ఉపేక్ష వహింపకుము; ఆకాశముపై పయనించి, రోహిణీతార చంద్రునితో కలసియున్నట్లుగా నీవు శ్రీరామునితో కలసి యుందువు.

**శ్లో॥ కథయంతీ చ చంద్రేణ సూర్యేణ చ మహార్చిషా ।**
**మత్పృష్ఠ మధిరుహ్యా త్వం త రాకాశమహార్ణవౌ ॥ 27**

**పదచ్ఛేదము** :– కథయంతీ – ఇవ – చంద్రేణ – సూర్యేణ – చ – మహార్చిషా – మత్పృష్ఠమ్ – అధిరుహ్యా – త్వం – తర – ఆకాశమహార్ణవౌ ॥

**అన్వయక్రమము** :– త్వం మత్పృష్ఠమ్ అధిరుహ్యా చంద్రేణ మహార్చిషా సూర్యేణ చ కథయంతీ ఇవ, ఆకాశమహార్ణవౌ తర.

**ప్రతిపదార్థము** :– త్వం = నీవు, మత్పృష్ఠం = నా వీపును, అధిరుహ్యా = ఆరోహించి, చంద్రేణ = చంద్రునితోడను, మహార్చిషా = గొప్పతేజస్సు గల్గినట్టి, సూర్యేణ చ = సూర్యునితోడను, కథయంతీ ఇవ = భాషించుచున్నదానివలె, ఆకాశమహార్ణవౌ = ఆకాశమును మహాసముద్రమును, తర = దాటుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** చంద్రేణ, సూర్యేణ కథయంతీ ఇవ – చంద్రసూర్యులతో మాటలాడగలిగినంతటి ఉన్నతమార్గమున నిన్ను గైకొని నేను ప్రయాణింపగలను సుమా యని భావము.

**తాత్పర్యము :–** నీవు నా వీపు నధిరోహించి సూర్యచంద్రులతో మాటలాడుచున్నట్లుగా ఉన్నతమార్గమున ఆకాశమున పయనించుచు మహాసాగరమును దాటుము.

**శ్లో॥ న హి మే సంప్రయాతస్య త్వామితో నయతో ఉఽంగనే ।**
**అనుగంతుం గతిం శక్తాః సర్వే లంకానివాసినః ॥ 28**

**పదచ్ఛేదము :–** న – హి – మే – సంప్రయాతస్య – త్వామ్ – ఇతః – నయతః – అంగనే – అనుగంతుం – గతిం – శక్తాః – సర్వే – లంకానివాసినః ॥

**అన్వయక్రమము :–** అంగనే! త్వాం ఇతః నయతః, సంప్రయాతస్య మే గతిం అనుగంతుం సర్వే లంకానివాసినః న శక్తాః హి.

**ప్రతిపదార్థము :–** అంగనే! = ఓ భామినీ! త్వాం = నిన్ను, ఇతః = ఇచ్చటినుండి, నయతః = కొనిపోవుచు, సంప్రయాతస్య = వెడలిపోవుచున్నట్టి, మే = నాయొక్క, గతిం = గమనమును, అనుగంతుం = అనుసరించుటకు, లంకానివాసినః = లంకలో నివసించుచున్నట్టి, సర్వే = ఎల్లరును, న శక్తాః హి = సమర్థులుగారు సుమా!

**తాత్పర్యము :–** నిన్ను గైకొని వెడలిపోవుచున్న నన్ను వెంబడించుటకు ఈ లంకలో నివసించుచున్న వారిలో ఎవ్వడును సమర్థుడు గాడు సుమా!

**శ్లో॥ యథై వాహ మిహ ప్రాప్త స్తథై వాహ మసంశయమ్ ।**
**యాస్యామి పశ్య వైదేహి త్వా ముద్యమ్య విహాయసమ్ ॥ 29**

**పదచ్ఛేదము :–** యథా – ఏవ – అహమ్ – ఇహ – ప్రాప్తః – తథా – ఏవ – అహమ్ – అసంశయమ్ – యాస్యామి – పశ్య – వైదేహి – త్వామ్ – ఉద్యమ్య – విహాయసమ్ ॥

**అన్వయక్రమము :–** వైదేహి! పశ్య, అహం యథా ఏవ ఇహ ప్రాప్తః తథా ఏవ త్వామ్ ఉద్యమ్య అసంశయం విహాయసం యాస్యామి.

**ప్రతిపదార్థము :–** వైదేహి! = ఓ జానకీ! పశ్య = చూడుము, అహం = నేను, ఇహ = ఇచ్చటికి, యథా ఏవ = ఏరీతిగా, ప్రాప్తః = చేరితినో, తథైవ = ఆ రీతిగనే, త్వాం

= నిన్ను, ఉద్యమ్య = ఎత్తుకొని, అసంశయం = నిస్సందేహముగా, విహాయసం = ఆకాశమార్గమున, యాస్యామి = పయనింపగలను.

**తాత్పర్యము** :– సీతాదేవీ! నేను ఈ లంకకు ఎట్లు అవలీలగ చేరగల్గితినో అంత తేలికగనే నా వీపుపై నిన్నుంచుకొని ఆకాశమార్గమున అనాయాసముగా పయనింతును. నీవే చూడుము.

**శ్లో॥ మైథిలీ తు హరిశ్రేష్ఠా చ్ఛ్రుత్వా వచన మద్భుతమ్ ।**
**హర్షవిస్మితసర్వాంగీ హనూమంత మథాబ్రవీత్ ॥ 30**

**పదచ్ఛేదము** :– మైథిలీ – తు – హరిశ్రేష్ఠాత్ – శ్రుత్వా – వచనమ్ – అద్భుతమ్ – హర్షవిస్మితసర్వాంగీ – హనూమంతమ్ – అథ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– మైథిలీ! హరిశ్రేష్ఠాత్ అద్భుతం వచనం శ్రుత్వా హర్షవిస్మిత సర్వాంగీ (సతీ) హనూమంతమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– మైథిలీ = సీతాదేవి, హరిశ్రేష్ఠాత్ = వానరశ్రేష్ఠుడైన హనుమనుండి, అద్భుతం = ఆశ్చర్యకరమైనట్టి, వచనం = మాటను, శ్రుత్వా = విని, హర్షవిస్మిత సర్వాంగీ = సంతోషముచే గగురు పొడిచిన శరీరముగలదై, అథ = పిమ్మట, హనూమంతం = హనుమనుగూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :– సీతాదేవి హనుమ పలికిన ఆశ్చర్యకరమైన మాటలను ఆలకించి ఆనందముతో శరీరము గగుర్పాటు నొందుచుండ ఆతనిని జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ హనుమన్ దూర మధ్వానం కథం మాం నేతు మిచ్ఛసి ।**
**త దేవ ఖలు తే మన్యే కపిత్వం హరియూథప ॥ 31**

**పదచ్ఛేదము** :– హనుమన్ – దూరమ్ – అధ్వానం – కథం – మాం – నేతుమ్ – ఇచ్ఛసి – తత్ – ఏవ – ఖలు – తే – మన్యే – కపిత్వం – హరియూథప ॥

**అన్వయక్రమము** :– హనుమన్! దూరమ్ అధ్వానం మాం కథం నేతుమ్ ఇచ్ఛసి? హరియూథప! తదేవ ఖలు తే కపిత్వం (ఇతి) మన్యే.

**ప్రతిపదార్థము** :– హనుమన్! = ఓ హనుమా! దూరం = దూరమైనట్టి, అధ్వానం = మార్గమును, మాం = నన్ను, కథం = ఎట్లు, నేతుం = కొనిపోవుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు? హరియూథప! = ఓ వానరాగ్రణీ! తదేవ ఖలు = అదియేగదా, తే కపిత్వం = నీ వానరలక్షణము, (ఇతి = అని) మన్యే = తలచుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ హనుమా! ఇంత దూరమైన మార్గమున నన్ను ఎట్లుగా తీసికొనిపోవ గోరుచున్నావు? వానరశ్రేష్ఠుడా! నీయందలి వానరస్వభావము ఇట్లే యుండునుగదా! యని నేను అర్థము చేసికొనుచున్నాను.

**శ్లో॥ కథం చాల్పశరీర స్త్వం మా మితో నేతు మిచ్ఛసి ।**
**సకాశం మానవేంద్రస్య భర్తు ర్మే ప్లవగర్షభ ॥ 32**

**పదచ్ఛేదము :–** కథం – చ – అల్పశరీరః – త్వం – మాం – ఇతః – నేతుమ్ – ఇచ్ఛసి – సకాశం – మానవేంద్రస్య – భర్తుః – మే – ప్లవగర్షభ ॥

**అన్వయక్రమము :–** ప్లవగర్షభ! అల్పశరీరః త్వం ఇతః మాం మానవేంద్రస్య మే భర్తుః సకాశం కథం నేతుమ్ ఇచ్ఛసి?

**ప్రతిపదార్థము :–** ప్లవగర్షభ = ఓ వానరశ్రేష్ఠుడా! అల్పశరీరః = చిన్నదైన శరీరము కలిగినట్టి, త్వం = నీవు, ఇతః = ఇచ్చటినుండి, మాం = నన్ను, మానవేంద్రస్య = మనుజనాథుడయిన, మే = నాయొక్క, భర్తుః = పెనిమిటియొక్క, సకాశం = సమీపమునకు, కథం = ఎట్లుగా, నేతుం = కొనిపోవుటకు, ఇచ్ఛసి = కోరుచున్నావు.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! ఇంత చిన్న శరీరముగల నీవు ఈ లంకానగరము నుండి నా భర్తయైన ఆ నరేంద్రుని సన్నిధికి ఎట్లు గొనిపోవవలెనని ఆశించుచున్నావు?

**శ్లో॥ సీతాయాస్తు వచ శ్శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః ।**
**చింతయామాస లక్ష్మీవా న్నవం పరిభవం కృతమ్ ॥ 33**

**పదచ్ఛేదము :–** సీతాయాః – తు – వచః – శ్రుత్వా – హనుమాన్ – మారుతాత్మజః – చింతయామాస – లక్ష్మీవాన్ – నవం – పరిభవం – కృతమ్ ॥

**అన్వయక్రమము :–** లక్ష్మీవాన్ మారుతాత్మజః హనుమాన్ సీతాయాః వచః శ్రుత్వా నవం పరిభవం కృతం ఇవ చింతయామాస.

**ప్రతిపదార్థము :–** లక్ష్మీవాన్ = శుభలక్షణ సమన్వితుడును, మారుతాత్మజః = వాయునందనుడును అగు, హనుమాన్ = హనుమ, సీతాయాః = సీతాదేవియొక్క, వచః = మాటను, శ్రుత్వా = విని, నవం = క్రొత్తదైన, పరిభవం = పరాభవము, కృతమ్ ఇవ = చేయబడినట్లు, చింతయామాస = చింతింపసాగెను.

**తాత్పర్యము :–** మహాపరాక్రమవంతుడైన హనుమ, తన సామర్థ్యము నెఱుగక సీతాదేవి మాటలు విని, తనకు మున్నెన్నడును జరుగని మహాపరాభవము జరిగినట్లుగా వ్యథనొందెను.

**శ్లో॥ న మే జానాతి సత్త్వం వా ప్రభావం వా ఽసితేక్షణా ।**
**తస్మా త్పశ్యతు వైదేహీ యద్రూపం మమ కామతః ॥ 34**

**పదచ్ఛేదము** :- న - మే - జానాతి - సత్త్వం - వా - ప్రభావం - వా - అసితేక్షణా - తస్మాత్ - పశ్యతు - వైదేహీ - యత్ - రూపం - మమ - కామతః ॥

**అన్వయక్రమము** :- అసితేక్షణా, వైదేహీ మే సత్త్వం ప్రభావం వా న జానాతి, తస్మాత్ మమ కామతః యత్ రూపం (భవతి తత్) పశ్యతు.

**ప్రతిపదార్థము** :- అసితేక్షణా = సుందరమైన కన్నులుగల, వైదేహీ! = జానకీదేవి, మే = నా యొక్క, సత్త్వం = బలమునుగాని, ప్రభావం వా = మహిమనుగాని, న జానాతి = ఎఱుగదు, తస్మాత్ = అందువలన, మమ = నాకు, కామతః = ఇచ్చనుబట్టి, యత్ రూపం = ఏ రూపము (భవతి = ఉండునో, తత్ = ఆ రూపమును) పశ్యతు = చూచునుగాక!

**తాత్పర్యము** :- ఈ కోమలి నా శక్తినిగాని ప్రభావమునుగాని ఏమియు నెఱుగదు. అందుచే నేను కోరి ఎట్టి రూపమును ధరింపగలనో ఈమె చూచి తెలిసికొనును గాక!

**శ్లో॥ ఇతి సంచింత్య హనుమాన్ తదా ప్లవగసత్తమః ।**
**దర్శయామాస సీతాయా స్స్వం రూప మరిమర్దనః ॥ 35**

**పదచ్ఛేదము** :- ఇతి - సంచింత్య - హనుమాన్ - తదా - ప్లవగసత్తమః - దర్శయామాస - సీతాయాః - స్వం - రూపమ్ - అరిమర్దనః ॥

**అన్వయక్రమము** :- అరిమర్దనః, ప్లవగసత్తమః హనుమాన్ ఇతి సంచింత్య తదా సీతాయాః స్వం రూపం దర్శయామాస.

**ప్రతిపదార్థము** :- అరిమర్దనః = శత్రుసంహారకుడై నట్టియును, ప్లవగసత్తమః = వానరశ్రేష్ఠుడైనట్టియు, హనుమాన్ = హనుమ, ఇతి = ఈ విధముగ, సంచింత్య = ఆలోచించి, తదా = అప్పుడు, సీతాయాః = సీతాదేవికి, స్వం రూపం = తన నిజరూపమును, దర్శయామాస = చూపెను.

**తాత్పర్యము** :- వానరశ్రేష్ఠుడైన హనుమ ఈ విధముగా ఆలోచించి సీతాదేవికి శత్రుసంహారసమర్థుడైన ఆతడు తన నిజరూపమును చూపెను.

**శ్లో॥ స తస్మా త్పాదపా ద్ధీమా నాప్లుత్య ప్లవగర్షభః ।**
**తతో వర్ధితు మారేభే సీతాప్రత్యయకారణాత్ ॥ 36**

**పదచ్ఛేదము :-** సః - తస్మాత్ - పాదపాత్ - ధీమాన్ - ఆప్లుత్య - ప్లవగర్షభః - తతః - వర్ధితుమ్ - ఆరేభే - సీతాప్రత్యయకారణాత్ ॥

**అన్వయక్రమము :-** ధీమాన్ సః ప్లవగర్షభః తస్మాత్ పాదపాత్ ఆప్లుత్య తతః సీతాప్రత్యయకారణాత్ వర్ధితుమ్ ఆరేభే.

**ప్రతిపదార్థము :-** ధీమాన్ = ప్రజ్ఞాశాలియైనట్టి, సః ప్లవగర్షభః = ఆ వానరశ్రేష్ఠుడు, తస్మాత్ పాదపాత్ = ఆ వృక్షమునుండి, ఆప్లుత్య = లంఘించి, తతః = పిమ్మట, సీతాప్రత్యయకారణాత్ = సీతాదేవికి నమ్మకము నిమిత్తము, వర్ధితుం = వృద్ధి పొందుటకు, ఆరేభే = మొదలిడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** పాదపాత్ ఆప్లుత్య - కొమ్మనుండి దిగుట తన శరీరభారముచే చెట్లు విరిగి ఆ ధ్వనికి రాక్షసస్త్రీలు తనను గుర్తింతురను భీతితో నని భావము.

**తాత్పర్యము :-** ప్రజ్ఞాశాలియైన హనుమ తానున్న ఆ శింశుపావృక్షమునుండి క్రిందికి దూకి తనపై సీతాదేవికి నమ్మకము గల్గుటకొఱకై తన శరీరమును పెంచదొడగెను.

**శ్లో॥ మేరుమందరసంకాశో బభౌ దీప్తానలప్రభః ।**
**అగ్రతో వ్యవతస్థే చ సీతాయా వానరోత్తమః ॥ 37**

**పదచ్ఛేదము :-** మేరుమందరసంకాశః - బభౌ - దీప్తానలప్రభః - అగ్రతః - వ్యవతస్థే - చ - సీతాయాః - వానరర్షభః ॥

**అన్వయక్రమము :-** వానరర్షభః మేరుమందరసంకాశః (సన్) బభౌ, దీప్తానలప్రభః (సన్) సీతాయాః అగ్రతః వ్యవతస్థే.

**ప్రతిపదార్థము :-** వానరర్షభః = వానరశ్రేష్ఠుడైన హనుమ, మేరుమందరసంకాశః (సన్) = మేరుపర్వతము తోడను, మందరగిరి తోడను, సమానమైనట్టివాడై, బభౌ = ప్రకాశించెను, దీప్తానలప్రభః = ప్రజ్వలించిన అగ్నియొక్క తేజస్సువంటి ప్రభగలవాడై, సీతాయాః = సీతాదేవియొక్క, అగ్రతః = ఎదుట, వ్యవతస్థే = నిలచెను.

**తాత్పర్యము :-** అట్లు వృద్ధిపొందియున్న హనుమ మేరుపర్వతము వలెను, మందరాద్రి వలెను చూచుటకు ఆశ్చర్యము గొల్పుచుండెను. ఇట్లు సీతాదేవిముందు నిలచిన

యాతడు ప్రజ్వలించుచున్న అగ్నిదేవుని వలెనే ప్రకాశించెను.

**శ్లో॥ హరిః పర్వతసంకాశ స్తామ్రవక్త్రో మహాబలః ।**
**వజ్రదంష్ట్రనఖో భీమో వైదేహీ మిద మబ్రవీత్ ॥ 38**

**పదచ్ఛేదము** :– హరిః – పర్వతసంకాశః – తామ్రవక్త్రః – మహాబలః – వజ్రదంష్ట్రనఖః – భీమః – వైదేహీమ్ – ఇదమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– పర్వతసంకాశః, తామ్రవక్త్రః, మహాబలః, వజ్రదంష్ట్రనఖః, భీమః (సః) హరిః వైదేహీమ్ ఇదమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– పర్వతసంకాశః = పర్వతసమానుడును, తామ్రవక్త్రః = ఎఱ్ఱని ముఖము గలవాడును, మహాబలః = మహాబలాఢ్యుడును, వజ్రదంష్ట్రనఖః = వజ్రముల వంటి కోఱలును గోరులును గలవాడును, భీమః = భయంకరుడును అగు, (సః) హరిః = ఆ వానరుడు, వైదేహీం = జానకీదేవిని గూర్చి, ఇదం = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :– ఆ హనుమంతుడు పర్వతమువంటి శరీరమును ఎఱ్ఱని ముఖమును వజ్రములవంటి కోఱలును గోరులును గలిగి మహాబలాఢ్యుడుగాను, భయంకరుడు గాను, కాన్పించుచు సీతాదేవిని గూర్చి ఇట్లు పలికెను.

**శ్లో॥ సపర్వతవనోద్దేశాం సాట్టప్రాకారతోరణామ్ ।**
**లంకా మిమాం సనాథాం వా నయితుం శక్తి రస్తి మే ॥ 39**

**పదచ్ఛేదము** :– సపర్వతవనోద్దేశాం – సాట్టప్రాకారతోరణామ్ – లంకామ్ – ఇమామ్ – సనాథాం – వా – నయితుం – శక్తిః – అస్తి – మే ॥

**అన్వయక్రమము** :– సపర్వతవనోద్దేశాం, సాట్టప్రాకారతోరణాం, సనాథామ్ ఇమాం లంకాం వా నయితుం మే శక్తిః అస్తి.

**ప్రతిపదార్థము** :– సపర్వతవనోద్దేశాం = పర్వతములతోడను వనప్రదేశములతోడను కూడినదియును, సాట్టప్రాకారతోరణాం = మేడలతోడను ప్రాకారములతోడను తోరణములతోడను గూడినదియును, సనాథాం = రాజుతో గూడినదియునగు, ఇమాం లంకాం వా = ఈ లంకానగరినైనను, నయితుం = తీసికొనిపోవుటకు, మే = నాకు, శక్తిః = సామర్థ్యము, అస్తి = ఉన్నది.

**తాత్పర్యము** :– సమస్తపర్వతములతోను అరణ్యప్రదేశములతోను సౌధములతోను ప్రాకారములతోను బహిర్ద్వారములతోను తన యేలికయైన రావణునితోను గూడియున్న

ఈ లంకానగరము నంతను మోసికొనిపోవుటకు కావలసినంత శక్తి నాకున్నది సుమా!

**శ్లో॥ త దవస్థాప్యతాం బుద్ధి రలం దేవి వికాంక్షయా ।**
**విశోకం కురు వైదేహి రాఘవం సహలక్ష్మణమ్ ॥ 40**

**పదచ్ఛేదము :–** తత్ – అవస్థాప్యతాం – బుద్ధిః – అలం – దేవి – వికాంక్షయా – విశోకం – కురు – వైదేహి – రాఘవం – సహలక్ష్మణమ్ ॥

**అన్వయక్రమము :–** తత్ దేవి! బుద్ధిః అవస్థాప్యతాం; వికాంక్షయా అలమ్; వైదేహి! సహలక్ష్మణం రాఘవం విశోకం కురు.

**ప్రతిపదార్థము :–** తత్ = ఆ కారణమున, దేవి! = ఓ పూజ్యురాలా! బుద్ధిః = బుద్ధి, అవస్థాప్యతాం = నిశ్చలపఱుపబడుగాక! వికాంక్షయా అలం = వేఱుతలంపువలదు, వైదేహి! = ఓ జానకీ! సహలక్ష్మణం = లక్ష్మణునితో గూడినట్టి, రాఘవం = శ్రీరాముని, విశోకం = శోకరహితునిగా, కురు = చేయుము.

**తాత్పర్యము :–** తల్లీ! అందుచే నన్ను గూర్చి నీ మనస్సునందు ధైర్యముతో నిశ్చలముగ నుండుము. నీకు ఎట్టి శంకయు అక్కఱలేదు. నా తోడవచ్చి తమ్మునితో గూడి శోకనిమగ్నుడైయున్న శ్రీరాముని శోకమును తొలగింపుము.

**శ్లో॥ తం దృష్ట్వాఽచలసంకాశ మువాచ జనకాత్మజా ।**
**పద్మపత్రవిశాలాక్షీ మారుత స్యౌరసం సుతమ్ ॥ 41**

**పదచ్ఛేదము :–** తం – దృష్ట్వా – అచలసంకాశం – ఉవాచ – జనకాత్మజా – పద్మపత్రవిశాలాక్షీ – మారుతస్య – ఔరసం – సుతమ్ ॥

**అన్వయక్రమము :–** పద్మపత్రవిశాలాక్షీ జనకాత్మజా అచలసంకాశం మారుతస్య ఔరసం సుతం తం దృష్ట్వా ఉవాచ.

**ప్రతిపదార్థము :–** పద్మపత్రవిశాలాక్షీ = తామరఱేకులవలె విశాలమైన కన్నులుగల, జనకాత్మజా = జానకీదేవి, అచలసంకాశం = పర్వతసన్నిభుడైనట్టి, మారుతస్య = వాయువుయొక్క, ఔరసం సుతం = ఔరసపుత్రుడైన, తం = ఆ హనుమను, దృష్ట్వా = చూచి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** తామరఱేకులవలె విశాలము లైనట్టి కన్నులుగల సీతాదేవి తన ముందు పర్వతమువలె ప్రకాశించుచున్నట్టి ఆ వాయునందనుని జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ తవ సత్త్వం బలం చైవ విజానామి మహాకపే ।**
**వాయోరివ గతిం చాపి తేజ శ్చా గ్నేరివాద్భుతమ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** తవ – సత్త్వం – బలం – చ – ఏవ – విజానామి – మహాకపే – వాయోః – ఇవ – గతిం – చ – అపి – తేజః – చ – అగ్నేః – ఇవ – అద్భుతమ్ ॥

**అన్వయక్రమము :–** మహాకపే! అద్భుతం తవ సత్త్వం, బలం చ, వాయోః ఇవ గతిం చ, అగ్నేః ఇవ తేజః చ అహం విజానామి.

**ప్రతిపదార్థము :–** మహాకపే = ఓ వానరశ్రేష్ఠుడా, అద్భుతం = ఆశ్చర్యకరమైన, తవ = నీయొక్క, సత్త్వం = శక్తిని, బలం చ = బలమును, వాయోః ఇవ = వాయువునకువలె, గతిం చ = గమనమును, అగ్నేః ఇవ = అగ్నికివలె, తేజః చ = తేజస్సును, అహం = నేను, విజానామి = బాగుగా తెలిసికొనుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తమా! అద్భుతమైనట్టి నీ శక్తిని గూర్చియు, సామర్థ్యమును గూర్చియు, వాయుదేవున కున్నంతటి నీ వేగమును గూర్చియు, అగ్నిదేవునివంటి నీ తేజస్సును గూర్చియును నాకు బాగుగ తెలిసినది.

**శ్లో॥ ప్రాకృతో ఽ న్యః కథం చేమాం భూమిమాగంతు మర్హతి ।**
**ఉదధే రప్రమేయస్య పారం వానరయూథప ॥ 43**

**పదచ్ఛేదము :–** ప్రాకృతః – అన్యః – కథం – చ – ఇమాం – భూమిమ్ – ఆగంతుం – అర్హతి – ఉదధేః – అప్రమేయస్య – పారం – వానరయూథప ॥

**అన్వయక్రమము :–** వానరయూథప! అప్రమేయస్య ఉదధేః పారమ్ ఇమాం భూమిం అన్యః ప్రాకృతః కథమ్ ఆగంతుమ్ అర్హతి?

**ప్రతిపదార్థము :–** వానరయూథప = ఓ వానరాగ్రేసరా! అప్రమేయస్య = అపారమైనట్టి, ఉదధేః = సముద్రముయొక్క, పారం = ఆవలియొడ్డైనట్టి, ఇమాం భూమిం = ఈ ప్రదేశమును, అన్యః = ఇతరుడైన, ప్రాకృతః = సామాన్యుడు, కథం = ఎట్లు, ఆగంతుం = వచ్చుటకు, అర్హతి = సమర్థుడగును.

**తాత్పర్యము :–** వానరోత్తమా! అపారమైన ఈ మహాసాగరముయొక్క ఆవలి యొడ్డుననున్న ఈ సుదూరదేశమును నీవుగాక మఱెవ్వడు చేరుటకు సమర్థుడగును?

**శ్లో॥ జానామి గమనే శక్తిం నయనే చాపి తే మమ ।**
**అవశ్యం సంప్రధార్యాశు కార్యసిద్ధిర్మహాత్మనః ॥ 44**

**పదచ్ఛేదము** :– జానామి – గమనే – శక్తిం – నయనే – చ – అపి – తే – మమ – అవశ్యం – సంప్రధార్యా – ఆశు – కార్యసిద్ధిః – మహాత్మనః ॥

**అన్వయక్రమము** :– మమ నయనే, తే గమనే చ శక్తిం జానామి, మహాత్మనః ఆశు కార్యసిద్ధిః అవశ్యం సంప్రధార్యా.

**ప్రతిపదార్థము** :– మమ = నా యొక్క, నయనే = కొనిపోవుటయందును, గమనే చ = గమనమునందును, తే = నీ యొక్క, శక్తిం = సామర్థ్యమును గూర్చి, జానామి = ఎఱుగుదును (కింతు = కాని), మహాత్మనః = మహాత్ముడైన శ్రీరామునియొక్క, ఆశు = శీఘ్రమైన, కార్యసిద్ధిః = కార్యసిద్ధి, అవశ్యం = తప్పక, సంప్రధార్యా = నిశ్చయింప వలసియున్నది.

**తాత్పర్యము** :– ఓ హనుమా! నన్ను గొనిపోవుటకును, సముద్రమును లంఘించుటకును నీకుగల విశేషమైన సామర్థ్యమును గూర్చి నాకు తెలియును గాని ఆ మహాత్ముడైన శ్రీరాముడు తలపెట్టిన కార్యసిద్ధిని గూర్చి కూడ మనము ఆలోచింప వలసియున్నది గదా!

**శ్లో॥ అయుక్తం హి కపిశ్రేష్ఠ మయా గంతుం త్వయా సహ ।**
**వాయువేగసవేగస్య వేగో మాం మోహయేత్తవ ॥ 45**

**పదచ్ఛేదము** :– అయుక్తం – హి – కపిశ్రేష్ఠ – మయా – గంతుం – త్వయా – సహ – వాయువేగసవేగస్య – వేగః – మాం – మోహయేత్ – తవ ॥

**అన్వయక్రమము** :– కపిశ్రేష్ఠ! త్వయా సహ మయా గంతుమ్ అయుక్తం హి, వాయువేగ సవేగస్య తవ వేగః మాం మోహయేత్.

**ప్రతిపదార్థము** :– కపిశ్రేష్ఠ! = ఓ వానరశ్రేష్ఠుడా! త్వయా సహ = నీతోగూడ, మయా = నాచేత, గంతుం = అనుసరింపబడుటకు, అయుక్తం హి = అయుక్తము సుమా! వాయువేగసవేగస్య = వాయువుయొక్క వేగముతో సమానమైన వేగముగల్గినట్టి, తవ = నీ యొక్క, వేగః = వేగము, మాం = నన్ను, మోహయేత్ = వశము తప్పినదానిని చేయును.

**తాత్పర్యము** :– వానరోత్తమా! నీతోగూడ నేను వచ్చుట ఉచితముగాదు. ఏలననగా వాయువేగముతో ఆకసమున ఎగిరిపోవుచున్నట్టి నీ గమనవేగమును నేను భరింపజాలను.

**శ్లో॥ అహ మాకాశ మాపన్నా హ్యుపర్యుపరి సాగరమ్ ।**
**ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయా ద్వేగేన గచ్ఛతః ॥ 46**

**పదచ్ఛేదము** :– అహమ్ – ఆకాశమ్ – ఆపన్నా – హి – ఉపరి – ఉపరి – సాగరమ్ – ప్రపతేయం – హి – తే – పృష్ఠాత్ – భయాత్ – వేగేన – గచ్ఛతః ॥

**అన్వయక్రమము** :– సాగరం ఉపరి ఉపరి ఆకాశమ్ ఆపన్నా అహం వేగేన గచ్ఛతః తవ పృష్ఠాత్ భయాత్ ప్రపతేయం హి.

**ప్రతిపదార్థము** :– సాగరం ఉపరి ఉపరి = సముద్రమునకు పైపైని, ఆకాశం = ఆకాశమును, ఆపన్నా = పొందినట్టి, అహం = నేను, వేగేన = వేగముగా, గచ్ఛతః = పోవుచున్నట్టి, తవ = నీ యొక్క, పృష్ఠాత్ = వీపుమీద నుండి, భయాత్ = భయమువలన, ప్రపతేయం హి = పడిపోవుదును గదా!

**తాత్పర్యము** :– మహాసముద్రముయొక్క మిక్కిలి పైభాగముగ ఆకాశముపై చేర్చి నన్ను మహావేగముతో గొనిపోవుచున్న నీ వీపుమీద నుండి నేను భయముచే పట్టుతప్పి క్రింద పడిపోవచ్చును గదా!

**శ్లో॥ పతితా సాగరే చాహం తిమినక్రఝషాకులే ।**
**భవేయ మాశు వివశా యాదసా మన్న ముత్తమమ్ ॥ 47**

**పదచ్ఛేదము** :– పతితా – సాగరే – చ – అహం – తిమినక్రఝషాకులే – భవేయమ్ – ఆశు – వివశా – యాదసామ్ – అన్నమ్ – ఉత్తమమ్ ॥

**అన్వయక్రమము** :– తిమినక్రఝషాకులే సాగరే పతితా అహమ్ ఆశు వివశా యాదసాం ఉత్తమమ్ అన్నం భవేయం చ.

**ప్రతిపదార్థము** :– తిమినక్రఝషాకులే = తిమింగిలములతోడను, మొసళ్ళతోడను, మీనములతోడను సంకులమైయుండు, సాగరే = సముద్రమునందు, పతితా = పడినదాననై, అహం = నేను, ఆశు = శీఘ్రముగా, వివశా = వశముతప్పినదాననై, యాదసాం = జలజంతువులకు, ఉత్తమం = ఉత్తమమైన, అన్నం = ఆహారమును, భవేయం చ = అగుదునుగూడను.

**తాత్పర్యము** :– తిమింగలములతోను, మొసళ్ళతోను, మత్స్యములతోను భీకరమైయుండు మహాసాగరమునందు పడిపోయి వేఱుగతి లేక నేను అందలి జలజంతువులకు మంచి రుచికరమైన ఆహారము కాగలను గదా!

**శ్లో॥ న చ శక్ష్యే త్వయా సార్ధం గంతుం శత్రువినాశన ।**
**కళత్రవతి సందేహస్త్వయి స్యాద ప్యసంశయమ్ ॥ 48**

**పదచ్ఛేదము :–** న – చ – శక్ష్యే – త్వయా – సార్ధం – గంతుం – శత్రువినాశన – కళత్రవతి – సందేహః – త్వయి – స్యాత్ – అపి – అసంశయమ్ ॥

**అన్వయక్రమము :–** శత్రువినాశన! త్వయా సార్ధం గంతుం చ (అహం) న శక్ష్యే, త్వయి కళత్రవతి (ఇవ) అసంశయం సందేహః స్యాత్.

**ప్రతిపదార్థము :–** శత్రువినాశన = శత్రుసంహారకుడైన ఓ హనుమా! త్వయా సార్ధం = నీతోగూడ, గంతుం = పయనించుటకు, అహం = నేను, న శక్ష్యే = చాలను, త్వయి = నీయందు, కళత్రవతి ఇవ = భార్యతో గూడినవానియందువలె, అసంశయం = నిస్సంశయముగా, సందేహః అపి = శంకగూడ, స్యాత్ = కలుగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** కళత్రవతి సందేహః – ఒక స్త్రీని వెంటబెట్టుకొని పోవుచున్నవానిని జూచి రాక్షసులకు విపరీతమైన శంకలు గలుగవచ్చునని భావము.

**గోవిందరాజీయము :–** కళత్రము అనగా రక్షింపవలసినట్టి వస్తువు అని అర్థము. రక్షింపవలసిన నన్ను వెంటగొని పోవుచున్న నీకు గూడ రాక్షసులచే ప్రాణభయము కలుగవచ్చునను సందేహము కలుగునని భావము.

**తాత్పర్యము :–** నీతోగూడ నేను ప్రయాణము చేయజాలను. నీవు శత్రువినాశకుడవైనను నీతోగూడనున్న స్త్రీ నైన నన్ను చూచి నీ భార్యనేమో అని, పరులు శంకింపవచ్చునుగదా!

**శ్లో॥ హ్రియమాణాం తు మాం దృష్ట్వా రాక్షసా భీమవిక్రమాః ।**
**అనుగచ్ఛేయు రాదిష్టా రావణేన దురాత్మనా ॥ 49**

**పదచ్ఛేదము :–** హ్రియమాణాం – తు – మాం – దృష్ట్వా – రాక్షసాః – భీమవిక్రమాః – అనుగచ్ఛేయుః – ఆదిష్టాః – రావణేన – దురాత్మనా ॥

**అన్వయక్రమము :–** హ్రియమాణాం మాం దృష్ట్వా దురాత్మనా రావణేన ఆదిష్టాః భీమవిక్రమాః రాక్షసాః అనుగచ్ఛేయుః.

**ప్రతిపదార్థము :–** హ్రియమాణాం = కొనిపోవబడుచున్న, మాం = నన్ను, దృష్ట్వా = చూచి, దురాత్మనా = దుర్మార్గుడైన, రావణేన = రావణునిచే, ఆదిష్టాః =

ఆజ్ఞాపింపబడినట్టి, భీమవిక్రమాః = భయంకరపరాక్రమముగల్గిన, రాక్షసాః = రాక్షసులు, అనుగచ్ఛేయుః = వెంబడింతురు.

**తాత్పర్యము** :- నీవు నన్ను గొనిపోవుటను జూచి రావణుడు ఆజ్ఞాపింపగా భయంకరులైన రాక్షసులు వెంటనే మనలను తప్పక వెంబడింతురు.

**శ్లో॥ తై స్త్వం పరివృత శ్శూరై శ్శూలముద్గరపాణిభిః ।**
**భవే స్త్వం సంశయం ప్రాప్తో మయా వీర కళత్రవాన్ ॥ 50**

**పదచ్ఛేదము** :- తైః - త్వం - పరివృతః - శూరైః - శూలముద్గరపాణిభిః, భవేః - త్వం - సంశయం - ప్రాప్తః - మయా - వీర - కళత్రవాన్ ॥

**అన్వయక్రమము** :- శూలముద్గరపాణిభిః తైః శూరైః పరివృతః కళత్రవాన్ త్వం మయా సంశయం ప్రాప్తః భవేః.

**ప్రతిపదార్థము** :- శూలముద్గరపాణిభిః = శూలములు ముద్గరములు చేతియందు గలిగినట్టి, తైః శూరైః = ఆ శూరులచే, పరివృతః = చుట్టుముట్టబడిన, త్వం = నీవు, కళత్రవాన్ = కళత్రవంతుడవుగా, సంశయం ప్రాప్తః = సంశయము నొందినవాడవు, భవేః = కాగలవు.

**తాత్పర్యము** :- శూలములు ముద్గరములు చేతబట్టి వచ్చిన ఆ రాక్షసులు నిన్ను చుట్టుముట్టి నాతోగూడ నున్న నిన్ను కళత్రవంతుడవను సందేహమునే పొందెదరు.

**శ్లో॥ సాయుధా బహవో వ్యోమ్ని రాక్షసా స్త్వం నిరాయుధః ।**
**కథం శక్ష్యసి సంయాతుం మాం చైవ పరిరక్షితుమ్ ॥ 51**

**పదచ్ఛేదము** :- సాయుధాః - బహవః - వ్యోమ్ని - రాక్షసాః - త్వం - నిరాయుధః - కథం - శక్ష్యసి - సంయాతుం - మాం - చ - ఏవ - పరిరక్షితుమ్ ॥

**అన్వయక్రమము** :- రాక్షసాః బహవః, సాయుధాః, త్వం నిరాయుధః వ్యోమ్ని సంయాతుం, మాం పరిరక్షితుం చ కథం శక్ష్యసి.

**ప్రతిపదార్థము** :- రాక్షసాః = రాక్షసులు, బహవః = పెక్కుమంది, సాయుధాః = ఆయుధములు గల్గియున్నవారు, త్వం = నీవు, నిరాయుధః = ఆయుధములు లేనివాడవు, వ్యోమ్ని = ఆకసమునందు, సంయాతుం = పోరుటకును, మాం = నన్ను, పరిరక్షితుం చ = కాపాడుటకును, కథం = ఎట్లు, శక్ష్యసి = చాలుదువు?

**తాత్పర్యము** :- మనలను వెంబడించు రాక్షసులు చూడగా పెక్కుమంది యుందురు.

పైగా వారు ఆయుధములను ధరించియుందురు. నీవన్ననో ఒంటరివి, మీదుమిక్కిలి నిరాయుధుడవు, అట్టి నీవు ఆ యాకాశమునందు వారందరితో నెట్లు పోరాడగలవు? నన్నెట్లు రక్షింపగలవు?

**శ్లో॥ యుధ్యమానస్య రక్షోభి స్తత స్తైః క్రూరకర్మభిః ।**
**ప్రపతేయం హి తే పృష్ఠా ద్భయార్తా కపిసత్తమ ॥ 52**

**పదచ్ఛేదము** :– యుధ్యమానస్య – రక్షోభిః – తతః – తైః – క్రూరకర్మభిః – ప్రపతేయం – హి – తే – పృష్ఠాత్ – భయార్తా – కపిసత్తమ ॥

**అన్వయక్రమము** :– కపిసత్తమ! తతః క్రూరకర్మభిః తైః రక్షోభిః యుధ్యమానస్య తే పృష్ఠాత్ భయార్తా ప్రపతేయం హి.

**ప్రతిపదార్థము** :– కపిసత్తమ! = ఓ వానరోత్తమా! తతః = పిమ్మట, క్రూరకర్మభిః = క్రూరచేష్టలు గల్గినట్టి, తైః రక్షోభిః = ఆ రాక్షసులతో, యుధ్యమానస్య = యుద్ధము చేయుచున్నట్టి, తే = నీయొక్క, పృష్ఠాత్ = వీపుమీదనుండి, భయార్తా = భయపీడితురాలనై, ప్రపతేయం హి = పడిపోవుదునుగదా!

**తాత్పర్యము** :– ఓ వానరోత్తమా! పరమక్రూరులైనట్టి ఆ రాక్షసయోధులతో నీవు పోరాడుచుండగా నీ వీపుమీదనుండి నేను భయకంపితురాలనై క్రిందకు పడిపోవుదును గదా!

**శ్లో॥ అథ రక్షాంసి భీమాని మహాంతి బలవంతి చ ।**
**కథంచి త్సాంపరాయే త్వాం జయేయుః కపిసత్తమ ॥ 53**

**పదచ్ఛేదము** :– అథ – రక్షాంసి – భీమాని – మహాంతి – బలవంతి – చ – కథంచిత్ – సాంపరాయే – త్వాం – జయేయుః – కపిసత్తమ ॥

**అన్వయక్రమము** :– కపిసత్తమ! భీమాని, మహాంతి, బలవంతి చ రక్షాంసి అథ సాంపరాయే త్వాం కథంచిత్ జయేయుః.

**ప్రతిపదార్థము** :– కపిసత్తమ = ఓ వానరోత్తమా! భీమాని = భీకరులును, మహాంతి = పెద్దవారును, బలవంతి చ = బలాఢ్యులును అగు, రక్షాంసి = రాక్షసులు, అథ = పిమ్మట, సాంపరాయే = యుద్ధమునందు, త్వాం = నిన్ను, కథంచిత్ = ఎట్లో, జయేయుః = జయింతురు.

**తాత్పర్యము** :– ఓ వానరోత్తమా! మహాభయంకరులును నీ కంటె పెద్దవారును బలాఢ్యులును అగు ఆ రక్కసులు అటుపిమ్మట జరుగు యుద్ధమునందు ఎట్టి

మాయోపాయముతో నైన నిన్ను జయించవచ్చును.

**శ్లో॥ అథవా యుధ్యమానస్య పతేయం విముఖస్య తే ।**
**పతితాం చ గృహీత్వా మాం నయేయుః పాపరాక్షసాః ॥ 54**

**పదచ్ఛేదము** :- అథవా - యుధ్యమానస్య - పతేయం - విముఖస్య - తే - పతితాం - చ - గృహీత్వా - మాం - నయేయుః - పాపరాక్షసాః ॥

**అన్వయక్రమము** :- అథవా యుధ్యమానస్య విముఖస్య తే (పృష్ఠాత్ అహం) పతేయమ్, పాపరాక్షసాః పతితాం మాం గృహీత్వా నయేయుః చ.

**ప్రతిపదార్థము** :- అథవా = లేక, యుధ్యమానస్య = యుద్ధము చేయుచున్న, విముఖస్య = ప్రక్కకు తిరిగియున్నట్టి, తే = నీయొక్క, (పృష్ఠాత్ = వీపునుండి, అహం = నేను) పతేయం = పడిపోవచ్చును, పాపరాక్షసాః = పాపాత్ములైన రక్కసులు, పతితాం = పడిపోయినట్టి, మాం = నన్ను, గృహీత్వా = పట్టుకొని, నయేయుః చ = తీసికొని పోవుదురు కూడను.

**తాత్పర్యము** :- ఆ జయించు మాట ఎట్లున్నను వారితో నీవు పోరాడుచు ప్రక్కకు తిరిగి యున్నప్పుడు నీ వీపుమీద నుండి నేను క్రిందికి పడిపోవుదును. అట్లు పడిపోవగనే పాపాత్ములైన రాక్షసులు వెంటనే నన్ను బంధించి తీసికొని పోవుదురు.

**శ్లో॥ మాం వా హరేయు స్త్వద్ధస్తా ద్విశసేయు రథాపి వా ।**
**అనవస్థౌ హి దృశ్యేతే యుద్ధే జయపరాజయౌ ॥ 55**

**పదచ్ఛేదము** :- మాం - వా - హరేయుః - త్వద్ధస్తాత్ - విశసేయుః - అథ - అపి - వా - అనవస్థౌ - హి - దృశ్యేతే - యుద్ధే - జయపరాజయౌ ॥

**అన్వయక్రమము** :- వా త్వద్ధస్తాత్ మాం హరేయుః, అథాపి వా, (మాం) విశసేయుః, యుద్ధే జయపరాజయౌ అనవస్థౌ దృశ్యేతే హి.

**ప్రతిపదార్థము** :- వా = లేక, త్వద్ధస్తాత్ = నీ చేతినుండి, మాం = నన్ను, హరేయుః = లాగికొనిపోవుదురు, అథాపి వా = మఱియును, (మాం = నన్ను) విశసేయుః = ఖండించెదరు, యుద్ధే = యుద్ధమునందు, జయపరాజయౌ = జయాపజయములు, అనవస్థౌ = అనిశ్చితములుగా, దృశ్యేతే హి = కాన్పించునుకదా!

**తాత్పర్యము** :- ఆ రక్కసులు నీ చేతినుండి నన్ను బలవంతముగా లాగికొనిపోయి వెంటనే ముక్కలుగా ఖండించి వేయవచ్చును. లోకమున యుద్ధమునందు జయాప జయములు నిశ్చయింపరానివిగదా!

**శ్లో॥ అహం వాపి విపద్యేయం రక్షోభిరభితర్జితా ।**
**త్వత్ప్రయత్నో హరిశ్రేష్ఠ భవే న్నిష్ఫల ఏవ తు ॥ 56**

**పదచ్ఛేదము :–** అహం – వా – అపి – విపద్యేయం – రక్షోభిః – అభితర్జితా – త్వత్ప్రయత్నః – హరిశ్రేష్ఠ – భవేత్ – నిష్ఫలః – ఏవ – తు ॥

**అన్వయక్రమము :–** అహం రక్షోభిః అభితర్జితా విపద్యేయం వా అపి, హరిశ్రేష్ఠ! తు త్వత్ప్రయత్నః నిష్ఫలః ఏవ భవేత్.

**ప్రతిపదార్థము :–** అహం = నేను, రక్షోభిః = రాక్షసులచే, అభితర్జితా = బెదిరింపబడిన దాననై, విపద్యేయం వా అపి = నశించిపోవుదును కూడ, హరిశ్రేష్ఠ = వానరశ్రేష్ఠుడా! తు = అప్పుడు, త్వత్ప్రయత్నః = నీ ప్రయత్నము, నిష్ఫలః ఏవ = వ్యర్థమైనదియే, భవేత్ = కాగలదు.

**తాత్పర్యము :–** నేను ఆ రాక్షసులచే బహువిధములుగ హింసింపబడినదాననై నాశము నొందవచ్చును గూడను. వానరోత్తమా! అప్పుడు నీ ప్రయాసమంతయును నిష్ఫలమే అయిపోవును గదా!

**శ్లో॥ కామం త్వ మసి పర్యాప్తో నిహంతుం సర్వరాక్షసాన్ ।**
**రాఘవస్య యశో హీయే త్త్వయా శస్తైస్తు రాక్షసైః ॥ 57**

**పదచ్ఛేదము :–** కామం – త్వమ్ – అసి – పర్యాప్తః – నిహంతుం – సర్వరాక్షసాన్ – రాఘవస్య – యశః – హీయేత్ – త్వయా – శస్తైః – తు – రాక్షసైః ॥

**అన్వయక్రమము :–** త్వం సర్వరాక్షసాన్ నిహంతుం కామం పర్యాప్తః, అపితు రాక్షసైః త్వయా శస్తైః (సద్భిః) రాఘవస్య యశః హీయేత్.

**ప్రతిపదార్థము :–** త్వం = నీవు, సర్వరాక్షసాన్ = సమస్తరాక్షసులను, నిహంతుం = పరిమార్చుటకు, కామం = కావలసినంతగా, పర్యాప్తః = తగియున్నావు, అపితు = కాని, రాక్షసైః = రాక్షసులు, త్వయా = నీచేత, శస్తైః (సద్భిః) = వధింపబడినవారుకాగా, రాఘవస్య = శ్రీరామునియొక్క, యశః = కీర్తి, హీయేత్ = క్షీణించును.

**తాత్పర్యము :–** ఈ రాక్షసుల నెల్లరను పరిమార్చుటకు నీ వెంతయును సమర్థుడవే యైయున్నావు గాని రాక్షసులు నీచేతనే వధింపబడినచో శ్రీరాముని కీర్తికి భంగము వాటిల్లునుగదా!

**శ్లో॥ అథవా ఉ_ఉ_దాయ రక్షాంసి న్యసేయు స్సంవృతే హి మామ్ ।**
**యత్ర తే నాభిజానీయు ర్హరయో నాపి రాఘవః ॥ 58**

**పదచ్ఛేదము :–** అథవా – ఆదాయ – రక్షాంసి – న్యసేయుః – సంవృతే – హి – మామ్ – యత్ర – తే – న – అభిజానీయుః – హరయః – న – అపి – రాఘవః ॥

**అన్వయక్రమము :–** అథవా రక్షాంసి మామ్ ఆదాయ యత్ర తే హరయః, రాఘవః అపి న అభిజానీయుః (తత్ర) సంవృతే న్యసేయుః.

**ప్రతిపదార్థము :–** అథవా = లేక, రక్షాంసి = రాక్షసులు, మాం = నన్ను, ఆదాయ = తీసికొని, యత్ర = ఎచ్చటనైతే, తే హరయః = ఆ వానరులును, రాఘవః అపి = శ్రీరాముడును గూడ, న అభిజానీయుః = గుర్తింపలేకుందురో, (తత్ర = అట్టి) సంవృతే = గూఢమైనట్టిచోట, న్యసేయుః = ఉంచెదరు.

**తాత్పర్యము :–** లేక రాక్షసులు నన్ను గొనిపోయి వానరులెవ్వరును గాని శ్రీరాముడుగాని కనిపెట్టజాలనట్టి అతి రహస్యమైన ప్రదేశమునందు నన్ను దాచి యుంచెదరు.

**శ్లో॥ ఆరంభస్తు మదర్థో ఉ_యం తత స్తవ నిరర్థకః ।**
**త్వయా హి సహ రామస్య మహా నాగమనే గుణః ॥ 59**

**పదచ్ఛేదము :–** ఆరంభః – తు – మదర్థః – అయం – తతః – తవ – నిరర్థకః – త్వయా – హి – సహ – రామస్య – మహాన్ – ఆగమనే – గుణః ॥

**అన్వయక్రమము :–** తతః మదర్థః అయం ఆరంభః నిరర్థకః (భవేత్) త్వయా సహ రామస్య ఆగమనే మహాన్ గుణః (స్యాత్) హి.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, మదర్థః = నాకొఱకైనట్టి, అయం = ఈ, తవ = నీయొక్క, ఆరంభః = ప్రయత్నము, నిరర్థకః = నిష్ఫలము, భవేత్ = అగును, త్వయా సహ = నీతోగూడ, రామస్య = రామునియొక్క, ఆగమనే = రాకలో, మహాన్ = గొప్పదైన, గుణః = మేలు, (స్యాత్) హి = (ఉండును) సుమా!

**తాత్పర్యము :–** నా కొఱకై నీవు పడిన శ్రమ అంతయును నిష్ఫలమై పోవునుగదా! అందుచేత నీతో గూడ శ్రీరాముడు లంకకు వచ్చుటలోనే ఎంతయో క్షేమ మున్నది.

**శ్లో॥ మయి జీవిత మాయత్తం రాఘవ స్యామితౌజసః ।**
**భ్రాతౄణాం చ మహాబాహో తవ రాజకులస్య చ ॥ 60**

**పదచ్ఛేదము :–** మయి – జీవితమ్ – ఆయత్తం – రాఘవస్య – అమితౌజసః –

భ్రాతౄణాం – చ – మహాబాహో – తవ – రాజకులస్య – చ ॥

**అన్వయక్రమము** :– మహాబాహో! అమితౌజసః రాఘవస్య భ్రాతౄణాం చ, తవ, రాజకులస్య చ జీవితం మయి ఆయత్తమ్.

**ప్రతిపదార్థము** :– మహాబాహో! = మహావీరుడా! అమితౌజసః = అమిత పరాక్రమము గలిగినట్టి, రాఘవస్య = శ్రీరాముని యొక్కయు, భ్రాతౄణాం చ = సోదరుల యొక్కయును, తవ = నీ యొక్కయు, రాజకులస్య చ = సుగ్రీవుని కుటుంబము యొక్కయు, జీవితం = జీవితము, మయి = నా యందు, ఆయత్తం = అధీనమైనది.

**తాత్పర్యము** :– ఓ మహావీరుడా! మహాపరాక్రమసంపన్నుడైన శ్రీరామునియొక్కయు ఆతని సోదరులయొక్కయు, నీ యొక్కయు సుగ్రీవుని వంశముయొక్కయు జీవితము లన్నియును నా క్షేమము మీదనే ఆధారపడి యున్నవిగదా!

**శ్లో॥ తౌ నిరాశౌ మదర్థం చ శోకసంతాపకర్శితౌ ।**
**సహసర్వర్క్ష హరిభి స్త్యక్ష్యతః ప్రాణసంగ్రహమ్ ॥ 61**

**పదచ్ఛేదము** :– తౌ – నిరాశౌ – మదర్థం – చ – శోకసంతాపకర్శితౌ – సహ – సర్వర్క్షహరిభిః – త్యక్ష్యతః – ప్రాణసంగ్రహమ్ ॥

**అన్వయక్రమము** :– మదర్థం శోకసంతాపకర్శితౌ తౌ నిరాశౌ (సతౌ) సర్వర్క్షహరిభిః సహ ప్రాణసంగ్రహం త్యక్ష్యతః.

**ప్రతిపదార్థము** :– మదర్థం = నా కొఱకు, శోకసంతాపకర్శితౌ = దుఃఖము చేతను పరితాపము చేతను పీడింపబడినట్టి, తౌ = వారిరువురును, నిరాశౌ సంతౌ = నిరాశ నొందినవారై, సర్వర్క్షహరిభిః సహ = సమస్తమైన భల్లూకములతోడను వానరులతోడను గూడ, ప్రాణసంగ్రహం = ప్రాణధారణమును, త్యక్ష్యతః = విడుతురు.

**తాత్పర్యము** :– నా నిమిత్తమైన దుఃఖముతోడను సంతాపముతోడను కృశించియున్నట్టి ఆ సోదరు లిరువురును నిరాశాపూరితులై తమ పరివారమునందలి సమస్త భల్లూకముల తోడను వానరులతోడను గూడ ప్రాణములను విడిచి పెట్టుదురు.

**శ్లో॥ భర్తృభక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర ।**
**నాహం స్ప్రష్టుం స్వతో గాత్రమిచ్ఛేయం వానరోత్తమ ॥ 62**

**పదచ్ఛేదము** :– భర్తృభక్తిం – పురస్కృత్య – రామాత్ – అన్యస్య – వానర – న – అహం – స్ప్రష్టుం – స్వతః – గాత్రమ్ – ఇచ్ఛేయం – వానరోత్తమ ॥

**అన్వయక్రమము** :- వానర! వానరోత్తమ! భర్తృభక్తిం పురస్కృత్య స్వతః అహం రామాత్ అన్యస్య గాత్రం స్ప్రష్టుం న ఇచ్ఛేయమ్.

**ప్రతిపదార్థము** :- వానర! వానరోత్తమ! = వానరోత్తముడైన ఓ హనుమా! భర్తృభక్తిం = నాథునియందలి భక్తిని, పురస్కృత్య = పురస్కరించుకొని, స్వతః = స్వయముగా, అహం = నేను, రామాత్ = శ్రీరామునికంటె, అన్యస్య = వేఱైనట్టి వానియొక్క, గాత్రం = శరీరమును, స్ప్రష్టుం = తాకుటకు, న ఇచ్ఛేయమ్ = ఇచ్ఛగించను.

**తాత్పర్యము** :- ఓ వానరోత్తమా! నా భర్తృభక్తిని అనుసరించి నాయంతటనేను ఎన్నడును రఘురాముని తప్ప వేఱెవ్వని శరీరమును స్పృశింపబోవను సుమా!

**శ్లో॥ య దహం గాత్రసంస్పర్శం రావణస్య గతా బలాత్ ।**
**అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ ॥ 63**

**పదచ్ఛేదము** :- యత్ - అహం - గాత్రసంస్పర్శం - రావణస్య - గతా - బలాత్ - అనీశా - కిం - కరిష్యామి - వినాథా - వివశా - సతీ ॥

**అన్వయక్రమము** :- బలాత్ యత్ రావణస్య గాత్రసంస్పర్శమ్ అహం గతా (తత్) అనీశా, వినాథా, వివశా (సతీ) కృతవతీ; కిం కరిష్యామి?

**ప్రతిపదార్థము** :- బలాత్ = బలవంతముగా, అహం = నేను, యత్ = ఏ, రావణస్య = రావణునియొక్క, గాత్రసంస్పర్శం = శరీరస్పర్శను, గతా = పొందియుంటినో, (తత్ = అది) అనీశా = అసమర్థురాలను, వినాథా = రక్షణ హీనురాలను, వివశా = చేష్టారహితురాలను, (సతీ = అగుచు, కృతవతీ = చేసితిని) కిం కరిష్యామి = ఏమి చేయగలను?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- అనీశా - స్త్రీ నై యుండుట చేత అసమర్థురాలను, వినాథా - దూరము నందుండి పోయిన రామలక్ష్మణులు గలదానను.

**వాసుదాసస్వామి** :- రామచంద్రమూర్తి యొక్కడే పురుషుడు, తక్కిన వారందరును స్త్రీలని యభిప్రాయము.

"స ఏవ వాసుదేవోఽయం సాక్షాత్పురుష ఉచ్యతే ।
స్త్రీప్రాయ మితరత్సర్వం జగద్బ్రహ్మపురస్సరమ్ ॥"

కావున జీవాత్మ భగవంతునితో సాయుజ్యము నొందిననే ఆనందము గలదు.

గాని బ్రహ్మాదులతో సాయుజ్యము గలిగిన మఱల జన్మింపవలసినదే, మఱల దుఃఖింపవలసినదే.

**తాత్పర్యము** :– ఆనాడు బలాత్కారము గావింపబడి మూర్ఛపోయి పరాధీననై యుండి రావణుని గాత్రస్పర్శను పొందిన మాట నిజమే, అత్తఱి నేను అసమర్థురాలను, రక్షణ హీనురాలను, చేష్టలను గోల్పోయియున్న దానను కాబట్టి అంతకంటె నేను ఆనాడు వేఱేమి చేయగలను?

**శ్లో॥ యది రామో దశగ్రీవ మిహ హత్వా సరాక్షసమ్ ।**
**మామితో గృహ్య గచ్ఛేత తత్తస్య సదృశం భవేత్ ॥ 64**

**పదచ్ఛేదము** :– యది – రామః – దశగ్రీవమ్ – ఇహ – హత్వా – సరాక్షసమ్, – మాం – ఇతః – గృహ్య – గచ్ఛేత – తత్ – తస్య – సదృశం – భవేత్ ॥

**అన్వయక్రమము** :– రామః ఇహ సరాక్షసం దశగ్రీవం హత్వా ఇతః మాం గృహ్య గచ్ఛేత యది తత్ తస్య సదృశం భవేత్.

**ప్రతిపదార్థము** :– రామః = శ్రీరాముడు, ఇహ = ఇచ్చట, సరాక్షసం = రాక్షసులతో గూడినట్టి, దశగ్రీవం = దశకంఠుని, హత్వా = పరిమార్చి, ఇతః = ఇటనుండి, మాం = నన్ను, గృహ్య = తీసికొని, గచ్ఛేత యది = వెళ్ళినయెడల, తత్ = అది, తస్య = అతనికి, సదృశం = యుక్తమైనది, భవేత్ = కాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– "తత్ సదృశం భవేత్" – రాక్షసు లందఱితోడను కలిపి రావణుని నిర్మూలించి తనను గొనిపోవుట జరిగినప్పుడే శ్రీరాముని అవతారప్రయోజనము నెఱవేఱినట్లగును గదా! అట్లుగాక సీతమ్మయే రామునివద్దకు ఎట్లో చేరినచో తాను పూనిన కార్యము నెఱవేఱనందుకు ఆతనికి కోపముగూడ గలుగవచ్చునని భావము.

**వాసుదాసస్వామి** :– ఇందు ఆత్మనిక్షేపము, పారతంత్ర్యము స్పష్టముగా చెప్పబడెను. ప్రపన్నుడు భగవత్ప్రాప్తికి ఉపాయముగా భక్తియోగము, కర్మయోగము, జ్ఞానయోగము మున్నగు సాధనములను దేనిని ఆశింపక భగవత్ప్రాప్తికి భగవంతుడే సాధనము, ఆయనయే వచ్చి నన్ను తీసికొని పోవలెనని కోరును. వానికి భగవంతుని –

"అహం స్మరామి మద్భక్తం; నయామి పరమాం గతిమ్"
'అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి'
'అభయం సర్వభూతేభ్యో దదామి"

యను వాక్యములే యూతకోలలు, భగవంతుని తప్ప వేఱొకదేవత నాశ్రయించిన ప్రపత్తి చెడును, ఫలింపదు. పారతంత్ర్యము వదలిన ప్రపన్నుని భగవంతుడు స్వీకరింపడు. కావున ప్రపన్నులన్నివిధముల అనన్యులై యుండవలెను.

**తాత్పర్యము :–** రాక్షసబలములతో సహితముగా రావణుని నిర్మూలించి శ్రీరాముడు నన్ను లంకనుండి గొనిపోయినప్పుడే ఆతని ఘనతకు తగినట్లుగా తన కర్తవ్యము నెఱవేర్చినట్లగును.

**శ్లో॥ శ్రుతాశ్చ దృష్టా హి మయా పరాక్రమా**
**మహాత్మన స్తస్య రణావమర్దినః ।**
**న దేవగంధర్వభుజంగరాక్షసా**
**భవంతి రామేణ సమా హి సంయుగే ॥ 65**

**పదచ్ఛేదము :–** శ్రుతాః – చ – దృష్టాః – హి – మయా – పరాక్రమాః – మహాత్మనః – తస్య – రణావమర్దినః – న – దేవగంధర్వభుజంగరాక్షసాః – భవంతి – రామేణ – సమాః – హి – సంయుగే ॥

**అన్వయక్రమము :–** మయా రణావమర్దినః తస్య మహాత్మనః పరాక్రమాః శ్రుతాః చ, దృష్టా హి; సంయుగే రామేణ దేవగంధర్వభుజంగరాక్షసాః సమాః న భవంతి హి.

**ప్రతిపదార్థము :–** మయా = నాచేత, రణావమర్దినః = యుద్ధమునందు శత్రువులను హతమార్చునట్టి, తస్య మహాత్మనః = ఆ మహాత్మునియొక్క, పరాక్రమాః = పరాక్రమములు, శ్రుతాః చ = వినబడినవి గూడను, దృష్టాః హి = చూడబడినవి కూడను గదా! రామేణ = శ్రీరామునితో, సంయుగే = యుద్ధమునందు, దేవగంధర్వ భుజంగరాక్షసాః = దేవతలును, గంధర్వులును, నాగులును, రాక్షసులును, సమాః = సరియగువారు, న భవంతి హి = కాజాలరు గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** శ్రుతాః చ = విశ్వామిత్ర యాగరక్షణము వాలివధ మున్నగు రఘురాముని పరాక్రమములు వినబడినవి. దృష్టాః = ఖరదూషణాది సంహారము మున్నగు పరాక్రమములు స్వయముగా చూడబడినవి.

**వాసుదాసస్వామి :–** భక్తునకు ప్రపన్నునకు భగవంతుడు తన పాలిట గలడనుటకు అనేక నిదర్శనము లనుభవమున తెలియుచుండును. బాలకాండమున బ్రహ్మ రుద్రేంద్రాదుల శరణాగతి, యుద్ధకాండమున బ్రహ్మాదుల స్తుతి మున్నగునవి

యన్నియును భగవంతుడగు శ్రీరామచంద్రమూర్తియే తక్కిన యందఱి దేవతలకంటె గొప్పవాడని స్థాపించుచున్నవి.

**తాత్పర్యము** :- యుద్ధమునందు శత్రుభీకరుడైయుండు ఆ మహాత్ముని పరాక్రమ విశేషము లెన్నియో నేను విని యుంటిని; ఇక ఎన్నియో నేను కన్నులారా జూచి యుంటిని; యుద్ధమున దేవతలందును గంధర్వులందును, నాగులందును రాక్షసులందును ఎందును రామునితో సాటివచ్చు వీరులుండరు సుమా!

**శ్లో॥ సమీక్ష్య తం సంయతి చిత్రకార్ముకం**
**మహాబలం వాసవతుల్యవిక్రమమ్ ।**
**సలక్ష్మణం కో విషహేత రాఘవం**
**హుతాశనం దీప్తమివానిలేరితమ్ ॥ 66**

**పదచ్ఛేదము** :- సమీక్ష్య - తం - సంయతి - చిత్రకార్ముకం - మహాబలం - వాసవతుల్యవిక్రమమ్ - సలక్ష్మణం - కః - విషహేత - రాఘవం - హుతాశనం - దీప్తమ్ - ఇవ - అనిలేరితమ్ ॥

**అన్వయక్రమము** :- సంయతి చిత్రకార్ముకం మహాబలం వాసవతుల్యవిక్రమం అనిలేరితం దీప్తం హుతాశనమ్ ఇవ (స్థితం) సలక్ష్మణం రాఘవం సమీక్ష్య కః విషహేత?

**ప్రతిపదార్థము** :- సంయతి = యుద్ధమునందు, చిత్రకార్ముకం = బహువిధవర్ణములతో ప్రకాశించు ధనుస్సు గలవాడును, మహాబలం = మహాబలాఢ్యుడును, వాసవతుల్య విక్రమం = దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గలవాడును, అనిలేరితం = వాయువుచే రగుల్కొల్పబడిన, దీప్తం = ప్రజ్వలించిన, హుతాశనమ్ ఇవ = అగ్నివలె, స్థితం = ఉన్నవాడునగు, సలక్ష్మణం = లక్ష్మణునితో గూడినట్టి, రాఘవం = శ్రీరాముని, సమీక్ష్య = చూచి, కః = ఎవ్వడు, విషహేత = సహింపగలడు?

**తాత్పర్యము** :- రణాంగణమునందు పలువన్నెలతో వెలయు విల్లు ధరించి దేవేంద్రునితో సమానమైన పరాక్రమమును ప్రదర్శించుచు వాయువుచే ప్రజ్వలించుచున్న అగ్ని దేవునివలె భీకరుడైన లక్ష్మణుడు వెంటనుండగా ఆ శ్రీరాముని ఎదుటనిలచి చూచుటకు గూడ ఎవ్వరికైన శక్యమగునా!

**శ్లో॥ సలక్ష్మణం రాఘవ మాజిమర్దనం**
**దిశాగజం మత్తమివ వ్యవస్థితమ్ ।**
**సహేత కో వానరముఖ్య సంయుగే**
**యుగాంతసూర్యప్రతిమం శరార్చిషమ్ ॥ 67**

**పదచ్ఛేదము :-** సలక్ష్మణం - రాఘవమ్ - ఆజిమర్దనం - దిశాగజం - మత్తమ్ - ఇవ - వ్యవస్థితమ్, - సహేత - కః - వానరముఖ్య - సంయుగే - యుగాంత సూర్యప్రతిమం - శరార్చిషమ్ ॥

**అన్వయక్రమము :-** వానరముఖ్య! సంయుగే మత్తం దిశాగజమ్ ఇవ వ్యవస్థితం, యుగాంతసూర్యప్రతిమం, శరార్చిషమ్, ఆజిమర్దనం, సలక్ష్మణం రాఘవం కః సహేత?

**ప్రతిపదార్థము :-** వానరముఖ్య = వానరశ్రేష్ఠుడా! సంయుగే = యుద్ధమునందు, మత్తం = మదించినట్టి, దిశాగజమ్ ఇవ = దిగ్గజమువలె, వ్యవస్థితం = నిలచియున్న వాడును, శరార్చిషం = బాణములనెడి జ్వాలలు కలిగినట్టి వాడును, యుగాంత సూర్య ప్రతిమం = ప్రళయకాల సూర్యునితో సమానుడును, ఆజిమర్దనం = యుద్ధమున శత్రువులను హతమార్చువాడును అగు, సలక్ష్మణం = లక్ష్మణునితో గూడియుండు, రాఘవం = శ్రీరాముని, కః = ఎవ్వడు, సహేత = ఓర్వగలడు?

**తాత్పర్యము :-** వానరశ్రేష్ఠుడా! యుద్ధభూమియందు మదించిన ఏనుగువలె నిలచి తన బాణజ్వాలలతో ప్రళయకాల సూర్యునివలె భయము గొల్పుచు, శత్రువులను లెక్కలేకుండ పరిమార్చుచు, మహావీరుడైన లక్ష్మణుని వెంటబెట్టుకొనియున్న ఆ శ్రీరాముని ఎదిరించుటకు ఎవనికి శక్తి యున్నది?

**శ్లో॥ స మే కపిశ్రేష్ఠ సలక్ష్మణం ప్రియం**
**సయూథపం క్షిప్రమి హోపపాదయ ।**
**చిరాయ రామం ప్రతి శోకకర్శితాం**
**కురుష్వ మాం వానరవీర హర్షితామ్ ॥ 68**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సీతాప్రత్యానయనానౌచిత్యం" నామ*
*సప్తత్రింశస్సర్గః*

**పదచ్ఛేదము** :– సః – మే – కపిశ్రేష్ఠ – సలక్ష్మణం – ప్రియం – సయూథపం – క్షిప్రమ్ – ఇహ – ఉపపాదయ, చిరాయ – రామం – ప్రతి – శోకకర్శితాం – కురుష్వ – మాం – వానరవీర – హర్షితామ్ ॥

**అన్వయక్రమము** :– కపిశ్రేష్ఠ! సః (త్వం) సయూథపం సలక్ష్మణం మే ప్రియం క్షిప్రం ఇహ ఉపపాదయ; వానరవీర! చిరాయ రామం ప్రతి శోకకర్శితాం మాం హర్షితాం కురుష్వ.

**ప్రతిపదార్థము** :– కపిశ్రేష్ఠ! = వానరోత్తమా! సః (త్వం) = అట్టి నీవు, సయూథపం = సేనాధిపతులతోడను, సలక్ష్మణం = లక్ష్మణునితోడను, మే ప్రియం = నా నాథుని, క్షిప్రం = శీఘ్రముగా, ఇహ = ఇటకు, ఉపపాదయ = రప్పింపుము. వానరవీర! = వానరయోధుడా! చిరాయ = చిరకాలము, రామం ప్రతి = శ్రీరాముని గూర్చి, శోకకర్శితాం = దుఃఖగ్రస్తురాలనైనట్టి, మాం = నన్ను, హర్షితాం = సంతోషము నొందినదానినిగా, కురుష్వ = చేయుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'రామమ్ ఉపపాదయ' శోకకర్శితాం హర్షితాం కురుష్వ – శోకకర్శితులకు రామసాన్నిధ్యమే హర్షప్రాప్తి సాధనమగును అని ఇట సూచింపబడినది.

**వాసుదాసస్వామి** :– జీవాత్మ పరమాత్మలకు నడిమివా డాచార్యుడు. ఆచార్యుని మూలమున భగవత్ప్రాప్తి సుకరము, ఇది భక్త ప్రపన్నుల చర్య. లక్ష్మణశబ్దము నిత్యశూరులకును సుగ్రీవశబ్దము ముక్తులకు నుపలక్షణము. భగవంతుని వెదకుచు నేను పోలేను, ఆయనయే ఇచటికి వచ్చునట్లు చేయుమని శిష్యుడు గురువును ప్రార్థించవలెను.

**తాత్పర్యము** :– వానరశ్రేష్ఠుడా! నీవు వెంటనే సుగ్రీవాది వానరవీరులతోడను లక్ష్మణుని తోడను కూడియున్న నా ప్రియుని ఇటకు గొనిరమ్ము. చిరకాలము రాముని ఎడబాటుచే శోకకర్శితురాలనై యున్న నాకు ఆనందమును కూర్పుము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతాప్రత్యానయనానౌచిత్యము" అను*
*ముప్పదియేడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

★★★

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# అష్టత్రింశసర్గ

**శ్లో॥ తత స్స కపిశార్దూల స్తేన వాక్యేన తోషితః ।**
**సీతా మువాచ త చ్ఛ్రుత్వా వాక్యం వాక్యవిశారదః ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – సః – కపిశార్దూలః – తేన – వాక్యేన – తోషితః – సీతామ్ – ఉవాచ – తత్ – శ్రుత్వా – వాక్యం – వాక్యవిశారదః ॥

**అన్వయక్రమము :–** తత్ శ్రుత్వా తేన వాక్యేన తోషితః, వాక్యవిశారదః, సః కపిశార్దూలః తతః సీతాం వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** తత్ శ్రుత్వా = అది విని, తేన వాక్యేన = ఆ వచనముచే, తోషితః = సంతోషము కల్గింపబడినవాడై, వాక్యవిశారదః = వాక్పాటవము గల్గినట్టి, సః కపిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, తతః = అటుపిమ్మట, సీతాం = సీతనుగూర్చి, వాక్యమ్ ఉవాచ = ఈ మాటను పలికెను.

**తాత్పర్యము :–** సీతాదేవి పలికిన మాటలు విని ఆ మాటలకు మిక్కిలి ఆనందించి యుక్తముగా మాటలాడుటయందు ప్రజ్ఞ గలిగిన హనుమ ఆమెను గూర్చి ఇట్లు పలికెను.

**శ్లో॥ యుక్తరూపం త్వయా దేవి భాషితం శుభదర్శనే ।**
**సదృశం స్త్రీస్వభావస్య సాధ్వీనాం వినయస్య చ ॥ 2**

**పదచ్ఛేదము :–** యుక్తరూపం – త్వయా – దేవి – భాషితం – శుభదర్శనే – సదృశం – స్త్రీస్వభావస్య – సాధ్వీనాం – వినయస్య – చ ॥

**అన్వయక్రమము :–** శుభదర్శనే! త్వయా స్త్రీస్వభావస్య, సాధ్వీనాం వినయస్య చ సదృశం, యుక్తరూపం భాషితమ్.

**ప్రతిపదార్థము :–** శుభదర్శనే = మంగళకరమైన దర్శనము గల్గినట్టి, దేవి! = ఓ పూజ్యురాలా! త్వయా = నీచేత, స్త్రీస్వభావస్య = స్త్రీలస్వభావమునకు, సాధ్వీనాం = పతివ్రతలయొక్క, వినయస్య చ = వినయమునకును, సదృశం = సరిగా, యుక్తరూపం

= తగినట్లుగా, భాషితమ్ = పలుకబడినది.

**తాత్పర్యము :–** మంగళప్రదమైన దర్శనముగల ఓ పూజ్యురాలా! భీరుస్వభావులైన స్త్రీలకును పాతివ్రత్యశోభితులైన వినయవతులకును తగినట్లుగా నీవు మాటలాడితివి సుమా!

**శ్లో॥ స్త్రీత్వా న్న త్వం సమర్థాఽసి సాగరం వ్యతివర్తితుమ్ ।**
**మా మధిష్ఠాయ విస్తీర్ణం శతయోజన మాయతమ్ ॥ 3**

**పదచ్ఛేదము :–** స్త్రీత్వాత్ – న – త్వం – సమర్థా – అసి – సాగరం – వ్యతివర్తితుం – మామ్ – అధిష్ఠాయ – విస్తీర్ణం – శతయోజనమ్ – ఆయతమ్ ॥

**అన్వయక్రమము :–** మామ్ అధిష్ఠాయ శతయోజనమ్ ఆయతం విస్తీర్ణం సాగరం వ్యతివర్తితుం స్త్రీత్వాత్ త్వం సమర్థా న అసి.

**ప్రతిపదార్థము :–** మాం = నన్ను, అధిష్ఠాయ = అధిరోహించి, శతయోజనమ్ = నూఱామడల, ఆయతం = పొడవైనట్టి, విస్తీర్ణం = విశాలమైనట్టి, సాగరం = సముద్రమును, వ్యతివర్తితుం = దాటుటకు, స్త్రీత్వాత్ = ఆడుదానివగుట వలన, త్వం = నీవు, సమర్థా = శక్తురాలవు, న అసి = కావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'స్త్రీత్వం న తు సమర్థం హి' అని పాఠాంతరము. సముద్రము వలెనే మిక్కిలి విశాలమైయుండు నన్ను అధిరోహించికూడ సముద్రము దాటుటకు స్త్రీసహజమైన నీ భయమును నీవు దాటలేకున్నావని భావము.

**తాత్పర్యము :–** స్త్రీవి కాబట్టి నూఱామడల విస్తీర్ణమైన మహాసముద్రమును నా వీపుమీద కూర్చుండి దాటుటకు నీవు భయపడుచున్నావు.

**శ్లో॥ ద్వితీయం కారణం యచ్చ బ్రవీషి వినయాన్వితే ।**
**రామా దన్యస్య నార్హామి సంస్పర్శ మితి జానకి ॥ 4**

**ఏత త్తే దేవి సదృశం పత్న్యా స్తస్య మహాత్మనః ।**
**కా హ్యన్యా త్వామృతే దేవి బ్రూయా ద్వచన మీదృశమ్ ॥ 5**

**పదచ్ఛేదము :–** ద్వితీయం – కారణం – యత్ – చ – బ్రవీషి – వినయాన్వితే – రామాత్ – అన్యస్య – న – అర్హామి – సంస్పర్శమ్ – ఇతి – జానకి – ఏతత్ – తే – దేవి – సదృశం – పత్న్యాః – తస్య – మహాత్మనః – కా – హి – అన్యా – త్వామ్

- ఋతే - దేవి - బ్రూయాత్ - వచనమ్ - ఈదృశమ్ ॥

**అన్వయక్రమము** :- వినయాన్వితే, దేవి! జానకి! రామాత్, అన్యస్య సంస్పర్శం న అర్హామి ఇతి ద్వితీయం యత్ కారణం బ్రవీషి ఏతత్ మహాత్మనః తస్య పత్న్యాః తే సదృశమ్; దేవి! ఈదృశం వచనం త్వామ్ ఋతే అన్యా కా బ్రూయాత్ హి?

**ప్రతిపదార్థము** :- వినయాన్వితే = వినయ సంపన్నురాలవైనట్టి, దేవి! = పూజ్యురాలవైన, జానకి! = ఓ సీతా, రామాత్ = రామునికంటె, అన్యస్య = వేఱైనవానియొక్క, సంస్పర్శం = స్పర్శను, న అర్హామి = పొందదగను, ఇతి = అని, ద్వితీయం = రెండవదియైన, యత్ = ఏ, కారణం = కారణమును, బ్రవీషి = పలుకుచున్నావో, ఏతత్ = ఇది, మహాత్మనః = మహనీయుడైనట్టి, తస్య = ఆ శ్రీరామునకు, పత్న్యాః = భార్యవైనట్టి, తే = నీకు, సదృశం = తగియున్నది, దేవి! = ఓ పూజ్యురాలా!, ఈదృశం = ఈ విధమైన, వచనం = మాటను, త్వాం = నిన్ను, ఋతే = తప్పించి, అన్యా = వేఱైన, కా = ఏ స్త్రీ, బ్రూయాత్ హి = పలుకగలదు?

**తాత్పర్యము** :- వినయభూషణురాలవైన ఓ జానకీదేవీ, రామునితప్ప వేఱెవ్వరిని నేను తాకననెడి ఏ రెండవ కారణము నీవు చెప్పుచున్నావో అట్టి వచనము మహాత్ముడైన ఆ శ్రీరామునకు ధర్మపత్నివైన నీ కెంతయు ఉచితమై యున్నది. తల్లీ! ఇట్టి మాటను నీవు తప్ప వేఱెవ్వరు పలుకగలరు?

**శ్లో॥ శ్రోష్యతే చైవ కాకుత్థ్సః సర్వం నిరవశేషతః ।**
**చేష్టితం యత్త్వయా దేవి భాషితం చ మమాగ్రతః ॥ 6**

**పదచ్ఛేదము** :- శ్రోష్యతే - చ - ఏవ - కాకుత్థ్సః - సర్వం - నిరవశేషతః - చేష్టితం - యత్ - త్వయా - దేవి - భాషితం - చ - మమ - అగ్రతః ॥

**అన్వయక్రమము** :- దేవి! మమ అగ్రతః త్వయా యత్ చేష్టితం (యత్) భాషితం చ (తత్) సర్వం నిరవశేషతః కాకుత్థ్సః (మత్తః) శ్రోష్యతే.

**ప్రతిపదార్థము** :- దేవి! = ఓ పూజ్యురాలా! మమ = నా యొక్క, అగ్రతః = ఎదుట, త్వయా = నీచేత, యత్ = ఏది, చేష్టితం = ఆచరింపబడినదో, (యత్) = (ఏది), భాషితం చ = పలుకబడినదో, (తత్) = (అది), సర్వం = అంతయును, నిరవశేషతః = సంపూర్ణముగా, కాకుత్థ్సః = శ్రీరాముడు, మత్తః = నావలన, శ్రోష్యతే = వినగలడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'త్వయా చేష్టితం - ఉరిపోసికొనుట మున్నగు కృత్యములను.

భాషితం - రావణుని తృణీకరించి పలికిన మాటలను అని భావము.

**తాత్పర్యము :-** దేవి! దుఃఖగ్రస్తురాలవై నీవు చేసిన చేష్టలను, రావణునితో నిర్భయముగ నీవు పలికిన మాటలను, నాతో చెప్పిన వచనములను అన్నింటిని సంపూర్ణముగా నేను శ్రీరామునకు విన్నవించెదను.

**శ్లో॥ కారణై ర్బహుభి ర్దేవి రామప్రియచికీర్షయా ।**
**స్నేహప్రస్కన్నమనసా మ యైత త్సముదీరితమ్ ॥ 7**

**పదచ్ఛేదము :-** కారణైః - బహుభిః - దేవి - రామప్రియచికీర్షయా - స్నేహప్రస్కన్న మనసా - మయా - ఏతత్ - సముదీరితమ్ ॥

**అన్వయక్రమము :-** దేవి! రామప్రియచికీర్షయా బహుభిః కారణైః ఏతత్ స్నేహప్రస్కన్న మనసా మయా సముదీరితమ్.

**ప్రతిపదార్థము :-** దేవి! = ఓ పూజ్యురాలా! రామప్రియచికీర్షయా = రామునకు ప్రియమును చేయవలెనను ఇచ్ఛతోడను, బహుభిః కారణైః = పెక్కుహేతువులచేతను, ఏతత్ = ఈ మాట, స్నేహప్రస్కన్నమనసా = స్నేహముచే ద్రవించిన హృదయము గల్గినట్టి, మయా = నాచేత, సముదీరితమ్ = పలుకబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :-** బహభిః కారణైః - నీ యొక్క దుఃఖస్థితిని చూచుట మున్నగు కారణములచే.

**తాత్పర్యము :-** తల్లీ! నీ దుఃఖస్థితి చూచుట మున్నగు పెక్కు కారణముల చేతను, శ్రీరామునకు ప్రియమును గూర్చు కోరికతోడను, మీ యుభయులపై గల స్నేహ గౌరవముచే నా మనస్సు ద్రవించి యిట్లు పలికితిని.

**శ్లో॥ లంకాయా దుష్ప్రవేశత్వా ద్దుస్తరత్వా న్మహోదధేః ।**
**సామర్థ్యా దాత్మనశ్చైవ మ యైత త్సముదీరితమ్ ॥ 8**

**పదచ్ఛేదము :-** లంకాయాః - దుష్ప్రవేశత్వాత్ - దుస్తరత్వాత్ - మహోదధేః - సామర్థ్యాత్ - ఆత్మనః - చ - ఏవ - మయా - ఏతత్ - సముదీరితమ్ ॥

**అన్వయక్రమము :-** లంకాయాః దుష్ప్రవేశత్వాత్, మహోదధేః దుస్తరత్వాత్, ఆత్మనః సామర్థ్యాత్ చ ఏవ ఏతత్ మయా సముదీరితమ్.

**ప్రతిపదార్థము :-** లంకాయాః = లంకానగరము, దుష్ప్రవేశత్వాత్ = ప్రవేశించుటకు కష్టమైన దగుట వలనను, మహోదధేః = మహాసముద్రము, దుస్తరత్వాత్ = దాటుటకు కష్టమైనదగుట వలనను, ఆత్మనః = నాయొక్క, సామర్థ్యాత్ చ ఏవ = ప్రజ్ఞవలనను మాత్రమే, ఏతత్ = ఈ మాట, మయా = నాచేత, సముదీరితమ్ = పలుకబడినది.

**తాత్పర్యము :-** ఈ లంకాపట్టణము సామాన్యులకు ప్రవేశింపరానిదగుటచేతను, ఈ మహాసముద్రము ఎల్లరకును దాటరానిదగుటచేతను నేనీ దుర్ఘటకార్యమును చేయగల సమర్థుడనై యుండుటచేతను మాత్రమే ఈ విధముగ పలికితినిగాని మఱేమియుగాదు సుమా!

**శ్లో॥ ఇచ్ఛామి త్వాం సమానేతు మద్యైవ రఘునందినా ।**
**గురుస్నేహేన భక్త్యా చ నాన్యథైత దుదాహృతమ్ ॥ 9**

**పదచ్ఛేదము :-** ఇచ్ఛామి - త్వాం - సమానేతుమ్ - అద్య - ఏవ - రఘునందినా - గురుస్నేహేన - భక్త్యా - చ - న - అన్యథా - ఏతత్ - ఉదాహృతమ్ ॥

**అన్వయక్రమము :-** రఘునందినా త్వాం అద్య ఏవ సమానేతుం ఇచ్ఛామి; గురుస్నేహేన భక్త్యా చ ఏతత్ ఉదాహృతమ్; అన్యథా న.

**ప్రతిపదార్థము :-** రఘునందినా = రఘునందనుడైన శ్రీరామునితో, త్వాం = నిన్ను, అద్య ఏవ = నేడే, సమానేతుం = చేర్చుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, గురుస్నేహేన = గొప్పదైన అనురాగముచేతను, భక్త్యా చ = భక్తిచేతను, ఏతత్ = ఇది, ఉదాహృతమ్ = చెప్పబడినది, అన్యథా = వేఱు విధముగా, న = కాదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** 'గురుస్నేహేన' - శ్రీరామునియందలి స్నేహముచే, అన్యథా న - నా బలమునందలి గర్వముచేత నేనిట్లు పలుకలేదని భావము.

**తాత్పర్యము :-** తల్లీ! ఆ రఘునందనునితో నిన్ను ఈనాడే చేర్చవలెనను తీవ్రమైన వాంఛ గలవాడనై రామునియందలి అనురాగముచేతను, భక్తివిశేషముచేతను మాత్రమే ఇట్లు పలికితిని; అంతకన్న వేఱు భావము ఏమియు నాకు లేదు సుమా!

**శ్లో॥ యది నోత్సహసే యాతుం మయా సార్ధ మనిందితే ।**
**అభిజ్ఞానం ప్రయచ్ఛ త్వం జానీయా ద్రాఘవో హి యత్ ॥ 10**

**పదచ్ఛేదము :-** యది - న - ఉత్సాహసే - యాతుం - మయా - సార్ధమ్ -

అనిందితే, – అభిజ్ఞానం – ప్రయచ్ఛ – త్వం – జానీయాత్ – రాఘవః – హి – యత్ ॥

**అన్వయక్రమము** :– అనిందితే! మయా సార్ధం యాతుం న ఉత్సహసే యది, రాఘవః యత్ జానీయాత్ (తత్) అభిజ్ఞానం త్వం (మే) ప్రయచ్ఛ.

**ప్రతిపదార్థము** :– అనిందితే! = అనింద్య చరిత్రురాలవైన జానకీ! మయా సార్ధం = నాతో గూడ, యాతుం = పయనించుటకు, న ఉత్సహసే యది = ఇచ్ఛగింపని యెడల, రాఘవః = శ్రీరాముడు, యత్ = దేనినయితే, జానీయాత్ = తెలిసికొనగలడో, తత్ = ఆ, అభిజ్ఞానం = గుర్తును, త్వం = నీవు, మే = నాకు, ప్రయచ్ఛ = ఇమ్ము.

**తాత్పర్యము** :– ఓ పూజ్యురాలా, నా వెంబడి వచ్చుటకు నీ విష్టపడనియెడల శ్రీరాముడు చక్కగా గ్రహింపగలిగినట్టి గుర్తు నొకదానిని నా కొసగుము.

**శ్లో॥ ఏవ ముక్తా హనుమతా సీతా సురసుతోపమా ।**
**ఉవాచ వచనం మందం బాష్పప్రగ్రథితాక్షరమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– ఏవమ్ – ఉక్తా – హనుమతా – సీతా – సురసుతోపమా – ఉవాచ – వచనం – మందం – బాష్పప్రగ్రథితాక్షరమ్ ॥

**అన్వయక్రమము** :– హనుమతా ఏవమ్ ఉక్తా సురసుతోపమా సీతా మందం బాష్పప్రగ్రథితాక్షరం వచనమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :– హనుమతా = హనుమచే, ఏవం = ఇట్లు, ఉక్తా = పలుకబడినట్టి, సురసుతోపమా = దేవకన్యలతో సాటియైనట్టి, సీతా = జానకి, మందం = నెమ్మదిగా, బాష్పప్రగ్రథితాక్షరం = కన్నీటిచే తొట్రుపడిన అక్షరములుగల, వచనం = మాటను, మందం = మెల్లగా, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :– హనుమంతు డిట్లు పలుకగనే దేవకన్యలను బోలిన శుభలక్షణములు గలిగిన సీతాదేవి కన్నీటితో డగ్గుత్తిక పడిన కంఠముతో మెల్లగా ఇట్లు పలికెను.

**శ్లో॥ ఇదం శ్రేష్ఠ మభిజ్ఞానం బ్రూయా స్త్వం తు మమ ప్రియమ్ ।**
**శైలస్య చిత్రకూటస్య పాదే పూర్వోత్తరే పురా ॥ 12**

**శ్లో॥ తాపసాశ్రమవాసిన్యాః ప్రాజ్యమూలఫలోదకే ।**
**తస్మిన్ సిద్ధాశ్రితే దేశే మందాకిన్యా హ్యదూరతః ॥ 13**

**పదచ్ఛేదము** :– ఇదం – శ్రేష్ఠమ్ – అభిజ్ఞానం – బ్రూయాః – త్వం – తు – మమ

- ప్రియమ్ - శైలస్య - చిత్రకూటస్య - పాదే - పూర్వోత్తరే - పురా - తాపసాశ్రమవాసిన్యాః - ప్రాజ్యమూలఫలోదకే - తస్మిన్ - సిద్ధాశ్రితే - దేశే - మందాకిన్యాః - హి - అదూరతః ॥

**అన్వయక్రమము** :- పురా చిత్రకూటస్య శైలస్య పాదే, పూర్వోత్తరే, మందాకిన్యాః అదూరతః, ప్రాజ్యమూలఫలోదకే, తస్మిన్ సిద్ధాశ్రితే దేశే మమ తాపసాశ్రమవాసిన్యాః (సత్యాః) (మే) ప్రియం శ్రేష్ఠమ్ ఇదమ్ అభిజ్ఞానం త్వం బ్రూయాః.

**ప్రతిపదార్థము** :- పురా = పూర్వము, చిత్రకూటస్య = చిత్రకూట మనెడి, శైలస్య = పర్వతముయొక్క, పాదే = దిగువప్రదేశమున, పూర్వోత్త రే = ఈశాన్యమున, మందాకిన్యాః = మందాకినీనదికి, అదూరతః = సమీపమున, ప్రాజ్యమూలఫలోదకే = సమృద్ధమైన మూలములును, ఫలములును, జలములును గలిగినట్టి, తస్మిన్ = సుప్రసిద్ధమైన, సిద్ధాశ్రితే = సిద్ధులచే ఆశ్రయింపబడినట్టి, దేశే = ప్రదేశమున, మమ = నేను, తాపసాశ్రమవాసిన్యాః (సత్యాః) = తాపసాశ్రమమునందు నివసించుచున్న దాన నగుచుండగా, మే = నాకు, ప్రియం = ప్రియమైనట్టి, శ్రేష్ఠం = గొప్పదైనట్టి, ఇదమ్ = ఈ, అభిజ్ఞానం = గుర్తును, త్వం = నీవు, బ్రూయాః = చెప్పుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- శ్రేష్ఠమ్ అభిజ్ఞానం - ఇతరులెవ్వరికిని తెలియనందువలన శ్రీరామునికి నమ్మకము కలిగించుటలో శ్రేష్ఠమైనదని భావము.

**గోవిందరాజీయము** :- ప్రియం బ్రూయాః - నా ప్రియుడైన రఘురాముని గూర్చి పలుకుము.

**తాత్పర్యము** :- పూర్వము చిత్రకూటపర్వతమునకు దిగువ ప్రదేశమున, ఈశాన్య దిక్కుగా ప్రవహించుచున్న మందాకినీనదికి సమీపమున పుష్కలమైన కందమూల ఫలములు, నీరు గలిగి సిద్ధపురుషులకు నిలయమైన ఆ పుణ్యభూమియందున్న తాపసాశ్రమమునందు నేను వసించుచుండగా జరిగినట్టి శ్రేష్ఠమైన ఈ గుర్తును నీవు నా ప్రియుడైన శ్రీరామునకు తెలుపుము.

**శ్లో॥ త స్యోపవనషండేషు నానాపుష్పసుగంధిషు ।**
**విహృత్య సలిలక్లిన్నా తవాంకే సముపావిశమ్ ॥ 14**

**పదచ్ఛేదము** :- తస్య - ఉపవనషండేషు - నానాపుష్పసుగంధిషు - విహృత్య - సలిలక్లిన్నా - తవ - అంకే - సముపావిశమ్ ॥

**అన్వయక్రమము :–** నానాపుష్పసుగంధిషు తస్య ఉపవనషండేషు విహృత్య సలిలక్లిన్నా (అహం) తవ అంకే సముపావిశమ్.

**ప్రతిపదార్థము :–** నానాపుష్పసుగంధిషు = బహువిధపుష్పములయొక్క పరిమళములు గలిగినట్టి, తస్య = ఆ యాశ్రమముయొక్క, ఉపవనషండేషు = తోటలసమూహము లందు, విహృత్య = విహరించి, సలిలక్లిన్నా = నీటిచే తడిసినదాననై, అహం = నేను, తవ = నీయొక్క, అంకే = ఒడియందు, సముపావిశమ్ = కూర్చుంటిని.

**సూచన :–** ఇటనుండి సీతమ్మ చెప్పుచున్న మాటలు శ్రీరామునితో తాను ప్రత్యక్షముగా చెప్పుచున్నట్లుగనే పలుకుచున్నదని తెలియవలెను.

**వాసుదాసస్వామి :–** నొక్కి చెప్పవలసిన దానిని రాముని సంబోధించియు, నితరవార్త హనుమంతుని సంబోధించియు అనుచున్నదని కాని, నాతో మాటలాడుచున్నను మనస్సంతయు నీ మీదనే యుండుటచే మైమఱచి నడుమ నడుమ నిన్ను సంబోధించెనని హనుమంతుడు రామునితో చెప్పుటకై యని కాని సీతమ్మ ఇట్లు పలికినదని యెఱుంగునది.

**తాత్పర్యము :–** బహువిధములగు పుష్పముల పరిమళములతో నిండిన ఆ యాశ్రమము నందున్న ఉద్యానవనములందు చిరకాలము విహరించి అలసి చెమటచే తడసిన దాననై నీయొడిలోనికి వచ్చి కూర్చుంటిని.

**శ్లో॥ తతో మాంససమాయుక్తో వాయసః పర్యతుండయత్ ।**
**త మహం లోష్ట ముద్యమ్య వారయామి స్మ వాయసమ్ ॥ 15**

**పదచ్ఛేదము :–** తతః – మాంససమాయుక్తః – వాయసః – పర్యతుండయత్ – తమ్ – అహం – లోష్టమ్ – ఉద్యమ్య – వారయామి స్మ – వాయసమ్ ॥

**అన్వయక్రమము :–** తతః మాంససమాయుక్తః వాయసః (మాం) పర్యతుండయత్; అహం లోష్టమ్ ఉద్యమ్య తం వాయసం వారయామి స్మ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, మాంససమాయుక్తః = మాంసమునందు లోభము గలిగినట్టి, వాయసః = కాకి, (మాం = నన్ను) పర్యతుండయత్ = పొడిచినది, అహం = నేను, లోష్టం = మట్టిబెడ్డను, ఉద్యమ్య = ఎత్తి (తీసికొని), తం = ఆ, వాయసం = కాకిని, వారయామి స్మ = నివారించుచుంటిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :–** మాంససమాయుక్తః వాయసః – తననోటితో మాంసమును కఱచుకొన్న ఒక కాకి, మాం పర్యతుండయత్ – ఆ మాంసముతో నన్ను కొట్టినది.

**మహేశ్వరతీర్థులు :–** మాం పర్యతుండయత్ – నా స్తనమధ్యమున తన ముక్కుతో పొడిచెను.

**తాత్పర్యము :–** అటుపిమ్మట మాంసమునందు వాంఛ గలిగినట్టి ఒక కాకి నా ఱొమ్ముపై తన ముక్కుతో పొడిచినది. అంత నే నొక మట్టిబెడ్డను తీసికొని దానిని నివారించు చుంటిని.

**శ్లో॥ దారయన్ స చ మాం కాక స్తత్రైవ పరిలీయతే ।**
**న చాప్యుపారమ న్మాంసా ద్భక్షార్థీ బలిభోజనః ॥ 16**

**పదచ్ఛేదము :–** దారయన్ – సః – చ – మాం – కాకః – తత్ర – ఏవ – పరిలీయతే – న – చ – అపి – ఉపారమత్ – మాంసాత్ – భక్షార్థీ – బలిభోజనః ॥

**అన్వయక్రమము :–** సః కాకః మాం దారయన్ తత్ర ఏవ పరిలీయతే; భక్షార్థీ (సః) బలిభోజనః మాంసాత్ న అపి చ ఉపారమత్.

**ప్రతిపదార్థము :–** సః కాకః = ఆ వాయసము, మాం = నన్ను, దారయన్ = పొడుచుచు, తత్ర ఏవ = అచ్చటనే, పరిలీయతే = దాగుకొనుచుండెను, భక్షార్థీ = భక్షణము కోరునట్టి, సః బలిభోజనః = ఆ వాయసము, మాంసాత్ = మాంసభక్షణము నుండి, న అపి చ ఉపారమత్ = ఎంత మాత్రము గూడ విరమింపకుండెను.

**తాత్పర్యము :–** ఆ కాకి నన్నట్లు పొడుచుచు నేను వారించుచుండగా ప్రక్కకు బోయి దాగుకొనుచుండెను. అది నా మాంసభక్షణమునుండి ఎంత మాత్రము విరమింప కుండెను.

**శ్లో॥ ఉత్కర్షంత్యాం చ రశనాం క్రుద్ధాయాం మయి పక్షిణి ।**
**స్రంసమానే చ వసనే తతో దృష్టా త్వయా హ్యహమ్ ॥ 17**

**పదచ్ఛేదము :–** ఉత్కర్షంత్యాం – చ – రశనాం – క్రుద్ధాయాం – మయి – పక్షిణి – స్రంసమానే – చ – వసనే – తతః – దృష్టా – త్వయా – హి – అహమ్ ॥

**అన్వయక్రమము :–** తతః మయి పక్షిణి క్రుద్ధాయాం, రశనాం ఉత్కర్షంత్యాం చ (సత్యాం) వసనే స్రంసమానే (సతి) అహం త్వయా దృష్టా.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, మయి = నేను, పక్షిణి = వాయసమునందు, క్రుద్ధాయాం = కోపించియున్నదానినై, రశనాం = మొలనూలును, ఉత్కర్షంత్యాం చ (సత్యాం) = పైకి తీయుచున్నదాన నగుచుండగా, వసనే = చీర, స్రంసమానే సతి = జాఱిపోవుచుండగా, అహం = నేను, త్వయా = నీ చేత, దృష్టా = చూడబడితిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** "పక్షిణా స్రస్యమానే చ వసనే" అని పాఠాంతరము. కాకిచే నా చీర లాగివేయబడగా అని అర్థము – "క్రుద్ధాయాం మయి పక్షిణే" అని తిలక సమ్మతమైన పాఠాంతరము.

**తాత్పర్యము :–** నేనే వాయసముపై కోపించి దానిని కొట్టుటకై నా మొలనూలును లాగుచుంటిని. అప్పట్టున నా చీర జాఱిపోవుచుండగా అట్టి యవస్థలో నున్న నన్ను నీవు కనులు తెఱచి చూచితివి.

**శ్లో॥ త్వయా విహసితా చాహం క్రుద్ధా సంలజ్జితా తదా ।**
**భక్ష్యగృధ్నేన కాకేన దారితా త్వా ముపాగతా ॥ 18**

**పదచ్ఛేదము :–** త్వయా – విహసితా – చ – అహం – క్రుద్ధా – సంలజ్జితా – తదా – భక్ష్యగృధ్నేన – కాకేన – దారితా – త్వామ్ – ఉపాగతా ॥

**అన్వయక్రమము :–** భక్ష్యగృధ్నేన కాకేన దారితా, అహం త్వామ్ ఉపాగతా; త్వయా విహసితా (సతీ) సంలజ్జితా, క్రుద్ధా చ.

**ప్రతిపదార్థము :–** భక్ష్యగృధ్నేన = మాంసభక్షణమున లోభముగల, కాకేన = కాకిచే, దారితా = పొడవబడినదాననై, అహం = నేను, త్వాం = నిన్ను, ఉపాగతా = చేరియుంటిని, తదా = అప్పుడు, త్వయా = నీచేత, విహసితా (సతీ) = పరిహసింప బడినదాన నగుచు, సంలజ్జితా = సిగ్గును బొందితిని, క్రుద్ధా చ = కోపించితిని కూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'భక్ష్యగృధ్నేన దారితా త్వామ్ ఉపాగతా' కాకిచే పొడవబడి నిన్ను చేరితిని అనుటచే సీతాదేవి వాయసమును తఱుముచు కొంత దూరము పోయి తిరిగి వచ్చి రాముని యొడిలో కూర్చున్నదని తెలియుచున్నది.

**తాత్పర్యము :–** అట్లు మాంసలోభియైన వాయసముచే పొడవబడినదాననై కోపముతో

నీయొద్దకు వచ్చియుంటిని. కాని నీ వప్పుడు నన్ను పరిహాసముతో చూడగా నాకు చాల సిగ్గును, కోపమును కూడ గలిగినది.

**శ్లో॥ తత శ్శ్రాంతాஉహ ముత్సంగ మాసీనస్య త వావిశమ్ ।**
**క్రుధ్యంతీవ ప్రహృష్టేన త్వ యాహం పరిసాంత్వితా ॥ 19**

**పదచ్ఛేదము :-** తతః - శ్రాంతా - అహమ్ - ఉత్సంగమ్ - ఆసీనస్య - తవ - అవిశమ్ - క్రుధ్యంతీ - ఇవ - ప్రహృష్టేన - త్వయా - అహం - పరిసాంత్వితా ॥

**అన్వయక్రమము :-** తతః శ్రాంతా అహమ్ ఆసీనస్య తవ ఉత్సంగమ్ అవిశమ్. క్రుధ్యంతీ ఇవ (స్థితా) అహం ప్రహృష్టేన త్వయా పరిసాంత్వితా.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, శ్రాంతా = అలసియున్నట్టి, అహం = నేను, ఆసీనస్య = కూర్చుండియున్నట్టి, తవ = నీయొక్క, ఉత్సంగం = ఒడిని, అవిశమ్ = ప్రవేశించితిని, క్రుధ్యంతీ ఇవ = క్రోధమునొందుచున్నట్లు, స్థితా = ఉన్నట్టి, అహం = నేను, ప్రహృష్టేన = సంతోషించియున్నట్టి, త్వయా = నీచేత, పరిసాంత్వితా = ఓదార్చబడితిని.

**తాత్పర్యము :-** అప్పుడు నేను అలసిపోయి అచ్చటనే కూర్చుండియున్న నీ యొడిలోనికి చేరితిని. జరిగిన దానికి కోపముతో నున్న నన్ను నీవు సంతోషముతో ఓదార్చియున్నావు.

**శ్లో॥ బాష్పపూర్ణముఖీ మందం చక్షుషీ పరిమార్జతీ ।**
**లక్షితా உహం త్వయా నాథ వాయసేన ప్రకోపితా ॥ 20**

**పదచ్ఛేదము :-** బాష్పపూర్ణముఖీ - మందం - చక్షుషీ - పరిమార్జతీ - లక్షితా - అహం - త్వయా - నాథ - వాయసేన - ప్రకోపితా ॥

**అన్వయక్రమము :-** నాథ! వాయసేన ప్రకోపితా బాష్పపూర్ణముఖీ మందం చక్షుషీ పరిమార్జతీ త్వయా అహం లక్షితా.

**ప్రతిపదార్థము :-** నాథ! = ప్రియుడా! వాయసేన = కాకముచే, ప్రకోపితా = కోపింపచేయబడినదాననై, బాష్పపూర్ణముఖీ = కన్నీటితో నిండిన ముఖముగలదాననై, మందం = మెల్లగా, చక్షుషీ = కన్నులను, పరిమార్జతీ = తుడుచుకొనుచున్న దానినిగా, త్వయా = నీచేత, అహం = నేను, లక్షితా = చూడబడితిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** శ్రీరాముని ఒడిలో నుండగా వాయసము తనను పొడిచినప్పుడు

దానిని తఱుముటకై సీతమ్మ ప్రయాసపడుచు ఆ తఱుముట శక్యము గానందులకు దుఃఖించుచుండగా శ్రీరాము డామెను పరిహాసము చేయుచు ఓదార్చెను. అనగా తన యొక్క రక్షణమునుగూర్చి తానే ప్రయాస పడుచున్న వాని యెడల పరమేశ్వరుడు ఉపేక్షించును. రక్షణభారము నాదిగాదు నీదే యను భావము గల్గినప్పుడు అతడే రక్షించునని ఈ వృత్తాంతముచే వెల్లడింప బడుచున్నది.

**తాత్పర్యము** :– రామా! వాయసముపై నేను కోపించి దానిని తఱుమలేనందులకు దుఃఖించుచు కన్నులనుండి ఆ శోకబాష్పములను తుడుచుకొనుచుండగా నీవు నన్ను అప్పుడు అనురాగముతో చూచితివి.

**శ్లో॥ పరిశ్రమా త్ప్రసుప్తా చ రాఘవాంకేఽస్మ్యహం చిరమ్ ।**
**పర్యాయేణ ప్రసుప్తశ్చ మమాంకే భరతాగ్రజః ॥ 21**

**పదచ్ఛేదము** :– పరిశ్రమాత్ – ప్రసుప్తా – చ – రాఘవాంకే –అస్మి – అహం – చిరమ్ – పర్యాయేణ – ప్రసుప్తః – చ – మమ – అంకే – భరతాగ్రజః ॥

**అన్వయక్రమము** :– అహం పరిశ్రమాత్ రాఘవాంకే చిరం ప్రసుప్తా అస్మి. భరతాగ్రజః చ పర్యాయేణ మమ అంకే ప్రసుప్తః.

**ప్రతిపదార్థము** :– అహం = నేను, పరిశ్రమాత్ = అలసటవలన, రాఘవాంకే = శ్రీరామునియొడిలో, చిరం = చాలసేపు, ప్రసుప్తా అస్మి = నిద్రించియుంటిని, భరతాగ్రజః చ = శ్రీరాముడును, పర్యాయేణ = క్రమప్రకారముగా, మమ = నాయొక్క, అంకే = ఒడియందు, ప్రసుప్తః = నిద్రించెను.

**తాత్పర్యము** :– నేను శ్రీరాముని యొడిలో చాలసేపటివఱకు నిద్రబోయితిని. శ్రీరాముడు గూడ వంతు ప్రకారము మేల్కొన్న పిదప నా యొడిలో తాను నిద్రించెను.

**శ్లో॥ స తత్ర పునరే వాథ వాయస స్సముపాగమత్ ।**
**తత స్సుప్తప్రబుద్ధాం మాం రాఘవాంకాత్సముత్థితామ్ ।**
**వాయస స్సహసాఽఽగత్య విదదార స్తనాంతరే ॥ 22**

**పదచ్ఛేదము** :– సః – తత్ర – పునః – ఏవ – అథ – వాయసః –సముపాగమత్ – తతః – సుప్తప్రబుద్ధాం – మాం – రాఘవాంకాత్ – సముత్థితామ్ – వాయసః – సహసా – ఆగత్య – విదదార – స్తనాంతరే ॥

**అన్వయక్రమము** :– అథ తత్ర పునః ఏవ సః వాయసః సముపాగమత్; తతః సుప్త ప్రబుద్ధాం, రాఘవాంకాత్ సముత్థితాం మాం వాయసః సహసా ఆగత్య స్తనాంతరే

విదదార.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, తత్ర = అచటికి, పునః ఏవ = మఱల, సః వాయసః = ఆ కాకము, సముపాగమత్ = వచ్చెను, తతః = పిమ్మట, సుప్తప్రబుద్ధాం = నిద్రించి లేచినట్టియు, రాఘవాంకాత్ = శ్రీరాముని యొక్క ఒడినుండి, సముత్థితాం = లేచినదాననగు, మాం = నన్ను, వాయసః = కాకము, సహసా = శీఘ్రముగా, ఆగత్య = వచ్చి, స్తనాంతరే = స్తనములనడుమ, విదదార = పొడిచెను.

**తాత్పర్యము :–** పిమ్మట అచటికి ఆ వాయసము మఱల వచ్చినది. అప్పటికి నిద్రనుండి మేల్కొని శ్రీరాముని ఒడి నుండి లేచి కూర్చొనియున్న నా మీదికి అది వేగముగ వచ్చి నా ఱొమ్ముపై పొడిచెను.

**శ్లో॥ పునః పున రథోత్పత్య విదదార స మాం భృశమ్ ।**
**తతస్సముక్షితో రామో ముక్తైః శోణితబిందుభిః ॥ 23**

**పదచ్ఛేదము :–** పునః – పునః – అథ – ఉత్పత్య – విదదార – సః – మాం – భృశమ్ తతః – సముక్షితః – రామః – ముక్తైః – శోణితబిందుభిః ॥

**అన్వయక్రమము :–** అథ సః పునః పునః ఉత్పత్య మాం భృశం విదదార. తతః ముక్తైః శోణితబిందుభిః రామః సముక్షితః.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, సః = ఆ వాయసము, పునః పునః = మఱల మఱల, ఉత్పత్య = ఎగిరి, మాం = నన్ను, భృశం = మిక్కిలిగా, విదదార = పొడవసాగెను. తతః = అటు పిమ్మట, ముక్తైః = విడువబడిన, శోణితబిందుభిః = రక్తబిందువులచే, రామః = శ్రీరాముడు, సముక్షితః = తడుపబడెను.

**తాత్పర్యము :–** ఆ వాయసము మఱలమఱల ఎగురుచు వచ్చి నన్ను పొడవసాగెను. అప్పుడు శ్రీరాముడు, నా గాయమునుండి స్రవించిన రక్తబిందువులచే తడిసెను.

**శ్లో॥ వాయసేన తత స్తేన బలవత్ క్లిశ్యమానయా ।**
**స మయా బోధిత శ్శ్రీమా న్సుఖసుప్తః పరంతపః ॥ 24**

**పదచ్ఛేదము :–** వాయసేన – తతః – తేన – బలవత్ – క్లిశ్యమానయా – సః – మయా – బోధితః – శ్రీమాన్ – సుఖసుప్తః – పరంతపః ॥

**అన్వయక్రమము :–** తతః తేన వాయసేన బలవత్ క్లిశ్యమానయా మయా సుఖసుప్తః పరంతపః సః శ్రీమాన్ మయా బోధితః.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, తేన = ఆ, వాయసేన = కాకముచే, బలవత్ = బలముగా, క్లిశ్యమానయా = పీడింపబడుచున్నట్టి, మయా = నాచే, సుఖసుప్తః = సుఖముగ నిద్రించుచున్నట్టి, పరంతపః = శత్రుసంహారకుడైన, శ్రీమాన్ = శుభలక్షణ సమన్వితుడైన, సః = ఆ రాముడు, బోధితః = మేల్కొల్పబడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** సః – నిఖిలలోకములయందును సువిదితమైన నిరతిశయ సౌందర్యముచే సుప్రసిద్ధుడు. మయా బోధితః – నిద్రాకాలమునందలి సౌందర్య విశేషమును అనుభవించుట మాని మేల్కొల్పుటచే నన్ను నేనే నష్టపఱచుకొంటిని. శ్రీమాన్ – మెలకువతో సంచరించుచున్నప్పుడు మాత్రమే సుందరముగ నుండి శయనించినప్పుడు వికారముగ కనబడుటగాక, నిద్రాసమయమున గూడ సహజ సౌందర్య విశేషముతో ప్రకాశించునట్టివాడు. సుఖసుప్తః – ఆత్మలక్షణమైన ఆనందానుభూతి నొందుచు శయనించియున్నవాడు. పరంతపః – శయనించినను శత్రుసంహార సమర్థుడుగ నుండువాడు. 'సుఖసుప్తః శ్రీమాన్' అనుటచే నిద్రావస్థలో గూడ సౌందర్య విశేషమునకు దృష్టిదోషము తగులకుండ 'దిష్టి' తీయవలసినంతటి సౌందర్యవంతుడు.

**తాత్పర్యము :–** అప్పుడు నేను ఆ వాయసము కలిగించుచున్న తీవ్రమైన పీడను భరింపజాలక సుఖముగ నిద్రించుచున్న ఆ మహనీయుని ఆ మహావీరుని నా ప్రియుని మేల్కొల్పితిని.

**శ్లో॥ స మాం దృష్ట్వా మహాబాహు ర్వితున్నాం స్తనయో స్తదా ।**
**ఆశీవిష ఇవ క్రుద్ధ శ్శ్వస న్వాక్య మభాషత ॥ 25**

**పదచ్ఛేదము :–** సః – మాం – దృష్ట్వా – మహాబాహుః – వితున్నాం – స్తనయోః – తదా – ఆశీవిషః – ఇవ – క్రుద్ధః – శ్వసన్ – వాక్యమ్ – అభాషత ॥

**అన్వయక్రమము :–** తదా సః మహాబాహుః స్తనయోః వితున్నాం మాం దృష్ట్వా క్రుద్ధః ఆశీవిషః ఇవ శ్వసన్ వాక్యమ్ అభాషత.

**ప్రతిపదార్థము :–** తదా = అప్పుడు, సః మహాబాహుః = ఆ మహావీరుడు, స్తనయోః = స్తనములందు, వితున్నాం = గాయమునొందియున్న, మాం = నన్ను, దృష్ట్వా = చూచి, క్రుద్ధః = క్రోధితుడై, (క్రుద్ధః = పగబట్టి కోపించిన) ఆశీవిషః ఇవ = సర్పమువలె, శ్వసన్ = రోజుచు, వాక్యం = ఈ వాక్యమును, అభాషత = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- క్రుద్ధః = ఇంతవఱకును కాకిచేష్టలను సామాన్యమైనవిగా మాత్రము ఎంచెను, పరిహసించెను. ఇప్పుడు సీతమ్మ ఱొమ్ముపై గాయమును జూచి క్రుద్ధ భుజంగమువలె రోజుచు లేచెనని భావము.

**రా.శిరోమణి** :- స్తనయోః వితున్నాం - అనగా ఆ వాయసము తన నోటియందు కఱచుకొనియున్న మాంసముతో కూడిన ముట్టిని తగిలించుటచే ఆ మాంసమునందలి రక్తము బిందువులచే గాయపడినట్లు సీతమ్మ ఱొమ్ము కాన్పించినది. ఆ దృశ్యమును జూచి రాముడు క్రోధము నొందెను.

**తాత్పర్యము** :- అప్పు డా మహావీరుడు స్తనములందు గాయము నొందియున్న నన్ను జూచి మహాక్రోధము నొంది తోకత్రొక్కిన త్రాచు బుసకొట్టుచున్నట్లు రోజుచు ఈ విధముగ పలికెను.

**శ్లో॥ కేన తే నాగనాసోరు విక్షతం వై స్తనాంతరమ్ ।**
**కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా ॥ 26**

**పదచ్ఛేదము** :- కేన - తే - నాగనాసోరు - విక్షతం - వై - స్తనాంతరమ్, కః - క్రీడతి - సరోషేణ - పంచవక్త్రేణ - భోగినా ॥

**అన్వయక్రమము** :- నాగనాసోరు! తే స్తనాంతరం కేన వై విక్షతమ్ ? సరోషేణ పంచవక్త్రేణ భోగినా కః క్రీడతి ?

**ప్రతిపదార్థము** :- నాగనాసోరు = ఏనుగు తొండమువంటి ఊరువులు గల్గినట్టి ఓ సుందరీ! తే = నీయొక్క, స్తనాంతరం = స్తనమధ్యము, కేన వై = ఎవ్వనిచేత, విక్షతం = గాయపఱచబడెను ? సరోషేణ = క్రోధముతోనున్న, పంచవక్త్రేణ = ఐదునోళ్ళు గలిగినట్టి, భోగినా = సర్పముతో, కః = ఎవ్వడు, క్రీడతి = ఆటలాడుచున్నాడు ?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- "పంచవక్త్రేణ భోగినా" పెద్దగ తెఱచిన నోరుగల క్రుద్ధసర్పము తోనని భావము. పంచ యనగా విస్తృతమైనయని అర్థము.

**తాత్పర్యము** :- ఓ సుందరీ! నీ స్తనమధ్యము ఎవనిచే ఇట్లు గాయపఱుపబడినది? రోషావేశము నొంది ఐదు నోళ్ళతో బుసకొట్టుచున్న భీకరసర్పముతో ఎవడు ఆటలాడు చున్నాడు?

**శ్లో॥ వీక్షమాణ సత స్తం వై వాయసం సమవైక్షత ।**
**నఖై స్సరుధిరై స్తీక్ష్ణై ర్మామే వాభిముఖం స్థితమ్ ॥ 27**

**పదచ్ఛేదము :–** వీక్షమాణః – తతః – తం – వై – వాయసం – సమవైక్షత – నఖైః – సరుధిరైః – తీక్ష్ణైః – మామ్ – ఏవ – అభిముఖం – స్థితమ్ ॥

**అన్వయక్రమము :–** వీక్షమాణః తతః సరుధిరైః తీక్ష్ణైః నఖైః మామ్ ఏవ అభిముఖం స్థితం తం వాయసం సమవైక్షత.

**ప్రతిపదార్థము :–** వీక్షమాణః = అన్నివైపులకు చూచుచున్నవాడై, తతః = అటుపిమ్మట, సరుధిరైః = రక్తముతో కూడినవియును, తీక్ష్ణైః = వాడియైనవియునగు, నఖైః = నఖములతో, మామేవ = నన్ను గూర్చియే, అభిముఖం = అభిముఖముగా, స్థితం = నిలచియున్న, తం వాయసం = ఆ కాకమును, సమవైక్షత = చూచెను.

**తాత్పర్యము :–** అట్లు పలుకుచు శ్రీరాముడు నలువైపులకును చూచుచుండగా నా ఎదుట రక్తపుబిందువులతో వాడిగనున్న గోళ్ళతో నిలచియున్న వాయసము కాన్పించెను.

**శ్లో॥ పుత్రః కిల స శక్రస్య వాయసః పతతాం వరః ।**
**ధరాంతరం గత శ్శీఘ్రం పవనస్య గతౌ సమః ॥ 28**

**పదచ్ఛేదము :–** పుత్రః – కిల – సః – శక్రస్య – వాయసః – పతతాం – వరః – ధరాంతరం – గతః – శీఘ్రం – పవనస్య – గతౌ – సమః ॥

**అన్వయక్రమము :–** పతతాం వరః సః వాయసః శక్రస్య పుత్రః కిల, గతౌ పవనస్య సమః (సః) శీఘ్రం ధరాంతరం గతః.

**ప్రతిపదార్థము :–** పతతాం వరః = పక్షులలో శ్రేష్ఠుడైన, సః వాయసః = ఆ కాకము, శక్రస్య = దేవేంద్రునకు, పుత్రః కిల = కుమారుడట, గతౌ = గమనమునందు, పవనస్య సమః = వాయుసమానుడైనట్టి, సః = అతడు, శీఘ్రం = వేగముగా, ధరాంతరం = భూమియందలి బిలమును, గతః = చేరెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :–** మానవుల ఒడలిని కాకి పొడుచుట లోకమునందు ఎన్నడును కాన్పింపని విషయము గదా యని హనుమ తన మనస్సునందు శంకింపకుండగ ఈ కాకము విశేషమైనదని దానివిశేషమును సీతమ్మ హనుమకు తెలుపుచున్నది. వాయువేగము గలది గనుక తలచినంతనే భూమిమీదకి రాగలిగినది. ఈ వచ్చుట

రాముని పరాక్రమమును పరీక్షించుటకై దేవేంద్రుని ప్రేరణచేతనే జరిగియుండునని ధ్వనితము.

**గోవిందరాజీయము :-** ఒక్క కాకి నిమిత్తమై (ముందు తెలుపబోవు రీతిగా) బ్రహ్మాస్త్రము నేల రాముడు ప్రయోగించెనని హనుమ శంకింపకుండ తనకు శ్రీరాముడు ఈ సంఘటనము జరిగిన పిమ్మట తెలిపినట్టి వాయసపూర్వవృత్తాంతము సీతమ్మ ఇట్లు తెలిపినది. ఈ వాయసము ఇంద్రపుత్రుడైన జయంతుడని కొందఱును వాయస రూపమైన పుత్రు డింకొకడని మఱి కొందఱును చెప్పుచున్నారు.

**వాసుదాసస్వామి :-** ఇంద్రుడు అహల్యను జెఱుపదలచి యొకనాటి రాత్రి కాకియై కూసెను. గౌతముడు కాకులు కూయువేళ యైనదని లేచి యేటికి బోయి ఆ నది నిద్రించుచుండుట చూచి వెనుకకువచ్చి ఇది యింద్రుని కుచేష్టయని ఎఱిగి ఆతనిని నీకు కాకి రూపమే శాశ్వతమగును గాక యని శపించెను. అప్పుడు దేవతలు ఋషులు గౌతముని ప్రార్థింపగా ఈ శాపము ఇంద్రుని కొడుకునకు తగులుననియు రామబాణ పీడితుడై ఆయనచే రక్షింపబడి శాపవిముక్తు డగుననియు గౌతముడు చెప్పెనని వసిష్ఠ రామాయణము.

**తాత్పర్యము :-** ఆ వాయసము సామాన్యమైనది కాదు. అది దేవేంద్రునియొక్క పుత్రుడే అట. వాయువుతో సమానమైన వేగము గలిగిన ఆ వాయసము అప్పుడే మహావేగముతో దూరమున గల భూమియందలి బిలమును చేరినది.

**శ్లో॥ తత స్తస్మి న్మహాబాహుః కోపసంవర్తితేక్షణః ।**
**వాయసే కృతవాన్ క్రూరాం మతిం మతిమతాం వరః ॥ 29**

**పదచ్ఛేదము :-** తతః – తస్మిన్ – మహాబాహుః – కోపసంవర్తితేక్షణః – వాయసే – కృతవాన్ – క్రూరాం – మతిం – మతిమతాం – వరః ॥

**అన్వయక్రమము :-** తతః మతిమతాం వరః (సః) మహాబాహుః కోపసంవర్తితేక్షణః (సన్) తస్మిన్ వాయసే క్రూరాం మతిం కృతవాన్.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, మతిమతాం = ప్రజ్ఞావంతులలో, వరః = శ్రేష్ఠుడైనట్టి, సః మహాబాహుః = ఆ మహావీరుడు, కోపసంవర్తితేక్షణః సన్ = క్రోధముచే త్రిప్పబడుచున్న కన్నులు గలవాడై, తస్మిన్ వాయసే = ఆ కాకి విషయమునందు, క్రూరాం = క్రూరమైనట్టి, మతిం = తలంపును, కృతవాన్ = చేసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :–** క్రూరాం మతిం – క్రూరముగా గాన్పించు ఆలోచన.

**తాత్పర్యము :–** అప్పుడు మహామేధావియైన ఆ మహావీరుడు క్రోధముచే కన్నులు చలించుచుండ ఆ వాయసమును గూర్చి క్రూరమైన నిశ్చయమును పూనెను.

**శ్లో॥ స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రాహ్మేణాస్త్రేణ యోజయత్ ।**
**స దీప్త ఇవ కాలాగ్ని ర్జజ్వాలాభిముఖో ద్విజమ్ ॥ 30**

**పదచ్ఛేదము :–** సః – దర్భం – సంస్తరాత్ – గృహ్య – బ్రాహ్మేణ – అస్త్రేణ – యోజయత్ – సః – దీప్తః – ఇవ – కాలాగ్నిః – జజ్వాల – అభిముఖః – ద్విజమ్ ॥

**అన్వయక్రమము :–** సః సంస్తరాత్ దర్భం గృహ్య, బ్రాహ్మేణ అస్త్రేణ యోజయత్ సః దీప్తః కాలాగ్నిః ఇవ ద్విజం అభిముఖః జజ్వాల.

**ప్రతిపదార్థము :–** సః = ఆతడు, సంస్తరాత్ = ఆస్తరణమునుండి, దర్భం = ఒక దర్భను, గృహ్య = గ్రహించి, (తం = దానిని) బ్రాహ్మేణ అస్త్రేణ = బ్రహ్మాస్త్రముతో, యోజయత్ = సంధించెను, సః = ఆ దర్భ, కాలాగ్నిః ఇవ = ప్రళయకాలాగ్నివలె, ద్విజమ్ అభిముఖః = వాయసమునకు ఎదురుగా నిలచినదై, జజ్వాల = ప్రజ్వరిల్ల సాగెను.

**తాత్పర్యము :–** వెంటనే శ్రీరాముడు తాను కూర్చున్న ఆసనమునుండి ఒక దర్భను గ్రహించి బ్రహ్మాస్త్రమంత్రముతో దానిని అభిమంత్రించెను. వెంటనే ఆ యస్త్రము ప్రళయకాలాగ్నివలె ఆ పక్షి ఎదుటకు బోయి భయంకరముగ ప్రజ్వలింపసాగెను.

**శ్లో॥ స తం ప్రదీప్తం చిక్షేప దర్భం తం వాయసం ప్రతి ।**
**తతస్తు వాయసం దర్భః సోఽంబరే ఽనుజగామ హ ॥ 31**

**పదచ్ఛేదము :–** సః – తం – ప్రదీప్తం – చిక్షేప – దర్భం – తం – వాయసం – ప్రతి – తతః – తు – వాయసం – దర్భః – సః – అంబరే – అనుజగామ – హ ॥

**అన్వయక్రమము :–** సః ప్రదీప్తం తం దర్భం తం వాయసం ప్రతి చిక్షేప. తతః సః దర్భః తం వాయసమ్ అంబరే అనుజగామ హ.

**ప్రతిపదార్థము :–** సః = అతడు, ప్రదీప్తం = ప్రజ్వరిల్లుచున్నట్టి, తం దర్భం = ఆ దర్భను, తం వాయసం ప్రతి = ఆ కాకమును గూర్చి, చిక్షేప = విసరెను, తతః = పిమ్మట, సః దర్భః = ఆ దర్భ, అంబరే = ఆకాశమున, తం వాయసం = ఆ

వాయసమును, అనుజగామ హ = వెంబడించెను.

**తాత్పర్యము** :- శ్రీరాము డప్పుడు ప్రజ్వలించుచున్న ఆ దర్భను వాయసము మీదికి విసరెను. ఆ దర్భ ఆకాశమునందు ఆ వాయసమును వెంబడించి తఱుమ సాగెను.

**శ్లో॥ అనుసృష్ట స్తదా కాకో జగామ వివిధాం గతిమ్ ।**
**త్రాణకామ ఇమం లోకం సర్వం వై విచచార హ ॥ 32**

**పదచ్ఛేదము** :- అనుసృష్టః - తదా - కాకః - జగామ - వివిధాం - గతిమ్ - త్రాణకామః - ఇమం - లోకం - సర్వం - వై - విచచార హ ॥

**అన్వయక్రమము** :- తదా అనుసృష్టః (సః) కాకః వివిధాం గతిం జగామ. త్రాణకామః (సః) సర్వమ్ ఇమం లోకం విచచార హ.

**ప్రతిపదార్థము** :- తదా = అప్పుడు, అనుసృష్టః = తఱుమబడుచున్నట్టి, (సః) కాకః = (ఆ) వాయసము, వివిధాం గతిం = వివిధమైన మార్గమును, జగామ = పొందెను, త్రాణకామః (సః) = రక్షణమును గోరుచున్నట్టి (ఆ కాకము), సర్వం = సమస్తమైన, ఇమం లోకం = ఈ లోకమును, విచచార హ = తిరిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :- వివిధాం గతిం జగామ - వివిధములైన ఆశ్రయములను గూర్చి చింతింపసాగెను.

**గోవిందరాజీయము** :- 'వివిధాం గతిం' వివిధములైన స్థానములను.

**'త్రాణకామః'** అనుటకు బదులుగా 'లోకకామః' అని పాఠాంతరము.

**తాత్పర్యము** :- అప్పు డా యస్త్రముచే తఱుమబడుచు ఆ వాయసము వివిధములైన ఆశ్రయములను గూర్చి పరుగులెత్తుచు తనను రక్షించువారికొఱకై ఈ లోకము నంతటను కలయదిరిగెను.

**శ్లో॥ స పిత్రా చ పరిత్యక్త స్సురై స్సర్వై ర్మహర్షిభిః ।**
**త్రీన్లోకా న్సంపరిక్రమ్య తమేవ శరణం గతః ॥ 33**

**పదచ్ఛేదము** :- సః - పిత్రా - చ - పరిత్యక్తః - సురైః - సర్వైః - మహర్షిభిః - త్రీన్ - లోకాన్ - సంపరిక్రమ్య - తమ్ - ఏవ - శరణం - గతః ॥

**అన్వయక్రమము** :- సః సర్వైః సురైః మహర్షిభిః పిత్రా చ పరిత్యక్తః త్రీన్ లోకాన్

సంపరిక్రమ్య తమ్ ఏవ శరణం గతః.

**ప్రతిపదార్థము** :– సః = ఆ వాయసము, సర్వైః = ఎల్ల, సురైః = దేవతలచేతను, మహర్షిభిః = మహర్షులచేతను, పిత్రా చ = తండ్రిచేతను, పరిత్యక్తః = విడిచివేయబడినవాడై, త్రీన్ లోకాన్ = మూడు లోకములను, సంపరిక్రమ్య = పలుమాఱులు పరిభ్రమించి, తమ్ ఏవ = ఆ శ్రీరామునే, శరణం గతః = శరణుజొచ్చెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– "పిత్రా చ పరిత్యక్తః" తండ్రిచేతను గూడ విడువబడెను అనుటచే మొదట ఈతడు తల్లి కడకు పోయెననియు పురుషకారభూతయైన సీతామాత యెడ అపరాధము చేసినట్టి వీనిని గాచుట తనకును సమ్మతముగాక పోవుటచే ఆమె విడచి పెట్టగా అప్పుడు తండ్రిని జేరి ఆతనిచే గూడ విడువబడెనని తెలియవలెను.

రామునకు విరోధియైనవానిని "ఇంద్రో మహేంద్రస్సురనాయకో వా ...... త్రాతుం న సమర్థః" అనునది సుప్రసిద్ధమే గనుక దేవేంద్రుడు విడుచుట ఆశ్చర్యము గాదు.

'పరిత్యక్తః' అనుటచే వీనిని తల్లిదండ్రులు కోరియే విడిచిపెట్టిరని భావము.

సురైస్సర్వైః మహర్షిభిః – పిమ్మట ఈతడు, తనను తల్లిదండ్రులు విడిచినను తన బంధువులు ఆదరింపవచ్చునని వారికడకుపోగా – "కస్య బిభ్యతి దేవాశ్చ జాత రోషస్య సంయుగే" అను ప్రసిద్ధి ననుసరించి ఆ దేవత లెవ్వరును గూడ ఈతనిని రక్షింపకుండిరి. ఇట్లు దేవత లెల్లరును పరిత్యజించగా సహజదయాపరులైన మహర్షుల కడకు వెడలగా సర్వరక్షకుడైన శ్రీరాము డుండగా ఆతని యెడ నపరాధము చేసిన వీనియెడల దయ చూపినచో మాకును అధర్మము అంటి హాని వాటిల్లుననియు, చివరికీతడు శ్రీరామునిచేతనే రక్షింపబడుననియు దూర మాలోచించి వారును వీనిని విడచిపెట్టిరి.

ఇట్లాతడు ముల్లోకములందును రక్షణకొఱకై పలుమాఱులు తిరిగి తిరిగి గత్యంతరము గానక సర్వలోకశరణ్యుడైన శ్రీరామునే శరణుజొచ్చెను.

సురైస్సర్వైర్మహర్షిభిః – అనుదానికి బదులుగా సురైశ్చ సమహర్షిభిః – అని పాఠాంతరము.

**తాత్పర్యము** :– అప్పు డా వాయసము తల్లిదండ్రులచేతను, ఎల్ల దేవతలచేతను, సర్వమహర్షుల చేతను గూడ రక్షణను బొందజాలక ముల్లోకములందును పలుమాఱులు

తిరిగితిరిగి ఎందును రక్షణమును గానక ఆ శ్రీరామచంద్రునే శరణుజొచ్చెను.

**శ్లో॥ స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్ ।**
**వధార్హమపి కాకుత్థ్సః కృపయా పర్యపాలయత్ ॥ 34**

**పదచ్ఛేదము :-** శరణ్యః - సః - కాకుత్థ్సః - వధార్హమ్ - అపి - శరణాగతం - భూమౌ - నిపతితం - తం - కృపయా - పర్యపాలయత్ ॥

**అన్వయక్రమము :-** శరణ్యః సః కాకుత్థ్సః వధార్హమ్ అపి శరణాగతం భూమౌ నిపతితం తం కృపయా పర్యపాలయత్.

**ప్రతిపదార్థము :-** శరణ్యః = శరణు వేడినవానిని రక్షించు స్వభావము గలిగినట్టి, సః కాకుత్థ్సః = ఆ శ్రీరాముడు, వధార్హమ్ అపి = వధించుటకు దగినవాడై యున్నప్పటికిని, శరణాగతం = శరణువేడినవాడును, భూమౌ నిపతితం = నేలపైబడియున్నవాడు నగు, తం = ఆ వాయసమును, కృపయా = కరుణతో, పర్యపాలయత్ = రక్షించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :-** "శరణాగతం తం కృపయా పర్యపాలయత్" అవ్యాజకృపాళువైన శ్రీరాముడు ఈతనిని కాపాడుటకు ఇంత ఆలస్యము ఏల చేసె ననరాదు. ప్రార్థించిన వారికే పరమకళ్యాణములు ప్రసాదింపబడును.

కరుణావానపి వ్యక్తం శక్తః స్వామ్యపి, దేహినామ్,
అప్రార్థితో న గోపాయేత్ ఇతి తత్ ప్రార్థనామతిః. - అని పురాణవచనము.

**గోవిందరాజీయము :-** భూమౌ నిపతితం - దేవజాతి యగుటచే నేలను తాకుట ఆతని స్వభావము గాకున్నను తండ్రిచే శిక్షింపబడిన పుత్రుడు తల్లి పాదములపై బడినట్లు తన పాదముల చెంత పడియుండెనని భావము. వధార్హం అపి కృపయా పర్యపాలయత్ - తనచే వధింపబడవలసియున్నను తన సహజస్వభావమైన దయాగుణముచే వానిని రక్షించెను.

దోషో యద్యపి తస్య స్యాత్ - అనుచు శ్రీరాముడు శరణాగతుల దోషములను ఉదారబుద్ధితో ఉపేక్షించును.

**వాసుదాసస్వామి :-** 'యది వా రావణః స్వయం' అనగా "రావణుడు వచ్చినను రక్షింతు"నని గదా శ్రీరాముని యధ్యవసాయము.

**తాత్పర్యము :-** భక్తశరణ్యుడైన శ్రీరాముడు తన పాదములముందు భూమిపై బడి శరణు వేడుచున్న ఆ వాయసమును చంపవలసి యున్నట్టి ఆతని దోషము నుపేక్షించి

తన సహజదయాగుణముచే రక్షించెను.

**శ్లో॥ పరిద్యూనం విషణ్ణం చ స త మాయాంత మబ్రవీత్ ।**
**మోఘం కర్తుం న శక్యం తు బ్రాహ్మ మస్త్రం త దుచ్యతామ్ ॥35**

**పదచ్ఛేదము** :- పరిద్యూనం - విషణ్ణం - చ - సః - తమ్ - ఆయాంతం - అబ్రవీత్ - మోఘం - కర్తుం - న - శక్యం - తు - బ్రాహ్మమ్ - అస్త్రం - తత్ - ఉచ్యతామ్ ॥

**అన్వయక్రమము** :- పరిద్యూనం విషణ్ణమ్ ఆయాంతం తమ్ (సః) అబ్రవీత్; బ్రాహ్మం అస్త్రం మోఘం కర్తుం తు న శక్యం; తత్ ఉచ్యతామ్.

**ప్రతిపదార్థము** :- పరిద్యూనం = పరితాపము నొందినవాడును, విషణ్ణం = విషాదముతో కూడినవాడు నగు, ఆయాంతం = వచ్చుచున్నట్టి, తం = ఆ వాయసమును గూర్చి, సః = ఆ శ్రీరాముడు, అబ్రవీత్ = పలికెను. బ్రాహ్మమ్ అస్త్రం = బ్రహ్మాస్త్రము, మోఘం కర్తుం = విఫలమును చేయుటకు, న శక్యం = సాధ్యముకాదు, తత్ = ఆ కారణమున, ఉచ్యతామ్ = చెప్పబడుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'తత్ ఉచ్యతామ్' బ్రహ్మాస్త్రము దేనిని సంహరింపవలెనో అట్టిదానిని చెప్పుము. పూర్వము తనకు పరశురాముడు చూపించినట్లు నీవును చూపించుమని భావము.

**తాత్పర్యము** :- ముల్లోకములు తిరిగి అలసిపోయి విషాదగ్రస్తుడై శరణుగోరి వచ్చుచున్న యాతనిని జూచి శ్రీరాముడు 'బ్రహ్మాస్త్రము ప్రయోగింపబడి వ్యర్థముగ వెనుకకు రాదు. కాబట్టి దానికి లక్ష్యము చేయవలసినది ఏదియో తెలుపు'మని వాయసము నడిగెను.

**శ్లో॥ హినస్తు దక్షిణాక్షి త్వచ్ఛర ఇత్యథ సోఽబ్రవీత్ ।**
**తత స్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్ ॥ 36**

**పదచ్ఛేదము** :- హినస్తు - దక్షిణాక్షి - త్వచ్ఛరః - ఇతి - అథ - సః - అబ్రవీత్ - తతః - తస్య - ఆక్షి - కాకస్య - హినస్తి - స్మ - సః - దక్షిణమ్ ॥

**అన్వయక్రమము** :- అథ సః త్వచ్ఛరః (మే) దక్షిణాక్షి హినస్తు ఇతి అబ్రవీత్; తతః సః తస్య కాకస్య దక్షిణమ్ అక్షి హినస్తి స్మ.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, సః = ఆ వాయసము, త్వచ్ఛరః = నీ బాణము, మే = నాయొక్క, దక్షిణాక్షి = కుడికంటిని, హినస్తు = నశింపజేయునుగాక, ఇతి = అని, అబ్రవీత్ = పలికెను, తతః = పిమ్మట, సః = ఆ బ్రహ్మాస్త్రము, తస్య కాకస్య = ఆ వాయసముయొక్క, దక్షిణమ్ అక్షి = కుడికంటిని, హినస్తి స్మ = నశింపజేసెను.

**తాత్పర్యము** :- అప్పు డా వాయసము నీ యస్త్రము నా దక్షిణనేత్రమును నశింపచేయు గాక యని పలికెను. అంతట శ్రీరాముడు తన అస్త్రమును ఆ వాయసముయొక్క కుడికంటినే లక్ష్యము చేసెను.

**శ్లో॥ దత్త్వా తు దక్షిణం నేత్రం ప్రాణేభ్యః పరిరక్షితః ।**
**స రామాయ నమస్కృత్వా రాజ్ఞే దశరథాయ చ ॥ 37**

**శ్లో॥ విసృష్టస్తేన వీరేణ ప్రతిపేదే స్వమాలయమ్ ॥ 38**

**పదచ్ఛేదము** :- దత్త్వా - తు - దక్షిణం - నేత్రం - ప్రాణేభ్యః - పరిరక్షితః - సః - రామాయ - నమస్కృత్వా - రాజ్ఞే - దశరథాయ - చ - విసృష్టః - తేన - వీరేణ - ప్రతిపేదే - స్వమ్ - ఆలయమ్ ॥

**అన్వయక్రమము** :- సః ప్రాణేభ్యః దక్షిణం నేత్రం దత్త్వా పరిరక్షితః; సః రామాయ, రాజ్ఞే దశరథాయ చ నమస్కృత్వా తేన వీరేణ విసృష్టః, స్వమ్ ఆలయం ప్రతిపేదే.

**ప్రతిపదార్థము** :- సః = ఆ వాయసము, ప్రాణేభ్యః = ప్రాణములకొఱకై, దక్షిణం నేత్రం = కుడికంటిని, దత్త్వా = అర్పించి, పరిరక్షితః = కాపాడబడినది, సః = ఆ వాయసము, రామాయ = శ్రీరామునకును, రాజ్ఞే = మహారాజయిన, దశరథాయ చ = దశరథునకును, నమస్కృత్వా = నమస్కరించి, తేన వీరేణ = ఆ వీరునిచే, విసృష్టః = విడువబడినదై, స్వమ్ ఆలయం = నిజగృహమును, ప్రతిపేదే = చేరెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :- "దశరథాయ చ నమస్కృత్వా" అని దశరథునకు గూడ నమస్కరించెనని చెప్పుటచే ఈతడు స్వర్గమునందు రక్షణకొఱకు పరుగిడినప్పుడు తమ వంశధర్మమైన దయాగుణము ననుసరించి అచ్చట నున్న దశరథుడు తన కుమారుని ఆశ్రితరక్షకత్త్వము ఎఱిగియున్నవాడు గావున ఆతనినే శరణువేడుమని ఉపదేశింపగా ఆ యుపదేశము ననుసరించియే తన ప్రాణములను నిలుపుకొనెను. కాబట్టి శ్రీరామునితో బాటుగా దశరథునకు గూడ నమస్కరించెనని తెలియవలెను.

**తాత్పర్యము** :- ఆ వాయస మట్లు తన దక్షిణ నేత్రమును అర్పించి తన ప్రాణములను

నిలుపుకొనెను. పిమ్మట ఆతడు శ్రీరామునకును దశరథమహారాజునకును నమస్కారముచేసి శ్రీరాముడు తనను విడిచిపెట్టగా నిజగృహమునకు చేరుకొనెను.

**శ్లో॥ మత్కృతే కాకమాత్రేఽపి బ్రహ్మాస్త్రం సముదీరితమ్ ।**
**కస్మా ద్యో మాఽహర త్త్వత్తః క్షమసే తం మహీపతే ॥ 39**

**పదచ్ఛేదము** :- మత్కృతే - కాకమాత్రే - అపి - బ్రహ్మాస్త్రం - సముదీరితమ్ - కస్మాత్ - యః - మా - అహరత్ - త్వత్తః - క్షమసే - తం - మహీపతే ॥

**అన్వయక్రమము** :- మహీపతే (త్వయా) మత్కృతే కాకమాత్రే అపి బ్రహ్మాస్త్రం సముదీరితమ్; యః త్వత్తః మా అహరత్ తం కస్మాత్ క్షమసే?

**ప్రతిపదార్థము** :- మహీపతే = ఓ మహారాజా!, త్వయా = నీచేత, మత్కృతే = నా నిమిత్తమై, కాకమాత్రే అపి = కాకమాత్రమునందే, బ్రహ్మాస్త్రం = బ్రహ్మాస్త్రము, సముదీరితం = ప్రయోగింపబడినది, యః = ఎవ్వడు, త్వత్తః = నీ నుండి, మా = నన్ను, అహరత్ = అపహరించెనో, తం = వానిని, కస్మాత్ = ఎందువలన, క్షమసే = సహించుచున్నావు?

**తాత్పర్యము** :- ఓ రామా! నీవు నా క్షేమముకొఱకై అల్పమైన ఒక కాకి మీదనే బ్రహ్మాస్త్రమును ప్రయోగించియున్నావు గదా! అట్టి దయాపరుడవు నేడు నీ కడనుండి నన్ను అపహరించినట్టి ఆ దుర్మార్గుని ఈనాడింత కాలము ఎట్లు సహింపగలుగు చున్నావు?

**శ్లో॥ స కురుష్వ మహోత్సాహః కృపాం మయి నరర్షభ ।**
**త్వయా నాథవతీ నాథ హ్యనాథా ఇవ దృశ్యతే ॥ 40**

**పదచ్ఛేదము** :- సః - కురుష్వ - మహోత్సాహః - కృపాం - మయి - నరర్షభ - త్వయా - నాథవతీ - నాథ - హి - అనాథా - ఇవ - దృశ్యతే ॥

**అన్వయక్రమము** :- నరర్షభ! మహోత్సాహః (సన్) మయి కృపాం కురుష్వ; నాథ! త్వయా నాథవతీ (ఏషా నారీ) అనాథా ఇవ దృశ్యతే.

**ప్రతిపదార్థము** :- నరర్షభ = ఓ మనుజశ్రేష్ఠుడా! మహోత్సాహః (సన్) = గొప్పదైన ఉత్సాహము గలవాడవై, మయి = నా యెడ, కృపాం = దయను, కురుష్వ = చేయుము, నాథ! = ఓ స్వామీ! త్వయా = నీ చేత, నాథవతీ = సనాథయైయున్న, (ఏషా నారీ = ఈ యబల) అనాథా ఇవ = అనాథవలె, దృశ్యతే = చూడబడుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవింద రాజీయము :–** నరర్షభ! – నీవు నరోత్తముడవు గదా! నీవు పరుల దుఃఖమును సహింపలేని వాడవుగదా! అట్టి నీ ఉత్తమగుణమును నా యెడల ప్రదర్శింప కుండుట నీ సరోత్తమత్వమునకే హాని యగునని సూచించుచు సీతమ్మ ఇచ్చట రాముని ఇట్లు సంబోధించెనని తెలియవలెను.

**తాత్పర్యము :–** ఓ నరశ్రేష్ఠుడా! నీవు మహోత్సాహమును బూని నాపై కృపజూపి నన్ను రక్షింపుము. లోకముచే నీ భార్యను అని అనిపించుకొనుచున్న నేను ఒక అనాథవలె ఇట్టి దీనస్థితిలో నుండుట నీకు ఉచితముకాదు సుమా!

**శ్లో॥ ఆనృశంస్యం పరో ధర్మ స్త్వత్త ఏవ మయా శ్రుతమ్ ।**
**జానామి త్వాం మహావీర్యం మహోత్సాహం మహాబలమ్ ॥ 41**

**శ్లో॥ అపారపార మక్షోభ్యం గాంభీర్యా త్సాగరోపమమ్ ।**
**భర్తారం ససముద్రాయా ధరణ్యా వాసవోపమమ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** ఆనృశంస్యం – పరః – ధర్మః – త్వత్తః – ఏవ – మయా – శ్రుతమ్ – జానామి – త్వాం – మహావీర్యం – మహోత్సాహం – మహాబలమ్ – అపారపారమ్ – అక్షోభ్యం – గాంభీర్యాత్ – సాగరోపమమ్ – భర్తారం – ససముద్రాయాః – ధరణ్యాః – వాసవోపమమ్ ॥

**అన్వయక్రమము :–** త్వత్తః ఏవ ఆనృశంస్యం పరః ధర్మః ఇతి మయా శ్రుతమ్. త్వాం మహావీర్యం మహోత్సాహం మహాబలమ్ అపారపారమ్ అక్షోభ్యం గాంభీర్యాత్ సాగరోపమం ససముద్రాయా ధరణ్యాః భర్తారం వాసవోపమం జానామి.

**ప్రతిపదార్థము :–** త్వత్తః ఏవ = నీ నుండియే, ఆనృశంస్యం = దయాళుత్వము, పరః = శ్రేష్ఠమైన, ధర్మః = ధర్మము, ఇతి = అని, మయా = నాచేత, శ్రుతమ్ = వినబడినది, త్వాం = నిన్ను, మహావీర్యం = గొప్ప వీరత్వము గలవానిగాను, మహోత్సాహం = గొప్ప ఉత్సాహము గలవానిగాను, మహాబలం = గొప్ప శక్తి గలవానిగను, అపారపారం = అపరిమితమైన సామర్థ్యము గలవానిగను, అక్షోభ్యం = క్షోభనొందింప శక్యముగాని వానిగాను, గాంభీర్యాత్ = గాంభీర్యమున, సాగరోపమం = సముద్రతుల్యునిగను, ససముద్రాయాః = (చుట్టును) సాగరములతో కూడినట్టి, ధరణ్యాః = భూమికి, భర్తారం = ప్రభువుగను, వాసవోపమం = దేవేంద్రసదృశునిగను, జానామి = ఎఱుగుదును.

**తాత్పర్యము** :– మానవగుణములలో దయాళుత్వము శ్రేష్ఠమైన ధర్మమని నీవే నాకు చెప్పియున్నావుగదా! అట్టి దయాగుణముతో నన్నేల కాపాడకుంటివి? నీ వీ రాక్షసులను జూచి భయమునొందువాడవు కాదుగదా! నీవు వీర్యశాలివనియు, ఉత్సాహసంపన్నుడ వనియు, మహాబలాఢ్యుడవనియు, అపరమితమైన సామర్థ్యము గలవాడవనియు, పరులచే క్షోభనొందు వాడవు గావనియు, సముద్రమువలె గంభీరుడవనియు, చతుస్సముద్ర వలయితమైన భూమండలమును పాలించు ప్రభువువనియు, దేవేంద్ర సన్నిభుడవనియు, నీ ప్రభావమును గూర్చి నాకు బాగుగా తెలియును.

**శ్లో॥ ఏవ మస్త్రవిదాం శ్రేష్ఠో బలవా న్సత్యవానపి ।**
**కిమర్థ మస్త్రం రక్షస్సు న యోజయసి రాఘవ ॥ 43**

**పదచ్ఛేదము** :– ఏవమ్ – అస్త్రవిదాం – శ్రేష్ఠః – బలవాన్ – సత్యవాన్ – అపి – కిమర్థం – అస్త్రం – రక్షస్సు – న – యోజయసి – రాఘవ ॥

**అన్వయక్రమము** :– రాఘవ! ఏవం అస్త్రవిదాం శ్రేష్ఠః బలవాన్ సత్యవాన్ అపి కిమర్థం రక్షస్సు అస్త్రం న యోజయసి?

**ప్రతిపదార్థము** :– రాఘవ! = ఓ శ్రీరామా, ఏవం = ఇట్లు, అస్త్రవిదాం = అస్త్రవేత్తలలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడవును, బలవాన్ = బలవంతుడవును, సత్యవాన్ అపి = సత్యవంతుడవునై నప్పటికిని, కిమర్థం = ఏల, రక్షస్సు = రక్కసులపై, అస్త్రం = అస్త్రమును, న యోజయసి = సంధింపకుంటివి?

**తాత్పర్యము** :– రామా! ఈ విధముగ ధనుర్విద్యలో శ్రేష్ఠుడవై సత్యవంతుడవై సామర్థ్య సంపన్నుడవై యుండియు కూడ నీ వేల ఈ రాక్షసులపై అస్త్రమును ప్రయోగింప కుంటివి?

**శ్లో॥ న నాగా నాపి గంధర్వా నాసురా న మరుద్గణాః ।**
**రామస్య సమరే వేగం శక్తాః ప్రతిసమాధితుమ్ ॥ 44**

**పదచ్ఛేదము** :– న – నాగాః – న – అపి – గంధర్వాః – న – అసురాః – న – మరుద్గణాః – రామస్య – సమరే – వేగం – శక్తాః – ప్రతిసమాధితుమ్ ॥

**అన్వయక్రమము** :– సమరే రామస్య వేగం ప్రతిసమాధితుం నాగాః న శక్తాః, గంధర్వా అపి న శక్తాః, మరుద్గణాః న శక్తాః.

**ప్రతిపదార్థము** :– సమరే = యుద్ధమునందు, రామస్య = శ్రీరామునియొక్క, వేగం = ఉద్ధతిని, ప్రతిసమాధితుం = ఎదుర్కొనుటకు, నాగాః = నాగులు, న శక్తాః =

సమర్థులు గారు, గంధర్వాః అపి = గంధర్వులుగూడ, న = సమర్థులుగారు, మరుద్గణాః = దేవగణములును, న శక్తాః = సమర్థులుగారు.

**తాత్పర్యము :–** రణాంగణమున రాముని ధాటికి తట్టుకొని నిలుచుటకు నాగయోధులు గాని, గంధర్వవీరులుగాని, రాక్షసయోధులుగాని, దేవగణములుగాని సామర్థ్యము గలవారుకాదు సుమా!

**శ్లో॥ తస్య వీర్యవతః కశ్చి ద్యద్యస్తి మయి సంభ్రమః ।**
**కిమర్థం న శరై స్తీక్ష్ణై క్షయం నయతి రాక్షసాన్ ॥ 45**

**పదచ్ఛేదము :–** తస్య – వీర్యవతః – కశ్చిత్ – యది – అస్తి – మయి – సంభ్రమః – కిమర్థం – న – శరైః – తీక్ష్ణైః – క్షయం – నయతి – రాక్షసాన్ ॥

**అన్వయక్రమము :–** వీర్యవతః తస్య మయి కశ్చిత్ సంభ్రమః అస్తి యది తీక్ష్ణైః శరైః రాక్షసాన్ కిమర్థం క్షయం న నయతి?

**ప్రతిపదార్థము :–** వీర్యవతః = పరాక్రమవంతుడైన, తస్య = ఆ రామునకు, మయి = నాయందు, కశ్చిత్ = ఏమైనను, సంభ్రమః = వేగిరపాటు, అస్తి యది = ఉన్నయెడల, తీక్ష్ణైః = వాడియైనట్టి, శరైః = బాణములచే, రాక్షసాన్ = రాక్షసులను, కిమర్థం = ఏల, క్షయం న నయతి = నాశము నొందించుటలేదు?

**తాత్పర్యము :–** మహావీరుడైన ఆ శ్రీరామునకు నన్ను గూర్చి కొంచెమైనను సంభ్రమమున్న యెడల తన తీక్ష్ణమైన శరములకు రాక్షసులను గుఱిచేసి వారినెల్లర నేల నశింపజేయకున్నాడు.

**శ్లో॥ భ్రాతు రాదేశ మాదాయ లక్ష్మణో వా పరంతపః ।**
**కస్య హేతోర్న మాం వీరః పరిత్రాతి మహాబలః ॥ 46**

**పదచ్ఛేదము :–** భ్రాతుః – ఆదేశం – ఆదాయ – లక్ష్మణః – వా – పరంతపః – కస్య – హేతోః – న – మాం – వీరః – పరిత్రాతి – మహాబలః ॥

**అన్వయక్రమము :–** వీరః పరంతపః మహాబలః లక్ష్మణో వా కస్య హేతోః భ్రాతుః ఆదేశమ్ ఆదాయ మాం న పరిత్రాతి.

**ప్రతిపదార్థము :–** వీరః = వీరుడును, పరంతపః = శత్రుసంహారకుడును, మహాబలః = మహాబలాఢ్యుడును అగు, లక్ష్మణో వా = లక్ష్మణుడైనను, కస్య హేతోః = దేని కారణమువలన, భ్రాతుః = సోదరునియొక్క, ఆదేశమ్ = ఆజ్ఞను, ఆదాయ = గైకొని, మాం = నన్ను, న పరిత్రాతి = రక్షింపకున్నాడు.

**తాత్పర్యము** :- మహావీరుడును శత్రుమర్దనుడును మహాసమర్థుడును అగు లక్ష్మణుడైనను తన అన్న ఆజ్ఞను గైకొని నన్ను రక్షింప పూనకున్నాడు ఏ కారణము చేతనో కదా!

**శ్లో॥ యది తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ ।**
**సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మాముపేక్షతః ॥ 47**

**పదచ్ఛేదము** :- యది – తౌ – పురుషవ్యాఘ్రౌ – వాయ్వగ్నిసమతేజసౌ – సురాణాం – అపి – దుర్ధర్షౌ – కిమర్థం – మామ్ – ఉపేక్షతః ॥

**అన్వయక్రమము** :- పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ (తౌ సంగతౌ) యది సురాణామపి దుర్ధర్షౌ తౌ కిమర్థం మామ్ ఉపేక్షతః.

**ప్రతిపదార్థము** :- పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులైనట్టి, వాయ్వగ్నిసమతేజసౌ = వాయువుతోడను అగ్నితోడను సమానమైన ప్రతాపముగలవారైనట్టి, (తౌ సంగతౌ) యది = వారు కలసికొన్నయెడల, సురాణామ్ అపి = దేవతలకుగూడ, దుర్ధర్షౌ = ఎదుర్కొన శక్యముగానట్టి, తౌ = వారు, కిమర్థం = ఏల, మాం = నన్ను, ఉపేక్షతః = ఉపేక్షించుచున్నారు?

**తాత్పర్యము** :- వాయువుతోడను అగ్నితోడను సమానమైన ప్రతాపముగల ఆ యన్నదమ్ము లిరువురును ఆనాడు తిరిగి కలిసికొన్న యెడల దేవతలకు కూడ అజేయులైనట్టి వారు నాయెడ నేల ఇట్లు ఉపేక్ష వహించియున్నారు?

**శ్లో॥ మమైవ దుష్కృతం కించిన్మహ దస్తి న సంశయః ।**
**సమర్థావపి తౌ యన్మాం నావేక్షేతే పరంతపౌ ॥ 48**

**పదచ్ఛేదము** :- మమ – ఏవ – దుష్కృతం – కించిత్ – మహత్ – అస్తి – న – సంశయః – సమర్థౌ – అపి – తౌ – యత్ – మాం – న – అవేక్షేతే – పరంతపౌ ॥

**అన్వయక్రమము** :- పరంతపౌ తౌ సమర్థౌ అపి యత్ మాం న అవేక్షేతే, తత్ మమ ఏవ మహత్ కించిత్ దుష్కృతం అస్తి; సంశయః న.

**ప్రతిపదార్థము** :- పరంతపౌ = శత్రుతాపసులైన, తౌ = ఆ యన్నదమ్ములు, సమర్థౌ అపి = సమర్థులైనను, యత్ = ఏ కారణమున, మాం = నన్ను, న అవేక్షేతే = పరికించుటలేదో, తత్ = ఆ కారణమున, మమ ఏవ = నాయదియే, మహత్ = గొప్పదైన, కించిత్ = ఒకానొక, దుష్కృతం = పాతకము, అస్తి = ఉన్నది, సంశయః = సందేహము, న = లేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'మమైవ దుష్కృతం కించిత్ మహదస్తి' - రామలక్ష్మణులు తనను రక్షించుటలో జరిగిన ఉపేక్షకు కారణము నూహించుచు ఆ సోదరుల లోపమో తన లోపమో యైయుండవలెనని ఎంచుకొని రాముని అసాధారణప్రభావమును స్మరించి రాముని లోపము కాదు అని నిశ్చయించి అది తన లోపమే యని సీతమ్మ ఒప్పుకొనుచున్నది. వనవాసమునకు తన అనుగమనమును అంగీకరింపలేదని తాను ఆనాడు నాథుని దూషించి దుష్కృతము చేసియున్నది. అట్లే మాయామృగవధ సందర్భమున రాముని గొనివచ్చుటకై పోలేదని లక్ష్మణుని దూషించియున్నది. అట్లు భగవత్ భాగవతాపచారములు రెండును తాను చేసితినని ఇప్పుడు విచారముతో ఇట్లు స్మరించుచున్నదని గ్రహించవలెను.

**వాసుదాసస్వామి** :- రామునితో చెప్పుమని సీతమ్మ హనుమకు చెప్పిన మాటలలో కొన్ని రామునితో ప్రత్యక్షముగ చెప్పినట్లుగా పలికినది. కొన్ని హనుమను గూర్చి చెప్పినట్లే పలికినది. వికలమనస్కురాలైన సీతాదేవి దుఃఖావేశముతో ఈ విధముగ వేఱువేఱు రీతులుగా చెప్పుట సహజమైన విషయముగ గ్రహింపవలెను. విపరీతమని శంకింపరాదు.

**తాత్పర్యము** :- మహావీరులైన ఆ యన్నదమ్ములు నా కష్టములు తొలగించుటకు సమర్థులైనను నన్ను ఉపేక్షించుచున్నారనగా నేను చేసిన దోషమేదియో గొప్పది యుండవలెను; సందేహము లేదు.

**శ్లో॥ వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్ ।**
**అథాబ్రవీ న్మహాతేజా హనుమాన్మారుతాత్మజః ॥ 49**

**పదచ్ఛేదము** :- వైదేహ్యాః - వచనం - శ్రుత్వా - కరుణం - సాశ్రుభాషితమ్ - అథ - అబ్రవీత్ - మహాతేజాః - హనుమాన్ - మారుతాత్మజః ॥

**అన్వయక్రమము** :- వైదేహ్యాః కరుణం సాశ్రుభాషితం శ్రుత్వా అథ మారుతాత్మజః మహాతేజాః హనుమాన్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- వైదేహ్యాః = జానకీదేవియొక్క, కరుణం = దీనమైనట్టి, సాశ్రుభాషితం = కన్నీటితోడి మాటను, శ్రుత్వా = విని, అథ = పిమ్మట, మారుతాత్మజః = వాయునందనుడును, మహాతేజాః = మహాప్రతాపవంతుడునగు, హనుమాన్ = హనుమ, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** సీతాదేవి కన్నీటితో దీనముగా పలికిన మాటలు విని మహాప్రతాప శాలియైన వాయునందనుడు ఆమెతో నిట్లు పలికెను.

**శ్లో॥ త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన మే శపే ।**
**రామే దుఃఖాభిపన్నే చ లక్ష్మణః పరితప్యతే ॥ 50**

**పదచ్ఛేదము :–** త్వచ్ఛోకవిముఖః – రామః – దేవి – సత్యేన – మే – శపే – రామే – దుఃఖాభిపన్నే – చ – లక్ష్మణః – పరితప్యతే ॥

**అన్వయక్రమము :–** దేవి! మే సత్యేన శపే, రామః త్వచ్ఛోకవిముఖః; రామే దుఃఖాభిపన్నే తు లక్ష్మణః పరితప్యతే.

**ప్రతిపదార్థము :–** దేవి! = ఓ పూజ్యురాలా! మే సత్యేన = నా సత్యవ్రతముతో, శపే = ఒట్టుపెట్టుకొనుచున్నాను, రామః = శ్రీరాముడు, త్వచ్ఛోకవిముఖః = నీ యందలి శోకముచే (లోక) విముఖుడైయున్నాడు, రామే = శ్రీరాముడు, దుఃఖాభిపన్నే తు = దుఃఖనిమగ్నుడై యుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, పరితప్యతే = దుఃఖించుచున్నాడు.

**తాత్పర్యము :–** నా సత్యపాలన వ్రతముపై ఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను. తల్లీ! శ్రీరాముడు నీ వియోగదుఃఖముచే సర్వవిషయములందును విముఖుడై యున్నాడు; రాము డట్లు శోకనిమగ్నుడై యుండగా లక్ష్మణుడు గూడ సంతాపమున మునిగి యున్నాడు.

**శ్లో॥ కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్ ।**
**ఇమం ముహూర్తం దుఃఖానాం ద్రక్ష్య స్యంత మనిందితే ॥ 51**

**పదచ్ఛేదము :–** కథంచిత్ – భవతీ – దృష్టా – న – కాలః – పరిశోచితుమ్ – ఇమం – ముహూర్తం – దుఃఖానాం – ద్రక్ష్యసి – అంతమ్ – అనిందితే ॥

**అన్వయక్రమము :–** భవతీ–కథంచిత్ దృష్టా; పరిశోచితుం (అయం) కాలః న; అనిందితే! ఇమం ముహూర్తం దుఃఖానామ్ అంతం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము :–** భవతీ = నీవు, కథంచిత్ = ఎట్లో, దృష్టా = కనబడితివి (అయం = ఇది) పరిశోచితుం = దుఃఖించుటకు, కాలః = సమయము, న = కాదు, అనిందితే = ఓ ఉత్తమురాలా! ఇమం ముహూర్తం = ఈ క్షణమే, దుఃఖానాం = దుఃఖములకు, అంతం = అంతమును, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము :–** తల్లీ! ఎట్లో మా యదృష్టముచే నీవు నా కంటబడితివి. ఇది దుఃఖింప

వలసిన సమయము గాదు. అతిస్వల్పకాలములోనే నీ దుఃఖములు అంతమును చేరగలవు సుమా!.

**శ్లో॥ తా వుభౌ పురుషవ్యాఘ్రౌ రాజపుత్రౌ మహాబలౌ ।**
**త్వద్దర్శనకృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః ॥ 52**

**పదచ్ఛేదము** :- తౌ - ఉభౌ - పురుషవ్యాఘ్రౌ - రాజపుత్రౌ - మహాబలౌ - త్వద్దర్శనకృతోత్సాహౌ - లంకాం - భస్మీకరిష్యతః ॥

**అన్వయక్రమము** :- పురుషవ్యాఘ్రౌ, మహాబలౌ తౌ ఉభౌ రాజపుత్రౌ త్వద్దర్శన కృతోత్సాహౌ (సంతౌ) లంకాం భస్మీకరిష్యతః.

**ప్రతిపదార్థము** :- పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులును, మహాబలౌ = మహాబలాఢ్యులు నగు, తౌ ఉభౌ = ఆ ఇరువురు, రాజపుత్రౌ = రాజకుమారులును, త్వద్దర్శనకృతోత్సాహౌ (సంతౌ) = నిన్ను చూచుటయందు గలిగిన ఉత్సాహముతో కూడినవా రగుచు, లంకాం = లంకానగరమును, భస్మీకరిష్యతః = భస్మము గావింపగలదు.

**తాత్పర్యము** :- మహాబలాఢ్యులును, పురుషసింహులునైన ఆ రాజకుమారు లిరువురును నిన్ను చూడవలెనను అమితమైన ఉత్సాహముతో బయలుదేరి ఈ లంకానగరమును భస్మము చేసి వేయుదురు, చూచుచుండుము.

**శ్లో॥ హత్వా చ సమరే క్రూరం రావణం సహబాంధవమ్ ।**
**రాఘవ స్త్వాం విశాలాక్షి నేష్యతి స్వాం పురీం ప్రతి ॥ 53**

**పదచ్ఛేదము** :- హత్వా - చ - సమరే - క్రూరం - రావణం - సహబాంధవమ్ - రాఘవః - త్వాం - విశాలాక్షి - నేష్యతి - స్వాం - పురీం - ప్రతి ॥

**అన్వయక్రమము** :- విశాలాక్షి! రాఘవః క్రూరం రావణం సమరే సహబాంధవం హత్వా త్వాం స్వాం పురీం ప్రతి నేష్యతి.

**ప్రతిపదార్థము** :- విశాలాక్షి = విశాలమైన నేత్రములు గల ఓ జానకీ! రాఘవః = శ్రీరాముడు, క్రూరం రావణం = క్రూరుడైన రావణుని, సమరే = యుద్ధమున, సహబాంధవం = బంధువులందరితోడనుగూడ, హత్వా = వధించి, త్వాం = నిన్ను, స్వాం పురీం ప్రతి = తన నగరమును గూర్చి, నేష్యతి = కొనిపోవగలడు.

**తాత్పర్యము** :- ఓ జానకీ! శ్రీరాముడు యుద్ధమున ఈ రావణుని బంధుసమేతముగా సంహరించి నిన్ను నిజపట్టణమునకు త్వరలోనే తీసికొని పోవగలడు సుమా!

**శ్లో॥ బ్రూహి యద్రాఘవో వాచ్యో లక్ష్మణశ్చ మహాబలః ।**
**సుగ్రీవో వాపి తేజస్వీ హరయో వా సమాగతాః ॥ 54**

**పదచ్ఛేదము :–** బ్రూహి – యత్ – రాఘవః – వాచ్యః – లక్ష్మణః – చ – మహాబలః – సుగ్రీవః – వా – అపి – తేజస్వీ – హరయః – వా – సమాగతాః ॥

**అన్వయక్రమము :–** రాఘవః, మహాబలః లక్ష్మణః చ, తేజస్వీ సుగ్రీవః వా అపి యత్ వాచ్యః, సమాగతాః హరయః వా (యత్ వాచ్యాః తత్ బ్రూహి).

**ప్రతిపదార్థము :–** రాఘవః = శ్రీరాముడును, మహాబలః = బలశాలియైన, లక్ష్మణః చ = లక్ష్మణుడును, తేజస్వీ = ప్రతాపశాలి, సుగ్రీవః వా అపి = సుగ్రీవుడైనను, యత్ = ఏమి, వాచ్యః = చెప్పబడవలయునో, సమాగతాః = చేరినట్టి, హరయః వా = వానరులు గాని, యత్ = ఏమి, వాచ్యాః = చెప్పబడవలసియున్నారో, తత్ = దానిని, బ్రూహి = చెప్పుము.

**తాత్పర్యము :–** తల్లీ! శ్రీరామునితో ఏమని చెప్పుమందువో చెప్పుము. మహాబలశాలి యగు లక్ష్మణునితోడను ప్రతాపవంతుడైన సుగ్రీవునితోడను ఏ మని చెప్పుమందువు? నన్ను చూడగనే అచ్చటికి చేరిన వానరు లందరితోడను ఏమని చెప్పుమందువు?

**శ్లో॥ ఇ త్యుక్తవతి తస్మింస్తు సీతా సురసుతోపమా ।**
**ఉవాచ శోకసంతప్తా హనుమంతం ప్లవంగమమ్ ॥ 55**

**పదచ్ఛేదము :–** ఇతి – ఉక్తవతి – తస్మిన్ – తు – సీతా – సురసుతోపమా – ఉవాచ – శోకసంతప్తా – హనుమంతం – ప్లవంగమమ్ ॥

**అన్వయక్రమము :–** తస్మిన్ ఇతి ఉక్తవతి, సురసుతోపమా సీతా శోకసంతప్తా (సతీ) హనుమంతం ప్లవంగమమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** తస్మిన్ = ఆతడు, ఇతి = ఇట్లు, ఉక్తవతి = పలుకగా, సురసుతోపమా = దేవకన్యలతో సమానురాలయిన, సీతా = జానకి, ప్లవంగమం = వానరశ్రేష్ఠుడైన, హనుమంతం = హనుమంతునిగూర్చి, శోకసంతప్తా (సతీ) = శోకముతో పరితపించు చున్నదై, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** హనుమంతుడు పలికిన మాటలు విని మహనీయురాలైన సీతాదేవి శోకసంతప్తురా లగుచు అతనితో నిట్లు పలికెను.

**శ్లో॥ కౌసల్యా లోకభర్తారం సుషువే యం మనస్వినీ ।**
**తం మమార్థే సుఖం పృచ్ఛ శిరసా చాభివాదయ ॥ 56**

**పదచ్ఛేదము** :- కౌసల్యా - లోకభర్తారం - సుషువే - యం - మనస్వినీ - తం - మమ - అర్థే - సుఖం - పృచ్ఛ - శిరసా - చ - అభివాదయ ॥

**అన్వయక్రమము** :- మనస్వినీ కౌసల్యా లోకభర్తారం యం సుషువే, తం మమార్థే సుఖం పృచ్ఛ; శిరసా అభివాదయ చ.

**ప్రతిపదార్థము** :- మనస్వినీ = ధీరురాలైన, కౌసల్యా = కౌసల్యాదేవి, లోకభర్తారం = లోకములకు ప్రభువైనట్టి, యం = ఎవనినైతే, సుషువే = కనినదో, తం = ఆతనిని, మమార్థే = నా నిమిత్తమై, సుఖం పృచ్ఛ = క్షేమమును అడుగుము, శిరసా = శిరస్సుతో, అభివాదయ చ = నమస్కారము కూడ చేయుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- మనస్వినీ కౌసల్యా - విశాలహృదయురాలైన కౌసల్య, లోకభర్తారం యం సుషువే - లోకమున స్త్రీలు సామాన్యముగా తనకు రక్షకులుగ నుండవలెనని కోరుచు పుత్రులను బడయుదురు, కౌసల్య మాత్రము విశాలభావము గలదై సర్వలోకరక్షకుడైన పుత్రుడు తనకు గలుగవలెనని నవమీవ్రతము నాచరించి లోకోపకారము కొఱకై కుమారుని గన్నది. అట్టి ఆమె కోరిక వ్యర్థమైన దెట్లగును? ఆతనివల్ల మేలు పొందవలసిన లోకములో నేను గూడ ఒకతెనే గదా! ఆతడు సుఖముగ నున్న తప్పక అందఱి సుఖములును ఆతని వలన సిద్ధించును. అందువలన ఆతని సుఖమే మొదట నేను కోరవలసినది. నా రక్షణభారము ఆతనిదే. నా చింతయెల్లను ఆలస్యము కాగూడదని మాత్రమే. అందుకే ఆతని సుఖమునుగూర్చి నేను అడుగు చున్నానని చెప్పుము.

**తాత్పర్యము** :- అత్యుత్తమ హృదయముగల కౌసల్యాదేవి సర్వలోకరక్షకుడైన ఏ మహనీయుని గనినదో ఆతనిని నా కోరికగా క్షేమవార్తను అడుగుము. నాకు మాఱుగా తలవంచి నమస్కారము చేయుము.

**శ్లో॥ ప్రజహశ్చ సర్వరత్నాని ప్రియా యాశ్చ వరాంగనాః ।**
**ఐశ్వర్యం చ విశాలాయాం పృథివ్యామపి దుర్లభమ్ ॥ 57**

**శ్లో॥ పితరం మాతరం చైవ సమ్మా న్యాభిప్రసాద్య చ ।**
**అనుప్రవ్రజితో రామం సుమిత్రా యేన సుప్రజాః ॥ 58**

**పదచ్ఛేదము :–** స్రజః – చ – సర్వరత్నాని – ప్రియాః – యాః – చ – వరాంగనాః – ఐశ్వర్యం – చ – విశాలాయాం – పృథివ్యామ్ – అపి – దుర్లభమ్ – పితరం – మాతరం – చ – ఏవ – సమ్మాన్య – అభిప్రసాద్య – చ – అనుప్రవ్రజితః – రామం – సుమిత్రా – యేన – సుప్రజాః ॥

**అన్వయక్రమము :–** సుమిత్రా యేన సుప్రజాః సః లక్ష్మణః, స్రజః చ, సర్వరత్నాని, యాః ప్రియాః వరాంగనాః (తాః) విశాలాయాం పృథివ్యాం అపి దుర్లభం ఐశ్వర్యం చ త్యక్త్వా పితరం సమ్మాన్య మాతరం అభిప్రసాద్య చ రామం అనుప్రవ్రజితః.

**ప్రతిపదార్థము :–** సుమిత్రా = సుమిత్రాదేవి, యేన = ఏ మహాత్మునిచే, సుప్రజాః = ఉత్తమమైన సంతానముగలది యయ్యెనో, సః లక్ష్మణః = ఆ లక్ష్మణుడు, స్రజః చ = పూలమాలలను, సర్వరత్నాని = సమస్తరత్నములను, ప్రియాః = ప్రియమైనట్టి, యాః వరాంగనాః = ఏ సుందరాంగనలు గలరో (తాః = వారిని) విశాలాయాం = విశాలమైనట్టి, పృథివ్యాం అపి = భూమండలమునందు గూడ, దుర్లభం = దుర్లభమైనట్టి, ఐశ్వర్యం చ = ఐశ్వర్యమును, త్యక్త్వా = విడిచిపెట్టి, పితరం = తండ్రిని, సమ్మాన్య = గౌరవించి, మాతరం = తల్లిని, అభిప్రసాద్య చ = నచ్చచెప్పియు, రామం = శ్రీరాముని, అనుప్రవ్రజితః = సన్యాసిగా వెంబడించెను.

**తాత్పర్యము :–** ఏ మహనీయుని సుమిత్రాదేవి అపూర్వసంతానవంతురాలని పేరు బడసినదో అట్టి మహాత్ముడైన లక్ష్మణుడు ఆనాడు తాను అనుభవింపదలచిన విలాసములైన పూలమాలలను, రత్నాభరణములను, ప్రియాంగనలను, భూమండలమున ఎవ్వరికిని లభ్యముగాని ఆ యఖండైశ్వర్యమును తృణప్రాయముగ విడిచి తండ్రిని తగురీతిగా గౌరవించుచు తల్లికి నచ్చజెప్పి అరణ్యమునకు వెడలుచున్న శ్రీరాముని వెంబడించినాడుగదా!

**శ్లో॥ ఆనుకూల్యేన ధర్మాత్మా త్యక్త్వా సుఖ మనుత్తమమ్ ।**
**అనుగచ్ఛతి కాకుత్థ్సం భ్రాతరం పాలయన్ వనే ॥ 59**

**పదచ్ఛేదము :–** ఆనుకూల్యేన – ధర్మాత్మా – త్యక్త్వా – సుఖమ్ – అనుత్తమమ్ – అనుగచ్ఛతి – కాకుత్థ్సం – భ్రాతరం – పాలయన్ – వనే ॥

**అన్వయక్రమము :–** ధర్మాత్మా (సః) ఆనుకూల్యేన అనుత్తమం సుఖం త్యక్త్వా వనే భ్రాతరం కాకుత్థ్సం పాలయన్ అనుగచ్ఛతి.

**ప్రతిపదార్థము :–** ధర్మాత్మా సః = ధర్మాత్ముడైన యాతడు, ఆనుకూల్యేన = అనుకూలమైన స్వభావముతో, అనుత్తమం = శ్రేష్ఠమైనట్టి, సుఖం = సుఖమును,

త్యక్త్వా = విడిచి, వనే = అరణ్యమునందు, భ్రాతరం = సోదరుడైన, కాకుత్థ్సం = శ్రీరాముని, పాలయన్ = సంరక్షించుచు, అనుగచ్ఛతి = అనుసరించుచున్నాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'ఆనుకూల్యేన అనుగచ్ఛతి' భక్తిభావముతో అనుసరించు చున్నాడు.

**వాసుదాసస్వామి** :– శ్రీరాముని అర్ధాంగి నగుటచే నాకు అడవులకు రాక తప్పినదిగాదు. లక్ష్మణు డరణ్యములకు రావలసిన కారణము లేదు. ఆయన కన్నగారియందుగల భక్తి ప్రపత్తులే అందుకు కారణము.

**తాత్పర్యము** :– ధర్మాత్ముడైన లక్ష్మణుడు మిక్కిలి అనురాగముతో గొప్పవైన తన సుఖములను అన్నింటిని విడిచి అరణ్యవాసము చేయుచున్న సోదరుని సంరక్షణ కొఱకు ఆతనిని వెంబడించి వచ్చుచున్నాడు.

**శ్లో॥ సింహస్కంధో మహాబాహు ర్మనస్వీ ప్రియదర్శనః ।**
**పితృవ ద్వర్తతే రామే మాతృవ న్మాం సమాచరన్ ॥ 60**

**పదచ్ఛేదము** :– సింహస్కంధః – మహాబాహుః – మనస్వీ – ప్రియదర్శనః – పితృవత్ – వర్తతే – రామే – మాతృవత్ – మాం – సమాచరన్ ॥

**అన్వయక్రమము** :– సింహస్కంధః మహాబాహుః మనస్వీ ప్రియదర్శనః (సః) మాతృవత్ మాం సమాచరన్ రామే పితృవత్ వర్తతే.

**ప్రతిపదార్థము** :– సింహస్కంధః = సింహమువంటి మూపు గలవాడును, మహాబాహుః = బలిష్ఠమైన భుజములు గలవాడును, మనస్వీ = ధీరుడైనవాడును, ప్రియదర్శనః = ప్రియమైన రూపము గలవాడు నగు, సః = ఆతడు, మాతృవత్ = తల్లినివలెనే, మాం = నన్ను, సమాచరన్ = పరిచరించుచు, రామే = శ్రీరామునియెడ, పితృవత్ = తండ్రియెడవలెనే, వర్తతే = ప్రవర్తించుచుండువాడు.

**తాత్పర్యము** :– మహావీర లక్షణములు గలవాడు, పరమధీరుడు ప్రియదర్శనుడు అగు ఆ లక్ష్మణుడు నన్ను తన తల్లినివలెనే సేవించుచు శ్రీరాముని యెడ తన తండ్రియెడవలె ప్రియముతోడను భక్తితోడను ప్రవర్తించువాడు.

**శ్లో॥ హ్రియమాణాం తదా వీరో న తు మాం వేద లక్ష్మణః ।**
**వృద్ధోపసేవీ లక్ష్మీవాన్ శక్తో న బహుభాషితా ॥ 61**

**పదచ్ఛేదము** :– హ్రియమాణాం – తదా – వీరః – న – తు – మాం – వేద – లక్ష్మణః – వృద్ధోపసేవీ – లక్ష్మీవాన్ – శక్తః – న – బహుభాషితా ॥

**అన్వయక్రమము** :– వృద్ధోపసేవీ లక్ష్మీవాన్, శక్తః, న బహుభాషితా, వీరః లక్ష్మణః తదా హ్రియమాణాం మాం న తు వేద.

**ప్రతిపదార్థము** :– వృద్ధోపసేవీ = పెద్దలను వినయముతో సేవించువాడును, లక్ష్మీవాన్ = శుభలక్షణసమన్వితుడును, శక్తః = సమర్థుడును, న బహుభాషితా = ఎక్కువగా మాటలాడనివాడు నగు, వీరః లక్ష్మణః = వీరుడైన లక్ష్మణుడు, తదా = ఆనాడు, హ్రియమాణాం = అపహరింపబడుచున్నట్టి, మాం = నన్నుగూర్చి, న తు వేద = ఎఱుగనే ఎఱుగడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– "వీరః లక్ష్మణః హ్రియమాణాం మాం న వేద" దుర్వాక్యములచే తన మనస్సునకు బాధగలిగిన ఆ వీరుడైన లక్ష్మణుడు నేనట్లు రక్కసునిచే అపహరింప బడుదునని తెలిసికొనలేక పోయెను. లేనిచో నన్నాతడు విడిచి దూరమునకు బోవడు. నా దురదృష్టవశముచేతనే అట్లు అంతయును జరిగినదని నా భావము.

**తాత్పర్యము** :– మహావినయముతో పెద్దలను సేవించువాడు, సర్వశుభలక్షణ సంశోభితుడు, సమర్థుడైయుండియు ఎక్కువగ మాటలాడని స్వభావముగలవాడు మహావీరుడు అగు నా మఱది లక్ష్మణుడు ఆనాడు న న్నా దుర్మార్గుడు అపహరించునని ఏమియు ఎఱుగడు గదా!

**శ్లో॥ రాజపుత్రః ప్రియః శ్రేష్ఠ స్సదృశ శ్శ్వశురస్య మే ।**
**మత్తః ప్రియతరో నిత్యం భ్రాతా రామస్య లక్ష్మణః ॥ 62**

**పదచ్ఛేదము** :– రాజపుత్రః – ప్రియః – శ్రేష్ఠః – సదృశః – శ్వశురస్య – మే – మత్తః – ప్రియతరః – నిత్యం – భ్రాతా – రామస్య – లక్ష్మణః ॥

**అన్వయక్రమము** :– మే శ్వశురస్య సదృశః ప్రియః శ్రేష్ఠః రాజపుత్రః భ్రాతా లక్ష్మణః నిత్యం రామస్య మత్తః ప్రియతరః.

**ప్రతిపదార్థము** :– మే శ్వశురస్య = నా మామ దశరథునకు, సదృశః = తగినట్టియు, ప్రియః = ప్రియుడైనట్టియు, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైనట్టియు, రాజపుత్రః = రాజకుమారుడు అయినట్టియు, భ్రాతా లక్ష్మణః = తమ్ముడైన లక్ష్మణుడు, నిత్యం = ఎల్లప్పుడును, రామస్య = శ్రీరామునకు, మత్తః = నాకంటెను, ప్రియతరః = మిక్కిలి ఇష్టుడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :–** "మత్తః ప్రియః = మమాపి ప్రియః" అనగా నాకును మిక్కిలి ఇష్టుడు.

**తిలకము :–** రాజపుత్రప్రియశ్రేష్ఠః – శ్రీరామునకు ప్రియమైన వారిలో శ్రేష్ఠుడు.

**తాత్పర్యము :–** నా మామయైన దశరథునకు ఎల్లవిధముల సమానమైన వాడును, ప్రియమైన వాడును, శ్రేష్ఠుడైన రాజపుత్రుడును అగు నా మఱది లక్ష్మణుడు శ్రీరామునకు తన అనుంగు తమ్మునిగా నాకంటెను గూడ మిక్కిలి ప్రియమైనవాడు సుమా!

**శ్లో॥ నియుక్తో ధురి యస్యాం తు తా ముద్వహతి వీర్యవాన్ ।**
**యం దృష్ట్వా రాఘవో నైవ వృత్త మార్య మనుస్మరేత్ ॥ 63**

**శ్లో॥ స మమార్థాయ కుశలం వక్తవ్యో వచనా న్మమ ।**
**మృదు ర్నిత్యం శుచి ర్దక్షః ప్రియో రామస్య లక్ష్మణః ॥ 64**

**పదచ్ఛేదము :–** నియుక్తః – ధురి – యస్యాం – తు – తామ్ – ఉద్వహతి – వీర్యవాన్ – యం – దృష్ట్వా – రాఘవః – న – ఏవ – వృత్తమ్ – ఆర్యమ్ – అనుస్మరేత్ – సః – మమ – అర్థాయ – కుశలం – వక్తవ్యః – వచనాత్ – మమ – మృదుః – నిత్యం – శుచిః – దక్షః – ప్రియః – రామస్య – లక్ష్మణః ॥

**అన్వయక్రమము :–** (వానరశ్రేష్ఠః) యః వీర్యవాన్ యస్యాం ధురి నియుక్తః తాం ఉద్వహతి; రాఘవః యం దృష్ట్వా వృత్తమ్ ఆర్యం నైవ అనుస్మరేత్, సః మృదుః, శుచిః, దక్షః, నిత్యం రామస్య ప్రియః లక్ష్మణః మమ అర్థాయ మమ వచనాత్ కుశలం వక్తవ్యః.

**ప్రతిపదార్థము :–** (వానరశ్రేష్ఠ = ఓ వానరోత్తమా) యః వీర్యవాన్ = ఏ పరాక్రమశాలి, యస్యాం ధురి = ఏ (కార్య) భారమునందు, నియుక్తః = నియోగింపబడినవాడో, తాం = ఆ భారమును, ఉద్వహతి = చక్కగా నిర్వహించునో, రాఘవః = శ్రీరాముడు, యం = ఎవరినైతే, దృష్ట్వా = చూచుకొని, వృత్తమ్ ఆర్యం = చనిపోయిన తండ్రిని, నైవ అనుస్మరేత్ = స్మరింపకుండెనో, సః = అట్టి, మృదుః = సౌమ్యుడును, శుచిః = పరిశుద్ధుడును, దక్షః = సమర్థుడును, రామస్య = రామునకు, నిత్యం = ఎల్లప్పుడును, ప్రియః = ఇష్టుడును అగు, లక్ష్మణః = లక్ష్మణుడు, మమ వచనాత్ = నా మాటవలన, మమ అర్థాయ = నా నిమిత్తము, కుశలం = క్షేమము, వక్తవ్యః = అడుగబడవలయును.

**తాత్పర్యము :–** ఏ మహావీరుడు తనకు నియోగించిన కార్యభారమును మా సుఖముకొఱకై అతి సమర్థతతో చక్కగా నెఱవేర్చు చుండువాడో, ఎవ్వనిని చూచుకొనుచు

శ్రీరాముడు చనిపోయిన తండ్రిని మఱచిపోగలిగినాడో అట్టి సౌమ్యస్వభావుడును, పరిశుద్ధహృదయుడును, అతిసమర్థుడును, శ్రీరామునకు నిత్యము అత్యంతము ఇష్టమైనవాడును అగు అట్టి మా లక్ష్మణునితో నా మాటగా నాకొఱకై ప్రత్యేకముగా క్షేమవార్త నడిగితినని చెప్పుము.

**శ్లో॥ యథా హి వానరశ్రేష్ఠ దుఃఖక్షయకరో భవేత్ ।**
**త్వ మస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ ।**
**రాఘవ స్త్వత్సమారంభా న్మయి యత్నపరో భవేత్ ॥ 65**

**పదచ్ఛేదము** :- యథా - హి - వానరశ్రేష్ఠ - దుఃఖక్షయకరః - భవేత్ - త్వం - అస్మిన్ - కార్యనిర్యోగే - ప్రమాణం - హరిసత్తమ - రాఘవః - త్వత్సమారంభాత్ - మయి - యత్నపరః - భవేత్ ॥

**అన్వయక్రమము** :- వానరశ్రేష్ఠ! హరిసత్తమ! యథా (రాఘవః మమ) దుఃఖక్షయకరః భవేత్ (తథా) త్వమ్ అస్మిన్ కార్యనిర్యోగే ప్రమాణం హి! రాఘవః త్వత్సమారంభాత్ మయి యత్నపరః భవేత్.

**ప్రతిపదార్థము** :- వానరశ్రేష్ఠ! = ఓ కపిశ్రేష్ఠుడా! హరిసత్తమ! = ఓ వానరోత్తమా! యథా = ఏ విధముగా, (రాఘవః = శ్రీరాముడు, మమ = నాకు) దుఃఖక్షయకరః = దుఃఖమును పోగొట్టువాడు, భవేత్ = అగునో, (తథా = అట్లే) త్వం = నీవు, అస్మిన్ = ఈ, కార్యనిర్యోగే = కార్యనిర్వహణమునందు, ప్రమాణం హి = ఆధారము సుమా! రాఘవః = శ్రీరాముడు, త్వత్సమారంభాత్ = నీ ప్రయత్నము వలన, మయి = నాయెడ, యత్నపరః = ప్రయత్నశీలుడు, భవేత్ = కావలెను.

**తాత్పర్యము** :- ఓ వానరోత్తమా! ఏ విధముగా శ్రీరాముడు నా దుఃఖమును పోగొట్టునట్టివాడు అగునో ఆ విధముగా కార్యమును చక్కబెట్టవలసినవాడవు నీవే సుమా! నీ పూనికవలననే శ్రీరాముడు నా విముక్తి యెడ యత్నపరుడు గావలసియున్నది.

**శ్లో॥ ఇదం బ్రూయాశ్చ మే నాథం శూరం రామం పునః పునః ।**
**జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ ।**
**ఊర్ధ్వం మాసా న్న జీవేయం సత్యే నాహం బ్రవీమి తే ॥ 66**

**పదచ్ఛేదము** :- ఇదం - బ్రూయాః - చ - మే - నాథం - శూరం - రామం - పునః - పునః - జీవితం - ధారయిష్యామి - మాసం - దశరథాత్మజ - ఊర్ధ్వం - మాసాత్ - న - జీవేయం - సత్యేన - అహం - బ్రవీమి - తే ॥

**అన్వయక్రమము** :- మే నాథం శూరం రామం పునః పునః ఇదం చ బ్రూయాః; దశరథాత్మజ! మాసం జీవితం ధారయిష్యామి; మాసాత్ ఊర్ధ్వం న జీవేయమ్; అహం సత్యేన తే బ్రవీమి.

**ప్రతిపదార్థము** :- మే = నా యొక్క, నాథం = భర్తయైన, శూరం = శూరుడైన, రామం = రాముని గూర్చి, పునః పునః = మఱలమఱల, ఇదం చ = ఈ మాటనుకూడ, బ్రూయాః = చెప్పుము; దశరథాత్మజ! = ఓ రామా! మాసం = ఒక్క మాసము, జీవితం = జీవితమును, ధారయిష్యామి = ధరించగలను; మాసాత్ ఊర్ధ్వం = ఒకనెలకన్న మించి, న జీవేయం = బ్రదుకను, అహం = నేను, సత్యేన = యథార్థముగా, తే = నీకు, బ్రవీమి = చెప్పుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :- ఇంకను రావణుడిచ్చిన గడువు రెండు నెలలకు మించి యుండగా ఒక్క నెలకే ప్రాణములు విడిచెద నన నేల!

ఇది పదునాలుగవ సంవత్సరము, ఫాల్గుణమాసము, సీతారామలక్ష్మణులు అయోధ్య విడిచినది చైత్రశుద్ధచతుర్థి. పదునాలుగు సంవత్సరములు పూర్తి యగుటకు పందొమ్మిది దినములే కొఱతయున్నది. పదునైదవ సంవత్సరము మొదటిదినము శ్రీరాము డయోధ్యకు రాకున్నచో భరతు డగ్నిప్రవేశము చేసెదనని శపథము చేసెను. కావున నేటి కిరువదవనా డయోధ్యలో రామచంద్రమూర్తి యుండక తప్పదు. ఆయన ఇటు రాక అయోధ్యకు బోయెనేని నా యాశ భంగమగును. దానితో బ్రాణములు పోవును. కావున నెలదినములు బ్రదికియుండెద ననెను.

**తాత్పర్యము** :- మహావీరుడైన నా భర్తతో ఈ విషయమును మఱల మఱల చెప్పుము. రామా! ఒక్క నెల మాత్రము నేను ప్రాణములను ధరించి యుండగలను. మాసము గడచిన పిమ్మట నేను ప్రాణములతో నుండను. నేను యథార్థముగనే నీ కీ విషయమును తెలుపుచున్నాను.

**శ్లో॥ రావణే నోపరుద్ధాం మాం నికృత్యా పాపకర్మణా ।**
**త్రాతు మర్హసి వీర త్వం పాతాళాదివ కౌశికీమ్ ॥ 67**

**పదచ్ఛేదము** :- రావణేన - ఉపరుద్ధాం - మాం - నికృత్యా - పాపకర్మణా - త్రాతుమ్ - అర్హసి - వీర - త్వం - పాతాళాత్ - ఇవ - కౌశికీమ్ ॥

**అన్వయక్రమము** :- వీర! నికృత్యా పాపకర్మణా రావణేన ఉపరుద్ధాం మాం పాతాళాత్

కౌశికీమ్ ఇవ త్రాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :–** వీర! = ఓ వీరుడా! పాపకర్మణా = పాపాత్ముడైనట్టి, రావణేన = రావణునిచే, నికృత్యా = అవమానముచేత, ఉపరుద్ధాం = నిరోధింపబడినట్టి, మాం = నన్ను, పాతాళాత్ = పాతాళలోకమునుండి, కౌశికీమ్ ఇవ = కౌశికినివలె, త్రాతుం = రక్షించుటకు, అర్హసి = తగియున్నావు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు :–** 'పాతాళాదివ కౌశికీం' పూర్వము వృత్రాసురవధచే ఇంద్రునకు బ్రహ్మహత్యాపాతకము సంభవింపగా ఆ ఇంద్రునియొక్క లక్ష్మి స్వర్గమును విడిచి పాతాళమునకు బోయెను. అప్పుడు భగవానుడగు ఆదినారాయణుని దేవతలందఱును ప్రార్థింపగా ఆతడు పాతాళముననున్న ఆ లక్ష్మిని స్వర్గమునకు గొనివచ్చి దేవేంద్రునకు ప్రసాదించెను. ఆ పురాణప్రసిద్ధమైన గాథను ఇచ్చట అనుసంధించు కొనవలెను.

**రా.శిరోమణి :–** పూర్వము వరాహావతారమున శ్రీమహావిష్ణువు పాతాళనిమగ్నయైన కౌశికిని అనగా పృథివిని ఉద్ధరించి రక్షించినట్లుగా నని భావము.

**గోవిందరాజీయము :–** ఉచథ్యుని భార్య యమునలో స్నానము చేయుచుండగా వరుణు డామె నపహరించి పాతాళమునకు గొనిపోయెను. అప్పుడు ఉచథ్యుడు నారదుని ద్వారా తన భార్యను తిరిగి ఇమ్మని వరుణుని యాచించెను. కాని ఆత డియ్యకుండుటచే ఉచథ్యుడు కుపితుడై పాతాళహ్రదమును శోషింపజేసి ఆమెను సంపాదించుకొనెను. ఆ ఉచథ్యుని భార్యయే కౌశికి యని యందురు. (భారతము)

**తాత్పర్యము :–** పాపాత్ముడైన రావణునిచే మోసముతో నిరోధింపబడినట్టి నన్ను పాతాళలోకమునుండి పూర్వ మింద్రుడు కౌశికి నుద్ధరించినట్లుగా మహావీరుడవైన నీవు నన్ను కాపాడుటకు సమర్థుడవు.

**శ్లో॥ తతో వస్త్రగతం ముక్త్వా దివ్యం చూడామణిం శుభమ్ ।**
**ప్రదేయో రాఘవాయేతి సీతా హనుమతే దదౌ ॥ 68**

**పదచ్ఛేదము :–** తతః – వస్త్రగతం – ముక్త్వా – దివ్యం – చూడామణిం – శుభమ్ – ప్రదేయః – రాఘవాయ – ఇతి – సీతా – హనుమతే – దదౌ ॥

**అన్వయక్రమము :–** తతః సీతా వస్త్రగతం దివ్యం శుభం చూడామణిం ముక్త్వా రాఘవాయ ప్రదేయః ఇతి (ఉక్త్వా) హనుమతే దదౌ.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, సీతా = సీతమ్మ, వస్త్రగతం = చీరయందున్న, దివ్యం = దివ్యమైనట్టి, శుభం = మంగళకరమైనట్టి, చూడామణిం = చూడామణిని (శిరోభూషణమును), ముక్త్వా = (ముడి) విప్పి, రాఘవాయ = శ్రీరామునకు, ప్రదేయః = ఈయవలసియున్నది, ఇతి = అని, (ఉక్త్వా = పలికి) హనుమతే = హనుమకు, దదౌ = ఇచ్చెను.

**తాత్పర్యము** :- అప్పుడు సీతాదేవి తన చీరకొంగున ముడివేసియున్న దివ్యమైన మంగళకరమైనట్టి తన చూడామణిని విప్పి దీనిని శ్రీరామునకు సమర్పింపుమని హనుమ చేతియం దుంచెను.

**శ్లో॥ ప్రతిగృహ్య తతో వీరో మణిరత్న మనుత్తమమ్ ।**
**అంగుళ్యా యోజయామాస న హ్యస్య ప్రాభవ ద్భుజః ॥ 69**

**పదచ్ఛేదము** :- ప్రతిగృహ్య - తతః - వీరః - మణిరత్నమ్ - అనుత్తమమ్ - అంగుళ్యా - యోజయామాస - న - హి - అస్య - ప్రాభవత్ - భుజః ॥

**అన్వయక్రమము** :- తతః వీరః అనుత్తమం మణిరత్నం ప్రతిగృహ్య అంగుళ్యా యోజయామాస; అస్య భుజః న హి ప్రాభవత్.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, వీరః = వీరుడైన హనుమ, అనుత్తమం = శ్రేష్ఠమైనట్టి, మణిరత్నం = చూడామణిని, ప్రతిగృహ్య = స్వీకరించి, అంగుళ్యా = వ్రేలితో, యోజయామాస = చేర్చుకొనెను, అస్య = అతనియొక్క, భుజః = భుజము, న హి ప్రాభవత్ = చాలకుండెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :- అంగుళ్యా యోజయామాస; న హ్యస్య ప్రాభవత్ భుజః - చూడామణి ఆభరణమునందు కేశములు జొనుపుటకై యుండు రంధ్రమున వ్రేలికి తొడుగుకొనెను. హనుమ మిక్కిలి సూక్ష్మరూపమున నున్నాడు గదా! ఆతనికి దానిని భుజమునకే తొడిగికొన వచ్చునేమో అనిపించెను. కాని ఆతని భుజము దానిని తొడిగికొనుటకు సరిపడలేదు. అందుచేత వ్రేలికి తొడిగికొనెనని భావము.

**తిలకము** :- చూడామణి భూషణమునకే చిన్న దార మున్నది. దానిని హనుమ తన వ్రేలికి ముడివేసికొనెను దానిని భుజమునకు కట్టుకొనుటకు మాత్రము సరిపడలేదు. అందుచే వ్రేలికి కట్టుకొనెను. అంతియే గాక భుజమునకు కట్టుకొన్నచో ఎల్లవారలకును గాన వచ్చును. తన గుప్పిటియందు గూడ దాచుటకు వీలుపడదు అని యెంచి

హనుమ వ్రేలికి ధరించెను.

**తాత్పర్యము :–** సీతమ్మ యొసగిన ఆ దివ్యమైన చూడామణిని హనుమ గ్రహించి తన వ్రేలికి తొడిగికొనెను. భుజమునకు కట్టుకొనుట తగదని భావించి ఆతడు వ్రేలికి ధరించెను.

**శ్లో॥ మణిరత్నం కపివరః ప్రతిగృ హ్యాభివాద్య చ ।**
**సీతాం ప్రదక్షిణం కృత్వా ప్రణతః పార్శ్వతః స్థితః ॥ 70**

**పదచ్ఛేదము :–** మణిరత్నం – కపివరః – ప్రతిగృహ్య – అభివాద్య – చ – సీతాం – ప్రదక్షిణం – కృత్వా – ప్రణతః – పార్శ్వతః – స్థితః ॥

**అన్వయక్రమము :–** కపివరః మణిరత్నం ప్రతిగృహ్య సీతామ్ అభివాద్య చ ప్రదక్షిణం కృత్వా ప్రణతః పార్శ్వతః స్థితః.

**ప్రతిపదార్థము :–** కపివరః = వానరశ్రేష్ఠుడైన హనుమ, మణిరత్నం = చూడామణిని, ప్రతిగృహ్య = గ్రహించి, సీతాం = సీతమ్మను, అభివాద్య చ = మ్రొక్కియు, ప్రదక్షిణం కృత్వా = ప్రదక్షిణమును గావించి, ప్రణతః = వినయవంతుడై, పార్శ్వతః = ప్రక్కగా, స్థితః = నిలచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** హనుమంతుడు సీతమ్మకు ప్రదక్షిణము చేసి నమస్కరించినట్లు చెప్పబడుటచే హనుమంతునకు సీతారాము లిరువురును సమానులే యైనను భక్తిముల్లు కొంచెను సీతమ్మవైపు వ్రాలెనేమో యని చెప్పవలసియున్నది.

**తాత్పర్యము :–** అప్పుడు హనుమ ఆ చూడామణి నట్లు గ్రహించి సీతాదేవికి మ్రొక్కి, ప్రదక్షిణము గావించి శిరమువంచి ప్రక్కగా నిలచియుండెను.

**శ్లో॥ హర్షేణ మహతా యుక్త స్సీతాదర్శనజేన సః ।**
**హృదయేన గతో రామం శరీరేణ చ విష్ఠితః ॥ 71**

**పదచ్ఛేదము :–** హర్షేణ – మహతా – యుక్తః – సీతాదర్శనజేన – సః – హృదయేన – గతః – రామం – శరీరేణ – చ – విష్ఠితః ॥

**అన్వయక్రమము :–** సః సీతాదర్శనజేన మహతా హర్షేణ యుక్తః హృదయేన రామం గతః, శరీరేణ విష్ఠితః చ.

**ప్రతిపదార్థము :-** సః = ఆ హనుమ, సీతాదర్శనజేన = సీతమ్మయొక్క దర్శనము వలన గల్గినట్టి, మహతా = గొప్పదైన, హర్షేణ = ఆనందముతో, యుక్తః = కూడినవాడై, హృదయేన = మనస్సుతో, రామం = శ్రీరాముని, గతః = పొందెను. శరీరేణ = శరీరముచే, విష్ఠితః = నిలచియుండెను.

**తాత్పర్యము :-** ఆ హనుమ సీతాదేవిని దర్శించిన ఆనందముతో నిండినవాడై ఒక్క సారిగ మనస్సుతో శ్రీరాముని సన్నిధికి చేరుకొనెను. ఆతని శరీరము మాత్రమే అచట నుండెను.

**శ్లో॥ మణివర ముపగృహ్య తం మహార్హం**
**జనకనృపాత్మజయా ధృతం ప్రభావాత్ ।**
**గిరిరివ పవనావధూతముక్తః**
**సుఖితమనాః ప్రతిసంక్రమం ప్రపేదే ॥ 72**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"వాయసవృత్తాంతకథనం" నామ*
*అష్టత్రింశస్సర్గః.*

**పదచ్ఛేదము :-** మణవరమ్ - ఉపగృహ్య - తం - మహార్హం - జనకనృపాత్మజయా - ధృతం - ప్రభావాత్ - గిరిః - ఇవ - పవనావధూతముక్తః - సుఖితమనాః - ప్రతిసంక్రమం - ప్రపేదే ॥

**అన్వయక్రమము :-** జనకనృపాత్మజయా ప్రభావాత్ ధృతం మహార్హం తం మణివరం ఉపగృహ్య (సః) పవనావధూతముక్తః గిరిః ఇవ సుఖితమనాః ప్రతిసంక్రమం ప్రపేదే.

**ప్రతిపదార్థము :-** జనకనృపాత్మజయా = జానకీదేవిచే, ప్రభావాత్ = మహిమవలన, ధృతం = ధరింపబడినట్టి, మహార్హం = అమూల్యమైనట్టి, తం మణివరం = ఆ గొప్పదైన చూడామణిని, ఉపగృహ్య = స్వీకరించి, (సః = ఆ హనుమ) పవనావ ధూతముక్తః = వాయువుయొక్క కంపనమునుండి విడువబడినట్టి, గిరిః ఇవ = పర్వతమువలె, సుఖితమనాః = సంతోషము నొందిన మనస్సుగలవాడై, ప్రతిసంక్రమం = తిరుగు ప్రయాణమును, ప్రపేదే = పూనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ప్రభావాత్ ధృతం – సీతాదేవి తన సామర్థ్యముచే రాక్షసస్త్రీల కెవ్వరికిని కాన్పింపకుండ ఆ చూడామణిని ధరించెనని భావము.

**వాసుదాసస్వామి :–** శ్యమంతకమణినివలె నీ మణి నందఱును ధరింపయోగ్యులు గారు.

**తాత్పర్యము :–** జానకీదేవి తన ప్రభావవిశేషముచే రాక్షసాంగనల కంటబడకుండ ధరించినట్టి అమూల్యమైన ఆ చూడామణిని ఆమెకడనుండి స్వీకరించి హనుమ పెనుగాలిచే కంపించి మఱల యథాస్థితి నొందిన పర్వతమువలె, సీతాదేవి గాన్పించలేదను దుఃఖముతో వ్యాకులత చెందినను తిరిగి ఆమె దర్శనముచే మహానందము నొంది తన తిరుగు ప్రయాణమునకు సమకట్టెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"వాయస వృత్తాంత కథనము" అను*
*ముప్పదియెనిమిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకోనచత్వారింశసర్గ

**శ్లో॥ మణిం దత్త్వా తత స్సీతా హనూమంత మథాబ్రవీత్ ।**
**అభిజ్ఞాన మభిజ్ఞాత మేత ద్రామస్య తత్త్వతః ॥ 1**

**పదచ్ఛేదము :–** మణిం – దత్త్వా – తతః – సీతా – హనూమంతమ్ – అథ – అబ్రవీత్ – అభిజ్ఞానమ్ – అభిజ్ఞాతం – ఏతత్ – రామస్య – తత్త్వతః ॥

**అన్వయక్రమము :–** తతః సీతా మణిం దత్త్వా అథ హనూమంతమ్ అబ్రవీత్ "ఏతత్ రామస్య తత్త్వతః అభిజ్ఞాతం అభిజ్ఞానమ్."

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, సీతా = సీతాదేవి, మణిం = చూడామణిని, దత్త్వా = ఇచ్చి, అథ = అనంతరము, హనూమంతం = హనుమనుగూర్చి, అబ్రవీత్ = పలికెను, ఏతత్ = ఇది, రామస్య = శ్రీరామునకు, తత్త్వతః = యథార్థముగా, అభిజ్ఞాతమ్ = గుర్తింపబడినట్టి, అభిజ్ఞానమ్ = చిహ్నము.

**తాత్పర్యము :–** అటుపిమ్మట సీతాదేవి హనుమకు చూడామణి నొసగి అతనితో నిట్లు పలికెను. ఈ చూడామణి రామునకు నన్ను బాగుగా గుర్తు చేయునట్టి మంచి ఆనవా లగును సుమా!

**శ్లో॥ మణిం దృష్ట్వా తు రామో వై త్రయాణాం సంస్మరిష్యతి ।**
**వీరో జనన్యా మమ చ రాజ్ఞో దశరథస్య చ ॥ 2**

**పదచ్ఛేదము :–** మణిం – దృష్ట్వా – తు – రామః – వై – త్రయాణాం – సంస్మరిష్యతి – వీరః – జనన్యాః – మమ – చ – రాజ్ఞః – దశరథస్య – చ ॥

**అన్వయక్రమము :–** వీరః రామః మణిం దృష్ట్వా జనన్యాః, మమ చ, రాజ్ఞః, దశరథస్య చ, త్రయాణాం, సంస్మరిష్యతి.

**ప్రతిపదార్థము :–** వీరః = వీరుడైనట్టి, రామః = శ్రీరాముడు, మణిం = చూడామణిని, దృష్ట్వా = చూచి, జనన్యాః = తల్లిని, మమ చ = నన్నును, రాజ్ఞః = రాజైన, దశరథస్య చ = దశరథునిని, త్రయాణాం = ముగ్గురను, సంస్మరిష్యతి = బాగుగ

స్మరింపగలడు.

**తాత్పర్యము** :- ఈ చూడామణిని చూచినంతనే నా వివాహ సమయమున నాకు దీనిని కానుకగా నొసగిన మహారాజైన దశరథుని, దీనిని తలపై అలంకరించినట్టి నా తల్లిని, ఆ అలంకారమును ధరించినట్టి నన్నును, ఈ మా ముగ్వురిని కూడ నా నాథుడు జ్ఞాపకము తెచ్చుకొనును.

**శ్లో॥ స భూయ స్త్వం సముత్సాహచోదితో హరిసత్తమ ।**
**అస్మి న్కార్యసమారంభే ప్రచింతయ యదుత్తరమ్ ॥ 3**

**పదచ్ఛేదము** :- సః - భూయః - త్వం - సముత్సాహచోదితః - హరిసత్తమ - అస్మిన్ - కార్యసమారంభే - ప్రచింతయ - యత్ - ఉత్తరమ్ ॥

**అన్వయక్రమము** :- హరిసత్తమ! సః త్వం భూయః సముత్సాహచోదితః (సన్) అస్మిన్ కార్యసమారంభే యత్ ఉత్తరం (తత్) ప్రచింతయ.

**ప్రతిపదార్థము** :- హరిసత్తమ! = ఓ వానరశ్రేష్ఠుడా! సః త్వం = అట్టి నీవు, అస్మిన్ కార్యసమారంభే = ఈ కార్యసమారంభమున, భూయః = ఎక్కువగా, సముత్సాహచోదితః = గొప్పఉత్సాహముచే ప్రేరేపింపబడినవాడవై, యత్ ఉత్తరం = మీది కర్తవ్యము ఏదియో, (తత్ = దానిని) ప్రచింతయ = బాగుగా ఆలోచింపుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :- 'సముత్సాహచోదితః' - మణిదర్శనమువలన కలిగినట్టి శ్రీరాముని యుద్ధోత్సాహమును చూచు సమయమున నీవు ఇంకను ఆ శ్రీరామునిచే ప్రేరేపింప బడుదువని భావము.

**తాత్పర్యము** :- ఓ వానరశ్రేష్ఠుడా! ఈ ప్రస్తుత కార్యసమారంభమునందు నీవు సమధికోత్సాహపూరితుడవై భావికర్తవ్యమును గూర్చి బాగుగా ఆలోచింప వలసియున్నది.

**శ్లో॥ త్వ మస్మి న్కార్యనిర్యోగే ప్రమాణం హరిసత్తమ ।**
**తస్య చింతయ యో యత్నః దుఃఖక్షయకరో భవేత్ ॥ 4**

**పదచ్ఛేదము** :- త్వం - అస్మిన్ - కార్యనిర్యోగే - ప్రమాణం - హరిసత్తమ - తస్య - చింతయ - యః - యత్నః - దుఃఖక్షయకరః - భవేత్ ॥

**అన్వయక్రమము** :- హరిసత్తమ! అస్మిన్ కార్యనిర్యోగే త్వం ప్రమాణమ్. తస్య యః

యత్నః దుఃఖక్షయకరః (తం) చింతయ.

**ప్రతిపదార్థము** :– హరిసత్తమ! = ఓ వానరోత్తమా!, అస్మిన్ కార్యనిర్యోగే = ఈ కార్యనిర్వహణమునందు, త్వం = నీవు, ప్రమాణం = ప్రమాణము, తస్య = దానికి, యః యత్నః = ఏ ప్రయత్నము, దుఃఖక్షయకరః = దుఃఖము నశింపచేయునట్టిది, భవేత్ = అగునో, (తం = దానిని) చింతయ = ఆలోచించుము.

**తాత్పర్యము** :– వానరోత్తమా! ఈ భావి కార్యనిర్వహణము అంతయును నీ మీదనే ఆధారపడి యున్నది. అందు నా దుఃఖము తొలగి పోవునట్లుగా చేయవలసిన ప్రయత్నము ఎట్టిదో నీవే ఆలోచింపుము.

**శ్లో॥ హనుమన్ యత్న మాస్థాయ దుఃఖక్షయకరో భవ ॥ 5**

**పదచ్ఛేదము** :– హనుమన్ – యత్నమ్ – ఆస్థాయ – దుఃఖక్షయకరః – భవ ॥

**అన్వయక్రమము** :– హనుమన్! (త్వం) (తం) యత్నమ్ ఆస్థాయ దుఃఖక్షయకరః భవ.

**ప్రతిపదార్థము** :– హనుమన్ = ఓ ఆంజనేయా! (త్వం = నీవు) (తం) యత్నమ్ = (అట్టి) యత్నమును, ఆస్థాయ = చేపట్టి, దుఃఖక్షయకరః = దుఃఖమును పోగొట్టువాడవు, భవ = అగుము.

**తాత్పర్యము** :– ఓ హనుమా! నీవే అట్టి తగిన ప్రయత్నమును గావించి నా దుఃఖమును నిర్మూలింప వలసియున్నది సుమా!

**శ్లో॥ స తథేతి ప్రతిజ్ఞాయ మారుతి ర్భీమవిక్రమః ।**
**శిరసాఽఽవంద్య వైదేహీం గమనా యోపచక్రమే ॥ 6**

**పదచ్ఛేదము** :– సః – తథా – ఇతి – ప్రతిజ్ఞాయ – మారుతిః – భీమవిక్రమః – శిరసా – ఆవంద్య – వైదేహీం – గమనాయ – ఉపచక్రమే ॥

**అన్వయక్రమము** :– భీమవిక్రమః సః మారుతిః తథా ఇతి ప్రతిజ్ఞాయ వైదేహీం శిరసా ఆవంద్య గమనాయ ఉపచక్రమే.

**ప్రతిపదార్థము** :– భీమవిక్రమః = భయంకరపరాక్రముడైన, సః మారుతిః = ఆ హనుమ, తథా ఇతి = అట్లే యని, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞచేసి, వైదేహీం = సీతాదేవిని గూర్చి, శిరసా = శిరస్సుతో, ఆవంద్య = మ్రొక్కి, గమనాయ = పయనమునకు, ఉపచక్రమే = ప్రారంభించెను.

**తాత్పర్యము** :- మహా పరాక్రమ సంపన్నుడైన హనుమ అట్లే యొనర్చెదనని ఆమెకు వాగ్దానముచేసి శిరమువంచి మ్రొక్కి తన ప్రయాణమునకు సిద్ధమయ్యెను.

**శ్లో॥ జ్ఞాత్వా సంప్రస్థితం దేవీ వానరం మారుతాత్మజమ్ ।**
**బాష్పగద్గదయా వాచా మైథిలీ వాక్య మబ్రవీత్ ॥ 7**

**పదచ్ఛేదము** :- జ్ఞాత్వా - సంప్రస్థితం - దేవీ - వానరం - మారుతాత్మజమ్ - బాష్పగద్గదయా - వాచా - మైథిలీ - వాక్యమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- దేవీ మైథిలీ మారుతాత్మజం వానరం సంప్రస్థితం జ్ఞాత్వా బాష్పగద్గదయా వాచా వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- దేవీ మైథిలీ = పూజ్యురాలయిన జానకీదేవి, మారుతాత్మజం = వాయునందనుడైన, వానరం = హనుమను, సంప్రస్థితం = బయలుదేరినవానినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, బాష్పగద్గదయా = కన్నీటిచే డగ్గుత్తిక పడినట్టి, వాచా = వాక్కుతో, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- జానకీదేవి హనుమ అటనుండి బయలుదేరుచుండుట గమనించి పొంగుచున్న దుఃఖముచే డగ్గుత్తిక పడిన స్వరముతో ఆతనిని చూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ హనుమన్ కుశలం బ్రూయా స్సహితౌ రామలక్ష్మణౌ ।**
**సుగ్రీవం చ సహామాత్యం సర్వాన్ వృద్ధాం శ్చ వానరాన్ ।**
**బ్రూయా స్త్వం వానరశ్రేష్ఠ కుశలం ధర్మసంహితమ్ ॥ 8**

**పదచ్ఛేదము** :- హనుమన్ - కుశలం - బ్రూయాః - సహితౌ - రామలక్ష్మణౌ - సుగ్రీవం - చ - సహామాత్యం - సర్వాన్ - వృద్ధాన్ - చ - వానరాన్ - బ్రూయాః - త్వం - వానరశ్రేష్ఠ - కుశలం - ధర్మసంహితమ్ ॥

**అన్వయక్రమము** :- హనుమన్! సహితౌ రామలక్ష్మణౌ త్వం కుశలం బ్రూయాః; వానరశ్రేష్ఠ! సహామాత్యం సుగ్రీవం చ, వృద్ధాన్ వానరాన్ చ ధర్మసంహితం కుశలం బ్రూయాః.

**ప్రతిపదార్థము** :- హనుమన్ = ఓ ఆంజనేయా! సహితౌ = కలసికొన్నట్టి, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, త్వం = నీవు, కుశలం = క్షేమమును, బ్రూయాః = పలుకుము, వానరశ్రేష్ఠ! = ఓ వానరోత్తమా! సహామాత్యం = మంత్రులతో గూడినట్టి, సుగ్రీవం చ = సుగ్రీవునిని, వృద్ధాన్ = పెద్దలైనట్టి, వానరాన్ సర్వాన్ చ = వానరుల నందఱిని గూడ, ధర్మసంహితం = ధర్మసంయుతముగా, కుశలం = క్షేమమును, బ్రూయాః =

పలుకుము.

**తాత్పర్యము :-** ఓ ఆంజనేయా! అన్నదమ్ములైన రామలక్ష్మణుల నిరువురను కుశలము నడిగితినని చెప్పుము. మఱియు తన మంత్రులతో గూడియున్న సుగ్రీవుని, అచ్చట గల పెద్దలైన వానరుల నెల్లరను ధర్మసమ్మతముగ నేను క్షేమము నడుగుచున్నట్లుగా తెలుపుము.

**శ్లో॥ యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః ।**
**అస్మాత్ దుఃఖాంబుసంరోధాత్త్వం సమాధాతు మర్హసి ॥ 9**

**పదచ్ఛేదము :-** యథా - చ - సః - మహాబాహుః - మాం - తారయతి - రాఘవః - అస్మాత్ - దుఃఖాంబుసంరోధాత్ - త్వం సమాధాతుమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము :-** సః మహాబాహుః రాఘవః అస్మాత్ దుఃఖాంబుసంరోధాత్ యథా మాం తారయతి చ, త్వం (తథా) సమాధాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :-** మహాబాహుః = మహావీరుడైన, సః రాఘవః = ఆ శ్రీరాముడు, మాం = నన్ను, అస్మాత్ = ఈ, దుఃఖాంబుసంరోధాత్ = దుఃఖమనెడి ఉప్పెననుండి, యథా = ఏ విధముగా, తారయతి = దాటించునో, తథా = ఆ రీతిగా, త్వం = నీవు, సమాధాతుం = ఒనరించుటకు, అర్హసి = తగుదువు.

**తాత్పర్యము :-** మహావీరుడైన శ్రీరాముడు నన్నీ దుఃఖసముద్రము నుండి ఎట్లు దాటింపగలడో ఆ విధానమును నీవే సమకూర్చుటకు అర్హుడవు సుమా!

**శ్లో॥ జీవంతీం మాం యథా రామ స్సంభావయతి కీర్తిమాన్ ।**
**తత్త్వయా హనుమ న్వాచ్యం వాచా ధర్మ మవాప్నుహి ॥ 10**

**పదచ్ఛేదము :-** జీవంతీం - మాం - యథా - రామః - సంభావయతి - కీర్తిమాన్ - తత్ - త్వయా - హనుమాన్ - వాచ్యం - వాచా - ధర్మమ్ - అవాప్నుహి ॥

**అన్వయక్రమము :-** హనుమన్! కీర్తిమాన్ రామః జీవంతీం మాం యథా సంభావయతి తత్ త్వయా వాచ్యమ్; వాచా ధర్మమ్ అవాప్నుహి.

**ప్రతిపదార్థము :-** హనుమన్ = ఓ ఆంజనేయా, కీర్తిమాన్ = యశశ్శాలియైన, రామః = శ్రీరాముడు, జీవంతీం మాం = బ్రదికియున్నట్టి నన్ను, యథా = ఎట్లుగా, సంభావయతి = ఆదరించునో, తత్ = ఆ విధమును, త్వయా = నీచే, వాచ్యమ్ = చెప్పబడవలెను, వాచా = మాటతో, ధర్మమ్ = ధర్మమును, అవాప్నుహి = పొందుము.

**తాత్పర్యము :–** ఓ ఆంజనేయా! కీర్తిశాలియైన శ్రీరాముడు నేను జీవించియుండగనే నన్ను చేరి ఆదరించునట్లుగా నీ వతనితో తగు విధముగా పలుకవలెను. ఈ మాట సహాయముచేసి నీవు పుణ్యము గట్టుకొనుము.

**శ్లో॥ నిత్య ముత్సాహయుక్తాశ్చ వాచ శ్శ్రుత్వా త్వ యేరితాః ।**
**వర్ధిష్యతే దాశరథేః పౌరుషం మదవాప్తయే ॥ 11**

**పదచ్ఛేదము :–** నిత్యమ్ – ఉత్సాహయుక్తాః – చ – వాచః – శ్రుత్వా – త్వయా – ఈరితాః – వర్ధిష్యతే – దాశరథేః – పౌరుషం – మదవాప్తయే ॥

**అన్వయక్రమము :–** నిత్యం త్వయా ఈరితాః ఉత్సాహయుక్తాః వాచః శ్రుత్వా దాశరథేః మదవాప్తయే పౌరుషం వర్ధిష్యతే.

**ప్రతిపదార్థము :–** నిత్యం = నిరంతరము, త్వయా = నీచేత, ఈరితాః = పలుకబడినట్టి, ఉత్సాహయుక్తాః = ఉత్సాహకరములైనట్టి, వాచః = మాటలను, శ్రుత్వా = విని, దాశరథేః = శ్రీరామునకు, మదవాప్తయే = నన్ను పొందుటకై, పౌరుషం = పౌరుషము, వర్ధిష్యతే = వృద్ధినొందగలదు.

**తాత్పర్యము :–** ఉత్సాహమును కల్గించునట్టి నీ మాటలు నిత్యము వినుచుండుటవలన శ్రీరామునిలో నన్ను సంపాదించుటకై గొప్ప పౌరుషము పెంపొందును.

**శ్లో॥ మత్సందేశయుతా వాచ స్త్వత్త శ్శ్రుత్వా చ రాఘవః ।**
**పరాక్రమే మతిం వీరో విధివ త్సంవిధాస్యతి ॥ 12**

**పదచ్ఛేదము :–** మత్సందేశయుతాః – వాచః – త్వత్తః – శ్రుత్వా – చ – రాఘవః – పరాక్రమే – మతిం – వీరః – విధివత్ – సంవిధాస్యతి ॥

**అన్వయక్రమము :–** వీరః రాఘవః త్వత్తః మత్సందేశయుతాః వాచః శ్రుత్వా చ విధివత్ పరాక్రమే మతిం సంవిధాస్యతి.

**ప్రతిపదార్థము :–** వీరః = వీరుడైనట్టి, రాఘవః = శ్రీరాముడు, త్వత్తః = నీనుండి, మత్సందేశయుతాః = నా సందేశముతో గూడినట్టి, వాచః = మాటలను, శ్రుత్వా చ = వినినంతనే, విధివత్ = తగుపద్ధతిననుసరించి, పరాక్రమే = పరాక్రమించుటయందు, మతిం = నిశ్చయమును, సంవిధాస్యతి = కావించును.

**తాత్పర్యము :–** మహావీరుడైన శ్రీరాముడు నీవు తెలిపినట్టి నా సందేశము వాక్యములను వినినంతనే న్యాయమైన విధానమున తన పరాక్రమము జూపుటకు నిర్ణయమును తీసికొనగలడు.

**శ్లో॥ సీతాయా వచనం శ్రుత్వా హనుమా న్మారుతాత్మజః ।**
**శిర స్యంజలి మాధాయ వాక్య ముత్తర మబ్రవీత్ ॥ 13**

**పదచ్ఛేదము :–** సీతాయాః – వచనం – శ్రుత్వా – హనుమాన్ – మారుతాత్మజః – శిరసి – అంజలిమ్ – ఆధాయ – వాక్యమ్ – ఉత్తరమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః హనుమాన్ సీతాయాః వచనం శ్రుత్వా శిరసి అంజలిమ్ ఆధాయ ఉత్తరం వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః = పవనసుతుడైనట్టి, హనుమాన్ = ఆంజనేయుడు, సీతాయాః = సీతయొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, శిరసి = తలపై, అంజలిమ్ = దోసిలిని, ఆధాయ = ఉంచి, ఉత్తరం వాక్యమ్ = సమాధాన వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** పవన నందనుడైన హనుమ సీతమ్మమాటలను విని తలవంచి దోసిలి యొగ్గి ఈ రీతిగ పలుకదొడగెను.

**శ్లో॥ నహి పశ్యామి మర్త్యేషు నాసురేషు సురేషు వా ।**
**య స్తస్య క్షిపతో బాణాన్ స్థాతు ముత్సహతేఽగ్రతః ॥ 14**

**పదచ్ఛేదము :–** న – హి – పశ్యామి – మర్త్యేషు – న – అసురేషు – సురేషు – వా – యః – తస్య – క్షిపతః – బాణాన్ – స్థాతుమ్ – ఉత్సహతే – అగ్రతః ॥

**అన్వయక్రమము :–** మర్త్యేషు అసురేషు సురేషు వా బాణాన్ క్షిపతః తస్య అగ్రతః స్థాతుం యః ఉత్సహతే (తం) న హి పశ్యామి.

**ప్రతిపదార్థము :–** మర్త్యేషు = మానవులందుగాని, అసురేషు = రాక్షసులందుగాని, సురేషు వా = దేవతలందుగాని, బాణాన్ = శరములను, క్షిపతః = ప్రయోగించుచున్నట్టి, తస్య = ఆ శ్రీరామునియొక్క, అగ్రతః = ఎదుట, స్థాతుం = నిలచుటకు, యః = ఎవ్వడు, ఉత్సహతే = ఉత్సహించునో, (తం = అట్టివానిని) న హి పశ్యామి = ఎంత మాత్రము చూడను.

**తాత్పర్యము :–** మానవులందుగాని, దానవులందుగాని, దేవతలందుగాని, యుద్ధ భూమిలో బాణములను వర్షించుచున్న ఆ శ్రీరాముని ఎదురుగ నిలుచుట కంగీకరించు వీరుని నేను ఎందును గానను.

**శ్లో॥ క్షిప్ర మేష్యతి కాకుత్థ్సో హర్యృక్షప్రవరై ర్వృతః ।**
**య స్తే యుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి ॥ 15**

**పదచ్ఛేదము :–** క్షిప్రమ్ – ఏష్యతి – కాకుత్థ్సః – హర్యృక్షప్రవరైః – వృతః – యః – తే – యుధి – విజిత్య – అరీన్ – శోకం – వ్యపనయిష్యతి ॥

**అన్వయక్రమము :–** యః యుధి అరీన్ విజిత్య తే శోకం వ్యపనయిష్యతి, సః కాకుత్థ్సః హర్యృక్షప్రవరైః వృతః క్షిప్రమ్ ఏష్యతి.

**ప్రతిపదార్థము :–** యః = ఏ మహాత్ముడు, యుధి = యుద్ధమునందు, అరీన్ = శత్రువులను, విజిత్య = జయించి, తే = నీయొక్క, శోకం = దుఃఖమును, వ్యపనయిష్యతి = తొలగింపగలడో, సః కాకుత్థ్సః = ఆ శ్రీరాముడు, హర్యృక్షప్రవరైః = వానరులయొక్కయు, భల్లూకములయొక్కయు వీరులతో, వృతః = కూడినవాడై, క్షిప్రం = శీఘ్రముగ, ఏష్యతి = రాగలడు.

**తాత్పర్యము :–** యుద్ధభూమియందు శత్రువులను దునుమాడి నీ శోకము నిర్మూలింప చేయునట్టి వీరుడైన ఆ కాకుత్థ్సుడు వానరవీరులతోను, భల్లూకయోధులతోను కలసి అచిరకాలములోనే ఇటకు రానున్నాడు.

**శ్లో॥ అప్యర్క మపి పర్జన్య మపి వైవస్వతం యమమ్ ।**
**స హి సోఢుం రణే శక్త స్తవ హేతో ర్విశేషతః ॥ 16**

**పదచ్ఛేదము :–** అపి – అర్కమ్ – అపి – పర్జన్యమ్ – అపి – వైవస్వతం – యమమ్ – సః – హి – సోఢుం – రణే – శక్తః – తవ – హేతోః – విశేషతః ॥

**అన్వయక్రమము :–** సః రణే అర్కమ్ అపి పర్జన్యమ్ అపి, వై వస్వతం యమమ్ అపి సోఢుం శక్తః హి; తవ హేతోః విశేషతః శక్తః (భవతి).

**ప్రతిపదార్థము :–** సః = అతడు, రణే = యుద్ధమునందు, అర్కమ్ అపి = సూర్యునైనను, పర్జన్యమ్ అపి = ఇంద్రునైనను, వైవస్వతం యమమ్ అపి = వివస్వంతుని సుతుడైన యమునైనను, సోఢుం = సహించుటకు, శక్తః హి = సమర్థుడు సుమా! తవ హేతోః = నీ నిమిత్తమై, విశేషతః = ఇంకను మిక్కిలిగా, శక్తః = సమర్థుడు, (భవతి = అగును).

**తాత్పర్యము :–** వీరుడైన ఆ శ్రీరాముడు రణరంగమునందు సూర్యుడెదుర్కొన్నను, దేవేంద్రుడే ఎదుట నిలచినను యమధర్మరాజే వచ్చి ఎదిరించినను అవలీలగ నోడింపగలడు సుమా! అందునను నీ కొఱకేయైనచో వేఱుగా చెప్పనక్కఱలేదు.

**శ్లో॥ స హి సాగరపర్యంతాం మహీం సాధితు మర్హతి ।**
**త్వన్నిమిత్తో హి రామస్య జయో జనకనందిని ॥ 17**

**పదచ్ఛేదము** :– సః – హి – సాగరపర్యంతాం – మహీం – సాధితుమ్ – అర్హతి – త్వన్నిమిత్తః – హి – రామస్య – జయః – జనకనందిని ॥

**అన్వయక్రమము** :– సః సాగరపర్యంతాం మహీం సాధితుమ్ అర్హతి హి; జనకనందిని! రామస్య జయః త్వన్నిమిత్తః హి.

**ప్రతిపదార్థము** :– సః = ఆ శ్రీరాముడు, సాగరపర్యంతాం = సముద్రముల వఱకును గల, మహీం = వసుధను, సాధితుం = వశపఱచుకొనుటకు, అర్హతి హి = సమర్థుడు అగుచున్నాడు సుమా! జనకనందిని! = ఓ జనకపుత్రీ! రామస్య = శ్రీరామునకు, జయః = విజయము, త్వన్నిమిత్తః హి = నీ నిమిత్తమైనదే సుమా!

**తాత్పర్యము** :– ఆ మహావీరుడు సాగరపర్యంతము గల భూమండలము నంతయు స్వాధీనము చేసికొనగల సమర్థుడు! తల్లీ! శ్రీరాముడు సాధించు ఈ విజయ మంతయు నీ గుఱించియే సుమా!

**శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా సమ్య క్సత్యం సుభాషితమ్ ।**
**జానకీ బహుమేనే తం వచనం చేద మబ్రవీత్ ॥ 18**

**పదచ్ఛేదము** :– తస్య – తత్ – వచనం – శ్రుత్వా – సమ్యక్ – సత్యం – సుభాషితమ్ – జానకీ – బహు – మేనే; – తం – వచనం – చ – ఇదమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– తస్య సత్యం సుభాషితం తద్వచనం సమ్యక్ శ్రుత్వా జానకీ తం బహు మేనే. ఇదం వచనమ్ అబ్రవీత్ చ.

**ప్రతిపదార్థము** :– తస్య = హనుమంతునియొక్క, సత్యం = యథార్థమైనదియును, సుభాషితం = చక్కగ చెప్పబడినదియునగు, తద్వచనం = ఆ మాటను, సమ్యక్ = లెస్సగా, శ్రుత్వా = విని, జానకీ = సీతాదేవి, తం = ఆ హనుమను, బహుమేనే = మెచ్చుకొనెను, ఇదం వచనం = ఈ మాటను, అబ్రవీత్ చ = పలికెను కూడ.

**తాత్పర్యము** :– హనుమంతుడు పలికినట్టి యథార్థమైన ఆ మంచిమాటలను సీతాదేవి సంతోషముగా విని ఎంతయో మెచ్చుకొని ఆతనితో తిరిగి ఇట్లు పలికెను.

**శ్లో॥ తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునః పునః ।**
**భర్తృస్నేహాన్వితం వాక్యం సౌహార్దా దనుమానయత్ ॥ 19**

**పదచ్ఛేదము** :– తతః – తం – ప్రస్థితం – సీతా – వీక్షమాణా – పునః – పునః – భర్తృస్నేహాన్వితం – వాక్యం – సౌహార్దాత్ – (బ్రువన్) అనుమానయత్ ॥

**అన్వయక్రమము :–** తతః సీతా ప్రస్థితం తం పునః పునః వీక్షమాణా సౌహార్దాత్ భర్తృస్నేహాన్వితం వాక్యమ్ (బ్రువన్) అనుమానయత్.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, సీతా = సీతాదేవి, ప్రస్థితం = బయలుదేరినట్టి, తం = ఆ హనుమను, పునః పునః = తిరిగి తిరిగి, వీక్షమాణా = చూచుచున్నదై, సౌహార్దాత్ = స్నేహమువలన, భర్తృస్నేహాన్వితం = భర్తృప్రేమతోగూడినట్టి, వాక్యం = వాక్యమును, (బ్రువన్ = పలుకుచు) అనుమానయత్ = గౌరవించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'భర్తృస్నేహాన్వితం వాక్యమ్ అనుమానయత్' తన భర్తపై స్నేహముతో హనుమ పలికిన మాటను సీతమ్మ ప్రేమతో గౌరవించెను.

**రా.శిరోమణి :–** ప్రస్థితం తమ్ అనుమానయత్ – తిరుగు ముఖముబట్టి బయలుదేరిన హనుమను సీతాదేవి మిక్కిలి గౌరవించినదని భావము.

**గోవిందరాజీయము :–** 'వాక్యమ్ అనుమానయత్' ముందు చెప్పబోవురీతిగా గౌరవించుచు పలికినదని భావము.

**మహేశ్వరతీర్థులు :–** 'వాక్యమ్ అనుమానయత్' హనుమంతుడు పలికిన మాటలను గౌరవించుచున్నదై అని అన్వయము.

**తాత్పర్యము :–** పిమ్మట తిరిగి వెడలి పోవ సమకట్టిన హనుమంతుని మఱల మఱల జూచుచు సీతాదేవి భర్తయందలి ప్రేమచే గౌరవపూర్వకముగా ఆతనితో తిరిగి ఇట్లు పలికెను.

**శ్లో॥ యది వా మన్యసే వీర వ సైకాహ మరిందమ ।**
**కస్మింశ్చి త్సంవృతే దేశే విశ్రాంత శ్శ్వో గమిష్యసి ॥ 20**

**పదచ్ఛేదము :–** యది – వా – మన్యసే – వీర – వస – ఏకాహమ్ – అరిందమ – కస్మిన్ – చిత్ – సంవృతే – దేశే – విశ్రాంతః – శ్వః – గమిష్యసి ॥

**అన్వయక్రమము :–** వీర! అరిందమ! యది వా మన్యసే ఏకాహం వస; కస్మింశ్చిత్ సంవృతే దేశే విశ్రాంతః (సన్)శ్వః గమిష్యసి.

**ప్రతిపదార్థము :–** వీర = మహావీరుడా! అరిందమ = శత్రుసంహారకుడా! యది వా మన్యసే = తలచుచున్నయెడల, ఏకాహం = ఒక్కదినము, వస = వసింపుము, కస్మింశ్చిత్ = ఏదియైన, సంవృతే = గూఢమైనట్టి, దేశే = ప్రదేశమునందు, విశ్రాంతః

(సన్) = విశ్రమించినవాడవై, శ్వః = రేపు, గమిష్యసి = వెడలగలవు.

**తాత్పర్యము :–** శత్రుసంహారకుడవైన ఓ మహావీరుడా! నీ కిష్టమైనచో ఇంకొక్కదినము వసింపుము. పరులకు కానరాకుండ గూఢమైన ఏ ప్రదేశమందైనను విశ్రాంతి తీసికొని రేపు వెడలిపోవచ్చును.

**శ్లో॥ మమ చై వాల్పభాగ్యాయాః సాన్నిధ్యా త్తవ వానర ।**
**అస్య శోకస్య మహతః ముహూర్తం మోక్షణం భవేత్ ॥ 21**

**పదచ్ఛేదము :–** మమ – చ – ఏవ – అల్పభాగ్యాయాః – సాన్నిధ్యాత్ – తవ – వానర – అస్య – శోకస్య – మహతః – ముహూర్తం – మోక్షణం – భవేత్ ॥

**అన్వయక్రమము :–** వానర! అల్పభాగ్యాయాః మమ చ తవ సాన్నిధ్యాత్ అస్య మహతః శోకస్య ముహూర్తం మోక్షణం భవేత్.

**ప్రతిపదార్థము :–** వానర! = ఓ హనుమా! అల్పభాగ్యాయాః = మందభాగ్యురాలనైనట్టి, మమ చ = నాకును, తవ = నీయొక్క, సాన్నిధ్యాత్ = దగ్గఱనుండుటవలన, అస్య = ఈ, మహతః = గొప్పదైన, శోకస్య = దుఃఖమునకు, ముహూర్తం = క్షణకాలము, మోక్షణం = విముక్తి, భవేత్ = అగును.

**తాత్పర్యము :–** ఓ ఆంజనేయా! నీవు నా యొద్ద ఇంకను కొద్దికాల ముండుము. మందభాగ్యురాలనైన నాకు ఆ కొద్ది కాలమైనను నన్ను దహించుచున్న ఈ శోకతాపము నుండి విమోచనము కలుగును.

**శ్లో॥ గతే హి హరిశార్దూల పునరాగమనాయ తు ।**
**ప్రాణానామపి సందేహో మమ స్యా న్నాత్ర సంశయః ॥ 22**

**పదచ్ఛేదము :–** గతే – హి – హరిశార్దూల – పునః – ఆగమనాయ – తు – ప్రాణానామ్ – అపి – సందేహః – మమ – స్యాత్ – న – అత్ర – సంశయః ॥

**అన్వయక్రమము :–** హరిశార్దూల! పునః ఆగమనాయ (త్వయి) గతే (సతి) హి మమ ప్రాణానామ్ అపి సందేహః స్యాత్; అత్ర సంశయః న (అస్తి).

**ప్రతిపదార్థము :–** హరిశార్దూల = ఓ వానరశ్రేష్ఠుడా! పునః ఆగమనాయ = తిరిగివచ్చుటకై, త్వయి = నీవు, గతే (సతి) హి = వెళ్ళినవాడవు కాగా, మమ = నా యొక్క, ప్రాణానామ్ అపి = ప్రాణములకుగూడ, సందేహః = సంశయము, స్యాత్ = అగును, అత్ర = ఈ విషయమున, సంశయః = సందేహము, న (అస్తి) = లేదు.

**తాత్పర్యము :-** ఓ వానరోత్తమా! మఱల వచ్చుటకై నీ విప్పుడు వెడలిపోయినచో మఱల నా యాతన ఆరంభమై నా ప్రాణములకే సంశయము వాటిల్లును. ఇందు సందేహము లేదు.

**శ్లో॥ త వాదర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్ ।**
**దుఃఖా ద్దుఃఖపరామృష్టాం దీపయన్నివ వానర ॥ 23**

**పదచ్ఛేదము :-** తవ – అదర్శనజః – శోకః – భూయః – మాం – పరితాపయేత్ – దుఃఖాత్ – దుఃఖపరామృష్టాం – దీపయన్ – ఇవ – వానర ॥

**అన్వయక్రమము :-** వానర! దుఃఖాత్ దుఃఖపరామృష్టాం మాం తవ అదర్శనజః శోకః దీపయన్ ఇవ భూయః పరితాపయేత్.

**ప్రతిపదార్థము :-** వానర! = ఓ హనుమా! దుఃఖాత్ = దుఃఖమునుండి, దుఃఖపరామృష్టాం = దుఃఖములచే కప్పబడుచున్నట్టి, మాం = నన్ను, తవ = నీ యొక్క, అదర్శనజః = దర్శనము లేనందువలన గలిగినట్టి, శోకః = దుఃఖము, భూయః = ఇంకను, దీపయన్ ఇవ = మండించుచున్నట్లుగా, పరితాపయేత్ = మిక్కిలిగా తపింపజేయును.

**తాత్పర్యము :-** ఓ వానరోత్తమా! ఒక దుఃఖము పిమ్మట ఇంకొక దుఃఖము కప్పివేయుచున్న నాకు నీ సాన్నిధ్యముగూడ దూరమైన యెడల ఈ శోకము ఇంకను నన్ను దహించి నాకు అమితమైన సంతాపము కలుగజేయును సుమా!

**శ్లో॥ అయం చ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః ।**
**సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర ॥ 24**

**పదచ్ఛేదము :-** అయం – చ – వీర – సందేహః – తిష్ఠతి – ఇవ – మమ – అగ్రతః – సుమహాన్ – త్వత్సహాయేషు – హర్యృక్షేషు – హరీశ్వర ॥

**అన్వయక్రమము :-** వీర! హరీశ్వర! త్వత్సహాయేషు హర్యృక్షేషు సుమహాన్ సందేహః మమ అగ్రతః తిష్ఠతి ఇవ.

**ప్రతిపదార్థము :-** వీర! = మహావీరుడవైన, హరీశ్వర! = వానరశ్రేష్ఠుడా! త్వత్సహాయేషు = నీకు సహాయకులైనట్టి, హర్యృక్షేషు = వానరభల్లూకముల విషయమున, సుమహాన్ = మిక్కిలి గొప్పదైన, అయం సందేహః = ఈ సందేహము, మమ అగ్రతః = నా యెదుట, తిష్ఠతి ఇవ (అస్తి) = నిలచియున్నట్లున్నది.

**తాత్పర్యము** :– ఓ వీరాగ్రేసరా! నీకు సహాయకులైన మీ వానర భల్లూకముల విషయమున గొప్ప సందేహ మొకటి యెదురై నన్ను వేధించుచున్నది.

**శ్లో॥ కథం ను ఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిమ్ ।**
**తాని హర్యృక్షసైన్యాని తౌ వా నరవరాత్మజౌ ॥ 25**

**పదచ్ఛేదము** :– కథం – ను – ఖలు – దుష్పారం – తరిష్యంతి – మహోదధిమ్ – తాని – హర్యృక్షసైన్యాని – తౌ – వా – నరవరాత్మజౌ ॥

**అన్వయక్రమము** :– దుష్పారం మహోదధిం తాని హర్యృక్షసైన్యాని, తౌ నరవరాత్మజౌ వా కథం ను ఖలు తరిష్యంతి?

**ప్రతిపదార్థము** :– దుష్పారం = దాటశక్యముగాని, మహోదధిం = మహాసముద్రమును, తాని = ఆ, హర్యృక్షసైన్యాని = వానరభల్లూకసైన్యములుగాని, తౌ = ఆ, నరవరాత్మజౌ వా = రాజకుమారు లిరువురు గాని, కథం ను ఖలు = ఎట్లుగ, తరిష్యంతి = దాటగలరు?

**తాత్పర్యము** :– హనుమా! మీ వానరభల్లూక సైన్యములుగాని, ఆ రాజపుత్రు లిరువురు గాని దాట శక్యముగానట్టి ఈ మహాసాగరమును ఏ రీతిగా దాటి రాగలరు?

**శ్లో॥ త్రయాణామేవ భూతానాం సాగర స్యాస్య లంఘనే ।**
**శక్తి స్స్యా ద్వైనతేయస్య తవ వా మారుతస్య వా ॥ 26**

**పదచ్ఛేదము** :– త్రయాణామ్ – ఏవ – భూతానాం – సాగరస్య – అస్య – లంఘనే – శక్తిః – స్యాత్ – వైనతేయస్య – తవ – వా – మారుతస్య – వా ॥

**అన్వయక్రమము** :– అస్య సాగరస్య లంఘనే వైనతేయస్య వా తవ వా మారుతస్య వా త్రయాణాం భూతానామ్ ఏవ శక్తిః స్యాత్.

**ప్రతిపదార్థము** :– అస్య = ఈ, సాగరస్య = సముద్రముయొక్క, లంఘనే = లంఘనమునందు, వైనతేయస్య వా = గరుత్మంతునకు గాని, తవ వా = నీకు గాని, మారుతస్య వా = వాయువునకు గాని, త్రయాణాం భూతానామ్ ఏవ = మూడు ప్రాణులకు మాత్రమే, శక్తిః = సామర్థ్యము, స్యాత్ = ఉండును.

**తాత్పర్యము** :– ఈ సాగరమును లంఘించుటకు గరుత్మంతునకును నీకును వాయుదేవునకును మాత్రమే శక్తిగలదు. ఈ ముప్వరు తప్ప వేఱెవ్వరిచ్చట ఈ సాగర లంఘనమునకు సమర్థులు కారు.

**శ్లో॥ త దస్మి న్కార్యనిర్యోగే వీరైవం దురతిక్రమే ।**
**కిం పశ్యసి సమాధానం త్వం హి కార్యవిదాం వరః ॥ 27**

**పదచ్ఛేదము** :– తత్ – అస్మిన్ – కార్యనిర్యోగే – వీర – ఏవం – దురతిక్రమే – కిం – పశ్యసి – సమాధానం – త్వం – హి – కార్యవిదాం – వరః ॥

**అన్వయక్రమము** :– తత్ వీర! ఏవం దురతిక్రమే అస్మిన్ కార్యనిర్యోగే కిం సమాధానం పశ్యసి? త్వం కార్యవిదాం వరః హి.

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ కారణమున, వీర! = ఓ వీరుడా! ఏవం = ఈ రీతిగా, దురతిక్రమే = అసాధ్యమైనట్టి, అస్మిన్ = ఈ, కార్యనిర్యోగే = కార్యనిర్వహణమునందు, కిం సమాధానం = ఏమి సమాధానమును, పశ్యసి = కనుగొనుచున్నావు, త్వం = నీవు, కార్యవిదాం = కార్యవేత్తలలో, వరః హి = శ్రేష్ఠుడవుగదా!

**తాత్పర్యము** :– ఓ మహావీరుడా! ఇట్టి అసాధ్యమైన ఈ కార్యమును నిర్వహించుటకై చేయదగు కర్తవ్య మెట్టిదని యెంచుచున్నావు? నీవే కార్యసాధకులలో అగ్రగణ్యుడవు సుమా!

**శ్లో॥ కామ మస్య త్వ మే వైకః కార్యస్య పరిసాధనే ।**
**పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే ఫలోదయః ॥ 28**

**పదచ్ఛేదము** :– కామమ్ – అస్య – త్వమ్ – ఏవ – ఏకః – కార్యస్య – పరిసాధనే – పర్యాప్తః – పరవీరఘ్న – యశస్యః – తే – ఫలోదయః ॥

**అన్వయక్రమము** :– పరవీరఘ్న! అస్య కార్యస్య పరిసాధనే త్వమ్ ఏకః ఏవ కామం పర్యాప్తః. ఫలోదయః తే యశస్యః.

**ప్రతిపదార్థము** :– పరవీరఘ్న = శత్రువీరులను పరిమార్చునట్టి హనుమా, అస్య కార్యస్య = ఈ కార్యము యొక్క, పరిసాధనే = నిర్వహణమునందు, త్వం = నీవు, ఏకః ఏవ = ఒక్కడవే, కామం = మిక్కిలిగా, పర్యాప్తః = చాలినట్టివాడవు, ఫలోదయః = ఫలప్రాప్తి, తే = నీకు, యశస్యః = కీర్తికరమైనట్టిది.

**తాత్పర్యము** :– శత్రుసంహారకుడవైన ఓ హనుమా! నన్ను విడిపించి, రామునికడ చేర్చునట్టి ఈ కార్యమును నిర్వహించుటకు నీ వొక్కడవే సమర్థుడవు. ఈ కార్యనిర్వహణము నీ కెంతయో కీర్తిని గూర్చును.

**శ్లో॥ బలై స్సమగ్రై ర్యది మాం రావణం జిత్య సంయుగే ।**
**విజయీ స్వపురం యాయా త్త త్తస్య సదృశం భవేత్ ॥ 29**

**పదచ్ఛేదము :–** బలైః – సమగ్రైః – యది – మాం – రావణం – జిత్య – సంయుగే – విజయీ – స్వపురం – యాయాత్ – తత్ – తస్య – సదృశం – భవేత్ ॥

**అన్వయక్రమము :–** (రామః) సమగ్రైః బలైః సంయుగే రావణం జిత్య విజయీ (సన్) మాం (గృహీత్వా) స్వపురం యాయాత్ యది తత్ తస్య సదృశం భవేత్.

**ప్రతిపదార్థము :–** (రామః = శ్రీరాముడు), సమగ్రైః = సమగ్రములైన, బలైః = సైన్యములతో, సంయుగే = యుద్ధమునందు, రావణం = రావణుని, జిత్య = జయించి, విజయీ (సన్) = విజయముగలవాడై, మాం = నన్ను, (గృహీత్వా = తీసికొని), స్వపురం = తన నగరమును గూర్చి, యాయాత్ యది = వెడలినయెడల, తత్ = అది, తస్య = ఆతనికి, సదృశం = యుక్తమైనది, భవేత్ = కాగలదు.

**సూచన :–** ఇచ్చట 'తత్ తస్య సదృశం భవేత్' అనుటకు బదులుగా, 'తత్తు మే స్యాత్ యశస్కరమ్' అని కొన్ని ప్రతులలోని పాఠము. ఈ పక్షమున, నీవు రాక్షసులను హతమార్చి నన్ను గొనిపోవుటకంటె శ్రీరాముడే వచ్చి రావణుని ఓడించి నన్ను గొనిపోవుటయే నాకు ప్రతిష్ఠాకరమైన విషయము గాగలదని భావము.

**తాత్పర్యము :–** శ్రీరాముడు సమగ్రములైన సైన్యములతో ఇచటికివచ్చి రణరంగమున రావణుని జయించి విజయోపేతుడై నన్ను తన పురమునకు గొనిపోవుటయే ఆతని పరాక్రమమునకు యుక్తమై యుండును.

**శ్లో॥ శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః ।**
**మాం నయేద్యది కాకుత్థ్సః త త్తస్య సదృశం భవేత్ ॥ 30**

**పదచ్ఛేదము :–** శరైః – తు – సంకులాం – కృత్వా – లంకాం – పరబలార్దనః – మాం – నయేత్ – యది – కాకుత్థ్సః – తత్ – తస్య – సదృశం – భవేత్ ॥

**అన్వయక్రమము :–** పరబలార్దనః కాకుత్థ్సః శరైః లంకాం సంకులాం కృత్వా మాం నయేత్ యది తత్ తస్య సదృశం భవేత్.

**ప్రతిపదార్థము :–** పరబలార్దనః = శత్రుసైన్యమును అణచునట్టి, కాకుత్థ్సః = శ్రీరాముడు, శరైః = బాణములతో, లంకాం = లంకానగరమును, సంకులాం కృత్వా = కల్లోలితము గావించి, మాం = నన్ను, నయేత్ యది = కొనిపోయినచో, తత్ = అది, తస్య = ఆతనికి, సదృశం = తగియున్నట్టిది, భవేత్ = అగును.

**తాత్పర్యము :–** శ్రీరాముడు శత్రుబల సంహారకుడై తన శరపరంపరలచే లంకా నగరమును కల్లోలము గావించి నన్ను గొని పోయినచో ఆ వీరకృత్యమే ఆతనికి

యుక్తమై యుండును.

**శ్లో॥ త ద్యథా తస్య వి(క్రాంత మనురూపం మహాత్మనః ।**
**భవే దాహవశూరస్య తథా త్వ ముపపాదయ ॥ 31**

**పదచ్ఛేదము** :- తత్ - యథా - తస్య - వి(క్రాంతమ్ - అనురూపం - మహాత్మనః - భవేత్ - ఆహవశూరస్య - తథా - త్వమ్ - ఉపపాదయ ॥

**అన్వయక్రమము** :- తత్ ఆహవశూరస్య తస్య మహాత్మనః అనురూపం వి(క్రాంతం యథా భవేత్ తథా త్వమ్ ఉపపాదయ.

**ప్రతిపదార్థము** :- తత్ = అందువలన, ఆహవశూరస్య = యుద్ధవీరుడైన, తస్య మహాత్మనః = ఆ మహనీయునకు, అనురూపం = ఉచితమైన, వి(క్రాంతం = పరా(క్రమము, యథా = ఏ రీతిగా, భవేత్ = అగునో, తథా = ఆ రీతిగా, త్వం = నీవు, ఉపపాదయ = (ప్రతిపాదించుము.

**తాత్పర్యము** :- అందుచే మహావీరుడైన ఆ మహాత్మునకు ఉచితమైన రీతిగా ఆతని పరా(క్రమవిజృంభణము ఎట్లుగ జరుగవలసియున్నదో ఆ రీతిగా నీవు ఆలోచించి నిర్ణయించుము.

**శ్లో॥ తదర్థోపహితం వాక్యం సహితం హేతుసంహితమ్ ।**
**నిశమ్య హనుమాన్ శేషం వాక్యముత్తర మ(బవీత్ ॥ 32**

**పదచ్ఛేదము** :- తత్ - అర్థోపహితం - వాక్యం - సహితం - హేతుసంహితమ్ - నిశమ్య - హనుమాన్ - శేషం - వాక్యమ్ - ఉత్తరమ్ - అ(బవీత్ ॥

**అన్వయక్రమము** :- హనుమాన్ హేతుసంహితమ్, అర్థోపహితం, సహితం తత్ వాక్యం నిశమ్య శేషమ్ ఉత్తరం వాక్యమ్ అ(బవీత్.

**ప్రతిపదార్థము** :- హనుమాన్ = హనుమ, హేతుసంహితం = సహేతుకమైనట్టియు, అర్థోపహితం = (ప్రయోజనయుక్తమైనట్టియు, సహితం = హితముతో గూడినట్టిదియు నగు, తత్ వాక్యం = ఆ వాక్యమును, నిశమ్య = విని, శేషం = మిగిలినట్టి, ఉత్తరం = సమాధానమైన, వాక్యం = వచనమును, అ(బవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- సహేతుకముగను, (ప్రయోజనవంతముగను, హితకరముగను సీతాదేవి పలికినట్టి వచనములను ఆలకించి హనుమ తాను చెప్పవలసిన మిగిలిన మాటలను ఈ రీతిగ పలికెను.

**శ్లో॥ దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాం వరః ।**
**సుగ్రీవ స్సత్త్వసంపన్న స్తవార్థే కృతనిశ్చయః ॥ 33**

**పదచ్ఛేదము :-** దేవి! - హర్యృక్షసైన్యానాం - ఈశ్వరః - ప్లవతాం - వరః - సుగ్రీవః - సత్త్వసంపన్నః - తవ - అర్థే - కృతనిశ్చయః ॥

**అన్వయక్రమము :-** దేవి! హర్యృక్షసైన్యానాం ఈశ్వరః సత్త్వసంపన్నః ప్లవతాం వరః సుగ్రీవః తవ అర్థే కృతనిశ్చయః (అస్తి).

**ప్రతిపదార్థము :-** దేవి! = ఓ పూజ్యురాలా! హర్యృక్షసైన్యానాం = వానరులయొక్కయు భల్లూకములయొక్కయు సైన్యములకు, ఈశ్వరః = ప్రభువును, సత్త్వసంపన్నః = బలసంపన్నుడును, ప్లవతాం వరః = వానరులలో శ్రేష్ఠుడును అగు, సుగ్రీవః = సుగ్రీవుడు, తవ అర్థే = నీ విషయమునందు, కృతనిశ్చయః = చేయబడిన నిశ్చయము గలవాడుగా, (అస్తి = ఉన్నాడు).

**తాత్పర్యము :-** ఓ సీతాదేవీ! అపారమైన వానర భల్లూక సైన్యములకు అధిపతియు, మహాబలాఢ్యుడును అగు వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుడు నీ శోకమును తొలగించు కార్యమునందు ధృఢమైన నిశ్చయముతో నున్నాడు సుమా!

**శ్లో॥ స వానరసహస్రాణాం కోటీభి రభిసంవృతః ।**
**క్షిప్ర మేష్యతి వైదేహి రాక్షసానాం నిబర్హణః ॥ 34**

**పదచ్ఛేదము :-** సః - వానరసహస్రాణాం - కోటీభిః - అభిసంవృతః - క్షిప్రమ్ - ఏష్యతి - వైదేహి - రాక్షసానాం - నిబర్హణః ॥

**అన్వయక్రమము :-** వైదేహి! రాక్షసానాం నిబర్హణః సః వానరసహస్రాణాం కోటీభిః అభిసంవృతః క్షిప్రమ్ ఏష్యతి.

**ప్రతిపదార్థము :-** వైదేహి! = ఓ సీతాదేవీ! రాక్షసానాం నిబర్హణః = రాక్షసులను హతమార్చునట్టి, సః = ఆ సుగ్రీవుడు, వానరసహస్రాణాం = వేలకొలది వానరుల యొక్క, కోటీభిః = కోట్లకొలదిచే, అభిసంవృతః = కూడియున్నవాడై, క్షిప్రం = త్వరలో, ఏష్యతి = రాగలడు.

**తాత్పర్యము :-** ఓ జానకీదేవీ! రాక్షసులను తుదముట్టింప గలవాడైనట్టి ఆ సుగ్రీవుడు వేలకొలది కోట్లుగనున్న వానరసైన్యముతో కలిసి నిన్ను విడిపించుటకై త్వరలో ఇచ్చటకు రాగలడు.

**శ్లో॥ తస్య విక్రమసంపన్నా స్సత్త్వవంతో మహాబలాః ।**
**మనస్సంకల్పసంపాతా నిదేశే హరయ స్థ్సితాః ॥ 35**

**శ్లో॥ యేషాం నోపరి నాధస్తాన్నతిర్యక్సజ్జతే గతిః ।**
**న చ కర్మసు సీదంతి మహ త్స్వమితతేజసః ॥ 36**

**పదచ్ఛేదము** :- తస్య - విక్రమసంపన్నాః - సత్త్వవంతః - మహాబలాః - మనస్సంకల్పసంపాతాః - నిదేశే - హరయః - స్థితాః - యేషాం - న - ఉపరి - న - అధస్తాత్ - న - తిర్యక్ - సజ్జతే - గతిః ॥

**అన్వయక్రమము** :- యేషాం గతిః ఉపరి న సజ్జతే; అధస్తాత్ న సజ్జతే; తిర్యక్ న సజ్జతే; తే విక్రమసంపన్నాః సత్త్వవంతః మహాబలాః మనస్సంకల్పసంపాతాః హరయః తస్య నిదేశే స్థితాః; అమితతేజసః మహత్సు కర్మసు న చ సీదంతి.

**ప్రతిపదార్థము** :- యేషాం = ఎవరియొక్క అయితే, గతిః = గమనము, ఉపరి = ఊర్ధ్వమున, న సజ్జతే = అడ్డగింపబడదో, అధస్తాత్ = క్రిందిలోకములందు, న సజ్జతే = అడ్డగింపబడదో, తిర్యక్ = అడ్డముగ, న సజ్జతే = అడ్డగింపబడదో, తే = అట్టి, విక్రమసంపన్నాః = పరాక్రమసంపన్నులును, సత్త్వవంతః = శక్తి సంపన్నులును, మహాబలాః = మహాబలాఢ్యులును, మనస్సంకల్పసంపాతాః = మనస్సంకల్పమును బట్టి చరించువారు నగు, హరయః = వానరులు, తస్య = ఆ సుగ్రీవునియొక్క, నిదేశే = ఆజ్ఞయందు, స్థితాః = ఉన్నారు, అమితతేజసః = అపారమైన ప్రతాపము గల్గినట్టి ఆ వానరులు, మహత్సు = గొప్పవైన, కర్మసు = కార్యములందు, న చ సీదంతి = దిగులునొందరు.

**తాత్పర్యము** :- మహాపరాక్రమవంతులును, అమితశక్తిమంతులును, మహా బలాఢ్యులును, మనస్సంకల్పానుసారముగా అమితవేగముగ చరింపగలవారును, ఊర్ధ్వలోకములలో గాని అధోలోకములో గాని నలుమూలల గల దేశములలో గాని అడ్డులేకుండ చరింపగలవారును అగు వానరులు అసంఖ్యాకులు ఆతని ఆజ్ఞకు కట్టుబడియున్నారు. అందుచే నీవు దిగులు నొందవలసిన పనిలేదు. ప్రతాప సంపన్నులగు వానరులు ఎంతటి ఘనకార్యములందును వ్యాకులత నొందరు.

**శ్లో॥ అసకృ త్తై ర్మహోత్సాహై స్ససాగరధరాధరా ।**
**ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గానుసారిభిః ॥ 37**

**పదచ్ఛేదము** :- అసకృత్ - తైః - మహోత్సాహైః - ససాగరధరాధరా - ప్రదక్షిణీకృతా - భూమిః - వాయుమార్గానుసారిభిః ॥

**అన్వయక్రమము** :- వాయుమార్గానుసారిభిః మహోత్సాహైః తైః ససాగరధరాధరా భూమిః అసకృత్ ప్రదక్షిణీకృతా.

**ప్రతిపదార్థము** :- మహోత్సాహైః = గొప్పదైన ఉత్సాహము కలిగినట్టి, వాయుమార్గానుసారిభిః = ఆకాశమార్గమున సంచరించుచున్నట్టి, తైః = ఆ వానరులచే, ససాగరధరాధరా = సముద్రముతోడను పర్వతములతోడను కూడినట్టి, భూమిః = భూమి, అసకృత్ = పలుమాఱులు, ప్రదక్షిణీకృతా = ప్రదక్షిణము చేయబడినది.

**తాత్పర్యము** :- అమితోత్సాహసంపన్నులైన ఆ వానరులు వాయుమార్గమును అనుసరించినవారై సముద్రములతోను పర్వతములతోను కూడిన ఈ భూమండలమును పలుమాఱులు ప్రదక్షిణము చేసిరి.

**శ్లో॥ మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః ।**
**మత్తః ప్రత్యవరః కశ్చి న్నాస్తి సుగ్రీవసన్నిధౌ ॥ 38**

**పదచ్ఛేదము** :- మద్విశిష్టాః - చ - తుల్యాః - చ - సంతి - తత్ర - వనౌకసః - మత్తః - ప్రత్యవరః - కశ్చిత్ - న - అస్తి - సుగ్రీవసన్నిధౌ ॥

**అన్వయక్రమము** :- తత్ర వనౌకసః మద్విశిష్టాః తుల్యాః చ సంతి; సుగ్రీవసన్నిధౌ మత్తః ప్రత్యవరః కశ్చిత్ న అస్తి.

**ప్రతిపదార్థము** :- తత్ర = అచ్చట, వనౌకసః = వానరులు, మద్విశిష్టాః = నాకంటె ఘనులైన వారుగను, తుల్యాః చ = సమానులైనవారుగను, సంతి = ఉన్నారు, సుగ్రీవసన్నిధౌ = సుగ్రీవునికడ, మత్తః = నాకంటె, ప్రత్యవరః = తక్కువవాడు, కశ్చిత్ = ఒక్కడును, నాస్తి = లేడు.

**తాత్పర్యము** :- ఆ సుగ్రీవుని సన్నిధియందు ఉన్న వానరులు ఎందరో నాతో సమానులున్నారు. మఱెందరో నా కన్నను గొప్పవా రున్నారు. ఆతని కడ నాకంటె తక్కువవా డెవ్వడును లేడు సుమా!

**శ్లో॥ అహం తావ దిహ ప్రాప్తః కిం పున స్తే మహాబలాః ।**
**నహి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః ॥ 39**

**పదచ్ఛేదము** :- అహం - తావత్ - ఇహ - ప్రాప్తః - కిం - పునః - తే - మహాబలాః - న - హి - ప్రకృష్టాః - ప్రేష్యంతే - ప్రేష్యంతే - హి - ఇతరే - జనాః ॥

**అన్వయక్రమము** :– అహం తావత్ ఇహ ప్రాప్తః; తే మహాబలాః కిం పునః? ప్రకృష్టాః న ప్రేష్యంతే హి; ఇతరే జనాః హి ప్రేష్యంతే.

**ప్రతిపదార్థము** :– అహం తావత్ = నేనే, ఇహ = ఇచ్చటకు, ప్రాప్తః = చేరుకొంటిని, తే మహాబలాః = ఆ మహాబలాఢ్యులు, కిం పునః = ఏమి ఇక చెప్పునది? ప్రకృష్టాః = శ్రేష్ఠులు, న ప్రేష్యంతే హి = పంపబడరు గదా!, ఇతరే జనాః హి = సామాన్యజనులే గదా, ప్రేష్యంతే = పంపబడుదురు.

**తాత్పర్యము** :– నావంటివాడనే ఇచటి కనాయాసముగ వచ్చి యుంటిని. ఆ మహాబలశాలుర విషయము ఇక నేమి చెప్పవలయును? ఎచ్చటనైనను ఘనులైన వారిని దూతలుగ పంపరు గదా! సామాన్యులనే గదా దూతకృత్యమునకు వినియోగింతురు.

**శ్లో॥ త దలం పరితాపేన దేవి శోకో వ్యపైతు తే ।**
**ఏకోత్పాతేన తే లంకా మేష్యంతి హరియూథపాః ॥ 40**

**పదచ్ఛేదము** :– తత్ – అలం – పరితాపేన – దేవి – శోకః – వ్యపైతు – తే – ఏకోత్పాతేన – తే – లంకామ్ – ఏష్యంతి – హరియూథపాః ॥

**అన్వయక్రమము** :– దేవి! తత్ పరితాపేన అలం; తే శోకః వ్యపైతు; తే హరియుథపాః ఏకోత్పాతేన లంకామ్ ఏష్యంతి.

**ప్రతిపదార్థము** :– దేవి! = ఓ పూజ్యురాలా!, తత్ = అందువలన, పరితాపేన అలమ్ = సంతాపము వలదు, తే = నీ యొక్క, శోకః = దుఃఖము, వ్యపైతు = తొలగిపోవుగాక, తే హరియుథపాః = ఆ వానరవీరులు, ఏకోత్పాతేన = ఒక్క గంతులో, లంకాం = లంకానగరమును, ఏష్యంతి = చేరుదురు.

**తాత్పర్యము** :– ఓ సీతాదేవీ! నీవు విచారింపవలసిన పనిలేదు. నీ దుఃఖమంతయును తొలగిపోవును. ఆ వానరవీరులు ఒక్క గెంతులోనే ఈ లంకానగరమునకు రానున్నారు.

**శ్లో॥ మమ పృష్ఠగతౌ తౌ చ చంద్రసూర్యా వివోదితౌ ।**
**త్వత్సకాశం మహాసత్త్వౌ నృసింహా వాగమిష్యతః ॥ 41**

**పదచ్ఛేదము** :– మమ – పృష్ఠగతౌ – తౌ – చ – చంద్రసూర్యౌ – ఇవ – ఉదితౌ – త్వత్సకాశం – మహాసత్త్వౌ – నృసింహౌ – ఆగమిష్యతః ॥

**అన్వయక్రమము** :– మహాసత్త్వౌ తౌ నృసింహౌ మమ పృష్ఠగతౌ (సంతౌ) ఉదితౌ చంద్రసూర్యౌ ఇవ త్వత్సకాశమ్ ఆగమిష్యతః.

**ప్రతిపదార్థము** :– మహాసత్త్వౌ = గొప్పశక్తి గలవారగు, తౌ నృసింహౌ = ఆ పురుషశ్రేష్ఠు లిరువురును, మమ పృష్ఠగతౌ (సంతౌ) = నా వీపుపైనున్నవారై, ఉదితౌ = ఉదయించినట్టి, చంద్రసూర్యౌ ఇవ = చంద్రసూర్యులవలె, త్వత్సకాశం = నీ సమీపమును గూర్చి, ఆగమిష్యతః = రాగలరు.

**తాత్పర్యము** :– మహాబలసంపన్నులును పురుషశ్రేష్ఠులును అగు రామలక్ష్మణు లిరువురును నా పృష్ఠము నధిరోహించినవారై ఒక్క మాఱుగ నుదయించిన చంద్రసూర్యులవలె నీ సమీపమున ప్రత్యక్షము గాగలరు.

**శ్లో॥ తౌ హి వీరౌ నరవరౌ సహితౌ రామలక్ష్మణౌ ।**
**ఆగమ్య నగరీం లంకాం సాయకై ర్విధమిష్యతః ॥ 42**

**పదచ్ఛేదము** :– తౌ – హి – వీరౌ – నరవరౌ – సహితౌ – రామలక్ష్మణౌ – ఆగమ్య – నగరీం – లంకాం – సాయకైః – విధమిష్యతః ॥

**అన్వయక్రమము** :– సహితౌ నరవరౌ వీరౌ తౌ రామలక్ష్మణౌ ఆగమ్య సాయకైః లంకాం విధమిష్యతః.

**ప్రతిపదార్థము** :– సహితౌ = కలసికొన్నవారును, నరవరౌ = పురుషశ్రేష్ఠులును, వీరౌ = వీరులును అగు, తౌ రామలక్ష్మణౌ = ఆ రామలక్ష్మణులు, ఆగమ్య = వచ్చి, లంకాం = లంకను, సాయకైః = బాణములతో, విధమిష్యతః = నాశమొందింతురు.

**తాత్పర్యము** :– పురుషశ్రేష్ఠులైన మహావీరులగు ఆ రామలక్ష్మణు లిరువురును కలసివచ్చి ఈ లంకానగరమును బాణములతో నాశమొందింతురు.

**శ్లో॥ సగణం రావణం హత్వా రాఘవో రఘునందనః ।**
**త్వా మాదాయ వరారోహే స్వపురీం ప్రతి యాస్యతి ॥ 43**

**పదచ్ఛేదము** :– సగణం – రావణం – హత్వా – రాఘవః – రఘునందనః – త్వామ్ – ఆదాయ – వరారోహే – స్వపురీం – ప్రతి – యాస్యతి ॥

**అన్వయక్రమము** :– వరారోహే! రఘునందనః రాఘవః సగణం రావణం హత్వా త్వామ్ ఆదాయ స్వపురీం ప్రతియాస్యతి.

**ప్రతిపదార్థము** :– వరారోహే! = శ్రేష్ఠమైన కటిసీమగల ఓ జానకీ! రఘునందనః = రఘువంశవర్ధనుడైన, రాఘవః = శ్రీరాముడు, సగణం = పరివారముతోగూడిన, రావణం = రావణుని, హత్వా = చంపి, త్వాం = నిన్ను, ఆదాయ = తీసికొని, స్వపురీం = నిజనగరమును గూర్చి, ప్రతియాస్యతి = వెడలిపోవును.

**తాత్పర్యము :–** ఓ సుందరాంగీ! రఘుకులభూషణుడైన శ్రీరాముడు రావణుని పరివార సమేతముగా పరిమార్చి నిన్ను గైకొని నిజనగరమునకు వెడలిపోవగలడు.

**శ్లో॥ త దాశ్వసిహి భద్రం తే భవ త్వం కాలకాంక్షిణీ ।**
**నచిరా ద్ద్రక్ష్యసే రామం ప్రజ్వలంతమి వానలమ్ ॥ 44**

**పదచ్ఛేదము :–** తత్ – ఆశ్వసిహి – భద్రం – తే – భవ – త్వం – కాలకాంక్షిణీ – న – చిరాత్ – ద్రక్ష్యసే – రామం – ప్రజ్వలంతమ్ – ఇవ – అనలమ్ ॥

**అన్వయక్రమము :–** తత్ ఆశ్వసిహి; తే భద్రమ్, త్వం కాలకాంక్షిణీ భవ; నచిరాత్ ప్రజ్వలంతమ్ అనలమ్ ఇవ రామం ద్రక్ష్యసే.

**ప్రతిపదార్థము :–** తత్ = అందువలన, ఆశ్వసిహి = ఊరడిల్లుము, తే = నీకు, భద్రమ్ = మంగళము, త్వం = నీవు, కాలకాంక్షిణీ = సమయమును కోరుచున్నదానవు, భవ = అగుము; నచిరాత్ = త్వరలో, ప్రజ్వలంతం = ప్రజ్వలించుచున్న, అనలమ్ ఇవ = అగ్నిదేవునివలె, రామం = శ్రీరాముని, ద్రక్ష్యసే = చూడగలవు.

**తాత్పర్యము :–** తల్లీ! ఊరడిల్లుము. నీకు శుభమగుగాక! దుఃఖవిమోచనకాలము కొఱకై నిరీక్షించుచుండుము. స్వల్పకాలములోనే ప్రజ్వలించుచున్న అగ్నిదేవునివలె పొడచూపు శ్రీరాముని నీవు కనుగొనగలవు.

**శ్లో॥ నిహతే రాక్షసేంద్రేఽస్మిన్ సపుత్రామాత్యబాంధవే ।**
**త్వం సమేష్యసి రామేణ శశాంకేనేవ రోహిణీ ॥ 45**

**పదచ్ఛేదము :–** నిహతే – రాక్షసేంద్రే – అస్మిన్ – సపుత్రామాత్యబాంధవే – త్వం – సమేష్యసి – రామేణ – శశాంకేన – ఇవ – రోహిణీ ॥

**అన్వయక్రమము :–** సపుత్రామాత్యబాంధవే అస్మిన్ రాక్షసేంద్రే నిహతే సతి శశాంకేన రోహిణీ ఇవ రామేణ త్వం సమేష్యసి.

**ప్రతిపదార్థము :–** సపుత్రామాత్యబాంధవే = పుత్రులతోడను, మంత్రులతోడను, బంధువులతోడను గూడినట్టి, అస్మిన్ రాక్షసేంద్రే = ఈ రాక్షసరాజు, నిహతే సతి = చంపబడినవాడుకాగా, శశాంకేన = చంద్రునితో, రోహిణీ ఇవ = రోహిణివలె, రామేణ = శ్రీరామునితో, త్వం = నీవు, సమేష్యసి = కలసికొనగలవు.

**తాత్పర్యము :–** శ్రీరామునిచేతిలో తన పుత్రులు, మంత్రులు మున్నగు పరిజనముతో సహితముగా రావణుడు కడతేరగనే చంద్రునితో రోహిణీసతివలె శ్రీరామునితో నీవు కలసికొనగలవు సుమా!

**శ్లో॥ క్షిప్రం త్వం దేవి శోకస్య పారం యాస్యసి మైథిలి ।**
**రావణం చైవ రామేణ నిహతం ద్రక్ష్యసేఽచిరాత్ ॥ 46**

**పదచ్ఛేదము :–** క్షిప్రం – త్వం – దేవి – శోకస్య – పారం – యాస్యసి – మైథిలి – రావణం – చ – ఏవ – రామేణ – నిహతం – ద్రక్ష్యసే – అచిరాత్ ॥

**అన్వయక్రమము :–** దేవి! మైథిలి! త్వం క్షిప్రం శోకస్య పారం యాస్యసి; రామేణ నిహతం రావణం చైవ అచిరాత్ ద్రక్ష్యసే.

**ప్రతిపదార్థము :–** దేవి! మైథిలి! = పూజ్యురాలవైన ఓ జానకీ, త్వం = నీవు, క్షిప్రం = త్వరలో, శోకస్య = దుఃఖముయొక్క, పారం = అంతమును, యాస్యసి = చేరగలవు, అచిరాత్ = త్వరలోనే, రామేణ = శ్రీరామునిచే, నిహతం = చంపబడినట్టి, రావణం చ ఏవ = రావణునిగూడ, ద్రక్ష్యసే = చూడగలవు.

**తాత్పర్యము :–** ఓ సీతాదేవీ! త్వరలోనే నీ శోకమునకు అంతము గలుగును. మిక్కిలి త్వరలోనే రామునిచే నిహతుడైన రావణుని నీవు కనుగొన గలవు.

**శ్లో॥ ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమాన్మారుతాత్మజః ।**
**గమనాయ మతిం కృత్వా వైదేహీం పున రబ్రవీత్ ॥ 47**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఆశ్వాస్య – వైదేహీం – హనుమాన్ – మారుతాత్మజః – గమనాయ – మతిం – కృత్వా – వైదేహీం – పునః – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః హనుమాన్ వైదేహీమ్ ఏవమ్ ఆశ్వాస్య గమనాయ మతిం కృత్వా పునః వైదేహీమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః = వాయునందనుడైన, హనుమాన్ = హనుమ, వైదేహీం = జానకిని, ఏవం = ఇట్లు, ఆశ్వాస్య = ఊరడించి, గమనాయ = వెడలుటకై, మతిం కృత్వా = నిశ్చయించి, పునః = తిరిగి, వైదేహీం = సీతనుగూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** హనుమ ఈ రీతిగ సీతమ్మ నోదార్చి పయనమున కుద్యుక్తుడై తిరిగి ఆమెను జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ త మరిఘ్నం కృతాత్మానం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవం ।**
**లక్ష్మణం చ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్ ॥ 48**

**పదచ్ఛేదము :–** తమ్ – అరిఘ్నం – కృతాత్మానం – క్షిప్రం – ద్రక్ష్యసి – రాఘవమ్ – లక్ష్మణం చ – ధనుష్పాణిం – లంకాద్వారమ్ – ఉపస్థితమ్ ॥

**అన్వయక్రమము** :- లంకాద్వారమ్ ఉపస్థితమ్ అరిఘ్నం కృతాత్మానం తం రాఘవం ధనుష్పాణిం లక్ష్మణం చ క్షిప్రం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :- అరిఘ్నం = శత్రుసంహారకుడును, కృతాత్మానం = నిర్వహించిన ఆత్మకృత్యముగలవాడు నగు, ధనుష్పాణిం = గొప్పధనుస్సు హస్తమునందు గలవాడు నగు, తం రాఘవం = ఆ శ్రీరాముని, లక్ష్మణం చ = లక్ష్మణుని, లంకాద్వారం = లంకానగరద్వారమును, ఉపస్థితం = చేరుకొన్నవానినిగా, క్షిప్రం = త్వరలో, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :- తల్లీ! నీవు త్వరలోనే శత్రుసంహారకుడై, కృతకృత్యుడై, మహా ధనుర్ధారియై నిలచు శ్రీరాముని, లక్ష్మణుని ఈ లంకానగరద్వారమునందు చూడగలవు సుమా!

**శ్లో॥ నఖదంష్ట్రాయుధా న్వీరా న్సింహశార్దూలవిక్రమాన్ ।**
**వానరా న్వారణేంద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్ ॥ 49**

**పదచ్ఛేదము** :- నఖదంష్ట్రాయుధాన్ - వీరాన్ - సింహశార్దూలవిక్రమాన్ - వానరాన్ - వారణేంద్రాభాన్ - క్షిప్రం - ద్రక్ష్యసి - సంగతాన్ ॥

**అన్వయక్రమము** :- సంగతాన్ నఖదంష్ట్రాయుధాన్ సింహశార్దూలవిక్రమాన్ వారణేంద్రాభాన్ వీరాన్ వానరాన్ క్షిప్రం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :- సంగతాన్ = గుంపుగూడినట్టి, నఖదంష్ట్రాయుధాన్ = నఖములు దంష్ట్రలు ఆయుధముగా గలవారును, సింహశార్దూలవిక్రమాన్ = సింహము వ్యాఘ్రమువంటి పరాక్రమముగలవారును, వారణేంద్రాభాన్ = మదగజముల వంటివారును, వీరాన్ = వీరులును అగు, వానరాన్ = వానరులను, క్షిప్రం = త్వరలో, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :- తల్లీ! కొద్దికాలములోనే తమ గోళ్ళను కోఱలను ఆయుధముగా చేసికొని సింహములవలెను వ్యాఘ్రములవలెను విక్రమించుచు మదించిన ఏనుగులవలె గానవచ్చు వానరవీరులను లంకానగరమునందు గుమిగూడియుండుట చూడగలవు సుమా!

**శ్లో॥ శైలాంబుదనికాశానాం లంకామలయసానుషు ।**
**నర్దతాం కపిముఖ్యానా మచిరా చ్ఛ్రోష్యసి స్వనమ్ ॥ 50**

**పదచ్ఛేదము** :- శైలాంబుదనికాశానాం - లంకామలయసానుషు - నర్దతాం - కపిముఖ్యానామ్ - అచిరాత్ - శ్రోష్యసి - స్వనమ్ ॥

**అన్వయక్రమము :–** లంకామలయసానుషు అచిరాత్ శైలాంబుదనికాశానాం నర్దతాం కపిముఖ్యానాం స్వనం శ్రోష్యసి.

**ప్రతిపదార్థము :–** లంకామలయసానుషు = లంకయందలి మలయపర్వతపు చరియలపై, అచిరాత్ = త్వరలోనే, నర్దతాం = గర్జించుచున్నట్టి, శైలాంబుదనికాశానాం = పర్వతములవలెను, మేఘములవలెను ఉన్నట్టి, కపిముఖ్యానాం = వానరాగ్రేసరుల యొక్క, స్వనం = ధ్వనిని, శ్రోష్యసి = వినగలవు.

**తాత్పర్యము :–** జానకీదేవీ! ఈ లంకానగరములోని మలయపర్వతముయొక్క చఱియలపై భయంకరముగ గర్జించుచున్న పర్వతములవలెను, మేఘములవలెను గానవచ్చు కపిముఖ్యుల హుంకారములను త్వరలోనే వినగలవు.

**శ్లో॥ స తు మర్మణి ఘోరేణ తాడితో మన్మథేషుణా ।**
**న శర్మ లభతే రామః సింహార్దిత ఇవ ద్విపః ॥ 51**

**పదచ్ఛేదము :–** సః – తు – మర్మణి – ఘోరేణ – తాడితః – మన్మథేషుణా – న – శర్మ – లభతే – రామః – సింహార్దితః – ఇవ – ద్విపః ॥

**అన్వయక్రమము :–** సః రామః తు ఘోరేణ మన్మథేషుణా మర్మణి తాడితః (సన్) సింహార్దితః ద్విపః ఇవ శర్మ న లభతే.

**ప్రతిపదార్థము :–** సః రామః తు = ఆ రాముడు, ఘోరేణ = తీవ్రమైన, మన్మథేషుణా = మన్మథశరముచే, మర్మణి = జీవస్థానమునందు, తాడితః (సన్) = వేధింపబడినవాడై, సింహార్దితః = సింహముచే హింసింపబడినట్టి, ద్విపః ఇవ = ఏనుగువలె, శర్మ = సుఖమును, న లభతే = పొందుటలేదు.

**తాత్పర్యము :–** తల్లీ! ఆ రాముడిపుడు తీవ్రమైన మన్మథశరములచే హృదయము వేధింపబడుచుండగా సింహమునకు చిక్కి హింసనొందుచున్న ఏనుగువలెనే సుఖమునకు దూరమై యున్నాడు.

**శ్లో॥ రుదో మా దేవి శోకేన మా భూత్తే మనసో భయమ్ ।**
**శచీవ భర్త్రా శక్రేణ సంగ మేష్యసి శోభనే ॥ 52**

**పదచ్ఛేదము :–** రుదః – మా – దేవి – శోకేన – మాభూత్ – తే – మనసః – భయమ్ – శచీ – ఇవ – భర్త్రా – శక్రేణ – సంగమ్ – ఏష్యసి – శోభనే ॥

**అన్వయక్రమము :–** దేవి! శోకేన మా రుదః; తే మనసః భయం మా భూత్; శోభనే! శచీ భర్త్రా శక్రేణ ఇవ సంగమ్ ఏష్యసి.

**ప్రతిపదార్థము** :– దేవి! = ఓ పూజ్యురాలా! శోకేన = దుఃఖముతో, మా రుదః = శోకింపకుము, తే = నీ యొక్క, మనసః = మనస్సునకు, భయం = భీతి, మా భూత్ = లేకుండుగాక, శోభనే = ఓ మంగళస్వరూపురాలా! శచీ = శచీదేవి, శక్రేణ ఇవ = దేవేంద్రునితోవలె, భర్త్రా = భర్తయగు రామునితో, సంగం = కలయికను, ఏష్యసి = పొందగలవు.

**తాత్పర్యము** :– తల్లీ! దిగులుతో శోకింపకుము. నీ మనస్సునుండి భయము తొలగిపోవుగాక! శచీదేవి దేవేంద్రుని కలసికొన్నట్లుగా నీవు నీ నాథుని కలసికొందువు.

**శ్లో॥ రామా ద్విశిష్టః కోఽన్యోఽస్తి కశ్చి త్సౌమిత్రిణా సమః ।**
**అగ్నిమారుతకల్పౌ తౌ భ్రాతరౌ తవ సంశ్రయౌ ॥ 53**

**పదచ్ఛేదము** :– రామాత్ – విశిష్టః – కః – అన్యః – అస్తి – కశ్చిత్ – సౌమిత్రిణా – సమః – అగ్నిమారుతకల్పౌ – తౌ – భ్రాతరౌ – తవ – సంశ్రయౌ ॥

**అన్వయక్రమము** :– రామాత్ విశిష్టః అన్యః కః అస్తి? సౌమిత్రిణా సమః కశ్చిత్ (కుత్ర అస్తి?) అగ్నిమారుతకల్పౌ తౌ తవ సంశ్రయౌ.

**ప్రతిపదార్థము** :– రామాత్ = రామునికన్న, విశిష్టః = అధికుడు, అన్యః = ఇతరుడు, కః = ఎవడు, అస్తి = ఉన్నాడు? సౌమిత్రిణా = లక్ష్మణునితో, సమః = సమానుడు, కశ్చిత్ = ఎవ్వడైన, (కుత్ర అస్తి = ఎచ్చట నున్నాడు?) అగ్నిమారుతకల్పౌ = అగ్నితోను వాయువుతోను, సమానులైనట్టి, తౌ = వారిరువురును, తవ = నీకు, సంశ్రయౌ = ఆశ్రయమైయున్నారు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– లోకమున దహనకర్మయం దగ్నిని మించినది లేదు. ఇది రూపమే లేకుండ చేయును. బలమునందు వాయువుతో సమానమైనది లేదు. ఈ రెండును ఏకమైనప్పుడు అవి శత్రునిశ్శేషము చేయగలవు. అట్టి ఆ ఇరువురు నీకు సహాయులు. ఇక నీకు వచ్చిన భయమేమి?

**తాత్పర్యము** :– రాముని కంటె అధికుడైనవాడు ఇతరు డెవ్వడైన నున్నాడా? లక్ష్మణుని బోలినట్టి వీరు డెచ్చటనైన నున్నాడా? పరస్పరము తోడై అగ్నివాయువులవలె నుండు వారిరువురును నీకు ఆశ్రయమై యుండగా దిగులు చెందవలసినపని నీకేమున్నది?

**శ్లో॥ నాస్మిం శ్చిరం వత్స్యసి దేవి దేశే**
**రక్షోగణై రధ్యుషితే ఽతిరౌద్రే ।**
**న తే చిరా దాగమనం ప్రియస్య**
**క్షమస్వ మత్సంగమకాలమాత్రమ్ ॥ 54**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనూమత్సందేశో" నామ*
*ఏకోనచత్వారింశస్సర్గః*

**పదచ్ఛేదము** :- న - అస్మిన్ - చిరం - వత్స్యసి - దేవి - దేశే - రక్షోగణైః - అధ్యుషితే - అతిరౌద్రే - న - తే - చిరాత్ - ఆగమనం - ప్రియస్య - క్షమస్వ - మత్సంగమకాలమాత్రమ్ ॥

**అన్వయక్రమము** :- దేవి! రక్షోగణైః అధ్యుషితే అతిరౌద్రే అస్మిన్ దేశే చిరం న వత్స్యసి; తే ప్రియస్య ఆగమనం నచిరాత్ (భవిష్యతి); మత్సంగమకాలమాత్రం క్షమస్వ.

**ప్రతిపదార్థము** :- దేవి! = ఓ పూజ్యురాలా!, రక్షోగణైః = రాక్షసుల సమూహములచే, అధ్యుషితే = నివసింపబడుచున్నట్టి, అతిరౌద్రే = మహాభయంకరమైన, అస్మిన్ దేశే = ఈ దేశమునందు, చిరం = చిరకాలము, స వత్స్యసి = నివసింపబోవు, తే ప్రియస్య = నీ భర్తయొక్క, ఆగమనం = రాక, న చిరాత్ = త్వరలో, (భవిష్యతి = కాగలదు), మత్సంగమకాలమాత్రం = నాతో నీ భర్త (మఱల) కలిసికొనునంత కాలము మాత్రము, క్షమస్వ = ఓర్చుకొనుము.

**తాత్పర్యము** :- తల్లీ! రక్కసుల మూకలతో నిండియున్న భయంకరమైన ఈ లంకానగరమున చిరకాలము నీవు వసింపనక్కఱలేదు. అచిరకాలములోనే నీ ప్రియుడు నీ కడకు వచ్చుట జరుగును. కేవలము నేనా మహనీయునితో కలసికొనునంతవఱకును ఆవశ్యకమైన కొద్దికాలము మాత్రము ఎట్లో సహింపుము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనూమత్సందేశము" అను*
*ముప్పదితొమ్మిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చత్వారింశసర్గ

**శ్లో॥ శ్రుత్వా తు వచనం తస్య వాయుసూనో ర్మహాత్మనః ।**
**ఉవా చాత్మహితం వాక్యం సీతా సురసుతోపమా ॥ 1**

**పదచ్ఛేదము :–** శ్రుత్వా – తు – వచనం – తస్య – వాయుసూనోః – మహాత్మనః – ఉవాచ – ఆత్మహితం – వాక్యం – సీతా – సురసుతోపమా ॥

**అన్వయక్రమము :–** మహాత్మనః వాయుసూనోః తస్య వచనం శ్రుత్వా సురసుతోపమా సీతా ఆత్మహితం వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** వాయుసూనోః = వాయుపుత్రుడైన, మహాత్మనః = మహనీయుడైనట్టి, తస్య = ఆ హనుమయొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, సురసుతోపమా = దేవకన్యను బోలిన, సీతా = సీతాదేవి, ఆత్మహితం = తనకు హితమైనట్టి, వాక్యం = మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** వాయునందనుడైన ఆ మహాత్ముడగు ఆంజనేయుని మాటలను విని దేవకన్యను బోలిన సీతాదేవి తనకు హితమైన మాటలను ఈ రీతిగ పలికెను.

**శ్లో॥ త్వాం దృష్ట్వా ప్రియవక్తారం సంప్రహృష్యామి వానర ।**
**అర్ధసంజాతసస్యేవ వృష్టిం ప్రాప్య వసుంధరా ॥ 2**

**పదచ్ఛేదము :–** త్వాం – దృష్ట్వా – ప్రియవక్తారం – సంప్రహృష్యామి – వానర – అర్ధసంజాతసస్యా – ఇవ – వృష్టిం – ప్రాప్య – వసుంధరా ॥

**అన్వయక్రమము :–** వానర! ప్రియవక్తారం త్వాం దృష్ట్వా అర్ధసంజాతసస్యా వసుంధరా వృష్టిం ప్రాప్య ఇవ సంప్రహృష్యామి.

**ప్రతిపదార్థము :–** వానర! = ఓ హనుమా! ప్రియవక్తారం = ప్రియముగ మాటలాడుచున్నట్టి, త్వాం = నిన్ను, దృష్ట్వా = చూచి, అర్ధసంజాతసస్యా = సగము మొలచిన పైరుగల, వసుంధరా = భూమి, వృష్టిం = వర్షమును, ప్రాప్య ఇవ = పొందివలె, సంప్రహృష్యామి = మిక్కిలి సంతోషము నొందుచున్నాను.

**తాత్పర్యము** :– ఓ హనుమా! నా మనస్సున కానందకరముగా మంచి మాటలు చెప్పుచున్న నిన్ను జూచి సగము పెరిగిన పైరుతో వర్షములేక ఎండిపోవుచున్నట్టి చేను అప్పుడే కురిసిన వర్షమువలన ఎంత ఆనందించునో అంత గొప్ప ఆనందము పొందుచున్నాను సుమా!

**శ్లో॥ యథా తం పురుషవ్యాఘ్రం గాత్రై శ్శోకాభికర్శితైః ।**
**సంస్పృశేయం సకామాహం తథా కురు దయాం మయి ॥ 3**

**పదచ్ఛేదము** :– యథా – తం – పురుషవ్యాఘ్రం – గాత్రైః – శోకాభికర్శితైః – సంస్పృశేయం – సకామా – అహం – తథా – కురు – దయాం – మయి ॥

**అన్వయక్రమము** :– సకామా అహం శోకాభికర్శితైః (మమ) గాత్రైః తం పురుష వ్యాఘ్రం యథా సంస్పృశేయం తథా మయి దయాం కురు.

**ప్రతిపదార్థము** :– సకామా = కోరికతో కూడినట్టి, అహం = నేను, శోకాభికర్శితైః = దుఃఖముచే మిక్కిలి కృశించియున్నట్టి, (మమ = నా యొక్క) గాత్రైః = అవయవములతో, తం పురుషవ్యాఘ్రం = ఆ పురుషశ్రేష్ఠుని, యథా = ఏ విధముగ, సంస్పృశేయం = తాకగలనో, తథా = ఆ రీతిగా, మయి = నాయందు, దయాం కురు = దయను నెఱుపుము.

**తాత్పర్యము** :– మిక్కిలి కోరికతో నున్నట్టి నేను వియోగదుఃఖముచే కృశించియున్న నా అవయవములతో ఆ పురుషశ్రేష్ఠుని స్పృశించునట్టి భాగ్యమును నాకు దయతో సమకూర్పుము.

**శ్లో॥ అభిజ్ఞానం చ రామస్య దద్యా హరిగణోత్తమ ।**
**క్షిప్తా మిషీకాం కాకస్య కోపా దేకాక్షిశాతనీమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– అభిజ్ఞానం – చ – రామస్య – దద్యాః – హరిగణోత్తమ – క్షిప్తామ్ – ఇషీకాం – కాకస్య – కోపాత్ – ఏకాక్షిశాతనీమ్ ॥

**అన్వయక్రమము** :– హరిగణోత్తమ! కోపాత్ క్షిప్తాం కాకస్య ఏకాక్షిశాతనీమ్ ఇషీకాం రామస్య అభిజ్ఞానం చ దద్యాః.

**ప్రతిపదార్థము** :– హరిగణోత్తమ! = ఓ వానరయూథాగ్రేసరుడా! కోపాత్ = కోపము వలన, క్షిప్తాం = విసరినట్టి, కాకస్య = కాకికి, ఏకాక్షిశాతనీం = ఒక కన్నును పోగొట్టినట్టి, ఇషీకాం = దర్భనుగుఱించిన వృత్తాంతమును, రామస్య = శ్రీరామునకు, అభిజ్ఞానం = గుర్తునుగా, దద్యాః = ఒసగుము.

**తాత్పర్యము** :- వానరశ్రేష్ఠుడా! ఆనాడు కోపముతో విసరి వాయసముయొక్క ఒక కంటిని హరించినట్టి ఆ దర్భవృత్తాంతమును శ్రీరామునకు గుర్తుగా తెలుపుము.

**శ్లో॥ మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః ।**
**త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తు మర్హసి ॥ 5**

**పదచ్ఛేదము** :- మనశ్శిలాయాః - తిలకః - గండపార్శ్వే - నివేశితః - త్వయా - ప్రణష్టే - తిలకే - తం - కిల - స్మర్తుమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము** :- (మమ) తిలకే ప్రణష్టే (సతి) గండపార్శ్వే (యః) మనశ్శిలాయాః తిలకః త్వయా నివేశితః తం స్మర్తుమ్ అర్హసి కిల.

**ప్రతిపదార్థము** :- (మమ = నా యొక్క), తిలకే = బొట్టు, ప్రణష్టే (సతి) = చెఱిగిపోవగా, గండపార్శ్వే = చెక్కిలియందలి, మనశ్శిలాయాః = మణిశిలధాతువు యొక్క, తిలకః = తిలకము, త్వయా = నీ చేత, నివేశితః = (బొట్టుగా) పెట్టబడినది, తం = ఆ విషయమును, స్మర్తుం = జ్ఞాపకము తెచ్చుకొనుటకు, అర్హసి = తగుదువు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'మమ గండపార్శ్వే మనశ్శిలాతిలకః నివేశితః' - బుగ్గపై బొట్టు చెఱిగి పోవగా కొండపై నున్న మణిశిలాధాతువుతో తిరిగి ఆ చుక్కను నాకు పెట్టితివి అని భావము.

**గోవిందరాజీయము** :- గండపార్శ్వే తిలకః నివేశితః - గండస్థలమందు అని గాని, గండశైలమున ఒక ప్రక్క కూర్చుండగా గాని బొట్టుపెట్టబడినదని భావము.

**వాసుదాసస్వామి** :- గండశైలమునందు చెమటకు నా ముఖమున చుక్కబొట్టు కరగిపోవగా పాడు ముఖముతో నున్న నాకు తానే ప్రేమతో మణిశిలను జాది తిలకముంచెను.

**తాత్పర్యము** :- రామా! ఒక మాఱు నా నుదుటిపై తిలకము చెదరిపోవగా, నీవు వెంటనే నా బుగ్గపై నున్న మణిశిలాతిలకమును ఒలిచి నా నుదుటిపై బొట్టుగా పెట్టితివి; ఆ విషయమును జ్ఞాపకము తెచ్చుకొనుము.

**శ్లో॥ స వీర్యవాన్ కథం సీతాం హృతాం సమనుమన్యసే ।**
**వసంతీం రక్షసాం మధ్యే మహేంద్రవరుణోపమః ॥ 6**

**పదచ్ఛేదము** :- సః - వీర్యవాన్ - కథం - సీతాం - హృతాం - సమనుమన్యసే -

వసంతీం - రక్షసాం - మధ్యే - మహేంద్రవరుణోపమః ॥

**అన్వయక్రమము** :- మహేంద్రవరుణోపమః వీర్యవాన్ సః (త్వం) సీతాం హృతాం, రక్షసాం మధ్యే వసంతీం కథం సమనుమన్యసే?

**ప్రతిపదార్థము** :- మహేంద్రవరుణోపమః = దేవేంద్రునితోడను, వరుణునితోడను సాటియైనవాడవు అగు, వీర్యవాన్ = పరాక్రమవంతుడవైన, సః త్వం = ఆ నీవు, సీతాం = సీతను, హృతాం = అపహరింపబడినదానిగను, రక్షసాం = రాక్షసుల యొక్క, మధ్యే = నడుమ, వసంతీం = నివసించుచున్న దానినిగను, కథం = ఎట్లు, సమనుమన్యసే = సమ్మతించుచున్నావు.

**తాత్పర్యము** :- దేవేంద్రునివలెను వరుణదేవునివలెను మహాపరాక్రమశాలివగు నీవు నీ భార్యయైన సీతను రాక్షసులు అపహరించుటయును ఆమె ఆ క్రూరుల నడుమ నివసించుటయు ఎట్లు సమ్మతించుచున్నావు?

**శ్లో॥ ఏష చూడామణిర్దివ్యో మయా సుపరిరక్షితః ।**
**ఏతం దృష్ట్వా ప్రహృష్యామి వ్యసనే త్వామి వానఘ ॥ 7**

**పదచ్ఛేదము** :- ఏషః - చూడామణిః - దివ్యః - మయా - సుపరిరక్షితః - ఏతం - దృష్ట్వా - ప్రహృష్యామి - వ్యసనే - త్వామ్ - ఇవ - అనఘ ॥

**అన్వయక్రమము** :- అనఘ! ఏషః దివ్యః చూడామణిః మయా సుపరిరక్షితః; వ్యసనే ఏతం దృష్ట్వా త్వాం దృష్ట్వా ఇవ ప్రహృష్యామి.

**ప్రతిపదార్థము** :- అనఘ! = ఓ పాపరహితుడా! ఏషః = ఈ, దివ్యః = పూజ్యమైనట్టి, చూడామణిః = చూడామణి, మయా = నాచే, సుపరిరక్షితః = చక్కగా భద్రము చేయబడినది, వ్యసనే = కష్టకాలమునందు, ఏతం = దీనిని, దృష్ట్వా = చూచి, త్వాం = నిన్ను, దృష్ట్వా ఇవ = చూచినట్లువలె, ప్రహృష్యామి = గొప్ప ఆనందము నొందుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'ఏతం దృష్ట్వా ప్రహృష్యామి' ఈ చూడామణిని నీవు మిక్కిలి ప్రేమగా పలుమాఱులు చేతిలో నిడికొని చూచెడివాడవు గావున దీనినిచూచి నిన్ను చూచినట్లు సంతోషించుచున్నాను.

**తాత్పర్యము** :- ఈ చూడామణి నాకు మిక్కిలి పవిత్రమైనదగుటచే దీనిని మిక్కిలి ప్రియముగా భద్రపఱచుకొంటిని. నేను ఈ కష్టకాలములో దీనిని చూచికొనియే

నిన్ను జూచినట్లు సంతోషించుచున్నాను.

**శ్లో॥ ఏష నిర్యాతిత శ్రీమా న్మయా తే వారిసంభవః ।**
**అతః పరం న శక్ష్యామి జీవితుం శోకలాలసా ॥ 8**

**పదచ్ఛేదము** :- ఏషః - నిర్యాతితః - శ్రీమాన్ - మయా - తే - వారిసంభవః - అతః - పరం - న - శక్ష్యామి - జీవితుం - శోకలాలసా ॥

**అన్వయక్రమము** :- వారిసంభవః శ్రీమాన్ ఏషః మయా తే నిర్యాతితః, శోకలాలసా (సతీ) అతః పరం జీవితుం న శక్ష్యామి.

**ప్రతిపదార్థము** :- వారిసంభవః = సముద్రమునుండి ఉద్భవించినట్టి, శ్రీమాన్ = శోభావంతమైనట్టి, ఏషః = ఈ చూడామణి, మయా = నాచేత, తే = నీకొఱకై, నిర్యాతితః = పంపబడినది, శోకలాలసా = దుఃఖగ్రస్తురాలనై, అతః పరం = ఇటుపైని, జీవితుం = జీవించుటకు, న శక్ష్యామి = చాలను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'ఏతత్చూడామణిసన్నిధానే రక్షోభిభవస్య అసంభవాత్' ఈ చూడామణి ప్రభావము వలననే సీతమ్మకు రాక్షసుల క్రౌర్యమును, హింసయును ఎట్టి ఉపద్రవమును అపాయమును కలిగించలేదని భావము.

**తాత్పర్యము** :- రత్నాకరసముద్భవమై లక్ష్మీకరమైయున్న ఈ దివ్యమైన చూడామణిని ఇప్పుడు నీకు పంపివేయుచున్నాను. ఇక మీదట చిరకాలము నేను ఒంటరిగా జీవముతో నుండజాలను.

**శ్లో॥ అసహ్యాని చ దుఃఖాని వాచశ్చ హృదయచ్ఛిదః ।**
**రాక్షసై స్సహ సంవాసం త్వత్కృతే మర్షయా మ్యహమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :- అసహ్యాని - చ - దుఃఖాని - వాచః - చ - హృదయచ్ఛిదః - రాక్షసైః - సహ - సంవాసం - త్వత్కృతే - మర్షయామి - అహమ్ ॥

**అన్వయక్రమము** :- అసహ్యాని దుఃఖాని చ, హృదయచ్ఛిదః వాచః చ, రాక్షసైః సహ సంవాసం చ త్వత్కృతే అహం మర్షయామి.

**ప్రతిపదార్థము** :- అసహ్యాని = భరింపరాని, దుఃఖాని చ = దుఃఖములను, హృదయచ్ఛిదః = గుండెలను బ్రద్దలుచేయు, వాచః చ = మాటలను, రాక్షసైః సహ = రాక్షసులతోడ, సంవాసం = నివాసమును, త్వత్కృతే = నీ నిమిత్తమై, అహం =

నేను, మర్షయామి = సహించుచున్నాను.

**సూచన** :– 'రాక్షసైః సహ సంవాసం' అనుటకు బదులుగా 'రాక్షసీనాం సుఘోరాణాం' అని పాఠాంతరము.

**తాత్పర్యము** :– ఈ భరింపరాని దుఃఖములను ఈ రాక్షసస్త్రీలు పలుకు హృదయ భేదకములైన మాటలను, ఈ దానవుల నడుమ నివాసమును నేను సహించుచున్నది నీ నిమిత్తమే సుమా!

**శ్లో॥ ధారయిష్యామి మాసం తు జీవితం శత్రుసూదన ।**
**మాసా దూర్ధ్వం న జీవిష్యే త్వయా హీనా నృపాత్మజ ॥ 10**

**పదచ్ఛేదము** :– ధారయిష్యామి – మాసం – తు – జీవితం – శత్రుసూదన – మాసాత్ – ఊర్ధ్వం – న – జీవిష్యే – త్వయా – హీనా – నృపాత్మజ ॥

**అన్వయక్రమము** :– నృపాత్మజ! శత్రుసూదన! మాసం తు జీవితం ధారయిష్యామి; మాసాత్ ఊర్ధ్వం త్వయా హీనా న జీవిష్యే.

**ప్రతిపదార్థము** :– శత్రుసూదన = ఓ శత్రుసంహారకుడవైనట్టి, నృపాత్మజ = రాజకుమారా!, మాసం తు = ఒక మాసము మాత్రము, జీవితం = జీవితమును, ధారయిష్యామి = ధరింపగలను, మాసాత్ = మాసముకంటె, ఊర్ధ్వం = పిమ్మట, త్వయా హీనా = నీవులేనిదానినై, న జీవిష్యే = జీవింపను.

**తాత్పర్యము** :– ఓ శత్రుసంహారకుడా! ఒక మాసము మాత్రమెట్లో నా జీవితమును నిలబెట్టుకొందును. అటుపిమ్మట నీవు లేకుండ ఒక్క క్షణముగూడ జీవింపజాలను.

**శ్లో॥ ఘోరో రాక్షసరాజోఽయం దృష్టిశ్చ న సుఖా మయి ।**
**త్వాం చ శ్రుత్వా విషజ్జంతం న జీవేయ మహం క్షణమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– ఘోరః – రాక్షసరాజః – అయం – దృష్టిః – చ – న – సుఖా – మయి – త్వాం – చ – శ్రుత్వా – విషజ్జంతం – న – జీవేయమ్ – అహం – క్షణమ్ ॥

**అన్వయక్రమము** :– అయం రాక్షసరాజః ఘోరః; మయి (అస్య) దృష్టిః చ న సుఖా; త్వాం విషజ్జంతం చ శ్రుత్వా అహం క్షణం న జీవేయమ్.

**ప్రతిపదార్థము** :– అయం రాక్షసరాజః = ఈ రావణుడు, ఘోరః = క్రూరుడు, మయి = నాయందు, (అస్య = వీనియొక్క), దృష్టిః చ = చూపుకూడ, న సుఖా = సుఖమైనది

గాదు, త్వాం = నిన్ను, విషజ్జంతం = విలంబము గావించుచున్నవానినిగా, శ్రుత్వా చ = వినిగూడ, అహం = నేను, క్షణం = క్షణకాలము, న జీవేయమ్ = బ్రదుకజాలను, (ఇతి రామం బ్రూహి = అని రాముని గూర్చి చెప్పుము).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'దృష్టిశ్చ న సుఖా' – ఇచ్చట దృష్టిగూడ దుఃఖకరముగ నున్నది అనుటచే బుద్ధిగూడ తన యెడ క్రూరముగనే యున్నది అనియు అవధి కాలము గడచిన వెంటనే నన్ను వధింపక మానడనియును రెండు నెలల పిమ్మట అతని చేతిలో చనిపోవుట కంటె మాసము వఱకు చూచి నీవు గాన్పింపనిచో నేను చనిపోవుటయే యుక్త మనియు సీతమ్మ తెలుపుచున్నదని భావము.

**తాత్పర్యము :–** ఈ రాక్షసరాజు మహాక్రూరుడు. ఈతని దృష్టి కూడ నాకు దుఃఖకరముగనే యున్నది. ఇట్టి స్థితిలో నీవు నన్ను ఉద్ధరించుటలో విలంబము చేసిన యెడల నేను క్షణము గూడ జీవింపజాలను.

**శ్లో॥ వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రుభాషితమ్ ।**
**అథాబ్రవీ న్మహాతేజా హనుమా న్మారుతాత్మజః ॥ 12**

**పదచ్ఛేదము :–** వైదేహ్యాః – వచనం – శ్రుత్వా – కరుణం – సాశ్రుభాషితమ్ – అథ – అబ్రవీత్ – మహాతేజాః – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః మారుతాత్మజః హనుమాన్ వైదేహ్యాః సాశ్రుభాషితం కరుణం వచనం శ్రుత్వా అథ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః = తేజశ్శాలియును, మారుతాత్మజః = వాయునందనుడును అగు, హనుమాన్ = హనుమ, వైదేహ్యాః = జానకియొక్క, సాశ్రుభాషితం = కన్నీటితో పలుకబడినదియును, కరుణం = దీనమైనదియు నగు, వచనం = మాటను, శ్రుత్వా = విని, అథ = పిమ్మట, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** మహాతేజస్సంపన్నుడైన మారుతాత్మజుడు కన్నీటితో దీనముగా పలికిన జానకీదేవి వచనము లాలకించి వెంటనే ఆమెతో నిట్లు పలికెను.

**శ్లో॥ త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే ।**
**రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే ॥ 13**

**పదచ్ఛేదము :–** త్వచ్ఛోకవిముఖః – రామః – దేవి – సత్యేన – తే – శపే – రామే

- దుఃఖాభిభూతే - తు - లక్ష్మణః - పరితప్యతే ॥

**అన్వయక్రమము** :- దేవి! సత్యేన తే శపే; రామః త్వచ్ఛోకవిముఖః; - రామే - దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే.

**ప్రతిపదార్థము** :- దేవి! = ఓ పూజ్యురాలా! సత్యేన తే శపే = నిజముపై ఒట్టుపెట్టి నీకు చెప్పుచున్నాను, రామః = శ్రీరాముడు, త్వచ్ఛోకవిముఖః = నిన్నుగూర్చిన శోకముచే (అన్నిటియెడల) విముఖుడై యున్నాడు, రామే = శ్రీరాముడు, దుఃఖాభిభూతే తు = శోకసంతప్తుడై యుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, పరితప్యతే = సంతాపము నొందుచున్నాడు.

**తాత్పర్యము** :- ఓ జానకీదేవీ! సత్యముపై ప్రమాణము చేసి చెప్పుచున్నాను. శ్రీరాముడు ఇప్పుడు నీయందలి శోకముచే లోకవ్యవహారము లన్నింటి యెడను విముఖుడై యున్నాడు. అత డిట్లు పరితపించుచుండగా లక్ష్మణుడు గూడ సంతాపగ్రస్తుడయి యున్నాడు.

**శ్లో॥ దృష్టా కథంచి ద్భవతీ న కాలః పరిశోచితుమ్ ।**
**ఇమం ముహూర్తం దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామిని ॥ 14**

**పదచ్ఛేదము** :- దృష్టా - కథంచిత్ - భవతీ - న - కాలః - పరిశోచితుమ్ - ఇమం - ముహూర్తం - దుఃఖానామ్ - అంతం - ద్రక్ష్యసి - భామిని ॥

**అన్వయక్రమము** :- భవతీ కథంచిత్ దృష్టా; (అయం) పరిశోచితుం కాలః న; భామిని! ఇమం ముహూర్తం దుఃఖానామ్ అంతం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :- భవతీ = నీవు, కథంచిత్ = ఎట్లో, దృష్టా = కనబడితివి, అయం = ఇది, పరిశోచితుం = దుఃఖించుటకు, కాలః న = సమయముగాదు, భామిని = ఓ తరుణీ! ఇమం ముహూర్తం = ఈ ఘడియలోనే, దుఃఖానాం = దుఃఖములకు, అంతం = అంతమును, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :- మా భాగ్యముచే నీవెట్లో గానవచ్చితివి. ఇది దుఃఖింపవలసిన సమయముగాదు. కొన్ని ఘడియలలోనే నీ దుఃఖము కడతేరుచున్నది సుమా!

**శ్లో॥ తా వుభౌ నరశార్దూలౌ రాజపుత్రా వరిందమౌ ।**
**త్వద్దర్శనకృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః ॥ 15**

**పదచ్ఛేదము** :- తౌ - ఉభౌ - నరశార్దూలౌ - రాజపుత్రౌ - అరిందమౌ - త్వద్దర్శనకృతోత్సాహౌ - లంకాం - భస్మీకరిష్యతః ॥

**అన్వయక్రమము** :- అరిందమౌ, నరశార్దూలౌ, తౌ ఉభౌ రాజపుత్రౌ త్వద్దర్శన కృతోత్సాహౌ (సంతౌ) లంకాం భస్మీకరిష్యతః.

**ప్రతిపదార్థము** :- అరిందమౌ = శత్రువుల నణచువారును, నరశార్దూలౌ = పురుష శ్రేష్ఠులును అగు, తౌ ఉభౌ = ఆ ఇరువురు, రాజపుత్రౌ = రాజపుత్రులును, త్వద్దర్శన కృతోత్సాహౌ (సంతౌ) = నిన్ను చూచుటయందు కడు ఉత్సాహముగలవా రగుచు, లంకాం = లంకానగరమును, భస్మీకరిష్యతః = భస్మము చేయుదురు.

**తాత్పర్యము** :- శత్రుసంహారకులైన మహావీరులగు ఆ రామలక్ష్మణు లిరువురును నిన్ను చూచుటయందు మహోత్సాహముతో ఇటకు చేరి ఈ లంకానగరమును భస్మము గావింతురు సుమా!

**శ్లో॥ హత్వా తు సమరే క్రూరం రావణం సహబాంధవమ్ ।**
**రాఘవౌ త్వాం విశాలాక్షి స్వాం పురీం ప్రాపయిష్యతః ॥ 16**

**పదచ్ఛేదము** :- హత్వా - తు - సమరే - క్రూరం - రావణం - సహబాంధవమ్ - రాఘవౌ - త్వాం - విశాలాక్షి - స్వాం - పురీం - ప్రాపయిష్యతః ॥

**అన్వయక్రమము** :- విశాలాక్షి! రాఘవౌ సమరే క్రూరం రావణం సహబాంధవం హత్వా త్వాం స్వాం పురీం ప్రాపయిష్యతః.

**ప్రతిపదార్థము** :- విశాలాక్షి = విశాలమైన నేత్రములుగల ఓ జానకీదేవి!, రాఘవౌ = రామలక్ష్మణులు, సమరే = యుద్ధమున, క్రూరం = క్రూరుడైన, రావణం = రావణుని, సహబాంధవం = బంధువులతోగూడ, హత్వా = సంహరించి, త్వాం = నిన్ను, స్వాం పురీం = తన నగరమును, ప్రాపయిష్యతః = చేర్చగలరు.

**తాత్పర్యము** :- ఓ కమలాక్షీ! ఆ రామలక్ష్మణులు దుర్మార్గుడైన రావణుని బంధు గణములతో కూడ యుద్ధమునందు పరిమార్చి నిన్ను తమ నగరమునకు గొనిపోవగలరు సుమా!

**శ్లో॥ యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే ।**
**ప్రీతిసంజననం తస్య భూయ స్త్వం దాతు మర్హసి ॥ 17**

**పదచ్ఛేదము** :- యత్ - తు - రామః - విజానీయాత్ - అభిజ్ఞానమ్ - అనిందితే - ప్రీతిసంజననం - తస్య - భూయః - త్వం - దాతుమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము** :- అనిందితే! రామః యత్ అభిజ్ఞానం విజానీయాత్ (తం) ప్రీతిసంజననం త్వం భూయః దాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :–** అనిందితే = ఓ పూజ్యురాలా!, రామః = శ్రీరాముడు, యత్ అభిజ్ఞానం = ఏ గుర్తును, విజానీయాత్ = తెలిసికొనగలడో, (తం) ప్రీతిసంజననం = అట్టి ఆనందకరమైనదానిని, త్వం = నీవు, భూయః = తిరిగి, దాతుం = ఇచ్చుటకు, అర్హసి = తగుదువు.

**తాత్పర్యము :–** తల్లీ! శ్రీరాముడు ఏ గుర్తువలన ఇచ్చుటి విషయము తెలియగలడో ఆతని కానందకర మగు అట్టి గుర్తును ఒక దానిని తిరిగి నాకు ఇమ్ము.

**శ్లో॥ సాఽబ్రవీ ద్దత్త మే వేతి మ యాభిజ్ఞాన ముత్తమమ్ ।**
**ఏతదేవ హి రామస్య దృష్ట్వా మత్కేశభూషణమ్ ।**
**శ్రద్ధేయం హనుమ న్వాక్యం తవ వీర భవిష్యతి ॥ 18**

**పదచ్ఛేదము :–** సా – అబ్రవీత్ – దత్తమ్ – ఏవ – ఇతి – మయా – అభిజ్ఞానమ్ – ఉత్తమమ్ – ఏతత్ – ఏవ – హి – రామస్య – దృష్ట్వా – మత్కేశభూషణమ్ – శ్రద్ధేయం – హనుమన్ – వాక్యం – తవ – వీర – భవిష్యతి ॥

**అన్వయక్రమము :–** ఉత్తమమ్ అభిజ్ఞానం మయా దత్తమ్ ఏవ, వీర! హనుమాన్! ఏతత్ మత్కేశభూషణం దృష్ట్వా ఏవ తవ వాక్యం శ్రద్ధేయం భవిష్యతి, ఇతి సా అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** ఉత్తమమ్ = శ్రేష్ఠమైన, అభిజ్ఞానం = గుర్తు, మయా = నాచేత, దత్తమ్ ఏవ అస్తి = ఈయబడియే యున్నది, వీర! హనుమన్! = వీరుడైన ఓ హనుమంతుడా! ఏతత్ మత్కేశభూషణం = ఈ నా చూడామణిని, దృష్ట్వా ఏవ = చూచియే, తవ = నీ యొక్క, వాక్యం = మాట, శ్రద్ధేయం = విశ్వసింపదగినది, భవిష్యతి = కాగలదు, ఇతి = అని, సా = ఆ సీతాదేవి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** మేలైన గుర్తును నీకు నే నిదివఱకే ఇచ్చి యుంటిని. ఓ మహావీరుడా! నా కేశభూషణమైనట్టి ఈ చూడామణిని చూడగనే శ్రీరామునకు తప్పక నీ మాటల యందు విశ్వాసము కలుగును.

**శ్లో॥ స తం మణివరం గృహ్యా శ్రీమాన్ ప్లవగసత్తమః ।**
**ప్రణమ్య శిరసా దేవీం గమనా యోపచక్రమే ॥ 19**

**పదచ్ఛేదము :–** సః – తం – మణివరం – గృహ్యా – శ్రీమాన్ – ప్లవగసత్తమః – ప్రణమ్య – శిరసా – దేవీం – గమనాయ – ఉపచక్రమే ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్ ప్లవగసత్తమః సః తం మణివరం గృహ్యా దేవీం శిరసా

ప్రణమ్య గమనాయ ఉపచక్రమే.

**ప్రతిపదార్థము** :– శ్రీమాన్ = శుభలక్షణాఢ్యుడైన, ప్లవగసత్తమః = వానరశ్రేష్ఠుడగు, సః = ఆ హనుమ, తం మణివరం = ఆ మణిశ్రేష్ఠమును, గృహ్య = గ్రహించి, దేవీం = సీతాదేవిని, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = మ్రొక్కి, గమనాయ = పయనమునకు, ఉపచక్రమే = సిద్ధపడెను.

**తాత్పర్యము** :– శుభలక్షణశోభితుడైన ఆ వానరశ్రేష్ఠుడు సీత యొసగిన చూడామణిని గ్రహించి శిరమువంచి ఆమెకు మ్రొక్కి తిరుగు ప్రయాణమునకు ఉద్యుక్తుడయ్యెను.

**శ్లో॥ త ముత్పాతకృతోత్సాహ మవేక్ష్య హరిపుంగవమ్ ।**
**వర్ధమానం మహావేగ మువాచ జనకాత్మజా ।**
**అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పగద్గదయా గిరా ॥ 20**

**పదచ్ఛేదము** :– తం – ఉత్పాతకృతోత్సాహమ్ – అవేక్ష్య – హరిపుంగవమ్ – వర్ధమానం – మహావేగమ్ – ఉవాచ – జనకాత్మజా – అశ్రుపూర్ణముఖీ – దీనా – బాష్పగద్గదయా – గిరా ॥

**అన్వయక్రమము** :– ఉత్పాతకృతోత్సాహం, మహావేగం, వర్ధమానం తం హరియూథపం అవేక్ష్య జనకాత్మజా అశ్రుపూర్ణముఖీ, దీనా (సతీ) బాష్పగద్గదయా గిరా ఉవాచ.

**ప్రతిపదార్థము** :– ఉత్పాతకృతోత్సాహం = ఎగిరిపోవుటయందు ఉత్సాహము కలిగినట్టి వాడును, మహావేగం = గొప్పవేగముగలవాడును, వర్ధమానం = వృద్ధిపొందుచున్న వాడును అగు, తం హరియూథపం = ఆ హనుమను, అవేక్ష్య = చూచి, జనకాత్మజా = జానకీదేవి, అశ్రుపూర్ణముఖీ = కన్నీటితో నిండిన ముఖము గలదియును, దీనా (సతీ) = దీనురాలు నగుచు, బాష్పగద్గదయా = కన్నీటిచే డగ్గుత్తిక బడినట్టి, గిరా = వాక్కుతో, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :– అప్పుడు సీతాదేవి ఆకసము మీదికి ఎగిరి పోవుటకు ఉత్సాహపడుచు మహావేగముతో తన శరీరమును పెంచుకొనుచున్నట్టి ఆ హనుమను జూచి కన్నీటితో తడసిన ముఖముగలదై దుఃఖబాష్పములచే డగ్గుత్తిక బడిన కంఠముతో దీనముగా జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ హనుమన్ సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ ।**
**సుగ్రీవం చ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్॥21**

**పదచ్ఛేదము** :– హనుమన్ – సింహసంకాశౌ – భ్రాతరౌ – రామలక్ష్మణౌ – సుగ్రీవం

- చ - సహామాత్యం - సర్వాన్ - బ్రూయాః - హి - అనామయమ్ ॥

**అన్వయక్రమము :-** హనుమన్! సింహసంకాశౌ భ్రాతరౌ రామలక్ష్మణౌ, సహామాత్యం సుగ్రీవం చ, సర్వాన్ అనామయం బ్రూయాః.

**ప్రతిపదార్థము :-** హనుమన్ = ఆంజనేయా! సింహసంకాశౌ = సింహసన్నిభులగు, భ్రాతరౌ = సోదరులైన, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, సహామాత్యం = మంత్రులతో గూడిన, సుగ్రీవం చ = సుగ్రీవునిని, సర్వాన్ = ఎల్లరను, అనామయం = క్షేమమును, బ్రూయాః = పలుకుము.

**తాత్పర్యము :-** ఓ హనుమంతుడా! సింహవిక్రములగు సోదరులైన ఆ రామలక్ష్మణులను, మంత్రిసమేతుడైన సుగ్రీవుని, మనవారి నెల్లరను నేను క్షేమము నడిగినట్లు చెప్పుము.

**శ్లో॥ యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః ।**
**అస్మా ద్దుఃఖాంబుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి ॥ 22**

**పదచ్ఛేదము :-** యథా - చ - సః - మహాబాహుః - మాం - తారయతి - రాఘవః - అస్మాత్ - దుఃఖాంబుసంరోధాత్ - త్వం - సమాధాతుమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము :-** మహాబాహుః సః రాఘవః అస్మాత్ దుఃఖాంబుసంరోధాత్ యథా మాం తారయతి తథా త్వం సమాధాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :-** మహాబాహుః = పరాక్రమవంతుడైన, సః రాఘవః = ఆ శ్రీరాముడు, అస్మాత్ దుఃఖాంబుసంరోధాత్ = ఈ దుఃఖమనెడి నీటివెల్లువనుండి, యథా = ఏ విధముగా, మాం = నన్ను, తారయతి = దాటించునో, తథా = ఆ విధముగా, త్వం = నీవు, సమాధాతుం = సన్నద్ధుని చేయుటకు, అర్హసి = తగియున్నావు.

**తాత్పర్యము :-** మహావీరుడైన ఆ శ్రీరాముడు నన్నీ దుఃఖసాగరము నుండి ఏ విధముగ దాటించగలడో ఆ విధానము నాలోచించి దానిని నీవే సమకూర్ప దగుదువు.

**శ్లో॥ ఇమం చ తీవ్రం మమ శోకవేగం**
**రక్షోభి రేభిః పరిభర్త్సనం చ ।**
**బ్రూయాస్తు రామస్య గత స్సమీపం**
**శివశ్చ తేఽ ధ్వాస్తు హరిప్రవీర ॥ 23**

**పదచ్ఛేదము :-** ఇమం - చ - తీవ్రం - మమ - శోకవేగం - రక్షోభిః - ఏభిః - పరిభర్త్సనం - చ - బ్రూయాః - తు - రామస్య - గతః - సమీపం - శివః - చ

– తే – అధ్వా – అస్తు – హరిప్రవీర ॥

**అన్వయక్రమము :–** మమ ఇమం శోకవేగమ్ ఏభిః రక్షోభిః పరిభర్త్సనం చ రామస్య సమీపం గతః బ్రూయాః తు హరిప్రవీర! తే అధ్వా శివః అస్తు.

**ప్రతిపదార్థము :–** మమ = నా యొక్క, ఇమం శోకవేగం = ఈ నా దుఃఖవేగమును, ఏభిః రక్షోభిః = ఈ రక్కసులచే, పరిభర్త్సనం చ = గద్దింపును, రామస్య = శ్రీరాముని యొక్క, సమీపం = సాన్నిధ్యమును, గతః = పొందినవాడవై, బ్రూయాః = చెప్పుము, హరిప్రవీర! = ఓ వానరశ్రేష్ఠుడా! తే = నీయొక్క, అధ్వా = మార్గము, శివః = మంగళకరమైనది, అస్తు = అగు గాక!

**తాత్పర్యము :–** నా యీ దుఃఖవేగమును, ఈ రాక్షసులచే చేయబడు గద్దింపులను రాముని కడకేగి ఆతనికి అంతయు తెలుపుము. నీకు మార్గము మంగళకరమగు గాక!

**శ్లో॥ స రాజపుత్ర్యా ప్రతివేదితార్థః**
**కపిః కృతార్థః పరిహృష్టచేతాః ।**
**అల్పావశేషం ప్రసమీక్ష్య కార్యం**
**దిశం హ్యుదీచీం మనసా జగామ ॥** **24**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనూమత్ప్రేషణం" నామ*
*చత్వారింశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** సః – రాజపుత్ర్యా – ప్రతివేదితార్థః – కపిః – కృతార్థః – పరిహృష్ట చేతాః – అల్పావశేషం – ప్రసమీక్ష్య – కార్యం – దిశం – హి – ఉదీచీం – మనసా – జగామ ॥

**అన్వయక్రమము :–** సః కపిః రాజపుత్ర్యా ప్రతివేదితార్థః, కృతార్థః, పరిహృష్టచేతాః (సన్) కార్యమ్ అల్పావశేషం ప్రసమీక్ష్య మనసా ఉదీచీం దిశం జగామ.

**ప్రతిపదార్థము :–** సః కపిః = ఆ హనుమ, రాజపుత్ర్యా = సీతమ్మచే, ప్రతివేదితార్థః = తెలుపబడిన విషయముగలవాడై, కృతార్థః = కృతకృత్యుడై, పరిహృష్టచేతాః (సన్) = మిక్కిలి సంతుష్టినొందిన మనస్సుగలవా డగుచు, కార్యం = కర్తవ్యమును, అల్పావ శేషం = కొలదిగ మిగిలినదానినిగా, ప్రసమీక్ష్య = కనుగొని, మనసా = మనస్సుచే,

ఉదీచీం దిశం = ఉత్తర దిక్కునుగూర్చి, జగామ = వెడలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** 'కార్యమ్ అల్పావశేషం ప్రసమీక్ష్య' ప్రధానమైన సీతా సందర్శన కర్తవ్యము సాధింపబడినను, శత్రుబలపరిమితిదర్శనమనెడి ఆనుషంగికమైన చిన్న కార్యము మాత్రము మిగిలియున్నదని భావము.

**తాత్పర్యము :-** హనుమంతు డీ విధముగ సీతాదేవిచే తెలుపబడిన ఆవశ్యక విషయములన్నియును వినినవాడై కృతకృత్యుడై మహానందము నొందిన మనస్సుతో తన దౌత్యకృత్యములో శత్రుబలదర్శనము అనెడి మిగిలిన కృత్యమును గూడ స్మరించుకొనుచు ఒక్కమాఱు ఉత్తరదిక్కునకు మానసికముగ పయనించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనూమత్ప్రేషణము" అను*
*నలుబదియవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

## మంగళ శ్లోకాః

శ్లో॥ స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యమ్
లోకా స్సమస్తాః సుఖినో భవంతు ॥

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ
మహనీయగుణాత్మనే ।
చక్రవర్తితనూజాయ
సార్వభౌమాయ మంగళమ్ ॥

శ్లో॥ కాయేన వాచా మన సేంద్రియై ర్వా
బుధ్ద్యాఽఽత్మనా వా ప్రకృతేః స్వభావాత్ ।
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణా యేతి సమర్పయామి ॥

హరిః ఓం తత్ సత్.

శ్రీమద్వాల్మీకి రామాయణము

# సుందరకాండము

## తృతీయ సంపుటము

(41-68 సర్గలు)

పదచ్ఛేద - అన్వయక్రమ - ప్రతిపదార్థ - వ్యాఖ్యానవిశేష -
తాత్పర్యములతో కూడిన

## సుబోధినీ వివరణ సహితము

విద్యాప్రవీణ, భాషాప్రవీణ
**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయినపల్లి**
**కామేశ్వరరావు**, బి.ఏ

## విజయతే శ్రీవేంకటేశః ప్రభుః

శ్లో॥ లభ్యతే దర్శనా ద్యస్య
నిర్వృతి ర్నేత్రయోః, హృది ।
బ్రహ్మానందానుభూతి శ్చ
తం భజే వేంకటప్రభుమ్ ॥

శ్లో॥ వినుతిః కలిదోషశోషణాయ
ప్రణతి ర్వాంఛితసిద్ధయే చ యస్య ।
స్మరణం చిరసౌఖ్యలబ్ధయే స్యాత్
కలయే తం హృది వేంకటాద్రినాథమ్ ॥

శ్లో॥ యో దేవ స్స్వజనావనాయ కృతసంకల్పోఽవతీర్ణః క్షితౌ
లక్ష్మీశోభితవిగ్రహః ప్రవిలసద్వైకుంఠరమ్యాలయః ।
అశ్రాంతోత్సవరాజితో ఘనదయాసింధు స్స బంధు స్సతాం
భక్తాభీష్టవరప్రదో విజయతే శ్రీవేంకటేశః ప్రభుః ॥

: సుబోధినీ సమర్పకులు :

**మైలవరపు సుబ్రహ్మణ్యము**

**బోయనపల్లి కామేశ్వరరావు** బి.ఏ.,

## విషయ సూచిక

# విషయ సూచిక - II

### శ్రీరామ పట్టాభిషేక ఘట్టము



★★★

# మంగళాశాసనము

**శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులు**
ముముక్షుజన మహాపీఠము, శ్రీ కృష్ణాశ్రమము
పెదముత్తేవి , కృష్ణామండలము

ఓం నమో భగవతే వైకుంఠనాథాయ
ఓం నమ శ్రీసీతారామయతీంద్రాయ

శ్రీమద్రామాయణం అందరికీ అందుబాటులో ఉండేవిధంగా పదచ్ఛేద అన్వయక్రమ టీకాతాత్పర్య లఘువ్యాఖ్యలతో వ్యాప్తిలోకి వస్తే బాగుండును అని ఎంతోకాలంగా ఎదురుచూస్తున్న మావంటివారికి విందు అయింది మీరు ప్రచురిస్తున్న రామాయణం. సుందరకాండము నలభై సర్గలవరకు అయిదుసంపుటాలుగా ఇతఃపూర్వం అందుకున్నాం; ఆనందించాం. హనుమద్విక్రమము అన్న విశిష్ట శీర్షికతోడి ఆరవ సంపుటం ఇప్పుడు అందుకొని శిరసున ధరించాము.

"వ్రాసిన రామచంద్రకథ వ్రాసితినం చనిపించుకో -

వృథాయాసము కాక కట్టుకత లైహికమా? పరమా?" అన్నారట యశశ్శరీరులైన విశ్వనాథ శోభనాద్రి మహాశయులు తమ పుత్రులు 'కవి సమ్రాట్' విశ్వనాథ సత్యనారాయణగారితో.

'తండ్రి హరిజేరుమనియెడి తండ్రి తండ్రి'. వెనుక ఒకరిద్దరు ఇట్టి ప్రయత్నం చేసినమాట నిజమే కానీ ఆ ప్రచురణలు ఏవీ ఈనాడు ఆసక్తికల పాఠకులకు అందుబాటులో దొరకటం లేదు. అంతేకాక పూర్వవ్యాఖ్యాతలు చెప్పిన విశేషాలు - సంక్షిప్తంగా అయినా ఆ గ్రంథాలలో ఉన్నగుర్తు లేదు.

ఈనాడు మీరు చేస్తున్న ఈసేవ ఈనాటి ఆంధ్ర ఆస్తికలోకం శాశ్వతంగా గుర్తుంచుకుంటుంది. ఈ రచనకు మీరువాడిన భాష సులభసుందరంగా ఉంది. సరళమైన గ్రాంథికభాష. భాషలోని సారళ్యం జిగిని బిగిని ఏమాత్రం సడలించలేదు. అది విశేషం. మూలం చక్కగా వివరిస్తూ - విశేషార్థాలు అవసరమైన మేరకు, సంప్రదాయబద్ధంగా అందిస్తూ - ఇట్టి గ్రంథాలు ఎలా ఉండాలో ఒరవడి పెట్టారు అని అనిపించింది. ఇది "శ్రీ శ్రీ శ్రీ రామచరణ" శుశ్రూషాఫలం.

ఈ సందర్భంగా మీతో సహకరిస్తూ మీతో అద్వైతభావం భజిస్తున్న బ్రహ్మశ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యంగారిని ప్రత్యేకముగా అభినందిస్తున్నాం.

ఇదే క్రమంలో మిగిలిన భాగాలు అన్నీ ఎప్పుడు చూస్తామా, సమగ్ర రామాయణ సంగ్రహవ్యాఖ్యాతలుగా మిమ్ము ఎప్పుడు ఆశీర్వదిద్దామా అని ఎదురు చూస్తూ మంగళాశాసనం చేస్తున్నాను.

**లక్ష్మణ యతీంద్రులు**

# అభినందన

**ఆచార్య సి. నారాయణరెడ్డి**
ఎం.ఎ, పిహెచ్.డి., డి.లిట్,
ఉపాధ్యక్షులు : తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవనం, సైఫాబాదు
హైదరాబాదు

కవిత్రయం పుణ్యాన వ్యాసమహాభారతం తెలుగువారి ఇళ్లకూ లోగిళ్లకూ అందింది. పోతన చేతిచలువవల్ల వ్యాసమహాభాగవతం తెలుగు కృతే అన్నంత ఆత్మీయతను సంతరించుకుంది. ఎన్ని రామాయణాలు తెలుగులో వెలువడినా ఎందుకో సముచిత ప్రాచుర్యం లభించలేదు.

శ్రీ కామేశ్వరరావుగారు వాల్మీకి రామాయణంలోని సుందరకాండను పదచ్ఛేదం, అన్వయక్రమం, ప్రతిపదార్థం అన్న విభజనతో సుబోధకంగా తెలుగులో వివరిస్తూ ఈ సంపుటాలు వెలువరిస్తున్నారు.

వాల్మీకిహృదయం సామాన్య తెలుగు పాఠకులకు అవగతం కావడానికి ఈమార్గం ఉత్తమమైంది. అందుకు వీరికి నా అభినందన.

**సి.నారాయణరెడ్డి**

# సుబోధినీ సౌందర్యము

'అవధానసరస్వతి', 'కవిపంచానన'
**శ్రీ పేరాల భరతశర్మ,** ఎమ్.ఏ.
ప్రభుత్వ మహారాజ సంస్కృత కళాశాల అధ్యక్షులు
విజయనగరం.

సుందరుని భావము సౌందర్యమా? సుందరి భావము సౌందర్యమా? సుందరీ సుందరుల భావమే సౌందర్యమా? దీనికి పరిష్కారముగా సీతారాములు ఒకే సౌందర్యము యొక్క రెండు రూపములుగా కనుగొన్నవాడు హనుమ. సౌందర్యం యొక్క సమగ్రమైన సాక్షాత్కారంకొఱకు తపించిన వానికంటె, ఆ సౌందర్యమును తన హృదయమున నిలుపుకొన్నవానికంటె సుందరుడు మరెవ్వరు? అటువంటి సుందరుడు తన విశ్వరూపంతో మనకు కనిపించే కాండము సుందరకాండము.

రామాయణమువలన మనం ప్రధానంగా పొందవలసిన ప్రయోజనం ఏమిటి? "రామస్య రామాయాశ్చ అయనమ్" రామునియొక్కయు రామయొక్కయు మార్గము తెలియాలి. అదే ప్రయోజనం. రామ రామా అయనం అన్నది – అతిసూక్ష్మం, అతివిస్తారము. అతిగహనము అత్యుదాత్తము. దానిని కనుగొన్నవానికంటె సుందరుడెవడు? ఆ సుందరుడు ప్రధానంగా నడిచే కాండము సుందరకాండము.

అర్థం తెలియక పారాయణం చేసినా గొప్పఫలితాన్ని కలిగించటంలో సందేహం లేదు. కాని అర్థం తెలిసికొని సుశబ్దంగా సుస్వరంగా సుష్ఠుగా పారాయణం చేస్తే దాని ప్రయోజనం ఇంత అంత అని చెప్పగలమా?

ఆ ప్రయోజనాన్ని పొందడానికి జనాన్ని అనుగ్రహించి శ్రీ బోయనపల్లి కామేశ్వరరావుగారు, శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారు సుందరకాండములోని ప్రతిశ్లోకానికి పదవిభాగం, అన్వయం, ప్రతిపదార్థం వివిధవ్యాఖ్యాతలు చెప్పిన విశేషార్థాల సారాంశం గ్రుచ్చియెత్తి వివరంగా వ్రాస్తూ ఎనిమిది సంపుటాలలో ప్రకటిస్తున్నారు. ఇది ఆంజనేయస్వామి సముద్రసంతరణమంతటి ఘనకార్యము. సీతారాముల సమగ్రసౌందర్యదర్శనానికి అనుకూలించే కార్యము. 'స్వయం తీర్త్వా పరాం స్తారయేత్' అన్న దానికి నిదర్శనంగా తాము పొందిన ప్రయోజనాన్ని ఇతరుల కందించే ఉదారసంకల్పము. వారికి ఆంధ్రపాఠకలోకం భక్తకోటి ఋణపడి ఉన్నాము. ఆ ఋణము తీర్చుకోవడమంటే అది ఋషిఋణం తీర్చుకోవడం వంటిది.

ఈ సుబోధినీ వివరణ సహితమైన సుందరకాండాన్ని ఇంటింటా ప్రతివారూ

చదువుకోవాలి. అవగాహన చేసుకోవాలి. వాల్మీకిహృదయాన్ని తెలుసుకోవాలి. శబ్ద బ్రహ్మస్వరూపమున ఉన్న పరమాత్మను ఉపాసించడానికి తగిన సాధనాన్ని అందిపుచ్చుకోవాలి. అందుకే చిరకాలంగా భక్తులు రామాయణం పారాయణం చేస్తున్నారు. అందులో సుందరకాండ మరీ శ్రద్ధగా పారాయణం చేస్తారు.

ఒక మహాకావ్యం పారాయణగ్రంథంగా ఒక జాతిచేత నిత్యమూ ఆరాధింపబడటం మన దేశంలోనే ఉన్న సత్సంప్రదాయం.

రామకథ తెలియనివారు లేరు. లౌకికంగా పారమార్థికంగా ఎన్నో రహస్యాలు ఈ కథనుండి మానవజాతికి అవగతమైనాయి. దానికి కారణము పారాయణమే. ఋషులు చెప్పిన గ్రంథాలు వట్టి అక్షరాల ముద్దలు, వాక్యాల సంపుటులు కావు. ఋషులు తపించి తపించి తమ ప్రాణాన్ని తేజోమయంగా చేసుకుంటారు. వారు తమ ప్రాణశక్తిని అక్షరరూపాన భద్రపరచినపుడు ఆ అక్షరాలలో ఆ అక్షరాల పరంపరలతోడి పదాలలో వాక్యాలలో ఒక శబ్దజ్యోతి ఇమిడి ఉంటుంది.

'శమప్రధానేషు తపోధనేషు గూఢం హి దాహాత్మక మస్తి తేజః' అన్న కాళిదాసు మహాకవిభావనను మనం ఇక్కడ అనుశీలించి అర్థం చేసుకోవాలి. ఆ శబ్దాలలోని తేజస్సును తెలుసుకుంటే మన ప్రాణాలు ఆ తేజస్సుతో పచనం అయి పాకానికి వస్తాయి. అలా కాక వట్టి శబ్దాలుగా వాటిని ఉచ్చరించినా ఆ తేజఃప్రభావంచేత మన ప్రాణాలు అబోధపూర్వకమైన ఒక సుఖాన్ని పొందుతాయి.

పారాయణంలో పఠించిన గ్రంథంలోని అక్షరాలనుండి శబ్దం వస్తుంది కదా! ఆ శబ్దంలో ఋషియొక్క ప్రాణశక్తి ఉంటుంది. దానిని గ్రహించడానికి మన దగ్గర కొంత తపన ఉండాలి. అదే తపస్సు – అగ్ని. అప్పుడది వట్టి శబ్దంగా కాక నాదరూపంగా పరిణమిస్తుంది. అందుకనే రామాయణం వంటి ఒక ఆర్షగ్రంథాన్ని మనం శ్రద్ధతో నియమంతో నిష్ఠతో పారాయణం చేస్తున్నప్పుడు పవిత్రత సంపన్నం అవుతుంది.

ఆ ఆర్షకవి ఏ అక్షరాలలోనికి తన తపోమయమైన ప్రాణాన్ని ఊదినాడో ఆ ప్రాణము దీప్తిమంతము కావాలంటే ఆ అక్షరాలను పలుకుతున్న మనలో ఆర్తి, తపన, తపస్సు ఉండాలి. అప్పుడు ఆ అక్షరాలలోని ఋషుల ప్రాణశక్తి మన ప్రాణాలను సముజ్జ్వలింపచేస్తుంది. ఋషి తపశ్శక్తి అక్షరాలలో నాదరూపాన ఉంటుంది.

'న'కారో ప్రాణవాచకః 'ద'కారోఽగ్నివాచకః. ప్రాణాగ్నిసంయోగాన్నాద ఇతీర్యతే. మన ప్రాణమును తపోరూపమైన అగ్నిలో వ్రేల్చినపుడు నాదం పుట్టుతుంది.

పారాయణంలో రామకథను నాదరూపాన కరగించుకోవటంచేత పరాగతిని పొందని వాడుండడు, “శృణ్వన్ రామకథానాదం కో న యాతి పరాం గతిమ్”

కనుక ముందు రామకథ మనకు స్పష్టంగా తెలియాలి. ఆ వాల్మీకి శ్లోకాలలో ఆధ్యాత్మిక లోకాలెన్నో ఉన్నాయి. అవి తెలియవలెనంటే ఆ శ్లోకాలలో, సమాసాలలో, పదాలలో పదసంధులలో వాని కూర్పులలో సుప్తగా ఉన్న మధురమైన అర్థమును అందించే వాక్యాలలో ముని చెప్పిన రఘువరచరితమును మనం యోగ్యంగా అర్థం చేసుకోవాలి.

వాల్మీకి ముని ప్రతిశ్లోకం నాదరూపమైన పరబ్రహ్మయొక్క అక్షరరూపము. ఈ అక్షరరూపవైన శ్లోకబద్ధమైన సమాససంధియోగంతో నిరూపితమైన అర్థమాధుర్యాన్ని మనం గ్రోలినప్పుడు శ్లోకములలోని రామకథ నాదరూపంగా పరిణమించి మన పారాయణము శబ్దబ్రహ్మోపాసనముగా వికసిస్తుంది. విస్తరిస్తుంది.

అందుకు సహకరించే గ్రంథం ఈ సుబోధినీ వివరణ సహితమైన ఎనిమిది సంపుటాల సుందరకాండము.

“తెలిసి రామచింతన సేయవే మనసా”

**పేరాల భరతశర్మ**

# పరిప్రేక్షణ

డా॥యస్.సంజీవదేవ్, డి.లిట్.
చిత్రకళానిష్ణాతులు

రామాయణం, మహాభారతం, భాగవతం వంటి గ్రంథాలు మన పురాణ వాఙ్మయానికి చెందినవి.

ఈ గ్రంథం రామాయణంలో సుందరకాండకు చెందింది.

ఈ గ్రంథకర్త కామేశ్వరరావుగారు రామాయణంలోని సుందరకాండను మాత్రమే తీసుకొని తెలుగు అనువాదంలోకి ఎనిమిది సంపుటాలలో ముగించారు.

కామేశ్వరరావుగారు, ఈయనకు సహకరిస్తున్న సుబ్రహ్మణ్యంగారు కూడ ప్రకాండపండితులు. తెలుగులోను, సంస్కృతంలోను కూడ వాల్మీకి రామాయణంలోని సుందరకాండను సంస్కృతమాతృకనుండి తెలుగులోనికి ఎనిమిది సంపుటాలుగా అనువదించారు.

ఈ ఆరవ సంపుటం పేరు "హనుమద్విక్రమం", అంటే మౌలికశ్లోకాలను, పదచ్ఛేద, అన్వయక్రమ, ప్రతిపదార్థ, వ్యాఖ్యానవిశేషసహితంగా అనువదించారు. అంటే ఇది విశ్లేషణాత్మక అనువాదం.

ఇదివరలో ఎందరో మహానుభావులు సంస్కృత వాల్మీకి రామాయణాన్ని, తెలుగులోకి అనువదించారు. గద్యరూపంలో, పద్యరూపంలో కూడా. వాటిలో వారు కథకు ప్రాధాన్యం ఇవ్వటమే కాని కథన విశ్లేషవిశేషాలకు ప్రాధాన్యం ఇవ్వలేదు.

కొందరు పండితులు టీకాతాత్పర్యసహితంగా అనువదించారు కాని కామేశ్వరరావుగారి వలె ప్రతిశ్లోకాన్నీ ఇన్ని విధాలుగా విశ్లేషించి చూపలేదు. ఇదే ఈ గ్రంథంలోని ప్రత్యేకత.

దీనిలోని కథావిశేషాలను తెలుసుకోవాలి అనేవారు తాత్పర్యాన్ని చదువుకుంటే సరిపోతుంది. అదికాక భాషాపాండితిని, వాక్యనిర్మాణాన్ని, పద, పదార్థ వైచిత్రి మొదలైన వాటిని తెలియకోరేవారు విశ్లేషణ వివరాలను తెలుసుకొంటే సరిపోతుంది.

ఈవిధంగా ఈగ్రంథం సామాన్య పాఠకునికీ, అసామాన్య పాఠకునికి కూడ సమానంగా ఉపకరిస్తుంది.

వాల్మీకి రామాయణంలోని వైశిష్ట్యాలలో ఒక ప్రధానవైశిష్ట్యం ఏమంటే ఆయన కావ్యరచనలో అర్థాని కెంత విలువ ఉంటుందో శబ్దానికి అంత విలువ ఉంటుంది.

ఉత్తమకావ్యలక్షణం కూడ అదే; శ్రావ్యమైన శబ్దం, విషయవిశదీకరణగల అర్థం, శబ్దం నిమిత్తం అర్థాన్ని బలివ్వటం కాని, అర్థం నిమిత్తం శబ్దాన్ని బలివ్వటం కాని జరగరాదు.

నిజానికి సాహితీరచనలో శబ్దం నిమిత్తం శబ్దం కాక, అర్థాన్ని అభివ్యక్త పరిచేందుకు శబ్దం వాడబడుతుంది.

శుద్ధసంగీతంలో, అంటే రాగాలాపనలాంటి వాటితో, అర్థం కాక, కేవలం నాదం మాత్రమే ఉంటుంది. అటువంటి శుద్ధసంగీతం శ్రోతకు అర్థాన్ని కాక శుద్ధ అనుభూతిని ప్రసాదించి రసానందాన్ని కలిగిస్తుంది. ఇటువంటి సంగీతంలో అర్థంతో పనిలేదు, అనుభూతి మాత్రమే ప్రధానం.

ఈ పద్ధతి సాహిత్యానికి వర్తించదు. సంగీతానికి మాధ్యమం నాదం, సాహిత్యానికి వాక్కు, నాదానికి సంవేదన మాత్రమే ఉంటుంది కాని అర్థం ఉండదు. కాని వాక్కుకు నాదం ఉంటుంది, అర్థం ఉంటుంది.

వాల్మీకి ఆదికవి మాత్రమే కాదు, కావ్యరచనలో శబ్దం, అర్థంకూడ సమపాళ్ళలో ఉండాలని గ్రహించిన ఆదిలాక్షణికుడు కూడ.

ఆయన అర్థానికి ఎంత విలువ ఇచ్చాడో అర్థాన్ని అభివ్యక్తపరిచే మాధ్యమానికీ (శబ్దానికీ) అంత విలువ ఇచ్చాడు.

వాల్మీకి తన రచనల్లో శబ్ద సౌందర్యానికీ, అర్థగాంభీర్యానికి కూడ సమాన మర్యాద ఇచ్చాడు.

ఈ గ్రంథంలోని ఒక శ్లోకాన్ని చూతం.

**"తత్తస్య రక్తం రక్తేన రంజితం శుశుభే ముఖమ్ ।**
**యథాకాశే మహాపద్మం సిక్తం చందనబిందుభిః ॥"**

ఈ పై శ్లోకంలోని ప్రతీది ఒక శ్రావ్యపదం, గ్రంథకర్త విశ్లేషించిన రీతిని కూడా చూతాం.

**పదచ్ఛేదము** :– తత్ – తస్య – రక్తం – రక్తేన – రంజితం – శుశుభే – ముఖమ్ – యథా – ఆకాశే – మహాపద్మం – సిక్తం – చందనబిందుభిః ॥

**అన్వయక్రమము** :– రక్తేన రంజితం తస్య తత్ రక్తం ముఖం ఆకాశే చందనబిందుభిః సిక్తం మహాపద్మం యథా శుశుభే.

**ప్రతిపదార్థము** :– రక్తేన = నెత్తురుచే, రంజితం = పూయబడిన, తస్య = ఆ హనుమ యొక్క, రక్తం = ఎఱ్ఱనై యున్న, తత్ ముఖం = ఆ ముఖము, ఆకాశే = ఆకాశమున, చందనబిందుభిః = రక్తచందనబిందువులచే, సిక్తం = తడుపబడిన, మహాపద్మం యథా = గొప్పదైన పద్మంవలె, శుశుభే = శోభిల్లెను.

"**తాత్పర్యము** :– నెత్తురుచారలతో ముఖమంతయు నిండి ఎఱ్ఱనై కానవచ్చుచున్న హనుమముఖము రక్తచందనబిందువులతో తడుపబడి ఆకాశమునందు వికసించియున్న ఒక మహాపద్మమువలె ప్రకాశించెను."

పైన ఉదాహరించిన వాల్మీకి శ్లోకం ఎంత రమణీయంగా ఉన్నదో కామేశ్వర రావుగారి విశ్లేషణవైవిధ్యం అంత కమనీయంగా ఉన్నది.

ప్రాచీనకాలపు సాహిత్యం ప్రధానంగా పద్యమే కాని గద్యం కాదు. గద్యంకంటే పద్యం ఎక్కువగా చెవిమీద ఆధారపడి ఉంటుంది. ఒకప్పుడు సాహిత్యం ఎక్కువగా వాచ్యమే కాని లేఖ్యం కాదు. నోటితో పలకటమే కాని చేతితో వ్రాయటం ఉండేదికాదు.

లేఖాసాహిత్యానికంటే వాచ్యసాహిత్యానికి శబ్దప్రాధాన్యం ఎక్కువ స్థానం ఉండేది.

ఈ సత్యమే వాల్మీకిశ్లోకాల్లో గోచరిస్తుంది. ఆయనది శబ్దజాలం కనుకనే సునాదాన్ని కలిగి ఉండేది అది.

అసలు ఆలోచనకుకాని, అనుభూతికికాని శ్రావ్యరూపంకాని దృశ్యరూపంకాని లేవు. వాటిరూపం నైరూప్యమే, వాటిశబ్దం నిశ్శబ్దమే.

ఆలోచనలు, అనుభూతులు అభివ్యక్తం కావాలంటే ఒక శ్రావ్యమాధ్యమాన్నో, దృశ్యమాధ్యమాన్నో తీసుకోవలసి వచ్చేది.

అందుకు వాల్మీకి శబ్దమాధ్యమాన్నే తీసుకొన్నాడు. అందుకే ఆయన కావ్యంలో అర్థానికిచ్చినంత ప్రాధాన్యం శబ్దానికి కూడ ఇచ్చాడు.

లంకలో సీత ఉంటున్న అశోకవనం హనుమంతుని ధ్వంసకాండ మూలంగా శోకవనం అయినదట.

**"సా విహ్వలాశోకలతాప్రతానా**
**వనస్థలీ శోకలతాప్రతానా ।**
**జాతా దశాస్యప్రమదావనస్య**
**కపే ర్బలాద్ధి ప్రమదావనస్య ॥"**

ఇందులో పదప్రయోగం ఎంత లలితంగా ఉన్నదో అర్థం కూడ అంత రమణీయంగా ఉన్నది. కామేశ్వరరావుగారి మాటల్లో దాని తాత్పర్యం ఇది:

'సీతాదేవి నివసించుచున్నట్టి ఆ రావణుని ప్రమదావనమున అశోకలతలు అన్నియు చెదిరిపోయినవై ఆ వనభూమియందు హనుమగావించిన విధ్వంసకృత్యము వలన వెనుకటి అశోకవనమిప్పుడు శోకవనము అయినది.'

పై శ్లోకంలోని పదాలు పారిజాతాలవలె ఉన్నాయి. అందులోని భావాల పరిమళంతో వినిపించే పదాలద్వారా వినిపించని భావలహరి ప్రతిధ్వనించింది.

హనుమంతుని పరాక్రమమంతా ఈ సంపుటంలో చాలావరకు కావ్యస్థమైంది. అందుకే ఈ సంపుటానికి 'హనుమద్విక్రమము' అనే నామకరణం చేయబడింది.

హనుమంతునిచేత అక్షకుమారుడు మృతుడైనట్లు తెలుసుకొని రావణుడు ఇంద్రజిత్తుతో అంటాడు, ఇంద్రజిత్తు సమరశక్తి ప్రతిభను గురించి అందుకు సంబంధించిన ఈ క్రిందిశ్లోకం ఒక శ్రవ్యవైచిత్రిని ప్రదర్శిస్తుంది.

**"న తేఽస్త్యశక్యం సమరేషు కర్మణా**
**న తేఽస్త్యకార్యం మతిపూర్వమంత్రణే ।**
**న సోఽస్తి కశ్చిత్ త్రిషు సంగ్రహేషు వై**
**న వేద య స్తేఽస్త్రబలం బలం చ తే ॥"**

ఇందుకు కామేశ్వరరావుగారి తాత్పర్యం : –

'యుద్ధములందు నీవు నిర్వహింపజాలని అసాధ్యకృత్యము ఏదియును లేదు, ఈ మూడు లోకములందును నీ అస్త్రబలమును గురించిగాని శరీరబలమును గురించి గాని తెలియనివాడు ఎవ్వడును లేదు.'

ప్రతికాలంలోను, గడచిపోయిన కాలంలో కాని గడుస్తున్నకాలంలో కాని, 'బలం'కు ఉన్నబలం మరోదానికి లేనట్లు కనిపిస్తుంది! అన్నిటికీ బలం ప్రధానం. శరీరబలం, మానసికబలం, ఆత్మబలం, అస్త్రబలం, శస్త్రబలం, ఇతరులను చంపే బలం, తాను స్వయంగా చచ్చే బలం, ఎన్నో మరెన్నో బలాలు అవసరం. ఈ లోకంలో బలం ఉన్న మనిషి సబలుడు, బలంలేని మనిషి దుర్బలుడు.

అందుకే రావణుడు ఇంద్రజిత్తుకు 'బలం'యొక్క బలాన్ని గురించి ప్రబోధించసాగేడు.

నేడు మనం మంత్రబలాన్ని దాటి యంత్రబలంలో నివసిస్తున్నాం. అయితే క్రమేణ ఈ పరమాణుయుగంలో స్థూలయాంత్రికత తన యంత్రబలాన్ని సూక్ష్మమైన నైరూప్యంలోకి రూపాంతరపరుస్తూ మంత్రబలంలాంటి అతిసూక్ష్మబలంలోకి ప్రవేశింప చూస్తూంది. జడం క్రమేణ చేతనామయం అవుతుంది.

రామాయణ యుద్ధానికి మాత్రమే కాదు బలం కావలసింది, రామాయణ రచనకు కూడ బలం కావాలి. ఒకటి స్థూలబలం, రెండవది సూక్ష్మబలం. ఒకటి దేహబలం, రెండవది బుద్ధిబలం. యుద్ధం తాత్కాలికం, రచన చిరకాలికం.

రామాయణయుద్ధం, కొందరు ఓడిననాడు – మరికొందరు గెలిచిననాడుతో అంతమైంది; రామాయణరచన నేటికీ మిగిలే ఉన్నది; అసంఖ్యాకపాఠకులకు, శ్రోతలకు ప్రాణప్రేరణ నిస్తూనే ఉన్నది.

దాని మాతృక సంస్కృతంలో రచించబడినా, అనువాదం అనే అద్భుత సాధనం ద్వారా అది అన్యభాషల్లోకి ప్రవేశిస్తున్నది.

అటువంటి సంస్కృత రామాయణాన్ని మన కామేశ్వరరావుగారు సామాన్య అనువాదం కాక సాంకేతికమైన విశ్లేషణాత్మక అనువాదం చేసి తెలుగు పాఠకులకు నూతనకిరణాన్ని చూపేరు.

ఆధునికయుగంలో పౌరాణిక కావ్యాలు అవసరమా? దీని జవాబుకు ముందు మరోప్రశ్న ఉదయిస్తుంది. ఆధునికయుగంలో, పరమాణువైజ్ఞానికయుగంలో అసలు కావ్యాలు అవసరమా అని.

మానవుడు ఆలోచనలో మాత్రమే జీవించలేడు, ఆనందంతో కూడ జీవించాలి. ఆనందం లేని ఆలోచన ఎండుఎడారి మాత్రమే అవుతుంది.

అందుకే మానవుడికి ఆలోచనజ్వాలకు తోడు రసానుభూతి సుగంధంకూడ అవసరం. అందుకే అనేది – వైజ్ఞానికయుగంలో కావ్యాలు పూర్వం కంటే ఎక్కువ అవసరమని.

ఆధునికయుగంలో కావ్యాలు అవసరమని తేలినప్పుడు ఆ కావ్యాలు పౌరాణికాలా, సామాజికాలా అనే చర్చ అవసరంలేదు. ఒకో తరహా కావ్యం ఒకో తరహా రసానుభూతిని ప్రసాదిస్తుంది. అటువంటి కావ్యాలు ప్రాచీనాలు కావచ్చు. అర్వాచీనాలు కావచ్చు.

పాఠకులు మూడు విధాలుగా ఉంటారు. సాధారణంగా సంస్కృతంతో అసలు పరిచయం లేనివారు, సగం పరిచయం ఉన్నవారు, పూర్ణపరిచయం ఉన్నవారు.

సంస్కృతంతో అసలు పరిచయం లేనివారికికూడ ఆ భాషను చదువుతుంటే అర్థంకాకపోయినా చెవికి ఇంపుగా వినిపిస్తుంది.

సగం పరిచయం ఉన్న వారికి వాక్యాలు మొత్తం అర్థం కాకపోయినా, అర్థం అవుతున్నట్లు ఆభాస జనిస్తుంది.

ఇక ఆ భాషతో పూర్ణపరిచయం ఉన్నవారికి ఆ భాషలో ఉన్న అసలు అర్థానికి మించికూడ విశిష్టార్థం జనిస్తుంది.

సంస్కృతంలో అసలు పరిచయం లేనివారికి కామేశ్వరరావుగారి ఈ గ్రంథాన్ని చదివితే అసలు సంస్కృతం అంటే ఎట్లా ఉంటుందో దాని స్థూలరేఖలు తెలుస్తాయి.

సగం పరిచయం ఉన్నవారు ఈ గ్రంథాన్ని చదివితే సంస్కృత భాషలోని స్థూలరేఖలేకాక సూక్ష్మరేఖలుకూడ తెలుస్తాయి వారికి.

ఇక మూడవ వర్గంవారైన పూర్ణపరిచయం ఉన్నవారు దీన్ని చదివితే వారికి సంస్కృతపు స్థూలరేఖలు తెలుస్తాయి, ఇంకా తెలుస్తాయి తెలుసుకోతగినవన్నీ, ఇంకా తెలుస్తాయి తెలిసినవాటికంటె మించికూడ.

ఈ గ్రంథంలోని ప్రతిశ్లోకంలోని వాక్యనిర్మాణం, పదవిన్యాసం, శబ్దవిశ్లేషణ, అర్థవివరణ, భావాభివ్యక్తి మొదలైన కావ్య సామగ్రి అంతా నగ్నరూపంలో ప్రత్యక్ష పరచబడింది అనువాదకుని అశేష సాహితీ ప్రతిభ ద్వారా.

ఈ కృషిలో కామేశ్వరరావుగారికి తోడునీడ అయి నిలచి సర్వవిధాలా

సహకరించి ఈ మహాకార్యాన్ని (మహాకావ్యాన్ని) ఈ విధంగా రూపొందించిన విద్యాప్రవీణ, భాషాప్రవీణ శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారు శ్లాఘనీయులు.

సంస్కృతం, కొందరంటున్నట్టుగా, మాతృభాషకాదు; అదొక అద్భుతభాష; అదొక శాస్త్రీయభాష, రచనాత్మక భాషకూడ.

వాల్మీకి రామాయణం, అందులోని కథను వదలినా కూడ మహాకావ్యంగా నిలవగల సాహితీశిల్పాన్ని, రససృష్టిని కలిగి ఉండటం ప్రమోదకరమైన విషయం.

దాన్ని తెలుగు అనువాదరూపంలో, సాహిత్య శాస్త్రఛాయల్లో శిల్పించిన నిపుణశిల్పి శ్రీ కామేశ్వరరావుగారు, వారితో సహకరించిన శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యముగారు తెలుగుపాఠకులకు చిరసంస్మరణీయులు.

భాషలో వాక్యానిది పెద్దస్థానం, అయితే, మనిషి వాక్యంతో మాత్రమే జీవించజాలడు. వాక్యం కావ్యంగా శిల్పించబడాలి. ఆ వాక్యం కావ్యంగా మారినపుడే మనిషి మేధావిగా మాత్రమేకాక రసజీవిగాకూడ తన జీవననౌకను ఈ భవసాగరపు కెరటాలమీద నర్తనశీలి అయి నడపగలడు!

**ఎన్.సంజీవదేవ్**

శ్రీమతే రామానుజాయ నమః

# ప్రహర్షము

సాహిత్య విద్యా ప్రవీణ, భాషాప్రవీణ
**ఉ.వే.ప్ర.శ్రీమాన్ కందాళ శఠకోపాచార్యులు,**
రిటైర్డు లెక్చరర్ – మహారాజ సంస్కృతకళాశాల
విజయనగరము.

సుబోధినీ సమర్పకులు ప్రేమతో నాకు పంపిన సుందరకాండముల సంపుటములు ఐదును అందుకొని ఆసక్తితో ఆమూలాగ్రము చదివితిని. ఇది నాకు నిత్యపారాయణ ప్రవచనములలో నున్న పూజనీయగ్రంథము. చాల సంతోషమైనది. ఆ ఆనందమును తెలుపుటకు కొద్దిమాటలు వ్రాయుచున్నాను.

సంస్కృతాంధ్ర సాహిత్య ప్రవీణులు శ్రీ సుబ్రహ్మణ్యముగారును, ఆంధ్రాంగ్ల సాహితీకోవిదులు శ్రీమంతులు కామేశ్వరరావుగారును శ్రీరామ శరణ్ గురువర్యుల శిష్యులు, శ్రీసీతారామాంజనేయ సద్భక్తులు, జన్మాంతర సుకృత విశేషముచే మంచి ప్రతిభావ్యుత్పత్తులు కలవారును అగుటచే తమ జీవితమును ఇట్టి సత్కార్యములతో సార్థకము చేసికొనుచున్నారు.

దైవసంకల్పమువలననే వీరుభయులకును మైత్రి కలిగినది. అదియే వీరిని ఇట్టి అపూర్వ కార్యకరణ దక్షులను చేసినది. "న హి కర్మసు సీదన్తి మహత్స్వమిత తేజసః" అని వాల్మీకి సుందరకాండములో చెప్పినట్లుగా వీరు సీతారామ హనుమ దుపాసనామితతేజస్కులగుటచేతనే మానసికఆర్థికశ్రమల కోర్చి నిర్వేదముచెందక పరస్పరసహాయముతో లోకోపకారమైన ఈకృషిని ఇట్లు నిర్వహించుచు తెలుగువారిని తరింపచేయుచున్నారు.

సంస్కృతమునందు ప్రవేశము చాలక పోయినను ఈ సుందర పవిత్ర కృతియందు మిక్కిలి భక్తి, ఆసక్తి కలిగియున్న వారెల్లరికిని సుబోధకమగునట్లుగా చక్కని ప్రణాళికను వేసికొని, వ్యయప్రయాసలకు లెక్కచేయక, ఎన్నో ప్రాచీన నవీన వ్యాఖ్యాన విమర్శ విశేషములను అందించుచున్న వీరికృషి సర్వశ్లాఘ్యము.

ముఖ్యముగా వాల్మీకి వెల్లడింపదలచుకొన్న సీతారామహనుమంతులయొక్క బాహ్య ఆంతర సౌందర్యమునంతను లోకమునకు తెలియచేయుటలో వీరు కృతార్థులైనారని నా నిశ్చయము. ఆ పావనమూర్తుల దివ్యమంగళ విగ్రహములను

మన మనోనేత్రములముందు నిలిపి చూపుచున్న ఈమిత్రులిరువురి యత్నము సర్వదా ధన్యము.

ఈ ధన్యజీవులపై నాకుగల స్నేహగౌరవములతో ఈ పావనవిశేష సుందరకృతి సంపుటములు చదువుచుండగా ఎన్నో విషయములు చెప్పవలసినవి కనబడినవి. కాని గ్రంథవిస్తరభీతిచే నా "ప్రహర్షమును" సారాంశముగా మాత్రమే ఇప్పుడిట్లు వెల్లడించుట జరిగినది.

ఇట్టి విశేష విషయములనే తెలుగులోకమునకు తేటతెల్లము చేయుచు ఈ మిత్రద్వయము శ్రీసీతారామ హనుమానుల కరుణా విశేషముచే శ్రీమద్రామాయణము నంతనుకూడ ప్రచురింపగల శక్త్యుత్సాహములు ఆయుర్భాగము కలవారగుదురుగాక.

**కందాళ శఠకోపాచార్యులు**

# ఆమోదము

ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారు
MA, Ph.D
తెలుగు విశ్వవిద్యాలయము
బొమ్మూరు - రాజమండ్రి.

"బ్రహ్మలోకంనుంచి భూలోకానికి అవతరిస్తున్న భారతీదేవికి ప్రథమ విశ్రామశాఖ" అన్నాడు వాల్మీకిని అనర్ఘ రాఘవకర్త మురారిభట్టు.

"ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ మౌని వాల్మీకి భాషా సంక్రాంత ఋణంబు దీర్పఁగలదా! సత్కావ్య నిర్మాణరేఖా సామగ్రి ఋణంబు దీర్పఁగలదా!" అని విశ్వనాథవారు ఆశ్చర్యపోయారు.

"మానవుడు ఎలా ఉన్నాడో చెబుతుంది భారతం, ఎలా ఉండాలో చెబుతుంది రామాయణం" అన్నారు మా గురుదేవులు.

ఇన్ని రకాలుగా వీను మిగిలినది - చతుర్వింశతి సాహస్రిక శ్రీమద్రామాయణం. అది భారతీయసంస్కృతికి ప్రాణం. ప్రాంతీయభాషాకవులకు కావ్యవస్తునిధానం. ఏదో రకంగా రామాయణాన్ని స్పృశించని కలంగానీ గళంగానీ లేవు.

ఆ రామాయణానికి ప్రాణస్నాయువు సుందరకాండ. కవితాపరంగా తాత్త్వికంగా ఈ కాండకు ఉన్న ప్రాముఖ్యాన్నీ, ప్రాశస్త్యాన్నీ గుర్తించి శ్రీ మైలవరపు సుబ్రహ్మణ్యం గారూ, శ్రీ బోయనపల్లి కామేశ్వరరావు గారూ దీనికి సమగ్రంగా వ్యాఖ్యానం సంతరించి ఆంధ్ర జిజ్ఞాసువులను ఋణగ్రస్తులను చేస్తున్నారు. ఏదో అర్థతాత్పర్యాలు రాయడంగా కాకుండా వివిధవ్యాఖ్యానాలను పరిశీలించి వివిధ సంప్రదాయాలను అనుశీలించి ఆ యా విశేషాలను కూడా నాతిదీర్ఘంగా పొందు పరచడం వీరి కృషికి అద్వితీయతనూ, అపూర్వతనూ సమకూరుస్తోంది. ఇకనుంచి ఆంధ్రదేశంలో ఆస్తికమహాజనుల సుందరకాండ పారాయణ సార్థకమవుతుంది. అందరి పక్షానా భవిష్యత్తరాల పక్షానా ఈ జంట రచయితలకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

(26)

శ్రీరాముని కళ్యాణ గుణాలను ఏకరువు పెడుతూ వాల్మీకి "కృతజ్ఞశ్చ" అన్నాడు. కృతజ్ఞత్వం అనేది అంత ప్రత్యేకంగా పేర్కొన వలసిన గుణం అని వాల్మీకి సంభావన. జనాభా పెరిగి మానవ సంఖ్య తరిగిపోతున్న ఈ రోజుల్లో ఇది మరీ ప్రత్యేకంగా గుర్తుపెట్టుకోవలసిన అంశం. ఈ దృష్టితో ఆర్ద్రమైన హృదయంతో వీరికి మరోసారి కృతజ్ఞతలు తెలుపుతూ సెలవు.

భవదీయుడు
**బేతవోలు రామబ్రహ్మం**

# ప్రమోదము

శ్రీమాన్ కందాళ వేంకటాచార్యులుగారు

MA, Ph.D

విశ్రాంతాంధ్రోపన్యాసకులు

విజయనగరము.

శ్రీరామాయణము వామలూరుభవుని తపఃఫలము. ఎంతవానికంతగా నర్థమును ప్రసాదించునది. వేదవేద్యుడు రాముడు కాగా వేదము రామాయణ రూపమున వాల్మీకి కోకిల కుహూనాదమున ఆవిర్భవించినది.

శ్రీ రామాయణ భూషణ మను వ్యాఖ్యానమును అనుగ్రహించిన గోవిందరాజు "క్వాహం మందమతిః గభీరహృదయం రామాయణం తత్ క్వ చ" అని నివ్వెరపోయిరి. తత్త్వదీపికావ్యాఖ్యాత యగు మహేశ్వరతీర్థులు "నానాటీకాస్థవాక్యాని లిఖ్యన్తేఽత్ర యథామతి,..., లేఖకోఽహం న కల్పకః" అన్నారు. అట్టి రామాయణమున తిలకాయమానము సుందరకాండము, దీని వ్యాఖ్యకు 'శృంగారతిలకము' అని సార్థక నామముంచి మురిసిపోయినారు గోవిందరాజులు.

అట్టి మహోన్నత గ్రంథమైన దీనిలోని వివిధ విషయములను వ్యాఖ్యాత లనేకులు సంస్కృతమునను, ఆంధ్రమునను ఎట్లు వివరించిరో పరిశీలించి సుబోధినీ వ్యాఖ్య పేర సుబోధకముగ ఆంధ్రపాఠకులకు అందించిన మహనీయులు శ్రీయుతులు మైలవరపు సుబ్రహ్మణ్యముగారు, శ్రీయుతులు బోయనపల్లి కామేశ్వరరావుగారు. వీరిరువురి కృషి ఫలితముగా వెలసిన యీ గ్రంథము ఆంధ్రుల భాగ్యపు పంట.

హనుమ రావణునకు చేసిన హితబోధలోని 'ధర్మశ్చాధర్మనాశనః' 'ఇంద్రో మహేంద్రస్సురనాయకో వా' వంటి శ్లోకముల భావము చాల సుగమముగా చక్కగా వ్రాసిరి. చాల సంతోషమైనది.

ఆంధ్రలోకము ఈ గ్రంథమును పఠించి ధన్యమై కృతికర్తల ఋణమును తీర్చవలెనని ఆశించుచున్నాను.

ఇట్లు

భవదీయుడు

**కందాళ వేంకటాచార్యులు**

# అభినందనము

ఆచార్య తూమాటి దోణప్పగారు,
తొలి ఉపాధ్యక్షులు,
తెలుగు విశ్వవిద్యాలయం
హైదరాబాదు.

శ్రీ కామేశ్వరరావుగారికి

ఆదరపురస్సరంగా మీ రంపిన సుబోధిని, సుందరకాండం ఏడు సంపుటాలు అందాయి. రోజు కొక సంపుటం వంతున వారం రోజులలో అన్నీ పరిశీలించాను.

సామాన్యులకు సైతం చక్కగా అర్థమయ్యే రీతిలో అన్ని అంశాలు సమగ్రంగా శాస్త్రీయంగా వివరణం సాగింది. పూర్వవ్యాఖ్యాతల తీర్పులను చేర్చడం మరింత ఆనందవర్ధనం.

అంతా సర్వాంగసుందరంగా అమరింది. హార్దికమైన అభినందనలు. మీ కృషి ప్రశంసార్హం.

ధన్యవాదాలతో
**తూమాటి దోణప్ప**

# శుభాశంసనము

"సాహిత్య కళా తపస్వి"
**జి.వి.జ్వాలా నరసింహశాస్త్రి,**
బి.కాం, బి.యల్.
అడ్వకేటు : పబ్లిక్ నోటరీ, చీరాల

**యః కర్ణాంజలి సంపుటై రహరహ స్సమ్య క్పిబ త్యాదరా**
**ద్వాల్మీకే ర్వదనారవిన్దగళితం రామాయణాఖ్యం మధు ।**
**జన్మవ్యాధిజరావిపత్తిమరణైః అత్యంతసోపద్రవం**
**సంసారం స విహాయ గచ్ఛతి పుమాన్ విష్ణోః పదం శాశ్వతమ్ ॥**

పుట్టుటలు, వ్యాధులు, ఆపదలు, ముదుసలితనాలు, చావులు చర్వితచర్వణం అవుతుంటే, సంసారభారాన్ని మోయలేక, భవబంధాలచేత కట్టుబడి, అవస్థల పాలౌతున్న ప్రాణికోటికి అపూర్వమైన మధువును "రామాయణ" మనే రూపంలో ప్రసాదించి, తరించడానికి మహోపకారం చేసిన వాల్మీకిమహర్షి చరణకమలములకు సహస్రప్రణామములను సమర్పించుకొన్ననూ యీ సంసారము ఆయనకు ఎల్లప్పుడూ ఋణపడియే ఉంటుంది.

**"అచ్చమైన యమృత మమరులు త్రావినా**
**రోయి! దాని కే నసూయపడను**
**పరమమౌనియైన వాల్మీకి కృత రామ**
**సత్కథాసుధారసంబుఁ ద్రావి"**

**"ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ మౌని వాల్మీకి భా -**
**షా సంక్రాంత ఋణమ్ము దీర్పగలదా! సత్కావ్యనిర్మాణరే - ।**
**ఖాసామగ్రి ఋణమ్ము దీర్పకలదా! కాకుత్థ్సుడౌ స్వామిగా -**
**థా సంపన్నము భక్తిఁదీర్చినను ద్వైతాద్వైతమార్గమ్ములన్"**

అని కవిసామ్రాట్ విశ్వనాథ, కల్పవృక్షావతారికలో ప్రశంసించారు.

శ్రీరామ కథగా, సీతాదేవికథగా, పౌలస్త్యవధకథా విశేషంగా పఠనమునకు ప్రాచుర్యం పొందిన వాల్మీకిరామాయణం సర్వలక్షణలక్షితంగా, గాయత్రీ

మహామంత్రార్థపూర్ణంగా, సకలవేద వేదాంగ ఉపనిషద్భాష్య మందరంగా అధ్యాత్మ విదులచే మంత్రశాస్త్రవేత్తలచే పరమ ప్రమాణ పారాయణ పాత్రమైనది.

ఈ రామాయణమును ఎన్ని విధాల ఎందరో మహానుభావులు ప్రాంతీయ భాషలలోనికి అనువాదం చేసినా, వాల్మీకి హృదయగతార్థములను గీర్వాణవాణిలో నిర్భరమైనట్లుగా, వ్యాఖ్యానాలు, ఎన్ని వచ్చినా, వాల్మీకి వదనారవింద గళితం అయిన రామాయణాఖ్య మధువుయొక్క స్వాదుగుణము యితరత్రా కొరవడుతూనే ఉంది. అందుకే ఆంధ్రీకృత, తమిళానువాద, హిందీభాషాగత రామాయణములను చదివి ఆనందిస్తూనే మూలంలో వాల్మీకి ఎలా అన్నాడో, ఎలా రచించాడో తెలుసుకోవాలనే జిజ్ఞాస ప్రతివారిలోనూ సహజంగా ఉంటున్నది.

ఇదంతా ఎందుకు చెప్పడం అంటే, ఇంతకాలానికి కూడా వాల్మీకి విరచిత సంస్కృతభాషాగత శబ్దవృత్తి అర్థప్రతిపత్తియొక్క ప్రాధాన్యమును తెలుసుకోడానికే!

ఆ ప్రధానలక్ష్యమే శ్రీమైలవరపు సుబ్రహ్మణ్య శ్రీ బోయినపల్లి కామేశ్వరరావు మహోదయులను ప్రేరేపించగా పదపదార్థ టీకా తాత్పర్యములతో సరిక్రొత్త ప్రతిని మరల ఆంధ్రుల హస్తాలకు అందించవలెనని కృషికి దీక్షాకంకణులైనట్లు అనుకొన వలెను.

ప్రస్తుతానికి రామాయణ మహాగ్రంథంలో అతి ముఖ్యమైన సుందర కాండకు యీ కృషిని ఎన్నుకోడం హర్షదాయకం. సుందరకాండ పలువురకు పారాయణ గ్రంథంగా యిష్టార్థసిద్ధి నిచ్చు మంత్రరాజముగా యీనాటికీ ప్రచారంలో ఉన్నది. సంస్కృత భాషా జ్ఞానం లేనివారు చక్కగా తాము పఠించే శ్లోకార్థాలను అవగతం చేసుకుంటూ మననం చేసుకుంటూ యున్నప్పుడు వారికి విశేషపరిజ్ఞానం, వారి పాఠ్యాంశం పట్ల ప్రత్యయము, లెస్సగా కల్గి, ఏకాగ్రతకూ, ఆసక్తికీ, సంపూర్ణ స్వాదనకూ ఆలంబనం అవుతుంది.

ఇంతటి ఘనకార్యం చేపట్టిన కృతికర్తలు శ్లాఘనీయులు, ఈ సుందరకాండ యొక్క ప్రాముఖ్యం పండితులకు తెలియనిదికాదు.

**"సుందరే సుందరో రామః, సుందరే సుందరీ కథా**
**సుందరే సుందరీ సీతా, సుందరే సుందరం వనం**
**సుందరే సుందరం కావ్యం, సుందరే సుందరః కపిః**
**సుందరే సుందరం మంత్రం, సుందరే కిం న సుందరమ్?"**

**'నష్టద్రవ్యస్య లాభో హి సుందరః పరికీర్తితః'**

ఇట్టి కాండమును చక్కగా తెలుగు పాఠకులకు అవగతం కావాలనే సులభ శైలిలో, వాల్మీకి ప్రయోగించిన కొన్ని గూఢార్థములతో కూడిన శబ్దములకు అపచారం జరుగకుండా అనగా, "రహస్యం చ ప్రకాశం చ యద్ వృత్తం తస్య ధీమతః" అన్న విషయాన్ని మనసునం దుంచుకొని చేస్తున్న అనువాదము యిది.

లోగడ వావిళ్ళవారూ మరి కొందరు ప్రచురణ కర్తలూ తాత్పర్యమును మాత్రం యిస్తూ సంస్కృతమూలమును ముద్రించినారు. కాని ప్రతిపదార్థ టీకా భావార్థ, విశేషార్థ ప్రవచనం చేసినట్లు తెలియదు. ఆ కొరతను శ్రీ మైలవరపు వారు, శ్రీ బోయినపల్లివారు పూర్తి చేసినారు. ఈ కృషికి అసాధారణ పాండిత్యం కావాలి, వ్యాఖ్యాతలను అర్థం చేసుకోవాలి. ఉభయభాషలయందు దర్శనములయందు ఉత్తమమైన సంస్కారం ఉండాలి.

అది శ్రీ సుబ్రహ్మణ్యము కామేశ్వరరావుగారలయొక్క రచనలో కన్పిస్తున్నది. భాషకూడ అటుకేవలం గ్రామ్యం కాకుండా, జటిలగ్రాంథికం కాకుండా, వీలైనంత సులువుగా అర్థమయ్యే శిష్టుల భాషనే యీ అనువాదంలో ఉపయోగించారు.

వాస్తవంలో ఇది "సుబోధినీవివరణ" సహితమే! సుందరకాండమును సశాస్త్రీయంగా విభజించి, ఆ ప్రకారం సులువుగా హస్తగతం చేసుకొనుటకు అనువుగా సంపుటాలను ఎన్నుకోవడంలో రచయితలయొక్క సూక్ష్మదృష్టి తెలుస్తున్నది.

ప్రకృతం "క్షేమనివేదనము" అను శీర్షికతో ఈ చివరి సంపుటాన్ని అందిస్తున్నారు.

మానసికసంక్షోభంనించి సీతాక్షేమనివేదనము చేసి రామచంద్రుడికీ, అట్లే రామభద్రుని కుశలవార్తాహరుడై సీతాసాధ్వికీ, దుఃఖవిమోచనం కల్గచేసిన ధన్యజీవి, పరమభాగవతోత్తముడు, శ్రీ ఆంజనేయస్వామి!

లంకలో శత్రువుల గుండెలలో సంక్షోభాన్ని తాను సృష్టించి, అవసరమైనంత సంక్షయం చేసి, సంక్లిష్టకర్తవ్యమును తన ప్రజ్ఞతో సాధించిన మతిమంతుడు, బుద్ధిమంతుడు, హనుమంతుడు! హనుమత్సందేశము సంక్షేమనివేదనమే! రావణుడికి కిట్టనందున సంకీర్ణపరిస్థితులను కొనితెచ్చుకొన్నాడు. "దాసోఽహం కోసలేంద్రస్య, రామస్యాక్లిష్టకర్మణః" అని చెప్పుకొన్న ధైర్యశౌర్యవీర్యవంతుడు.

ఈ ప్రకరణంలో అందరికీ క్షేమం ప్రాప్తిస్తుంది. అది పఠించిన, పారాయణం చేసినవారికి కూడ క్షేమం కల్గుతుంది. ఇంత విషయవివేచనం చేసి ఔచిత్యవంతంగా నామకరణం చేసిన తాత్త్వికులు ఈ సుబోధినీ వివరణ కర్తలు!

లోకకల్యాణం కొరకైన యితివృత్తభాగము అనువదించడం ద్వారా సర్వ జనులకు సర్వతోభద్రమును కాంక్షించిన ఈ సుకృతులకు హనుమత్ సీతా లక్ష్మణ సమేతుడైన రామచంద్రుడు శుభాశీస్సులు వర్షించుగాక.

ఇట్లు

**జ్వాలాశాస్త్రి**

# సుందర సుబోధిని

చంద్రమౌళి శేషగిరిరావు
(మహాభారతోపన్యాసకులు)
యాజలి, గుంటూరుజిల్లా.

శ్రీయుతులు మైలవరపు సుబ్రహ్మణ్యంగారు శ్రీబోయనపల్లి కామేశ్వరరావు గారు ఉభయులు శ్రమించి వివరణ సమేతముగా ప్రచురించిన సుందర కాండమును సాకల్యముగ పఠించి ఆనంద పరవశుడనైతిని. వాల్మీకి మహర్షి రచించిన సంస్కృత రామాయణమునందలి సుందరకాండమునకు పదచ్ఛేదము, అన్వయక్రమము, ప్రతిపదార్ధము, వ్యాఖ్యాన విశేషము, తాత్పర్యము – ఈ క్రమములో వివరణ ఇచ్చుట అనునది చిన్నవిషయం కాదు. పాండిత్యబల సాధ్యమైన ఈ పనిని చేయసంకల్పించి కృతకృత్యులైన ఈ విద్వాంసు లిరువురూ అభినందనీయులు. ఈ రోజులలో ఇటువంటి వివరణతో కూడిన గ్రంథములు ఎంతయో అవసరము. మనకు సాహిత్యమునకు కొరతలేదు. వాల్మీకి మహర్షి, వ్యాసభగవానుడు, కాళిదాసాది మహాకవులు సంస్కృత భాషలో ఎంతో గొప్ప సాహిత్యాన్ని ప్రసాదించారు. దానిని పఠించుటవలన ఉత్తమ జ్ఞానము, విషయ పరిజ్ఞానము, మనోవికాసము కలుగుతుంది. ఆ సాహిత్యాన్ని విజ్ఞాన సర్వస్వమని చెప్పుకోకలిగినవారు తెలుగువారిలో చాలాకొద్దిమంది మాత్రమే. ఈ లోటును భర్తీ చేయుటయే యీ ఉభయుల సంకల్పము. అక్షరాస్యుడైన ప్రతివాడును ఇతరుల సహాయం లేకుండానే వీరు ప్రచురించిన ఈ గ్రంథము ననుసరించి అర్థంచేసుకొని పరిపూర్ణమయిన జ్ఞానమును పొందగలరు. ఇంతవరకు ఇటువంటి వివరణము ఇచ్చే గ్రంథములు లేకపోవుటచే మన సాహిత్యంవలన తగిన ప్రయోజనం పొందలేక పోవుచున్నారు. ఎవరైనా ఇటువంటి గ్రంథములు ప్రచురిస్తే బాగుండునుకదా అని నేను అనుకొనేవాడిని. వెదకబోయిన తీగ కాలికి తగిలినట్లు వీరు వివరణ సమేతముగా గ్రంథమును ప్రచురించడం, అభిప్రాయాన్ని కోరుతూ వారు నాకు పుస్తకాన్ని పంపటం జరిగింది. నా కల సఫలమయిందని సంతోషించాను. సంతోషమే కాదు, ఆశ్చర్యంకూడా కలిగింది, ఎందుకంటే ఈ రోజులలో చాలామంది ద్రవ్యార్జన లక్ష్యంతో ఏమేమో వ్రాస్తారు, భాష ఉండదు – భావం ఉండదు. అంతా ఆర్భాటం. వీరు మాత్రం స్వతంత్రంగా గ్రంథరచనకు పూనుకోకుండా సర్వజనామోదమైన పరమపవిత్రమైన, పూజ్యమైన రామాయణ మహాకావ్యాన్ని వివరణ సహితంగా ప్రచురించి ఆంధ్రావళికి అందించటానికే పూనుకున్నారు ధన్యులు.

"భావంబెక్కడలేక వృత్తనియమాపాయంబు చింతింపక పైపై వన్నెల్ పచరింప

దాని తిలకింపబోరు ధీరోత్తములు" అని పూర్వమే సారహీనసాహిత్యాన్ని నిందచేశారు. యీ బెడద పూర్వం నుండి కూడ ఉన్నది. దానివలన విలువయిన సాహిత్యం మరుగునపడే ప్రమాదం ఉంది.

వీరు వ్రాసిన వివరణతో విలువయిన సాహిత్యం వెలుగుచూడడం వలన అది మరుగునపడిపోయే ప్రమాదం తప్పింది. భారతరచన ప్రారంభంలో తిక్కన సోమయాజి "భారతామృతము కర్ణపుటంబుల నారగ్రోలి ఆంధ్రావళి మోదముంబొర యునట్లుగ" అన్నారు. అదే ఉద్దేశ్యము వీరిరువురిలో గోచరిస్తుంది. మహాభారతంలో విరాటోద్యోగ పర్వములు ఎట్లాగో రామాయణములో సుందరకాండము అట్లాగే రసవత్తరమైనది. రామాయణ మహాకావ్య రసపానముచేసి ఆంధ్రావళి మోదమున్ బొరయుటయే వీరి ఆశయము. వీరి కృషి వడ్డించిన విస్తరి. కడుపార నారగించి తృప్తినొందుటయే పాఠకులవంతు.

రామాయణ కృతికి చక్కని వివరణ ఇచ్చారు కనుక నేను మరల అందులోని విషయం జోలికి పోలేదు.

వీరు చేయవలసినది ఇంకనూ ఎంతో ఉంది. రసవత్తరమైన కావ్యాలు ఇంకా ఎన్నో ఉన్నాయి. వాటికి కూడా ఇదేవిధముగా సుబోధినీ వివరణ ఇస్తే బాగుంటుంది. ఆ పని కూడా వీరేచేస్తే బాగుంటుందని తలుస్తాను. ఇందుకు వారికి తగిన శక్తిని ఆయురారోగ్యములను ప్రసాదించవలసినదిగా దైవాన్ని ప్రార్థిస్తున్నాను. అనితరసాధ్యమైన వీరికృషిని ప్రశంసిస్తూ ఈ ప్రయత్నంలో కృతకృత్యులైనందుకు వీరిని సహృదయంగా అభినందిస్తున్నాను.

ఇట్లు

**చంద్రమౌళి శేషగిరిరావు**

# సుందర నందనము

కవిరాజ పండిత
**బుద్ధరాజు రామరాజు** ఎమ్.ఎ.,
విద్యాప్రవీణ, శిక్షాశాస్త్రి
ప్రధాన సాహిత్యాచార్యులు
మహారాజ ప్రభుత్వ సంస్కృత కళాశాల
విజయనగరము

**"మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః"** అనియు
**"పాఠ్యే గేయే చ మధురమ్"** అనియును
**"స్వసూక్తినాం పాత్రం రఘుతిలకమేకం కలయతామ్"**

అనియు పలువిధములుగా స్తుతింపబడిన వాల్మీకి రామాయణ కావ్యము విశ్వసాహిత్యములో ప్రథమగణ్యమైనట్టిది.

**"న గాయత్ర్యాః పరో మంత్రః"** అను మహాప్రభావముగల గాయత్రీ మంత్రాత్మకమైన పవిత్రకావ్య మిది.

అందు **"సుందరం సర్వసుందరమ్"** అనిపించుకొన్న సుందరకాండము సారభూత మైనట్టిది.

ఇందు కథా ప్రసంగమున శ్రీరాముని పావనచరిత్రము, సర్వలక్షణపూర్ణమైన ఆతని దివ్యమంగళవిగ్రహ వర్ణన, సర్వజనగ్రాహ్యమైన హితోపదేశమును నిండియున్నవి.

మరియు **"సుందరే సుందరః కపిః"** అని కీర్తింపబడిన హనుమ **"విక్రాంతస్త్వం సమర్థస్త్వం, ప్రాజ్ఞస్త్వం వానరోత్తమ"** అని సీతామహాదేవిచే శ్లాఘింపబడుచు లాంగూలచక్రముతో పింగళవర్ణముతో శ్వసనవిక్రముడై మనకు సాక్షాత్కరించును.

ఈ సుందరకథలోని సీతాన్వేషణమునందలి అంతరార్థము – జీవుడు తాను అన్వేషించి పొందవలసిన జీవితపరమార్థమును సాధించుటయే అని తెలియనగును.

ఆ సాధనలో జపింపబడు మంత్రమే **"నమోఽస్తు రామాయ సలక్ష్మణాయ దేవ్యై చ తస్యై జనకాత్మజాయై, నమోఽస్తు రుద్రేంద్రయమానిలేభ్యో నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః"** అన్నట్టిది.

సమస్తపీడాపరిహారమునకును, సర్వజయ మంగళములకును సాధనమైన ఈ సత్కావ్యము భారతీయుల తపఃఫలము.

ఇట్టి విశిష్టమైనట్టి ఈ ఆదికావ్యము సంస్కృతభాషలోనే చదువుకొనగల్గిన అదృష్టము సామాన్యమైనది కాదు.

అట్టి భాగ్యము తమ సుబోధినీ వివరణ రూపమున శ్రీవైలవరపు సుబ్రహ్మణ్యము గారును, శ్రీ బోయనపల్లి కామేశ్వరరావుగారును ఆంధ్రపాఠకులకు సులభగ్రాహ్యము చేసినారు.

ఇందలి పదచ్ఛేదాదికమైన వివరణము భాషాజిజ్ఞాసువులకు కూడ అత్యంత లాభదాయకమైనది. తాత్పర్యాది విశేష వివరణము తారకరాముని పావన చరిత్ర యొక్క గ్రహణమునకును మననానిదిధ్యాసనములకును సాధనమయి భక్తవరేణ్యులకు పరమార్థసంధాయకమై యుండుట నిశ్చయము.

**బుద్ధరాజు రామరాజు**

# క్షేమంకరం

మధురకవి, కవికులశేఖర
**ఓగేటి పశుపతి**
విద్యాక్షేత్రం, యాజలి,
గుంటూరుజిల్లా.

"సత్యం శివం సుందరం. సీత సుందరి, శ్రీరాముడు సుందరుడు", "బుద్ధిమతాం వరిష్ఠః" అయిన హనుమంతుడు దశకంఠునియొక్క అంటే దశేంద్రియముల యొక్క ప్రాబల్యంచే యెడబాటు ప్రాప్తించిన సుందరీసుందరులను (ప్రకృతి పురుషులను) కలుపుటకు చేసిన ప్రయత్నం గురించి చెప్పేదే సుందరకాండము. అది కావ్యరూపంలో రసభరితం అన్నమాట.

భవసాగరతరణోపాయంగా భావించి దానిని నిత్యం పారాయణ చేసుకొనే శ్రద్ధాళువులూ, భక్తులూ ఎందరో ఉన్నారు. సంస్కృతభాషలో సరియైన పరిజ్ఞానం లేక దానిని సరియైన రీతిలో అర్థం చేసుకోలేనివారు కూడా ఎందరో ఉన్నారు. అట్టివారందరికి ఉపయోగించునట్లు వివిధ వ్యాఖ్యానాలలోగల విశేషార్థాలతో తేటతెనుగులో ఈ గ్రంథము వెలువరించుచున్న శ్రీయుతులు సుబ్రహ్మణ్యం కామేశ్వరరావుగార్లు ఎంతో అభినందనీయులు. విశేషించి 'క్షేమనివేదనము' ప్రకృతి పురుషుల అవినాభావసంబంధం తెలుపుచూ భౌతికవిజ్ఞానశాస్త్రం బలిసి పోయిన అధునాతన ప్రపంచంలో ఆదర్శ దాంపత్య జీవిత విషయంలో కనువిప్పు క్షేమకరం కాగలదని నా విశ్వాసం.

ఇంకొకమాట – ఈ గ్రంథకర్తలు మా బుద్ధాం 'నామప్రయాగ' సంస్థాపకులు శ్రీరామశరణ్ గురువర్యుల శిష్యులు కావటం మాకు మరింత సంతోషకరమైన విషయం. శ్రీరామశరణులు పరమపదించియు ఏతాదృశశిష్యగణంతో శ్రీరామనామ ప్రచారం చేస్తూనే ఉన్నారు. మహాపురుషులు అమరులు.

**ఓగేటి పశుపతి**

# సమ్మోద నివేదనము

ప్రస్తుత 'హనుమద్విక్రమ' సంపుటము ఆరంభించినది ఆదిగా అడుగడుగున అంతరాయములు బాధించుచుండగా ఆర్తితో 'హనూమత్ప్రభో నః ప్రసన్నో భవ త్వమ్", అని ఎన్నోమాఱులు వేడుకొన్నాము. ఆ ఆర్తి పూర్తిగా తొలగి నేడు "హనూమత్ప్రభో! నః ప్రసన్నో హ్యసి త్వమ్' అని ఆనందముతో కృతజ్ఞత తెలుపుకొనుచున్నాము.

ఇట్టి నేటి ఈ మా సమ్మోదమునకు కారణములు –

ఈ సంపుటము బైండరుదగ్గర బైండింగు పూర్తికాకుండగనే చివరి క్షణములో శ్రీ భరతశర్మగారి నుండి మాకు చేరిన వారి అభిమానపూర్వకమైన అమూల్య అభినందన సుభాషితములు, సునిశిత ప్రతిభతో వారు గావించిన సుందరకావ్యసారావిష్కృతి;

మాపై ప్రేమపూర్ణహృదయులు శ్రీశ్రీశ్రీ లక్ష్మణయతీంద్రులు ప్రసాదించిన మంగళాశాసనపూర్వకమైన సుందరకావ్యముఖతిలకము;

స్వయముగా దర్శింపజాలక లేఖామూలముగానే – మా కృషిని చిత్తగించి తమ ఆమోదమును దయచేయుడని కోరగా సాహిత్యబాంధవులైన ఆచార్య శ్రీ సి.నారాయణరెడ్డి మహోదయులు ఒసగిన 'అభినందన' మఱియు నేడే ఆంధ్రసాహితీ లోకమునకంతకును గర్వకారణమగు దేశములోనికెల్ల సర్వశ్రేష్ఠమైన జ్ఞానపీఠము వారి అవార్డు వీరికి లభించుట.

వర్ణరేఖావిన్యాసములతో అక్షరములైన సజీవచిత్రములను సృష్టించి నేత్రపర్వముచేయు డాక్టరు సంజీవదేవుగారి బహుముఖప్రజ్ఞాపాటవముతో పరిమితాక్షర పదములతో వాల్మీకిమహాకవి హృదయమునుండి రామాయణ మహాకావ్యములోనికి జాలువారిన సౌందర్య స్వరూప నిరూపణము.

మిత్రులు శ్రీమాన్ శఠకోపాచార్యులుగారు మాపైగల స్నేహగౌరవముల వలనను, ఏతత్ కృతిపరిశీలనము వలనను కలిగిన ఆమోదమును వెల్లడించుచు తెలియజేసిన ప్రహర్షము అని మా మనవి.

మా కోరికమేరకు ఆప్తహృదయముతో ఇట్లు మమ్ము ప్రోత్సహించిన ఈ మహనీయులకు ప్రత్యేకముగా మా హృదయపూర్వక కృతజ్ఞతా వందనము లర్పించుకొనుచున్నాము.

ఆది నుండియు మమ్మాదరించుచున్న తిరుమలేశుని దేవస్థాన అధికార వర్గమువారికి మా నమస్సుమాంజలి.

**సుబోధినీ సమర్పకులు**

## శ్రీ హనుమత్ ప్రణతి

**శ్లో॥ యత్ర యత్ర రామనామకీర్తనం ప్రవర్తతే**
**తత్ర తత్ర హర్షబాష్పలోచనః ప్రనృత్యసి ।**
**రామదేవదివ్యనామమాధురీరసజ్ఞ! హే**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 1**

ఎచ్చటెచ్చట భక్తగణము కూడి ముక్తకంఠముతో రామనామ సంకీర్తనము చేయుచుందురో అచ్చోటులనెల్ల సన్నిహితుడవై ఆనందబాష్పములు నిండిన కన్నులతో నృత్యము చేయుచుందువు. రామదేవుని దివ్యనామమునందలి మాధుర్యవిశేషమును పూర్ణముగా అనుభవింపజాలిన ధన్యుడవు నీవు. నీ శౌర్యధైర్యములు ఎంత అద్భుతమైనవో రామప్రభునియెడ నీ భక్తికూడ అంత ఘనమైనది.

రామధ్యానతత్పరమతీ! మారుతీ! నీకు మా ప్రణతులు.

**శ్లో॥ దుస్తరో మహాంబుధి స్స గోష్పదో బభూవ తే**
**అక్ష మేఘనాదముఖ్య రాక్షసాశ్చ కీటకాః ।**
**రామనామ చింతన ప్రవృద్ధ శౌర్య జృంభణ!**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 2**

అపారమైన మహాసాగరము నీకు చిన్నగోష్పద మైనది. ఎనుబది వేలమంది కింకరాసురులు, ఎదురులేని అక్షకుమారుడు, ఇంద్రజిత్తు వంటి దుర్దాంతదానవులు నీకు కీటకప్రాయులైనారు. "జయత్యతిబలో రామః... దాసోఽహం కోసలేంద్రస్య రామస్య....." అనుచు లంకలో రామనామమును ప్రతిధ్వనింపజేయుచు అరిగణము పెరుగుచున్నకొలది శౌర్యధైర్యములతో విజృంభించిన ధీరవీరుడవు నీవు!

రామభక్త! మారుతీ! నీకు మా ప్రణతులు.

**శ్లో॥ సర్వలోక భీకరో -పి భీవశో దశాననః**
**సో ఽభవత్ భవత్ప్రతాపతాపతప్తమానసః ।**
**అప్రధృష్యశౌర్యధైర్యవిక్రమక్రమోజ్జ్వల!**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 3**

"యస్య సూర్యో న తపతి, భీతో యస్య చ మారుతః న వాతి...." అనిపించుకొని సర్వలోక భయంకరుడై యున్న రావణుడు నీ విక్రమమునుగూర్చి విని ".... శంకాహతాత్మా దధ్యౌ, ........ మన స్సమాధాయ ..... మహత్ సత్త్వమిదం జ్ఞేయం .... సర్వథా తత్ మహద్ భూతం ..... నహ్యహం తం కపిం మన్యే" అనుచు నీ శౌర్యధైర్యములకు గుండె చెదిరినవాడైనాడు.

నిరుపమవిక్రమా! హనుమా! నీకు మా నమస్కారములు.

**శ్లో॥ రాఘవేణ సీతయా చ సన్నుతో భృశం ముదా**
**దుష్కరార్థసాధక స్త్వ మప్రమేయవిక్రమః ।**
**ఆశ్రితార్తినాశకః ప్రమోదకృత్ సతాం సదా**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥** 4

"కృతం హనుమతా కార్యం సుమహన్ భువి దుష్కరం, మనసాఽపి య దన్యేన న శక్యం ధరణీతలే ..... విక్రాంత స్త్వం సమర్థ స్త్వం ప్రాజ్ఞ స్త్వం వానరోత్తమ! .... తేజో ధృతి ర్యశో దాక్ష్యం, సామర్థ్యం వినయో నయః, పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్య త్వేతాని నిత్యదా.... అహం చ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః, వైదేహ్యా దర్శనే నాద్య ధర్మతః పరిరక్షితాః" అని సీతారాములచే కీర్తింపబడిన ప్రభావముగల మహనీయుడవు నీవు. నీ అప్రమేయవిక్రమముచే ఆశ్రితుల ఆర్తిని పోగొట్టి సదా సజ్జనులకు సమ్మోదము గూర్తువు నీవు.

సర్వజనస్తవనీయా! ఆంజనేయా! నీకు మా నమోవాకములు.

**శ్లో॥ యత్ర తే గభీరవీరదివ్యమూర్తి రర్చ్యతే**
**యత్ర చైవ కీర్త్యతే త్వదప్రమేయవిక్రమః ।**
**దుష్టశక్తయః ప్రయాంతి దూరతస్తతోఽఖిలాః**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥** 5

ధీరగంభీరమైన నీ దివ్యరూపమును నెలకొల్పుకొని నిన్నెచ్చట అర్చించు చుందురో, అద్భుతములైన నీ పరాక్రమగాథలను ఎచ్చట కీర్తించుచుందురో, పరమపవిత్రమైన ఆయా ప్రదేశములందెల్ల అనగా ఆ హృదయములందు, ఆ మందిరములందు, ఆ జనపదము లందెల్ల భూతప్రేత పిశాచాది దుష్టరాక్షసగణముగాని హింసాద్వేషాసూయాది రాక్షసభావములుగాని నిలువజాలక దూరముగా తొలగిపోవును.

మహనీయా! శత్రుభయంకర వీరాంజనేయా! నీకు మా భక్తి పూర్వకమైన ప్రణామాంజలి.

**శ్లో॥ దృప్త దుష్ట హృద్విదారి తావకోగ్రవీక్షణమ్**
**త్వత్ప్రసన్నరమ్యమూర్తి రాశ్రితాక్షికౌముదీ ।**
**దివ్యభావదీపనం హి తే గుణౌఘచింతనం**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 6**

దుష్టశిక్షకుడవైన నీ ఉగ్రవీక్షణములు దుర్జనుల సర్వగర్వములను నిర్మూలింప జేయును. నీ శరణముగోరిన ఆశ్రితజనుల కనులకు నీ దివ్యసుందరవిగ్రహము చల్లని వెన్నెల యగును. ఉజ్జ్వలమైన నీ పావనచరితమును భావన చేయు ధన్యుల మానసములు ఘనమైన జ్ఞానక్రియాశక్తులకు నెలవులై దైవీభావసంపన్నములై యుండును.

అరిభయంకరా! ఆశ్రితవత్సలా! అనుపమగుణాంబుధీ! హనుమా! నీకు మా ప్రణామములు.

**శ్లో॥ వానరోత్తమస్య తే హి యో భవేత్ ప్రియో నరః**
**స్యా న్నరోత్తమప్రభో స్స రాఘవస్య చ ప్రియః ।**
**నిశ్చయం నరోత్తమ స్స సర్వదేవతాప్రియః**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 7**

వానరోత్తమా! నీ భక్తుడై నీ ప్రేమకు పాత్రుడైన నరుడు నరులలో ఉత్తముడగును. మఱియు ఆ ధన్యుడు నిన్ను అమితముగా ప్రేమించు పురుషోత్తముడైన రామప్రభువునకు కూడ మిక్కిలి ప్రీతిపాత్రుడగును, అంతేకాక సర్వదేవతలకును నీవు ఇష్టుడవు కావున ఆ నరోత్తముడు హరి హర బ్రహ్మేంద్రాది సకల దేవతలకు కూడ ప్రేమపాత్రుడగును.

ఈ విషయమునే 'ఆంజనేయః పూజితశ్చేత్ పూజితా స్సర్వదేవతాః' అను ఆర్షవచనము విశదము చేయుచున్నది.

అఖిలదేవతలకును ఆత్మీయుడవైన రామభక్తాగ్రణీ! పావనీ! నీకు మా వందనములు.

**శ్లో॥ వ్యోమగామివీర! వాయుజాంబురాశిలంఘన!**
**భూమిజార్తినాశ! వహ్నిదగ్ధదైత్యమందిర ।**
**స్వామి సేవనోపయుక్తపంచభూతసంచయ!**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 8**

వాతాత్మజా; నీవు లంకలో రామదూతగా సాధించిన విజయము ఎన్నోవిధముల విశిష్టమైనది. అందొక విశేష మిట్టిది - ఇందు పృథివ్యాది పంచభూతములకును భాగము కలిగినది. ఎట్లనగా - నీచే అన్వేషింపబడి ఆర్తి తొలగించుకొన్నది - పృథివీసుత; నీవు లంకను చేరుటకు దాటినది - జలరాశి; నీ వచట రాక్షసభవనములందు జ్వలింపజేసినది - అగ్ని ; ఏతత్కార్యనిర్వాహకుడవైన నీ జనకుడు - వాయువు; నీ సుదీర్ఘ గమన ప్రదేశము ఆకాశము.

స్వామి సేవనోపయుక్త సర్వభూత సంతతీ! మారుతీ! నీకు మా ప్రణతి.

**శ్లో॥ రత్నసాను శైల రమ్య దివ్య దేహ రాజిత!**
**దివ్య రత్నహార ముఖ్య హేమభూషణోజ్జ్వల ।**
**భానువంశ రామరత్న దీప్యమాన మానస!**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 9**

రత్నసాను వైన మేరుగిరివంటి సుందరగంభీరమైన శరీరముతో విరాజిల్లు వాడవు. సీతామాత ప్రేమపూర్వకముగా నొసగిన రత్నహారము మున్నగు హేమాభరణములతో శోభిల్లువాడవు. మఱియు భానువంశరత్నమైన రామప్రభుని ఉనికిచే మహాతేజస్సుతో నిండిన మనస్సుతో వెలుగొందువాడవు.

రామాయణమహామాలారత్నమా! అనిలాత్మజా! నీకు ప్రణామాంజలి.

**శ్లో॥ అంజనామనోంబుజాతరంజనప్రభాకర!**
**వారితావనీసుతాప్రగాఢచిత్తసంజ్వర!**
**రామదేవభవ్యదివ్యపాదపద్మబంభర!**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥ 10**

సూర్యుడు పద్మములకు వికాసము కూర్చునట్లు నీవు అంజనామాత మానసమునకు ఆనందము కూర్చువాడవు. అమితమైన తాపము నొందుచున్న సీతామాత హృదయవ్యథను శమింపజేసినవాడవు. మధుపము పద్మమును జేరి అమితానందము నొందునట్లు నీవు రామదేవుని పావనపాదసన్నిధిని మహానందము

నొందువాడవై యుందువు.

అంజనానందనా! జానకీశోకనాశనా! రామభక్తాగ్రణీ! నీకు వందనము.

**శ్లో॥ భక్తకోటి వాంఛితార్థ దానకల్పభూరుహా!**
**యో భవత్కటాక్షభాగ్యభాజనో జనో భవేత్ ।**
**నిర్భయో నిరాపద స్స సంతతాప్తసమ్మదః**
**వీర! ధీర! రామభక్త! మారుతే! నమోఽస్తు తే ॥** **11**

ఏయే భక్తుడు ఏయే ఫలమును కోరి నిన్ను వేడుచుండునో ఆ యా భక్తునకు ఆయా ఫలములనెల్ల యొసగి సంతుష్టుల జేయునట్టి ముంగిటి కల్పవృక్షము వంటివాడవు నీవు భక్తులకు. నీ కటాక్షభాగ్యమునకు పాత్రుడైన మానవుడు ఎట్టి భయములకును గురికాకుండా ఎట్టి ఇక్కట్లకు లోనుగాకుండా ధన్యజీవనుడగుచు నిరంతరానందముతో వెలయుచుండును.

ఆశ్రితవత్సలా! అమేయమహిమా! హనుమా! నీ పాదపద్మములకు సాష్టాంగదండ ప్రణామములు.

☆☆☆

ఓం నమో భవతే హనుమతే

# జయతి పవనసూనుః

**సకలసుజనబంధు స్సచ్చిదానందసింధుః**
**నిఖిలఖలవిదారీ శిష్టకష్టాపహారీ ।**
**నిరవధిసుఖదాయీ నైకసంపద్విధాయీ**
**జయతి పవనసూనుః భక్తహృత్పద్మభానుః ॥ 1**

సజ్జను లెల్లరికిని ఆప్తబంధువు, సత్యజ్ఞానానందములకు నిలయము, దుష్టులను నాశమొందించి శిష్టుల కష్టములను తొలగించునట్టివాడు, శాశ్వత సౌఖ్యములను సమకూర్చి సమస్త సంపదలను ప్రసాదించునట్టివాడు, సూర్యుడు పద్మములను వికసింపజేయునట్లు భక్తుల మనస్సులను ఆనందభరితము చేయునట్టివాడు అని కీర్తింపబడునట్టి హనుమ – సర్వసేవ్యుడైన దైవము.

**కనకశిఖరిరమ్యప్రాజ్యగంభీరమూర్తిః**
**శమితదనుజదర్పోద్రేకసంలబ్ధకీర్తిః ।**
**పరిహృతనిజభక్తస్వాంతసంతాపజార్తిః**
**జయతి కపివరేణ్యో రామభక్తాగ్రగణ్యః ॥ 2**

బంగరు కొండవంటి గంభీరమైన మూర్తిసౌందర్యము, దుష్టదానవ సంహారముచే గలిగిన కీర్తి వైభవము, ఆశ్రితభక్తుల ఆర్తిని పోగొట్టు కారుణ్యభావము, అను దివ్యలక్షణములతో విరాజిల్లు రామభక్తాగ్రగణ్యుడైన హనుమ సర్వలోకశరణ్యుడు.

**సురగురుసమబుద్ధిప్రాభవఖ్యాతకీర్తిః**
**హృదయలసితసీతారామసౌమిత్రిమూర్తిః ।**
**రఘుపతినుతిజాతానందబాష్పార్ద్రనేత్రః**
**జయతి జగతిసేవ్యస్సంతతం వాయుపుత్రః ॥ 3**

బృహస్పతిసమానుడైన బుద్ధిశాలి యను కీర్తివైభవము, మనసునందు నిలుపుకొన్న సీతారామలక్ష్మణులను ధ్యానించు నిత్యభక్తి, తన రామప్రభువు దివ్యగుణగానానందముతో ఆర్ద్రమైన నేత్రయుగళము కలిగి వెలయుచుండు వాయుపుత్రుడైన హనుమ లోకత్రయారాధ్యుడు.

**అమితజవవిశేషోత్తీర్ణదుర్గాంబురాశిః**
**అతిచతురగవేషజ్ఞాతసీతానివేశః ।**
**శమితజనకజాహృత్తీవ్రసంతాపవహ్నిః**
**జయతి విజయహేతుర్మారుతీ రామభక్తః ॥ 4**

అద్భుతమైన జవసత్త్వములతో మహాసముద్రమును లంఘించి అమిత చాతుర్యముతో సీతామాత ఉనికిని కనుగొని ఆ సాధ్వి మనసునందలి సంతాపాగ్నిని శమింపజేసి స్వామి కార్యవిజయము సాధించినట్టి రామదూత మారుతి – భక్తతతికి విజయప్రదాతయై వెలయుచున్నాడు.

**మథితసుబహురక్షోరక్షితాశోకవన్యః**
**ప్రమథితమదరుంధద్భీకరాక్షాదిదైత్యః ।**
**ప్రశమితదశవక్త్రస్వాంతదుర్దాంతదర్పః**
**జయతి కపివరేణ్యో వీరలోకాగ్రగణ్యః ॥ 5**

ప్రబల రాక్షస సంరక్షణమునందున్న అశోకవనవాటికను విలాసముగా విధ్వంసమొనర్చి, ఎదుర్కొన వచ్చిన అక్షకుమారాది రాక్షసమహావీరులను హతమార్చి దశకంఠుని అకుంఠిత ధైర్యదర్పములను అణచివైచి అద్భుతశౌర్యధుర్యుడుగా విరాజిల్లినట్టి ఘనుడు – కపివర్యుడైన హనుమ!

**స్వహృదయచిరదీప్తం జానకీశోకవహ్నిం**
**సమయసముచితం సంగృహ్య లంకాం సమస్తామ్ ।**
**సదశవదనదర్పం సందదాహాశు యస్సః**
**జయతి పవనజాతో రుద్రతేజఃప్రభూతః ॥ 6**

చిరకాలమునుండి రగులుకొనుచున్నట్టి జానకీదేవి హృదయమునందలి శోకాగ్నిజ్వాలను గ్రహించి వాయుపుత్రుడగు హనుమ వాయుమిత్రుడైన అగ్నిదేవునకు విందు గావించుచు సమస్తలంకాపట్టణమునే గాక లంకాధిపతి మదిలోని మహాదర్పమును గూడ దహించివేసి తన ప్రభువు ఘనతను, తన రుద్రతేజః ప్రభావమును గూడ వెల్లడించి దేవగణములచే కొనియాడబడినట్టి మహిమాఢ్యుడు.

**రణధరణివిశీర్ణం లక్ష్మణం జీవయిత్వా**
**ప్లవగతతిసమేతం రాఘవం రంజయిత్వా ।**
**ప్రముదితరఘునాథాశ్లేషసమ్మానితో యః**
**జయతి స హనుమాన్ శ్రీరామచంద్రాత్మభక్తః ॥ 7**

రణరంగమున సమ్మూర్ఛితుడైనట్టి లక్ష్మణస్వామి ప్రాణసంరక్షణము గావించి సర్వవానరవీరులకును రామప్రభువునకును మహానందమును గలిగించి తత్ఫలితముగా రఘునాథుని గాఢాలింగనభాగ్యము నొందిన హనుమ రామప్రభువున కాత్మీయుడు.

**అతులితబలశాలీ భక్తసంత్రాణశీలీ**
**నిఖిలనిగమవేదీ దీనదుఃఖాపనోదీ ।**
**దురితతతివినాశీ సాధుబుద్ధిప్రకాశీ**
**జయతి సులభసేవ్య స్సుప్రసన్నాంజనేయః ॥ 8**

లోకోత్తరపరాక్రమము, భక్తసంరక్షణదీక్ష, దీనజనకారుణ్యము, సకలపాపపరిహరణము, సద్బుద్ధిప్రదానము, స్మరణమాత్రప్రసన్నత మున్నగు దివ్య ప్రభావములకు నిలయమైన ఆంజనేయస్వామి – సకలజనులకు సులభసేవ్యుడైన పరమదైవము.

**సుందర సుబోధినీ సమర్పకులు**

# స్వీయ నివేదనము

దైవకృపచే ఈ మా సుబోధినీ సమేత సుందరకాండ గ్రంథసంపుటములు నేటికి పూర్తియై మేము కృతకృత్యులమైనాము.

ఈ పవిత్రకృతిని అంకితము గొనుచు మాగురుదేవులు శ్రీరామశరణ మహనీయులు "ఈ కృతిని భక్తసేవ్యముగా లోకమున ప్రకాశింప జేయగలరు." అని చేసిన ఆశీర్వాదమును సఫలము చేసికొన్నాము.

ఇందలి ప్రథమసంపుటము ప్రకటించిననాటి నుండియు పెద్దలును సహృదయ భక్తసోదరులును "మీ ప్రణాళిక సుందరకావ్యమును సుగమము చేయుచున్నది" అని తెలుపుచుండు అభినందనలు మాకు ఎంతయో ఉత్సాహప్రదము లగుచుండినవి.

కాని పరిమితశక్తులు గల మేము మా కోరికను దైవనిర్ణయముగానే ఎంచి ఆనందించుచు యథాశక్తిగా ముందుకు సాగుచుండగా "శ్రేయాంసి బహువిఘ్నాని" అను సూక్తి మాయెడ పూర్తిగ నిజమై మా దీక్షకు అనేక పరీక్షలు ఏర్పడినవి. తత్ ఫలితముగా ఈ సంపుటములను అందించుటలో ఆలస్యము అనివార్యము అగుచుండెను. ఆలస్యమైనను శాశ్వతోపయుక్తమగు ఉత్తమగ్రంథమును లోకమున కర్పింప గలిగినాము అనెడి తృప్తి మాకు లభించినది.

వాల్మీకి రామాయణము నందలి ఈ సుందరకాండమునకు "బీజకాండము" అను ప్రశస్తియున్నదికదా! ఇందలి శ్లోకములన్నియు మంత్రతుల్యములైనవి కావున అందలి పదములనన్నింటిని పునఃపునః ఆవృత్తి చేయుచు మహర్షిముఖపద్మ నిస్సృతమైన రామకథామధువును భక్తకోటికి శుభప్రదమైన రీతిలో సులభప్రాప్యము చేయుట అను మా లక్ష్యము సిద్ధించినది అని మనవి.

మరియు "క్షేమనివేదనము" అను ఈ ఎనిమిదవ సంపుటము ఈ కాండమునకు మకుటాయమానమైనట్టిది. ఇందలి మొదటి సర్గమునందు వెనుకటి కథ అంతయు సంగ్రహముగా తెలుపబడియుండుటచే సంపూర్ణ గ్రంథపఠన లాభము కలుగగలదు. ఇంకను ఇందలి ప్రధానవిషయమైన "క్షేమనివేదనము" ఆనాటి రామలక్ష్మణాదులకు వలెనే నేటి సమస్తభక్తకోటికిని సంతోషకరమును, సంతాపహరమును అగుచు శ్రేయోదాయకము కాగలదు.

అత్యధిక ద్రవ్యసాధ్యమైన ఈ బృహద్గ్రంథ ప్రచురణభాగ్యము భక్తవరదుడైన శ్రీ తిరుమలేశుని కృపావిశేషము వలననే లభ్యమైనదని తెలుపుకొనుచు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానకార్య నిర్వహణాధిపతులకు మా హృదయపూర్వకమైన కృతజ్ఞతా వందనములను అర్పించుచున్నాము.

చివరి మనవిగా – మా ఉత్సాహమునకు తగిన పూర్తి అవకాశములు మాకు లేకపోవుటచే ఈ కృతిలో కనిపించిన లోపములకు విజ్ఞమహాశయులు మమ్ము మన్నింపవలెనని ప్రార్థించుచున్నాము.

ఇట్లు

**సుబోధినీ సమర్పకులు**

## ఆదికావ్య ప్రశంస

**ఏక స్సేవ్యో రామదేవో యథా నః**
**మంతవ్యం త ద్రామవృత్తం తథైవ ।**
**య న్మర్త్యానాం జన్మసాఫల్యకృత్ తత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥** 1

రామప్రభువొక్కడే ఎట్లుగా ఆరాధ్యదైవమై యున్నాడో, అట్లే మనము మననము చేయవలసియున్నది కూడ రామచరిత్ర మొక్కటే. అదియే మనకు జన్మ సాఫల్యము కూర్చునట్టిది కాబట్టి సర్వబుధసేవ్యమై యున్న కావ్యము.

**గైర్వాణీ వాక్ రమ్యతాయా నిధానం**
**శ్రీణాం మూలం చైహికాముష్మికాణామ్ ।**
**య ద్విశ్వస్మిన్ వాఙ్మయే నిస్తులం తత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥** 2

ఈ మహాకావ్యము అమరభాషలోని అందముల నన్నింటిని సంతరించు కొన్నట్టిది. మానవులకు ఐహికాముష్మికశ్రేయముల కన్నింటికి మూలమైనట్టిది మరియు ప్రపంచభాషలన్నింటిలోను సాటిలేని మేటికావ్యమని ఎన్నిక గన్నట్టిది. ఇట్టి విశిష్టకావ్యము సర్వబుధసేవ్యమైనట్టిది కదా!

**పాఠ్యే గేయే ఽత్యంతమాధుర్యపూర్ణం**
**సద్ధర్మాణాం నిర్మలం దర్పణం యత్ ।**
**వాల్మీకీయం దివ్యరామాయణం తత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥** 3

వాల్మీకిమహర్షి తన రామాయణకావ్యమును పఠనమునందును గానము నందును కూడ మధురముగా నుండునట్లుగను, మానవజీవితమునకు వలసిన సర్వధర్మములను విశదము చేయునట్టిదానిగను నిర్మించి యున్నాడు కాబట్టి ఈ మధురమంగళకావ్యము సర్వసుజనసంసేవ్యము.

**ఆదౌ జ్ఞాతం బ్రహ్మణస్సూనునా యత్**
**పశ్చాత్ సాక్షాత్ బ్రహ్మణా ప్రేరితం సత్ ।**
**బ్రాహ్మ్యా దేవ్యా వాక్స్థయా చోదితం తత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥ 4**

ఆదికాలమునందు వాల్మీకి కోరికపై బ్రహ్మమానసపుత్రుడైన నారదుడు ఈ రామచరితమును ఆతనికి తెలియజేసినాడు. పిమ్మట బ్రహ్మయే స్వయముగా సాక్షాత్కరించి ఆతనికి వలసిన శక్తినంతను ప్రసాదించి దీనిని సర్వలోకసేవ్యముగా ప్రకాశింపజేయుమని ప్రోత్సహించినాడు. అట్లే బ్రాహ్మీదేవి వాణి మహర్షివాక్కున నిలచియుండి ఈ భవ్యకావ్యమును వెలయింప జేసినది. కాబట్టి ఈ దివ్యమైన ఆదికావ్యము సర్వలోకసంసేవ్యము.

**వేదై ర్వేద్యో యః పరః పూరుష స్సః**
**స్వేన ప్రేమ్ణా మానవస్సన్ యథా నః ।**
**ఆత్మీయో ఽ భూత్ తత్ క్రమం వక్తి యత్ తత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥ 5**

అవాఙ్మానసగోచరుడుగా వేదప్రతిపాదితుడైన పరమాత్మ తన కృపావిశేషముచే మానవుడుగా మన మధ్య జన్మించి తన ప్రేమను మనకు పంచి ఉత్తమ జీవనమార్గమును చూపిన విధమును తెలుపుచున్నట్టి ఈ భవ్యకావ్యము బుధజనులకు వరప్రసాదముగా నిత్యసేవ్య మైనట్టిది కదా.

**విశ్వశ్రేయఃకామివాల్మీకిమౌనీ**
**సీతారామస్తవ్యగాధాత్మకం యత్ ।**
**ప్రాదా న్న స్తత్ లోకసంవేద్యసారం**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥ 6**

వాల్మీకిమహర్షి చిరతపఃప్రభావముచే తనకు లభించిన దివ్యశక్తిని లోక శ్రేయమునకై వినియోగించి మానవులు గ్రహించవలసిన జ్ఞానమునంతను సీతారాముల పవిత్రచరిత్రరూపమున వెలయించినాడు. అట్టి భవ్యకావ్యము సకలసేవ్యము.

**రామం సీతాం మారుతిం మానవానాం**
**స్వాంతక్షేత్రే స్థాపయిత్వా దృఢం నః ।**
**భక్తిధ్యానజ్ఞానధన్యాన్ వితన్వత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥ 7**

రామదేవుని, సీతామాతను, హనుమత్స్వామిని మానవుల హృదయపీఠము నందు స్థిరముగ నెలకొల్పి వారిని భక్తితత్పరులనుగాను, జ్ఞానసంపన్నులను గాను తీర్చి దిద్దుచున్నట్టి ఈ భవ్యకావ్యము నిఖిలజననిత్యసేవ్యము.

**వ్యాసాద్యై స్తైః కాళిదాసాదిభి శ్చ**
**లోకక్షేమం సాధితం యస్య మార్గాత్ ।**
**స్వీయై రమ్యై ర్వాగ్విలాసై శ్చిరాత్ తత్**
**భవ్యం కావ్యం సేవ్య మాద్యం సుధీభిః ॥ 8**

వేదవ్యాసుని వంటి మహామునులును, కాళిదాసు వంటి మహాకవులును ఏ ఆదికావ్యమును తమకు మార్గదర్శకముగా గ్రహించి పురాణ శ్రవ్య దృశ్యకావ్యాది రూపమున మానవకళ్యాణమును సాధించు కమనీయవచోవిలాసములకు నిలయమైన ఉత్తమవాఙ్మయము నందించుచున్నారో అట్టి ఈ ఉత్కృష్టకావ్యము మనకెల్లరికిని సమస్తసన్మంగళసంధాయక మైనట్టిది.

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామశరణ గురుభ్యో నమః

# శ్రీమద్వాల్మీకి రామాయణము

# సుందర కాండము

## ఏకచత్వారింశసర్గ

**శ్లో॥ స చ వాగ్భిః ప్రశస్తాభిః గమిష్య న్పూజిత స్తయా ।**
**తస్మాద్దేశా దపాక్రమ్య చింతయామాస వానరః ॥ 1**

**పదచ్ఛేదము :–** సః – చ – వాగ్భిః – ప్రశస్తాభిః – గమిష్యన్ – పూజితః – తయా – తస్మాత్ – దేశాత్ – దపాక్రమ్య – చింతయామాస – వానరః ॥

**అన్వయక్రమము :–** సః వానరః తయా ప్రశస్తాభిః వాగ్భిః పూజితః, గమిష్యన్, తస్మాత్ దేశాత్ అపాక్రమ్య చింతయామాస.

**ప్రతిపదార్థము :–** సః వానరః = ఆ హనుమ, తయా = ఆ సీతాదేవిచే, ప్రశస్తాభిః = శ్రేష్ఠములైన, వాగ్భిః = మాటలచే, పూజితః = గౌరవింపబడినవాడై, గమిష్యన్ = వెడలబోవుచు, తస్మాత్ దేశాత్ = ఆ ప్రదేశము నుండి, అపాక్రమ్య = తొలగి, చింతయామాస = ఆలోచింపదొడగెను.

**తాత్పర్యము :–** హనుమ సీతాదేవిచే మంచి మాటలతో సముచితముగా గౌరవింపబడి అటనుండి వెడలిపోవుచు ఆ ప్రదేశము నుండి ప్రక్కకు వెడలి కొలది దూరమున నిలచి ఇట్లు చింతింపసాగెను.

**శ్లో॥ అల్పశేష మిదం కార్యం దృష్టేయ మసితేక్షణా ।**
**త్రీ నుపాయా నతిక్రమ్య చతుర్థ ఇహ దృశ్యతే ॥ 2**

**పదచ్ఛేదము :–** అల్పశేషమ్ – ఇదం – కార్యం – దృష్టా – ఇయం – అసితేక్షణా – త్రీన్ – ఉపాయాన్ – అతిక్రమ్య – చతుర్థః – ఇహ – దృశ్యతే ॥

**అన్వయక్రమము :–** ఇదం కార్యమ్ అల్పశేషమ్; ఇయమ్ అసితేక్షణా దృష్టా; ఇహ త్రీన్ ఉపాయాన్ అతిక్రమ్య చతుర్థః దృశ్యతే.

**ప్రతిపదార్థము :–** ఇదం కార్యం = ఈ కార్యము, అల్పశేషం = కొద్దిగ మిగిలినట్టిది, ఇయం అసితేక్షణా = ఈ సీతాదేవి, దృష్టా = కనబడినది, ఇహ = ఇచ్చట, త్రీన్ ఉపాయాన్ = సామాదులైన మూడు ఉపాయములను, అతిక్రమ్య = మించి, చతుర్థః

= నాల్గవదైన దండోపాయము, దృశ్యతే = కాన్పించుచున్నది.

**తాత్పర్యము :-** ప్రధానకార్యమైన సీతాసందర్శనము ఇప్పటికి సాధింపబడినది. శత్రుబల సందర్శనమనెడి రెండవ చిన్న కార్యము ఇంక మిగిలియున్నది. దానికొఱకు సామదాన భేదములనెడి మూడు ఉపాయములును గాక దండము అనగా యుద్ధము అనెడి నాల్గవ ఉపాయమే ప్రస్తుతము ప్రయోజనకరముగా నాకు గాన్పించుచున్నది.

**శ్లో॥ న సామ రక్షస్సు గుణాయ కల్పతే**
**న దాన మర్థోపచితేషు యుజ్యతే ।**
**న భేదసాధ్యా బలదర్పితా జనాః**
**పరాక్రమ స్త్వేవ మ మేహ రోచతే ॥ 3**

**పదచ్ఛేదము :-** న – సామ – రక్షస్సు – గుణాయ – కల్పతే – న – దానమ్ – అర్థోపచితేషు – యుజ్యతే – న – భేదసాధ్యాః – బలదర్పితాః – జనాః – పరాక్రమః – తు – ఏవ – మమ – ఇహ – రోచతే ॥

**అన్వయక్రమము :-** రక్షస్సు సామ గుణాయ న కల్పతే; అర్థోపచితేషు దానం న యుజ్యతే; బలదర్పితాః జనాః భేదసాధ్యాః న; ఇహ మమ పరాక్రమః ఏవ రోచతే.

**ప్రతిపదార్థము :-** రక్షస్సు = రాక్షసుల విషయమునందు, సామ = సామవచనము, గుణాయ = మంచి కొఱకు, న కల్పతే = ఉపయోగింపదు, అర్థోపచితేషు = ధనముచే సమృద్ధిగాంచియున్న వారి యెడ, దానం = దానము, న యుజ్యతే = ఉపయోగించదు, బలదర్పితాః = బలముచే మదించియున్నట్టి, జనాః = జనులు, భేదసాధ్యాః = భేదోపాయముచే వశపడునట్టి వారు, న = కారు, ఇహ = ఈ సందర్భమున, మమ = నాకు, పరాక్రమః ఏవ = పరాక్రమమే, రోచతే = ఇష్టమగుచున్నది.

**తాత్పర్యము :-** ఈ రాక్షసులయందు సామవచనము ఫలవంతము గాజాలదు. ఐశ్వర్యముతో మదించియున్న ఈ రక్కసుల యెడ దానమను ఉపాయముకూడ పనిచేయదు. ఎవ్వరిని లెక్కచేయని బలగర్వితులైన వీరినడుమ పరస్పరవైరము కల్పించి సాధింపవలసియున్నట్టి భేదోపాయముగూడ ఏమియు పనిచేయదు. అందుచే వీరియెడ చూపవలసినది చివరి ఉపాయమైన యుద్ధమనెడి దండోపాయ మొక్కటియే యని నా నిశ్చయము.

**శ్లో॥ న చాస్య కార్యస్య పరాక్రమా దృతే**
**వినిశ్చయః కశ్చి ది హోపపద్యతే ।**

హతప్రవీరా శ్చ రణే తు రాక్షసాః
కథంచి దీయు ర్య ది హాద్య మార్దవమ్ ॥ 4

**పదచ్ఛేదము** :– న – చ – అస్య – కార్యస్య – పరాక్రమాత్ – ఋతే – వినిశ్చయః – కశ్చిత్ – ఇహ – ఉపపద్యతే – హతప్రవీరాః – చ – రణే – తు – రాక్షసాః – కథంచిత్ – ఈయుః – యత్ – ఇహ – అద్య – మార్దవమ్ ॥

**అన్వయక్రమము** :– ఇహ అస్య కార్యస్య పరాక్రమాత్ ఋతే కశ్చిత్ వినిశ్చయః న ఉపపద్యతే; ఇహ అద్య రణే హతప్రవీరాః రాక్షసాః కథంచిత్ మార్దవమ్ ఈయుః.

**ప్రతిపదార్థము** :– ఇహ = ఇచ్చట, అస్య కార్యస్య = ఈ కార్యమునకు, పరాక్రమాత్ ఋతే = పరాక్రమముగాక, కశ్చిత్ వినిశ్చయః = ఒకానొక నిశ్చయము, న ఉపపద్యతే = తగియుండదు, యత్ = ఏలననగా, ఇహ = ఇచ్చట, అద్య = నేడు, రణే = యుద్ధమునందు, హతప్రవీరాః = చనిపోయిన మహాయోధులు కలిగినట్టి, రాక్షసాః = రక్కసులు, కథంచిత్ = ఎట్లో, మార్దవం = మెత్తబడుటను, ఈయుః = పొందగలరు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణ శిరోమణి** :– రాక్షసాః కథంచిత్ మార్దవమ్ ఈయుః – నేనిప్పుడే విజృంభించి ఈ రాక్షసులలో పెద్దవారిని హతమార్చినచో వారు చేయునదిలేక తమ కార్యమును వదలి, సీతను రామునకు అప్పగించినచో రాక్షసకులవిధ్వంసనము జరుగకుండును గదా యని హనుమ తన దయాస్వభావము నిట్లు వెల్లడించుచున్నాడు.

**తాత్పర్యము** :– నేను సాధింపబోవు కార్యమునకు పరాక్రమము కంటె వేఱైన మార్గమేమియు తగియుండదు. ఈ రాక్షసులలోని మహావీరులు నేడు హతమారినచో మిగిలిన వారైనను క్రౌర్యమును వీడి ఎట్లో సాధుమార్గము నవలంబించవచ్చును.

శ్లో॥ కార్యే కర్మణి నిర్దిష్టే యో బహూ న్యపి సాధయేత్ ।
పూర్వకార్యావిరోధేన స కార్యం కర్తు మర్హతి ॥ 5

**పదచ్ఛేదము** :– కార్యే – కర్మణి – నిర్దిష్టే – యః – బహూని – అపి – సాధయేత్ – పూర్వకార్యావిరోధేన – సః – కార్యం – కర్తుమ్ – అర్హతి ॥

**అన్వయక్రమము** :– నిర్దిష్టే కార్యే కర్మణి యః బహూని అపి పూర్వకార్యావిరోధేన సాధయేత్, సః కార్యం కర్తుమ్ అర్హతి.

**ప్రతిపదార్థము** :– నిర్దిష్టే = నిర్దేశింపబడినట్టి, కార్యే = కర్తవ్యమైనట్టి, కర్మణి =

పనియందు, పూర్వకార్యావిరోధేన = మొదటి కర్తవ్యమునకు విరోధము లేకుండగా, బహూని అపి = పెక్కింటిని గూడ, యః = ఎవడు, సాధయేత్ = నెఱవేర్చునో, సః = ఆతడు, కార్యం = పనిని, కర్తుం = సాధించుటకు, అర్హతి = తగియుండును.

**సూచన :–** కార్యే కర్మణి నిర్దిష్టే – అనుటకు బదులుగా 'కార్యే కర్మణి నిర్వృత్తే' అని పాఠాంతరము. అనగా నిర్ణయింపబడిన కర్తవ్యము పూర్తిగా నిర్వహింపబడిన పిమ్మట అని అర్థము.

**తాత్పర్యము :–** తనకు నిర్దేశింపబడినట్టి కర్తవ్యనిర్వహణమునందు ప్రధానకార్యమునకు విరోధము లేకుండ, ఆ కార్యమునకే పోషకములైనట్టి మఱి పెక్కింటిని గూడ నెవ్వడు సాధింపగల్గునో అట్టి వాడే కార్యనిర్వహణమునకు అర్హుడై యుండును.

**శ్లో॥ న హ్యేక స్సాధకో హేతు స్స్వల్ప స్యాపీహ కర్మణః ।**
**యో హ్యర్థం బహుధా వేద స సమర్థో ఽర్థసాధనే ॥ 6**

**పదచ్ఛేదము :–** న – హి – ఏకః – సాధకః – హేతుః – స్వల్పస్య – అపి – ఇహ – కర్మణః – యః – హి – అర్థం – బహుధా – వేద – సః – సమర్థః – అర్థసాధనే ॥

**అన్వయక్రమము :–** ఇహ స్వల్పస్య కర్మణః అపి సాధకః హేతుః ఏకః న హి; యః అర్థం బహుధా (కర్తుం) వేద, సః అర్థసాధనే సమర్థః హి.

**ప్రతిపదార్థము :–** ఇహ = ఈ లోకమున, స్వల్పస్య = చిన్నదైనట్టి, కర్మణః అపి = పనికిగూడ, సాధకః = సాధించునట్టి, హేతుః = కారణము, ఏకః = ఒక్కటి, న హి = కాదుగదా, యః = ఎవ్వడు, అర్థం = కార్యమును, బహుధా = పెక్కువిధములుగా, (కర్తుం = నిర్వహించుటకు) వేద = తెలిసియుండునో, సః = ఆతడు, అర్థసాధనే = కార్యనిర్వహణమునందు, సమర్థః హి = అర్హుడుగదా!

**తాత్పర్యము :–** లోకమునందు ఎంతచిన్న పనికిని గూడ దానిని సాధించుటకు ఒక్కటే సాధనము అని చెప్పవీలుపడదు. కార్య నిర్వహణమునకు అనేకములు సాధనములు ఉండితీరును. అందుచే ఒక మహాకార్యమును నిర్వహించుటకు పలుమార్గములను ఎవ్వడు ఎఱిగియుండునో ఆతడే మహాకార్యనిర్వహణమునకు సమర్థుడు కాగలడు.

**శ్లో॥ ఇ హైవ తావ త్కృతనిశ్చయో హ్యహం**
**యది వ్రజేయం ప్లవగేశ్వరాలయమ్ ।**

**పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవి**
**త్తతః కృతం స్యా న్మమ భర్తృశాసనమ్ ॥ 7**

**పదచ్ఛేదము** :– ఇహ – ఏవ – తావత్ – కృతనిశ్చయః – హి – అహమ్ – యది – వ్రజేయం – ప్లవగేశ్వరాలయమ్ – పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవిత్ – తతః – కృతం – స్యాత్ – మమ – భర్తృశాసనమ్ ॥

**అన్వయక్రమము** :– ఇహ అద్య ఏవ తావత్ పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవిత్, కృతనిశ్చయః అహం ప్లవగేశ్వరాలయం వ్రజేయం యది, తతః మమ భర్తృశాసనం కృతం స్యాత్.

**ప్రతిపదార్థము** :– ఇహ = ఇచట, అద్య ఏవ = ఇప్పుడే, తావత్ = ముందుగా, పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవిత్ = శత్రువులయొక్కయు మాయొక్కయు బలవిశేషముల వాస్తవరూపమును తెలిసికొన్నవాడనై, కృతనిశ్చయః = చేసికొన్న నిశ్చయము గలవాడనై, అహం = నేను, ప్లవగేశ్వరాలయం = వానరరాజైన సుగ్రీవుని నివాసమును గూర్చి, వ్రజేయం యది = వెడలినయెడల, తతః = ఆ కారణమువలన, మమ = నా యొక్క, భర్తృశాసనం = రాజాజ్ఞ, కృతం = నెఱవేర్పబడినది, స్యాత్ = కాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'పరాత్మసమ్మర్దవిశేషతత్త్వవిత్' నేను శత్రుబలమును గూడ వాస్తవముగా తెలిసికొన్నవాడను గావలయును. లేనిచో శ్రీరాముడును మిగిలిన సుగ్రీవాదులును శత్రుబల మెంతటిదని అడిగినచో నేను నిరుత్తరుడను గావలసియుండునుగదా! అని భావము.

**తాత్పర్యము** :– నేనిప్పుడే ముందుగా సంపూర్ణముగా శత్రువుయొక్క బలాధిక్యము ఎంతటిదో ఆ వాస్తవస్వరూపమును తెలిసికొని నిశ్చయజ్ఞానము సంపాదించి మా వానరరాజు నిలయమునకు వెడలుదును. అట్లు చేయుటవలన మా ప్రభువు ఆజ్ఞను నేను పూర్తిగా నిర్వహించినవాడను కాగలను.

**శ్లో॥ కథం ను ఖ ల్వద్య భవే త్సుఖాగతం**
**ప్రసహ్య యుద్ధం మమ రాక్షసై స్సహ ।**
**తథైవ ఖ ల్వాత్మబలం చ సారవ**
**త్సమ్మానయే న్మాం చ రణే దశాననః ॥ 8**

**పదచ్ఛేదము** :– కథం – ను – ఖలు – అద్య – భవేత్ – సుఖాగతం – ప్రసహ్య –

యుద్ధం – మమ – రాక్షసైః – సహ – తథా – ఏవ – ఖలు – ఆత్మబలం – చ – సారవత్ – సమ్మానయేత్ – మాం – చ – రణే – దశాననః ॥

**అన్వయక్రమము** :– అద్య కథం ను మమ సుఖాగతం భవేత్ ఖలు! రాక్షసైః సహ ప్రసహ్య మమ యుద్ధం (కథం ను భవేత్;) తథా ఏవ దశాననః సారవత్ ఆత్మబలం మాం చ, రణే కథం ను సమ్మానయేత్ ఖలు!

**ప్రతిపదార్థము** :– అద్య = నేడు, కథం = ఎట్లుగా, మమ = నాకు, సుఖాగతం = సుఖకరమైన రాక, భవేత్ ఖలు = కాగలదో, రాక్షసైః సహ = రాక్షసులతోడ, ప్రసహ్య = బలవంతముగా, మమ = నాకు, యుద్ధం = రణము, కథం ను భవేత్ = ఎట్లుగా సంభవించును?, తథా ఏవ = అట్లే, దశాననః = రావణాసురుడు, సారవత్ = శ్రేష్ఠమైన, ఆత్మబలం = తన సైన్యమును, మాం చ = నన్నును, కథం = ఎట్లు, సమ్మానయేత్ ఖలు = గౌరవించునో గదా!

**తాత్పర్యము** :– నేడు ఇచటికి నా రాక సుఖకరమైన ఫలితముగలది ఎట్లు కాగలదో? ఈ రాక్షసులతో బలవంతముగా నాకు యుద్ధమెట్లు సంభవించునో? మఱియు ఈ రావణుడు యుద్ధమునందు సమర్థమైన తన సైన్యము యొక్క బలమును, నా శక్తిని గ్రహించి ఆ రెండింటి తారతమ్యమును గుర్తించి నన్ను ఎట్లు గౌరవించునో గదా!

**శ్లో॥ తత స్సమాసాద్య రణే దశాననం**
**సమంత్రివర్గం సబలప్రయాయినమ్ ।**
**హృది స్థితం తస్య మతం బలం చ వై**
**సుఖేన మత్వాఽహ మితః పున ర్వ్రజే ॥ 9**

**పదచ్ఛేదము** :– తతః – సమాసాద్య – రణే – దశాననం – సమంత్రివర్గం – సబలప్రయాయినమ్ – హృది – స్థితం – తస్య – మతం – బలం – చ – వై – సుఖేన – మత్వా – అహమ్ – ఇతః – పునః – వ్రజే ॥

**అన్వయక్రమము** :– తతః సమంత్రివర్గం, సబలప్రయాయినం దశాననం రణే సమాసాద్య తస్య హృది స్థితం మతం, తస్య బలం చ మత్వా సుఖేన ఇతః పునః వ్రజే.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, సమంత్రివర్గం = మంత్రుల వర్గములతో కూడిన వాడును, సబలప్రయాయినమ్ = సైన్యముతో వెడలిన వాడునగు, దశాననం = రావణుని, రణే = యుద్ధమున, సమాసాద్య = చేరి, తస్య = అతనియొక్క, హృది = మనస్సునందు, స్థితం = ఉన్నట్టి, మతం = అభిప్రాయమును, (తస్య = అతనియొక్క)

బలం చ = శక్తిని, మత్వా = తెలిసికొని, సుఖేన = సుఖముగా, ఇతః = ఇటనుండి, పునః = తిరిగి, వ్రజే = వెడలిపోవుదును.

**తాత్పర్యము :–** యుద్ధము సంభవించిన పిమ్మట రావణాసురుడు తన మంత్రివర్గము తోడను తన యోధులతోడను రణరంగమునకు వచ్చును. అట్లు వచ్చిన ఆ రావణుని ఎదుర్కొని అతని మనస్సునందున్న అభిప్రాయమును, అతని బలవిశేషమును సంపూర్ణముగ గ్రహించి నేను సుఖముగా ఇటనుండి వెడలిపోవుదును గాక!

**శ్లో॥ ఇదమస్య నృశంసస్య నందనోపమ ముత్తమమ్ ।**
**వనం నేత్రమనఃకాంతం నానాద్రుమలతాయుతమ్ ॥ 10**

**పదచ్ఛేదము :–** ఇదమ్ – అస్య – నృశంసస్య – నందనోపమమ్ – ఉత్తమమ్ – వనం – నేత్రమనఃకాంతం – నానాద్రుమలతాయుతమ్ ॥

**అన్వయక్రమము :–** అస్య నృశంసస్య నందనోపమమ్, ఉత్తమం, నానాద్రుమ లతాయుతమ్ ఇదం వనం నేత్రమనఃకాంతం (వర్తతే).

**ప్రతిపదార్థము :–** అస్య నృశంసస్య = ఈ దుర్మార్గునియొక్క, నందనోపమమ్ = నందనవనముతో సాటివచ్చునదియు, ఉత్తమం = శ్రేష్ఠమైనదియును, నానాద్రుమ లతాయుతమ్ = పలువృక్షములతోడను తీగలతోడను కూడినదియు నగు, ఇదం వనం = ఈ వనము, నేత్రమనఃకాంతం = నేత్రములకును మనస్సునకు రమణీయమై, (వర్తతే = ఉన్నది).

**తాత్పర్యము :–** ఈ దుర్మార్గునియొక్క ఈ వనము స్వర్గమునందలి నందనవనమును బోలి, బహువిధ వృక్షములతోడను, లతలతోడను వెలయుచు కన్నులకును మనస్సునకును గూడ గొప్ప వేడుక గూర్చు చున్నది.

**శ్లో॥ ఇదం విధ్వంసయిష్యామి శుష్కం వనమివానలః ।**
**అస్మి న్భగ్నే తతః కోపం కరిష్యతి దశాననః ॥ 11**

**పదచ్ఛేదము :–** ఇదం – విధ్వంసయిష్యామి – శుష్కం – వనమ్ – ఇవ – అనలః – అస్మిన్ – భగ్నే – తతః – కోపం – కరిష్యతి – దశాననః ।

**అన్వయక్రమము :–** శుష్కం వనమ్ అనలః ఇవ ఇదమ్ అహం విధ్వంసయిష్యామి; అస్మిన్ భగ్నే (సతి) తతః దశాననః కోపం కరిష్యతి.

**ప్రతిపదార్థము :–** శుష్కం = ఎండిపోయినట్టి, వనం = వనమును, అనలః ఇవ = అగ్నివలె, ఇదం = ఈ వనమును, అహం = నేను, విధ్వంసయిష్యామి = ధ్వంసము

గావింతును, అస్మిన్ = ఈ వనము, భగ్నే (సతి) = ధ్వంసముకాగా, తతః = పిమ్మట, దశాననః = రావణుడు, కోపం కరిష్యతి = కోపగించును.

**తాత్పర్యము** :– నేనిప్పుడీ వనమును ఎండిపోయియున్న అడవిని అగ్నిహోత్రుడు దహించునట్లుగా ధ్వంసము గావించెదను. రావణాసురుడు ఈ ధ్వంసమును గూర్చి విని తప్పక మిక్కిలి క్రోధము నొందును.

**శ్లో॥ తతో మహ త్సాశ్వమహారథద్విపం**
**బలం సమాదేక్ష్యతి రాక్షసాధిపః ।**
**త్రిశూలకాలాయసపట్టిసాయుధం**
**తతో మహ ద్యుద్ధ మిదం భవిష్యతి ॥ 12**

**పదచ్ఛేదము** :– తతః – మహత్ – సాశ్వమహారథద్విపం – బలం – సమాదేక్ష్యతి – రాక్షసాధిపః – త్రిశూలకాలాయసపట్టిసాయుధం – తతః – మహత్ – యుద్ధమ్ – ఇదం – భవిష్యతి ॥

**అన్వయక్రమము** :– తతః రాక్షసాధిపః సాశ్వమహారథద్విపం, త్రిశూలకాలాయస పట్టిసాయుధం, మహత్ బలం సమాదేక్ష్యతి; తతః ఇదం మహత్ యుద్ధం భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, రాక్షసాధిపః = రాక్షసరాజు, సాశ్వమహారథ ద్విపం = గుఱ్ఱములతోడను, పెద్దరథములతోడను; ఏనుగులతోడను, కూడినదియు, త్రిశూలకాలాయసపట్టిసాయుధం = త్రిశూలములను, నల్లని ఉక్కుకత్తులను, ఆయుధములుగా కలిగినట్టిదియు నగు, మహత్ బలం = గొప్పదైన సైన్యమును, సమాదేక్ష్యతి = ఆజ్ఞాపించును, తతః = ఆ కారణమున, ఇదం = ఇది, మహత్ యుద్ధం = గొప్ప యుద్ధము, భవిష్యతి = సంభవింపగలదు.

**తాత్పర్యము** :– అట్లు కోపించినట్టి రాక్షసరాజు వెంటనే గుఱ్ఱములతోడను రథముల తోడను మదగజముల తోడను కూడి త్రిశూలములు ఖడ్గములు మున్నగు ఆయుధములు బూనినట్టి గొప్పదైన తనసైన్యమును బంపి నన్ను బంధింపుడని ఆజ్ఞాపించును. అప్పుడు అచ్చట గొప్పదైన యుద్ధము సంభవించును.

**శ్లో॥ అహం తు తై స్సంయతి చండవిక్రమైః**
**సమేత్య రక్షోభి రసహ్యావిక్రమః ।**
**నిహత్య త ద్రావణచోదితం బలం**
**సుఖం గమిష్యామి కపీశ్వరాలయమ్ ॥ 13**

**పదచ్ఛేదము** :– అహం – తు – తైః – సంయతి – చండవిక్రమైః – సమేత్య – రక్షోభిః – అసహ్యవిక్రమః – నిహత్య – తత్ – రావణచోదితం – బలం – సుఖం – గమిష్యామి – కపీశ్వరాలయమ్ ॥

**అన్వయక్రమము** :– అసహ్యవిక్రమః అహం తు సంయతి చండవిక్రమైః తైః రక్షోభిః సమేత్య రావణచోదితం తత్ బలం నిహత్య సుఖం కపీశ్వరాలయం గమిష్యామి.

**ప్రతిపదార్థము** :– అసహ్యవిక్రమః = సహింప శక్యముగాని పరాక్రమముగల్గినట్టి, తైః రక్షోభిః = ఆ రాక్షసులతో, సమేత్య = కూడి, రావణచోదితం = రావణునిచే ప్రేరేపింపబడినట్టి, తత్ బలం = ఆ సైన్యమును, నిహత్య = తునుమాడి, సుఖం = సుఖముగా, కపీశ్వరాలయం = వానరరాజు భవనమునకు, గమిష్యామి = పోవుదును.

**తాత్పర్యము** :– శత్రువులు భరింపశక్యముగాని పరాక్రమము గల్గిన నే నా యుద్ధమునందు భయంకరపరాక్రమముతో పోరాడుచున్నట్టి ఆ రాక్షసులకు ఎదురునిలచి, రావణుడు పంపిన ఆ సైన్యమునంతను నేలగూల్చి సుఖముగా వానరరాజు నిలయమునకు చేరుకొందును.

**శ్లో॥ తతో మారుతవ త్క్రుద్ధో మారుతి ర్భీమవిక్రమః ।**
**ఊరువేగేన మహతా ద్రుమాన్ క్షేప్తుమ థారభత్ ॥ 14**

**పదచ్ఛేదము** :– తతః – మారుతవత్ – క్రుద్ధః – మారుతిః – భీమవిక్రమః – ఊరువేగేన – మహతా – ద్రుమాన్ – క్షేప్తుమ్ – అథ – ఆరభత్ ॥

**అన్వయక్రమము** :– తతః భీమవిక్రమః మారుతిః క్రుద్ధః మారుతవత్ అథ మహతా ఊరువేగేన ద్రుమాన్ క్షేప్తుమ్ ఆరభత్.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, భీమవిక్రమః = భయంకరపరాక్రముడైన, మారుతిః = హనుమ, క్రుద్ధః = క్రోధమునొందిన, మారుతవత్ = ప్రభంజనమువలె, అథ = పిమ్మట, మహతా = గొప్పదైన, ఊరువేగేన = తోడలవేగముతో, ద్రుమాన్ = వృక్షములను, క్షేప్తుమ్ = విసరుటకు, ఆరభత్ = మొదలిడెను.

**తాత్పర్యము** :– ఇట్లు ఆలోచించిన పిమ్మట ప్రచండపరాక్రమముగలవాడైన ఆ వాయునందనుడు ప్రభంజనమువలె విజృంభించి భీకరమైన తన తొడల వేగముతో ఆ వనమునందలి వృక్షములను విసరివేయ నారంభించెను.

**శ్లో॥ తతస్తు హనుమా న్వీరో బభంజ ప్రమదావనమ్ ।**
**మత్తద్విజసమాఘుష్టం నానాద్రుమలతాయుతమ్ ॥ 15**

**పదచ్ఛేదము :–** తతః – తు – హనుమాన్ – వీరః – బభంజ – ప్రమదావనమ్ – మత్తద్విజసమాఘుష్టం – నానాద్రుమలతాయుతమ్ ॥

**అన్వయక్రమము :–** తతః వీరః హనుమాన్ మత్తద్విజసమాఘుష్టం నానాద్రుమ లతాయుతం ప్రమదావనం బభంజ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, వీరః = వీరుడైనట్టి, హనుమాన్ = హనుమ, మత్తద్విజసమాఘుష్టం = మదించిన పక్షులచే రొదచేయబడుచున్నదియును, నానాద్రుమలతాయుతం = బహువృక్షములతోడను, తీగలతోడను గూడినదియునగు, ప్రమదావనం = ఉద్యానవనమును, బభంజ = ధ్వంసముచేసెను.

**తాత్పర్యము :–** పిమ్మట మహావీరుడైన ఆ హనుమ మదించిన పక్షుల కోలాహలముతో గూడి బహువిధములగు వృక్షములతోను లతలతోను నిండియున్న ఆ యుద్యానవనము నంతను ధ్వంసము చేసివేసెను.

**శ్లో॥ తద్వనం మథితై ర్వృక్షై ర్భిన్నై శ్చ సలిలాశయైః ।**
**చూర్ణితైః పర్వతాగ్రైశ్చ బభూ వాప్రియదర్శనమ్ ॥ 16**

**పదచ్ఛేదము :–** తత్ – వనం – మథితైః – వృక్షైః – భిన్నైః – చ – సలిలాశయైః – చూర్ణితైః – పర్వతాగ్రైః చ – బభూవ – అప్రియదర్శనమ్ ॥

**అన్వయక్రమము :–** తత్ వనం మథితైః వృక్షైః భిన్నైః సలిలాశయైః చ, చూర్ణితైః పర్వతాగ్రైః చ అప్రియదర్శనం బభూవ.

**ప్రతిపదార్థము :–** తత్ వనం = ఆ వనము, మథితైః = విఱిచివేయబడిన, వృక్షైః = వృక్షములతోడను, ప్రభిన్నైః = తెగగొట్టబడిన, సలిలాశయైః = జలాశయములతోడను, చూర్ణితైః = నుగ్గుగా చేయబడిన, పర్వతాగ్రైః చ = గిరిశిఖరములతోడను, అప్రియదర్శనం = చూచుటకు అప్రియమైనదిగా, బభూవ = ఆయెను.

**తాత్పర్యము :–** అప్పుడా వనము విఱుగగొట్టిన చెట్లతోను తెగిన గట్టులు గల తటాకముల తోడను ముక్కలు ముక్కలుగా చేసిన పర్వతశిఖరములతోను చూచుట కెంతయో బీభత్సముగా నుండెను.

**శ్లో॥ నానాశకుంతవిరుతైః ప్రభిన్నై స్సలిలాశయైః ।**
**తామ్రైః కిసలయైః క్లాంతైః క్లాంతద్రుమలతాయుతమ్ ॥**
**న బభౌ త ద్వనం తత్ర దావానలహతం యథా ।**
**వ్యాకులావరణా రేజు ర్విహ్వలా ఇవ తా లతాః ॥ 17**

**పదచ్ఛేదము** :– నానాశకుంతవిరుతైః – ప్రభిన్నైః – సలిలాశయైః – తామ్రైః – కిసలయైః – క్లాంతైః – క్లాంతద్రుమలతాయుతమ్ – న – బభౌ – తత్ – వనం – తత్ర – దావానలహతం – యథా – వ్యాకులావరణాః – రేజుః – విహ్వలాః – ఇవ – తాః – లతాః ॥

**అన్వయక్రమము** :– నానాశకుంతవిరుతైః ప్రభిన్నైః సలిలాశయైః క్లాంతైః తామ్రైః కిసలయైః, క్లాంతద్రుమలతాయుతం, తద్వనం దావానలహతం యథా న బభౌ; తత్ర వ్యాకులావరణాః తాః లతాః విహ్వలాః (స్త్రియః ఇవ) రేజుః.

**ప్రతిపదార్థము** :– నానాశకుంతవిరుతైః = వివిధములగు పక్షుల కూతలచేతను, ప్రభిన్నైః = తెగిపోయినట్టి, సలిలాశయైః = తటాకములతోడను, క్లాంతైః = వాడిపోయినట్టి, తామ్రైః = ఎఱ్ఱనైనట్టి, కిసలయైః = చిగుళ్ళతోడను, క్లాంతద్రుమ లతాయుతం = వాడిపోయినచెట్ల తోడను తీగలతోడను కూడినట్టి, తద్వనం = ఆ వనము, దావానలహతం యథా = కారుచిచ్చుచే ధ్వంసమైనదివలె, న బభౌ = ప్రకాశింప కుండెను, తత్ర = ఆ వనమునందు, వ్యాకులావరణాః = చెదిరిపోయిన కంచెలు గలిగినట్టి, తాః లతాః = ఆ తీగలు, విహ్వలాః = భయచకితురాండ్రైన, (స్త్రియః ఇవ = అబలలవలె) రేజుః = ప్రకాశించినవి.

**తాత్పర్యము** :– వివిధములగు పక్షుల కూతలతోను, తెగిపోయిన గట్టులుగల జలాశయములతోను, వాడిపోయిన ఎఱ్ఱని చిగుళ్ళతోను, వాడిపోయిన చెట్లతోను, తీగలతోను ఆ వనమంతయు కారుచిచ్చుచే దహింపబడినట్లు వెల వెల బోవుచుండెను. అచ్చటి కంచెలు అన్నియు చెడిపోగా ఆ పూలతీగలు భయముతో హడలిపోవుచున్న అబలవలె కనబడినవి.

**శ్లో॥ లతాగృహై శ్చిత్రగృహై శ్చ నాశితై**
**ర్మహోరగై ర్వ్యాళమృగై శ్చ నిర్ధుతైః ।**
**శిలాగృహై రున్మథితై స్తథా గృహైః**
**ప్రణష్టరూపం త దభూ న్మహ ద్వనమ్ ॥** 18

**పదచ్ఛేదము** :– లతాగృహైః – చిత్రగృహైః – చ – నాశితైః – మహోరగైః – వ్యాళమృగైః – చ – నిర్ధుతైః – శిలాగృహైః – ఉన్మథితైః – తథా – గృహైః – ప్రణష్టరూపం – తత్ – అభూత్ – మహత్ – వనమ్ ॥

**అన్వయక్రమము** :– నాశితైః లతాగృహైః చిత్రగృహైః చ నిర్ధుతైః మహోరగైః వ్యాళమృగైః చ తథా ఉన్మథితైః శిలాగృహైః చ తత్ మహద్వనం ప్రణష్టరూపమ్ అభూత్.

**ప్రతిపదార్థము :–** నాశితైః = ధ్వంసముచేయబడినట్టి, లతాగృహైః = పొదరిండ్లతోడను, చిత్రగృహైః చ = చిత్రమందిరములతోడను, నిర్ధుతైః = తఱుమబడినట్టి, మహోరగైః = మహాసర్పములతోడను, వ్యాళమృగైః = క్రూరమృగములతోడను, ఉన్మథితైః = విఱుగగొట్టబడినట్టి, శిలాగృహైః = ఱాతిభవనములతోడను, తథా = అట్లే, గృహైః = సామాన్యమైన ఇండ్లతోడను, తత్ మహత్ వనం = ఆ గొప్పదైనట్టి వనము, ప్రణష్టరూపం = చెడిపోయినట్టి రూపముగలదిగ, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము :–** గొప్పదైన ఆ వనమంతయు ధ్వంసమైయున్న పొదరిండ్లతోను, విలాస భవనములతోను, తఱుమగొట్టిన మహాసర్పములతోను, క్రూరమృగములతోను, విఱిగిపోయిన శిలాభవనములతోను, సామాన్యగృహములతోను పూర్తిగా చెడిపోయి శోభావిహీనమై యుండెను.

**శ్లో॥ సా విహ్వాలాశోకలతాప్రతానా**
**వనస్థలీ శోకలతాప్రతానా ।**
**జాతా దశాస్యప్రమదావనస్య**
**కపే ర్బలా ద్ధి ప్రమదావనస్య ॥ 19**

**పదచ్ఛేదము :–** సా – విహ్వాలాశోకలతాప్రతానా – వనస్థలీ – శోకలతాప్రతానా – జాతా – దశాస్యప్రమదావనస్య – కపేః – బలాత్ – హి – ప్రమదావనస్య ॥

**అన్వయక్రమము :–** ప్రమదావనస్య దశాస్యప్రమదావనస్య విహ్వాలాశోకలతాప్రతానా వనస్థలీ, కపేః బలాత్ శోకలతాప్రతానా జాతా.

**ప్రతిపదార్థము :–** ప్రమదావనస్య = స్త్రీలకు రక్షణమైనట్టి, దశాస్యప్రమదావనస్య = రావణుని ఉద్యానవనముయొక్క, విహ్వాలాశోకలతాప్రతానా = చెదిరిపోయిన అశోకలతల సమూహము గలిగినట్టి, వనస్థలీ = వనభూమి, కపేః = హనుమయొక్క, బలాత్ = బలమువలన, శోకలతాప్రతానా = శోకమనెడి తీగల సమూహము గలదిగా, జాతా = ఆయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** "శోకలతాప్రతానా" – రలయోః అభేదః అనుటచే శోకరతమైన అనగా వాడిపోయినట్టి, అప్రుతానా – నీటియందు విస్తరించినట్టి తామరలు కలువలు మున్నగునది గలిగినట్టిది అనగా వాడిపోయిన తామరపువ్వులు మున్నగునవి గలిగినట్టిది. దశాస్యప్రమదావనస్య – రావణుడు కాపాడుచున్న సీతకు నివాసమైనట్టి,

వనస్థలీ – అశోకవనభూమి.

**తిలకము :–** దశాస్యప్రమదావనస్య – రావణుని స్త్రీలకు కామసంవర్ధనమును గూర్చుచు రక్షకమై యుండునట్టిదని అశోకవనమునకు విశేషణము. వనస్థలీ – తృణములు, గుల్మములు, లతలు, జలాశయములు అనువానితో గూడిన రమ్య వనభూమి యని భావము.

శోకలతాప్రతానా – చూచువారి మనస్సునకు శోకము జనింపజేయునట్టిది.

**తాత్పర్యము :–** సీతాదేవి నివసించుచున్నట్టి ఆ రావణుని ప్రమదావనమున అశోకలతలు అన్నియు చెదరిపోయినవై ఆ వనభూమియందు హనుమ గావించిన విధ్వంసకృత్యమువలన వెనుకటి అశోకవన మిప్పుడు శోకవనము అయినది.

**శ్లో॥ స తస్య కృత్వార్థపతే ర్మహాకపి**
**ర్మహ ద్వ్యలీకం మనసో మహాత్మనః ।**
**యుయుత్సు రేకో బహుభి ర్మహాబలైః**
**శ్రియా జ్వలం స్తోరణ మాశ్రితః కపిః ॥ 20**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"ప్రమదావనభంజనం" నామ*
*ఏకచత్వారింశస్సర్గః*

**పదచ్ఛేదము :–** సః – తస్య – కృత్వా – అర్థపతేః – మహాకపిః – మహత్ – వ్యలీకం – మనసః – మహాత్మనః – యుయుత్సుః – ఏకః – బహుభిః – మహాబలైః – శ్రియా – జ్వలన్ – తోరణమ్ – ఆశ్రితః – కపిః ॥

**అన్వయక్రమము :–** సః మహాకపిః తస్య అర్థపతేః, మహాత్మనః మనసః మహత్ వ్యలీకం కృత్వా మహాబలైః బహుభిః ఏకః యుయుత్సుః, శ్రియా జ్వలన్ తోరణమ్ ఆశ్రితః.

**ప్రతిపదార్థము :–** సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, తస్య = ఆ, అర్థపతేః = ఐశ్వర్యవంతుడైన, మహాత్మనః = మహనీయుడైన రావణునియొక్క, మనసః = మనస్సునకు, మహత్ = గొప్పదైన, వ్యలీకం = అప్రియమును, కృత్వా = చేసి, మహాబలైః = గొప్పబలశాలురైన, బహుభిః = పెక్కుమందితో, ఏకః = ఒంటరియై, యుయుత్సుః = యుద్ధము చేయగోరినవాడై, శ్రియా = శోభతో, జ్వలన్ =

ప్రజ్వలించుచు, తోరణం = బహిర్ద్వారమును, ఆశ్రితః = ఆశ్రయించెను.

**తాత్పర్యము** :- అప్పు డా వానరశ్రేష్ఠుడైన హనుమ, మహైశ్వర్యముతోను, అధికారముతోను విఱ్ఱవీగుచున్నట్టి రావణుని హృదయమునకు గొప్పవేదనను కలిగింపగోరి అచ్చటనున్న అసంఖ్యాకులైన మహావీరులతో తాను ఒక్కడే తన పరాక్రమమును వెలయించుచు పోరుసలుప దలచినవాడై అద్వితీయమైన పరాక్రమాతిశయముతో శోభిల్లుచుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"ప్రమదావన భంజనము" అను*
*నలుబదియొకటవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## ద్విచత్వారింశసర్గ

**శ్లో॥ తతః పక్షినినాదేన వృక్షభంగస్వనేన చ ।**
**బభూవు స్త్రాససంభ్రాంతా స్సర్వే లంకానివాసినః ॥ 1**

**పదచ్ఛేదము :-** తతః - పక్షినినాదేన - వృక్షభంగస్వనేన - చ - బభూవుః - త్రాససంభ్రాంతాః - సర్వే - లంకానివాసినః ॥

**అన్వయక్రమము :-** తతః పక్షినినాదేన, వృక్షభంగస్వనేన చ లంకానివాసినః సర్వే త్రాససంభ్రాంతాః బభూవుః.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, పక్షినినాదేన = పక్షులధ్వనిచేతను, వృక్షభంగ స్వనేన చ = వృక్షములు విఱుగుటయొక్క శబ్దముచేతను, లంకానివాసినః = లంకలో నివసించునట్టి, సర్వే = ఎల్లరును, త్రాససంభ్రాంతాః = భయముచేత చకితులు, బభూవుః = అయిరి.

**తాత్పర్యము :-** అప్పుడు ఆ వనమునందలి పక్షులు భయముతో చేయు రొదలచేతను, చెట్లు విఱుగుచున్నప్పుడు కలిగిన ధ్వనులచేతను, లంకానివాసులైన రక్కసు లెల్లరును భయవిహ్వలురయిరి.

**శ్లో॥ విద్రుతాశ్చ భయత్రస్తా వినేదు ర్మృగపక్షిణః ।**
**రక్షసాం చ నిమిత్తాని క్రూరాణి ప్రతిపేదిరే ॥ 2**

**పదచ్ఛేదము :-** విద్రుతాః - చ - భయత్రస్తాః - వినేదుః - మృగపక్షిణః - రక్షసాం - చ - నిమిత్తాని - క్రూరాణి - ప్రతిపేదిరే ॥

**అన్వయక్రమము :-** మృగపక్షిణః భయత్రస్తాః విద్రుతాః వినేదుః చ. రక్షసాం క్రూరాణి నిమిత్తాని ప్రతిపేదిరే.

**ప్రతిపదార్థము :-** మృగపక్షిణః = మృగములును పక్షులును, భయత్రస్తాః = భయపీడితములై, విద్రుతాః = పరుగెత్తుచున్నవై, వినేదుః చ = అఱచినవి కూడను, రక్షసాం = రాక్షసులకు, క్రూరాణి = ఘోరములైనట్టి, నిమిత్తాని చ = శకునములుగూడ,

ప్రతిపేదిరే = సంభవించినవి.

**తాత్పర్యము :–** అచ్చట జంతువులును పక్షులును భయచకితములై నలుమూలలకును పరుగిడుచు అఱచుట ప్రారంభించినవి. అప్పుడు రాక్షసులకు దారుణములైన ఎన్నో అపశకునములు గూడ సంభవించినవి.

**శ్లో॥ తతో గతాయాం నిద్రాయాం రాక్షస్యో వికృతాననాః ।**
**తద్వనం దదృశు ర్భగ్నం తం చ వీరం మహాకపిమ్ ॥ 3**

**పదచ్ఛేదము :–** తతః – గతాయాం – నిద్రాయాం – రాక్షస్యః – వికృతాననాః – తత్ – వనం – దదృశుః – భగ్నం – తం – చ – వీరం – మహాకపిమ్ ॥

**అన్వయక్రమము :–** తతః నిద్రాయాం గతాయాం (సత్యాం) రాక్షస్యః వికృతాననాః (సత్యః) భగ్నం తద్వనం, వీరం తం మహాకపిం చ దదృశుః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, నిద్రాయాం = నిద్ర, గతాయాం (సత్యాం) = తొలగిపోవగా, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, వికృతాననాః (సత్యః) = వికారముపొందిన ముఖములు గలవారై, భగ్నం = ధ్వంసమైయున్న, తద్వనం = ఆ వనమును, వీరం = వీరుడైన, తం మహాకపిం చ = ఆ వానరశ్రేష్ఠుని కూడ, దదృశుః = చూచిరి.

**తాత్పర్యము :–** అప్పుడచ్చటి రాక్షసస్త్రీలు ఆ భయంకరశబ్దములచే నిద్ర తొలగిపోవగా, భయముచే వికారములయిన ముఖములతో, విధ్వంసమైయున్న తమ వనమును, మహావీరుడై అచట నిలచి యున్న హనుమను చూచిరి.

**శ్లో॥ స తా దృష్ట్వా మహాబాహు ర్మహాసత్త్వో మహాబలః ।**
**చకార సుమహ ద్రూపం రాక్షసీనాం భయావహమ్ ॥ 4**

**పదచ్ఛేదము :–** సః – తాః – దృష్ట్వా – మహాబాహుః – మహాసత్త్వః – మహాబలః – చకార – సుమహత్ – రూపం – రాక్షసీనాం – భయావహమ్ ॥

**అన్వయక్రమము :–** మహాబాహుః, మహాసత్త్వః, మహాబలః సః తాః దృష్ట్వా రాక్షసీనాం భయావహం సుమహత్ రూపం చకార.

**ప్రతిపదార్థము :–** మహాబాహుః = గొప్పవైన బాహువులు గలవాడును, మహాసత్త్వః = గొప్పదైన శక్తిగలవాడును, మహాబలః = మహాబలము గలవాడునగు ఆ హనుమ, తాః = ఆ రాక్షసస్త్రీలను, దృష్ట్వా = చూచి, రాక్షసీనాం = రాక్షసస్త్రీలకు, భయావహం = భయంకరమైనట్టి, సుమహత్ = మిక్కిలిగొప్పదైనట్టి, రూపం = ఆకారమును, చకార = చేసెను.

**తాత్పర్యము** :– ఆజానుబాహుడును అమితసత్త్వసంపన్నుడును మహాబలాఢ్యుడును అగు ఆ హనుమ ఆ రాక్షసస్త్రీలను గాంచి వారు జడిసికొనునట్లుగా గొప్పదైన భీకరాకారమును ధరించెను.

**శ్లో॥ తత స్తం గిరిసంకాశ మతికాయం మహాబలమ్ ।**
**రాక్షస్యో వానరం దృష్ట్వా పప్రచ్ఛుర్జనకాత్మజామ్ ॥ 5**

**పదచ్ఛేదము** :– తతః – తం – గిరిసంకాశమ్ – అతికాయం – మహాబలమ్ – రాక్షస్యః – వానరం – దృష్ట్వా – పప్రచ్ఛుః – జనకాత్మజామ్ ॥

**అన్వయక్రమము** :– తతః గిరిసంకాశమ్, అతికాయం, మహాబలం వానరం దృష్ట్వా రాక్షస్యః జనకాత్మజాం పప్రచ్ఛుః.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, గిరిసంకాశం = పర్వతమును బోలినవాడును, అతికాయం = గొప్పదైన శరీరముగలవాడును, మహాబలం = గొప్పదైన బలము గలవాడు నగు, తం వానరం = ఆ వానరుని, దృష్ట్వా = చూచి, రాక్షస్యః = రాక్షస వనితలు, జనకాత్మజాం = జానకీదేవిని, పప్రచ్ఛుః = అడిగిరి.

**తాత్పర్యము** :– అప్పుడు పర్వతమువలె పెద్దదైన శరీరము కలిగి మహాబలాఢ్యుడై యున్న ఆ వానరశ్రేష్ఠుని జూచి ఆ రాక్షసస్త్రీలు జానకీదేవిని ఈ రీతిగా ప్రశ్నింపదొడగిరి.

**శ్లో॥ కోఽయం కస్య కుతో వాఽయం కిన్నిమిత్త మిహాగతః ।**
**కథం త్వయా సహానేన సంవాదః కృత ఇత్యుత ॥ 6**

**పదచ్ఛేదము** :– కః – అయం – కస్య – కుతః – వా – అయం – కింనిమిత్తమ్ – ఇహ – ఆగతః, కథం – త్వయా – సహ – అనేన – సంవాదః – కృతః – ఇతి – ఉత ॥

**అన్వయక్రమము** :– అయం కః? కస్య అయమ్? కింనిమిత్తమ్ ఇహ కుతః ఆగతః? త్వయా సహ అనేన కథమ్ ఉత సంవాదః కృతః? ఇతి.

**ప్రతిపదార్థము** :– అయం = ఈతడు, కః = ఎవ్వడు? కస్య = ఎవనియొక్క (సంబంధము గలవాడు)? అయం = ఈతడు, కింనిమిత్తం = ఎందునిమిత్తమై, ఇహ = ఇచ్చటికి, కుతః = ఎచ్చటినుండి, ఆగతః = వచ్చియున్నాడు? త్వయా సహ = నీతోగూడ, అనేన = వీనిచే, కథమ్ ఉత = ఎట్లుగాను, సంవాదః = సంభాషణము, కృతః = చేయబడినదో, ఇతి = అని, (పప్రచ్ఛుః = అడిగిరి).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– అనేన కథం సంవాదః త్వయా కృతః – హనుమత్ సీతా సంభాషణము జరుగుచున్నప్పు డీ రాక్షసస్త్రీలు నిద్రించియే యుండిరి. వనభంగధ్వని వినియే మేల్కొనిరి.

**తాత్పర్యము** :– ఈతడు ఎవ్వడు? ఎవనికి సంబంధించినవాడు? ఎచ్చటినుండి వచ్చినవాడు? ఈత డిచ్చటి కెందునిమిత్తమై వచ్చినాడు? నీతోగూడ ఈతడు ఎట్లుగా మఱియు ఏమని సంభాషించినాడు? అని ఆతని వివరములన్నియు అడుగసాగిరి.

**శ్లో॥ ఆచక్ష్వ నో విశాలాక్షి మా భూత్తే సుభగే భయమ్ ।**
**సంవాద మసితాపాంగే త్వయా కిం కృతవా నయమ్ ॥ 7**

**పదచ్ఛేదము** :– ఆచక్ష్వ – నః – విశాలాక్షి – మా – భూత్ – తే – సుభగే – భయమ్ – సంవాదమ్ – అసితాపాంగే – త్వయా – కిం – కృతవాన్ – అయమ్ ॥

**అన్వయక్రమము** :– విశాలాక్షి! నః ఆచక్ష్వ; సుభగే! తే భయం మా భూత్; అసితాపాంగే! అయం త్వయా కిం సంవాదం కృతవాన్?

**ప్రతిపదార్థము** :– విశాలాక్షి = విశాలమైన కన్నులు గల ఓ సుందరాంగీ! నః = మాకు, ఆచక్ష్వ = చెప్పుము. సుభగే = ఓ సౌభాగ్యవతీ, తే = నీకు, భయం = భీతి, మా భూత్ = లేకుండుగాక, అసితాపాంగే = నల్లని కనుగొనలుగల ఓ రమణీ, అయం = ఈతడు, త్వయా = నీతో, కిం సంవాదం = ఏమి సంభాషణమును, కృతవాన్ = చేసియున్నాడు?

**తాత్పర్యము** :– ఓ సుందరీ! మాకు స్పష్టముగా తెలుపుము. నీ కేమియు భయ మక్కఱ లేదు. ఆతడు నీతో ఏమి సంభాషణము గావించినాడు?

**శ్లో॥ అథాబ్రవీ న్మహాసాధ్వీ సీతా సర్వాంగసుందరీ ।**
**రక్షసాం భీమరూపాణాం విజ్ఞానే మమ కా గతిః ॥ 8**

**పదచ్ఛేదము** :– అథ – అబ్రవీత్ – మహాసాధ్వీ – సీతా – సర్వాంగసుందరీ – రక్షసాం – భీమరూపాణాం – విజ్ఞానే – మమ – కా – గతిః ॥

**అన్వయక్రమము** :– అథ సర్వాంగసుందరీ, మహాసాధ్వీ సీతా అబ్రవీత్, భీమరూపాణాం రక్షసాం విజ్ఞానే మమ కా గతిః ?

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, సర్వాంగసుందరీ = సర్వాంగసౌందర్యముగల,

మహాసాధ్వీ = పరమపతివ్రతయైన, సీతా = సీతాదేవి, అబ్రవీత్ = పలికెను, కామరూపాణాం = కామరూపులైయుండు, రక్షసాం = రక్కసులయొక్క, విజ్ఞానే = వివరము తెలియుటయందు, మమ = నాకు, కా గతిః (అస్తి) = ఏమి శక్తియున్నది?

**తాత్పర్యము :-** రాక్షసస్త్రీల ప్రశ్నమునకు సీతాసాధ్వి ఈ రీతిగ సమాధానము చెప్పెను. కామరూపులై యుండు రాక్షసుల చర్యలు తెలిసికొనుటకు నాకేమి శక్తి యున్నది?

**శ్లో॥ యూయమేవాభిజానీత యో౽యం యద్వా కరిష్యతి ।**
**అహి రేవ హ్యహేః పాదా న్విజానాతి న సంశయః ॥ 9**

**పదచ్ఛేదము :-** యూయం - ఏవ - అభిజానీత - యః - అయం - యత్ - వా - కరిష్యతి - అహిః - ఏవ - హి - అహేః - పాదాన్ - విజానాతి - న - సంశయః ॥

**అన్వయక్రమము :-** అయం యః, యత్ వా కరిష్యతి; (ఇతి) యూయమ్ ఏవ అభిజానీత; అహేః పాదాన్ అహిః ఏవ విజానాతి హి; సంశయః న.

**ప్రతిపదార్థము :-** అయం = ఈతడు, యః = ఎవ్వడో, యత్ = దేనిని, కరిష్యతి వా = చేయునో, ఇతి = అని, యూయమ్ ఏవ = మీరే, అభిజానీత = ఎఱుగుదురు, అహేః = పాముయొక్క, పాదాన్ = పాదములను, అహిః ఏవ = పామే, విజానాతి హి = తెలిసికొనునుగదా, సంశయః న = సందేహములేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** "యూయమేవ అభిజానీత' అని ఇచ్చట మీకే తెలియవలయును గాని నాకు తెలియదు అని అసత్యము చెప్పుట దోషము గాదు

"వివాహకాలే రతి సంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే ।
మిత్రస్య చార్థే ప్యనృతం వదేయుః పంచానృతా న్యాహు రపాతకాని ॥"

అని పెద్దల వచనము.

**వాసుదాసస్వామి :-** దురుద్దేశము లేని హాస్యము నందును, స్త్రీల విషయము నందును, వివాహకాలము నందును, ప్రాణాపాయము సంభవించు నప్పుడును, తన సర్వధనము నపహృత మగునపుడును, నీ యైదు విషయంబుల నసత్య మాడుట వలన పాపములేదు.

హనుమంతుడు సీతాదేవికి ప్రత్యుపకార మపేక్షింపని యుపకారి. గౌరవమిత్రుడు, నిరపరాధి. అట్టివానికి తాను సత్యమాడుటచే నిష్కారణముగ హింస

కలుగునేని, సీతాదేవికి పాపము వచ్చునే గాని సత్యమాడిన ఫలము రాదు, సత్యము చెప్పుటచే తనకును ప్రాణభయము గలదని భయపడెను. కావున ఆమె యసత్యమునకు అసత్యదోషము లేదు.

**తాత్పర్యము :–** ఈతడు ఎవ్వడో ఏమి చేయగలడో అది యంతయును మీకే తెలియ వలయును. పాముల పాదములు పాములకే తెలియును గదా! మీ రాక్షసుల చేష్టలు మా కెట్లు తెలియగలవు?

**శ్లో॥ అహ మప్యస్య భీతాఽస్మి నైవ జానామి కో న్వయమ్ ।**
**వేద్మి రాక్షసమేవైనం కామరూపిణ మాగతమ్ ॥ 10**

**పదచ్ఛేదము :–** అహమ్ – అపి – అస్య – భీతా – అస్మి – న – ఏవ – జానామి – కః – ను – అయమ్, వేద్మి – రాక్షసమ్ – ఏవ – ఏనం – కామరూపిణమ్ – ఆగతమ్ ॥

**అన్వయక్రమము :–** అస్య; అహం అపి భీతా అస్మి; అయం కః ను (ఇతి) (అహం) న ఏవ జానామి; ఏనం కామరూపిణమ్ ఆగతం రాక్షసమ్ ఏవ వేద్మి.

**ప్రతిపదార్థము :–** అస్య = వీనికి, అహమ్ అపి = నేనుకూడ, భీతా అస్మి = భయపడిన దాననై యున్నాను, అయం = ఈతడు, కః ను = ఎవ్వడో? నైవ జానామి = ఎఱుగనే ఎఱుగను, ఏనం = ఈతనిని, కామరూపిణం = కామరూపుడుగా, ఆగతం = వచ్చినట్టి, రాక్షసమ్ ఏవ = రాక్షసునిగనే, వేద్మి = గ్రహించుచున్నాను.

**తాత్పర్యము :–** నేనును ఇతనిని జూచి భయపడుచున్నాను. ఈత డెవ్వడై యుండునో నాకేమి తెలియును? నేను మాత్రము వీనిని కామరూపముతో వచ్చిన రాక్షసుడనియే భావించుచున్నాను.

**శ్లో॥ వైదేహ్యా వచనం శ్రుత్వా రాక్షస్యో విద్రుతా ద్రుతమ్ ।**
**స్థితాః కాశ్చి ద్గతాః కాశ్చిత్ రావణాయ నివేదితుమ్ ॥ 11**

**పదచ్ఛేదము :–** వైదేహ్యాః – వచనం – శ్రుత్వా – రాక్షస్యః – విద్రుతాః – ద్రుతమ్, స్థితాః – కాశ్చిత్ – గతాః – కాశ్చిత్ – రావణాయ – నివేదితుమ్ ॥

**అన్వయక్రమము :–** వైదేహ్యాః వచనం శ్రుత్వా రాక్షస్యః ద్రుతం విద్రుతాః; కాశ్చిత్ స్థితాః, కాశ్చిత్ రావణాయ నివేదితుం గతాః.

**ప్రతిపదార్థము :–** వైదేహ్యాః = సీతాదేవియొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, రాక్షస్యః = రాక్షసాంగనలు, ద్రుతం = శీఘ్రముగా, విద్రుతాః = పరుగెత్తి పోయిరి,

కాశ్చిత్ = కొద్దిమంది, స్థితాః = నిలచిరి, కాశ్చిత్ = కొద్దిమంది, రావణాయ = రావణునకు, నివేదితుం = విన్నవించుటకు, గతాః = వెడలిరి.

**తాత్పర్యము :–** సీతాదేవి పలికిన మాటలు విని రాక్షసాంగనలు కొందఱు పరుగెత్తుకొని పోయిరి. మఱికొందఱు రావణునకు విన్నవించుటకై పోయిరి. కొలదిమందిమాత్ర మచ్చటనే సీతమ్మకు కావలిగా నిలచియుండిరి.

**శ్లో॥ రావణస్య సమీపే తు రాక్షస్యో వికృతాననాః ।**
**విరూపం వానరం భీమ మాఖ్యాతు ముపచక్రముః ॥ 12**

**పదచ్ఛేదము :–** రావణస్య – సమీపే – తు – రాక్షస్యః – వికృతాననాః – విరూపం – వానరం – భీమమ్ – ఆఖ్యాతుం – ఉపచక్రముః ॥

**అన్వయక్రమము :–** వికృతాననాః రాక్షస్యః రావణస్య సమీపే విరూపం, భీమం వానరమ్ ఆఖ్యాతుమ్ ఉపచక్రముః.

**ప్రతిపదార్థము :–** వికృతాననాః = వికారమైన ముఖముకల్గినట్టి, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, రావణస్య = రావణుని యొక్క, సమీపే = సన్నిధిని, విరూపం = విపరీతరూపము కలిగినట్టియు, భీమం = భయంకరుడైనట్టియు, వానరమ్ = వానరునిగూర్చి, ఆఖ్యాతుమ్ = చెప్పుటకు, ఉపచక్రముః = ప్రారంభించిరి.

**తాత్పర్యము :–** వికారములైన ముఖములు గలిగిన ఆ రాక్షసస్త్రీలు రావణుని సమక్షమున కేగి విపరీతమైన ఆకారముతో భయంకరముగా అచట తమకు కానవచ్చిన ఆ వానరుని వర్ణించుట మొదలుపెట్టిరి.

**శ్లో॥ అశోకవనికామధ్యే రాజన్ భీమవపుః కపిః ।**
**సీతయా కృతసంవాద స్తిష్ఠ త్యమితవిక్రమః ॥ 13**

**పదచ్ఛేదము :–** అశోకవనికామధ్యే – రాజన్ – భీమవపుః – కపిః – సీతయా – కృతసంవాదః – తిష్ఠతి – అమితవిక్రమః ॥

**అన్వయక్రమము :–** రాజన్! అశోకవనికామధ్యే భీమవపుః అమితవిక్రమః కపిః సీతయా కృతసంవాదః తిష్ఠతి.

**ప్రతిపదార్థము :–** రాజన్ = ఓ రాజా, అశోకవనికామధ్యే = అశోకవనము నడుమ, భీమవపుః = భయంకరమైన శరీరము కలవాడును, అమితవిక్రమః = అపారమైన పరాక్రమము గలవాడు నగు, కపిః = ఒక వానరుడు, సీతయా = సీతతో, కృత సంవాదః = సంభాషణము గావించినవాడై, తిష్ఠతి = ఉన్నాడు.

**తాత్పర్యము** :- మహారాజా! మన అశోకవనమునడుమ మహాభయంకరమైన శరీరముతో ఒకానొక వానరుడు సీతతో సంభాషణ మొనరించి అమితపరాక్రమము గలవాడై అచ్చటనే యున్నాడు.

**శ్లో॥ న చ తం జానకీ సీతా హరిం హరిణలోచనా ।**
**అస్మాభి ర్బహుధా పృష్టా నివేదయితు మిచ్ఛతి ॥ 14**

**పదచ్ఛేదము** :- న - చ - తం - జానకీ - సీతా - హరిం - హరిణలోచనా - అస్మాభిః - బహుధా - పృష్టా - నివేదయతుమ్ - ఇచ్ఛతి ॥

**అన్వయక్రమము** :- హరిణలోచనా జానకీ సీతా అస్మాభిః బహుధా పృష్టా తం హరిం నివేదయితుం న చ ఇచ్ఛతి.

**ప్రతిపదార్థము** :- హరిణలోచనా = లేడికన్నులవంటి కన్నులుగల, జానకీ = జనకుని కుమార్తెయైన, సీతా = సీత, అస్మాభిః = మాచే, బహుధా = పలువిధములుగ, పృష్టా = అడుగబడినదై, తం హరిం = ఆ వానరుని గూర్చి, నివేదయితుం = తెలుపుటకు, న చ ఇచ్ఛతి = ఏమియు నిచ్చగించుట లేదు.

**తాత్పర్యము** :- చంచలమైన చూపులు గల ఆ సీతాదేవి మేమెన్ని విధములుగా అడిగినప్పటికిని ఆ వానరుని గూర్చి ఎంతమాత్రమును మాకు చెప్పుటలేదు.

**శ్లో॥ వాసవస్య భవేద్దూతో దూతో వైశ్రవణస్య వా ।**
**ప్రేషితో వాపి రామేణ సీతాన్వేషణకాంక్షయా ॥ 15**

**పదచ్ఛేదము** :- వాసవస్య - భవేత్ - దూతః - దూతః - వైశ్రవణస్య - వా - ప్రేషితః - వా - అపి - రామేణ - సీతాన్వేషణకాంక్షయా ॥

**అన్వయక్రమము** :- (అయం) వాసవస్య దూతః భవేత్; వైశ్రవణస్య వా దూతః భవేత్; సీతాన్వేషణకాంక్షయా రామేణ ప్రేషితః, (అపి వా భవేత్).

**ప్రతిపదార్థము** :- (అయం = ఈతడు) వాసవస్య = దేవేంద్రునియొక్క, దూతః = దూత, భవేత్ = అయియుండును, వైశ్రవణస్య వా = కుబేరునియొక్కగాని, దూతః = దూత, భవేత్ = అయియుండును, సీతాన్వేషణకాంక్షయా = సీతను వెదుకు కోరికతో, రామేణ = రామునిచే, ప్రేషితః అపి వా = పంపబడినట్టి వాడైనను, (భవేత్ = కావచ్చును).

**తాత్పర్యము** :- ఈ వానరుడు సామాన్యుడుగాడు. దేవేంద్రుడు పంపినదూత గావచ్చును. లేక కుబేరుని దూతయైనను గావచ్చును. లేక సీతను వెదుకుటకొఱకై రాముడు

పంపినట్టి దూతయైనను గావచ్చును.

**శ్లో॥ తే నై వాద్భుతరూపేణ యత్త త్తవ మనోహరమ్ ।**
**నానామృగగణాకీర్ణం ప్రమృష్టం ప్రమదావనమ్ ॥ 16**

**పదచ్ఛేదము :–** తేన – ఏవ – అద్భుతరూపేణ – యత్ – తత్ – తవ – మనోహరమ్, నానామృగగణాకీర్ణం – ప్రమృష్టం – ప్రమదావనమ్ ॥

**అన్వయక్రమము :–** అద్భుతరూపేణ తేన ఏవ మనోహరం, నానామృగగణాకీర్ణం తవ యత్ ప్రమదావనం (అస్తి) తత్ ప్రమృష్టమ్.

**ప్రతిపదార్థము :–** అద్భుతరూపేణ = ఆశ్చర్యకరమైన రూపము గల్గినట్టి, తేన ఏవ = అతనిచేతనే, మనోహరం = రమణీయమైనదై, నానామృగగణాకీర్ణం = వివిధమృగ సమూహములతో నిండినదై, తవ = నీకు, యత్ ప్రమదావనం = ఏ ప్రమదావనమైతే, అస్తి = ప్రియమైయున్నదో, తత్ = ఆ వనము, ప్రమృష్టమ్ = ధ్వంసము చేయబడినది.

**తాత్పర్యము :–** పెక్కు విధములగు జంతువులతో నిండి రమణీయమై నీకు మిక్కిలి ప్రియమైనట్టిదైన నీ ప్రమదావనమును భీకరమైన అద్భుతశరీరముగల ఆ వానరుడే ధ్వంసము చేసివేసినాడు సుమా!

**శ్లో॥ న తత్ర కశ్చి దుద్దేశో య స్తేన న వినాశితః ।**
**యత్ర సా జానకీ సీతా స తేన న వినాశితః ॥ 17**

**పదచ్ఛేదము :–** న – తత్ర – కః – చిత్ – ఉద్దేశః – యః – తేన – న – వినాశితః – యత్ర – సా – జానకీ – సీతా – సః – తేన – న – వినాశితః ॥

**అన్వయక్రమము :–** తత్ర యః ఉద్దేశః తేన న వినాశితః, (సః) కశ్చిత్ న (అస్తి), సా జానకీ సీతా యత్ర (అస్తి), సః తేన న వినాశితః.

**ప్రతిపదార్థము :–** తత్ర = ఆ ప్రమదావనమున, యః ఉద్దేశః = ఏ ప్రదేశము, తేన = ఆ వానరునిచే, న వినాశితః = ధ్వంసముచేయబడలేదో, సః = అట్టిది, కశ్చిత్ = ఏదియునుకూడ, న అస్తి = లేదు, సా జానకీ సీతా = ఆ జనకపుత్రియైన సీత, యత్ర (అస్తి) = ఎచ్చట నున్నదో, సః = ఆ చోటు, తేన = ఆ వానరునిచే, న వినాశితః = ధ్వంసము చేయబడలేదు.

**తాత్పర్యము :–** ఆ ప్రమదావనమునందు ఆ వానరుడు ధ్వంసము చేయనట్టి ప్రదేశము లేదు, కాని జనకపుత్రియైన సీతయున్న ప్రదేశ మొక్కటి మాత్రము ఆతడు విడిచిపెట్టెను.

**శ్లో॥ జానకీరక్షణార్థం వా శ్రమాద్వా నోపలక్ష్యతే ।**
**అథవా కశ్శ్రమ స్తస్య సైవ తేనాభిరక్షితా ॥ 18**

**పదచ్ఛేదము :–** జానకీరక్షణార్థం – వా – శ్రమాత్ – వా – న – ఉపలక్ష్యతే, అథవా – కః – శ్రమః – తస్య – సా – ఏవ – తేన – అభిరక్షితా ॥

**అన్వయక్రమము :–** జానకీరక్షణార్థం వా, శ్రమాత్ వా (ఇతి) న ఉపలక్ష్యతే, అథవా తస్య శ్రమః కః? సా ఏవ తేన అభిరక్షితా.

**ప్రతిపదార్థము :–** జానకీరక్షణార్థం వా = సీతయొక్క రక్షణముకొఱకో, శ్రమాత్ వా = శ్రమవలననో, (ఇతి = అని) న ఉపలక్ష్యతే = తెలియుటలేదు, అథవా = లేక, తస్య = అతనికి, శ్రమః కః = శ్రమ ఏమి? తేన = అతనిచే, సా ఏవ = ఆమెయే, అభిరక్షితా = రక్షింపబడినది.

**తాత్పర్యము :–** జనకరాజపుత్రి యున్న ప్రదేశమును ధ్వంసము చేయకుండుట అనునది ఆమెను రక్షించుటకొఱకే, లేక తనకు శ్రమ కలుగుటచేతనో తెలియుటలేదు. కాని ఆ మహనీయునికి శ్రమ అనునది ఎట్లుండును? కావలసియే ఆత డామెను రక్షించినాడు.

**శ్లో॥ చారుపల్లవపుష్పాఢ్యం యం సీతా స్వయ మాస్థితా ।**
**ప్రవృద్ధ శ్శింశుపావృక్ష స్స చ తేనాభిరక్షితః ॥ 19**

**పదచ్ఛేదము :–** చారుపల్లవపుష్పాఢ్యం – యం – సీతా – స్వయమ్ – ఆస్థితా – ప్రవృద్ధః – శింశుపావృక్షః – సః – చ – తేన – అభిరక్షితః ॥

**అన్వయక్రమము :–** సీతా స్వయం చారుపల్లవపుష్పాఢ్యం యమ్ ఆస్థితా, సః ప్రవృద్ధః శింశుపావృక్షః చ తేన అభిరక్షితః.

**ప్రతిపదార్థము :–** సీతా = సీతాదేవి, స్వయం = స్వయముగా, చారుపల్లవపుష్పాఢ్యం = సుందరమైన చిగుళ్ళతోడను పువ్వులతోడను నిండినట్టి, యం = ఏ వృక్షమును, ఆస్థితా = చేరియున్నదో, సః = ఆ, ప్రవృద్ధః = ఏపుగా పెరిగినట్టి, శింశుపావృక్షః చ = శింశుపావృక్షముగూడ, తేన = ఆతనిచే, అభిరక్షితః = రక్షింపబడినది.

**తాత్పర్యము :–** మనోహరమైన పల్లవములతోడను, పుష్పములతోడను నిండియున్న ఏ చెట్టును సీతాదేవి స్వయముగా చేరియున్నదో ఆ శింశుపావృక్షమును మాత్రము ఆ వానరుడు చెక్కుచెదరకుండ నిలిపియుంచినాడు.

**శ్లో॥ త స్యోగ్రరూప స్యోగ్రం త్వం దండమాజ్ఞాతు మర్హసి ।**
**సీతా సంభాషితా యేన తద్వనం చ వినాశితమ్ ॥ 20**

**పదచ్ఛేదము :–** తస్య – ఉగ్రరూపస్య – ఉగ్రం – త్వం – దండమ్ – ఆజ్ఞాతుమ్ – అర్హసి, సీతా – సంభాషితా – యేన – తత్ – వనం – చ – వినాశితమ్.

**అన్వయక్రమము :–** యేన సీతా సంభాషితా, (యేన) తత్ వనం చ వినాశితం, ఉగ్రరూపస్య తస్య త్వమ్ ఉగ్రం దండమ్ ఆజ్ఞాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :–** యేన = ఏ వానరునిచే, సీతా = జానకి, సంభాషితా = సంభాషణము చేయబడెనో, యేన = ఎవ్వనిచే, తత్ వనం చ = ఆ వనము గూడ, వినాశితం = నాశనము చేయబడెనో, ఉగ్రరూపస్య = భయంకరరూపుడైనట్టి, తస్య = అతనికి, త్వమ్ = నీవు, ఉగ్రం = భయంకరమైనట్టి, దండమ్ = శిక్షను, ఆజ్ఞాతుమ్ = విధించుటకు, అర్హసి = తగుదువు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'ఉగ్రం త్వం' అనుటకు బదులుగా 'ఉగ్రః త్వం' అని పాఠాంతరము. అనగా ఓ ఉగ్రుడా! ఆ ఉగ్రరూపమునకు తగిన దండమును నీవు విధింపదగుదువని భావము.

**తాత్పర్యము :–** సీతతో సంభాషణము గావించియు, మన వనమును భగ్నముచేసియు మహాపరాధము గావించినట్టి ఆ భయంకరవానరునకు నీవు భయంకరమైన దండనము విధింపవలసియున్నది.

**శ్లో॥ మనఃపరిగృహీతాం తాం తవ రక్షోగణేశ్వర ।**
**క స్సీతా మభిభాషేత యో న స్యా త్త్యక్తజీవితః ॥ 21**

**పదచ్ఛేదము :–** మనఃపరిగృహీతాం – తాం – తవ – రక్షోగణేశ్వర – కః – సీతామ్ – అభిభాషేత – యః – న – స్యాత్ – త్యక్తజీవితః ॥

**అన్వయక్రమము :–** రక్షోగణేశ్వర! తవ మనఃపరిగృహీతాం తాం సీతాం, యః త్యక్త జీవితః న స్యాత్, సః కః అభిభాషేత?

**ప్రతిపదార్థము :–** రక్షోగణేశ్వర! = ఓ రాక్షసచక్రవర్తీ, యః = ఎవడు, త్యక్తజీవితః = విడిచిన జీవితాశగలవాడు, న స్యాత్ = కాకుండునో, సః = అట్టి, కః = ఎవ్వడు, తవ = నీ యొక్క, మనఃపరిగృహీతాం = మనస్సుచే స్వీకరింపబడినట్టి, తాం సీతాం

= ఆ జానకినిగూర్చి, అభిభాషేత = మాటలాడును?

**తాత్పర్యము** :– ఓ రాక్షసరాజా! జీవితముపై ఆశ యున్న వాడెవ్వడు నీవు మనసార స్వీకరించియున్న ఆ సీతాదేవితో మాటలాడుటకు సాహసింపగలడు?

**శ్లో॥ రాక్షసీనాం వచ శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః ।**
**చితాగ్నిరివ జజ్వాల కోపసంవర్తితేక్షణః ॥ 22**

**పదచ్ఛేదము** :– రాక్షసీనాం – వచః – శ్రుత్వా – రావణః – రాక్షసేశ్వరః – చితాగ్నిః – ఇవ – జజ్వాల – కోపసంవర్తితేక్షణః ॥

**అన్వయక్రమము** :– రాక్షసీనాం వచః శ్రుత్వా రాక్షసేశ్వరః రావణః కోపసంవర్తితేక్షణః (సన్) చితాగ్నిః ఇవ జజ్వాల.

**ప్రతిపదార్థము** :– రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క, వచః = మాటను, శ్రుత్వా = విని, రాక్షసేశ్వరః = రాక్షసప్రభువైన, రావణః = రావణుడు, కోపసంవర్తితేక్షణః (సన్) = కోపముచే త్రిప్పబడుచున్న కన్నులుగలవాడై, చితాగ్నిః ఇవ = చితియందలి మంటవలె, జజ్వాల = ప్రజ్వలించెను.

**సూచన** :– "చితాగ్నిః ఇవ" అనుటకు బదులుగా "హుతాగ్నిః ఇవ" అని పాఠాంతరము. అనగా చక్కగా హోమము చేయబడుటచే మండిన అగ్నివలె అని భావము.

**తాత్పర్యము** :– రాక్షసస్త్రీలయొక్క మాట లాలించి ఆ రాక్షసాధిపతి క్రోధముతో మిడిగ్రుడ్లను త్రిప్పుచు చితియందలి అగ్ని ప్రజ్వలించినట్లుగా తీవ్రముగా మండిపడెను.

**శ్లో॥ తస్య క్రుద్ధస్య నేత్రాభ్యాం ప్రాపతన్నస్రబిందవః ।**
**దీప్తాభ్యామివ దీపాభ్యాం సార్చిషః స్నేహబిందవః ॥ 23**

**పదచ్ఛేదము** :– తస్య – క్రుద్ధస్య – నేత్రాభ్యాం – ప్రాపతన్ – అస్రబిందవః – దీప్తాభ్యాం – ఇవ – దీపాభ్యాం – సార్చిషః – స్నేహబిందవః ॥

**అన్వయక్రమము** :– క్రుద్ధస్య తస్య నేత్రాభ్యాం, దీప్తాభ్యాం దీపాభ్యాం సార్చిషః స్నేహబిందవః ఇవ అస్రబిందవః ప్రాపతన్.

**ప్రతిపదార్థము** :– క్రుద్ధస్య = క్రోధమునొందియున్నట్టి, తస్య = ఆ రావణునియొక్క, నేత్రాభ్యాం = రెండు కన్నులనుండి, దీప్తాభ్యాం = జ్వలించుచున్న, దీపాభ్యాం = దీపములనుండి, సార్చిషః = మంటతో గూడినట్టి, స్నేహబిందవః ఇవ = నూనెబొట్టులవలె, అస్రబిందవః = కన్నీటిబొట్టులు, ప్రాపతన్ = రాలినవి.

**తాత్పర్యము** :– క్రోధోద్రిక్తుడైనట్టి ఆ రావణాసురుని నేత్రయుగ్మము నుండి జ్వలించుచున్న దీపద్వయమునుండి మంటతోకూడిన నూనెబొట్లు రాలినట్లుగ కన్నీటిబొట్లు రాలిపడినవి.

**శ్లో॥ ఆత్మన స్సదృశా న్వీరా న్కింకరా న్నామ రాక్షసాన్ ।**
**వ్యాదిదేశ మహాతేజా నిగ్రహార్థం హనూమతః ॥ 24**

**పదచ్ఛేదము** :– ఆత్మనః – సదృశాన్ – వీరాన్ – కింకరాన్ – నామ – రాక్షసాన్ – వ్యాదిదేశ – మహాతేజాః – నిగ్రహార్థం – హనూమతః ॥

**అన్వయక్రమము** :– మహాతేజాః (సః) హనూమతః నిగ్రహార్థం కింకరాన్ నామ ఆత్మనః సదృశాన్ వీరాన్ రాక్షసాన్ వ్యాదిదేశ.

**ప్రతిపదార్థము** :– మహాతేజాః (సః) = మహాప్రతాపశాలియైన ఆ రావణుడు, హనూమతః = హనుమంతునియొక్క, నిగ్రహార్థం = బంధనము కొఱకై, కింకరాన్ నామ = కింకరులను పేరుగల, ఆత్మనః = తనకు, సదృశాన్ = సమానులైనట్టి, వీరాన్ = వీరులైన, రాక్షసాన్ = రక్కసులను, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :– మహాప్రతాపశాలియగు ఆ రావణుడు హనుమంతుని పట్టిబంధించుటకై కింకరు లను పేరుగల తనతో సమానమగు వీరులైన రాక్షసులను యుద్ధమునకు బంపెను.

**శ్లో॥ తేషా మశీతిసాహస్రం కింకరాణాం తరస్వినామ్ ।**
**నిర్యయు ర్భవనా త్తస్మా త్కూటముద్గరపాణయః ॥ 25**

**పదచ్ఛేదము** :– తేషామ్ – అశీతిసాహస్రం – కింకరాణాం – తరస్వినామ్ – నిర్యయుః – భవనాత్ – తస్మాత్ – కూటముద్గరపాణయః ॥

**అన్వయక్రమము** :– తేషాం తరస్వినాం కింకరాణామ్ అశీతిసాహస్రం కూటముద్గర పాణయః (సంతః) తస్మాత్ భవనాత్ నిర్యయుః.

**ప్రతిపదార్థము** :– తేషాం = ఆ, తరస్వినాం = బలవంతులైనట్టి, కింకరాణాం = కింకరులయొక్క, అశీతిసాహస్రం = ఎనుబదివేలమంది, కూటముద్గరపాణయః = ఇనుపదండములు ముద్గరాయుధములు చేతియందు గలవారై, తస్మాత్ భవనాత్ = ఆ భవనమునుండి, నిర్యయుః = వెడలిరి.

**తాత్పర్యము** :– మహాబలవంతులైన ఆ కింకరాసురులు ఎనుబదివేలమంది కూటములను, ముద్గరములను తమ తమ చేతులయందు ధరించి రావణుని భవనము

నుండి హనుమను గూర్చి వెడలిరి.

**శ్లో॥ మహోదరా మహాదంష్ట్రా ఘోరరూపా మహాబలాః ।**
**యుద్ధాభిమనస స్సర్వే హనూమద్గ్రహణోన్ముఖాః ॥ 26**

**పదచ్ఛేదము** :– మహోదరాః – మహాదంష్ట్రాః – ఘోరరూపాః – మహాబలాః – యుద్ధాభిమనసః – సర్వే – హనూమద్గ్రహణోన్ముఖాః ॥

**అన్వయక్రమము** :– మహోదరాః మహాదంష్ట్రాః ఘోరరూపాః మహాబలాః (తే) సర్వే యుద్ధాభిమనసః (సంతః) హనూమద్గ్రహణోన్ముఖాః (నిర్యయుః).

**ప్రతిపదార్థము** :– మహోదరాః = పెద్దపొట్టలు గలవాడును, మహాదంష్ట్రాః = పెద్దకోఱలు గలవారును, ఘోరరూపాః = భీకరాకారము గలవారును, మహాబలాః = గొప్పబలము గలవారునగు, (తే) సర్వే = ఆ కింకరులెల్లరును, యుద్ధాభిమనసః సంతః = యుద్ధమునందు కోరికగలవారై, హనూమద్గ్రహణోన్ముఖాః = హనుమంతుని పట్టుకొనుటకు ఉద్యుక్తులై, (నిర్యయుః = వెడలిరి).

**తాత్పర్యము** :– పెద్దపొట్టలును పెద్దకోఱలును భయంకరమైన ఆకారములును గొప్పబలమును గలిగియున్న ఆ కింకరరాక్షసు లందఱును యుద్ధమును గూర్చిన వాంఛతో హనుమంతుని బంధించుటకై నిశ్చయించుకొని వెడలిరి.

**శ్లో॥ తే కపిం తం సమాసాద్య తోరణస్థ మవస్థితమ్ ।**
**అభిపేతు ర్మహావేగాః పతంగా ఇవ పావకమ్ ॥ 27**

**పదచ్ఛేదము** :– తే – కపిం – తం – సమాసాద్య – తోరణస్థమ్ – అవస్థితమ్ – అభిపేతుః – మహావేగాః – పతంగాః – ఇవ – పావకమ్ ॥

**అన్వయక్రమము** :– మహావేగాః తే తోరణస్థమ్ అవస్థితం తం కపిం సమాసాద్య పతంగాః పావకమ్ ఇవ అభిపేతుః.

**ప్రతిపదార్థము** :– మహావేగాః = గొప్పవేగము కల్గినట్టి, తే = ఆ రాక్షసులు, తోరణస్థం = బహిర్ద్వారమునందు ఉన్నవాడును, అవస్థితం = సన్నద్ధుడైన వాడును అగు, తం కపిం = ఆ హనుమను, సమాసాద్య = చేరి, పతంగాః = మిడుతలు, పావకమ్ ఇవ = అగ్నినిగూర్చివలె, అభిపేతుః = మీదబడిరి.

**తాత్పర్యము** :– అట్లు ఆ రక్కసులు బయలువెడలి ఆ వనబహిర్ద్వారముపై నిశ్చలముగ కూర్చొనియున్న ఆ హనుమంతుని మీదికి మిడుతలు అగ్నిమీదికి దుమికినట్లుగా, మహావేగముతో పోయి మీదబడిరి.

**శ్లో॥ తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాంచనాంగదైః ।**
**ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం శరై శ్చాదిత్యసన్నిభైః ॥ 28**

**పదచ్ఛేదము** :- తే - గదాభిః - విచిత్రాభిః - పరిఘైః - కాంచనాంగదైః - ఆజఘ్నుః - వానరశ్రేష్ఠం - శరైః - చ - ఆదిత్యసన్నిభైః ॥

**అన్వయక్రమము** :- తే విచిత్రాభిః గదాభిః కాంచనాంగదైః పరిఘైః ఆదిత్యసన్నిభైః శరైః చ వానరశ్రేష్ఠం ఆజఘ్నుః.

**ప్రతిపదార్థము** :- తే = ఆ రాక్షసులు, విచిత్రాభిః = విచిత్రములైన, గదాభిః = గదలతోడను, కాంచనాంగదైః = సువర్ణాభరణములతో కూడిన, పరిఘైః = పరిఘల తోడను, ఆదిత్యసన్నిభైః = సూర్యునితో సమానమైనట్టి, శరైః = బాణములతోడను, వానరశ్రేష్ఠం = వానరోత్తముడైన హనుమను, ఆజఘ్నుః = కొట్టిరి.

**తాత్పర్యము** :- ఆ కింకరాసురులు విచిత్రములైన తమ గదలతోడను, బంగారు కట్టులుగల పరిఘలతోడను, సూర్యసన్నిభములైన బాణములతోడను హనుమను కొట్టదొడగిరి.

**శ్లో॥ ముద్గరైః పట్టసై శ్శూలైః ప్రాసతోమరశక్తిభిః ।**
**పరివార్య హనూమంతం సహసా తస్థు రగ్రతః ॥ 29**

**పదచ్ఛేదము** :- ముద్గరైః - పట్టసైః - శూలైః - ప్రాసతోమరశక్తిభిః - పరివార్య - హనూమంతం - సహసా - తస్థుః - అగ్రతః ॥

**అన్వయక్రమము** :- (తే) ముద్గరైః పట్టసైః శూలైః ప్రాసతోమరశక్తిభిః సహసా హనూమంతం పరివార్య అగ్రతః తస్థుః.

**ప్రతిపదార్థము** :- (తే = వారు) ముద్గరైః = ఇనుపగుదియలతోడను, పట్టసైః = అడ్డకత్తులతోడను, శూలైః = శూలములతోడను, ప్రాసతోమరశక్తిభిః = ఈటెలు, చిల్లకోలలు, బల్లెములు అనువానితోడను, సహసా = వేగముగా, హనూమంతం = హనుమను, పరివార్య = చుట్టుముట్టి, అగ్రతః = ఎదురుగా, తస్థుః = నిలచిరి.

**తాత్పర్యము** :- ఆ రక్కసులు ఇనుపగదలు, అడ్డకత్తులు, శూలములు, ఈటెలు, చిల్లకోలలు, బల్లెములు అను వివిధములైన ఆయుధములను ధరించి హనుమంతుని చుట్టుముట్టి నిలచిరి.

**శ్లో॥ హనుమానపి తేజస్వీ శ్రీమా న్పర్వతసన్నిభః ।**
**క్షితా వావిధ్య లాంగూలం ననాద చ మహాస్వనమ్ ॥ 30**

**పదచ్ఛేదము** :– హనుమాన్ – అపి – తేజస్వీ – శ్రీమాన్ – పర్వతసన్నిభః – క్షితౌ – ఆవిధ్య – లాంగూలం – ననాద – చ – మహాస్వనమ్ ॥

**అన్వయక్రమము** :– పర్వతసన్నిభః, తేజస్వీ, శ్రీమాన్ హనుమాన్ అపి క్షితౌ లాంగూలం ఆవిధ్య మహాస్వనం ననాద.

**ప్రతిపదార్థము** :– పర్వతసన్నిభః = పర్వతమును బోలినవాడును, తేజస్వీ = తేజశ్శాలియును, శ్రీమాన్ = శుభలక్షణసమేతుడును అగు, హనుమాన్ అపి = హనుమంతుడుగూడ, క్షితౌ = నేలపై, లాంగూలం = తోకను, ఆవిధ్య = చఱచి, మహాస్వనం = గొప్పధ్వని అగునట్లు, ననాద = అఱచెను.

**తాత్పర్యము** :– పర్వతముతో సమానమైన శరీరముతోను, గొప్ప తేజస్సుతోను, గొప్ప శోభతోను వెలుగొందుచున్న హనుమగూడ వారిని జూచి నేలపై తన వాలముతో గొట్టి పెద్దధ్వని యగునట్లు అఱచెను.

**శ్లో॥ స భూత్వా సుమహాకాయః హనుమా న్మారుతాత్మజః ।**
**ధృష్ట మాస్ఫోటయామాస లంకాం శబ్దేన పూరయన్ ॥ 31**

**పదచ్ఛేదము** :– సః – భూత్వా – సుమహాకాయః – హనుమాన్ – మారుతాత్మజః – ధృష్టమ్ – ఆస్ఫోటయామాస – లంకాం – శబ్దేన – పూరయన్ ॥

**అన్వయక్రమము** :– మారుతాత్మజః హనుమాన్ సుమహాకాయః భూత్వా లంకాం శబ్దేన పూరయన్ ధృష్టమ్ ఆస్ఫోటయామాస.

**ప్రతిపదార్థము** :– మారుతాత్మజః = వాయునందనుడైన, హనుమాన్ = హనుమంతుడు, సుమహాకాయః భూత్వా = పెద్దదైన శరీరము గలవాడయి, లంకాం = లంకా నగరమును, శబ్దేన = ధ్వనితో, పూరయన్ = నిండించుచు, ధృష్టం = కఠోరముగా, ఆస్ఫోటయామాస = చఱచుకొనెను.

**తాత్పర్యము** :– అట్లు వాయునందనుడైన యా హనుమ పెద్దగ శరీరమును పెంచుకొని గొప్ప ధ్వనితో లంకానగరము నంతను పూరించుచు దర్పముతో తన జబ్బ చఱచు కొనెను.

**శ్లో॥ త స్యాస్ఫోటితశబ్దేన మహతా సానునాదినా ।**
**పేతు ర్విహంగా గగనా దుచ్చై శ్చేద మఘోషయత్ ॥ 32**

**పదచ్ఛేదము** :– తస్య – ఆస్ఫోటితశబ్దేన – మహతా – సానునాదినా – పేతుః – విహంగాః – గగనాత్ – ఉచ్చైః – చ – ఇదమ్ – అఘోషయత్ ॥

**అన్వయక్రమము** :- సానునాదినా మహతా తస్య ఆస్ఫోటితశబ్దేన గగనాత్ విహంగాః పేతుః, (సః) ఉచ్చైః ఇదం అఘోషయత్ చ.

**ప్రతిపదార్థము** :- సానునాదినా = ప్రతిధ్వనితో కూడినట్టి, మహతా = గొప్పదైనట్టి, తస్య = ఆ హనుమయొక్క, ఆస్ఫోటితశబ్దేన = భుజాస్ఫాలనశబ్దముచే, గగనాత్ = ఆకసమునుండి, విహంగాః = పక్షులు, పేతుః = పడినవి, (సః = ఆ హనుమ) ఉచ్చైః = బిగ్గరగా, ఇదమ్ = దీనిని, అఘోషయత్ = ఘోషించెను.

**తాత్పర్యము** :- గొప్ప ప్రతిధ్వని గలుగునట్లుగా ఆతడు గావించిన భుజాస్ఫాలన శబ్దమునకు ఆకసము నందలి పక్షులు నేలగూలినవి. అప్పుడు హనుమంతుడు ఉచ్చైః స్వరముతో ఈ రీతిగ ఘోషించెను.

**శ్లో॥ జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।**
**రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః ॥ 33**

**శ్లో॥ దాసో ఽ హం కోసలేంద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః ।**
**హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః ॥ 34**

**శ్లో॥ న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్ ।**
**శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః ॥ 35**

**శ్లో॥ అర్దయిత్వా పురీం లంకా మభివాద్య చ మైథిలీమ్ ।**
**సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్ ॥ 36**

**పదచ్ఛేదము** :- జయతి - అతిబలః - రామః - లక్ష్మణః - చ - మహాబలః - రాజా - జయతి - సుగ్రీవః - రాఘవేణ - అభిపాలితః - దాసః - అహం - కోసలేంద్రస్య - రామస్య - అక్లిష్టకర్మణః - హనుమాన్ - శత్రుసైన్యానాం - నిహంతా - మారుతాత్మజః - న - రావణసహస్రం - మే - యుద్ధే - ప్రతిబలం - భవేత్ - శిలాభిః - తు - ప్రహరతః - పాదపైః - చ - సహస్రశః - అర్దయిత్వా - పురీం - లంకామ్ - అభివాద్య - చ - మైథిలీమ్ - సమృద్ధార్థః - గమిష్యామి - మిషతాం - సర్వరక్షసామ్ ॥

**అన్వయక్రమము** :- అతిబలః రామః జయతి, మహాబలః లక్ష్మణః చ (జయతి), రాఘవేణ అభిపాలితః రాజా సుగ్రీవః జయతి, అహమ్ అక్లిష్టకర్మణః కోసలేంద్రస్య రామస్య దాసః, శత్రుసైన్యానాం నిహంతా, మారుతాత్మజః హనుమాన్; సహస్రశః శిలాభిః పాదపైః చ ప్రహరతః మే యుద్ధే రావణసహస్రం ప్రతిబలం న భవేత్,

సర్వరక్షసాం మిషతాం (సతాం) లంకాపురీం అర్దయిత్వా మైథిలీం అభివాద్య చ సమృద్ధార్థః (సన్) గమిష్యామి.

**ప్రతిపదార్థము** :– అతిబలః = అధికబలుడైన, రామః = శ్రీరాముడు, జయతి = సర్వోత్కర్షతో వర్ధిల్లుచున్నాడు; మహాబలః = బలశాలియైన, లక్ష్మణః చ = లక్ష్మణుడును, జయతి = వర్ధిల్లుచున్నాడు; రాఘవేణ = శ్రీరామునిచే, అభిపాలితః = రక్షింపబడు చున్నట్టి, రాజా సుగ్రీవః = రాజైన సుగ్రీవుడు, జయతి = వర్ధిల్లుచున్నాడు, అహం = నేను, అక్లిష్టకర్మణః = క్లేశము కల్గింపని కృత్యములు గలవాడును, కోసలేంద్రస్య = కోసలప్రభువునగు, రామస్య = రామునకు, దాసః = సేవకుడను. శత్రుసైన్యానాం = శత్రుసైన్యములకు, నిహంతా = మారకుడనైన, అహం = నేను, మారుతాత్మజః = వాయుదేవుని పుత్రుడనగు, హనుమాన్ = హనుమంతుడను. సహస్రశః = వేలకొలది, శిలాభిః = ఱాళ్ళతోడను, పాదపైః చ = వృక్షములతోడను, ప్రహరతః = ప్రహరించు చున్నట్టి, మే = నాకు, యుద్ధే = యుద్ధమునందు, రావణసహస్రం = వెయ్యిమంది రావణుల సమూహము, ప్రతిబలం = ఎదురునిలచు శత్రువు, న భవేత్ = కాజాలదు, సర్వరక్షసాం = ఎల్లరు రాక్షసులును, మిషతాం (సతాం) = చూచుచుండగా, లంకాపురీం = లంకానగరమును, అర్దయిత్వా = పీడించి, మైథిలీమ్ = జానకీదేవిని, అభివాద్య = నమస్కరించి, సమృద్ధార్థః = సుసంపన్నమైన ప్రయోజనముగలవాడనై, గమిష్యామి = వెడలిపోవుదును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– "అక్లిష్టకర్మణః రామస్య దాసః" అనుచు తన దాస్యము క్లేశమును గల్పించునట్టి కర్మగ చేయబడుటలేదు. మఱియేమనగా తనకు సహజమైన ధర్మముగా చేయుచున్నానని హనుమ చెప్పుచున్నాడు.

**వాసుదాస స్వామి** :– శ్రీరామచంద్రమూర్తికి తాను దాసుడను అనగా కింకరుడను అని చెప్పుటచే తాను జీతబత్తెములను కోరి దాసుడుగా లేదనియు, శ్రీరామమూర్తి యందుగల కళ్యాణగుణములు నామనస్సు నాకర్షించుటచే దాస్యము నా స్వరూపము గాన నే నాయనను సేవించుచున్నానని భావము.

ఈ నాలుగు శ్లోకములును క్షుద్రప్రయోగములనెల్ల హరించునని అనుభవజ్ఞులు చెప్పిరి. ఎవరైనను ఏదైన క్షుద్రశక్తి ప్రయోగము చేసినారని భయపడువారు ఈ నాల్గు శ్లోకములను కొన్నాళ్లు విడువక జపించిరేని ఆ ప్రయోగము చెడును. దీని పఠనము వలన దుష్టస్వప్నముల భయముండదు.

విమర్శక శిరోమణి బ్రహ్మశ్రీ చిలుకూరి పాపయశాస్త్రి - కార్య విజయము నాకాంక్షించి సుందరకాండ పారాయణము చేయగోరువారు ప్రతిసర్గకును ప్రారంభమున ఈ నాలుగు శ్లోకములను పఠించుచు పారాయణము గావించి విజయమును సాధించుట సంప్రదాయముగ వచ్చుచున్న విషయము.

**తాత్పర్యము :-** అతిబలసముపేతుడైన శ్రీరామునకు జయము, మహాబలసంపన్నుడైన లక్ష్మణునకు జయము, రాఘవునిచే పాలింపబడిన సుగ్రీవ మహారాజునకు జయము, సజ్జన క్లేశవిదూరమైన కృత్యములొనరించు కోసలాధినాథుడగు శ్రీరామునకు నేను సేవకుడను. శత్రుసైన్యములను పరిమార్చు శక్తిమంతుడనైన నేను వాయుపుత్రుడను. హనుమంతుడను పేరుగల వాడను. వేలకొలదిగ శిలలతోడను వృక్షములతోడను ప్రహరించుచు యుద్ధము చేయునట్టి నాకు వేయిమంది రావణులు వచ్చినను నాతో సమానమైన ప్రతివీరులు గాజాలరు. ఇచ్చటి రాక్షసుల కట్టెదుటనే లంకానగరము నంతను ధ్వంసముచేసి మా సీతమ్మకి మ్రొక్కి నేను తలపెట్టిన కార్యమును సాధించుకొని వెడలిపోవుదును.

**శ్లో॥ తస్య సన్నాదశబ్దేన తే ఽభవ న్భయశంకితాః ।**
**దదృశుశ్చ హనూమంతం సంధ్యామేఘమి వోన్నతమ్ ॥ 37**

**పదచ్ఛేదము :-** తస్య - సన్నాదశబ్దేన - తే - అభవన్ - భయశంకితాః - దదృశుః - చ - హనూమంతం - సంధ్యామేఘమ్ - ఇవ - ఉన్నతమ్ ॥

**అన్వయక్రమము :-** తే తస్య సన్నాదశబ్దేన భయశంకితాః అభవన్, ఉన్నతం సంధ్యామేఘమ్ ఇవ (స్థితం) తం హనూమంతం దదృశుః చ.

**ప్రతిపదార్థము :-** తస్య = ఆ హనుమయొక్క, సన్నాదశబ్దేన = అఱపుయొక్క ధ్వనిచేత, తే = ఆ కింకరాసురులు, భయశంకితాః = భీతిచే శంకనొందినవారు, అభవన్ = అయిరి, ఉన్నతం = ఎత్తుగనున్న, సంధ్యామేఘమ్ ఇవ = సంధ్యాకాలపు మేఘమువలె, స్థితం = ఉన్నట్టి, హనూమంతం = హనుమంతుని, దదృశుః చ = చూచిరికూడను.

**తాత్పర్యము :-** ఈ రీతిగా హనుమంతుడు గావించిన మహాశబ్దమునకు ఆ కింకరాసురులు భయచకితులైరి. పిమ్మట తమ ఎదుట సంధ్యామేఘమువలె అత్యున్నత రూపముతో తేజరిల్లుచున్న హనుమను కనుగొనిరి.

**శ్లో॥ స్వామిసందేశనిశ్శంకా స్తత స్తే రాక్షసాః కపిమ్ ।**
**చిత్రైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్సహస్రశః ॥ 38**

**పదచ్ఛేదము :–** స్వామిసందేశనిశ్శంకాః – తతః – తే – రాక్షసాః – కపిమ్ – చిత్రైః – ప్రహరణైః – భీమైః – అభిపేతుః – సహస్రశః ॥

**అన్వయక్రమము :–** తతః తే రాక్షసాః స్వామిసందేశనిశ్శంకాః చిత్రైః భీమైః ప్రహరణైః సహస్రశః (తం) కపిమ్ అభిపేతుః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, తే రాక్షసాః = ఆ రాక్షసులు, స్వామిసందేశ నిశ్శంకాః = ప్రభువుయొక్క ఆజ్ఞచే శంకారహితులై, చిత్రైః = చిత్రములైనట్టి, భీమైః = భయంకరమైనట్టి, ప్రహరణైః = ఆయుధములతో, సహస్రశః = వేలకొలదిగా, తం కపిం = ఆ హనుమను, అభిపేతుః = ఎదుర్కొనిరి.

**తాత్పర్యము :–** అప్పు డా రాక్షసులెల్లరును తమ ప్రభువు ఇచ్చిన ఆజ్ఞను స్మరించుకొనుచు శంకవీడి విచిత్రములును భయంకరములును అగు వివిధములైన ఆయుధములతో వేలకొలదిగా గుమిగూడి ఆ హనుమపై బడజొచ్చిరి.

**శ్లో॥ స తైః పరివృత శ్శూరై స్సర్వత స్స మహాబలః ।**
**ఆససాదాஉஉయసం భీమం పరిఘం తోరణాశ్రితమ్ ॥ 39**

**పదచ్ఛేదము :–** సః – తైః – పరివృతః – శూరైః – సర్వతః – సః – మహాబలః – ఆససాద – ఆయసం – భీమం – పరిఘం – తోరణాశ్రితమ్ ॥

**అన్వయక్రమము :–** తైః శూరైః సర్వతః పరివృతః సః మహాబలః తోరణాశ్రితం భీమమ్ ఆయసం పరిఘమ్ ఆససాద.

**ప్రతిపదార్థము :–** తైః శూరైః = ఆ వీరులచే, సర్వతః = అన్నివైపుల నుండి, పరివృతః = చుట్టుకొనబడినవాడై, మహాబలః = బలాఢ్యుడైన, సః = ఆ హనుమ, తోరణాశ్రితం = బహిర్ద్వారముననున్నట్టి, భీమమ్ = భయంకరమైనట్టి, ఆయసం పరిఘమ్ = ఉక్కు దూలమును, ఆససాద = సమీపించెను.

**తాత్పర్యము :–** ఆ వీరులు తనను చుట్టుముట్టి యుండగా మహాబలాఢ్యుడైన ఆతడు తాను కూర్చున్న వనబహిర్ద్వారమునందే భయంకరముగ కానవచ్చుచున్న ఒక ఇనుపదూలమును చూచి దానిని సమీపించెను.

**శ్లో॥ స తం పరిఘ మాదాయ జఘాన చ నిశాచరాన్ ।**
**స పన్నగమి వాదాయ స్ఫురంతం వినతాసుతః ।**
**విచచా రాంబరే వీరః పరిగృహ్య చ మారుతిః ॥ 40**

**పదచ్ఛేదము :–** సః – తం – పరిఘమ్ – ఆదాయ – జఘాన – చ – నిశాచరాన్ – సః – పన్నగమ్ – ఇవ – ఆదాయ – స్ఫురంతం – వినతాసుతః – విచచార – అంబరే – వీరః – పరిగృహ్య – చ – మారుతిః ॥

**అన్వయక్రమము :–** సః తం పరిఘమ్ ఆదాయ నిశాచరాన్ జఘాన; వినతాసుతః స్ఫురంతం పన్నగమ్ ఆదాయ ఇవ సః వీరః మారుతిః (తం) పరిగృహ్య అంబరే విచచార.

**ప్రతిపదార్థము :–** సః = ఆ హనుమ, తం = ఆ, పరిఘమ్ = ఇనుపగుదియను, ఆదాయ = పట్టుకొని, నిశాచరాన్ = రాక్షసులను, జఘాన = చంపెను, వినతాసుతః = గరుత్మంతుడు, స్ఫురంతం = మెఱయుచున్న, పన్నగమ్ = సర్పమును, ఆదాయ ఇవ = పట్టుకొనివలె, సః = ఆ, వీరః = వీరుడైన, మారుతిః = హనుమ, తం = ఆ పరిఘను, పరిగృహ్య = పట్టుకొని, అంబరే = ఆకాశమునందు, విచచార = తిరిగెను.

**తాత్పర్యము :–** హనుమ ఆ పరిఘను చేతబట్టి పెక్కండ్రు రాక్షసులను సంహరించెను. పిమ్మట నాతడు గరుత్మంతుడు మిలమిల మెఱయుచున్న సర్పమును బట్టి ఎగురుచున్నట్లుగా ఆ పరిఘను చేతితో బట్టుకొని ఆకాశమున కొద్దిసేపు విహరించెను.

**శ్లో॥ స హత్వా రాక్షసా న్వీరాన్ కింకరా న్మారుతాత్మజః ।**
**యుద్ధకాంక్షీ పున ర్వీర స్తోరణం సముపాశ్రితః ॥ 41**

**పదచ్ఛేదము :–** సః – హత్వా – రాక్షసాన్ – వీరాన్ – కింకరాన్ – మారుతాత్మజః – యుద్ధకాంక్షీ – పునః – వీరః – తోరణం – సముపాశ్రితః ॥

**అన్వయక్రమము :–** సః మారుతాత్మజః వీరాన్ కింకరాన్ రాక్షసాన్ హత్వా యుద్ధకాంక్షీ పునః తోరణం సముపాశ్రితః.

**ప్రతిపదార్థము :–** సః = ఆ, వీరః = వీరుడైన, మారుతాత్మజః = వాయునందనుడు, వీరాన్ = వీరులైన, కింకరాన్ రాక్షసాన్ = కింకరులనెడి రాక్షసులను, హత్వా = హతమార్చి, పునః = తిరిగి, యుద్ధకాంక్షీ = యుద్ధమును కోరుచున్నవాడై, తోరణం = బహిర్ద్వారమును, సముపాశ్రితః = చేరుకొనెను.

**తాత్పర్యము :–** ఆ పవననందనుడు వీరులైన ఆ కింకరాసురులను హతమార్చి తిరిగి యుద్ధమును కాంక్షించుచు ఆ బహిర్ద్వారము మీదకే చేరి నిలచెను.

**శ్లో॥ తత స్తస్మా ద్భయా న్ముక్తాః కతిచి త్తత్ర రాక్షసాః ।**
**నిహతా న్కింకరా న్సర్వాన్ రావణాయ న్యవేదయన్ ॥ 42**

**పదచ్ఛేదము** :– తతః – తస్మాత్ – భయాత్ – ముక్తాః – కతిచిత్ – తత్ర – రాక్షసాః – నిహతాన్ – కింకరాన్ – సర్వాన్ – రావణాయ – న్యవేదయన్ ॥

**అన్వయక్రమము** :– తతః తత్ర తస్మాత్ భయాత్ ముక్తాః కతిచిత్ రాక్షసాః (గత్వా) రావణాయ సర్వాన్ కింకరాన్ నిహతాన్ న్యవేదయన్.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, తత్ర = ఆ యుద్ధభూమియందు, తస్మాత్ భయాత్ = ఆ భయమునుండి, ముక్తాః = విడువబడినట్టి, కతిచిత్ = కొద్దిమంది, రాక్షసాః = రాక్షసులు, (గత్వా = పోయి) రావణాయ = రావణునకు, సర్వాన్ కింకరాన్ = ఎల్ల కింకరాసురులను, నిహతాన్ = చనిపోయినవారినిగా, న్యవేదయన్ = నివేదించిరి.

**తాత్పర్యము** :– అప్పుడు అచ్చటి ఆ మారణమునుండి తప్పించుకొనిపోయి కొద్దిమంది రక్కసులు రావణుని కడకేగి ఆతనితో కింకరాసురులెల్లరును మడిసిరని విన్నవించిరి.

**శ్లో॥ స రాక్షసానాం నిహతం మహద్బలమ్**
**నిశమ్య రాజా పరివృత్తలోచనః ।**
**సమాదిదే శాప్రతిమం పరాక్రమే**
**ప్రహస్తపుత్రం సమరే సుదుర్జయమ్ ॥ 43**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"కింకరనిషూదనం" నామ*
*ద్విచత్వారింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– సః – రాక్షసానాం – నిహతం – మహత్ – బలం – నిశమ్య – రాజా – పరివృత్తలోచనః – సమాదిదేశ – అప్రతిమం – పరాక్రమే – ప్రహస్త పుత్రం – సమరే – సుదుర్జయమ్ ॥

**అన్వయక్రమము** :– సః రాజా రాక్షసానాం మహత్ బలం నిహతం నిశమ్య, పరివృత్త లోచనః సన్ పరాక్రమే అప్రతిమం, సమరే సుదుర్జయం ప్రహస్తపుత్రం (యుద్ధాయ) సమాదిదేశ.

**ప్రతిపదార్థము** :– సః రాజా = ఆ లంకాధిపతి, రాక్షసానాం = రాక్షసులయొక్క, మహత్ = గొప్పదైన, బలం = సైన్యమును, నిహతం = హతమైనదానినిగా, నిశమ్య = విని, పరివృత్తలోచనః సన్ = త్రిప్పబడిన కన్నులుగలవాడై, పరాక్రమే =

శౌర్యమునందు, అప్రతిమం = సాటిలేనివాడును, సమరే = యుద్ధమునందు, సుదుర్జయం = జయింపశక్యముగానివాడును అగు, ప్రహస్తపుత్రం = ప్రహస్తుని కుమారుని (జంబుమాలిని), (యుద్ధాయ = యుద్ధమునకై), సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :– ఆ రాక్షసరాజు గొప్పదైన తన రాక్షససైన్యమంతయు హతమారినదని వినగానే కన్నులు తిరిగిపోవుచుండగా వెంటనే పరాక్రమమునందు సాటిలేనివాడును యుద్ధమునందు జయింప శక్యముగాని వాడును అగు ప్రహస్తపుత్రుడైన జంబుమాలిని యుద్ధమునకై ఆజ్ఞాపించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"కింకర నిషూదనము' అను*
*నలుబదిరెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# త్రిచత్వారింశసర్గ

**శ్లో॥ తత స్స కింకరా న్హత్వా హనుమా న్ధ్యాన మాస్థితః ।**
**వనం భగ్నం మయా చైత్యప్రాసాదో న వినాశితః ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – సః – కింకరాన్ – హత్వా – హనుమాన్ – ధ్యానమ్ – ఆస్థితః, వనం – భగ్నం – మయా – చైత్యప్రాసాదః – న – వినాశితః ॥

**అన్వయక్రమము :–** తతః సః హనుమాన్ కింకరాన్ హత్వా ధ్యానమ్ ఆస్థితః "మయా వనం భగ్నం; చైత్యప్రాసాదః న వినాశితః"

(మీది శ్లోకముతో అన్వయము)

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, సః హనుమాన్ = ఆ హనుమ, కింకరాన్ = కింకరాసురులను, హత్వా = వధించి, ధ్యానమ్ ఆస్థితః = ఆలోచననొందెను, మయా = నాచేత, వనం = వనము, భగ్నం = ధ్వంసము చేయబడినది, చైత్యప్రసాదః = వనసౌధము, న వినాశితః = నాశనము చేయబడలేదు.

**తాత్పర్యము :–** అప్పుడు హనుమంతుడు ఆ కింకరాసురులను హతమార్చి పిమ్మట ఈ రీతిగా ఆలోచించెను. రావణాసురుని ఈ వనమును ధ్వంసము చేసితినిగాని ఈ రక్కసుల వనసౌధమును ధ్వంసము చేయలేదు.

**శ్లో॥ తస్మా త్ప్రాసాదమప్యేవ మిమం విధ్వంసయామ్యహమ్ ।**
**ఇతి సంచింత్య మనసా హనుమాన్ దర్శయన్ బలమ్ ॥ 2**

**శ్లో॥ చైత్యప్రాసాద మాప్లుత్య మేరుశృంగమివోన్నతమ్ ।**
**ఆరురోహ హరిశ్రేష్ఠో హనుమాన్ మారుతాత్మజః ॥ 3**

**పదచ్ఛేదము :–** తస్మాత్ – ప్రాసాదం – అపి – ఏవమ్ – ఇమం – విధ్వంసయామి – అహమ్ – ఇతి – సంచింత్య – మనసా – హనుమాన్ – దర్శయన్ – బలం, చైత్యప్రాసాదమ్ – ఆప్లుత్య – మేరుశృంగమ్ – ఇవ – ఉన్నతమ్; ఆరురోహ – హరిశ్రేష్ఠః – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :-** తస్మాత్ ఇమం ప్రాసాదమ్ అపి అహమ్ ఏవం విధ్వంసయామి, ఇతి మనసా సంచింత్య బలం దర్శయన్ హరిశ్రేష్ఠః మారుతాత్మజః హనుమాన్ మేరుశృంగమ్ ఇవ ఉన్నతం చైత్యప్రాసాదమ్ ఆప్లుత్య ఆరురోహ.

**ప్రతిపదార్థము :-** తస్మాత్ = అందువలన, ఇమం ప్రాసాదమ్ అపి = ఈ సౌధమును గూడ, ఏవం = ఈ రీతిగనే, అహం = నేను, విధ్వంసయామి = ధ్వంసము చేయుదును, ఇతి = అని, మనసా = మనస్సున, సంచింత్య = ఆలోచించి, బలం = శక్తిని, దర్శయన్ = చూపుచు, హరిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైన, మారుతాత్మజః హనుమాన్ = వాయునందనుడగు ఆ హనుమ, మేరుశృంగం ఇవ = మేరుశిఖరమునువలె, ఉన్నతం = ఎత్తయినట్టి, చైత్యప్రాసాదమ్ = వనశిలాసౌధమును, ఆప్లుత్య = గెంతి, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము :-** అందుచేత ఈ సౌధమును గూడ ఆ వనమును వలెనే ఇప్పుడే ధ్వంసము చేయుదునని నిశ్చయించి తన బలమును ప్రదర్శించుచు పవనసుతుడైన ఆ హనుమ మేరుపర్వత శిఖరమువలె ఉన్నతమైయున్న ఆ చైత్యప్రాసాదము మీదికి ఒక్క గంతులో ఎగిరి దానిపై కూర్చుండెను.

**శ్లో॥ ఆరుహ్య గిరిసంకాశం ప్రాసాదం హరియూథపః ।**
**బభౌ స సుమహాతేజాః ప్రతిసూర్య ఇవోదితః ॥ 4**

**పదచ్ఛేదము :-** ఆరుహ్య - గిరిసంకాశం - ప్రాసాదం - హరియూథపః - బభౌ - సః - సుమహాతేజాః - ప్రతిసూర్యః - ఇవ - ఉదితః ॥

**అన్వయక్రమము :-** సుమహాతేజాః సః హరియూథపః గిరిసంకాశం ప్రాసాదమ్ ఆరుహ్య, ఉదితః ప్రతిసూర్యః ఇవ బభౌ.

**ప్రతిపదార్థము :-** సుమహాతేజాః = మిక్కిలి గొప్పదైన తేజస్సు గలిగిన, సః హరియూథపః = ఆ వానరశ్రేష్ఠుడు, గిరిసంకాశం = పర్వతసన్నిభమైనట్టి, ప్రాసాదమ్ = చైత్యప్రాసాదమును, ఆరుహ్య = అధిష్ఠించి, ఉదితః = ఉదయించినట్టి, ప్రతిసూర్యః ఇవ = రెండవ సూర్యుడువలె, బభౌ = ప్రకాశించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** "ఉదితః ప్రతిసూర్యః ఇవ బభౌ" - ఉదయించిన రెండవ సూర్యునివలె ప్రకాశించెను అనగా తూర్పు దిక్కున అప్పుడే సూర్యోదయ మగుచుండెనని సూచింపబడెను.

**తాత్పర్యము :–** మహాతేజస్వియైన ఆ హనుమ మహాపర్వతము వలె నున్న ఆ యున్నత సౌధము నధిష్ఠించి అచ్చట ఇంకొక సూర్యు డుదయించి యున్నాడా అనునట్లుగా గొప్పగా ప్రకాశించుచుండెను.

**శ్లో॥ సంప్రధృష్య చ దుర్ధర్షం చైత్యప్రాసాద మున్నతమ్ ।**
**హనుమాన్ ప్రజ్వలన్ లక్ష్మ్యా పారియాత్రోపమోఽభవత్ ॥ 5**

**పదచ్ఛేదము :–** సంప్రధృష్య – చ – దుర్ధర్షం – చైత్యప్రాసాదమ్ – ఉన్నతమ్ – హనుమాన్ – ప్రజ్వలన్ – లక్ష్మ్యా – పారియాత్రోపమః – అభవత్ ॥

**అన్వయక్రమము :–** దుర్ధర్షమ్, ఉన్నతం చైత్యప్రాసాదం సంప్రధృష్య హనుమాన్ లక్ష్మ్యా ప్రజ్వలన్ పారియాత్రోపమః అభవత్.

**ప్రతిపదార్థము :–** దుర్ధర్షం = చలింపజేయరాని, చైత్యప్రాసాదం = శిలాసౌధమును, సంప్రధృష్య = ధ్వంసముచేసి, హనుమాన్ = హనుమ, లక్ష్మ్యా = శోభతో, ప్రజ్వలన్ = మిక్కిలి ప్రకాశించుచు, పారియాత్రోపమః = పారియాత్రపర్వతమును బోలినవాడు, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము :–** వెంటనే హనుమ మహాబలిష్ఠమై ఉన్నతముగానున్న ఆ చైత్య ప్రాసాదమును ధ్వంసముచేసి శౌర్యలక్ష్మితో విరాజిల్లుచు పారియాత్ర పర్వతమువలె కనిపించుచుండెను.

**శ్లో॥ స భూత్వా సుమహాకాయః ప్రభావా న్మారుతాత్మజః ।**
**ధృష్ట మాస్ఫోటయామాస లంకాం శబ్దేన పూరయన్ ॥ 6**

**పదచ్ఛేదము :–** సః – భూత్వా – సుమహాకాయః – ప్రభావాత్ – మారుతాత్మజః – ధృష్టమ్ – ఆస్ఫోటయామాస – లంకాం – శబ్దేన – పూరయన్ ॥

**అన్వయక్రమము :–** సః మారుతాత్మజః ప్రభావాత్ సుమహాకాయః భూత్వా లంకాం శబ్దేన పూరయన్ ధృష్టమ్ ఆస్ఫోటయామాస.

**ప్రతిపదార్థము :–** సః మారుతాత్మజః = ఆ వాయునందనుడు, ప్రభావాత్ = మహిమ వలన, సుమహాకాయః = మిక్కిలి పెద్దదైన శరీరము గలవాడుగా, భూత్వా = అయి, లంకాం = లంకను, శబ్దేన = ధ్వనితో, పూరయన్ = నింపుచు, ధృష్టం = కఠోరముగా, ఆస్ఫోటయామాస = చఱచెను.

**తాత్పర్యము :–** పెద్దగా శరీరమును పెంచి లంకానగరమునంతను ధ్వనితో నింపించుచు మిక్కిలి కఠోరముగా భుజాస్ఫాలనము గావించెను.

**శ్లో॥ త స్యాస్ఫోటితశబ్దేన మహతా శ్రోత్రఘాతినా ।**
**పేతు ర్విహంగమా స్తత్ర చైత్యపాలాశ్చ మోహితాః ॥ 7**

**పదచ్ఛేదము :-** తస్య - ఆస్ఫోటితశబ్దేన - మహతా - శ్రోత్రఘాతినా - పేతుః - విహంగమాః - తత్ర - చైత్యపాలాః - చ - మోహితాః ॥

**అన్వయక్రమము :-** శ్రోత్రఘాతినా మహతా తస్య ఆస్ఫోటితశబ్దేన తత్ర విహంగమాః పేతుః; చైత్యపాలాః చ మోహితాః.

**ప్రతిపదార్థము :-** శ్రోత్రఘాతినా = చెవులను బ్రద్దలుగొట్టునట్టి, మహతా = గొప్పదైనట్టి, తస్య = ఆ హనుమయొక్క, ఆస్ఫోటితశబ్దేన = ఆస్ఫాలనధ్వనిచేత, తత్ర = అచ్చటి, విహంగమాః = పక్షులు, పేతుః = పడినవి, చైత్యపాలాః = ప్రాసాదరక్షకులు, మోహితాః (అభవన్) = మూర్ఛితులైరి.

**తాత్పర్యము :-** చెవులు బ్రద్దలగునట్లు పెద్దధ్వనితో హనుమ గావించినట్టి ఆ భుజాస్ఫాలన శబ్దమునకు ఆకాశమున ఎగురుచున్న పక్షులు భయవిహ్వలములై నేలకూలినవి. ఆ చైత్యరక్షకులు ఎల్లరును మూర్ఛనొందిరి.

**శ్లో॥ అస్త్రవి జ్జయతాం రామో లక్ష్మణశ్చ మహాబలః ।**
**రాజా జయతి సుగ్రీవో రాఘవేణాభిపాలితః ॥ 8**

**శ్లో॥ దాసోఽహం కోసలేంద్రస్య రామ స్యాక్లిష్టకర్మణః ।**
**హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః ॥ 9**

**శ్లో॥ న రావణసహస్రం మే యుద్ధే ప్రతిబలం భవేత్ ।**
**శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః ॥ 10**

**శ్లో॥ అర్దయిత్వా పురీం లంకా మభివాద్య చ మైథిలీమ్ ।**
**సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్ ॥ 11**

**పదచ్ఛేదము :-** అస్త్రవిత్ - జయతాం - రామః - లక్ష్మణః - చ - మహాబలః - రాజా - జయతి - సుగ్రీవః - రాఘవేణ - అభిపాలితః - దాసః - అహం - కోసలేంద్రస్య - రామస్య - అక్లిష్టకర్మణః - హనుమాన్ - శత్రుసైన్యానాం - నిహంతా - మారుతాత్మజః - న - రావణసహస్రం - మే - యుద్ధే - ప్రతిబలం - భవేత్ - శిలాభిః - తు - ప్రహరతః - పాదపైః - చ - సహస్రశః - అర్దయిత్వా - పురీం - లంకామ్ - అభివాద్య - చ - మైథిలీమ్ - సమృద్ధార్థో - గమిష్యామి

– మిషతాం – సర్వరక్షసామ్ ॥

**అన్వయక్రమము :–** అస్త్రవిత్ రామః జయతామ్, మహాబలః లక్ష్మణశ్చ జయతామ్, రాఘవేణ అభిపాలితః రాజా సుగ్రీవః జయతి, అహం అక్లిష్టకర్మణః కోసలేంద్రస్య రామస్య దాసః, శత్రుసైన్యానాం నిహంతా (అహం) మారుతాత్మజః హనుమాన్, సహస్రశః శిలాభిః పాదపైః చ ప్రహరతః మే యుద్ధే రావణసహస్రం ప్రతిబలం న భవేత్, సర్వరక్షసాం మిషతాం (సతాం) లంకాం పురీం అర్దయిత్వా మైథిలీమ్ అభివాద్య చ సమృద్ధార్థః (సన్) గమిష్యామి.

**ప్రతిపదార్థము :–** అస్త్రవిత్ = అస్త్రకోవిదుడైన, రామః = శ్రీరాముడు, జయతాం = జయించుగాక; మహాబలః = బలాఢ్యుడైన, లక్ష్మణశ్చ = లక్ష్మణుడును, జయతాం = వర్ధిలుగాక, రాఘవేణ = శ్రీరామునిచే, అభిపాలితః = సంరక్షింపబడిన, రాజా సుగ్రీవః = రాజైన సుగ్రీవుడు, జయతి = వర్ధిల్లుచున్నాడు, అహం = నేను, అక్లిష్టకర్మణః = క్లేశముగూర్పని కృత్యములు గల్గినట్టి, కోసలేంద్రస్య = కోసలాధిపతియగు, రామస్య = శ్రీరామునకు, దాసః = బంటును, శత్రుసైన్యానాం = శత్రుసైన్యములకు, నిహంతా = మారకుడనగు, అహం = నేను, మారుతాత్మజః = వాయుపుత్రుడనగు, హనుమాన్ = హనుమంతుడను పేరుగలవాడను, సహస్రశః = వేలకొలదిగ, శిలాభిః = ఱాళ్ళతోడను, పాదపైః చ = వృక్షములతోడను, ప్రహరతః = ప్రహరించుచున్నట్టి, మే = నాకు, యుద్ధే = యుద్ధమునందు, రావణసహస్రం = వేయిమంది రావణుల సమూహము, ప్రతిబలం = ప్రతిపక్షము, న భవేత్ = కాజాలరు, సర్వరక్షసాం = రాక్షసులెల్లరును, మిషతాం (సతాం) = చూచుచుండగా, లంకాం పురీం = లంకానగరమును, అర్దయిత్వా = ధ్వంసముచేసి, మైథిలీం = జానకిని, అభివాద్య చ = మ్రొక్కియు, సమృద్ధార్థః = సంపన్నమైన కార్యము గలవాడనై, గమిష్యామి = వెడలిపోవుదును.

**తాత్పర్యము :–** సర్వాస్త్రవిద్యలును తెలిసినట్టి శ్రీరాముడు సర్వోత్కర్షతో వర్ధిల్లుగాక! మహాబలాఢ్యుడైన లక్ష్మణుడును వర్ధిల్లుగాక! శ్రీరామునిచే సంరక్షింపబడిన సుగ్రీవమహారాజు వర్ధిల్లుచున్నాడు. క్లేశకృత్యమును ఎఱుగనట్టి కోసలప్రభువైన శ్రీరామునకు నేను బంటును. శత్రుసైన్యములను పరిమార్చువాడనగు నేను వాయునందనుడైన హనుమంతుడను. వేలకొలదిగ శిలలతోడను, వృక్షములతోడను ప్రహరించుచు యుద్ధముచేయునట్టి నాకు రణరంగమునందు వేయిమంది రావణులైనను ఎదురుగ నిలువగల ప్రతివీరులు గాజాలరు. ఈ రాక్షసులెల్లరును చూచుచుండగనే లంకానగరమును ధ్వంసముచేసి మా జానకీదేవికి మ్రొక్కి నే దలపెట్టిన

కార్యమును సాధించుకొని వెడలిపోవుదును.

**శ్లో॥ ఏవ ముక్త్వా మహాబాహు శ్చైత్యస్థో హరియూథపః ।**
**ననాద భీమనిర్హ్రాదో రక్షసాం జనయ న్భయమ్ ॥ 12**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - ఉక్త్వా - మహాబాహుః - చైత్యస్థః - హరియూథపః - ననాద - భీమనిర్హ్రాదః - రక్షసాం - జనయన్ - భయమ్ ॥

**అన్వయక్రమము** :- మహాబాహుః హరియూథపః చైత్యస్థః (సన్) ఏవమ్ ఉక్త్వా రక్షసాం భయం జనయన్ భీమనిర్హ్రాదః సన్ ననాద.

**ప్రతిపదార్థము** :- మహాబాహుః = మహావీరుడైనట్టియు, హరియూథపః = వానరవీర శ్రేష్ఠుడైనట్టియు హనుమ, ఏవమ్ ఉక్త్వా = ఇట్లు పలికిన, రక్షసాం = రక్కసులకు, భయం = భీతిని, జనయన్ = కలిగించుచు, భీమనిర్హ్రాదః (సన్) = భీకరమైన ధ్వనిగలవాడై, ననాద = గర్జించెను.

**తాత్పర్యము** :- మహావీరుడైన ఆ వానరశ్రేష్ఠుడు చైత్యప్రాసాదముపై నిలచి ఈరీతిగ ఘోషించుచు రాక్షసులకు మహాభీతిని కల్గించుచు భయంకరమైన శబ్దముతో గర్జన చేసెను.

**శ్లో॥ తేన శబ్దేన మహతా చైత్యపాలా శ్శతం యయుః ।**
**గృహీత్వా వివిధా నస్త్రా న్ప్రాసా న్ఖడ్గా న్పరశ్వధాన్ ।**
**విసృజంతో మహాకాయా మారుతిం పర్యవారయన్ ॥ 13**

**పదచ్ఛేదము** :- తేన - శబ్దేన - మహతా - చైత్యపాలాః - శతం - యయుః - గృహీత్వా - వివిధాన్ - అస్త్రాన్ - ప్రాసాన్ - ఖడ్గాన్ - పరశ్వధాన్ - విసృజంతః - మహాకాయాః - మారుతిం - పర్యవారయన్ ॥

**అన్వయక్రమము** :- మహతా తేన శబ్దేన శతం చైత్యపాలాః వివిధాన్ అస్త్రాన్ గృహీత్వా యయుః, మహాకాయాః (తే) ప్రాసాన్ ఖడ్గాన్ పరశ్వధాన్ విసృజంతః మారుతిం పర్యవారయన్.

**ప్రతిపదార్థము** :- మహతా = గొప్పదైనట్టి, తేన శబ్దేన = ఆ ధ్వనిచేత, శతం = వందమంది, చైత్యపాలాః = చైత్యపాలకులు, వివిధాన్ = బహువిధములైన, అస్త్రాన్ = అస్త్రములను, గృహీత్వా = గ్రహించి, యయుః = బయలువెడలిరి, మహాకాయాః = గొప్పదైన శరీరముగల, తే = ఆ చైత్యపాలురు, ప్రాసాన్ = ఈటెలను, ఖడ్గాన్ = ఖడ్గములను, పరశ్వధాన్ = గండ్రగొడ్డళ్ళను, విసృజంతః = విసరుచు, మారుతిం =

హనుమను, పర్యవారయన్ = చుట్టుముట్టిరి.

**తాత్పర్యము :–** హనుమ గావించిన ఆ భీకరగర్జనకు అచటి చైత్యపాలకులు వందమంది వివిధములగు ఆయుధములను ధరించి యుద్ధమునకు వచ్చిరి. భీకరమైన శరీరములు కలిగిన ఆ చైత్యపాలురు హనుమమీదికి ఈటెలను, కత్తులను, గండ్రగొడ్డళ్ళను విసరుచు ఆతనిని చుట్టుముట్టిరి.

**శ్లో॥ తే గదాభి ర్విచిత్రాభిః పరిఘైః కాంచనాంగదైః ।**
**ఆజఘ్ను ర్వానరశ్రేష్ఠం బాణై శ్చాదిత్యసన్నిభైః ॥ 14**

**పదచ్ఛేదము :–** తే – గదాభిః – విచిత్రాభిః – పరిఘైః – కాంచనాంగదైః – ఆజఘ్నుః – వానరశ్రేష్ఠమ్ – బాణైః – చ – ఆదిత్యసన్నిభైః ॥

**అన్వయక్రమము :–** తే, విచిత్రాభిః గదాభిః కాంచనాంగదైః పరిఘైః ఆదిత్యసన్నిభైః బాణైః చ వానరశ్రేష్ఠమ్ ఆజఘ్నుః.

**ప్రతిపదార్థము :–** తే = వారు, విచిత్రాభిః = విచిత్రములైనట్టి, గదాభిః = గదలతోడను, కాంచనాంగదైః = బంగారు అలంకారములు గల, పరిఘైః = పరిఘలతోడను, ఆదిత్యసన్నిభైః = సూర్యునితో సమానమైన, బాణైః చ = బాణములతోడను, వానర శ్రేష్ఠం = వానరశ్రేష్ఠుడైన హనుమను, ఆజఘ్నుః = ప్రహరించిరి.

**తాత్పర్యము :–** ఆ చైత్యపాలకులు విచిత్రములైన గదలతోడను, బంగారు నడికట్టుగల ఇనుప గుదియలతోడను, సూర్యునివలె ప్రకాశించు బాణములతోడను ఆ వానరవీరుని ప్రహరింపసాగిరి.

**శ్లో॥ ఆవర్త ఇవ గంగాయా స్తోయస్య విపులో మహాన్ ।**
**పరిక్షిప్య హరిశ్రేష్ఠం స బభౌ రక్షసాం గణః ॥ 15**

**పదచ్ఛేదము :–** ఆవర్తః – ఇవ – గంగాయాః – తోయస్య – విపులం – మహాన్ – పరిక్షిప్య – హరిశ్రేష్ఠం – సః – బభౌ – రక్షసాం – గణః ॥

**అన్వయక్రమము :–** గంగాయాః తోయస్య విపులః మహాన్ ఆవర్తః ఇవ, సః రక్షసాం గణః హరిశ్రేష్ఠం పరిక్షిప్య బభౌ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ, రక్షసాం = రాక్షసులయొక్క, గణః = సమూహము, హరిశ్రేష్ఠం = వానరశ్రేష్ఠుడైన హనుమను, పరిక్షిప్య = చుట్టుముట్టి, గంగాయాః = గంగానదియొక్క, తోయస్య = జలముయొక్క, విపులః = విస్తారమైనదియును, మహాన్ = గొప్పదియు నగు, ఆవర్తః ఇవ = సుడివలె, బభౌ = ప్రకాశించెను.

**తాత్పర్యము :-** ఆ రాక్షసుల సమూహము హనుమను చుట్టుముట్టినప్పుడు ఆ దృశ్యము గంగానదీ ప్రవాహజలములో కానవచ్చెడి గొప్పదైన పెద్ద సుడిగుండమువలె వింతగా కనిపించెను.

**శ్లో॥ తతో వాతాత్మజః క్రుద్ధో భీమం రూపం సమాస్థితః ।**
**ప్రాసాదస్య మహాంతస్య స్తంభం హేమపరిష్కృతమ్ ॥ 16**

**శ్లో॥ ఉత్పాటయిత్వా వేగేన హనుమా న్పవనాత్మజః ।**
**తత స్తం భ్రామయామాస శతధారం మహాబలః ॥ 17**

**పదచ్ఛేదము :-** తతః - వాతాత్మజః - క్రుద్ధః - భీమం - రూపం - సమాస్థితః - ప్రాసాదస్య - మహాంతస్య - స్తంభం - హేమపరిష్కృతమ్ - ఉత్పాటయిత్వా - వేగేన - హనుమాన్ - పవనాత్మజః - తతః - తం - భ్రామయామాస - శతధారం - మహాబలః ॥

**అన్వయక్రమము :-** తతః క్రుద్ధః వాతాత్మజః భీమం రూపం సమాస్థితః - మహాంతస్య ప్రాసాదస్య హేమపరిష్కృతం స్తంభమ్ ఉత్పాటయిత్వా తతః మహాబలః పవనాత్మజః హనుమాన్ శతధారం తం వేగేన భ్రామయామాస.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, క్రుద్ధః = క్రోధితుడైన, వాతాత్మజః = హనుమ, భీమం రూపం = భయంకరమైన రూపమును, సమాస్థితః = ధరించినవాడై, మహాంతస్య = గొప్పదైన శిఖరముగల, ప్రాసాదస్య = చైత్యప్రాసాదముయొక్క, హేమపరిష్కృతం = బంగారునగిషీ గలిగినట్టి, స్తంభం = స్తంభమును, ఉత్పాటయిత్వా = పెల్లగించి, తతః = పిమ్మట, మహాబలః = మహాబలశాలియైన, పవనాత్మజః = వాయునందనుడగు, హనుమాన్ = హనుమ, శతధారం = నూఱుఅంచులు గలిగినట్టి, తం = ఆ స్తంభమును, వేగేన = వేగముతో, భ్రామయామాస = త్రిప్పదొడగెను.

**సూచన :-** ఇట శతధారం తం భ్రామయామాస అను పదములను, తం శతధా అరం భ్రామయామాస, అనగా ఆ స్తంభమును నూఱువిధములుగా వేగముగా త్రిప్పుచుండెను అని ఇంకొక అన్వయము గలదు. (అరం = వేగముగా)

**తాత్పర్యము :-** అటుపిమ్మట వాయునందనుడు మిక్కిలి క్రోధము నొంది భయంకరమైన రూపమును దాల్చినవాడై గొప్పదైనట్టి ఆ ప్రాసాదమునందలి స్వర్ణభూషితమైన ఒకానొక స్తంభమును పెఱికివేచి వజ్రాయుధమువలె నూఱుమొనలతో ప్రకాశించుచున్నట్టి ఆ స్తంభమును తనచేతితో మహావేగముగా త్రిప్పదొడగెను.

**శ్లో॥ తత్ర చాగ్ని స్సమభవ త్ప్రాసాద శ్చా ప్యదహ్యత ।**
**దహ్యామానం తతో దృష్ట్వా ప్రాసాదం హరియూథపః ॥ 18**

**శ్లో॥ స రాక్షసశతం హత్వా వజ్రే ణేంద్ర ఇవాసురాన్ ।**
**అంతరిక్షే స్థిత శ్శ్రీమా నిదం వచన మబ్రవీత్ ॥ 19**

**పదచ్ఛేదము** :- తత్ర - చ - అగ్నిః - సమభవత్ - ప్రాసాదః - చ - అపి - అదహ్యత - దహ్యామానం - తతః - దృష్ట్వా - ప్రాసాదం - హరియూథపః - సః - రాక్షసశతం - హత్వా - వజ్రేణ - ఇంద్రః - ఇవ - అసురాన్ - అంతరిక్షే - స్థితః - శ్రీమాన్ - ఇదం - వచనమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- తత్ర అగ్నిః చ సమభవత్ - ప్రాసాదః చ అపి అదహ్యత. తతః సః హరియూథపః దహ్యామానం ప్రాసాదం దృష్ట్వా ఇంద్రః వజ్రేణ అసురాన్ ఇవ రాక్షసశతం హత్వా శ్రీమాన్ అంతరిక్షే స్థితః (సన్) ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ స్తంభమునందు, అగ్నిః = అగ్ని, సమభవత్ = జనియించెను, ప్రాసాదః చ అపి = ఆ చైత్యప్రాసాదము కూడ, అదహ్యత = దహింపబడెను, తతః = పిమ్మట, హరియూథపః = వానరవీరుడైన హనుమ, దహ్యామానం = దహింపబడుచున్న, ప్రాసాదం = చైత్యప్రాసాదమును, దృష్ట్వా = చూచి, ఇంద్రః = దేవేంద్రుడు, వజ్రేణ = వజ్రాయుధముచే, అసురాన్ ఇవ = రాక్షసులనువలె, రాక్షసశతం = నూఱుమంది రాక్షసులను, హత్వా = వధించి, శ్రీమాన్ = ఆ శోభాసమన్వితుడైన హనుమ, అంతరిక్షే = ఆకాశమున, స్థితః సన్ = నిలచినవాడై, ఇదం వచనమ్ = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- అప్పుడా ఇనుప ప్రాసాద స్తంభము ఇతరములైన ఇనుపస్తంభములతో రాచుకొని అగ్ని ఉద్భవించినది. ఆ యగ్నిచే ఆ చైత్యప్రాసాదము తగులబడినది. హనుమ అట్లు తగులబడుచున్న ఆ చైత్యప్రాసాదమును చూచి ఆ చైత్యపాలకులైన వందమంది రాక్షసులను ఇంద్రుడు వజ్రాయుధముచే రాక్షసులను వధించినట్లు చంపివేసి అంతరిక్షమున కెగిరి అచట నిలచి ఈ విధముగా పలికెను.

**శ్లో॥ మాదృశానాం సహస్రాణి విసృష్టాని మహాత్మనామ్ ।**
**బలినాం వానరేంద్రాణాం సుగ్రీవవశవర్తినామ్ ॥ 20**

**పదచ్ఛేదము** :- మాదృశానాం - సహస్రాణి - విసృష్టాని - మహాత్మనామ్ - బలినాం - వానరేంద్రాణాం - సుగ్రీవవశవర్తినామ్ ॥

**అన్వయక్రమము :–** సుగ్రీవవశవర్తినామ్, వానరేంద్రాణాం, బలినాం మహాత్మనాం, మాదృశానాం సహస్రాణి విసృష్టాని.

**ప్రతిపదార్థము :–** సుగ్రీవవశవర్తినాం = సుగ్రీవుని వశవర్తులైనట్టియు, బలినాం = బలాఢ్యులైనట్టియు, మహాత్మనాం = మహనీయులైనట్టియు, మాదృశానాం = నావంటి, వానరేంద్రాణాం = వానరశ్రేష్ఠులయొక్క, సహస్రాణి = వేలసంఖ్యలు గలవారు, విసృష్టాని = పంపబడిరి.

**తాత్పర్యము :–** సుగ్రీవుని ఆజ్ఞానువర్తనులై మహాబలశాలులై యున్న నావంటి వానరశ్రేష్ఠులు వేలకొలదిగా ఈ రీతిగా నలుమూలలకును పంపబడినారు.

**శ్లో॥ అటంతి వసుధాం కృత్స్నాం వయ మన్యే చ వానరాః ।**
**దశనాగబలాః కేచి త్కేచి ద్దశగుణోత్తరాః ॥ 21**

**శ్లో॥ కేచి న్నాగసహస్రస్య బభూవు స్తుల్యవిక్రమాః ।**
**సంతి చౌఘబలాః కేచి త్కేచి ద్వాయుబలోపమాః ।**
**అప్రమేయబలా శ్చాన్యే త త్రాస న్హరియూథపాః ॥ 22**

**పదచ్ఛేదము :–** అటంతి – వసుధాం – కృత్స్నాం – వయమ్ – అన్యే – చ – వానరాః – దశనాగబలాః – కేచిత్ – కేచిత్ – దశగుణోత్తరాః – కేచిత్ – నాగసహస్రస్య – బభూవుః – తుల్యవిక్రమాః – సంతి – చ – ఓఘబలాః – కేచిత్ – కేచిత్ – వాయుబలోపమాః – అప్రమేయబలాః – చ – అన్యే – తత్ర – ఆసన్ – హరియూథపాః ॥

**అన్వయక్రమము :–** వయం అన్యే వానరాః చ కృత్స్నాం వసుధామ్ అటంతి, (తేషు) కేచిత్ దశనాగబలాః, కేచిత్ దశగుణోత్తరాః, కేచిత్ నాగసహస్రస్య తుల్యవిక్రమాః బభూవుః, కేచిత్ ఓఘబలాః, కేచిత్ వాయుబలోపమాః సంతి, తత్ర అన్యే హరియూథపాః అప్రమేయబలాః చ – ఆసన్.

**ప్రతిపదార్థము :–** వయం = మేమును, అన్యే = ఇతరులైన, వానరాః చ = వానరులును, కృత్స్నాం = సంపూర్ణమైన, వసుధామ్ = భూమిని, అటంతి = పర్యటించుచున్నారు, తేషు = వారిలో, కేచిత్ = కొంతమంది, దశనాగబలాః = పదిఏనుగుల బలముగలవారుగను, కేచిత్ = కొంతమంది, దశగుణోత్తరాః = వారికంటెను పదిరెట్లు బలముగల వారుగను, కేచిత్ = కొంతమంది, నాగసహస్రస్య = వేయిఏనుగుల యొక్క, తుల్యవిక్రమాః = సమానమైన పరాక్రమము గలవారుగను ఉన్నారు, కేచిత్

= కొంతమంది, ఓఘబలాః = ప్రవాహముయొక్క బలమువంటి బలముగలవారు గను, కేచిత్ వాయుబలోపమాః = కొంతమంది వాయువుయొక్క బలముతో సమానమైన బలము కలవారుగను, సంతి = ఉన్నారు, తత్ర = అచ్చట, అన్యే = ఇతరులైన, హరియూథపాః = వానరయోధులు, అప్రమేయబలాః చ = అపరిమితమైన బలము గలవారుగను, ఆసన్ = ఉండిరి.

**తాత్పర్యము** :- ఈ విధముగా మేమును మిగిలిన వానరవీరులును భూమండల మంతయును పర్యటించుచున్నాము. మాలో కొందఱు పది ఏనుగుల బలముగలవారు. కొంతమంది వంద ఏనుగుల బలముతో సమానమైన బలము గలవారును, కొంతమంది వేయిఏనుగులతో సమానమైన బలముగలవారును ఉన్నారు. మఱియు మావారు కొందఱు మహానదీప్రవాహముతో సమానమైన బలము గలవారును, వాయుదేవునితో సమానమైన బలముగలవారును పెక్కుమంది యున్నారు. వారిలో మఱికొందఱు వానరయోధులు అపరిమితమైన పరాక్రమము గలవారు కూడ నున్నారు.

**సూచన** :- ఓఘబలాః - ఓఘమనునది ఒక పెద్దసంఖ్య. అట్టి సంఖ్యగల ఏనుగుల బలముగలవారు మఱికొంతమంది వానరులు అని కొందఱు వాఖ్యాతలు అర్థము చెప్పిరి.

**శ్లో॥ ఈదృగ్విధైస్తు హరిభి ర్వృతో దంతనఖాయుధైః ।**
**శతై శ్శతసహస్రైశ్చ కోటీభి రయుతైరపి ।**
**ఆగమిష్యతి సుగ్రీవ స్సర్వేషాం వో నిషూదనః ॥ 23**

**పదచ్ఛేదము** :- ఈదృగ్విధైః - తు - హరిభిః - వృతః - దంతనఖాయుధైః - శతైః - శతసహస్రైః - చ - కోటీభిః - అయుతైః - అపి - ఆగమిష్యతి - సుగ్రీవః - సర్వేషాం - వః - నిషూదనః ॥

**అన్వయక్రమము** :- ఈదృగ్విధైః దంతనఖాయుధైః శతైః శతసహస్రైః చ కోటీభిః అయుతైః అపి హరిభిః వృతః సర్వేషాం వః నిషూదనః (సన్) సుగ్రీవః ఆగమిష్యతి.

**ప్రతిపదార్థము** :- శతైః = వందలకొలదియు, శతసహస్రైః చ = లక్షలకొలదియు, కోటీభిః = కోట్ల కొలదియు, అయుతైః అపి = అయుత సంఖ్య కలిగినట్టియు, ఈదృగ్విధైః = ఈ విధముగనున్నట్టి, దంతనఖాయుధైః = దంతములు నఖములు ఆయుధములుగాగల, హరిభిః = వానరులతో, వృతః = కూడినవాడై, సుగ్రీవః = సుగ్రీవుడు, సర్వేషాం వః = మీ అందఱికిని, నిషూదనః (సన్) = మారకుడగుచు, ఆగమిష్యతి = రాగలడు.

**తాత్పర్యము** :– వందలకొలదియు, లక్షలకొలదియు, కోట్లకొలదియు, పదివేలకోట్ల కొలదియు నున్నట్టి ఈ విధమైన మహాబలాఢ్యులైన, తమ దంతములు నఖములు ఆయుధములుగా చేసికొని పోరాడు వానరవీరులతో కూడినవాడై మా సుగ్రీవమహారాజు మిమ్ముల నందరను తుదముట్టించుటకై త్వరలోనే రాబోవుచున్నాడు సుమీ!

**శ్లో॥ నేయ మస్తి పురీ లంకా న యూయం న చ రావణః ।**
**యస్మా దిక్ష్వాకునాథేన బద్ధం వైరం మహాత్మనా ॥ 24**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"చైత్యప్రాసాదదాహో" నామ*
*త్రిచత్వారింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– న – ఇయమ్ – అస్తి – పురీ – లంకా – న – యూయం – న – చ – రావణః – యస్మాత్ – ఇక్ష్వాకునాథేన – బద్ధం – వైరం – మహాత్మనా ॥

**అన్వయక్రమము** :– యస్మాత్ మహాత్మనా ఇక్ష్వాకునాథేన వైరం బద్ధం (తస్మాత్) ఇయం లంకాపురీ ఇతః పరం న అస్తి, యూయం (న స్థ) రావణః చ న అస్తి.

**ప్రతిపదార్థము** :– యస్మాత్ = ఎందువలననైతే, మహాత్మనా = మహనీయుడైన, ఇక్ష్వాకునాథేన = ఇక్ష్వాకువంశప్రభువైన శ్రీరామునితో, వైరం = శత్రుత్వము, బద్ధం = కూర్చబడెనో, (తస్మాత్ = ఆ కారణమువలన) ఇయం లంకాపురీ = ఈ లంకానగరము, ఇతః పరం = ఇకమీదట, న అస్తి = ఉండదు, యూయం చ = మీరును, న(స్థ) = ఉండరు, రావణః చ = రావణుడు, న అస్తి = ఉండదు.

**తాత్పర్యము** :– మహాత్ముడైన ఇక్ష్వాకు వంశ ప్రభువగు శ్రీరామునితో మీరు వైరమును పెట్టుకొన్నారు కాబట్టి ఇకమీదట ఈ లంకానగరము ఉండదు. మీరెవ్వరును ఉండరు. అట్లే రావణుడును ఉండడు సుమీ!

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"చైత్య ప్రాసాద దహనము" అను*
*నలుబదిమూడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుశ్చత్వారింశసర్గ

**శ్లో॥ సందిష్టో రాక్షసేంద్రేణ ప్రహస్తస్య సుతో బలీ ।**
**జంబుమాలీ మహాదంష్ట్రో నిర్జగామ ధనుర్ధరః ॥ 1**

**శ్లో॥ రక్తమాల్యాంబరధరః స్రగ్వీ రుచిరకుండలః ।**
**మహా న్వివృత్తనయన శ్చండ స్సమరదుర్జయః ॥ 2**

**శ్లో॥ ధను శ్శక్రధనుఃప్రఖ్యం మహ ద్రుచిరసాయకమ్ ।**
**విస్ఫారయాణో వేగేన వజ్రాశనిసమస్వనమ్ ॥ 3**

**పదచ్ఛేదము** :– సందిష్టః – రాక్షసేంద్రేణ – ప్రహస్తస్య – సుతః – బలీ – జంబుమాలీ – మహాదంష్ట్రః – నిర్జగామ – ధనుర్ధరః – రక్తమాల్యాంబరధరః – స్రగ్వీ – రుచిరకుండలః – మహాన్ – వివృత్తనయనః – చండః – సమరదుర్జయః – ధనుః – శక్రధనుఃప్రఖ్యం – మహత్ – రుచిరసాయకం – విస్ఫారయాణః – వేగేన – వజ్రాశనిసమస్వనమ్ ॥

**అన్వయక్రమము** :– రాక్షసేంద్రేణ సందిష్టః ప్రహస్తస్య సుతః, బలీ జంబుమాలీ ధనుర్ధరః, మహాదంష్ట్రః రక్తమాల్యాంబరధరః స్రగ్వీ, రుచిరకుండలః, మహాన్, చండః, సమరదుర్జయః వివృత్తనయనః, (సన్) శక్రధనుఃప్రఖ్యం, రుచిరసాయకం, వజ్రాశనిసమస్వనం, మహత్ ధనుః వేగేన విస్ఫారయాణః నిర్జగామ.

**ప్రతిపదార్థము** :– రాక్షసేంద్రేణ = రాక్షసాధిపుడైన రావణునిచే, సందిష్టః = ఆజ్ఞాపింపబడినవాడై, ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క, సుతః = పుత్రుడు, బలీ = బలాఢ్యుడైన, జంబుమాలీ = జంబుమాలియనువాడు, ధనుర్ధరః = గొప్పధనుస్సును ధరించినవాడును, మహాదంష్ట్రః = పెద్దకోఱలు కలవాడును, రక్తమాల్యాంబరధరః = ఎఱ్ఱని పూలమాలికలను, వస్త్రములను ధరించినవాడును, రుచిరకుండలః = సుందరమైన కర్ణాభరణములు గలవాడును, మహాన్ = గొప్పవాడును, చండః = భీకరుడును, సమరదుర్జయః = యుద్ధమున జయింప శక్యముగాని వాడును,

వివృత్తనయనః (సన్) = తిరుగుడు కన్నులు గలవాడును అగుచు, శక్రధనుఃప్రఖ్యం = ఇంద్రధనుస్సుతో సమానమైనదియును, రుచిరసాయకం = సుందరమైన బాణము గలదియును, వజ్రాశనిసమస్వనం = పిడుగుతో సమానమైన ధ్వనిగలదియునగు, మహత్ = గొప్పదైన, ధనుః = ధనుస్సును, విస్ఫారయాణః = సారించుచున్నవాడై, నిర్జగామ = బయలువెడలెను.

**తాత్పర్యము** :– రాక్షసరాజైన రావణుడు ప్రహస్తుని పుత్రుడైన మహాబలాఢ్యుడగు జంబుమాలిని హనుమను ఎదుర్కొనుటకు ఆజ్ఞాపింపగా ఆతడు ధనుర్ధారియై యుద్ధమునకు బయలుదేరి వచ్చెను. ఆ జంబుమాలి భీకరమైన కోఱలును, ఎఱ్ఱని పూలమాలలను, వస్త్రములను, సుందరమైన హారములను మనోహరమైన కర్ణాభరణములను ధరించి, యుద్ధమునందు జయింపరానివాడుగను, భయంకరుడుగను మహావీరుడుగను కన్పట్టుచు తనగ్రుడ్లు త్రిప్పుచు ఇంద్రధనుస్సును బోలిన తన గొప్పధనుస్సును సుందరమైన బాణములతో చేత ధరించి పెద్దపిడుగు మ్రోతవంటి ధ్వనిగల్గునట్లుగా వేగముగ వింటినారిని మ్రోగించుచు బయలుదేరెను.

**శ్లో॥ తస్య విస్ఫారఘోషేణ ధనుషో మహతా దిశః ।**
**ప్రదిశశ్చ నభశ్చైవ సహసా సమపూర్యత ॥ 4**

**పదచ్ఛేదము** :– తస్య – విస్ఫారఘోషేణ – ధనుషః – మహతా – దిశః – ప్రదిశః – చ – నభః – చ – ఏవ – సహసా – సమపూర్యత ॥

**అన్వయక్రమము** :– తస్య ధనుషః మహతా విస్ఫారఘోషేణ దిశః, ప్రదిశః చ, నభః చ ఏవ సహసా సమపూర్యత.

**ప్రతిపదార్థము** :– తస్య = అతనియొక్క, ధనుషః = ధనుస్సుయొక్క, మహతా = గొప్పదైన, విస్ఫారఘోషేణ = సారించుటయొక్క ధ్వనిచే, దిశః = దిక్కులును, ప్రదిశః చ = విదిక్కులును, నభః చ ఏవ = ఆకాశముకూడను, సహసా = వెంటనే, సమపూర్యత = నిండింపబడెను.

**తాత్పర్యము** :– ఆ జంబుమాలి గావించిన గొప్పదైన ధనుష్టంకార ఘోషమునకు ఎనిమిది దిక్కులును, ఆకాశమును అంతయును వెంటనే పెద్దధ్వనితో నిండిపోయెను.

**శ్లో॥ రథేన ఖరయుక్తేన త మాగత ముదీక్ష్య సః ।**
**హనుమా న్వేగసంపన్నో జహర్ష చ ననాద చ ॥ 5**

**పదచ్ఛేదము** :– రథేన – ఖరయుక్తేన – తమ్ – ఆగతమ్ – ఉదీక్ష్య – సః –

హనుమాన్ – వేగసంపన్నః – జహర్ష – చ – ననాద – చ ॥

**అన్వయక్రమము** :– ఖరయుక్తేన రథేన ఆగతం తమ్ ఉదీక్ష్య సః హనుమాన్ వేగ సంపన్నః (సన్) జహర్ష చ ననాద చ.

**ప్రతిపదార్థము** :– ఖరయుక్తేన = గాడిదలతో కూడినట్టి, రథేన = రథముతో, ఆగతం = వచ్చిన, తం = ఆ జంబుమాలిని, ఉదీక్ష్య = వీక్షించి, సః హనుమాన్ = ఆ హనుమ, వేగసంపన్నః సన్ = వేగాధిక్యముగలవాడై, జహర్ష చ = సంతోషించెను మఱియు, ననాద చ = గర్జనము చేసెను కూడ.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– జహర్ష – తన శక్తికి అనురూపమైన శత్రువు ఇప్పుడు ప్రాప్తించినాడని హనుమ హర్షము నొందెనని భావము.

**తాత్పర్యము** :– గాడిదలు పూన్చిన రథము నధిష్ఠించి వచ్చియున్న ఆ జంబుమాలిని చూచి హనుమంతుడు గొప్ప శౌర్యోత్సాహము గలవాడై హర్షాతిరేకముతో సింహగర్జనము చేసెను.

**శ్లో॥ తం తోరణవిటంకస్థం హనుమంతం మహాకపిమ్ ।**
**జంబుమాలీ మహాతేజా వివ్యాధ నిశితైశ్శరైః ॥ 6**

**పదచ్ఛేదము** :– తం – తోరణవిటంకస్థం – హనుమంతం – మహాకపిమ్ – జంబుమాలీ – మహాతేజాః – వివ్యాధ – నిశితైః – శరైః ॥

**అన్వయక్రమము** :– తోరణవిటంకస్థం మహాకపిం తం హనుమంతం మహాతేజాః జంబుమాలీ నిశితైః శరైః వివ్యాధ.

**ప్రతిపదార్థము** :– తోరణవిటంకస్థం = బహిర్ద్వారముయొక్క మీదివాసముపై నిలచియున్న, మహాకపిం = వానరశ్రేష్ఠుడైన, తం హనుమంతం = ఆ హనుమను, మహాతేజాః = మహాప్రతాపవంతుడగు, జంబుమాలీ = జంబుమాలి, నిశితైః = వాడియైన, శరైః = బాణములతో, వివ్యాధ = కొట్టెను.

**తాత్పర్యము** :– ఆ భవనముయొక్క బహిర్ద్వారము మీది విశాలమైన కపోతపాలికపై భీకరాకారముతో నిలచియున్న ఆ హనుమపై మహావీరుడైన జంబుమాలి వాడియైన బాణములను కురిపించెను.

**శ్లో॥ అర్ధచంద్రేణ వదనే శిర స్యేకేన కర్ణినా ।**
**బాహ్వోర్వివ్యాధ నారాచై ర్దశభి స్తం కపీశ్వరమ్ ॥ 7**

**పదచ్ఛేదము** :- అర్ధచంద్రేణ - వదనే - శిరసి - ఏకేన - కర్ణినా - బాహ్వోః - వివ్యాధ - నారాచైః - దశభిః - తం - కపీశ్వరమ్ ॥

**అన్వయక్రమము** :- తం కపీశ్వరమ్ అర్ధచంద్రేణ వదనే కర్ణినా ఏకేన శిరసి, దశభిః నారాచైః బాహ్వోః వివ్యాధ.

**ప్రతిపదార్థము** :- తం కపీశ్వరమ్ = ఆ వానరశ్రేష్ఠుని, అర్ధచంద్రేణ = అర్ధచంద్రాకార బాణముతో, వదనే = ముఖమునందును, కర్ణినా = చెవులుగల, ఏకేన = ఒక బాణముతో, శిరసి = తలమీదను, దశభిః నారాచైః = పదిబాణములతో, బాహ్వోః = రెండుభుజములందును, వివ్యాధ = ప్రహరించెను.

**తాత్పర్యము** :- ఆ జంబుమాలి ఆ వానరశ్రేష్ఠుని గుఱిచూచి అర్ధచంద్రాకారమగు ఒక బాణముతో ముఖముమీదను, వాడియైన చెవులుగల ఒక్క బాణముతో శిరస్సునందును, పది బాణములతో భుజములమీదను ప్రహరించెను.

**శ్లో॥ తస్య త చ్ఛుశుభే తామ్రం శరేణాభిహతం ముఖమ్ ।**
**శరదీ వాంబుజం ఫుల్లం విద్ధం భాస్కరరశ్మినా ॥ 8**

**పదచ్ఛేదము** :- తస్య - తత్ - శుశుభే - తామ్రం - శరేణ - అభిహతం - ముఖమ్, శరది - ఇవ - అంబుజం - ఫుల్లం - విద్ధం - భాస్కరరశ్మినా ॥

**అన్వయక్రమము** :- శరేణ అభిహతం తస్య తామ్రం తత్ ముఖం శరది, భాస్కరరశ్మినా విద్ధం ఫుల్లమ్ అంబుజమ్ ఇవ శుశుభే.

**ప్రతిపదార్థము** :- శరేణ = బాణముచే, అభిహతం = కొట్టబడిన, తస్య = ఆ హనుమయొక్క, తామ్రం = ఎఱ్ఱనైన, తత్ ముఖం = ఆ ముఖము, శరది = శరత్కాలము నందు, భాస్కరరశ్మినా = సూర్యకిరణముచే, విద్ధం = భిన్నమైనదై, ఫుల్లమ్ = వికసించిన, అంబుజమ్ ఇవ = తామరపువ్వువలె, శుశుభే = శోభిల్లెను.

**తాత్పర్యము** :- జంబుమాలి ప్రయోగించిన బాణముయొక్క ఘాతముచే రక్తసిక్తమై ఎఱ్ఱబడియున్న హనుమ ముఖము శరత్కాలమునందు సూర్యకాంతి స్పర్శనొంది చక్కగా వికసించిన తామరపువ్వువలె ఎంతయో ప్రకాశించెను.

**శ్లో॥ త త్తస్య రక్తం రక్తేన రంజితం శుశుభే ముఖమ్ ।**
**యథాఽఽకాశే మహాపద్మం సిక్తం చందనబిందుభిః ॥ 9**

**పదచ్ఛేదము :–** తత్ – తస్య – రక్తం – రక్తేన – రంజితం – శుశుభే – ముఖమ్ – యథా – ఆకాశే – మహాపద్మం – సిక్తం – చందనబిందుభిః ॥

**అన్వయక్రమము :–** రక్తేన రంజితం తస్య తత్ రక్తం ముఖమ్ ఆకాశే చందనబిందుభిః సిక్తం మహాపద్మం యథా శుశుభే.

**ప్రతిపదార్థము :–** రక్తేన = నెత్తురుచే, రంజితం = పూయబడిన, తస్య = ఆ హనుమ యొక్క, రక్తం = ఎఱ్ఱనైయున్న, తత్ ముఖం = ఆ ముఖము, ఆకాశే = ఆకాశమున, చందనబిందుభిః = రక్తచందనబిందువులచే, సిక్తం = తడుపబడిన, మహాపద్మం యథా = గొప్పదైన పద్మమువలె, శుశుభే = శోభిల్లెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'చందనబిందుభిః' అనుటకు మాఱుగా కాంచనబిందుభిః అను పాఠాంతరము గలదు.

అశోకః కాంచనాహ్వయః – అశోకమునకు కాంచనమను పేరు గలదు. అందుచే రక్తాశోక పుష్పరస బిందువులచే అని అర్థము. మహాపద్మమ్ ఇవ – గొప్పదైన రక్తపద్మమువలె నున్నది. ఈ ఉపమను అభూతోపమ అందురు.

**తాత్పర్యము :–** నెత్తురు చారలతో ముఖమంతయు నిండి ఎఱ్ఱనై కానవచ్చుచున్న హనుమముఖము రక్తచందనబిందువులతో తడుపబడి ఆకాశమునందు వికసించి యున్న ఒక మహాపద్మమువలె ప్రకాశించెను.

**శ్లో॥ చుకోప బాణాభిహతో రాక్షసేన మహాకపిః ।**
**తతః పార్శ్వేఽతివిపులాం దదర్శ మహతీం శిలామ్ ॥ 10**

**పదచ్ఛేదము :–** చుకోప – బాణాభిహతః – రాక్షసేన – మహాకపిః – తతః – పార్శ్వే – అతివిపులాం – దదర్శ – మహతీం – శిలామ్ ॥

**అన్వయక్రమము :–** బాణాభిహతః మహాకపిః రాక్షసస్య చుకోప, తతః పార్శ్వే అతివిపులాం మహతీం శిలాం దదర్శ.

**ప్రతిపదార్థము :–** బాణాభిహతః = బాణముచే కొట్టబడినవాడై, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమ, రాక్షసస్య = రాక్షసునిపై, చుకోప = కోపించెను, తతః = పిమ్మట, పార్శ్వే = ప్రక్కన, అతివిపులాం = మిక్కిలిపెద్దదై యున్న, మహతీం = గొప్పదైన, శిలాం = ఒక శిలను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :–** అట్లు బాణములచే గాయపఱుపబడిన హనుమ రాక్షసునిపై క్రోధము నొంది ప్రక్కనే మిక్కిలి పెద్దదిగా నున్న ఒక పెద్ద ఱాతిబండను చూచెను.

**శ్లో॥ తరసా తాం సముత్పాట్య చిక్షేప బలవద్బలీ ।**
**తాం శరై ర్దశభిః క్రుద్ధ స్తాడయామాస రాక్షసః ॥ 11**

**పదచ్ఛేదము :–** తరసా – తం – సముత్పాట్య – చిక్షేప – బలవత్ – బలీ – తాం – శరైః – దశభిః – క్రుద్ధః – తాడయామాస – రాక్షసః ॥

**అన్వయక్రమము :–** బలీ (సః) తం తరసా సముత్పాట్య బలవత్ చిక్షేప, రాక్షసః క్రుద్ధః (సన్) తాం దశభిః శరైః తాడయామాస.

**ప్రతిపదార్థము :–** బలీ = బలాఢ్యుడైన, సః = ఆ హనుమ, తాం = ఆ శిలను, తరసా = వేగముగ, సముత్పాట్య = పెల్లగించి, బలవత్ = బలముగా, చిక్షేప = విసిరెను, రాక్షసః = జంబుమాలి, క్రుద్ధః (సన్) = కోపించినవాడై, దశభిః శరైః = పది బాణములతో, తాం = ఆ శిలను, తాడయామాస = కొట్టెను.

**తాత్పర్యము :–** వెంటనే మహాబలాఢ్యుడైన హనుమ ఆ ఱాతిబండను పెల్లగించి జంబుమాలిపై విసరెను. ఆతడును క్రోధముతో దానిని పదిబాణములచే ముక్కలు ముక్కలు చేసెను.

**శ్లో॥ విపన్నం కర్మ తద్దృష్ట్వా హనుమాం శ్చండవిక్రమః ।**
**సాలం విపుల ముత్పాట్య భ్రామయామాస వీర్యవాన్ ॥ 12**

**పదచ్ఛేదము :–** విపన్నం – కర్మ – తత్ – దృష్ట్వా – హనుమాన్ – చండవిక్రమః – సాలం – విపులమ్ – ఉత్పాట్య – భ్రామయామాస – వీర్యవాన్ ॥

**అన్వయక్రమము :–** చండవిక్రమః హనుమాన్ తత్ కర్మ విపన్నం దృష్ట్వా వీర్యవాన్ (సః) విపులం సాలం ఉత్పాట్య భ్రామయామాస.

**ప్రతిపదార్థము :–** చండవిక్రమః = భీకరమైన పరాక్రమము గల్గినట్టి, హనుమాన్ = హనుమ, తత్ కర్మ = ఆ పనిని, విపన్నం = చెడిపోయినదిగా, దృష్ట్వా = చూచి, వీర్యవాన్ సః = శౌర్యవంతుడైన ఆతడు, విపులం = విశాలమైనట్టి, సాలం = మద్దిచెట్టును, ఉత్పాట్య = పెల్లగించి, భ్రామయామాస = త్రిప్పుచుండెను.

**తాత్పర్యము :–** భీకరవిక్రముడైన ఆ హనుమ తాను గావించిన శిలాప్రయోగము వ్యర్థమగుట గాంచి వెంటనే అచట నున్న ఒక పెద్ద మద్దిచెట్టును పెల్లగించి దానిని గిరగిర త్రిప్పసాగెను.

**శ్లో॥ భ్రామయంతం కపిం దృష్ట్వా సాలవృక్షం మహాబలమ్ ।**
**చిక్షేప సుబహూన్ బాణాన్ జంబుమాలీ మహాబలః ॥ 13**

**పదచ్ఛేదము :–** భ్రామయంతం – కపిం – దృష్ట్వా – సాలవృక్షం – మహాబలమ్ – చిక్షేప – సుబహూన్ – బాణాన్ – జంబుమాలీ – మహాబలః ॥

**అన్వయక్రమము :–** సాలవృక్షం భ్రామయంతం మహాబలం కపిం దృష్ట్వా మహాబలః జంబుమాలీ సుబహూన్ బాణాన్ చిక్షేప.

**ప్రతిపదార్థము :–** సాలవృక్షం = మద్దిచెట్టును, భ్రామయంతం = త్రిప్పుచున్నట్టి, మహాబలం = మహాబలశాలియైన, కపిం = హనుమను, దృష్ట్వా = చూచి, మహాబలః = మహాబలాఢ్యుడైన, జంబుమాలీ = జంబుమాలి, సుబహూన్ = అనేకములైన, బాణాన్ = బాణములను, చిక్షేప = చిమ్మెను.

**తాత్పర్యము :–** మిక్కిలి పెద్దదైయున్న ఆ మద్దిచెట్టును అవలీలగా త్రిప్పుచున్న ఆ మహాబలశాలియైన హనుమను జూచి మహాబలాఢ్యుడైన జంబుమాలి దానిపై అనేకములైన బాణములను కురిపించెను.

**శ్లో॥ సాలం చతుర్భి శ్చిచ్ఛేద వానరం పంచభి ర్భుజే ।**
**శిర స్యేకేన బాణేన దశభిస్తు స్తనాంతరే ॥ 14**

**పదచ్ఛేదము :–** సాలం – చతుర్భిః – చిచ్ఛేద – వానరం – పంచభిః – భుజే – శిరసి – ఏకేన – బాణేన – దశభిః – తు – స్తనాంతరే ॥

**అన్వయక్రమము :–** చతుర్భిః సాలం చిచ్ఛేద; వానరం భుజే పంచభిః, శిరసి ఏకేన బాణేన, స్తనాంతరే దశభిః (వివ్యాధ).

**ప్రతిపదార్థము :–** చతుర్భిః = నాల్గుబాణములతో, సాలం = మద్దిచెట్టును, చిచ్ఛేద = ఛేదించెను, వానరం = హనుమను, భుజే = భుజమునందు, పంచభిః = ఐదింటితోడను, శిరసి = తలయందు, ఏకేన బాణేన = ఒక్క బాణముతోడను, స్తనాంతరే = స్తనములనడుమ, దశభిః = పదింటితోడను, (వివ్యాధ = కొట్టెను).

**తాత్పర్యము :–** అప్పుడు జంబుమాలి నాల్గుబాణములతో ఆ మద్దిచెట్టును ముక్కలుచేసి హనుమయొక్క భుజమును ఐదుబాణములతోను, తలను ఒక బాణముతోను, ఱొమ్మును పదిబాణములతోను కొట్టెను.

**శ్లో॥ స శరైః పూరితతనుః క్రోధేన మహతా వృతః ।**
**తమేవ పరిఘం గృహ్య భ్రామయామాస వేగతః ॥ 15**

**పదచ్ఛేదము** :- సః - శరైః - పూరితతనుః - క్రోధేన - మహతా - వృతః - తమ్ - ఏవ - పరిఘం - గృహ్య - భ్రామయామాస - వేగతః ॥

**అన్వయక్రమము** :- శరైః పూరితతనుః సః మహతా క్రోధేన వృతః, తం పరిఘమ్ ఏవ గృహ్య వేగతః భ్రామయామాస.

**ప్రతిపదార్థము** :- శరైః = బాణములతో, పూరితతనుః = నింపబడిన శరీరము కలిగినట్టి, సః = ఆ హనుమ, మహతా = గొప్పదైన, క్రోధేన = కోపముతో, వృతః = కూడినవాడై, తం పరిఘమ్ ఏవ = ఆ పరిఘమునే, గృహ్య = పట్టుకొని, వేగతః = వేగముగా, భ్రామయామాస = త్రిప్పెను.

**తాత్పర్యము** :- ఒడలినిండ బాణములు గ్రుచ్చుకొనగా తీవ్రమైన క్రోధమునొంది హనుమంతుడు వెనుకటి పరిఘమునే చేతబట్టి వేగముగా త్రిప్పదొడగెను.

**శ్లో॥ అతివేగో ఽతివేగేన భ్రామయిత్వా బలోత్కటః ।**
**పరిఘం పాతయామాస జంబుమాలే ర్మహోరసి ॥ 16**

**పదచ్ఛేదము** :- అతివేగః - బలోత్కటః - పరిఘమ్ - అతివేగేన - భ్రామయిత్వా - జంబుమాలేః - మహోరసి - పాతయామాస ॥

**అన్వయక్రమము** :- బలోత్కటః అతివేగః (సః) పరిఘమ్ అతివేగేన భ్రామయిత్వా జంబుమాలేః మహోరసి పాతయామాస.

**ప్రతిపదార్థము** :- బలోత్కటః = బలముచే తీవ్రమైనవాడును, అతివేగః = మహావేగము కలవాడునునైన, సః = ఆ హనుమ, పరిఘం = ఇనుపదూలమును, అతివేగేన = మహావేగముతో, భ్రామయిత్వా = త్రిప్పి, జంబుమాలేః = జంబుమాలియొక్క, మహోరసి = గొప్పదైన వక్షమున, పాతయామాస = విసిరెను.

**తాత్పర్యము** :- తీవ్రమైన బలముతో ప్రకాశించు ప్రతాపశాలియైన ఆ హనుమ తాను పూర్వము ఉపయోగించిన ఆ ఉక్కుదూలమునే తన చేతబట్టి అమితవేగముతో త్రిప్పుచు జంబుమాలియొక్క విశాలమైన ఱొమ్ముపై గుఱిచూచి విసిరెను.

**శ్లో॥ తస్య చైవ శిరో నాస్తి న బాహూ న చ జానునీ ।**
**న ధనుర్న రథో నాశ్వా స్తత్రాదృశ్యంత నేషవః ॥ 17**

**పదచ్ఛేదము** :- తస్య - చ - ఏవ - శిరః - న - అస్తి - న - బాహూ - న - చ - జానునీ - న - ధనుః - న - రథః - న -అశ్వాః - తత్ర - అదృశ్యంత - న - ఇషవః ॥

**అన్వయక్రమము** :- తదా తత్ర తస్య శిరః చైవ నాస్తి; బాహూ న స్తః; జానునీ చ న స్తః; ధనుః నాస్తి; రథః నాస్తి; అశ్వాః న సంతి. ఇషవః న అదృశ్యంత.

**ప్రతిపదార్థము** :- (తదా = అప్పుడు) తస్య = ఆ జంబుమాలియొక్క, శిరః చైవ = తలయును, నాస్తి = లేకుండెను, బాహూ = రెండుభుజములును, న స్తః = లేకుండెను, జానునీ చ = మోకాళ్లును, న స్తః = లేకుండెను, రథః నాస్తి = రథము లేకుండెను, అశ్వాః = గుఱ్ఱములు, న సంతి = లేకుండెను, ఇషవః = బాణములు, న అదృశ్యంత = కానరాకుండెను.

**తాత్పర్యము** :- ఆ పరిఘము తనపై బడుటచే అప్పుడచ్చట ఆ జంబుమాలి శిరస్సుగాని బాహువులుగాని మోకాళ్లుగాని ధనుస్సుగాని రథము గాని, గాడిదలుగాని ఏమియు కానరాకుండెను.

**శ్లో॥ స హత స్తరసా తేన జంబుమాలీ మహాబలః ।**
**పపాత నిహతో భూమౌ చూర్ణితాంగవిభూషణః ॥ 18**

**పదచ్ఛేదము** :- సః – హతః – తరసా – తేన – జంబుమాలీ – మహాబలః – పపాత – నిహతః – భూమౌ – చూర్ణితాంగవిభూషణః ॥

**అన్వయక్రమము** :- తేన తరసా హతః, మహాబలః సః జంబుమాలీ నిహతః చూర్ణితాంగవిభూషణః సన్ భూమౌ పపాత.

**ప్రతిపదార్థము** :- తేన = ఆ హనుమచే, తరసా = బలముగా, హతః = కొట్టబడినవాడై, మహాబలః = మహాబలాఢ్యుడైన, సః జంబుమాలీ = ఆ జంబుమాలి, నిహతః = మరణించినవాడై, చూర్ణితాంగవిభూషణః సన్ = చూర్ణములైపోయిన అవయవములును ఆభరణములును గలవాడై, భూమౌ = నేలపై, పపాత = పడిపోయెను.

**తాత్పర్యము** :- హనుమ అట్లు బలముగా పరిఘముతో కొట్టగా మహాబలాఢ్యుడైన ఆ జంబుమాలి అసువులు గోల్పోయి నుగ్గునుగ్గు అయిన అవయవములతోను, అలంకారములతోను నేలపై కుప్పగూలెను.

**శ్లో॥ జంబుమాలిం చ నిహతం కింకరాంశ్చ మహాబలాన్ ।**
**చుక్రోధ రావణం శ్రుత్వా కోపసంరక్తలోచనః ॥ 19**

**పదచ్ఛేదము** :- జంబుమాలిం – చ – నిహతం – కింకరాన్ – చ – మహాబలాన్ – చుక్రోధ – రావణః – శ్రుత్వా – కోపసంరక్తలోచనః ॥

**అన్వయక్రమము :-** రావణః జంబుమాలిం చ నిహతం, మహాబలాన్ కింకరాన్ చ (నిహతాన్) శ్రుత్వా కోపసంరక్తలోచనః (సన్) చుక్రోధ.

**ప్రతిపదార్థము :-** రావణః = రావణుడు, జంబుమాలిం చ = జంబుమాలినిగూడ, నిహతం = చనిపోయినవానినిగాను, మహాబలాన్ = మహాబలశాలురైన, కింకరాన్ చ = కింకరాసురులనుగూడ, (నిహతాన్ = చనిపోయినవారినిగాను), శ్రుత్వా = విని, కోపసంరక్తలోచనః (సన్) = కోపముచే ఎఱ్ఱబారిన కన్నులు గలవాడగుచు, చుక్రోధ = క్రోధమునొందెను.

**తాత్పర్యము :-** రావణాసురుడు, తాను పంపిన జంబుమాలియు అమితబలశాలురైన కింకరాసురులు గూడ మడిసి రనువార్తను వినగానే కోపముచే ఎఱ్ఱబడిన కన్నులతో అమితమైన ఆవేశముతో తీవ్రముగా క్రోధము నొందెను.

**శ్లో॥ స రోషసంవర్తితతామ్రలోచనః**
**ప్రహస్తపుత్రే నిహతే మహాబలే ।**
**అమాత్యపుత్రా నతివీర్యవిక్రమాన్**
**సమాదిదే శాశు నిశాచరేశ్వరః ॥ 20**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"జంబుమాలివధో" నామ*
*చతుశ్చత్వారింశస్సర్గః.*

**పదచ్ఛేదము :-** సః - రోషసంవర్తితతామ్రలోచనః - ప్రహస్తపుత్రే - నిహతే - మహాబలే - అమాత్యపుత్రాన్ - అతివీర్యవిక్రమాన్ - సమాదిదేశ - ఆశు - నిశాచరేశ్వరః ॥

**అన్వయక్రమము :-** మహాబలే ప్రహస్తపుత్రే నిహతే (సతి) సః నిశాచరేశ్వరః రోషసంవర్తితతామ్రలోచనః (సన్) ఆశు అతివీర్యవిక్రమాన్ అమాత్యపుత్రాన్ సమాదిదేశ.

**ప్రతిపదార్థము :-** మహాబలే = మహాబలాఢ్యుడైన, ప్రహస్తపుత్రే = ప్రహస్తుని పుత్రుడు, నిహతే సతి = చంపబడినవాడు కాగా, సః = ఆ, నిశాచరేశ్వరః = రాక్షసరాజైన రావణుడు, ఆశు = వెంటనే, అతివీర్యవిక్రమాన్ = మిక్కిలి శౌర్యపరాక్రమములు కలిగినట్టి, అమాత్యపుత్రాన్ = మంత్రిపుత్రులను, సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము :-** మహాబలశాలియైన ప్రహస్తపుత్రుడు, హనుమచేతిలో మడియుట విని క్రోధముతో ఎఱ్ఱబారిన కన్నులు తిరిగిపోవుచుండగా వెంటనే ఆ రాక్షసరాజు అమితమైన శౌర్యపరాక్రమములు గల్గినట్టి తన మంత్రిపుత్రులను ఏడుగురిని హనుమను నిర్జించి రండని ఆజ్ఞాపించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"జంబుమాలివధ" అను*
*నలుబదినాల్గవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

⋆⋆⋆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## పంచచత్వారింశసర్గ

**శ్లో॥ తత స్తే రాక్షసేంద్రేణ చోదితా మంత్రిణ స్సుతాః ।**
**నిర్యయు ర్భవనా త్తస్మాత్సప్త సప్తార్చివర్చసః ॥ 1**

**శ్లో॥ మహాబలపరీవారా ధనుష్మంతో మహాబలాః ।**
**కృతాస్త్రాస్త్రవిదాం శ్రేష్ఠాః పరస్పరజయైషిణః ॥ 2**

**శ్లో॥ హేమజాలపరిక్షిప్తై ర్ధ్వజవద్భిః పతాకిభిః ।**
**తోయదస్వననిర్ఘోషై ర్వాజియుక్తై ర్మహారథైః ॥ 3**

**శ్లో॥ తప్తకాంచనచిత్రాణి చాపా న్యమితవిక్రమాః ।**
**విస్ఫారయంత స్సంహృష్టా స్తటిత్వంత ఇవాంబుదాః ॥ 4**

**పదచ్ఛేదము** :- తతః - తే - రాక్షసేంద్రేణ - చోదితాః - మంత్రిణః - సుతాః - నిర్యయుః - భవనాత్ - తస్మాత్ - సప్త - సప్తార్చివర్చసః. మహాబలపరీవారాః - ధనుష్మంతః - మహాబలాః - కృతాస్త్రాస్త్రవిదాం - శ్రేష్ఠాః - పరస్పరజయైషిణః - హేమజాలపరిక్షిప్తైః - ధ్వజవద్భిః - పతాకిభిః - తోయదస్వననిర్ఘోషైః - వాజియుక్తైః - మహారథైః - తప్తకాంచనచిత్రాణి - చాపాని - అమితవిక్రమాః - విస్ఫారయంతః - సంహృష్టాః - తటిత్వంతః - ఇవ - అంబుదాః ॥

**అన్వయక్రమము** :- తతః రాక్షసేంద్రేణ చోదితాః మంత్రిణః సుతాః మహాబలపరీవారాః, ధనుష్మంతః, మహాబలాః, కృతాస్త్రాస్త్రవిదాం శ్రేష్ఠాః, వరస్పరజయైషిణః సంతః, అమిత విక్రమాః, హేమజాలపరిక్షిప్తైః, ధ్వజవద్భిః, పతాకిభిః, తోయదస్వననిర్ఘోషైః, వాజియుక్తైః, మహారథైః తటిత్వంతః అంబుదాః ఇవ తప్తకాంచనచిత్రాణి చాపాని విస్ఫారయంతః, సప్తార్చివర్చసః తే సప్త తస్మాత్ భవనాత్ నిర్యయుః.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, రాక్షసేంద్రేణ = రాక్షసరాజైన రావణునిచే, చోదితాః = ప్రేరేపింపబడినవారై, మంత్రిణః = మంత్రియొక్క, సుతాః = పుత్రులు, మహాబలపరీవారాః = గొప్పదైన సైన్యపరివారము గలవారును, ధనుష్మంతః =

గొప్పధనుస్సులు గలవారును, మహాబలాః = గొప్పశక్తి గలవారును, కృతాస్త్రాస్త్రవిదాం = అస్త్రశిక్షణను పొందిన ధనుర్విద్యను నేర్చినవారిలో, శ్రేష్ఠాః = అధికులును, పరస్పరజయైషిణః = ఒకరినొకరు మించు కోరిక గలవారును, (సంతః = అగుచు) అమితవిక్రమాః = అనంతమైన పరాక్రమముగలవారై, హేమజాలపరిక్షిప్తైః = బంగరు జాలరులతో చుట్టబడినవియును, ధ్వజవద్భిః = గొప్పవైన ధ్వజస్తంభములు గలవియును, పతాకిభిః = శ్రేష్ఠమైన జెండాలు గలవియును, తోయదస్వననిర్ఘోషైః = మేఘముల ధ్వనులవంటి మహాశబ్దము గలవియును, వాజియుక్తైః = శ్రేష్ఠమైన గుఱ్ఱములతో కూడినవియుననగు, మహారథైః = గొప్పవైన రథములతోడ, తటిత్వంతః = మెఱపులతో కూడిన, అంబుదాః ఇవ = మేఘములవలె, తప్తకాంచనచిత్రాణి = కరిగిన బంగారు చిత్రములు కలిగినట్టి, చాపాని = ధనుస్సులను, విస్ఫారయంతః = టంకారముచేయుచు, సంహృష్టాః = గొప్పహర్షముగలవారై, సప్తార్చివర్చసః = అగ్నిహోత్రముతో సమానమైన తేజస్సు గలిగినట్టి, తే సప్త = ఆ మంత్రిపుత్రులు ఏడుగురును, తస్మాత్ భవనాత్ = ఆ రావణుని భవనము నుండి, నిర్యయుః = బయలువెడలిరి.

**తాత్పర్యము** :– అటుపిమ్మట రాక్షసరాజైన రావణుడు ప్రేరేపింపగా అతని మంత్రి పుత్రులు ఏడుగురును అగ్నిహోత్రముతో సమానమైన తేజస్సుతో ప్రజ్వలించుచు, గొప్పసైన్యములను వెంటపెట్టుకొని గొప్పధనుస్సులను చేతబూని, మహాబలాఢ్యులైన తాము గొప్పదైన అస్త్రశిక్షను బొంది అస్త్రవిద్యలో శ్రేష్ఠులుగావున ఒకరిని మించి ఒకరు జయమును సంపాదించు కోరికగలవారై, అమితమైన తమపరాక్రమమును ప్రదర్శింపగోరి, బంగారుజాలరులతో అలంకరింపబడిన శ్రేష్ఠమైన ధ్వజములతోను పతాకములతోను విరాజిల్లుచు శ్రేష్ఠమైన గుఱ్ఱములు పూన్చినట్టి మేఘగర్జనములవంటి గొప్పధ్వని గలిగిన శ్రేష్ఠమైన రథములను ఆరోహించి, మెఱపుతీగలతో కూడిన మేఘమువలె మేలిమిబంగారు చిత్తరువులు గలిగిన దృఢమైన తమ ధనుస్సులను టంకారముచేయుచు, మహాహర్షముతో రావణుని భవనమునుండి హనుమమీదికి బయలుదేరిరి.

**శ్లో॥ జనన్య స్తా స్తత స్తేషాం విదిత్వా కింకరాన్ హతాన్ ।**
**బభూవు శ్శోకసంభ్రాంతా స్సబాంధవసుహృజ్జనాః ॥ 5**

**పదచ్ఛేదము** :– జనన్యః – తాః – తతః – తేషాం – విదిత్వా – కింకరాన్ – హతాన్ – బభూవుః – శోకసంభ్రాంతాః – సబాంధవసుహృజ్జనాః ॥

**అన్వయక్రమము** :– తేషాం తాః జనన్యః కింకరాన్ హతాన్ విదిత్వా తతః సబాంధవ

సుహృజ్జనాః శోకసంభ్రాంతాః బభూవుః.

**ప్రతిపదార్థము :–** తేషాం = ఆ మంత్రిపుత్రులయొక్క, తాః జనన్యః = ఆ కన్నతల్లులు, కింకరాన్ = కింకరాసురులను, హతాన్ = చంపబడినవారినిగా, విదిత్వా = తెలిసికొని, తతః = ఆ కారణమున, సబాంధవసుహృజ్జనాః = బంధుజనముతోడను మిత్రజనముతోడను కూడినవారై, శోకసంభ్రాంతాః = దుఃఖవిహ్వలురాండ్రు, బభూవుః = అయిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి :–** తాః జనన్యః – పూర్వము నిహతులైన కింకరాసురుల యొక్క తల్లులు అని సింహావలోకనన్యాయముగ పూర్వవిషయము ఇచ్చట స్మరింపబడినదని గ్రహించవలెను.

**సూచన :–** మంత్రిణః సుతాః అని పూర్వము ఒక మంత్రియొక్క బిడ్డలే ఈ ఏడుగురు అని చెప్పబడినది కాబట్టి "తేషాం జనన్యః – అనగా వారితల్లులని బహువచనముతో ఇచ్చట చెప్పబడి యుండుటచే ప్రస్తుతము పేర్కొనబడిన తల్లులు మంత్రిపుత్రుల తల్లులుగారని శంకింప నక్కరలేదు. ఏలననగా ఆ మంత్రికే పెక్కుమంది భార్యలు ఉండవచ్చును. కాబట్టి మంత్రిపుత్రులకు తల్లులు పలువు రుండుట సమర్థనీయమే యగును.

**తాత్పర్యము :–** అప్పు డా మంత్రిపుత్రుల తల్లులు కింకరాసురు లంతటివారే హనుమచేతిలో చనిపోయిరని విని తమ బంధువులతోడను మిత్రులతోడను గూడ తమ పుత్రుల క్షేమవిషయమున అధైర్యముతో శోకవిహ్వల లగుచుండిరి.

**శ్లో॥ తే పరస్పరసంఘర్షా స్తప్తకాంచనభూషణాః ।**
**అభిపేతు ర్హనూమంతం తోరణస్థమవస్థితమ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** తే – పరస్పరసంఘర్షాః – తప్తకాంచనభూషణాః – అభిపేతుః – హనూమంతం – తోరణస్థమ్ – అవస్థితమ్ ॥

**అన్వయక్రమము :–** పరస్పరసంఘర్షాః, తప్తకాంచనభూషణాః తే అవస్థితం, తోరణస్థం హనుమంతం అభిపేతుః.

**ప్రతిపదార్థము :–** పరస్పరసంఘర్షాః = ఒకరినొకరు త్రోసికొనుచున్నవారగుచు, తప్తకాంచనభూషణాః = మేలిమి బంగారు భూషణములు కలిగినట్టి, తే = ఆ మంత్రిపుత్రులు, అవస్థితం = నిశ్చలుడై, తోరణస్థం = బహిర్ద్వారమునం దున్నట్టి,

హనుమంతం = హనుమంతుని, అభిపేతుః = మీదబడిరి.

**తాత్పర్యము :–** మేలిమిబంగారు ఆభరణములను ధరించిన ఆ ఏడుగురు మంత్రి పుత్రులును ఒకరినొకరు త్రోసికొనుచు ఆ బహిర్ద్వారముపై నిశ్చింతగ కూర్చొనియున్న హనుమమీద పడిరి.

**శ్లో॥ సృజంతో బాణవృష్టిం తే రథగర్జితనిస్వనాః ।**
**ప్రావృట్కాల ఇవాంభోదా విచేరు ర్నైరృతాంబుదాః ॥ 7**

**పదచ్ఛేదము :–** సృజంతః – బాణవృష్టిం – తే – రథగర్జితనిస్వనాః – తే – ప్రావృట్కాలే – ఇవ – అంభోదాః – విచేరుః – నైరృతాంబుదాః ॥

**అన్వయక్రమము :–** ప్రావృట్కాలే అంభోదాః ఇవ తే నైరృతాంబుదాః రథగర్జితనిస్వనాః బాణవృష్టిం సృజంతః విచేరుః.

**ప్రతిపదార్థము :–** ప్రావృట్కాలే = వర్షాకాలమునందు, అంభోదాః ఇవ = మేఘములవలె, తే నైరృతాంబుదాః = ఆ మేఘములవంటి రాక్షసులు, రథగర్జితనిస్వనాః = ఉఱుములనెడు రథగర్జనములుగలవారై, బాణవృష్టిం = వర్షములవంటి బాణ పరంపరను, సృజంతః = కురిపించుచు, విచేరుః = సంచరించిరి.

**తాత్పర్యము :–** మేఘముల గుంపువంటి ఆ రాక్షసుల సమూహము, మేఘముల ఉఱుములవంటి రథములధ్వనితో వర్షపు జల్లులవంటి బాణపరంపరలను హనుమపై కురిపించుచు వర్షాకాలములోని మేఘములవలెనే అతనిమీది భాగమున తిరుగాడు చుండిరి.

**శ్లో॥ అవకీర్ణ స్తత స్తాభి ర్హనుమా న్శరవృష్టిభిః ।**
**అభవ త్సంవృతాకార శ్శైలరాడివ వృష్టిభిః ॥ 8**

**పదచ్ఛేదము :–** అవకీర్ణః – తతః – తాభిః – హనుమాన్ – శరవృష్టిభిః – అభవత్ – సంవృతాకారః – శైలరాట్ – ఇవ – వృష్టిభిః ॥

**అన్వయక్రమము :–** తతః హనుమాన్ తాభిః శరవృష్టిభిః అవకీర్ణః వృష్టిభిః శైలరాట్ ఇవ సంవృతాకారః అభవత్.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, హనుమాన్ = హనుమ, తాభిః శరవృష్టిభిః = ఆ బాణవర్షములచే, అవకీర్ణః = చుట్టుకొనబడినవాడై, వృష్టిభిః = వర్షములతో, శైలరాట్ ఇవ = పర్వతరాజువలె, సంవృతాకారః = కప్పబడిన స్వరూపము గలవాడుగ, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము** :- అప్పు డా హనుమ మంత్రిపుత్రులు కురిపించిన బాణవర్షముచే మూయబడి వర్షముతో కప్పబడియున్న హిమపర్వతమువలె తన రూపము ఇతరులకు గాన్పించనివాడుగా నుండెను.

**శ్లో॥ స శరా న్మోఘయామాస తేషా మాశుచరః కపిః ।**
**రథవేగం చ వీరాణాం విచర న్విమలే ఽంబరే ॥ 9**

**పదచ్ఛేదము** :- సః - శరాన్ - మోఘయామాస - తేషామ్ - ఆశుచరః - కపిః - రథవేగం - చ - వీరాణాం - విచరన్ - విమలే - అంబరే ॥

**అన్వయక్రమము** :- ఆశుచరః సః కపిః విమలే అంబరే విచరన్, తేషాం వీరాణాం శరాన్, రథవేగం చ మోఘయామాస.

**ప్రతిపదార్థము** :- ఆశుచరః = వేగముగా చలించు, సః కపిః = ఆ హనుమ, విమలే = నిర్మలమైనట్టి, అంబరే = ఆకాశమున, విచరన్ = వేగముగ తిరుగుచు, తేషాం వీరాణాం = ఆ వీరులయొక్క, శరాన్ = బాణములను, రథవేగం చ = రథవేగమును గూడ, మోఘయామాస = వమ్ముచేసెను.

**తాత్పర్యము** :- అతివేగముగ చలించు నైపుణ్యముగల ఆ హనుమ విశాలమైన ఆకాశముపై వడిగా తిరుగుచు ఆ శత్రువీరులు కురిపించు బాణములను తనను ఆంటకుండగా చేసికొనుచు వారి శరములు, రథవేగము గూడ వ్యర్థము అగునట్లు చేసెను.

**శ్లో॥ స తైః క్రీడ న్ధనుష్మద్భి ర్వ్యోమ్ని వీరః ప్రకాశతే ।**
**ధనుష్మద్భి ర్యథా మేఘై ర్మారుతః ప్రభురంబరే ॥ 10**

**పదచ్ఛేదము** :- సః - తైః - క్రీడన్ - ధనుష్మద్భిః - వ్యోమ్ని - వీరః - ప్రకాశతే - ధనుష్మద్భిః - యథా - మేఘైః - మారుతః - ప్రభుః - అంబరే ॥

**అన్వయక్రమము** :- సః వీరః తైః ధనుష్మద్భిః వ్యోమ్ని క్రీడన్, అంబరే ధనుష్మద్భిః మేఘైః క్రీడన్ ప్రభుః మారుతః యథా ప్రకాశతే.

**ప్రతిపదార్థము** :- సః వీరః = ఆ వీరుడైన హనుమ, తైః ధనుష్మద్భిః = ధనుర్ధారులైన ఆ వీరులతో, వ్యోమ్ని = ఆకసమున, క్రీడన్ = క్రీడించుచు, అంబరే = ఆకసమునందు, ధనుష్మద్భిః = ఇంద్రధనుస్సులతో కూడిన, మేఘైః = మేఘములతో, క్రీడన్ = ఆడుచున్న, ప్రభుః మారుతః యథా = ప్రభావశాలియైన వాయుదేవునివలె, ప్రకాశతే = ప్రకాశించు చుండెను.

**తాత్పర్యము** :- అప్పుడు వీరుడైన హనుమ ఆకసమునందు గొప్పధనుస్సులను చేతబూనిన ఆ వీరులతో రణక్రీడ గావించుచు ఆకాశమునందు ఇంద్రధనుస్సులతో ప్రకాశించుచున్న మేఘములతో స్వేచ్ఛగ విహరించుచున్న ప్రభావసంపన్నుడైన వాయుదేవుని వలెనే ప్రకాశించు చుండెను.

**శ్లో॥ స కృత్వా నినదం ఘోరం త్రాసయంస్తాం మహాచమూమ్ ।**
**చకార హనుమా న్వేగం తేషు రక్షస్సు వీర్యవాన్ ॥ 11**

**పదచ్ఛేదము** :- సః - కృత్వా - నినదం - ఘోరం - త్రాసయన్ - తాం - మహాచమూమ్ - చకార - హనుమాన్ - వేగం - తేషు - రక్షస్సు - వీర్యవాన్ ॥

**అన్వయక్రమము** :- వీర్యవాన్ సః హనుమాన్ తాం మహాచమూం త్రాసయన్ ఘోరం నినదం కృత్వా తేషు రక్షస్సు వేగం చకార.

**ప్రతిపదార్థము** :- వీర్యవాన్ = పరాక్రమవంతుడైనట్టి, సః హనుమాన్ = ఆ హనుమ, తాం మహాచమూం = ఆ మహాసైన్యమును, త్రాసయన్ = భయపెట్టుచు, ఘోరం = భీకరమైన, నినదం = గర్జనమును, కృత్వా = చేసి, తేషు రక్షస్సు = ఆ రాక్షసుల విషయమున, వేగం = తీవ్రతను, చకార = చేసెను.

**తాత్పర్యము** :- మహాపరాక్రమశాలియైన ఆ హనుమ సైన్యసమూహమును భయగ్రస్తము గావించుచు భీకరముగ గర్జించి ఆ రాక్షసవీరుల విషయమున గొప్ప తీవ్రత చూపించుచు విజృంభించెను.

**శ్లో॥ తలేనాభ్యహన త్కాంశ్చిత్పద్భ్యాం కాంశ్చిత్పరంతపః ।**
**ముష్టినాభ్యహన త్కాంశ్చిన్నఖైః కాంశ్చిద్వ్యదారయత్ ॥ 12**

**పదచ్ఛేదము** :- తలేన - అభ్యహనత్ - కాంశ్చిత్ - పద్భ్యాం - కాంశ్చిత్ - పరంతపః - ముష్టినా - అభ్యహనత్ - కాంశ్చిత్ - నఖైః - కాంశ్చిత్ - వ్యదారయత్ ॥

**అన్వయక్రమము** :- పరంతపః (సః) కాంశ్చిత్ తలేన అభ్యహనత్, కాంశ్చిత్ పద్భ్యాం (అభ్యహనత్), కాంశ్చిత్ ముష్టినా అభ్యహనత్, కాంశ్చిత్ నఖైః వ్యదారయత్.

**ప్రతిపదార్థము** :- పరంతపః = శత్రువులను తపింపజేయునట్టి, (సః = ఆ హనుమ) కాంశ్చిత్ = కొంతమందిని, తలేన = అరచేతితో, అభ్యహనత్ = మోదెను, కాంశ్చిత్ = కొందఱిని, పద్భ్యాం = పాదములతో, (అభ్యహనత్ = తన్నెను) కాంశ్చిత్ = కొంతమందిని, ముష్టినా = పిడికిటితో, అభ్యహనత్ = పొడిచెను, కాంశ్చిత్ = కొంతమందిని, నఖైః = గోళ్లతో, వ్యదారయత్ = చీల్చెను.

**తాత్పర్యము :-** శత్రుమర్దనుడైన హనుమ అప్పుడట్లు విజృంభించి శత్రుసైన్యములోని కొందఱు రక్కసులను తన అఱచేతితో మోదెను. మఱికొందఱిని కాళ్లతో క్రుమ్మెను. మఱికొందఱిని పిడికిటితో పొడిచెను. మఱికొందఱిని తనగోళ్లతో చీల్చెను.

**శ్లో॥ ప్రమమా థోరసా కాంశ్చి దూరుభ్యా మపరా న్కపిః ।**
**కేచి త్తస్య నినాదేన తత్రైవ పతితా భువి ॥ 13**

**పదచ్ఛేదము :-** ప్రమమాథ - ఉరసా - కాంశ్చిత్ - ఊరుభ్యాం - అపరాన్ - కపిః - కేచిత్ - తస్య - నినాదేన - తత్ర - ఏవ - పతితాః - భువి ॥

**అన్వయక్రమము :-** (సః) కపిః కాంశ్చిత్ ఉరసా ప్రమమాథ. కేచిత్ తస్య నినాదేన తత్ర ఏవ భువి పతితాః.

**ప్రతిపదార్థము :-** (సః) కపిః = ఆ హనుమ, కాంశ్చిత్ = కొంతమందిని, ఉరసా = ఱొమ్ముతో, ప్రమమాథ = రూపడచెను, అపరాన్ = మిగిలినవారిని, ఊరుభ్యాం = తొడలతో, ప్రమమాథ = చంపెను, కేచిత్ = కొంతమంది, తస్య = ఆ హనుమ యొక్క, నినాదేన = గర్జనచేత, తత్ర ఏవ = అచ్చటనే, భువి = నేలపై, పతితాః = పడిపోయిరి.

**తాత్పర్యము :-** అప్పు డా హనుమ కొందఱిని తన ఱొమ్ముతో నొక్కి నలిపివేసెను. మఱికొందఱిని తన తొడలతో నొక్కి నలిపివేసెను. ఇక కొంతమంది ఆతని సింహగర్జనకు అసువులు బాసి అచ్చటనే నేలగూలిరి.

**శ్లో॥ తత స్తే ష్వవసన్నేషు భూమౌ నిపతితేషు చ ।**
**త త్సైన్య మగమ త్సర్వం దిశో దశ భయార్దితమ్ ॥ 14**

**పదచ్ఛేదము :-** తతః - తేషు - అవసన్నేషు - భూమౌ - నిపతితేషు - చ - తత్ - సైన్యమ్ - అగమత్ - సర్వం - దిశః - దశ - భయార్దితమ్ ॥

**అన్వయక్రమము :-** తతః తేషు అవసన్నేషు భూమౌ నిపతితేషు (సత్సు) తత్ సర్వం సైన్యం భయార్దితమ్ (సత్) దశ దిశః అగమత్.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, తేషు = ఆ రక్కసులు, అవసన్నేషు = నశించిన వారును, భూమౌ = నేలపై, నిపతితేషు = పడిపోయిన వారును, (సత్సు = అగుచుండగా) తత్ సర్వం సైన్యం = ఆ సమస్తమైన సైన్యమును, భయార్దితమ్ (సత్) = భయముచే పీడింపబడినదై, దశ దిశః = పదిదిక్కులకును, అగమత్ = పోయెను.

**తాత్పర్యము :–** అప్పుడారీతిగా, ఆ రాక్షస సైనికులు శక్తిహీనులై నేలపై గూలుచుండగా ఆ సైన్యమంతయు భయవిహ్వలమై ఎల్లదిక్కులకును పరుగిడిపోయెను.

**శ్లో॥ వినేదు ర్విస్వరం నాగా నిపేతు ర్భువి వాజినః ।**
**భగ్ననీడ ధ్వజచ్ఛత్రైర్భూశ్చ కీర్ణాఽభవద్రథైః ॥ 15**

**పదచ్ఛేదము :–** వినేదుః – విస్వరం – నాగాః – నిపేతుః – భువి – వాజినః – భగ్ననీడధ్వజచ్ఛత్రైః – భూః – చ – కీర్ణా – అభవత్ – రథైః ॥

**అన్వయక్రమము :–** నాగాః విస్వరం వినేదుః; వాజినః భువి నిపేతుః; భగ్ననీడ ధ్వజచ్ఛత్రైః రథైః భూః కీర్ణా అభవత్ చ.

**ప్రతిపదార్థము :–** నాగాః = ఏనుగులు, విస్వరం = వికృతమైన స్వరముతో, వినేదుః = అఱచినవి, వాజినః = గుఱ్ఱములు, భువి = నేలపై, నిపేతుః = పడినవి, భగ్ననీడ ధ్వజచ్ఛత్రైః = విఱిగిపోయిన కప్పులును ధ్వజములును గొడుగులును కలిగినట్టి, రథైః = రథములతో, భూః = భూమి, కీర్ణా = నిండినది, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము :–** అప్పుడు అచ్చట ఏనుగులు వికారమైన స్వరముతో ఘీంకారములు చేసినవి. గుఱ్ఱములు నేలపై కూలినవి. కప్పులును ధ్వజములును ఛత్రములును ముక్కలైపోగా అట్లు భగ్నములైన రథములతో ఆ ప్రదేశమంతయు నిండిపోయి యుండెను.

**శ్లో॥ స్రవతా రుధిరే ణాథ స్రవంత్యో దర్శితాః పథి ।**
**వివిధైశ్చ స్వనై ర్లంకా ననాద వికృతం తదా ॥ 16**

**పదచ్ఛేదము :–** స్రవతా – రుధిరేణ – అథ – స్రవంత్యః – దర్శితాః – పథి – వివిధైః – చ – స్వనైః – లంకా – ననాద – వికృతం – తదా ॥

**అన్వయక్రమము :–** అథ పథి స్రవతా రుధిరేణ స్రవంత్యః దర్శితాః; తదా వివిధైః స్వనైః లంకా వికృతం ననాద.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, పథి = మార్గమునందు, స్రవతా = పారుచున్న, రుధిరేణ = రక్తముతో, స్రవంత్యః = ఏఱులు, దర్శితాః = చూపబడినవి, తదా = అప్పుడు, వివిధైః = బహువిధములైన, స్వనైః = ధ్వనులతో, లంకా = లంకానగరము, వికృతం = వికృతముగా, ననాద = ఘోషిల్లెను.

**తాత్పర్యము :–** అప్పుడచటి మార్గమునందు ప్రవహించుచున్న రక్తపు టేఱులు గానవచ్చినవి. లంకానగరము అంతయు పశువుల పక్షుల రక్కసుల అఱపులతో

మిక్కిలి వికృతముగా నాక్రోశించినది.

**శ్లో॥ స తా న్ప్రవృద్ధా న్వినిహత్య రాక్షసాన్**
**మహాబల శ్చండపరాక్రమః కపిః ।**
**యుయుత్సు రన్యైః పునరేవ రాక్షసైః**
**తదేవ వీరో ఽభిజగామ తోరణమ్ ॥ 17**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"అమాత్యపుత్రవధో" నామ*
*పంచచత్వారింశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** సః – తాన్ – ప్రవృద్ధాన్ – వినిహత్య – రాక్షసాన్ – మహాబలః – చండపరాక్రమః – కపిః – యుయుత్సుః – అన్యైః – పునః – ఏవ – రాక్షసైః – తత్ – ఏవ – వీరః – అభిజగామ – తోరణమ్ ॥

**అన్వయక్రమము :–** మహాబలః, చండపరాక్రమః సః వీరః కపిః ప్రవృద్ధాన్ రాక్షసాన్ వినిహత్య, పునః ఏవ అన్యైః రాక్షసైః యుయుత్సుః, తత్ తోరణమేవ అభిజగామ.

**ప్రతిపదార్థము :–** మహాబలః = మహాబలాఢ్యుడును, చండపరాక్రమః = భీకరమైన విక్రమము గలవాడునగు, వీరః = వీరుడైనట్టి, సః కపిః = ఆ హనుమ, ప్రవృద్ధాన్ = పెచ్చుపెరిగిన, రాక్షసాన్ = ఆ రాక్షసులను, వినిహత్య = పరిమార్చి, పునరేవ = మఱలగూడ, అన్యైః రాక్షసైః = ఇతరులైన రక్కసులతో, యుయుత్సుః = యుద్ధము చేయుకోరిక గలవాడై, తత్ తోరణమ్ ఏవ = ఆ బహిర్ద్వారమునే, అభిజగామ = చేరుకొనెను.

**తాత్పర్యము :–** మహాబలశాలియు భీకరపరాక్రమోపేతుడును అగు మహావీరుడైన ఆ హనుమ అట్లు తనమీదికి చెలరేగి వచ్చిన ఆ రక్కసుల నందఱను ఉక్కడగించి ఇంకను అచ్చటి రాక్షసవీరులతో పోరాడవలెనని కుతూహలముతో ఇదివఱకటినుండియు కూర్చునియున్న ఆ బహిర్ద్వారమునే చేరుకొనెను.

ఇది శ్రీమత్సుందరకాండమున
"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు
"అమాత్యపుత్రవధ" అను నలుబదియైదవసర్గము.
హరిః ఓం తత్ సత్.

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# షట్చత్వారింశసర్గ

**శ్లో॥ హతా న్మంత్రిసుతా న్బుద్ధ్వా వానరేణ మహాత్మనా ।**
**రావణ స్సంవృతాకార శ్చకార మతి ముత్తమామ్ ॥ 1**

**పదచ్ఛేదము :-** హతాన్ - మంత్రిసుతాన్ - బుద్ధ్వా - వానరేణ - మహాత్మనా - రావణః - సంవృతాకారః - చకార - మతిమ్ - ఉత్తమామ్ ॥

**అన్వయక్రమము :-** మహాత్మనా వానరేణ మంత్రిసుతాన్ హతాన్ బుద్ధ్వా రావణః సంవృతాకారః (సన్) ఉత్తమాం మతిం చకార.

**ప్రతిపదార్థము :-** మహాత్మనా = మహనీయుడైనట్టి, వానరేణ = హనుమచే, మంత్రిసుతాన్ = మంత్రిపుత్రులను, హతాన్ = చంపబడిన వారినిగా, బుద్ధ్వా = తెలిసికొని, రావణః = రావణుడు, సంవృతాకారః = దాచుకొనబడిన స్వరూపము గలవాడై, ఉత్తమాం = యోగ్యమైన, మతిం = ఆలోచనను, చకార = చేసెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** సంవృతాకారః - అణుచుకొనిన లోపలనున్న భయముగలవాడు.

**తాత్పర్యము :-** మహావీరుడైన హనుమచేతిలో తాను పంపిన మంత్రిసుతులెల్లరును హతమారినట్లు తెలిసికొని రావణుడు తనమనస్సులో గలిగిన భయమును, శంకలను పైకి కనపడకుండ అణచుకొని భావికార్యమును గూర్చి ధైర్యముతో ఆలోచనమును గావించెను.

**శ్లో॥ స విరూపాక్షయూపాక్షౌ దుర్ధర్షం చైవ రాక్షసమ్ ।**
**ప్రఘసం భాసకర్ణం చ పంచ సేనాగ్రనాయకాన్ ॥ 2**

**శ్లో॥ ఆదిదేశ దశగ్రీవో వీరా న్నయవిశారదాన్ ।**
**హనూమద్గ్రహణే వ్యగ్రా న్వాయువేగసమాన్యుధి ॥ 3**

**పదచ్ఛేదము :-** సః - విరూపాక్షయూపాక్షౌ - దుర్ధర్షం చ - ఏవ - రాక్షసమ్ -

ప్రఘసం – భాసకర్ణం – చ – పంచ – సేనాగ్రనాయకాన్ – ఆదిదేశ – దశగ్రీవః – వీరాన్ – నయవిశారదాన్ – హనూమద్గ్రహణే – వ్యగ్రాన్ – వాయువేగసమాన్ – యుధి ॥

**అన్వయక్రమము :–** సః దశగ్రీవః వీరాన్, నయవిశారదాన్, హనూమద్గ్రహణే వ్యగ్రాన్, యుధి వాయువేగసమాన్ విరూపాక్షయూపాక్షౌ రాక్షసం దుర్ధర్షం చైవ, ప్రఘసం, భాసకర్ణం చ పంచసేనాగ్రనాయకాన్ ఆదిదేశ.

**ప్రతిపదార్థము :–** సః దశగ్రీవః = ఆ దశకంఠుడు, వీరాన్ = శూరులును, నయవిశారదాన్ = యుద్ధనీతికోవిదులును, హనూమద్గ్రహణే = హనుమను బంధించుటయందు, వ్యగ్రాన్ = తీవ్రమైన వాంఛగలవారును, యుధి = యుద్ధమునందు, వాయువేగసమాన్ = వాయువుతో సమానమైన వేగముగలవారును అగు, విరూపాక్షయూపాక్షౌ = విరూపాక్షుని, యూపాక్షుని, రాక్షసం = రాక్షసశ్రేష్ఠుడైన, దుర్ధర్షం = దుర్ధర్షుని, ప్రఘసం = ప్రఘసుని, భాసకర్ణం చ = భాసకర్ణుని, పంచ = ఐదుగురు, సేనాగ్రనాయకాన్ = సేనాధిపతులను, అదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము :–** అప్పుడు దశకంఠుడు వెంటనే విరూపాక్షుడు, యూపాక్షుడు, దుర్ధర్షుడు, ప్రఘసుడు, భాసకర్ణుడు అనెడు మహావీరులును, యుద్ధనీతివిశారదులును, హనుమంతుని బంధించి తెచ్చుటకై వేగిరపడుచున్నవారును, యుద్ధమున వాయుదేవునితో సమానమైన చురుకుదనము గలవారును అగు తన ప్రధాన సైన్యాధికారులైన ఐదుగురిని హనుమంతునితో పోరుటకై ఆజ్ఞాపించెను.

**శ్లో॥ యాత సేనాగ్రగా స్సర్వే మహాబలపరిగ్రహాః ।**
**సవాజిరథమాతంగా స్స కపి శ్శాస్యతామితి ॥ 4**

**పదచ్ఛేదము :–** యాత – సేనాగ్రగాః – సర్వే – మహాబలపరిగ్రహాః – సవాజిరథ మాతంగాః – సః – కపిః – శాస్యతామ్ – ఇతి ॥

**అన్వయక్రమము :–** హే సేనాగ్రగాః యూయం సర్వే మహాబలపరిగ్రహాః సవాజిరథమాతంగాః యాత; సః కపిః శాస్యతామ్ ఇతి (ఆదిదేశ).

**ప్రతిపదార్థము :–** హే సేనాగ్రగాః = ఓ సైన్యాధిపతులారా (యూయం=మీరు) సర్వే = అందరును, మహాబలపరిగ్రహాః = గొప్పదైన సైన్యమును వెంటనిడుకొనినవారై, సవాజిరథమాతంగాః = గుఱ్ఱములతోడను రథములతోడను, ఏనుగులతోడను గూడిన వారగుచు, యాత = వెడలుడు, సః కపిః = ఆ వానరుడు, శాస్యతాం = శిక్షింపబడుగాక! ఇతి = అని, ఆదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము :–** ఓ సైన్యాధిపతులారా! మీరెల్లరును కలసి ఆవశ్యకమైన మహాసైన్యమును వెంటబెట్టుకొని కావలసినన్ని మన ఏనుగులను, గుఱ్ఱములను, రథములను గైకొని ఆ వానరుని మీదకు పోయి ఆతనిని దండించిరావలెను.

**శ్లో॥ యత్తైశ్చ ఖలు భావ్యం స్యాత్త మాసాద్య వనాలయమ్ ।**
**కర్మ చాపి సమాధేయం దేశకాలావిరోధితమ్ ॥ 5**

**పదచ్ఛేదము :–** యత్తైః – చ – ఖలు – భావ్యం – స్యాత్ – తమ్ – ఆసాద్య – వనాలయమ్ – కర్మ – చ – అపి – సమాధేయం – దేశకాలావిరోధితమ్ ॥

**అన్వయక్రమము :–** తం వనాలయం ఆసాద్య యత్తైః భావ్యం స్యాత్ ఖలు! కర్మ చ అపి దేశకాలావిరోధితం సమాధేయమ్.

**ప్రతిపదార్థము :–** తం వనాలయం = ఆ వానరుని, ఆసాద్య = చేరి, యత్తైః = జాగరూకులై, భావ్యం స్యాత్ ఖలు = యుండవలెను సుమీ!, కర్మ చ అపి = పనిగూడ, దేశకాల అవిరోధితం = దేశమునకును కాలమునకును విరోధింపనిదిగా, సమాధేయం = చేయవలసినది.

**తాత్పర్యము :–** మీ రా వానరునితో తలపడునప్పుడు అతిజాగరూకులుగా మెలగవలయును సుమీ! అచ్చట మీరు చేయు కృత్యము కూడ దేశకాలములకు విరుద్ధముగాకుండ సముచితముగనే నిర్వహింపవలసియున్నది.

**శ్లో॥ న హ్యహం తం కపిం మన్యే కర్మణా ప్రతితర్కయన్ ।**
**సర్వథా తన్మహద్భూతం మహాబలపరిగ్రహమ్ ॥ 6**

**పదచ్ఛేదము :–** న – హి – అహం – తం – కపిం – మన్యే – కర్మణా – ప్రతితర్కయన్ – సర్వథా – తత్ – మహత్ – భూతం – మహాబలపరిగ్రహమ్ ॥

**అన్వయక్రమము :–** కర్మణా ప్రతితర్కయన్ అహం తం కపిం న హి మన్యే, తత్ సర్వథా మహాబలపరిగ్రహం మహత్ భూతమ్ (స్యాత్).

**ప్రతిపదార్థము :–** కర్మణా = కృత్యముచే, ప్రతితర్కయన్ = ఆలోచించుచు, అహం = నేను, తం = అతనిని, కపిం = వానరునిగా, న హి మన్యే = ఎంతమాత్రమును అనుకొనను, సర్వథా = ఎల్లవిధముల, తత్ = ఆయది, మహాబలపరిగ్రహం = గొప్పదైన, భూతం = భూతము, స్యాత్ = అగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :- మహాబలపరిగ్రహం - తనను చుట్టుముట్టిన మహాసైన్యములను విధ్వంసము చేయునట్టిది అని అర్థము.

**తాత్పర్యము** :- అతడు గావించిన భీకరకృత్యములనుబట్టి చూచినచో ఆతడు కేవలము వానరమాత్రుడు గాడని భావించుచున్నాను. సర్వవిధముల ఆతడు మహాశక్తి సంపన్నుడైనట్టి ఒక మహాభూతమై యుండవలెను.

**శ్లో॥ వానరోఽయ మితి జ్ఞాత్వా న హి శుధ్యతి మే మనః ।**
**నై వాహం తం కపిం మన్యే యథేయం ప్రస్తుతా కథా ॥ 7**

**పదచ్ఛేదము** :- వానరః - అయమ్ - ఇతి - జ్ఞాత్వా - న - హి - శుధ్యతి - మే - మనః - న - ఏవ - అహం - తం - కపిం - మన్యే - యథా - ఇయం - ప్రస్తుతా - కథా ॥

**అన్వయక్రమము** :- మే మనః అయం వానరః ఇతి జ్ఞాత్వా న హి శుధ్యతి, యథా ఇయం ప్రస్తుతా కథా (తథా) అహం తం కపిం నైవ మన్యే.

**ప్రతిపదార్థము** :- మే = నా యొక్క, మనః = మనస్సు, అయం = ఈతడు, వానరః = వానరుడు, ఇతి = అని, జ్ఞాత్వా = తెలిసికొని, న హి శుధ్యతి = శాంతి నొందుట లేదు, యథా = ఏరీతిని, ఇయం = ఈ, ప్రస్తుతా = ప్రస్తుతపు, కథా = వ్యవహారము, (దృశ్యతే = కాన్పించుచున్నదో) తథా = ఆ రీతిని, తం = ఆతనిని, కపిం = వానరునిగా, నైవ మన్యే = ఎంతమాత్రము తలచను.

**తాత్పర్యము** :- ఈత డొక వానరుడని తెలిసికొని నేను మనస్సులో తృప్తిపడలేకున్నాను. ప్రస్తుతము జరుగుచున్న భీకరకృత్యములనుబట్టి ఈతడు వానరమాత్రుడని నే నెంతమాత్రము విశ్వసింపజాలను.

సూచన : - ఈ శ్లోకము కొన్ని ప్రతులలో గానవచ్చుటలేదు.

**శ్లో॥ భవే దింద్రేణ వా సృష్ట మస్మదర్థం తపోబలాత్ ।**
**సనాగయక్షగంధర్వా దేవాసురమహర్షయః ॥ 8**

**శ్లో॥ యుష్మాభిః ప్రహితైః స్సర్వై ర్మయా సహ వినిర్జితాః ।**
**తై రవశ్యం విధాతవ్యం వ్యలీకం కించిదేవ నః ॥ 9**

**పదచ్ఛేదము** :- భవేత్ - ఇంద్రేణ - వా సృష్టమ్ - అస్మదర్థం - తపోబలాత్ -

సనాగయక్షగంధర్వాః – దేవాసురమహర్షయః – యుష్మాభిః – ప్రహితైః – సర్వైః – మయా – సహ – వినిర్జితాః. తైః – అవశ్యం – విధాతవ్యం – వ్యలీకం – కించిత్ – ఏవ – నః ॥

**అన్వయక్రమము** :– అస్మదర్థమ్ ఇంద్రేణ తపోబలాత్ (ఇదం) సృష్టం భవేత్; మయా ప్రహితైః యుష్మాభిః మయా సహ సనాగయక్షగంధర్వాః, దేవాసురమహర్షయః వినిర్జితాః; అవశ్యం నః కించిత్ ఏవ వ్యలీకం తైః విధాతవ్యమ్.

**ప్రతిపదార్థము** :– అస్మదర్థం = మాకొఱకై, ఇంద్రేణ = దేవేంద్రునిచే, తపోబలాత్ = తపశ్శక్తివలన, ఇదం = ఈ మహాభూతము, సృష్టం = సృజింపబడినది, భవేత్ = కావచ్చును, మయా = నాచేత, ప్రహితైః = పంపబడినట్టి, యుష్మాభిః = మీచేత, మయా సహ = నాతోగలసి, సనాగయక్షగంధర్వాః = నాగులతోడను యక్షులతోడను గంధర్వులతోడను కూడినట్టి, దేవాసురమహర్షయః = దేవతలును, రాక్షసులును మహర్షులును, వినిర్జితాః = ఓడింపబడియుండిరి, అవశ్యం = తప్పనిసరిగా, తైః ఏవ = వారిచేతనే, (ఇదం = ఈ) కించిత్ = ఏదోఒక, వ్యలీకం = అప్రియము, నః = మనకు, విధాతవ్యమ్ = చేయబడియుండును.

**తాత్పర్యము** :– ఈ వానరరూపమైన మహాభూతమును దేవేంద్రుడే తన తపశ్శక్తి వలన మనకొఱకుగాను సృష్టించి యుండవచ్చును. పెక్కుమాఱులు నాగులు, యక్షులు, గంధర్వులు, దేవతలు, దానవులు, మహర్షులు నాతో కలసి మీయందఱిచేతను ఓడింపబడి యుండిరి కదా! వారే నేడు మనకు హాని కల్గించుటకై ఈ విధమైన అప్రియమును మనకు సృష్టించి యుందురు.

**శ్లో॥ తదేవ నాత్ర సందేహః ప్రసహ్య పరిగృహ్యతామ్ ।**
**నావమాన్యో భవద్భిశ్చ హరి ర్ధీరపరాక్రమః ॥ 10**

**పదచ్ఛేదము** :– తత్ – ఏవ – న – అత్ర – సందేహః – ప్రసహ్య – పరిగృహ్యతామ్ – న – అవమాన్యః – భవద్భిః – చ – హరిః – ధీరపరాక్రమః ॥

**అన్వయక్రమము** :– ఇదం తత్ ఏవ; అత్ర సందేహః న (అస్తి). ప్రసహ్య పరిగృహ్యతామ్; ధీరపరాక్రమః హరిః భవద్భిః నచ అవమాన్యః.

**ప్రతిపదార్థము** :– ఇదం = ఈ మహాభూతము, తత్ ఏవ = ఆ ఇంద్రసృష్టియే; అత్ర = ఈ విషయమునందు, సందేహః = శంక, నాస్తి = లేదు; ధీరపరాక్రమః = ధైర్యయుతమైన పరాక్రమము కల్గినట్టి, హరిః = వానరుడు, భవద్భిః = మీచేత, న చ అవమాన్యః = ఎంతమాత్రము అవమానింపబడకూడదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- ఇంతకుపూర్వము పదమూడువేల శ్లోకములు గడిచినవి. ఇది పదునాల్గవ సహస్రముయొక్క ప్రథమ శ్లోకము. గాయత్రీమంత్రమునందలి పదునాల్గవ అక్షరమైన 'ధీ' యను అక్షరము ఇందు ప్రయుక్తమైనది (ధీరపరాక్రమః)

**తాత్పర్యము** :- ఈ వానరుడు ఆ దేవేంద్రునిచే సృష్టింపబడిన మహాభూతమే యగును. ఇందు సందేహములేదు. కాబట్టి మీ రాతనిని బలాత్కారముగా పట్టి బంధించి తెండు. మహాధైర్యపరాక్రమములు కల్గినట్టి ఆ వానరుని ఎంతమాత్రము అవమానము చేయకుడు.

**శ్లో॥ దృష్టా హి హరయః పూర్వం మయా విపులవిక్రమాః ।**
**వాలీ చ సహసుగ్రీవో జాంబవాంశ్చ మహాబలః ॥ 11**

**శ్లో॥ నీల స్సేనాపతిశ్చైవ యే చాన్యే ద్వివిదాదయః ।**
**నైవం తేషాం గతి ర్భీమా న తేజో న పరాక్రమః ॥ 12**

**శ్లో॥ న మతి ర్న బలోత్సాహౌ న రూపపరికల్పనమ్ ।**
**మహ త్సత్త్వ మిదం జ్ఞేయం కపిరూపం వ్యవస్థితమ్ ॥ 13**

**పదచ్ఛేదము** :- దృష్టాః - హి - హరయః - పూర్వం - మయా - విపులవిక్రమాః, వాలీ - చ - సహసుగ్రీవః - జాంబవాన్ - చ - మహాబలః - నీలః - సేనాపతిః - చ - ఏవ - యే - చ - అన్యే - ద్వివిదాదయః, న - ఏవం - తేషాం - గతిః - భీమా - న - తేజః - న - పరాక్రమః, న - మతిః - న - బలోత్సాహౌ - న - రూపపరికల్పనమ్, మహత్ - సత్త్వమ్ - ఇదం - జ్ఞేయం - కపిరూపం - వ్యవస్థితమ్ ॥

**అన్వయక్రమము** :- సహసుగ్రీవః వాలీ చ, మహాబలః జాంబవాన్ చ, సేనాపతిః నీలః చైవ, అన్యే ద్వివిదాదయః యే విపులవిక్రమాః హరయః పూర్వం మయా దృష్టా హి, తేషాం గతిః ఏవం భీమా న; తేజః న; పరాక్రమః న, మతిః న; బలోత్సాహౌ న; రూపపరికల్పనం న; ఇదం కపిరూపం వ్యవస్థితం మహత్ సత్త్వం జ్ఞేయమ్.

**ప్రతిపదార్థము** :- సహసుగ్రీవః = సుగ్రీవునితో గూడినట్టి, వాలీ చ = వాలియును, మహాబలః = మహాబలాఢ్యుడైన, జాంబవాన్ చ = జాంబవంతుడు, సేనాపతిః = సేనాధిపతియైన, నీలః చ = నీలుడును, ద్వివిదాదయః = ద్వివిదుడు మున్నగు, విపులవిక్రమాః = అమితవిక్రమము కల్గినట్టి, అన్యే = ఇతరులైన, యే హరయః =

ఏ వానరవీరులు, పూర్వం = ఇంతకుముందు, మయా దృష్టాః = నాచేత చూడబడిరో, తేషాం = వారికి, ఏవం = ఈ రీతిగా, భీమా గతిః = భయంకరమైన గమనము, న = లేదు. తేజః న = తేజస్సు లేదు, పరాక్రమః న = పరాక్రమము లేదు, మతిః న = ప్రజ్ఞ లేదు, బలోత్సాహౌ న = శక్తి, యుత్సాహమును లేవు, రూపపరికల్పనం న = కామరూపధారణమును లేదు, కపిరూపం = వానరరూపమును, వ్యవస్థితం = ధరించినట్టి, ఇదం = ఈయది, మహత్ సత్త్వం = మహాభూతముగా, జ్ఞేయం = తెలియదగినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– భీమా గతిః = మహాసముద్రమును దాటివచ్చుట అనెడి భయంకరమైన గమనము.

**తాత్పర్యము** :– నేను పూర్వము అమితపరాక్రమ సంపన్నులైన వానరవీరులను ఎంతమందినో చూచియుంటిని గదా! ఆ వాలి, ఆ సుగ్రీవుడు, మహాబలాఢ్యుడైన ఆ జాంబవంతుడు, వానరసేనా నాయకుడైన నీలుడు, ఇంకను ద్వివిదుడు మున్నగు పెక్కుమంది వానరయోధులు నాకు పరిచితులే. వారెవ్వరిలోను ఈవిధమైనట్టి భయంకరమైన గతి గాని, శక్తి గాని, మహాప్రతాపము గాని పరాక్రమము గాని, ప్రజ్ఞ గాని, శక్తిఉత్సాహములు గాని, స్వేచ్ఛారూపధారణశక్తి గాని, గాన్పింపలేదు. అందుచే ఈతడు వానరరూపమును స్వీకరించి యున్న అద్భుతమైన ఒక మహాభూతమే యని మనము గ్రహించవలెను.

**శ్లో॥ ప్రయత్నం మహ దాస్థాయ క్రియతా మస్య నిగ్రహః ।**
**కామం లోకా స్త్రయ స్సేంద్రా స్ససురాసురమానవాః ।**
**భవతా మగ్రతః స్థాతుం న పర్యాప్తా రణాజిరే ॥ 14**

**పదచ్ఛేదము** :– ప్రయత్నం – మహత్ – ఆస్థాయ – క్రియతామ్ – అస్య – నిగ్రహః – కామం – లోకాః – త్రయః – సేంద్రాః – ససురాసురమానవాః – భవతాం – అగ్రతః – స్థాతుం – న – పర్యాప్తాః – రణాజిరే ॥

**అన్వయక్రమము** :– మహత్ ప్రయత్నం ఆస్థాయ అస్య నిగ్రహః క్రియతామ్, రణాజిరే సేంద్రాః ససురాసురమానవాః కామం త్రయః లోకాః భవతామ్ అగ్రతః స్థాతుం పర్యాప్తాః న (భవంతి).

**ప్రతిపదార్థము** :– మహత్ ప్రయత్నం = గొప్పదైన ప్రయత్నమును, ఆస్థాయ =

ఒనరించి, అస్య = వీనియొక్క, నిగ్రహః = నిరోధించుట, క్రియతాం = చేయబడుగాక, రణాజిరే = రణరంగమున, సేంద్రాః = ఇంద్రునితో గూడినట్టియు, ససురాసురమానవాః = దేవదానవమానవులతో గూడినవియునగు, త్రయః లోకాః = మూడులోకములును, కామం = స్వేచ్ఛగా, భవతామ్ అగ్రతః = మీ ఎదుట, స్థాతుం = నిలచుటకు, పర్యాప్తాః = సమర్థములైనవి, న భవంతి = కావు;

**తాత్పర్యము** :- గొప్పదైన యత్నమును గాంచి ఈతనిని మీరు బంధింపవలెను. ఇంద్రునితోడను, దేవదానవమానవులతోడను కూడి వచ్చినను సరియే యుద్ధభూమిలో మీ ఎదుట నిలబడుటకు వారికి సామర్థ్యము కలుగదు.

**శ్లో॥ తథాపి తు నయజ్ఞేన జయమాకాంక్షతా రణే ।**
**ఆత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధసిద్ధిర్హి చంచలా ॥ 15**

**పదచ్ఛేదము** :- తథా - అపి - నయజ్ఞేన - జయమ్ - ఆకాంక్షతా - రణే - ఆత్మా - రక్ష్యః - ప్రయత్నేన - యుద్ధసిద్ధిః - హి - చంచలా ॥

**అన్వయక్రమము** :- తథాపి రణే జయం ఆకాంక్షతా నయజ్ఞేన తు ఆత్మా ప్రయత్నేన రక్ష్యః; యుద్ధసిద్ధిః చంచలా హి.

**ప్రతిపదార్థము** :- తథాపి = అయినప్పటికిని, రణే = యుద్ధమునందు, జయం = జయమును, ఆకాంక్షతా = వాంఛించుచున్నట్టి, నయజ్ఞేన తు = యుద్ధనీతివేత్త చేతమాత్రము; ఆత్మా = తన దేహము, ప్రయత్నేన = గొప్పయత్నముతో, రక్ష్యః = రక్షించుకొనవలసినది, యుద్ధసిద్ధిః = యుద్ధమున జయసిద్ధి, చంచలా హి = చంచలమైనదిగదా.

**తాత్పర్యము** :- మీరు ముల్లోకములను జయింపగలవారే; అయినప్పటికిని యుద్ధము నందు విజయమును సంపాదింపగోరు నీతివేత్త మాత్రము తనను తాను మిక్కిలి ప్రయత్నపూర్వకముగా కాపాడుకొనవలసియుండును. యుద్ధమునందు విజయప్రాప్తి సాధారణముగా అనిశ్చయమై యుండును గదా!

**శ్లో॥ తే స్వామివచనం సర్వే ప్రతిగృహ్య మహౌజసః ।**
**సముత్పేతు ర్మహావేగా హుతాశసమతేజసః ॥ 16**

**పదచ్ఛేదము** :- తే - స్వామివచనం - సర్వే - ప్రతిగృహ్య - మహౌజసః - సముత్పేతుః - మహావేగాః - హుతాశసమతేజసః ॥

**అన్వయక్రమము** :- మహౌజసః తే సర్వే స్వామివచనం ప్రతిగృహ్య హుతాశసమతేజసః

మహావేగాః (సంతః) సముత్పేతుః.

**ప్రతిపదార్థము** :– మహౌజసః = మహాపరాక్రమవంతులైన, తే సర్వే = ఆ సేనాధిపతులందరును, స్వామివచనం = ప్రభువుయొక్క మాటను, ప్రతిగృహ్య = స్వీకరించి, హుతాశసమతేజసః = అగ్నిహోత్రునితో సమానమైన తేజస్సు గలవారును, మహావేగాః = అమితమైన వేగముగలవారును, సంతః = అగుచు, సముత్పేతుః = మీదికి ఎగిరిరి.

**తాత్పర్యము** :– ఆ సేనానాయకులు ఏవురును తమ ప్రభువు ఆజ్ఞను స్వీకరించి అగ్నిహోత్రములవలె జ్వలించుచు అమితమైన వేగముతో అటనుండి యుద్ధభూమికి ఎగసిపోయిరి.

**శ్లో॥ రథై ర్మత్తైశ్చ మాతంగై ర్వాజిభిశ్చ మహాజవైః ।**
**శస్త్రైశ్చ వివిధై స్తీక్ష్ణైస్సర్వై శ్చోపచితా బలైః ॥ 17**

**పదచ్ఛేదము** :– రథైః – మత్తైః – చ – మాతంగైః – వాజిభిః – చ – మహాజవైః – శస్త్రైః – చ – వివిధైః – తీక్ష్ణైః – సర్వైః – చ – ఉపచితాః – బలైః ॥

**అన్వయక్రమము** :– (తే) రథైః మత్తైః మాతంగైః చ మహాజవైః వాజిభిశ్చ, తీక్ష్ణైః వివిధైః శస్త్రైః చ, సర్వైః బలైః చ ఉపచితాః సముత్పేతుః.

**ప్రతిపదార్థము** :– (తే = ఆ పంచ సేనానాయకులు) రథైః = రథములతోడను, మత్తైః = మదించిన, మాతంగైః = ఏనుగులతోడను, మహాజవైః = మహావేగముగల, వాజిభిః చ = గుఱ్ఱములతోడను, తీక్ష్ణైః = వాడియైన, వివిధైః = పలువిధములైన, శస్త్రైః చ = ఆయుధములతోడను, సర్వైః = ఎల్లవిధములైన, బలైః = బలములతోడను, ఉపచితాః = కూడుకొన్నవారై, (సముత్పేతుః = ఎగసిరి).

**తాత్పర్యము** :– ఆ సేనానాయకపంచకము శ్రేష్ఠములైన రథములను, మదించిన ఏనుగులను, అమితవేగము గల అశ్వములను, పలువిధములైన వాడిగల ఆయుధములను, చతురంగ బలములను, అన్నిటిని చక్కగా సమకూర్చుకొని హనుమ మీదకి వెడలెను.

**శ్లో॥ తత స్తం దదృశు ర్వీరా దీప్యమానం మహాకపిమ్ ।**
**రశ్మిమంత మివోద్యంతం స్వతేజోరశ్మిమాలినమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– తతః – తం – దదృశుః – వీరాః – దీప్యమానం – మహాకపిమ్, రశ్మిమంతమ్ – ఇవ – ఉద్యంతం – స్వతేజోరశ్మిమాలినమ్ ॥

**అన్వయక్రమము :–** తతః (తే) వీరాః స్వతేజోరశ్మిమాలినమ్, దీప్యమానం తం మహాకపిమ్, ఉద్యంతం రశ్మిమంతమ్ ఇవ దదృశుః.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, తే వీరాః = ఆ వీరులు, ఉద్యంతం = ఉదయించుచున్నట్టి, రశ్మిమంతమ్ ఇవ = భాస్కరునివలె, స్వతేజోరశ్మిమాలినమ్ = తన తేజస్సు అనెడు ప్రకాశము కల్గియున్న, దీప్యమానం = ప్రజ్వలించుచున్న, తం మహాకపిమ్ = ఆ వానరశ్రేష్ఠుని, దదృశుః = చూచిరి.

**తాత్పర్యము :–** అట్లు వెడలివచ్చిన ఆ సేనాధిపతు లైదుగురును అప్పుడే ఉదయించుచున్న సూర్యునివలె తన తేజోవిశేషముచేత ప్రజ్వలించుచున్న వానరశ్రేష్ఠుడైన హనుమను గాంచిరి.

**శ్లో॥ తోరణస్థం మహోత్సాహం మహాసత్త్వం మహాబలమ్ ।**
**మహామతిం మహావేగం మహాకాయం మహాభుజమ్ ॥ 19**

**శ్లో॥ తం సమీక్ష్యైవ తే సర్వే దిక్షు సర్వా స్వవస్థితాః ।**
**తై స్తైః ప్రహరణై ర్భీమై రభిపేతు స్తత స్తతః ॥ 20**

**పదచ్ఛేదము :–** తోరణస్థం – మహోత్సాహం – మహాసత్త్వం – మహాబలమ్ – మహామతిం – మహావేగం – మహాకాయం – మహాభుజమ్ – తం – సమీక్ష్య – ఏవ – తే – సర్వే – దిక్షు – సర్వాసు – అవస్థితాః – తైః – తైః – ప్రహరణైః – భీమైః – అభిపేతుః – తతః – తతః ॥

**అన్వయక్రమము :–** తోరణస్థం మహోత్సాహం, మహాసత్త్వం మహాబలం, మహామతిం, మహావేగం, మహాకాయం మహాభుజం తం సమీక్ష్య ఏవ సర్వే సర్వాసు దిక్షు అవస్థితాః, తతః తతః భీమైః తైః తైః ప్రహరణైః అభిపేతుః.

**ప్రతిపదార్థము :–** తోరణస్థం = బహిర్ద్వారముపై కూర్చున్నవాడును, మహోత్సాహం = గొప్ప ఉత్సాహము గలవాడును, మహాసత్త్వం = గొప్పశక్తి గలవాడును, మహాబలం = గొప్ప బలము గలవాడును, మహామతిం = గొప్ప ప్రజ్ఞ గలవాడును, మహాభుజం = గొప్ప భుజములు గలవాడును అగు, తం = ఆ హనుమను, సమీక్ష్య ఏవ = చూచియే, తే సర్వే = వారెల్లరును, సర్వాసు దిక్షు = అన్నివైపులందును, అవస్థితాః = నిలచిపోయిన వారై, తతః తతః = ఆ యా దిక్కులనుండి, భీమైః = భయంకరమైనట్టి, తైః తైః ప్రహరణైః = ఆ యా ఆయుధములతో, అభిపేతుః = మీదబడిరి.

**తాత్పర్యము :–** ఆ సేనాధిపతు లైదుగురును ఆ ప్రాసాదబహిర్ద్వారముపై అమితమైన

ఉత్సాహముతోడను శక్తితోడను బలముతోడను ప్రజ్ఞతోడను వేగముతోడను విరాజిల్లుచు, ధృఢములైన భుజములతోడను శరీరముతోడను గానవచ్చుచున్న మహావీరుడైన ఆ హనుమను చూచి వెంటనే మూలమూలలకు బోయి నిలచి తమ తమ తీక్ష్ణములైన ఆయుధములను చేత ధరించి అన్నివైపుల నుండి వచ్చి ఆతనిపై బడిరి.

**శ్లో॥ తస్య పంచాయసా స్తీక్ష్ణాస్సితాః పీతముఖా శ్శరాః ।**
**శిర స్యుత్పలపత్రాభా దుర్ధరేణ నిపాతితాః ॥ 21**

**పదచ్ఛేదము :–** తస్య – పంచ – ఆయసాః – తీక్ష్ణాః – సితాః – పీతముఖాః – శరాః – శిరసి – ఉత్పలపత్రాభాః – దుర్ధరేణ – నిపాతితాః ॥

**అన్వయక్రమము :–** తస్య శిరసి దుర్ధరేణ ఆయసాః, తీక్ష్ణాః, సితాః పీతముఖాః ఉత్పలపత్రాభాః పంచశరాః నిపాతితాః.

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ హనుమయొక్క, శిరసి = శిరస్సున, ఆయసాః = లోహనిర్మితములును, తీక్ష్ణాః = వాడియైనవియును, సితాః = తెల్లనివియును, పీతముఖాః = పచ్చని ములికి కలిగినవియును, ఉత్పలపత్రాభాః = కలువఱేకులవంటి కాంతులు గలవియునగు, పంచశరాః = ఐదుబాణములు, దుర్ధరేణ = దుర్ధరునిచే, నిపాతితాః = ప్రయోగింపబడినవి.

**తాత్పర్యము :–** వారిలో దుర్ధరు డనువాడు హనుమ శిరస్సుపై లోహనిర్మితములై బంగారుములికి గలిగి వాడివై కలువఱేకులవంటిపై తెల్లని కాంతులుగలవై యున్న ఐదుబాణములను ప్రయోగించెను.

**శ్లో॥ స తైః పంచభి రావిద్ధః శరై శ్శిరసి వానరః ।**
**ఉత్పపాత నదన్వ్యోమ్ని దిశో దశ వినాదయన్ ॥ 22**

**పదచ్ఛేదము :–** సః – తైః – పంచభిః – ఆవిద్ధః – శరైః – శిరసి – వానరః – ఉత్పపాత – నదన్ – వ్యోమ్ని – దిశః – దశ – వినాదయన్ ॥

**అన్వయక్రమము :–** సః వానరః శిరసి తైః పంచభిః శరైః ఆవిద్ధః దశ దిశః వినాదయన్ నదన్ వ్యోమ్ని ఉత్పపాత.

**ప్రతిపదార్థము :–** సః వానరః = ఆ హనుమ, శిరసి = శిరస్సునందు, తైః పంచభిః శరైః = ఆ యైదు బాణములచే, ఆవిద్ధః = కొట్టబడినవాడై, దశ దిశః = పది దిక్కులను, వినాదయన్ = ప్రతిధ్వనింప చేయుచు, నదన్ = గర్జించుచు, వ్యోమ్ని =

ఆకాశమునందు, ఉత్పపాత = ఎగిరెను.

**తాత్పర్యము** :– అప్పుడు హనుమ ఆ యైదు బాణములు తన తలకు తగులగనే ఎల్లదిక్కులు పిక్కటిల్లునట్లు గర్జించుచు ఆకసమున కెగిసెను.

**శ్లో॥ తతస్తు దుర్ధరో వీర స్సరథ స్సజ్యకార్ముకః ।**
**కిరన్ శరశతైస్తీక్ష్ణై రభిపేదే మహాబలః ॥ 23**

**పదచ్ఛేదము** :– తతః – తు – దుర్ధరః – వీరః – సరథః – సజ్యకార్ముకః – కిరన్ – శరశతైః – తీక్ష్ణైః – అభిపేదే – మహాబలః ॥

**అన్వయక్రమము** :– తతః మహాబలః వీరః దుర్ధరః సరథః సజ్యకార్ముకః (సన్) తీక్ష్ణైః శరశతైః కిరన్ అభిపేదే.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, మహాబలః = మహాబలాఢ్యుడును, వీరః = శూరుడును అగు, దుర్ధరః = దుర్ధరుడు, సరథః = రథముతో కూడినవాడును, సజ్యకార్ముకః = ఎక్కుపెట్టిన విల్లుగలవాడును అగుచు, తీక్ష్ణైః = వాడియైన, శరశతైః = వందల కొలదిబాణములతో, కిరన్ = వెదజల్లుచు, అభిపేదే = మీదికి వచ్చెను.

**తాత్పర్యము** :– వీరుడును మహాబలాఢ్యుడును అగు ఆ దుర్ధరుడు రథముతోడను ఎక్కు పెట్టిన విల్లుతోడను మీదికి ఎగసి వాడియైన బాణములను వందలకొలది హనుమపై కురిపించదొడగెను.

**శ్లో॥ స కపి ర్వారయామాస తం వ్యోమ్ని శరవర్షిణమ్ ।**
**వృష్టిమంతం పయోదాంతే పయోదమివ మారుతః ॥ 24**

**పదచ్ఛేదము** :– సః – కపిః – వారయామాస – తం – వ్యోమ్ని – శరవర్షిణమ్ – వృష్టిమంతం – పయోదాంతే – పయోదమ్ – ఇవ – మారుతః ॥

**అన్వయక్రమము** :– సః కపిః వ్యోమ్ని శరవర్షిణం తం పయోదాంతే మారుతః వృష్టిమంతం పయోదమ్ ఇవ వారయామాస.

**ప్రతిపదార్థము** :– సః కపిః = ఆ హనుమ, వ్యోమ్ని = ఆకసమునందు, శరవర్షిణం = బాణములను కురిపించుచున్న, తం = ఆ దుర్ధరుని, పయోదాంతే = వర్షాకాలముచివర, మారుతః = వాయువు, వృష్టిమంతం = వర్షించుచున్నట్టి, పయోదమ్ ఇవ = మేఘమునువలె, వారయామాస = అడ్డగించెను.

**తాత్పర్యము** :– అప్పుడు హనుమ తనతో ఆకసమునకు వచ్చి తనపై బాణములు

కురిపించుచున్నట్టి ఆ దుర్ధరుని శరత్కాలమునందు జల్లులను కురిపించుచున్నట్టి మేఘమును వాయువు దూరమున కెగురగొట్టినట్లుగా ఎగురగొట్టెను.

**శ్లో॥ అర్ద్యమాన స్తత స్తేన దుర్ధరే ణానిలాత్మజః ।**
**చకార కదనం భూయో వ్యవర్ధత చ వేగవాన్ ॥ 25**

**పదచ్ఛేదము :-** అర్ద్యమానః – తతః – తేన – దుర్ధరేణ – అనిలాత్మజః – చకార – కదనం – భూయః – వ్యవర్ధత – చ – వేగవాన్ ॥

**అన్వయక్రమము :-** తతః వేగవాన్ అనిలాత్మజః తేన దుర్ధరేణ అర్ద్యమానః కదనం చకార. భూయః వ్యవర్ధత చ.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, వేగవాన్ = వేగవంతుడైనట్టి, అనిలాత్మజః = వాయునందనుడైన హనుమ, తేన దుర్ధరేణ = ఆ దుర్ధరునిచే, అర్ద్యమానః = పీడింప బడుచున్నవాడై, కదనం = యుద్ధమును, చకార = చేసెను. భూయః = తిరిగి, వ్యవర్ధత చ = మిక్కిలిగా వృద్ధినొందెను కూడ.

**సూచన :-** 'కదనం' అనుటకు బదులుగా 'నినదం' అని పాఠాంతరము. అనగా గొప్పగర్జన చేసెను అని అర్థము.

**తాత్పర్యము :-** అప్పుడు మహావేగశాలియైన హనుమ దుర్ధరునిచే అట్లు పీడింప బడుచునే మిక్కిలి విజృంభించి తిరిగి మహాయుద్ధము చేయసాగెను.

**శ్లో॥ స దూరం సహ సోత్పత్య దుర్ధరస్య రథే హరిః ।**
**నిపపాత మహావేగో విద్యుద్రాశిర్గిరావివ ॥ 26**

**పదచ్ఛేదము :-** సః – దూరం – సహసా – ఉత్పత్య – దుర్ధరస్య – రథే – హరిః, నిపపాత – మహావేగః – విద్యుద్రాశిః – గిరౌ – ఇవ ॥

**అన్వయక్రమము :-** మహావేగః సః హరిః సహసా దూరమ్ ఉత్పత్య విద్యుద్రాశిః గిరౌ ఇవ దుర్ధరస్య రథే నిపపాత.

**ప్రతిపదార్థము :-** మహావేగః సః హరిః = అమిత వేగవంతుడైన ఆ హనుమ, సహసా = వెంటనే, దూరం = దూరముగా, ఉత్పత్య = మీదికి ఎగిరి, విద్యుద్రాశిః = విద్యుత్తుల సమూహమైన పిడుగు, గిరౌ ఇవ = పర్వతమునందువలె, దుర్ధరస్య = దుర్ధరునియొక్క, రథే = రథమునందు, నిపపాత = ఉఱికెను.

**తాత్పర్యము :-** అప్పుడు హనుమ వెంటనే ఆకసముమీది కెగిరిపోయి పర్వతముపై

పిడుగు పడినట్లుగా అమితమైన వేగముతో దుర్ధరుని రథముమీదికి ఉఱికెను.

**శ్లో॥ తత స్స మథితాష్టాశ్వం రథం భగ్నాక్షకూబరమ్ ।**
**విహాయ న్యపతత్ భూమౌ దుర్ధర స్త్యక్తజీవితః ॥ 27**

**పదచ్ఛేదము** :- తతః - సః - మథితాష్టాశ్వం - రథం - భగ్నాక్షకూబరమ్ - విహాయ - న్యపతత్ - భూమౌ - దుర్ధరః - త్యక్తజీవితః ॥

**అన్వయక్రమము** :- తతః సః దుర్ధరః మథితాష్టాశ్వం భగ్నాక్షకూబరం రథం విహాయ త్యక్తజీవితః సన్ భూమౌ న్యపతత్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, సః దుర్ధరః = ఆ దుర్ధరుడు, మథితాష్టాశ్వం = చంపబడిన ఎనిమిది గుఱ్ఱములు కలిగినట్టియు, భగ్నాక్షకూబరం = విరిగిపోయిన ఇరుసును కాడియును గలదియును అగు, రథం = రథమును, విహాయ = విడిచి, భూమౌ = నేలపై, న్యపతత్ = పడెను.

**తాత్పర్యము** :- అప్పు డా దుర్ధరుడు తన రథమునకు కట్టిన ఎనిమిది గుఱ్ఱములును నలిగి ముద్దయైపోవగా రథచక్రములును నొగలును ముక్కముక్కలై పోవగా నేలపై గూలి అసువులు బాసెను.

**శ్లో॥ తం విరూపాక్షయూపాక్షౌ దృష్ట్వా నిపతితం భువి ।**
**సంజాతరోషౌ దుర్ధర్షా వుత్పేతతు రరిందమౌ ॥ 28**

**పదచ్ఛేదము** :- తం - విరూపాక్షయూపాక్షౌ - దృష్ట్వా - నిపతితం - భువి - సంజాతరోషౌ - దుర్ధర్షౌ - ఉత్పేతతుః - అరిందమౌ ॥

**అన్వయక్రమము** :- తం భువి నిపతితం దృష్ట్వా దుర్ధర్షౌ అరిందమౌ, విరూపాక్ష యూపాక్షౌ సంజాతరోషౌ (సంతౌ) ఉత్పేతతుః.

**ప్రతిపదార్థము** :- తం = ఆ దుర్ధర్షుని, భువి = నేలపై, నిపతితం = కూలినవానినిగా, దృష్ట్వా = చూచి, దుర్ధర్షౌ = ఎదిరింప శక్యముగాని వారును, అరిందమౌ = శత్రు మర్దనులును అగు, విరూపాక్షయూపాక్షౌ = విరూపాక్షుడు యూపాక్షుడు అను సేనాధిపతు లిరువురును, సంజాతరోషౌ (సంతౌ) = జనించిన మహారోషము గలవారై, ఉత్పేతతుః = మీదికి ఎగసిరి.

**తాత్పర్యము** :- దుర్ధరు డా రీతిగా నేలగూలుటను జూచి మహాపరాక్రమవంతులగు విరూపాక్షుడు యూపాక్షుడు అను ఇరువురు సేనాధిపతులును అమితమైన రోషావేశము నొంది హనుమ మీదికి ఎగసిరి.

**శ్లో॥ స తాభ్యాం సహ సోత్పత్య విష్ఠితో విమలేఽంబరే ।**
**ముద్గరాభ్యాం మహాబాహు ర్వక్ష స్యభిహతః కపిః ॥ 29**

**పదచ్ఛేదము :–** సః – తాభ్యాం – సహసా – ఉత్పత్య – విష్ఠితః – విమలే – అంబరే – ముద్గరాభ్యాం – మహాబాహుః – వక్షసి – అభిహతః – కపిః ॥

**అన్వయక్రమము :–** మహాబాహుః సః కపిః విమలే అంబరే విష్ఠితః తాభ్యాం సహసా ఉత్పత్య ముద్గరాభ్యాం వక్షసి అభిహతః.

**ప్రతిపదార్థము :–** విమలే = నిర్మలమైనట్టి, అంబరే = ఆకాశమునందు, విష్ఠితః = నిలచియున్నట్టి, మహాబాహుః = మహావీరుడైన, సః కపిః = ఆ హనుమ, తాభ్యాం = ఆ విరూపాక్షయూపాక్షు లిరువురిచే, సహసా = వెంటనే, ఉత్పత్య = మీదికెగిరి, ముద్గరాభ్యాం = రెండు ఇనుప గుదియలచేత, వక్షసి = ఱొమ్ముపై, అభిహతః = కొట్టబడెను.

**తాత్పర్యము :–** నిర్మలమైన ఆకాశమునందు ధీరుడై నిలచియున్న మహావీరుడైన ఆ హనుమను ఆ విరూపాక్షయూపాక్షు లిరువురును మీదికి ఎగిరి తమతమ ముద్గరములతో ఱొమ్ముపై బలముగా ప్రహరించిరి.

**శ్లో॥ తయో ర్వేగవతో ర్వేగం వినిహత్య మహాబలః ।**
**నిపపాత పున ర్భూమౌ సుపర్ణసమవిక్రమః ॥ 30**

**పదచ్ఛేదము :–** తయోః – వేగవతోః – వేగం – వినిహత్య – మహాబలః – నిపపాత – పునః – భూమౌ – సుపర్ణసమవిక్రమః ॥

**అన్వయక్రమము :–** వేగవతోః తయోః వేగం వినిహత్య మహాబలః సుపర్ణసమవిక్రమః (సః) పునః భూమౌ నిపపాత.

**ప్రతిపదార్థము :–** వేగవతోః = మహావేగము కలిగినట్టి, తయోః = ఆ సేనాధిపతుల ఇరువురియొక్క, వేగం = వేగమును, వినిహత్య = అణచివేసి, మహాబలః = మహాబలాఢ్యుడును, సుపర్ణసమవిక్రమః = గరుత్మంతునితో సమానమగు పరాక్రమము గలవాడునగు, (సః = ఆ హనుమ) పునః = తిరిగి, భూమౌ = భూమిమీదకు, నిపపాత = ఉఱికెను.

**తాత్పర్యము :–** ఆకసమునందు తనమీదకు మహావేగముతో వచ్చుచున్నట్టి వారి వేగాతిశయమును వమ్ముచేయుచు గరుత్మంతునితో సమానమైన జవసత్త్వములు కలిగినట్టి ఆ హనుమ వారికి చిక్కకుండ నేలమీదికి ఉఱికెను.

**శ్లో॥ స సాలవృక్ష మాసాద్య త ముత్పాట్య చ వానరః ।**
**తా వుభౌ రాక్షసౌ వీరౌ జఘాన పవనాత్మజః ॥ 31**

**పదచ్ఛేదము** :– సః – సాలవృక్షమ్ – ఆసాద్య – తమ్ – ఉత్పాట్య – చ – వానరః – తౌ – ఉభౌ – రాక్షసౌ – వీరౌ – జఘాన – పవనాత్మజః ॥

**అన్వయక్రమము** :– పవనాత్మజః సః వానరః సాలవృక్షమ్ ఆసాద్య, తమ్ ఉత్పాట్య చ వీరౌ ఉభౌ తౌ రాక్షసౌ జఘాన.

**ప్రతిపదార్థము** :– పవనాత్మజః = వాయుపుత్రుడైన, సః వానరః = ఆ హనుమ, సాలవృక్షం = ఒక మద్దిచెట్టును, ఆసాద్య = చేరి, తం = ఆ చెట్టును, ఉత్పాట్య చ = పెల్లగించియు, వీరౌ = వీరులైనట్టి, ఉభౌ తౌ రాక్షసౌ = ఆ రాక్షసు లిరువురిని, జఘాన= హతమార్చెను.

**తాత్పర్యము** :– వెంటనే హనుమ సమీపమున నున్న మద్దిచెట్టును చేరి దానిని పెల్లగించి మహావీరులైన ఆ రాక్షసు లిరువురను దానితోడనే మోది కడతేర్చెను.

**శ్లో॥ తత స్తాం స్త్రీ న్హతా న్జ్ఞాత్వా వానరేణ తరస్వినా ।**
**అభిపేదే మహావేగః ప్రసహ్య ప్రఘసో హరిమ్ ॥ 32**

**పదచ్ఛేదము** :– తతః – తాన్ – త్రీన్ – హతాన్ – జ్ఞాత్వా – వానరేణ – తరస్వినా – అభిపేదే – మహావేగః – ప్రసహ్య – ప్రఘసః – హరిమ్ ॥

**అన్వయక్రమము** :– తతః ప్రఘసః తరస్వినా వానరేణ తాన్ త్రీన్ హతాన్ జ్ఞాత్వా, మహావేగః (సన్) ప్రసహ్య (తం) హరిమ్ అభిపేదే.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, ప్రఘసః = ప్రఘసుడను సేనాధిపతి, తరస్వినా = మహాబలశాలియైన, వానరేణ = వానరునిచే, తాన్ = ఆ సేనానాయకులను, త్రీన్ = ముప్పరిని, హతాన్ = చంపబడినవారినిగా, జ్ఞాత్వా = తెలిసికొని, మహావేగః (సన్) = అమితమైన వేగముగలవాడై, ప్రసహ్య = బలవంతముగా, తం హరిం = ఆ హనుమను, అభిపేదే = ఎదుర్కొనెను.

**తాత్పర్యము** :– అప్పుడు ప్రఘసుడను సేనాధిపతి – దుర్ధరుడు, విరూపాక్షుడు, యూపాక్షుడు అను ముప్పరును గూడ మహావీరుడైన హనుమ చేతిలో మడిసిరని తెలిసికొని మహావేగముతో మిక్కిలి పూనికతో హనుమ మీదకి వెడలెను.

**శ్లో॥ భాసకర్ణశ్చ సంక్రుద్ధ శ్శూల మాదాయ వీర్యవాన్ ।**
**ఏకతః కపిశార్దూలం యశస్విన మవస్థితమ్ ॥ 33**

**పదచ్ఛేదము** :- భాసకర్ణః - చ - సంక్రుద్ధః - శూలమ్ - ఆదాయ - వీర్యవాన్, ఏకతః - కపిశార్దూలం - యశస్వినమ్ - అవస్థితమ్ ॥

**అన్వయక్రమము** :- సంక్రుద్ధః, వీర్యవాన్ భాసకర్ణః చ శూలమ్ ఆదాయ అవస్థితం యశస్వినం కపిశార్దూలమ్ ఏకతః (అభిపేదే).

**ప్రతిపదార్థము** :- సంక్రుద్ధః = మిక్కిలి క్రోధము నొందినట్టి, వీర్యవాన్ = పరాక్రమశాలియగు, భాసకర్ణః చ = భాసకర్ణు డను సేనాధిపతియును, శూలం = శూలమును, ఆదాయ = తీసికొని, యశస్వినం = కీర్తిశాలియును, అవస్థితం = నిలచియున్నవాడునగు, కపిశార్దూలం = వానరశ్రేష్ఠుని, ఏకతః = ఒకవైపునుండి, అభిపేదే = ఎదుర్కొనెను.

**తాత్పర్యము** :- మిక్కిలి కోపించియున్న భాసకర్ణుడనెడు మహావీరుడైన సేనాధిపతి తనశూలమును చేత ధరించి రణరంగమున నిర్భయముగా నిలచియున్న సాటిలేని వీరుడైన హనుమ మీదికి వేఱొకవైపు నుండి పోయెను.

**శ్లో॥ పట్టసేన శితాగ్రేణ ప్రఘసః ప్రత్యయోధయత్ ।**
**భాసకర్ణశ్చ శూలేన రాక్షసః కపిసత్తమమ్ ॥ 34**

**పదచ్ఛేదము** :- పట్టసేన - శితాగ్రేణ - ప్రఘసః - ప్రత్యయోధయత్, భాసకర్ణః - చ - శూలేన - రాక్షసః - కపిసత్తమమ్ ॥

**అన్వయక్రమము** :- ప్రఘసః శితాగ్రేణ పట్టసేన, రాక్షసః భాసకర్ణః శూలేన చ, కపిసత్తమం ప్రత్యయోధయత్.

**ప్రతిపదార్థము** :- ప్రఘసః = ప్రఘసుడు, శితాగ్రేణ = వాడియైనకొనగల, పట్టసేన = దీర్ఘమైన ఖడ్గముతోడను, రాక్షసః భాసకర్ణః = రాక్షసుడైన భాసకర్ణుడు, శూలేన చ = శూలముతోడను, కపిసత్తమం = వానరశ్రేష్ఠుడైన హనుమను, ప్రత్యయోధయత్ = ఎదుర్కొనెను.

**తాత్పర్యము** :- అప్పుడా ప్రఘససేనాధిపతి వాడియైన అగ్రములు కలిగినట్టి తన పట్టసముతోను, భాసకర్ణసేనానాయకుడు తన శూలాయుధముతోను హనుమ నెదుర్కొనిరి.

**శ్లో॥ స తాభ్యాం విక్షతై ర్గాత్రై రసృగ్దిగ్ధతనూరుహః ।**
**అభవ ద్వానరః క్రుద్ధో బాలసూర్యసమప్రభః ॥ 35**

**పదచ్ఛేదము** :- సః - తాభ్యాం - విక్షతైః - గాత్రైః - అసృగ్దిగ్ధతనూరుహః -

అభవత్ – వానరః – క్రుద్ధః – బాలసూర్యసమప్రభః ॥

**అన్వయక్రమము :–** తాభ్యాం విక్షతైః గాత్రైః అసృగ్దిగ్ధతనూరుహాః సః వానరః క్రుద్ధః (సన్) బాలసూర్యసమప్రభః అభవత్.

**ప్రతిపదార్థము :–** తాభ్యాం = ఆ ఇరువురిచే, విక్షతైః = గాయపఱచబడిన, గాత్రైః = అవయవములచే, అసృగ్దిగ్ధతనూరుహాః = రక్తముచే పూయబడిన రోమములు కలిగినట్టి, సః వానరః = ఆ హనుమ, క్రుద్ధః (సన్) = మిక్కిలి కోపించినవాడై, బాలసూర్యసమప్రభః = బాలసూర్యునితో సమానమైన కాంతిగలవాడుగా, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము :–** ప్రఘసుడును భాసకర్ణుడును కొట్టిన దెబ్బలచే రక్తము కారి శరీరము నందలి రోమము లన్నియును ఎఱ్ఱబడి యుండగా క్రోధోద్రిక్తుడైన ఆ హనుమ ఉదయకాల సూర్యబింబమువంటి తేజస్సుతో ప్రకాశించుచుండెను.

**శ్లో॥ సముత్పాట్య గిరే శ్శృంగం సమృగవ్యాళపాదపమ్ ।**
**జఘాన హనుమాన్ వీరో రాక్షసౌ కపికుంజరః ।**
**గిరిశృంగవినిష్పిష్టౌ తిలశ స్తౌ బభూవతుః ॥ 36**

**పదచ్ఛేదము :–** సముత్పాట్య – గిరేః – శృంగం – సమృగవ్యాళపాదపమ్ – జఘాన – హనుమాన్ – వీరః – రాక్షసౌ – కపికుంజరః, గిరిశృంగవినిష్పిష్టౌ – తిలశః – తౌ – బభూవతుః ॥

**అన్వయక్రమము :–** కపికుంజరః వీరః హనుమాన్ సమృగవ్యాళపాదపమ్ తం గిరేః శృంగం సముత్పాట్య రాక్షసౌ జఘాన, గిరిశృంగవినిష్పిష్టౌ తౌ తిలశః బభూవతుః.

**ప్రతిపదార్థము :–** కపికుంజరః = వానరశ్రేష్ఠుడైనట్టి, వీరః = వీరుడైన, హనుమాన్ = హనుమ, సమృగవ్యాళపాదపం = మృగములతోడను, సర్పములతోడను, వృక్షములతోడను గూడినట్టి, గిరేః = పర్వతముయొక్క, శృంగం = శిఖరమును, సముత్పాట్య = పెల్లగించి, రాక్షసౌ = ఇరువురు రక్కసులను, జఘాన = ప్రహరించెను, గిరిశృంగవినిష్పిష్టౌ = పర్వతశిఖరముచే నుగ్గుగా చేయబడిన, తౌ = వారిరువురును, తిలశః = నువ్వుగింజలుగా, బభూవతుః = అయిరి.

**సూచన :–** ఇందలి చివరిపాదము కొన్ని ప్రతులలో గాన్పించుటలేదు.

**తాత్పర్యము :–** మహావీరుడైన హనుమ అచ్చటనేయున్న ఒక పర్వతశిఖరమును అందుండు జంతువులతో, సర్పములతో, వృక్షములతో సహ పెల్లగించి ఆ

సేనానాయకులిరువురిని చావమోదెను. ఆ గిరిశిఖరము మీదబడగా నలిగి వారిరువురును నువ్వుగింజలంతలుగా తునుకలు తునుక లయిరి.

**శ్లో॥ తత స్తేష్వవసన్నేషు సేనాపతిషు పంచసు ।**
**బలం త దవశేషం చ నాశయామాస వానరః ॥ 37**

**పదచ్ఛేదము** :- తతః - తేషు - అవసన్నేషు - సేనాపతిషు - పంచసు - బలం - తత్ - అవశేషం - చ - నాశయామాస - వానరః ॥

**అన్వయక్రమము** :- తతః తేషు పంచసు సేనాపతిషు అవసన్నేషు (సత్సు) వానరః తత్ అవశేషం బలం చ నాశయామాస.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, తేషు = ఆ, పంచసు = ఐదుగురైన, సేనాపతిషు = సేనానాయకులు, అవసన్నేషు (సత్సు) = చనిపోయినవారు కాగా, వానరః = హనుమ, తత్ = ఆ, అవశేషం = శేషించియున్న, బలం చ = సైన్యమునుగూడ, నాశయామాస = సంహరించెను.

**తాత్పర్యము** :- అట్లు ఆ సేనానాయకులు ఏవురును కడతేరిపోగా హనుమ వారితో వచ్చియున్న మిగిలిన సైనికులనుగూడ హతమార్చెను.

**శ్లో॥ అశ్వై రశ్వాన్ గజై ర్నాగాన్ యోధై ర్యోధాన్ రథై రథాన్ ।**
**స కపి ర్నాశయామాస సహస్రాక్ష ఇవాసురాన్ ॥ 38**

**పదచ్ఛేదము** :- అశ్వైః - అశ్వాన్ - గజైః - నాగాన్ - యోధైః - యోధాన్ - రథైః - రథాన్ - సః - కపిః - నాశయామాస - సహస్రాక్షః - ఇవ - అసురాన్ ॥

**అన్వయక్రమము** :- సః కపిః అశ్వైః అశ్వాన్, యోధైః యోధాన్, రథైః రథాన్, సహస్రాక్షః అసురాన్ ఇవ నాశయామాస.

**ప్రతిపదార్థము** :- సః కపిః = ఆ హనుమ, అశ్వైః = గుఱ్ఱములతో, అశ్వాన్ = గుఱ్ఱములను, గజైః = ఏనుగులతో, నాగాన్ = ఏనుగులను, యోధైః = యోధులచే, యోధాన్ = యోధులను, రథైః = రథములచే, రథాన్ = రథములను, (ప్రహరన్ = మోదుచు) సహస్రాక్షః = దేవేంద్రుడు, అసురాన్ ఇవ = దైత్యులనువలె, నాశయామాస = నాశ మొందించెను.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమ శత్రుసైన్యమునందలి గుఱ్ఱములను పైకెత్తి గుఱ్ఱములను మోదియు, అట్లే ఏనుగులతో ఏనుగులను మోదియు, యోధులతోనే

యోధులను మోదియు, దేవేంద్రుడు విజృంభించి రక్కసుల నుక్కడగించినట్లు ఆ రాక్షససైనికుల నెల్లరను తుదముట్టించెను.

**శ్లో॥ హతై ర్నాగై స్తురంగై శ్చ భగ్నాక్షైశ్చ మహారథైః ।**
**హతైశ్చ రాక్షసై ర్భూమీ రుద్ధమార్గా సమంతతః ॥ 39**

**పదచ్ఛేదము** :- హతైః - నాగైః - తురంగైః - చ - భగ్నాక్షైః - చ - మహారథైః, హతైః - చ - రాక్షసైః - భూమిః - రుద్ధమార్గా - సమంతతః ॥

**అన్వయక్రమము** :- భూమిః హతైః నాగైః, తురంగైశ్చ భగ్నాక్షైః మహారథైః చ, హతైః రాక్షసైః చ, సమంతతః రుద్ధమార్గా (అభవత్).

**ప్రతిపదార్థము** :- భూమిః = యుద్ధభూమి, హతైః = చనిపోయిన, నాగైః = ఏనుగుల చేతను, తురంగైః చ = గుఱ్ఱములచేతను, భగ్నాక్షైః = విఱిగిపోయిన ఇరుసులు గల్గినట్టి, మహారథైః చ = మహారథములతోడను, హతైః = చనిపోయిన, రాక్షసైః చ = రక్కసులతోడను, సమంతతః = అన్నివైపులను, రుద్ధమార్గా = అడ్డగింపబడిన త్రోవలు గలదిగ (అభవత్ = ఆయెను)

**తాత్పర్యము** :- ఆ రీతిగా హనుమచే ధ్వంసము చేయబడిన ఆ ప్రదేశమునందు చనిపోయిన ఏనుగులతోడను, గుఱ్ఱములతోడను, విఱిగిపోయిన పెద్దరథములతోడను, నిహతులై పడియున్న రాక్షసులతోను, యుద్ధభూమి కాలుమోపుటకు వీలులేనిదిగా నైనది.

**శ్లో॥ తతః కపి స్తాన్ ధ్వజినీపతీన్ రణే**
**నిహత్య వీరాన్ సబలాన్ సవాహనాన్ ।**
**తదేవ వీరః పరిగృహ్య తోరణం**
**కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే ॥ 40**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సేనాపతిపంచకవధో" నామ*
*షట్చత్వారింశస్సర్గః.*

**పదచ్ఛేదము** :- తతః - కపిః - తాన్ - ధ్వజినీపతీన్ - రణే - నిహత్య - వీరాన్ - సబలాన్ - సవాహనాన్ - తత్ - ఏవ - వీరః - పరిగృహ్య - తోరణం - కృతక్షణః - కాలః - ఇవ - ప్రజాక్షయే ॥

**అన్వయక్రమము :–** తతః వీరః కపిః సబలాన్, సవాహనాన్ వీరాన్, తాన్ ధ్వజనీపతీన్ రణే నిహత్య, తత్ తోరణం ఏవ పరిగృహ్య, ప్రజాక్షయే కృతక్షణః కాలః ఇవ (అతిష్ఠత్).

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, వీరః = వీరుడైన, కపిః = హనుమ, సబలాన్ = సేనలతో కూడియున్నవారును, సవాహనాన్ = వాహనములతో గూడియున్న వారును, వీరాన్ = మహావీరులును అగు, తాన్ ధ్వజనీపతీన్ = ఆ సేనాధిపతులను, రణే = యుద్ధమున, నిహత్య = వధించి, ప్రజాక్షయే = జనులను అంతమొందించుటలో, కృతక్షణః = పూనిన వేడుకగల్గినట్టి, కాలః ఇవ = యముడువలె, తత్ తోరణమ్ ఏవ = ఆ బహిర్ద్వారమునే, పరిగృహ్య = స్వీకరించి, (అతిష్ఠత్ = నిలచియుండెను).

**తాత్పర్యము :–** అప్పు డా వీరుడైన హనుమ అనంతములైన సైన్యములతోను, రథగజాది వాహనములతోను రణమునకు వచ్చియున్న ఆ సేనానాయకపంచకమును పరిమార్చి ప్రజాక్షయమునకై సమాయత్తుడైన మృత్యుదేవతవలె ఎప్పటివలె చైత్యప్రాసాదముయొక్క బహిర్ద్వారము మీదనే అధివసించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సేనాపతి పంచక వధ" అను*
*నలుబదియాఱవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తచత్వారింశసర్గ

**శ్లో॥ సేనాపతీన్ పంచ స తు ప్రమాపితాన్**
**హనూమతా సానుచరాన్ సవాహనాన్ ।**
**నిశమ్య రాజా సమరోద్ధతోన్ముఖం**
**కుమార మక్షం ప్రసమైక్షతాగ్రతః ॥ 1**

**పదచ్ఛేదము :–** సేనాపతీన్ – పంచ – సః – తు – ప్రమాపితాన్ – హనూమతా – సానుచరాన్ – సవాహనాన్ – నిశమ్య – రాజా – సమరోద్ధతోన్ముఖం – కుమారమ్ – అక్షం – ప్రసమైక్షత – అగ్రతః ॥

**అన్వయక్రమము :–** సః రాజా సానుచరాన్, సవాహనాన్, పంచసేనాపతీన్ హనుమతా ప్రమాపితాన్ నిశమ్య అగ్రతః (స్థితం) సమరోద్ధతోన్ముఖం కుమారమ్ అక్షం ప్రసమైక్షత.

**ప్రతిపదార్థము :–** సః రాజా = ఆ రాక్షసరాజు, సానుచరాన్ = అనుచరులతో కూడినవారును, సవాహనాన్ = వాహనములతో కూడినవారునగు, పంచ సేనాపతీన్ = ఐదుగురు సేనాధిపతులను, హనుమతా = హనుమచే, ప్రమాపితాన్ = సంహరింప బడినవారినిగా, నిశమ్య = విని, అగ్రతః = ఎదుట, (స్థితం = ఉన్నట్టి) సమరోద్ధ తోన్ముఖం = యుద్ధమునందు ఉద్ధతుడై వేగిరపడుచున్నవాడు అగు, కుమారమ్ అక్షం = పుత్రుడైన అక్షుని, ప్రసమైక్షత = చూచెను.

**తాత్పర్యము :–** హనుమచే తన సేనాధిపతులు ఏవురును చతురంగబలసమేతముగా వధింపబడినట్లు విని, రావణాసురుడు తన ఎదుటనే యుద్ధమున కేగి హనుమతో పోరాడుటకై ఉవ్విళ్ళూరుచున్న అక్షకుమారుని గాంచెను.

**శ్లో॥ స తస్య దృష్ట్యర్పణసంప్రచోదితః**
**ప్రతాపవాన్ కాంచనచిత్రకార్ముకః ।**
**సముత్పపా తాథ సద స్యుదీరితః**
**ద్విజాతిముఖ్యై ర్హవిషేవ పావకః ॥ 2**

**పదచ్ఛేదము** :– సః – తస్య – దృష్ట్యర్పణసంప్రచోదితః – ప్రతాపవాన్ – కాంచనచిత్రకార్ముకః – సముత్పపాత – అథ – సదసి – ఉదీరితః – ద్విజాతిముఖ్యైః – హవిషా – ఇవ – పావకః ॥

**అన్వయక్రమము** :– అథ సదసి తస్య దృష్ట్యర్పణసంప్రచోదితః, ప్రతాపవాన్, కాంచనచిత్రకార్ముకః సః ద్విజాతిముఖ్యైః, హవిషా ఉదీరితః పావకః ఇవ సముత్పపాత.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, సదసి = రాజసభయందు, తస్య = ఆ రావణుని యొక్క, దృష్ట్యర్పణ సంప్రచోదితః = చూపును ఉంచుటచే ప్రోత్సహింపబడినట్టివాడును, ప్రతాపవాన్ = పరాక్రమవంతుడును, కాంచనచిత్రకార్ముకః = బంగరు చిత్తరువులతో గూడినట్టి ధనుస్సు గలవాడును అగు, సః = ఆ యక్షకుమారుడు, ద్విజాతిముఖ్యైః = విప్రశ్రేష్ఠులచే, ఉదీరితః = వృద్ధినొందింపబడిన, పావకః ఇవ = అగ్నిహోత్రుడువలె, సముత్పపాత = మీదికి లేచెను.

**తాత్పర్యము** :– అప్పుడు ఆ రాజసభలో రావణుడు తనమీద దృష్టిపఱపి ప్రోత్సహింపగా గొప్ప ప్రతాపశాలియగు ఆ యక్షకుమారుడు కాంచనచిత్రములతో గూడిన తన ధనుస్సును చేతధరించి యజ్ఞశాలలో బ్రాహ్మణులచే ఆజ్యాదిహోమద్రవ్యములతో వృద్ధిచేయబడిన అగ్నిహోత్రునివలె ఒక్కసారిగా లేచి నిలచెను.

**శ్లో॥ తతో మహద్బాలదివాకరప్రభం**
**ప్రతప్త జాంబూనదజాల సంతతమ్ ।**
**రథం సమాస్థాయ యయౌ స వీర్యవాన్**
**మహాహరిం తం ప్రతి నైరృతర్షభః ॥** 3

**పదచ్ఛేదము** :– తతః – మహత్ – బాలదివాకరప్రభం – ప్రతప్తజాంబూనదజాల సంతతమ్, రథం – సమాస్థాయ – యయౌ – సః – వీర్యవాన్ – మహాహరిం – తం – ప్రతి – నైరృతర్షభః ॥

**అన్వయక్రమము** :– తతః వీర్యవాన్ సః నైరృతర్షభః ప్రతప్తజాంబూనదజాలసంతతం, బాలదివాకరప్రభం, మహత్ రథం సమాస్థాయ తం మహాహరిం ప్రతి యయౌ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, వీర్యవాన్ = పరాక్రమశాలియైన, సః నైరృతర్షభః = ఆ రాక్షసశ్రేష్ఠుడు, ప్రతప్తజాంబూనదజాలసంతతం = మేలిమి బంగరుగొలుసులతో నిండినట్టిదియును, బాలదివాకరప్రభం = లేతసూర్యుని కాంతివంటి కాంతి గలదియునగు, మహత్ = గొప్పదైన, రథం = రథమును, సమాస్థాయ = అధిష్ఠించి, తం మహాహరిం ప్రతి = ఆ వానరశ్రేష్ఠునిగూర్చి, యయౌ = వెడలెను.

**తాత్పర్యము :-** వెంటనే మహాపరాక్రమవంతుడగు ఆ అక్షకుమారుడు శుద్ధమైన బంగారు జాలరులతో అంతటను అలంకరింపబడి లేత సూర్యునివలె గొప్ప ప్రకాశముతో వెలయుచున్న గొప్పదైన రథమును అధిష్ఠించి హనుమ నెదుర్కొనుటకై వెడలెను.

**శ్లో॥ తత స్తపస్సంగ్రహసంచయార్జితం**
**ప్రతప్తజాంబూనదజాలశోభితమ్ ।**
**పతాకినం రత్నవిభూషితధ్వజం**
**మనోజవాష్టాశ్వవరై స్సుయోజితమ్ ॥ 4**

**శ్లో॥ సురాసురాధృష్య మసంగచారిణమ్**
**రవిప్రభం వ్యోమచరం సమాహితమ్ ।**
**సతూణ మష్టాసినిబద్ధబంధురం**
**యథాక్రమావేశితశక్తితోమరమ్ ॥ 5**

**శ్లో॥ విరాజమానం ప్రతిపూర్ణవస్తునా**
**సహేమదామ్నా శశిసూర్యవర్చసా ।**
**దివాకరాభం రథ మాస్థిత స్తతః**
**స నిర్జగా మామరతుల్యవిక్రమః ॥ 6**

**పదచ్ఛేదము :-** తతః – తపస్సంగ్రహసంచయార్జితమ్ – ప్రతప్తజాంబూనదజాల శోభితమ్ – పతాకినం – రత్నవిభూషితధ్వజం – మనోజవాష్టాశ్వవరైః – సుయోజితమ్ – సురాసురాధృష్యమ్ – అసంగచారిణమ్ – రవిప్రభం – వ్యోమచరం – సమాహితమ్ – సతూణమ్ – అష్టాసినిబద్ధబంధురం – యథాక్రమావేశితశక్తితోమరమ్ – విరాజమానం – ప్రతిపూర్ణవస్తునా – సహేమదామ్నా – శశిసూర్యవర్చసా – దివాకరాభం – రథమ్ – ఆస్థితః – తతః – స – నిర్జగామ – అమరతుల్యవిక్రమః ॥

**అన్వయక్రమము :-** తతః అమరతుల్యవిక్రమః సః తపస్సంగ్రహసంచయార్జితం, ప్రతప్తజాంబూనదజాలశోభితం, పతాకినం, రత్నవిభూషితధ్వజం, మనోజవాష్టాశ్వవరైః సుయోజితం, సురాసురాధృష్యమ్ అసంగచారిణం, రవిప్రభం, వ్యోమచరం, సమాహితం, సతూణమ్, అష్టాసినిబద్ధబంధురం, యథాక్రమావేశితశక్తితోమరం, శశిసూర్యవర్చసా, సహేమదామ్నా, ప్రతిపూర్ణవస్తునా విరాజమానం, దివాకరాభం రథమ్ ఆస్థితః సన్ తతః నిర్జగామ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, అమరతుల్యవిక్రమః = దేవతలతో సమానమైన పరాక్రమము కల్గినట్టి, సః = ఆ అక్షకుమారుడు, తపస్సంగ్రహసంచయార్జితం = ప్రోగుచేసి మహాతపోరాశిచే సంపాదింపబడినదియును, ప్రతప్తజాంబూనదజాలశోభితం = మేలిమి బంగరుజాలరులతో ప్రకాశించుచున్నదియును, పతాకినం = శ్రేష్ఠమైన జండా కలదియును, రత్నవిభూషితధ్వజం = రత్నములచే అలంకరింపబడిన ధ్వజస్తంభము గలదియును, మనోజవాష్టాశ్వవరైః = మనోవేగముకల్గిన ఎనిమిది హయశ్రేష్ఠములచే, సుయోజితం = పూన్చబడినదియును, సురాసురాధృష్యమ్ = దేవదానవుల కెదిరింపరానిదియును, అసంగచారిణం = నేలకంటకుండ చరించునదియును, సతూణమ్ = అమ్ములపొదులతో గూడినదియును, అష్టాసినిబద్ధబంధురం = ఎనిమిది ఖడ్గములతో బంధింపబడిన రథఫలకములు గలదియును, యథాక్రమావేశితశక్తితోమరం = యథాస్థానమునం దుంచబడినట్టి శక్తి తోమరాయుధములు గలదియును, శశిసూర్యవర్చసా = చంద్రసూర్యులవంటి కాంతికల్గినట్టి, సహేమదామ్నా = బంగరుపూలమాలికలతో, ప్రతిపూర్ణవస్తునా = సంపూర్ణమైన ద్రవ్యములు కలిగియున్న పరికరములతో, విరాజమానం = వెలయుచున్న దియును, (వ్యోమచరం = ఆకాశమున చరించుచున్నదియును), సమాహితం = చక్కగా కూర్చబడినదియును, దివాకరాభం = సూర్యునివంటి తేజస్సు గలదియునగు, రథమ్ = రథమును, ఆస్థితః (సన్) = ఆరోహించినవాడై, తతః = అటనుండి, నిర్జగామ = వెడలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** రవిప్రభం దివాకరాభం అని రెండు మాఱులు చెప్పుటవలన ఆతని రథము సూర్యునివంటి కాంతికల్గియున్నదియు, ఆకాశమున ప్రజ్వలించు చున్నట్టిదనియు చెప్పుటకని తెలియవలెను. శశిసూర్యవర్చసా సహేమదామ్నా – అనగా ఆ బంగారుమాలికలందు కొంతభాగము చంద్రునివలె తెల్లగను, కొంతభాగము సూర్యునివలె ఎఱ్ఱగను ఉన్నదని తెలియవలెను.

**తిలకము :–** అష్టాసినిబద్ధబంధురం – ఎనిమిది దిక్కులందును కత్తులను అడ్డముగ కట్టియుంచిరని భావము.

**వాసుదాసస్వామి :–** పూర్వపు మంత్రులు రథముల విడిచి యాకాశమున యుద్ధము చేయుటచే జంపబడిరని విని, యాకాశమునందు జేరి, మీదినుండియే యుద్ధముచేయ సాధ్యపడునట్లు ఆకాశమున సంచరించగల రథముపై గూర్చుండి, దూరపు యుద్ధమునకు బాణములు, ద్వంద్వయుద్ధమునకు గత్తులు నని యుభయవిధ

సాధనములు గ్రహించినవాడయ్యెనని భావము.

**తాత్పర్యము :-** అప్పుడు దేవతలతో సమానమైన పరాక్రమము గల్గినట్టి ఆ అక్ష కుమారుడు తన రథమును అధిష్ఠించి హనుమమీదికి వెడలెను. అట్లాతడారోహించిన రథము అతడు చిరకాలము తపస్సుచేసి సంపాదించినట్టిది. మేలిమి బంగరు గొలుసులతో ప్రకాశించుచున్నట్టిది. రత్నాలంకృతమైన ధ్వజములతోడను, సుందరమైన జండాలతోడను ఆ రథము వెలయుచుండెను. మనోవేగము గల ఎనిమిది గుఱ్ఱములు దానికి పూన్చబడి యుండెను. దేవదానవులకు సమీపింపరానిదై, నేలనంటకయే సంచరింపగలదై, సూర్యతేజముతో ఆకాశమున సంచరించుచున్నదై, యుద్ధమునకు వలయు సమస్తవస్తువులతో నిండినదై, అమ్ములపొదులను శక్తి తోమరాది ఆయుధములను చక్కగా అమర్చుకొన్నదై, ఎనిమిది మూలలందును పలువిధములగు ఖడ్గములతో నిండియుండి, చంద్రసూర్యుల కాంతులను బోలిన బంగరుపూల మాలికలతోను సమగ్రమైన సమరోచితద్రవ్యములతోను నిండియుండి, సూర్యతేజముతో ఆ రథము అద్భుతరూపము కలిగి వెలుగొందుచుండెను.

**శ్లో॥ స పూరయన్ ఖం చ మహీం చ సాచలాం**
**తురంగమాతంగమహారథస్వనైః ।**
**బలై స్సమేతై స్సహ తోరణస్థితం**
**సమర్థ మాసీన ముపాగమ త్కపిమ్ ॥ 7**

**పదచ్ఛేదము :-** సః - పూరయన్ - ఖం - చ - మహీం - చ - సాచలాం - తురంగ మాతంగ మహారథస్వనైః, బలైః - సమేతైః - సహ - తోరణస్థితం - సమర్థమ్ - ఆసీనమ్ - ఉపాగమత్ - కపిమ్ ॥

**అన్వయక్రమము :-** సః తురంగమాతంగమహారథస్వనైః ఖం చ, సమేతైః బలైః సహ సాచలాం మహీం చ పూరయన్, తోరణస్థితం, సమర్థమ్, ఆసీనం కపిమ్ ఉపాగమత్.

**ప్రతిపదార్థము :-** సః = ఆతడు, తురంగమాతంగమహారథస్వనైః = గుఱ్ఱముల యొక్కయు, ఏనుగుల యొక్కయు, మహారథముల యొక్కయు ధ్వనులతో, ఖం చ = ఆకాశమును, సమేతైః = కూడియున్నట్టి, బలైః సహ = సైన్యములతోగూడ, సాచలాం = పర్వతములతో గూడిన, మహీం చ = భూమిని, పూరయన్ = నింపించుచు, తోరణస్థితం = ద్వారముపైనున్న, సమర్థమ్ = సమర్థుడై, ఆసీనం = కూర్చొనియున్న, కపిమ్ = హనుమను, ఉపాగమత్ = సమీపించెను.

**సూచన :-** ఈశ్లోకమున ఈ మూడవపాదమున 'బలైః సమేతైః సహితః రణస్థితం'

అను పాఠాంతరమున్నది. దానికి తన బలములతో కూడినవాడై యుద్ధభూమి యం దున్నట్టి హనుమను చేరెను అని అర్థము.

**తాత్పర్యము** :– ఆ అక్షకుమారుడు తన వెంటనున్న గుఱ్ఱములును, ఏనుగులును, మహారథములును చేయుచున్న ధ్వనులతో ఆకసమును, తన వెంటనున్న అపారమైన సైన్యములతో భూమినంతను నిండించుచు ద్వారముపై కూర్చున్న హనుమను చేరవచ్చెను.

**శ్లో॥ స తం సమాసాద్య హరిం హరీక్షణో**
**యుగాంతకాలాగ్నిమివ ప్రజాక్షయే ।**
**అవస్థితం విస్మితజాతసంభ్రమః**
**సమైక్షతాక్షో బహుమానచక్షుషా ॥ 8**

**పదచ్ఛేదము** :– సః – తం – సమాసాద్య – హరిం – హరీక్షణః – యుగాంత కాలాగ్నిమ్ – ఇవ – ప్రజాక్షయే, అవస్థితం – విస్మితజాతసంభ్రమః – సమైక్షత – అక్షః – బహుమానచక్షుషా ॥

**అన్వయక్రమము** :– ప్రజాక్షయే అవస్థితం యుగాంతకాలాగ్నిమ్ ఇవ (స్థితం) హరిం సమాసాద్య విస్మితజాతసంభ్రమః హరీక్షణః, సః అక్షః బహుమానచక్షుషా తం సమైక్షత.

**ప్రతిపదార్థము** :– ప్రజాక్షయే = ప్రజానాశనమునందు, అవస్థితం = ఉద్యుక్తుడైనట్టి, యుగాంతకాలాగ్నిమ్ ఇవ = ప్రళయకాలమునందలి అగ్నివలె, (స్థితం = ఉన్నట్టి) హరిం = హనుమను, సమాసాద్య = చేరి, విస్మితజాతసంభ్రమః = ఆశ్చర్యముచే కలిగిన తొట్రుబాటు కలిగినట్టి, హరీక్షణః = సింహమువంటి చూపుగల్గిన, సః అక్షః = ఆ అక్షకుమారుడు, బహుమానచక్షుషా = గౌరవముతో కూడిన దృష్టితో, తం = ఆ హనుమను, సమైక్షత = తిలకించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– విస్మితజాతసంభ్రమం అని ఒక పాఠము. ఇది హనుమకు విశేషణ మగును. ఇట్టి చిన్నవయస్సులో నున్న ఈతడు నావంటివానిమీదికి ఎట్లు వచ్చినాడో యని హనుమకు రావణుని పుత్రునిపై ఆ సమయమున గల్గిన వాత్సల్యమును ఆదర భావమును ఈ విశేషణము సూచించుచున్నది.

**తాత్పర్యము** :– చైత్యద్వారముపై ప్రళయకాలమందు ప్రజాసంహారమున కుద్యుక్తుడైన భయంకరాగ్నివలె ప్రజ్వలించుచున్న ఆ హనుమను సమీపించి ఆతని తేజో

విశేషమునకు ఆశ్చర్యమును తొట్రుపాటును గలుగుచుండగా ఆ అక్షకుమారుడు ఆతనిని గొప్ప గౌరవభావముతో చూచెను.

**శ్లో॥ స తస్య వేగం చ కపే ర్మహాత్మనః**
**పరాక్రమం చారిషు రావణాత్మజః ।**
**విచారయన్ స్వం చ బలం మహాబలో**
**యుగక్షయే సూర్య ఇవాభ్యవర్ధత ॥ 9**

**పదచ్ఛేదము** :- సః - తస్య - వేగం - చ - కపేః - మహాత్మనః - పరాక్రమం - చ - అరిషు - రావణాత్మజః - విచారయన్ - స్వం - చ - బలం - మహాబలః - యుగక్షయే - సూర్యః - ఇవ - అభ్యవర్ధత ॥

**అన్వయక్రమము** :- మహాబలః సః రావణాత్మజః మహాత్మనః తస్య కపేః వేగం చ, అరిషు పరాక్రమం చ, స్వం బలం చ విచారయన్ యుగక్షయే సూర్యః ఇవ అభ్యవర్ధత.

**ప్రతిపదార్థము** :- మహాబలః = మహాబలాఢ్యుడైన, సః రావణాత్మజః = ఆ రావణపుత్రుడు, మహాత్మనః = మహనీయుడైన, తస్య కపేః = ఆ హనుమయొక్క, వేగం చ = జవమును, అరిషు = శత్రువుల విషయమున, పరాక్రమం చ = పరాక్రమమును, స్వం = తన, బలం చ = బలమును, విచారయన్ = పర్యాలోచించుచు, యుగక్షయే = ప్రళయకాలమునందలి, సూర్యః ఇవ = సూర్యుడువలె, అభ్యవర్ధత = విజృంభించుచుండెను.

**తాత్పర్యము** :- మహావీరుడైన ఆ అక్షకుమారుడు సాటిలేని వీరుడగు ఆ హనుమ యొక్క ప్రతాపమును, శత్రువులపై ఆతడు చూపుచున్న పరాక్రమమును తన బలవిశేషమును చక్కగా గుర్తించుకొనుచు ప్రళయకాలమునందలి సూర్యుడువలె విజృంభింపసాగెను.

**శ్లో॥ స జాతమన్యుః ప్రసమీక్ష్య విక్రమం**
**స్థిరం స్థిత స్సంయతి దుర్నివారణమ్ ।**
**సమాహితాత్మా హనుమంత మాహవే**
**ప్రచోదయామాస శరై స్త్రిభి శ్శితైః ॥ 10**

**పదచ్ఛేదము** :- సః - జాతమన్యుః - ప్రసమీక్ష్య - విక్రమం - స్థిరం - స్థితః - సంయతి - దుర్నివారణమ్, సమాహితాత్మా - హనుమంతమ్ - ఆహవే - ప్రచోదయామాస - శరైః - త్రిభిః - శితైః ॥

**అన్వయక్రమము** :- జాతమన్యుః సః సంయతి దుర్నివారణం (తస్య) విక్రమం ప్రసమీక్ష్య, సమాహితాత్మా స్థిరం స్థితః సన్ హనుమంతం శితైః త్రిభిః శరైః ఆహవే ప్రచోదయామాస.

**ప్రతిపదార్థము** :- జాతమన్యుః = జనించిన క్రోధము కల్గినట్టి, సః = ఆ అక్ష కుమారుడు, సంయతి = యుద్ధమునందు, దుర్నివారణమ్ = వారింపశక్యముగాని, తస్య విక్రమం = ఆతని పరాక్రమమును, ప్రసమీక్ష్య = చూచి, సమాహితాత్మా = కూడదీసికొనిన మనస్సుగలవాడై, స్థిరం = స్థిరముగా, స్థితః సన్ = నిలచినవాడగుచు, హనుమంతం = హనుమను, శితైః = వాడియైన, త్రిభిః శరైః = మూడు బాణములతో, ఆహవే = యుద్ధమున, ప్రచోదయామాస = ప్రేరేపించెను. (కొట్టెను).

**తాత్పర్యము** :- మిక్కిలి కోపించియున్న ఆ అక్షకుమారుడు యుద్ధమునందు ఆ హనుమ చూపుచున్న పరాక్రమవిశేషమును గ్రహించి తన ధైర్యమును కూడగట్టుకొని దృఢముగ నిల్చినవాడై, మూడు వాడిబాణము లుపయోగించి హనుమను యుద్ధమునకు ప్రోత్సహించెను.

**శ్లో॥ తతః కపిం తం ప్రసమీక్ష్య గర్వితం**
**జితశ్రమం శత్రుపరాజయోర్జితమ్ ।**
**అవైక్ష తాక్ష స్సముదీర్ణమానసం**
**స బాణపాణిః ప్రగృహీతకార్ముకః ॥** **11**

**పదచ్ఛేదము** :- తతః - కపిం - తం - ప్రసమీక్ష్య - గర్వితం - జితశ్రమం - శత్రుపరాజయోర్జితమ్ - అవైక్షత - అక్షః - సముదీర్ణమానసం - సః - బాణపాణిః - ప్రగృహీతకార్ముకః ॥

**అన్వయక్రమము** :- బాణపాణిః ప్రగృహీతకార్ముకః సః అక్షః ప్రసమీక్ష్య, తం కపిం జితశ్రమం, శత్రుపరాజయోర్జితం, సముదీర్ణమానసం, గర్వితమ్ అవైక్షత.

**ప్రతిపదార్థము** :- బాణపాణిః = బాణములు చేతియందు గలవాడును, ప్రగృహీత కార్ముకః = స్వీకరింపబడిన ధనుస్సు గలవాడునగు, సః అక్షః = ఆ అక్షకుమారుడు, ప్రసమీక్ష్య = బాగుగా చూచి, తం కపిం = ఆ హనుమను, జితశ్రమం = జయించిన శ్రమగలవానినిగను, శత్రుపరాజయోర్జితం = శత్రువుల అపజయముచే విజృంభించిన వానినిగను, సముదీర్ణమానసం = పొంగుచున్న మనస్సు గలవానినిగను, గర్వితం = గర్వించియున్నవానినిగను, అవైక్షత = కనుగొనెను.

**తాత్పర్యము** :- బాణములను, ధనుస్సును ధరించి యుద్ధమునందు నిలచియున్న ఆ

అక్షకుమారుడు ఎదుటనున్న హనుమ గంభీరవిగ్రహమును జూచి ఆతడు శ్రమనెఱుగని వాడనియు, శత్రువుల నోడించి ఉత్సాహముతో నున్నవాడనియు, ఇంకను యుద్ధమునకు కుతూహలముతో గర్వించి శత్రువుకొఱకు నిరీక్షించుచున్నాడనియు గ్రహించెను.

**శ్లో॥ స హేమనిష్కాంగదచారుకుండలః**
**సమాససా దాశుపరాక్రమః కపిమ్ ।**
**తయో ర్బభూ వాప్రతిమ స్సమాగమః**
**సురాసురాణామపి సంభ్రమప్రదః ॥** **12**

**పదచ్ఛేదము :-** సః - హేమనిష్కాంగదచారుకుండలః - సమాససాద - ఆశుపరాక్రమః - కపిమ్, తయోః - బభూవ - అప్రతిమః - సమాగమః - సురాసురాణామ్ - అపి - సంభ్రమప్రదః ॥

**అన్వయక్రమము :-** హేమనిష్కాంగదచారుకుండలః, ఆశుపరాక్రమః సః, కపిం ఆససాద, తయోః సమాగమః సురాసురాణాం అపి సంభ్రమప్రదః అప్రతిమః బభూవ.

**ప్రతిపదార్థము :-** హేమనిష్కాంగదచారుకుండలః = సువర్ణమయమైన పతకములును, భుజకీర్తులును, రమ్యమైన కర్ణాభరణములును గలవాడై, ఆశుపరాక్రమః = తీవ్రమైన పరాక్రమముగల్గినట్టి, సః = ఆ అక్షకుమారుడు, కపిం = హనుమను, ఆససాద = చేరెను. తయోః = ఆ ఇరువురియొక్క (హనుమయొక్కయు అక్షునియొక్కయు), సమాగమః = కలయిక, సురాసురాణామ్ అపి = దేవతలకును దానవులకును గూడ, సంభ్రమప్రదః = తొట్రుబాటు గల్గించునట్టిదై, అప్రతిమః = సాటిలేనిదిగ, బభూవ = ఉండెను.

**తాత్పర్యము :-** సువర్ణహారములును, భుజకీర్తులును, కర్ణాభరణములును ధరించియున్న ఆ మహావీరుడు వెంటనే హనుమ నెదుర్కొనెను, యుద్ధమునందు మహావీరులైన వారిరువురి పోరాటమును దేవదానవులకు గూడ సంభ్రమకారణమై సాటిలేనిదిగా కానవచ్చుచుండెను.

**శ్లో॥ రరాస భూమిర్న తతాప భానుమాన్**
**వవౌ న వాయుః ప్రచచాల చాచలః ।**
**కపేః కుమారస్య చ వీక్ష్య సంయుగం**
**ననాద చ ద్యౌ రుదధిశ్చ చుక్షుభే ॥** **13**

**పదచ్ఛేదము :-** రరాస - భూమిః - న - తతాప - భానుమాన్ - వవౌ - న -

వాయుః - ప్రచచాల - చ - అచలః, కపేః - కుమారస్య - చ - వీక్ష్య - సంయుగం - ననాద - చ - ద్యౌః - ఉదధిః - చ - చుక్షుభే ॥

**అన్వయక్రమము** :- కపేః కుమారస్య చ సంయుగం వీక్ష్య భూమిః రరాస; భానుమాన్ న తతాప; వాయుః న వవౌ; అచలః ప్రచచాల; ద్యౌః చ ననాద, ఉదధిః చ చుక్షుభే.

**ప్రతిపదార్థము** :- కపేః = హనుమయొక్కయు, కుమారస్య చ = అక్షకుమారుని యొక్కయు, సంయుగం = యుద్ధమును, వీక్ష్య = చూచి, భూమిః = భూమి, రరాస = ఆక్రోశించెను, భానుమాన్ = సూర్యుడు, న తతాప = తపింపకుండెను, వాయుః = వాయువు, న వవౌ = వీవకుండెను, అచలః = పర్వతము, ప్రచచాల = చలించెను, ద్యౌః చ = ఆకాశము, ననాద = శబ్దము చేసెను, ఉదధిః చ = సముద్రము, చుక్షుభే = క్షోభిల్లెను.

**తాత్పర్యము** :- అప్పుడు ఆ హనుమ యొక్కయు అక్షకుమారుని యొక్కయు సంగ్రామమును గాంచి భయముచే భూమి ఆక్రోశింపదొడగెను. సూర్యుడు చల్ల బడుచుండెను. వాయువు వీచుట మానివేసెను. పర్వతములు కంపింప దొడగెను. ఆకాశము గొప్ప నాదము చేయుచుండెను. సముద్రము కలగుండుపడెను.

**శ్లో॥ తత స్స వీర స్సుముఖాన్ పతత్రిణః**
**సువర్ణపుంఖా న్సవిషా ని వోరగాన్ ।**
**సమాధిసంయోగవిమోక్షతత్త్వవిత్**
**శరా నథ త్రీన్ కపిమూ ర్ధ్న్యపాతయత్ ॥ 14**

**పదచ్ఛేదము** :- తతః - సః - వీరః - సుముఖాన్ - పతత్రిణః - సువర్ణపుంఖాన్ - సవిషాన్ - ఇవ - ఉరగాన్, సమాధిసంయోగవిమోక్షతత్త్వవిత్ - శరాన్ - అథ - త్రీన్ - కపిమూర్ధ్ని - అపాతయత్ ॥

**అన్వయక్రమము** :- అథ - సమాధిసంయోగవిమోక్షతత్త్వవిత్ సః వీరః తతః కపిమూర్ధ్ని సవిషాన్ ఉరగాన్ ఇవ సుముఖాన్ పతత్రిణః సువర్ణపుంఖాన్ త్రీన్ శరాన్ అపాతయత్.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, సమాధిసంయోగవిమోక్షతత్త్వవిత్ = గ్రహించుట కూర్చుట విడుచుట అనువానియొక్క రహస్యములు తెలిసినట్టి, సః వీరః = ఆ రాక్షసవీరుడు, తతః = అటుపిమ్మట, కపిమూర్ధ్ని = హనుమ శిరమున, సవిషాన్ = విషముతో కూడిన, ఉరగాన్ ఇవ = సర్పములనువలె, సుముఖాన్ = మంచిమొనలు గలవియును, పతత్రిణః = చక్కనిఱెక్కలుగలవియును, సువర్ణపుంఖాన్ = హేమపుంఖములు కలవియునగు, త్రీన్ శరాన్ = మూడు బాణములను, అపాతయత్

= ప్రయోగించెను.

**తాత్పర్యము** :- అప్పుడా సమయమున అస్త్రముయొక్క ప్రయోగోపసంహారాది రహస్యములను చక్కగా నెఱిగినట్టి వీరుడైన ఆ అక్షకుమారుడు ఆ హనుమ శిరముపై విషపూర్ణములైన సర్పములవంటి చక్కని ములుకులును ఱెక్కలును పుంఖములును కలిగినట్టి సువర్ణనిర్మితములగు మూడు బాణములతో కొట్టెను.

**శ్లో॥ స తై శ్శరై ర్మూర్ధ్ని సమం నిపాతితైః**
**క్షరన్నసృగ్దిగ్ధవివృత్తలోచనః ।**
**నవోదితాదిత్యనిభ శ్శరాంశుమాన్**
**వ్యరోచ తాదిత్య ఇవాంశుమాలికః ॥ 15**

**పదచ్ఛేదము** :- సః - తైః - శరైః - మూర్ధ్ని - సమం - నిపాతితైః - క్షరన్నసృగ్దిగ్ధ వివృత్తలోచనః, నవోదితాదిత్యనిభః - శరాంశుమాన్ - వ్యరోచత - ఆదిత్యః - ఇవ - అంశుమాలికః ॥

**అన్వయక్రమము** :- మూర్ధ్ని సమం నిపాతితైః తైః శరైః క్షరన్నసృగ్దిగ్ధవివృత్తలోచనః శరాంశుమాన్ సః నవోదితాత్యనిభః (సన్) అంశుమాలికః ఆదిత్యః ఇవ వ్యరోచత.

**ప్రతిపదార్థము** :- మూర్ధ్ని = తలపై, సమం = ఒక్కమాఱుగా, నిపాతితైః = ప్రయోగింపబడిన, తైః శరైః = ఆ బాణములచే, క్షరన్నసృగ్దిగ్ధవివృత్తలోచనః = స్రవించుచున్న రక్తముచే పూయబడిన తిరుగుడుపడుచున్న నేత్రములు గలవాడును, శరాంశుమాన్ = బాణము లనెడు కిరణములు గలవాడు నగు, సః = ఆ హనుమ, నవోదితాత్యనిభః (సన్) = క్రొత్తగ నుదయించిన సూర్యునితో సమానమగుచు, అంశుమాలికః = కిరణములవఱుస కలిగినట్టి, ఆదిత్యః ఇవ = సూర్యుడువలె, వ్యరోచత = ప్రకాశించెను.

**తాత్పర్యము** :- అట్లు తన తలపై ప్రయోగింపబడిన ఆ బంగారు బాణములచే గాయములనుండి స్రవించుచున్న రక్తముచేత తడిసి చలించుచున్న నేత్రములు గల్గిన ఆ హనుమ ఎఱ్ఱని ముఖముతోను, పచ్చని కిరణములవంటి బాణములతోను ఉదయకాలమున లేతకిరణములతో ప్రకాశించుచున్న సూర్యునివలెనే గానవచ్చుచుండెను.

**శ్లో॥ తత స్స పింగాధిపమంత్రిసత్తమః**
**సమీక్ష్య తం రాజవరాత్మజం రణే ।**
**ఉదగ్రచిత్రాయుధచిత్రకార్ముకం**
**జహర్ష చాపూర్యత చాహవోన్ముఖః ॥ 16**

**పదచ్ఛేదము** :– తతః – సః – పింగాధిపమంత్రిసత్తమః – సమీక్ష్య – తం – రాజవరాత్మజం – రణే, ఉదగ్రచిత్రాయుధచిత్రకార్ముకం, జహర్ష – చ – ఆపూర్యత – చ – ఆహవోన్ముఖః ॥

**అన్వయక్రమము** :– తతః పింగాధిపమంత్రిసత్తమః సః రణే ఉదగ్రచిత్రాయుధ చిత్రకార్ముకం తం రాజవరాత్మజం సమీక్ష్య జహర్ష, ఆహవోన్ముఖః (సన్) ఆపూర్యత చ.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, పింగాధిపమంత్రిసత్తమః = వానరరాజు యొక్క అమాత్యశ్రేష్ఠుడైన, సః = ఆ హనుమ, రణే = యుద్ధమున, ఉదగ్రచిత్రాయుధచిత్రకార్ముకం = శ్రేష్ఠములును చిత్రములునగు ఆయుధములను, చిత్రమైన వింటిని ధరించియున్న, తం రాజవరాత్మజం = ఆ మహారాజు పుత్రుడైన అక్షుని, సమీక్ష్య = చూచి, జహర్ష = ఆనందించెను, ఆహవోన్ముఖః సన్ = యుద్ధమునకు ఆయత్తు డగుచు, ఆపూర్యత చ = (బలమును) పూరించుకొనెనుగూడ.

**తాత్పర్యము** :– వానరరాజుమంత్రులలో శ్రేష్ఠుడైన యా హనుమ, మహారాజపుత్రుడైన అక్షకుమారుడు శ్రేష్ఠములైన చిత్రవిచిత్రములగు ఆయుధములను, చిత్రమైన ధనుస్సును ధరించి ఎదురుగ నిలచి యుండుటను జూచి మిక్కిలి హర్షము నొందెను. యుద్ధమునకు సన్నద్ధుడగుచు ఎంతయు నుప్పొంగెనుకూడ.

**శ్లో॥ స మందరాగ్రస్థ ఇ వాంశుమాలికః**
**వివృద్ధకోపో బలవీర్యసంయుతః ।**
**కుమార మక్షం సబలం సవాహనం**
**దదాహ నేత్రాగ్నిమరీచిభి స్తదా ॥ 17**

**పదచ్ఛేదము** :– సః – మందరాగ్రస్థః – ఇవ – అంశుమాలికః – వివృద్ధకోపః – బలవీర్యసంయుతః – కుమారమ్ – అక్షం – సబలం – సవాహనం – దదాహ – నేత్రాగ్నిమరీచిభిః – తదా ॥

**అన్వయక్రమము** :– బలవీర్యసంయుతః, వివృద్ధకోపః సః మందరాగ్రస్థః అంశుమాలికః ఇవ తదా నేత్రాగ్నిమరీచిభిః సబలం సవాహనం కుమారమ్ అక్షం దదాహ.

**ప్రతిపదార్థము** :– బలవీర్యసంయుతః = బలముతోడను పరాక్రమముతోడను కూడినవాడును, వివృద్ధకోపః = హెచ్చిన కోపముగలవాడు నగు, సః = ఆ హనుమంతుడు, మందరాగ్రస్థః = మందరపర్వతముయొక్క శిఖరముపై నున్న, అంశుమాలికః ఇవ = సూర్యునివలె, తదా = అప్పుడు, నేత్రాగ్నిమరీచిభిః =

కన్నులందలి అగ్నిజ్వాలలచే, సబలం = సైన్యముతో కూడినవాడును, సవాహనం = వాహనముతో గూడినవాడునగు, కుమారమ్ అక్షం = అక్షకుమారుని, దదాహ = దహించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– మందరాగ్రస్థః – మందరము అనునది భూమధ్యము నందలి పర్వతము. దాని కొననున్న సూర్యుడు అనగా మధ్యాహ్నకాలమున మిక్కిలి ఉగ్రముగ నున్నవాడని అర్థము.

**తాత్పర్యము** :– మహాబలపరాక్రమసంపన్నుడైన ఆ హనుమ వాహనములతోను, సైన్యములతోను యుద్ధభూమిలో నిలచియున్న ఆ అక్షకుమారుని, మందరపర్వత శిఖరముపై ప్రజ్వలించుచున్న భాస్కరుడువలె క్రోధముతో నిప్పులు గ్రక్కుచున్న తన నేత్రములతో చూచుచు దహించెను.

**శ్లో॥ తత స్స బాణాసనశక్రకార్ముకః**
**శరప్రవర్షో యుధి రాక్షసాంబుదః ।**
**శరా న్ముమోచాశు హరీశ్వరాచలే**
**వలాహకో వృష్టిమి వాచలోత్తమే ॥ 18**

**పదచ్ఛేదము** :– తతః – సః – బాణాసనశక్రకార్ముకః – శరప్రవర్షః – యుధి – రాక్షసాంబుదః – శరాన్ – ముమోచ – ఆశు – హరీశ్వరాచలే, వలాహకః – వృష్టిమ్ – ఇవ – అచలోత్తమే ॥

**అన్వయక్రమము** :– తతః వలాహకః అచలోత్తమే వృష్టిమ్ ఇవ బాణసనశక్రకార్ముకః, శరప్రవర్షః సః రాక్షసాంబుదః హరీశ్వరాచలే ఆశు శరాన్ ముమోచ.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, వలాహకః = మేఘము, అచలోత్తమే = పర్వతశ్రేష్ఠముపై, వృష్టిమ్ ఇవ = వర్షమును వలె, బాణసనశక్రకార్ముకః = విల్లు అనెడు ఇంద్రధనుస్సు గలవాడును, శరప్రవర్షః = బాణము లనెడు పెద్దవర్షము గలవాడు నగు, సః రాక్షసాంబుదః = ఆ రాక్షసుడనెడి పర్వతముపై, హరీశ్వరాచలే = వానరశ్రేష్ఠ డనెడి పర్వతముపై, ఆశు = వెంటనే, శరాన్ = బాణము లనెడు జలములను, ముమోచ = వర్షించెను.

**తాత్పర్యము** :– అప్పుడా అక్షకుమారుడు అనెడు మేఘము, చేతిలో విల్లనెడు ఇంద్రధనుస్సును దాల్చి హనుమంతు డనెడు పర్వతముపై తీవ్రముగా బాణము లనెడు వర్షమును గురిపించెను. అప్పుడు హనుమ వర్షధారలచే కప్పబడియున్న పెద్ద

పర్వతమువలెనే కనిపించెను.

**శ్లో॥ తతః కపి స్తం రణచండవిక్రమం**
**వివృద్ధతేజోబలవీర్యసంయుతమ్ ।**
**కుమార మక్షం ప్రసమీక్ష్య సంయుగే**
**ననాద హర్షాద్ఘనతుల్యనిస్వనః ॥ 19**

**పదచ్ఛేదము :–** తతః – కపిః – తం – రణచండవిక్రమం, వివృద్ధతేజోబలవీర్య సంయుతమ్, కుమారమ్ – అక్షం – ప్రసమీక్ష్య – సంయుగే, ననాద – హర్షాత్ – ఘనతుల్యనిస్వనః ॥

**అన్వయక్రమము :–** తతః ఘనతుల్యనిస్వనః (సః) కపిః సంయుగే రణచండవిక్రమం వివృద్ధతేజోబలవీర్యసంయుతం తం కుమారమ్ అక్షం ప్రసమీక్ష్య హర్షాత్ ననాద.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, (సః)కపిః = ఆ హనుమ, రణచండవిక్రమం = యుద్ధమున తీవ్రమైన పరాక్రమము గలవాడును, వివృద్ధతేజోబలవీర్యసంయుతం = మిక్కిలి వృద్ధిపొందిన ప్రతాపముతోను బలముతోను పరాక్రమముతోను గూడినట్టి, తం కుమారమ్ అక్షం = ఆ అక్షకుమారుని, సంయుగే = యుద్ధమున, ప్రసమీక్ష్య = చూచి, ఘనతుల్యనిస్వనః సన్ = మేఘముతో సమానమైన ధ్వని గలవాడై, హర్షాత్ = సంతోషముతో, ననాద = గర్జించెను.

**తాత్పర్యము :–** అప్పు డా హనుమ యుద్ధమునందు గొప్ప పరాక్రమమును జూపుచు తనయెదుట అంతకంతకు మించిపోవుచున్న ప్రతాపముతోను, బలపరాక్రమములతోను విజృంభించుచున్న ఆ అక్షకుమారుని శౌర్యమును గాంచి తనకు కలిగిన హర్షాతిశయముతో పెద్ద ఉఱుమువంటి ధ్వనితో గర్జించెను.

**శ్లో॥ స బాలభావా ద్యుధి వీర్యదర్పితః**
**ప్రవృద్ధమన్యుః క్షతజోపమేక్షణః ।**
**సమాససా దాప్రతిమం కపిం రణే**
**గజో మహాకూపమి వావృతం తృణైః ॥ 20**

**పదచ్ఛేదము :–** సః – బాలభావాత్ – యుధి – వీర్యదర్పితః – ప్రవృద్ధమన్యుః – క్షతజోపమేక్షణః, సమాససాద – అప్రతిమం – కపిం – రణే – గజః – మహాకూపమ్ – ఇవ – ఆవృతం – తృణైః ॥

**అన్వయక్రమము :–** బాలభావాత్ యుధి వీర్యదర్పితః, ప్రవృద్ధమన్యుః, క్షతజోపమేక్షణః

సః, గజః తృణైః ఆవృతం మహాకూపమ్ ఇవ, రణే అప్రతిమం తం కపిం సమాససాద.

**ప్రతిపదార్థము** :- బాలభావాత్ = చిన్నతనమువలన, యుధి = యుద్ధమునందు, వీర్యదర్పితః = పరాక్రమముచే గర్వించినవాడును, ప్రవృద్ధమన్యుః = హెచ్చిన క్రోధము గలవాడును, క్షతజోపమేక్షణః = రక్తమును బోలిన కన్నులు గలవాడునుఅగు, సః = ఆ అక్షకుమారుడు, గజః = ఏనుగు, తృణైః = గడ్డిపరకలతో, ఆవృతం = కప్పబడియున్న, మహాకూపమ్ ఇవ = పెద్దనూతినివలె, రణే = యుద్ధమునందు, అప్రతిమం = సాటిలేనట్టి, తం కపిం = ఆ హనుమను, సమాససాద = చేరుకొనెను.

**తాత్పర్యము** :- అప్పుడా అక్షకుమారుడు తనబాల్యచాపల్యముచే యుద్ధవిషయమున తనపరాక్రమమును చూచుకొని గర్వించుచు, పెరిగిపోవుచున్న క్రోధముతో ఎఱ్ఱబడిన నెత్తుఱుగడ్డలవంటి కన్నులు గలవాడై తృణములచే కప్పబడిన మిక్కిలిలోతుగనున్న పెద్దనూతిలో ఏనుగు దిగబడినట్లు సాటిలేని పరాక్రమముతో విజృంభించుచున్న హనుమమీదకి పోయెను.

**శ్లో॥ స తేన బాణైః ప్రసభం నిపాతితైః**
**చకార నాదం ఘననాదనిస్వనః ।**
**సముత్పపా తాశు నభ స్స మారుతిః**
**భుజోరువిక్షేపణఘోరదర్శనః ॥ 21**

**పదచ్ఛేదము** :- సః - తేన - బాణైః - ప్రసభం - నిపాతితైః - చకార - నాదం - ఘననాదనిస్వనః, సముత్పపాత - ఆశు - నభః - సః - మారుతిః - భుజోరువిక్షేపణఘోరదర్శనః ॥

**అన్వయక్రమము** :- సః ప్రసభం తేన నిపాతితైః బాణైః ఘననాదనిస్వనః (సన్) నాదం చకార. భుజోరువిక్షేపణఘోరదర్శనః (సన్) సః ఆశు నభః సముత్పపాత.

**ప్రతిపదార్థము** :- సః = ఆ హనుమ, తేన = ఆ అక్షకుమారునిచే, ప్రసభం = బలముగా, నిపాతితైః = ప్రయోగింపబడినట్టి, బాణైః = బాణములచే, ఘననాదనిస్వనః సన్ = మేఘముయొక్క ఉఱుమును బోలిన గర్జనము గలవాడై, నాదం చకార = ధ్వనిని చేసెను, భుజోరువిక్షేపణఘోరదర్శనః (సన్) = భుజముల యొక్కయు తొడలయొక్కయు చాచుటచే భయంకరమైన ఆకారముగలవాడై, సః = ఆ హనుమ, ఆశు = శీఘ్రముగా, నభః = ఆకాశమునకు, ఉత్పపాత = ఎగసెను.

**తాత్పర్యము** :- అప్పుడా అక్షకుమారుడు గొప్ప బలముతో తనపై ప్రయోగించిన బాణముల దెబ్బలకు హనుమంతుడు ఉఱుము వంటి ధ్వనితో పెద్ద గర్జనము చేసెను.

తన భుజమును, ఊరువులను దూరముగ చాచుచు వెంటనే ఆతడు ఆకసము మీదికి ఎగిరెను.

**శ్లో॥ త ముత్పతంతం సమభిద్రవ ద్బలీ**
**స రాక్షసానాం ప్రవరః ప్రతాపవాన్ ।**
**రథీ రథిశ్రేష్ఠతమః కిరన్ శరైః**
**పయోధర శ్శైలమి వాశ్మవృష్టిభిః ॥ 22**

**పదచ్ఛేదము** :- తమ్ - ఉత్పతంతం - సమభిద్రవత్ - బలీ - సః - రాక్షసానాం - ప్రవరః - ప్రతాపవాన్ - రథీ - రథిశ్రేష్ఠతమః - కిరన్ - శరైః - పయోధరః - శైలమ్ - ఇవ - అశ్మవృష్టిభిః ॥

**అన్వయక్రమము** :- ప్రతాపవాన్ రథీ రథిశ్రేష్ఠతమః, బలీ రాక్షసానాం ప్రవరః సః పయోధరః శైలం అశ్మవృష్టిభిః ఇవ, ఉత్పతంతం తం శరైః కిరన్ సమభిద్రవత్.

**ప్రతిపదార్థము** :- ప్రతాపవాన్ = పరాక్రమవంతుడును, రథీ = రథారూఢుడును, రథిశ్రేష్ఠతమః = మహావీరులలో మిక్కిలి శ్రేష్ఠుడును, బలీ = బలాఢ్యుడును, రాక్షసానాం = రాక్షసులలో, ప్రవరః = శ్రేష్ఠుడునగు, సః = ఆ అక్షకుమారుడు, పయోధరః = మేఘము, శైలం = పర్వతమును, అశ్మవృష్టిభిః ఇవ = ఱాళ్ళవర్షములతోవలె, ఉత్పతంతం = మీదికి ఎగురుచున్నట్టి, తం = ఆ హనుమను, శరైః = బాణములతో, కిరన్ = చిమ్ముచు, సమభిద్రవత్ = మీదికి పరుగిడెను.

**తాత్పర్యము** :- మహా పరాక్రమవంతుడును, మహారథికులలో అగ్రగణ్యుడును మహాబలశాలియునగు ఆ రాక్షసశ్రేష్ఠుడైన అక్షుడు పెద్ద మేఘము పర్వతముపై ఱాళ్ళవర్షమును కురిపించినట్లుగ మీదకెగురుచున్నట్టి ఆ హనుమపై బాణవర్షమును గురిపించుచు అతని నెదుర్కొనెను.

**శ్లో॥ స తాన్ శరాం స్తస్య విమోక్షయన్ కపిః**
**చచార వీరః పథి వాయుసేవితే ।**
**శరాంతరే మారుతవ ద్వినిష్పతన్**
**మనోజవ స్సంయతి చండవిక్రమః ॥ 23**

**పదచ్ఛేదము** :- సః - తాన్ - శరాన్ - తస్య - విమోక్షయన్ - కపిః - చచార - వీరః - పథి - వాయుసేవితే, శరాంతరే - మారుతవత్ - వినిష్పతన్ - మనోజవః - సంయతి - చండవిక్రమః ॥

**అన్వయక్రమము :–** చండవిక్రమః మనోజవః, వీరః సః కపిః సంయతి వాయుసేవితే పథి, శరాంతరే మారుతవత్ వినిష్పతన్ తస్య తాన్ శరాన్ విమోక్షయన్ చచార.

**ప్రతిపదార్థము :–** చండవిక్రమః = భీకరమైన పరాక్రమము గలవాడును, మనోజవః = మనస్సుయొక్క వేగమువంటి వేగముగలవాడును, వీరః = గొప్పశూరుడైన వాడును అగు, సః కపిః = ఆ హనుమ, సంయతి = యుద్ధమున, వాయుసేవితే పథి = వాయువు సంచరించు మార్గమైనట్టి ఆకాశమునందు, శరాంతరే = బాణములనడుమ, మారుతవత్ = వాయువువలె, వినిష్పతన్ = తప్పించుకొనుచు, తస్య = ఆ యక్ష కుమారుని యొక్క, తాన్ శరాన్ = ఆ బాణములను, విమోక్షయన్ = తొలగించుకొనుచు, చచార = సంచరించెను.

**తాత్పర్యము :–** ప్రచండ పరాక్రమము గలవాడును, మనోవేగమువంటి వేగము గలవాడునగు వీరుడైన హనుమ ఆ యాకాశమార్గమునందు జరుగుచున్న యుద్ధమున బాణముల నడుమనుండి వాయువు అవలీలగా ముందుకు పోవునట్లు ఆ యక్ష కుమారుడు తనపై ప్రయోగించిన బాణములు తనకు తగులకుండ తప్పించుకొనుచు వానిమధ్య సంచరించు చుండెను.

**శ్లో॥ త మాత్తబాణాసన మాహవోన్ముఖం**
**ఖ మాస్తృణంతం వివిధై శ్శరోత్తమైః ।**
**అవైక్ష తాక్షం బహుమానచక్షుషా**
**జగామ చింతాం చ స మారుతాత్మజః ॥ 24**

**పదచ్ఛేదము :–** తం – ఆత్తబాణాసనం – ఆహవోన్ముఖం – ఖమ్ – ఆస్తృణంతం – వివిధైః – శరోత్తమైః – అవైక్షత – అక్షం – బహుమానచక్షుషా – జగామ – చింతాం – చ – సః – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :–** సః మారుతాత్మజః ఆహవోన్ముఖం ఆత్తబాణాసనం వివిధైః శరోత్తమైః ఖం ఆస్తృణంతం తం అక్షం బహుమానచక్షుషా అవైక్షత చింతాం జగామ చ.

**ప్రతిపదార్థము :–** సః మారుతాత్మజః = ఆ వాయునందనుడు, ఆహవోన్ముఖం = యుద్ధమునకు సన్నద్ధుడైనవాడును, ఆత్తబాణాసనం = చేపట్టిన ధనుస్సు గలవాడును, వివిధైః శరోత్తమైః = బహువిధములగు శ్రేష్ఠములైన బాణములతో, ఖం = ఆకాశమును, ఆస్తృణంతం = కప్పివేయుచున్నవాడునగు, తం అక్షం = ఆ యక్షకుమారుని, బహుమానచక్షుషా = గౌరవపూర్వకమైన దృష్టితో, అవైక్షత = చూచెను, చింతాం

జగామ చ = చింతను బొందెనుకూడ.

**తాత్పర్యము :–** అప్పుడా హనుమ తనతో యుద్ధమునకు సన్నద్ధుడై చేతిలో మేటివింటిని ధరించి బహువిధములగు గొప్పశక్తిగల బాణములతో ఆకసమును గప్పివేయుచు ధైర్యముతో పోరాడుచున్న ఆ యక్షకుమారుని ఎంతయును గౌరవపూర్వకమైన దృష్టితో చూచెను. మఱియు ఇట్టి వానిని ఎట్లు వధించుటా యని చింతాగ్రస్తుడయ్యెను.

**శ్లో॥ తతశ్శరైర్భిన్నభుజాంతరః కపిః**
**కుమారవీర్యేణ మహాత్మనా నదన్ ।**
**మహాభుజః కర్మవిశేషతత్త్వవిత్**
**విచింతయామాస రణే పరాక్రమమ్ ॥ 25**

**పదచ్ఛేదము :–** తతః – శరైః – భిన్నభుజాంతరః – కపిః – కుమారవీర్యేణ – మహాత్మనా – నదన్ – మహాభుజః – కర్మవిశేషతత్త్వవిత్ – విచింతయామాస – రణే – పరాక్రమమ్ ॥

**అన్వయక్రమము :–** తతః మహాత్మనా కుమారవీర్యేణ శరైః భిన్నభుజాంతరః మహాభుజః కర్మవిశేషతత్త్వవిత్ సః కపిః నదన్ రణే పరాక్రమం విచింతయామాస.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, మహాత్మనా = మహనీయుడైనట్టి, కుమార వీర్యేణ = కుమారస్వామియొక్క పరాక్రమము వంటి పరాక్రమము గల్గిన (తేన = ఆ అక్షకుమారునిచే) శరైః = బాణములచే, భిన్నభుజాంతరః = బ్రద్దలైన వక్షస్థలము గలవాడై, మహాభుజః = మహావీరుడును, కర్మవిశేషతత్త్వవిత్ = యుద్ధకృత్యముల యొక్క విశేషములందలి రహస్యమును తెలిసినవాడునగు, కపిః = హనుమ, నదన్ = గర్జించుచు, రణే = యుద్ధమునందు, పరాక్రమం = పరాక్రమమును గూర్చి, విచింతయామాస = ఆలోచింపసాగెను.

**తాత్పర్యము :–** కుమారస్వామియొక్క పరాక్రమమును బోలిన మహాపరాక్రమమును ప్రదర్శించుచున్న మహనీయుడైన ఆ అక్షకుమారుడు ప్రయోగించిన శరములచే గాయపడిన ఱొమ్ము కల్గిన మహావీరుడైన హనుమ ఏయే సమయములందు ఏయే కృత్యములు గావించుట ధర్మమో చక్కగా తెలిసినట్టివాడు గావున కాలోచితముగా భీకరముగా గర్జించుచు అప్పుడు తాను చూపవలసిన పరాక్రమమును గూర్చియే ఆలోచించెను.

**శ్లో॥ అబాలవ ద్బాలదివాకరప్రభః**
**కరో త్యయం కర్మ మహ న్మహాబలః ।**

**న చాస్య సర్వాహవకర్మశోభినః**
**ప్రమాపణే మే మతి రత్ర జాయతే ॥ 26**

**పదచ్ఛేదము** :- అబాలవత్ - బాలదివాకరప్రభః - కరోతి - అయం - కర్మ - మహత్ - మహాబలః - న - చ - అస్య - సర్వాహవకర్మశోభినః - ప్రమాపణే - మే - మతిః - అత్ర - జాయతే ॥

**అన్వయక్రమము** :- మహాబలః బాలదివాకరప్రభః అయమ్ అబాలవత్ మహత్ కర్మ కరోతి. సర్వాహవకర్మశోభినః అస్య ప్రమాపణే అత్ర మే మతిః న చ జాయతే.

**ప్రతిపదార్థము** :- మహాబలః = మహాబలశాలియు, బాలదివాకరప్రభః = లేత సూర్యునివంటి తేజస్సుగలవాడు నగు, అయం = ఈతడు, అబాలవత్ = ప్రౌఢునివలెనే, మహత్ కర్మ = ఘనమైన కార్యమును, కరోతి = కావించుచున్నాడు. సర్వాహవకర్మ శోభినః = యుద్ధమునందలి సమస్తమైన క్రియలతోడను ప్రకాశించుచున్నట్టి, అస్య = వీనియొక్క, ప్రమాపణే = సంహారమున, అత్ర = ఇచ్చట, మే = నాకు, మతిః న చ జాయతే = ఎంతమాత్రమును బుద్ధి పుట్టుట లేదు.

**తాత్పర్యము** :- బాలసూర్యునివంటి తేజస్సుగల ఈ మహాబలశాలియైన అక్షుడు బాలురు చేయలేనట్టి గొప్పదైన కృత్యమును గావించుచున్నాడు. యుద్ధమునకు సంబంధించిన సమస్తవిజ్ఞానమును కౌశలమును గలిగిన ఈతనిని వధించు విషయమున నాకు మనస్సు ఒప్పకున్నది.

**శ్లో॥ అయం మహాత్మా చ మహాంశ్చ వీర్యతః**
**సమాహిత శ్చాతిసహశ్చ సంయుగే ।**
**అసంశయం కర్మగుణోదయా దయం**
**సనాగయక్షై ర్మునిభిశ్చ పూజితః ॥ 27**

**పదచ్ఛేదము** :- అయం - మహాత్మా - చ - మహాన్ - చ - వీర్యతః - సమాహితః - చ - అతిసహః - చ - సంయుగే, అసంశయం - కర్మగుణోదయాత్ - అయం - సనాగయక్షైః - మునిభిః - చ - పూజితః ॥

**అన్వయక్రమము** :- అయం, మహాత్మా చ - వీర్యతః చ మహాన్ సంయుగే సమాహితః, అతిసహః చ కర్మగుణోదయాత్ అసంశయమ్ అయం సనాగయక్షైః మునిభిః చ పూజితః.

**ప్రతిపదార్థము** :- అయం = ఈతడు, మహాత్మా చ = మహనీయుడును, వీర్యతః చ

= పరాక్రమమువలన గూడ, మహాన్ = గొప్పవాడును, సంయుగే = యుద్ధమునందు, సమాహితః చ = ఏకాగ్రమగు చిత్తము గలవాడును, అతిసహః చ = గొప్ప ఓర్పు గలవాడును, (భవతి = అగుచున్నాడు) కర్మగుణోదయాత్ = యుద్ధకృత్యములలోని గుణములయొక్క ఆధిక్యమువలన, అసంశయమ్ = నిస్సంశయముగా, అయం = ఈతడు, సనాగయక్షైః = నాగులతోడను, యక్షులతోడను గూడినట్టి, మునిభిశ్చ = మునులచేగూడ, పూజితః = పూజింపబడువాడు, భవతి = అగుచున్నాడు.

**తాత్పర్యము :–** ఈతడు సహజముగనే మహనీయుడుగా గానవచ్చుచున్నాడు. తన పరాక్రమముచే గూడ నీతడు మహాత్ముడే యగుచున్నాడు. ఈతడు యుద్ధమున గొప్ప ఏకాగ్రత గలిగి యుద్ధక్లేశములను సహించగలవాడుగా నున్నాడు. యుద్ధోచితమైన పరాక్రమాదిగుణసంపదచే నిస్సంశయముగా నీతడు నాగయక్షాదులకును, మహర్షులకును గూడ పూజ్యుడే యగును.

**శ్లో॥ పరాక్రమోత్సాహవివృద్ధమానసః**
**సమీక్షతే మాం ప్రముఖాగ్రత స్థ్సితః ।**
**పరాక్రమో హ్యస్య మనాంసి కంపయేత్**
**సురాసురాణామపి శీఘ్రకారిణః ॥ 28**

**పదచ్ఛేదము :–** పరాక్రమోత్సాహవివృద్ధమానసః – సమీక్షతే – మాం – ప్రముఖాగ్రతః – స్థితః – పరాక్రమః – హి – అస్య – మనాంసి – కంపయేత్ – సురాసురాణాం – అపి – శీఘ్రకారిణః ॥

**అన్వయక్రమము :–** పరాక్రమోత్సాహవివృద్ధమానసః ప్రముఖాగ్రతః స్థితః, మాం సమీక్షతే, శీఘ్రకారిణః అస్య పరాక్రమః సురాసురాణామ్ అపి మనాంసి కంపయేత్.

**ప్రతిపదార్థము :–** పరాక్రమోత్సాహవివృద్ధమానసః = పరాక్రమముచేతను ఉత్సాహము చేతను వృద్ధి బొందుచున్న మనస్సుగలవాడై, ప్రముఖాగ్రతః = ఎట్టఎదుట, స్థితః = నిలచినవాడై, మాం = నన్ను, సమీక్షతే = చూచుచున్నాడు, శీఘ్రకారిణః = వేగముగ కృత్యములను ఆచరించునట్టి, అస్య = ఈతనియొక్క, పరాక్రమః = విక్రమము, సురాసురాణామ్ అపి = దేవతలయొక్కయు రాక్షసులయొక్కయు కూడ, మనాంసి = మనస్సులను, కంపయేత్ = కంపింపచేయును.

**తాత్పర్యము :–** గొప్పదైన పరాక్రమముతోను, ఉత్సాహముతోను విజృంభించుచున్నట్టి ఈతడు నా ఎట్టఎదుటనే నిలచి నన్ను నిర్భయముగా చూచుచున్నాడు. యుద్ధ పద్ధతులందు లాఘవము గల్గినట్టి ఈతని పరాక్రమమును చూడగా దేవదానవులు గూడ కంపించవలసినదే.

**శ్లో॥ న ఖల్వయం నాభిభవే దుపేక్షితః**
**పరాక్రమో హ్యస్య రణే వివర్ధతే ।**
**ప్రమాపణం త్వేవ మమాద్య రోచతే**
**న వర్ధమానోఽగ్ని రుపేక్షితుం క్షమః ॥ 29**

**పదచ్ఛేదము** :- న - ఖలు - అయమ్ - అభిభవేత్ - ఉపేక్షితః - పరాక్రమః - హి - అస్య - రణే - వివర్ధతే, ప్రమాపణం - తు - ఏవ - మమ - అద్య - రోచతే - న - వర్ధమానః - అగ్నిః - ఉపేక్షితుం - క్షమః ॥

**అన్వయక్రమము** :- రణే అస్య పరాక్రమః వివర్ధతే, ఉపేక్షితః చేత్ అయం న ఖలు న అభిభవేత్, అద్య అస్య ప్రమాపణం తు ఏవ మమ రోచతే; వర్ధమానః అగ్నిః ఉపేక్షితుం క్షమః న.

**ప్రతిపదార్థము** :- రణే = యుద్ధమునందు, అస్య = వీనియొక్క, పరాక్రమః = విక్రమము, వివర్ధతే = పెరిగిపోవుచున్నది. ఉపేక్షితః చేత్ = ఉపేక్షింప బడినచో, అయం = ఈతడు, న ఖలు న అభిభవేత్ = తిరస్కరింపకుండ నుండడు, అద్య = నేడు, అస్య = వీనియొక్క, ప్రమాపణం తు ఏవ = సంహారమే, మమ = నాకు, రోచతే = ఇష్టమగుచున్నది, వర్ధమానః = వృద్ధిచెందుచున్నట్టి, అగ్నిః = అగ్ని, ఉపేక్షితుం = ఉపేక్షించుటకు, క్షమః న = తగినదిగాదు.

**తాత్పర్యము** :- యుద్ధమునం దితని పరాక్రమము చూడగా అంతకంతకు పెరిగి పోవుచున్నది. నేనిట్లే ఉపేక్షించినచో ఈతడు నన్ను అణచివేయకుండ నుండడు. అందుచే నే డీతనిని సంహరించుటయే నేను చేయవలసిన కృత్యము. అంతకంతకు విస్తరించుచున్న అగ్ని నుపేక్షించుట ఎవరికిని తగదుగదా!

**శ్లో॥ ఇతి ప్రవేగం తు పరస్య తర్కయన్**
**స్వకర్మయోగం చ విధాయ వీర్యవాన్ ।**
**చకార వేగం తు మహాబల స్తదా**
**మతిం చ చక్రే ఽస్య వధే మహాకపిః ॥ 30**

**పదచ్ఛేదము** :- ఇతి - ప్రవేగం - తు - పరస్య - తర్కయన్ - స్వకర్మయోగం - చ - విధాయ - వీర్యవాన్, చకార - వేగం - తు - మహాబలః - తదా - మతిం - చ - చక్రే - అస్య - వధే - మహాకపిః ॥

**అన్వయక్రమము** :- ఇతి వీర్యవాన్, మహాబలః (సః) పరస్య ప్రవేగం తర్కయన్,

స్వకర్మయోగం చ విధాయ, మహాకపిః తదా అస్య వధే మతిం చక్రే; వేగం చ చకార.

**ప్రతిపదార్థము** :– ఇతి = ఇట్లు, వీర్యవాన్ = శౌర్యవంతుడును, మహాబలః = మహాబలసంపన్నుడును అగు, మహాకపిః = వానరముఖ్యుడగు, సః = ఆ హనుమ, పరస్య = శత్రువుయొక్క, ప్రవేగం = తీవ్రతనుగూర్చి, తర్కయన్ = ఊహించుచు, స్వకర్మయోగం చ = తన కృత్యముయొక్క విధానమును, విధాయ = నిర్ణయించుకొని, తదా = అప్పుడు, అస్య = ఈతనియొక్క, వధే = సంహారమునందు, మతిం చక్రే = ఆలోచన చేసెను, వేగం చ చకార = తొందరపడెను గూడ.

**తాత్పర్యము** :– పరాక్రమవంతుడును బలశాలియునగు హనుమ ఈరీతిగా శత్రువుల యొక్క విజృంభణమును గూర్చి ఆలోచించి తనకర్తవ్యమును గూడ నిర్ణయించుకొని అప్పు డాతనిని వధించుటకే నిశ్చయించుకొని అందులకై తగిన వేగిరపాటును జూపెను.

**శ్లో॥ స తస్య తా నష్ట హయా న్మహాజవాన్**
**సమాహితా న్భారసహా న్వివర్తనే ।**
**జఘాన వీరః పథి వాయుసేవితే**
**తలప్రహారైః పవనాత్మజః కపిః ॥ 31**

**పదచ్ఛేదము** :– సః – తస్య – తాన్ – అష్టహయాన్ – మహాజవాన్ – సమాహితాన్ – భారసహాన్ – వివర్తనే – జఘాన – వీరః – పథి – వాయుసేవితే – తలప్రహారైః – పవనాత్మజః – కపిః ॥

**అన్వయక్రమము** :– పవనాత్మజః వీరః సః కపిః మహాజవాన్ వివర్తనే సమాహితాన్, భారసహాన్, తాన్ అష్టహయాన్ వాయుసేవితే పథి తలప్రహారైః జఘాన.

**ప్రతిపదార్థము** :– పవనాత్మజః = వాయునందనుడును, వీరః = శూరుడును అగు, సః కపిః = ఆ హనుమ, మహాజవాన్ = గొప్పవేగము గలవియును, వివర్తనే = బహువిధమైన గమనమునందు, సమాహితాన్ = చక్కనిశిక్షణము పొందినవియును, భారసహాన్ = భారమును సహింపగలవియునగు, తాన్ అష్టహయాన్ = ఆ ఎనిమిదిగుఱ్ఱములను, వాయుసేవితే = వాయువుచే సేవింపబడినట్టి, పథి = మార్గమున (ఆకాశమున), తలప్రహారైః = అఱచేతిదెబ్బలచే, జఘాన = ప్రహరించెను.

**తాత్పర్యము** :– వాయునందనుడగు ఆమహావీరుడైన హనుమ యుద్ధమునందు వలసినట్టి సకలవిధమైన గమనములందును సంపూర్ణమైన శిక్షణమును పొందినవై ఎంతటి భారమైనను అవలీలగ భరించి మహావేగముతో పరుగిడగల ఆ అక్షకుమారుని

అశ్వములను ఎనిమిదింటిని ఆ యాకాశమార్గమునందే తన అఱచేతి దెబ్బలకును, అఱికాలిదెబ్బలకును గుఱిచేసి హతమార్చెను.

**శ్లో॥ తత స్తలే నాభిహతో మహారథః**
**స తస్య పింగాధిపమంత్రినిర్జితః ।**
**ప్రభగ్ననీడః పరిముక్తకూబరః**
**పపాత భూమౌ హతవాజి రంబరాత్ ॥ 32**

**పదచ్ఛేదము** :– తతః – తలేన – అభిహతః – మహారథః – సః – తస్య – పింగాధిపమంత్రినిర్జితః, ప్రభగ్ననీడః – పరిముక్తకూబరః, పపాత – భూమౌ – హతవాజిః – అంబరాత్ ॥

**అన్వయక్రమము** :– తతః తస్య తలేన అభిహతః, పింగాధిపమంత్రినిర్జితః, సః మహారథః ప్రభగ్ననీడః, పరిముక్తకూబరః, హతవాజిః (సన్) అంబరాత్ భూమౌ పపాత.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, తస్య = ఆ హనుమయొక్క, తలేన = అఱచేతిచే, అభిహతః = కొట్టబడినదియును, పింగాధిపమంత్రినిర్జితః = సుగ్రీవుని మంత్రియైన హనుమచే జయింపబడినదియు నగు, సః మహారథః = ఆ గొప్పదైన రథము, ప్రభగ్ననీడః = విఱిగిపోయిన తొట్టిగలదియును, పరిముక్తకూబరః = ఊడిపోయిన కాడిగలదియును, హతవాజిః = చనిపోయిన గుఱ్ఱములు గలదియును, అంబరాత్ = ఆకసమునుండి, భూమౌ = నేలపై, పపాత = కూలెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :– మహారథః పపాత – భగ్నమైన నీడమును పరిముక్తకూబరములును హతములైన అశ్వములును కలిగిన మహారథికుడైన అక్షుడు నేలగూలెను.

**తాత్పర్యము** :– పిమ్మట ఆ హనుమయొక్క అఱచేతి దెబ్బకు గుఱియై ఆతనిచే సంపూర్ణముగా ధ్వంసమైన ఆ యక్షుని మహారథము తొట్టి విఱిగిపోయి, కాడి ఊడిపోయి, గుఱ్ఱములు చనిపోయి ఎల్లరును చూచుచుండగా ఆకసమునుండి నేలపై ముక్కలు ముక్కలుగా కూలెను.

**శ్లో॥ స తం పరిత్యజ్య మహారథో రథం**
**సకార్ముకః ఖడ్గధరః ఖ ముత్పతన్ ।**
**తపోభియోగా దృషి రుగ్రవీర్యవాన్**
**విహాయ దేహం మరుతామి వాలయమ్ ॥ 33**

**పదచ్ఛేదము** :- సః - తం - పరిత్యజ్య - మహారథః - రథం - సకార్ముకః - ఖడ్గధరః - ఖమ్ - ఉత్పతన్, తపోభియోగాత్ - ఋషిః - ఉగ్రవీర్యవాన్ - విహాయ - దేహం - మరుతామ్ - ఇవ - ఆలయమ్ ॥

**అన్వయక్రమము** :- ఉగ్రవీర్యవాన్ సః మహారథః, తం రథం పరిత్యజ్య సకార్ముకః ఖడ్గధరః ఖమ్ ఉత్పతన్ తపోభియోగాత్ దేహం విహాయ మరుతామ్ ఆలయం ఉత్పతన్, ఉగ్రవీర్యవాన్ ఋషిః ఇవ (బభూవ).

**ప్రతిపదార్థము** :- ఉగ్రవీర్యవాన్ = ఉగ్రమైన పరాక్రమముగల్గిన, సః మహారథః = ఆ మహారథుడైన అక్షుడు, తం రథం = ఆ మహారథమును, పరిత్యజ్య = విడచి, సకార్ముకః = ధనుస్సుతో కూడినవాడై, ఖడ్గధరః = ఖడ్గమును ధరించినవాడై, ఖమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పతన్ = ఎగురుచు, తపోభియోగాత్ = తపస్సువలన గలిగిన యోగశక్తివలన, దేహం = శరీరమును, విహాయ = విడచి, మరుతామ్ ఆలయమ్ = దేవతలకు నివాసమైన స్వర్గమును గూర్చి, ఉత్పతన్ = ఎగురుచున్నట్టి, ఋషిః ఇవ = ఋషీశ్వరుడువలె, బభూవ = ఉండెను.

**తాత్పర్యము** :- ఉగ్రమైన పరాక్రమముగల ఆ అక్షకుమారుడు అప్పుడు శిథిలమైన తన రథమును విడిచిపెట్టి ధనుస్సును ఖడ్గమును చేతబూని ఆకసముమీదికి ఎగసిపోవుచు చూచువారికి ఒక మహర్షి తనతపోయోగశక్తిచే భౌతికశరీరమును విడిచిపెట్టి దివ్యదేహముతో దేవలోకమునకు ఏగుచున్నట్లుగా గానవచ్చెను.

**శ్లో॥ తతః కపి స్తం విచరంత మంబరే**
**పతత్రిరాజానిలసిద్ధసేవితే ।**
**సమేత్య తం మారుతతుల్యవిక్రమః**
**క్రమేణ జగ్రాహ స పాదయోర్దృఢమ్ ॥ 34**

**పదచ్ఛేదము** :- తతః - కపిః - తం - విచరంతమ్ - అంబరే - పతత్రిరాజానిలసిద్ధ సేవితే, సమేత్య - తం - మారుతతుల్యవిక్రమః - క్రమేణ - జగ్రాహ - సః - పాదయోః - ధృఢమ్ ॥

**అన్వయక్రమము** :- తతః మారుతతుల్యవిక్రమః సః కపిః పతత్రిరాజానిలసిద్ధసేవితే అంబరే విచరంతం తం క్రమేణ సమేత్య పాదయోః ధృఢం జగ్రాహ.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, మారుతతుల్యవిక్రమః = వాయుదేవునితో సమానమైన విజృంభణము గల్గినట్టి, సః కపిః = ఆ హనుమ, పతత్రిరాజానిలసిద్ధసేవితే = గరుత్మంతునిచేతను వాయువుచేతను సిద్ధులచేతను సేవింపబడు, అంబరే =

ఆకాశమునందు, విచరంతం = సంచరించుచున్నట్టి ఆ అక్షకుమారుని, సమేత్య = చేరి, పాదయోః = పాదములందు, ధృఢం = బలముగా, జగ్రాహ = పట్టుకొనెను.

**తాత్పర్యము** :– అప్పుడు వాయుదేవునివలె విజృంభించుచున్న ఆ హనుమ – గరుడునకును, వాయువునకును, సిద్ధులకును సంచారస్థలమైన ఆకాశమునందు సంచరించుచున్న ఆ అక్షకుమారుని నేర్పుగా సమీపించి ఆతని పాదములను రెండింటిని బలముగ పట్టుకొనెను.

**శ్లో॥ స తం సమావిధ్య సహస్రశః కపిః**
**మహోరగం గృహ్య ఇవాండజేశ్వరః ।**
**ముమోచ వేగా త్పితృతుల్యవిక్రమో**
**మహీతలే సంయతి వానరోత్తమః ॥ 35**

**పదచ్ఛేదము** :– సః – తం – సమావిధ్య – సహస్రశః – కపిః – మహోరగం – గృహ్య – ఇవ – అండజేశ్వరః – ముమోచ – వేగాత్ – పితృతుల్యవిక్రమః – మహీతలే – సంయతి – వానరోత్తమః ॥

**అన్వయక్రమము** :– పితృతుల్యవిక్రమః, వానరోత్తమః సః కపిః, అండజేశ్వరః మహోరగమ్ ఇవ సంయతి తం గృహ్య సహస్రశః సమావిధ్య వేగాత్ మహీతలే ముమోచ.

**ప్రతిపదార్థము** :– పితృతుల్యవిక్రమః = తండ్రితో సమానమైన పరాక్రమముకల్గినట్టి, వానరోత్తమః = వానరశ్రేష్ఠుడగు, సః కపిః = ఆ హనుమ, అండజేశ్వరః = పక్షిరాజైన గరుడుడు, మహోరగమ్ ఇవ = మహాసర్పమునువలె, సంయతి = యుద్ధమునందు, తం = ఆ అక్షుని, గృహ్య = పట్టుకొని, సహస్రశః = వేయివిధములుగ, సమావిధ్య = కొట్టి, వేగాత్ = వేగముగా, మహీతలే = భూమిపై, ముమోచ = విడిచెను.

**తాత్పర్యము** :– తన తండ్రియైన వాయుదేవునితో సమానమైన పరాక్రమము గల్గినట్టి ఆ హనుమ ఆకాశయుద్ధమునందు గరుత్మంతుడు మహాసర్పమును పట్టినట్లుగా, అట్లా అక్షకుమారుని పట్టుకొని వేయి మాఱులు వేగముగా గిరగిరత్రిప్పి నేలపైబడ వేసెను.

**శ్లో॥ స భగ్నబాహూరుకటీశిరోధరః**
**క్షరన్నసృ క్నిర్మథితాస్థిలోచనః ।**
**ప్రభిన్నసంధిః ప్రవికీర్ణబంధనో**
**హతః క్షితౌ వాయుసుతేన రాక్షసః ॥ 36**

**పదచ్ఛేదము** :– సః – భగ్నబాహూరుకటీశిరోధరః – క్షరన్ – అసృక్ – నిర్మథితాస్థిలోచనః, ప్రభిన్నసంధిః – ప్రవికీర్ణబంధనః, హతః – క్షితౌ – వాయుసుతేన – రాక్షసః ॥

**అన్వయక్రమము** :– వాయుసుతేన హతః సః రాక్షసః భగ్నబాహూరుకటీశిరోధరః, నిర్మథితాస్థిలోచనః ప్రభిన్నసంధిః, ప్రవికీర్ణబంధనః సన్, క్షరన్ అసృక్ క్షితౌ (పపాత).

**ప్రతిపదార్థము** :– వాయుసుతేన = వాయునందనునిచే, హతః = తునుమబడిన, సః రాక్షసః = ఆ రాక్షసుడు, భగ్నబాహూరుకటీశిరోధరః = విఱిగిపోయిన భుజములును తొడలును, నడుమును, మెడయును గలవాడును, నిర్మథితాస్థిలోచనః = చూర్ణము గావింపబడిన ఎముకలు కన్నులు గలవాడును, ప్రభిన్నసంధిః = ఊడిపోయిన కీళ్ళు గలవాడును, ప్రవికీర్ణబంధనః = చెదిరిపోయిన సంధిబంధములు గలవాడును అగుచు, క్షరన్ అసృక్ = కారుచున్ననెత్తుఱు గలవాడై, క్షితౌ = నేలపై, పపాత = పడెను.

**తాత్పర్యము** :– హనుమచే నా విధముగా విహతుడైన ఆ అక్షకుమారుడు విఱిగిపోయిన బాహువులు, ఊరువులు, నడుము, మెడ తోడను, ముక్కలు ముక్కలైన ఎముకలును, కనుగ్రుడ్లును గలవాడై సర్వావయములయొక్క కీళ్ళును విడిపోగా రక్తమును గ్రక్కుచు నేలగూలెను.

**శ్లో॥ మహాకపి ర్భూమితలే నిపీడ్య తం**
**చకార రక్షోధిపతే ర్మహ ద్భయమ్ ॥ 37**

**పదచ్ఛేదము** :– మహాకపిః – భూమితలే – నిపీడ్య – తం – చకార – రక్షోధిపతేః – మహత్ – భయమ్ ॥

**అన్వయక్రమము** :– మహాకపిః తం భూమితలే నిపీడ్య రక్షోధిపతేః మహత్ భయం చకార.

**ప్రతిపదార్థము** :– తం = ఆ అక్షకుమారుని, భూమితలే = నేలపై, నిపీడ్య = పడగొట్టి, రక్షోధిపతేః = రాక్షసరాజైన రావణునకు, మహత్ భయం = గొప్పదైన భయమును, చకార = కావించెను.

**తాత్పర్యము** :– హనుమంతుడా విధముగా ఆ యక్షకుమారుని నేలపై కూలవేసి రాక్షసరాజైన దశగ్రీవునకు అమితమైన భీతిని గూర్చెను.

**శ్లో॥ మహర్షి భి శ్చక్రచరై స్సమాగతైః**
**సమేత్య భూతైశ్చ సయక్షపన్నగైః ।**

**సురైశ్చ సేంద్రై ర్భృశజాతవిస్మయైః**
**హతే కుమారే స కపి ర్నిరీక్షితః ॥ 38**

**పదచ్ఛేదము** :- మహర్షిభిః - చక్రచరైః - సమాగతైః - సమేత్య - భూతైః - చ - సయక్షపన్నగైః - సురైః - చ - సేంద్రైః - భృశజాతవిస్మయైః, హతే - కుమారే - సః - కపిః - నిరీక్షితః॥

**అన్వయక్రమము** :- కుమారే హతే సతి సః కపిః భృశజాతవిస్మయైః సమేత్య సమాగతైః చ, సేంద్రైః సురైః చ నిరీక్షితః.

**ప్రతిపదార్థము** :- కుమారే = అక్షకుమారుడు, హతే సతి = చంపబడగా, భృశజాత విస్మయైః = మిక్కిలిగా ఆశ్చర్యము కలిగినట్టి వారును, సమేత్య = కలసి, సమాగతైః = వచ్చినట్టివారును, చక్రచరైః = జ్యోతిశ్చక్రమునందు సంచరించువారునగు, మహర్షిభిః = మహర్షులచేతను, సయక్షపన్నగైః = యక్షులతోడను, పన్నగులతోడను గూడినట్టి, భూతైః చ = భూతములచేతను, సేంద్రైః = ఇంద్రునితో గూడినట్టి, సురైః = దేవతలచేతను, సః కపిః = ఆ హనుమ, నిరీక్షితః = చూడబడెను.

**తాత్పర్యము** :- అక్షకుమారు డా విధముగ మృతినొందగానే అచ్చటికి చేరియున్న జ్యోతిశ్చక్రమునందలి సప్తమహర్షి ప్రభృతులును, యక్షులు పన్నగులు మున్నగువారును, మహాభూతములును, దేవేంద్రునితో గూడిన దేవతలును అమితమైన ఆశ్చర్యముతో ఆ హనుమను చూడసాగిరి.

**శ్లో॥ నిపాత్య తం వజ్రిసుతోపమం రణే**
**కుమార మక్షం క్షతజోపమేక్షణమ్ ।**
**తదేవ వీరోఽభిజగామ తోరణం**
**కృతక్షణః కాల ఇవ ప్రజాక్షయే ॥ 39**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"అక్షకుమారవధో" నామ*
*సప్తచత్వారింశస్సర్గః*

**పదచ్ఛేదము** :- నిపాత్య - తం - వజ్రిసుతోపమం - రణే, కుమారమ్ - అక్షం - క్షతజోపమేక్షణమ్, తత్ - ఏవ - వీరో - అభిజగామ - తోరణం, కృతక్షణః - కాలః - ఇవ - ప్రజాక్షయే ॥

**అన్వయక్రమము :–** సః వీరః రణే వజ్రిసుతోపమం, క్షతజోపమేక్షణం తమ్ అక్షం కుమారం నిపాత్య, ప్రజాక్షయే కృతక్షణః కాలః ఇవ తత్ తోరణమ్ ఏవ అభిజగామ.

**ప్రతిపదార్థము :–** సః వీరః = వీరుడైన ఆ హనుమ, రణే = యుద్ధమునందు, వజ్రిసుతోపమం = దేవేంద్రుని పుత్రునితో సాటియగు వాడును, క్షతజోపమేక్షణం = రక్తమును బోలినకన్నులు గలవాడునగు, తం అక్షం కుమారం = ఆ అక్షకుమారుని, నిపాత్య = కూల్చి, ప్రజాక్షయే = జనక్షయమునందు, కృతక్షణః = వేడుకగల్గినట్టి, కాలః ఇవ = యముడువలె, తత్ తోరణమ్ ఏవ = ఆ బహిర్ద్వారమునే, అభిజగామ = చేరుకొనెను.

**తాత్పర్యము :–** వీరుడైన యా హనుమంతుడు, ఎఱ్ఱని కన్నులతో మహావీరుడును దేవేంద్రుని పుత్రునివంటి మహత్త్వముగలవాడునగు ఆ అక్షకుమారుని యుద్ధమున వధించి ప్రజావినాశమునకై వేడుకపడుచు సమయముకొఱకు చూచుచున్న యమధర్మరాజువలె పూర్వము రీతిగా బహిర్ద్వారము మీదకే పోయి కూర్చుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"అక్షకుమారవధ" అను*
*నలుబదిఏడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# అష్టచత్వారింశసర్గ

**శ్లో॥ తత స్స రక్షోధిపతి ర్మహాత్మా**
**హనూమతాక్షే నిహతే కుమారే ।**
**మన స్సమాధాయ త దేంద్రకల్పం**
**సమాదిదే శేంద్రజితం సరోషమ్ ॥ 1**

**పదచ్ఛేదము** :- తతః - సః - రక్షోధిపతిః - మహాత్మా, హనూమతా - అక్షే - నిహతే - కుమారే, మనః - సమాధాయ - తదా - ఇంద్రకల్పం, సమాదిదేశ - ఇంద్రజితం - సరోషమ్ ॥

**అన్వయక్రమము** :- తతః హనూమతా కుమారే అక్షే నిహతే (సతి) మహాత్మా సః రక్షోధిపతిః మనః సమాధాయ తదా సరోషమ్ ఇంద్రకల్పమ్ ఇంద్రజితం సమాదిదేశ.

**ప్రతిపదార్థము** :- హనూమతా = హనుమచే, కుమారే అక్షే = అక్షకుమారుడు, నిహతే (సతి) = చంపబడినవాడుకాగా, తతః = పిమ్మట, మహాత్మా = మహనీయుడైన, సః రక్షోధిపతిః = ఆ రాక్షసరాజు, మనః = మనస్సును, సమాధాయ = చిక్కబట్టుకొని, తదా = అప్పుడు, సరోషం = రోషముతో, ఇంద్రకల్పం = ఇంద్రునితో సమానమైన పరాక్రమము కల ఇంద్రజిత్తును, సమాదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :- అక్షకుమారుడు హనుమంతునిచే నిహతుడైనట్లు విని రాక్షసరాజు చెదిరిపోయిన తన గుండెను చిక్కబట్టుకొని తీవ్రమైన రోషముతో తన ఆజ్ఞకొఱకు వేచియున్నట్టి ఇంద్రతుల్యపరాక్రముడైన ఇంద్రజిత్తును హనుమంతు నెదుర్కొనుట కాజ్ఞాపించెను.

**శ్లో॥ త్వ మస్త్రవి చ్ఛస్త్రభృతాం వరిష్ఠః**
**సురాసురాణామపి శోకదాతా ।**
**సురేషు సేంద్రేషు చ దృష్టకర్మా**
**పితామహారాధనసంచితాస్త్రః ॥ 2**

**పదచ్ఛేదము** :- త్వం - అస్త్రవిత్ - శస్త్రభృతాం - వరిష్ఠః - సురాసురాణామ్ - అపి - శోకదాతా - సురేషు - సేంద్రేషు - చ - దృష్టకర్మా - పితామహారాధన సంచితాస్త్రః ॥

**అన్వయక్రమము** :- త్వమ్ అస్త్రవిత్, శస్త్రభృతాం వరిష్ఠః సురాసురాణామ్ అపి శోకదాతా సేంద్రేషు సురేషు దృష్టకర్మా, పితామహారాధనసంచితాస్త్రః చ (అసి).

**ప్రతిపదార్థము** :- త్వమ్ = నీవు, అస్త్రవిత్ = అస్త్రముల నెఱిగినవాడవు, శస్త్రభృతాం = ఆయుధధారులలో, వరిష్ఠః = శ్రేష్ఠుడవు, సురాసురాణామ్ అపి = దేవతలకును, దానవులకును కూడ, శోకదాతా = దుఃఖమును కలిగించువాడవు, సేంద్రేషు = దేవేంద్రునితో గూడినట్టి, సురేషు = దేవతలయందు, దృష్టకర్మా = చూడబడిన గొప్ప కృత్యములు గలవాడవు, పితామహారాధనసంచితాస్త్రః చ = బ్రహ్మదేవునియొక్క ఆరాధనముచే సాధింపబడిన గొప్ప అస్త్రములు గలవాడవుకూడను, (అసి = అగుచున్నావు).

**తాత్పర్యము** :- ఓ మేఘనాదుడా! నీవు అస్త్రవిద్యలను సమగ్రముగా నేర్చినవాడవు. ఆయుధములనుపయోగింప నేర్చిన యోధులలో అగ్రగణ్యుడవు. నీ పరాక్రమముచే దేవతలకును దానవులకును గూడ దిగులు కల్పించువాడవు. దేవేంద్రునితో గూడిన దేవతలెల్లరికిని నీ యుద్ధనైపుణ్యమును గనపఱచినవాడవు. బ్రహ్మదేవుని ఆరాధించి దివ్యాస్త్రములను బడిసినవాడవునుగదా!

**శ్లో॥ త వాస్త్రబల మాసాద్య నాసురా న మరుద్గణాః ।**
**న శేకు స్సమరే స్థాతుం సురేశ్వరసమాశ్రితాః ।**
**న కశ్చి త్త్రిషు లోకేషు సంయుగే న గతశ్రమః ॥ 3**

**పదచ్ఛేదము** :- తవ - అస్త్రబలం - ఆసాద్య - న - అసురాః - న - మరుద్గణాః, న - శేకుః - సమరే - స్థాతుం - సురేశ్వరసమాశ్రితాః, న - కశ్చిత్ - త్రిషు - లోకేషు - సంయుగే - న - గతశ్రమః ॥

**అన్వయక్రమము** :- సమరే తవ అస్త్రబలమ్ ఆసాద్య అసురాః స్థాతుం న శేకుః; సురేశ్వరసమాశ్రితాః మరుద్గణాః (అపి) (న శేకుః) త్రిషు లోకేషు కశ్చిత్ సంయుగే న గతశ్రమః న (అస్తి).

**ప్రతిపదార్థము** :- సమరే = యుద్ధమునందు, తవ = నీయొక్క, అస్త్రబలం = అస్త్రబలమును, ఆసాద్య = పొంది, అసురాః = రాక్షసులు గాని, మరుద్గణాః = దేవతలు కాని, మూడు లోకములందును, కశ్చిత్ = ఒకడును, సంయుగే =

యుద్ధమునందు, న గతశ్రమః = పొందని క్లేశము గలవాడు, న (అస్తి) = లేడు.

**తాత్పర్యము :–** నీకుగల అస్త్రబలప్రభావముచే యుద్ధమునందు నిన్నెదిరించి నిలచుటకు రాక్షసవీరులకుగాని దేవేంద్రుని రక్షణముపొంది యున్నట్టి దేవతలకుగాని ఎవ్వరికిని శక్తిలేదుసుమా! త్రిభువనములందును యుద్ధభూమిలో నీకెదురుగా నిలచి క్లేశముల పాలుగానివాడు ఎవ్వడునులేడు.

**శ్లో॥ భుజవీర్యాభిగుప్తశ్చ తపసా చాభిరక్షితః ।**
**దేశకాలవిభాగజ్ఞ స్త్వమేవ మతిసత్తమః ॥ 4**

**పదచ్ఛేదము :–** భుజవీర్యాభిగుప్తః – చ – తపసా – చ – అభిరక్షితః – దేశకాల విభాగజ్ఞః – త్వమ్ – ఏవ – మతిసత్తమః ॥

**అన్వయక్రమము :–** త్వమ్ ఏవ భుజవీర్యాభిగుప్తః చ తపసా అభిరక్షితః చ దేశకాల విభాగజ్ఞః మతిసత్తమః చ (అసి).

**ప్రతిపదార్థము :–** త్వమ్ ఏవ = నీవే, భుజవీర్యాభిగుప్తః చ = భుజపరాక్రమముచే రక్షింపబడినవాడవును, తపసా = తపస్సుచే, అభిరక్షితః చ = రక్షింపబడినవాడవును, దేశకాలవిభాగజ్ఞః = దేశముయొక్కయు, కాలముయొక్కయు విభాగమును గూర్చి తెలిసిన వాడవును, మతిసత్తమః = ప్రజ్ఞచే శ్రేష్ఠుడవును, చ (అసి) = అగుచున్నావు.

**తాత్పర్యము :–** ఓ వీరాగ్రేసరా! నీ భుజపరాక్రమముచే నిన్ను నీవు రక్షించుకొను చున్నావు. మఱియు నీ తపోబలముచే గూడ నీవు రక్షింపబడుచున్నావు. దేశకాలముల తారతమ్యము చక్కగా తెలిసినవాడవు నీవే! నీవే గొప్ప ప్రజ్ఞాశాలివి.

**శ్లో॥ న తే ఽ స్త్యశక్యం సమరేషు కర్మణా**
**న తే ఽ స్త్యకార్యం మతిపూర్వమంత్రణే ।**
**న తే ఽ స్తి కశ్చి త్రిషు సంగ్రహేషు వై**
**న వేద య స్తేఽ స్త్రబలం బలం చ తే ॥ 5**

**పదచ్ఛేదము :–** న – తే – అస్తి – అశక్యం – సమరేషు – కర్మణా, న – తే – అస్తి – అకార్యం – మతిపూర్వమంత్రణే – న – తే – అస్తి – కశ్చిత్ – త్రిషు – సంగ్రహేషు – వై, న – వేద – యః – తే – అస్త్రబలం – బలం – చ – తే ॥

**అన్వయక్రమము :–** సమరేషు తే కర్మణా అశక్యం న అస్తి. మతిపూర్వమంత్రణే తే అకార్యం న అస్తి, త్రిషు సంగ్రహేషు – యః తే అస్త్రబలం, తే బలం చ న వేద సః కశ్చిత్ న అస్తి.

**ప్రతిపదార్థము** :– సమరేషు = యుద్ధములందు, తే = నీ యొక్క, కర్మణా = పూనికచేత, అశక్యం = అసాధ్యమైనది, న అస్తి = లేదు, మతిపూర్వమంత్రణే = బుద్ధిమూలకమైన ఆలోచనమునందు, తే = నీకు, అకార్యం = చేయశక్యముగానిపని, న అస్తి = లేదు, త్రిషు సంగ్రహేషు = మూడులోకములయందును, యః = ఎవడు, తే = నీయొక్క, అస్త్రబలం = అస్త్రశక్తిని, తే = నీయొక్క, బలం చ = సామర్థ్యమును, న వేద = తెలిసికొనలేడో, సః = అట్టివాడు, కశ్చిత్ = ఒక్కడును, న అస్తి = లేదు.

**తాత్పర్యము** :– యుద్ధములందు నీవు నిర్వహింపజాలని అసాధ్యకృత్యము ఏదియును లేదు. ఈ మూడు లోకములందును నీ అస్త్రబలమును గుఱించిగాని శరీరబలమును గుఱించిగాని తెలియనివాడు ఎవ్వడును లేదు సుమా!

**శ్లో॥ మ మానురూపం తపసో బలం చ తే**
**పరాక్రమ శ్చాస్త్రబలం చ సంయుగే ।**
**న త్వాం సమాసాద్య రణావమర్దే**
**మనశ్శ్రమం గచ్ఛతి నిశ్చితార్థమ్ ॥** **6**

**పదచ్ఛేదము** :– మమ – అనురూపం – తపసః – బలం – చ – తే – పరాక్రమః – చ – అస్త్రబలం – చ – సంయుగే – న – త్వాం – సమాసాద్య – రణావమర్దే – మనః – శ్రమం – గచ్ఛతి – నిశ్చితార్థమ్ ॥

**అన్వయక్రమము** :– తే తపసః బలం చ, పరాక్రమః చ, అస్త్రబలం చ, మమ అనురూపమ్, రణావమర్దే త్వాం సమాసాద్య మే మనః నిశ్చితార్థం (సత్) శ్రమం న గచ్ఛతి.

**ప్రతిపదార్థము** :– తే = నీయొక్క, తపసః = తపము యొక్క, బలం చ = బలమున్నూ, పరాక్రమః చ = పరాక్రమమున్నూ, అస్త్రబలం చ = అస్త్రముల బలమున్నూ, మమ = నాకు, అనురూపమ్ = సదృశ్యమైయున్నది. రణావమర్దే = యుద్ధ సంఘర్షమున, త్వాం = నిన్ను, సమాసాద్య = పొంది, మే = నాయొక్క, మనః = మనస్సు, నిశ్చితార్థం సత్ = జయము విషయమున నిశ్చయముకలదై, శ్రమం = విషాదమును, న గచ్ఛతి = పొందదు.

**తాత్పర్యము** :– నీవు తపోబలముననను యుద్ధముననను అస్త్రబలముననను నన్నుబోలినవాడవు. యుద్ధమున సంకటము గల్గునప్పుడు నామనసు నిన్ను దలంచి దుఃఖము నొందకుండును.

**శ్లో॥ నిహతాః కింకరాస్సర్వే జంబుమాలీ చ రాక్షసః ।**
**అమాత్యాపుత్త్రా వీరాశ్చ పంచ సేనాగ్రయాయినః ॥ 7**

**పదచ్ఛేదము** :- నిహతాః - కింకరాః - సర్వే - జంబుమాలీ - చ - రాక్షసః - అమాత్యపుత్త్రాః - వీరాః - చ - పంచ - సేనాగ్రయాయినః ॥

**అన్వయక్రమము** :- సర్వే కింకరాః నిహతాః. రాక్షసః జంబుమాలీ చ (నిహతః). వీరాః అమాత్యపుత్త్రాః చ, పంచ సేనాగ్రయాయినః చ (నిహతాః).

**ప్రతిపదార్థము** :- సర్వే కింకరాః = కింకరరాక్షసు లెల్లరును, నిహతాః = చంపబడిరి, రాక్షసః జంబుమాలీ చ = రాక్షసుడైన జంబుమాలియు, (నిహతః = వధింపబడెను). వీరాః = శూరులైన, అమాత్యపుత్త్రాః చ = మంత్రికుమారులును, పంచ సేనాగ్రయాయినః = ఐదుగురు సేనాధిపతులును, నిహతాః = చంపబడిరి.

**తాత్పర్యము** :- మన కింకరరాక్షసు లెల్లరును మరణించిరి. రాక్షసవీరుడైన జంబుమాలియును వధింపబడెను. మహావీరులైన మంత్రికుమారు లేడుగురును సేనాధిపతు లేవురును గూడ పంచత్వము నొందిరి.

**శ్లో॥ బలాని సుసమృద్ధాని సాశ్వనాగరథాని చ ।**
**సహోదర స్తే దయితః కుమారో౽క్షశ్చ సూదితః ।**
**న హి తేష్వేవ మే సారో యస్త్వ య్యరినిషూదన ॥ 8**

**పదచ్ఛేదము** :- బలాని - సుసమృద్ధాని - సాశ్వనాగరథాని చ - సహోదరః - తే - దయితః - కుమారః - అక్షః - చ - సూదితః, న - హి - తేషు - ఏవ - మే - సారః - యః - త్వయి - అరినిషూదన ॥

**అన్వయక్రమము** :- సాశ్వనాగరథాని సుసమృద్ధాని బలాని (నిహతాని); తే దయితః, సహోదరః, కుమారః అక్షః చ సూదితః; అరినిషూదన! త్వయి మే యః సారః, తేషు సః నైవ అస్తి.

**ప్రతిపదార్థము** :- సాశ్వనాగరథాని = గుఱ్ఱములతోడను, ఏనుగులతోడను, రథములతోడను గూడినట్టి, సుసమృద్ధాని = మిక్కిలి సమగ్రమైనట్టి, బలాని చ = సైన్యములును, (నిహతాని = సంహరింపబడినవి). తే = నీయొక్క, దయితః = ప్రియుడైన, సహోదరః = సోదరుడగు, కుమారః అక్షః చ = అక్షకుమారుడును, సూదితః = వధింపబడినాడు. అరినిషూదన = ఓ శత్రుమర్దనుడా! త్వయి = నీయందు, యః సారః = ఏ గౌరవము, మే = నాకు, అస్తి = ఉన్నదో, తేషు = వారియందు,

సః = ఆ గౌరవము, నైవ అస్తి హి = ఏమియును లేదు సుమా.

**తాత్పర్యము** :- అసంఖ్యములైన అశ్వములు, మదగజములు, రథములు మున్నగు వానితో నిండియున్న మనసైన్యములు ఎన్నియో నశించిపోయినవి. ప్రేమపాత్రుడైన నీ తమ్ముడు అక్షకుమారుడుగూడ కడదేరినాడు. ఓ శత్రుసంహారకుడా! వారెవ్వరి యందునుగూడ విజయమునకు నాకు నీయం దున్నంతటి గౌరవము, నమ్మకము ఎన్నడును లేదు సుమా!

**శ్లో॥ ఇదం చ దృష్ట్వా నిహతం మహద్బలం**
**కపేః ప్రభావం చ పరాక్రమం చ ।**
**త్వ మాత్మన శ్చాపి సమీక్ష్య సారం**
**కురుష్వ వేగం స్వబలానురూపమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :- ఇదం – చ – దృష్ట్వా – నిహతం – మహత్ – బలం – కపేః – ప్రభావం – చ – పరాక్రమం – చ – త్వమ్ – ఆత్మనః – చ – అపి – సమీక్ష్య – సారం, కురుష్వ – వేగం – స్వబలానురూపమ్ ॥

**అన్వయక్రమము** :- ఇదం నిహతం మహత్ బలం చ, కపేః ప్రభావం చ, పరాక్రమం చ దృష్ట్వా, ఆత్మనః సారం చ అపి సమీక్ష్య స్వబలానురూపం వేగం కురుష్వ.

**ప్రతిపదార్థము** :- ఇదం = ఈ, నిహతం = చంపబడినట్టి, మహత్ = గొప్పదైన, బలం చ = సైన్యమును, కపేః = వానరునియొక్క ప్రభావం చ = మహిమను, పరాక్రమం చ = శౌర్యమును, దృష్ట్వా = చూచి, ఆత్మనః = నీయొక్క, సారం చ అపి = బలమును గూడ, సమీక్ష్య = చక్కగా తెలిసికొని, స్వబలానురూపం = నీశక్తికి తగినట్టిదైన, వేగం = విజృంభణమును, త్వం = నీవు, కురుష్వ = కావింపుము.

**తాత్పర్యము** :- ఇంతవఱకును యుద్ధమునందు కడతేరియున్న మన గొప్పదైన బలసంపదను, ఆ వానరుని ప్రభావమును, చక్కగా గుర్తించుకొని, నీవు నీ సామర్థ్యమును చక్కగా తెలిసికొని నీ శక్తికి తగినరీతిగా యుద్ధమునందు విజృంభించుము.

**శ్లో॥ బలావమర్ద స్త్వయి సన్నికృష్టే**
**యథాగతే శామ్యతి శాంతశత్రౌ ।**
**తథా సమీ క్ష్యాత్మబలం పరం చ**
**సమారభ స్వాస్త్రవిదాం వరిష్ఠ ॥ 10**

**పదచ్ఛేదము :-** బలావమర్దః - త్వయి - సన్నికృష్టే - యథా - గతే - శామ్యతి - శాంతశత్రౌ, తథా - సమీక్ష్య - ఆత్మబలం - పరం - చ - సమారభస్వ - అస్త్రవిదాం - వరిష్ఠ ॥

**అన్వయక్రమము :-** అస్త్రవిదాం వరిష్ఠ! త్వయి సన్నికృష్టే గతే శాంతశత్రౌ చ (సతి) యథా బలావమర్దః శామ్యతి, ఆత్మబలం పరం చ సమీక్ష్య, తథా సమారభస్వ.

**ప్రతిపదార్థము :-** అస్త్రవిదాం = అస్త్రవేత్తలలో, వరిష్ఠ = శ్రేష్ఠుడా, త్వయి = నీవు, సన్నికృష్టే = సమీపమున, గతే = వెళ్ళినవాడవును, శాంతశత్రౌ చ (సతి) = చల్లార్చబడిన (అణచివేయబడిన) శత్రువులు గలవాడవు నగుచుండగా, యథా = ఏరీతిగా, బలావమర్దః = బలముయొక్క ఉద్రేకము, శామ్యతి = క్షీణించునో, తథా = ఆ రీతిగా, ఆత్మబలం = నీ శక్తిని, పరం చ = శత్రువును, సమీక్ష్య = ఆకళించుకొని, సమారభస్వ = ఉద్యమింపుము.

**తాత్పర్యము :-** ఓ సర్వాస్త్రనిపుణుడా! నీవు యుద్ధభూమి కేగి శత్రువు బలోద్రేకము చల్లబడిపోవునట్లుగా నీ నిజబలమును చూపుచు శత్రుబలమును కూడ చక్కగా ఆకళింపు చేసికొనుచు తగినరీతిగా యుద్ధక్రమమునందు ముందునకు సాగుము.

**శ్లో॥ న వీర సేనా గణశోచ్యవంతి**
**న వజ్రమాదాయ విశాలసారమ్ ।**
**న మారుత స్యాస్య గతిప్రమాణం**
**న చాగ్నికల్పః కరణేన హంతుమ్ ॥** **11**

**పదచ్ఛేదము :-** న - వీర - సేనాః - గణశోచి - అవంతి - న - వజ్రమ్ - ఆదాయ - విశాలసారమ్, న - మారుతస్య - అస్య - గతిప్రమాణం - న - చ - అగ్నికల్పః - కరణేన - హంతుమ్ ॥

**అన్వయక్రమము :-** వీర! గణశోచి (అస్మిన్) సేనాః న అవంతి; విశాలసారం వజ్రం ఆదాయ న (ప్రయోజనం); అస్య గతిప్రమాణం మారుతస్య న (అస్తి); అగ్నికల్పః (అయం) కరణేన హంతుం న చ (శక్యః).

**ప్రతిపదార్థము :-** వీర! = ఓ మహావీరుడా! గణశోచి = శత్రుగణములను శోకింపజేయునట్టి, (అస్మిన్ = ఈతనియెడ) సేనాః = సైన్యములు, న అవంతి = రక్షింపవు, విశాలసారం = గొప్పదైన సామర్థ్యముగల, వజ్రమ్ = వజ్రమును, ఆదాయ = గ్రహించి, న ప్రయోజనమ్ = ప్రయోజనములేదు, అస్య = ఈతనియొక్క, గతి ప్రమాణం = గమనపరిమితి, మారుతస్య = వాయుదేవునకు, న (అస్తి) = లేదు,

అగ్నికల్పః = అగ్నిహోత్రునితో సమానుడైన, (అయం = ఈతడు) కరణేన = సాధనముతో, హంతుం = చంపుటకు, న(శక్యః) = శక్యమైనవాడుగాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సేనాః గణశః చ్యవంతి – సైన్యములు గుంపులుగా పరుగుపెట్టుకొని పోవును (హనుమను చూడగానే) మారుతస్య అస్య గతిప్రమాణం న – వాయుదేవుని పుత్రుడైన ఈతనియొక్క గమనమునకు ఇంతటిదను పరిమాణము లేదు. ఈ వచ్చినది వాయుపుత్రుడే అని రావణునకు తెలియుట అశక్యముగాదు. "హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః" అని హనుమ తనను గూర్చి చెప్పుకొనెనుగదా!

**గోవిందరాజీయము** :– "అలసారం వజ్రం ఆదాయ న విశ" హనుమంతుని విషయమున అదికూడ అల్పబలము కలిగినట్టిదే అగును. కావున వజ్రాయుధమును గ్రహించి వెడలకుము. "అస్య మారుతస్య గతేః ప్రమాణం న" – ఈ వాయుపుత్రుని యొక్క గమనమునకు పరిమితిలేదు. వాయు వేదిక్కుకైనను అవలీలగ నెట్లు పోగలదో అట్లే ఈతడు ఏ దిక్కునుండి సైన్యము మీదకురుకునో తెలియదని భావము.

న గణశోఽ ప్యవంతి – అని పాఠాంతరము. అనగా సైన్యములు ఎన్ని సమూహములుగ వచ్చినను హనుమనుండి రక్షింపలేవని భావము.

**తాత్పర్యము** :– శత్రుసైన్యముల సమూహము లెన్నివచ్చినను నశింపచేయగల ఈ హనుమ విషయమున సైన్యములు మనను కాపాడజాలవు. ఎట్టి ఆయుధములకును భయపడని ఈతని మీదికి గొప్పబలముగల వజ్రాయుధమును గొనిపోయినను ప్రయోజనములేదు. యుద్ధరంగమునందు ఈతని గమనమునకుగల లాఘవము ఆ వాయుదేవునకు గూడలేదు. మీదికి పోయి పిడికిళ్లతో పొడిచి పోరుటకు ఈతడు అగ్నిహోత్రునివంటివాడు గావున అదియును అశక్యమే.

**శ్లో॥ త మేవ మర్థం ప్రసమీక్ష్య సమ్యక్**
**స్వకర్మసామ్యాద్ధి సమాహితాత్మా ।**
**స్మరంశ్చ దివ్యం ధనుషో ఽ స్త్రవీర్యం**
**వ్రజాక్షతం కర్మ సమారభస్వ ॥ 12**

**పదచ్ఛేదము** :– తమ్ – ఏవమ్ – అర్థం – ప్రసమీక్ష్య – సమ్యక్, స్వకర్మసామ్యాత్ – హి – సమాహితాత్మా, స్మరన్ – చ – దివ్యం – ధనుషః – అస్త్రవీర్యం – వ్రజ – అక్షతం – కర్మ – సమారభస్వ ॥

**అన్వయక్రమము** :– ఏవం తమ్ అర్థం సమ్యక్ ప్రసమీక్ష్య, స్వకర్మసామ్యాత్ సమాహితాత్మా, ధనుషః దివ్యమ్ అస్త్రవీర్యం స్మరన్ వ్రజ, అక్షతం కర్మ సమారభస్వ.

**ప్రతిపదార్థము** :– ఏవం = ఈవిధముగా, తమ్ అర్థం = ఆ విషయమును, సమ్యక్ = లెస్సగా, ప్రసమీక్ష్య = గుర్తించుకొని, స్వకర్మసామ్యాత్ = నీపనికి సరియగునట్లుగా, సమాహితాత్మా = ఏకాగ్రమైన మనస్సుగలవాడవై, ధనుషః = ధనుస్సుయొక్క, దివ్యం = గొప్పదైనట్టి, అస్త్రవీర్యం = అస్త్రప్రభావమును, స్మరన్ = జ్ఞప్తికి తెచ్చుకొనుచు, వ్రజ = పొమ్ము, అక్షతం = హానిలేనట్టి, కర్మ = పనిని, సమారభస్వ = ప్రారంభించుము.

**తాత్పర్యము** :– ఈవిధముగ నున్న విషయమును చక్కగా ఆకళింపు చేసికొని ఏకాగ్రచిత్తుడవై నీ కృత్యమునకు తగినరీతిగా ఆలోచనము సాగించుచు నీ యధీనమందున్న ధనుస్సు శక్తిని, అస్త్రముల ప్రభావమును మఱచిపోకుండ యుద్ధరంగమునకు వెడలి అపాయము లేనిరీతిగా ఈ యుద్ధకార్యమును కొనసాగింపుము.

**శ్లో॥ న ఖల్వియం మతిః శ్రేష్ఠా యత్త్వాం సంప్రేషయామ్యహమ్ ।**
**ఇయం చ రాజధర్మాణాం క్షత్రస్య చ మతి ర్మతా ॥ 13**

**పదచ్ఛేదము** :– న – ఖలు – ఇయం – మతిః – శ్రేష్ఠా – యత్ – త్వాం – సంప్రేషయామి – అహం, ఇయం – చ – రాజధర్మాణాం – క్షత్రస్య – చ – మతిః – మతా ॥

**అన్వయక్రమము** :– త్వామ్ అహం సంప్రేషయామి (ఇతి) యత్, ఇయం మతిః న శ్రేష్ఠా ఖలు; రాజధర్మాణాం, క్షత్రియస్య ఇయం మతా మతిః.

**ప్రతిపదార్థము** :– అహం = నేను, త్వాం = నిన్ను, సంప్రేషయామి = పంపుచున్నాను, ఇతి = అనునది, యత్ = ఏదియున్నదో, ఇయం మతిః = ఈ యాలోచనము, న శ్రేష్ఠా ఖలు = మంచిదిగాదుసుమా! రాజధర్మాణాం = రాజధర్మములకును, క్షత్రియస్య చ = క్షత్రియునకును, ఇయం = ఈ పద్ధతి, మతా = సమ్మతమైనట్టి, మతిః = ఆలోచనము, భవతి = అగుచున్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :– రావణుడు జాతిగుణకర్మములచే క్షత్రియుడేగాని బ్రాహ్మణుడుగాడు. రావణునకు జరిపిన యుత్తరక్రియల విధానమును పరిశీలించినను బ్రాహ్మణునకు చేయు కార్యములు గావని స్పష్టపడును. భగవద్ద్వేషియైన సుమాలియొక్క పుత్రికయగు కైకసి, బిడ్డలనుకోరి ప్రదోషకాలమందు విశ్రవసుని బొందినది కావున బ్రాహ్మణుడైన

విశ్రవసునకు వివాహము చేసికొనని రాక్షసక్షత్రియయందు బుట్టిన రావణుడు బ్రాహ్మణ జాతివాడెట్లగును? విశ్వామిత్రుని తాత కుశుడు సాక్షాద్బ్రహ్మపుత్రుడైనను ఆయన వంశము వారందరు క్షత్రియధర్మ మవలంబించుటచే క్షత్రియులైరి గాని బ్రాహ్మణు లనబడలేదుగదా!

**తాత్పర్యము** :– నిన్నిప్పుడు ఇట్లు యుద్ధమునకు పంపుట యనునది నాకు ఎంత మాత్రము సమ్మతమైన మంచి ఆలోచనము గాదు, గాని ఈ పద్ధతియే రాజ ధర్మమునకును, క్షత్రియుని కర్తవ్యమునకును ఉచితమైనదని పెద్దల నిర్ణయము.

**శ్లో॥ నానాశస్త్రేషు సంగ్రామే వైశారద్య మరిందమ ।**
**అవశ్యమేవ బోద్ధవ్యం కామ్యశ్చ విజయో రణే ॥ 14**

**పదచ్ఛేదము** :– నానాశస్త్రేషు – సంగ్రామే – వైశారద్యమ్ – అరిందమ – అవశ్యమ్ – ఏవ – బోద్ధవ్యం – కామ్యః – చ – విజయః – రణే ॥

**అన్వయక్రమము** :– అరిందమ! సంగ్రామే నానాశస్త్రేషు వైశారద్యమ్ అవశ్యమేవ బోద్ధవ్యమ్; రణే విజయః చ కామ్యః.

**ప్రతిపదార్థము** :– అరిందమ = ఓ శత్రుమర్దనుడా, సంగ్రామే = యుద్ధమున, నానాశస్త్రేషు = వివిధములగు శస్త్రములందు, వైశారద్యం = ప్రావీణ్యము, అవశ్యమ్ ఏవ = తప్పనిసరిగనే, బోద్ధవ్యం = తెలిసికొన వలసియున్నది, రణే = యుద్ధమున, విజయః చ = జయమును, కామ్యః = కోరదగినది.

**సూచన** :– 'నానాశస్త్రేషు (తే) వైశారద్యం (అస్తి) అవశ్యమేవ యోద్ధవ్యం' అని పాఠాంతరము. అనగా నీకు పెక్కు ఆయుధముల ప్రయోగమున ప్రావీణ్యమున్నది గాన తప్పక యుద్ధము చేయుమని భావము.

**తాత్పర్యము** :– ఓ శత్రుంజయుడా! యుద్ధమున ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, నీతిశాస్త్రము, కూటనీతి మున్నగు పెక్కింటియందు ప్రావీణ్యము కలిగియుండవలెను. రణమున ముఖ్యముగా విజయము కోరదగినదై యుండును.

**శ్లో॥ తతః పితు స్త ద్వచనం నిశమ్య**
**ప్రదక్షిణం దక్షసుతప్రభావః ।**
**చకార భర్తార మతిత్వరేణ**
**రణాయ వీరః ప్రతిపన్నబుద్ధిః ॥ 15**

**పదచ్ఛేదము :–** తతః – పితుః – తత్ – వచనం – నిశమ్య – ప్రదక్షిణం – దక్షసుత ప్రభావః, చకార – భర్తారమ్ – అతిత్వరేణ, రణాయ – వీరః – ప్రతిపన్నబుద్ధిః ॥

**అన్వయక్రమము :–** తతః పితుః తద్వచనం నిశమ్య దక్షసుతప్రభావః, వీరః రణాయ ప్రతిపన్నబుద్ధిః, అతిత్వరేణ భర్తారం ప్రదక్షిణం చకార.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, పితుః = తండ్రియొక్క, తద్వచనం = ఆ మాటను, నిశమ్య = విని, దక్షసుతప్రభావః = దక్షసుతులైన దేవతలయొక్క ప్రభావముగల, వీరః = వీరుడైన ఇంద్రజిత్తు, రణాయ = యుద్ధముకొఱకు, అతిత్వరేణ = మిక్కిలిత్వరగా, ప్రతిపన్నబుద్ధిః = నిశ్చయించుకొన్నట్టి మనస్సుగలవాడై, భర్తారం = తండ్రినిగూర్చి, ప్రదక్షిణం చకార = ప్రదక్షిణము గావించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** దక్షసుతాః దేవాః – ఇందుకు ప్రమాణము "మనసా త్వేవ భూతాని పూర్వం దక్షోఽసృజత్ తథా, దేవాన్ ఋషీన్ సగంధర్వా నురగాన్ పక్షిణస్తథా"

– విష్ణుపురాణము

**తాత్పర్యము :–** అప్పుడా ఇంద్రజిత్తు తండ్రిమాటలను విని దేవతల పరాక్రమము గల్గినట్టి ఆతడు యుద్ధమునకు వేగిరపడుచు లేచి తండ్రికి ప్రదక్షణ మొనరించెను.

**శ్లో॥ తత స్తై స్స్వగణై రిష్టై రింద్రజి త్ప్రతిపూజితః ।**
**యుద్ధోద్ధతః కృతోత్సాహః సంగ్రామం ప్రత్యపద్యత ॥ 16**

**పదచ్ఛేదము :–** తతః – తైః – స్వగణైః – ఇష్టైః – ఇంద్రజిత్ – ప్రతిపూజితః, యుద్ధోద్ధతః – కృతోత్సాహః – సంగ్రామం – ప్రత్యపద్యత ॥

**అన్వయక్రమము :–** తతః ఇంద్రజిత్ ఇష్టైః, తైః స్వగణైః ప్రతిపూజితః, యుద్ధోద్ధతః, కృతోత్సాహః సంగ్రామం ప్రత్యపద్యత.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు, ఇష్టైః = ప్రియులైనట్టి, తైః స్వగణైః = తనయొక్క ఆత్మీయులచే, ప్రతిపూజితః = సన్మానింపబడినవాడై, యుద్ధోద్ధతః = యుద్ధమునుగూర్చి ఉద్రేకము గలవాడగుచు, కృతోత్సాహః = కూర్చుకొన్న ఉత్సాహముగలవాడై, సంగ్రామం = యుద్ధమును, ప్రత్యపద్యత = పొందెను.

**తాత్పర్యము :–** అప్పుడా ఇంద్రజిత్తు ఆత్మీయులైన రాక్షసగణములు తనను సన్మానింపగా మిక్కిలి ఉత్సాహముతోను, ఆవేశముతోను రణమునకై వేగిరపడుచుండెను.

**శ్లో॥ శ్రీమాన్ పద్మపలాశాక్షో రాక్షసాధిపతే స్సుతః ।**
**నిర్జగామ మహాతేజాః సముద్ర ఇవ పర్వసు ॥ 17**

**పదచ్ఛేదము :–** శ్రీమాన్ – పద్మపలాశాక్షః – రాక్షసాధిపతేః – సుతః – నిర్జగామ – మహాతేజాః – సముద్రః – ఇవ – పర్వసు ॥ ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్, పద్మపలాశాక్షః, మహాతేజాః, రాక్షసాధిపతేః సుతః, పర్వసు సముద్రః ఇవ నిర్జగామ.

**ప్రతిపదార్థము :–** శ్రీమాన్ = గొప్పశోభ గలవాడును, పద్మపలాశాక్షః = తామరఱేకుల వంటి కన్నులు గలవాడును, మహాతేజాః = గొప్పదైన తేజస్సు గలవాడునగు, రాక్షసాధిపతేః = రాక్షసరాజుయొక్క, సుతః = కుమారుడైన ఇంద్రజిత్తు, పర్వసు = పర్వదినములందు, సముద్రః ఇవ = సముద్రమువలె, నిర్జగామ = (యుద్ధమునకు) వెడలెను.

**తాత్పర్యము :–** గొప్పశోభగలవాడును, తామరఱేకులవంటి కన్నులుగలవాడును, అమితమైన తేజస్సుగలవాడు నగు రాక్షసరాజు తనయుడైన ఇంద్రజిత్తు పర్వదినములందు సముద్రము పొంగి పొరలి పోవుచున్నట్లుగా యుద్ధభూమికి వెడలెను.

**శ్లో॥ స పక్షిరాజానిలతుల్యవేగై**
**ర్వ్యాళై శ్చతుర్భి స్సితతీక్ష్ణదంష్ట్రైః ।**
**రథం సమాయుక్త మసంగవేగం**
**సమారురో హేంద్రజి దింద్రకల్పః ॥ 18**

**పదచ్ఛేదము :–** సః – పక్షిరాజానిలతుల్యవేగైః – వ్యాలైః – చతుర్భిః – సితతీక్ష్ణదంష్ట్రైః – రథం – సమాయుక్తమ్ – అసంగవేగం – సమారురోహ – ఇంద్రజిత్ – ఇంద్రకల్పః ॥

**అన్వయక్రమము :–** ఇంద్రకల్పః సః ఇంద్రజిత్ పక్షిరాజానిలతుల్యవేగైః, సితతీక్ష్ణదంష్ట్రైః చతుర్భిః వ్యాలైః సమాయుక్తమ్ అసంగవేగం రథం సమారురోహ.

**ప్రతిపదార్థము :–** ఇంద్రకల్పః = ఇంద్రునితో సమానుడగు, సః ఇంద్రజిత్ = ఆ ఇంద్రజిత్తు, పక్షిరాజానిలతుల్యవేగైః = గరుత్మంతునితోడను వాయువుతోడను సమానమైన వేగముగలవియును, సితతీక్ష్ణదంష్ట్రైః = తెల్లనివాడియైన కోఱలుగలవియునగు, చతుర్భిః వ్యాలైః = నాలుగు క్రూరమృగములచే, (అనగా సింహములచే) సమాయుక్తం = పూన్చబడినట్టి, అసంగవేగం = సాటిలేని వేగము

గల్గినట్టి, రథం = రథమును, సమారురోహ = ఆరోహించెను.

**సూచన :–** పక్షిరాజానిలతుల్యవేగైః అను నీ పాఠము జగద్గురు శ్రీకంచి కామకోటి పీఠాధీశ్వరుల ఆమోదముతో వెలువడిన మద్రాసుప్రతిలోనిది. మిగిలిన ప్రతులలో పక్షిరాజోపమతుల్యవేగైః అనియే ఉన్నది. ఈ పాఠమునకు అర్థము గరుత్మంతునితో సమానమైన వేగముగలవియును, తమలో తాము సమానమైన వేగము గల్గినట్టివియును అని చెప్పుకొనవలెను. ఇచ్చట ఈ శ్లోకమున 'వ్యాలైః' అను పదమునకు తిలక వ్యాఖ్యానమున 'సర్పములతో' అనియును, 'గుఱ్ఱములచే' అని వాసుదాసస్వామియును, 'హింస్రపశువులచే' యని మహేశ్వరతీర్థులవారును, 'సింహములచే' అని గోవింద రాజీయమును తెల్పుచున్నది.

**తాత్పర్యము :–** దేవేంద్రునితో సమానమైన శక్తిశాలియగు ఇంద్రజిత్తు గరుడునితోడను, వాయువుతోడను సమానమైన వేగముగల్గి, తెల్లని వాడియైన కోఅలతో ప్రకాశించుచున్న నాల్గు సింహములతో కూర్చబడిన సాటిలేని వేగముగల రథమును నారోహించెను.

**శ్లో॥ స రథీ ధన్వినాం శ్రేష్ఠః శస్త్రజ్ఞో ఽస్త్రవిదాం వరః ।**
**రథే నాభియయౌ క్షిప్రం హనుమాన్యత్ర సోఽభవత్ ॥ 19**

**పదచ్ఛేదము :–** సః – రథీ – ధన్వినాం – శ్రేష్ఠః – శస్త్రజ్ఞః – అస్త్రవిదాం – వరః – రథేన – అభియయౌ – క్షిప్రం – హనుమాన్ – యత్ర – సః – అభవత్ ॥

**అన్వయక్రమము :–** ధన్వినాం శ్రేష్ఠః, శస్త్రజ్ఞః, అస్త్రవిదాం వరః, సః రథీ, సః హనుమాన్ యత్ర అభవత్, తత్ర క్షిప్రం రథేన అభియయౌ.

**ప్రతిపదార్థము :–** ధన్వినాం = విలుకాండ్రలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడును, శస్త్రజ్ఞః = ఆయుధ రహస్యముల నెఱిగినవాడును, అస్త్రవిదాం = అస్త్రవేత్తలలో, వరః = శ్రేష్ఠుడునగు, రథీ సః = రథికుడైన ఆ ఇంద్రజిత్తు, సః హనుమాన్ = ఆ హనుమ, యత్ర అభవత్ = ఎచ్చటనుండెనో, క్షిప్రం = వెంటనే, రథేన = రథముతో, అభియయౌ = చేరెను.

**తాత్పర్యము :–** మేటి విలుకాండ్రలో శ్రేష్ఠుడును, శస్త్రాస్త్రముల రహస్యములు తెలిసిన వారిలో మేటియునగు మహారథుడైన ఆ ఇంద్రజిత్తు తన రథము నతిశీఘ్రముగా నడిపించుకొనుచు హనుమయున్న చోటికి చేరుకొనెను.

**శ్లో॥ స తస్య రథనిర్ఘోషం జ్యాస్వనం కార్ముకస్య చ ।**
**నిశమ్య హరివీరో ఽసౌ సంప్రహృష్టతరో ఽభవత్ ॥ 20**

**పదచ్ఛేదము :–** సః – తస్య – రథనిర్ఘోషం – జ్యాస్వనం – కార్ముకస్య – చ, నిశమ్య – హరివీరః – అసౌ – సంప్రహృష్టతరః – అభవత్ ॥

**అన్వయక్రమము :–** సః అసౌ హరివీరః తస్య రథనిర్ఘోషం, కార్ముకస్య జ్యాస్వనం చ నిశమ్య, సంప్రహృష్టతరః అభవత్.

**ప్రతిపదార్థము :–** సః = ఆ, అసౌ = ఈ, హరివీరః = వానరవీరుడైన హనుమ, తస్య = ఆ ఇంద్రజిత్తుయొక్క, రథనిర్ఘోషం = రథధ్వనిని, కార్ముకస్య = ధనుస్సుయొక్క, జ్యాస్వనం చ = అల్లెతాటిమ్రోతను, నిశమ్య = ఆలకించి, సంప్రహృష్టతరః = మిక్కిలి సంతోషించినట్టివాడు, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము :–** మహావీరుడైన హనుమ ఇంద్రజిత్తు రథముయొక్క ఘోషయును, ఆతని వింటినారినుండి వెలువడు ధనుష్టంకారముల యొక్క ధ్వనిని ఆకర్ణించి మఱల ఇంకొక మహావీరుడు వచ్చుచున్నాడని మహానందము నొందెను.

**శ్లో॥ స మహ చ్చాప మాదాయ శితశల్యాంశ్చ సాయకాన్ ।**
**హనూమంత మభిప్రేత్య జగామ రణపండితః ॥ 21**

**పదచ్ఛేదము :–** సః – మహత్ – చాపమ్ – ఆదాయ – శితశల్యాన్ – చ – సాయకాన్, హనూమంతమ్ – అభిప్రేత్య – జగామ – రణపండితః ॥

**అన్వయక్రమము :–** రణపండితః సః మహత్ చాపం శితశల్యాన్ సాయకాన్ చ ఆదాయ హనూమంతమ్ అభిప్రేత్య జగామ.

**ప్రతిపదార్థము :–** రణపండితః = యుద్ధమునందు ఆరితేరినట్టి, సః = ఆ ఇంద్రజిత్తు, మహత్ = మిక్కిలి గొప్పదైన, చాపం = ధనుస్సును, శితశల్యాన్ = వాడియైన ములుకులు గల, సాయకాన్ చ = బాణములను, ఆదాయ = తీసికొని, హనూమంతం అభిప్రేత్య = హనుమంతుని ఉద్దేశించి, జగామ = వెడలెను.

**తాత్పర్యము :–** యుద్ధకోవిదుడైన ఆ ఇంద్రజిత్తు మిక్కిలి శ్రేష్ఠమైన ధనుస్సును, వాడియైన అలుగులుగల బాణములను ధరించి హనుమంతుని వెదకికొనుచు బయలుదేరెను.

**శ్లో॥ తస్మిం స్తత స్సంయతి జాతహర్షే**
**రణాయ నిర్గచ్ఛతి బాణపాణౌ ।**
**దిశశ్చ సర్వాః కలుషా బభూవు**
**ర్మృగాశ్చ రౌద్రా బహుధా వినేదుః ॥ 22**

**పదచ్ఛేదము** :- తస్మిన్ - తతః - సంయతి - జాతహర్షే - రణాయ - నిర్గచ్ఛతి - బాణపాణౌ, దిశః - చ - సర్వాః - కలుషాః - బభూవుః - మృగాః - చ - రౌద్రాః - బహుధా - వినేదుః ॥

**అన్వయక్రమము** :- తతః సంయతి జాతహర్షే బాణపాణౌ, తస్మిన్ రణాయ నిర్గచ్ఛతి (సతి) సర్వాః దిశః చ కలుషాః బభూవుః, రౌద్రాః మృగాః బహుధా వినేదుః చ.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, సంయతి = యుద్ధవిషయమునందు, జాతహర్షే = జనించిన సంతోషముగల్గినట్టి, బాణపాణౌ = బాణహస్తుడైన, తస్మిన్ = ఆ ఇంద్రజిత్తు, రణాయ = యుద్ధముకొఱకై, నిర్గచ్ఛతి సతి = బయలుదేరి వెళ్లుచుండగా, సర్వాః = సమస్తములైన, దిశశ్చ = దిక్కులును, కలుషాః = వ్యాకులములు, బభూవుః = అయినవి, రౌద్రాః = క్రూరములైన, మృగాః = జంతువులు, బహుధా = పలు విధములుగా, వినేదుః చ = ఆక్రోశించినవిగూడను.

**తాత్పర్యము** :- యుద్ధమునకై యువ్విళ్లూరుచున్న ఆ ఇంద్రజిత్తు ధనుర్బాణములను ధరించి రణరంగమునకు చేరుచుండగా దిక్కులెల్లను కలతనొందినవి. నక్కలు మున్నగు క్రూరమృగములు వివిధరీతులుగా ఆక్రోశింపసాగినవి.

**శ్లో॥ సమాగతా స్తత్ర తు నాగయక్షాః**
**మహర్షయ శ్చక్రచరాశ్చ సిద్ధాః ।**
**నభ స్సమావృత్య చ పక్షిసంఘా**
**వినేదు రుచ్చైః పరమప్రహృష్టాః ॥** **23**

**పదచ్ఛేదము** :- సమాగతాః - తత్ర - తు - నాగయక్షాః, మహర్షయః - చక్రచరాః - చ - సిద్ధాః, నభః - సమావృత్య - చ - పక్షిసంఘాః, వినేదుః - ఉచ్చైః - పరమప్రహృష్టాః ॥

**అన్వయక్రమము** :- తత్ర నాగయక్షాః, సిద్ధాః, చక్రచరాః మహర్షయః చ సమాగతాః, పక్షిసంఘాః చ పరమప్రహృష్టాః (సంతః) నభః సమావృత్య ఉచ్చైః వినేదుః.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ ప్రదేశమునకు, నాగయక్షాః = నాగులును, యక్షులును, సిద్ధాః = సిద్ధులు, చక్రచరాః = జ్యోతిశ్చక్రమునందు చరించునట్టి, మహర్షయః చ = మహాఋషులును, సమాగతాః = వచ్చిరి. పక్షిసంఘాః = పక్షిసమూహములును, పరమప్రహృష్టాః (సంతః) = మిక్కిలి సంతోషమును బొందినవి యగుచు, నభః = ఆకాశమును, సమావృత్య = ఆవరించి, ఉచ్చైః = బిగ్గరగా, వినేదుః = అఱచినవి.

**తాత్పర్యము :–** ఆ రణమును చూడగోరి నాగులు, యక్షులు, సిద్ధులు, జ్యోతిశ్చక్రము నందలి మహర్షులును కూడ వచ్చిరి. పక్షిసంఘములు కూడ ఆకాశము నావరించి గొప్ప ఉత్సాహముతో బిగ్గరగా నాదములు చేసినవి.

**శ్లో॥ ఆయాంతం సరథం దృష్ట్వా తూర్ణ మింద్రజితం కపిః ।**
**విననాద మహానాదం వ్యవర్ధత చ వేగవాన్ ॥ 24**

**పదచ్ఛేదము :–** ఆయాంతం – సరథం – దృష్ట్వా – తూర్ణమ్ – ఇంద్రజితం – కపిః – విననాద – మహానాదం – వ్యవర్ధత – చ – వేగవాన్ ॥

**అన్వయక్రమము :–** కపిః తూర్ణమ్ ఆయాంతం, సరథమ్ ఇంద్రజితం, దృష్ట్వా మహానాదం వినవాద; వేగవాన్ (సన్) వ్యవర్ధత చ.

**ప్రతిపదార్థము :–** కపిః = హనుమ, తూర్ణమ్ = శీఘ్రముగా, ఆయాంతం = వచ్చుచున్నట్టి, సరథం = రథముతోగూడిన, ఇంద్రజితం = ఇంద్రజిత్తును, దృష్ట్వా = చూచి, మహానాదం = గొప్పదైనధ్వని కలుగునట్లు, వినవాద = గర్జించెను. వేగవాన్ (సన్) = గొప్ప వేగము గలవాడగుచు; వ్యవర్ధత చ = పెరిగెను గూడను.

**తాత్పర్యము :–** అప్పుడు హనుమంతుడు, రథము నారోహించి తన వైపునకు వేగముగా వచ్చుచున్న ఇంద్రజిత్తును గాంచి గొప్పధ్వనితో పెద్దగర్జనమును చేసెను. తన శరీరమును గూడ తగినట్లుగా పెంచుకొనెను.

**శ్లో॥ ఇంద్రజిత్స రథం దివ్య మాస్థిత శ్చిత్రకార్ముకః ।**
**ధను ర్విస్ఫారయామాస తటిదూర్జితనిస్వనమ్ ॥ 25**

**పదచ్ఛేదము :–** ఇంద్రజిత్ – సః – రథం – దివ్యమ్ – ఆస్థితః – చిత్రకార్ముకః – ధనుః – విస్ఫారయామాస – తటిదూర్జితనిస్వనమ్ ॥

**అన్వయక్రమము :–** చిత్రకార్ముకః సః ఇంద్రజిత్ దివ్యం రథమ్ ఆస్థితః, తటిదూర్జిత నిస్వనం ధనుః విస్ఫారయామాస.

**ప్రతిపదార్థము :–** చిత్రకార్ముకః = చిత్రమైన ధనుస్సుగల్గినట్టి, సః ఇంద్రజిత్ = ఆ ఇంద్రజిత్తు, దివ్యం = దివ్యమైనట్టి, రథమ్ = రథమును, ఆస్థితః = ఆరోహించినవాడై, తటిదూర్జితనిస్వనమ్ = మెఱుపులతో గూడిన ఉఱుముల మ్రోతవంటి ధ్వనిగలిగిన, ధనుః = ధనుస్సును, విస్ఫారయామాస = సారించెను.

**తాత్పర్యము :–** చిత్రమైన తన గొప్పధనుస్సును చేతబట్టి రథము నధిష్ఠించి అచ్చటికి వచ్చిన ఇంద్రజిత్తు, మేఘగర్జనమువంటి ధ్వనిని కల్గించుచు వింటినారిని సారించెను.

**శ్లో॥ తత స్సమేతా వతితీక్ష్ణవేగౌ**
**మహాబలౌ తౌ రణనిర్విశంకౌ ।**
**కపిశ్చ రక్షోధిపతేశ్చ పుత్రః**
**సురాసురేంద్రావివ బద్ధవైరౌ ॥ 26**

**పదచ్ఛేదము :–** తతః – సమేతౌ – అతితీక్ష్ణవేగౌ – మహాబలౌ – తౌ – రణనిర్విశంకౌ, కపిః – చ – రక్షోధిపతేః – చ – పుత్రః – సురాసురేంద్రౌ – ఇవ – బద్ధవైరౌ ॥

**అన్వయక్రమము :–** తతః అతితీక్ష్ణవేగౌ, మహాబలౌ, రణనిర్విశంకౌ తౌ కపిః చ, రక్షోధిపతేః పుత్రః చ, బద్ధవైరౌ సురాసురేంద్రౌ ఇవ సమేతౌ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, అతితీక్ష్ణవేగౌ = మిక్కిలి తీవ్రమైన వడిగలవారును, మహాబలౌ = అమితబలసంపన్నులును, రణనిర్విశంకౌ = యుద్ధమున జంకులేనివారునగు, తౌ = ఆ, కపిః చ = హనుమయును, రక్షోధిపతేః = రాక్షసరాజు యొక్క, పుత్రః చ = పుత్రుడును, బద్ధవైరౌ = ఏర్పడినవైరముగలిగిన, సురాసురేంద్రౌ ఇవ = దేవేంద్రుడును రాక్షసేంద్రుడునువలె, సమేతౌ = కలసికొనిరి.

**తాత్పర్యము :–** అటుపిమ్మట యుద్ధమునందు అతితీక్ష్ణమైన ప్రతాపము గలవారును, మహాబలాఢ్యులును, యుద్ధమునకై యువ్విళ్లూరుచున్న వారునగు ఆ హనుమంతుడు, ఇంద్రజిత్తును బద్ధవైరము గలిగినట్టి దేవేంద్రుడును రాక్షసేంద్రుడును పరస్పరము ఎదుర్కొన్నట్లుగా అచ్చట కలిసికొనిరి.

**శ్లో॥ స తస్య వీరస్య మహారథస్య**
**ధనుష్మత స్సంయతి సమ్మతస్య ।**
**శరప్రవేగం వ్యహన త్ప్రవృద్ధ**
**శ్చచార మార్గే పితు రప్రమేయే ॥ 27**

**పదచ్ఛేదము :–** సః – తస్య – వీరస్య – మహారథస్య – ధనుష్మతః – సంయతి – సమ్మతస్య – శరప్రవేగం – వ్యహనత్ – ప్రవృద్ధః – చచార – మార్గే – పితుః – అప్రమేయే ॥

**అన్వయక్రమము :–** వీరస్య, మహారథస్య, ధనుష్మతః, సంయతి సమ్మతస్య తస్య శరప్రయోగం, ప్రవృద్ధః (సన్) సః వ్యహనత్; అప్రమేయే పితుః మార్గే చచార.

**ప్రతిపదార్థము :–** వీరస్య = వీరుడును, మహారథస్య = మహారథుడును, ధనుష్మతః = గొప్పవిలుకాడును, సంయతి = యుద్ధమునందు, సమ్మతస్య = గౌరవించబడిన

వాడునగు, తస్య = ఆ ఇంద్రజిత్తుయొక్క, శరప్రయోగం = బాణముల గొప్పవేగమును, ప్రవృద్ధః (సన్) = మిక్కిలిగ పెరిగియున్నవాడై, సః = హనుమ, వ్యహనత్ = వ్యర్థము చేసెను, అప్రమేయే = మితిలేనట్టి, పితుః మార్గే = తండ్రియొక్క మార్గమైన ఆకాశము నందు, చచార = సంచరించెను.

**తాత్పర్యము :–** మహారథుడును, గొప్పవిలుకాడును, యుద్ధమున విఖ్యాతి గలవాడునగు ఇంద్రజిత్తు మహావేగముగా తనపై కురిపించుచున్న బాణవర్షమున ఒక్క బాణమైనను తనకు తగులకుండ హనుమ తన తండ్రియైన వాయుదేవుని సంచారమార్గమైన ఆకాశమునందు అపరిమితమైన లాఘవముతో తప్పించుకొనుచుండెను.

**శ్లో॥ తత శ్శరా నాయతతీక్ష్ణశల్యాన్**
**సుపత్త్రిణః కాంచనచిత్రపుంఖాన్ ।**
**ముమోచ వీరః పరవీరహంతా**
**సుసంతతాన్ వజ్రనిపాతవేగాన్ ॥ 28**

**పదచ్ఛేదము :–** తతః – శరాన్ – ఆయతతీక్ష్ణశల్యాన్ – సుపత్త్రిణః – కాంచనచిత్రపుంఖాన్, ముమోచ – వీరః – పరవీరహంతా – సుసంతతాన్ – వజ్రనిపాతవేగాన్ ॥

**అన్వయక్రమము :–** తతః పరవీరహంతా (సః) వీరః ఆయతతీక్ష్ణశల్యాన్, సుపత్త్రిణః, కాంచనచిత్రపుంఖాన్, సుసంతతాన్, వజ్రనిపాతవేగాన్ శరాన్ ముమోచ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, పరవీరహంతా = శత్రువీరులను హతమార్చువాడగు, సః వీరః = ఆ వీరుడైన ఇంద్రజిత్తు, ఆయతతీక్ష్ణశల్యాన్ = పొడవైనవై వాడియైన అలుగులు గలవియును, సుపత్త్రిణః = మంచిఱెక్కలు గలవియును, కాంచనచిత్రపుంఖాన్ = బంగరు చిత్రములు గలిగియుండిన పుంఖములు గలవియును, సుసంతతాన్ = మిక్కిలి దృఢమైనవియును, వజ్రనిపాతవేగాన్ = పిడుగుపాటువంటి వేగము గలవియును అగు, శరాన్ = బాణములను, ముమోచ = ప్రయోగించెను.

**తాత్పర్యము :–** శత్రుసంహారకుడైన మహావీరుడగు ఆ ఇంద్రజిత్తు పొడవైనవై వాడియైన అలుగులుగలవై, మంచిఱెక్కలుగలవై, బంగరుచిత్తరువులుగల పుంఖములుగలవై, ధృఢమైనవై, పిడుగుపాటు వంటి గొప్పవేగముగలవై యున్న బాణములను పెక్కింటిని హనుమపై ప్రయోగించెను.

**శ్లో॥ తత స్స త త్స్యందననిస్వనం చ**
**మృదంగభేరీపటహస్వనం చ ।**
**వికృష్యమాణస్య చ కార్ముకస్య**
**నిశమ్య ఘోషం పున రుత్పపాత ॥ 29**

**పదచ్ఛేదము** :- తతః - సః - తత్ - స్యందననిస్వనం - చ - మృదంగభేరీ పటహస్వనం - చ - వికృష్యమాణస్య - చ - కార్ముకస్య - నిశమ్య - ఘోషం - పునః - ఉత్పపాత ॥

**అన్వయక్రమము** :- తతః సః తత్ స్యందననిస్వనం చ, మృదంగభేరీపటహస్వనం చ, వికృష్యమాణస్య కార్ముకస్య ఘోషం చ నిశమ్య పునః ఉత్పపాత.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, సః = ఆ హనుమ, తత్ = ఆ, స్యందన నిస్వనం చ = రథధ్వనిని, మృదంగభేరీపటహస్వనం చ = మద్దెలలయొక్కయు భేరీలయొక్కయు పటహములయొక్కయు ధ్వనిని, వికృష్యమాణస్య = ఎక్కుపెట్టబడు చున్నట్టి, కార్ముకస్య = ధనుస్సుయొక్క, ఘోషం చ = ధ్వనిని, నిశమ్య = విని, పునః = మఱల, ఉత్పపాత = మీది కెగసెను.

**తాత్పర్యము** :- అప్పుడా హనుమ ఆ ఇంద్రజిత్తుయొక్క రథధ్వనిని, మృదంగభేరీ పటాహాది యుద్ధవాద్యముల ధ్వనిని, వినుచు వెంటనే మఱల ఆకసముమీదికి ఎగిరెను.

**శ్లో॥ శరాణా మంతరే ష్వాశు వ్యావర్తత మహాకపిః ।**
**హరి స్తస్యాభిలక్ష్యస్య మోఘయన్ లక్ష్యసంగ్రహమ్ ॥ 30**

**పదచ్ఛేదము** :- శరాణామ్ - అంతరేషు - ఆశు - వ్యావర్తత - మహాకపిః - హరిః - తస్య - అభిలక్ష్యస్య - మోఘయన్ - లక్ష్యసంగ్రహమ్ ॥

**అన్వయక్రమము** :- మహాకపిః (సః హరిః) శరాణామ్ అంతరేషు అభిలక్ష్యస్య తస్య లక్ష్యసంగ్రహం మోఘయన్ ఆశు వ్యావర్తత.

**ప్రతిపదార్థము** :- మహాకపిః = వానరశ్రేష్ఠుడైనట్టి, (సః హరిః = ఆ హనుమ) అభిలక్ష్యస్య = లక్ష్యమును చేధించుటలో నిపుణుడైనట్టి, తస్య = ఆ ఇంద్రజిత్తు యొక్క, లక్ష్యసంగ్రహం = లక్ష్యముమీది దృష్టిని, మోఘయన్ = వ్యర్థముచేయుచు, శరణాం = బాణములయొక్క, అంతరేషు = మధ్యభాగములందు, వ్యావర్తత = తిరిగెను.

**తాత్పర్యము** :- వానరశ్రేష్ఠుడైన ఆ హనుమ, లక్ష్యమును చక్కగా ఛేదించుటలో గొప్పఖ్యాతి నార్జించిన ఆ ఇంద్రజిత్తుయొక్క లక్ష్యభేదనప్రావీణ్యము నంతను వ్యర్థము

చేయుచు ఆతడు ప్రయోగించు బాణములు తనకు తగులకుండ ఆ బాణములమధ్యనే పరిభ్రమించుచుండెను.

**శ్లో॥ శరాణా మగ్రత స్తస్య పున స్సమభివర్తత ।**
**ప్రసార్య హస్తౌ హనుమా నుత్పపా తానిలాత్మజః ॥ 31**

**పదచ్ఛేదము :–** శరాణామ్ – అగ్రతః – తస్య – పునః – సమభివర్తత, ప్రసార్య – హస్తౌ – హనుమాన్ – ఉత్పపాత – అనిలాత్మజః ॥

**అన్వయక్రమము :–** అనిలాత్మజః హనుమాన్ తస్య శరాణాం అగ్రతః హస్తౌ ప్రసార్య సమభివర్తత, పునః ఉత్పపాత.

**ప్రతిపదార్థము :–** అనిలాత్మజః = వాయునందనుడైన, హనుమాన్ = హనుమ, పునః = తిరిగి, తస్య = ఆ ఇంద్రజిత్తుయొక్క, శరాణాం = బాణములకు, అగ్రతః = ఎదుట, సమభివర్తత = నిలచెను, హస్తౌ = చేతులను, ప్రసార్య = చాచి, ఉత్పపాత = మీదికి ఎగిరెను.

**తాత్పర్యము :–** వాయునందనుడైన హనుమ అప్పుడు మఱల ఒకసారి ఆ ఇంద్రజిత్తు ప్రయోగించుచున్న బాణములకు ఎదురుగవచ్చి నిలుచుండెను. మఱల అంతలోనే బాహువులు చాచి మీది కెగిరిపోయెను.

**శ్లో॥ తా వుభౌ వేగసంపన్నౌ రణకర్మవిశారదౌ ।**
**సర్వభూతమనోగ్రాహి చక్రతు ర్యుద్ధ ముత్తమమ్ ॥ 32**

**పదచ్ఛేదము :–** తౌ – ఉభౌ – వేగసంపన్నౌ – రణకర్మవిశారదౌ – సర్వభూత మనోగ్రాహి – చక్రతుః – యుద్ధమ్ – ఉత్తమమ్ ॥

**అన్వయక్రమము :–** రణకర్మవిశారదౌ, వేగసంపన్నౌ తౌ ఉభౌ, సర్వభూతమనోగ్రాహి, ఉత్తమం యుద్ధం చక్రతుః.

**ప్రతిపదార్థము :–** రణకర్మవిశారదౌ = యుద్ధముచేయుటయందు ప్రవీణులైనట్టి వారును, వేగసంపన్నౌ = గొప్పవేగముగలవారునగు, తౌ ఉభౌ = వారిరువురును, సర్వభూతమనోగ్రాహి = సర్వప్రాణుల మనస్సులను ఆకర్షించునట్టి, ఉత్తమం = గొప్పదైనట్టి, యుద్ధం = యుద్ధమును, చక్రతుః = చేసిరి.

**తాత్పర్యము :–** యుద్ధము గావించుటలో గొప్ప ప్రావీణ్యము గలవారును, అమితమైన లాఘవము గలవారునగు ఆ హనుమంతుడును, ఇంద్రజిత్తును అచ్చటగల ఎల్లరి మనస్సులకును ఆశ్చర్యము గొల్పునట్టి, గొప్పదైన యుద్ధమొనరించిరి.

**శ్లో॥ హనూమతో వేద న రాక్షసోఽన్తరమ్**
**న మారుతి స్తస్య మహాత్మనో ఽన్తరమ్ ।**
**పరస్పరం నిర్విషహౌ బభూవతుః**
**సమేత్య తౌ దేవసమానవిక్రమౌ ॥ 33**

**పదచ్ఛేదము :-** హనూమతః - వేద - న - రాక్షసః - అంతరం, న - మారుతిః - తస్య - మహాత్మనః - అంతరమ్, పరస్పరం - నిర్విషహౌ - బభూవతుః - సమేత్య - తౌ - దేవసమానవిక్రమౌ ॥

**అన్వయక్రమము :-** రాక్షసః, హనూమతః అంతరం న వేద; మారుతిః తస్య మహాత్మనః అంతరం న(వేద); దేవసమానవిక్రమౌ తౌ సమేత్య పరస్పరం నిర్విషహౌ బభూవతుః.

**ప్రతిపదార్థము :-** రాక్షసః = ఇంద్రజిత్తు, హనూమతః = హనుమంతునియొక్క, అంతరం = లోతును, న వేద = తెలిసికొనలేకుండెను, మారుతిః = హనుమ, తస్య మహాత్మనః = ఆ మహనీయుడైన ఇంద్రజిత్తుయొక్క, అంతరం = అవకాశమును, న వేద = తెలిసికొన లేకుండెను, దేవసమానవిక్రమౌ = దేవతలతో తుల్యమైన పరాక్రమము గల్గినట్టి, తౌ = వారిరువురును, సమేత్య = కూడి, పరస్పరం = ఒకరికొకరు, నిర్విషహౌ = సహింపరానివారుగా, బభూవతుః = అయిరి.

**తాత్పర్యము :-** ఇంద్రజిత్తునకు హనుమంతుని శక్తి గూర్చి అంతుచిక్కుటలేదు. అట్లే హనుమంతునకును ఇంద్రజిత్తు యొక్క పరాక్రమము ఇంతటిదని బోధపడకున్నది. దేవతుల్యపరాక్రములైన వారిరువురును కలసి పోరుచు ఒకరికొకరు అజేయులుగా గానవచ్చుచుండిరి.

**శ్లో॥ తతస్తు లక్ష్యే స విహన్యమానే**
**శరే ష్వమోఘేషు చ సంపతత్సు ।**
**జగామ చింతాం మహతీం మహాత్మా**
**సమాధిసంయోగసమాహితాత్మా ॥ 34**

**పదచ్ఛేదము :-** తతః - తు - లక్ష్యే - సః - విహన్యమానే - శరేషు - అమోఘేషు - చ - సంపతత్సు, జగామ - చింతాం - మహతీం - మహాత్మా, సమాధిసంయోగ సమాహితాత్మా ॥

**అన్వయక్రమము :-** తతః అమోఘేషు శరేషు సంపతత్సు చ లక్ష్యే విహన్యమానే (సతి) సమాధిసంయోగసమాహితాత్మా స మహాత్మా మహతీం చింతాం జగామ.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, అమోఘేషు = తిరుగులేనట్టి, శరేషు = బాణములు, సంపతత్సు (సత్సు)చ = మీదబడుచున్నను, లక్ష్యే = లక్ష్యము, విహన్యమానే సతి = తప్పిపోవుచుండగా, సమాధిసంయోగసమాహితాత్మా = సంధించుట ప్రయోగించుట యనువానియం దేకాగ్రచిత్తముగల, సః మహాత్మా = ఆ మహాత్ముడైన, ఇంద్రజిత్తు, మహతీం = గొప్పదైన, చింతాం = చింతను, జగామ = పొందెను.

**తాత్పర్యము** :– తనకు లక్ష్యమైన శత్రువగు ఆ హనుమ అద్భుతమైన శక్తిగల, తిరుగులేని తన బాణములు ఎన్ని మీద కురిసినప్పటికిని చెక్కుచెదరక యుండుట చూచి బాణసంధానప్రయోగాదులందు అమితమైన కౌశలముగల్గిన ఇంద్రజిత్తు (ఎంతయో) చింతకు లోనయ్యెను.

**శ్లో॥ తతో మతిం రాక్షసరాజసూను**
**శ్చకార తస్మిన్ హరివీరముఖ్యే ।**
**అవధ్యతాం తస్య కపే స్సమీక్ష్య**
**కథం నిగచ్ఛే దితి నిగ్రహార్థమ్ ॥ 35**

**పదచ్ఛేదము** :– తతః – మతిం – రాక్షసరాజసూనుః, చకార – తస్మిన్ – హరివీరముఖ్యే, అవధ్యతాం – తస్య – కపేః – సమీక్ష్య – కథం – నిగచ్ఛేత్ – ఇతి – నిగ్రహార్థమ్ ॥

**అన్వయక్రమము** :– తతః రాక్షసరాజసూనుః తస్య కపేః అవధ్యతాం సమీక్ష్య (అయం) కథం నిగచ్ఛేత్ ఇతి హరివీరముఖ్యే తస్మిన్ నిగ్రహార్థం మతిం చకార.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, రాక్షసరాజసూనుః = రాక్షసప్రభువుయొక్క పుత్రుడైన ఇంద్రజిత్తు, తస్య కపేః = ఆ హనుమయొక్క, అవధ్యతాం = వధించుటకు శక్యముగాకుండుటను, సమీక్ష్య = గ్రహించి, (అయం = ఈతడు) కథం = ఎట్లుగా, నిగచ్ఛేత్ = వశుడగును, ఇతి = అని, హరివీరముఖ్యే = వానరశ్రేష్ఠుడైన, తస్మిన్ = ఆ హనుమ విషయమున, నిగ్రహార్థం = బంధించుటకొఱకు, మతిం చకార = నిశ్చయము చేసెను.

**తాత్పర్యము** :– రాక్షసరాజతనయుడైన ఇంద్రజిత్తు, ఎంతకును తన శస్త్రములచే హనుమ నిహతుడు కాకుండుటను జూచి ఈ వానరవీరుడు తన కెట్లు వశుడగునా యని చింతించి చివరకు ఆతనిని బంధించుటకై నిశ్చయించుకొనెను.

**శ్లో॥ తతః పైతామహం వీర స్సో ఽ స్త్ర మస్త్రవిదాం వరః ।**
**సందధే సుమహాతేజా స్తం హరిప్రవరం ప్రతి ॥ 36**

**పదచ్ఛేదము :-** తతః - పైతామహం - వీరః - సః - అస్త్రం - అస్త్రవిదాం - వరః - సందధే - సుమహాతేజాః - తం - హరిప్రవరం - ప్రతి ॥

**అన్వయక్రమము :-** తతః అస్త్రవిదాం వరః సుమహాతేజాః సః వీరః తం హరిప్రవరం ప్రతి పైతామహమ్ అస్త్రం సందధే.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, అస్త్రవిదాం = అస్త్రవేత్తలలో, వరః = శ్రేష్ఠుడును, సుమహాతేజాః = మహాతేజస్సంపన్నుడును అగు, సః వీరః = ఆ వీరుడైన ఇంద్రజిత్తు, తం హరిప్రవరం ప్రతి = ఆ వానరశ్రేష్ఠునిగూర్చి, పైతామహమ్ = బ్రహ్మదేవునికి సంబంధించిన, అస్త్రం = అస్త్రమును, సందధే = సంధించెను.

**తాత్పర్యము :-** అస్త్రవిద్యాప్రవీణుడైన తేజశ్శాలియగు ఆ ఇంద్రజిత్తు తన ఎదుట నున్న ఆ వానరశ్రేష్ఠుని గూర్చి వెంటనే బ్రహ్మాస్త్రమును సంధించెను.

**శ్లో॥ అవధ్యో ఽ య మితి జ్ఞాత్వా త మస్త్రేణాస్త్రతత్త్వవిత్ ।**
**నిజగ్రాహ మహాబాహు ర్మారుతాత్మజ మింద్రజిత్ ॥ 37**

**పదచ్ఛేదము :-** అవధ్యః - అయం - ఇతి - జ్ఞాత్వా - తం - అస్త్రేణ - అస్త్రతత్త్వవిత్, నిజగ్రాహ - మహాబాహుః - మారుతాత్మజమ్ - ఇంద్రజిత్ ॥

**అన్వయక్రమము :-** అస్త్రతత్త్వవిత్ మహాబాహుః ఇంద్రజిత్, అయం అవధ్యః ఇతి జ్ఞాత్వా తం మారుతాత్మజం తేన అస్త్రేణ నిజగ్రాహ.

**ప్రతిపదార్థము :-** అస్త్రతత్త్వవిత్ = అస్త్రరహస్యముల నెఱిగిన, మహాబాహుః = బలశాలియైన, ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు, అయమ్ = ఈ హనుమ, అవధ్యః = చంపుటకు సాధ్యుడుగాడు, ఇతి = అని, జ్ఞాత్వా = తెలిసికొని, తం మారుతాత్మజం = ఆ వాయుసూనుని, తేన అస్త్రేణ = ఆ బ్రహ్మాస్త్రముతో, నిజగ్రాహ = బంధించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** 'అవధ్యః అయం ఇతి జ్ఞాత్వా' - ఈ వానరవీరుడు బ్రహ్మాస్త్రముచేత గూడ వధించుటకు సాధ్యమైనవాడు గాడని తెలిసికొని.

**తాత్పర్యము :-** మహావీరుడైన ఇంద్రజిత్తు ఈ వానరశ్రేష్ఠుడు నాకు వధింప శక్యుడు గాడని గ్రహించి వివిధాస్త్రముల రహస్యములను ఎఱిగినవాడగుటచే ఆ

వాయునందనుని మహాశక్తిగల బ్రహ్మాస్త్రముతో బంధించెను.

**శ్లో॥ తేన బద్ధ స్తతో ఽస్త్రేణ రాక్షసేన స వానరః ।**
**అభవ న్నిర్విచేష్టశ్చ పపాత చ మహీతలే ॥ 38**

**పదచ్ఛేదము** :- తేన - బద్ధః - తతః - అస్త్రేణ - రాక్షసేన - సః - వానరః - అభవత్ - నిర్విచేష్టః - చ - పపాత - చ - మహీతలే ॥

**అన్వయక్రమము** :- తతః రాక్షసేన తేన అస్త్రేణ బద్ధః సః వానరః నిర్విచేష్టః అభవత్ చ; మహీతలే పపాత చ.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, రాక్షసేన = ఇంద్రజిత్తుచేత, తేన అస్త్రేణ = ఆ బ్రహ్మాస్త్రముచే, బద్ధః = బంధింపబడినవాడై, సః వానరః = ఆ హనుమ, నిర్విచేష్టః = చేష్టారహితుడు, అభవత్ చ = ఆయెను, మహీతలే = భూతలమున, పపాత చ = పడిపోయెను కూడను.

**తాత్పర్యము** :- ఇంద్రజిత్తు అట్లు బ్రహ్మాస్త్రముచే హనుమను బంధింపగా ఆతడు చేష్టారహితుడై నేలపై బడిపోయెను.

**శ్లో॥ తతో ఽథ బుద్ధ్వా స త దస్త్రబంధం**
**ప్రభోః ప్రభావా ద్విగతాత్మవేగః ।**
**పితామహానుగ్రహ మాత్మనశ్చ**
**విచింతయామాస హరిప్రవీరః ॥ 39**

**పదచ్ఛేదము** :- తతః - అథ - బుద్ధ్వా - సః - తత్ - అస్త్రబంధం - ప్రభోః - ప్రభావాత్ - విగతాత్మవేగః, పితామహానుగ్రహమ్ - ఆత్మనః - చ, విచింతయామాస - హరిప్రవీరః ॥

**అన్వయక్రమము** :- తతః హరిప్రవీరః సః తదస్త్రబంధం బుద్ధ్వా ప్రభోః ప్రభావాత్ విగతాత్మవేగః, అథ ఆత్మనః పితామహానుగ్రహం చ విచింతయామాస.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, హరిప్రవీరః = వానరశ్రేష్ఠుడైనట్టి, సః = ఆ హనుమ, తదస్త్రబంధం = బ్రహ్మదేవుని అస్త్రముయొక్క బంధనమును గూర్చి, బుద్ధ్వా = తెలిసికొని, ప్రభోః = ప్రభువుయొక్క, ప్రభావాత్ = మహిమవలన, విగతాత్మవేగః = తొలగిన నిజప్రతాపము గలవాడై, అథ = పిమ్మట, ఆత్మనః = తనకు, పితామహానుగ్రహం చ = బ్రహ్మదేవుని అనుగ్రహమును గూర్చి కూడ, విచింతయామాస = ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :– 'విగతాత్మవేగః' అనుటకు బదులుగా 'విగతాల్పవేగః' అని పాఠాంతరము గలదు.

'ప్రభోః ప్రభావాత్' అనగా ప్రభువైన శ్రీరామునియొక్క ప్రభావమువలన విగతాల్పవేగుడయ్యెను అనగా అతనిలోని అల్పప్రతాపము తొలగి బ్రహ్మాస్త్రమును భరించుటకు తగిన రీతిగా మహాప్రతాపశాలియయ్యెనని భావము.

'ఆత్మనః పితామహానుగ్రహమ్' – ముహూర్త మాత్రముననే నా అస్త్రబంధము నుండి నీకు విమోక్షణము లభింపగలదని పూర్వము బ్రహ్మ తనపై చూపిన అనుగ్రహమని భావము.

**తాత్పర్యము** :– వెంటనే హనుమ తాను బ్రహ్మాస్త్రముచేత బంధితుడనైతినని గుర్తుంచుకొని ఆతని ప్రభావముచేతనే తాను శక్తిహీనుడైన విషయమును, మఱియు బ్రహ్మదేవుని అనుగ్రహముచేత తనకు కొలది గడియలలో బంధవిముక్తి గలుగుననియు తెలిసికొనెను.

**శ్లో॥ తతస్స్వాయంభువైర్మంత్రై ర్బ్రహ్మాస్త్రమభిమంత్రితమ్ ।**
**హనుమాం శ్చింతయామాస వరదానం పితామహాత్ ॥ 40**

**పదచ్ఛేదము** :– తతః – స్వాయంభువైః – మంత్రైః – బ్రహ్మాస్త్రమ్ – అభిమంత్రితం – హనుమాన్ – చింతయామాస – వరదానం – పితామహాత్ ॥

**అన్వయక్రమము** :– తతః స్వాయంభువైః మంత్రైః అభిమంత్రితం బ్రహ్మాస్త్రం, పితామహాత్ వరదానం హనుమాన్ చింతయామాస.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, స్వాయంభువైః = బ్రహ్మ దేవతగా గల్గినట్టి, మంత్రైః = మంత్రములచే, అభిమంత్రితం = అభిమంత్రింపబడినట్టి, బ్రహ్మాస్త్రం = బ్రహ్మాస్త్రమును గూర్చియు, పితామహాత్ = బ్రహ్మదేవునినుండి, వరదానం = వరదానమును గూర్చియు, హనుమాన్ = హనుమ, చింతయామాస = ఆలోచించెను.

**తాత్పర్యము** :– అటుపిమ్మట హనుమ బ్రహ్మదేవతాకములైన మహామంత్రములచే అభిమంత్రింపబడిన ఆ బ్రహ్మాస్త్రముయొక్క ప్రభావమును గూర్చియు, తనకు బ్రహ్మదేవు డనుగ్రహించిన వరదానమును గూర్చియు ఆలోచింపసాగెను.

**శ్లో॥ న మే ఽ స్య బంధస్య చ శక్తి రస్తి**
**విమోక్షణే లోకగురోః ప్రభావాత్ ।**
**ఇత్యేవ మత్వా విహితో ఽ స్త్రబంధః**
**మ యాత్మయోనే రనువర్తితవ్యః ॥ 41**

**పదచ్ఛేదము :–** న – మే – అస్య – బంధస్య – చ – శక్తిః – అస్తిః – విమోక్షణే – లోకగురోః – ప్రభావాత్, ఇతి – ఏవ – మత్వా – విహితః – అస్త్రబంధః – మయా – ఆత్మయోనేః – అనువర్తితవ్యః ॥

**అన్వయక్రమము :–** లోకగురోః ప్రభావాత్ అస్య బంధస్య విమోక్షణే మే శక్తిః న చ అస్తి ఇతి ఏవ మత్వా, విహితః అత్మయోనేః అస్త్రబంధః మయా అనువర్తితవ్యః.

**ప్రతిపదార్థము :–** లోకగురోః = బ్రహ్మదేవునియొక్క, ప్రభావాత్ = మహిమవలన, అస్య బంధస్య = ఈ యస్త్రబంధముయొక్క, విమోక్షణే = విడిపించుకొనుటయందు, మే = నాకు, శక్తిః = సామర్థ్యము, న చ అస్తి = ఏమియు లేదు, ఇతి = అని, మత్వా ఏవ = తలచియే, విహితః = ప్రయోగింపబడినట్టి, అత్మయోనేః = బ్రహ్మయొక్క, అస్త్రబంధః = అస్త్రబంధము, మయా = నాచే, అనువర్తితవ్యః = అనుసరింప బడవలసినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'విమోక్షణే శక్తిః నాస్తి' – బ్రహ్మాస్త్రమునుండి విడిపించుకొనుటకు శక్తి లేదని హనుమ గ్రహించుకొనెను.

**గోవిందరాజీయము :–** బ్రహ్మాస్త్రము నుండి విడిపించుకొనుటకు హనుమకు శక్తి లేదని ఇంద్రజిత్తు తలచెను. మహేశ్వరతీర్థుల భావము గూడ నిదియే.

**తాత్పర్యము :–** పరమేష్ఠి యొక్క ప్రభావము వలన ఈ యస్త్రబంధమునకు వశము గాకుండ తప్పించుకొనుటకు నాకెంతమాత్రము శక్తిలేదని గ్రహించి హనుమ, ఇంద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రబంధనమునకు కట్టుబడి యుండవలెననియే తలచుకొనెను.

**శ్లో॥ స వీర్య మస్త్రస్య కపి ర్విచార్య**
**పితామహానుగ్రహ మాత్మనశ్చ ।**
**విమోక్షశక్తిం పరిచింతయిత్వా**
**పితామహాజ్ఞా మనువర్తతే స్మ ॥ 42**

**పదచ్ఛేదము :–** సః – వీర్యమ్ – అస్త్రస్య – కపిః – విచార్య – పితామహానుగ్రహమ్ – ఆత్మనః – చ – విమోక్షశక్తిం – పరిచింతయిత్వా, పితామహాజ్ఞామ్ – అనువర్తతే – స్మ ॥

**అన్వయక్రమము :–** సః కపిః అస్త్రస్య వీర్యం విచార్య, ఆత్మనః పితామహానుగ్రహం, విమోక్షశక్తిం చ పరిచింతయిత్వా పితామహాజ్ఞామ్ అనువర్తతే స్మ.

**ప్రతిపదార్థము :–** సః కపిః = ఆ హనుమ, అస్త్రస్య = బ్రహ్మాస్త్రముయొక్క, వీర్యం = సామర్థ్యమును, విచార్య = ఆలోచించి, ఆత్మనః = తనకు, పితామహానుగ్రహం = బ్రహ్మదేవుని అనుగ్రహమును, విమోక్షశక్తిం = విడిపించుకొనుటయందు శక్తిని, పరిచింతయిత్వా = చక్కగా ఆలోచించి, పితామహాజ్ఞాం = బ్రహ్మదేవుని ఆదేశమును, అనువర్తతే స్మ = అనుసరించుచుండెను.

**తాత్పర్యము :–** అప్పుడా హనుమ బ్రహ్మాస్త్రమునకు గల మహామహిమను గుర్తించుచు తనపై బ్రహ్మదేవునికి గల అనుగ్రహమును గూర్చియు ఆయన అనుగ్రహముచే తనకు అల్పకాలములో గలుగు విమోక్షణమును గూర్చియు బాగుగా తెలిసికొని తత్కాలోచితముగా బ్రహ్మదేవుని ఆదేశము ననుసరించి ఆ యస్త్రబంధనమునకు కట్టుబడియుండెను.

**శ్లో॥ అస్త్రేణాపి హి బద్ధస్య భయం మమ న జాయతే ।**
**పితామహమహేంద్రాభ్యాం రక్షిత స్యానిలేన చ ॥ 43**

**పదచ్ఛేదము :–** అస్త్రేణ – అపి – హి – బద్ధస్య – భయం – మమ – న – జాయతే – పితామహమహేంద్రాభ్యాం – రక్షితస్య – అనిలేన – చ ॥

**అన్వయక్రమము :–** పితామహమహేంద్రాభ్యాం అనిలేన చ రక్షితస్య మమ, అస్త్రేణ బద్ధస్య (సతః) అపి భయం న జాయతే హి.

**ప్రతిపదార్థము :–** పితామహమహేంద్రాభ్యాం = బ్రహ్మచేతను, దేవేంద్రునిచేతను, అనిలేన చ = వాయువుచేతను, రక్షితస్య = రక్షింపబడినట్టి, మమ = నాకు, అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచే, బద్ధస్య సతః అపి = బంధింపబడినవాడ నైనప్పటికిని, భయం = భీతి, న జాయతే హి = కలుగుటలేదుగదా!

**తాత్పర్యము :–** బ్రహ్మదేవుడును, దేవేంద్రుడును, నా తండ్రి వాయుదేవుడును నన్ను కాపాడుచుండుటచే బ్రహ్మాస్త్రము నన్ను బంధించినను నా మనస్సున ఏమియు భయము జనించుట లేదు.

**శ్లో॥ గ్రహణే చాపి రక్షోభి ర్మహాన్మే గుణదర్శనః ।**
**రాక్షసేంద్రేణ సంవాద స్తస్మాద్గృహ్ణంతు మాం పరే ॥ 44**

**పదచ్ఛేదము :**– గ్రహణే – చ – అపి – రక్షోభిః – మహాన్ – మే – గుణదర్శనః – రాక్షసేంద్రేణ – సంవాదః – తస్మాత్ – గృహ్ణంతు – మాం – పరే ॥

**అన్వయక్రమము :**– రక్షోభిః గ్రహణే అపి మే మహాన్ గుణదర్శనః రాక్షసేంద్రేణ సంవాదః (సిధ్యతి) తస్మాత్ మాం పరే గృహ్ణంతు.

**ప్రతిపదార్థము :**– రక్షోభిః = రాక్షసులచే, గ్రహణే అపి = పట్టుకొని పోబడుటయందు గూడ, మే = నాకు, మహాన్ = గొప్పదైన, గుణదర్శనః = గుణము జూపునట్టి, రాక్షసేంద్రేణ = రాక్షసాధిపతియైన రావణునితో, సంవాదః = సంభాషణము, సిధ్యతి = కలుగును, తస్మాత్ = అందువలన, మాం = నన్ను, పరే = శత్రువులు, గృహ్ణంతు = పట్టుకొందురుగాక.

**తాత్పర్యము :**– నన్ను రాక్షసులు పట్టుకొని తీసికొని పోయినప్పటికినికూడ గొప్ప ఉపయోగమే గానవచ్చుచున్నది. ఈ విధముగా నాకు రాక్షసరాజుతో సంభాషించు అవకాశము కల్గును. కావున అదియు నొక మేలే. అందుచే నన్నీ శత్రుభటులు బంధించి స్వేచ్ఛగా గొనిపోవుదురుగాక.

**శ్లో॥ స నిశ్చితార్థః పరవీరహంతా**
**సమీక్ష్యకారీ వినివృత్తచేష్టః ।**
**పరైః ప్రసహ్యాభిగతై ర్నిగృహ్య**
**ననాద తైస్తైః పరిభర్త్స్యమానః ॥ 45**

**పదచ్ఛేదము :**– సః – నిశ్చితార్థః – పరవీరహంతా – సమీక్ష్యకారీ – వినివృత్తచేష్టః – పరైః – ప్రసహ్య – అభిగతైః – నిగృహ్య – ననాద – తైః – తైః – పరిభర్త్స్యమానః ॥

**అన్వయక్రమము :**– పరవీరహంతా, సమీక్ష్యకారీ సః నిశ్చితార్థః, వినివృత్తచేష్టః, అభిగతైః పరైః ప్రసహ్య నిగృహ్య తైః తైః పరిభర్త్స్యమానః ననాద.

**ప్రతిపదార్థము :**– పరవీరహంతా = శత్రువీరులను పరిమార్చువాడును, సమీక్ష్యకారీ = చక్కగా ఆలోచించి పనిచేయువాడునగు, సః = ఆ హనుమ, నిశ్చితార్థః = నిశ్చయించుకొన్న కృత్యముగలవాడై, వినివృత్తచేష్టః = తొలగిన చేష్టలుగలవాడై, అభిగతైః = చుట్టునుచేరినట్టి, పరైః = శత్రువులైనట్టి, తైః తైః = ఆయా రక్కసులచే, ప్రసహ్య = బలవంతముగా, నిగృహ్య = పట్టుకొని, పరిభర్త్స్యమానః = మిక్కిలిగ పీడింప

బడుచున్నవాడై, ననాద = అఱచెను.

**తాత్పర్యము** :- కోరినచో శత్రువీరులను క్షణములో తుదముట్టింప గలవాడును, చక్కగా ఆలోచించి పనిచేయగలవాడునగు ఆ హనుమ తన కర్తవ్యమునుగూర్చి చక్కగా నిశ్చయించుకొని ఆ సమయమునందు అన్ని చేష్టలను ఉడిగి శత్రుభటులు తనను బలవంతముగా కట్టివేసి హింసించుచుండగా భయముచేవలెనే పెద్దగా ఆక్రోశించు చుండెను.

**శ్లో॥ తత స్తం రాక్షసా దృష్ట్వా నిర్విచేష్ట మరిందమమ్ ।**
**బబంధు శ్శణవల్కైశ్చ ద్రుమచీరైశ్చ సంహతైః ॥ 46**

**పదచ్ఛేదము** :- తతః - తం - రాక్షసాః - దృష్ట్వా - నిర్విచేష్టమ్ - అరిందమమ్, బబంధుః - శణవల్కైః - చ - ద్రుమచీరైః - చ - సంహతైః ॥

**అన్వయక్రమము** :- తతః రాక్షసాః అరిందమం తం నిర్విచేష్టం దృష్ట్వా సంహతైః శణవల్కైః చ ద్రుమచీరైః చ బబంధుః.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, రాక్షసాః = రక్కసులు, అరిందమం = శత్రుమర్దనుడైన, తం = ఆ హనుమను, నిర్విచేష్టం = కదలికలేనివానినిగా, దృష్ట్వా = చూచి, (సంహతైః = పేనినట్టి) శణవల్కైః చ = జనపనారలతోడను, ద్రుమచీరైః చ = వల్కలములతోడను, బబంధుః = బంధించిరి.

**తాత్పర్యము** :- అప్పుడంతవఱకును శత్రుభయంకరుడుగా నుండిన హనుమ ఎట్టి చేష్టలును లేక తమకు లొంగి యుండుటను జూచి ఆ రక్కసులు వెనువెంటనే చక్కగా పేనినట్టి జనపనారత్రాళ్ళతోడను వల్కములతోడను బంధింపసాగిరి.

**శ్లో॥ స రోచయామాస పరైశ్చ బంధనం**
**ప్రసహ్య వీరై రభిగర్హణం చ ।**
**కౌతూహలాన్మాం యది రాక్షసేంద్రో**
**ద్రష్టుం వ్యవస్యేదితి నిశ్చితార్థః ॥ 47**

**పదచ్ఛేదము** :- సః - రోచయామాస - పరైః - చ - బంధనం - ప్రసహ్య - వీరైః - అభిగర్హణం - చ, కౌతూహలాత్ - మాం - యది - రాక్షసేంద్రః - ద్రష్టుం - వ్యవస్యేత్ - ఇతి - నిశ్చితార్థః ॥

**అన్వయక్రమము** :- రాక్షసేంద్రః కౌతూహలాత్ యది మాం ద్రష్టుం వ్యవసేత్ ఇతి నిశ్చితార్థః (సన్) సః పరైః ప్రసహ్య బంధనం చ వీరైః అభిగర్హణం చ రోచయామాస.

**ప్రతిపదార్థము** :- రాక్షసేంద్రః = రాక్షసరాజైన రావణుడు, కౌతూహలాత్ = కుతూహలమువలన, మాం = నన్ను, ద్రష్టుం = చూచుటకు, వ్యవస్యేత్ యది = యత్నించునేమో, ఇతి = అని, నిశ్చితార్థః = నిశ్చయించబడిన ప్రయోజనముగలవాడై, పరైః = శత్రువులచే, ప్రసహ్య = బలవంతముగ, బంధనం = బంధింపబడుటను, వీరైః = రాక్షసవీరులచే, అభిగర్హణం చ = దూషణమును, రోచయామాస = ఇష్టపడు చుండెను.

**తాత్పర్యము** :- రాక్షసరాజైన రావణుడు కుతూహలముగలవాడై ఒకవేళ తనను చూడవలెనని నిశ్చయించుకొనవచ్చును గదా యను దృఢమైన అభిప్రాయముతో హనుమ శత్రువీరులును భటులును తనను బంధించుచున్నను దూషించుచున్నను గూడ ఇష్టపడి ఊరకుండెను.

**శ్లో॥ స బద్ధ స్తేన వల్కేన విముక్తో ఽ స్త్రేణ వీర్యవాన్ ।**
**అస్త్రబంధ స్స చాన్యం హి న బంధ మనువర్తతే ॥ 48**

**పదచ్ఛేదము** :- సః - బద్ధః - తేన - వల్కేన - విముక్తః - అస్త్రేణ - వీర్యవాన్ అస్త్రబంధః - సః - చ - అన్యం - హి - న - బంధమ్ - అనువర్తతే ॥

**అన్వయక్రమము** :- తేన వల్కేన బద్ధః వీర్యవాన్ సః తేన అస్త్రేణ విముక్తః (అభవత్) సః అస్త్రబంధః అన్యం బంధం న అనువర్తతే హి.

**ప్రతిపదార్థము** :- తేన వల్కేన = ఆ వల్కలముతో, బద్ధః = కట్టబడినట్టి, వీర్యవాన్ = ఆ పరాక్రమశాలి, అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచే, విముక్తః = విడువబడినవాడు, (అభవత్ = అయెను) సః అస్త్రబంధః = ఆ బ్రహ్మాస్త్రబంధనము, అన్యం బంధం = వేఱు బంధనమును, న అనువర్తతే హి = అనుసరించదు గదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- అస్త్రబంధ మనగా మంత్రముచే బంధనము. మంత్రముచే బద్ధమైనది ఇతర బంధనములను వేనిని సహించదు. అప్పుడు ఆ మంత్రబంధనము తనయొక్క పట్టును విడుచునని భావము.

**వాసుదాసస్వామి** :- రాక్షసులు బ్రహ్మాస్త్రబంధనబలమునందు విశ్వాసములేనివారై జనపనారత్రాళ్ళతో హనుమను కట్టగనే యా అవమానము సహింపలేక అస్త్రబంధము ఊడిపోయెను. అట్లే ప్రపత్తి చేసినవాడు దానియందు విశ్వాసములేక దానికి సహాయమని వేఱొక సాధనమును గ్రహించెనేని ప్రపత్తి చెడును. ప్రపత్తియందుండు అపాయమిదియే! ఉత్తములు నీచసహవాసమును సహింపలేరుగదా!

**తాత్పర్యము :-** పరాక్రమశాలియైన హనుమ జనపనార త్రాళ్లచే అట్లు బంధింప బడినంతనే బ్రహ్మాస్త్రబంధనము నుండి విముక్తుడై పోయెను. మంత్రపూరితమైనట్టి దివ్యాస్త్రబంధనము వేఱు లౌకికబంధనమును సహింపక తాను స్వయముగనే తన పట్టును వదలివేయునుగదా!

**శ్లో॥ అ థేంద్రజిత్తు ద్రుమచీరబద్ధం**
**విచార్య వీరః కపిసత్తమం తమ్ ।**
**విముక్త మస్త్రేణ జగామ చింతాం**
**నాన్యేన బద్ధో హ్యనువర్తతేఽస్త్రమ్ ॥ 49**

**పదచ్ఛేదము :-** అథ - ఇంద్రజిత్ - తు - ద్రుమచీరబద్ధం, విచార్య - వీరః - కపిసత్తమం - తమ్, విముక్తమ్ - అస్త్రేణ - జగామ - చింతాం, న - అన్యేన - బద్ధః - అనువర్తతే - అస్త్రమ్ ॥

**అన్వయక్రమము :-** అథ వీరః ఇంద్రజిత్ ద్రుమచీరబద్ధం తం కపిసత్తమమ్ అస్త్రేణ విముక్తం విచార్య, అన్యేన బద్ధః (అయం) అస్త్రం న అనువర్తతే హి (ఇతి) చింతాం జగామ.

**ప్రతిపదార్థము :-** అథ = పిమ్మట, వీరః = వీరుడైన, ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు, ద్రుమచీరబద్ధం = వృక్షచర్మముచే కట్టబడిన, తం కపిసత్తమం = వానరశ్రేష్ఠుని, అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచే, విముక్తం = విడువబడినవానినిగా, విచార్య = గ్రహించి, అన్యేన = ఇతరమైనదానిచే, బద్ధః = బంధింపబడిన, (అయం = ఈతడు) అస్త్రం = బ్రహ్మాస్త్రమును, న అనువర్తతే = అనుసరింపడు, (ఇతి = అని) చింతాం = విచారమును, జగామ = పొందెను.

**తాత్పర్యము :-** అప్పుడు వీరుడైన ఇంద్రజిత్తు వల్కలములచే బంధింపబడిన హనుమను జూచి ఈతడు బ్రహ్మాస్త్రము నుండి విముక్తుడై పోయెనని గ్రహించి వేఱుబంధనములచే కట్టుబడిన బ్రహ్మాస్త్రమునకు కట్టుబడియుండవలసిన పనిలేదు గదా యని చింతా నిమగ్నుడయ్యెను.

**శ్లో॥ అహో! మహా త్కర్మ కృతం నిరర్థకం**
**న రాక్షసై ర్మంత్రగతి ర్విమృష్టా ।**
**పునశ్చ నాస్త్రే విహతే ఽస్త్ర మన్య**
**త్ప్రవర్తతే సంశయితా స్స్మ సర్వే ॥ 50**

**పదచ్ఛేదము :–** అహో – మహత్ – కర్మ – కృతం – నిరర్థకం – న – రాక్షసైః – మంత్రగతిః – విమృష్టా, పునః – చ – న – అస్త్రే – విహతే – అస్త్రమ్ – అన్యత్ – ప్రవర్తతే – సంశయితాః – స్మ – సర్వే ॥

**అన్వయక్రమము :–** అహో! మహత్ కర్మ నిరర్థకం కృతం, రాక్షసైః మంత్రగతిః న విమృష్టా, అస్త్రే విహతే పునః చ అన్యత్ అస్త్రం న ప్రవర్తతే; సర్వే సంశయితాః స్మ (ఇతి చింతాం జగామ).

**ప్రతిపదార్థము :–** అహో = ఆహా; మహత్ = గొప్పదైనట్టి, కర్మ = కార్యము, నిరర్థకం = నిష్ఫలము, కృతం = చేయబడినది, రాక్షసైః = రాక్షసులచే, మంత్రగతిః = మంత్రముల విధానము, న విమృష్టా = విమర్శింపబడలేదు, అస్త్రే = బ్రహ్మాస్త్రము, విహతే = చెడగొట్టబడగా, అన్యత్ అస్త్రం = వేఱొక అస్త్రము, న ప్రవర్తతే = పనిచేయదు, సర్వే = అందరమును, నంశయితాః = సందిగ్ధస్థితి నొందినవారము, స్మ = అయితిమి, (ఇతి = అని, చింతాం = విచారమును, జగామ = పొందెను).

**తాత్పర్యము :–** ఆహా! మహాప్రభావముగల నా బ్రహ్మాస్త్రప్రయోగము నిష్ఫలము చేయబడినదిగదా! ఈ రాక్షసులు మంత్రప్రభావమును గూర్చి సరిగా ఆలోచింపలేక పోయిరి. ప్రయోగించిన బ్రహ్మాస్త్రము కారణాంతరములచే విఫలమైనప్పుడు ఇంకొక మా రా బ్రహ్మాస్త్రమును ప్రయోగించుటకు వీలులేదు. అందుచే గొప్ప జయమును సాధించినప్పటికిని మేము తిరిగి సందిగ్ధస్థితిలో పడిపోయితిమిగదా!

**శ్లో॥ అస్త్రేణ హనుమా న్ముక్తో నాత్మాన మవబుధ్యత ।**
**కృష్యమాణ స్తు రక్షోభి స్తైశ్చ బంధై ర్నిపీడితః ॥ 51**

**పదచ్ఛేదము :–** అస్త్రేణ – హనుమాన్ – ముక్తః – న – ఆత్మానమ్ – అవబుధ్యత – కృష్యమాణః – తు – రక్షోభిః – తైః – చ – బంధైః – నిపీడితః ॥

**అన్వయక్రమము :–** అస్త్రేణ ముక్తః హనుమాన్ ఆత్మానం న అవబుధ్యత; రక్షోభిః కృష్యమాణః (సన్) తైః బంధైః చ నిపీడితః (అభవత్).

**ప్రతిపదార్థము :–** అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచే, ముక్తః = విడువబడిన, హనుమాన్ = హనుమ, ఆత్మానం = తనను, న అవబుధ్యత = వెల్లడికానీయలేదు, రక్షోభిః = రాక్షసులచే, కృష్యమాణః (సన్) = లాగబడుచున్నవాడై, తైః బంధైః చ = ఆ బంధనములచే కూడ, నిపీడితః = హింసింపబడినవాడు, అభవత్ = ఆయెను.

**సూచన :–** 'హనుమాన్ముక్తో నాత్మానమవబుధ్యతే' అను తన పాఠముతో తిలక వ్యాఖ్యాత 'అవబుధ్యతే' అని క్రియాపదమునకు 'న అవబోధయతి, న ప్రకాశయతి' అని యర్థము

చెప్పవలెను. అని సమర్థించియున్నాడు. కొందఱు వ్యాఖ్యానకారులు మాత్రము తనకు ఆ ఎఱుక లేకుండగనే హనుమ రాక్షసులచే పీడింపబడెనని యథాతథముగా అర్థము చెప్పిరి.

**తాత్పర్యము** :- బ్రహ్మాస్త్రముచే విడువబడిన హనుమ ఆ విషయము పరులకు తెలియనీయక దానిచే బద్ధుడైయున్నట్లే వారికి గాన్పించుచుండెను. అందుచే ఆ యా బంధములతో వారాతనిని హింసించుచు ఈడ్చుకొని పోవుచుండినను హనుమ ఆ పీడను సహించుచు యుండెను.

**శ్లో॥ హన్యమాన స్తతః క్రూరై రాక్షసైః కాష్ఠముష్టిభిః ।**
**సమీపం రాక్షసేంద్రస్య ప్రాకృష్యత స వానరః ॥ 52**

**పదచ్ఛేదము** :- హన్యమానః - తతః - క్రూరైః - రాక్షసైః - కాష్ఠముష్టిభిః - సమీపం - రాక్షసేంద్రస్య - ప్రాకృష్యత - సః - వానరః ॥

**అన్వయక్రమము** :- తతః క్రూరైః రాక్షసైః కాష్ఠముష్టిభిః హన్యమానః సః వానరః రాక్షసేంద్రస్య సమీపం ప్రాకృష్యత.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, సః వానరః = ఆ హనుమ, క్రూరైః = క్రూరులైన, రాక్షసైః = రాక్షసులచే, కాష్ఠముష్టిభిః = కఱ్ఱలతోడను పిడికిళ్ళతోడను, హన్యమానః = కొట్టబడుచున్నవాడై, రాక్షసేంద్రస్య = రాక్షసరాజైన రావణునియొక్క, సమీపం = సన్నిధిని గూర్చి, ప్రాకృష్యత = ఈడ్వబడెను.

**తాత్పర్యము** :- దుర్మార్గులైన ఆ రాక్షసులు హనుమను కఱ్ఱలతో కొట్టుచు పిడికిళ్ళతో పొడుచుచు రావణుని సమీపమునకు లాగుకొని పోయిరి.

**శ్లో॥ అ థేంద్రజిత్తం ప్రసమీక్ష్య ముక్త**
**మస్త్రేణ బద్ధం ద్రుమచీరసూత్రైః ।**
**వ్యదర్శయ త్తత్ర మహాబలం తం**
**హరిప్రవీరం సగణాయ రాజ్ఞే ॥ 53**

**పదచ్ఛేదము** :- అథ - ఇంద్రజిత్ - తం - ప్రసమీక్ష్య - ముక్తమ్ - అస్త్రేణ - బద్ధం - ద్రుమచీరసూత్రైః - వ్యదర్శయత్ - తత్ర - మహాబలం - తం - హరిప్రవీరం - సగణాయ - రాజ్ఞే ॥

**అన్వయక్రమము** :- అథ ఇంద్రజిత్ తమ్ అస్త్రేణ ముక్తం ప్రసమీక్ష్య ద్రుమచీర సూత్రైః బద్ధం తం మహాబలం హరిప్రవీరం తత్ర సగణాయ రాజ్ఞే వ్యదర్శయత్.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, ఇంద్రజిత్ = ఇంద్రజిత్తు, తం = ఆ హనుమను, అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచే, ముక్తం = విడువబడినవానినిగా, ప్రసమీక్ష్య = గ్రహించి, ద్రుమచీరసూత్రైః = వృక్షవల్కలముల త్రాళ్ళతో, బద్ధం తం = బంధింపబడియున్న, మహాబలం = మహాబలశాలియైన, తం హరిప్రవీరం = ఆ వానరవీరాగ్రేసరుని, తత్ర = ఆ కొలువునందు, సగణాయ = పరివారముతో గూడినట్టి, రాజ్ఞే = రాజయిన రావణునకు, వ్యదర్శయత్ = చూపించెను.

**తాత్పర్యము :–** అప్పుడు ఇంద్రజిత్తు హనుమను బ్రహ్మాస్త్రము విడిచియుండెనని గ్రహించియే నారతాళ్ళచే కట్టబడియున్న ఆ మహాబలాఢ్యుడైన వానరవీరుని తన పరివారముతో కొలువుదీరియున్న రావణునకు చూపించెను.

**శ్లో॥ తం మత్తమివ మాతంగం బద్ధం కపివరోత్తమమ్ ।**
**రాక్షసా రాక్షసేంద్రాయ రావణాయ న్యవేదయన్ ॥ 54**

**పదచ్ఛేదము :–** తం – మత్తమ్ – ఇవ – మాతంగం – బద్ధం – కపివరోత్తమం – రాక్షసాః – రాక్షసేంద్రాయ – రావణాయ – న్యవేదయన్ ॥

**అన్వయక్రమము :–** రాక్షసాః బద్ధం మత్తం మాతంగమ్ ఇవ (స్థితం) తం కపివరోత్తమం రాక్షసేంద్రాయ రావణాయ న్యవేదయన్.

**ప్రతిపదార్థము :–** రాక్షసాః = రాక్షసులు, బద్ధం = బంధింపబడియున్న, మత్తం = మదించిన, మాతంగం = ఏనుగువలె, (స్థితం = ఉన్నట్టి) తం కపివరోత్తమం = ఆ వానరోత్తముని, రాక్షసేంద్రాయ = రాక్షసరాజైన, రావణాయ = రావణునకు, న్యవేదయన్ = నివేదించిరి.

**తాత్పర్యము :–** అప్పుడు ఆ రాక్షసులు బంధించి తెచ్చిన మత్తగజమువలె నున్నట్టి ఆ వానరవీరుని రాక్షసరాజైన రావణునకు చూపిరి.

**శ్లో॥ కోఽయం కస్య కుతో వాత్ర కిం కార్యం కో వ్యపాశ్రయః ।**
**ఇతి రాక్షసవీరాణాం తత్ర సంజజ్ఞిరే కథాః ॥ 55**

**పదచ్ఛేదము :–** కః – అయం – కస్య – కుతః – వా – అత్ర – కిం – కార్యం – కః – వ్యపాశ్రయః – ఇతి – రాక్షసవీరాణాం – తత్ర – సంజజ్ఞిరే – కథాః ॥

**అన్వయక్రమము :–** అయం కః? కస్య వా (సుతః)? కుతః (ఆగతః) ? అత్ర కిం కార్యమ్? (అస్య) కః వ్యపాశ్రయః? ఇతి తత్ర రాక్షసవీరాణాం కథాః సంజజ్ఞిరే.

**ప్రతిపదార్థము :–** అయం = ఈతడు, కః = ఎవడు? కస్య వా = ఎవనియొక్క,

(సుతః = పుత్రుడు)? కుతః = ఎచ్చటినుండి, (ఆగతః = వచ్చినాడు) ? అత్ర = ఇచ్చట, కిం కార్యమ్ = ఏమిపని? (అస్య = వీనికి) కః = ఎవ్వడు, వ్యపాశ్రయః = ఆశ్రయము, ఇతి = అని, తత్ర = ఆ కొలువునందు, రాక్షసానాం = రాక్షసులలో, కథాః = ప్రసంగములు, సంజజ్ఞిరే = కలిగినవి.

**తాత్పర్యము :–** ఈత డెవ్వడు; ఎవ్వని పుత్రుడై యుండును? ఎచ్చటనుండి వచ్చినాడు? ఇచ్చట అతనికి గల పనియేమి? ఈత డెవ్వని ఆశ్రయమున నున్నట్టివాడు? అనుచు ఆ రావణుని కొలువునందు ఆ రాక్షసులు పరస్పరము ప్రశ్నించుకొనదొడగిరి.

**శ్లో॥ హన్యతాం దహ్యతాం వాపి భక్ష్యతా మితి చాపరే ।**
**రాక్షసా స్తత్ర సంక్రుద్ధాః పరస్పర మ థాబ్రువన్ ॥ 56**

**పదచ్ఛేదము :–** హన్యతాం – దహ్యతాం – వా – అపి – భక్ష్యతాం – ఇతి – చ – అపరే, రాక్షసాః – తత్ర – సంక్రుద్ధాః – పరస్పరమ్ – అథ – అబ్రువన్ ॥

**అన్వయక్రమము :–** అథ తత్ర రాక్షసాః సంక్రుద్ధాః (సంతః) (అయం) హన్యతాం, దహ్యతామితి, అపరే భక్ష్యతాం ఇతి చ పరస్పరం అబ్రువన్.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, తత్ర = ఆ కొలువునందు, రాక్షసాః = రాక్షసులు, సంకృద్ధాః (సంతః) = మిక్కిలి క్రోధము నొందినవారై, అయం = ఈ వానరుడు, హన్యతాం = చంపబడుగాక! దహ్యతాం = కాల్చబడుగాక, ఇతి = అనియు, అపరే = మఱికొంత మంది, భక్ష్యతాం = భక్షింపబడుగాక! ఇతి చ = అనియును, పరస్పరమ్ = తమలో తాము, అబ్రువన్ = పలుకుచుండిరి.

**తాత్పర్యము :–** ఆ రావణుని కొలువునందు అప్పుడు క్రోధావిష్టులైన రాక్షసులు హనుమను జూచుచు ఈ వానరుని చంపివేయుడని కొందఱును, కాల్చివేయుడని కొందఱును, తినివేయుదమని మఱికొందఱును తమలో తాము అఱవసాగిరి.

**శ్లో॥ అతీత్య మార్గం సహసా మహాత్మా**
**స తత్ర రక్షోధిపపాదమూలే ।**
**దదర్శ రాజ్ఞః పరిచారవృద్ధాన్**
**గృహం మహారత్నవిభూషితం చ ॥ 57**

**పదచ్ఛేదము :–** అతీత్య – మార్గం – సహసా – మహాత్మా – సః – తత్ర – రక్షోధిప పాదమూలే, దదర్శ – రాజ్ఞః – పరిచారవృద్ధాన్, గృహం – మహారత్నవిభూషితం – చ ॥

**అన్వయక్రమము** :- మహాత్మా సః మార్గం సహసా అతీత్య తత్ర రక్షోధిపపాదమూలే పరిచారవృద్ధాన్, మహారత్నవిభూషితం రాజ్ఞః గృహం చ దదర్శ.

**ప్రతిపదార్థము** :- మహాత్మా = మహనీయుడైన, సః = ఆ హనుమ, సహసా = తొందరగా, మార్గం = బాటను, అతీత్య = కడచి, తత్ర = అచ్చట, రక్షోధిపపాదమూలే = రాక్షసరాజుయొక్క చరణసమీపమున, పరిచారవృద్ధాన్ = పరిచారకులైన వృద్ధులను, మహారత్నవిభూషితం = గొప్పవైన రత్నములతో అలంకరింపబడిన, రాజ్ఞః = రాజైన రావణునియొక్క, గృహం చ = గృహమునుగూడ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- మహాత్ముడైన హనుమంతుడప్పుడు త్వరలో మార్గము నతిక్రమించి రావణుని కొలువుచేరి అచ్చట అతని చరణసన్నిధిని పరిచర్యలు చేయుచున్న వృద్ధ రాక్షసులను, అనర్ఘరత్నకాంతులతో విరాజిల్లుచున్న ఆతని మందిరమును తిలకించెను.

**శ్లో॥ స దదర్శ మహాతేజా రావణః కపిసత్తమమ్ ।**
**రక్షోభిర్వికృతాకారైః కృష్యమాణ మితస్తతః ॥ 58**

**పదచ్ఛేదము** :- సః - దదర్శ - మహాతేజాః - రావణః - కపిసత్తమమ్ - రక్షోభిః - వికృతాకారైః - కృష్యమాణమ్ - ఇతః - తతః ॥

**అన్వయక్రమము** :- మహాతేజాః సః రావణః వికృతాకారైః రక్షోభిః ఇతః తతః కృష్యమాణం కపిసత్తమం దదర్శ.

**ప్రతిపదార్థము** :- మహాతేజాః = మహాతేజశ్శాలియగు, సః రావణః = ఆ రావణుడు, వికృతాకారైః = వికారములైన రూపములు గల్గినట్టి, రక్షోభిః = రక్కసులచే, ఇతః తతః = ఇటునటు, కృష్యమాణం = లాగబడుచున్న, కపిసత్తమం = వానరశ్రేష్ఠుని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- తేజశ్శాలియగు ఆ రావణుడు వికృతాకారులైన రక్కసులు ఇటునటు లాగుచుండగా తనవైపునకు వచ్చుచున్న ఆ వానరశ్రేష్ఠుని చూచెను.

**శ్లో॥ రాక్షసాధిపతిం చాపి దదర్శ కపిసత్తమః ।**
**తేజోబలసమాయుక్తం తపంతమివ భాస్కరమ్ ॥ 59**

**పదచ్ఛేదము** :- రాక్షసాధిపతిం - చ - అపి - దదర్శ - కపిసత్తమః - తేజోబల సమాయుక్తం - తపంతమ్ - ఇవ - భాస్కరమ్ ॥

**అన్వయక్రమము** :- కపిసత్తమః చ అపి తపంతం భాస్కరమ్ ఇవ (స్థితం) తేజోబల సమాయుక్తం రాక్షసాధిపతిం దదర్శ.

**ప్రతిపదార్థము :-** కపిసత్తమః చ అపి = వానరశ్రేష్ఠుడైన హనుమగూడ, తపంతం = జ్వలించుచున్న, భాస్కరమ్ ఇవ = సూర్యునివలె (స్థితం = ఉన్నట్టి), తేజోబలసమాయుక్తం = తేజస్సుతోడను బలముతోడను నిండియున్న, రాక్షసాధిపతిం = రాక్షసరాజైన రావణుని, దదర్శ = చూచెను.

**తాత్పర్యము :-** వానరోత్తముడైన హనుమయు తీక్ష్ణమైన కాంతులు వెడలగ్రక్కుచున్న సూర్యునివలె గొప్పతేజస్సుతోను, బలముతోను విరాజిల్లుచున్న రాక్షసచక్రవర్తి యగు రావణుని జూచెను.

**శ్లో॥ స రోషసంవర్తితతామ్రదృష్టి**
**ర్దశానన స్తం కపి మన్వవేక్ష్య ।**
**అథోపవిష్టా న్కులశీలవృద్ధా**
**న్సమాదిశ త్తం ప్రతి మంత్రిముఖ్యాన్ ॥ 60**

**పదచ్ఛేదము :-** సః - రోషసంవర్తితతామ్రదృష్టిః - దశాననః - తం - కపిమ్ - అన్వవేక్ష్య, అథ - ఉపవిష్టాన్ - కులశీలవృద్ధాన్ - సమాదిశత్ - తం - ప్రతి - మంత్రిముఖ్యాన్ ॥

**అన్వయక్రమము :-** అథ రోషసంవర్తితతామ్రదృష్టిః సః దశాననః తం కపిమ్ అన్వవేక్ష్య ఉపవిష్టాన్ కులశీలవృద్ధాన్ మంత్రిముఖ్యాన్ తం ప్రతి (జ్ఞాతుం) సమాదిశత్.

**ప్రతిపదార్థము :-** అథ = పిమ్మట, రోషసంవర్తితతామ్రదృష్టిః = క్రోధముచే త్రిప్పబడుచున్న ఎఱ్ఱనైన చూపులు గలవాడు అగు, సః దశాననః = ఆ దశముఖుడు, తం కపిం = ఆ వానరుని, అన్వవేక్ష్య = చూచి, ఉపవిష్టాన్ = కూర్చునియున్న, కులశీలవృద్ధాన్ = కులముచేతను శీలముచేతను పెద్దలైయున్నట్టి, మంత్రిముఖ్యాన్ = ముఖ్యులైన మంత్రులను, తం ప్రతి = ఆ హనుమను గూర్చి, (జ్ఞాతుం = తెలిసికొనుటకు), సమాదిశత్ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము :-** అప్పుడు తీవ్రమైన రోషముచే తన కనుగ్రుడ్లు సంభ్రమించుచుండగా క్రోధారుణమైన నేత్రములతో ఆ దశముఖుడు ఎదుటనున్న హనుమను జూచుచు సమీపమున ఉపవిష్టులైయున్న కులశీలవృద్ధులగు తన ముఖ్యమంత్రులను హనుమను గూర్చి వివరములు తెలిసికొనుడని ఆజ్ఞాపించెను.

**శ్లో॥ యథాక్రమం తై స్స కపి ర్విపృష్టః**
**కార్యార్థ మర్థస్య చ మూల మాదౌ ।**

నివేదయామాస హరీశ్వరస్య
దూత స్సకాశా దహమాగతోఽస్మి ॥ 61

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే ఆదికావ్యే సుందరకాండే*
*"ఇంద్రజిదభియోగో" నామ అష్టచత్వారింశస్సర్గః*

**పదచ్ఛేదము** :- యథాక్రమం – తైః – సః – కపిః – విపృష్టః – కార్యార్థమ్ – అర్థస్య – చ – మూలమ్ – ఆదౌ, నివేదయామాస – హరీశ్వరస్య – దూతః – సకాశాత్ – అహమ్ – అగతః – అస్మి ॥

**అన్వయక్రమము** :- సః కపిః తైః యథాక్రమం ఆదౌ కార్యార్థం అర్థస్య చ మూలం చ విపృష్టః, అహం హరీశ్వరస్య సకాశాత్ ఆగతః దూతః అస్మి (ఇతి) నివేదయామాస.

**ప్రతిపదార్థము** :- సః కపిః = ఆ హనుమ, తైః = ఆ మంత్రులచే, యథాక్రమం = క్రమముగా, ఆదౌ = మొదట, కార్యార్థం = కర్తవ్యమైన ప్రయోజనమును గూర్చియు, అర్థస్య చ = ప్రయోజనముయొక్క, మూలం చ = కారణమును గూర్చియు, విపృష్టః (సన్) = వివరముగ ప్రశ్నింపబడినవాడై, అహం = నేను, హరీశ్వరస్య = వానరరాజైన సుగ్రీవునియొక్క, సకాశాత్ = సమీపమునుండి, ఆగతః = వచ్చినట్టి, దూతః = దూతను, అస్మి = అగుచున్నాను, ఇతి = అని, నివేదయామాస = నివేదించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి** :- ఇది వ్యాసవాక్యమునకు ముందు సంగ్రహవాక్యమనియైన గ్రహింపవచ్చును లేక సభ్యులకిచ్చిన ప్రత్యుత్తరమనియైన దలపవచ్చును.

**తాత్పర్యము** :- అప్పుడా మంత్రులు హనుమను జూచి ఇచట నీవు తలపెట్టిన కృత్యమేమి? దానియొక్క ప్రయోజనమేమి? దానిని గూర్చి నిన్ను పంపిన ఆ మూల పురుషు డెవ్వడని వఱుసగా హనుమను వివరములు ప్రశ్నింపగా హనుమ తాను వానరరాజైన సుగ్రీవుని సన్నిధినుండి వచ్చినట్టి దూతనని వారికి తెలిపెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"ఇంద్రజిదభియోగము" అను*
*నలుబదియెనిమిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

★★★

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకోనపంచాశసర్గ

**శ్లో॥ తత స్స కర్మణా తస్య విస్మితో భీమవిక్రమః ।**
**హనుమాన్ రోషతామ్రాక్షో రక్షోధిప మవైక్షత ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – సః – కర్మణా – తస్య – విస్మితః – భీమవిక్రమః – హనుమాన్ – రోషతామ్రాక్షః – రక్షోధిపమ్ – అవైక్షత ॥

**అన్వయక్రమము :–** తతః భీమవిక్రమః సః హనుమాన్ తస్య కర్మణా విస్మితః రోషతామ్రాక్షః (సన్) రక్షోధిపమ్ అవైక్షత.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, భీమవిక్రమః = భయంకరమైన పరాక్రమము కల్గినట్టి, సః హనుమాన్ = ఆ హనుమ, తస్య = ఆ రావణునియొక్క, కర్మణా = కృత్యముచేత, విస్మితః = ఆశ్చర్యము నొందినవాడై, రోషతామ్రాక్షః (సన్) = క్రోధముచే ఎఱ్ఱనైన కన్నులు గలవాడునగుచు, రక్షోధిపం = రాక్షసరాజైన రావణుని, అవైక్షత = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'తస్య కర్మణా' రావణుని కృత్యముచేత అనిగాక ఇంద్రజిత్తు కృత్యముచేత యని చెప్పవలెను. రావణు డింతవఱకును తన యెడ ఎట్టి కృత్యమును చేయలేదు గదా యని కతకవ్యాఖ్యానము.

**రా.శిరోమణి :–** తస్య కర్మణా – యని రెండు మాఱులు గ్రహించవలెను. మొదట ఇంద్రజిత్తు కృత్యముచే హనుమ ఆశ్చర్యము నొందెను. రెండవది రావణుని సీతాపహరణ కృత్యముచే క్రోధతామ్రాక్షుడయ్యెను. అని ఇట్లు రెండుమాఱులు గ్రహించి అర్థము చెప్పవలెను.

**గోవిందరాజీయము; మహేశ్వరతీర్థులు :–** నాతో యుద్ధము చేయుటకై రావణుడు నాయొద్దకు రావలెనని నేను ప్రయత్నించితిని గాని రాజనీతివేత్తయైన రావణుడు, తన సింహాసనమునుండి కదలకుండగనే, ఇంద్రజిత్తుచే నన్ను బంధింపజేసి, తన

యొద్దకే నన్ను రప్పించుకొన్నాడని ఆతని కృత్యముచే, విస్మితుడయ్యెనని భావము.

**తాత్పర్యము** :- అటు పిమ్మట రావణుని కృత్యమునకు ఆశ్చర్యమునొందిన భీకర పరాక్రముడైన హనుమంతుడు అంతలోనే అతని దుష్టత్వమునకు మఱల క్రోధముచే కన్నులెఱ్ఱబాఱుచుండగా తీవ్రమైన చూపులతో రావణుని జూచెను.

**శ్లో॥ భ్రాజమానం మహార్హేణ కాంచనేన విరాజతా ।**
**ముక్తాజాలవృతే నాథ మకుటేన మహాద్యుతిమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :- భ్రాజమానం - మహార్హేణ - కాంచనేన - విరాజతా - ముక్తాజాలవృతేన - అథ - మకుటేన - మహాద్యుతిమ్ ॥

**అన్వయక్రమము** :- అథ మహార్హేణ కాంచనేన విరాజతా ముక్తాజాలవృతేన మకుటేన భ్రాజమానం మహాద్యుతిం రక్షోధిపమ్ అవైక్షత.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, మహార్హేణ = మిక్కిలి విలువైన, కాంచనేన = సువర్ణముతో, విరాజతా = ప్రకాశించుచున్నట్టి, ముక్తాజాలవృతేన = ముత్యాల జాలరులతో నిండిన, మకుటేన = కిరీటముతో, భ్రాజమానం = ప్రకాశించుచున్న వాడును, మహాద్యుతిం = గొప్పతేజస్సు కల్గియున్నవాడునగు, (రక్షోధిపం = రావణుని, అవైక్షత = చూచెను).

**తాత్పర్యము** :- ఆ రావణుడు మిక్కిలి శ్రేష్ఠమైన బంగారముతో నిర్మింపబడి తళతళ మెఱయు ముత్యాల జాలరులతో నిండిన కిరీటమును ధరించి గొప్పదైన తేజస్సుతో వెలుగొందుచుండెను.

**శ్లో॥ వజ్రసంయోగసంయుక్తై ర్మహార్హై ర్మణివిగ్రహైః ।**
**హైమై రాభరణై శ్చిత్రైర్మనసేవ ప్రకల్పితైః ॥ 3**

**పదచ్ఛేదము** :- వజ్రసంయోగ సంయుక్తైః - మహార్హైః - మణివిగ్రహైః - హైమైః - ఆభరణైః - చిత్రైః - మనసా - ఇవ - ప్రకల్పితైః ॥

**అన్వయక్రమము** :- వజ్రసంయోగసంయుక్తైః మహార్హైః మణివిగ్రహైః మనసా ప్రకల్పితైః ఇవ (స్థితైః) చిత్రైః హైమైః ఆభరణైః (భ్రాజమానం రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము** :- వజ్రసంయోగసంయుక్తైః = వజ్రముల సంధులతో గూడినవియును, మహార్హైః = మిక్కిలి విలువైనవియును, మణివిగ్రహైః = మణిరూపములు గల్గియున్నవి యును, మనసా = మనస్సుతో, ప్రకల్పితైః ఇవ (స్థితైః) = ఊహించి నిర్మింపబడినట్లు ఉన్నవియును, చిత్రైః = వివిధవర్ణములు గలవియునగు, హైమైః = సువర్ణమయములైన,

ఆభరణైః = భూషణములతో, (భ్రాజమానం = ప్రకాశించుచున్నట్టి, రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

**తాత్పర్యము** :– వజ్రములతో సంధించి నిర్మింపబడినవియును, అమూల్యములైన వియును, మణివిగ్రహములతో కూడినవియును, మనస్సుతో ఊహించినట్లుగనే నిర్మింపబడినవియునగు విచిత్రములైన వివిధవర్ణములుగల సువర్ణాభరణములతో వెలుగొందుచున్న ఆ రావణుని హనుమ చూచెను.

**శ్లో॥ మహార్హక్షౌమసంవీతం రక్తచందనరూషితమ్ ।**
**స్వనులిప్తం విచిత్రాభి ర్వివిధాభిశ్చ భక్తిభిః ॥ 4**

**పదచ్ఛేదము** :– మహార్హక్షౌమసంవీతం – రక్తచందనరూషితమ్ – స్వనులిప్తం – విచిత్రాభిః – వివిధాభిః – చ – భక్తిభిః ॥

**అన్వయక్రమము** :– మహార్హక్షౌమసంవీతం, రక్తచందనరూషితం, వివిధాభిః విచిత్రాభిః భక్తిభిః స్వనులిప్తం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము** :– మహార్హక్షౌమసంవీతం = అమూల్యములైన పట్టువస్త్రములను ధరించియున్న వాడును, రక్తచందనరూషితం = ఎఱ్ఱని గంధమును పూసుకొనియున్న వాడును, వివిధాభిః = బహువిధములైన, విచిత్రాభిః = విచిత్రములైన, భక్తిభిః = రేఖలతో, స్వనులిప్తం = చక్కగా పూయబడియున్న వాడునగు, (రక్షోధిపం = రావణుని, అవైక్షత = చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– భక్తిభిః = శైవులు ధరించు విభూత్యాది త్రిపుండ్రరేఖలవంటి రచనా విశేషములతో.

**తాత్పర్యము** :– ఆ రావణుడు అమూల్యములైన పట్టువస్త్రములను ధరించి ఒడలినిండ రక్తచందనమును పూసుకొన్నవాడై కస్తూరి మున్నగు పరిమళద్రవ్యములతో వివిధములగు విచిత్రములైన రేఖలను ఒడలినిండుగా ధరించి ప్రకాశించుచుండెను.

**శ్లో॥ వివృతైర్దర్శనీయైశ్చ రక్తాక్షైర్భీమదర్శనైః ।**
**దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః ప్రలంబదశనచ్ఛదైః ॥ 5**

**శ్లో॥ శిరోభిర్దశభి ర్వీరం భ్రాజమానం మహౌజసమ్ ।**
**నానావ్యాళసమాకీర్ణై శ్శిఖరైరివ మందరమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :– వివృతైః – దర్శనీయైః – చ – రక్తాక్షైః – భీమదర్శనైః – దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః – ప్రలంబదశనచ్ఛదైః – శిరోభిః – దశభిః – వీరం – భ్రాజమానం – మహౌజసమ్, నానావ్యాళసమాకీర్ణైః – శిఖరైః – ఇవ – మందరమ్ ॥

**అన్వయక్రమము** :– వివృతైః, దర్శనీయైః, రక్తాక్షైః చ, భీమదర్శనైః, దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః, ప్రలంబదశనచ్ఛదైః దశభిః శిరోభిః, నానావ్యాళసమాకీర్ణైః శిఖరైః మందరమ్ ఇవ భ్రాజమానం మహౌజసం వీరం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము** :– వివృతైః = తెరువబడినవియును, దర్శనీయైః = చూడదగినవియునగు, రక్తాక్షైః = ఎఱ్ఱని కన్నులుగలవియును, భీమదర్శనైః = భీకరమైన ఆకారము గలవియును, దీప్తతీక్ష్ణమహాదంష్ట్రైః = మిక్కిలి ప్రకాశించు వాడియైన కోఱలు గలవియును, ప్రలంబదశనచ్ఛదైః = వ్రేలాడుచున్న పెదవులుగలవియునగు, దశభిః శిరోభిః = పదితలలతో, నానావ్యాళసమాకీర్ణైః = బహువిధసర్పములతో నిండియున్న, శిఖరైః = శిఖరములతో, మందరమ్ ఇవ = మందరపర్వతమువలె, భ్రాజమానం = ప్రకాశించుచున్నట్టి, మహౌజసం = గొప్పప్రతాపము కల్గిన, (వీరం = వీరుడైన, రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'దశభిః శిరోభిః' – రావణుడు రణరంగమునందు వలెనే హనుమను కలసికొనినప్పుడు గూడ పదితలలుగల భీకరరూపమునే ధరించెనని గ్రాహ్యము.

**వాసుదాసస్వామి** :– రావణు డుత్తరరామాయణమున "అహం పౌలస్త్యతనయో దశగ్రీవశ్చ నామతః" యని తన పేరు దశగ్రీవుడనియే చెప్పుకొనెను. దీనివలన పదితలలు సహజములనియు కృత్రిమములు కావనియు తెలియుచున్నది.

ఛందత స్తవ రూపం చ మనసా యద్య దీప్సితమ్ ।
భవిష్యతి న సందేహో మద్వరాత్తవ రాక్షస! ॥

– ఉత్తర రామాయణము

రావణుడు కోరినప్పుడు కోరినరూపమెత్తు వరము బ్రహ్మ ఇచ్చెను. కావున తన ఇచ్ఛానుసారము పదితలలతోను ఒంటితలతోను ఉండగలడు.

**తాత్పర్యము** :– హనుమ చూచుచున్న ఆ రావణుడు బహువిధసర్పములతో నిండియున్న పెక్కు శిఖరములతో గూడిన మందరపర్వతమువలె, భయంకరములైన పదితలలతో తేజరిల్లుచుండెను. ఆతని శిరస్సులు పదియును గూడ చక్కగా తెరువబడి

చూడదగియున్నవై ఎఱ్ఱని కన్నులతోను, భయంకరములై మిక్కిలి వాడిగనున్న కోఱలతోను, వ్రేలాడుచున్నట్టి పెదవులతోను వెలుగొందుచుండెను.

**శ్లో॥ నీలాంజనచయప్రఖ్యం హారే ణోరసి రాజతా ।**
**పూర్ణచంద్రాభవక్త్రేణ సబలాకమివాంబుదమ్ ॥ 7**

**పదచ్ఛేదము :-** నీలాంజనచయప్రఖ్యం - హారేణ - ఉరసి - రాజతా, పూర్ణచంద్రాభ వక్త్రేణ - సబలాకమ్ - ఇవ - అంబుదమ్ ॥

**అన్వయక్రమము :-** పూర్ణచంద్రాభవక్త్రేణ ఉరసి రాజతా హారేణ సబలాకమ్ అంబుదమ్ ఇవ నీలాంజనచయప్రఖ్యం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము :-** పూర్ణచంద్రాభవక్త్రేణ = నిండుచంద్రుని బోలిన ముఖముతోడను, ఉరసి = ఱొమ్మునందు, రాజతా = ప్రకాశించుచున్న, హారేణ = ముత్యాలహారము తోడను, సబలాకం = బెగ్గురు పక్షులతో కూడిన, అంబుదమ్ ఇవ స్థితం = మేఘమువలె నున్నట్టి, నీలాంజనచయప్రఖ్యం = నల్లనికాటుకరాశివలె వెలయుచున్న, (రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** పూర్ణచంద్రాభవక్త్రేణ - అనునది 'హారేణ' యను పదమునకు విశేషణము.

ముత్యాలహారమునందలి ముఖస్థానీయమైన నాయకరత్నము చంద్రునివలె ప్రకాశించుచున్నదని అర్థము.

**తాత్పర్యము :-** వక్షమునందు ప్రకాశించుచున్న ముత్యాలహారముతోను, నిండు చంద్రునివలె ప్రకాశించుచున్న ముఖముతోను గూడి నల్లని రంగుతో కాటుకరాశి వలెనున్న ఆ రావణుడు బెగ్గురుపిట్టలబారులతో గూడియున్న నల్లని మేఘమువలె గానవచ్చుచుండెను.

**శ్లో॥ బాహుభి ర్బద్ధకేయూరై శ్చందనోత్తమరూషితైః ।**
**భ్రాజమానాంగదైః పీనైః పంచశీర్షైరివోరగైః ॥ 8**

**పదచ్ఛేదము :-** బాహుభిః - బద్ధకేయూరైః - చందనోత్తమరూషితైః - భ్రాజమానాంగదైః - పీనైః - పంచశీర్షైః - ఇవ - ఉరగైః ॥

**అన్వయక్రమము :-** చందనోత్తమరూషితైః, బద్ధకేయూరైః భ్రాజమానాంగదైః, పంచశీర్షైః

ఉరగైః ఇవ (స్థితైః) పీనైః బాహుభిః యుక్తం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము** :- చందనోత్తమరూషితైః = శ్రేష్ఠమైన మంచిగంధముచే పూయబడినవియును, బద్ధకేయూరైః = కేయూరములతో కూర్పబడినవియును, భ్రాజమానాంగదైః = ప్రకాశించుచున్న భుజకీర్తులుగల్గినవియును, పంచశీర్షైః = ఐదుతలలు గల్గినట్టి, ఉరగైః ఇవ = సర్పములవలె, (స్థితైః = ఉన్నట్టివియును) పీనైః = బలిష్ఠములైనవియును అగు, బాహుభిః = భుజములతో, యుక్తం = కూడిన, (రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

**తాత్పర్యము** :- ఆ రావణాసురుని భుజములు మంచిగంధముతో చక్కగా పూయబడి సుందరమైన పనితనముగల బాహుపురులతో ప్రకాశించుచు మిక్కిలి బలిసియున్నవై ఐదుతలలతో కూడిన మహాసర్పములవలె ఒప్పుచుండెను.

**శ్లో॥ మహతి స్ఫాటికే చిత్రే రత్నసంయోగసంస్కృతే ।**
**ఉత్తమాస్తరణాస్తీర్ణే సూపవిష్టం వరాసనే ॥ 9**

**పదచ్ఛేదము** :- మహతి - స్ఫాటికే - చిత్రే - రత్నసంయోగసంస్కృతే - ఉత్తమాస్తరణా స్తీర్ణే - సూపవిష్టం - వరాసనే ॥

**అన్వయక్రమము** :- స్ఫాటికే, చిత్రరత్నసంయోగసంస్కృతే ఉత్తమాస్తరణాస్తీర్ణే, మహతి వరాసనే సూపవిష్టం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము** :- స్ఫాటికే = స్ఫటికములతో నిర్మింపబడినదియును, చిత్రే = వివిధ వర్ణములు గల్గియున్నదియును, రత్నసంయోగసంస్కృతే = రత్నములయొక్క సంయోజనముతో అలంకరింపబడినదియును, ఉత్తమాస్తరణాస్తీర్ణే = మంచిదైన కంబళిచే పఱవబడియున్నదియునునగు, మహతి వరాసనే = గొప్పదైన సింహాసనముపై, సూపవిష్టం = చక్కగా కూర్చుండియున్న, (రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

**తాత్పర్యము** :- ఆ రావణుడు స్ఫటికమణులతో నిర్మింపబడి రంగురంగుల వివిధ మణుల కూర్పులతో అలంకరింపబడి శ్రేష్ఠమైన కంబళితో గూడియున్న గొప్పదైన సింహాసనముపై మిక్కిలి ఠీవిగ కూర్చుండియుండెను.

**శ్లో॥ అలంకృతాభి రత్యర్థం ప్రమదాభి స్సమంతతః ।**
**వాలవ్యజనహస్తాభి రారాత్సముపసేవితమ్ ॥ 10**

**పదచ్ఛేదము** :- అలంకృతాభిః - అత్యర్థం - ప్రమదాభిః - సమంతతః -

వాలవ్యజనహస్తాభిః – ఆరాత్ – సముపసేవితమ్ ॥

**అన్వయక్రమము :–** అత్యర్థమ్ అలంకృతాభిః వాలవ్యజనహస్తాభిః ప్రమదాభిః ఆరాత్ సమంతతః సముపసేవితం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము :–** అత్యర్థం = మిక్కిలిగా, అలంకృతాభిః = అలంకరణము చేసికొనబడినట్టి, వాలవ్యజనహస్తాభిః = వింజామరలు చేతియందు కలిగినట్టి, ప్రమదాభిః = యువతులచే, ఆరాత్ = దగ్గరగా, సమంతతః = చుట్టునునుండి, సముపసేవితం = చక్కగా సేవింపబడుచున్నట్టి, (రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

**తాత్పర్యము :–** ఆ రావణునికి చుట్టును దగ్గరగ నిలచి చక్కగ నలంకరించుకొనియున్న విలాసినీజనము వింజామరలు చేత ధరించి ఆతనిని ఆసక్తితో సేవించుచుండిరి.

**శ్లో॥ దుర్ధరేణ ప్రహస్తేన మహాపార్శ్వేన రక్షసా ।**
**మంత్రిభి ర్మంత్రతత్త్వజ్ఞైర్నికుంభేన చ మంత్రిణా ॥ 11**

**శ్లో॥ ఉపోపవిష్టం రక్షోభి శ్చతుర్భి ర్బలదర్పితైః ।**
**కృత్స్నం పరివృతం లోకం చతుర్భిరివ సాగరైః ॥ 12**

**పదచ్ఛేదము :–** దుర్ధరేణ – ప్రహస్తేన – మహాపార్శ్వేన – రక్షసా – మంత్రిభిః – మంత్రతత్త్వజ్ఞైః – నికుంభేన – చ – రక్షసా – ఉపోపవిష్టం – రక్షోభిః – చతుర్భిః – బలదర్పితైః – కృత్స్నం – పరివృతం – లోకం – చతుర్భిః – ఇవ – సాగరైః ॥

**అన్వయక్రమము :–** మంత్రతత్త్వజ్ఞైః, బలదర్పితైః, చతుర్భిః రక్షోభిః మంత్రిభిః దుర్ధరేణ, ప్రహస్తేన, రక్షసా మహాపార్శ్వేన, మంత్రిణా నికుంభేన చ, చతుర్భిః సాగరైః పరివృతం కృత్స్నం లోకమ్ ఇవ ఉపోపవిష్టం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము :–** మంత్రతత్త్వజ్ఞైః = ఆలోచనాతత్త్వము తెలిసినట్టివారును, బలదర్పితైః = బలముచే గర్వించియున్నవారునగు, చతుర్భిః = నలుగురైన, రక్షోభిః మంత్రిభిః = రాక్షసమంత్రులయినట్టి, దుర్ధరేణ = దుర్ధరుడనువానిచేతను, ప్రహస్తేన = ప్రహస్తుడను వానిచేతను, రక్షసా = రక్షసుడైన, మహాపార్శ్వేన = మహాపార్శ్వుడు అనువానిచేతను, మంత్రిణా = మంత్రియైన, నికుంభేన = నికుంభుడను వానిచేతను, చతుర్భిః సాగరైః = నాల్గుసముద్రములచేతను, పరివృతం = చుట్టుకొనబడిన, కృత్స్నం లోకమ్ ఇవ = సంపూర్ణమైన లోకమువలె, ఉపోపవిష్టం = దగ్గరగా కూర్చొనియున్నట్టి, (రక్షోధిపమ్ = రాక్షసరాజును, అవైక్షత = చూచెను).

**తాత్పర్యము :–** దుర్ధరుడు, ప్రహస్తుడు, మహాపార్శ్వుడు, నికుంభుడు అను ఆలోచనా తత్త్వమును తెలిసినవారును, తమ బలపరాక్రమములచే గర్వితులై యున్నవారును అగు రాక్షసమంత్రులు నలుగురును భూమిని చుట్టియుండు నాల్గు సముద్రములవలె రావణుని చుట్టును చేరి ఆతనిని సేవించుచుండిరి.

**శ్లో॥ మంత్రిభి ర్మంత్రతత్త్వజ్ఞై రన్యైశ్చ శుభబుద్ధిభిః ।**
**అన్వాస్యమానం సచివైః సురైరివ సురేశ్వరమ్ ॥ 13**

**పదచ్ఛేదము :–** మంత్రిభిః – మంత్రతత్త్వజ్ఞైః – అన్యైః – చ – శుభబుద్ధిభిః – అన్వాస్యమానం – సచివైః – సురైః – ఇవ – సురేశ్వరమ్ ॥

**అన్వయక్రమము :–** మంత్రతత్త్వజ్ఞైః శుభబుద్ధిభిః అన్యైః మంత్రిభిః సచివైః చ సురైః సురేశ్వరమ్ ఇవ అన్వాస్యమానం (రక్షోధిపమ్ అవైక్షత).

**ప్రతిపదార్థము :–** మంత్రతత్త్వజ్ఞైః = ఆలోచనలతత్త్వము తెలిసినట్టియు, శుభబుద్ధిభిః = మంచిబుద్ధిగలిగినట్టియు, అన్యైః = ఇతరులైన, మంత్రిభిః = మంత్రులతోడను, సచివైః = సచివులతోడను, సురైః = దేవతలచే, సురేశ్వరమ్ ఇవ = దేవేంద్రునివలె, అన్వాస్యమానం = సమీపమున కూర్చుండబడియున్న, (రక్షోధిపమ్ = రావణుని, అవైక్షత = చూచెను).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** మంత్రి = బుద్ధిసహాయకుడు; సచివుడు = కార్యసహాయకుడు.

**తాత్పర్యము :–** దేవతలచే పరివేష్టింపబడిన దేవేంద్రుడువలె రావణుడు మంత్రతత్త్వ కోవిదులును ఉత్తమమైన కార్యదక్షత గలవారును అగు మఱికొంతమంది వేఱువేఱు విధములగు మంత్రిసత్తములచే కూడ పరివేష్టింపబడి యుండెను.

**శ్లో॥ అపశ్య ద్రాక్షసపతిం హనుమా నతితేజసమ్ ।**
**విష్ఠితం మేరుశిఖరే సతోయమివ తోయదమ్ ॥ 14**

**పదచ్ఛేదము :–** అపశ్యత్ – రాక్షసపతిం – హనుమాన్ – అతితేజసమ్ – విష్ఠితం – మేరుశిఖరే – సతోయమ్ – ఇవ – తోయదమ్ ॥

**అన్వయక్రమము :–** హనుమాన్ మేరుశిఖరే విష్ఠితం సతోయం తోయదమ్ ఇవ (స్థితం) అతితేజసం రాక్షసపతిమ్ అపశ్యత్.

**ప్రతిపదార్థము :–** హనుమాన్ = హనుమ, మేరుశిఖరే = మేరుపర్వతశిఖరమునందు,

విష్ఠితం = నిలచియున్న, సతోయం = నీటితో కూడిన, తోయదమ్ ఇవ స్థితం = మేఘమువలె నున్నట్టి, అతితేజసం = మహాతేజస్సుతో గూడిన, రాక్షసపతిమ్ = రాక్షసరాజును, అపశ్యత్ = చూచెను.

**తాత్పర్యము** :– హనుమకు పచ్చని ఉన్నతమైన మహారత్నసింహాసనముపై మహాతేజస్సుతో వెలుగొందుచు నల్లని శరీరముతో నున్న ఆ రావణుడు సువర్ణపర్వతముపై నిలచియున్న నీలమేఘమువలె గానవచ్చెను.

**శ్లో॥ స తై స్సంపీడ్యమానోఽపి రక్షోభి ర్భీమవిక్రమైః ।**
**విస్మయం పరమం గత్వా రక్షోధిప మవైక్షత ॥ 15**

**పదచ్ఛేదము** :– సః – తైః – సంపీడ్యమానః – అపి – రక్షోభిః – భీమవిక్రమైః – విస్మయం – పరమం – గత్వా – రక్షోధిపమ్ – అవైక్షత ॥

**అన్వయక్రమము** :– భీమవిక్రమైః తైః రక్షోభిః సంపీడ్యమానః అపి సః పరమం విస్మయం గత్వా రక్షోధిపమ్ అవైక్షత.

**ప్రతిపదార్థము** :– భీమవిక్రమైః = భీకరమైన పరాక్రమము గల్గినట్టి, తైః రక్షోభిః = ఆ రక్కసులచే, సంపీడ్యమానః అపి = మిక్కిలి పీడింపబడుచున్నవాడైనప్పటికిని, సః = ఆ హనుమ, పరమం = గొప్పదయిన, విస్మయం = ఆశ్చర్యమును, గత్వా = పొంది, రక్షోధిపం = రాక్షసరాజును, అవైక్షత = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– రక్షోధిపమ్ అవైక్షత – హనుమ ఎదుటనున్న రావణునే చూచుచుండెను గాని రాక్షసులు తనకు గల్గించుచున్న పీడను ఏమియు చూడకుండెనని భావము.

**తాత్పర్యము** :– మహాభయంకర పరాక్రమముకల్గినట్టి రాక్షసులెందరో తనను చుట్టుముట్టి పలువిధముగా బాధించుచున్నను హనుమ దాని నేమియును లెక్కచేయక తన కమితాశ్చర్యము గొల్పుచున్న రావణాసురునే పరికించుచుండెను.

**శ్లో॥ భ్రాజమానం తతో దృష్ట్వా హనుమాన్ రాక్షసేశ్వరమ్ ।**
**మనసా చింతయామాస తేజసా తస్య మోహితః ॥ 16**

**పదచ్ఛేదము** :– భ్రాజమానం – తతః – దృష్ట్వా – హనుమాన్ – రాక్షసేశ్వరమ్ – మనసా – చింతయామాస – తేజసా – తస్య – మోహితః ॥

**అన్వయక్రమము** :– తతః భ్రాజమానం రాక్షసేశ్వరం దృష్ట్వా హనుమాన్ తస్య తేజసా

మోహితః సన్ మనసా చింతయామాస.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, భ్రాజమానం = విరాజమానుడైయున్న, రాక్షసేశ్వరం = రాక్షసరాజును, దృష్ట్వా = చూచి, హనుమాన్ = హనుమ, తస్య = ఆ రావణునియొక్క, తేజసా = తేజస్సుచే, మోహితః = ముగ్ధుడై, మనసా = మనస్సు చేత, చింతయామాస = ఆలోచింప దొడగెను.

**తాత్పర్యము** :- ఈ రీతిగా వెల్గొందుచున్న రాక్షసాధిపతిని గాంచి హనుమ అతని తేజోవిశేషమునకు విస్మయము నొంది తన మనస్సునం దిట్లు చింతింపదొడగెను.

**శ్లో॥ అహో రూప మహో ధైర్య మహో సత్త్వమహో ద్యుతిః ।**
**అహో రాక్షసరాజస్య సర్వలక్షణయుక్తతా ॥ 17**

**పదచ్ఛేదము** :- అహో – రూపమ్ – అహో – ధైర్యమ్ – అహో – సత్త్వమ్ – అహో – ద్యుతిః – అహో – రాక్షసరాజస్య – సర్వలక్షణయుక్తతా ॥

**అన్వయక్రమము** :- రాక్షసరాజస్య రూపమ్ అహో! ధైర్యమ్ అహో, సత్త్వమ్ అహో, ద్యుతిః అహో, సర్వలక్షణయుక్తతా అహో.

**ప్రతిపదార్థము** :- రాక్షసరాజస్య = రాక్షసాధిపతియొక్క, రూపం = రూపము, అహో! = ఎంత యాశ్చర్యకరమైనదో, ధైర్యం = ధైర్యము, అహో! = ఆశ్చర్యము, సత్త్వం = శక్తి, అహో! = ఆశ్చర్యకరము! ద్యుతిః = తేజస్సు, అహో! = ఆశ్చర్యకరము! సర్వలక్షణయుక్తతా = సర్వలక్షణ సంపన్నత, అహో! = ఎంత యాశ్చర్యకరమో!

**తాత్పర్యము** :- ఆహా! ఈ రాక్షసరాజైన రావణుని రూప మెంత అద్భుతమైనది! ధైర్య మెంత యాశ్చర్యకరమైనది! ఈతనిశక్తి ఈతని తేజస్సు నిరుపమానముగదా! మహాపురుషలక్షణము లన్నియును ఈతనియం దెంత అద్భుతముగా నిండియున్నవో గదా!

**శ్లో॥ య ద్యధర్మో న బలవాన్ స్యా దయం రాక్షసేశ్వరః ।**
**స్యాదయం సురలోకస్య సశక్రస్యాపి రక్షితా ॥ 18**

**పదచ్ఛేదము** :- యది – అధర్మః – న – బలవాన్ – స్యాత్ – అయం – రాక్షసేశ్వరః – స్యాత్ – అయం – సురలోకస్య – సశక్రస్య – అపి – రక్షితా ॥

**అన్వయక్రమము** :- అయం అధర్మః బలవాన్ న స్యాత్ యది అయం రాక్షసేశ్వరః సశక్రస్య సురలోకస్య అపి రక్షితా స్యాత్.

**ప్రతిపదార్థము** :– అయం అధర్మః = ఈ యధర్మము, బలవాన్ = ప్రబలమైనది, న స్యాత్ యది = కాకుండినయెడల, అయం రాక్షసేశ్వరః = ఈ రాక్షసరాజు, సశక్రస్య = దేవేంద్రునితో గూడిన, సురలోకస్య అపి = దేవలోకమునకు గూడ, రక్షితా స్యాత్ = రక్షకుడుగా నుండి యుండునుగదా.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– ఇన్ని విధముల బలసమృద్ధులుగల ఈతనిలో వినాశమూలమైనట్టి అధర్మమే లేకున్నచో దేవేంద్రునితో గూడిన స్వర్గమును విష్ణువువలె రక్షింప గల్గి యుండును. ఈతని ఈ యధర్మదోషమే తన వారందఱికిని గూడ ముప్పుతెచ్చిపెట్టినది గదా!

**మహేశ్వరతీర్థులు** :– ఈ రావణుడు అధర్మపరుడు గానిచో మహాబలసంపన్నుడై యుండును. స్వర్గాదిలోకములను గూడ రక్షింపగల్గిన వాడై యుండును.

**తాత్పర్యము** :– ఈ రాక్షసరాజునందు పరదారాపహరణమనెడి ప్రబలమైన యధర్మమే లేకుండినయెడల దేవేంద్రునితో కూడిన స్వర్గలోకము వంటి ఊర్ధ్వలోకములనుగూడ రక్షింపగల్గినవాడై యుండునుగదా!

**శ్లో॥ అస్య క్రూరై ర్నృశంసైశ్చ కర్మభి ర్లోకకుత్సితైః ।**
**సర్వే బిభ్యతి ఖ ల్వస్మాల్లోకా స్సామరదానవాః ॥ 19**

**పదచ్ఛేదము** :– అస్య – క్రూరైః – నృశంసైః – చ – కర్మభిః – లోకకుత్సితైః – సర్వే – బిభ్యతి – ఖలు – అస్మాత్ – లోకాః – సామరదానవాః ॥

**అన్వయక్రమము** :– క్రూరైః నృశంసైః లోకకుత్సితైః చ అస్య కర్మభిః సామరదానవాః సర్వే లోకాః అస్మాత్ బిభ్యతి ఖలు.

**ప్రతిపదార్థము** :– క్రూరైః = క్రూరములును, నృశంసైః = ఘాతుకములును, లోకకుత్సితైః చ = లోకులచే నిందింపబడినట్టివియును అగు, అస్య = ఈతనియొక్క, కర్మభిః = కార్యములచే, సామరదానవాః = దేవతలతోడను దానవులతోడను కూడిన, సర్వే లోకాః = సమస్తలోకములును, అస్మాత్ = ఈతనినుండి, బిభ్యతి ఖలు = భయపడుచున్నవిగదా.

**తాత్పర్యము** :– క్రూరములును, ఘాతుకములును, లోకనింద్యములునైన వీనియొక్క దారుణకృత్యములకు దేవదానవులతో కూడిన సమస్తలోకములును గూడ నిత్యమును భయగ్రస్తములై యున్నవి గదా.

**శ్లో॥ అయం హ్యుత్సహతే క్రుద్ధః కర్తు మేకార్ణవం జగత్ ।**
**ఇతి చింతాం బహువిధా మకరో న్మతిమా న్కపిః ।**
**దృష్ట్వా రాక్షసరాజస్య ప్రభావ మమితౌజసః ॥ 20**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"రావణప్రభావదర్శనం" నామ*
*ఏకోనపంచాశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– అయం – హి – ఉత్సహతే – క్రుద్ధః – కర్తుమ్ – ఏకార్ణవం – జగత్ – ఇతి – చింతాం – బహువిధామ్ – అకరోత్ – మతిమాన్ – కపిః – దృష్ట్వా – రాక్షసరాజస్య – ప్రభావమ్ – అమితౌజసః ॥

**అన్వయక్రమము** :– అమితౌజసః రాక్షసరాజస్య ప్రభావం దృష్ట్వా మతిమాన్ కపిః క్రుద్ధః అయం జగత్ ఏకార్ణవం కర్తుమ్ ఉత్సహతే హి, ఇతి బహువిధాం చింతామ్ అకరోత్.

**ప్రతిపదార్థము** :– అమితౌజసః = అపరిమితమైన ప్రభావము గల్గినట్టి, రాక్షసరాజస్య = రావణునియొక్క, ప్రభావం = ప్రభావమును, దృష్ట్వా = చూచి, మతిమాన్ = బుద్ధిశాలియైన, కపిః = హనుమ, అయం = ఈ రావణుడు, క్రుద్ధః = కోపించినవాడై, జగత్ = లోకమును, ఏకార్ణవం = ఏకసముద్రముగా, కర్తుమ్ = చేయుటకు, ఉత్సహతే హి = ఉత్సహించునుగదా! ఇతి = అని, బహువిధాం = పలువిధములైనట్టి, చింతాం = ఆలోచనమును, అకరోత్ = చేసెను.

**తాత్పర్యము** :– బుద్ధిశాలియైన హనుమ, అపరిమితశక్తిశాలియైన రాక్షసరాజు ప్రభావమును గాంచి ఆహా! ఈ రావణుడు క్రోధమునొందినచో ఈ లోకమునంతను ఏకసముద్రము చేసివేయగలడు గదా! యనుచు బహువిధములుగా రావణుని ప్రజ్ఞను గూర్చి తలపోయసాగెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"రావణప్రభావదర్శనము" అను*
*నలుబదితొమ్మిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచాశసర్గ

**శ్లో॥ త ముద్వీక్ష్య మహాబాహుః పింగాక్షం పురత స్థ్సితమ్ ।**
**రోషేణ మహతాఽఽవిష్టో రావణో లోకరావణః ॥ 1**

**పదచ్ఛేదము** :– తమ్ – ఉద్వీక్ష్య – మహాబాహుః – పింగాక్షం – పురతః – స్థితం – రోషేణ – మహతా – ఆవిష్టః – రావణః – లోకరావణః ॥

**అన్వయక్రమము** :– మహాబాహుః లోకరావణః రావణః పురతః స్థితం పింగాక్షం తమ్ ఉద్వీక్ష్య మహతా రోషేణ ఆవిష్టః (అభవత్).

**ప్రతిపదార్థము** :– మహాబాహుః = గొప్ప భుజములు గలవాడును, లోకరావణః = లోకములను ఆక్రోశింపజేయువాడునగు, రావణః = రావణుడు, పురతః = ఎదుట, స్థితం = ఉన్నట్టి, పింగాక్షం = పచ్చని కన్నులు గల్గియున్నట్టి, తం = ఆ హనుమను, ఉద్వీక్ష్య = చూచి, మహతా = గొప్పదైన, రోషేణ = క్రోధముతో, ఆవిష్టః = నిండినవాడు (అభవత్ = ఆయెను).

**తాత్పర్యము** :– తన భీకరకృత్యములచే లోకములను ఆక్రోశింపజేయు మహావీరుడైన ఆ రావణు డప్పుడు పచ్చని కన్నులతో తన ఎదుట నిలచియున్న హనుమను గాంచి తీవ్రమైన క్రోధము నొందెను.

**శ్లో॥ శంకాహతాత్మా దధ్యౌ స కపీంద్రం తేజసా వృతమ్ ।**
**కి మేష భగవా న్నందీ భవే త్సాక్షాదిహాఽఽగతః ॥ 2**

**శ్లో॥ యేన శప్తోఽస్మి కైలాసే మయా సంచాలితే పురా ।**
**సోఽయం వానరమూర్తి స్స్యా త్కింస్వి ద్బాణోఽపి వాఽసురః॥ 3**

**పదచ్ఛేదము** :– శంకాహతాత్మా – దధ్యౌ – సః – కపీంద్రం – తేజసా – వృతమ్ – కిమ్ – ఏషః – భగవాన్ – నందీ – భవేత్ – సాక్షాత్ – ఇహ – ఆగతః – యేన – శప్తః – అస్మి – కైలాసే – మయా – సంచాలితే – పురా, సః – అయం – వానరమూర్తిః – స్యాత్ – కిం – స్విత్ – బాణః – అపి – వా – అసురః ॥

**అన్వయక్రమము :–** శంకాహతాత్మా సః తేజసా వృతం కపీంద్రం (ఏవం) దధ్యౌ. పురా మయా కైలాసే సంచాలితే సతి యేన శప్తః అస్మి సః భగవాన్ నందీ ఇహ సాక్షాత్ అయం ఏషః వానరమూర్తిః సన్ ఆగతః భవేత్ కిమ్? అపి వా అసురః బాణః స్యాత్ కిం స్విత్?

**ప్రతిపదార్థము :–** శంకాహతాత్మా = సంశయముచే పీడింపబడిన మనస్సుగల్గినట్టి, సః = ఆ రావణుడు, తేజసా = తేజస్సుతో, వృతం = నిండిన, కపీంద్రం = ఆ వానర శ్రేష్ఠుడైన హనుమనుగూర్చి, (ఏవం = ఇట్లు), దధ్యౌ = చింతించెను. పురా = పూర్వము, మయా = నాచేత, కైలాసే = కైలాసపర్వతము, సంచాలితే సతి = కంపింపజేయబడగా, యేన = ఎవ్వనిచేతనైతే, శప్తః = శపింపబడినవాడను, అస్మి = అయితినో, సః = ఆ, భగవాన్ = పూజ్యుడైన, నందీ = నంది, సాక్షాత్ = స్వయముగా, ఇహ = ఇటకు, ఏషః = ఈ, అయం వానరమూర్తిః సన్ = ఈ వానర రూపుడుగా, ఆగతః = వచ్చినవాడు, భవేత్ కిమ్ = అగునా యేమి? అపి వా = లేక, అసురః = రాక్షసుడైన, బాణః = బాణాసురుడు, స్యాత్ కిం స్విత్ = అగునా యేమి?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'నందీ' – వానరముఖము కల్గిన ప్రమథగణాధిపుడు. 'శప్తః' – పూర్వము కైలాసపర్వతమునకు తాను పోయినప్పుడు అచట వానరముఖముతో కనబడిన నందిని జూచి రావణుడు పరిహసింపగా, నావంటి ముఖము కలిగినవారిచే నీకు వినాశము సంభవింపగలదని అతడప్పుడు శపించెను. బాణోఽపి వా అసురః – 'బాణుడు' బలికుమారుడైన రాక్షసుడు. అతడును శివభక్తగణములలోనివాడే యగుటచే ఆ నందిచే పంపబడిన వానరరూపములో నున్న బాణుడా ఈత దని రావణుని సందేహము.

**తాత్పర్యము :–** మహాతేజస్సుతో ప్రకాశించుచున్న హనుమను గాంచి రావణుడు శంకాకులహృదయుడై, పూర్వము నేను కైలాసమున కేగినప్పుడు తనను చూచి నవ్వితినను కోపముతో వానరముఖుడైన ఆ నంది నావంటి ముఖముగలవారిచే నీకు వినాశము సంభవించునని శపించిన పూర్వవృత్తాంతము ప్రకారము నానిమిత్తమై ఆ నందియే ఇట వానరరూపముతో వచ్చియుండునేమో? లేక అతనిచే పంపబడిన బాణాసురుడై యుండునేమో! అని తనలో అనుకొనెను.

**శ్లో॥ స రాజా రోషతామ్రాక్షః ప్రహస్తం మంత్రిసత్తమమ్ ।**
**కాలయుక్త మువాచేదం వచో విపుల మర్థవత్ ॥** 4

**పదచ్ఛేదము :–** సః – రాజా – రోషతామ్రాక్షః – ప్రహస్తం – మంత్రిసత్తమమ్ –

కాలయుక్తమ్ - ఉవాచ - ఇదం - వచః - విపులమ్ - అర్థవత్ ॥

**అన్వయక్రమము :-** సః రాజా రోషతామ్రాక్షః ప్రహస్తం మంత్రిసత్తమం కాలయుక్తం విపులమ్ అర్థవత్ ఇదం వచః ఉవాచ.

**ప్రతిపదార్థము :-** సః రాజా = ఆ రాక్షసాధిపతి, రోషతామ్రాక్షః = క్రోధముచే ఎఱ్ఱబారిన కన్నులు గలవాడై, ప్రహస్తం = ప్రహస్తుడను, మంత్రిసత్తమం = అమాత్య శ్రేష్ఠునిగూర్చి, కాలయుక్తం = కాలోచితమును, విపులం = విస్తృతమైనదియును, అర్థవత్ = ప్రయోజనకరమైనదియునగు, ఇదం వచః = ఈ మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :-** రాక్షసాధిపుడైన ఆ రావణుడప్పుడు క్రోధముచే ఎఱ్ఱబడిన కన్నులతో అచ్చటనున్న ప్రహస్తుడను మంత్రిశ్రేష్ఠుని జూచి తత్కాలోచితముగా విపులముగా సార్థకమైన మాటల నీరీతిగ పలికెను.

**శ్లో॥ దురాత్మా పృచ్ఛ్యతా మేష కుతః కిం వాఽస్య కారణమ్ ।**
**వనభంగే చ కోఽస్యార్థో రాక్షసీనాం చ తర్జనే ॥ 5**

**పదచ్ఛేదము :-** దురాత్మా - పృచ్ఛ్యతామ్ - ఏషః - కుతః - కిం - వా - అస్య - కారణమ్ - వనభంగే - చ - కః - అస్య - అర్థః - రాక్షసీనాం - చ - తర్జనే ॥

**అన్వయక్రమము :-** ఏషః దురాత్మా పృచ్ఛ్యతామ్. ఏషః కుతః (ఆగతః)? అస్య (ఆగమనస్య) కారణం కిమ్? వనభంగే చ, రాక్షసీనాం తర్జనే చ అస్య అర్థః కః?

**ప్రతిపదార్థము :-** ఏషః దురాత్మా = ఈ దుర్మార్గుడు, పృచ్ఛ్యతామ్ = అడుగబడుగాక, ఏషః = ఈతడు, కుతః = ఎచ్చటినుండి (ఆగతః = వచ్చినవాడు?) అస్య = వీనియొక్క (ఆగమనస్య = రాకయొక్క) కారణం = హేతువు, కిం వా = ఏమైయున్నది? వనభంగే చ = వనవినాశమునను, రాక్షసీనాం = రాక్షసస్త్రీలయొక్క, తర్జనే చ = పీడించుటయందును, అస్య = వీనికి, అర్థః = ప్రయోజనము, కః = ఏమి?

**సూచన :-** 'రాక్షసీనాం'కి బదులుగా 'రాక్షసానాం' అని బొంబాయి ప్రతి. ఇచ్చట స్త్రీలింగస్వారస్యముచే పురుషులైన మా రాక్షస వీరులెవ్వరును వీనికి భయపడుటలేదు. స్త్రీలు మాత్రమే భయపడి యుండవచ్చునని రావణుని భావముగా గ్రహింపవలెను.

**తాత్పర్యము :-** ఈ దురాత్ముని అడిగి తెలిసికొనుము. ఈత డెచ్చటినుండి ఇటకు వచ్చెను? ఈతని రాకకు కారణమేమి? ఈ వనమును ధ్వంసము చేయుటలో ఈతని యుద్దేశమేమి? ఈ రాక్షసస్త్రీలను భయపెట్టుటలో ఈతని యభిప్రాయ మేమి?

**శ్లో॥ మత్పురీ మప్రధృష్యాం వాఽఽగమనే కిం ప్రయోజనమ్? ।**
**ఆయోధనే వా కిం కార్యం పృచ్ఛ్యతా మేష దుర్మతిః ॥ 6**

**పదచ్ఛేదము :–** మత్పురీమ్ – అప్రధృష్యాం – వా – ఆగమనే – కిం – ప్రయోజనమ్ – ఆయోధనే – వా – కిం – కార్యం – పృచ్ఛ్యతామ్ – ఏషః – దుర్మతిః.

**అన్వయక్రమము :–** అప్రధృష్యాం మత్పురీమ్ ఆగమనే కిం వా ప్రయోజనమ్? ఆయోధనే కిం వా కార్యమ్? ఇతి ఏషః దుర్మతిః పృచ్ఛ్యతామ్.

**ప్రతిపదార్థము :–** అప్రధృష్యాం = ఎదిరింపశక్యముగాని, మత్పురీం = నా పట్టణమును గూర్చి, ఆగమనే = వచ్చుటయందు, కిం వా ప్రయోజనమ్ = ఏమి ప్రయోజనము, ఆయోధనే = యుద్ధమునందు, కిం వా కార్యమ్ = ఏమి ప్రయోజనము, ఇతి = అని, ఏషః దుర్మతిః = ఈ దుర్మార్గుడు, పృచ్ఛ్యతామ్ = అడుగబడుగాక.

**తాత్పర్యము :–** పరులు చేరుట కసాధ్యమైనట్టి నా పట్టణమునకు వచ్చుటలో ఈతని అభిప్రాయమేమి? మా రాక్షసులతో యుద్ధము చేయుటలో ఈతని ఉద్దేశ్యమేమి? అని ఇది యంతయును సరిగా చెప్పుమని ఈ దుర్మార్గుని అడుగుము.

**శ్లో॥ రావణస్య వచ శ్శ్రుత్వా ప్రహస్తో వాక్య మబ్రవీత్ ।**
**సమాశ్వసిహి భద్రం తే న భీః కార్యా త్వయా కపే ॥ 7**

**పదచ్ఛేదము :–** రావణస్య – వచః – శ్రుత్వా – ప్రహస్తః – వాక్యమ్ – అబ్రవీత్, సమాశ్వసిహి – భద్రం – తే – న – భీః – కార్యా – త్వయా – కపే ॥

**అన్వయక్రమము :–** రావణస్య వచః శ్రుత్వా ప్రహస్తః వాక్యమ్ అబ్రవీత్, కపే సమాశ్వసిహి; తే భద్రమ్ (అస్తు). త్వయా భీః న కార్యా ॥

**ప్రతిపదార్థము :–** రావణస్య = రావణునియొక్క, వచః = మాటను, శ్రుత్వా = విని, ప్రహస్తః = ప్రహస్తుడు, వాక్యమ్ = వాక్యమును, అబ్రవీత్ = పలికెను, కపే = ఓ వానరుడా! సమాశ్వసిహి = ఊరడిల్లుము, తే = నీకు, భద్రం (అస్తు) = క్షేమ(మగుగాక), త్వయా = నీచేత, భీః = భయము, న కార్యా = చేయబడనక్కరలేదు.

**తాత్పర్యము :–** రావణుని మాటలను వినగనే మంత్రియైన ప్రహస్తుడు హనుమను ఇట్లు అడిగెను. ఓ వానరుడా! స్తిమితపడుము. నీకు క్షేమము కలుగును. నీవేమియు భయపడనక్కరలేదు.

**శ్లో॥ యది తావత్త్వ మింద్రేణ ప్రేషితో రావణాలయమ్ ।**
**తత్త్వ మాఖ్యాహి మా భూత్తే భయం వానర! మోక్ష్యసే ॥ 8**

**పదచ్ఛేదము :-** యది - తావత్ - త్వమ్ - ఇంద్రేణ - ప్రేషితః - రావణాలయమ్ - తత్త్వమ్ - ఆఖ్యాహి - మా - భూత్ - తే - భయం - వానర - మోక్ష్యసే ॥

**అన్వయక్రమము :-** వానర! త్వమ్ ఇంద్రేణ రావణాలయం ప్రేషితః యది తావత్ తత్త్వమ్ ఆఖ్యాహి; తే భయం మా భూత్, (బంధాత్) మోక్ష్యసే.

**ప్రతిపదార్థము :-** వానర! = ఓ వానరుడా! త్వం = నీవు, ఇంద్రేణ = దేవేంద్రునిచే, రావణాలయం = రావణుని నివాసమును గూర్చి, ప్రేషితః యది = పంపబడిన వాడవైనయెడల, తావత్ = ముందుగా, తత్త్వం = యథార్థమును, ఆఖ్యాహి = చెప్పుము, తే = నీకు, భయం = భీతి, మా భూత్ = కలుగకుండుగాక! (బంధాత్ = బంధనమునుండి,) మోక్ష్యసే = విడిపింపబడుదువు.

**తాత్పర్యము :-** ఓ వానరుడా! నీవు గాని యా దేవేంద్రునిచే మా రావణభవనమునకు పంపబడినట్టివాడవైనయెడల ఆ యథార్థమును ముందుగా స్పష్టముగా చెప్పివేయుము. నీ కేమియును భయ మక్కరలేదు. మేము నీ బంధనమునుండి నిన్ను విడిపించెదము.

**శ్లో॥ యది వైశ్రవణస్య త్వం యమస్య వరుణస్య చ ।**
**చారరూప మిదం కృత్వా ప్రవిష్టో నః పురీ మిమామ్ ॥ 9**

**పదచ్ఛేదము :-** యది - వైశ్రవణస్య - త్వం - యమస్య - వరుణస్య - చ - చారరూపమ్ - ఇదం - కృత్వా - ప్రవిష్టః - నః - పురీమ్ - ఇమామ్ ॥

**అన్వయక్రమము :-** త్వం వైశ్రవణస్య యమస్య వరుణస్య చ ఇదం చారరూపం కృత్వా నః ఇమాం పురీం ప్రవిష్టః యది (తత్త్వమ్ ఆఖ్యాహి).

**ప్రతిపదార్థము :-** త్వం = నీవు, వైశ్రవణస్య = కుబేరుని యొక్కయు, యమస్య = యముని యొక్కయు, వరుణస్య చ = వరుణునియొక్కయును, ఇదం చారరూపం = ఈ దూతరూపమును, కృత్వా = వహించి, నః = మాయొక్క, ఇమాం పురీం = ఈ నగరమును, ప్రవిష్టః యది = ప్రవేశించివాడవైనయెడల, తత్త్వమ్ ఆఖ్యాహి = యథార్థమును చెప్పుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** 'చారరూప మిదం కృత్వా' - సామాన్యముగా రాజకృత్యములకై వచ్చు చారులు ప్రచ్ఛన్నవేషములు ధరించియే వత్తురు గావున నీ వానరరూపము నిజమైనది గాదు అని మా భావము.

**తాత్పర్యము :–** నీవు కుబేర, యమ, వరుణులలో ఎవరి గూఢచారిగానో ఈ రూపమును ధరించి మా పట్టణమునకు వచ్చినట్లుగా కనబడుచున్నావు. ఆ యథార్థవిషయమును చెప్పుము. అప్పుడే నిన్ను మేము బంధనమునుండి విడిపించుదుము.

**శ్లో॥ విష్ణునా ప్రేషితో వాపి దూతో విజయకాంక్షిణా ।**
**న హి తే వానరం తేజో రూపమాత్రం తు వానరమ్ ॥ 10**

**పదచ్ఛేదము :–** విష్ణునా – ప్రేషితః – వా – అపి – దూతః – విజయకాంక్షిణా – న – హి – తే – వానరం – తేజః – రూపమాత్రం – తు – వానరమ్ ॥

**అన్వయక్రమము :–** (త్వం) విజయకాంక్షిణా విష్ణునా ప్రేషితః దూతః అపి వా (తత్త్వమ్ ఆఖ్యాహి) తే తేజః వానరం న హి; రూపమాత్రం తు వానరమ్.

**ప్రతిపదార్థము :–** (త్వం = నీవు) విజయకాంక్షిణా = విజయమును ఆశించుచున్నట్టి, విష్ణునా = విష్ణువుచే, ప్రేషితః = పంపబడిన, దూతః = దూతవు, అపి వా = అయినప్పటికిని (తత్త్వమ్ ఆఖ్యాహి = యథార్థమును చెప్పుము), తే = నీయొక్క, తేజః = ప్రతాపము, వానరం న హి = వానరోచితము గాదు, రూపమాత్రం తు = ఆకారముమాత్రమే, వానరం = వానరసంబంధమైనది.

**తాత్పర్యము :–** విజయమును ఆశపడుచున్నట్టి విష్ణువు నిన్ను ఇచ్చటికి దూతగా పంపినను, ఆ యథార్థమును మాకు చెప్పివేయుము. నీ ప్రతాపము చూడగా వానరజాతికి తగినదిగ లేదు. నీవు స్వరూపమునకు మాత్రమే వానరజాతికి చెందినవాడవు అని మాకు అనిపించుచున్నది.

**శ్లో॥ తత్త్వతః కథయ స్వాద్య తతో వానర మోక్ష్యసే ।**
**అనృతం వదతశ్చాపి దుర్లభం తవ జీవితమ్ ।**
**అథవా యన్నిమిత్తస్తే ప్రవేశో రావణాలయే ॥ 11**

**పదచ్ఛేదము :–** తత్త్వతః – కథయస్వ – అద్య – తతః – వానర – మోక్ష్యసే – అనృతం – వదతః – చ – అపి – దుర్లభం – తవ – జీవితమ్ – అథవా – యన్నిమిత్తః – తే – ప్రవేశః – రావణాలయే ॥

**అన్వయక్రమము :–** వానర! అథవా రావణాలయే తే ప్రవేశః యన్నిమిత్తః అద్య తత్త్వతః కథయస్వ; తతః మోక్ష్యసే; అనృతం వదతః తవ జీవితమ్ అపి దుర్లభం (భవేత్).

**ప్రతిపదార్థము :–** వానర! = ఓ వానరుడా! అథవా = అట్లుగానిచో, రావణాలయే =

రావణభవనమునందు, తే = నీయొక్క, ప్రవేశః = ప్రవేశము, అద్య = నేడు, యన్నిమిత్తః = ఏయుద్దేశ్యముచేతనో, తత్త్వతః = యథార్థముగ, కథయస్వ = చెప్పుము, తతః = అందువలన, మోక్ష్యసే = విడిపింపబడుదువు. అనృతం = అసత్యమును, వదతః = పలుకుచున్న, తవ = నీకు, జీవితమ్ అపి = ప్రాణముగూడ, దుర్లభం భవేత్ = దుర్లభమగును.

**తాత్పర్యము** :- ఓ వానరుడా! మొదట నీ వీ రావణభవనమును ప్రవేశించుటలో నీ యుద్దేశ్యమేమో యదార్థముగ చెప్పివేయుము. అట్లు చెప్పినచో నిన్ను విడిపించెదము. అట్లుగాక నీవు అసత్యమును పల్కిన యెడల నీ ప్రాణము నిలుచుట దుర్లభమగును సుమా!

**శ్లో॥ ఏవ ముక్తో హరివర స్తథా రక్షోగణేశ్వరమ్ ।**
**అబ్రవీన్నాస్మి శక్రస్య యమస్య వరుణస్య వా ॥ 12**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - ఉక్తః - హరివరః - తదా - రక్షోగణేశ్వరమ్ - అబ్రవీత్ - న - అస్మి - శక్రస్య - యమస్య - వరుణస్య - వా ।

**అన్వయక్రమము** :- ఏవమ్ ఉక్తః హరివరః - తదా రక్షోగణేశ్వరమ్ అబ్రవీత్ - (అహం) శక్రస్య యమస్య వరుణస్య వా (దూతః) న అస్మి.

**ప్రతిపదార్థము** :- ఏవమ్ = ఈరీతిగా, ఉక్తః = పలుకబడినట్టి, హరివరః = వానర శ్రేష్ఠుడైన హనుమ, తదా = అప్పుడు, రక్షోగణేశ్వరమ్ = రాక్షసచక్రవర్తిని గూర్చి, అబ్రవీత్ = పలికెను, అహం = నేను, శక్రస్య = దేవేంద్రునియొక్కగాని, యమస్య = యమునియొక్కగాని, వరుణస్య = వరుణునియొక్కగాని (దూతః = దూతను), అస్మి = కాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- "ఏవం ఉక్తః రక్షోగణేశ్వరమ్ అబ్రవీత్" ఇంతవఱకును తనను అన్ని ప్రశ్నలు వేసినది ప్రహస్తుడేయైనను హనుమ అతనిని లెక్కచేయుట మాని రాక్షసరాజునే చూచుచు అతనికే జవాబు చెప్పుట కారంభించెను అని గ్రహించవలెను.

**తాత్పర్యము** :- ప్రహస్తుడు తననిట్లు ప్రశ్నింపగా హనుమ రాక్షసరాజును గాంచి అతనితో ఇట్లు పలికెను:- నేను దేవేంద్రునకుగాని, యమునకుగాని, వరుణునకుగాని సంబంధించిన దూతను కాను సుమా!

**శ్లో॥ ధనదేన న మే సఖ్యం విష్ణునా నాస్మి చోదితః ।**
**జాతిరేవ మమ త్వేషా వానరో ఽహ మి హాగతః ॥ 13**

**పదచ్ఛేదము** :– ధనదేన – న – మే – సఖ్యం – విష్ణునా – న – అస్మి – చోదితః – జాతిః – ఏవ – మమ – తు – ఏషా – వానరః – అహం – ఇహ – ఆగతః ॥

**అన్వయక్రమము** :– ధనదేన మే సఖ్యం న (అస్తి); విష్ణునా చోదితః న (అస్మి); ఏషా తు మమ జాతిః ఏవ, ఇహ ఆగతః అహం వానరః.

**ప్రతిపదార్థము** :– ధనదేన = కుబేరునితో, మే = నాకు, సఖ్యం = మైత్రి, న అస్తి = లేదు, విష్ణునా = విష్ణువుచే, చోదితః = ప్రేరేపింపబడినవాడను, న (అస్మి) = కాను, ఏషా తు = ఈ వానరరూపము, మము = నాకు, జాతిః ఏవ = జన్మసిద్ధమైనదే, ఇహ = ఇటకు, ఆగతః = వచ్చినట్టి, అహం = నేను, వానరః = వానరుడను.

**తాత్పర్యము** :– కుబేరునితో నాకేమియును స్నేహము లేదు. నన్ను విష్ణువేమియు ప్రేరేపించి ఇటకు పంపలేదు. ఈ నా రూపము నాకు సహజమైనదే. ఇచ్చటికి వచ్చిన నేను నిజముగ వానరుడనే.

**శ్లో॥ దర్శనే రాక్షసేంద్రస్య దుర్లభే త దిదం మయా ।**
**వనం రాక్షసరాజస్య దర్శనార్థే వినాశితమ్ ॥ 14**

**పదచ్ఛేదము** :– దర్శనే – రాక్షసేంద్రస్య – దుర్లభే – తత్ – ఇదం – మయా – వనం – రాక్షసరాజస్య – దర్శనార్థే – వినాశితమ్ ॥

**అన్వయక్రమము** :– రాక్షసేంద్రస్య దర్శనే దుర్లభే (సతి) మయా రాక్షసరాజస్య దర్శనార్థే ఇదం తత్ వనం వినాశితమ్.

**ప్రతిపదార్థము** :– రాక్షసేంద్రస్య = రాక్షసరాజుయొక్క, దర్శనే = దర్శనము, దుర్లభే (సతి) = దుర్లభము కాగా, మయా = నాచేత, రాక్షసరాజస్య = రాక్షసాధిపతియొక్క, దర్శనార్థే = దర్శనము నిమిత్తము, ఇదం తత్ వనం = ఈ యా వనము, వినాశితమ్ = పాడు చేయబడినది.

**తాత్పర్యము** :– రాక్షసప్రభువైన నీ దర్శనము వేఱొక రీతిగా నాకు కాజాలదు గనుక నీ దర్శనమును గుఱించియే నీకు మిక్కిలి ప్రియమైనట్టి అశోకవనమును ధ్వంసము చేసితిని.

**శ్లో॥ తత స్తే రాక్షసాః ప్రాప్తా బలినో యుద్ధకాంక్షిణః ।**
**రక్షణార్థం తు దేహస్య ప్రతియుద్ధా మయా రణే ॥ 15**

**పదచ్ఛేదము :–** తతః – తే – రాక్షసాః – ప్రాప్తాః – బలినః – యుద్ధకాంక్షిణః – రక్షణార్థం – తు – దేహస్య – ప్రతియుద్ధాః – మయా – రణే ॥

**అన్వయక్రమము :–** తతః యుద్ధకాంక్షిణః, బలినః, తే రాక్షసాః ప్రాప్తాః. దేహస్య రక్షణార్థం తు రణే మయా (తే) ప్రతియుద్ధాః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, బలినః = బలవంతులైన, రాక్షసాః = రాక్షసులు, యుద్ధకాంక్షిణః = యుద్ధమును కోరుచున్నవారై, ప్రాప్తాః = వచ్చిరి. దేహస్య = శరీరముయొక్క, రక్షణార్థం తు = రక్షణముకొఱకు మాత్రమే, మయా = నాచేత, రణే = యుద్ధమునందు, తే = ఆ రక్కసులు, ప్రతియుద్ధాః = ఎదిరింపబడిరి.

**సూచన :–** "రక్షణార్థం తు దేహస్య" – నా ప్రాణములకు హాని కలిగించుట వీరెవరికిని శక్యము గాదు. నా కాయము మాత్ర మేల గాయము నొందవలెను? అని నా మీదికి వచ్చిన వారిని హతమార్చినానని హనుమ భావము.

**తాత్పర్యము :–** నేను నీ దర్శనము కోరుచుండగా బలాఢ్యులైన రాక్షసులు నాతో యుద్ధము చేయగోరుచు నా మీదికి వచ్చిరి. అత్తఱి నేను నా శరీరరక్షణముకొఱకు మాత్రమే వారి ఎదుట నిలిచి పోరాడితిని.

**శ్లో॥ అస్త్రపాశైర్న శక్యోఽహం బద్ధుం దేవాసురై రపి ।**
**పితామహాదేవ వరో మమా ప్యేషోఽభ్యుపాగతః ॥ 16**

**పదచ్ఛేదము :–** అస్త్రపాశైః – న – శక్యః – అహం – బద్ధుం – దేవాసురైః – అపి, పితామహాత్ – ఏవ – వరః – మమ – అపి – ఏషః – అభ్యుపాగతః ॥

**అన్వయక్రమము :–** అహమ్ అస్త్రపాశైః బద్ధుం దేవాసురైః అపి న శక్యః. మమ అపి ఏష వరః పితామహాత్ ఏవ అభ్యుపాగతః.

**ప్రతిపదార్థము :–** అహం = నేను, అస్త్రపాశైః = అస్త్రములచేతను పాశముల చేతను, బద్ధుం = బంధించుటకు, దేవాసురైః అపి = దేవతలచేతను దానవులచేతను గూడ, న శక్యః = సాధ్యమైనవాడను గాను, పితామహాత్ ఏవ = బ్రహ్మదేవుని నుండియే, ఏషః వరః = ఈ వరము, మమ అపి = నాకుకూడ, అభ్యుపాగతః = ప్రాప్తించినది.

## విశేషార్థములు – వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** "అస్త్రపాశైః" = బ్రహ్మాస్త్రము వఱకునుగల సమస్తాస్త్రములచేతను అనియు, యమపాశమువఱకుగల సమస్తపాశములచేతను అనియు, "దేవాసురైః అపి" –

దేవతలును దానవులును కలసి యుద్ధము చేసినప్పటికిని అనియు, "మమాపి ఏష వరః" - అద్భుతమైన వరములు నీకేగాక నాకును బ్రహ్మవలన లభించినవిసుమా అనియును హనుమ తెలుపుచున్నాడు.

**తాత్పర్యము** :- ఏ యస్త్రముగాని ఏ పాశముగాని ప్రయోగింపనిమ్ము. దేవతలును దానవులును కలసి వచ్చినను రానిమ్ము, ఎన్నటికిని నన్ను బంధింపజాలరు. బ్రహ్మదేవుని యనుగ్రహముచే నాకు గూడ నిట్టి అద్భుతమైన వరములు ప్రాప్తించియున్నవి సుమా!

**శ్లో॥ రాజానం ద్రష్టుకామేన మ యాస్త్ర మనువర్తితమ్ ।**
**విముక్తో హ్యహ మస్త్రేణ రాక్షసై స్త్వభిపీడితః ॥ 17**

**పదచ్ఛేదము** :- రాజానం - ద్రష్టుకామేన - మయా - అస్త్రమ్ - అనువర్తితమ్, విముక్తః - హి - అహమ్ - అస్త్రేణ - రాక్షసైః - తు - అభిపీడితః ॥

**అన్వయక్రమము** :- రాజానం ద్రష్టుకామేన మయా అస్త్రమ్ అనువర్తితమ్. రాక్షసైః అభిపీడితః తు అహమ్ అస్త్రేణ విముక్తః.

**ప్రతిపదార్థము** :- రాజానం = రాక్షసరాజును, ద్రష్టుకామేన = చూడగోరినట్టి, మయా = నాచేత, అస్త్రమ్ = బ్రహ్మాస్త్రము, అనువర్తితమ్ = గౌరవింపబడినది. రాక్షసైః = రక్కసులచే, అభిపీడితః తు = తిరిగి బంధింపబడగనే, అస్త్రేణ = ఆ బ్రహ్మాస్త్రముచే, విముక్తః అస్మి = విడువబడిన వాడనైతిని.

**తాత్పర్యము** :- రాక్షసప్రభువైన నిన్ను చూచుటకొఱకే నేను బ్రహ్మాస్త్రమునకు వశుడనై యుంటిని కాని ఈ రాక్షసులు తిరిగి నన్ను బంధించుటచే నేనా యస్త్రబంధమునుండి విడిచి వేయబడితిని.

**శ్లో॥ కేనచి ద్రాజకార్యేణ సంప్రాప్తోఽస్మి తవాంతికమ్ ।**
**దూతోఽహ మితి విజ్ఞేయో రాఘవ స్యామితౌజసః ॥ 18**

**శ్లో॥ శ్రూయతాం చాపి వచనం మమ పథ్య మిదం ప్రభో ॥ 19**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"ప్రహస్తప్రశ్నో" నామ*
*పంచాశస్సర్గః*

**పదచ్ఛేదము** :- కేన - చిత్ - రాజకార్యేణ - సంప్రాప్తః - అస్మి - తవ - అంతికమ్, దూతః - అహమ్ - ఇతి - విజ్ఞేయః - రాఘవస్య - అమితౌజసః - శ్రూయతాం - చ - అపి - వచనం - మమ - పథ్యమ్ - ఇదం - ప్రభో ॥

**అన్వయక్రమము** :- కేనచిత్ రాజకార్యేణ తవ అంతికం సంప్రాప్తః అస్మి, అహమ్ అమితౌజసః రాఘవస్య దూతః, ఇతి విజ్ఞేయః. ప్రభో! పథ్యం ఇదం మమ వచనం చ అపి శ్రూయతామ్.

**ప్రతిపదార్థము** :- కేనచిత్ = ఒకానొక, రాజకార్యేణ = రాజకార్యముచే, తవ = నీయొక్క, అంతికం = సమీపమును, సంప్రాప్తః = చేరినవాడను, అస్మి = అగుచున్నాను. అహం = నేను, అమితౌజసః = అపరిమితమైన ప్రతాపము గల్గినట్టి, రాఘవస్య = శ్రీరామునియొక్క, దూతః = దూతను, ఇతి = అని, విజ్ఞేయః = తెలియదగిన వాడను, ప్రభో = రాజా! పథ్యం = హితమైనట్టి, ఇదం = ఈ, మమ = నాయొక్క, వచనం = మాట, శ్రూయతాం = వినబడుగాక!

**తాత్పర్యము** :- ఇప్పుడు నేను నీ కడకు వచ్చినది ఒకానొక రాజకార్యము గుఱించి సుమా! నేను మహాపరాక్రమసంపన్నుడైన శ్రీరాముని కడనుండి వచ్చిన దూతనని తెలిసికొనుము. రాజా, నీ మేలుగోరి నేను చెప్పుచున్న మాటను శ్రద్ధగా ఆలకింపుము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"ప్రహస్త ప్రశ్నము" అను*
*ఏబదియవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకపంచాశసర్గ

**శ్లో॥ తం సమీక్ష్య మహాసత్త్వం సత్త్వవాన్ హరిసత్తమః ।**
**వాక్య మర్థవ దవ్యగ్రస్త మువాచ దశాననమ్ ॥ 1**

**పదచ్ఛేదము** :- తం - సమీక్ష్య - మహాసత్త్వం - సత్త్వవాన్ - హరిసత్తమః - వాక్యమ్ - అర్థవత్ - అవ్యగ్రః - తమ్ - ఉవాచ - దశాననమ్ ॥

**అన్వయక్రమము** :- సత్త్వవాన్ హరిసత్తమః, మహాసత్త్వం తం సమీక్ష్య అవ్యగ్రః తం దశాననమ్ అర్థవత్ వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :- సత్త్వవాన్ = బలశాలియైన, హరిసత్తమః = వానరశ్రేష్ఠుడగు హనుమ, మహాసత్త్వం = మహాబలాఢ్యుడైన, తం = ఆ రావణుని, సమీక్ష్య = చూచి, అవ్యగ్రః = తొట్రుపాటు లేనివాడై, తం దశాననం = ఆ దశగ్రీవునిగూర్చి, అర్థవత్ = అర్థయుక్తమైనట్టి, వాక్యం = వాక్యమును, ఉవాచ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- "అర్థవత్ వాక్యం" - ఈ రావణుడు న్యాయానుసారియై సామోపాయమునకు తగియుండువా డగునో కాదో యని తెలిసికొనుటకై సుగ్రీవసందేశ వ్యాజమున సాభిప్రాయములైన వచనములను హనుమ పలుకుచున్నాడని భావము.

**తాత్పర్యము** :- అమితబలశాలియైన హనుమ మహాబలాఢ్యుడైన రావణుని చూచి ఎట్టి తొట్రుపాటును లేనివాడై తన దౌత్యకృత్యప్రయోజనమునకు అనుకూలములైన వచనములను రావణుని గూర్చి ఇట్లు పలికెను.

**శ్లో॥ అహం సుగ్రీవసందేశా దిహ ప్రాప్త స్త వాలయమ్ ।**
**రాక్షసేంద్ర హరీశ స్త్వాం భ్రాతా కుశల మబ్రవీత్ ॥ 2**

**పదచ్ఛేదము** :- అహం - సుగ్రీవసందేశాత్ - ఇహ - ప్రాప్తః - తవ - ఆలయమ్ - రాక్షసేంద్ర - హరీశః - త్వాం - భ్రాతా - కుశలమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :–** రాక్షసేంద్ర! అహం సుగ్రీవసందేశాత్ ఇహ తవ ఆలయం ప్రాప్తః. భ్రాతా హరీశః త్వాం కుశలమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** రాక్షసేంద్ర! = ఓ రాక్షసరాజా!, అహం = నేను, సుగ్రీవసందేశాత్ = సుగ్రీవుని సందేశమువలన, ఇహ = ఇచ్చట, తవ = నీయొక్క, ఆలయం = నివాసమును, ప్రాప్తః = చేరినవాడను. భ్రాతా = సోదరుడైన సుగ్రీవుడు, త్వాం = నిన్ను, కుశలమ్ అబ్రవీత్ = క్షేమము నడిగెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** సుగ్రీవసందేశాత్ – హనుమ చెప్పబోవు విషయము సుగ్రీవుడా పద్ధతిలో పూర్వము చెప్పకున్నను ఈ సందర్భమున చెప్పబోవునది యంతయును తన యజమానికి అనుకూలమైన దగు ననెడి భావముతో సుగ్రీవ సందేశమును తెలుపుచున్నా ననుచు హనుమ అట్లు చెప్పెను.

**తాత్పర్యము :–** ఓ రాక్షసేశ్వరా! నేను మా ప్రభువైన సుగ్రీవుని సందేశమును గొని నీ నివాసమునకు వచ్చియున్నాను. నీకు సోదరప్రాయుడైన మా వానరరాజు నిన్ను కుశల మడిగినాడు.

**శ్లో॥ భ్రాతు శ్శృణు సమాదేశం సుగ్రీవస్య మహాత్మనః ।**
**ధర్మార్థోపహితం వాక్య మిహ చాముత్ర చ క్షమమ్ ॥ 3**

**పదచ్ఛేదము :–** భ్రాతుః – శృణు – సమాదేశం – సుగ్రీవస్య – మహాత్మనః – ధర్మార్థోపహితం – వాక్యమ్ – ఇహ – చ – అముత్ర – చ – క్షమమ్ ॥

**అన్వయక్రమము :–** మహాత్మనః భ్రాతుః సుగ్రీవస్య సమాదేశం ధర్మార్థోపహితం ఇహ చ అముత్ర క్షమం వాక్యం శృణు.

**ప్రతిపదార్థము :–** మహాత్మనః = మహనీయుడైన, భ్రాతుః = సోదరుడగు, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, సమాదేశం = సందేశరూపమైన, ధర్మార్థోపహితం = ధర్మముతోడను, అర్థముతోడను కూడినట్టిదియును, ఇహ చ = ఈ లోకమునను, అముత్ర చ = పైలోకమునను, క్షమం = సమర్థమైనట్టిదియు నగు, వాక్యం = వాక్యమును, శృణు = ఆలకింపుము.

**తాత్పర్యము :–** మహాత్ముడగు నీ సోదరుడైన సుగ్రీవుడు ధర్మయుక్తముగను అర్థయుక్తముగను ఈ లోకమునను పైలోకమునను నీకు శ్రేయస్సును గూర్చు విధముగా తెలిపిన ఈ సందేశ వచనములను శ్రద్ధగా ఆలకింపుము.

**సూచన** :- (రావణుడును వాలియును భ్రాతృభావము గలవారమై యుందమని సంధి చేసికొనిరి).

**శ్లో॥ రాజా దశరథో నామ రథకుంజరవాజిమాన్ ।**
**పితేవ బంధు ర్లోకస్య సురేశ్వరసమద్యుతిః ॥ 4**

**పదచ్ఛేదము** :- రాజా - దశరథః - నామ - రథకుంజరవాజిమాన్, పితా - ఇవ - బంధుః - లోకస్య - సురేశ్వరసమద్యుతిః ॥

**అన్వయక్రమము** :- రథకుంజరవాజిమాన్, లోకస్య పితా ఇవ బంధుః, సురేశ్వరసమద్యుతిః దశరథః నామ రాజా (ఆసీత్).

**ప్రతిపదార్థము** :- రథకుంజరవాజిమాన్ = శ్రేష్ఠములైన రథములును ఏనుగులును గుఱ్ఱములును సమృద్ధిగ కలిగినట్టివాడును, లోకస్య = లోకమునకు, పితా ఇవ = తండ్రివలె, బంధుః = బంధువైన వాడును, సురేశ్వరసమద్యుతిః = దేవేంద్రునితో సమానమైన తేజస్సుగలవాడునగు, దశరథః నామ = దశరథుడను ప్రసిద్ధుడైన, రాజా = రాజు, ఆసీత్ = ఉండెను.

**తాత్పర్యము** :- అసంఖ్యాకములైన రాజవైభవచిహ్నములగు మేలుజాతి గుఱ్ఱములు ఏనుగులు రథములు కలిగినవాడును, ప్రజల నెల్లరను కన్నతండ్రివలె పరిపాలించిన వాడును, దేవేంద్రతుల్యమైన తేజస్సు గలవాడును అగు దశరథు డను జగద్విఖ్యాతుడైన రాజుండెను.

**శ్లో॥ జ్యేష్ఠ స్తస్య మహాబాహుః పుత్రః ప్రియకరః ప్రభుః ।**
**పితు ర్నిదేశా న్నిష్క్రాంతః ప్రవిష్టో దండకావనమ్ ॥ 5**

**శ్లో॥ లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చాపి భార్యయా ।**
**రామో నామ మహాతేజా ధర్మ్యం పంథాన మాశ్రితః ॥ 6**

**పదచ్ఛేదము** :- జ్యేష్ఠః - తస్య - మహాబాహుః - పుత్రః - ప్రియకరః - ప్రభుః - పితుః - నిదేశాత్ - నిష్క్రాంతః - ప్రవిష్టః - దండకావనమ్ - లక్ష్మణేన - సహ - భ్రాత్రా - సీతయా - చ - అపి - భార్యయా - రామః - నామ - మహాతేజాః - ధర్మ్యం - పంథానమ్ - ఆశ్రితః ॥

**అన్వయక్రమము** :- మహాబాహుః ప్రియకరః ప్రభుః తస్య జ్యేష్ఠః పుత్రః రామో నామ మహాతేజాః పితుః నిదేశాత్ నిష్క్రాంతః భ్రాత్రా లక్ష్మణేన, భార్యయా సీతయా చ అపి సహ ధర్మ్యం పంథానమ్ ఆశ్రితః దండకావనం ప్రవిష్టః.

**ప్రతిపదార్థము** :- మహాబాహుః = మహావీరుడును, ప్రియకరః = ప్రియమును గూర్చువాడును, ప్రభుః = సామర్థ్యవంతుడునగు, తస్య = ఆ దశరథునియొక్క, జ్యేష్ఠః పుత్రః = పెద్దకుమారుడు, రామో నామ = రాముడను ప్రసిద్ధుడైన, మహాతేజాః = గొప్ప తేజశ్శాలి, పితుః = తండ్రియొక్క, నిదేశాత్ = ఆజ్ఞవలన, నిష్క్రాంతః = ఇల్లు వెడలినవాడై, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన = లక్ష్మణునితోడను, భార్యయా = ధర్మపత్నియైన, సీతయా చ అపి = సీతతోడను గూడ, సహ = కూడి, ధర్మ్యం = ధర్మసమ్మతమైనట్టి, పంథానం = మార్గమును, ఆశ్రితః = ఆశ్రయించినవాడై, దండకావనం = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడయ్యెను.

**తాత్పర్యము** :- మహావీరుడును, లోకమునకు హితమును గూర్చువాడును, సర్వసమర్థుడును అగు ఆ దశరథుని పెద్దకుమారుడు శ్రీరాము డను సువిఖ్యాత మహాపురుషుడు తమ్ముడైన లక్ష్మణునితోడను అర్ధాంగియైన సీతతోడను గూడి తండ్రి ఆజ్ఞను శిరసావహించి అయోధ్యను వీడి దండకారణ్యమును ప్రవేశించెను.

**శ్లో॥ తస్య భార్యా వనే నష్టా సీతా పతి మనువ్రతా ।**
**వైదేహస్య సుతా రాజ్ఞో జనకస్య మహాత్మనః ॥ 7**

**పదచ్ఛేదము** :- తస్య - భార్యా - వనే - నష్టా - సీతా - పతిమ్ - అనువ్రతా - వైదేహస్య - సుతా - రాజ్ఞః - జనకస్య - మహాత్మనః ॥

**అన్వయక్రమము** :- వైదేహస్య రాజ్ఞః మహాత్మనః జనకస్య సుతా పతిమ్ అనువ్రతా తస్య భార్యా సీతా వనే నష్టా.

**ప్రతిపదార్థము** :- వైదేహస్య రాజ్ఞః = విదేహాధిపతియైనట్టి, మహాత్మనః = మహాత్ముడైన, జనకస్య = జనకుని యొక్క, సుతా = పుత్రికయును, పతిమ్ అనువ్రతా = భర్త ననుసరించి యుండునదియును అగు, తస్య భార్యా = ఆ శ్రీరామునిభార్యయైన, సీతా = జానకీదేవి, వనే = అరణ్యమునందు, నష్టా = అదృశ్యమైనది.

**తాత్పర్యము** :- విదేహదేశాధిపతియగు జనకమహారాజు పుత్రిక, రాముని భార్య, మహాపతివ్రత యగు సీతాదేవి దండకారణ్యమునందలి జనస్థానమున భర్తతో వసించుచుండగా దైవవశమున ఆమె అదృశ్యురాలైనది.

**శ్లో॥ స మార్గమాణ స్తాం దేవీం రాజపుత్ర స్సహానుజః ।**
**ఋశ్యమూక మనుప్రాప్త స్సుగ్రీవేణ సమాగతః ॥ 8**

**పదచ్ఛేదము** :- సః - మార్గమాణః - తాం - దేవీం - రాజపుత్రః - సహానుజః -

ఋశ్యమూకమ్ – అనుప్రాప్తః – సుగ్రీవేణ – సమాగతః ॥

**అన్వయక్రమము :–** సహానుజః సః రాజపుత్రః తాం దేవీం మార్గమాణః ఋశ్యమూకమ్ అనుప్రాప్తః సుగ్రీవేణ సమాగతః.

**ప్రతిపదార్థము :–** సహానుజః = తమ్మునితో కూడినట్టి, సః రాజపుత్రః = ఆ రాజకుమారుడైన శ్రీరాముడు, తాం దేవీం = ఆ సీతాదేవిని, మార్గమాణః = వెదకుచున్నవాడై, ఋశ్యమూకమ్ = ఋశ్యమూకపర్వతమును, అనుప్రాప్తః = చేరినవాడై, సుగ్రీవేణ = సుగ్రీవునితో, సమాగతః = కలసికొన్నవాడయ్యెను.

## విశేషార్థములు – వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఈ శ్లోకమునందలి వాక్యవిధానముచేత కూడ హనుమ చెప్పునది సుగ్రీవుని మాటలు గావనియు, ఆతని హృదయము ననుసరించి హనుమయే స్వయముగా అవసరమైన విషయము చెప్పుచున్నాడనియు తెలియుచున్నది.

**గోవిందరాజీయము :–** లోకమున కొందఱు వక్తలు తమను గుఱించి ప్రథమ పురుషములోనే చెప్పుకొను మర్యాద ఒకటి గలదు. సుగ్రీవు డిచట ఆ పద్ధతినే అవలంబించెనని అనుకొనవచ్చును. లేక సుగ్రీవుని మాటలను మనస్సునం దుంచుకొని హనుమ – రామసుగ్రీవుల సఖ్యము మున్నగు విషయములను స్వయముగనే వివరించుచున్నాడని గ్రహించవలెను.

**వాసుదాసస్వామి :–** ఉత్తమదూత తన ప్రభువు అభిప్రాయము ననుసరించి దానికి విరోధము గాకుండునట్లు ఏ మాటలైన చెప్పవచ్చును. ఏ పనియైన చేయవచ్చును. అదియును గాక రాజులు తమ్ము గుఱించి చెప్పునపుడు అస్మదర్థకముతో చెప్పక యన్యుడుగా చెప్పు మర్యాద గలదు.

**తాత్పర్యము :–** అప్పుడు శ్రీరాముడు తన తమ్ముడైన లక్ష్మణుడు వెంటనుండగా సీతాదేవిని వెదకుచు ఋశ్యమూకపర్వతమును చేరుకొని అచట సుగ్రీవునితో మైత్రి చేసికొనెను.

**శ్లో॥ తస్య తేన ప్రతిజ్ఞాతం సీతాయాః పరిమార్గణమ్ ।**
**సుగ్రీవస్యాపి రామేణ హరిరాజ్యం నివేదితమ్ ॥ 9**

**పదచ్ఛేదము :–** తస్య – తేన – ప్రతిజ్ఞాతం – సీతాయాః – పరిమార్గణమ్ – సుగ్రీవస్య – అపి – రామేణ – హరిరాజ్యం – నివేదితమ్ ॥

**అన్వయక్రమము :–** తేన తస్య (సన్నిధౌ) సీతాయాః పరిమార్గణం ప్రతిజ్ఞాతమ్. రామేణ అపి సుగ్రీవస్య హరిరాజ్యం నివేదితమ్.

**ప్రతిపదార్థము :–** తేన = ఆ సుగ్రీవునిచే, తస్య = ఆ శ్రీరామునియొక్క (సన్నిధౌ = సన్నిధిని) సీతాయాః = సీతాదేవియొక్క, పరిమార్గణం = అన్వేషణమును గూర్చి, ప్రతిజ్ఞాతం = ప్రతిజ్ఞ చేయబడినది, రామేణ అపి = శ్రీరామునిచే గూడ, సుగ్రీవస్య = సుగ్రీవునకు, హరిరాజ్యం = వానరరాజ్యము, నివేదితం = వాగ్దానము చేయబడినది.

**తాత్పర్యము :–** అప్పు డచ్చట సుగ్రీవుడు తాను సీతాన్వేషణము గావించెదనని ప్రతిజ్ఞ యొనర్చెను. శ్రీరాముడు గూడ సుగ్రీవునకు వానరరాజ్యమును ఒసగెదనని ప్రతిజ్ఞ చేసెను.

**శ్లో॥ తత స్తేన మృధే హత్వా రాజపుత్రేణ వాలినమ్ ।**
**సుగ్రీవ స్థాపితో రాజ్యే హర్యృక్షాణాం గణేశ్వరః ॥ 10**

**పదచ్ఛేదము :–** తతః – తేన – మృధే – హత్వా – రాజపుత్రేణ – వాలినమ్ – సుగ్రీవః – స్థాపితః – రాజ్యే – హర్యృక్షాణాం – గణేశ్వరః ॥

**అన్వయక్రమము :–** తతః తేన రాజపుత్రేణ మృధే వాలినం హత్వా హర్యృక్షాణాం రాజ్యే సుగ్రీవః గణేశ్వరః స్థాపితః.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, తేన రాజపుత్రేణ = ఆ రాజపుత్రుడైన శ్రీరామునిచే, మృధే = యుద్ధమునందు, వాలినం = వాలిని, హత్వా = చంపి, హర్యృక్షాణాం = వానరులయొక్కయు, భల్లూకములయొక్కయు, రాజ్యే = రాజ్యమునందు, సుగ్రీవః = సుగ్రీవుడు, గణేశ్వరః = రాజుగా, స్థాపితః = స్థాపింపబడెను.

**తాత్పర్యము :–** అటుపిమ్మట శ్రీరాముడు యుద్ధమునందు వాలిని సంహరించి వానర రాజ్యమునకు సుగ్రీవుని ప్రభువును గావించెను.

**శ్లో॥ త్వయా విజ్ఞాతపూర్వశ్చ వాలీ వానరపుంగవః ।**
**స తేన నిహతః సంఖ్యే శరేణైకేన వానరః ॥ 11**

**పదచ్ఛేదము :–** త్వయా – విజ్ఞాతపూర్వః – చ – వాలీ – వానరపుంగవః – సః – తేన – నిహతః – సంఖ్యే – శరేణ – ఏకేన వానరః ॥

**అన్వయక్రమము :–** వానరపుంగవః వాలీ త్వయా విజ్ఞాతపూర్వః; సః వానరః సంఖ్యే తేన ఏకేన శరేణ నిహతః.

**ప్రతిపదార్థము** :- వానరపుంగవః = వానరశ్రేష్ఠుడైనట్టి, వాలీ = వాలి, త్వయా = నీచేత, విజ్ఞాతపూర్వః చ = బాగుగా తెలియబడియున్నవాడే కూడను, సః వానరః = ఆ వానరుడైన వాలి, సంఖ్యే = యుద్ధమునందు, తేన (రామేణ) = ఆ శ్రీరామునిచే, ఏకేన శరేణ = ఒక్కబాణముచే, నిహతః = సంహరింపబడినాడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'వాలీ త్వయా విజ్ఞాతపూర్వః - చ - అనుటలో వాలి పరాక్రమమును అతనిచే రావణునకు జరిగినట్టి పరాభవమును అట్టి వానిని చంపిన శ్రీరాముని ఉత్కర్షయు హనుమ ఇచట వ్యంగ్యముగ తెలుపుచున్నాడని గ్రహింపవలెను.

**తాత్పర్యము** :- వానరశ్రేష్ఠుడైన వాలిని నీవు పూర్వమునుండియు బాగుగ నెఱుగుదువుగదా! అట్టి మహావీరుడైన వాలిని యుద్ధమున శ్రీరాముడు ఒక్క బాణముచేతనే నేలగూల్చినాడు సుమా!

**శ్లో॥ స సీతామార్గణే వ్యగ్ర స్సుగ్రీవ స్సత్యసంగరః ।**
**హరీన్ సంప్రేషయామాస దిశ స్సర్వా హరీశ్వరః ॥ 12**

**పదచ్ఛేదము** :- సః - సీతామార్గణే - వ్యగ్రః - సుగ్రీవః - సత్యసంగరః - హరీన్ - సంప్రేషయామాస - దిశః - సర్వాః - హరీశ్వరః ॥

**అన్వయక్రమము** :- సత్యసంగరః సః హరీశ్వరః సుగ్రీవః సీతామార్గణే వ్యగ్రః సర్వాః దిశః హరీన్ సంప్రేషయామాస.

**ప్రతిపదార్థము** :- సత్యసంగరః = సత్య ప్రతిజ్ఞ కలిగినట్టి, హరీశ్వరః = వానరరాజగు, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, సీతామార్గణే = సీతాన్వేషణమునందు, వ్యగ్రః = ఆత్రముగలవాడై, సర్వాః దిశః = ఎల్లదిక్కులను, హరీన్ = వానరులను, సంప్రేషయామాస = పంపెను.

**తాత్పర్యము** :- సత్యప్రతిజ్ఞుడైన ఆ వానరరాజగు సుగ్రీవుడు సీతాన్వేషణమునందు మిక్కిలి ఉత్సుకత గలవాడై ఎల్లదిక్కులకును తన యనుచరులైన వానరులను బంపెను.

**శ్లో॥ తాం హరీణాం సహస్రాణి శతాని నియుతాని చ ।**
**దిక్షు సర్వాసు మార్గంతే హ్యధ శ్చోపరి చాంబరే ॥ 13**

**పదచ్ఛేదము** :- తాం - హరీణాం - సహస్రాణి - శతాని - నియుతాని - చ - దిక్షు - సర్వాసు - మార్గంతే - హి - అధః - చ - ఉపరి - చ - అంబరే ॥

**అన్వయక్రమము** :– హరీణాం శతాని, సహస్రాణి, నియుతాని చ సర్వాసు దిక్షు అధః ఉపరి చ అంబరే చ తాం మార్గంతే.

**ప్రతిపదార్థము** :– హరీణాం = వానరులయొక్క, శతాని = వందలును, సహస్రాణి = వేలును, నియుతాని చ = లక్షలును, సర్వాసు = సమస్తములైన, దిక్షు = దిక్కులందును, అధః = పాతాళమునందును, ఉపరి చ = పైనున్న భూమియందును, అంబరే చ = ఆకాశమునందును, తాం = సీతాదేవిని, మార్గంతే = వెదకుచున్నారు.

**తాత్పర్యము** :– ఆ సీతాదేవికొఱకై వేలకొలది, లక్షలకొలది వానరు లెల్ల దిక్కులందును, పాతాళమునందును, భూమ్యాకాశములందును గూడ శ్రద్ధగా వెదుకుచున్నారు.

**శ్లో॥ వైనతేయసమాః కేచి త్కేచి త్తత్రానిలోపమాః ।**
**అసంగగతయ శ్శీఘ్రా హరివీరా మహాబలాః ॥ 14**

**పదచ్ఛేదము** :– వైనతేయసమాః – కేచిత్ – కేచిత్ – తత్ర – అనిలోపమాః – అసంగగతయః – శీఘ్రాః – హరివీరాః – మహాబలాః ॥

**అన్వయక్రమము** :– తత్ర కేచిత్ మహాబలాః హరివీరాః వైనతేయసమాః, కేచిత్ అనిలోపమాః అసంగగతయః శీఘ్రాః.

**ప్రతిపదార్థము** :– తత్ర = ఆ వానరసైన్యమునందు, మహాబలాః = మహాబలాఢ్యులైన, హరివీరాః = వానరవీరులు, కేచిత్ = కొంతమంది, వైనతేయసమాః = గరుత్మంతునితో సమానమైనవారు, కేచిత్ = కొంతమంది, అనిలోపమాః = వాయువుతో సమానులై, అసంగగతయః = సాటిలేని గమనముగల్గినవారైన, శీఘ్రాః = వేగవంతులైనవారును.

**తాత్పర్యము** :– ఆ వానరసైన్యమునందు మహాబలాఢ్యులైన కొందరు వానరవీరులు గరుత్మంతునితో సమానమైనవారు, మఱికొందరు వాయుదేవునితో సమానులై సాటిలేని గమనశక్తిగల అమితవేగశాలురును సుమా!

**శ్లో॥ అహం తు హనుమాన్నామ మారుత స్యౌరస స్సుతః ।**
**సీతాయాస్తు కృతే తూర్ణం శతయోజన మాయతమ్ ॥ 15**

**శ్లో॥ సముద్రం లంఘయిత్వైవ తాం దిదృక్షు రిహాగతః ।**
**భ్రమతా చ మయా దృష్టా గృహే తే జనకాత్మజా ॥ 16**

**పదచ్ఛేదము** :– అహం – తు – హనుమాన్ – నామ – మారుతస్య – ఔరసః – సుతః – సీతాయాః – తు – కృతే – తూర్ణం – శతయోజనమ్ – ఆయతమ్ –

సముద్రం – లంఘయిత్వా – ఏవ – తాం – దిదృక్షుః – ఇహ – ఆగతః – భ్రమతా – చ – మయా – దృష్టా – గృహే – తే – జనకాత్మజా ॥

**అన్వయక్రమము :–** మారుతస్య ఔరసః సుతః హనుమాన్ నామ అహం తు సీతాయాః కృతే శతయోజనమ్ ఆయతం సముద్రం తూర్ణం లంఘయిత్వా తాం దిదృక్షుః ఏవ ఇహ ఆగతః; తే గృహే భ్రమతా మయా జనకాత్మజా దృష్టా చ.

**ప్రతిపదార్థము :–** మారుతస్య = వాయుదేవునియొక్క, ఔరసః సుతః = ఔరస పుత్రుడనగు, హనుమాన్ నామ = హనుమంతు డనెడు, అహం తు = నేనుమాత్రము, సీతాయాః కృతే = సీతాదేవికొరకై, శతయోజనం = నూఱామడల, ఆయతం = పొడవైనట్టి, సముద్రం = సాగరమును, లంఘయిత్వా = దాటి, తాం = ఆ సీతాదేవిని, దిదృక్షుః ఏవ = చూడగోరినవాడనయియే, ఇహ = ఇచ్చటికి, ఆగతః = వచ్చినాడను. తే = నీయొక్క, గృహే = భవనమునందు, భ్రమతా = తిరుగుచున్నట్టి, మయా = నాచేత, జనకాత్మజా = సీతాదేవి, దృష్టా చ = చూడబడినది కూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'తాం దిదృక్షుః ఇహ ఆగతః' అనుటకు బదులుగా 'త్వాం దిదృక్షుః ఇహ ఆగతః' అని బొంబాయి ముద్రణమున గలదు. దాని ననుసరించి మా సుగ్రీవునకు సోదరుడవైన నిన్ను కలసికొన్నచో సర్వలోకవృత్తాంతములు తెలిసియున్న నీవు మాకు సీతమ్మ వృత్తాంతమును తెలుపగలవని మాకు సుగ్రీవుడు చెప్పియుండుటచే నేనిచ్చటికి నిన్ను చూడగోరియే వచ్చితినని భావము. దైవవశమున కుంటివాని మీద గంగాజలము బడినట్లుగ మా సీతమ్మ దర్శనము కూడ నిటనే లభించినది అని హనుమ వచనముల భావము.

**రా.శిరోమణి :–** మారుతస్య ఔరసః సుతః – తాను కేసరికి క్షేత్రజపుత్రుడననియు, వాయుదేవునకు ఔరసపుత్రుడననియు ఈ రీతిగా హనుమ తెలుపుచున్నాడని గ్రహించవలెను.

**వాసుదాసస్వామి :–** నేను అన్ని ప్రదేశములను వెదకినట్లే ఇటుకూడ వెదుకవచ్చితిని. నీవు లంకకు బోయినపుడు మా యన్న రావణు నడుగుము. ఆయన అన్నిలోకములయొక్క వృత్తాంతములు తెలిసినవాడు. నీకు సీత వృత్తాంతము తెలుపునని సుగ్రీవుడు చెప్పియుండెను. ఆ మాట ప్రకారము నీకై వెదకుచుండగా నీతో మాట్లాడుటకు ముందు సీతయే గానవచ్చెనని భావము. నీ దర్శనము మాకు దుర్లభమని తక్కిన కార్యము చేసితిని అని భావము.

**తాత్పర్యము** :- వాయుదేవున కౌరసపుత్రుడనైన నన్ను హనుమంతు డందురు. సీతాదేవికొఱకై నూఱామడల సముద్రమును మహావేగముతో లంఘించి ఆమెను చూడగోరియే నే నీ లంకానగరమునకు వచ్చియున్నాను. నీ భవనమునందు పరిభ్రమించుచు నేను మా సీతమ్మను కనుగొంటిని.

**శ్లో॥ త ద్భవాన్ దృష్టధర్మార్థ స్తపఃకృతపరిగ్రహః ।**
**పరదారాన్ మహాప్రాజ్ఞ నోపరోద్ధుం త్వ మర్హసి ॥ 17**

**పదచ్ఛేదము** :- తత్ - భవాన్ - దృష్టధర్మార్థః - తపఃకృతపరిగ్రహః - పరదారాన్ - మహాప్రాజ్ఞ - న - ఉపరోద్ధుం - త్వమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము** :- మహాప్రాజ్ఞ ! (యత్) భవాన్ దృష్టధర్మార్థః తపఃకృతపరిగ్రహః తత్ త్వం పరదారాన్ ఉపరోద్ధుం న అర్హసి.

**ప్రతిపదార్థము** :- మహాప్రాజ్ఞ = ఓ వివేకసంపన్నుడా! (యత్ = ఎందువల్లనైతే) భవాన్ = నీవు, దృష్టధర్మార్థః = గ్రహించిన ధర్మతత్త్వము గలవాడవును, తపః కృతపరిగ్రహః =తపశ్శక్తిచే సాధించుకొన్న విభవము గలవాడవు (అయియుంటివో), తత్ = అందువలన, త్వం = నీవు, పరదారాన్ = పరుల భార్యలను, ఉపరోద్ధుం = అడ్డగించుటకు, న అర్హసి = తగవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'దృష్టధర్మార్థః' - శాస్త్రముచే బోధపరచుకొన్న ధర్మముయొక్కయు అర్థముయొక్కయును స్వరూపము గలవాడవు. 'తపఃకృతపరిగ్రహః' - స్వయముగా తపస్సుచేతనే పరిగ్రహింపబడినట్టి మహావైభవసంపన్నుడవు గావున నీ కిట్టి పని తగదని సుగ్రీవుడు స్వయముగా చెప్పిన మాటలుగా గ్రహించవలెను.

**వాసుదాసస్వామి** :- గురువువద్ద 'తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా' అన్నట్లు అధ్యయనము, బోధము, ఆచరణము, ప్రచారణము అను నాలుగు రీతులుగా, శాస్త్రధర్మమును చదివినవాడవు.

**తాత్పర్యము** :- నీవు సమస్త ధర్మశాస్త్రములందలి విషయములును తెలిసినవాడవు. తపశ్శక్తిచే ఎన్నో విభవములను సాధించినవాడవు. అట్టి మహాప్రాజ్ఞుడవైన నీకు పరభార్యలను చెఱబట్టుట ఎంత మాత్రమును తగదు సుమా!

**శ్లో॥ నహి ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు కర్మసు ।**
**మూలఘాతిషు సజ్జంతే బుద్ధిమంతో భవద్విధాః ॥ 18**

**పదచ్ఛేదము** :– నహి – ధర్మవిరుద్ధేషు – బహ్వపాయేషు – కర్మసు – మూలఘాతిషు – సజ్జంతే – బుద్ధిమంతః – భవద్విధాః ॥

**అన్వయక్రమము** :– భవద్విధాః ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు మూలఘాతిషు కర్మసు నహి సజ్జంతే.

**ప్రతిపదార్థము** :– భవద్విధాః = నీవంటివారైన, బుద్ధిమంతః = ప్రాజ్ఞులైనవారు, ధర్మవిరుద్ధేషు = ధర్మమునకు విరుద్ధమైనవియును, బహ్వపాయేషు = బహుళములైన అపాయములు గల్గినట్టివియును, మూలఘాతిషు = మూలమునకే వినాశము కల్గించునవియునగు, కర్మసు = పనులందు, నహి సజ్జంతే = ఆసక్తులుగారుగదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– ధర్మవిరుద్ధేషు బహ్వపాయేషు మూలఘాతిషు – ధర్మశాస్త్రవిరుద్ధములైన కర్మలను సుఖసంపాదనకొఱకు చేయుచున్నాను అనరాదు. నీ కృత్యములు బహువిధములైన అపాయములతో నిండినవి. నే నపాయములకు వెఱవను అనరాదు, నీ కృత్యములు మూలమునకే వినాశము తెచ్చునట్టివి కాబట్టి నీ ప్రజ్ఞ యంతయును వ్యర్థమని తెలిసికొనవలెను సుమా యని భావము.

**తాత్పర్యము** :– బుద్ధిమంతులైన నీబోటివాడు ఎవ్వడును ధర్మవిరుద్ధములును, బహు ప్రమాద భూయిష్ఠములును, మూలమునకే వినాశమును గల్గించునట్టివియునగు ఇట్టి అకృత్యములకు పాల్పడడు సుమా!

**శ్లో॥ కశ్చ లక్ష్మణముక్తానాం రామకోపానువర్తినామ్ ।**
**శరాణా మగ్రత స్థాతుం శక్తో దేవాసురేష్వపి ॥ 19**

**పదచ్ఛేదము** :– కః – చ – లక్ష్మణముక్తానాం – రామకోపానువర్తినామ్ – శరాణామ్ – అగ్రతః – స్థాతుం – శక్తః – దేవాసురేషు – అపి ॥

**అన్వయక్రమము** :– రామకోపానువర్తినాం లక్ష్మణముక్తానాం శరాణామ్ అగ్రతః స్థాతుం దేవాసురేషు అపి శక్తః కః.

**ప్రతిపదార్థము** :– రామకోపానువర్తినాం =శ్రీరాముని క్రోధమును వెల్లడించునవియును, లక్ష్మణముక్తానాం = లక్ష్మణునిచే ప్రయోగింపబడినవియునగు, శరాణామ్ = బాణములయొక్క, అగ్రతః = ఎదుట, స్థాతుం = నిలుచుటకు, దేవాసురేషు అపి = దేవతలందును దానవులందును గూడ, శక్తః = సమర్థుడు, కః = ఎవ్వడు(న్నాడు)?

**తాత్పర్యము :–** శ్రీరాముని క్రోధకారణముగా వెడలి, లక్ష్మణునిచే ప్రయోగింపబడినట్టి నిశితాస్త్రములను యుద్ధభూమియందు ఎదురొడ్డి నిలువగలవాడు దేవదానవులలో ఎవడున్నాడో ఆలోచించుకొంటివా?

**శ్లో॥ న చాపి త్రిషు లోకేషు రాజన్ విద్యేత కశ్చన ।**
**రాఘవస్య వ్యలీకం యః కృత్వా సుఖ మవాప్నుయాత్ ॥ 20**

**పదచ్ఛేదము :–** న – చ – అపి – త్రిషు – లోకేషు – రాజన్ – విద్యేత – కః – చన – రాఘవస్య – వ్యలీకం – యః – కృత్వా – సుఖమ్ – అవాప్నుయాత్ ॥

**అన్వయక్రమము :–** రాజన్! రాఘవస్య వ్యలీకం కృత్వా యః సుఖమ్ అవాప్నుయాత్ సః త్రిషు లోకేషు చ అపి కశ్చన న విద్యేత.

**ప్రతిపదార్థము :–** రాజన్ = ఓ రాజా! రాఘవస్య = శ్రీరామునకు, వ్యలీకం = అప్రియమును, కృత్వా = చేసి, యః = ఎవ్వడు, సుఖమ్ = సుఖమును, అవాప్నుయాత్ = పొందగల్గునో, సః = అట్టివాడు, త్రిషు లోకేషు చ అపి = మూడులోకముల యందునుకూడ, కశ్చన = ఎవ్వడును, న విద్యేత = ఉండడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి :–** "త్రిషు లోకేషు కశ్చన న విద్యతే" మహాపాతకములకు ప్రాయశ్చిత్తము చేసికొని, దేహాంతరములం దనుభవింప వలసిన పాపములను నివృత్తి చేసికొనుటకు వీలుండవచ్చును గాని శ్రీరామున కపరాధము గావించుట యను పాతకమునకు నివృత్తియు శ్రేయఃప్రాప్తియు మాత్రము ఆయన అనుగ్రహములేనిదే లభించదని భావము.

**తాత్పర్యము :–** ఓ రాక్షసేశ్వరా! శ్రీరామునియెడ నపరాధము గావించి అతనికి క్రోధము కల్గించి సుఖము పొందగలుగువాడు ముల్లోకములందును ఎవ్వడు నుండబోడు సుమా!

**శ్లో॥ తత్త్రికాలహితం వాక్యం ధర్మ్య మర్థానుబంధి చ ।**
**మన్యస్వ నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్ ॥ 21**

**పదచ్ఛేదము :–** తత్ – త్రికాలహితం – వాక్యం – ధర్మ్యమ్ – అర్థానుబంధి – చ – మన్యస్వ – నరదేవాయ – జానకీ – ప్రతిదీయతామ్ ॥

**అన్వయక్రమము :–** తత్, వాక్యం త్రికాలహితం ధర్మ్యమ్ అర్థానుబంధి చ మన్యస్వ

నరదేవాయ జానకీ ప్రతిదీయతామ్.

**ప్రతిపదార్థము** :- తత్ = అందువలన, వాక్యం = నా మాటను, త్రికాలహితం = భూతభవిష్యద్వర్తమాన కాలములందు హితమైనదిగాను, ధర్మ్యమ్ = ధర్మసమ్మతమైనదిగాను, అర్థానుబంధి చ = ప్రయోజనమును గూర్చునదిగాను, మన్యస్వ = తలచుము, నరదేవాయ = నరరూపమున నున్న దేవుడైన శ్రీరామునకు, జానకీ = సీతాదేవి, ప్రతిదీయతామ్ = తిరిగి ఈయబడుగాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'త్రికాలహితం' = సీతను ఇచ్చివేయుటవలన భూతకాలమునందు అపరాధము తొలగును, వర్తమానమునందు ఐశ్వర్యమునకు వినాశము లేకుండును, భవిష్యత్తునందు శుభములు గల్గించును సుమా యని భావము. 'నరదేవాయ' యనుటకు బదులు 'నరశార్దూల' యని రావణసంబోధనపరముగ పాఠాంతరము.

**గోవిందరాజీయము** :- ప్రస్తుతము చేయునట్టి కృత్యము భూతకాలహితము అగుట ఎట్లనగా దారుణమైన యధర్మము తత్కర్తయొక్క పూర్వపురుషులకుగూడ హానిని గూర్చును గావున ప్రస్తుత అధర్మమును విడిచినచో భూతకాలహితముగూడ సాధించుకొనినట్లగును అని భావము.

**తాత్పర్యము** :- అందువలన రామునియెడల అపరాధము గావించినట్టివానికి వినాశము తప్పదు గనుక భూతభవిష్యత్వర్తమానకాలములందు నీకు మేలు గల్గించునట్టి నా మాట ధర్మయుక్తమైనట్టిది, పరమార్థప్రదమైనట్టిది అని తెలిసికొని సీతాదేవిని శ్రీరామునకు తిరిగి అప్పగింపుము.

**శ్లో॥ దృష్టా హీయం మయా దేవీ లబ్ధం య దిహ దుర్లభమ్ ।**
**ఉత్తరం కర్మ య చ్ఛేషం నిమిత్తం తత్ర రాఘవః ॥ 22**

**పదచ్ఛేదము** :- దృష్టా - హి - ఇయం - మయా - దేవీ - లబ్ధం - యత్ - ఇహ - దుర్లభమ్ - ఉత్తరం - కర్మ - యత్ - శేషం - నిమిత్తం - తత్ర - రాఘవః ॥

**అన్వయక్రమము** :- మయా ఇయం దేవీ దృష్టా హి; యత్ దుర్లభం (తత్) ఇహ లబ్ధమ్; ఉత్తరం శేషం యత్ కర్మ తత్ర రాఘవః నిమిత్తమ్.

**ప్రతిపదార్థము** :- మయా = నాచేత, ఇయం దేవీ = ఈ సీతాదేవి, దృష్టా హి = చూడబడినది సుమా! యత్ = ఏది, దుర్లభం = పొందశక్యముగానిదో, తత్ = అది, ఇహ = ఇచ్చట, లబ్ధం = పొందబడినది, ఉత్తరం = తరువాతిదగు, శేషం =

మిగిలినది, యత్ కర్మ = ఏ కృత్యమున్నచో, తత్ర = దాని విషయమున, రాఘవః = శ్రీరాముడు, నిమిత్తం = ప్రమాణము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** దృష్టా దేవీ! – సీతాదేవి నావద్ద లేదని నీవు అపలాపించుటకు వీలులేదు. నాకన్నులతో నేనామెను ఈ లంకయందే చూచితినని భావము. నిమిత్తం తత్ర రాఘవః– చూచిన సీతను తీసికొనిపోవుటయో లేక ఆమెకై యుద్ధముచేయుటయో అనునది మా పనిగాదు. మా పని చూచి వెళ్లుటయే. మిగిలిన కార్యమును నిర్ణయింపవలసిన వాడు శ్రీరాముడని భావము.

**తాత్పర్యము :–** సీతాదేవిని నేనిచ్చట జూచియేయున్నాను. మా ఇతరవానరులకు అసాధ్యమైన సీతాదర్శనభాగ్యము నాకు లభించినది. చూచివచ్చుటయను నా పని పూర్తి అయినది తరువాత మిగిలియున్న పనిని శ్రీరాముడే నిర్ణయించవలసియున్నది.

**శ్లో॥ లక్షితేయం మయా సీతా తథా శోకపరాయణా ।**
**గృహ్యా యాం నాభిజానాసి పంచాస్యా మివ పన్నగీమ్ ॥ 23**

**పదచ్ఛేదము :–** లక్షితా – ఇయం – మయా – సీతా – తథా – శోకపరాయణా – గృహ్యా – యాం – న – అభిజానాసి – పంచాస్యామ్ – ఇవ – పన్నగీమ్ ॥

**అన్వయక్రమము :–** యాం పంచాస్యాం పన్నగీం గృహ్యా ఇవ న అభిజానాసి సా ఇయం సీతా తథా శోకపరాయణా మయా లక్షితా.

**ప్రతిపదార్థము :–** యాం = ఎవరినయితే, పంచాస్యాం = ఐదునోరులు గల, పన్నగీం = త్రాచును, గృహ్యా ఇవ = పట్టుకొనివలె, న అభిజానాసి = తెలిసికొనలేకున్నావో, ఇయం (సా)సీతా = అట్టి ఈ సీతాదేవి, తథా = ఆ రీతిగా, శోకపరాయణా = శోకమగ్నురాలుగా, మయా = నాచేత, లక్షితా = చూడబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** పంచాస్యాం పన్నగీం – సీతాదేవి శోకాగ్నిచేతనే ఐదుతలల త్రాచు కోరలందలి విషాగ్నిచేతవలె నీ లంకానగరము దగ్ధము కాగలదని భావము.

**రా. శిరోమణి :–** "గృహ్యా" అనుటకు బదులుగా "గృహే" అని పాఠాంతరము. నీవే దొంగిలించి తెచ్చిన సీతాదేవి, ఇంటిలో నున్న భయంకరమైన ఐదుతలల త్రాచుపామని నీవు గుర్తింపలేకున్నావు అని భావము.

**గోవిందరాజీయము** :- 'తథా శోకపరాయణా' - వాక్కులతో వర్ణింపజాలనట్టి శోకస్థితిలో నున్నట్టి సీతాదేవి యని భావము.

**మహేశ్వరతీర్థులు** :- పరమపతివ్రతయైన సీతమ్మ శోకపరాయణయై నీ లంకలో బంధింపబడుటచే నీ లంక నశించునని భావము.

**తాత్పర్యము** :- శోకపరాయణురాలుగా దీనస్థితిలో నున్న సీతను నేను జూచితిని. ఆమె నట్లు బంధించుట ఐదుతలల త్రాచుపామును చేతితో పట్టియుండుటయే యని నీవు తెలిసికొనలేకున్నావు.

**శ్లో॥ నేయం జరయితుం శక్యా సాసురై రమరై రపి ।**
**విషసంసృష్ట మత్యర్థం భుక్త మన్న మివౌజసా ॥ 24**

**పదచ్ఛేదము** :- న - ఇయం - జరయితుం - శక్యా - సాసురైః - అమరైః - అపి, విషసంసృష్టమ్ - అత్యర్థం - భుక్తమ్ - అన్నమ్ - ఇవ - ఓజసా ॥

**అన్వయక్రమము** :- సాసురైః అమరైః అపి ఇయం భుక్తమ్ అత్యర్థం విషసంసృష్టమ్ అన్నం ఇవ ఓజసా జరయితుం న శక్యా.

**ప్రతిపదార్థము** :- సాసురైః = రాక్షసులతో గూడిన, అమరైః అపి = దేవతలచేగూడ, ఇయం = ఈ సీతాదేవి, భుక్తం = భుజింపబడిన, అత్యర్థం = మిక్కిలిగా, విషసంసృష్టం = విషమిశ్రితమైనట్టి, అన్నమ్ ఇవ = ఆహారమువలె, ఓజసా = ప్రతాపముచే (జఠరాగ్నిచే) జరయితుం = జీర్ణించుకొనుటకు (దక్కించుకొనుటకు), శక్యా న = సాధ్యమైనదిగాదు.

**తాత్పర్యము** :- మిక్కిలిగా విషము కలిపియున్న అన్నమును తిని జఠరాగ్నిబలముచే జీర్ణించుకొనుట సాధ్యము గానట్లుగా ఈ సీతాదేవిని బంధించి దేవతలును రాక్షసులును గూడ దక్కించుకొనజాలరు.

**శ్లో॥ తపస్సంతాపలబ్ధ స్తే యోఽయం ధర్మపరిగ్రహః ।**
**న స నాశయితుం న్యాయ్య ఆత్మప్రాణపరిగ్రహః ॥ 25**

**పదచ్ఛేదము** :- తపస్సంతాపలబ్ధః - తే - యః - అయం - ధర్మపరిగ్రహః - న - సః - నాశయితుం - న్యాయ్యః - ఆత్మప్రాణపరిగ్రహః ॥

**అన్వయక్రమము** :- తపస్సంతాపలబ్ధః ధర్మపరిగ్రహః తే యః ఆత్మప్రాణపరిగ్రహః (అస్తి) సః అయం నాశయితుం న్యాయ్యః న.

**ప్రతిపదార్థము** :– తపస్సంతాపలబ్ధః = తపఃక్లేశముచే పొందబడినదియును, ధర్మపరిగ్రహః = ధర్మసంపదతో కూడినదియునగు, తే = నీయొక్క, యః = ఏ, ఆత్మప్రాణపరిగ్రహః = చిరకాల జీవిత మనెడి సంపదయున్నదో, సః అయం = అయ్యది, నాశయితుం = నశింపచేసికొనుటకు, న్యాయ్యః న = యుక్తముగాదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– నాశయితుం న న్యాయ్యః – పరభార్యాపహరణ రూపమైన అధర్మముచేత నీ భాగ్యమును నశింపజేసికొనుట తగదని భావము.

**తాత్పర్యము** :– గొప్ప తపఃక్లేశముచే సంపాదించుకొన్న పరమధర్మరూపమైన సంపదయును, తత్ఫలితముగా నీవు సంపాదించుకొన్న చిరకాలజీవనభాగ్యమును ఇట్టి యధర్మాచరణమువలన నశింపజేసికొనుట నీ కుచితము గాదు సుమా!

**శ్లో॥ అవధ్యతాం తపోభిర్యాం భవాన్సమనుపశ్యతి ।**
**ఆత్మనస్సాసురై ర్దేవైర్హేతు స్తత్రాప్యయం మహాన్ ॥ 26**

**పదచ్ఛేదము** :– అవధ్యతాం – తపోభిః – యాం – భవాన్ – సమనుపశ్యతి, ఆత్మనః – సాసురైః – దేవైః – హేతుః – తత్ర – అపి – అయం – మహాన్ ॥

**అన్వయక్రమము** :– భవాన్ తపోభిః సాసురైః దేవైః ఆత్మనః యామ్ అవధ్యతాం సమనుపశ్యతి, తత్ర అపి అయం మహాన్ హేతుః (అస్తి).

**ప్రతిపదార్థము** :– భవాన్ = నీవు, తపోభిః = తపస్సులచే, సాసురైః = రాక్షసులతో గూడినట్టి, దేవైః = దేవతలచే, ఆత్మనః = నీకు, యామ్ అవధ్యతాం = ఏ మృత్యురాహిత్యమును, సమనుపశ్యతి = చూచుకొనుచున్నావో, తత్ర అపి = ఆ విషయమునందుగూడ, అయం = ఈ, మహాన్ = గొప్పదైన, హేతుః = కారణము, అస్తి = ఉన్నది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'తత్రాపి అయం మహాన్ హేతుః' – నీవు సాధించుకొన్న అవధ్యత్వవరమునకు నీ గొప్పధర్మబలమే కారణము. దానిని క్షీణింపజేసికొనకుమని భావము.

**మహేశ్వరతీర్థులు** :– నీ అవధ్యత్వవరము సుగ్రీవాదులయెడ ఫలింపదు అని నేను ముందు తెలుపబోవునట్టి కారణమును గ్రహింపుమని భావము.

**తాత్పర్యము** :– నేను గొప్ప తపస్సు జేసి దేవాసురులకు అవధ్యుడనై యుండునట్టి వరమును సంపాదించుకొంటిని గదా యని నీవు అనుకొనుచున్నావు; ఆ వరముకూడ పనిచేయదని నేను చెప్పబోవుచున్న కారణమును వినుము.

**శ్లో॥ సుగ్రీవో నహి దేవోఽయం నాసురో నచ రాక్షసః ।**
**న దానవో న గంధర్వో న యక్షో నచ పన్నగః ।**
**(మానుషో రాఘవో రాజన్ సుగ్రీవశ్చ హరీశ్వరః)**
**తస్మాత్ప్రాణపరిత్రాణం కథం రాజ న్కరిష్యసి ॥ 27**

**పదచ్ఛేదము** :– సుగ్రీవః – న – హి – దేవః – అయం – న – అసురః – న – చ – రాక్షసః – స – దానవః – న – గంధర్వః – న – యక్షః – న – చ – పన్నగః, (మానుషః – రాఘవః – సుగ్రీవః – చ – హరీశ్వరః) – తస్మాత్ – ప్రాణపరిత్రాణం – కథం – రాజన్ – కరిష్యసి ॥

**అన్వయక్రమము** :– అయం సుగ్రీవః దేవః నహి; అసురః న; రాక్షసః చ న; దానవః న, గంధర్వః న, యక్షః చ న, పన్నగః చ న, (రాజన్! రాఘవః మానుషః; సుగ్రీవః హరీశ్వరః చ) రాజన్! తస్మాత్ ప్రాణపరిత్రాణం కథం కరిష్యసి?

**ప్రతిపదార్థము** :– అయం సుగ్రీవః = ఈ సుగ్రీవుడు, దేవః నహి = దేవత కాడు గదా! అసురః న = అసురుడు గాడు, రాక్షసః చ న = రాక్షసుడు గాడు, దానవః న = దానవుడు గాడు, గంధర్వః న = గంధర్వుడు గాడు, యక్షః న = యక్షుడు గాడు, పన్నగః చ న = పన్నగుడును కాడు, (రాజన్ = రాజా! రాఘవః = రఘువంశ తిలకుడగు శ్రీరాముడు, మానుషః = మానవుడు. సుగ్రీవః = సుగ్రీవుడు, హరీశ్వరః = వానరరాజు.) రాజన్ = రాజా!, తస్మాత్ = ఆ కారణమువలన, ప్రాణపరిత్రాణం = ప్రాణరక్షణమును, కథం = ఎట్లు, కరిష్యసి = చేసికొనగలవు?

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము, రా. శిరోమణి** :– రాఘవః మానుషః, సుగ్రీవః హరీశ్వరః – నీవు వరమును గోరుసమయమున ఉపేక్షించినట్టి నరవానరజాతులకు చెందిన రఘురామ సుగ్రీవులవలన అవధ్యత్వవరము నీకు లేదు గదా! గావున వారినుండి నీకు ప్రాణరక్షణము ఎట్లు గలుగునని భావము.

**సూచన** :– మానుషో రాఘవః – ఇత్యాది శ్లోకపాదము దక్షిణాది ప్రతులందు గానరాదు.

**వాసుదాసస్వామి** :– నిన్ను యుద్ధమున జయించి కారాగృహమున నుంచినవాడు

కార్తవీర్యార్జునుడు. అట్టి వానిని బరిమార్చినవాడు పరశురాముడు. అట్టి పరశురాముని అరగడియలో బాణప్రయోగము చేయకయే రఘురాము డోడించెను. అట్టి వీరపురుషుని ఎదుట నీవు ప్రాణరక్షణ నెట్లు చేసికొనగలవు?

**తాత్పర్యము** :- ఈ సుగ్రీవుడు నిన్ను చంపజాలనట్టి దేవగణములోనివాడు గాదు కదా! అట్లే యసురుడుగాని రాక్షసుడుగాని దానవుడుగాని గంధర్వుడుగాని యక్షుడుగాని పన్నగుడు గాని కాదు. శ్రీరాముడు నరుడు, సుగ్రీవుడు వానరుడు. నీకు అవధ్యత్వము నరవానరులనుండి లేనందున ఇప్పుడు నీవు ప్రాణరక్షణము ఎట్లు చేసికొనగలవు?

**శ్లో॥ న తు ధర్మోపసంహార మధర్మఫలసంహితమ్ ।**
**తదేవ ఫల మన్వేతి ధర్మ శ్చాధర్మనాశనః ॥ 28**

**శ్లో॥ ప్రాప్తం ధర్మఫలం తావ ద్భవతా నాత్ర సంశయః ।**
**ఫల మ స్యా ప్యధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే ॥ 29**

**పదచ్ఛేదము** :- న - తు - ధర్మోపసంహారమ్ - అధర్మఫలసంహితమ్ - తత్ - ఏవ - ఫలమ్ - అన్వేతి - ధర్మః - చ - అధర్మనాశనః - ప్రాప్తం - ధర్మఫలం - తావత్ - భవతా - న - అత్ర - సంశయః - ఫలమ్ - అస్య - అపి - అధర్మస్య - క్షిప్రమ్ - ఏవ - ప్రపత్స్యసే ॥

**అన్వయక్రమము** :- న తు (మంతవ్యం) ధర్మోపసంహారమ్ అధర్మఫలసంహితం (అపి) తత్ ఫలం ఏవ అన్వేతి, ధర్మః అధర్మనాశనః చ ఇతి. భవతా తావత్ ధర్మఫలం ప్రాప్తం అత్ర సంశయః న, అస్య అధర్మస్య ఫలమ్ అపి క్షిప్రమ్ ఏవ ప్రపత్స్యసే.

**ప్రతిపదార్థము** :- న తు (మంతవ్యం) = ఇట్లు మాత్రము భావించరాదు, ధర్మోపసంహారం = ధర్మసంగ్రహము కలిగినట్టివానిని, అధర్మఫలసంహితమ్ అపి = పాపయుక్తుడుగా నున్నప్పటికిని, తత్ ఫలం ఏవ = పూర్వార్జితమైన పుణ్యమే, అన్వేతి = అనుసరించును, ధర్మః = ధర్మము, అధర్మనాశనః చ = అధర్మమును నశింపచేయునట్టికూడను, (ఇతి = అని); భవతా = నీచేత, తావత్ = ముందుగా, ధర్మఫలం = ధర్మముయొక్క ఫలితము, ప్రాప్తం = పొందబడినది, అత్ర = ఈ విషయమునందు, సంశయః = సందేహము, న = లేదు, అస్య = ఈ, అధర్మస్య = అధర్మముయొక్క, ఫలమ్ అపి = ఫలితమునుగూడ, క్షిప్రమ్ ఏవ = శీఘ్రముగనే, ప్రపత్స్యసే = పొందగలవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**సూచన :–** ఇందలి ఈ 28వ శ్లోకమునకు పూర్వవ్యాఖ్యాతలు పలువురు పలువిధములుగా నన్వయించి అర్థమును చెప్పియున్నారు. పాఠాంతరములుగూడ రెండుమూడు గానవచ్చుచున్నవి. మఱియు పలువురు దీనిని ప్రత్యేక శ్లోకములుగా విడిగానే చూసి అర్థము చెప్పినారు. మద్రాసు శ్రీరామరత్నప్రకాశక మహాశయులచే ప్రకటింపబడిన మూలప్రతియందు "నతు ధర్మోపసంహారం" అను దానికి బదులుగా 'నను ధర్మోపసంహారం' అను పాఠాంతరము స్వీకరింపబడినది. దీని ననుసరించి ఇందలి మొదటి శ్లోకము పూర్వపక్షవాక్యముగాను తరువాతి శ్లోకము దానికి సమాధాన వాక్యముగాను గ్రహింపవలెనని స్పష్టమగుచున్నది.

**తిలకము :–** అధర్మఫలముయొక్క ప్రాబల్యము గలవాడైన పురుషుడు ప్రస్తుతము ఆ యధర్మానుభవము నొందుచుండగా పూర్వము తాను చేసికొన్న కొద్ది ధర్మసంగ్రహ మున్నను ఆ ధర్మఫలము ఇప్పు డతనిని జేరదు. ఫలోన్ముఖమైన అధర్మమే యతనిని చేరుచుండును. అయినచో నిక ధర్మము అధర్మమును నశింపజేయును అను సిద్ధాంతమునకు అర్థమేమి? అనగా నిజమే, ఒకడు చేసిన యధర్మమును అతడు తరువాతి కాలమున చేసినట్టి ఉత్కటమైన ధర్మము నశింపజేయగలదు. కాని అదే విధముగ నాతడు చేసిన ఉత్కటమైన అధర్మము గూడ తాను పూర్వము చేసిన ధర్మమును నశింపజేయును గదా! కాబట్టి ఓ రావణా! ప్రస్తుతము నీవు చేసిన ఘోరమైన అధర్మముచే నీ పూర్వధర్మమంతయు నశించినది సుమా యని భావము.

ఇచ్చట కొందరు, ధర్మఫలమైనట్టి సుఖము అధర్మఫలమైనట్టి దుఃఖముతోగలసి యనుభవింపబడుట జరుగదు. అందుచే ధర్మఫలము ధర్మఫలముతోడను, అధర్మఫల మధర్మఫలము తోడను మాత్రమే గలియుచుండును. "ధర్మో నా ऽ ధర్మనాశనః"యని చెప్పబడెను. గనుక పూర్వకృతధర్మము ప్రస్తుతాధర్మమును నశింపచేయజాలదని భావము అని చెప్పుచున్నారు విజ్ఞులు. యుక్తమైన యర్థమును గ్రహించగలరు. రా. శిరోమణి గూడ తిలకవ్యాఖ్యానమునే అనుసరించెను.

**గోవిందరాజీయము :–** ధర్మఫల మధర్మఫలముతో గూడునది గాదు. అది ధర్మఫలముతో మాత్రమే గూడును. ధర్మము నెదుట యధర్మము నిలువజాలదు. "ధర్మేణ పాపమపనుదతి" అను శ్రుతి ప్రమాణమును బట్టి ధర్మమే యధర్మమును నశింపజేయును. కాని రావణా! నేను ధర్మము చేసిన వాడను కావున నా ధర్మఫలము ప్రస్తుతపు అధర్మమును నశింపజేయగలదు గదా యని తలపకుము. కాబట్టి ప్రస్తుతపు అధర్మమును నశింపజేసికొనుటకు సరిపడునంతటి గొప్పధర్మమును నీవు

చేసికొనవలసియున్నది. లేనిచో ఇప్పుడే నీకు వినాశము సంభవించును. ఇక ఇప్పుడు నీవు చేయదగు ధర్మ మేమందువా అది సీతమ్మను శ్రీరాముని కప్పగించి ఆ మహానుభావుని శరణు వేడుకొనుటయే అని భావము. రావణుని ధర్మఫలము నశించిపోయెనని హనుమ కెట్లు తెలిసెననగా రావణుడు తన శౌర్యమును జూపు ధైర్యములేక చౌర్యవృత్తిని బూని సీతమ్మ నపహరించుటనుబట్టి గ్రహింపగల్గెనని తెలియవలెను.

**మహేశ్వరతీర్థులు** :- ధర్మఫలమైన సుఖము అధర్మఫలితమైన దుఃఖముతో గలసి అనుభవింపదగినదిగాదు. అనగా ధర్మఫలమైన రాజ్యభోగము, అధర్మఫలమైన రోగబాధయు రెండును గలసియే ఒకడు అనుభవించునట్లుగా రావణుడు చేసిన తీవ్రమైన తపస్సు అనెడి ధర్మమునకు ఫలమైనట్టి సుఖజీవన మనునదియును, పరదారాపహరణరూపమైన అత్యుత్కటమగు అధర్మమునకు ఫలమైన మృత్యువు అనునదియును, ఈ రెండును గలసి యనుభవించుటకు తగినవి గావు గదా! గావున ధర్మఫలము ధర్మఫలమునే యనుసరించును. ధర్మ మధర్మమును నశింపజేయునట్టిది గాదు. అనగా ధర్మము అధర్మఫలము నణచి తాను ఉత్తమ ఫలము నొసగజాలదు అని భావము. పూర్వము చేసిన ధర్మము ఇప్పుడు చేసిన అధర్మమును నశింపజేయునట్టిది గాజాలదు. ధర్మాధర్మములు రెండును దేనికదియే తమ తమ ఫలానుభవము నొసగి క్షీణించునట్టివని సారాంశము.

**తాత్పర్యము** :- నేనెంతయో ధర్మము జేసియున్నట్టి వాడను. ప్రస్తుతము కొద్ది అధర్మఫలము నన్నంటి నప్పటికిని నా పూర్వార్జిత ధర్మఫలము నావెంట యుండనే యున్నది. ధర్మ మధర్మమును నాశనముజేసి వేయగలదు గదా!" యని ఎంతమాత్రము భావింపకుము. ప్రస్తుతము నీవు చేసికొనుచున్న అధర్మమునకు ఫలితమును గూడక త్వరలోనే పొందబోవుచున్నావు సుమా!

**శ్లో॥ జనస్థానవధం బుద్ధ్వా బుద్ధ్వా వాలివధం తథా ।**
**రామసుగ్రీవసఖ్యం చ బుధ్యస్వ హిత మాత్మనః ॥ 30**

**పదచ్ఛేదము** :- జనస్థానవధం - బుద్ధ్వా - బుద్ధ్వా - వాలివధం - తథా - రామ సుగ్రీవసఖ్యం - చ - బుధ్యస్వ - హితమ్ - ఆత్మనః ॥

**అన్వయక్రమము** :- జనస్థానవధం బుద్ధ్వా, వాలివధం, తథా రామసుగ్రీవసఖ్యం చ బుద్ధ్వా ఆత్మనః హితం బుధ్యస్వ.

**ప్రతిపదార్థము** :- జనస్థానవధం = జనస్థానమునందలివధను, వాలివధం =

వాలివధను, తథా = అట్లే, రామసుగ్రీవసఖ్యం చ = రామసుగ్రీవుల మైత్రిని, బుద్ధ్వా = తెలిసికొని, ఆత్మనః = నీకు, హితం = శ్రేయస్సును, బుధ్యస్వ = తెలిసికొనుము.

**తాత్పర్యము :–** ఆనాడు జనస్థానమునందు జరిగిన ఖరదూషణాదుల వధను గూర్చియు, వాలివధను గూర్చియు, రామసుగ్రీవుల మధ్య నేర్పడిన మైత్రిని గూర్చియు పూర్తిగా తెలిసికొని నీకు మేలుగూర్చు మార్గ మేదియో నిర్ణయించుకొనుము.

**శ్లో॥ కామం ఖ ల్వహ మ ప్యేక స్సవాజిరథకుంజరామ్ ।**
**లంకాం నాశయితుం శక్త స్తస్యైష తు న నిశ్చయః ॥ 31**

**పదచ్ఛేదము :–** కామం – ఖలు – అహమ్ – అపి – ఏకః – సవాజిరథకుంజరామ్, లంకాం – నాశయితుం – శక్తః – తస్య – ఏషః – తు – న – నిశ్చయః ॥

**అన్వయక్రమము :–** అహమ్ ఏకః అపి సవాజిరథకుంజరాం లంకాం నాశయితుం కామం శక్తః ఖలు; ఏషః తు తస్య నిశ్చయః న.

**ప్రతిపదార్థము :–** అహం = నేను, ఏకః అపి = ఒక్కడనే గూడ, సవాజిరథకుంజరాం = అశ్వములతోడను రథములతోడను, ఏనుగులతోడను గూడిన, లంకాం = లంకానగరమును, నాశయితుం = నశింపజేయుటకు, కామం = పూర్తిగా, శక్తః ఖలు = సమర్థుడను సుమా! తు = కాని, ఏషః = ఇది, తస్య, ఆ శ్రీరామునియొక్క, నిశ్చయః న = నిర్ణయముగాదు.

**తాత్పర్యము :–** నేను ఒక్కడనే సమస్తములైన ఈ యశ్వములతోడను, రథములతోడను, ఏనుగులతోడను గూడిన ఈ లంక నంతయు నాశనము జేసి వేయగలను, కాని అట్లు చేయుట శ్రీరాముని నిర్ణయము గాదు.

**శ్లో॥ రామేణ హి ప్రతిజ్ఞాతం హర్యృక్షగణసన్నిధౌ ।**
**ఉత్సాదన మమిత్రాణాం సీతా యై స్తు ప్రధర్షితా ॥ 32**

**పదచ్ఛేదము :–** రామేణ – హి – ప్రతిజ్ఞాతం – హర్యృక్షగణసన్నిధౌ – ఉత్సాదనమ్ – అమిత్రాణాం – సీతా – యైః – తు – ప్రధర్షితా ॥

**అన్వయక్రమము :–** యైః సీతా ప్రధర్షితా (తేషామ్) అమిత్రాణామ్ ఉత్సాదనం హర్యృక్షణగణసన్నిధౌ రామేణ ప్రతిజ్ఞాతం హి.

**ప్రతిపదార్థము :–** యైః = ఎవరిచే, సీతా = సీతాదేవి, ప్రధర్షితా = పీడింపబడినదో, (తేషాం = ఆ) అమిత్రాణాం = శత్రువులయొక్క, ఉత్సాదనం = వినాశమును గూర్చి, హర్యృక్షగణసన్నిధౌ = వానరుల యొక్కయు భల్లూకముల యొక్కయు సమూహముల

సమక్షమున, రామేణ = శ్రీరామునిచే, ప్రతిజ్ఞాతం హి = ప్రతిజ్ఞ చేయబడెను సుమా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– జాంబవంతుడు సుగ్రీవుడు మున్నగు పలువురు వృద్ధులున్న ఆ సభలో చేసిన ప్రతిజ్ఞను రాము డతిక్రమించుటకు వీలులేదు.

**తాత్పర్యము** :– మా వానరవీరులు, భల్లూకయోధులును గల పెద్ద సభలో తన భార్యను మోసగించినట్టి శత్రువును నశింపజేసెదనని శ్రీరాముడు ప్రతిజ్ఞ చేసియున్నాడు సుమా!

**శ్లో॥ అపకుర్వ న్హి రామస్య సాక్షా దపి పురందరః ।**
**న సుఖం ప్రాప్నుయా దన్యః కిం పునస్త్వాదృశో జనః ॥ 33**

**పదచ్ఛేదము** :– అపకుర్వన్ – హి – రామస్య – సాక్షాత్ – అపి – పురందరః – న – సుఖం – ప్రాప్నుయాత్ – అన్యః – కిం – పునః – త్వాదృశః – జనః ॥

**అన్వయక్రమము** :– రామస్య అపకుర్వన్ సాక్షాత్ పురందరః అపి సుఖం న ప్రాప్నుయాత్ హి, త్వాదృశః అన్యః జనః పునః కిం (వక్తవ్యమ్)!

**ప్రతిపదార్థము** :– రామస్య = శ్రీరామునకు, అపకుర్వన్ = అపకారము చేయుచున్నవాడు, సాక్షాత్ = స్వయముగా, పురందరః అపి = దేవేంద్రుడైనను, సుఖం = సౌఖ్యమును, న ప్రాప్నుయాత్ హి = పొందదు సుమా! త్వాదృశః = నీబోటి, అన్యః జనః = ఇతరవ్యక్తి, పునః = తిరిగి, కిం (వక్తవ్యమ్) = చెప్పవలసిన దేమి?

**తాత్పర్యము** :– శ్రీరామున కపకారము చేసినవాడు సాక్షాత్తుగ దేవేంద్రుడైనను సుఖముగ జీవింపజాలడు; ఇక నీబోటివారి విషయము వేఱుగ చెప్పవలయునా?

**శ్లో॥ యాం సీతే త్యభిజానాసి యేయం తిష్ఠతి తే వశే ।**
**కాలరాత్రీతి తాం విద్ధి సర్వలంకావినాశినీమ్ ॥ 34**

**పదచ్ఛేదము** :– యాం – సీతా – ఇతి – అభిజానాసి – యా – ఇయం – తిష్ఠతి –తే – వశే, కాలరాత్రీ – ఇతి – తాం – విద్ధి – సర్వలంకావినాశినీమ్ ॥

**అన్వయక్రమము** :– యా ఇయం తే వశే తిష్ఠతి, యాం సీతా ఇతి అభిజానాసి, సర్వలంకావినాశినీం తాం కాలరాత్రీ ఇతి విద్ధి.

**ప్రతిపదార్థము** :– యా ఇయం = ఏ ఈమె, తే = నీయొక్క, వశే = అధీనమున,

తిష్ఠతి = ఉన్నదో, యాం = ఎవరిని, సీతా ఇతి = సీత యని, అభిజానాసి = అనుకొనుచున్నావో, సర్వలంకావినాశినీమ్ = సమస్తమైన లంకను నశింపచేయునట్టి, తాం = ఆమెను, కాళరాత్రీ ఇతి = కాళరాత్రి యని, విద్ధి = తెలిసికొనుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– కాళరాత్రీ – మహాప్రళయమును గల్గించునట్టి భగవంతుని శక్తిని కాళరాత్రి యందురు.

**వాసుదాసస్వామి** :– మార్కండేయపురాణమునందు ఈ విష్ణుశక్తినే కాళరాత్రి నారాయణి మున్నగు పేర్లతో వ్యవహరించిరి. మహానారాయణోపనిషత్తునందు గూడ భగవంతుని మహామాయ ఆయన యాజ్ఞకు లోబడి వర్తించునని చెప్పబడినది. ఈ విష్ణుశక్తియే జగద్రక్షాకార్యమునందు కేవలసత్త్వగుణము గల్గి లక్ష్మి – శ్రీ – భూమి – నీళ – రుక్మిణి – సీతాది రూపంబుల నవతరించును. సంహారము చేయు కాలమందు తమోభూయిష్ఠయై మహాకాళరాత్రి మున్నగు నామధేయములు గలదై యుండును. త్రిగుణాత్మకమగు ప్రకృతి భగవచ్ఛక్తియే గదా!

కాళరాత్రి ప్రళయకాలమందు సంహారమెట్లు చేయునో యట్లే సీత నీవంశమును నాశనము చేయునని గ్రాహ్యము.

**తాత్పర్యము** :– నీ యధీనమందున్న ఎవ్వతెనైతే నీవు సీత యనెడి ఒక స్త్రీ యని అనుకొనుచున్నావో ఆమె నీ లంక నంతను నశింపజేయునట్టి ప్రళయకారణమగు కాళరాత్రి యని తెలిసికొనుము.

**శ్లో॥ త దలం కాలపాశేన సీతావిగ్రహరూపిణా ।**
**స్వయం స్కంధావసక్తేన క్షేమ మాత్మని చింత్యతామ్ ॥ 35**

**పదచ్ఛేదము** :– తత్ – అలం – కాలపాశేన – సీతావిగ్రహరూపిణా, స్వయం – స్కంధావసక్తేన – క్షేమమ్ – ఆత్మని – చింత్యతామ్ ॥

**అన్వయక్రమము** :– తత్ సీతావిగ్రహరూపిణా స్వయం స్కంధావసక్తేన కాలపాశేన అలమ్; ఆత్మని క్షేమం చింత్యతామ్.

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ కారణమువలన, సీతావిగ్రహరూపిణా = సీతా స్వరూపమున నున్నట్టి, స్వయం = స్వయముగా, స్కంధావసక్తేన = మూపుపై వేసికొన్నట్టి, కాలపాశేన = యమపాశముచేత, అలమ్ = చాలును, ఆత్మని = నీవిషయమున, క్షేమం = మేలు, చింత్యతామ్ = ఆలోచింపబడుగాక!

**తాత్పర్యము :–** అందుచేత అజ్ఞానమువలన నీవు మెడపై వేసికొన్న ఈ సీతారూపమైన కాలపాశమును ఇప్పటికైనను గుర్తించుకొని విడిచిపెట్టి నీ యాత్మక్షేమమును గూర్చి ఆలోచించుకొనుము.

**శ్లో॥ సీతాయా స్తేజసా దగ్ధాం రామకోపప్రపీడితామ్ ।**
**దహ్యమానా మిమాం పశ్య పురీం సాట్టప్రతోళికామ్ ॥ 36**

**పదచ్ఛేదము :–** సీతయాః – తేజసా – దగ్ధాం – రామకోపప్రపీడితామ్, దహ్యమానామ్ – ఇమాం – పశ్య – పురీం – సాట్టప్రతోళికామ్ ॥

**అన్వయక్రమము :–** సాట్టప్రతోళికాం సీతాయాః తేజసా దగ్ధాం రామకోపప్రపీడితామ్ ఇమాం పురీం దహ్యమానాం పశ్య.

**ప్రతిపదార్థము :–** సాట్టప్రతోళికాం = కోటబురుజులతోను, రాజమార్గములతోడను గూడినదై, సీతయాః = సీతాదేవియొక్క, తేజసా = తేజస్సుచే, దగ్ధాం = దహింపబడినదియును, రామకోపప్రపీడితాం = శ్రీరాముని క్రోధముచే ధ్వంసము చేయబడినదైన, ఇమాం పురీం = ఈ లంకాపురిని, దహ్యమానాం = దహింపబడుచున్న దానినిగా, పశ్య = తెలిసికొనుము.

**తాత్పర్యము :–** సమస్తమైన కోట బురుజులతోడను, రాజవీథులతోడనుగూడిన ఈ లంకానగరము సీతాదేవియొక్క శోకాగ్నిచేతను శ్రీరాముని క్రోధముచేతను ధ్వంసమై అచిరకాలములో పూర్తిగా దహింపబడబోవుచున్నది అని ఇప్పుడే తెలిసికొనుము.

**శ్లో॥ స్వాని మిత్రాణి మంత్రీంశ్చ జ్ఞాతీ న్భ్రాతౄ న్సుతా న్హితాన్ ।**
**భోగా న్దారాంశ్చ లంకాం చ మా వినాశ ముపానయ ॥ 37**

**పదచ్ఛేదము :–** స్వాని – మిత్రాణి – మంత్రీన్ – చ – జ్ఞాతీన్ – భ్రాతౄన్ – సుతాన్ – హితాన్ – భోగాన్ – దారాన్ – చ – లంకాం – చ – మా – వినాశం – ఉపానయ ॥

**అన్వయక్రమము :–** స్వాని మిత్రాణి, మంత్రీన్ చ, జ్ఞాతీన్, భ్రాతౄన్, సుతాన్, హితాన్, భోగాన్, దారాన్ చ, లంకాం చ వినాశం మా ఉపానయ.

**ప్రతిపదార్థము :–** స్వాని మిత్రాణి = నీ స్నేహితులను, మంత్రీన్ చ = మంత్రులను, జ్ఞాతీన్ = జ్ఞాతులను, భ్రాతౄన్ = సోదరులను, సుతాన్ = పుత్రులను, హితాన్ = ఇష్టమైన, భోగాన్ = భోగములను, దారాన్ చ = భార్యలను, లంకాం చ = లంకను, వినాశం = వినాశనమును, మా ఉపానయ = పొందింపకుము.

**తాత్పర్యము** :- నీ స్నేహితులను మంత్రులను జ్ఞాతులను నీ సోదరులను పుత్రులను నీ ఇష్టమైన భోగములను నీ భార్యలను వేయేల నీలంకనంతను నిష్కారణముగా నాశనము జేసికొనకుము.

**శ్లో॥ సత్యం రాక్షసరాజేంద్ర శృణుష్వ వచనం మమ ।**
**రామదాసస్య దూతస్య వానరస్య విశేషతః ॥ 38**

**పదచ్ఛేదము** :- సత్యం - రాక్షసరాజేంద్ర - శృణుష్వ - వచనం - మమ, రామదాసస్య - దూతస్య - వానరస్య - విశేషతః ॥

**అన్వయక్రమము** :- రాక్షసరాజేంద్ర! రామదాసస్య దూతస్య వానరస్య మమ విశేషతః (ఉచ్యమానం) సత్యం వచనం శృణుష్వ.

**ప్రతిపదార్థము** :- రాక్షసరాజేంద్ర! = ఓ రాక్షసరాజోత్తమా! రామదాసస్య = శ్రీరామునకు దాసుడను, దూతస్య = దౌత్యమును నెఱవేర్చువాడను, వానరస్య = వానరజాతివాడను అగు, మమ = నాయొక్క, విశేషతః = విశేషించి (ఉచ్యమానం = చెప్పబడుచున్న) సత్యం వచనం = సత్యవచనమును, శృణుష్వ = వినుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- విశేషతః - నిష్కర్షచేసి చెప్పబడినది - అనగా తాను - రామదాసస్య - శ్రీరాముని మహిమను పూర్తిగా తెలిసినవాడననియును - దూతస్య - హితోపదేశాధికారము తనకు తన ప్రభువు వలన గలిగినదనియును - వానరస్య - మీ రాక్షసులయెడలగాని ఆ మనుష్యులయెడల గాని తాను పక్షపాతము లేనట్టివాడననియును హనుమయొక్క భావము అని గ్రహించవలెను.

**తాత్పర్యము** :- ఓ రాక్షసరాజా! శ్రీరామునకు దాసుడనై యున్నవాడను, దూతగా వచ్చినట్టివాడను, వానరజాతివాడను అగు నేను దూర మాలోచించి నిష్కర్షముగా చెప్పు మాటలను శ్రద్ధగా ఆలకించుము.

**శ్లో॥ సర్వా న్లోకా న్సుసంహృత్య సభూతాన్ సచరాచరాన్ ।**
**పునరేవ తథా స్రష్టుం శక్తో రామో మహాయశాః ॥ 39**

**పదచ్ఛేదము** :- సర్వాన్ - లోకాన్ - సుసంహృత్య - సభూతాన్ - సచరాచరాన్ - పునః - ఏవ - తథా - స్రష్టుం - శక్తః - రామః - మహాయశాః ॥

**అన్వయక్రమము** :- సభూతాన్, సచరాచరాన్, సర్వాన్ లోకాన్ సుసంహృత్య

మహాయశాః రామః పునః తథా ఏవ స్రష్టుం శక్తః.

**ప్రతిపదార్థము :–** సభూతాన్ = పంచభూతములతో గూడినట్టివియును, సచరాచరాన్ = చరాచరములతో గూడినట్టివియు నగు, సర్వాన్ = సమస్తములైన, లోకాన్ = లోకములను, సుసంహృత్య = ఉపసంహరించి, పునః = తిరిగి, తథా ఏవ = ఆ రీతిగనే, స్రష్టుం = సృజించుటకు, మహాయశాః = మహాయశస్సంపన్నుడైన, స రామః = ఆ శ్రీరాముడు, శక్తః = సమర్థుడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ఈ రీతి వర్ణనముచే శ్రీరాముడు సర్వజగత్తులయొక్క సృష్టిస్థితి సంహారములకు కర్తయై యున్నాడని బోధింపబడినది.

**గోవిందరాజీయము :–** సుసంహృత్య – ప్రళయావసానమున రుద్రుని మూలముననుు, స్వయముగను ఉపసంహరించి, స్రష్టుం – తిరిగి కల్పాదియందు 'ధాతా యథా పూర్వమకల్పయత్' అను శ్రుతివచనము ననుసరించి బ్రహ్మద్వారా సృష్టించుటకు సమర్థుడు అని చెప్పుచు అట్టి సామర్థ్యము రామునకు గలదని, మహాయశాః – అను పదముచే తెలుపుచు 'న తస్యేశే కశ్చన, తస్య నామ మహద్యశః' యను శ్రుతి ప్రమాణమును జ్ఞాపకము చేయుచున్నాడు.

**వాసుదాసస్వామి :–** ఈ శ్లోకము 'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయం త్యభిసంవిశంతి, తద్బ్రహ్మేతి' అను శ్రుత్యర్థమును బోధించుచున్నది. ఇట్లు రామచంద్రమూర్తి పరత్వము చెప్పబడినది. అనేక కోటి బ్రహ్మాండములకంతయు ప్రథమకారణము ప్రథమాధికారి భగవంతు డొక్కడే. "ఏక మేవాద్వితీయం బ్రహ్మ" అన్నట్లు పరబ్రహ్మ ఒక్కడే. ఆ భగవంతుడే బ్రహ్మయందు ప్రవేశించి సృష్టికార్యము చేయును.

**శ్రీరామశరణ్‌గారి రామోపాసనాసర్వస్వము :–**

మహేశ్వరతంత్రములో బ్రహ్మ నారదునితో నిట్లనెను.

శ్లో॥ రామేణైవ జగత్సృష్టం రామేణైవ ప్రభూయతే ।
రామేణ స్థితి మాప్నోతి రామేణైవ ప్రలీయతే ।
రామా న్నాన్యత్పరం కించిత్సర్వం రామమయం జగత్ ॥

రామునిచేతనే జగత్తు సృష్టింపబడినది. రామునివలననే విస్తరింప చేయబడుచున్నది. రామునిచే పోషింపబడుచున్నది. రామునిచేతనే ప్రళయ

మొనర్పబడుచున్నది. ఈ జగత్తంతయును రామమయమే.

ఉపనిషత్తులలో –

"రామ ఏవ పరం బ్రహ్మ రామ ఏవ పరం తపః ।
రామ ఏవ పరం తత్త్వం శ్రీరామో బ్రహ్మ తారకమ్ ॥" అని చెప్పబడినది.

అనగా శ్రీరాముడే పరబ్రహ్మ, శ్రీరాముడే పరమతపము, శ్రీరాముడే పరమతత్త్వము. శ్రీరాముడు తారకపరబ్రహ్మ యని చెప్పబడినది.

వేదసారోపనిషత్తులో నిట్లు గలదు –

విరజాయాః పరే పారే లోకే వైకుంఠసంజ్ఞితే ।
తన్మధ్యే రాజతేఽయోధ్యా సచ్చిదానందరూపిణీ.
తత్ర లోకే చతుర్బాహూ రామనారాయణః ప్రభుః
అయోధ్యాయాం యథా చాస్య హ్యవతారో భవే దిహ,
తథాస్తి రామనామేద మవతారవిధో విభోః ॥

యాజ్ఞవల్క్యుడు జనకునితో నిట్లనెను –

"విరజానది కావల వైకుంఠమని పేరుగల లోకము గలదు. సచ్చిదానంద రూపిణియగు నయోధ్య దాని మధ్య విరాజిల్లుచుండును. అందు చతుర్బాహువులు గల్గిన రామనారాయణప్రభువు గలడు. అయోధ్యలో నుండు రాము డీయన యవతారమే. ఆయన తాను ఆ నామమునే యవతారకాలమునకూడ ధరించెను.

**తాత్పర్యము :–** పంచమహాభూతములతో కూడిన స్థావరజంగమాత్మకమైన ఈ సమస్త విశ్వమును అనంతశక్తిసంపన్నుడని కీర్తింపబడు శ్రీరాముడు తన ఇచ్ఛామాత్రముచే లయింపజేసి తిరిగి యథాపూర్వముగా సృజింపగల సామర్థ్యము గలవాడు సుమా ।

**శ్లో॥ దేవాసురనరేంద్రేషు యక్షరక్షోగణేషు చ ।**
**విద్యాధరేషు సర్వేషు గంధర్వే ష్వురగేషు చ ।**
**సిద్ధేషు కిన్నరేంద్రేషు పతత్రిషు చ సర్వతః ।**
**యో రామం ప్రతియుధ్యేత విష్ణుతుల్యపరాక్రమమ్ ।**
**సర్వభూతేషు సర్వత్ర సర్వకాలేషు నాస్తి సః ॥ 40**

**పదచ్ఛేదము :–** దేవాసురనరేంద్రేషు – యక్షరక్షోగణేషు – చ – విద్యాధరేషు – సర్వేషు – గంధర్వేషు – ఉరగేషు – చ, సిద్ధేషు – కిన్నరేంద్రేషు – పతత్రిషు – చ –

సర్వతః, సర్వభూతేషు – సర్వత్ర – సర్వకాలేషు – న – అస్తి – సః, యః – రామం – ప్రతియుధ్యేత – విష్ణుతుల్యపరాక్రమమ్ ॥

**అన్వయక్రమము** :– దేవాసురనరేంద్రేషు యక్షరక్షోగణేషు చ, విద్యాధరేషు, గంధర్వేషు, ఉరగేషు, సిద్ధేషు కిన్నరేంద్రేషు, పతత్రిషు, సర్వేషు చ, సర్వతః, సర్వభూతేషు, సర్వత్ర, సర్వకాలేషు విష్ణుతుల్యపరాక్రమం రామం యః ప్రతియుధ్యేత సః న అస్తి.

**ప్రతిపదార్థము** :– దేవాసురనరేంద్రేషు = దేవతలందును, రాక్షసులందును, అసురులందును, నరశ్రేష్ఠులందును, యక్షరక్షోగణేషు = యక్షుల యొక్కయు, రాక్షసుల యొక్కయు గణములయందును, విద్యాధరేషు = విద్యాధరులయందును, గంధర్వేషు = గంధర్వులయందును, ఉరగేషు చ = నాగులయందును, సిద్ధేషు = సిద్ధులయందును, కిన్నరేంద్రేషు = కిన్నరశ్రేష్ఠులందును, పతత్రిషు = పక్షులందును, సర్వేషు చ = సమస్తమైనవారియందును, సర్వతః = అన్ని యెడలను, సర్వకాలేషు = ఎల్లకాలములయందును, విష్ణుతుల్యపరాక్రమం = మహావిష్ణువుతో సాటియైన పరాక్రమము గల్గినట్టి, రామం = శ్రీరాముని, యః = ఎవ్వడు, ప్రతియుధ్యేత = ఎదిరించి పోరగలడో, సః = అట్టివాడు, న అస్తి = లేడు.

**తాత్పర్యము** :– శ్రీ మహావిష్ణువుతో సమానమైన పరాక్రమము గల్గినట్టి ఆ శ్రీరాము నెదిరించి నిలిచి యుద్ధము చేయగలవాడు దేవతలందుగాని, రాక్షసులందుగాని, పన్నగులందుగాని, సిద్ధులందుగాని, పక్షులందుగాని, ఎందును ఏకాలమునందును యే ప్రదేశమునందును, యే భూతములందును, ఎవ్వడును నుండ బోవడు సుమా!

**శ్లో॥ సర్వలోకేశ్వర స్యైవం కృత్వా విప్రియ మీదృశమ్ ।**
**రామస్య రాజసింహస్య దుర్లభం తవ జీవితమ్ ॥ 41**

**పదచ్ఛేదము** :– సర్వలోకేశ్వరస్య – ఏవం – కృత్వా – విప్రియమ్ – ఈదృశమ్, రామస్య – రాజసింహస్య – దుర్లభం – తవ – జీవితమ్ ॥

**అన్వయక్రమము** :– సర్వలోకేశ్వరస్య, రాజసింహస్య, రామస్య, ఈదృశం విప్రియం కృత్వా తవ జీవితం దుర్లభమ్.

**ప్రతిపదార్థము** :– సర్వలోకేశ్వరస్య = సమస్తమైన లోకములయొక్క ప్రభువైనవాడును, రాజసింహస్య = రాజులలో శ్రేష్ఠుడునగు, రామస్య = రామునకు, ఏవం = ఈరీతిగా, ఈదృశం = ఈ విధమైన, విప్రియం = అపకారమును, కృత్వా = చేసి, తవ = నీకు, జీవితం = జీవితము, దుర్లభమ్ = దుర్లభము.

**తాత్పర్యము** :- సమస్తలోకములకును ప్రభువైనవాడును, రాజులలో శ్రేష్ఠుడును అగు శ్రీరామునకు ఇట్టి అపకార మొనర్చినట్టి నీకు ప్రాణములతో నుండగలుగుట సాధ్యముగాదు సుమా!

**శ్లో॥ దేవాశ్చ దైత్యాశ్చ నిశాచరేంద్ర**
**గంధర్వవిద్యాధరనాగయక్షాః ।**
**రామస్య లోకత్రయనాయకస్య**
**స్థాతుం న శక్తా స్సమరేషు సర్వే ॥ 42**

**పదచ్ఛేదము** :- దేవాః - చ - దైత్యాః - చ - నిశాచరేంద్ర - గంధర్వవిద్యాధర నాగయక్షాః, రామస్య - లోకత్రయనాయకస్య - స్థాతుం - న శక్తాః - సమరేషు - సర్వే ॥

**అన్వయక్రమము** :- నిశాచరేంద్ర! లోకత్రయనాయకస్య రామస్య సమరేషు (అగ్రే) స్థాతుం సర్వే దేవాః చ దైత్యాః చ గంధర్వవిద్యాధరనాగయక్షాః చ శక్తాః న.

**ప్రతిపదార్థము** :- నిశాచరేంద్ర! = ఓ రాక్షసరాజా! లోకత్రయనాయకస్య = త్రిలోకములకు ప్రభువైనట్టి, రామస్య = శ్రీరామునకు, సమరేషు = యుద్ధములందు, (అగ్రే = ఎదుట) స్థాతుం = నిలుచుటకు, సర్వే = సమస్తమైన, దేవాః చ = దేవతలును, దైత్యాః చ = రాక్షసులును, గంధర్వవిద్యాధరనాగయక్షాః = గంధర్వులు విద్యాధరులు నాగులు యక్షలును గూడ, శక్తాః = సమర్థులు, న = కారు.

**తాత్పర్యము** :- ఓ రావణా! ముల్లోకములకును ప్రభువైనట్టి శ్రీరాముని ఎదిరించి రణరంగమునందు నిలబడుటకు సమర్థుడైనవాడు దేవతలలో గాని, దైత్యులలో గాని గంధర్వులందుగాని విద్యాధరులందుగాని నాగులందుగాని యక్షులందుగాని ఎవ్వడును లేడు సుమా!

**శ్లో॥ బ్రహ్మా స్వయంభూ శ్చతురాననో వా**
**రుద్ర స్త్రినేత్ర స్త్రిపురాంతకో వా ।**
**ఇంద్రో మహేంద్ర స్సురనాయకో వా**
**త్రాతుం న శక్తా యుధి రామవధ్యమ్ ॥ 43**

**పదచ్ఛేదము** :- బ్రహ్మా - స్వయంభూః - చతురాననః - వా - రుద్రః - త్రినేత్రః - త్రిపురాంతకః - వా - ఇంద్రః - మహేంద్రః - సురనాయకః - వా - త్రాతుం - న - శక్తాః - యుధి - రామవధ్యమ్ ॥

**అన్వయక్రమము** :– యుధి రామవధ్యం త్రాతుం స్వయంభూః చతురాననః బ్రహ్మా వా, త్రినేత్రః రుద్రః వా, మహేంద్రః సురనాయకః ఇంద్రో వా శక్తాః న.

**ప్రతిపదార్థము** :– యుధి = యుద్ధమునందు, రామవధ్యం = రామునిచే చంపబడవలసి యున్నట్టి వానిని, త్రాతుం = కాపాడుటకు, స్వయంభూః = స్వయముగనే ఉద్భవించినట్టి వాడును, చతురాననః = నాల్గు ముఖములు గల్గినట్టి వాడునగు, బ్రహ్మా వా = బ్రహ్మదేవుడుగాని, త్రినేత్రః = మూడుకన్నులు గలవాడును, త్రిపురాంతకః = త్రిపురాసురులను సంహరించినవాడు నగు, రుద్రః వా = రుద్రుడుగాని, మహేంద్రః = త్రిలోకప్రభువును, సురనాయకః = దేవతలకురాజు నగు, ఇంద్రో వా = దేవేంద్రుడు గాని, శక్తాః న = సమర్థులుగారు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము: సూచన** :– ఈ శ్లోకమున 'పతత్ప్రకర్షము' అను దోషము నివారించుకొనుటకై చివరినుండి అన్వయించుకొనవలెను.

త్రిలోకాధిపతియు, వృత్రాసురసంహారియునగు దేవేంద్రుడుగాని, సమస్త దేవతలయొక్క సహాయముగల దేవేంద్రుడుగాని, అట్టి ఇంద్రుని మించిన మహాశక్తి గలిగినట్టి, ప్రళయకాలమున ప్రజలనందరను రోదింప చేయువాడును, తన తృతీయ నేత్రముతో మన్మథుని భస్మముజేసినవాడును, మహోగ్రబలశాలురైన త్రిపురాసురులను సంహరించినవాడునగు రుద్రుడుగాని, ఆ రుద్రునకు మూలమైనట్టి అనగా తండ్రియైనట్టి సమస్తవిశ్వమును వ్యాపించిన వాడును, స్వయంశక్తిచేతనే ఉద్భవించిన వాడును, ఒక్కమారుగనే నాల్గువేదములను ఉచ్చరింపగల ప్రభావాతిశయము గల బ్రహ్మదేవుడుగాని, వీరు విడిగానే గాక ముప్వురును గలసివచ్చినప్పటికిని, రామునకు వధ్యుడైనట్టి అపరాధిని రక్షించుటకు సమర్థులు గాజాలరు.

'స్థానవిత్ నిగ్రహస్య చ' అని పేరువడసిన శ్రీరామునికి అపరాధము చేసిన వానిని రక్షించుట కెవ్వరును సమర్థులుగారు. యుద్ధమునందు శ్రీరాముని ఎదిరించి, తాము పరులను రక్షింపజాలరు గాని, ఆ శ్రీరాముని శరణువేడినవారు గూడ పరులను రక్షింపగలరని సూచింపబడినది. ఇచ్చట ఇంద్రుడు రుద్రుడు, బ్రహ్మ యనెడి పరదేవతల కంటె శ్రీరాముడు మహిమోపేతుడని వేదాంతరహస్యము బోధింపబడినది. రక్షణ సమర్థులుగ ప్రధానులైన ముగ్గురిని చెప్పి విష్ణువును చెప్పకపోవుటచే, పరిశేష న్యాయమున శ్రీరాముడే మహావిష్ణువని వెల్లడింపబడినది.

**మహేశ్వరతీర్థులు** :– ఇంద్రః = పరమైశ్వర్యవంతుడు, మహేంద్రః = వృత్రాసురసంహారి,

'మహాన్ అయమభూత్ యో వృత్ర మవధీత్ ఇతి తన్మహేంద్రస్య మహేంద్రత్వం' అని శ్రుతి ప్రమాణము.

**సురనాయకః** :– సమస్త దేవతలతోగూడియున్నట్టివాడు, రుద్రః = సంహారకాలమున ప్రజలను రోదింపచేయువాడు, రుతము అనగా శబ్దము అనగా వేదము. ఆ వేదమును కల్పాదిని బ్రహ్మ కొసగినవాడు. నాదముచే సకల జగత్తును ద్రవింప చేయు వాడనగా రంజింపచేయువాడు. రుతముచే అనగా నాదముచే ప్రణవరూపమైన లేక వేదరూపమైన నాదముచే ఇష్టములైన అర్థములను ప్రసాదించువాడు. రుతము అనగా సంసారదుఃఖము లేదా ఆ దుఃఖకారణము, దానిని ద్రవింపచేయువాడు.

ఇందులకు ప్రమాణము – 'మత్ దుఃఖం దుఃఖహేతుం వా తద్రావయతి యత్ ప్రభుః రుద్ర ఇత్యుచ్యతే తస్మాత్ శివః పరమకారణమ్' ॥

త్రినేత్రః – శత్రు భస్మీకరణ సమర్థమైన ఫాలలోచనము గలవాడు, బ్రహ్మ – విశ్వము నంతటిని వ్యాపించి యుండువాడు. స్వయంభూః – పరతంత్రుడు గానివాడు, చతురాననః – బహుముఖకార్యనిర్వాహకశక్తివిశిష్టుడు అని భావము.

**వాసుదాసస్వామి** :– "హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే" యని బ్రహ్మదేవుడే పరదేవత యనియు "న సన్నచాసచ్ఛివ ఏవ కేవలః"యని రుద్రుడే పరదేవత యనియు "ఇంద్రో మాయాభిః పరరూప ఈయతే"యని ఇంద్రుడే పరదేవత యనియు వేదమున నీముగ్గురిని పరదేవతలుగా చెప్పియున్నను ఆ ముగ్గురికన్నను రాముడే పరాత్పరుడని ఇట చెప్పబడినది. వేదాంతమునందు సత్, బ్రహ్మ, ఆత్మ ఇత్యాదులైన సామాన్య శబ్దములున్నవి. వాటికన్నిటికి మూలతత్త్వము శ్రీరాములవారే. "ఇతి రామపదే నాసౌ పరబ్రహ్మాఽ భిధీయతే" యనినట్లు రామచంద్రమూర్తి త్రికాలసత్యమగు పరబ్రహ్మమని హనుమంతుడు చెప్పుచున్నాడు.

'స బ్రహ్మ స శివ స్సేంద్రః' యనుచో విష్ణువును చెప్పక యాయన పరత్వమును శ్రుతి సూచించు నట్టులిచట నా మువ్వురే చెప్పబడిరనియు వీరి మువ్వురికి పరుడైన వాడు శ్రీరాముడనియు సూచింపబడెను. అందుచే నీకు రక్షకము శ్రీరామశరణాగతియే యని భావము.

**తాత్పర్యము** :– స్వయంభువును చతుర్ముఖుడు నగు ఆ బ్రహ్మదేవుడు గాని, త్రినేత్రుడును త్రిపురాసురసంహారకుడును అగు రుద్రుడుగాని, మహేంద్రుడును దేవతలకు ప్రభువును అగు వజ్రపాణిగాని శ్రీరాముని యెడ అపరాధము గావించి అతనికి వధ్యుడైయున్నట్టి వానిని గాపాడుటకు సామర్థ్యము గలవారు కారు సుమా!

**శ్లో॥ స సౌష్ఠవోపేత మదీనవాదినః**
**కపేర్నిశ మ్యాప్రతిమో ఽప్రియం వచః ।**
**దశాననః కోపవివృత్తలోచనః**
**సమాదిశత్తస్య వధం మహాకపేః ॥ 44**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనుమదుపదేశో" నామ*
*ఏకపంచాశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– సః – సౌష్ఠవోపేతమ్ – అదీనవాదినః – కపేః – నిశమ్య – అప్రతిమః – అప్రియం – వచః – దశాననః – కోపవివృత్తలోచనః – సమాదిశత్ – తస్య – వధం – మహాకపేః ॥

**అన్వయక్రమము** :– అదీనవాదినః కపేః అప్రియం సౌష్ఠవోపేతం వచః నిశమ్య అప్రతిమః సః దశాననః కోపవివృత్తలోచనః సన్ తస్య మహాకపేః వధం సమాదిశత్.

**ప్రతిపదార్థము** :– అదీనవాదినః = దైన్యములేకుండ మాటలాడువాడగు, కపేః = హనుమయొక్క, సౌష్ఠవోపేతం = ఔచిత్యముతో గూడినట్టి, అప్రియం = కటువైనట్టి, వచః = మాటను, నిశమ్య = విని, అప్రతిమః = సాటిలేనివీరుడైన, సః దశాననః= ఆ దశముఖుడు, కోపవివృత్తలోచనః సన్ = క్రోధముచే భీకరముగ తిరుగుచున్న కన్నులు గలవాడై, తస్య మహాకపేః = ఆ మహావానరుడైన హనుమయొక్క, వధం = వధనుగూర్చి, సమాదిశత్ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :– ఎట్టి దైన్యభావము లేకుండ అతిసముచితముగ మాటలాడిన ఆ హనుమ పలికిన అప్రియమైన వచనములను ఆలకించి నిరుపమానపరాక్రమశాలి యగు ఆ దశముఖుడు క్రోధముచే కన్నులు భయంకరముగా తిరిగిపోవుచుండగా నెదుటనున్న ఆ మహావానరుని వెంటనే వధింపుడని ఆజ్ఞాపించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమదుపదేశము" అను*
*ఏబదియొకటవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ద్విపంచాశసర్గ

**శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా వానరస్య మహాత్మనః ।**
**ఆజ్ఞాపయ త్తస్య వధం రావణః క్రోధమూర్ఛితః ॥ 1**

**పదచ్ఛేదము :–** తస్య – తత్ – వచనం – శ్రుత్వా – వానరస్య – మహాత్మనః – ఆజ్ఞాపయత్ – తస్య – వధం – రావణః – క్రోధమూర్ఛితః ॥

**అన్వయక్రమము :–** మహాత్మనః తస్య వానరస్య తత్ వచనం శ్రుత్వా రావణః క్రోధమూర్ఛితః సన్ తస్య వధమ్ ఆజ్ఞాపయత్.

**ప్రతిపదార్థము :–** మహాత్మనః = మహనీయుడైనట్టి, తస్య వానరస్య = ఆ హనుమయొక్క తత్ వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, క్రోధమూర్ఛితః = క్రోధవివశుడై, తస్య = ఆ హనుమయొక్క, వధమ్ = వధను, ఆజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము :–** మహాత్ముడైన హనుమ పలికిన మాటలను విని రావణుడు క్రోధావేశము నొంది వెంటనే అతనిని వధింపుడని భటులకు ఆజ్ఞాపించెను.

**శ్లో॥ వధే తస్య సమాజ్ఞప్తే రావణేన దురాత్మనా ।**
**నివేదితవతో దౌత్యం నానుమేనే విభీషణః ॥ 2**

**పదచ్ఛేదము :–** వధే – తస్య – సమాజ్ఞప్తే – రావణేన – దురాత్మనా – నివేదితవతః – దౌత్యం – న – అనుమేనే – విభీషణః ॥

**అన్వయక్రమము :–** దురాత్మనా రావణేన దౌత్యం నివేదితవతః తస్య వధే సమాజ్ఞప్తే (సతి) విభీషణః (తం) న అనుమేనే.

**ప్రతిపదార్థము :–** దురాత్మనా = దుర్మార్గుడైనట్టి, రావణేన = రావణునిచే, దౌత్యం = ప్రభుసందేశమును, నివేదితవతః = విన్నవించినట్టి, తస్య = ఆ హనుమయొక్క, వధే = వధ, సమాజ్ఞప్తే (సతి) = ఆజ్ఞాపింపబడగా, విభీషణః = విభీషణుడు (తం = ఆ వధను), న అనుమేనే = అనుమతించలేదు.

**తాత్పర్యము** :- దూతకృత్యముగా తన ప్రభువుయొక్క సందేశమును వినిపించినట్టి హనుమకు దుర్మార్గుడైన రావణుడు మరణదండన మాజ్ఞాపించగా దానికి విభీషణుడు సమ్మతించలేదు.

**శ్లో॥ తం రక్షోధిపతిం క్రుద్ధం తచ్చ కార్యముపస్థితమ్ ।**
**విదిత్వా చింతయామాస కార్యం కార్యవిధౌ స్థితః ॥ 3**

**పదచ్ఛేదము** :- తం - రక్షోధిపతిం - క్రుద్ధం - తత్ - చ - కార్యమ్ - ఉపస్థితమ్, విదిత్వా - చింతయామాస - కార్యం - కార్యవిధౌ - స్థితః ॥

**అన్వయక్రమము** :- కార్యవిధౌ స్థితః (సః)తం రక్షోధిపతిం క్రుద్ధమ్, ఉపస్థితం తత్ కార్యం చ విదిత్వా కార్యం చింతయామాస.

**ప్రతిపదార్థము** :- కార్యవిధౌ = కృత్యవిధానమునందు, స్థితః = ఉన్నట్టివాడైన, (సః = ఆ విభీషణుడు), తం రక్షోధిపతిం = ఆ రాక్షసరాజైన రావణుని, క్రుద్ధమ్ = కోపించియున్నవానినిగను, ఉపస్థితం = సమీపించియున్న, తత్ కార్యం చ = ఆ పనిని - అనగా - దూతవధను గూర్చియు, విదిత్వా = తెలిసికొని, కార్యం = కార్యమునుగూర్చి, చింతయామాస = ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- కార్యవిధౌ స్థితః - ప్రస్తుతకర్తవ్యాచరణమున దృఢచిత్తుడైయున్న వాడును, మంచి చెడ్డలను వివేకించి కార్యము నిర్ణయము చేయగల్గిన వాడును అని భావము.

**తాత్పర్యము** :- కార్యనిర్వహణమునందు దృఢమైన నిశ్చయము గల్గినట్టి ఆ విభీషణుడు అప్పుడు రాక్షసరాజు క్రోధావిష్టుడై యుండుటచే తాను తలపెట్టిన దూతవధ నివారణమనెడి అప్పటి కార్యము జాగరూకతతో నిర్వహింపవలసియున్నదని చక్కగా తెలిసికొని ఆ కర్తవ్యమును గూర్చి ఆలోచింపసాగెను.

**శ్లో॥ నిశ్చితార్థ స్తత స్సామ్నా పూజ్యం శత్రుజిదగ్రజమ్ ।**
**ఉవాచ హిత మత్యర్థం వాక్యం వాక్యవిశారదః ॥ 4**

**పదచ్ఛేదము** :- నిశ్చితార్థః - తతః - సామ్నా - పూజ్యం - శత్రుజిదగ్రజమ్ - ఉవాచ - హితమ్ - అత్యర్థం - వాక్యం - వాక్యవిశారదః ॥

**అన్వయక్రమము** :- తతః నిశ్చితార్థః వాక్యవిశారదః సః పూజ్యం శత్రుజిదగ్రజం

సామ్నా అత్యర్థం హితం వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, నిశ్చితార్థః = నిశ్చయింపబడిన విషయము గలవాడును, వాక్యవిశారదః = మాటనేర్పుగలవాడునగు, సః = ఆ విభీషణుడు,పూజ్యం = పూజనీయుడైనట్టి, శత్రుజిదగ్రజం = శత్రువులను జయించువాడైన అన్నను గూర్చి, సామ్నా = మంచిమాటతో, అత్యర్థం = మిక్కిలి, హితం = మేలైనట్టి, వాక్యమ్ = వాక్యమును, ఉవాచ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :– 'శత్రుజిత్' అని విడదీసి శత్రుజిత్తు అయిన విభీషణుడని అర్థము చెప్పి 'అపూజ్యం' అని విడదీసి పూజింపదగని అని రావణునకు విశేషణముచేసి – శత్రుజిత్ విభీషణః, అపూజ్యం రావణం ఉవాచ – అని అన్వయించవలెను.

**తాత్పర్యము** :– ప్రస్తుత కర్తవ్యమును చక్కగా నిశ్చయించుకొన్నవాడై చక్కని మాటనేర్పు గలిగినట్టి ఆ విభీషణుడప్పుడు వీరుడును పూజ్యుడునగు తన యన్నతో మంచిమాటలతో అతనికి మేలుగూర్చునట్టి వచనముల నీ రీతిగ పలికెను.

**శ్లో॥ క్షమస్వ రోషం త్యజ రాక్షసేంద్ర**
**ప్రసీద మద్వాక్య మిదం శృణుష్వ ।**
**వధం న కుర్వంతి పరావరజ్ఞా**
**దూతస్య సంతో వసుధాధిపేంద్రాః ॥** 5

**పదచ్ఛేదము** :– క్షమస్వ – రోషం – త్యజ – రాక్షసేంద్ర – ప్రసీద – మద్వాక్యమ్ – ఇదం – శృణుష్వ – వధం – న – కుర్వంతి – పరావరజ్ఞాః – దూతస్య – సంతః – వసుధాధిపేంద్రాః ॥

**అన్వయక్రమము** :– రాక్షసేంద్ర! క్షమస్వ, రోషం త్యజ, ప్రసీద, ఇదం మద్వాక్యం శృణుష్వ, పరావరజ్ఞాః సంతః వసుధాధి పేంద్రాః దూతస్య వధం న కుర్వంతి.

**ప్రతిపదార్థము** :– రాక్షసేంద్ర! = ఓ రాక్షసరాజా, క్షమస్వ = మన్నింపుము, రోషం = క్రోధమును, త్యజ = విడువుము, ప్రసీద = ప్రసన్నుడవగుము, ఇదం మద్వాక్యం = ఈ నామాటను, శృణుష్వ = ఆలకింపుము, పరావరజ్ఞాః = మంచిచెడ్డలు తెలిసినట్టి, సంతః = సత్పురుషులైనట్టి, వసుధాధిపేంద్రాః = రాజశ్రేష్ఠులు, దూతస్య = దూతయొక్క వధం = వధను, న కుర్వంతి = చేయరు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** క్షమస్వ రోషం - క్రోధమును సహింపుము. త్యజ - దూతవధనిమిత్తమై చేసిన ఆజ్ఞను విడువుము. పరావరజ్ఞాః - సమస్తకార్యవిషయములందు ఉత్కర్షాపకర్షముల నెఱిగినవారు.

**గోవిందరాజీయము, మహేశ్వరతీర్థులు :-** పరావరజ్ఞాః - త్యజింపదగినది, గ్రహింపదగినది అను వాని భేదమును గూర్చి బాగుగా తెలిసినట్టివారు.

**తాత్పర్యము :-** ఓ రాక్షసరాజా! క్షమింపుము. క్రోధమును వీడుము. అనుగ్రహము చూపుము. నేను చెప్పుమాటను శ్రద్ధగ వినుము. మంచి చెడు విషయములయొక్క తారతమ్యము నెఱిగినట్టి ఉత్తములైన రాజశ్రేష్ఠులు దూతను వధింపబూనరు.

**శ్లో॥ రాజధర్మవిరుద్ధం చ లోకవృత్తే శ్చ గర్హితమ్ ।**
**తవ చాసదృశం వీర కపే రస్య ప్రమాపణమ్ ॥ 6**

**పదచ్ఛేదము :-** రాజధర్మవిరుద్ధం - చ - లోకవృత్తేః - చ - గర్హితమ్, తవ - చ - అసదృశం - వీర - కపేః - అస్య - ప్రమాపణమ్ ॥

**అన్వయక్రమము :-** వీర! అస్య కపేః ప్రమాపణం, రాజధర్మవిరుద్ధం చ లోకవృత్తేః గర్హితం చ, తవ అసదృశం చ భవతి.

**ప్రతిపదార్థము :-** వీర! = ఓ వీరుడా!, అస్య కపేః = ఈ వానరునియొక్క ప్రమాపణం = సంహారము, రాజధర్మవిరుద్ధం చ = రాజధర్మమునకు విరుద్ధమైనట్టిదియును, లోకవృత్తేః = లోకముయొక్క నడవడికి, గర్హితం చ = నిందితమైనదియును, తవ = నీకు, అసదృశం చ = అనుచితమైనట్టిదియును, భవతి = అగును.

**సూచన:-** 'రాజధర్మవిరుద్ధం' అనుటకు బదులుగా 'రాజన్! ధర్మవిరుద్ధం' అని పాఠాంతరము.

**తాత్పర్యము :-** ఓ మహావీరుడా! ఇప్పుడీ దూతయైన వానరుని వధించుట రాజధర్మమున కెంతయును విరుద్ధమైనట్టిది, మఱియును లోకవ్యవహారమున గూడ నింద్యమైన విషయమగును,పైగా నీవంటి వానికి ఎంత మాత్రము ఇది ఉచితమైనది గాదు సుమా!

**శ్లో॥ ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ రాజధర్మవిశారదః ।**
**పరావరజ్ఞో భూతానాం త్వమేవ పరమార్థవిత్ ॥ 7**

**పదచ్ఛేదము :–** ధర్మజ్ఞః – చ – కృతజ్ఞః – చ – రాజధర్మవిశారదః, పరావరజ్ఞః – భూతానాం – త్వమ్ – ఏవ – పరమార్థవిత్ ॥

**అన్వయక్రమము :–** త్వమ్ ఏవ ధర్మజ్ఞః, కృతజ్ఞః చ, రాజధర్మవిశారదః చ, భూతానాం పరమార్థవిత్, పరావరజ్ఞః చ.

**ప్రతిపదార్థము :–** త్వమ్ ఏవ = నీవే, ధర్మజ్ఞః = ధర్మము తెలిసినవాడవు, కృతజ్ఞః చ = కృతజ్ఞుడవును, రాజధర్మవిశారదః చ = రాజధర్మములందు కోవిదుడవును, భూతానాం = ప్రాణులయొక్క, పరమార్థవిత్ = సారమును తెలిసినవాడవు, పరావరజ్ఞః = మహత్త్వము అల్పత్వము అను తారతమ్యము తెలిసివాడవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి :–** పై శ్లోకమునందు చెప్పిన నీవంటివానికి అనున దిచ్చట వివరింపబడుచున్నది. ధర్మజ్ఞుడవు, కృతజ్ఞుడవు, రాజధర్మవిశేషజ్ఞుడవు, పరావరజ్ఞుడవు, సారజ్ఞుడవు గనుక నీవు దూతవధను అంగీకరింపరాదని భావము.

**తాత్పర్యము :–** రాజా! నీవు ధర్మజ్ఞుడవు. పరులు చేసిన మంచిచెడ్డలను గుర్తింపగలవాడవు. రాజధర్మనిపుణుడవు. గొప్ప విషయము హీనవిషయ మను విచక్షణ నెఱిగినవాడవు గాన సర్వప్రాణుల తత్త్వము నీకే సంపూర్ణముగ తెలియును గదా!

**శ్లో॥ గృహ్యంతే యది రోషేణ త్వాదృశోఽపి విపశ్చితః ।**
**తత శ్శాస్త్రవిపశ్చిత్త్వం శ్రమ ఏవ హి కేవలమ్ ॥ 8**

**పదచ్ఛేదము :–** గృహ్యంతే – యది – రోషేణ – త్వాదృశః – అపి – విపశ్చితః, తతః – శాస్త్రవిపశ్చిత్త్వం – శ్రమః – ఏవ – హి – కేవలమ్ ॥

**అన్వయక్రమము :–** త్వాదృశః విపశ్చితః అపి రోషేణ గృహ్యంతే యది తతః శాస్త్రవిపశ్చిత్త్వం కేవలం శ్రమః ఏవ హి.

**ప్రతిపదార్థము :–** త్వాదృశః = నీవంటివారయిన, విపశ్చితః అపి = విద్వాంసులుగూడ, రోషేణ = క్రోధముచే, గృహ్యంతే యది = పట్టుబడుదురేని, తతః = ఆ కారణమున, శాస్త్రవిపశ్చిత్త్వం = శాస్త్రములందు పాండిత్యము, కేవలం = కేవలము, శ్రమః ఏవ హి = ప్రయాసము మాత్రమే గదా!

**తాత్పర్యము :–** నీ వంటి ప్రాజ్ఞుడు గూడ ఇట్లు క్రోధావేశమునకు లోబడిపోయినచో ఈ శాస్త్రములయందలి పాండిత్యమంతయు కేవలము ప్రయాసము మాత్రమే యనుకొనవలసి వచ్చును గదా!

**శ్లో॥ తస్మా త్ప్రసీద శత్రుఘ్న రాక్షసేంద్ర దురాసద ।**
**యుక్తాయుక్తం వినిశ్చిత్య దూతే దండో విధీయతామ్ ॥ 9**

**పదచ్ఛేదము :-** తస్మాత్ - ప్రసీద - శత్రుఘ్న - రాక్షసేంద్ర - దురాసద - యుక్తాయుక్తం - వినిశ్చిత్య - దూతే - దండః - విధీయతామ్ ॥

**అన్వయక్రమము :-** తస్మాత్ హే శత్రుఘ్న! రాక్షసేంద్ర! దురాసద! ప్రసీద, యుక్తాయుక్తం వినిశ్చిత్య దూతే దండః విధీయతామ్.

**ప్రతిపదార్థము :-** తస్మాత్ = అందువలన, హే శత్రుఘ్న = ఓ శత్రుదమనుడా!, రాక్షసేంద్ర! = ఓ రాక్షసరాజా!, దురాసద! = చేరశక్యముగానివాడా!, ప్రసీద = శాంతించుము, యుక్తాయుక్తం = మంచి చెడ్డలను, వినిశ్చిత్య = నిర్ణయించి, దూతే = దూతయెడ, దండః = శిక్ష, విధీయతామ్ = విధింపబడుగాక!

**తాత్పర్యము :-** ఓ రాక్షసరాజా! నీవు శత్రుంజయుడవు. శత్రువులు నిన్ను జేరుటకే వెఱతురు. అందుకే ఈ దూతయెడల ప్రసన్నుడవు గమ్ము. యుక్తాయుక్తములను చక్కగ నిర్ణయించి దూతకు విధింపవలసిన ఒక శిక్షను ఆజ్ఞాపింపుము.

**శ్లో॥ విభీషణవచ శ్శ్రుత్వా రావణో రాక్షసేశ్వరః ।**
**రోషేణ మహతాऽऽవిష్టో వాక్య ముత్తర మబ్రవీత్ ॥ 10**

**పదచ్ఛేదము :-** విభీషణవచః - శ్రుత్వా - రావణః - రాక్షసేశ్వరః - రోషేణ - మహతా - ఆవిష్టః - వాక్యమ్ - ఉత్తరమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :-** విభీషణవచః శ్రుత్వా రాక్షసేశ్వరః రావణః మహతా రోషేణ ఆవిష్టః ఉత్తరం వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :-** విభీషణవచః = విభీషణుని మాటను, శ్రుత్వా = విని, రాక్షసేశ్వరః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, మహతా = గొప్పదైన, రోషేణ = క్రోధముచే, ఆవిష్టః = ఆవేశింపబడినవాడై, ఉత్తరం = సమాధానమైన, వాక్యం = వచనమును, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :-** రాక్షసరాజైన రావణుడు, విభీషణుడు చెప్పిన మాటను విని, తీవ్రమైన క్రోధావేశమునొంది సమాధానముగా నిట్లు పలికెను.

**శ్లో॥ న పాపానాం వధే పాపం విద్యతే శత్రుసూదన ।**
**తస్మాదేనం వధిష్యామి వానరం పాపకారిణమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– న – పాపానాం – వధే – పాపం – విద్యతే – శత్రుసూదన – తస్మాత్ – ఏనం – వధిష్యామి – వానరం – పాపకారిణమ్ ॥

**అన్వయక్రమము** :– హే శత్రుసూదన! పాపానాం వధే పాపం న విద్యతే. తస్మాత్ పాపకారిణమ్ ఏనం వధిష్యామి.

**ప్రతిపదార్థము** :– శత్రుసూదన! = ఓ శత్రుసంహారకుడా!, పాపానాం = పాపాత్ములయొక్క, వధే = వధయందు, పాపం = పాపము, న విద్యతే = ఉండదు, తస్మాత్ = అందువలన, పాపకారిణం = పాపము చేసినట్టి, ఏనం వానరం = ఈ వానరుని, వధిష్యామి = వధించెదను.

**తాత్పర్యము** :– శత్రుసంహారకుడవైన తమ్ముడా! పాపాత్ములను సంహరించుటలో పాపమేమియు లేదు కాబట్టి మనకు ద్రోహము తలపెట్టి పాపముల నాచరించినట్టి ఈ వానరుని నే నిప్పుడే వధించెదను.

**శ్లో॥ అధర్మమూలం బహుదోషయుక్త**
**మనార్యజుష్టం వచనం నిశమ్య ।**
**ఉవాచ వాక్యం పరమార్థతత్త్వం**
**విభీషణో బుద్ధిమతాం వరిష్ఠః ॥** **12**

**పదచ్ఛేదము** :– అధర్మమూలం – బహుదోషయుక్తమ్ – అనార్యజుష్టం – వచనం – నిశమ్య – ఉవాచ – వాక్యం – పరమార్థయుక్తం – విభీషణః – బుద్ధిమతాం – వరిష్ఠః ॥

**అన్వయక్రమము** :– అధర్మమూలం బహుదోషయుక్తమ్ అనార్యజుష్టం (రావణస్య) వచనం నిశమ్య బుద్ధిమతాం వరిష్ఠః విభీషణః పరమార్థతత్త్వం వాక్యం ఉవాచ.

**ప్రతిపదార్థము** :– అధర్మమూలం = అధర్మమునకు మూలమైనట్టిదియును, బహుదోషయుక్తం = అనేక దోషములతో గూడినదియును, అనార్యజుష్టం = దుష్టులచే సేవింపబడినదియునగు, రావణస్య = రావణునియొక్క, వచనం = మాటను, నిశమ్య = విని, బుద్ధిమతాం = బుద్ధిమంతులలో, వరిష్ఠః = శ్రేష్ఠుడైనట్టి, విభీషణః = విభీషణుడు, పరమార్థతత్త్వం = పరమార్థమైన సారముగల్గినట్టి, వాక్యం = వచనమును, ఉవాచ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**సూచన** :– 'బహురోషయుక్తం' అని పాఠాంతరము.

**తాత్పర్యము :-** అధర్మములకు కారణమైనదియును, అపకీర్తి మున్నగు అనేకమైన గొప్ప దోషములతో నిండినదియును, దుర్మార్గులు మాత్రమే అనుసరించునదియునగు రావణునియొక్క ఆ నిశ్చయమును విని ప్రాజ్ఞులలో ఎన్నదగినవాడైన విభీషణుడు పరమార్థసారమైనట్టి వచనములను అన్నతో నిట్లు పలికెను.

**శ్లో॥ ప్రసీద లంకేశ్వర రాక్షసేంద్ర**
**ధర్మార్థయుక్తం వచనం శృణుష్వ ।**
**దూతా నవధ్యాన్ సమయేషు రాజన్**
**సర్వేషు సర్వత్ర వదంతి సంతః ॥ 13**

**పదచ్ఛేదము :-** ప్రసీద – లంకేశ్వర – రాక్షసేంద్ర ! – ధర్మార్థయుక్తం – వచనం – శృణుష్వ – దూతాన్ – అవధ్యాన్ – సమయేషు – రాజన్ – సర్వేషు – సర్వత్ర – వదంతి – సంతః ॥

**అన్వయక్రమము :-** రాక్షసేంద్ర! లంకేశ్వర! ప్రసీద, ధర్మార్థయుక్తం వచనం, శృణుష్వ, రాజన్! సర్వేషు సమయేషు సర్వత్ర సంతః దూతాన్ అవధ్యాన్ వదంతి.

**ప్రతిపదార్థము :-** లంకేశ్వర! = ఓ లంకాధిపతీ! రాక్షసేంద్ర = రాక్షసరాజా! ప్రసీద = ప్రసన్నుడవగుము, ధర్మార్థయుక్తం = ధర్మముతోడను అర్థముతోడను గూడినట్టి, వచనం = మాటను, శృణుష్వ = వినుము, రాజన్ = ఓ రాజా! సర్వేషు సమయేషు = అన్నియెడలను, సర్వత్ర = అన్నివిషయములందును, సంతః = సత్పురుషులు, దూతాన్ = దూతలను, అవధ్యాన్ = చంపదగనివారినిగా, వదంతి = చెప్పుదురు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :-** సమయేషు – తన ప్రభువు నియోగించిన కృత్యమును తన ధర్మముగా అనుష్ఠించు కాలములందు అని భావము.

**గోవిందరాజీయము :-** సర్వత్ర – అన్ని జాతులయందును అనగా దూత ఏ జాతివాడైనను యని భావము.

**తాత్పర్యము :-** ఓ లంకాధిపతీ! రాక్షసరాజా! ఈ దూతయెడల ప్రసన్నుడవుగమ్ము. ధర్మసమ్మతమును అర్థసమ్మతమునగు నేను చెప్పు మాటల నాలకింపుము. ఎల్లయెడలను తన ప్రభువు పంపున దూతకృత్యమునకై వచ్చినవా డెట్టివాడైనను వానిని చంపగూడదని ధర్మజ్ఞులైన పెద్దలు వక్కాణింతురు గదా!

**శ్లో॥ అసంశయం శత్రు రయం ప్రవృద్ధః**
**కృతం హ్యనే నాప్రియ మప్రమేయమ్ ।**
**న దూతవధ్యాం ప్రవదంతి సంతో**
**దూతస్య దృష్టా బహవో హి దండాః ॥ 14**

**పదచ్ఛేదము** :- అసంశయం - శత్రుః - అయం - ప్రవృద్ధః - కృతం - హి - అనేన - అప్రియమ్ - అప్రమేయమ్ - న - దూతవధ్యాం - ప్రవదంతి - సంతః - దూతస్య - దృష్టాః - బహవః - హి - దండాః ॥

**అన్వయక్రమము** :- అసంశయమ్ అయం ప్రవృద్ధః శత్రుః. అనేన అప్రమేయమ్ అప్రియం కృతం హి. సంతః దూతవధ్యాం న ప్రవదంతి. దూతస్య దండాః బహవః దృష్టాః హి.

**ప్రతిపదార్థము** :- అసంశయం = నిస్సంశయంగా, అయం = ఈతడు, ప్రవృద్ధః = పెచ్చు పెరిగినట్టి, శత్రుః = శత్రువు. అనేన = వీనిచే, అప్రమేయం = అపరిమితమైనట్టి, అప్రియం = అనిష్టము, కృతం హి = చేయబడినది సుమా. సంతః = సత్పురుషులు, దూతవధ్యాం = దూతయొక్క మరణమును, న ప్రవదంతి = చెప్పుటలేదు. దూతస్య = దూతకు, దండాః = దండములు, బహవః = పలువిధములు, దృష్టాః హి = కనబడుచున్నవిగదా!

**తాత్పర్యము** :- రాజా! నిస్సంశయముగా ఈ వానరుడు పెచ్చుపెరిగిపోయినట్టి ఘోరశత్రువే అయియున్నాడు. మఱియు నితడు ఇంత యంత అనరాని గొప్ప అనిష్టమునే మనకు కల్గించినవాడుకూడను. అయినప్పటికిని దూతను వధించుటకు పెద్దలెవ్వరును సమ్మతింపరు. ధర్మశాస్త్రములందు చూచినను దూతకు వధ గాక ఇతరశిక్షలు ఎన్నియో గాన్పించుచున్నవి గదా!

**శ్లో॥ వైరూప్య మంగేషు కశాభిఘాతో**
**మౌండ్యం తథా లక్షణసన్నిపాతః ।**
**ఏతాన్ హి దూతే ప్రవదంతి దండాన్**
**వధస్తు దూతస్య న నః శ్రుతోఽపి ॥ 15**

**పదచ్ఛేదము** :- వైరూప్యమ్ - అంగేషు - కశాభిఘాతః - మౌండ్యం - తథా - లక్షణసన్నిపాతః - ఏతాన్ - హి - దూతే - ప్రవదంతి - దండాన్ - వధః - తు - దూతస్య - న - నః - శ్రుతః - అపి ॥

**అన్వయక్రమము** :– అంగేషు వైరూప్యం, కశాభిఘాతః, మౌండ్యం, తథా లక్షణ సన్నిపాతః, ఏతాన్ హి దూతే దండాన్ ప్రవదంతి, దూతస్య వధః తు నః శ్రుతః అపి న.

**ప్రతిపదార్థము** :– అంగేషు = అవయవములందు, వైరూప్యం = వికృతి గల్గించుటయును, కశాభిఘాతః = కొరడాతో కొట్టుటయును, మౌండ్యం = ముండనమును, తథా = అట్లే, లక్షణసన్నిపాతః = లజ్జాకరమైన గుర్తులను వేయుటయును, ఏతాన్ హి = వీనినిగదా, దూతే = దూతయెడల, దండాన్ = దండనములుగా, ప్రవదంతి = చెప్పుచున్నారు. దూతస్య = దూతయొక్క, వధః తు = వధ మాత్రము, నః = మనకు, శ్రుతః అపి = వినబడినది గూడ, న = లేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– లక్షణసన్నిపాతః – దూతయొక్క ముఖము మున్నగు అవయవములందు స్థిరముగ నిలచియుండునట్లుగా కాల్చి అవమానకరమైన ముద్రలు వేయుట, అని ఒకరు అనగా మహేశ్వరతీర్థులు ముండనము మున్నగు వానిలో ఒకానొక్కటి విధించుటగాని లేక అన్ని దండనములను విధించుట గాని (సన్నిపాతః అను శబ్దముచే) అని చెప్పుచున్నారు.

**రా. శిరోమణి** :– వైరూప్యం = ముక్కు కోయుట మున్నగు అవయవచ్ఛేదము, మౌండ్యం = కనుబొమ్మలతో సహితముగా వపనము చేయించుట, లక్షణసన్నిపాతః – రాగి ముద్రను కాల్చి నుదురు మున్నగు వానియందు గుర్తులు వేయుట.

**తాత్పర్యము** :– నాసిక మున్నగు అవయవములను ఖండించి వికృతరూపుని చేయుట, కొరడాతో దెబ్బలు కొట్టుట, సర్వాంగముండనము గావించుట, అపరాధచిహ్నముగా కాల్చి అవమానకరమైన ముద్రలు వేయుట అనువానిని దూతకు విధించవలసిన శిక్షలుగా పెద్దలు చెప్పుచున్నారు గదా! దూతకు మరణదండనము మన మెచ్చుటనైన వినియున్నామా?

**శ్లో॥ కథం చ ధర్మార్థవినీతబుద్ధిః**
**పరావరప్రత్యయనిశ్చితార్థః ।**
**భవద్విధః కోపవశే హి తిష్ఠే**
**త్కోపం నియచ్ఛంతి హి సత్త్వవంతః ॥ 16**

**పదచ్ఛేదము** :– కథం – చ – ధర్మార్థవినీతబుద్ధిః – పరావరప్రత్యయనిశ్చితార్థః –

భవద్విధః – కోపవశే – హి – తిష్ఠేత్ – కోపం – నియచ్ఛంతి – హి – సత్త్వవంతః ॥

**అన్వయక్రమము** :– ధర్మార్థవినీతబుద్ధిః పరావరప్రత్యయనిశ్చితార్థః భవద్విధః కోపవశే కథం హి తిష్ఠేత్? సత్త్వవంతః కోపం నియచ్ఛంతి హి.

**ప్రతిపదార్థము** :– ధర్మార్థవినీతబుద్ధిః = ధర్మమునందును అర్థమునందును శిక్షణము పొందినట్టి బుద్ధిగలవాడవై, పరావరప్రత్యయనిశ్చితార్థః = ఘనమైనది, అల్పమైనది యను వివేకముతో నిర్ణయించుకొన్న విషయములు గల్గిన, భవద్విధః = నీవంటివాడు, కథం హి = ఎట్లుగా, కోపవశే = క్రోధముయొక్క యధీనమునందు, తిష్ఠేత్ = నిలుచును? సత్త్వవంతః = శక్తిమంతులైనవారు, కోపం = క్రోధమును, నియచ్ఛంతి హి = అణచి వేయుదురుగదా!

**తాత్పర్యము** :– ధర్మము అర్థము అను పురుషార్థములు రెండింటియందును చక్కని శిక్షణము నొందిన వాడవును, యుక్తాయుక్త వివేకముతో సర్వ విషయములను నిశ్చయింపగలవాడవు నగు నీవంటి వాడే క్రోధమునకు లొంగిపోవుట ఏమి ఉచిత మగును? శక్తిమంతులైన ధీరులు తమ క్రోధమును తాము వివేకముతో అణచు కొందురు కదా!

**శ్లో॥ న ధర్మవాదే న చ లోకవృత్తే**
**న శాస్త్రబుద్ధిగ్రహణేషు చాపి ।**
**విద్యేత కశ్చిత్తవ వీర తుల్య**
**స్త్వం హ్యుత్తమ స్సర్వసురాణామ్ ॥ 17**

**పదచ్ఛేదము** :– న – ధర్మవాదే – న – చ – లోకవృత్తే – న – శాస్త్రబుద్ధిగ్రహణేషు – చ – అపి, విద్యేత – కశ్చిత్ – తవ – వీర – తుల్యః – త్వం – హి – ఉత్తమః – సర్వసురాసురాణామ్ ॥

**అన్వయక్రమము** :– వీర! ధర్మవాదే తవ తుల్యః న అస్తి, లోకవృత్తే చ న, శాస్త్రబుద్ధి గ్రహణేషు చ అపి తవ తుల్యః కశ్చిత్ న విద్యేత. సర్వసురాసురాణాం త్వం హి ఉత్తమః.

**ప్రతిపదార్థము** :– వీర! = ఓ వీరుడా!, ధర్మవాదే = ధర్మప్రవచనమునందు, తవ = నీకు, తుల్యః = సమానుడు, కశ్చిత్ = ఒక్కడును, న విద్యతే = లేడు, లోకవృత్తే చ = లోకవ్యవహారమునందును, న విద్యేత = ఉండడు, శాస్త్రబుద్ధిగ్రహణేషు చ అపి = శాస్త్రనిశ్చయములందును వినియోగమునందును గూడ, న విద్యేత = ఉండడు, సర్వసురాసురాణాం = సమస్తమైన దేవతలలోను దానవులలోను, త్వం హి =

నీవేగదా!, ఉత్తమః = శ్రేష్ఠుడవు.

**తాత్పర్యము** :- ఓ మహావీరుడా! ధర్మశాస్త్రముల ప్రవచనమునందుగాని, లోకవ్యవహారముల విషయమున గాని శాస్త్రముల నిర్ణయమునందుగాని, వాని వినియోగమునందుగాని నిన్ను బోలినవాడు ఎవ్వడును ఏ లోకమందును లేడు. దేవతలయందును దానవులందును గూడ ఎల్లవిషయములలోను నీవే శ్రేష్ఠుడవు.

**శ్లో॥ న చా ప్యస్య కపేర్ఘాతే కంచి త్పశ్యా మ్యహం గుణమ్ ।**
**తే ష్వయం పాత్యతాం దండో యైరయం ప్రేషితః కపిః ॥ 18**

**పదచ్ఛేదము** :- న - చ - అపి - అస్య - కపేః - ఘాతే - కం - చిత్ - పశ్యామి - అహం - గుణమ్ - తేషు - అయం - పాత్యతాం - దండః - యైః - అయం -ప్రేషితః - కపిః ॥

**అన్వయక్రమము** :- అస్య కపేః ఘాతే కంచిత్ గుణమ్ అపి చ అహం న పశ్యామి, యైః అయం కపిః ప్రేషితః, తేషు అయం దండః పాత్యతామ్.

**ప్రతిపదార్థము** :- అస్య కపేః = ఈ వానరుని యొక్క, ఘాతే = వధయందు, కంచిత్ గుణమ్ అపి చ = కొంచెము మేలునుగూడ, అహం = నేను, న పశ్యామి = చూడను, అయం కపిః = ఈ వానరుడు, యైః = ఎవరిచేతనయితే, ప్రేషితః = పంపబడినాడో, తేషు = వారియందు, అయం దండః = ఈ దండనము, పాత్యతాం = విధింపబడుగాక!

**తాత్పర్యము** :- ఈ దూతయైన వానరుని వధించుటవలన మనకు కలుగు ఎట్టి మేలును నాకు గాన్పించుట లేదు. మన కడకు ఈ దూతను బంపినట్టి ఆ శత్రువుల యెడనే ఈ మృత్యుదండనమును విధింతము గాక!

**శ్లో॥ సాధు ర్వా యది వాఽసాధుః పరై రేష సమర్పితః ।**
**బ్రువన్ పరార్థం పరవా న్న దూతో వధ మర్హతి ॥ 19**

**పదచ్ఛేదము** :- సాధుః - వా - యది - వా - అసాధుః - పరైః - ఏషః - సమర్పితః - బ్రువన్ - పరార్థం - పరవాన్ - న - దూతః - వధమ్ - అర్హతి ॥

**అన్వయక్రమము** :- సాధుః వా, అసాధుః వా, ఏషః పరైః సమర్పితః, పరార్థం బ్రువన్ పరవాన్ దూతః వధం న అర్హతి.

**ప్రతిపదార్థము** :- సాధుః వా = సాధువైనను, అసాధుః యది వా = అసాధువైనప్పటికిని, ఏషః = ఈ దూత, పరైః = ఇతరులచే, సమర్పితః = పంపబడినట్టివాడు, పరార్థం =

ఇతరులకొఱకై, బ్రువన్ = మాటాడుచు, పరవాన్ = పరాధీనుడైనట్టి, దూతః = దూత, వధం = మరణమును, న అర్హతి = (పొందుటకు) అర్హుడు గాడు.

**తాత్పర్యము** :- సాధువైనను అసాధువైనను ఈ దూత పరులచే పంపబడినట్టివాడు గదా! ఇతరులకొఱకై వారు చెప్పుమన్నది చెప్పుచున్నట్టి ఈ పరాధీనుడైన దూత మరణదండనమునకు ఎంత మాత్రము తగినవాడు గాడు.

**శ్లో॥ అపి చాస్మి న్హతే రాజ న్నాన్యం పశ్యామి ఖేచరమ్ ।**
**ఇహ యః పున రాగచ్ఛే త్పరం పారం మహోదధేః ॥ 20**

**పదచ్ఛేదము** :- అపి – చ – అస్మిన్ – హతే – రాజన్ – న – అన్యం – పశ్యామి – ఖేచరమ్ – ఇహ – యః – పునః – ఆగచ్ఛేత్ – పరం – పారం – మహోదధేః ॥

**అన్వయక్రమము** :- రాజన్ ! అపి చ అస్మిన్ హతే (సతి) ఇహ మహోదధేః పరం పారం యః పునః ఆగచ్ఛేత్ (తం) అన్యం ఖేచరం న పశ్యామి.

**ప్రతిపదార్థము** :- రాజన్! = ఓ రాజా!, అపి చ = మఱియును, అస్మిన్ = ఈ వానరుడు, హతే (సతి) = చంపబడగా, ఇహ = ఇక్కడకు, మహోదధేః = మహాసముద్రము యొక్క, పరం = ఆవలిదైన, పారం = తీరమును, యః = ఎవ్వడు, పునః = తిరిగి, ఆగచ్ఛేత్ = రాగలడో, తమ్ = అట్టి, అన్యం = వేఱొక, ఖేచరం = ఆకాశసంచారము గల్గినట్టి వానిని, న పశ్యామి = చూడను.

**తాత్పర్యము** :- నీవిప్పుడు వీనిని చంపివేసినచో ఈ మహాసముద్రము యొక్క ఆవలియొడ్డునుండి ఈవలి తీరమునకు వచ్చుటకు ఇంతటి ఆకాశగమనశక్తి గలిగిన వీరుడు ఇంకొకడు నాకు గాన్పింపడు.

**శ్లో॥ తస్మా న్నాస్య వధే యత్నః కార్యః పరపురంజయ ।**
**భవా న్సేంద్రేషు దేవేషు యత్న మాస్థాతు మర్హతి ॥ 21**

**పదచ్ఛేదము** :- తస్మాత్ – న – అస్య – వధే – యత్నః – కార్యః – పరపురంజయ – భవాన్ – సేంద్రేషు – దేవేషు – యత్నమ్ – ఆస్థాతుమ్ – అర్హతి ॥

**అన్వయక్రమము** :- పరపురంజయ! తస్మాత్ అస్య వధే యత్నః న కార్యః, భవాన్ సేంద్రేషు దేవేషు యత్నమ్ ఆస్థాతుమ్ అర్హతి.

**ప్రతిపదార్థము** :- పరపురంజయ = శత్రుపురములను జయించినట్టి వీరుడా!, తస్మాత్ = అందువలన, అస్య = ఈ దూతయొక్క, వధే = వధయందు, యత్నః = ప్రయత్నము, న కార్యః = చేయదగినది గాదు, భవాన్ = నీవు, సేంద్రేషు = ఇంద్రునితో గూడినట్టి,

దేవేషు = దేవతలయెడల, యత్నమ్ = ప్రయత్నమును, ఆస్థాతుం = చేయుటకు, అర్హతి = తగుదువు.

**తాత్పర్యము** :- ఓ శత్రుసంహారకుడా! ఈ కారణములచేత దూతగా వచ్చిన ఈతనిని వధించు యత్నమును విడువుము. కావలసిన యెడల దేవేంద్రునిగూర్చి దేవతలను గూర్చి నీ దండనప్రయత్నమును సాగింపుము.

**శ్లో॥ అస్మి న్వినష్టే న హి దూత మన్యం**
**పశ్యామి య స్తౌ నరరాజపుత్రౌ ।**
**యుద్ధాయ యుద్ధప్రియ దుర్వినీతా**
**వుద్యోజయే ద్దీర్ఘపథావరుద్ధౌ ॥ 22**

**పదచ్ఛేదము** :- అస్మిన్ - వినష్టే - న - హి - దూతమ్ - అన్యం - పశ్యామి - యః - తౌ - నరరాజపుత్రౌ - యుద్ధాయ - యుద్ధప్రియ - దుర్వినీతౌ - ఉద్యోజయేత్ - దీర్ఘపథావరుద్ధౌ ॥

**అన్వయక్రమము** :- యుద్ధప్రియ! అస్మిన్ వినష్టే సతి దీర్ఘపథావరుద్ధౌ, దుర్వినీతౌ తౌ నరరాజపుత్రౌ యః యుద్ధాయ ఉద్యోజయేత్ (తం) అన్యం దూతం న పశ్యామి హి.

**ప్రతిపదార్థము** :- యుద్ధప్రియ! = యుద్ధమునందు వేడుక గల్గినవాడా! అస్మిన్ = ఈ దూతయైన వానరుడు, వినష్టే సతి = చనిపోవగా, దీర్ఘపథావరుద్ధౌ = దూరమైన మార్గముచే అడ్డగింపబడినవారును, దుర్వినీతౌ = గర్వితులైనవారునగు, తౌ నరరాజపుత్రౌ = ఆ రాజపుత్రుల నిరువురను, యః = ఎవ్వడు, యుద్ధాయ = యుద్ధముకొఱకు, ఉద్యోజయేత్ = పురిగొల్పునో, (తం = అట్టి) అన్యం దూతం = వేరొక దూతను, న పశ్యామి హి = చూడను సుమా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- యుద్ధప్రియ! - దూత చనిపోయిన నష్టమేమి? ఆ రామలక్ష్మణులు ఇటకు రాకున్న హాని యేమి యనగూడదు. నీవు యుద్ధప్రియుడవు. యుద్ధమున పరాక్రమించుట, విజయముచే కీర్తినొందుట నీకు మిక్కిలి ఇష్టము గదా! ఈ దూత మరణించిన నీకు ఆ కోరిక లెట్లు నెఱవేరును? అని రావణుని రాజసప్రకృతిని ప్రకోపింప చేయుచు విభీషణుడు తనకు ఇష్టములేకున్నను రామలక్ష్మణులను దుర్వినీతులని రావణుని ప్రీతికొఱకే పలికెను అని తెలియవలెను.

**రా. శిరోమణి** :– యుద్ధప్రియదుర్వినీతౌ – యుద్ధప్రియులైన గర్విష్ఠులు అని రామలక్ష్మణులకు విశేషముగా అన్వయించుకొననగును.

**తాత్పర్యము** :– మహావీరుడా! ఇప్పుడీ దూత మరణించిన యెడల మిక్కిలి దూరమందుండి గర్విష్ఠులై ఇటకు వచ్చుటకు అవకాశము లేక యుండునట్టి ఆ రాజకుమారు లిరువురిని యుద్ధమునకు సన్నద్ధము చేయుచు, దౌత్యము నెఱవేర్పగల వేఱొక యోధుడు ఆయనకడ నున్నట్లుగా నాకు గాన్పించుట లేదు. కాబట్టి యుద్ధప్రియుడవైన నీవు ఈ దూతను చంపి సిద్ధమైయున్న యుద్ధమునకు అవకాశము లేకుండ చేసికొనుట యుక్తమై యుండునా?

**శ్లో॥ పరాక్రమోత్సాహమనస్వినాం చ**
**సురాసురాణామపి దుర్జయేన ।**
**త్వయా మనోనందన నైరృతానాం**
**యుద్ధాయతి ర్నాశయితుం న యుక్తా ॥ 23**

**పదచ్ఛేదము** :– పరాక్రమోత్సాహమనస్వినాం – చ – సురాసురాణామ్ – అపి – దుర్జయేన – త్వయా – మనోనందన – నైరృతానాం – యుద్ధాయతిః – నాశయితుం – న – యుక్తా ॥

**అన్వయక్రమము** :– నైరృతానాం మనోనందన! పరాక్రమోత్సాహమనస్వినాం సురాసురాణామ్ అపి దుర్జయేన త్వయా యుద్ధాయతిః నాశయితుం న యుక్తా.

**ప్రతిపదార్థము** :– నైరృతానాం = రాక్షసులకు, మనోనందన = మనస్సుకు ఆనందము గల్గించు వీరుడా!, పరాక్రమోత్సాహమనస్వినాం = పరాక్రమము, ఉత్సాహము పౌరుషము గల్గినట్టి, సురాసురాణాం చ అపి = దేవతలకును దానవులకును గూడ, దుర్జయేన = జయింపరానట్టి, త్వయా = నీచేత, యుద్ధాయతిః = యుద్ధఫలము, నాశయితుం = నశింపజేయుటకు, న యుక్తా = యుక్తముగాదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :– "హే నందన! యుద్ధాయ (సముత్సుకం) నైరృతానాం మనః నిర్నాశయితుం న యుక్తమ్" – రాక్షసులను ఆనందింపజేయు నట్టి మహావీరుడా! యుద్ధమునకై యువ్విళ్లూరుచున్న రక్కసుల మనస్సును నాశ మొందించుట నీకు యుక్తము గాదు. కావున యుద్ధమున కనుకూలముగా వచ్చియున్న దూతను చంపుట మాని వెనుకకు బంపుమని భావము.

**వాసుదాసస్వామి :–** నీ భటులలో యుద్ధమెప్పుడు వచ్చునా యని ఎదురుచూచువారు యుద్ధమునందు జయింపరానివారు గలరు. కావున ఇంద్రుడు మొదలైన వారందరు దండెత్తి వచ్చినను యుద్ధము చేయుటయం దుత్సాహము వహించుటే మగతనము. దానిని నీవు తప్పించ జూడరాదు, కావున దూతను జంపకుము.

**తాత్పర్యము :–** రాక్షసరాజా! యుద్ధప్రియులైన రాక్షసులను సంతోషపెట్టుట నీకును అభిమతమే గదా! కావున పరాక్రమము, ఉత్సాహము, పౌరుషము గల దేవదానవు లెల్లరకును దుర్జయుడవైన నీవు ఈ దూతను వధించి, ఇప్పుడు సిద్ధముగ నున్నట్టి మన రాక్షసులకు ప్రియమైన ఈ యుద్ధలాభమును చెఱచుట నీకు యుక్తముగాదు సుమా!

**శ్లో॥ హితాశ్చ శూరాశ్చ సమాహితాశ్చ**
**కులేషు జాతాశ్చ మహాగుణేషు ।**
**మనస్విన శ్శస్త్రభృతాం వరిష్ఠాః**
**కోట్యగ్రత స్తే సుభృతాశ్చ యోధాః ॥ 24**

**పదచ్ఛేదము :–** హితాః – చ – శూరాః – చ – సమాహితాః – చ – కులేషు – జాతాః – చ – మహాగుణేషు – మనస్వినః – శస్త్రభృతాం – వరిష్ఠాః – కోట్యగ్రతః – తే – సుభృతాః – చ – యోధాః ॥

**అన్వయక్రమము :–** హితాః చ శూరాః చ సమాహితాః చ మహాగుణేషు కులేషు జాతాః చ మనస్వినః శస్త్రభృతాం వరిష్ఠాః సుభృతాః చ యోధాః తే కోట్యగ్రతః (సంతి).

**ప్రతిపదార్థము :–** హితాః చ = హితులైనవారును, శూరాః చ = వీరులైనవారును, సమాహితాః చ = సన్నద్ధులైయున్నవారును, మహాగుణేషు = గొప్పగుణములు గల్గినట్టి, కులేషు = వంశములందు, జాతాః చ = జన్మించినవారును, మనస్వినః = పౌరుషవంతులును, శస్త్రభృతాం = ఆయుధధారులలో, వరిష్ఠాః = శ్రేష్ఠులును, సుభృతాః = చక్కగ పోషింపబడినవారునగు, యోధాః =యోధులు, తే = నీకు, కోట్యగ్రతః = కోట్లకొలదిగ, (సంతి = ఉన్నారు).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** సమాహితాః – దానాది సమ్మానములచే వశము చేసికొనబడినట్టివారు ఇట్టి విశిష్ట లక్షణములుగల యోధులు నీకడ కోట్ల కొలదిగనుండుటచే నీకు జయము

తప్పదని సూచింపబడుచున్నది.

**తాత్పర్యము** :- నీకు హితులైన వారును, నీపై ననురాగముగల వారును, గొప్పగుణములుగల గొప్ప వంశమునందు జన్మించినవారును, నీచే చక్కగ పోషింపబడుచున్నవారు నగు మహాయోధులు నీకడ కోట్ల కొలదిగ నున్నారు గదా!

**శ్లో॥ త దేకదేశేన బలస్య తావ**
**త్కేచిత్త వాదేశకృతోఽభియాంతు ।**
**తౌ రాజపుత్రౌ వినిగృహ్య మూఢౌ**
**పరేషు తే భావయితుం ప్రభావమ్ ॥ 25**

**పదచ్ఛేదము** :- తత్ - ఏకదేశేన - బలస్య - తావత్ - కేచిత్ - తవ - ఆదేశకృతః - అభియాంతు - తౌ - రాజపుత్రౌ - వినిగృహ్య - మూఢౌ - పరేషు - తే - భావయితుం - ప్రభావమ్ ॥

**అన్వయక్రమము** :- తత్ తవ ఆదేశకృతః కేచిత్ బలస్య ఏకదేశేన సహ మూఢౌ తౌ రాజపుత్రౌ వినిగృహ్య పరేషు తే ప్రభావం భావయితుం తావత్ అభియాంతు.

**ప్రతిపదార్థము** :- తత్ = అందువలన, తన = నీయొక్క, ఆదేశకృతః = ఆజ్ఞను నెరవేర్చువారు, కేచిత్ = కొంతమంది, బలస్య = సైన్యముయొక్క, ఏకదేశేన (సహ) =ఒక భాగముతోగూడి, వినిగృహ్య = నిగ్రహించి, పరేషు = శత్రువులందు, తే = నీయొక్క, ప్రభావం = మహిమను, భావయితుం = వెల్లడించుటకై, తావత్ = ముందుగా, అభియాంతు = ఎదురు వెళ్లుదురు గాక!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము, రా. శిరోమణి** :- రాజపుత్రౌ వినిగృహ్య - (ఆనయంతు ఇతి శేషః) రామలక్ష్మణులను బంధించి తెచ్చెదరు గాక!

**తాత్పర్యము** :- అందుచే అపారమైనట్టి నీ సైన్యములో నీ మనస్సు నెఱిగి నీ యాజ్ఞను చక్కగా నెఱవేర్చునట్టి కొంతమంది వీరులు మూఢులైన ఆ రాజపుత్రుల కడ కేగి వారిని భయగ్రస్తులుగా చేసి ఆ శత్రుసైన్యమునందు నీ ప్రభావమును తెలియజేయుటకై ముందుగ నటకు వెళ్లుదురు గాక!

**శ్లో॥ నిశాచరాణా మధిపోఽనుజస్య**
**విభీషణ స్యోత్తమవాక్య మిష్టమ్ ।**

జగ్రాహ బుద్ధ్యా సురలోకశత్రు
ర్మహాబలో రాక్షసరాజముఖ్యః ॥ **26**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"దూతవధనివారణం" నామ*
*పంచాశస్సర్గః*

**పదచ్ఛేదము :-** నిశాచరాణామ్ - అధిపః - అనుజస్య - విభీషణస్య - ఉత్తమవాక్యమ్ - ఇష్టమ్ - జగ్రాహ - బుద్ధ్యా - సురలోకశత్రుః - మహాబలః - రాక్షసరాజముఖ్యః ॥

**అన్వయక్రమము :-** నిశాచరాణాం అధిపః సురలోకశత్రుః మహాబలః రాక్షసరాజముఖ్యః (సః) అనుజస్య విభీషణస్య ఇష్టమ్ ఉత్తమవాక్యం బుద్ధ్యా జగ్రాహ.

**ప్రతిపదార్థము :-** నిశాచరాణాం = రాక్షసులకు, అధిపః = ప్రభువైనవాడును, సురలోకశత్రుః = దేవలోకమునకు శత్రువైనవాడును, మహాబలః = మహాబలాఢ్యుడును, రాక్షసరాజముఖ్యః = రాక్షసరాజులలో శ్రేష్ఠుడును అగు, (సః = ఆ రావణుడు) అనుజస్య = తమ్ముడైన, విభీషణస్య = విభీషణునియొక్క, ఇష్టం = నచ్చినట్టి, ఉత్తమవాక్యం = మేలైన మాటను, బుద్ధ్యా = నిశ్చితమైన బుద్ధిచేత, జగ్రాహ = స్వీకరించెను.

**తాత్పర్యము :-** రాక్షసులకు ప్రభువును, దేవతలకు శత్రువును అగు ఆ రావణుడు తన తమ్ముడైన విభీషణుడు పలికిన యిష్టమైన ఆ వచనమును నిశ్చయబుద్ధితో నంగీకరించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"దూతవధనివారణము" అను*
*ఏబదిరెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# త్రిపంచాశసర్గ

**శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా దశగ్రీవో మహాబలః ।**
**దేశకాలహితం వాక్యం భ్రాతు రుత్తర మబ్రవీత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తస్య – తత్ – వచనం – శ్రుత్వా – దశగ్రీవః – మహాబలః, దేశకాలహితం – వాక్యం – భ్రాతుః – ఉత్తరమ్ – అబ్రవీత్.

**అన్వయక్రమము :–** మహాబలః దశగ్రీవః తస్య తద్వచనం శ్రుత్వా భ్రాతుః దేశకాలహితం వాక్యమ్ ఉత్తరమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** మహాబలః = మహాబలాఢ్యుడైన, దశగ్రీవః = రావణుడు, తస్య = ఆ విభీషణుని యొక్క, తత్ వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, భ్రాతుః = సోదరునకు, దేశకాలహితం = దేశమునకును, కాలమునకును హితమైనట్టి, వాక్యం = వచనమును, ఉత్తరం = సమాధానముగా, అబ్రవీత్ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'దేశకాలహితం' – విభీషణుని వచనము దేశకాలోచితమైనదని అన్వయించుకొనవలెను.

**రా.శిరోమణి :–** 'మహాబలః' అనుటకు బదులుగా 'మహాత్మనః' అని పాఠాంతరము. అనగా మహాత్ముడైన విభీషణుని యొక్క మాటను విని యని అన్వయము.

**తాత్పర్యము :–** మహాబలశాలియగు దశకంఠుడు విభీషణుని వచనములను ఆలకించి దేశకాలోచితముగ సమాధానము చెప్పుచు తన తమ్ముని జూచి ఇట్లు పలికెను.

**శ్లో॥ సమ్య గుక్తం హి భవతా దూతవధ్యా విగర్హితా ।**
**అవశ్యం తు వధా దన్యః క్రియతా మస్య నిగ్రహః ॥ 2**

**పదచ్ఛేదము :–** సమ్యక్ – ఉక్తం – హి – భవతా – దూతవధ్యా – విగర్హితా – అవశ్యం – తు – వధాత్ – అన్యః – క్రియతామ్ – అస్య – నిగ్రహః ॥

**అన్వయక్రమము :-** భవతా సమ్యక్ ఉక్తం హి, దూతవధ్యా విగర్హితా, అవశ్యం అస్య వధాత్ అన్యః నిగ్రహః క్రియతామ్.

**ప్రతిపదార్థము :-** భవతా = నీచేత, సమ్యక్ = లెస్సగా, ఉక్తం హి = చెప్పబడినది సుమా!, దూతవధ్యా = దూతవధ, విగర్హితా = నింద్యమైనది, అవశ్యం = తప్పక, అస్య = వీనికి, వధాత్ = వధకంటె, అన్యః = వేరైనట్టి, నిగ్రహః = దండనము, క్రియతాం = చేయబడుగాక!

**తాత్పర్యము :-** దూతవధ నింద్యమైనది యని నీవు లెస్సగ తెలిపితివి. అందుచే నీతనిని ఇప్పుడు చంపుట మాని వేఱొక విధమైన దండనము విధించవలెను.

**శ్లో॥ కపీనాం కిల లాంగూల మిష్టం భవతి భూషణమ్ ।**
**త దస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు ॥ 3**

**పదచ్ఛేదము :-** కపీనాం - కిల - లాంగూలమ్ - ఇష్టం - భవతి - భూషణమ్ - తత్ - అస్య - దీప్యతాం - శీఘ్రం - తేన - దగ్ధేన - గచ్ఛతు ॥

**అన్వయక్రమము :-** కపీనాం లాంగూలమ్ ఇష్టం భూషణం భవతి కిల. (తత్) శీఘ్రం అస్య తత్ దీప్యతాం, దగ్ధేన తేన గచ్ఛతు ॥

**ప్రతిపదార్థము :-** కపీనాం = వానరులకు, లాంగూలం = తోక, ఇష్టం = ప్రియమైన, భూషణం = అలంకారము, భవతి కిల = అగును గదా! (తత్ = అందువలన) శీఘ్రం = వెంటనే, అస్య = ఈతనియొక్క, తత్ = ఆ వాలము, దీప్యతాం = కాల్చబడుగాక, దగ్ధేన = కాల్పబడినట్టి, తేన = ఆ తోకతో, గచ్ఛతు = వెడలునుగాక!

**తాత్పర్యము :-** కోతులకు తమ తోక మిక్కిలి ప్రియమైన ఆభరణము వంటిది గదా! కాబట్టి వెంటనే ఆ తోకకు నిప్పుబెట్టి అంటింపుము. అప్పుడు కాలి పుండైన తోక తోడనే తన యజమాని దగ్గరకు అతడు వెడలగలడు!

**శ్లో॥ తతః పశ్యం త్విమం దీన మంగవైరూప్యకర్శితమ్ ।**
**సమిత్రజ్ఞాతయ స్సర్వే బాంధవా స్ససుహృజ్జనాః ॥ 4**

**పదచ్ఛేదము :-** తతః - పశ్యంతు - ఇమం - దీనమ్ - అంగవైరూప్యకర్శితమ్, సమిత్రజ్ఞాతయః - సర్వే - బాంధవాః - ససుహృజ్జనాః ॥

**అన్వయక్రమము :-** తతః అంగవైరూప్యకర్శితమ్ ఇమం దీనం సమిత్రజ్ఞాతయః ససుహృజ్జనాః బాంధవాః సర్వే పశ్యంతు.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, అంగవైరూప్యకర్శితం = అవయవములయొక్క వికారముచే పీడింపబడినట్టి, దీనం = దీనుడైయున్నట్టి, ఇమం = ఈతనిని, సమిత్రజ్ఞాతయః = మిత్రులతోడను జ్ఞాతులతోడను గూడినవారును, ససుహృజ్జనాః = అనురక్తులైన జనులతో గూడినవారునగు, బాంధవాః = బంధువులు, సర్వే = ఎల్లరును, పశ్యంతు = తిలకింతురుగాక!

**తాత్పర్యము** :– తగులబడిన తోకతో తనవారి కడకేగినపుడు అంగవైకల్యము నొంది దీనస్థితిలో నున్నట్టి వీనిని ఈతని మిత్రులును జ్ఞాతులును ఇష్టులును బంధువులును ఎల్లరును అసహ్యించుకొనుచు జూతురు గాక!

**శ్లో॥ ఆజ్ఞాపయ ద్రాక్షసేంద్రః పురం సర్వం సచత్వరమ్ ।**
**లాంగూలేన ప్రదీప్తేన రక్షోభిః పరిణీయతామ్ ॥ 5**

**పదచ్ఛేదము** :– ఆజ్ఞాపయత్ – రాక్షసేంద్రః – పురం – సర్వం – సచత్వరమ్, లాంగూలేన – ప్రదీప్తేన – రక్షోభిః – పరిణీయతామ్ ॥

**అన్వయక్రమము** :– రాక్షసేంద్రః ప్రదీప్తేన లాంగూలేన సచత్వరం పురం రక్షోభిః పరిణీయతామ్ (ఇతి) ఆజ్ఞాపయత్.

**ప్రతిపదార్థము** :– సచత్వరం = వీథిముంగిళ్లతో గూడిన, పురం సర్వం = పట్టణమంతయును, ప్రదీప్తేన = దహింపబడినట్టి, లాంగూలేన = తోకతో, (అయం = ఈ వానరుడు), రక్షోభిః = రాక్షసులచే, పరిణీయతాం = తీసికొని పోబడుగాక! (ఇతి = అని) రాక్షసేంద్రః = రావణాసురుడు, ఆజ్ఞాపయత్ = ఆజ్ఞాపించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'పురం సర్వం పరిణీయతాం' – తన పట్టణమంతయు త్రిప్పుట ఎందులకని యనగా తన మహాబలము, మహదైశ్వర్యము, తన దుర్గములు, తనయొక్క నగరవైభవము శత్రువు తెలిసికొని ఆశ్చర్యపడుటకై యని రావణుని భావము.

**రా. శిరోమణి** :– తోకనంటించి శిక్షింపబడిన హనుమంతుని చూచి ఈతనిచే చంపబడిన వారి బంధువులును స్త్రీలును తమ దుఃఖమును మఱచిపోవుదురని రావణుని భావము.

**తాత్పర్యము** :– తగులబడుచున్న తోకతో ఈతనిని మన పట్టణపు వీథులనన్నిటను మన రాక్షసులు త్రిప్పి తీసికొని వెళ్లెదరుగాక యని రావణుడు తన భటులకు ఆజ్ఞాపించెను.

**శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసాః కోపకర్కశాః ।**
**వేష్టయంతి స్మ లాంగూలం జీర్ణైః కార్పాసకైః పటైః ॥ 6**

**పదచ్ఛేదము :–** తస్య – తత్ – వచనం – శ్రుత్వా – రాక్షసాః – కోపకర్కశాః – వేష్టయంతి – స్మ – లాంగూలం – జీర్ణైః – కార్పాసకైః – పటైః ॥

**అన్వయక్రమము :–** తస్య తత్ వచనం శ్రుత్వా రాక్షసాః కోపకర్కశాః (సంతః) లాంగూలం కార్పాసకైః జీర్ణైః పటైః వేష్టయంతి స్మ.

**ప్రతిపదార్థము :–** కోపకర్కశాః = క్రోధముచే క్రూరులైయున్నట్టి, రాక్షసాః = రాక్షసులు, తస్య = ఆ రావణునియొక్క, తత్ వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, లాంగూలం = తోకను, జీర్ణైః = పాతబడినట్టి, కార్పాసకైః = నూలు సంబంధమైనట్టి, పటైః = వస్త్రములతో, వేష్టయంతి స్మ = చుట్టబెట్టుచుండిరి.

**తాత్పర్యము :–** క్రోధావేశము నొందియున్న యచటి రాక్షసభటులు రావణుడు పలికిన మాటలను వినినంతనే జీర్ణమై యున్న నూలుబట్టలను తెచ్చి హనుమ తోకకు చుట్టబెట్టదొడగిరి.

**శ్లో॥ సంవేష్ట్యమానే లాంగూలే వ్యవర్ధత మహాకపిః ।**
**శుష్క మింధన మాసాద్య వనే ష్వివ హుతాశనః ॥ 7**

**పదచ్ఛేదము :–** సంవేష్ట్యమానే – లాంగూలే – వ్యవర్ధత – మహాకపిః, శుష్కమ్ – ఇంధనం – ఆసాద్య – వనేషు – ఇవ – హుతాశనః ॥

**అన్వయక్రమము :–** లాంగూలే సంవేష్ట్యమానే (సతి) మహాకపిః, శుష్కమ్ ఇంధనం ఆసాద్య హుతాశనః ఇవ వ్యవర్ధత.

**ప్రతిపదార్థము :–** లాంగూలే = వాలము, సంవేష్ట్యమానే (సతి) = చుట్టబెట్టబడుచుండగా, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమ, వనేషు = అడవులయందు, శుష్కమ్ = ఎండిపోయిన, ఇంధనమ్ = కట్టెను, ఆసాద్య = చేరి, హుతాశనః ఇవ = అగ్నిహోత్రుడువలె, వ్యవర్ధత = వర్ధిల్లుచుండెను.

**తాత్పర్యము :–** ఆ రాక్షసభటులు తన తోకను పాతగుడ్డలతో అట్లు చుట్టబెట్టుచుండగా అడవిలో ఎండుకట్టెలు లభించినప్పుడు అగ్నిదేవుడు విజృంభించినట్లు హనుమ తన శరీరముతో మిక్కిలిగ పెరిగిపోయెను.

**శ్లో॥ తైలేన పరిషి చ్యాథ తే ఽగ్నిం త త్రావపాతయన్ ।**
**లాంగూలేన ప్రదీప్తేన రాక్షసాం స్తా నపాతయత్ ।**
**స తు రోషపరీతాత్మా బాలసూర్యసమాననః ॥ 8**

**పదచ్ఛేదము** :- తైలేన – పరిషిచ్య – అథ – తే – అగ్నిం – తత్ర – అవపాతయన్ – సః – తు – రోషపరీతాత్మా – బాలసూర్యసమాననః ॥

**అన్వయక్రమము** :- అథ తే తైలేన పరిషిచ్య తత్ర అగ్నిమ్ అవపాతయన్. ప్రదీప్తేన లాంగూలేన బాలసూర్యసమాననః సః తు రోషపరీతాత్మా (సన్) తాన్ రాక్షసాన్ లాంగూలేన అపాతయత్.

**ప్రతిపదార్థము** :- అథ = అటుపిమ్మట, తే = ఆ రాక్షసులు, తైలేన = నూనెతో, పరిషిచ్య = తడిపి, తత్ర = ఆ తోకయందు, అగ్నిం = నిప్పును, అపాతయన్ = పడవేసిరి. ప్రదీప్తేన = మండుచున్నట్టి, లాంగూలేన = తోకతో, బాలసూర్యసమాననః = లేత సూర్యునితో సమానమైన ముఖము గల్గినట్టి, సః తు = ఆ హనుమ అప్పుడు, రోషపరీతాత్మా (సన్) = క్రోధముచే నిండిన మనస్సు గలవాడగుచు, తేన లాంగూలేన = ఆ తోకతో, తాన్ రాక్షసాన్ = ఆ రాక్షసులను, అపాతయత్ = పడగొట్టెను.

**తాత్పర్యము** :- అప్పుడా రాక్షసభటులు తోకకు చుట్టబెట్టిన ఆ పాతగుడ్డలను నూనెతో తడిపి దానికి నిప్పును ముట్టించిరి. మండుచున్నట్టి తన తోకతో లేత సూర్యునివంటి తేజస్సుగల హనుమ తీవ్రమైన క్రోధావేశమునొంది మండుచున్న ఆ తోకతోడనే అచటి రాక్షసులను తటిమి పడగొట్టెను.

**శ్లో॥ లాంగూలం సంప్రదీప్తం తు ద్రష్టుం తస్య హనూమతః ।**
**సహస్త్రీబాలవృద్ధాశ్చ జగ్ముః ప్రీతా నిశాచరాః ॥ 9**

**పదచ్ఛేదము** :- లాంగూలం – సంప్రదీప్తం – తు – ద్రష్టుం – తస్య – హనూమతః – సహస్త్రీబాలవృద్ధాః – చ – జగ్ముః – ప్రీతాః – నిశాచరాః ॥

**అన్వయక్రమము** :- తస్య హనూమతః సంప్రదీప్తం లాంగూలం ద్రష్టుం ప్రీతాః నిశాచరాః సహస్త్రీబాలవృద్ధాః జగ్ముః.

**ప్రతిపదార్థము** :- తస్య హనూమతః = ఆ హనుమయొక్క, సంప్రదీప్తం = మండుచున్నట్టి, లాంగూలం = తోకను, ద్రష్టుం = చూచుటకై, ప్రీతాః = సంతోషము నొందినట్టి, నిశాచరాః = రాక్షసులు, సహస్త్రీబాలవృద్ధాః = స్త్రీలతోడను వృద్ధులతోడను గూడినవారై, జగ్ముః = చేరిరి.

**తాత్పర్యము :-** అట్లు అంటించబడి మండుచున్నట్టి ఆ హనుమ తోకను చూచి ఆనందించుటకై కుతూహలముతో నగరములోని రాక్షసులు స్త్రీ బాల వృద్ధులతో సహా అచటకు చేరుకొనిరి.

**శ్లో॥ స భూయ స్సంగతైః క్రూరైః రాక్షసై ర్హరిసత్తమః ।**
**నిబద్ధః కృతవా న్వీర స్తత్కాలసదృశీం మతిమ్ ॥ 10**

**పదచ్ఛేదము :-** సః భూయః - సంగతైః - క్రూరైః - రాక్షసైః - హరిసత్తమః -నిబద్ధః - కృతవాన్ - వీరః - తత్కాలసదృశీం - మతిమ్ ॥

**అన్వయక్రమము :-** సంగతైః క్రూరైః రాక్షసైః భూయః నిబద్ధః (సన్) వీరః సః హరిసత్తమః తత్కాలసదృశీం మతిం కృతవాన్.

**ప్రతిపదార్థము :-** సంగతైః = గుమికూడినట్టి, క్రూరైః = క్రూరులైనట్టి, రాక్షసైః = రాక్షసులచే, భూయః = తిరిగి, నిబద్ధః = బంధింపబడినట్టి, వీరః = వీరుడైన, సః హరిసత్తమః = ఆ వానరశ్రేష్ఠుడు, తత్కాలదృశీం = ఆ సమయమునకు తగినట్టి, మతిం = ఆలోచనమును, కృతవాన్ = చేసినవాడాయెను.

**విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు**

**తిలకము :-** 'తత్కాలసదృశీం మతిం కృతవాన్' రాక్షసుల బంధనములను తేలికగా త్రెంపుకొనగలవాడయినప్పటికిని సమయోచితముగ తనను నిగ్రహించుకొని ఈ పై విధముగా ఆలోచించెనని భావము.

**తాత్పర్యము :-** అచ్చటకు చేరిన దుర్మార్గులైన రాక్షసులు వీరుడైన హనుమను తిరిగి గట్టిగ బంధించుచుండగా హనుమ వాటిని సహించుచు సమయోచితముగ నిట్లాలోచించెను.

**శ్లో॥ కామం ఖలు న మే శక్తా నిబద్ధస్యాపి రాక్షసాః ।**
**ఛిత్త్వా పాశాన్సముత్పత్య హన్యామహ మిమాన్ పునః ॥ 11**

**పదచ్ఛేదము :-** కామం - ఖలు - న - మే - శక్తాః - నిబద్ధస్య - అపి - రాక్షసాః - ఛిత్త్వా - పాశాన్ - సముత్పత్య - హన్యామ్ - అహమ్ - ఇమాన్ - పునః ॥

**అన్వయక్రమము :-** నిబద్ధస్య అపి మే రాక్షసాః కామం న శక్తాః ఖలు. అహం పాశాన్ ఛిత్త్వా సముత్పత్య పునః ఇమాన్ హన్యామ్.

**ప్రతిపదార్థము :-** నిబద్ధస్య అపి = కట్టబడిన వాడనైనప్పటికిని, మే = నాకు, రాక్షసాః

= రాక్షసులు, (అపకర్తుం = హానిచేయుటకు), కామం = ఎంతమాత్రము, శక్తాః న ఖలు = సమర్థులు కారు గదా! అహం = నేను, పాశాన్ = బంధనములను, ఛిత్వా = త్రెంపుకొని, సముత్పత్య = మీదికి ఎగిరిపోయి, ఇమాన్ = ఈ రక్కసులను, పునః = తిరిగి, హన్యామ్ = చంపగలను.

**తాత్పర్యము :–** నేను బంధింపబడినప్పటికిని ఈ రాక్షసులు నన్నేమియు చేయజాలరు. ఏలనన నాకు కావలసినప్పుడు నేనీ బంధనములను ఛేదించుకొని ఈ రాక్షసుల నందరను మఱల హతమార్చగలను.

**శ్లో॥ యది భర్తృహితార్థాయ చరంతం భర్తృశాసనాత్ ।**
**బధ్నం త్యేతే దురాత్మానో నతు మే నిష్కృతిః కృతా ॥ 12**

**పదచ్ఛేదము :–** యది – భర్తృహితార్థాయ – చరంతం – భర్తృశాసనాత్ – బధ్నంతి – ఏతే – దురాత్మానః – న – తు – మే – నిష్కృతిః – కృతా ॥

**అన్వయక్రమము :–** భర్తృహితార్థాయ చరంతం (మాం) ఏతే దురాత్మానః భర్తృశాసనాత్ బధ్నంతి యది మే నిష్కృతిః తు న కృతా.

**ప్రతిపదార్థము :–** భర్తృహితార్థాయ = ప్రభువుయొక్క హితము కొఱకై, చరంతం = చరించు చున్నట్టి, (మాం = నన్ను) ఏతే దురాత్మానః = ఈ దుర్మార్గులు, బధ్నంతి యది = బంధించిన యెడల, మే = నాకు, నిష్కృతిః తు = ప్రతీకారము మాత్రము, న కృతా = చేయబడదు.

**తాత్పర్యము :–** నా ప్రభువుయొక్క మేలుకొఱకు నేను చరించుచుండగా నన్నీ దుర్మార్గులు తమ ప్రభువైన రావణుని యాజ్ఞననుసరించి బంధించినంత మాత్రమున నాపై పగదీర్చుకొనుట జరుగదుగదా!

**శ్లో॥ సర్వేషామేవ పర్యాప్తో రాక్షసానా మహం యుధి ।**
**రామస్య కింతు ప్రీత్యర్థం విషహిష్యే ఽ హ మీదృశమ్ ॥ 13**

**పదచ్ఛేదము :–** సర్వేషామ్ – ఏవ – పర్యాప్తః – రాక్షసానామ్ – అహమ్ – యుధి – రామస్య – కిం – తు – ప్రీత్యర్థం – విషహిష్యే – అహమ్ – ఈదృశమ్ ॥

**అన్వయక్రమము :–** అహం యుధి సర్వేషాం రాక్షసానాం పర్యాప్తః ఏవ, కింతు రామస్య ప్రీత్యర్థమ్ ఈదృశమ్ (క్లేశం) అహం విషహిష్యే ॥

**ప్రతిపదార్థము :–** యుధి = యుద్ధమునందు, సర్వేషాం రాక్షసానాం = ఎల్లరు

రాక్షసులకును, అహం = నేను, పర్యాప్తః ఏవ = సరిపడినట్టివాడనే, కింతు = కాని, రామస్య = రామునియొక్క, ప్రీత్యర్థం = ప్రీతికొఱకై, ఈదృశం = ఈ విధమైన, (క్లేశం = క్లేశమును) అహం = నేను, విషహిష్యే = సహించెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'రామస్య ప్రీత్యర్థం' – సర్వరాక్షసులను స్వయముగ వధించుటచే శ్రీరామునకు గలుగునట్టి ప్రీతికి విఘ్నము గలుగకుండ నేనీ బంధనక్లేశమును సహించెదనని భావము.

**మహేశ్వరతీర్థులు** :– శ్రీరామునిచే సర్వరాక్షస సంహారము ప్రతిజ్ఞ చేయబడియుండుటచే ప్రస్తుతము తనకీ బంధనము అవమానకరమైనప్పటికి తాను తన ప్రభువు ప్రీతికొఱకై సహింతునని భావము.

**తాత్పర్యము** :– యుద్ధమున విజృంభించి ఇచ్చటి రాక్షసుల నెల్లరను మట్టుపెట్టుటకు నేనొక్కడనే చాలుదును గాని శత్రుసంహారకార్యము శ్రీరామునిది గాబట్టి అతనికి ప్రీతికరముగ ఆ పని అతనికే విడచిపెట్టి నేనీ స్వల్పమైన క్లేశమును ఓర్చుకొందునుగాక!

**శ్లో॥ లంకా చారయితవ్యా వై పునరేవ భవే దితి ।**
**రాత్రౌ నహి సుదృష్టా మే దుర్గకర్మవిధానతః ।**
**అవశ్యమేవ ద్రష్టవ్యా మయా లంకా నిశాక్షయే ॥ 14**

**పదచ్ఛేదము** :– లంకా – చారయితవ్యా – వై – పునః – ఏవ – భవేత్ – ఇతి – రాత్రౌ – న – హి – సుదృష్టా – మే – దుర్గకర్మవిధానతః, అవశ్యమ్ – ఏవ – ద్రష్టవ్యా – మయా – లంకా – నిశాక్షయే ॥

**అన్వయక్రమము** :– లంకా పునః ఏవ చారయితవ్యా భవేత్ ఇతి రాత్రౌ మే దుర్గకర్మవిధానతః న హి సుదృష్టా, లంకా నిశాక్షయే అవశ్యం మయా ద్రష్టవ్యా ఏవ.

**ప్రతిపదార్థము** :– లంకా = లంకానగరము, పునః = తిరిగి, చారయితవ్యా ఏవ = చరింపబడవలసినదే, భవేత్ = అగును, ఇతి = అని, రాత్రౌ = రాత్రియందు, మే = నాయొక్క, దుర్గకర్మవిధానతః = దుర్గరక్షణ క్రియయొక్క విధానము వలన, న హి సుదృష్టా = చక్కగా చూడబడలేదు, లంకా = లంకానగరము, నిశాక్షయే = ప్రాతఃకాలమునందు, అవశ్యం = తప్పక, మయా = నాచేత, ద్రష్టవ్యా ఏవ = చూడవలసినదే.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'రాత్రౌ దుర్గకర్మవిధానతః' – రాత్రిసమయమున దుర్గమమైన ప్రదేశములందు సంచరించుటకు వీలులేకపోవుట వలన అని భావము. 'నిశాక్షయే అవశ్యమేవ ద్రష్టవ్యా' – అని చెప్పుటచే సీతతో సంభాషించుట కొఱకు హనుమ కొన్ని దినములు లంకలో ఆగినట్లు గానవచ్చుచున్నది! ఫాల్గుణమాసమున రావణుడు సీత నపహరించుట, ఆశ్వయుజ శుక్లపక్షమున చివర హనుమంతుని ప్రేరణతో పక్షము దినములు గడువునిచ్చి, వానరులనుగూర్చి దూతను బంపుట, పిమ్మట కార్తీక శుక్లప్రతిపత్తున సీతాన్వేషణకై వానరులు వెడలుట, మార్గశిర శుక్లదశమినాడు సంపాతి దర్శనము. అప్పుడే సుగ్రీవుడొసగిన నెల రోజుల గడువు గడచినదని వానరులు చెప్పుట, పిమ్మట ఏకాదశినాడు హనుమ లంకకు వచ్చుట, ఆ రాత్రిశేషమునందే సీతను దర్శించుట, మరునాడు ద్వాదశీదినమున వనములో ఆగి ఆ రాత్రి సీతను స్వయముగ చూచుట, ఆ రాత్రిశేషమునందే అచటికి రావణుడు వచ్చుట, అప్పుడే యచ్చట రావణుడు పండ్రెండు మాసములకును ఇంక రెండు మాసములు మాత్రమే మిగిలియున్నవని కొద్ది రోజులు ఇంచుమించుగా చెప్పుట. మరునాడు త్రయోదశీ ఉదయము సీతమ్మతో సంభాషించుట, ఆనాటి పగలే అశోకవనభంజనము మొదలైనవి. చతుర్దశినాడు అక్షాధిరాక్షసవధ, ఆనాడో లేక పున్నమినాడో లంకాదహనము జరిగియుండెను అని తెలియనగును.

**గోవిందరాజీయము :–** 'దుర్గకర్మవిధానతః' – నగర రక్షణమునకై శత్రువులచే చేయబడిన విశేషమైన ఏర్పాటులను పరిశీలించుట.

**తాత్పర్యము :–** నేను రాత్రిసమయమున సీతమ్మను వెదకుచు తిరిగినప్పుడు ఇచ్చటి దుర్గకర్మ విధానము మున్నగునవి మఱల చూడవచ్చునని నేను అప్పుడు స్పష్టముగా చూడనైతిని. అందువలన ఈ ఉదయ సమయమునందు లంకయం దంతటనుగల రావణుని నగరరక్షణ విధానములను పరిశీలనముగా తప్పక చూడవలసియున్నది.

**శ్లో॥ కామం బంధైశ్చ మే భూయః పుచ్ఛ స్యోద్దీపనేన చ ।**
**పీడాం కుర్వంతు రక్షాంసి న మేఽస్తి మనస శ్శ్రమః ॥ 15**

**పదచ్ఛేదము :–** కామం – బంధైః – చ – మే – భూయః – పుచ్ఛస్య – ఉద్దీపనేన – చ, పీడాం – కుర్వంతు – రక్షాంసి – న – మే – అస్తి – మనసః – శ్రమః ॥

**అన్వయక్రమము :–** బంధైః చ, పుచ్ఛస్య ఉద్దీపనేన చ, మే భూయః కామం రక్షాంసి పీడాం కుర్వంతు, మే మనసః శ్రమః న అస్తి.

**ప్రతిపదార్థము** :- బంధైః చ = బంధనములచేతను, పుచ్ఛస్య = తోకయొక్క, ఉద్దీపనేన చ = అంటించుటచేతను, మే = నాకు, రక్షాంసి = రాక్షసులు, కామం = ఇష్టము వచ్చినట్లు, పీడాం = బాధను, కుర్వంతు = చేయుదురుగాక! మే = నాయొక్క మనసః = మనస్సునకు, శ్రమః = శ్రమము, న అస్తి = లేదు (ఇతి చింతయామాస = అని ఆలోచించెను).

**తాత్పర్యము** :- ఈ రాక్షసులు నన్ను బంధించియు, నా తోకకు నిప్పును ముట్టించియు తమ కిష్టము వచ్చినట్లు నన్ను బాధపెట్టుదురుగాక! నా మనస్సునకు మాత్రము పీడ ఏమియు గలుగుటలేదు గదా యని హనుమ తలపోసెను.

**శ్లో॥ తతస్తే సంవృతాకారం సత్త్వవంతం మహాకపిమ్ ।**
**పరిగృహ్య యయు ర్హృష్టా రాక్షసాః కపికుంజరమ్ ॥ 16**

**పదచ్ఛేదము** :- తతః - తే - సంవృతాకారం - సత్త్వవంతం - మహాకపిమ్ - పరిగృహ్య - యయుః - హృష్టాః - రాక్షసాః - కపికుంజరమ్ ॥

**అన్వయక్రమము** :- తతః సంవృతాకారం కపికుంజరం మహాకపిం పరిగృహ్య తే రాక్షసాః హృష్టాః (సంతః) యయుః.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, సంవృతాకారం = మఱుగుపఱుచుకొన్న రూపముగలవాడును, సత్త్వవంతం = బలశాలియును, మహాకపిం = వానర శ్రేష్ఠుడునగు, కపికుంజరం = హనుమను, పరిగృహ్య = పట్టుకొని, తే రాక్షసాః = ఆ రక్కసులు, హృష్టాః = సంతోషము నొందినవారై, యయుః = వెడలిపోయిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'మహాకపిం' = బుద్ధిచే ఘనుడైనవాడు, కపికుంజరం = వానరజాతిలో శ్రేష్ఠుడైనవాడు.

**తాత్పర్యము** :- అప్పుడా రాక్షసభటులు మహాబలాఢ్యుడైనను తన రూపమును మఱుగుపఱచుకొని యుండుటచే ఆ హనుమను తమ వెంటగొని సంతసమున నగరమునకు వెడలిపోయిరి.

**శ్లో॥ శంఖభేరీనినాదైశ్చ ఘోషయంత స్స్వకర్మభిః ।**
**రాక్షసాః క్రూరకర్మాణ శ్చారయంతి స్మ తాం పురీమ్ ॥ 17**

**పదచ్ఛేదము** :- శంఖభేరీనినాదైః - చ - ఘోషయంతః - స్వకర్మభిః, రాక్షసాః -

క్రూరకర్మాణః - చారయంతి - స్మ - తాం - పురీమ్ ॥

**అన్వయక్రమము** :- క్రూరకర్మాణః రాక్షసాః శంఖభేరీనినాదైః, స్వకర్మభిః (తం) తాం పురీం చారయంతి స్మ.

**ప్రతిపదార్థము** :- క్రూరకర్మాణః = క్రూరమైన కృత్యములు గల్గినట్టి, రాక్షసాః = రాక్షసులు, శంఖభేరీనినాదైః = శంఖములయొక్కయు భేరీలయొక్కయు ధ్వనులతోడను, స్వకర్మభిః చ = తమ చేష్టలతోడను, ఘోషయంతః = చాటించుచు, (తం = ఆ హనుమను) తాం పురీం = ఆ లంకానగరమునుగూర్చి, చారయంతి స్మ = త్రిప్పుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'స్వకర్మభిః ఘోషయంతః - రాజద్రోహియైన దుష్టునకు ఇట్టి దండనమే విధింపబడును. అను నీరీతి వచనములతో హనుమ పూర్వచేష్టలను ఎల్లరకును వెల్లడించుచు చాటించిరని భావము.

**గోవిందరాజీయము** :- జబ్బలు చఱచుట, సింహనాదములు చేయుట మున్నగు రాక్షస చేష్టలతోనని భావము.

**తాత్పర్యము** :- క్రూరమైన చేష్టలు తమ స్వభావమైయున్న ఆ రాక్షసులు శంఖభేరీ ప్రభృతి వాద్యధ్వనులతోడను తమ తమ వికారచేష్టలతోడను హనుమను గూర్చి నగరమున చాటుచు అతనిని నగరమంతయును త్రిప్పుచుండిరి.

**శ్లో॥ అన్వీయమానో రక్షోభి ర్యయౌ సుఖ మరిందమః ।**
**హనుమాం శ్చారయామాస రాక్షసానాం మహాపురీమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :- అన్వీయమానః - రక్షోభిః - యయౌ - సుఖమ్ - అరిందమః - హనుమాన్ - చారయామాస - రాక్షసానాం - మహాపురీమ్ ॥

**అన్వయక్రమము** :- అరిందమః రక్షోభిః అన్వీయమానః (సన్) సుఖం యయౌ, హనుమాన్ రాక్షసానాం మహాపురీం చారయామాస.

**ప్రతిపదార్థము** :- అరిందమః = శత్రుమర్దనుడైనట్టి హనుమ, రక్షోభిః = రక్కసులచే, అన్వీయమానః = వెంబడింపబడుచున్నవాడై, సుఖం = సుఖముగా, యయౌ = వెడలెను, హనుమాన్ = హనుమ, రాక్షసానాం = రక్కసులయొక్క, మహాపురీం = మహానగరమును, చారయామాస = చరించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- చారయామాస = సంచారముచే చూచెనని భావము.

**రా. శిరోమణి** :- తిరిగెను.

**గోవిందరాజీయము** :- శోధించెను.

**తాత్పర్యము** :- శత్రుంజయుడైన హనుమ ఆ రాక్షసభటులు తన వెంబడి వచ్చుచుండగా లంకాపట్టణమంతయు సుఖముగ తిరుగుచు తనకు గావలసిన విశేషములను పరికించుచుండెను.

**శ్లో॥ అ థాపశ్య ద్విమానాని విచిత్రాణి మహాకపిః ।**
**సంవృతాన్ భూమిభాగాంశ్చ సువిభక్తాంశ్చ చత్వరాన్ ॥ 19**

**పదచ్ఛేదము** :- అథ - అపశ్యత్ - విమానాని - విచిత్రాణి - మహాకపిః - సంవృతాన్ - భూమిభాగాన్ - చ - సువిభక్తాన్ - చ - చత్వరాన్ ॥

**అన్వయక్రమము** :- అథ మహాకపిః విచిత్రాణి విమానాని, సంవృతాన్ భూమిభాగాన్ చ, సువిభక్తాన్ చత్వరాన్ చ అపశ్యత్.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమ, విచిత్రాణి = విచిత్రములైనట్టి, విమానాని = విమానములను, సంవృతాన్ = మూయబడియున్న, భూమిభాగాన్ చ = భూమిభాగములను, సువిభక్తాన్ = చక్కగ తీర్చిదిద్దబడియున్న, చత్వరాన్ = ముంగిళ్ళను, అపశ్యత్ = చూచెను.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమ లంకానగరము నందలి మిక్కిలి విచిత్రములైన విమానములను, మూయబడియున్న భూమిభాగములను చక్కగా తీర్చిదిద్దబడియున్న ముంగిళ్లతో గూడిన భవనములను చూచుచు ముందుకు పోవుచుండెను.

**శ్లో॥ వీథీశ్చ గృహసంబాధాః కపి శ్శృంగాటకాని చ ।**
**తథా రథ్యోపరథ్యాశ్చ తథైవ గృహకాంతరాన్ ।**
**గృహాంశ్చ మేఘసంకాశాన్ దదర్శ పవనాత్మజః ॥ 20**

**పదచ్ఛేదము** :- వీథీః - చ - గృహసంబాధాః - కపిః - శృంగాటకాని - చ - తథా - రథ్యోపరథ్యాః - చ - తథా - ఏవ - గృహకాంతరాన్ - గృహాన్ - చ - మేఘసంకాశాన్ - దదర్శ - పవనాత్మజః ॥

**అన్వయక్రమము** :- పవనాత్మజః కపిః గృహసంబాధాః వీథీః చ, శృంగాటకాని చ, తథా రథ్యోపరథ్యాః చ, తథైవ గృహకాంతరాన్ మేఘసంకాశాన్ గృహాన్ చ దదర్శ.

**ప్రతిపదార్థము** :- పవనాత్మజః కపిః = వాయునందనుడైన హనుమ, గృహసంబాధాః = ఇండ్లతో క్రిక్కిరిసియున్న, వీథీః చ = వీథులను, శృంగాటకాని చ = చతుష్పథములను, తథా = అట్లు, రథ్యోపరథ్యాః చ = రాజమార్గములను చిన్న బాటలను, తథైవ = అట్లే, గృహకాంతరాన్ = రహస్యద్వారములుగల ఇండ్లను, మేఘసంకాశాన్ గృహాన్ = మేఘములను బోలిన ఇండ్లను, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :- వాయునందనుడైన హనుమ క్రిక్కిరిసియున్న ఇండ్లతో నిండిన వీథులను, సుందరముగా కానవచ్చు చతుష్పథములను, విశాలమైన రాచబాటలను, వానిని చేరియున్న ప్రక్కప్రక్క వీథులను, రహస్యద్వారములతోగూడిన గృహవిశేషములను, మేఘములను తాకుచున్న ఉన్నతభవనములను విలోకించెను.

**శ్లో॥ చత్వరేషు చతుష్కేషు రాజమార్గే తథైవ చ ।**
**ఘోషయంతి కపిం సర్వే చార ఇత్యేవ రాక్షసాః ॥ 21**

**పదచ్ఛేదము** :- చత్వరేషు – చతుష్కేషు – రాజమార్గే – తథా – ఏవ – చ – ఘోషయంతి – కపిం – సర్వే – చారః – ఇతి – ఏవ – రాక్షసాః ॥

**అన్వయక్రమము** :- చతుష్కేషు చత్వరేషు తథా ఏవ రాజ్యమార్గే చ రాక్షసాః సర్వే కపిం చారః ఇతి ఏవ ఘోషయంతి.

**ప్రతిపదార్థము** :- చతుష్కేషు = చతుష్పథములందును, చత్వరేషు = ముంగిళ్లయందును, తథా ఏవ = అట్లే, రాజమార్గే = రాజవీథియందు, రాక్షసాః సర్వే = రాక్షసులందరును, కపిం = వానరుని, చారః ఇతి ఏవ = గూఢచారియనియే, ఘోషయంతి = చాటిరి.

**సూచన** :- చార ఇత్యేవ యనుటకు బదులుగా 'చారీక ఇతి' అని పాఠాంతరము.
చతుష్కేషు – చతుస్స్తంభ మండపము.

**తాత్పర్యము** :- రాజవీథులందును, నాల్గువీథుల మొగలందును, ఇండ్లముంగిళ్ల యందును గుమిగూడిన రక్కసులు వినునట్లుగా రాక్షసభటులు ఈ వానరుడు మన గుట్టుమట్టులు తెలిసికొనుటకై వచ్చినట్టి గూఢచారి సుడీయని పరిహాసపూర్వకముగా ఘోషించు చుండిరి.

**శ్లో॥ స్త్రీబాలవృద్ధా నిర్జగ్ముస్తత్ర తత్ర కుతూహలాత్ ।**
**తం ప్రదీపితలాంగూలం హనుమంతం దిదృక్షవః ॥ 22**

**పదచ్ఛేదము :-** స్త్రీబాలవృద్ధాః - నిర్జగ్ముః - తత్ర - తత్ర - కుతూహలాత్ - తం - ప్రదీపితలాంగూలం - హనుమంతం - దిదృక్షవః ॥

**అన్వయక్రమము :-** ప్రదీపితలాంగూలం - తం హనుమంతం దిదృక్షవః కుతూహలాత్ తత్ర తత్ర స్త్రీబాలవృద్ధాః నిర్జగ్ముః.

**ప్రతిపదార్థము :-** ప్రదీపితలాంగూలం = అంటింపబడినట్టి వాలముగల్గిన, తం హనుమంతం = ఆ హనుమంతుని, దిదృక్షవః = చూడగోరుచున్నవారై, కుతూహలాత్ = కుతూహలమువలన, తత్ర తత్ర = అచ్చటచ్చట, స్త్రీబాలవృద్ధాః = స్త్రీలును బాలురును వృద్ధులును, నిర్జగ్ముః = బయటకు వచ్చిరి.

**తాత్పర్యము :-** మండుచున్న తోకతో ఆ రీతిగా వీథులవెంబడి గొనిపోబడుచున్న హనుమంతుని చూడ ముచ్చట గలిగినవారై ఆయా వీథులందెల్ల ఇండ్లలోపలనున్న స్త్రీలును, బాలురును, వృద్ధులును గూడ బయటికి వచ్చుచుండిరి.

**శ్లో॥ దీప్యమానే తతస్తస్య లాంగూలాగ్రే హనూమతః ।**
**రాక్షస్య స్తా విరూపాక్ష్య శ్శంసు ర్దేవ్యాస్తదప్రియమ్ ॥ 23**

**పదచ్ఛేదము :-** దీప్యమానే - తతః - తస్య - లాంగూలాగ్రే - హనూమతః - రాక్షస్యః - తాః - విరూపాక్ష్యః - శంసుః - దేవ్యాః - తత్ - అప్రియమ్ ॥

**అన్వయక్రమము :-** తతః తస్య హనూమతః లాంగూలాగ్రే దీప్యమానే సతి, విరూపాక్ష్యః రాక్షస్యః దేవ్యాః తత్ అప్రియం శంసుః.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, తస్య హనూమతః = ఆ హనుమంతునియొక్క, లాంగూలాగ్రే = తోకచివరి భాగము, దీప్యమానే సతి = మండుచుండగా, తాః = ఆ, విరూపాక్ష్యః = వికృతమైన కన్నులు గలిగినట్టి, రాక్షస్యః = రాక్షసాంగనలు, దేవ్యాః = సీతాదేవికి, తత్ = ఆ, అప్రియం = అనిష్టవార్తను, శంసుః = తెలిపిరి.

**తాత్పర్యము :-** అప్పుడు హనుమంతుని లాంగూలాగ్రము మండుచుండగా సీతమ్మకు కావలిగానున్న వికారపుకన్నులుగల ఆ రాక్షసస్త్రీలు ఆమెకడకేగి ఆమెకు బాధకల్గించునట్టి ఆ వార్తను వినిపించిరి.

**శ్లో॥ యస్త్వయా కృతసంవాద స్సీతే తామ్రముఖః కపిః ।**
**లాంగూలేన ప్రదీప్తేన స ఏష పరిణీయతే ॥ 24**

**పదచ్ఛేదము :–** యః – త్వయా – కృతసంవాదః – సీతే – తామ్రముఖః – కపిః, లాంగూలేన – ప్రదీప్తేన – సః – ఏషః – పరిణీయతే ॥

**అన్వయక్రమము :–** సీతే! త్వయా కృతసంవాదః తామ్రముఖః యః కపిః (అస్తి) సః ఏషః ప్రదీప్తేన లాంగూలేన పరిణీయతే.

**ప్రతిపదార్థము :–** సీతే! = ఓ జానకీ!, త్వయా = నీతోడ, కృతసంవాదః = చేసిన సంభాషణము కల్గినట్టి, తామ్రముఖః = ఎఱ్ఱని ముఖము గల్గినట్టి, యః కపిః అస్తి = ఏ వానరు డున్నాడో, సః ఏషః = ఆ యతడు, ప్రదీప్తేన = అంటింప బడినట్టి, లాంగూలేన = తోకతోడ, పరిణీయతే = తీసికొనిపోబడుచున్నాడు.

**తాత్పర్యము :–** ఓ జానకీ! ఇంతకుముందు నీతో మాటలాడినట్టి ఎఱ్ఱని మూతిగల్గిన ఆ వానరుని, తోకకు ఇప్పుడు రాక్షసులు నిప్పు అంటించి, లంకావీథులందు త్రిప్పుచున్నారు సుమా!

**శ్లో॥ శ్రుత్వా తద్వచనం క్రూర మాత్మాపహరణోపమమ్ ।**
**వైదేహీ శోకసంతప్తా హుతాశన ముపాగమత్ ॥ 25**

**పదచ్ఛేదము :–** శ్రుత్వా – తత్ – వచనం – క్రూరమ్ – ఆత్మాపహరణోపమమ్, వైదేహీ – శోకసంతప్తా – హుతాశనమ్ – ఉపాగమత్ ॥

**అన్వయక్రమము :–** వైదేహీ, ఆత్మాపహరణోపమం తత్ క్రూరవచనం శ్రుత్వా శోకసంతప్తా సతీ హుతాశనమ్ ఉపాగమత్.

**ప్రతిపదార్థము :–** వైదేహీ = సీతాదేవి, ఆత్మాపహరణోపమం = తనను అపహరించుటతో సమానమైన, తత్ = ఆ, క్రూరం = దారుణమైన, వచనం = మాటను, శ్రుత్వా = విని, శోకసంతప్తా సతీ = శోకముచే దహింపబడుచున్నదై, హుతాశనం = అగ్నిహోత్రుని, ఉపాగమత్ = ఉపాసించెను.

**తాత్పర్యము :–** సీతాదేవి ఆ రాక్షసస్త్రీలు పలికినమాట తనను అపహరించినప్పుడు కలిగినంతటి తీవ్రమైన సంతాపమును గలిగింపగా ఆమె అగ్నిహోత్రుని ధ్యానింపదొడగెను.

**శ్లో॥ మంగళాభిముఖీ తస్య సా తదాసీ న్మహాకపేః ।**
**ఉపతస్థే విశాలక్షీ ప్రయతా హవ్యవాహనమ్ ॥ 26**

**పదచ్ఛేదము** :– మంగళాభిముఖీ – తస్య – సా – తదా – ఆసీత్ – మహాకపేః, ఉపతస్థే – విశాలాక్షీ – ప్రయతా – హవ్యవాహనమ్ ॥

**అన్వయక్రమము** :– తదా సా విశాలాక్షీ తస్య మహాకపేః మంగళాభిముఖీ (సతీ) ప్రయతా హవ్యవాహనం ఉపతస్థే.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, సా విశాలాక్షీ = విశాలమైన కన్నులుగల ఆ సీతాదేవి, తస్య మహాకపేః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమకు, మంగళాభిముఖీ (సతీ) = మంగళములను గూర్చునట్టిదగుచు, ప్రయతా = నిష్ఠగలదై, హవ్యవాహనం = అగ్నిహోత్రుని, ఉపతస్థే = ధ్యానించినది.

**తాత్పర్యము** :– అప్పుడు ఆ సీతాదేవి తనకు మేలుగూర్చిన ఆ హనుమకు హాని తొలగించి మంగళము గూర్చు నిశ్చయము గలదై పరిశుద్ధమైన మనస్సుతో అగ్నిదేవుని గూర్చి ఇట్లు ప్రార్థింపసాగెను.

**శ్లో॥ యద్యస్తి పతిశుశ్రూషా యద్యస్తి చరితం తపః ।**
**యది వాస్త్యేకపత్నీత్వం శీతో భవ హనూమతః ॥ 27**

**పదచ్ఛేదము** :– యది – అస్తి – పతిశుశ్రూషా – యది – అస్తి – చరితం – తపః – యది – వా – అస్తి – ఏకపత్నీత్వం – శీతః – భవ – హనూమతః ॥

**అన్వయక్రమము** :– (మమ) పతిశుశ్రూషా అస్తి యది; చరితం తపః అస్తి యది, ఏకపత్నీత్వం వా అస్తి యది, (అగ్నే) హనూమతః శీతః భవ.

**ప్రతిపదార్థము** :– (మమ = నాకు) పతిశుశ్రూషా = పతిసేవ, అస్తి యది = ఉన్నయెడల, చరితం = చేయబడినట్టి, తపః = తపస్సు, అస్తి యది = ఉన్నదేని, ఏకపత్నీత్వం వా = పాతివ్రత్యమైనను గాని, అస్తి యది = ఉన్నదేని, (అగ్నే! = ఓ అగ్నిదేవుడా) హనూమతః = హనుమంతునకు, శీతః = చల్లనివాడవు, భవ = అగుము.

**తాత్పర్యము** :– నాయందు పతిసేవాపుణ్య మున్నదేని, నాకు చేసికొన్న తపస్సు గలదేని, లేక నా యందు పాతివ్రత్యధర్మ మున్నదేని ఓ యగ్నిదేవా! హనుమంతుని యెడ నీవు చల్లనివాడవు గమ్ము!

**శ్లో॥ యది కించి దనుక్రోశ స్తస్య మ య్యస్తి ధీమతః ।**
**యది వా భాగ్యశేషో మే శీతో భవ హనూమతః ॥ 28**

**పదచ్ఛేదము** :– యది – కించిత్ – నుక్రోశః – తస్య – మయి – అస్తి – ధీమతః, యది – వా – భాగ్యశేషః – మే – శీతః – భవ – హనూమతః ॥

**అన్వయక్రమము** :– మయి ధీమతః తస్య కించిదనుక్రోశః అస్తి యది, మే భాగ్య శేషో వా (అస్తి) యది, హనూమతః శీతః భవ.

**ప్రతిపదార్థము** :– మయి = నాయందు, ధీమతః = ప్రజ్ఞావంతుడైన, తస్య = ఆ రామునకు, కించిదనుక్రోశః = కొద్ది కరుణ, అస్తి యది = ఉన్నదేని, మే = నాకు, భాగ్యశేషః వా = భాగ్యశేషమైనను గాని, (అస్తి) యది = ఉన్నయెడల, హనూమతః = హనుమంతునకు, శీతః = చల్లనివాడవు, భవ = అగుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– మే భాగ్యశేషః అస్తి యది – పూర్వజన్మము నందలి భాగ్యశేష మేమైన యున్నచో దాని మూలముననైనను ప్రస్తుతము తాననుభవించుచున్న నిరంతరదుఃఖమువలన ఈ జన్మమునందలి భాగ్యము లేకున్నను పూర్వపుణ్య ఫలముగనైన హనుమంతునియెడ అగ్నిదేవుడు చల్లనివాడు గావలెనని సీతాదేవి భావము.

**తాత్పర్యము** :– ప్రజ్ఞావంతుడైన ఆ శ్రీరామునకు నా యెడ కొంచెమేని కరుణయున్నను, లేక నాకు కొంచెమైన పూర్వజన్మమునందలి అదృష్టము శేషించియున్నను ఓ అగ్నిదేవుడా! నీవు హనుమంతునియెడ చల్లనివాడవు గమ్ము!

**శ్లో॥ యది మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసామ్ ।**
**స విజనాతి ధర్మాత్మా శీతో భవ హనూమతః ॥ 29**

**పదచ్ఛేదము** :– యది – మాం – వృత్తసంపన్నాం – తత్సమాగమలాలసామ్ – సః విజానాతి – ధర్మాత్మా – శీతః – భవ – హనూమతః ॥

**అన్వయక్రమము** :– మాం వృత్తసంపన్నాం తత్సమాగమలాలసాం సః ధర్మాత్మా విజానాతి యది, హనూమతః శీతః భవ.

**ప్రతిపదార్థము** :– మాం = నన్ను, వృత్తసంపన్నాం = సద్వర్తనముతో నిండియున్న దానినిగను, తత్సమాగమలాలసాం = ఆతనియొక్క కలయికయందు తీవ్రమైన కోరికగలదాననుగను, సః ధర్మాత్మా = ఆ ధర్మాత్ముడైన రాముడు, విజానాతి యది = తెలిసికొనుచున్నయెడల, హనూమతః = హనుమంతునకు, శీతః = చల్లనివాడవు, భవ అగుము.

**తాత్పర్యము :-** ధర్మాత్ముడైన ఆ శ్రీరాముడు నన్ను సద్వర్తనముతో వెలయునట్టి దానినిగాను, ఆతనిని కలిసికొనుటకై ఉత్కంఠతో నున్నదానినిగాను తెలిసికొనుచున్న యెడల అగ్నిదేవా! నీవు హనుమంతుని యెడల చల్లనివాడ వగుదువు గాక!

**శ్లో॥ యది మాం తారయే దార్య స్సుగ్రీవ స్సత్యసంగరః ।**
**అస్మా ద్దుఃఖాంబుసంరోధాచ్ఛీతో భవ హనూమతః ॥ 30**

**పదచ్ఛేదము :-** యది - మాం - తారయేత్ - ఆర్యః - సుగ్రీవః - సత్యసంగరః, అస్మాత్ - దుఃఖాంబుసంరోధాత్ - శీతః - భవ - హనూమతః ॥

**అన్వయక్రమము :-** ఆర్యః సత్యసంగరః సుగ్రీవః మామ్ అస్మాత్ దుఃఖాంబుసంరోధాత్ తారయేత్ యది హనూమతః శీతః భవ.

**ప్రతిపదార్థము :-** ఆర్యః = పూజ్యుదును, సత్యసంగరః = సత్యమైన ప్రతిజ్ఞగలవాడునగు, సుగ్రీవః = సుగ్రీవుడు, మాం = నన్ను, అస్మాత్ = ఈ, దుఃఖాంబుసంరోధాత్ = దుఃఖమనెడి నీటి వెల్లువనుండి, తారయేత్ యది = తరింపచేయునేని, హనూమతః = హనుమంతునకు, శీతః = చల్లనివాడవు, భవ = అగుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :-** సీతాదేవి - భర్తృశుశ్రూష నొనరించుపడతినేని యని తెలిపి తన రామకైంకర్యమును స్థిరపరచెను. ఆమె ఇప్పుడు రామదాసుడగు హనుమద్భాగవతునకు నపాయము లేకుండజేసి భాగవతప్రీతి కనబఱచెను. దయ యాధారముగాగల పరోపకారము అవశ్యకర్తవ్యమైన మిత్రభాగవత భర్తృహిత లక్షణము. బిడ్డలను రక్షించుటయందు భర్తకు గల స్వాతంత్ర్యము భార్యకును గలదు.

**తాత్పర్యము :-** పూజ్యుదును సత్యప్రతిజ్ఞుడునైన సుగ్రీవుడు నన్నీ దుఃఖసముద్రమునుండి తప్పించుటయే తథ్యమైనయెడల ఓ యగ్నిదేవా! నీవు హనుమంతుని యెడ చల్లదనమును వహింపుము.

**శ్లో॥ తత స్తీక్ష్ణార్చి రవ్యగ్రః ప్రదక్షిణశిఖోఽనలః ।**
**జజ్వాల మృగశాబాక్ష్యా శ్శంస న్నివ శివం కపేః ॥ 31**

**పదచ్ఛేదము :-** తతః - తీక్ష్ణార్చిః - అవ్యగ్రః - ప్రదక్షిణశిఖః - అనలః, జజ్వాల - మృగశాబాక్ష్యాః - శంసన్ - ఇవ - శివం - కపేః ॥

**అన్వయక్రమము :-** తతః మృగశాబాక్ష్యాః కపేః శివం శంసన్ ఇవ, అనలః తీక్ష్ణార్చిః

ప్రదక్షిణశిఖః అవ్యగ్రః చ సన్ జజ్వాల.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, మృగశాబాక్ష్యాః = లేడిపిల్ల కన్నులవంటి కన్నులుగల సీతాదేవికి, కపేః = హనుమయొక్క, శివం = శుభమునుగూర్చి, శంసన్ ఇవ = చెప్పుచున్నవాడువలె, అనలః = అగ్ని, తీక్ష్ణార్చిః = తీక్ష్ణమైన జ్వాలలు గలవాడుగను, ప్రదక్షిణశిఖః =కుడివైపునకు తిరిగిన మంటలు గలవాడుగను, అవ్యగ్రః చ(సన్) = చాంచల్యములేనివాడుగను అగుచు, జజ్వాల = జ్వలించెను.

**తాత్పర్యము** :- అప్పుడా యగ్నిదేవుడు సీతాదేవికి హనుమయొక్క క్షేమము నివేదించుచున్నట్లుగా చాంచల్యము లేకుండ కుడివైపునకు వంగిన ప్రదీప్తమైన జ్వాలలతో ప్రజ్వలించుచు కానవచ్చెను.

**శ్లో॥ హనుమజ్జనక శ్చాపి పుచ్ఛానలయుతో ఽ నిలః ।**
**వవౌ స్వాస్థ్యకరో దేవ్యాః ప్రాలేయానిలశీతలః ॥ 32**

**పదచ్ఛేదము** :- హనుమజ్జనకః – చ – అపి – పుచ్ఛానలయుతః – అనిలః – వవౌ – స్వాస్థ్యకరః – దేవ్యాః – ప్రాలేయానిలశీతలః ॥

**అన్వయక్రమము** :- పుచ్ఛానలయుతః అపి హనుమజ్జనకః అనిలః దేవ్యాః స్వాస్థ్యకరః ప్రాలేయానిలశీతలః (సన్) వవౌ.

**ప్రతిపదార్థము** :- పుచ్ఛానలయుతః అపి = తోకయందలి అగ్నితో గూడిన వాడయినప్పటికిని, హనుమజ్జనకః = హనుమంతుని తండ్రియైనట్టి, అనిలః = వాయువు, దేవ్యాః = సీతాదేవికి, స్వాస్థ్యకరః = స్వస్థతను గల్గించుచున్నవాడై, ప్రాలేయానిలశీతలః సన్ = మంచుతో గూడిన వాయువువలె చల్లని వాడగుచు, వవౌ = వీచెను.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమ తోకయందు జ్వలించుచున్న అగ్నితో గూడియున్నప్పటికిని హనుమంతుని తండ్రియైన వాయుదేవుడు సీతాదేవికి తాపము గలుగకుండ మంచుతో నిండిన వాయువువలెనే చల్లగ వీచుచు ఆమెకు సుఖమును గూర్చెను.

**శ్లో॥ దహ్యమానే చ లాంగూలే చింతయామాస వానరః ।**
**ప్రదీప్తోఽగ్ని రయం కస్మాన్న మాం దహతి సర్వతః ॥ 33**

**పదచ్ఛేదము** :- దహ్యమానే – చ – లాంగూలే – చింతయామాస – వానరః – ప్రదీప్తః – అగ్నిః – అయం – కస్మాత్ – న – మాం – దహతి – సర్వతః ॥

**అన్వయక్రమము** :- లాంగూలే దహ్యమానే (సతి) వానరః చింతయామాస; అయం సర్వతః ప్రదీప్తః అగ్నిః మాం కస్మాత్ న దహతి?

**ప్రతిపదార్థము** :- లాంగూలే = తోక, దహ్యమానే సతి = తగులపెట్టబడుచుండగా, వానరః = హనుమ, చింతయామాస = ఆలోచించెను, సర్వతః = అన్నివైపులనుండి, ప్రదీప్తః = ప్రజ్వలించుచున్నట్టి, అయం అగ్నిః = ఈ యగ్ని, మాం = నన్ను, కస్మాత్ = ఎందువలన, న దహతి = దహించుట లేదు?

**తాత్పర్యము** :- తన తోక అట్లు తగులబడుచున్నను తనకు తాపము కలుగుకుండుటచే తనలో నిట్లు చింతించెను. ఈ యగ్ని అన్నివైపులకును ఇట్లు చెలరేగి మండుచున్నను నన్ను కొంచెము గూడ ఎందుచే దహించుట లేదు?

**శ్లో॥ దృశ్యతే చ మహాజ్వాలో న కరోతి చ మే రుజమ్ ।**
**శిశిర స్యేవ సంపాతో లాంగూలాగ్రే ప్రతిష్ఠితః ॥ 34**

**పదచ్ఛేదము** :- దృశ్యతే - చ - మహాజ్వాలః - న - కరోతి - చ - మే - రుజమ్, శిశిరస్య - ఇవ - సంపాతః - లాంగూలాగ్రే - ప్రతిష్ఠితః ॥

**అన్వయక్రమము** :- మహాజ్వాలః దృశ్యతే; మే రుజం న చ కరోతి, లాంగూలాగ్రే ప్రతిష్ఠితః శిశిరస్య సంపాత ఇవ (అస్తి).

**ప్రతిపదార్థము** :- మహాజ్వాలః = గొప్పదైనమంట, దృశ్యతే = కనబడుచున్నది, మే = నాకు, రుజం = బాధను, న చ కరోతి = ఏ మాత్రమును కల్గించుటలేదు, లాంగూలాగ్రే = తోకచివరను, ప్రతిష్ఠితః = ఉంచబడిన, శిశిరస్య = మంచుయొక్క, సంపాతః ఇవ = ముద్దవలె (అస్తి = ఉన్నది).

**తాత్పర్యము** :- నాకు చూడగా ఈ యగ్ని పెద్దమంటలతో గానవచ్చుచున్నది. కాని బాధమాత్ర మేమియు గల్గించుటలేదు. నా తోక చివర ఒక మంచు ముద్దను పెట్టినట్లే యున్నది గాని అగ్నిగా నాకు కనిపించుటలేదు. ఇది ఏమి చిత్రమో!

**శ్లో॥ అథవా తదిదం వ్యక్తం యద్దృష్టం ప్లవతా మయా ।**
**రామప్రభావా దాశ్చర్యం పర్వత స్సరితాం పతౌ ॥ 35**

**పదచ్ఛేదము** :- అథవా - తత్ - ఇదం - యత్ - దృష్టం - ప్లవతా - మయా - రామప్రభావాత్ - ఆశ్చర్యం - పర్వతః - సరితాం - పతౌ ॥

**అన్వయక్రమము** :- అథవా ప్లవతా మయా రామప్రభావాత్ సరితాం పతౌ యత్

ఆశ్చర్యం పర్వతః దృష్టః తత్ ఇదం వ్యక్తమ్.

**ప్రతిపదార్థము** :– అథవా = లేక, ప్లవతా = దాటుచున్నట్టి, మయా = నాచేత, సరితాం పతౌ = సముద్రమునందు, రామప్రభావాత్ = శ్రీరాముని ప్రభావమువలన, యత్ = ఎట్లుగా, ఆశ్చర్యం = ఆశ్చర్యకరముగా, పర్వతః = మైనాకపర్వతము, దృష్టః = చూడబడినదో, తత్ = అట్లుగా, ఇదం = ఈ యగ్నిశైత్యము, వ్యక్తమ్ = స్పష్టమైనది.

**తాత్పర్యము** :– పూర్వము నేను మహాసాగరమును దాటుచున్నప్పుడు శ్రీరాముని ప్రభావముచే ఆశ్చర్యకరముగా సముద్రము నుండి మైనాకపర్వతము ఉద్భవించుట ఎట్లు జరిగినదో అట్లే ఇప్పుడీ యగ్నికి శైత్యము గూడ సంభవించియున్నదని స్పష్టమగుచున్నది.

**శ్లో॥ యది తావ త్సముద్రస్య మైనాకస్య చ ధీమతః ।**
**రామార్థం సంభ్రమ స్తాదృ క్కి మగ్ని ర్న కరిష్యతి ॥ 36**

**పదచ్ఛేదము** :– యది – తావత్ – సముద్రస్య – మైనాకస్య – చ – ధీమతః – రామార్థం – సంభ్రమః – తాదృక్ – కిమ్ – అగ్నిః – న – కరిష్యతి ॥

**అన్వయక్రమము** :– సముద్రస్య, ధీమతః మైనాకస్య చ, రామార్థం తావత్ సంభ్రమః దృష్టః యది అగ్నిః తాదృక్ (సంభ్రమం) కిం న కరిష్యతి?

**ప్రతిపదార్థము** :– సముద్రస్య = సముద్రమునకును, ధీమతః = గొప్పబుద్ధిగలవాడైన, మైనాకస్య చ = మైనాకునకును, రామార్థం = శ్రీరామునికొఱకై, తావత్ సంభ్రమః = అంతటి వేగిరపాటు (దృష్టః) యది = కనపడినప్పుడు, అగ్నిః = అగ్నిదేవుడు (మాత్రము) తాదృక్ సంభ్రమం = అంతటి ఉత్కంఠను, కిం = ఏల, న కరిష్యతి = చేయడు?

**తాత్పర్యము** :– ఆ నా డా మహనీయులైన సముద్రునకును మైనాకునకును శ్రీరాముని సేవకొఱకై అంతటి ఉత్కంఠ గల్గినప్పుడు ఇప్పుడీ యగ్నిదేవునకు మాత్రము ఇట్టి సంభ్రమము గలుగకుండ ఎట్లుండును?

**శ్లో॥ సీతాయా శ్చానృశంస్యేన తేజసా రాఘవస్య చ ।**
**పితుశ్చ మమ సఖ్యేన న మాం దహతి పావకః ॥ 37**

**పదచ్ఛేదము** :– సీతాయాః – చ – ఆనృశంస్యేన – తేజసా – రాఘవస్య – చ – పితుః – చ – మమ – సఖ్యేన – న – మాం – దహతి – పావకః ॥

**అన్వయక్రమము :-** సీతాయాః ఆనృశంస్యేన, రాఘవస్య తేజసా చ, మమ పితుః, సఖ్యేన చ పావకః మాం న దహతి.

**ప్రతిపదార్థము :-** సీతాయాః = సీతాదేవియొక్క, ఆనృశంస్యేన = కారుణ్యముచేతను, రాఘవస్య = శ్రీరామునియొక్క, తేజసా చ = తేజముచేతను, మమ = నాయొక్క, పితుః = తండ్రియొక్క, సఖ్యేన చ = మైత్రిచేతను, పావకః = అగ్ని, మాం = నన్ను, న దహతి = దహించుటలేదు.

**తాత్పర్యము :-** సీతాదేవియొక్క దయావిశేషముచేతను, శ్రీరాముని యొక్క ప్రభావాతిశయముచేతను, నా తండ్రియగు వాయుదేవునియొక్క స్నేహాధిక్యముచేతను అగ్నిదేవుడు ఇప్పుడు నన్ను తపింపచేయుట లేదు.

**శ్లో॥ భూయ స్స చింతయామాస ముహూర్తం కపికుంజరః ।**
**ఉత్పపా తాథ వేగేన ననాద చ మహాకపిః ॥ 38**

**పదచ్ఛేదము:-** భూయః - సః - చింతయామాస - ముహూర్తం - కపికుంజరః, ఉత్పపాత - అథ - వేగేన - ననాద - చ - మహాకపిః ॥

**అన్వయక్రమము :-** సః కపికుంజరః భూయః ముహూర్తం చింతయామాస, అథ మహాకపిః వేగేన ఉత్పపాత ననాద చ.

**ప్రతిపదార్థము :-** సః కపికుంజరః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, భూయః = తిరిగి, ముహూర్తం = రెండు క్షణముల కాలము, చింతయామాస = ఆలోచించెను, అథ = పిమ్మట, మహాకపిః = వానరశ్రేష్ఠుడైన హనుమ, వేగేన = వేగముతో, ఉత్పపాత = మీదికి ఎగిరెను, ననాద చ = గర్జించెను కూడను.

**తాత్పర్యము :-** వానరశ్రేష్ఠుడైన ఆ హనుమ అప్పుడు తిరిగి కొద్దిసేపు ఆలోచించి వెంటనే మహావేగముతో మీదికెగసి పెద్ద సింహనాదమును జేసెను.

**శ్లో॥ పురద్వారం తత శ్శ్రీమాన్ శైలశృంగ మివోన్నతమ్ ।**
**విభక్తరక్షస్సంబాధ మాససా దానిలాత్మజః ॥ 39**

**పదచ్ఛేదము :-** పురద్వారం - తతః - శ్రీమాన్ - శైలశృంగమ్ - ఇవ - ఉన్నతమ్, విభక్తరక్షస్సంబాధమ్ - ఆససాద - అనిలాత్మజః ॥

**అన్వయక్రమము :-** తతః శ్రీమాన్ అనిలాత్మజః శైలశృంగమ్ ఇవ ఉన్నతం, విభక్తరక్షస్సంబాధం పురద్వారమ్ ఆససాద.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, శ్రీమాన్ = శుభలక్షణ సముపేతుడైన, అనిలాత్మజః = వాయునందనుడు, శైలశృంగమ్ ఇవ = పర్వతశిఖరమువలె, ఉన్నతం = ఎత్తైనదియును, విభక్తరక్షస్సంబాధం = విడివడిన రాక్షసులయొక్క సమ్మర్దము గలదియునగు, పురద్వారం = పట్టణద్వారమును, ఆససాద = చేరెను.

**తాత్పర్యము** :- అటు పిమ్మట వాయునందనుడు పర్వత శిఖరమువలె నున్నతమై రాక్షసుల సమ్మర్దములేనిదై యున్నట్టి పట్టణద్వారము కడకు చేరుకొనెను.

**శ్లో॥ స భూత్వా శైలసంకాశః క్షణేన పున రాత్మవాన్ ।**
**హ్రస్వతాం పరమాం ప్రాప్తో బంధనా న్యవశాతయత్ ॥ 40**

**పదచ్ఛేదము** :- సః - భూత్వా - శైలసంకాశః - క్షణేన - పునః - ఆత్మవాన్ - హ్రస్వతాం - పరమాం - ప్రాప్తః - బంధనాని - అవశాతయత్ ॥

**అన్వయక్రమము** :- ఆత్మవాన్ సః శైలసంకాశః భూత్వా పునః క్షణేన పరమాం హ్రస్వతాం ప్రాప్తః సన్ బంధనాని అవశాతయత్.

**ప్రతిపదార్థము** :- ఆత్మవాన్ సః = మహాత్ముడైన యా హనుమ, క్షణేన = ఒక్క క్షణమున, శైలసంకాశః = పర్వతమును బోలినట్టివాడుగా, భూత్వా = అయి (అనగా పెరిగి) పునః = తిరిగి, పరమాం = గొప్పదైన, హ్రస్వతాం = హ్రస్వరూపమును, ప్రాప్తః సన్ = పొందినవాడై, బంధనాని = బంధనములను, అవశాతయత్ = సడలించుకొనెను.

**తాత్పర్యము** :- మహాశక్తిసంపన్నుడైన యా హనుమ అప్పుడు క్షణములో పర్వతమువలె తన రూపమును పెద్దగా పెంచుకొని వెంటనే తిరిగి మిక్కిలి చిన్నదైన రూపమును ధరించి వెనుకటి బంధనములను అన్నింటిని సడలించుకొనెను.

**శ్లో॥ విముక్త శ్చాభవ చ్ఛ్రీమాన్పునః పర్వతసన్నిభః ।**
**వీక్షమాణశ్చ దదృశే పరిఘం తోరణాశ్రితమ్ ॥ 41**

**పదచ్ఛేదము** :- విముక్తః - చ - అభివత్ - శ్రీమాన్ - పునః - పర్వతసన్నిభః - వీక్షమాణః - చ - దదృశే - పరిఘం - తోరణాశ్రితమ్ ॥

**అన్వయక్రమము** :- శ్రీమాన్ సః విముక్తః సన్ పునః పర్వతసన్నిభః అభవత్, వీక్షమాణః తోరణాశ్రితం పరిఘం దదృశే.

**ప్రతిపదార్థము** :- శ్రీమాన్ సః = శుభలక్షణ సంపన్నుడైన యా హనుమ, విముక్తః =

బంధవిముక్తుడై, పునః = తిరిగి, పర్వతసన్నిభః = పర్వతముతో సమానుడు, అభవత్ = ఆయెను, వీక్షమాణః = పరికించుచున్నవాడైన, సః = ఆ హనుమ, తోరణాశ్రితం = పురద్వారము నంటియున్న, పరిఘం = ఇనుపగడియను, దదృశే = చూచెను.

**తాత్పర్యము :-** అట్లు తన బంధనమునుండి విడివడినట్టి మహాబలాఢ్యుడైన హనుమ, వెంటనే తిరిగి పర్వతసమానుడుగా వృద్ధిచెందెను. అట్టి రూపముతో ఇటు నటు చూడగా నాతనికి ఆ పట్టణద్వారము నంటియున్న ఇనుపగడియ గానవచ్చెను.

**శ్లో॥ స తం గృహ్య మహాబాహుః కాలాయసపరిష్కృతమ్ ।**
**రక్షిణస్తాన్ పున స్సర్వాన్ సూదయామాస మారుతిః ॥ 42**

**పదచ్ఛేదము :-** సః - తం - గృహ్య - మహాబాహుః - కాలాయసపరిష్కృతమ్, రక్షిణః - తాన్ - పునః - సర్వాన్ - సూదయామాస - మారుతిః ॥

**అన్వయక్రమము :-** సః మహాబాహుః మారుతిః కాలాయసపరిష్కృతం తం గృహ్య తాన్ రక్షిణః సర్వాన్ సూదయామాస.

**ప్రతిపదార్థము :-** సః = ఆ, మహాబాహుః = మహావీరుడైన, మారుతిః = హనుమ, కాలాయసపరిష్కృతం = ఉక్కుతో నిర్మింపబడినట్టి, తం = ఆ గడియను, గృహ్య = పట్టుకొని, తాన్ = ఆ, రక్షిణః సర్వాన్ = రక్షకభటులనందఱను, పునః = తిరిగి, సూదయామాస = హతమార్చెను.

**తాత్పర్యము :-** మహావీరుడైన హనుమ బలమైన ఆ ఉక్కుగడియను గైకొని, అచ్చట కావలియున్న భటుల నెల్లరను పరిమార్చెను.

**శ్లో॥ స తా న్నిహత్వా రణచండవిక్రమః**
**సమీక్షమాణః పునరేవ లంకామ్ ।**
**ప్రదీప్తలాంగూల కృతార్చిమాలీ**
**ప్రకాశ తాదిత్య ఇ వార్చిమాలీ ॥ 43**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"పావకశైత్యమ్" నామ*
*త్రిపంచాశస్సర్గః*

**పదచ్ఛేదము :-** సః - తాన్ - నిహత్వా - రణచండవిక్రమః - సమీక్షమాణః - పునః - ఏవ - లంకాం - ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ, ప్రకాశత - ఆదిత్యః -

ఇవ - అర్చిమాలీ ॥

**అన్వయక్రమము** :- రణచండవిక్రమః సః తాన్ నిహత్వా పునః ఏవ లంకాం సమీక్షమాణః ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ అర్చిమాలీ ఆదిత్యః ఇవ ప్రకాశత.

**ప్రతిపదార్థము** :- రణచండవిక్రమః = యుద్ధమునందు భయంకరమైన పరాక్రమముగల్గినట్టి, సః = ఆ హనుమ, తాన్ = ఆ రక్షకభటులను, నిహత్వా = పరిమార్చి, పునః ఏవ = మఱల, లంకాం = లంకానగరిని, సమీక్షమాణః = పరికించుచున్నవాడై, ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ సన్ = ప్రజ్వలించుచున్న లాంగూలమునందు గూర్పబడిన అగ్నిజ్వాలలుగలవాడై, అర్చిమాలీ = కిరణముల సమూహము గల్గినట్టి, ఆదిత్యః ఇవ = సూర్యుడువలె, ప్రకాశత = ప్రకాశించెను.

**తాత్పర్యము** :- అచ్చటి రక్షకభటులైన రక్కసుల నెల్లరను ఉక్కడగించి నిలువబడి అటునుండియే లంకానగరమును జూచుచుండగా తన తోకయందు ప్రజ్వలించుచున్న జ్వాలలతో గూడిన యా హనుమ కిరణముల మాలికలతో తేజరిల్లుచున్న భాస్కరుని వలెనే ప్రకాశించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"పావక శైత్యము" అను*
*ఏబదిమూడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుష్పంచాశసర్గ

**శ్లో॥ వీక్షమాణ స్తతో లంకాం కపిః కృతమనోరథః ।**
**వర్ధమానసముత్సాహః కార్యశేష మచింతయత్ ॥ 1**

**పదచ్ఛేదము** :- వీక్షమాణః - తతః - లంకాం - కపిః - కృతమనోరథః - వర్ధమానసముత్సాహః - కార్యశేషం - అచింతయత్ ॥

**అన్వయక్రమము** :- తతః కృతమనోరథః కపిః లంకాం వీక్షమాణః వర్ధమాన సముత్సాహః (సన్) కార్యశేషమ్ అచింతయత్.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, కృతమనోరథః = నెఱవేర్చుకొన్న కోరికగలవాడైనట్టి, కపిః = హనుమ, లంకాం = లంకా పట్టణమును, వీక్షమాణః = విలోకించుచున్నవాడై, వర్ధమానసముత్సాహః (సన్) = వృద్ధిపొందుచున్న గొప్ప ఉత్సాహముగలవాడగుచు, కార్యశేషం = కర్తవ్యముయొక్క శేషవిషయమును గూర్చి, అచింతయత్ = ఆలోచించెను.

**తాత్పర్యము** :- పిమ్మట హనుమంతుడు లంకానగరమును ఒకమాఱు పరికించి చూచుచు తన మనోరథము నెఱవేరుటవలన పొంగివచ్చుచున్న ఉత్సాహముతో ఇకమీదట తాను చేయవలసిన కర్తవ్యమును గూర్చి ఆలోచింపసాగెను.

**శ్లో॥ కిం ను ఖల్వవశిష్టం మే కర్తవ్య మిహ సాంప్రతమ్ ।**
**య దేషాం రక్షసాం భూయః సంతాపజననం భవేత్ ॥ 2**

**పదచ్ఛేదము** :- కిం - ను - ఖలు - అవశిష్టం - మే - కర్తవ్యమ్ - ఇహ - సాంప్రతమ్ - యత్ - ఏషాం - రక్షసాం - భూయః - సంతాపజననం - భవేత్ ॥

**అన్వయక్రమము** :- ఏషాం రక్షసాం భూయః యత్ సంతాపజననం భవేత్, ఇహ సాంప్రతం మే అవశిష్టం తత్ కర్తవ్యం కిం ను ఖలు?

**ప్రతిపదార్థము** :- ఏషాం రక్షసాం = ఈ రాక్షసులకు, భూయః = తిరిగి, యత్ = ఏ కృత్యము, సంతాపజననం = సంతాపమును కల్గించునట్టిది, భవేత్ = కాగలదో,

సాం|ప్రతం = ఇప్పుడు, ఇహ = ఇచ్చట, మే = నాకు, అవశిష్టం = మిగిలియున్నట్టి, తత్ = ఆ, కర్తవ్యం = చేయవలసియున్నపని, కిం ను ఖలు = ఏమియో గదా!

**తాత్పర్యము** :- ఇప్పుడీ రాక్షసులకు మఱల గొప్పసంతాపము గల్గించుటకు గాను నేను చేయవలసియున్నట్టిదైన మిగిలిపోయినపని ఇంక ఏమి యున్నదో గదా!

**శ్లో॥ వనం తావ త్ప్రమథితం ప్రకృష్టా రాక్షసా హతాః ।**
**బలైకదేశః క్షపితః శేషం దుర్గవినాశనమ్ ॥ 3**

**పదచ్ఛేదము** :- వనం - తావత్ - ప్రమథితం - ప్రకృష్టాః - రాక్షసాః - హతాః, బలైకదేశః - క్షపితః - శేషం - దుర్గవినాశనమ్ ॥

**అన్వయక్రమము** :- వనం తావత్ ప్రమథితం, ప్రకృష్టాః, రాక్షసాః హతాః, బలైకదేశః క్షపితః, శేషం దుర్గవినాశనమ్.

**ప్రతిపదార్థము** :- వనం తావత్ = వన మంతయును, ప్రమథితం = ధ్వంసము చేయబడినది, ప్రకృష్టాః = బలవంతులైన, రాక్షసాః = రాక్షసులు, హతాః = వధింపబడిరి, బలైకదేశః = సైన్యములో ఒక భాగము, క్షపితః = నాశనము చేయబడినది, దుర్గవినాశనం = కోటను కూల్చివేయుట, శేషం = మిగిలినది.

**తాత్పర్యము** :- ఈ లంకలోని వనమంతయును ధ్వంసము చేసినాను; బలవంతులైన రాక్షసులను పెక్కుమందిని చంపినాను; ఈ రాక్షససైన్యములో కొంతభాగమును హతమార్చినాను. ఇక మిగిలియున్నది కోటను పడగొట్టుటయే.

**శ్లో॥ దుర్గే వినాశితే కర్మ భవే త్సుఖపరిశ్రమమ్ ।**
**అల్పయత్నేన కార్యేఽస్మిన్ మమ స్యా త్సఫలః శ్రమః ॥ 4**

**పదచ్ఛేదము** :- దుర్గే - వినాశితే - కర్మ - భవేత్ - సుఖపరిశ్రమమ్ - అల్పయత్నేన - కార్యే - అస్మిన్ - మమ - స్యాత్ - సఫలః - శ్రమః ॥

**అన్వయక్రమము** :- దుర్గే వినాశితే (సతి) కర్మ సుఖపరిశ్రమం భవేత్; అస్మిన్ కార్యే మమ శ్రమః అల్పయత్నేన సఫలః స్యాత్.

**ప్రతిపదార్థము** :- దుర్గే = కోట, వినాశితే (సతి) = ధ్వంసము చేయబడగా, కర్మ = పని, సుఖపరిశ్రమం = సుఖకరమైన శ్రమగలది, భవేత్ = కాగలదు, అస్మిన్ కార్యే = ఈ కృత్యమునందు, మమ = నా యొక్క, శ్రమః = ప్రయాసము, అల్పయత్నేన = కొద్ది ప్రయత్నముతో, సఫలః = సఫలమైనది, స్యాత్ = కాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'కర్మ సుఖపరిశ్రమం భవేత్' – సముద్రలంఘనము మున్నగు నా ప్రయాసము, కఠోరతపశ్చర్య ఫలించినట్లుగ సుఖప్రదమైన ప్రయాసము కలదగునని భావము.

**గోవిందరాజీయము** :– 'కర్మ' – వనభంజనము, సముద్రలంఘనము, దౌత్యకృత్యము అంతయును సఫలమగునని భావము.

**తాత్పర్యము** :– ఇప్పుడీ కోటను గూడ ధ్వంసము చేసినచో నేనింతవఱకును చేసిన కృషి యంతయును సఫలము కాగలదు. ఈ యల్పప్రయత్నముతో నే నీ పని గూడ నెరవేర్చుటవలన నా ప్రయాసమంతయును సఫలము కాగలదు.

**శ్లో॥ యో హ్యయం మమ లాంగూలే దీప్యతే హవ్యవాహనః ।**
**అస్య సంతర్పణం న్యాయ్యం కర్తు మేభి ర్గృహోత్తమైః ॥ 5**

**పదచ్ఛేదము** :– యః – హి – అయం – మమ – లాంగూలే – దీప్యతే – హవ్యవాహనః – అస్య – సంతర్పణం – న్యాయ్యం – కర్తుమ్ – ఏభిః – గృహోత్తమైః ॥

**అన్వయక్రమము** :– మమ లాంగూలే అయం యః హవ్యవాహనః దీప్యతే, అస్య ఏభిః గృహోత్తమైః సంతర్పణం కర్తుం న్యాయ్యం హి.

**ప్రతిపదార్థము** :– మమ = నాయొక్క, లాంగూలే = తోకయందు, అయం = ఈ, యః హవ్యవాహనః = ఏ యగ్నిహోత్రుడు, దీప్యతే = జ్వలించుచున్నాడో, అస్య = ఆ యగ్నిహోత్రునకు, ఏభిః గృహోత్తమైః = ఈ శ్రేష్ఠమైన భవనములతో, సంతర్పణం = విందును, కర్తుం = చేయుటకు, న్యాయ్యం హి = ఉచితముగదా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము, గోవిందరాజీయము** :– 'అస్య సంతర్పణం కర్తుం న్యాయ్యం' – తోకకు రాక్షసులు రగిల్చిన జ్వాలలచే వాని శరీరమునకు ఏమియు తాపము గల్గింపకుండుటచే ఆ యగ్నిదేవునకు తాను తిరిగి సంతృప్తిని గలిగించుట ఉచితమని భావము.

**తాత్పర్యము** :– నా వాలాగ్రమునందు ప్రజ్వలించుచున్నట్టి అగ్నిదేవుడు నా శరీరమునకు ఇసుమంతయును తాపమును కల్గించకుండ నాపై ప్రేమజూపినాడు కాబట్టి అట్టి ఆ యగ్నిదేవునకు ఇప్పుడు ఈ లంకానగరమునందలి ప్రాసాదములతో విందుచేయుట నాకు న్యాయమైయుండును గదా!

**శ్లో॥ తతః ప్రదీప్తలాంగూల స్సవిద్యు దివ తోయదః ।**
**భవనాగ్రేషు లంకాయా విచచార మహాకపిః ॥ 6**

**పదచ్ఛేదము :–** తతః – ప్రదీప్తలాంగూలః – సవిద్యుత్ – ఇవ – తోయదః – భవనాగ్రేషు – లంకాయాః – విచచార – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** తతః ప్రదీప్తలాంగూలః సః మహాకపిః సవిద్యుత్ తోయదః ఇవ లంకాయాః భవనాగ్రేషు విచచార.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, ప్రదీప్తలాంగూలః = మండుచున్నతోక గల్గినట్టి, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, సవిద్యుత్ = మెఱపులతో గూడినట్టి, తోయదః ఇవ = మేఘమువలె, లంకాయాః = లంకానగరముయొక్క, భవనాగ్రేషు = భవనములమీద, విచచార = పర్యటించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'తోయదః ఇవ' – సంధ్యాకాలమునందలి ఎఱ్ఱనైన మేఘమువలెనని భావము. హనుమంతుని దేహము రక్తవర్ణమైనది గదా!

**గోవిందరాజీయము :–** 'ప్రదీప్తలాంగూలః' – హనుమ తన దేహమును సంకోచింపజేసి బంధనమును తొలగించుకొనినప్పటికిని తోక పైనున్న అగ్నిని భావికృత్యముకొఱకై నిలుపుకొనెనని గ్రహింపవలెను.

**తాత్పర్యము :–** అట్లు నిశ్చయించుకొని హనుమ జ్వలించుచున్న తన వాలముతోడను తన ఎఱ్ఱని శరీరముతోడను ఆ లంకానగరమునందలి సౌధాగ్రములపై మెఱపులతో గూడిన సంధ్యాకాలమేఘమువలె పరిభ్రమించెను.

**శ్లో॥ గృహా ద్గృహం రాక్షసానా ముద్యానాని చ వానరః ।**
**వీక్షమాణో హ్యసంత్రస్తః ప్రాసాదాంశ్చ చచార సః ॥ 7**

**పదచ్ఛేదము :–** గృహాత్ – గృహం – రాక్షసానాం – ఉద్యానాని – చ – వానరః – వీక్షమాణః – హి – అసంత్రస్తః – ప్రాసాదాన్ – చ – చచార – సః ॥

**అన్వయక్రమము :–** సః వానరః రాక్షసానాం గృహాత్ గృహం ఉద్యానాని చ ప్రాసాదాన్ చ వీక్షమాణః అసంత్రస్తః చచార.

**ప్రతిపదార్థము :–** సః వానరః = ఆ హనుమ, రాక్షసానాం = రాక్షసులయొక్క, ఉద్యానాని చ = ఉద్యానవనములను, ప్రాసాదాంశ్చ = సౌధములను, వీక్షమాణః =

విలోకించుచున్నవాడై, అసంత్రస్తః = భయమును పొందనివాడై, గృహాత్ = ఒక యింటినుండి, గృహం = ఒక యింటికి, చచార = పరిభ్రమించెను.

**తాత్పర్యము :–** అప్పుడా హనుమ అచ్చటి రాక్షసులయొక్క సౌధములనెల్లను ఉద్యానవనములను పరికించుచు విసుగు చెందకుండ ఒక భవనమునుండి వేరొక భవనమునకు మిక్కిలి ఆసక్తితో పరిభ్రమించెను.

**శ్లో॥ అవప్లుత్య మహావేగః ప్రహస్తస్య నివేశనమ్ ।**
**అగ్నిం తత్ర వినిక్షిప్య శ్వసనేన సమో బలీ ॥ 8**

**శ్లో॥ తతోఽన్య త్పుప్లువే వేశ్మ ప్రహస్తస్య నివేశనమ్ ।**
**ముమోచ హనుమా నగ్నిం కాలానలశిఖోపమమ్ ॥ 9**

**పదచ్ఛేదము :–** అపప్లుత్య – మహావేగః – ప్రహస్తస్య – నివేశనమ్, అగ్నిం – తత్ర – వినిక్షిప్య – శ్వసనేన – సమః – బలీ, తతః – అన్యత్ – పుప్లువే – వేశ్మ – మహాపార్శ్వస్య – వీర్యవాన్ – ముమోచ – హనుమాన్ – అగ్నిం – కాలానల శిఖోపమమ్ ॥

**అన్వయక్రమము :–** మహావేగః (సః) ప్రహస్తస్య నివేశనమ్ అవప్లుత్య తత్ర అగ్నిం వినిక్షిప్య బలీ, వీర్యవాన్, శ్వసనేన సమః హనుమాన్ తతః అన్యత్ మహాపార్శ్వస్య వేశ్మ పుప్లువే; కాలానలశిఖోపమమ్ అగ్నిం (తత్ర) ముమోచ.

**ప్రతిపదార్థము :–** మహావేగః (సః) = గొప్పవేగవంతుడైన ఆ హనుమ, ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క, నివేశనం = భవనమును, అవప్ల్యుత్య = దుమికి, తత్ర = ఆ భవనముపై, అగ్నిం = అగ్నిని, వినిక్షిప్య = పడవేసి, బలీ = బలాఢ్యుడును, వీర్యవాన్ = పరాక్రమవంతుడును, శ్వసనేన = వాయుదేవునితో, సమః = సమానుడునగు, హనుమాన్ = హనుమ, తతః = అచ్చటినుండి, అన్యత్ = వేరైనట్టి, మహాపార్శ్వస్య = మహాపార్శ్వునియొక్క, వేశ్మ = భవనమును, పుప్లువే = ఉఱికెను, తత్ర = అచ్చట కాలానలశిఖోపమం = ప్రళయకాలాగ్నిజ్వాలవంటి, అగ్నిం = అగ్నిని, ముమోచ = విడిచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** ప్రహస్తస్య నివేశనం – ప్రధానమంత్రి యగుట వలన మొట్టమొదట ఆతనిని గౌరవించుట ఉచితమని అతని భవనమునకే హనుమ అగ్నిసంస్కారము చేసెనని భావము.

**తాత్పర్యము :–** అప్పుడా హనుమ మహావేగముతో పోయి ప్రహస్తుని భవనము మీదికి ఉఱికి దానికి నిప్పు అంటించి మహాబలపరాక్రమసంపన్నుడైన యాతడు వాయువేగముతో అటనుండి వెడలి మహాపార్శ్వుని ప్రాసాదము మీది కుఱికి అచ్చట ఆ మేడకు ప్రళయకాలమునందలి అగ్నిజ్వాలవంటి మంటను ముట్టించెను.

**శ్లో॥ వజ్రదంష్ట్రస్య చ తథా పుప్లువే స మహాకపిః ।**
**శుకస్య చ మహాతేజా స్సారణస్య చ ధీమతః ॥ 10**

**శ్లో॥ తథా చేంద్రజితో వేశ్మ దదాహ హరియూథపః ।**
**జంబుమాలే స్సుమాలేశ్చ దదాహ భవనం తతః ॥ 11**

**పదచ్ఛేదము :–** వజ్రదంష్ట్రస్య – చ – తథా – పుప్లువే – సః – మహాకపిః, శుకస్య – చ – మహాతేజాః – సారణస్య – చ – ధీమతః, తథా – చ – ఇంద్రజితః – వేశ్మ – దదాహ – హరియూథపః – జంబుమాలేః – సుమాలేః – చ – దదాహ – భవనం – తతః ॥

**అన్వయక్రమము :–** మహాతేజాః సః మహాకపిః తథా వజ్రదంష్ట్రస్య (వేశ్మ) చ పుప్లువే; హరియూథపః శుకస్య చ, ధీమతః సారణస్య చ, తథా ఇంద్రజితః వేశ్మ చ దదాహ. తతః జంబుమాలేః భవనం, సుమాలేః భవనం చ దదాహ.

**ప్రతిపదార్థము :–** మహాతేజాః = గొప్ప తేజశ్శాలి యగు, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, తథా = ఆ రీతిగా, వజ్రదంష్ట్ర = వజ్రదంష్ట్రునియొక్క, వేశ్మ చ = భవనమును, పుప్లువే = లంఘించెను. తథా = అట్లే, శుకస్య = శుకాసురుని యొక్క, వేశ్మ చ = భవనమును, ధీమతః = ప్రజ్ఞాశాలియైన, సారణస్య చ = సారణరాక్షసునియొక్క, వేశ్మ చ = భవనమును, దదాహ = దహించెను, తతః = అటుపిమ్మట, హరియూథపః = వానరశ్రేష్ఠుడైన హనుమ, జంబుమాలేః = జంబుమాలియొక్క, భవనం = భవనమును, సుమాలేః = సుమాలియొక్క, భవనం = భవనమును, దదాహ = దహించెను.

**తాత్పర్యము :–** అప్పుడా హనుమ వజ్రదంష్ట్రుని భవనము మీది కుఱికి అటనుండి శుకుని మందిరమునకును, అటనుండి బుద్ధిశాలియైన సారణుని భవనమునకును అట్లే ఇంద్రజిత్తుసౌధమును జేరి వానినెల్ల దహించెను. తేజశ్శాలియైన ఆ వానరయోధుడు అటుపిమ్మట జంబుమాలి భవనమును, సుమాలి భవనమును గూడ దహించెను.

శ్లో॥ రశ్మికేతోశ్చ భవనం సూర్యశత్రో స్తథైవ చ ।
హ్రస్వకర్ణస్య దంష్ట్రస్య రోమశస్య చ రక్షసః ॥ 12

శ్లో॥ యుద్ధోన్మత్తస్య మత్తస్య ధ్వజగ్రీవస్య రక్షసః ।
విద్యుజ్జిహ్వస్య ఘోరస్య తథా హస్తిముఖస్య చ ॥ 13

శ్లో॥ కరాలస్య విశాలస్య శోణితాక్షస్య చైవ హి ।
కుంభకర్ణస్య భవనం మకరాక్షస్య చైవ హి ॥ 14

శ్లో॥ యజ్ఞశత్రోశ్చ భవనం బ్రహ్మశత్రోస్తథైవ చ ।
నరాంతకస్య కుంభస్య నికుంభస్య దురాత్మనః ॥ 15

శ్లో॥ వర్జయిత్వా మహాతేజా విభీషణగృహం ప్రతి ।
క్రమమాణః క్రమేణైవ దదాహ హరిపుంగవః ॥ 16

**పదచ్ఛేదము: అన్వయక్రమము** :- మహాతేజాః సః హరిపుంగవః విభీషణగృహం ప్రతి వర్జయిత్వా, రశ్మికేతోః భవనం చ, తథైవ సూర్యశత్రోః హ్రస్వకర్ణస్య, దంష్ట్రస్య, రక్షసః రోమశస్య చ, యుద్ధోన్మత్తస్య, మత్తస్య, రక్షసః ధ్వజగ్రీవస్య, విద్యుజ్జిహ్వస్య, ఘోరస్య, తథా హస్తిముఖస్య చ, కరాళస్య, విశాలస్య, శోణితాక్షస్య, కుంభకర్ణస్య, మకరాక్షస్య చ భవనం చ, యజ్ఞశత్రోః, బ్రహ్మశత్రోః చ తథా ఏవ నరాంతకస్య, కుంభస్య, దురాత్మనః నికుంభస్య చ భవనం చ క్రమేణ క్రమమాణః దదాహ ॥

**ప్రతిపదార్థము** :- మహాతేజాః = గొప్పతేజశ్శాలియైన, సః హరిపుంగవః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, క్రమేణైవ = వరుసగనే, క్రమమాణః = ముందున కేగుచున్నవాడై, విభీషణగృహం = విభీషణుని భవనమును, ప్రతివర్జయిత్వా = విడిచిపెట్టి, రశ్మికేతోః = రశ్మికేతువుయొక్క, భవనం చ = భవనమును, తథైవ = అట్లే, సూర్యశత్రోః చ = సూర్యశత్రువుయొక్కయు, హ్రస్వకర్ణస్య = హ్రస్వకర్ణునియొక్కయు, దంష్ట్రస్య = దంష్ట్రునియొక్కయు, రక్షసః = రాక్షసుడైన, రోమశస్య చ = రోమశునియొక్కయు, యుద్ధోన్మత్తస్య = యుద్ధోన్మత్తుని యొక్కయు, మత్తస్య = మత్తుని యొక్కయు, రక్షసః = రాక్షసుడైన, ధ్వజగ్రీవస్య = ధ్వజ గ్రీవునియొక్కయు, విద్యుజ్జిహ్వస్య = విద్యుజ్జిహ్వునియొక్కయు, ఘోరస్య = ఘోరుని యొక్కయు, తథా = అట్లు, హస్తిముఖస్య చ = హస్తిముఖునియొక్కయు, కరాళస్య = కరాళునియొక్కయు, విశాలస్య = విశాలుని యొక్కయు, శోణితాక్షస్య = శోణితాక్షునియొక్కయు, కుంభకర్ణస్య = కుంభకర్ణునియొక్కయు, మకరాక్షస్య చ =

మకరాక్షునియొక్కయు, భవనం = భవనమును, యజ్ఞశత్రోః చ = యజ్ఞశత్రువు యొక్కయు, బ్రహ్మశత్రోః = బ్రహ్మశత్రువు యొక్కయు, నరాంతకస్య = నరాంతకుని యొక్కయు, కుంభస్య = కుంభునియొక్కయు, దురాత్మనః = దుర్మార్గుడైన, నికుంభస్య చ = నికుంభుని యొక్కయు, భవనం = భవనమును, దదాహ = దహించెను.

**తాత్పర్యము** :– మహాతేజశ్శాలియైన వానరశ్రేష్ఠుడగు ఆ హనుమ లంకానగర వీథులందు తిరుగుచు వరుసగ పోయి పోయి విభీషణుని భవనమును మాత్రము విడిచి రశ్మికేతువు, సూర్యశత్రువు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, రోమశుడు, యుద్ధోన్మత్తుడు, మత్తుడు, ధ్వజగ్రీవుడు, విద్యుజ్జిహ్వుడు, ఘోరాసురుడు, హస్తిముఖుడు, కరాళుడు, విశాలాసురుడు, శోణితాక్షుడు, కుంభకర్ణుడు, మకరాక్షుడు, యజ్ఞశత్రువు, బ్రహ్మశత్రువు, నరాంతకుడు, కుంభుడు, దుర్మార్గుడగు నికుంభుడు అనువారల భవనముల మీదికి వెడలి వాటినన్నిటిని దహించెను.

**శ్లో॥ తేషు తేషు మహార్హేషు భవనేషు మహాయశాః ।**
**గృహే ష్వృద్ధిమతా మృద్ధిం దదాహ స మహాకపిః ॥ 17**

**పదచ్ఛేదము** :– తేషు – తేషు – మహార్హేషు – భవనేషు – మహాయశాః – గృహేషు – ఋద్ధిమతాం – ఋద్ధిం – దదాహ – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– మహాయశాః సః మహాకపిః ఋద్ధిమతాం గృహేషు తేషు తేషు మహార్హేషు భవనేషు ఋద్ధిం దదాహ.

**ప్రతిపదార్థము** :– మహాయశాః = గొప్పకీర్తిశాలియైన, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడు, ఋద్ధిమతాం = గొప్ప సంపదలు గల్గినట్టి, (తేషాం = ఆ రక్కసుల యొక్క) గృహేషు = ఇండ్లయందును, తేషు తేషు = ఆ యా, మహార్హేషు = గొప్పవిలువైన, భవనేషు = భవనములందున్న, ఋద్ధిం = సంపదను, దదాహ = దహించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– 'ఋద్ధిమతాం ఋద్ధిం దదాహ' – అగ్నిదేవుడు పూర్వము రావణునికి భయపడియున్నవాడైనను నేడు మాత్రము సీతాదేవియొక్క తేజోబలసంబంధ విశేషముచేత సంశయము లేకుండగా రాక్షసభవనములను దహించెనని గ్రహించవలెను.

**తాత్పర్యము** :– మహాయశస్సంపన్నుడైన హనుమ అఖండైశ్వర్యములతో గూడిన ఆ

రాక్షసుల భవనములందలి సంపదలనెల్లను శ్రద్ధగా పరికించి వాటినెల్ల దహించెను.

**శ్లో॥ సర్వేషాం సమతిక్రమ్య రాక్షసేంద్రస్య వీర్యవాన్ ।**
**ఆససా దాథ లక్ష్మీవాన్ రావణస్య నివేశనమ్ ॥ 18**

**పదచ్ఛేదము :–** సర్వేషాం – సమతిక్రమ్య – రాక్షసేంద్రస్య – వీర్యవాన్, ఆససాద – అథ – లక్ష్మీవాన్ – రావణస్య – నివేశనమ్ ॥

**అన్వయక్రమము :–** వీర్యవాన్, లక్ష్మీవాన్, సః సర్వేషాం భవనాని సమతిక్రమ్య అథ రాక్షసేంద్రస్య రావణస్య నివేశనమ్ ఆససాద.

**ప్రతిపదార్థము :–** వీర్యవాన్ = పరాక్రమవంతుడును, లక్షీవాన్ = శోభాసంపన్నుడునగు, సః = ఆ హనుమ, సర్వేషాం = రాక్షసులందఱియొక్కయు, (భవనాని = భవనములను), సమతిక్రమ్య = దాటి, అథ = పిమ్మట, రాక్షసేంద్రస్య = రాక్షసరాజైన, రావణస్య = రావణునియొక్క, నివేశనం = భవనమును, ఆససాద = చేరుకొనెను.

**తాత్పర్యము :–** మహావీరుడైన హనుమ ఆ యా రాక్షసుల భవనము లన్నింటిని దాటివచ్చి చివరకు రాక్షసరాజైన రావణుని భవనము చేరుకొనెను.

**శ్లో॥ తత స్తస్మిన్ గృహే ముఖ్యే నానారత్నవిభూషితే ।**
**మేరుమందరసంకాశే సర్వమంగళశోభితే ॥ 19**

**శ్లో॥ ప్రదీప్త మగ్ని ముత్సృజ్య లాంగూలాగ్రే ప్రతిష్ఠితమ్ ।**
**ననాద హనుమా న్వీరో యుగాంతే జలదో యథా ॥ 20**

**పదచ్ఛేదము :–** తతః – తస్మిన్ – గృహే – ముఖ్యే – నానారత్నవిభూషితే, మేరు మందరసంకాశే – సర్వమంగళశోభితే, ప్రదీప్తమ్ – అగ్నిమ్ – ఉత్సృజ్య – లాంగూలాగ్రే – ప్రతిష్ఠితమ్ – ననాద – హనుమాన్ – వీరః – యుగాంతే – జలదః – యథా ॥

**అన్వయక్రమము :–** వీరః హనుమాన్ తతః నానారత్నవిభూషితే, మేరుమందరసంకాశే సర్వమంగళశోభితే, తస్మిన్ ముఖ్యే గృహే లాంగూలాగ్రే ప్రతిష్ఠితం ప్రదీప్తం అగ్నిమ్ ఉత్సృజ్య యుగాంతే జలదః యథా ననాద.

**ప్రతిపదార్థము :–** వీరః హనుమాన్ = వీరుడైన హనుమ, తతః = అటుపిమ్మట, నానారత్నవిభూషితే = వివిధములైన రత్నములచే అలంకరింపబడినదియును, మేరుమందరసంకాశే = మేరుపర్వతముతోడను మందరపర్వతముతోడను

సమానమైనట్టిదియును, సర్వమంగళశోభితే = సమస్త మంగళములతో ప్రకాశించుచున్నదియు నగు, ముఖ్యే = ప్రధానమైనట్టి, తస్మిన్ గృహే = ఆ భవనమునందు, లాంగూలాగ్రే = తోకచివరను, ప్రతిష్ఠితం = నిలుపబడియున్నట్టి, ప్రదీప్తం = జ్వలించుచున్నట్టి, అగ్నిం = అగ్నిని, ఉత్సృజ్య = విడిచి, యుగాంతే = ప్రళయకాలము నందలి, జలదః యథా = మేఘమువలె, ననాద = గర్జించెను.

**తాత్పర్యము** :– బహువిధ మణిగణములతో ప్రకాశించుచు మేరుమందర పర్వతములతో తులతూగుచున్నదై సర్వవిధమంగళ ద్రవ్యములతో శోభిల్లుచున్నట్టి ఆ రావణుని ప్రధాన భవనమునందు మహావీరుడైన హనుమ, తన లాంగూలాగ్రము నందు ప్రజ్వలించుచున్న అగ్నిని చక్కగ ప్రతిష్ఠించి అది రగులుకొనుచుండ తాను ప్రళయకాలమునందలి భయంకరమైన మేఘమువలె గర్జించుచుండెను.

**శ్లో॥ శ్వసనేన చ సంయోగా దతివేగో మహాబలః ।**
**కాలాగ్నిరివ సందీప్తః ప్రావర్ధత హుతాశనః ॥ 21**

**పదచ్ఛేదము** :– శ్వసనేన – చ – సంయోగాత్ – అతివేగః – మహాబలః, కాలాగ్నిః – ఇవ – సందీప్తః – ప్రావర్ధత – హుతాశనః ॥

**అన్వయక్రమము** :– అతివేగః మహాబలః హుతాశనః శ్వసనేన చ సంయోగాత్ సందీప్తః (సన్) కాలాగ్నిః ఇవ ప్రావర్ధత.

**ప్రతిపదార్థము** :– అతివేగః = మహావేగము గలవాడును, మహాబలః = అమిత బలాఢ్యుడును, అగు; (సః)హుతాశనః = (ఆ) అగ్ని, శ్వసనేన = వాయువుతోడి, సంయోగాత్ = కూడికవలన, సందీప్తః = మిక్కిలి ప్రజ్వలించినవాడై, కాలాగ్నిః ఇవ = ప్రళయకాలాగ్నివలె, ప్రావర్ధత = మిక్కిలి వృద్ధిచెందెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :–'శ్వసనేన చ సంయోగాత్' – సీతా నిశ్వాసవాయువులతో మిశ్రితమగుటచే వాయుదేవుడు గూడ నిర్భయముగా ఈ యగ్నికి సహాయము చేయుచున్నాడు అని గ్రహింపవలెను.

**గోవిందరాజీయము** :– వాయువును అగ్నియు గూడ రావణునకు భయపడియున్న వారైనప్పటికిని నేడు రాక్షసనాశనము త్వరలో గలుగుచున్నదని ధైర్యము వహించినవారై జంకులేకుండ విజృంభించిరని భావము.

**తాత్పర్యము :-** ఆ సమయమున మిత్రుడైన వాయువు వచ్చి తనతో గలిసియుండుటచే మహావేగమును మహాబలమును పొంది అగ్నిదేవుడు ప్రళయాగ్నివలె ప్రజ్వరిల్లుచు విజృంభింపసాగెను.

**శ్లో॥ ప్రవృద్ధ మగ్నిం పవన స్తేషు వేశ్మ స్వచారయత్ ।**
**అభూ చ్ఛ్వసనసంయోగా దతివేగో హుతాశనః ॥ 22**

**పదచ్ఛేదము :-** ప్రవృద్ధమ్ - అగ్నిం - పవనః - తేషు - వేశ్మసు - అచారయత్, అభూత్ - శ్వసనసంయోగాత్ - అతివేగః - హుతాశనః ॥

**అన్వయక్రమము :-** పవనః ప్రవృద్ధమ్ అగ్నిం తేషు వేశ్మసు అచారయత్, హుతాశనః శ్వసనసంయోగాత్ అతివేగః అభూత్.

**ప్రతిపదార్థము :-** పవనః = వాయువు, ప్రవృద్ధం = ప్రజ్వరిల్లినట్టి, అగ్నిం = అగ్నిని, తేషు వేశ్మసు = ఆ భవనములందు, అచారయత్ = ప్రసరింపజేసెను, హుతాశనః = అగ్ని, శ్వసనసంయోగాత్ = వాయువుయొక్క కూడిక వలన, అతివేగః = మహావేగసంపన్నుడు, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము :-** అట్లు ప్రజ్వరిల్లుచుండిన ఆ యగ్నికి వాయుదేవుడు తోడుగా నుండి రావణుని భవనముల నన్నిటను ప్రసరింపజేసెను. అట్లు ఆ యగ్ని వాయువు సహాయముతో అమితమైన వేగముతో పరుగిడుచుండెను.

**శ్లో॥ తాని కాంచనజాలాని ముక్తామణిమయాని చ ।**
**భవనాని వ్యశీర్యంత రత్నవంతి మహాంతి చ ॥ 23**

**పదచ్ఛేదము :-** తాని - కాంచనజాలాని - ముక్తామణిమయాని - చ, భవనాని - వ్యశీర్యంత - రత్నవంతి - మహాంతి - చ ॥

**అన్వయక్రమము :-** కాంచనజాలాని ముక్తామణిమయాని రత్నవంతి మహాంతి తాని భవనాని వ్యశీర్యంత.

**ప్రతిపదార్థము :-** కాంచనజాలాని = బంగారు జాలరులు గల్గినవియును, ముక్తామణిమయాని చ = ముత్యములతో నిండినవియును, రత్నవంతి = రత్నములు గలవియును, మహాంతి చ = గొప్పవైనవియునగు, తాని = ఆ, భవనాని = భవనములు, వ్యశీర్యంత = శిథిలములైపోయెను.

**తాత్పర్యము :-** బంగారు గొలుసులతోను, మంచిముత్యములతోను, వివిధ

రత్నములతోను నిర్మింపబడిన ఆ యద్భుతమైన సౌధములన్నియును దహింపబడి, కరిగి నేలగూలినవి.

**శ్లో॥ తాని భగ్నవిమానాని నిపేతు ర్ధరణీతలే ।**
**భవనానీవ సిద్ధానా మంబరా త్పుణ్యసంక్షయే ॥ 24**

**పదచ్ఛేదము** :- తాని - భగ్నవిమానాని - నిపేతుః - ధరణీతలే, భవనాని - ఇవ - సిద్ధానామ్ - అంబరాత్ - పుణ్యసంక్షయే ॥

**అన్వయక్రమము** :- పుణ్యసంక్షయే అంబరాత్ సిద్ధానాం భవనాని ఇవ, భగ్నవిమానాని తాని భవనాని ధరణీతలే నిపేతుః.

**ప్రతిపదార్థము** :- పుణ్యసంక్షయే = పుణ్యముయొక్క క్షీణదశయందు, అంబరాత్ = ఆకాశమునుండి, సిద్ధానాం = సిద్ధులయొక్క, భవనాని ఇవ = భవనములవలె, భగ్నవిమానాని = విరిగిపోయిన అంతస్తులుగల, తాని భవనాని = ఆ రావణ భవనములు, ధరణీతలే = భూతలమునందు, నిపేతుః = పడిపోయినవి.

**తాత్పర్యము** :- తమ పుణ్యము నశించిపోయినపుడు సిద్ధులయొక్క భవనములు ఆకాశమునుండి పడిపోయి నట్లుండగ ఆ రావణుని భవనముల మీది అంతస్తులు ఒక్కటొక్కటిగ విరిగి పడుచుండగ సమూలముగా నేలపై కూలిపోయినవి.

**శ్లో॥ సంజజ్ఞే తుముల శ్శబ్దో రాక్షసానాం ప్రధావతామ్ ।**
**స్వగృహస్య పరిత్రాణే భగ్నోత్సాహోర్జితశ్రియామ్ ॥ 25**

**పదచ్ఛేదము** :- సంజజ్ఞే - తుములః - శబ్దః - రాక్షసానాం - ప్రధావతామ్, స్వగృహస్య - పరిత్రాణే - భగ్నోత్సాహోర్జితశ్రియామ్ ॥

**అన్వయక్రమము** :- స్వగృహస్య పరిత్రాణే భగ్నోత్సాహోర్జితశ్రియాం ప్రధావతాం రాక్షసానాం తుములః శబ్దః సంజజ్ఞే.

**ప్రతిపదార్థము** :- స్వగృహస్య = తమ గృహముయొక్క, పరిత్రాణే = కాపాడుకొనుట యందు, భగ్నోత్సాహోర్జితశ్రియామ్ = నశించిన ఉత్సాహమును, గొప్పవైన సంపదలను గల్గినట్టి, రాక్షసానాం = రాక్షసులు, ప్రధావతాం (సతాం) = పరుగులిడుచుండగా, తుములః శబ్దః = కోలాహలధ్వని, సంజజ్ఞే = ఉప్పతిల్లినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రామాయణశిరోమణి** :- స్వే స్వే గృహపరిత్రాణే - భగ్నోత్సాహోర్జితశ్రియామ్ -

తమ గృహములను కాపాడుకొనుటకు శక్తిలేనివారును తమ సంపదలన్నింటిపై ఆశవదులుకొన్నవారునుగా ఆ రాక్షసులు కాన్పించుచున్నారని పాఠాంతరము.

**తాత్పర్యము :–** అచటి రాక్షసులు తమ తమ భవనములను దక్కించుకొను ఆశ గోల్పోయినవారై తమ ఐశ్వర్యములపై ఆశవదులుకొని నలువైపులకును పరుగెత్తుచుండగా వారి హాహాకారములవలన పెద్ద సంకులధ్వని యేర్పడెను.

**శ్లో॥ నూన మేషోఽగ్ని రాయాతః కపిరూపేణ హా ఇతి ।**
**క్రందంత్య స్సహసా పేతుస్స్తనంధయధరాస్స్త్రియః ॥ 26**

**పదచ్ఛేదము :–** నూనం – ఏషః – అగ్నిః – ఆయాతః – కపిరూపేణ – హా – ఇతి, క్రందంత్యః – సహసా – పేతుః – స్తనంధయధరాః – స్త్రియః ॥

**అన్వయక్రమము :–** హా నూనం కపిరూపేణ ఏషః అగ్నిః ఆయాతః ఇతి స్తనంధయధరాః స్త్రియః క్రందంత్యః సహసా పేతుః.

**ప్రతిపదార్థము :–** హా! = అయ్యో! నూనం = నిశ్చయముగా, కపిరూపేణ = వానర రూపముతో, ఏషః అగ్నిః = ఈ యగ్ని, ఆయాతః = వచ్చినది, ఇతి = అని, స్తనంధయధరాః = చన్నుగుడుచు బిడ్డలను ధరించిన, స్త్రియః = స్త్రీలు, క్రందంత్యః = ఆక్రోశించుచున్నవారై, సహసా = వెంటనే, పేతుః = పడిరి.

**తాత్పర్యము :–** అయ్యో! ఇప్పుడిచ్చటకు నిశ్చయముగా భీకరుడైనట్టి అగ్నిహోత్రుడే ఈ వానరరూపముతో నిట్లు వచ్చినాడు అని ఆక్రోశించుచు స్త్రీలు పాలుత్రాగుచున్న చంటిబిడ్డల నెత్తుకొని భీతితో పరువిడుచు త్రోవగానక ఆ మంటలో పడిరి.

**శ్లో॥ కాశ్చి దగ్నిపరీతాంగ్యో హర్మ్యేభ్యో ముక్తమూర్ధజాః ।**
**పతంత్యో రేజిరేఽభ్రేభ్య స్సౌదామన్య ఇ వాంబరాత్ ॥ 27**

**పదచ్ఛేదము :–** కాః – చిత్ – అగ్నిపరీతాంగ్యః – హర్మ్యేభ్యః – ముక్తమూర్ధజాః – పతంత్యః – రేజిరే – అభ్రేభ్యః – సౌదామన్యః – ఇవ – అంబరాత్ ॥

**అన్వయక్రమము :–** అగ్నిపరీతాంగ్యః ముక్తమూర్ధజాః కాశ్చిత్ హర్మ్యేభ్యః పతంత్యః అంబరాత్ అభ్రేభ్యః (పతంత్యః) సౌదామన్యః ఇవ రేజిరే.

**ప్రతిపదార్థము :–** అగ్నిపరీతాంగ్యః = అగ్నిచే చుట్టుకొనబడిన శరీరములు గలవారును, ముగ్రమూర్ధజాః = విడివడినట్టి కేశములు గలవారునగు, కాశ్చిత్ = కొంతమంది స్త్రీలు, హర్మ్యేభ్యః = సౌధములనుండి, పతంత్యః = పడుచున్నవారై, అంబరాత్ =

ఆకాశమునుండి, అభ్రేభ్యః = మేఘములనుండి (పతంత్యః = పడుచున్నట్టి) సౌదామన్యః ఇవ = మెఱపుతీగలవలె, రేజిరే = ప్రకాశించిరి.

**తాత్పర్యము** :– తమ ఒడలంతయును అగ్నిజ్వాలలు చుట్టుముట్టుచుండ, చెదరిపోయిన జుట్టుతో మేడలనుండి క్రిందికి పడుచున్న స్త్రీలను చూడగా ఆకసమునందలి మేఘములనుండి క్రిందికి ప్రసరించుచున్న మెఱపుతీగలవలె గానవచ్చిరి.

**శ్లో॥ వజ్రవిద్రుమవైదూర్య ముక్తారజతసంహితాన్ ।**
**విచిత్రాన్ భవనాన్ ధాతూన్ స్యందమానాన్ దదర్శ సః ॥ 28**

**పదచ్ఛేదము** :– వజ్రవిద్రుమవైదూర్యముక్తారజతసంహితాన్, విచిత్రాన్ – భవనాన్ – ధాతూన్ – స్యందమానాన్ – దదర్శ – సః ॥

**అన్వయక్రమము** :– వజ్రవిద్రుమవైదూర్యముక్తారజతసంహితాన్, విచిత్రాన్ ధాతూన్ స్యందమానాన్ భవనాన్ సః దదర్శ.

**ప్రతిపదార్థము** :– వజ్రవిద్రుమవైదూర్యముక్తారజతసంహితాన్ = వజ్రములతోడను పవడములతోడను, వైడూర్యములతోడను మంచిముత్యములతోడను వెండితోడను మిశ్రితమైనట్టి, విచిత్రాన్ = విచిత్రములైనట్టి, ధాతూన్ = గైరికాది ధాతువులను, స్యందమానాన్ = స్రవించుచున్నట్టి, భవనాన్ = భవనములను, సః = ఆ హనుమ, దదర్శ = చూచెను.

**తాత్పర్యము** :– అప్పుడు హనుమంతు డచ్చట ఆ భవనములనుండి వజ్రములతోను పవడములతోను, వైడూర్యములతోడను, మంచి ముత్యములతోను, వెండితోను కలసి విచిత్రముగ రంగురంగుల ధాతుద్రవములు స్రవించుచుండుట గాంచెను.

**శ్లో॥ నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం తృణానాం చ యథా తథా,**
**హనుమాన్ రాక్షసేంద్రాణాం వధే కించి న్న తృప్యతి ।**
**న హనూమద్విశస్తానాం రాక్షసానాం వసుంధరా ॥ 29**

**పదచ్ఛేదము** :– న – అగ్నిః – తృప్యతి – కాష్ఠానాం – తృణానాం – చ – యథా – తథా – హనుమాన్ – రాక్షసేంద్రాణాం – వధే – కించిత్ – న – తృప్యతి – న – హనూమద్విశస్తానాం – రాక్షసానాం – వసుంధరా ॥

**అన్వయక్రమము** :– యథా అగ్నిః కాష్ఠానాం తృణానాం చ న తృప్యతి, తథా రాక్షసేంద్రాణాం వధే హనుమాన్ కించిత్ న తృప్యతి. హనూమద్విశస్తానాం రాక్షసానాం వసుంధరా (అపి) న తృప్యతి.

**ప్రతిపదార్థము** :– యథా = ఏ రీతిగా, అగ్నిః = అగ్ని, కాష్ఠానాం = కట్టెలకును, తృణానాం = తృణములకును, న తృప్యతి = తృప్తినొందదో, తథా = అట్లు, రాక్షసేంద్రాణాం = రాక్షసశ్రేష్ఠులయొక్క, వధే = మారణమునందు, హనుమాన్ = హనుమ, కించిత్ = కొంచెమైనను, న తృప్యతి = తృప్తినొందుటలేదు, హనూమద్విశస్తానాం = హనుమంతునిచే వధింపబడినట్టి, రాక్షసానాం = రాక్షసులకు, వసుంధరా అపి = భూమిగూడ, న తృప్యతి = తృప్తిచెందుటలేదు.

**సూచన**:– ఇచ్చటి ఈ శ్లోకపాఠము బొంబాయి ప్రతినుండి గ్రహించబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– దక్షిణాది ప్రతుల పాఠము "నాగ్నిస్తృప్యతి కాష్ఠానాం తృణానాం హరియూథపః, నాగ్నిర్నాపి విశస్తానాం రాక్షసానాం వసుంధరా", కట్టెలకును తృణములకును అగ్ని తృప్తి నొందదు. అట్లే హనుమ తాను జ్వలింపచేయుచున్న అగ్నికిని తృప్తి నొందుటలేదు. అట్లే భూమి అప్పుడు చంపబడిన రాక్షసులకు తృప్తిపడుటలేదు.

**తాత్పర్యము** :– ఏ విధముగ అగ్ని కట్టెలచేతను తృణములచేతను తృప్తినొందుట యుండదో అట్లే హనుమ యానాడు చనిపోవుచున్న రాక్షసులచే తృప్తినొంద డాయెను. అట్లే భూమిగూడ హనుమంతునిచే తనపై కూలుచున్నట్టి రాక్షసులకు తృప్తినొంద దాయెను.

**శ్లో॥ క్వచి త్కింశుకసంకాశాః క్వచి చ్ఛాల్మలిసన్నిభాః ।**
**క్వచి త్కుంకుమసంకాశాః శిఖా వహ్నే శ్చకాశిరే ॥ 30**

**పదచ్ఛేదము** :– క్వచిత్ – కింశుకసంకాశాః – క్వచిత్ – శాల్మలిసన్నిభాః – క్వచిత్ – కుంకుమసంకాశాః – శిఖాః – వహ్నేః – చకాశిరే ॥

**అన్వయక్రమము** :– వహ్నేః శిఖాః క్వచిత్ కింశుకసంకాశాః క్వచిత్ శాల్మలిసన్నిభాః, క్వచిత్ కుంకుమసంకాశాః (సత్యః) చకాశిరే.

**ప్రతిపదార్థము** :– వహ్నేః = అగ్నియొక్క, శిఖాః = జ్వాలలు, క్వచిత్ = ఒకచోట, కింశుకసంకాశాః = మోదుగుపువ్వులను బోలినవిగను, క్వచిత్ = ఒకచోట, శాల్మలిసన్నిభాః = బూరుగుపువ్వులను బోలినవిగను, క్వచిత్ = ఒకచోట, కుంకుమసంకాశాః = కుంకుమపువ్వులను బోలునవిగను, (సత్యః = ఉన్నవై) చకాశిరే = ప్రకాశించినవి.

**తాత్పర్యము :–** లంకానగరభవనములందు చెలరేగిన అగ్నిజ్వాలలు అప్పుడు కొన్నిచోట్ల మోదుగ పువ్వులవలెను, కొన్నిచోట్ల బూరుగుపువ్వులవలెను, కొన్నిచోట్ల కుంకుమపువ్వులవలెను పలువిధములగు వన్నెలతో గాన్పించుచుండెను.

**శ్లో॥ హనూమతా వేగవతా వానరేణ మహాత్మనా ।**
**లంకాపురం ప్రదగ్ధం త ద్రుద్రేణ త్రిపురం యథా ॥ 31**

**పదచ్ఛేదము :–** హనూమతా – వేగవతా – వానరేణ – మహాత్మనా – లంకాపురం – ప్రదగ్ధం – తత్ – రుద్రేణ – త్రిపురం – యథా ॥

**అన్వయక్రమము :–** మహాత్మనా వేగవతా వానరేణ హనూమతా, రుద్రేణ తత్ త్రిపురం యథా లంకాపురం ప్రదగ్ధమ్.

**ప్రతిపదార్థము :–** మహాత్మనా = మహనీయుడైన, వేగవతా = వేగముగల, వానరేణ = కపిశ్రేష్ఠుడగు, హనూమతా = హనుమచే, రుద్రేణ = ఈశ్వరునిచే, తత్ త్రిపురం యథా = ఆ త్రిపురసమూహమువలె, లంకాపురం = లంకానగరము, ప్రదగ్ధం = మిక్కిలిగా దగ్ధము చేయబడినది.

**తాత్పర్యము :–** మహనీయుడైన హనుమ మహావేగమును వహించినవాడై ఆనాడు రుద్రుడు త్రిపురములను భస్మముచేసినట్లు లంకానగరమును దగ్ధపటలము కావించెను.

**శ్లో॥ తతస్తు లంకాపురపర్వతాగ్రే**
**సముత్థితో భీమపరాక్రమోఽగ్నిః ।**
**ప్రసార్య చూడావలయం ప్రదీప్తో**
**హనూమతా వేగవతా విసృష్టః ॥ 32**

**పదచ్ఛేదము :–** తతః – తు – లంకాపురపర్వతాగ్రే – సముత్థితః – భీమపరాక్రమః – అగ్నిః – ప్రసార్య – చూడావలయం – ప్రదీప్తః – హనూమతా – వేగవతా – విసృష్టః ॥

**అన్వయక్రమము :–** తతః వేగవతా హనూమతా విసృష్టః భీమపరాక్రమః అగ్నిః లంకాపురపర్వతాగ్రే చూడావలయం ప్రసార్య ప్రదీప్తః సన్ సముత్థితః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, వేగవతా = గొప్పవేగము గల్గినట్టి, హనూమతా = హనుమంతునిచే, విసృష్టః = విడువబడిన, భీమపరాక్రమః = భీకరపరాక్రమము గల్గినట్టి, అగ్నిః = అగ్ని, లంకాపురపర్వతాగ్రే = లంకానగరముననున్న పర్వతాగ్రమున, చూడావలయం = జ్వాలల వలయమును, ప్రసార్య = ప్రసరింపజేసి, ప్రదీప్తః సన్ =

మిక్కిలి జ్వలించినదై, సముత్థితః = విజృంభించినది.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమ మహావేగసంపన్నుడై అగ్నిని రగుల్కొల్పుచుండగా ఆ యగ్నిహోత్రుడు త్రికూట పర్వత శిఖరముపై భీమపరాక్రమముతో జ్వాలామాలలను ప్రసరింపచేయుచు విజృంభించి ప్రజ్వలింపసాగెను.

**శ్లో॥ యుగాంత కాలానలతుల్యవేగః**
**సమారుతోఽగ్ని ర్వవృధే దివిస్పృక్ ।**
**విధూమరశ్మి ర్భవనేషు సక్తో**
**రక్షశ్శరీరాజ్యసమర్పితార్చిః ॥ 33**

**పదచ్ఛేదము** :- యుగాంతకాలానలతుల్యవేగః - సమారుతః - అగ్నిః - వవృధే - దివిస్పృక్, విధూమరశ్మిః - భవనేషు - సక్తః - రక్షశ్శరీరాజ్యసమర్పితార్చిః ॥

**అన్వయక్రమము** :- సమారుతః (సః) అగ్నిః యుగాంతకాలానలతుల్యవేగః దివిస్పృక్ భవనేషు సక్తః రక్షశ్శరీరాజ్యసమర్పితార్చిః విధూమరశ్మిః (సన్) వవృధే.

**ప్రతిపదార్థము** :- సమారుతః = వాయువుతోకూడినట్టి, (సః) అగ్నిః = ఆ యగ్ని, యుగాంతకాలానలతుల్యవేగః = యుగావసానమునందలి ప్రళయకాలాగ్నితో సమానమైన వేగముగలదై, దివిస్పృక్ = ఆకసమునంటుచున్నదై, భవనేషు = భవనములందు, సక్తః = లగ్నమైనదై, రక్షశ్శరీరాజ్యసమర్పితార్చిః = రాక్షసుల శరీరములనెడు నేయిచే ఏర్పడిన జ్వాలలు గలదై, విధూమరశ్మిః = పొగలేనట్టి మంటగలదై, వవృధే = విజృంభించెను.

**తాత్పర్యము** :- అప్పుడు వాయుదేవుని సహాయము నొందిన ఆ యగ్నిహోత్రుడు ప్రళయకాలమునందలి అగ్నితో సమానమైన విజృంభణముగలవాడై రాక్షసుల భవనములందు ప్రవేశించి యచ్చటి రాక్షసుల దేహములనెడి ఆజ్యముచే వృద్ధినొందిన జ్వాలలు గలవాడై పొగలేని దీప్తితో ఆకసము నంటుచు చూచుచుండగనే భీకరరూపముతో పెరిగిపోవుచుండెను.

**శ్లో॥ ఆదిత్యకోటీసదృశ స్సుతేజా**
**లంకాం సమస్తాం పరివార్య తిష్ఠన్ ।**
**శబ్దైరనేకై రశనిప్రరూఢై**
**ర్భింద న్నివాండం ప్రబభౌ మహాగ్నిః ॥ 34**

**పదచ్ఛేదము :–** ఆదిత్యకోటీసదృశః – సుతేజాః – లంకాం – సమస్తాం – పరివార్య – తిష్ఠన్ – శబ్దైః – అనేకైః – అశనిప్రరూఢైః – భిందన్ – ఇవ – అండం – ప్రబభౌ – మహాగ్నిః ॥

**అన్వయక్రమము :–** (సః) మహాగ్నిః ఆదిత్యకోటీసదృశః సుతేజాః సమస్తాం లంకాం పరివార్య తిష్ఠన్ అశనిప్రరూఢైః అనేకైః శబ్దైః అండం భిందన్ ఇవ ప్రబభౌ.

**ప్రతిపదార్థము :–** (సః) మహాగ్నిః = (ఆ)మహాగ్నిహోత్రము, ఆదిత్యకోటీసదృశః = కోటిసూర్యులతో సమానమైనదై, సుతేజాః = గొప్పతేజస్సుగల్గినదై, సమస్తాం = సంపూర్ణమైన, లంకాం = లంకానగరమును, పరివార్య = చుట్టుముట్టి, తిష్ఠన్ = నిలచినదై, అశనిప్రరూఢైః = పిడుగులవలె నుప్పతిల్లుచున్న, అనేకైః = బహువిధములైన, శబ్దైః = ధ్వనులతో, అండం = బ్రహ్మాండమును, భిందన్ ఇవ = బ్రద్దలుకొట్టుచున్నట్లుగా, ప్రబభౌ = మిక్కిలి ప్రకాశించెను.

**తాత్పర్యము :–** అట్లు చెలరేగిన ఆ యగ్నిహోత్రము కోటిసూర్యులతో సమానముగ గొప్పతేజస్సు గలిగి లంకనంతను చుట్టుముట్టి పిడుగుపాటులవలె భీకరమైనట్టి బహువిధములైన ధ్వనులతో బ్రహ్మాండమును బ్రద్దలుగొట్టుచున్నట్టి ప్రళయకాలాగ్నివలె ప్రజ్వరిల్లెను.

**శ్లో॥ త త్రాంబరా దగ్ని రతిప్రవృద్ధో**
**రూక్షప్రభః కింశుకపుష్పచూడః ।**
**నిర్వాణధూమాకులరాజయశ్చ**
**నీలోత్పలాభాః ప్రచకాశిరేఽభ్రాః ॥ 35**

**పదచ్ఛేదము :–** తత్ర – అంబరాత్ – అగ్నిః – అతిప్రవృద్ధః – రూక్షప్రభః – కింశుక పుష్పచూడః, నిర్వాణధూమాకులరాజయః – చ – నీలోత్పలాభాః – ప్రచకాశిరే – అభ్రాః ॥

**అన్వయక్రమము :–** తత్ర అగ్నిః రూక్షప్రభః కింశుకపుష్పచూడః అంబరాత్ అతిప్రవృద్ధః అభ్రాః చ నిర్వాణధూమాకులరాజయః నీలోత్పలాభాః (సంతః) ప్రచకాశిరే.

**ప్రతిపదార్థము :–** తత్ర = అచ్చట, అగ్నిః = అగ్ని, రూక్షప్రభః = కఠోరమైన ప్రకాశముగలదై, కింశుకపుష్పచూడః = మోదుగుపువ్వులవంటి జ్వాలలుగలదై, అంబరాత్ = ఆకాశము వఱకును, అతిప్రవృద్ధః = మిక్కిలి పెరిగినదయ్యెను. అభ్రాః చ = మేఘములును, నిర్వాణధూమాకులరాజయః = ఆరిన అగ్నియొక్క

ధూమములయొక్క చెదరిన సమూహములుగలవై, నీలోత్పలాభాః (సంతః) = నల్లకలువలవంటి కాంతులుగల్గినట్టివగుచు, ప్రచకాశిరే = ప్రకాశించినవి.

**తాత్పర్యము** :- అప్పుడచ్చటి మహాగ్ని భీకరమైన కాంతులతో మోదుగపువ్వులను బోలినట్టి జ్వాలలతో ఆకసము వఱకును పెరిగిపోవుచుండెను. అచటి మేఘములు అంతవరకును మండి చల్లారిన భవనములనుండి వచ్చినట్టి నల్లనిపొగలు చెదరి తనపై నలముకొనుటచే నల్లకలువల వంటి కాంతులుగలవై ప్రకాశించినవి.

**శ్లో॥ వజ్రీ మహేంద్ర స్త్రిదశేశ్వరో వా**
**సాక్షా ద్యమో వా వరుణో ఽనిలో వా ।**
**రుద్రోఽగ్ని రర్కో ధనదశ్చ సోమో**
**న వానరో ఽయం స్వయమేవ కాలః ॥ 36**

**పదచ్ఛేదము** :- వజ్రీ - మహేంద్రః - త్రిదశేశ్వరః - వా - సాక్షాత్ - యమః - వా - వరుణః - అనిలః - వా - రుద్రః - అగ్నిః - అర్కః - ధనదః - చ - సోమః - న - వానరః - అయం - స్వయమ్ - ఏవ - కాలః ॥

**అన్వయక్రమము** :- అయం త్రిదశేశ్వరః మహేంద్రః వజ్రీ వా, సాక్షాత్ యమః వా వరుణః వా అనిలః వా రుద్రః అగ్నిః అర్కః ధనదః సోమః వా భవేత్ (అయం) వానరః న, స్వయం కాలః ఏవ.

**ప్రతిపదార్థము** :- అయం = ఈతడు, త్రిదశేశ్వరః = దేవతలకు ప్రభువైనట్టి, వజ్రీ = వజ్రపాణియగు, మహేంద్రః వా = మహేంద్రుడో, సాక్షాత్ = ప్రత్యక్షముగా, యమః వా = యముడో, వరుణః వా = వరుణుడో, అనిలః వా = వాయుదేవుడో, రుద్రః = రుద్రుడో, అగ్నిః = అగ్నిదేవుడో, అర్కః = సూర్యుడో, ధనదః = కుబేరుడో, సోమః వా = చంద్రుడో, భవేత్ = అయియుండును. అయం = ఈతడు, వానరః = వానరుడు, న = కాడు, స్వయం = స్వయముగా, కాలః ఏవ = కాలుడే.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'రుద్రః అగ్నిః' అనుటకు బదులుగా 'రౌద్రః అగ్నిః' అని పాఠాంతరము ఈ పాఠమునకు రుద్రునియొక్క మూడవనేత్రమునకు సంబంధించిన అగ్ని యని అర్థము.

**తాత్పర్యము** :- మహాభయంకరుడైన ఈతడు దేవతలెల్లరకును ప్రభువైన వజ్రపాణియగు ఇంద్రుడుగాని లేక సాక్షాత్ యమధర్మరాజుగాని వరుణుడుగాని వాయుదేవుడుగాని

మహేశ్వరుడుగాని అగ్నిహోత్రుడుగాని భాస్కరుడు గాని కుబేరుడుగాని చంద్రుడుగాని అయియుండవలెను. అంతియేగాని వానరమాత్రుడు గాదు. ఆలోచించి చూడగా ఈతడు సాక్షాత్ మృత్యుదేవతయే యైయుండును.

**శ్లో॥ కిం బ్రహ్మణ స్సర్వపితామహస్య**
**సర్వస్య ధాతు శ్చతురాననస్య ।**
**ఇ హాగతో వానరరూపధారీ**
**రక్షోపసంహారకరః ప్రకోపః ॥ 37**

**పదచ్ఛేదము** :– కిం – బ్రహ్మణః – సర్వపితామహస్య – సర్వస్య – ధాతుః – చతురాననస్య – ఇహ – ఆగతః – వానరరూపధారీ – రక్షోపసంహారకరః – ప్రకోపః ॥

**అన్వయక్రమము** :– సర్వపితామహస్య, సర్వస్య ధాతుః, చతురాననస్య బ్రహ్మణః ప్రకోపః రక్షోపసంహారకరః వానరరూపధారీ (సన్) ఇహ ఆగతః కిం?

**ప్రతిపదార్థము** :– సర్వపితామహస్య = ఎల్లరకును పితామహుడైనవాడును, సర్వస్య = సమస్తమునకును, ధాతుః = ధరించినవాడును, చతురాననస్య = నాలుగుముఖములు గలవాడునగు, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, ప్రకోపః = తీక్ష్ణమైన క్రోధము, రక్షోపసంహారకరః = రాక్షసులయొక్క వినాశమును గావించునదై, వానరరూపధారీ (సన్) = వానరరూపమును ధరించినదై, ఇహ = ఇచ్చుటకు, ఆగతః కిం = వచ్చినదా యేమి?

**తాత్పర్యము** :– సమస్తప్రాణులకును మూలమైనవాడును సమస్తసృష్టికి కర్తయైనవాడును చతుర్ముఖుడు నగు బ్రహ్మదేవునకు గల్గినట్టి తీక్ష్ణమైన క్రోధమే ఈనా డీ రాక్షససంహారము గావించుచున్నట్టి ఈ వానరరూపమును ధరించినదై ఇప్పు డిట్లు ఇచ్చుటకు వచ్చినదేమో!

**శ్లో॥ కిం వైష్ణవం వా కపిరూపమేత్య**
**రక్షోవినాశాయ పరం సుతేజః ।**
**అనంత మవ్యక్త మచింత్యమేకం**
**స్వమాయయా సాంప్రత మాగతం వా? ॥ 38**

**పదచ్ఛేదము** :– కిం – వైష్ణవం – వా – కపిరూపమ్ – ఏత్య – రక్షోవినాశాయ – పరం – సుతేజః, అనంతమ్ – అవ్యక్తమ్ – అచింత్యమ్ – ఏకం – స్వమాయయా – సాంప్రతమ్ – ఆగతం – వా ॥

**అన్వయక్రమము** :– అనంతం, అవ్యక్తం, అచింత్యం, ఏకం పరం వైష్ణవం సుతేజః వా రక్షోవినాశాయ స్వమాయయా సాంప్రతమ్ ఆగతం కిమ్ వా?

**ప్రతిపదార్థము** :– అనంతం = అంతములేనిదియును, అవ్యక్తం = అగోచరమైనదియును, అచింత్యం = ఊహింపరానిదియును, ఏకం = అద్వితీయ మైనదియును, పరం = ఉత్కృష్టమైనదియునగు, వైష్ణవం = విష్ణువునకు సంబంధించినట్టి, సుతేజః వా = ఉత్తమమైన తేజస్సే, రక్షోవినాశాయ = రాక్షసులయొక్క సంహారముకొఱకు, స్వమాయయా = తనయొక్క మాయచే, కపిరూపం = వానరరూపమును, ఏత్య = పొంది, సాంప్రతం = ఇప్పుడు, ఆగతం కిం వా = వచ్చినదో ఏమో!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :– 'అనంతం' దేశకాలవస్తు రూపమైన పరిమితిలేనట్టిది.

**గోవిందరాజీయము** :– 'అవ్యక్తం' – కంటికి కానరానిది. అచింత్యం – మనస్సునకు కూడా అందనిది. వైష్ణవం తేజః = విష్ణుశరీరాంతర్నిహితమైనట్టి తేజస్సు, స్వమాయయా – అసాధారణమైన తన ఆశ్చర్యశక్తిచేత.

**వాసుదాసస్వామి** :– అనంతము – కాలపరిచ్ఛేదము, వస్తుపరిచ్ఛేదము, దేశపరిచ్ఛేదము లేనిది.

అవ్యక్తము – కన్ను మొదలగు బాహ్యేంద్రియములకు గోచరింపనిది, ఏకము – అట్టిది రెండవది లేనిది, అచింత్యము – మనస్సుచే ఆలోచించి తెలిసికొన సాధ్యము గానిది. వైష్ణవం సుతేజః – విష్ణువునందున్న పూజ్యమగు పరమశక్తి. విష్ణుమూర్తియనెడి తేజస్సు –

"వా స్యాద్వికల్పోపమయో రేవార్థే చ సముచ్చయే"యని విశ్వనిఘంటువు.

దీనికి తరువాత మఱియొకటి దీనిని నిషేధించి చెప్పకుండుటచే నిది యే నిశ్చయమని గ్రహింపనగును.

**తాత్పర్యము** :– దేశకాలవస్తురూపమైన పరిమితి లేక అనంతమై అగోచరమై అనూహ్యమై అద్వితీయమై విలసిల్లునట్టి విష్ణుదేవుని అద్భుతతేజస్సు రక్షోవినాశముకొఱకై తన మాయావిలాసముచే ఇప్పు డీరీతిగ వానరరూపమును స్వీకరించివచ్చినదో యేమో!

**శ్లో॥ ఇ త్యేవ మూచు ర్బహవో విశిష్టా**
**రక్షోగణా స్తత్ర సమేత్య సర్వే ।**
**సప్రాణిసంఘాం సగృహాం సవృక్షాం**
**దగ్ధాం పురీం తాం సహసా సమీక్ష్య ॥ 39**

**పదచ్ఛేదము :–** ఇతి – ఏవమ్ – ఊచుః – బహవః – విశిష్టాః – రక్షోగణాః – తత్ర – సమేత్య – సర్వే – సప్రాణిసంఘాం – సగృహాం – సవృక్షాం – దగ్ధాం – పురీం – తాం – సహసా – సమీక్ష్య ॥

**అన్వయక్రమము :–** సప్రాణిసంఘాం సగృహాం సవృక్షాం సహసా దగ్ధాం తాం పురీం సమీక్ష్య బహవః విశిష్టాః రక్షోగణాః తత్ర సమేత్య సర్వే ఇతి ఏవం ఊచుః.

**ప్రతిపదార్థము :–** సప్రాణిసంఘాం = ప్రాణిసమూహములతో గూడినదియును, సగృహాం = భవనములతో గూడినదియును, సవృక్షాం = వృక్షములతోగూడినదియును, సహసా = హఠాత్తుగా, దగ్ధాం = దహింపబడినదియునగు, తాం పురీం = ఆ లంకానగరిని, సమీక్ష్య = కనుగొని, బహవః = పెక్కుమంది, విశిష్టాః = ప్రముఖులైన, రక్షోగణాః = రాక్షసబృందములు, తత్ర = అచ్చటికి, సమేత్య = చేరి, సర్వే = ఎల్లరును, ఇతి ఏవం = అని ఈరీతిగా, ఊచుః = పలికిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** విశిష్టాః = ప్రహస్తుడు మున్నగు మహావీరులు.

**రా. శిరోమణి :–** తత్ర – రావణసన్నిధిని (చేరి ఇట్లు పలికిరని భావము).

**తాత్పర్యము :–** అప్పుడా విధముగ సర్వప్రాణికోటితోడను వృక్షములు, గృహములు మున్నగువానితోడను హఠాత్తుగా తగులబడిన ఆ లంకానగరిని గాంచి ప్రముఖులైన రాక్షసవీరులు పెక్కుమంది అచటికి చేరి ఈ విధముగ తమ అభిప్రాయములను వెల్లడించిరి.

**శ్లో॥ తతస్తు లంకా సహసా ప్రదగ్ధా**
**సరాక్షసా సాశ్వరథా సనాగా ।**
**సపక్షిసంఘా సమృగా సవృక్షా**
**రురోద దీనా తుములం సశబ్దమ్ ॥ 40**

**పదచ్ఛేదము :–** తతః – తు – లంకా – సహసా – ప్రదగ్ధా – సరాక్షసా –

సాశ్వరథా - సనాగా, సపక్షిసంఘా - సమృగా - సవృక్షా - రురోద - దీనా - తుములం - సశబ్దమ్ ॥

**అన్వయక్రమము** :- తతః సహసా ప్రదగ్ధా లంకా తు సరాక్షసా సాశ్వరథా సనాగా సపక్షిసంఘా సమృగా సవృక్షా (సతీ) దీనా తుములం సశబ్దం రురోద.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, సహసా = హఠాత్తుగా, ప్రదగ్ధా = పూర్తిగా దహింపబడినట్టి, లంకా = లంకాపట్టణము, సరాక్షసా = రాక్షసులతో గూడినదియును, సాశ్వరథా = అశ్వములతోడను రథములతోడను గూడినదియును, సనాగా = ఏనుగులతో గూడినదియును, సపక్షిసంఘా = పక్షిసమూహములతో గూడినదియును, సమృగా = మృగములతో గూడినదియును, సవృక్షా (సతీ) = వృక్షములతో గూడినదియును అగుచు, దీనా = దీనమైనదై, తుములం = కోలాహలముగా, సశబ్దం పెద్దధ్వనితో, రురోద = విలపించెను.

**తాత్పర్యము** :- అప్పు డట్లు తగులబడిపోయిన ఆ లంకానగరి తనయం దున్నట్టి రాక్షసులతోడను, అశ్వములతోడను, రథములతోడను, ఏనుగులతోడను, పక్షిసంఘములతోడను, మృగములతోడను, వృక్షగణములతోడను గూడి దీనమైన రూపముతో పెద్ద కోలాహలధ్వనితో ఆక్రోశించినది.

**శ్లో॥ హా తాత హా పుత్రక కాంత మిత్ర**
**హా జీవితం భోగయుతం సుపుణ్యమ్ ।**
**రక్షోభి రేవం బహుధా బ్రువద్భిః**
**శబ్దః కృతో ఘోరతర స్సుభీమః ॥ 41**

**పదచ్ఛేదము** :- హా - తాత - హా - పుత్రక - కాంత - మిత్ర - హా - జీవితం - భోగయుతం - సుపుణ్యమ్ - రక్షోభిః - ఏవం - బహుధా - బ్రువద్భిః - శబ్దః - కృతః - ఘోరతరః - సుభీమః ॥

**అన్వయక్రమము** :- హా తాత! హా పుత్రక! హా కాంత! హా మిత్ర! భోగయుతం సుపుణ్యం జీవితం (గతమ్). ఏవం, బహుధా బ్రువద్భిః రక్షోభిః ఘోరతరః సుభీమః శబ్దః కృతః.

**ప్రతిపదార్థము** :- హా తాత! = అయ్యో తండ్రీ!, హా పుత్రక! = అయ్యో పుత్రుడా!, కాంత! = అయ్యో ప్రియుడా!, మిత్ర = అయ్యో మిత్రుడా!, హా = అయ్యో!, భోగయుతం = భోగముతో కూడిన, సుపుణ్యం = గొప్ప పుణ్యములు గల్గిన, జీవితం = జీవితము, (గతమ్ = పోయినది) (ఇతి = అని) ఏవం = ఈ రీతిగా, బహుధా =

పెక్కువిధములుగా, బ్రువద్భిః = పలుకుచున్నట్టి, రక్షోభిః = రక్కసులచే, ఘోరతరః = మిక్కిలి ఘోరమైన, సుభీమః = మిక్కిలి భయంకరమైనట్టి, శబ్దః = ధ్వని, కృతః = చేయబడినది.

**తాత్పర్యము** :- అయ్యో తండ్రీ! అయ్యో బిడ్డా! అయ్యో ప్రియుడా! అయ్యో మిత్రుడా! గొప్ప పుణ్యము చేసికొని సంపాదించుకొన్న భోగములతో గూడిన జీవిత మంతరించినది. నా కేది దిక్కనుచు నిట్లు పలువిధములుగ విలపించుచున్న రాక్షసులచే భీకరమైన మహాధ్వని చెలరేగినది.

**శ్లో॥ హుతాశనజ్వాలసమావృతా సా**
**హతప్రవీరా పరివృత్తయోధా ।**
**హనూమతః క్రోధవశాభిభూతా**
**బభూవ శోకోపహతేవ లంకా ॥** 42

**పదచ్ఛేదము** :- హుతాశనజ్వాలసమావృతా - హతప్రవీరా - పరివృత్తయోధా - హనూమతః - క్రోధవశాభిభూతా - బభూవ - శాపోపహతా - ఇవ - లంకా ॥

**అన్వయక్రమము** :- హనూమతః క్రోధవశాభిభూతా, హుతాశనజ్వాలసమావృతా సా లంకా శాపోపహతా ఇవ హతప్రవీరా పరివృత్తయోధా బభూవ.

**ప్రతిపదార్థము** :- హనూమతః = హనుమంతునియొక్క, క్రోధవశాభిభూతా = క్రోధావేశముచే తిరస్కరింపబడినదై, హుతాశనజ్వాలసమావృతా = అగ్నిజ్వాలలచే ఆవరింపబడియున్నట్టి, సా లంకా = ఆ లంకానగరి, శాపోపహతా ఇవ = శాపముచే నశింపజేయబడినదివలె, హతప్రవీరా = చనిపోయిన మహావీరులు గలదిగను, పరివృత్తయోధా = అస్తమించిన యోధులుగలదిగను, బభూవ = ఆయెను.

**తాత్పర్యము** :- అట్లు హనుమంతుని క్రోధోద్రేకమునకు గుఱియై నాశము నొంది అగ్నిజ్వాలలచే చుట్టుకొనబడియున్న ఆ లంకానగరి హతమారిన మహావీరులతోను మరణించిన యుద్ధభటులతోను ఒకానొక మహాత్ముని శాపకారణముగా విధ్వస్తమైయున్నట్లు కనబడెను.

**శ్లో॥ ససంభ్రమత్రస్త విషణ్ణరాక్షసాం**
**సముజ్జ్వలజ్వాల హుతాశనాంకితామ్ ।**
**దదర్శ లంకాం హనుమా న్మహామనాః**
**స్వయంభుకోపోపహతా మి వావనిమ్ ॥** 43

**పదచ్ఛేదము** :– ససంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం సముజ్జ్వలజ్వాలహుతాశనాంకితామ్ దదర్శ – లంకాం – హనుమాన్ – మహామనాః – స్వయంభుకోపోపహతామ్ ఇవ అవనిమ్ ॥

**అన్వయక్రమము** :– ససంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం, సముజ్జ్వలజ్వాలహుతాశనాంకితాం లంకాం మహామనాః హనుమాన్ స్వయంభుకోపోపహతాం అవనిమ్ ఇవ దదర్శ.

**ప్రతిపదార్థము** :– ససంభ్రమత్రస్తవిషణ్ణరాక్షసాం = వేగిరపాటుతో భీతినొందిన విషాదము గల్గియున్న రాక్షసులతో గూడినదియును, సముజ్జ్వలజ్వాలహుతాశనాంకితాం = మిక్కిలిగ జ్వలించుచున్న మంటలు గల అగ్నితో నిండినదియును అగు, లంకాం = లంకానగరిని, మహామనాః = గొప్పమనస్సుగల, హనుమాన్ = హనుమంతుడు, స్వయంభుకోపోపహతాం = బ్రహ్మయొక్క క్రోధముచే ధ్వంసముచేయబడిన, అవనిమ్ ఇవ = భూమినివలె, దదర్శ = కనుగొనెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :– స్వయంభుకోపోపహతాం = ప్రళయకాలమున సంహారకారియైన శివుని క్రోధముచే నశించినది.

**తాత్పర్యము** :– వేగిరపాటుతో భీతిల్లి విషాదమును చెందిన రాక్షసులతో, తీవ్రమైన జ్వాలలచే ఆవరింపబడియున్న యా లంకానగరి హనుమకు ప్రళయకాలమునందు భస్మమగు భూమండలమువలె గానవచ్చెను.

**శ్లో॥ భంక్త్వా వనం పాదపరత్నసంకులం**
**హత్వా తు రక్షాంసి మహాంతి సంయుగే ।**
**దగ్ధ్వా పురీం తాం గృహరత్నమాలినీం**
**తస్థౌ హనూమాన్ పవనాత్మజః కపిః ॥ 44**

**పదచ్ఛేదము** :– భంక్త్వా – వనం – పాదపరత్నసంకులం, హత్వా – తు – రక్షాంసి – మహాంతి – సంయుగే, దగ్ధ్వా – పురీం – తాం – గృహరత్నమాలినీమ్ – తస్థౌ – హనూమాన్ – పవనాత్మజః – కపిః ॥

**అన్వయక్రమము** :– పవనాత్మజః హనుమాన్ పాదపరత్నసంకులం వనం భంక్త్వా సంయుగే మహాంతి రక్షాంసి హత్వా తు గృహరత్నమాలినీం తాం పురీం దగ్ధ్వా సుఖం తస్థౌ.

**ప్రతిపదార్థము** :- పవనాత్మజః = వాయునందనుడైన, కపిః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమ, పాదపరత్నసంకులం = శ్రేష్ఠమైన వృక్షములతో నిండియున్న, వనం = వనమును, భంక్త్వా = ధ్వంసముచేసి, సంయుగే = యుద్ధమునందు, మహాంతి = గొప్పవారయిన, రక్షాంసి = రాక్షసులను, హత్వా తు = పరిమార్చియు, గృహరత్నమాలినీం = శ్రేష్ఠములైన భవనపంక్తులు గలిగినట్టి, తాం పురీం = ఆ లంకాపురిని, దగ్ధ్వా = దహించి, సుఖం = సుఖముగా, తస్థౌ = కూర్చుండియుండెను.

**తాత్పర్యము** :- వాయునందనుడైన హనుమ ఈ విధముగ అపూర్వమైన వృక్షవిశేషములతో నిండిన ఆ యశోకవనమును ధ్వంసము చేసి మహావీరులైన రాక్షస శ్రేష్ఠులను యుద్ధమున మడియించి శ్రేష్ఠములైన భవనపంక్తులతో విరాజిల్లు లంకానగరిని దగ్ధముచేసి కృతకృత్యుడై సుఖముగ కూర్చుండెను.

**శ్లో॥ త్రికూటశృంగాగ్రతలే విచిత్రే**
**ప్రతిష్ఠితో వానరరాజసింహః ।**
**ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ**
**వ్యరాజ తాదిత్య ఇ వాంశుమాలీ ॥ 45**

**పదచ్ఛేదము** :- త్రికూటశృంగాగ్రతలే - విచిత్రే, ప్రతిష్ఠితః - వానరరాజసింహః, ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ, వ్యరాజత - ఆదిత్యః - ఇవ - అంశుమాలీ ॥

**అన్వయక్రమము** :- విచిత్రే త్రికూటశృంగాగ్రతలే ప్రతిష్ఠితః వానరరాజసింహః ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ (సన్) అంశుమాలీ ఆదిత్యః ఇవ వ్యరాజత.

**ప్రతిపదార్థము** :- విచిత్రే = విచిత్రమైన, త్రికూటశృంగాగ్రతలే = త్రికూటపర్వతము యొక్క శిఖరమునందలి పైభాగమునందు, ప్రతిష్ఠితః = నిలిచియున్నట్టి, వానరరాజసింహః = వానరశ్రేష్ఠుడైన హనుమ ప్రదీప్తలాంగూలకృతార్చిమాలీ (సన్) = ప్రజ్వలించుచున్న వాలముచే నేర్పబడిన కిరణసమూహముగల్గియున్న, ఆదిత్యః ఇవ = సూర్యునివలె, వ్యరాజత = విరాజిల్లెను.

సూచన - ఈ శ్లోకము ప్రక్షిప్తమని చెప్పబడినది.

**తాత్పర్యము** :- అప్పుడా త్రికూటశిఖరాగ్రమున వివిధ వర్ణములతో ప్రకాశించుచు సింహమువలె గూర్చుండియున్న యా హనుమ తన వాలమునందు జ్వలించుచున్న జ్వాలామాలికలచే ఉదయాద్రిపై కిరణసమూహముతో వెల్గొందు ఆదిత్యునివలె ప్రకాశించెను.

**శ్లో॥ స రాక్షసాం స్తాన్ సుబహూంశ్చ హత్వా**
**వనం చ భంక్త్వా బహుపాదపం తత్ ।**
**విసృజ్య రక్షోభవనేషు చాగ్నిం**
**జగామ రామం మనసా మహాత్మా ॥ 46**

**పదచ్ఛేదము** :– సః – రాక్షసాన్ – తాన్ – సుబహూన్ – చ – హత్వా, వనం – చ – భంక్త్వా – బహుపాదపం – తత్ – విసృజ్య – రక్షోభవనేషు – చ – అగ్నిం జగామ – రామం – మనసా – మహాత్మా ॥

**అన్వయక్రమము** :– మహాత్మా సః సుబహూన్ తాన్ రాక్షసాన్ హత్వా చ బహుపాదపం తత్ వనం భంక్త్వా చ రక్షోభవనేషు అగ్నిం విసృజ్య చ మనసా రామం జగామ.

**ప్రతిపదార్థము** :– మహాత్మా = మహనీయుడైన, సః = ఆ హనుమ, సుబహూన్ = చాలమందియైన, తాన్ రాక్షసాన్ = ఆ రాక్షసులను, హత్వా చ = చంపియు, బహుపాదపం = పెక్కు వృక్షములతోగూడిన, తత్ వనం = ఆ యశోకవనమును, భంక్త్వా చ = ధ్వంసముచేసియు, రక్షోభవనేషు = రాక్షసుల గృహములందు, అగ్నిం = అగ్నిని, విసృజ్య చ = విడిచియును, మనసా = మనస్సుచే, రామం = శ్రీరాముని, జగామ = పొందెను.

**తాత్పర్యము** :– మహాత్ముడైన హనుమ పెక్కుమంది రాక్షసవీరులను హతమార్చి వేలకొలది వృక్షములతో నిండిన అశోకవనమును ధ్వంసముచేసి రాక్షసుల భవనములకు నిప్పుబెట్టి తాను తలపెట్టిన పని కడముట్టుటచే తన మనస్సును రామప్రభువు సన్నిధికి జేర్చెను.

**శ్లో॥ తతస్తు తం వానరవీరముఖ్యం**
**మహాబలం మారుతతుల్యవేగమ్ ।**
**మహామతిం వాయుసుతం వరిష్ఠం**
**ప్రతుష్టువు ర్దేవగణాశ్చ సర్వే ॥ 47**

**పదచ్ఛేదము** :– తతః – తు – తం – వానరవీరముఖ్యం, మహాబలం – మారుతతుల్యవేగమ్ – మహామతిం – వాయుసుతం – వరిష్ఠం – ప్రతుష్టువుః దేవగణాః – చ – సర్వే ॥

**అన్వయక్రమము** :– తతః వానరవీరముఖ్యం మహాబలం మారుతతుల్యవేగం మహామతిం వరిష్ఠం తం వాయుసుతం సర్వే దేవగణాశ్చ ప్రతుష్టువుః.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, వానరవీరముఖ్యం = వానరవీరులలో శ్రేష్ఠుడైనవాడును, మహాబలం = మహాబలశాలియును, మారుతతుల్యవేగం = వాయువుతో సమానమైన వేగముగలవాడును, మహామతిం = గొప్ప ప్రజ్ఞగలవాడును, వరిష్ఠం = మిక్కిలిశ్రేష్ఠుడును అగు, తం వాయుసుతం = ఆ వాయునందనుని, సర్వే = సమస్తమైన, దేవగణాః చ = దేవసంఘములును, ప్రతుష్టువుః = స్తోత్ర మొనర్చినవి.

**తాత్పర్యము** :- వానరశీలురందు అగ్రేసరుడును, మహాబలాఢ్యుడును, వాయుసమానవేగసంపన్నుడును, ప్రజ్ఞాశాలియును, సర్వశ్రేష్ఠుడునగు వాయునందనుని దేవగణములన్నియు స్తుతియొనర్చెను.

**శ్లో॥ భంక్త్వా వనం మహాతేజా హత్వా రక్షాంసి సంయుగే ।**
**దగ్ధ్వా లంకాపురీం రమ్యాం రరాజ స మహాకపిః ॥ 48**

**పదచ్ఛేదము** :- భంక్త్వా – వనం – మహాతేజాః – హత్వా – రక్షాంసి – సంయుగే దగ్ధ్వా – లంకాపురీం – రమ్యాం – రరాజ – సః – మహాకపిః ॥

**అన్వయక్రమము** :- సః మహాతేజాః మహాకపిః వనం భంక్త్వా సంయుగే రక్షాంసి హత్వా రమ్యాం లంకాపురీం దగ్ధ్వా రరాజ.

**ప్రతిపదార్థము** :- మహాతేజాః = గొప్పతేజశ్శాలియగు, సః మహాకపిః = ఆ వానర శ్రేష్ఠుడు, వనం = అశోకవనమును, భంక్త్వా = ధ్వంసముచేసి, సంయుగే = యుద్ధమున, రక్షాంసి = రక్కసులను, హత్వా = పరిమార్చి, రమ్యాం = సుందరమైన, లంకాపురీం = లంకానగరిని, దగ్ధ్వా = దహించి, రరాజ = ప్రకాశించెను.

**తాత్పర్యము** :- మహాప్రతాపసంపన్నుడైన యా హనుమ అట్లు అశోకవనమును ధ్వంసముచేసి రాక్షసయోధులను నేలగూల్చి యా లంకామహానగరమును దగ్ధము చేసి యెదురులేని వీరునిగా విరాజిల్లెను.

**శ్లో॥ తత్ర దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః ।**
**దృష్ట్వా లంకాం ప్రదగ్ధాం తాం విస్మయం పరమం గతాః ॥ 49**

**పదచ్ఛేదము** :- తత్ర – దేవాః – సగంధర్వాః – సిద్ధాః – చ – పరమర్షయః – దృష్ట్వా – లంకాం – ప్రదగ్ధాం – తాం – విస్మయం – పరమం – గతాః ॥

**అన్వయక్రమము** :- తత్ర దేవాః సగంధర్వాః సిద్ధాః పరమర్షయః చ తాం లంకాం ప్రదగ్ధాం దృష్ట్వా పరమం విస్మయం గతాః.

**ప్రతిపదార్థము :–** తత్ర = అచ్చట, దేవాః = దేవతలును, సగంధర్వాః = గంధర్వులతో కూడినవారైన, సిద్ధాః = సిద్ధులును, పరమర్షయః చ = మహాఋషులును, తాం లంకాం = ఆ లంకానగరిని, ప్రదగ్ధాం = దగ్ధమైనదానినిగా, దృష్ట్వా = చూచి, పరమం = గొప్పదైన, విస్మయం = ఆశ్చర్యమును, గతాః = పొందిరి.

**తాత్పర్యము :–** అప్పుడచ్చటి దేవతలును, గంధర్వులును, సిద్ధులును, మహాఋషులును ఆ లంకానగరము దగ్ధమై పోవుటను జూచి అమితాశ్చర్యము నొందిరి.

**శ్లో॥ తం దృష్ట్వా వానరశ్రేష్ఠం హనూమంతం మహాకపిమ్**
**కాలాగ్నిరితి సంచింత్య సర్వభూతాని తత్రసుః ॥ 50**

**పదచ్ఛేదము :–** తం – దృష్ట్వా – వానరశ్రేష్ఠం – హనూమంతం – మహాకపిమ్ – కాలాగ్నిః – ఇతి – సంచింత్య – సర్వభూతాని – తత్రసుః ॥

**అన్వయక్రమము :–** వానరశ్రేష్ఠం మహాకపిం తం హనూమంతం దృష్ట్వా కాలాగ్నిః ఇతి సంచింత్య సర్వభూతాని తత్రసుః.

**ప్రతిపదార్థము :–** వానరశ్రేష్ఠం = వానరులలో శ్రేష్ఠుడును, మహాకపిం = మహాత్ముడును అగు, తం హనూమంతం = ఆ హనుమంతుని, దృష్ట్వా = చూచి, కాలాగ్నిః ఇతి = ప్రళయకాలమునందలి అగ్ని యని, సంచింత్య = భావించి, సర్వభూతాని = సమస్త ప్రాణులును, తత్రసుః = భీతిల్లినవి.

**తాత్పర్యము :–** మహావీరుడైన ఆ వానరశ్రేష్ఠుని గాంచి ప్రళయకాలమునందు విజృంభించునట్టి కాలాగ్ని యని భావించి సమస్తభూతములును అమితమైన భీతికి లోనైనవి.

**శ్లో॥ దేవాశ్చ సర్వే మునిపుంగవాశ్చ**
**గంధర్వవిద్యాధరకింనరాశ్చ ।**
**భూతాని సర్వాణి మహాంతి తత్ర**
**జగ్ముః పరాం ప్రీతి మతుల్యరూపామ్ ॥ 51**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"లంకాదహనం" నామ*
*చతిష్పంచాశస్సర్గః.*

**పదచ్ఛేదము :–** దేవాః – చ – సర్వే – మునిపుంగవాః – చ, గంధర్వవిద్యాధరకింనరాః – చ, భూతాని – సర్వాణి – మహాంతి – తత్ర – జగ్ముః – పరాం – ప్రీతిమ్ – అతుల్యరూపామ్ ॥

**అన్వయక్రమము :–** తత్ర దేవాః చ, సర్వే మునిపుంగవాః చ, గంధర్వవిద్యాధరకిన్నరాః చ, సర్వాణి మహాంతి భూతాని పరామ్ అతుల్యరూపాం ప్రీతిం జగ్ముః.

**ప్రతిపదార్థము :–** తత్ర = అచ్చట, సర్వే = సమస్తమైన, దేవాః చ = దేవతలును, మునిపుంగవాః చ = మునిశ్రేష్ఠులును, గంధర్వవిద్యాధరకిన్నరాః చ = గంధర్వులును, విద్యాధరులును, కిన్నరులును, సర్వాణి = సమస్తములైన, మహాంతి = గొప్పవైన, భూతాని = భూతములును, పరాం = గొప్పదైన, అతుల్యరూపాం = సాటిలేని, ప్రీతిం = సంతోషమును, జగ్ముః = పొందినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** ఈ సర్గమునందలి చివరిశ్లోకములు కొన్ని ప్రతులలో వెనుకముందుగ నుండుట గానవచ్చుచున్నది.

**తాత్పర్యము :–** అప్పుడా హనుమ గావించిన లంకాదహనచర్యను గాంచి ఎల్లరు దేవతలును మహర్షులును గంధర్వులును విద్యాధరులును కింనరులును సమస్తమహాభూతములును ఎనలేని మహానందము నొందిరి.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"లంకాదహనము" అను*
*ఏబదినాల్గవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచపంచాశసర్గ

**శ్లో॥ లంకాం సమస్తాం సందీప్య లాంగూలాగ్నిం మహాబలః ।**
**నిర్వాపయామాస తదా సముద్రే హరిసత్తమః ॥ 1**

**పదచ్ఛేదము** :– లంకాం – సమస్తాం – సందీప్య – లాంగూలాగ్నిం – మహాబలః నిర్వాపయామాస – తదా – సముద్రే – హరిసత్తమః ॥

**అన్వయక్రమము** :– మహాబలః, హరిసత్తమః, తదా సమస్తాం, లంకాం సందీప్య లాంగూలాగ్నిం సముద్రే నిర్వాపయామాస.

**ప్రతిపదార్థము** :– మహాబలః = మహాబలాఢ్యుడైన, హరిసత్తమః = వానరశ్రేష్ఠుడగు హనుమ, లంకాం = లంకానగరమును, సమస్తాం = అంతను, సందీప్య = దహించి, తదా = అప్పుడు, లాంగూలాగ్నిం = తోకయందలి అగ్నిని, సముద్రే = సముద్రమునందు, నిర్వాపయామాస = అర్పివైచెను.

**తాత్పర్యము** :– మహాబలశాలియగు ఆ హనుమ లంకానగరమును సమస్తమును దహించివైచి తన తోకయందు జ్వలించుచున్న ఆ యగ్నిని సముద్రజలములో ముంచి ఆర్పుకొనెను.

**శ్లో॥ సందీప్యమానాం విధ్వస్తాం త్రస్తరక్షోగణాం పురీమ్ ।**
**అవేక్ష్య హనుమాన్ లంకాం చింతయామాస వానరః ॥ 2**

**పదచ్ఛేదము** :– సందీప్యమానాం – విధ్వస్తాం – త్రస్తరక్షోగణాం – పురీమ్ – అవేక్ష్య – హనుమాన్ – లంకాం – చింతయామాస – వానరః ॥

**అన్వయక్రమము** :– వానరః, హనుమాన్, సందీప్యమానాం విధ్వస్తాం, త్రస్తరక్షోగణాం, లంకాపురీమ్, అవేక్ష్య, చింతయామాస ॥

**ప్రతిపదార్థము** :– వానరః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమ, సందీప్యమానాం = మండుచున్నదియును, విధ్వస్తాం = ధ్వంసమైనదియును, త్రస్తరక్షోగణాం = భీతిగ్రస్తులైన రాక్షస సమూహములు గలదియునగు, లంకాం పురీం = లంకానగరిని,

అవేక్ష్య = చూచి, చింతయామాస = ఆలోచింపసాగెను.

**తాత్పర్యము** :- అట్లు పెద్దమంటలతో తగులబడుచు విధ్వంసమై రాక్షసుల హాహాకారములతో గూడియున్న ఆ లంకానగరమును విలోకించి హనుమ చింతింపసాగెను.

**శ్లో॥ తస్యాభూ త్సుమహాం స్త్రాసః కుత్సా చాత్మ న్యజాయత ।**
**లంకాం ప్రదహతా కర్మ కింస్వి త్కృత మిదం మయా ॥ 3**

**పదచ్ఛేదము** :- తస్య – అభూత్ – సుమహాన్ – త్రాసః – కుత్సా – చ – ఆత్మని – అజాయత, లంకాం – ప్రదహతా – కర్మ – కింస్విత్ – కృతమ్ – ఇదం – మయా ॥

**అన్వయక్రమము** :- తస్య సుమహాన్ త్రాసః కుత్సా చ ఆత్మని అజాయత, లంకాం ప్రదహతా కర్మ కింస్విత్ కృతమ్ ఇదం మయా.

**ప్రతిపదార్థము** :- తస్య = అతనికి, సుమహాన్ = మిక్కిలిగొప్పదైన, త్రాసః = భీతి, అభూత్ = ఆయెను, లంకాం = లంకానగరమును, ప్రదహతా = తగులబెట్టుచున్నట్టి, మయా = నాచేత, ఇదం = ఈ, కింస్విత్ = ఏమి నీచమైన, కర్మ = కృత్యము, కృతం = చేయబడినది? (ఇతి = అని), ఆత్మని = తనయందు, కుత్సా చ = ఏవగింపుకూడ, అజాయత = కలిగెను.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమకు జరిగిన విషయమును గూర్చి మనస్సునందు గొప్పదైన భయము పొడమెను. ఈ లంకానగరమును తగులబెట్టుచు అక్కటా! నేనెట్టి దారుణమైన కృత్యమున కొడిగట్టితినని తనయందు తనకే ఒక యేవగింపు కూడ గలిగెను.

**శ్లో॥ ధన్యాస్తే పురుషశ్రేష్ఠా యే బుద్ధ్యా కోప ముత్థితమ్ ।**
**నిరుంధంతి మహాత్మానో దీప్త మగ్ని మి వాంభసా ॥ 4**

**పదచ్ఛేదము** :- ధన్యాః – తే – పురుషశ్రేష్ఠాః – యే – బుద్ధ్యా – కోపమ్ – ఉత్థితమ్, నిరుంధంతి – మహాత్మానః – దీప్తమ్ – అగ్నిమ్ – ఇవ – అంభసా ॥

**అన్వయక్రమము** :- దీప్తమ్ అగ్నిమ్, అంభసా ఇవ, యే మహాత్మానః, ఉత్థితం కోపం బుద్ధ్యా నిరుంధంతి, తే పురుషశ్రేష్ఠాః ధన్యాః.

**ప్రతిపదార్థము** :- దీప్తం = ప్రజ్వలితమైన, అగ్నిం = అగ్నిని, అంభసా ఇవ =

నీటితోవలె, యే మహాత్మానః = ఏ మహనీయులు, ఉత్థితం = ఉద్భవించినట్టి, కోపం = క్రోధమును, బుద్ధ్యా = బుద్ధిచే, నిరుంధంతి = అణచివేయుదురో, తే పురుషశ్రేష్ఠాః = ఆ పురుషశ్రేష్ఠులు, ధన్యాః = ధన్యులు.

**తాత్పర్యము :–** ఏ మహనీయులు తమ హృదయమునందు ఉద్భవించిన క్రోధమును ప్రజ్వలించిన అగ్నిని నీటితో చల్లార్చినట్లు తమ వివేకముచే అణచివేసికొందురో అట్టివారు ధన్యులు గదా!

**శ్లో॥ క్రుద్ధః పాపం న కుర్యాత్కః క్రుద్ధో హన్యా ద్గురూనపి ।**
**క్రుద్ధః పరుషయా వాచా నర స్సాధూ నధిక్షిపేత్ ॥ 5**

**పదచ్ఛేదము :–** క్రుద్ధః – పాపం – న – కుర్యాత్ – కః – క్రుద్ధః – హన్యాత్ – గురూన్ – అపి – క్రుద్ధః – పరుషయా – వాచా – నరః – సాధూన్ – అధిక్షిపేత్ ॥

**అన్వయక్రమము :–** క్రుద్ధః కః పాపం న కుర్యాత్? క్రుద్ధః, గురూన్, అపి, హన్యాత్. క్రుద్ధః, నరః, పరుషయా, వాచా, సాధూన్, అధిక్షిపేత్.

**ప్రతిపదార్థము :–** క్రుద్ధః = క్రోధమునొందినవాడు, కః = ఎవ్వడు, పాపం = పాపమును, న కుర్యాత్ = చేయకుండును? క్రుద్ధః = క్రోధితుడైనవాడు, గురూన్ అపి = గురువులను గూడ, హన్యాత్ = చంపివేయును, క్రుద్ధః = క్రోధమునొందిన, నరః = మనుష్యుడు, పరుషయా = పరుషమైన, వాచా = వాక్కుతో, సాధూన్ = సజ్జనులను, అధిక్షిపేత్ = నిందించును.

**తాత్పర్యము :–** క్రోధావేశము నొందినవాడు ఎవడు పాపము చేయకుండ నుండును? క్రోధోద్రిక్తుడు తన గురువునుగూడ వధించును. క్రోధమునకు వశుడైన నరుడు పరుషమైన వచనములతో సత్పురుషులను గూడ నిందించును గదా!

**శ్లో॥ వాచ్యావాచ్యం ప్రకుపితో న విజానాతి కర్హిచిత్ ।**
**నాకార్య మస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్ ॥ 6**

**పదచ్ఛేదము :–** వాచ్యావాచ్యం – ప్రకుపితః – న – విజానాతి – కర్హిచిత్, న – అకార్యమ్ – అస్తి – క్రుద్ధస్య – న – అవాచ్యం – విద్యతే – క్వచిత్ ॥

**అన్వయక్రమము :–** ప్రకుపితః, కర్హిచిత్, వాచ్యావాచ్యం, న విజానాతి. క్రుద్ధస్య, అకార్యం నాస్తి, క్వచిత్, అవాచ్యం న విద్యతే.

**ప్రతిపదార్థము :–** ప్రకుపితః = క్రోధోద్రిక్తుడు, కర్హిచిత్ = ఎన్నడును, వాచ్యావాచ్యం

= అనదగిన దానిని అనదగని దానిని, న విజానాతి = విశేషించి తెలిసికొనలేదు, క్రుద్ధస్య = క్రోధము నొందియున్నవానికి, అకార్యం = చేయకూడనిది, నాస్తి = ఉండదు, క్వచిత్ = ఎచ్చటను, అవాచ్యం = అనరానిది, న విద్యతే = ఉండదు.

**తాత్పర్యము** :– క్రోధావేశము నొందినట్టివాడు ఎన్నడును అనదగినమాట అనదగని మాట యను అను విశేషము నెఱుగజాలడు. క్రోధావేశము నొందియున్న వానికి అకృత్య మనునట్టిది ఉండనే యుండదు. అట్లే అతనికి అనరాని మాట యనునది గూడ యుండదు.

**శ్లో॥ య స్సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి ।**
**యథోరగ స్త్వచం జీర్ణాం స వై పురుష ఉచ్యతే ॥ 7**

**పదచ్ఛేదము** :– యః – సముత్పతితం – క్రోధం – క్షమయా – ఏవ – నిరస్యతి, యథా – ఉరగః – త్వచం – జీర్ణాం – సః – పురుషః – ఉచ్యతే ॥

**అన్వయక్రమము** :– ఉరగః యథా జీర్ణాం త్వచం నిరస్యతి తథా యః సముత్పతితం క్రోధం క్షమయా ఏవ నిరస్యతి, సః వై పురుషః ఉచ్యతే.

**ప్రతిపదార్థము** :– ఉరగః = సర్పము, యథా = ఏ విధముగా, జీర్ణాం = శిథిలమైన, త్వచం = చర్మమును, నిరస్యతి = తొలగించుకొనునో, తథా = ఆ రీతిగా, యః = ఎవ్వడయితే, సముత్పతితం = సంభవించినట్టి, క్రోధం = క్రోధమును, క్షమయా ఏవ = ఓర్పుతోడనే, నిరస్యతి = తొలగించుకొనునో, సః వై = అతడే, పురుషః ఉచ్యతే = పురుషుడుగా చెప్పబడుచున్నాడు.

**తాత్పర్యము** :– శిథిలమైన తనచర్మమును సర్ప మెట్లు వెంటనే తొలగించుకొనునో అట్లే ఏ వివేకవంతుడైతే తనలో పొడమిన క్రోధజ్వాలను తన సహనశక్తిచే వెంటనే తొలగించుకొనునో అతనినే సరియైన పురుషుడని చెప్పవలెను.

**శ్లో॥ ధి గస్తు మాం సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమమ్ ।**
**అచింతయిత్వా తాం సీతా మగ్నిదం స్వామిఘాతుకమ్ ॥ 8**

**పదచ్ఛేదము** :– ధిక్ – అస్తు – మాం – సుదుర్బుద్ధిం – నిర్లజ్జం – పాపకృత్తమమ్ – అచింతయిత్వా – తాం – సీతాం – అగ్నిదం – స్వామిఘాతుకమ్ ॥

**అన్వయక్రమము** :– సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమం తాం సీతాం అచింతయిత్వా అగ్నిదం స్వామిఘాతుకం మాం ధిక్ అస్తు.

**ప్రతిపదార్థము** :- సుదుర్బుద్ధిం = మిక్కిలి దుష్టమైన బుద్ధిగలవాడను, నిర్లజ్జం = సిగ్గుమాలినవాడను, పాపకృత్తమం = పాపాత్ములలో అగ్రేసరుడను, తాం సీతాం = ఆ సీతాదేవినిగూర్చి, అచింతయిత్వా = ఆలోచింపకుండ, అగ్నిదం = నిప్పుపెట్టినవాడను అగు, మాం = నన్నుగూర్చి, ధిక్ అస్తు = నిందయగుగాక!

**తాత్పర్యము** :- మిక్కిలి దుష్టమైన బుద్ధిగలవాడను, సిగ్గుమాలినవాడను, పాపాత్ములలో మొదటివాడను సీతాదేవిని గూర్చి ఆలోచింపకుండా ఆమె నివాసమునుగూడా అగ్నిపాలు చేసిన వాడను, అద్దాన నా రామచంద్రప్రభువునకే ద్రోహము గావించినవాడను గదా! ఆహా నేనెంత నింద్యమైన పని చేసితిని!

**శ్లో॥ యది దగ్ధా త్వియం లంకా నూన మార్యాపి జానకీ ।**
**దగ్ధా తేన మయా భర్తుర్హతం కార్య మజానతా ॥ 9**

**పదచ్ఛేదము** :- యది - దగ్ధా - తు - ఇయం - లంకా - నూనం - ఆర్యా - అపి - జానకీ - దగ్ధా - తేన - మయా - భర్తుః - హతం - కార్యమ్ - అజానతా ॥

**అన్వయక్రమము** :- ఇయం లంకా దగ్ధా యది ఆర్యా జానకీ అపి దగ్ధా; తేన అజానతా మయా భర్తుః కార్యం హతమ్.

**ప్రతిపదార్థము** :- ఇయం లంకా = ఈ లంకానగరము, దగ్ధా యది = దహింపబడినయెడల, ఆర్యా = పూజ్యురాలయిన, జానకీ అపి = సీతాదేవిగూడ, నూనం = నిశ్చయముగా, దగ్ధా = దహింపబడినది. తేన = అందుచే, అజానతా = తెలిసికొనలేనట్టి, మయా = నాచేత, భర్తుః = ప్రభువుయొక్క, కార్యం = పని, హతం = నశింపచేయబడినది.

**తాత్పర్యము** :- ఈ లంకానగరము దహింపబడినప్పుడు పూజ్యురాలైన సీతాదేవిగూడ నిశ్చయముగా దహింపబడియేయుండునుగదా! ఆమెయే దహింపబడినయెడల అజ్ఞానినైన నేను నా ప్రభువుకార్యము నేనే నాశనము చేసితినిగదా!

**శ్లో॥ యదర్థ మయ మారంభ స్తత్కార్య మవసాదితమ్ ।**
**మయా హి దహతా లంకాం న సీతా పరిరక్షితా ॥ 10**

**పదచ్ఛేదము** :- యదర్థమ్ - అయమ్ - ఆరంభః - తత్ - కార్యమ్ - అవసాదితమ్, మయా - హి - దహతా - లంకాం - న - సీతా - పరిరక్షితా ॥

**అన్వయక్రమము** :- అయమ్ ఆరంభః యదర్థం, తత్ కార్యం అవసాదితమ్; హి లంకాం దహతా మయా సీతా న పరిరక్షితా.

**ప్రతిపదార్థము** :- అయమ్ ఆరంభః = ఈ యుద్యమము, యదర్థం = దేనినిగురించియో, తత్ కార్యం = ఆ కృత్యము, అవసాదితమ్ = నశింపచేయబడినది, హి = ఎందుచేతననగా, లంకాం = లంకను, దహతా = తగులబెట్టుచున్నట్టి, మయా = నాచేత, సీతా = సీతాదేవి, న పరిరక్షితా = రక్షింపబడలేదు.

**తాత్పర్యము** :- నేను ఏ మహాకార్యమునుగూర్చి యత్న మారంభించితినో ఆ ప్రధానకార్యమును నేనే నాశమొనర్చుకొంటిని. ఈ లంకానగరమును తగులబెట్టుచు నా లక్ష్యమైన సీతాదేవిని నేను రక్షించుకొనలేకపోతినిగదా!

**శ్లో॥ ఈషత్కార్య మిదం కార్యం కృతమాసీ న్న సంశయః ।**
**తస్య క్రోధాభిభూతేన మయా మూలక్షయః కృతః ॥ 11**

**పదచ్ఛేదము** :- ఈషత్కార్యమ్ - ఇదం - కార్యం - కృతమ్ - ఆసీత్ - న - సంశయః, తస్య - క్రోధాభిభూతేన - మయా - మూలక్షయః - కృతః ॥

**అన్వయక్రమము** :- ఇదం కార్యం ఈషత్కార్యం కృతం ఆసీత్; సంశయః, న. క్రోధాభిభూతేన మయా తస్య మూలక్షయః కృతః.

**ప్రతిపదార్థము** :- ఇదం కార్యం = ఈ సీతాన్వేషణ కార్యము, ఈషత్కార్యం = స్వల్పముగ శేషించినట్టిపనిగా, కృతమ్ ఆసీత్ = చేయబడినదయ్యెను, సంశయః న = సందేహము లేదు, క్రోధాభిభూతేన = క్రోధముచే వివశుడనైనట్టి, మయా = నాచేత, తస్య = ఆ కృత్యమునకు, మూలక్షయః = మూలవిఘాతము, కృతః = చేయబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా. శిరోమణి** :- 'ఇదం కార్యం ఈషత్కార్యం కృతం' లంకాదహనము రాక్షసమారణము మున్నగు ఘనకార్యములు నేడు నీచమైన పనులుగా నైనవని భావము.

**మహేశ్వరతీర్థులు**:- ఈషత్కార్యం కృతం ఆసీత్ - సీతాన్వేషణము రావణ నిలయపరిజ్ఞానము సీతాదర్శనము క్షేమవార్తానివేదనము మున్నగు మహత్కార్యములలో శ్రీరామునకు తిరిగి నివేదించుట యను కొద్దిపనిమాత్రమే మిగిలినదిగా నిర్వహింపబడినది.

**తాత్పర్యము** :- కొద్దికార్యము మిగిలియున్నప్పటికిని నేను ఉద్యమించిన ఘనకార్యమునంతను నిర్వహించితిని. అది గొప్పవిషయమే గాని రావణునిపై క్రోధావేశమునొంది నేను నా లక్ష్యమైన సీతమ్మ కుశలస్థితి యనెడి ప్రధానకృత్యమునకే

భంగము గలిగించితినికదా!

**శ్లో॥ వినష్టా జానకీ నూనం న హ్యదగ్ధః ప్రదృశ్యతే ।**
**లంకాయాం కశ్చి దుద్దేశ స్సర్వా భస్మీకృతా పురీ ॥ 12**

**పదచ్ఛేదము :-** వినష్టా - జానకీ - నూనం - న - హి - అదగ్ధః - ప్రదృశ్యతే, లంకాయాం - కశ్చిత్ - ఉద్దేశః - సర్వా - భస్మీకృతా - పురీ ॥

**అన్వయక్రమము :-** జానకీ నూనం వినష్టా, లంకాయాం కశ్చిత్ ఉద్దేశః అదగ్ధః న ప్రదృశ్యతే, సర్వా పురీ భస్మీకృతా.

**ప్రతిపదార్థము :-** జానకీ = సీతాదేవి, నూనం = నిశ్చయముగా, వినష్టా = నశించినది, లంకాయాం = లంకయందు, కశ్చిత్ ఉద్దేశః = ఏ ప్రదేశముగూడ, అదగ్ధః = దహింపబడనిది, న ప్రదృశ్యతే = కానబడుటలేదు, పురీ = నగరము, సర్వా = అంతయును, భస్మీకృతా = భస్మము చేయబడినది.

**తాత్పర్యము :-** సీతాదేవి తప్పక నశించియుండును. ఈ లంకానగరమున దగ్ధముగాని ప్రదేశము ఒక్కటిగూడ లేదు; పట్టణమంతయును భస్మమైనది.

**శ్లో॥ యది తద్విహతం కార్యం మమ ప్రజ్ఞావిపర్యయాత్ ।**
**ఇహైవ ప్రాణసంన్యాసో మమాపి హ్యద్య రోచతే ॥ 13**

**పదచ్ఛేదము :-** యది - తత్ - విహతం - కార్యం - మమ - ప్రజ్ఞావిపర్యయాత్, ఇహ - ఏవ - ప్రాణసంన్యాసః - మమ - అపి - హి - అద్య - రోచతే ॥

**అన్వయక్రమము :-** మమ ప్రజ్ఞావిపర్యయాత్ తత్ కార్యం విహతం యది మమ అపి ఇహ ఏవ అద్య ప్రాణసంన్యాసః రోచతే.

**ప్రతిపదార్థము :-** మమ = నాయొక్క, ప్రజ్ఞావిపర్యయాత్ = బుద్ధివైపరీత్యమువలన, తత్ కార్యం = ఆ స్వామికార్యము, విహతం యది = నశించియున్నయెడల, మమ అపి = నాకుకూడ, ఇహ ఏవ = ఈ లంకయందే, అద్య = నేడు, ప్రాణసంన్యాసః = ప్రాణత్యాగము, రోచతే = ఇష్టమగును.

**తాత్పర్యము :-** నా బుద్ధివైపరీత్యమువలన నా స్వామికార్యమే చెడిపోయినయెడల నేడు నాకిచ్చటనే ప్రాణత్యాగమే కర్తవ్యమై యుండును.

**శ్లో॥ కి మగ్నౌ నిపతా మ్యద్య ఆహోస్వి ద్బడబాముఖే ।**
**శరీర మాహో సత్త్వానాం దద్మి సాగరవాసినామ్ ॥ 14**

**పదచ్ఛేదము** :– కిమ్ – అగ్నౌ – నిపతామి – అద్య – ఆహోస్విత్ – బడబాముఖే, శరీరమ్ – ఆహో – సత్త్వానాం – దద్మి – సాగరవాసినామ్ ॥

**అన్వయక్రమము** :– అద్య అగ్నౌ నిపతామి కిమ్, ఆహో స్విత్ బడబాముఖే నిపతామి, ఆహో! సాగరవాసినాం సత్త్వానాం శరీరం దద్మి (కిమ్)?

**ప్రతిపదార్థము** :– అద్య = ఇప్పుడు, అగ్నౌ = అగ్నియందు, నిపతామి కిం = పడుదునా ఏమి? ఆహోస్విత్ = లేక, బడబాముఖే = బడబాగ్నియందు, నిపతామి = పడుదునా? ఆహో = లేక, సాగరవాసినాం = సముద్రమునందు వసించునట్టి, సత్త్వానాం = జంతువులకు, శరీరం = దేహమును, దద్మి కిం = ఇత్తునా యేమి?

**తాత్పర్యము** :– నేనిప్పుడు నా శరీరమును అగ్ని కర్పింతునా లేక సముద్రమునందలి బడబాగ్ని కర్పింతునా లేక ఈ సముద్రమునందలి జంతువుల కాహారముగా నర్పింతునా?

**శ్లో॥ కథం హి జీవతా శక్యో మయా ద్రష్టుం హరీశ్వరః ।**
**తౌ వా పురుషశార్దూలౌ కార్యసర్వస్వఘాతినా ॥ 15**

**పదచ్ఛేదము** :– కథం – హి – జీవతా – శక్యః – మయా – ద్రష్టుం – హరీశ్వరః – తౌ – వా – పురుషశార్దూలౌ – కార్యసర్వస్వఘాతినా ॥

**అన్వయక్రమము** :– కార్యసర్వస్వఘాతినా జీవతా మయా హరీశ్వరః కథం ద్రష్టుం శక్యః? తౌ పురుషశార్దూలౌ వా (కథం శక్యౌ?).

**ప్రతిపదార్థము** :– కార్యసర్వస్వఘాతినా = కార్యము సమస్తము ధ్వంసము చేసినట్టి, మయా = నాచేత, జీవతా = బ్రతికియున్నవాడనై, హరీశ్వరః = వానరరాజైన సుగ్రీవుడు, ద్రష్టుం = చూచుటకు, కథం = ఎట్లు, శక్యః = వీలగును?, తౌ పురుషశార్దూలౌ వా = ఆ పురుషశ్రేష్ఠు లిరువు రయినప్పటికి, కథం = ఎట్లు, ద్రష్టుం = చూచుటకు, శక్యౌ = వీలగుదురు?

**తాత్పర్యము** :– స్వామికార్యమునకు మూలవిఘాతము చేసినట్టి నేను నా ప్రాణములతో నిలచి మా వానరరాజైన సుగ్రీవునెట్లు చూడగలను? పురుషశ్రేష్ఠులైన ఆ రామలక్ష్మణు లిరువురిని మాత్రమెట్లు దర్శింపగలను?

**శ్లో॥ మయా ఖలు తదే వేదం రోషదోషా త్ప్రదర్శితమ్ ।**
**ప్రథితం త్రిషు లోకేషు కపిత్వ మనవస్థితమ్ ॥ 16**

**పదచ్ఛేదము** :- మయా - ఖలు - తత్ - ఏవ - ఇదం - రోషదోషాత్ - ప్రదర్శితమ్, ప్రథితం - త్రిషు - లోకేషు - కపిత్వమ్ - అనవస్థితమ్ ॥

**అన్వయక్రమము** :- త్రిషు లోకేషు ప్రథితం తత్ అనవస్థితం ఇదం కపిత్వమ్ ఏవ రోషదోషాత్ మయా ప్రదర్శితం ఖలు!

**ప్రతిపదార్థము** :- త్రిషు లోకేషు = మూడులోకములందును, ప్రథితం = ప్రసిద్ధమైయున్న, తత్ = ఆ, అనవస్థితం = చంచలమైనట్టి, ఇదం కపిత్వమ్ ఏవ = ఈ వానరస్వభావమే, రోషదోషాత్ = క్రోధముయొక్క దోషమువలన, మయా = నాచేత, ప్రదర్శితం ఖలు = ప్రదర్శింపబడినదిగదా!

**తాత్పర్యము** :- మూడు లోకములందును ప్రసిద్ధమైయున్న వానరుల సహజగుణమగు మా చపలస్వభావమునే నేనిప్పుడు క్రోధమునకు చిక్కుకొని ప్రదర్శించుకొంటినిగదా!

**శ్లో॥ ధిగస్తు రాజసం భావ మనీశ మనవస్థితమ్ ।**
**ఈశ్వరేణాపి య ద్రాగా న్మయా సీతా న రక్షితా ॥ 17**

**పదచ్ఛేదము** :- ధిక్ - అస్తు - రాజసం - భావమ్ - అనీశమ్ - అనవస్థితమ్ - ఈశ్వరేణ - అపి - యత్ - రాగాత్ - మయా - సీతా - న - రక్షితా ॥

**అన్వయక్రమము** :- అనీశమ్ అనవస్థితం రాజసం భావం ధిక్ అస్తు; యత్ ఈశ్వరేణాపి మయా సీతా రాగాత్ న రక్షితా.

**ప్రతిపదార్థము** :- అనీశం = నిగ్రహములేనట్టిదియు, అనవస్థితం = స్థిరత్వము లేనట్టిదియునగు, రాజసం భావం = రాజగుణమును గూర్చి, ధిక్ అస్తు = నిందయగుగాక! యత్ = ఎందువల్లననగా, రాగాత్ = రాజసగుణమువలన, ఈశ్వరేణాపి = సమర్థుడనైప్పటికిని, మయా = నాచేత, సీతా = సీతాదేవి, న రక్షితా = రక్షింపబడలేదు.

**తాత్పర్యము** :- నిగ్రహమును గోల్పోవజేసి చంచలత్వమునకు నిలయమై యుండెడు రాజసగుణము మిక్కిలి నింద్యమైనది. నే నా రాజసము వలన గల్గిన క్రోధముచేతనే ఇట్టి దహనకృత్యమునకు బూని సమర్థుడైనప్పటికిని జానకమ్మను గూర్చి ఆలోచించి రక్షింపలేకపోయితిని.

**శ్లో॥ వినష్టాయాం తు సీతాయాం తావుభౌ వినశిష్యతః ।**
**తయో ర్వినాశే సుగ్రీవ స్సబంధు ర్వినశిష్యతి ॥ 18**

**పదచ్ఛేదము** :– వినష్టాయాం – తు – సీతాయాం – తౌ – ఉభౌ – వినశిష్యతః , తయోః – వినాశే – సుగ్రీవః – సబంధుః – వినశిష్యతి ॥

**అన్వయక్రమము** :– సీతాయాం వినష్టాయాం (సత్యాం) తౌ ఉభౌ వినశిష్యతః, తయోః వినాశే (సతి) సుగ్రీవః సబంధుః వినశిష్యతి.

**ప్రతిపదార్థము** :– సీతాయాం = సీతాదేవి, వినష్టాయాం (సత్యాం) = నశించినది కాగా, తౌ ఉభౌ = ఆ రామలక్ష్మణు లిరువురును, వినశిష్యతః = నశించిపోవుదురు, తయోః = వారిరువురియొక్క, వినాశే (సతి) = వినాశము కాగా, సుగ్రీవః = సుగ్రీవుడు, సబంధుః = బంధువులతో సహితముగా, వినశిష్యతి = నశించును.

**తాత్పర్యము** :– సీతమ్మయే నశించినప్పుడు ఆ రామలక్ష్మణు లిరువురును మరణింతురు. వారిరువురును మరణించినప్పుడు తన బంధుగణములతో గలసి మా రాజగు సుగ్రీవుడు ప్రాణములు వీడును.

**శ్లో॥ ఏతదేవ వచ శ్శ్రుత్వా భరతో భ్రాతృవత్సలః ।**
**ధర్మాత్మా సహశత్రుఘ్నః కథం శక్ష్యతి జీవితుమ్ ॥ 19**

**పదచ్ఛేదము** :– ఏతత్ – ఏవ – వచః – శ్రుత్వా – భరతః – భ్రాతృవత్సలః – ధర్మాత్మా – సహశత్రుఘ్నః – కథం – శక్ష్యతి – జీవితుమ్ ॥

**అన్వయక్రమము** :– ఏతత్ వచః శ్రుత్వా ఏవ భ్రాతృవత్సలః ధర్మాత్మా భరతః సహశత్రుఘ్నః జీవితుం కథం శక్ష్యతి?

**ప్రతిపదార్థము** :– ఏతత్ వచః = ఈ మాటను, శ్రుత్వా ఏవ = వినగానే, భ్రాతృవత్సలః సోదరప్రేమగలవాడును, ధర్మాత్మా = ధర్మమునందు నిష్ఠగలవాడును అగు, సహశత్రుఘ్నః = శత్రుఘ్నునితో గూడియున్నట్టి, భరతః = భరతుడు, జీవితుం = బ్రతికియుండుటకు, కథం = ఎట్లు, శక్ష్యతి = శక్తుడగును?

**తాత్పర్యము** :– ఈ దుర్వార్తను వినగానే సోదరప్రేమకు నిలయమైనవాడును పరమ ధార్మికుడును అగు భరతుడును, ఆ శత్రుఘ్నుడును ప్రాణముల నెట్లు నిలుపుకొనగలరు?

**శ్లో॥ ఇక్ష్వాకువంశే ధర్మిష్ఠే గతే నాశ మసంశయమ్ ।**
**భవిష్యంతి ప్రజా స్సర్వా శ్శోకసంతాపపీడితాః ॥ 20**

**పదచ్ఛేదము** :– ఇక్ష్వాకువంశే – ధర్మిష్ఠే – గతే – నాశమ్ – అసంశయమ్, భవిష్యంతి – ప్రజాః – సర్వాః – శోకసంతాపపీడితాః ॥

**అన్వయక్రమము** :- ధర్మిష్ఠే ఇక్ష్వాకువంశే నాశం గతే (సతి) అసంశయం ప్రజాః సర్వాః శోకసంతాపపీడితాః భవిష్యంతి.

**ప్రతిపదార్థము** :- ధర్మిష్ఠే = ధర్మనిష్ఠ గలిగినట్టి, ఇక్ష్వాకువంశే = ఇక్ష్వాకువంశము, నాశం గతే (సతి) = నాశనమునొందగా, అసంశయమ్ = నిస్సంశయముగా, ప్రజాః సర్వాః = ప్రజలెల్లరును, శోకసంతాపపీడితాః = దుఃఖసంతాపముచే పీడింపబడినవారు, భవిష్యంతి = కాగలరు.

**తాత్పర్యము** :- పరమధార్మికులని ప్రసిద్ధినొందిన ఇక్ష్వాకుమహారాజు వంశ మీరీతిగా నశించిపోగా లోకములోని జనులెల్లరును నిస్సందేహముగా దుఃఖసంతాపముతో పీడింపబడి నశించిపోవుదురు.

**శ్లో॥ తదహం భాగ్యరహితో లుప్తధర్మార్థసంగ్రహః ।**
**రోషదోషపరీతాత్మా వ్యక్తం లోకవినాశనః ॥ 21**

**పదచ్ఛేదము** :- తత్ - అహం - భాగ్యరహితః - లుప్తధర్మార్థసంగ్రహః, రోషదోషపరీతాత్మా - వ్యక్తం - లోకవినాశనః ॥

**అన్వయక్రమము** :- తత్ అహం భాగ్యరహితః లుప్తధర్మార్థసంగ్రహః, రోషదోషపరీతాత్మా వ్యక్తం లోకవినాశనః (భవిష్యామి).

**ప్రతిపదార్థము** :- తత్ = ఆ కారణమున, భాగ్యరహితః = అదృష్టహీనుడను, లుప్తధర్మార్థసంగ్రహః = లోపించిన ధర్మార్థముల సముదాయము గలవాడను, రోషదోషపరీతాత్మా = క్రోధముయొక్క దోషముచే నిండిన మనస్సుగలవాడను అగు, అహం = నేను, వ్యక్తం = స్పష్టముగా, లోకవినాశనః = లోకమునకు నాశనము గూర్చువాడను (భవిష్యామి = కాగలను).

**తాత్పర్యము** :- ఈ విధముగ అదృష్టహీనుడను, ధర్మార్థములను గోల్పోయినవాడను, క్రోధదుష్ఫలితమునకు వశుడైనవాడను అయి స్పష్టముగా లోకమునకు వినాశము తెచ్చిపెట్టినవాడను కాగలను గదా!

**శ్లో॥ ఇతి చింతయత స్తస్య నిమిత్తా న్యుపపేదిరే ।**
**పూర్వ మ ప్యుపలబ్ధాని సాక్షా త్పున రచింతయత్ ॥ 22**

**పదచ్ఛేదము** :- ఇతి - చింతయతః - తస్య - నిమిత్తాని - ఉపపేదిరే, పూర్వమ్ - అపి - ఉపలబ్ధాని - సాక్షాత్ - పునః - అచింతయత్ ॥

**అన్వయక్రమము** :– ఇతి చింతయతః తస్య పూర్వమ్ అపి ఉపలబ్ధాని నిమిత్తాని సాక్షాత్ ఉపపేదిరే (అతః సః) పునః అచింతయత్.

**ప్రతిపదార్థము** :– ఇతి = ఈ విధముగా, చింతయతః = ఆలోచించుచున్నట్టి, తస్య = ఆ హనుమకు, పూర్వమ్ అపి = పూర్వము గూడ, ఉపలబ్ధాని = చూడబడినట్టి, నిమిత్తాని = శుభశకునములు, సాక్షాత్ = ప్రత్యక్షముగా, ఉపపేదిరే = కలిగినవి (అతః = అందువలన, సః = అతడు) పునః = తిరిగి, అచింతయత్ = ఆలోచింపదొడగెను.

**తాత్పర్యము** :– ఈ విధముగా సంతాపముతో భయావహములైనట్టి ఆలోచనలు చేయుచున్న హనుమకు పూర్వము సీతాదర్శనమునకు ముందు గానవచ్చినట్టి శుభశకునములు మఱల గోచరింపసాగెను. అందుచే నాతడు సంతోషముతో తిరిగి ఇట్లు ఆలోచింపదొడగెను.

**శ్లో॥ అథవా చారుసర్వాంగీ రక్షితా స్వేన తేజసా ।**
**న నశిష్యతి కళ్యాణీ నాగ్ని రగ్నౌ ప్రవర్తతే ॥ 23**

**పదచ్ఛేదము** :– అథవా – చారుసర్వాంగీ – రక్షితా – స్వేన – తేజసా, న – నశిష్యతి – కళ్యాణీ – న – అగ్నిః – అగ్నౌ – ప్రవర్తతే ॥

**అన్వయక్రమము** :– అథవా – చారుసర్వాంగీ (సా) కళ్యాణీ స్వేన తేజసా రక్షితా న నశిష్యతి, అగ్నిః అగ్నౌ న ప్రవర్తతే.

**ప్రతిపదార్థము** :– అథవా = లేక, చారుసర్వాంగీ = సర్వాంగ సౌందర్యముగలదియును, కళ్యాణీ = మంగళస్వరూపురాలునగు, (సా = ఆ సీతాదేవి) స్వేన తేజసా = తన తేజస్సుచే, రక్షితా = రక్షింపబడినదై, న నశిష్యతి = నశింపబోవదు, అగ్నిః = అగ్ని, అగ్నౌ = అగ్నియందు, న ప్రవర్తతే = ప్రవర్తింపదు.

**తాత్పర్యము** :– అట్లుగాదు; నిండైన రమణీయరూపము గల్గినట్టి ఆ మంగళస్వరూపురాలు తన నిజతేజస్సుచేతనే తాను రక్షింపబడియుండగలదు. అగ్నిహోత్రుని తిరిగి అగ్ని దహించుట యనునది యుండునా.

**శ్లో॥ నహి ధర్మాత్మన స్తస్య భార్యా మమితతేజసః ।**
**స్వచారిత్రాభిగుప్తాం తాం స్ప్రష్టు మర్హతి పావకః ॥ 24**

**పదచ్ఛేదము** :– న – హి – ధర్మాత్మనః – తస్య – భార్యామ్ – అమితతేజసః, స్వచారిత్రాభిగుప్తాం – తాం – స్ప్రష్టుమ్ – అర్హతి – పావకః ॥

**అన్వయక్రమము** :- ధర్మాత్మనః అమితతేజసః తస్య భార్యాం స్వచారిత్రాభిగుప్తాం పావకః స్ప్రష్టుం న హి అర్హతి.

**ప్రతిపదార్థము** :- ధర్మాత్మనః = ధర్మాత్ముడును, అమితతేజసః = గొప్పతేజస్సుగలవాడు నగు, తస్య = ఆ శ్రీరామునియొక్క, భార్యాం = భార్యయైనట్టి, స్వచారిత్రాభిగుప్తాం = తన శీలముచేతనే రక్షణము నొందియున్నట్టి, తాం = ఆ సీతాదేవిని, పావకః = అగ్నిహోత్రుడు, స్ప్రష్టుం = తాకుటకు, న హి అర్హతి = సమర్థుడుగాడు గదా!

**తాత్పర్యము** :- పరమధర్మాత్ముడైన ఆ యపరిమితప్రతాపశాలి యగు శ్రీరాముని ధర్మపత్నియును తన పాతివ్రత్యధర్మమే కవచముగా గలిగియున్నదియునగు సాధ్వీమణియైన సీతమ్మను అగ్నిహోత్రు డెట్లు తాకగలడు?

**శ్లో॥ నూనం రామప్రభావేణ వైదేహ్యా స్సుకృతేన చ ।**
**య న్మాం దహనకర్మాయం నాదహ ద్ధవ్యవాహనః ॥ 25**

**పదచ్ఛేదము** :- నూనం - రామప్రభావేణ - వైదేహ్యాః - సుకృతేన - చ, యత్ - మాం - దహనకర్మా - అయం - న - అదహత్ - హవ్యవాహనః ॥

**అన్వయక్రమము** :- దహనకర్మా అయం హవ్యవాహనః మాం న అదహత్ (ఇతి) యత్ (తత్) నూనం రామప్రభావేణ, వైదేహ్యాః సుకృతేన చ.

**ప్రతిపదార్థము** :- దహనకర్మా = దహించుటయే కృత్యముగా కలిగినట్టి, అయం హవ్యవాహనః = ఈ యగ్నిహోత్రుడు, మాం = నన్ను, న అదహత్ = దహింపలేదు, (ఇతి యత్ = అనునదేది గలదో) తత్ = అది, నూనం = నిశ్చయముగా, రామప్రభావేణ = రఘురాముని ప్రభావముచేతను, వైదేహ్యాః = సీతాదేవియొక్క, సుకృతేన చ = పుణ్యముచేతను (జరిగినది).

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- శ్రీరాముని ప్రభావమువలన అగ్ని అతని దాసుడనగు నన్నే దహింపనప్పుడు ఆతని ధర్మపత్ని నెట్లు తాకగలడని భావము.

**తాత్పర్యము** :- నిశ్చయముగా శ్రీరాముని ప్రభావముచేతను సీతాదేవియొక్క పుణ్యవిశేషముచేతను మాత్రమే ఆ యగ్నిహోత్రుడు తన నైజగుణముగా అన్నింటిని దహించువాడేయైనప్పటికిని నా శరీరమునందుండికూడ నన్ను దహింపలేదు. అట్టిచో నాతడు సీతాసాధ్వి నెట్లు తాకగలడు?

**శ్లో॥ త్రయాణాం భరతాదీనాం భ్రాతౄణాం దేవతా చ యా ।**
**రామస్య చ మనఃకాంతా సా కథం వినశిష్యతి ? ॥ 26**

**పదచ్ఛేదము** :– త్రయాణాం – భరతాదీనాం – భ్రాతౄణాం – దేవతా – చ – యా – రామస్య – చ – మనఃకాంతా – సా – కథం – వినశిష్యతి ॥

**అన్వయక్రమము** :– యా భరతాదీనాం త్రయాణాం భ్రాతౄణాం దేవతా చ రామస్య మనఃకాంతా చ, సా కథం వినశిష్యతి?

**ప్రతిపదార్థము** :– యా = ఏ పూజ్యురాలు, భరతాదీనాం = భరతుడు మున్నగు, త్రయాణాం భ్రాతౄణాం = ముప్పురుసోదరులకును, దేవతా చ = ఉపాస్యదేవతయైనదో, రామస్య = శ్రీరామునకు, మనఃకాంతా చ = మనోహారిణియునైయున్నదో, సా = ఆ దేవి, కథం = ఎట్లుగ, వినశిష్యతి = నశింపగలదు?

**తాత్పర్యము** :– ఏ పూజ్యురాలు భరతలక్ష్మణశత్రుఘ్నులను ముప్పురుసోదరులకును ఉపాస్యదైవమై శ్రీరాముని కత్యంతప్రియరాలుగ వెలయుచున్నదో అట్టి మహాత్మురాలెట్లు నశించును?

**శ్లో॥ యద్వా దహనకర్మాయం సర్వత్ర ప్రభు రవ్యయః ।**
**న మే దహతి లాంగూలం కథమార్యాం ప్రధక్ష్యతి ॥ 27**

**పదచ్ఛేదము** :– యద్వా – దహనకర్మా – అయం – సర్వత్ర – ప్రభుః – అవ్యయః – న – మే – దహతి – లాంగూలం – కథమ్ – ఆర్యాం – ప్రధక్ష్యతి ॥

**అన్వయక్రమము** :– యద్వా సర్వత్ర దహనకర్మా ప్రభుః అవ్యయః అయం మే లాంగూలం న దహతి; ఆర్యాం కథం ప్రధక్ష్యతి?

**ప్రతిపదార్థము** :– యద్వా = లేక, సర్వత్ర = ఎల్లయెడలను, దహనకర్మా = దహించుటకృత్యముగాగల, ప్రభుః = సమర్థుడైనట్టి, అవ్యయః అయం = నాశనములేనట్టి ఈ యగ్నిహోత్రుడు, మే లాంగూలం = నాయొక్క తోకను, న దహతి = దహింపగలడు, ఆర్యాం = పూజ్యురాలైనట్టి సీతామాతను, కథం = ఎట్లు, ప్రధక్ష్యతి = దహింపగలడు.

**తాత్పర్యము** :– అట్లుగాక ఎల్లయెడల దహించుటయే తన స్వభావముగా తన సామర్థ్యమును ప్రదర్శించునట్టి ఈ యగ్నిహోత్రుడు నా వాలమును దహించుట మానినాడు. శ్రీరాముని సేవకుడనైన నన్నే విడిచిన ఈ యగ్నిదేవుడు రామపత్నియైన ఆ మహాసాధ్వి నెట్లు దహించును?

**శ్లో॥ పున శ్చాచింతయ త్తత్ర హనుమా న్విస్మిత స్తదా ।**
**హిరణ్యనాభస్య గిరే ర్జలమధ్యే ప్రదర్శనమ్ ॥ 28**

**పదచ్ఛేదము** :- పునః - చ - అచింతయత్ - తత్ర - హనుమాన్ - విస్మితః - తదా, హిరణ్యనాభస్య - గిరేః - జలమధ్యే - ప్రదర్శనమ్ ॥

**అన్వయక్రమము** :- తదా తత్ర హనుమాన్ విస్మితః (సన్) జలమధ్యే హిరణ్యనాభస్య గిరేః ప్రదర్శనం పునః చ అచింతయత్.

**ప్రతిపదార్థము** :- తదా = అప్పుడు, తత్ర = అచ్చట, హనుమాన్ = హనుమ, విస్మితః (సన్) = ఆశ్చర్యము నొందినవాడగుచు, జలమధ్యే = నీటినడుమ, హిరణ్యనాభస్య గిరేః = మైనాకపర్వతముయొక్క, ప్రదర్శనం = కాన్పించుటనుగూర్చి, పునః చ = మఱల, అచింతయత్ = ఆలోచించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- సముద్రజలమధ్యమున సీతాదేవి ప్రభావముచేతనే గదా నా విశ్రాంతి నిమిత్తమై పర్వత ముద్భవించినది! అట్టి ప్రభావశాలినియైన సీతాదేవిని అగ్నిదేవుడు ఎన్నడును దహింపదని హనుమ భావన.

**రా. శిరోమణి** :- పర్వతప్రభృతి సమస్తభూతజాలమును రామాజ్ఞావశవర్తులై యుండుటచే సీతాదేవికి అగ్నివలన భయముండదని హనుమ గ్రహించుచున్నాడు.

**తాత్పర్యము** :- అప్పుడా సమయమున విస్మయాన్వితుడైన హనుమ తిరిగి మహాసముద్రమధ్యమందు తన విశ్రాంతి నిమిత్తమై పర్వత ముద్భవించినట్టి విషయమును సీతారాముల ప్రభావమునకు నిదర్శనముగా జ్ఞప్తికి తెచ్చుకొనెను.

**శ్లో॥ తపసా సత్యవాక్యేన అనన్యత్వాచ్చ భర్తరి ।**
**అపి సా నిర్దహే దగ్నిం న తా మగ్నిః ప్రధక్ష్యతి ॥ 29**

**పదచ్ఛేదము** :- తపసా - సత్యవాక్యేన - అనన్యత్వాత్ - చ - భర్తరి, అపి - సా - నిర్దహేత్ - అగ్నిం - న - తామ్ - అగ్నిః - ప్రధక్ష్యతి ॥

**అన్వయక్రమము** :- తపసా సత్యవాక్యేన భర్తరి అనన్యత్వాత్ చ, సా అగ్నిమ్ అపి నిర్దహేత్, తాం అగ్నిః న ప్రధక్ష్యతి.

**ప్రతిపదార్థము** :- తపసా = తపస్సుచేతను, సత్యవాక్యేన = సత్యవచనముచేతను, భర్తరి = భర్త విషయమునందు, అనన్యత్వాత్ చ = ఇతరభావము లేకపోవుటచేతను,

సా = ఆ సీతాదేవి, అగ్నిమ్ అపి = అగ్నిని గూడ, నిర్దహేత్ = దహించివేయును, తాం = ఆ సీతాదేవిని, అగ్నిః = అగ్నిహోత్రుడు, న ప్రధక్ష్యతి = దహింపబోవడు.

**తాత్పర్యము** :- తన తపశ్శక్తిచేతను, సత్యపాలనప్రభావముచేతను భర్తయందలి తత్పరతచేతను సీతాదేవి అగ్నిహోత్రునే దహింపగలదు. అంతియేగాని అగ్నిహోత్రుడు మాత్ర మామె నెన్నడును తాకజాలడు.

**శ్లో॥ స తథా చింతయం స్తత్ర దేవ్యా ధర్మపరిగ్రహమ్ ।**
**శుశ్రావ హనుమా న్వాక్యం చారణానాం మహాత్మనామ్ ॥ 30**

**పదచ్ఛేదము** :- సః - తథా - చింతయన్ - తత్ర - దేవ్యాః - ధర్మపరిగ్రహం శుశ్రావ - హనుమాన్ - వాక్యం - చారణానాం - మహాత్మనామ్ ॥

**అన్వయక్రమము** :- సః హనుమాన్ తత్ర తథా దేవ్యాః ధర్మపరిగ్రహం చింతయన్ మహాత్మనాం చారణానాం వాక్యం శుశ్రావ.

**ప్రతిపదార్థము** :- సః హనుమాన్ = ఆ హనుమ, తత్ర = అచ్చట, తథా = అట్లు, దేవ్యాః = సీతాదేవియొక్క, ధర్మపరిగ్రహం = ధర్మతత్పరతనుగూర్చి, చింతయన్ = ఆలోచించుచు, మహాత్మనాం = మహనీయులైనట్టి, చారణానాం = చారణులయొక్క, వాక్యం = వచనమును, శుశ్రావ = వినెను.

**తాత్పర్యము** :- హనుమంతు డప్పుడు అచ్చట ఆ విధముగా సీతాదేవియొక్క ధర్మతత్పరతను గూర్చి స్మరించుచుండగా అతనికి చారణులు ఆకసమున తమలో తాము చెప్పుకొనుచున్నట్టి ఈ మాటలు వినవచ్చినవి.

**శ్లో॥ అహో! ఖలు కృతం కర్మ దుష్కరం హి హనూమతా ।**
**అగ్నిం విసృజతాఽభీక్ష్ణం భీమం రాక్షససద్మని ॥ 31**

**పదచ్ఛేదము** :- అహో - ఖలు - కృతం - కర్మ - దుష్కరం - హి - హనూమతా, అగ్నిం - విసృజతా - అభీక్ష్ణం - భీమం - రాక్షససద్మని ॥

**అన్వయక్రమము** :- అహో! రాక్షససద్మని భీమమ్ అభీక్ష్ణమ్ అగ్నిం విసృజతా హనూమతా దుష్కరం కర్మ కృతం హి ఖలు.

**ప్రతిపదార్థము** :- అహో = ఆహా!, రాక్షససద్మని = రాక్షసనివాసమునందు, అభీక్ష్ణం = మిక్కిలిగా, భీమం = భయంకరమైనట్టి, అగ్నిం = అగ్నిని, విసృజతా = విడుచుచున్నట్టి, హనూమతా = హనుమచే, దుష్కరం = అసాధ్యమైనట్టి, కర్మ = కృత్యము, కృతం హి ఖలు = చేయబడినదిగదా!

**తాత్పర్యము :-** ఆహా! రాక్షసులయొక్క నిలయములందు ఎడతెగని భయంకరమైన అగ్నిని రగిల్చి హనుమంతుడు ఎంతటి దుష్కరకార్యమును గావించినాడో గదా!

**శ్లో॥ ప్రపలాయితరక్షఃస్త్రీ బాలవృద్ధసమాకులా ।**
**జనకోలాహలాధ్మాతా క్రందంతీ వాద్రికందరే ॥ 32**

**పదచ్ఛేదము :-** ప్రపలాయితరక్షఃస్త్రీబాలవృద్ధసమాకులా, జనకోలాహలాధ్మాతా - క్రందంతీ - ఇవ - అద్రికందరే ॥

**అన్వయక్రమము :-** ప్రపలాయితరక్షఃస్త్రీబాలవృద్ధసమాకులా నగరీ జనకోలాహలాధ్మాతా అద్రికందరే క్రందంతీ ఇవ (వర్తతే).

**ప్రతిపదార్థము :-** ప్రపలాయితరక్షఃస్త్రీబాలవృద్ధసమాకులా = పరువిడుచున్న రాక్షసస్త్రీలతోడను బాలురతోడను వృద్ధులతోడను సంకులముగ నున్నదై, నగరీ = లంకాపురి, జనకోలాహలాధ్మాతా = జనులయొక్క కోలాహలముచే పూరింపబడినదై, అద్రికందరే = పర్వతగుహయందు, క్రందంతీ ఇవ = ఆక్రోశించుచున్నదానివలె (వర్తతే = ఉన్నది).

**తాత్పర్యము :-** ఇప్పు డీ లంకానగరిని చూడగా ప్రాణరక్షణముకొఱకై నలుమూలలకును పరుగిడుచున్న రాక్షస్త్రీలతోడను, బాలురతోడను, వృద్ధులతోడను మిక్కిలి సంకులముగ నుండి కోలాహలముగనున్న వారి ఆక్రోశధ్వనితో నిండి కొండగుహలు మాఱుమ్రోగుచుండ ఈ నగరియే అందుండి ఆక్రందించుచున్నట్లున్నది.

**శ్లో॥ దగ్ధేయం నగరీ సర్వా సాట్టప్రాకారతోరణా ।**
**జానకీ న చ దగ్ధేతి విస్మయో ఉద్భుత ఏవ నః ॥ 33**

**పదచ్ఛేదము :-** దగ్ధా - ఇయం - నగరీ - సర్వా - సాట్టప్రాకారతోరణా, జానకీ - న - చ - దగ్ధా - ఇతి - విస్మయః - అద్భుతః - ఏవ - నః ॥

**అన్వయక్రమము :-** సాట్టప్రాకారతోరణా, సర్వా ఇయం నగరీ దగ్ధా, జానకీ న చ దగ్ధా ఇతి నః విస్మయః అద్భుతః (భవతి).

**ప్రతిపదార్థము :-** సాట్టప్రాకారతోరణా = కోటబురుజులతోడను ప్రాకారములతోడను, బహిర్ద్వారముల తోడను కూడిన, సర్వా = సమస్తమైన, ఇయం నగరీ = ఈ పట్టణము, దగ్ధా = దహింపబడినది, జానకీ = సీతాదేవి, న చ దగ్ధా = ఏ మాత్రమును దహింపబడలేదు, ఇతి = అనునది, నః = మనకు, విస్మయః = ఆశ్చర్యమును, అద్భుతః = అద్భుతమును, (భవతి = అగుచున్నది).

**తాత్పర్యము** :- బురుజులతోడను, ప్రాకారములతోడను సింహద్వారములతోడను కూడిన నగరమంతయును తగలబడిపోయినది. కాని సీతాదేవి మాత్రము కసుగందలేదు. ఈ విషయము మన కపరిమితమైన ఆశ్చర్యముగను అద్భుతముగను ఉన్నది.

**శ్లో॥ ఇతి శుశ్రావ హనుమా న్వాచం తా మమృతోపమామ్ ।**
**బభూవ చాస్య మనసో హర్ష స్తత్కాలసంభవః ॥ 34**

**పదచ్ఛేదము** :- ఇతి - శుశ్రావ - హనుమాన్ - వాచం - తామ్ - అమృతోపమామ్, బభూవ - చ - అస్య - మనసః - హర్షః - తత్కాలసంభవః ॥

**అన్వయక్రమము** :- ఇతి హనుమాన్ అమృతోపమాం తాం వాచం శుశ్రావ, (అస్య మనసః) తత్కాలసంభవః హర్షః చ బభూవ.

**ప్రతిపదార్థము** :- ఇతి = అని, హనుమాన్ = హనుమ, అమృతోపమాం = అమృతతుల్యమైన, తాం వాచం = ఆ వచనమును, శుశ్రావ = ఆలకించెను. అస్య = ఆతనియొక్క, మనసః = మనస్సునకు, తత్కాలసంభవః = ఆ సమయమునందు జనించినట్టి, హర్షః చ = ఆనందము కూడ, బభూవ = కలిగెను.

**తాత్పర్యము** :- హనుమ ఈ విధమైన అమృతతుల్యమగు వచనములను ఆలకించగనే ఆతని మనస్సు ఆ సమయమునందు అమితమైన ఆనందము నొందెను.

**శ్లో॥ స నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః ।**
**ఋషివాక్యైశ్చ హనుమా నభవ త్ప్రీతమానసః ॥ 35**

**పదచ్ఛేదము** :- సః - నిమిత్తైః - చ - దృష్టార్థైః - కారణైః - చ - మహాగుణైః, ఋషివాక్యైః - చ - హనుమాన్ - అభవత్- ప్రీతమానసః ॥

**అన్వయక్రమము** :- దృష్టార్థైః నిమిత్తైః చ మహాగుణైః కారణైః చ ఋషివాక్యైః చ సః హనుమాన్ ప్రీతమానసః అభవత్.

**ప్రతిపదార్థము** :- దృష్టార్థైః = కనపడిన ప్రయోజనముగల్గినట్టి, నిమిత్తైః చ = మంచిశకునములచేతను, మహాగుణైః = గొప్పగుణములుగల, కారణైః చ = కారణములచేతను, ఋషివాక్యైః చ = చారణుల వచనములచేతను, సః హనుమాన్ = ఆ హనుమ, ప్రీతమానసః = సంతోషము నొందిన మనస్సుగలవాడు, అభవత్ = ఆయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** నిమిత్తైః – కుడికన్ను అదురుట మున్నగు శుభశకునములచే, కారణైః – సీతమ్మ పాతివ్రత్యము రఘురాముని ప్రభావము మున్నగు హేతువులచే, ఋషివాక్యైః – చారణుల పలుకులచే.

**తాత్పర్యము :–** కుడికన్ను అదురుట మున్నగు శుభశకునములచేతను, సీతారాముల దివ్యప్రభావము మున్నగు గొప్ప కారణములచేతను, ఆకసమునందు వినిపించిన చారణుల వచనములచేతను హనుమంతుని మనస్సునకు అప్పుడు మహానందము గలిగెను.

**శ్లో॥ తతః కపిః ప్రాప్తమనోరథార్థ**
**స్తా మక్షతాం రాజసుతాం విదిత్వా ।**
**ప్రత్యక్షత స్తాం పునరేవ దృష్ట్వా**
**ప్రతిప్రయాణాయ మతిం చకార ॥ 36**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*“హనుమద్విభ్రమో’ నామ*
*పంచపంచాశస్సర్గః*

**పదచ్ఛేదము :–** తతః – కపిః – ప్రాప్తమనోరథార్థః – తామ్ – అక్షతాం – రాజసుతాం – విదిత్వా, ప్రత్యక్షతః – తాం – పునః – ఏవ – దృష్ట్వా – ప్రతిప్రయాణాయ – మతిం – చకార ॥

**అన్వయక్రమము :–** తతః కపిః ప్రాప్తమనోరథార్థః (సన్) తామ్ అక్షతాం రాజసుతాం విదిత్వా ప్రత్యక్షతః తాం పునః ఏవ దృష్ట్వా ప్రతిప్రయాణాయ మతిం చకార.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, కపిః = హనుమ, ప్రాప్తమనోరథార్థః (సన్) = పొందబడిన కోరికగలవా డగుచు, తాం రాజసుతాం = ఆ రాజకుమారియైన సీతాదేవిని, అక్షతాం = హానిలేనిదానినిగా, విదిత్వా = తెలిసికొని, పునః = తిరిగి, తాం = ఆమెను, ప్రత్యక్షతః = ప్రత్యక్షముగా, దృష్ట్వా ఏవ = చూచియే, ప్రతిప్రయాణాయ = తిరుగు ప్రయాణముకొఱకు, మతిం చకార = నిశ్చయము చేసికొనెను.

**తాత్పర్యము :–** అప్పుడు హనుమ తలపెట్టిన యత్నము ఫలించినందున సీతాదేవి చెక్కుచెదరక క్షేమముగ నున్నదని తెలిసికొని మఱల నింకొకమాఱు ఆమెను ప్రత్యక్షముగ

దర్శించియే తన నిజనివాసమునకు వెడలవలెనని నిశ్చయించుకొనెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమద్విభ్రమము" అను*
*ఏబదియైదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## షట్పంచాశసర్గ

**శ్లో॥ తత స్తాం శింశుపామూలే జానకీం పర్యవస్థితామ్ ।**
**అభివా ద్యాబ్రవీ ద్దిష్ట్యా పశ్యామి త్వా మి హాక్షతామ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – తాం – శింశుపామూలే – జానకీం – పర్యవస్థితామ్ – అభివాద్య – అబ్రవీత్ – దిష్ట్యా – పశ్యామి – త్వామ్ – ఇహ – అక్షతామ్ ॥

**అన్వయక్రమము :–** తతః (హనుమాన్) శింశుపామూలే పర్యవస్థితాం తాం జానకీం అభివాద్య దిష్ట్యా త్వాం ఇహ అక్షతాం పశ్యామి (ఇతి) అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, హనుమాన్ = హనుమ, శింశుపామూలే = శింశుపావృక్షము మొదట, పర్యవస్థితాం = కూర్చుండియున్న, తాం జానకీం = ఆ సీతమ్మను, అభివాద్య = నమస్కరించి, దిష్ట్యా = భాగ్యవశమున, త్వాం = నిన్ను, ఇహ = ఇచ్చట, అక్షతాం = కుశలముగ నున్నదానినిగా, పశ్యామి = చూచుచున్నాను, (ఇతి = అని) అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** అప్పుడు హనుమ శింశుపావృక్షముక్రింద కూర్చుండియున్న సీతాదేవిని సమీపించి ఆమెకు మ్రొక్కి ఆమెతో తల్లీ! నా అదృష్టమున మఱల నిన్నిచ్చట క్షేమముగ నుండుట చూడగల్గితిని అని పలికెను.

**శ్లో॥ తత స్తం ప్రస్థితం సీతా వీక్షమాణా పునః పునః ।**
**భర్తృస్నేహాన్వితం వాక్యం హనూమంత మభాషత ॥ 2**

**పదచ్ఛేదము :–** తతః – తం – ప్రస్థితం – సీతా – వీక్షమాణా – పునః – పునః, భర్తృస్నేహాన్వితం – వాక్యం – హనూమంతమ్ – అభాషత ॥

**అన్వయక్రమము :–** తతః ప్రస్థితం తం హనూమంతం పునః పునః వీక్షమాణా సీతా భర్తృస్నేహాన్వితం వాక్యమ్ అభాషత.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, ప్రస్థితం = బయలుదేరినట్టి, తం హనూమంతం = ఆ హనుమను, పునః పునః = మఱల మఱల, వీక్షమాణా = చూచుచున్నదై, సీతా

= సీతమ్మ, భర్తృస్నేహాన్వితం = భర్తయందలి ప్రేమతోగూడినట్టి, వాక్యం = వచనమును, అభాషత = పలికెను.

**తాత్పర్యము** :– అప్పుడారీతిగా ప్రయాణమై వెడలిపోనుద్యుక్తుడైన హనుమంతుని అనురాగముతో మఱల మఱల చూచుచు సీతమ్మ తన భర్తయందలి ప్రేమాతిశయముచే అతనితో నీరీతిగా పలికినది.

**శ్లో॥ కామ మస్య త్వమే వైకః కార్యస్య పరిసాధనే ।**
**పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః ॥ 3**

**పదచ్ఛేదము** :– కామమ్ – అస్య – త్వం – ఏవ – ఏకః – కార్యస్య – పరిసాధనే, పర్యాప్తః – పరవీరఘ్న – యశస్యః – తే – బలోదయః ॥

**అన్వయక్రమము** :– పరవీరఘ్న అస్య కార్యస్య పరిసాధనే త్వమ్ ఏకః ఏవ కామం పర్యాప్తః, తే బలోదయః యశస్యః.

**ప్రతిపదార్థము** :– పరవీరఘ్న = శత్రువీరులను దునుమాడు శూరుడా!, అస్య కార్యస్య = ఈ పనియొక్క, పరిసాధనే = నిర్వహణమునందు, త్వం = నీవు, ఏకః ఏవ = ఒక్కడవే, కామం = ఎంతయును, పర్యాప్తః = చాలినవాడవు; తే బలోదయః = నీ బలవిజృంభణము, యశస్యః = కీర్తికరమైనది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'అస్య కార్యస్య పరిసాధనే' – లంకయందలి రాక్షసుల నెల్లరను వధించి నన్ను శ్రీరామసన్నిధికి గొనిపోవుట యను కార్యముయొక్క నిర్వహణమునందు 'బలోదయః తే యశస్యః' – ఈ ప్రతాపప్రకర్షము నీకే కీర్తికరమగును, గాని రామునకు కాదు గదా యని భావము.

**తాత్పర్యము** :– ఓ శత్రుసంహారకుడా! ప్రస్తుతకార్యమును నీవొక్కడవు చేపట్టి సాధింపగల సామర్థ్యము గలవాడవు. ఈ బలవిజృంభణము నీకెంతయును ప్రతిష్ఠను గూర్చునట్టిదే.

**శ్లో॥ శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః ।**
**మాం నయేద్యది కాకుత్థ్సస్తత్తస్య సదృశం భవేత్ ॥ 4**

**పదచ్ఛేదము** :– శరైః – తు – సంకులాం – కృత్వా – లంకాం – పరబలార్దనః – మాం – నయేత్ – యది – కాకుత్థ్సః – తత్ – తస్య – సదృశం – భవేత్ ॥

**అన్వయక్రమము** :– తు పరబలార్దనః కాకుత్థ్సః లంకాం శరైః సంకులాం కృత్వా మాం నయేత్ యది తత్ తస్య సదృశం భవేత్.

**ప్రతిపదార్థము** :– తు = కాని, పరబలార్దనః = శత్రుబలమును అణచివేయునట్టి, కాకుత్థ్సః = శ్రీరాముడు, లంకాం = లంకానగరమును, శరైః = బాణములచే, సంకులాం = కల్లోలమైనదానినిగా, కృత్వా = చేసి, మాం = నన్ను, నయేత్ యది = కొనిపోయినయెడల, తత్ = అది, తస్య = అతనికి, సదృశం = యుక్తమైనది, భవేత్ = అగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'తత్ తస్య సదృశం భవేత్' – తన పరాక్రమమును కనపరచి నన్ను గొనిపోవుట అతనికి యుక్తమును, నా యభిలాషను నెఱవేర్చుటయు నగును. అట్లు గానిచో నేను వీరపత్ని ననిపించుకొనుట ఎట్లు సంభవించునని భావము.

**తాత్పర్యము** :– ఈ రక్కసులను సంహరించుటకు నీవు సమర్థుడవేయైనను శత్రుమర్దనుడైన శ్రీరాముడు తన శస్త్రవర్షముచే లంకానగరమును కల్లోలము గావించి విజయుడై నన్ను గొనిపోయినయెడల ఆ మహావీరున కది తన కర్తవ్యనిర్వహణరూపమైన కార్యమగును.

**శ్లో॥ త ద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః ।**
**భవే దాహవశూరస్య తథా త్వ ముపపాదయ ॥ 5**

**పదచ్ఛేదము** :– తత్ – యథా – తస్య – విక్రాంతమ్ – అనురూపం – మహాత్మనః, భవేత్ – ఆహవశూరస్య – తథా – త్వమ్ – ఉపపాదయ ॥

**అన్వయక్రమము** :– తత్ ఆహవశూరస్య తస్య మహాత్మనః విక్రాంతమ్ అనురూపం యథా భవేత్ తథా త్వమ్ ఉపపాదయ.

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ కారణమువలన, ఆహవశూరస్య = యుద్ధవీరుడైనట్టి, తస్య మహాత్మనః = ఆ మహాత్మునియొక్క, విక్రాంతం = విక్రమణము, అనురూపం = తగినట్టిది, యథా = ఏ విధముగా, భవేత్ = అగునో, తథా = ఆ విధముగా, త్వం = నీవు, ఉపపాదయ = ఏర్పఱచుము.

**తాత్పర్యము** :– అందుచేత మహావీరుడైన ఆ మహాత్మునియొక్క పరాక్రమమునకు తగియున్న పద్ధతి ఎట్టిదో నిశ్చయించి ఆ విధానమును నీవు సంఘటింపజేయుము.

**శ్లో॥ తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్ ।**
**నిశమ్య హనుమాం స్తస్యా వాక్య ముత్తర మబ్రవీత్ ॥ 6**

**పదచ్ఛేదము** :– తత్ – అర్థోపహితం – వాక్యం – ప్రశ్రితం – హేతుసంహితమ్ – నిశమ్య – హనుమాన్ – తస్యాః – వాక్యమ్ – ఉత్తరమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– అర్థోపహితం ప్రశ్రితం హేతుసంహితం తస్యాః తత్ వాక్యం నిశమ్య హనుమాన్ ఉత్తరం వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– అర్థోపహితం = గొప్ప అర్థముతో గూడినదియును, ప్రశ్రితం = వినయముతో గూడినదియును, హేతుసంహితం = కారణముతో గూడినదియునగు, తస్యాః = ఆమెయొక్క, తత్ వాక్యం = ఆ వచనమును, నిశమ్య = విని, హనుమాన్ = హనుమ, ఉత్తరం వాక్యం = సమాధానమైన వచనమును, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :– ఆ రీతిగ సీతాదేవి మిక్కిలి అర్థవంతముగను వినయపూర్వకముగను న్యాయమైన కారణములతోను తెలిపిన మాటలను హనుమ విని ఆమెకు సమాధానముగా ఇట్లు పలికెను.

**శ్లో॥ క్షిప్రమేష్యతి కాకుత్థ్సో హర్యృక్షప్రవరై ర్వృతః ।**
**యస్తే యుధి విజిత్యారీన్ శోకం వ్యపనయిష్యతి ॥ 7**

**పదచ్ఛేదము** :– క్షిప్రమ్ – ఏష్యతి – కాకుత్థ్సః – హర్యృక్షప్రవరైః – వృతః, యః – తే – యుధి – విజిత్య – అరీన్ – శోకం – వ్యపనయిష్యతి ॥

**అన్వయక్రమము** :– యః యుధి అరీన్ విజిత్య తే శోకం వ్యపనయిష్యతి (సః) కాకుత్థ్సః హర్యృక్షప్రవరైః వృతః క్షిప్రమ్ ఏష్యతి.

**ప్రతిపదార్థము** :– యః = ఏ మహావీరుడైతే, యుధి = యుద్ధమునందు, అరీన్ = శత్రువులను, విజిత్య = జయించి, తే = నీయొక్క, శోకం = దుఃఖమును, వ్యపనయిష్యతి = తొలగింపగలడో, (సః)కాకుత్థ్సః = (ఆ) శ్రీరాముడు, హర్యృక్షప్రవరైః = వానరుల యొక్కయు, భల్లూకముల యొక్కయు, శ్రేష్ఠులతో, వృతః = కూడినవాడై, క్షిప్రం = శీఘ్రముగా, ఏష్యతి = రాగలడు.

**తాత్పర్యము** :– తల్లీ! యుద్ధమునందు శత్రువుల నుక్కడగించి నీశోకమును తొలగించుటకుగాను శ్రీరామచంద్రుడు వానరవీరులతోడను భల్లూకయోధుల తోడనుగూడి శీఘ్రముగానే లంకకు రానైయున్నాడు సుమా!

**శ్లో॥ ఏవ మాశ్వాస్య వైదేహీం హనుమా న్మారుతాత్మజః ।**
**గమనాయ మతిం కృత్వా వైదేహీ మభ్యవాదయత్ ॥ 8**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఆశ్వాస్య – వైదేహీం – హనుమాన్ – మారుతాత్మజః – గమనాయ – మతిం – కృత్వా – వైదేహీమ్ – అభ్యవాదయత్ ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః హనుమాన్ వైదేహీమ్ ఏవమ్ ఆశ్వాస్య గమనాయ మతిం కృత్వా వైదేహీమ్ అభ్యవాదయత్.

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః హనుమాన్ = వాయునందనుడైన హనుమ, వైదేహీం = సీతాదేవిని, ఏవం = ఈ రీతిగా, ఆశ్వాస్య = ఓదార్చి, గమనాయ = పయనమునకై, మతిం కృత్వా = నిశ్చయముచేసికొని, వైదేహీం = జానకమ్మకు, అభ్యవాదయత్ = మ్రొక్కెను.

**తాత్పర్యము :–** వాయునందనుడైన హనుమ సీతాదేవి నీరీతిగా నూఱడించి తిరుగు ప్రయాణమునకు నిశ్చయించుకొని ఇంకొకమాఱు సీతమ్మకు వందనము గావించెను.

**శ్లో॥ తత స్స కపిశార్దూల స్స్వామిసందర్శనోత్సుకః ।**
**ఆరురోహ గిరిశ్రేష్ఠ మరిష్ట మరిమర్దనః ॥ 9**

**పదచ్ఛేదము :–** తతః – సః – కపిశార్దూలః – స్వామిసందర్శనోత్సుకః – ఆరురోహ – గిరిశ్రేష్ఠమ్ – అరిష్టమ్ – అరిమర్దనః ॥

**అన్వయక్రమము :–** తతః అరిమర్దనః సః కపిశార్దూలః స్వామిసందర్శనోత్సుకః (సన్) గిరిశ్రేష్ఠమ్ అరిష్టమ్ ఆరురోహ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, అరిమర్దనః = శత్రుమర్దనుడైన, సః కపిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, స్వామిసందర్శనోత్సుకః (సన్) = ప్రభువును చూచుటకు వేగిరపడుచున్నవాడై, అరిష్టం = అరిష్టమను పేరుగల, గిరిశ్రేష్ఠం = పర్వతశ్రేష్ఠమును, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము :–** పిమ్మట శత్రుసంహారకుడైన వానరోత్తముడగు హనుమ తన ప్రభువైన శ్రీరాముని సందర్శించుటకై వేగిరపడుచు లంకాతీరమునందున్న అరిష్టమనెడు పర్వతము నారోహించెను.

**శ్లో॥ తుంగపద్మకజుష్టాభిర్నీలాభి ర్వనరాజిభిః ।**
**సోత్తరీయ మివాంభోదైః శృంగాంతరవిలంబిభిః ॥ 10**

**పదచ్ఛేదము** :– తుంగపద్మకజుష్టాభిః – నీలాభిః – వనరాజిభిః – సోత్తరీయమ్ – ఇవ – అంభోదైః – శృంగాంతరవిలంబిభిః ॥

**అన్వయక్రమము** :– తుంగపద్మకజుష్టాభిః నీలాభిః వనరాజిభిః (సపరిధానమ్ ఇవ) శృంగాంతరవిలంబిభిః అంభోదైః సోత్తరీయమ్ ఇవ చ (స్థితం అరిష్టం సః ఆరురోహ).

**ప్రతిపదార్థము** :– తుంగపద్మకజుష్టాభిః = ఉన్నతమైన పద్మకవృక్షములతో నిండినట్టియు, నీలాభిః = నల్లనైనవియునగు, వనరాజిభిః = వనపంక్తులతో (సపరిధానమ్ ఇవ = కట్టుబట్టలతో గూడినదివలెను), శృంగాంతరవిలంబిభిః = శిఖరములనడుమ వ్రేలుచున్న, అంభోదైః = మేఘములచే, సోత్తరీయమ్ ఇవ చ = ఉత్తరీయము కల్గినదివలెను, స్థితం = ఉన్నట్టి, (అరిష్టం సః ఆరురోహ = అరిష్టపర్వతమును హనుమ ఆరోహించెను).

**తాత్పర్యము** :– హనుమ యారోహించిన ఆ యరిష్టపర్వతము నిండ ఉన్నతమైన నల్లని పద్మకవృక్షములు వఱుసలు దీరి అవి యా కొండ ధరించిన వస్త్రములవలె నుండెను. శిఖరములపై మేఘపంక్తులు వ్రేలాడుచు అవి యా పర్వతము ధరించిన ఉత్తరీయమువలె నుండెను.

**శ్లో॥ బోధ్యమానమివ ప్రీత్యా దివాకరకరై శ్శుభైః ।**
**ఉన్మిషంతమి వోద్ధూతై ర్లోచనైరివ ధాతుభిః ॥ 11**

**పదచ్ఛేదము** :– బోధ్యమానం – ఇవ – ప్రీత్యా – దివాకరకరైః – శుభైః, ఉన్మిషంతమ్ – ఇవ – ఉద్ధూతైః – లోచనైః – ఇవ – ధాతుభిః ॥

**అన్వయక్రమము** :– శుభైః దివాకరకరైః ప్రీత్యా బోధ్యమానమ్ ఇవ, ఉద్ధూతైః ధాతుభిః లోచనైః ఉన్మిషంతమ్ ఇవ చ స్థితమ్ అరిష్టం సః ఆరురోహ.

**ప్రతిపదార్థము** :– శుభైః = మంగళకరమైన, దివాకరకరైః = సూర్యకిరణములచే, ప్రీత్యా = ప్రేమతో, బోధ్యమానమ్ ఇవ = మేలుకొలుపబడుచున్నదానివలెను, ఉద్ధూతైః = ఎగురుచున్నట్టి, ధాతుభిః = గైరికాదిధాతువులచే, లోచనైః = నేత్రములతో, ఉన్మిషంతమ్ ఇవ చ = కన్నులు తెఱచుచున్న దానివలెను, స్థితమ్ అరిష్టం సః ఆరురోహ = ఉన్నట్టి అరిష్టపర్వతమును హనుమ ఆరోహించెను).

**తాత్పర్యము** :– ఆ యరిష్టపర్వతముపై సూర్యుని కిరణములు సూటిగా పడుచుండెను. అవి సూర్యుడు తన చేతులతో నీ పర్వతమును మేలుకొలుపుచున్నట్టుగా గానవచ్చుచుండెను. అప్పుడా పర్వతము మీది రంగురంగుల గైరికాది ధాతువుల

శిలలు మిలమిల మెఱయుచుండగా నా పర్వతమే కన్నులువిప్పి చూచుచున్నట్లుండెను.

**శ్లో॥ తోయౌఘనిస్వనై ర్మంద్రైః ప్రాధీతమివ సర్వతః ।**
**ప్రగీతమివ విస్పష్టై ర్నానాప్రస్రవణస్వనైః ॥ 12**

**పదచ్ఛేదము** :– తోయౌఘనిస్వనైః – మంద్రైః – ప్రాధీతమ్ – ఇవ – సర్వతః – ప్రగీతమ్ – ఇవ – విస్పష్టైః – నానాప్రస్రవణస్వనైః ॥

**అన్వయక్రమము** :– సర్వతః మంద్రైః తోయౌఘనిస్వనైః ప్రాధీతమ్ ఇవ, విస్పష్టైః నానాప్రస్రవణస్వనైః ప్రగీతం ఇవ చ (స్థితం అరిష్టం సః ఆరురోహ).

**ప్రతిపదార్థము** :– సర్వతః = అంతటను, మంద్రైః = మధ్యమస్వరముగల, తోయౌఘనిస్వనైః = జలప్రవాహముయొక్క ధ్వనులచే, ప్రాధీతమ్ ఇవ = వేదాధ్యయనము చేయుచున్నదివలెను, విస్పష్టైః = మిక్కిలి స్పష్టమైన, నానాప్రస్రవణస్వనైః = బహువిధములైన సెలయేళ్ళధ్వనులచే, (ప్రగీతమ్ ఇవ = చక్కగా గానము చేయుచున్నది వలెను) (స్థితం = ఉన్నట్టి అరిష్టపర్వతమును) సః = హనుమ, ఆరురోహ = ఆరోహించెను).

**తాత్పర్యము** :– ఆ పర్వతముపై నంతటను మంద్రస్వరముతో చిన్న ఏఱులు ప్రవహించుచుండెను. ఆ మంద్రధ్వని వేదాధ్యయనము చేయుచున్న వారి స్వరమును బోలియుండెను. పెక్కుచోట్ల మీదినుండి తారస్వరముతో సెలయేళ్ళు ప్రవహించుచుండెను. ఆ స్వరము గొంతెత్తి పాడుచున్నవారి కంఠస్వరమువలె వినవచ్చుచుండెను.

**శ్లో॥ దేవదారుభి రత్యుచ్చై రూర్ధ్వబాహుమివ స్థితమ్ ।**
**ప్రపాతజలనిర్ఘోషైః ప్రాకృష్టమివ సర్వతః ॥ 13**

**పదచ్ఛేదము** :– దేవదారుభిః – అత్యుచ్చైః – ఊర్ధ్వబాహుమ్ – ఇవ – స్థితమ్, ప్రపాతజలనిర్ఘోషైః – ప్రాకృష్టమ్ ఇవ చ (స్థితం అరిష్టం సః ఆరురోహ) ॥

**అన్వయక్రమము** :– అత్యుచ్చైః దేవదారుభిః ఊర్ధ్వబాహుమ్ ఇవ, ప్రపాతజలనిర్ఘోషైః సర్వతః ప్రాకృష్టమ్ ఇవ చ (స్థితమ్ అరిష్టం సః ఆరురోహ).

**ప్రతిపదార్థము** :– అత్యుచ్చైః = మిక్కిలి యున్నతమైనట్టి, దేవదారుభిః = దేవదారు వృక్షములచే, ఊర్ధ్వబాహుమ్ ఇవ = ఎత్తైన చేతులు గలదిగను, ప్రపాతజలనిర్ఘోషైః = జలప్రపాతముల శబ్దములచే, సర్వతః = ఎల్లయెడలను, ప్రాకృష్టమ్ ఇవ = ఆక్రోశించుచున్నదివలెను, స్థితం = ఉన్నట్టి (అరిష్టం = అరిష్టపర్వతమును), సః =

ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము** :- అరిష్టపర్వతముపై మిక్కిలి యున్నతమైన దేవదారు వృక్షములు గానవచ్చుచుండెను. అవి యా గిరి చేతులు మీదికి ఎత్తియుంచెనా యన్నట్లున్నవి. ఆ పర్వతముపైనున్న జలప్రవాహములనుండి పెద్దధ్వని వినవచ్చుచుండగా నది ఆక్రోశించుచున్నట్లుండెను.

**శ్లో॥ వేపమానమివ శ్యామైః కంపమానై శ్శరద్వనైః ।**
**వేణుభి ర్మారుతోద్ధూతైః కూజంతమివ కీచకైః ॥ 14**

**పదచ్ఛేదము** :- వేపమానమ్ - ఇవ - శ్యామైః - కంపమానైః - శరద్వనైః - వేణుభిః - మారుతోద్ధూతైః - కూజంతమ్ - ఇవ - కీచకైః ॥

**అన్వయక్రమము** :- కంపమానైః శ్యామైః శరద్వనైః వేపమానమ్ ఇవ, మారుతోద్ధూతైః వేణుభిః కూజంతమ్ ఇవ (స్థితమ్ అరిష్టం సః ఆరురోహ).

**ప్రతిపదార్థము** :- కంపమానైః = కంపించుచున్నట్టి, శ్యామైః = నల్లనైన, శరద్వనైః = శరత్కాలవృక్షములచే, వేపమానమ్ ఇవ = వణుకుచున్నదివలెను, మారుతోద్ధూతైః = వాయువుచే కదల్చబడిన, కీచకైః వేణుభిః = బొంగువెదుళ్ళతో, కూజంతమ్ ఇవ చ = కూయుచున్నదివలెను, స్థితమ్ = ఉన్నట్టి, అరిష్టం = అరిష్టపర్వతమును, సః = ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- శరద్వనైః - ఏడాకుల అరటిచెట్టుమున్నగు శరత్కాలమున ఏపుగనుండు వృక్షములు.

**రా. శిరోమణి** :- శరద్ఘనైః - శరత్కాలమునందలి మేఘముల వంటి ఏడాకుల అరటిచెట్టుమున్నగువానిచే.

**తాత్పర్యము** :- కంపించుచున్న యేడాకుల అరటిచెట్టుమున్నగు శరత్కాల వృక్షములతో వణుకుచున్నదివలెను, గాలికి ధ్వనిచేయు బొంగు వెదుళ్ళచే పక్షుల కూతలతో కూడియున్నది వలెను ఆ యరిష్టపర్వతము గానవచ్చుచుండెను.

**శ్లో॥ నిశ్శ్వసంతమి వామర్షా ద్ఘోరై రాశీవిషోత్తమైః ।**
**నీహారకృతగంభీరై ర్ధ్యాయంతమివ గహ్వరైః ॥ 15**

**పదచ్ఛేదము** :- నిశ్శ్వసంతమ్ - ఇవ - అమర్షాత్ - ఘోరైః - ఆశీవిషోత్తమైః -

నీహారకృతగంభీరైః – ధ్యాయంతమ్ – ఇవ – గహ్వరైః ॥

**అన్వయక్రమము** :– ఘోరైః ఆశీవిషోత్తమైః అమర్షాత్ నిశ్శ్వసంతమ్ ఇవ, నీహారకృతగంభీరైః గహ్వరైః ధ్యాయంతమ్ ఇవ చ స్థితమ్ అరిష్టం సః ఆరురోహ.

**ప్రతిపదార్థము** :– ఘోరైః = భయంకరమైనట్టి, ఆశీవిషోత్తమైః = మహాసర్పములచే, అమర్షాత్ = క్రోధమువలన, నిశ్శ్వసంతమ్ ఇవ = నిట్టూర్పులు విడుచుచున్న వానివలెను, నీహారకృతగంభీరైః = మంచుచే కలిగిన గాంభీర్యముగల, గహ్వరైః = గుహలతో, ధ్యాయంతమ్ ఇవ చ = ధ్యానము చేయుచున్నవాని వలెను, స్థితం = ఉన్నట్టి, అరిష్టం = అరిష్ట పర్వతమును, సః = ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము** :– ఆ పర్వతము నందలి భీకరమైన మహా సర్పములు బుసలు కొట్టుచుండగా ఆ యద్రి క్రోధముతో నిట్టూర్పులు విడుచుచున్నట్లుండెను. అందలి గుహలు మంచుచే గప్పబడి యుండగా నా గిరిరాజు గంభీరముగా ధ్యానస్థితిలో నింద్రియములను నిరోధించి కూర్చుండియున్నట్లుండెను.

**శ్లో॥ మేఘపాదనిభైః పాదైః ప్రక్రాంతమివ సర్వతః ।**
**జృంభమాణమి వాకాశే శిఖరై రభ్రమాలిభిః ॥ 16**

**పదచ్ఛేదము** :– మేఘపాదనిభైః – పాదైః – ప్రక్రాంతమ్ – ఇవ – సర్వతః – జృంభమాణమ్ – ఇవ – ఆకాశే – శిఖరైః – అభ్రమాలిభిః ॥

**అన్వయక్రమము** :– మేఘపాదనిభైః పాదైః సర్వతః ప్రక్రాంతమ్ ఇవ, ఆకాశే అభ్రమాలిభిః శిఖరైః జృంభమాణమ్ ఇవ చ (స్థితమ్ అరిష్టమ్ ఆరురోహ).

**ప్రతిపదార్థము** :– మేఘపాదనిభైః = మేఘములపాదములతో సమానముగనున్నట్టి, పాదైః = పర్వతము క్రిందనున్న బండలచే, సర్వతః = అంతటను, ప్రక్రాంతమ్ ఇవ = నడచిపోవుచున్నది వలెను, ఆకాశే = ఆకాశమునందలి, అభ్రమాలిభిః = మేఘపంక్తులతో కూడియున్న, శిఖరైః = శిఖరములచే, జృంభమాణమ్ ఇవ = ఆవులించుచున్నదివలెను, స్థితం = ఉన్నట్టి, అరిష్టమ్ = అరిష్టపర్వతమును, సః = ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము** :– ఆ పర్వతము చుట్టునున్న ప్రాంతపర్వతములు మేఘములయొక్క పాదములవలె నుండుటచే ఆ పాదముతో పర్వతమే నడచి పోవుచున్నట్లుండెను. శిఖరములకడ తెల్లని మేఘములు నిలచియుండగా ఆ పర్వతము నోరుతెరచి ఆవలించుచున్నట్లు గానవచ్చుచుండెను.

**శ్లో॥ కూటైశ్చ బహుధా కీర్ణైః శోభితం బహుకందరైః ।**
**సాలతాలాశ్వకర్ణైశ్చ వంశైశ్చ బహుభి ర్వృతమ్ ॥ 17**

**పదచ్ఛేదము** :– కూటైః – చ – బహుధా – కీర్ణైః – శోభితం – బహుకందరైః, సాలతాలాశ్వకర్ణైః – చ – వంశైః – చ – బహుభిః – వృతమ్ ॥

**అన్వయక్రమము** :– బహుధా కీర్ణైః బహుకందరైః కూటైః చ శోభితం, సాలతాలాశ్వకర్ణైః బహుభిః వంశైః చ వృతమ్ – (అరిష్టం సః ఆరురోహ).

**ప్రతిపదార్థము** :– బహుధా = బహువిధములుగ, కీర్ణైః = చెదిరిపోయినట్టి, బహుకందరైః = పలుగుహలు కలిగినట్టి, కూటైః చ = శిఖరములతో, శోభితం = ప్రకాశించుచున్నదియును, సాలతాలాశ్వకర్ణైః చ = మద్దిచెట్లతోడను, తాడిచెట్లతోడను, గుఱ్ఱపుచెవి చెట్లతోడను, వృతం = చుట్టుకొనబడియున్న, (అరిష్టం = అరిష్ట పర్వతమును, సః = ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను).

**తాత్పర్యము** :– ఆ యరిష్టపర్వతమునిండ అన్నివైపుల ఎన్నో శిఖరములుండెను. ఆ శిఖరములు పెక్కుగుహలతో ప్రకాశించుచుండెను. మఱియు నా పర్వతము చుట్టును మద్ది, తాడి, గుఱ్ఱపుచెవి మున్నగు వృక్షములును, ఎన్నియో వెదురు పొదలును వెలయుచుండెను.

**శ్లో॥ లతావితానై ర్వితతైః పుష్పవద్భి రలంకృతమ్ ।**
**నానామృగగణాకీర్ణం ధాతునిష్యందభూషితమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– లతావితానైః – వితతైః – పుష్పవద్భిః – అలంకృతమ్, నానామృగగణాకీర్ణం – ధాతునిష్యందభూషితమ్ ॥

**అన్వయక్రమము** :– పుష్పవద్భిః వితతైః లతావితానైః అలంకృతం నానామృగగణాకీర్ణం ధాతునిష్యందభూషితం (అరిష్టం సః ఆరురోహ).

**ప్రతిపదార్థము** :– పుష్పవద్భిః = పుష్పములతో నిండినట్టివియును, వితతైః = విస్తరించియున్నట్టివియునగు, లతావితానైః = లతల సమూహములతో, అలంకృతం = అలంకరింపబడియున్నదియును, నానామృగగణాకీర్ణం = బహువిధములగు జంతువుల సమూహముతో నిండియున్నదియును, ధాతునిష్యందభూషితం = ధాతుద్రవముల స్రావములతో నలంకరింపబడియున్నదియునునగు, అరిష్టం = అరిష్టపర్వతమును, సః = ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము** :– ఆ యరిష్టపర్వతము పుష్పములతో కలకలలాడుచు దూరముగ కొనలు

సాగిన పూలతీగలతో నొప్పుచుండెను. బహువిధములగు మృగసమూహములు ముచ్చటగ అందు సంచరించుచుండెను. అటనట వివిధవర్ణముల ధాతుద్రవములు అందముగా స్రవించుచు గానవచ్చుచుండెను.

**శ్లో॥ బహుప్రస్రవణోపేతం శిలాసంచయసంకటమ్ ।**
**మహర్షి యక్ష గంధర్వ కిన్నరోరగసేవితమ్ ॥ 19**

**పదచ్ఛేదము** :– బహుప్రస్రవణోపేతం – శిలాసంచయసంకటమ్, మహర్షియక్షగంధర్వ కిన్నరోరగసేవితమ్ ॥

**అన్వయక్రమము** :– బహుప్రస్రవణోపేతం, శిలాసంచయసంకటమ్, మహర్షియక్షగంధర్వ కిన్నరోరగ సేవితమ్ అరిష్టం సః ఆరురోహ.

**ప్రతిపదార్థము** :– బహుప్రస్రవణోపేతం = అనేకములైన సెలయేళ్ళతో కూడినదియును, శిలాసంచయసంకటం = ఱాళ్లగుట్టలతో క్రిక్కిరిసియున్నదియును, మహర్షియక్షగంధర్వకిన్నరోరగసేవితం = మహాఋషులచేతను, యక్షులచేతను, గంధర్వులచేతను, కిన్నరులచేతను, నాగులచేతను, సేవింపబడుచున్నదియును అగు, (అరిష్టం = అరిష్టపర్వతమును, సః = ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను).

**తాత్పర్యము** :– ఆ యరిష్టపర్వతముపై ఎన్నో సెలయేళ్లు సుందరముగ ప్రవహించు చుండెను. అడుగడుగున వివిధాకారములలో నున్న శిలల సమూహములు ముచ్చట గొల్పుచుండెను. అచ్చట మహర్షులు, యక్షులు, గంధర్వులు, కిన్నరులు, నాగులు మున్నగువారు దాని నాశ్రయించి వసించుచుండిరి.

**శ్లో॥ లతాపాదపసంబాధం సింహాధ్యుషితకందరమ్ ।**
**వ్యాఘ్రసంఘసమాకీర్ణం స్వాదుమూలఫలోదకమ్ ॥ 20**

**పదచ్ఛేదము** :– లతాపాదపసంబాధం – సింహాధ్యుషితకందరమ్, వ్యాఘ్రసంఘ సమాకీర్ణం స్వాదుమూలఫలోదకమ్ ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– లతాపాదపసంబాధం = వృక్షములయొక్కయు, లతలయొక్కయు, గుబురులుగలదియును, సింహాధ్యుషితకందరం = సింహములచే వసింపబడుచున్న గుహలు గలదియును, వ్యాఘ్రసంఘసమాకీర్ణం = పెద్దపులులమందలతో నిండియున్నదియును, స్వాదుమూలఫలోదకం = రుచికరమైన మూలములును, ఫలములును, జలములును గలదియునగు, (అరిష్టం = అరిష్టపర్వతమును, సః =

ఆ హనుమ, ఆరురోహ = ఆరోహించెను).

**తాత్పర్యము** :– మఱియు నా పర్వతముపై వివిధములైన లతలును వృక్షములు క్రిక్కిరిసియుండెను. అందలి గుహలలో సింహములు సుఖముగా వసించుచుండెను. పెద్దపులుల మందలు అటనట పరువిడుచుండెను. అచటి కందమూలములు, పండ్లు, నీరు మిక్కిలి మధురముగ నుండెను.

**శ్లో॥ త మారురోహ హనుమాన్ పర్వతం ప్లవగోత్తమః ।**
**రామదర్శనశీఘ్రేణ ప్రహర్షే ణాభిచోదితః ॥ 21**

**పదచ్ఛేదము** :– తమ్ – ఆరురోహ – హనుమాన్ – పర్వతం – ప్లవగోత్తమః, రామదర్శనశీఘ్రేణ – ప్రహర్షేణ – అభిచోదితః ॥

**అన్వయక్రమము** :– ప్లవగోత్తమః హనుమాన్ రామదర్శనశీఘ్రేణ ప్రహర్షేణ అభిచోదితః (సన్) తం పర్వతమ్ ఆరురోహ.

**ప్రతిపదార్థము** :– ప్లవగోత్తమః = వానరశ్రేష్ఠుడైన, హనుమాన్ = హనుమ, రామదర్శనశీఘ్రేణ = శ్రీరామునియొక్క దర్శనము నందలి వేగిరపాటుతో కూడిన, ప్రహర్షేణ = అధికసంతోషముతో, అభిచోదితః = మిక్కిలి ప్రేరేపింపబడినవాడై, తం పర్వతం = ఆ యరిష్టపర్వతమును, ఆరురోహ = ఆరోహించెను.

**తాత్పర్యము** :– వానరోత్తముడైన హనుమ శ్రీరాముని దర్శింపవలెనను వేగిరపాటుతో కూడిన మహానందముతో ఆ యరిష్టపర్వతమును ఒక్క అంగతో ఎగిరి ఆరోహించెను.

**శ్లో॥ తేన పాదతలాక్రాంతా రమ్యేషు గిరిసానుషు ।**
**సఘోషా స్సమశీర్యంత శిలా శ్చూర్ణీకృతా స్తతః ॥ 22**

**పదచ్ఛేదము** :– తేన – పాదతలాక్రాంతాః – రమ్యేషు – గిరిసానుషు, సఘోషాః – సమశీర్యంత – శిలాః – చూర్ణీకృతాః – తతః ॥

**అన్వయక్రమము** :– రమ్యేషు గిరిసానుషు తేన పాదతలాక్రాంతాః శిలాః సఘోషాః సమశీర్యంతః తతః చూర్ణీకృతాః.

**ప్రతిపదార్థము** :– రమ్యేషు = సుందరములైనట్టి, గిరిసానుషు = కొండచరియలయందు, తేన = ఆ హనుమచే, పాదతలాక్రాంతాః = అరికాళ్లచే త్రొక్కబడినట్టి, శిలాః = శిలలు, సఘోషాః = ధ్వనితో కూడినవై, సమశీర్యంత = ముక్కలు ముక్కలైనవి, తతః = పిమ్మట, చూర్ణీకృతాః = చూర్ణమైపోయినవి.

**తాత్పర్యము :–** సుందరమైన ఆ కొండయందలి చఱియలపై హనుమ యుఱుకగనే అచ్చటి శిలలు పెద్దధ్వనితో నలిగి నుగ్గునుగ్గయిపోయినవి.

**శ్లో॥ స త మారుహ్య శైలేంద్రం వ్యవర్ధత మహాకపిః ।**
**దక్షిణా దుత్తరం పారం ప్రార్థయన్ లవణాంభసః ॥ 23**

**పదచ్ఛేదము :–** సః – తమ్ – ఆరుహ్య – శైలేంద్రం – వ్యవర్ధత – మహాకపిః, దక్షిణాత్ – ఉత్తరం – పారం – ప్రార్థయన్ – లవణాంభసః ॥

**అన్వయక్రమము :–** లవణాంభసః దక్షిణాత్ ఉత్తరం పారం ప్రార్థయన్ సః మహాకపిః తం శైలేంద్రమ్ ఆరుహ్య వ్యవర్ధత.

**ప్రతిపదార్థము :–** లవణాంభసః = లవణసముద్రముయొక్క, దక్షిణాత్ = దక్షిణమునుండి, ఉత్తరం పారం = ఉత్తరతీరమును, ప్రార్థయన్ = అభిలషించుచు, సః మహాకపిః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, తం శైలేంద్రం = ఆ మహాపర్వతమును, ఆరుహ్య = ఆరోహించి, వ్యవర్ధత = వృద్ధిపొందెను.

**తాత్పర్యము :–** హనుమ లంకయందలి యా సముద్రదక్షిణతీరమునకు చేరి తనవారున్న ఆవలి ఉత్తరపు తీరమునకు చేరుటకై ఆ యరిష్టపర్వతము నారోహించి తన గమనమున కనుకూలముగా తన శరీరమును మిక్కిలిగా పెంచుకొనెను.

**శ్లో॥ అధిరుహ్య తతో వీరః పర్వతం పవనాత్మజః ।**
**దదర్శ సాగరం భీమం మీనోరగనిషేవితమ్ ॥ 24**

**పదచ్ఛేదము :–** అధిరుహ్య – తతః – వీరః – పర్వతం – పవనాత్మజః, దదర్శ – సాగరం – భీమం – మీనోరగనిషేవితమ్ ॥

**అన్వయక్రమము :–** తతః వీరః పవనాత్మజః పర్వతమ్ అధిరుహ్య మీనోరగనిషేవితం భీమం సాగరం దదర్శ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, వీరః = వీరుడైన, పవనాత్మజః = వాయునందనుడు, పర్వతం = అరిష్టపర్వతమును, అధిరుహ్య = ఆరోహించి, మీనోరగనిషేవితం = మత్స్యములతోడను, నాగములతోడను నిండిన, భీమం = భయంకరమైన, సాగరం = సముద్రమును, దదర్శ = చూచెను;

**తాత్పర్యము :–** వీరుడయిన వాయునందనుడు ఆ యరిష్టపర్వతము నారోహించి మహామీనములతోడను సర్పములతోడను భయంకరమైయున్న సాగరమును గాంచెను.

**శ్లో॥ స మారుత ఇవాకాశం మారుత స్యాత్మసంభవః ।**
**ప్రపేదే హరిశార్దూలో దక్షిణా దుత్తరాం దిశమ్ ॥ 25**

**పదచ్ఛేదము** :- సః - మారుతః - ఇవ - ఆకాశం - మారుతస్య - ఆత్మసంభవః - ప్రపేదే - హరిశార్దూలః - దక్షిణాత్ - ఉత్తరాం - దిశమ్ ॥

**అన్వయక్రమము** :- హరిశార్దూలః మారుతస్య ఆత్మసంభవః సః మారుతః ఆకాశం ఇవ దక్షిణాత్ ఉత్తరాం దిశం ప్రపేదే ॥

**ప్రతిపదార్థము** :- హరిశార్దూలః = వానర శ్రేష్ఠుడును, మారుతస్య = వాయువునకు, ఆత్మసంభవః = పుత్రుడునగు, సః = ఆ హనుమ, మారుతః = వాయువు, ఆకాశమ్ ఇవ = ఆకాశమువలె, దక్షిణాత్ = దక్షిణ దిక్కునుండి, ఉత్తరాం దిశం = ఉత్తరదిక్కును, ప్రపేదే = పొందెను.

**తాత్పర్యము** :- వాయునందనుడైన యా హనుమ అప్పుడు వాయువు సాధారణముగా ఆకాశమునందు దక్షిణదిక్కునుండి ఉత్తరదిశకు పయనము సాగించునట్లుగానే తా నా దక్షిణతీరపర్వతమునుండి ఉత్తరతీరమునకు వెడలెను.

**శ్లో॥ స తదా పీడితస్తేన కపినా పర్వతోత్తమః ।**
**రరాస సహ తై ర్భూతైః ప్రవిశన్ వసుధాతలమ్ ।**
**కంపమానై శ్చ శిఖరైః పతద్భి రపి చ ద్రుమైః ॥ 26**

**పదచ్ఛేదము** :- సః - తదా - పీడితః - తేన - కపినా - పర్వతోత్తమః, రరాస - సహ - తైః - భూతైః - ప్రవిశన్ - వసుధాతలమ్, కంపమానైః - చ - శిఖరైః - పతద్భిః - అపి - చ - ద్రుమైః ॥

**అన్వయక్రమము** :- తదా తేన కపినా పీడితః పర్వతోత్తమః కంపమానైః శిఖరైః చ, పతద్భిః ద్రుమైః అపి, వసుధాతలమ్ ప్రవిశన్, తైః భూతైః సహ రరాస.

**ప్రతిపదార్థము** :- తదా = అప్పుడు, తేన కపినా = ఆ హనుమచే, పీడితః = పీడింపబడినట్టి, కంపమానైః = కంపించుచున్నట్టి, శిఖరైః చ = శిఖరములతోడను, పతద్భిః = పడిపోవుచున్నట్టి, ద్రుమైః చ = వృక్షములతోడను, సః పర్వతోత్తమః = ఆ పర్వతశ్రేష్ఠము, వసుధాతలం = భూతలమును, ప్రవిశన్ = ప్రవేశించుచు, తైః భూతైః సహ = ఆ భూతములతోగూడ, రరాస = ఆక్రోశించెను.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమ ఎగురుటకు అదుమగనే ఆ మహాపర్వతము కంపించుచున్న శిఖరములతోడను, కూలిపోవుచున్న చెట్లతోడను భూమిలోనికి

దిగబడుచు ఆ పర్వతము నందలి ప్రాణులన్నిటితో గలసి ఆక్రోశించుచున్నట్లుండెను.

**శ్లో॥ త స్యోరువేగోన్మథితాః పాదపాః పుష్పశాలినః ।**
**నిపేతు ర్భూతలే భగ్నాః శక్రాయుధహతా ఇవ ॥ 27**

**పదచ్ఛేదము :-** తస్య - ఊరువేగోన్మథితాః - పాదపాః - పుష్పశాలినః - నిపేతుః - భూతలే - భగ్నాః - శక్రాయుధహతాః - ఇవ ॥

**అన్వయక్రమము :-** తస్య ఊరువేగోన్మథితాః పుష్పశాలినః పాదపాః భగ్నాః శక్రాయుధహతాః ఇవ భూతలే నిపేతుః.

**ప్రతిపదార్థము :-** తస్య = ఆతనియొక్క, ఊరువేగోన్మథితాః = తొడలయొక్క వేగముచే నొరిపిడి నొందినట్టి, పుష్పశాలినః = పుష్పములతో నిండినట్టి, పాదపాః = వృక్షములు, భగ్నాః = శిథిలమైనవై, శక్రాయుధహతా ఇవ = దేవేంద్రుని వజ్రాయుధముచే ప్రహరింపబడినవివలె, భూతలే = భూమిపై, నిపేతుః = కూలినవి.

**తాత్పర్యము :-** ఆ హనుమయొక్క ప్రయాణవేగమున అతని తొడలచే ఒరిపిడినొందిన పుష్పవృక్షములు పిడుగుపడినప్పుడువలె శిథిలములై నేల గూలినవి.

**శ్లో॥ కందరోదరసంస్థానాం పీడితానాం మహౌజసామ్ ।**
**సింహానాం నినదో భీమో నభో భిందన్ హి శుశ్రువే ॥ 28**

**పదచ్ఛేదము :-** కందరోదరసంస్థానాం - పీడితానాం - మహౌజసామ్, సింహానాం - నినదః - భీమః - నభః -భిందన్ - హి - శుశ్రువే ॥

**అన్వయక్రమము :-** కందరోదరసంస్థానాం మహౌజసాం సింహానాం పీడితానాం భీమః నినదః నభః భిందన్ శుశ్రువే హి.

**ప్రతిపదార్థము :-** కందరోదరసంస్థానాం = గుహలలోపలనుండినట్టి, మహౌజసాం = గొప్పపరాక్రమము గల్గిన, పీడితానాం = పీడనొందినట్టి, సింహానాం = సింహములయొక్క, భీమః నినదః = భయంకరమైన శబ్దము (గర్జనము), నభః = ఆకాశమును, భిందన్ = బ్రద్దలుగొట్టుచు, శుశ్రువే హి = గొప్పగ వినబడెను.

**తాత్పర్యము :-** హనుమంతుడు ఆ పర్వతము నదమగా బాధనొంది గుహలో నివసించుచున్న మహాపరాక్రమముగల సింహములు భయముతో భీకరముగా గర్జించుచుండగా ఆ ధ్వని నభోమండలమును బ్రద్దలు గొట్టుచు మిగుల భయావహముగా వినిపించెను.

**శ్లో॥ స్రస్తవ్యావిద్ధవసనా వ్యాకులీకృతభూషణాః ।**
**విద్యాధర్య స్సముత్పేతు స్సహసా ధరణీధరాత్ ॥ 29**

**పదచ్ఛేదము** :- స్రస్తవ్యావిద్ధవసనాః - వ్యాకులీకృతభూషణాః - విద్యాధర్యః - సముత్పేతుః - సహసా - ధరణీధరాత్ ॥

**అన్వయక్రమము** :- విద్యాధర్యః స్రస్తవ్యావిద్ధవసనాః వ్యాకులీకృతభూషణాః (సత్యః) సహసా ధరణీధరాత్ సముత్పేతుః.

**ప్రతిపదార్థము** :- విద్యాధర్యః = విద్యాధరస్త్రీలు, స్రస్తవ్యావిద్ధవసనాః = జాఱి చెదరిపోయినట్టి వస్త్రము గలవారును, వ్యాకులీకృతభూషణాః = చెదిరిపోయిన నగలుగలవారును, (సత్యః = అగుచున్నవారై) సహసా = వెంటనే, ధరణీధరాత్ = పర్వతమునుండి, సముత్పేతుః = మీది కెగిరిరి.

**తాత్పర్యము** :- అందలి విద్యాధరస్త్రీలు భయముచే గలిగిన తొట్రుపాటు వలన తమ తమ చీరలు విడివడి జాఱిపోవుచుండగా ఒడలి మీద నున్న నగలు చెదరిపోవుచుండగా వారు తత్క్షణమే ఆ పర్వతమును వీడి ఆకసమున కెగసిరి.

**శ్లో॥ అతిప్రమాణా బలినో దీప్తజిహ్వా మహావిషాః ।**
**నిపీడితశిరోగ్రీవా వ్యవేష్టన్త మహాహయః ॥ 30**

**పదచ్ఛేదము** :- అతిప్రమాణాః - బలినః - దీప్తజిహ్వాః - మహావిషాః, నిపీడితశిరోగ్రీవాః - వ్యవేష్టంత - మహాహయః ॥

**అన్వయక్రమము** :- అతిప్రమాణాః బలినః దీప్తజిహ్వాః మహావిషాః మహాహయః నిపీడితశిరోగ్రీవాః (సంతః) వ్యవేష్టంత.

**ప్రతిపదార్థము** :- అతిప్రమాణాః = గొప్పపరిమాణము గలవియును, బలినః = గొప్పబలముగలవియును, దీప్తజిహ్వాః = జ్వలించుచున్న నాలుకలుగలవియును, మహావిషాః = తీవ్రమైన విషముగలవియునగు, మహాహయః = మహాసర్పములు, నిపీడితశిరోగ్రీవాః (సంతః) = చితుక గొట్టబడిన తలలును కంఠములును గలవై, వ్యవేష్టంత = చుట్టచుట్టుకొని పోయినవి.

**తాత్పర్యము** :- మిక్కిలి పొడవైన శరీరములుగలిగి మహాబలముతో నుండెడి ఆ పర్వతము మీది మహాసర్పములు జ్వలించుచున్న తమ నాలుకలనుండి తీవ్రమైన విషమును గ్రక్కుచు చిదికిపోయిన తలలతోను, కంఠములతోను తమలో తాము చుట్టలు చుట్టుకొనసాగినవి.

**శ్లో॥ కిన్నరోరగగంధర్వ యక్షవిద్యాధరా స్తదా ।**
**పీడితం తం నగవరం త్యక్త్వా గగన మాశ్రితాః ॥ 31**

**పదచ్ఛేదము :-** కిన్నరోరగగంధర్వయక్షవిద్యాధరాః - తదా, పీడితం - తం - నగవరం - త్యక్త్వా - గగనమ్ - ఆశ్రితాః ॥

**అన్వయక్రమము :-** తదా కిన్నరోరగగంధర్వయక్షవిద్యాధరాః పీడితం తం నగవరం త్యక్త్వా గగనమ్ ఆశ్రితాః.

**ప్రతిపదార్థము :-** తదా = అప్పుడు, కిన్నరోరగగంధర్వయక్షవిద్యాధరాః = కిన్నరులును, ఉరగులును, గంధర్వులును, యక్షులును, విద్యాధరులును, పీడితం = పీడింపబడినట్టి, తం నగవరం = ఆ పర్వతశ్రేష్ఠమును, త్యక్త్వా = విడిచి, గగనం = ఆకాశమును, ఆశ్రితాః = ఆశ్రయించిరి.

**తాత్పర్యము :-** అప్పుడా పర్వతవాసులైన కిన్నరులును, ఉరగులును, గంధర్వులును యక్షులును, విద్యాధరులును హనుమచే పీడింపబడిన యా పర్వతమున నిలువజాలక దానిని విడిచిపెట్టి ఆకాశము నాశ్రయించిరి.

**శ్లో॥ స చ భూమిధర శ్శ్రీమాన్ బలినా తేన పీడితః ।**
**సవృక్షశిఖరోదగ్రః ప్రవివేశ రసాతలమ్ ॥ 32**

**పదచ్ఛేదము :-** సః - చ - భూమిధరః - శ్రీమాన్ - బలినా - తేన - పీడితః - సవృక్షశిఖరోదగ్రః ప్రవివేశ రసాతలమ్ ॥

**అన్వయక్రమము :-** శ్రీమాన్ సః భూమిధరః బలినా తేన పీడితః సవృక్షశిఖరోదగ్రః రసాతలం ప్రవివేశ.

**ప్రతిపదార్థము :-** శ్రీమాన్ = గొప్పశోభతో గూడిన, సః భూమిధరః = ఆ పర్వతము, బలినా = బలాఢ్యుడైన, తేన = ఆ హనుమచే, పీడితః = పీడింపబడినదై, సవృక్షశిఖరోదగ్రః = వృక్షములతో గూడిన శిఖరములచే ఉన్నతమైనట్టిదై, రసాతలం = పాతాళమును, ప్రవివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము :-** మహాబలాఢ్యుడైన యా హనుమ అదమగా అందమైన ఆ పర్వతము ఉన్నతమైన వృక్షములతో నిండిన శిఖరములతో కలిపి పాతాళలోకము లోనికి కూరుకొని పోయెను.

**శ్లో॥ దశయోజనవిస్తార స్త్రింశద్యోజనముచ్ఛ్రితః ।**
**ధరణ్యాం సమతాం యాత స్స బభూవ ధరాధరః ॥ 33**

**పదచ్ఛేదము** :- దశయోజనవిస్తారః - త్రింశద్యోజనమ్ - ఉచ్ఛ్రితః - ధరణ్యాం - సమతాం - యాతః - సః - బభూవ - ధరాధరః ॥

**అన్వయక్రమము** :- దశయోజనవిస్తారః త్రింశద్యోజనమ్ ఉచ్ఛ్రితః సః ధరాధరః ధరణ్యాం సమతాం యాతః బభూవ.

**ప్రతిపదార్థము** :- దశయోజనవిస్తారః = పది యోజనముల వెడల్పు గలదియును, త్రింశద్యోజనం =ముప్పదియోజనములు, ఉచ్ఛ్రితః = ఉన్నతమైనదియునగు, సః ధరాధరః = ఆ పర్వతము, ధరణ్యాం = భూమియందు, సమతాం = చదునును, యాతః = పొందినది, బభూవ = ఆయెను.

**తాత్పర్యము** :- పది యోజనముల వెడల్పును, ముప్పది యోజనముల పొడవును గల్గినట్టి యా పర్వతము అప్పుడు పాతాళమునకు దిగబడి నేలతో సమానముగా చదునై పోయినది.

**శ్లో॥ స లిలంఘయిషు ర్భీమం సలీలం లవణార్ణవమ్ ।**
**కల్లోలాస్ఫాలవేలాంత ముత్పపాత నభో హరిః ॥ 34**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"ప్రతిప్రయాణోత్పతనం" నామ*
*షట్పంచాశస్సర్గః.*

**పదచ్ఛేదము** :- సః - లిలంఘయిషుః - భీమం - సలీలం - లవణార్ణవమ్, కల్లోలాస్ఫాలవేలాంతమ్ - ఉత్పపాత - నభః - హరిః ॥

**అన్వయక్రమము** :- సః హరిః కల్లోలాస్ఫాలవేలాంతం భీమం లవణార్ణవం లిలంఘయిషుః నభః ఉత్పపాత.

**ప్రతిపదార్థము** :- సః హరిః = ఆ హనుమ, కల్లోలాస్ఫాలవేలాంతం = కెరటములయొక్క, చఱపులుగల తీరప్రాంతము గల్గినట్టి, భీమం = భీకరమైనట్టి, లవణార్ణవం = లవణసముద్రమును, లిలంఘయిషుః = దాటగోరినవాడై, సలీలం = హేలగా, నభః = ఆకసమునుగూర్చి, ఉత్పపాత = ఎగిరెను.

**తాత్పర్యము :-** ఆ హనుమ కల్లోలమైన తరంగముల తాకిడి నొందుచున్న తీరముతో భయంకరముగా నున్నట్టి లవణసముద్రమును హేలగా దాటగోరి ఒక్కమాఱుగా ఆకసమున కెగసెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"ప్రతిప్రయాణోత్పతనము" అను*
*ఏబదియారవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

★★★

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తపంచాశసర్గ

**శ్లో॥ సచంద్రకుముదం రమ్యం సార్కకారండవం శుభమ్ ।**
**తిష్యశ్రవణకాదంబ మభ్రశైవాలశాద్వలమ్ ॥ 1**

**పదచ్ఛేదము** :- సచంద్రకుముదం - రమ్యం - సార్కకారండవం - శుభమ్, తిష్యశ్రవణకాదంబమ్ - అభ్రశైవాలశాద్వలమ్ ॥

**శ్లో॥ పునర్వసుమహామీనం లోహితాంగమహాగ్రహమ్ ।**
**ఐరావతమహాద్వీపం స్వాతీహంసవిలాసితమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :- పునర్వసుమహామీనం - లోహితాంగమహాగ్రహమ్ - ఐరావత మహాద్వీపం - స్వాతీహంసవిలాసితమ్ ॥

**శ్లో॥ వాతసంఘాతజాతోర్మిచంద్రాంశుశిశిరాంబుమత్ ।**
**భుజంగయక్షగంధర్వ ప్రబుద్ధకమలోత్పలమ్ ॥ 3**

**పదచ్ఛేదము** :- వాతసంఘాతజాతోర్మిచంద్రాంశుశిశిరాంబుమత్, భుజంగయక్షగంధర్వ ప్రబుద్ధకమలోత్పలమ్ ॥

**శ్లో॥ హనుమా న్మారుతగతి ర్మహానౌరివ సాగరమ్ ।**
**అపార మపరిశ్రాంతః పుప్లువే గగనార్ణవమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :- హనుమాన్ - మారుతగతిః - మహానౌః - ఇవ - సాగరమ్, అపారమ్ - అపరిశ్రాంతః - పుప్లువే - గగనార్ణవమ్ ॥

**అన్వయక్రమము** :- సచంద్రకుముదం, రమ్యం సార్కకారండవం శుభం తిష్యశ్రవణ కాదంబమ్ అభ్రశైవాలశాద్వలం, పునర్వసుమహామీనం, లోహితాంగమహాగ్రహం, ఐరావతమహాద్వీపం, స్వాతీహంసవిలాసితం, వాతసంఘాతజాతోర్మిచంద్రాంశు శిశిరాంబుమత్, భుజంగయక్షగంధర్వప్రబుద్ధకమలోత్పలం అపారం గగనార్ణవం హనుమాన్ మారుతగతిః (సన్) మహానౌః సాగరమ్ ఇవ అపరిశ్రాంతః పుప్లువే.

**ప్రతిపదార్థము :-** సచంద్రకుముదం = చంద్రుడనెడు తెల్లకలువతో గూడినదియును; రమ్యం = సుందరమైనదియును, సార్కకారండవం = సూర్యుడనెడు నీరుకోడిని గలిగియున్నదియును, శుభం = మంగళకరమైనదియును, తిష్యశ్రవణకాదంబం = పుష్యమి శ్రవణము అను పేరులుగల నక్షత్రములనెడు హంసలు కలదియును, అభ్రశైవాలశాద్వలం = మేఘములనెడు నాచుతో పచ్చికతో గూడినదియును, పునర్వసు మహామీనం = పునర్వసు నక్షత్రమనెడు పెద్ద మత్స్యము గలదియును, లోహితాంగమహాగ్రహం = అంగారక గ్రహ మనెడు పెద్దమొసలి గలదియును, ఐరావతమహాద్వీపం = ఐరావత గజమనెడు పెద్ద దీవి కలదియును, (ఐరావతమును 'అభ్రమాతంగము' అందురు) స్వాతీహంసవిలాసితం = స్వాతి నక్షత్రమనెడు హంసచేత ప్రకాశించుచున్నదియును, వాతసంఘాతజాతోర్మిచంద్రాంశుశిశిరాంబుమత్ = వాయువుల సమూహము లనెడు కెరటములను, చంద్రకిరణము లనెడు చల్లని నీరును గలదియును, భుజంగయక్షగంధర్వ ప్రబుద్ధకమలోత్పలం = నాగులు యక్షులు గంధర్వులనెడి వికసించిన తామరపువ్వులును కలువపువ్వులును గలదియును, అపారం = అనంతమైనదియునగు, గగనార్ణవం = ఆకసమనెడు సముద్రమును, హనుమాన్ = హనుమ, మారుతగతిః (సన్) = వాయువుతో సమానమైన గమనము గలవాడై, మహానౌః = పెద్ద ఓడ, సాగరమ్ ఇవ = సముద్రమునువలె, అపరిశ్రాంతః = అలసటలేని వాడై, పుప్లవే = లంఘించెను.

**సూచన :-** స్వాతీహంసవిలాసితమ్ అనుటకు బదులుగా స్వాతీహంసవిలోలితమ్ అని పాఠాంతరము.

**తాత్పర్యము :-** అటుపిమ్మట హనుమ చంద్రుడనెడు కలువలతోడను, సూర్యుడనెడు జలపక్షితోడను, పుష్యమి శ్రవణము అనెడు కలహంసలతోడను, మేఘములనెడు నాచు పచ్చిక తోడను, పునర్వసు అనెడు మహామత్స్యములతోడను, అంగారక గ్రహమనెడు పెద్ద మొసలితోడను, ఐరావత దిగ్గజ మనెడు పెద్దద్వీపము తోడను, స్వాతి యనెడు హంసతోడను, పెనుగాలుల సమూహమనెడు కెరటములతోడను, చంద్ర కిరణములనెడు చల్లని నీటితోడను, భుజంగయక్షగంధర్వులనెడు వికసించిన తామరపూవులతోడను, కలువపువ్వులతోడను, రమణీయముగను మంగళకరముగను ఉండి అనంతమైన ఆకాశమనెడు మహాసముద్రమును వాయువేగముతో ఒకానొక మహానౌక మహా సాగరమును దాటుచున్నట్లు ఏమియు శ్రమలేకుండ హనుమ దాటుచుండెను.

**శ్లో॥ గ్రసమాన ఇ వాకాశం తారాధిప మి వోల్లిఖన్ ।**
**హర న్నివ సనక్షత్రం గగనం సార్కమండలమ్ ॥ 5**

**శ్లో॥ మారుత స్యాత్మజ శ్శ్రీమాన్ కపి ర్వ్యోమచరో మహాన్ ।**
**హనుమా న్మేఘజాలాని వికర్షన్నివ గచ్ఛతి ॥ 6**

**పదచ్ఛేదము :–** గ్రసమానః – ఇవ – ఆకాశం – తారాధిపమ్ – ఇవ – ఉల్లిఖన్, హరన్ – ఇవ – సనక్షత్రం – గగనం – సార్కమండలమ్, మారుతస్య – ఆత్మజః – మేఘజాలాని – వికర్షన్ – ఇవ – గచ్ఛతి ॥

**అన్వయక్రమము :–** మారుతస్య ఆత్మజః శ్రీమాన్ మహాన్ కపిః హనుమాన్ వ్యోమచరః (సన్) ఆకాశం గ్రసమానః ఇవ, తారాధిపం ఉల్లిఖన్ ఇవ, మేఘజాలాని వికర్షన్ ఇవ గచ్ఛతి.

**ప్రతిపదార్థము :–** మారుతస్య = వాయుదేవునియొక్క, ఆత్మజః = పుత్రుడును, శ్రీమాన్ = శుభలక్షణసముపేతుడును, మహాన్ = మహనీయుడును అగు, కపిః హనుమాన్ = వానరశ్రేష్ఠుడైన హనుమ, వ్యోమచరః (సన్) = ఆకసమున పయనించుచున్నవాడై, ఆకాశం = ఆకాశమును, గ్రసమానః ఇవ = మ్రింగివేయుచున్నవాడువలెను, తారాధిపం = చంద్రుని, ఉల్లిఖన్ ఇవ = ఒరయుచున్నవానివలెను, సనక్షత్రం = నక్షత్రములతో గూడినదియును, సార్కమండలం = సూర్యబింబముతో గూడినదియునగు, గగనం = ఆకాశమును, హరన్ ఇవ = హరించుచున్నవానివలెను, మేఘజాలాని = మేఘబృందములను, వికర్షన్ ఇవ = లాగికొనిపోవుచున్నవానివలెను, గచ్ఛతి = పోవుచుండెను.

**తాత్పర్యము :–** వాయునందనుడును మహనీయుడును అగు శ్రీమంతుడైన హనుమంతుడు అట్లు ఆకాశమునందు పయనించుచు ఆ యాకాశమును మ్రింగివేయుచున్నవానివలెను, అచటి చంద్రునితో నొరయగోరుచున్నవానివలెను, నక్షత్రములతోడను, సూర్యమండలముతోడను గూడిన ఆకాశమును హరించుకొని పోవుచున్నవానివలెను, అందలి మేఘముల గుంపును తనతో లాగికొని పోవుచున్న వానివలెను గన్పట్టుచు ముందుకు బోవుచుండెను.

**శ్లో॥ పాండురారుణవర్ణాని నీలమాంజిష్ఠకాని చ ।**
**హరితారుణవర్ణాని మహాభ్రాణి చకాశిరే ॥ 7**

**పదచ్ఛేదము :–** పాండురారుణవర్ణాని – నీలమాంజిష్ఠకాని చ – హరితారుణవర్ణాని

- మహాభ్రాణి - చకాశిరే ॥

**అన్వయక్రమము** :- (తత్ర) మహాభ్రాణి పాండురారుణవర్ణాని నీలమాంజిష్ఠకాని చ హరితారుణవర్ణాని చ చకాశిరే.

**ప్రతిపదార్థము** :- (తత్ర = అచ్చటి) మహాభ్రాణి = పెద్దమేఘములు, పాండురారుణవర్ణాని = తెల్లని ఎఱ్ఱనిరంగులుగలవిగను, నీలమాంజిష్ఠకాని చ = నల్లనివి పచ్చనివిగాను, హరితారుణవర్ణాని = పచ్చని ఎఱ్ఱనివర్ణములు గలవిగను, చకాశిరే = ప్రకాశించినవి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- మహాభ్రాణి - ఇచ్చటి మేఘములు హనుమచే తనవెంట లాగికొనిపోబడుచున్నవని తెలియవలెను.

**తాత్పర్యము** :- హనుమ వెంటనున్న ఆ మేఘబృందములు అతని ఒడలిపైగల రత్నాభరణముల కాంతులచే కొన్ని తెల్లని ఎఱ్ఱని రంగులతోడను, మఱికొన్ని నల్లని పచ్చని రంగులతోడను ఇంకను కొన్ని పచ్చని ఎఱ్ఱని రంగులతోడను ప్రకాశించుచుండినవి.

**శ్లో॥ ప్రవిశ న్నభ్రజాలాని నిష్క్రమంశ్చ పునః పునః ।**
**ప్రకాశ శ్చాప్రకాశశ్చ చంద్రమా ఇవ లక్ష్యతే ॥ 8**

**పదచ్ఛేదము** :- ప్రవిశన్ - అభ్రజాలాని - నిష్క్రమన్ - చ - పునః - పునః - ప్రకాశః - చ - అప్రకాశః - చ - చంద్రమాః ఇవ - లక్ష్యతే ॥

**అన్వయక్రమము** :- (సః) అభ్రజాలాని పునః పునః ప్రవిశన్ నిష్క్రమన్ చ ప్రకాశః చ అప్రకాశః చ చంద్రమాః ఇవ లక్ష్యతే.

**ప్రతిపదార్థము** :- (సః = ఆ హనుమ), అభ్రజాలాని = మేఘములయొక్క గుంపులను, పునః పునః = మఱల, ప్రవిశన్ = ప్రవేశించుచు, నిష్క్రమన్ చ = నిష్క్రమించుచును, ప్రకాశః చ = కనబడుచున్నవాడును, అప్రకాశః చ = కనబడనట్టివాడునగు, చంద్రమాః ఇవ = చంద్రుడువలె, లక్ష్యతే = కనబడుచుండెను.

**తాత్పర్యము** :- ఆ యాకాశమునందు పయనించుచున్న హనుమ దట్టమైన మేఘములలోనికి ప్రవేశించుచు మఱల వెలువడుచు మబ్బులలో మాటిమాటికిని కనిపించుచు మఱుగుపడుచు నుండునట్టి చంద్రునివలెనే గానవచ్చుచుండెను.

**శ్లో॥ వివిధాభ్రఘనాపన్నగోచరో ధవళాంబరః ।**
**దృశ్యాదృశ్యతను ర్వీర స్తదా చంద్రాయతే ఽ౦బరే ॥ 9**

**పదచ్ఛేదము** :– వివిధాభ్రఘనాపన్నగోచరః – ధవళాంబరః, దృశ్యాదృశ్యతనుః – వీరః – తదా – చంద్రాయతే – అంబరే ॥

**అన్వయక్రమము** :– ధవళాంబరః (సః) వీరః వివిధాభ్రఘనాపన్నగోచరః దృశ్యాదృశ్యతనుః తదా అంబరే చంద్రాయతే.

**ప్రతిపదార్థము** :– ధవళాంబరః = తెల్లని వస్త్రములుకలవాడయిన (సః) వీరః = ఆ వీరుడైన హనుమ, వివిధాభ్రఘనాపన్నగోచరః = వివిధములగు దట్టమైన మేఘములందు పొందిన మార్గముగలవాడై, దృశ్యాదృశ్యతనుః (సన్) = కనబడినదియు, కనబడనిదియునగు శరీరము గలవాడగుచు, అంబరే = ఆకాశమునందు, తదా = అప్పుడు, చంద్రాయతే = చంద్రుని వలెనే గోచరించుచుండెను.

**తాత్పర్యము** :– తెల్లని వస్త్రములు ధరించినవాడై తెల్లని దట్టమైన మేఘముల నడుమ పయనించుచు ఒకమాఱు కనబడుచు ఒకమాఱు కనబడనట్టి తన తెల్లని దేహముతో హనుమ అప్పుడా ఆకాశమునందుండు చంద్రునివలెనే గానవచ్చెను.

**శ్లో॥ తార్క్ష్యాయమాణో గగనే బభాసే వాయునందనః ।**
**దారయన్ మేఘబృందాని నిష్పతంశ్చ పునః పునః ॥ 10**

**పదచ్ఛేదము** :– తార్క్ష్యాయమాణః – గగనే – బభాసే – వాయునందనః – దారయన్ – మేఘబృందాని – నిష్పతన్ – చ – పునః – పునః ॥

**అన్వయక్రమము** :– పునః పునః మేఘబృందాని దారయన్, నిష్పతన్ చ గగనే వాయునందనః తార్క్ష్యాయమాణః బభాసే.

**ప్రతిపదార్థము** :– పునః పునః = మాటిమాటికిని, మేఘబృందాని = మబ్బుల గుంపులను, దారయన్ = చీల్చుచు, నిష్పతన్ చ = వెలువడుచు, వాయునందనః = వాయుపుత్రుడైన హనుమ, గగనే = ఆకాశమునందు, తార్క్ష్యాయమాణః = గరుత్మంతుని రీతిగ నున్నవాడై, బభాసే = ప్రకాశించెను.

**తాత్పర్యము** :– మఱియు హనుమ ఆ యాకాశమునందలి మేఘబృందములను చీల్చుకొనిపోవుచును, అందుండి వెలువడి వచ్చుచును, ఆకసమున విహరించు గరుత్మంతుని వలెనే ప్రకాశించుచుండెను.

**శ్లో॥ నద న్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః ।**
**ప్రవరాన్ రాక్షసాన్ హత్వా నామ విశ్రావ్య చాత్మనః ॥ 11**

**పదచ్ఛేదము :–** నదన్ – నాదేన – మహతా – మేఘస్వనమహాస్వనః – ప్రవరాన్ – రాక్షసాన్ – హత్వా – నామ – విశ్రావ్య – చ – ఆత్మనః ॥

**శ్లో॥ ఆకులాం నగరీం కృత్వా వ్యథయిత్వా చ రావణమ్ ।**
**అర్దయిత్వా బలం ఘోరం వైదేహీ మభివాద్య చ ।**
**ఆజగామ మహాతేజాః పున ర్మధ్యేన సాగరమ్ ॥ 12**

**పదచ్ఛేదము :–** ఆకులాం – నగరీం – కృత్వా – వ్యథయిత్వా – చ – రావణమ్ – అర్దయిత్వా – బలం – ఘోరం – వైదేహీమ్ – అభివాద్య – చ, ఆజగామ – మహాతేజాః – పునః – మధ్యేన – సాగరమ్ ॥

**అన్వయక్రమము :–** మేఘస్వనమహాస్వనః మహతా నాదేన నదన్, ప్రవరాన్ రాక్షసాన్ హత్వా, ఆత్మనః నామ విశ్రావ్య చ, నగరీం, ఆకులాం కృత్వా రావణం వ్యథయిత్వా చ ఘోరం బలం అర్దయిత్వా వైదేహీం అభివాద్య చ సః మహాతేజాః పునః సాగరం మధ్యేన ఆజగామ.

**ప్రతిపదార్థము :–** మేఘస్వనమహాస్వనః = మేఘముల యుఱుమువంటి మహాధ్వనిగలవాడై, మహతా = గొప్పదైన, నాదేన = శబ్దముతో, నదన్ = అఱచుచు, ప్రవరాన్ = శ్రేష్ఠులైన, రాక్షసాన్ = రాక్షసులను, హత్వా = పరిమార్చి, ఆత్మనః = తనయొక్క, నామ = పేరును, విశ్రావ్య = వినిపించి, నగరీం = లంకానగరమును, ఆకులాం = సంకులమైనదానినిగా, కృత్వా = చేసి, రావణం = దశగ్రీవుని, వ్యథయిత్వా చ = పీడించియు, ఘోరం = భయంకరమైన, బలం = సైన్యమును, అర్దయిత్వా చ = నశింపజేసియును, వైదేహీం = సీతాదేవిని, అభివాద్య చ = మ్రొక్కియును, మహాతేజాః సః = మహాప్రతాపశాలియగు ఆ హనుమ, పునః = తిరిగి, సాగరం = సముద్రమును, మధ్యేన = మధ్యగా, ఆజగామ = చేరుకొనెను.

**తాత్పర్యము :–** మేఘగర్జనము వంటి గొప్ప కంఠధ్వని గలవాడై పెద్ద శబ్దముతో అరచుచు ప్రముఖులైన రాక్షసులను ఎందఱినో వధించి, తన పేరును ఘనతను లంకలో చాటి ఆ నగరమునంతను కల్లోలము గావించి, రావణుని వెతలపాలు చేసి ఆతని సైన్యమును భీకరమైన రీతిగా హతమార్చి సీతమ్మకు మ్రొక్కి మహాప్రతాప సంపన్నుడైన హనుమ తిరిగి సముద్రమధ్యమునకు చేరుకొనెను.

**శ్లో॥ పర్వతేంద్రం సునాభం చ సముపస్పృశ్య వీర్యవాన్ ।**
**జ్యాముక్త ఇవ నారాచో ఽ మహావేగోఽ భ్యుపాగతః ॥ 13**

**పదచ్ఛేదము** :– పర్వతేంద్రం – సునాభం – చ – సముపస్పృశ్య – వీర్యవాన్ – జ్యాముక్తః – ఇవ – నారాచః – మహావేగః – అభ్యుపాగతః ॥

**అన్వయక్రమము** :– వీర్యవాన్ (సః) సునాభం పర్వతేంద్రం సముపస్పృశ్య చ మహావేగః (సన్) జ్యాముక్తః నారాచః ఇవ అభ్యుపాగతః.

**ప్రతిపదార్థము** :– వీర్యవాన్ = పరాక్రమవంతుడైన, సః = ఆ హనుమ, సునాభం = మైనాకమనెడు, పర్వతేంద్రం = పర్వతరాజును, సముపస్పృశ్య = ఆదరముతో నిమిరి, మహావేగః (సన్) = గొప్పవేగము గలవాడై, జ్యాముక్తః = వింటి నారినుండి విడువబడినట్టి, నారాచః ఇవ = బాణమువలె, అభ్యుపాగతః = తిరిగివచ్చెను.

**తాత్పర్యము** :– ఆ మహావీరుడు ఆ మహాసముద్రమధ్యమునందలి మైనాకపర్వతమును ఆదరముతో నిమిరి ఎక్కుపెట్టిన వింటినుండి విడువబడిన బాణమువలె మహావేగముతో మఱలి వచ్చుచుండెను.

**శ్లో॥ స కించి దనుసంప్రాప్త స్సమాలోక్య మహాగిరిమ్ ।**
**మహేంద్రం మేఘసంకాశం ననాద హరిపుంగవః ॥ 14**

**పదచ్ఛేదము** :– సః – కించిత్ – అనుసంప్రాప్తః – సమాలోక్య – మహాగిరిమ్, మహేంద్రం – మేఘసంకాశం – ననాద – హరిపుంగవః ॥

**అన్వయక్రమము** :– సః హరిపుంగవః మేఘసంకాశం మహేంద్రం మహాగిరిం కించిత్ అనుసంప్రాప్తః సమాలోక్య ననాద.

**ప్రతిపదార్థము** :– సః హరిపుంగవః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, మేఘసంకాశం = మేఘసన్నిభమైన, మహేంద్రం = మహేంద్ర మను పేరుగల, మహాగిరిం = పెద్దపర్వతమును, కించిత్ = కొలదిగా, అనుసంప్రాప్తః = చేరినవాడై, సమాలోక్య = చూచి, ననాద = నాదమును గావించెను.

**తాత్పర్యము** :– వానరశ్రేష్ఠుడైన హనుమ ఉత్తరతీరపు సమీపమునకు జేరి అచ్చట పెద్దమేఘములను బోలిన మహేంద్రపర్వతమును విలోకించి సంతోషముతో సింహనాదమును జేసెను.

**శ్లో॥ స పూరయామాస కపి ర్దిశో దశ సమంతతః ।**
**నద న్నాదేన మహతా మేఘస్వనమహాస్వనః ॥ 15**

**పదచ్ఛేదము :-** సః - పూరయామాస - కపిః - దిశః - దశ - సమంతతః, నదన్ - నాదేన - మహతా - మేఘస్వనమహాస్వనః ॥

**అన్వయక్రమము :-** మేఘస్వనమహాస్వనః సః కపిః నదన్ మహతా (తేన) నాదేన సమంతతః దశ దిశః పూరయామాస.

**ప్రతిపదార్థము :-** మేఘస్వనమహాస్వనః = మేఘగర్జనమువంటి గొప్పకంఠస్వరముగల, సః కపిః = ఆ వానరశ్రేష్ఠుడు, నదన్ = నాదము గావించుచు, తేన = ఆ, మహతా = గొప్పదైన, నాదేన = శబ్దముతో, సమంతతః = చుట్టును, దశదిశః = పదిదిక్కులను, పూరయామాస = నిండజేసెను.

**తాత్పర్యము :-** మేఘగర్జనమువంటి గొప్ప కంఠస్వరముగల ఆ హనుమ సంతోషముతో సింహనాదమును గావించుచు గొప్పదైన ఆ మహాధ్వనితో పదిదిక్కులను నిండునట్లు చేసెను.

**శ్లో॥ స తం దేశ మను ప్రాప్త స్సుహృద్దర్శనలాలసః ।**
**ననాద హరిశార్దూలో లాంగూలం చాప్యకంపయత్ ॥ 16**

**పదచ్ఛేదము :-** సః - తం - దేశమ్ - అనుప్రాప్తః - సుహృద్దర్శనలాలసః, ననాద - హరిశార్దూలః - లాంగూలం - చ - అపి - అకంపయత్ ॥

**అన్వయక్రమము :-** సః హరిశార్దూలః తం దేశమ్ అనుప్రాప్తః సుహృద్దర్శనలాలసః (సన్) ననాద. లాంగూలమ్ అపి అకంపయత్ చ.

**ప్రతిపదార్థము :-** సః హరిశార్దూలః = ఆ వానరశ్రేష్ఠుడైన హనుమ, తం = ఆ, దేశం = ప్రదేశమును, అనుప్రాప్తః = చేరినవాడై, సుహృద్దర్శనలాలసః (సన్) = స్నేహితులయొక్క దర్శనమునందు తీవ్రమైన ఇచ్ఛగలవాడగుచు, ననాద = గర్జించెను, లాంగూలం = వాలమును, అకంపయత్ చ = కంపింపచేసెను కూడ.

**తాత్పర్యము :-** వానరశ్రేష్ఠుడైన యా హనుమ తన మిత్రులను చూడవలెనను తీవ్రమైన కోరికతో ఆ ప్రదేశమును చేరుకొని వెంటనే తన వాలమును కంపింపచేయుచు పెద్దగర్జనము చేసెను.

**శ్లో॥ తస్య నానద్యమానస్య సుపర్ణచరితే పథి ।**
**ఫలతీ వాస్యఘోషేణ గగనం సార్కమండలమ్ ॥ 17**

**పదచ్ఛేదము** :– తస్య – నానద్యమానస్య – సుపర్ణచరితే – పథి – ఫలతి – ఇవ – ఆస్యఘోషేణ – గగనం – సార్కమండలమ్ ॥

**అన్వయక్రమము** :– సుపర్ణచరితే పథి నానద్యమానస్య తస్య ఆస్యఘోషేణ, సార్కమండలం గగనం ఫలతి ఇవ (ఆస).

**ప్రతిపదార్థము** :– సుపర్ణచరితే = గరుత్మంతునిచే సంచరింపబడినట్టి, పథి = మార్గమున, నానద్యమానస్య = బిగ్గరగా గర్జించుచున్నట్టి, తస్య = ఆ హనుమయొక్క, ఆస్యఘోషేణ = నోటిధ్వనిచే, సార్కమండలం = సూర్యమండలముతోగూడిన, గగనం = ఆకాశము, ఫలతి ఇవ = బ్రద్దలగుచున్నది వలె (ఆస = ఉండెను).

**తాత్పర్యము** :– ఆ హనుమ యట్లు గరుత్మంతుని సంచారమార్గమైన గగనతలమునందు బిగ్గరగా గర్జనము గావించుచుండగా అతని కంఠధ్వనికి సూర్యమండలముతో సహితముగ గగనమండలము బ్రద్దలగుచున్నట్లుండెను.

**శ్లో॥ యే తు తత్రోత్తరే తీరే సముద్రస్య మహాబలాః ।**
**పూర్వం సంవిష్ఠితా శ్శూరా వాయుపుత్రదిదృక్షవః ॥ 18**

**శ్లో॥ మహతో వాయునున్నస్య తోయదస్యేవ గర్జితమ్ ।**
**శుశ్రువు స్తే తదా ఘోష మూరువేగం హనూమతః ॥ 19**

**పదచ్ఛేదము** :– యే – తు – తత్ర – ఉత్తరే – తీరే – సముద్రస్య – మహాబలాః, పూర్వం – సంవిష్ఠితాః – శూరాః – వాయుపుత్రదిదృక్షవః, మహతః – వాయునున్నస్య – తోయదస్య – ఇవ – గర్జితమ్ – శుశ్రువుః – తే – తదా – ఘోషమ్ – ఉరువేగం – హనుమతః ॥

**అన్వయక్రమము** :– పూర్వం తత్ర సముద్రస్య ఉత్తరే తీరే వాయుపుత్రదిదృక్షవః (సంతః) మహాబలాః శూరాః యే సంవిష్ఠితాః తే తదా వాయునున్నస్య మహతః, తోయదస్య గర్జితమ్ ఇవ హనూమతః ఊరువేగం ఘోషం శుశ్రువుః.

**ప్రతిపదార్థము** :– పూర్వం = అంతకుపూర్వము, తత్ర = అచ్చట, సముద్రస్య = సముద్రముయొక్క, ఉత్తరే తీరే = ఉత్తరతీరమునందు, వాయుపుత్రదిదృక్షవః (సంతః) = పవనసుతుని చూడగోరుచున్నవారై, మహాబలాః = మహాబలాఢ్యులును, శూరాః = శూరులునగు, యే = ఏ వానరులైతే, సంవిష్ఠితాః = కూర్చొనియుండిరో, తే = ఆ

వానరులు, వాయునున్నస్య = వాయువుచే ప్రేరేపింపబడినట్టి, మహతః = గొప్పదైన, తోయదస్య = మేఘముయొక్క, గర్జితమ్ ఇవ = ఉఱుమునువలె, తదా = అప్పుడు, హనూమతః = హనుమంతునియొక్క, ఊరువేగం = తొడలవడిని, ఘోషం = సింహనాదమును, శుశ్రువుః = ఆకర్ణించిరి.

**తాత్పర్యము :–** ఆ మహాసముద్రముయొక్క ఉత్తరతీరమునందు పవననందనుని రాకకై వేయికన్నులతో నిరీక్షించుచు కూర్చుండియున్న వానరవీరులు, వాయువుచే త్రోయబడుచున్న ఒక మహామేఘమునుండి వచ్చెడి ఒక పెద్ద యుఱుమువలె వినవచ్చుచుండగా అపు డా హనుమ మహావేగముతో పయనించి వచ్చుచు చేయుచున్న ఆ సింహగర్జనమును ఆశ్చర్యముగా ఆలకించిరి.

**శ్లో॥ తే దీనవదనా స్సర్వే శుశ్రువుః కాననౌకసః ।**
**వానరేంద్రస్య నిర్ఘోషం పర్జన్యనినదోపమమ్ ॥ 20**

**పదచ్ఛేదము :–** తే – దీనవదనాః – సర్వే – శుశ్రువుః – కాననౌకసః, వానరేంద్రస్య – నిర్ఘోషం – పర్జన్యనినదోపమమ్ ॥

**అన్వయక్రమము :–** దీనవదనాః తే కాననౌకసః సర్వే పర్జన్యనినదోపమం వానరేంద్రస్య నిర్ఘోషం శుశ్రువుః.

**ప్రతిపదార్థము :–** దీనవదనాః = దైన్యముతో గూడిన ముఖము గల్గినట్టి, తే = ఆ, కాననౌకసః = వనచరులైన వానరులు, సర్వే = ఎల్లరును, పర్జన్యనినదోపమం = మేఘములయొక్క ఉఱుముతో సమానమైన, వానరేంద్రస్య = హనుమయొక్క, నిర్ఘోషం = గర్జనమును, శుశ్రువుః = ఆలకించిరి.

**తాత్పర్యము :–** ఇంతవఱకును సీతాదేవిని గూర్చి ఎట్టి వార్త వినవలసియుండునో యని భీతితో దీనవదనులైయున్న యా వానరువీరు లెల్లరును మహామేఘధ్వనివలె వినవచ్చిన హనుమయొక్క సింహనాదమును మహానందముతో ఆలకించిరి.

**శ్లో॥ నిశమ్య నదతో నాదం వానరా స్తే సమంతతః ।**
**బభూవు రుత్సుకా స్సర్వే సుహృద్దర్శనకాంక్షిణః ॥ 21**

**పదచ్ఛేదము :–** నిశమ్య – నదతః – నాదం – వానరాః – తే – సమంతతః – బభూవుః – ఉత్సుకాః – సర్వే – సుహృద్దర్శనకాంక్షిణః ॥

**అన్వయక్రమము :–** నదతః నాదం నిశమ్య తే వానరాః సర్వే సమంతతః సుహృద్దర్శనకాంక్షిణః (సంతః) ఉత్సుకాః బభూవుః.

**ప్రతిపదార్థము** :– నదతః = గర్జించుచున్నట్టి హనుమయొక్క, నాదం = ధ్వనిని, నిశమ్య = ఆలకించి, తే = ఆ, వానరాః = వానరులు, సర్వే = ఎల్లరును, సమంతతః = అంతటను, సుహృద్దర్శనకాంక్షిణః (సంతః) = మిత్రునియొక్క దర్శనమును కోరుచున్నవారగుచు, ఉత్సుకాః = వేగిరపాటు నొందినవారు, బభూవుః = అయిరి.

**తాత్పర్యము** :– హనుమంతుడు గావించిన యా సింహగర్జనము నాకర్ణించి చుట్టుప్రక్కలనున్న ఆ వానరు లెల్లరును తమ ప్రియతమ మిత్రుని జూడవలయునను తీవ్రమైన కాంక్షతో మిక్కిలి తహతహపాటు నొందుచుండిరి.

**శ్లో॥ జాంబవా న్స హరిశ్రేష్ఠః ప్రీతిసంహృష్టమానసః ।**
**ఉపామంత్ర్య హరీ న్సర్వా నిదం వచన మబ్రవీత్ ॥ 22**

**పదచ్ఛేదము** :– జాంబవాన్ – సః – హరిశ్రేష్ఠః – ప్రీతిసంహృష్టమానసః, ఉపామంత్ర్య – హరీన్ – సర్వాన్ – ఇదం – వచనమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– హరిశ్రేష్ఠః సః జాంబవాన్ ప్రీతిసంహృష్టమానసః (సన్) హరీన్ సర్వాన్ ఉపామంత్ర్య ఇదం వచనమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :– హరిశ్రేష్ఠః = వానరశ్రేష్ఠుడైనట్టి, సః జాంబవాన్ = ఆ జాంబవంతుడు, ప్రీతిసంహృష్టమానసః = ప్రేమతో సంతోషమునొందిన మనస్సుగలవాడై, హరీన్ = వానరులను, సర్వాన్ = ఎల్లరను, ఉపామంత్ర్య = దగ్గఱకు పిలిచి, ఇదం = ఈ, వచనం = మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :– అప్పుడు వానరశ్రేష్ఠుడైనట్టి జాంబవంతుడు ప్రేమపూర్ణమైన మనస్సుతో చుట్టునున్న వానరులనందరను దగ్గఱకు పిలిచి ఈ విధముగ పలికెను.

**శ్లో॥ సర్వథా కృతకార్యో ఽసౌ హనుమాన్నాత్ర సంశయః ।**
**న హ్య స్యాకృతకార్యస్య నాద ఏవంవిధో భవేత్ ॥ 23**

**పదచ్ఛేదము** :– సర్వథా – కృతకార్యః – అసౌ – హనుమాన్ – న – అత్ర – సంశయః– న – హి – అస్య – అకృతకార్యస్య – నాదః – ఏవంవిధః – భవేత్ ॥

**అన్వయక్రమము** :– అసౌ హనుమాన్ సర్వథా కృతకార్యః. అత్ర సంశయః న(అస్తి). అకృతకార్యస్య అస్య నాదః ఏవంవిధః న భవేత్ హి.

**ప్రతిపదార్థము** :– అసౌ = ఈ, హనుమాన్ = హనుమ, సర్వథా = సర్వవిధములుగా, కృతకార్యః = నెఱవేర్చిన కర్తవ్యముగలవాడు. అత్ర = ఈ విషయమునందు, సంశయః

= సందేహము, న అస్తి = లేదు. అకృతకార్యస్య = నెఱవేర్పని కర్తవ్యము గలిగినట్టి, అస్య = ఈ హనుమయొక్క, నాదః = శబ్దము, ఏవంవిధః = ఈ విధమైనదిగా, న భవేత్ హి = ఉండదుగదా!

**తాత్పర్యము :–** మన హనుమ నూటికి నూఱుపాళ్లు తన కర్తవ్యమును నెఱవేర్చియే వచ్చుచున్నాడు. ఈ విషయమునందు అణుమాత్రమును సందేహములేదు. తన కర్తవ్యమును నెఱవేర్పకుండగ వచ్చుచున్న యెడల యాతని కంఠస్వరము ఇంత ఉత్సాహముగను భీకరముగను ఉండదు గదా!

**శ్లో॥ తస్య బాహూరువేగం చ నినాదం చ మహాత్మనః ।**
**నిశమ్య హరయో హృష్టా స్సముత్పేతు స్తతస్తతః ॥ 24**

**పదచ్ఛేదము :–** తస్య – బాహూరువేగం – చ – నినాదం – చ – మహాత్మనః, నిశమ్య – హరయః – హృష్టాః – సముత్పేతుః – తతః – తతః ॥

**అన్వయక్రమము :–** మహాత్మనః తస్య బాహూరువేగం చ నినాదం చ నిశమ్య హరయః తతః తతః సముత్పేతుః.

**ప్రతిపదార్థము :–** మహాత్మనః = మహనీయుడైనట్టి, తస్య = ఆ హనుమయొక్క, బాహూరువేగం చ = బాహువులయొక్కయు, ఊరువులయొక్కయు వేగమును, నినాదం చ = కంఠస్వరమును, నిశమ్య = ఆకర్ణించి, హరయః = వానరులు, హృష్టాః = సంతోషము నొందినవారై, తతః తతః = అచ్చటచ్చటనుండి, సముత్పేతుః = ఎగురుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము :–** 'బాహూరువేగం' – బాహువులయొక్కయు, ఊరువులయొక్కయు వేగముచే గలిగిన ధ్వనిని వానరులు వినిరని భావము.

**తాత్పర్యము :–** మహాప్రభావసంపన్నుడైన యా హనుమయొక్క బాహువుల యొక్కయు ఊరువులయొక్కయు వడిసవ్వడిని కంఠధ్వనిని ఆలించి ఆ వానరులు మహానందముతో ఎచ్చటి వారచ్చట మీది మీది కెగురుచుండిరి.

**శ్లో॥ తే నగాగ్రా న్నగాగ్రాణి శిఖరా చ్ఛిఖరాణి చ ।**
**ప్రహృష్టా స్సమపద్యంత హనూమంతం దిదృక్షవః ॥ 25**

**పదచ్ఛేదము :–** తే – నగాగ్రాత్ – నగాగ్రాణి – శిఖరాత్ – శిఖరాణి – చ,

ప్రహృష్టాః – సమపద్యంత – హనూమంతం – దిదృక్షవః ॥

**అన్వయక్రమము :–** తే ప్రహృష్టాః హనూమంతం దిదృక్షవః(సంతః) నగాగ్రాత్ శిఖరాత్ శిఖరాణి చ సమపద్యంత.

**ప్రతిపదార్థము :–** తే = ఆ వానరులు, ప్రహృష్టాః = గొప్ప సంతోషము నొందినవారై, హనూమంతం = హనుమను, దిదృక్షవః (సంతః) = చూడకోరికగలవారగుచు, నగాగ్రాత్ = చెట్టుకొననుండి, నగాగ్రాణి = చెట్టుకొనలను, శిఖరాత్ = గిరిశిఖరములనుండి, శిఖరాణి చ = ఉన్నతశిఖరములను, సమపద్యంత = చేరిరి.

**తాత్పర్యము :–** మహానందముతో గూడిన ఆ వానరులు హనుమంతుని దూరమునుండియే చూడగోరి తామున్న చెట్టుకొననుండి ఇంకను ఎత్తైన కొనకును పర్వతాగ్రము నుండి ఇంకను ఎత్తైన శిఖరాగ్రమునకును చేరుకొనుచుండిరి.

**శ్లో॥ తే ప్రీతాః పాదపాగ్రేషు గృహ్య శాఖాస్సుపుష్పితాః ।**
**వాసాంసీవ ప్రశాఖాశ్చ సమావిధ్యంత వానరాః ॥ 26**

**పదచ్ఛేదము :–** తే – ప్రీతాః – పాదపాగ్రేషు – గృహ్య – శాఖాః – సుపుష్పితాః – వాసాంసి – ఇవ – ప్రశాఖాః – చ – సమావిధ్యంత – వానరాః ॥

**అన్వయక్రమము :–** తే వానరాః ప్రీతాః (సంతః) పాదపాగ్రేషు సుపుష్పితాః శాఖాః గృహ్య ప్రశాఖాః వాసాంసి ఇవ సమావిధ్యంత.

**ప్రతిపదార్థము :–** తే = ఆ, వానరాః = వానరులు, ప్రీతాః (సంతః) = సంతోషము నొందినవారగుచు, పాదపాగ్రేషు = వృక్షాగ్రములయందు, సుపుష్పితాః = చక్కగాపూచినట్టి, శాఖాః = కొమ్మలను, గృహ్య = గ్రహించి, ప్రశాఖాః = చిన్నకొమ్మలను, వాసాంసి ఇవ = వస్త్రములనువలె, సమావిధ్యంత = ఊపుచుండిరి.

**తాత్పర్యము :–** ఆ వానరులు మహాసంతోషముతో చెట్ల కొనలపైనుండి చక్కగా పుష్పించియున్న కొమ్మలమీదికి చేరి చిన్న కొమ్మలను విఱిచి చేతితో పట్టుకొని గుడ్డ జండాలను ఊపినట్లుగా ఊపుచుండిరి.

**శ్లో॥ గిరిగహ్వరసంలీనో యథా గర్జతి మారుతః ।**
**ఏవం జగర్జ బలవాన్ హనుమా న్మారుతాత్మజః ॥ 27**

**పదచ్ఛేదము :–** గిరిగహ్వరసంలీనః – యథా – గర్జతి – మారుతః – ఏవం – జగర్జ – బలవాన్ – హనుమాన్ – మారుతాత్మజః ॥

**అన్వయక్రమము :-** మారుతః గిరిగహ్వరసంలీనః (సన్) యథా గర్జతి ఏవం బలవాన్ మారుతాత్మజః హనుమాన్ జగర్జ.

**ప్రతిపదార్థము :-** మారుతః = వాయువు, గిరిగహ్వరసంలీనః (సన్) = పర్వతగుహలందు ప్రవేశించినదై, యథా = ఏ విధముగా, గర్జతి = గర్జించునో, ఏవం = ఈ రీతిగా, బలవాన్ = బలాఢ్యుడైనట్టి, మారుతాత్మజః = మారుతతనయుడగు, హనుమాన్ = హనుమ, జగర్జ = గర్జించెను.

**తాత్పర్యము :-** పర్వతగుహలందు ప్రవేశించిన వాయువు మహాధ్వనితో ఎట్లు గర్జించునో అట్లే మహాబలశాలియైన వాయునందనుడగు హనుమ గొప్ప ధ్వనితో గర్జించుచుండెను.

**శ్లో॥ త మభ్రఘనసంకాశ మాపతంతం మహాకపిమ్ ।**
**దృష్ట్వా తే వానరా స్సర్వే తస్థుః ప్రాంజలయ స్తదా ॥ 28**

**పదచ్ఛేదము :-** తమ్ - అభ్రఘనసంకాశమ్ - ఆపతంతం - మహాకపిం, దృష్ట్వా - తే - వానరాః - సర్వే - తస్థుః - ప్రాంజలయః - తదా॥

**అన్వయక్రమము :-** అభ్రఘనసంకాశమ్ ఆపతంతం తం మహాకపిం దృష్ట్వా తదా తే వానరాః సర్వే ప్రాంజలయః త్రస్థుః.

**ప్రతిపదార్థము :-** అభ్రఘనసంకాశం = దట్టమైన మేఘముతో సమానుడై, ఆపతంతం = దగ్గఱకు పచ్చిపడుచున్న, తం మహాకపిం = ఆ వానరశ్రేష్ఠుని, దృష్ట్వా = చూచి, తే వానరాః = ఆ వానరులు, సర్వే = ఎల్లరును, ప్రాంజలయః = దోసిలిఒగ్గినవారై, తస్థుః = నిలచిరి.

**తాత్పర్యము :-** దట్టమైన పెద్ద మేఘమువంటి రూపముతో తమ సమీపమునకు వచ్చుచున్న వానరశ్రేష్ఠుడైన ఆ హనుమను గాంచి ఆ వానరులెల్లరును లేచి దోసిలియొగ్గి నిలువబడిరి.

**శ్లో॥ తతస్తు వేగవాం స్తస్య గిరే ర్గిరినిభః కపిః ।**
**నిపపాత మహేంద్రస్య శిఖరే పాదపాకులే ॥ 29**

**పదచ్ఛేదము :-** తతః - తు - వేగవాన్ - తస్య - గిరేః - గిరినిభః - కపిః, నిపపాత - మహేంద్రస్య - శిఖరే - పాదపాకులే ॥

**అన్వయక్రమము :-** తతః వేగవాన్ గిరినిభః కపిః తస్య మహేంద్రస్య గిరేః పాదపాకులే శిఖరే నిపపాత.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, వేగవాన్ = గొప్పవేగము గల్గినట్టి, గిరినిభః = పర్వతసన్నిభుడైన, కపిః = హనుమ, తస్య = ఆ, మహేంద్రస్య = మహేంద్ర మను పేరుగల, గిరేః = పర్వతముయొక్క, పాదపాకులే = వృక్షములతో దట్టముగనున్నట్టి, శిఖరే = శిఖరమునందు, నిపపాత = ఉరికెను.

**తాత్పర్యము :–** మహావేగముతో క్రిందికి పడుచున్న పర్వతము వలె నున్న ఆ హనుమ వివిధవృక్షములతో నిండియున్న మహేంద్రపర్వతము శిఖరము మీదికి ఉరికెను.

**శ్లో॥ హర్షేణాపూర్యమాణో ఽసౌ రమ్యే పర్వతనిర్ఝరే ।**
**ఛిన్న పక్ష ఇవాకాశా త్పపాత ధరణీధరః ॥ 30**

**పదచ్ఛేదము :–** హర్షేణ – ఆపూర్యమాణః – అసౌ – రమ్యే – పర్వతనిర్ఝరే – ఛిన్నపక్షః – ఇవ – ఆకాశాత్ – పపాత – ధరణీధరః ॥

**అన్వయక్రమము :–** హర్షేణ ఆపూర్యమాణః అసౌ ఆకాశాత్ ఛిన్నపక్షః ధరణీధరః ఇవ రమ్యే పర్వతనిర్ఝరే పపాత.

**ప్రతిపదార్థము :–** హర్షేణ = సంతోషముతో, ఆపూర్యమాణః = నింపబడుచున్నట్టి, అసౌ = ఈ హనుమ, రమ్యే = సుందరమైనట్టి, పర్వతనిర్ఝరే = కొండవాగునందు, ఆకాశాత్ = ఆకాశమునుండి, ఛిన్నపక్షః = తెగగొట్టబడిన ఱెక్కలుగల్గినట్టి, ధరణీధరః ఇవ = పర్వతమువలె, పపాత = పడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము:–** పర్వతనిర్ఝరే పపాత – సెలయేళ్లు ప్రవహించుచున్న పర్వతముపై అనగా సెలయేళ్ల ప్రక్కను హనుమ దిగెను. లేక ప్రయాణము శ్రమ తొలగుటకై ఆ నీటియందే దూకెనని కొందరు చెప్పినదిగూడ యుక్తమే.

**వాసుదాసస్వామి :–** హనుమ కొండవంకయందు నీళ్లలో ఱెక్కలు విఱిగిన పర్వతమువలె దభాలున పడెను.

శ్రీరామదర్శనమునకై పోవుటయం దొక నిమేషమైన జాగు కారాదని ఇది యాయన త్వరను సూచించుచున్నది. లేని యెడల హనుమ దూరమునుండియే వేగము తగ్గించి యుండవచ్చును గదా!

**తాత్పర్యము :–** మహానందముతో నిండిన యా హనుమ సెలయేళ్లతో చల్లనైయున్న మహేంద్రగిరిపర్వతమున ఱెక్కలు తెగిన పర్వతమువలె ఆకసమునుండి క్రిందికి ఉరికెను.

**శ్లో॥ తత స్తే ప్రీతమనస స్సర్వే వానరపుంగవాః ।**
**హనూమంతం మహాత్మానం పరివా ర్యోపతస్థిరే ॥ 31**

**పదచ్ఛేదము :-** తతః – తే – ప్రీతమనసః – సర్వే – వానరపుంగవాః – హనూమంతం – మహాత్మానం – పరివార్య – ఉపతస్థిరే ॥

**అన్వయక్రమము :-** తతః తే వానరపుంగవాః సర్వే ప్రీతమనసః (సంతః) మహాత్మానం హనూమంతం పరివార్య ఉపతస్థిరే.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, తే = ఆ, వానరపుంగవాః = వానర శ్రేష్ఠులు, సర్వే = ఎల్లరును, ప్రీతమనసః (సంతః) = ఆనందము నొందిన మనస్సుగల వారగుచు, మహాత్మానం = మహనీయుడైనట్టి, హనూమంతం = హనుమను, పరివార్య = చుట్టునుచేరి, ఉపతస్థిరే = కూర్చుండిరి.

**తాత్పర్యము :-** అప్పుడా వానర వీరులెల్లరును మహానందభరితమైన మనస్సుతో మహాత్ముడైన యా హనుమచుట్టును జేరి కూర్చుండిరి.

**శ్లో॥ పరివార్య చ తే సర్వే పరాం ప్రీతి ముపాగతాః ॥ 32**

**పదచ్ఛేదము :-** పరివార్య – చ – తే – సర్వే – పరాం – ప్రీతిమ్ – ఉపాగతాః ॥

**ప్రతిపదార్థము :-** పరివార్య చ = చుట్టుముట్టి, తే సర్వే = ఆ వానరులెల్లరును, పరాం = గొప్పదైన, ప్రీతిం = సంతోషమును, ఉపాగతాః = పొందిరి.

**తాత్పర్యము :-** వానరవీరు లెల్లరును అట్లు హనుమ చుట్టును మూగి మహాసంతోషము నొందుచుండిరి.

**శ్లో॥ ప్రహృష్టవదనా స్సర్వే త మరోగ ముపాగతమ్ ।**
**ఉపాయనాని చాదాయ మూలాని చ ఫలాని చ ।**
**ప్రత్యర్చయన్ హరిశ్రేష్ఠం హరయో మారుతాత్మజమ్ ॥ 33**

**పదచ్ఛేదము :-** ప్రహృష్టవదనాః – సర్వే – తమ్ – అరోగమ్ – ఉపాగతమ్, ఉపాయనాని – చ – ఆదాయ – మూలాని – చ – ఫలాని – చ, ప్రత్యర్చయన్ – హరిశ్రేష్ఠం – హరయః – మారుతాత్మజమ్ ॥

**అన్వయక్రమము :-** ప్రహృష్టవదనాః సర్వే హరయః అరోగమ్ ఉపాగతం హరిశ్రేష్ఠం తం మారుతాత్మజమ్ ఉపాయనాని చ మూలాని చ ఫలాని చ ఆదాయ ప్రత్యర్చయన్.

**ప్రతిపదార్థము :–** ప్రహృష్టవదనాః = గొప్ప ఆనందము నొందిన ముఖములు కలిగినట్టి, సర్వే హరయః = ఆ వానరు లందరును, అరోగమ్ = అస్వస్థత లేనివాడై, ఉపాగతం = చేరినట్టి, హరిశ్రేష్ఠం = వానరశ్రేష్ఠుడైనట్టి, తం మారుతాత్మజమ్ = ఆ పవననందనుని, ఉపాయనాని చ = కానుకలను, మూలాని చ = దుంపలను, ఫలాని = పండ్లను, ఆదాయ = గ్రహించి, ప్రత్యర్చయన్ = సత్కరించిరి.

**తాత్పర్యము :–** ఎట్టి ఆపదయును లేకుండ సుఖముగా తిరిగి వచ్చిన ఆ వాయునందనుని గాంచి మహానందముతో వికసించిన ముఖము గల యా వానరులందఱును మధురములైన కందమూలఫలములు మొదలగు కానుకలను గొని తెచ్చి, గౌరవముతో అర్పించుచుండిరి.

**శ్లో॥ హనుమాంస్తు గురూ న్వృద్ధాన్ జాంబవత్ప్రముఖాంస్తదా ।**
**కుమార మంగదం చైవ సోఽవందత మహాకపిః ॥ 34**

**పదచ్ఛేదము :–** హనుమాన్ – తు – గురూన్ – వృద్ధాన్ – జాంబవత్ప్రముఖాన్ – తదా, కుమారమ్ – అంగదం – చ – ఏవ – సః – అవందత – మహాకపిః ॥

**అన్వయక్రమము :–** మహాకపిః హనుమాన్ తు గురూన్ వృద్ధాన్ జాంబవత్ప్రముఖాన్, కుమారమ్ అంగదం చ ఏవ అవందత.

**ప్రతిపదార్థము :–** మహాకపిః = వానరశ్రేష్ఠుడైనట్టి, సః హనుమాన్ = ఆ హనుమ, తదా = అప్పుడు, గురూన్ = గురువులను, వృద్ధాన్ = వృద్ధులును అగు, జాంబవత్ ప్రముఖాన్ = జాంబవంతుడు మున్నగు వారిని, కుమారం = చిన్నవాడైన, అంగదం చైవ = అంగదుని కూడ, అవందత = మ్రొక్కెను.

**తాత్పర్యము :–** వానరశ్రేష్ఠుడైన హనుమ యప్పుడు జాంబవంతుడు మున్నగు గురువులకును పెద్దలకును యువరాజైన అంగదునికిని వందన మాచరించెను.

**శ్లో॥ స తాభ్యాం పూజితః పూజ్యః కపిభిశ్చ ప్రసాదితః ।**
**దృష్టా సీతేతి విక్రాంత స్సంక్షేపేణ న్యవేదయత్ ॥ 35**

**పదచ్ఛేదము :–** సః – తాభ్యాం – పూజితః – పూజ్యః – కపిభిః – చ – ప్రసాదితః – దృష్టా – సీతా – ఇతి – విక్రాంతః – సంక్షేపేణ – న్యవేదయత్ ॥

**అన్వయక్రమము :–** తాభ్యాం పూజితః కపిభిః చ ప్రసాదితః విక్రాంతః సః పూజ్యః దృష్టా సీతా ఇతి సంక్షేపేణ న్యవేదయత్.

**ప్రతిపదార్థము :-** తాభ్యాం = జాంబవంతునిచేతను, అంగదునిచేతను, పూజితః = గౌరవింపబడినవాడై, కపిభిః చ = వానరులచేతను, ప్రసాదితః = సత్కరింపబడినవాడై, పూజ్యః = పూజనీయుడు అగు, సః = ఆ హనుమ, సంక్షేపేణ = సంక్షేపముగా, దృష్టా సీతా = చూడబడినది సీతాదేవి, ఇతి = అని, న్యవేదయత్ = నివేదించెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**బొంబాయిపాఠము :-** దృష్టా సీతా యనుటకు బదులుగా దృష్టా దేవీ యని గలదు.

**వాసుదాసస్వామి :-** ఏమి చెప్పునో యని తహతహలాడు వానరుల మనస్సు కుదుటబడుటకు 'చూచితి సీత నని' రెండుమాటలతో సారాంశమును తెలిపెను.

**శ్రీమాన్ తెన్మఠం రంగాచార్యస్వామి :-** ఇచ్చట 'సీతా దృష్టా'యని చెప్పిన యెడల సీతా శబ్దము నుచ్చరించి దృష్టా శబ్దము నుచ్చరించునంతలో సీతమ్మ ఏమయ్యెనని చెప్పునో యని వానరులు భయపడుదురని హనుమంతుడు 'దృష్టా సీతా' యని చెప్పెను.

**తాత్పర్యము :-** జాంబవంతుడును అంగదుడును మిక్కిలి గౌరవించుచుండ మిగిలిన వానరులెల్లరును ఆప్యాయముగ తనను తిలకించుచుండ హనుమ వారి నెల్లరను జూచుచు "చూచితిని సీతమ్మను" అని సంగ్రహముగ వారికి నివేదించెను.

**శ్లో॥ నిషసాద చ హస్తేన గృహీత్వా వాలిన స్సుతమ్ ।**
**రమణీయే వనోద్దేశే మహేంద్రస్య గిరే స్తదా ॥ 36**

**పదచ్ఛేదము :-** నిషసాద - చ - హస్తేన - గృహీత్వా - వాలినః - సుతమ్ - రమణీయే - వనోద్దేశే - మహేంద్రస్య - గిరేః - తదా ॥

**అన్వయక్రమము :-** తదా వాలినః సుతం హస్తేన గృహీత్వా రమణీయే మహేంద్రస్య గిరేః వనోద్దేశే నిషసాద చ.

**ప్రతిపదార్థము :-** తదా = అప్పుడు, వాలినః = వాలియొక్క, సుతం = పుత్రుడైన అంగదుని, హస్తేన = చేతితో, గృహీత్వా = పట్టుకొని, మహేంద్రస్య గిరేః = మహేంద్ర పర్వతముయొక్క, రమణీయే = సుందరమైనట్టి, వనోద్దేశే = వనప్రదేశమునందు, నిషసాద చ = కూర్చుండెను.

**తాత్పర్యము :-** అప్పుడు హనుమ యువరాజైన అంగదుని చేతిని తనచేతిలోనికి తీసికొని యా మహేంద్రపర్వతమునందలి సుందరమైన ప్రదేశమున గూర్చుండెను.

శ్లో॥ హనుమా నబ్రవీ ద్హృష్ట స్తదా తా న్వానరర్షభాన్ ।
అశోకవనికాసంస్థా దృష్టా సా జనకాత్మజా ॥ 37

శ్లో॥ రక్ష్యమాణా సుఘోరాభీ రాక్షసీభి రనిన్దితా ।
ఏకవేణీధరా దీనా రామదర్శనలాలసా ॥ 38

శ్లో॥ ఉపవాసపరిశ్రాంతా జటిలా మలినా కృశా ॥ 39

**పదచ్ఛేదము** :- హనుమాన్ - అబ్రవీత్ - హృష్టః - తదా - తాన్ - వానరర్షభాన్, అశోకవనికాసంస్థా - దృష్టా - సా - జనకాత్మజా - రక్ష్యమాణా - సుఘోరాభిః - రాక్షసీభిః - అనిందితా - ఏకవేణీధరా - దీనా - రామదర్శనలాలసా - ఉపవాసపరిశ్రాంతా - జటిలా - మలినా - కృశా.

**అన్వయక్రమము** :- తదా హనుమాన్ హృష్టః సన్, సుఘోరాభిః రాక్షసీభిః రక్ష్యమాణా ఏకవేణీధరా దీనా రామదర్శనలాలసా ఉపవాసపరిశ్రాంతా జటిలా మలినా కృశా సా అనిందితా జనకాత్మజా అశోకవనికాసంస్థా దృష్టా ఇతి తాన్ వానరర్షభాన్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- తదా = అప్పుడు, హనుమాన్ = హనుమంతుడు, హృష్టః సన్ = సంతోషించినవాడై, సుఘోరాభిః = మిక్కిలి భీకరులైనట్టి, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, రక్ష్యమాణా = రక్షింపబడుచున్నదై, ఏకవేణీధరా = జడగట్టిన కేశములుగలదియును, దీనా = దీనురాలును, రామదర్శనలాలసా = రఘురాముని దర్శనము కొఱకై వేగిరపడు చున్నదియును, ఉపవాసపరిశ్రాంతా = ఉపవాసములచే బడలియున్నదియును, జటిలా = జడలు ధరించినదియును, మలినా = మలినమైయున్నదియును, కృశా = కృశించియున్నదియును అగు, సా = ఆ, ఆనిందితా = అనింద్యచరితురాలయిన, జనకాత్మజా = జానకీదేవి, అశోకవనికాసంస్థా = అశోకవనమునందు ఉన్నదిగా, దృష్టా = చూడబడినది, ఇతి = అని, తాన్ వానరర్షభాన్ = ఆ వానర శ్రేష్ఠులనుగూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- అప్పుడు హనుమ మహానందముతో మిత్రులైన వానరవీరులను జూచి నేను జానకమ్మను అశోకవనమునందు జూచితిని. ఆమెను భయంకరమైన రాక్షసస్త్రీలు కావలి గాచుచున్నారు. జడగట్టిన కేశములతో దీనురాలై శ్రీరామ దర్శనమునకై పరితపించుచున్నదై ఉపవాసములచే బడలి కృశించి మలినమైయున్న కేశములతోను శరీరముతోను ఉత్తమపవిత్రమూర్తిగానున్నది యని పలికెను.

**శ్లో॥ తతో దృష్టేతి వచనం మహార్థ మమృతోపమమ్ ।**
**నిశమ్య మారుతే స్సర్వే ముదితా వానరా భవన్ ॥ 40**

**పదచ్ఛేదము :–** తతః – దృష్టా – ఇతి – వచనం – మహార్థమ్ – అమృతోపమమ్ – నిశమ్య – మారుతేః – సర్వే – ముదితాః – వానరాః – అభవన్ ॥

**అన్వయక్రమము :–** తతః మారుతేః దృష్టా ఇతి మహార్థం అమృతోపమం వచనం నిశమ్య వానరాః సర్వే ముదితాః అభవన్.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, మారుతేః = హనుమనుండి, దృష్టా = చూడబడినది, ఇతి = అనెడు, మహార్థం = గొప్పయర్థముగలదియును, అమృతోపమం = అమృతతుల్యమైనదియును అగు, వచనం = మాటను, నిశమ్య = విని, వానరాః = వానరులు, సర్వే = అందఱును, ముదితాః = సంతోషమునొందినవారు, అభవన్ = అయిరి.

**తాత్పర్యము :–** హనుమంతుని నోటినుండి 'చూడబడినది'యనెడు మహార్థపూర్ణమైన అమృతము వంటి ఆ మాటను వినగనే వానరులెల్లరును మహానందము నొందిరి.

**శ్లో॥ క్ష్వేళం త్యన్యే నదం త్యన్యే గర్జం త్యన్యే మహాబలాః ।**
**చక్రుః కిలకిలా మన్యే ప్రతిగర్జంతి చాపరే ॥ 41**

**పదచ్ఛేదము :–** క్ష్వేళంతి – అన్యే – నదంతి – అన్యే – గర్జంతి – అన్యే – మహాబలాః, చక్రుః – కిలకిలామ్ – అన్యే – ప్రతిగర్జంతి – చ – అపరే ॥

**ప్రతిపదార్థము :–** అన్యే క్ష్వేళంతి = కొందఱు సింహగర్జనము చేయుచుండిరి. మహాబలాః = గొప్పబలముగల, అన్యే = కొందఱు, గర్జంతి = గర్జించుచుండిరి, అన్యే = మఱికొందఱు, కిలకిలాం = కిలకిలారావమును, చక్రుః = చేసిరి. అపరే = మఱికొందఱు, ప్రతిగర్జంతి చ = బదులుగా గర్జనము చేయుచుండిరి.

**తాత్పర్యము :–** ఆనందనిమగ్నులైన ఆ వానరులు కొందరు సింహనాదములు చేయుచుండిరి. మరికొందరు బిగ్గరగా యఱుచుచుండిరి. బలాఢ్యులైన మఱికొందరు మేఘములవలె ఉఱుముచుండిరి. కొందరు ఉల్లాసముతో కిలకిలారావములు చేయుచుండిరి. మఱికొందరు ఎదుటివాని గర్జనకు బదులుగా ఇంకను బిగ్గఱగా గర్జించుచుండిరి.

**శ్లో॥ కేచి దుచ్ఛ్రితలాంగూలాః ప్రహృష్టాః కపికుంజరాః ।**
**అంచితాయతదీర్ఘాణి లాంగూలాని ప్రవివ్యథుః ॥ 42**

**పదచ్ఛేదము** :– కేచిత్ – ఉచ్ఛ్రితలాంగూలాః – ప్రహృష్టాః – కపికుంజరాః, అంచితాయతదీర్ఘాణి – లాంగూలాని – ప్రవివ్యథుః ॥

**అన్వయక్రమము** :– కేచిత్ ప్రహృష్టాః కపికుంజరాః ఉచ్ఛ్రితలాంగూలాః (సంతః) అంచితాయతదీర్ఘాణి లాంగూలాని ప్రవివ్యథుః.

**ప్రతిపదార్థము** :– కేచిత్ = కొంతమంది, ప్రహృష్టాః = మిక్కిలి హర్షమునొందిన, కపికుంజరాః = వానరశ్రేష్ఠులు, ఉచ్ఛ్రితలాంగూలాః (సంతః) = ఉన్నతమైన వాలములు గలవారై, అంచితాయతదీర్ఘాణి = సుందరములును, స్థూలములును, దీర్ఘములును అగు, లాంగూలాని = తోకలను, ప్రవివ్యథుః = కొట్టుచుండిరి.

**తాత్పర్యము** :– మహానందము నొందుచున్న కొందఱు వానరవీరులు అత్యున్నతముగను సుందరముగను స్థూలముగను పొడవుగను ఉన్న తమ తోకలను ఊపుచు నేలపై కొట్టుచుండిరి.

**శ్లో॥ అపరే చ హనూమంతం వానరా వారణోపమమ్ ।**
**ఆప్లుత్య గిరిశృంగేభ్య స్సంస్పృశంతి స్మ హర్షితాః ॥ 43**

**పదచ్ఛేదము** :– అపరే – చ – హనూమంతం – వానరాః – వారణోపమమ్, ఆప్లుత్య – గిరిశృంగేభ్యః – సంస్పృశంతి – స్మ – హర్షితాః ॥

**అన్వయక్రమము** :– అపరాః వానరాః హర్షితాః గిరిశృంగేభ్యః ఆప్లుత్య వారణోపమం హనూమంతం సంస్పృశంతి స్మ.

**ప్రతిపదార్థము** :– అపరే = మఱికొందరు, వానరాః = వానరులు, హర్షితాః = సంతోషము నొందినవారై, గిరిశృంగేభ్యః = గిరిశిఖరములనుండి, ఆప్లుత్య = దుమికి, వారణోపమం = ఏనుగుతో సమానుడైయున్న, హనూమంతం = హనుమను, సంస్పృశంతి స్మ = ముట్టుకొనుచుండిరి.

**తాత్పర్యము** :– మఱికొందరు వానరులు ఆనందాతిశయముతో కొండకోనలనుండి క్రిందికి దూకి వచ్చి గజరాజసన్నిభుడైన హనుమయొడలిని తమ చేతితో నిమురుచుండిరి.

**శ్లో॥ ఉక్తవాక్యం హనూమంత మంగద స్తమథాబ్రవీత్ ।**
**సర్వేషాం హరివీరాణాం మధ్యే వాచ మనుత్తమామ్ ॥ 44**

**పదచ్ఛేదము** :– ఉక్తవాక్యం – హనూమంతమ్ – అంగదః – తమ్ – అథ – అబ్రవీత్, సర్వేషాం – హరివీరాణాం – మధ్యే – వాచమ్ – అనుత్తమామ్ ॥

**అన్వయక్రమము** :- అథ ఉక్తవాక్యం తం హనూమంతం హరివీరాణాం సర్వేషాం మధ్యే అంగదః అనుత్తమాం వాచమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, హరివీరాణాం = వానరుల, సర్వేషాం = ఎల్లరియొక్క, మధ్యే = నడుమ, అంగదః = అంగదుడు, ఉక్తవాక్యం = పలికిన మాటలుగల, హనూమంతం = హనుమంతునిగూర్చి, అనుత్తమాం = అత్యుత్తమమైనట్టి, వాచం = మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- హనుమంతుడు చెప్పిన మాటలను విని ఆ వానరవీరుల నడుమనున్న అంగదు డా హనుమనుజూచి ఈ మంచి మాటలను పలికెను.

**శ్లో॥ సత్త్వే వీర్యే న తే కశ్చిత్ సమో వానర విద్యతే ।**
**య దవప్లుత్య విస్తీర్ణం సాగరం పున రాగతః ॥ 45**

**పదచ్ఛేదము** :- సత్త్వే - వీర్యే - న - తే - కశ్చిత్ - సమః - వానర - విద్యతే, యత్ - అవప్లుత్య - విస్తీర్ణం - సాగరం - పునః - ఆగతః ॥

**అన్వయక్రమము** :- వానర! సత్త్వే వీర్యే తే సమః కశ్చిత్ న విద్యతే, యత్ విస్తీర్ణం సాగరమ్ అవప్లుత్య పునః ఆగతః (అపి).

**ప్రతిపదార్థము** :- వానర! = ఓ వానరశ్రేష్ఠుడా!, సత్త్వే = బలమునందును, వీర్యే = పరాక్రమమునందును, తే = నీకు, సమః = సమానుడు, కశ్చిత్ = ఒక్కడును, న విద్యతే = ఉండడు, యత్ = ఎందువల్లననగా, విస్తీర్ణం = విశాలమైన, సాగరం = సముద్రమును, అవప్లుత్య = దాటి, పునః = తిరిగి, ఆగతః (అసి) = వచ్చినవాడవైతివి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- 'విస్తీర్ణం సాగరమ్ అవప్లుత్య పునః ఆగతః' అనుటచే అంగదునితో సహితముగా నీకు సాటియైన వానరుడు లేడు అనియును 'విస్తీర్ణం సాగరమ్ అవప్లుత్య' అనునంతవఱకును అంగదుని విడచి ఏ వానరుడును నీకు సాటి రాడనియు సూచింపబడినది.

**తాత్పర్యము** :- వానరవీరుడా! అతివిశాలమైన మహాసాగరము నవలీలగ దాటి తిరిగి వచ్చినట్టి నీకు బలమునందుగాని పరాక్రమమునందుగాని సాటివచ్చువాడు ఎవ్వడును లేడు సుమా!

**శ్లో॥ జీవితస్య ప్రదాతా న స్త్వ మేకో వానరోత్తమ ।**
**త్వత్ప్రసాదా త్సమేష్యామ స్సిద్ధార్థా రాఘవేణ తు ॥ 46**

**సూచన :-** ఈ శ్లోకము బొంబాయి ప్రతినుండి గ్రహింపబడినది. ఇది దక్షిణదేశ ప్రతులలో లేదు.

**పదచ్ఛేదము :-** జీవితస్య – ప్రదాతా – నః – త్వం – ఏకః – వానరోత్తమ – త్వత్ప్రసాదాత్ – సమేష్యామః – సిద్ధార్థాః – రాఘవేణ – తు ॥

**అన్వయక్రమము :-** వానరోత్తమ! త్వమ్ ఏకః నః జీవితస్య ప్రదాతా, త్వత్ప్రసాదాత్ సిద్ధార్థాః (సంతః) రాఘవేణ సమేష్యామః.

**ప్రతిపదార్థము :-** వానరోత్తమ! = వానరశ్రేష్ఠుడా!, త్వం = నీవు, ఏకః = ఒక్కడవు, నః = మాకు, జీవితస్య ప్రదాతా = జీవితముయొక్క దాతవు, త్వత్ప్రసాదాత్ = నీ దయవలన, సిద్ధార్థాః (సంతః) = చరితార్థులమై, రాఘవేణ = శ్రీరామునితో, సమేష్యామః = కలియగలము.

**తాత్పర్యము :-** ఓ వానరశ్రేష్ఠుడా! నీవే మా కీనాడు జీవితదానము చేసిన వాడవు. నీ యనుగ్రహమువలననే మేము చరితార్థులమై సంతోషముగా శ్రీరాముని దర్శింప గలుగుచున్నాము.

**శ్లో॥ అహో స్వామిని తే భక్తి రహో వీర్య మహో ధృతిః ।**
**దిష్ట్యా దృష్టా త్వయా దేవీ రామపత్నీ యశస్వినీ**
**దిష్ట్యా త్యక్ష్యతి కాకుత్స్థః శోకం సీతావియోగజమ్ ॥ 47**

**పదచ్ఛేదము :-** అహో – స్వామిని – తే – భక్తిః – అహో – వీర్యమ్ – అహో – ధృతిః – దిష్ట్యా – దృష్టా – త్వయా – దేవీ – రామపత్నీ – యశస్వినీ – దిష్ట్యా – త్యక్ష్యతి – కాకుత్స్థః – శోకం – సీతావియోగజమ్ ॥

**అన్వయక్రమము :-** తే స్వామిని భక్తిః అహో! వీర్యం అహో! ధృతిః అహో! దిష్ట్యా యశస్వినీ దేవీ రామపత్నీ త్వయా దృష్టా! దిష్ట్యా కాకుత్స్థః సీతావియోగజం శోకం త్యక్ష్యతి.

**ప్రతిపదార్థము :-** తే = నీకు, స్వామిని = ప్రభువునందు, భక్తిః = భక్తి, అహో = ఎంత గొప్పదో, వీర్యం = పరాక్రమము, అహో = ఎంత గొప్పదో, ధృతిః = ధైర్యము, అహో! = ఆశ్చర్యకరమైనది! దిష్ట్యా = భాగ్యవశమున, యశస్వినీ = కీర్తిమంతురాలును, దేవీ = మహనీయురాలును అగు, రామపత్నీ = శ్రీరాముని ధర్మపత్ని, త్వయా = నీచేత, దృష్టా = చూడబడినది, దిష్ట్యా = అదృష్టవశమున, కాకుత్స్థః = శ్రీరాముడు, సీతావియోగజం = జానకీవియోగమువలన గలిగినట్టి, శోకం = దుఃఖమును, త్యక్ష్యతి = విడువగలడు.

**తాత్పర్యము :-** ఓ వానరోత్తమా! నీ ప్రభుభక్తిని ఏమని కీర్తింపగలము. ఆహా! నీ పరాక్రమ మెంత గొప్పది. నీ ధైర్య మెంత యద్భుతమైనది. మా యందఱి అదృష్టముచేత పూజ్యురాలైన శ్రీరాముని ప్రియురాలిని నీవు కనుగొనగల్గితివి. మన అదృష్టవశమున నేటితో ఆ రఘుపుంగవుడు సీతావియోగజనితమైన శోకమును విడిచి పెట్టగలడుగదా!

**శ్లో॥ త తో ఉ ంగదం హనూమంతం జాంబవంతం చ వానరాః ।**
**పరివార్య ప్రముదితా భేజిరే విపులా శ్శిలాః ॥ 48**

**శ్లో॥ శ్రోతుకామా స్సముద్రస్య లంఘనం వానరోత్తమాః ।**
**దర్శనం చాపి లంకాయా స్సీతాయా రావణస్య చ ॥ 49**

**శ్లో॥ తస్థుః ప్రాంజలయ స్సర్వే హనూమద్వదనోన్ముఖాః ॥ 50**

**పదచ్ఛేదము :-** తతః - అంగదం - హనూమంతం - జాంబవంతం - చ - వానరాః, పరివార్య - ప్రముదితాః - భేజిరే - విపులాః - శిలాః, శ్రోతుకామాః - సముద్రస్య - లంఘనం - వానరోత్తమాః, దర్శనం - చ - అపి - లంకాయాః - సీతాయాః - రావణస్య - చ, తస్థుః - ప్రాంజలయః - సర్వే - హనుమద్వదనోన్ముఖాః ॥

**అన్వయక్రమము :-** తతః ప్రముదితాః వానరాః అంగదం హనూమంతం జాంబవంతం చ పరివార్య విపులాః శిలాః భేజిరే, వానరోత్తమాః సముద్రస్య లంఘనం లంకాయాః రావణస్య చ దర్శనం చ అపి శ్రోతుకామాః సర్వే హనుమద్వదనోన్ముఖాః ప్రాంజలయః తస్థుః.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, ప్రముదితాః = సంతోషము నొందిన, వానరాః = వానరులు, అంగదం = అంగదుని, హనూమంతం = హనుమను, జాంబవంతం = జాంబవంతుని, పరివార్య = చుట్టును జేరి, విపులాః = విశాలములైన, శిలాః = శిలలను, భేజిరే = ఆశ్రయించిరి. వానరోత్తమాః = వానరశ్రేష్ఠులు, సముద్రస్య = సముద్రముయొక్క, లంఘనం = దాటుటను, లంకాయాః = లంకయొక్కయు, సీతాయాః = సీతయొక్కయు, రావణస్య చ = రావణునియొక్కయు, దర్శనం చాపి = దర్శనమునుగూర్చియు, శ్రోతుకామాః = వినగోరినవా రగుచు, సర్వే = ఎల్లరను, హనుమద్వదనోన్ముఖాః = హనుమముఖమునకే ఎదురుగ నున్నవారై, ప్రాంజలయః = దోసిలి యొగ్గినవారై, తస్థుః = ఉండిరి.

**తాత్పర్యము :-** అప్పుడు సంతోషాతిశయముతోనున్న యా వానరులు అంగదుని, హనుమంతుని, జాంబవంతుని చుట్టును జేరి యచటి విశాలమైన ఱాతిబండలపై

కూర్చుండిరి. ఆ వానరులు సముద్రలంఘనమును గూర్చియు లంకాగమనమును గూర్చియును సీతాసందర్శనమును గూర్చియును, రావణ సమాగమమును గూర్చియును వివరముగా తెలిసికొనగోరి హనుమ ముఖముపై చూపులు నిలిపి, చేతులు జోడించి యాతని వచనములను విను కుతూహలముతో వేచియుండిరి.

**శ్లో॥ తస్థౌ తత్రాంగద శ్రీమాన్ వానరైర్బహుభి ర్వృతః ।**
**ఉపాస్యమానో విబుధై ర్దివి దేవపతిర్యథా ॥ 51**

**పదచ్ఛేదము** :– తస్థౌ – తత్ర – అంగదః – శ్రీమాన్ – వానరైః – బహుభిః – వృతః, ఉపాస్యమానః – విబుధైః – దివి – దేవపతిః – యథా ॥

**అన్వయక్రమము** :– తత్ర బహుభిః వానరైః వృతః శ్రీమాన్ అంగదః దివి విబుధైః ఉపాస్యమానః దేవపతిః యథా తస్థౌ.

**ప్రతిపదార్థము** :– తత్ర = అచ్చట, బహుభిః = పెక్కుమంది, వానరైః = వానరులచే, వృతః = చుట్టుకొనబడియున్న, శ్రీమాన్ = మహాశోభాసంపన్నుడైన, అంగదః = అంగదుడు, దివి = స్వర్గమునందు, విబుధైః = దేవతలచే, ఉపాస్యమానః = సేవింపబడుచున్నట్టి, దేవపతిః యథా = దేవేంద్రునివలె, తస్థౌ = ఉండెను.

**తాత్పర్యము** :– ఆ మహేంద్రపర్వతముపై ఎదుట హనుమయు జాంబవంతుడును చుట్టును వానరవీరు లనేకులును కొలువుదీరియుండగా రాజశోభతో వెలుగొందు యువరాజైన అంగదుడప్పుడు స్వర్గలోకమునందు దేవగణములచే సేవింపబడు మహేంద్రునివలెనే వెలయుచుండెను.

**శ్లో॥ హనూమతా కీర్తిమతా యశస్వినా**
**తథాంగదే నాంగదబద్ధబాహునా ।**
**ముదా తదా ఽధ్యాసిత మున్నతం మహ**
**న్మహీధరాగ్రం జ్వలితం శ్రియాఽ భవత్ ॥ 52**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"ప్రతిప్రయాణోత్పతనం" నామ*
*సప్తపంచాశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– హనూమతా – కీర్తిమతా – యశస్వినా, తథా – అంగదేన – అంగదబద్ధబాహునా, ముదా – తదా – అధ్యాసితం – ఉన్నతం – మహత్,

మహీధరాగ్రం - జ్వలితం - శ్రియా - అభవత్ ॥

**అన్వయక్రమము** :- కీర్తిమతా హనుమతా తథా అంగదబద్ధబాహునా యశస్వినా అంగదేన ముదా అధ్యాసితం ఉన్నతం మహత్ తత్ మహీధరాగ్రం తదా శ్రియా జ్వలితమ్ అభవత్.

**ప్రతిపదార్థము** :- కీర్తిమతా = కీర్తిసంపన్నుడైన, హనూమతా = హనుమంతుని చేతను, తథా = అట్లే, యశస్వినా = యశోవంతుడైన, అంగదబద్ధబాహునా = భుజకీర్తులచే గట్టబడిన భుజములు కల్గినట్టి, అంగదేన = అంగదునిచేతను, ముదా = సంతోషముతో, అధ్యాసితం = ఆశ్రయించబడినట్టి, ఉన్నతం = ఎత్తైనట్టి, మహత్ = గొప్పదైనట్టి, (తత్) మహీధరాగ్రం = ఆ పర్వతశిఖరము, తదా = అప్పుడు, శ్రియా = శోభతో, జ్వలితం = వెల్గొందుచున్నట్టిది, అభవత్ = అయెను.

**తాత్పర్యము** :- మహాకీర్తిని సంపాదించియున్న హనుమంతుడును అట్లే యువరాజపదవిచే లబ్ధప్రతిష్ఠుడై భుజకీర్తులతో వెలయుచున్న అంగదుడును ఆ మహేంద్రగిరి శిఖరాగ్రమున మహాసంతోషముతో కలిసి కూర్చుండియుండగా వారితో గూడిన ఆ గిరిశిఖర మద్భుతమైన శోభతో వెలుగొందుచుండెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"ప్రతిప్రయాణోత్పతనము" అను*
*ఏబదియేడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# అష్టపంచాశసర్గ

**శ్లో॥ తత స్తస్య గిరేః శృంగే మహేంద్రస్య మహాబలాః ।**
**హనుమత్ప్రముఖాః ప్రీతిం హరయో జగ్ము రుత్తమామ్ ॥ 1**

**పదచ్ఛేదము** :- తతః - తస్య - గిరేః - శృంగే - మహేంద్రస్య - మహాబలాః, హనుమత్ప్రముఖాః - ప్రీతిం - హరయః - జగ్ముః - ఉత్తమామ్ ॥

**అన్వయక్రమము** :- తతః తస్య మహేంద్రస్య గిరేః శృంగే మహాబలాః హనుమత్ప్రముఖాః హరయః ఉత్తమాం ప్రీతిం జగ్ముః.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, తస్య = ఆ, మహేంద్రస్య గిరేః = మహేంద్ర పర్వతము యొక్క, శృంగే = శిఖరమునందు, మహాబలాః = గొప్పబలవంతులైన, హనుమత్ప్రముఖాః = హనుమంతుడు మొదలుగా గల్గినట్టి, హరయః = వానరులు, ఉత్తమాం = ఉత్తమమైన, ప్రీతిం = సంతోషమును, జగ్ముః = పొందిరి.

**తాత్పర్యము** :- అటు పిమ్మట మహేంద్రపర్వత శిఖరమునందు మహాబలాఢ్యుడైన హనుమ మున్నగు వానరవీరులందరును చిరకాలమునకు కలసికొని అమితమైన ఆనందము నొందిరి.

**శ్లో॥ తం తతః ప్రీతిసంహృష్టః ప్రీతిమంతం మహాకపిమ్ ।**
**జాంబవా న్కార్యవృత్తాంత మపృచ్ఛ దనిలాత్మజమ్ ॥ 2**

**పదచ్ఛేదము** :- తం - తతః - ప్రీతిసంహృష్టః - ప్రీతిమంతం - మహాకపిమ్, జాంబవాన్ - కార్యవృత్తాంతమ్ - అపృచ్ఛత్ - అనిలాత్మజమ్ ॥

**అన్వయక్రమము** :- తతః జాంబవాన్ ప్రీతిసంహృష్టః (సన్) తం ప్రీతిమంతం మహాకపిమ్ అనిలాత్మజం కార్యవృత్తాంతమ్ అపృచ్ఛత్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, జాంబవాన్ = జాంబవంతుడు, ప్రీతిసంహృష్టః (సన్) = ప్రేమతో మిక్కిలి సంతోషించుచున్నవాడై, ప్రీతిమంతం = సంతోషము గలిగియున్న, మహాకపిం = వానరశ్రేష్ఠుడగు, తం = ఆ, అనిలాత్మజం =

వాయునందనుని, కార్యవృత్తాంతం = (చేసిన) పనివిషయమును గూర్చి, అపృచ్ఛత్= అడిగెను.

**తాత్పర్యము** :– అంతట జాంబవంతుడు హనుమంతునిపై అమితమైన అనురాగము గల్గిన మనస్సుతో, తమను కలిసికొని ఆనందభరితుడైయున్న వాయునందనుని జూచి ఆతడు సాధించుకొని వచ్చిన సీతాదర్శనాది విషయముల వివరమును గూర్చి ప్రశ్నించెను.

**శ్లో॥ కథం దృష్టా త్వయా దేవీ కథం వా తత్ర వర్తతే ।**
**తస్యాం వా స కథం వృత్తః క్రూరకర్మా దశాననః ॥ 3**

**పదచ్ఛేదము** :– కథం – దృష్టా – త్వయా – దేవీ – కథం – వా – తత్ర – వర్తతే – తస్యాం – వా – సః – కథం – వృత్తః – క్రూరకర్మా – దశాననః ॥

**అన్వయక్రమము** :– త్వయా దేవీ కథం దృష్టా? తత్ర కథం వా వర్తతే ? సః క్రూరకర్మా దశాననః వా తస్యాం కథం వృత్తః?

**ప్రతిపదార్థము** :– త్వయా = నీచేత, దేవీ = పూజ్యురాలైన సీత, కథం = ఎట్లు, దృష్టా = చూడబడినది? తత్ర = ఆ లంకయందు, కథం వా = ఎట్లుగా, వర్తతే = మెలగుచున్నది? సః = ఆ, క్రూరకర్మా = క్రూరాత్ముడైన, దశాననః వా = రావణుడు, తస్యాం = ఆమెయందు, కథం వృత్తః = ఎట్టి వర్తనముగలవాడై యున్నాడు?

**తాత్పర్యము** :– ఆ లంకయందు సీతాదేవిని నీవెట్లు చూడగలిగినావు? పూజ్యురాలైన ఆ సీతాదేవి ఆ లంకలో ఎట్లు జీవించుచున్నది? క్రూరచర్యలు గల రావణుడు సీతాదేవి యెడ ఎట్లుగా వర్తించుచున్నాడు?

**శ్లో॥ తత్త్వత స్సర్వ మేత న్నః ప్రబ్రూహి త్వం మహాకపే!**
**సంమార్గితా కథం దేవీ కిం చ సా ప్రత్యభాషత? ॥**
**శ్రుతార్థా శ్చింతయిష్యామో భూయః కార్యవినిశ్చయమ్ ॥ 4**

**సూచన** :– ఇందలి రెండవ పంక్తి కొన్ని ప్రతులలో కానవచ్చుట లేదు.

**పదచ్ఛేదము** :– తత్త్వతః – సర్వమ్ – ఏతత్ – నః – ప్రబ్రూహి – త్వం – మహాకపే, సంమార్గితా – కథం – దేవీ – కిం – చ – సా – ప్రత్యభాషత, శ్రుతార్థాః – చింతయిష్యామః – భూయః – కార్యవినిశ్చయమ్ ॥

**అన్వయక్రమము** :– మహాకపే! దేవీ కథం సంమార్గితా? సా కిం ప్రత్యభాషత చ?

ఏతత్ సర్వం నః త్వం తత్త్వతః ప్రబ్రూహి, శ్రుతార్థాః భూయః కార్యవినిశ్చయం చింతయిష్యామః.

**ప్రతిపదార్థము** :- మహాకపే! = వానరోత్తముడా! దేవీ = పూజ్యురాలైన సీత, కథం = ఎట్లు, సంమార్గితా = వెదుకబడినది? సా = ఆమె, కిం = ఏమి, ప్రత్యభాషత = బదులు చెప్పినది? ఏతత్ = ఇది, సర్వం = అంతయును, నః = మాకు, త్వం = నీవు, తత్త్వతః = ఉన్నది యున్నట్లుగా, ప్రబ్రూహి = వివరముగ చెప్పుము. శ్రుతార్థాః = వినిన విషయముగలవారమై, భూయః = తిరిగి, కార్యవినిశ్చయం = కర్తవ్యముయొక్క నిర్ణయమును గూర్చి, చింతయిష్యామః = ఆలోచింపగలము.

**తాత్పర్యము** :- ఓ వానరోత్తమా! లంకలో నీవు సీతాదేవిని ఎట్లు వెదక గలిగితివి? ఆమె తన ప్రతివచనముగా ఏమి చెప్పినది? ఇది యంతయును నీవు మాకు వివరముగా ఉన్నది యున్నట్లు తెలుపుము. ఆ విషయములన్నియును వినిన పిమ్మట అనంతర కర్తవ్యమును గూర్చి ఆలోచించుదుము.

**శ్లో॥ యశ్చార్థ స్తత్ర వక్తవ్యో గతై రస్మాభి రాత్మవాన్ ।**
**రక్షితవ్యం చ య త్తత్ర త ద్భవాన్ వ్యాకరోతు నః ॥ 5**

**పదచ్ఛేదము** :- యః - చ - అర్థః - తత్ర - వక్తవ్యః - గతైః - అస్మాభిః - ఆత్మవాన్, రక్షితవ్యం - చ - యత్ - తత్ర - తత్ - భవాన్ - వ్యాకరోతు - నః॥

**అన్వయక్రమము** :- తత్ర గతైః అస్మాభిః యః అర్థః వక్తవ్యః, యత్ రక్షితవ్యం చ, ఆత్మవాన్ భవాన్ తత్ నః వ్యాకరోతు.

**ప్రతిపదార్థము** :- తత్ర = అచ్చటకు, గతైః = వెడలినట్టి, అస్మాభిః = మనచేత, యః = ఏ, అర్థః = విషయము, వక్తవ్యః = చెప్పవలసినదో, యత్ = ఏది, రక్షితవ్యం చ = దాచవలసినదియును అగునో, తత్ = దానిని, ఆత్మవాన్ = బుద్ధిమంతుడవైన, భవాన్ = నీవు, నః = మాకు, వ్యాకరోతు = వివరింపుము.

**తాత్పర్యము** :- మనము శ్రీరాముని సన్నిధికి వెడలినప్పుడు చెప్పవలసిన విషయములు ఏమియుండునో చెప్పగూడనివి, దాచవలసినవి యేమి యుండునో ఆ విషయములను బుద్ధిమంతుడవై నీవు చక్కగా ఆలోచించి వివరింపుము.

**శ్లో॥ స నియుక్త స్తత స్తేన సంప్రహృష్టతనూరుహః ।**
**ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై ప్రత్యభాషత ॥ 6**

**పదచ్ఛేదము** :- సః - నియుక్తః - తతః - తేన - సంప్రహృష్టతనూరుహః -

ప్రణమ్య – శిరసా – దేవ్యై – సీతాయై – ప్రత్యభాషత ॥

**అన్వయక్రమము** :– తతః తేన నియుక్తః సః సంప్రహృష్టతనూరుహః (సన్) దేవ్యై సీతాయై శిరసా ప్రణమ్య ప్రత్యభాషత.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, తేన = ఆ జాంబవంతునిచే, నియుక్తః = నియోగింప బడినవాడైన, సః = ఆ హనుమ, సంప్రహృష్టతనూరుహః = గగురుపాటు చెందిన రోమములు గలవాడై, దేవ్యై = పూజ్యురాలైన, సీతాయై = సీతమ్మకు, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = మ్రొక్కి, ప్రత్యభాషత = బదులు పలికెను.

**తాత్పర్యము** :– జాంబవంతుడట్లు ప్రశ్నింపగా హనుమ అనందాతిశయముతో ఒడలినిండుగ పులకాంకురములు పొడమగా శిరమువంచి సీతామాతకు మ్రొక్కి బదులు చెప్పుటకు ఆరంభించెను.

**శ్లో॥ ప్రత్యక్షమేవ భవతాం మహేంద్రాగ్రా త్ఖ మాప్లుతః ।**
**ఉదధే ర్దక్షిణం పారం కాంక్షమాణ స్సమాహితః ॥ 7**

**పదచ్ఛేదము** :– ప్రత్యక్షమ్ – ఏవ – భవతాం – మహేంద్రాగ్రాత్ – ఖమ్ – ఆప్లుతః – ఉదధేః – దక్షిణం – పారం – కాంక్షమాణః – సమాహితః ॥

**అన్వయక్రమము** :– భవతాం ప్రత్యక్షమ్ ఏవ మహేంద్రాగ్రాత్ ఉదధేః దక్షిణం పారం కాంక్షమాణః సమాహితః ఖమ్ ఆప్లుతః.

**ప్రతిపదార్థము** :– భవతాం = మీ యొక్క, ప్రత్యక్షమ్ ఏవ = సమక్షముననే, మహేంద్రాగ్రాత్ = మహేంద్రగిరి శిఖరమున నుండి, ఉదధేః = సముద్రముయొక్క, దక్షిణం పారం = దక్షిణతీరమును, కాంక్షమాణః = (చేర) గోరుచున్నవాడనై, సమాహితః = ఏకాగ్రచిత్తుడనై, ఖం = ఆకాశమును గూర్చి, ఆప్లుతః = ఎగిరితిని.

**తాత్పర్యము** :– ఆనాడు మీరందరును జూచుచుండగా మీ సమక్షముననే ఈ మహేంద్రగిరి శిఖరము నుండి సముద్రము ఆవలిగట్టును చేరగోరి అందుకొరకు సన్నద్ధుడనై ఆకసమునకు ఎగిరియుంటిని గదా!

**శ్లో॥ గచ్ఛతశ్చ హి మే ఘోరం విఘ్నరూపమి వాభవత్ ।**
**కాంచనం శిఖరం దివ్యం పశ్యామి సుమనోహరమ్ ॥ 8**

**శ్లో॥ స్థితం పంథాన మావృత్య మేనే విఘ్నం చ తం నగమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :– గచ్ఛతః – చ–హి–మే – ఘోరం – విఘ్నరూపమ్ – ఇవ –

అభవత్ – కాంచనం – శిఖరం – దివ్యం – పశ్యామి – సుమనోహరమ్, స్థితం – పంథానమ్ – ఆవృత్య – మేనే – విఘ్నం – చ – తం – నగమ్ ॥

**అన్వయక్రమము :–** గచ్ఛతః చ హి మే ఘోరం విఘ్నరూపమ్ ఇవ అభవత్, కాంచనం సుమనోహరం దివ్యం శిఖరం పశ్యామి, పంథానమ్ ఆవృత్య స్థితం తం నగమ్ అహమ్ విఘ్నం మేనే.

**ప్రతిపదార్థము :–** గచ్ఛతః = పోవుచున్నట్టి, మే = నాకు, ఘోరం = భయంకరమైన, విఘ్నరూపమ్ ఇవ = విఘ్నమువలె, అభవత్ = అయ్యెను, కాంచనం = స్వర్ణమయమైనను, మనోహరం = మిక్కిలి రమణీయమైన, దివ్యం = ఉజ్జ్వలమైన, శిఖరం = పర్వతశృంగమును, పశ్యామి = చూచితిని, పంథానం = మార్గమును, ఆవృత్య = ఆవరించి, స్థితం = ఉన్నట్టి, తం = ఆ, నగం = పర్వతమును, (అహం = నేను), విఘ్నం = అంతరాయముగా, మేనే = తలచితిని.

**తాత్పర్యము :–** నేనట్లు ఆకాశమున ఎగురుచుండగా ఒక భయంకరమైన విఘ్నము సంభవించినది. ఎదుట స్వర్ణమయమైన అతి రమణీయమైన ఒక పర్వత శిఖరము నా మార్గమునకు అడ్డముగ నిలచి యుండెను. ఆ పర్వతమును జూచి దానిని నాకొక పెద్ద విఘ్నముగా భావించితిని.

**శ్లో॥ ఉపసంగమ్య తం దివ్యం కాంచనం నగసత్తమమ్ ।**
**కృతా మే మనసా బుద్ధి ర్భేత్తవ్యోఽయం మయేతి చ ॥ 10**

**పదచ్ఛేదము :–** ఉపసంగమ్య – తం – దివ్యం – కాంచనం – నగసత్తమమ్, కృతా – మే – మనసా – బుద్ధిః – భేత్తవ్యః – అయం – మయా – ఇతి – చ ॥

**అన్వయక్రమము :–** దివ్యం కాంచనం తం నగసత్తమమ్ ఉపసంగమ్య మయా అయం భేత్తవ్యః ఇతి మే మనసా బుద్ధిః కృతా చ.

**ప్రతిపదార్థము :–** దివ్యం = ఉజ్జ్వలమైనట్టి, కాంచనం = సువర్ణమయమైన, తం = ఆ, నగసత్తమం = పర్వతశ్రేష్ఠమును, ఉపసంగమ్య = సమీపించి, అయం = ఇది, మయా = నాచేత, భేత్తవ్యః = బ్రద్దలు కొట్టవలసినట్టిది, ఇతి చ = అనియును, మే = నాకు, మనసా = మనస్సుచే, బుద్ధిః = ఆలోచనము, కృతా = చేయబడినది.

**తాత్పర్యము :–** నేను దివ్యమైన ఆ కాంచన పర్వతమును సమీపించి దీని నిప్పుడు బ్రద్దలు గొట్టవలయును కాబోలునని మనస్సునందు ఆలోచించితిని.

**శ్లో॥ ప్రహతం చ మయా తస్య లాంగూలేన మహాగిరేః ।**
**శిఖరం సూర్యసంకాశం వ్యశీర్యత సహస్రధా ॥ 11**

**పదచ్ఛేదము :–** ప్రహతం – చ – మయా – తస్య – లాంగూలేన – మహాగిరేః – శిఖరం – సూర్యసంకాశం – వ్యశీర్యత – సహస్రధా ॥

**అన్వయక్రమము :–** తస్య మహాగిరేః సూర్యసంకాశం శిఖరం మయా లాంగూలేన ప్రహతం (సత్) సహస్రధా వ్యశీర్యత చ.

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ, మహాగిరేః = మహాపర్వతము యొక్క, సూర్యసంకాశం = సూర్యునితో సమానమైనట్టి, శిఖరం = శృంగము, మయా = నాచేత, లాంగూలేన = వాలముచే, ప్రహతం (సత్) = బ్రద్దలుకొట్టబడినదగుచు, సహస్రధా = వేయి విధములుగా, వ్యశీర్యత చ = ముక్కలైనది కూడను.

**తాత్పర్యము :–** వెంటనే నేను నా తోకతో ఆ పర్వత శిఖరమును ఒక్క వ్రేటున మోదితిని. దానితో సూర్యసన్నిభమైన ఆ గిరిశిఖరము వేయిముక్కలైనది.

**శ్లో॥ వ్యవసాయం చ తం బుద్ధ్వా స హోవాచ మహాగిరిః ।**
**పుత్రేతి మధురాం వాణీం మనః ప్రహ్లాదయన్నివ ॥ 12**

**పదచ్ఛేదము :–** వ్యవసాయం – చ – తం – బుద్ధ్వా – సః – హ – ఉవాచ – మహాగిరిః, పుత్ర – ఇతి – మధురాం – వాణీం – మనః – ప్రహ్లాదయన్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** తం వ్యవసాయం బుద్ధ్వా సః మహాగిరిః మనః ప్రహ్లాదయన్ ఇవ పుత్ర ఇతి మధురాం వాణీమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** తం = ఆ, వ్యవసాయం = ప్రయత్నమును, బుద్ధ్వా = తెలిసికొని, సః = ఆ, మహాగిరిః = మహాపర్వతము, మనః = మనస్సును, ప్రహ్లాదయన్ ఇవ = ఆనందింపచేయుచున్నట్లు, పుత్ర = కుమారా, ఇతి = అని, మధురాం = తియ్యనైన, వాణీమ్ = మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** ఆ మహాపర్వతము నా ఉద్యమమును తెలుసుకొనుచు నా మనస్సునకు అమితమైన ఆహ్లాదము కలిగించుచు కుమారా! అని తియ్యనైన వచనముతో ఇట్లు పలికెను.

**శ్లో॥ పితృవ్యం చాపి మాం విద్ధి సఖాయం మాతరిశ్వనః ।**
**మైనాకమితి విఖ్యాతం నివసంతం మహోదధౌ ॥ 13**

**పదచ్ఛేదము :–** పితృవ్యం – చ – అపి – మాం – విద్ధి – సఖాయం – మాతరిశ్వనః, మైనాకమ్ ఇతి – విఖ్యాతం – నివసంతం – మహోదధౌ ॥

**అన్వయక్రమము :–** మాతరిశ్వనః సఖాయం మాం మైనాకమ్ ఇతి విఖ్యాతం మహోదధౌ నివసంతం (తవ) పితృవ్య (ఇతి) అపి చ విద్ధి.

**ప్రతిపదార్థము :–** మాం = నన్ను, మాతరిశ్వనః = వాయువుయొక్క, సఖాయం = మిత్రునిగను, మహోదధౌ = మహాసాగరమునందు, నివసంతం = నివసించుచున్నట్టి, మైనాకమ్ ఇతి = మైనాకుడని, విఖ్యాతం = ప్రసిద్ధుడైనవానినిగను, తవ = నీకు, పితృవ్యమ్ ఇతి అపి చ = పినతండ్రిని అనియును, విద్ధి = తెలిసికొనుము.

**తాత్పర్యము :–** నేను మీ తండ్రియైన వాయుదేవునకు మిత్రుడను కాబట్టి నేను నీకు పినతండ్రి నగుదును! ఈ మహాసాగరమున నివసించుచున్న నన్ను మైనాకుడని ఎల్లరును ఎరుగుదురు.

**శ్లో॥ పక్షవంతః పురా పుత్ర బభూవుః పర్వతోత్తమాః ।**
**ఛందతః పృథివీం చేరు ర్బాధమానా స్సమంతతః ॥ 14**

**పదచ్ఛేదము :–** పక్షవంతః – పురా – పుత్ర – బభూవుః – పర్వతోత్తమాః, ఛందతః – పృథివీం – చేరుః – బాధమానాః – సమంతతః ॥

**అన్వయక్రమము :–** పుత్ర! పురా పర్వతోత్తమాః పక్షవంతః బభూవుః. ఛందతః పృథివీం బాధమానాః సమంతతః చేరుః.

**ప్రతిపదార్థము :–** పుత్ర = కుమారా! పురా = పూర్వము, పర్వతోత్తమాః = పెద్ద పర్వతములు, పక్షవంతః = రెక్కలుగలవిగా, బభూవుః = ఉండినవి, (తే=అవి) ఛందతః = స్వేచ్ఛగా, పృథివీం = భూమిని, బాధమానాః = బాధించుచున్నవై, సమంతతః = ఎల్లయెడల, చేరుః = చరించినవి.

**తాత్పర్యము :–** కుమారా! పూర్వకాలమున పెద్ద పర్వతము లన్నియును రెక్కలు గలిగియుండెడివి. అవి అప్పుడు యథేచ్ఛగా లోకులకు బాధ కలిగించుచు భూమిపై నెల్లయెడలను తిరుగుచుండెడివి.

**శ్లో॥ శ్రుత్వా నగానాం చరితం మహేంద్రః పాకశాసనః ।**
**చిచ్ఛేద భగవాన్ పక్షా న్వజ్రే ణైషాం సహస్రశః ॥ 15**

**పదచ్ఛేదము :–** శ్రుత్వా – నగానాం – చరితం – మహేంద్రః – పాకశాసనః – చిచ్ఛేద – భగవాన్ – పక్షాన్ – వజ్రేణ – ఏషాం – సహస్రశః ॥

**అన్వయక్రమము :-** పాకశాసనః భగవాన్ మహేంద్రః నగానాం చరితం శ్రుత్వా వజ్రేణ ఏషాం పక్షాన్ సహస్రశః చిచ్ఛేద.

**ప్రతిపదార్థము :-** పాకశాసనః = పాకాసురసంహారియైన, భగవాన్ = పూజ్యుడగు, మహేంద్రః = దేవేంద్రుడు, నగానాం = పర్వతములయొక్క, చరితం = ప్రవర్తనమును, శ్రుత్వా = విని, వజ్రేణ = వజ్రముచే, ఏషాం = ఆ పర్వతముల యొక్క, పక్షాన్ = రెక్కలను, సహస్రశః = వేలముక్కలుగా, చిచ్ఛేద = ఛేదించెను.

**తాత్పర్యము :-** అప్పుడు దేవేంద్రుడా పర్వతముల ప్రవర్తనమును గూర్చి విని తన వజ్రాయుధముతో ఈ కొండల యొక్క రెక్కలను వేలముక్కలుగా వెదకి వెదకి ఖండించెను.

**శ్లో॥ అహం తు మోక్షిత స్తస్మా త్తవ పిత్రా మహాత్మనా ।**
**మారుతేన తదా వత్స ప్రక్షిప్తోఽస్మి మహార్ణవే ॥ 16**

**పదచ్ఛేదము :-** అహం - తు - మోక్షితః - తస్మాత్ - తవ - పిత్రా - మహాత్మనా - మారుతేన - తదా - వత్స - ప్రక్షిప్తః - అస్మి - మహార్ణవే ॥

**అన్వయక్రమము :-** వత్స! తదా అహం తు మహాత్మనా తవ పిత్రా మారుతేన మోక్షితః (సన్) మహార్ణవే ప్రక్షిప్తః అస్మి.

**ప్రతిపదార్థము :-** వత్స = బిడ్డా! తదా = అప్పుడు, అహం తు = నేను మాత్రము, తవ = నీయొక్క, పిత్రా = తండ్రియైన, మహాత్మనా = మహనీయుడగు, మారుతేన = వాయుదేవునిచే, తస్మాత్ = ఆ దేవేంద్రుని నుండి, మోక్షితః (సన్) = విడిపింపబడిన వాడనై, మహార్ణవే = మహాసముద్రమునందు, ప్రక్షిప్తః అస్మి = విసరబడినవాడనైతిని.

**తాత్పర్యము :-** బిడ్డా! ఆ సమయమున నేను మాత్రము మహాత్ముడైన నీ తండ్రి యగు వాయుదేవునిచే ఆ మహేంద్రుని బారి నుండి రక్షింపబడి ఈ మహా సముద్రమునందు విసరి వేయబడితిని.

**శ్లో॥ రామస్య చ మయా సాహ్యే వర్తితవ్య మరిందమ ।**
**రామో ధర్మభృతాం శ్రేష్ఠో మహేంద్రసమవిక్రమః ॥ 17**

**పదచ్ఛేదము :-** రామస్య - చ - మయా - సాహ్యే - వర్తితవ్యమ్ - అరిందమ, రామః - ధర్మభృతాం - శ్రేష్ఠః - మహేంద్రసమవిక్రమః ॥

**అన్వయక్రమము :-** అరిందమ! రామస్య సాహ్యే మయా చ వర్తితవ్యమ్, రామః ధర్మభృతాం శ్రేష్ఠః, మహేంద్రసమవిక్రమః చ.

**ప్రతిపదార్థము :–** అరిందిమ! = ఓ శత్రుసంహారకా! రామస్య = శ్రీరాముని యొక్క, సాహ్యే = సహాయమునందు, మయా చ = నాచేత గూడ, వర్తితవ్యం = వర్తింప వలసినది, (యతః = ఎందువల్లననగా), రామః = శ్రీరాముడు, ధర్మభృతాం = ధార్మికులలో, శ్రేష్ఠః = మేటి, మహేంద్రసమవిక్రమః = దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గలవాడు.

**తాత్పర్యము :–** శ్రీరాముడు ధార్మికులలో నెల్ల శ్రేష్ఠుడు, దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గలవాడు. అట్టి శ్రీరాముని కార్యమునందు నేను గూడ సహాయపడుచు పాల్గొనవలసినదే సుమా!

**శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా వచ స్తస్య మైనాకస్య మహాత్మనః ।**
**కార్య మావేద్య చ గిరే రుద్యతం చ మనో మమ ॥ 18**

**పదచ్ఛేదము :–** ఏతత్ – శ్రుత్వా – వచః – తస్య – మైనాకస్య – మహాత్మనః – కార్యమ్ – ఆవేద్య – చ – గిరేః – ఉద్యతం – చ – మనః – మమ ॥

**అన్వయక్రమము :–** మహాత్మనః తస్య మైనాకస్య ఏతత్ వచః శ్రుత్వా మమ కార్యమ్, ఉద్యతం మనః చ గిరేః ఆవేద్య (ప్రస్థితః).

**ప్రతిపదార్థము :–** మహాత్మనః = మహనీయుడైన, తస్య = ఆ, మైనాకస్య = మైనాకుని యొక్క, ఏతత్ = ఈ, వచః = మాటను, శ్రుత్వా = విని, మమ = నా యొక్క, కార్యం చ = కర్తవ్యమును, ఉద్యతం = ఉద్యుక్తమై యున్న, మనః చ = మనస్సును గూడ, గిరేః = మైనాకగిరికి, ఆవేద్య = తెలిపి, (ప్రస్థితః = బయలుదేరితిని)

**తాత్పర్యము :–** మహాత్ముడైన ఆ మైనాకుడు ప్రేమతో పలికిన మాటల నాలకించి ఆతనికి నా కర్తవ్యమును గూర్చియు దాని నిర్వహణమున నా మనోనిశ్చయమును గూర్చియు తెలిపి అటనుండి బయలుదేరితిని.

**శ్లో॥ తేన చాహ మనుజ్ఞాతో మైనాకేన మహాత్మనా ।**
**స చా ప్యంతర్హిత శ్శైలో మానుషేణ వపుష్మతా ।**
**శరీరేణ మహాశైల శ్శైలేన చ మహోదధౌ ॥ 19**

**పదచ్ఛేదము :–** తేన – చ – అహమ్ – అనుజ్ఞాతః – మైనాకేన – మహాత్మనా, సః – చ – అపి – ఆంతర్హితః – శైలః – మానుషేణ – వపుష్మతా, శరీరేణ – మహాశైలః – శైలేన – చ – మహోదధౌ ॥

**అన్వయక్రమము :–** మహాత్మనా తేన మైనాకేన అహమ్ అనుజ్ఞాతః, సః శైలః చ

మానుషేణ వపుష్మతా అంతర్హితః, (సః) మహాశైలః శైలేన శరీరేణ మహోదధౌ (స్థితః).

**ప్రతిపదార్థము :-** మహాత్మనా = మహనీయుడైనట్టి, తేన = ఆ, మైనాకేన = మైనాకునిచే, అహం = నేను, అనుజ్ఞాతః = అనుమతింపబడితిని, సః శైలః చ అపి = ఆ గిరియును గూడ, మానుషేణ = మానవరూపమైన, వపుష్మతా = శరీరముతో, అంతర్హితః = అంతర్ధానమయ్యెను, సః మహాశైలః = ఆ మైనాక మహాపర్వతము, శైలేన = పర్వతరూపమైనట్టి, శరీరేణ = దేహముతో, మహోదధౌ = మహాసాగరము నందు, (స్థితః = ఉండెను).

**తాత్పర్యము :-** అప్పుడు మహాత్ముడైన ఆ మైనాకుడు ముందునకు సాగిపోవుటకు నాకు అనుమతినిచ్చి మానవరూపముతో నున్న తానుగూడ అంతర్ధానము నొంది వెంటనే పర్వతరూపమైన శరీరముతో ఆ మహాసముద్రమునందు మునిగియుండెను.

**శ్లో॥ ఉత్తమం జవ మాస్థాయ శేషం పంథాన మాస్థితః ।**
**తతోఽహం సుచిరం కాలం వేగే నాభ్యగమం పథి ॥ 20**

**పదచ్ఛేదము :-** ఉత్తమం - జవమ్ - ఆస్థాయ - శేషం - పంథానమ్ - ఆస్థితః - తతః - అహం - సుచిరం - కాలం - వేగేన - అభ్యగమం - పథి ॥

**అన్వయక్రమము :-** ఉత్తమం జవమ్ ఆస్థాయ (అహం) శేషం పంథానమ్ ఆస్థితః, తతః అహం సుచిరం కాలం పథి వేగేన అభ్యగమమ్.

**ప్రతిపదార్థము :-** ఉత్తమం = గొప్పదైన, జవం = వేగమును, ఆస్థాయ = పొంది, అహం = నేను, శేషం = మిగిలిన, పంథానం = మార్గమును, ఆస్థితః = పొందితిని, తతః = పిమ్మట, అహం = నేను, వేగేన = వేగముగా, సుచిరం కాలం = చాలకాలము, పథి = మార్గమున, అభ్యగమమ్ = పోయితిని.

**తాత్పర్యము :-** గొప్పదైన వేగముతో నేను నా మిగిలిన ప్రయాణమునకు పూనుకొంటిని. అది మొదలుకొని నేను చిరకాలము ఆకాశమార్గమున వేగముగ పయనించితిని.

**శ్లో॥ తతః పశ్యా మ్యహం దేవీం సురసాం నాగమాతరమ్ ।**
**సముద్రమధ్యే సా దేవీ వచనం మా మభాషత ॥ 21**

**పదచ్ఛేదము :-** తతః - పశ్యామి - అహం - దేవీం - సురసాం - నాగమాతరమ్, సముద్రమధ్యే - సా - దేవీ - వచనం - మామ్ - అభాషత ॥

**అన్వయక్రమము :-** తతః అహం నాగమాతరం సురసాం దేవీం పశ్యామి, సముద్రమధ్యే సా దేవీ మాం వచనమ్ అభాషత.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, అహం = నేను, నాగమాతరం = నాగులకు మాతయైనట్టి, దేవీం = పూజ్యురాలైనట్టి, సురసాం = సురసను, పశ్యామి = చూచితిని, సముద్రమధ్యే = సముద్రమధ్యమున, సా = ఆ, దేవీ = సురసాదేవి, మాం = నన్ను గూర్చి, వచనం = మాటను, అభాషత = పలికెను.

**తాత్పర్యము** :– అటుపిమ్మట సముద్రమధ్యమున నాకు నాగమాతయైన సురసాదేవి కాన్పించినది. ఆమె నన్నుజూచి ఈ విధముగ పలికినది.

**శ్లో॥ మమ భక్షః ప్రదిష్ట స్త్వ మమరై ర్హరిసత్తమ ।**
**అత స్త్వాం భక్షయిష్యామి విహిత స్త్వం చిరస్య మే ॥ 22**

**పదచ్ఛేదము** :– మమ – భక్షః – ప్రదిష్టః – త్వం – అమరైః – హరిసత్తమ, అతః – త్వాం – భక్షయిష్యామి – విహితః – త్వం – చిరస్య – మే ॥

**అన్వయక్రమము** :– హరిసత్తమ! అమరైః త్వం మమ భక్షః ప్రదిష్టః. అతః త్వాం భక్షయిష్యామి, త్వం మే చిరస్య విహితః.

**ప్రతిపదార్థము** :– హరిసత్తమ = ఓ వానరోత్తమా, త్వం = నీవు, అమరైః = దేవతలచే, మమ = నాకు, భక్షః = ఆహారముగా, ప్రదిష్టః = ఒసగబడితివి, అతః = అందువలన, త్వాం = నిన్ను, భక్షయిష్యామి = భక్షించెదను, త్వం = నీవు, మే = నాకు, చిరస్య = చిరకాలమునకు, విహితః = ఏర్పరుపబడితివి.

**తాత్పర్యము** :– ఓ వానరశ్రేష్ఠుడా! నిన్ను నాకు అమరులు ఆహారముగా నొసగినారు. కాబట్టి నిన్నిప్పుడే భక్షించెదను. చాలకాలమునకు నాకు నీవు ఆహారముగా సమకూర్ప బడితివి.

**శ్లో॥ ఏవ ముక్త స్సురసయా ప్రాంజలిః ప్రణతః స్థితః ।**
**వివర్ణవదనో భూత్వా వాక్యం చేద ముదీరయమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :– ఏవమ్ – ఉక్తః – సురసయా – ప్రాంజలిః – ప్రణతః – స్థితః – వివర్ణవదనః – భూత్వా – వాక్యం – చ – ఇదమ్ – ఉదీరయమ్ ॥

**అన్వయక్రమము** :– సురసయా ఏవమ్ ఉక్తః ప్రాంజలిః ప్రణతః స్థితః, వివర్ణవదనః భూత్వా ఇదం వాక్యమ్ ఉదీరయమ్.

**ప్రతిపదార్థము** :– సురసయా = సురసాదేవిచే, ఏవం = ఈరీతిగా, ఉక్తః = చెప్పబడిన వాడనై, ప్రాంజలిః = దోసిలియొగ్గిన వాడనై, ప్రణతః = నమస్కరించుచున్నవాడనై, స్థితః = నిలచితిని, వివర్ణవదనః = పాలిపోయిన ముఖము గలవాడను, భూత్వా =

అయి, ఇదం = ఈ, వాక్యం చ = వచనమును గూడ, ఉదీరయమ్ = పలికితిని.

**తాత్పర్యము :–** సురసాదేవి ఇట్లు పలుకగనే దోసిలియొగ్గి శిరమువంచి నిలచి వివర్ణమైన వదనముతో ఆమెతో ఈ విధముగా పలికితిని.

**శ్లో॥ రామో దాశరథి శ్రీమాన్ ప్రవిష్టో దండకావనమ్ ।**
**లక్ష్మణేన సహ భ్రాత్రా సీతయా చ పరంతపః ॥ 24**

**పదచ్ఛేదము :–** రామః – దాశరథిః – శ్రీమాన్ – ప్రవిష్టః – దండకావనం, లక్ష్మణేన – సహ – భ్రాత్రా – సీతయా – చ – పరంతపః ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్ పరంతపః దాశరథిః రామః భ్రాత్రా లక్ష్మణేన సీతయా చ సహ దండకావనం ప్రవిష్టః.

**ప్రతిపదార్థము :–** శ్రీమాన్ = శుభలక్షణ సంపన్నుడును, పరంతపః = శత్రునాశకుడును అగు, దాశరథిః = దశరథ పుత్రుడైన, రామః = శ్రీరాముడు, భ్రాత్రా = సోదరుడైన, లక్ష్మణేన = లక్ష్మణునితోడను, సీతయా చ = సీతాదేవి తోడను, సహ = కూడ, దండకావనం = దండకారణ్యమును, ప్రవిష్టః = ప్రవేశించెను.

**తాత్పర్యము :–** శుభలక్షణ సమన్వితుడును శత్రుమర్దనుడునగు దశరథుని పుత్రుడైన శ్రీరాముడు తన తమ్ముడైన లక్ష్మణుని తోడను, భార్యయైన సీతాదేవితోడను దండకారణ్యమునకు వచ్చెను.

**శ్లో॥ తస్య సీతా హృతా భార్యా రావణేన దురాత్మనా ।**
**తస్యా స్సకాశం దూతోఽహం గమిష్యే రామశాసనాత్ ॥ 25**

**పదచ్ఛేదము :–** తస్య – సీతా – హృతా – భార్యా – రావణేన – దురాత్మనా – తస్యాః – సకాశం – దూతః – అహం – గమిష్యే – రామశాసనాత్ ॥

**అన్వయక్రమము :–** తస్య భార్యా సీతా దురాత్మనా రావణేన హృతా, రామశాసనాత్ దూతః (సన్) తస్యాః సకాశం గమిష్యే.

**ప్రతిపదార్థము :–** తస్య = ఆ శ్రీరాముని యొక్క, భార్యా = భార్యయైనట్టి, సీతా = సీతాదేవి, దురాత్మనా = దుర్మార్గుడైన, రావణేన = రావణునిచే, హృతా = అపహరింపబడినది, రామశాసనాత్ = శ్రీరాముని ఆజ్ఞచే, అహం = నేను, దూతః (సన్) = దూతగానున్నవాడనై, తస్యాః = ఆ సీతాదేవి యొక్క, సకాశం = సమీపమునకు, గమిష్యే = పోయెదను.

**తాత్పర్యము** :- ఆ శ్రీరాముని భార్యయైన సీతాదేవిని దుర్మార్గుడైన రావణుడు అపహరించినాడు. శ్రీరాముని ఆజ్ఞపై దూతగా నేను ఇప్పుడా సీతాదేవికడకే పోవుచున్నాను.

**శ్లో॥ కర్తు మర్హసి రామస్య సాహాయ్యం విషయే సతీ ।**
**అథవా మైథిలీం దృష్ట్వా రామం చాక్లిష్టకారిణమ్ ।**
**ఆగమిష్యామి తే వక్త్రం సత్యం ప్రతిశృణోమి తే ॥ 26**

**పదచ్ఛేదము** :- కర్తుమ్ - అర్హసి - రామస్య - సాహాయ్యం - విషయే - సతీ, అథవా - మైథిలీం - దృష్ట్వా - రామం - చ - అక్లిష్టకారిణమ్, ఆగమిష్యామి - తే - వక్త్రం - సత్యం - ప్రతిశృణోమి - తే ॥

**అన్వయక్రమము** :- రామస్య విషయే సతీ (త్వం) (తస్య) సాహాయ్యం కర్తుమ్ అర్హసి, అథవా మైథిలీమ్, అక్లిష్టకారిణం రామం చ దృష్ట్వా తే వక్త్రం ఆగమిష్యామి, తే సత్యం ప్రతిశృణోమి.

**ప్రతిపదార్థము** :- రామస్య = శ్రీరాముని యొక్క, విషయే = రాజ్యమున, సతీ = ఉన్నదానవై, త్వం = నీవు, (తస్య = అతనికి) సాహాయ్యం = సాయమును, కర్తుం = చేయుటకు, అర్హసి = తగుదువు, అథవా = లేక, మైథిలీం = జానకిని, అక్లిష్టకారిణం = క్లేశములు గల్గింపకుండ కార్యములాచరించునట్టి, రామం చ = శ్రీరాముని గూడ, దృష్ట్వా = చూచి, తే = నీ యొక్క, వక్త్రం = నోటినిగూర్చి, ఆగమిష్యామి = రాగలను, తే = నీకు, సత్యం = యథార్థమును, ప్రతిశృణోమి = వాగ్దానము చేయుచున్నాను.

**తాత్పర్యము** :- శ్రీరాముని రాజ్యమునందు నివసించుచున్న దానవు కాబట్టి ఆ మహాత్మునకు నీవుగూడ సహాయము చేయవలసి యున్నది. అట్లు కాకపోయినచో ఆ సీతాదేవిని జూచి, మహాత్ముడైన శ్రీరామునకు ఆమె కుశలవార్తను విన్నవించి, త్వరలో నీకు ఆహారముగా నీ నోటికడకు నేనే చేరగలను. శపథపూర్వకముగా నేను సత్యము పలుకుచున్నాను.

**శ్లో॥ ఏవ ముక్తా మయా సా తు సురసా కామరూపిణీ ।**
**అబ్రవీ న్నాతివర్తేత కశ్చి దేష వరో మమ ॥ 27**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - ఉక్తా - మయా - సా - తు - సురసా - కామరూపిణీ, అబ్రవీత్ - న - అతివర్తేత - కశ్చిత్ - ఏషః - వరః - మమ ॥

**అన్వయక్రమము** :- మయా ఏవమ్ ఉక్తా కామరూపిణీ సా సురసా తు అబ్రవీత్,

కశ్చిత్ న అతివర్తేత, ఏషః మమ వరః.

**ప్రతిపదార్థము** :- ఏవం = ఈ రీతిగా, మయా = నాచే, ఉక్తా = చెప్పబడినదై, కామరూపిణీ = కామరూపురాలైన, సా సురసా తు = ఆ సురస అప్పుడు, అబ్రవీత్ = పలికెను, కశ్చిత్ = ఏ ఒక్కడును, న అతివర్తేత = అతిక్రమింప గూడదు, మమ = నాకు, ఏషః = ఇది, వరః = వరము.

**తాత్పర్యము** :- నేనిట్లు చెప్పగనే కామరూపిణియైన ఆ సురస వెంటనే ఇట్లు పలికినది. నా కోరిక నెప్పుడును అతిక్రమించుటకు వీలులేదు. ఇది నాకు దైవమొసగిన వరము.

**శ్లో॥ ఏవ ముక్త స్సురసయా దశయోజన మాయతః ।**
**తతో ఽర్ధగుణవిస్తారో బభూ వాహం క్షణేన తు ॥ 28**

**పదచ్ఛేదము** :- ఏవం - ఉక్తః - సురసయా - దశయోజనమ్ - ఆయతః, తతః - అర్ధగుణవిస్తారః - బభూవ - అహం - క్షణేన - తు ॥

**అన్వయక్రమము** :- సురసయా ఏవమ్ ఉక్తః అహం తతః క్షణేన దశయోజనమ్ ఆయతః అర్ధగుణవిస్తారః బభూవ.

**ప్రతిపదార్థము** :- సురసయా = సురసచే, ఏవం = ఈరీతిగా, ఉక్తః = చెప్పబడిన వాడనై, అహం = నేను, తతః = పిమ్మట, క్షణేన = క్షణకాలమున, దశయోజనం = పదియామడలు, ఆయతః = పొడవైన వాడను, అర్ధగుణవిస్తారః = సగము లెక్కగల వెడల్పుగలవాడను, బభూవ = అయితిని.

**తాత్పర్యము** :- సురస ఇట్లు పలుకగనే నేను ఒక్కక్షణములో పది యోజనముల పొడవైన వాడనుగాను, ఐదు యోజనముల వెడల్పయినవాడనుగాను పెరిగిపోయితిని.

**శ్లో॥ మత్ప్రమాణాధికం చైవ వ్యాదితం చ ముఖం తయా ।**
**త ద్దృష్ట్వా వ్యాదితం చాస్యం హ్రస్వం హ్యకరవం వపుః ॥ 29**

**పదచ్ఛేదము** :- మత్ప్రమాణాధికం - చ - ఏవ - వ్యాదితం - చ - ముఖం - తయా - తత్ - దృష్ట్వా - వ్యాదితం - చ - ఆస్యం - హ్రస్వం - హి - అకరవం - వపుః ॥

**అన్వయక్రమము** :- తయా ముఖం మత్ప్రమాణాధికం ఏవ వ్యాదితమ్, (అహం) తత్ వ్యాదితమ్ ఆస్యం దృష్ట్వా వపుః హ్రస్వమ్ అకరవమ్.

**ప్రతిపదార్థము** :- తయా = ఆ సురసచే, ముఖం = నోరు, మత్ప్రమాణాధికమ్ ఏవ

= నా ప్రమాణము కంటెను పెద్దదిగనే, వ్యాదితం = తెఱువబడినది, (అహం = నేను) తత్ = ఆ, వ్యాదితం = తెరవబడిన, ఆస్యం = నోటిని, దృష్ట్వా = చూచి, వపుః = శరీరమును, హ్రస్వం = పొట్టిదానినిగా, అకరవమ్ = చేసితిని.

**తాత్పర్యము :–** వెంటనే ఆ సురస తన నోటిని నా దేహపరిమాణము కంటె పెద్దదిగా చేసికొన్నది. అట్లు తెరచిన యామె నోటిని జూచి వెంటనే నేను నా శరీరమును మిక్కిలి చిన్నదానినిగా చేసికొంటిని.

**శ్లో॥ తస్మి న్ముహూర్తే చ తదా బభూ వాంగుష్ఠమాత్రకః ।**
**అభిప త్యాశు తద్వక్త్రం నిర్గతో ఒహం తతః క్షణాత్ ॥ 30**

**పదచ్ఛేదము :–** తస్మిన్ – ముహూర్తే – చ – తదా – బభూవ – అంగుష్ఠమాత్రకః, అభిపత్య – ఆశు – తద్వక్త్రం – నిర్గతః – అహం – తతః – క్షణాత్ ॥

**అన్వయక్రమము :–** తదా తస్మిన్ ముహూర్తే అహం అంగుష్ఠమాత్రకః బభూవ, తతః అహం తద్వక్త్రమ్ ఆశు అభిపత్య క్షణాత్ నిర్గతః.

**ప్రతిపదార్థము :–** తస్మిన్ = ఆ, ముహూర్తే = సమయమునందు, (అహం = నేను) అంగుష్ఠమాత్రకః = బొటనవ్రేలి పరిమాణము గలవాడను, బభూవ = అయితిని, తతః = పిమ్మట, అహం = నేను, తద్వక్త్రం = ఆమెనోటిని, ఆశు = శీఘ్రముగా, అభిపత్య = ప్రవేశించి, క్షణాత్ = క్షణకాలమున, నిర్గతః = వెడలివచ్చితిని.

**తాత్పర్యము :–** అప్పుడు నేను బొటనవ్రేలి యంతటి పరిమాణముగల శరీరమును ధరించి వెంటనే ఆమె నోటిలోనికి ప్రవేశించి ఒక్క క్షణములో అచటి నుండి వెలుపలికి వచ్చితిని.

**శ్లో॥ అబ్రవీ త్సురసా దేవీ స్వేన రూపేణ మాం పునః ।**
**అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ గచ్ఛ సౌమ్య యథాసుఖమ్ ॥ 31**

**పదచ్ఛేదము :–** అబ్రవీత్ – సురసా – దేవీ – స్వేన – రూపేణ – మాం – పునః, అర్థసిద్ధ్యై – హరిశ్రేష్ఠ – గచ్ఛ – సౌమ్య – యథాసుఖమ్ ॥

**అన్వయక్రమము :–** సురసాదేవీ స్వేన రూపేణ అబ్రవీత్ సౌమ్య హరిశ్రేష్ఠ అర్థసిద్ధ్యై యథాసుఖం గచ్ఛ.

**ప్రతిపదార్థము :–** సురసాదేవీ = సురసాదేవి, స్వేన రూపేణ = నిజరూపముతో, మాం = నన్నుగూర్చి, పునః = తిరిగి, అబ్రవీత్ = పలికెను, సౌమ్య = సజ్జనుడవైన,

హరిశ్రేష్ఠ = ఓ వానరశ్రేష్ఠుడా! అర్థసిద్ధ్యై = కార్యసిద్ధికొరకై, యథాసుఖం = సుఖముగ, గచ్ఛ = పొమ్ము.

**తాత్పర్యము** :– అప్పుడు సురసాదేవి తన నిజరూపమును ధరించి నాతో ఇట్లు పలికినది. సౌమ్యుడవైన ఓ వానరశ్రేష్ఠుడా! నీ కార్యమును సిద్ధింప జేసికొనుటకై నీవు సుఖముగా వెడలిరమ్ము. నీ యత్నము సఫలమగుగాక!

**శ్లో॥ సమానయ చ వైదేహీం రాఘవేణ మహాత్మనా ।**
**సుఖీ భవ మహాబాహో ప్రీతాస్మి తవ వానర ॥ 32**

**పదచ్ఛేదము** :– సమానయ – చ – వైదేహీం – రాఘవేణ – మహాత్మనా – సుఖీ – భవ – మహాబాహో! – ప్రీతా – అస్మి – తవ – వానర ॥

**అన్వయక్రమము** :– మహాత్మనా రాఘవేణ వైదేహీం సమానయ చ, మహాబాహో! సుఖీ భవ, వానర! తవ ప్రీతా అస్మి.

**ప్రతిపదార్థము** :– వైదేహీం = సీతాదేవిని, మహాత్మనా = మహనీయుడైన, రాఘవేణ = శ్రీరామునితో, సమానయ చ = కలుపుము, మహాబాహో! = ఓ వీరుడా! సుఖీ భవ = సుఖముగలవాడ వగుము, వానర! = ఓ వానరోత్తమా! తవ = నీ అనగా నీయెడల, ప్రీతా అస్మి = సంతుష్టురాల నైతిని.

**తాత్పర్యము** :– ఓ వానరశ్రేష్ఠుడా! జానకీదేవిని మహాత్ముడైన శ్రీరామునితో జేర్పుము. నీవు నీ పరాక్రమముతో చిరకాలము సుఖముగ నుండుము. ఉత్తమవిక్రముడవైన నీ యెడల నేనెంతయో సంతసించితిని.

**శ్లో॥ తతోఽహం సాధు సాధ్వీతి సర్వభూతైః ప్రశంసితః ।**
**తతో ఽంతరిక్షం విపులం ప్లుతోఽహం గరుడో యథా ॥ 33**

**పదచ్ఛేదము** :– తతః – అహం – సాధు – సాధు – ఇతి – సర్వభూతైః – ప్రశంసితః, తతః – అంతరిక్షం – విపులం – ప్లుతః – అహం – గరుడః – యథా ॥

**అన్వయక్రమము** :– తతః అహం సర్వభూతైః సాధు సాధు ఇతి ప్రశంసితః, తతః అహం గరుడః యథా విపులమ్ అంతరిక్షం ప్లుతః.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, అహం = నేను, సర్వభూతైః = సమస్త భూతములచేతను, సాధు సాధు ఇతి = మేలుమేలని, ప్రశంసితః = ప్రశంసింపబడితిని, తతః = పిమ్మట, అహం = నేను, గరుడః యథా = గరుత్మంతుడువలె, విపులమ్ = విశాలమైనట్టి, అంతరిక్షం = ఆకాశమును గూర్చి, ప్లుతః = ఎగిరితిని.

**తాత్పర్యము :–** అప్పుడు నన్ను సమస్త భూతములును మేలు మేలని ప్రశంసించినవి. వెంటనే నేను అటనుండి గరుత్మంతునివలె మహావేగముతో ఆకాశమార్గమునకు ఎగసితిని.

**శ్లో॥ ఛాయా మే నిగృహీతా చ న చ పశ్యామి కించన ।**
**సోఽహం విగతవేగస్తు దిశో దశ విలోకయన్ ॥ 34**

**శ్లో॥ న కించి త్తత్ర పశ్యామి యేన మేఽపహృతా గతిః ॥ 35**

**పదచ్ఛేదము :–** ఛాయా – మే – నిగృహీతా – చ – న – చ – పశ్యామి – కించన, సః – అహం – విగతవేగః – తు – దిశః – దశ – విలోకయన్, న – కించిత్ – తత్ర – పశ్యామి – యేన – మే – అపహృతా – గతిః ॥

**అన్వయక్రమము :–** మే ఛాయా చ నిగృహీతా, కిం చన న పశ్యామి. విగతవేగః సః అహం దశదిశః విలోకయన్ యేన మే గతిః అపహృతా తత్ అత్ర కించిత్ న చ పశ్యామి.

**ప్రతిపదార్థము :–** మే = నాయొక్క, ఛాయా చ = నీడయును, నిగృహీతా = పట్టుకొనబడెను, కించన = దేనినిగూడ, న చ పశ్యామి = కానకున్నాను. విగతవేగః = తొలగిన వేగము గల్గినట్టి, సః అహం = ఆ నేను, దశ దిశః = పది దిక్కులును, విలోకయన్ = ఆలోకించుచు, యేన = ఎవనిచే, మే = నా యొక్క, గతిః = గమనము, అపహృతా = అపహరించబడినదో, తత్ = అట్టిదానిని, కించిత్ = దేనినికూడ, తత్ర = అచ్చట, న పశ్యామి = చూడలేకపోయితిని.

**తాత్పర్యము :–** అప్పుడు నా నీడ ఎవ్వరిచేతనో బలముగా లాగబడినది. ఎవ్వరును నా కచ్చుట కాన్పింపకుండిరి. అప్పుడు నా వేగము కట్టుబడిపోవుటచే నేను దశదిశలను పరికించుచు నా గమనమును అడ్డగించినట్టి ఆ భూతమును నేను ఏమియు కనుగొనలేక పోయితిని.

**శ్లో॥ తతో మే బుద్ధి రుత్పన్నా కిం నామ గగనే మమ ।**
**ఈదృశో విఘ్న ఉత్పన్నో రూపం యత్ర న దృశ్యతే ॥ 36**

**పదచ్ఛేదము :–** తతః – మే – బుద్ధిః – ఉత్పన్నా – కిం – నామ – గగనే – మమ, ఈదృశః – విఘ్నః – ఉత్పన్నః – రూపం – యత్ర – న – దృశ్యతే ॥

**అన్వయక్రమము :–** తతః గగనే యత్ర రూపం న దృశ్యతే సః ఈదృశః విఘ్నః మమ కిం నామ ఉత్పన్నః? ఇతి మే బుద్ధిః ఉత్పన్నా.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, గగనే = ఆకాశమునందు, యత్ర = ఎచ్చటనయితే, రూపం = ఆకారము, న దృశ్యతే = కాన్పించుటలేదో, ఈదృశః = ఇట్టి, విఘ్నః = విఘ్నము, కిం నామ = ఏదో? ఉత్పన్నః = సంభవించినది, ఇతి = అని, మే = నాకు, బుద్ధిః = ఆలోచన, ఉత్పన్నా = కలిగినది.

**తాత్పర్యము :–** ఈ యాకాశమునందు తన స్వరూపము కాన్పించనట్టి నాకీ విఘ్నమేల తటస్థించినది? అని అప్పుడు నాకు తీవ్రమైన ఆలోచనము కలిగినది.

**శ్లో॥ అధోభాగేన మే దృష్టి శ్శోచతా పాతితా మయా ।**
**తతోఽద్రాక్ష మహం భీమాం రాక్షసీం సలిలేశయామ్ ॥ 37**

**పదచ్ఛేదము :–** అధోభాగేన – మే – దృష్టిః – శోచతా – పాతితా – మయా, తతః – అద్రాక్షమ్ – అహం – భీమాం – రాక్షసీం – సలిలేశయామ్ ॥

**అన్వయక్రమము :–** శోచతా మయా మే దృష్టిః అధోభాగేన పాతితా, తతః అహం భీమాం సలిలేశయాం రాక్షసీమ్ అద్రాక్షమ్.

**ప్రతిపదార్థము :–** శోచతా = చింతించుచున్నట్టి, మయా = నాచేత, మే = నాయొక్క, దృష్టిః = చూపు, అధోభాగేన = క్రిందిభాగమున, పాతితా = ప్రసరింపచేయబడినది, తతః = పిమ్మట, అహం = నేను, సలిలేశయాం = నీటియందు శయనించియున్న, భీమాం = భీకరమైన, రాక్షసీమ్ = రాక్షసస్త్రీని, అద్రాక్షమ్ = కనుగొంటిని.

**తాత్పర్యము :–** అట్లు చింతించుచు నేను క్రిందిభాగమును పరికించి చూచితిని. అచ్చట నీటిలో పరుండియున్న ఒకానొక భీకరమైన రాక్షసస్త్రీ నాకు కానవచ్చినది.

**శ్లో॥ ప్రహస్య చ మహానాద ముక్తోఽహం భీమయా తయా ।**
**అవస్థిత మసంభ్రాంత మిదం వాక్య మశోభనమ్ ॥ 38**

**పదచ్ఛేదము :–** ప్రహస్య – చ – మహానాదమ్ – ఉక్తః – అహం – భీమయా – తయా, అవస్థితమ్ – అసంభ్రాంతమ్ – ఇదం – వాక్యమ్ – అశోభనమ్ ॥

**అన్వయక్రమము :–** భీమయా తయా మహానాదం ప్రహస్య అవస్థితమ్ అసంభ్రాంతమ్ ఇదమ్ అశోభనం వాక్యమ్ అహమ్ ఉక్తః.

**ప్రతిపదార్థము :–** భీమయా = భయంకరురాలైనట్టి, తయా = ఆ రాక్షసస్త్రీచే, మహానాదం = పెద్దధ్వని కలుగునట్లు, ప్రహస్య = పెద్దగా నవ్వి, అవస్థితం = ధృఢముగను, అసంభ్రాంతమ్ = బెదురులేకుండను, ఇదమ్ = ఈ, అశోభనం =

అమంగళకరమైన, వాక్యం = వచనమును, అహం = నేను, ఉక్తః = పలుకబడితిని.

**తాత్పర్యము** :- ఆ మహాభయంకరురాలైన రాక్షసి నన్ను జూచి పెద్ద నవ్వు నవ్వి తానేమియును చలింపక తొట్రుపడక బిగ్గరగా ఈ కఠోరమైన వాక్యమును పలికినది.

**శ్లో॥ క్వాసి గంతా మహాకాయ క్షుధితాయా మ మేప్సితః ।**
**భక్షః ప్రీణయ మే దేహం చిర మాహారవర్జితమ్ ॥ 39**

**పదచ్ఛేదము** :- క్వ - అసి - గంతా - మహాకాయ - క్షుధితాయాః - మమ - ఈప్సితః - భక్షః - ప్రీణయ - మే - దేహం - చిరమ్ - ఆహారవర్జితమ్ ॥

**అన్వయక్రమము** :- మహాకాయ! క్వ గంతా అసి! క్షుధితాయాః మమ (త్వం) ఈప్సితః భక్షః, చిరమ్ ఆహారవర్జితం మే దేహం ప్రీణయ.

**ప్రతిపదార్థము** :- మహాకాయ! = గొప్పదైన శరీరము గలవాడా! క్వ = ఎచటికి, గంతా = పోవువాడవు, అసి = అగుచున్నావు? క్షుధితాయాః = ఆకలిగొనియున్న, మమ = నాకు, (త్వం = నీవు) ఈప్సితః = ఇష్టమైనట్టి, భక్షః = ఆహారము. చిరం = చిరకాలము నుండి, ఆహారవర్జితం = ఆహారరహితమైనట్టి, మే = నాయొక్క, దేహం = శరీరమును, ప్రీణయ = సంతోషపెట్టుము.

**తాత్పర్యము** :- బలిసియున్నట్టి శరీరముగల్గిన ఓ వానరుడా! నీవెచటికి పోయెదవు? ఆకలిగొనియున్న నాకు అభీష్టమైన ఆహారముగా లభించియున్నావు. కాబట్టి చిరకాలము నుండి ఆహారము లేకయున్న నాకు ఆహారముగా వచ్చి నన్ను తృప్తి పరచుము.

**శ్లో॥ బాఢ మిత్యేవ తాం వాణీం ప్రత్యగృహ్ణో మహం తతః ।**
**ఆస్యప్రమాణా దధికం తస్యాః కాయ మపూరయమ్ ॥ 40**

**పదచ్ఛేదము** :- బాఢమ్ - ఇతి - ఏవ - తాం - వాణీం - ప్రత్యగృహ్ణామ్ - అహం - తతః, ఆస్యప్రమాణాత్ - అధికం - తస్యాః - కాయమ్ - అపూరయమ్ ॥

**అన్వయక్రమము** :- అహం తాం వాణీం బాఢమ్ ఇతి ఏవ ప్రత్యగృహ్ణామ్, తతః కాయం తస్యాః ఆస్యప్రమాణాత్ అధికమ్ అపూరయమ్.

**ప్రతిపదార్థము** :- అహం = నేను, తాం = ఆ, వాణీం = వచనమును, బాఢం = మంచిది, ఇతి ఏవ = అనియే, ప్రత్యగృహ్ణామ్ = స్వీకరించితిని. తతః = పిమ్మట, కాయం = శరీరమును, తస్యాః = ఆమెయొక్క, ఆస్యప్రమాణాత్ = నోటియొక్క పరిమాణముకంటెను, అధికం = పెద్దదిగా, అపూరయమ్ = పెంచితిని.

**తాత్పర్యము :–** నే నామె పలికిన మాటను మంచిదే యని అంగీకరించితిని. మరియు నేను వెంటనే నా శరీరమును ఆమె నోటిపరిమాణము కంటెను మిక్కిలి పెద్దదైనట్టి దానినిగా చేసి నిలచితిని.

**శ్లో॥ తస్యా శ్చాస్యం మహద్భీమం వర్ధతే మమ భక్షణే ।**
**న చ మాం సా తు బుబుధే మమ వా నికృతం కృతమ్ ॥ 41**

**పదచ్ఛేదము :–** తస్యాః – చ – ఆస్యం – మహత్ – భీమం – వర్ధతే – మమ – భక్షణే, న – చ – మాం – సా – తు – బుబుధే – మమ – వా – నికృతం – కృతమ్ ॥

**అన్వయక్రమము :–** మమ భక్షణే మహత్ భీమం తస్యాః ఆస్యం చ వర్ధతే, సా తు మాం చ, కృతం మమ నికృతం వా న బుబుధే.

**ప్రతిపదార్థము :–** మమ = నా యొక్క, భక్షణే = భక్షించుట నిమిత్తము, మహత్ = గొప్పదైన, భీమం = భయంకరమైన, తస్యాః = ఆమెయొక్క, ఆస్యం చ = నోరుగూడ, వర్ధతే = పెరుగుచుండెను, సా తు = ఆ రాక్షసిమాత్రము, మాం చ = నన్నును, కృతం = చేయబడినట్టి, మమ = నా యొక్క, నికృతం వా = మోసమును గాని, న బుబుధే = గ్రహింపలేదు.

**తాత్పర్యము :–** నేను నా శరీరము పెంచుచుండగా ఆమెగూడ నన్ను మ్రింగివేయుటకై తన నోటినిగూడ భయంకరముగా పెద్దదిగా చేసికొనుచుండెను. పాపము ఆమె నా శక్తిని గురించి గాని నేను తలపెట్టిన మోసమును గురించిగాని ఏమియు తెలిసికొన లేకపోయెను.

**శ్లో॥ తతో ఽహం విపులం రూపం సంక్షిప్య నిమిషాంతరాత్ ।**
**తస్యా హృదయ మాదాయ ప్రపతామి నభస్థ్సలమ్ ॥ 42**

**పదచ్ఛేదము :–** తతః – అహం – విపులం – రూపం – సంక్షిప్య – నిమిషాంతరాత్, తస్యాః – హృదయమ్ – ఆదాయ – ప్రపతామి – నభఃస్థలమ్ ॥

**అన్వయక్రమము :–** తతః అహం నిమిషాంతరాత్ విపులం రూపం సంక్షిప్య తస్యాః హృదయమ్ ఆదాయ నభఃస్థలం ప్రపతామి.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, అహం = నేను, నిమిషాంతరాత్ = నిమిషములోపల, విపులం = గొప్పదైనట్టి, రూపం = శరీరమును, సంక్షిప్య = చిన్నదిగచేసి, తస్యాః = ఆ రాక్షసియొక్క, హృదయమ్ = గుండెను, ఆదాయ =

తీసికొని, నభఃస్థలం = గగనతలమును గూర్చి, ప్రపతామి = వెడలిపోయితిని.

**తాత్పర్యము** :– అప్పుడు నేను ఒక్క నిమిషములో అతివిస్తృతమైన నా శరీరమును మిక్కిలి చిన్నదిగ చేసికొని ఆమె నోటిలో ప్రవేశించి ఆమె గుండెను పెకలించి ఈవలకు వచ్చి ఆకసమున కెగిరి పోయితిని.

**శ్లో॥ సా విసృష్టభుజా భీమా పపాత లవణాంభసి ।**
**మయా పర్వతసంకాశా నికృత్తహృదయా సతీ ॥ 43**

**పదచ్ఛేదము** :– సా – విసృష్టభుజా – భీమా – పపాత – లవణాంభసి – మయా – పర్వతసంకాశా – నికృత్తహృదయా – సతీ ॥

**అన్వయక్రమము** :– విసృష్టభుజా పర్వతసంకాశా మయా నికృత్తహృదయా సతీ భీమా సా లవణాంభసి పపాత.

**ప్రతిపదార్థము** :– విసృష్టభుజా = జారిన భుజములు గలదియును, పర్వతసంకాశా = పర్వతమును బోలినదియును, భీమా = భయంకరురాలునగు, సా = ఆరాక్షసి, మయా = నాచేత, నికృత్తహృదయా = ఛేదింపబడిన గుండెకాయగలది, సతీ = అగుచు, సా = ఆ రాక్షసి, లవణాంభసి = లవణసముద్రమునందు, పపాత = కూలెను.

**తాత్పర్యము** :– నేను తన గుండెను ఛేదించివేయగనే భుజములు జారిపోవగా పెద్ద పర్వతము వంటి ఆకారముగల ఆ భయంకరమైన రాక్షసి ఆ సాగరజలమునందు కూలిపోయినది.

**శ్లో॥ శృణోమి ఖగతానాం చ వాచః సౌమ్యా మహాత్మనామ్ ।**
**రాక్షసీ సింహికా భీమా క్షిప్రం హనుమతా హతా ॥ 44**

**పదచ్ఛేదము** :– శృణోమి – ఖగతానాం – చ – వాచః – సౌమ్యాః – మహాత్మనామ్, రాక్షసీ – సింహికా – భీమా – క్షిప్రం – హనుమతా – హతా ॥

**అన్వయక్రమము** :– భీమా సింహికా రాక్షసీ క్షిప్రం హనుమతా హతా ఇతి ఖగతానాం మహాత్మనాం సౌమ్యాః వాచః శృణోమి.

**ప్రతిపదార్థము** :– భీమా = భయంకరమైనట్టి, సింహికా రాక్షసీ = సింహిక యను రక్కసి, క్షిప్రం = స్వల్పకాలములో, హనుమతా = హనుమచే, హతా = చంపబడినది, ఇతి = అనెడు, ఖగతానాం = ఆకాశమున నున్నట్టి, మహాత్మనాం = మహాత్ములయొక్క, సౌమ్యాః = మంచివైన, వాచః = మాటలను, శృణోమి = వింటిని.

**తాత్పర్యము** :– ఆ రాక్షసి సముద్రములో కూలగనే ఆకసమునందు చరించుచున్న మహాత్ములైన సిద్ధులు మున్నగువారు "ఆహా! మహాభయంకరురాలైన ఈ సింహికా రాక్షసి హనుమంతుని చేతిలో నొక్క తృటిలోనే కడతేరినదిగదా" అని ప్రశంసించుచు పలికిన మాటలు నాకు వినబడినవి.

**శ్లో॥ తాం హత్వా పునరే వాహం కృత్య మాత్యయికం స్మరన్ ।**
**గత్వా చాహం మహాధ్వానం పశ్యామి నగమండితమ్ ॥ 45**

**శ్లో॥ దక్షిణం తీర ముదధే ర్లంకా యత్ర చ సా పురీ ॥ 46**

**పదచ్ఛేదము** :– తాం – హత్వా – పునః – ఏవ – అహం – కృత్యమ్ – ఆత్యయికం – స్మరన్, గత్వా – చ – అహం – మహాధ్వానం – పశ్యామి – నగమండితమ్, దక్షిణం – తీరమ్ – ఉదధేః – లంకా – యత్ర – చ – సా పురీ ॥

**అన్వయక్రమము** :– తాం హత్వా పునః ఏవ అహమ్ ఆత్యయికం కృత్యం స్మరన్, మహాధ్వానం గత్వా చ యత్ర సా లంకాపురీ (అస్తి) తం నగమండితమ్ ఉదధేః దక్షిణం తీరం పశ్యామి.

**ప్రతిపదార్థము** :– తాం = ఆ సింహికను, హత్వా = చంపి, పునః ఏవ = వెంటనే తిరిగి, అహం = నేను, ఆత్యయికం = దారుణమారణమైన, కృత్యం = పనిని, స్మరన్ = తలచుకొనుచు, మహాధ్వానం = గొప్పదైన మార్గమును, గత్వా చ = పోయియును, యత్ర = ఎచ్చటనైతే, సా = ఆ, లంకాపురీ = లంకానగరి, అస్తి = ఉన్నదో, తం = ఆ, నగమండితం = పర్వతముచే అలంకరింపబడినట్టి, ఉదధేః = సముద్రముయొక్క, దక్షిణం = దక్షిణపు, తీరం = తీరమును, పశ్యామి = చూచితిని.

**తాత్పర్యము** :– ఆ సింహికను సంహరించి తిరిగి తిరిగి దారుణమైన ఆ సంహార కార్యమును గూర్చియే తలచుకొనుచు కడుదూరము పోయి పోయి లంకానగరములో విరాజిల్లుచున్న గొప్పపర్వతముగల దక్షిణసముద్రతీరమును గాంచితిని.

**శ్లో॥ అస్తం దినకరే యాతే రక్షసాం నిలయం పురమ్ ।**
**ప్రవిష్టోఽ హ మవిజ్ఞాతో రక్షోభి ర్భీమవిక్రమైః ॥ 47**

**పదచ్ఛేదము** :– అస్తం – దినకరే – యాతే – రక్షసాం – నిలయం – పురమ్, ప్రవిష్టః – అహమ్ – అవిజ్ఞాతః – రక్షోభిః – భీమవిక్రమైః ॥

**అన్వయక్రమము** :– దినకరే అస్తం యాతే (సతి) భీమవిక్రమైః రక్షోభిః అవిజ్ఞాతః అహం రక్షసాం నిలయం పురం ప్రవిష్టః.

**ప్రతిపదార్థము** :- దినకరే = సూర్యుడు, అస్తం యాతే (సతి) = అస్తమించగా, భీమవిక్రమైః = భీకరమైన పరాక్రమము గలిగినట్టి, రక్షోభిః = రాక్షసులచే, అవిజ్ఞాతః = తెలియబడనివాడనై, రక్షసాం = రాక్షసులయొక్క, నిలయం = నివాసమైన, పురం = లంకానగరమును, అహం = నేను, ప్రవిష్టః = ప్రవేశించినాడను.

**తాత్పర్యము** :- ఆ సాగరతీరమును చేరి సూర్యు డస్తమించువరకును వేచియుండి భీకరులైన రాక్షసులకు కంటబడకుండ ఆ రాక్షసనివాసమైన లంకానగరమును ప్రదోష సమయమున ప్రవేశించితిని.

**శ్లో॥ తత్ర ప్రవిశత శ్చాపి కల్పాంతఘనసన్నిభా ।**
**అట్టహాసం విముంచంతీ నారీ కా ప్యుత్థితా పురః ॥ 48**

**పదచ్ఛేదము** :- తత్ర - ప్రవిశతః - చ - అపి - కల్పాంతఘనసన్నిభా, అట్టహాసం - విముంచంతీ - నారీ - కా - అపి - ఉత్థితా - పురః ॥

**అన్వయక్రమము** :- తత్ర ప్రవిశతః (మమ) పురః కల్పాంతఘనసన్నిభా కాఽపి నారీ అట్టహాసం విముంచంతీ ఉత్థితా.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ లంకయందు, ప్రవిశతః = ప్రవేశించుచున్నట్టి, (మమ = నా యొక్క), పురః = ఎదుట, కల్పాంతఘనసన్నిభా = ప్రళయకాల మేఘముతో సమానమైనట్టి, కా అపి = ఒకానొక, నారీ = స్త్రీ, అట్టహాసం = పెద్ద నవ్వును, విముంచంతీ = వెలువరించుచున్నదై, ఉత్థితా = నిలువబడినది.

**తాత్పర్యము** :- నే నా లంకలో ప్రవేశించుచుండగా ప్రళయకాలమేఘమువంటి మహాభయంకరమైన శరీరముతో దిక్కులు మారుమ్రోగునట్లు బిగ్గరగా నవ్వుచు ఒకానొక స్త్రీ నా కెదురుగ వచ్చి నిలువబడినది.

**శ్లో॥ జిఘాంసంతీం తత స్తాం తు జ్వలదగ్నిశిరోరుహామ్ ।**
**సవ్యముష్టిప్రహారేణ పరాజిత్య సుభైరవామ్ ॥ 49**

**శ్లో॥ ప్రదోషకాలే ప్రవిశం భీతయా ఽహం త యోదితః ॥ 50**

**పదచ్ఛేదము** :- జిఘాంసంతీం - తతః - తాం - తు - జ్వలదగ్నిశిరోరుహామ్, సవ్యముష్టిప్రహారేణ - పరాజిత్య - సుభైరవామ్, ప్రదోషకాలే - ప్రవిశం - భీతయా - అహం - తయా - ఉదితః ॥

**అన్వయక్రమము** :- తతః జ్వలదగ్నిశిరోరుహాం, సుభైరవాం జిఘాంసంతీం తాం

సవ్యముష్టిప్రహారేణ పరాజిత్య ప్రదోషకాలే (నగరం) ప్రవిశమ్, భీతయా తయా అహం ఏవమ్ ఉదితః.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, జ్వలదగ్నిశిరోరుహాం = జ్వలించుచున్న అగ్నివంటి తలవెండ్రుకలు గల్గినట్టిదియును, సుభైరవాం = మిక్కిలి భయంకరమైనట్టిదియును, జిఘాంసంతీం = చంపగోరుచున్నదియునగు, తాం = ఆ రాక్షసిని, సవ్యముష్టి ప్రహారేణ = ఎడమ పిడికిటిపోటుతో, పరాజిత్య = ఓడించి, ప్రదోషకాలే = సాయం సమయమున, (నగరం = లంకానగరమును), ప్రవిశమ్ = ప్రవేశించితిని. భీతయా = భయమునొందినట్టి, తయా = ఆ రక్కసిచే, అహం = నేను, (ఏవం = ఇట్లు) ఉదితః = చెప్పబడితిని.

**తాత్పర్యము** :- అప్పుడు ప్రజ్వలించుచున్న అగ్నిజ్వాలలవంటి తలవెండ్రుకలతో, భీకరమైయున్న రూపముతో నన్ను హతమార్చుటకై మీదికి వచ్చుచున్న ఆ రక్కసిని నా యెడమచేతి పిడికిలిపోటుతో పడగొట్టి ఆ ప్రదోషసమయమునందు నగరములోనికి ప్రవేశింపబోవుచుంటిని. నా విక్రమమునకు అప్పుడామె భయగ్రస్తయై నాతో ఇట్లు పలికినది.

**శ్లో॥ అహం లంకాపురీ వీర నిర్జితా విక్రమేణ తే ।**
**యస్మా త్తస్మా ద్విజేతాసి సర్వరక్షాం స్యశేషతః ॥ 51**

**పదచ్ఛేదము** :- అహం - లంకాపురీ - వీర - నిర్జితా - విక్రమేణ - తే, యస్మాత్ - తస్మాత్ - విజేతా - అసి - సర్వరక్షాంసి - అశేషతః ॥

**అన్వయక్రమము** :- వీర అహం లంకాపురీ, యస్మాత్ (అహం) తే విక్రమేణ నిర్జితా, తస్మాత్ (త్వం) సర్వరక్షాంసి అశేషతః విజేతా అసి.

**ప్రతిపదార్థము** :- వీర = ఓ మహావీరుడా! అహం = నేను, లంకానగరీ = లంకానగరిని, యస్మాత్ = ఏ కారణమువలన, (అహం = నేను), తే విక్రమేణ = నీ పరాక్రమముచే, నిర్జితా = ఓడింపబడితినో, తస్మాత్ = ఆ కారణమువలన, (త్వం = నీవు), అశేషతః = నిశ్శేషముగా, సర్వరక్షాంసి = సకల రాక్షసులను, విజేతా అసి = జయింపగలవాడవగుదువు.

**తాత్పర్యము** :- ఓ మహావీరుడా! నేను లంకానగరిని, నీ పరాక్రమవిశేషముచే నన్ను నిర్జించితివి. కాబట్టి ఇక మీదట నీవు లంకలోని రాక్షసుల నెల్లరను గూడ నిశ్శేషముగా నిర్జింపగలవు సుమా.

**శ్లో॥ త త్రాహం సర్వరాత్రం తు విచిన్వన్ జనకాత్మజామ్ ।**
**రావణాంతఃపురగతో న చాపశ్యం సుమధ్యమామ్ ॥ 52**

**పదచ్ఛేదము :–** తత్ర – అహం – సర్వరాత్రం – తు – విచిన్వన్ – జనకాత్మజామ్, రావణాంతఃపురగతః – న – చ – అపశ్యం – సుమధ్యమామ్ ॥

**అన్వయక్రమము :–** తత్ర అహం రావణాంతఃపురగతః జనకాత్మజాం సర్వరాత్రం విచిన్వన్ సుమధ్యమాం న చ అపశ్యమ్.

**ప్రతిపదార్థము :–** తత్ర = ఆ లంకయందు, అహం = నేను, రావణాంతఃపురగతః = రావణునియొక్క అంతఃపురము చేరినవాడనై, సర్వరాత్రం = రాత్రియంతయును, జనకాత్మజాం = జానకిని, విచిన్వన్ = వెదకుచు, సుమధ్యమాం = చక్కని నడుముగల్గిన సీతాదేవిని, న చ అపశ్యమ్ = ఎంతమాత్రము చూడనైతిని.

**తాత్పర్యము :–** అటుపిమ్మట లంకయందు తిరుగుచు రావణుని అంతఃపురమును ప్రవేశించి సీతాదేవికొఱకై రాత్రి అంతయును వెదకితిని గాని ఆమె నెచ్చటను కనుగొనలేక పోయితిని.

**శ్లో॥ తత స్సీతా మపశ్యంస్తు రావణస్య నివేశనే ।**
**శోకసాగర మాసాద్య న పార ముపలక్షయే ॥ 53**

**పదచ్ఛేదము :–** తతః – సీతామ్ – అపశ్యన్ – తు – రావణస్య – నివేశనే, శోకసాగరమ్ – ఆసాద్య – న పారమ్ – ఉపలక్షయే ॥

**అన్వయక్రమము :–** తతః రావణస్య నివేశనే సీతామ్ అపశ్యన్ శోకసాగరమ్ ఆసాద్య పారం న ఉపలక్షయే.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, రావణస్య = రావణునియొక్క, నివేశనే = భవనమునందు, సీతామ్ = సీతాదేవిని, అపశ్యన్ = కానక, శోకసాగరమ్ = దుఃఖ సముద్రమును, ఆసాద్య = చేరి, పారం = ఒడ్డును, న ఉపలక్షయే = కానకుంటిని.

**తాత్పర్యము :–** అప్పుడు రావణుని భవనమునందు సీతాదేవిని కనుగొనలేక దుఃఖ సాగరమున నిమగ్నుడనై దరిగానక విలపించుచుంటిని.

**శ్లో॥ శోచతా చ మయా దృష్టం ప్రాకారేణ సమావృతమ్ ।**
**కాంచనేన వికృష్టేన గృహోపవన ముత్తమమ్ ॥ 54**

**పదచ్ఛేదము :–** శోచతా – చ – మయా – దృష్టం – ప్రాకారేణ – సమావృతమ్,

కాంచనేన – వికృష్టేన – గృహోపవనమ్ – ఉత్తమమ్ ॥

**అన్వయక్రమము** :– శోచతా మయా వికృష్టేన కాంచనేన ప్రాకారేణ సమావృతమ్ ఉత్తమం గృహోపవనం దృష్టమ్.

**ప్రతిపదార్థము** :– శోచతా = దుఃఖించుచున్నట్టి, మయా = నాచేత, వికృష్టేన = మిక్కిలి పొడవైన, కాంచనేన = సువర్ణమయమైన, ప్రాకారేణ = ప్రాకారముతో, సమావృతం = చుట్టుకొనబడినట్టి, ఉత్తమం = శ్రేష్ఠమైనట్టి, గృహోపవనం = గృహోద్యానవనము, దృష్టమ్ = చూడబడినది.

**తాత్పర్యము** :– అట్లు దుఃఖనిమగ్నుడనై ఇటు నటు చూచుచుండ ఒకచోట సువర్ణ నిర్మితమై మిక్కిలి ఉన్నతమైన ప్రాకారముతో వెలుగొందుచున్న సుందరమైన ఉద్యానవన మొకటి నాకు దృష్టిగోచరమయ్యెను.

**శ్లో॥ స ప్రాకార మవప్లుత్య పశ్యామి బహుపాదపమ్ ।**
**అశోకవనికామధ్యే శింశుపాపాదపో మహాన్ ॥ 55**

**శ్లో॥ త మారుహ్య చ పశ్యామి కాంచనం కదళీవనమ్ ॥ 56**

**పదచ్ఛేదము** :– సః – ప్రాకారమ్ – అవప్లుత్య – పశ్యామి – బహుపాదపమ్, అశోకవనికామధ్యే – శింశుపాపాదపః – మహాన్, తమ్ – ఆరుహ్య – చ – పశ్యామి – కాంచనం – కదళీవనమ్ ॥

**అన్వయక్రమము** :– సః (అహం) ప్రాకారమ్ అవప్లుత్య బహుపాదపం (ఉపవనం) పశ్యామి. (తస్మిన్) అశోకవనికామధ్యే మహాన్ శింశుపాపాదపః (వర్తతే) తమ్ ఆరుహ్య కాంచనం కదళీవనం పశ్యామి.

**ప్రతిపదార్థము** :– సః (అహం) = ఆ నేను, ప్రాకారం = ప్రాకారమును, అవప్లుత్య = దిగి, బహుపాదపం = బహు వృక్షములతో గూడిన, (ఉపవనం = ఉపవనమును) పశ్యామి = చూచితిని, (తస్మిన్ = ఆ వనమందు), అశోకవనికామధ్యే = అశోకవనము నడుమ, మహాన్ = గొప్పదైన, శింశుపాపాదపః = శింశుపా వృక్షము, (వర్తతే = ఉన్నది), తం = ఆ వృక్షమును, ఆరుహ్య = ఆరోహించి, కాంచనం = స్వర్ణమయమైన, కదళీవనం = అరటితోటను, పశ్యామి = చూచితిని.

**తాత్పర్యము** :– నేను అప్పుడా ప్రాకారమును దిగి బహువృక్షములతో వెలయుచున్న ఒక ఉద్యానవనమును గాంచితిని. అచ్చటనున్న అశోకవనము నడుమ ఒక పెద్ద శింశుపావృక్షమున్నది. నేను దానిని ఆరోహించి ఆవలిదూరములో గానవచ్చుచున్న

బంగారు అరటితోటను చూచితిని.

**శ్లో॥ అదూరే శింశుపావృక్షా త్పశ్యామి వరవర్ణినీమ్ ।**
**శ్యామాం కమలపత్రాక్షీ ముపవాసకృశాననామ్ ॥ 57**

**శ్లో॥ తదేకవాసస్సంవీతాం రజోధ్వస్తశిరోరుహామ్ ।**
**శోకసంతాపదీనాంగీం సీతాం భర్తృహితే స్థితామ్ ॥ 58**

**శ్లో॥ రాక్షసీభి ర్విరూపాభిః క్రూరాభి రభిసంవృతామ్ ।**
**మాంసశోణితభక్షాభి ర్వ్యాఘ్రీభి ర్హరిణీమివ ॥ 59**

**పదచ్ఛేదము** :- అదూరే - శింశుపావృక్షాత్ - పశ్యామి వరవర్ణినీమ్, శ్యామాం - కమలపత్రాక్షీమ్ - ఉపవాసకృశాననామ్, తదేకవాసస్సంవీతాం - రజోధ్వస్త శిరోరుహామ్, శోకసంతాపదీనాంగీం - సీతాం - భర్తృహితే - స్థితామ్, రాక్షసీభిః - విరూపాభిః - క్రూరాభిః - అభిసంవృతామ్, మాంసశోణితభక్షాభిః - వ్యాఘ్రీభిః - హరిణీమ్ - ఇవ ॥

**అన్వయక్రమము** :- శింశుపావృక్షాత్ అదూరే వరవర్ణినీం శ్యామాం మాంసశోణిత భక్షాభిః వ్యాఘ్రీభిః అభిసంవృతాం హరిణీమ్ ఇవ విరూపాభిః క్రూరాభిః రాక్షసీభిః అభిసంవృతాం సీతాం పశ్యామి.

**ప్రతిపదార్థము** :- శింశుపావృక్షాత్ = శింశుపావృక్షము నుండి, అదూరే = సమీపమున, వరవర్ణినీం = శ్రేష్ఠమైన ఛాయగలిగి యున్నదియును, శ్యామాం = యౌవన వయస్సున నున్నదియును, కమలపత్రాక్షీం = తామరరేకులవంటి కన్నులు గలదియును, ఉపవాసకృశాననాం = ఉపవాసములచే కృశించిన ముఖముగలదియును, తదేకవాస స్సంవీతాం = ఆ యొక్క చీరనే ధరించినదియును, రజోధ్వస్తశిరోరుహాం = ధూళిచే రూపుచెడియున్న తలవెంద్రుకలు గలదియును, శోకసంతాపదీనాంగీం = దుఃఖము యొక్క తీవ్రతాపముచే దీనమైన దేహము గల్గియున్నదియును, భర్తృహితే = భర్తయొక్క ప్రియమునందు, స్థితాం = నిలిచియున్నదియును, మాంసశోణితభక్షాభిః = మాంసమును రక్తమును భక్షించునట్టి, వ్యాఘ్రీభిః = ఆడపులులచే, అభిసంవృతాం = చుట్టుకొనబడియున్న, హరిణీమ్ ఇవ = ఆడులేడివలె, విరూపాభిః = వికారరూపము గల్గినట్టి, క్రూరాభిః = క్రూరస్వభావులైన, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, అభిసంవృతాం = చుట్టబడియున్నదియును అగు, సీతాం = సీతాదేవిని, పశ్యామి = కనుగొంటిని.

**తాత్పర్యము** :- నేనప్పు డా శింశుపావృక్షమునకు దగ్గరలోనే సుందరమైన

దేహచ్ఛాయతో, నవయౌవనముననుండి, తామరరేకులవంటి కన్నులతో ఉపవాసములచే బడలియున్న ముఖముతో, మనము చూచినప్పటి చీరనే ధరించి యున్నదై, ధూళిచే అట్టగట్టియున్న కేశములతో, శోకాగ్నిచే తపించుచు, భర్తృక్షేమమునే వాంఛించుచు, మాంసము నెత్తురు ఆహారముగా గోరు భీకరములైన ఆడుపులుల నడుమ జిక్కుకొనియున్న ఆడులేడివలె, ఘోరమైన వికారరూపములతో క్రూరులైన రాక్షసస్త్రీలు తనను చుట్టుముట్టియుండగా దీనస్థితిలోనున్న సీతమ్మను కనుగొంటిని.

**శ్లో॥ సామయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః ।**
**ఏకవేణీధరా దీనా భర్తృచింతాపరాయణా ॥ 60**

**శ్లో॥ భూమిశయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే ।**
**రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా ।**
**కథంచి న్మృగశాబాక్షీ తూర్ణ మాసాదితా మయా ॥ 61**

**పదచ్ఛేదము** :- స+ఆమయా - రాక్షసీమధ్యే - తర్జ్యమానా - ముహుః - ముహుః ఏకవేణీధరా - దీనా - భర్తృచింతాపరాయణా, భూమిశయ్యా - వివర్ణాంగీ - పద్మినీ - ఇవ - హిమాగమే, రావణాత్ - వినివృత్తార్థా - మర్తవ్యకృతనిశ్చయా, కథంచిత్ - మృగశాబాక్షీ - తూర్ణమ్ - ఆసాదితా - మయా ॥

**అన్వయక్రమము** :- రాక్షసీమధ్యే ముహుః ముహుః తర్జ్యమానా, ఏకవేణీధరా, దీనా, భర్తృచింతాపరాయణా, భూమిశయ్యా, హిమాగమే పద్మినీ ఇవ వివర్ణాంగీ, రావణాత్ వినివృత్తార్థా, మర్తవ్యకృతనిశ్చయా, సామయా మృగశాబాక్షీ కథంచిత్ మయా తూర్ణం ఆసాదితా.

**ప్రతిపదార్థము** :- రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీల నడుమ, ముహుః ముహుః = మాటిమాటికిని, తర్జ్యమానా = బెదిరింపబడుచున్నదియును, ఏకవేణీధరా = జడగట్టిన తలవెంట్రుకలను ధరించినదియును, దీనా = దీనురాలును, భర్తృచింతాపరాయణా = భర్తయొక్క స్మరణమునందు నిమగ్నురాలై యున్నదియును, భూమిశయ్యా = నేలనే శయ్యగా చేసికొన్నదియును, హిమాగమే = మంచుకురియుకాలమున, పద్మినీ ఇవ = తామరతీగవలె, వివర్ణాంగీ = వెలవెలబోయిన రూపము గలదియును, రావణాత్ = రావణునినుండి, వినివృత్తార్థా = మరలిన ప్రయోజనము గలదియును, మర్తవ్యకృత నిశ్చయా = చనిపోవవలెనని చేసికొన్న నిర్ణయముగలదియును, (స+ఆమయా) సామయా = దుఃఖముతో గూడినదియునగు, (సా=అ), మృగశాబాక్షీ = లేడిపిల్ల యొక్క కన్నులవంటి కన్నులుగల్గినట్టి సీతాదేవి, కథంచిత్ = ఎట్లో, మయా = నాచేత,

తూర్ణం = త్వరగా, ఆసాదితా = చేరబడినది.

**తాత్పర్యము** :- నేను చూచిన ఆ సీతాదేవి అచటి రాక్షసస్త్రీలచే మాటి మాటికి భయపెట్టబడుచుండెను. ఆమె కేశములన్నియును ఒకే జడగా అంటుకొని పోయియున్నవి. తన భర్తనే స్మరించుకొనుచు దీనురాలై యున్నది. మంచుకురియు కాలమునందు వెలవెలబోవుచున్న తామరతీగవలె కాంతివిహీనమైన రూపముతో నేలనే తన శయ్యగా చేసికొని, రావణుని నుండి తన క్షేమమును గూర్చిన యాశను మరలించుకొని, ఆత్మహత్య చేసికొనుటకై నిశ్చయించుకొని, దుఃఖస్థితిలో నుండి భీతహరిణేక్షణయైయున్న పూజ్యురాలగు సీతాదేవిని దైవవశమున నేను వెంటనే కనుగొంటిని.

**శ్లో॥ తాం దృష్ట్వా తాదృశీం నారీం రామపత్నీం యశస్వినీమ్ ।**
**తత్రైవ శింశుపావృక్షే పశ్య న్నహ మవస్థితః ॥ 62**

**పదచ్ఛేదము** :- తాం - దృష్ట్వా - తాదృశీం - నారీం - రామపత్నీం - యశస్వినీమ్, తత్ర - ఏవ - శింశుపావృక్షే - పశ్యన్ - అహమ్ - అవస్థితః ॥

**అన్వయక్రమము** :- రామపత్నీం యశస్వినీం తాం నారీం తాదృశీం దృష్ట్వా అహం తత్ర శింశుపావృక్షే ఏవ (తాం పశ్యన్) అవస్థితః.

**ప్రతిపదార్థము** :- రామపత్నీం = శ్రీరాముని ధర్మపత్నియును, యశస్వినీం = కీర్తిమంతురాలునగు, తాం నారీం = ఆ పూజ్యురాలైన వనితను, తాదృశీం = ఆ రీతిగనున్న దానినిగా, దృష్ట్వా = చూచి, తత్ర = అచ్చట, శింశుపావృక్షే ఏవ = శింశుపావృక్షమునందే, (తాం = ఆ సీతాదేవిని), పశ్యన్ = చూచుచు, అహం = నేను, అవస్థితః = నిలచియుంటిని.

**తాత్పర్యము** :- శ్రీరాముని ధర్మపత్నియై సుగుణములచే జగద్విఖ్యాతి నొందినట్టి ఆ సాధ్వీమతల్లి అట్టి స్థితిలో నుండగా జూచి అచ్చటి ఆ శింశుపావృక్షము మీదనే ఆమెను చూచుచు నుంటిని.

**శ్లో॥ తతో హలహలాశబ్దం కాంచీనూపురమిశ్రితమ్ ।**
**శృణో మ్యధికగంభీరం రావణస్య నివేశనే ॥ 63**

**పదచ్ఛేదము** :- తతః - హలహలాశబ్దం - కాంచీనూపురమిశ్రితమ్, శృణోమి - అధికగంభీరం - రావణస్య - నివేశనే ॥

**అన్వయక్రమము** :- తతః రావణస్య నివేశనే కాంచీనూపురమిశ్రితమ్ అధికగంభీరం

హలహలాశబ్దం శృణోమి.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, రావణస్య = రావణునియొక్క, నివేశనే = భవనమునందు, కాంచీనూపురమిశ్రితం = మొలనూళ్ళ యొక్కయు, అందెల యొక్కయు (ధ్వనులతో గలసిన), అధికగంభీరం = మిక్కిలి గంభీరమైనట్టి, హలహలాశబ్దం = గలగలమను ధ్వనిని, శృణోమి = వింటిని.

**తాత్పర్యము** :- అటుపిమ్మట కనుచూపుమేరలో నున్న రావణునియొక్క భవనమునందు మొలనూలిగంటల సవ్వడియు, కాలియందెల మ్రోతయు గలసినట్టి ఒకానొక పరమ గంభీరమైన కలకలధ్వని నాకు వినవచ్చెను.

**శ్లో॥ తతో௨హం పరమోద్విగ్న స్స్వం రూపం ప్రతిసంహరన్ ।**
**అహం తు శింశుపావృక్షే పక్షీవ గహనే స్థితః ॥ 64**

**పదచ్ఛేదము** :- తతః - అహం - పరమోద్విగ్నః - స్వం - రూపం - ప్రతిసంహరన్, అహం - తు - శింశుపావృక్షే - పక్షీ - ఇవ - గహనే - స్థితః ॥

**అన్వయక్రమము** :- తతః అహం స్వం రూపం ప్రతిసంహరన్ పరమోద్విగ్నః (జాతః) అహం తు గహనే శింశుపావృక్షే పక్షీ ఇవ స్థితః.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, అహం = నేను, స్వం రూపం = నిజ రూపమును, ప్రతిసంహరన్ = సూక్ష్మీకరించుచు, పరమోద్విగ్నః = మిక్కిలి కంగారు పడినవాడను, జాతః = అయితిని. అహం తు = నేను అప్పుడు, పక్షీ ఇవ = పిట్టవలె, గహనే = దట్టమైన, శింశుపావృక్షే = శింశుపావృక్షమునందు, స్థితః = ఉంటిని.

**తాత్పర్యము** :- రావణుని భవనమున గంభీరమైన ఆ ధ్వని వినబడగనే నేనెంతయో కంగారుపడుచు నా రూపమును మిక్కిలి చిన్నదిగ చేసికొని పిట్టవలె ఆ శింశుపా వృక్షపు ఆకుల గుబురులో అణగియుంటిని.

**శ్లో॥ తతో రావణదారాశ్చ రావణశ్చ మహాబలః ।**
**తం దేశం సమనుప్రాప్తాః యత్ర సీతా௨భవ త్థ్సితా ॥ 65**

**పదచ్ఛేదము** :- తతః - రావణదారాః - చ - రావణః - చ - మహాబలః, తం - దేశం - సమనుప్రాప్తాః - యత్ర - సీతా - అభవత్ - స్థితా ॥

**అన్వయక్రమము** :- తతః సీతా యత్ర స్థితా అభవత్, తం దేశం మహాబలః రావణః చ రావణదారాః చ సమనుప్రాప్తాః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, సీతా = సీతాదేవి, యత్ర = ఎచ్చటనయితే, స్థితా = ఉన్నది, అభవత్ = ఆయెనో, తం = ఆ, దేశం = ప్రదేశమును, మహాబలం = మహాబలశాలియైన, రావణః చ = రావణుడును, రావణదారాః చ = రావణుని భార్యలును, సమనుప్రాప్తాః = చేరిరి.

**తాత్పర్యము :–** అప్పుడు సీతాదేవి యుండు ప్రదేశమునకు మహాబలాఢ్యుడైన రావణుడును ఆతని భార్యలును వచ్చి చేరిరి.

**శ్లో॥ తం దృష్ట్వా ఽథ వరారోహా సీతా రక్షోగణేశ్వరమ్ ।**
**సంకు చ్యోరూ స్తనౌ పీనౌ బాహుభ్యాం పరిరభ్య చ ॥ 66**

**పదచ్ఛేదము :–** తం – దృష్ట్వా – అథ – వరారోహా – సీతా – రక్షోగణేశ్వరమ్, సంకుచ్య – ఊరూ – స్తనౌ – పీనౌ – బాహుభ్యాం – పరిరభ్య – చ ॥

**అన్వయక్రమము :–** అథ వరారోహా సీతా తం రక్షోగణేశ్వరం దృష్ట్వా ఊరూ సంకుచ్య పీనౌ స్తనౌ బాహుభ్యాం పరిరభ్య చ (విత్రస్తా అభవత్).

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, వరారోహా = శ్రేష్ఠమైన రూపముగల, సీతా = సీతాదేవి, తం = ఆ, రక్షోగణేశ్వరం = రాక్షసరాజును, దృష్ట్వా = చూచి, ఊరూ = తొడలను, సంకుచ్య = ముడుచుకొని, పీనౌ = స్థూలములైన, స్తనౌ = స్తనములను, బాహుభ్యాం = బాహువులచే, పరిరభ్య చ = కప్పుకొనియు, (విత్రస్తా = మిక్కిలి భీతినొందినది, అభవత్ = ఆయెను).

**తాత్పర్యము :–** అప్పుడు సౌందర్యవతియైన సీతాదేవి రాక్షసరాజైన రావణుడు తన కడకు వచ్చుచుండగా చూచి తన ఊరుద్వయమును దగ్గరకు కూడదీసికొని స్థూలములైన తన స్తనములను తన భుజములతో కప్పుకొని భీతురాలై యుండెను.

**శ్లో॥ విత్రస్తాం పరమోద్విగ్నాం వీక్షమాణా మితస్తతః ।**
**త్రాణం కించి దపశ్యంతీం వేపమానాం తపస్వినీమ్ ॥ 67**

**శ్లో॥ తా మువాచ దశగ్రీవ స్సీతాం పరమదుఃఖితామ్ ।**
**అవాక్ఛిరాః ప్రపతితో బహుమన్యస్వ మా మితి ॥ 68**

**పదచ్ఛేదము :–** విత్రస్తాం – పరమోద్విగ్నాం – వీక్షమాణామ్ – ఇతః – తతః – త్రాణం – కించిత్ – అపశ్యంతీం – వేపమానాం – తపస్వినీమ్, తామ్ – ఉవాచ – దశగ్రీవః – సీతాం – పరమదుఃఖితామ్, అవాక్ఛిరాః – ప్రపతితః – బహుమన్యస్వ – మామ్ – ఇతి ॥

**అన్వయక్రమము** :- విత్రస్తాం పరమోద్విగ్నామ్ ఇతః తతః వీక్షమాణాం కించిత్ త్రాణమ్ అపశ్యంతీం వేపమానాం తపస్వినీమ్ పరమదుఃఖితాం తాం సీతాం, బహుమన్యస్వ ఇతి, దశగ్రీవః అవాక్ఛిరాః ప్రపతితః (సన్) ఉవాచ.

**ప్రతిపదార్థము** :- విత్రస్తాం = మిక్కిలి భీతినొందినదియు, పరమోద్విగ్నాం = ఎంతయో కంగారు పడుచున్నదియును, ఇతః తతః = ఇటునటు, వీక్షమాణాం = చూచుచున్నదియును, కించిత్ = కొంచెమైన, త్రాణమ్ = రక్షణమును, అపశ్యంతీం = కానకున్నదియును, వేపమానాం = వణుకుచున్నదియునగు, తపస్వినీం = దీనురాలైనదియును, పరమదుఃఖితాం = మిక్కిలి దుఃఖించుచున్నదియునగు, తాం సీతాం = ఆ సీతాదేవిని గూర్చి, దశగ్రీవః = దశకంఠుడైన రావణుడు, మాం = నన్ను, బహుమన్యస్వ = మన్నింపుము, ఇతి = అనుచు, అవాక్ఛిరాః = క్రిందకు వంగిన శిరస్సుగలవాడుగా, ప్రపతితః = నేలపై బడినవాడై, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :- తనను జూచి భీతినొందుచు కంగారుతో ఇటు నటు జూచుచు తనను కాపాడువా రెవ్వరును లేక కంపించుచు దీనురాలై దుఃఖనిమగ్నురాలై యున్న ఆ సీతాదేవిని జూచి రావణుడు దయతో నన్ను మన్నింపుమనుచు తలవంచి నేలమీదికి ఒరిగి సీతాదేవితో ఇట్లు పలికెను.

**శ్లో॥ యది చే త్త్వం తు దర్పా న్మాం నాభినందసి గర్వితే ।**
**ద్వౌ మాసా వంతరం సీతే పాస్యామి రుధిరం తవ ॥ 69**

**పదచ్ఛేదము** :- యది – చేత్ – త్వం – తు – దర్పాత్ – మాం – న – అభినందసి – గర్వితే, ద్వౌ – మాసౌ – అంతరం – సీతే – పాస్యామి – రుధిరం – తవ ॥

**అన్వయక్రమము** :- గర్వితే సీతే! త్వం – దర్పాత్ మాం యది న అభినందసి, ద్వౌ మాసౌ అంతరం, (తతః) తవ రుధిరం పాస్యామి.

**ప్రతిపదార్థము** :- గర్వితే = ఓ గర్విష్ఠురాలవైన, సీతే = సీతాదేవీ! త్వం = నీవు, దర్పాత్ = మదముచే, మాం = నన్ను, యది = ఒకవేళ, న అభినందసి చేత్ = ఆమోదింపకున్నచో, ద్వౌ మాసౌ = రెండు నెలలు, అంతరం = గడువు, (తతః = పిమ్మట), తవ = నీయొక్క, రుధిరం = నెత్తురును, పాస్యామి = త్రాగుదును.

**తాత్పర్యము** :- గర్వితురాలవైన ఓ సీతా! నీవు నా కోరికను ఆమోదింపక దర్పముచే తిరస్కరించితివేని ఇదిగో రెండు మాసములు నీకు గడువిచ్చుచున్నాను. అటుపిమ్మట నిన్ను చంపి నీ నెత్తురును నేను త్రాగుదును సుమా!

**శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా వచ స్తస్య రావణస్య దురాత్మనః ।**
**ఉవాచ పరమక్రుద్ధా సీతా వచన ముత్తరమ్ ॥ 70**

**పదచ్ఛేదము :–** ఏతత్ – శ్రుత్వా – వచః – తస్య – రావణస్య – దురాత్మనః, ఉవాచ – పరమక్రుద్ధా – సీతా – వచనమ్ – ఉత్తరమ్ ॥

**అన్వయక్రమము :–** దురాత్మనః తస్య రావణస్య ఏతత్ వచః శ్రుత్వా పరమక్రుద్ధా సీతా ఉత్తరం వచనమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** దురాత్మనః = దుర్మార్గుడైనట్టి, తస్య = ఆ, రావణస్య = రావణుని యొక్క, ఏతత్ = ఈ, వచః = మాటను, శ్రుత్వా = విని, పరమక్రుద్ధా = మిక్కిలి క్రోధము నొందినట్టి, సీతా = సీతాదేవి, ఉత్తరం = సమాధానమైనట్టి, వచనం = మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** దుర్మార్గుడైన ఆ రావణుడు పలికిన మాటలను విని సీతాదేవి తీవ్రమైన క్రోధము నొంది యిట్లు జవాబు చెప్పెను.

**శ్లో॥ రాక్షసాధమ రామస్య భార్యా మమితతేజసః ।**
**ఇక్ష్వాకుకులనాథస్య స్నుషాం దశరథస్య చ ।**
**అవాచ్యం వదతో జిహ్వా కథం న పతితా తవ ॥ 71**

**పదచ్ఛేదము :–** రాక్షసాధమ – రామస్య – భార్యామ్ – అమితతేజసః – ఇక్ష్వాకు కులనాథస్య – స్నుషాం – దశరథస్య – చ, అవాచ్యం – వదతః – జిహ్వా – కథం – న – పతితా – తవ ॥

**అన్వయక్రమము :–** రాక్షసాధమ! అమితతేజసః రామస్య భార్యామ్ ఇక్ష్వాకుకులనాథస్య దశరథస్య స్నుషాం చ అవాచ్యం వదతః తవ జిహ్వా కథం న పతితా!

**ప్రతిపదార్థము :–** రాక్షసాధమ = ఓ నీచరాక్షసుడా! అమితతేజసః = అత్యంత ప్రతాపశాలియైన, రామస్య = శ్రీరామునియొక్క, భార్యాం = భార్యను, ఇక్ష్వాకుకులనాథస్య = ఇక్ష్వాకువంశమునకు ప్రభువగు, దశరథస్య = దశరథునియొక్క, స్నుషాం చ = కోడలినగు, (మాం = నన్నుగూర్చి), అవాచ్యం = అనరానిమాటలను, వదతః = పలుకుచున్నట్టి, తవ = నీయొక్క, జిహ్వా = నాలుక, కథం = ఎందుచే, న పతితా = పడిపోవలేదు?

**తాత్పర్యము :–** ఓ రాక్షసాధమా! అపరిమితపరాక్రమశాలియైన శ్రీరాముని భార్యను, ఇక్ష్వాకువంశప్రతిష్ఠాకరుడైన దశరథుని కోడలిని అగు నన్ను అనరాని మాటలను

పలికినట్టి నీ నాలుక ఏల ముక్కలుగ తెగి నేలపై బడకున్నది?

**శ్లో॥ కింస్విద్వీర్యం త వానార్య యో మాం భర్తు రసన్నిధౌ ।**
**అపహృత్యాగతః పాప తేనాదృష్టో మహాత్మనా ॥ 72**

**పదచ్ఛేదము** :- కింస్విత్ - వీర్యం - తవ - అనార్య - యః - మాం - భర్తుః - అసన్నిధౌ, అపహృత్య - ఆగతః - పాప - తేన - అదృష్టః - మహాత్మనా ॥

**అన్వయక్రమము** :- అనార్య! పాప! యః మాం భర్తుః అసన్నిధౌ తేన మహాత్మనా అదృష్టః మాం అపహృత్య ఆగతః (అసి) (తస్య) తవ వీర్యం కిం స్విత్!

**ప్రతిపదార్థము** :- అనార్య! = దురాత్ముడా! పాప! = పాపాత్ముడా! యః = ఏ, త్వం = నీవు, భర్తుః = భర్తయొక్క, అసన్నిధౌ = పరోక్షమునందు, తేన = ఆ, మహాత్మనా = మహనీయునిచే, అదృష్టః = చూడబడనివాడవై, అపహృత్య = అపహరించి, ఆగతః = వచ్చియుంటివో, (తస్య = అట్టి), తవ = నీయొక్క, వీర్యం = పరాక్రమము, కింస్విత్ = ఏమది?

**సూచన** :- ఈ శ్లోకమున “కించిద్వీర్యం తవానార్య” అను పాఠాంతరము ఉన్నది. అనగా “నీ పరాక్రమము అల్పము, నీచము” అని భావము. ఈ అర్థముతోనే “కింస్విద్వీర్య!” అని సంబోధనముగా ఇంకొక పాఠాంతరము కూడ ఉన్నది.

**తాత్పర్యము** :- ఓ దురాత్ముడా! మహాత్ముడైన నా భర్తకంట బడకుండగా ఆతడు దగ్గరలేనప్పుడు నన్ను దొంగిలించి తీసికొని వచ్చితివి గదా! అట్టి నీ పరాక్రమము అనగా ఎంతటిది?

**శ్లో॥ న త్వం రామస్య సదృశో దాస్యేఽప్యస్య న యుజ్యసే ।**
**అజేయ స్సత్యవాదీ చ రణశ్లాఘీ చ రాఘవః ॥ 73**

**పదచ్ఛేదము** :- న - త్వం - రామస్య - సదృశః - దాస్యే - అపి - అస్య - న - యుజ్యసే, అజేయః - సత్యవాదీ - చ - రణశ్లాఘీ - చ - రాఘవః ॥

**అన్వయక్రమము** :- రాఘవః అజేయః సత్యవాదీ చ, రణశ్లాఘీ చ (భవతి). త్వం రామస్య సదృశః న (భవసి). అస్య దాస్యే అపి న యుజ్యసే.

**ప్రతిపదార్థము** :- రాఘవః = రఘునందనుడు, అజేయః = జయింప శక్యముగాని వాడు, సత్యవాదీ చ = సత్యవచనుడును, రణశ్లాఘీ చ = యుద్ధమును గొనియాడువాడను, (భవతి = అగుచున్నాడు), త్వం = నీవు, రామస్య = రామునకు, సదృశః = సమానుడవు, న భవసి = కావు, అస్య = అతనియొక్క, దాస్యే అపి =

దాస్యమునందు గూడ, న యుజ్యసే = తగవు.

**తాత్పర్యము** :- నా భర్తయైన రఘునందనుడు అజేయుడు, సత్యవాది, రణమును శ్లాఘించువాడు. అట్టి ఆ రామునకు నీవెంతమాత్రము సాటి కాజాలవు. తుదకా మహనీయునికి దాస్యము చేయుటకు గూడ నీవు తగవు సుమా!

**శ్లో॥ వివృత్య నయనే క్రూరే ముష్టి ముద్యమ్య దక్షిణమ్ ।**
**మైథిలీం హంతు మారబ్ధః స్త్రీభి ర్హాహాకృతం తదా ॥ 74**

**పదచ్ఛేదము** :- వివృత్య - నయనే - క్రూరే - ముష్టిమ్ - ఉద్యమ్య - దక్షిణమ్, మైథిలీం - హంతుమ్ - ఆరబ్ధః - స్త్రీభిః - హాహాకృతం - తదా ॥

**అన్వయక్రమము** :- (సః) క్రూరే నయనే వివృత్య దక్షిణం ముష్టిమ్ ఉద్యమ్య మైథిలీం హంతుమ్ ఆరబ్ధః. తదా స్త్రీభిః హాహాకృతమ్.

**ప్రతిపదార్థము** :- (సః = ఆ దశకంఠుడు), క్రూరే = క్రూరములైన, నయనే = కన్నులను, వివృత్య = త్రిప్పి, దక్షిణం = కుడిదైన, ముష్టిమ్ = పిడికిలిని, ఉద్యమ్య = ఎత్తి, మైథిలీం = జానకిని, హంతుమ్ = చంపుటకు, ఆరబ్ధః = సమకట్టెను, తదా = అప్పుడు, స్త్రీభిః = స్త్రీలచే, హాహాకృతమ్ = హాహాకారము చేయబడెను.

**తాత్పర్యము** :- అటుపిమ్మట వెంటనే రావణుడు భీకరములైన తన మిడిగ్రుడ్లను త్రిప్పుచు కుడిచేతి పిడికిలిని మీదికి ఎత్తి సీతాదేవిని చంపుటకు మీదికి వచ్చుచుండెను. అప్పుడచటి స్త్రీలు ఎల్లరును భయముతో హాహాకారములు చేసిరి.

**శ్లో॥ స్త్రీణాం మధ్యాత్ సముత్పత్య తస్య భార్యా దురాత్మనః ।**
**వరా మండోదరీ నామ తయా స ప్రతిషేధితః ॥ 75**

**పదచ్ఛేదము** :- స్త్రీణాం - మధ్యాత్ - సముత్పత్య - తస్య - భార్యా - దురాత్మనః, వరా - మండోదరీనామ - తయా - సః - ప్రతిషేధితః ॥

**అన్వయక్రమము** :- దురాత్మనః తస్య భార్యా మండోదరీనామ వరా స్త్రీణాం మధ్యాత్ సముత్పత్య (ఆగతా). సః తయా ప్రతిషేధితః.

**ప్రతిపదార్థము** :- దురాత్మనః = దుర్మార్గుడైనట్టి, తస్య = ఆ రావణునియొక్క, భార్యా = భార్యయైన, మండోదరీనామ = మండోదరియను పేరుగల, వరా = ఉత్తమురాలు, స్త్రీణాం = స్త్రీలయొక్క, మధ్యాత్ = నడుమనుండి, సముత్పత్య = మీదికి లేచి, (ఆగతా = వచ్చినది). సః = ఆ రావణుడు, తయా = ఆమెచే, ప్రతిషేధితః = అడ్డగింపబడెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- మొదట ఈ సందర్భమున ధాన్యమాలిని రావణుని నిషేధించినదని చెప్పబడెను. ఇచ్చట మండోదరియని చెప్పుట ఎట్లు పొసగునని అనుకొననక్కరలేదు. రావణుని వారించినది వారిద్దరును కలిసియే. హనుమకు వారిరువురి వివరము తరువాత మాత్రమే ప్రక్కవారి మాటలవలన తెలిసినది.

**తిలకము** :- రావణాసురుని ధాన్యమాలినియు మండోదరియు కలిసి నివారించిరి అని అనుకొనవలెను. కొందరు పెద్దలు మండోదరికే ధాన్యమాలిని యని ఇంకొక పేరు ఉన్నదని చెప్పుచున్నారు.

**తాత్పర్యము** :- అప్పు డాతడా ఘాతుకకృత్యము జరుపకుండగ ఆ దుర్మార్గుని భార్యలలో నుత్తమురాలగు మండోదరియను సాధ్వి స్త్రీల నడుమనుండి ఈవలకు వచ్చి రావణుని అడ్డుకొనెను.

**శ్లో॥ ఉక్తశ్చ మధురాం వాణీం తయా స మదనార్దితః ।**
**సీతయా తవ కిం కార్యం మహేంద్రసమవిక్రమ ॥ 76**

**శ్లో॥ దేవగంధర్వకన్యాభి ర్యక్షకన్యాభిరేవ చ ।**
**సార్ధం ప్రభో రమస్వేహ సీతయా కిం కరిష్యసి ॥ 77**

**పదచ్ఛేదము** :- ఉక్తః - చ - మధురాం - వాణీం - తయా - సః - మదనార్దితః, సీతయా - తవ - కిం - కార్యం - మహేంద్రసమవిక్రమ, దేవగంధర్వకన్యాభిః - యక్షకన్యాభిః - ఏవ - చ, సార్ధం - ప్రభో - రమస్వ - ఇహ - సీతయా - కిం - కరిష్యసి ॥

**అన్వయక్రమము** :- ప్రభో! మహేంద్రసమవిక్రమ! తవ సీతయా కిం కార్యమ్? దేవగంధర్వకన్యాభిః యక్షకన్యాభిః సార్ధం రమస్వ, ఇహ సీతయా కిం కరిష్యసి? ఇతి మదనార్దితః సః తయా మధురాం వాణీమ్ ఉక్తః చ.

**ప్రతిపదార్థము** :- ప్రభో! = రాజా!, మహేంద్రసమవిక్రమః = దేవేంద్రునితో సమానమైన పరాక్రమము గల వీరుడా!, తవ = నీకు, సీతయా = సీతతో, కిం = ఏమి, కార్యం = పని, దేవగంధర్వకన్యాభిః = దేవకన్యలతోడను, గంధర్వకన్యలతోడను, యక్షకన్యాభిః చ సార్ధం = యక్షకన్యలతోడను గూడి, రమస్వ = క్రీడింపుము. ఇహ = ఇచ్చట, సీతయా = సీతతో, కిం కరిష్యసి = ఏమి చేయుదువు? ఇతి = అని, మదనార్దితః = కామముచే పీడింపబడినట్టి, సః = ఆ రావణుడు, తయా = ఆ మండోదరిచే, మధురాం

= తియ్యనైన, వాణీం = మాటను, ఉక్తః చ = చెప్పబడెను కూడను.

**సూచనము** :– 'మయా సహ రమస్వాద్య మద్విశిష్టా న జానకీ'

**తాత్పర్యము** :– నీవు నాతో చక్కగ క్రీడింపుము. ఈ జానకి నాకంటె ఎంతమాత్రము గొప్పది కాదు సుమా.

ఈ శ్లోకార్ధము పై శ్లోకముల నడుమ బొంబాయి ముద్రణమును గానవచ్చు చున్నది.

**తాత్పర్యము** :– దేవేంద్రునితో సమానమైన పరాక్రమవైభవము గల ఓ రాక్షసేంద్రా! నీ కీ మర్త్యురాలైన సీతతో ఏమి పని? దేవకన్యలు, గంధర్వకన్యలును, యక్షకన్యలును ఎందరో యున్నారు గదా! నీవు వారితో గూడి రమింపుము. నీపై మక్కువలేని సీతను నీవేమి చేసికొందువు? అని మన్మథపీడితుడైన రావణునితో మండోదరి తీయని మాటలతో ఆతని మనస్సును మరలించినది.

**శ్లో॥ తత స్తాభి స్సమేతాభి ర్నారీభి స్స మహాబలః ।**
**ప్రసాద్య సహసా నీతో భవనం స్వం నిశాచరః ॥ 78**

**పదచ్ఛేదము** :– తతః – తాభిః – సమేతాభిః – నారీభిః – సః – మహాబలః, ప్రసాద్య – సహసా – నీతః – భవనం – స్వం – నిశాచరః ॥

**అన్వయక్రమము** :– తతః సమేతాభిః తాభిః నారీభిః మహాబలః సః నిశాచరః ప్రసాద్య సహసా స్వం భవనం నీతః.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, సమేతాభిః = దగ్గరకు చేరినట్టి, తాభిః = ఆ, నారీభిః = స్త్రీలచే, మహాబలః = గొప్పబలశాలియైన, సః = ఆ, నిశాచరః = రాక్షసుడు, ప్రసాద్య = బ్రతిమాలి, సహసా = వెంటనే, స్వం = తన, భవనం = మందిరమును గూర్చి, నీతః = కొనిపోవబడెను.

**తాత్పర్యము** :– అప్పు డాతని చుట్టును జేరి ఆతని భార్యలందరును మహాబలాఢ్యుడైన ఆ రాక్షసరాజును ఎట్లో ఒప్పించి తన భవనమునకు గొనిపోయిరి.

**శ్లో॥ యాతే తస్మిన్ దశగ్రీవే రాక్షస్యో వికృతాననాః ।**
**సీతాం నిర్భర్త్సయామాసు ర్వాక్యైః క్రూరై స్సుదారుణైః ॥ 79**

**పదచ్ఛేదము** :– యాతే – తస్మిన్ – దశగ్రీవే – రాక్షస్యః – వికృతాననాః, సీతాం – నిర్భర్త్సయామాసుః – వాక్యైః – క్రూరైః – సుదారుణైః ॥

**అన్వయక్రమము** :– తస్మిన్ దశగ్రీవే యాతే సతి వికృతాననాః రాక్షస్యః క్రూరైః సుదారుణైః వాక్యైః సీతాం నిర్భర్త్సయామాసుః.

**ప్రతిపదార్థము** :– తస్మిన్ = ఆ, దశగ్రీవే = రావణుడు, యాతే(సతి) = వెడలిపోవగా, వికృతాననాః = వికారమైన ముఖముగల, రాక్షస్యః = రాక్షతవనితలు, క్రూరైః = క్రూరములును, సుదారుణైః = ఘోరములునగు, వాక్యైః = మాటలతో, సీతాం = సీతాదేవిని, నిర్భర్త్సయామాసుః = పీడింపసాగిరి.

**తాత్పర్యము** :– రావణు డట్లు వెడలగనే అచట కావలియున్న వికారమైన ముఖములుగల రాక్షసస్త్రీలు మిక్కిలి క్రూరమైన ఘోరమైన వచనములతో సీతాదేవిని హింసింపసాగిరి.

**శ్లో॥ తృణవ ద్భాషితం తాసాం గణయామాస జానకీ ।**
**తర్జితం చ తదా తాసాం సీతాం ప్రాప్య నిరర్థకమ్ ॥ 80**

**పదచ్ఛేదము** :– తృణవత్ – భాషితం – తాసాం – గణయామాస – జానకీ, తర్జితం – చ – తదా – తాసాం – సీతాం – ప్రాప్య – నిరర్థకమ్ ॥

**అన్వయక్రమము** :– జానకీ తాసాం భాషితం తృణవత్ గణయామాస. తదా తాసాం తర్జితం చ సీతాం ప్రాప్య నిరర్థకం (జాతమ్).

**ప్రతిపదార్థము** :– జానకీ = సీతాదేవి, తాసాం = ఆ స్త్రీలయొక్క, భాషితం = మాటను, తృణవత్ = గడ్డిపోచవలె, గణయామాస = లెక్కించినది, తదా = అప్పుడు, తాసాం = ఆ రాక్షసస్త్రీలయొక్క, తర్జితం చ = బెదిరింపుగూడ, సీతాం = సీతాదేవిని, ప్రాప్య = పొంది, నిరర్థకం = వ్యర్థమైనది, (జాతం = అయినది).

**తాత్పర్యము** :– సీతాదేవి ఆ రాక్షసస్త్రీలు మహాభయంకరముగ పలికిన మాటలను గడ్డిపోచగా తీసిపారవైచెను. వారామెను బెదిరించుచు చేసిన ప్రయత్నమంతయును వ్యర్థమే అయ్యెను.

**శ్లో॥ వృథాగర్జితనిశ్చేష్టా రాక్షస్యః పిశితాశనాః ।**
**రావణాయ శశంసు స్తా స్సీతావ్యవసితం మహత్ ॥ 81**

**పదచ్ఛేదము** :– వృథాగర్జితనిశ్చేష్టాః – రాక్షస్యః – పిశితాశనాః, రావణాయ – శశంసుః – తాః – సీతావ్యవసితం – మహత్ ॥

**అన్వయక్రమము** :– పిశితాశనాః వృథాగర్జితనిశ్చేష్టాః తాః రాక్షస్యః మహత్ సీతావ్యవసితం రావణాయ శశంసుః.

**ప్రతిపదార్థము :–** పిశితాశనాః = మాంసభక్షణము గలిగినట్టి, తాః = ఆ, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, వృథాగర్జితనిశ్చేష్టాః (సత్యః) = వ్యర్థమైన గర్జనములు గలిగి, చేష్టలులేని వారగుచు, మహత్ = గొప్పదైన, సీతావ్యవసితం = సీతయొక్క దృఢనిశ్చయమును గూర్చి, రావణాయ = రావణునకు, శశంసుః = తెలిపిరి.

**తాత్పర్యము :–** క్రూరులైన ఆ రాక్షసస్త్రీలు తమ గద్దింపులు వ్యర్థముకాగా చేయునదిలేక రావణుని కడకేగి ఆతనితో సీతాదేవియొక్క ధృఢనిశ్చయమును తెలియజెప్పిరి.

**శ్లో॥ తత స్తా స్సహితా స్సర్వా విహతాశా నిరుద్యమాః ।**
**పరిక్షిప్య సమంతా త్తాం నిద్రావశముపాగతాః ॥ 82**

**పదచ్ఛేదము :–** తతః – తాః – సహితాః – సర్వాః – విహతాశాః – నిరుద్యమాః, పరిక్షిప్య – సమంతాత్ – తాం – నిద్రావశమ్ – ఉపాగతాః ॥

**అన్వయక్రమము :–** తతః తాః సర్వాః విహతాశాః నిరుద్యమాః (సత్యః) సమంతాత్ తాం పరిక్షిప్య నిద్రావశమ్ ఉపాగతాః.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, తాః = వారు, సర్వాః = ఎల్లరును, విహతాశాః = నశించిన ఆశగలవారును, నిరుద్యమాః = ప్రయత్నము లేనివారునగుచు, సహితాః = కలిసియుండినవారై, సమంతాత్ = అన్నివైపులను, తాం = ఆ సీతాదేవిని, పరిక్షిప్య = చుట్టుముట్టి, నిద్రావశం = నిద్రయొక్క వశమును, ఉపాగతాః = పొందిరి.

**తాత్పర్యము :–** అప్పుడా రాక్షసస్త్రీలు ఎల్లరును తమ యత్నము వ్యర్థమైపోవుటచే చేయునదిలేక అందరు కలిసి ఆ సీతాదేవిని చుట్టుముట్టి కూర్చుండి కొద్దిసేపటిలో నిద్రకు లొంగిపోయి పరుండిరి.

**శ్లో॥ తాసు చైవ ప్రసుప్తాసు సీతా భర్తృహితే రతా ।**
**విలప్య కరుణం దీనా ప్రశుశోచ సుదుఃఖితా ॥ 83**

**పదచ్ఛేదము :–** తాసు – చ – ఏవ – ప్రసుప్తాసు – సీతా – భర్తృహితే – రతా, విలప్య – కరుణం – దీనా – ప్రశుశోచ – సుదుఃఖితా ॥

**అన్వయక్రమము :–** తాసు ప్రసుప్తాసు (సతీషు) భర్తృహితే రతా సీతా సుదుఃఖితా (సతీ) కరుణం విలప్య దీనా (సతీ) ప్రశుశోచ.

**ప్రతిపదార్థము :–** తాసు = ఆ రాక్షసస్త్రీలు, ప్రసుప్తాసు (సతీషు) = నిద్రించినవారై యుండగా, భర్తృహితే = భర్తయొక్క హితమునందు, రతా = ఆసక్తురాలైనట్టి, సీతా = సీతాదేవి, సుదుఃఖితా సతీ = మిక్కిలి దుఃఖము నొందినదై, కరుణం = జాలిగా,

విలప్య = విలపించి, దీనా (సతీ) = దీనురాలై, ప్రశుశోచ = మిక్కిలి శోకించెను.

**తాత్పర్యము :–** ఆ రాక్షసస్త్రీ లట్లు నిద్రలో మునిగియుండగా భర్త క్షేమమును కోరుచున్న సీతాదేవి దీనురాలై జాలిగా విలపించుచు దుఃఖము నాపుకొనలేక మిక్కిలిగ శోకించెను.

**శ్లో॥ తాసాం మధ్యా త్సముత్థాయ త్రిజటా వాక్య మబ్రవీత్ ।**
**ఆత్మానం ఖాదత క్షిప్రం న సీతా వినశిష్యతి ।**
**జనక స్యాత్మజా సాధ్వీ స్నుషా దశరథస్య చ ॥ 84**

**పదచ్ఛేదము :–** తాసాం – మధ్యాత్ – సముత్థాయ – త్రిజటా – వాక్యమ్ – అబ్రవీత్, ఆత్మానం – ఖాదత – క్షిప్రం – న – సీతా – వినశిష్యతి, జనకస్య – ఆత్మజా – సాధ్వీ – స్నుషా – దశరథస్య – చ ॥

**అన్వయక్రమము :–** తాసాం మధ్యాత్ సముత్థాయ త్రిజటా వాక్యమ్ అబ్రవీత్, క్షిప్రమ్ ఆత్మానం ఖాదత, జనకస్య ఆత్మజా దశరథస్య స్నుషా సాధ్వీ సీతా న వినశిష్యతి.

**ప్రతిపదార్థము :–** తాసాం = ఆ స్త్రీలయొక్క, మధ్యాత్ = నడుమ నుండి, సముత్థాయ = లేచి, త్రిజటా = త్రిజట అను రక్కసి, వాక్యమ్ = వచనమును, అబ్రవీత్ = పలికెను, క్షిప్రం = శీఘ్రముగా, ఆత్మానం = నన్ను, ఖాదత = తినుడు, జనకస్య = జనకునియొక్క, ఆత్మజా = పుత్రికయును, దశరథస్య స్నుషా చ = దశరథుని కోడలును, సాధ్వీ = పతివ్రతయునగు, సీతా = సీతాదేవి, న వినశిష్యతి = నాశనము నొందదు.

**తాత్పర్యము :–** అప్పుడా రాక్షసస్త్రీల నడుమనుండి త్రిజట యను నామె లేచి ఇట్లు పలికినది. మీకు కావలసినచో నన్ను తినివేయుడు. మీరు సీతాదేవి నేల హింసింతురు! జనక మహారాజు కుమార్తెయు, దశరథచక్రవర్తి కోడలును, మహాపతివ్రతయునగు సీతాదేవికి నాశము గలుగదు సుడీ!

**శ్లో॥ స్వప్నో హ్యద్య మయా దృష్టో దారుణో రోమహర్షణః ।**
**రక్షసాం చ వినాశాయ భర్తు రస్యా జయాయ చ ॥ 85**

**పదచ్ఛేదము :–** స్వప్నః – హి – అద్య – మయా – దృష్టః – దారుణః – రోమహర్షణః, రక్షసాం – చ – వినాశాయ – భర్తుః – అస్యాః – జయాయ – చ ॥

**అన్వయక్రమము :–** రక్షసాం వినాశాయ చ అస్యాః భర్తుః జయాయ చ అద్య మయా దారుణః రోమహర్షణః స్వప్నః దృష్టః హి!

**ప్రతిపదార్థము :–** రక్షసాం = రాక్షసులయొక్క, వినాశాయ చ = వినాశము కొరకును, అస్యాః = ఈమెయొక్క, భర్తుః = పెనిమిటియొక్క, జయాయ చ = జయముకొరకును,

అద్య = నేడు, మయా = నాచేత, దారుణః = ఘోరమైన, రోమహర్షణః = గగుర్పాటు గలిగించునట్టి, స్వప్నః = స్వప్నము, దృష్టః హి = చూడబడినదిసుడీ!

**తాత్పర్యము :–** ఈనాడు నాకు రాక్షసులకు వినాశకరమును, ఈమె భర్తకు జయకరమును అగు ఒకానొక ఘోరమైన ఒడలు గగుర్పొడుచునట్టి స్వప్నము వచ్చినదిసుడీ!

**శ్లో॥ అల మస్మాన్ పరిత్రాతుం రాఘవా ద్రాక్షసీగణమ్ ।**
**అభియాచామ వైదేహీ మేతద్ధి మమ రోచతే ॥ 86**

**పదచ్ఛేదము :–** అలం – అస్మాన్ – పరిత్రాతుం – రాఘవాత్ – రాక్షసీగణమ్, అభియాచామ – వైదేహీమ్ – ఏతత్ – హి – మమ – రోచతే ॥

**అన్వయక్రమము :–** రాఘవాత్ అస్మాన్ రాక్షసీగణం పరిత్రాతుం ఏషా అలమ్, (తత్) వైదేహీం అభియాచామ, మమ ఏతత్ హి రోచతే.

**ప్రతిపదార్థము :–** రాఘవాత్ = శ్రీరామునినుండి, అస్మాన్ = మనలను, రాక్షసీ గణం = రాక్షసవర్గమును, పరిత్రాతుం = పరిరక్షించుటకు, (ఏషా = ఈమె) అలం = చాలును, (తత్ = అందువలన), వైదేహీం = జానకీదేవిని, అభియాచామ = యాచించుదము, మమ = నాకు, ఏతత్ హి = ఇదియే, రోచతే = ఇష్టమగుచున్నది.

**తాత్పర్యము :–** మనకు గలుగబోవు వినాశమునకు మూలమైన శ్రీరాముని నుండి మనను, మన రాక్షసీబృందమును రక్షించుటకు ఇప్పు డీమెయే సమర్థురాలు. కాబట్టి ఈమెనే మనను కాపాడుటకై యాచింతుము గాక! నాకిదియే క్షేమమని తోచుచున్నది.

**శ్లో॥ యస్యా హ్యేవంవిధ స్స్వప్నో దుఃఖితాయాః ప్రదృశ్యతే ।**
**సా దుఃఖై ర్వివిధై ర్ముక్తా సుఖం ప్రాప్నో త్యనుత్తమమ్ ॥ 87**

**పదచ్ఛేదము :–** యస్యాః – హి – ఏవంవిధః – స్వప్నః – దుఃఖితాయాః – ప్రదృశ్యతే, సా – దుఃఖైః – వివిధైః – ముక్తా – సుఖం – ప్రాప్నోతి – అనుత్తమమ్ ॥

**అన్వయక్రమము :–** దుఃఖితాయాః యస్యాః విషయే ఏవంవిధః స్వప్నః ప్రదృశ్యతే, సా వివిధైః దుఃఖైః ముక్తా, అనుత్తమం సుఖం ప్రాప్నోతి.

**ప్రతిపదార్థము :–** దుఃఖితాయాః = దుఃఖించుచున్నట్టి, యస్యాః (విషయే) = ఎవతె విషయముననైతే, ఏవంవిధః = ఈ విధమైనట్టి, స్వప్నః = స్వప్నము, ప్రదృశ్యతే = గాన్పించునో, సా = ఆమె, వివిధైః = బహువిధములైన, దుఃఖైః = దుఃఖములచే,

ముక్తా = విడువబడినదై, అనుత్తమం = శ్రేష్ఠమైన, సుఖం = సౌఖ్యమును, ప్రాప్నోతి = పొందును.

**తాత్పర్యము :-** దుఃఖనిమగ్నురాలైన ఏ దీనురాలి విషయమై ఈ విధమగు స్వప్నము కానవచ్చెనో ఆ దుఃఖితురాలు తన సర్వదుఃఖములను తొలగించుకొని గొప్పదైన క్షేమమును తప్పక పొందగలదు.

**శ్లో॥ ప్రణిపాతప్రసన్నా హి మైథిలీ జనకాత్మజా ॥ 88**

**పదచ్ఛేదము :-** ప్రణిపాతప్రసన్నా - హి - మైథిలీ - జనకాత్మజా ॥

**అన్వయక్రమము :-** సుగమము.

**ప్రతిపదార్థము :-** జనకాత్మజా = జనకమహారాజు పుత్రికయైన, మైథిలీ = సీతాదేవి, ప్రణిపాతప్రసన్నా హి = నమస్కారముచేతనే ప్రసన్నురాలగునట్టిది సుడీ!

**తాత్పర్యము :-** జనకరాజపుత్రియగు సీతాదేవి ఒక్క నమస్కారము తోడనే ప్రసన్నురాలయి మనకు కావలసినట్టి మేలు గల్గింపగలదు సుడీ!

**సూచనము :-** అలమేషా పరిత్రాతుం రాక్షస్యో మహతో భయాత్ అనగా

ఓ రాక్షసస్త్రీలారా! ఎంతటి గొప్ప ప్రమాదము నుండియైనను మనను కాపాడుటకు ఈమె సర్వసమర్థురాలు సుడీ!

ఈ ఉత్తరార్ధము ఒక్క ఉత్తరాదిప్రతులందు మాత్రమే కానవచ్చుచున్నది.

**శ్లో॥ తత స్సా హ్రీమతీ బాలా భర్తు ర్విజయహర్షితా ।**
**అవోచ ద్యది త త్తథ్యం భవేయం శరణం హి వః ॥ 89**

**పదచ్ఛేదము :-** తతః - సా - హ్రీమతీ - బాలా - భర్తుః - విజయహర్షితా, అవోచత్ - యది - తత్ - తథ్యం - భవేయం - శరణం - హి - వః ॥

**అన్వయక్రమము :-** తతః హ్రీమతీ సా బాలా భర్తుః విజయహర్షితా అవోచత్, తత్ తథ్యం యది, వః శరణం భవేయం హి.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, హ్రీమతీ = లజ్జావతియైన, సా = ఆ, బాలా = తరుణి, భర్తుః = భర్తయొక్క, విజయహర్షితా = విజయముచే ఆనందము నొందినదై, అవోచత్ = పలికెను, తత్ = అయ్యది, తథ్యం = యథార్థము, యది = అయినయెడల, వః = మీకు, శరణం = రక్షకము, భవేయం హి = కాగలను సుడీ.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- లజ్జితా - నాకు ఇంతటి భాగ్యము ఎట్లు లభించును అని అను కొనుచున్నట్టి ఆమెకు అప్పుడు సిగ్గు కలిగినదని భావము.

**తాత్పర్యము** :- భర్తకు కలుగబోవు విజయమునకు మహానందము నొందుచు తాను పొందు ఆనందమును గూర్చి తానే సిగ్గునొందుచున్న ఆ బాలస్వభావురాలైన సీతాదేవి త్రిజటాదిరాక్షసస్త్రీలను జూచి మీరు పలికినదే నిజమైనచో నేను మీకు తప్పక రక్షణముగ నుందునని పలికెను.

**శ్లో॥ తాం చాహం తాదృశీం దృష్ట్వా సీతాయా దారుణాం దశామ్ ।**
**చింతయామాస విక్రాంతో నచ మే నిర్వృతం మనః ॥ 90**

**పదచ్ఛేదము** :- తాం - చ - అహం - తాదృశీం - దృష్ట్వా - సీతాయాః - దారుణాం - దశామ్, చింతయామాస - విక్రాంతః - న - చ - మే - నిర్వృతం - మనః ॥

**అన్వయక్రమము** :- సీతాయాః తాదృశీం తాం దారుణాం దశాం దృష్ట్వా విక్రాంతః అహం చింతయామాస, మే మనః న చ నిర్వృతమ్.

**ప్రతిపదార్థము** :- సీతాయాః = సీతాదేవియొక్క, తాదృశీం = ఆ విధమైనట్టి, దారుణాం = ఘోరమైన, తాం = ఆ, దశాం = పరిస్థితిని, దృష్ట్వా = చూచి, విక్రాంతః = దుఃఖాక్రాంతుడనై, అహం = నేను, చింతయామాస = ఆలోచించితిని. మే = నాయొక్క, మనః = మనస్సు, న చ నిర్వృతమ్ = సుఖములేనిదయ్యెను.

**తాత్పర్యము** :- సీతాదేవి ప్రస్తుతమున్న ఘోరమైన ఆ పరిస్థితిని చూడగనే నేను మిక్కిలి చింతాగ్రస్తుడనైతిని. అప్పట్ల నాకు మనస్సున ఏమియు సుఖము లేకుండెను.

**శ్లో॥ సంభాషణార్థం చ మయా జానక్యా శ్చింతితో విధిః ।**
**ఇక్ష్వాకూణాం హి వంశ స్తు తతో మమ పురస్కృతః ॥ 91**

**పదచ్ఛేదము** :- సంభాషణార్థం - చ - మయా - జానక్యాః - చింతితః - విధిః, ఇక్ష్వాకూణాం - హి - వంశః - తు - తతః - మమ - పురస్కృతః ॥

**అన్వయక్రమము** :- జానక్యాః సంభాషణార్థం మయా విధిః చింతితః. తతః ఇక్ష్వాకూణాం వంశః మమ పురస్కృతః.

**ప్రతిపదార్థము** :- జానక్యాః = సీతాదేవియొక్క, సంభాషణార్థం = సంభాషణము

కొఱకు, మయా = నాచేత, విధిః = విధానము, చింతితః = ఆలోచింపబడినది, తతః = పిమ్మట, ఇక్ష్వాకూణాం = ఇక్ష్వాకురాజులయొక్క, వంశః = వంశము, మమ (మయా) = నాచేత, పురస్కృతః = స్తుతించబడినది.

**తాత్పర్యము :–** పిమ్మట నేను సీతాదేవితో సంభాషించుటకై ఒక పద్ధతిని ఆలోచించితిని. వెంటనే నేను ఇక్ష్వాకువంశమును స్తుతింప నారంభించితిని.

**శ్లో॥ శ్రుత్వా తు గదితాం వాచం రాజర్షిగణపూజితామ్ ।**
**ప్రత్యభాషత మాం దేవీ బాష్పైః పిహితలోచనా ॥ 92**

**పదచ్ఛేదము :–** శ్రుత్వా – తు – గదితాం – వాచం – రాజర్షిగణపూజితామ్ । ప్రత్యభాషత – మాం – దేవీ – బాష్పైః – పిహితలోచనా ॥

**అన్వయక్రమము :–** రాజర్షిగణపూజితాం (తాం) గదితాం వాచం శ్రుత్వా బాష్పైః పిహితలోచనా దేవీ మాం ప్రత్యభాషత.

**ప్రతిపదార్థము :–** రాజర్షిగణపూజితాం = రాజఋషి బృందములచే శ్లాఘింపబడిన, తాం = ఆ, గదితాం = చెప్పబడినట్టి, వాచం = మాటను, శ్రుత్వా = విని, బాష్పైః = కన్నీళ్ళచే, పిహితలోచనా = కప్పబడిన కన్నులుగల్గినట్టి, దేవీ = ఆ పూజ్యురాలు, మాం = నన్నుగూర్చి, ప్రత్యభాషత = తిరిగి పలికెను.

**తాత్పర్యము :–** ఋషిగణము గూడ మెచ్చినట్టి నా మాటను వినినంతనే పూజ్యురాలైన ఆ సీత ఆనందబాష్పములతో తన కన్నులు నిండిపోయి యుండగా నాతో ఇట్లు పలికినది.

**శ్లో॥ క స్త్వం కేన కథం చేహ ప్రాప్తో వానరపుంగవ ।**
**కాచ రామేణ తే ప్రీతి స్త న్మే శంసితు మర్హసి ॥ 93**

**పదచ్ఛేదము :–** కః – త్వం – కేన – కథం – చ – ఇహ – ప్రాప్తః – వానరపుంగవ, కా – చ – రామేణ – తే – ప్రీతిః – తత్ – మే – శంసితుమ్ – అర్హసి ॥

**అన్వయక్రమము :–** వానరపుంగవ! త్వం కః? కేన కథం చ ఇహ ప్రాప్తః? తే రామేణ ప్రీతిః కా? తత్ మే శంసితుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము :–** వానరపుంగవ! = ఓ వానర శ్రేష్ఠుడా!, త్వం = నీవు, కః = ఎవ్వడవు? కేన = ఏ కారణముచే, కథం = ఎట్లు, ఇహ = ఇటకు, ప్రాప్తః = చేరితివి? రామేణ = శ్రీరామునితో, తే = నీకు, ప్రీతిః = అనురాగము, కా = ఎట్టిది? తత్ = దానిని, మే = నాకు, శంసితుమ్ = చెప్పుటకు, అర్హసి = తగుదువు.

**తాత్పర్యము** :– ఓ వానరోత్తమా! నీవెవ్వడవు? ఎందుచేత ఇపుడు వచ్చితివి? నీ వెట్లుగ నిటకు రాగల్గితివి? రామునితో నీకు మైత్రి ఎట్లు గలిగినది? నా కది యంతయును తెలియజెప్పుము.

**శ్లో॥ తస్యా స్తద్వచనం శ్రుత్వా హ్యాహమ ప్యబ్రువం వచః ।**
**దేవి రామస్య భర్తు స్తే సహాయో భీమవిక్రమః ॥ 94**

**శ్లో॥ సుగ్రీవో నామ విక్రాంతో వానరేంద్రో మహాబలః ।**
**తస్య మాం విద్ధి భృత్యం త్వం హనుమంత మిహాగతమ్ ॥ 95**

**పదచ్ఛేదము** :– తస్యాః – తత్ – వచనం – శ్రుత్వా – హి – అహమ్ – అపి – అబ్రువం – వచః, దేవి – రామస్య – భర్తుః – తే – సహాయః – భీమవిక్రమః, సుగ్రీవః – నామ – విక్రాంతః – వానరేంద్రః – మహాబలః – తస్య – మాం – విద్ధి – భృత్యం – త్వం – హనుమంతమ్ – ఇహ – ఆగతమ్ ॥

**అన్వయక్రమము** :– తస్యాః తత్ వచనం శ్రుత్వా అహమ్ అపి వచః అబ్రువమ్ – దేవి! తే భర్తుః రామస్య సహాయః భీమవిక్రమః విక్రాంతః మహాబలః సుగ్రీవః నామ వానరేంద్రః (అస్తి). తస్య భృత్యమ్ ఇహ ఆగతం హనుమంతం మాం త్వం విద్ధి.

**ప్రతిపదార్థము** :– తస్యాః = ఆమెయొక్క, తత్ = ఆ, వచనం = మాటను, శ్రుత్వా = విని, అహమ్ అపి = నేను గూడ, వచః = మాటను, అబ్రువమ్ = పలికితిని, దేవి! = ఓ పూజ్యురాలా!, తే = నీయొక్క, భర్తుః = భర్తయైన, రామస్య = రామునకు, సహాయః = సహాయకుడును, భీమవిక్రమః = భీకరపరాక్రమోపేతుడును, విక్రాంతః = మహావీరుడును, మహాబలః = మహాబలాఢ్యుడును అగు, సుగ్రీవః నామ = సుగ్రీవుడని పేరు పొందిన, వానరేంద్రః = వానరాధిపతి, (అస్తి = కలడు), తస్య = ఆతనియొక్క, భృత్యం = సేవకునిగను, ఇహ = ఇటకు, ఆగతం = వచ్చిన, హనుమంతం = హనుమంతుడను వానిగను, మాం = నన్ను గూర్చి, త్వం = నీవు, విద్ధి = తెలిసికొనుము.

**తాత్పర్యము** :– సీతాదేవి పలికిన ఆ మాటలను విని వెంటనే నేను ఆమెతో ఇట్లు చెప్పితిని – దేవీ! నీ భర్తయైన శ్రీరామునకు సహాయకుడుగా భీకరపరాక్రమోపేతుడును, మహావీరుడును, మహాబలాఢ్యుడును అగు సుగ్రీవుడను వానరరాజు గలడు. నేను ఆతడు పంపగ నిచటికి వచ్చిన హనుమంతుడను పేరుగల యాతని భృత్యుడనని నన్ను గూర్చి తెలుసుకొనుము.

**శ్లో॥ భర్త్రాహం ప్రేషిత స్తుభ్యం రామే ణాక్లిష్టకర్మణా ।**
**ఇదం చ పురుషవ్యాఘ్ర శ్శీమాన్ దాశరథి స్స్వయమ్ ।**
**అంగులీయ మభిజ్ఞాన మదాత్తుభ్యం యశస్విని ॥ 96**

**పదచ్ఛేదము :–** భర్త్రా – అహం – ప్రేషితః – తుభ్యం – రామేణ – అక్లిష్టకర్మణా, ఇదం – చ – పురుషవ్యాఘ్రః – శ్రీమాన్ – దాశరథిః – స్వయమ్, అంగులీయమ్ – అభిజ్ఞానమ్ – అదాత్ – తుభ్యం – యశస్విని ॥

**అన్వయక్రమము :–** అక్లిష్టకర్మణా తే భర్త్రా రామేణ అహం తుభ్యం ప్రేషితః, యశస్విని! పురుషవ్యాఘ్రః శ్రీమాన్ దాశరథిః స్వయం తుభ్యమ్ ఇదమ్ అభిజ్ఞానమ్ అంగులీయమ్ అదాత్.

**ప్రతిపదార్థము :–** అక్లిష్టకర్మణా = క్లేశములేని కర్మలు గలిగినట్టి, (తే) భర్త్రా = (నీ) భర్తయైన, రామేణ = శ్రీరామునిచే, అహం = నేను, తుభ్యం = నీ కొరకు, ప్రేషితః = పంపబడితిని, యశస్విని! = కీర్తిమంతురాలా! పురుషవ్యాఘ్రః = పురుష శ్రేష్ఠుడును, శ్రీమాన్ = శుభలక్షణ సంపన్నుడునగు, దాశరథిః = దశరథనందనుడు, స్వయం = స్వయముగా, తుభ్యం = నీ కొరకు, ఇదమ్ = ఈ, అభిజ్ఞానమ్ = ఆనవాలయినట్టి, అంగులీయమ్ = ఉంగరమును, అదాత్ = ఇచ్చెను.

**తాత్పర్యము :–** క్లేశదూరముగా ఆవశ్యకకృత్యములను గావించునట్టి ఉత్తముడైన నీనాథుడు నీకొరకై నన్ను ఇచ్చటికి పంపినాడు. కీర్తిమంతురాలవైన సీతా! పురుషోత్తము డయిన ఆ దశరథనందనుడు నీ కానవాలుగా ఈ యుంగరము నిమ్మని స్వయముగా నాచేతికి ఇచ్చినాడు.

**శ్లో॥ త దిచ్ఛామి త్వయాఽఽ జ్ఞప్తం దేవి కిం కరవా ణ్యహమ్ ।**
**రామలక్ష్మణయోః పార్శ్వం నయామి త్వాం కి ముత్తరమ్ ॥ 97**

**పదచ్ఛేదము :–** తత్ – ఇచ్ఛామి – త్వయా – ఆజ్ఞప్తం – దేవి – కిం – కరవాణి – అహమ్ – రామలక్ష్మణయోః – పార్శ్వం – నయామి – త్వాం – కిమ్ – ఉత్తరమ్ ॥

**అన్వయక్రమము :–** తత్ దేవి! అహం కిం కరవాణి? త్వయా ఆజ్ఞప్తమ్ ఇచ్ఛామి, రామలక్ష్మణయోః పార్శ్వం త్వాం నయామి.

**ప్రతిపదార్థము :–** తత్ = అందువలన, దేవి! = ఓ జానకీదేవీ! అహం = నేను, కిం = ఏమి, కరవాణి = చేయుదును? త్వయా = నీచేత, ఆజ్ఞప్తం = ఆజ్ఞాపింపబడుటను, ఇచ్ఛామి = కోరుచున్నాను, త్వాం = నిన్ను, రామలక్ష్మణయోః = రామలక్ష్మణుల

యొక్క, పార్శ్వం = పజ్జకు, నయామి = కొనిపోవుదును, ఉత్తరం = సమాధానము, కిం = ఏమి?

**తాత్పర్యము :–** తల్లీ! ఇప్పుడు నన్ను ఏమి చేయుమందువో ఆజ్ఞాపింపుము. నిన్నిప్పుడే రామలక్ష్మణుల కడకు గొని పొమ్మందువా! నీ జవాబేమి? చెప్పుము.

**శ్లో॥ ఏత చ్ఛ్రుత్వా విదిత్వా చ సీతా జనకనందినీ ।**
**ఆహ రావణ ముత్సాద్య రాఘవో మాం నయ త్వితి ॥ 98**

**పదచ్ఛేదము :–** ఏతత్ – శ్రుత్వా – విదిత్వా – చ – సీతా – జనకనందినీ, ఆహ – రావణమ్ – ఉత్సాద్య – రాఘవః – మాం – నయతు – ఇతి ॥

**అన్వయక్రమము :–** జనకనందినీ సీతా ఏతత్ శ్రుత్వా విదిత్వా చ రాఘవః రావణం ఉత్సాద్య మాం నయతు ఇతి ఆహ.

**ప్రతిపదార్థము :–** జనకనందినీ = జనకునకు పుత్రికయైన, సీతా = సీతాదేవి, ఏతత్ = ఈ మాటను, శ్రుత్వా = విని, విదిత్వా చ = తెలిసికొని, రాఘవః = శ్రీరాముడు, రావణం = రావణుని, ఉత్సాద్య = పరిమార్చి, మాం = నన్ను, నయతు = తీసికొని వెళ్ళునుగాక!, ఇతి = అని, ఆహ = పలికెను.

**తాత్పర్యము :–** జనకపుత్రియైన సీతాదేవి నేను చెప్పిన దంతయును విని భావము గ్రహించి "శ్రీరాముడు రావణాసురుని సంహరించి నన్ను తనవెంట గైకొని పోవునుగాక!" అని నాకు సమాధానము చెప్పెను.

**శ్లో॥ ప్రణమ్య శిరసా దేవీ మహ మార్యా మనిందితామ్ ।**
**రాఘవస్య మనోహ్లాద మభిజ్ఞాన మయాచిషమ్ ॥ 99**

**పదచ్ఛేదము :–** ప్రణమ్య – శిరసా – దేవీమ్ – అహమ్ – ఆర్యామ్ – అనిందితామ్, రాఘవస్య – మనోహ్లాదమ్ – అభిజ్ఞానమ్ – అయాచిషమ్ ॥

**అన్వయక్రమము :–** అహమ్ ఆర్యామ్ అనిందితాం దేవీం శిరసా ప్రణమ్య రాఘవస్య మనోహ్లాదమ్ అభిజ్ఞానమ్ అయాచిషమ్.

**ప్రతిపదార్థము :–** అహమ్ = నేను, ఆర్యామ్ = పూజ్యురాలును, అనిందితాం = నిందారహితురాలునగు, దేవీం = సీతాదేవిని, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = మ్రొక్కి, రాఘవస్య = శ్రీరామునకు, మనోహ్లాదం = మనస్సున కానందము గల్గించునట్టి, అభిజ్ఞానం = ఆనవాలును, అయాచిషమ్ = అడిగితిని.

**తాత్పర్యము** :- నేనప్పుడు పవిత్రురాలును పూజ్యురాలునగు సీతాదేవికి తలవంచి నమస్కరించి శ్రీరాముని మనస్సునకు ప్రియమునుగూర్చు ఆనవా లొకటి యొసగుమని కోరితిని.

**శ్లో॥ అథ మామబ్రవీ త్సీతా గృహ్యతా మయ ముత్తమః ।**
**మణిర్యేన మహాబాహూ రామ స్త్వాం బహుమన్యతే ॥ 100**

**పదచ్ఛేదము** :- అథ - మామ్ - అబ్రవీత్ - సీతా - గృహ్యతామ్ - అయమ్ - ఉత్తమః, మణిః - యేన - మహాబాహుః - రామః - త్వాం - బహు - మన్యతే ॥

**అన్వయక్రమము** :- అథ సీతా, మహాబాహుః రామః త్వాం యేన బహుమన్యతే (సః) అయమ్ ఉత్తమః మణిః గృహ్యతామ్ (ఇతి) మామ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, సీతా = సీతాదేవి, మహాబాహుః = గొప్ప బాహువులు గల్గిన, రామః = శ్రీరాముడు, త్వాం = నిన్ను, యేన = దేనిచే, బహుమన్యతే = మెచ్చుకొనునో, (సః = అట్టి), అయం = ఈ, ఉత్తమః = శ్రేష్ఠమైన, మణిః = చూడామణి, గృహ్యతాం = గ్రహింపబడుగాక, (ఇతి = అని) మామ్ = నన్ను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- అప్పుడు సీతాదేవి ఇదిగో ఈ యమూల్యమైన చూడామణిని తీసికొని వెళ్ళుము. దీనిని చూచి మహావీరుడైన శ్రీరాముడు నిన్నెంతయో మెచ్చుకొనునని పలికెను.

**శ్లో॥ ఇత్యుక్త్వా తు వరారోహా మణిప్రవర మద్భుతమ్ ।**
**ప్రాయచ్ఛ త్పరమోద్విగ్నా వాచా మాం సందిదేశ హ ॥ 101**

**పదచ్ఛేదము** :- ఇతి - ఉక్త్వా - తు - వరారోహ - మణిప్రవరమ్ - అద్భుతమ్, ప్రాయచ్ఛత్ - పరమోద్విగ్నా - వాచా - మాం - సందిదేశ - హ ॥

**అన్వయక్రమము** :- వరారోహా తు ఇతి ఉక్త్వా అద్భుతం మణిప్రవరం ప్రాయచ్ఛత్, పరమోద్విగ్నా వాచా మాం సందిదేశ హ.

**ప్రతిపదార్థము** :- వరారోహా తు = సుందరాంగియైన సీతాదేవి, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, అద్భుతం = అద్భుతమైన, మణిప్రవరం = మణిశ్రేష్ఠమును, ప్రాయచ్ఛత్ = ఒసగెను, పరమోద్విగ్నా (సతీ) = మిక్కిలిగా చింతావేశము నొందినదై, వాచా = మాటతో, మాం = నన్నుగూర్చి, సందిదేశ హ = సందేశమొసగినది.

**తాత్పర్యము** :- కోమలాంగి ఈ రీతిగ పలికి అద్భుతమైనట్టి ఆ చూడామణిని నా కొసగెను. మరియు మిక్కిలి చింతావేశముతో తన సందేశవచనములను కొన్నింటిని నాకు చెప్పినది.

**శ్లో॥ తత స్తస్యై ప్రణ మ్యాహం రాజపుత్ర్యై సమాహితః ।**
**ప్రదక్షిణం పరిక్రామ మి హాభ్యుద్గతమానసః ॥ 102**

**పదచ్ఛేదము** :- తతః - తస్యై - ప్రణమ్య - అహం - రాజపుత్ర్యై - సమాహితః, ప్రదక్షిణం - పరిక్రామమ్ - ఇహ - అభ్యుద్గతమానసః ॥

**అన్వయక్రమము** :- తతః అహం తస్యై రాజపుత్ర్యై ప్రణమ్య సమాహితః ఇహ అభ్యుద్గతమానసః (సన్) ప్రదక్షిణం పరిక్రామమ్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, అహం = నేను, రాజపుత్ర్యై = రాజపుత్రికయైన సీతాదేవికి, ప్రణమ్య = నమస్కరించి, సమాహితః = శ్రద్ధగలవాడనై, ఇహ = ఇచ్చటికి, అభ్యుద్గతమానసః (సన్) = తిరిగివచ్చుటయందు మనస్సుగలవాడనగుచు, ప్రదక్షిణం = ప్రదక్షిణముగ, పరిక్రామమ్ = చుట్టును తిరిగితిని.

**తాత్పర్యము** :- అటుపిమ్మట నేను జానకీదేవికి మ్రొక్కి నిశ్చలమనస్కుడనై మిమ్ము త్వరలో చేరుకొనవలెనన్న తలంపుతో తిరిగి వచ్చుచు ఆమెకు ప్రదక్షిణము చేసితిని.

**శ్లో॥ ఉక్తో ఽహం పునరే వేదం నిశ్చిత్య మనసా తయా ।**
**హనుమ న్మమ వృత్తాంతం వక్తు మర్హసి రాఘవే ॥ 103**

**పదచ్ఛేదము** :- ఉక్తః - అహం - పునః - ఏవ - ఇదం - నిశ్చిత్య - మనసా - తయా, హనుమన్ - మమ - వృత్తాంతం - వక్తుమ్ - అర్హసి - రాఘవే ॥

**అన్వయక్రమము** :- తయా మనసా నిశ్చిత్య పునః ఏవ ఇదమ్ అహమ్ ఉక్తః. హనుమన్! రాఘవే మమ వృత్తాంతం వక్తుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము** :- తయా = ఆ జానకీదేవిచే, మనసా = మనస్సుచే, నిశ్చిత్య = నిశ్చయించుకొని, పునః ఏవ = తిరిగి, అహం = నేను, ఉక్తః = చెప్పబడితిని, హనుమన్ = ఓ హనుమా! రాఘవే = శ్రీరాముని సన్నిధియందు, మమ = నాయొక్క, వృత్తాంతం = విషయమును, వక్తుమ్ = చెప్పుటకు, అర్హసి = తగుదువు.

**తాత్పర్యము** :- అప్పుడు జానకీదేవి తన మనస్సునందు నిశ్చయించుకొన్న మాటలను తిరిగి నాతో మనసార ఈ విధముగ చెప్పినది. ఓ హనుమా! శ్రీరామునకు నా వృత్తాంతమునంతను విశదము చేయుము.

**శ్లో॥ యథా శ్రుత్వైవ నచిరా త్తావుభౌ రామలక్ష్మణౌ ।**
**సుగ్రీవసహితౌ వీరా వుపేయాతాం తథా కురు ॥ 104**

**పదచ్ఛేదము** :- యథా - శ్రుత్వా - ఏవ - న - చిరాత్ - తౌ - ఉభౌ - రామలక్ష్మణౌ, సుగ్రీవసహితౌ - వీరౌ - ఉపేయాతాం - తథా - కురు ॥

**అన్వయక్రమము** :- శ్రుత్వా ఏవ వీరౌ తౌ ఉభౌ రామలక్ష్మణౌ యథా న చిరాత్ సుగ్రీవసహితౌ ఉపేయాతాం తథా కురు.

**ప్రతిపదార్థము** :- శ్రుత్వా ఏవ = వినినవెంటనే, వీరౌ = వీరులైనట్టి, తౌ = ఆ, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులు, ఉభౌ = ఇరువురును, యథా = ఏ రీతిగా, నచిరాత్ = శీఘ్రముగా, సుగ్రీవసహితౌ = సుగ్రీవునితో కూడినవారై, ఉపేయాతాం = రాగలరో, తథా = ఆ రీతిగా, కురు = చేయుము.

**తాత్పర్యము** :- మహావీరులైన ఆ రామలక్ష్మణులిరువురును నీవు చెప్పిన నా వృత్తాంతమును వినిన వెంటనే సుగ్రీవాదులతో గూడి శీఘ్రముగ నెట్లు బయలుదేరి రాగలరో ఆ పద్ధతిగా నీవు కార్యసాఫల్యమును చేకూర్చవలెను.

**శ్లో॥ య ద్యన్యథా భవే దేత ద్ద్వౌ మాసౌ జీవితం మమ ।**
**న మాం ద్రక్ష్యతి కాకుత్థ్సో మ్రియే సాఽహ మనాథవత్ ॥ 105**

**పదచ్ఛేదము** :- యది - అన్యథా - భవేత్ - ఏతత్ - ద్వౌ - మాసౌ - జీవితం - మమ, న - మాం - ద్రక్ష్యతి - కాకుత్థ్సః - మ్రియే - సా - అహం - అనాథవత్ ॥

**అన్వయక్రమము** :- ఏతత్ అన్యథా భవేత్ యది మమ జీవితం ద్వౌ మాసౌ (భవేత్) కాకుత్థ్సః మాం న ద్రక్ష్యతి, సా అహం అనాథవత్ మ్రియే.

**ప్రతిపదార్థము** :- ఏతత్ = ఈ యత్నము, అన్యథా = వేరొక రీతిగా, భవేత్ యది = జరిగినయెడల, మమ = నాకు, జీవితం = జీవితము, ద్వౌ మాసౌ = రెండు నెలలు, భవేత్ = అగును, కాకుత్థ్సః = శ్రీరాముడు, మాం = నన్ను, న ద్రక్ష్యతి = చూడబోవడు, సా అహం = అట్టి నేను, అనాథవత్ = అనాథవలె, మ్రియే = మరణింతును.

**తాత్పర్యము** :- నీ యత్నము కొనసాగుట, రామలక్ష్మణులు వచ్చుట, యనునవి జరుగక పోయినచో ఇక మీదట నేను జీవించియుండు కాలము ఒక్క రెండు మాసములే సుమా! అటుపిమ్మట నన్ను శ్రీరాముడు చూడజాలడు. నే నిచ్చట దిక్కులేని దాననై మరణింపవలసినదే.

**శ్లో॥ తచ్ఛ్రుత్వా కరుణం వాక్యం క్రోధో మా మభ్యవర్తత ।**
**ఉత్తరం చ మయా దృష్టం కార్యశేష మనంతరమ్ ॥ 106**

**పదచ్ఛేదము** :– తత్ – శ్రుత్వా – కరుణం – వాక్యం – క్రోధః – మామ్ – అభ్యవర్తత, ఉత్తరం – చ – మయా – దృష్టం – కార్యశేషమ్ – అనంతరమ్ ॥

**అన్వయక్రమము** :– కరుణం తత్ వాక్యం శ్రుత్వా మాం క్రోధః అభ్యవర్తత; మయా అనంతరమ్ ఉత్తరం కార్యశేషం చ దృష్టమ్.

**ప్రతిపదార్థము** :– కరుణం = జాలిగొలుపునట్టి, తత్ = ఆ, వాక్యం = వచనమును, శ్రుత్వా = విని, మాం = నన్ను, క్రోధః = క్రోధము, అభ్యవర్తత = అలముకొనెను, అనంతరం = పిమ్మట, మయా = నాచేత, ఉత్తరం = తరువాతిదైన, కార్యశేషం = కర్తవ్యశేషము, దృష్టమ్ = చూడబడినది.

**తాత్పర్యము** :– సీతాదేవి పలికిన దీనమైన ఆ మాటలను వినినంతనే నాలో తీవ్రమైన క్రోధము చెలరేగినది. వెంటనే పూర్తి చేయవలసిన భవిష్యత్కార్యమును నిర్ణయించు కొంటిని.

**శ్లో॥ తతోఽవర్ధత మే కాయ స్తదా పర్వతసన్నిభః ।**
**యుద్ధకాంక్షీ వనం తస్య వినాశయితు మారభే ॥ 107**

**పదచ్ఛేదము** :– తతః – అవర్ధత – మే – కాయః – తదా – పర్వతసన్నిభః, యుద్ధకాంక్షీ – వనం – తస్య – వినాశయితుమ్ – ఆరభే ॥

**అన్వయక్రమము** :– తతః మే కాయః పర్వతసన్నిభః అవర్ధత, తదా (అహం) యుద్ధకాంక్షీ (సన్) తస్య వనం వినాశయితుమ్ ఆరభే.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, మే = నాయొక్క, కాయః = దేహము, పర్వతసన్నిభః = పర్వతముతో సమానమైనదిగా, అవర్ధత = పెరిగెను, తదా = అప్పుడు, (అహం = నేను) యుద్ధకాంక్షీ = యుద్ధమును గోరుచున్నవాడనై, తస్య = ఆ రావణునియొక్క, వనం = అశోకవనమును, వినాశయితుం = ధ్వంసము చేయుటకు, ఆరభే = ప్రారంభించితిని.

**తాత్పర్యము** :– అట్లు క్రోధావేశము నొందియున్న నా శరీరము పర్వతమువలె పెరిగిపోయినది. అంతట నేను రాక్షసులతో సంగ్రామ మొనర్ప గోరినవాడనై అచ్చట గల రావణుని అశోకవనమును ధ్వంసము చేయసాగితిని.

**శ్లో॥ త ద్భగ్నం వనషండం తు భ్రాంతత్రస్తమృగద్విజమ్ ।**
**ప్రతిబుద్ధా నిరీక్షంతే రాక్షస్యో వికృతాననాః ॥ 108**

**పదచ్ఛేదము** :- తత్ - భగ్నం - వనషండం - తు - భ్రాంతత్రస్తమృగద్విజమ్, ప్రతిబుద్ధాః - నిరీక్షంతే - రాక్షస్యః - వికృతాననాః ॥

**అన్వయక్రమము** :- భ్రాంతత్రస్తమృగద్విజం భగ్నం తత్ వనషండం ప్రతిబుద్ధాః వికృతాననాః రాక్షస్యః నిరీక్షంతే.

**ప్రతిపదార్థము** :- భ్రాంతత్రస్తమృగద్విజం = పరుగిడుచు భయము నొందిన జంతువులును పక్షులును గలిగినట్టి, భగ్నం = ధ్వంసము చేయబడిన, తత్ = ఆ, వనషండం = వనసమూహమును, ప్రతిబుద్ధాః = మేలుకొన్నట్టి, వికృతాననాః = వికారమైన ముఖములు కల్గినట్టి, రాక్షస్యః = రాక్షసస్త్రీలు, నిరీక్షంతే = తేరిపారి చూచుచుండిరి.

**తాత్పర్యము** :- ఆ రాక్షసస్త్రీలు మెలకువ వచ్చినవారై భయముతో బెదిరి పరుగిడుచున్న జంతువులను, పక్షులను, ధ్వంసమైయున్న ఆ వనమునందలి వృక్షసమూహములను వికారమైన ముఖములతో ఆశ్చర్యముతో చూడసాగిరి.

**శ్లో॥ మాం చ దృష్ట్వా వనే తస్మి న్సమాగమ్య తత స్తతః ।**
**తా స్సమభ్యాగతాః క్షిప్రం రావణా యాచచక్షిరే ॥ 109**

**పదచ్ఛేదము** :- మాం - చ - దృష్ట్వా - వనే - తస్మిన్ - సమాగమ్య - తతః - తతః, తాః - సమభ్యాగతాః - క్షిప్రం - రావణాయ - ఆచచక్షిరే ॥

**అన్వయక్రమము** :- తస్మిన్ వనే తతః తతః సమాగమ్య మాం దృష్ట్వా సమభ్యాగతాః తాః క్షిప్రం రావణాయ ఆచచక్షిరే.

**ప్రతిపదార్థము** :- తస్మిన్ = ఆ, వనే = అశోకవనమున, తతః తతః = అక్కడక్కడ నుండి, సమాగమ్య = చేరి, మాం = నన్ను, దృష్ట్వా = చూచి, సమభ్యాగతాః = కలసికొన్నట్టి, తాః = ఆ రాక్షసస్త్రీలు, క్షిప్రం = శీఘ్రముగా, రావణాయ = రావణుని కొరకు, ఆచచక్షిరే = చెప్పిరి.

**తాత్పర్యము** :- ఆ యశోకవనమున నలువైపులను కావలియున్న రాక్షసస్త్రీలు అందరును ఒక చోటికి చేరి నన్ను కనుగొని వెంటనే రావణుని కడకేగి జరిగిన వృత్తాంతమును తెలియజెప్పిరి.

**శ్లో॥ రాజ న్వన మిదం దుర్గం తవ భగ్నం దురాత్మనా ।**
**వానరేణ హ్యవిజ్ఞాయ తవ వీర్యం మహాబల ॥ 110**

**పదచ్ఛేదము :–** రాజన్ – వనమ్ – ఇదం – దుర్గం – తవ – భగ్నం – దురాత్మనా, వానరేణ – హి – అవిజ్ఞాయ – తవ – వీర్యం – మహాబల ॥

**అన్వయక్రమము :–** రాజన్! మహాబల! తవ వీర్యమ్ అవిజ్ఞాయ దురాత్మనా వానరేణ దుర్గమ్ ఇదం తవ వనం భగ్నమ్.

**ప్రతిపదార్థము :–** రాజన్ = ఓ రాజా! మహాబల = ఓ మహాబలశాలీ! తవ = నీ యొక్క, వీర్యం = పరాక్రమమును, అవిజ్ఞాయ = తెలియక, దురాత్మనా = దుర్మార్గుడైన, వానరేణ = ఒక వానరునిచే, దుర్గం = దుర్గమమైనట్టి, ఇదం = ఈ, తవ వనం = నీయొక్కవనము, భగ్నమ్ = ధ్వంసము చేయబడినది.

**తాత్పర్యము :–** మహావీరుడైన ఓ రాక్షసరాజా! నీ పరాక్రమమును గూర్చి ఏమియు ఎరుగనట్టి ఒకానొక వానరుడు, ఎవ్వరును దరిచేరరానట్టి నీ అశోకవనమును ప్రవేశించి ధ్వంసము చేసినాడు.

**శ్లో॥ దుర్బుద్ధే స్తస్య రాజేంద్ర తవ విప్రియకారిణః ।**
**వధ మాజ్ఞాపయ క్షిప్రం యథా ఽసౌ విలయం వ్రజేత్ ॥ 111**

**పదచ్ఛేదము :–** దుర్బుద్ధేః – తస్య – రాజేంద్ర – తవ – విప్రియకారిణః, వధమ్ – ఆజ్ఞాపయ – క్షిప్రం – యథా – అసౌ – విలయం – వ్రజేత్ ॥

**అన్వయక్రమము :–** రాజేంద్ర! యథా అసౌ విలయం వ్రజేత్ (తథా) క్షిప్రం తవ విప్రియకారిణః తస్య దుర్బుద్ధేః వధమ్ ఆజ్ఞాపయ.

**ప్రతిపదార్థము :–** రాజేంద్ర = ఓ రాజోత్తమా! యథా = ఏ రీతిగా, అసౌ = ఇతడు, విలయం = నాశమును, వ్రజేత్ = పొందునో, (తథా = ఆరీతిగా), క్షిప్రం = శీఘ్రముగా, తవ = నీకు, విప్రియకారిణః = అనిష్టము గావించినట్టి, తస్య = ఆ, దుర్బుద్ధేః = దురాత్మునకు, వధం = వధను, ఆజ్ఞాపయ = ఆజ్ఞాపించుము.

**తాత్పర్యము :–** మహారాజా! నీకు అనిష్టము గావించిన ఆ దుర్మార్గుడు నామరూపములు లేకుండ పోవునట్లుగా వెంటనే ఆతనికి మృత్యుదండనమును విధింపుము.

**శ్లో॥ త చ్ఛ్రుత్వా రాక్షసేంద్రేణ విసృష్టా భృశదుర్జయాః ।**
**రాక్షసాః కింకరా నామ రావణస్య మనోనుగాః ॥ 112**

**పదచ్ఛేదము** :– తత్ – శ్రుత్వా – రాక్షసేంద్రేణ – విసృష్టాః – భృశదుర్జయాః, రాక్షసాః – కింకరాః – నామ – రావణస్య – మనోనుగాః ॥

**అన్వయక్రమము** :– తత్ శ్రుత్వా రాక్షసేంద్రేణ భృశదుర్జయాః రావణస్య మనోనుగాః కింకరాః నామ రాక్షసాః విసృష్టాః.

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ మాటను, శ్రుత్వా = విని, రాక్షసేంద్రేణ = రాక్షసాధిపతియైన రావణునిచే, భృశదుర్జయాః = మిక్కిలి అజేయులైనట్టి వారును, రావణస్య = రావణునకు, మనోనుగాః = మనస్సుననుసరించువారును అగు, కింకరాః నామ = కింకరులను పేరుగల, రాక్షసాః = రాక్షసులు, విసృష్టాః = పంపబడిరి.

**తాత్పర్యము** :– ఆ వనపాలకురాంద్రు చెప్పిన మాటలు విని రాక్షసరాజైన రావణుడు యుద్ధమునందు అజేయులైనవారును తన మనసుననుసరించి మెలగువారునగు కింకరులనెడి రాక్షసులను నన్నెదుర్కొనుటకై పంపెను.

**శ్లో॥ తేషా మశీతిసాహస్రం శూలముద్గరపాణినామ్ ।**
**మయా తస్మి న్వనోద్దేశే పరిఘేణ నిషూదితమ్ ॥ 113**

**పదచ్ఛేదము** :– తేషామ్ – అశీతిసాహస్రం – శూలముద్గరపాణినామ్, మయా – తస్మిన్ – వనోద్దేశే – పరిఘేణ – నిషూదితమ్ ॥

**అన్వయక్రమము** :– శూలముద్గరపాణినాం తేషామ్ అశీతిసాహస్రం మయా తస్మిన్ వనోద్దేశే పరిఘేణ నిషూదితమ్.

**ప్రతిపదార్థము** :– శూలముద్గరపాణినాం = శూలములు ముద్గరములు చేతులందు గలిగినట్టి, తేషాం = ఆ రాక్షసుల యొక్క, అశీతిసాహస్రం = ఎనుబదివేల సమూహము, మయా = నాచే, తస్మిన్ = ఆ, వనోద్దేశే = వనప్రదేశమునందు, పరిఘేణ = పరిఘాయుధముచే, నిషూదితమ్ = వధింపబడెను.

**తాత్పర్యము** :– శూలములు ముద్గరములు చేతియందు దాల్చి పోరాడుచున్నట్టి ఆ ఎనుబదివేలమంది రాక్షసులను నేనా వనప్రదేశమునందు పరిఘాయుధమును చేతబూని సంహరించివైచితిని.

**శ్లో॥ తేషాం తు హతశేషా యే తే గత్వా లఘువిక్రమాః ।**
**నిహతం చ మహత్సైన్యం రావణాయాఽఽచచక్షిరే ॥ 114**

**పదచ్ఛేదము** :– తేషాం – తు – హతశేషాః – యే – తే – గత్వా – లఘువిక్రమాః, నిహతం – చ – మహత్ – సైన్యం – రావణాయ – ఆచచక్షిరే ॥

**అన్వయక్రమము :–** తేషాం లఘువిక్రమాః యే హతశేషాః (సంతి) తే గత్వా రావణాయ మహత్ సైన్యం నిహతమ్ ఆచచక్షిరే.

**ప్రతిపదార్థము :–** తేషాం = వారిలో, లఘువిక్రమాః = లాఘవముగల పరాక్రమము గలవారు, యే = ఎవ్వరు, హతశేషాః = చావగా మిగిలినవారు, సంతి = ఉన్నారో, తే = వారు, గత్వా = పోయి, రావణాయ = రావణునికి, మహత్ = గొప్పదైన, సైన్యం = సైన్యము, నిహతం = మరణించినదిగా, ఆచచక్షిరే = చెప్పిరి.

**తాత్పర్యము :–** ఆ కింకరాసురులలో నా చేతినుండి తప్పించుకొని పోయిన హతశేషులైన రాక్షసవీరులు కొందరు శీఘ్రముగ రావణుని కడకు పోయి నీచే పంపబడిన ఆ గొప్ప సైన్యమంతయును మడిసినదని ఆతనికి తెలియజేసిరి.

**శ్లో॥ తతో మే బుద్ధి రుత్పన్నా చైత్యప్రాసాద మాక్రమమ్ ।**
**తత్రస్థాన్ రాక్షసాన్ హత్వా శతం స్తంభేన వై పునః ।**
**లలామభూతో లంకాయా స్స వై విధ్వంసితో మయా ॥ 115**

**పదచ్ఛేదము :–** తతః – మే – బుద్ధిః – ఉత్పన్నా – చైత్యప్రాసాదమ్ – ఆక్రమమ్, తత్రస్థాన్ – రాక్షసాన్ – హత్వా – శతం – స్తంభేన – వై – పునః, లలామభూతః – లంకాయాః – సః – వై – విధ్వంసితః – మయా ॥

**అన్వయక్రమము :–** తతః మే బుద్ధిః ఉత్పన్నా, చైత్యప్రాసాదమ్ ఆక్రమమ్, తత్రస్థాన్ శతం రాక్షసాన్ స్తంభేన హత్వా పునః లంకాయాః లలామభూతః సః చ మయా విధ్వంసితః.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, మే = నాకు, బుద్ధిః = ఒక తలంపు, ఉత్పన్నా = జనించినది, చైత్యప్రాసాదం = చైత్యప్రాసాదమును, ఆక్రమమ్ = అక్రమించితిని. తత్రస్థాన్ = అందున్న, శతం = నూర్గురు, రాక్షసాన్ = రాక్షసులను, స్తంభేన = ప్రాసాద స్తంభముచే, హత్వా = పరిమార్చి, పునః = తిరిగి, లంకాయాః = లంకకు, లలామభూతః = ఆభరణమైనట్టి, సః చ = ఆ ప్రాసాదముగూడ, మయా = నాచేత, విధ్వంసితః = భగ్నము గావింపబడినది.

**తాత్పర్యము :–** అంతలో నాకొక తలంపు గలిగి ఆ సమీపముననే యున్న చైత్య ప్రాసాదమును జేరితిని. అచట రక్షకులుగా నున్న వందమంది రాక్షసభటులను ఆ ప్రాసాదస్తంభముతోనే మోది పరిమార్చితిని. మరియు ఆ లంకకు ఆభరణముగా నున్న ఆ చైత్యప్రాసాదమును గూడ నేలగూల్చితిని.

**శ్లో॥ తతః ప్రహస్తస్య సుతం జంబుమాలిన మాదిశత్ ।**
**రాక్షసై ర్బహుభిః స్సార్ధం ఘోరరూపై ర్భయానకైః ॥ 116**

**పదచ్ఛేదము** :– తతః – ప్రహస్తస్య – సుతం – జంబుమాలినమ్ – ఆదిశత్, రాక్షసైః – బహుభిః – సార్ధం – ఘోరరూపైః – భయానకైః ॥

**అన్వయక్రమము** :– తతః ఘోరరూపైః భయానకైః బహుభిః రాక్షసైః సార్ధం ప్రహస్తస్య సుతం జంబుమాలినమ్ ఆదిశత్.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, ఘోరరూపైః = భయంకరరూపము గల్గినవారు, భయానకైః = భయంకరులునగు, బహుభిః = పెక్కుమంది, రాక్షసైః సార్ధం = రాక్షసులతోగూడ, ప్రహస్తస్య = ప్రహస్తునియొక్క, సుతం = పుత్రుడైన, జంబుమాలినం = జంబుమాలియను వానిని, ఆదిశత్ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :– భీకరమైన శరీరముతో భయము గొల్పునట్టి అసంఖ్యాకులైన రాక్షసులను తోడిచ్చి ప్రహస్తుడను మంత్రిపుత్రుడైన జంబుమాలిని రావణుడు నన్ను చంపి రమ్మని ఆజ్ఞాపించెను.

**శ్లో॥ త మహం బలసంపన్నం రాక్షసం రణకోవిదమ్ ।**
**పరిఘే ణాతిఘోరేణ సూదయామి సహానుగమ్ ॥ 117**

**పదచ్ఛేదము** :– తమ్ – అహం – బలసంపన్నం – రాక్షసం – రణకోవిదమ్, పరిఘేణ – అతిఘోరేణ – సూదయామి – సహానుగమ్ ॥

**అన్వయక్రమము** :– అహం బలసంపన్నం రణకోవిదం తం రాక్షసం సహానుగమ్ అతిఘోరేణ పరిఘేణ సూదయామి.

**ప్రతిపదార్థము** :– అహం = నేను, బలసంపన్నం = బలశాలియును, రణకోవిదం = యుద్ధమునం దారితేరిన వాడునగు, తం = ఆ, రాక్షసం = జంబుమాలిని, సహానుగం = సహచరులతో గూడ, అతిఘోరేణ = మిక్కిలి భీకరమైన, పరిఘేణ = ఇనుప గుదియతో, సూదయామి = హతమార్చితిని.

**తాత్పర్యము** :– వెంటనే నేను మహాబలాఢ్యుడును, యుద్ధవిశారదుడును అగు జంబుమాలిని, అతనితో వచ్చిన అసంఖ్యాకులైన రాక్షసవీరులనుగూడ నా చేతిలోని ఇనుపగుదియతోడనే హతమార్చితిని.

**శ్లో॥ త చ్ఛ్రుత్వా రాక్షసేంద్రస్తు మంత్రిపుత్రా న్మహాబలాన్ ।**
**పదాతిబలసంపన్నాన్ ప్రేషయామాస రావణః ।**
**పరిఘేణైవ తా న్సర్వా న్నయామి యమసాదనమ్ ॥ 118**

**పదచ్ఛేదము :–** తత్ – శ్రుత్వా – రాక్షసేంద్రః – తు – మంత్రిపుత్రాన్ – మహాబలాన్ – పదాతిబలసంపన్నాన్ – ప్రేషయామాస – రావణః, పరిఘేణ – ఏవ – తాన్ – సర్వాన్ – నయామి – యమసాదనమ్ ॥

**అన్వయక్రమము :–** రాక్షసేంద్రః రావణః తత్ శ్రుత్వా పదాతిబలసంపన్నాన్ మహాబలాన్ మంత్రిపుత్రాన్ ప్రేషయామాస, తాన్ సర్వాన్ అహం పరిఘేణ ఏవ యమసాదనం నయామి.

**ప్రతిపదార్థము :–** రాక్షసేంద్రః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, తత్ = ఆ విషయమును, శ్రుత్వా = విని, మహాబలాన్ = అమితబలసంపన్నులును, పదాతిబల సంపన్నాన్ = పెద్దకాల్బలముతో గూడినవారునగు, మంత్రిపుత్రాన్ = మంత్రికుమారులను, ప్రేషయామాస = పంపెను, తాన్ = వారిని, సర్వాన్ = అందరిని, పరిఘేణ ఏవ = ఇనుపగుదియ తోడనే, యమసాదనం = యముని భవనమునకు, నయామి = చేర్చితిని.

**తాత్పర్యము :–** రాక్షసరాజైన రావణుడు జంబుమాలి యుద్ధమున గూలెనని విని వెంటనే గొప్పదైన కాల్బలమును తోడుగ నిచ్చి మహాబలాఢ్యులైన మంత్రిపుత్రు లను నా మీదికి పంపెను. వారినందరిని నాచేతిలోని ఆ ఇనుప గుదియతోడనే యముని సదనమునకు పంపితిని.

**శ్లో॥ మంత్రి పుత్రాన్ హతాన్ శ్రుత్వా సమరే లఘువిక్రమాన్ ।**
**పంచ సేనాగ్రగాన్ శూరాన్ ప్రేషయామాస రావణః ।**
**తా నహం సహసైన్యాన్వై సర్వానే వాభ్యసూదయమ్ ॥ 119**

**పదచ్ఛేదము :–** మంత్రిపుత్రాన్ – హతాన్ – శ్రుత్వా – సమరే – లఘువిక్రమాన్, పంచసేనాగ్రగాన్ – శూరాన్ – ప్రేషయామాస – రావణః, తాన్ – అహం – సహసైన్యాన్ – వై – సర్వాన్ – ఏవ – అభ్యసూదయమ్ ॥

**అన్వయక్రమము :–** లఘువిక్రమాన్ మంత్రిపుత్రాన్ సమరే హతాన్ శ్రుత్వా రావణః శూరాన్ పంచసేనాగ్రగాన్ ప్రేషయామాస, అహం తాన్ సహసైన్యాన్ సర్వాన్ ఏవ అభ్యసూదయమ్.

**ప్రతిపదార్థము** :- లఘువిక్రమాన్ = లాఘవయుక్తమైన శౌర్యము గల్గినట్టి, మంత్రి పుత్రాన్ = మంత్రిపుత్రులను, సమరే = యుద్ధమున, హతాన్ = వధింపబడిన వారినిగా, శ్రుత్వా = విని, రావణః = రావణుడు, శూరాన్ = వీరులైన, పంచసేనా గ్రగాన్ = అయిదుగురు సేనానాయకులను, ప్రేషయామాస = పంపించెను, అహం = నేను, తాన్ = ఆ, సహసైన్యాన్ = సైన్యముతో గూడినట్టి, సర్వాన్ ఏవ = అందరిని గూడ, అభ్యసూదయమ్ = హతమార్చితిని.

**తాత్పర్యము** :- యుద్ధమునందు గొప్పలాఘవమును, పరాక్రమమును గల్గినట్టి ఆ మంత్రిపుత్రులందరుకూడ కడతేరిరని విని రావణుడు మహావీరులైన సేనాధిపతుల నైదుగురిని వెంటనే నా మీదికి పంపెను. నేనా సేనాధిపతులనేవురిని వారితో వచ్చిన సైన్యమునుగూడ యుద్ధమున హతమార్చితిని.

**శ్లో॥ తతః పున ర్దశగ్రీవః పుత్ర మక్షం మహాబలమ్ ।**
**బహుభీ రాక్షసై స్సార్ధం ప్రేషయామాస రావణః ॥ 120**

**పదచ్ఛేదము** :- తతః - పునః - దశగ్రీవః - పుత్రమ్ - అక్షం - మహాబలమ్, బహుభిః - రాక్షసైః - సార్ధం - ప్రేషయామాస - రావణః ॥

**అన్వయక్రమము** :- తతః దశగ్రీవః రావణః పునః బహుభిః రాక్షసైః సార్ధం మహాబలం పుత్రమ్ అక్షం ప్రేషయామాస.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, దశగ్రీవః = దశకంఠుడైన, రావణః = రావణుడు, పునః = తిరిగి, బహుభిః = పెక్కుమంది, రాక్షసైః = రాక్షసులతో, సార్ధం = కూడ, మహాబలం = మహాబలాఢ్యుడైన, పుత్రమ్ = కుమారుడైన, అక్షం = అక్షుని, ప్రేషయామాస = పంపెను.

**తాత్పర్యము** :- అప్పుడు దశగ్రీవుడు తన పుత్రుడైన అక్షుని పెద్దరాక్షససైన్యమును తోడిచ్చి నన్ను చంపుటకొరకై పంపించెను.

**శ్లో॥ తం తు మండోదరీ పుత్రం కుమారం రణపండితమ్ ।**
**సహసా ఖం సముత్క్రాంతం పాదయోశ్చ గృహీతవాన్ ।**
**చర్మాసినం శతగుణం భ్రామయిత్వా వ్యపేషయమ్ ॥ 121**

**పదచ్ఛేదము** :- తం - తు - మండోదరీపుత్రం - కుమారం - రణపండితమ్ - సహసా - ఖం - సముత్క్రాంతం - పాదయోః - చ - గృహీతవాన్, చర్మాసినం - శతగుణం - భ్రామయిత్వా - వ్యపేషయమ్ ॥

**అన్వయక్రమము** :- తం రణపండితం, సహసా ఖం సముత్క్రాంతం, కుమారం మండోదరీపుత్రం పాదయోః, గృహీతవాన్, చర్మాసినం (తం) శతగుణం భ్రామయిత్వా వ్యపేషయమ్.

**ప్రతిపదార్థము** :- తం = ఆ, రణపండితం = యుద్ధవిశారదుడును, సహసా = వెంటనే, ఖం = ఆకాశమునకు, సముత్క్రాంతం = ఎగిరిపోవుచున్న వాడును, కుమారం = చిన్నవాడునగు, మండోదరీపుత్రం = మండోదరి పుత్రుడైన అక్షుని, పాదయోః గృహీతవాన్ = రెండు కాళ్ళను పట్టుకొంటిని, చర్మాసినం = డాలును కత్తిని గలిగియున్న, తం = ఆ అక్షకుమారుని, శతగుణం = నూరుమారులు, భ్రామయిత్వా = త్రిప్పి, వ్యపేషయమ్ = ముద్దగా జేసితిని.

**తాత్పర్యము** :- యుద్ధవిద్యలో ఆరితేరినవాడైన ఆ మండోదరీపుత్రుడు నా మీదికి వచ్చి ఆకాశము మీదికి ఎగిరిపోవుచుండగా నేనాతని పాదములను పట్టుకొని క్రిందికి లాగి నూరు మారులు గిరగిరత్రిప్పి నేలపై పడగొట్టి నుగ్గు నుగ్గు చేసితిని.

**శ్లో॥ త మక్ష మాగతం భగ్నం నిశమ్య స దశాననః ।**
**తత ఇంద్రజితం నామ ద్వితీయం రావణస్సుతమ్ ।**
**వ్యాదిదేశ సుసంక్రుద్ధో బలినం యుద్ధదుర్మదమ్ ॥ 122**

**పదచ్ఛేదము** :- తమ్ - అక్షమ్ - ఆగతం - భగ్నం - నిశమ్య - సః - దశాననః - తతః - ఇంద్రజితం - నామ - ద్వితీయం - రావణః - సుతమ్, వ్యాదిదేశ - సుసంక్రుద్ధః - బలినం - యుద్ధదుర్మదమ్ ॥

**అన్వయక్రమము** :- ఆగతం తమ్ అక్షం భగ్నం నిశమ్య తతః దశాననః సః రావణః సుసంక్రుద్ధః (సన్) యుద్ధదుర్మదం బలినమ్ ఇంద్రజితం నామ సుతం వ్యాదిదేశ.

**ప్రతిపదార్థము** :- ఆగతం = వచ్చినట్టి, తమ్ అక్షం = ఆ అక్షకుమారుని, భగ్నం = మడిసిన వానినిగా, నిశమ్య = విని, తతః = పిమ్మట, దశాననః = దశగ్రీవుడైన, సః = ఆ, రావణః = రావణుడు, సుసంక్రుద్ధః (సన్) = మిక్కిలి క్రోధము నొందినవాడై, బలినం = మహాబలాఢ్యుడును, యుద్ధదుర్మదం = యుద్ధముకొరకై మదము నొందియున్నవాడునగు, ఇంద్రజితం నామ = ఇంద్రజిత్తను పేరుగల, సుతం = కుమారుని, వ్యాదిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :- యుద్ధమునకు వచ్చినట్టి అక్షకుమారుడు వధింపబడెనని విని రాక్షసరాజు తీవ్రమైన క్రోధమునొంది, యుద్ధమును గూర్చి మదముతో ఎదురు చూచుచుండునట్టి తన పుత్రుడైన ఇంద్రజిత్తును నామీదికి పంపెను.

**శ్లో॥ త చ్చా ప్యహం బలం సర్వం తం చ రాక్షసపుంగవమ్ ।**
**నష్టౌజసం రణే కృత్వా పరం హర్ష ముపాగమమ్ ॥ 123**

**పదచ్ఛేదము** :- తత్ - చ - అపి - అహం - బలం - సర్వం - తం - చ - రాక్షసపుంగవమ్, నష్టౌజసం - రణే - కృత్వా - పరం - హర్షమ్ - ఉపాగమమ్ ॥

**అన్వయక్రమము** :- అహం తత్ బలం సర్వమ్ అపి చ, తం రాక్షసపుంగవం చ, రణే నష్టౌజసం కృత్వా పరం హర్షమ్ ఉపాగమమ్.

**ప్రతిపదార్థము** :- అహం = నేను, తత్ = ఆ, బలం = సైన్యమును, సర్వమ్ అపి చ = అంతనుగూడ, తం = ఆ, రాక్షసపుంగవం చ = రాక్షసశ్రేష్ఠుని గూడ, రణే = యుద్ధమునందు, నష్టౌజసం = నశించిన శక్తిగలవానినిగా, కృత్వా = చేసి, పరం = గొప్పదైన, హర్షమ్ = సంతోషమును, ఉపాగమమ్ = పొందితిని.

**తాత్పర్యము** :- అప్పుడు మహావీరుడైన ఆ ఇంద్రజిత్తును, ఆతనితో వచ్చిన అపారమైన సైన్యమును గూడ యుద్ధమునందు క్షీణశక్తులను గావించి నేను గొప్ప ఆనందము నొందితిని.

**శ్లో॥ మహతా హి మహాబాహుః ప్రత్యయేన మహాబలః ।**
**ప్రేషితో రావణేనైవ సహవీరై ర్మదోత్కటైః ॥ 124**

**పదచ్ఛేదము** :- మహతా - హి - మహాబాహుః - ప్రత్యయేన - మహాబలః, ప్రేషితః - రావణేన - ఏవ - సహ - వీరైః - మదోత్కటైః ॥

**అన్వయక్రమము** :- రావణేన మహతా ప్రత్యయేన మహాబాహుః మహాబలః (సః) మదోత్కటైః వీరైః (సహ) ప్రేషితః హి.

**ప్రతిపదార్థము** :- రావణేన = రావణాసురునిచే, మహతా = గొప్పదైన, ప్రత్యయేన = నమ్మకముతో, మహాబాహుః = గొప్పదైన బలముగలవాడగు, (సః = ఆ ఇంద్రజిత్తు) మదోత్కటైః = మదముచే గర్వించినవారగు, వీరైః (సహ) = వీరులతో గూడ, ప్రేషితః హి = పంపబడెను జుడీ!

**తాత్పర్యము** :- రావణాసురుడెంతో నమ్మకముతో మహా పరాక్రమ సంపన్నుడైన ఇంద్రజిత్తును మహాబలగర్వితులైన పెక్కుమంది వీరులను తోడిచ్చి యుద్ధమునకు పంపెను.

**శ్లో॥ సోఽవిషహ్యం చ మాం బుద్ధ్వా స్వసైన్యం చావమర్దితమ్ ।**
**బ్రాహ్మే ణాస్త్రేణ స తు మాం ప్రాబధ్నా చ్చాతివేగితః ॥ 125**

**పదచ్ఛేదము** :- సః - అవిషహ్యం - చ - మాం - బుద్ధ్వా - స్వసైన్యం - చ - అవమర్ధితమ్, బ్రాహ్మేణ - అస్త్రేణ - సః - తు - మాం - ప్రాబధ్నాత్ - చ - అతి - వేగితః ॥

**అన్వయక్రమము** :- సః స్వసైన్యమ్ అవమర్ధితం చ, మామ్ అవిషహ్యం చ బుద్ధ్వా అతివేగితః సః మాం బ్రాహ్మేణ అస్త్రేణ ప్రాబధ్నాత్.

**ప్రతిపదార్థము** :- సః = ఆ ఇంద్రజిత్తు, స్వసైన్యం = తన సైన్యమును, అవమర్ధితం = నశింపచేయబడిన దానినిగను, మాం = నన్ను, అవిషహ్యం = సహింపరాని వానినిగను, బుద్ధ్వా = తెలిసికొని, అతివేగితః = మిక్కిలి వేగిరపాటు నొందినవాడై, సః = ఆతడు, మాం = నన్ను, బ్రాహ్మేణ అస్త్రేణ = బ్రహ్మాస్త్రముచేత, ప్రాబధ్నాత్ = బంధించెను.

**తాత్పర్యము** :- అప్పుడా ఇంద్రజిత్తు తన సైన్యము నశించిపోవుచుండుటను, నేను తనకు ఎదుర్కొనుటకు శక్యముగాని వాడుగా నుండుటను తెలిసికొని వెంటనే నన్ను బ్రహ్మాస్త్రమును ప్రయోగించి బంధించెను.

**శ్లో॥ రజ్జుభి శ్చాభిబధ్నంతి తతో మాం తత్ర రాక్షసాః ।**
**రావణస్య సమీపం చ గృహీత్వా మా ముపానయన్ ॥ 126**

**పదచ్ఛేదము** :- రజ్జుభిః - చ - అభిబధ్నంతి - తతః - మాం - తత్ర - రాక్షసాః, రావణస్య - సమీపం - చ - గృహీత్వా - మామ్ - ఉపానయన్ ॥

**అన్వయక్రమము** :- తతః తత్ర రాక్షసాః మాం రజ్జుభిః చ అభిబధ్నంతి, మాం గృహీత్వా రావణస్య సమీపమ్ ఉపానయన్ చ.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, తత్ర = ఆ యుద్ధభూమిలో, రాక్షసాః = రాక్షసులు, మాం = నన్ను, గృహీత్వా = పట్టుకొని, రావణస్య = రావణునియొక్క, సమీపం = సమీపమునుగూర్చి, ఉపానయన్ చ = తీసికొని పోయిరి కూడను.

**తాత్పర్యము** :- పిమ్మట అచ్చటి రాక్షసులు నన్ను త్రాళ్ళతోగూడ బంధించి తీసికొనిపోయి రావణుని సమీపమున నిలిపిరి.

**శ్లో॥ దృష్ట్వా సంభాషిత శ్చాహం రావణేన దురాత్మనా ।**
**పృష్టశ్చ లంకాగమనం రాక్షసానాం చ తం వధమ్ ।**
**తత్సర్వం చ మయా తత్ర సీతార్థమితి జల్పితమ్ ॥ 127**

**పదచ్ఛేదము :–** దృష్ట్వా – సంభాషితః – చ – అహం – రావణేన – దురాత్మనా, పృష్టః – చ – లంకాగమనం – రాక్షసానాం – చ – తం – వధమ్, తత్ – సర్వం – చ – మయా – తత్ర – సీతార్థమ్ – ఇతి – జల్పితమ్ ॥

**అన్వయక్రమము :–** అహం దురాత్మనా రావణేన దృష్ట్వా సంభాషితః చ, లంకాగమనం రాక్షసానాం తం వధం చ పృష్టః చ, తత్ర మయా తత్ సర్వం సీతార్థమ్ ఇతి జల్పితమ్.

**ప్రతిపదార్థము :–** అహం = నేను, దురాత్మనా = దుర్మార్గుడైన, రావణేన = రావణునిచే, దృష్ట్వా = చూచి, సంభాషితః చ = మాటాడబడితిని కూడను, లంకాగమనం = లంకలోనికి రాకను గూర్చియు, రాక్షసానాం = రాక్షసులయొక్క, తం = ఆ, వధం చ = మారణమును గూర్చియు, పృష్టః చ = అడుగబడితినిగూడను, తత్ర = ఆతనియెదుట, మయా = నాచేత, తత్ = అది, సర్వం = అంతయును, సీతార్థం = సీతాదేవి కొరకు, ఇతి = అని, జల్పితమ్ = పలుకబడినది.

**తాత్పర్యము :–** ఆ రావణుని కొలువునందు ఆ దుర్మార్గుడు నన్ను జూచి నాతో మాటాడుచు లంకలోనికి నేను వచ్చుటకు కారణమును. తన రాక్షసులను వధించుటకు హేతువును తెలుపుమని నన్నడుగగా నేను జేసిన ఆ పని అంతయును మా సీతమ్మ కొరకే అని బదులు చెప్పితిని.

**శ్లో॥ తస్యాస్తు దర్శనాకాంక్షీ ప్రాప్త స్త్వద్భవనం విభో ।**
**మారుత స్యౌరసః పుత్రో వానరో హనుమా నహమ్ ॥ 128**

**పదచ్ఛేదము :–** తస్యాః – తు – దర్శనాకాంక్షీ – ప్రాప్తః – త్వద్భవనం – విభో, మారుతస్య – ఔరసః – పుత్రః – వానరః – హనుమాన్ – అహమ్ ॥

**అన్వయక్రమము :–** అహం మారుతస్య ఔరసః వానరః పుత్రః హనుమాన్; విభో! అహం తస్యాః తు దర్శనాకాంక్షీ (సన్) త్వద్భవనం ప్రాప్తః.

**ప్రతిపదార్థము :–** అహం = నేను, మారుతస్య = వాయుదేవునియొక్క, ఔరసః పుత్రః = ఔరసపుత్రుడనగు, వానరః = వానరుడను, హనుమాన్ = హనుమంతుడనువాడను, విభో! = ఓ రాజా! తస్యాః తు = ఆ సీతమ్మ యొక్కయే, దర్శనాకాంక్షీ (సన్) = దర్శనము గోరినవాడనై, త్వద్భవనం = నీ భవనమును, ప్రాప్తః = చేరినాడను.

**తాత్పర్యము :–** రాజా! నేను వాయుదేవుని ఔరసపుత్రుడను, హనుమంతుడను పేరుగల వానరుడను. నీ లంకలో నున్న ఆ సీతాదేవిని దర్శించు కోరికతోడనే నీ భవనమునకు వచ్చితిని.

**శ్లో॥ రామదూతం చ మాం విద్ధి సుగ్రీవసచివం కపిమ్ ।**
**సోఽహం దూత్యేన రామస్య త్వత్సకాశ మిహాగతః ॥ 129**

**పదచ్ఛేదము** :- రామదూతం - చ - మాం - విద్ధి - సుగ్రీవసచివం - కపిమ్, సః - అహం - దూత్యేన - రామస్య - త్వత్సకాశమ్ - ఇహ - ఆగతః ॥

**అన్వయక్రమము** :- కపిం మాం సుగ్రీవసచివం రామదూతం చ విద్ధి, సః అహం రామస్య దూత్యేన ఇహ త్వత్సకాశమ్ ఆగతః.

**సూచన** :- ఇందు గోరఖ్‌పూర్ ప్రతిలో 'దూత్యేన' అనుదానికి బదులుగా 'దౌత్యేన' అని పాఠాంతరము.

**ప్రతిపదార్థము** :- కపిం = వానరుడనైన, మాం = నన్ను, సుగ్రీవసచివం = సుగ్రీవునియొక్క మంత్రినిగను, రామదూతం చ = రామునియొక్క దూతగను గూడ, విద్ధి = తెలిసికొనుము. సః = ఆ, అహం = నేను, రామస్య = రామునియొక్క, దూత్యేన = దూతకృత్యముచే, ఇహ = ఈ లంకయందు, త్వత్సకాశం = నీ సమీపమునకు, ఆగతః = వచ్చినాడను.

**తాత్పర్యము** :- సుగ్రీవుని మంత్రినగు వానరుడనైన నేను శ్రీరాముని దూతనని గూడ తెలిసికొనుము. అట్టి నేను శ్రీరాముని దూతకృత్యమును నెరవేర్చుటకొరకే ఈ లంకలో నీకడకు వచ్చియున్నాను.

**శ్లో॥ సుగ్రీవశ్చ మహాతేజా స్స త్వాం కుశల మబ్రవీత్ ।**
**ధర్మార్థకామసహితం హితం పథ్య మువాచ చ ॥ 130**

**పదచ్ఛేదము** :- సుగ్రీవః - చ - మహాతేజాః - సః - త్వాం - కుశలమ్ - అబ్రవీత్, ధర్మార్థకామసహితం - హితం - పథ్యమ్ - ఉవాచ - చ ॥

**అన్వయక్రమము** :- మహాతేజాః సః సుగ్రీవః త్వాం కుశలమ్ అబ్రవీత్, ధర్మార్థకామ సహితం హితం పథ్యమ్ ఉవాచ చ.

**ప్రతిపదార్థము** :- మహాతేజాః = మహాప్రతాప సంపన్నుడైన, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, త్వాం = నిన్ను, కుశలమ్ అబ్రవీత్ = క్షేమము నడిగెను, ధర్మార్థకామ సహితం = ధర్మము తోడను అర్థము తోడను, కామము తోడను గూడినట్టి, హితం = మేలైనదియును, పథ్యం = క్షేమకరమైనదియును అగు మాటను, ఉవాచ చ = పలికెను కూడను.

**తాత్పర్యము :-** మహాప్రతాపసంపన్నుడైన మా సుగ్రీవుడు నిన్ను క్షేమవార్త నడిగి ధర్మార్థకామసమ్మతమైనట్టి హితమును పథ్యమునగు సందేశమును ఇట్లు నీకు తెలుపుచున్నాడు.

**శ్లో॥ వసతో ఋశ్యమూకే మే పర్వతే విపులద్రుమే ।**
**రాఘవో రణవిక్రాంతో మిత్రత్వం సముపాగతః ॥ 131**

**పదచ్ఛేదము :-** వసతః - ఋశ్యమూకే - మే - పర్వతే - విపులద్రుమే - రాఘవః - రణవిక్రాంతః - మిత్రత్వం - సముపాగతః ॥

**అన్వయక్రమము :-** విపులద్రుమే ఋశ్యమూకే పర్వతే వసతః మే రణవిక్రాంతః రాఘవః మిత్రత్వం సముపాగతః.

**ప్రతిపదార్థము :-** విపులద్రుమే = విస్తారమైన వృక్షములు గల్గినట్టి, ఋశ్యమూకే పర్వతే = ఋష్యమూక పర్వతమునందు, వసతః = వసించుచున్నట్టి, మే = నాకు, రణవిక్రాంతః = యుద్ధమునందు గొప్పపరాక్రమము గలవాడయిన, రాఘవః = శ్రీరాముడు, మిత్రత్వం = మైత్రిని, సముపాగతః = పొందెను.

**తాత్పర్యము :-** దట్టమైన వృక్షములు గల్గియున్న ఋశ్యమూకపర్వతముపై నేను వసించుచుండగా మహాపరాక్రమశాలి యగు శ్రీరాముడు నాకు మిత్రుడుగ లభించినాడు.

**శ్లో॥ తేన మే కథితం రాజ్ఞా భార్యా మే రక్షసా హృతా ।**
**తత్ర సాహాయ్య మస్మాకం కార్యం సర్వాత్మనా త్వయా ॥ 132**

**పదచ్ఛేదము :-** తేన - మే - కథితం - రాజ్ఞా - భార్యా - మే - రక్షసా - హృతా, తత్ర - సాహాయ్యమ్ - అస్మాకం - కార్యం - సర్వాత్మనా - త్వయా ॥

**అన్వయక్రమము :-** తేన రాజ్ఞా మే కథితం మే భార్యా రక్షసా హృతా, తత్ర అస్మాకం త్వయా సర్వాత్మనా సాహాయ్యం కార్యమ్.

**ప్రతిపదార్థము :-** తేన = ఆ, రాజ్ఞా = రాజుచే, మే = నాకు, కథితం = చెప్పబడినది, మే = నా యొక్క, భార్యా = భార్య, రక్షసా = రాక్షసునిచే, హృతా = అపహరింపబడినది, తత్ర = ఆ విషయమున, అస్మాకం = మాకు, త్వయా = నీచేత, సర్వాత్మనా = సర్వవిధముల, సాహాయ్యం = సాహాయ్యము, కార్యం = చేయవలసినది.

**తాత్పర్యము :-** ఆ రామనరేంద్రుడు - "ఈ యరణ్యమునం దుండగా నా భార్య నొక రాక్షసు డపహరించెను. నా భార్యను కనుగొను ప్రయత్నమునందు నీవు నాకు

సర్వవిధముల తోడ్పడవలయును." అని నన్ను కోరినాడు.

**శ్లో॥ మయా చ కథితం తస్మై వాలినశ్చ వధం ప్రతి ।**
**తత్ర సాహాయ్యహేతో ర్మే సమయం కర్తు మర్హసి ॥ 133**

**పదచ్ఛేదము :-** మయా - చ - కథితం - తస్మై - వాలినః - చ - వధం - ప్రతి, తత్ర సాహాయ్యహేతోః - మే - సమయం - కర్తుమ్ - అర్హసి ॥

**అన్వయక్రమము :-** మయా చ తస్మై వాలినః వధం ప్రతి చ తత్ర సాహాయ్యహేతోః మే సమయం కర్తుమ్ అర్హసి (ఇతి) కథితమ్.

**ప్రతిపదార్థము :-** మయా చ = నాచేతగూడ, తస్మై = ఆ శ్రీరామునికొరకు, వాలినః = వాలియొక్క, వధం ప్రతి చ = వధను గూర్చియును, తత్ర = ఆ విషయమునందు, సాహాయ్యహేతోః = సహాయము నిమిత్తమై, సమయం = వాగ్దానమును, కర్తుం = చేయుటకు, అర్హసి = తగుదువు, (ఇతి చ = అనియును), కథితమ్ = చెప్పబడినది.

**తాత్పర్యము :-** అప్పుడు నేను వాలిని వధింపవలసిన విషయమును గూర్చి ఆతనికి తెలిపి ఆ సందర్భమున నాకు సహాయపడుటకై వాగ్దానముచేయవలయునని ఆతనిని కోరితిని.

**శ్లో॥ వాలినా హృతరాజ్యేన సుగ్రీవేణ సహ ప్రభుః ।**
**చక్రే ఽగ్నిసాక్షికం సఖ్యం రాఘవ స్సహలక్ష్మణః ॥ 134**

**పదచ్ఛేదము :-** వాలినా - హృతరాజ్యేన - సుగ్రీవేణ - సహ - ప్రభుః - చక్రే - అగ్నిసాక్షికం - సఖ్యం - రాఘవః - సహలక్ష్మణః ॥

**అన్వయక్రమము :-** సహలక్ష్మణః ప్రభుః రాఘవః వాలినా హృతరాజ్యేన సుగ్రీవేణ సహ అగ్నిసాక్షికం సఖ్యం చక్రే.

**ప్రతిపదార్థము :-** సహలక్ష్మణః = లక్ష్మణునితో కూడినట్టి, ప్రభుః = ప్రభువైన, రాఘవః = శ్రీరాముడు, వాలినా = వాలిచే, హృతరాజ్యేన = అపహరింపబడిన రాజ్యము గలవాడైనట్టి, సుగ్రీవేణ సహ = సుగ్రీవునితో కూడ, అగ్నిసాక్షికం = అగ్నిదేవుడు సాక్ష్యముగనున్నట్టి, సఖ్యం = మైత్రిని, చక్రే = చేసికొనెను.

**తాత్పర్యము :-** వాలి వలన రాజ్యము గోల్పోయిన సుగ్రీవునితో లక్ష్మణసహితుడైన రామప్రభువు అగ్ని సాక్షికముగా సఖ్యమును గూర్చుకొనెను.

**శ్లో॥ తేన వాలిన ముత్పాట్య శరే ణైకేన సంయుగే ।**
**వానరాణాం మహారాజః కృత స్స ప్లవతాం వరః ॥ 135**

**పదచ్ఛేదము :-** తేన - వాలినమ్ - ఉత్పాట్య - శరేణ - ఏకేన - సంయుగే, వానరాణాం - మహారాజః - కృతః - సః - ప్లవతాం - వరః ॥

**అన్వయక్రమము :-** తేన సంయుగే ఏకేన శరేణ వాలినమ్ ఉత్పాట్య సః ప్లవతాం వరః (అహం) వానరాణాం మహారాజః కృతః.

**ప్రతిపదార్థము :-** తేన = ఆ రామప్రభువుచే, సంయుగే = యుద్ధమునందు, ఏకేన శరేణ = ఒక్క బాణముతో, వాలినం = వాలిని, ఉత్పాట్య = నిర్మూలించి, సః = ఆ, ప్లవతాం వరః = వానరులలో శ్రేష్ఠుడనైనట్టి, (అహం = నేను), వానరాణాం = వానరులకు, మహారాజః = మహారాజుగా, కృతః = చేయబడితిని.

**తాత్పర్యము :-** అప్పుడు మహావీరుడైన రామప్రభువు ఒక్క బాణము తోడనే యుద్ధము నందు వాలిని వధించి వానరరాజ్యమునకు నన్ను మహారాజును గావించెను.

**శ్లో॥ తస్య సాహాయ్య మస్మాభిః కార్యం సర్వాత్మనా త్విహ ।**
**తేన ప్రస్థాపిత స్తుభ్యం సమీప మిహ ధర్మతః ॥ 136**

**పదచ్ఛేదము :-** తస్య - సాహాయ్యమ్ - అస్మాభిః - కార్యం - సర్వాత్మనా - తు - ఇహ, తేన - ప్రస్థాపితః - తుభ్యం - సమీపమ్ - ఇహ - ధర్మతః ॥

**అన్వయక్రమము :-** తస్య ఇహ అస్మాభిః సర్వాత్మనా సాహాయ్యం కార్యమ్, తేన ఇహ ధర్మతః తుభ్యం సమీపం (దూతః) ప్రస్థాపితః.

**ప్రతిపదార్థము :-** తస్య = ఆ శ్రీరామునకు, ఇహ = ఈ విషయమున, అస్మాభిః = మాచేత, సర్వాత్మనా = అన్ని విధముల, సాహాయ్యం = సాహాయ్యము, కార్యమ్ = చేయవలసియున్నది, తేన = అందుచే, ధర్మతః = ధర్మమున నుసరించి, ఇహ = ఈ లంకకు, తుభ్యం సమీపం = నీ సమీపమును గూర్చి, (దూతః = దూత), ప్రస్థాపితః = పంపబడినాడు.

**తాత్పర్యము :-** అట్లు నా కుపకారము చేసిన శ్రీరామునకు నేను సర్వవిధముల ఆతని ప్రయత్నమునందు సహాయపడవలసి యున్నది. అందుచేతనే ధర్మసమ్మతముగా నీ కడకిప్పుడు దూతను పంపుచున్నాను.

**శ్లో॥ క్షిప్ర మానీయతాం సీతా దీయతాం రాఘవాయ చ ।**
**యావ న్న హరయో వీరా విధమంతి బలం తవ ॥ 137**

**పదచ్ఛేదము** :- క్షిప్రమ్ - ఆనీయతాం - సీతా - దీయతాం - రాఘవాయ - చ, యావత్ - న - హరయః - వీరాః - విధమంతి - బలం - తవ ॥

**అన్వయక్రమము** :- యావత్ వీరాః హరయః తవ బలం న విధమంతి (తావత్) క్షిప్రం సీతా ఆనీయతామ్, రాఘవాయ దీయతాం చ.

**ప్రతిపదార్థము** :- యావత్ = ఎంతలో, వీరాః = వీరులైన, హరయః = వానరులు, తవ = నీయొక్క, బలం = బలగమును, న విధమంతి = నశింపచేయరో, తావత్ = అంతలోనే, క్షిప్రం = శీఘ్రముగా, సీతా = సీతాదేవి, ఆనీయతామ్ = తీసికొని రాబడుగాక! రాఘవాయ = శ్రీరామునికొరకు, దీయతాం = ఇచ్చివేయబడుగాక.

**తాత్పర్యము** :- మహావీరులైన వానరయోధులు లంకలోని నీ బలగమునంతను నశింపజేయుటకు ముందుగనే నీవు తెచ్చిన సీతాదేవిని శీఘ్రముగ బంధనమునుండి తప్పించి శ్రీరామున కర్పింపుము.

**శ్లో॥ వానరాణాం ప్రభావో హి న కేన విదితః పురా ।**
**దేవతానాం సకాశం చ యే గచ్ఛంతి నిమంత్రితాః ॥ 138**

**పదచ్ఛేదము** :- వానరాణాం - ప్రభావః - హి - న - కేన - విదితః - పురా, దేవతానాం - సకాశం - చ - యే - గచ్ఛంతి - నిమంత్రితాః ॥

**అన్వయక్రమము** :- యే పురా నిమంత్రితాః (సంతః) దేవతానాం సకాశం చ గచ్ఛంతి (తేషాం) వానరాణాం ప్రభావః కేన న విదితః?

**ప్రతిపదార్థము** :- యే = ఎవ్వరయితే, పురా = పూర్వము, నిమంత్రితాః (సంతః) = ఆహ్వానింపబడినవారై, దేవతానాం = దేవతలయొక్క, సకాశం చ = సన్నిధినికూడ, గచ్ఛంతి = వెళ్లెడివారో, తేషాం = ఆ, వానరాణాం = వానరులయొక్క, ప్రభావః = ప్రభావము, కేన = ఎవనిచేత, న విదితః = తెలియబడదు?

**తాత్పర్యము** :- పూర్వకాలము నుండియు యుద్ధసమయములందు సాహాయ్యము కొరకై దేవతలచే స్వర్గలోకమునకు ఆహ్వానింపబడినట్టి వానరవీరుల యొక్క పరాక్రమ ప్రభావము ఎవ్వరికి తెలియనిది?

**శ్లో॥ ఇతి వానరరాజ స్త్వా మాహే త్యభిహితో మయా ।**
**మా మైక్షత తతః క్రుద్ధో చక్షుషా ప్రదహన్నివ ॥ 139**

**పదచ్ఛేదము** :- ఇతి - వానరరాజః - త్వామ్ - ఆహ - ఇతి - అభిహితః - మయా, మామ్ - ఐక్షత - తతః - క్రుద్ధః - చక్షుషా - ప్రదహన్ - ఇవ ॥

**అన్వయక్రమము** :– ఇతి త్వాం వానరరాజః ఆహ, ఇతి మయా అభిహితః (సః) క్రుద్ధః (సన్) చక్షుషా ప్రదహన్ ఇవ మామ్ ఐక్షత.

**ప్రతిపదార్థము** :– ఇతి = ఇట్లని, త్వాం = నిన్నుగూర్చి, వానరరాజః = వానరాధిపతియైన సుగ్రీవుడు, ఆహ = పలికెను, ఇతి = అని, మయా = నాచేత, అభిహితః = పలుకబడినవాడై, తతః = పిమ్మట, సః = ఆ రావణుడు, క్రుద్ధః (సన్) = క్రోధమునొందినవాడై, చక్షుషా = కంటితో, ప్రదహన్ ఇవ = దహించుచున్నట్లుగా, మామ్ = నన్ను, ఐక్షత = చూచెను.

**తాత్పర్యము** :– ఈ విధముగ మా వానరరాజైన సుగ్రీవుడు నీకు తెలుపుమనినాడు అని నేను రావణునితో చెప్పగనే ఆతడు తీవ్రమైన క్రోధము నొంది నన్ను నిప్పులు గ్రక్కుచున్న తన కన్నులతో దహించి వేయునట్లుగా జూచెను.

**శ్లో॥ తేన వధ్యోఽహ మాజ్ఞప్తో రక్షసా రౌద్రకర్మణా ।**
**మత్ప్రభావ మవిజ్ఞాయ రావణేన దురాత్మనా ॥ 140**

**పదచ్ఛేదము** :– తేన – వధ్యః – అహమ్ – ఆజ్ఞప్తః – రక్షసా – రౌద్రకర్మణా, మత్ప్రభావమ్ – అవిజ్ఞాయ – రావణేన – దురాత్మనా ॥

**అన్వయక్రమము** :– రౌద్రకర్మణా దురాత్మనా తేన రక్షసా రావణేన మత్ప్రభావమ్ అవిజ్ఞాయ అహం వధ్యః (ఇతి) ఆజ్ఞప్తః.

**ప్రతిపదార్థము** :– రౌద్రకర్మణా = భీకరచేష్టుడైన, దురాత్మనా = దుర్మార్గుడగు, తేన = ఆ, రక్షసా రావణేన = రావణాసురునిచే, మత్ప్రభావం = నా ప్రభావమును గూర్చి, అవిజ్ఞాయ = తెలియక, అహం = నేను, వధ్యః = వధింపవలసినవాడనుగా, ఆజ్ఞప్తః = ఆజ్ఞాపింపబడితిని.

**తాత్పర్యము** :– వెంటనే రౌద్రకృత్యములకు అలవాటు పడినట్టి దుర్మార్గుడైన ఆ రావణాసురుడు నా ప్రభావమెట్టిదో తెలిసికొనలేక నన్ను చంపుటకు ఆజ్ఞాపించెను.

**శ్లో॥ తతో విభీషణో నామ తస్య భ్రాతా మహామతిః ।**
**తేన రాక్షసరాజోఽసౌ యాచితో మమ కారణాత్ ॥ 141**

**పదచ్ఛేదము** :– తతః – విభీషణః – నామ – తస్య – భ్రాతా – మహామతిః, తేన – రాక్షసరాజః – అసౌ – యాచితః – మమ – కారణాత్ ॥

**అన్వయక్రమము** :– తతః మహామతిః విభీషణః నామ తస్య (యః) భ్రాతా (అస్తి) తేన అసౌ రాక్షసరాజః మమ కారణాత్ యాచితః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, మహామతిః = గొప్పవివేకవంతుడైన, విభీషణః నామ = విభీషణుడను పేరుగల, తస్య = ఆతనియొక్క, (యః = ఏ), భ్రాతా = సోదరుడు, (అస్తి = ఉన్నాడో), తేన = అతనిచే, అసౌ = ఈ, రాక్షసరాజః = రాక్షసరాజైన రావణుడు, మమ కారణాత్ = నా నిమిత్తమై, యాచితః = వేడుకొనబడెను.

**తాత్పర్యము :–** అప్పుడు మహాబుద్ధిశాలియైన విభీషణుడను రావణుని తమ్ముడు నన్ను మృత్యుదండనమునుండి తప్పింపవలెనని నిశ్చయించుకొని రావణుని వేడుకొనెను.

**శ్లో॥ నైవం రాక్షసశార్దూల త్యజ్యతా మేష నిశ్చయః ।**
**రాజశాస్త్రవ్యపేతో హి మార్గ స్సంసేవ్యతే త్వయా ॥ 142**

**పదచ్ఛేదము :–** న – ఏవం – రాక్షసశార్దూల – త్యజ్యతామ్ – ఏషః – నిశ్చయః, రాజశాస్త్రవ్యపేతః – హి – మార్గః – సంసేవ్యతే – త్వయా ॥

**అన్వయక్రమము :–** రాక్షసశార్దూల! ఏవం న; ఏషః నిశ్చయః త్యజ్యతామ్; త్వయా రాజశాస్త్రవ్యపేతః మార్గః సంసేవ్యతే హి.

**ప్రతిపదార్థము :–** రాక్షసశార్దూల = ఓ రాక్షసశ్రేష్ఠుడా! ఏవం = ఈ రీతిగా, న (కార్యం) = (చేయ) తగదు, ఏషః = ఈ, నిశ్చయః = నిర్ణయము, త్యజ్యతామ్ = విడువబడుగాక! త్వయా = నీచేత, రాజశాస్త్రవ్యపేతః = రాజధర్మమునకు విరుద్ధమైనట్టి, మార్గః = పద్ధతి, సంసేవ్యతే హి = అవలంబింపబడుచున్నది సుమా!

**శ్లో॥ దూతవధ్యా న దృష్టా హి రాజశాస్త్రేషు రాక్షస ।**
**దూతేన వేదితవ్యం చ యథాభిహితవాదినా ॥ 143**

**పదచ్ఛేదము :–** దూతవధ్యా – న – దృష్టా – హి – రాజశాస్త్రేషు – రాక్షస, దూతేన – వేదితవ్యం – చ – యథాభిహితవాదినా ॥

**అన్వయక్రమము :–** రాక్షసరాజ! శాస్త్రేషు దూతవధ్యా న హి దృష్టా, యథాభిహితవాదినా దూతేన వేదితవ్యం (భవతి) చ.

**ప్రతిపదార్థము :–** రాక్షస! = ఓ రాక్షసోత్తమా! రాజశాస్త్రేషు = రాజధర్మములందు, దూతవధ్యా = దూతయొక్క వధ, న హి దృష్టా = ఎంతమాత్రము చూడబడలేదు, యథాభిహితవాదినా = (తనకు) చెప్పబడిన విధముగా పలుకునట్టి, దూతేన = దూతచే, వేదితవ్యం = నివేదింపబడవలసినది, భవతి = అగును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

'యథాభిహితవాదినా' అను బొంబాయి పాఠమునకు బదులుగా 'యథార్థ హితవాదినా' యని దక్షిణాదిప్రతుల పాఠము. ఈ పాఠమునకు భావము మనకు హితమును పల్కు దూతచే సత్యమును గ్రహించవలెను అని భావము.

**తిలకము** :- 'దూతేన వేదితవ్యం' - దూత తనకు చెప్పినది యంతయు తాను మనకు నివేదింపవలసినదే. అందుండు అప్రియోక్తులకు అతని బాధ్యత ఏ ముండును? కనుక అతడు దండనీయుడు గాడని భావము.

**రా.శిరోమణి** :- 'దూతేన వేదితవ్యం' - (ఉక్తమ్ ఇతి శేషః) దూత చెప్పినది మనము శ్రద్ధగా గ్రహించవలెను. వానిని దూషింపరాదని భావము.

**తాత్పర్యము** :- ఓ రాక్షసరాజా, రాజధర్మములం దెచ్చటను దూతను వధించుట యుక్తమని చెప్పబడలేదు. మనకు చెప్పుమని చెప్పబడిన మాటలనే మన ఎదుట అన్నియును చెప్పుట అతని విధిగదా! అందు అతని యపరాధమేముండును?

**శ్లో॥ సుమహ త్యపరాధేఽపి దూత స్యాతులవిక్రమ ।**
**విరూపకరణం దృష్టం న వధో ఽస్తి హి శాస్త్రతః ॥ 144**

**పదచ్ఛేదము** :- సుమహతి - అపరాధే - అపి - దూతస్య - అతులవిక్రమ, విరూపకరణం - దృష్టం - న - వధః - అస్తి - హి - శాస్త్రతః ॥

**అన్వయక్రమము** :- అతులవిక్రమ! దూతస్య అపరాధే సుమహతి (సతి) అపి విరూపకరణం దృష్టం; శాస్త్రతః వధః నహి అస్తి.

**ప్రతిపదార్థము** :- అతులవిక్రమ = అనుపమానమైన పరాక్రమము గల్గిన ఓ రావణా!, దూతస్య = దూతయొక్క, అపరాధే = అపరాధము, సుమహతి (సతి) అపి = గొప్పదై యున్నప్పటికిని, విరూపకరణం = అంగవైకల్యము చేయుట, దృష్టం = చూడబడినది, శాస్త్రతః = శాస్త్రముననుసరించి, వధః = మారణము, నహి అస్తి = ఎంతమాత్రమును లేదు.

**తాత్పర్యము** :- అనుపమవిక్రమోపేతుడవైన ఓ రాక్షసరాజా! దూతచేసిన అపరాధము ఎంతగొప్పదైనప్పటికిని ఏ అంగవిచ్ఛేదమో దండనముగా విధింపబడినదిగాని శాస్త్రముల ననుసరించి చూచిన దూతను వధించుట ఎచ్చటను గానరాదు సుమా!

**శ్లో॥ విభీషణే నైవ ముక్తో రావణ స్సందిదేశ తాన్ ।**
**రాక్షసా నేతదే వాస్య లాంగూలం దహ్యతా మితి ॥ 145**

**పదచ్ఛేదము** :- విభీషణేన - ఏవమ్ - ఉక్తః - రావణః - సందిదేశ - తాన్, రాక్షసాన్ - ఏతత్ - ఏవ - అస్య - లాంగూలం - దహ్యతామ్ - ఇతి ॥

**అన్వయక్రమము** :- రావణః ఏవం విభీషణేన ఉక్తః అస్య ఏతత్ లాంగూలమ్ ఏవ దహ్యతాం ఇతి తాన్ రాక్షసాన్ సందిదేశ.

**ప్రతిపదార్థము** :- రావణః = రావణుడు, ఏవం = ఈరీతిగా, విభీషణేన = విభీషణునిచే, ఉక్తః = చెప్పబడినవాడై, అస్య = ఈ వానరునియొక్క, ఏతత్ = ఈ, లాంగూలమ్ ఏవ = తోకయే, దహ్యతాం = దహింపబడుగాక, ఇతి = అని, తాన్ = ఆ, రాక్షసాన్ = రాక్షసులను గూర్చి, సందిదేశ = ఆజ్ఞాపించెను.

**తాత్పర్యము** :- విభీషణు డిట్లు తెలుపగా రావణు డా మాటలను విని ఈ వానరుని లాంగూలమును తగులబెట్టుడని అచటనున్న రాక్షసభటులకు ఆజ్ఞాపించెను.

**శ్లో॥ తత స్తస్య వచ శ్శ్రుత్వా మమ పుచ్ఛం సమంతతః ।**
**వేష్టితం శణవల్కైశ్చ జీర్ణైః కార్పాసజైః పటైః ॥ 146**

**పదచ్ఛేదము** :- తతః - తస్య - వచః - శ్రుత్వా - మమ - పుచ్ఛం - సమంతతః, వేష్టితం - శణవల్కైః - చ - జీర్ణైః - కార్పాసజైః - పటైః ॥

**అన్వయక్రమము** :- తతః తస్య వచః శ్రుత్వా మమ పుచ్ఛం సమంతతః శణవల్కైః జీర్ణైః కార్పాసజైః పటైః చ వేష్టితమ్.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, తస్య = ఆ రావణునియొక్క, వచః = మాటను, శ్రుత్వా = విని, మమ = నాయొక్క, పుచ్ఛం = తోక, సమంతతః = అంతటను, శణవల్కైః = జనపనార గుడ్డలచేతను, జీర్ణైః = శిథిలములైన, కార్పాసజైః పటైః = నూలు గుడ్డలచేతను, వేష్టితమ్ = చుట్టబెట్టబడినది.

**తాత్పర్యము** :- రావణుని మాట వినగనే అతని భటులు గోనెగుడ్డలను పాతగుడ్డలను తెచ్చి నాతోక పొడవున చుట్టిరి.

**శ్లో॥ రాక్షసా స్సిద్ధసన్నాహా స్తతస్తే చండవిక్రమాః ।**
**తదాదహంత మే పుచ్ఛం నిఘ్నంతః కాష్ఠముష్టిభిః ॥ 147**

**పదచ్ఛేదము** :- రాక్షసాః - సిద్ధసన్నాహాః - తతః - తే - చండవిక్రమాః, తదా - అదహంత - మే - పుచ్ఛం - నిఘ్నంతః - కాష్ఠముష్టిభిః ॥

**అన్వయక్రమము** :- తతః చండవిక్రమాః తే రాక్షసాః సిద్ధసన్నాహాః (సంతః) కాష్ఠముష్టిభిః

నిఘ్నంతః మే పుచ్ఛమ్ అదహంత.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, చండవిక్రమాః = భయంకరమైన పరాక్రమము గలిగినట్టి, తే = ఆ, రాక్షసాః = రాక్షసులు, సిద్ధసన్నాహాః = సిద్ధమైన సన్నాహములు గలవారై, తదా = అప్పుడు, కాష్ఠముష్టిభిః = కర్రలతోడను, పిడికిళ్ళతోడను, నిఘ్నంతః = కొట్టుచున్నవారై, మే = నాయొక్క, పుచ్ఛమ్ = తోకను, అదహంత (అదహన్) = దహించిరి.

**తాత్పర్యము** :- అటుపిమ్మట మహాభయంకరచేష్టలు గల ఆ రాక్షసులు వలసిన సన్నాహములను పూర్తిచేసికొని, నన్ను కర్రలతోడను, తమ పిడికిళ్ళతోడను ప్రహరించుచు నాతోకకు నిప్పు ముట్టించిరి.

**శ్లో॥ బద్ధస్య బహుభిః పాశైర్యంత్రితస్య చ రాక్షసైః ।**
**న మే పీడా భవే త్కాచి ద్దిదృక్షో ర్నగరీం దివా ॥ 148**

**పదచ్ఛేదము** :- బద్ధస్య - బహుభిః - పాశైః - యంత్రితస్య - చ - రాక్షసైః - న - మే - పీడా - భవేత్ - కాచిత్ - దిదృక్షోః - నగరీం - దివా ॥

**అన్వయక్రమము** :- బహుభిః పాశైః బద్ధస్య రాక్షసైః యంత్రితస్య చ నగరీం దివా దిదృక్షోః చ మే కాచిత్ పీడా న భవేత్.

**ప్రతిపదార్థము** :- బహుభిః పాశైః = పెక్కుత్రాళ్ళతో, బద్ధస్య = బంధింపబడినట్టివాడను, రాక్షసైః = రాక్షసులచే, యంత్రితస్య చ = నిరోధింపబడు చున్నవాడనై, నగరీం = లంకానగరమును, దివా = పగటి సమయమున, దిదృక్షోః = చూడగోరుచున్నట్టి, మే = నాకు, కాచిత్ = కొంచమైనను, పీడా = బాధ, న భవేత్ (న అభవత్) = కాలేదు.

**సూచన** :- ఇందలి "భవేత్" అనుదానికి బదులుగా 'అభవత్' అని పాఠాంతరము, మరియు ఈ రెండవ సగము శ్లోకము కొన్ని ప్రతులలో లేదు.

**తాత్పర్యము** :- ఎన్నో త్రాళ్ళతో నన్ను కట్టి ఆ రాక్షసులు నన్ను నిరోధించుచున్నను లంకానగరమును పగటిపూట చూచు కోరికతో నున్న నాకు వారి హింసలు పీడను గల్గించకుండెను.

**శ్లో॥ తత స్తే రాక్షసా శ్శూరా బద్ధం మా మగ్నిసంవృతమ్ ।**
**అఘోషయ న్రాజమార్గే నగరద్వారమాగతాః ॥ 149**

**పదచ్ఛేదము** :- తతః - తే - రాక్షసాః - శూరాః - బద్ధం - మామ్ - అగ్ని సంవృతమ్, అఘోషయన్ - రాజమార్గే - నగరద్వారమ్ - ఆగతాః ॥

**అన్వయక్రమము** :– తతః శూరాః తే రాక్షసాః బద్ధమ్ అగ్నిసంవృతమ్ మాం రాజమార్గే నగరద్వారమ్ ఆగతాః అఘోషయన్.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, శూరాః = వీరులైన, తే = ఆ, రాక్షసాః = రాక్షసులు, బద్ధం = బంధింపబడినవాడను, అగ్నిసంవృతమ్ = అగ్నితో చుట్టుముట్ట బడినవాడను అగు, మాం = నన్ను గూర్చి, రాజమార్గే = రాజమార్గమున, నగరద్వారే = పట్టణద్వారమును, ఆగతాః = చేరినవారై, అఘోషయన్ = చాటింపు వేసిరి.

**తాత్పర్యము** :– వీరులైన ఆ రాక్షసులు రాజమార్గమునుండి బంధింపబడి, అగ్నితో చుట్టుముట్టబడియున్న నన్ను నగరద్వారమునకు తీసికొని పోవుచు నన్ను గూర్చి చాటింపు వేయుచుండిరి.

**శ్లో॥ తతోఽహం సుమహ ద్రూపం సంక్షిప్య పున రాత్మనః ।**
**విమోచయిత్వా తం బంధం ప్రకృతిస్థ స్థ్సితః పునః ॥ 150**

**పదచ్ఛేదము** :– తతః – అహం – సుమహత్ – రూపం – సంక్షిప్య – పునః – ఆత్మనః, విమోచయిత్వా – తం – బంధం – ప్రకృతిస్థః – స్థితః – పునః ॥

**అన్వయక్రమము** :– తతః అహమ్ ఆత్మనః సుమహత్ రూపం సంక్షిప్య తం బంధం విమోచయిత్వా పునః ప్రకృతిస్థః స్థితః.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, అహం = నేను, పునః = తిరిగి, సుమహత్ = గొప్పదైన, ఆత్మనః = నాయొక్క, రూపం = రూపమును, సంక్షిప్య = చిన్నదిగ చేసి, తం = ఆ, బంధం = బంధనమును, విమోచయిత్వా = విడిపించుకొని, పునః = తిరిగి, ప్రకృతిస్థః = సహజరూపమున నున్నవాడనుగా, స్థితః = ఉంటిని.

**తాత్పర్యము** :– అటు పిమ్మట నేను మిక్కిలి గొప్పదైన నా రూపమును చిన్నదిగ చేసికొని ఆ రాక్షసులు కట్టిన బంధములను విడిపించుకొని మరల వెనుకటి రూపమును దాల్చి నిలచితిని.

**శ్లో॥ ఆయసం పరిఘం గృహ్యా తాని రక్షాం స్యసూదయమ్ ।**
**తత స్త న్నగరద్వారం వేగేనాప్లుతవా నహమ్ ॥ 151**

**పదచ్ఛేదము** :– ఆయసం – పరిఘం – గృహ్యా – తాని – రక్షాంసి – అసూదయమ్, తతః – తత్ – నగరద్వారం – వేగేన – ఆప్లుతవాన్ – అహమ్ ॥

**అన్వయక్రమము** :– ఆయసం పరిఘం గృహ్యా తాని రక్షాంసి అసూదయమ్, తతః అహం వేగేన తత్ నగరద్వారం ఆప్లుతవాన్.

**ప్రతిపదార్థము :-** ఆయసం పరిఘం = ఉక్కుగుదియను, గృహ్య = గ్రహించి, తాని = ఆ, రక్షాంసి = రాక్షసులను, అసూదయమ్ = సంహరించితిని, తతః = పిమ్మట, అహం = నేను, వేగేన = వేగముగా, తత్ నగరద్వారం = ఆ పట్టణద్వారమును గూర్చి, ఆప్లుతవాన్ = గెంతితిని.

**తాత్పర్యము :-** వెంటనే నేను అచ్చటి ఇనుపగుదియను చేతబట్టుకొని అచటి రాక్షసుల నందరిని హతమార్చి వెంటనే వేగముగా ఆ పట్టణద్వారమును లంఘించితిని.

**శ్లో॥ పుచ్ఛేన చ ప్రదీప్తేన తాం పురీం సాట్టగోపురామ్ ।**
**దహా మ్యహ మసంభ్రాంతో యుగాంతాగ్నిరివ ప్రజాః ॥ 152**

**పదచ్ఛేదము :-** పుచ్ఛేన - చ - ప్రదీప్తేన - తాం - పురీం - సాట్టగోపురామ్, దహామి - అహమ్ - అసంభ్రాంతః - యుగాంతాగ్నిః - ఇవ - ప్రజాః ॥

**అన్వయక్రమము :-** ప్రదీప్తేన పుచ్ఛేన అహమ్ అసంభ్రాంతః యుగాంతాగ్నిః ప్రజాః ఇవ సాట్టగోపురాం తాం పురీం దహామి.

**ప్రతిపదార్థము :-** ప్రదీప్తేన = మిక్కిలిగా జ్వలించుచున్నట్టి, పుచ్ఛేన = తోకతో, అహం = నేను, అసంభ్రాంతః = భీతినొందని వాడనై, యుగాంతాగ్నిః = ప్రళయకాలము నందలి అగ్ని, ప్రజాః ఇవ = ప్రజలనువలె, సాట్టగోపురాం = బురుజులతోడను గోపురముల తోడను కూడిన, తాం = ఆ, పురీం = లంకాపురిని, దహామి = తగులబెట్టితిని.

**తాత్పర్యము :-** నా వాలము తీవ్రముగా జ్వలించుచున్నప్పటికిని నేనేమియు భయము నొందకుండ ప్రళయకాలమునందు చెలరేగిన అగ్ని ప్రజలను దహించునట్లు పెద్దబురుజుల తోడను, గోపురములతోడను కూడినట్టి ఆ లంకానగరమును తగులబెట్టితిని.

**శ్లో॥ వినష్టా జానకీ వ్యక్తం న హ్యదగ్ధః ప్రదృశ్యతే ।**
**లంకాయాం కశ్చి దుద్దేశః సర్వా భస్మీకృతా పురీ ॥ 153**

**పదచ్ఛేదము :-** వినష్టా - జానకీ - వ్యక్తం - న - హి - అదగ్ధః - ప్రదృశ్యతే, లంకాయాం - కశ్చిత్ - ఉద్దేశః - సర్వా - భస్మీకృతా - పురీ ॥

**అన్వయక్రమము :-** జానకీ వ్యక్తం వినష్టా, లంకాయాం కశ్చిత్ ఉద్దేశః అదగ్ధః న హి ప్రదృశ్యతే - సర్వా పురీ భస్మీకృతా.

**ప్రతిపదార్థము** :– జానకీ = సీతాదేవి, వ్యక్తం = స్పష్టముగా, వినష్టా = నశించినది, లంకాయాం = లంకయందు, కశ్చిత్ ఉద్దేశః = ఏ ప్రదేశముగూడ, అదగ్ధః = దహింపబడనిది, న హి ప్రదృశ్యతే = కనబడుట లేదుగదా, సర్వా = సమస్తమైన, పురీ = పట్టణము, భస్మీకృతా = భస్మము చేయబడినది.

**తాత్పర్యము** :– ఈ పరిస్థితి చూడగా నిస్సందేహముగా సీతాదేవి నశించిపోయినది. ఎందుచేతననగా దహింపబడకుండగ మిగిలిన ప్రదేశము కొంచెమైనను కాన్పించుట లేదు. మొత్తము పట్టణ మంతయును భస్మమై పోయెనుగదా!

**శ్లో॥ దహతా చ మయా లంకాం దగ్ధా సీతా న సంశయః ।**
**రామస్య హి మహ త్కార్యం మ యేదం వితథీకృతమ్ ।**
**ఇతి శోకసమావిష్ట శ్చింతా మహముపాగతః ॥ 154**

**పదచ్ఛేదము** :– దహతా – చ – మయా – లంకాం – దగ్ధా – సీతా – న – సంశయః – రామస్య – హి – మహత్ – కార్యం – మయా – ఇదం – వితథీకృతమ్, ఇతి – శోకసమావిష్టః – చింతామ్ – అహమ్ – ఉపాగతః ॥

**అన్వయక్రమము** :– లంకాం దహతా మయా సీతా చ దగ్ధా, సంశయః న, ఇదం మహత్ రామస్య కార్యం మయా వితథీకృతం హి, ఇతి శోకసమావిష్టః అహం చింతామ్ ఉపాగతః.

**ప్రతిపదార్థము** :– లంకాం = లంకానగరమును, దహతా = దహించుచున్నట్టి, మయా = నాచేత, సీతా చ = సీతాదేవియును, దగ్ధా = దహింపబడినది. సంశయః = సంశయము, న = లేదు, ఇదం = ఈ, మహత్ = గొప్పదైన, రామస్య = శ్రీరామునియొక్క, కార్యం = కార్యము, మయా = నాచేత, వితథీకృతమ్ = వ్యర్థము చేయబడినది, ఇతి = అని, అహం = నేను, శోకసమావిష్టః = దుఃఖము నొందినవాడనై, చింతాం = దిగులును, ఉపాగతః = పొందితిని.

**తాత్పర్యము** :– అక్కటా! ఈ లంకానగరమును దహించుచు నేను సీతాదేవినిగూడ దహించియే యుంటినిగదా! ఇందు సంశయమునకు తావు ఏమున్నది? ఇట్లు శ్రీరామచంద్రుని కొరకు నేను సాధించిన ఘనకార్యమును నేనే నిష్ఫలము చేసితినిగదా! అని వ్యాకులచిత్తముతో శోకగ్రస్తుడనైతిని.

**శ్లో॥ అ థాహం వాచ మశ్రౌషం చారణానాం శుభాక్షరామ్ ।**
**జానకీ న చ దగ్ధేతి విస్మయోదంతభాషిణామ్ ॥ 155**

**పదచ్ఛేదము :–** అథ – అహం – వాచమ్ – అశ్రౌషం – చారణానాం – శుభాక్షరామ్, జానకీ – న – చ – దగ్ధా – ఇతి – విస్మయోదంతభాషిణామ్ ॥

**అన్వయక్రమము :–** అథ అహం జానకీ న చ దగ్ధా ఇతి విస్మయోదంతభాషిణాం చారణానాం శుభాక్షరాం వాచమ్ అశ్రౌషమ్.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, అహం = నేను, జానకీ = సీతాదేవి, న చ దగ్ధా = ఏమియు దహింపబడలేదు, ఇతి = అని, విస్మయోదంతభాషిణాం = ఆశ్చర్యకరమైన వృత్తాంతమును గూర్చి మాటలాడుకొనుచున్నట్టి, చారణానాం = చారణులయొక్క, శుభాక్షరాం = మంగళకరమైన అక్షరములు గల, వాచమ్ = మాటను, అశ్రౌషమ్ = వింటిని.

**తాత్పర్యము :–** అప్పుడు ఆకాశమునందు 'ఆహా!' జానకీదేవి మాత్రము ఏమియు దహింపబడలేదు సుమా యనుచు ఆశ్చర్యముతో ఈ వృత్తాంతమును గూర్చి తమలో తాము సంభాషించుకొనుచున్న చారణగణములయొక్క అమృతప్రాయములైన వచనములు నాచెవిన బడినవి.

**శ్లో॥ తతో మే బుద్ధిరుత్పన్నా శ్రుత్వా తా మద్భుతాం గిరమ్ ।**
**అదగ్ధా జానకీత్యేవం నిమిత్తై శ్చోపలక్షితా ॥ 156**

**పదచ్ఛేదము :–** తతః – మే – బుద్ధిః – ఉత్పన్నా – శ్రుత్వా – తామ్ – అద్భుతాం – గిరమ్, అదగ్ధా – జానకీ – ఇతి – ఏవం – నిమిత్తైః – చ – ఉపలక్షితా ॥

**అన్వయక్రమము :–** తతః తాం అద్భుతాం గిరం శ్రుత్వా జానకీ అదగ్ధా ఇతి మే బుద్ధిః ఉత్పన్నా. నిమిత్తైః చ ఏవమ్ ఉపలక్షితా.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, అద్భుతాం = అద్భుతమైనట్టి, తాం = ఆ, గిరం = వాక్కును, శ్రుత్వా = విని, జానకీ = సీతాదేవి, అదగ్ధా = దహింపబడలేదు, ఇతి = అని, బుద్ధిః = నిశ్చయము, మే = నాకు, ఉత్పన్నా = గలిగినది, నిమిత్తైః చ = శుభశకునములచే గూడ, ఏవం = ఈరీతిగా, ఉపలక్షితా = గ్రహింపబడినది.

**తాత్పర్యము :–** ఆకసమునందు చారణగణములు పలుకుచున్న ఆశ్చర్యకరమైన ఆ మాటలు వినినంతనే సీతాదేవి దహింపబడలేదని నాకు నిశ్చయము గలిగినది. అప్పుడు నాకు గాన్పించిన శుభశకునములను బట్టి కూడ ఆ విషయము దృఢపడినది.

**శ్లో॥ దీప్యమానే తు లాంగూలే న మాం దహతి పావకః ।**
**హృదయం చ ప్రహృష్టం మే వాతా స్సురభిగంధినః ॥ 157**

**పదచ్ఛేదము** :- దీప్యమానే - తు - లాంగూలే - న - మాం - దహతి - పావకః, హృదయం - చ - ప్రహృష్టం - మే - వాతాః - సురభిగంధినః ॥

**అన్వయక్రమము** :- లాంగూలే దీప్యమానే (సతి) పావకః మాం న దహతి, మే హృదయం చ ప్రహృష్టం, వాతాః సురభిగంధినః (ఆసన్).

**ప్రతిపదార్థము** :- లాంగూలే = వాలము, దీప్యమానే (సతి) = దహింపబడుచున్నది యైనను, పావకః = అగ్ని, మాం = నన్ను, న దహతి = దహించుటలేదు, మే = నాయొక్క, హృదయం చ = హృదయము గూడ, ప్రహృష్టం = సంతుష్టమైయున్నది, వాతాః = వాయువులు, సురభిగంధినః = సువాసనగలవై, (ఆసన్ = ఉన్నవి).

**తాత్పర్యము** :- నా తోక దహింపబడుచున్నప్పటికిని అగ్ని నాకేమియును తాపమును గలిగించుటలేదు. నా హృదయము గూడ హర్షభరితమై యున్నది గాని ఏ విధమైన చింతను పొందుటలేదు. వీచుచున్న గాలులు గూడ పరిమళభరితములై నాకు ఆనందకరములే యగుచున్నవిగాని భయమునకు కారణమగుటలేదు.

**శ్లో॥ తై ర్నిమిత్తైశ్చ దృష్టార్థైః కారణైశ్చ మహాగుణైః ।**
**ఋషివాక్యైశ్చ సిద్ధార్థై రభవం హృష్టమానసః ॥ 158**

**పదచ్ఛేదము** :- తైః - నిమిత్తైః - చ - దృష్టార్థైః - కారణైః - చ - మహాగుణైః - ఋషివాక్యైః - చ - సిద్ధార్థైః - అభవం - హృష్టమానసః ॥

**అన్వయక్రమము** :- దృష్టార్థైః తైః నిమిత్తైః చ, మహాగుణైః కారణైః చ, సిద్ధార్థైః ఋషివాక్యైః చ హృష్టమానసః అభవమ్.

**ప్రతిపదార్థము** :- దృష్టార్థైః = కాన్పించిన ఫలము గలిగినట్టి, తైః = ఆ, నిమిత్తైః చ = శుభశకునములచేతను, మహాగుణైః = గొప్ప గుణములు గల్గినట్టి, కారణైః చ = కారణములచేతను, సిద్ధార్థైః = సిద్ధించు ప్రయోజనము గల్గినట్టి, ఋషివాక్యైః చ = మునులవచనముల చేతను, హృష్టమానసః = హర్షము నొందిన మనస్సుగలవాడను, అభవమ్ = అయితిని.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- మహాగుణైః కారణైః = నన్ను నడిపించుచున్నట్టి సీతారాముల రూపములో నున్న మహాశక్తులచేతను.

**తాత్పర్యము** :- ఈ విధముగ నాకు కాన్పించిన ప్రత్యక్షఫలము గల శుభశకునముల

చేతను, అద్భుతమైన నా మనస్సును ప్రోత్సహించుచున్న శక్తులచేతను, ఆకసము నందలి ఫలసిద్ధికరములయిన ఋషివాక్యములచేతను నా హృదయము ఆనందభరితమయ్యెను.

**శ్లో॥ పున ర్దృష్ట్వా చ వైదేహీం విసృష్టశ్చ తయా పునః ।**
**తతః పర్వత మాసాద్య త త్రారిష్ట మహం పునః ।**
**ప్రతిప్లవనమారేభే యుష్మద్దర్శనకాంక్షయా ॥ 159**

**పదచ్ఛేదము** :- పునః - దృష్ట్వా - చ - వైదేహీం - విసృష్టః - చ - తయా - పునః, తతః - పర్వతమ్ - ఆసాద్య - తత్ర - అరిష్టమ్ - అహం - పునః - ప్రతిప్లవనమ్ - ఆరేభే - యుష్మద్దర్శనకాంక్షయా ॥

**అన్వయక్రమము** :- పునః చ వైదేహీం దృష్ట్వా తయా పునః చ విసృష్టః తతః అహం తత్ర అరిష్టం పర్వతమ్ ఆసాద్య యుష్మద్దర్శనకాంక్షయా పునః ప్రతిప్లవనం ఆరేభే.

**ప్రతిపదార్థము** :- పునః చ = తిరిగి, వైదేహీం = సీతాదేవిని, దృష్ట్వా = చూచి, తయా = ఆమెచే, పునః = తిరిగి, విసృష్టః = పంపబడినవాడనై, తతః = పిమ్మట, తత్ర = ఆ లంకయందు, అరిష్టం = అరిష్ట మను పర్వతమును, ఆసాద్య = చేరి, యుష్మద్దర్శనకాంక్షయా = మీయొక్క దర్శనమునందలి కోరికతో, అహం = నేను, ప్రతిప్లవనం = తిరిగి లంఘనమును, ఆరేభే = ఆరంభించితిని.

**తాత్పర్యము** :- తిరిగి సీతాదేవిని దర్శించి ఆమెకడ సెలవు గైకొని అటనుండి ఆ లంకయందలి అరిష్టపర్వతశిఖరమును చేరి మిమ్ముల నందరను దర్శించవలె ననెడి వేగిరపాటుతో తిరుగు ప్రయాణమునకై లంఘనమును ఆరంభించితిని.

**శ్లో॥ తతః పవన చంద్రార్క సిద్ధగంధర్వ సేవితమ్ ।**
**పంథాన మహ మాక్రమ్య భవతో దృష్టవా నిహ ॥ 160**

**పదచ్ఛేదము** :- తతః - పవనచంద్రార్క సిద్ధ గంధర్వ సేవితమ్, పంథానం - అహమ్ - ఆక్రమ్య - భవతః - దృష్టవాన్ - ఇహ ॥

**అన్వయక్రమము** :- తతః అహం పవనచంద్రార్క సిద్ధగంధర్వసేవితం పంథానమ్ ఆక్రమ్య ఇహ భవతః దృష్టవాన్.

**ప్రతిపదార్థము** :- తతః = అటు పిమ్మట, అహం = నేను, పవనచంద్రార్కసిద్ధ గంధర్వసేవితం = వాయువుచేతను చంద్రసూర్యులచేతను, సిద్ధులచేతను, గంధర్వులచేతను సేవింపబడుచున్నట్టి, పంథానం = మార్గమును, ఆక్రమ్య = చేరి,

ఇహ = ఈ సముద్రతీరమునందు, భవతః = మిమ్ములను, దృష్టవాన్ = దర్శించినాడను.

**తాత్పర్యము** :– అట్లు మహాసముద్రమును లంఘించి వాయువు, చంద్రసూర్యులు, సిద్ధగంధర్వాదులును సేవించుచున్నట్టి ఈ యాకాశమార్గమున పయనించి ఈ సముద్రతీరమును చేరుకొని మిమ్ముల నందరిని చూచితిని.

**శ్లో॥ రాఘవస్య ప్రభావేణ భవతాం చైవ తేజసా ।**
**సుగ్రీవస్య చ కార్యార్థం మయా సర్వ మనుష్ఠితమ్ ॥ 161**

**పదచ్ఛేదము** :– రాఘవస్య – ప్రభావేణ – భవతాం – చ – ఏవ – తేజసా – సుగ్రీవస్య – చ – కార్యార్థం – మయా – సర్వమ్ – అనుష్ఠితమ్ ॥

**అన్వయక్రమము** :– రాఘవస్య ప్రభావేణ, భవతాం తేజసా చ ఏవ సుగ్రీవస్య కార్యార్థం చ (ఏతత్) సర్వం మయా అనుష్ఠితమ్.

**ప్రతిపదార్థము** :– రాఘవస్య = శ్రీరామచంద్రునియొక్క, ప్రభావేణ = ప్రభావము చేతను, భవతాం = మీయొక్క, తేజసా చైవ = మహిమచేతను, సుగ్రీవస్య = సుగ్రీవుని యొక్క, కార్యార్థం = కర్తవ్యముకొరకును, (ఏతత్) సర్వం = (ఇది) అంతయును, మయా = నాచే, అనుష్ఠితమ్ = నెరవేర్పబడినది.

**సూచన** :– "రాఘవస్య ప్రభావేణ" అనుదానికి బదులుగా 'రాఘవస్య ప్రసాదేన' అని బొంబాయి ముద్రణమునందు గలదు – అనగా శ్రీరాముని అనుగ్రహవిశేషముచే అని భావము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి హృదయము** :– 'రాఘవస్య ప్రభావేణ' అని అనుటలోని తాత్పర్యము – సీతాదేవిని హనుమ దర్శించగనే ఆమెయందలి దివ్యప్రభావమును పూర్తిగా గుర్తించెను. అప్పటినుండియు ఆతనికి ఆమె ప్రాణేశ్వరుడైన రాఘవునిపైగల పూర్వగౌరవము ఇంకను తీవ్రమైనది. అట్టి భక్తివిశేషముతోడనే ప్రస్తుతము ఇచ్చట శ్రీరాముని స్మరించుచు 'రాఘవస్య ప్రభావేణ' అనుచున్నాడు. మొదట ఈ లంకావృత్తాంతకథనము ఆరంభించినపుడు 'ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై' అని సీతమ్మకి మ్రొక్కి ముగింపునందు ఇచ్చట శ్రీరాముని స్మరించుటలో హనుమద్దృష్టిలో సీతారాముల అభేదము స్పష్టమగు చున్నది. ఇట్లు ఈ సీతారాముల అనపాయత్వము రామాయణసందేశము అని విదిత మగుచున్నది. రాఘవు డనగా సీతావల్లభు డనియు, సీత యనగా రామవల్లభ యనియు తత్త్వవేత్తలైన భక్తుల భావము.

**తాత్పర్యము :–** సీతావల్లభుని ప్రభావవిశేషముచేతను మీ యందరి మహిమచేతను సుగ్రీవమహారాజు కార్యనిర్వహణముకొరకు దీని నంతను ఇట్లు నేను నెరవేర్చుకొని వచ్చితిని.

**శ్లో॥ ఏత త్సర్వం మయా తత్ర యథావ దుపపాదితమ్ ।**
**అత్ర య న్న కృతం శేషం తత్సర్వం క్రియతా మితి ॥ 162**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనుమద్వృత్తానుకథనం" నామ*
*అష్టపంచాశస్సర్గః*

**పదచ్ఛేదము :–** ఏతత్ – సర్వం – మయా – తత్ర – యథావత్ – ఉపపాదితమ్, అత్ర – యత్ – న – కృతం – శేషం – తత్ – సర్వం – క్రియతామ్ – ఇతి ॥

**అన్వయక్రమము :–** తత్ర సర్వమ్ ఏతత్ యథావత్ ఉపపాదితమ్, అత్ర యత్ న కృతం తత్ శేషం సర్వం క్రియతామ్ ఇతి (హనుమతా నివేదితమ్).

**ప్రతిపదార్థము :–** తత్ర = ఆ లంకయందు, ఏతత్ = ఇది యంతయును, యథావత్ = ఉచితమైన రీతిగా, ఉపపాదితమ్ = ఆచరింపబడినది. అత్ర = ఈ కార్యమునందు, యత్ = ఏది, న కృతం = చేయబడలేదో, తత్ = ఆ, శేషం = మిగిలినది, సర్వం = అంతయును, క్రియతాం = చేయబడుగాక! ఇతి = అని, హనుమాన్ = హనుమ, ప్రత్యభాషత = పలికెను.

**తాత్పర్యము :–** ఈ రీతిగా నేను లంకయందు సముచితమైన రీతిగా కార్యక్రమమును నెరవేర్చి వచ్చితిని. ఇక ఈ కార్యనిర్వహణమునందు శేషించియున్న దంతయును మీరు గ్రహించి పూర్తిచేయుదురుగాక! అని హనుమ అంగదాదులతో పలికెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమద్ వృత్తానుకథనము" అను*
*ఏబదియెనిమిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకోనషష్టితమసర్గ

**శ్లో॥ ఏత దాఖ్యాయ తత్సర్వం హనుమా న్మారుతాత్మజః ।**
**భూయ స్సముపచక్రామ వచనం వక్తు ముత్తరమ్ ॥ 1**

**పదచ్ఛేదము :–** ఏతత్ – ఆఖ్యాయ – తత్ – సర్వం – హనుమాన్ – మారుతాత్మజః, భూయః – సముపచక్రామ – వచనం – వక్తుమ్ – ఉత్తరమ్ ॥

**అన్వయక్రమము :–** మారుతాత్మజః హనుమాన్ తత్ ఏతత్ సర్వమ్ ఆఖ్యాయ భూయః ఉత్తరం వచనం వక్తుం సముపచక్రామ.

**ప్రతిపదార్థము :–** మారుతాత్మజః = వాయునందనుడైన, హనుమాన్ = హనుమ, తత్ = ఆ, ఏతత్ = ఇది, సర్వం = అంతయును, ఆఖ్యాయ = చెప్పి, భూయః = తిరిగి, ఉత్తరం = తరువాతిదైన, వచనం = మాటను, వక్తుం = పలుకుటకు, సముపచక్రామ = ప్రారంభించెను.

**తాత్పర్యము :–** వాయునందనుడైన హనుమ తానాచరించిన ఆ వృత్తాంత మంతయును ఈ రీతిగ తెలిపి తిరిగి తెలుపవలసిన విషయమును ఇట్లు పలుక దొడగెను.

**శ్లో॥ సఫలో రాఘవోద్యోగ స్సుగ్రీవస్య చ సంభ్రమః ।**
**శీల మాసాద్య సీతాయా మమ చ ప్రవణం మనః ॥ 2**

**పదచ్ఛేదము :–** సఫలః – రాఘవోద్యోగః – సుగ్రీవస్య – చ – సంభ్రమః, శీలమ్ – ఆసాద్య – సీతాయాః – మమ – చ – ప్రవణం – మనః ॥

**అన్వయక్రమము :–** సీతాయాః శీలమ్ ఆసాద్య రాఘవోద్యోగః సఫలః, సుగ్రీవస్య సంభ్రమః చ (సఫలః). మమ మనః చ ప్రవణమ్.

**ప్రతిపదార్థము :–** సీతాయాః = సీతాదేవియొక్క, శీలం = సచ్చరిత్రమును, ఆసాద్య = చేరి, (ఆధారముగ చేసికొని), రాఘవోద్యోగః = శ్రీరాముని ఉద్యమము, సఫలః = సఫలమైనది, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, సంభ్రమః చ = వేగిరపాటుకూడ, (సఫలః = సఫలమైనది), మమ = నాయొక్క, మనః చ = మనస్సుగూడ, ప్రవణమ్ =

భక్తితత్పరము (ఆయెను).

**సూచన** :– 'మమ చ ప్రవణం మనః' అనుటకు బదులుగా 'మమ చ ప్రీణితం మనః' అని బొంబాయి ముద్రణము. అనగా నా మనస్సు సంతోషయుక్తమైనదని భావము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సుగ్రీవస్య చ సంభ్రమః సుగ్రీవుని ఆదరము ఉత్సాహము అని అర్థము. శీలమ్ ఆసాద్య – అనగా పాతివ్రత్యమును జూచి.

**గోవిందరాజీయము** :– 'మమ చ ప్రవణం మనః' నాకు పూర్వమే తెలిసి యున్నను ఆమెను దర్శించిన పిమ్మట సీతాప్రభావమునకు ఏమియు అసాధ్యముండదని తెలిసికొంటినని భావము.

**తాత్పర్యము** :– శ్రీరాముని ఉద్యమము, మన మహారాజు సుగ్రీవునియొక్క సంభ్రమము గూడ సీతాదేవి శీలవైభవమువలన సఫలత నొందినది. నా మనస్సుగూడ భక్తితత్పరమై నెగడుచున్నది.

**శ్లో॥ తపసా ధారయే ల్లోకాన్క్రుద్ధో వా నిర్దహేదపి ।**
**సర్వథా ఽతిప్రవృద్ధోఽసౌ రావణో రాక్షసాధిపః ॥ 3**

**శ్లో॥ తస్య తాం స్పృశతో గాత్రం తపసా న వినాశితమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– తపసా – ధారయేత్ – లోకాన్ – క్రుద్ధః – వా – నిర్దహేత్ – అపి, సర్వథా – అతిప్రవృద్ధః – అసౌ – రావణః – రాక్షసాధిపః, తస్య – తాం – స్పృశతః – గాత్రం – తపసా – న – వినాశితమ్ ॥

**అన్వయక్రమము** :– అసౌ రాక్షసాధిపః రావణః తపసా లోకాన్ ధారయేత్, క్రుద్ధః వా నిర్దహేత్ అపి, సర్వథా అతిప్రవృద్ధః. తాం స్పృశతః తస్య గాత్రం తపసా న వినాశితమ్.

**ప్రతిపదార్థము** :– అసౌ = ఈ, రాక్షసాధిపః = రాక్షసరాజైన, రావణః = రావణుడు, తపసా = తపస్సుచే, లోకాన్ = జగత్తును, ధారయేత్ = నిలువబెట్టును. క్రుద్ధః వా = కోపించినవాడగునేని, నిర్దహేత్ అపి = దహించివేయునుగూడ, సర్వథా = ఎల్లవిధములుగా, అతిప్రవృద్ధః = మిక్కిలి వృద్ధిని సాధించి యున్నవాడు, తాం = ఆ సీతాదేవిని, స్పృశతః = తాకుచున్నట్టి, తస్య = ఆతనియొక్క, గాత్రం = శరీరము,

తపసా = తపస్సుచేతనే, న వినాశితమ్ = నశింపచేయబడలేదు.

**తాత్పర్యము** :– రాక్షసేశ్వరుడైన ఆ రావణుడు తనయొక్క తపఃప్రభావముచే లోకము లన్నింటిని నిలిపియుంచగలడు. కోపము వచ్చినయెడల సమస్తజగత్తులను దహించివేయగలడు. సర్వథా ఆతడు తన తపఃప్రభావముచే మహాశక్తిసంపన్నుడై యున్నాడు. అందుచేతనే ఆనాడు సీతాసాధ్విని స్పృశించినప్పటికిని తన తపోమహిమ కారణముగనే నాశనము నొందక నిలువగలిగెను.

**శ్లో॥ న తదగ్నిశిఖా కుర్యా త్సంస్పృష్టా పాణినా సతీ ।**
**జనకస్యాత్మజా కుర్యా ద్యత్క్రోధకలుషీకృతా ॥ 5**

**పదచ్ఛేదము** :– న – తత్ – అగ్నిశిఖా – కుర్యాత్ – సంస్పృష్టా – పాణినా – సతీ, జనకస్య – ఆత్మజా – కుర్యాత్ – యత్ – క్రోధకలుషీకృతా ॥

**అన్వయక్రమము** :– క్రోధకలుషీకృతా జనకస్య ఆత్మజా యత్ న కుర్యాత్, తత్ పాణినా సంస్పృష్టా సతీ అగ్నిశిఖా న కుర్యాత్.

**ప్రతిపదార్థము** :– క్రోధకలుషీకృతా = క్రోధముచే కలుషముగా చేయబడినట్టి, జనకస్య = జనకమహారాజుయొక్క, ఆత్మజా = పుత్రికయైన సీతాదేవి, యత్ = దేనిని, న కుర్యాత్ = చేయలేదో, తత్ = దానిని, పాణినా = చేతితో, సంస్పృష్టా = ముట్టుకొనబడినట్టి, అగ్నిశిఖా = అగ్నిజ్వాల, న కుర్యాత్ = చేయజాలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– సీతాదేవి తన భర్తయొక్క పరాక్రమమును ఎరిగినది గావున తాను రావణునిపై క్రోధము నొందలేదు అని భావము. అయినను ఆమె పాతివ్రత్య ప్రభావముచే ఆమెను స్పృశించిన రావణుని శరీరము దహింపబడవలసినదేగాని రావణుడు గూడ మహాతపశ్శక్తి సంపన్నుడగుటచే అట్లు దహింపబడకుండ నిలువగలిగినాడని తెలియవలెను.

**గోవిందరాజీయము** :– తాను క్రోధ కలుషితురాలయినచో సీతాదేవి ఎట్టివారినైనను భస్మము చేయగలదు గాని తన భర్తచేతనే శత్రునిర్మూలనము చేయించుట వీరపత్ని యొక్క ధర్మము, కాబట్టి భర్త పరాక్రమమునకు అగౌరవము కలుగకుండ తాను పారతంత్ర్యమునే అంగీకరించినది. అందుచేతనే రావణుడు జీవించి యుండగలిగినాడు. ఈ విషయ మామె వెనుకయే చెప్పియున్నదిగదా!

"అసందేశాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్,
న త్వాం కుర్మి దశగ్రీవ భస్మ భస్మార్హ తేజసా ॥"

**తాత్పర్యము :–** సీతాదేవి క్రోధోద్రేకము నొందిన యెడల ఎట్టి భయంకర శత్రువునైనను నిర్మూలనము చేయగలదు. చేతితో ముట్టుకొన్న అగ్నిజ్వాల ఒకప్పుడు దహింపలేక పోవచ్చునేమో గాని సీతమ్మయొక్క క్రోధము మాత్రము దహింపకుండుట సంభవించదు.

**శ్లో॥ జాంబవత్ప్రముఖా న్సర్వా ననుజ్ఞాప్య మహాహరీన్ ।**
**అస్మి న్నేవంగతే కార్యే భవతాం చ నివేదితే ।**
**న్యాయ్యం చ సహ వైదేహ్యా ద్రష్టుం తౌ పార్థివాత్మజౌ ॥ 6**

**పదచ్ఛేదము :–** జాంబవత్ ప్రముఖాన్ – సర్వాన్ – అనుజ్ఞాప్య – మహాహరీన్ – అస్మిన్ – ఏవం – గతే – కార్యే – భవతాం – చ – నివేదితే – న్యాయ్యం – చ – సహ – వైదేహ్యా – ద్రష్టుం – తౌ – పార్థివాత్మజౌ ॥

**అన్వయక్రమము :–** అస్మిన్ కార్యే ఏవం గతే సతి భవతాం చ నివేదితే చ సతి జాంబవత్ప్రముఖాన్ మహాహరీన్ సర్వాన్ అనుజ్ఞాప్య వైదేహ్యా చ సహ తౌ పార్థివాత్మజౌ ద్రష్టుం న్యాయ్యమ్.

**ప్రతిపదార్థము :–** అస్మిన్ = ఈ, కార్యే = కార్యము, ఏవం = ఈరీతిగా, గతే = జరిగినదికాగా, భవతాం = నీకు, నివేదితే సతి = విన్నవింపబడియుండగా, జాంబవత్ప్రముఖాన్ = జాంబవంతుడు మొదలైనట్టి, మహాహరీన్ = మహనీయులైన వానరులను, సర్వాన్ = అందరిని, అనుజ్ఞాప్య = అంగీకరింపచేసి, వైదేహ్యా చ సహ = సీతాదేవితోగూడ, తౌ = ఆ, పార్థివాత్మజౌ = రాజపుత్రులను, ద్రష్టుం = చూచుటకు, న్యాయ్యమ్ = న్యాయ్యము.

**తాత్పర్యము :–** ప్రస్తుతము తలపెట్టిన ఉద్యమము ఇంతవరకు సిద్ధించినదని తెలుపబడినది. పిమ్మట జాంబవంతుడు మున్నగు మహనీయులైన వానరులకు విన్నవించి వారి యనుజ్ఞ తీసికొని మనము సీతాదేవిని లంకనుండి తీసికొనివచ్చి ఆమెతో గలసియే రామలక్ష్మణులను దర్శించుట న్యాయమై యుండును.

**శ్లో॥ అహ మేకోఽపి పర్యాప్త స్సరాక్షసగణాం పురీమ్ ।**
**తాం లంకాం తరసా హంతుం రావణం చ మహాబలమ్ ॥ 7**

**పదచ్ఛేదము :–** అహమ్ – ఏకః – అపి – పర్యాప్తః – సరాక్షసగణాం – పురీమ్, తాం – లంకాం – తరసా – హంతుం – రావణం – చ – మహాబలమ్ ॥

**అన్వయక్రమము** :- సరాక్షసగణాం తాం లంకాం పురీం, మహాబలం రావణం చ తరసా హంతుమ్ ఏకః అపి అహం పర్యాప్తః.

**ప్రతిపదార్థము** :- సరాక్షసగణాం = రాక్షససమూహములతో గూడినట్టి, తాం = ఆ, లంకాపురీం = లంకానగరమును, మహాబలం = గొప్పబలశాలియైన, రావణం చ = రావణుని, తరసా = వేగముతో (బలముచే), హంతుం = చంపుటకు, ఏకః అపి = ఒక్కడనైనప్పటికిని, అహం = నేను, పర్యాప్తః = చాలినవాడను.

**తాత్పర్యము** :- రాక్షససైన్యము లన్నింటితో గూడిన ఆ లంకానగరమును నశింపజేసి మహాబలశాలియైన రావణుని నా పరాక్రమముచే సంహరించుటకు నేనొక్కడనే సరిపడెదను.

**శ్లో॥ కిం పున స్సహితో వీరైర్బలవద్భిః కృతాత్మభిః ।**
**కృతాస్త్రైః ప్లవగైః శూరై ర్భవద్భి ర్విజయైషిభిః ॥ 8**

**పదచ్ఛేదము** :- కిం - పునః - సహితః - వీరైః - బలవద్భిః - కృతాత్మభిః - కృతాస్త్రైః - ప్లవగైః - శూరైః - భవద్భిః - విజయైషిభిః ॥

**అన్వయక్రమము** :- వీరైః బలవద్భిః కృతాత్మభిః కృతాస్త్రైః విజయైషిభిః శూరైః ప్లవగైః భవద్భిః సహితః (చేత్) పునః కిం (వక్తవ్యమ్?).

**ప్రతిపదార్థము** :- వీరైః = వీరులును, బలవద్భిః = బలవంతులును, కృతాత్మభిః = నిశ్చయమైన మనస్సుగలవారును, కృతాస్త్రైః = నేర్చిన అస్త్రవిద్యగలవారును, విజయైషిభిః = విజయము గోరువారు నగు, శూరైః ప్లవగైః = శూరులైన వానరులగు, భవద్భిః = మీతోడ, సహితః (చేత్) = కూడినవాడనైనచో, పునః = తిరిగి, కిం (వక్తవ్యమ్?) = ఏమి చెప్పవలెను?

**తాత్పర్యము** :- మహావీరులును, మహాబలాఢ్యులును, స్థిరసంకల్పులును, అస్త్రనిపుణులును, జయాభిలాష గలవారునగు యోధులైన మీ యందరితో గలసి లంకమీదికి వెడలినచో శత్రుసంహారవిషయమై ఇంక ఏమి చెప్పవలెను?

**శ్లో॥ అహం తు రావణం యుద్ధే ససైన్యం సపురస్సరమ్ ।**
**సహపుత్రం వధిష్యామి సహోదరయుతం యుధి ॥ 9**

**పదచ్ఛేదము** :- అహం - తు - రావణం - యుద్ధే - ససైన్యం - సపురస్సరమ్, సహపుత్రం - వధిష్యామి - సహోదరయుతం - యుధి ॥

**అన్వయక్రమము** :- అహం తు యుద్ధే ససైన్యం సపురస్సరం, సహపుత్రం,

సహోదరయుతం రావణం యుధి వధిష్యామి.

**ప్రతిపదార్థము** :– అహం తు = నేనే, యుద్ధే = యుద్ధమునందు, ససైన్యం = సేనతోగూడినవాడును, సపురస్సరం = అగ్రేసరులతో గూడినవాడును, సహపుత్రం = పుత్రులతో గూడినవాడును, సహోదరయుతం = సోదరులతో గూడినవాడునగు, రావణం = రావణుని, యుధి = యుద్ధమునందు, వధిష్యామి = సంహరించెదను.

**తాత్పర్యము** :– నేనొక్కడనే యుద్ధభూమిలో నిలిచి మహాసైన్యములతోడను, మహా సేనాధిపతులతోడను, పుత్రులతోడను, సోదరులతోడను గూడిన రావణునితో రణమొనరించి ఆతనిని వధించెదను.

**శ్లో॥ బ్రాహ్మ మైంద్రం చ రౌద్రం చ వాయవ్యం వారుణం తథా ।**
**యది శక్రజితోఽస్త్రాణి దుర్నిరీక్ష్యాణి సంయుగే ॥ 10**

**శ్లో॥ తాన్యహం విధమిష్యామి నిహనిష్యామి రాక్షసాన్ ।**
**భవతామభ్యనుజ్ఞాతో విక్రమో మే రుణద్ధి తమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– బ్రాహ్మమ్ – ఐంద్రం – చ – రౌద్రం – చ – వాయవ్యం – వారుణం – తథా, యది – శక్రజితః – అస్త్రాణి – దుర్నిరీక్ష్యాణి – సంయుగే, తాని – అహం – విధమిష్యామి – నిహనిష్యామి – రాక్షసాన్, భవతామ్ – అభ్యనుజ్ఞాతః – విక్రమః – మే – రుణద్ధి – తమ్ ॥

**అన్వయక్రమము** :– బ్రాహ్మమ్, ఐంద్రం, రౌద్రం, వాయవ్యం, వారుణం, తథా శక్రజితః దుర్నిరీక్ష్యాణి (అన్యాని) అస్త్రాణి, యది (ఆపతేయుః) తాని అహం భవతామ్ అభ్యనుజ్ఞాతః సంయుగే విధమిష్యామి, రాక్షసాన్ నిహనిష్యామి, మే విక్రమః తం రుణద్ధి.

**ప్రతిపదార్థము** :– బ్రాహ్మం = బ్రహ్మాస్త్రము, ఐంద్రం = ఇంద్రాస్త్రము, రౌద్రం = పాశుపతాస్త్రము, వాయవ్యం = వాయవ్యాస్త్రము, వారుణం = వారుణాస్త్రము, తథా = అట్లే, శక్రజితః = ఇంద్రజిత్తుయొక్క, (అన్యాని = ఇతరములైన) అస్త్రాణి = అస్త్రములు, యది (ఆపతేయుః) = ఒకవేళ ప్రయోగింపబడునేని, తాని = ఆ యస్త్రములను, అహం = నేను, భవతాం = మీయొక్క, అభ్యనుజ్ఞాతః = అనుమతి వలన, సంయుగే = యుద్ధమునందు, విధమిష్యామి = అణచివేయుదును, రాక్షసాన్ = రాక్షసులను, నిహనిష్యామి = పూర్తిగా వధించెదను, మే = నా యొక్క, విక్రమః = పరాక్రమము, తం = ఆ ఇంద్రజిత్తును, రుణద్ధి = నిరోధించును.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- 'భవతామ్ అభ్యనుజ్ఞాతః' - హనుమ పూర్వము లంకను ధ్వంసము చేసినప్పుడే ఆయా రక్కసులను వధించినప్పుడే రావణాదులను వధింపవచ్చును గదా అనుకొందురేమో యని, మీ యనుజ్ఞ లేకుండుటచేతనే వారిని అప్పుడు వధింప లేదనియు, మీ యనుజ్ఞయైనచో ఇప్పుడు వధింపగలననియు భావము.

**రా.శిరోమణి** :- 'భవతాం అభ్యనుజ్ఞాతః' - అనుదానికి బదులుగా 'భవతామననుజ్ఞాతః' అని పాఠాంతరము, ఈ పక్షమున -

'భవతామ్ అననుజ్ఞాతః మే విక్రమః మాం రుణద్ధి' అని అన్వయించి నీ యనుజ్ఞ లేకపోవుటచే నా పరాక్రమము నన్ను అడ్డగించి రావణాదులను వధింపకుండ చేసినది యని గ్రహించవలెను.

**తాత్పర్యము** :- వివిధమహాస్త్రవేదియైన ఇంద్రజిత్తుయొక్క బ్రాహ్మము, ఐంద్రము, పాశుపతము, వాయవ్యము, వారుణము మున్నగు శత్రుభయంకరములైన అస్త్రములు ఎన్ని ప్రయోగింపబడినప్పటికిని మీ యనుజ్ఞ పొంది రణరంగమునందు వాని నన్నింటిని ఎదుర్కొని అణచివైచెదను. ఆ రాక్షసుల నెల్లరిని సంహరించెదను. నా పరాక్రమ మా ఇంద్రజిత్తును అవలీలగా పరిమార్చగలదు.

**శ్లో॥ మయా ఽ తులా విసృష్టా హి శైలవృష్టి ర్నిరంతరా ।**
**దేవానపి రణే హన్యా త్కింపున స్తా న్నిశాచరాన్ ॥ 12**

**పదచ్ఛేదము** :- మయా - అతులా - విసృష్టా - హి - శైలవృష్టిః - నిరంతరా, దేవాన్ - అపి - రణే - హన్యాత్ - కిం - పునః - తాన్ - నిశాచరాన్ ॥

**అన్వయక్రమము** :- రణే మయా విసృష్టా నిరంతరా అతులా శైలవృష్టిః దేవాన్ అపి రణే హన్యాత్, తాన్ నిశాచరాన్ (హన్యాత్ ఇతి) కిం పునః (వక్తవ్యమ్?).

**ప్రతిపదార్థము** :- రణే = యుద్ధమునందు, మయా = నాచేత, విసృష్టా = విడువబడిన, నిరంతరా = ఎడతెరిపిలేనట్టి, అతులా = సాటిలేనట్టి, శైలవృష్టిః = పర్వత వర్షము, దేవాన్ అపి = దేవతలనుగూడ, హన్యాత్ = హతమార్చును. తాన్ = ఆ, నిశాచరాన్ = రాక్షసులను, హన్యాత్ (ఇతి) = చంపునని, కిం పునః (వక్తవ్యమ్) = తిరిగి చెప్పవలసిన దేమి?

**తాత్పర్యము** :- రణరంగమున విజృంభించి నేను కురిపించెడి సాటిలేని శిలావర్షము దేవతలను గూడ హతమార్చును. ఈ లంకలోని రాక్షసులను సంహరించుట లెక్క

ఏమి?

**శ్లో॥ సాగరో ఉ_ప్యతియా ద్వేలాం మందరః ప్రచలేదపి ।**
**న జాంబవంతం సమరే కంపయే దరివాహినీ ॥ 13**

**పదచ్ఛేదము :–** సాగరః – అపి – అతియాత్ – వేలాం – మందరః – ప్రచలేత్ – అపి, న – జాంబవంతం – సమరే – కంపయేత్ – అరివాహినీ ॥

**అన్వయక్రమము :–** సాగరః వేలాం అతియాత్ అపి, మందరః ప్రచలేత్ అపి, సమరే అరివాహినీ జాంబవంతం న కంపయేత్?

**ప్రతిపదార్థము :–** సాగరః = సముద్రము, వేలాం = చెలియలికట్టను, అతియాత్ అపి = దాటిరావచ్చునుగూడ, మందరః = మందర పర్వతము, ప్రచలేత్ అపి = చలింప వచ్చును గూడ, సమరే = యుద్ధమునందు, అరివాహినీ = శత్రుసైన్యము, జాంబవంతం = జాంబవంతుని, న కంపయేత్ = చలింపచేయజాలదు.

**తాత్పర్యము :–** సముద్రము చెలియలికట్ట దాటి రావచ్చును. మందరపర్వతము చలింప వచ్చును కూడ, కాని మన జాంబవంతుని మాత్రము యుద్ధమునందు ఎట్టి శత్రుసైన్యమైనను చలింపచేయజాలదు గదా!

**శ్లో॥ సర్వరాక్షససంఘానాం రాక్షసా యే చ పూర్వజాః ।**
**అల మేకో వినాశాయ వీరో వాలిసుతః కపిః ॥ 14**

**పదచ్ఛేదము :–** సర్వరాక్షససంఘానాం – రాక్షసాః – యే – చ – పూర్వజాః, అలమ్ – ఏకః – వినాశాయ – వీరః – వాలిసుతః – కపిః ॥

**అన్వయక్రమము :–** వీరః వాలిసుతః కపిః ఏకః, సర్వరాక్షససంఘానాం, యే పూర్వజాః రాక్షసాః (తేషాం సర్వేషాం) వినాశాయ అలమ్?

**ప్రతిపదార్థము :–** వీరః = వీరుడైనట్టి, వాలిసుతః = వాలిపుత్రుడైన, కపిః = అంగదుడు, సర్వరాక్షససంఘానాం = సమస్తరాక్షసగణములకును, పూర్వజాః = ప్రాచీనులైన, యే రాక్షసాః = ఏ రాక్షసులు అయితే, (సంతి = ఉన్నారో) తేషాం సర్వేషాం = వారందరియొక్క, వినాశాయ = వినాశము కొఱకు, ఏకః = ఒక్కడే, ఆలం = చాలును.

**తాత్పర్యము :–** లంకలో గల సర్వరాక్షసగణములను, వారికి పెద్దలైనట్టి మహావీరులను గూడ యుద్ధమునందు వధించుటకు వాలిపుత్రుడైన మన అంగదు డొక్కడే సరిపోవును.

**శ్లో॥ పనస స్యోరువేగేన నీలస్య చ మహాత్మనః ।**
**మందరోఽపి విశీర్యేత కిం పున ర్యుధి రాక్షసాః ॥ 15**

**పదచ్ఛేదము** :– పనసస్య – ఊరువేగేన – నీలస్య – చ – మహాత్మనః – మందరః – అపి – విశీర్యేత – కిం – పునః – యుధి – రాక్షసాః ॥

**అన్వయక్రమము** :– పనసస్య, మహాత్మనః నీలస్య చ ఊరువేగేన మందరః అపి విశీర్యేత, యుధి రాక్షసాః పునః కిమ్?

**ప్రతిపదార్థము** :– పనసస్య = పనసుని యొక్కయు, మహాత్మనః = మహనీయుడైన, నీలస్య చ = నీలునియొక్కయును, ఊరువేగేన = తొడలవేగముచే, మందరః అపి = మందరపర్వతము గూడ, విశీర్యేత = ముక్కలగును, యుధి = యుద్ధమునందు, రాక్షసాః = రక్కసులు, కిం పునః = చెప్పవలసినదేమి?

**తాత్పర్యము** :– పనసుడు, మహనీయుడైన నీలుడు ఇరువురును విజృంభించినచో వారి తొడల వేగముచే మందర పర్వతము గూడ బీటలు వారి ముక్కలు గావలసినదే! ఇక యుద్ధమున ఎదురు నిలుచు రాక్షసుల మాట చెప్పవలసినదేమున్నది?

**శ్లో॥ సదేవాసురయక్షేషు గంధర్వోరగపక్షిషు ।**
**మైందస్య ప్రతియోద్ధారం శంసత ద్వివిదస్య వా ॥ 16**

**పదచ్ఛేదము** :– సదేవాసురయక్షేషు – గంధర్వోరగపక్షిషు – మైందస్య – ప్రతియోద్ధారం – శంసత – ద్వివిదస్య – వా ॥

**అన్వయక్రమము** :– సదేవాసురయక్షేషు, గంధర్వోరగపక్షిషు మైందస్య, ద్వివిదస్య వా ప్రతియోద్ధారం శంసత.

**ప్రతిపదార్థము** :– సదేవాసురయక్షేషు = దేవతలతో గూడిన రాక్షసులందును, యక్షులందును, గంధర్వోరగపక్షిషు = గంధర్వులందును నాగులందును, పక్షులందును, మైందస్య = మైందునకు గాని, ద్వివిదస్య వా = ద్వివిదునకు గాని, ప్రతియోద్ధారం = ఎదురుగ నిల్చు వీరుని, శంసత = చెప్పుడు?

**తాత్పర్యము** :– దేవతలందైనను రాక్షసులందైనను యక్షులందైనను గంధర్వులందైనను నాగులలోనైనను పక్షులతోనైనను, మన మైందునకు గాని ద్వివిదునకు గాని, ఎదురుగ నిలచి పోరాడు యోధుడు ఉండునేమో మీరు చెప్పుడు?

**శ్లో॥ పితామహవరోత్సేకా త్పరమం దర్ప మాస్థితౌ ।**
**అమృతప్రాశినా వేతౌ సర్వవానరసత్తమౌ ॥ 17**

**పదచ్ఛేదము** :– పితామహవరోత్సేకాత్ – పరమం – దర్పమ్ – ఆస్థితౌ, అమృతప్రాశినౌ – ఏతౌ – సర్వవానరసత్తమౌ ॥

**అన్వయక్రమము** :– పితామహవరోత్సేకాత్ పరమం దర్పమ్ ఆస్థితౌ, అమృతప్రాశినౌ ఏతౌ సర్వవానరసత్తమౌ.

**ప్రతిపదార్థము** :– పితామహవరోత్సేకాత్ = బ్రహ్మదేవునియొక్క వరముయొక్క అతిశయమువలన, పరమం = గొప్పదైన, దర్పం = గర్వమును, ఆస్థితౌ = పొందిన వారును, అమృతప్రాశినౌ = అమృతమును భుజించిన వారునగు, ఏతౌ = వీరు, సర్వవానరసత్తమౌ = వానరులందరిలోను మిన్నలైనట్టివారు.

**తాత్పర్యము** :– అశ్వినీపుత్రులైన ఈ మైందద్వివిదులు బ్రహ్మ ఇచ్చిన వరముల ప్రభావముచే మిక్కిలి మదించి యున్నవారై అమృతమును భుజించి వానరులలో కెల్ల శ్రేష్ఠులని పేరుపొందినట్టివారుగదా!

**శ్లో॥ అశ్వినో ర్మాననార్థం హి సర్వలోకపితామహః ।**
**సర్వావధ్యత్వ మతుల మనయో ర్దత్తవా న్పురా ॥ 18**

**పదచ్ఛేదము** :– అశ్వినోః – మాననార్థం – హి – సర్వలోకపితామహః, సర్వావధ్యత్వమ్ – అతులం – అనయోః – దత్తవాన్ – పురా ॥

**అన్వయక్రమము** :– పురా సర్వలోకపితామహః అశ్వినోః మాననార్థమ్ అనయోః అతులం సర్వావధ్యత్వం దత్తవాన్ హి.

**ప్రతిపదార్థము** :– పురా = పూర్వము, సర్వలోకపితామహః = సమస్త లోకములకును పితామహుడైన బ్రహ్మదేవుడు, అశ్వినోః = అశ్వినీదేవతల యొక్క, మాననార్థం = గౌరవార్థమై, అనయోః = వీరిరువురికిని, అతులం = సాటిలేనట్టి, సర్వావధ్యత్వం = ఎల్లరిచేతను చావులేకుండుటను, దత్తవాన్ హి = ఇచ్చినాడుగదా!

**తాత్పర్యము** :– సమస్తలోకములకును పితామహుడైనట్టి బ్రహ్మదేవుడు అశ్వినీ దేవతలను గౌరవించుటకై వారి సంతానమైన వీరిరువురికిని పూర్వము ఎవ్వరి వలనను మరణము లేకుండునట్లు గొప్పదైన వరమును ఇచ్చి యున్నాడుగదా!

**శ్లో॥ వరోత్సేకేన మత్తౌ చ ప్రమథ్య మహతీం చమూమ్ ।**
**సురాణా మమృతం వీరౌ పీతవంతౌ ప్లవంగమౌ ॥ 19**

**పదచ్ఛేదము :–** వరోత్సేకేన – మత్తౌ – చ – ప్రమథ్య – మహతీం – చమూమ్, సురాణామ్ – అమృతం – వీరౌ – పీతవంతౌ – ప్లవంగమౌ ॥

**అన్వయక్రమము :–** వరోత్సేకేన మత్తౌ వీరౌ (ఏతౌ) ప్లవంగమౌ సురాణాం మహతీం చమూం ప్రమథ్య అమృతం పీతవంతౌ.

**ప్రతిపదార్థము :–** వరోత్సేకేన = వరముయొక్క అతిశయముచేత, మత్తౌ = మదించిన వారైన, ఏతౌ = ఈ, వీరౌ = వీరులైన, ప్లవంగమౌ = వానరులిరువురును, సురాణాం = దేవతల యొక్క, మహతీం = గొప్పదైన, చమూం = సైన్యమును, ప్రమథ్య = మర్దించి, అమృతం = అమృతమును, పీతవంతౌ = త్రాగినారు.

**తాత్పర్యము :–** ఆ వరముయొక్క మహిమచే మదించినవారై మహావీరులైన ఈ వానరులిరువురును స్వర్గమునందలి గొప్ప దేవతల సైన్యము నంతను అణచి అమృతమును త్రాగియున్నారు.

**శ్లో॥ ఏతావేవ హి సంక్రుద్ధౌ సవాజిరథకుంజరామ్ ।**
**లంకాం నాశయితుం శక్తౌ సర్వే తిష్ఠంతు వానరాః ॥ 20**

**పదచ్ఛేదము :–** ఏతౌ – ఏవ – హి – సంక్రుద్ధౌ – సవాజిరథకుంజరామ్, లంకాం – నాశయితుం – శక్తౌ – సర్వే – తిష్ఠంతు – వానరాః ॥

**అన్వయక్రమము :–** సంక్రుద్ధౌ ఏతౌ ఏవ సవాజిరథకుంజరాం లంకాం నాశయితుం శక్తౌ హి వానరాః సర్వే (దూరే) తిష్ఠంతు.

**ప్రతిపదార్థము :–** సంక్రుద్ధౌ = క్రోధము నొందినవారైన, ఏతౌ ఏవ = వీరిరువురే, సవాజిరథకుంజరాం = గుఱ్ఱములతోడను, రథములతోడను, ఏనుగులతోడను గూడినట్టి, లంకాం = లంకానగరమును, నాశయితుం = నశింపచేయుటకు, శక్తౌ హి = శక్తిగలిగినట్టివారు గదా! వానరాః = వానరులు, సర్వే = అందరును, (దూరే = దూరమున) తిష్ఠంతు = ఉందురుగాక!

**తాత్పర్యము :–** వీరిరువురును విజృంభించినయెడల చతురంగ బలసమేతమైన లంకానగరమునంతను ఒక్క చేతిమీదనే నశింప చేయగలరు; మిగిలిన వానరవీరు లెల్లరును కదలవలసిన పనియే యుండదు.

**శ్లో॥ మయైవ నిహతా లంకా దగ్ధా భస్మీకృతా పునః ।**
**రాజమార్గేషు సర్వత్ర నామ విశ్రావితం మయా ॥ 21**

**పదచ్ఛేదము** :– మయా – ఏవ – నిహతా – లంకా – దగ్ధా – భస్మీకృతా – పునః, రాజమార్గేషు – సర్వత్ర – నామ – విశ్రావితం – మయా ॥

**అన్వయక్రమము** :– లంకా మయా ఏవ నిహతా, దగ్ధా భస్మీకృతా, పునః రాజమార్గేషు మయా నామ సర్వత్ర విశ్రావితమ్.

**ప్రతిపదార్థము** :– లంకా = లంకానగరి, మయైవ = నాచేతనే, నిహతా = కూల్చబడినది, దగ్ధా = దహింపబడినది, భస్మీకృతా = బూడిదచేయబడినది, పునః = తిరిగి, రాజమార్గేషు = రాజవీథులందు, మయా = నాచేత, నామ = పేరు, సర్వత్ర = ఎల్లయెడల, విశ్రావితం = వినిపింపబడినది.

**తాత్పర్యము** :– నేనే లంకానగరము నంతను ధ్వంసము చేసి, దగ్ధము గావించి, భస్మముచేసి వచ్చితిని. మరియు నచ్చటి రాజమార్గమునం దెల్లెడల మన పేరును ఎల్లరికిని వినిపించితిని.

**శ్లో॥ జయ త్యతిబలో రామో లక్ష్మణశ్చ మహాబలః ।**
**రాజా జయతి సుగ్రీవో రాఘవే ణాభిపాలితః ॥ 22**

**పదచ్ఛేదము** :– జయతి – అతిబలః – రామః – లక్ష్మణః – చ – మహాబలః, రాజా – జయతి – సుగ్రీవః – రాఘవేణ – అభిపాలితః ॥

**అన్వయక్రమము** :– అతిబలః రామః జయతి, మహాబలః లక్ష్మణః చ జయతి, రాఘవేణ అభిపాలితః రాజా సుగ్రీవః జయతి.

**ప్రతిపదార్థము** :– అతిబలః = అమితబలాఢ్యుడైన, రామః = రాముడు, జయతి = వర్ధిల్లుచున్నాడు, మహాబలః = మహాబలశాలియైన, లక్ష్మణః చ = లక్ష్మణుడును, (జయతి = వర్ధిల్లుచున్నాడు), రాఘవేణ = శ్రీరామునిచే, అభిపాలితః = కాపాడబడు చున్నట్టి, రాజా = వానరరాజైన, సుగ్రీవః = సుగ్రీవుడు, జయతి = వర్ధిల్లు చున్నాడు.

**తాత్పర్యము** :– అమితబలసంపన్నుడైన శ్రీరామచంద్రుడు సర్వోత్కర్షముగా వర్ధిల్లు చున్నాడు. శ్రీరామునిచే కాపాడబడుచున్న వానరరాజైన సుగ్రీవుడును మహోత్కర్షముతో వృద్ధిపొందుచున్నాడు.

**శ్లో॥ అహం కోసలరాజస్య దాసః పవనసంభవః ।**
**హనుమానితి సర్వత్ర నామ విశ్రావితం మయా ॥ 23**

**పదచ్ఛేదము** :- అహం - కోసలరాజస్య - దాసః - పవనసంభవః, హనుమాన్ - ఇతి - సర్వత్ర - నామ - విశ్రావితం - మయా ॥

**అన్వయక్రమము** :- అహం కోసలరాజస్య దాసః పవనసంభవః హనుమాన్ ఇతి మయా సర్వత్ర నామ విశ్రావితమ్.

**ప్రతిపదార్థము** :- అహం = నేను, కోసలరాజస్య = కోసలాధిపతియొక్క, దాసః = బంటును, పవనసంభవః = వాయుపుత్రుడను, హనుమాన్ = హనుమంతుడను వాడను, ఇతి = అని, మయా = నాచేత, సర్వత్ర = ఎల్లయెడల, నామ = పేరు, విశ్రావితమ్ = వినిపింపబడినది.

**తాత్పర్యము** :- కోసలాధీశుడైన శ్రీరామచంద్రునకు దాసుడనైన నేను వాయుపుత్రుడను, హనుమంతు డను పేరుగలవాడ ననుచు ఎల్లెడల తిరుగుచు వారెల్లరికిని నా పేరు వినిపించితిని.

**శ్లో॥ అశోకవనికామధ్యే రావణస్య దురాత్మనః ।**
**అధస్తా చ్ఛింశుపావృక్షే సాధ్వీ కరుణ మాస్థితా ॥ 24**

**పదచ్ఛేదము** :- అశోకవనికామధ్యే - రావణస్య - దురాత్మనః, అధస్తాత్ - శింశుపావృక్షే - సాధ్వీ - కరుణమ్ - ఆస్థితా ॥

**అన్వయక్రమము** :- దురాత్మనః రావణస్య అశోకవనికామధ్యే శింశుపావృక్షే అధస్తాత్ సాధ్వీ కరుణమ్ ఆస్థితా.

**ప్రతిపదార్థము** :- దురాత్మనః = దుర్మార్గుడైన, రావణస్య = రావణుని యొక్క, అశోకవనికామధ్యే = అశోకవనము నడుమ, శింశుపావృక్షే = శింశుపావృక్షమున, అధస్తాత్ = క్రిందిభాగమున, సాధ్వీ = పతివ్రతయగు సీత, కరుణం = దుఃఖముగా, ఆస్థితా = ఉన్నది.

**తాత్పర్యము** :- దుర్మార్గుడైన ఆ రావణునియొక్క అశోకవనమునందు నడుమనున్న శింశుపావృక్షము క్రింద సీతమ్మతల్లి చూచువారికి దుఃఖము కల్గించుచు ఉన్నది.

**శ్లో॥ రాక్షసీభిః పరివృతా శోకసంతాపకర్శితా ।**
**మేఘలేఖాపరివృతా చంద్రలేఖేవ నిష్ప్రభా ॥ 25**

**శ్లో॥ అచింతయంతీ వైదేహీ రావణం బలదర్పితమ్ ॥ 26**

**పదచ్ఛేదము :–** రాక్షసీభిః – పరివృతా – శోకసంతాపకర్శితా, మేఘలేఖాపరివృతా – చంద్రలేఖా – ఇవ – నిష్ప్రభా, అచింతయంతీ – వైదేహీ – రావణం – బలదర్పితమ్ ॥

**అన్వయక్రమము :–** రాక్షసీభిః పరివృతా శోకసంతాపకర్శితా, బలదర్పితం రావణం అచింతయంతీ వైదేహీ, మేఘలేఖాపరివృతా నిష్ప్రభా చంద్రలేఖా ఇవ (కరుణమ్ ఆస్థితా).

**ప్రతిపదార్థము :–** రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, పరివృతా = చుట్టుకొనబడినదై, శోకసంతాపకర్శితా = శోకముచేత సంతాపముచేత కృశింపచేయబడినదై, బలదర్పితం = బలముచే మదించియున్న, రావణం = రావణుని, అచింతయంతీ = లెక్కచేయనిదై, మేఘలేఖాపరివృతా = మబ్బులపంక్తిచే కప్పబడియున్న, నిష్ప్రభా = కాంతిలేని, చంద్రలేఖా ఇవ = చంద్రరేఖవలె, (కరుణం = దుఃఖముగా), ఆస్థితా = ఉన్నది.

**తాత్పర్యము :–** అచ్చట జానకీదేవి బలదర్పితుడైన రావణుని ఏమియు లెక్కచేయకున్నదై రాక్షసస్త్రీలచే పరివేష్టింపబడి, శోకసంతాపములచే కృశించియున్నదై, మేఘఖండములచే కప్పబడియున్న తేజోవిహీనమైన చంద్రవంకవలె కానవచ్చుచున్నది.

**శ్లో॥ పతివ్రతా చ సుశ్రోణీ అవష్టబ్ధా చ జానకీ ।**
**అనురక్తా హి వైదేహీ రామం సర్వాత్మనా శుభా ॥ 27**

**శ్లో॥ అనన్యచిత్తా రామే చ పౌలోమీవ పురందరే ॥ 28**

**పదచ్ఛేదము :–** పతివ్రతా – చ – సుశ్రోణీ – అవష్టబ్ధా – చ – జానకీ, అనురక్తా – హి – వైదేహీ – రామం – సర్వాత్మనా – శుభా, అనన్యచిత్తా – రామే – చ – పౌలోమీ – ఇవ – పురందరే ॥

**అన్వయక్రమము :–** సుశ్రోణీ జానకీ పతివ్రతా అవష్టబ్ధా చ; శుభా వైదేహీ రామే అనన్యచిత్తా (సతీ) పురందరే పౌలోమీ ఇవ సర్వాత్మనా రామం అనురక్తా హి.

**ప్రతిపదార్థము :–** సుశ్రోణీ = సుందరమైన కటిసీమగల, జానకీ = సీతాదేవి, పతివ్రతా చ = పతివ్రతయును, అవష్టబ్ధా చ = అరికట్టబడినదిగను ఉన్నది, శుభా = మంగళ కరురాలైన, వైదేహీ = జానకీదేవి, రామే = శ్రీరామునియందు, అనన్యచిత్తా (సతీ) = ఏకాగ్రచిత్తురాలగుచు, పురందరే = దేవేంద్రునియందు, పౌలోమీ ఇవ = శచీదేవివలె, సర్వాత్మనా = సంపూర్ణమైన మనస్సుతో, రామం = శ్రీరాముని, అనురక్తా హి =

అనురక్తురాలై యున్నది.

**తాత్పర్యము** :- సుందరాగియైన సీతాదేవి తన పతివ్రతాధర్మమును నిలుపుకొనుచు రాక్షసులచే నిర్బంధితురాలై యున్నది. మంగళస్వరూపురాలైన ఆ జానకీదేవి సర్వవిధముల శ్రీరామునియం దనురక్తురాలై, నహుషుని నిర్బంధము నందున్నను శచీదేవి దేవేంద్రునియందే తన మనస్సు లగ్నము చేసికొని యున్నట్లు, రామచంద్రుని యందే తన మనస్సు లగ్నము చేసి ఏకాగ్రచిత్తముతో నున్నది.

**శ్లో॥ తదేకవాసస్సంవీతా రజోధ్వస్తా తథైవ చ ।**
**శోకసంతాపదీనాంగీ సీతా భర్తృహితే రతా ॥ 29**

**పదచ్ఛేదము** :- తదేకవాసస్సంవీతా - రజోధ్వస్తా - తథా - ఏవ - చ, శోక సంతాపదీనాంగీ - సీతా - భర్తృహితే - రతా ॥

**అన్వయక్రమము** :- తదేకవాసస్సంవీతా తథైవ రజోధ్వస్తా శోకసంతాపదీనాంగీ, సీతా భర్తృహితే రతా.

**ప్రతిపదార్థము** :- తదేకవాసస్సంవీతా = ఆ ఒక్క చీరచేతనే ధరింపబడినదై, తథైవ = అట్లే, రజోధ్వస్తా = ధూళిచే మలినమైనదై, శోకసంతాపదీనాంగీ = శోకము చేతను సంతాపముచేతను దుఃఖజనకముగనున్న శరీరముగలదై, సీతా = సీతాదేవి, భర్తృహితే = భర్తయొక్క శ్రేయస్సునందు, రతా = నిమగ్నురాలై యున్నది.

**తాత్పర్యము** :- మనము చూచిన ఆనాటి చీరనే ధరించి యున్నదై శరీరమంతయును ధూళిచే కప్పబడి శోకసంతాపములచే కృశించిపోయిన శరీరముతో జానకీదేవి తన భర్తయొక్క శ్రేయస్సునే కాంక్షించుచున్నది.

**శ్లో॥ సా మయా రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః ।**
**రాక్షసీభి ర్విరూపాభి ర్దృష్టా హి ప్రమదావనే ॥ 30**

**పదచ్ఛేదము** :- సా - మయా - రాక్షసీమధ్యే - తర్జ్యమానా - ముహుః - ముహుః, రాక్షసీభిః - విరూపాభిః - దృష్టా - హి - ప్రమదావనే ॥

**అన్వయక్రమము** :- ప్రమదావనే రాక్షసీమధ్యే విరూపాభిః రాక్షసీభిః ముహుః ముహుః తర్జ్యమానా సా మయా దృష్టా హి.

**ప్రతిపదార్థము** :- ప్రమదావనే = ఉద్యానవనమునందు, రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీల నడుమ, విరూపాభిః = వికృతాకారములుగల, రాక్షసీభిః = రాక్షసవనితలచే, ముహుః ముహుః = మాటిమాటికిని, తర్జ్యమానా = గద్దింపబడుచున్నదై, సా = ఆ జానకీ

దేవి, మయా = నా చేత, దృష్టా హి = చూడబడెనుసుడీ!

**తాత్పర్యము :–** రావణుని ప్రమదావనమునందు రాక్షసస్త్రీల నడుమ వికృతమైన శరీరములు గల్గినట్టి రాక్షసవనితలు తనను మాటిమాటికిని గద్దించుచుండగా దీనమైన స్థితిలో సీతాదేవి నాకు కాన్పించినది.

**శ్లో॥ ఏకవేణీధరా దీనా భర్తృచింతాపరాయణా ।**
**అధశ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే ॥ 31**

**పదచ్ఛేదము :–** ఏకవేణీధరా – దీనా – భర్తృచింతాపరాయణా, అధశ్శయ్యా – వివర్ణాంగీ – పద్మినీ – ఇవ – హిమాగమే ॥

**అన్వయక్రమము :–** ఏకవేణీధరా దీనా భర్తృచింతాపరాయణా అధశ్శయ్యా హిమాగమే పద్మినీ ఇవ వివర్ణాంగీ (దృష్టా).

**ప్రతిపదార్థము :–** ఏకవేణీధరా = ఒక్కజడగా ఏర్పడిన కేశసమూహమును ధరించినదియును, దీనా = దుఃఖజనకముగ నున్నదియును, భర్తృచింతాపరాయణా = భర్తయొక్క ధ్యానమునందు నిమగ్నురాలై యున్నదియును, అధశ్శయ్యా = నేలయే శయ్యగా గలదియును, హిమాగమే = హేమంతకాలమునందలి, పద్మినీ ఇవ = తామరతీగవలె, వివర్ణాంగీ = వెలవెల బోవుచున్న శరీరము గలదియును అగు, (సా = ఆ సీతాదేవి), (మయా = నాచే), దృష్టా = చూడబడినది.

**తాత్పర్యము :–** ఆ సీతాదేవి కేశములు ఒకే జడగా అంటుకొని పోయి యుండెను. ఆమె రూపము దుఃఖజనకముగ నుండెను. నేలనే శయ్యగా చేసికొని భర్తృ చింతాపరాయణురాలై హేమంతఋతువునందలి తామరతీగవలె వెలవెలపోవుచు కానవచ్చినది.

**శ్లో॥ రావణా ద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా ।**
**కథంచి న్మృగశాబాక్షీ విశ్వాస ముపపాదితా ॥ 32**

**పదచ్ఛేదము :–** రావణాత్ – వినివృత్తార్థా – మర్తవ్యకృతనిశ్చయా, కథంచిత్ – మృగశాబాక్షీ – విశ్వాసమ్ – ఉపపాదితా ॥

**అన్వయక్రమము :–** రావణాత్ వినివృత్తార్థా, మర్తవ్యకృతనిశ్చయా (సా) మృగశాబాక్షీ కథంచిత్ విశ్వాసమ్ ఉపపాదితా.

**ప్రతిపదార్థము :–** రావణాత్ = రావణునినుండి, వినివృత్తార్థా = మరలించుకొనిన ప్రయోజనము గలదియును, మర్తవ్యకృతనిశ్చయా = చనిపోవలెనని చేసికొనిన

నిశ్చయము గలదియును, (సా = ఆ), మృగశాబాక్షీ = లేడిపిల్ల కన్నులవంటి నేత్రములుగల ఆ సీతాదేవి, కథంచిత్ = ఎట్లో, విశ్వాసం = నమ్మకమును, ఉపపాదితా = కలిగింపబడినది.

**తాత్పర్యము :–** రావణునివలన తనకు విడుదల గలుగునను ఆశ తొలగినదై ఆత్మహత్య చేసికొనుటకే నిశ్చయించుకొన్నట్టి ఆ భీతచిత్తయైన సీతాదేవిని సమీపించి ఎట్లో ఆమెకు నాపై నమ్మకము కలిగించుకొనగలిగితిని.

**శ్లో॥ తత స్సంభాషితా చైవ సర్వమర్థం చ దర్శితా ।**
**రామసుగ్రీవసఖ్యం చ శ్రుత్వా ప్రీతి ముపాగతా ॥ 33**

**పదచ్ఛేదము :–** తతః – సంభాషితా – చ – ఏవ – సర్వమ్ – అర్థం – చ – దర్శితా, రామసుగ్రీవసఖ్యం – చ – శ్రుత్వా – ప్రీతిమ్ – ఉపాగతా ॥

**అన్వయక్రమము :–** తతః సంభాషితా చ సర్వమ్ అర్థం దర్శితా చ (సా) రామసుగ్రీవ సఖ్యం శ్రుత్వా ప్రీతిమ్ ఉపాగతా.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, సంభాషితా = మాటలాడబడినదియును, సర్వం = సమస్తమైన, అర్థం = విషయమును, దర్శితా = తెలుపబడినది, (సతీ = అగుచు), సా = ఆ సీతమ్మ, రామసుగ్రీవసఖ్యం చ = రామసుగ్రీవుల మైత్రిని గూర్చి గూడ, శ్రుత్వా = విని, ప్రీతిం = సంతోషమును, ఉపాగతా = పొందినది.

**తాత్పర్యము :–** ఆమెకు నమ్మకము కలిగిన పిమ్మట ఆమెతో సంభాషించి తెలుపవలసిన విషయమును నివేదించితిని. నేను చెప్పినదంతయును తెలిసికొని రామసుగ్రీవుల మైత్రీ వృత్తాంతమును విని ఆమె మిక్కిలి సంతోషించెను.

**శ్లో॥ నియత స్సముదాచారో భక్తి ర్భర్తరి చోత్తమా ।**
**య న్న హంతి దశగ్రీవం న మహాత్మా కృతాగసమ్ ॥ 34**

**శ్లో॥ నిమిత్తమాత్రం రామస్తు వధే తస్య భవిష్యతి ॥ 35**

**పదచ్ఛేదము :–** నియతః – సముదాచారః – భక్తిః – భర్తరి – చ – ఉత్తమా, యత్ – న – హంతి – దశగ్రీవం – సః – మహాత్మా – కృతాగసమ్, నిమిత్తమాత్రం – రామః – తు – వధే – తస్య – భవిష్యతి ॥

**అన్వయక్రమము :–** (తస్యాః) సముదాచారః నియతః, భర్తరి భక్తిః చ ఉత్తమా, సా కృతాగసం దశగ్రీవం న హంతి ఇతి యత్ సః మహాత్మా, తస్య వధే రామః తు నిమిత్తమాత్రం భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– (తస్యాః = ఆ సీతాదేవియొక్క) సముదాచారః = సదాచరణము, నియతః = నిత్యమైనది, భర్తరి = భర్తయందు, భక్తిః చ = భక్తియును, ఉత్తమా = శ్రేష్ఠమైనది, కృతాగసం = చేసిన అపరాధము గల్గినట్టి, దశగ్రీవం = రావణుని, న హంతి = చంపుటలేదు, ఇతి యత్ = అనునదేది గలదో, తత్ = ఆ కారణమున, సః = ఆ రావణుడు, మహాత్మా = మహనీయుడైనవాడు, తస్య = అతనియొక్క, వధే = వధయందు, రామః తు = రాముడు మాత్రము, నిమిత్తమాత్రం = నిమిత్తకారణము, భవిష్యతి = కాగలడు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు** :– 'తస్య వధే సీతా నిమిత్తమాత్రం భవతి, రామస్తు ప్రధానకారణం భవిష్యతి' –

స్వయముగా రావణుని వధింపని సీత ఆ రావణుని వధయందు కేవలము అప్రధానమైన కారణముగా నుండును. ప్రధానకారణముగా రాముడే రావణుని వధించునని భావము.

**రా.శిరోమణి** :– రావణుడు తన అధర్మముచే తన మహత్త్వమును గోల్పోయి యున్నాడు గనుక ప్రస్తుత మాతడు మృతప్రాయుడే. ఆతని వధయందు శ్రీరాముడు కేవలము నిమిత్తమాత్రుడై యుండునని భావము.

**తాత్పర్యము** :– ఆ సీతాసాధ్వియొక్క సదాచరణము ఎట్టి పరిస్థితియందైనను నిత్యమైనట్టిది. భర్తయం దామెకు గల భక్తియు సాటిలేనట్టిదే. ఇట్టి యామె ప్రభావము రావణుని హతమార్పకుండుటకు కారణము అతడును మహా తప స్సంపన్నుడై యుండుటయే. కాని నేడు అధర్మమున కొడిగట్టిన యాతని ధర్మప్రభావము నశించినది. కాబట్టి ఆతడు రామునిచేత తేలికగనే వధింపబడును.

**శ్లో॥ సా ప్రకృత్యైవ తన్వంగీ తద్వియోగాచ్చ కర్శితా ।**
**ప్రతిపత్పాఠశీలస్య విద్యేవ తనుతాం గతా ॥ 36**

**పదచ్ఛేదము** :– సా – ప్రకృత్యా – ఏవ – తన్వంగీ – తద్వియోగాత్ – చ – కర్శితా, ప్రతిపత్పాఠశీలస్య – విద్యా – ఇవ – తనుతాం – గతా ॥

**అన్వయక్రమము** :– ప్రకృత్యా ఏవ తన్వంగీ, తద్వియోగాత్ కర్శితా చ సా ప్రతిపత్పాఠశీలస్య విద్యా ఇవ తనుతాం గతా.

**ప్రతిపదార్థము** :– ప్రకృత్యా ఏవ = సహజముగనే, తన్వంగీ = కృశాంగియును,

తద్వియోగాత్ = ఆ శ్రీరాముని వియోగమువలన, కర్శితా చ (సతీ) = కృశింప చేయబడినదియు నగుచు, ప్రతిపత్పాఠశీలస్య = పాడ్యమినాడు చదువుకొను అలవాటు గలవానియొక్క, విద్యా ఇవ = విద్యవలె, తనుతాం = క్షీణతను, గతా = పొందినది.

**తాత్పర్యము** :– సీతాదేవి సహజముగనే సన్నని దేహము గలది, ఇప్పుడు ప్రియుని వియోగమువలన ఇంకను కృశించియున్నదై పాడ్యమినాడు పాఠము చదువుకొనువాని విద్యవలె క్షీణస్థితి నొందియున్నది.

**శ్లో॥ ఏవ మాస్తే మహాభాగా సీతా శోకపరాయణా ।**
**య దత్ర ప్రతికర్తవ్యం తత్సర్వ ముపపాద్యతామ్ ॥ 37**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే ఆదికావ్యే సుందరకాండే*
*"అనంతరకర్తవ్యప్రరోచనం" నామ ఏకోనషష్టితమస్సర్గః.*

**పదచ్ఛేదము** :– ఏవమ్ – ఆస్తే – మహాభాగా – సీతా – శోకపరాయణా – యత్ – అత్ర – ప్రతికర్తవ్యం – తత్ – సర్వమ్ – ఉపపాద్యతామ్ ॥

**అన్వయక్రమము** :– మహాభాగా సీతా ఏవం శోకపరాయణా ఆస్తే. అత్ర యత్ ప్రతికర్తవ్యం తత్ సర్వం (యుష్మాభిః) ఉపపాద్యతామ్.

**ప్రతిపదార్థము** :– మహాభాగా = మహనీయురాలైనట్టి, సీతా = జానకీదేవి, ఏవం = ఈవిధముగా, శోకపరాయణా = శోకనిమగ్నురాలై, ఆస్తే = ఉన్నది. అత్ర = ఈ విషయమునందు, యత్ = ఏది, ప్రతికర్తవ్యం = బదులుగ చేయవలసినది యున్నదో, తత్ సర్వం = అది యంతయును, (యుష్మాభిః = మీచే), ఉపపాద్యతామ్ = తెలుపబడుగాక.

**తాత్పర్యము** :– మహనీయురాలైన సీతాదేవి ఆ లంకయందు ఈ విధముగా శోకమగ్నురాలై యున్నది. ప్రస్తుత మీ సందర్భములో మీది కర్తవ్య మేమో దాని నంతను మీరే నిర్ణయింపవలసియున్నది.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"అనంతరకర్తవ్యప్రరోచనము" అను*
*ఏబదితొమ్మిదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# షష్టితమసర్గ

**శ్లో॥ తస్య తద్వచనం శ్రుత్వా వాలిసూను రభాషత ।**
**అయుక్తం తు వినా దేవీం దృష్టవద్భిశ్చ వానరాః ।**
**సమీపం గంతు మస్మాభీ రాఘవస్య మహాత్మనః ॥ 1**

**పదచ్ఛేదము** :- తస్య - తత్ - వచనం - శ్రుత్వా - వాలిసూనుః - అభాషత - అయుక్తం - తు - వినా - దేవీం - దృష్టవద్భిః - చ - వానరాః, సమీపం - గంతుమ్ - అస్మాభిః - రాఘవస్య - మహాత్మనః ॥

**అన్వయక్రమము** :- తస్య తత్ వచనం శ్రుత్వా వాలిసూనుః అభాషత. వానరాః! దేవీం దృష్టవద్భిః అస్మాభిః మహాత్మనః రాఘవస్య సమీపం (దేవీం) వినా గంతుం తు అయుక్తమ్.

**ప్రతిపదార్థము** :- తస్య = హనుమంతునియొక్క, తత్ వచనం = ఆ మాటను, శ్రుత్వా = విని, వాలిసూనుః = వాలిపుత్రుడైన అంగదుడు, అభాషత = పలికెను, వానరాః = ఓ కపివరులారా!, దేవీం = సీతాదేవిని, దృష్టవద్భిః = చూచినట్టి, అస్మాభిః = మనచేత, (దేవీం) వినా = సీతాదేవి లేకుండగా, మహాత్మనః = మహనీయుడైన, రాఘవస్య = శ్రీరామునియొక్క, సమీపం = సమీపమునకు, గంతుః = వెళ్ళుటకు, అయుక్తమ్ = యుక్తమైనదిగాదు.

**తాత్పర్యము** :- హనుమ చెప్పిన మాటలను విని అంగదు డిట్లనెను - ఓ వానర శ్రేష్ఠులారా! సీతాదేవిని చూచి వచ్చిన మనము ఆ సీతాదేవి లేకుండ ఆ మహాత్ముడైన రాఘవునికడకు పోవుట ఉచితము కాదు.

**శ్లో॥ దృష్టా దేవీ న చానీతా ఇతి తత్ర నివేదనమ్ ।**
**అయుక్తమివ పశ్యామి భవద్భిః ఖ్యాతవిక్రమైః ॥ 2**

**పదచ్ఛేదము** :- దృష్టా - దేవీ - న - చ - ఆనీతా - ఇతి - తత్ర - నివేదనమ్, అయుక్తమ్ - ఇవ - పశ్యామి - భవద్భిః - ఖ్యాతవిక్రమైః ॥

**అన్వయక్రమము** :- తత్ర దేవీ దృష్టా న చ ఆనీతా; ఇతి ఖ్యాతవిక్రమైః భవద్భిః నివేదనమ్ అయుక్తమ్ ఇవ పశ్యామి.

**ప్రతిపదార్థము** :- తత్ర = ఆ రాఘవుని సమక్షమున, దేవీ = సీతాదేవి, దృష్టా = చూడబడినది, న చ ఆనీతా = కాని తీసికొని రాబడలేదు, ఇతి = అని, ఖ్యాతవిక్రమైః = ప్రఖ్యాతమైన పరాక్రమము గల్గినట్టి, భవద్భిః = మీచేత, నివేదనం = విన్నవించుట, అయుక్తమ్ ఇవ = అనుచితమైనదిగా, పశ్యామి = తలచుచున్నాను.

**తాత్పర్యము** :- మేము సీతాదేవిని చూచితిమి కాని ఆమెను తీసికొని రాలేదు. అని సువిఖ్యాతపరాక్రములైన మీరు శ్రీరాముని సన్నిధిని విన్నవించుట ఉచితముగ నుండదని భావించుచున్నాను.

**శ్లో॥ నహి నః ప్లవనే కశ్చిత్ నాస్తి కశ్చి త్పరాక్రమే ।**
**తుల్య స్సామరదైత్యేషు లోకేషు హరిసత్తమాః ॥ 3**

**పదచ్ఛేదము** :- న - హి - నః - ప్లవనే - కః - చిత్ - న - అపి - కః - చిత్ - పరాక్రమే - తుల్యాః - సామరదైత్యేషు - లోకేషు - హరిసత్తమాః ॥

**అన్వయక్రమము** :- హరిసత్తమాః! సామరదైత్యేషు లోకేషు ప్లవనే కశ్చిత్ నః తుల్యాః నహి, పరాక్రమే అపి కశ్చిత్ తుల్యాః నహి.

**ప్రతిపదార్థము** :- హరిసత్తమాః = ఓ వానరశ్రేష్ఠులారా! సామరదైత్యేషు = దేవతలతోడను, రాక్షసులతోడను గూడినట్టి, లోకేషు = లోకములందు, ప్లవనే = లంఘించుటయందు, నః = మనకు, తుల్యాః = సమానుడు, కశ్చిత్ = ఎవ్వడును, నహి = లేడుగదా! పరాక్రమే అపి = పరాక్రమమునందుగూడ, తుల్యాః = సాటియగువాడు, కశ్చిత్ = ఎవ్వడును, నహి = లేడుగదా!

**తాత్పర్యము** :- ఓ వానరోత్తములారా! లంఘించుటయందు గాని పరాక్రమము చూపుటలోగాని మనకు సాటివచ్చువాడు దేవలోకమునందుగాని రాక్షసలోకమునందు గాని ఎవ్వడును లేడుగదా!

**శ్లో॥ తే ష్వేవం హతవీరేషు రాక్షసేషు హనూమతా ।**
**కి మన్య దత్ర కర్తవ్యం గృహీత్వా యామ జానకీమ్ ॥ 4**

**శ్లో॥ రామలక్ష్మణయో ర్మధ్యే న్యస్యామ జనకాత్మజామ్ ॥ 5**

**పదచ్ఛేదము** :- తేషు - ఏవం - హతవీరేషు - రాక్షసేషు - హనూమతా, కిం - అన్యత్ - అత్ర - కర్తవ్యం - గృహీత్వా - యామ - జానకీమ్, రామలక్ష్మణయోః

మధ్యే – న్యస్యామ – జనకాత్మజామ్ ॥

**అన్వయక్రమము** :– హనూమతా తేషు రాక్షసేషు ఏవం హతవీరేషు (సత్సు) అత్ర అన్యత్ కర్తవ్యం కిమ్? జానకీం గృహీత్వా యామ, జనకాత్మజాం రామలక్ష్మణయోః మధ్యే న్యస్యామ.

**ప్రతిపదార్థము** :– హనూమతా = హనుమచే, తేషు = ఆ, రాక్షసేషు = రాక్షసులు, ఏవం = ఈరీతిగా, హతవీరేషు (సత్సు) = చంపబడిన వీరులుగలవారై యుండగా, అత్ర = ఈ విషయమున, అన్యత్ = వేరైనట్టి, కర్తవ్యం = కృత్యము, కిం = ఏమున్నది? జానకీం = సీతాదేవిని, గృహీత్వా = తీసికొని, యామ = వెళ్ళుదుముగాక, జనకాత్మజాం = సీతాదేవిని, రామలక్ష్మణయోః మధ్యే = రామలక్ష్మణుల నడుమ, న్యస్యామ = ఉంచెదముగాక!

**తాత్పర్యము** :– మహావీరుడైన మన హనుమంతుడు ఆ రాక్షసులలోని మహావీరుల నందరిని చంపివేసియుండగా ఇంక మనకు మిగిలియున్న కార్యమేమున్నది? కాబట్టి లంకనుండి ఆ సీతాదేవిని తీసికొనివచ్చి రాముని కడకేగి సీతమ్మను ఆ యన్నదమ్ముల నడుమకు చేర్చుదము.

**శ్లో॥ కిం వ్యలీకైస్తు తాన్ గత్వా హత్వా రాక్షసపుంగవాన్ ।**
**రాఘవం ద్రష్టుమర్హామ స్సుగ్రీవం సహలక్ష్మణమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :– కిం – వ్యలీకైః – తు – తాన్ – గత్వా – హత్వా – రాక్షసపుంగవాన్, రాఘవం – ద్రష్టుమ్ – అర్హామః – సుగ్రీవం – సహలక్ష్మణమ్ ॥

**అన్వయక్రమము** :– వ్యలీకైః తు కిమ్? గత్వా తాన్ రాక్షసపుంగవాన్ హత్వా సహలక్ష్మణం రాఘవం సుగ్రీవం ద్రష్టుమ్ అర్హామః.

**ప్రతిపదార్థము** :– వ్యలీకైః తు = వికల్పములతో, కిం = ఏమి ప్రయోజనము? గత్వా = పోయి, తాన్ రాక్షసపుంగవాన్ = ఆ రాక్షసశ్రేష్ఠులను, హత్వా చ = చంపి, సహలక్ష్మణం = లక్ష్మణునితో గూడియున్న, రాఘవం = శ్రీరాముని, సుగ్రీవం = సుగ్రీవుని, ద్రష్టుమ్ అర్హామః = చూడదగుదుము.

**తాత్పర్యము** :– అనావశ్యకములైన వికల్పము లెందుకు ? మనమిప్పుడే పోయి లంకలోని రాక్షసవీరుల నెల్లరిని వధించి రామలక్ష్మణులను సుగ్రీవుని చూచుటయే ఉచితము.

**శ్లో॥ త మేవం కృతసంకల్పం జాంబవాన్ హరిసత్తమః ।**
**ఉవాచ పరమప్రీతో వాక్య మర్థవ దర్థవిత్ ॥ 7**

**పదచ్ఛేదము** :- తమ్ - ఏవం - కృతసంకల్పం - జాంబవాన్ - హరిసత్తమః, ఉవాచ - పరమప్రీతః - వాక్యమ్ - అర్థవత్ - అర్థవిత్ ॥

**అన్వయక్రమము** :- హరిసత్తమః అర్థవిత్ జాంబవాన్ ఏవం కృతసంకల్పం తం, పరమప్రీతః (సన్) అర్థవత్ వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము** :- హరిసత్తమః = వానరశ్రేష్ఠుడైన, అర్థవిత్ = విషయగ్రహణ కోవిదుడగు, జాంబవాన్ = జాంబవంతుడు, ఏవం = ఈరీతిగా, కృతసంకల్పం = చేయబడిన సంకల్పము గలిగినట్టి, తం = ఆ యంగదుని గూర్చి, అర్థవత్ = అర్థవంతమైనట్టి, వాక్యం = మాటను, పరమప్రీతః (సన్) = మిక్కిలి సంతోషము నొందినవా డగుచు, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము** :- చేయవలసిన పనులను చక్కగా ఎరిగినవాడయిన వానరవృద్ధుడగు జాంబవంతుడు ఆ యంగదుని మాటలకు మిక్కిలి సంతోషించినవాడై ఆతని సంకల్పమును సరిదిద్దుటకై దూర మాలోచించిన మాటలతో ఇట్లు పలికెను.

**శ్లో॥ నైషా బుద్ధి ర్మహాబుద్ధే యద్బ్రవీషి మహాకపే ।**
**విచేతుం వయ మాజ్ఞప్తా దక్షిణాం దిశ ముత్తమామ్ ।**
**నానేతుం కపిరాజేన నైవం రామేణ ధీమతా ॥ 8**

**పదచ్ఛేదము** :- న - ఏషా - బుద్ధిః - మహాబుద్ధే - యత్ - బ్రవీషి - మహాకపే, విచేతుం - వయమ్ - ఆజ్ఞప్తాః - దక్షిణాం - దిశమ్ - ఉత్తమామ్, న - ఆనేతుం - కపిరాజేన - న - ఏవం - రామేణ - ధీమతా ॥

**అన్వయక్రమము** :- మహాబుద్ధే! మహాకపే (త్వం) యత్ బ్రవీషి ఏషా బుద్ధిః న, వయమ్ ఉత్తమాం దక్షిణాం దిశం విచేతుమ్ ఆజ్ఞప్తాః, కపిరాజేన ఆనేతుం న (ఆజ్ఞప్తాః) ఏవం ధీమతా రామేణ న (ఆజ్ఞప్తాః).

**ప్రతిపదార్థము** :- మహాబుద్ధే = గొప్పబుద్ధిమంతుడవైన, మహాకపే = ఓ వానరశ్రేష్ఠుడా! (త్వం = నీవు) యత్ = దేనిని, బ్రవీషి = చెప్పుచున్నావో, ఏషా = ఇది, బుద్ధిః = సరియైన ఆలోచన, న = కాదు, వయం = మనము, ఉత్తమాం = ఉత్తమమైనట్టి, దక్షిణాం దిశం = దక్షిణదిక్కును, విచేతుం = వెదుకుటకు, ఆజ్ఞప్తాః = ఆజ్ఞాపింపబడితిమి, కపిరాజేన = సుగ్రీవునిచే, (సీతాం = సీతను) ఆనేతుం = కొనివచ్చుటకు, న ఆజ్ఞప్తాః = ఆజ్ఞాపింపబడలేదు, ఏవం = అట్లే, ధీమతా = బుద్ధిశాలియైన, రామేణ = శ్రీరామునిచేత, న ఆజ్ఞప్తాః = ఆజ్ఞాపింపబడలేదు.

**తాత్పర్యము** :- గొప్ప బుద్ధిశాలివైన ఓ వానరశ్రేష్ఠుడా! నీవు ఇప్పుడు చెప్పుచున్నది

సరియైన ఆలోచనముగాదు. మనము ఆజ్ఞాపింపబడినట్టిది - ముఖ్యమైన దక్షిణ దిక్కునంతను వెదికి వచ్చుటయే. మహారాజైన సుగ్రీవుడుగాని ధీశాలియైన శ్రీరాముడుగాని సీతాదేవిని కొనిరండని మనను ఆజ్ఞాపించలేదుగదా!

**శ్లో॥ కథంచి న్నిర్జితాం సీతా మస్మాభి ర్నాభిరోచయేత్ ।**
**రాఘవో నృపశార్దూలః కులం వ్యపదిశన్ స్వకమ్ ॥ 9**

**పదచ్ఛేదము** :- కథంచిత్ - నిర్జితాం - సీతామ్ - అస్మాభిః - న - అభిరోచయేత్, రాఘవః - నృపశార్దూలః - కులం - వ్యపదిశన్ - స్వకమ్ ॥

**అన్వయక్రమము** :- నృపశార్దూలః రాఘవః స్వకం కులం వ్యపదిశన్ కథంచిత్ అస్మాభిః నిర్జితాం సీతాం న అభిరోచయేత్.

**ప్రతిపదార్థము** :- నృపశార్దూలః = రాజశ్రేష్ఠుడైనట్టి, రాఘవః = శ్రీరాముడు, స్వకం కులం = తన ఉన్నతకులమును, వ్యపదిశన్ = వెల్లడించుచు, కథంచిత్ = ఎట్లో, అస్మాభిః = మనచేత, నిర్జితాం = జయింపబడిన, సీతాం = సీతను, న అభిరోచయేత్ ఇష్టపడక పోవచ్చును.

**తాత్పర్యము** :- రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడు తన క్షత్రియకులమునకు తగినట్లు పరాక్రమము చూపగోరును. కావున మనమెట్లో రావణుని ఓడించి సీతను తీసికొని వచ్చుట ఎంతమాత్రమునూ ఆతడు ఇష్టపడడు.

**శ్లో॥ ప్రతిజ్ఞాయ స్వయం రాజా సీతావిజయ మగ్రతః ।**
**సర్వేషాం కపిముఖ్యానాం కథం మిథ్యా కరిష్యతి ॥ 10**

**పదచ్ఛేదము** :- ప్రతిజ్ఞాయ - స్వయం - రాజా - సీతావిజయమ్ - అగ్రతః, సర్వేషాం - కపిముఖ్యానాం - కథం - మిథ్యా - కరిష్యతి ॥

**అన్వయక్రమము** :- రాజా సర్వేషాం కపిముఖ్యానామ్ అగ్రతః సీతావిజయం ప్రతిజ్ఞాయ కథం మిథ్యా కరిష్యతి?

**ప్రతిపదార్థము** :- రాజా = రాజైన సుగ్రీవుడు, సర్వేషాం కపిముఖ్యానామ్ అగ్రతః = వానరశ్రేష్ఠులందరి ఎదుటను, సీతావిజయం = సీతను జయించి తెచ్చుటను, స్వయం = స్వయముగా, ప్రతిజ్ఞాయ = ప్రతిజ్ఞచేసి, కథం = ఎట్లు, మిథ్యా కరిష్యతి = అసత్యము చేయగలడు?

**తాత్పర్యము** :- మన మహారాజైన సుగ్రీవుడు వానరశ్రేష్ఠు లందరి యెదుటను స్వయముగా శత్రువు నోడించి సీతను జయించి తెచ్చెదనని ప్రతిజ్ఞ చేసెనుగదా!

దాని నాతడు వ్యర్థము చేయుటకు ఎట్లు ఇష్టపడగలడు?

**శ్లో॥ విఫలం కర్మ చ కృతం భవే త్తుష్టి ర్న తస్య చ ।**
**వృథా చ దర్శితం వీర్యం భవే ద్వానరపుంగవాః ॥ 11**

**పదచ్ఛేదము :–** విఫలం – కర్మ – చ – కృతం – భవేత్ – తుష్టిః – న – తస్య – చ, వృథా – చ – దర్శితం – వీర్యం – భవేత్ – వానరపుంగవాః ॥

**అన్వయక్రమము :–** వానరపుంగవాః! కృతం కర్మ చ విఫలం భవేత్; తస్య తుష్టిః చ న (భవేత్); వీర్యం వృథా దర్శితం భవేత్.

**ప్రతిపదార్థము :–** వానరపుంగవాః = ఓ వానరశ్రేష్ఠులారా! విఫలం కర్మ = నిష్ఫలమైన పని, కృతం భవేత్ = చేయబడినట్లగును, తస్య = ఆ సుగ్రీవునకు, తుష్టిః చ = సంతోషముకూడ, న భవేత్ = కాకపోవును, వీర్యం = పరాక్రమము, వృథా = వ్యర్థముగా, దర్శితం = చూపబడినది, భవేత్ = కాగలదు.

**తాత్పర్యము :–** ఓ వానరోత్తములారా! మనము నిష్ప్రయోజనమైన పని చేసినట్లగును. రాజైన సుగ్రీవునకు గూడ తృప్తికరముగా నుండకపోవచ్చును. మన పరాక్రమ మంతయును వ్యర్థముగా ప్రదర్శించినట్లే అగును జుడీ!

**శ్లో॥ తస్మా ద్గచ్ఛామ వై సర్వే యత్ర రామ స్సలక్ష్మణః ।**
**సుగ్రీవశ్చ మహాతేజాః కార్య స్యాస్య నివేదనే ॥ 12**

**పదచ్ఛేదము :–** తస్మాత్ – గచ్ఛామ – వై – సర్వే – యత్ర – రామః – సలక్ష్మణః, సుగ్రీవః – చ – మహాతేజాః – కార్యస్య – అస్య – నివేదనే ॥

**అన్వయక్రమము :–** తస్మాత్ యత్ర సలక్ష్మణః రామః, మహాతేజాః సుగ్రీవః చ (అస్తి) (తత్ర) (వయం) సర్వే అస్య కార్యస్య నివేదనే గచ్ఛామ.

**ప్రతిపదార్థము :–** తస్మాత్ = అందువలన, యత్ర = ఎచ్చటనయితే, సలక్ష్మణః = లక్ష్మణునితో గూడినట్టి, రామః = రాముడును, మహాతేజాః = మహాప్రతాపశాలియైన, సుగ్రీవః చ = సుగ్రీవుడును, (స్తః = ఉన్నారో), తత్ర = అచ్చటికి, వయం సర్వే = మనమందరమును, అస్య కార్యస్య = ఈ కృత్యముయొక్క, నివేదనే = నివేదించు విషయమున, గచ్ఛామ = వెళ్ళుదము.

**తాత్పర్యము :–** అందుచే రాముడును, లక్ష్మణుడును, సుగ్రీవుడును ఉన్న చోటికే మనమందరమును పోయి ఈ సాధించిన కార్యమును నివేదించుదము.

**శ్లో॥ న తావ దేషా మతి రక్షమా నో**
**యథా భవాన్ పశ్యతి రాజపుత్ర ।**
**యథా తు రామస్య మతి ర్నివిష్టా**
**తథా భవాన్ పశ్యతు కార్యసిద్ధిమ్ ॥ 13**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"అంగదజాంబవత్సంవాదో" నామ పంచాశస్సర్గః.*

**పదచ్ఛేదము** :– న – తావత్ – ఏషా – మతిః – అక్షమా – నః, యథా – భవాన్ – పశ్యతి – రాజపుత్ర, యథా – తు – రామస్య – మతిః – నివిష్టా, తథా భవాన్ పశ్యతు కార్యసిద్ధిమ్ ॥

**అన్వయక్రమము** :– రాజపుత్ర! భవాన్ యథా పశ్యతి ఏషా మతిః నః అక్షమా న తావత్; రామస్య మతిః తు యథా నివిష్టా, భవాన్ కార్యసిద్ధిం తథా పశ్యతు.

**ప్రతిపదార్థము** :– రాజపుత్ర! = ఓ రాజకుమారుడా! భవాన్ = నీవు, యథా = ఏరీతిగా, పశ్యతి = చూచుచున్నావో, ఏషా మతిః = ఈ యాలోచన, నః = మనకు, అక్షమా = తగనిది, న తావత్ = కాజాలదు, రామస్య = శ్రీరాముని యొక్క, మతిః తు = ఆలోచనము మాత్రము, యథా = ఏరీతిగా, నివిష్టా = ఉండియున్నదో, భవాన్ = నీవు, కార్యసిద్ధిం = కార్యసిద్ధిని గూర్చి, పశ్యతు = ఆలోచించుము.

**తాత్పర్యము** :– ఓ రాజకుమారుడా! నీవాలోచించునట్టి పద్ధతి ఎంతమాత్రమును మనకు అసాధ్యమైనది కాదు, కాని శ్రీరాముని అభిప్రాయ మేరీతిగ నున్నదో ఆ రీతిగనే నీవు కార్యసిద్ధిని గూర్చి ఆలోచించవలసి యుండును గదా!

**సూచన** :– ఈ సర్గమునందు కొన్ని ప్రతులలో ఆరుశ్లోకములు మాత్రమే కానవచ్చు చున్నవి. మరికొన్ని ప్రతులలో పదిశ్లోకములకు మించి యున్నవి. బొంబాయి ప్రతియందు ఇరువది గలవు. ప్రముఖపండితులు నిర్ణయించి నట్టిదని మాచే ఈ శ్లోకముల పరిమితి గ్రహింపబడినది.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"అంగదజాంబవత్సంవాదము" అను అరువదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ఏకషష్టితమసర్గ

**శ్లో॥ తతో జాంబవతో వాక్య మగృహ్ణంత వనౌకసః ।**
**అంగదప్రముఖా వీరా హనూమాంశ్చ మహాకపిః ॥ 1**

**పదచ్ఛేదము** :– తతః – జాంబవతః – వాక్యమ్ – అగృహ్ణంత – వనౌకసః, అంగదప్రముఖాః – వీరాః – హనూమాన్ – చ – మహాకపిః ॥

**అన్వయక్రమము** :– తతః అంగదప్రముఖాః వీరాః వనౌకసః, మహాకపిః హనూమాన్ చ, జాంబవతః వాక్యమ్ అగృహ్ణంత.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, అంగదప్రముఖాః = అంగదుడు మొదలుగా కలిగినట్టి, వీరాః = వీరులైన, వనౌకసః = వానరులును, మహాకపిః = కపిశ్రేష్ఠుడైన, హనుమాన్ చ = హనుమంతుడును, జాంబవతః = జాంబవంతునియొక్క, వాక్యం = వాక్యమును, అగృహ్ణంత = స్వీకరించిరి.

**తాత్పర్యము** :– అటుపిమ్మట మహావీరులైన అంగదాదివానరులును , వానరశ్రేష్ఠుడైన హనుమంతుడును, జాంబవంతుడు చెప్పినమాట యుక్తమైనదే యని ఒప్పుకొనిరి.

**శ్లో॥ ప్రీతిమంత స్తత స్సర్వే వాయుపుత్రపురస్సరాః ।**
**మహేంద్రాద్రిం పరిత్యజ్య పుప్లువుః ప్లవగర్షభాః ॥ 2**

**పదచ్ఛేదము** :– ప్రీతిమంతః – తతః – సర్వే – వాయుపుత్రపురస్సరాః, మహేంద్రాద్రిం – పరిత్యజ్య – పుప్లువుః – ప్లవగర్షభాః ॥

**అన్వయక్రమము** :– తతః ప్లవగర్షభాః సర్వే ప్రీతిమంతః (సంతః) వాయుపుత్రపురస్సరాః మహేంద్రాద్రిం పరిత్యజ్య పుప్లువుః.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, ప్లవగర్షభాః = వానరశ్రేష్ఠులు, సర్వే = ఎల్లరును, ప్రీతిమంతః సంతః = మహాసంతోషము గలవారై, వాయుపుత్రపురస్సరాః = హనుమంతుని ముందిడుకొన్నవారై, మహేంద్రాద్రిం = మహేంద్రపర్వతమును, పరిత్యజ్య = విడిచి, పుప్లువుః = ఎగిరిరి.

**తాత్పర్యము :–** అప్పుడు ఆ వానరవీరు లందరును మిక్కిలి ఆనందముతో వాయునందనుని ముందిడుకొని మహేంద్రపర్వతము మీదనుండి ఆకసమున కెగసిరి.

**శ్లో॥ మేరుమందరసంకాశా మత్తా ఇవ మహాగజాః ।**
**ఛాదయంత ఇ వాకాశం మహాకాయా మహాబలాః ॥ 3**

**పదచ్ఛేదము :–** మేరుమందరసంకాశాః – మత్తాః – ఇవ – మహాగజాః – ఛాదయంతః – ఇవ – ఆకాశం – మహాకాయాః – మహాబలాః ॥

**అన్వయక్రమము :–** మహాకాయాః మహాబలాః, మేరుమందరసంకాశాః తే మత్తాః మహాగజాః ఇవ, ఆకాశం ఛాదయంతః ఇవ (పుప్లువః).

**ప్రతిపదార్థము :–** మహాకాయాః = గొప్పదైన దేహముగలవారును, మహాబలాః = గొప్పదైన బలముగలవారును, మేరుమందరసంకాశాః = మేరుపర్వతముతోడను మందరపర్వతముతోడను సమానులై యున్నట్టివారు నగు, తే = ఆ వానరులు, మత్తాః = మదించిన, మహాగజాః ఇవ = గొప్ప ఏనుగులవలె, ఆకాశం = ఆకాశమును, ఛాదయంతః ఇవ = కప్పివేయుచున్నవారువలె, పుప్లువః = ఎగిరిరి.

**తాత్పర్యము :–** మేరు మందర పర్వతములవంటి స్థూలములైన శరీరములు కలిగి, మదించిన మహాగజమువలె మహాబలాఢ్యులై యున్నట్టి ఆ వానరులు ఆకాశమును కప్పివేయుచున్నట్లుగా గగనవీథి నెగురుచు పోవుచుండిరి.

**శ్లో॥ సభాజ్యమానం భూతైస్త మాత్మవంతం మహాబలమ్ ।**
**హనుమంతం మహావేగం వహంత ఇవ దృష్టిభిః ॥ 4**

**పదచ్ఛేదము :–** సభాజ్యమానం – భూతైః – తమ్ – ఆత్మవంతం – మహాబలమ్, హనుమంతం – మహావేగం – వహంతః – ఇవ – దృష్టిభిః ॥

**అన్వయక్రమము :–** భూతైః సభాజ్యమానమ్ ఆత్మవంతం మహాబలం మహావేగం తం హనూమంతం దృష్టిభిః వహంతః ఇవ పుప్లువుః.

**ప్రతిపదార్థము :–** భూతైః = పృథివ్యాదిభూతములచే, సభాజ్యమానం = పూజింపబడుచున్న వాడును, ఆత్మవంతం = మహాధైర్యవంతుడును, మహాబలం = మహాబలాఢ్యుడును, మహావేగం = మహావేగసంపన్నుడునగు, హనుమంతం = హనుమంతుని, దృష్టిభిః = చూపులతో, వహంతః ఇవ = మోయుచున్నవారువలె, పుప్లువుః = ఎగిరిరి.

**తాత్పర్యము** :- పంచమహాభూతములచేతను సమస్తప్రాణులచేతను గౌరవింప బడుచున్నవాడును, మహాబలాఢ్యుడును, మహావేగసంపన్నుడును అగు హనుమంతుని ఆ వానరులెల్లరును రెప్పపాటులేని తమ చూపులతో మోయుచున్నట్లుగా సంతోషముతో చూచుచు ఆకసమున నెగురుచు పోవుచుండిరి.

**శ్లో॥ రాఘవే చార్థనిర్వృత్తిం కర్తుం చ పరమం యశః ।**
**సమాదాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభి రున్నతాః ॥ 5**

**పదచ్ఛేదము** :- రాఘవే – చ – అర్థనిర్వృత్తిం – కర్తుం – చ – పరమం – యశః, సమాధాయ – సమృద్ధార్థాః – కర్మసిద్ధిభిః – ఉన్నతాః ॥

**అన్వయక్రమము** :- రాఘవే అర్థనిర్వృత్తిం చ పరమం యశః చ కర్తుం సమాధాయ సమృద్ధార్థాః కర్మసిద్ధిభిః ఉన్నతాః చ (సంతః) (పుప్లువః).

**ప్రతిపదార్థము** :- రాఘవే = శ్రీరామునియందు, అర్థనిర్వృత్తిం చ = కార్యసిద్ధిని, పరమం యశః చ = గొప్ప కీర్తిని, కర్తుం = కూర్చుకొనుటకు, సమాధాయ = నిర్ణయించుకొని, సమృద్ధార్థాః = నెరవేరిన ప్రయోజనము గలవారై, కర్మసిద్ధిభిః = కార్యసిద్ధులచే, ఉన్నతాః (సంతః) = ఔన్నత్యము గలవారగుచు, పుప్లువుః = ఎగిరిరి.

**తాత్పర్యము** :- ఆ వానరులు శ్రీరామునకు కార్యసిద్ధిని, గొప్ప కీర్తిని సాధించి తమ ప్రయోజనము నెరవేర్చుకొని కార్యము సిద్ధించుటచే మిక్కిలి ఘనత వహించినవారై ఆకసమునం దెగిరి పోవుచుండిరి.

**శ్లో॥ ప్రియాఖ్యానోన్ముఖా స్సర్వే సర్వే యుద్ధాభినందినః ।**
**సర్వే రామప్రతీకారే నిశ్చితార్థా మనస్వినః ॥ 6**

**పదచ్ఛేదము** :- ప్రియాఖ్యానోన్ముఖాః – సర్వే – సర్వే – యుద్ధాభినందినః, సర్వే – రామప్రతీకారే – నిశ్చితార్థాః – మనస్వినః ॥

**అన్వయక్రమము** :- సర్వే ప్రియాఖ్యానోన్ముఖాః సర్వే యుద్ధాభినందినః సర్వే రామ ప్రతీకారే నిశ్చితార్థాః మనస్వినః (చ సంతః) పుప్లువుః.

**ప్రతిపదార్థము** :- సర్వే = ఆ వానరులందరును, ప్రియాఖ్యానోన్ముఖాః = ప్రియమును చెప్పుటకు ఉద్యుక్తులైనవారును, సర్వే = అందరును, యుద్ధాభినందినః = యుద్ధమును మెచ్చునట్టివారును, సర్వే = ఎల్లరును, రామప్రతీకారే = రామునకు సంబంధించిన ప్రతీకారమునందు, నిశ్చితార్థాః = నిశ్చయించిన కార్యములు గలవారును, మనస్వినః (చ సంతః) = పౌరుషవంతులును అగుచు, పుప్లువుః = ఎగురుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** "రామప్రతీకారే" రామునికి ప్రత్యుపకారమునందని భావము.

**తిలకము :–** 'రామప్రతీకారే' రాముడు చేయవలసియున్న రావణప్రతీకారము నందని భావము.

**తాత్పర్యము :–** ఆ వానరులెల్లరును శ్రీరామునకు ప్రియమైనవార్తను తెలుపుటకు వేగిర పడుచున్నట్టి వారును, యుద్ధమును గూర్చి యువ్విళ్ళూరుచున్న వారును. శ్రీరామునకు గల్గిన హానికి ప్రతీకారము గావింప నిశ్చయించుకొన్నట్టి వారును, మహాపౌరుషశాలులును అగుచు ఆకసమున కెగురుచుండిరి.

**శ్లో॥ ప్లవమానా స్సముత్పత్య తత స్తే కాననౌకసః ।**
**నందనోపమ మాసేదు ర్వనం ద్రుమలతాయుతమ్ ॥ 7**

**శ్లో॥ యత్త న్మధువనం నామ సుగ్రీవ స్యాభిరక్షితమ్ ॥ 8**

**పదచ్ఛేదము :–** ప్లవమానాః – సముత్పత్య – తతః – తే – కాననౌకసః, నందనోపమమ్ – ఆసేదుః – వనం – ద్రుమలతాయుతమ్, యత్ – తత్ – మధువనం – నామ – సుగ్రీవస్య – అభిరక్షితమ్॥

**అన్వయక్రమము :–** తతః తే కాననౌకసః ప్లవమానాః సముత్పత్య అభిరక్షితం ద్రుమలతాయుతం మధువనం నామ సుగ్రీవస్య నందనోపమం యత్ వనం తత్ ఆసేదుః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, తే = ఆ, కాననౌకసః = వానరులు, ప్లవమానాః = ఎగురుచున్నవారై, సముత్పత్య = గెంతి, అభిరక్షితం = చక్కగ రక్షింపబడుచున్నదియును, ద్రుమలతాయుతం = వృక్షములతోడను తీగలతోడను లతల తోడను గూడినదియునగు, మధువనం నామ = మధువనమని పేరు గలిగినట్టి, నందనోపమం = నందనవనముతో సమానమైన, యత్ వనం = ఏ వనము, అస్తి = ఉన్నదో, తత్ = ఆ వనమును, ఆసేదుః = చేరిరి.

**తాత్పర్యము :–** ఆ వానరవీరు లందరును ఆకసమునం దెగురుచు పోయి పోయి పెక్కు వృక్షములతోడను లతలతోడను నిండి చక్కగ రక్షింపబడుచు, మధువనమని పేరు గలిగియున్నట్టి నందనము వంటి సుందరమైన వనమును జేరుకొనిరి.

**శ్లో॥ అధృష్యం సర్వభూతానాం సర్వభూతమనోహరమ్ ।**
**యద్రక్షతి మహావీర్య స్సదా దధిముఖః కపిః ।**
**మాతులః కపిముఖ్యస్య సుగ్రీవస్య మహాత్మనః ॥ 9**

**పదచ్ఛేదము** :– అధృష్యం – సర్వభూతానాం – సర్వభూతమనోహరం, యత్ – రక్షతి – మహావీర్యః – సదా – దధిముఖః – కపిః, మాతులః – కపిముఖ్యస్య – సుగ్రీవస్య – మహాత్మనః ॥

**అన్వయక్రమము** :– మహావీర్యః కపిముఖ్యస్య మహాత్మనః సుగ్రీవస్య మాతులః దధిముఖః కపిః యత్ రక్షతి, తత్ సర్వభూతానామ్ అధృష్యం సర్వభూతమనోహరం (మధువనమ్ ఆసేదుః).

**ప్రతిపదార్థము** :– యత్ = దేనినైతే, మహావీర్యః = మహాపరాక్రమసంపన్నుడును, కపిముఖ్యస్య = వానరశ్రేష్ఠుడైన, మహాత్మనః = మహనీయుడగు, సుగ్రీవస్య = సుగ్రీవుని యొక్క, మాతులః = మేనమామయైన, దధిముఖః కపిః = దధిముఖుడను వానరుడు, సదా = నిత్యము, రక్షతి = రక్షించుచున్నాడో, సర్వభూతానామ్ అధృష్యం = ఎల్ల ప్రాణులకును భయంకరముగ నుండునదియును, సర్వభూతమనోహరం = సర్వ ప్రాణులకును, ఆకర్షకముగ నుండునదియును అగు, తత్ మధువనం = ఆ మధువనమును, ఆసేదుః = చేరుకొనిరి.

**తాత్పర్యము** :– సర్వప్రాణిమనోహరమై యుండి మహనీయుడైన సుగ్రీవుని మేనమామ యగు దధిముఖు డను మహావీరుడైన వానరుడు ఎల్లకాలము మిక్కిలి శ్రద్ధతో రక్షించుచుండగా ఏ దుష్టప్రాణికిని చేరరానిదై యున్న సుందరమగు మధువనమును ఆ వానరులు చేరుకొనిరి.

**శ్లో॥ తే తద్వన ముపాగమ్య బభూవుః పరమోత్కటాః ।**
**వానరా వానరేంద్రస్య మనఃకాంతతమం మహత్ ॥ 10**

**పదచ్ఛేదము** :– తే – తత్ – వనమ్ – ఉపాగమ్య – బభూవుః – పరమోత్కటాః, వానరాః – వానరేంద్రస్య – మనఃకాంతతమం – మహత్ ॥

**అన్వయక్రమము** :– తే వానరాః మనఃకాంతతమం తత్ వానరేంద్రస్య మహత్ వనమ్ ఉపాగమ్య పరమోత్కటాః బభూవుః.

**ప్రతిపదార్థము** :– తే వానరాః = ఆ వానరులు, మనఃకాంతతమం = మిక్కిలి మనోహరమైనట్టి, తత్ = ఆ, వానరేంద్రస్య = సుగ్రీవునియొక్క, మహత్ = గొప్పదైనట్టి,

వనం = మధువనమును, ఉపాగమ్య = చేరి, పరమోత్కటాః = మహౌత్సుక్యము గలవారు, బభూవుః = అయిరి.

**తాత్పర్యము** :– ఆ వానరయోధులు మిక్కిలి రమణీయముగా నుండి సుగ్రీవునకు ప్రియమైనదై మిక్కిలి గొప్పదైయున్న మధువనమును చేరుకొని మహోత్సాహభరితులైరి.

**శ్లో॥ తత స్తే వానరా హృష్టా దృష్ట్వా మధువనం మహత్ ।**
**కుమార మభ్యయాచంత మధూని మధుపింగళాః ॥ 11**

**పదచ్ఛేదము** :– తతః – తే – వానరాః – హృష్టాః – దృష్ట్వా – మధువనం – మహత్, కుమారమ్ – అభ్యయాచంత – మధూని – మధుపింగళాః ॥

**అన్వయక్రమము** :– తతః తే మధుపింగళాః వానరాః మహత్ మధువనం దృష్ట్వా హృష్టాః (సంతః) కుమారం మధూని అభ్యయాచంత.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, మధుపింగళాః = తేనెవలె పచ్చని ఛాయగలిగినట్టి, తే = ఆ, వానరాః = వానరులు, మహత్ = గొప్పదైన, మధువనం = మధువనమును, దృష్ట్వా = చూచి, హృష్టాః (సంతః) = హర్షము నొందిన వారై, కుమారం = అంగదుని, మధూని = తేనెలను, అభ్యయాచంత = కోరుకొనిరి.

**తాత్పర్యము** :– అప్పుడు మధువువలెనే పచ్చగానున్న ఆ వానరులు ఆ మధువనమున ప్రవేశించి దానిని చూచి మహానందము నొందినవారై అంగదకుమారుని ఆ వనము నందలి మధువులను గ్రోలుటకు అనుమతిని అర్థించిరి.

**శ్లో॥ తతః కుమార స్తాన్ వృద్ధాన్ జాంబవత్ప్రముఖాన్ కపీన్ ।**
**అనుమాన్య దదౌ తేషాం నిసర్గం మధుభక్షణే ॥ 12**

**పదచ్ఛేదము** :– తతః – కుమారః – తాన్ – వృద్ధాన్ – జాంబవత్ప్రముఖాన్ – కపీన్, అనుమాన్య – దదౌ – తేషాం – నిసర్గం – మధుభక్షణే ॥

**అన్వయక్రమము** :– తతః కుమారః జాంబవత్ప్రముఖాన్ వృద్ధాన్ తాన్ కపీన్ అనుమాన్య తేషాం మధుభక్షణే నిసర్గం దదౌ.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, కుమారః = అంగద కుమారుడు, వృద్ధాన్ = పెద్దలైనట్టి, జాంబవత్ప్రముఖాన్ = జాంబవంతుడు మొదలుగాగల, తాన్ కపీన్ = ఆ వానరులను, అనుమాన్య = అనుమతింపచేసి, తేషాం = ఆ వానర సమూహములకు, మధుభక్షణే = మధుభక్షణమున, నిసర్గం = అనుజ్ఞను, దదౌ = ఇచ్చెను.

**తాత్పర్యము** :- అంతట ఆ అంగదకుమారుడు, జాంబవంతుడు మున్నగు వానర వృద్ధులతో ఆలోచించి వారి అనుమతి వడసి ఆ వానరులందరికిని మధుభక్షణమునకు అనుమతి నొసగెను.

**శ్లో॥ తత శ్చానుమతా స్సర్వే సంప్రహృష్టా వనౌకసః ।**
**ముదితాః ప్రేరితా శ్చాపి ప్రనృత్యంతో ఽభవం స్తదా ॥ 13**

**పదచ్ఛేదము** :- తతః - చ - అనుమతాః - సర్వే - సంప్రహృష్టాః - వనౌకసః, ముదితాః - ప్రేరితాః - చ - అపి - ప్రనృత్యంతః - అభవన్ - తదా ॥

**అన్వయక్రమము** :- తతః అనుమతాః (తే) వనౌకసః సర్వే సంప్రహృష్టాః ముదితాః ప్రేరితాశ్చ అపి (సంతః) తదా ప్రనృత్యంతః అభవన్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, అనుమతాః = అనుజ్ఞనొందినట్టి, తే = ఆ, వనౌకసః = వానరులు, సర్వే = అందరును, సంప్రహృష్టాః = మిక్కిలి ఆనందము నొందినవారును, ప్రేరితాః చ అపి (సంతః) = ప్రోత్సహింపబడినవారు నగుచు, తదా = అప్పుడు, ప్రనృత్యంతః = నృత్యముచేయుచున్నవారు, అభవన్ = అయిరి.

**తాత్పర్యము** :- అప్పుడా వానరులెల్లరును తమ కోరిక అనుమతింపబడినందుకు మహానందము నొందినవారై మహోత్సాహముతో అప్పుడు నాట్యము చేసిరి.

**శ్లో॥ గాయంతి కేచి త్ప్రణమంతి కేచి**
**న్నృత్యంతి కేచి త్ప్రహసంతి కేచిత్ ।**
**పతంతి కేచి ద్విచరంతి కేచిత్**
**ప్లవంతి కేచి త్ప్రలపంతి కేచిత్ ॥ 14**

**పదచ్ఛేదము** :- గాయంతి - కేచిత్ - ప్రణమంతి - కేచిత్, నృత్యంతి - కేచిత్ - ప్రహసంతి - కేచిత్, పతంతి - కేచిత్ - విచరంతి - కేచిత్, ప్లవంతి - కేచిత్ - ప్రలపంతి - కేచిత్ ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- కేచిత్ = కొంతమంది వానరులు, గాయంతి = పాడుచున్నారు, కేచిత్ = కొంతమంది, ప్రణమంతి = నమస్కరించుచున్నారు, కేచిత్ = కొంతమంది, నృత్యంతి = నాట్యము చేయుచున్నారు, కేచిత్ = కొంతమంది, ప్రహసంతి = పెద్దగ నవ్వుచున్నారు, కేచిత్ = కొంతమంది, పతంతి = పడుచున్నారు, కేచిత్ = కొందరు, విచరంతి = పరిభ్రమించుచున్నారు, కేచిత్ = కొంతమంది, ప్లవంతి = దుముకు

చున్నారు, కేచిత్ = కొంతమంది, ప్రలపంతి = ప్రలాపములు చేయుచున్నారు.

**తాత్పర్యము** :– మధుపానమున కనుజ్ఞనొందిన ఆ వానరులు ఆనందావేశముతో కొందరు పాటలు పాడుచుండిరి. కొందరు నమస్కారములు చేయుచుండిరి. కొందరు నృత్యము చేయుచుండిరి. కొందరు పెద్దగ నవ్వుచుండిరి. కొందరు చెట్లమీద నుండి క్రిందకు ఉరుకుచుండిరి. కొంద రావనమున కలియ తిరుగుచుండిరి. కొందరు గంతులు వేయుచుండిరి. కొందరతిగా వాగుచుండిరి.

**శ్లో॥ పరస్పరం కేచి దుపాశ్రయంతే**
**పరస్పరం కేచి దుపాక్రమంతే ।**
**పరస్పరం కేచి దుపబ్రువంతే**
**పరస్పరం కేచి దుపారమంతే ॥ 15**

**పదచ్ఛేదము** :– పరస్పరం – కేచిత్ – ఉపాశ్రయంతే – పరస్పరం – కేచిత్ – ఉపాక్రమంతే, పరస్పరం – కేచిత్ – ఉపబ్రువంతే – పరస్పరం – కేచిత్ – ఉపారమంతే ॥

**అన్వయక్రమము** :– సుగమము.

**ప్రతిపదార్థము** :– కేచిత్ = కొందరు వానరులు, పరస్పరం = ఒండొరులను, ఉపాశ్రయంతే = ఆశ్రయించుచుండిరి, కేచిత్ = కొందరు, పరస్పరం = ఒకరినొకరు, ఉపాక్రమంతే = ఆక్రమించుచుండిరి, కేచిత్ = కొందరు, పరస్పరం = ఒకరితో నొకరు, ఉపారమంతే = చేరి ఆడుచుండిరి.

**తాత్పర్యము** :– ఆ వానరులలో కొందరు ఒకరికొకరు దగ్గరకు చేరుకొనుచుండిరి. కొందరు ఒకరినొకరు చేరి కౌగిలించు కొనుచుండిరి. కొందరు ఒకరితో నొకరు రహస్యపుమాటలు చెప్పుకొనుచుండిరి. కొందరు ఒకరితో నొకరు క్రీడించుచుండిరి.

**శ్లో॥ ద్రుమా ద్ద్రుమం కేచి దభిద్రవంతి**
**క్షితౌ నగాగ్రా న్నిపతంతి కేచిత్ ।**
**మహీతలా త్కేచి దుదీర్ణవేగా**
**మహాద్రుమాగ్రా ణ్యభిసంపతంతి ॥ 16**

**పదచ్ఛేదము** :– ద్రుమాత్ – ద్రుమం – కేచిత్ – అభిద్రవంతి, క్షితౌ – నగాగ్రాత్ – నిపతంతి – కేచిత్ – మహీతలాత్ – కేచిత్ – ఉదీర్ణవేగాః, మహాద్రుమాగ్రాణి – అభిసంపతంతి ॥

**అన్వయక్రమము** :- సుగమము.

**ప్రతిపదార్థము** :- కేచిత్ = కొందరు వానరులు, ద్రుమాత్ = ఒకచెట్టునుండి, ద్రుమం = ఇంకొక చెట్టునుగూర్చి, అభిద్రవంతి = పరుగెత్తుచుండిరి, కేచిత్ = కొందరు, నగాగ్రాత్ = చెట్టుకొననుండి, క్షితౌ = నేలమీద, నిపతంతి = ఉరుకుచుండిరి, కేచిత్ = కొంతమంది, మహీతలాత్ = నేలమీదనుండి, ఉదీర్ణవేగాః = గొప్పదైన వేగముగలవారై, మహాద్రుమాగ్రాణి = పెద్దవైన వృక్షములయొక్క అగ్రమును గూర్చి, అభిసంపతంతి = ఎగురుచుండిరి.

**తాత్పర్యము** :- ఆ వానరులలో కొందరు ఒక చెట్టునుండి ఇంకొక చెట్టుమీదకి గెంతుచుండిరి. కొందరు చెట్టుకొననుండి నేలమీదకి దూకుచుండిరి. కొందరు నేలమీది నుండి మహావేగముతో ఎత్తైన చెట్టు కొనల కెగురుచుండిరి.

**శ్లో॥ గాయంత మన్యః ప్రహస న్నుపైతి**
**హసంత మన్యః ప్రరుద న్నుపైతి ।**
**రుదంత మన్యః ప్రణద న్నుపైతి**
**నదంత మన్యః ప్రణుద న్నుపైతి ॥ 17**

**పదచ్ఛేదము** :- గాయంతమ్ - అన్యః - ప్రహసన్ - ఉపైతి, హసంతమ్ - అన్యః - ప్రరుదన్ - ఉపైతి, రుదంతమ్ - అన్యః - ప్రణదన్ - ఉపైతి, నదంతం - అన్యః - ప్రణుదన్ - ఉపైతి ॥

**ప్రతిపదార్థము** :- గాయంతం = పాడుచున్నట్టి వానిని, అన్యః = వేరొకడు, ప్రహసన్ = బిగ్గరగ నవ్వుచు, ఉపైతి = సమీపించుచున్నాడు, హసంతం = నవ్వుచున్న ఒకనిని, అన్యః = వేరొకడు, ప్రరుదన్ = పెద్దగ ఏడ్చుచు, ఉపైతి = సమీపించుచున్నాడు, రుదంతం = ఏడ్చుచున్నట్టి వానిని, అన్యః = వేరొకడు, ప్రణదన్ = చప్పుడుచేయుచు, ఉపైతి = సమీపించు చున్నాడు, నదంతం = ధ్వనిచేయుచున్న వానిని, అన్యః = ఇంకొకడు, ప్రణుదన్ = త్రోయుచు, ఉపైతి = చేరుచున్నాడు.

**తాత్పర్యము** :- వారిలో నొక వానరుడు పాడుచుండగా వేరొకడు పెద్దగ నవ్వుచు దగ్గరకు వచ్చుచుండెను. ఆ నవ్వుచున్న వానికడకు వేరొక డేడ్చుచు సమీపించు చుండెను. ఏడ్చుచున్న వానికడకు ఇంకొకడు పెద్దకేకలు వేయుచు వచ్చు చుండెను. ఆ కేకలు వేయుచున్న వానికడకు మరియొకడు వచ్చి త్రోసివేయుచుండెను.

**శ్లో॥ సమాకులం తత్కపిసైన్య మాసీత్**
**మధుప్రపానోత్కటసత్త్వచేష్టమ్ ।**
**న చాత్ర కశ్చి న్న బభూవ మత్తః**
**న చాత్ర కశ్చి న్న బభూవ తృప్తః ॥ 18**

**పదచ్ఛేదము** :– సమాకులం – తత్ – కపిసైన్యమ్ – ఆసీత్ – మధుప్రపానోత్కట సత్త్వచేష్టమ్, న – చ – అత్ర – కః – చిత్ – న – బభూవ – మత్తః, న – చ – అత్ర – కః – చిత్ – న – బభూవ – తృప్తః ॥

**అన్వయక్రమము** :– తత్ కపిసైన్యం మధుప్రపానోత్కటసత్త్వచేష్టం సమాకులమ్ ఆసీత్, అత్ర కశ్చిత్ న మత్తః న బభూవ, కశ్చిత్ అత్ర న తృప్తః చ న బభూవ.

**ప్రతిపదార్థము** :– తత్ కపిసైన్యం = ఆ వానరసైన్యము, మధుప్రపానోత్కట సత్త్వ చేష్టం = తేనెలను త్రాగుటచే మదించిన మనస్సును, చేష్టలుకలదై, సమాకులమ్ = కల్లోలమైనది, ఆసీత్ = ఆయెను, అత్ర = ఆ వానర సమూహమునందు, కశ్చిత్ = ఒక్కడును, న మత్తః = మత్తిల్లనివాడు, న బభూవ = లేకుండెను, కశ్చిత్ = ఏ యొక్కడును, అత్ర = వీరిలో, న తృప్తః చ న బభూవ = తృప్తినొందనివాడును లేకుండెను.

**తాత్పర్యము** :– ఆ వానరసైన్య మంతయును మధుపానముచే మదించిన మనస్సుతో స్వేచ్ఛాచరణముగలదై మిక్కిలి కల్లోలమైనదిగ నుండెను. అప్పుడు అచ్చట ఏయొక్క వానరుడును మత్తెక్కియుండనివాడుగాని తేనెలు త్రాగి తృప్తిదీరనివాడుగాని లేకుండెను.

**శ్లో॥ తతో వనం తైః పరిభక్ష్యమాణం**
**ద్రుమాంశ్చ విధ్వంసితపత్రపుష్పాన్ ।**
**సమీక్ష్య కోపా ద్దధివక్త్రనామా**
**నివారయామాస కపిః కపీం స్తాన్ ॥ 19**

**పదచ్ఛేదము** :– తతః – వనం – తైః – పరిభక్ష్యమాణం, ద్రుమాన్ – చ – విధ్వంసితపత్రపుష్పాన్, సమీక్ష్య – కోపాత్ – దధివక్త్రనామా – నివారయామాస – కపిః – కపీన్ – తాన్ ॥

**అన్వయక్రమము** :– తతః తైః పరిభక్ష్యమాణం వనం విధ్వంసితపత్రపుష్పాన్ ద్రుమాన్ చ సమీక్ష్య దధివక్త్రనామా కపిః తాన్ కపీన్ నివారయామాస.

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, తైః = ఆ వానరులచే, పరిభక్ష్యమాణం =

తినివేయబడుచున్నట్టి, వనం = వనమును, విధ్వంసితపత్రపుష్పాన్ = ధ్వంసము చేయబడిన ఆకులును పువ్వులును గలిగినట్టి, ద్రుమాన్ చ = వృక్షములనుకూడ, సమీక్ష్య = చూచి, దధివక్త్రనామా = దధిముఖుడను పేరుగల, కపిః = వానరుడు, తాన్ = ఆ, కపీన్ = వానరులను, నివారయామాస = అడ్డుకొనెను.

**తాత్పర్యము** :– అప్పు డా మధువనమును ఆ వానరులు తినివేయుటయును, చెట్ల యందలి ఆకులను పువ్వులను పాడుచేయుటయును చూచి దధిముఖుడను పేరుగల వనపాలకుడైన వానరుడు వచ్చి ఆ వానరుల నడ్డగించెను.

**శ్లో॥ స తైః ప్రవృద్ధైః పరిభర్త్స్యమానో**
**వనస్య గోప్తా హరివీరవృద్ధః ।**
**చకార భూయో మతి ముగ్రతేజా**
**వనస్య రక్షాం ప్రతి వానరేభ్యః ॥ 20**

**పదచ్ఛేదము** :– సః – తైః – ప్రవృద్ధైః – పరిభర్త్స్యమానః, వనస్య – గోప్తా – హరివీరవృద్ధః, చకార – భూయః – మతిమ్ – ఉగ్రతేజాః, వనస్య – రక్షాం – ప్రతి – వానరేభ్యః ॥

**అన్వయక్రమము** :– వనస్య గోప్తా హరివీరవృద్ధః సః ప్రవృద్ధైః తైః పరిభర్త్స్యమానః ఉగ్రతేజాః (సన్) వానరేభ్యః వనస్య రక్షాం ప్రతి భూయః మతిం చకార.

**ప్రతిపదార్థము** :– వనస్య గోప్తా = వనమునకు రక్షకుడైన, హరివీరవృద్ధః = వృద్ధవానర వీరుడైనట్టి, సః = ఆ దధిముఖుడు, ప్రవృద్ధైః = పెచ్చు పెరిగినట్టి, తైః = ఆ వానర వీరులచే, పరిభర్త్స్యమానః = గద్దింపబడుచున్నవాడై, ఉగ్రతేజాః (సన్) = ఉగ్రమైన పరాక్రమము గలవాడై, వానరేభ్యః = వానరుల నుండి, వనస్య = మధువనము యొక్క, రక్షాం ప్రతి = రక్షణమును గూర్చి, భూయః = తిరిగి, మతిం చకార = నిశ్చయించుకొనెను.

**తాత్పర్యము** :– మధువనపాలకుడైనట్టి ఆ వానరవీరవృద్ధుడైన దధిముఖుని ఆ కపిసేనలు దర్పించి లెక్కచేయక ఎదురు తిరిగి గద్దించుచుండగా ఆతనికి గొప్ప పౌరుషము గలిగి ఆ వానరులనుండి మధువనమును రక్షించుటకుగాను తీవ్రముగా నిశ్చయించుకొనెను.

**శ్లో॥ ఉవాచ కాంశ్చి త్పరుషాణి ధృష్ట**
**మసక్త మన్యాంశ్చ తలై ర్జఘాన ।**

**సమేత్య కైశ్చి త్కలహం చకార**
**తథైవ సామ్నోపజగామ కాంశ్చిత్ ॥ 21**

**పదచ్ఛేదము** :– ఉవాచ – కాన్ – చిత్ – పరుషాణి – ధృష్టమ్ – అసక్తమ్ – అన్యాన్ – చ – తలైః – జఘాన, సమేత్య – కైశ్చిత్ – కలహం – చకార – తథా – ఏవ – సామ్నా – ఉపజగామ – కాంశ్చిత్ ॥

**అన్వయక్రమము** :– (సః) కాంశ్చిత్ ధృష్టం పరుషాణి ఉవాచ, అన్యాన్ చ అసక్తం తలైః జఘాన, కైశ్చిత్ సమేత్య కలహం చకార, తథైవ కాంశ్చిత్ సామ్నా ఉపజగామ.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ దధిముఖుడు), కాంశ్చిత్ = కొంతమందిని, ధృష్టం = పొగరుగా, పరుషాణి = పరుషవచనములను, ఉవాచ = పలికెను, అన్యాన్ చ = ఇతరులనుగూడ, అసక్తం = అంటకుండ, తలైః = అరచేతులతో, జఘాన = కొట్టెను, కైశ్చిత్ = కొందరితో, సమేత్య = కలసి, కలహం చకార = కలహము పెట్టుకొనెను, తథా ఏవ = అట్లే, కాంశ్చిత్ = కొందరిని, సామ్నా = మంచిగనే, ఉపజగామ = సమీపించెను.

**తాత్పర్యము** :– అప్పుడా దధిముఖుడు కొందరు వానరులతో పొగరుగా పరుష వచనములు పలికెను. మరి కొందరిని తన అరచేతులతో ప్రహరించెను. కొందరికడ కేగి వారితో కయ్యము పెట్టుకొనెను. మరికొందరికడ కేగి మంచిగనే మాటలాడి ఒప్పించ యత్నించెను.

**శ్లో॥ స తై ర్మదా త్సంపరివార్య వాక్యై**
**ర్బలాచ్చ తేన ప్రతివార్యమాణైః ।**
**ప్రధర్షిత స్త్యక్తభయై స్సమేత్య**
**ప్రకృష్యతే చా ప్యనవేక్ష్య దోషమ్ ॥ 22**

**పదచ్ఛేదము** :– సః – తైః – మదాత్ – సంపరివార్య – వాక్యైః – బలాత్ – చ – తేన – ప్రతివార్యమాణైః, ప్రధర్షితః – త్యక్తభయైః – సమేత్య – ప్రకృష్యతే – చ – అపి – అనవేక్ష్య – దోషమ్ ॥

**అన్వయక్రమము** :– మదాత్ సంపరివార్య వాక్యైః బలాత్ చ తేన ప్రతివార్యమాణైః త్యక్తభయైః తైః సమేత్య, దోషం చ అపి అనవేక్ష్య సః ప్రధర్షితః ప్రకృష్యతే చ.

**ప్రతిపదార్థము** :– మదాత్ = మదమువలన, సంపరివార్య = చుట్టును మూగి, వాక్యైః = మాటలతోడను, బలాత్ చ = బలమువలనను, తేన = వానిచే,

ప్రతివార్యమాణైః = అడ్డగింపబడుచున్న వారును, త్యక్తభయైః = విడిచిపెట్టబడిన భయముగలవారునగు, తైః = ఆ వానరులచే, ప్రధర్షితః = తిరస్కరింపబడినవాడై, సః = ఆ దధిముఖుడు, దోషమ్ అపి = దోషమునుగూడ, అనవేక్ష్య = చూడకుండ, ప్రకృష్యతే చాపి = ఈడ్వబడు చుండెను గూడను.

**తాత్పర్యము :–** ఆ దధిముఖుడు కొంతవరకు మాటలతోను, కొంతవరకు దేహబలము తోడను తమ్ము ఎంత అడ్డగించినను ఆ వానరవీరులు మదముచే లెక్కచేయక భయము విడిచి దోషమని ఎంచక అందరును కలసి ఆతనిని గద్దించుచు క్రిందకు పడగొట్టి లాగుచుండిరి.

**శ్లో॥ నఖై స్తుదంతో దశనై ర్దశంత**
**స్తలైశ్చ పాదైశ్చ సమాపయంతః ।**
**మదా త్కపిం తం కపయ స్సమగ్రా**
**మహావనం నిర్విషయం చ చక్రుః ॥ 23**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"మధువనప్రవేశో" నామ*
*ఏకషష్టితమస్సర్గః.*

**పదచ్ఛేదము :–** నఖైః – తుదంతః – దశనైః – దశంతః – తలైః – చ – పాదైః – చ – సమాపయంతః, మదాత్ – కపిం – తం – కపయః – సమగ్రాః – మహావనం – నిర్విషయం – చ – చక్రుః ॥

**అన్వయక్రమము :–** సమగ్రాః కపయః మదాత్ తం కపిం నఖైః తుదంతః, దశనైః దశంతః తలైః చ పాదైః చ సమాపయంతః, మహావనం నిర్విషయం చక్రుః.

**ప్రతిపదార్థము :–** సమగ్రాః కపయః = అందరు వానరులును, మదాత్ = మదము వలన, తం కపిం = ఆ దధిముఖుని, నఖైః = గోళ్ళతో, తుదంతః = హింసించుచు, దశనైః = దంతములతో, దశంతః = కరచుచు, తలైః చ = అరచేతులతోడను, పాదైః చ = పాదములతోడను, సమాపయంతః = అంతమొందించుచు, మహావనం = మహావనమైన ఆ మధువనమును, నిర్విషయం = ఒక్క వస్తువు కూడ లేనిదిగా, చక్రుః = చేసిరి.

**తాత్పర్యము :–** అప్పుడా వానరులెల్లరును మధుపానముచే మత్తిల్లి యున్నవారై ఆ

దధిముఖునిపై బడి తమ గోళ్ళతో రక్కుచు పన్నులతో కరచుచు అరచేతులతో బాదుచు కాళ్ళతో తన్నుచు ఆతనిని చావగొట్టుచున్నవారై మహావనమైన ఆ మధువనమునందు తేనెగాని ఫలములు పుష్పములు మున్నగునవిగాని ఏమియును లేకుండజేసిరి.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"మధువన ప్రవేశము" అను*
*అరువదియొకటవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# ద్విషష్టితమసర్గ

**శ్లో॥ తా నువాచ హరిశ్రేష్ఠో హనుమా న్వానరర్షభః ।**
**అవ్యగ్రమనసో యూయం మధు సేవత వానరాః ।**
**అహ మావారయిష్యామి యుష్మాకం పరిపంథినః ॥ 1**

**పదచ్ఛేదము** :- తాన్ - ఉవాచ - హరిశ్రేష్ఠః - హనుమాన్ - వానరర్షభః, అవ్యగ్రమనసః - యూయం - మధు - సేవత - వానరాః, అహమ్ - ఆవారయిష్యామి - యుష్మాకం - పరిపంథినః ॥

**అన్వయక్రమము** :- వానరర్షభః హరిశ్రేష్ఠః హనుమాన్ తాన్ ఉవాచ. వానరాః! యూయం అవ్యగ్రమనసః (సంతః) మధు సేవత; యుష్మాకం పరిపంథినః అహమ్ ఆవారయిష్యామి.

**ప్రతిపదార్థము** :- వానరర్షభః = వానరోత్తముడైన, హరిశ్రేష్ఠః హనుమాన్ = కపిశ్రేష్ఠుడగు హనుమ, తాన్ = ఆ వానరులను గూర్చి, ఉవాచ = పలికెను, వానరాః = ఓ వానరులారా!, యూయం = మీరు, అవ్యగ్రమనసః = నిశ్చింతగల మనస్సు గలవారై, మధు = తేనెను, సేవత = సేవింపుడు, యుష్మాకం = మీయొక్క, పరిపంథినః = శత్రువులను, అహం = నేను, ఆవారయిష్యామి = నివారించెదను.

**తాత్పర్యము** :- అప్పుడా వానరశ్రేష్ఠుడైన ఆ హనుమ ఆ వానరులను గూర్చి ఇట్లు పలికెను. ఓ వానరులారా! మీరు నిశ్చింతగా ఇచట మధువును సేవింపుడు. మిమ్ములను అడ్డుకొనెడి శత్రువులను అందరిని నేను నివారించెదను.

**శ్లో॥ శ్రుత్వా హనుమతో వాక్యం హరీణాం ప్రవరోఽఙ్గదః ।**
**ప్రత్యువాచ ప్రసన్నాత్మా పిబంతు హరయో మధు ॥ 2**

**పదచ్ఛేదము** :- శ్రుత్వా - హనుమతః - వాక్యం - హరీణాం - ప్రవరః - అంగదః, ప్రత్యువాచ - ప్రసన్నాత్మా - పిబంతు - హరయః - మధు ॥

**అన్వయక్రమము** :- హనుమతః వాక్యం శ్రుత్వా హరీణాం ప్రవరః అంగదః

ప్రసన్నాత్మా (సన్) ప్రత్యువాచ 'హరయః మధు పిబంతు'.

**ప్రతిపదార్థము** :– హనుమతః = హనుమయొక్క, వాక్యం = మాటను, శ్రుత్వా = విని, హరీణాం = వానరులలో, ప్రవరః = శ్రేష్ఠుడైన, అంగదః = అంగదుడు, ప్రసన్నాత్మా సన్ = ప్రసన్నమైన మనస్సుగలవాడై, ప్రత్యువాచ = బదులు పలికెను, హరయః = వానరులు, మధు = తేనెను, పిబంతు = త్రాగుదురుగాక.

**తాత్పర్యము** :– హనుమ చెప్పిన మాటను విని వానరశ్రేష్ఠుడైన అంగదుడు సంతోషము నొందిన మనస్సుతో తిరిగి ఇట్లు పలికెను. "ఈ వానరులు స్వేచ్ఛగా మధువును త్రాగుదురుగాక! వీరి నెవ్వరును అడ్డగింపరాదు".

**శ్లో॥ అవశ్యం కృతకార్యస్య వాక్యం హనుమతో మయా ।**
**అకార్యమపి కర్తవ్యం కి మంగ పున రీదృశమ్ ॥ 3**

**పదచ్ఛేదము** :– అవశ్యం – కృతకార్యస్య – వాక్యం – హనుమతః – మయా, అకార్యమ్ – అపి – కర్తవ్యం – కిమ్ – అంగ – పునః – ఈదృశమ్ ॥

**అన్వయక్రమము** :– కృతకార్యస్య హనుమతః వాక్యమ్ అకార్యమ్ అపి మయా అవశ్యం కర్తవ్యమ్, అంగ! ఈదృశం కిం పునః (వక్తవ్యమ్?).

**ప్రతిపదార్థము** :– కృతకార్యస్య = చేయబడిన కార్యము గల్గినట్టి, హనుమతః = హనుమంతునియొక్క, వాక్యం = మాట, అకార్యమ్ అపి = చేయరానిదైనను, మయా = నాచే, అవశ్యం = తప్పక, కర్తవ్యమ్ = చేయవలసినది, అంగ = ఆహా! ఈదృశం = ఇట్టిది, కిం పునః = ఏమి చెప్పవలయును?

**తాత్పర్యము** :– కార్యము సాధించుకొని వచ్చిన మహాత్ముడైన హనుమయొక్క వచనము చేయకూడనిదైనను నాకు శిరోధార్యమే యగును. అట్టిచో సర్వవానరులకు వాంఛితమైన ఈ విషయ మేల అంగీకారయోగ్యము కాకుండును?

**శ్లో॥ అంగదస్య ముఖా చ్ఛ్రుత్వా వచనం వానరర్షభాః ।**
**సాధు సాధ్వితి సంహృష్టా వానరాః ప్రత్యపూజయన్ ॥ 4**

**పదచ్ఛేదము** :– అంగదస్య – ముఖాత్ – శ్రుత్వా – వచనం – వానరర్షభాః, సాధు – సాధు – ఇతి – సంహృష్టాః – వానరాః – ప్రత్యపూజయన్ ॥

**అన్వయక్రమము** :– వానరర్షభాః వానరాః అంగదస్య ముఖాత్ వచనం శ్రుత్వా సంహృష్టాః సాధు సాధు ఇతి ప్రత్యపూజయన్.

**ప్రతిపదార్థము :–** వానరర్షభాః వానరాః = వానరశ్రేష్ఠులైన ఆ కపివీరులు, అంగదస్య = అంగదునియొక్క, ముఖాత్ = నోటినుండి, వచనం = మాటను, శ్రుత్వా = విని, సంప్రహృష్టాః = మిక్కిలి సంతోషించినవారై, సాధు సాధు ఇతి = బాగుబాగని, ప్రత్య పూజయన్ = అభినందించిరి.

**తాత్పర్యము :–** అప్పుడా వానరశ్రేష్ఠులందరును అంగదుడు పలికిన సంతోషకరమైన ఆ మాటను విని అమితానందము నొందినవారై బాగు బాగని అంగదుని మెచ్చుకొనిరి.

**శ్లో॥ పూజయిత్వాంగదం సర్వే వానరా వానరర్షభమ్ ।**
**జగ్ము ర్మధువనం యత్ర నదీవేగా ఇవ ద్రుతమ్ ॥ 5**

**పదచ్ఛేదము :–** పూజయిత్వా – అంగదం – సర్వే – వానరాః – వానరర్షభమ్ – జగ్ముః – మధువనం – యత్ర – నదీవేగాః – ఇవ – ద్రుతమ్ ॥

**అన్వయక్రమము :–** సర్వే వానరాః వానరర్షభమ్ అంగదం పూజయిత్వా నదీవేగాః ఇవ ద్రుతం యత్ర మధువనం (తత్ర) జగ్ముః.

**ప్రతిపదార్థము :–** సర్వే వానరాః = ఎల్లవానరులును, వానరర్షభమ్ అంగదం = వానరశ్రేష్ఠుడైన అంగదుని, పూజయిత్వా = గౌరవించి, నదీవేగాః ఇవ = నదీవేగములవలె, ద్రుతం = వడిగా, యత్ర మధువనం = ఎక్కడ మధువనమున్నదో, తత్ర = అచ్చటికి, జగ్ముః = వెడలిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** "మధువనం జగ్ముః" మధువనమునకు వెడలిరి అని చెప్పుట ఇంకను మధువు సమృద్ధిగా నున్నట్టి ప్రదేశమునకు వెడలిరని భావము. లేక పూర్వము దదిముఖు డెదుర్కొనగా కొంతదూరము ఈవలికి వచ్చి హనుమంతుడును అంగదుడును ధైర్యము చెప్పగా మరల నటకు వెడలిరని చెప్పవచ్చును.

**తాత్పర్యము :–** ఆ వానరులెల్లరును వానరోత్తముడైన అంగదుని మెచ్చుకొని నదీప్రవాహములవలె మరల వడివడిగా మధువనమునకు పరుగిడిరి.

**శ్లో॥ తే ప్రవిష్టా మధువనం పాలా నాక్రమ్య వీర్యతః ।**
**అతిసర్గాచ్చ పటవో దృష్ట్వా శ్రుత్వా చ మైథిలీమ్ ।**
**పపు స్సర్వే మధు తదా రసవత్ఫల మాదదుః ॥ 6**

**పదచ్ఛేదము :–** తే – ప్రవిష్టాః – మధువనం – పాలాన్ – ఆక్రమ్య – వీర్యతః,

అతిసర్గాత్ – చ – పటవః – దృష్ట్వా – శ్రుత్వా – చ – మైథిలీమ్, పపుః – సర్వే – మధు – తదా – రసవత్ – ఫలమ్ – ఆదదుః ॥

**అన్వయక్రమము** :– మైథిలీం దృష్ట్వా శ్రుత్వా చ అతిసర్గాత్ చ పటవః తే సర్వే మధువనం ప్రవిష్టాః వీర్యతః పాలాన్ ఆక్రమ్య మధు పపుః తథా రసవత్ ఫలం ఆదదుః.

**ప్రతిపదార్థము** :– మైథిలీం = సీతాదేవిని, దృష్ట్వా = చూచి, శ్రుత్వా చ = వినియును, అతిసర్గాత్ చ = అనుజ్ఞవలనను, పటవః = గొప్పబలముగలవారై, మధువనం = మధువనమును, ప్రవిష్టాః = ప్రవేశించినవారై, వీర్యతః = పరాక్రమమువలన, పాలాన్ = వనపాలురను, ఆక్రమ్య = చుట్టుముట్టి, తే సర్వే = ఆ వానరులందరును, మధు = తేనెను, పపుః = త్రాగిరి, తథా = అట్లు, రసవత్ = రసవంతమైన, ఫలం = ఫలములను, ఆదదుః = తినిరి.

**తాత్పర్యము** :– అప్పుడా వానరులందరును సీతాదేవిని గూర్చి వింటిమి, చూచితిమి అను గర్వముతోను, అంగదుని అనుజ్ఞ పొందితిమను దర్పముతోను తమ శౌర్యమును ప్రదర్శించుచు, వనపాలకులను త్రోసిపుచ్చి మధువనమున ప్రవేశించి స్వేచ్ఛగా మధువును త్రాగిరి మరియు అందలి రసవంతములైన పండ్లను తృప్తిగా భక్షించిరి.

**శ్లో॥ ఉత్పత్య చ తత స్సర్వే వనపాలా న్సమాగతాన్ ।**
**తాడయంతి స్మ శతశ స్సక్తా న్మధువనే తదా ॥ 7**

**పదచ్ఛేదము** :– ఉత్పత్య – చ – తతః – సర్వే – వనపాలాన్ – సమాగతాన్, తాడయంతి – స్మ – శతశః – సక్తాన్ – మధువనే – తదా ॥

**అన్వయక్రమము** :– తతః సర్వే ఉత్పత్య మధువనే సక్తాన్ సమాగతాన్ వనపాలాన్ తదా శతశః తాడయంతి స్మ.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, సర్వే = ఎల్లరును, ఉత్పత్య = ఎగిరి, మధువనే = మధువనమునందు, సక్తాన్ = ఆసక్తిగలిగియున్నట్టి, సమాగతాన్ = ఎదురుగ వచ్చినవారైన, వనపాలాన్ = వనరక్షకులను, తదా = అప్పుడు, శతశః = పలువిధములుగా, తాడయంతి స్మ = ప్రహరించిరి.

**తాత్పర్యము** :– అప్పుడా వానరులందరును ఎగురుచు వచ్చి ఆ మధువన రక్షణము నందు నిమగ్నులై యుండి తమ నెదుర్కొనుటకై వచ్చినట్టి వనపాలకులను పలు విధములుగా ప్రహరింప దొడగిరి.

**శ్లో॥ మధూని ద్రోణమాత్రాణి బాహుభిః పరిగృహ్యా తే ।**
**పిబంతి సహితా స్సర్వే నిఘ్నంతి స్మ తథాఽపరే ॥ 8**

**పదచ్ఛేదము** :– మధూని – ద్రోణమాత్రాణి – బాహుభిః – పరిగృహ్యా – తే – పిబంతి – సహితాః – సర్వే – నిఘ్నంతి – స్మ – తథా – అపరే ॥

**అన్వయక్రమము** :– తే సర్వే సహితాః ద్రోణమాత్రాణి మధూని బాహుభిః పరిగృహ్యా పిబంతి, తథా అపరే నిఘ్నంతి స్మ.

**ప్రతిపదార్థము** :– తే = ఆ వానరులు, సర్వే = అందరును, సహితాః = కలిసినవారై, ద్రోణమాత్రాణి = తూమెడు పరిమాణము గల్గినట్టి, మధూని = మధుకోశములను, బాహుభిః = బాహువులతో, పరిగృహ్యా = వెలుపలికి లాగి, పిబంతి స్మ = త్రాగుచుండిరి, తథా = అట్లు, అపరే = మరికొంతమంది, నిఘ్నంతి స్మ = ప్రహరించుచుండిరి.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'అపరే నిఘ్నంతి స్మ' అనగా మరి కొందరు త్రాగగా మిగిలిన ఆ తేనెపట్టులను చిదిమివేయుచుండిరని భావము.

**తాత్పర్యము** :– ఆ వానరులందరును కలసి ఆ వనమునందున్న పెద్ద పెద్ద తేనెపట్టులను తమ బాహువులతో చెట్లనుండి క్రిందికి దింపి అందలి మధువును త్రాగుచుండగా మరి కొందరు తమను వారింపవచ్చిన వనరక్షకులతో పోరాడుచుండిరి.

**శ్లో॥ కేచి త్పీత్వాపవిధ్యంతి మధూని మధుపింగళాః ।**
**మధూచ్ఛిష్టేన కేచిచ్చ జఘ్ను రన్యోన్య ముత్కటాః ॥ 9**

**పదచ్ఛేదము** :– కే – చిత్ – పీత్వా – అపవిధ్యంతి – మధూని – మధుపింగళాః – మధూచ్ఛిష్టేన – కేచిత్ – చ – జఘ్నుః – అన్యోన్యమ్ – ఉత్కటాః ॥

**అన్వయక్రమము** :– కేచిత్ మధుపింగళాః మధూని పీత్వా అపవిధ్యంతి. ఉత్కటాః కేచిత్ మధూచ్ఛిష్టేన అన్యోన్యం జఘ్నుః.

**ప్రతిపదార్థము** :– మధుపింగళాః = తేనెవన్నెగల, కేచిత్ = కొంతమంది, మధూని = తేనెలను, పీత్వా = త్రాగి, అపవిధ్యంతి = పారవేయుచుండిరి, కేచిత్ = మరికొంతమంది, ఉత్కటాః = మదించినవారై, మధూచ్ఛిష్టేన = మైనముతో, అన్యోన్యం = పరస్పరము, జఘ్నుః = కొట్టుకొనుచుండిరి.

**తాత్పర్యము** :– పచ్చని తేనెవన్నెగల కొందరు వానరులు తేనెలను త్రాగి తేనె పట్టులను

పారవైచుచుండిరి. మరికొందరు మదించి యున్నవారై ఆ తేనెపట్టునందలి మైనముతో ఒకరి నొకరు కొట్టుకొనుచుండిరి.

**శ్లో॥ అపరే వృక్షమూలే తు శాఖాం గృహ్యా వ్యవస్థితాః ।**
**అత్యర్థం చ మదగ్లానాః పర్ణా న్యాస్తీర్య శేరతే ॥ 10**

**పదచ్ఛేదము** :– అపరే – వృక్షమూలే – తు – శాఖాం – గృహ్యా – వ్యవస్థితాః, అత్యర్థం – చ – మదగ్లానాః – పర్ణాని – ఆస్తీర్య – శేరతే ॥

**అన్వయక్రమము** :– అపరే శాఖాం గృహ్యా వృక్షమూలే వ్యవస్థితాః, (అన్యే) అత్యర్థం మదగ్లానాః పర్ణాని ఆస్తీర్య శేరతే.

**ప్రతిపదార్థము** :– అపరే = మరికొందరు, శాఖాం = కొమ్మను, గృహ్యా = పట్టుకొని, వృక్షమూలే = చెట్టుమొదట, వ్యవస్థితాః = నిలచియుండిరి, (అన్యే = ఇతరులు), అత్యర్థం = మిక్కిలిగా, మదగ్లానాః = మత్తుచే డస్సినవారై, పర్ణాని = ఆకులను, ఆస్తీర్య = పరచుకొని, శేరతే = నిద్రించుచుండిరి.

**తాత్పర్యము** :– వారిలో కొందరు కొమ్మలను పట్టుకొని చెట్లమొదళ్ళలో నిలచి యుండిరి. మరికొందరు మిక్కిలి మదించి అలసి నేలపై ఆకులను పరచుకొని వాటిపై పరుండిరి.

**శ్లో॥ ఉన్మత్తభూతాః ప్లవగా మధుమత్తాశ్చ హృష్టవత్ ।**
**క్షిపంతి చ తదాఽన్యోన్యం స్ఖలంతి చ తథాఽపరే ॥ 11**

**పదచ్ఛేదము** :– ఉన్మత్తభూతాః – ప్లవగాః – మధుమత్తాః – చ – హృష్టవత్, క్షిపంతి – చ – తదా – అన్యోన్యం – స్ఖలంతి – చ – తథా – అపరే ॥

**అన్వయక్రమము** :– ప్లవగాః ఉన్మత్తభూతాః మధుమత్తాః చ హృష్టవత్ తదా అన్యోన్యం క్షిపంతి తథా అపరే స్ఖలంతి.

**ప్రతిపదార్థము** :– ప్లవగాః = వానరులు, ఉన్మత్తభూతాః = ఉన్మత్తప్రాయులై, మధుమత్తాః = తేనెలచే మత్తిల్లినవారై, హృష్టవత్ = సంతోషించినట్లుగా, తదా = అప్పుడు, అన్యోన్యం = ఒకరినొకరు, క్షిపంతి = త్రోసికొనుచుండిరి, తథా = అట్లు, అపరే = మరికొందరు, స్ఖలంతి చ = తూలుచుండిరిగూడను.

**తాత్పర్యము** :– ఆ వానరులు పిచ్చి ఎక్కినవారివలె మధుపానముచే మత్తెక్కి ఆనందావేశమునొంది ఒకరినొకరు త్రోసికొనుచుండిరి. మరికొందరు నడచుచు తూలిపోవుచుండిరి.

**శ్లో॥ కేచిత్ క్ష్వేళాం ప్రకుర్వంతి కేచి త్కూజంతి హృష్టవత్ ।**
**హరయో మధునా మత్తాః కేచి త్సుప్తా మహీతలే ॥ 12**

**పదచ్ఛేదము :–** కేచిత్ – క్ష్వేళాం – ప్రకుర్వంతి – కేచిత్ – కూజంతి – హృష్టవత్, హరయః – మధునా – మత్తాః – కేచిత్ – సుప్తాః – మహీతలే ॥

**అన్వయక్రమము :–** హరయః కేచిత్ క్ష్వేళాం ప్రకుర్వంతి, కేచిత్ హృష్టవత్ కూజంతి, మధునా మత్తాః కేచిత్ మహీతలే సుప్తాః.

**ప్రతిపదార్థము :–** మధునా = తేనెచేత, మత్తాః = మత్తెక్కిన వారైన, హరయః = వానరులు, కేచిత్ = కొంతమంది, క్ష్వేళాం = గర్జనమును, ప్రకుర్వంతి = చేయుచుండిరి, కేచిత్ = కొంతమంది, హృష్టవత్ = సంతోషించినట్లు, కూజంతి = కూయుచుండిరి, కేచిత్ = కొంతమంది, మహీతలే = నేలపై, సుప్తాః = నిద్రించి యుండిరి.

**తాత్పర్యము :–** మధుపానముచే మత్తెక్కియున్న ఆ వానరులలో కొందరు సింహగర్జనములు చేయుచుండిరి. మరికొంద రానందావేశముతో పక్షులవలె కూయుచుండిరి. మరికొందరు నేలపైబడి నిద్రించుచుండిరి.

**శ్లో॥ కృత్వా కేచి ద్ధసం త్యన్యే కేచి త్కుర్వంతి చేతరత్ ।**
**కృత్వా కించి ద్వదం త్యన్యే కేచి ద్బుధ్యంతి చేతరత్ ॥ 13**

**పదచ్ఛేదము :–** కృత్వా – కేచిత్ – హసంతి – అన్యే – కేచిత్ – కుర్వంతి – చ – ఇతరత్, కృత్వా – కించిత్ – వదంతి – అన్యే – కేచిత్ – బుధ్యంతి – చ – ఇతరత్ ॥

**అన్వయక్రమము :–** కేచిత్ కృత్వా హసంతి, అన్యే కేచిత్ ఇతరత్ కుర్వంతి, కేచిత్ కృత్వా వదంతి, అన్యే కేచిత్ ఇతరత్ బుధ్యంతి.

**ప్రతిపదార్థము :–** కేచిత్ = కొంతమంది, కృత్వా = చేసి, హసంతి = నవ్వుచుండిరి, అన్యే కేచిత్ = మరికొంతమంది, ఇతరత్ = ఇంకొకటి, కుర్వంతి = చేయుచుండిరి, కేచిత్ = కొంతమంది, కృత్వా = చేసి, వదంతి = చెప్పుచుండిరి, అన్యే కేచిత్ = మరికొంతమంది, ఇతరత్ బుధ్యంతి = వేరొకటి తలచుచుండిరి.

**తాత్పర్యము :–** ఆ వానరులలో కొందరు గ్రామ్యకృత్యమును చేసి నవ్వుచుండిరి. మరికొందరు మరియొకరీతిని గ్రామ్యధర్మమును చేయుచుండిరి. మరికొంద రట్టిపనినే చేసి దానిని ఘనముగ చెప్పుకొనుచుండిరి. మరికొందరు వేరొకరీతి పని చేయవలెనని తలచుచుండిరి.

**శ్లో॥ యే ఽప్యత్ర మధుపాలా స్స్యుః ప్రేష్యా దధిముఖస్య తు ।**
**తేఽపి తై ర్వానరై ర్భీమైః ప్రతిషిద్ధా దిశో గతాః ॥ 14**

**పదచ్ఛేదము :–** యే – అపి – అత్ర – మధుపాలాః – స్యుః – ప్రేష్యాః – దధిముఖస్య – తు – తే – అపి – తైః – వానరైః – భీమైః – ప్రతిషిద్ధాః – దిశః – గతాః ॥

**అన్వయక్రమము :–** దధిముఖస్య ప్రేష్యాః అత్ర యే మధుపాలాః స్యుః తే అపి తైః భీమైః వానరైః ప్రతిషిద్ధాః దిశః గతాః.

**ప్రతిపదార్థము :–** దధిముఖస్య = దధిముఖునియొక్క, ప్రేష్యాః = సేవకులైన, యే మధుపాలాః = ఏ మధువనరక్షకులైతే, అత్ర = ఈ వనమున, స్యుః = ఉందురో, తే అపి = వారును, తైః = ఆ, భీమైః = భయంకరులైన, వానరైః = వానరులచే, ప్రతిషిద్ధాః = వారింపబడినవారై, దిశః = దిక్కులను గూర్చి, గతాః = పోయినారు.

**తాత్పర్యము :–** ఈ మధువనమునందు దధిముఖుని సేవకులైనట్టి వనరక్షకుల నందరిని, ఆ భయంకరులైన వానరులు నలుదిక్కులకును తరిమివేసిరి.

**శ్లో॥ జానుభిస్తు ప్రకృష్టాశ్చ దేవమార్గం చ దర్శితాః ।**
**అబ్రువన్ పరమోద్విగ్నా గత్వా దధిముఖం కపిమ్ ॥ 15**

**పదచ్ఛేదము :–** జానుభిః – తు – ప్రకృష్టాః – చ – దేవమార్గం – చ – దర్శితాః – అబ్రువన్ – పరమోద్విగ్నాః – గత్వా – దధిముఖం – కపిమ్ ॥

**అన్వయక్రమము :–** జానుభిః ప్రకృష్టాః దేవమార్గం దర్శితాః చ (సంతః) పరమోద్విగ్నాః (తే) దధిముఖం కపిం గత్వా అబ్రువన్.

**ప్రతిపదార్థము :–** జానుభిః = మోకాళ్ళతో, ప్రకృష్టాః = పొడవబడినవారై, దేవమార్గం = పృష్ఠభాగమును, దర్శితాః చ (సంతః) = చూపబడినవారగుచును, పరమోద్విగ్నాః = మిక్కిలి వ్యాకులత నొందినవారైన, తే = ఆ వనపాలకులు, దధిముఖం కపిం = దధిముఖ వానరుని గూర్చి, గత్వా = పోయి, అబ్రువన్ = పలికిరి.

**సూచన :–** 'దేవమార్గం దర్శితాః' అనగా ఆకాశముమీదికి విసరి వేయబడిరి. అని భావముగా కొందరు వివరించి యున్నారు.

**తాత్పర్యము :–** ఆ వనరక్షకులను ఈ వానరవీరులు మోకాళ్ళతో పొడిచియు పృష్ఠభాగమును జూపియు, అవమానింపగా వారు మిక్కిలి వ్యాకులత నొందినవారై దధిముఖుని కడకుపోయి ఇట్లు పలికిరి.

**శ్లో॥ హనూమతా దత్తవరై ర్హతం మధువనం మహత్ ।**
**వయం చ జానుభిః కృష్టా దేవమార్గం చ దర్శితాః ॥ 16**

**పదచ్ఛేదము :–** హనూమతా – దత్తవరైః – హతం – మధువనం – మహత్, వయం – చ – జానుభిః – కృష్టాః – దేవమార్గం – చ – దర్శితాః ॥

**అన్వయక్రమము :–** హనూమతా దత్తవరైః తైః మహత్ మధువనం హతమ్, వయం చ జానుభిః కృష్టాః దేవమార్గం దర్శితాః చ.

**ప్రతిపదార్థము :–** హనూమతా = హనుమంతునిచే, దత్తవరైః = ఈయబడిన యనుజ్ఞ గలవారయిన, తైః = ఆ వానరులచే, మహత్ = గొప్పదైన, మధువనం = మధువనము, హతం = ధ్వంసము చేయబడినది, వయం చ = మేమును, జానుభిః = మోకాళ్ళతో, కృష్టాః = పొడువబడితిమి. దేవమార్గం = పృష్ఠభాగమును, దర్శితాః చ = చూపబడితిమి కూడను.

**తాత్పర్యము :–** హనుమంతుడు వారి కనుజ్ఞనీయగా గొప్పదైన మన మధువనము నంతను ధ్వంసము చేసినారు. వారు మమ్ము మోకాళ్ళతో బొడిచియు పృష్ఠభాగమును జూపియు చాలా అవమానించినారు.

**శ్లో॥ తతో దధిముఖః క్రుద్ధో వనప స్తత్ర వానరః ।**
**హతం మధువనం శ్రుత్వా సాంత్వయామాస తా న్హరీన్ ॥ 17**

**పదచ్ఛేదము :–** తతః – దధిముఖః – క్రుద్ధః – వనపః – తత్ర – వానరః, హతం – మధువనం – శ్రుత్వా – సాంత్వయామాస – తాన్ – హరీన్ ॥

**అన్వయక్రమము :–** తతః తత్ర వనపః దధిముఖః వానరః మధువనం హతం శ్రుత్వా తాన్ హరీన్ సాంత్వయామాస.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, తత్ర = అచ్చట, వనపః = వనరక్షకుడయిన, దధిముఖః వానరః = దధిముఖ వానరుడు, మధువనం = మధువనమును, హతం = ధ్వంసముచేయబడిన దానినిగా, శ్రుత్వా = విని, తాన్ హరీన్ = ఆ వానరులను, సాంత్వయామాస = ఓదార్చెను.

**తాత్పర్యము :–** అప్పుడు మధువనమున కధికారియైన ఆ దధిముఖుడు క్రోధితుడై తన మధువనము ధ్వంసము చేయబడినట్లు దీనులై చెప్పుచున్న ఆ వానరులను భయముదీర్చి ఓదార్చెను.

**శ్లో॥ ఇహా ఽఽగచ్ఛత గచ్ఛామో వానరాన్ బలదర్పితాన్ ।**
**బలేన వారయిష్యామో మధు భక్షయతో వయమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– ఇహ – ఆగచ్ఛత – గచ్ఛామః – వానరాన్ – బలదర్పితాన్, బలేన – వారయిష్యామః – మధు – భక్షయతః – వయమ్ ॥

**అన్వయక్రమము** :– ఇహ ఆగచ్ఛత, గచ్ఛామః; బలదర్పితాన్ మధు భక్షయతః వానరాన్ వయం బలేన వారయిష్యామః.

**ప్రతిపదార్థము** :– ఇహ = ఇటు, ఆగచ్ఛత = రండు, గచ్ఛామః = పోవుదము, బలదర్పితాన్ = బలముచే మదించినవారై, మధు = తేనెను, భక్షయతః = భక్షించుచున్నట్టి, వానరాన్ = వానరులను, వయం = మనము, బలేన = బలముతో, వారయిష్యామః = పారద్రోలుదము.

**తాత్పర్యము** :– ఇటురండు; మనమందరమును కలసి వెడలి బలముచే మదించి మధుపానము చేయుచున్న ఆ వానరులను మనబలము జూపి తరిమి వేయుదము.

**శ్లో॥ శ్రుత్వా దధిముఖ స్యేదం వచనం వానరర్షభాః ।**
**పున ర్వీరా మధువనం తేనైవ సహితా యయుః ॥ 19**

**పదచ్ఛేదము** :– శ్రుత్వా – దధిముఖస్య – ఇదం – వచనం – వానరర్షభాః, పునః – వీరాః – మధువనం – తేన – ఏవ – సహితాః – యయుః ॥

**అన్వయక్రమము** :– వీరాః వానరర్షభాః దధిముఖస్య ఇదం వచనం శ్రుత్వా తేన ఏవ సహితాః పునః మధువనం యయుః.

**ప్రతిపదార్థము** :– వీరాః = వీరులైనట్టి, వానరర్షభాః = వానరశ్రేష్ఠులు, దధిముఖస్య = దధిముఖునియొక్క, ఇదం = ఈ, వచనం = మాటను, శ్రుత్వా = విని, తేన ఏవ = అతని తోడనే, సహితాః = కూడినవారై, పునః = తిరిగి, మధువనం = మధువనమును గూర్చి, యయుః = వెడలిరి.

**తాత్పర్యము** :– దధిముఖుడు చెప్పిన ఆ మాటలను విని వీరులైన ఆ వానరులు అతడే తమతో వచ్చుచున్నాడను ధైర్యముతో తిరిగి మధువనమున కేగిరి.

**శ్లో॥ మధ్యే చైషాం దధిముఖః ప్రగృహ్య తరసా తరుమ్ ।**
**సమభ్యధావ ద్వేగేన తే చ సర్వే ప్లవంగమాః ॥ 20**

**పదచ్ఛేదము** :– మధ్యే – చ – ఏషాం – దధిముఖః – ప్రగృహ్య – తరసా –

తరుమ్, సమభ్యధావత్ – వేగేన – తే – చ – సర్వే – ప్లవంగమాః ॥

**అన్వయక్రమము** :– ఏషాం మధ్యే దధిముఖః తరసా తరుం ప్రగృహ్యా వేగేన సమభ్యధావత్, తే ప్లవంగమాః చ (అధావన్).

**ప్రతిపదార్థము** :– ఏషాం = ఆ వానరులయొక్క, మధ్యే = నడుమ, దధిముఖః = దధిముఖుడు, తరసా = బలముతో, తరుం = వృక్షమును, ప్రగృహ్యా = పట్టుకొని, వేగేన = వేగముగా, సమభ్యధావత్ = ఎదురుగ పరుగిడెను, తే = ఆ, ప్లవంగమాః = వానరులు, సర్వే చ = అందరునుగూడ, (అధావన్ = పరుగెత్తిరి).

**తాత్పర్యము** :– ఆ వానరుల నడుమనున్న దధిముఖుడు ఒక చెట్టును బలముగ పెకలించి దానిని గైకొని మధువనమువైపునకు పరుగెత్తెను. ఆతని అనుచరులు గూడ అట్లే వానివెంట పరుగిడిరి.

**శ్లో॥ తే శిలాః పాదపాంశ్చాపి పర్వతాం శ్చాపి వానరాః ।**
**గృహీత్వా ఽభ్యగమన్ క్రుద్ధా యత్ర తే కపికుంజరాః ॥ 21**

**పదచ్ఛేదము** :– తే – శిలాః – పాదపాన్ – చ – అపి – పర్వతాన్ – చ – అపి – వానరాః, గృహీత్వా – అభ్యగమన్ – క్రుద్ధాః – యత్ర – తే – కపికుంజరాః ॥

**అన్వయక్రమము** :– తే వానరాః శిలాః పాదపాన్ చ అపి గృహీత్వా క్రుద్ధాః తే కపికుంజరాః యత్ర (సంతి) తత్ర అభ్యగమన్.

**ప్రతిపదార్థము** :– తే వానరాః = ఆ వానరులు, శిలాః = రాళ్ళను, పాదపాన్ చ అపి = వృక్షములను, పర్వతాన్ చ అపి = పర్వతములను గూడ, గృహీత్వా = తీసికొని, క్రుద్ధాః = క్రోధము నొందినవారై, తే కపికుంజరాః = ఆ వానర శ్రేష్ఠులు, యత్ర = ఎచ్చటనైతే, (సంతి = ఉన్నారో), తత్ర = అచ్చటికి, అభ్యగమన్ = పరుగెత్తిరి.

**తాత్పర్యము** :– వనరక్షకులైన ఆ వానరులు శిలలను, వృక్షములను పర్వతములను గూడ పట్టుకొని మిక్కిలి క్రోధముతో అంగదాది వానరులున్న చోటికి పరుగున వెడలిరి.

**శ్లో॥ తే స్వామివచనం వీరా హృదయే ష్వవసజ్య తత్ ।**
**త్వరయా హ్యభ్యధావంత సాలతాలశిలాయుధాః ॥ 22**

**పదచ్ఛేదము** :– తే – స్వామివచనం – వీరాః – హృదయేషు – అవసజ్య – తత్, త్వరయా – హి – అభ్యధావంత – సాలతాలశిలాయుధాః ॥

**అన్వయక్రమము** :– తే వీరాః స్వామివచనం హృదయేషు అవసజ్య సాలతాల

శిలాయుధాః (సంతః) త్వరయా తత్ అభ్యధావంత.

**ప్రతిపదార్థము** :– తే వీరాః = ఆ వానరవీరులు, స్వామివచనం = యజమాని మాటను, హృదయేషు = మనస్సులందు, అవసజ్య = నిలుపుకొని, సాలతాల శిలాయుధాః (సంతః) = మద్దిచెట్లను, తాటిచెట్లను, శిలలను ఆయుధములుగా గలవారయి, త్వరయా = వేగముగా, తత్ = ఆ వనమునుగూర్చి, అభ్యధావంత = పరుగిడిరి.

**తాత్పర్యము** :– వనరక్షకులయిన ఆ వానరవీరులు దధిముఖుడు చెప్పిన మాటను మనస్సునం దుంచుకొని మద్దిచెట్లను, తాడిచెట్లను, రాళ్ళను ఆయుధములుగ చేసికొని ఆ మధువనమునకు వేగముగా పరుగిడిరి.

**శ్లో॥ వృక్షస్థాంశ్చ తలస్థాంశ్చ వానరాన్ బలదర్పితాన్ ।**
**అభ్యక్రామం స్తతో వీరాః పాలా స్తత్ర సహస్రశః ॥ 23**

**పదచ్ఛేదము** :– వృక్షస్థాన్ – చ – తలస్థాన్ – చ – వానరాన్ – బలదర్పితాన్, అభ్యక్రామన్ – తతః – వీరాః – పాలాః – తత్ర – సహస్రశః ॥

**అన్వయక్రమము** :– సహస్రశః వీరాః పాలాః తతః తత్ర వృక్షస్థాన్ చ తలస్థాన్ చ బలదర్పితాన్ వానరాన్ అభ్యక్రామన్.

**ప్రతిపదార్థము** :– సహస్రశః = వేలకొలది, వీరాః = వీరులైనట్టి, పాలాః = వనపాలురు, తతః = అటుపిమ్మట, తత్ర = అచ్చట, వృక్షస్థాన్ = చెట్లపైనున్న, తలస్థాన్ చ = నేలపై నున్నవారును, బలదర్పితాన్ = బలముచే మదించియున్నవారునగు, వానరాన్ = వానరులగు, అభ్యక్రామన్ = ఆక్రమించిరి.

**తాత్పర్యము** :– వేలకొలదిగనున్న వీరులైన ఆ వనపాలకులు ఆ వనమునందు చెట్లమీదను నేలమీదను బలదర్పితులై విహరించుచున్న అంగదాది వీరులను చుట్టుముట్టిరి.

**శ్లో॥ అథ దృష్ట్వా దధిముఖం క్రుద్ధం వానరపుంగవాః ।**
**అభ్యధావంత వేగేన హనుమత్ప్రముఖా స్తదా ॥ 24**

**పదచ్ఛేదము** :– అథ – దృష్ట్వా – దధిముఖం – క్రుద్ధం – వానరపుంగవాః, అభ్యధావంత – వేగేన – హనుమత్ప్రముఖాః – తదా ॥

**అన్వయక్రమము** :– అథ హనుమత్ప్రముఖాః వానరపుంగవాః క్రుద్ధం దధిముఖం తదా దృష్ట్వా వేగేన అభ్యధావంత.

**ప్రతిపదార్థము :–** అథ = పిమ్మట, హనుమత్ప్రముఖాః = హనుమంతుడాదిగా గల, వానరపుంగవాః = వానరశ్రేష్ఠులు, తదా = అప్పుడు, క్రుద్ధం = క్రోధము నొందిన, దధిముఖం = దధిముఖుని, దృష్ట్వా = చూచి, వేగేన = వేగముగా, అభ్యధావంత = ఎదురుగా పరుగెత్తిరి.

**తాత్పర్యము :–** హనుమంతుడు మున్నగు ఆ వానరవీరులు ఆ సమయమున క్రోధముతో వచ్చుచున్న దధిముఖుని జూచి వెంటనే ఆతని మీదికి పరుగెత్తిరి.

**శ్లో॥ తం సవృక్షం మహాబాహు మాపతంతం మహాబలమ్ ।**
**ఆర్యకం ప్రాహర త్తత్ర బాహుభ్యాం కుపితోఽఙ్గదః ॥ 25**

**పదచ్ఛేదము :–** తం – సవృక్షం – మహాబాహుం – ఆపతంతం – మహాబలమ్, ఆర్యకం – ప్రాహరత్ – తత్ర – బాహుభ్యాం – కుపితః – అంగదః ॥

**అన్వయక్రమము :–** మహాబాహుం మహాబలం సవృక్షమ్ ఆపతంతం తమ్ ఆర్యకం తత్ర కుపితః అంగదః బాహుభ్యాం ప్రాహరత్.

**ప్రతిపదార్థము :–** మహాబాహుం = గొప్పభుజములు గలవాడును, మహాబలం = గొప్పబలముగలవాడును, సవృక్షం = వృక్షముతోడ, ఆపతంతం = మీదికి వచ్చుచున్న వాడునగు, తమ్ ఆర్యకం = ఆ దధిముఖుని, కుపితః = కోపము నొందియున్న, అంగదః = అంగదుడు, బాహుభ్యాం = భుజములతో, ప్రాహరత్ = మోదెను.

**తాత్పర్యము :–** మహాబలశాలియు మహావీరుడును పూజనీయుడును అగు దధిముఖుడు వృక్షమును చేతబట్టి తన మీదికి వచ్చుచుండుట చూచి క్రోధము నొందిన అంగదుడు వానిని తన బాహువులతో మోదెను.

**శ్లో॥ మదాంధశ్చ న వే దైనమ్ ఆర్యకో ఽయం మమేతి సః ।**
**అ థైనం నిష్పిపే షాశు వేగవ ద్వసుధాతలే ॥ 26**

**పదచ్ఛేదము :–** మదాంధః – చ – న – వేద – ఏనమ్ – ఆర్యకః – అయం – మమ – ఇతి – సః – అథ – ఏనం – నిష్పిపేష – ఆశు – వేగవత్ – వసుధాతలే ॥

**అన్వయక్రమము :–** మదాంధః సః అయం ఆర్యకః మమ ఇతి ఏవం న వేద, అథ ఏనం వసుధాతలే వేగవత్ ఆశు నిష్పిపేష.

**ప్రతిపదార్థము :–** మదాంధః = మదముచే గ్రుడ్డివాడయిన, సః = ఆ అంగదుడు, అయం = ఈతడు, మమ = నాకు, ఆర్యకః = పూజ్యబంధువు, ఇతి = అని, ఏనం = ఈతనినిగూర్చి, న వేద = తెలిసికొనలేదు, అథ = పిమ్మట, ఏనం = వీనిని,

వసుధాతలే = నేలపై, ఆశు = వెంటనే, వేగవత్ = వేగముగా, నిష్పిపేష = నలిపివేసెను.

**తాత్పర్యము :–** మద్యముమత్తుచే కన్నుగానకయున్న ఆ అంగదుడు ఈ దధిముఖుడు నాకు పూజ్యుడైన బంధువని ఏమియు తెలిసికొనక ఆతనిని నేలపై బడవైచి క్రుమ్ముచు నలిపివేసెను.

**శ్లో॥ స భగ్నబాహూరుభుజో విహ్వల శ్శోణితోక్షితః ।**
**ముమోహ సహసా వీరో ముహూర్తం కపికుంజరః ॥ 27**

**పదచ్ఛేదము :–** సః – భగ్నబాహూరుభుజః – విహ్వలః – శోణితోక్షితః – ముమోహ – సహసా – వీరః – ముహూర్తం – కపికుంజరః ॥

**అన్వయక్రమము :–** భగ్నబాహూరుభుజః శోణితోక్షితః విహ్వలః సః వీరః కపికుంజరః సహసా ముహూర్తం ముమోహ.

**ప్రతిపదార్థము :–** భగ్నబాహూరుభుజః = విరిగిన బాహువులును తొడలును, భుజములును గలవాడును, శోణితోక్షితః = నెత్తురుతో తడిసిన వాడును, విహ్వలః = స్పృహతప్పినవాడునగు, సః = ఆ, వీరః = వీరుడైన, కపికుంజరః = వానరశ్రేష్ఠుడైన దధిముఖుడు, సహసా = వెంటనే, ముహూర్తం = కొద్దికాలము, ముమోహ = మూర్ఛితుడయ్యెను.

**తాత్పర్యము :–** అప్పుడు మహావీరుడైన దధిముఖుడు తన భుజములును, తొడలును, చేతులును విరుగగా రక్తముతో తడిసి స్పృహను గోల్పోయి వెంటనే కొద్దిసేపు మూర్ఛ నొందెను.

**శ్లో॥ స సమాశ్వస్య సహసా సంక్రుద్ధో రాజమాతులః ।**
**వానరా న్వారయామాస దండేన మధుమోహితాన్ ॥ 28**

**పదచ్ఛేదము :–** సః – సమాశ్వస్య – సహసా – సంక్రుద్ధః – రాజమాతులః, వానరాన్ – వారయామాస – దండేన – మధుమోహితాన్ ॥

**అన్వయక్రమము :–** రాజమాతులః సః సహసా సమాశ్వస్య సంక్రుద్ధః (సన్) మధుమోహితాన్ వానరాన్ దండేన వారయామాస.

**ప్రతిపదార్థము :–** రాజమాతులః = రాజగు సుగ్రీవునకు మేనమామయైనట్టి, సః = ఆ దధిముఖుడు, సహసా = వెంటనే, సమాశ్వస్య = తెప్పరిల్లి, మధుమోహితాన్ = తేనెలచే మత్తిల్లియున్నట్టి, వానరాన్ = వానరులను, దండేన = దండముతో, వారయామాస = నివారించెను.

**తాత్పర్యము :–** సుగ్రీవునకు మేనమామయైన ఆ దధిముఖుడు వెంటనే మూర్ఛనుండి తేరుకొని మధుపానముచే మత్తులైయున్న ఆ వానరులను ఒక కఱ్ఱ తీసికొని తరుమ దొడగెను.

**శ్లో॥ స కథంచి ద్విముక్త స్తై ర్వానరై ర్వానరర్షభః ।**
**ఉవాచైకాంతమాశ్రిత్య భృత్యా న్స్వా న్సముపాగతాన్ ॥ 29**

**పదచ్ఛేదము :–** సః – కథంచిత్ – విముక్తః – తైః – వానరైః – వానరర్షభః, ఉవాచ – ఏకాంతమ్ – ఆశ్రిత్య – భృత్యాన్ – స్వాన్ – సముపాగతాన్ ॥

**అన్వయక్రమము :–** సః వానరర్షభః కథంచిత్ తైః వానరైః విముక్తః (సన్) సముపాగతాన్ స్వాన్ భృత్యాన్ ఏకాంతమ్ ఆశ్రిత్య ఉవాచ.

**ప్రతిపదార్థము :–** సః = ఆ, వానరర్షభః = వానరశ్రేష్ఠుడైన దధిముఖుడు, కథంచిత్ = ఎట్లో, తైః = ఆ, వానరైః = వానరులచే, విముక్తః = విడువబడినవాడై, సముపాగతాన్ = సమీపించినట్టి, స్వాన్ భృత్యాన్ = తన భటులను గూర్చి, ఏకాంతమ్ ఆశ్రిత్య = రహస్యప్రదేశమును చేరి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** ఆ దధిముఖుడు ఎట్లో అంగదాది వానరులనుండి తప్పించుకొని రహస్యప్రదేశమునకు చేరి తనకడకు చేరినట్టి తన బంటులతో ఇట్లు పలికెను.

**శ్లో॥ ఏతే తిష్ఠంతు గచ్ఛామో భర్తా నో యత్ర వానరః ।**
**సుగ్రీవో విపులగ్రీవ స్సహ రామేణ తిష్ఠతి ॥ 30**

**పదచ్ఛేదము :–** ఏతే – తిష్ఠంతు – గచ్ఛామః – భర్తా – నః – యత్ర – వానరః, సుగ్రీవః – విపులగ్రీవః – సహ – రామేణ – తిష్ఠతి ॥

**అన్వయక్రమము :–** ఏతే తిష్ఠంతు; యత్ర నః భర్తా విపులగ్రీవః సుగ్రీవః వానరః రామేణ సహ తిష్ఠతి (తత్ర) గచ్ఛామః.

**ప్రతిపదార్థము :–** ఏతే = వీరు, తిష్ఠంతు = ఉందురుగాక! యత్ర = ఎచ్చటనైతే, నః = మనయొక్క, భర్తా = ప్రభువైనట్టి, విపులగ్రీవః = స్థూలమైన కంఠము గలిగినట్టి, సుగ్రీవః వానరః = సుగ్రీవవానరుడు, రామేణ సహ = శ్రీరామునితోగూడ, తిష్ఠతి = ఉండునో, (తత్ర = అచ్చటికి), గచ్ఛామః = పోవుదము.

**తాత్పర్యము :–** ఈ వానరుల నిక్కడ నుండనిండు; మహావీరుడైన మన ప్రభువు సుగ్రీవుడు శ్రీరామునితో కలిసి కొలువుదీరియున్న చోటికి మనమిప్పుడే పోవుదము.

**శ్లో॥ సర్వం చై వాంగదే దోషం శ్రావయిష్యామి పార్థివే ।**
**అమర్షీ వచనం శ్రుత్వా ఘాతయిష్యతి వానరాన్ ॥ 31**

**పదచ్ఛేదము** :– సర్వం – చ – ఏవ – అంగదే – దోషం – శ్రావయిష్యామి – పార్థివే, అమర్షీ – వచనం – శ్రుత్వా – ఘాతయిష్యతి – వానరాన్ ॥

**అన్వయక్రమము** :– అంగదే సర్వం దోషం చైవ పార్థివే శ్రావయిష్యామి, అమర్షీ (సః) వచనం శ్రుత్వా వానరాన్ ఘాతయిష్యతి.

**ప్రతిపదార్థము** :– అంగదే = అంగదునియందలి, దోషం సర్వం చైవ = దోషము సర్వమును, పార్థివే = రాజైన సుగ్రీవునికడ, శ్రావయిష్యామి = వినిపించెదను, అమర్షీ = క్రోధముగలవాడయిన, (సః = ఆ సుగ్రీవుడు), వచనం శ్రుత్వా = మాటను విని, వానరాన్ = వానరులను, ఘాతయిష్యతి = కొట్టించగలడు.

**తాత్పర్యము** :– నే నా మహారాజుకడ కేగి ఈ మధువనధ్వంసమునకు కారణము అంతయు అంగదుడే యని తెలియపరచెదను. అత డా మాటలు విని తప్పక క్రోధము నొంది ఈ వానరుల నందరిని చావగొట్టించును.

**శ్లో॥ ఇష్టం మధువనం హ్యేత త్సుగ్రీవస్య మహాత్మనః ।**
**పితృపైతామహం దివ్యం దేవైరపి దురాసదమ్ ॥ 32**

**పదచ్ఛేదము** :– ఇష్టం – మధువనం – హి – ఏతత్ – సుగ్రీవస్య – మహాత్మనః, పితృపైతామహం – దివ్యం – దేవైః – అపి – దురాసదమ్ ॥

**అన్వయక్రమము** :– పితృపైతామహం దివ్యం దేవైః అపి దురాసదమ్ ఏతత్ మధువనం మహాత్మనః సుగ్రీవస్య ఇష్టం హి.

**ప్రతిపదార్థము** :– పితృపైతామహం = తండ్రి తాతలనాటి నుండి వచ్చుచున్నదియును, దివ్యం = దివ్యమైనదియును, దేవైః అపి = దేవతలకు కూడ, దురాసదం = చేరశక్యము గానట్టిదియునగు, ఇదం మధువనం = ఈ మధువనము, మహాత్మనః = మహనీయులైన, సుగ్రీవస్య = సుగ్రీవునకు, ఇష్టం హి = మిక్కిలి ఇష్టమైనదిగదా!

**తాత్పర్యము** :– మహాత్ముడైన సుగ్రీవునకు తండ్రితాతలనాటి నుండి వంశానుక్రమముగ వచ్చుచున్నదియును, దివ్యమైనదియును దేవతలకు గూడ లభ్యము గానిదియును అగు నీమధువనము ఆతనికి ఎంతయో ప్రియమైనదిగదా!

**శ్లో॥ స వానరా నిమా న్సర్వాన్ మధులుబ్ధా న్గతాయుషః ।**
**ఘాతయిష్యతి దండేన సుగ్రీవ స్ససుహృజ్జనాన్ ॥ 33**

**పదచ్ఛేదము** :– సః – వానరాన్ – ఇమాన్ – సర్వాన్ – మధులుబ్ధాన్ – గతాయుషః, ఘాతయిష్యతి – దండేన – సుగ్రీవః – ససుహృజ్జనాన్ ॥

**అన్వయక్రమము** :– మధులుబ్ధాన్ గతాయుషః ఇమాన్ ససుహృజ్జనాన్ వానరాన్ సర్వాన్ సః సుగ్రీవః దండేన ఘాతయిష్యతి.

**ప్రతిపదార్థము** :– మధులుబ్ధాన్ = తేనెపై పేరాస గలిగినవారును, గతాయుషః = ఆయువు మూడినవారునగు, ఇమాన్ = ఈ, ససుహృజ్జనాన్ = మిత్రవర్గముతో గూడినట్టి, వానరాన్ సర్వాన్ = వానరుల నందరిని, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, దండేన = దండనముచే, ఘాతయిష్యతి = కొట్టింపగలడు.

**తాత్పర్యము** :– మన సుగ్రీవమహారాజు, తేనెకు ఆశపడి ఆయువు మూడివచ్చిన ఈ వానరులను వారి వారి స్నేహితులతో గలపి అందరినిగూడ తన ఉగ్రమైన దండనమునకు గురిచేసి చావకొట్టించగలడు.

**శ్లో॥ వధ్యా హ్యేతే దురాత్మానో నృపాజ్ఞాపరిభావినః ।**
**అమర్షప్రభవో రోషః సఫలో నో భవిష్యతి ॥ 34**

**పదచ్ఛేదము** :– వధ్యాః – హి – ఏతే – దురాత్మానః – నృపాజ్ఞాపరిభావినః, అమర్షప్రభవః – రోషః – సఫలః – నః – భవిష్యతి ॥

**అన్వయక్రమము** :– నృపాజ్ఞాపరిభావినః ఏతే దురాత్మానః వధ్యాః హి, అమర్షప్రభవః నః రోషః సఫలః భవిష్యతి.

**ప్రతిపదార్థము** :– నృపాజ్ఞాపరిభావినః = రాజాజ్ఞను ధిక్కరించినట్టి, ఏతే = ఈ, దురాత్మానః = దుర్మార్గులు, వధ్యాః హి = చంపదగినవారే గదా, అమర్షప్రభవః = క్రోధమువలన జనించినట్టి, నః = మనయొక్క, రోషః = రోషము, సఫలః = సఫలమైనది, భవిష్యతి = కాగలదు.

**తాత్పర్యము** :– రాజాజ్ఞను ధిక్కరించినట్టి ఈ దుర్మార్గులు తప్పక వధ్యులే యగుదురు గదా! అప్పుడు మనకు గలిగిన క్రోధమును, రోషమును శమింపగలవు.

**శ్లో॥ ఏవ ముక్త్వా దధిముఖో వనపాలా న్మహాబలః ।**
**జగామ సహ సోత్పత్య వనపాలై స్సమన్వితః ॥ 35**

**పదచ్ఛేదము** :– ఏవమ్ – ఉక్త్వా – దధిముఖః – వనపాలాన్ – మహాబలః – జగామ – సహసా – ఉత్పత్య – వనపాలైః – సమన్వితః ॥

**అన్వయక్రమము** :– మహాబలః దధిముఖః వనపాలాన్ ఏవమ్ ఉక్త్వా సహసా వనపాలైః సమన్వితః ఉత్పత్య జగామ.

**ప్రతిపదార్థము** :– మహాబలః = అమితబలాఢ్యుడైన, దధిముఖః = దధిముఖుడు, వనపాలాన్ = వనరక్షకులను గూర్చి, ఏవం = ఇట్లు, ఉక్త్వా = పలికి, సహసా = వెంటనే, వనపాలైః = ఆ తోటకాపరులతో, సమన్వితః = కూడినవాడై, ఉత్పత్య = మీదికి ఎగిరి, జగామ = వెడలెను.

**తాత్పర్యము** :– మహావీరుడైన దధిముఖుడు ఆ వనపాలకులతో ఇట్లు పలికి వారిని వెంటబెట్టుకొని వెంటనే ఆకసమునకు ఎగిరి వెడలెను.

**శ్లో॥ నిమేషాంతరమాత్రేణ స హి ప్రాప్తో వనాలయః ।**
**సహస్రాంశుసుతో ధీమా న్సుగ్రీవో యత్ర వానరః ॥ 36**

**పదచ్ఛేదము** :– నిమేషాంతరమాత్రేణ – సః – హి – ప్రాప్తః – వనాలయః, సహస్రాంశు సుతః – ధీమాన్ – సుగ్రీవః – యత్ర – వానరః ॥

**అన్వయక్రమము** :– సః వనాలయః నిమేషాంతరమాత్రేణ ధీమాన్ సహస్రాంశు సుతః సుగ్రీవః వానరః యత్ర (వర్తతే) (తత్ర) ప్రాప్తః.

**ప్రతిపదార్థము** :– సః వనాలయః = ఆ దధిముఖుడు, నిమేషాంతరమాత్రేణ = ఒక్క నిమిషములోపలనే, ధీమాన్ = బుద్ధిమంతుడైనట్టి, సహస్రాంశుసుతః సుగ్రీవః = సూర్యతనయుడైన సుగ్రీవుడు, యత్ర = ఎచ్చటనయితే, (వర్తతే = ఉన్నాడో) (తత్ర = అచ్చటికి), ప్రాప్తః = చేరెను.

**తాత్పర్యము** :– పిమ్మట దధిముఖుడు అచటినుండి పోయి ఒక్క నిమిషములోనే బుద్ధిశాలియైన సుగ్రీవుడున్న చోటికి చేరుకొనెను.

**శ్లో॥ రామం చ లక్ష్మణం చైవ దృష్ట్వా సుగ్రీవమేవ చ ।**
**సమప్రతిష్ఠాం జగతీ మాకాశాన్నిపపాత హ ॥ 37**

**పదచ్ఛేదము** :– రామం – చ – లక్ష్మణం – చ – ఏవ – దృష్ట్వా – సుగ్రీవమ్ – ఏవ – చ – సమప్రతిష్ఠాం – జగతీమ్ – ఆకాశాత్ – నిపపాత – హ ॥

**అన్వయక్రమము** :– రామం చ లక్ష్మణం చ ఏవ సుగ్రీవం చ ఏవ దృష్ట్వా ఆకాశాత్

సమప్రతిష్ఠాం జగతీం నిపపాత.

**ప్రతిపదార్థము** :- రామం చ = శ్రీరాముని, లక్ష్మణం చ ఏవ = లక్ష్మణుని, సుగ్రీవం చ ఏవ = సుగ్రీవుని కూడ, దృష్ట్వా = చూచి, ఆకాశాత్ = ఆకాశమునుండి, సమప్రతిష్ఠాం = సమానమైన ప్రదేశము కల్గినట్టి, జగతీం = నేలను, నిపపాత = పడెను.

**తాత్పర్యము** :- ఆ దధిముఖుడు దూరమునుండి శ్రీరాముని లక్ష్మణుని సుగ్రీవుని కనుగొని చదునైన నేలచూచుకొని ఆకాశమునుండి వారి ముందు దూకెను.

**శ్లో॥ సన్నిపత్య మహావీర్య స్సర్వై స్తైః పరివారితః ।**
**హరి ర్దధిముఖః పాలైః పాలానాం పరమేశ్వరః ॥ 38**

**శ్లో॥ స దీనవదనో భూత్వా కృత్వా శిరసి చాంజలిమ్ ।**
**సుగ్రీవస్య శుభౌ మూర్ధ్నా చరణౌ ప్రత్యపీడయత్ ॥ 39**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"దధిముఖ ఖిలీకరణం" నామ*
*ద్విషష్టితమస్సర్గః.*

**పదచ్ఛేదము** :- సన్నిపత్య - మహావీర్యః - సర్వైః - తైః - పరివారితః, హరిః - దధిముఖః - పాలైః - పాలానాం - పరమేశ్వరః, సః - దీనవదనః - భూత్వా - కృత్వా - శిరసి - చ - అంజలిమ్, సుగ్రీవస్య - శుభౌ - మూర్ధ్నా - చరణౌ - ప్రత్యపీడయత్ ॥

**అన్వయక్రమము** :- మహావీర్యః పాలానాం పరమేశ్వరః సః దధిముఖః హరిః, తైః పాలైః సర్వైః పరివారితః దీనవదనః భూత్వా, శిరసి అంజలిం కృత్వా సుగ్రీవస్య శుభౌ చరణౌ మూర్ధ్నా ప్రత్యపీడయత్.

**ప్రతిపదార్థము** :- మహావీర్యః = మహాపరాక్రమవంతుడును, పాలానాం = వనరక్షకులకు, పరమేశ్వరః = ప్రభువును అగు, సః = ఆ, దధిముఖః హరిః = దధిముఖ వానరుడు, తైః = ఆ, పాలైః సర్వైః = వనరక్షకులందరిచే, పరివారితః = చుట్టుముట్టబడినవాడై, దీనవదనః భూత్వా = దీనమైన ముఖముగలవాడై, శిరసి = తలపై, అంజలిం = దోసిలిని, కృత్వా చ = చేసికొనియు, సుగ్రీవస్య = సుగ్రీవునియొక్క, శుభౌ = మంగళకరములైన, చరణౌ = పాదములను, మూర్ధ్నా

= శిరస్సుతో, ప్రత్యపీడయత్ = మ్రొక్కెను.

**తాత్పర్యము** :- అట్లు క్రిందికి దిగినట్టి మహావీరుడును, వనరక్షకులకు ప్రభువునగు ఆ దధిముఖుడు తన పరివారమైన వనరక్షకులు తన చుట్టునుండగా ముందునకు వచ్చి దీనమైన వదనముతో తలపై దోసిలిని చేర్చి సుగ్రీవమహారాజు యొక్క పవిత్రమైన పాదములకు మ్రొక్కెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"దధిముఖ ఖిలీకరణము" అను*
*అరువదిరెండవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# త్రిషష్టితమసర్గ

**శ్లో॥ తతో మూర్ధ్నా నిపతితం వానరం వానరర్షభః ।**
**దృష్ట్వై వోద్విగ్నహృదయో వాక్య మేత దువాచ హ ॥ 1**

**పదచ్ఛేదము :-** తతః - మూర్ధ్నా - నిపతితం - వానరం - వానరర్షభః - దృష్ట్వా - ఏవ - ఉద్విగ్నహృదయః - వాక్యమ్ - ఏతత్ - ఉవాచ - హ ॥

**అన్వయక్రమము :-** తతః మూర్ధ్నా నిపతితం వానరం వానరర్షభః దృష్ట్వా ఏవ ఉద్విగ్నహృదయః (సన్) ఏతత్ వాక్యమ్ ఉవాచ హ.

**ప్రతిపదార్థము :-** తతః = అటుపిమ్మట, మూర్ధ్నా = శిరస్సుతో, నిపతితం = ఒరిగియున్న, వానరం = దధిముఖుని, వానరర్షభః = సుగ్రీవుడు, దృష్ట్వా ఏవ = చూడగనే, ఉద్విగ్నహృదయః (సన్) = వ్యాకులత నొందిన మనస్సుగలవాడై, ఏతత్ = ఈ, వాక్యం = మాటను, ఉవాచ = పలికెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** దధిముఖుడు సుగ్రీవుని మేనమామయైనను ఇచట తన మేనల్లుని మహారాజుగనే గౌరవించి పాదముల నంటినాడని తెలియవలెను.

**తాత్పర్యము :-** అట్లు తన పాదములపై శిరమును మోపియున్న దధిముఖుని చూడగనే సుగ్రీవుడు వ్యాకులత నొందిన మనస్సుతో ఆతనితో ఇట్లు పలికెను.

**శ్లో॥ ఉత్తి ష్ఠోత్తిష్ఠ కస్మా త్త్వం పాదయోః పతితో మమ ।**
**అభయం తే భవే ద్వీర సర్వమే వాభిధీయతామ్ ॥ 2**

**పదచ్ఛేదము :-** ఉత్తిష్ఠ - ఉత్తిష్ఠ - కస్మాత్ - త్వం - పాదయోః - పతితః - మమ, అభయం - తే - భవేత్ - వీర - సర్వమ్ - ఏవ - అభిధీయతామ్ ॥

**అన్వయక్రమము :-** వీర ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ. త్వం కస్మాత్ మమ పాదయోః పతితః, తే అభయం భవేత్, సర్వమ్ ఏవ అభిధీయతామ్.

**ప్రతిపదార్థము :-** వీర! = ఓ వీరుడా!, ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ = లెమ్ము లెమ్ము, త్వం = నీవు, కస్మాత్ = ఎందువలన, మమ = నాయొక్క, పాదయోః = పాదములపై, పతితః = పడినావు, తే = నీకు, అభయం = అభయము, భవేత్ = అగును, సర్వమ్ ఏవ = అంతయును, అభిధీయతామ్ = చెప్పబడుగాక!

**తాత్పర్యము :-** ఓ మహావీరుడా! లెమ్ము లెమ్ము, ఇట్లు హఠాత్తుగా వచ్చి నా పాదములపై బడుటకు కారణమేమి? నీకు నే నభయ మొసంగుచున్నాను. విషయమును సమగ్రముగా తెలుపుము.

**శ్లో॥ స తు విశ్వాసిత స్తేన సుగ్రీవేణ మహాత్మనా ।**
**ఉత్థాయ సుమహాప్రాజ్ఞో వాక్యం దధిముఖో ఽబ్రవీత్ ॥ 3**

**పదచ్ఛేదము :-** సః - తు - విశ్వాసితః - తేన - సుగ్రీవేణ - మహాత్మనా, ఉత్థాయ - సుమహాప్రాజ్ఞః - వాక్యం - దధిముఖః - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :-** మహాత్మనా తేన సుగ్రీవేణ విశ్వాసితః సుమహాప్రాజ్ఞః సః దధిముఖః ఉత్థాయ వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :-** మహాత్మనా = మహనీయుడైనట్టి, తేన సుగ్రీవేణ = ఆ సుగ్రీవునిచే, విశ్వాసితః = నమ్మకము కల్గింపబడినట్టి, సః = ఆ, సుమహాప్రాజ్ఞః = గొప్ప ప్రాజ్ఞుడైనట్టి, దధిముఖః = దధిముఖుడు, ఉత్థాయ = లేచి, వాక్యమ్ = మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :-** మహనీయుడైన సుగ్రీవుడు తన నిట్లు ఓదార్చుచు పలుకగా మహాప్రాజ్ఞుడైన ఆ దధిముఖుడు భయము తొలగి లేచి నిలబడి ఆతనితో ఇట్లు పలికెను.

**శ్లో॥ నైవర్క్షరజసా రాజన్న త్వయా నాపి వాలినా ।**
**వనం నిసృష్టపూర్వం హి భక్షితం తచ్చ వానరైః ॥ 4**

**పదచ్ఛేదము :-** న - ఏవ - ఋక్షరజసా - రాజన్ - న - త్వయా - న - అపి - వాలినా, వనం - నిసృష్టపూర్వం - హి - భక్షితం - తత్ - చ - వానరైః ॥

**అన్వయక్రమము :-** రాజన్, వనం ఋక్షరజసా న నిసృష్టపూర్వం హి, త్వయా అపి న వాలినా అపి న, తత్ (అద్య) వానరైః భక్షితం హి.

**ప్రతిపదార్థము :-** రాజన్ = ఓ రాజా!, వనం = మధువనము, ఋక్షరజసా =

ఋక్షరజసునిచే, న ఏవ నిసృష్టపూర్వం = పూర్వము వదలివేయబడలేదు, త్వయా అపి = నీచేతను గూడ, న = వదలివేయబడలేదు, వాలినా అపి = వాలిచేతను గూడ, న = వదిలివేయబడలేదు, తత్ చ = అదియును, (అద్య = నేడు), వానరైః = వానరులచే, భక్షితం హి = తినివేయబడెను సుమా!

**తాత్పర్యము** :- మహారాజా! అమూల్యమైన ఈ మధువనము మీ తండ్రిగారయిన ఋక్షరజసుడుగాని స్వయముగా నీవుగాని, నీయన్నయైన వాలిగాని ఎన్నడును ఎవరికిని స్వేచ్ఛగా భక్షించుటకై వదలివేయలేదు. కాని అట్టి ఆ వనమును నేడు కోతిమూకలు వచ్చి సర్వము తినివేసెను సుమా!

**శ్లో॥ ఏభిః ప్రధర్షితాశ్చైవ వానరా వనరక్షిభిః ।**
**మధూ న్యచింతయి త్వేమాన్ భక్షయంతి పిబంతి చ ॥ 5**

**పదచ్ఛేదము** :- ఏభిః - ప్రధర్షితాః - చ - ఏవ - వానరాః - వనరక్షిభిః - మధూని - అచింతయిత్వా - ఇమాన్ - భక్షయంతి - పిబంతి - చ ॥

**అన్వయక్రమము** :- వానరాః ఏభిః వనరక్షిభిః ప్రధర్షితాః చ ఏవ ఇమాన్ అచింతయిత్వా మధూని భక్షయంతి పిబంతి చ.

**ప్రతిపదార్థము** :- వానరాః = వానరులు, ఏభిః = ఈ, వనరక్షిభిః = వనపాలకులచే, ప్రధర్షితాః చ ఏవ = ఎదుర్కొనబడిన వారయినను, ఇమాన్ = వీరిని, అచింతయిత్వా = లెక్కచేయక, మధూని = తేనెలను, భక్షయంతి = తినుచున్నారు, పిబంతి చ = త్రాగుచున్నారు కూడ.

**తాత్పర్యము** :- దుష్టులైన ఆ వానరులు మా వనరక్షకులు ఎంత అడ్డుకొనుచున్నను వీరి నేమియును లెక్కచేయక స్వేచ్ఛగా తేనెపట్టులను తినుచు, తేనెను త్రాగుచు యథేచ్ఛగా విహరించుచున్నారు.

**శ్లో॥ శిష్ట మత్రాపవిధ్యంతి భక్షయంతి తథా ఽపరే ।**
**నివార్యమాణా స్తే సర్వే భ్రుకుటిం దర్శయంతి చ ॥ 6**

**పదచ్ఛేదము** :- శిష్టమ్ - అత్ర - అపవిధ్యంతి - భక్షయంతి - తథా - అపరే, నివార్యమాణాః - తే - సర్వే - భ్రుకుటిం - దర్శయంతి - చ ॥

**అన్వయక్రమము** :- అత్ర శిష్టమ్ అపవిధ్యంతి, తథా అపరే భక్షయంతి, నివార్యమాణాః తే సర్వే భ్రుకుటిం దర్శయంతి చ.

**ప్రతిపదార్థము** :- అత్ర = ఈ మధువనమున, శిష్టం = మిగిలినదానిని, అపవిధ్యంతి

= పారవేయుచున్నారు, తథా = అట్లు, అపరే = మరికొందరు, భక్షయంతి = తినివేయుచున్నారు, నివార్యమాణాః = అడ్డగింపబడుచున్నట్టి, తే సర్వే = వారందరు, భ్రుకుటిం = బొమముడిని, దర్శయంతి చ = చూపుచున్నారుకూడను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– శిష్టమ్ అపవిధ్యంతి – మధుకోశములలో మిగిలిన మైనపుముద్దను మట్టిపాలుచేసి పాడుచేయుచున్నారు.

**తాత్పర్యము** :– మరియు ఆ వానరులు త్రాగినంతత్రాగి మిగిలినది పారబోయు చున్నారు. మరికొందరు మైనములనుకూడ తినివేయుచున్నారు. మేము వారికి ఎదురుగబోయి బెదిరించి అడ్డుకొనుచుండగా వారు బొమముడులను చూపి మమ్ములను భయపెట్టుచున్నారు.

**శ్లో॥ ఇమే హి సంరబ్ధతరా స్తథా తై స్సంప్రధర్షితాః ।**
**వారయంతో వనా త్తస్మాత్క్రుద్ధై ర్వానరపుంగవైః ॥ 7**

**పదచ్ఛేదము** :– ఇమే – హి – సంరబ్ధతరాః – తథా – తైః – సంప్రధర్షితాః, వారయంతః – వనాత్ – తస్మాత్ – క్రుద్ధైః – వానరపుంగవైః ॥

**అన్వయక్రమము** :– ఇమే సంరబ్ధతరాః వారయంతః తస్మాత్ వనాత్ క్రుద్ధైః వానరపుంగవైః తథా సంప్రధర్షితాః.

**ప్రతిపదార్థము** :– ఇమే = ఈ వానరులు, సంరబ్ధతరాః = మిక్కిలి పూనికగలవారై, తస్మాత్ వనాత్ = ఆ మధువనమునుండి, వారయంతః = అడ్డుకొనుచు, క్రుద్ధైః = క్రోధము నొందియున్న, తైః = ఆ, వానరపుంగవైః = వానరయోధులచే, తథా = ఆ రీతిగా, సంప్రధర్షితాః = మిక్కిలి బెదిరింపబడిరి.

**తాత్పర్యము** :– నా వనపాలకులు మిక్కిలి పూనికతో ఆ మధువనము నుండి వారిని వారించుచుండగా మిక్కిలి క్రోధముతో ఆ వానరయోధులు మా భటులను పలువిధములుగ బెదిరించిరి.

**శ్లో॥ తత స్తై ర్బహుభి ర్వీరై ర్వానరై ర్వానరర్షభ ।**
**సంరక్తనయనైః క్రోధా ద్ధరయః ప్రవిచాలితాః ॥ 8**

**పదచ్ఛేదము** :– తతః – తైః – బహుభిః – వీరైః – వానరైః – వానరర్షభ, సంరక్తనయనైః – క్రోధాత్ – హరయః – ప్రవిచాలితాః ॥

**అన్వయక్రమము :–** తతః వానరర్షభః వీరైః సంరక్తనయనైః బహుభిః వానరైః క్రోధాత్ హరయః ప్రవిచాలితాః.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, వానరర్షభ = ఓ వానరరాజా, వీరైః = వీరులైనట్టి, సంరక్తనయనైః = ఎఱ్ఱబారిన కన్నులు గలిగినట్టి, తైః బహుభిః వానరైః = ఆ పెక్కుమంది వానరులచే, క్రోధాత్ = క్రోధము వలన, హరయః = వనరక్షకులయిన వానరులు, ప్రవిచాలితాః = తరిమివేయబడిరి.

**తాత్పర్యము :–** ఓ వానరరాజా! ఆ మహావీరులైన వానరులు పెక్కు మంది గ్రుడ్లెఱ్ఱజేయుచు తీవ్రమయిన క్రోధముతో ఆ వనపాలురను అచ్చటి నుండి తరిమి వేసిరి.

**శ్లో॥ పాణిభి ర్నిహతాః కేచి త్కేచి జ్జానుభి రాహతాః ।**
**ప్రకృష్టాశ్చ యథాకామం దేవమార్గం చ దర్శితాః ॥ 9**

**పదచ్ఛేదము :–** పాణిభిః – నిహతాః – కేచిత్ – కేచిత్ – జానుభిః – ఆహతాః, ప్రకృష్టాః – చ – యథాకామం – దేవమార్గం – చ – దర్శితాః ॥

**అన్వయక్రమము :–** కేచిత్ పాణిభిః నిహతాః. కేచిత్ జానుభిః ఆహతాః. యథాకామం ప్రకృష్టాః చ దేవమార్గం దర్శితాః చ.

**ప్రతిపదార్థము :–** కేచిత్ = కొంతమంది, పాణిభిః = చేతులతో, నిహతాః = కొట్టబడిరి, కేచిత్ = కొంతమంది, జానుభిః = మోకాళ్ళతో, ఆహతాః = క్రుమ్మబడిరి, కేచిత్ = కొంతమంది, యథాకామం = ఇష్టమువచ్చినరీతిగా, ప్రకృష్టాః చ = ఈడ్వబడిరి, (కేచిత్ = కొంతమంది), దేవమార్గం = పృష్ఠభాగమును, దర్శితాః = చూపబడినారు కూడను.

**తాత్పర్యము :–** మదించిన ఆ వానరులు మా వనపాలకులను కొందరిని చేతులతో కొట్టియు, కొందరిని మోకాళ్ళతో పొడిచియు, కొందరిని ఇష్టమువచ్చినట్టు నేలపై నీడ్చియు పీడించినారు. మరి కొంతమందికి తమపృష్ఠభాగమును జూపి వారి నవమానించినారు కూడను.

**శ్లో॥ ఏవ మేతే హతా శ్శూరా స్త్వయి తిష్ఠతి భర్తరి ।**
**కృత్స్నం మధువనం చైవ ప్రకామం తైః ప్రభక్ష్యతే ॥ 10**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఏతే – హతాః – శూరాః – త్వయి – తిష్ఠతి – భర్తరి, కృత్స్నం – మధువనం – చ – ఏవ – ప్రకామం – తైః – ప్రభక్ష్యతే ॥

**అన్వయక్రమము** :– భర్తరి త్వయి తిష్ఠతి (సతి) ఏతే శూరాః ఏవం హతాః తైః మధువనం చ ఏవ కృత్స్నం ప్రకామం ప్రభక్ష్యతే.

**ప్రతిపదార్థము** :– భర్తరి = ప్రభువైనట్టి, త్వయి = నీవు, తిష్ఠతి సతి = ఉండగా, ఏతే = ఈ, శూరాః = వీరులు, ఏవం = ఇట్లు, హతాః = హతమారినారు; మధువనం చ ఏవ = మధువనముగూడ, కృత్స్నం = సంపూర్ణముగా, తైః = వారిచే, ప్రకామం = స్వేచ్ఛగా, ప్రభక్ష్యతే = తినివేయబడుచున్నది.

**తాత్పర్యము** :– నీ యంతటివాడు ప్రభువుగా నుండగనే వీరులైన ఈ వనపాలురు ఈ విధముగా వారి చేతిలో హింసలకు గురియైనారు. అమూల్యమైన మన మధు వనమంతయును గూడా వారు స్వేచ్ఛగా మ్రింగివేయుచున్నారు.

**శ్లో॥ ఏవం విజ్ఞాప్యమానం తం సుగ్రీవం వానరర్షభః ।**
**అపృచ్ఛ త్తం మహాప్రాజ్ఞో లక్ష్మణః పరవీరహా ॥ 11**

**పదచ్ఛేదము** :– ఏవం – విజ్ఞాప్యమానం – తం – సుగ్రీవం – వానరర్షభమ్, అపృచ్ఛత్ – తం – మహాప్రాజ్ఞః – లక్ష్మణః – పరవీరహా ॥

**అన్వయక్రమము** :– ఏవం విజ్ఞాప్యమానం వానరర్షభం తం సుగ్రీవం మహాప్రాజ్ఞః పరవీరహా లక్ష్మణః తమ్ అపృచ్ఛత్.

**ప్రతిపదార్థము** :– ఏవం = ఇట్లు, విజ్ఞాప్యమానం = విన్నవింపబడుచున్న, వానరర్షభం = వానరశ్రేష్ఠుడైనట్టి, తం = ఆ, సుగ్రీవం = సుగ్రీవుని, మహాప్రాజ్ఞః = గొప్ప ప్రాజ్ఞుడైనట్టియు, పరవీరహా = శత్రువీరులను హతమార్చువాడునగు, లక్ష్మణః = లక్ష్మణుడు, తం = ఆ విషయమును గూర్చి, అపృచ్ఛత్ = అడిగెను.

**తాత్పర్యము** :– దధిముఖుడు వానరశ్రేష్ఠుడైన సుగ్రీవుని ఈ రీతిగా భయపడుచు వ్యాకులతతో అడుగుచుండగా చూచి మహావీరుడును మహాప్రాజ్ఞుడునగు లక్ష్మణుడు ఎవరికెట్టి హాని కలిగినదో యని శంకనొందుచు తనకు దధిముఖుని భాష అర్థముగాక పోవుటచే ఆతడు మీతో చెప్పుచున్న విషయ మేమిటని సుగ్రీవుని అడిగెను.

**శ్లో॥ కి మయం వానరో రాజన్ వనపః ప్రత్యుపస్థితః ।**
**కం చార్థ మభినిర్దిశ్య దుఃఖితో వాక్య మబ్రవీత్ ॥ 12**

**పదచ్ఛేదము** :– కిమ్ – అయం – వానరః – రాజన్ – వనపః – ప్రత్యుపస్థితః – కం – చ – అర్థమ్ – అభినిర్దిశ్య – దుఃఖితః – వాక్యమ్ – అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :– రాజన్! వనపః అయం వానరః కిం ప్రత్యుపస్థితః? దుఃఖితః

(సన్) కమ్ అర్థమ్ అభినిర్దిశ్య వాక్యమ్ అబ్రవీత్ చ?

**ప్రతిపదార్థము :–** రాజన్! = ఓ రాజా! వనపః = వనపాలకుడైనట్టి, అయం = ఈ, వానరః = వానరుడు, కిం = ఎందుకొరకు, ప్రత్యుపస్థితః = వచ్చియున్నాడు? దుఃఖితః సన్ = దుఃఖితుడై, కం = ఏ, అర్థమ్ = విషయమును, అభినిర్దిశ్య = నిర్దేశించి, వాక్యం = మాటను, అబ్రవీత్ = పలికెను?

**తాత్పర్యము :–** రాజా! వనపాలకుడైనట్టి ఈ వానరుడు మీకడకు వచ్చుటకు కారణమేమి? ఎంతయో దుఃఖవ్యాకులుడై ఈతడు నీతో ఇప్పుడు చెప్పుచున్నట్టి ఆ విషయమేమి?

**శ్లో॥ ఏవ ముక్తస్తు సుగ్రీవో లక్ష్మణేన మహాత్మనా ।**
**లక్ష్మణం ప్రత్యువా చేదం వాక్యం వాక్యవిశారదః ॥ 13**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తః – తు – సుగ్రీవః – లక్ష్మణేన – మహాత్మనా, లక్ష్మణం – ప్రత్యువాచ – ఇదం – వాక్యం – వాక్యవిశారదః ॥

**అన్వయక్రమము :–** మహాత్మనా లక్ష్మణేన ఏవమ్ ఉక్తః వాక్యవిశారదః సుగ్రీవః తు లక్ష్మణమ్ ఇదం వాక్యం ప్రత్యువాచ.

**ప్రతిపదార్థము :–** మహాత్మనా = మహనీయుడైనట్టి, లక్ష్మణేన = లక్ష్మణునిచే, ఏవం = ఈరీతిగా, ఉక్తః = చెప్పబడినవాడై, వాక్యవిశారదః = మాటలనేర్పు గలిగినట్టి, సుగ్రీవః తు = సుగ్రీవుడు అప్పుడు, లక్ష్మణం = లక్ష్మణునిగూర్చి, ఇదం = ఈ, వాక్యం = మాటను, ప్రత్యువాచ = బదులుచెప్పెను.

**తాత్పర్యము :–** మహాత్ముడైన లక్ష్మణుడు తన నిట్లు ప్రశ్నింపగా వాక్యవిశారదుడైన సుగ్రీవుడు లక్ష్మణునికి ఇట్లు సమాధానము చెప్పెను.

**శ్లో॥ ఆర్య లక్ష్మణ సంప్రాహ వీరో దధిముఖః కపిః ।**
**అంగదప్రముఖై ర్వీరై ర్భక్షితం మధు వానరైః ॥ 14**

**శ్లో॥ విచిత్య దక్షిణా మాశా మాగతై ర్హరిపుంగవైః ॥ 15**

**పదచ్ఛేదము :–** ఆర్య – లక్ష్మణ – సంప్రాహ – వీరః – దధిముఖః – కపిః, అంగదప్రముఖైః – వీరైః – భక్షితం – మధు – వానరైః – విచిత్య – దక్షిణామ్ – ఆశామ్ – ఆగతైః – హరిపుంగవైః ॥

**అన్వయక్రమము :–** ఆర్య! లక్ష్మణ! దక్షిణామ్ ఆశాం విచిత్య ఆగతైః అంగదప్రముఖైః

వీరైః వానరైః హరిపుంగవైః మధు భక్షితమ్ ఇతి వీరః దధిముఖః సంప్రాహ.

**ప్రతిపదార్థము** :– ఆర్య! = పూజ్యుడైన, లక్ష్మణ! = ఓ సౌమిత్రీ! దక్షిణామ్ ఆశాం = దక్షిణ దిక్కును, విచిత్య = వెదకి, ఆగతైః = వచ్చినట్టి, అంగదప్రముఖైః = అంగదుడు మున్నగు, వీరైః వానరైః = వీరులైనట్టి వానరులచేతను, హరిపుంగవైః = వానర శ్రేష్ఠులచేతను, మధు = తేనె, భక్షితమ్ = భక్షింపబడినది, ఇతి = అని, వీరః = వీరుడైన, దధిముఖః = దధిముఖుడు, సంప్రాహ = పలికెను.

**తాత్పర్యము** :– పూజ్యుడైన లక్ష్మణా! దక్షిణదిక్కుకు పోయి సీతమ్మను వెదకి వచ్చినట్టి మన అంగదాది వానరశ్రేష్ఠులును, మహావీరులైన ఇతర వానరోత్తములును మధువనమున ప్రవేశించి తేనెను త్రాగివేసినారని ఈతడు నాకు తెలుపుచున్నాడు.

**శ్లో॥ నైషా మకృతకృత్యానా మీదృశ స్స్యాదుపక్రమః ।**
**ఆగతైశ్చ ప్రమథితం యథా మధువనం హి తైః ।**
**ధర్షితం చ వనం కృత్స్న ముపభుక్తం చ వానరైః ॥ 16**

**పదచ్ఛేదము** :– న – ఏషామ్ – అకృతకృత్యానామ్ – ఈదృశః – స్యాత్ – ఉపక్రమః – ఆగతైః – చ – ప్రమథితం – యథా – మధువనం – హి – తైః, ధర్షితం – చ – వనం – కృత్స్నమ్ – ఉపభుక్తం – చ – వానరైః ॥

**అన్వయక్రమము** :– ఆగతైః తైః వానరైః యథా మధువనం ప్రమథితం, కృత్స్నం వనం ధర్షితమ్ ఉపభుక్తం చ (తథా) ఈదృశః ఉపక్రమః అకృతకృత్యానామ్ ఏషాం న స్యాత్ హి.

**ప్రతిపదార్థము** :– ఆగతైః = వచ్చినట్టి, తైః = ఆ, వానరైః = వానరులచే, యథా = ఏ విధముగా, మధువనం = మధువనము, ప్రమథితం = కల్లోలము చేయబడినదో, వనం = తోట, కృత్స్నం = అంతయును, ధర్షితం = చిందరవందర చేయబడినదో, ఉపభుక్తం = భుజింపబడినదో, (తథా = ఆ విధమునుబట్టి), ఈదృశః = ఇట్టి, ఉపక్రమః = ఆచరణము, అకృతకృత్యానాం = కృతకృత్యులుగాని, ఏషాం = వీరికి, న స్యాత్ హి = ఉండదుగదా!

**తాత్పర్యము** :– తిరిగివచ్చుచున్న ఈ అంగదాదివీరులు మధువనమున ప్రవేశించి దానిని చిందరవందరచేసి ధ్వంసము గావించి స్వేచ్ఛగా మధుపానమును చేయుటనుబట్టి చూడగా ఇట్టి ఉత్సాహచర్యను కార్యము సాధింపనట్టివారు చేయలేరని తెలియుచునే యున్నది.

**శ్లో॥ వనం యదా ఽభిపన్నా స్తే సాధితం కర్మ వానరైః ।**
**దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా ।**
**న హ్యన్య స్సాధనే హేతుః కర్మణో ఽస్య హనూమతః ॥ 17**

**పదచ్ఛేదము** :– వనం – యదా – అభిపన్నాః – తే – సాధితం – కర్మ – వానరైః, దృష్టా – దేవీ – న – సందేహః – న – చ – అన్యేన – హనూమతా, న – హి – అన్యః – సాధనే – హేతుః – కర్మణః – అస్య – హనూమతః ॥

**అన్వయక్రమము** :– తే యదా వనమ్ అభిపన్నాః తదా వానరైః కర్మ సాధితమ్; దేవీ దృష్టా; సందేహః న; అన్యేన చ న; హనుమతా దృష్టా, అస్య కర్మణః సాధనే హనూమతః అన్యః హేతుః న హి.

**ప్రతిపదార్థము** :– తే = ఆ వానరులు, యదా = ఎప్పుడయితే, వనం = మధువనమును, గూర్చి, అభిపన్నాః = వచ్చియున్నారో, తదా = అప్పుడే, వానరైః = వానరులచే, కర్మ = కార్యము, సాధితం = సాధింపబడినది, దేవీ = సీతాదేవి, దృష్టా = చూడబడినది, సందేహః = సంశయము, న = లేదు, అన్యేన చ = వేరెవ్వరిచేతను, న = కాదు, హనూమతా = హనుమచేత, (దృష్టా = చూడబడినది), అస్య = ఈ, కర్మణః = పనియొక్క, సాధనే = సాధనమునందు, హనూమతః = హనుమంతునికంటె, అన్యః = వేరొకడు, హేతుః = కారణము, నహి = కాదుసుమా!

**తాత్పర్యము** :– ఈ వానరులు మధువనమును ప్రవేశించుట ఎప్పుడు జరిగినదో అప్పుడే వీరు తాము పూనిన కార్యమును సాధించుకొని వచ్చినారని తెలియుచున్నది, కాబట్టి వారు సీతాదేవిని చూచియే వచ్చినారు. అందు సందేహ మేమియును లేదు. ఆ యమ్మను జూచినదిగూడ హనుమంతుడే కాని వేరెవ్వరును కాదు. ఈ కార్యసాధనలో హనుమవిక్రమముకంటె వేరైనదేదియును కారణమై యుండదు సుమా!

**శ్లో॥ కార్యసిద్ధి ర్మతిశ్చైవ తస్మి న్వానరపుంగవే ।**
**వ్యవసాయశ్చ వీర్యం చ శ్రుతం చాపి ప్రతిష్ఠితమ్ ॥ 18**

**పదచ్ఛేదము** :– కార్యసిద్ధిః – మతిః – చ – ఏవ – తస్మిన్ – వానరపుంగవే, వ్యవసాయః – చ – వీర్యం – చ – శ్రుతం – చ – అపి – ప్రతిష్ఠితమ్ ॥

**అన్వయక్రమము** :– తస్మిన్ వానరపుంగవే కార్యసిద్ధిః మతిః చ ఏవ వ్యవసాయః చ, వీర్యం చ శ్రుతం చ అపి ప్రతిష్ఠితమ్.

**ప్రతిపదార్థము** :– తస్మిన్ = ఆ, వానరపుంగవే = వానరశ్రేష్ఠునియందు, కార్యసిద్ధిః

= కార్యసిద్ధియు, మతిః చ ఏవ = ప్రజ్ఞయును, వ్యవసాయః చ = ప్రయత్నమును, వీర్యం చ = శౌర్యమును, శ్రుతం చ అపి = వైదుష్యమును, ప్రతిష్ఠితమ్ = రూఢమైయున్నది.

**తాత్పర్యము** :- వానరోత్తముడైన ఆ హనుమంతునియందు కార్యసిద్ధియును, ప్రజ్ఞయును, ప్రయత్నమును, శౌర్యమును, వైదుష్యమును చిరకాలమునుండి సుప్రతిష్ఠితములై యున్నవి.

**శ్లో॥ జాంబవా న్యత్ర నేతా స్యా దంగదశ్చ మహాబలః ।**
**హనుమాం శ్చాప్యధిష్ఠాతా న తస్య గతి రన్యథా ॥ 19**

**పదచ్ఛేదము** :- జాంబవాన్ - యత్ర - నేతా - స్యాత్ - అంగదః - చ - మహాబలః - హనుమాన్ - చ - అపి - అధిష్ఠాతా - న - తస్య - గతిః - అన్యథా ॥

**అన్వయక్రమము** :- యత్ర నేతా జాంబవాన్, మహాబలః అంగదశ్చ స్యాత్, అధిష్ఠాతా హనుమాన్ స్యాత్, తస్య గతిః అన్యథా న స్యాత్.

**ప్రతిపదార్థము** :- యత్ర = ఏ కార్యమునందు, నేతా = నాయకుడు, జాంబవాన్ = జాంబవంతుడును, మహాబలః = మహాబలసంపన్నుడైన, అంగదః చ = అంగదుడును, స్యాత్ = అగునో, అధిష్ఠాతా = అధిపతి, హనుమాన్ చ స్యాత్ = హనుమంతుడును అగునో, తస్య = ఆ కార్యముయొక్క, గతిః = విధానము, అన్యథా = వేరు రీతిగా, న స్యాత్ = కానేరదు.

**తాత్పర్యము** :- ఏ మహాకార్యమునందు వృద్ధవీరుడైన జాంబవంతుడును, మహాబలాఢ్యుడైన అంగదుడును నాయకులుగా నున్నారో హనుమంతుడు స్వయముగా కార్యవిధాతగా వ్యవహరించుచున్నాడో ఆ కార్యముయొక్క ఫలితము వేరొకరీతిగా నుండనేరదు.

**శ్లో॥ అంగదప్రముఖై ర్వీరై ర్హతం మధువనం కిల ।**
**వారయంతశ్చ సహితా స్తథా జానుభి రాహతాః ॥ 20**

**పదచ్ఛేదము** :- అంగదప్రముఖైః - వీరైః - హతం - మధువనం - కిల, వారయంతః - చ - సహితాః - తథా - జానుభిః - ఆహతాః ॥

**అన్వయక్రమము** :- మధువనమ్ అంగదప్రముఖైః వీరైః హతం కిల! తథా వారయంతః సహితాః జానుభిః ఆహతాః కిల!

**ప్రతిపదార్థము** :- అంగదప్రముఖైః = అంగదుడు మున్నగువారు గల, వీరైః = వీరులచే, మధువనం = మధువనము, హతం కిల = ధ్వంసము చేయబడినదట, తథా = అట్లే, సహితాః = కలసినవారై, వారయంతః = అడ్డగించుచున్నవారై, జానుభిః = మోకాళ్ళతో, ఆహతాః కిల = కొట్టబడినారట!

**తాత్పర్యము** :- అంగదుడు మున్నగు వానరవీరులు మధువనమును ధ్వంసము చేసినారట. మరియు వారిని వలదని వారింపగా ఆ వనపాలురను వారు మోకాళ్ళతో పొడిచి హింసించినారట.

**శ్లో॥ ఏతదర్థమయం ప్రాప్తో వక్తుం మధురవా గిహ ।**
**నామ్నా దధిముఖో నామ హరిః ప్రఖ్యాతవిక్రమః ॥ 21**

**పదచ్ఛేదము** :- ఏతదర్థమ్ - అయం - ప్రాప్తః - వక్తుం - మధురవాక్ - ఇహ, నామ్నా - దధిముఖః - నామ - హరిః - ప్రఖ్యాతవిక్రమః ॥

**అన్వయక్రమము** :- మధురవాక్ ప్రఖ్యాతవిక్రమః నామ్నా దధిముఖః అయం హరిః ఏతదర్థం వక్తుమ్ ఇహ ప్రాప్తః.

**ప్రతిపదార్థము** :- మధురవాక్ = మధురమైన వాక్కు గలవాడును, ప్రఖ్యాతవిక్రమః = విఖ్యాతమైన పరాక్రమముగలవాడును, నామ్నా = పేరుచేత, దధిముఖః నామ = దధిముఖుడను ప్రసిద్ధిగలవాడునగు, అయం = ఈ, హరిః = వానరుడు, ఏతత్ = ఈ, అర్థం = విషయమును, వక్తుం = చెప్పుటకు, ఇహ = ఇటకు, ప్రాప్తః = వచ్చినాడు.

**తాత్పర్యము** :- మధురముగ మాటలాడువాడును మహాపరాక్రమవంతుడునగు ఈ దధిముఖుడను సుప్రసిద్ధుడైన వానరోత్తముడు తనకు విషాదము గలిగించిన విషయమును తెలుపుటకై ఇట్లు ఇచటికి వచ్చినాడు.

**శ్లో॥ దృష్టా సీతా మహాబాహో సౌమిత్రే పశ్య తత్త్వతః ।**
**అభిగమ్య తథా సర్వే పిబంతి మధు వానరాః ॥ 22**

**పదచ్ఛేదము** :- దృష్టా - సీతా - మహాబాహో - సౌమిత్రే - పశ్య - తత్త్వతః, అభిగమ్య - తథా - సర్వే - పిబంతి - మధు - వానరాః ॥

**అన్వయక్రమము** :- మహాబాహో సౌమిత్రే తత్త్వతః పశ్య, సీతా దృష్టా, తథా వానరాః సర్వే అభిగమ్య మధు పిబంతి.

**ప్రతిపదార్థము :–** మహాబాహో = భుజబలసంపన్నుడవైన, సౌమిత్రే = లక్ష్మణా, తత్త్వతః = యథార్థవిషయమును బట్టి, పశ్య = పరికింపుము, సీతా = సీతాదేవి, దృష్టా = చూడబడినది, తథా = ఆ కారణముగనే, వానరాః = వానరులు, సర్వే = అందరును, అభిగమ్య = చేరి, మధు = తేనెను, పిబంతి = త్రాగుచున్నారు.

**తాత్పర్యము :–** మహావీరుడైన లక్ష్మణా! జరిగినది తెలిసికొను దృష్టితో పరికించి చూడుము; మనవానరు లెల్లరును కూడి మధువనము జొచ్చి ఉల్లాసముగా మధువును గ్రోలుచున్నారనగా దానిని బట్టి వారు సీతాదేవిని చూచి వచ్చినారని తెలియుచునే యున్నదిగదా!

**శ్లో॥ న చాప్యదృష్ట్వా వైదేహీం విశ్రుతాః పురుషర్షభ ।**
**వనం దత్తవరం దివ్యం ధర్షయేయు ర్వనౌకసః ॥ 23**

**పదచ్ఛేదము :–** న – చ – అపి – అదృష్ట్వా – వైదేహీం – విశ్రుతాః – పురుషర్షభ, వనం – దత్తవరం – దివ్యం – ధర్షయేయుః – వనౌకసః ॥

**అన్వయక్రమము :–** పురుషర్షభ! విశ్రుతాః వనౌకసః వైదేహీమ్ అదృష్ట్వా దత్తవరం దివ్యం వనం న చ ధర్షయేయుః.

**ప్రతిపదార్థము :–** పురుషర్షభ = వానరశ్రేష్ఠుడా! విశ్రుతాః = సుప్రసిద్ధులైనట్టి, వనౌకసః = వానరులు, వైదేహీం = జానకిని, అదృష్ట్వా = చూడకుండ, దత్తవరం = ఈయబడిన వరముగల, దివ్యం = గొప్పదైనట్టి, వనం = మధువనమును, నచ ధర్షయేయుః = ధ్వంసము చేయరుసుమా!

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** 'దత్తవరం దివ్యం వనం' పూర్వము బ్రహ్మదేవుడు సుగ్రీవుని తండ్రియైన ఋక్షరజసున కీ మధువనము నొసగినాడని తెలియుచున్నది.

**రా.శిరోమణి :–** 'దత్తవరం దివ్యం వనం' మాచే అధికార మొసగబడి రక్షింపబడు చున్నట్టి వనము.

**తాత్పర్యము :–** ఓ పురుషశ్రేష్ఠుడా! విఖ్యాతచరిత్రులైన మన అంగదాదివీరులు సీతాదేవిని చూడకుండ బ్రహ్మదేవునిచే వరముగా మా కొసగబడినట్టి ఈ దివ్యమైన మధువనమును ధ్వంసము చేయబోవరు సుమా!

**శ్లో॥ తతః ప్రహృష్టో ధర్మాత్మా లక్ష్మణ స్సహరాఘవః ॥ 24**

**పదచ్ఛేదము** :– తతః – ప్రహృష్టః – ధర్మాత్మా – లక్ష్మణః – సహరాఘవః ॥

**అన్వయక్రమము** :– తతః ధర్మాత్మా సహరాఘవః లక్ష్మణః ప్రహృష్టః (అభవత్).

**ప్రతిపదార్థము** :– తతః = అటుపిమ్మట, ధర్మాత్మా = పరమ ధార్మికుడును, సహరాఘవః = శ్రీరామునితో కూడియున్న వాడునగు, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రహృష్టః = మిక్కిలి హర్షము నొందినవాడు, అభవత్ = అయ్యెను.

**తాత్పర్యము** :– సుగ్రీవుని మాటలను విని ధర్మాత్ముడైన లక్ష్మణుడు శ్రీరామునితో కలిసి మిక్కిలి ఆనందమునొందెను.

**శ్లో॥ శ్రుత్వా కర్ణసుఖాం వాణీం సుగ్రీవవదనా చ్చ్యుతామ్ ।**
**ప్రాహృష్యత భృశం రామో లక్ష్మణశ్చ మహాబలః ॥ 25**

**పదచ్ఛేదము** :– శ్రుత్వా – కర్ణసుఖాం – వాణీం – సుగ్రీవవదనాత్ – చ్యుతామ్, ప్రాహృష్యత – భృశం – రామః – లక్ష్మణః – చ – మహాబలః ॥

**అన్వయక్రమము** :– రామః సుగ్రీవవదనాత్ చ్యుతాం కర్ణసుఖాం వాణీం శ్రుత్వా భృశం ప్రాహృష్యత, మహాబలః లక్ష్మణః చ (ప్రాహృష్యత).

**ప్రతిపదార్థము** :– రామః = శ్రీరాముడు, సుగ్రీవవదనాత్ చ్యుతాం = సుగ్రీవుని నోటినుండి వెలువడినట్టి, కర్ణసుఖాం = వీనులకు విందైనట్టి, వాణీం = మాటను, శ్రుత్వా = విని, భృశం = మిక్కిలిగా, ప్రాహృష్యత = ఆనందము నొందెను, మహాబలః = వీరుడైన, లక్ష్మణః చ = లక్ష్మణుడును, ప్రాహృష్యత = ఆనందించెను.

**తాత్పర్యము** :– "మన హనుమ సీతాదేవిని కనుగొని వచ్చినాడని తెలియుచున్నది" అని సుగ్రీవుడు వీనులకు విందుగా చెప్పుచున్న మాటలను వినుచు శ్రీరాముడమితమైన ఆనందము నొందెను. తమ్ముడైన లక్ష్మణుడును ఎంతయో సంతోషించెను.

**శ్లో॥ శ్రుత్వా దధిముఖ స్యేదం సుగ్రీవస్తు ప్రహృష్య చ ।**
**వనపాలం పునర్వాక్యం సుగ్రీవః ప్రత్యభాషత ॥ 26**

**పదచ్ఛేదము** :– శ్రుత్వా – దధిముఖస్య – ఇదం – సుగ్రీవః – తు – ప్రహృష్య – చ, వనపాలం – పునః – వాక్యం – సుగ్రీవః – ప్రత్యభాషత ॥

**అన్వయక్రమము** :– దధిముఖస్య ఇదం (వాక్యం) శ్రుత్వా సుగ్రీవః తు ప్రహృష్య వనపాలం పునః వాక్యం ప్రత్యభాషత.

**ప్రతిపదార్థము** :– ఇదం (వాక్యం) = ఈ మాటను, శ్రుత్వా = విని, సుగ్రీవః =

మంచికంఠము కల్గినట్టి, సుగ్రీవః తు = సుగ్రీవుడు, ప్రహృష్య = మిక్కిలి సంతసించి, వనపాలం = వనపాలకుడైన దధిముఖునిగూర్చి, పునః = తిరిగి, వాక్యం = మాటను, ప్రత్యభాషత = సమాధానముగా చెప్పెను.

**తాత్పర్యము** :- దధిముఖుడు చెప్పిన మాటలను ఆలకించి చక్కని కంఠముగల సుగ్రీవుడు మహానందముతో ఆతనిని గూర్చి ఈ రీతిగా పలికెను.

**శ్లో॥ ప్రీతో ఽస్మి సోఽహం యద్భుక్తం వనం తైః కృతకర్మభిః ।**
**మర్షితం మర్షణీయం చ చేష్టితం కృతకర్మణామ్ ॥ 27**

**పదచ్ఛేదము** :- ప్రీతః - అస్మి - సః - అహం - యత్ - భుక్తం - వనం - తైః - కృతకర్మభిః, మర్షితం - మర్షణీయం - చ - చేష్టితం - కృతకర్మణామ్ ॥

**అన్వయక్రమము** :- యత్ కృతకర్మభిః తైః వనం భుక్తం, (తత్) సః అహం ప్రీతః అస్మి, కృతకర్మణాం మర్షణీయం చేష్టితం మర్షితం చ.

**ప్రతిపదార్థము** :- యత్ = ఏ కారణమువలన, కృతకర్మభిః = సాధించిన కృత్యముగల వారైనట్టి, తైః = ఆ వానరులచే, వనం = మధువనము, భుక్తం = భక్షింపబడినదో, (తత్ = ఆ కారణమువల్ల) సః = అట్టి, అహం = నేను, ప్రీతః = సంతోషము నొందినవాడను, అస్మి = అగుచున్నాను, కృతకర్మణాం = సాధింపబడిన కృత్యములు గల్గినట్టి వారియొక్క, మర్షణీయం = క్షమింపదగినట్టి, చేష్టితం = చర్య, మర్షితం చ = క్షమింపబడినదికూడను.

**తాత్పర్యము** :- తాను పూనిన పనిని సాధించుకొనివచ్చిన అంగదాది వానరశ్రేష్ఠులు మన మధువనమునుచేరి మధువును భక్షించిరని తెలిసి నేను మిక్కిలి సంతసించితిని, కృతకృత్యులై వచ్చినట్టి వారిచర్య సహింపదగ్గదే కాబట్టి నేను దానిని క్షమించుచున్నాను.

**శ్లో॥ ఇచ్ఛామి శీఘ్రం హనుమత్ప్రధానాన్**
**శాఖామృగాం స్తాన్ మృగరాజదర్పాన్ ।**
**ద్రష్టుం కృతార్థాన్ సహ రాఘవాభ్యాం**
**శ్రోతుం చ సీతాధిగమే ప్రయత్నమ్ ॥ 28**

**పదచ్ఛేదము** :- ఇచ్ఛామి - శీఘ్రం - హనుమత్ప్రధానాన్ - శాఖామృగాన్ - తాన్ - మృగరాజదర్పాన్, ద్రష్టుం - కృతార్థాన్ - సహ - రాఘవాభ్యాం - శ్రోతుం - చ - సీతాధిగమే - ప్రయత్నమ్ ॥

**అన్వయక్రమము** :- హనుమత్ప్రధానాన్ మృగరాజదర్పాన్ కృతార్థాన్ తాన్ శాఖా

మృగాన్ రాఘవాభ్యాం సహ ద్రష్టుం, సీతాధిగమే ప్రయత్నం శ్రోతుం చ ఇచ్ఛామి.

**ప్రతిపదార్థము** :– హనుమత్ప్రధానాన్ = హనుమంతుడు మొదలైన, మృగరాజదర్పాన్ = సింహదర్పము కల్గినట్టి, తాన్ = ఆ, కృతార్థాన్ = కార్యసాఫల్యము కలిగినట్టి, శాఖామృగాన్ = వానరులను, శీఘ్రం = త్వరగా, రాఘవాభ్యాం సహ = రామలక్ష్మణులతో కలిసి, ద్రష్టుం = చూచుటకు, ఇచ్ఛామి = కోరుచున్నాను, సీతాధిగమే = సీతమ్మను తెలిసికొనుటయందు, ప్రయత్నం చ = ప్రయత్నమును గూర్చియును, శ్రోతుం చ = వినుటకుగూడ, ఇచ్ఛామి = కోరుచున్నాను.

**తాత్పర్యము** :– సింహపరాక్రములైనట్టి హనుమంతుడు మున్నగు కృతకృత్యులై వచ్చిన మా వానరవీరులను నేనును మా రామలక్ష్మణులును శీఘ్రముగా చూడవలెననియు, సీతమ్మకొరకై చేసెడి ప్రయత్నమును గూర్చి వినవలెననియును మిక్కిలి కుతూహలముగ నున్నాము.

**శ్లో॥ ప్రీతిస్ఫీతాక్షౌ సంప్రహృష్టౌ కుమారౌ**
**దృష్ట్వా సిద్ధార్థౌ వానరాణాం చ రాజా ।**
**అంగై స్సంహృష్టైః కర్మసిద్ధిం విదిత్వా**
**బాహ్వో రాసన్నాం సోఽతిమాత్రం ననంద ॥ 29**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సుగ్రీవహర్షో" నామ*
*త్రిషష్టితమస్సర్గః*

**పదచ్ఛేదము** :– ప్రీతిస్ఫీతాక్షౌ – సంప్రహృష్టౌ – కుమారౌ – దృష్ట్వా – సిద్ధార్థౌ – వానరాణాం – చ – రాజా, అంగైః – సంహృష్టైః – కర్మసిద్ధిం – విదిత్వా – బాహ్వోః – ఆసన్నాం – సః – అతిమాత్రం – ననంద ॥

**అన్వయక్రమము** :– కుమారౌ సిద్ధార్థౌ ప్రీతిస్ఫీతాక్షౌ సంప్రహృష్టౌ దృష్ట్వా సః వానరాణాం రాజా సంహృష్టైః అంగైః కర్మసిద్ధిం బాహ్వోః ఆసన్నాం విదిత్వా అతిమాత్రం ననంద.

**ప్రతిపదార్థము** :– కుమారౌ = రాజకుమారులగు ఆ రామలక్ష్మణు లిర్వురును, సిద్ధార్థౌ = కృతార్థులైనవారినిగాను, ప్రీతిస్ఫీతాక్షౌ = సంతోషముచే విప్పారిన కన్నులుగల వారినిగాను, సంప్రహృష్టౌ = మిక్కిలి ఆనందము నొందిన వారినిగాను, దృష్ట్వా = చూచి, సః = ఆ, వానరాణాం రాజా = వానరరాజైన సుగ్రీవుడు, సంహృష్టైః =

గగుర్పాటు నొందినట్టి, అంగైః = అవయవములచే, కర్మసిద్ధిం = కార్యసిద్ధిని, బాహ్వోః = చేతులకు, ఆసన్నాం = సమీపించిన దానినిగా, విదిత్వా = తెలిసికొని, అతిమాత్రం = మిక్కిలిగా, ననంద = ఆనందించెను.

**తాత్పర్యము** :– రామలక్ష్మణు లిరువురును అప్పుడు తెలిసిన కార్యసాఫల్యమునకు గొప్ప ఆనందము గలిగి ముఖము వికసించి ఒడలు పులకరించుచుండగా మిక్కిలి సంతోషము నొందుటను జూచుచు సుగ్రీవు డా సమయమునందు తనకు గలిగిన అవయవములందలి గగుర్పాటుచే తాను పూనిన యత్నము సఫలమై ఫలితము చేతికి లభించినదని అమితమైన ఆనందము నొందెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*“సుబోధిని”యను ఆంధ్రవివరణమునందు*
*“సుగ్రీవహర్షము” అను*
*అరువదిమూడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# చతుష్షష్టితమసర్గ

**శ్లో॥ సుగ్రీవేణైవ ముక్తస్తు హృష్టో దధిముఖః కపిః ।**
**రాఘవం లక్ష్మణం చైవ సుగ్రీవం చాభ్యవాదయత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** సుగ్రీవేణ – ఏవమ్ – ఉక్తః – తు – హృష్టః – దధిముఖః – కపిః, రాఘవం – లక్ష్మణం – చ – ఏవ – సుగ్రీవం – చ – అభ్యవాదయత్ ॥

**అన్వయక్రమము :–** సుగ్రీవేణ ఏవమ్ ఉక్తః దధిముఖః కపిః హృష్టః సన్ రాఘవం లక్ష్మణం చ, సుగ్రీవం చ ఏవ అభ్యవాదయత్.

**ప్రతిపదార్థము :–** సుగ్రీవేణ = సుగ్రీవునిచే, ఏవం = ఈరీతిగా, ఉక్తః = చెప్పబడినవాడై, దధిముఖః వానరః = దధిముఖుడను వానరుడు, హృష్టః సన్ = సంతోషము నొందినవాడై, రాఘవం = శ్రీరాముని, లక్ష్మణం చ = లక్ష్మణుని మరియు, సుగ్రీవం చైవ = సుగ్రీవునిని, అభ్యవాదయత్ = మ్రొక్కెను.

**తాత్పర్యము :–** సుగ్రీవుడిట్లు చెప్పగనే ఆ దధిముఖుడు సంతోషము నొందినవాడై, శ్రీరామునకును లక్ష్మణునకును సుగ్రీవునకును నమస్కారములు చేసెను.

**శ్లో॥ స ప్రణమ్య చ సుగ్రీవం రాఘవౌ చ మహాబలౌ ।**
**వానరై స్సహిత శ్శూరై ర్దివమే వోత్పపాత హ ॥ 2**

**పదచ్ఛేదము :–** సః – ప్రణమ్య – చ – సుగ్రీవం – రాఘవౌ – చ – మహాబలౌ, వానరైః – సహితః – శూరైః – దివమ్ – ఏవ – ఉత్పపాత – హ ॥

**అన్వయక్రమము :–** సః సుగ్రీవం మహాబలౌ రాఘవౌ చ ప్రణమ్య శూరైః వానరైః సహితః దివమ్ ఏవ ఉత్పపాత.

**ప్రతిపదార్థము :–** సః = ఆ దధిముఖుడు, సుగ్రీవం = సుగ్రీవుని, మహాబలౌ = మహాబల సంపన్నులైన, రాఘవౌ చ = రామలక్ష్మణులను, ప్రణమ్య = నమస్కరించి, శూరైః = వీరులైన, వానరైః = వానరులతో, సహితః = కూడినవాడై, దివమ్ ఏవ = ఆకాశమును గూర్చియే, ఉత్పపాత = ఎగిరెను.

**తాత్పర్యము :-** అప్పుడా దధిముఖుడు అట్లు సుగ్రీవునకును మహావీరులైన రామలక్ష్మణులకును మ్రొక్కి తన పరివారముతో కలిసి ఆకాశము మీదికి ఎగిరి పోయెను.

**శ్లో॥ స యథై వాగతః పూర్వం తథైవ త్వరితం గతః ।**
**నిపత్య గగనా ద్భూమౌ తద్వనం ప్రవివేశ హ ॥ 3**

**పదచ్ఛేదము :-** యథా - ఏవ - ఆగతః - పూర్వం - తథా - ఏవ - త్వరితం - గతః, నిపత్య - గగనాత్ - భూమౌ - తత్ - వనం - ప్రవివేశ - హ ॥

**అన్వయక్రమము :-** సః పూర్వం యథైవ ఆగతః, తథైవ త్వరితం గతః, గగనాత్ భూమౌ నిపత్య తత్ వనం ప్రవివేశ.

**ప్రతిపదార్థము :-** సః = ఆ దధిముఖుడు, పూర్వం = వెనుక, యథైవ = ఏ రీతిగా, ఆగతః = వచ్చినాడో, తథైవ = ఆ రీతిగనే, త్వరితం = వేగముగా, గతః = వెడలినాడు, గగనాత్ = ఆకాశమునుండి, భూమౌ = నేలమీద, నిపత్య = దిగి, తత్ = ఆ, వనం = మధువనమును, ప్రవివేశ = ప్రవేశించెను.

**తాత్పర్యము :-** ఆ దధిముఖుడు వెనుక తాను వచ్చినట్లుగనే మిక్కిలి వేగముతో తిరిగి వెడలిపోయెను. అట్లు ఆకసమున పయనించి తన వనముకడ నేల మీదికి దిగి ఆ మధువనమున ప్రవేశించెను.

**శ్లో॥ స ప్రవిష్టో మధువనం దదర్శ హరియూథపాన్ ।**
**విమదా నుత్థితా న్సర్వా న్మేహమానా న్మధూదకమ్ ॥ 4**

**పదచ్ఛేదము :-** సః - ప్రవిష్టః - మధువనం - దదర్శ - హరియూథపాన్, విమదాన్ - ఉత్థితాన్ - సర్వాన్ - మేహమానాన్ - మధూదకమ్ ॥

**అన్వయక్రమము :-** సః మధువనం ప్రవిష్టః సన్ హరియూథపాన్ సర్వాన్, విమదాన్ ఉత్థితాన్ మధూదకం మేహమానాన్ దదర్శ.

**ప్రతిపదార్థము :-** సః = ఆ దధిముఖుడు, మధువనం = మధువనమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడై, హరియూథపాన్ = వానరయోధులను, సర్వాన్ = అందరిని, విమదాన్ = మత్తుతొలగిన వారినిగను, ఉత్థితాన్ = మేల్కొన్న వారినిగను, మధూదకం = మధుమిశ్రితమైన నీరును, మేహమానాన్ = మూత్రించుచున్న వారినిగను, దదర్శ = చూచెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :-** తేనెలను నీటిని మూత్రముగ విడుచుచున్నట్టి వారు అనగా వారు త్రాగిన మధువు జీర్ణమై మత్తు తొలగిపోయినది. వారు విమదులై ఉత్థితులై యుండిరి. వారు తేనెతోబాటుగా నీరుకూడ అనుపానముగా త్రాగియున్నారు. తేనెకు ఉదక మనుపానమని వాగ్భటుడు తెలిపియున్నాడు.

"శ్లో॥ అనుపానం హిమం వారి యవగోధూమయో ర్హితమ్ ।
దధ్ని మద్యే బిసే క్షౌద్రే కోష్ణం పిష్టమయేషు చ ॥"

**తాత్పర్యము :-** ఆ దధిముఖుడు అట్లు మధువనమున ప్రవేశించి అచ్చట అప్పటికి మధుపానముచే గలిగిన మైకము తొలగి మత్తునుండి లేచి మిక్కిలిగ మధుపానము చేయుటచే మధువుతో గూడిన మూత్రము విడుచుచున్న వానరయోధులను గాంచెను.

**శ్లో॥ స తా నుపాగమ ద్వీరో బద్ధ్వా కరపుటాంజలిమ్ ।**
**ఉవాచ వచనం శ్లక్ష్ణ మిదం హృష్టవ దంగదమ్ ॥ 5**

**పదచ్ఛేదము :-** సః - తాన్ - ఉపాగమత్ - వీరః - బద్ధ్వా - కరపుటాంజలిమ్, ఉవాచ - వచనం - శ్లక్ష్ణమ్ - ఇదం - హృష్టవత్ - అంగదమ్ ॥

**అన్వయక్రమము :-** వీరః సః తాన్ ఉపాగమత్, కరపుటాంజలిం బద్ధ్వా హృష్టవత్ అంగదం శ్లక్ష్ణమ్ ఇదం వచనమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :-** వీరః = వీరుడైనట్టి, సః = ఆ దధిముఖుడు, తాన్ = ఆ వానరులను, ఉపాగమత్ = చేరెను, కరపుటాంజలిం = దగ్గరకు చేర్చిన చేతులుగల దోసిలిని, బద్ధ్వా = కూర్చి, హృష్టవత్ = సంతోషించినట్లు, అంగదం = అంగదునిగూర్చి, శ్లక్ష్ణం = మృదువైనట్టి, ఇదం = ఈ, వచనం = మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :-** అప్పుడా దధిముఖుడా వానరవీరులను చేరి దోసిలొగ్గి వినయముతో తన సంతోషమును సూచించుచు అంగదుని చూచి మృదువైన మాటలతో ఇట్లు పలికెను.

**శ్లో॥ సౌమ్య రోషో న కర్తవ్యో య దేభి రభివారితః ।**
**అజ్ఞానా ద్రక్షిభిః క్రోధా ద్భవంతః ప్రతిషేధితాః ॥ 6**

**పదచ్ఛేదము :-** సౌమ్య - రోషః - న - కర్తవ్యః - యత్ - ఏభిః - అభివారితః, అజ్ఞానాత్ - రక్షిభిః - క్రోధాత్ - భవంతః - ప్రతిషేధితాః ॥

**అన్వయక్రమము :-** సౌమ్య! ఏభిః అభివారితః (ఇతి) యత్ (అత్ర) రోషః న కర్తవ్యః. భవంతః అజ్ఞానాత్ క్రోధాత్ రక్షిభిః ప్రతిషేధితాః.

**ప్రతిపదార్థము :-** సౌమ్య! = ఓ సౌమ్యస్వభావుడా! ఏభిః = ఈ వనపాలురచే, అభివారితః = అడ్డగింపబడితిని, ఇతి = అని, యత్ = ఏది యున్నదో, అత్ర = ఈ విషయమున, రోషః = కోపము, న కర్తవ్యః = చేయదగదు, భవంతః = మీరలు, అజ్ఞానాత్ = అజ్ఞానమువలన, క్రోధాత్ = కోపమువలన, రక్షిభిః = వనరక్షకులచే, ప్రతిషేధితాః = నివారింపబడినారు.

**తాత్పర్యము :-** ఓ సౌమ్యుడా! మా వనపాలురు అడ్డగించినందులకు కోపము నొందవలదు. ఏలననగా ఈ వనరక్షకులు మీ యధికారమును గూర్చి తెలియక అజ్ఞానముచే క్రోధము నొంది మిమ్మందరిని ఎదుర్కొని అడ్డగించినారు.

**శ్లో॥ యువరాజ స్త్వ మీశశ్చ వన స్యాస్య మహాబల!**
**మౌర్ఖ్యా త్పూర్వం కృతో దోష స్తం భవాన్ క్షంతుమర్హతి ॥ 7**

**పదచ్ఛేదము :-** యువరాజః - త్వమ్ - ఈశః - చ - వనస్య - అస్య - మహాబల!, మౌర్ఖ్యాత్ - పూర్వం - కృతః - దోషః - తం - భవాన్ - క్షంతుమ్ - అర్హతి ॥

**అన్వయక్రమము :-** మహాబల! త్వం యువరాజః, అస్య వనస్య ఈశః చ, మౌర్ఖ్యాత్ పూర్వం దోషః కృతః, భవాన్ తం క్షంతుమ్ అర్హతి.

**ప్రతిపదార్థము :-** మహాబల! = ఓ మహాబలాఢ్యుడా!, త్వం = నీవు, యువరాజః = యువరాజువు, అస్య = ఈ, వనస్య = మధువనమునకు, ఈశః చ = అధిపతివి గూడ, పూర్వం = వెనుక, మౌర్ఖ్యాత్ = అజ్ఞానమువలన, దోషః = అపరాధము, కృతః = చేయబడినది, తం = ఆ తప్పును, భవాన్ = నీవు, క్షంతుం = క్షమించుటకు, అర్హతి = తగుదువు.

**తాత్పర్యము :-** ఓ మహాబలాఢ్యుడా! వానరరాజ్యమునకు యువరాజైనట్టి నీవు ఈ మధువనమునకు గూడ ప్రభువై యున్నావుగదా! ఇంతకుముందు మేము అజ్ఞానముచే నీయెడ అపరాధమును చేసియున్నాము. ఆ తప్పును నీవు దయతో క్షమింపుము.

**శ్లో॥ శ్రాంతో దూరా దనుప్రాప్తో భక్షయస్వ స్వకం మధు ।**
**యథైవ హి పితా తే ఽభూ త్పూర్వం హరిగణేశ్వరః ।**
**తథా త్వ మపి సుగ్రీవో నాన్యస్తు హరిసత్తమ ॥ 8**

**పదచ్ఛేదము :-** శ్రాంతః - దూరాత్ - అనుప్రాప్తః - భక్షయస్వ - స్వకం - మధు,

మధు – యథా – ఏవ – హి – పితా – తే – అభూత్ – పూర్వం – హరిగణేశ్వరః,
తథా – త్వమ్ – అపి – సుగ్రీవః – న – అన్యః – తు – హరిసత్తమ ॥

**అన్వయక్రమము :–** దూరాత్ అనుప్రాప్తః (త్వం) శ్రాంతః స్వకం మధు భక్షయస్వ, హరిసత్తమ! యథైవ పూర్వం తే పితా హరిగణేశ్వరః తథా త్వమ్ అపి సుగ్రీవః (అపి) అన్యః తు న.

**ప్రతిపదార్థము :–** దూరాత్ = దూరమునుండి, అనుప్రాప్తః = వచ్చినట్టి, (త్వం = నీవు) శ్రాంతః = అలసినాడవు, స్వకం = నీ స్వంతమైనట్టి, మధు = మధువును, భక్షయస్వ =భక్షింపుము, పూర్వం = వెనుకటికాలమున, యథైవ = ఏరీతిగా, తే = నీయొక్క, పితా = తండ్రియైన వాలి, హరిగణేశ్వరః = వానరసమూహమునకు ప్రభువై యుండెనో, హరిసత్తమ! = ఓ వానరశ్రేష్ఠుడా! తథా = అట్లు, త్వమ్ అపి = నీవుగూడను, సుగ్రీవః అపి = సుగ్రీవుడు కూడను, హరిగణేశ్వరః = వానరాధిపతి, అన్యః తు = వేరొకడు మాత్రము, న = కాడు.

**తాత్పర్యము :–** ఓ యువరాజా! నీవు చాలదూరమునుండి ఈ వనమునకు వచ్చి అలసియుంటివి. కాబట్టి నీ తోటలోని తేనెను నీవు స్వేచ్ఛగా త్రాగుము. ఇంతకు పూర్వము నీ తండ్రియైన వాలి వానరలోకమున కెట్లు ప్రభువో నేడు నీవును సుగ్రీవుడును అట్లే వానరరాజ్యమునకు ప్రభువులై యున్నారుగదా!

**సూచన :–** ఈ మూడు శ్లోకార్థములు కొన్ని ప్రతులందు లేవు.

**శ్లో॥ ఆఖ్యాతం హి మయా గత్వా పితృవ్యస్య త వానఘ ।**
**ఇహోపయాతం సర్వేషా మేతేషాం వనచారిణామ్ ॥ 9**

**పదచ్ఛేదము :–** ఆఖ్యాతం – హి – మయా – గత్వా – పితృవ్యస్య – తవ – అనఘ, ఇహ – ఉపయాతం – సర్వేషామ్ – ఏతేషాం – వనచారిణామ్ ॥

**అన్వయక్రమము :–** అనఘ! తవ పితృవ్యస్య ఏతేషాం వనచారిణాం సర్వేషామ్ ఇహ ఉపయాతం మయా గత్వా ఆఖ్యాతం హి.

**ప్రతిపదార్థము :–** అనఘ = ఓ పాపరహితుడా, ఏతేషాం = ఈ, వనచారిణాం సర్వేషాం = వానరులందరియొక్క, ఇహ = ఇచటికి, ఉపయాతం చ = వచ్చుటను గూర్చి, మయా = నాచేత, గత్వా = పోయి, తవ = నీయొక్క, పితృవ్యస్య = పినతండ్రియైన సుగ్రీవునకు, ఆఖ్యాతం హి = చెప్పబడెను సుమా!

**తాత్పర్యము :–** ఓ పుణ్యాత్ముడా! మీ వానరులందరును ఈ మధువనమునకు వచ్చిన

విషయమును నేను నీ పినతండ్రియైన సుగ్రీవుని కడకుపోయి తెలిపియుంటిని సుమా!

**శ్లో॥ స త్వదాగమనం శ్రుత్వా స హైభి ర్హరియూథపైః ।**
**ప్రహృష్టో నతు రుష్టో ఽసౌ వనం శ్రుత్వా ప్రధర్షితమ్ ॥ 10**

**పదచ్ఛేదము** :- సః - త్వదాగమనం - శ్రుత్వా - సహ - ఏభిః - హరియూథపైః, ప్రహృష్టః - న - తు - రుష్టః - అసౌ - వనం - శ్రుత్వా - ప్రధర్షితమ్ ॥

**అన్వయక్రమము** :- సః ఏభిః హరియూథపైః సహ త్వదాగమనం శ్రుత్వా ప్రహృష్టః, అసౌ వనం ప్రధర్షితం శ్రుత్వా నతు రుష్టః.

**ప్రతిపదార్థము** :- సః = ఆ సుగ్రీవుడు, ఏభిః = ఈ, హరియూథపైః సహ = వానరయోధులతోగూడ, త్వదాగమనం = నీరాకనుగూర్చి, శ్రుత్వా = విని, ప్రహృష్టః = మిక్కిలి సంతోషించినాడు, అసౌ = ఆతడు, వనం = మధువనమును, ప్రధర్షితం = ధ్వంసముచేయబడిన దానినిగా, శ్రుత్వా = విని, న తు రుష్టః = కోపించినవాడు కాలేదు.

**తాత్పర్యము** :- ఈ వానరసమూహములతో కలిసి నీ వీ వనమునకు వచ్చుటను గూర్చి విన్న ఆ వానరరాజు మిక్కిలి సంతసించినాడు. ఈ మధువనము ధ్వంసము చేయబడినట్లు వినికూడ ఏమియు కోపము తెచ్చుకొనలేదు.

**శ్లో॥ ప్రహృష్టో మాం పితృవ్యస్తే సుగ్రీవో వానరేశ్వరః ।**
**శీఘ్రం ప్రేషయ సర్వాం స్తా నితి హోవాచ పార్థివః ॥ 11**

**పదచ్ఛేదము** :- ప్రహృష్టః - మాం - పితృవ్యః - తే - సుగ్రీవః - వానరేశ్వరః, శీఘ్రం - ప్రేషయ - సర్వాన్ - తాన్ - ఇతి - హ - ఉవాచ - పార్థివః ॥

**అన్వయక్రమము** :- తే పితృవ్యః వానరేశ్వరః పార్థివః సుగ్రీవః ప్రహృష్టః (సన్) తాన్ సర్వాన్ శీఘ్రం ప్రేషయ ఇతి మాం ఉవాచ హ!

**ప్రతిపదార్థము** :- తే పితృవ్యః = నీ పినతండ్రియును, వానరేశ్వరః = వానరరాజునగు, పార్థివః సుగ్రీవః = మహారాజైన సుగ్రీవుడు, ప్రహృష్టః (సన్) = మిక్కిలి సంతోషము నొందినవాడై, తాన్ సర్వాన్ = వారి నందరిని, శీఘ్రం = త్వరగా, ప్రేషయ = పంపుము, ఇతి = అని, మాం = నన్నుగూర్చి, ఉవాచ హ = పలికెను సుమా!

**తాత్పర్యము** :- వానరప్రభువైన నీ పినతండ్రి సుగ్రీవమహారాజు మిక్కిలి సంతోషించి మా అంగదాది వీరుల నందరిని త్వరగా ఇచటికి పంపించుమని నాతో చెప్పెను.

**శ్లో॥ శ్రుత్వా దధిముఖ స్యైత ద్వచనం శ్లక్ష్ణ మంగదః ।**
**అబ్రవీ త్తాన్ హరిశ్రేష్ఠో వాక్యం వాక్యవిశారదః ॥ 12**

**పదచ్ఛేదము :–** శ్రుత్వా – దధిముఖస్య – ఏతత్ – వచనం – శ్లక్ష్ణమ్ – అంగదః, అబ్రవీత్ – తాన్ – హరిశ్రేష్ఠః – వాక్యం – వాక్యవిశారదః ॥

**అన్వయక్రమము :–** దధిముఖస్య ఏతత్ శ్లక్ష్ణం వచనం శ్రుత్వా వాక్యవిశారదః హరిశ్రేష్ఠః అంగదః తాన్ వాక్యమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము :–** దధిముఖస్య = దధిముఖునియొక్క, ఏతత్ = ఈ, శ్లక్ష్ణం = మృదువైనట్టి, వచనం = మాటను, శ్రుత్వా = విని, వాక్యవిశారదః = మాటలందు నేర్పరియైనట్టి, హరిశ్రేష్ఠః అంగదః = వానరశ్రేష్ఠుడైన అంగదుడు, తాన్ = ఆ వానరులను గూర్చి, వాక్యమ్ అబ్రవీత్ = మాటను పలికెను.

**తాత్పర్యము :–** దధిముఖుడు చెప్పిన ఈ మృదువైన మాటలు విని వాక్యవిశారదుడైన అంగదుడు తన వానరవీరులను గూర్చి ఇట్లు పలికెను.

**శ్లో॥ శంకే శ్రుతో ఒ యం వృత్తాంతో రామేణ హరియూథపాః ।**
**తత్క్షమం నేహ న స్థాతుం కృతే కార్యే పరంతపాః ॥ 13**

**పదచ్ఛేదము :–** శంకే – శ్రుతః – అయం – వృత్తాంతః – రామేణ – హరియూథపాః, తత్ – క్షమం – న – ఇహ – నః – స్థాతుం – కృతే – కార్యే – పరంతపాః ॥

**అన్వయక్రమము :–** పరంతపాః హరియూథపాః! రామేణ అయం వృత్తాంతః శ్రుతః (ఇతి) శంకే, తత్ కార్యే కృతే (సతి) నః ఇహ స్థాతుం న క్షమమ్.

**ప్రతిపదార్థము :–** పరంతపాః = ఓ శత్రుసంహారకులారా! హరియూథపాః = వానరాగ్రేసరులారా!, రామేణ = శ్రీరామునిచే, అయం = ఈ, వృత్తాంతః = వృత్తాంతము, శ్రుతః = వినబడినది, (ఇతి = అని) శంకే = ఊహించుచున్నాను. తత్ = అందువలన, కార్యే = కార్యము, కృతే సతి = నెరవేర్పబడియుండగా, నః = మనకు, ఇహ = ఇచ్చట, స్థాతుం = నిలుచుటకు, న క్షమమ్ = తగదు.

**తాత్పర్యము :–** ఓ శత్రుభయంకరులైన వానరవీరులారా! మన వృత్తాంతమంతయును శ్రీరామునకు తెలిసిపోయినదని నేను ఊహించుచున్నాను. అందుచేత కర్తవ్యమును నిర్వహించుకొని వచ్చిన మనము ఇచ్చట జాగుచేయుట ఎంత మాత్రము ఉచితము కాదు.

**శ్లో॥ పీత్వా మధు యథాకామం విశ్రాంతా వనచారిణః ।**
**కిం శేషం గమనం తత్ర సుగ్రీవో యత్ర నో విభుః ॥ 14**

**పదచ్ఛేదము :–** పీత్వా – మధు – యథాకామం – విశ్రాంతాః – వనచారిణః, కిం – శేషం – గమనం – తత్ర – సుగ్రీవః – యత్ర – నః – విభుః ॥

**అన్వయక్రమము :–** వనచారిణః యథాకామం మధు పీత్వా విశ్రాంతాః. శేషం కిమ్? యత్ర నః విభుః సుగ్రీవః (అస్తి) తత్ర గమనం (ఉచితమ్).

**ప్రతిపదార్థము :–** వనచారిణః = వనచారులైన వానరులు, యథాకామం = స్వేచ్ఛగా, మధు = తేనెను, పీత్వా = త్రాగి, విశ్రాంతాః = విశ్రాంతినొందినారు. శేషం = మిగిలినది, కిం = ఏమి? యత్ర = ఎచ్చట, నః = మనయొక్క, విభుః = ప్రభువైన, సుగ్రీవః = సుగ్రీవుడు, (అస్తి = ఉన్నాడో), తత్ర = అచ్చటికి, గమనం = పోవుట, (ఉచితం = తగినది).

**తాత్పర్యము :–** మన వానరవీరు లెల్లరును తనివితీర తేనెలను త్రాగి విశ్రాంతి తీసికొనియున్నారు. ఇక మిగిలినది ఏమున్నది? ఇక మీదట మన ప్రభువైన సుగ్రీవుడున్న చోటికి త్వరితముగ పోవుదము.

**శ్లో॥ సర్వే యథా మాం వక్ష్యంతి సమేత్య హరియూథపాః ।**
**తథా ఽస్మి కర్తా కర్తవ్యే భవద్భిః పరవా నహమ్ ॥ 15**

**పదచ్ఛేదము :–** సర్వే – యథా – మాం – వక్ష్యంతి – సమేత్య – హరియూథపాః, తథా – అస్మి – కర్తా – కర్తవ్యే – భవద్భిః – పరవాన్ – అహమ్ ॥

**అన్వయక్రమము :–** హరియూథపాః సర్వే యథా సమేత్య మాం వక్ష్యంతి తథా కర్తా అస్మి, కర్తవ్యే అహం భవద్భిః పరవాన్.

**ప్రతిపదార్థము :–** హరియూథపాః = వానర ప్రభువులు, సర్వే = అందరును, సమేత్య = కలసి, యథా = ఏరీతిగా, మాం = నన్నుగూర్చి, వక్ష్యంతి = పలుకుదురో, తథా = ఆ రీతిగా, కర్తా = చేయువాడను, అస్మి = అగుచున్నాను. కర్తవ్యే = కర్తవ్యమునందు, అహం = నేను, భవద్భిః = మీచేత, పరవాన్ = పరాధీనుడను.

**తాత్పర్యము :–** మీ వానరశ్రేష్ఠు లెల్లరును కలసి ఆలోచించి నన్నేరీతిగా ఆజ్ఞాపించెదరో ఆ విధముగా చేయుటకు నేను సంసిద్ధుడనే. కర్తవ్య నిర్ణయమునందు సర్వథా మీకు నేను అధీనుడను.

**శ్లో॥ నాఽఽజ్ఞాపయితు మీశోఽహం యువరాజోఽస్మి యద్యపి ।**
**అయుక్తం కృతకర్మాణో యూయం ధర్షయితుం మయా ॥ 16**

**పదచ్ఛేదము :–** న – ఆజ్ఞాపయితుమ్ – ఈశః – అహం – యువరాజః – అస్మి – యది – అపి, అయుక్తం – కృతకర్మాణః – యూయం – ధర్షయితుం – మయా ॥

**అన్వయక్రమము :–** యువరాజః అస్మి యద్యపి అహమ్ ఆజ్ఞాపయితుం ఈశః న, యూయం కృతకర్మాణః, మయా ధర్షయితుమ్ అయుక్తమ్.

**ప్రతిపదార్థము :–** యువరాజః = యువరాజును, అస్మి యద్యపి = అయినప్పటికిని, ఆజ్ఞాపయితుం = ఆజ్ఞాపించుటకు, అహం = నేను, ఈశః = సమర్థుడను, న = కాను, కృతకర్మాణః = చేయబడినకార్యము కల్గియున్నట్టి, యూయం = మీరు, మయా = నాచేత, ధర్షయితుమ్ = బలవంతము చేయుటకు, అయుక్తమ్ = న్యాయముకాదు.

**తాత్పర్యము :–** నే నెంతటి యువరాజు నైనప్పటికిని, ఇట్లే చేయుడని మిమ్మాజ్ఞాపించుట నాకు తగదు. కర్తవ్యమును నెరవేర్చుకొని వచ్చినట్టి మిమ్ము నేను బలవంతము చేసి ఆజ్ఞాపించుట ఎంతమాత్రము ఉచితముకాదు.

**శ్లో॥ బ్రువత శ్చాంగద స్యైవం శ్రుత్వా వచన మవ్యయమ్ ।**
**ప్రహృష్టమనసో వాక్య మిద మూచు ర్వనౌకసః ॥ 17**

**పదచ్ఛేదము :–** బ్రువతః – చ – అంగదస్య – ఏవం – శ్రుత్వా – వచనమ్ – అవ్యయమ్, ప్రహృష్టమనసః – వాక్యమ్ – ఇదమ్ – ఊచుః – వనౌకసః ॥

**అన్వయక్రమము :–** ఏవం బ్రువతః అంగదస్య అవ్యయం వచనం శ్రుత్వా వనౌకసః ప్రహృష్టమనసః (సంతః) ఇదం వాక్యమ్ ఊచుః.

**ప్రతిపదార్థము :–** ఏవం = ఈరీతిగా, బ్రువతః = పలుకుచున్నట్టి, అంగదస్య = అంగదునియొక్క, అవ్యయం = స్థిరమైనట్టి, వచనం = మాటను, శ్రుత్వా = విని, వనౌకసః = వానరులు, ప్రహృష్టమనసః (సంతః) = గొప్ప సంతోషము నొందిన మనస్సుగలవా రగుచు, ఇదం = ఈ, వాక్యం = మాటను, ఊచుః = పలికిరి.

**తాత్పర్యము :–** అంగదు డిట్లు పలుకుటను విని ఆ వానరులందరును ఆతని యథార్థ వచనములకు మిక్కిలి సంతోషము నొందినవారై ఆతనితో ఇట్లు పలికిరి.

**శ్లో॥ ఏవం వక్ష్యతి కో రాజన్ ప్రభు స్సన్ వానరర్షభ ।**
**ఐశ్వర్యమదమత్తో హి సర్వో ఽహ మితి మన్యతే ॥ 18**

**పదచ్ఛేదము** :- ఏవం - వక్ష్యతి - కః - రాజన్ - ప్రభుః - సన్ - వానరర్షభ, ఐశ్వర్యమదమత్తః - హి - సర్వః - అహమ్ - ఇతి - మన్యతే ॥

**అన్వయక్రమము** :- వానరర్షభ! రాజన్! ప్రభుః సన్ కః ఏవం వక్ష్యతి? సర్వః ఐశ్వర్యమదమత్తః అహం శ్రేష్ఠః ఇది మన్యతే హి.

**ప్రతిపదార్థము** :- వానరర్షభ! = వానర శ్రేష్ఠుడా!, రాజన్ = రాజా!, ప్రభుః సన్ = అధికారియై యుండియును, కః = ఎవ్వడు, ఏవం = ఇట్లు వినయముగా, వక్ష్యతి = పలుకగలడు? సర్వః = ప్రతివాడును, ఐశ్వర్యమదమత్తః = అధికారమదముచే మత్తిల్లినవాడై, అహం = నేను, శ్రేష్ఠః = సర్వాధికుడను, ఇతి = అని, మన్యతే హి = తలచునుగదా!

**తాత్పర్యము** :- వానరశ్రేష్ఠుడవైన ఓ యువరాజా! గొప్ప అధికారము చేతియందు ఉండియుగూడ ఇంత వినయముగా ఎవడు మాటాడగలడు? లోకమునందు ప్రతివాడును ఐశ్వర్యమదముచే మత్తిల్లినవాడై అందరికంటె నేనే ఉత్కృష్టుడనని భావించును గదా!

**శ్లో॥ తవ చేదం సుసదృశం వాక్యం నాన్యస్య కస్యచిత్ ।**
**సంనతిర్హి తవాఖ్యాతి భవిష్యచ్ఛుభయోగ్యతామ్ ॥ 19**

**పదచ్ఛేదము** :- తవ - చ - ఇదం - సుసదృశం - వాక్యం - న - అన్యస్య - కస్యచిత్, సంనతిః - హి - తవ - ఆఖ్యాతి - భవిష్యచ్ఛుభయోగ్యతామ్ ॥

**అన్వయక్రమము** :- ఇదం వాక్యం చ తవ సుసదృశమ్, అన్యస్య కస్యచిత్ న (సదృశమ్). తవ సంనతిః భవిష్యచ్ఛుభయోగ్యతాం ఆఖ్యాతి హి.

**ప్రతిపదార్థము** :- ఇదం = ఈ, వాక్యం చ = మాటయును, తవ = నీకు, సుసదృశం = మిక్కిలి తగియున్నది, అన్యస్య = వేరైనట్టి, కస్యచిత్ = ఎవ్వనికిని, న = తగినట్టిది గాదు, తవ = నీయొక్క, సంనతిః = వినయము, భవిష్యచ్ఛుభయోగ్యతాం = భావిశ్రేయములకు అర్హతను, ఆఖ్యాతి = చెప్పుచున్నది.

**తాత్పర్యము** :- నీవు చెప్పినమాట నీ యోగ్యతకు ఎంతయో సరిపడి యున్నది. వేరెవ్వడును ఇంత ఉచితముగ పలుకజాలడు. ఇట్టి నీ వినయమే నీవు భవిష్యత్కాలమున పొందబోయెడి గొప్పశుభములను వెల్లడించుచున్నది సుమా!

**శ్లో॥ సర్వే వయమపి ప్రాప్తా స్తత్ర గంతుం కృతక్షణాః ।**
**స యత్ర హరివీరాణాం సుగ్రీవః పతి రవ్యయః ॥ 20**

**పదచ్ఛేదము** :– సర్వే – వయం – అపి – ప్రాప్తాః – తత్ర – గంతుం – కృతక్షణాః, సః – యత్ర – హరివీరాణాం – సుగ్రీవః – పతిః – అవ్యయః ॥

**అన్వయక్రమము** :– హరివీరాణాం పతిః సుగ్రీవః అవ్యయః సన్ యత్ర (అస్తి), ప్రాప్తాః వయం సర్వే అపి తత్ర గంతుం కృతక్షణాః (స్మః).

**ప్రతిపదార్థము** :– హరివీరాణాం = వానరవీరులకు, పతిః = ప్రభువైనట్టి, సః సుగ్రీవః = ఆ సుగ్రీవుడు, అవ్యయః = స్థిరమైనవాడై, యత్ర = ఎచ్చటనయితే, అస్తి = ఉన్నాడో, ప్రాప్తాః = చేరియున్నట్టి, వయం = మేము, సర్వే అపి = ఎల్లరముగూడి, తత్ర = అచ్చటికి, గంతుం = పోవుటకు, కృతక్షణాః = పొందిన యుత్సాహము గలవారముగా, (స్మః = ఉన్నాము).

**తాత్పర్యము** :– వానరవీరులకు ప్రభువైన ఆ సుగ్రీవమహారాజు స్థిరసంకల్పుడై నిలచియున్నచోటికి పోవుటకు ఇక్కడ చేరిన మేమెల్లరమును గూడ కుతూహలముతో నున్నాము.

**శ్లో॥ త్వయా హ్యనుక్తై ర్హరిభి ర్నైవ శక్యం పదాత్పదమ్ ।**
**క్వచి ద్గంతుం హరిశ్రేష్ఠ బ్రూమ స్సత్య మిదం తు తే ॥ 21**

**పదచ్ఛేదము** :– త్వయా – హి – అనుక్తైః – హరిభిః – న – ఏవ – శక్యం – పదాత్ – పదమ్, క్వచిత్ – గంతుం – హరిశ్రేష్ఠ – బ్రూమః – సత్యమ్ – ఇదం – తు – తే ॥

**అన్వయక్రమము** :– హరిశ్రేష్ఠ! త్వయా అనుక్తైః హరిభిః పదాత్ పదం క్వచిత్ గంతుం నైవ శక్యమ్, ఇదం సత్యం తే బ్రూమః.

**ప్రతిపదార్థము** :– హరిశ్రేష్ఠ! = ఓ వానరశ్రేష్ఠుడా! త్వయా = నీచేత, అనుక్తైః = చెప్పబడనట్టి, హరిభిః = వానరులచేత, క్వచిత్ = ఎచ్చటికిని, పదాత్ = ఒక అడుగు నుండి, పదం = (ఇంకొక) అడుగును, గంతుం = పోవుటకు, నైవ శక్యం = ఏమియును శక్యము గాదు. ఇదం = ఈ, సత్యం = యథార్థమును, తే = నీకు, బ్రూమః = చెప్పుచున్నాము.

**తాత్పర్యము** :– ఓ వానరశ్రేష్ఠుడా! నీవు ఆజ్ఞాపించని యెడల మా వానరులతో ఎవ్వడును గూడ ఒక అడుగుతీసి ఇంకొక అడుగు ఎచ్చటికిని వేయజాలడు. ఈ వాస్తవమును నీకు మరల మేము తెలుపుచున్నాము.

**శ్లో॥ ఏవం తు వదతాం తేషా మంగదః ప్రత్యభాషత ।**
**బాఢం గచ్ఛామ ఇత్యుక్త్వా ఖ ముత్పేతు ర్మహాబలాః ॥ 22**

**పదచ్ఛేదము** :- ఏవం - తు - వదతాం - తేషామ్ - అంగదః - ప్రత్యభాషత, బాఢం - గచ్ఛామః - ఇతి - ఉక్త్వా - ఖమ్ - ఉత్పేతుః - మహాబలాః ॥

**అన్వయక్రమము** :- తేషామ్ ఏవం వదతాం (సతామ్) అంగదః బాఢమ్ ఇతి ప్రత్యభాషత, గచ్ఛామః ఇతి ఉక్త్వా (తే) ఖమ్ ఉత్పేతుః.

**ప్రతిపదార్థము** :- తేషామ్ = ఆ వానరవీరులు, ఏవం = ఈవిధముగా, వదతాం సతామ్ = చెప్పుచుండగా, అంగదః = అంగదుడు, బాఢం = బాగు, ఇతి = అని, ప్రత్యభాషత = జవాబుచెప్పెను, గచ్ఛామః = వెడలుదము, ఇతి = అని, ఉక్త్వా = పలికి, మహాబలాః = మహాబలసంపన్నులైన, తే = ఆ వానరులు, ఖం = ఆకాశమును గూర్చి, ఉత్పేతుః = ఎగిరిరి.

**తాత్పర్యము** :- వానరులందరు ఇట్లు పలుకుచుండగా అంగదుడు సరియే అనెను. అంతట మహాబలశాలురైన ఆ వానరులెల్లరును పోవుదము రండని ఆకసము మీదికి ఎగిరిపోయిరి.

**శ్లో॥ ఉత్పతంత మనూత్పేతు స్సర్వే తే హరియూథపాః ।**
**కృత్వా ఽఽకాశం నిరాకాశం యంత్రోత్క్షిప్తా ఇవాఽచలాః ॥23**

**పదచ్ఛేదము** :- ఉత్పతంతం - అనూత్పేతుః - సర్వే - తే - హరియూథపాః, కృత్వా - ఆకాశం - నిరాకాశం - యంత్రోత్క్షిప్తాః - ఇవ - అచలాః ॥

**అన్వయక్రమము** :- తే హరియూథపాః సర్వే యంత్రోత్క్షిప్తాః అచలాః ఇవ ఆకాశం నిరాకాశం కృత్వా ఉత్పతంతం (తం) అనూత్పేతుః.

**ప్రతిపదార్థము** :- తే హరియూథపాః = ఆ వానరవీరులు, సర్వే = అందరును, యంత్రోత్క్షిప్తాః = యంత్రముచే మీదికి విసరబడిన, అచలాః ఇవ = పర్వతములవలె, ఆకాశం = ఆకాశమును, నిరాకాశం = అవకాశము లేనిదానినిగా, కృత్వా = చేసి, ఉత్పతంతం = మీదికి ఎగురుచున్న, (తం = ఆ అంగదుని), అనూత్పేతుః = అనుసరించి ఎగిరిరి.

**తాత్పర్యము** :- అట్లు ఆకసము మీదికి ఎగురుచున్న అంగదుని వెంట ఆ వానర యోధులెల్లరును ఒకానొక యంత్రముచే మీదికి విసరివేయబడుచున్న పర్వతములవలె రివ్వున మీదికెగసి ఆకసమునంతయును కప్పి వేయుచు ఆతనిని వెంబడించిరి.

**శ్లో॥ తే ఽంబరం సహ సోత్పత్య వేగవంతః ప్లవంగమాః ।**
**వినదంతో మహానాదం ఘనా వాతేరితా యథా ॥ 24**

**పదచ్ఛేదము :–** తే – అంబరం – సహసా – ఉత్పత్య – వేగవంతః – ప్లవంగమాః, వినదంతః – మహానాదం – ఘనాః – వాతేరితాః – యథా ॥

**అన్వయక్రమము :–** తే ప్లవంగమాః వేగవంతః అంబరం సహసా ఉత్పత్య వాతేరితాః ఘనాః యథా మహానాదం వినదంతః (జగ్మః).

**ప్రతిపదార్థము :–** తే ప్లవంగమాః = ఆ వానరులు, వేగవంతః = గొప్పవేగముగలవారై, అంబరం = ఆకసమునుగూర్చి, సహసా = తత్క్షణమే, ఉత్పత్య = ఎగిరి, వాతేరితాః = వాయువుచే నెట్టబడుచున్న, ఘనాః యథా = మేఘములవలె, మహానాదం వినదంతః = గొప్పదైన ధ్వనిచేయుచున్నవారై, (జగ్మః = వెడలిరి).

**తాత్పర్యము :–** ఆ వానరు లట్లు మహావేగముతో తత్క్షణమే ఆకసమున ఎగిరి వాయువుచే ఎగురగొట్ట బడుచున్న మేఘములవలె ఉరుములవంటి పెద్దపెద్ద గర్జనలు చేయుచు పోవుచుండిరి.

**శ్లో॥ అంగదే హ్యననుప్రాప్తే సుగ్రీవో వానరాధిపః ।**
**ఉవాచ శోకోపహతం రామం కమలలోచనమ్ ॥ 25**

**పదచ్ఛేదము :–** అంగదే – హి – అననుప్రాప్తే – సుగ్రీవః – వానరాధిపః – ఉవాచ – శోకోపహతం – రామం – కమలలోచనమ్ ॥

**అన్వయక్రమము :–** అంగదే అననుప్రాప్తే (సతి) వానరాధిపః సుగ్రీవః శోకోపహతం కమలలోచనం రామమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** అంగదే = అంగదుడు, అననుప్రాప్తే సతి = రాకయుండగా, వానరాధిపః = వానరరాజైనట్టి, సుగ్రీవః = సుగ్రీవుడు, శోకోపహతం = దుఃఖముచే వివశుడైనట్టి, కమలలోచనం = పద్మనయనుడైన, రామం = శ్రీరాముని గూర్చి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** అంగదుడు తమకడకు రాకముందు సుందరమైన నేత్రద్వయము గలిగియున్న శ్రీరాముడు విషాదభరితుడైయుండగా ఆతనితో సుగ్రీవుడు ఇట్లు పలికెను.

**శ్లో॥ సమాశ్వసిహి భద్రం తే దృష్టా దేవీ న సంశయః ।**
**నాఽఽగంతు మిహ శక్యం తైరతీతే సమయే హి నః ॥ 26**

**పదచ్ఛేదము :–** సమాశ్వసిహి – భద్రం – తే – దృష్టా – దేవీ – న – సంశయః, న – ఆగంతుమ్ – ఇహ – శక్యం – తైః – అతీతే – సమయే – హి – నః ॥

**అన్వయక్రమము :-** సమాశ్వసిహి, తే భద్రం, దేవీ దృష్టా, సంశయః న, నః సమయే అతీతే సతి తైః ఇహ ఆగంతుం న శక్యం హి.

**ప్రతిపదార్థము :-** సమాశ్వసిహి = ఊరడిల్లుము. తే = నీకు, భద్రం = శుభము. దేవీ = సీతాదేవి, దృష్టా = చూడబడినది. సంశయః = సందేహము, న = లేదు. నః = మనయొక్క, సమయే = గడువు, అతీతే సతి = అతిక్రమించినదికాగా, తైః = వారిచే, ఇహ = ఇచ్చటికి, ఆగంతుం = వచ్చుటకు, న శక్యం హి = శక్యముకాదుగదా.

**తాత్పర్యము :-** రామచంద్రా! ఊరడిల్లుము. నీకు శుభమగుచున్నది! సీతాదేవి కాన్పించినది. అందు సందేహమేమియును లేదు. మనమొసగిన గడువు దాటిపోయిన పిమ్మట కృతకృత్యులు గాకుండ వారు మన ఎదుటికి వచ్చుటకు శక్యముగాదు సుమా!

**శ్లో॥ న మత్సకాశ మాగచ్ఛే త్కృత్యే హి వినిపాతితే ।**
**యువరాజో మహాబాహుః ప్లవతాం ప్రవరోఽంగదః ॥ 27**

**పదచ్ఛేదము :-** న - మత్సకాశమ్ - ఆగచ్ఛేత్ - కృత్యే - హి - వినిపాతితే, యువరాజః - మహాబాహుః - ప్లవతాం - ప్రవరః - అంగదః ॥

**అన్వయక్రమము :-** యువరాజః మహాబాహుః ప్లవతాం ప్రవరః అంగదః కృత్యే వినిపాతితే సతి మత్సకాశం న అగచ్ఛేత్ హి.

**ప్రతిపదార్థము :-** యువరాజః = యువరాజును, మహాబాహుః = గొప్ప భుజములు గలవాడును, ప్లవతాం ప్రవరః = వానరులలో శ్రేష్ఠుడు నగు, అంగదః = అంగదుడు, కృత్యే = కర్తవ్యము, వినిపాతితే సతి = చెడిపోయినది కాగా, మత్సకాశం = నా సమీపమునకు, న ఆగచ్ఛేత్ హి = రాజాలడు సుమా!

**తాత్పర్యము :-** వానరశ్రేష్ఠుడును మహావీరుడు నగు యువరాజైన అంగదుడు తన కప్పగింపబడిన కార్యము చెడిపోయిన పక్షమున నా ఎదుటికి రాజాలడు సుమా!

**శ్లో॥ యద్య ప్యకృతకృత్యానా మీదృశః స్యా దుపక్రమః ।**
**భవే త్స దీనవదనో భ్రాంతవిప్లుతమానసః ॥ 28**

**పదచ్ఛేదము :-** యది అపి - అకృతకృత్యానామ్ - ఈదృశః - స్యాత్ - ఉపక్రమః, భవేత్ - సః - దీనవదనః - భ్రాంతవిప్లుతమానసః ॥

**అన్వయక్రమము :-** అకృతకృత్యానాం ఈదృశః ఉపక్రమః (స్యాత్) యద్యపి సః దీనవదనః భ్రాంతవిప్లుతమానసః భవేత్.

**ప్రతిపదార్థము** :- అకృతకృత్యానాం = చేయబడని కృత్యములుగల వారియొక్క, ఉపక్రమః = చేష్టితము, ఈదృశః = ఈ విధమైనది, స్యాత్ యద్యపి = అయినయెడల, సః = ఆ యంగదుడు, దీనవదనః = దీనమైన ముఖముగలవాడును, భ్రాంతవిప్లుత మానసః = విభ్రాంతినొంది కలగియున్న మనస్సు గలవాడుగాను, భవేత్ = ఉండవలయును.

**తాత్పర్యము** :- ఒకవేళ ఈ మధువనభంగము అనెడి ఈ సాహసచేష్టితము కృతకృత్యులు కాకుండగనే ఆ వానరులు చేసియున్న యెడల ఆ అంగదుడు ముఖము వ్రేలవేసికొని వ్యాకులమైన మనస్సుతోడనే కాన్పించును.

**శ్లో॥ పితృపైతామహం చైత త్పూర్వకై రభిరక్షితమ్ ।**
**న మే మధువనం హన్యా దహృష్టః ప్లవగేశ్వరః ॥ 29**

**పదచ్ఛేదము** :- పితృపైతామహం - చ - ఏతత్ - పూర్వకైః - అభిరక్షితమ్, న - మే - మధువనం - హన్యాత్ - అహృష్టః - ప్లవగేశ్వరః ॥

**అన్వయక్రమము** :- మే పూర్వకైః అభిరక్షితం పితృపైతామహం ఏతత్ మే మధువనం ప్లవగేశ్వరః అహృష్టః సన్ న హన్యాత్.

**ప్రతిపదార్థము** :- మే పూర్వకైః = నా పూర్వులచే, అభిరక్షితం = కాపాడబడినదియును, పితృపైతామహం = తండ్రితాతలకు సంబంధించినదియునగు, ఏతత్ మధువనం = ఈ మధువనమును, ప్లవగేశ్వరః = వానరప్రభువైన అంగదుడు, అహృష్టః సన్ = సంతోషము నొందనివాడగుచు, న హన్యాత్ = పాడుచేయడు.

**తాత్పర్యము** :- మా పూర్వవంశీయులచే ప్రాణపదముగా కాపాడబడి మా తండ్రితాతల వలన మాకు లభించినట్టి ఈ మధువనమును యువరాజైన అంగదుడు సంతోషభరితుడై యుండనియెడల ఈ విధముగా పాడుచేసి యుండడు.

**శ్లో॥ కౌసల్యా సుప్రజా రామ సమాశ్వసిహి సువ్రత ।**
**దృష్టా దేవీ న సందేహో న చాన్యేన హనూమతా ॥ 30**

**శ్లో॥ న హ్యన్యః కర్మణో హేతు స్సాధనే ఽస్య హనూమతః ॥ 31**

**పదచ్ఛేదము** :- కౌసల్యా - సుప్రజాః - రామ - సమాశ్వసిహి - సువ్రత, దృష్టా - దేవీ - న - సందేహః - న - చ - అన్యేన - హనూమతా, న - హి - అన్యః - కర్మణః - హేతుః - సాధనే - అస్య - హనూమతః ॥

**అన్వయక్రమము** :- రామ! కౌసల్యా సుప్రజాః. సువ్రత! సమాశ్వసిహి, దేవీ దృష్టా,

సందేహః న, అన్యేన చ న, హనూమతా (దృష్టా), అస్య కర్మణః సాధనే హనూమతః అన్యః హేతుః న.

**ప్రతిపదార్థము** :- రామ = ఓ శ్రీరామా, కౌసల్యా = కౌసల్యాదేవి, సుప్రజాః = ఉత్తమమైన సంతానము గలది, సువ్రత = ఉత్తమవ్రతసంపన్నుడా!, సమాశ్వసిహి = ఊరడిల్లుము, దేవీ = సీతాదేవి, దృష్టా = చూడబడినది, సందేహః = సంశయము, న = లేదు, అన్యేన చ = ఇతరునిచేత గూడ, న = కాదు. హనూమతా = హనుమచేత, (దృష్టా = చూడబడినది), అస్య కర్మణః = ఈ కార్యముయొక్క, సాధనే = నిర్వహణమునందు, హనూమతః = హనుమంతునికంటె, అన్యః = వేరైనట్టి, హేతుః = కారణము, న (అస్తి) = లేదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :- సీతమ్మయొక్క ఉనికి తెలిసికొన్నవాడవై నీవు ప్రాణములతో సుఖముగ నుందువు కాబట్టి ఇట్టి అదృష్టవంతుడవైన నిన్ను గన్న కౌసల్య సత్‌సంతానవతి సుమా! అని భావము.

**తాత్పర్యము** :- రామభద్రా! సీతాక్షేమవార్త విని నీవు క్షేమముగా నుందువు గనుక నిన్ను గన్న ఆ కౌసల్యాదేవి సత్‌సంతానముగన్న ఉత్తమమైన జనని యగును. ఇక నీవు ఊరడిల్లుము. మనవారికి సీతాదేవి కాన్పించినది. సందేహ మేమియును లేదు. ఆమెను చూచినది గూడ హనుమంతుడే తప్ప వేరెవ్వరును కాదు. ఈ కార్యసిద్ధిలో హనుమంతుని ప్రయత్నవిశేషమే గాక వేరొక హేతు వేదియును లేదు.

**శ్లో॥ హనూమతి హి సిద్ధిశ్చ మతిశ్చ మతిసత్తమ ।**
**వ్యవసాయశ్చ వీర్యం చ సూర్యే తేజ ఇవ ధ్రువమ్ ॥ 32**

**పదచ్ఛేదము** :- హనూమతి - హి - సిద్ధిః - చ - మతిః - చ - మతిసత్తమ, వ్యవసాయః - చ - వీర్యం - చ - సూర్యే - తేజః - ఇవ - ధ్రువమ్ ॥

**అన్వయక్రమము** :- మతిసత్తమ! సూర్యే తేజః ఇవ, హనూమతి సిద్ధిః చ, మతిః చ, వ్యవసాయః చ ధ్రువమ్ (వర్తంతే).

**ప్రతిపదార్థము** :- మతిసత్తమ = బుద్ధిశ్రేష్ఠుడవైన ఓ శ్రీరామా! సూర్యే = సూర్యుని యందు, తేజః ఇవ = ప్రకాశమువలె, హనూమతి = హనుమంతునియందు, సిద్ధిః చ = కార్యసిద్ధియును, మతిః చ = జ్ఞానమును, వ్యవసాయః చ = ప్రయత్నమును, వీర్యం చ = పరాక్రమమును, ధ్రువం = స్థిరముగా (వర్తంతే హి = ఉన్నవి గదా).

**తాత్పర్యము** :- ఓ ప్రజ్ఞావంతుడా! సూర్యునిలో తేజస్సు నియతమైనట్లుగా హనుమంతునియందు కార్యసిద్ధియు కర్తవ్యనిశ్చయమును తీవ్రప్రయత్నమును దానికి కావలసిన పరాక్రమమును అన్నియును సుస్థిరములై ఒప్పుచున్నది సుమా!

**శ్లో॥ జాంబవా న్యత్ర నేతా స్యా దంగదశ్చ బలేశ్వరః ।**
**హనుమాం శ్చాప్యధిష్ఠాతా న తస్య గతి రన్యథా ॥ 33**

**శ్లో॥ మా భూ శ్చింతాసమాయుక్త స్సంప్ర త్యమితవిక్రమ ॥ 34**

**పదచ్ఛేదము** :- జాంబవాన్ - యత్ర - నేతా - స్యాత్ - అంగదః - చ - బలేశ్వరః, హనుమాన్ - చ - అపి - అధిష్ఠాతా - న - తస్య - గతిః - అన్యథా, మా - భూః - చింతాసమాయుక్తః - సంప్రతి - అమితవిక్రమ ॥

**అన్వయక్రమము** :- యత్ర జాంబవాన్ నేతా స్యాత్, అంగదః చ బలేశ్వరః (స్యాత్) హనుమాన్ చ అధిష్ఠాతా (స్యాత్), తస్య గతిః అన్యథా న (స్యాత్). అమితవిక్రమ! సంప్రతి చింతాసమాయుక్తః మా భూః.

**ప్రతిపదార్థము** :- యత్ర = ఏ కార్యమునందు, జాంబవాన్ = జాంబవంతుడు, నేతా = నాయకుడు, స్యాత్ = అగునో, అంగదః చ = అంగదుడును, బలేశ్వరః = సైన్యాధిపతిగా, (స్యాత్ = ఉండునో), తస్య = ఆ కార్యముయొక్క, గతిః = విధానము, అన్యథా = వేరువిధముగా, న స్యాత్ = ఉండదు. అమితవిక్రమ = అఖండమైన పరాక్రమముగల ఓ శ్రీరామా!, సంప్రతి = ఇప్పుడు, చింతాసమాయుక్తః = చింతతో నున్నవాడవు, మా భూః = కాకుము.

**తాత్పర్యము** :- ఏ కార్యమునందు జాంబవంతుడు నాయకత్వము వహించియుండునో, అంగదుడు సేనాధిపత్యమును వహించియుండునో, హనుమంతుడు కార్యనిర్వహణమునకు పూనుకొనునో ఆ కార్యముయొక్క సిద్ధివిషయమునందు వేరు విధమగు అనుమానమునకు అవకాశము లేదు. కాబట్టి పరాక్రమశాలియైన ఓ శ్రీరామా! నీ వికనుండి దిగులు పొందవలసిన పనిలేదు సుమా!

**శ్లో॥ తతః కిలకిలాశబ్దం శుశ్రా వాసన్న మంబరే ।**
**హనూమత్కర్మదృప్తానాం నర్దతాం కాననౌకసామ్ ।**
**కిష్కింధా ముపయాతానాం సిద్ధిం కథయతామివ ॥ 35**

**పదచ్ఛేదము** :- తతః - కిలకిలాశబ్దం - శుశ్రావ - ఆసన్నమ్ - అంబరే - హనూమత్కర్మదృప్తానాం - నర్దతాం - కాననౌకసామ్ - కిష్కింధామ్ - ఉపయాతానాం

– సిద్ధిం – కథయతామ్ – ఇవ ॥

**అన్వయక్రమము :–** తతః హనూమత్కర్మదృప్తానాం కిష్కింధామ్ ఉపయాతానాం సిద్ధిం కథయతామ్ ఇవ నర్దతాం కాననౌకసామ్ అంబరే ఆసన్నం కిలకిలాశబ్దం శుశ్రావ.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, హనూమత్కర్మదృప్తానాం = హనుమంతునియొక్క కార్యముచే దర్పించియున్నవారును, కిష్కింధాం = కిష్కింధనుగూర్చి, ఉపయాతానాం = సమీపించినట్టివారును, సిద్ధిం = కార్యసిద్ధిని, కథయతామ్ ఇవ = చెప్పుచున్న వారునువలె, నర్దతాం = అరచుచున్నట్టి, కాననౌకసాం = వానరులయొక్క, అంబరే = ఆకసమునందు, ఆసన్నం = సమీపించియున్నట్టి, కిలకిలాశబ్దం = కిలకిల యను ధ్వనిని, శుశ్రావ = వినెను.

**తాత్పర్యము :–** అంతట హనుమ సాధించిన కార్యసిద్ధిచే గర్వించియున్నవారై కిష్కింధకు వచ్చుచు, తమ కార్యసిద్ధివార్తనే ఘోషించుచున్నట్లుగా సింహనాదములు చేయుచున్న ఆ వానరులయొక్క కిలకిలారావము ఆకసమునుండి దగ్గరలో వినవచ్చెను.

**శ్లో॥ తత శ్శ్రుత్వా నినాదం తం కపీనాం కపిసత్తమః ।**
**ఆయతాంచితలాంగూల స్సో ఽభవ ద్ధృష్టమానసః ॥ 36**

**పదచ్ఛేదము :–** తతః – శ్రుత్వా – నినాదం – తం – కపీనాం – కపిసత్తమః, ఆయతాంచితలాంగూలః – సః – అభవత్ – హృష్టమానసః ॥

**అన్వయక్రమము :–** తతః సః కపిసత్తమః కపీనాం తం నినాదం శ్రుత్వా ఆయతాంచిత లాంగూలః (సన్) హృష్టమానసః అభవత్.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, సః కపిసత్తమః = ఆ వానరోత్తముడైన సుగ్రీవుడు, కపీనాం = వానరులయొక్క, తం = ఆ, నినాదం = ధ్వనిని, శ్రుత్వా = విని, ఆయతాంచితలాంగూలః (సన్) = పొడవైన అందమైన తోకగలవా డగుచు, హృష్టమానసః = సంతోషము నొందిన మనస్సుగలవాడు, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము :–** అప్పుడు వానరులు చేయుచున్న ఆ కోలాహలధ్వనిని వీనులవిందుగ విని వానరుడైన సుగ్రీవుడు తన వాలమును అందముగ పొడవుగ పెంచి ఆనంద భరితుడయ్యెను.

**శ్లో॥ ఆజగ్ము స్తేఽపి హరయో రామదర్శనకాంక్షిణః ।**
**అంగదం పురతః కృత్వా హనూమంతం చ వానరమ్ ॥ 37**

**పదచ్ఛేదము :–** ఆజగ్ముః – తే – అపి – హరయః – రామదర్శనకాంక్షిణః – అంగదం – పురతః – కృత్వా – హనూమంతం – చ – వానరమ్ ॥

**అన్వయక్రమము :–** తే హరయః అపి రామదర్శనకాంక్షిణః (సంతః) అంగదం హనూమంతం వానరం చ పురతః కృత్వా ఆజగ్ముః.

**ప్రతిపదార్థము :–** తే = ఆ, హరయః అపి = వానరులుగూడ, రామదర్శనకాంక్షిణః (సంతః) = రామునియొక్క దర్శనము కోరుచున్నవారగుచు, అంగదం = అంగదుని, వానరం = వానరుడైన, హనూమంతం చ = హనుమంతుని, పురతః = ఎదురుగా, కృత్వా = చేసికొని, ఆజగ్ముః = వచ్చిరి.

**తాత్పర్యము :–** జాంబవంతుడు మున్నగు వానరవీరులు ఎల్లరును శ్రీరాముని సందర్శించు కుతూహలముతో అంగదుని, హనుమను ముందు ఉంచుకొని ఆ ప్రదేశమునకు వచ్చిరి.

**శ్లో॥ తే ఽంగదప్రముఖా వీరాః ప్రహృష్టాశ్చ ముదాన్వితాః ।**
**నిపేతు ర్హరిరాజస్య సమీపే రాఘవస్య చ ॥ 38**

**పదచ్ఛేదము :–** తే – అంగదప్రముఖాః – వీరాః – ప్రహృష్టాః – చ – ముదా – అన్వితాః – నిపేతుః – హరిరాజస్య – సమీపే – రాఘవస్య – చ ॥

**అన్వయక్రమము :–** అంగదప్రముఖాః తే వీరాః ప్రహృష్టాః ముదా అన్వితాః చ (సంతః) హరిరాజస్య రాఘవస్య చ సమీపే నిపేతుః.

**ప్రతిపదార్థము :–** అంగదప్రముఖాః = అంగదుడు మొదలుగాగల, తే = ఆ, వీరాః = వానరవీరులు, ప్రహృష్టాః = హర్షము నొందినవారును, ముదా = ప్రీతితో, అన్వితాః చ సంతః = కూడినవారు నగుచు, హరిరాజస్య = వానరరాజైన సుగ్రీవునకును, రాఘవస్య చ = శ్రీరామునకును, సమీపే = సమీపమునందు, నిపేతుః = దిగిరి.

**తాత్పర్యము :–** అట్లు ఆ యంగదప్రముఖులైన వానరశ్రేష్ఠులు మిక్కిలి ఆనందముతోను ప్రీతితోను నిండినవారై రామసుగ్రీవుల సన్నిధిని ఆకసమునుండి భూమిమీదకు దిగిరి.

**శ్లో॥ హనూమాంశ్చ మహాబాహుః ప్రణమ్య శిరసా తతః ।**
**నియతా మక్షతాం దేవీం రాఘవాయ న్యవేదయత్ ॥ 39**

**పదచ్ఛేదము :–** హనూమాన్ – చ – మహాబాహుః – ప్రణమ్య – శిరసా – తతః, నియతామ్ – అక్షతాం – దేవీం – రాఘవాయ – న్యవేదయత్ ॥

**అన్వయక్రమము** :- తతః మహాబాహుః హనుమాన్ శిరసా ప్రణమ్య రాఘవాయ దేవీం నియతామ్ అక్షతాం న్యవేదయత్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, మహాబాహుః = గొప్పవైన బాహువులు గలిగినట్టి, హనుమాన్ = హనుమంతుడు, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = మ్రొక్కి, రాఘవాయ = శ్రీరాముని కొరకు, దేవీం = సీతాదేవిని, నియతాం = నియమవంతురాలినిగాను, అక్షతాం = హాని నొందనిదానినిగాను, న్యవేదయత్ = నివేదించెను.

**తాత్పర్యము** :- అంతట మహాబాహువైన హనుమంతుడు శ్రీరామునకు సాష్టాంగ వందనము గావించి సీతాదేవి నియమవతియై హానినొందనిదై యున్నదని విన్నవించెను.

**శ్లో॥ దృష్టా దేవీతి హనుమ ద్వదనా దమృతోపమమ్ ।**
**ఆకర్ణ్య వచనం రామో హర్ష మాప సలక్ష్మణః ॥ 40**

**పదచ్ఛేదము** :- దృష్టా - దేవీ - ఇతి - హనుమద్వదనాత్ - అమృతోపమమ్, ఆకర్ణ్య - వచనం - రామః - హర్షమ్ - ఆప - సలక్ష్మణః ॥

**అన్వయక్రమము** :- హనుమద్వదనాత్ అమృతోపమం “దృష్టా దేవీ” ఇతి వచనం ఆకర్ణ్య సలక్ష్మణః రామః హర్షమ్ ఆప.

**ప్రతిపదార్థము** :- హనుమద్వదనాత్ = హనుమయొక్క ముఖమునుండి, అమృతోపమం = అమృతతుల్యమైనట్టి, దృష్టా దేవీ = సీతాదేవి చూడబడినది, ఇతి = అను, వచనం = మాటను, ఆకర్ణ్య = విని, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడియున్న, రామః = శ్రీరాముడు, హర్షం = ఆనందమును, ఆప = పొందెను.

**తాత్పర్యము** :- హనుమంతుడు నోరార పలికినట్టి “సీతాదేవి కాన్పించినది” అనెడి అమృతోపమానమైన వచనమును విని శ్రీరాముడు తన తమ్ముడైన లక్ష్మణునితోకూడ ఎంతయో ఆనందించెను.

**శ్లో॥ నిశ్చితార్థ స్తత స్తస్మిన్ సుగ్రీవః పవనాత్మజే ।**
**లక్ష్మణః ప్రీతిమాన్ ప్రీతం బహుమానా దవైక్షత ॥ 41**

**పదచ్ఛేదము** :- నిశ్చితార్థః - తతః - తస్మిన్ - సుగ్రీవః - పవనాత్మజే, లక్ష్మణః - ప్రీతిమాన్ - ప్రీతం - బహుమానాత్ - అవైక్షత ॥

**అన్వయక్రమము** :- తతః సుగ్రీవః తస్మిన్ పవనాత్మజే నిశ్చితార్థః (అభవత్), ప్రీతిమాన్ లక్ష్మణః ప్రీతం బహుమానాత్ అవైక్షత.

**ప్రతిపదార్థము** :– తతః = పిమ్మట, సుగ్రీవః = సుగ్రీవుడు, తస్మిన్ = ఆ, పవనాత్మజే = హనుమంతునియందు, నిశ్చితార్థః = నిశ్చయింపబడిన కార్యముగలవాడు, అభవత్ = అయ్యెను, లక్ష్మణః = లక్ష్మణుడు, ప్రీతిమాన్ = ప్రీతినొందినవాడై, బహుమానాత్ = గౌరవపూర్వకముగా, ప్రీతం = ఇష్టుడైన హనుమను, అవైక్షత = చూచెను.

**తాత్పర్యము** :– అప్పుడు సుగ్రీవుడు ఈ సంతోషకార్యమును సాధించినట్టివాడు హనుమయే అని నిశ్చయించుకొని సంతోషించుచుండెను. లక్ష్మణుడా హనుమయెడల అమితమైన ప్రేమగలవాడై ప్రీతిపాత్రుడైన ఆతనిని పరమాదరముతో చూచుచుండెను.

**శ్లో॥ ప్రీత్యా చ రమమాణో ఽథ రాఘవః పరవీరహా ।**
**బహుమానేన మహతా హనుమంత మవైక్షత ॥ 42**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనుమదాద్యాగమనం" నామ*
*చతుఃషష్టితమస్సర్గః.*

**పదచ్ఛేదము** :– ప్రీత్యా – చ – రమమాణః – అథ – రాఘవః – పరవీరహా, బహుమానేన – మహతా – హనుమంతమ్ – అవైక్షత ॥

**అన్వయక్రమము** :– అథ పరవీరహా రాఘవః ప్రీత్యా రమమాణః మహతా బహుమానేన హనుమంతమ్ అవైక్షత.

**ప్రతిపదార్థము** :– అథ = పిమ్మట, పరవీరహా = శత్రువీరసంహారకుడైన, రాఘవః = శ్రీరాముడు, ప్రీత్యా = సంతోషముతో, రమమాణః = ఉల్లాసము నొందుచున్నవాడై, హనుమంతం = హనుమను, మహతా = గొప్పదైన, బహుమానేన = గౌరవముతో, అవైక్షత = చూచెను.

**తాత్పర్యము** :– అప్పుడు మహావీరుడైన శ్రీరాముడు ఆనందముతో ఉప్పొంగుచున్న అమితమైన ఆదరవిశేషముతో విప్పారియున్నట్టి కన్నులతో హనుమను విలోకించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనుమదాద్యాగమనము" అను*
*అరువదినాల్గవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# పంచషష్టితమసర్గ

శ్లో॥ తతః ప్రస్రవణం శైలం తే గత్వా చిత్రకాననమ్ ।
ప్రణమ్య శిరసా రామం లక్ష్మణం చ మహాబలమ్ ॥ 1

శ్లో॥ యువరాజం పురస్కృత్య సుగ్రీవ మభివాద్య చ ।
ప్రవృత్తి మథ సీతాయాః ప్రవక్తు ముపచక్రముః ॥ 2

**పదచ్ఛేదము** :- తతః - ప్రస్రవణం - శైలం - తే - గత్వా - చిత్రకాననమ్, ప్రణమ్య - శిరసా - రామం - లక్ష్మణం - చ - మహాబలమ్, యువరాజం - పురస్కృత్య - సుగ్రీవమ్ - అభివాద్య - చ, ప్రవృత్తిమ్ - అథ - సీతాయాః - ప్రవక్తుమ్ - ఉపచక్రముః ॥

**అన్వయక్రమము** :- తతః తే చిత్రకాననం ప్రస్రవణం శైలం గత్వా రామం మహాబలం లక్ష్మణం చ శిరసా ప్రణమ్య యువరాజం పురస్కృత్య సుగ్రీవం చ అభివాద్య అథ సీతాయాః ప్రవృత్తిం ప్రవక్తుమ్ ఉపచక్రముః.

**ప్రతిపదార్థము** :- తతః = అటుపిమ్మట, తే = ఆ వానరులు, యువరాజం = అంగదుని, పురస్కృత్య = ముందుంచుకొని, చిత్రకాననం = చిత్రములైన అరణ్యములు గల్గినట్టి, ప్రస్రవణం = ప్రస్రవణ మను పేరు గల, శైలం = పర్వతమునుగూర్చి, గత్వా = పోయి, రామం = శ్రీరాముని, మహాబలం = గొప్పబలశాలియైన, లక్ష్మణం చ = లక్ష్మణుని, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = నమస్కరించి, సుగ్రీవం చ = సుగ్రీవునికిని, అభివాద్య = మ్రొక్కి, అథ = పిమ్మట, సీతాయాః = సీతాదేవియొక్క, ప్రవృత్తిం = వృత్తాంతమును, ప్రవక్తుం = చెప్పుటకు, ఉపచక్రముః = ఆరంభించిరి.

**తాత్పర్యము** :- అప్పుడు జాంబవత్ప్రముఖులైన వానరులు యువరాజైన అంగదుని ముందుంచుకొని చిత్రమైన వనములతో శోభిల్లుచున్న ప్రస్రవణపర్వతమునకు వెడలి అచ్చటగల శ్రీరామునకును, లక్ష్మణునకును శిరమువంచి నమస్కరించి, సుగ్రీవున కభివాదన మొనర్చి, సీతాదేవిని గూర్చిన వృత్తాంతమును తెలుపుట కుపక్రమించిరి.

**శ్లో॥ రావణాంతఃపురే రోధం రాక్షసీభిశ్చ తర్జనమ్ ।**
**రామే సమనురాగం చ యశ్చాయం సమయః కృతః ।**
**ఏతదాఖ్యాంతి తే సర్వే హరయో రామసన్నిధౌ ॥ 4**

**పదచ్ఛేదము** :- రావణాంతఃపురే - రోధం - రాక్షసీభిః - చ - తర్జనమ్, రామే - సమనురాగం - చ - యః - చ - అయం - సమయః - కృతః, ఏతత్ - ఆఖ్యాంతి - తే - సర్వే - హరయః - రామసన్నిధౌ ॥

**అన్వయక్రమము** :- రావణాంతఃపురే (సీతాయాః) రోధం రాక్షసీభిః తర్జనం చ రామే సమనురాగం చ (రావణేన) యః సమయః కృతః అయం, రామసన్నిధౌ తే సర్వే హరయః ఏతత్ ఆఖ్యాంతి.

**ప్రతిపదార్థము** :- రావణాంతఃపురే = రావణుని అంతఃపురమునందు, సీతాయాః = సీతాదేవియొక్క, రోధం = నిరోధమును, రాక్షసీభిః = రాక్షసాంగనలచే, తర్జనం చ = బెదిరింపును, రామే = శ్రీరామునియందు, సమనురాగం చ = ఎక్కువైన ప్రేమను, (రావణేన = రావణునిచే), యః సమయః = ఏ గడువు, కృతః = చేయబడెనో, అయం చ = ఇదియును, రామసన్నిధౌ = శ్రీరాముని సాన్నిధ్యమునందు, తే = ఆ, హరయః = వానరులు, సర్వే = అందరు, ఏతత్ = ఈ విషయమును, ఆఖ్యాంతి = చెప్పిరి.

**తాత్పర్యము** :- ఆ వానరులు శ్రీరాముని సమక్షమున ఉపవిష్టులై సీతాదేవికి రావణాంతఃపురమునందు కలుగుచున్న బాధలను, రాక్షసవనితలు ఆమెతో పలుకుచున్న పరుషవచనములను బెదిరింపులను శ్రీరామునియెడ ఆమెకు గల నమ్మకముతో కూడిన అనురాగమును, రావణుడు ఆమె కిచ్చిన గడువును గూర్చి కుతూహలముతో చెప్పిరి.

**శ్లో॥ వైదేహీ మక్షతాం శ్రుత్వా రామ స్తూత్తర మబ్రవీత్ ।**
**క్వ సీతా వర్తతే దేవీ కథం చ మయి వర్తతే ।**
**ఏత న్మే సర్వ మాఖ్యాత వైదేహీం ప్రతి వానరాః ॥ 5**

**పదచ్ఛేదము** :- వైదేహీమ్ - అక్షతాం - శ్రుత్వా - రామః - తు - ఉత్తరమ్ - అబ్రవీత్, క్వ - సీతా - వర్తతే - దేవీ - కథం - చ - మయి - వర్తతే, ఏతత్ - మే - సర్వమ్ - ఆఖ్యాత - వైదేహీం - ప్రతి - వానరాః ॥

**అన్వయక్రమము** :- రామః తు వైదేహీమ్ అక్షతాం శ్రుత్వా ఉత్తరం అబ్రవీత్, వానరాః! దేవీ సీతా క్వ వర్తతే? మయి కథం వర్తతే? వైదేహీం ప్రతి మే ఏతత్ సర్వమ్ ఆఖ్యాత.

**ప్రతిపదార్థము** :– రామః తు = రాముడప్పుడు, వైదేహీం = జానకిని, అక్షతాం = హానినొందనిదానినిగా, శ్రుత్వా = విని, ఉత్తరం = సమాధానము, అబ్రవీత్ = పలికెను, వానరాః = ఓ వానరులారా!, దేవీ సీతా = పూజ్యురాలైన సీతాదేవి, క్వ = ఎక్కడ, వర్తతే = ఉన్నది? మయి చ = నాయందును, కథం = ఎట్లు, వర్తతే = ఉన్నది? వైదేహీం ప్రతి = సీతాదేవినిగూర్చి, మే = నాకు, ఏతత్ = దీనిని, సర్వం = అంతను, ఆఖ్యాత = చెప్పుడు.

**తాత్పర్యము** :– శ్రీరాముడు అంతట వానరులవలన సీతాదేవి ఏ యాపదయు నొందకుండ నున్నదని తెలిసికొని వెంటనే వారిని నా సీతాదేవి ఇప్పు డెచ్చట నున్నది? నాయం దెట్టి భావమును గలిగియున్నది? ఈ విషయము నాకు సవిస్తరముగా తెలుపుడని అడిగెను.

**శ్లో॥ రామస్య గదితం శ్రుత్వా హరయో రామసన్నిధౌ ।**
**చోదయంతి హనూమంతం సీతావృత్తాంతకోవిదమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :– రామస్య – గదితం – శ్రుత్వా – హరయః – రామసన్నిధౌ, చోదయంతి – హనూమంతం – సీతావృత్తాంతకోవిదమ్ ॥

**అన్వయక్రమము** :– హరయః రామస్య గదితం శ్రుత్వా సీతావృత్తాంతకోవిదం హనూమంతం రామసన్నిధౌ చోదయంతి.

**ప్రతిపదార్థము** :– హరయః = వానరులు, రామస్య = శ్రీరామునియొక్క, గదితం = వచనమును, శ్రుత్వా = విని, సీతావృత్తాంతకోవిదం = సీతమ్మయొక్క వృత్తాంతమును తెలిసియున్న, హనూమంతం = హనుమను, రామసన్నిధౌ = రాముని సమీపమున, చోదయంతి = ప్రోత్సహించిరి.

**తాత్పర్యము** :– రాముడడిగిన ప్రశ్నలను విని ఆ వానరులు సీతమ్మను గూర్చిన విషయములను అన్నింటిని తెలిసియున్న హనుమంతుని శ్రీరాముని సమక్షమునకు చేర్చి సీతాదేవివృత్తాంతమును వివరింపుమని కోరిరి.

**శ్లో॥ శ్రుత్వా తు వచనం తేషాం హనుమా న్మారుతాత్మజః ।**
**ప్రణమ్య శిరసా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి ।**
**ఉవాచ వాక్యం వాక్యజ్ఞ స్సీతాయా దర్శనం యథా ॥ 7**

**పదచ్ఛేదము** :– శ్రుత్వా – తు – వచనం – తేషాం – హనుమాన్ – మారుతాత్మజః, ప్రణమ్య – శిరసా – దేవ్యై – సీతాయై – తాం – దిశం – ప్రతి, ఉవాచ – వాక్యం

- వాక్యజ్ఞః - సీతాయాః - దర్శనం - యథా ॥

**అన్వయక్రమము :-** మారుతాత్మజః హనుమాన్ తేషాం వచనం శ్రుత్వా దేవ్యై సీతాయై తాం దిశం ప్రతి శిరసా ప్రణమ్య యథా సీతాయాః దర్శనం (అభవత్) తథా వాక్యజ్ఞః వాక్యమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :-** మారుతాత్మజః = వాయునందనుడైనట్టి, హనుమాన్ తు = హనుమంతు డప్పుడు, తేషాం = ఆ వానరులయొక్క, వచనం = మాటను, శ్రుత్వా = విని, దేవ్యై = పూజ్యురాలయిన, సీతాయై = సీతకొరకు, తాం = ఆ, దిశం ప్రతి = దక్షిణదిశనుగూర్చి, శిరసా = శిరస్సుతో, ప్రణమ్య = మ్రొక్కి, వాక్యజ్ఞః = వాక్యవిశారదుడైన ఆతడు, యథా = ఏరీతిగా, సీతాయాః = సీతాదేవియొక్క, దర్శనం = దర్శనము, అభవత్ = ఆయెనో, తథా = అట్లు, వాక్యం = మాటను, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :-** అప్పుడు వాయునందనుడు తోడివానరుల ప్రోత్సాహమునొంది దక్షిణ దిక్కునకు తిరిగి సీతాదేవికి శిరమువంచి నమస్కరించి తనకు సీతాదర్శనము లభించిన విధమునుగూర్చి వాక్యవిశారదుడైన ఆతడు వివరముగా ఇట్లు తెలుపదొడగెను.

**శ్లో॥ తం మణిం కాంచనం దివ్యం దీప్యమానం స్వతేజసా ।**
**దత్త్వా రామాయ హనుమాం స్తతః ప్రాంజలి రబ్రవీత్ ॥ 8**

**పదచ్ఛేదము :-** తం - మణిం - కాంచనం - దివ్యం - దీప్యమానం - స్వతేజసా, దత్త్వా - రామాయ - హనుమాన్ - తతః - ప్రాంజలిః - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము :-** హనుమాన్ స్వతేజసా దీప్యమానం దివ్యం తం కాంచనం మణిం రామాయ దత్త్వా తతః ప్రాంజలిః (సన్) అబ్రవీత్.

**ప్రతిపదార్థము :-** హనుమాన్ = హనుమ, స్వతేజసా = తన తేజస్సుచే, దీప్యమానం = ప్రకాశించుచున్నదియును, దివ్యం = దేవసంబంధమైనదియును అగు, తం = ఆ, కాంచనం = సువర్ణమయమైన, మణిం = చూడామణిని, రామాయ = శ్రీరామునకు, దత్త్వా = ఇచ్చి, తతః = పిమ్మట, ప్రాంజలిః సన్ = దోసిలియొగ్గినవాడై, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :-** హనుమంతు డప్పుడు తన ప్రకాశముతో మిక్కిలిగా తేజరిల్లుచున్న అపూర్వమైనట్టి తాను తెచ్చిన ఆ చూడామణిని శ్రీరామున కొసగి దోసిలొగ్గి తిరిగి ఇట్లు పలికెను.

**సూచన** :– ఈ శ్లోకము బొంబాయి ప్రతియందు మాత్రమే కలదు.

**శ్లో॥ సముద్రం లంఘయిత్వా ఽహం శతయోజన మాయతమ్ ।**
**అగచ్ఛం జానకీం సీతాం మార్గమాణో దిదృక్షయా ॥ 9**

**పదచ్ఛేదము** :– సముద్రం – లంఘయిత్వా – అహం – శతయోజనమ్ – ఆయతమ్, అగచ్ఛం – జానకీం – సీతాం – మార్గమాణః – దిదృక్షయా ॥

**అన్వయక్రమము** :– అహం శతయోజనమ్ ఆయతం సముద్రం లంఘయిత్వా జానకీం సీతాం దిదృక్షయా మార్గమాణః అగచ్ఛమ్.

**ప్రతిపదార్థము** :– అహం = నేను, జానకీం = జనకరాజపుత్రియైన, సీతాం = సీతాదేవిని, దిదృక్షయా = చూచు కోరికతో, మార్గమాణః = వెదుకుచున్నవాడనై, శతయోజనం = నూరామడలు, ఆయతం = పొడవైనట్టి, సముద్రం = సముద్రమును, లంఘయిత్వా = దాటి, అగచ్ఛమ్ = పోయితిని.

**తాత్పర్యము** :– నేను జానకీదేవిని చూడవలెనను కోరికతో ఆమెను వెదకుచు నూరామడల పొడవైన సముద్రమును దాటి దక్షిణదిశగా కడుదూరము వెడలితిని.

**శ్లో॥ తత్ర లంకేతి నగరీ రావణస్య దురాత్మనః ।**
**దక్షిణస్య సముద్రస్య తీరే వసతి దక్షిణే ॥ 10**

**పదచ్ఛేదము** :– తత్ర – లంకా – ఇతి – నగరీ – రావణస్య – దురాత్మనః, దక్షిణస్య – సముద్రస్య – తీరే – వసతి – దక్షిణే ॥

**అన్వయక్రమము** :– తత్ర దక్షిణస్య సముద్రస్య దక్షిణే తీరే లంకా ఇతి దురాత్మనః రావణస్య నగరీ వసతి.

**ప్రతిపదార్థము** :– తత్ర = అచ్చట, దక్షిణస్య సముద్రస్య = దక్షిణసముద్రముయొక్క, దక్షిణే తీరే = దక్షిణతీరమునందు, దురాత్మనః = దుర్మార్గుడైన, రావణస్య = రావణునకు, లంకా ఇతి = లంక అను, నగరీ = పట్టణము, వసతి = ఉన్నది.

**తాత్పర్యము** :– ఆ దక్షిణసముద్రతీరమునందు లంక యను పేరుగల పట్టణ మున్నది. అది దుర్మార్గుడైన రావణాసురుని రాజధాని.

**శ్లో॥ తత్ర సీతా మయా దృష్టా రావణాంతఃపురే సతీ ।**
**సంన్యస్య త్వయి జీవంతీ రామా రామ మనోరథమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– తత్ర – దృష్టా – మయా – సీతా – రావణాంతఃపురే – సతీ,

సంన్యస్య – త్వయి – జీవంతీ – రామా – రామ – మనోరథమ్ ॥

**అన్వయక్రమము** :– రామ! తత్ర రావణాంతఃపురే మనోరథం త్వయి సంన్యస్య జీవంతీ సతీ సీతా రామా మయా దృష్టా.

**ప్రతిపదార్థము** :– రామ = ఓ శ్రీరామా!, తత్ర = ఆ లంకయందు, రావణాంతఃపురే = రావణుని అంతఃపురమునందు, మనోరథం = కోరికను, త్వయి = నీయందు, సంన్యస్య = ఉంచి, జీవంతీ = బ్రతుకుచున్నదియును, సతీ = పతివ్రతయునగు, సీతా రామా = సీతాసుందరి, మయా = నాచేత, దృష్టా = చూడబడినది.

**తాత్పర్యము** :– ఆ లంకానగరమున రావణుని యంతఃపురమునందు తన కోరికలన్నియు నీయందే నిలుపుకొని కొనయూపిరితో జీవించుచు పాతివ్రత్యధర్మముతో మెలగుచున్న సీతారమణి నాకు గానవచ్చినది.

**శ్లో॥ దృష్టా మే రాక్షసీమధ్యే తర్జ్యమానా ముహుర్ముహుః ।**
**రాక్షసీభి ర్విరూపాభీ రక్షితా ప్రమదావనే ॥ 12**

**పదచ్ఛేదము** :– దృష్టా – మే – రాక్షసీమధ్యే – తర్జ్యమానా – ముహుః – ముహుః, రాక్షసీభిః – విరూపాభిః – రక్షితా – ప్రమదావనే ॥

**అన్వయక్రమము** :– రాక్షసీమధ్యే ముహుః ముహుః తర్జ్యమానా ప్రమదావనే విరూపాభిః రాక్షసీభిః రక్షితా మే దృష్టా.

**ప్రతిపదార్థము** :– రాక్షసీమధ్యే = రాక్షసస్త్రీల నడుమ, ముహుః ముహుః = మాటిమాటికి, తర్జ్యమానా = గద్దింపబడుచున్నదియును, విరూపాభిః = వికారమైన రూపముగల్గినట్టి, రాక్షసీభిః = రాక్షసాంగనలచే, ప్రమదావనే = అంతఃపురోద్యానమునందు, రక్షితా = రక్షింపబడుచున్నదియునగు, (సా = ఆ సీతాదేవి), మే = నాచే, దృష్టా = చూడబడినది.

**తాత్పర్యము** :– ఆ రావణుని నివాసమునందు సీతాదేవిని రాక్షసస్త్రీలు మాటిమాటికిని గద్దించుచుండిరి. అచటి అంతఃపురోద్యానవనమునందు భీకరములైన రూపములు గల రాక్షసవనిత లామె చుట్టునుండి కావలి కాయుచున్నారు.

**శ్లో॥ దుఃఖ మాపద్యతే దేవీ త వాదుఃఖోచితా సతీ ।**
**రావణాంతఃపురే రుద్ధా రాక్షసీభి స్సురక్షితా ॥ 13**

**పదచ్ఛేదము** :– దుఃఖమ్ – ఆపద్యతే – దేవీ – తవ – అదుఃఖోచితా – సతీ, రావణాంతఃపురే – రుద్ధా – రాక్షసీభిః – సురక్షితా ॥

**అన్వయక్రమము :–** అదుఃఖోచితా సతీ తవ దేవీ రావణాంతఃపురే రాక్షసీభిః సురక్షితా రుద్ధా దుఃఖమ్ ఆపద్యతే.

**ప్రతిపదార్థము :–** అదుఃఖోచితా = దుఃఖమునకు తగినది కానట్టిదియు, సతీ = పతివ్రతయునగు, తవ = నీయొక్క, దేవీ = మహిషి, రావణాంతఃపురే = రావణుని అంతఃపురమునందు, రాక్షసీభిః = రాక్షసస్త్రీలచే, సురక్షితా = కావలియుంచబడినదై, రుద్ధా = బంధింపబడినదై, దుఃఖం = శోకమును, ఆపద్యతే = పొందుచున్నది.

**తాత్పర్యము :–** ఎట్టి దుఃఖములకును తగనట్టి మహాపతివ్రతయగు నీ యర్ధాంగి రావణాంతఃపురమునందు రాక్షసస్త్రీలు కావలిగాయుచుండగా బంధితురాలై దుఃఖసాగరమున మునిగియున్నది.

**శ్లో॥ ఏకవేణీధరా దీనా త్వయి చింతాపరాయణా ।**
**అధశ్శయ్యా వివర్ణాంగీ పద్మినీవ హిమాగమే ॥ 14**

**పదచ్ఛేదము :–** ఏకవేణీధరా – దీనా – త్వయి – చింతాపరాయణా, అధశ్శయ్యా – వివర్ణాంగీ – పద్మినీ – ఇవ – హిమాగమే ॥

**అన్వయక్రమము :–** ఏకవేణీధరా దీనా త్వయి చింతాపరాయణా అధశ్శయ్యా వివర్ణాంగీ హిమాగమే పద్మినీ ఇవ వివర్ణాంగీ (ఆస్తే).

**ప్రతిపదార్థము :–** ఏకవేణీధరా = జడకట్టిన కేశములు ధరించినదియును, దీనా = దీనురాలును, త్వయి = నీయందు, చింతాపరాయణా = ధ్యాననిమగ్నురాలును, అధశ్శయ్యా = నేలయే శయ్యగా గలదియును, హిమాగమే = హేమంతఋతువునందు, పద్మినీ ఇవ = తామరతీగవలె, వివర్ణాంగీ = వన్నెతొలగిన శరీరముగలదియునై, (అస్తి = ఉన్నది).

**తాత్పర్యము :–** జడగట్టియున్న తలవెంద్రుకలతో దీనమైన రూపముతో నేలపై శయనించియుండి నీ స్మరణమునందే నిమగ్నురాలై హేమంతకాలములోని తామరతీగవలె లావణ్యమును గోల్పోయిన శరీరముతో నాకు కానవచ్చినది.

**శ్లో॥ రావణాద్వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా ।**
**దేవీ కథంచిత్ కాకుత్థ్స త్వన్మనా మార్గితా మయా ॥ 15**

**పదచ్ఛేదము :–** రావణాత్ – వినివృత్తార్థా – మర్తవ్యకృతనిశ్చయా – దేవీ – కథంచిత్ – కాకుత్థ్స – త్వన్మనాః – మార్గితా – మయా ॥

**అన్వయక్రమము :–** కాకుత్థ్స! రావణాత్ వినివృత్తార్థా మర్తవ్యకృతనిశ్చయా త్వన్మనాః దేవీ మయా కథంచిత్ మార్గితా.

**ప్రతిపదార్థము :–** కాకుత్థ్స = ఓ శ్రీరామా!, రావణాత్ = రావణాసురునినుండి, వినివృత్తార్థా = మరలింపబడిన ప్రయోజనము గలదియును, మర్తవ్యకృతనిశ్చయా = మరణింపవలెనను నిశ్చయము గలదియును, త్వన్మనాః = నీయందు మనస్సుగలదియు నగు, దేవీ = సీతాదేవి, మయా = నాచేత, కథంచిత్ = ఎట్లో, మార్గితా = వెదుకబడినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**వాసుదాసస్వామి :–** సీతాదేవి సత్పురుషులు మెచ్చుకొనెడి భక్తి స్వభావము, పాతివ్రత్యము, తపస్సు అను సద్గుణములు విడువక అశోకవనము నందు నీ కొరకై తపించుచున్నది అని భావము.

**తాత్పర్యము :–** ఓ రామా! రావణుని కోరికను వ్యర్థము చేయగోరి మరణమే కర్తవ్యమని నిర్ణయించుకొన్నదై నీయందే తన సమస్తభావమును లగ్నము చేసినదై అప్పటికెట్లో జీవించియున్న సీతాదేవిని వెదకి వెదకి అతికష్టముమీద చివరకు కనుగొనగలిగితిని.

**శ్లో॥ ఇక్ష్వాకువంశవిఖ్యాతిం శనైః కీర్తయతాఽనఘ ।**
**సా మయా నరశార్దూల విశ్వాస ముపపాదితా ॥ 16**

**పదచ్ఛేదము :–** ఇక్ష్వాకువంశవిఖ్యాతిం – శనైః – కీర్తయతా – అనఘ, సా – మయా – నరశార్దూల – విశ్వాసమ్ – ఉపపాదితా ॥

**అన్వయక్రమము :–** అనఘ! నరశార్దూల! ఇక్ష్వాకువంశవిఖ్యాతిం కీర్తయతా మయా సా శనైః విశ్వాసమ్ ఉపపాదితా.

**ప్రతిపదార్థము :–** అనఘ! = పాపరహితుడవైనట్టి, నరశార్దూల! = ఓ పురుషశ్రేష్ఠుడా!, ఇక్ష్వాకువంశవిఖ్యాతిం = ఇక్ష్వాకువంశముయొక్క ప్రశస్తిని, కీర్తయతా = కీర్తించు చున్నట్టి, మయా = నాచేత, శనైః = నెమ్మదిగా, విశ్వాసం = నమ్మకము, ఉపపాదితా = కల్గింపబడినది.

**తాత్పర్యము :–** పాపరహితుడవైన ఓ పురుషోత్తమా! నేను ఆ జానకీదేవిని సమీపించి ఇక్ష్వాకువంశముయొక్క ప్రశస్తిని కీర్తించుచు మెల్లగా ఆమె మనస్సునందు నేను రామదూతనే గాని రాక్షసుడను గానని నమ్మకము కలిగించుకొంటిని.

**శ్లో॥ తత స్సంభాషితా దేవీ సర్వ మర్థం చ దర్శితా ।**
**రామసుగ్రీవసఖ్యం చ శ్రుత్వా ప్రీతి ముపాగతా ॥ 17**

**పదచ్ఛేదము :-** తతః - సంభాషితా - దేవీ - సర్వమ్ - అర్థం - చ - దర్శితా, రామసుగ్రీవసఖ్యం - చ - శ్రుత్వా - ప్రీతిమ్ - ఉపాగతా ॥

**అన్వయక్రమము :-** తతః దేవీ సంభాషితా, సర్వమ్ అర్థం దర్శితా చ, రామసుగ్రీవ సఖ్యం శ్రుత్వా ప్రీతిమ్ ఉపాగతా చ.

**ప్రతిపదార్థము :-** తతః = పిమ్మట, దేవీ = సీతాదేవి, సంభాషితా = మాటాడబడినది, సర్వమ్ అర్థం = విషయమంతయును, దర్శితా చ = తెలుపబడినది కూడను. రామ సుగ్రీవసఖ్యం = రామసుగ్రీవులకు జరిగిన మైత్రిని గూర్చి, శ్రుత్వా = విని, ప్రీతిం = సంతోషమును, ఉపాగతా చ = పొందినది గూడను.

**తాత్పర్యము :-** నాపై నమ్మకము గల్గిన పిమ్మట, నే నామెతో సంభాషణము గావించి జరిగిన విషయము నంతను ఆమె కెరిగించితిని. తన భర్తకును సుగ్రీవునకును గలిగిన మైత్రిని గూర్చి విని ఆమె ఎంతయో సంతోషించినది.

**శ్లో॥ నియత స్సముదాచారో భక్తి శ్చాస్యా స్తథా త్వయి ।**
**ఏవం మయా మహాభాగా దృష్టా జనకనందినీ ।**
**ఉగ్రేణ తపసా యుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ ॥ 18**

**పదచ్ఛేదము :-** నియతః - సముదాచారః - భక్తిః - చ - అస్యాః - తథా - త్వయి, ఏవం - మయా - మహాభాగా - దృష్టా - జనకనందినీ, ఉగ్రేణ - తపసా - యుక్తా - త్వద్భక్త్యా - పురుషర్షభ ॥

**అన్వయక్రమము :-** పురుషర్షభ! అస్యాః సముదాచారః నియతః త్వయి భక్తిః చ తథా, మహాభాగా జనకనందినీ త్వద్భక్త్యా ఏవం ఉగ్రేణ తపసా యుక్తా మయా దృష్టా.

**ప్రతిపదార్థము :-** పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా!, అస్యాః = ఈ సీతాదేవియొక్క, సముదాచారః = పాతివ్రత్యాచరణము, నియతః = అచంచలమైనట్టిది, త్వయి = నీ యందు, భక్తిః చ = భక్తియును, తథా = అట్టిదే. మహాభాగా = మహాత్మురాలైనట్టి, జనకనందినీ = జనకతనయ, త్వద్భక్త్యా = నీయందలి భక్తిచే, ఏవం = ఈరీతిగా, ఉగ్రేణ = తీవ్రమైన, తపసా = తపస్సుతో, యుక్తా = కూడినట్టిదిగా, మయా = నాచే, దృష్టా = చూడబడినది.

**తాత్పర్యము** :– ఓ పురుషోత్తమా! సీతాదేవియొక్క పాతివ్రత్యరూపమైన ధర్మాచరణము అచంచలమై యున్నది. ఆమెకు నీయందుగల భక్తిగూడ అట్లే నిశ్చలమైనట్టిది. మహాత్మురాలైన ఆ జానకీదేవి మూర్తీభవించినట్టి పతిభక్తిగాను, తీవ్రమైనట్టి మహాతపస్సుగాను నాకు కాన్పించినది.

**శ్లో॥ అభిజ్ఞానం చ మే దత్తం యథావృత్తం తవాంతికే ।**
**చిత్రకూటే మహాప్రాజ్ఞ వాయసం ప్రతి రాఘవ ॥ 19**

**పదచ్ఛేదము** :– అభిజ్ఞానం – చ – మే – దత్తం – యథా – వృత్తం – తవ – అంతికే, చిత్రకూటే – మహాప్రాజ్ఞ – వాయసం – ప్రతి – రాఘవ ॥

**అన్వయక్రమము** :– మహాప్రాజ్ఞ! రాఘవ! చిత్రకూటే తవ అంతికే వాయసం ప్రతి యథా వృత్తం (తథా) అభిజ్ఞానం చ మే దత్తమ్.

**ప్రతిపదార్థము** :– మహాప్రాజ్ఞ = గొప్ప ప్రాజ్ఞుడవైన, రాఘవ! = శ్రీరామా!, చిత్రకూటే = చిత్రకూటపర్వతమున, తవ = నీయొక్క, అంతికే = సమీపమున, వాయసం ప్రతి = కాకమునుగూర్చి, యథా = ఏ విధముగా, వృత్తం = జరిగినదో, తథా = ఆ విధముగ, మే = నాకు, అభిజ్ఞానం = గుర్తు కూడ, దత్తం = ఈయబడినది.

**తాత్పర్యము** :– ఓ మహాప్రాజ్ఞుడవైన రఘునందనా! పూర్వము చిత్రకూటపర్వతముపై నీయెదుట కాకి చేసినట్టి ఆ దుష్టచర్యను ఆనవాలుగా చెప్పినది.

**శ్లో॥ విజ్ఞాప్యశ్చ నరవ్యాఘ్రో రామో వాయుసుత త్వయా ।**
**అఖిలే నేహ యద్దృష్ట మితి మా మాహ జానకీ ॥ 20**

**పదచ్ఛేదము** :– విజ్ఞాప్యః – చ – నరవ్యాఘ్రః – రామో – వాయుసుత – త్వయా – అఖిలేన – ఇహ – యత్ – దృష్టమ్ – ఇతి – మామ్ – ఆహ – జానకీ ॥

**అన్వయక్రమము** :– వాయుసుత! నరవ్యాఘ్రః రామః త్వయా ఇహ యత్ దృష్టమ్ అఖిలేన విజ్ఞాప్యః చ, ఇతి జానకీ మామ్ ఆహ.

**ప్రతిపదార్థము** :– వాయుసుత = ఓ వాయునందనా, ఇహ = ఇచ్చట, త్వయా = నీచేత, యత్ = ఏది, దృష్టం = చూడబడినదో, (తత్ = అది), అఖిలేన = సంపూర్ణముగా, నరవ్యాఘ్రః = పురుషశ్రేష్ఠుడైన, రామః = శ్రీరాముడు, విజ్ఞాప్యః చ = విన్నవించబడవలసినవాడు సుమా!, ఇతి = అని, జానకీ = సీతాదేవి, మాం = నన్నుగూర్చి, ఆహ = పలికెను.

**తాత్పర్యము** :– ఓ వాయునందనా! నీ విచ్చట ఏమి చూచితివో అది యంతయును

సంపూర్ణముగా పురుషోత్తముడైన ఆ శ్రీరామునకు ఎరిగింపవలయును సుమా! అని సీతమ్మ నన్ను కోరినది.

**శ్లో॥ అయం చాస్మై ప్రదాతవ్యో యత్నా త్సుపరిరక్షితః ।**
**బ్రువతా వచనా న్యేవం సుగ్రీవ స్యోపశృణ్వతః ।**
**ఏష చూడామణిః శ్రీమా న్మయా సుపరిరక్షితః ॥ 21**

**పదచ్ఛేదము** :– అయం – చ – అస్మై – ప్రదాతవ్యః – యత్నాత్ – సుపరిరక్షితః, బ్రువతా – వచనాని – ఏవం – సుగ్రీవస్య – ఉపశృణ్వతః, ఏషః – చూడామణి – శ్రీమాన్ – మయా – సుపరిరక్షితః ॥

**అన్వయక్రమము** :– శ్రీమాన్ ఏషః చూడామణిః మయా సుపరిరక్షితః, ఏవం వచనాని బ్రువతా త్వయా సుగ్రీవస్య ఉపశృణ్వతః (సతః) యత్నాత్ సుపరిరక్షితః అయం చ అస్మై ప్రదాతవ్యః.

**ప్రతిపదార్థము** :– శ్రీమాన్ = గొప్పశోభకల్గినట్టి, ఏషః = ఈ, చూడామణిః = చూడామణి, మయా = నాచేత, సుపరిరక్షితః = భద్రముగా కాపాడుకొనబడినది, సుగ్రీవస్య = సుగ్రీవుడు, ఉపశృణ్వతః (సతః) = వినుచుండగా, ఏవం = ఈ రీతిగా, వచనాని = మాటలను, బ్రువతా = పల్కుచున్నట్టి, (త్వయా = నీచేత), యత్నాత్ = ప్రయత్న పూర్వకముగా, సుపరిరక్షితః = భద్రముగా కాపాడు కొనబడినట్టి, అయం చ = ఈ చూడామణి గూడ, అస్మై = ఆ శ్రీరామునకు, ప్రదాతవ్యః = ఈయబడవలసినది.

**తాత్పర్యము** :– ఈ చూడామణిని మిక్కిలి శ్రేష్ఠమైనదిగా ప్రేమించుచు నేనెంతయో భద్రముగా దాచుకొని యుంటిని. సుగ్రీవుని సన్నిధిని నా మాటలన్నియు నీవు చెప్పుచున్నప్పుడు ఈ అమూల్యమైన చూడామణిని నా నాథున కొసగుము.

**శ్లో॥ మనశ్శిలాయా స్తిలకో గండపార్శ్వే నివేశితః ।**
**త్వయా ప్రణష్టే తిలకే తం కిల స్మర్తుమర్హసి ॥ 22**

**పదచ్ఛేదము** :– మనశ్శిలాయాః – తిలకః – గండపార్శ్వే – నివేశితః – త్వయా – ప్రణష్టే – తిలకే – తం – కిల – స్మర్తుమ్ – అర్హసి ॥

**అన్వయక్రమము** :– తిలకే ప్రణష్టే (సతి) మనశ్శిలాయాః తిలకః గండపార్శ్వే త్వయా నివేశితః, తం స్మర్తుమ్ అర్హసి కిల.

**ప్రతిపదార్థము** :– తిలకే = బొట్టు, ప్రణష్టే (సతి) = చెరిగిపోవగా, గండపార్శ్వే =

కపోలముపై గల, మనశ్శిలాయాః = మణిశిలయొక్క, తిలకః = బొట్టు, త్వయా = నీచేత, నివేశితః = ఉంచబడినది, తం = ఆ విషయమును, స్మర్తుం = స్మరించుటకు, అర్హసి కిల = తగుదువు సుమా!.

**తాత్పర్యము** :– ఒకమారు నా నుదుటిపై బొట్టు చెదిరిపోవగా అప్పుడు నీవు నా చెక్కిలిపై గల మణిశిలాధాతురేఖను ఒలిచి నా నుదుటిపై బొట్టుగా ఉంచినావు. ఆ సంఘటనమును జ్ఞాపకము చేసికొనుము.

**శ్లో॥ ఏష నిర్యాతితః శ్రీమా న్మయా తే వారిసంభవః ।**
**ఏతం దృష్ట్వా ప్రమోదిష్యే వ్యసనే త్వామివానఘ ॥ 23**

**పదచ్ఛేదము** :– ఏషః – నిర్యాతితః – శ్రీమాన్ – మయా – తే – వారిసంభవః – ఏతం – దృష్ట్వా – ప్రమోదిష్యే – వ్యసనే – త్వామ్ – ఇవ – అనఘ ॥

**అన్వయక్రమము** :– అనఘః వారిసంభవః శ్రీమాన్ ఏషః తే నిర్యాతితః, వ్యసనే ఏతం దృష్ట్వా త్వామ్ (దృష్ట్వా) ఇవ ప్రమోదిష్యే.

**ప్రతిపదార్థము** :– అనఘః = పాపరహితుడు, వారిసంభవః = సముద్రము నుండి ఉద్భవించినట్టి, ఏషః = ఈ చూడామణి, తే = నీ కొరకు, నిర్యాతితః = పంపబడినది, వ్యసనే = కష్టకాలమునందు, ఏతం = ఈ యంగుళీయకమును, దృష్ట్వా = చూచి, త్వాం = నిన్ను, దృష్ట్వా ఇవ = చూచినట్లుగా, ప్రమోదిష్యే = ఆనందించెదను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**మహేశ్వరతీర్థులు, తిలకము** :– ఏతం = త్వత్ప్రేషితమ్ అంగులీయకమ్ ఇత్యర్థః.

**తాత్పర్యము** :– ఓ పుణ్యశీలుడా! దివ్యమైనట్టిదియును, గొప్పశోభకు నిలయమైనట్టిదియును నేను ప్రేమపూర్వకముగా దాచుకొనినట్టిదియునునగు నా చూడామణిని నీకిప్పుడు పంపివేయుచున్నాను. అయినను ఇక మీదట నా కష్టకాలమునందు నీవు పంపిన ఈ యంగుళీయకమును జూచుకొనుచు నేను నిన్ను జూచినట్లే సంతోషింపగలను సుమా!

**శ్లో॥ జీవితం ధారయిష్యామి మాసం దశరథాత్మజ ।**
**ఊర్ధ్వం మాసా న్న జీవేయం రక్షసాం వశ మాగతా ॥ 24**

**పదచ్ఛేదము** :– జీవితం – ధారయిష్యామి – మాసం – దశరథాత్మజ, ఊర్ధ్వం – మాసాత్ – న – జీవేయం – రక్షసాం – వశమ్ – ఆగతా ॥

**అన్వయక్రమము** :- దశరథాత్మజ! మాసం జీవితం ధారయిష్యామి. రక్షసాం వశం ఆగతా మాసాత్ ఊర్ధ్వం న జీవేయమ్.

**ప్రతిపదార్థము** :- దశరథాత్మజ = ఓ దశరథనందనా!, మాసం = నెల, జీవితం = జీవితమును, ధారయిష్యామి = ధరించెదను. రక్షసాం = రాక్షసులయొక్క, వశం = అధీనమును, ఆగతా = చేరినదాననై, మాసాత్ = నెలకంటె, ఊర్ధ్వం = తరువాత, న జీవేయమ్ = జీవింపను.

**తాత్పర్యము** :- ఓ దశరథనందనా! నే నీ పరిస్థితిలో ఒక్క నెల మాత్రము జీవనముతో నిలువగలను. ఈ రాక్షసుల పాలబడియున్న నేను ఈ నెలదాటిన పిమ్మట ఏ మాత్రము జీవించజాలను.

**శ్లో॥ ఇతి మా మబ్రవీ త్సీతా కృశాంగీ ధర్మచారిణీ ।**
**రావణాంతఃపురే రుద్ధా మృగీ వోత్ఫుల్లలోచనా ॥ 25**

**పదచ్ఛేదము** :- ఇతి - మామ్ - అబ్రవీత్ - సీతా - కృశాంగీ - ధర్మచారిణీ, రావణాంతఃపురే - రుద్ధా - మృగీ - ఇవ - ఉత్ఫుల్లలోచనా - ॥

**అన్వయక్రమము** :- కృశాంగీ ధర్మచారిణీ, రావణాంతఃపురే రుద్ధా, మృగీ ఇవ ఉత్ఫుల్లలోచనా సీతా మామ్ ఇతి అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- కృశాంగీ = కృశించిన శరీరము గలదియును, ధర్మచారిణీ = ధర్మాచరణము గలదియును, మృగీ ఇవ = ఆడులేడి వలె, ఉత్ఫుల్లలోచనా = విశాలమైన కన్నులు గలదియునగు, సీతా = సీతాదేవి, రావణాంతఃపురే = రావణుని అంతఃపురము నందు, రుద్ధా = బంధింపబడినదై, ఇతి = ఈ విధముగా, మాం = నన్నుగూర్చి, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము** :- ధర్మాచరణమున ఏమరుపాటులేనిదై కృశించిన శరీరముతో లేడికన్నుల వంటి విశాలమైన నేత్రములుగల సీతాదేవి రావణాంతఃపురమున అట్లు బంధింపబడి యుండి నాతో ఈ రీతిగా పలికినది.

**శ్లో॥ ఏతదేవ మయాఽఽఖ్యాతం సర్వం రాఘవ యద్యథా ।**
**సర్వథా సాగరజలే సంతారః ప్రవిధీయతామ్ ॥ 26**

**పదచ్ఛేదము** :- ఏతత్ - ఏవ - మయా - ఆఖ్యాతం - సర్వం - రాఘవ - యత్ - యథా, సర్వథా - సాగరజలే - సంతారః - ప్రవిధీయతామ్ ॥

**అన్వయక్రమము :–** రాఘవ! యత్ యథా (స్థితం) ఏతత్ (తత్) ఏవ సర్వం మయా ఆఖ్యాతమ్, సర్వథా సాగరజలే సంతారః ప్రవిధీయతామ్.

**ప్రతిపదార్థము :–** రాఘవ = ఓ రఘునందనా!, యత్ = ఏది, యథా = ఏరీతిగా, స్థితం = ఉన్నదో, మయా = నాచేత, ఏతత్ = ఇది, తత్ ఏవ = అదియే, సర్వం = అంతయును, ఆఖ్యాతమ్ = చెప్పబడినది. సర్వథా = సర్వవిధముల, సాగరజలే = సముద్రజలమున, సంతారః = తరణోపాయము (సేతువు), ప్రవిధీయతామ్ = ఏర్పరుపబడుగాక.

**తాత్పర్యము :–** ఓ రఘునందనా! ఉన్నది యున్నట్లుగా జరిగిన దంతయును నీకు విన్నవించితిని. ఇక ఇప్పుడు లంకను చేరుటకై సముద్రమును దాటు ఉపాయమును ఏర్పాటుచేయవలసి యున్నది.

**శ్లో॥ తౌ జాతాశ్వాసౌ రాజపుత్రౌ విదిత్వా**
**తచ్చాభిజ్ఞానం రాఘవాయ ప్రదాయ ।**
**దేవ్యా చాఖ్యాతం సర్వమే వానుపూర్వ్యా**
**ద్వాచా సంపూర్ణం వాయుపుత్ర శ్శశంస ॥ 27**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"చూడామణి ప్రదానం" నామ*
*పంచషష్టితమ స్సర్గః.*

**పదచ్ఛేదము :–** తౌ – జాతాశ్వాసౌ – రాజపుత్రౌ – విదిత్వా – తత్ – చ – అభిజ్ఞానం – రాఘవాయ – ప్రదాయ – దేవ్యా – చ – ఆఖ్యాతం – సర్వమ్ – ఏవ – అనుపూర్వ్యాత్ – వాచా – సంపూర్ణం – వాయుపుత్రః – శశంస ॥

**అన్వయక్రమము :–** తౌ రాజపుత్రౌ జాతాశ్వాసౌ విదిత్వా తత్ అభిజ్ఞానం రాఘవాయ ప్రదాయ చ, వాయుపుత్రః దేవ్యా ఆఖ్యాతం సర్వం చ ఆనుపూర్వ్యాత్ వాచా సంపూర్ణం శశంస.

**ప్రతిపదార్థము :–** తౌ = ఆ, రాజపుత్రౌ = రాజకుమారులైన రామలక్ష్మణులను, జాతాశ్వాసౌ = కలిగిన ఊరటగలవారినిగా, విదిత్వా = తెలిసికొని, రాఘవాయ = శ్రీరామునికొరకు, తత్ = ఆ, అభిజ్ఞానం = ఆనవాలును, ప్రదాయ = ఇచ్చి, దేవ్యా = సీతాదేవిచే, ఆఖ్యాతం = చెప్పబడినదానిని, సర్వమ్ ఏవ చ = అంతయును కూడ, వాయుపుత్రః = వాయునందనుడు, అనుపూర్వ్యాత్ = క్రమపూర్వకముగా,

వాచా = మాటలతో, సంపూర్ణం = సమగ్రముగా, శశంస = చెప్పెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– దేవ్యా చాఖ్యాతం సర్వమేవ – శశంస.

హనుమన్న శ్రీరామునితో లంకలో తాను నెరపిన విషయము లన్నియును చెప్పవలసియుండగా నచ్చటి అక్షవధ మున్నగువానినిగూర్చియు, లంకా దహనాదికమును గూర్చియు, నట్లే సముద్రలంఘన సమయమున సురసానిరస నాదికమును గూర్చియు చెప్పకుండుట అనునది అత్మస్తుతిగా గాన్పించునను భావముతోడనే అనియును, పూర్వ మంగదాదులకడ ఉన్నది యున్నట్లు చెప్పవలెనను భావముతో మాత్రమే అచట చెప్పియుండెననియును గ్రహించవలెను.

**తాత్పర్యము** :– ఆ రామలక్ష్మణులు తమ చిరకాల చింత తొలగి ఆనందించు చున్నందుకు సంతసించుచు, తన గుర్తుగా సీతమ్మ ఇచ్చిన చూడామణిని రామునకు ఒసగి, ఆమె ఆతనితో చెప్పుమన్నమాటల నన్నింటిని పూసగుచ్చినట్లు హనుమ ఏమియు విడువకుండ శ్రీరామునకు వివరించెను.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"చూడామణిప్రదానము" అను*
*అరువదియైదవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

# షట్‌షష్టితమసర్గ

**శ్లో॥ ఏవముక్తో హనుమతా రామో దశరథాత్మజః ।**
**తం మణిం హృదయే కృత్వా ప్రరురోద సలక్ష్మణః ॥ 1**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - ఉక్తః - హనుమతా - రామః - దశరథాత్మజః - తం - మణిం - హృదయే - కృత్వా - ప్రరురోద - సలక్ష్మణః ॥

**అన్వయక్రమము** :- దశరథాత్మజః సలక్ష్మణః రామః హనుమతా ఏవమ్ ఉక్తః (సన్) తం మణిం హృదయే కృత్వా ప్రరురోద.

**ప్రతిపదార్థము** :- దశరథాత్మజః = దశరథనందనుడైనట్టి, సలక్ష్మణః = లక్ష్మణునితో కూడిన, రామః = శ్రీరాముడు, హనుమతా = హనుమచే, ఏవమ్ = ఇట్లు, ఉక్తః (సన్) = చెప్పబడినవాడై, తం = ఆ, మణిం = చూడామణిని, హృదయే = గుండెపై, కృత్వా = తీసికొని, ప్రరురోద = మిక్కిలిగ శోకించెను.

**తాత్పర్యము** :- హనుమంతు డిట్లు చెప్పగనే దశరథనందనుడు తన ప్రియురాలిచే గుర్తుగా ఈయబడినట్టి ఆ చూడామణిని తన గుండెపై నుంచుకొని తమ్మునితో గూడి ఎంతగానో విలపించెను.

**శ్లో॥ తం తు దృష్ట్వా మణిశ్రేష్ఠం రాఘవ శ్శోకకర్శితః ।**
**నేత్రాభ్యా మశ్రుపూర్ణాభ్యాం సుగ్రీవ మిద మబ్రవీత్ ॥ 2**

**పదచ్ఛేదము** :- తం - తు - దృష్ట్వా - మణిశ్రేష్ఠం - రాఘవః - శోకకర్శితః, నేత్రాభ్యామ్ - అశ్రుపూర్ణాభ్యాం - సుగ్రీవమ్ - ఇదమ్ - అబ్రవీత్ ॥

**అన్వయక్రమము** :- తం మణిశ్రేష్ఠం దృష్ట్వా రాఘవః శోకకర్శితః (సన్) అశ్రుపూర్ణాభ్యాం నేత్రాభ్యాం సుగ్రీవమ్ ఇదమ్ అబ్రవీత్.

**ప్రతిపదార్థము** :- తం = ఆ, మణిశ్రేష్ఠం = గొప్పదైనట్టి చూడామణిని, దృష్ట్వా = చూచి, రాఘవః = శ్రీరాముడు, శోకకర్శితః సన్ = దుఃఖముచే పీడింపబడినవాడై, అశ్రుపూర్ణాభ్యాం = కన్నీటితో నిండినట్టి, నేత్రాభ్యాం = కన్నులతో, సుగ్రీవం =

సుగ్రీవునిగూర్చి, ఇదం = ఈ మాటను, అబ్రవీత్ = పలికెను.

**తాత్పర్యము :–** అమూల్యమైనట్టి ఆ చూడామణిని కనుగొనగానే శ్రీరాముడు తన హృదయమున దుఃఖము పొంగివచ్చుచుండగా దుఃఖాశ్రువులతో నిండిన కన్నులతో సుగ్రీవుని జూచుచు ఇట్లు పలికెను.

**శ్లో॥ యథైవ ధేను స్స్రవతి స్నేహా ద్వత్సస్య వత్సలా ।**
**తథా మమాపి హృదయం మణిరత్నస్య దర్శనాత్ ॥ 3**

**పదచ్ఛేదము :–** యథా – ఏవ – ధేనుః – స్రవతి – స్నేహాత్ – వత్సస్య – వత్సలా, తథా – మమ – అపి – హృదయం – మణిరత్నస్య – దర్శనాత్ ॥

**అన్వయక్రమము :–** యథా ఏవ వత్సలా ధేనుః వత్సస్య స్నేహాత్ స్రవతి తథా మణిరత్నస్య దర్శనాత్ మమ హృదయమ్ అపి స్రవతి.

**ప్రతిపదార్థము :–** యథా ఏవ = ఏరీతిగానైతే, వత్సలా = వాత్సల్యము గలిగినట్టి, ధేనుః = ఆవు, వత్సస్య = బిడ్డయొక్క, స్నేహాత్ = ప్రేమవలన, స్రవతి = ద్రవించునో, తథా = ఆ విధముగా, మణిరత్నస్య = గొప్పదైన చూడామణియొక్క, దర్శనాత్ = దర్శనమువలన, మమ = నాయొక్క, హృదయమ్ అపి = హృదయము గూడ, స్రవతి = ద్రవించుచున్నది.

**తాత్పర్యము :–** తన బిడ్డపై మక్కువగలిగియుండు ఆవు తన దూడను చాలకాలమునకు చూచినప్పుడు ప్రేమచేత పొదుగెట్లు స్రవించునో అట్లే ఈ చూడామణిని జూచినంతనే నా హృదయముగూడ ద్రవించిపోవుచున్నది.

**శ్లో॥ మణిరత్న మిదం దత్తం వైదేహ్యా శ్శ్వశురేణ మే ।**
**వధూకాలే యథా బద్ధ మధికం మూర్ధ్ని శోభతే ॥ 4**

**పదచ్ఛేదము :–** మణిరత్నమ్ – ఇదం – దత్తం – వైదేహ్యాః – శ్వశురేణ – మే, వధూకాలే – యథా – బద్ధమ్ – అధికం – మూర్ధ్ని – శోభతే ॥

**అన్వయక్రమము :–** వధూకాలే మూర్ధ్ని యథా అధికం శోభతే, తథా బద్ధం మణిరత్నం మే శ్వశురేణ వైదేహ్యా దత్తమ్.

**ప్రతిపదార్థము :–** వధూకాలే = వివాహసమయమునందు, యథా = ఏరీతిగా, మూర్ధ్ని = శిరస్సునందు, అధికం = మిక్కిలిగా, శోభతే = ప్రకాశించునో, తథా = ఆరీతిగా, బద్ధం = కట్టబడినట్టి, ఇదం = ఈ, మణిరత్నం = గొప్పదైన చూడామణి, మే = నాయొక్క, శ్వశురేణ = మామయైన జనకునిచే, వైదేహ్యాః = జానకికి, దత్తం

= ఈయబడినది.

**తాత్పర్యము :–** వివాహ సమయమునందు శిరస్సున అలంకరింపబడి మిక్కిలి శోభతో ప్రకాశించినట్టిదైన ఈ దివ్యమైన చూడామణిని నా మామగారైన జనకమహారాజు సీతాదేవి కొసగినాడు.

**శ్లో॥ అయం హి జలసంభూతో మణి స్సజ్జనపూజితః ।**
**యజ్ఞే పరమతుష్టేన దత్త శ్శక్రేణ ధీమతా ॥ 5**

**పదచ్ఛేదము :–** అయం – హి – జలసంభూతః – మణిః – సజ్జనపూజితః, యజ్ఞే – పరమతుష్టేన – దత్తః – శక్రేణ – ధీమతా ॥

**అన్వయక్రమము :–** జలసంభూతః సజ్జనపూజితః అయం మణిః యజ్ఞే పరమతుష్టేన ధీమతా శక్రేణ దత్తః.

**ప్రతిపదార్థము :–** జలసంభూతః = జలమునుండి పుట్టినదియును, సజ్జనపూజితః = సత్పురుషులచే పూజింపబడినదియునగు, అయం = ఈ, మణిః = చూడామణి, యజ్ఞే = యజ్ఞమునందు, పరమతుష్టేన = మిక్కిలి తృప్తినొందినట్టి, ధీమతా = బుద్ధిశాలియైన, శక్రేణ = దేవేంద్రునిచే, దత్తః = ఈయబడినది.

**తాత్పర్యము :–** ఈ చూడామణి జలమునుండి జనించినట్టిది, సజ్జను లెల్లరిచే ప్రశంసింపబడినట్టిది. మరియును ఒకానొక యాగమునందు దేవేంద్రుడు మిక్కిలి సంతోషించి తాను స్వయముగా నా మామయైన జనకమహారాజునకు ఇచ్చినట్టిది యును సుమా!

**శ్లో॥ ఇమం దృష్ట్వా మణిశ్రేష్ఠం యథా తాతస్య దర్శనమ్ ।**
**అద్యా స్మ్యవగత స్సౌమ్య వైదేహస్య తథా విభోః ॥ 6**

**పదచ్ఛేదము :–** ఇమం – దృష్ట్వా – మణిశ్రేష్ఠం – యథా – తాతస్య – దర్శనమ్ – అద్య – అస్మి – అవగతః – సౌమ్య – వైదేహస్య – తథా – విభోః ॥

**అన్వయక్రమము :–** సౌమ్య! ఇదం మణిశ్రేష్ఠం దృష్ట్వా అద్య తాతస్య దర్శనం యథా వైదేహస్య విభోః దర్శనం చ అవగతః అస్మి.

**ప్రతిపదార్థము :–** సౌమ్య = ఓ సజ్జనుడా, ఇదం = ఈ , మణిశ్రేష్ఠం = గొప్పదైన చూడామణిని, దృష్ట్వా = చూచి, తాతస్య = తండ్రియొక్క, దర్శనం యథా = దర్శనమట్లు, అద్య = ఇప్పుడు, వైదేహస్య విభోః = జనకమహారాజుయొక్క, దర్శనం = దర్శనమును, అవగతః = పొందినవాడను, అస్మి = అగుచున్నాను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :- పూర్వము సీతాసందేశ సందర్భమున 39వ సర్గలో 2వ శ్లోకమున సీత తానొసగిన చూడామణిని చూడగనే శ్రీరాముడు తన తల్లిని, తనను, దశరథమహారాజును ముప్పురిని స్మరింపగలడని తెలిపినది. అచ్చట ముప్పురిని అనగా ఆమె భావమున తననే గాక ఇంకను చాలామందిని స్మరించునని తెలుపుటయే. అందుకు తగినట్లుగానే శ్రీరాము డిప్పు డిచట తన తండ్రియైన దశరథుని మామయైన జనకుని గూడ స్మరించుట సహజముగా నున్నది.

**తాత్పర్యము** :- ఓ సజ్జనుడా! గొప్పదైనట్టి ఈ చూడామణిని చూడగనే నాతండ్రియైన దశరథుని దర్శించినట్లును మామయైన జనకమహారాజును చూచినట్లును నా మనస్సునకు సంతోషము కలుగుచున్నది సుమా!

**శ్లో॥ అయం హి శోభతే తస్యాః ప్రియాయా మూర్ధ్ని మే మణిః ।**
**అద్యాస్య దర్శనే నాహం ప్రాప్తాం తామివ చింతయే ॥ 7**

**పదచ్ఛేదము** :- అయం - హి - శోభతే - తస్యాః - ప్రియాయాః - మూర్ధ్ని - మే - మణిః, అద్య - అస్య - దర్శనేన - అహం - ప్రాప్తాం - తామ్ - ఇవ - చింతయే ॥

**అన్వయక్రమము** :- అయం మణిః తస్యాః మే ప్రియాయాః మూర్ధ్ని (ఏవ) శోభతే హి, అద్య అహం అస్య దర్శనేన తాం ప్రాప్తామ్ ఇవ చింతయే.

**ప్రతిపదార్థము** :- అయం = ఈ, మణిః = మణి, తస్యాః = ఆ, మే = నాయొక్క, ప్రియాయాః = ప్రియురాలియొక్క, మూర్ధ్ని ఏవ = శిరమునందే, శోభతే హి = ప్రకాశించును సుమా!, అద్య = నేడు, అహం = నేను, అస్య = ఈ మణియొక్క, దర్శనేన = చూచుటచేత, తాం = ఆ సీతాదేవిని, ప్రాప్తామ్ ఇవ = ప్రాప్తించిన దానినిగనే, చింతయే = భావించుచున్నాను.

**తాత్పర్యము** :- ఈ చూడామణి నా ప్రియురాలి శిరముపై నున్నప్పుడు ఎంత గొప్పగనో ప్రకాశించుచుండెడిది సుమా! నే డీ మణిని దర్శించుచుండగా నాకు ప్రియురాలే ఎదుట నిలచినట్లుగా తోచుచున్నది.

**శ్లో॥ కి మాహ సీతా వైదేహీ బ్రూహి సౌమ్య పునః పునః ।**
**పిపాసుమివ తోయేన సించంతీ వాక్యవారిణా ॥ 8**

**పదచ్ఛేదము** :- కిమ్ - ఆహ - సీతా - వైదేహీ - బ్రూహి - సౌమ్య - పునః -

పునః, పిపాసుమ్ – ఇవ – తోయేన – సించంతీ – వాక్యవారిణా ॥

**అన్వయక్రమము :–** సౌమ్య! పిపాసుం తోయేన ఇవ వాక్యవారిణా సించంతీ వైదేహీ సీతా కిమ్ ఆహ? పునః పునః బ్రూహి.

**ప్రతిపదార్థము :–** సౌమ్య = ఓ సజ్జనుడా!, పిపాసుం = దప్పిగొన్నవానిని, తోయేన ఇవ = మంచినీటితో వలె, వాక్యవారిణా = వచనజలముచే, సించంతీ = తడుపుచున్నదై, వైదేహీ = విదేహరాజు తనయయైన, సీతా = సీతాదేవి, కిం = ఏమి, ఆహ = పలికెను. పునః పునః = మరల మరల, బ్రూహి = చెప్పుము.

**తాత్పర్యము :–** దప్పిగొన్నవానిని మంచినీటితో తృప్తి పరచినట్లు తన వచనామృతముచే నన్ను తృప్తిపరచుచు ఆ విదేహరాజతనయ ఏమేమి పలికినది? అవి యన్నియును నాకు మరల మరల చెప్పుము.

**శ్లో॥ ఇతస్తు కిం దుఃఖతరం య దిమం వారిసంభవమ్ ।**
**మణిం పశ్యామి సౌమిత్రే వైదేహీ మాగతాం వినా ॥ 9**

**పదచ్ఛేదము :–** ఇతః – తు – కిం – దుఃఖతరం – యత్ – ఇమం – వారిసంభవమ్, మణిం – పశ్యామి – సౌమిత్రే – వైదేహీమ్ – ఆగతాం – వినా ॥

**అన్వయక్రమము :–** సౌమిత్రే! ఆగతాం వైదేహీం వినా వారిసంభవమ్ ఇమం మణిం పశ్యామి ఇతి యత్ ఇతః దుఃఖతరం కిం?

**ప్రతిపదార్థము :–** సౌమిత్రే = ఓ సుమిత్రానందనా!, వైదేహీమ్ ఆగతాం వినా = జానకిరాకుండా, వారిసంభవం = జలసంభూతమైన, ఇమం = ఈ, మణిం = రత్నమును, పశ్యామి = చూచుచున్నాను, ఇతి యత్ = అను మాట ఏది గలదో, ఇతః = ఇంతకంటె, దుఃఖతరం = మిక్కిలి దుఃఖకరమైనట్టిది, కిం = ఏది యుండును.

**తాత్పర్యము :–** తమ్ముడా! సీత లేకుండ ఆమె ధరించినట్టి ఈ దివ్యమైన రత్నమును మాత్రమే చూడవలసి వచ్చుచున్నట్టి ఈ దుస్థితికంటె దుఃఖతరమైన విషయమేది యుండును?

**శ్లో॥ చిరం జీవతి వైదేహీ యది మాసం ధరిష్యతి ।**
**న జీవేయం క్షణమపి వినా తా మసితేక్షణామ్ ॥ 10**

**పదచ్ఛేదము :–** చిరం – జీవతి – వైదేహీ – యది – మాసం – ధరిష్యతి, న – జీవేయం – క్షణమ్ – అపి – వినా – తామ్ – అసితేక్షణామ్ ॥

**అన్వయక్రమము** :– వైదేహీ మాసం (ప్రాణాన్) ధరిష్యతి యది చిరం జీవతి, అసితేక్షణాం తాం వినా (అహం) క్షణమ్ అపి న జీవేయమ్.

**ప్రతిపదార్థము** :– వైదేహీ = జానకీదేవి, మాసం = ఒకనెల కాలము, (ప్రాణాన్ = ప్రాణములను), ధరిష్యతి యది = ధరించునెడల, చిరం = చిరకాలము, జీవతి = జీవించును, అసితేక్షణాం = నల్లని కన్నులుగల, తాం వినా = ఆమె లేకుండగ, (అహం = నేను), క్షణమపి = ఒక్క క్షణముగూడ, న జీవేయమ్ = బ్రతుకజాలను.

**తాత్పర్యము** :– జానకి నెలదినములు ప్రాణములు నిలుపుకొనగలిగిన యెడల ఆమె చిరకాలము జీవించినట్లే యని నమ్ముము. నేను మాత్రము నా ప్రియురాలు లేకుండగ ఒక్క క్షణము గూడ జీవింపలే ననిపించుచున్నది.

**శ్లో॥ నయ మామపి తం దేశం యత్ర దృష్టా మమ ప్రియా ।**
**న తిష్ఠేయం క్షణమపి ప్రవృత్తి ముపలభ్య చ ॥ 11**

**పదచ్ఛేదము** :– నయ – మామ్ – అపి – తం – దేశం – యత్ర – దృష్టా – మమ – ప్రియా, న – తిష్ఠేయం – క్షణమ్ – అపి – ప్రవృత్తిమ్ – ఉపలభ్య – చ ॥

**అన్వయక్రమము** :– మమ ప్రియా యత్ర దృష్టా మామ్ అపి తం దేశం నయ, ప్రవృత్తిమ్ ఉపలభ్య చ క్షణమ్ అపి న తిష్ఠేయమ్.

**ప్రతిపదార్థము** :– మమ = నాయొక్క, ప్రియా = ప్రియురాలు, యత్ర = ఎచ్చట, దృష్టా = చూడబడినదో, మామ్ అపి = నన్ను గూడ, తం = ఆ, దేశం = ప్రదేశమును గూర్చి, నయ = తీసికొనిపొమ్ము, ప్రవృత్తిం = వార్తను, ఉపలభ్య చ = పొంది గూడ, క్షణమ్ అపి = క్షణమైనను, న తిష్ఠేయమ్ = నిలువజాలను.

**తాత్పర్యము** :– ఓ హనుమా! నా ప్రియురాలి నెచ్చట చూచినావో అచటికే నన్ను గూడ వెంటనే గొనిపొమ్ము. ఆమె వార్త తెలిసిన పిమ్మటగూడ నే నామెను చూడకుండ ఒక్క క్షణమైనను బ్రదుకజాలను.

**శ్లో॥ కథం సా మమ సుశ్రోణీ భీరుభీరుస్సతీ సదా ।**
**భయావహానాం ఘోరాణాం మధ్యే తిష్ఠతి రక్షసామ్ ॥ 12**

**పదచ్ఛేదము** :– కథం – సా – మమ – సుశ్రోణీ – భీరుభీరుః – సతీ – సదా, భయావహానాం – ఘోరాణాం – మధ్యే – తిష్ఠతి – రక్షసామ్ ॥

**అన్వయక్రమము** :– మమ సుశ్రోణీ సా సదా భీరుభీరుః సతీ భయావహానాం ఘోరాణాం రక్షసాం మధ్యే కథం తిష్ఠతి?

**ప్రతిపదార్థము :–** మమ = నాయొక్క, సుశ్రోణీ సా = ప్రియురాలైన ఆమె, సదా = ఎల్లప్పుడును, భీరుభీరుః సతీ = మిక్కిలి భీతినొందు స్వభావము గల్గినట్టిదై, భయావహానాం = భయము గొల్పెడి, ఘోరాణాం = క్రూరులైన, రక్షసాం = రాక్షసుల యొక్క, మధ్యే = నడుమ, కథం = ఎట్లు, తిష్ఠతి = ఉన్నది?

**తాత్పర్యము :–** మిక్కిలి భయస్వభావము గల్గినట్టి నా ప్రియురాలు మహాభయంకరులైన ఆ క్రూరరాక్షసుల నడుమ ఎటు లుండగలుగుచున్నదో గదా!

**శ్లో॥ శారద స్తిమిరోన్ముక్తో నూనం చంద్ర ఇ వాంబుదైః ।**
**ఆవృతం వదనం తస్యా న విరాజతి రాక్షసైః ॥ 13**

**పదచ్ఛేదము :–** శారదః – తిమిరోన్ముక్తః – నూనం – చంద్రః – ఇవ – అంబుదైః, ఆవృతం – వదనం – తస్యాః – న – విరాజతి – రాక్షసైః ॥

**అన్వయక్రమము :–** తిమిరోన్ముక్తః అంబుదైః (ఆవృతః) శారదః చంద్రః ఇవ రాక్షసైః ఆవృతం తస్యాః వదనం నూనం న విరాజతి.

**ప్రతిపదార్థము :–** తిమిరోన్ముక్తః = చీకటినుండి విడువబడినట్టిదియును, అంబుదైః = మేఘములచే, ఆవృతః = ఆవరింపబడినదియును అగు, శారదః = శరత్కాలము నందలిదైన, చంద్రః ఇవ = చంద్రబింబమువలె, రాక్షసైః = రాక్షసులచే, ఆవృతం = ఆవరింపబడిన, తస్యాః = ఆ సీతాదేవియొక్క, వదనం = ముఖము, నూనం = నిశ్చయముగా, న విరాజతి = శోభిల్లదు.

**తాత్పర్యము :–** చీకటిచే విడువబడి చక్కగా ప్రకాశింపవలసిన శరత్కాల చంద్రబింబము మేఘము లావరించుటచే ప్రకాశవిహీనమై యున్నట్లుగా మిక్కిలి సుందరమైన నా జానకి ముఖము రాక్షసాంగనలు చుట్టుకొని యుండుటచే ఎంత శోభావిహీనమై యున్నదో గదా!

**శ్లో॥ కిమాహ సీతా హనుమం స్తత్త్వతః కథయాఽద్య మే ।**
**ఏతేన ఖలు జీవిష్యే భేషజే నాతురో యథా ॥ 14**

**పదచ్ఛేదము :–** కిమ్ – ఆహ – సీతా – హనుమన్ – తత్త్వతః – కథయ – అద్య – మే – ఏతేన – ఖలు – జీవిష్యే – భేషజేన – ఆతురః – యథా ॥

**అన్వయక్రమము :–** హనుమన్! సీతా కిమ్ ఆహ? మే అద్య తత్త్వతః కథయ, ఆతురః భేషజేన యథా (అహం) ఏతేన జీవిష్యే ఖలు!

**ప్రతిపదార్థము :–** హనుమన్ = ఓ హనుమా!, సీతా = జానకి, కిం = ఏమి?, ఆహ

= పలికినది? మే = నాకు, అద్య = ఇప్పుడు, తత్త్వతః = ఉన్నది ఉన్నట్లు, కథయ = చెప్పుము, ఆతురః = రోగి, భేషజేన యథా = ఔషధముచేత వలె, (అహం = నేను), ఏతేన = ఈ సందేశముచేతనే, జీవిష్యే ఖలు = జీవింతును సుమా!

**తాత్పర్యము :–** ఓ హనుమా! నా సీతాదేవి ఏమి చెప్పినది? అది యంతయును ఆమె నీతో చెప్పినది చెప్పినట్లు ఇప్పుడు నాకు చెప్పుము. రోగి ఔషధముచే ప్రాణమును నిలుపుకొనునట్లుగా, నీవు చెప్పు మాటలచేతనే సుమా నేను జీవించునట్టిది.

**శ్లో॥ మధురా మధురాలాపా కిమాహ మమ భామినీ ।**
**మద్విహీనా వరారోహా హనుమన్ కథయస్వ మే ॥ 15**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సీతాభాషితప్రశ్నో" నామ*
*షట్షష్టితమస్సర్గః*

**పదచ్ఛేదము :–** మధురా – మధురాలాపా – కిమ్ – ఆహ – మమ – భామినీ, మద్విహీనా – వరారోహా – హనుమన్ – కథయస్వ – మే ॥

**అన్వయక్రమము :–** మధురా మధురాలాపా వరారోహా మద్విహీనా మమ భామినీ కిమ్ ఆహ? హనుమన్! మే కథయస్వ.

**ప్రతిపదార్థము :–** మధురా = సుందరియును, మధురాలాపా = మధురమైన మాటలు గలదియును, వరారోహా = చక్కని ఆకారము గలదియును, మద్విహీనా = నేను లేకుండ నున్నదియు నగు, మమ = నాయొక్క, భామినీ = ప్రియురాలు, కిం = ఏమి, ఆహ = చెప్పినది?, హనుమన్! = ఓ హనుమా, మే = నాకు, కథయస్వ = చెప్పుము.

**తాత్పర్యము :–** సుందరమైన రూపము గలదియును మధురముగ మాటలాడునదియును సుందరమైన ఆకారము గలదియు నగు నా ప్రియురాలు నాకు దూరముగ నుండి ఏమి చెప్పినదో ఓ హనుమా! అవి యన్నియును నాకు వీనులవిందుగా వినిపింపుము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతాభాషితప్రశ్నము" అను అరువదియారవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# సప్తషష్టితమసర్గ

**శ్లో॥ ఏవ ముక్తస్తు హనుమాన్ రాఘవేణ మహాత్మనా ।**
**సీతాయా భాషితం సర్వం న్యవేదయత రాఘవే ॥ 1**

**పదచ్ఛేదము :–** ఏవమ్ – ఉక్తః – తు – హనుమాన్ – రాఘవేణ – మహాత్మనా, సీతాయాః – భాషితం – సర్వం – న్యవేదయత – రాఘవే ॥

**అన్వయక్రమము :–** మహాత్మనా రాఘవేణ ఏవం ఉక్తః హనుమాన్ సీతాయాః భాషితం సర్వం రాఘవే న్యవేదయత్.

**ప్రతిపదార్థము :–** మహాత్మనా = మహనీయుడైన, రాఘవేణ = శ్రీరామునిచే, ఏవమ్ = ఇట్లు, ఉక్తః = చెప్పబడినవాడై, హనుమాన్ = హనుమ, సీతాయాః = సీతాదేవియొక్క, భాషితం = మాటను, సర్వం = అంతను, రాఘవే = శ్రీరామునియెడ, న్యవేదయత్ = నివేదించెను.

**తాత్పర్యము :–** మహాత్ముడైన శ్రీరాముడు తనతో అట్లు పలుకగా హనుమ శ్రీరామునకు సీతాదేవి తెలిపిన విషయమునంతను విన్నవించెను.

**శ్లో॥ ఇద ముక్తవతీ దేవీ జానకీ పురుషర్షభ ।**
**పూర్వవృత్త మభిజ్ఞానం చిత్రకూటే యథాతథమ్ ॥ 2**

**పదచ్ఛేదము :–** ఇదమ్ – ఉక్తవతీ – దేవీ – జానకీ – పురుషర్షభ – పూర్వవృత్తమ్ – అభిజ్ఞానం – చిత్రకూటే – యథాతథమ్ ॥

**అన్వయక్రమము :–** పురుషర్షభ! జానకీ దేవీ చిత్రకూటే పూర్వవృత్తమ్ అభిజ్ఞానం యథాతథమ్ ఇదమ్ ఉక్తవతీ.

**ప్రతిపదార్థము :–** పురుషర్షభ = ఓ పురుషశ్రేష్ఠుడా!, జానకీ దేవీ = సీతాదేవి, చిత్రకూటే = చిత్రకూటపర్వతమునందు, పూర్వవృత్తం = వెనుకజరిగిన దానిని, అభిజ్ఞానం = ఆనవాలుగా, యథాతథం = ఉన్నది యున్నట్లుగా, ఇదం = ఈ విషయమును, ఉక్తవతీ = చెప్పినది.

**తాత్పర్యము :–** ఓ పురుషోత్తమా! సీతాదేవి పూర్వము చిత్రకూటమునం దుండగా జరిగిన సంఘటనమును నీకు ఆనవాలుగా ఉన్నది యున్నట్లు ఇట్లు చెప్పినది సుమా!

**శ్లో॥ సుఖసుప్తా త్వయా సార్ధం జానకీ పూర్వముత్థితా ।**
**వాయస స్సహ సోత్పత్య విదదార స్తనాంతరే ॥ 3**

**పదచ్ఛేదము :–** సుఖసుప్తా – త్వయా – సార్ధం – జానకీ – పూర్వమ్ – ఉత్థితా, వాయసః – సహసా – ఉత్పత్య – విదదార – స్తనాంతరే ॥

**అన్వయక్రమము :–** జానకీ త్వయా సార్ధం సుఖసుప్తా (సతీ) పూర్వమ్ ఉత్థితా, వాయసః సహసా ఉత్పత్య స్తనాంతరే విదదార.

**ప్రతిపదార్థము :–** జానకీ = సీతాదేవి, త్వయా సార్ధం = నీతోడ, సుఖసుప్తా సతీ = సుఖముగా నిద్రించినదై, పూర్వం = ముందుగా, ఉత్థితా = లేచినది, వాయసః = కాకము, సహసా = అకస్మాత్తుగా, ఉత్పత్య = ఎగిరి, స్తనాంతరే = స్తనమధ్యమున, విదదార = పొడిచెను.

**తాత్పర్యము :–** సీతాదేవి నీతో గూడ సుఖముగా నిద్రించి తాను ముందుగనే మేల్కొనెను. అప్పుడే అకస్మికముగా ఒక వాయసము ఎగిరివచ్చి ఆమె స్తనమధ్యమున ముక్కుతో పొడిచినది.

**శ్లో॥ పర్యాయేణ చ సుప్త స్త్వం దేవ్యంకే భరతాగ్రజ ।**
**పునశ్చ కిల పక్షీ స దేవ్యా జనయతి వ్యథామ్ ॥ 4**

**పదచ్ఛేదము :–** పర్యాయేణ – చ – సుప్తః – త్వం – దేవ్యంకే – భరతాగ్రజ, పునః – చ – కిల – పక్షీ – సః – దేవ్యాః – జనయతి – వ్యథామ్ ॥

**అన్వయక్రమము :–** భరతాగ్రజ! పర్యాయేణ త్వం దేవ్యంకే సుప్తః. సః పక్షీ పునః దేవ్యాః వ్యథాం జనయతి కిల.

**ప్రతిపదార్థము :–** భరతాగ్రజ = భరతుని జ్యేష్ఠసోదరుడైన రామా!, పర్యాయేణ = పర్యాయక్రమముగా, త్వం = నీవు, దేవ్యంకే = సీతాదేవిని యొడిలో, సుప్తః = నిద్రించినవాడవు, సః పక్షీ = ఆ వాయసము, పునః చ = మరల గూడ, దేవ్యాః = సీతాదేవికి, వ్యథాం = బాధను, జనయతి కిల = కలిగించుచుండెనట.

**తాత్పర్యము :–** ఓ రామా! ఒకరి పిమ్మట ఒకరు చొప్పున నీ వప్పుడు సీతాదేవి యొడిలో నిదురించుచుంటి వట – ఆ వాయసము మరల వచ్చి ఆమెను బాధింప నారంభించెనట.

**శ్లో॥ పునః పున రుపాగమ్య విదదార భృశం కిల ।**
**తత స్త్వం బోధిత స్తస్యా శ్శోణితేన సముక్షితః ॥ 5**

**పదచ్ఛేదము** :– పునః – పునః – ఉపాగమ్య – విదదార – భృశం – కిల, తతః – త్వం – బోధితః – తస్యాః – శోణితేన – సముక్షితః ॥

**అన్వయక్రమము** :– (సః) పునః పునః ఉపాగమ్య భృశం విదదార కిల, తతః తస్యాః శోణితేన సముక్షితః త్వం బోధితః.

**ప్రతిపదార్థము** :– (సః = ఆ వాయసము), పునః పునః = మరల మరల, ఉపాగమ్య = వచ్చి, భృశం = తీవ్రముగా, విదదార కిల = పొడుచుచుండెనట, తతః = పిమ్మట, తస్యాః = ఆమెయొక్క, శోణితేన = రక్తముచే, సముక్షితః = తడుపబడినవాడవై, త్వం = నీవు, బోధితః = మేలుకొల్పబడినవాడవు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**రా.శిరోమణి** :– "పునః పునః ఆగమ్య భృశం విదదార" అనగా పొడిచినట్లుగా నటించెనని అర్థము చెప్పవలెను – అట్లే "శోణితేన సముక్షితః బోధితః" అనగా నెత్తురు చుక్కలచే తడుపబడినట్లు తన చీరపై సహజముగనున్న ఎర్రని బిందువులచే సీతాదేవి భ్రమచెంది ఆమెచే రాముడు మేల్కొల్పబడెను. అంతియేగాని సీతాదేవి వక్షమును కాకి పొడుచుట, రక్తముకారుట యనునది అసంభావ్యము. ఏలనన సీతారాముల శరీరము లప్రాకృతములు అని ఒప్పుకొనవలెనుగదా!,

"యో వేత్తి భౌతికం దేహం రామస్య పరమాత్మనః
స సర్వస్మాత్ బహిః కార్యః శ్రౌతస్మార్తవిధానతః."

పరమాత్మయైన శ్రీరాముని దేహమును భౌతికమని భావించునతడు ఎట్టివైదిక క్రియకును అర్హుడు కాజాలడని భావము ఈ సందర్భమున గ్రహింపవలసినది. వనవాసము మొదటిరోజులలో సీతారాములు చిత్రకూటగిరిపై నివసించుచు అచటి మనోహర వాతావరణమున మహోల్లాసముగా నుండిరి. అది గమనించిన ఇంద్రపుత్రుడైన జయంతునకు శంక కలిగెను. శ్రీరాముడు చేయవలసియున్న దుష్టశిక్షణము రావణాదుల నిగ్రహణము సాధ్యమా అని. ఆ శంక తీరుటకై రామునకు క్రోధము కలిగించెను. దాని ఫలితము వెల్లడి అయ్యెను.

**తాత్పర్యము** :– ఆ వాయసము మరల మరల వచ్చి ఆమె నట్లు పొడుచుచు బాధించెనట. అప్పుడు స్రవించిన రక్తబిందువులు నీయొడలి కంటి నీవు మేల్కొంటివట.

**శ్లో॥ తాం తు దృష్ట్వా మహాబాహో దారితాం చ స్తనాంతరే ।**
**ఆశీవిష ఇవ క్రుద్ధో నిశ్శ్వస న్నభ్యభాషథాః ॥ 6**

**పదచ్ఛేదము :–** తాం తు – దృష్ట్వా – మహాబాహో – దారితాం – చ – స్తనాంతరే, ఆశీవిషః – ఇవ – క్రుద్ధః – నిశ్శ్వసన్ – అభ్యభాషథాః ॥

**అన్వయక్రమము :–** మహాబాహో! స్తనాంతరే దారితాం తాం దృష్ట్వా ఆశీవిషః ఇవ క్రుద్ధః (సన్) నిశ్శ్వసన్ (త్వమ్) అభ్యభాషథాః.

**ప్రతిపదార్థము :–** మహాబాహో = గొప్ప భుజములు గల ఓ రామా!, స్తనాంతరే = స్తనమధ్యమున, దారితాం = చీల్చబడినట్టి, తాం = ఆ సీతాదేవిని, దృష్ట్వా = చూచి, త్వం = నీవు, ఆశీవిషః ఇవ = త్రాచుపామువలె, క్రుద్ధః సన్ = క్రోధము నొందినవాడనై, నిశ్శ్వసన్ = నిట్టూర్చుచు, అభ్యభాషథాః = పలికితివట.

**తాత్పర్యము :–** ఓ మహావీరుడా! నీవు మేల్కొని స్తనమధ్యమున గాయముతో నున్న సీతాదేవిని గాంచి తీవ్రమైన క్రోధమునొంది త్రాచుపాము బుసకొట్టినట్లు నిశ్శ్వసించు చుంటివట!

**శ్లో॥ నఖాగ్రైః కేన తే భీరు దారితం తు స్తనాంతరమ్ ।**
**కః క్రీడతి సరోషేణ పంచవక్త్రేణ భోగినా ॥ 7**

**పదచ్ఛేదము :–** నఖాగ్రైః – కేన – తే – భీరు – దారితం – తు – స్తనాంతరమ్, కః – క్రీడతి – సరోషేణ – పంచవక్త్రేణ – భోగినా ॥

**అన్వయక్రమము :–** భీరు! తే స్తనాంతరం నఖాగ్రైః కేన దారితమ్? కః పంచవక్త్రేణ సరోషేణ భోగినా క్రీడతి?

**ప్రతిపదార్థము :–** భీరు = భయమునొందియున్న ఓ కోమలీ, తే = నీయొక్క, స్తనాంతరం = స్తనమధ్యము, నఖాగ్రైః = గోళ్ళకొనలచే, కేన = ఎవ్వనిచే, దారితం = చీల్చబడినది? కః = ఎవ్వడు, పంచవక్త్రేణ = ఐదుముఖములుకల్గిన, సరోషేణ = క్రోధముతోనున్నట్టి, భోగినా = సర్పముతో, క్రీడతి = ఆటలాడుచున్నాడు?

**తాత్పర్యము :–** భీతచిత్తవైన ఓ సీతా! నీ స్తనమధ్యమును గోళ్ళకొనలతో చీల్చిన దెవ్వరు? ఐదు పడగల మహాసర్పముతో ఆటలాడు నీచుడెవరు?

**శ్లో॥ నిరీక్షమాణ స్సహసా వాయసం సమవైక్షథాః ।**
**నఖై స్సరుధిరై స్తీక్ష్ణై స్తామే వాభిముఖం స్థితమ్ ॥ 8**

**పదచ్ఛేదము** :- నిరీక్షమాణః - సహసా - వాయసం - సమవైక్షథాః - నఖైః - సరుధిరైః - తీక్ష్ణైః - తామ్ - ఏవ - అభిముఖం - స్థితమ్ ॥

**అన్వయక్రమము** :- సహసా నిరీక్షమాణః త్వం సరుధిరైః తీక్ష్ణైః నఖైః తామ్ అభిముఖమ్ ఏవ స్థితం వాయసం సమవైక్షథాః.

**ప్రతిపదార్థము** :- సహసా = తత్‌క్షణమే, నిరీక్షమాణః = పరీక్షించుచున్నవాడవై, త్వం = నీవు, సరుధిరైః = నెత్తురుతో కూడినవియును, తీక్ష్ణైః = వాడివైనవియునగు, నఖైః = గోళ్ళతో, తాం = సీతాదేవిని (కి), అభిముఖమ్ ఏవ = ఎదురుగనే, స్థితం = నిలచియున్న, వాయసం = కాకమును, సమవైక్షథాః = చూచితివి.

**తాత్పర్యము** :- అప్పుడు నీవు వెంటనే నలుప్రక్కలకును చూచుచుండగా నెత్తురు అంటియున్న వాడియైన గోళ్ళతో సీతాదేవికి ఎదురుగనే నిలచియున్న వాయసమును చూచితివట.

**శ్లో॥ సుతః కిల స శక్రస్య వాయసః పతతాం వరః ।**
**ధరాంతరచర శ్శీఘ్రం పవనస్య గతౌ సమః ॥ 9**

**పదచ్ఛేదము** :- సుతః - కిల - సః - శక్రస్య - వాయసః - పతతాం - వరః - ధరాంతరచరః - శీఘ్రం - పవనస్య - గతౌ - సమః ॥

**అన్వయక్రమము** :- పతతాం వరః గతౌ పవనస్య సమః శీఘ్రం ధరాంతరచరః సః వాయసః శక్రస్య సుతః కిల.

**ప్రతిపదార్థము** :- పతతాం వరః = పక్షులలో శ్రేష్ఠమైనదియును, గతౌ = గమనము నందు, పవనస్య = వాయువునకు, సమః = తుల్యమైనదియును, శీఘ్రం = వడిగా, ధరాంతరచరః = కొండలపై సంచరించునదియును అగు, సః = ఆ, వాయసః = కాకము, శక్రస్య = దేవేంద్రునియొక్క, సుతః కిల = పుత్రుడట.

**తాత్పర్యము** :- వాయుసమాన గమనము గల్గి పర్వతములపై మహావేగముతో సంచరించుచున్నట్టి, ఆ పక్షిరాజమైన వాయసము దేవేంద్రుని పుత్రుడట.

**శ్లో॥ తత స్తస్మిన్ మహాబాహో కోపసంవర్ధితేక్షణః ।**
**వాయసే త్వం కృథాః క్రూరాం మతిం మతిమతాం వర ॥ 10**

**పదచ్ఛేదము** :- తతః - తస్మిన్ - మహాబాహో - కోపసంవర్ధితేక్షణః - వాయసే - త్వం - కృథాః - క్రూరాం - మతిం - మతిమతాం - వర ॥

**అన్వయక్రమము** :– మహాబాహో! మతిమతాంవర! తతః త్వం కోపసంవర్ధితేక్షణః సన్ వాయసే క్రూరాం మతిం కృథాః.

**ప్రతిపదార్థము** :– మహాబాహో = గొప్పవైన భుజములు గలవాడవును, మతిమతాం వర = బుద్ధిశాలురలో శ్రేష్ఠుడవునగు ఓ రామా!, తతః = పిమ్మట, త్వం = నీవు, తస్మిన్ = ఆ, వాయసే = కాకమునందు, కోపసంవర్ధితేక్షణః = క్రోధముచే పెద్దవిగ చేయబడిన కన్నులు గలవాడవై, క్రూరాం = ఉగ్రమైనట్టి, మతిం = మనస్సును, కృథాః = చేసితివి.

**తాత్పర్యము** :– కోపసంవర్ధితేక్షణః – అనుదానికి మారుగా "కోపసంవర్తితేక్షణః" (కోపముతో ప్రక్కకు మరల్చిన కన్నులు కలవాడు) అని పాఠాంతరము.

**తాత్పర్యము** :– మహావీరుడైన ఓ ప్రజ్ఞావంతుడా! నీ వప్పుడు క్రోధముచే కన్నులను పెద్దవిగ చేసి ఆ వాయసమును గూర్చి ఉగ్రమైన భావమును పూనితివట.

**శ్లో॥ స దర్భం సంస్తరా ద్గృహ్య బ్రహ్మాస్త్రేణ హ్యయోజయః ।**
**స దీప్త ఇవ కాలాగ్ని ర్జజ్వా లాభిముఖః ఖగమ్ ॥ 11**

**పదచ్ఛేదము** :– సః – దర్భం – సంస్తరాత్ – గృహ్య – బ్రహ్మాస్త్రేణ – హి – ఆయోజయః, సః – దీప్తః – ఇవ – కాలాగ్నిః – జజ్వాల – అభిముఖః – ఖగమ్ ॥

**అన్వయక్రమము** :– సః (త్వం) సంస్తరాత్ దర్భం గృహ్య బ్రహ్మాస్త్రేణ అయోజయః హి, సః దీప్తః కాలాగ్నిః ఇవ ఖగమ్ అభిముఖః జజ్వాల.

**ప్రతిపదార్థము** :– సః (త్వం) = ఆ నీవు, సంస్తరాత్ = దర్భాసనమునుండి, దర్భం = ఒక దర్భను, గృహ్య = గ్రహించి, బ్రహ్మాస్త్రేణ = బ్రహ్మాస్త్రమంత్రముచే, ఆయోజయః హి = కూర్చితివట, సః = ఆ దర్భ, దీప్తః = ప్రజ్వలించుచున్న, కాలాగ్నిః ఇవ = ప్రళయాగ్నివలె, ఖగమ్ అభిముఖః = వాయసమున కెదురు తిరిగినదై, జజ్వాల = ప్రజ్వలింపసాగెను.

**తాత్పర్యము** :– అట్లు ఉగ్రమైన నిశ్చయము వహించినట్టి నీవు దర్భాసనమునుండి ఒక దర్భను తీసికొని దానిని బ్రహ్మాస్త్రమంత్రముచే అభిమంత్రించితివట. అట్లు ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రము ప్రళయకాలాగ్నివలె ప్రజ్వరిల్లుచు వాయసము నెదుట భీకరముగ మండదొడగెను.

**శ్లో॥ క్షిప్తవాం స్త్వం ప్రదీప్తం హి దర్భం తం వాయసం ప్రతి ।**
**తతస్తు వాయసం దీప్త స్స దర్భో ఽనుజగామ హ ॥ 12**

**పదచ్ఛేదము** :– క్షిప్తవాన్ – త్వం – ప్రదీప్తం – హి – దర్భం – తం – వాయసం – ప్రతి – తతః – తు – వాయసం – దీప్తః – సః – దర్భః – అనుజగామ – హ ॥

**అన్వయక్రమము** :– తం ప్రదీప్తం దర్భం త్వం వాయసం ప్రతి క్షిప్తవాన్, తతః సః దీప్తః దర్భః వాయసమ్ అనుజగామ హ.

**ప్రతిపదార్థము** :– ప్రదీప్తం = ప్రజ్వలించుచున్నట్టి, తం = ఆ, దర్భం = దర్భను, త్వం = నీవు, తం = ఆ, వాయసం ప్రతి = కాకమునుగూర్చి, క్షిప్తవాన్ = విసిరినావు, తతః = పిమ్మట, దీప్తః = ప్రజ్వలించుచున్న, సః = ఆ, దర్భః = దర్భ, వాయసం = కాకిని, అనుజగామ హ = వెంబడించెనట.

**తాత్పర్యము** :– అట్లు ప్రజ్వలించుచున్న ఆ దర్భను నీవు వాయసము మీదికి విసిరితివట. జ్వలించుచున్న ఆ దర్భ వెంటనే ఆ వాయసమును వెంబడింప దొడగెనట!.

**శ్లో॥ స పిత్రా చ పరిత్యక్త స్సురైశ్చ సమహర్షిభిః ।**
**త్రీన్లోకా న్సంపరిక్రమ్య త్రాతారం నాధిగచ్ఛతి ॥ 13**

**పదచ్ఛేదము** :– సః – పిత్రా – చ – పరిత్యక్తః – సురైః – చ – సమహర్షిభిః, త్రీన్ – లోకాన్ – సంపరిక్రమ్య – త్రాతారం – న – అధిగచ్ఛతి ॥

**అన్వయక్రమము** :– సః పిత్రా చ సమహర్షిభిః సురైః చ పరిత్యక్తః త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య త్రాతారం న అధిగచ్ఛతి.

**ప్రతిపదార్థము** :– సః = ఆ వాయసము, పిత్రా చ = తండ్రిచేతను, సమహర్షిభిః = మహర్షులతో గూడినట్టి, సురైః చ = దేవతలచేతను, పరిత్యక్తః = విడువబడినదై, త్రీన్ లోకాన్ = మూడులోకములను, సంపరిక్రమ్య = పరిభ్రమించి, త్రాతారం = రక్షణచేయువానిని, న అధిగచ్ఛతి = పొందకుండెను.

**తాత్పర్యము** :– బ్రహ్మాస్త్రముచే తరుమబడుచున్న ఆ వాయసము పరుగిడిపోయి తన లోకములోని తల్లిచేతను, తండ్రిచేతనుగాని ఋషులచేతను, దేవతలచేతను కాని ఎట్టి రక్షణను పొందలేక ఎల్లరిచే విడువబడి ముల్లోకములును తిరిగి తిరిగి ఎచ్చట కూడ తనను రక్షించువానిని కనుగొనలేక పోయెను.

**శ్లో॥ పునరే వాగత స్త్రస్త స్త్వత్సకాశ మరిందమ ।**
**స తం నిపతితం భూమౌ శరణ్య శ్శరణాగతమ్ ।**
**వధార్హమపి కాకుత్థ్స కృపయా పర్యపాలయః ॥ 14**

**పదచ్ఛేదము** :– పునః – ఏవ – ఆగతః – త్రస్తః – త్వత్సకాశమ్ – అరిందమ – సః – తం – నిపతితం – భూమౌ – శరణ్యః – శరణాగతమ్ – వధార్హమ్ – అపి – కాకుత్స్థ – కృపయా – పర్యపాలయః ॥

**అన్వయక్రమము** :– అరిందమ! త్రస్తః (సః) పునః త్వత్సకాశమ్ ఏవ ఆగతః, కాకుత్స్థః శరణాగతం భూమౌ నిపతితం తం వధార్హమ్ అపి సః (త్వం) కృపయా పర్యపాలయః.

**ప్రతిపదార్థము** :– అరిందమ! = ఓ శత్రుమర్దనుడా!, త్రస్తః = భీతినొందినట్టి, (సః = ఆ వాయసము), పునః = మరల, త్వత్సకాశమ్ ఏవ = నీ సన్నిధిని గూర్చియే, ఆగతః = వచ్చినది, కాకుత్స్థ = ఓ శ్రీరామా, శరణాగతం = రక్షణమునకై వచ్చినదియును, భూమౌ = నేలపై, నిపతితం = పడియున్నదియునగు, తం = ఆ వాయసమును, వధార్హమ్ అపి = వధకు తగినదైనప్పటికిని , శరణ్యః = రక్షకుడవైన, సః త్వం = ఆ నీవు, కృపయా = దయతో, పర్యపాలయః = కాపాడితివి.

**తాత్పర్యము** :– ఓ శత్రుమర్దనుడా! తనను రక్షించువానిని గానక భీతిచెందిన ఆ వాయసము తిరిగి తిరిగి నీ పాదములను చేరి నేలపై బడియుండగా ఆ వాయసమును గాంచి వధార్హమైనను దాని యపరాధమును మన్నించి శరణాగతవత్సలుడవైన నీవు దయతో గాపాడితివట.

**శ్లో॥ మోఘ మస్త్రం న శక్యం తు కర్తు మిత్యేవ రాఘవ ।**
**భవాం స్తస్యాక్షి కాకస్య హినస్తి స్మ స దక్షిణమ్ ॥ 15**

**పదచ్ఛేదము** :– మోఘమ్ – అస్త్రం – న – శక్యం – తు – కర్తుమ్ – ఇతి – ఏవ – రాఘవ – భవాన్ – తస్య – అక్షి – కాకస్య – హినస్తి – స్మ – సః – దక్షిణమ్ ॥

**అన్వయక్రమము** :– రాఘవ! అస్త్రం తు మోఘం కర్తుం న శక్యమ్ ఇతి ఏవ సః భవాన్ తస్య కాకస్య దక్షిణమ్ అక్షి హినస్తి స్మ.

**ప్రతిపదార్థము** :– రాఘవ! = ఓ శ్రీరామా!, అస్త్రం తు = బ్రహ్మాస్త్రమును, మోఘం = వ్యర్థమైన దానినిగా, కర్తుం = చేయుటకు, న శక్యం = వీలులేనిది, ఇతి ఏవ = అనియే, సః = ఆ, భవాన్ = నీవు, తస్య = ఆ, కాకస్య = కాకముయొక్క, దక్షిణమ్ అక్షి = కుడి కంటిని, హినస్తి స్మ = హింసించితివి.

**తాత్పర్యము** :– ఓ శ్రీరామా! ప్రయోగింపబడిన బ్రహ్మాస్త్రమును వ్యర్థము చేయుటకు వీలు లేదని గ్రహించి నీవు ఆ కాకముయొక్క కుడి కంటిని ఆ యస్త్రమునకు ఎరచేసి యుంటివి.

**శ్లో॥ రామ త్వాం స నమస్కృత్య రాజ్ఞే దశరథాయ చ ।**
**విసృష్టస్తు తదా కాకః ప్రతిపేదే స్వ మాలయమ్ ॥ 16**

**పదచ్ఛేదము** :- రామ - త్వాం - సః - నమస్కృత్య - రాజ్ఞే - దశరథాయ - చ, విసృష్టః - తు - తదా - కాకః - ప్రతిపేదే - స్వమ్ - ఆలయమ్ ॥

**అన్వయక్రమము** :- రామ! సః కాకః తు త్వాం నమస్కృత్య రాజ్ఞే దశరథాయ చ (నమస్కృత్య) విసృష్టః (సన్) తదా స్వమ్ ఆలయం ప్రతిపేదే.

**ప్రతిపదార్థము** :- రామ = ఓ రాఘువా!, సః = ఆ, కాకః = కాకము, త్వాం = నిన్ను, నమస్కృత్య = నమస్కరించి, రాజ్ఞే = రాజయిన, దశరథాయ చ = దశరథుని కొరకును, (నమస్కృత్య = నమస్కరించి), విసృష్టః (సన్) = విడువబడినదై, తదా = అప్పుడు, స్వం = తనదైన, ఆలయం = నివాసమును, ప్రతిపేదే = చేరెను.

**తాత్పర్యము** :- ఓ శ్రీరామా! అప్పు డా వాయసము నీకును నీ తండ్రియగు మహారాజైన దశరథునకును మ్రొక్కి నీచేత ప్రాణములతో విడువబడి సంతోషముతో తన నివాసమును చేరుకొనెను.

**శ్లో॥ ఏవ మస్త్రవిదాం శ్రేష్ఠ స్సత్త్వవాంశ్శీలవానపి ।**
**కిమర్థ మస్త్రం రక్షస్సు న యోజయసి రాఘవ ॥ 17**

**పదచ్ఛేదము** :- ఏవమ్ - అస్త్రవిదాం - శ్రేష్ఠః - సత్త్వవాన్ - శీలవాన్ - అపి, కిమర్థమ్ - అస్త్రం - రక్షస్సు - న - యోజయసి - రాఘవ ॥

**అన్వయక్రమము** :- రాఘవ! అస్త్రవిదాం శ్రేష్ఠః సత్త్వవాన్ శీలవాన్ అపి కిమర్థమ్ ఏవం రక్షస్సు అస్త్రం న యోజయసి?

**ప్రతిపదార్థము** :- రాఘవ = ఓ శ్రీరామా!, అస్త్రవిదాం = అస్త్రవేత్తలలో, శ్రేష్ఠః = శ్రేష్ఠుడవును, సత్త్వవాన్ = శక్తిమంతుడవును, శీలవాన్ అపి = శీలవంతుడవు నైనప్పటికిని, కిమర్థం = ఏ కారణమున, ఏవం = ఇట్లు, (త్వం = నీవు), రక్షస్సు = రాక్షసులయెడ, అస్త్రం = అస్త్రమును, న యోజయసి = సంధింపకున్నావు?

**తాత్పర్యము** :- ఓ శ్రీరామా! అస్త్రవేత్తలలో సర్వశ్రేష్ఠుడవును మహాపరాక్రమ సంపన్నుడవును ఉత్తమశీలసంపన్నుడవు నగు నీవు కాకాసురునియెడ వలెనే ఈ రాక్షసులపై ఏ కారణముచే అస్త్రమును సంధించి పగ దీర్చుకొనకున్నావు.

**శ్లో॥ న నాగా నాపి గంధర్వా నాసురా న మరుద్గణాః ।**
**తవ రామ రణే శక్తా స్తథా ప్రతిసమాసితుమ్ ॥ 18**

**పదచ్ఛేదము :–** న – నాగాః – న – అపి – గంధర్వాః – న – అసురాః – న – మరుద్గణాః, తవ – రామ – రణే – శక్తాః – తథా – ప్రతిసమాసితుమ్ ॥

**అన్వయక్రమము :–** రామ! రణే తవ ప్రతిసమాసితుం నాగాః న శక్తాః, గంధర్వాః అపి న, అసురాః న, మరుద్గణాః అపి న (శక్తాః).

**ప్రతిపదార్థము :–** రామ = ఓ శ్రీరామా!, రణే = యుద్ధమునందు, తవ = నీకు, తథా = ఆ వాయసము వలెనే, ప్రతిసమాసితుం = ఎదురునిల్చుటకు, నాగాః = నాగజాతివీరులు, శక్తాః న = సమర్థులు కారు, గంధర్వాః అపి = గంధర్వులుకూడ, న = సమర్థులుకారు, అసురాః = రాక్షసులు, న = సమర్థులు కారు, మరుద్గణాః అపి = దేవగణములుగూడ, న(శక్తాః) = సమర్థులు కారు .

**తాత్పర్యము :–** ఓ శ్రీరామా! యుద్ధమునందు ఆ వాయసమువలెనే నీ కెదురుగా నిలువబడుటకు నాగవీరులుగాని, గంధర్వులుగాని, రాక్షసులుగాని దేవగణములలో మరెవ్వరైన గాని సమర్థులుగారు కదా!

**శ్లో॥ తవ వీర్యవతః కశ్చి న్మయి యద్యస్తి సంభ్రమః ।**
**క్షిప్రం సునిశితై ర్బాణై ర్హన్యతాం యుధి రావణః ॥ 19**

**పదచ్ఛేదము :–** తవ – వీర్యవతః – కశ్చిత్ – మయి – యది – అస్తి – సంభ్రమః, క్షిప్రం – సునిశితైః – బాణైః – హన్యతాం – యుధి – రావణః ॥

**అన్వయక్రమము :–** వీర్యవతః తవ కశ్చిత్ సంభ్రమః మయి అస్తి యది క్షిప్రం సునిశితైః బాణైః రావణః యుధి హన్యతామ్.

**ప్రతిపదార్థము :–** వీర్యవతః = పరాక్రమవంతుడవైన, తవ = నీకు, కశ్చిత్ = కొంచెమైన, సంభ్రమః = వేగిరపాటు, మయి = నాయందు, అస్తి యది = ఉన్న యెడల, క్షిప్రం = వెంటనే, సునిశితైః = మిక్కిలి వాడియైన, బాణైః = బాణములచే, రావణః = రావణుడు, యుధి = యుద్ధమునందు, హన్యతామ్ = చంపబడుగాక!

**తాత్పర్యము :–** మహాపరాక్రమ సంపన్నుడవైన నీకే గనుక నన్ను గూర్చి కొంచెమైన వేగిరపా టున్నయెడల వెంటనే యుద్ధమునందు రావణాసురుని వాడియైన బాణములతో సంహరింప వలసియున్నది.

**శ్లో॥ భ్రాతు రాదేశ మాజ్ఞాయ లక్ష్మణో వా పరంతపః ।**
**స కిమర్థం నరవరో న మాం రక్షతి రాఘవః ॥ 20**

**పదచ్ఛేదము** :- భ్రాతుః - ఆదేశమ్ - ఆజ్ఞాయ - లక్ష్మణః - వా - పరంతపః - సః - కిమర్థం - నరవరః - న - మాం - రక్షతి - రాఘవః ॥

**అన్వయక్రమము** :- భ్రాతుః ఆదేశమ్ ఆజ్ఞాయ పరంతపః నరవరః సః రాఘవః లక్ష్మణః కిమర్థం మాం న రక్షతి?

**ప్రతిపదార్థము** :- భ్రాతుః = సోదరునియొక్క, ఆదేశం = ఆజ్ఞను, ఆజ్ఞాయ = స్వీకరించి, పరంతపః = శత్రుతాపనుడును, నరవరః = పురుషశ్రేష్ఠుడునగు, సః = ఆ, రాఘవః = రఘునందనుడైన, లక్ష్మణః = లక్ష్మణుడు, కిమర్థం = ఎందుకొరకు, మాం = నన్ను, న రక్షతి = రక్షించుట లేదు?

**తాత్పర్యము** :- అన్నగారి యాజ్ఞను గైకొని శత్రుసంహారకుడును పురుషపుంగవుడును రఘువంశవర్ధనుడునగు ఆ లక్ష్మణుడు ఇంతవర కేల నన్ను రక్షించుటకై రాకున్నాడు.

**శ్లో॥ శక్తౌ తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ ।**
**సురాణామపి దుర్ధర్షౌ కిమర్థం మా ముపేక్షతః ॥ 21**

**పదచ్ఛేదము** :- శక్తౌ - తౌ - పురుషవ్యాఘ్రౌ - వాయ్వగ్నిసమతేజసౌ, సురాణామ్ - అపి - దుర్ధర్షౌ - కిమర్థం - మామ్ - ఉపేక్షతః ॥

**అన్వయక్రమము** :- శక్తౌ పురుషవ్యాఘ్రౌ వాయ్వగ్నిసమతేజసౌ సురాణామ్ అపి దుర్ధర్షౌ తౌ కిమర్థం మామ్ ఉపేక్షతః?

**ప్రతిపదార్థము** :- శక్తౌ = సమర్థులును, పురుషవ్యాఘ్రౌ = పురుషశ్రేష్ఠులును, వాయ్వగ్నిసమతేజసౌ = వాయువుతోడను అగ్నితోడను సమానమైన ప్రతాపముగల వారును, సురాణామ్ అపి = దేవతలకుగూడ, దుర్ధర్షౌ = ఎదిరింప శక్యముగాని వారునగు, తౌ = వారిరువురును, కిమర్థం = ఎందుకు, మామ్ = నన్ను, ఉపేక్షతః = ఉపేక్షించుచున్నారు.

**తాత్పర్యము** :- సర్వసమర్థులును, పురుషసింహులును, వాయ్వగ్నులతో సమానమైన ప్రతాపము గలవారును, దేవతలకు గూడ ఎదుర్కొన శక్యముగాని పరాక్రమము గలవారునగు ఆ యన్నదమ్ము లిరువురును ఏ కారణముచే నన్నిట్లుపేక్షించుచున్నారు?

**శ్లో॥ మమైవ దుష్కృతం కించి న్మహ దస్తి న సంశయః ।**
**సమర్థౌ సహితౌ య న్మాం నావేక్షేతే పరంతపౌ ॥ 22**

**పదచ్ఛేదము** :– మమ – ఏవ – దుష్కృతం – కించిత్ – మహత్ – అస్తి – న – సంశయః, సమర్థౌ – సహితౌ – యత్ – మాం – న – అవేక్షేతే – పరంతపౌ ॥

**అన్వయక్రమము** :– సమర్థౌ సహితౌ (తౌ) పరంతపౌ యత్ మాం న అవేక్షేతే (తత్) మమ కించిత్ మహత్ దుష్కృతమ్ అస్తి ఏవ, సంశయః న.

**ప్రతిపదార్థము** :– సమర్థౌ = సమర్థులును, సహితౌ = కలిసికొన్నవారునగు, తౌ = ఆ, పరంతపౌ = శత్రుమర్దనులు, యత్ = ఏ కారణమున, మాం = నన్ను, న అవేక్షేతే = చూడకున్నారో, తత్ = ఆ కారణమున, మమ = నాయొక్క, కించిత్ = కొద్ది, మహత్ దుష్కృతం = పెద్దదైన పాపము, అస్తి ఏవ = తప్పకయున్నది, సంశయః చ = సందేహము, న = లేదు.

**తాత్పర్యము** :– సమర్థులైన ఆ యన్నదమ్ములు ఒకరినొకరు కలిసి యున్నవారై కూడ శత్రుసంహారదక్షులై యుండికూడ ఇంతవరకును నన్ను చూడకున్నారనగా ఏ కొద్దియో గొప్పదైన నా పాపమే కారణమైయుండును; సందేహములేదు!

**శ్లో॥ వైదేహ్యా వచనం శ్రుత్వా కరుణం సాశ్రు భాషితమ్ ।**
**పునర ప్యహ మార్యాం తా మిదం వచన మబ్రువమ్ ॥ 23**

**పదచ్ఛేదము** :– వైదేహ్యాః – వచనం – శ్రుత్వా – కరుణం – సాశ్రు – భాషితమ్, పునః – అపి – అహమ్ – ఆర్యాం – తామ్ – ఇదం – వచనమ్ – అబ్రువమ్ ॥

**అన్వయక్రమము** :– వైదేహ్యాః కరుణం సాశ్రు భాషితం శ్రుత్వా అహం పునః అపి తామ్ ఆర్యామ్ ఇదం వచనమ్ అబ్రువమ్.

**ప్రతిపదార్థము** :– వైదేహ్యాః = జానకీదేవియొక్క, కరుణం = దుఃఖకరమును, సాశ్రు భాషితం = కన్నీటితో కూడిన మాటలు కలదియునగు, వచనం = వచనమును, శ్రుత్వా = విని, అహం = నేను, పునః అపి = మరలగూడ, తాం = ఆ, ఆర్యాం = పూజ్యురాలిని గూర్చి, ఇదం = ఈ, వచనం = మాటను, అబ్రువమ్ = పలికితిని.

**తాత్పర్యము** :– జానకీదేవి కన్నీరు స్రవించుచుండ దుఃఖకరముగ పలికిన మాటలను అన్నియు విని మరల ఆ పూజ్యురాలితో ఈ విధముగా పలికితిని.

**శ్లో॥ త్వచ్ఛోకవిముఖో రామో దేవి సత్యేన తే శపే ।**
**రామే దుఃఖాభిభూతే తు లక్ష్మణః పరితప్యతే ॥ 24**

**పదచ్ఛేదము** :- త్వచ్ఛోకవిముఖః - రామః - దేవి - సత్యేన - తే - శపే - రామే - దుఃఖాభిభూతే - తు - లక్ష్మణః - పరితప్యతే ॥

**అన్వయక్రమము** :- దేవి! తే సత్యేన శపే; రామః త్వచ్ఛోకవిముఖః, రామే దుఃఖాభిభూతే తు (సతి) లక్ష్మణః పరితప్యతే.

**ప్రతిపదార్థము** :- దేవి = ఓ సీతాదేవీ!, తే సత్యేన శపే = నీపై ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను, రామః = శ్రీరాముడు, త్వచ్ఛోకవిముఖః = నిన్ను గూర్చిన దుఃఖముచే అన్నిటియెడ విముఖుడై యున్నాడు, రామే = శ్రీరాముడు, దుఃఖాభిభూతే (సతి) = దుఃఖముచే వివశుడై యుండగా, లక్ష్మణః = లక్ష్మణుడు, పరితప్యతే = సంతాపము నొందుచున్నాడు.

**తాత్పర్యము** :- ఓ జానకీదేవీ! నీపై ఒట్టుపెట్టి చెప్పుచున్నాను వినుము. శ్రీరాముడిప్పుడు నిన్ను గూర్చిన దుఃఖావేశముచే ఒడలెరుగక యున్నాడు. ఆహారాదులయెడ సైతము విముఖుడైయున్నాడు. రాముడిట్లు దుఃఖవివశుడై యుండగా లక్ష్మణుని సంతాపమునకు మేరయే లేకున్నది.

**శ్లో॥ కథంచి ద్భవతీ దృష్టా న కాలః పరిశోచితుమ్ ।**
**అస్మి న్ముహూర్తే దుఃఖానా మంతం ద్రక్ష్యసి భామిని ॥ 25**

**పదచ్ఛేదము** :- కథంచిత్ - భవతీ - దృష్టా - న - కాలః - పరిశోచితుమ్ - అస్మిన్ - ముహూర్తే - దుఃఖానామ్ - అంతం - ద్రక్ష్యసి - భామిని ॥

**అన్వయక్రమము** :- భామిని! భవతీ కథంచిత్ దృష్టా, పరిశోచితుం కాలః న, అస్మిన్ ముహూర్తే దుఃఖానామ్ అంతం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :- భామిని = కోమలీ!, కథంచిత్ = ఎట్లో, భవతీ = నీవు, దృష్టా = కనబడితివి, పరిశోచితుం = దుఃఖించుటకు, కాలః = సమయము, న = కాదు. అస్మిన్ = ఈ, ముహూర్తే = క్షణమునందు, దుఃఖానాం = దుఃఖములకు, అంతం = అంతమును, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :- తల్లీ! నా యదృష్టవశముచే ఎట్లో నీవు మా కన్నులబడితివి. ఇప్పుడు దుఃఖింపవలసిన సమయముగాదు. ఈ క్షణమునుండియే నీవు పొందిన దుఃఖములన్నియును కడతేరగలవు.

**శ్లో॥ తా వుభౌ నరశార్దూలౌ రాజపుత్రా వనిందితౌ ।**
**త్వద్దర్శనకృతోత్సాహౌ లంకాం భస్మీకరిష్యతః ॥ 26**

**పదచ్ఛేదము :-** తౌ - ఉభౌ - నరశార్దూలౌ - రాజపుత్రౌ - అనిందితౌ, త్వద్దర్శన కృతోత్సాహౌ - లంకాం - భస్మీకరిష్యతః ॥

**అన్వయక్రమము :-** నరశార్దూలౌ అనిందితౌ ఉభౌ తౌ రాజపుత్రౌ త్వద్దర్శనకృతోత్సాహౌ (సంతౌ) లంకాం భస్మీకరిష్యతః.

**ప్రతిపదార్థము :-** నరశార్దూలౌ = పురుషశ్రేష్ఠులును, అనిందితౌ = నిందలేని చరిత్రులునగు, ఉభౌ = ఇద్దరైన, తౌ = ఆ, రాజపుత్రౌ = రాజపుత్రులు, త్వద్దర్శన కృతోత్సాహౌ (సంతౌ) = నిన్ను దర్శించుట కొరకు పొంగివచ్చుచున్న ఉత్సాహముగల్గిన వారగుచు, లంకాం = లంకను, భస్మీకరిష్యతః = భస్మము చేయగలరు.

**తాత్పర్యము :-** అనింద్యచరిత్రులును పురుషశ్రేష్ఠులు నగు ఆ రాజపుత్రు లిరువురును నిన్ను జూడవలెనను గొప్ప ఉత్సాహముతో వచ్చి ఈ లంకను భస్మము గావించెదరు సుమా!

**శ్లో॥ హత్వా చ సమరే రౌద్రం రావణం సహబాంధవమ్ ।**
**రాఘవ స్త్వాం వరారోహే స్వాం పురీం నయితా ధ్రువమ్ ॥ 27**

**పదచ్ఛేదము :-** హత్వా - చ - సమరే - రౌద్రం - రావణం - సహబాంధవమ్, రాఘవః - త్వాం - వరారోహే - స్వాం - పురీం - నయితా - ధ్రువమ్ ॥

**అన్వయక్రమము :-** వరారోహే! రాఘవః సమరే రౌద్రం రావణం సహబాంధవం హత్వా చ త్వాం స్వాం పురీం ధ్రువం నయితా.

**ప్రతిపదార్థము :-** వరారోహే = సుందరీ!, రాఘవః = శ్రీరాముడు, సమరే = యుద్ధమునందు, రౌద్రం = భయంకరుడగు, రావణం = రావణుని, సహబాంధవమ్ = బంధువులతో సహితముగా, హత్వా చ = పరిమార్చి పిమ్మట, త్వాం = నిన్ను, స్వాం పురీం = తన పట్టణమునుగూర్చి, ధ్రువం = నిశ్చయముగా, నయితా = తీసికొని పోవగలడు.

**తాత్పర్యము :-** ఓ జానకీ! శ్రీరాముడు మహాక్రూరుడైన ఆ రావణాసురుని యుద్ధమునందు బంధుసహితముగా హతమార్చి నిన్ను అచిరకాలములోనే తప్పక అయోధ్యానగరికి గొనిపోవగలడు సుమా!

**శ్లో॥ యత్తు రామో విజానీయా దభిజ్ఞాన మనిందితే ।**
**ప్రీతిసంజననం తస్య ప్రదాతుం త్వ మిహార్హసి ॥ 28**

**పదచ్ఛేదము :-** యత్ - తు - రామః - విజానీయాత్ - అభిజ్ఞానమ్ - అనిందితే,

ప్రీతిసంజననం – తస్య – ప్రదాతుం – త్వమ్ – ఇహ – అర్హసి ॥

**అన్వయక్రమము** :– అనిందితే రామః యత్ అభిజ్ఞానం విజానీయాత్ తస్య ప్రీతిసంజననం తత్ త్వమ్ ఇహ ప్రదాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము** :– అనిందితే = ఓ యనింద్యచరిత్రురాలా!, రామః తు = రాముడు మాత్రము, యత్ = ఏ, అభిజ్ఞానం = గుర్తును, విజానీయాత్ = తెలిసికొనునో, తస్య = ఆతనికి, ప్రీతిసంజననం = ప్రీతిని గలిగించునట్టిదైన, తత్ = ఆ యానవాలును, ఇహ = ఇప్పుడు, త్వం = నీవు, ప్రదాతుం = ఇచ్చుటకు, అర్హసి = తగుదువు.

**తాత్పర్యము** :– అనింద్యచరిత్రురాలవైన ఓ సీతాదేవీ! శ్రీరాముడు మాత్రము తెలిసికొన గలిగినట్టి ఒకానొక ఆనవాలును ఆతనికి సంతోషము గలిగించునట్లుగా నీ విప్పుడు నా కిచ్చుట ఉచితమై యుండును.

**శ్లో॥ సా ఉ౽భివీక్ష్య దిశ స్సర్వా వేణ్యుద్గ్రథిత ముత్తమమ్ ।**
**ముక్త్వా వస్త్రాద్దదౌ మహ్యం మణి మేతం మహాబల ॥ 29**

**పదచ్ఛేదము** :– సా – అభివీక్ష్య – దిశః – సర్వాః – వేణ్యుద్గ్రథితమ్ – ఉత్తమమ్, ముక్త్వా – వస్త్రాత్ – దదౌ – మహ్యం – మణిమ్ – ఏతం – మహాబల ॥

**అన్వయక్రమము** :– మహాబల! సా సర్వాః దిశః అభివీక్ష్య ఉత్తమం వేణ్యుద్గ్రథితం ముక్త్వా వస్త్రాత్ ఏతం మణిం మహ్యం దదౌ.

**ప్రతిపదార్థము** :– మహాబల = ఓ మహాబలాఢ్యుడా!, సా = ఆ సీతాదేవి, సర్వాః దిశః = అన్ని దిక్కులను, అభివీక్ష్య = పరికించి చూచి, ఉత్తమం = శ్రేష్ఠమైన, ఏతం = ఈ, వేణ్యుద్గ్రథితం = జడయందు ముడివేసికొన్నట్టి, మణిం = చూడామణిని, వస్త్రాత్ = చీరకొంగునుండి, ముక్త్వా = విప్పి, మహ్యం = నాకొరకు, దదౌ = ఇచ్చినది.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము** :– 'దిశః సర్వాః అభివీక్ష్య' – అచటి రాక్షసస్త్రీలు ఈ విషయమును చూచి రావణున కెరిగింపగలరను భయముతో చుట్టును గలియ జూచి ఇతరులు చూచుటలేదను నిశ్చయముతో కొంగునందు ముడివేసికొన్న తన చూడామణిని విప్పి హనుమ కిచ్చెనని భావము.

**తాత్పర్యము** :– ఓ మహాబలాఢ్యుడా! అప్పుడు సీతాదేవి నలుదిక్కులను పరికించి చూచి రాక్షసాంగనల కంటబడకుండ జడయందు ధరింపవలసిన చూడామణిని

చీరకొంగునందు ముడివైచుకొనియుండుటచేత దానిని అప్పుడు ముడివిప్పి నాచేతి కిచ్చినది.

**శ్లో॥ ప్రతిగృహ్యా మణిం దివ్యం తవ హేతో రఘూద్వహ ।**
**శిరసా తాం ప్రణ మ్యార్యా మహ మాగమనే త్వరే ॥ 30**

**పదచ్ఛేదము :**– ప్రతిగృహ్యా – మణిం – దివ్యం – తవ – హేతోః – రఘూద్వహ, శిరసా – తాం – ప్రణమ్య – ఆర్యామ్ – అహమ్ – ఆగమనే – త్వరే ॥

**అన్వయక్రమము :**– రఘూద్వహ! తవ హేతోః దివ్యం (తం) మణిం ప్రతిగృహ్యా తామ్ ఆర్యాం శిరసా ప్రణమ్య అహమ్ ఆగమనే త్వరే.

**ప్రతిపదార్థము :**– రఘూద్వహ = ఓ రఘువంశశ్రేష్ఠుడా, తవ హేతోః = నీ కారణమున, దివ్యం = దివ్యమైనట్టి, తం = ఆ, మణిం = చూడామణిని, ప్రతిగృహ్యా = స్వీకరించి, తాం = ఆ, ఆర్యాం = పూజ్యురాలిని, శిరసా = శిరముతో, ప్రణమ్య = మ్రొక్కి, అహం = నేను, ఆగమనే = వచ్చువిషయమున, త్వరే = వేగిరపడితిని.

**తాత్పర్యము :**– ఓ రఘువంశశ్రేష్ఠుడా! నీకు సమర్పించుటకుగాను దివ్యమైన ఆ చూడామణిని ఆమెనుండి గైకొని ఆ పూజ్యురాలికి పాదాభివందనము గావించి తిరిగి ఇచ్చటికి రావలెనని వేగిరపడితిని.

**శ్లో॥ గమనే చ కృతోత్సాహ మవేక్ష్య వరవర్ణినీ ।**
**వివర్ధమానం చ హి మా మువాచ జనకాత్మజా ॥ 31**

**పదచ్ఛేదము :**– గమనే – చ – కృతోత్సాహం – అవేక్ష్య – వరవర్ణినీ, వివర్ధమానం – చ – హి – మామ్ – ఉవాచ – జనకాత్మజా ॥

**అన్వయక్రమము :**– వరవర్ణినీ జనకాత్మజా గమనే కృతోత్సాహం వివర్ధమానం చ మామ్ అవేక్ష్య ఉవాచ.

**ప్రతిపదార్థము :**– వరవర్ణినీ = శ్రేష్ఠమైన ఛాయ గలిగినట్టి, జనకాత్మజా = జానకీదేవి, గమనే = ప్రయాణమునందు, కృతోత్సాహం = ఉత్సాహముతో గూడినట్టివాడను, వివర్ధమానం = వృద్ధిపొందుచున్నవాడను అగు, మాం = నన్ను, అవేక్ష్య = చూచి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :**– గొప్పదైన దేహచ్ఛాయతో ప్రకాశించుచున్న ఆ జానకీదేవి నేను తిరుగ ప్రయాణమునకై ఉత్సాహపడుచు నా శరీరమును వృద్ధి పొందించుకొనుటను జూచి నాతో తిరిగి ఇట్లు పలికినది.

**శ్లో॥ అశ్రుపూర్ణముఖీ దీనా బాష్పసందిగ్ధభాషిణీ ।**
**మ మోత్పతనసంభ్రాంతా శోకవేగసమాహతా ॥ 32**

**పదచ్ఛేదము :–** అశ్రుపూర్ణముఖీ – దీనా – బాష్పసందిగ్ధభాషిణీ, మమ – ఉత్పతన సంభ్రాంతా – శోకవేగసమాహతా ॥

**అన్వయక్రమము :–** (తదా) (సా) అశ్రుపూర్ణముఖీ, బాష్పసందిగ్ధభాషిణీ, మమ ఉత్పతన సంభ్రాంతా దీనా శోకవేగసమాహతా (ఆసీత్).

**ప్రతిపదార్థము :–** (తదా = అప్పుడు), (సా = ఆమె), అశ్రుపూర్ణముఖీ = కన్నీటితో నిండిన ముఖము గలదియును, బాష్పసందిగ్ధభాషిణీ = కన్నీటితో అస్పష్టముగా మాటలాడుచున్నదియును, మమ = నాయొక్క, ఉత్పతనసంభ్రాంతా = మీది కెగురు యత్నమునకు భీతినొందినదియును, దీనా = దీనురాలును, శోకవేగసమాహతా = దుఃఖముయొక్క వేగముచే బాధింపబడినదియును, (ఆసీత్ = ఆయెను).

**తాత్పర్యము :–** అప్పుడు ఆమె కన్నీటితో నిండిన ముఖముతోడను, ఆ కన్నీటి వేగముచే స్పష్టముగా వినిపించని మాటలతోడను, వెడలిపోవుటకై నేను ఎగిరిపోయెదనను భయావేశముతోడను పీడింపబడుచు దుఃఖకరమైన స్థితిలో నుండెను.

**శ్లో॥ మా మువాచ తతస్సీతా సభాగ్యోఽసి మహాకపే ।**
**యద్ద్రక్ష్యసి మహాబాహుం రామం కమలలోచనమ్ ।**
**లక్ష్మణం చ మహాబాహుం దేవరం మే యశస్వినమ్ ॥ 33**

**పదచ్ఛేదము :–** మామ్ – ఉవాచ – తతః – సీతా – సభాగ్యః – అసి – మహాకపే, యత్ – ద్రక్ష్యసి – మహాబాహుం – రామం – కమలలోచనమ్ – లక్ష్మణం – చ – మహాబాహుం – దేవరం – మే – యశస్వినమ్ ॥

**అన్వయక్రమము :–** తతః సీతా మామ్ ఉవాచ. మహాకపే! యత్ మహాబాహుం కమలలోచనం రామం, మహాబాహుం యశస్వినం మే దేవరం లక్ష్మణం చ ద్రక్ష్యసి, (తత్) (త్వం) సభాగ్యః అసి.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, సీతా = సీతాదేవి, మాం = నన్ను గూర్చి, ఉవాచ = పలికెను, మహాకపే = ఓ వానరశ్రేష్ఠుడా!, యత్ = ఏకారణము వలన, మహా బాహుం = గొప్ప భుజములు గలవాడును, కమలలోచనం = పద్మములవంటి నేత్రములు గలవాడునగు, రామం = శ్రీరాముని, మహాబాహుం = ఆజానుబాహుడును, యశస్వినం = కీర్తిశాలియునగు, మే = నాయొక్క, దేవరం = మరిదియైనట్టి, లక్ష్మణం

చ = లక్ష్మణునికూడ, ద్రక్ష్యసి = చూడగలవో, (తత్ = ఆ కారణమున), (త్వం = నీవు), సభాగ్యః = భాగ్యవంతుడవు, అసి = అగుచున్నావు.

**తాత్పర్యము :–** అప్పుడు సీతాదేవి నాతో ఇట్లన్నది – ఓ వానరోత్తముడా! నీ వెంత అదృష్టవంతుడవు! ఆజానుబాహుడును, కమలాయతలోచనుడునగు నా నాథుడైన శ్రీరాముని, మహాబాహువును యశశ్శాలియునగు నామరిదియైన లక్ష్మణుని, కన్నులార గాంచు భాగ్యము నిరంతరముగా నీకు కల్గుచున్నదిగదా!

**శ్లో॥ సీతయా ప్యేవ ముక్తో ఽ హ మబ్రవం మైథిలీం తదా ।**
**పృష్ఠమారోహ మే దేవి క్షిప్రం జనకనందిని ॥ 34**

**శ్లో॥ యావ త్తే దర్శయా మ్యద్య ససుగ్రీవం సలక్ష్మణమ్ ।**
**రాఘవం చ మహాభాగే భర్తార మసితేక్షణే ॥ 35**

**పదచ్ఛేదము :–** సీతయా – అపి – ఏవమ్ – ఉక్తః – అహమ్ – అబ్రవం – మైథిలీం – తదా, పృష్ఠమ్ – ఆరోహ – మే – దేవి – క్షిప్రం – జనకనందిని, యావత్ – తే – దర్శయామి – అద్య – ససుగ్రీవం – సలక్ష్మణమ్, రాఘవం – చ – మహాభాగే – భర్తారమ్ – అసితేక్షణే ॥

**అన్వయక్రమము :–** సీతయా అపి ఏవమ్ ఉక్తః అహం తదా మైథిలీమ్ అబ్రవమ్, దేవి! జనకనందిని! క్షిప్రం మే పృష్ఠమ్ ఆరోహ, మహాభాగే అసితేక్షణే! అద్య ససుగ్రీవం లక్ష్మణం తే భర్తారం రాఘవం యావత్ దర్శయామి.

**ప్రతిపదార్థము :–** సీతయా అపి = సీతమ్మ చేతను, ఏవం = ఈరీతిగా, ఉక్తః = చెప్పబడినవాడనై, అహం = నేను, తదా = అప్పుడు, మైథిలీం = జానకీదేవిని గూర్చి, అబ్రవమ్ = పలికితిని, దేవి! జనకనందిని = ఓ జానకీదేవీ, క్షిప్రం = శీఘ్రముగా, మే = నా యొక్క, పృష్ఠం = వీపును, ఆరోహ = అధిష్ఠించుము, మహాభాగే = ఓ మహాత్మురాలా!, అసితేక్షణే = నల్లని కన్నులుగల సీతాదేవీ, అద్య = ఇప్పుడు, ససుగ్రీవం = సుగ్రీవునితోగూడిన వాడును, సలక్ష్మణం = లక్ష్మణునితో గూడినవాడును అగు, తే భర్తారం = నీ నాథుడైన, రాఘవం = శ్రీరాముని, యావత్ = త్వరలో, దర్శయామి = చూపించెదను.

**తాత్పర్యము :–** సీతాదేవి నన్నుగూర్చి ఇట్లు పలుకగా అప్పుడు నేను వెంటనే ఆమెతో ఇట్లంటిని. 'ఓ తల్లీ జానకీ! నీ విప్పుడే నా వీపు నారోహింపుము. సుగ్రీవుని తోడను లక్ష్మణునితోడను కూడియున్న నీ నాథుడైన రాఘవుని నీ కిప్పుడే చూపగలను.

**శ్లో॥ సా ఉ బ్రవీ న్మాం తతో దేవీ నైష ధర్మో మహాకపే ।**
**యత్తే పృష్ఠం సిషేవేఉహం స్వవశా హరిపుంగవ ॥ 36**

**పదచ్ఛేదము :–** సా – అబ్రవీత్ – మాం – తతః – దేవీ – న – ఏషః – ధర్మః – మహాకపే, యత్ – తే – పృష్ఠం – సిషేవే – అహం – స్వవశా – హరిపుంగవ ॥

**అన్వయక్రమము :–** తతః సా దేవీ మామ్ అబ్రవీత్, మహాకపే! హరిపుంగవ! స్వవశా అహం తే పృష్ఠం సిషేవే (ఇతి) యత్, ఏషః ధర్మః న.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, సా = ఆ, దేవీ = సీతాదేవి, మాం = నన్నుగూర్చి, అబ్రవీత్ = పలికెను, మహాకపే = ఓ వానరశ్రేష్ఠుడా!, హరిపుంగవ = ఓ కపిసత్తమా!, స్వవశా = స్వతంత్రురాలనైన, అహం = నేను, తే = నీయొక్క, పృష్ఠం = వీపును, సిషేవే = సేవించితిని, ఇతి యత్ = అనునది ఏదియున్నదో, ఏషః = ఇయ్యది, ధర్మః = ధర్మము, న = కాదు.

**తాత్పర్యము :–** అప్పుడు సీతాదేవి నాతో ఇట్లు చెప్పినది. ఓ వానరోత్తమా! నేను నా యిష్టముతో నీ వీపు నధిరోహించుట అనునది ధర్మమైన విషయము కాదు సుమా!

**శ్లో॥ పురా చ య దహం వీర స్పృష్టా గాత్రేషు రక్షసా ।**
**త త్రాహం కిం కరిష్యామి కాలే నోపనిపీడితా ॥ 37**

**పదచ్ఛేదము :–** పురా – చ – యత్ – అహం – వీర – స్పృష్టా – గాత్రేషు – రక్షసా, తత్ర – అహం – కిం – కరిష్యామి – కాలేన – ఉపనిపీడితా ॥

**అన్వయక్రమము :–** వీర! పురా గాత్రేషు రక్షసా అహం స్పృష్టా ఇతి యత్ తత్ర కాలేన ఉపనిపీడితా, అహం కిం కరిష్యామి?

**ప్రతిపదార్థము :–** వీర! = ఓ వీరుడా!, పురా = పూర్వము, గాత్రేషు = అవయవములందు, రక్షసా = రక్కసులచే, అహం = నేను, స్పృష్టా = తాకబడితిని, ఇతి యత్ = అనునదేది గలదో, తత్ర = ఆ విషయమున, కాలేన = కాలముచే, ఉపనిపీడితా = బాధింపబడినదానను, కిం కరిష్యామి = ఏమి చేయగలను ?

**తాత్పర్యము :–** ఓ వీరాగ్రేసరుడా, వెనుకటి సమయమున ఆ రావణాసురునిచే నా శరీరము తాకబడుట జరిగియున్నప్పటికిని అప్పుడు కాలప్రభావముచే వివశురాలనై యుండుటచే నే నేమియును చేయజాలకుంటిని.

**శ్లో॥ గచ్ఛ త్వం కపిశార్దూల యత్ర తే నృపతే స్సుతౌ ।**
**ఇత్యేవం సా సమాభాష్య భూయ స్సందేష్టు మాస్థితా ॥ 38**

**పదచ్ఛేదము** :– గచ్ఛ – త్వం – కపిశార్దూల – యత్ర – తౌ – నృపతేః – సుతౌ, ఇతి – ఏవం – సా – సమాభాష్య – భూయః – సందేష్టుమ్ – ఆస్థితా ॥

**అన్వయక్రమము** :– కపిశార్దూల! తౌ నృపతేః సుతౌ యత్ర (వర్తేతే) తత్ర త్వం గచ్ఛ, ఇతి  ఏవం సా సమాభాష్య భూయః సందేష్టుమ్ ఆస్థితా.

**ప్రతిపదార్థము** :– కపిశార్దూల = ఓ వానరశ్రేష్ఠుడా!, తౌ = ఆ, నృపతేః = రాజుయొక్క, సుతౌ = కుమారులిరువురును, యత్ర = ఎచ్చటనయితే, (వర్తేతే = ఉన్నారో), తత్ర = అచటికి, త్వం = నీవు, గచ్ఛ = పొమ్ము, ఇతి = అని, సా = ఆమె, ఏవం = ఇట్లు, సమాభాష్య = పలికి, భూయః = తిరిగి, సందేష్టుం = సందేశము చెప్పుటకు, ఆస్థితా = సమకట్టినది.

**తాత్పర్యము** :– ఓ వానరోత్తమా! ఆ రాజపుత్రు లున్నచోటికే వెడలి అనంతరకార్యము చక్కబెట్టుమని నాతో పలికి తిరిగి ఇట్లు చెప్పదొడగెను.

**సూచన** :– శ్లో 33 నుండి 38 వరకూగల ఈ యారు శ్లోకములును కొన్ని తెలుగులిపి ప్రతులలో లేవు. మరియు వేరు వేరు ముద్రణములలో (వెనుక ముందులుగా కూడ) కనిపించుచున్నవి.

**శ్లో॥ హనుమన్ సింహసంకాశౌ వుభౌ తౌ రామలక్ష్మణౌ ।**
**సుగ్రీవం చ సహామాత్యం సర్వాన్ బ్రూయా హ్యనామయమ్ ॥39**

**పదచ్ఛేదము** :– హనుమన్ – సింహసంకాశౌ – ఉభౌ – తౌ – రామలక్ష్మణౌ, సుగ్రీవం – చ – సహామాత్యం – సర్వాన్ – బ్రూయాః – హి – అనామయమ్ ॥

**అన్వయక్రమము** :– హనుమన్! సింహసంకాశౌ తౌ రామలక్ష్మణౌ ఉభౌ చ సహామాత్యం సుగ్రీవం చ సర్వాన్ అనామయం బ్రూయాః హి.

**ప్రతిపదార్థము** :– హనుమన్ = ఓ హనుమా!, సింహసంకాశౌ = సింహసమానులైనట్టి, తౌ = ఆ, రామలక్ష్మణౌ = రామలక్ష్మణులను, ఉభౌ = ఇరువురిని, సహామాత్యం = మంత్రులతో గూడినట్టి, సుగ్రీవం చ = సుగ్రీవునికూడ, అనామయం = క్షేమమును, బ్రూయాః హి = పలుకవలెను సుమా!

**తాత్పర్యము** :– ఓ హనుమా! సింహపరాక్రమము కలిగినట్టి ఆ రామలక్ష్మణుల నిరువురిని, మంత్రిసమేతుడైన ఆ సుగ్రీవుని, అచటి వానరవీరుల నెల్లరిని నేను కుశలము నడిగినట్లు చెప్పవలెను సుమా!

**శ్లో॥ యథా చ స మహాబాహు ర్మాం తారయతి రాఘవః ।**
**అస్మా ద్దుఃఖాంబుసంరోధా త్త్వం సమాధాతు మర్హసి ॥ 40**

**పదచ్ఛేదము** :– యథా – చ – సః – మహాబాహుః – మాం – తారయతి – రాఘవః – అస్మాత్ – దుఃఖాంబుసంరోధాత్ – త్వం – సమాధాతుమ్ – అర్హసి ॥

**అన్వయక్రమము** :– మహాబాహుః సః రాఘవః యథా అస్మాత్ దుఃఖాంబుసంరోధాత్ మాం తారయతి (తథా) త్వం సమాధాతుమ్ అర్హసి.

**ప్రతిపదార్థము** :– మహాబాహుః = గొప్పభుజములు కల్గినట్టి, సః = ఆ, రాఘవః = శ్రీరాముడు, అస్మాత్ = ఈ, దుఃఖాంబుసంరోధాత్ = దుఃఖపు నీటివెల్లువనుండి, యథా = ఎట్లు, మాం = నన్ను, తారయతి = దాటించునో, (తథా = అట్లు), త్వం = నీవు, సమాధాతుం = సమకూర్చుటకు, అర్హసి = తగుదువు.

**తాత్పర్యము** :– ఓ హనుమా! మహావీరుడైన ఆ రాఘవుడు నన్నీ దుఃఖసముద్రము నుండి త్వరలో ఒడ్డునకు చేర్చునట్టి విధానమును నీవే సమకూర్చగలవాడవు సుమా!

**శ్లో॥ ఇమం చ తీవ్రం మమ శోకవేగం**
**రక్షోభి రేభిః పరిభర్త్సనం చ ।**
**బ్రూయాస్తు రామస్య గత స్సమీపం**
**శివశ్చ తేఽధ్వాఽస్తు హరిప్రవీర ॥ 41**

**పదచ్ఛేదము** :– ఇమం – చ – తీవ్రం – మమ – శోకవేగం – రక్షోభిః – ఏభిః – పరిభర్త్సనం – చ – బ్రూయాః – తు – రామస్య – గతః – సమీపం – శివః – చ – తే – అధ్వా – అస్తు – హరిప్రవీర ॥

**అన్వయక్రమము** :– హరిప్రవీర! ఇమం తీవ్రం మమ శోకవేగం చ, ఏభిః రక్షోభిః పరిభర్త్సనం చ రామస్య సమీపం గతః (సన్) బ్రూయాః; తే అధ్వా చ శివః అస్తు.

**ప్రతిపదార్థము** :– హరిప్రవీర! = వానరయోధుడా!, ఇమం = ఈ, తీవ్రం = తీవ్రమైనట్టి, మమ = నాయొక్క, శోకవేగం చ = దుఃఖాతిశయమును గూర్చియు, ఏభిః = ఈ, రక్షోభిః = రక్కసులచేతనైన, పరిభర్త్సనం చ = గద్దింపును గూర్చియు, రామస్య = శ్రీరామునియొక్క, సమీపం = సన్నిధిని, గతః సన్ = చేరినవాడవై, బ్రూయాః = చెప్పుము, తే = నీయొక్క, అధ్వా చ = మార్గము గూడ, శివః = మంగళకరమైనది, అస్తు = అగుగాక!

**తాత్పర్యము** :– ఓ వానరవీరుడా! నీవు రాముని సన్నిధికేగి నేననుభవించుచున్న ఈ

తీవ్రమైన దుఃఖమును గూర్చియు, ఇచ్చటి రక్కసులు నన్ను బెదిరించుచున్న విధమును గూర్చియు వివరముగా ఆతనికి తెలుపుము. నీకు మార్గము క్షేమకరమగుగాక!

**శ్లో॥ ఏత త్త వార్యా నృపరాజసింహ**
**సీతా వచః ప్రాహ విషాదపూర్వమ్ ।**
**ఏతచ్చ బుద్ధ్వా గదితం మయా త్వం**
**శ్రద్ధత్స్వ సీతాం కుశలాం సమగ్రామ్ ॥ 42**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"సీతాభాషితానువచనం" నామ*
*సప్తషష్టితమస్సర్గః*

**పదచ్ఛేదము** :– ఏతత్ – తవ – ఆర్యా – నృపరాజసింహ – సీతా – వచః – ప్రాహ – విషాదపూర్వమ్ – ఏతత్ – చ – బుద్ధ్వా – గదితం – మయా – త్వం – శ్రద్ధత్స్వ – సీతాం – కుశలాం – సమగ్రామ్ ॥

**అన్వయక్రమము** :– నృపరాజసింహ! ఆర్యా సీతా విషాదపూర్వమ్ ఏతత్ వచః ప్రాహ, మయా గదితం ఏతత్ చ బుద్ధ్వా త్వం సీతాం కుశలాం సమగ్రాం శ్రద్ధత్స్వ.

**ప్రతిపదార్థము** :– నృపరాజసింహ = మనుజులను పాలించునట్టి రాజశ్రేష్ఠుడా!, ఆర్యా = పూజ్యురాలయిన, సీతా = సీతాదేవి, విషాదపూర్వం = దుఃఖపూర్వకముగా, ఏతత్ = ఈ, వచః = మాటను, తవ = నీకు, ప్రాహ = చెప్పినది. మయా = నాచేత, గదితం = చెప్పబడినట్టి, ఏతత్ చ = ఈ మాటను గూడా, బుద్ధ్వా = గ్రహించి, సీతాం = సీతాదేవిని, కుశలాం = క్షేమముగ నున్నదిగను, సమగ్రాం = పతివ్రతలలో అగ్రేసరురాలినిగాను, శ్రద్ధత్స్వ = విశ్వసింపుము.

**తాత్పర్యము** :– ఓ రాజశ్రేష్ఠుడా! పూజ్యురాలయిన సీతాదేవి విషాదపూర్వకముగా నీ కీ మాటలను తెలిపినది. నేను చెప్పిన ఈ మాటలను తెలిసికొని నీ ప్రియురాలు క్షేమముగ నున్నదనియు పతివ్రతాధర్మమున వెలయుచున్నదనియు నమ్ముము.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"సీతాభాషితానువచనం" అను అరువదియేడవసర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః
శ్రీరామ శరణ గురుభ్యో నమః

## అష్టషష్టితమసర్గ

**శ్లో॥ అథాహ ముత్తరం దేవ్యా పునరుక్త స్ససంభ్రమః ।**
**తవ స్నేహా న్నరవ్యాఘ్ర సౌహార్దా దనుమాన్య వై ॥ 1**

**పదచ్ఛేదము** :- అథ - అహమ్ - ఉత్తరం - దేవ్యా - పునః - ఉక్తః - ససంభ్రమః - తవ - స్నేహాత్ - నరవ్యాఘ్ర - సౌహార్దాత్ - అనుమాన్య - వై ॥

**అన్వయక్రమము** :- నరవ్యాఘ్ర! అథ ససంభ్రమః అహం తవ స్నేహాత్ సౌహార్దాత్ దేవ్యా అనుమాన్య పునః ఉత్తరమ్ ఉక్తః.

**ప్రతిపదార్థము** :- నరవ్యాఘ్ర = ఓ పురుషశ్రేష్ఠుడా!, అథ = పిమ్మట, ససంభ్రమః = వేగిరపాటుతో గూడినట్టి, అహం = నేను, తవ = నీయొక్క, స్నేహాత్ = మైత్రివలనను, సౌహార్దాత్ = అనురాగమువలనను, అనుమాన్య = గౌరవించి, దేవ్యా = సీతాదేవిచేత, పునః = తిరిగి, ఉత్తరం = మీది కార్యమును గూర్చి, ఉక్తః = చెప్పబడినాను.

**తాత్పర్యము** :- ఓ పురుషశ్రేష్ఠుడా! పిమ్మట సీతాదేవి నాయందు నీకుగల స్నేహ విశేషమును, అనురాగాతిశయమును చక్కగా గ్రహించినదై నన్ను తగువిధముగా గౌరవించుచు తిరిగి, భావికర్తవ్యమును గూర్చి ఇట్లు చెప్పినది.

**శ్లో॥ ఏవం బహువిధం వాచ్యో రామో దాశరథి స్త్వయా ।**
**యథా మా మాప్నుయా చ్ఛీఘ్రం హత్వా రావణ మాహవే ॥ 2**

**పదచ్ఛేదము** :- ఏవం - బహువిధం - వాచ్యః - రామః - దాశరథిః - త్వయా, యథా - మాం - ఆప్నుయాత్ - శీఘ్రం - హత్వా - రావణమ్ - ఆహవే ॥

**అన్వయక్రమము** :- దాశరథిః రామః ఆహవే రావణం హత్వా యథా మాం శీఘ్రం ఆప్నుయాత్, ఏవం త్వయా బహువిధం వాచ్యః.

**ప్రతిపదార్థము** :- దాశరథిః = దశరథనందనుడైన, రామః = శ్రీరాముడు, ఆహవే = యుద్ధమునందు, రావణం = రావణుని, హత్వా = వధించి, మాం = నన్ను, యథా = ఏవిధముగా, శీఘ్రం = అచిరకాలములో, ఆప్నుయాత్ = పొందునో, ఏవం = ఆ

విధముగా, త్వయా = నీచేత, బహువిధం = పలువిధములుగా, వాచ్యః = చెప్పదగినవాడు.

**తాత్పర్యము** :– ఓ హనుమా! ఆ దశరథనందనుడు రావణాసురుని యుద్ధమున హతమార్చి నన్నతిశీఘ్రముగా గొనిపోవునట్లుగా బహువిధముల నా వృత్తాంతమును గూర్చి తెలుపవలయును సుమా!

**శ్లో॥ యది వా మన్యసే వీర వ సైకాహ మరిందమ ।**
**కస్మింశ్చిత్సంవృతే దేశే విశ్రాంత శ్శ్వో గమిష్యసి ॥ 3**

**పదచ్ఛేదము** :– యది – వా – మన్యసే – వీర – వస – ఏకాహమ్ – అరిందమ – కస్మిన్ – చిత్ – సంవృతే – దేశే – విశ్రాంతః – శ్వః – గమిష్యసి ॥

**అన్వయక్రమము** :– అరిందమ, మన్యసే యది వా ఏకాహం (ఇహ) వస, కస్మిన్చిత్ సంవృతే దేశే విశ్రాంతః (సన్) శ్వః గమిష్యసి.

**ప్రతిపదార్థము** :– అరిందమ = శత్రుమర్దనుడవైన, వీర = పరాక్రమవంతుడా!, మన్యసే యది వా = నీవు తలచిన యెడల, (ఇహ = ఈ లంకలో), ఏకాహం = ఒక్క దినము, వస = వసింపుము, కస్మిన్చిత్ = ఏదైన, సంవృతే = గుప్తమైనట్టి, దేశే = ప్రదేశమునందు, విశ్రాంతః సన్ = విశ్రమించినవాడవై, శ్వః = రేపు, గమిష్యసి = వెళ్ళగలవు.

**తాత్పర్యము** :– శత్రుభయంకరుడవైన ఓ మహావీరుడా! నీ కిష్టమైనచో ఇచ్చట ఇంకొక రోజు ఆగిపొమ్ము. ఎచటనైన రహస్యప్రదేశమునందు చక్కగా విశ్రాంతి దీసికొని రేపు తిరిగి వెడలిపోవచ్చును.

**శ్లో॥ మమ చా ప్యల్పభాగ్యాయా స్సాన్ని ధ్యాత్తవ వానర ।**
**అస్య శోకవిపాకస్య ముహూర్తం స్యా ద్విమోక్షణమ్ ॥ 4**

**పదచ్ఛేదము** :– మమ – చ – అపి – అల్పభాగ్యాయాః – సాన్నిధ్యాత్ – తవ – వానర, అస్య – శోకవిపాకస్య – ముహూర్తం – స్యాత్ – విమోక్షణమ్ ॥

**అన్వయక్రమము** :– వానర! తవ సాన్నిధ్యాత్ అల్పభాగ్యాయాః మమ చ అపి అస్య శోకవిపాకస్య ముహూర్తం విమోక్షణం స్యాత్.

**ప్రతిపదార్థము** :– వానర! = ఓ వానరోత్తమా!, తవ = నీయొక్క, సాన్నిధ్యాత్ = సామీప్యమువలన, అల్పభాగ్యాయాః = మందభాగ్యురాలనైనట్టి, మమ చ = నాకును, అస్య = ఈ, శోకవిపాకస్య = దుఃఖపరిణామమునకు, ముహూర్తం = కొద్దికాలము,

విమోక్షణం = విముక్తి, స్యాత్ = అగును.

**తాత్పర్యము** :– ఓ హనుమా! నీవు నా దగ్గర నుండుటవలన మందభాగ్యురాలనైనట్టి నన్ను పీడించుచున్న ఈ దుఃఖభారమునుండి కొన్ని క్షణముల కాలమైనను నాకు విముక్తి లభించగలదు.

**శ్లో॥ గతే హి త్వయి విక్రాంతే పునరాగమనాయ వై ।**
**ప్రాణానామపి సందేహో మమ స్యా న్నాత్ర సంశయః ॥ 5**

**పదచ్ఛేదము** :– గతే – హి – త్వయి – విక్రాంతే – పునః – ఆగమనాయ – వై, ప్రాణానామ్ – అపి – సందేహః – మమ – స్యాత్ – న – అత్ర – సంశయః ॥

**అన్వయక్రమము** :– విక్రాంతే త్వయి పున రాగమనాయ గతే (సతి) మమ ప్రాణానామ్ అపి సందేహః స్యాత్, అత్ర సంశయః న.

**ప్రతిపదార్థము** :– విక్రాంతే = పరాక్రమవంతుడవైన, త్వయి = నీవు, పునః = తిరిగి, ఆగమనాయ = వచ్చుటకై, గతే (సతి) = వెడలియుండగా, మమ = నాయొక్క, ప్రాణానామ్ అపి = ప్రాణములకుగూడ, సందేహః = సంశయము, స్యాత్ = కాగలదు, అత్ర = ఈ విషయమున, సంశయః = సందేహము, న = లేదు.

**తాత్పర్యము** :– మహాపరాక్రమసంపన్నుడవైన నీ విప్పుడు మరల తిరిగి రావచ్చును గదా అని వెడలిపోవగనే, దుఃఖాతిశయమువలన నా ప్రాణములు నిలుచుట కూడ సంశయమే అగును. ఇందుకు సందేహము లేదు.

**శ్లో॥ త వాదర్శనజ శ్శోకో భూయో మాం పరితాపయేత్ ।**
**దుఃఖా ద్దుఃఖపరాభూతాం దుర్గతాం దుఃఖభాగినీమ్ ॥ 6**

**పదచ్ఛేదము** :– తవ – అదర్శనజః – శోకః – భూయః – మాం – పరితాపయేత్, దుఃఖాత్ – దుఃఖపరాభూతాం – దుర్గతాం – దుఃఖభాగినీమ్ ॥

**అన్వయక్రమము** :– దుఃఖాత్ దుఃఖపరాభూతాం దుర్గతాం దుఃఖభాగినీం మాం తవ అదర్శనజః శోకః భూయః పరితాపయేత్.

**ప్రతిపదార్థము** :– దుఃఖాత్ = దుఃఖమునుండి, దుఃఖపరాభూతాం = దుఃఖముచే పరాభవింపబడినదానను, దుర్గతాం = దీనురాలను, దుఃఖభాగినీం = దుఃఖము పొందినదానను అగు, మాం = నన్ను, తవ = నీయొక్క, అదర్శనజః = కాన్పింప కుండుట వలన కలిగినట్టి, శోకః = దుఃఖము, భూయః = తిరిగి ఇంకను, పరితాప యేత్ = పరితపింపజేయును.

**తాత్పర్యము :–** దుఃఖము వెంబడి దుఃఖముచే పీడింపబడుచు దీనురాలనై దుఃఖముల పాలైయున్న నాకు నీవు దూరమగుటవలన ఇప్పుడు గలుగు ఇంకొక దుఃఖము తిరిగి ఇంకను సంతాపమును గలుగచేయును సుమా!

**శ్లో॥ అయం చ వీర సందేహ స్తిష్ఠతీవ మమాగ్రతః ।**
**సుమహాం స్త్వత్సహాయేషు హర్యృక్షేషు హరీశ్వర ॥ 7**

**పదచ్ఛేదము :–** అయం – చ – వీర – సందేహః – తిష్ఠతి – ఇవ – మమ – అగ్రతః, సుమహాన్ – త్వత్సహాయేషు – హర్యృక్షేషు – హరీశ్వర ॥

**అన్వయక్రమము :–** వీర! హరీశ్వర! త్వత్సహాయేషు హర్యృక్షేషు సుమహాన్ అయం సందేహః చ మమ అగ్రతః తిష్ఠతి ఇవ.

**ప్రతిపదార్థము :–** వీర! = ఓ మహావీరుడా!, హరీశ్వర = వానరోత్తమా, త్వత్సహాయేషు = నీ సహాయకులైనట్టి, హర్యృక్షేషు = వానరులందును, ఎలుగుబంట్ల యందును, సుమహాన్ = మిక్కిలి గొప్పదైన, అయం = ఈ, సందేహః = సంశయము, మమ = నాకు, అగ్రతః = ఎదుట, తిష్ఠతి ఇవ = నిలచినట్లున్నది.

**తాత్పర్యము :–** ఓ మహావీరుడా! నీకు సహాయకులుగా నున్నట్టి ఆ వానరసైన్యముల విషయమునను భల్లూకగణముల యెడలను నాకు గొప్ప సందేహము గలిగి నన్ను బాధించుచున్నది సుమా!

**శ్లో॥ కథం ను ఖలు దుష్పారం తరిష్యంతి మహోదధిమ్ ।**
**తాని హర్యృక్షసైన్యాని తౌ వా నరవరాత్మజౌ ॥ 8**

**పదచ్ఛేదము :–** కథం – ను – ఖలు – దుష్పారం – తరిష్యంతి – మహోదధిమ్, తాని – హర్యృక్షసైన్యాని – తౌ – వా – నరవరాత్మజౌ ॥

**అన్వయక్రమము :–** తాని హర్యృక్షసైన్యాని తౌ నరవరాత్మజౌ వా దుష్పారం మహోదధిం కథం ను తరిష్యంతి ఖలు!

**ప్రతిపదార్థము :–** తాని = ఆ, హర్యృక్షసైన్యాని = వానరులయొక్కయు, భల్లూకముల యొక్కయు సైన్యములుగాని, తౌ = ఆ, నరవరాత్మజౌ = రాజపుత్రులిద్దరునుగాని, దుష్పారం = దాటుటకు శక్యముగాని, మహోదధిం = మహాసాగరమును, కథం ను = ఎటుగా, తరిష్యంతి ఖలు = దాటగలరో గదా!

**తాత్పర్యము :–** మీయొక్క ఆ వానరసైన్యములుగాని భల్లూక సైన్యములు గాని మరియు ఆ రాజపుత్రులైన రామలక్ష్మణులుగాని దాటుటకు దుష్కరమైన ఈ మహాసాగరము

నెట్లుగా దాటి రాగలరో గదా!

**శ్లో॥ త్రయాణామేవ భూతానాం సాగర స్యాస్య లంఘనే ।**
**శక్తి స్స్యా ద్వైనతేయస్య వాయోర్వా తవ వానఘ ॥ 9**

**పదచ్ఛేదము :**– త్రయాణామ్ – ఏవ – భూతానాం – సాగరస్య – అస్య – లంఘనే, శక్తిః – స్యాత్ – వైనతేయస్య – వాయోః – వా – తవ – వా – అనఘ ॥

**అన్వయక్రమము :**– అనఘ! వైనతేయస్య వా వాయోః వా తవ వా త్రయాణాం భూతానాం ఏవ, అస్య సాగరస్య లంఘనే శక్తిః స్యాత్.

**ప్రతిపదార్థము :**– అనఘ! = ఓ పాపరహితుడా!, వైనతేయస్య వా = గరుత్మంతునికి గాని, వాయోః వా = వాయుదేవునకుగాని, తవ వా = నీకుగాని, త్రయాణాం భూతానాం ఏవ = ఈ ముగ్గురు ప్రాణులకు మాత్రమే, అస్య = ఈ, సాగరస్య = సముద్రము యొక్క, లంఘనే = దాటుటయందు, శక్తిః = సామర్థ్యము, స్యాత్ = ఉండును.

**తాత్పర్యము :**– గరుత్మంతుడు, వాయుదేవుడు, నీవు – ఈ ముగ్గురు మాత్రమే గదా లోకము మొత్తము నందీ మహాసముద్రమును దాటుటకు సామర్థ్యమును గల్గియుందురు!

**శ్లో॥ త దస్మి న్కార్యనిర్యోగే వీ రైవం దురతిక్రమే ।**
**కిం పశ్యసి సమాధానం బ్రూహి కార్యవిదాం వర ॥ 10**

**పదచ్ఛేదము :**– తత్ – అస్మిన్ – కార్యనిర్యోగే – వీర – ఏవం – దురతిక్రమే, కిం – పశ్యసి – సమాధానం – బ్రూహి – కార్యవిదాం – వర ॥

**అన్వయక్రమము :**– తత్ ఏవం దురతిక్రమే అస్మిన్ కార్యనిర్యోగే సమాధానం కిం పశ్యసి? వీర! కార్యవిదాం వర! బ్రూహి.

**ప్రతిపదార్థము :**– తత్ = ఆ కారణమువలన, ఏవం = ఈ విధముగా, దురతిక్రమే = దాటుటకు దుష్కరమైనట్టి, అస్మిన్ = ఈ, కార్యనిర్యోగే = కార్యనిర్వహణమునందు, సమాధానం = సమాధానముగా, కిం = ఏమి, పశ్యసి = చూచుచున్నావు, కార్యవిదాం = కర్తవ్యము నెరిగియున్నవారిలో, వర = శ్రేష్ఠుడవైన, వీర! = ఓ వీరుడా!, బ్రూహి = చెప్పుము.

**తాత్పర్యము :**– ఈ విధముగా అసాధ్యముగా గానవచ్చుచున్నట్టి ఈ కార్యమును నిర్వహించుటకై నీవు ఊహించుచున్న మార్గము ఎట్టిది? కార్యనిర్వాహకులలో మేటివైన వీరుడవు గాబట్టి ఈ నిర్ణయమును నీవే తెలుపుము.

**శ్లో॥ కామ మస్య త్వ మే వైకః కార్యస్య పరిసాధనే ।**
**పర్యాప్తః పరవీరఘ్న యశస్య స్తే బలోదయః ॥ 11**

**పదచ్ఛేదము** :– కామమ్ – అస్య – త్వం – ఏవ – ఏకః – కార్యస్య – పరిసాధనే, పర్యాప్తః – పరవీరఘ్న – యశస్యః – తే – బలోదయః – ॥

**అన్వయక్రమము** :– పరవీరఘ్న! అస్య కార్యస్య పరిసాధనే త్వమ్ ఏకః ఏవ కామం పర్యాప్తః, తే బలోదయః యశస్యః భవేత్.

**ప్రతిపదార్థము** :– పరవీరఘ్న! = శత్రువీరులను హతమార్చు మహావీరుడా!, అస్య = ఈ, కార్యస్య = కార్యముయొక్క, పరిసాధనే = నిర్వహణమునందు, త్వం = నీవు, ఏకః ఏవ = ఒక్కడవే, కామం = సంపూర్ణముగా, పర్యాప్తః = సరిపడినట్టివాడవు, తే = నీయొక్క, బలోదయః = పరాక్రమాతిశయము, యశస్యః = కీర్తికరమైనది, (భవేత్ = అగును).

**తాత్పర్యము** :– ఓ శత్రువీరసంహారకుడా! ఈ ప్రస్తుత కార్యమును తుదముట్టించుటకు తలచుకొన్నచో నీ వొక్కడవే సరిపడుదువు. కాని అట్టి నీపరాక్రమవిజృంభణము నీ కొక్కనికి మాత్రమే గొప్ప కీర్తిని గూర్చగలదు.

**శ్లో॥ బలై స్సమగ్రై ర్యది మాం హత్వా రావణ మాహవే ।**
**విజయీ స్వాం పురీం రామో నయే త్తత్స్యా ద్యశస్కరమ్ ॥ 12**

**పదచ్ఛేదము** :– బలైః – సమగ్రైః – యది – మాం – హత్వా – రావణమ్ – ఆహవే – విజయీ – స్వాం – పురీం – రామః – నయేత్ – తత్ – స్యాత్ – యశస్కరమ్ ॥

**అన్వయక్రమము** :– రామః సమగ్రైః బలైః ఆహవే రావణం హత్వా విజయీ సన్ మాం స్వాం పురీం నయేత్ యది తత్ యశస్కరం స్యాత్.

**ప్రతిపదార్థము** :– రామః = శ్రీరాముడు, సమగ్రైః = సంపూర్ణములైనట్టి, బలైః = సైన్యములతో, ఆహవే = యుద్ధమునందు, రావణం = రావణాసురుని, హత్వా = వధించి, విజయీ సన్ = విజయవంతుడై, మాం = నన్ను, స్వాం = తనదైన, పురీం = అయోధ్యానగరమును, నయేత్ యది = తీసుకొనిపోయిన యెడల, తత్ = అది, యశస్కరం = కీర్తికరమైనది, స్యాత్ = కాగలదు.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**తిలకము** :– "తత్ యశస్కరం స్యాత్' – ఆ చర్య కీర్తికరమైనది గాగలదు అనగా నీవు రావణవధకు సమర్థుడవైనను స్వయముగ తాను వధించుటయే శ్రీరామునకు

ప్రతిష్ఠాకరమగునని సీతమ్మ భావము.

**తాత్పర్యము :–** శ్రీరాముడు సంపూర్ణములైన సైన్యములతో ఇచటికి వచ్చి యుద్ధము నందు రావణుని సంహరించి శత్రువిజయము సాధించినవాడై నన్ను అయోధ్యా పట్టణమునకు గొనిపోయిన యెడల ఆ చర్యయే ఎంతయును యశస్కరమైనదిగా నుండును గదా!

**శ్లో॥ యథాహం తస్య వీరస్య వనా దుపధినా హృతా ।**
**రక్షసా తద్భయాదేవ తథా నార్హతి రాఘవః ॥ 13**

**పదచ్ఛేదము :–** యథా – అహం – తస్య – వీరస్య – వనాత్ – ఉపధినా – హృతా, రక్షసా – తద్భయాత్ – ఏవ – తథా – న – అర్హతి – రాఘవః ॥

**అన్వయక్రమము :–** తస్య వీరస్య భయాత్ ఏవ రక్షసా వనాత్ అహం యథా ఉపధినా హృతా, రాఘవః తథా (కర్తుం) న అర్హతి.

**ప్రతిపదార్థము :–** తస్య వీరస్య = ఆ వీరుడైన రామునియొక్క, భయాత్ ఏవ = భయమువలననే, రక్షసా = రావణునిచే, అహం = నేను, యథా = ఏ విధముగానైతే, ఉపధినా = మోసముచే, హృతా = అపహరింపబడితినో, తథా = అట్లుగానే, (కర్తుం = చేయుటకు), రాఘవః = శ్రీరాముడు, న అర్హతి = తగడు.

**తాత్పర్యము :–** వీరుడైన శ్రీరామునకు భయపడియే నన్నా రావణుడు ఆనా డా యరణ్యమునుండి ఎట్లుగా మోసముచే అపహరించియున్నాడో అట్లే భయవిదూరుడైన శ్రీరాముడు కూడ రావణుని మోసగించియే నన్ను గొనిపోవలసిన పనిలేదు.

**శ్లో॥ బలైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః ।**
**మాం నయేద్యది కాకుత్థ్స స్తత్తస్య సదృశం భవేత్ ॥ 14**

**పదచ్ఛేదము :–** బలైః – తు – సంకులాం – కృత్వా – లంకాం – పరబలార్దనః, మాం – నయేత్ – యది – కాకుత్థ్సః – తత్ – తస్య – సదృశం – భవేత్ ॥

**అన్వయక్రమము :–** పరబలార్దనః కాకుత్థ్సః బలైః లంకాం సంకులాం కృత్వా మాం నయేత్ యది తత్ తస్య సదృశం భవేత్.

**ప్రతిపదార్థము :–** పరబలార్దనః = శత్రుసైన్యమును హతమార్చునట్టి, కాకుత్థ్సః = శ్రీరాముడు, బలైః = సైన్యములతో, లంకాం = లంకను, సంకులాం = కల్లోలితమును, కృత్వా = చేసి, మాం = నన్ను, నయేత్ యది = తీసికొని పోయిన యెడల, తత్ = అది, తస్య = శ్రీరామునకు, సదృశం = తగినది, భవేత్ = అగును.

**తాత్పర్యము :–** శత్రుమర్దనుడైన రాఘవుడు సమర్థములైన సైన్యములతో వచ్చి లంకను కల్లోలము నొందించి నన్ను వెంట గైకొని పోయినచో ఆ వీరకృత్యము ఆతని కుచితమైనదిగా నుండును.

**శ్లో॥ త ద్యథా తస్య విక్రాంత మనురూపం మహాత్మనః ।**
**భవ త్యాహవశూరస్య తథా త్వ ముపపాదయ ॥ 15**

**పదచ్ఛేదము :–** తత్ – యథా – తస్య – విక్రాంతమ్ – అనురూపం – మహాత్మనః, భవతి – ఆహవశూరస్య – తథా – త్వమ్ – ఉపపాదయ ॥

**అన్వయక్రమము :–** ఆహవశూరస్య, మహాత్మనః తస్య తత్ విక్రాంతం యథా అనురూపం భవతి తథా త్వమ్ ఉపపాదయ.

**ప్రతిపదార్థము :–** ఆహవశూరస్య = యుద్ధవీరుడైన, తస్య = ఆ, మహాత్మనః = మహనీయునియొక్క, తత్ = ఆ, విక్రాంతం = పరాక్రమము, యథా = ఏ విధముగా, అనురూపం = ఉచితమైనట్టిది, భవతి = అగునో, తథా = అట్లుగా, త్వం = నీవు, ఉపపాదయ = తెలుపుము.

**తాత్పర్యము :–** రణరంగవీరుడైన ఆ రాఘవుని పరాక్రమమునకు ఏ విధాన ముచితమై యుండునో నీవట్టి విధమును చక్కగా ఆలోచించి తెలుపుము.

**శ్లో॥ తదర్థోపహితం వాక్యం ప్రశ్రితం హేతుసంహితమ్ ।**
**నిశ మ్యాహం తత శ్శేషం వాక్య ముత్తర మబ్రవమ్ ॥ 16**

**పదచ్ఛేదము :–** తత్ – అర్థోపహితం – వాక్యం – ప్రశ్రితం – హేతుసంహితమ్, నిశమ్య – అహం – తతః – శేషం – వాక్యమ్ – ఉత్తరమ్ – అబ్రవమ్ ॥

**అన్వయక్రమము :–** అర్థోపహితం ప్రశ్రితం హేతుసంహితం తత్ వాక్యం నిశమ్య, తతః అహం శేషమ్ ఉత్తరం వాక్యమ్ అబ్రవమ్.

**ప్రతిపదార్థము :–** అర్థోపహితం = ప్రయోజనముతో గూడినదియును, ప్రశ్రితం = వినయముతో గూడినదియును, హేతుసంహితం = కారణములతో నొప్పుచున్నది యునగు, తత్ = ఆ, వాక్యం = మాటను, నిశమ్య = విని, తతః = పిమ్మట, అహం = నేను, శేషం = మిగిలినట్టి, ఉత్తరం = సమాధానమైనట్టి, వాక్యం = వాక్యమును, అబ్రవమ్ = చెప్పితిని.

**తాత్పర్యము :–** అర్థవంతముగను, వినయయుక్తముగను, సకారణముగను సీతమ్మ పలికిన ఆ మాటలను ఆలకించి నేను జవాబుగా చెప్పవలసిన మిగిలిన మాటలను

ఇట్లు చెప్పితిని.

**శ్లో॥ దేవి హర్యృక్షసైన్యానా మీశ్వరః ప్లవతాం వరః ।**
**సుగ్రీవ స్సత్త్వసంపన్న స్తవార్థే కృతనిశ్చయః ॥ 17**

**పదచ్ఛేదము** :– దేవి – హర్యృక్షసైన్యానామ్ – ఈశ్వరః – ప్లవతాం – వరః – సుగ్రీవః – సత్త్వసంపన్నః – తవ – అర్థే – కృతనిశ్చయః ॥

**అన్వయక్రమము** :– దేవి! హర్యృక్షసైన్యానామ్ ఈశ్వరః, ప్లవతాం వరః, సత్త్వసంపన్నః సుగ్రీవః తవ అర్థే కృతనిశ్చయః.

**ప్రతిపదార్థము** :– దేవి = సీతాదేవీ!, హర్యృక్షసైన్యానాం = వానరభల్లూకముల సైన్యములకు, ఈశ్వరః, = ప్రభువును, ప్లవతాం = వానరులలో, వరః = శ్రేష్ఠుడును, సత్త్వసంపన్నః = మహాబలశాలియునగు, సుగ్రీవః = సుగ్రీవుడు, తవ = నీయొక్క, అర్థే = కార్యవిషయమున, కృతనిశ్చయః = దృఢమైన నిశ్చయము గల్గియున్నవాడు.

**తాత్పర్యము** :– వానర భల్లూకముల సేనల కధిపతియును, మహాబలాఢ్యుడును అగు వానరరాజైన సుగ్రీవుడు నిన్నుగూర్చి దృఢనిశ్చయముతో కార్యసాధనకు సిద్ధముగా నున్నాడుసుమా!

**శ్లో॥ తస్య విక్రమసంపన్నా స్సత్త్వవంతో మహాబలాః ।**
**మనస్సంకల్పసంపాతా నిదేశే హరయ స్థ్సితాః ॥ 18**

**పదచ్ఛేదము** :– తస్య – విక్రమసంపన్నాః – సత్త్వవంతః – మహాబలాః, మనస్సంకల్ప సంపాతాః – నిదేశే – హరయః – స్థితాః ॥

**అన్వయక్రమము** :– విక్రమసంపన్నాః సత్త్వవంతః మహాబలాః మనస్సంకల్పసంపాతాః హరయః (బహవః) తస్య నిదేశే స్థితాః.

**ప్రతిపదార్థము** :– విక్రమసంపన్నాః = గొప్ప పరాక్రమము గలవారును, సత్త్వవంతః = గొప్పశక్తి గలవారును, మహాబలాః = మహాబలాఢ్యులును, మనస్సంకల్పసంపాతాః = మనస్సుయొక్క సంకల్పము ననుసరించిన వేగగమనము గలవారును అగు, హరయః = వానరులు, (బహవః = పెక్కుమంది), తస్య = ఆతనియొక్క, నిదేశే = ఆజ్ఞయందు, స్థితాః = నిలచియున్నారు.

**తాత్పర్యము** :– అమితమైన పరాక్రమము గలవారును మహాశక్తిసంపన్నులును మహాబలాఢ్యులును మనస్సుయొక్క సంకల్పము ననుసరించి వేగముగా చరించు సామర్థ్యము గలవారు నగు వానరవీరులు పెక్కుమంది ఆతని యధీనమునందు

వేచియున్నారు సుమా!

**శ్లో॥ ఏషాం నోపరి నాధస్తా న్న తిర్య క్సజ్జతే గతిః ।**
**న చ కర్మసు సీదంతి మహ త్స్వమితతేజసః ॥ 19**

**పదచ్ఛేదము :-** ఏషాం - న - ఉపరి - అధస్తాత్ - న - తిర్యక్ - సజ్జతే - గతిః, న - చ - కర్మసు - సీదంతి - మహత్సు - అమితతేజసః ॥

**అన్వయక్రమము :-** ఏషాం గతి, ఉపరి న సజ్జతే, అధస్తాత్ న సజ్జతే, తిర్యక్ న సజ్జతే, అమితతేజసః (ఏతే) మహత్సు కర్మసు చ న సీదంతి.

**ప్రతిపదార్థము :-** ఏషాం = ఈ వీరులయొక్క, గతిః = గమనము, ఉపరి = పైలోకమున, న సజ్జతే = అడ్డదు, అధస్తాత్ = అధోలోకమున, న సజ్జతే = అడ్డదు, తిర్యక్ = పార్శ్వదేశమున, న సజ్జతే, = అడ్డదు, అమితతేజసః = అపరిమిత పరాక్రమము గల్గినట్టి, (ఏతే = వీరు), మహత్సు = గొప్పవైనట్టి, కర్మసు చ = కృత్యములందుగూడ, న సీదంతి = క్షీణతనొందరు.

**సూచన :-** ఈ శ్లోకములోని "ఏషాం"కు మారుగా "యేషాం" అని అర్థవిశేష భేదములేని పాఠాంతరము కొన్ని ప్రతులలో కానవచ్చుచున్నది.

**తాత్పర్యము :-** సుగ్రీవుని వశమునందున్నట్టి ఆ వానరయోధులు ఊర్ధ్వలోకములందు గాని, పాతాళలోకములందుగాని చుట్టుప్రక్కల ప్రదేశములందు గాని గమనమునకు వెనుదీయనివారు. అమిత ప్రతాపసంపన్నులైనట్టి ఆ వీరులు ఎంతటి దుష్కర కార్యమునకు గూడ వెనుదీయని ప్రభావశాలురు సుమా!

**శ్లో॥ అసకృత్తై ర్మహాభాగై ర్వానరై ర్బలదర్పితైః ।**
**ప్రదక్షిణీకృతా భూమి ర్వాయుమార్గానుసారిభిః ॥ 20**

**పదచ్ఛేదము :-** అసకృత్ - తైః - మహాభాగైః - వానరైః - బలదర్పితైః, ప్రదక్షిణీకృతా - భూమిః - వాయుమార్గానుసారిభిః ॥

**అన్వయక్రమము :-** మహాభాగైః బలదర్పితైః తైః వానరైః వాయుమార్గానుసారిభిః (సద్భిః) అసకృత్ భూమిః ప్రదక్షిణీకృతా.

**ప్రతిపదార్థము :-** మహాభాగైః = మహనీయులును, బలదర్పితైః = బలగర్వితులునగు, తైః = ఆ, వానరైః = వానరులచే, వాయుమార్గానుసారిభిః సద్భిః = వాయుమార్గమును అనుసరించుచు, అసకృత్ = పలుమారులు, భూమిః = భూమండలము, ప్రదక్షిణీకృతా = ప్రదక్షిణము చేయబడినది.

**తాత్పర్యము** :- నిరుపమానమైన తమ బలాతిశయముచే గర్వించియున్నట్టి మహనీయులైన ఆ వానరవీరులు ఆకాశమార్గమును బూని ఎన్ని మారులో భూమిచుట్టును ప్రదక్షిణము చేసి వచ్చిరి.

**శ్లో॥ మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః ।**
**మత్తః ప్రత్యవరః కశ్చిన్నాస్తి సుగ్రీవసన్నిధౌ ॥ 21**

**పదచ్ఛేదము** :- మద్విశిష్టాః - చ - తుల్యాః - చ - సంతి - తత్ర - వనౌకసః, మత్తః - ప్రత్యవరః - కః - చిత్ - న - అస్తి - సుగ్రీవసన్నిధౌ ॥

**అన్వయక్రమము** :- తత్ర సుగ్రీవసన్నిధౌ వనౌకసః మద్విశిష్టాః చ తుల్యాః చ సంతి, మత్తః ప్రత్యవరః కశ్చిత్ న అస్తి.

**ప్రతిపదార్థము** :- సుగ్రీవసన్నిధౌ = సుగ్రీవుని సన్నిధియందు, వనౌకసః = వానరులు, మద్విశిష్టాః = నాకంటె అధికులైనవారు, తత్ర = అచ్చట, సంతి = ఉన్నారు, మత్తః = నాకంటె, ప్రత్యవరః = తక్కువవాడు, కశ్చిత్ = ఎవ్వడును, న అస్తి = లేడు.

**తాత్పర్యము** :- సుగ్రీవుని కొలువులోని వానరులెల్లరును నాకంటె ఘనులైనవారును నాతో సమానమైనవారునై ఉన్నారు. ఆతనికడ నాకంటె తక్కువైన వాడు ఒక్కడును లేడు సుమా!

**శ్లో॥ అహం తావ దిహ ప్రాప్తః కింపున స్తే మహాబలాః ।**
**నహి ప్రకృష్టాః ప్రేష్యంతే ప్రేష్యంతే హీతరే జనాః ॥ 22**

**పదచ్ఛేదము** :- అహం - తావత్ - ఇహ - ప్రాప్తః - కిం - పునః - తే - మహాబలాః, న - హి - ప్రకృష్టాః - ప్రేష్యంతే - ప్రేష్యంతే - హి - ఇతరే - జనాః ॥

**అన్వయక్రమము** :- అహం తావత్ ఇహ ప్రాప్తః, తే మహాబలాః పునః కిమ్? ప్రకృష్టాః న ప్రేష్యంతే హి, ఇతరే జనాః ప్రేష్యంతే హి.

**ప్రతిపదార్థము** :- అహం తావత్ = నేనయితే, ఇహ = ఇచటికి, ప్రాప్తః = చేరితిని, మహాబలాః = మహాబలసంపన్నులైన, తే = వారు, కిం పునః = చెప్పవలసినదేమి?, ప్రకృష్టాః = శ్రేష్ఠులైనవారు, న ప్రేష్యంతే హి = దూతగా పంపబడరు గదా, ఇతరే జనాః = సామాన్యజనులే, ప్రేష్యంతే హి = పంపబడుదురు గదా.

**తాత్పర్యము** :- నావంటివాడనే ఇచటికి చేరుకొనగల్గితిని గదా! ఇక మహాబలాఢ్యుల విషయము చెప్పవలసిన దేమున్నది? దూతకృత్యమునకు పెద్దవారిని ఎంచి

పంపరుగదా! చిన్నవారినేగదా ఏరి పంపుదురు!

**శ్లో॥ త దలం పరితాపేన దేవి మన్యు ర్వ్యపైతు తే ।**
**ఏకోత్పాతేన వై లంకా మేష్యంతి హరియూథపాః ॥ 23**

**పదచ్ఛేదము** :– తత్ – అలం – పరితాపేన – దేవి – మన్యుః – వ్యపైతు – తే, ఏకోత్పాతేన – వై – లంకామ్ – ఏష్యంతి – హరియూథపాః ॥

**అన్వయక్రమము** :– దేవి! తత్ పరితాపేన అలమ్, తే మన్యుః వ్యపైతు, తే హరియూథపాః ఏకోత్పాతేన లంకామ్ ఏష్యంతి.

**ప్రతిపదార్థము** :– తత్ = ఆ కారణముచేత, దేవి = ఓ సీతాదేవీ, పరితాపేన అలం = సంతాపమువలదు, తే = నీ యొక్క, మన్యుః = శోకము, వ్యపైతు = తొలగిపోవుగాక!, తే = ఆ, హరియూథపాః = వానరవీరులు, ఏకోత్పాతేన = ఒక గెంతుతో, లంకాం = లంకనుగూర్చి, ఏష్యంతి = రాగలరు.

**తాత్పర్యము** :– అందుచేత ఓ సీతాదేవీ! నీవు సంతాపము నొందవలసిన పనిలేదు, నీ మనసునందలి దిగులు తొలగించుకొనుము. ఆ వానరవీరు లందరును ఒక్క గెంతుతోనే లంకలోనికి రాబోవుచున్నారు సుమా!

**శ్లో॥ మమ పృష్ఠగతౌ తౌ చ చంద్రసూర్యావివోదితౌ ।**
**త్వత్సకాశం మహాభాగే నృసింహౌ వాగమిష్యతః ॥ 24**

**పదచ్ఛేదము** :– మమ – పృష్ఠగతౌ – తౌ – చ – చంద్రసూర్యౌ – ఇవ – ఉదితౌ, త్వత్సకాశం – మహాభాగే – నృసింహౌ – ఆగమిష్యతః ॥

**అన్వయక్రమము** :– మహాభాగే! నృసింహౌ తౌ చ మమ పృష్ఠగతౌ (సంతౌ) ఉదితౌ చంద్రసూర్యౌ ఇవ త్వత్సకాశం ఆగమిష్యతః.

**ప్రతిపదార్థము** :– మహాభాగే = ఓ మహాత్మురాలా!, నృసింహౌ = పురుషశ్రేష్ఠులైనట్టి, తౌ చ = ఆ రామలక్ష్మణు లిరువురును, మమ = నాయొక్క, పృష్ఠగతౌ (సంతౌ) = వీపు నధిష్ఠించినవారై, ఉదితౌ = ఉదయించినట్టి, చంద్రసూర్యౌ ఇవ = చంద్రసూర్యుల వలె, త్వత్సకాశం = నీ సమీపమును గూర్చి, ఆగమిష్యతః = రాగలరు.

**తాత్పర్యము** :– తల్లీ! పురుషసింహులైన ఆ యన్నదమ్ము లిరువురును నావీపు నధిరోహించి అప్పుడే ఉదయించిన చంద్రసూర్యులవలె నీ కడకు రానై యున్నారు సుమా!

**శ్లో॥ అరిఘ్నం సింహసంకాశం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్ ।**
**లక్ష్మణం చ ధనుష్పాణిం లంకాద్వార ముపస్థితమ్ ॥ 25**

**పదచ్ఛేదము** :– అరిఘ్నం – సింహసంకాశం – క్షిప్రం – ద్రక్ష్యసి – రాఘవమ్, లక్ష్మణం – చ – ధనుష్పాణిం – లంకాద్వారమ్ – ఉపస్థితమ్ ॥

**అన్వయక్రమము** :– అరిఘ్నం సింహసంకాశం రాఘవం చ లంకాద్వారమ్ ఉపస్థితం ధనుష్పాణిం లక్ష్మణం చ క్షిప్రం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :– అరిఘ్నం = శత్రుమర్దనుడును, సింహసంకాశం = సింహ సన్నిభుడునగు, రాఘవం చ = శ్రీరాముని, లంకాద్వారం = లంకాపురద్వారమును, ఉపస్థితం = చేరినట్టి, ధనుష్పాణిం = విల్లు చేతియందు గల్గినట్టి, లక్ష్మణం చ = లక్ష్మణుని, క్షిప్రం = శీఘ్రముగా, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :– శత్రుసంహారకుడును సింహవిక్రముడునగు నీ నాథుడైన శ్రీరాముని, ధనుర్ధారియై లంకానగరద్వారమునందు నిలచియున్న నీ మరదియైన లక్ష్మణుని అచిరకాలములోనే చూడగలవు సుమా!

**శ్లో॥ నఖదంష్ట్రాయుధా న్వీరా న్సింహశార్దూలవిక్రమాన్ ।**
**వానరా న్వారణేంద్రాభాన్ క్షిప్రం ద్రక్ష్యసి సంగతాన్ ॥ 26**

**పదచ్ఛేదము** :– నఖదంష్ట్రాయుధాన్ – వీరాన్ – సింహశార్దూలవిక్రమాన్ – వానరాన్ – వారణేంద్రాభాన్ – క్షిప్రం – ద్రక్ష్యసి – సంగతాన్ ॥

**అన్వయక్రమము** :– నఖదంష్ట్రాయుధాన్ సింహశార్దూలవిక్రమాన్ వారణేంద్రాభాన్ వానరాన్ సంగతాన్ క్షిప్రం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :– నఖదంష్ట్రాయుధాన్ = గోళ్ళను, కోరలును ఆయుధములుగాగల వారును, సింహశార్దూలవిక్రమాన్ = సింహములయొక్కయు వ్యాఘ్రముల యొక్కయు విక్రమమువంటి పరాక్రమము గలవారును, వారణేంద్రాభాన్ = మత్తగజమువలె ప్రకాశించువారునగు, వానరాన్ = వానరులను, క్షిప్రం = త్వరలో, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :– తమ గోళ్ళను, కోరలను ఆయుధములుగా నుపయోగించువారును సింహములతో, వ్యాఘ్రములతో సమానమైన పరాక్రమము గలవారును మదపుటేనుగు వలె బలసి యున్నవారునగు వానరులు మహాసైన్యముగా లంకనంతయును నిండి యుండుట అచిరకాలములోనే చూడగలవు.

**శ్లో॥ శైలాంబుదనికాశానాం లంకామలయసానుషు ।**
**నర్దతాం కపిముఖ్యానా మచిరా చ్ఛ్రోష్యసి స్వనమ్ ॥ 27**

**పదచ్ఛేదము** :– శైలాంబుదనికాశానాం – లంకామలయసానుషు – నర్దతాం – కపిముఖ్యానామ్ – అచిరాత్ – శ్రోష్యసి – స్వనమ్ ॥

**అన్వయక్రమము** :– శైలాంబుదనికాశానాం లంకామలయసానుషు నర్దతాం కపిముఖ్యానాం స్వనమ్ అచిరాత్ శ్రోష్యసి.

**ప్రతిపదార్థము** :– శైలాంబుదనికాశానాం = పర్వతములతోడను, మేఘములతోడను సమానమైనట్టివారును, లంకామలయసానుషు = లంకయందలి మలయపర్వతముల యొక్క చరియలయందు, నర్దతాం = గర్జించుచున్నట్టి వారును అగు, కపిముఖ్యానాం = వానరశ్రేష్ఠులయొక్క, స్వనం = శబ్దమును, అచిరాత్ = శీఘ్రముగా, శ్రోష్యసి = వినగలవు.

**తాత్పర్యము** :– ఈ లంకానగరమునందలి మలయపర్వతపు చరియలను ఆరోహించి పెద్ద పర్వతముపై చేరిన మేఘములవలె, పెద్దయురుములవంటి గర్జనలు చేయుచున్న వానరవీరులయొక్క సింహనాదముల నతిత్వరలోనే నీవు వినగలవు.

**శ్లో॥ నివృత్తవనవాసం చ త్వయా సార్ధ మరిందమమ్ ।**
**అభిషిక్త మయోధ్యాయాం క్షిప్రం ద్రక్ష్యసి రాఘవమ్ ॥ 28**

**పదచ్ఛేదము** :– నివృత్తవనవాసం – చ – త్వయా – సార్ధమ్ – అరిందమమ్, అభిషిక్తమ్ – అయోధ్యాయాం – క్షిప్రం – ద్రక్ష్యసి – రాఘవమ్ ॥

**అన్వయక్రమము** :– అరిందమం నివృత్తవనవాసం త్వయా సార్ధమ్ అయోధ్యాయామ్ అభిషిక్తం రాఘవం క్షిప్రం ద్రక్ష్యసి.

**ప్రతిపదార్థము** :– అరిందమం = శత్రుమర్దనుడును, నివృత్తవనవాసం = ముగిసినట్టి వనవాసదీక్ష గలవాడును, త్వయా సార్ధం = నీతోగూడ, అయోధ్యాయాం = అయోధ్య యందు, అభిషిక్తం = పట్టాభిషిక్తుడయి యున్నవాడునగు, రాఘవం = శ్రీరాముని, క్షిప్రం = శీఘ్రముగా, ద్రక్ష్యసి = చూడగలవు.

**తాత్పర్యము** :– శత్రుసంహారము గావించి వనవాసవ్రతమును ముగించుకొని అయోధ్యానగరమునందు నీతోగూడ సింహాసనము నధిష్ఠించి పట్టాభిషేకము నొందు శ్రీరాముని అచిరకాలములోనే చూడగలవు.

**శ్లో॥ తతో మయా వాగ్భి రదీనభాషిణా**
**శివాభి రిష్టాభి రభిప్రసాదితా ।**
**జగామ శాంతిం మమ మైథిలాత్మజా**
**తవాపి శోకేన తథాఽభిపీడితా ॥ 29**

*ఇత్యార్షే శ్రీమద్వాల్మీకిరామాయణే*
*ఆదికావ్యే సుందరకాండే*
*"హనుమత్సమాశ్వాసన వచనానువాదో" నామ*
*అష్టషష్టితమస్సర్గః*

**పదచ్ఛేదము :–** తతః – మయా – వాగ్భిః – అదీనభాషిణా – శివాభిః – ఇష్టాభిః – అభిప్రసాదితా, జగామ – శాంతిం – మమ – మైథిలాత్మజా – తవ – అపి – శోకేన – తథా – అభిపీడితా ॥

**అన్వయక్రమము :–** తతః తవ శోకేన అపి అభిపీడితా మైథిలాత్మజా అదీనభాషిణా మయా శివాభిః ఇష్టాభిః వాగ్భిః తథా అభిప్రసాదితా (సతీ) మమ (పురతః) శాంతిం జగామ.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, తవ = నీయొక్క, శోకేన అపి = దుఃఖముచేత గూడ, అభిపీడితా = మిక్కిలి బాధింపబడినట్టి, మైథిలాత్మజా = జనకరాజపుత్రి, అదీనభాషిణా = దైన్యమును తొలగించు మాటలు పలుకుచున్నట్టి, మయా = నాచేత, శివాభిః = మంగళకరములును, ఇష్టాభిః = ప్రీతికరములునగు, వాగ్భిః = పలుకులచే, తథా = అట్లు, అభిప్రసాదితా (సతీ) = ఉపశమింపచేయబడినదై, (మమ) పురతః = నా యెదుట, శాంతిం = ఊరటను, జగామ = పొందెను.

**తాత్పర్యము :–** శ్రీరామా! తన కొరకై నీవు పొందుచున్న దుఃఖమును గూర్చి నేను చెప్పగా విని సీతమ్మ మిక్కిలి దుఃఖము నొందుచున్నది. నేను మంగళకరమైన ప్రియ వచనములతో ఆమె నూరడింపగా ఎట్లో తన దుఃఖమును దిగమ్రింగి యామె శాంతి వహించియున్నది.

*ఇది శ్రీమత్సుందరకాండమున*
*"సుబోధిని"యను ఆంధ్రవివరణమునందు*
*"హనూమత్సమాశ్వాసనవచనానువాదము" అను*
*అరువదియెనిమిదవ సర్గము.*
*హరిః ఓం తత్ సత్.*

☆☆☆

శ్రీరామాయ నమః

శ్రీరామ శరణ గురుభ్యో నమః

# అథ శ్రీరామ పట్టాభిషేక ఘట్టః

**శ్లో॥ తత స్స ప్రయతో వృద్ధో వసిష్ఠో బ్రాహ్మణైస్సహ ।**
**రామం రత్నమయే పీఠే సహసీతం న్యవేశయత్ ॥ 1**

**పదచ్ఛేదము :–** తతః – సః – ప్రయతః – వృద్ధః – వసిష్ఠః – బ్రాహ్మణైః – సహ, రామం – రత్నమయే – పీఠే – సహసీతం – న్యవేశయత్ ॥

**అన్వయక్రమము :–** తతః ప్రయతః వృద్ధః సః వసిష్ఠః బ్రాహ్మణైః సహ సహసీతం రామం రత్నమయే పీఠే న్యవేశయత్.

**ప్రతిపదార్థము :–** తతః = పిమ్మట, వృద్ధః = వృద్ధుడును, ప్రయతః = పరిశుద్ధుడును అగు, వసిష్ఠః = వసిష్ఠమహర్షి, బ్రాహ్మణైః సహ = బ్రాహ్మణులతో గూడ, సహసీతం = సీతాదేవితో గూడియున్న, రామం = శ్రీరాముని, రత్నమయే = రత్నఖచిత మైనట్టి, పీఠే = సింహాసనమునందు, న్యవేశయత్ = కూర్చుండజేసెను.

**తాత్పర్యము :–** ఐదువందల నదుల నుండియు, నాలుగు సముద్రముల నుండియు అభిషేకజలము గొని రాబడుటజూచి శత్రుఘ్నుడు మీది కార్యక్రమమునకై తనను కోరి యుండగా వృద్ధుడైన ఆ వసిష్ఠ మహర్షి పవిత్రమైన మనస్సుతో ఋత్విజులగు బ్రాహ్మణులు దగ్గరనుండగా శ్రీరాముని, సీతాదేవిని రత్నఖచితమైన బంగారు సింహాసనముపై నధిష్ఠింపజేసెను.

**శ్లో॥ వసిష్ఠో వామదేవశ్చ జాబాలి రథ కాశ్యపః ।**
**కాత్యాయన స్సుయజ్ఞశ్చ గౌతమో విజయస్తథా ॥ 2**

**అభ్యషించ న్నరవ్యాఘ్రం ప్రసన్నేన సుగంధినా ।**
**సలిలేన సహస్రాక్షం వసవో వాసవం యథా ॥ 3**

**పదచ్ఛేదము :–** వసిష్ఠః – వామదేవః – చ – జాబాలిః – అథ – కాశ్యపః, కాత్యాయనః – సుయజ్ఞః – చ – గౌతమః – విజయః – తథా, – అభ్యషించన్ – నరవ్యాఘ్రం – ప్రసన్నేన – సుగంధినా, సలిలేన – సహస్రాక్షం – వసవః –

వాసవం - యథా ॥

**అన్వయక్రమము** :- వసవః సహస్రాక్షం వాసవం యథా వసిష్ఠః వామదేవః చ, జాబాలిః అథ కాశ్యపః కాత్యాయనః సుయజ్ఞః చ, గౌతమః తథా విజయః, ప్రసన్నేన సుగంధినా సలిలేన నరవ్యాఘ్రమ్ అభ్యషించన్.

**ప్రతిపదార్థము** :- అథ = పిమ్మట, వసవః = అష్టవసువులు, సహస్రాక్షం = వేయి కన్నులు గల్గినట్టి, వాసవం యథా = దేవేంద్రునివలె, వసిష్ఠః = వసిష్ఠుడును, వామదేవశ్చ = వామదేవుడును, జాబాలిః = జాబాలియును, కాశ్యపః = కాశ్యపుడును, కాత్యాయనః = కాత్యాయనుడును, సుయజ్ఞః చ = సుయజ్ఞుడును, గౌతమః = గౌతముడును, తథా = అట్లే, విజయః = విజయుడును, ప్రసన్నేన = నిర్మలమైనట్టి, సుగంధినా = పరిమళవంతమైనట్టి, సలిలేన = జలముచే, నరవ్యాఘ్రం = పురుషశ్రేష్ఠుడైన శ్రీరాముని, అభ్యషించన్ = అభిషేకించిరి.

**తాత్పర్యము** :- అటుపిమ్మట, ఎనమండుగురు వసువులు మున్ను ముల్లోకములకు ప్రభువైన దేవేంద్రు నభిషేకించిన విధముగా వసిష్ఠుడు, వామదేవుడు, జాబాలి, కాశ్యపుడు, కాత్యాయనుడు, సుయజ్ఞుడు, గౌతముడు మరియు విజయుడు అను ఎనమండుగురు మహర్షులు పరిమళభరితమైన నిర్మలజలముతో పురుషపుంగవుడైన శ్రీరామచంద్రునికి అభిషేకము చేసిరి.

**శ్లో॥ ఋత్విగ్భి ర్బ్రాహ్మణైః పూర్వం కన్యాభి ర్మంత్రిభి స్తథా ।**
**యోధైశ్చై వాభ్యషించం స్తే సంప్రహృష్టా స్సనైగమైః ॥ 4**

**పదచ్ఛేదము** :- ఋత్విగ్భిః - బ్రాహ్మణైః - పూర్వం - కన్యాభిః - మంత్రిభిః - తథా, యోధైః - చ - ఏవ - అభ్యషించన్ - తే - సంప్రహృష్టాః - సనైగమైః ॥

**అన్వయక్రమము** :- సంప్రహృష్టాః తే పూర్వం ఋత్విగ్భిః బ్రాహ్మణైః, తథా కన్యాభిః మంత్రిభిః, సనైగమైః యోధైశ్చైవ అభ్యషించన్.

**ప్రతిపదార్థము** :- సంప్రహృష్టాః = మిక్కిలి సంతోషముతో నున్నట్టి, తే = ఆ వసిష్ఠాది మహర్షులు, పూర్వం = మొదట, ఋత్విగ్భిః = ఋత్విక్కులుగా నున్నట్టి, బ్రాహ్మణైః = బ్రాహ్మణులచేతను, తథా = అట్లు, కన్యాభిః = కన్యలచేతను, మంత్రిభిః = అమాత్యుల చేతను, అభ్యషించన్ = అభిషేకము చేయించిరి.

**తాత్పర్యము** :- అటుపిమ్మట ఆనందభరితులైన వసిష్ఠాది మహర్షులు మొదలు ఋత్విక్కులైన బ్రాహ్మణులచేతను పిమ్మట కన్యకలచేతను, మంత్రులచేతను, వణిక్ శ్రేష్ఠులచేతను, యోధులచేతనుగూడ శ్రీరామున కభిషేకము చేయించిరి.

**శ్లో॥ సర్వౌషధిరసై ర్దివ్యై ర్దైవతై ర్నభసి స్థితైః ।**
**చతుర్భి ర్లోకపాలైశ్చ సర్వై ర్దేవైశ్చ సంగతైః ॥ 5**

**పదచ్ఛేదము** :– సర్వౌషధిరసైః – దివ్యైః – దైవతైః – నభసి – స్థితైః – చతుర్భిః – లోకపాలైః – చ – సర్వైః – దేవైః – చ – సంగతైః ॥

**అన్వయక్రమము** :– నభసి స్థితైః దైవతైః చతుర్భిః లోకపాలైః చ, సంగతైః సర్వైః దేవైః చ, దివ్యైః సర్వౌషధిరసైః అభ్యషించన్.

**ప్రతిపదార్థము** :– నభసి = ఆకాశమునందు, స్థితైః = ఉన్నట్టి, దైవతైః = దేవతాశ్రేష్ఠులైన, చతుర్భిః = నలుగురైన, లోకపాలైః చ = దిక్పాలకులచేతను, సంగతైః = చేరియున్న, సర్వైః దేవైః చ = సమస్త దేవతలచేతను, దివ్యైః = దివ్యములైనట్టి, సర్వౌషధిరసైః = సమస్త ఓషధీరసములతో, అభ్యషించన్ = అభిషేకము చేయించిరి.

**తాత్పర్యము** :– అప్పుడా వసిష్ఠాది మహర్షులు శ్రీరామపట్టాభిషేకోత్సవమును దర్శింపవచ్చి ఆకసమున నిలచియున్నట్టి ఇంద్ర, యమ, వరుణ, కుబేరు లను నలుగురు దిక్పాలకులచేతను అచటికి చేరియున్న దేవతలందరిచేతను విశేషమైన దివ్యౌషధీ రసములతో శ్రీరాముని కభిషేకము చేయించిరి.

**శ్లో॥ బ్రహ్మణా నిర్మితం పూర్వం కిరీటం రత్నశోభితమ్ ।**
**అభిషిక్తః పురా యేన మను స్తం దీప్తతేజసమ్ ॥ 6**

**శ్లో॥ త స్యాన్వవాయే రాజానః క్రమా ద్యే నాభిషేచితాః ।**
**సభాయాం హేమక్లృప్తాయాం శోభితాయాం మహాజనైః ॥ 7**

**శ్లో॥ రత్నై ర్నానావిధైశ్చైవ చిత్రితాయాం సుశోభనైః ।**
**నానారత్నమయే పీఠే కల్పయిత్వా యథావిధి ॥ 8**

**శ్లో॥ కిరీటేన తతః పశ్చా ద్వసిష్ఠేన మహాత్మనా ।**
**ఋత్విగ్భి ర్భూషణైశ్చైవ సమయోక్ష్యత రాఘవః ॥ 9**

**పదచ్ఛేదము** :– బ్రహ్మణా – నిర్మితం – పూర్వం – కిరీటం – రత్నశోభితమ్, అభిషిక్తః – పురా – యేన – మనుః – తం – దీప్తతేజసమ్, తస్య – అన్వవాయే – రాజానః – క్రమాత్ – యేన – అభిషేచితాః – సభాయాం – హేమక్లృప్తాయాం – శోభితాయాం – మహాజనైః, రత్నైః – నానావిధైః – చ – ఏవ – చిత్రితాయాం – సుశోభనైః, నానారత్నమయే – పీఠే – కల్పయిత్వా – యథావిధి, కిరీటేన – తతః –

పశ్చాత్ – వసిష్ఠేన – మహాత్మనా – ఋత్విగ్భిః – భూషణైః చ – ఏవ – సమయోక్ష్యత – రాఘవః ॥

**అన్వయక్రమము** :– పూర్వం బ్రాహ్మణా నిర్మితం రత్నశోభితం, పురా మనుః యేన అభిషిక్తః, తస్య అన్వవాయే రాజానః క్రమాత్ యేన అభిషేచితాః, తం దీప్తతేజసం కిరీటం, మహాజనైః శోభితాయాం, సుశోభనైః నానావిధైః రత్నైః చిత్రితాయాం, హేమక్లృప్తాయాం, సభాయాం నానారత్నమయే పీఠే యథావిధి కల్పయిత్వా తతః పశ్చాత్ మహాత్మనా వసిష్ఠేన ఋత్విగ్భిః తేన కిరీటేన భూషణైః చైవ రాఘవః సమయోక్ష్యత.

**ప్రతిపదార్థము** :– పూర్వం = పూర్వకాలమున, బ్రాహ్మణా = బ్రహ్మదేవునిచే, నిర్మితం = నిర్మింపబడినదియును, రత్నశోభితం = రత్నములతో ప్రకాశించుచున్నదియును, పురా = పూర్వము, మనుః = వైవస్వతమనువు, యేన = దేనిచేతనయితే, అభిషిక్తః = అభిషేకింపబడియుండెనో, తం = ఆ, దీప్తతేజసం = జ్వలించుచున్న తేజస్సు గలిగినట్టి, కిరీటం = కిరీటమును, మహాజనైః = మహాజనులతో, శోభితాయాం = శోభిల్లుచున్నదియును, సుశోభనైః = మిక్కిలి మంగళకరములగు, నానావిధైః = బహువిధములగు, రత్నైః చైవ = రత్నములచేతను, చిత్రితాయాం = అలంకరింపబడినట్టి, హేమక్లృప్తాయాం = సువర్ణముచే నిర్మింపబడినట్టి, సభాయాం = సభామందిరమునందు, నానారత్నమయే = బహురత్ననిర్మితమైన, పీఠే = పీఠమునందు, యథావిధి = శాస్త్రమునననుసరించి, కల్పయిత్వా = ఆసీనుని చేసి, తతః పశ్చాత్ = అటుపిమ్మట, మహాత్మనా = మహనీయుడైనట్టి, వసిష్ఠేన = వసిష్ఠ మహర్షిచేతను, ఋత్విగ్భిః = ఋత్విక్కులచేతను, తేన కిరీటేన = ఆ కిరీటముతోడను, భూషణైః చైవ = ఆభరణముల తోడను, రాఘవః = శ్రీరాముడు, సమయోక్ష్యత = అలంకరింపబడెను.

**తాత్పర్యము** :– ఏ కిరీటమును పూర్వము బ్రహ్మదేవుడు స్వయముగ నిర్మింపజేసి యుండెనో, ఏ కిరీటముచే పూర్వము వైవస్వతమను వభిషేకింపబడెనో అది మొదలు ఆతని వంశమునందలి రాజులెల్లరును వరుసగా ఏ కిరీటముతో నభిషేకించబడిరో, రత్నశోభితమై వెల్గొందుచున్నట్టి ఆ దివ్యకిరీటమును, మహాజనులతో విలసిల్లుచు ఉజ్జ్వలములైన రత్నములతో ప్రకాశించుచున్నట్టి ఆ సభాభవనమునందు ముందుగా ఒక రత్నమయపీఠముపై నిల్పి యథాశాస్త్రముగా నర్చించి మహాత్ముడైన వసిష్ఠుడు, మిగిలిన ఋత్విక్కులతో గూడి రత్నమయసింహాసనముపై నధిష్ఠించియున్న శ్రీరాముని ఆ అర్చింపబడిన కిరీటముతోడను వివిధములైన ఆభరణములతోడను అలంకరించెను.

**శ్లో॥ ఛత్రం తు తస్య జగ్రాహ శత్రుఘ్నః పాండురం శుభమ్ ।**
**శ్వేతం చ వాలవ్యజనం సుగ్రీవో వానరేశ్వరః ॥ 10**

**పదచ్ఛేదము :–** ఛత్రం – తు – తస్య – జగ్రాహ – శత్రుఘ్నః – పాండురం – శుభమ్, శ్వేతం – చ – వాలవ్యజనం – సుగ్రీవః – వానరేశ్వరః ॥

**అన్వయక్రమము :–** శత్రుఘ్నః తస్య పాండురం శుభం ఛత్రం జగ్రాహ, వానరేశ్వరః సుగ్రీవః చ శ్వేతం వాలవ్యజనం జగ్రాహ.

**ప్రతిపదార్థము :–** శత్రుఘ్నః = శత్రుఘ్నుడు, తస్య = ఆ శ్రీరామునకు, శుభం = మంగళకరమైన, పాండురం ఛత్రం = తెల్లని గొడుగును, జగ్రాహ = పట్టెను, వానరేశ్వరః = వానరప్రభువైన, సుగ్రీవః = సుగ్రీవుడు, శ్వేతం వాలవ్యజనం = తెల్లని చామరమును, జగ్రాహ = పట్టెను.

**తాత్పర్యము :–** అట్లు పట్టాభిషిక్తుడైన శ్రీరామునకు శత్రుఘ్నుడు మంగళప్రదమైన శ్వేతఛత్రమును పట్టి నిలచెను. వానరరాజైన సుగ్రీవుడు తెల్లని చామరమును వీచుచుండెను.

**శ్లో॥ అపరం చంద్రసంకాశం వాలవ్యజన ముత్తమమ్ ।**
**హృష్టో రామస్య జగ్రాహ రాక్షసేంద్రో విభీషణః ॥ 11**

**పదచ్ఛేదము :–** అపరం – చంద్రసంకాశం – వాలవ్యజనమ్ – ఉత్తమమ్, హృష్టః – రామస్య – జగ్రాహ – రాక్షసేంద్రః – విభీషణః ॥

**అన్వయక్రమము :–** హృష్టః రాక్షసేంద్రః విభీషణః రామస్య చంద్రసంకాశమ్ ఉత్తమం అపరం వాలవ్యజనం జగ్రాహ.

**ప్రతిపదార్థము :–** హృష్టః = ఆనందభరితుడైన, రాక్షసేంద్రః = రాక్షసరాజగు, విభీషణః = విభీషణుడు, రామస్య = శ్రీరామునకు, చంద్రసంకాశం = చంద్రుని బోలినట్టి, ఉత్తమం = శ్రేష్ఠమైన, అపరం వాలవ్యజనం = ఇంకొక వింజామరమును, జగ్రాహ = పట్టెను.

**తాత్పర్యము :–** మహానందభరితుడైన రాక్షసరాజగు విభీషణుడు చంద్రునివలె తెల్లని కాంతుల నీనుచున్నట్టి వేరొక వింజామరమునుపట్టి శ్రీరామునకు వీచుచుండెను.

**శ్లో॥ మాలాం జ్వలంతీం వపుషా కాంచనీం శతపుష్కరామ్ ।**
**రాఘవాయ దదౌ వాయు ర్వాసవేన ప్రచోదితః ॥ 12**

**పదచ్ఛేదము** :- మాలాం - జ్వలంతీం - వపుషా - కాంచనీం - శతపుష్కరామ్, రాఘవాయ - దదౌ - వాయుః - వాసవేన - ప్రచోదితః ॥

**అన్వయక్రమము** :- వపుషా జ్వలంతీం కాంచనీం శతపుష్కరాం మాలాం వాసవేన ప్రచోదితః వాయుః రాఘవాయ దదౌ.

**ప్రతిపదార్థము** :- వపుషా = దేవేంద్రునిచే, ప్రచోదితః = ప్రేరేపింపబడినవాడై, వాయుః = వాయుదేవుడు, రాఘవాయ = శ్రీరామునకు, వపుషా = స్వరూపముచే, జ్వలంతీం = మిక్కిలిగా ప్రకాశించుచున్నట్టి, కాంచనీం = సువర్ణమయమైనట్టి, శత పుష్కరాం = నూరు తామరపూవులుగల, మాలాం = మాలికను, దదౌ = ఇచ్చెను.

**తాత్పర్యము** :- అప్పుడు శ్రీరామునకు దేవేంద్రుడు వాయుదేవునిద్వారా గొప్పకాంతితో ప్రజ్వరిల్లుచున్న స్వర్ణమయమైన నూరుతామరపువ్వులుగల ఒక మాలికను కానుకగా సమర్పించెను.

**శ్లో॥ సర్వరత్నసమాయుక్తం మణిరత్నవిభూషితమ్ ।**
**ముక్తాహారం నరేంద్రాయ దదౌ శక్రప్రచోదితః ॥ 13**

**పదచ్ఛేదము** :- సర్వరత్నసమాయుక్తం - మణిరత్నవిభూషితమ్, ముక్తాహారం - నరేంద్రాయ - దదౌ - శక్రప్రచోదితః ॥

**అన్వయక్రమము** :- నరేంద్రాయ శక్రప్రచోదితః (వాయుః) సర్వరత్నసమాయుక్తం మణిరత్నవిభూషితం ముక్తాహారం దదౌ.

**ప్రతిపదార్థము** :- శక్రప్రచోదితః = దేవేంద్రునిచే ప్రేరేపింపబడినట్టి, (వాయుః = వాయుదేవుడు), నరేంద్రాయ = శ్రీరామునికొరకు, సర్వరత్నసమాయుక్తం = సర్వవిధములైన రత్నములతో గూడియున్నదియును, మణిరత్నవిభూషితం = శ్రేష్ఠమైన ప్రత్యేకమణితో నలంకరింపబడినదియునగు, ముక్తాహారం = ముత్యాలహారమును గూడ, దదౌ = ఒసగెను.

**తాత్పర్యము** :- దేవేంద్రునిచే ప్రోత్సహించబడిన వాయుదేవుడు శ్రీరామునకు అప్పుడు నవవిధరత్నములతో గూడి నాయకమణిగా అమూల్యమైన వేరొక గొప్పమణితో నిర్మింపబడిన వేరొక మంచి ముత్యాలహారమునుగూడ కానుకగా నర్పించెను.

**శ్లో॥ ప్రజగు ర్దేవగంధర్వా ననృతు శ్చాప్సరోగణాః ।**
**అభిషేకే తదర్హస్య తదా రామస్య ధీమతః ॥ 14**

**పదచ్ఛేదము** :– ప్రజగుః – దేవగంధర్వాః – ననృతుః – చ – అప్సరోగణాః, అభిషేకే – తదర్హస్య – తదా – రామస్య – ధీమతః ॥

**అన్వయక్రమము** :– తదా ధీమతః తదర్హస్య రామస్య అభిషేకే దేవగంధర్వాః ప్రజగుః, అప్సరోగణాః ననృతుః చ.

**ప్రతిపదార్థము** :– తదా = అప్పుడు, ధీమతః = బుద్ధిశాలియైన, తదర్హస్య = పట్టాభిషేకమున కర్హుడైనట్టి, రామస్య = శ్రీరాముని యొక్క, అభిషేకే = అభిషేకమున, దేవగంధర్వాః = దేవతలు గంధర్వులును, ప్రజగుః = గొప్పగా పాడిరి. అప్సరోగణాః = అప్సరసల సమూహములు, ననృతుః చ = నృత్యమును గూడ చేసిరి.

**తాత్పర్యము** :– మహాత్ముడైన సర్వసమర్థుడగు శ్రీరాముని పట్టాభిషేక సమయమునందు దేవగంధర్వులు మహానందముతో గానము చేసిరి. అప్సర స్త్రీలు హర్షాతిశయముతో నృత్య మొనర్చిరి.

**శ్లో॥ భూమి స్సస్యవతీ చైవ ఫలవంతశ్చ పాదపాః ।**
**గంధవంతి చ పుష్పాణి బభూవూ రాఘవోత్సవే ॥ 15**

**పదచ్ఛేదము** :– భూమిః – సస్యవతీ – చ – ఏవ – ఫలవంతః – చ – పాదపాః, గంధవంతి – చ – పుష్పాణి – బభూవుః – రాఘవోత్సవే ॥

**అన్వయక్రమము** :– రాఘవోత్సవే భూమిః సస్యవతీ (బభూవ), పాదపాః ఫలవంతః (బభూవుః), పుష్పాణి గంధవంతి (బభూవుః).

**ప్రతిపదార్థము** :– రాఘవోత్సవే = శ్రీరాముని పట్టాభిషేకోత్సవ సమయమున, భూమిః = భూమి, సస్యవతీ = సస్యసంపన్నమైనది, (బభూవ = ఆయెను), పాదపాః = వృక్షములు, ఫలవంతః = ఫలసమృద్ధిగలవి, (బభూవుః = అయినవి), పుష్పాణి = పుష్పములు, గంధవంతి = పరిమళ భరితములు, (బభూవుః = అయినవి).

**తాత్పర్యము** :– శ్రీరాముని వియోగముచే ప్రజలతోబాటు చింతలో మునిగియున్న ప్రకృతియంతయును శ్రీరామపట్టాభిషేకోత్సవమునకు ప్రజలవలెనే మహానందము ననుభవించినది. భూమి ఎల్లయెడలను సకలసస్యసంభరితమై ఒప్పెను. వృక్షములన్నియు ఫలసమృద్ధి వహించియుండెను, పుష్పములు దివ్యమైన సౌరభమును వెదజల్లుచుండెను.

**శ్లో॥ సహస్రశత మశ్వానాం ధేనూనాం చ గవాం తథా ।**
**దదౌ శతం వృషాన్ పూర్వం ద్విజేభ్యో మనుజర్షభః ॥ 16**

**పదచ్ఛేదము** :- సహస్రశతం - అశ్వానాం - ధేనూనాం - చ - గవాం - తథా, దదౌ - శతం - వృషాన్ - పూర్వం - ద్విజేభ్యః - మనుజర్షభః ॥

**అన్వయక్రమము** :- మనుజర్షభః పూర్వం ద్విజేభ్యః అశ్వానాం చ ధేనూనాం చ తథా గవాం చ సహస్రశతం శతం వృషాన్ చ దదౌ.

**ప్రతిపదార్థము** :- మనుజర్షభః = మనుజశ్రేష్ఠుడైన శ్రీరాముడు, పూర్వం = ముందుగా, ద్విజేభ్యః = బ్రాహ్మణులకొరకు, అశ్వానాం = అశ్వములయొక్కయు, ధేనూనాం = పాడియావులయొక్కయు, గవాం = శ్రేష్ఠమైన గోవులయొక్కయు, సహస్రశతం = లక్షసంఖ్యగలవానిని, శతం = వందసంఖ్యగల, వృషాన్ = వృషభములను, దదౌ = ఇచ్చెను.

**తాత్పర్యము** :- పట్టాభిషిక్తుడైన శ్రీరాముడు మొట్టమొదట బ్రాహ్మణులకు లక్ష అశ్వములను, లక్ష ధేనువులను, లక్ష మేలుజాతిగోవులను, వంద ఆబోతులను దాన మొసగెను.

**శ్లో॥ త్రింశత్కోటీ ర్హిరణ్యస్య బ్రాహ్మణేభ్యో దదౌ పునః ।**
**నానాభరణవస్త్రాణి మహార్హాణి చ రాఘవః ॥ 17**

**పదచ్ఛేదము** :- త్రింశత్కోటీః - హిరణ్యస్య - బ్రాహ్మణేభ్యః - దదౌ - పునః, నానాభరణవస్త్రాణి - మహార్హాణి - చ - రాఘవః ॥

**అన్వయక్రమము** :- రాఘవః పునః బ్రాహ్మణేభ్యః హిరణ్యస్య త్రింశత్‌కోటీః మహార్హాణి నానాభరణవస్త్రాణి చ దదౌ.

**ప్రతిపదార్థము** :- రాఘవః = శ్రీరాముడు, పునః = తిరిగి, బ్రాహ్మణేభ్యః = విప్రుల కొరకు, హిరణ్యస్య = బంగారు నాణెములయొక్క, త్రింశత్ కోటీః = ముప్పదికోట్లను, మహార్హాణి = మిక్కిలి విలువైనట్టి, నానాభరణవస్త్రాణి చ = బహువిధములగు భూషణములను, వస్త్రములను, దదౌ = ఒసగెను.

**తాత్పర్యము** :- శ్రీరాము డప్పుడు బ్రాహ్మణులకు తిరిగి ముప్పది కోట్ల బంగారు నాణెములను గొప్ప విలువగల్గినట్టి బహువిధములగు ఆభరణములను చీనాం బరములను దాన మొసగెను.

**శ్లో॥ అర్కరశ్మిప్రతీకాశాం కాంచనీం మణివిగ్రహామ్ ।**
**సుగ్రీవాయ స్రజం దివ్యాం ప్రాయచ్ఛ న్మనుజేశ్వరః ॥ 18**

**పదచ్ఛేదము** :- అర్కరశ్మిప్రతీకాశాం - కాంచనీం - మణివిగ్రహామ్, సుగ్రీవాయ - స్రజం - దివ్యాం - ప్రాయచ్ఛత్ - మనుజేశ్వరః ॥

**అన్వయక్రమము** :- మనుజేశ్వరః సుగ్రీవాయ అర్కరశ్మిప్రతీకాశాం మణివిగ్రహాం దివ్యాం కాంచనీం స్రజం ప్రాయచ్ఛత్.

**ప్రతిపదార్థము** :- మనుజేశ్వరః = మహారాజైన శ్రీరాముడు, సుగ్రీవాయ = సుగ్రీవునికి, అర్కరశ్మిప్రతీకాశాం = సూర్యకిరణములవలె ప్రకాశించునదియును, మణివిగ్రహాం = రత్నవిగ్రహము గలదియును, దివ్యాం = దివ్యమైనట్టిదియును అగు, కాంచనీం = సువర్ణనిర్మితమైనట్టి, దివ్యాం = దివ్యమైన, స్రజం = మాలికను, ప్రాయచ్ఛత్ = ఒసగెను.

**తాత్పర్యము** :- పిమ్మట శ్రీరాముడు సుగ్రీవునకు సూర్యకిరణముల ప్రకాశమువంటి తేజస్సు గలిగి మణివిగ్రహములతో కూడియున్న ఒకానొక దివ్యమైన సువర్ణమాలికను బహుమానముగా నొసగెను.

**శ్లో॥ వైదూర్యమణిచిత్రే చ వజ్రరత్నవిభూషితే ।**
**వాలిపుత్రాయ ధృతిమా నంగదా యాంగదే దదౌ ॥** **19**

**పదచ్ఛేదము** :- వైదూర్యమణిచిత్రే - చ - వజ్రరత్నవిభూషితే, వాలిపుత్రాయ - ధృతిమాన్ - అంగదాయ - అంగదే - దదౌ ॥

**అన్వయక్రమము** :- ధృతిమాన్ వాలిపుత్రాయ అంగదాయ వైదూర్యమణిచిత్రే వజ్రరత్నవిభూషితే చ అంగదే దదౌ.

**ప్రతిపదార్థము** :- ధృతిమాన్ = ఉత్సాహవంతుడైన శ్రీరాముడు, వాలిపుత్రాయ = వాలికుమారుడైనట్టి, అంగదాయ = అంగదుని కొరకు, వైదూర్యమణిచిత్రే = వైదూర్యరత్నములయొక్క చిత్రములు గలవియును, వజ్రరత్నవిభూషితే చ = గొప్ప వజ్రములతో పొదగబడియున్నవియునగు, అంగదే = రెండు భుజకీర్తులను, దదౌ = ఇచ్చెను.

**తాత్పర్యము** :- తరువాత శ్రీరాముడు వాలిపుత్రుడైన అంగదునకు సుందరమైన వైదూర్యరత్నములును గొప్పగొప్ప వజ్రములును పొదిగిన సుందరమైన రెండు భుజకీర్తులను ఇచ్చెను.

**శ్లో॥ మణిప్రవరజుష్టం చ ముక్తాహారమనుత్తమమ్ ।**
**సీతాయై ప్రదదౌ రామ శ్చంద్రరశ్మిసమప్రభమ్ ॥** **20**

**పదచ్ఛేదము** :– మణిప్రవరజుష్టం – చ – ముక్తాహారమ్ – అనుత్తమమ్, సీతాయై – ప్రదదౌ – రామః – చంద్రరశ్మిసమప్రభమ్ ॥

**అన్వయక్రమము** :– రామః మణిప్రవరజుష్టం చంద్రరశ్మిసమప్రభమ్ అనుత్తమం చ ముక్తాహారం సీతాయై ప్రదదౌ.

**ప్రతిపదార్థము** :– రామః = శ్రీరాముడు, మణిప్రవరజుష్టం = శ్రేష్ఠమైన రత్నములతో గూడినదియును, చంద్రరశ్మిసమప్రభం = చంద్రకిరణములతో సమానమైన కాంతి గలదియునగు, అనుత్తమం చ = సర్వశ్రేష్ఠమైనదియునగు, ముక్తాహారం = ముత్యాలహారమును, సీతాయై = సీతాదేవికొరకు, ప్రదదౌ = ఇచ్చెను.

**తాత్పర్యము** :– అటుపిమ్మట శ్రీరాముడు శ్రేష్ఠమైన రత్నములతో నిర్మింపబడి చంద్రకిరణములవంటి కాంతులను విరజిమ్ముచున్న సర్వశ్రేష్ఠమైన ఒక మంచి ముత్యాలహారమును సీతాదేవి కొసగెను.

**శ్లో॥ అరజే వాససీ దివ్యే శుభా న్యాభరణాని చ ।**
**అవేక్షమాణా వైదేహీ ప్రదదౌ వాయుసూనవే ॥ 21**

**పదచ్ఛేదము** :– అరజే – వాససీ – దివ్యే – శుభాని – ఆభరణాని – చ, అవేక్షమాణా – వైదేహీ – ప్రదదౌ – వాయుసూనవే ॥

**అన్వయక్రమము** :– వైదేహీ అవేక్షమాణా వాయుసూనవే అరజే దివ్యే వాససీ చ, శుభాని ఆభారణాని చ ప్రదదౌ.

**ప్రతిపదార్థము** :– వైదేహీ = జానకీదేవి, అవేక్షమాణా = (భర్తను) చూచుచున్నదై, అరజే = ధూళియంటనట్టి, దివ్యే = దివ్యమైనట్టి, వాససీ = రెండు వస్త్రములను, శుభాని = మంగళకరమైనట్టి, ఆభరణాని చ = ఆభరణములను, వాయుసూనవే = వాయునందనునకు, ప్రదదౌ = ఒసగెను.

**తాత్పర్యము** :– అంత జానకీదేవి తన భర్త ముఖమును విలోకించుచు ధూళియంటనట్టి దివ్యమైన వస్త్రయుగ్మమును, మంగళకరమైనట్టి పెక్కు ఆభరణములను హనుమకు బహుమానముగా నొసగెను.

**శ్లో॥ అవము చ్యాత్మనః కంఠా ద్ధారం జనకనందినీ ।**
**అవైక్షత హరీ న్సర్వా న్భర్తారం చ ముహుర్ముహుః ॥ 22**

**పదచ్ఛేదము** :– అవముచ్య – ఆత్మనః – కంఠాత్ – హారం – జనకనందినీ, అవైక్షత – హరీన్ – సర్వాన్ – భర్తారం – చ – ముహుః – ముహుః ॥

**అన్వయక్రమము** :- జనకనందినీ ఆత్మనః కంఠాత్ హారమ్ అవముచ్య, సర్వాన్ హరీన్ భర్తారం చ ముహుః ముహుః అవైక్షత.

**ప్రతిపదార్థము** :- జనకనందినీ = జనకమహారాజపుత్రికయైన సీతాదేవి, ఆత్మనః = తనయొక్క, కంఠాత్ = కంఠమునుండి, హారం = ముత్యాలహారమును, అవముచ్య = ఈవలికి తీసి, హరీన్ = వానరులను, సర్వాన్ = అందరిని, భర్తారం చ = భర్తను, ముహుః ముహుః = మరల మరల, అవైక్షత = చూచుచుండెను.

**తాత్పర్యము** :- పిమ్మట జానకీదేవి తన కంఠమునందు అలంకరించుకొన్న దివ్యమైన ముత్యాలహారమును ఈవలికి తీసి చేత బట్టుకొని అచ్చటనున్న వానరులందరివైపును, భర్తముఖమును మరల మరల చూచుచుండెను.

**శ్లో॥ తా మింగితజ్ఞ స్సంప్రేక్ష్య బభాషే జనకాత్మజామ్ ।**
**ప్రదేహి సుభగే హారం యస్య తుష్టాసి భామిని ।**
**పౌరుషం విక్రమో బుద్ధి ర్యస్మి న్నేతాని సర్వశః ॥ 23**

**పదచ్ఛేదము** :- తామ్ - ఇంగితజ్ఞః - సంప్రేక్ష్య - బభాషే - జనకాత్మజామ్, ప్రదేహి - సుభగే - హారం - యస్య - తుష్టా - అసి - భామిని, పౌరుషం - విక్రమః - బుద్ధిః - యస్మిన్ - ఏతాని - సర్వశః ॥

**అన్వయక్రమము** :- ఇంగితజ్ఞః (రామః) తాం జనకాత్మజాం సంప్రేక్ష్య బభాషే. సుభగే! భామిని! యస్య (త్వం) తుష్టా అసి పౌరుషం విక్రమః బుద్ధిః ఏతాని సర్వశః యస్మిన్ (సంతి) హారం (తస్మై) ప్రదేహి.

**ప్రతిపదార్థము** :- ఇంగితజ్ఞః = పరుల యభిప్రాయమును తెలిసికొనగల్గిన వాడైనట్టి, (రామః = శ్రీరాముడు), తాం = ఆ, జనకాత్మజాం = జానకీదేవిని, సంప్రేక్ష్య = చూచి, బభాషే = పలికెను, సుభగే = ఓ సౌభాగ్యవతీ! యస్య = ఎవనికి, త్వం = నీవు, తుష్టా అసి = సంతోషించినదాన వగుచున్నావో, యస్మిన్ = ఎవనియం దయితే, పౌరుషం = పౌరుషము, విక్రమః = పరాక్రమము, (బుద్ధిః = తెలివి అను), ఏతాని = ఈ సద్గుణములు, సర్వశః = అన్నివిధముల, (సంతి = ఉన్నవో), హారం = హారమును, తస్మై = వానికి, ప్రదేహి = ఒసగుము.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

"సుభగే యస్య తుష్టాసి" - అనుటచే నీ సౌభాగ్యమునకు కారణమైన మహనీయుడని నీ వెవనియెడ సంతుష్టి నొందియున్నావో అట్టి గుణశాలి కొసగుమని

ఆ సంబోధనలోనే ధ్వనింపచేయబడినది.

**తాత్పర్యము :–** తనవైపు చూచుచున్న సీతాదేవియొక్క మనస్సునందలి అభిప్రాయమును శ్రీరాముడు వెంటనే గ్రహించి ఆమెకు తన అనుమతిని తెలుపుచు ఆమెను జూచి "ఓ కోమలీ! నీ వెవ్వనియెడ సంతోషము నొందియుంటివో ఎవ్వనియందు సర్వకార్య నిర్వహణములయందును పౌరుషము పరాక్రమము వివేకము అను సద్గుణములు నిత్యము వెలయుచుండునో అట్టి ఉత్తమునకు నీ వీ హారమును బహుమానముగా ఇమ్ము అనెను.

**శ్లో॥ దదౌ సా వాయుపుత్రాయ తం హార మసితేక్షణా ।**
**హనుమాం స్తేన హారేణ శుశుభే వానరర్షభః ।**
**చంద్రాంశుచయగౌరేణ శ్వేతాభ్రేణ యథాఽచలః ॥ 24**

**పదచ్ఛేదము :–** దదౌ – సా – వాయుపుత్రాయ – తం – హారమ్ – అసితేక్షణా, హనుమాన్ – తేన – హారేణ – శుశుభే – వానరర్షభః, చంద్రాంశుచయగౌరేణ – శ్వేతాభ్రేణ – యథా – అచలః ॥

**అన్వయక్రమము :–** సా అసితేక్షణా తం హారం వాయుపుత్రాయ దదౌ, వానరర్షభః తేన హారేణ చంద్రాంశుచయగౌరేణ శ్వేతాభ్రేణ అచలః యథా శుశుభే.

**ప్రతిపదార్థము :–** సా = ఆ, అసితేక్షణా = నల్లని కన్నులుగల సీతాదేవి, తం = ఆ, హారం = హారమును, వాయుపుత్రాయ = వాయునందనునకు, దదౌ = ఇచ్చెను, హనుమాన్ = ఆ వాయునందనుడైన, వానరర్షభః = వానరశ్రేష్ఠుడు, తేన = ఆ, హారేణ = ముత్యాలహారముచే, చంద్రాంశుచయగౌరేణ = చంద్రకిరణముల యొక్క సమూహముచే తెల్లనైనట్టి, శ్వేతాభ్రేణ = తెల్లని మేఘముచే, అచలః యథా = పర్వతమువలె, శుశుభే = ప్రకాశించెను.

**తాత్పర్యము :–** సీతాదేవి అట్లు భర్త అనుమతిని పొంది తన చేతిలోని ఆ ముత్యాలహారమును సముద్రలంఘనముచే బలమును, లంకాదహనముచే విక్రమమును, అశోకవనికాప్రవేశముచే బుద్ధిబలమును చూపినట్టి వాయునందనునకు బహుమానముగ నొసగెను. దివ్యమైన ఆ హారమును తన వక్షమున ధరించిన హనుమ చంద్రకిరణముల కాంతిచే మిక్కిలి తెల్లనైయున్న శరత్కాలపు మేఘముతో కూడియున్న పర్వతమువలె మిక్కిలి శోభిల్లెను.

**శ్లో॥ తతో ద్వివిదమైందాభ్యాం నీలాయ చ పరంతపః ।**
**సర్వా న్కామగుణా న్వీక్ష్య ప్రదదౌ వసుధాధిపః ॥ 25**

**పదచ్ఛేదము :–** తతః – ద్వివిదమైందాభ్యాం – నీలాయ – చ – పరంతపః, సర్వాన్ – కామగుణాన్ – వీక్ష్య – ప్రదదౌ – వసుధాధిపః ॥

**అన్వయక్రమము :–** తతః పరంతపః వసుధాధిపః వీక్ష్య ద్వివిదమైందాభ్యాం నీలాయ చ సర్వాన్ కామగుణాన్ ప్రదదౌ.

**ప్రతిపదార్థము :–** తతః = అటుపిమ్మట, పరంతపః = శత్రుమర్దనుడైన, వసుధాధిపః = రామభూపతి, వీక్ష్య = చూచి, ద్వివిదమైందాభ్యాం = ద్వివిదునకును మైందునకును, నీలాయ చ = నీలునకును, సర్వాన్ = సమస్తమైన, కామగుణాన్ = ఇష్టములైన వస్తువులను, ప్రదదౌ = బహూకరించెను.

**తాత్పర్యము :–** అటుపిమ్మట శత్రుభీకరుడైన శ్రీరాముడు అచ్చటి వానరవీరులను జూచుచు కవలలైన ద్వివిదునకును మైందునకును మరియు నీలునకును వారివారికి అభీష్టములైనట్టి శ్రేష్ఠములైన ఆభరణాదికములను బహూకరించెను.

**శ్లో॥ సర్వే వానరవృద్ధాశ్చ యే చాన్యే వానరేశ్వరాః ।**
**వాసోభి ర్భూషణైశ్చైవ యథార్హం ప్రతిపూజితాః ॥ 26**

**పదచ్ఛేదము :–** సర్వే – వానరవృద్ధాః – చ – యే – చ – అన్యే – వానరేశ్వరాః, వాసోభిః – భూషణైః – చ – ఏవ – యథార్హం – ప్రతిపూజితాః ॥

**అన్వయక్రమము :–** సర్వే వానరవృద్ధాః చ అన్యే యే వానరేశ్వరాః (తే) చ వాసోభిః భూషణైః చ ఏవ యథార్హం ప్రతిపూజితాః.

**ప్రతిపదార్థము :–** సర్వే వానరవృద్ధాః చ = ఎల్లవానరవృద్ధులును, అన్యే = ఇతరులైన, యే వానరేశ్వరాః = ఏ వానరశ్రేష్ఠులుగలరో, (తే) చ = వారును, వాసోభిః = వస్త్రములచేతను, భూషణైః చైవ = ఆభరణములచేతను, యథార్హం = అర్హత ననుసరించి, ప్రతిపూజితాః = సత్కరింపబడిరి.

**తాత్పర్యము :–** పిమ్మట శ్రీరాముడు వానరవృద్ధు లెల్లరిని, మిగిలిన కపిశ్రేష్ఠులను అందరిని గూడ వారి వారి అర్హతకు తగిన విధముగ విలువగల వస్త్రములతోడను ఆభరణములతోడను సత్కరించెను.

**శ్లో॥ విభీషణోఽథ సుగ్రీవో హనుమాన్ జాంబవాం స్తథా ।**
**సర్వే వానరముఖ్యాశ్చ రామేణాక్లిష్టకర్మణా ॥ 27**

**శ్లో॥ యథార్హం పూజితా స్సర్వైః కామై రత్నైశ్చ పుష్కలైః ।**
**ప్రహృష్టమనస స్సర్వే జగ్మురేవ యథాగతమ్ ॥ 28**

**పదచ్ఛేదము** :- విభీషణః - అథ - సుగ్రీవః - హనుమాన్ - జాంబవాన్ - తథా, సర్వే - వానరముఖ్యాః - చ - రామేణ - అక్లిష్టకర్మణా, యథార్హం - పూజితాః - సర్వైః - కామైః - రత్నైః - చ - పుష్కలైః, ప్రహృష్టమనసః - సర్వే - జగ్ముః - ఏవ - యథాగతమ్ ॥

**అన్వయక్రమము** :- అథ అక్లిష్టకర్మణా రామేణ విభీషణః సుగ్రీవః హనుమాన్ జాంబవాన్ తథా సర్వే వానరముఖ్యాః చ యథార్హం పుష్కలైః రత్నైః చ సర్వైః కామైః చ పూజితాః (సంతః) సర్వే ప్రహృష్టమనసః యథాగతం జగ్ముః.

**ప్రతిపదార్థము** :- అథ = అటుపిమ్మట, అక్లిష్టకర్మణా = క్లేశమును గల్గింపని కార్యములు గల్గినట్టి, రామేణ = శ్రీరామునిచే, విభీషణః = విభీషణుడు, సుగ్రీవః = సుగ్రీవుడును, హనుమాన్ = హనుమయును, జాంబవాన్ = జాంబవంతుడును, తథా = అట్లుగా, సర్వే వానరముఖ్యాశ్చ = వానరులలో ముఖ్యులెల్లరును, పుష్కలైః = సమృద్ధములైన, రత్నైః చ = రత్నములతోడను, సర్వైః = సమస్తమైన, కామైః = ఇష్టములైన వస్తువులతోడను, యథార్హం = అర్హతకు తగినట్లుగా, పూజితాః (సంతః) = పూజింపబడినవారై, ప్రహృష్టమనసః = మిక్కిలి ఆనందము నొందిన మనస్సుగల వారగుచు, సర్వే = అందరును, యథాగతం = వచ్చినట్లుగనే, జగ్ముః = వెడలిపోయిరి.

**తాత్పర్యము** :- అటుపిమ్మట ఇతరుల క్లేశమును సహింపని శ్రీరామచంద్రుడు విభీషణుని, సుగ్రీవుని, హనుమంతుని, జాంబవంతుని మరియు ప్రధానులైన వానరవీరుల నెల్లరిని వారి వారి అర్హత ననుసరించి పుష్కలములైన రత్నాభరణముల తోడను వారివారికి అభీష్టములైన ఇతరవస్తువులతోడను ఎల్లరిని సత్కరింపగా వారందరును ఎంత ఆనందముతో అయోధ్యకు వచ్చిరో అంత సంతోషముతో తమ తమ నివాసములకు వెడలిపోయిరి.

**శ్లో॥ నత్వా సర్వే మహాత్మానం తత స్తే ప్లవగర్షభాః ।**
**విసృష్టాః పార్థివేంద్రేణ కిష్కింధా మభ్యుపాగమన్ ॥ 29**

**పదచ్ఛేదము** :- నత్వా - సర్వే - మహాత్మానం - తతః - తే - ప్లవగర్షభాః, విసృష్టాః - పార్థివేంద్రేణ - కిష్కింధామ్ - అభ్యుపాగమన్ ॥

**అన్వయక్రమము** :- తతః తే ప్లవగర్షభాః సర్వే మహాత్మానం నత్వా పార్థివేంద్రేణ విసృష్టాః కిష్కింధామ్ అభ్యుపాగమన్.

**ప్రతిపదార్థము** :- తతః = పిమ్మట, తే = ఆ, ప్లవగర్షభాః = వానరశ్రేష్ఠులు, సర్వే = ఎల్లరును, మహాత్మానం = మహనీయుడైన శ్రీరామునికి, నత్వా = మ్రొక్కి, పార్థివేంద్రేణ

= శ్రీరామునిచే, విసృష్టాః = సెలవొసంగబడినవారై, కిష్కింధాం = కిష్కింధను, అభ్యపాగమన్ = చేరుకొనిరి.

**తాత్పర్యము :–** అటుపిమ్మట ఆ వానరశ్రేష్ఠులెల్లరును మహాత్ముడైన శ్రీరామచంద్రునికి మ్రొక్కి ఆ పట్టాభిరాముని కడ సెలవుగైకొని కిష్కింధకు చేరుకొనిరి.

**శ్లో॥ సుగ్రీవో వానరశ్రేష్ఠో దృష్ట్వా రామాభిషేచనమ్ ।**
**పూజితశ్చైవ రామేణ కిష్కింధాం ప్రావిశత్పురీమ్ ॥ 30**

**పదచ్ఛేదము :–** సుగ్రీవః – వానరశ్రేష్ఠః – దృష్ట్వా – రామాభిషేచనమ్, పూజితః – చ – ఏవ – రామేణ – కిష్కింధాం – ప్రావిశత్ – పురీమ్ ॥

**అన్వయక్రమము :–** వానరశ్రేష్ఠః సుగ్రీవః రామాభిషేచనం దృష్ట్వా రామేణ పూజితః కిష్కింధాం పురీం ప్రావిశత్.

**ప్రతిపదార్థము :–** వానరశ్రేష్ఠః = కపిముఖ్యుడైనట్టి, సుగ్రీవః = సుగ్రీవుడు, రామాభిషేచనం = శ్రీరాముని పట్టాభిషేకమును, దృష్ట్వా = చూచి, రామేణ = శ్రీరామునిచే, పూజితః = సత్కరింపబడినవాడై, కిష్కింధాం పురీం = కిష్కింధా నగరమును, ప్రావిశత్ = ప్రవేశించెను.

**తాత్పర్యము :–** వానరరాజైన సుగ్రీవుడు శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవమును కనులార తిలకించి రామచంద్రునిచే గౌరవభావముతో వీడ్కోలు నొంది నిజనగరమైన కిష్కింధకు చేరుకొనెను.

**శ్లో॥ రామేణ సర్వకామైశ్చ యథార్హం ప్రతిపూజితః ।**
**లబ్ధ్వా కులధనం రాజా లంకాం ప్రాయా ద్విభీషణః ॥ 31**

**పదచ్ఛేదము :–** రామేణ – సర్వకామైః – చ – యథార్హం – ప్రతిపూజితః, లబ్ధ్వా – కులధనం – రాజా – లంకాం – ప్రాయాత్ – విభీషణః ॥

**అన్వయక్రమము :–** రాజా విభీషణః కులధనం లబ్ధ్వా యథార్హం సర్వకామైః ప్రతిపూజితః లంకాం ప్రాయాత్.

**ప్రతిపదార్థము :–** రాజా = రాక్షసరాజైన, విభీషణః = విభీషణుడు, కులధనం = తన కులధనమైన రాజ్యమును, లబ్ధ్వా = పొంది, యథార్హం = తగినరీతిగా, సర్వకామైః చ = సమస్తమైన అభీష్టములతో, ప్రతిపూజితః = సత్కరింపబడినవాడై, లంకాం = లంకానగరమును గూర్చి, ప్రాయాత్ = వెడలిపోయెను.

## విశేషార్థములు, వ్యాఖ్యాతల అభిప్రాయములు

**గోవిందరాజీయము :–** "కులధనము" అనగా ఇక్ష్వాకువంశీయుల కులధనమని భావము. శ్రీరంగవిమానమని సంప్రదాయార్థము.

**రామానుజీయము :–** 'కులధనము' అనగా ఇక్ష్వాకుల కులధనము శ్రీరంగసంజ్ఞకమైన విమానమని పెద్దలు చెప్పుదురు. విభీషణకులక్రమాగతమైనట్టి లంకారాజ్యమని కొందరు చెప్పుచున్నారు.

**మహేశ్వరతీర్థులు :–** ఇచ్చట "కులధన" శబ్దముచేత ఇదివరలో శ్రీరామునిచే అనుగ్రహింపబడిన రాక్షసకులధనమైనట్టి లంకారాజ్యమని వాల్మీకి యూహ. వెనుకటి విషయమునే జ్ఞాపకము చేయుచున్నాడు. కొందరు కులధనము అనగా ఇక్ష్వాకు కులదైవతమైన రంగవిమానమని వివరించుచున్నారు. అది యుక్తము గాదు; కులధనము అనగా ఇక్ష్వాకుకులధనమని ఎచ్చటను చెప్పబడలేదు. శ్రీరాముని అవతారసమాప్తి సమయమునందు విభీషణునకు ఇక్ష్వాకుకుల దైవతమైన రంగవిమానమును ఒసగినట్లు చెప్పబడుచున్నది. అచ్చట విభీషణునితో శ్రీరాము డిట్లు పలికెను; "కించాన్యద్వక్తు మిచ్ఛామి రాక్షసేంద్ర మహాబల, ఆరాధయ జగన్నాథ మిక్ష్వాకుకులదైవతమ్" పద్మపురాణమునందు అవతారసమాప్తి సమయమునందు తన దగ్గరకు వచ్చిన విభీషణునితో శ్రీరాముడిట్లు పలికెనని యున్నది.

> "యావచ్చంద్రశ్చ సూర్యశ్చ యావత్తిష్ఠతి మేదినీ ।
> తావద్రమస్వ రాజ్యస్థః కాలే మమ పదం వ్రజ ।
> ఇత్యుక్త్వా ప్రదదౌ తస్మై స్వవిశ్లేషాసహిష్ణవే ।
> శ్రీరంగశాయినం స్వార్చ్య మిక్ష్వాకుకులదైవతమ్ ।
> రంగం విమాన మాదాయ లంకాం ప్రాయా ద్విభీషణః ॥"

అని యవతార సమాప్తి కాలమునందు రంగవిమానము నొసగినట్లు తెలుపబడుటచే ప్రస్తుతసందర్భమునందలి కులధనశబ్దమునకు రాక్షసకులధనమైనట్టి లంకారాజ్యమనియే వాల్మీకి యభిప్రాయమని తెలియవలెను.

తిలక వ్యాఖ్యానముకూడ పై మహేశ్వరతీర్థవ్యాఖ్యానమునే బలపరచినది.

**తాత్పర్యము :–** పిమ్మట రాక్షసవల్లభుడైన విభీషణుడు తనను యథోచితముగ శ్రీరాముడు అభీష్టవస్తువులతో సత్కరింపగా పూర్వము శ్రీరాముడొసగిన తన కులధనమైన లంకారాజ్యమును పొంది నిజనివాసమైన లంకానగరమున కేగెను.

**శ్లో॥ స రాజ్య మఖిలం శాస న్నిహతారి ర్మహాయశాః ।**
**రాఘవః పరమోదారో రరాజ పరయా ముదా ॥ 32**

**పదచ్ఛేదము :–** సః – రాజ్యమ్ – అఖిలం – శాసన్ – నిహతారిః – మహాయశాః – రాఘవః – పరమోదారః – రరాజ – పరయా – ముదా ॥

**అన్వయక్రమము :–** మహాయశాః పరమోదారః నిహతారిః సః రాఘవః అఖిలం రాజ్యం శాసన్ పరయా ముదా రరాజ.

**ప్రతిపదార్థము :–** మహాయశాః = గొప్పకీర్తి గలవాడును, పరమోదారః = గొప్ప ఔదార్యము గలవాడును, నిహతారిః = సంహరింపబడిన శత్రువులు గలవాడునగు, సః = ఆ, రాఘవః = శ్రీరాముడు, అఖిలం = సమస్తమైన, రాజ్యం = రాజ్యమును, శాసన్ = శాసించుచు, పరయా = గొప్పదైన, ముదా = సంతోషముతో, రరాజ = విరాజిల్లెను.

**తాత్పర్యము :–** శత్రువుల నెల్లరిని సంహరించి శ్రీరామచంద్రుడు మహాకీర్తి వైభవములతో ఉదారమైన హృదయము గల్గి సమస్తరాజ్యమును నిష్కంటకముగా శాసించుచు మహానందముతో విరాజిల్లెను.

**శ్లో॥ ఉవాచ లక్ష్మణం రామో ధర్మజ్ఞం ధర్మవత్సలః ॥ 33**

**పదచ్ఛేదము :–** ఉవాచ – లక్ష్మణం – రామః – ధర్మజ్ఞం – ధర్మవత్సలః ॥

**అన్వయక్రమము :–** ధర్మవత్సలః రామః ధర్మజ్ఞం లక్ష్మణమ్ ఉవాచ.

**ప్రతిపదార్థము :–** ధర్మవత్సలః = ధర్మమునందు ప్రీతిగలిగినట్టి, రామః = శ్రీరాముడు, ధర్మజ్ఞం = ధర్మము నెరిగియున్నవాడైన, లక్ష్మణం = లక్ష్మణుని గూర్చి, ఉవాచ = పలికెను.

**తాత్పర్యము :–** ధర్మానుష్ఠానమునందు ప్రీతి గలిగినట్టి శ్రీరాముడు ధర్మవేత్తయైన లక్ష్మణునితో ఇట్లు పలికెను.

**శ్లో॥ ఆతిష్ఠ ధర్మజ్ఞ మయా సహేమాం**
**గాం పూర్వరాజాధ్యుషితాం బలేన ।**
**తుల్యం మయా త్వం పితృభిర్ధృతా యా**
**తాం యౌవరాజ్యే ధుర ముద్వహస్వ ॥ 34**

**పదచ్ఛేదము :–** ఆతిష్ఠ – ధర్మజ్ఞ – మయా – సహ – ఇమాం – గాం –

పూర్వరాజాధ్యుషితాం – బలేన – తుల్యం – మయా – త్వం – పితృభిః – ధృతా – యా – తాం – యౌవరాజ్యే – ధురమ్ – ఉద్వహస్వ ॥

**అన్వయక్రమము :–** ధర్మజ్ఞ! బలేన పూర్వరాజాధ్యుషితాం ఇమాం గాం మయా సహ ఆతిష్ఠ! పితృభిః యా ధృతా తాం ధురం యౌవరాజ్యే (అభిషిక్తః సన్) ఉద్వహస్వ.

**ప్రతిపదార్థము :–** ధర్మజ్ఞ = ధర్మము నెరిగిన ఓ లక్ష్మణుడా! బలేన = శక్తితో, పూర్వరాజాధ్యుషితాం = పూర్వులైన రాజులచే పరిపాలింపబడినట్టి, ఇమాం = ఈ, గాం = భూమిని, మయా సహ = నాతో గూడ, ఆతిష్ఠ = స్వీకరింపుము, పితృభిః = తండ్రితాతలచే, యా = ఎయ్యది, ధృతా = ధరింపబడినదో, తాం = ఆ, ధురం = భారమును, త్వం = నీవు, మయా = నాతో, తుల్యమ్ = సమానముగా, ఉద్వహస్వ = వహింపుము.

**తాత్పర్యము :–** ధర్మవేత్తవైన ఓ తమ్ముడా! గొప్పదైన తమ సామర్థ్యముతో మన పూర్వులైన రాజులు ఏలిన ఈ రాజ్యమును నాతో కలిసి నీవును పాలింపుము. యౌవరాజ్యమునందు పట్టాభిషిక్తుడవై మన తాతతండ్రులు వహించిన ఈ రాజ్యభారమును నాతో సమముగా ఇప్పుడు నీవును వహింపవలసియున్నది.

**శ్లో॥ సర్వాత్మనా పర్యనునీయమానో**
**యదా న సౌమిత్రి రుపైతి యోగమ్ ।**
**నియుజ్యమానోఽపి చ యౌవరాజ్యే**
**తతోఽభ్యషించ ద్భరతం మహాత్మా ॥ 35**

**పదచ్ఛేదము :–** సర్వాత్మనా – పర్యనునీయమానః – యదా – న – సౌమిత్రిః – ఉపైతి – యోగమ్, నియుజ్యమానః – అపి – చ – యౌవరాజ్యే – తతః – అభ్యషించత్ – భరతం – మహాత్మా ॥

**అన్వయక్రమము :–** సర్వాత్మనా పర్యనునీయమానః నియుజ్యమానః అపి చ సౌమిత్రిః యదా యోగం న ఉపైతి, తతః మహాత్మా భరతం యౌవరాజ్యే అభ్యషించత్.

**ప్రతిపదార్థము :–** సర్వాత్మనా = సమస్తవిధముల, పర్యనునీయమానః = బ్రతిమాలబడుచున్న వాడును, నియుజ్యమానః అపి చ = నియోగింపబడుచున్న వాడును అయినప్పటికిని, సౌమిత్రిః = లక్ష్మణుడు, యదా = ఎప్పుడైతే, యోగం = అభిషేక యోగమును, న ఉపైతి = స్వీకరింపకుండెనో, తతః = అప్పుడు, మహాత్మా = మహాత్ముడైన శ్రీరాముడు, యౌవరాజ్యే = యువరాజపదవియందు, భరతం = భరతుని, అభ్యషించత్ = అభిషేకించెను.

**తాత్పర్యము :–** అనేకవిధములుగా తనను ఆదేశించి బ్రతిమాలినప్పటికిని లక్ష్మణుడు యువరాజపదవిని చేపట్టుటకు అంగీకరింపకుండుటచే మహాత్ముడైన శ్రీరాముడు యువరాజుగా భరతుని అభిషిక్తుని గావించెను.

**శ్లో॥ పౌండరీకాశ్వమేధాభ్యాం వాజపేయేన చాసకృత్ ।**
**అన్యైశ్చ వివిధై ర్యజ్ఞై రయజత్ పార్థివర్షభః ॥ 36**

**పదచ్ఛేదము :–** పౌండరీకాశ్వమేధాభ్యాం – వాజపేయేన – చ – అసకృత్, అన్యైః – చ – వివిధైః – యజ్ఞైః – అయజత్ – పార్థివర్షభః ॥

**అన్వయక్రమము :–** పార్థివర్షభః పౌండరీకాశ్వమేధాభ్యాం వాజపేయేన చ అన్యైః వివిధైః యజ్ఞైః చ అసకృత్ అయజత్.

**ప్రతిపదార్థము :–** పార్థివర్షభః = రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడు, పౌండరీకాశ్వమేధాభ్యాం = పౌండరీకము అశ్వమేధము అను యాగములచేతను, వాజపేయేన చ = వాజపేయ మను యాగముచేతను, వివిధైః = అనేకవిధములైనట్టి, అన్యైః = ఇతరములైన, యజ్ఞైః = యజ్ఞములతోడను, అసకృత్ = పెక్కుమారులు, అయజత్ = దేవతలను తృప్తి పరచెను.

**తాత్పర్యము :–** రాజశ్రేష్ఠుడైన శ్రీరాముడు అనేక పర్యాయములు పౌండరీకము, అశ్వమేధము, వాజపేయము మున్నగు అనేకములైన యాగములను గావించుచు దేవతలను తృప్తి పరచెను.

**శ్లో॥ రాజ్యం దశసహస్రాణి ప్రాప్య వర్షాణి రాఘవః ।**
**శతాశ్వమేధా నాజహ్రే సదశ్వాన్ భూరిదక్షిణాన్ ॥ 37**

**పదచ్ఛేదము :–** రాజ్యం – దశసహస్రాణి – ప్రాప్య – వర్షాణి – రాఘవః, శతాశ్వమేధాన్ – ఆజహ్రే – సదశ్వాన్ – భూరిదక్షిణాన్ ॥

**అన్వయక్రమము :–** రాఘవః దశసహస్రాణి వర్షాణి రాజ్యం ప్రాప్య సదశ్వాన్ భూరిదక్షిణాన్ శతాశ్వమేధాన్ ఆజహ్రే.

**ప్రతిపదార్థము :–** రాఘవః = శ్రీరాముడు, దశసహస్రాణి వర్షాణి = పదివేల సంవత్సరములు, రాజ్యం = రాజ్యమును, ప్రాప్య = పొంది, సదశ్వాన్ = ఉత్తమములైన గుఱ్ఱములు గలిగినవియును, భూరిదక్షిణాన్ = అధికమైన దక్షిణలు గలవియునగు, శతాశ్వమేధాన్ = నూరు అశ్వమేధములను, ఆజహ్రే = యజించెను.

**తాత్పర్యము** :- శ్రీరాముడు పదివేల సంవత్సరములు రాజ్యపాలనము గావించి శ్రేష్ఠములైన అశ్వములతో విస్తారమైన దక్షిణములతో నూరశ్వమేధయాగములను గావించెను.

**శ్లో॥ ఆజానులంబబాహు స్స మహాస్కంధః ప్రతాపవాన్ ।**
**లక్ష్మణానుచరో రామః పృథివీ మన్వపాలయత్ ॥ 38**

**పదచ్ఛేదము** :- ఆజానులంబబాహుః - సః - మహాస్కంధః - ప్రతాపవాన్ - లక్ష్మణానుచరః - రామః - పృథివీమ్ - అన్వపాలయత్ ॥

**అన్వయక్రమము** :- ఆజానులంబబాహుః మహాస్కంధః ప్రతాపవాన్ సః రామః లక్ష్మణానుచరః (సన్) పృథివీమ్ అన్వపాలయత్.

**ప్రతిపదార్థము** :- ఆజానులంబబాహుః = మోకాళ్ళవరకును పొడవైన బాహువులు గలవాడును, మహాస్కంధః = గొప్పవైన భుజశిరస్సులు గలవాడును, ప్రతాపవాన్ = గొప్ప ప్రతాపముగలవాడునగు, రామః = శ్రీరాముడు, లక్ష్మణానుచరః (సన్) = లక్ష్మణుడు అనుచరుడుగా గలవాడై, పృథివీం = భూమిని, అన్వపాలయత్ = పరిపాలించెను.

**తాత్పర్యము** :- ఆజానుదీర్ఘబాహువులును బలిష్ఠములైన భుజశిరస్సులును గలిగి మహాపరాక్రమసంపన్నుడైయున్న శ్రీరాముడు తమ్ముడైన లక్ష్మణుడు అన్నివిధముల తన ననుసరించుచుండగా ధర్మము తప్పకుండ భూమిని పాలించెను.

**శ్లో॥ రాఘవశ్చాపి ధర్మాత్మా ప్రాప్య రాజ్య మనుత్తమమ్ ।**
**ఈజే బహువిధై ర్యజ్ఞై స్ససుహృజ్జ్ఞాతిబాంధవః ॥ 39**

**పదచ్ఛేదము** :- రాఘవః - చ - అపి - ధర్మాత్మా - ప్రాప్య - రాజ్యమ్ - అనుత్తమమ్, ఈజే - బహువిధైః - యజ్ఞైః - ససుహృజ్జ్ఞాతిబాంధవః ॥

**అన్వయక్రమము** :- ధర్మాత్మా రాఘవః చ అపి అనుత్తమం రాజ్యం ప్రాప్య ససుహృజ్జ్ఞాతి బాంధవః బహువిధైః యజ్ఞైః ఈజే.

**ప్రతిపదార్థము** :- ధర్మాత్మా = పరమధార్మికుడైన, రాఘవః చాపి = శ్రీరాముడును, అనుత్తమం = సర్వశ్రేష్ఠమైనట్టి, రాజ్యం = రాజ్యమును, ప్రాప్య = పొంది, ససుహృజ్జ్ఞాతి బాంధవః = మిత్రులు జ్ఞాతులు బంధువులు అయినట్టి వారితో గూడినట్టివాడై, బహువిధైః = అనేకవిధములైన, యజ్ఞైః = యాగాలతో, ఈజే = దేవతలకు ప్రీతి గలిగించెను.

**తాత్పర్యము** :– ధర్మానుష్ఠానమునందు అమితమైన శ్రద్ధగలిగిన శ్రీరామచంద్రుడు గొప్పదైన అయోధ్యారాజ్యమును పాలించుచు తన మిత్రులతోడను, జ్ఞాతులతోడను, బంధువులతోడను గూడి వివిధములైన యాగములు నెన్నింటినో చేసి దేవతలకు ప్రీతిని గూర్చెను.

**శ్లో॥ న పర్యదేవ న్విధవా న చ వ్యాళకృతం భయమ్ ।**
**న వ్యాధిజం భయం వాపి రామే రాజ్యం ప్రశాసతి ॥ 40**

**పదచ్ఛేదము** :– న – పర్యదేవన్ – విధవాః – న – చ – వ్యాళకృతం – భయమ్, న – వ్యాధిజం – భయం – వా – అపి – రామే – రాజ్యం – ప్రశాసతి ॥

**అన్వయక్రమము** :– రామే రాజ్యం ప్రశాసతి (సతి) విధవాః న పర్యదేవన్, వ్యాళకృతం భయం చ న (అస్తి). వ్యాధిజం భయం వాపి న (అస్తి).

**ప్రతిపదార్థము** :– రామే = శ్రీరాముడు, రాజ్యం = రాజ్యమును, ప్రశాసతి (సతి) = పాలించుచుండగా, విధవాః = వితంతువులు, న పర్యదేవన్ = విలపించుటలేదు, వ్యాళకృతం = క్రూరమృగములచే చేయబడినట్టి, భయం చ = భయమును, న అస్తి = లేకుండెను.

**తాత్పర్యము** :– శ్రీరామచంద్రుడు సింహాసనము నధిష్ఠించి అయోధ్యారాజ్యము నేలుచుండగా స్త్రీలు వితంతువులై విలపించుట యనునది లేకుండెను. జనులకు క్రూరమృగాదుల బాధ లేకుండెను. జనులను ఎట్టి వ్యాధులు పీడింపకుండెను.

**శ్లో॥ నిర్దస్యు రభవ ల్లోకో నానర్థః కంచి దస్పృశత్ ।**
**న చ స్మ వృద్ధా బాలానాం ప్రేతకార్యాణి కుర్వతే ॥ 41**

**పదచ్ఛేదము** :– నిర్దస్యుః – అభవత్ – లోకః – న – అనర్థః – కంచిత్ – అస్పృశత్, న – చ – స్మ – వృద్ధాః – బాలానాం – ప్రేతకార్యాణి – కుర్వతే ॥

**అన్వయక్రమము** :– లోకః నిర్దస్యుః అభవత్, కంచిత్ అనర్థః న అస్పృశత్, వృద్ధాః బాలానాం ప్రేతకార్యాణి న చ కుర్వతే స్మ.

**ప్రతిపదార్థము** :– లోకః = లోకము, నిర్దస్యుః = దొంగలు లేనిది, అభవత్ = అయ్యెను, కంచిత్ = ఎవ్వనిని, అనర్థః = ఉపద్రవము, న అస్పృశత్ = అంటకుండెను, వృద్ధాః = పెద్దలు, బాలానాం = పిల్లలకు, ప్రేతకార్యాణి = ప్రేతసంస్కారములను, న చ కుర్వతే స్మ = చేయరైరి.

**తాత్పర్యము** :– లోకమున దొంగల భయము లేకుండెను. ఏ మనుజునకును ఎట్టి యనర్ధమును వాటిల్లకుండెను. ఆ రాజ్యమున పెద్దవారికి – పిన్నవారికి ప్రేతకార్యములు చేయు దుస్థితి ఎచ్చటను లేకుండెను.

**శ్లో॥ సర్వం ముదితమే వాసీ త్సర్వో ధర్మపరో ఽ భవత్ ।**
**రామమే వానుపశ్యంతో నాభ్యహింస న్పరస్పరమ్ ॥ 42**

**పదచ్ఛేదము** :– సర్వం – ముదితమ్ – ఏవ – ఆసీత్ – సర్వః – ధర్మపరః – అభవత్, రామమ్ – ఏవ – అనుపశ్యంతః – న – అభ్యహింసన్ – పరస్పరమ్ ॥

**అన్వయక్రమము** :– సర్వం ముదితం ఏవ ఆసీత్, సర్వః ధర్మపరః అభవత్, రామమ్ ఏవ అనుపశ్యంతః పరస్పరం న అభ్యహింసన్.

**ప్రతిపదార్థము** :– సర్వం = సమస్తమును, ముదితమ్ ఏవ = సంతోషమునొందినదే, ఆసీత్ = అయ్యెను, సర్వః = ప్రతిమనుజుడును, ధర్మపరః = ధర్మమునందు శ్రద్ధగలవాడు, అభవత్ = అయ్యెను, రామమ్ఏవ = శ్రీరామునే, అనుపశ్యంతః = చూచుచున్నవారై, పరస్పరం = ఒండొరులను, న అభ్యహింసన్ = హింసింపకుండిరి.

**తాత్పర్యము** :– ప్రాణికోటి అంతయును సంతోషభరితమై యుండెను. జనులెల్లరును ధర్మపరాయణులై యుండిరి. ఎట్టి సందర్భమునందును శ్రీరామునకు అప్రియము కలుగకూడదను కోరికగలవారై ఒకరికొకరు ఎట్టి హానియును గలుగ నీయకుండ అన్యోన్యప్రేమతో జీవించుచుండిరి.

**శ్లో॥ ఆసన్ వర్షసహస్రాణి తథా పుత్రసహస్రిణః ।**
**నిరామయా విశోకాశ్చ రామే రాజ్యం ప్రశాసతి ॥ 43**

**పదచ్ఛేదము** :– ఆసన్ – వర్షసహస్రాణి – తథా – పుత్రసహస్రిణః – నిరామయాః – విశోకాః – చ – రామే – రాజ్యం – ప్రశాసతి ॥

**అన్వయక్రమము** :– రామే రాజ్యం ప్రశాసతి (సతి నరాః) నిరామయాః విశోకాః చ తథా పుత్రసహస్రిణః చ (సంతః) వర్షసహస్రాణి ఆసన్.

**ప్రతిపదార్థము** :– రామే = శ్రీరాముడు, రాజ్యం = రాజ్యమును, ప్రశాసతి (సతి) = పాలించుచుండగా, (నరాః = ప్రజలు), వర్షసహస్రాణి = వేలకొలది సంవత్సరములు, నిరామయాః = రోగములు లేనివారుగాను, తథా = అట్లు, పుత్రసహస్రిణః = బహుపుత్రులు గలవారుగను, ఆసన్ = ఉండిరి.

**తాత్పర్యము** :– శ్రీరాము డట్లు రాజ్యము చేయుచున్న కాలమున ప్రజలందరును ఎట్టి అనారోగ్యమును, ఎట్టి దుఃఖమును లేకుండ బహుళమైన పుత్రపౌత్రాదిసంపత్తితో వేలకొలది సంవత్సరములు సుఖముగా జీవించుచుండిరి.

> **శ్లో॥ రామో రామో రామ ఇతి ప్రజానా మభవ న్కథాః ।**
> **రామభూతం జగ దభూ ద్రామే రాజ్యం ప్రశాసతి ॥ 44**

**పదచ్ఛేదము** :– రామః – రామః – రామః – ఇతి – ప్రజానాం – అభవన్ – కథాః, రామభూతం – జగత్ – అభూత్ – రామే – రాజ్యం – ప్రశాసతి ॥

**అన్వయక్రమము** :– రామే రాజ్యం ప్రశాసతి (సతి) ప్రజానాం కథాః రామః రామః రామః ఇతి అభవన్, జగత్ రామభూతం అభూత్.

**ప్రతిపదార్థము** :– రామే = శ్రీరాముడు, రాజ్యం = రాజ్యమును, ప్రశాసతి సతి = పరిపాలించుచుండగా, ప్రజానాం = ప్రజలలో, కథాః = భాషణములు, రామః రామః రామః ఇతి = రాముడు రాముడు రాముడు అని, అభవన్ = ఉండెడివి, జగత్ = లోకము, రామభూతం = రామమయముగా, అభూత్ = ఆయెను.

**తాత్పర్యము** :– శ్రీరాముడు రాజ్యము చేయుచున్న ఆ పుణ్యకాలమున జనులలో ఎచ్చట చూచినను, శ్రీరాముడిట్లు చెప్పెను. శ్రీరాముడిట్లు చేసెను, రామభద్రుడు దీనినే సమ్మతించును, అనుమాటలే సర్వత్ర వినవచ్చుచుండెను. ఇట్లానాడు జగమంతయును రామమయమై యుండెను.

> **శ్లో॥ నిత్యపుష్పా నిత్యఫలా స్తరవ స్స్కంధవిస్తృతాః ।**
> **కాలే వర్షీ చ పర్జన్య స్సుఖస్పర్శశ్చ మారుతః ॥ 45**

**పదచ్ఛేదము** :– నిత్యపుష్పాః – నిత్యఫలాః – తరవః – స్కంధవిస్తృతాః – కాలే – వర్షీ – చ – పర్జన్యః – సుఖస్పర్శః – చ – మారుతః ॥

**అన్వయక్రమము** :– తరవః నిత్యపుష్పాః నిత్యఫలాః స్కంధవిస్తృతాః (అభవన్). పర్జన్యః చ కాలే వర్షీ (అభవత్). మారుతః సుఖస్పర్శః చ.

**ప్రతిపదార్థము** :– తరవః = వృక్షములు, స్కంధవిస్తృతాః = బలసిన మ్రానులు గలవై, నిత్యపుష్పాః = ఎల్లప్పుడును పూవులు కలవిగను, నిత్యఫలాః చ = ఎల్లప్పుడును పండ్లుగలవిగను, (అభవన్ = ఉండినవి), పర్జన్యః = మేఘము, కాలే = సకాలము నందు, వర్షీ = వర్షించునదిగా, (అభవత్ = ఉండెను), మారుతః = వాయువు, సుఖస్పర్శః = సుఖమైన స్పర్శగలదిగా, అభవత్ = ఉండెను.

**తాత్పర్యము :–** ఆ కాలమునందు వృక్షములన్నియును పెద్దశాఖలతో చక్కగా విస్తరించినవిగను, ఎల్లకాలములందు పూవులు పూయునవిగను, పండ్లుగలవిగను ఉండెను. మరియు మేఘుడు సకాలములో సువృష్టి నొసగుచుండెను. వాయువు జీవులకు సుఖకరముగ వీచుచుండెను.

**శ్లో॥ బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా లోభవివర్జితాః ।**
**స్వకర్మసు ప్రవర్తంతే తుష్టా స్స్వైరేవ కర్మభిః ॥ 46**

**పదచ్ఛేదము :–** బ్రాహ్మణాః – క్షత్రియాః – వైశ్యాః – శూద్రాః – లోభవివర్జితాః, స్వకర్మసు – ప్రవర్తంతే – తుష్టాః – స్వైః – ఏవ – కర్మభిః ॥

**అన్వయక్రమము :–** బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాః శూద్రాః లోభవివర్జితాః స్వైః కర్మభిః ఏవ తుష్టాః (సంతః) స్వకర్మసు ప్రవర్తంతే.

**ప్రతిపదార్థము :–** బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, క్షత్రియాః = క్షత్రియులు, వైశ్యాః = కోమటులు, శూద్రాః = శూద్రులు, లోభవివర్జితాః = లోభముచే విడువబడినవారై, స్వైః కర్మభిః ఏవ = తమ తమ పనులతోడనే, తుష్టాః (సంతః) = సంతుష్టి నొందినవారై, స్వకర్మసు = తమ పనులయందు, ప్రవర్తంతే = ప్రవర్తిల్లు చుండిరి.

**తాత్పర్యము :–** బ్రాహ్మణులును క్షత్రియులును వైశ్యులును శూద్రులును ఇసుమంతయును లోభగుణములేనివారై తమ తమ పనులను నిర్వహించుటయందే సంతృప్తి గలవారై తమకు విహితములైన కర్మలయందే నిమగ్నులై యుండెడివారు.

**శ్లో॥ ఆస న్ప్రజా ధర్మరతా రామే శాసతి నానృతాః ।**
**సర్వే లక్షణసంపన్నా స్సర్వే ధర్మపరాయణాః ॥ 47**

**పదచ్ఛేదము :–** ఆసన్ – ప్రజాః – ధర్మరతాః – రామే – శాసతి – నానృతాః, సర్వే – లక్షణసంపన్నాః – సర్వే – ధర్మపరాయణాః ॥

**అన్వయక్రమము :–** రామే – శాసతి (సతి) ప్రజాః సర్వే ధర్మరతాః నానృతాః లక్షణసంపన్నాః సర్వే ధర్మపరాయణాః ఆసన్.

**ప్రతిపదార్థము :–** రామే = శ్రీరాముడు, శాసతి (సతి) = పరిపాలించుచుండగా, ప్రజాః = ప్రజలు, ధర్మరతాః = ధర్మమునం దాసక్తి గలవారుగను, నానృతాః = అసత్యము పలుకనివారుగను, సర్వే = ఎల్లరును, లక్షణసంపన్నాః = ఉత్తమ లక్షణములు గలవారుగను, సర్వే = ఎల్లరును, ధర్మపరాయణాః = ధర్మతత్పరులుగను, ఆసన్ = ఉండిరి.

**తాత్పర్యము :–** శ్రీరాముడు రాజ్యపాలనము చేయుచుండగా జనులెల్లరును సత్యనిరతులై యుండిరి. ఆనాడు ప్రజలెల్లరును శుభలక్షణములతో విలసిల్లు చుండిరి. ఎల్లరును ధర్మపరాయణులై యుండిరి.

**శ్లో॥ దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ ।**
**భ్రాతృభి స్సహితః శ్రీమా న్రామో రాజ్య మకారయత్ ॥ 48**

**పదచ్ఛేదము :–** దశవర్షసహస్రాణి – దశవర్షశతాని – చ, భ్రాతృభిః సహితః – శ్రీమాన్ – రామః – రాజ్యమ్ – అకారయత్ ॥

**అన్వయక్రమము :–** శ్రీమాన్ రామః భ్రాతృభిః సహితః (సన్) దశవర్షసహస్రాణి దశవర్షశతాని చ రాజ్యమ్ అకారయత్.

**ప్రతిపదార్థము :–** శ్రీమాన్ = శ్రీమంతుడైనట్టి, రామః = రామచంద్రుడు, భ్రాతృభిః = సోదరులతో, సహితః (సన్) = కూడినవాడై, దశవర్షసహస్రాణి = పదివేలయేండ్లును, దశవర్షశతాని చ = పదివందల సంవత్సరములును, రాజ్యం = రాజ్యమును, అకారయత్ = పాలించెను.

**తాత్పర్యము :–** శ్రీరామచంద్రుడు తన సోదరవర్గముతో గూడినవాడై పదునొకండువేల సంవత్సరములు ప్రజారంజకముగ రాజ్యపాలన మొనరించెను.

**శ్లో॥ ధన్యం యశస్య మాయుష్యం రాజ్ఞాం చ విజయావహమ్ ।**
**ఆదికావ్య మిదం త్వార్షం పురా వాల్మీకినా కృతమ్ ।**
**యః పఠేచ్ఛృణుయాల్లోకే నరః పాపాద్విముచ్యతే ॥ 49**

**పదచ్ఛేదము :–** ధన్యం – యశస్యమ్ – ఆయుష్యం – రాజ్ఞాం – చ – విజయావహమ్, ఆదికావ్యమ్ – ఇదం – తు – ఆర్షం – పురా – వాల్మీకినా – కృతమ్, యః – పఠేత్ – శృణుయాత్ – లోకే – నరః – పాపాత్ – విముచ్యతే ॥

**అన్వయక్రమము :–** ధన్యం యశస్యమ్ ఆయుష్యం రాజ్ఞాం విజయావహమ్, పురా వాల్మీకినా కృతమ్ ఇదమ్ ఆర్షమ్ ఆదికావ్యం, యః పఠేత్ శృణుయాత్ (సః) నరః లోకే పాపాత్ విముచ్యతే.

**ప్రతిపదార్థము :–** ధన్యం = పుణ్యప్రదమైనదియును, యశస్యం = కీర్తికరమైనదియును, ఆయుష్యం = ఆయుర్వృద్ధికరమును, రాజ్ఞాం = రాజులకు, విజయావహం = విజయమును గూర్చునదియును, పురా = పూర్వము, వాల్మీకినా = వాల్మీకిమహర్షిచే, కృతం = రచింపబడినదియును, ఆర్షం = వేదసమ్మతమైనదియునుఅగు, ఇదం =

ఈ, ఆదికావ్యం = ఆదికావ్యమును, యః = ఎవ్వడు, పఠేత్ = పఠించునో, శృణుయాత్ = వినునో, (సః = ఆ), నరః = మనుజుడు, లోకే = లోకమునందు, పాపాత్ = పాపమునుండి, విముచ్యతే = విడువబడును.

**తాత్పర్యము** :– మిక్కిలి ధన్యమైనదియును, కీర్తికరమైనదియును ఆయుర్వర్ధన మైనదియును, మహారాజులకు విజయమును సమకూర్చునదియును, శ్రీరాముని యవతారకారమునందే వేదముల సారమును వివరించునట్టి రీతిలో వాల్మీకిచే రచింపబడినదియును అగు ఈ యాదికావ్యమైన శ్రీమద్రామాయణము నెవరు భక్తిశ్రద్ధలతో పఠింతురో ఆకర్ణించెదరో అట్టి మనుజులు సర్వపాపములనుండి విముక్తి నొందుదురు.

**శ్లో॥ పుత్రకామస్తు పుత్రాన్వై ధనకామో ధనాని చ ।**
**లభతే మనుజో లోకే శ్రుత్వా రామాభిషేచనమ్ ।**
**మహీం విజయతే రాజా రిపూంశ్చాప్యధితిష్ఠతి ॥ 50**

**పదచ్ఛేదము** :– పుత్రకామః – తు – పుత్రాన్ – వై – ధనకామః – ధనాని – చ, లభతే – మనుజః – లోకే – శ్రుత్వా – రామాభిషేచనమ్, మహీం – విజయతే – రాజా – రిపూన్ – చ – అపి – అధితిష్ఠతి ॥

**అన్వయక్రమము** :– రామాభిషేచనమ్ శ్రుత్వా లోకే పుత్రకామః మనుజః పుత్రాన్, ధనకామః ధనాని చ లభతే. రాజా మహీం విజయతే, రిపూన్ అపి అధితిష్ఠతి చ.

**ప్రతిపదార్థము** :– రామాభిషేచనమ్ = రాముని అభిషేకమును, శ్రుత్వా = విని, లోకే = లోకమునందు, పుత్రకామః = పుత్రులను గోరునట్టి, మనుజః = నరుడు, పుత్రాన్ = పుత్రులను, ధనకామః = ధనమును గోరునట్టివాడు, ధనాని చ = ధనమును, లభతే = పొందును. రాజా = రాజు, మహీం = భూమిని, విజయతే = జయించును, అపి చ = మరియును, రిపూన్ = శత్రువులను, అధితిష్ఠతి = జయించును.

**తాత్పర్యము** :– ఈ లోకమున జనులలో శ్రీరామపట్టాభిషేకవృత్తాంతమును భక్తితో నాకర్ణించిన పుణ్యాత్ముడు సంతానమును గోరువాడయిన పుత్రులను బడయును. ఐశ్వర్యమును గోరువాడయిన సంపదలను సంపాదించుకొనును. రాజు రాజ్యమును జయించును. మరియు శత్రువుల నణచివేయును.

**శ్లో॥ రాఘవేణ యథా మాతా సుమిత్రా లక్ష్మణేన చ ।**
**భరతేనేవ కైకేయీ జీవపుత్రా స్తథా స్త్రియః ॥ 51**

**శ్లో॥ భవిష్యంతి సదానందాః పుత్రపౌత్రసమన్వితాః ॥ 52**

**పదచ్ఛేదము** :– రాఘవేణ – యథా – మాతా – సుమిత్రా – లక్ష్మణేన – చ – భరతేన – ఇవ – కైకేయీ – జీవపుత్రాః – తథా – స్త్రియః, భవిష్యంతి – సదానందాః – పుత్రపౌత్రసమన్వితాః ॥

**అన్వయక్రమము** :– (రామాభిషేచనం శ్రుత్వా) తథా స్త్రియః మాతా రాఘవేణ యథా సుమిత్రా లక్ష్మణేన యథా, కైకేయీ భరతేన ఇవ జీవపుత్రాః పుత్రపౌత్రసమన్వితాః సదానందాః భవిష్యంతి.

**ప్రతిపదార్థము** :– (రామాభిషేచనం శ్రుత్వా = శ్రీరామపట్టాభిషేకమును విని), తథా = ఆ విధముగ, స్త్రియః = స్త్రీలు, రాఘవేణ = శ్రీరామునితో, మాతా యథా = తల్లియగు కౌసల్యవలెను, లక్ష్మణేన = లక్ష్మణునితో, సుమిత్రా యథా = సుమిత్రవలెను, భరతేన = భరతునితో, కైకేయీ ఇవ = కైకేయివలెను, జీవపుత్రాః = జీవించియున్న బిడ్డలు గలవారుగను, పుత్రపౌత్రసమన్వితాః = పుత్రులతోడను, పౌత్రులతోడను గూడియున్నవారై, సదానందాః = నిత్యము సంతోషముగలవారు, భవిష్యంతి = కాగలరు.

**తాత్పర్యము** :– స్త్రీలు శ్రీరామపట్టాభిషేకముతో గూడిన రామాయణశ్రవణమువలన శ్రీరామునితో కౌసల్యవలెను, లక్ష్మణునితో సుమిత్రవలెను, భరతునితో కైకేయివలెను చిరంజీవులగు బిడ్డలతో పుత్రపౌత్రాభివృద్ధిగా ఆనందము నొందగలరు.

**శ్లో॥ శ్రుత్వా రామాయణ మిదం దీర్ఘమాయుశ్చ విందతి ।**
**రామస్య విజయం చైవ సర్వ మక్లిష్టకర్మణః ॥ 53**

**పదచ్ఛేదము** :– శ్రుత్వా – రామాయణమ్ – ఇదం – దీర్ఘమ్ – ఆయుః – చ – విందతి, రామస్య – విజయం – చ – ఏవ – సర్వమ్ – అక్లిష్టకర్మణః ॥

**అన్వయక్రమము** :– అక్లిష్టకర్మణః రామస్య విజయమ్ ఇదం రామాయణం సర్వం చైవ శ్రుత్వా దీర్ఘమ్ ఆయుః చ విందతి.

**ప్రతిపదార్థము** :– అక్లిష్టకర్మణః = క్లేశములు గల్గింపని కృత్యములు గల్గినట్టి, రామస్య = రామునియొక్క, విజయం = విజయమైనట్టి, ఇదం = ఈ, రామాయణం = రామాయణమును, సర్వం చైవ = సమస్తమును, శ్రుత్వా = విని, దీర్ఘం = దీర్ఘమైన, ఆయుః చ = ఆయుర్దాయమునుకూడ, విందతి = పొందును.

**తాత్పర్యము** :– ఇతరులకు ఎట్టి క్లేశము గల్గింపకుండ ఉత్కృష్టకృత్యములు సాధించు

